## Ballad Poetry in Telugu

**by Prof. T.V. Subba Rao**

***This is not 'Research'!***
***This is not 'Search' even!***
***This is an 'Adventure'!***
***Hats off to you!***
***I want to* see you!!**

***- Prof. K.V. Ramana Reddy***

***He has collected many Telugu ballads***
***which are not known to the educated public and***
***when he publishes them,***
***I am sure,***
***he will put the Telugu public indebted to him***
***for his work.***

***- Prof. G.N.Reddy***

***His laborious collection of a good number of new ballads***
***from different parts of Andhra Pradesh***
***won admiration of the Telugu scholars and***
***he threw new light on the subject.***

***- Prof. T. Kodanda Ramaiah***

# తెలుఁగు వీరగాథా కవిత్వము

## Ballad Poetry in Telugu

రచనా కాలము: **1967** సమర్పణము: జనవరి **1968**

**1969** ఫిబ్రవరి నెలలో శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయము నుండి
డాక్టరేటు పట్టమును పొందిన సిద్ధాంత గ్రంథము


రచన

**ఆచార్య తంగిరాల వేంకట సుబ్బారావు**
*ఎం.ఏ.; పిహెచ్.డి.*

విశ్రాంత ఆంధ్రశాఖాధ్యక్షులు
బెంగుళూరు విశ్వవిద్యాలయము
'జ్ఞానభారతి', బెంగుళూరు



ప్రచురణ

'శ్రీరస'
శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య
బెంగుళూరు

**2013**

**“TELUGU VEERAGATHA KAVITWAMU” (Ballad Poetry in Telugu)**

**a Doctoral Thesis** written by Prof. Tangirala Venkata Subba Rao, Retired Professor and Head of the Department of Telugu, Bangalore University, Jnana Bharathi, Bangalore- 560 056, which was awarded the Degree of Doctor of Philosophy in Telugu by Sri Venkateswara University, Tirupati, A.P. in February 1969 and published by 'Sri Rasa'- Sri Krishnadevaraya Rasajna Samakhya, Bangalore, in 2013.

(Year of writing the thesis- 1967; Year of Submission - January 1968)

PP. xxviii + 800

First Edition: 14-10-2013 Monday), ‘Viyaya’nama samvatsara, Vijaya Dasami

Copies : 1000

Price : Rs. 1000/- ($ 100)



*Cover Page Painting:* **“Katama Raju”** by ‘Kalaprapoorna’, ‘Padmashri’ **Dr. Bapu,** Chennai.

*Back Cover Painting:* Portrait of Sarvayi Papadu by an anonymous artist (C. 1750-80). Courtesy of V&A Images/ Victoria and Albert Museum (London) No. IS-205-1953.

*For copies:*

1) Prof. **T.V. Subba Rao**
1708, ‘‘Siitaavadhaanam’’
11th cross, Ist ‘G‘ Main
Kengeri Satellite Town
Bangalore- 560 056.

Ph: 080- 2279 4022
Mobile: 099454 22742

2) **M/s Visalaandhra Book House**
4-1-435, Bank Street, Hyderabad, A.P.
*and all its Branches*

3) **Sahithi Prachuranalu**
29-13-53, Kaleswara Rao Road,
Suryaraopeta,
Vijayawada- 520 002, A.P.
Ph: 0866-243 6643

Coordination:- **Sri T. Muralidhar Gowd,** Hyderabad -500 035. Ph: 040-2404 7889, 93931 76552

D.T.P.: 1) **K.B.T. Kondaiah,** Kammaguda, Hayathnagar (M.D.) Rangareddy Dist.- 501510. Ph: 9985473125

2) **Sri Lakshmi Graphics,** Bangalore- 560 079; Ph: 080-23100603

Printing : **OMKAR OFFSET PRINTERS**
Bangalore - 560 002
Ph: 080- 2670 8186, 2670 9026

# అంకితము

1. మా గృహదైవము (ఇలువేల్పు) శ్రీ వేంకటేశ్వరస్వామివారి పాదారవిందములకు... నా యిష్ట దైవము 'భగవాన్ శిఖిపింఛమౌళి' మోహన వేణుగానమునకు...

2. నాకు జన్మనిచ్చిన తల్లిదండ్రులకు... వాత్సల్యమును పంచియిచ్చిన పెద్దక్కయ్యకు... 'చెల్లక్క'– చిన్నక్కయ్యకు... అన్నయ్యకు... 'బాచి' తమ్మునకు... 'బుల్లి' తమ్మునకు... మఱియు మా 'అబ్బిగాడు' మామయ్యకు...

3. నాకు సాహిత్యాభిరుచిని కలిగించిన గురుదేవులకు... గురువర్యులకు... నాకు కవితాశక్తిని ప్రసాదించిన "నవ్యాధునిక కవిత్రయము".. శ్రీశ్రీ– తిలక్– శేషేంద్రలకు...

4. నా సిద్ధాంత గ్రంథమును 1971లోనే ఆమూలాగ్రముగా చదివి అమందానందము నొందిన ప్రొ॥ కె.వి. రమణారెడ్డిగారికి...

5. తన జీవితమంతయు నా కొఱకే మీదుకట్టిన నా 'ముద్దబంతి పువ్వు' నా 'చిట్టి'కి... నా ప్రాణసమానులు మా చిరంజీవులు: 'కాళి–రాము– సీత– శీను– శశి'లకు... మా కోడళ్ళకు... అల్లుళ్ళకు... మనుమలకు... మనుమరాండ్రకు... ముని మనుమనికి... ముని మనుమరాలికి...

6. శ్రీమతి బులుసు వెంకటరత్నం ('చంటమ్మాయి')కి, ఆమె కుటుంబానికి...

7. నన్ను ఎంతగానో అభిమానించే మా మఱదండ్రు శ్రీమతి లంక నాగమణికి, శ్రీమతి పిల్లలమఱ్ఱి సత్యభామకు...

8. బెంగుళూరులోనే ఉండి, మా అబ్బాయివలెనే నాకు సేవలు చేస్తున్న, మా అబ్బాయిలవంటివారే అయిన మా మఱదండ్ర ఏకైక పుత్రులు చి॥లంక శోభన్ ప్రసాద్‌కు, చి॥ పిల్లలమఱ్ఱి నాగచైతన్యకు...

9. నాకన్న పదేండ్లు ముందుగా విశ్వవిద్యాలయ స్థాయిలో 'తెలుగు జానపద గేయ సాహిత్యము'ను గూర్చి అపూర్వ పరిశోధన కావించిన ఆచార్య బిరుదురాజు రామరాజుగారికి; నా తరువాత (1968 తరువాత) జానపద సాహిత్య పరిశోధనలు కావించిన సోదర సోదరీమణులందఱికిని...

10. ఆనాటినుండి (1970 నుండి) ఈనాటి వఱకును (2013 వఱకును) నేను తలపెట్టిన సాహిత్య కార్యక్రమము లన్నింటికిని ఉదారముగా సౌజన్యమును చూపుచున్న 'దానరాధేయ' శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠి మహోదయులకు...

11. బెంగుళూరులో నాకు వెన్నుదన్నుగా నిలిచి, కొండంత అండగానుండి, ఎన్నో ఉపకారములు చేయుచున్న ఆప్తమిత్రులు, విశ్రాంత ఐ.ఎ.ఎస్. అధికారి శ్రీ బుల్లా సబ్బారావు మహోదయులకు...

12. మహారాజ పోషకులు, 'రాయలసీమ రత్నము' శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డిగారికి... నా ప్రాణమిత్రులు శ్రీ ముక్కమళ్ళ నారాయణరెడ్డిగారికి, శ్రీ బసిరెడ్డి శ్రీనివాసులురెడ్డికి...

13. ఎన్నో ఏండ్లు నా కవిత్వ పత్రిక 'చైతన్యకవిత'కు ధనసహాయము చేసిన 'దానచింతామణి' కీ.శే. దళవాయి కృష్ణస్వామి ఆదికేశవులుగారి దివ్యస్మృతికి... మఱియు సంగీత సాహిత్య రసికులు, మెటలర్జీ ప్రొఫెసరు డి.హెచ్. శాస్త్రి (ద్వాదశి హనుమద్రామశాస్త్రి)గారి ఆత్మీయస్మృతికి...

14. మాతఱుకులోని నా వైద్యమిత్రులు డా॥ డి. ఇందిరాదేవి– డా॥ డి. గోపాలకృష్ణమూర్తి దంపతులకు, డా॥ జి. సోమరాజుగారికి... తిరుపతిలోని 'కడపరెడ్డి' సంగడీడు దుంపా శ్రీరాములురెడ్డిగారికి... బెంగుళూరులోని ప్రియమిత్రులు కీ.శే. వై.వి.వెంకటేశ్వరరావుగారికి... నా పండిత ప్రకాండ సఖులు డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారికి, డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారికి... ప్రొ॥ రత్నాకరం శంకరనారాయణరాజుగారికి...

15. ప్రాథమిక పాఠశాలలోని 'రెడ్డి బుల్లిరాజు'నుండి, విశ్వవిద్యాలములోని 'లింగమనేని బసవశంకరరావు' వఱకును గల నా సహాధ్యాయులందఱికిని...

16. 1969 నుండి 1996 వఱకును నా తెలుగు సాహిత్య పాఠప్రవచనములు విని ఉత్తేజితులైన నా ప్రియమైన విద్యార్థినీ విద్యార్థులందఱికిని... మఱియు పరిశోధన ప్రియశిష్యులు కీ.శే. వి.వై.వి. సోమయాజిగారికి, కీ.శే. పంపన సూర్యనారాయణగారికి...

17. ఈ గ్రంథ ముద్రణ సమితికి ఉదారముగా విరాళము లందించిన వదాన్యులైన బంధుమిత్రులందఱికిని...

18. భావ ఉగాది నుండి (11–4–1994 నుండి) ఈనాటి వఱకును బెంగుళూరులో "నెలనెలా వెన్నెల" పేరుతో తెలుగు సాహిత్య సభలు నిర్వహించుటకు నాకు ఆర్థికముగా హార్దికముగా సహకరించుచున్న "శ్రీకృష్ణదేవరాయ రసజ్ఞ సమాఖ్య" ("శ్రీరస") సభ్యులందఱికిని...

– భక్తి ప్రపత్తులతో... నమస్సులతో... ఆశీస్సులతో... అభినందనలతో... తంగిరాల వెంకట సుబ్బారావు

# కృతి స్వీకర్తలు

తల్లి : మమ్మల్ని పెంచి పెద్దచేయటం కోసం అష్టకష్టాలు పడిన మాతృమూర్తి, అభిమానవతి, పెదవాడపల్లె భళ్ళమూడి కృష్ణమూర్తిగారి యింట్లో పెద్ద ఆడపడుచు **కీ.శే. తంగిరాల సీతామహాలక్ష్మిగారు** (1907–1990).

తండ్రి : ప్రముఖ కృష్ణయజుర్వేద పండితుడు, మనస్సన్యాసి, సంసారం విషయంలో తామరాకు మీది నీటిబొట్టు, రాగద్వేషాలకు అతీతుడు, దైవసమానుడు **కీ.శే. తంగిరాల వేంకట సుబ్బావధానులుగారు** (1904–1968) కాకుల ఇల్లిందల పఱ్ఱు, ప.గో.జిల్లా.

పెద్దక్కయ్య : పూర్వార్ధంలో సిరిసంపదలతో తులతూగి, ఉత్తరార్ధంలో దారిద్ర్య సముద్రంలో ఈదులాడి, చివరికి కేన్సర్ మొసలి నోటపడిన **కీ.శే. చల్లా (తంగిరాల) పెద వెంకట రామలక్ష్మిగారు** (1924–1998). (భర్త: కీ.శే. చల్లా పాపయ్యశాస్త్రిగారు, పేకేరు, పశ్చిమ గోదావరి జిల్లా).

'చెల్లక్క'–చిన్నక్కయ్య : మొదట కొద్దికాలం సుఖించి, పిమ్మట బహుసంతానంతో, కటికి పేదరికంతో కష్టాల గోదావరిలో కొట్టుకొనిపోయిన **కీ.శే. బులుసు (తంగిరాల) చిన వెంకట రామలక్ష్మిగారు** (1926–1985). (భర్త: కీ.శే. బులుసు సోమన్నగారు, రాజమండ్రి).

అన్నయ్య : సంఘజీవి, బుద్ధిజీవి, నియమబద్ధజీవి, గాంధీయవాది, వ్యాయామ ప్రియుడు, చతుర సంభాషణా నిపుణుడు, ఉభయ భాషా ప్రవీణుడు, కవి, పండితుడు, ఉత్తమ వక్త, విశ్రాంత ఆంధ్రోపన్యాసకుడు, నా మొట్టమొదటి సాహిత్య గురువు, నా 'కాటమరాజు కథల' కృతిస్వీకర్త: **శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులుగారు (శ్రీ టి.వి.కె. సోమయాజులుగారు)** ఎం.ఏ. (తెలుగు), తణుకు. (భార్య: శ్రీమతి కోట భాస్కరలక్ష్మి).

'బాచి' తమ్ముడు : మా నాన్నగారి వంటి అమాయకుడు, మాతృభక్తి పరాయణుడు, సంతత దైవధ్యాన పరాయణుడు, పంచభక్ష్య పరమాన్న భోజనప్రియుడు, 'అజగర స్వామి', లక్ష్మీకటాక్ష సిద్ధిపొందిన అదృష్టవంతుడు, **చిరంజీవి తంగిరాల భాస్కరరావు,** బి.ఇ. (సివిల్), రిటైర్డు ఎక్జిక్యూటివ్ ఇంజనీరు (P.W.D), రాజమండ్రి. (భార్యలు: కీ.శే. వేదుల బాలాత్రిపుర సుందరి, శ్రీమతి ప్రవా శకుంతల).

'బుల్లి' తమ్ముడు : మా తంగిరాల సోదరులలో మహావీరుడు, నిరంతర చైతన్యవంతుడు, బంధుజనుల పాలిటి కల్పవృక్షం, నిత్యం సిరిసంపదలతో తులతూగే భోగి, సంతత త్యాగి, 'జానపద సాహిత్యం– వీరగాథలు' అనే నా సిద్ధాంతవ్యాస సారాంశ కృతిస్వీకర్త, **చిరంజీవి కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి,** బి.ఇ. (మెకానికల్), కాకినాడ. (భార్య: శ్రీమతి మల్లాది శంకరి).

'అబ్బిగాడు' మామయ్య: 'తన్నుమాలిన ధర్మం'గా బంధువులకు ఎన్నో ఉపకారాలు చేసి, మోసపోయిన మా అమ్మగారి ఆఖరి తమ్ముడు **కీ.శే. భళ్ళమూడి సూర్యనారాయణగారు,** అనకాపల్లి, విశాఖ జిల్లా.

గురుదేవులు : **స్వర్గీయ దిగుమర్తి వేంకట సీతారామస్వామిగారు** (భీమవరం).

గురువర్యులు : **ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, ఆచార్య జి.ఎన్.రెడ్డిగారు, ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు** (తిరుపతి).

'నా ముద్దబంతిపువ్వు'–'చిట్టి' : నా ధర్మపత్ని **స్వర్గీయ తంగిరాల (భళ్ళమూడి) శకుంతలాదేవి** (1940–2006)

మా చిరంజీవులు : "కాళి"– **శ్రీ తంగిరాల వేంకట సుబ్బావధానులు** (న్యూజిలాండ్); "రాము"– **శ్రీ తంగిరాల సీతారామరాజు** అలియాస్ **శ్రీరామమూర్తి.**; "సీత"– **శ్రీమతి తంగిరాల సీతామహాలక్ష్మి;** "శీను"– **శ్రీ తంగిరాల శ్రీనాథ కవిసార్వభౌమ;** "శశి"– **డా॥ తంగిరాల రేవతీ శశిప్రియ.**

కోడళ్ళు : **శ్రీమతి ద్వాదశి నాగలక్ష్మి** (న్యూజిలాండ్); **శ్రీమతి ఎన్.ఆర్.విమలకుమారి; శ్రీమతి కె.ఆర్.జయశ్రీ.**

అల్లుళ్ళు : **ప్రొ॥ సి.జి. పుట్టప్ప; శ్రీ అశోక్ కులకర్ణి.**

మనుమలు : **చి॥ పి. సంజయ్** (భార్య: శ్రీమతి అక్షత; కొడుకు: **చి॥ అర్జున్**– నా మునిమనుమడు)
**చి॥ డా॥ తేజస్వి తంగిరాల** (న్యూజిలాండ్) **చి॥ మహిర్ కులకర్ణి, చి॥ స్కంద్ తంగిరాల.**

మనుమరాండ్రు : **చి॥ శిల్ప** (అమెరికా)
**చి॥సౌ॥ భావన** (భర్త: శ్రీ అద్దంకి అలెగ్జాండర్; కూతురు: **చి॥ మైర** (Myra)- నా మునిమనుమరాలు)
**చి॥సౌ॥ డా॥ శ్రీప్రసన్న ప్రత్యూష** (భర్త: శ్రీ కె.విక్రాంత్ కౌశిక్) (న్యూజిలాండ్)
**చి॥ రసజ్ఞ కులకర్ణి; చి॥ టి.వి.ఎన్. వైజయంతి.**

# వీరగల్లు

## (విషయ సూచిక)

**పంద్రెండవ ప్రకరణము: కాటమరాజు కథాచక్రము 287-374**

## ఓం నమో వేంకటేశాయ! శ్రీకృష్ణః శరణం మమ!

ఉ. శ్రీ కమనీయ హారమణిఁ జెన్నుగఁ దానును, గౌస్తుభంబునం
దా కమలావధూటియు, నుదారతఁ దోఁపఁ, బరస్పరాత్మలం
దాకలితంబులైన తమ యాకృతు, లచ్చుతఁ బైకిఁ దోఁచి, య
స్తోకత నందుఁ దోఁచెనన, శోభిలు వేంకట భర్తఁ గొల్చెదన్! (శ్రీకృష్ణదేవరాయల ఆముక్తమాల్యద)

శ్లో. తరుణారుణ కరుణామయ విపులాయత నయనం
కమలాకుచ కలశీభర విపులీకృత పులకమ్।
మురలీరవ తరలీకృత మునిమానస నలినం
మమ ఖేలతి మద చేతసి మధురాధర మమృతమ్॥ (– లీలాశుకుని శ్రీకృష్ణకర్ణామృతము)

శ్లో. ప్రాణం వాపి పరిత్యజ్య మాన మేవాభి రక్షతు।
అనిత్యో భవతి ప్రాణో మాన మాచంద్రతారకమ్॥ (నీతి శాస్త్రము)

రగడ. ఈ పొద్దిదియా రేపు తదియా నరుని ప్రాణమోయి!
నీటి మీదనూ బుగ్గ తోడిదీ నరాశరీరమ్మూ!
ఏలబోయి యీ ప్రాపంచంలో మరల ఏలబోము!
పుట్టబోయి మన తల్లి కడుపునా మళ్లీ పుట్టేమా? (ఉయ్యాలవాడ నారసింహారెడ్డి వీరగాథ)

## శ్రీ గురుభ్యోనమః

మ. తన వాత్సల్య సుధాబ్ధి ముంచి, నను నేతన్మాత్రుగాఁ దీర్చి, యం
తనఁ జాలింపక, పింగళాన్వయుని జేతన్ దీర్చి దిద్దించి, దీ
వన లందించిన దేశికోత్తముఁడు, వాక్ ప్రాగల్భ్య దుగ్ధాబ్ధి, వం
దనముల్ మా 'దిగుమర్తి' వంశ్యునకు 'సీతారామ శ్రీస్వామికి'న్.

శా. చిమ్మౌ చీఁకటిఁ జిక్కియున్న నను నాశీశ్శారద జ్యోత్స్నలో
నిమ్మౌ చోటుకుఁ జేర్చి, బాధ్యతగ నన్నీ పీఠమెక్కించి, పా
ల్గుమ్మల్ పొంగు నదృష్టమిచ్చిన బుధున్ 'కోదండ రామా'ఖ్యు, మా
'తిమ్మావజ్ఝుల' సద్గురున్ దలఁతు భక్తిన్ భుక్తిఁ గొన్వేళలన్.

– తంగిరాల వేంకట సుబ్బారావు

"తెలుగు వీరగాథా కవిత్వము"– మొదటి సంపుటము అంకిత సమయములో–

# అన్న ఆశీస్సులు-అనుజుల అభివాదములు

ఉ. *"కాలము కాటువేయగ, వికాసము కోల్పడి, కొన్ని నాల్కలన్*
*జాలిగ నిల్చి, ఆంధ్రుల యశస్సులు పాడఁగ శక్తిలేని "గా*
*థాళి"కి జీవమిచ్చితివి! మహాద్భుత రూపము దిద్దినావు! ఆం*
*ధ్రాళియె అప్పువడ్డది సుమా! భవదీయ విశిష్ట సేవకున్!"*

శా. *"ఎన్నోయేండ్లు శ్రమన్ మునింగితివి! నీ వీ "వీరగాథాళి"కై*
*ఎన్నో కష్టములంది, సేకరణకై ఇంటింట మార్మూలలన్*
*ఎన్నో బాధలు కూడుగా కుడిచి, మా కీనాఁడు నీ కష్ట మ*
*న్నన్నా! పాలుగ పంచిపెట్టితివి! వహ్వా! ఎంత సౌభ్రాత్రమో!"*

ఉ. *"అంతములేని యీ కృషి మహత్తర దీక్షగ చేసి, క్రొత్త సి*
*ద్ధాంతము నిల్పి, ముద్రణ విధానపు బంగరు పూతవెట్టి, ర*
*వ్వంతయు నీకు తోడ్పడని అన్నకు– తమ్ముల కిచ్చినావు! నీ*
*యింతటి పిచ్చిప్రేమ కివె యిచ్చెద వేనకు వేలు దీవనల్!"*

ఇట్లు

నన్నయ భట్టారక పీఠము
తణుకు
**15–8–2000**

ఆశీస్సులతో– అన్న: టి.వి.కె. సోమయాజులు
అభివాదములతో తమ్ముళ్ళు:
తంగిరాల భాస్కరరావు
తంగిరాల కృష్ణమూర్తి

# సౌహృదము

–ఆచార్య కోవెల సంపత్కుమారాచార్య

శా॥ *"భావావేగ విచిత్ర వాఙ్మయ విధా వాల్లభ్య యుగ్వీరగా*
*థా విద్యాప్రవణుండు, జానపద బోధాలోల విజ్ఞాని, మై*
*త్రీ వేలాకృతి తంగిరాలుని, కృతార్థీభూత సత్కర్ముఁనిన్,*
*ధీవిద్యోతితు, సుబ్బరాయు, నభినందింతున్ మనః పూర్ణతన్"*

(28–6–2000 నాడు హైదరాబాదులో జరిగిన **"తెలుగు వీరగాథా కవిత్వము"** మొదటి సంపుటము ఆవిష్కరణ సభలో చెప్పిన పద్యము)

# విద్వత్కవి తంగిరాల

'నవకవితా పితామహ' ***డా॥ గుంటూరు శేషేంద్రశర్మగారు***
(30-3-1995)

*ఉ॥ క్రోధములేని సాధువు, అకుంఠిత నైతికశీలశాలియున్,*
*ఆధునికాంధ్రవాఙ్మయ మహార్ణవనౌక, కవిత్వమాధురీ*
*శీధుపిపాసి, మిత్రజనసింధు శరద్వర పౌర్ణమాసియున్,*
*సౌధములేని రాజునకు సాంద్ర నమస్సులు 'తంగిరాల'కున్.*

*శా॥ సాయంకాల శశాంకరేఖ, మధుమాసాయాత చూతాంకుర*
*చ్ఛాయాపాయి కిశోర కోకిలము, విశ్వాకాశ కోశాంతర*
*ప్రేయోవాయు సుపర్ణ బిందువు, వచఃపీయూష యోషిత్ కృపా*
*శ్రేయోజన్ముని, 'తంగిరాల' సఖునిం బ్రేమింతు, శేషేంద్రుఁడన్.*

# జానపదము-జ్ఞానపథము

*డా॥ మల్లేల గురవయ్యగారు*

*సప్తపది: దాని వాక్కుచేఁ దెల్పెడి తత్త్వమెదియొ*
*అనుభవమునకుఁ దుదిహద్దటంద్రు బుధులు*
*'తంగిరాల' సతీర్థ్యుఁ డుద్దామయశుఁడు*
*జానపద వాఙ్మయాంభోధి సలిల (సార) మెల్ల*
*పుడిసిలించు నగస్త్యుఁ డద్భుత వచస్వి*
*'జ్ఞానభారతి'కిన్ జతురాననుండు*
*కన్నడము-తెల్గు సంధాన కారకుండు!*

(22-2-1999 'రేనాటి సూర్యచంద్రులు' గ్రంథావిష్కరణ సందర్భమున)

# కార్యయత్నోజ్జ్వలా!

*శ్రీ గింజల నరసింహారెడ్డిగారు* (28-8-2000)

*క॥ ఒక కొన్ని డాక్టరేటుల*
*సుకమల మాలా మహత్త్వ శోభల స్థానాల్*
*అకలంక వీరగాథా*
*నికర భవత్ కృషి ఫలాఖ్య నీరాకరముల్.*

*శా॥ నీ వైదుష్యము స్వీయరంగమున వాణీనూపురధ్వాన శో*
*భా విఖ్యాతము- నీ సునైతికత, నీ ప్రౌఢార్ద్ర సౌహార్దమున్*
*తావుల్ జిమ్మెడు చైత్ర సుందర శుభోద్యానాలహో మిత్రమా!*
*సేవామంజుల! 'తంగిరాల'! సుకృత శ్రీకార్యయత్నోజ్జ్వలా!*

*తే॥ నైకవిధ సాహితీ సేవన ప్రవీణ!*
*అన్యరచయితృహితవర్ధకాధ్వ! రమ్య*
*శేముషీ హాస భాసిత! సితజలేజ*
*ఘన యశస్సాంద్ర! సౌజన్య మణిఘృణి ధన!*

# గురుదేవుల ఆశీస్సు

*"వీరగాథలను గుఱించి ఈ ఆంధ్రదేశములో*
*నీవొక్కనివే ప్రసంగింపగలవు!"*

**- శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారు**

# గీటురాయి

"తంగిరాల వెంకట సుబ్బారావు పది పన్నెండు డాక్టరేట్ పట్టాలకు సరిపడా విషయ సేకరణ చేశారు. కాలికి బలపం కట్టుకొని దేశమంతా తిరిగారు. చేతివ్రేళ్ళు అరిగేదాకా కలానికి పనిపెట్టారు... ఆ తర్వాత వర్గీకరణకు పూనుకొని కృతకృత్యులయ్యారు. తదుపరి వివరణాత్మకమైన రచనలోనూ సాఫల్యం పొందారు".

**-ప్రొ॥ కె.వి. రమణారెడ్డిగారు,** (భారతి, జూన్ 1988)

# మా సుబ్బన్న బావ

- శ్రీ దుగ్గిరాల రామారావుగారు

**"మ**ధురకవి"– "సరసకవి"– "సారకవితాభిరామ"– "కవిసుధాకర"– శ్రీ దుగ్గిరాల రామారావుగారు తంగిరాలవారిని గురించి "మా సుబ్బన్న బావ" అనే పేరుతో 50 పద్యాలు వ్రాశారు. ఇవి "చైతన్యకవిత"లో మొదట ప్రచురితమయ్యాయి. తరువాత దుగ్గిరాలవారు ప్రకటించిన "సుమనోభిరామము" (2005) అనే పుస్తకంలో వచ్చాయి. వాటిలో నుండి మూడు పద్యాలు:–

చ. *పలుకులదేవి సేవలను పండిన శీర్షము, దబ్బపండుతోఁ*
*గలఁబడు మేను, కాశ సువికాసము వాసము మీసకట్టు, మ*
*లెల్లలు విరఁబూయు లేనగవు రేకలు, 'సుబ్బనబావ' పండు వె*
*న్నెల దిగజారు మేరు ధరణీధర శృంగము భంగిఁ గన్పడున్.* **1**

సీ. *'చైతన్య కవిత'కు సంపాదకుండు, స*
*ద్గ్రంథ సంతతికి ముద్రాపకుండు,*
*అనుకూలురగు బిడ్డలనుగన్న జనకుండు,*
*ఖ్యాతిగన్నట్టి అధ్యాపకుండు,*
*వలచి చేకొను 'శకుంతల'కు దుష్యంతుండు,*
*పరిణతిఁ గన్నట్టి పండితుండు,*
*'సోమయాజులు'కుఁ గూర్చు సహోదరుఁడు, తంగి*
*రాలాబ్ధి తరుణ సారంగధరుఁడు*

తే. *భావబంధుర మధుర సంభాషణుండు,*
*ముచ్చటం గొల్పు వినయ విభూషణుండు,*
*జానపద సాహితీ విశేషముల తావు,*
*సుగుణముల ప్రోవు, వేంకట సుబ్బరావు!* **2**

సీ. *అభ్యుదయ కవులం దధికుండు 'బాల గం*
*గాధర తిలకు' సంగాతకాఁడు,*
*అభినవ పెద్దన్న యనఁదగు 'గుంటూరు*
*శేషేంద్రశర్మ' మెచ్చిన బుధుండు,*

'బుల్లా'కులాబ్ధి జాబిల్లి 'సుబ్బారావు'
ప్రాణమ్ము ప్రాణమైనట్టి సఖుఁడు,
'దళవాయి' పారిజాతమ్ము 'కృష్ణస్వామి
ఆదికేశవుల' వీరాభిమాని,

తే. దొరకవి వరుఁడు 'మల్లెల గురవయ' కవి
విమల కృతికన్యఁ జేకొన్న పెండ్లికొడుకు,
ధన్యజీవి, మా 'ఆచార్య తంగిరాల'
వర్ధిలునుగాత నూరు సంవత్సరాలు! *3*

# సమాంతర సాహిత్యం

ప్రముఖ విమర్శకులు, విప్లవ కవి, పండితులు, 'విరసం' అధ్యక్షులు, రాజనీతి శాస్త్రజ్ఞులు: ప్రొ॥ కె.వి. రమణారెడ్డిగారు

**అ**చ్చమైన 'దేశి' సాహిత్యం మచ్చలేని చంద్రబింబమే. అలాంటిది అసలే ఉండదని నిర్ధారించడం సాహసం మితిమీరడం కావచ్చుగాని, పూర్తి స్వచ్ఛందమైన 'దేశి' సాహిత్యం అపురూపమైన పదార్థమే. 'దేశి' సాహిత్యం చాలావరకు అపురూపం పొందిన 'మార్గ' సాహిత్యమే ననిపిస్తుంది.

ఇలా అనిపించడానికి కారణాలు అనేకం. వాటిలో మొదటిది ప్రజాసామాన్యం నిరక్షరాస్యత మాత్రమే కాబోదు. ఆస్తిలో అంతరాలేకాదు, అసలు సొంతానికి ఆస్తిగాని, అలాంటి ఆస్తి గురించిన భావంగాని లేని అత్యంత ఆదిమకాలంలో, లిపి రూపొందడానికి ఎన్నో శతాబ్దాల ముందు, ఆహారాన్వేషణలో, సేకరణలో, ఉత్పాదనలో అతి హీనమైన స్థాయిలో వుంటూ పరస్పర సహకారమూ, సామాజిక విభజనా చేసుకోక తప్పని గణ సమాజ దశలో, ప్రకృతిని వశీకరించుకుంటున్నామన్న భ్రమతోటి ఆత్మవిశ్వాసం పొందుతూ, సామూహిక నృత్యగానాలతోటి తమ శ్రమకు సంబంధించిన సాహిత్యాన్ని స్వచ్ఛందంగానే వెలువరించేవారు. విడి విడి కళలుగా అటు తర్వాత ఎంతోకాలానికి ప్రత్యేక ప్రతిపత్తి పొందిన సాహిత్య, నృత్య, గానాలు ఆనాటి అకృత్రిమ జీవన విధానానికి అనుగుణంగా ఉంటూ వచ్చాయి. అయితే, అవిభాజ్యంగా వుండిన యీ కళారూపాల విషయంలో తమలో ఒకరో కొందరో ప్రత్యేక ప్రావీణ్యం పొంది, దాన్ని తమ బిడ్డలకు అందించి పోయే క్రమంలో అవి ఆనువంశికంగా కొనసాగి వుండవచ్చు. ఇలా ఒక 'శిష్ట' బృందం రూపొందీ ఉండవచ్చు.

భౌతిక వస్తూత్పత్తి సాధనాలు మొరటువి కావడం కారణంగా ఉత్పాదనా శక్తి పరిమితమై, జనానికి బొటాబొటీగానే సరిపోతూ వచ్చిన ఆదిమ గణ సమాజ దశ, ప్రధానంగా తన అంతర్గత వైరుధ్యాల మూలంగానే క్షీణించి నశించాక, దాని శిథిలాల మీద లేచిన ప్రాచీన రాజరికాలు తమ బౌద్ధిక జీవితానికి ఆలంబనంగా ఇలాంటి శిష్ట బృందాలనే ఆశ్రయించి, పోషిస్తూ వచ్చినందుచేత, సహజంగానే అది పోష్య–పోషక సంబంధాల మూలాన పరిపాలకులకు పనికిరాగల భావాలనే ప్రకటిస్తూ, కొత్త కొత్త సామాజిక– ఆర్థిక వ్యవస్థల ప్రయోజనాలను పరిరక్షించే విధంగా భావోత్పాదననూ ప్రచారాన్నీ కొనసాగించడం జరిగింది. ఈ క్రమంలో కళలుగానీ, ఇతర భావజాల రూపాలైన మత విశ్వాసాదులు గానీ, పోను పోను ప్రజలకు దూరమై, ప్రజలనుంచి స్వతంత్రమై, ప్రజా జీవితాన్ని పాలకవర్గాలు అనుకూలంగా మలచుకునేందుకు సంకల్పపూర్వకంగానే ప్రయత్నించినందుచేత, భౌతిక పరాధీనతకు భావ పరాధీనత తోడైంది. ఏ యుగం భావజాలమయినా ఆ యుగం పాలకవర్గానికి అనుకూలమైన భావజాలమే.

దీనికి అపవాదం లేనేలేకపోలేదు. పాలకవర్గ సంస్కృతికి భిన్నంగానే గాక, బద్ధ విరుద్ధంగా కూడా, పాలిత ప్రజాకోటిలో స్వచ్ఛందంగా విశిష్టమయిన భావధోరణి తలెత్తినప్పుడు, దాన్ని 'ప్రతి సంస్కృతి' (Counter Culture) అనవచ్చు. అయితే అలాంటిది చాలా అరుదు. పాలకవర్గ సంస్కృతి ప్రభావానికి లోనై, దాన్నే మదికెక్కించుకొని, నరనరానా జీతింపజేసుకున్న ఫలితంగా, అనుకరణ జరుగుతుంది– లేదా అనుసరణ. అయితే ఇది 'శిష్ట' స్థాయిని ఎలాగూ పొందజాలదు గనక, దాన్ని 'భ్రష్టం' (Vulgarise) చేస్తుంది. ఇలాంటి ప్రజాసంస్కృతిని 'సమాంతర సంస్కృతి' (Parallel Culture) అనవచ్చు. 'సమాంతర సాహిత్యం' దీని అంతర్భాగమే. ఇది అసలుకి నకలూ కాదు, అసలు ఎలాగూ కాదు. దీని లోపం స్వచ్ఛందత. అందుచేత ఇది కుహనా సృజనే కాని అనుసృజన కూడా కాలేదు. అయినా ఇది జనంలో– పామరలోకంలో – విరివిగానే వ్యాప్తి పొందుతుంది. సమాజ నిర్మితి నిచ్చెనవంటిదయితే, దాని కిందిమెట్టున వున్న సామాన్య ప్రజ, పైమెట్టున వున్న 'శిష్ట' పాలకవర్గాన్ని సంస్కృతి విషయాలలో అనుసరిస్తూ, లేని ప్రతిష్ఠను సమకూర్చు కొనేందుకు ఎన్నెన్ని తంటాలో పడుతుంది. 'మౌఖిక' సంప్రదాయంగా పేరుపొంది ఉన్న ఈ ధోరణి మహేతిహాసాల విషయం నుంచీ తాత్విక దర్శనాల విషయం దాకా వర్తిస్తుంది. అద్వైత వేదాంతం వంటి గహనాల నుంచి కూడా తన శక్తి మేరకు ఎన్నో అంశాలను రాబట్టుకుని, తన మాట తీరునే గాక తన ఆలోచనారీతినీ దానికి జతచేసిన వాస్తవం ఎన్నో 'తత్త్వాల'లో ('అచల' తత్త్వం లాంటివి) కనిపిస్తుంది. ఇది ఒకానొక నిదర్శనం మాత్రమే.

'అపౌరుషేయాలు' గనక లిపిబద్ధం కాకూడదని వేదాలను సైతం మౌఖిక పద్ధతిలోనే గత శతాబ్దం ద్వితీయ దశకం దాకా వల్లెవేయిస్తూ, జటాంత స్వాధ్యాయులనూ, ఘనాపాఠీలు వగైరాలను రూపొందించుకుంటూ సంప్రదాయాన్ని, లిపి రూపొందిన తర్వాత గూడా కేవలం నిర్హేతుక విశ్వాస బలంకొద్దీ, అలాగే కొనసాగించారు 'శిష్టులు'. అక్షరాస్యతకే నోచుకోని పామరుల విషయం వేరే చెప్పాలా? 'మౌఖిక' సంప్రదాయం అని పేరు పెట్టినంత మాత్రాన్నే ప్రతిదీ జానపదసాహిత్యమో, ప్రజాసాహిత్యమో కాగలుగుతుందనుకోవడం అవిచార మూలకమైన అభిప్రాయం. అయితే అభూత మనిపించే కల్పనాచాతుర్యం, వర్ణనా కౌశలం, పాత్రచిత్రణ వైచిత్రి, పరమ హృదయంగమమైన రీతిలో ఈ జానపద సాహిత్యాన్ని విలక్షణంగా నిలిపి, అత్యంత ఆత్మీయమే (Homely) అని అనిపింపచేసే విశేషాలు లేకుంటే, రాజపుత్రిక, ఋషిపత్ని అయిన రేణుక ఏకవీరగానో ఎల్లమ్మగానో మాహురమ్మగానో రూపొందడం మాత్రమే కాక, వర్ణభేదాలను సైతం ఎలా అతిక్రమించ గలుగుతుంది? పలనాటి వెలమనాయుడు బ్రహ్మన్న విష్ణు స్వరూపుడెలా కాగలుగుతాడు?' 'మార్గ' పద్ధతి సాహిత్యానికి భిన్నంగా ఈ 'దేశి' సాహిత్యం ఎక్కువగా మాత్రాచ్ఛందస్సులనో లేక ద్విపదలనో ఆశ్రయించడం గానీ, రకరకాల చిందులతో దరువులతో

గూడిన పాటల రూపం పొందడం గానీ, గోరంత వాస్తవానికి కొండంత కల్పనను జోడించి, స్థల, కాల, యథార్థ విషయాలను గజిబిజి చేస్తూ, సామాజిక చరిత్రకు తరగని గనిలా వుండవలసిన కథా ఇతివృత్తాన్ని దుర్గమారణ్యంగా మార్చడం గానీ ఎలా జరుగుతుంది? చిలవలు పలవలుగా పెరిగి మహావృక్షంలా రూపొందే కొన్ని కొన్ని గాథలు ఒక్కొక్క 'చక్రం' కాగలిగాయంటే, జానపదుల కల్పనాశక్తి ఎంత అపారమైనదో గ్రహించవచ్చు.

**కాటమరాజు కథలను, పలనాటి కథలను, ఇతర వీరగాథలను సేకరించ బూనుకోవడమే 'హెర్క్యూలియన్ లేబర్' లాంటి గొప్ప శ్రమ. ఓపికకూ, కష్ట సహిష్ణుతకూ కఠిన పరీక్షలాంటి ఈ గాథాసేకరణను ఔత్సాహికులైతే, ఇతర వ్యాసంగాలూ వ్యాపకాలూ లేనివారైతే, చేయగలిగినంత తీరికగా, ఉల్లాసంగా, 'అకాడెమిక్' (academic) పరిశోధకులు చేయలేరని భావించడం సవ్యంకాదని తంగిరాల వెంకట సుబ్బారావు నిరూపించారు.** సేకరణ ఒక ఎత్తు కాగా, వర్గీకరణ మరొక ఎత్తు. మరి దానితో సరిపెట్టుకోకుండా ఈ కథాచక్రాల స్వరూప స్వభావాలను వివరించేందుకు ఎంతో ఉపజ్ఞ అవసరం. అది కూడా చాలదు. వివరణకు అస్థిబలం విశ్లేషణలోనే ఉంది. మరి ఈ కార్యం దక్షతకే గీటురాయి కావలెనంటే శాస్త్రీయమైన ఆలోచనాసరళి ఉండాలి. ఇది ఒక పట్టాన సమకూరేది కాదు. పరదేశాలలో యిలాంటి కృషికి సంబంధించి పరిశోధన గ్రంథాలు రాసిన ఆధునికులు ఎలాంటి భావపరమైన చట్రాన్ని (Conceptual Frame Work) రూపొందించుకొని, తాము సమకూర్చుకున్న సంక్లిష్టమైన విషయారణ్యాన్ని ఉద్యానవనంలా ఎలా మార్చుకోగలిగారో ముందుగా తెలుసుకొని వుంటే గాని, వీలైనంత నిర్దుష్టమైన విశ్లేషణను, గతానుగతికంగా తప్ప ఆలోచించలేని మన 'అకాడమిక్' (academic) పరిశోధకులు సైతం సాధించలేరు. 'పండిత సంప్రదాయ' వాసనలు వదలనంత కాలం శుష్కరమైన ప్రకర్ష స్థానంలో సార్థకమైన పరిశీలన గట్టిగా కాలూనలేదు. **తంగిరాల వెంకట సుబ్బారావు పది పన్నెండు డాక్టరేట్ పట్టాలకు సరిపడా విషయసేకరణ చేశారు. కాలికి బలం కట్టుకొని దేశమంతటా తిరిగారు. చేతివ్రేళ్ళు అరిగేదాకా కలానికి పనిపెట్టారు. టేప్‌లు ఎన్నో వాడుకున్నారు. ఆ తర్వాత వర్గీకరణకు పూనుకొని కృతకృత్యులయ్యారు. తదుపరి వివరణాత్మకమైన రచనలోనూ సాఫల్యం పొందారు.** ఎటొచ్చీ, విశ్లేషణ విషయంలోనే మరింత లోజూపుతోపాటు చుట్టుచూపును అలవరచుకొని వుంటే ఈ బృహత్‌కృషి సర్వాంశాసంపుష్టం కాగలిగి వుండేది. అసలే లేదనికాదు. ఉన్నదానికంటె ఉండవలసిందే ఎక్కువేమో! అయితే, చేసినంతవరకు చూసినా **ఎంతో సంతృప్తి కలిగేలా తన సిద్ధాంత వ్యాసాలను బహు విషయ సంపన్నం చేయగలిగారు. ఇలాంటి 'అకాడెమిక్' (academic) పరిశోధన ఎక్కడో తప్ప తనకు తగిన సమవుజ్జీని ఎదుర్కోలేదు.**

**డాక్టర్ పట్టా పొందిన తంగిరాల వెంకట సుబ్బారావుకు శ్రావ్యమైన కంఠస్వరం పెట్టని వరంగా. గానానికి ఒదిగి మెళకువలెన్నో చూపగల తన గొంతుకనుంచి తానే సేకరించిన ఒక వీరగాథను (సర్వాయి పాపని కథను) వినడం తటస్థించింది. శృంగార, కరుణరస ప్రకటనకే యోగ్యం అని భ్రమ గొలిపేంత కోమలమైన ఆ కంఠస్వరం వీరాన్ని సైతం పలికించగలిగి ఆశ్చర్యం కొలిపింది.**

ఈ వ్యక్తి విశేషాన్ని అటుంచి చూస్తే, ఈ 'మౌఖిక' జానపద సాహిత్యరాశినుంచి రాబట్టుకోగలిగిన, రాబట్టుకోవలసిన నెల్లు ఎంత, దాని సాయంతోటి సమకూర్చగలిగిన సామాజిక చారిత్రకాంశ ఏపాటిది, అని ఆలోచించాలి. గాథాకారులెవరైనా గాయనీ గాయకులు సమాజం అడుగు పొరలనుంచి వచ్చిన వ్యక్తులు. ఈ వ్యక్తులకు ఇది ప్రత్యేకసిద్ధి కాదు. సమష్టి సంచితం కొందరి ముఖతా వెలువడుతుంది– అంతే. మీదుమిక్కిలి, వీళ్ళు కులవ్యవస్థలో కడగొట్టు భాగాలకు చెందినవాళ్ళు– స్పృశ్యులుగానీ, అస్పృశ్యులుగానీ, విద్యాగంధం శూన్యం. సంపదకెలాగో శిష్ట సంస్కృతికి అలాగే దాదాపుగా వెలిబడిన సాదామనుషులు. అయితే తరతరాల నుంచీ యీ గాథా సాహిత్యాన్ని సొంతం చేసుకొని, అవిచ్ఛిన్నంగా మౌఖిక పద్ధతిలో కొనసాగించ గలుగుతున్నారు. పల్లెపట్టున రాత్రులకు రాత్రులు వరసగా అవిశ్రాంతంగా కథాగానం చేస్తూ కొందరు, శ్రమక్రమంలో అలసటనూ, వేసటనూ తొలగించుకునేందుకు అలవాటు చొప్పున గానం చేసేవాళ్ళు కొందరు, పురుషులు స్త్రీలు యీ పామర సాహిత్య సంప్రదాయాన్ని చావనీకుండా నిలబెట్ట గలుగుతున్నారు. నాగరికత వ్యాపిస్తున్నకొద్దీ ఈ భూస్వామిక యుగీన పామరజన సంస్కృతి కంటికే గాక చెవికీ దూరమై మొరటనిపించుకొని అదృశ్యం కాక తప్పదు. ఇలాంటి స్థితిలో, ఇంకా నేలమీద నూకలు మిగిలి వుండగానే దాన్ని వెదికి, నెమికి, పట్టి, అక్షరబద్ధం చేసి, నిక్షేపించాలంటే మరో వందమంది తంగిరాల వెంకట సుబ్బారావులైనా అవసరం. వెయ్యి చేతులు చేయగలిగిన పని ఇంకా మిగిలి వుంది. **డా॥ బిరుదురాజు రామరాజు, డా॥తూమాటి దొణప్ప, డా॥ నాయని కృష్ణకుమారి, డా॥ గోపు లింగారెడ్డి, ఇంకా ఎందరో ఈ విధమయిన పనకి పూనుకొని ఎంతో కొంత సత్ఫలితమే చూపెట్టారు. అయినా ఇది నేటికీ సశేషమే. వీరికి, డా॥ సుబ్బారావుకు మధ్యగల భేదం, నాకంటికి, ఒక్కటే కనిపిస్తూంది. గుణంలో గాకున్నా పరిమాణంలో సుబ్బారావు పరిశోధనాకృషి బారైనదే గాక బరువైనది. నిడివిలోనే గాక విరివిలోనూ భేదం కనిపిస్తుంది.**

కాటమరాజు కథాచక్రంగానీ, శక్తికథాచక్రంగానీ, పలనాటి వీరకథాచక్రం గానీ వ్యక్తి మాత్రులైన కర్తలకు చెందినవి కావు. రచనలు అసలే కావు. 'కవిసార్వభౌముడు' అనిపించుకున్న శ్రీనాథుడు పలనాటి వీరచరిత్రను రచించి వుండడు. రచించాడనుకొన్నా, తనకు యోగ్యమనిపించిన 'బాలుని యుద్ధం' వంటి భాగాలే రచించి వుండవచ్చు. 'శ్రీనాథ భట్టు'కూ– 'కవిసార్వభౌము'నికీ అభేదం చెప్పడం సాహసం. కొండయ్య, మల్లయ్య, మరొకరు, ఇంకొకరు– యిలాంటి వారే వీటిని గ్రంథస్థం చేసి వుండాలి. మంజరీ ద్విపద నడకలో గూడా కుంట్లు, రచనలో ఛందోభంగాలు, శబ్ద దోషాలు వల్లకొల్లగా కనిపించడానికి కారణం, యిదంతా పామరజన సృజన కావడమే. "పండితుల చేతఁ బరిష్కరింపబడియె" నని ప్రకాశకులు ఎన్నడైతే రాశారో,

అప్పుడే జానపద సాహిత్యాన్ని సంస్కరించి, శిష్ట సాహిత్యస్థాయిని కల్పించాలనే తాపత్రయంతోటి 'పండితులు' చెయ్యి చేసుకొన్నారని అర్థం చేసికోవలసి వుంటుంది. వేమనను అలాగే సంస్కరించారు. బ్రౌను చేసి చూపినదాన్ని చెరిపారు. పల్నాటి వీరచరిత్రను "పండిత అక్కిరాజు ఉమాకాన్త విద్యాశేఖరులవారు", ఆ తర్వాత 'ఆచార్య' పింగళి లక్ష్మీకాంతంగారు ఇలాగే మార్చారు. ఈ సంస్కరణ ఒక విధమైన సంహరణ కాగా, ఈ మార్పు ఒక విధమయిన తెగటార్పుగానే పర్యవసించింది. మాతృక మొక్కట్లు స్ఫుటంగా కనిపించని విధంగా పత్రికను పాండిత్యకోటి సింగారించడం, జానపద సాహిత్యాన్ని న్యూనతనుంచి తప్పించే ఉద్దేశ్యంతోటి కృతకతకు లోబరచివేయడమే. డా॥ టి.వి. సుబ్బారావు యిలా బలంగా చేయిజేసుకోలేదనే అనుకుంటున్నాను. ఎవరు అలా చేసినా క్షమార్హులు కారు. ఆ పని సాహిత్య- అకృత్యమే.

సిద్ధాంత గ్రంథరచనకు గ్రాంథిక భాషనే విధించిన రోజులలో టి.వి.సుబ్బారావు తన రచన చేశారు (1968). నిబంధన ప్రకారమే చేసినా, ఇష్టం కొద్దీ చేసినా, తన సిద్ధాంత గ్రంథంలో ఆయన వాడిన గ్రాంథిక భాషాశైలి కఠినం గాకపోవడం మంచిదయింది. లేకుంటే కొరుకుడు పడకుండా వుండేది. విశ్లేషణ పాలు ఎక్కువై వుంటే, వర్ణనా వైఫల్యం తగ్గి వుండేది. దాని మూలంగా ముద్రణలో వ్యయప్రయాసలు తగ్గి వుండేవి. కాని, ఇదంతా గతజల సేతుబంధనమే!

లోపాలు లేని వస్తువు ఏదీ వుండదు. లోపాలెక్కువా గుణాలెక్కువా అని చూసినప్పుడు టి.వి. సుబ్బారావు కృషి ప్రశస్తమయినది.

***(1986 జూన్ నెల 'భారతి' పత్రిక, కలగూరగంప, పుటలు 70-72)***

## A BALLAD OF 'ADVENTURE'

**I**n Telugu, there are some doctoral theses which have acquired the status of classic treatises, both by their unique content and masterly treatment. They have become synonymous epithets of their authors. One such book is Prof. T.V. Subba Rao's 'Telugu Veeragatha Kavitwamu' [Ballad Poetry in Telugu], which secured him Ph.D. from Sri Venkateswara University in 1969.

As K.V. Ramana Reddy aptly describes, ''This is not research. This is not search even! This is an adventure''. The work is voluminous that it can easily provide material for 10 to 15 theses. It is divided into 25 chapters and brought out in 4 volumes.

The present book is the first volume on 'Veeragatha Lakshanamu' (the attributes of a ballad). In this volume comprising 9 chapters, Prof. Subba Rao deals with evolution of literature, definitions, antiquity and genesis of ballad, ballads in foreign and Indian languages and in Telugu and attributes and calssification of ballads.

The book is comprehensive and analytical, with an amazing range of knowledge. The style couched in simple grandhic is delightfully readable. This is a book every Telugu scholar must read and prossess.

**G. Ramachandra Rao**
*[Indian Express, Hyderabad edition dated 02-11-2001]*

# సవరాల జిమ్మడి హేష! ఘోష!!

(ముందు మాట)

### *0. "సవరాల జిమ్మడు"–*

వీరగాథలను గురించి లోతైన పరిశోధన చేసిన నన్ను మెచ్చుకుంటూ కొందరు మిత్రులు నాకు సరదాగా "వీరగాథల సవరాల జిమ్మడు" అనే 'బిరుదు' నిచ్చారు. పల్నాటి వీరులలో ముఖ్యుడైన అలరాచమల్లుగారి గుఱ్ఱంపేరు "సవరాల జిమ్మడు". పెద్దన్న బాదరాజుగారి గుఱ్ఱంపేరు "కారుబొల్లడు". ఒకసారి అలరాజు గుఱ్ఱాన్ని మేపే 'గంగాధరుడు', పెద్దన్న గుఱ్ఱాన్ని మేపే 'దాదివారి మల్లు'– "మా యజమాని గొప్పవాడు అంటే మా యజమాని గొప్పవాడు" అని కలహించారు. ఇద్దరూ కొరడాలతో కొట్టుకున్నారు. పెద్దన్న సేవకుని కొరడాకొస వచ్చి అలరాజు గుఱ్ఱమైన సవరాల జిమ్మడి కంటి చివర చురుక్కున తగిలింది. అది పౌరుషంతో అప్పటినుండి మేత ముట్టడం మానివేసింది. అందువల్ల బాగా చిక్కిపోయింది. కారణం తెలిసికొన్న అలరాజు, పెద్దన్న గర్వించి ఉన్నాడనీ, అందువల్ల అతని సేవకుడు కూడా మదమెక్కి ఉన్నాడనీ గ్రహించి, పెద్దన్న బొమ్మచేసి దానిని తన గుఱ్ఱం కాలికి కట్టి, తన్మూలంగా పెద్దన్నను ద్వంద్వయుద్ధానికి ఆహ్వానించాడు. ఇద్దరూ చంద్రవంక నది ఒడ్డున తలపడ్డారు. ఇంతలో బ్రహ్మనాయుడు వచ్చి వారినిద్దరినీ విడదీశాడు. ఆ సమయంలో తనకన్నా, తన అన్న పెద్దన్న బాదరాజుకన్నా అలరాజు బలశాలి అని బ్రహ్మనాయుడు గ్రహించాడనీ, అతనిని మట్టుపెట్టే ఉద్దేశంతోనే గురిజాల రాయబారానికి పంపించాడనీ కొన్ని వీరగాథలలో ఉంది. అలరాజు గుఱ్ఱం "సవరాల జిమ్మడు", ఆతని ఖడ్గం "సూర్యభేతాళం" ఆనాటి వీరలోకంలో ప్రశస్తమైనవి, మహత్తరమైనవి.

### *1. నడచి వచ్చిన ముళ్ళదారి:–*

1940లో అక్షరాభ్యాసం నుండి 1968లో పిహెచ్.డి. పరిశోధన పూర్తి చేసేంత వరకూ నా చదువు సజావుగా సాగలేదు. మధ్య మధ్య ఎన్నో బ్రేకులు వచ్చాయి. ఎన్నో ఏండ్లు వృథాగా దొర్లిపోయాయి. దీనికి కారణం పేదరికం, బాల్యవివాహం. 4వ తరగతిలో చదువు మానేసి, క్రాపింగు తీసివేసి పిలక పెట్టుకొని, తాతగారి దగ్గర వేదాధ్యయనంలో ప్రవేశించడంతో ఒక బ్రేకు (1944). 1945లో వేదానికి బ్రేకు, తిరిగి ఇంగ్లీషు చదువులో ప్రవేశం. 1946లో రాజమండ్రి వీరేశలింగం హైస్కూలులో First Form Entrance పరీక్షలో ఫెయిల్ కావడంతో మరో బ్రేక్. 1954లో Intermediate లో ఉండగా టైఫాయిడ్ రావడంతో ఇంకో బ్రేక్. చిన్న వయసులోనే (19 ఏండ్ల వయస్సులో) పెండ్లి కావడంతో 1954 నుండి ఎన్నో అవరోధాలు. 1957లో తెలుగు బి.ఏ. ప్యాసయిన తరువాత నాలుగేళ్ళు పోస్టాఫీసులో గుమాస్తాగా చేరడంతో, ఎం.ఏ. చదువుకు నాలుగేళ్ళ బ్రేక్. 1961లో ముగ్గురు పిల్లల తండ్రిగా, 26 సం॥ల వయస్సులో, తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో తెలుగు ఎం.ఏ.లో చేరడం; 1963లో ఎం.ఏ. ప్రథమశ్రేణిలో పూర్తిచేసి, పరిశోధన ప్రారంభించడం; ఐదుగురు పిల్లల తండ్రిగా 1969లో Ph.D. డిగ్రీని పొందడం; చచ్చీచెడి చాయంగల విన్నపాలుగా, గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారి దయతో, 34 ఏండ్ల వయస్సులో, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో తెలుగు లెక్చరర్‌గా చేరడం– ఇదీ నా విద్యాభ్యాస కంటకపథ చరిత్ర.

### *2. "దైవం మానుష రూపేణ":–*

ఈ సందర్భంగా కొందరు బంధుమిత్రుల్ని నిండుమనస్సుతో కృతజ్ఞతాపూర్వకంగా తలచుకోవాలి. 1944లో నేను నాల్గవ తరగతి చదువుతుంటే, మా తాతగారి పోరుపడలేక, నన్ను చదువు మాన్పించి వేదాధ్యయనంలో పెట్టాడు మా అన్నయ్య. ఒక సంవత్సరం గడవగానే, మా అమ్మ "వీడు వేదం చవిదితే జీవితంలో బ్రతకలేడు" అని నిర్ణయించి, తిరిగి 5వ తరగతికి ప్రవేటు చెప్పించింది ( మా ఊళ్లో శ్రీ పేర్వేల సుబ్బారావుగారి దగ్గర). ఆయన సరిగా చదువు చెప్పలేదు. అందువల్ల 1946లో, రాజమండ్రి వీరేశలింగం హైస్కూలులో First Form (6వ తరగతి)లో చేరలేకపోయాను. అప్పుడు రాజమండ్రిలో ఆయుర్వేదం డాక్టరుగా ఉండిన మా చిన్నబావగారు డా॥ బులుసు సోమన్నగారు నన్ను ఒక మంచి Tutorial Schoolలో 6వ తరగతిలో చేర్పించి, బాగా చదివించి, 1947లో రాజమండ్రి Town Middle School లో Second Form (7వ తరగతి)లో చేర్పించారు. 1948లో అది ప్యాసై, తణుకు Board High School లో III Form (8వ తరగతి)లో చేరాను. అక్కడినుండి నా విద్య తిరుగులేకుండా కొనసాగింది. 1952లో తణుకు హైస్కూలు ఫస్టుగా S.S.L.C. లో ఉత్తీర్ణుడనయ్యాను. ఈ విధంగా కుంటువడిన నా ప్రాథమిక పాఠశాల విద్యను సరియైన గాడిలో పెట్టి, నేను హైస్కూలులో ప్రవేశించేలా చేసిన మహనీయుడు మా చిన్నబావగారు డా॥ బులుసు సోమన్నగారు. ఆయనకు నా కృతజ్ఞతాపూర్వక నమస్సులు...

స్కూల్లో చేరినప్పుడు మా చిన్నబావగారికి నా పుట్టిన తేది తెలియదు (నాకూ తెలియదు). అందువల్ల ఉజ్జాయింపుగా 5-10-1935 అని వ్రాయించారు. అదే నా ఉద్యోగ జీవితమంతా కొనసాగింది. చాలా ఏండ్ల తరువాత ఒకసారి మా తాతగారి (మాతామహుని) డైరీలో నేను పుట్టిన తేది "30-3-1935 శనివారం" అని ఉండటం చూశాను. అంటే మా బావగారు తనకు తెలియకుండానే నా వయసు ఆరు మాసాలు తక్కువ వేశారని గ్రహించాను. ఫలితంగా నేను తెలుగు ప్రొఫెసర్ ఉద్యోగం ఆరు నెలలు ఎక్కువ చేశాను. ఇందుకు కూడా మా చిన్నబావగారికి నేను ఋణపడి ఉన్నాను.

మా కులదైవం శ్రీ వేంకటేశ్వరస్వామివారు. మా కుటుంబంలో పుట్టిన మొట్టమొదటి కొడుకు పేరులో మొదట "వేంకట" ఉండాలి. తరువాతి కొడుకులకు అవసరం లేదు. అందువల్ల మా అన్నగారి పేరులో ("తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులు") "వేంకట' చేరింది. నా పేరులోను, మా తమ్ముళ్ల పేర్లలోనూ 'వేంకట" లేదు. కాని మా బావగారు నా పేరులో కూడా "వేంకట" చేర్చి వేశారు. అందువల్ల "తంగిరాల సుబ్బారావు"నైన నేను అప్పటినుండి "తంగిరాల వెంకట సుబ్బారావు"గా అయ్యాను.

1957 నుండి 1961 వరకూ పోస్టాఫీసులో గుమాస్తాగా పడివుండిన నన్ను ఉత్సాహపరిచి, ఆర్థిక సహాయాన్ని అందించి, ఎం.ఏ. చదివించి, పిహెచ్.డి. కూడా చేయించిన వ్యక్తి మా "బుల్లి తమ్ముడు" కర్నల్ తంగిరాల కృష్ణమూర్తి. వాడికి, వాడి కుటుంబానికీ నా అనంతమైన హార్దిక శుభాశీస్సులు...

తణుకులో, 1952 నుండి 1990లో మా అమ్మగారు చనిపోయే వరకూ, నా యందలి అభిమానంతో డా॥ డి. ఇందిరాదేవి- డా॥ డి. గోపాలకృష్ణమూర్తి దంపతులు, డా॥ జి. సోమరాజుగారు మా కుటుంబానికి ఉచిత వైద్యసేవలు అందించారు. వారికి నా ధన్యవాదాలు.

1964-1970 మధ్యకాలంలో తిరుపతిలో దుంపా శ్రీరాములురెడ్డిగారు, వారి అన్నదమ్ములు, వారి చిరంజీవులు నాకూ, నా కుటుంబానికి ఎన్నో రకాల సహాయాలు చేశారు. వారికి నా కృతజ్ఞతలు, ఆశీస్సులు...

1969వ సంవత్సరం, డిసెంబరు 27వ తేదీ శనివారంనాడు బెంగుళూరు విశ్వవిద్యాలయంలో కన్నడశాఖలో తెలుగు లెక్చరర్‌గా చేరాను. అప్పటినుండి ఇప్పటివరకూ ఎందరో మాన్యమిత్రులు, మహోదయులు నాకు సహాయ సహకారాలు అందించారు, అందిస్తున్నారు. వీరిలో స్వర్గీయులు డా॥ చన్నాప్రగడ తిరుపతిరావుగారు, స్వర్గీయులు డా॥ విష్ణుభొట్ల విశ్వనాథశాస్త్రిగారు, స్వర్గీయులు వై.వి. వెంకటేశ్వరరావుగారు (ఇన్‌కంటాక్స్ ఆఫీసరు) నేను ఆర్ద్ర హృదయంతో తలచుకొన దగినవారు. తక్కిన మహనీయులు శ్రీ పాలగుమ్మి విశ్వనాథంగారు, "దానరాధేయ" శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు, ప్రియమిత్రులు శ్రీ బుల్లా సుబ్బారావుగారు (ఐ.ఏ.ఎస్. రిటైర్డ్), "దానచింతామణి" శ్రీ డి.కె. ఆదికేశవులుగారు నాకు జీవితంలో ఎన్నోరకాల ఉపకారాలు చేశారు. వీరికి నేను మిక్కిలి ఋణగ్రస్తుడను. కర్ణాటక రాష్ట్ర గవర్నర్లుగా పనిచేసిన కీ.శే. పెండేకంటి వెంకట సుబ్బయ్యగారు, కీ.శే. వి.యస్. రమాదేవిగారు నన్ను ఎంతో అభిమానంతో ఆదరించారు. వీరిద్దరినీ నేను కృతజ్ఞతాభావంతో నిండుహృదయంతో తలచుకుంటున్నాను.

నేను 1961-63 మధ్య ఎం.ఏ. చదువుతున్నప్పటి నుండి, నన్ను సొంత తమ్ముని కన్న మిన్నగా భావించి, ఎంతగానో అభిమానించి, నాకు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి దగ్గర Ph.D. సీటు వచ్చేలా చేసి, నా సిద్ధాంత గ్రంథంలో ప్రతి అక్షరమూ దిద్ది ప్రోత్సహించి, 1969లో నన్ను దగ్గరుండి బెంగుళూరు విశ్వవిద్యాలయానికి తీసికొనివచ్చి, ఆచార్య దివాకర్ల వేంకటావధానిగారితోను, ఆచార్య బిరుదురాజు రామరాజుగారితోను నన్ను గురించి చెప్పి, నా పరిస్థితిని వారికి వివరించి, బెంగుళూరు విశ్వవిద్యాలయంలో నాకు లెక్చరర్ పోస్టును ఇప్పించిన మహనీయులు ప్రాతఃస్మరణీయులు ఆచార్య తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు. ఆ గురువర్యుని ఋణాన్ని ఈ జన్మలో తీర్చుకోలేను. ఆయన నా జీవనగమనంలో నా godfather ఆయన నా friend, philosopher, and guide. ఒక్క మాటలో చెప్పాలంటే- "మనసారథి, మన సచివుడు, మన వియ్యము, మన సఖుండు, మన బాంధవుఁడున్, మన విభుఁడు, గురువు, దేవర" అని భాగవతంలో కృష్ణుణ్ణి గురించి అర్జునుడు చెప్పినట్లుగా- పాండవులకు కృష్ణుడు ఎటువంటివాడో, నాకూ నా కుటుంబానికి తిమ్మావజ్ఝులవారు అటువంటివారు. వారిని నేను సర్వకాల సర్వావస్థలయందునూ తలచుకుంటూ ఉంటాను.

1971లో గౌరవనీయులు పి.వి.నరసింహారావుగారు ఆంధ్రప్రదేశ్ ముఖ్యమంత్రిగా ఉన్నారు. వారు గొప్ప సాహిత్యవేత్త; సాహిత్య ప్రియుడు. అందువల్ల నేను, తిరుపతిరావుగారు, విశ్వనాథశాస్త్రిగారు ముగ్గురం కలిసి ఒక లేఖ తయారు చేశాం. బెంగుళూరు విశ్వవిద్యాలయంలో "తెలుగు పీఠం" ఏర్పాటు చేయడానికి సహకరించవలసిందిగా ఆ లేఖలో ముఖ్యమంత్రిగారిని అర్థించాం. ఆ లేఖను ఆ రోజులలో "తెలుగు విజ్ఞాన సమితి"కి అధ్యక్షులుగా ఉన్న చెలికాని అన్నారావుగారి ద్వారా పి.వి.గారికి పంపించాం. తెలుగు సాహిత్యాభిమానియైన ఆయన వెంటనే స్పందించి, బెంగుళూరు విశ్వవిద్యాలయానికి మూడు లక్షల రూపాయల గ్రాంటును మంజూరు చేశారు. దానితో 1974లో ఇక్కడ తెలుగు స్నాతకోత్తరశాఖ (P.G. Dept.) ప్రారంభమయింది. దీనికి ముఖ్యకారకులైన గౌరవనీయులు పి.వి.నరసింహారావుగారికి, అప్పటి వైస్ ఛాన్సలర్ డా॥ హెచ్. నరసింహయ్యగారికి, అప్పటి Dean, Faculty of Arts గా ఉన్న కన్నడ ప్రొఫెసరు ప్రముఖ కవి డా॥ జి.యస్. శివరుద్రప్పగారికి నేను మాత్రమే కాకుండా, బెంగుళూరులోని తెలుగువారందరూ తమ కృతజ్ఞతలను తెలియజేసుకుంటున్నారు.

### *3. నా పరిశోధన:-*

ఇప్పుడు ప్రచురిస్తున్న ఈ సిద్ధాంత గ్రంథం, 1963-1968 మధ్యకాలంలో, తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయంలో, జానపద వీరగాథలను గురించి నేను చేసిన పరిశోధనాఫలం. దీని వ్రాతప్రతి (తెలుగు టైపు ప్రతి కూడా) 1500 పుటలు (25 ప్రకరణాలు). దీని రచనాకాలం 1967. దీనిని వ్రాయడానికి నాకు ఒక సంవత్సరం నాలుగు మాసాలు పట్టింది. ఈ సిద్ధాంతగ్రంథాన్ని 1968 జనవరి నెలలో విశ్వవిద్యాలయానికి సమర్పించాను. 1969 ఫిబ్రవరి నెలలో నాకు Ph.D. డిగ్రీ వచ్చింది. అప్పటినుండి ఇప్పటివరకు ఇది సంపూర్ణంగా వెలుగు చూడలేదు.

### *4. పాక్షిక ప్రచురణలు:-*

ఈ సిద్ధాంతగ్రంథ సారాంశాన్ని (చివరనున్న 'సింహావలోకనము' అనే ప్రకరణాన్ని) 1975లో హైదరాబాద్‌లో జరిగిన మొట్టమొదటి ప్రపంచ తెలుగు మహాసభల సందర్భంగా ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీవారు "జానపద సాహిత్యం-వీరగాథలు" అనే మోనోగ్రాఫ్‌గా ప్రచురించారు. 2012 డిసెంబరు 27-29 తేదీలలో తిరుపతిలో జరిగిన నాల్గవ ప్రపంచ తెలుగు మహాసభలలో పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయం వారు దీనిని పునర్ముద్రించారు.

ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు నేను సేకరించి, పరిష్కరించి యిచ్చిన "కాటమరాజు కథలు" అనే 1000 పుటల మొదటి సంపుటాన్ని 1976లోను, మరో 1000 పుటల రెండవ సంపుటాన్ని 1978లోను ప్రచురించారు. దీనిలో సుమారు 300 పుటల పీఠికగా వ్రాసిన నా సిద్ధాంత గ్రంథంలోని 12వ ప్రకరణమైన "కాటమరాజు కథాచక్రము" పండిత పరిశోధకుల దృష్టికి వచ్చింది. వారి ప్రశంసల నందుకుంది (ఈ 'కాటమరాజు కథలు' రెండు సంపుటాలనూ ఇప్పుడు రెండవ ముద్రణగా పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారు ప్రచురించారు).

1983లో నేను గుల్బర్గా విశ్వవిద్యాలయంలో మొట్టమొదటి పరీక్షా నియంత్రణాధికారిగా (Controller of Examinations గా) ఉన్నప్పుడు ఈ సిద్ధాంత గ్రంథంలోని 10వ ప్రకరణమైన "శక్తికథాచక్రము", 11వ ప్రకరణమైన "పల్నాటి వీరకథాచక్రము" కలిపి, "తెలుగు వీరగాథా కవిత్వము- రెండవ సంపుటము" అను పేరుతో వెలువరించాను.

తరువాత 2000 సంవత్సరంలో ఈ సిద్ధాంత గ్రంథంలోని 1 నుండి 9 ప్రకరణముల వరకుగల- వీరగాథల నిర్వచనము, ఉత్పత్తి, లక్షణము, వర్గీకరణము మున్నగు విషయములతో కూడిన గ్రంథాన్ని "తెలుగు వీరగాథా కవిత్వము- మొదటి సంపుటము"గా ప్రకటించాను. అలాగే మరో మూడు సంపుటాలుగా మొత్తం సిద్ధాంతగ్రంథాన్ని ప్రచురించాలనుకున్నాను. కాని నాకూ, మా ఆవిడకూ ఆరోగ్యాలు దెబ్బతినడం వల్ల, సుమారు 10 లక్షల రూపాయలు ఖర్చుకావడంతో ఆ ప్రయత్నం నెరవేరలేదు.

### *5. "ముసలితనంలో ఒక ముచ్చట" (వృద్ధాప్యంలో ఒక తీరని కోరిక):-*

"ఆచార్య బిరుదురాజు రామరాజుగారి పుస్తకంలా నా సిద్ధాంత గ్రంథాన్నంతా ఒకే సంపుటంగా ముద్రించలేకపోయానే" అనే బాధ నా మనసులో గూడుకట్టుకుంది. 2011లో మా అన్నగారైన శ్రీ టి.వి.కె.సోమయాజులుగారి దగ్గర నా బాధ వెళ్ళగ్రక్కాను. "నీకిప్పుడు 76 సంవత్సరాల వయస్సు! నాకు 80 సంవత్సరాలు. ఎంతకాలం బ్రతుకుతామో తెలియదు. We are about to fly! అందువల్ల నువ్వు రెండు పనుల్లో ఒక పని అర్జంటుగా చెయ్యాలి. ఒకటి నీ మనస్సులోంచి ఆ కోరికను త్రుంచివేసుకోవాలి. లేదా రెండు, నీ కోరికను వెంటనే నెరవేర్చుకోవాలి. There is no time!'' అన్నారు. నేను రెండవ పనివైపు మొగ్గుచూపాను.

### *6. అన్నగారి ఆశీస్సులు-విరాళాల వెల్లువ:-*

ఈ సిద్ధాంతగ్రంథ ముద్రణవ్యయం ఎంత అవుతుంది? అని బెంగుళూరులోని "ఓంకార్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్" అధినేత, నా మిత్రులు శ్రీ బాబుగారిని అడిగాను. $^{1}/_{4}{}^{th}$ Demy Size లో 800 పుటలు, వేయి కాపీలు ముద్రించడానికి సుమారు మూడు లక్షల రూపాయల ఖర్చు అవుతుందన్నారు. గుండె గుభేలుమంది! ఈ విషయం మా అన్నగారితో చెప్పాను. "నీకు ఆంధ్రదేశంలో చాలా మంచి పేరుంది. అనేకమంది శిష్యులు, మిత్రులు ఉన్నారు. నీ అన్నదమ్ములం మేము ముగ్గురం ఉన్నాం. మీ పెద్దబ్బాయి న్యూజిలాండ్‌లో ఉన్నాడు. అందర్నీ అడుగు. నీకు కావలసిన డబ్బుకన్నా ఎక్కువే వస్తుంది. ఇది నా ఆశీస్సు! Proceed!!" అని ధైర్యం చెప్పి, వెన్నుతట్టి, తన విరాళంగా 25 వేల రూపాయలు ఇచ్చారు. మా "బుల్లి తమ్ముడు" (కర్నూల్ తంగిరాల కృష్ణమూర్తి) 30 వేలు ఇచ్చాడు. న్యూజిలాండ్ నుండి మా పెద్దబ్బాయి చి॥ "కాళిదాసు" (చి॥ టి.వి.యస్. అవధానులు) లక్షరూపాయలు పంపించాడు. ఆప్తమిత్రులు, నా నిరంతర శ్రేయోభిలాషులు శ్రీ ముక్కమళ్ళ నారాయణరెడ్డిగారు (కోవెలకుంట్ల) "రాయలసీమ దానకర్ణుడు" బుడ్డా వెంగళరెడ్డిగారి వంశస్థులైన శ్రీ పోచా బ్రహ్మానందరెడ్డి (ఉయ్యాలవాడ) గారిచేత 50 వేల రూపాయల విరాళం ఇప్పించారు. (ఈ గ్రంథముద్రణకు కావలసిన మొత్తం

మూడు లక్షల రూపాయలూ ఈ బ్రహ్మానందరెడ్డిగారు ఒక్కరే ఇస్తానన్నారు. నేను వద్దన్నాను. నాకు అప్పటికే $2^1/_2$ లక్షలు సమకూడాయి. మిగిలిన 50 వేల రూపాయలిస్తే చాలునని విన్నవించుకున్నాను. ఈ "రాయలసీమ రత్నం" అంత గొప్పదాత!). "రేనాటి విప్లవసింహం" ఉయ్యాలవాడ నారసింహారెడ్డి వంశస్థులైన ప్రియమిత్రులు శ్రీ కర్నాటి చినవెంకటరెడ్డి (కె.సి.రెడ్డి)గారు (రూపనగుడి) 30 వేల రూపాయలు, వారి మేనల్లుడు శ్రీ ఎ. విజయభాస్కరరెడ్డి గారు (ఆలూరు) 10 వేలు (మొత్తం 40 వేలు), మరో మేనల్లుడు శ్రీ ఎ. శ్రీనివాసరెడ్డిగారిచేత బెంగుళూరులో ఉన్న మా యింటికి పంపించారు. నా చిరకాలమిత్రులు, సాహిత్య పోషకులు, "దాసరాధేయ" బిరుదాంకితులు శ్రీ సకలా నరసింహులు శ్రేష్ఠిగారు (ప్రతిభా జ్యుయల్రీ హౌస్, బెంగుళూరు)– "మీకు ఎంతకావాలో చెప్పండి? మీరు ఎంత అడిగితే అంత ఇస్తాను" అన్నారు. నేను అత్యాశకు పోకుండా 30 వేలు మాత్రం అడిగాను. వెంటనే ఇచ్చారు. నా కరపత్రానికి మొట్టమొదట స్పందించిన మహనీయులు ఈ శ్రేష్ఠిగారే. అలాగే నేను విరాళమడిగిన మొదటి మిత్రులు శ్రీ అత్తిలి వెంకటరమణ–(నూజివీడు)గారు. ఆయన గొప్ప సత్యసాయిబాబా భక్తుడు. తపశ్శక్తి సంపన్నుడు. ఎన్నడూ పరుషవాక్యం పలుకని వినయశీలి. 2-8-2012 శ్రావణ పూర్ణిమనాడు వారిచేతిలో నేను కరపత్రం పెట్టగానే, గదిలోపలికి వెళ్ళి, వేయి రూపాయలు తెచ్చి ఇచ్చారు. ఆయన తపోబలంవల్ల మా అన్నగారి ఆశీస్సులవల్ల మూడు నెలల్లో మూడు లక్షల రూపాయలు సమకూడాయి. వీరందరికీ నేను మనఃపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

### *7. "నువ్వు ఎక్కదలచుకున్న రైలు ఎప్పుడూ ఒక జీవితకాలం లేటు!":–*

అనుకున్న ధనం చేతికందింది కాని, గ్రంథాన్ని డి.టి.పి. చేయించడంలో మాత్రం ఎవ్వరూ ఊహించనంత జాప్యం (ఒక సంవత్సర కాలం ఆలస్యం) జరిగింది. గత 20 సంవత్సరాలుగా నా పుస్తకాలన్నీ అందంగా డి.టి.పి. చేసి యిస్తున్న వ్యక్తి శ్రీమతి మొవ్వ (కొసరాజు) శాంతిశ్రీ (బెంగుళూరు). రెండు భాగాలుగా ఉన్న నా థీసీస్సు వ్రాత ప్రతిలో మొదటి భాగమైన 825 పుటలు ఆమెకు ఇచ్చాను. ఎప్పుడు? 2012 జనవరి 15వ తేది సంక్రాంతినాడు. 2013 జనవరి 14 సంక్రాంతి నాటికి (అంటే ఒక సంవత్సరానికి) 825 పుటలు టైపు చేయవలసిన వ్యక్తి, కేవలం 80 పుటలు మాత్రమే టైపు చేసింది. మధ్యలో కేంద్రమంత్రి శ్రీ ఎం. వీరప్పమొయిలిగారి "శ్రీరామాయణ మహాన్వేషణము" (నా మిత్రులు నేను కలిసి చేసిన తెలుగు అనువాదం) శాంతిశ్రీకి అప్పజెప్పాము (ఈ పని చేసింది నేనే). అది రాయల్ సైజులో 1600 పుటల గ్రంథం. దీనిని టైపు చేసేసరికి ఆమె ఆరోగ్యం దెబ్బతింది (కుడి బుజంలో నొప్పి, ఆపరేషన్ చేయాలన్నారు). అందువల్ల నా పని అటకెక్కింది! ఇందులో ఆమె తప్పు ఏమీ లేదు; నా దురదృష్టం తప్పు. టైపింగే సంవత్సరకాలం ఆలస్యం కావడంతో ''We are about to fly'' అన్న మా అన్నగారి మాటలు పదే పదే జ్ఞప్తికి రాసాగాయి. నిజానికి టైపింగ్‌కు మూడు నెలలు, ప్రూఫ్ రీడింగ్ రెండు నెలలు, ప్రింటింగ్ ఒక నెల మొత్తం ఆరు నెలల్లో పనిపూర్తి అయిపోవలసింది. సంవత్సరం దాటిపోయినా 'ఎక్కడ వేసిన గొంగడి అక్కడే' అన్న సామెతగా ఉండిపోయింది నా పని.

### *8. చీకటిలో చిన్న వెలుగు దారి:–*

"ఎలాగరా దేవుడా!" అని ఆలోచిస్తూ ఉంటే, 2012 డిసెంబరు 8వ తేదినాడు మా మనుమరాలి పెండ్లి నిమిత్తం హైదరాబాద్ వెళ్ళవలసి వచ్చింది. అప్పుడు నా థీసీస్సులోని రెండవ భాగం 710 పుటల వ్రాతప్రతిని తీసికొని, పెండ్లికి ఐదు రోజులు ముందుగానే (డిసెంబరు 3వ తేదీని) హైదారబాద్ వెళ్లాను. నాకు అల్లుడు వరుసయైన (మా పెద్దకోడలు చి.సౌ.నాగలక్ష్మి అన్నగారైన) డా॥ ద్వా.నా.శాస్త్రిగారి సహాయంతో, కవిమిత్రులు శ్రీ తాళ్లపల్లి మురళీధరగౌడుగారిని ఆశ్రయించాను. ఆయన నెల రోజులలో ఆ వ్రాతప్రతినంతా అందంగా D.T.P. చేయించి నాకు పంపించారు. ఈలోగా శాంతిశ్రీ కూడా మరో 100 పుటలు D.T.P. చేసింది. ఇక ఆమె దగ్గర మిగిలిపోయిన మూడు ప్రకరణాలను కూడా గౌడుగారికి అందజేసి, పని పూర్తిచేశాను. నాకు ఈ మహోపకారాన్ని చేసినపెట్టిన డా॥ ద్వా.నా.శాస్త్రిగారికి, శ్రీ తాళ్ళపల్లి మురళీధర్‌గౌడుగారికి మిక్కిలి కృతజ్ఞుడను. (అయితే శాంతిశ్రీ ది "శ్రీలిపి", గౌడుగారిది "అనూ ఫాంట్". దీనితో అక్షరాలలో సమత కొంత లోపించి ఉండవచ్చు. ఏం చెయ్యను? పరిస్థితులు అలా వచ్చాయి.) ఈ సిద్ధాం గ్రంథాన్ని D.T.P. నాలుగు ప్రూఫులు దిద్దడానికి 2013 జనవరి నెలనుండి సెప్టెంబరు నెలవరకూ 9 మాసాలు పట్టింది.

### *9. జానపద సాహిత్య పరిశోధన గ్రంథంలో గ్రాంథిక భాష ఏమిటి?:–*

ఈ గ్రంథంలో వాడిన అరసున్నలు, శకటరేఫలతో కూడిన గ్రాంథిక భాషను గురించి ఒక మాట చెప్పాలి. జానపద సాహిత్య పరిశోధన గ్రంథం గ్రాంథిక భాషలో వ్రాయడమేమిటి? అనే ప్రశ్న వస్తుంది. (ప్రియమిత్రులు శ్రీ మల్లాప్రగడ శ్రీమన్నారాయణమూర్తిగారు పదే పదే నన్ను ఇదే ప్రశ్న వేశారు). నేను పరిశోధన చేసిన రోజులలో (1963-1968 మధ్య) "సిద్ధాంత గ్రంథాలన్నీ గ్రాంథిక భాషలోనే వ్రాయాలి" అనే నియమం ఉండేది. (1961-1963 మధ్య నేను ఎం.ఏ. చదివినప్పుడు సమాధాన పత్రాలు కూడా గ్రాంథిక భాషలోనే వ్రాయాలి). నా కన్న 10 సంవత్సరాలు ముందుగా పరిశోధనలు చేసిన ఆచార్య బి.రామరాజుగారు తమ "తెలుగు జానపదగేయ సాహిత్యము" అనే సిద్ధాంత గ్రంథాన్ని, ఆచార్య సి.నారాయణరెడ్డిగారు తమ "ఆధునికాంధ్ర కవిత్వము– సంప్రదాయములు, ప్రయోగములు" అనే సిద్ధాంత గ్రంథాన్ని గ్రాంథిక భాషలోనే వ్రాసిన విషయాన్ని అందరూ గమనించాలి.

అయితే వారిద్దరూ సరళగ్రాంథిక భాషలో వ్రాశారు. నేను కూడా మొదట సరళగ్రాంథికంలోనే వ్రాశాను. కాని మా గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండ రామయ్యగారు నా సిద్ధాంత గ్రంథాన్ని సరిచూస్తూ దీనిని "వీరగ్రాంథికం"లోకి మార్చివేశారు. (అరసున్నలు, శకటరేఫములు చేర్చి. ఉత్తునకచ్చుపరమైన తావులలో నిత్యసంధులు చేసివేశారు. సంధిలేనిచోట యడాగమాలు, నుగాగమాలు ఉంచారు.) ఇప్పుడు 1500 పుటల్ని తిరిగి సరళగ్రాంథికంలోకి మార్చడం నాకు సాధ్యం కాలేదు. అక్కడికీ మొదటి తొమ్మిది ప్రకరణాలలోను అరసున్నలు తీసివేసి, విసంధులు చేసి సరళాలను పరుషాలుగా మార్చాను. సాధురేఫము-శకటరేఫముల మార్పిడివల్ల కొన్ని పదాలలో అర్థభేదం వస్తుంది కాబట్టి, శకటరేఫములు మాత్రం అలాగే ఉంచివేశాను. తరువాతి ప్రకరణాలలో కూడా వీలైనచోట్ల ఈ మార్పులు చేశాను. (అసలే డి.టి.పి. ఒక సంవత్సరం ఆలస్యమయింది. ఇలాగ మార్పులన్నీ చేస్తూ కూర్చుంటే ఇంకా ఆలస్యమైపోతుంది. ఒక ప్రక్క మా అన్నగారి మాటలు యమపాశంలా భయపెడుతున్నాయి. అందువల్ల "వ్రాతప్రతిలో ఎలా ఉంటే అలా టైపు చేయించండి" అని మురళీధర్‌గౌడ్‌గారికి విన్నవించాను.) అయినా నా మిత్రులు, సుప్రసిద్ధ భాషాశాస్త్రవేత్తలు అయిన 'చేరా'గారు చెప్పినట్లుగా "గ్రాంథిక భాష కూడా ఒక భాషే! దానిని కూడా మనం నేర్చుకోవాలి. లేకపోతే ప్రాచీన సాహిత్యం ఎలా అర్థమవుతుంది మనకు?". నా గ్రాంథిక భాష మిక్కిలి సరళంగా ఉందని ప్రముఖ అభ్యుదయ సాహిత్యవేత్త అయిన శ్రీ కె.వి. రమణారెడ్డిగారే మెచ్చుకున్నారు. కాబట్టి పాఠకులు భయపడవలసిన పని లేదు.

## *10. ఏమిటి ప్రయోజనం?*

ఒక జాతి సంస్కృతిలో జానపద సంస్కృతి ప్రధానమైన భాగం. దీనిని అధ్యయనం చేయకుండా ఆ జాతి సంస్కృతిని పూర్తిగా అర్థం చేసుకోవడం కష్టం. వేగంగా అభివృద్ధి చెందుతున్న నాగకరితతోపాటు, జానపద సాహిత్యం కూడా అంతరించిపోతోంది. (ఇప్పటికే చాలా భాగం అంతరించిపోయింది.) దానిని పరిరక్షించుకోవలసిన బాధ్యత మనమీద ఉన్నది.

'బెర్‌ట్రాండ్ రస్సెల్' భావించినట్లుగా ప్రపంచమంతా ఒకే దేశంగా ఉంటే ఫరవాలేదు. కాని అలా లేదు కదా! కాబట్టి, వివిధ విభిన్న దేశాలు ఉన్నంతకాలం యుద్ధాలు వస్తాయి. యుద్ధ సమయంలో యువకులు ఉత్సాహంగా సైన్యంలో చేరి దేశాన్ని రక్షించుకోవాలి. వీరగాథాగానం యువకులలో యుద్ధోత్సాహాన్ని నింపుతుంది. అందువల్ల యువకులు వీరులనుగురించి, వీరగాథలనుగురించి తెలుసుకోవాలి. వీరగాథాగానం, బుఱ్ఱకథాగానం ప్రజలను నిత్యచైతన్యశీలురుగా మలచుతాయి. వీరగాథలవల్ల ఇది ఒక ముఖ్యమైన ప్రయోజనం.

అయితే, వీరగాథలలోని "పేరంటాండ్ర కథలు" మాత్రం ఆధునిక యువతులకు, స్త్రీలకు ఏ విధంగానూ ఉపయోగపడవు. కాని ఒకప్పుడు స్త్రీలు ఎంత అధోగతిలో ఉండేవారో, పాతివ్రత్యం విషయంలో వారి ఆలోచనలు ఎంత మూర్ఖంగా ఉండేవో, వారు కుటుంబ హింసలకు ఎలా బలి అయ్యేవారో తెలుసుకుందుకు మాత్రం ఈ పేరంటాండ్ర కథలు ఉపయోగపడతాయి. ఇవి వ్యతిరేక సందేశాన్ని ఇస్తాయి. అంటే స్త్రీలు ఎలా ఉండకూడదో అనే విషయాన్ని తెలియజేస్తాయి. "వెనుక చూచిన నేమి ఫలమోయ్- మంచి గతమున కొంచెమేనోయ్" అనే మహాకవి గురజాడ మాటలు ఈ పేరంటాండ్ర కథలకు, గ్రామకక్షలకు- హత్యలకు సంబంధించిన వీరగాథలకు, వీరగాథానికలకు, బాగా వర్తిసాయి. మహాభారతంలోని "మాద్రి" నుండి, నిన్నమొన్నటి రాజస్థానీ యువతి "రూప్ కన్వర్" వరకూ జరిగిన సహగమనాలను తలచుకుంటే సిగ్గుతో మన తలలు పాతాళం వరకూ దించుకోవాల్సి వస్తుంది! (ప్రాచీన కాలంలోను, మధ్యయుగాలలోను స్త్రీలు సంపదలో ఒక భాగం. శత్రువులు ఒక రాజ్యాన్ని జయించినప్పుడు అక్కడి సంపదతోపాటు స్త్రీలను కూడా ఎత్తుకుపోయేవారు. ఆ అవమానం తప్పించుకుందుకు సహగమనాలు చేసేవారని భావించవచ్చును.)

## *11. పండితుల చిన్నచూపు:-*

ఈ గ్రంథంలోని 24వ ప్రకరణంలో వీరగాథల క్షీణతాకారణాలను చెపుతూ 'పండితుల అనాదరణ' ముఖ్యకారణమన్నాను. దానిని బలపరుస్తూ, "జానపద సాహిత్యాన్ని పండితులు చులకనగా చూస్తారు" అనడానికి నా అనుభవంలోని నాలుగు ఉదాహరణాలను చెపుతాను:-

1) "నేను తెలుగు వీరగాథా కవిత్వాన్నిగురించి పరిశోధన చేస్తున్నాను" అని 1963లో మా అన్నగారు శ్రీ టి.వి.కె. సోమయాజులుగారితో ఎంతో సంతోషంతో ఉత్సాహంగా చెప్పాను. ఆయన సంస్కృతాంధ్రాలలో గొప్ప పండితులు. ఆయన వెంటనే "అయితే ఇప్పుడు వచ్చిన సాహిత్యజ్ఞానం కాస్తా మరిచిపోతావు!" అన్నారు.

2) 1963 నుండి 1968 వరకూ ఐదేళ్ళపాటు కష్టపడి, ఊరూరా తిరిగి, వీరగాథలు సేకరించి, 1500 పుటల సిద్ధాంత గ్రంథం వ్రాశాను. దానిలోని ప్రతి అక్షరమూ చదివి, తగిన సవరణలు చేసిన గురువర్యులు ఆచార్య తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు నా కృషిని చాలా మెచ్చుకున్నారు. అయితే ఒకసారి వేళాకోళంగా "ఈ 1500 పుటల్లో కవిత్వం కాని దానిని కవిత్వంగా దబాయించావయ్యా సుబ్బారావూ!" అని అన్నారు.

3) ప్రముఖ కవి శ్రీ దుగ్గిరాల రామారావుగారు "మా సుబ్బన్న బావ" అనే పేరుతో నన్ను గురించి 50 అందమైన పద్యాలు వ్రాశారు. అందులో ఒక పద్యంలో "మా బావ వేదపండితుల వంశంలో పుట్టాడు. కాని జానపద యువతిని చేపట్టాడు" అని మేలమాడారు.

4) శేషేంద్రశర్మగారిని నేను కలిసినప్పుడల్లా "సుబ్బారావుగారూ! ఆ మాయదారి జానపదాన్ని వదిలెయ్యండి!" అనేవారు. పాండిత్య విహీనులైన శ్రోతలను పాఠకులను ఉద్దేశించి, శేషేంద్ర ఒకసారి నాతో "బుఱ్ఱకథలు వినేవాళ్ళకి నేనేమి చెప్పగలను?" అన్నారు.

"ఏ కవిత్రయ భారతాన్ని గురించో, లేదా ఏదైనా మంచి ప్రబంధాన్ని గురించో పరిశోధన చేసివుంటే బాగుండేది" అని అప్పుడప్పుడు నాకు కూడా మనస్సులో ఏదో ఒక మూల అనిపిస్తూ వుంటుంది. ఆదికవి నన్నయభట్టుగారు మా తణుకులో యజ్ఞం చేసినట్టుగా 18వ శతాబ్దికి చెందిన పట్టమట్ట సరస్వతీ సోమయాజి అనేకవి చెప్పిన పద్యం ఉంది. మా ఊళ్ళో "నన్నయ్య భట్టారక పీఠం" 80 ఏండ్లనాడు స్థాపించడింది. తణుకుకు చెందిన నేను నన్నయ భారతాన్ని గురించి పరిశోధన చేసి ఉండవలసింది. ఇది 'గతజలసేతుబంధనం'!

పండిత కవియైన ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు పల్నాటి వీరకథలను సేకరించి, పరిష్కరించి, వాటికి ఒక చక్కని పీఠిక రచించారు. దానిని విశాలాంధ్రవారు 1961లో ముద్రించారు. ఎలాగూ గురువుగారు పల్నాటి వీరగాథలను సేకరించారు కదా! ఆ గ్రంథాన్ని గురించి పరిశోధన చేద్దామనుకున్నాను. "పల్నాటి వీరచరిత్ర– ఒక అధ్యయనం" అనే పరిశోధన శీర్షికను వ్రాసి వారికి ఇచ్చాను. వారు దానిని కొట్టిపారవేసి ''Ballad Poetry in Telugu'' అనే పరిశోధనాంశాన్ని నిర్ణయించారు. (మా గురువుగారికి ఆంగ్లభాష అంటే ఒక విధమైన మోజు ఉండేది. ఒక్కొక్కప్పుడు ఆయన తెలుగు సాహిత్య సభలో ఉన్నట్టుండి ఆంగ్లంలో ప్రసంగించేవారు.) దానితో నా పరిశోధన పరిధి అతి విస్తృతమైపోయింది. రెండేళ్ళల్లో పూర్తికావలసిన పరిశోధనకు ఐదేళ్ళకాలం పట్టింది. నదిలో స్నానం చేద్దామనుకున్న నాకు సముద్రంలో ఈతకొట్టాల్సి వచ్చింది. ఇదంతా దైవ నిర్ణయం! గురువుగారు అలా చేశారు కాబట్టే, నూతనములైన ఎన్నో కాటమరాజు కథలు తెలుగు సాహిత్యలోకానికి తెలియజేయగలిగాను. ఫలితంగా అఖండమైన కీర్తిని సంపాదించాను. అభ్యుదయ సాహిత్య విమర్శకులు, కవులు అయిన కె.వి.రమణారెడ్డిగారి ప్రశంసలు పొందగలిగాను. దీనినిబట్టి "అంతయు మన మేలునకే!" అనుకోవాలి.

### *12. ఒక గమనిక:–*

ఈ గ్రంథం రచనాకాలం 1967. అంటే 20వ శతాబ్దిలోని మూడవ పాదం. ఈ నా రచనలో కొన్నిచోట్ల "ఈ శతాబ్దిలో" అని, "క్రిందటి శతాబ్దిలో" అని పదాలు దొర్లాయి. వీటిని నేను కాలానుగుణంగా "ఈ శతాబ్దిలో" అనే దానిని "20వ శతాబ్దిలో" అనీ; "క్రిందటి శతాబ్దిలో" అనే దానిని "19వ శతాబ్దిలో" అనీ మార్చాను. మార్చనిచోట పాఠకులు ఈ క్రమంలో అర్థం చేసుకోగలరు. అలాగే అప్పుడు "జిల్లా"ను "మండలం" అనేవారు. ఇప్పుడు "మండలం" అంటే "జిల్లాలో చిన్న భాగం" అని అర్థం (అప్పటి తాలూకా కన్న చిన్నది). ఈ రచనలో "మండలం" అని వచ్చిన చోటల్లా పాఠకులు "జిల్లా (District)'' అని గ్రహించగలరు.

### *13. కొన్ని ప్రసిద్ధ వీరగాథల అనుబంధం వాయిదా:–*

ఈ గ్రంథం చివర కొన్ని ప్రసిద్ధ వీరగాథలను (బొబ్బిలికథ, ఆరెమరాటీల కథ, సర్వాయి పాపడు కథ, చిన్నపరెడ్డి కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ– అనే ఆరు వీరగాథలను) ఒక అనుబంధంగా ఇవ్వాలని అనుకున్నాను. మరో 150–200 పుటలు ఎక్కువ అవుతుంది. అయినా ఇద్దామనుకున్నాను. కాని ఈ గ్రంథముద్రణ ఇప్పటికే ఒక సంవత్సరంపాటు ఆలస్యం కావడం, ముసలితనం ముంచుకు వస్తూ ఉండడం "నిత్యం సన్నిహితో మృత్యుః" అని మా అన్నగారు నన్ను పదే పదే హెచ్చరిస్తూ ఉండడం కారణంగా ఆ పని విరమించుకున్నాను. కాని, తెలుగు జానపద సాహిత్యంలోనే కాదు, భారతీయ జానపద సాహిత్యంలోనే కాదు, మొత్తం ప్రపంచ జానపద సాహిత్యంలోనే అత్యుత్తమమైన వీరగాథ "బొబ్బిలికథ". అందువల్ల దీనిని మాత్రం ఇస్తున్నాను. క్రీ.శ. 1842లో సి.పి.బ్రౌనుదొరగారు సేకరించిన కథను చివరి అనుబంధంగా ముద్రిస్తున్నాను. త్వరలో కొన్ని అప్రకటితములైన పల్నాటి వీరకథలను, కాటమరాజు కథలను, కొన్ని ప్రసిద్ధ వీరగాథలను ప్రత్యేక గ్రంథాలుగా ముద్రించాలని అనుకుంటున్నాను. ఆ ప్రత్యేక గ్రంథాలనే ఈ సిద్ధాంత గ్రంథానికి అనుబంధాలుగా భావించవలసి ఉంటుంది. పూర్వం ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడెమీవారు, ప్రస్తుతం పొట్టిశ్రీరాములు తెలుగు విశ్వవిద్యాలయంవారు నేను సంకలనం చేసిన 'కాటమరాజు కథలు' అనే రెండు బృహత్సంపుటాలను (ఒక్కొక్కటి 1000 పేజీలు) ప్రచురించారు. అవి నా సిద్ధాంత గ్రంథానికి అనుబంధాలే కదా!

### *14. కృతజ్ఞతలు:–*

1. ఈ గ్రంథముద్రణకు నన్ను మిక్కిలిగా ప్రోత్సహించిన మా అన్నగారు, సాహిత్యంలో నా ప్రథమ గురువు అయిన శ్రీ టి.వి.కె. సోమయాజులుగారికి–

2. ఎంతో ఉదారంగా విరాళాలు అందజేసిన బంధుమిత్రులకు, శిష్యులకు–

3. ముద్రణ విషయంలో ఎన్నో విలువైన సలహాలనిచ్చిన సోదరతుల్యుడు ఆచార్య ఆర్వీయస్. సుందరానికి–

4. వీరుల రేఖాచిత్రాలు అందంగా గీసి యిచ్చిన "పద్మశ్రీ"–"కళాప్రపూర్ణ" డా॥ బాపుగారికి– వాటికి రంగులు వేసి యిచ్చిన శ్రీ కె. పురుషోత్తంగారికి, శ్రీ బి.కె. సోమశేఖర్‌గారికి– తాను గీసిన పల్నాటి వీరుల రేఖాచిత్రాలను ఇచ్చిన శ్రీరాయన గిరిధర్‌గౌడ్‌గారికి– నా రేఖాచిత్రమును చక్కగా గీసి ఇచ్చిన బాపుగారి తమ్ముడు శ్రీ శంకర్‌గారికి–

5. "వీరులు-వీరభూములు"- వీటికి సంబంధించిన కొన్ని రంగుల చిత్రాలను పంపి, నాకు సహకరించిన ఈ క్రింది మిత్రులకు-

1) శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తిగారు (గామాలపాడు)
2) శ్రీ ఉల్లి రామసుబ్బయ్యగారు (మాచెర్ల)
3) శ్రీ మూడమంచు వెంకటేశ్వర్లుగారు (ఒంగోలు)
4) డా॥ చిటిప్రోలు సుబ్బారావుగారు (నరసరావుపేట)
5) ప్రొ॥ పులికొండ సుబ్బాచారిగారు (కుప్పం)
6) శ్రీ మట్టి గురవయ్యగారు (ఒంగోలు)
7) శ్రీ మల్లెబోయిన లక్ష్మీనారాయణ యాదవ్‌గారు (హైదరాబాద్)
8) శ్రీ గుత్తి (జోళదరాశి) చంద్రశేఖరరెడ్డిగారు (హైదరాబాద్)
9) డా॥ టి. శ్రీరంగస్వామిగారు (వరంగల్లు)
10) కీ.శే. పంపన సూర్యనారాయణగారు (పెద్దాపురం)
11) కీ.శే. పేర్వారం జగన్నాథంగారి కుమారుడు శ్రీ పేర్వారం శ్రీనాథ్‌గారు (వరంగల్లు)
12) శ్రీ కొంపెల్ల వెంకటగౌడ్‌గారు (హైదరాబాద్)
13) శ్రీ వై.హెచ్.కె. మోహనరావుగారు (పిడుగురాళ్ళ)
14) శ్రీ కె.వి. నరేందర్‌గారు (జగిత్యాల)
15) శ్రీ శిష్ట్లా శ్రీనివాస్‌గారు (విశాఖపట్టణము)
16) శ్రీ మాధవపెద్ది ప్రమోద్‌గారు (కీ.శే. మాధవపెద్ది గోఖలేగారి కుమారుడు)- (చైన్నై)
17) శ్రీ మోదుగుల రవికృష్ణగారు, (గుంటూరు)
18) శ్రీ అరిశెట్టి సాయిప్రసాద్‌గారు (గుంటూరు)
19) శ్రీ వలివేటి శ్రీనివాసరావు ('వాసు') గారు (కారెంపూడి)
20) ఆచార్య మట్టెబోయిన జయదేవ్‌గారు (విశాఖపట్టణము).
21) డా॥ నిడిగొండ యాదగిరిశర్మగారు (హైదరాబాదు)

6. కారెంపూడిలోని డా॥ పి.వి. ఆచార్యగారు "పల్నాటి వీరుల చరిత్ర" అనే గ్రంథాన్ని రచించారు. దీనిని 5-6-2002 నాడు (శ్రీ హనుమజ్జయంతినాడు) కారెంపూడిలోని శ్రీవలివేటి శ్రీనివాసరావు (వాసు) గారు ప్రచురించారు. దీనిలో కారెంపూడికి సంబంధించిన మంచి మంచి రంగుల ఫోటోలు ఉన్నాయి. వీటిలో కొన్నింటిని నేను ఉపయోగించుకున్నాను. శ్రీ వలివేటి శ్రీనివాసరావు ('వాసు')గారికి, ఎంతో కష్టపడి ఈ గ్రంథాన్ని సంపాదించి, నాకు పంపిన ప్రియమిత్రులు డా॥ చిటిప్రోలు సుబ్బారావుగారికి నా ప్రత్యేక కృతజ్ఞతలు.

7. నేను సంపాదించిన సుమారు 200 ఫోటోలను, ప్రసిద్ధ చిత్రకారుల వర్ణచిత్రాలను ఎంతో ఓపికతో 'స్కాన్' చేసి ఇచ్చిన మా చిరంజీవి పిల్లలమట్టి నాగచైతన్యకు నా అనంతమైన ఆశీస్సులు....

8. కష్టపడి డి.టి.పి. చేసి ఇచ్చిన శ్రీమతి మొవ్వ (కొసరాజు) శాంతిశ్రీకి; శ్రీ తాళ్ళపల్లి మురళీధరగౌడుగారి ద్వారా డి.టి.పి. చేసి ఇచ్చిన శ్రీ కె.బి.టి. కొండయ్యగారికి, ఈ కార్యక్రమంలో సహకరించిన డా॥ ద్వా.నా. శాస్త్రిగారికి-

9. గ్రంథాన్ని సర్వాంగ సుందరంగా ముద్రించి యిచ్చిన "ఓంకార్ ఆఫ్‌సెట్ ప్రింటర్స్" అధినేత, ప్రియమిత్రులు శ్రీ పి.ఎస్. వెంకటేష్ బాబుగారికి- నా హృదయపూర్వక కృతజ్ఞతలు తెలియజేసుకుంటున్నాను.

"సీతావధానం"
బెంగుళూరు
30-03-2013
(నా 78వ జన్మదినం)

ఇట్లు
సుధీజన విధేయుడు,
**తంగిరాల వెంకట సుబ్బారావు**

నా సిద్ధాంత గ్రంథములోని ఆనాఁటి పీఠిక (1968)

# ప్రవేశిక

**నా** దేశికవితాభిమానమునకు మూలకారణము మా అమ్మగారు. ఆమె తఱచుగా పాడుచుండెడి మేలుకొలుపులు, మంగళహారతులు; మాపల్లెలోని పడతుల నందఱను ఒకచోట చేర్చి, వారికి అనుదినమును ఆప్యాయముగా పాడి వినిపించుచుండిన కుశలవ కుచ్చల కథ, ధర్మరాజు జూదము, కుమ్మరి గుండయ్య కథ మున్నగు స్త్రీల కథలపాటలు, కామమ్మ కథవంటి పేరంటాండ్ర కథలును నన్ను శైశవమునందే తమ వంకకు ఆకర్షించుకొనినవి. మా యిల్లు పంటపొలముల నడుమ నుండుటవలన పనిపాటులు చేసికొనెడి పామరుల పాటలపైఁగూడ బాల్యమునందే నాకు ఎనలేని మక్కువ నెక్కొనినది. అప్పటినుండియు ఈ దేశికవితాభిమానము నన్ను వెన్నంటుచునేయున్నది. ఈ అభిమానము చావకుండ, దీనికి ఆధునిక సాహిత్యాభిమానమును, శిష్ట సాహిత్యాభిమానమును గూడ జోడించి, నాలోని దేశి సాహిత్య సంస్కృతికి నానాఁట ప్రోది కల్పించినవారు మా అన్నగారు ఉభయభాషాప్రవీణులు శ్రీ తంగిరాల వేంకట కృష్ణ సోమయాజులుగారు, మఱియు నా గురుదేవులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారు, గురువర్యులు డా॥ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు. దేశిసాహిత్యములోని ప్రధానశాఖ యగు వీరగాథాకవిత్వమును పరిశోధనాంశముగా నేను స్వీకరించుటకు నా యీ దేశిసాహిత్యసంస్కృతియే ముఖ్యకారణము.

తిరుపతిలోని శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయమున ఇంచుమించుగా ఐదేండ్లపాటు (1963–1968) సాగించిన పరిశోధన ఫలమే ఈ సిద్ధాంత గ్రంథము. దీనినిగూర్చి పరిశోధించుటలో నాకు మార్గదర్శకులు ఆచార్య పింగళి లక్ష్మీకాంతకవిగారు (1963–1965), ఆచార్య జి.యన్.రెడ్డిగారు (1965–1968). నేను ఆంధ్రదేశమున వివిధ ప్రాంతములలో పర్యటించి, అపూర్వములగు వీరగాథలను వందలాదిగా సేకరింపగలుగుటకుఁ గల ప్రధాన కారణము ఆచార్య జి.యన్.రెడ్డిగారి ప్రోత్సాహ సహకారములే! నా యీ పరిశోధన కార్యమునకు ఒక నిర్దిష్ట ప్రణాళికను రూపొందించి, తగు సూచనలిచ్చి, ప్రత్యక్షరమును పర్యవేక్షించి, సరిదిద్ది, దీనికిట్టి సమగ్ర స్వరూపము నొసఁగుటకు తోడ్పడిన సహృదయవతంసులు, మద్గురువరేణ్యులు అయిన ఆచార్య జి.యన్.రెడ్డిగారికిని, డా॥ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారికిని నేను మిక్కిలి ఋణపడియున్నాను.

విశ్వవిద్యాలయ ఆర్థిక సహాయ సంఘము (University Grants Commission) వారు ఈ పరిశోధన కార్యమును నిర్వహించుటకు నాకు మూఁడేండ్లపాటు (1964–67) 'ఫెలోషిప్' (Fellowship) నొసగి తోడ్పడినారు. ఇదియునుగాక, వీరగాథలను సేకరించుటకై నేను ఆంధ్రదేశములోని వివిధ ప్రాంతములలో సంచరించుటకు వలసిన ఆర్థిక సహాయ సంపత్తిని గూడ ఈ సంస్థవారు నాకు చేకూర్చిరి. అట్టి సహాయమే లభింపనిచో, ఈ విధముగా మౌఖిక ప్రచారమున నున్న వీరగాథల సంపాదనముమీఁదనే ప్రధానముగా నాధారపడియున్న ఈ పరిశోధన కార్యము దుర్ఘటమయ్యెడిది. అందుచే ఆ యు.జి.సి. వారికి నేను సర్వదా కృతజ్ఞుడను.

పరిశోధన కాలములో (1963–68) సంసార బాధ్యతలన్నియును తానే వహించి నాకు మిక్కిలిగా సహకరించిన మా ఆవిడ– "భళ్ళమూడివారి చిట్టి"కి (శ్రీమతి తంగిరాల శకుంతలాదేవికి) నా అనంతమైన శుభాశీస్సులు...

తిరుపతి
23–1–1968
(నేతాజీ జన్మదినము)

***తంగిరాల వేంకట సుబ్బారావు***
ప్లవంగ–పుష్యబహుళ నవమి

# పదియవ ప్రకరణము

# శక్తి కథాచక్రము

## (The Ballad-cycle of Sakti)

**తె**లుఁగు సాహిత్యమందలి సాంప్రదాయిక వీరగాథలు మూఁడు ప్రధాన భాగములుగా విభజింపఁదగియున్నవి. 1) వీరగాథా చక్రములు, 2) వీరగాథలు, 3) వీరగాథానికలు. శక్తికథలు, పల్నాటి వీరుల కథలు, కాటమరాజు కథలు, వెలకంటి వీరుని కథలు మున్నగునవి వీరగాథాచక్రములకు ఉదాహరణములు. బొబ్బిలికథ, దీని వరుసలోను తద్భేదములలోను గల యితర కథలు, హరిహరీ పదములు, శారదపదములు, జంగంకథలు మొదలగునవి వీరగాథలు. గుఱ్ఱాల గోపిరెడ్డిపాట, మానందిరెడ్డిపాట, బుడ్డా వేంగళరెడ్డిపాట– ఇత్యాదులు వీరగాథానికలు లేక లఘు వీరగాథలు. ఈ ప్రకరణమున వీరగాథాచక్రములలో శక్తి కథలనుగూర్చి చర్చింతము.

శక్త్యారాధనమునకు అంకురారోపణము వేదములలోనే కనిపించును. ఋగ్వేదములో 'శక్తి' సర్వమహాశక్తుల సమాహారమూర్తిగా నభివర్ణితమయినది. అనంతరము కేనోపనిషత్తులో దేదీప్యమాన విగ్రహయగు 'ఉమా' రూపమున ఆమె మనకు దర్శనమిచ్చును. పురాణములలో శ్రీకృష్ణుని సోదరియగు 'మహామాయ'గా వర్ణితయై, వైష్ణవమతముతోఁగూడ సంబంధము కల్పించుకొన్నది. శైవమతానుసారము శక్తి శివపత్ని. కాలక్రమమున సర్వజగన్మాతగా శక్తిని ఆరాధించు నాచారము ప్రబలినది. శక్తియొక్క వివిధ రూపములలో భయంకర స్వరూపిణియగు కాళీమూర్తి బహుళ ప్రచారములోనికి వచ్చినది. పర్వతాధిదేవతయగు 'దుర్గ'గాను, సౌందర్య పరసీమయగు లలితగాను కూడ శక్తి యారాధితయగుచున్నది. శక్తిని నెవ్వరేవిధముగ నారాధించినను, ఎప్పుడును స్త్రీమూర్తిగనే యారాధింతురు. శాక్తేయమతమునకు 'తంత్రములు' ఆధారగ్రంథములు.[1]

శక్తులు అనంతవిధములు. ఇవన్నియును ఆదిశక్తిలోనుండి వచ్చినవనుట సాధారణ సూత్రము. వేదములో 'ఏకం సత్, విప్రా బహుధా వదంతి' అనినట్లు ఒకే శక్తి బహురూపములలో బహు నామాలలో భావింపఁబడుచుండును. కొందఱకు లలితమూర్తు లిష్టమగుచో, మఱికొందఱకు ఉగ్రమూర్తు లిష్టము. "అతీవ సౌమ్యం లలితేతి శబ్దం, ప్రచండ చండీతి పదంచ భీమం" అని కావ్యకంఠ గణపతిముని, ఒకే శక్తి లలిత భీమ రీతులుగాఁ బలుకఁబడుచుండునని వ్రాసెను.

అణిమాదికములైన అష్టసిద్ధులు 'ఉన్నత శక్తులు'. ఇవన్నియు ఘోరతపస్సు చేసినగాని లభింపవు. కొద్దిపాటి సాధనతో, అదియును నీచములగు మద్యమాంసాదుల సహాయముతో, అల్పతంత్రముల సహాయముతో– ఇతరులకు అపకారము చేయుటకును, చిన్నచిన్న ప్రజలు ప్రదర్శించుటకును సాధించెడివానిని 'క్షుద్రశక్తు'లందురు. (సామాన్యముగా 'క్షుద్ర' మనెడిది నీచార్థమున వాడఁబడుచున్నది. అంతకన్న నీ శబ్దమును అల్పార్థమున భావించుట సముచితము).

స్తంభన, విద్వేషణ, ఉచ్చాటన, భ్రామణ, ఉత్సాదన, మారణాది క్షుద్రశక్తులనుగూర్చి అన్ని మంత్రశాస్త్రములలోను బ్రస్తావింపఁబడినది. ఇవికాక, దేశమున నొక మహత్తర కార్యముకొఱకుఁ బ్రాణము వదలిన వ్యక్తులు దేవతలై వెలయుచుందురు. రేణుక యట్టివారిలో నొకతె. కావ్యకంఠ గణపతిముని తన 'ప్రచండచండీ త్రిశతి'లో రేణుకను భిల్లకాంతగా వర్ణించినాఁడు.

శ్లో *'గుంజాఫలా కల్పిత చారుహారా*
*శీర్షే శిఖండం శిఖినో వహంతీ*
*ధనుశ్చబాణాన్ దధతీ కరాభ్యాం*
*సా రేణుకా వల్కలభృద్ విచింత్యా'*

(తలయందు నెమలిపింఛము, మెడలో గురివెందల దండ, చేతులలో ధనుర్బాణములు గల వల్కలధారిణియైన రేణుక ధ్యానింపఁదగినది).

రేణుక మంత్రశాస్త్రములో నుత్తమదేవతగాఁ బొగడఁబడినది. భయంకరమూర్తులైన కాళీ, బగళా, చండికా, మాతంగీ– మొదలైన దేవతలు మంత్రశాస్త్రములలో నుత్తమ తపోమార్గములలోను, క్షుద్రసాధనములలోను– రెండింటను గాన్పింతురు. కాని, మంత్ర తంత్రములు మాత్రము భిన్నములు. ముఖ్యముగా సాధనాపద్ధతులలో భేదమెక్కువ. దక్షిణాచార మార్గములో యమనియమములు, శుద్ధత, ఆచారము ప్రధానము. వామాచార మార్గములో 'పంచ మకారములు'– అనఁగా మద్యము, మత్స్యము, మాంసము, మైథునము, ముద్ర– ప్రధానము. గమ్యమొక్కటే యైనను అనుసరణ మార్గములు వేఱు. ఉత్తమ సాధకునకు దేవతాసాక్షాత్కారము, జన్మరాహిత్యము మొదలగునవి ముఖ్యము కాగా, క్షుద్రసాధకునకు సిద్ధులు, లోకములో వాని ఉపయోగములు ముఖ్యము.

శక్తిపూజ యెంతకాలముగా నున్నదో చెప్పుట కష్టము. ఆర్యుల అగ్ని సూర్యాద్యుపాసనలకంటెఁ, బ్రాచీనజాతుల శక్తిపూజ ముందరిదని చారిత్రకులు భావించుచున్నారు. వైదిక వాఙ్మయములో తంత్రములు బయలుదేరునాటికి శక్తిపూజ మిక్కిలి ప్రచారములోనికి వచ్చినది.

లలిత, చండిక, దుర్గ– మొదలైనవి వైదిక దేవతలు. మంత్ర తంత్ర జపహోమాద్యుపాసనా పద్ధతులు వీని యారాధనా మార్గములు.

ఎల్లమ్మ (రేణుక), పోలేరమ్మ, ముత్యాలమ్మ, గంగానమ్మ, కాకతమ్మ, మాహురమ్మ, అంకమ్మ మొదలగునవి క్షుద్రదేవతలు. మద్యము, బలి మున్నగువానితో నివి తృప్తివహించును. ఈ క్షుద్రశక్తులు, వీని పద్ధతి తెలిసి చేసినచో త్వరగ సిద్ధించును. కాని, యెంతయో నిగ్రహమున్నఁ దప్ప, వీనివలన మానవుఁడు పతనము చెందెడి యవకాశములు హెచ్చు. అందువలన దివ్యత్వమునకుఁ బ్రయాణము చేసెడి మానవుఁడు ఉత్తమ శక్తుల నుపాసింపవలెను.[2]

జానపదులలో క్షుద్రశక్త్యారాధనమే హెచ్చు. ఈ దేవతలను 'గ్రామదేవత' లందురు. "అంకమ్మ, అంకాళమ్మ, అంకు, ఎఱ్ఱపోతమ్మ, ఎల్లమ్మ, కొండమ్మ, గంగమ్మ, గంగనమ్మ, గంగానమ్మ, గంటలమ్మ, పల్లకమ్మ, పళ్లాలమ్మ, పుట్టాలమ్మ, పెద్దింటమ్మ, పైడమ్మ, పోలక, పోలకమ్మ, పోలేరమ్మ, పోలేరు, మారి, ముత్యాలమ్మ మొగదారమ్మ"– మున్నగునవి మన యాంధ్రదేశమునఁ బూజింపఁబడుచున్న కొన్ని ప్రధాన గ్రామదేవతలు. ఈ క్షుద్రశక్త్యారాధనమున గ్రామీణులు జాతరలు, బలులు జరుపుచుందురు. ఈ జాతరలలోనే ఆయా శక్తుల మహిమలను దెల్పు కథలు గానముచేయఁబడును. ఇట్టి శక్తికథలలో నెల్లమ్మకథ, అంకమ్మకథ, పోలేరమ్మకథ, మాతపురాణము, మాతంగికథ, ముత్యాలమ్మకథ, మాహురమ్మకథ (మావురమ్మకథ), చౌడమ్మపాటలు, కాకతమ్మకథ, జాలమ్మకథ, గంగానమ్మకథ పుట్టాలమ్మకథ– మొదలగునవి కలవని తెలియు చున్నది. రేణుకకు జానపదులలో 'ఎల్లమ్మ' యని వ్యవహారము. 'మాహుర'మను గ్రామమున వెలసియుండుటచే నీమెకు 'మాహురమ్మ' (మావురమ్మ) అనియుఁ బేరువచ్చినది. రేణుకయే ఓరుగంటిలో 'నేకవీరాదేవి'గా వెలసినదది. 'ఏకవీరాంబకథ' యను వీరగాథయుఁ గలదు.

క్రీ.శే. వేటూరి ప్రభాకరశాస్త్రిగారును, వారి ననుసరించి వారి శిష్యులు శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారును శక్తికథలకొక పట్టిక నిచ్చిరి.[3] "మాతపురాణము, పరశురామ రామాయణము, గౌతమ పురాణము, మఱ్ఱిచెట్లకథ, రేణుక యుద్ధము, కాకతమ్మకథ, అంకమ్మకథ, గంగానమ్మకథ, మాతంగికథ" అనునవి వీరిచ్చిన పట్టికలో గలవు. ఈ పట్టిలో నొకేకథను త్రిప్పి త్రిప్పి నాలుగు కథలుగాఁ జెప్పిరి. 'పరశురామ రామాయణము, గౌతమ పురాణము'– అను రెండును ఒక్కటే. ఇది గాథావృత్తము (Ballad-cycle). 'మఱ్ఱిచెట్లకథ, రేణుక యుద్ధము' అనునవి యీ గాథావృత్తములోని కొన్ని వీరగాథలు. వీరిచ్చిన పేర్లుకూడ జానపద వ్యవహారమునకు భిన్నముగా నున్నవి. 'పరశురామాయణ' మనుట సమంజసము కాని 'పరశురామ రామాయణ' మనుట సరికాదు. ఉలిచి భావజ్ఞుఁడను కవి రచించిన ద్విపదకావ్యమున గూడ 'పరశురామాయణ' మనియే చెప్పఁబడినది. [చూ. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారము (Madras Government Oriental Manuscripts Library- సంక్షిప్తముగా MGOML) లోని తాళపత్రప్రతి, డి.నెం. 1110]. అట్లే 'గౌతమ పురాణ' మనుటయు సమంజసము కాదు. జానపద సంప్రదాయమున పరశురాముని పితామహుడు 'సత్యగౌతుడు'. ఆ సత్యగౌతునితో నీ పురాణము ప్రారంభింపఁబడును గాన దీనికి 'గౌతుపురాణ' మని పేరు. కావున 'గౌతు' శబ్దమే జానపద వ్యవహారమున సరియైనది. 'గౌతమ' శబ్దము పండిత సృష్టి. ఒకవేళ, ఈ 'గౌతమ' శబ్దమే సాధువనియు, ఇది జానపదులలో భ్రష్టమైనదనియుఁ దలంతుమన్న, శిష్టవ్యవహారమునఁ బరశురాముని పితామహుడు 'ఋచీకుఁడు' కాని, గౌతముడు కాదు. పైగా, ఈ గౌతమపురాణము పరశురాముని వృత్తాంతమునే తెల్పుచున్నది కాని, అహల్యాగౌతముల వృత్తాంతమును దెల్పుట లేదు. కాఁబట్టి జానపదుల 'గౌతు' శబ్దము శిష్టుల వ్యవహారమున నున్న 'గౌతమ' శబ్దముకంటె భిన్నమైనదని నా యభిప్రాయము.

శ్రీ కోదండరామయ్యగారివలెనే శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారును 1953 డిసెంబరు నెల 'కిన్నెర'లో నొక శక్తికథల పట్టిక నిచ్చిరి. "మాహురమ్మకథ, మాతపురాణము, గౌతమ పురాణము, మఱ్ఱిచెట్లకథ, రేణుక యుద్ధము, కాకతమ్మకథ, అంకమ్మకథ, గంగానమ్మకథ, మాతంగికథ, కామేశ్వరిపాట, పరశురామ పురాణము". శ్రీపాదవారిచ్చిన యీ పట్టికలోఁగూడ ఎల్లమ్మకథ చర్వితచర్వణమైనది. వీరుకూడ 'గౌతుపురాణము' న 'మ' అను నక్షరమును జేర్చిరి. పరశురామాయణమును 'పరశురామ పురాణ' మనిరి. వీరు చెప్పిన వానిలో 'మాహురమ్మకథ, గౌతమ పురాణము, పరశురామ పురాణము' అను మూఁడు కథలును ఒక్కటే. దీనిని 'పరశురాముని కథాచక్రము' లేక 'ఎల్లమ్మ కథాచక్రము' అని పిలువవచ్చును. శ్రీపాదవారు తెల్పిన 'మఱ్ఱిచెట్లకథ, రేణుక యుద్ధము' అనునవి పై గాథాచక్రములోని అంతశ్శాఖలు. అట్లే 'మాతపురాణ' మన్నను, 'కాకతమ్మకథ' యన్నను ఒక్కటే.

పైన చర్చించిన శక్తికథలలో 'ఎల్లమ్మకథలు, అంకమ్మకథలు, పోలేరమ్మకథ, ఎల్లమ్మకథ (తెలంగాణాప్రతి), ఏకవీరాంబకథ (తాళపత్ర గ్రంథము), చౌడమ్మపాటలు'– అనునవి నాకు లభించినవి. 'మాతపురాణము, మాహురమ్మకథ, ఉలిచి భావజ్ఞుఁడు రచించిన 'పరశురామాయణము' MGOML లోఁ గలవు. (చూ. ఆర్.నెం. 693, 694; డి.నెం. 110, 111). కాకతమ్మకథ వరంగల్లు మండలమునను, ముత్యాలమ్మకథ నల్లగొండ మండలమునను, జాలమ్మకథ ఒంగోలు తాలూకాలోను, ఆరంజోతికథ చిత్తూరు మండలమున కాళహస్తి తాలూకాలోను వ్యాప్తియందున్నట్లు తెలిసినది. కాని దేశద్రిమ్మరులగు ఆ గాథాకారులను బట్టుకొనుట నాకు అశక్యమైనది. కృష్ణామండలమున నాకు లభించిన 'ఏకవీరాంబకథ' యను తాళపత్ర గ్రంథమున 'రేణుకా కల్యాణము, గిరిరాజు యుద్ధము' అను రెండు వీరగాథలున్నవి. రేణుక కల్యాణమునకు రేణుక రాయబారమనియుఁ పేరు. రాజకీయ సంబంధమగు సామరస్యమును నెఱపు కార్యమునకే కాక, పెండ్లి సంబంధమును గుదుర్చు పనికిఁ గూడ 'రాయబారము' అని పిలుచుట జానపదులలోఁ బరిపాటి. దీనిని

'పెండ్లి రాయబారము' అందురు. పల్నాటి వీరకథలలో మొదటికథకు 'పెద్దన్న పెండ్లి రాయబారము' అని పేరు. కాఁబట్టి రేణుక రాయబార మనఁగా రేణుక కల్యాణమనియే యర్థము. గిరిరాజు యుద్ధమునకు 'రేణుక యుద్ధ'మని నామాంతరము. గిరిరాజు రేణుకతండ్రి. ఇతఁడు రాక్షసులతోఁ జేసిన యుద్ధమున నలసిపోయి మూర్ఛనొందును. అప్పుడు రేణుక తన తండ్రికి సహాయముగా వచ్చి రాక్షసులను సంహరించును. అందుచే ఈ గిరిరాజు యుద్ధమునకు రేణుక యుద్ధమని పేరు వచ్చినది.

ఇఁక పోగా, "మఱ్ఱిచెట్లకథ, గంగానమ్మకథ, మాతంగికథ"– అను మూఁడు కథలును నేను సంప్రతించిన జానపదులలో నెవరియొద్దను వినఁబడలేదు, కనఁబడలేదు. అంతమాత్రమున నివి దేశమున లేవని చెప్పుట కాదు. వీనినిగూర్చి యింకను శోధింపవలసి యున్నది. గౌతుపురాణమున మొదట వచ్చు యాదవమఱ్ఱినిగూర్చిన కథయే 'మఱ్ఱిచెట్లకథ' యగునని ఊహించుచున్నాము. 'గంగానమ్మ' యాదవుల కులదైవమగు గంగయే యగుచో, కాటమరాజు కథాచక్రములోని 'గంగతర్క' మను కథయే గంగానమ్మకథ కానోపును. పెండ్లి పెడాకులు లేని స్త్రీని 'మాతంగి' యందురు. పోలేరమ్మకథలో నామె యవివాహితయగు నీశ్వరపుత్రికగాఁ దెలుపఁబడినది. కాఁబట్టి పోలేరమ్మకథయు మాతంగికథయు అభిన్నములు కావచ్చును.

'కామేశ్వరికథ' కూడ పై శక్తిజాతికిఁ జెందినను ఇది నేఁడు 'అక్కలపాట' యను స్త్రీలపాటగా మాత్రమే లభించుచున్నది. జానపదులు పాడు వీరగాథగాఁ గానవచ్చుట లేదు. స్త్రీలపాటలు జానపదకవిత్వము కానేరవు, అగ్రవర్ణములకుఁ జెందిన జాతిదేశి కవిత్వము. MGOMLలో రేటూరి భావనామాత్యుఁడు రచించిన 'కామేశ్వరీ చరిత్ర' మను ద్విపద కావ్యమొకఁటి గలదు (కాగితపుప్రతి, డి.నెం. 1045). కామేశ్వరికథను దెల్పు 'ఆదిలక్ష్మీ విలాస' మను పద్యకృతియు మఱియొకటి గలదు (డి.నెం. 388). ఈ కామేశ్వరికథయే క్రీడాభిరామమున జక్కుల పురంధ్రి పాడిన 'కామవల్లీ మహాలక్ష్మి కైటభారి వలపు'. జక్కులు పాడెడి పాట నేఁడు లభించుట లేదు. 'అక్కెమ్మపాట' యనుపేర రాయలసీమ జానపదస్త్రీలలో నొక లఘుకథాగేయము ప్రచారమున నున్నది కాని, దీని యితివృత్తము నకును కామేశ్వరికథకును ఏవిధమగు సంబంధమును లేదు. మొత్తముపై కామేశ్వరికథ నేఁడు అగ్రవర్ణముల స్త్రీలపాటగా లభించుచున్నదే కాని, జక్కులవంటి జానపద గాయక భిక్షువులు పాడు వీరగాథగా లభించుట లేదు.

పోచమ్మ, మైసమ్మ, బాలమ్మ– అనునవి కూడ జానపదులు పూజించు క్షుద్రశక్తులే. తెలంగాణమున వ్యాప్తియందున్న ఎల్లమ్మకథలో ఆమెకుఁ దండ్రియగు గిరిరాజు 'మైసమాపురము'ను అరణముగా నిచ్చెనని కలదు. కాఁబట్టి 'మైసమ్మ' యను పేరుకూడ ఎల్లమ్మకే వర్తించునని భావింపవచ్చును. మొత్తముపై శిష్టసాహిత్యములో జమదగ్ని భార్యయగు రేణుక జానపదులలో బహునామములతో వ్యవహరింపఁబడుచున్నదని చెప్పవచ్చును. 'ఎల్లమ్మ, ఎల్లారమ్మ, మాహురమ్మ, మావురమ్మ, మావురాల యెల్లమ్మ, ఏకవీరాంబ, ఏకవీర, మైసమ్మ' అను పేర్లు జానపద వ్యవహారమునఁ గలవు. 'రేణుక' యను నామముకూడ నచ్చటచ్చట కాననగును. ఈ నామములన్నింటిలోను 'ఎల్లమ్మ' నామము మిక్కిలి ప్రసిద్ధము. కాకతమ్మనుగూడ ఎల్లమ్మగా భావించు విమర్శకులున్నారు. కాని 'కాకతమ్మకు సైదోడ ఏకవీర' అను క్రీడాభిరామ పద్యపాదమునుబట్టి ఈమె కాకతమ్మ కంటె భిన్నమైనదని ప్రభాకరశాస్త్రిగారు తీర్మానించిరి. 'మాతపురాణ' మను కథలో కాకతీయరాజుల చరిత్ర వచ్చుటచే నీ మాతపురాణమునే కాకతమ్మకథగా భావింపవలసియున్నది.

పైన తెల్పిన శక్తికథలలో నాకు లభించినవానిలో, ఎల్లమ్మకథలు, అంకమ్మకథలు ప్రత్యేక వీరగాథాచక్రములుగా నేర్పడి యున్నవి. చౌడమ్మ పాటలుకూడ వీరగాథాచక్రమే కాని, యిందలి కథలకొక వరుసక్రమము కానరాదు. అందునను నివి లఘువీరగాథలే కాని సాధారణ వీరగాథలు కావు. పోలేరమ్మకథ విడికథయే. మాతపురాణము అసమగ్రముగా లభించుటచే అది గాథావృత్తమో లేక విడిగాథయో చెప్పలేము. తక్కినవి అలభ్యములు కావున అవి ప్రత్యేకగాథలో లేక గాథావృత్తములోఁ దెలుపుటకు వీలుపడదు. పైన తెల్పిన వివిధ శక్తులన్నియును ఆదిశక్తినుండి పుట్టినవే కావున మొత్తము శక్తికథలన్నియును స్థూలముగా నొకే గాథావృత్తముగా భావింపనగును. ఈ మూల గాథావృత్తములో 'ఎల్లమ్మ కథాచక్రము, అంకమ్మ కథాచక్రము, చౌడమ్మ కథాచక్రము' అనునవి అంతశ్శాఖలని చెప్పవచ్చును. మాతపురాణము, పోలేరమ్మకథ, ఆరంజోతికథ– ఇత్యాదులు ఇతర శక్తికథలు.

కాటమరాజుకథలుకూడ నొకవిధముగాఁ బరిశీలించినచో శక్తికథలేయని చెప్పవలెను. అందలి ప్రధానదైవము గంగమ్మ. ఈమె కృష్ణుని సోదరియగు మహామాయయని 'కంసుడుకథ' అను వీరగాథలోఁ దెలుపఁబడినది. ఈమెకూడ శక్తిస్వరూపిణియే. అందుచే నీమెను గొల్చిన యాదవరాజుల కథలుకూడ శక్తికథలే కావలెను. కాని యీ యాదవరాజుల కథలకు 'గంగకథ'లను పేరు జానపద వ్యవహారమున లేదు; వీనికి 'కాటమరాజుకథ'లనియే వాడుక. కాటమరాజు క్రీ.శ. 13వ శతాబ్దమున నివసించిన చారిత్రక పురుషుడు. అందుచే ఈ కథలను వేఱుగా విభజింపవలసివచ్చినది.

## 1. ఎల్లమ్మ కథాచక్రము లేక పరశురాముని కథాచక్రము

ఈ కథాచక్రమునకు 'గౌతుపురాణ' మని జానపద వ్యవహారము. దీనికి సంబంధించి మౌకిక ప్రసరణమున నున్న ఆఱు వీరగాథలను నేను సేకరించితిని. అవి:–

1. జలగన్న పార్వతి కథ (ఎల్లమ్మ అత్తగారు 'జలగన్న పార్వతి', ఈమె భర్త 'సత్యగౌతుఁడు').
2. రేణుకా కల్యాణము లేక రేణుక రాయబారము.
3. పరశురాముని జననము.
4. పరశురాముని యుద్ధము.
5. గవరమ్మ గాజులు. (ఎల్లమ్మ కూతురు 'గవరమ్మ'. ఈమెను 'కార్తిక మల్లఁడు' వివాహమాడుట యీ కథలోఁ గలదు).
6. జంపన్న వెలుగొండ వెళ్లుట. (ఎల్లమ్మకు జ్యేష్ఠపుత్రుడు జంపన్న. ఈతని తరువాత గవరమ్మ, తరువాత పరశురాముడు పుట్టినారు. ఎల్లమ్మ యీ జంపన్నను వెలికొండలో నుండు సిద్ధులకాహారముగా బలినీయఁబోవును).

ఉపలబ్ధములగు 'ఏకవీరాంబకథ' 'మావురమ్మకథ' అను తాళపత్రగ్రంథములను, తెలంగాణములోని 'ఎల్లమ్మకథ'ను బరిశీలింపగా నీ పై కథాచక్రమునకు సంబంధించిన కథలు మఱి మూఁడు కలవని తెలియుచున్నది.

1. మఱ్ఱిచెట్టుకథ – సత్యగౌతుఁడు కొఱ్ఱచేను వేయుటకై యాదవ మఱ్ఱిని నఱికి పాపము కట్టుకొనుట. ఇది జలగన్న పార్వతి కథకన్న ముందు రావలెను.
2. రేణుక పుట్టుక – సంతానములేని గిరిరాజునకు ఆదిశక్తి రేణుకగా జన్మించుట. ఇది రేణుక కల్యాణము నకు ముందు వచ్చును.
3. రేణుక యుద్ధము లేక గిరిరాజు యుద్ధము– త్రిపురాసురులను జంపుటలో రేణుక తన తండ్రియగు గిరిరాజునకుఁ దోడ్పడుట. దీనిని 'రేణుక కల్యాణ' మను కథకుఁ దరువాత చేర్చుకొనవలెను.

తెలంగాణమున రామరాజుగారు సేకరించిన 'ఎల్లమ్మకథ', పై గాథావృత్తములోని ఎల్లమ్మ వృత్తాంతముకన్న కొంచెము భిన్నముగా నున్నది. ఇది అసమగ్రము. పరశురాముని వృత్తాంతము కాని, జమదగ్నితల్లి జలగన్న పార్వతి వృత్తాంతము కాని యిందు లేదు. ఇది యొక ప్రత్యేకగాథ. ఇందు యాదవమఱ్ఱి కథ, జమదగ్ని పుట్టుక, రేణుక కల్యాణము, పరశురాముఁడు తల్లిని నఱకుట– గలవు.

పరశురాముని వృత్తాంతము రామాయణ భారత భాగవతము లందుఁ గొంత కలదు; బ్రహ్మాండపురాణమున నతివిపులముగా నున్నది. కాని ఈ బ్రహ్మాండపురాణమందలి కథకును జానపదులలో వ్యాప్తియందున్న కథకును పోలికలు లేవు. బ్రహ్మాండపురాణములోని కథయే జనవ్యవహారమున నిట్లూహింపరాని మార్పు నొందియుండ వచ్చును. లేదా జానపదుల కథలను సంస్కరించుటచేతనే పురాణము వెలసియుండవచ్చును. ప్రకృత మీ రెండింటికిని, ఒకటి రెండు ఘట్టములలోఁ దప్ప, పోలికలు కానవచ్చుట లేదు. పురాణేతిహాసముల ననుసరించి పరశురాముని వంశవృక్ష మిట్లుండును:–



నేను సేకరించిన 'పరశురామునియుద్ధ'మను జానపదగాథలో జమదగ్ని తన పితృపితామహులనుగూర్చి పరశురామునితో నిట్లు చెప్పుకొనెను. 'చినవాడా, నీమకముని కొడుకు నిరేంద్రముని. నిరేంద్రముని గర్భమున జన్మించినవాడు రత్నమాముని. ఆయన గర్భమున గలిగినవాడు సత్యగౌతుడు. ఆ గౌతుడు గర్భమున జన్మించిన వాణ్ణి నేను. నా పేరు జమదగ్ని, నా భార్యపేరు రేణుక.

నాకు లభించిన 'ఏకవీరాంబకథ' యను తాళపత్రగ్రంథమున తొమ్మిదవ పత్రమున జమదగ్ని వంశమిట్లు చెప్పఁబడినది. "భౌటుక మహాముని కుమారుడు రత్నమహాముని. ఇతని కుమారుడు గౌతమహాముని. గౌతమహాముని కుమాళ్లు నీలమహాముని, పాలమహాముని, శంఖుమహాముని, జనకమహాముని, అందరికన్న పెద్దవాడు సట్టువైగరి వహించుకు పుట్టెను జమదగ్ని మహా మునీశ్వరుడు." ఈ కథలోనే యేబదియవ పత్రమున గిరిరాజు వంశమిట్లున్నది. "రేరాజు కుమారుడు భూరాజు. భూరాజు కుమారుడు గిరిరాజు. గిరిరాజు కుమారుడు అగస్త్యుడు చిద్దమారాజు". ఇందు గిరిరాజుది చంద్రవంశమనియు, యదువంశ మనియుఁ జెప్పఁబడినది.

కాబట్టి జానపదులలో వ్యాప్తియందున్న వీరగాథల ననుసరించి పరశురాముని వంశవృక్షము నిట్లు చూపవచ్చును:-




ఎల్లమ్మ కూఁతురగు గవరమ్మ 'గౌంతిదేవి' అను పేరుతోను, ఆమె భర్త 'కార్తిక మల్లఁడు, 'నందిగాఁడు' అను పేరుతోను నేఁడు పంచమ కులమువారిచేఁ పూజింపఁబడుచున్నారు. పరశురాముని భార్యయగు విధూలక్ష్మి అంధురాలు. ఈమె బ్రాహ్మణులచేఁ పూజింపఁ బడుచున్నది. నెలగంటు పెట్టిన నాటినుండి ఈమెను పూజింతురు.

ఈ జానపద వీరగాథలలో మఱియొక ముఖ్యవిషయమున్నది. జమదగ్నిని చంపిన కార్తవీర్యార్జునుఁడు రేణుకకు సోదరుఁడఁట. అనఁగాఁ బరశురాముఁడు మేనమామను జంపినాడు. ఇది భాగవత ప్రభావముగాఁ దోచుచున్నది. 'కార్తవీర్యార్జునుడు' జానపదుల నోళ్లలో 'శాత్రవీరార్జునుఁడు'గా మాఱినాఁడు. ఈ శాత్రవీరార్జునునకుఁ బెక్కురు తమ్ములున్నారు. వీరిని 'కార్తికరాజు' లందురు. వీరిలోఁ జివరివాఁడు 'విచిత్ర వీరరాజు'. పరశురాముఁడు ఈతనిని జంపక విడిచి పుచ్చినాఁడు. (దుర్యోధనుఁడు తన నూటుమంది మేనమామలలో 99 మందిని చంపి, చివరివాడగు శకునిని చంపక విడిచెనని తెలుగులో ఒక జానపదకథ కలదు. దాని ప్రభావమిచట కన్పట్టుచున్నది.) ఈ విచిత్ర వీరరాజునకు 'కార్తిక మల్లఁడు అను కుమారుఁడు, 'విధూలక్ష్మి' యను కూఁతురు గలరు. రేణుకపుత్రికయగు గవరమ్మను కార్తిక మల్లఁడు పెండ్లాడెను. విధూలక్ష్మి పరశురాముని ప్రేమించి, అతనికై గొప్ప తపస్సు చేసెను. రేణుకతండ్రి గిరిరాజు. ఈ గిరిరాజు సోదరి జలగన్న పార్వతి. ఈమె పరశురాముని పితామహుఁడగు సత్యగౌతుని భార్య. రేణుకపితామహుఁడు ఇవళాంగిరాజు. ఈ యివళాంగిరాజు సోదరి 'నీమకాదేవి'. ఈ నీమకాదేవి పరశురాముని

**వీరగాథల ననుసరించి శాత్రవీరార్జునుని వంశవృక్షము నిట్లు చూపవచ్చును:**




ప్రపితామహుఁడగు రత్నమాముని భార్య. ఇట్లు పరశురాముని వంశమునకును, కార్తవీర్యార్జునుని వంశమునకును, మేనఱికపు పెండ్లిండ్లతో బాంధవ్యము సూచింపబడినది. ఈ బాంధవ్య నిరూపణమునకు జనశ్రుతితప్ప మఱియే యితరమగు నాధారమును గానరాదు.

ఈ పరశురాముని కథలలో ఎల్లమ్మ తమ్ములనుగూర్చి యిట్లు చెప్పఁబడినది: "అందరికన్న పెద్దవాడు శాత్రవీరార్జునుడు, వీరాన వీరుండు విచ్చిత్రకారుండు, భావానభావుండు చక్రవధరుడు, సేనానసేకుండు చంద్రకారుండు, అడ్డమారుమూళ్లు, నిలువు తొమ్మిది మూళ్లు, పాదాలు పదిమూళ్లు, పద్మనాయకులు..."

ఎల్లమ్మ చెల్లెండ్రనుగూర్చి యిట్లున్నది: "వెట్టలమాత, వేదనుమాత, తుమ్ములమాత, దురదలమాత, పొంగులమాత, పోటకముమాత, ఆదివిరాటంబు హేంకాళిశక్తి, మరిడీ మహంకాళి..."

'రేణుకాకల్యాణ' మను కథలో కార్తికరాజులనుగూర్చి యిట్లు చెప్పఁబడినది: "మహాపరాక్రమ వంతులు, వీరానవీరులు, భావనభావులు, చక్రధరులు, ఈరులు, శూరులు, విక్రమార్కులు, సేవానసేకులు, ఉగ్రవధరులు, పాదాలు పదిమూళ్ళు, నిలువు తొమ్మిదిమూళ్ళు, పద్మనాయకులు, దేశానికి దేవుళ్ళు, రాజ్యానికి రాజులు...". ఇవన్నియు శిష్టకవులు రచించిన ప్రౌఢ సమాసములకు భ్రష్టరూపములుగాఁ దోఁచుచున్నవి.

పరశురాముని కథలనుగూర్చి వ్రాయుచు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ఇట్లనిరి: "పరశురామపురాణము వైష్ణవప్రశంస చేయును; అది తరువాతిదై యుంటుంది" (చూ. కిన్నెర, డిసెంబరు, 1953 పుట. 555). అనఁగా నిది కాకతీయుల కాలమునకుఁ దరువాతది యని శ్రీపాదవారి యభిప్రాయము. కాని క్రీడాభిరామమునుబట్టి చూచినచో రెండవ ప్రతాపరుద్రుని కాలమునాఁటికే 'పరశురామునికథ లెల్లఁ బ్రౌఢి'తోఁ బాడఁగల బవనీల చక్రవర్తులున్నారని తెలియుచున్నది. అనఁగా క్రీ.శ. 13వ శతాబ్దము నాటికే తెలుఁగుదేశమునఁ బరశురాముని కథలు వ్యాపించియున్నవని చెప్పవచ్చును. శ్రీపాదవారు పరశురాముని కథలు వైష్ణవప్రశంస చేయుననుట కూడ సమంజసము కాదు. ఇప్పుడు లభించుచున్న జానపద వీరగాథలలోఁగాని బ్రహ్మాండ పురాణములోఁగాని వైష్ణవ ప్రశంస యేమాత్రమును లేదు సరికదా, శైవమత ప్రశస్తి యున్నది. రేణుకాకల్యాణమను కథలో జమదగ్ని జంగమువేషము వేసికొనినట్లున్నది. 'గవరమ్మగాజు' లను కథలోఁ బరశురాముని అన్నయగు జంపన్నకు 'శివపర్వతం, హరిలింగమయ్య, గురులింగమయ్య, కోటిపల్లి స్వామిలింగమయ్య, ఈశ్వర వీరభద్రయ్య'– అను నైదుగురి అన్నదమ్ముల తోఁబుట్టువగు 'జంగపురి చేడి (=జంగపువారి చేడె) అను కన్యను బెండ్లిచేసినట్లు గలదు. ఇట్లు పరశురాముని వీరగాథలలో శైవమతప్రసక్తియే యెక్కువగానున్నది. బ్రహ్మాండపురాణమునఁ బరశురాముఁడు శివునిపూజించి, అతని యనుగ్రహముచే పరశువును, భార్గవాస్త్రములను గ్రహించి, వీరుఁడుగాఁ బేరుపొందినట్లున్నది. బ్రహ్మాండపురాణమునఁ గార్తవీర్యార్జునుని త్రిశూలముచేఁ బరశురాముఁడు కూలిపోఁగా, శివుఁడు సంజీవనితో నాతనిని తిరిగి బ్రతికించినట్లున్నది. ఇది 'పరశురామునియుద్ధ'మను వీరగాథ యందును గలదు. కాఁబట్టి పరశురాముని కథలలో వైష్ణవప్రసక్తి కలదనుట సరికాదు.

ఈ పరశురాముని కథలను 'బవనీలు' పాడుచుందురు. ఈ బవనీలను విశాఖ, శ్రీకాకుళ మండలములలో 'బుడబుడకలవాళ్లు'

అందురు. ఇది 'బుడబుక్కల' శబ్దము కంటె భిన్నమైనది. బవనీలు వాయించెడి 'జముకు' అనువాద్యము 'బుడబుడక... బుడబుడక' అను శబ్దమిచ్చుటచే వీరికీ పేరువచ్చినది. గోదావరి, కృష్ణా, గుంటూరు మండలములలో బవనీలను 'జముకులవాళ్ళు' అందురు. వీరి వాద్యమునకు 'జముకు' అని పేరు. ఇది 'బవనిక, జవనిక, జమిడిక' అను పేర్లతో శిష్టరచనలలోఁ గాననగును. ఇవియును ధ్వన్యనుకరణ శబ్దములుగనే కన్పట్టుచున్నవి. 'జవనిక' శబ్దమే జానపద వ్యవహారమున 'జముకు'గా మాఱియుండును. నెల్లూరు మండలమున బవనీలను 'బైనీడివాళ్లు' అందురు. రాయలసీమలో వీరిని 'ఆసాదివాళ్లు' అందురు. తెలంగాణమున వివిధ మండలములలో నీ బవనీలు 'బైనీడోళ్లు' (=బైనీడివారు), 'బైండ్లోళ్ళు' (=బైండ్లవారు) అను నామములతోఁ బిలువఁబడుచున్నారు. డా॥ బి. రామరాజుగారు తెలంగాణమున బవనీలను 'పంబాలవారు' అనికూడ పిలుతురని తెల్పియున్నారు. ఇది సందేహాస్పదము. ఒకవేళ, తెలంగాణమున అట్టి వాడుక యున్నదేమో కాని, ఆంధ్ర, రాయలసీమలలో 'బవనీలు' వేఱు, 'పంబలవారు' వేఱు. బవనీలు మాదిగలు, పంబలవారు మాలలు. బవనీలు ఎల్లమ్మకథలను బాడుదురు; పంబలవారు అంకమ్మకథలను బాడుదురు. మాలలోఁగూడ కొందఱు ఎల్లమ్మకథలను బాడుచున్నారని నెల్లూరు మండలమునఁ దెలియవచ్చినది. కాని యిట్టివారు నాకు తటస్థపడలేదు. బహుశః, ఇట్టివారిని జూచియే రామరాజుగారు బవనీలును పంబాలవారును అభిన్నులని తలఁచియుందురు. మొత్తమునకు ఈ ఎల్లమ్మకథలను పాడువారందఱును అమ్మగారి దర్శనమునకుఁ జెందిన బవనీలు; వీరు మాదిగలు. ఎల్లమ్మను గొలుచు వర్ణములలో గమళ్లవారు (శెట్టిబలిజ) ఎక్కువ. నెల్లూరు మండలములో కావలిదగ్గఱనున్న 'ఏనుగుల బావి' యను గ్రామములో నందఱును రేణుకను గొలిచెడి గమళ్లవారే. ఓరుగంటి రెడ్లుకూడ కొందఱు రేణుకను గొల్చుచున్నారు.

ఈ పరశురాముని కథాచక్రమున నేను సేకరించిన మొదటి ఆఱు మౌఖికగాథలును పశ్చిమగోదావరీ మండలమున భీమవరము పట్టణమున గల హరిజనవాడలో 'కంట చిన్నయ్యదాసు' అను బవనీఁడు పాడుచుండగా వ్రాసికొన్నట్టివి. ఈ చిన్నయ్యదాసు జానపద కవిత్వమునకుఁ బేరుమ్రోసిన ఉత్తరాంధ్రము (విశాఖ, విజయనగర, శ్రీకాకుళ మండలముల) నుండి పశ్చిమ గోదావరీ మండలమునకు వలసవచ్చిన వాఁడు. కావున నితఁడు పాడిన కథల గొప్పతన మంతయు విశాఖ, విజయనగర, శ్రీకాకుళ మండలములకుఁ జెందునదే కాని, పశ్చిమ గోదావరికి వర్తించునది కాదు. భాష, పలుకుబడి కూడ ఉత్తరాంధ్రమునదే. ఈ చిన్నయ్య మేనమామ గొప్ప జముకుల కథకుఁడు. అతఁడు శక్తివేషమును ధరించి, శ్రవణపేయముగా జముకు వాయించుచు, 'శుద్ధ సాళవ సంకీర్ణ' గతులలోఁ బాడుచు, శ్రోతల హృదయములను ఉఱ్ఱూతలూచుట నా చిన్నతనమున మా గ్రామము (తణుకు)న నెన్నియో మాఱులు గమనించితిని. మన దురదృష్టమున నాతఁడు కీర్తిశేషుఁడైనాడు. ఆ బవనీల చక్రవర్తికి నుద్దివచ్చునాడే నాకు కథలు చెప్పిన చిన్నయ్యదాసు. ఈతఁడు తన విద్యనంతను మేనమామ కడనే పడసెను. ఈ చిన్నయ్య తండ్రి కూడ గంధర్వాంశగల గొప్ప బవనీఁడు. 1964 ఆగస్టు, సెప్టెంబరు మాసములలో నే నీ కథలను సేకరించితిని.

రేణుక లేక ఎల్లమ్మ ఆంధ్రదేశమున ఓరుగల్లులోనే కాక, మఱి నాలుగుచోట్ల వెలసినట్లు క్రీడాభిరామమునఁ గలదు:

***"మడపాకను, బెనుఁబాక, మహురమున***
***నాగవరమునఁ, బోలాస ననిచె నింతి***
***యోరుగంట వసించె నీలోత్పలాక్షి***
***కాకతమ్మకు సైదోడ యేకవీర"***

– వేటూరి పరిష్కృత క్రీడాభిరామము. పుట–41.

పశ్చిమ గోదావరీ మండలమున తణుకు పట్టణమునకుఁ బ్రక్కనే 'మండపాక' యను గ్రామమున్నది. ఇట 'ఎల్లారమ్మ' కుఁ బ్రతిసంవత్సరము గొప్ప తిరునాళ్లు జరుగును. పెనుపాకకూడ నాంధ్రదేశములోనిదే కావచ్చును. 'మాహురము, నాగవరము, పోలాస' ఇవి మాత్రము మహారాష్ట్రమునఁ గలవు. మాహురము నేఁటి 'మాహూర్'; నాగవరము నేఁటి 'నాగపూర్'; 'పోలాసయే' నేఁటి 'బలాషా'. ఆంధ్రులకు శక్తిపూజ, ముఖ్యముగా ఎల్లమ్మపూజ మహారాష్ట్రులనుండియే సంక్రమించినదని నా అభిప్రాయము. "మహారాష్ట్రమున దత్తాత్రేయుడు రేణుకాదేవి కుమారుడందురు... మాహూర్ (మాహురము)లో దత్తాత్రేయ మఠము మఱియు రేణుకాలయము ఉన్నవి."[4] కాకతీయరాజులు ఈ దేవతను మహారాష్ట్రమునుండి తెచ్చియుందురు. ఈమె మాహురమున వెలసియుండుటచే, జానపదగాథలలో రేణుక 'మావురాల ఎల్లమ్మ, మావురమ్మ, మాహురమ్మ' అను పేర్లతోఁ బిలువఁబడుచున్నది. ఓరుగంటిలో వెలసిన ఎల్లమ్మకు 'ఏకవీర' యనిపేరు. తండ్రిచే అరణమీయఁబడిన మైసమాపురమున వసించుటచే ఎల్లమ్మకు 'మైసమ్మ' యను పేరుకూడ వచ్చియుండును. కాకతమ్మ మాత్రము వేఱు. కాకతమ్మకు ఎల్లమ్మ సైదోడ. వీరిద్దఱును కామేశ్వరీపాటలో 'భోగావతీకన్య'లని పేర్కొనఁబడిరి. కార్తవీర్యార్జునుఁడు పాలించిన వింధ్యపర్వత సమీపస్థమగు 'మాహిష్మతీపుర'మే 'మాహురము' కావచ్చును. ఈ మాహురము నేఁటి గోదావరినదికి ఉపనదియగు పెనగంగానది యొడ్డున మహారాష్ట్రములోఁ గలదు.

తెలుఁగునఁగల వీరగాథావృత్తములలో ఈ ఎల్లమ్మ కథాచక్రము లేక పరశురాముని కథాచక్రము అత్యంత ప్రాచీనమైనది కావలెను. ఏలన, పరశురాముఁడు క్రీ.పూ. 1176లో కేరళపై దండెత్తినట్లు చారిత్రకాధారములున్నవి (చూ. 'వీరగాథల ప్రాచీనత' యను మూఁడవ ప్రకరణము). దీనికిని, దరువాతి కథాచక్రములకును గూడ కొంత సంబంధమున్నది. ఇందలి

కార్తవీర్యార్జునుని వంశము వారే పల్నాడును బాలించిన హైహయరాజులు. ఇది చారిత్రక సత్యము. పోఁగా, పరశురాముఁడే బ్రహ్మనాయనిగా జన్మించెననియు, పరశురామునిచేఁ జంపఁబడిన యొక శూద్రవనితా గర్భస్థ శిశువే నాగమ్మగా నవతరించెననియుఁ బల్నాటి వీరకథలలోఁ జెప్పఁబడినది. ఎల్లమ్మకథలోని యావదమ్మట్టిని గూర్చిన కథ, కాటమరాజుకథలలో భక్తిరన్నకథయందుఁ గానవచ్చును.

ఈ జానపద వీరగాథలలోఁ గార్తవీర్యార్జునుఁడు పరశురాముని మేనమామగాఁ జిత్రింపబడుట, రేణుకకుఁ బుట్టింటిపై నాశ మిక్కిలిగా నుండుట, ఈమె తన తమ్ముల గండమునఁ బుట్టిన కన్నబిడ్డలను జంపయత్నించుట విచిత్రముగా నుండును. ఇందలి పేర్లు కూడ చిత్ర విచిత్రములుగనే యున్నవి ('ఇవళాంగిరాజు, జమిళికాదేవి, జలగన్న పార్వతి' మొదలైనవి). తరతరములనుండి ప్రజల జిహ్వాగ్రములపైఁ దాండవమాడుచుండుటచే ఈ కథలిట్టి యద్భుతావహములగు మార్పులకు లోనైయుండును. బ్రహ్మాండపురాణ కథకును దీనికిని బోలికలు సన్నగిల్లుటకు ఈ మౌఖికప్రసరణమే కారణము కావచ్చును. రేణుక సోదరులగు కార్తికరాజుల భార్యలు 'గౌంతికాంత' లనియు, తండ్రి 'గిరిరాజ'నియు, తల్లి 'జమిళికాదేవి' యనియు రేణుక యత్తగారు 'జలగన్న పార్వతి' యనియు ఈ కథలలోఁ గలదు.

ఎల్లమ్మకథలను బాడెడి బవనీలు ఈ క్రింది విధముగాఁ బ్రార్థన చేయుదురు:[5]

| | | | |
|---|---|---|---|
| **"శరణా శరణా శరణే...ఓయమ్మ–శరణన్న వినవే మా మనవీ** | | | |
| **ఏ లోక మెల్లినావో...** | ,, | **మా లోకమాత రావే** | |
| **శిరసుదే శివపూజా** | ,, | **అరితిదే గవళపేరూ** | |
| **నీ యరితి గవళపేరూ** | ,, | **నా యరితి నెయ్యవమ్మా** | |
| **కొట్రాము కోటమ్మా** | **ఓ యమ్మ–** | **ఒప్పైన తల్లివే శారదాంబా** | **ఏమి** |
| **కడపా కుమారెమ్మా** | ,, | **కాపాడి రక్షించు** | ,, |
| **అమ్మ నీ పుట్టిల్లూ** | ,, | **అశోక వనమమ్మా** | ,, |
| **తల్లి నీ పుట్టిల్లూ** | ,, | **తామరాకుల్లోను** | ,, |
| **అమ్మ–తూరుపూ రాజుల్నే** | ,, | **తూలనాడీనావే** | ,, |
| **అమ్మ–పడమటా రాజుల్నే** | ,, | **పట్టి కొల్లాడావే** | ,, |
| **ముందొచ్చే రాజుల్ని** | ,, | **మూల గలిపీనావే** | ,, |
| **ఎనకొచ్చే రాజుల్ని** | ,, | **ఏట గలిపీనావే"** | ,, |

## 1.1. జలగన్న పార్వతి కథ:–

నాకు లభించిన పరశురాముని కథాచక్రమున నిది మొదటి వీరగాథ. సుమారు 1500 పంక్తుల కథ. జలగన్న పార్వతి పరశురాముని నాయనమ్మ. ఈమె మహాపతివ్రత. అత్తగారైన నీమకాదేవికడ ఈమె పడిన కష్టముల కన్నీటిగాథయే యిందలి యితివృత్తము. ఈ జలగన్న పార్వతి భర్త సత్యగౌతుఁడు. ఇతనినిబట్టియే యీ కథాచక్రమునకు 'గౌతుపురాణ'మని పేరు వచ్చినది.

"రాజులకు కూడ మహారాజైనటువంటి రాజు ఇవళాంగిరాజు. ఆయన భార్య 'జమిళికాదేవి'. ఆ దంపతులకు 'గిరిరాజు, జలగన్న పార్వతి' అని ఇద్దరు బిడ్డలు. ఆ ఇవళాంగిరాజు తోబుట్టువు 'నీమకాదేవి'. ఆమెను రత్నమామునీశ్వరునకిచ్చి కల్యాణము చేసెను. వారి గర్భవాసనము సత్యగౌతుడనువాడు జన్మించెను..." ఇత్యాది వచనములతో నీ కథ ప్రారంభమగును. ఈ కథలో గేయభాగము కొన్నిచోట్ల అయిదు మాత్రల యావృత్తులు నాలుగొక పాదముగాను, మఱికొన్నిచోట్ల మంజరీ ద్విపదలోను కొనసాగినది. మొత్తముపై నీ కథాచక్రమున గేయభాగము కన్న వచనభాగమే మెచ్చుగా నున్నది.

భర్త చనిపోయిన తరువాత నీమకాదేవి తన అన్న ఇవళాంగి రాజు కూఁతురగు జలగన్న పార్వతిని దెచ్చి కుమారుఁడు సత్యగౌతునకుఁ బెండ్లిచేసెను. వివాహానంతరము నొసటి బాసికమును, చేతి కంకణమును విప్పఁబోగా నవి రాలేదు. దానికిఁ గారణమేమని సత్యగౌతుఁడు తల్లిని బ్రశ్నించెను. ఆమె తనకుఁ దెలియదని బ్రహ్మదేవుని యడుగుమనెను. ఆ బాలుఁడు బ్రహ్మలోకమునకేగి బ్రహ్మనడిగెను. ఆతని తండ్రి చేసిన గోహత్యయే అందులకుఁ గారణమనియు, దానిని వదల్చుకొనుటకుఁ గాశిక్షేత్రమునకుఁ బోయి తపస్సు చేయుమనియు బ్రహ్మ చెప్పెను. సత్యగౌతుఁడు తిరిగి తల్లికడకు వచ్చి, భార్యను తల్లికప్పగించి, తాను తపస్సు చేసికొనుటకై కాశికిఁ బోయెను.

జలగన్న పార్వతిని ఆమె యత్త నీమకాదేవి కోడంట్రము పెట్టి పెక్కు బాధలకు లోనుజేసినది. ఏడు తోటలకు నీళ్లు పోయించినది. ఏనుగుశాలలు, గుఱ్ఱములశాలలు తుడిపించినది. అన్నమడుగగా మాడు సంవత్సరములనుండి ముక్కిపోయిన పాతచోళ్ల అంబలి, పులిసిపోయిన మజ్జిగ, దుగ్గలికూర నంజుతోఁ బెట్టినది. జలగన్న పార్వతి, అత్తపెట్టు కష్టముల కోర్వలేక, తండ్రిని భర్తయగు సత్యగౌతుని మనమునఁ దలఁచుకొని దుఃఖించినది. భర్తను ప్రార్థించి నిద్రపోయినది.

కాశిలోఁ దపము చేయుచున్న సత్యగౌతునకు భార్య ఆక్రందనము వినిపించినది. అతడు అచటనున్న మునులను దనయింటికిఁ బోవుటకు అనుజ్ఞనిండని కోరెను. 'బ్రహ్మకోడి కుయ్యకుండా, కారుకోళ్లు కుయ్యకుండా, ఊరకోళ్లు కుయ్యకుండా నీవు తిరిగి యిక్కడకు రావాలి. లేకపోతే నిన్ను రానివ్వము' అనినారు మునీశ్వరులు. ఆ నియమమున కొడఁబడి అర్ధరాత్రివేళ సత్యగౌతుఁడు గుఱ్ఱమెక్కి ఇంటికి వచ్చెను. భార్య గాఢనిద్రలో నున్నది. ఎంత లేపినను లేవలేదు. ఆమె నిద్రించుచుండగానే అతఁడు 'ఏకాంతమాడి', రెండు విభూతిపండ్లు ప్రక్కలోనుంచి, తిరిగి కాశికిఁ బ్రయాణమయ్యెను. కాశికిఁ గొంచెము దూరమున నున్నప్పుడే కారుకోళ్ళు కూసినవి. అందుచే మునులు కోపించి, సత్యగౌతుఁడు తన భార్యాపుత్రులను మఱచిపోవునట్లుగా శాపమిచ్చిరి.

ఇట జలగన్న పార్వతి మిక్కిలి యాకలితో లేచి, ప్రక్కలోనున్న విభూతిపండ్లను భక్షించినది. ఆమెకు 'వేపకాయంత గర్భము వెన్నున నేర్పడి అండమందు పిండములు తిరిగి', తొమ్మిది గడియలలోఁ బ్రసవించినది. 'జమదగ్ని' యను మగపిల్లవాఁడును, 'గౌంతి' యను ఆడుపిల్లయుఁ గలిగిరి. ఆమె తన పాతివ్రత్యమునకు భంగము కలిగినదని భయపడుచుండగా ఆకాశవాణి జరిగిన సత్యమును జెప్పినది. తన భర్తవలననే తానా సంతానమును గంటినని తెలిసికొని, జలగన్న పార్వతి మిక్కిలి సంతసించెను.

సత్యగౌతుఁడు అర్ధరాత్రివేళ భార్యమేడకు వచ్చుట నెవ్వరును గాంచలేదు. అందుచే అమ్మలక్కలు ఆమెను ఆడిపోసికొనుచుండిరి. అత్త నీమకాదేవికి ఈ విషయము తెలిసి మిక్కిలి కోపించి, కోడలిని దూషించినది. జలగన్న పార్వతి యెంత చెప్పినను అత్త వినలేదు. కొన్ని కఠినములగు ప్రయాణములను సత్యములను జూపుమని కోరినది. ఉడికిన అన్నమును వెదచల్లి 'వరాకు' (వరియాకు) ను బుట్టించుమనెను. ఏడు సముద్రముల మధ్యగల 'జీవిగడ్డ'నుండి గన్నేరుపూలు తెమ్మనెను. బెల్లము వండెడి పెద్దపెనములో ముప్పందుమ నూనెపోసి కళపెళ కళపెళ మరగించి, అందు బిడ్డలిరువురను పడవేయుమనెను. వేయికళ్ల జల్లెడను ప్రత్యేకముగా నల్లించి కోడలికిచ్చి, ఆ జల్లెడతో సముద్రమునుండి ఒక్కచుక్క తొణకకుండ నీళ్లు తెమ్మన్నది. మహాపతివ్రతయగు జలగన్న పార్వతి యీ కఠిన పరీక్షలన్నిటిని గడచి గట్టెక్కినది. అయినను నీమకాదేవి నమ్మలేదు. అత్తయొద్ద బాధలు పడుటకన్న భర్తదగ్గఱ కేగుట మంచిదని తలఁచి జలగన్న పార్వతి తన యిరువురు బిడ్డలను దీసికొని కాశికిఁ బోయినది.

సత్యగౌతుఁడు మునులశాపముచే భార్యను బిడ్డలను గుర్తించ లేకపోయెను. తల్లివలెనే యాతఁడును గొన్ని ప్రమాణములఁ జూపుమని కోరెను. తన్నంటకుండ ముట్టకుండ తిరిగి బిడ్డలను గనుమనినాఁడు. ఆ పతివ్రత బ్రహ్మను బ్రార్థించి, తన కురులను జడలుగా నల్లి, జడకు మున్నూరుకోట్లుగా నాలమందవలె, గొఱ్ఱెలమందవలె కని వదలివేసినది. ఆ బిడ్డలు ఆకలిబాధ కోర్వలేక సత్యగౌతుని బీడింపఁ బ్రారంభించిరి. సత్యగౌతుఁడా బిడ్డల పీడను భరింపలేక, వారినందఱను మాయముచేయుమని భార్యను కోరెను. 'కొమ్మకు కోటివేల పక్షులు కందు' అని ఆమె ఆ పిల్లలను శపించినది. ఇంతచేసినను భర్త ఆమెను విశ్వసింపలేదు. 'ఎంచిన ఎల్ల గుఱ్ఱములు' పూన్చిన రథములో 'నాగ్రమమార్గము'న దాను బోవుచుండ, నామె బిడ్డలిర్వుర నెత్తుకొని, భూమిపైఁబడు నా రథచ్ఛాయల ననుసరించి పరుగెత్తి రావలెనని శాసించెను. జలగన్న పార్వతి యందుల కంగీకరించెను. ఆమె భర్త రథచ్ఛాయననుసరించి పరుగిడుచుండెను.

మార్గమధ్యమున నియోగులనఁబడు సాధువులు, భూమార్గమునఁబోవు జలగన్న పార్వతిని వస్త్రదానమడిగిరి. ఆమె తన చీరను జింపి దానమిచ్చినది. తరువాత ఆ సాధువులు ఆకాశ మార్గమునఁ బోవుచున్న సత్యగౌతుని అన్నదానమడిగిరి. అతఁడు వారికేమియు సమాధానమీయక వారిపైనుండి రథమును ద్రోలెను. ఆ నియోగులకు గోపమువచ్చి, భవిష్యత్తులో సత్యగౌతుని కోడలు రేణుక యను మావురాల యెల్లమ్మ వచ్చి ఆతనికి నమస్కరించిన వెంటనే యాతని కన్నులు ప్రేలిపోవునని శపించిరి.

జలగన్న పార్వతియు నామెభర్తయు మఱికొంత దూరము పోవుసరికి, నచ్చట కోటివేలమంది మునీశ్వరులు సత్యగౌతుఁడిట్లు భార్యను బాధించుటను జూచి సహింపలేక, ఆతనిని బరీక్షింపనెంచి, రథమునకడ్డువచ్చి యిట్లనిరి: "చినవాడా, నీకు మూడు సోలల కొఱ్ఱలిస్తాము. పొయిమీద మంగళంపెట్టి ఆ కొఱ్ఱలు వేపాలి. వేపిన కొఱ్ఱలు విత్తనాలు చల్లాలి. మొక్కలు మొలిపించాలి. ఆకు తీయించాలి. ఊడుపు ఊడిపించాలి. పండించాలి. కొడవళ్లతో కోయించాలి. కుప్పలు వేయించాలి. అది నూర్పించాలి. దంపించాలి. అన్నము వండాలి. ఏడుగడియల్లో నీళ్లన్నవారికి నీళ్లు, పాలన్నవారికి పాలు, పప్పన్నవారికి పప్పు వడ్డిస్తేనే నీ రథం వదులుతాము".

సత్యగౌతుఁ డీ పని చేయలేక ఉసూరుమనుచు వెనుకకుఁ బోవుచుండెను. భార్య ఆ విషయమును గ్రహించి, తాను ఆ సత్యమును జూపుదునని భర్తచే నా ప్రమాణము నొప్పించినది. కొఱ్ఱలు పండించి, అరచేతిలో వంటలు చేసి మునులకు వడ్డించినది. ఆ మహాపతివ్రత శక్తికి మునులు సంతసించి ఆ దంపతులకు శాపవిముక్తిని బ్రసాదించిరి.

సత్యగౌతుఁడు భార్యాపుత్రులను గుర్తించినాఁడు. తన తల్లి పెట్టిన కష్టములకుఁ జింతించి, తన్ను మన్నింపుమని భార్యను వేఁడుకొనెను. సతీపతులిర్వురును కాశినుండి తమ గృహమున కేతెంచిరి. మార్గమధ్యమున అత్తగారు తన్నెన్ని యిక్కట్లకు లోనుజేసినదో అన్నిటిని జలగన్న పార్వతి భర్తకెఱిగించెను. సత్యగౌతుఁడు తన తల్లిపై మిక్కిలి కోపించి, ఆమెతో మాటాడుట మానివేసెను. జలగన్న పార్వతియే గృహమునకు సర్వాధికారిణియైనది. 'నీవు నేర్పిన విద్యయే' యన్నట్లు అత్తగారిచేత పనులు చేయించుకొని, యింత జొన్నపిండి అంబలి పోయసాగినదఁట. కథాంతమునఁ గోడండ్రను బాధించు అత్తల కొక చక్కని నీతి చెప్పఁబడినది.

## 1.2. రేణుకా కల్యాణము:-

దీనికి 'రేణుక రాయబార'మను నామాంతరమున్నది. సత్యగౌతుఁడు జలగన్న పార్వతుల పుత్రుఁడు 'జమదగ్ని'. ఈ జమదగ్ని తన మేనమామయగు గిరిరాజు కూఁతురు రేణుక లేక మావురాల యెల్లమ్మను వివాహమాడుట యిందలి కథావృత్తాంతము. గేయము వచనము కలిపి సుమారు 1300 పాదములున్నవి.

"విద్యాబుద్ధులు, చదువు సాధనములు, టక్కుటమారు, గజకర్ణ భూకర్ణ ఇంద్రజాల మహేంద్ర జాలములు తెలిసినవాడు జమదగ్ని". అతనికిఁ బెండ్లియీడు వచ్చినది. తల్లిదండ్రులాతనికిఁ బెండ్లిసేయ

నిశ్చయించిరి. జలగన్న పార్వతి అన్న గిరిరాజు. అతనికి రేణుక యను కూఁతురు గలదు. ఆమెను నిశ్చయించి రమ్మని భర్తను పంపినది జలగన్న పార్వతి. సత్యగౌతుఁడు గిరిరాజు నగరికి వెడలి, ఆతని పుత్రికయగు మావురాల యెల్లమ్మను దన కుమారునకిచ్చి పెండ్లి సేయుమని కోరెను. గిరిరాజునకు రేణుకతోపాటు 'శాత్రవీరార్జునుఁడు (కార్యవీర్యార్జునుఁడు) మున్నగు పుత్రులు పెక్కురు గలరు. అతఁడు శాత్రవీరార్జునితో నాలోచించెను. శాత్రవీరార్జునుఁడు తన అక్క రేణుకను జమదగ్నికిచ్చుట కంగీకరింపక, మిక్కిలి కోపించి, సత్యగౌతు నవమానించెను. పుత్రుననుసరించి గిరిరాజుకూడ "ఇంటింటికి తిరిగి ఆరు మూడు గింజలు అడుక్కునే ముసిలి బ్రాహ్మణోత్తమునికైనా ఇచ్చి పెండ్లి చేస్తాను కాని నీ కుమారునికై నా కూతురు నివ్వను" అని సత్యగౌతునితోఁ జెప్పెను. సత్యగౌతుఁడు 'కొట్టి ఎన్నులాగ కొనమాడి పోయి' తిరిగి వచ్చెను. తరువాత జలగన్న పార్వతియే స్వయముగా బయలుదేరి పుట్టింటికిఁ జేరి అన్న నడిగినది. కాని ప్రయోజనము లేకపోయెను. ఆమెయు నవమానముతోఁ దిరిగి రావలసివచ్చెను.

తల్లిదండ్రుల యవస్థను జూచిన జమదగ్ని తానే స్వయముగాఁ బోయి, గిరిరాజు కూఁతురు రేణుకను దెచ్చి వివాహమాడుదునని చెప్పెను. తనకు మూఁడు వస్తువులు తెచ్చి యిండని తల్లిదండ్రులను గోరెను. 'వాగించుకొనేందు కొక గంట, ఊదేందు కొక శంకు, తొడుక్కునేందు కొక మాయకుంచుల బొంత'– ఈ మూఁడును దేవేంద్ర లోకమునఁ గలవఁట. జలగన్న పార్వతియు సత్యగౌతుఁడును దేవేంద్రుని కడకేగి, పదివేల వరహాలకు ఆ వస్తువులను గొనితెచ్చి పుత్రునకిచ్చిరి. తల్లి కుమారుని దీవించి, అచ్చయావుల పాలతో నెసరు పెట్టి, పాలు బియ్యముతోఁ బరమాన్నము వండి, కారరఁటి చెట్టుయొక్క ఆఱుమూరలాకులో భోజనముపెట్టి, 'పరమాన్నము, నవకాయ పిండి వంటలు, నాలుగు రుచులుగల పదార్థములతో అన్నము మూటగట్టి, కుమారుని 'రేణుకాపురి పట్టణము'నకుఁ బంపినది.

జమదగ్ని మునివేషముతో రేణుకాపురి పట్టణమును బ్రవేశించి, జోలిలోని విభూతి గోరెడు తీసి, జపించి, పట్టణములోఁ జల్లెను. అప్పుడు రాత్రి తొమ్మిది పది గంటల సమయము. కాని జమదగ్ని విభూతి మహిమచే నప్పుడే పట్టణము తూర్పు తెల్లవారినట్లుగాఁ దెల్లవారిపోసాగినది. 'ఇదేమిటీ? సందకాడే తెల్లారిపోయిందేమి?' అని పట్టణవాసు లందఱును ఆశ్చర్యపడుచుండిరి. గిరిరాజు పండితులను బిలిచి ఆ వైపరీత్యమునకుఁ గారణమడిగెను. పండితులు కవిలికట్టలఁ జూచుచుండగా జమదగ్ని వారికిఁగూడ భ్రమను గలిగించెను. అందుచే వారిట్లు చెప్పిరి: "ఈ రాత్రి పెళ్లిళ్లు అవాలట. అందుకని సందకాడే తెల్లారింది. పెళ్లికానివారికి పెళ్లి అవాలి ఈ వేళ. పెళ్లి అయినవారికి కూడా పెళ్లి అవాలి."

పట్టణములోని ప్రజలందఱును ఆ రాత్రి పెండ్లిండ్లు చేసికొనవలెనని గిరిరాజు చాటింపించెను. ఒక్క గిరిరాజు కూఁతురుఁ మావురాల యెల్లమ్మ తప్ప తక్కిన వారందఱును బెండ్లిండ్లు చేసికొనిరి. అప్పుడు జమదగ్ని కుష్ఠరోగముతో బాధపడుచున్న జుగుప్సావహమగు ముసలిజోగి జంగమయ్య వేషమును ధరించెను. ఆ వేషముతో నొక ముసలమ్మ యింటికి వెడలి, ఆమె సహాయముతో గిరిరాజు గృహమును గుర్తించి ఆ యింటికి వెళ్ళి భిక్షమడిగెను. పెండ్లికాని యువతులచేతి భిక్షమును మాత్రమునే గ్రహింతునని చెప్పెను. అప్పుడు అవివాహితయైన రేణుక భిక్షమును వేయవచ్చినది. ఆమె భిక్షమును వేసి వెనుదిరిగిపోవుచుండగా జమదగ్ని ఆమెపైఁ తన జోలిలోని విభూతిని గోరెడు తీసి జపించి చల్లినాఁడు. ఆమెకు వెఱ్ఱివికారము లెక్కువైపోయినవి. తాటాకిండ్లు పీకివేయుట, తోటివారిని జుట్టుపట్టుకొని పీకుట, యిండ్లకు నిప్పుపెట్టుట మొదలగు పిచ్చిపనులు చేయుచుండెను. ఆమెనొక చీఁకటింటిలోఁ బడవైచిరి. ఎందఱు వైద్యులు వచ్చి చూచినను ఆమె పిచ్చి కుదరలేదు.

ముసలిజోగి జంగమయ్య వేషములోనున్న జమదగ్ని ఒక ముసలి సిపాయితోఁ దాను రేణుకపిచ్చి కుదిర్చెదనని చెప్పెను. ఆ సిపాయి యీ జంగమయ్య నొక తట్టలోఁ బెట్టుకొని రాజుగారి దగ్గఱకుఁ దెచ్చెను. రేణుకపిచ్చి కుదిర్చినచో నేదియడిగినను నిచ్చెదనని గిరిరాజు వాగ్దానము చేసినాఁడు. ఈ ముసలి జంగమయ్య సంతసించి, విభూతిని జల్లి యామె రోగమును గుదిర్చెను. ఏమి కావలెనని గిరిరాజడుగగా ఆమెను తనకిచ్చి పెండ్లిచేయుమని కోరెను. ఆడినమాట తప్పుటకిష్టములేక గిరిరాజు అందులకు అంగీకరించెను. మంగళ సూత్రమును గట్టఁబోవుచు మాఱువేషముననున్న జమదగ్ని చనిపోయినట్లు నటించెను. గిరిరాజు మిక్కిలి సంతసించి, ఆతనిని శ్మశానమునకు గొనిపొండని ఆజ్ఞాపించెను. శ్మశానములో నతఁడు తిరిగి సజీవుఁడై మరల గిరిరాజునొద్దకు వచ్చి, ఆతని కూఁతురినిచ్చి పెండ్లిసేయుమని కోరెను. గిరిరాజు అయిష్టముతోఁ బెండ్లిచేసి, ఆ ముసలిజంగమయ్యను బల్లకిలోఁ గూర్చుండఁబెట్టి పంపుచు, మార్గమధ్యమునఁగల చీఁకటి మామిడితోటలో నతనిని జంపి, తన కుమార్తెను దిరిగి తనయొద్దకుఁ దెమ్మని భటులకాజ్ఞాపించెను. జమదగ్ని యీ విషయమును గ్రహించి, చీఁకటి మామిడితోట వచ్చుసరికి తన గంట, శంకు, మాయకుంచుల బొంత తీసి మూటకట్టి, ఆ తోటలోనికి విసరివైచెను. జమదగ్ని సూర్యకాంతివలె మిలమిల మెఱయునట్టి శరీరము కలవాఁడు– వజ్రశరీరుఁడు ఆయెను. అతని మేనికాంతితో నా చీఁకటితోట యంతయు వెలిగిపోవుచుండెను. ఎల్లమ్మ ఆశ్చర్యముతో భర్తను కౌగిలించుకొనెను. పల్లకీ వెనుక వచ్చుచున్న గిరిరాజు మేనల్లుని గుర్తించి, సంతోషించి, తిరిగి రేణుకాపురి పట్టణమునకుఁ దీసికొనిపోయి, వైభవోపేతముగాఁ బెండ్లిచేసి పంపెను. ఎల్లమ్మ అత్తవారింటికి వచ్చి, అత్తమామలకు నమస్కరింపఁగా, మునుల శాపప్రకారము మామయగు సత్యగౌతుని కన్నులు 'పెక్కున పేలిపోయినవి'. ఈ కథలో మధ్యన శారదవరుసలో నొకపాట, చివర నొక లాలిపాట యున్నవి.

## 1.3. పరశురాముని జననము:-

గేయము వచనము కలిపి సుమారు 1700 పంక్తులున్నది. రేణుక పుత్రులకొఱకై వ్రతములు చేయసాఁగెను. జమదగ్ని ఆమెపై కోపించి తపస్సుచేసికొనుటకై పోవ నిశ్చయించుకొనెను. రేణుక మందరాద్రి కడ కొఱ్ఱచేనును వేసి, దానికి జమదగ్నిని కాపుంచెను. జమదగ్ని ఆ కొఱ్ఱచేను దగ్గఱ తపస్సు చేసికొనుచుండెను. ఆ తపమునకు మెచ్చి బ్రహ్మ అతనికొక కామధేనువును బహూకరించెను.

రేణుక సంతానప్రాప్తికై వెలిగొండలోనున్న సిద్ధులు సుభోగులు మున్నగువారిని గొలిచెను. తన తొలిచూలు పంటను వారికాహారముగా నిత్తునని మ్రొక్కుకొనెను. ఇట్లు చేయఁగా నామెకు 'జంపన్నరాజు' అను పుత్రుఁడు కలిగెను. అతఁడు సిద్ధుల గండమునఁ బుట్టినాడని పురోహితులు చెప్పిరి. 'ఎట్లైనను నీ బాలుఁడు సిద్ధులకు బలికావలిసిన వాఁడే' అని రేణుక పుత్రుని నిర్లక్ష్యము చేసి అరణ్యములోఁ బాఱవైచెను. అల్లిపండ్లు, వాకపండ్లు తినుచు నా బాలుఁడు బ్రతుకుచుండెను. మఱిమూఁడేండ్లకు 'పాపేరు గవరమ్మ' అను కూఁతురు పుట్టెను. ఆమె మేనత్తల గండముతోఁ బుట్టినదని పురోహితులు చెప్పిరి. పుట్టింటిపై మక్కువగల రేణుక తన తమ్ముఁడగు శాత్రవీరార్జునునకుఁ దెలియజేసెను. అతఁడు ఖడ్గధారియై వచ్చి, కోపముతో గవరమ్మ నాకాశమున కెగురవేసెను. ఆ బాలిక శుక్రమండలములోని కెగిరి, తిరిగి క్రిందపడఁబోవుచుండగా దారిలో నొక జటాయువు ఆమెను రక్షించి, మోకాలి పర్వతముపైఁగల ఒక 'పులివండ'లోఁ బాఱవైచెను. అచటి పులియే గవరమ్మను బెంచు చుండెను. తరువాత విష్ణుమూర్తి దుర్మార్గులగు కార్తికరాజులను జంపుటకు రేణుక గర్భమునఁ బరశురాముఁడుగా జన్మించెను. అతఁడు ఏడు నెలల గర్భస్థ శిశువుగా నుండఁగా కార్తికరాజులు వేఁటకై యడవికిఁబోయి జమదగ్నివలన సత్కృతులై, కామధేనువును గొనిపోవ నుంకించిరి. జమదగ్ని వారి నడ్డగించెను. శాత్రవీరార్జునుఁడు కోపించి, చిటికెనవ్రేలి కొనగోరు నేబది యామడలు పెంచి, యా గోటితో జమదగ్ని శిరముత్తరించెను.

తొమ్మిదవ నెలలోఁ బరశురాముఁడు జన్మించెను. అతఁడు పుట్టిన వెంటనే బ్రాహ్మణోత్తములు రేణుకతో నిట్లనిరి: "అమ్మా, ఈ పిల్లవాడు నీ తమ్ములు కార్తికరాజుల గండంచేత జన్మించాడు. వీడు ఎడలేక ఏడుసంవత్సరాలు బ్రతికున్నాడంటే నీ కన్నవారిని కాల్చివేస్తాడు. నీ పుట్టింటివారిని బూడిద చేస్తాడు. నీ కన్నవారి పట్నంపై కాకులు గద్దలు ఆడిస్తాడు". ఈ మాటలు విన్న రేణుక పుట్టింటివారిపైఁగల యభిమానముచేఁ బరశురాముని అరణ్యములో వదలివేసెను. పరశురాముడు అరణ్యమున నొక సరస్సులోఁ బెరుగుచుండెను. ఇట్లు రేణుక 'తన కన్నవారి కాసించి, ముగ్గురు బిడ్డల్ని కని, మూడు తెన్నులుగా చేసి పారేసింది'.

గవరమ్మనివసించు 'పులివండ' క్రమముగా 'పులిరాజు పట్టణము'గా మాఱెను. తన తమ్ముఁడు చెఱువులో నున్నాడని తెలిసికొని, గవరమ్మ ఆ చెఱువు కడకుఁబోయి, తమ్ముని బయటకుఁ దీసి, అల్లారు ముద్దుగాఁ బెంచుచుండెను.

పరశురాముఁ డొకనాడు ఆటలలో బరులచేఁ బరిహసింపఁ బడి, తన తల్లిదండ్రులెవరో తెలిసికొనఁగోరి అక్కను నిర్బంధించెను. గవరమ్మ యెంత వారించినను అతఁడు వినలేదు. అందుచే నామె యెఱుకలవేషమును బూని, బాలుఁడైన పరశురాముని జోలిలోఁ గట్టుకొని, తమ తల్లి మావురాల యెల్లమ్మ వసించు 'కలంకారి మేడ'కు వెడలెను. గవరమ్మ తన తల్లికి ఎఱుక చెప్పుచు 'కుడిచెయ్యి పట్టుకొని గుభేలుమని నవ్వించింది; ఎడమ చెయ్యి పట్టుకొని ఏడు గడియలు ఏడిపించి వదిలింది'. ఇట్లు ఎఱుకత వేషముతో గవరమ్మ పరశు రామునకుఁ దమ తల్లి ముఖమును జూపి, తండ్రి జమదగ్ని పట్టిన చంద్రహారాల కత్తిని పరశురామునకిచ్చి, పిమ్మట నిర్వురును బయలుదేరి తమ పులిరాజు పట్టణమునకుఁ బోవుచుండిరి.

## 1.4. పరశురాముని యుద్ధము:-

ఇది యీ గాథాచక్రములోనికెల్ల పెద్దగాథ. సుమారు 2200 పంక్తులు కలది. ఎఱుకలవేషమున తల్లిమేడకు వచ్చిన గవరమ్మ, తన తమ్ముఁడు పరశురాము నెత్తుకొని తిరిగి తాము నివసించెడి పులిరాజు పట్టణమునకుఁ బోవుచుండెను. మార్గమధ్యమునఁ దమ్ముఁడు బడలిక చెందఁగా నొకచెట్టున కూయలవేసి, పరశురామునందుఁ బరుండఁబెట్టి జోలపాట పాడుచుండెను. ఆ పాట గాలివాటున కార్తికరాజులకు వినఁబడఁగా వారు పరశురాముని జంపుటకై దండెత్తి వచ్చిరి. గవరమ్మ నిద్రపోవున్న తమ్మునెత్తుకొని పాఱిపోయెను.

తరువాత మఱియొక ప్రదేశమున గవరమ్మ నిద్రపోయెను. పరశురాముఁడు ఆమెకుఁ దెలియకుండ మేనమామల దగ్గఱకుఁ బోయెను. వారితో బొంగరాల పందెము, కోడిపందెము, పొట్టేళ్ల పందెము, ఉక్కుగోతాము పందెము, పిడిగుద్దుల పందెము- మొదలగునవి యాడి గెలిచెను. తరువాత వారిని కికురించి, అక్కయున్న తావునకు వచ్చెను. ఇరువురును దమ పట్టణమునకేగిరి.

బాలుఁడగు పరశురాముఁడు దినదినాభివృద్ధి నందుచుండెను. తనతోఁబోరాడెడి వారెవరును లేక, యెగిరి భూలోకముతోఁ గుస్తీపట్టుచుండెను. అట్లు చేయుచున్న బాలుని తల్లి యెల్లమ్మ చూచెను. పరశురాముఁడామెను గుర్తించి, మఱింత బలాభివృద్ధికై ఆమె యొడిలోనికి దుమికి బలవంతముగా నామె చనుబాలు కుడిచెను. తరువాత తన తండ్రిని జూపుమని తల్లిని నిర్బంధించెను. చనిపోయినాడని చెప్పఁగా ఆ చనిపోయిన తావును జూపుమని తల్లి నరణ్యమునకుఁ గొనిపోయెను. కాని యెల్లమ్మ అతనిని మోసగించి వెనుకకు మఱలెను. పరవురాముఁడు తన తండ్రి హత్య కావింపఁ బడిన ప్రదేశమును గుర్తించి, అట పిండప్రదానము చేయుటకై అన్నమును వండుచుండగా, నా యన్నమునుండి జమదగ్ని యుద్భవించెను. అతఁడు కార్తికరాజులు తన్ను జంపిరని చెప్పెను.

పరశురాముఁడు తండ్రిని మూటగట్టి భుజమున వైచుకొని, తిరిగి తల్లిదగ్గఱకు వెళ్లి, పుట్టింటిపైఁ బక్షపాతమును జూపెడి యామెనుండి దీవెనలు పొంది, అక్క యొద్దకుఁ బోయెను. అక్కనుండి, పితృపితా మహులనుండి దీవెనలు, బాణములు స్వీకరించి, జాలారి తమ్మన్న తోడురాఁగాఁ దండ్రితోఁ గలసి మేనమామలపైకి యుద్ధమునకు వెడలెను.

మేనమామలగు కార్తికరాజులకుఁ దనతండ్రి మూలమున రాయబారములు నడిపి, యుద్ధము ప్రారంభించెను. మేనమామలలోఁ జిన్నవాఁడగుఎ విచిత్రవీరరాజు దొంగదెబ్బ కొట్టఁగాఁ, బరశురాముఁడు మూర్ఛపోయెను. జాలారి తమ్మన్న వెంటనే యింటికి వెడలి గవరమ్మతోఁ జెప్పెను. ఆమె తాతలనుండి సంజీవిని గ్రహించి ఇచ్చెను. దానితోఁ బరశురాముఁడు మూర్ఛఁదేఱి, విచిత్రవీరరాజును జంపఁ బోయెను. అంత జమదగ్ని కుమారుని వారించెను. ఏలన, నిదివఱలోఁ గార్తికరాజులలోఁ బెద్దవాఁడగు శాత్రవీరార్జునుఁడు జమదగ్నిని జంపఁగా, నీ విచిత్రవీరరాజు బావగారికి భక్తితో దహన క్రియలు చేసెను. ఆ యుపకారమును మనసునందుంచుకొని, జమదగ్ని అతనిని జంపవలదని పరశురామునిఁ గోరెను. తండ్రికోరిక ననుసరించి పరశురాముఁడు విచిత్రవీరరాజును వదలివేసెను. తక్కిన మేనమామలందఱిని సంహరించి, వారి తలలు తన రథమునకుఁ దోరణములుగాఁ గట్టుకొని తల్లి యెల్లమ్మ దగ్గఱకు వచ్చెను. ఇట్లు పరశురాముఁడు తల్లిదండ్రులకు శుభములు కూర్చి, అక్కను అన్నను వారికప్పగించి, తాను చీఁకటికోనలోఁ బికిలిపిట్టల వేటలాడుటకుఁ బోయెను.

## 1.5. గవరమ్మ గాజులు:-

నేను సేకరించిన మౌఖికగాథలలో నిది యైదవది. ఇది సుమారు 1200 పాదములున్నది. దీనికి 'గొంతెమ్మకథ' యనియు నామాంతరము గలదు.

రేణుకకూఁతురు గవరమ్మ 'యీడేరి యింట పడియున్నది' జంపయరాజు, జమదగ్ని, పరశురాముఁడు ఆలోచించి, ఊరుబయట అడవిలో లక్కసిరిమేడ కట్టించి, అందు గవరమ్మ నుంచిరి. ఏడుగురు దాదుల నామె దగ్గఱనుంచి, మగవాని గాలి తగులరాదని కట్టడి చేసిరి.

కార్తికరాజులలో నాఁడు దయతలఁచి విడిచిపెట్టఁబడిన విచిత్ర వీరరాజునకు ఏడుగురు కుమారులుండిరి. అందు కడసారపువాఁడు 'కార్తిక మల్లఁడు'. ఇతఁడు అవివాహితుఁడు. వీరందఱును గోనెలకోటను గట్టుకొని పాలించుచుండిరి. విచిత్ర వీరరాజునకు 'సిద్ధమాసెట్టి' యని మఱియొక పేరున్నది. ఇతని భార్య 'తరిదేవి'. వీరిరువురును దమపుత్రుఁడు కార్తిక మల్లనికి, రేణుకాదేవి పుత్రికయగు గవరమ్మను బెండ్లిసేయఁ దలంచి, రేణుకాపురి పట్టణమునకు వచ్చిరి.

ఇక్కడ యెల్లమ్మ తన పెద్దకుమారుఁడగు జంపయరాజునకు 'జంగపువారి చేడె' నిచ్చి పెండ్లిచేసెను. గవరమ్మను లక్కసిరమేడలో నుంచెను. గవరమ్మను కార్తిక మల్లనికిచ్చుటకు జంపయరాజును పరశురాముఁడును నంగీకరింపలేదు. అందుచే నామె నడుగవచ్చిన సిద్ధమాసెట్టి దంపతులు నిరుత్సాహముతో వెడలిపోవలసివచ్చెను.

తల్లిదండ్రులవలన విషయమంతయును గ్రహించిన కార్తిక మల్లఁడు ఏలాగుననైనను గవరమ్మను బెండ్లియాడ నిశ్చయించుకొని, 'మరలగాజులు' (మరులు గొల్పెడి గాజులు) తయారు చేసి, గాజుల బత్తుని వేషమును ధరించి, ఏడుపుట్ల గాజులు భుజమున వైచికొని, రేణుకాపురి పట్టణమునకు వచ్చెను. గాజుల కేకను వినిన గవరమ్మ తన తల్లి యెల్లమ్మను గాజులు కొనిపెట్టుమని బలవంతము చేసెను. ఎల్లమ్మ వినలేదు. గవరమ్మ కోపించి లక్కసిరిమేడకుఁ బోయి, అన్నాహారములు మాని భీష్మించుకొని యుండెను. ఎల్లమ్మకుఁ గొనక తప్పినది కాదు. ఆ మాయాగాజులబత్తుని లక్కసిరిమేడకుఁ బంపినది.

కార్తిక మల్లఁడు ఎల్లమ్మ అనుమతితో లక్కసిరిమేడకు వచ్చి, గవరమ్మకు మామూలు గాజులతోఁబాటు 'మరలగాజులు' కూడ తొడిగి, ఆమె మనసు విఱిచివైచెను. గవరమ్మకు ఆ మాయల గాజుల బత్తునిపై మరులు గ్రమ్మెను. ఆ బత్తుఁడు గవరమ్మ నొక సంచిలో మూటగట్టుకొని, తిరిగి ఎల్లమ్మ దగ్గఱకు వచ్చి, ధనముకూడ తీసికొని, వెడలిపోవుచుండెను. గవరమ్మయుఁ గార్తిక మల్లఁడును మార్గమధ్యమున నొక గచ్చగోరింత పొదకడ నాఁగి, బడలిక తీర్చుకొను చుండిరి.

ఈ వార్త జంపయరాజునకుఁ దెలిసి, 'ఎంచిన ఎల్లగుఱ్ఱము నెక్కి', ఆ మాయల గాజులబత్తుని వెంబడించెను. మార్గమధ్యమున నితఁడు శ్రమదీర నిద్రించుచుండెను. కార్తిక మల్లఁడు గవరమ్మ సలహాపై నిద్రపోవుచున్న జంపయరాజును మోసగించి, కాళ్లు చేతులు బంధించి, గుడ్డిరాళ్లపై బరమరయీడ్చి, ఆతని గుండెలపై నొక పెద్ద బండఱాతినుంచి వెడలిపోయెను.

చీఁకటికోనలోఁ బికిలిపిట్టల వేఁటాడుచున్న పరశురామునకీ విషయము తెలిసెను. వెంటనే తన మైలపురి దేగను బంపి, జంపయరాజును రక్షించెను. పరశురామునకు అక్కగారిపై మిక్కిలి కోపము వచ్చెను. గోనెలకోటపై దండువెడలి, ఊరిబయట డేరాలు వేసెను.

గవరమ్మ యాలోచన ప్రకారము, సిద్ధమాసెట్టియు నాతని పుత్రులేడ్గురును భాగవతుల వేషములు వేసికొని, శిగలలో కోడికత్తులు, గాజుపెంకులు పెట్టుకొని పరశురామునిఁ జంపవచ్చిరి. వారి మోసమును ముందుగనే మైలపురిదేగ కనిపెట్టి పరశురాముని కెఱిగించెను. ఆ మాయభాగవతులు వచ్చి పరశురాముని యెదుట భాగవత ప్రదర్శనమీయఁగాఁ, బరశురాముఁడు వారిని బంధించి, తలగొఱిగి, గాడిదలపై నెక్కించి, పంపివేసెను.

తరువాత, పరశురాముఁడు సిద్ధమాసెట్టిపై కోపముతోఁ దన్నుఁ బ్రేమించుచున్న సిద్ధమాసెట్టి పుత్రిక 'విధూలక్ష్మి'ని దెచ్చి హింసింపఁ దొడఁగెను. ఇఁక లాభములేదని గవరమ్మయే స్వయముగా వచ్చి తమ్ముని బ్రతిమాలెను. పరశురాముఁడు వారినందఱను క్షమించి, తనతోఁ జెప్పకుండ కార్తికమల్లనితో లేచివచ్చినందులకు గవరమ్మను మాలమాదిగల యిండ్లలో 'గొంతిదేవి' (గొంతాలమ్మ)గాఁ బుట్టుమని శపించెను. కార్తిక మల్లఁడు 'నందిగాడు'గాఁ బుట్టుననియు, నిరువురును మాలమాదిగలచేఁ గొల్వఁబడుదురనియుఁ జెప్పెను. తన్నుఁ బ్రేమించిన 'విధూలక్ష్మి' బ్రాహ్మణులయింట జన్మించి నెలగంటునుండి అన్ని పండుగలలోను బూజింపఁబడునట్లు వరమిచ్చెను.

## 1.6. జంపన్న వెలుగొండ వెళ్లుట:-

ఇది పరశురాముని కథాచక్రమున చివరిదిగా నున్నది. సుమారు 990 పంక్తులున్నది. 'వెలిగొండ'యే జానపద వ్యవహారమున 'వెలుగొండ' అయియుండవచ్చును. లేదా 'వెలుగుకొండ' (తూర్పు పర్వతము) అనునది 'వెలుగొండ'గా మాఱియుండవచ్చును. లేదా 'తెల్లనికొండ' యను నర్థమున 'వెలిగొండ'గా వ్యవహరింపఁబడుచు నదియే 'వెలుగొండ' యనియు నుచ్చరితమగుచుండవలెను. జానపదులలో 'వెలిగొండ', 'వెలుగొండ' అను రూపములు రెండును గలవు.

గవరమ్మ గోనులకోటలో భర్త కార్తిక మల్లనితో సర్వసుఖము లనుభవించుచుండెను. జంపయరాజు తన భార్య 'జంగపువారి చేడె'తో సుఖముగానుండెను. పరశురాముఁడు చీకటికోనలోఁ బికిలిపిట్టలను వేఁటాడుచుండెను. ఇట్లుండ, నొకనాఁడు రేణుకకుఁ దన మ్రొక్కుబడి విషయము జ్ఞప్తికి వచ్చెను. తనకు సంతానము గలుగక పూర్వము వెలిగొండపై నున్న సిద్ధులకు సుభోగులకుఁ దన ప్రథమ సంతానమును బలిదానమిచ్చెదనని మ్రొక్కుకొన్నది. ఇప్పుడు జంపయరాజు నేరీతిగ నైనను వెలిగొండకుఁ బంపఁ బ్రయత్నించుచున్నది. వెలిగొండకుఁ బోయి అచ్చటి సిద్ధులను సుభోగులను దమయింటికి యాగమునకై ఆహ్వానించి రమ్మని జంపయతోఁ జెప్పినది. అది పదునాల్గు సంవత్సరముల ప్రయాణమగుటచే జంపన్న అంగీకరింపలేదు. అందుచే నీ జంపన్నను ఇంటిదగ్గఱనే విషముపెట్టి చంపవలెనని ఎల్లమ్మ ప్రయత్నించినది. కాని జంపన్నభార్య ఆ విషప్రయోగమును సకాలములోఁ బసికట్టి భర్తను రక్షించుకొనెను. ఇంటిదగ్గఱనే యున్నచో నేదో విధముగ విషముపెట్టి తల్లి చంపివేయునని గ్రహించి, అమాయకుఁడగు జంపన్న వెలిగొండకుఁ బోవ నంగీకరించెను.

తల్లి ఎల్లమ్మ చేబియ్యము, గొడ్రాళ్లు, సూదులు- మున్నగు వానితో దారిబత్తెము కట్టి యిచ్చినది. ఏడుమూఁడు గండములు దాటి వచ్చుచున్న జంపన్నను భక్షింపుడని రేణుక అతని వీపుపై సిద్ధుల కొక లేఖ వ్రాసినది. జంపన్న పయనమై పోవుచు దారిలోఁ జెల్లెలు గవరమ్మకడ కేగెను. ఆమె యన్నగారి బత్తెము ఖర్చులను జూచి, తల్లి అకృత్యమునకుఁ జింతించి, అవన్నియుఁ బాఱవైచి, మంచి పదార్థములు కట్టి యిచ్చినది. వదిన 'జంగపువారి చేడె'తోఁ జెప్పి ప్రయాణము కమ్మని అన్నకు నచ్చఁజెప్పెను. అటనుండి జంపయ రాజు భార్యదగ్గఱకు వచ్చెను. ఆమె వెలిగొండకుఁ బోవలదని యెంత చెప్పినను జంపన్న వినలేదు. అందుచే జంగపువారి చేడె తపస్వులగు తన అన్నలను బిలిచినది. వారు జంపయరాజు నాశీర్వదించి, ఆపద కలిగినప్పుడు తమ్ము, పరశురాముని, తమ చెల్లెలిని, గరవమ్మను దలఁచుకొనుమని చెప్పి, జంపన్న జోలిలో రెండు విభూతిపండ్లు వేసిరి. ఆపద కలిగినప్పుడు పైవారిని దలఁచుకొన్నచో జంపన్న కుడిచేయి ఆ విభూతిపండ్లపైకి బోవుననియు, నప్పుడా యాపద తొలగిపోవు ననియుఁ జెప్పిరి.

జంపన్న వెలిగొండకుఁ బ్రయాణమయ్యెను. అది పదునాల్గు సంవత్సరముల ప్రయాణము. 'ఎంచిన ఎల్లగుఱ్ఱము' నెక్కి జంపన్న బయలుదేరెను. ఎల్లమ్మ రెండు త్రాఁచుపాములను జంపన్న వెనుకఁ బంపెను. అవి జంపన్నను కాటేసి వచ్చుచుండగా నతఁడు బావమఱఁదులు చెప్పిన రీతిగాఁ బరశురామాదులను దలఁచుకొనెను. వెంటనే విషము నీరుగా మాఱిపోయెను. జంపయరాజు కోపముతోఁ దన్నుఁ గఱచిన యా పాములను ఏడుముక్కలుగా నఱికి ముందునకు బయలుదేరెను.

తరువాత, ఎల్లమ్మయే స్వయముగాఁ బెద్దపులియై జంపన్న నడ్డగించినది. జంపన్న తన భార్యను, బావమఱఁదులను, తమ్ముని, చెల్లెలిని ప్రార్థించి, తాను రేచుగా మాఱెను. పెద్దపులి పాఱిపోయినది. పిమ్మట ఎల్లమ్మ ఎలుగుబంటి రూపమున వచ్చినది. జంపయరాజు అగ్గితుంటయినాఁడు. ఎలుగు పలాయనము చిత్తగించినది. ఇట్లే ఎల్లమ్మ జంపన్నకు మున్నూరుకోట్ల దొంగలగండమును, చెంచు గండమును సృష్టించినది. జంపన్న పరశురామాదుల బలముచే వానినన్నిటిని నధిగమించి, వెలిగొండ పర్వతమున కేగెను.

వెలిగొండపైనున్న సిద్ధులు జంపయరాజు వీపుమీఁదఁగల వ్రాఁతను జదువుకొని, దాని ప్రకారమాతనికొక పక్షినిచ్చి, సంజీవి పుల్లను తెద్దుగానిచ్చి, వంటచేయుమనిరి. సంజీవిపుల్ల తగిలి ఉడుకుచున్న మాంసము పక్షిగామాఱి యెగిరిపోయినది. సిద్ధులు జంపయరాజును బట్టుకొని, గుండెలలో గునపములు దింపి చంపి, తలకోసి ఱాళ్లలోఁ బాఱివైచి, శరీరమాంసమును గొంత భక్షించి, తక్కినది యెండఁబెట్టి, దానిని దీసికొని ఎల్లమ్మ కడకు వచ్చిరి.

జంపన్న మరణముచేఁ జీకటికోనలోనున్న పరశురాముఁడు కలఁతఁ జెంది, తన మైలపురిదేగను పంపఁగా, నది వెలిగొండకు వచ్చి జంపయరాజు శిరసును గుర్తించి, దానిని దీసికొనివచ్చి రేణుకాదేవి యొడిలోఁ బడవైచెను. ఆమె యా శిరసును, సిద్ధులు తెచ్చిన యెండు మాంసమును నటకపై నొక 'పొణక'లో భద్రపఱచెను.

సిద్ధులు, సుభోగులు ఎల్లమ్మ యింట తమ భోజనమునకుఁ బరశురాముఁడు పెంచుకొనుచున్న ఎఱ్ఱతోటకూర కావలెనని కోరిరి. ఎల్లమ్మ యెంత చెప్పినను వారు వినలేదు. కడకామె యెఱ్ఱతోటకూర కోసి వండమొదలిడెను. చీకటికోనలోఁగల పరశురాముని కీ విషయము తెలిసి మహాకోపముతో నింటికి వచ్చెను. సిద్ధులు సుభోగులు నడవిలోనికిఁ బాఱిపోయి యెండుటాకులు గప్పుకొని దాఁగిరి. ఎల్లమ్మ ఊరిలోనికిఁ బాఱిపోగా నెవరును నామె కాశ్రయమీయరైరి. ఊరిబయటనున్న యొక మాదిగవాఁడు మాత్రము ఆమె వస్తువుల కాశపడి, ఆమెనొక తోళ్లగోలెములో దాఁచెను. ఎల్లమ్మ వస్తువులను మాదిగవాని భార్య ధరించి దంపు దంపుకొనుచుండెను. పరశురాముఁడు తల్లిని తరుముకొనుచు మాదిగపల్లెలోనికి వచ్చి, దంచుచున్న మాదిగవాని భార్యను తన తల్లిగా భావించి, ఆమె శిరసు ఖండించెను.

పరశురాముడు వెడలిపోయిన తరువాత, ఎల్లమ్మ తోళ్లగోలెము నుండి బయటకు వచ్చి, మాదిగవాని భార్యను బ్రతికించి, ఇంటికి వచ్చెను. అప్పటికిఁ బరశురాముఁడు కొంత శాంతించెను. ఇంటిలో సిద్ధులు భోజనము చేసిన విస్తళ్లను జూచి, 'ఇవి ఎవరు భోజనము చేసినవి?' అని తల్లినడిగెను. ఆమె సిద్ధులు సుభోగుల విషయము చెప్పినది. పరశురాముఁడు మహోగ్రుఁడై పాఱిపోవుచున్న యా సిద్ధులను సుభోగులను బట్టుకొని, నిప్పుపెట్టి వారు దాఁగియున్న యెండుటాకుల నన్నిటిని అంటించి వేసెను.

పిమ్మట పరశురాముఁడు తనయన్న జంపయరాజునుగుఱించి తల్లిని బ్రశ్నించెను. రేణుక కొడుకునకు భయపడి, కోడలు జంగపువారి చేడె సహాయముతోఁ బ్రార్థించి, మంత్రములు జపించి, అటకపై 'పాణక'లోనున్న యెండుమాంసమునుండి జంపయరాజును బ్రతికించెను. పరశురాముఁడు అన్నను కౌగిలించుకొనెను. ఇరువురును గొంతసేపు దుఃఖించిరి. అప్పుడు పరశురాముఁడు, "అన్నయ్యా, మన తల్లి రేణుక 'పాడుగుళ్ల మారి, పంచంబు గుడిదేవి'– మంచిగుళ్లలో మన అమ్మ కాపురం ఉండదు. పాడైన గుళ్లలోనే ఉంటుంది. మన తల్లి యెదుట మనం బ్రతకలేము. నడు, వైకుంఠం పోదాం" అనెను. వెంటనే జంపయరాజు, పరశురాముఁడు, జంగపువారి చేడె, గవరమ్మ– వీరందఱును వైకుంఠము చేరుకొనిరి.

పైన దెల్పిన ఆఱుగాథలును పరశురాముని కథాచక్రములోనివి. ఇవి మౌఖిక సంప్రదాయమున నున్న వీరగాథలు. గాథాకారుఁడు వీనినిదే క్రమమునఁ బాడినాఁడు. పై కథలకు సంబంధించిన తాళపత్ర గ్రంథములు శ్రీకాకుళ మండలమున బొబ్బిలి, పార్వతీపురము, రాయగడ తాలూకాలలో మాదిగల యిండ్లలో విస్తారముగ లభించునని నాకు ఈ కథలను పాడి వినిపించిన కంట చిన్నయ్యదాసు తెలియఁజేయుచున్నాఁడు. ఈ కథలను రచించినవారు శ్రీకాకుళ మండలములోని 'టొంపల బంటయ్య, వెజ్జల రామస్వామి, కుంచి కన్నయ్య, గురయ్య' మున్నగు జానపద కవులఁట. విజయనగరము తాలూకాలో 'మరువాడ' గ్రామమునకుఁ జెందిన గర్భాం రామమూర్తిగారుకూడ నీ కథలు పదములుగా వ్రాసినకవియని తెలియుచున్నది.

## 1.7. ఎల్లమ్మ కథ:-

ఇది తెలంగాణమున వ్యాప్తియందున్న మౌఖికగాథ. దీనిని పంబాలవారు పాడుదురు. ఈ కథను మెదకు మండలములోని 'ఆర్నకొండ' గ్రామమున 12-12-1954వ తేది రాత్రి పంబాల సర్వాయి (చొప్పదండి గ్రామము) పాడఁగా, శ్రీమాన్ బి. మంగయ్య గారు సేకరించి 24-12-1954న డా॥ బి. రామరాజుగారికిఁ బంపిరి. రామరాజుగారి దగ్గఱనుండి నేను దీనిని 12-6-1966న హైదరాబాదులో వ్రాసికొంటిని. ఇది సుమారు 840 పంక్తులున్న కథ. ఈ కథలో పాట, వచనము, కొన్ని దరువులు కూడఁ గలవు. ఇందు మఱ్ఱిచెట్టుకథ, జమదగ్ని పుట్టుక, ఎల్లమ్మ జననము, ఎల్లమ్మ కల్యాణము, పరశురాముఁడు తల్లిని నఱకుట, కార్తవీర్యార్జునుఁడు జమదగ్నిని జంపుట, అది పరశురామునకుఁ దెలిసి అతనిపై దండెత్తుట– అను కథాంశములున్నవి.

తెలంగాణమున వ్యాప్తియందున్న యీ కథకును, నేను సేకరించిన మౌఖికగాథలకును సంబంధము లేదు. ఈ తెలంగాణపు కథ యెక్కువగా బ్రహ్మాండ పురాణము ననుసరించి యున్నది. ఈ కథను డా॥ రామరాజుగారు పూర్తిగాఁ జర్చించియున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౪౩౪-౪౪౦). నేను సంపాదించిన కథాచక్రమున జమదగ్ని తల్లిదండ్రులు 'జలగన్న పార్వతి, సత్యగౌతుఁడు' కాఁగా, నిందు 'అహల్యాగౌతము'లని యున్నది. వీరు కూడ నిజ జననీజనకులు కారు, పెంచుకొనినవారు మాత్రమే. ఈ అహల్యాగౌతములు 'ఎలిగొండ నలిగొండ' పట్టణములను బాలించుచుండిరి. ఒకనాఁడు భగవంతుఁడు వచ్చి గౌతముని ఎఱ్ఱకొఱ్ఱల సాహిత్యము (=స్వయంపాకము)ను కోరగా, గౌతముఁడు కొఱ్ఱచేను వేయుటకు యాదవుల మఱ్ఱిని నఱికి, అచట పుట్టలోనున్న పండ్రెండు శిరస్సుల పామును జంపి, పాపము కట్టుకొనెను. ఇంకను మార్జాలహత్య, గోహత్య, బ్రాహ్మణహత్య మున్నగునవి చేసి, ఆ పాపపరిహారార్థము దంపతులిరువురును సప్తసముద్రములకుఁ బోయిరి. మార్గమధ్యమున నక్కల కూటమివలనఁ బుట్టిన 'జమదగ్ని' యను బాలుని జూచి, ఇంటికిఁ దెచ్చి పెంచుకొనసాగిరి.

శివపురమును బాలించు శంకరుఁడు తన కూఁతురగు రేణుకను జమదగ్నికిచ్చి పెండ్లిచేసి, 'మైసమాపురము' నరణముగా నిచ్చెను. తండ్రిచేసిన పాపము జమదగ్నిపాలికి రాఁగా, దాని పరిహారార్థ మాతఁడు తపస్సుచేయుటకై పోయెను. ఒకనాఁడు రేణుక భర్తను

జూడఁగోరి, బోనము వండి, అలంకరించుకొని పయనమయ్యెను. ఆమె వలన జమదగ్నికిఁ దపోభంగమగునని భగవంతుఁడు మార్గమధ్యమున ముగ్గురు పసిబిడ్డలను సృజించెను. వారు రేణుకను అన్నమడిగిరి. వారికి అన్నము పెట్టకుండ ఎల్లమ్మ భర్తకడ కేగెను. ఆ పాత్రలో సగమన్నము మాయమయ్యెను. జమదగ్ని బోనమారగించుటకై జల్లెడతో నీరుతెమ్మని భార్య నాజ్ఞాపించెను. ఎల్లమ్మ తన పినతల్లి గంగను ప్రార్థించి జల్లెడతో నీరుతెచ్చెను. కడవలో సగమన్నమే యుండుట చూచి, జమదగ్ని శిశువుల విషయము గ్రహించి, వారు తమ పిల్లలేయని చెప్పి, వారికడ కేగి అన్నముపెట్టి రమ్మని భార్యకానతి యిచ్చెను. ఎల్లమ్మ తిరిగి పిల్లలకడ కేఁగఁగా, వారామెను వివస్త్రగా వడ్డింపుమని కోరిరి. దైవమును బ్రార్థించి, ఎల్లమ్మ 'అక్షయ వలువలు' పొంది, బిడ్డలకాహారమిడి, వారిని దీసికొని భర్తను జేరెను.

జమదగ్ని తన భార్యను ఇసుకతో భాండము చేసి నీరుతెమ్మని కొలనికిఁ బంపెను. అట ఎల్లమ్మ కప్పలు కూటమాడుట చూచెను. ఆమె మనస్సు చలించెను. దివ్యదృష్టిగల జమదగ్ని తన యెదుతొమ్ము నలచి, ముత్తెమంత మన్ను దీసి 'మసుకరేనుఁ' డను మాదిగను సృష్టించి రేణుక కడకుఁ బంపెను. వివస్త్రయై స్నానముచేయుచున్న రేణుక నాతఁడు బలాత్కరింపఁ బోయెను. ఆమె వానిని దూషింపఁ గాఁ దిరోహితుఁడయ్యెను. రేణుక యిసుకతోఁ గడవజేసి నీరు తెచ్చెను. భర్తకు అన్నము వడ్డించెను. జమదగ్ని రెండు కబళములారగించి, కోపావేశమున ముగ్గురు కుమారులను రావించి, తప్పుచేసిన తల్లిని సంహరింపుడనెను. పరశురాముఁడు ముందుకు వచ్చి, తల్లి తల నఱికి, తిరిగి తండ్రిని వేడుకొని ఆమెను బ్రతికించెను. పిమ్మట భర్త యాజ్ఞప్రకారము ఎల్లమ్మ పుత్రులతో మైసమాపురమునందుండెను.

ఒకనాఁడు అరణ్యమునఁ దపస్సు చేసికొనుచున్న జమదగ్నిని 'జంబరగిరి పట్టణము' (జంభనాపురి లేదా నేఁటి 'జబల్‌పూర్' ఇదియే కాఁబోలును) నేలు కార్తికరాజు చంపెను. రేణుక కీ వార్త తెలిసి దుః ఖించెను. కాని కుమారులకీ విషయమును జెప్పలేదు. ఒకనాఁడు పరశురాముఁడు బొంగరములాడుచుఁ దండ్రిలేనివాఁడని తోటివారిచేఁ బరిహసింపఁబడెను. పరశురాముఁడు తన తండ్రినిగూర్చి తల్లిని బ్రశ్నించెను. ఆమె చెప్పక తప్పించుకొని పాఱిపోయి మాదిగవాడలో 'లంద' (గోలెము)లో దాగియుండెను. పరశురాముఁడు పంబాల వేషముతో వచ్చి, జమిడిక వాయించి, తల్లిని బ్రార్థింపఁగా నామె గోలెమునుండి బయటకు వచ్చెను. అతఁడు కోపముతోఁ తండ్రి జాడ ఎఱిగింపుమని తల్లిపైఁ జేయెత్తెను. తిరిగి శాంతుఁడై యెత్తిన తన చేతిని మణికట్టు వఱకును నఱికికొనెను. ఆ చేయి 'ఉప్పలమ్మ' లేక 'ఉప్పల మైసమ్మ' అను పేరుతోఁ బూజలందునని వరమిచ్చెను. ఎల్లమ్మ భయపడి కార్తికరాజు జమదగ్నిని జంపెనని చెప్పెను. పరశురాముఁడు మండిపడి కార్తికరాజుపై దండెత్తఁబోయెను. తల్లి వారింపఁ బ్రయత్నించినను పరశురాముఁడాగలేదు.

ఈ కథ యింతవఱకే యున్నది. ఇందు మొదట జమదగ్ని పుట్టుకనుగూర్చి, తల్లిదండ్రులనుగూర్చి కొంతయున్నను, మొత్తమున కిది రేణుకకు సంబంధించిన కథ మాత్రమే. నేను సేకరించిన మౌఖిక గాథలలోఁగల రేణుకాకల్యాణమునకిది ఆద్యంతములు పెంచుకొనిన ప్రత్యంతరముగా భావింపనగును. ఈ కథాంతమునుబట్టి పరశురాముని యుద్ధమను కథ వేఱుగా నుండునని తెలియుచున్నది. ఇందు గౌతుఁడు యాదవమఱ్ఱిని నఱికి పాపములు చేయుట, జమదగ్ని అతనికిఁ బెంపుడుకొడుకుగా లభించుట నూతనాంశములు.

గౌతుఁడు యాదవమఱ్ఱిని నఱికి కొఱ్ఱచేను చేసిన కథ కాటమరాజు కథాచక్రమునఁ గల 'భక్తిరన్నకథ'లో 'గౌతమ చాటువ' అను పేర నుపకథగా వచ్చినది. ఆ కాటమరాజుకథలు పాడువారును, ఈ పరశురామునికథలు పాడువారును నొకే కులము వారగుటచే (మాదిగలు) నీ సామ్యము వచ్చియుండును. గూడూరులో నొక గాథాకారుఁడుకూడ గౌతుపురాణమున మొట్టమొదట నీ మఱ్ఱిని నఱికిన గాథనే పాడినాడు. వేటూరివారు, తిమ్మావజ్ఝులవారు ఇచ్చిన శక్తికథల పట్టికలో 'మఱ్ఱిచెట్లకథ' యున్నది. అది ఇదియే యగునేమో. (బహువచనము ప్రామాదికము కావచ్చును. 'మఱ్ఱిచెట్టుకథ' అనుటయే సమంసజము.) ఈ మఱ్ఱిచెట్టుకథను పరశురాముని కథాచక్రమున మొట్టమొదటి కథగాఁ దలంపవచ్చును.

పైన దెల్పిన మౌఖికసంప్రదాయగాథలే కాక, లిఖిత రూపమునఁ దాళపత్రగ్రంథములలో నున్న కథలును గొన్ని కలవు. ఇట్టి వానిలో 'ఏకవీరాంబ కథ' నాకు కృష్ణామండలమున లభించినది. 'పరశురామాయణము, మాతపురాణము' మద్రాసు ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమున గలవు.

## 1.8. 'ఏకవీరగాంబ కథ':-

లేఖకుఁడు దీని ముఖపత్రమున 'రేణుకా రాయభారము అనే గిరిరాజు యుద్ధము, ద్విపదకావ్యము' అని వ్రాసినాడు. మొదటి పత్రమున నెడమచేతి మూలలోఁగూడ లేఖకుఁడే 'రేణుకా రాయభారము అనే గిరిరాజు చరిత్రము- ద్విపద కావ్యము' అని వ్రాసినాడు. గ్రంథాంతమున 'రేణుకా రాయభారము అనే గిరిరాజు యుద్ధము' అనియు, 'రేణుక రాయభారము= గిరిరాజు యుద్ధము కలిసియున్నది' అనియు వ్రాయఁబడి యున్నది. లేఖకుఁడిన్ని రకములుగా వ్రాసినను కవి యీ కథారంభమున దీనిని 'ఏకవీరాంబ కథ' అని చెప్పినాఁడు: "అతివేగ వందనము అందరకు జేసి, ఏకవీరాంబకథ నే విన్నవింతు". లేఖకుఁడు చెప్పినట్లు ఇది ద్విపద చ్ఛందమున లేదు, మంజరీద్విపదగా నున్నది. అచ్చటచ్చట నీ మంజరి కూడ శిథిలమై అయిదు మాత్రల యావృత్తులు నాలుగొక పాదముగా సాఁగినది.

మొత్తముపై నీ 'యేకవీరాంబ కథ' రెండు కథల సమాహారమని చెప్పవలెను. ఇందు 'రేణుక రాయబారము, గిరిరాజు యుద్ధము' అను రెండు వీరగాథలున్నవి. రేణుక రాయబారమనఁగా రేణుక కల్యాణము. జమదగ్ని రేణుకను బెండ్లాడుట యిందలి కథాంశము. గిరిరాజు మొదట నంగీకరింపకున్నను జమదగ్ని మాఱువేషమున వచ్చినప్పుడు రేణుకనిచ్చి పెండ్లిచేయును. ఇది మొదటి కథ. (దీనికి ముందు రేణుక పుట్టుకనుగూర్చి కూడ కొంతకథ యున్నది.) గిరిరాజు త్రిపురాసురాది రాక్షసులతో యుద్ధమునకుఁ దలపడును. ఆ యుద్ధమున నతఁడు మూర్ఛిల్లి రేణుకను దలఁచుకొనును. మాహురమున నున్న రేణుక పీడకలగాంచి, లేచి, తమ్ముఁడు పోతురాజును, కాలభైరవుని వెంటఁ బెట్టుకొని యుద్ధమునకుఁ బోయి, తండ్రికి సహాయము చేసి, రాక్షసులను సంహరించును. (ఈ యుద్ధమునఁ బరశురాముఁడు కూడ తల్లికి సహాయము చేసెను.) ఈ విధముగా గిరిరాజుయుద్ధమను కథలో రేణుక ప్రధానపాత్ర వహించుటచే దీనికి 'రేణుక యుద్ధ' మనియుఁ బేరు వచ్చినది. కాఁబట్టి 'ఏకవీరాంబ కథ'లో రేణుక కల్యాణము లేక రేణుక రాయబారము, గిరిరాజు యుద్ధము లేక రేణుక యుద్ధము అను రెండు కథలున్నవని చెప్పవలెను. ఇందు 'రేణుక యుద్ధము' పరశురాముని కథాచక్రమునఁ జేర్పవలసిన నూతన గాథ.

## 1.9. పరశురామాయణము:-

ఇది మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమునఁ గలదు. దీనికి రెండు ప్రతులున్నవి. డి.నెం. 1110 అనునది తాళపత్రప్రతి. డి.నెం. 1111 అనునది కాగితపుఁబ్రతి. తాళపత్రప్రతి శైథిల్య గ్రంథపాతములతోఁ, దప్పులతోఁగల అసమగ్రప్రతి. ఇందు 23 మొదలు 66 వఱకునుగల పత్రములు కనిపించుటలేదు. కొన్ని యాకులకుఁ బుటలసంఖ్య లేదు. ఇది ఉలిచి భావజ్ఞుఁడను కవి రచించిన మంజరీద్విపద. ఈ గ్రంథము రెండు భాగములుగా విభజింపఁబడినట్లు తోచుచున్నది. ఇందు పూర్వార్ధము మాత్రము కలదు. కార్తవీర్యార్జునుని చరిత్రమును, పరశురాముని చరిత్రమును నిందు వర్ణింపఁబడినవి. వీరి యుద్ధము మాత్ర మిందు లేదు. కవియగు ఉలిచి భావజ్ఞుఁడు దీనిని కనకాద్రి కంకితము చేసినట్లుగా నొకచోట చెప్పినాడు. డి.నెం. 1111 కాగితపుఁబ్రతి పై తాళపత్రప్రతికిఁ బుత్రిక. ఈ గ్రంథమునుగూర్చి బ్రౌనుదొరగారిట్లు వ్రాసియున్నారు: "దీనియొక్క మాతృక కుంపిణీవారు పెట్టుకొన్న చెన్నపట్టం కాలీజులో మెకంజీ పొస్తుకాలలో వున్నది''. ఈ పరశురామాయణమునుగూర్చి Tylor పండితుఁడు 1838 ఏప్రిల్ నెలలో వెలువడిన 'Madras Journal of Literature of Science' లో వ్రాసెను. మెకంజీ ప్రతులలోఁగూడ దీనినిగూర్చి వ్రాయబడియున్నది (పుట. 353).

## 1.10. మావురమ్మ కథ (లేక మాహురమ్మ కథ):-

ఇదియును మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములో నున్న తాళపత్రప్రతియే (ఆర్.నెం. 694). ఇందు 47 ఆకులున్నవి. వ్రాత చెడ్డగను తప్పుల మయముగను ఉన్నను, శైథిల్య గ్రంథపాతములు లేవు. సమగ్రముగానున్న కథ. ఈ తాళపత్రగ్రంథమును 1920-21 సంవత్సరములో గుంటూరుజిల్లా రెంటచింతల గ్రామమునకుఁ జెందిన రామరాజు పెద్దసుబ్బయ్యగారు మద్రాసు గ్రంథాలయమునకు బహూకరించిరి. ఈ పుస్తకప్రదాతలు ఈ గ్రంథముపేరు 'గిరిరాజు యుద్ధము' అని చెప్పిరి. కాని గ్రంథములో నా పేరు లేదు. గ్రంథాంతమున 'మావురమ్మకథ' యని ప్రతిలేఖకుఁడు వ్రాసెను. శక్తికథలలో మావురమ్మకథ యున్నట్లును, రేణుకకు మావురమ్మయను పేరున్నట్లును క్రీడాభిరామమువలనఁ దెలియుచున్నది. దీనిపేరు మావురమ్మకథయే కావచ్చును. పైన తెల్పిన ఏకవీరాంబకథలోఁ గూడ లేఖకుఁడు దానిని 'గిరిరాజు యుద్ధము-రేణుక రాయబారము' అను పేర్లతోఁ బిలిచినట్లు తెలిసికొంటిమి. ఏకవీరయన్నను రేణుకయే. కాఁబట్టి రేణుకకథకు జానపద వ్యవహారమున గిరిరాజుయుద్ధమను నామముండియుండును. అందువలననే గ్రంథప్రదాతలు అట్లు చెప్పిరి.

ఈ మావురమ్మ కథ ముందు వివరించిన ఏకవీరాంబకథ వంటిదే. ఏకవీరాంబకథలో స్వల్పముగానున్న రేణుకపుట్టుక యీ కథలో విపులముగా నున్నది. గిరిరాజు త్రిపురాసురులతోఁ జేసిన యుద్ధమున రేణుక తండ్రికి సహాయపడుట యిందలి ప్రధాన గాథ. రేణుక పుట్టుక, రేణుక కల్యాణము, రేణుక యుద్ధము (గిరిరాజు యుద్ధము)- ఇందు వరుస క్రమమున వర్ణింపఁబడినవి. ఈ కథ శిథిలమగు మంజరీ ద్విపదయందున్నది. కొన్నిచోట్ల ఖండగతియుఁ గాననగును.

పరశురాముని కథాచక్రమున 'జలగన్న పార్వతి కథ' తరువాత 'రేణుక పుట్టుక'ను జేర్చుకొనవచ్చును. నేను సేకరించిన మౌఖిక గాథలలోని రేణుకాకల్యాణమున జమదగ్ని మాఱువేషమున వచ్చి రేణుకను బెండ్లాడిన కథ మాత్రమే కలదు. ఆదిశక్తి గిరిరాజునకు రేణుకగాఁ బుట్టిన కథ అందు లేదు. కావున రేణుకపుట్టుకను బ్రత్యేక గాథగా భావింపవచ్చును.

నేను సంపాదించిన మౌకికగాథలను, గ్రంథాలయములలోని తాళపత్రగ్రంథములను, జనవ్యవహారమును బరిశీలించి చూడగాఁ బరశురాముని లేక ఎల్లమ్మ కథాచక్రమున నీ క్రింది వీరగాథలున్నవని తేలుచున్నది:

1. మఱ్ఱిచెట్టు కథ : సత్యగౌతుఁడు కొఱ్ఱచేనువేయుటకై యాదవ మఱ్ఱిని నఱకి, అచటి పుట్టలోని పండ్రెండు శిరసుల ఆదిశేషునిఁ జంపి, చెట్టుపైనున్న పక్షులను నాశము చేసి పాపము కట్టుకొనిన కథ.

2. జలగన్న పార్వతి కథ : సత్యగౌతునిభార్య జలగన్న పార్వతి అత్తయగు నీమకాదేవిచే బాధలు పడుట.

3. ఏకవీరాంబ కథ లేక మాహురమ్మ కథ:

ఇది ప్రధానగాథ పేరు. ఇందు మూఁడు అంతర్గాథలున్నవి. 1) రేణుక పుట్టుక- సంతానహీనుఁడగు గిరిరాజునకు ఆదిశక్తి రేణుకగా జన్మించుట. 2) రేణుక కల్యాణము లేక రేణుక రాయబారము- సత్యగౌతుని పుత్రుఁడగు జమదగ్ని రేణుకను బెండ్లాడుట. 3) గిరిరాజు యుద్ధము లేక రేణుక యుద్ధము- త్రిపురాసురాది రాక్షసులను జంపుటలోఁ దండ్రియగు గిరిరాజునకు రేణుక సహాయపడుట.

4. పరశురాముని జననము:

రేణుకా జమదగ్నులకు 'జంపయరాజు, పాపేరు గవరమ్మ, పరశురాముఁడు' అను ముగ్గురు సంతానము కలుగుట.

5. పరశురాముని యుద్ధము:

పరశురాముఁడు కార్తికరాజులను జంపి తండ్రిపగ దీర్చుట.

6. గవరమ్మ గాజులు లేక గొంతమ్మ కథ:

రేణుకపుత్రికయగు గవరమ్మను కార్తిక మల్లఁడు పెండ్లాడుట.

7. జంపన్న వెలిగొండ వెళ్లుట:

రేణుక జ్యేష్ఠపుత్రుఁడగు జంపయరాజు వెలిగొండలోని సిద్ధులకు సుభోగులకు బలియగుట. పరశురామునిచే నతఁడు తిరిగి బ్రతికింపఁబడుట.

దీనినిబట్టి పరశురాముని వీరగాథావృత్తమున మొత్తము తొమ్మిది వీరగాథలున్నవని తెలియుచున్నది. తెలంగాణములో వ్యాప్తియందున్న 'ఎల్లమ్మకథ' పైన తెల్పిన ఏకవీరాంబకథ, మావురమ్మ కథలకన్న భిన్నముగా నున్నది. దానినిగూడ నీ కథాచక్రమున నొక ప్రత్యేకగాథగాఁ జేర్చినచో మొత్తము పది కథలగును.

ఈ కథాచక్రమున వీరగాథాలక్షణములు ప్రస్ఫుటముగా గోచరించుచున్నవి. ఇతివృత్తము పౌరాణికమైనను చక్కని సాంఘిక వాతావరణమునఁ దీర్చిదిద్దఁబడినది. ఇందు మాలమాదిగల వంటి నిమ్న కులములవారి జీవితవిధానము కడు రమణీయముగఁ జిత్రింపఁబడినది. అత్తల యారళ్లు, కోడండ్ర బాధలు, పతివ్రతల మాహాత్మ్యములు, శక్త్యవతారయగు రేణుక శౌర్యము, పరశురాముని శౌర్యము, సందర్భానుసారముగఁ గొంత హాస్యము, స్త్రీల పుట్టింటి యాస, వీరాద్భుతరసపరిపోషణము, అభూతకల్పనలతోఁ గూడిన జానపద వాతావరణ సృష్టి, పడికట్టు వర్ణనలు పదజాలము (Ballad Commonplaces) మున్నగునవి యీ కథలలోఁ గొట్టవచ్చినట్లు కనఁబడుచున్నవి.

అల్లవారింటికేఁగు సత్యగౌతుని 'ముస్తాబు' ఎంత దేశితన ముట్టి పడునట్లుగ వర్ణితమైనదో చూడుడు:

*"చింతపువ్వుల పంచ- చిలక్కట్టు కట్టాడు ॥చిలక్కట్టు॥*
*గామంచు రూమాలు- పైమీద ఏశాడు ॥పైమీద॥*
*బింకపంకామైన- బిళ్లల మొలతాడు కట్టాడు ॥బిళ్లల॥*
*మూడుతులాల్ బంగారం- మురుగు లేసీనాడు ॥మురుగు॥*
*పదివేళ్లకు పది- బటువు లేసీనాడు ॥బటువు॥*
*కిర్రుపెట్టిన జోడు- పాదమున తొడిగాడు ॥పాదము॥*
*ముస్తాబులైనాడు- ముద్దు వేడుకతోన ॥ముద్దు॥*
*నీలి గుబ్బల గొడుగు- నీడలొడ్డాడయ్య ॥నీడ॥*
*రేణుకాపట్నముకు- పయనమయ్యాడయ్య" ॥పయన॥[6]*

ఇది పురుషుని వర్ణన. స్త్రీల అలంకరణ వర్ణనకూడ నిట్లే జానపదులకు సన్నిహితముగా వర్ణింపఁబడినది. జలగన్న పార్వతి కథలో నీమకాదేవి వర్ణన చూడుడు:-

"ఏళ్లవే పిల్లేళ్లు- అవి కంచు మట్టెలూ ॥అవి॥
అందెలూ కడియాలు- అమర పాంజేబులు ॥అమర॥
రాగిడీ చేతులకు- రక్తబిందే లేసి ॥రక్త॥
సందిటీ దండలకు- సరిగ తావెదు లేసి ॥సరిగ॥
ముక్కుదీ ముంగారి- మునిజవల కుంటేళ్లు ॥ముని॥
ఏడువేలూ చెయ్యా- ఈరజడ దాల్చింది ॥ఈర॥
పదివేలు జేసినా- పాపిడీ గొలుసులు ॥పాపి॥
కొంగరెక్కలబోలు- కోకలను గట్టింది ॥కో॥
రాణింపు జలారు- రవికొకటి తొడిగింది ॥రవి॥
మేలైన శాల్వొకటి- మేలి ముసుగేసుకొని ॥మేలి॥
పయనంబులైనాది- అన్న పట్నమునకు" ॥అన్న॥[7]

## 2. అంకమ్మ కథాచక్రము

ఇందు 'అంకమ్మ' లేక 'అంకాళమ్మ' అను శక్తిని గొలిచిన 'మారాసపురాజుల' కథలు మూఁడున్నవి. 1) మారాసపు అంకమ్మ కథ, 2) రవద్దేవిరాజు కథ, 3) కల్యాణపు గంగురాజు కథ. ఈ మూఁడు కథలకును 'అంకమ్మ పాంగెము' అని పేరు. అనఁగా నీ కథాచక్రమునకు జానపదులలో అంకమ్మ పాంగెమను వ్యవహార

మున్నదని తెలియుచున్నది (పరశురాముని కథలకు 'గౌతుపురాణ' మనుపేరున్నట్లుగానే). ఇవి చారిత్రక వీరగాథలు. కల్యాణము నేలిన పశ్చిమ చాళుక్యులకు లేదా కలచూరి చాళుక్యులకు సంబంధించిన వీరగాథలుగాఁ గన్పట్టుచున్నవి. రవద్దేవిరాజు, గంగురాజు మున్నగు మారాసపువారు కొలుచుటచే ఈ అంకమ్మకు 'మారాసపు అంకమ్మ' అని పేరు వచ్చినది. ఇంకను మఱిరెండు రకముల అంకమ్మలున్నారు. 1) 'పల్నాటి అంకమ్మ లేక వీరుల అంకమ్మ'– పల్నాటి వీరులలో కొమ్మరాజు కొలిని అంకమ్మ. ఈమె గుడి కారెంపూడిలోఁ గలదు. ఈమెను జానపదులు 'ఈర్లంకమ్మ' (వీరుల అంకమ్మ) అందురు. 2) 'బయబట అంకమ్మ'– ఈమెను ఇంటిలో నుంచరు, ఊరిబయట నుంచెదరు. కాఁబట్టి అంకమ్మలు మొత్తము ముగ్గురు. మారాసపు అంకమ్మ, పల్నాటి అంకమ్మ లేక వీరుల అంకమ్మ, బయట అంకమ్మ. ప్రకృత కథాచక్రము మొదటి విధమగు అంకమ్మకు సంబంధించినది. పల్నాటి అంకమ్మనుగూర్చిన కథ పల్నాటి వీరకథలలో వచ్చును. కొమ్మరాజు యుద్ధమునకు ముందు 'అంకమ్మ పుట్టుక'నుగూర్చిన కథను జెప్పుదురు.

ఈ పల్నాటి అంకమ్మకూడ మారాసపు అంకమ్మనుండి యేర్పడినట్టిదే. అంకమ్మ కథలకును పల్నాటి వీరకథలకును దగ్గఱ సంబంధమున్నది. అంకమ్మను గొలిచిన మారాసపురాజులు ఏడుగు రన్నదమ్ములు. వారిలో చివరివాఁడు 'వీరసోమరాజు'. ఇతఁడు పల్నాటి వారితోఁ గలసిపోయినాఁడు. తన కూఁతురు సిరాదేవిని పెదమల్లి దేవరాజునకిచ్చి వివాహము చేసెను. ఈ వీరసోమరాజు పుత్రుఁడే కొమ్మరాజు. ఇతఁడు తనతోపాటుగ తన కులదైవమగు అంకమ్మను గూడ పల్నాటికిఁ దెచ్చినాడు. ఈమెయే పల్నాటి అంకమ్మ, లేక వీరుల అంకమ్మ. ఇది చారిత్రక సత్యముకూడ.

ఈ అంకమ్మకథలను పాడువారు 'అయ్యగారి దర్శనము' నకుఁ జెందిన మాలలు. వీరిని 'పంబలవారు' అందురు. వీరు వాయించెడి పంబజోడునుబట్టి వీరికీపేరు వచ్చియుండును. పంబజోడు, తిత్తి, కత్తి, జమజాల (కైజారు)– అనువానితో నీ కథను పాడుదురు. కథకుని

**అంకమ్మ కథాచక్రము ననుసరించి–**



కుడిచేతిలో కత్తి, ఎడమచేతిలో 'జమజాల' ఉండును. వంతలు పంబజోడును వాయించుచు తిత్తిపట్టుదురు.

అంకమ్మను అన్నివర్ణములవారును గొలిచెదరు. పల్నాడులో బ్రాహ్మణులు, కమ్మవారు; నెల్లూరు మండలమున పట్టుసాలీలు, ఓరుగంటి రెడ్లు, కుమ్మర్లు; ఉత్తరాదిన బోగమువారు, గమళ్ల, బలిజ, శూద్రచాకళ్లు, మాలలు, ముత్రాసులు మొదలగు వర్ణములవారు అంకమ్మను కొలిచెడివారిలోఁ బ్రధానులు.

అంకమ్మ పాంగెములోని మూఁడు కథలనుబట్టి మారాసపు రాజుల వంశక్రమ మిట్లున్నది:– (చూ. ప్రక్కనున్న 198వ పుట).

అంకమ్మ యేడుగురు అప్పచెల్లెండ్రతోఁ బుట్టినదఁట. 'అంకమ్మ, పోలేరమ్మ, మాలక్షుమమ్మ, కనకదుర్గమ్మ, బంగారమ్మ, గంగమ్మ, కూనలమ్మ'– వీరేడ్గురును అక్కసెల్లెండ్రు. ఇందు కూనలమ్మకు నూర్గురు బిడ్డలఁట. శక్తులన్నియు అభిన్నములగుటచేఁ గాఁబోలు, అంకమ్మకథలలో మధ్యమధ్య అంకమ్మ రేణుకగా స్తుతింపఁ బడు చుండును. ఇదియునుగాక, రాయలసీమలో ఎల్లమ్మకథలు పాడెడి ఆసాదివారిలో కొందఱు అంకమ్మకథలనుగూడ పాడుచున్నట్లు తెలియుచున్నది.

ఈ అంకమ్మకథలను పాడుటలో పంబలవారు నలుగు రుందురు. ఒకఁడు కథకుఁడు, తక్కిన ముగ్గురును వంతలు. ఈ వంతలలో నొకఁడు పంబజోడును వాయించును. మఱియొకఁడు తిత్తి యూఁదును. వేఱొకఁడు 'ఆఁ' కొట్టును. పంబజోడు– తాళమును, తిత్తి– శ్రుతిని సమకూర్చును. కథకుని కుడిచేతిలోఁ బెద్దపొడుగుపాటి కత్తి యుండును; ఎడమచేతిలో 'జమజాల' అనెడి కైజారుండును. ఈ కథకుని వేషమొక రాజకుమారుని వేషమువలె నుండును. కాళ్లకు గజ్జెలు, నెత్తికిఁ దలపాగ, దానికిరుప్రక్కల రెండు చంద్రవంకలు, కలికి తురాయి, దాలుగుడ్డ (ఎడమ భుజముమీఁదినుండి వేసికొను వల్లెవాటునకు 'దాలుగుడ్డ' అని పేరు), షరాయి (సన్నని ప్యాంటువలె నుండును), నుదుటిపైఁ గుంకుమతో నడ్డబొట్టు ధరించును. ఈ కథకుఁడు లయానుసారముగా గంతువేయుచు, చేతిలో పెద్దకత్తిని ద్రిప్పుచు, జమజాలపై దానిని కొట్టి మ్రోగించుచు, వీరావేశముతో కథను పాడుచుండును. ఈ పాట మూఁడు విధములుగా సాఁగును: 'శోకము, మాటలు, వర్ణము'. పాట మిక్కిలి దీర్ఘాలాపనతో శోకరస ముట్టిపడునట్లుగ పాడుట 'శోకము'. మాటలనఁగా వచనమని యర్థము కాదు. ద్విపదనుగాని లేక ఖండగతి రచననుగాని రాగము లేకుండ భావగర్భితముగా చదువుటను 'మాటలు' అందురు. శోకాలాపనయందున్నంత దీర్ఘముతోఁగాక, కొంత యుద్రేకముతోఁ బాడుటను 'వర్ణము' అందురు. ఇది శోకమునకును మాటలకును మధ్యస్థమగు పద్ధతి. వంత మెడలో వ్రేలాడు పంబజోడులో నొకటి తొడలపై నానుకొనియుండును; రెండవది మొదటిదానిపై నెక్కియుండును. తొడలకానుకొనియున్న పంబ తక్కువ శ్రుతిలోను, దానిపై నెక్కియున్న పంబ యెక్కువ శ్రుతిలోను బిగింపఁబడి యుండును. మొదటిపంబను ఎడమచేతితోఁ గొట్టుచు, రెండవ పంబను కుడిచేతిలోనున్న కఱ్ఱపుల్లతో తాకుచుండును. 'శోకము'నందు తక్కువ శ్రుతిలోనున్న మొదటిపంబ మ్రోగింపఁబడును. వర్ణము పాడునప్పుడు హెచ్చు శ్రుతిలోనున్న రెండవపంబ వాయింపఁబడును. 'మాటలు' చదువునప్పుడు కఱ్ఱపుల్లతో రెండవ పంబను తాళానుగుణముగా కొట్టుచుండును.

ఈ అంకమ్మ కథాచక్రమునఁగల మొదటి రెండు కథలను, అనఁగా 'అంకమ్మకథ, రవద్దేవిరాజుకథ' అను వానిని మౌఖిక ప్రసరణమున నుండఁగా నెల్లూరు మండలమున సేకరించితిని. మూఁడవదియగు గంగురాజుకథను కృష్ణామండలమున తాళపత్ర రూపమున సంపాదించితిని.

అంకమ్మకథలను పాడు గాథాకారులు ఈ క్రింది విధముగా ప్రార్థన చేయుదురు:–[8]

వర్ణన:– (పంబ యెక్కువ శ్రుతిలో మ్రోఁగుచుండును)–

| | |
|---|---|
| ***"గణనాయకా బ్రహ్మ–*** | ***గణనాయకా*** |
| ***గణనాయకా దేవా –*** | ,, |
| ***వజ్రాల తేరువలె*** | ,, |
| ***వాక్కు నా కియ్యవయ్య*** | ,, |
| ***పగడాల తేరువలె*** | ,, |
| ***పాటా నా కియ్యవయ్య*** | ,, |
| ***మాధవరాయా చిన్నికృష్ణ–*** | ***గోపాలా*** |
| ***మమ్ముల దయచూడు స్వామి*** | ,, |
| ***కరుణాచంద్రా రామకుందా*** | ,, |
| ***కానరాదే బ్రహ్మమాయ*** | ,, |
| ***పచ్చల భాగీరథురాలు*** | ,, |
| ***పరశురాముని గన్నతల్లి*** | ,, |
| ***తాటక సంహారుడమ్మ*** | ,, |
| ***తల్లికి లోకాము దెల్పె*** | ,, |
| ***అడిగెనే మూడడుగులేమొ*** | ,, |
| ***మచ్చావతారమూన*** | ,, |
| ***చొచ్చినాదే జలధిలోనా*** | ,, |
| ***చొచ్చీ సోమకుని ద్రుంచి*** | ,, |
| ***తెచ్చినాదే వేదమూలు–*** | ***గోపాలా"*** |

శోకము:– (పంబ తక్కువ శ్రుతిలో మ్రోఁగుచుండును)–

***"శ్రీహరీ.......... ఓ దైవమా.........***
***శరణమే ఆదిశక్తీ, శరణమే రేణుకా,***
***శరణమే తీరుభయంకరీ***
***శరణమే ముప్పై మూడుకోట్ల దేవతలారా!***

*శరణమ్మ మాపాలీ... ఓ శారదాంబా..*
*కనుగొని మేలుకున్నా నీ మీద జ్ఞానంబు*
*నిద్రబోయి మేలుకున్నా నీ మీద జ్ఞానంబు*
*బంటుబంటుకు నీ పిల్లబంటుమమ్మా...*
*మేలుకున్నంత మాకూ... మేలీయవమ్మా...*
*హరిభక్తులు ఎందరో కలరు అవనిలోన*
*గంగలో స్నానము చేసి హరిని కానలేరమ్మా*
*శివభక్తులు ఎందరో కలరు స్థితిలోన*
*గంగయందు స్నానము చేసి శివుని కానలేరమ్మా*
*హరిభక్తులకు శివభక్తులకు బ్రహ్మభక్తులకు*
*ఆధారకర్తవమ్మా... ఓ శారదాంబా...*
*సదుము శాస్త్రము నేర్పిన అయ్యలను ఈ సభయందు దలచి*
*విద్ధసాములు నేర్పిన అయ్యలను ఈ సభయందు దలచి*
*తప్పులు ఉన్న మిగుల ఒప్పుగా దిద్దుడీ*
*ఈ సభను కూర్చునట్టి ఓ సహృదయులారా...*
*సరగున మిమ్ము మెప్పింపా... ఇక నేనెంత వాడినో...*
*గోపాలవరదో... ఓ శారదాంబా..."*

## 2.1. అంకమ్మకథ లేక మారాసపువారి అంకమ్మకథ:-

అంకమ్మ పొంగెమున ఇది మొదటి కథ. కొన్నిచోట్ల మంజరీ ద్విపదగా, కొన్నిచోట్ల ఖండగతి రచనగా, మఱికొన్నిచోట్ల లయాత్మక వచనముగా నిది సాఁగినది. సుమారు 1100 పంక్తులున్నది. దీని ప్రారంభమిట్లున్నది:-

మాటలు:- (పంబను కఱ్ఱతోఁ గొట్టుచు వంత 'ఆ' కొట్టుచుండును)

*"వినరయ్య ఈ కత విశదంబుగాను*
*ఘనమోర్వగ మీ పెద్దలకు విన్నవించెదను*
*ఎడలేని కళ్యాణపు దేవగిరిపట్టణము*
*ఏలేటిరాజు దేవాధిదేవ రుద్రుండు*
*ఒకనాటి సమయమున వంశమార్గమున*
*తనకైన ఏడుగురి తలవర్లను బిలిచి*
*దారట్ల నాయుడును తలచీ పిలచీ*

*'తలవరులారా,*
*మన వెడలేని కళ్యాణపు దేవగిరిపట్టణము*
*వీధి ఇరవయ్యామడ తట్టు పన్నెండామడ*
*నలసదరము నాల్గునూరామడ*
*ఎడలేని దేవగిరిపట్టణము*
*రాజులుగాని రాజప్రధానులుగాని*
*భట్టులుగాని బ్రాహ్మణులుగాని*
*నివేగులుగాని నీతిమంతులుగాని*
*ఎవరు ఏలుబడి చేస్తున్నారో*
*ఎవురు ఏలుబడి చేయంగలేదో*
*సొచ్చి శోధనగానే శృంగారపు వనమునకు వచ్చి*
*విన్నవించండిరా తలవరులారా' అని*
*శృంగారపు వనమున తపస్సు చేస్తున్నాడు దేవాధిదేవరుద్రుండు".[9]*

కల్యాణపు దేవగిరిపట్టణమును దేవాధిదేవరుద్రుండు పాలించుచుండెను. అతని భార్య దేవరుద్రులగంగ, కొడుకు దేవీజలబ్రాహ్మణుఁడు. ఈ దేవీజలబ్రాహ్మణున కేడ్గురు పుత్రులు: 'ధర్మానికి పాలుపడ్డవాడు ధర్మసూదానిరాజు, అల్లానిరాజు, బల్లానిరాజు, అనుపద్మరాజు, కల్యాణరాజు, కనకసోమరాజు, వీరసోమరాజు". దేవాధిదేవరుద్రుండు ఆదదియగు అంకాళశక్తిని గొలుచుట కిష్టము లేక, శృంగారపు వనములోఁ దపస్సు చేయుచుండెను. అతని మనుమలుగూడ తాతగారి ననుసరించి అంకమ్మను ద్వేషించుచుండిరి.

ఆదిభయంకరి అంకమ్మ 'భుజనిమాంకాళి పట్టణము'లో దివ్యభవనములో నూటొక్క శక్తులు కొలుచుచుండగా నివసించి యుండెను. మారాసపురాజులచే నెట్లైనను దన్నుఁ గొలిపించుకొన వలెనని అంకమ్మ పట్టుపట్టినది. వృద్ధురాలి వేషములో కల్యాణ దేవగిరి పట్టణమునకు వచ్చినది. మారాసపురాజు లేడ్గురును ఆమెను జూచి కొట్టిరి; చిత్రహింసలు పెట్టిరి. పెద్దవాఁడు ధర్మసూదానిరాజు కొంచెము కనికరము చూపెను. చిన్నవాఁడు వీరసోమరాజు అమ్మవారి పట్టణమునకేగి, ఆమె భవనములనన్నిటిని గూల్చివేసెను.

తరువాత అమ్మవారు అల్లనేరేడుపండ్లను సృష్టించి, ఆ పండ్లొక తట్టలోఁబెట్టి, ఆ తట్టను నెత్తినిఁబెట్టుకొని కల్యాణమునకు వచ్చి పండ్లమ్మసాగెను. దేవాధిదేవరుద్రునిభార్య దేవరుద్రులగంగ పండ్లుకొనుచు, రుద్రాక్షలు విభూతి లేని ఆ అమ్మవారిని జూచి, మనుమలతోఁ జెప్పినది. వారువచ్చి ఆ పండ్లనమ్మెడి స్త్రీని అమ్మవారిగా గుర్తించి, పండ్లన్నియు నేల విసరి, ఆమెను ప్రేపబెత్తములతోఁ గొట్టి, మెడమీద చేతులువేసి అమ్మవారిని పడనెట్టినారు.

పిమ్మట మఱియొకప్పుడు అమ్మవారు ఏరుడు పిడకలను బుట్టలోఁ బెట్టుకొని, కల్యాణమునకుఁబోవు దారిలోనుండి, ఆ మార్గమునఁ బోవుచున్న మారాసపురాజులను ఆ గంపనెత్తుఁడని ప్రాధేయపడినది. వారు ఆ గంపనెత్తలేకపోయిరి. అంకమ్మ తన్నుఁ జిత్రహింసలు పెట్టిన ఆ రాజులను సమయము వచ్చినప్పుడు ప్రతీకారమొనర్తునని హెచ్చరించినది.

అంకమ్మ ఎఱుకల సింగఁడుగా మాఱి, నూటొక్క గుడిసెలు, గాడిదల గుంపులు, పందుల గుంపులు సృష్టించి, మారాసపువారి పంటలను నాశము చేయసాఁగెను. మనుమలు పోయి తమ తాత దేవాధిదేవరుద్రునితో ఈ విషయమును జెప్పిరి. ఆ పందులను బంధింపుడని తాత చెప్పెను. మారాసపురాజు లేడుగురును ఎఱుకల గుడిసెల కడుకు వచ్చిరి. అప్పుడు అమ్మవారు ముదుసలిరూపుఁ దాల్చెను. అమ్మవారిని గుర్తించి రాజులామెను బెత్తములతోఁ గొట్టఁ

బోయిరి. అమ్మవారు మంటలను సృష్టింపcగా, రాజులు కల్యాణమునకుc బాఱిపోయిరి.

అంకమ్మ తన చెల్లెలు 'భండి వీరమాలక్ష్మి'నిc బ్రార్థించి, ఆమెచేc గల్యాణ దేవగిరి పట్టణమునc బ్రజలకు దగ్గులు, పడిశములు, వాంతులు, భేదులు కలిగించెను. 'పాలుత్రాగేటి బాలలు పాలారగించకుండ, ఉగ్గుత్రాగేటి బాలలు ఉగ్గారగించకుండ, రేపో పీనుగ, మాపో పీనుగ, ఏడుకొల్లారపు బళ్లమీద ఎల్లదోలించమ్మా' అని చెల్లెలితోc జెప్పెను. తాను ఎఱుకలసాని వేషమును ధరించి, ఆ పట్టణమునకు వచ్చి, దేవరుద్రులగంగకు ఎఱుక చెప్పి, దేవాధిదేవరుద్రుని 'లక్షలకు దీరిన పచ్చలకిరీటంబు'నుc గాcజేసి పాఱిపోయెను.

తరువాత అంకమ్మదేవత జంగమువేషము ధరించి, 'భద్రగిరి చింతామణి పట్టణము'నకుcబోయి, ఱాతికొలనులోc బుష్పములు పండించి, ఆ పట్టణమేలు రాజుల మెప్పును బడసెను. 'కుంచెడు బియ్యము, కూరకట్ట, నలుగురు తలవరులను' ఆ రాజుకడ బహుమతిగాc బడసి, ఒక పూలవనమును సృష్టించి, ఆ తలవరులను దెచ్చి దానికిc గాపుంచెను. ఆ వనములోని పూవులనుగోసి కల్యాణమునకుc బంపించెను. అప్పుడు కల్యాణ దేవగిరి పట్టణమునc బూవులు లేక శివపూజ లాగిపోయెను. మాయాజంగము తలవరులచేc బంపిన పూవులను జూచి దేవాధిదేవరుద్రుండు మిక్కిలి సంతసించి, ఆ జంగమును తనదగ్గఱకుc దెమ్మనెను. రెండవదినమున జంగమ వేషములోనున్న అమ్మవారు పూలుతెచ్చి దేవాధిదేవరుద్రుని దర్శించెను. అతనిదగ్గఱ బహుమతిc బడసి వెడలిపోయెను. ఆ తరువాతc బుష్పములు పంపలేదు. మారాసపురాజులు తమ తాత యాదేశాను సారము వెండిరథములు, మేఘరథములు, కంచురథములు తయారుచేసికొని పుష్పములు తెచ్చుటకై భద్రగిరి చింతామణి పట్టణమునకు వచ్చిరి. అమ్మవారి వనములోc బుష్పములు కోసికొని వెడలిపోయిరి. మఱునాడు కూడ నట్లే పుష్పములు దొంగలించు చుండగా అమ్మవారు వారిని బట్టుకొని బంధించినది. అక్కడ ఉక్కుస్తంభములు సృష్టించినది అమ్మవారు. మారాసపురాజులను కల్యాణపు శంభుని మహిమచేత 'ఉక్కు నార్జాలు' (ఉక్కు నారసములు) కావింపుcడని కోరినది; వారట్లే చేసిరి. ఆ ఉక్కు నార్జాలపై నొరగిపోవలసినదిగా నాజ్ఞాపించినది అంకమ్మ. చేయునది లేక మారాసపురాజు లేడ్గురును తమ తాత దేవాధిదేవరుద్రుని దూషించుచు ఆ ఉక్కునార్జాలపై నొరగిపోయిరి. వారి రక్తము కాఱిపోకుండ, వారిపై ఈగలు వ్రాలకుండ అమ్మవారు 'దశకట్టులు' కట్టినది. అంకమ్మ ఈ విధముగా ఆ రాజులపైc గసి తీర్చుకొని బంగారు తూcగుటుయ్యాల యందూcగుచున్నది. ఈ కథాంతమున నిట్లున్నది:-

(మాటలు:-)

*"ఉక్కు నార్జాలపైన హరహర ఓ లింగ నమశ్శివాయ యని*
*ఆ ఉక్కు నార్జాలపైన ఒరిగిరి మారాసపు రాజులు*
*రక్తధారలు భూపాత్రమీదకు జడజడ కారుచునున్నవి*
*ఆ రక్తము చూసి అమ్మవారు, ఆ రాజులకు దశకట్లు కడుతున్నది*
*కారేటి రక్తము కరడుకట్టకుండ*
*ఈగ వ్రాలకుండ ఈపెలు ముసరకుండ*
*ఆమడ దూరాన పోతున్న నక్కల నారాయుడు*
*తలయెత్తి రాజులచాయ తప్పక చూడకుండ*
*దశకట్టులు కట్టి, భుజని మాంకాళి పట్టణము వెళ్లెను*
*అమ్మవారు తన మహిమచేత ఏడు భవనములు గట్టించుకొని*
*తొలి తోంబ్రమువంటి వస్త్రములు ధరించి*
*బంగారు తూగుటుయ్యలయందు తులతూగుతున్నాదట."* [10]

## 2.2. రవద్దేవిరాజు కథ:-

ఇది అంకమ్మ కథాచక్రమున రెండవ వీరగాథ. మౌఖిక ప్రసరణమున నున్నది. సుమారు 1060 పాదములు కలది. ఇందు గేయముకన్న వచనము హెచ్చుగా నున్నది. దీని ప్రారంభమిట్లుండును:

*"ముదిత గర్భిణియౌతున్న మూడు ఘడియలకు*
*నాతి గర్భిణియౌతున్న నాల్గు ఘడియలకు*
*అతివ గర్భిణియౌతున్న అయిదు ఘడియలకు*
*కడుపులో పిండంబు కదిలాడ సాగె*
*దంటి నొప్పులతోను తాళంగలేక*
*అడుగడుక్కు ఆ నోవు అధికమై తోచె."* [11]

పార్వతీపరమేశ్వరులు ఆకాశవీథిని బోవుచుండిరి. కొఱలc బద్ద మారాసపురాజుల శివనామస్మరణము పార్వతి చెవులcబడినది. ఆమె 'అది ఏమి' టని శివుని బ్రశ్నించినది. శివుcడు వారి కథను జెప్పి, ధర్మసూదానిరాజు గర్భమున జనింపcబోవు రవద్దేవిరాజు మాత్రమే వారి కొఱలను లేపగల సమర్థుcడని చెప్పెను.

మారాసపురాజులు కొఱలుపడుటకు మూcడుఘడియలు ముందుగాc బాములపట్నమేలు పద్మనందుల భాగీరథమ్మకు రవద్దేవిరాజు గర్భమునcబడెను. ఈమె ధర్మసూదానిరాజుభార్య. ఆమెకు ఒకే కాన్పున ముగ్గురు సంతానము జన్మించిరి. 'రవద్దేవిరాజు, కనకరావేంద్రుడు' అను నిరువురును కొడుకులు. 'శిగంటల మహాద్దేవమ్మ' కూcతురు.

ఒకనాcడు రవద్దేవిరాజు బొంగరములాడుచు, కోమటి యశోదమ్మచే దూషింపcబడి, తన తండ్రులను వెదుకcబోయెను. అతనికి అరణ్యమున నొకముని పండ్రెండుమెట్ల పైడికిన్నెర నిచ్చెను. దానితో రవద్దేవిరాజు భుజనిమాంకాళి పట్టణమునకుcబోయి, అమ్మవారికడ 'ఆనందకోపులు' పాడి సంతోషపెట్టెను. ఆమె అరణ్యమున అలసిపోయి యుండcగా, ఆమెకు సిద్ధులను గాపుంచి, బాలుcడు అమ్మవారి భవనమునకేcగి, ఆమె పండ్రెండు భద్రాయుధంబులను దెచ్చినాcడు. ఈలోపున అమ్మవారు భయపడి

నాగలోకమున కేఁగెను. ఆమె పోయిన సోరణకంతగుండా బాలుఁడు కూడ నాగలోకమునకుఁ బోవుచుండెను. అమ్మవారు సోరణకంతను 'ఆ గడ్డ ఇటు, ఈ గడ్డ అటు కలవొత్తినది'. బాలుఁడు మధ్య నలిగిపోవుచుఁ బరమేశ్వరునిఁ బ్రార్థించెను. మఱల నాగలోకమునకు మార్గము గనిపించెను. బాలుఁడు నాగలోకమున కేఁగఁగా నమ్మవారు పద్మసాలె స్త్రీవలె మాఱి, ఒడుగులు వేపుకొనుచుండెను. బాలుఁడామెను గుర్తింపఁగా, నామె పాఱిపోయి, ఆదికూర్మము చాటు కేఁగెను. బాలుఁడు ఆదికూర్మమును బ్రార్థించెను. అమ్మవారి యుత్సవములో నొకనాటి రాత్రి ఆదికూర్మమునకు వేడుక చేయింతునని చెప్పెను. ఆదికూర్మము ప్రక్కకుఁ దొలఁగెను. బాలుఁడు అమ్మవారి వీరజడ లొడిసిపట్టుకొనెను. ఆమె తప్పించుకొని ఆదిశేషుని మఱుఁగుఁ జొచ్చెను. అమ్మవారికి భూలోకమునఁజేయు నుత్సవములో నొకనాటి రాత్రి 'శేషపానుపు' అను వేడుకను జేయింతునని బాలుఁడు ఆదిశేషునకు మ్రొక్కుకొనెను. ఆ లంచమున కాశపడి శేషుఁడు ప్రక్కకుఁ దొలఁగెను. బాలుఁడు తిరిగి అమ్మవారిని బట్టెను. ఇద్దఱును పగడసాల పందెము నాడిరి.

ఇంతలో బాలుని మేనమామలగు నఱువదిముగ్గురు గోవింద రాజులు 'తుమ్మెద భళ్ళాణరాజు'నకు ఓడి పాఱిపోవుచుండిరని అమ్మవారు చెప్పెను. బాలుఁడు అమ్మవారి సెలవుదీసికొని తుమ్మెద భళ్ళాణరాజుపై దండెత్తి, మూఁడు శిరసులు, ఆఱు హస్తములు, ఖండించి, అమ్మవారికిఁ గనక నివాళులెత్తెను. అమ్మవారి దగ్గఱ తొమ్మిది గడియల సెలవు తీసికొని, మేనమామల దగ్గఱకుఁ బోయెను. మేనమామలు సంతసించిరి. పెద్ద మేనమామ పెదబాలగోవిందరాజు తన కుమార్తె 'ఉత్తర నలగంగ' నిచ్చి రవద్దేవిరాజునకు వివాహము చేసెను. బాలుఁడు తిరిగి అమ్మవారి దగ్గఱకు వచ్చెను. అప్పటికిఁ బంద్రెండు గడియలగుటచే అమ్మవారు కోమల పుట్టలో దాగిపోయెను. బాలుఁడు నాలుకలేని నాగస్వరము నూఁదెను. పంద్రెండు శిరసుల నాగేంద్రుఁడు బయటకు వచ్చెను. బాలుఁడు ధైర్యముతో ఆ పాము కంఠము నొడిసిపట్టుకొనెను. అమ్మవారు ఆ బాలుని ధైర్యమునకు మెచ్చి, ఆతని తండ్రుల నందఱను కొఱలు విడిపించినది.

అమ్మవారు తనకు దేవరుద్రుని బలిగా నిమ్మని బాలునిఁ గోరినది. నరబలియిచ్చుటకు వీలుకాదనియు, ఆతనికి బదులు మేకపోతును బలియిచ్చెదననియు బాలుఁడు చెప్పెను. అట్లే అమ్మవారు కోరిన తలారివానికి బదులు గొఱ్ఱెను, కల్యాణరాజునకు బదులు బల్లిని, వీరస్వామిరాజునకు బదులు పందిని, అనుపద్మరాజునకు బదులు ఎలుకను, కనక సోమరాజునకు బదులు పందికొక్కును, భళ్లాణరాజునకు బదులు దున్నపోతును బలియిచ్చుటకు బాలుఁ డంగీకరించెను. తన తండ్రి ధర్మసూడానిరాజునకు బొందితోఁ గైలాసమిచ్చెను. పాముఱాయి పట్టణమునకు వచ్చి తల్లికి నగ్నికుండమునకు సెలవిచ్చెను.

ఈ మారాసపురాజులలోఁ జివరివాఁడగు వీరసోమరాజు "ఆదదేవతరాలు, అనాధీకురాలు, పిండిగోరుశక్తి, గోడ ఏల్బురాలు, కొంచెపు దైత్య, వేగిలేచి దీని ముఖారవిందము మన మారాసపువారు చూడ దోషంబు" అని తలఁచి అంకమ్మను గొలుచుట కిష్టములేక, పల్నాటివారిలోఁ గలసిపోయెను. అంకమ్మకూడ నా వీరసోమరాజు చేఁ గొలిపించుకొనవలెనను పట్టుదలతో 'పల్నాటి అంకమ్మ'గా వెలసెను.

రవద్దేవిరాజు బ్రాహ్మణులు చెప్పిన జాతకము ననుసరించి తన చెల్లెలు శివగంటల మహద్దేవమ్మను కాలుసేతులు లేనివాఁడును, అంధుఁడును నగు శివన్న మహద్దేవిరాజునకిచ్చి పెండ్లిచేసెను. ఆమెకు మూఁడు వరములిచ్చుట కంగీకరించెను. రవద్దేవిరాజు తనభార్య ఉత్తరపు నలగంగతోఁ గలసి అంకాళశక్తిని గొలుచుండెను. ఈ కథాంతమిట్లున్నది:–

"అన్నా! నీ యిష్టానుసారముగనే కళ్యాణము ఆడుతున్నా, ముదమొప్ప మూడువరములు కోరెదను, తప్పక ఇచ్చెదవా?"

'సాష్టాంతముగా ఇచ్చెదను కోరుకొనుము అమ్మా!'

'ఇప్పుడు వద్దు అన్నా! నాకు అవసరము వచ్చినప్పుడు కోరుకొనెదను'.

'భూమి ఆకాశము సాక్షిగా, సూర్యచంద్రులు సాక్షిగా, మన కల్యాణ శంభుని సాక్షిగా, తప్పక ఇచ్చెదను తల్లీ!'

ఆ శివగంటల మహద్దేవమ్మనిచ్చి, శివన్న మహద్దేవిరాజునకు శ్రీకల్యాణమొదగూర్చెను. రవద్దేవిరాజు, భార్యయైన ఉత్తర నలగంగను గలసి, భార్యాభర్తలు సుఖజ్జీవులై, అమ్మవారు అంకాళదేవతను విశ్రాంతిగా కొలుచుకొనుచుండిరి..."[12]

ఏడుగురు మారాసపురాజులలోఁ జివరివాఁడగు వీరసోమరాజు పల్నాటివారితోఁ గలిసినట్లుగాఁ బల్నాటి వీరకథలలోఁగూడఁ బ్రమాణములున్నవి. ఈ వీరసోముని కూఁతురు సిరాదేవి. ఈమెను పెదమలిదేవరాజునకిచ్చి పెండ్లిచేసినట్లు పల్నాటివీరకథలలోఁ గలదు. ఈ వీరసోమరాజు కొడుకు కొమ్మరాజు. ఈ కొమ్మరాజు కొడుకు అలరాజు. ఇతఁడు నలగామరాజున కల్లుఁడు. అలరాజు రాయబారమున, అలరాజు తల్లి 'చల్లమదేవి' తమకొక్కఁడే పుత్రుఁడనియు, నామె మామ వీరసోముఁడుగారి అన్నదమ్ములేడుగురును ఆదదేవతను గొలిచి నశించిపోయిరనియుఁ దెల్పును.

ఇట్లు అంకమ్మను గొలిచిన పశ్చిమ చాళుక్యులకును, పల్నాటి హైహయులకును వివాహసంబంధములున్నవి. ఈ హైహయులు పశ్చిమ చాళుక్యులకు సామంతులగుట చారిత్రక సత్యము. మలిదేవాదులు బాలురుగా నున్నప్పుడు, కొమ్మరాజు కొంతకాలము మలిదేవుని రాజ్యమునకు రాజుగా నుండెనని నాకు లభించిన పల్నాటి

కథలలోఁ గలదు. ఈ హైమయులు పశ్చిమ చాళుక్యులకు సామంతు లగుటచేతనే వీరు కొమ్మరాజును అలరాజును మిక్కిలిగా గౌరవించెడి వారు. పల్నాటివారు కొమ్మరాజాదులను 'మహారాజులవారు' అని పిలిచెడివారు. ఈ 'మహారాజులవారు' అను శబ్దమే 'మారాజులవారు' > 'మారాసపువారు'గా మాఱియుండునని నా యభిప్రాయము. సార్వభౌములని దీని యర్థము. దీనినిబట్టి పల్నాటి యుద్ధములోని కొమ్మరాజాదులును, అంకమ్మను కొలిచిన రాజులును పశ్చిమ చాళుక్యులనియు, వీరి రాజధాని కల్యాణ నగరమనియుఁ జెప్పవచ్చును. కల్యాణము వీరి ముఖ్యపట్టణమగుటచేఁ జారిత్రకులు వీరిని 'కల్యాణి చాళుక్యులు' అని పిలుతురు.[13] (వీరసోముడు కలచూరి బిజ్జలుని కుమారుఁడని మల్లంపల్లి సోమశేఖరశర్మగారి అభిప్రాయము.)

## 2.3. గంగురాజు కథ లేక కల్యాణపు గంగురాజు కథ:-

ఇది కృష్ణామండలమున లభించిన తాళపత్రగ్రంథము. ఇందు ముప్పది యెనిమిది పత్రములున్నవి. తప్పు లెక్కువ. శైథిల్యము కలదు. అయినను కథ సమగ్రముగ నున్నది. సుమారు 1512 పంక్తులున్నవి. అంతయు మంజరీ ద్విపదయే. వచనము లేదు.

గంగురాజుకథ అంకమ్మగాథావృత్తమునఁగల మూఁడు గాథలలోఁ జివరిది. రవద్దేవిరాజు పుత్రుఁడు గంగురాజు. ఇతని పినతండ్రి కనకరావేంద్రుఁడు. ఈ కనకరావేంద్రుఁడు మిక్కిలి క్రూరుఁడు. రాజ్యము నపహరింపనెంచి కాఁబోలును, ఇతఁడు గంగురాజును జంపుటకుఁ బ్రయత్నించును. అమ్మవారి సహాయమున గంగురాజు ఇతనిని సంహరించును. ఈ గంగురాజును 'కల్యాణపు గంగురాజు' అని గాథాకారులు వ్యవహరింతురు. తాళపత్రగ్రంథమున 'రాజు గంగురాజు' అని కలదు. కల్యాణపట్టణము నేలుటచే కల్యాణపు గంగురాజను పేరు వచ్చియుండును.

రవద్దేవిరాజునకు ముగ్గురు పుత్రులు: 'గంగురాజు, భూపతిరాజు, కర్నమురాజు'. వీరిలో గంగురాజు మహావీరుఁడు. ఏడేండ్ల బాలుఁడు. దేవగిరిపట్టణములో నితని పినతండ్రి కనకరావేంద్రుఁడు బావగారైన శివన్నమహద్దేవిరాజుతో నాలోచించి గంగురాజును ఏవిధముగానైనను జంపుటకు నిశ్చయించెను. (ఈ కథను బట్టి దేవగిరిపట్టణమును కనకరావేంద్రుఁడును, కల్యాణ పట్టణమును రవద్దేవిరాజును బాలించుచున్నట్లు తెలియుచున్నది.) గంగురాజు తన తమ్ములతో దక్షిణ రామగిరిపట్టణమున నున్నాఁడు. అతఁడు గరిడిలో సాము చేయుచుండెను. కనకరావేంద్రుఁడు గంగురాజును జంపుటకై పదునాల్గురు జెట్టులను బంపినాడు. గరిడిలోనున్న గంగురాజు ఆ జెట్టుల నందఱను జంపి, వారి శిరస్సులు తెచ్చి శివన్నమహద్దేవిరాజు ముందర క్రుమ్మరించెను. తరువాత కనకరావేంద్రుఁడు గంగురాజుపై వెల్లటేనుఁగును బంపెను. గంగురాజు మావటివానితో సహా ఆ ఏనుఁగును హతమార్చెను. ఇక లాభములేదని గంగురాజును కల్యాణముపై దండెత్తి పొమ్మనెను. కల్యాణములో అతఁడు తప్పక హతుఁడగునని తలఁచి యీ పన్నాగము పన్నెను. గంగురాజు తనకు వివాహము చేసినఁగాని కల్యాణముపైకి దండెత్తిపోననెను. అందుచే శివన్నమహద్దేవిరాజునకుఁగల యేడుగురు కూఁతుళ్లలోఁ బెద్దదియగు 'చుక్కల సూరద్దేవి' నిచ్చి పెండ్లి చేసిరి.

వివాహానంతరము గంగురాజు పండ్రెండువేల చతురంగ బలముతోఁ గల్యాణముపై దండెత్తెను. తలారి మారినీడు, మువ్వల భీమినీఁడు, ఎఱుకల పోతినీఁడు, పక్షల భీమినీఁడు, తమ్ములు భూపతిరాజు, కరణమురాజు- మున్నగు వారందఱును గంగురాజుతో వెడలిరి. గంగురాజు భార్య చుక్కల సూరద్దేవి 'అష్టపద్మాల దేవగిరి యెంకు అంకాళశక్తి'ని బ్రార్థించి, తన భర్తకుఁ దోడుగాఁ బంపెను. ఆ యమ్మవారి సహాయముతో గంగురాజు కష్టముల నన్నిటిని గట్టెక్కెను. పొంగిన ఏడేడు సముద్రములను దాటినాఁడు; బండి వీరమహంకాళి మఠమును దాటినాఁడు; బాలమండలపు కోటను ముట్టడించినాఁడు; బాలమండలపు రాజులను జంపినాఁడు; పరింగల కోటపై దండెత్తి పదునాల్గురు పరింగదొరల నోడించినాఁడు.

దేవగిరిట్టణములోఁ గనకరావేంద్రుఁడు తానుపంపిన గంగురాజు కల్యాణపు దండయాత్రలో మరణించెనని యూహించి మిక్కిలి సంతోషించెను. గంగురాజు భార్య చుక్కల సూరద్దేవిని సహగమనము చేయుమని బలవంతము చేయసాఁగెను. ఆమె 'సాగుమానము' చేయుటకు సిద్ధపడఁగా, అమ్మవారు వచ్చి రక్షించినది. ఇంతలో గంగురాజు విజయయాత్ర ముగించుకొని, దేవగిరి పట్టణమునకు వచ్చి, క్రూరుఁడగు కనకరావేంద్రుని ఆ గుండములోనికిఁ ద్రోసి, చంపెను. త్రిమూర్తులు ప్రత్యక్షమై గంగురాజు దంపతుల నాశీర్వదించిరి.

కాటమరాజు కథాచక్రమునఁగల 'పెద్దిరాజుకథ'లో నొక గంగురాజు వచ్చును. అతఁడును నితఁడును ఒక్కరేయేమో. పెద్దిరాజు కల్యాణనగరమునకు వచ్చుట, అచ్చట నున్న మారాసపు గంగురాజుతోఁ జెలిమిచేయుట, ఆ గంగురాజునకు సహాయము చేయుటకై వాలికేతువరాజుతోఁ బోరి మరణించుట- మున్నగు అంశములు పెద్దిరాజుకథలోఁ గలవు. పెద్దిరాజు మరణానంతరము కాటమరాజును, అతని చెల్లెలు పాపనూకను మారాసపు గంగురాజు, పెందోట ముద్దమ్మ పెంచుదురు. కల్యాణనగరమునకు పెద్దిరాజు పోవుట, అప్పుడు దానిని గంగురాజు పాలించుచుండుట- అను విషయములు మాత్రము పెద్దిరాజుకథలో స్పష్టముగా నున్నవి. అందుచే పెద్దిరాజుకథలోని గంగురాజును, అంకమ్మకథలలోని గంగురాజును నొక్కరే అయియుందురు.

అంకమ్మ కథాచక్రములోని మొదటికథ, రెండవకథ కవిత్వ విషయమున అంత బింకముగా లేవు. మౌఖిక ప్రసరణమున నున్న

గాథల సేకరించుటచే నీ లోపము వచ్చియుండును. వీనికిఁగల తాళపత్ర గ్రంథములను సంపాదించినచో నీ లోపము తీరునని నా నమ్మకము. మూడవ కథయగు 'గంగురాజుకథ'లోఁ గవిత్వము పాలు హెచ్చుగా నున్నది. ఇది తాళపత్ర గ్రంథముగా లభించుటచే నిట్లున్నదని చెప్పవచ్చును. మౌఖిక సంప్రదాయమున నుండు కథలలోఁ గథాకథనమే ప్రాముఖ్యము వహించి, కవితాదృష్టి సన్నగిల్లును. కవిత్వపుష్టిగల పాదములను గాథాకారుఁడు విస్మరించి యుండవచ్చును. తాళపత్ర గ్రంథములలో నీ లోపములుండవు. వీనిలోఁ గండపట్టుగల భాగములు చెక్కుచెదరక అట్లే యుండును.

అంకమ్మకథలు ప్రధానముగా అద్భుతావహములగు వర్ణనలతో నున్నవి. అంకమ్మ శక్తియగుటచే ఆమె ప్రభావమును దెలుపుటకిట్లు వర్ణింపఁబడియుండును. అంకమ్మ తనతమ్ముఁడు పోతురాజుతోఁ గలసి పుష్పవనమును వేయుటకై భూమిని దున్ను సందర్భమున ఆమె కొఱ్ఱును సృష్టించుట అద్భుతరసప్రధానముగా వర్ణింపబడినది:-

*"నాగుబాముల బట్టెను- కొఱ్ఱుకు నొగలు కావించెను*
*జెఱ్ఱిపోతుల బట్టెను- కొఱ్ఱుకు చక్రములు గావించెను*
*త్రాచుపాముల బట్టెను- కొఱ్ఱుకు పరమలు గావించెను*
*పసిరికపాముల బట్టెను- కొఱ్ఱుకు పగ్గములు గావించెను*
*మునీశ్వరునివంటి పాముల బట్టెను- కొఱ్ఱుకు ఎద్దుల గావించెను."*[14]

గంగురాజుకథలోఁ దెలుఁగు నుడికారము, వీరగాథల సాధారణ ప్రయోగములు, దేశి ఉపమానములు పెక్కుగలవు. 'చెక్కిట భాగాలు చెదరంగ నవ్వెను'-'ఎంచంగ పెంచంగ ఏడేండ్ల బాల కుమారుడు' అనునవి నుడికారమునకు ఉదాహరణములు. 'మదగజంబులు రెండు మార్కొన్న యట్లు, కొదమ సింగములు రెండు కోరాడినట్లు' అనునది వీరగాథలలోఁ దఱచుగాఁ గానవచ్చు ప్రయోగము. 'కొమ్మై వంగనిదాన్ని మానై వంచంగరాదు, కొద్ది నిప్పుని కొంగున కట్టంగ తగదు' మున్నగు సామెత లీ కథలలో కొల్లలుగా నున్నవి. కనకరావేంద్రుఁడు గంగురాజును జంపుటకై పంపిన పదునార్గురు జెట్టులవర్ణనలో మంచి కవిత్వమున్నది:-

*"గుద్దులకు దొడ్డవాడు గుఱ్ఱపు జెట్టి వకడు*
*వీటె సాముకు దొడ్డవాడు వీరజెట్టి వకడు*
*పందిరిమీద గుండు వకడు, పైబడ్డ పిడుగు వకడు*
*నీళ్లలో ముల్లు వకడు, నిబ్బరమైన బంటు వకడు*
*కానరాని ముల్లు వకడు, అంగిట గాల మొకడు*
*తాటేకు మంట వకడు, దరిగొన్న చిచ్చు వకడు".* [15]

## 3. చౌడమ్మ పాటలు

'చౌడమ్మ' లేక 'చౌడేశ్వరి' రాయలసీమలో 'తొగటవీరక్షత్రియు' లనఁబడు సాలెకులములవారిచేఁ గొలువఁబడుచున్న శక్తి. 'చండీ, చాముండి, చౌడేశ్వరి, త్రిపురసుందరి, భగళాముఖి, దుర్గేశ్వరి, మహిషాసురమర్దని, చాముండేశ్వరి'- మున్నగు నామములన్నియు నీమెకు వర్తించును.

### 3.1. చౌడమ్మ పుట్టుక:-

రాక్షసులను సంహరించుటకై ఆదిశక్తి యోగమాయచే విష్ణుంశమున మహిషాసురునకుఁ గుమార్తెగా జన్మించినది. పితృగండమున నుద్భవించుటచే నామెనొక శిలామందసమున బంధించి భూస్థాపితము చేసిరి. శివుఁడు త్రిపురాసుర సంహారము చేయఁగా, రాక్షసులు విజృంభించి శివునిఁ జీకాకు పఱిచిరి. ఆ యుద్ధమున మిక్కిలి అలసిపోయిన శివుఁడు, ఆదిశక్తి భూస్థాపితము చేయఁబడిన ప్రదేశమునకు వచ్చి, తన నుదుటి చెమటను వ్రేలితో నూడ్చి అచట విదిపెను. అప్పుడా చెమట బిందువులచే శిలామందసము బ్రద్దలై, అందుండి ఘోరభీకర స్వరూపంబున శ్రీ చౌడేశ్వరి యుద్భవించెను. శివుఁడామెను రాక్షస సంహారిణియగుఁ దన పుత్రికగా నెఱింగి, యామెకు ఖడ్గ, డమరుక, భిండివాల, చక్ర త్రిశూల, పాశంబు-మొదలుగాఁగల ఆయుధముల నొసంగి, ఆశీర్వదించెను.

### 3.2. తొగటవీరుల పుట్టుక:-

అటనుండి వీరచౌడేశ్వరి తన కొఱకుఁ దపస్సు చేయుచున్న పుష్పాండజుని కడకు వచ్చి అతనికిఁ బ్రత్యక్షమయ్యెను. అతఁడు పుత్రులను వేఁడఁగా, నొక అగ్నికుండమును నిర్మిచి, అందువేయుమని కొన్ని అక్షత లిచ్చెను. పుష్పాండజుఁ డట్లు చేయఁగా, నా యగ్నికుండమునుండి మున్నూటయఱువది యేకాంగవీరు లుద్భవించిరి. వీరే తొగటవీరులు. చౌడేశ్వరి ఆ వీరులను దనవెంటఁ దీసికొని, రాక్షసులపై దండెత్తి, అంధకాసుర మహిషాసురులను సంహరించి, దేవతల బాధలను బాపెను. పిమ్మట చౌడేశ్వరి పుష్పాండజుని పుత్రులైన మున్నూట యఱువది యేకాంగవీరులకును దేవకన్యలనిచ్చి వివాహము చేసి, వారి కనేక సంపదలను బిరుదులను నిచ్చెను. ఎల్లవేళల వారి కోర్కెలను దీర్చుటకై శ్రీ వీరచౌడేశ్వరీ నామంబున వారి కులదేవతగా నుండి, ఆచంద్రార్కము రక్షింతునని వారికి వరమొసగి, అదృశ్యయై కాశీపురంబును జేరెను. అంతట తొగటవీరులు చౌడమ్మ నారాధించుచు సకలశుభంబుల ననుభవించు చుండిరి.

### 3.3. చౌడమ్మ రాయలసీమకు వచ్చుట:-

కాశీక్షేత్రంబున వెలసియున్న ఈ చౌడేశ్వరి రాయలసీమకు వచ్చుటను తెల్పు చక్కని కథ యొకటి గలదు. దీనిని 'పెదరాయభూపతి పాట' అందురు. కాశిలోని బ్రాహ్మణులచే చౌడేశ్వరి కర్నూలు

మండలములోని నందవరమునకుఁ గొనితేఁబడినది. ఆ నందవరమును పాలించురాజు దానిని ఆ కాశీబ్రాహ్మణులకు దానము చేసెను. అప్పటినుండియు నా బ్రాహ్మణులు 'నందవరీక బ్రాహ్మణు'లైరి. ఈ కథను దెలుపుచు శ్రీ లక్ష్మీనాథరాజుగారు 'శ్రీ చౌడేశ్వరీ పూజావిధానము' అను గ్రంథమునకు సమకూర్చిన 'తొగటవీర క్షత్రియుల చరిత్రము' అను పీఠికలో నిట్లు వ్రాసిరి: (పుట: XXXII- XXXVI).

"భూలోకమున పుణ్యక్షేత్రములగు అహోబిలక్షేత్రమునకును, శ్రీశైలక్షేత్రమున కాదర్శమై వెలయు మహానందిక్షేత్రమునకును, సమీపంబున నందివర్ధన పురంబను పట్టణంబును (నందవరమును) చంద్రవంశీయులగు నందివర్ధనుఁడును నతని పుత్రుండగు నుత్తుంగ భుజుండును రాజ్యపాలన మొనర్చిరి. వీరిలో నుత్తుంగభుజుండు సంతానము లేక అనేక పుణ్యక్షేత్రములు సేవించి ఆ దేవతల అనుగ్రహమువల్ల నొక పుత్రుని బడసెను. అతడే 'నందభూపాలుడు'. ఆ బాలుడు దినదిన ప్రవర్ధమానుడై సకల విద్యలు నేర్చి, శౌర్య ధైర్య గాంభీర్య పరాక్రమధీరుడై, నందవర పట్టణంబును రాజధానిగా జేసికొని, సత్యశీలుండై, ప్రజలనెల్ల కన్నబిడ్డల చందంబున పోషింపుచు, రాజ్యపాలన జేయుచుండెను.

"ఇట్లుండ కొన్ని దినంబులకు నందభూపాలుండు రాజాస్థానములోనున్న సమయంబున ఈశ్వరాంశ సంభూతుండైన ఒక సిద్ధుండు సభామధ్యంబునకు వచ్చి, నందభూపాలుని ధర్మపాలనంబున కెంతయు మెచ్చి, ఆ భూపాలుని సత్యశీలత కెంతయు సంతసించి, ఆతనిచే సేవలంది యుత్సాహుడై, తనయెడగల యోగాతీత మాహాత్మ్యముగల పావుకోళ్లను బహూకరించి, 'వీని మహిమచే నీవు పరోపకారమైన దైవారాధన కార్యము సాధించగలవు. దానిచే నీ కీర్తి నలుదిశలు వ్యాపించి ప్రకాశించును. కాన నీవు ఈ పాదుకలను ధరించి, పరమేశ్వరుని ధ్యానించి, నీవెందేగవలయునని తలంచెదవో అందేగ బ్రార్థించిన క్షణమాత్రంబున జేరగల' వని యా రహస్యము నుపదేశించి యరిగెను. అంత నందభూపాలుండు ఉత్సాహభరితుడై, వానిని బరీక్షించి, యథార్థమును తెలిసికొని, ఆనందభరితుడై, తన కులదైవమగు కాశీనాథుని నిత్యారాధనజేయ నాటినుండి వేకువఝామున నెవ్వరికి తెలియకుండ పాదులక మహిమచే కాశీపురంబు చేరి, గంగానదిలో స్నానమాడి, విశ్వేశ్వరుని సేవించి, తెల్లవారునంతలో మరల నందవరముచేరి యథాప్రకారము రాజ్యపాలన మొనరించుచు నిత్యారాధనలు సలుపుచుండెను.

"ఇట్లు నందభూపాలుడు ప్రజలనేలుచు తన సతీమణియగు సునందయందమిత ప్రేమానుబంధుడై యామె కోరిక దీర్చుచు, తన యభీష్టముల నెఱవేర్చుకొనుచుండెను. కాని సునందనాదేవి తన భర్త వేకువఝామునఁ గనపడకుండుట కెంతయు యోచించెను. ఆమె కతఁడెందుఁబోగలడో ప్రయత్నించి కనుగొనవలయుననెడి కుతూహలము కలిగెను. ఈ ప్రకారమాదేవి శ్రమపడుచుండ దైవవశమున నొక దినము భర్త లేచిపోవు సమయము కనుగొని, యాతడెటకేగునది తెలిసికొని, తానుగూడ కాశీవిశ్వేశ్వరుని జూడవత్తునని భర్త ననేక విధంబుల ప్రార్థించెను. భూపాలుడు భార్యావ్యామోహంబున నివారింపలేక వెంటనిడుకొని కాశికిఁబోయెను. అచ్చట ఆ దంపతులు గంగానదియందు స్నానమాచరించి, నారికేళ నీరాజనంబులతో నీశ్వరుని నారాధించి, కొంత విశ్రాంతి జెంది, ప్రయాణమగునంతలో నామె బహిష్ఠయ్యెను. ఆ సమాచారమెఱుఁగ భూపాలుడు పావుకోళ్లను సమీపించి, తన పురంబుచేర ప్రార్థించగ, నవి యేమియు చేయజాలక మిన్నకుండెను. ఇట్లగుటకు కారణమేమాయని విచారించుచుండ సునందనాదేవి తన పరిస్థితిని తెలియఁజేసెను. రాజు చేయునదిలేక తెల్లవారునంతలో తన పురంబుఁ జేరుటెట్లాయని ఆలోచించుచుండెను. ఇంతలో శ్రీచౌడేశ్వరీ ఆరాధనా తత్పరులైన బ్రాహ్మణులు అచటికేతెంచి, ఆ రాజన్యునిచే సమాచార మంతయు నెరిగి, దయాదరణ హృదయులై రాజును జూచి ఈ విధముగ నుడివిరి, 'ఈవెం రజస్వల దోషము బావి, మరునాడరుణోదయంబునకు పూర్వమే మీ యిరువురిని మీ గ్రామంబునకు జేర్చెదము కాన మాకేమి బహూకరించెద'వని ప్రశ్నించిరి. అంత నందనచక్రవర్తి సంతసించి, 'మీ కృపచే నటలొనరించిన నా రాజ్యమునందర్ధరాజ్య మిచ్చెదను. లేక మీరేమి యడిగిన దానినెఱవేర్తు'నని యొప్పుకొనెను. అందులకు బ్రాహ్మణులు చౌడేశ్వరిని సాక్షిగానుంచి, ఆమెను పవిత్రురాలిగా నొనర్చి, సతిపతిసహితముగా నందవర పట్టణంబు జేర్చి, వారి నివాసంబులకుం బోయిరి.

"ఇట్లుండఁ గొంతకాలంబునకు కాశియందు క్షామమేతెంచెను. అంతనా బ్రాహ్మణులు చేయునది లేక, యెటువోయి జీవించుటకుఁ దోఁచక, చింతాక్రాంతులై యాలోచించుచుండిరి. ఇంతలో నందవరాధీశుడు జ్ఞప్తికి వచ్చెను. వెంటనే యా బ్రాహ్మణులు నందవరము సమీపించి, నందనచక్రవర్తిని సందర్శించి, తాజెప్పిన రీతి 'మా యభీష్టము నేఁబవేర్పు'మని యడిగిరి. అప్పుడా రాజేంద్రుఁ డాబ్రాహ్మణుల జూచి 'నన్నిట జేర్చినవారు మీరవుదురో కాదో నేనమ్మజాల. మీ ఈప్సితంబుల నెరవేర్చుకో దలచినచో మీ కులదేవతయగు శ్రీచౌడేశ్వరీదేవిచే మీరు నాకు సహాయమొనరించినది నిక్కువమని చెప్పించిన, మీ యిష్టప్రకారము నెఱవేర్తు' ననియెను. అప్పుడు బ్రాహ్మణులు చేయునదిలేక వారణాసికేగి, యాదేవి ననేకవిధంబుల స్తోత్రము చేసి, సమాచార మెఱిగించిరి. భక్తాభీష్ట ప్రదాయిని యగు చౌడేశ్వరి వారి మనోరథంబు లీడేర్ప వారితో నిట్లనియెను. 'మీరీ బిల్వవృక్షంబు వెంటనిడుకొని ముందరుగు చుండుడు. నేనదృశ్యరూపినై మీ వెనువెంటనే వచ్చుచుందును. రాజుసన్నిధికేఁగువరకు మీరు వెనుదిరిగి చూడకుఁడు. ఒకవేళ

మీరటు చూచిన నేనందే నిలిచిపోవుదును. తరువాత మీరెంత వేఁడినను ప్రయోజనముండ'దని చెప్పి వారిని ప్రయాణమొనరించి, తాను వారి వెన్నంటివచ్చుచుండెను. ఇట్లా బ్రాహ్మణులు నందవరము సమీపించి, వెనుక శబ్దము లేకుండుటచే సందేహమున నొకఁడు వెనుదిరిగి చూచెను. వెంటనే జగదీశ్వరి బ్రహ్మాండమదరునట్లు ధ్వనింపజేసి ప్రతిమయై శిలాకారమున నచట నిలిచెను. ఆ సంగతి భూపాలుడెరింగి యనేక వాద్యంబులచే నా దేవిని సమీపించి యనేక విధంబుల నారాధించి బ్రాహ్మణుల కొనియాడెను. అంత బ్రాహ్మణులు దేవి సాక్ష్యమీయకున్నచో ప్రయత్నమంతయు వ్యర్థమగునని నిరుత్సాహులై యుండ, శ్రీచౌడేశ్వరీదేవి భక్తులనుద్దేశించి 'నేనీ నందవరమున స్థిరనివాసముజేసి, భక్తశిఖామణులైన తొగటవీర క్షత్రియుల కులదేవతనై, వారి జ్యోతి హోమగుండారాధనలు గైకొని వారిని రక్షింపవలయును. మీరును నా భక్తులై నందనచక్రవర్తి యొసంగు నగ్రహారములు గైకొని నన్నుఁ బూజించుచు నందవరీకులను నామంబున వెలయు'దని దీవించెను. అంత నందనచక్రవర్తి దేవియానతి చొప్పున బ్రాహ్మణులకు అగ్రహారంబు లొసంగి, నందవరంబును ఆ దేవికర్పించి, నంద్యాల యను పట్టణంబు నిర్మించుకొని రాజధానినందుంచి, రాజ్యపాలన మొనర్చుచుచు, శ్రీవీరచౌడేశ్వరిని ఆరాధించుచు, ఆమె భక్తుడై యొనలేని కీర్తి గడించెను".

రాయలవారి అష్టదిగ్గజములలోఁ బ్రసిద్ధికెక్కిన అల్లసాని పెద్దనామాత్యుఁడును నందవరీక బ్రాహ్మణుడే, రాయలసీమవాసియే. ఇతని మనుచరిత్రలో ప్రవరాఖ్యుని పాదలేపన వృత్తాంతమునకు, పైన దెల్పిన 'నందభూపాలునికథ'లోని పావుకోళ్ల మహిమ పోషకమై యుండునని నా అభిప్రాయము. ఈ రెండు సంఘటనలకును మిక్కిలి సాన్నిహిత్యముండుట గమనింపఁ దగ్గది. పెద్దన నందవరీక బ్రాహ్మణుఁడగుటచే నందభూపాలునికథలోని వృత్తాంతమును తన ప్రబంధ ప్రారంభమున భక్తిశ్రద్ధలతోఁ బ్రవేశపెట్టి, అతిలోకసుందరముగాఁ జిత్రించి, అభిమాన పురస్సరముగాఁ దీర్చిద్దినాఁడు.

## 3.4. చౌడమ్మ జాతర:-

రాయలసీమలో ఈ చౌడమ్మ ప్రధానాలయము నేటికిని కర్నూలు మండలమున నందవరగ్రామమున (నంద్యాలకు దగ్గఱలో) గలదు. ఇచ్చట ప్రతిసంవత్సరము కార్తిక మాసమునఁ గడపోమవారము నాఁడు చౌడమ్మజాతర బ్రహ్మాండముగా జరుగును. ఈ జాతరలోఁ దొగటవీరులు చౌడమ్మపాటలు పాడుచు, నెత్తిపై జ్యోతులను బెట్టుకొని, వీరావేశమున నృత్యము చేయుదురు. అగ్నికుండమున నడచెదరు. కడపమండలమున పులివెందులతాలూకా 'బొజ్జాయిపల్లె' యను గ్రామములోను, అనంతపుర మండలమున 'పెద్దకోట్ల' గ్రామములోను, ఇతర గ్రామములందును చౌడమ్మ గుడులు కలవు. చౌడమ్మ జాతర అన్ని చోట్లను కార్తిక మాసమునఁ గడసోమవారము నాఁడు జరుగుచుండఁగా, నొక్క బొజ్జాయిపల్లెలో మాత్రము చైత్రవైశాఖ మాసములలో జరుగుచున్నది. ఈ బొజ్జాయిపల్లెలో జరుగు చౌడమ్మ జాతరను గుఱించి ఆ గ్రామవాసులును నా మిత్రులును అగు శ్రీ దుంపా రామిరెడ్డిగారు పెక్కు సంగతులను దెల్పిరి. ఇవి ఆంధ్రుల అమూల్య జానపద సంపదకుఁ జెందిన విషయములగుటచే, వీని నీ క్రింద పొందుపఱచుచున్నాను.

### 3.4.1 జ్యోతిని తయారుచేయుట:-

అయిదుశేర్ల బియ్యము (మద్రాసు శేరు) మెత్తగా పిండికొట్టి, జల్లించి, బెల్లముతోఁ బాకముకట్టి ముద్దగాఁ జేయుదురు. ఆ ముద్దను నాలుగు పలకలుగాఁ గుదురు కట్టెదరు. ఈ కుదురు ఒకటిన్నర అడుగు ఎత్తుండును. క్రింద వెడల్పు పదకొండు అంగుళములుండగా, పైన వెడల్పు ఎనిమిది అంగుళములుమాత్రముండును. కాగితములతో టెక్కెములు తయారుచేసి ఆ కుదురునకు గ్రుచ్చెదరు. ఊలు, నక్కీ (ముత్యబంగారము) మున్నగు వానితోఁ గూడ నీ కుదురు నలంకరింతురు. ఒక అడుగు పొడవు ఇనుపకడ్డీకి గుడ్డచుట్టి, వత్తిగాఁ జేసి యా కుదురు మధ్యగ్రుచ్చెదరు. కుదురులో నేయి పోయుదురు.

జ్యోతిని తయారుచేసిన ప్రదేశములో మఱల దాని నార్పుటకు వీలులేదు. అందుచే దీనిని గుడిలోఁజేయరు. అట్లుచేసినచో దీనిని మరల గుడిలో నార్పుట కవకాశముండదు. గుడిలోఁ జేసిన జ్యోతిని చౌడమ్మ వేపచెట్టు దగ్గఱ నార్పవలసి వచ్చును. అప్పుడు గుడిదగ్గఱ జరుగవలసిన వేడుకకు భంగము కలుగును. కావున గుడిలో జ్యోతిని చేయరు. వేఱుగా నొక యింటిలోఁ జేయుదురు. అట్లు చేసిన దానిని గుడిదగ్గఱ నార్పుట కభ్యంతరముండదు.

జ్యోతిని తయారుచేయునప్పుడు రెడ్డి (గ్రామ మునసబు), కరణము రావలెను. ఈ కరణము నందవరీక బ్రాహ్మణుఁడు. బొజ్జాయిపల్లెలో నందవరీక బ్రాహ్మణులు లేరు. ప్రక్కనున్న 'బలపనూరు' గ్రామమునుండి యీ కరణము వచ్చును. ఊరి పొలిమేర వఱకును నెదురువెళ్లి యీ కరణమును గడుభక్తితోఁ దప్పెట్లను మ్రోగించుచు నాహ్వానింతురు.

### 3. 4.2. బలి:-

ఇంటిలో జ్యోతి తయారుచేయుట పూర్తికాఁగానే, దానిని వెలిగించి గడప యీవలకుఁ దీసికొనివచ్చి దించెదరు. అప్పుడు జ్యోతికి బలినిత్తురు. ఈ బలినిచ్చుటలోఁగూడ ప్రత్యేకపద్ధతి కలదు. బలిని (మేకపిల్లను) నేలపై నఱుకరు; భుజముపైఁ బెట్టుకొని నఱికెదరు. ముందటికాళ్లు ముందఱకు, వెనుకకాళ్లు వెనుకకు నుండునట్లుగా బలిని ఒక వ్యక్తి తన యెడమ భుజముపై వేసికొని, యెడమచేతితో మెడను వెనుకకు విఱిచి పట్టుకొని, కుడిచేతితో దాని

కుత్తుక నుత్తరించును. కాఱెడి రక్తమును అన్నముంచిన ఒక చేటలోనికిఁ బట్టుదురు. ఈ రక్తము సుమారు పదిగజముల వఱకును జిమ్మును. ఈ బలినిచ్చునప్పుడు నందరీక బ్రాహ్మణుఁ డెదురుగనే యుండవలెను. ఆ చేటలోని యన్నముతో బలిరక్తము కలియగనే, తొగటవీరులు నందరీక బ్రాహ్మణు నుద్దేశించి, 'స్వామీ, మీ ప్రసాదం మీరు తీసుకోండి' అందురు. అప్పుడు ఆకరణము జంకుకొంకులు లేక ముందునకువచ్చి, ఆ చేటలోని బలికూడును చేతితోఁ గొంచెము వేఱుపఱచి వెడలిపోవును. పిమ్మట ఆ జ్యోతిని గుడిదగ్గఱకుఁ దీసికొనిపోయి నెత్తికెత్తుకొందురు. దారిపొడుగునను జ్యోతికి బలులిచ్చుచునే యుందురు.

### 3.4.3. ఊరేగింపు:-

జ్యోతి నెత్తుకొనిన తొగటవీరునిచుట్టును తాళములు వాయించువారు గుండ్రముగాఁ బరివేష్టించి యుందురు. వీరు చౌడమ్మ పాటలు పాడుచు, నడుగువేయుదురు. ఈ పాటలలోఁ గేవలము తాళములు మాత్రమే ఉపయోగింపఁబడును. ఇతర వాద్యము లేవియు నుండవు. ఉత్సవమునకు ముందుభాగమున దూరముగా వివిధ వాద్యము లుండవచ్చును.

జ్యోతిని నెత్తిపైకెత్తుకొను వ్యక్తి గొప్ప నృత్యము చేయఁ గల సమర్థుఁడై యుండవలెను. నెత్తిపైనున్న జ్యోతిని జెంపపైకి, చెంపపైనుండి భుజముపైకి, భుజముపైనుండి మరల దానిని శిరస్సుపైకి మార్చుచుఁ, గన్నుల పండువుగా నృత్యము చేయు చుండును. ఈ జ్యోతిర్నృత్యము చేయుటకుఁ జాలకాలము శిక్షణ పొందెదరు. మట్టితోఁ జేసిన జ్యోతితో నీ శిక్షణకాలమున నృత్యము నభ్యసింతురు.

జ్యోతిని బుట్టలోఁ బెట్టుకొని నర్తకుఁడు ముందున కేఁ గుచుండఁగా దాని వెనుక 'బండారు తట్ట' (పసుపు కుంకుమలు కలిపి ఉంచిన తట్ట), గొడుగులు, 'బోనంక దవ' వెడలును.

### 3.4.4. 'బోనం కడవ':-

రెండుశేర్ల బియ్యము, ఒకశేరు పెసలు కలిపి, ఒక కడవలోఁ బోసి వండెదరు. ఆ కడవను నెత్తికెత్తుకొని, జ్యోతివెంబడి నూరేఁగి, జ్యోతి గుడిదగ్గఱ నార్పివేయఁబడిన తరువాత నీ ప్రసాదమును బంచెదరు. అంతవఱకును దీనిని తాఁకరు.

### 3.4.5 'నడ్డిసేవ- ఱొమ్ముసేవ':-

జ్యోతితోపాటుగా నూరేఁగెడి తొగటవీరులు చౌడమ్మను స్తుతించుచు, వీరావేశముతో నర్తించుచుఁ, బెద్ద పెద్ద కత్తులతోఁ దమతమ నడుములు చీఱుకొందురు. నడుమునుండి రక్తము కాఱి, కాలిగుండా ప్రవహించి నేలపైఁ బడును. దీనిని 'నడ్డిసేవ' అందురు. 'జాండ్లవారు' (దేవాంగులు) అనెడి మతియొక తెగకుఁ జెందిన చౌడమ్మభక్తులు పిడిబాకులతో ఱొమ్ములపై చీఱుకొందురు. దీనిని 'ఱొమ్ముసేవ' అందురు. ఈ రెండు విధముల సేవకులను 'ఖడ్గసేవ' అని పేరు. ఈ ఖడ్గసేవ చేయుచుఁ జదివెడి పద్యములకు 'ఖడ్గపద్యము' లని పేరు. ('తొగట-జాండ్ల' ఈ రెండు శాఖలును బట్టలు నేయు సాలీలే.) ఈ విధముగా చౌడమ్మకు సేవలు చేసిన వీరులకు నడుములపైనను, ఱొమ్ములపైనను మచ్చలుండును. వీనిని 'నఱుకు మచ్చలు' అందురు. ఈ నఱుకు మచ్చలున్న తొగట, జాండ్లవీరులు రాయలసీమ పల్లెలలో మనకు తఱచుఁ బ్రత్యక్షమగుచుందురు. చౌడమ్మ మహాశక్తి యనుటకును, తొగటవీరులు వీరాచారవంతులనుటకును నీ సేవలు ప్రబల తార్కాణములు. పల్నాటి వీరాచారమునఁగూడ నిట్టిసేవ లున్నవి.

### 3.4.6. 'నాజ్యము':-

జ్యోతినెత్తుకొని యూరేఁగునప్పుడు తొగటవీరులు, గోతములు కుట్టు దబ్బనముతో, కోరిన భక్తులకు బుగ్గలో రంధ్రము చేయుదురు. ఇట్లు తొగటవీరునిచే బుగ్గలో రంధ్రము పొడిపించుకొనుటను 'నాజ్యము' అందురు. బుగ్గలో నీ ప్రక్కనుండి యా ప్రక్కకు రంధ్రము చేసినను రక్తము రాదు; నొప్పిపెట్టదు. తొగటవీరుఁడు ముందు బుగ్గను గట్టిగా నలుపును. ఆ తరువాత దబ్బనము నోటి లోపలి భాగమునుండి గ్రుచ్చి, బుగ్గగుండా బయటకు లాగివేసి, ఆ రంధ్రమునకు బండారు తట్టలోనుండి పసుపుతీసి నొక్కివేయును. రంధ్రము కనఁబడదు; రక్తము రాదు. రాయలసీమ పల్లెలలో బాలబాలికలుకూడ నిర్భయముగా నీ నాజ్యమును వేయించుకొందురు. ఇవన్నియుఁ బ్రాచీనకాలము నుండియు భారతదేశమునఁ గల శక్తిపూజలలోని వీరాచారములు. ('నాజ్యము' అను శబ్దము 'నరాజి' లేక 'నారాజి' అను శబ్దమునకు జానపదీకరణమేమో!)

### 3.4.7. 'రతి':-

జ్యోతిని చేయుగదిలో చౌడమ్మ యాకృతితో నొక బొమ్మను వేయుదురు. ఈ బొమ్మకు 'రతి' యని పేరు. ఈ రతిని వేయుటలో ముగ్గుపొడి, పసుపు, కుంకుమ ఉపయోగింతురు. ఈ రతిదగ్గఱ నిమ్మకాయలు కోసి వప్పులు వేయుదురు. టెంకాయలు కొట్టెదరు. జ్యోతినెత్తుకొని వెళ్లిన తరువాత ఆ గది తలుపులు మూసివేయుదురు. జ్యోతి యూరేగింపు ముగిసి, గుడిలో దాని నార్పు నంతవఱకును నా గది తలుపులు తీయరాదు; అందెవ్వరు బ్రవేశింపరాదు. గుడిలో జ్యోతినార్పిన తరువాత, తిరిగివచ్చి, యా గదితలుపులు తెఱచి, రతిని చెఱిపివేయుదురు.

రాత్రి పండ్రెండుగంటల ప్రాంతములో చౌడమ్మ గుడిదగ్గఱ జ్యోతినెత్తుకొనుట జరుగును. (ఈ గుడి బొజ్జాయిపల్లె కుత్తరముగా

నున్నది.) జ్యోతితో నాట్యము చేయుచు, పాటలు పాడుచు, తూర్పుదిశగా వంద గజములు వచ్చి, అక్కడనుండి దక్షిణదిశగా నాలుగువందల గజములు వెళ్లెదరు. ఆ ప్రదేశమున నొక వేపచెట్టున్నది. దీనిని 'చౌడమ్మ వేపచెట్టు' అని పిలుతురు. ఆ వేపచెట్టుకడ జ్యోతిని దించెదరు. (ఇక్కడ తప్ప మార్గమధ్యమున మఱెచ్చటను జ్యోతిని దింపరాదు.) ఈ వేపచెట్టుదగ్గఱ చౌడమ్మపాటలు పాడి, ఖడ్గపద్యములు చదివి, తిరిగి జ్యోతినెత్తుకొని యూరేగుచు గుడికి వత్తురు. మార్గమధ్యమున జ్యోతి కెన్నియో బలులొసంగెదరు. ఇట్లు జ్యోతి నిర్ణీత ప్రదేశమందూరేగి, గుడిదగ్గఱకు వచ్చుసరికి ఉదయము ఏడుగంట లగును. ఈ గుడిదగ్గఱ జ్యోతి నార్పివేయుదురు.

గుడిలో జ్యోతినార్పిన తరువాత, జ్యోతిచేయఁబడిన పిండిని, టెంకాయ వప్పును ముందుగా నందవరీక బ్రాహ్మణుఁడగు కరణమున కిత్తురు. తరువాత రెడ్డికిచ్చెదరు. పిమ్మట నక్కడనున్నవారికిఁ బంచెదరు. అటనుండి బయలుదేరి యింటింటికిని బోయి, ప్రసాదమిచ్చి, బహుమానము తీసికొందురు. ప్రఖ్యాతములైన కొన్ని కుటుంబములకు– అనఁగా మాన్యకాపులవంటివారికి జ్యోతిపిండి, టెంకాయ వప్పు నిచ్చెదరు. మిగిలినవారికి వట్టిపిండి మాత్రమే యిత్తురు. ఈ మాన్యకాపులు దేవికి టెంకాయకొట్టినచో రెండువప్పులను నిచ్చివేయుదురు. తక్కినవారెవరైనను టెంకాయ కొట్టినచో నొక్క చెక్కను మాత్రమే యిత్తురు. ఈ మాన్యకాపులు గ్రామములను నిర్మించిన కాపులు. వీరికి మాన్యపు చేలు ఉండును. వీనికి పన్ను తక్కువ. ఊరిలో జరగెడి ఉత్సవాది కార్యములలో మాన్యకాపులకు బాధ్యత లెక్కువ.

ఇట్లు చౌడమ్మ జాతరలో నొక జ్యోతినెత్తవలెనన్నచో సుమారు రెండువందల రూపాయాలకు పైగా ఖర్చగును. బొజ్జాయిపల్లెలో నిట్టి జ్యోతి నొక్కటి మాత్రమే యెత్తెదరు. నందవరమున మూఁడు నాలుగు జ్యోతులను వెలిగించెదరు.

### 3.4.8. 'హోమగుండ జ్యోతి':–

చౌడమ్మ జాతరలో తొగటవీరులు చంద్రనిప్పులపై చిందులు త్రొక్కుటకూడ కలదు. ఇట్లు నిప్పులగుండములో నడచునప్పుడు నెత్తిపైఁబెట్టుకొను జ్యోతిని 'హోమగుండ జ్యోతి' అందురు. పెద్ద గుండమును త్రవ్వి, అందు నిప్పులు రగుల్కొల్పి, జ్యోతిని ధరించిన తొగటవీరులు ఆ నిప్పులపై నడచెదరు. వారివెనుక ప్రజలు నడతురు. ఈ అగ్నికుండము మూఁడడుగుల వెడల్పు, పదునైదడుగుల పొడవు, నాలుగడుగుల లోతు ఉండును. పొడవులో గుండమున కటునిటు తాపలు (మెట్లు) ఉండును. పదునైదడుగుల పొడవులో నీ మెట్లు పోగా తొమ్మిది యడుగుల అగ్ని యుండును. ఎక్కడ జ్యోతివీరుని అడుగులు పడునో అక్కడ ముందుఁగా బేరిననేతిని వేసెదరు. ఆ తరువాత పెరుగు పోసెదరు. జ్యోతిని నెత్తిపై పెట్టుకొనిన తొగటవీరుఁడు ఆయా తావులయందు అడుగులు వేయుచు ముందునకు వెడలును. ప్రజలాతని ననుసరింతురు. జాతరరోజునకు ముందు రాత్రి ఎనిమిదిగంటలనుండి తెల్లవారువఱకును రెండుబండ్ల కట్టెలను గాల్చెదరు. ఉదయము తొమ్మిది లేక పది గంటల సమయములో గుండములో నడచెదరు.

### 3.4.9. 'స్వరశాస్త్రము':–

జాతరలో కొందఱు భక్తులకు చౌడమ్మ పూనును. వారాపూనకములో జ్యోతిష్యమును చెప్పుదురు. ముఖ్యముగా నా సంవత్సరమున కురియఁబోవు వర్షపాతమునుగూర్చి చెప్పుదురు. ఇట్లు భావికాలమునుగూర్చి చెప్పుటను 'స్వరశాస్త్రము' అందురు.[16]

## 3.5. చౌడమ్మ మహిమలు:–

చౌడమ్మ గొప్ప మహిమగల శక్తిగా రాయలసీమలోఁ గొలువఁబడుచున్నది. అనంతపుర మండలములోని 'పెద్దకోట్ల' గ్రామములో నీ చౌడమ్మ అనేకాద్భుత కార్యములను జేసిన దేవతగా ప్రజలు కథలు చెప్పుకొందురు. ఒకప్పుడొక పగడాలసెట్టి ఆ గ్రామునకు వచ్చెను. పగడములు అమ్ముకొనుచుండెను. మట్టమధ్యాహ్నవేళ నాతని దగ్గఱకొక పంద్రెండేండ్ల బాలిక వచ్చి, పదిరూపాయల పగడములు కొని, 'నేను ఈ యూరి రెడ్డి బిడ్డను. దుడ్లు మా నాయన నడిగి తీసికొనుము' అని పగడాలసెట్టితోఁ జెప్పి వెడలిపోయినది. ఆ సెట్టి కొంతసేపయిన తరువాత రెడ్డి యింటికివెళ్లి డబ్బు నడుగఁగా, రెడ్డికసలు బిడ్డలు లేరని తేలినది. రెడ్డిభార్య వెంటనే చౌడమ్మ గుడికేగి చూడఁగా ఆ దేవి మెడలోఁ బగడాలహారమున్నదఁట! శక్తిమాహాత్మ్యమున కచ్చెరువంది, రెడ్డి యా సెట్టికి పదిరూపాయల నీయఁబోయెను. సెట్టి వలదని, ప్రతిసంవత్సరమును చౌడమ్మ వేడుకనాడు తాను ఆ దేవికి ఒక పగడాల హారమును సమర్పించుకొందుననియు, నందుల కనుమతి నీయుమనియు రెడ్డిని కోరెను. రెడ్డి అంగీకరించెను. ఈ సంఘటన జరిగి రెండుమూడు తరములకన్న నెక్కువ కాలేదు. అప్పటినుండి యిప్పటివఱకును ఆ సెట్టి వంశస్థులు ఏటేట పగడాల హారమును చౌడమ్మకు బహూకరించుచునేయున్నారు.

## 3.6. చౌడమ్మ పాటలు:–

చౌడమ్మపై పాటలు పద్యములు తరతరములుగా రాయలసీమలోఁ దొగటవీరులచేఁ బాడఁబడుచున్నవి. చౌడమ్మ పట్టుక, తొగటవీరుల పుట్టుక, మహిషాసుర వధ, కాశీక్షేత్రమునుండి చౌడమ్మ నందవరమునకు వచ్చిన కథ (పెదరాయభూపతి పాట)– మున్నగునవియు నీ పాటలలోఁ గలవు. ఈ పాటలలో నెక్కువ భాగము గుఱ్ఱము సర్వయ్య అనుకవిచే రచింపఁబడినవని తెలియుచున్నది. ఇతఁడు ప్రాచీనుఁడుగఁ దోచుచున్నాఁడు.

చౌడమ్మపాటలు కొన్ని ముద్రింపఁబడినవి. నాకు రెండు ముద్రిత గ్రంథములు లభించినవి: 1) శ్రీచౌడేశ్వరీ పూజావిధానము, 2) శ్రీచౌడేశ్వరీ పాటలు-పద్యములు. ఇందు మొదటిది మిక్కిలి ప్రాచీనమైన ప్రతి. దీనిలో 116 పాటలు, 55 ఖడ్గపద్యములు, చౌడమ్మ దండకములు, చౌడేశ్వరి అష్టోత్తర శతనామావళి, అగ్నికుండ పూజావిధానము, చౌడేశ్వరి పూజామంత్రములు, మంగళహారతులు, దానపత్రము, స్వరశాస్త్రము- మున్నగునవి కలవు. ఇందలి పాటలలో శుద్ధగేయములు కథాగేయములు- రెండును గలవు. 'ఖడ్గపద్యము' లనునవి నిజమునకు స్వచ్ఛమైన పద్యములు కావు. ఎక్కువ భాగము లయాత్మక వచనములుగా సాగిన స్తోత్రములు, మంత్రములు, పాటలు మాత్రమే. కొన్ని ఖడ్గపద్యములు జానపదుల నోళ్ళలో శిథిలములైన సీసపద్యములుగాఁ గానవచ్చుచున్నవి.[17] ఈ గ్రంథమున నాద్యంతములలోఁ గొన్ని పుటలు చినిగిపోవుటచేత రచయిత, ప్రకాశకులు, ప్రకటన సంవత్సరము- మున్నగు వివరములు తెలియుట లేదు. కాని మూఁడవ ప్రకరణము చివర నిది శ్రీ సింధురాజ లక్ష్మీనాథరాజుగారిచే లిఖింపబడినదని యున్నది.[18]

'శ్రీచౌడేశ్వరి పాటలు-పద్యములు' అను రెండవ పుస్తకము మొదటిదానికి సంక్షిప్త రచనము. 'చౌడేశ్వరీ పూజావిధానము'లోని కొన్ని పాటల నెన్నుకొని యిందు ముద్రించిరి. ఇది 1959లోఁ బ్రకటింపఁబడినది. ప్రకాశకుఁడు- పప్పూరు చిన్నచౌడప్ప, సింహాద్రిపురము, పులివెందుల తాలూకా, కడప మండలము. "శ్రీ పుష్పాండజాముని తపోబలముచే జన్మించిన మున్నూటఱువది వీరుల సంప్రదాయకులగు శ్రీ నిత్యానంద భక్తాగ్రేసరుడగు గుజ్జము సర్వయచే రచింపబడిన శ్రీచౌడేశ్వరీ ఆనందపాటలు, పద్యములు" అని ఈ గ్రంథ ముఖపత్రమున నుండుటచే, మొదటి గ్రంథకర్త కూడ గుజ్జము సర్వయ్యయే యని ఊహింపనగును. 'తిరువెంగళప్పయ్య' వంటి ఇతర కవులు పేర్లుకూడ కొన్ని పాటల చివర కాన్పించుచున్నవి.

ఈ చౌడమ్మపాటలలో 'గురువుపాట, వీరశేఖరునిపాట, కందనూలిపాట, జయావిష్ణువుపాట, పెదరాయభూపతిపాట, ఏలవరాజుపాట, మహిషాసురునిపాట, కంసునిపాట, చౌడమ్మ వేడుకలు, ఎఱుకలపాట, త్రిమూర్తుల జననముపాట, శక్తికా విజయము' అనునవి కథాగేయముల కుదాహరణములు. ఇవి చౌడేశ్వరీశక్తి వీరత్వమును బ్రదర్శించునట్టివి కావున వీరగాథలగు చున్నవి. వీనికి బహుజనాదర పాత్రతయుఁ గలదు. ఇవి లఘువీరగాథలే కాని సుదీర్ఘగాథలు మాత్రము కాఁజాలవు. ఈ పాటలన్నియును తాళలయాత్మకములుగా నుండును. ఎక్కువగ ఆదితాళములోఁ బాడఁబడుచుండును.

### 3.6.1. గురువు పాట:-

9 చరణములు, 90 పంక్తులు, గుజ్జము సర్వయ్య రచన.

పునరావృత్తి:

> *"ఆదికాలము వార్తలన్నియు ఆలకించీ వినరయా*
> *తోయజా పుష్పాండజా ముని తొగటవారికి గురువయా*
> *సమ్మతిగ మా గురుని దలచితె సకల భాగ్యము కల్గునూ"*

పాట ప్రారంభము:

> *"ఇలను సూర్యావంశమందున ఇక్షువాకను రాజు తానై*
> *సలలితంబుగ సకలభూములు సరసుడై పాలింపుచూ*
> *తనకు తనయులు లేక యిలపై తపము చేసితె గాకను*
> *అంతలో పురివెడలి కానల కరిగి జలకము లాడియు*
> *కమల సంభవుగూర్చి తపములు విమలుడై తాచేయగా"*

ఇది తొగటవీరుల కాదిపురుషుఁడగు పుష్పాండజాముని కథ. తొగటవీరుల జన్మక్రమ మీ పాటలోఁ జెప్పఁబడినది. ఇక్ష్వాకుఁడను రాజు సంతానార్థమై బ్రహ్మనుగూర్చి తపస్సు చేసెను. బ్రహ్మ ప్రత్యక్షమై కమండలోదకము నిచ్చెను. ఆ యుదకమును కొలను తామరలందుఁ బోయఁగాఁ బుష్పాండజుఁడు జన్మించెను. ఇక్ష్వాకుఁడాతనికి నయోధ్యాపురమును బట్టము కట్టెను. పుష్పాండజుఁడు కొంతకాలము రాజ్యమేలి, తరువాత పుత్రులకొఱకై చౌడేశ్వరినిగూర్చి ఘోరతపస్సు చేసెను. చౌడేశ్వరి ప్రత్యక్షమై అతనికి శేష (సేస) బియ్యము నిచ్చినది. ఆ బియ్యము నతఁడు కొలను తామరలందుఁ బోసెను. (తిరువెంగళప్పయ్య రచించిన 'శక్తికావిజయ'మను పాటలో నీ బియ్యము నగ్నికుండమున వేసినట్లుగాఁ గలదు). అందుండి మున్నూట యఱువదిమంది వీరులు పుట్టిరి. చౌడమ్మ యా వీరులను దీసికొని త్రిపురాసురులపై దండెత్తి, వారిని సంహరించెను. దేవి అండజాముని కొక ఫలమునిచ్చెను. ఆ ఫలమునుండి కన్యలుద్భువించిరి. ఆ కన్యలను వీరులకిచ్చి పెండ్లిచేసి, దీవించి, చౌడమ్మ కాశిపురమున కేగెను.

### 3.6.2. వీరశేఖరుని పాట:-

14 చరణములు, 114 పంక్తులు. గుజ్జము సర్వయ్య రచన.

పునరావృత్తి: *'చూడబోదమురారె సుఖముతో జనులు*
*కోరిన వరమిచ్చు కొలిపాక చౌడు'.*

ప్రారంభము: *'వీరప్రతాపుండు విజయచక్రవర్తి*
*ఇలలోన కొలిపాక పాలింపగా నాడు*
*పుడమిలో తొగటలును చౌడమ్మను కొలువంగ*
*కదలిరే పయనమై గాంభీర్యముగ నాడు'*

ఇది తొగటవీరుల శౌర్యమును బ్రశంసించు కథ. వీరశేఖరుఁడనురాజు 'కొలిపాక'ను పాలించుచుండగాఁ, దొగటవీరులు చౌడమ్మను గొలుచుటకై ఆ గ్రామమునకేగి, అచట రాజవీథిలో జాతర జరుపుకొనుచుండిరి. ఆ రాజవీథిలో జాంద్రవారు కొందఱు గుమిగూడి తొగటవీరులతోఁ గలహింప నుద్యుక్తులైరి. వారి కలహమును మాన్పుటకై, యిరుపక్షములవారి బలాబలములను బరీక్షించుటకై రాజు

వీరశేఖరుఁడు ఒక ఉక్కుగుజ్జమును తయారు చేయించి, దానిని గుండములో నుడికించి, ఆ తేజినెక్కినవారికి బిరుదులు చెల్లునని చెప్పెను. జాంద్రవారందఱును భయపడి పాఱిపోయిరి. తొగటవీరులలో 'సరువయ్య' (గేయకర్తయే కాఁబోలును), 'భండారు కేశవులు' అను వారిరువురు ముందునకు వచ్చి, తమ దైవమగు చౌడమ్మను బ్రార్థించి, 'కలపిల ఉడికేటి కంచుగుజ్జము' నెక్కిరి. రాజు వీరశేఖరుఁడును, రాణి రాజీవ రత్నాంగియుఁ దొగటవీరులను మెచ్చి గౌరవించిరి.

ఈ పాటలనుబట్టి చౌడమ్మపాటలు రచించిన గుజ్జము సర్వయ్య ప్రాచీనుఁడనియు, రాయలసీమలో 'కొలిపాక' ప్రాంతము వాఁడనియుఁ దెలియుచున్నది. ఈ పాటకు 'సరువయ్య-భండారు కేశవులు' అను నిర్వురును గర్తలేమో. గేయాంతమున నిర్వురి నామములును గలవు.

### 3.6.3. కందనూలి పాట:-

21 చరణములు, 90 పంక్తులు. గుజ్జము సర్వయ్య రచన. ఇందలి పునరావృత్తి యిట్లుండును.

*"వినరయ్యా చౌడమ్మా మహిమలు వివరముతో మీరెవరయినా*
*దూషణముచేసిన రాజేంద్రునకు దుర్గా మమ్మడి గొనలేదా?*
*మల్లయ్య మమ్మడి గొనలేదా?'*

ప్రారంభము:

*"కర మరదున ధర కందనూలి కరకంఠుని పుత్రి జాతరకు*
*రమ్మని పిలిచిరి వీరులనెల్ల నెమ్మది పున్నమనాటికిని,*
*విరివిగ నాలుగు దెసలందుండిన వీథులు గదలిరి వేడుకతో*
*పచ్చని నల్లని తెల్లని ఎఱ్ఱని పసుపు వన్నెలా గొడుగులతో"*

నేటి కర్నూలు పట్టణమునకుఁ బ్రాచీన నామము 'కందనూలు'. ఇట చౌడమ్మగుడి కలదు. ఈ జాతరకు తొగటవీరు లందఱును వచ్చిరి. వారి వేడుకలు తనకు నిద్రాభంగము కలిగించు చున్నవని ఆ పట్టణమేలు రాజు విసుగుచెంది, సైన్యమును బంపి, వారి వేడుకల నాపుజేయించెను. చేయునది లేక తొగటవీరులు ఖిన్నులై, అన్నాహారములు మాని, దేవి యెదుట పరుండిరి. దేవిని బరిపరి విధముల ప్రార్థించిరి. మఱుఁనాడు చౌడమ్మ రౌద్రాకారిణియై రాజేంద్రుని కోట కూలద్రోసి, కరి హయ భటాదులకెల్లఁ గడుపున శూలలు కావించి, రాజునకు వెఱ్ఱి కలుగునట్లు చేసెను. మంత్రులు భయపడి తొగటవీరులను ప్రార్థింపఁగా, నా వీరులు చౌడమ్మను గొనియాడి, రాజుగారి ఉన్మాదమును బోఁగొట్టి, బోనములతో వేఁటలతో జాతర చేసికొనిరి.

### 3.6.4. జయావిష్ణువు పాట:-

9 చరణములు, 82 పంక్తులు, గుజ్జము సర్వయ్య రచన.

పునరావృత్తి:

*'నాడు మా భూతాలపేటకు నల్లజానై వెలసెను*
*భక్తితో గొలుతాము రారే బాలబ్రహ్మేశ్వాయిని'*

ప్రారంభము:

*'జయావిష్ణువు నాభియందున చతుర్ముఖుడై పుట్టెను*
*అతని నాభిని బ్రహ్మపుట్టెను బ్రహ్మకును తొమ్మండ్రు పుట్టిరి*
*అందులోనే కశ్యపునకు అమర నలుగురు భార్యలు*
*సురలు, రక్కసులు మొదలుగ పాములే పక్షులు పుట్టెను'.*

ఇందు రాక్షసుల విజృంభణము, చౌడమ్మ పుట్టుక, ఆమె త్రిపురాసురాది రాక్షసులను జంపుట వర్ణింపఁబడినది. ఈ పాటలకుఁ బేర్లు వాని ప్రారంభమునుబట్టి పెట్టిరని తోచుచున్నది. చౌడమ్మ రాక్షసులను జంపుట యిందలి ఇతివృత్తము కాఁగా, నీ పాట ప్రారంభమునుబట్టి దీనికి 'జయావిష్ణువు పాట' అని పేరు వచ్చినది. కాఁబట్టి యీ పాటలపేర్లకును వీని యితివృత్తములకు సంబంధము లేదని తెలియుచున్నది.

### 3.6.5. రాజభూపతి పాట:-

దీనికి 'పెద రాయభూపతి పాట' అనియుఁబేరు. 130 పంక్తులలోఁ బదిచరణములుగా నున్న యీ పాట యిట్లు ప్రారంభ మగును.

పునరావృత్తి:

*"ధర్మనందన చక్రవర్తి దానమిచ్చిన మార్గము*
*కాశినుండి సాక్షి కొఱకై కదలివచ్చెను చౌడమ*
*కోటి గంగస్నాన ఫలములు కోరియున్నావారికి"*

పాట ప్రారంభము:

*"రాజువంశము రాజుయనగ రాజనందన చక్రవర్తి*
*నిజముగ శ్రీ రాజుకైవడి రాజ్యభోగములందుచూ*
*వందిజన కవి భట్లు సేనలు సందడై కొలువంగనూ*
*నందవర సింహాసనంబు నాడు కొలువై వేడ్కతో"*

రాజనందన చక్రవర్తి నందవరమును బాలించుచుండెను. అతఁడు గొప్ప శివభక్తుఁడు. ఒకనాఁడు శివుఁడు మునివేషమున వచ్చి యా రాజున కొక మహిమగల పావుకోళ్లజతను బహూకరించెను. వానిని ధరించి ప్రతిదినమును రాత్రి మూఁడవ జామువేళ రాజు తలఁచిన మాత్రమున కాశికిఁబోయి, విశ్వేశ్వరుని బూజించి, తెల్లవారు సరికి నందవరమునకు వచ్చుచుండెను. ఇది యెవ్వరికిని దెలియదు. ఒకనాఁడు రాణి దీనిని గ్రహించి, తానుగూడ కాశికి వచ్చెదనని ప్రయాణమయ్యెను. ఇరువురును కాశిక్షేత్రమునకుఁబోయి విశ్వనాథుని పూజించి, మఱలివచ్చుటకై ప్రయత్నింపఁగా పావుకోళ్లు కదలలేదు. రాణి రజస్వలయగుటచే దాని మహిమ యంతరించెను. రాజు విచార

గ్రస్తుఁడై, తన్నింటికిఁ జేర్చినవారికిఁ గోరినదాని నిత్తునని ప్రకటించెను. అట చౌడౌశ్వరీభక్తులగు బ్రాహ్మణులు రాజును జూచి కనికరించి, ఆ దేవి మహిమచే రాజదంపతులను నందవరము చేర్చిరి.

కొన్నినాళ్లకుఁ గాశిలోఁ గఱవు వచ్చెను. బ్రాహ్మణులు రాజునర్థింప నందవరమునకు వచ్చిరి. రాజు తానుచేసిన వాగ్దానమును మఱచిపోయెను. వారిని నమ్మలేదు. సాక్ష్యముకొఱకై బ్రాహ్మణులు తిరిగి కాశికేగి చౌడమ్మను గొనితెచ్చిరి. రాజు చౌడమ్మను బూజించి, ఆ బ్రాహ్మణులకు నందవరమును దానముచేసి, తాను నంద్యాల యను పట్టణమును గట్టుకొని, అందుండి పాలింపఁ దొడఁగెను. చౌడమ్మ నందవరమున వెలసి, తొగటవీరులచేఁ బూజింపఁ బడుచుండెను.

**3.6.6. ఏలవరాజు పాట:–**

15 చరణములు, 117 పంక్తులు.

ఇతివృత్తములనుబట్టి పాటలశీర్షికలు లేకున్నను, నీ చౌడమ్మ పాటలలో నొక విశేషమున్నది. వీని పునరావృత్తులలో నితివృత్త మంతయు గర్భితమై యుండును. ఈ ఏలవరాజుపాటకుఁ బునరావృత్తి యిట్లున్నది:

***"ధరణి తొగట ప్రజలు చేసిన ధర్మకథలే వినరయా***
***సాహసంబున నాఁడు రాజుకు సాయమైరో వీరులూ"***

దీనినిబట్టి తొగటవీరులొక రాజునకు యుద్ధమున సహాయము చేసిరని స్పష్టమగుచున్నది. ఇట్లే ప్రతిపాటలోను పునరావృత్తిలోఁ గథాసారము తెలుపఁబడియున్నది. ఇది యీ పాటలలోని విశేషము. ఈ యేలవరాజుపాట ప్రారంభమిట్లున్నది:

***"అట్టి బూమి ఆకసంబున విష్ణుమాయలు పుట్టెను***
***అతని నాభిని బ్రహ్మ పుట్టెను అఖిలలోకము లాయెను***
***సకలమై జీవరాసులు సమ్మతిగ నిర్మించియు***
***అట్టి జీవులలోన భూపతి అధికుఁడై జన్మించెను".***

పాట చివరలో నిది గుబ్బము సర్వయ్య రచనగాఁ దెలుపఁ బడినది. ఏలవరాయఁడను రాజు పానుగల్లుపట్టణము నేలుచు, మిక్కిలి గర్వించియుండెను. తనతో యుద్ధముచేయఁగల రాజు లెవ్వరును లేరని అతని గర్వము. అన్యరాజులందఱును గలసి అతనికోటను ముట్టడించిరి. పండ్రెండేండ్ల యుద్ధము జరిగెను. ఏలవరాయని సైన్యమంతయును నశించిపోయెను. అతఁడు మిక్కిలి చింతించి తొగటవీరుల సహాయమర్థించెను. వారు చౌడమ్మను బ్రార్థించిరి. ఆమె యెంతకును బ్రసన్నము కాకపోగాఁ, దమ శిరస్సులను బలియిచ్చి వేఁడుకొనిరి. చౌడమ్మ వారి భక్తికి సంతసించి, ప్రత్యక్షమై, వారికిఁ దోడుగా నిలిచి, శత్రురాజులను దఱిమివేసెను. ఏలవరాయఁడు మిక్కిలి సంతసించి, తొగటవీరులను గొనియాడెను. వారి కోరిక ప్రకారము తన బిరుదులన్నియు వారికొసంగెను.

**3.6.7. మహిషాసురుని పాట:–**

10 చరణములు, 215 పంక్తులు. ఇది మద్దులేటి స్వామి నామాంతకితముగా గురుకుంట్ల చౌడమ్మపై చెప్పిన పాట. కర్తపేరు లేదు. ఈ పాట ప్రారంభములోనే ఇతివృత్తసారమును గ్రహింపవచ్చును. పునరావృత్తి:

**"ఆది కాలము సూతుడీకథ అవనిపై వినిపించెను**
**సాధుజననుత శౌనకాది మహామునీశ్వరు లడుగగా"**

పాట ప్రారంభము:

**"శీకరంబుగ ఆదిశక్తిని శివుడు ఏమిటి కొఱకు దలచెను**
**తలచినప్పుడు శక్తివచ్చి తాను కార్యం బేమి చేసెను**
**మునులలో పుష్పాండజుండను ఘనుని తపమేరీతి పండెను**
**మునికి సుతులై తొగటవీరులు మున్నూటరువై వీర్లు గలిగిరి**
**క్రమము మాకు తెలుపుమాని శౌనకుడు సంతోషాన బల్కెను"**

మహిషాసురుఁడను రాక్షసుఁడు శివునిగూర్చి ఘోరతపస్సు చేసి, అనేకవరములు పొంది, గర్వించి, ముల్లోకములను జయించి, ఇంద్రాదిదేవతలను బాఱఁద్రోలెను. మఱల నతఁడు సంతానము కొఱకై తపస్సు చేయఁగా, శివుఁ డాదిశక్తిని మహిషాసురునకుఁ బుత్రికగాఁ బుట్టునట్లు చేసెను. తండ్రిగండమునఁ బుట్టుటచే రాక్షసులామెను ఇనుపమందసమున బంధించి భూస్థాపితము చేసిరి. సురాసురులకు భీషణ సంగ్రామము ప్రారంభమయ్యెను. శివుఁ డాదిశక్తిని బిలువఁగా, నా మందసమునుండి చౌడేశ్వరి బయటకు వచ్చెను. (శివుని చెమట ఆ మందసముపైఁ బడగా నామె బయటకు వచ్చినదని వేఱొక పాటలోఁ గలదు.) త్రిమూర్తులామెను దీవించి రాక్షసులపైకిఁ బంపిరి. వీరచౌడేశ్వరి పుష్పాండజా మునికి మున్నూటయఱువది తొగటవీరులను ప్రసాదించి, వారిని వెంటఁ బెట్టుకొని రాక్షసులను మర్దించెను. మహిషాసురాదులను సంహరించి లోకరక్షణము కావించెను.

**3.6.8. కంసుని పాట:–**

3 చరణములు, 40 పంక్తులు. ఇది నందవర భగళాంబపై సర్వయ్య చెప్పినపాట. ఆదిశక్తి యశోదగర్భమున మహామాయగా జన్మించి, కృష్ణునకు సహాయముచేసి, కంసుని బెదరించి, ఆకాశమున కెగసిపోయిన కథ. చిన్న గేయకథ.

పునరావృత్తి:

***"నీ తోడు గావలసె నిను వేడుకొనగా***
***ఆదివిష్ణుకు సాయమయితి వో తల్లీ***
***శివావిష్ణుకు సాయమైతి వో తల్లీ!"***

పాట ప్రారంభము:

*"మన్నూ మిన్నూ లేని మాయాంధకారమున*
*యెన్నగల దేవతలు ఎవరు లేనీవాడు*
*పంచమజ్యోతివై పాలమున్నీటిలో*
*ఆనంద భరితముగ ఆడుతాయుండంగ."*

**3.6.9. చౌడమ్మ వేడుకలు:-**

7 చరణములు, 42 పంక్తులు. నందవరము చౌడమ్మపై చెప్పిన పాట. కర్తపేరు లేదు.

పునరావృత్తి:

*"వినరయ్య జనులార ఈ పుణ్యకథలు*
*సజ్జనులు పాడేరు చౌడమ్మ కథలు"*

పాట ప్రారంభము:

*"పని బూని దేవతలు పాలసంద్రము దరువ*
*పరగ వేడుకతోన పయనమయ్యేరు*
*మందరాగిరి తెచ్చి మరి కవ్వముగ జేసి*
*ఆదిశేషుని తాను వాసిగా సరిత్రాడు"*

ఈ పాటలోఁ దొగటవీరుల పుట్టుక సంక్షిప్తముగాఁ జెప్పఁబడినది. దేవతలు పాలసముద్రమును దఱువఁగా, నందుండి అండజా ముని పుట్టి, చౌడమ్మనుగూర్చి తపస్సుచేసి, ఆమె ప్రసాదించిన శేషబియ్యముతో మున్నూటయఱువది వీరులను సుతులుగాఁ బొందినట్లు చెప్పఁబడినది. చిన్న గేయకథ.

**3.6.10. ఎఱుకల పాట:-**

7 చరణములు, 150 పంక్తులు. నందవరము చౌడమ్మపై గుఱ్ఱము సర్వయ్య వ్రాసినపాట. చక్కని కవిత్వముగల పాట. చౌడమ్మ యెఱుకతవేషము అత్యద్భుతముగా వర్ణింపఁబడినది:

***"సంకుపూసలపేర్లు ఎరుకలజాతి సొమ్ములు పెట్టెనూ***
***పొంకముగ రత్నాలు చెక్కిన బుట్ట శిరసున బెట్టెనూ***
***చిన్నెలలరిన యెదమచంకన, చిన్నికుఱ్ఱను గట్టెనూ***
***కొన్నివన్నెల గిలుకయును ఒక కుఱుచబెత్తము పట్టెనూ"***

ఇట్టి యెఱుకత వేషమున చౌడమ్మ పార్వతి దగ్గఱకుఁబోయి భృగుమహర్షి శాపమునుగూర్చి, దక్షయజ్ఞమునుగూర్చి, శివుని బ్రహ్మహత్యాపాపమునుగూర్చి ఎఱుక చెప్పును. అటనుండి శారద కడగకేఁగి భృగుమహర్షి శాపమును గూర్చి ఎఱుక చెప్పును. ఇట్లే లక్ష్మీదేవి కడకేగి భృగుమహర్షి విష్ణువును దశావతారాము లెత్తవలసినదిగా శపించునని చెప్పును. శచీదేవికడకేఁగి యింద్రునకుఁ గలుగఁబోవు గౌతమ శాపమును, బదవీచ్యుతిని దెల్పును. ఇట్లు చౌడమ్మ, దేవతల కెఱుక చెప్పి తిరిగి కాశిపురము చేరును. ఈ పాటలోఁ బునరావృత్తి యిట్లున్నది:

***"ఏకముగ ముల్లోకములవారికి వాకుపఱచెను ఎఱుకతా***
***సర్వమంగళ నందవరమని చౌడమాంబా మహిమలు***
***జగదీశ్వరమ్మా మహిమలు..."***

**3.6.11. త్రిమూర్తుల జననము పాట:-**

14 చరణములు, 107 పంక్తులు.

ఇది గుఱ్ఱము సర్వయ్య భగళాంబపేర వ్రాసిన శక్తిగీతము. సదానందరూపమగు బ్రహ్మమునుండి త్రిమూర్తులు జన్మించి, ఆదిశక్తియగు భగళాంబను భజన చేసిరి. ఆదిశక్తి ఆ బాలలను ప్రేమతోఁ జేరఁదీసి, వరములిచ్చి, పట్టముగట్టినది. ఈ పాటలో వేదాంతభాగ మెక్కువగను, కథాఖ్యానము తక్కువగ నున్నది. ఆదిశక్తివర్ణన రమణీయము-

***"కోటిచంద్రుల ముఖము దీప్తి కోమలాంగై నిలిచెను***
***పటుతరంబుగ పల్లవారుణ పాదకమలము లుండెను***
***పుటము బెట్టిన బంగరందెలు బోరు కొలుపుచు నుండెను***
***కటిపరందెలు కాళ్ళగజ్జెలు గల్లుగల్లని మ్రోయగా***
***నడుము సన్నము దాఋమెఱసెను నాగరామించాయెనూ***

......................................

***కనకచీరె జలతారు రవికెయు కమ్మలే రవిచంద్రులూ***
***వెనుక ముప్పదిమూడు కోట్ల వేల్పులుండిరి వరుసతో".***

**3.6.12. 'శక్తికావిజయము':-**

ఆదితాళమున నడుచు పెద్ద గేయకథ. 24 చరణములు, 400 పంక్తులు. పైన తెల్పిన పదునొకండు పాటలలో నించుమించుగ నన్నియును గుఱ్ఱము సర్వయ్య వ్రాయఁగా, నీ పాటను మాత్రము సుగమంచి పాపన్న పుత్రుఁడు తిరువెంగళప్పయ్య అనుకవి రచించెను. ఇతఁడు తొగట కులమువాఁడఁట. ప్రారంభమున హరివెంకటగురుని, వీరశరభయ్యను స్తుతించినాఁడు. దీనికి 'త్రిపుర సంహారము', 'చౌడమ్మ పండుగ', 'చౌడమ్మకథ' అను నామాంతరములున్నవి. ఇందలి కథలో నూతనాంశములు లేవు. పైన తెల్పిన యితివృత్తములే యిందును గలవు. రాక్షసుల విజృంభణము, ఆదిశక్తి మహిషాసురునకు చౌడమ్మగాఁ బుట్టుట, ఆమె పుష్పాండజామునికి మున్నూటయఱువది వీరులను బ్రసాదించుట, వారిని వెంటఁబెట్టుకొని రాక్షససంహారము చేయుట- ఈ గేయకథలోని యితివృత్తము. ఇది పైన చర్చించిన పాటలన్నిటికిని సమాహారమనవచ్చును. ఇది 'పాట'గా గాక 'కథ'గాఁ బేర్కొనఁబడినది.

ప్రారంభము:

*"కరిముఖుని అర్థించి శారదను కొనియాడి*
*హరియు వెంకటగురుని ఆత్మలో నెరనమ్మి*
*చౌదేశ్వరమ్మను సన్నుతించుట చాల*
*విష్ణుదేవత ప్రార్థన ఇంపొందగా జేసి*
*వర వీరశరభయను వలనొప్ప కొనియాడి*
*శక్తికావిజయంబు చెప్పెదను వినరయ్య."*

అంతము:

*"విన్నవారికినెల్ల విష్ణు కోరికలిచ్చి*
*సకలశుభకరమిచ్చు శక్తికావిజయంబు*
*అష్టభాగ్యములిచ్చు ఆదిమహలక్ష్మి*
*చౌదమ్మకథ విన్న పాయు పాపములు*
*ఆయురారోగ్యములు అష్ట ఐశ్వర్యములు*
*పంచాక్షరంబొసగు పరంజ్యోతి చౌదమ్మ*
*ధరణిలో తొగటకుల దైవంబు చౌదమ్మ*
*ఎంచగల యీ తొగటకులములో సుగమంచి*
*పాపన్న పుత్రుండు వంశపావనుడూ*
*తిరువెంగళప్పయ్య వరకవి చెప్పిన*
*ఈ కథ త్రిపురసంహారంబు చౌదమ్మపందువనగాను."*

ఆదిశక్తి చౌదమ్మను గొలుచు తొగటవీరులు వీరశైవులు. వీరముష్టివారికిని వీరికిని దగ్గఱ సంబంధమున్నట్లుగాఁ దోఁచుచున్నది. చెన్నబసప్ప యను వీరముష్టివాని కుమార్తెను భోజుఁడను రాజు వివాహమాడఁదలఁచెను. వీరముష్టులందులకు సమ్మతింపలేదు. తన గుఱ్ఱమును జంపి, తిరిగి దానిని బ్రతికించినచో నా బాలికను వివాహమాడెడి తలంపును విరమింతునని భోజుఁడు వారితోఁ జెప్పెను. భోజుని గుఱ్ఱమును జంపి తిరిగి బ్రతికించుటలోఁ వీరముష్టులకు దొగటవీరులు సహాయపడిరి. అందుచేఁ వీరముష్టులు తొగటవీరులకుఁ గొంత భూమిని దానము చేసిరి. ఈ దానపత్రమును చౌదమ్మ జాతరలో నేఁటికిని చదువుచుందురు (చూ. చౌడేశ్వరీ పూజా విధానము, పుట 223). ఈ దానపత్రమునుబట్టి యీ సంఘటన క్రీ.శ. 1081లో జరిగినట్లుగా దెలియుచున్నది. 'పానుగంటి దానపత్రమని మఱియొకటి కలదు. దానికి 'జయరేఖ' అని పేరు.

మొత్తముపై చౌదమ్మపాటలు కథాకథన ప్రధానములుగ నున్నవే కాని కవితా ప్రధానములుగ లేవు. మౌఖికప్రసరణమున నున్న యీ పాటలను మిడిమిడి జ్ఞానముగలవారు సంస్కరింప యత్నించుటచే, వీనిలోని జానపదత్వము (Folk element) ను సన్నగిల్లినది. ఇవి నేడు జానపదకవిత్వముగాఁగాక జాతి దేశికవిత్వముగాఁ గాన్పించుటకు ఈ దుష్టసంస్కరణమే కారణము. తాళబద్ధత మాత్రము ఈ పాటలలో నెచ్చటను లోపింపకుండుట ముదావహము. చౌదమ్మపాటలు శక్తికథాచక్రమున నొక ప్రత్యేకశాఖయనుటలో సందేహము లేదు.[19]

రాయలసీమలో చౌదమ్మపాటలవలెనే, తెలంగాణమున బొడ్డెమ్మ పాటలు, బ్రతుకమ్మ పాటలు ప్రసిద్ధికెక్కి యున్నవి. కాని 'బొడ్డెమ్మ, బ్రతుకమ్మ' అనునవి శక్తి స్వరూపములుగాఁ గానవచ్చుట లేదు. జానపద గేయములనుగూర్చి సమగ్ర పరిశోధన చేసిన రామరాజుగారు 'బొడ్డెమ్మ' పిల్లలపండుగ యనియు, 'బ్రతుకమ్మ' స్త్రీలవేడుక యనియుఁ దెలుపుచున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ४२८–४३२). వీరు వ్రాసిన దానినిబట్టి చూడఁగా శక్తిపాటలవలె వీనిలో రౌద్రము కానరాదు. బొడ్డెమ్మ పాటలు పిల్లల పాటలలోను, బ్రతుకమ్మ పాటలు జానపదస్త్రీల పాటలలోను గలసిపోవునే కాని, అవి శక్తికథాచక్రము క్రిందికి వచ్చెడివి కావు.

## 4. ఇతర శక్తికథలు

### 4.1. పోలేరమ్మ కథ:-

ఈమెకూడ చౌదమ్మవలెనే శివుని చెమటనుండి పుట్టినది. శక్తులన్నియు నీశ్వరుని పుత్రికలుగాఁ జెప్పఁబడును. ఈశ్వరాదులకు నలవికాని రాక్షససంహారమును ఈ శక్తులు అవలీలగాఁ గావించినట్లు వర్ణింపఁబడుచుండును. ముఖ్యముగా రక్తబీజుని బరిమార్చుటలో భూమిపై నాలుకను జాపి, ఆ యసురుని రక్తము నేలమీఁదఁ బడకుండ జుఱ్ఱి చంపినట్లుగాఁ జెప్పఁబడుచుండును. ఇది అన్ని శక్తికథలలోను గానవచ్చు సాధారణాంశము (Commonplace).

మౌఖిక సంప్రదాయమున నున్న పోలేరమ్మకథను నేను నెల్లూరు మండలమున సేకరించితిని. ఈ కథను మశూచిరోగుల కడ పాడింతురు. గ్రామములను కలరా, మశూచి మున్నగు నంటువ్యాధులు చుట్టుముట్టినప్పుడు, ఊరికిఁ బడమటిదిశగాఁగల నొక తోటలోనికిఁ బోయి, అక్కడ అమ్మవారికిఁ గొలుపులు కొలిచెదరు. ఆ కొలువులదగ్గఱ నీ పోలేరమ్మకథను బాడింతురు. వనభోజనములలోఁ గూడ నీ కథను బాడుట కలదు.

పోలేరమ్మకథను బాడుటలో శ్రుతి, పలక అను రెండు వాద్యముల నుపయోగింతురు. శ్రుతి యనునది జముకులలో నొక రకము. దీని గొట్టము జముకు గొట్టము కన్న కొంచెము సన్నముగా నుండును. శేరువలెనుండు గొట్టమున కొకవైపున మేకచర్మముండును. ఆ చర్మము మధ్యనుండి నారి లాగి, రెండవ వైపునుండి బయటకుతీసి, గొట్టము నంటిపెట్టుకొనియున్న ఒక కఱ్ఱకు ఆ నారిని బిగింతురు. ఈ నారిని కుడిచేతితో మ్రోఁగించుచు శ్రుతిని నిలుపుకొని కథకుఁడు పాటపాడుచుండఁగా, వంతలు పలకలు (టముకులు లేక డప్పులు) వాయించెదరు. ఈ పలకలు తాళమును నిలుపును. పోలేరమ్మకథ యీ క్రింది విధముగాఁ బ్రారంభమగును:

***"శరణే శరణే తల్లీ, శరణు పోలేరమ్మా,***
***దోవలు గాసిన తల్లీ దుర్మార్గురాలా***
***ఆది గాసినావు తల్లీ ఆంకారురాలా***

*మాయలాడి అమ్మవారు మరుమంతరాలు*
*ఎట్లా ఉన్నదంటే ఏ క్రమాన ఉన్నదంటే*
*అలనాడు శివుని చెమటను బుట్టిన చెమట కొమార్తెలు నలుగురు*
*నలుగురు ఆడబాలలు పుట్టివున్నా*
*'నా పాలిట నలుగురు పుట్టినా*
*యుద్ధానికి పోవదానికి ఒక్కరే లేరు'-*
*అని ఈశ్వరుడు దుఃఖపోతున్నాడు."* [20]

ఈశ్వరుని చెమటనుండి మొదట నలుగురు చెమట కుమార్తెలు పుట్టినారు. నలుగురు పుట్టినను, అందఱును ఆడుపిల్లలే యగుటచే, నొక్కరును దనకు యుద్ధమున సాయపడువారు కారని ఈశ్వరుఁడు దుఃఖించుచుండెను. తరువాత ఈశ్వరుఁడు 'నొష్టన' (నొసటి యందు) ఏదుమ కుంకుమ ధరింపఁగా, నాదిశక్తి యా కుంకుమలో బంగారు రామచిలుకయై వ్రాలినది. తన 'నొష్టన' జాఱుచున్న చెమటను నీశ్వరుఁడొక రచ్చబండపై వేసెను ఆ బండనుండి 'పోలేరమ్మ' జన్మించినది. (ఇది సరిగా చౌడమ్మ పుట్టుక వలెనే ఉన్నది.) మఱల నాడుపిల్లయే పుట్టినదని శివుఁడు నిరుత్సాహపడెను. పైగా, ఆ పిల్ల రకరకముల జబ్బులతోఁ గడు నసహ్యముగ నున్నది. కావున శివుఁ డాబాలను ఏడు నిలువుల కావు త్రవ్వించి, అందు ప్రాణముతోఁ బూడ్చిపెట్టించెను.

ఈశ్వరుని కుమారుడు నక్కనారాయఁడు తన కాహారముఁ జూపుమని తండ్రిని గోరెను. పోలేరమ్మకావును ద్రవ్వి తినుమని శివుఁ డు చెప్పెను. నక్కనారాయఁడు ఆ కావు త్రవ్వుటకుఁ బ్రారంభించెను. అమ్మవారు నక్కనారాయని చెవిపట్టుకొని బయటకు వచ్చినది. 'నీ తండ్రి నిన్ను యుద్ధమునకు దీసికొని రమ్మనినాడు' అని నక్క అబద్ధమాడినది. పోలేరమ్మ నక్కపై నధిష్ఠించి అయోధ్యకుఁ బయనమయ్యెను. జిత్తులమారి నక్క యాయె నొక వాగులోఁ బాఱవైచి పాఱిపోసాగెను.

పోలేరమ్మ ఒంటెయవతారమెత్తి, 'చీమూ రక్తమూ దుర్దండ పురుగులుగా', ఈగలు దోమలు ముసురుకొనుచుండఁగా, నక్కనారాయఁడు పోవు దారిలోఁ బరున్నది. నక్క మఱల పన్నాగము పన్ని, సింహాలరాజుతోఁ గలసి, యొంటెను జంపయత్నించి భంగపడెను. తరువాత అమ్మవారు ముదుసలియవతారమెత్తి అయోధ్యానగరమునకు రాఁగా,'సీమూ రకతమూ దుర్దండ పురుగులుగా' నున్న యా ముసలిదానిని శివుఁడు పాడుబావిలో వేయించెను. అమ్మవారు ఆ పాడుబావినుండి నాగలోకమునకుఁబోయి, బావిలోని నీరు పైకి రప్పించి, పాదాల బంగారు గజ్జెలు కట్టుకొని, ఆనందముగా నాడుకొనుచుండెను. ఆ బావిదగ్గఱ పశువులఁ గాచికొనెడి బాలురు అమ్మవారి విషయమును శివునకెఱింగించిరి. శివుఁడు అసురకోట యుద్ధమునకుఁ బోవుచు, దేవతాబ్రాహ్మణులను బల్లకితోఁ బంపి, తన కుమార్తెను గొనిరండనెను. ఆ బ్రాహ్మణులు పాడుబావి దగ్గఱకు వచ్చి, అమ్మవారి నయోధ్యాపురమునకు రమ్మని ఆహ్వానించిరి. అమ్మవారు రాచవారిపిల్లవానిగా మాఱి, వేపచెట్టును, తమ్ముఁడు పోతురాజును వెంటఁబెట్టుకొని అయోధ్యాపురమునకు వచ్చుచుండెను. దారిలో నొక సెనగచేనును జూచి పోతురాజు, అక్కగారి యనుమతినిగోరి, యా చేనునంతటిని దినివేసెను. పోలేరమ్మ తన మూఁడవ నేత్రమును దెఱచి తిరిగి పంటపండించెను.

ఇంటికివచ్చిన అమ్మవారితోఁ దండ్రియగు శివుఁడు, రక్తబీజులగు రాక్షసులను దాను సంహరింపలేకున్నానని మొఱవెట్టు కొనును. పోలేరమ్మ తానారాక్షసులనందఱను సంహరింతుననియు, ముందు తనయాకలిని దీర్చుమనియుఁ గోరినది. శివుఁడు పండ్రెండు పుట్ల కేసరిబియ్యము, నేతితోఁజేసిన కాకరకాయలకూర రాసిపోసి పెట్టినాఁడు. పండ్రెండు పుట్లయన్నము తొలిముద్దయే కాని మలిముద్ద లేదు అమ్మవారికి. తనకు దాహమగుచున్నదఁగా శివుఁడు 'హొన్నెలచ్చ సురాపానీ కావిళ్లు' తెప్పించెను. ఆ కల్లు అమ్మవారి చేతిలోఁ బోయఁ గా, నామె యరచేయి తడియలేదఁట!

పోలేరమ్మ ఆకాశమునకు భూమికి నొకటిగా నెదిగిపోయి, తమ్ముఁడు పోతురాజును, తన నల్గురప్పచెల్లెండ్రను వెంటఁబెట్టుకొని, 'ఎఱ్ఱజాము ప్రొద్దుకల్ల', 'అసురపురుగు' లేకుండఁ జేసినది. 'అప్ప దేశమ్మ' (అమ్మవారి అక్క) తన 'జల్లిమగుడాల నాలిక దబ్బళించి' పాఱెడి రక్తమును మొండెములను నారగించినది. కూఁతురు పరాక్రమమునకు మిక్కిలి సంతసించి, ఈశ్వరుఁడామెకుఁ బెండ్లిసేయఁ దలంచెను. కాని అమ్మవారు తండ్రితో నిట్లన్నది:-

*"నాయనా, నీవు నాకు పెండ్లిచేయలేవు*
*నాకు భూదేవంత అరుగు కావలెను*
*ఆకాశమంత పందిరి కావలెను*
*ఎలిగొండంత తాళి కావలెను*
*ఏఱంత కోక గావలెను*
*అదీగాకుండా నా కంట్లో కోరిన పురుషుడు కావలెను."* [21]

ఈశ్వరుఁడామె కోరికలను నేఱవేర్చలేక, కలియుగమున కోడిగ్రుడ్డంత పట్టణము వెలయుననియు, నా పట్టణమును బాలించుకొనుచుఁ, బెండ్లి పేరంటములు లేకుండ సుఖముగా బ్రతుకు మనియుఁ బోలేరమ్మను దీవించినాఁడు. ఈ కథాంతమున నిట్లున్నది:

*"ఎంటికెంటిక్కి ఎయ్యికళ్లు గలదానివే*
*నీ కంటికి కోరిన పురుషుణ్ణి ఎవర్ని తీసికొచ్చి చేసేది?*
*ముందు కలిగ్గం పుట్టబోతున్నాది*
*ఆ కలిగ్గంలో కోడిగుడ్డంత పట్నం ఏరుపడుతుంది*
*నువ్వు బొయ్యి రాజ్యంమింద పరిపాలన చేసుకోని*
*పెళ్లి పేరంటం లేకుండా సుకంగా బతుకు, పో కూతురా."*[22]

ఈ యీశ్వరుని దీవెననుబట్టి, పెండ్లిపేరంటములు లేని పోలేరమ్మయే 'మాతంగి' యని అనుమానము కలుగుచున్నది. ఇదియే సత్యమగుచో, వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచ్చిన శక్తికథల పట్టికలోని 'మాతంగికథ'యు, నేను సంపాదించిన పై 'పోలేరమ్మకథ'యు నొక్కటియే యగును.

## 4.2. అమ్మవారి దండకము:-

ఇది ఆంధ్రప్రాంతమున, ముఖ్యముగా విశాఖ, విజయ నగరము, శ్రీకాకుళము మండలములలో వ్యాప్తియందున్న శక్తికథ. పోలేరమ్మకథవలెనే చిన్నది. దీనినిగూడ మశూచి, కలరా మున్నగు వ్యాధులు గ్రామములందు వ్యాపించినప్పుడు పాడింతురు.

ఈ యమ్మవారి పుట్టిల్లు అనకాపల్లి, అత్తవారిల్లు కసిమికోట, తాతగారి ఊరు బెజవాడ. ఈమె స్థావరము విజయనగరము. పూసపాటి విజయరామరాజు ఈమెను కొలువలేక వదలుకొన్నాడట.

ఈ 'అమ్మవారి దండకము' జముకులకథ. మాదిగలు దీనిని బాడుదురు. విశాఖ మండలమునుండి భీమవరము (పశ్చిమగోదావరి మండలము)నకు వలసవచ్చిన కంట చిన్నయ్యదాసు అను బవనీఁడు పాడుచుండగా దీనిని సంపాదించితిని (27-9-1964). ఇది సుమారు 500 పాదములున్నది. ఇందలి కవిత్వము జానపదత్వముతో జాలువాఱుచు బహురమణీయముగ నున్నది. శ్రీ నేదునూరి గంగాధరం గారు 'సెలయేరు'లోఁ బ్రకటించిన 'చిన్నెలగౌరు' అను పాట ఈ యమ్మవారి దండకమునకు సంక్షిప్తరూపము. ఈ పాటను ఊడ్పుల (వరినాట్ల) లోఁగూడ పాడుచుందురు. ఇది ఖండగతిలో సాఁగు రచన. ప్రారంభమిట్లుండును:-

***"అమ్మవారు-***

| | | |
|---|---|---|
| *ఏలాగు నున్నాది?* | *తల్లి* | *ఎట్లాగు నున్నాది?* |
| ***కుందేడు నీళ్లల్లో*** | ,, | ***కుంకాలు గలిపేను*** |
| ***జానేడు నీళ్లల్లో*** | ,, | ***జవ్వాజి గలిపేను*** |
| ***పంటీడు నీళ్లల్లో*** | ,, | ***పన్నీరు గలిపేను*** |
| ***పన్నీరు జలకాలు*** | ,, | ***పొందుగాడీనాది*** |
| ***కూర్చోని తానాలు*** | ,, | ***కుసుమలకు పారేను*** |
| ***ఒంగోని తానాలు*** | ,, | ***వంగలాను దడిపేను*** |
| ***నిలబాడి తానాలు*** | ,, | ***నిమ్మలను దడిపేను"*** |

(పంటి= కుంద; కుసుమ= సస్యవిశేషము)

అమ్మవారు తన యత్తవారిల్లున్న పడమటిదేశమునుండి, పుట్టిల్లున్న తూర్పుదేశమునకుఁ బోవ నిశ్చయించినది. స్నానము చేసి, తలదువ్వుకొని అలంకరించుకొన్నది. పిఠాపురము (తూర్పు గోదావరీ మండలము) సాలెవారికి వార్తనంపి, చక్కని చీర నేయించుకొని ధరించినది. దూతలను మాతలను బిలిచి, తమ్ముఁడు పోతురాజును వెంటఁబెట్టుకొని, పల్లకినెక్కి తూర్పుదేశమునకుఁ బయనమయ్యెను. అనకాపల్లి దగ్గఱ ఏఱు అడ్డమయ్యెను. ఆ యేటిలోఁ బడవ నడపు జాలరివాఁడు అమ్మవారి సౌందర్యమును జూచి మోహించెను. తన్నుఁ బెండ్లాడినచో నేఱు దాటింతుననియు, లేనిచో దాటింపననియుఁ జెప్పెను. అమ్మవారా జాలరివానిని బరిపరి విధముల బ్రతిమాలినది; ఎన్నియో నీతులు బోధించినది; తాను శక్తినని భయపెట్టినది; వెండిబంగారము లిత్తునన్నది. ఎన్ని విధములఁ జెప్పినను జాలరివాఁడు తనపట్టు విడువలేదు. అమ్మవారు క్రుద్ధురాలై ఆ జాలరివానికి మశూచికము కలిగించెను. తన దూతలను మాతలను నాతని యూరిపైకి బంపెను. తుమ్ముల మాత, దురదల మాత, జాతాల మాత మున్నగువారు జాలరివాడున్న గ్రామము నల్లకల్లోలము గావించిరి. మశూచికముతోఁ బ్రజలందఱును జనిపోవుచుండిరి.

అమ్మవారు ముసలి వెజ్జురాలి వేషముతో నూరిబయట నొక వేఁపచెట్టు క్రింద కూర్చున్నది. ఆ యూరిలో రామభక్తులగు నేడ్గురన్న దమ్ములు అమ్మవారిని శరణుజొచ్చిరి. ఆమె యాఁతకల్లును గోరినది. ఆ యూరివారందఱును గల్లుతెచ్చిరి. వేపపిక్క చిదిమి, యా గులకలోఁ గల్లుపోయుమన్నది. ఎంతకల్లు పోసినను నా వేఁపగులక నిండలేదు. ప్రజలు భయపడిరి. ఆ యూరిలో గమిడి పిన్నమ్మ యొద్దఁ గల పోతుతాడికల్లు తెచ్చినచోఁ దన గులక నిండునని అమ్మవారు చెప్పినది. జాలర్లు వెడలిపోయిరి.

ఆ రాత్రి అమ్మవారు గమిడి పిన్నమ్మ కలలోఁ గనిపించి, జాలరులాతని దగ్గఱకుఁ గల్లునడుగ వత్తురనియుఁ, గల్లుఎత్తు బంగారమిచ్చినఁగాని అంగీకరింపవద్దనియుఁ జెప్పినది. మర్నాఁడు జాలర్లు గమిడి పిన్నమ్మను పోతుతాడికల్లు పోయుమనిరి. అతఁడు కల్లెత్తు బంగారము తెమ్మనెను. ఎంత బంగారము తెచ్చినను నా కల్లుతోఁ దూఁగలేదు. జాలరులు తమ భార్యల మంగళసూత్రములను గూడ తెచ్చివేసిరి. అప్పటికి అమ్మవారు కనికరించి, కల్లు సరితూఁగు నట్లు చేసినది. వారాకల్లును దెచ్చి అమ్మవారికిఁ బోసిరి. 'బుద్ధితెచ్చుకొని బ్రతుకు'దని అమ్మవారు జాలర్లను హెచ్చరించి, దీవించినది. పడవలో మశూచితోఁ బడియున్న జాలరి వానిని మాత్రము అమ్మవారు బ్రతికించలేదు. ఆ జాలరివాని తల్లి వచ్చి చూచుసరికి నతఁడు మరణించెను.

అమ్మవారు తన దూతలతో మాతలతోఁ గలసి, మహా కోపమున దారిలోని ఊళ్లన్నియు నాశముచేయ మొదలిడెను. త్రిమూర్తులిది చూచి, పెద్ద గజాశూలమును దెచ్చి, అమ్మవారికి శిరసు నుండి సిరిపాదమువఱకును గ్రుచ్చి, ఆమెను భూమికి తాపడము చేసిరి. ఈ కథాంతమిట్లున్నది:-

| | | |
|---|---|---|
| ***"తల్లిమొగము చూసినాడు-జాలారి-*** | | ***తల్లిమొగము చూసినాడు*** |
| ***మూడు బెక్కులు బెక్కి*** | ,, | ***ప్రాణమొదిలేశాడు*** |

| | | |
|---|---|---|
| **దూతల్ని మా తల్లి** | **తల్లి** | **తోడుదీసూకోని** |
| **కోదీలు పట్నాలు** | **,,** | **కొల్లలాడీనాది** |
| **పైడీలు పట్నాలు** | **,,** | **పాడుజేసీనాది** |
| **అసర్ల పట్నాలు** | **,,** | **అతము జేసీనాది"** |

వచనము:- అప్పుడు త్రిమూర్తులు ఆలోచించి... అమ్మవార్ని శిరసు నుండి సిరిపాదంవరకూ గజాశూలం వేసి, భూలోకానికి తాపడం చేసేశారు".

## 4.3. మాత పురాణము:-

ఇది మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమున నున్న కాగితపుఁబ్రతి (ఆర్.నెం. 693). 216 పంక్తులలో మంజరీ ద్విపదలో నసమగ్రముగాఁ నున్నది. 1920వ సంవత్సరములో గుంటూరు మండలములోని రెంటచింతల గ్రామమునకుఁ జెందిన రామరాజు పెద్దసుబ్బయ్యగారు దీనిని గ్రంథాలయమునకు బహూకరించిరి. ఈ కథనుగూర్చి విశేష వివరణ పట్టికలో నిట్లు వ్రాయఁబడి యున్నది:-

"మాత పురాణమని పేరుగల యీ గ్రంథము శక్తికథలలోనిది. యాదవరాజులకథలని, శక్తికథలని, పల్నాటి వీరులకథలని, యెఱ్ఱగొల్లలు పిచ్చుకుంట్లు మొదలగు జాతులవారు పాడుచుండు పదములు (మంజరీ ద్విపద, తద్వికారములు) ముత్తెఱఁగులు గలవి. అందిది శక్తికథలలోనిది. ఈ కథ ఓరుగంటి కాకతీయరాజ్య చరిత్రముతో సంబంధము గలదిగా నున్నది. ఏకవీర, కాకతిశక్తి విషయములిందుఁ గలవు. ఇక్కడ నుపలబ్ధమగునది గ్రంథములో నించుక భాగమే కావునను, అదికూడ బహుదోషభూయిష్ఠమయి యున్నది గావునను, నింతకంటె విశేషములు తెలుపఁ గుదురకున్నది. ఇది మంజరీ వికార మనఁదగిన పదరచనము. కర్త యెవ్వరో యెఱుఁగరాదు."

కథాప్రారంభమున దీనిని 'బడబాగ్ని రామచంద్రుఁ' డను కవి రచించినట్లు స్పష్టముగా నుండగా, నీ విశేష వివరణ వ్రాసిన మహానుభావుఁడు 'కర్తయెవ్వరో యెఱుఁగరా'దని వ్రాయుట సాహసము.

*"వినుతికెక్కిన యట్టి వీరశైవులకు*
*మతులను నగించి సమర్థించినట్టి*
*కత విన్నవించెద క్రమమెల్ల తెలియ*
*వినుపింతు వీనులకు విందులుగాను*
*రక్షించు శ్రీమాత రమణి చరిత్ర*
*ఆ కథావృత్తాంత మది యెట్టిదనిన*
*చేకొని బడబాగ్ని రామచంద్రుండు*
*చెప్పంగ దొడగెను శాశ్వతంబుగను."*

కాకతీయుల కులదైవము 'కాకతి' యను శక్తి. ఆమెకు సైదోడు ఏకవీర లేక రేణుక. ఇది కాకతిశక్తినిగూర్చిన పురాణము గావున దీనియందుఁ గాకతీయ రాజన్యుల కథలు చక్రరూపమున వచ్చి యుండును. వరంగల్లు మండలమున నీ కథ విశేష వ్యాప్తియందున్నది. మౌఖిక ప్రసరణమున నున్న యీ కథను శోధించి సంపాదింపవలసి యున్నది. అట్లు సంపాదించినపుడు కాని ఈ కాకతిశక్తికథల సంపూర్ణ విషయము బోధపడదు. ఏకవీర కాకతమ్మకు సైదోడు కావుననే ఆమె ప్రసక్తికూడ నీ కథలో వచ్చియున్నది.

## 4.4. ఆరంజోతి కథ లేక ఆదిపురాణము:-

ఇది అరుంధతీవసిష్ఠులకు సంబంధించిన గాథ. మాల మాదిగలు దీనిని బాడుదురు. తంబుఱ గుమ్మెట్లతోఁ బాడుదురు. ఇతర శక్తికథలన్నియును జముకులతోను, పంబలతోను పాడఁ బడుచుండగా నీ యారంజోతికథ మాత్రము తంబుఱతో గానము చేయఁబడుట వింతగా నున్నది. జంగముల ప్రభావము వీరిపై ప్రసరించియుండును. గుంటూరు మండలమున పల్నాడు తాలూకాలో నెమలిదిన్నె గ్రామమందును, చిత్తూరు మండలమున శ్రీకాళహస్తి తాలూకాలో 'రాయకుంట అగ్రహారము' అను గ్రామమందును నీ యారంజోతికథను బాడు మాలదాసరు లున్నారని తెలియుచున్నది. కాని నేనీ కథను పూర్తిగా సంపాదింపలేకపోతిని.

వసిష్ఠ మహర్షి అరుంధతిని ప్రేమించి ఆమె కొఱకై మాదిగవాడకు వచ్చినపుడు, మాదిగలు ఆ బ్రాహ్మణు నిట్లాక్షేపించు చున్నారు:

***"దండమయ్యా వాసిష్టుండా- నీకు దండం బ్రాహ్మణయ్యా***
***వారములో కడవారము స్వామీ- మేము మాదిగావారము స్వామీ***
***రొయ్యినీ రుద్దేటి వారమూ- చెప్పులూ కుట్టేటి వారమూ***
***ఒకరిండ్లాకే మేమూ పోమూ- మా యిండ్లాకే ఒకరే రారూ***
***ఇట్టి వాడలకు వస్తివి నీవూ- మాదిగావాడలకు వస్తివీ***
***పోపోవయ్యా బ్రాహ్మణయ్యా- నీదు ఊరూ చేరవయ్యా."***

మొత్తముపై, వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు- ఇచ్చిన శక్తికథలపేర్ల పట్టికలో 'గంగానమ్మకథ, మాతంగికథ' తప్ప తక్కినవన్నియును నాకు లభించినవి. వారు తమ పట్టికలలోఁ జెప్పని 'ఏకవీరాంబకథ, గవరమ్మగాజులు, జంపన్న వెలిగొండ వెళ్లుట, పోలేరమ్మకథ' మున్నగునవి నేను ప్రత్యేకముగా సంపాదించిన నూతన శక్తిగాథలు. 'జాలమ్మకథ, ముత్యాలమ్మకథ, ఆరంజోతికథ' వ్యాప్తియందుఁ గలవని తెలిసికొంటిని. 'గంగానమ్మకథ' యన్నను 'గంగకథ' యన్నను నొక్కటేయైనచోఁ, గాటమరాజుకథలలో వచ్చు 'గంగతర్కము' కాని, కంసుడుకథలో వచ్చు 'గంగపుట్టుక' కాని

'గంగానమ్మకథ' కావలెను. గంగజాతరలలో నేఁటికిని కాటమరాజు కథలలోని 'గంగతర్కము'నే పాడుట పరిపాటి. అందుచే గంగతర్కమే గంగానమ్మకథ యను పేరుతోఁగూడ పిలువబడుచున్నదని యూహింప వచ్చును. 'మాతంగికథ' యన్నను 'పోలేరమ్మకథ' యన్నను నొక్కటేయని ఇతివృత్తమునుబట్టి నాకుఁ దోఁచుచున్నది. దీనినిబట్టి పేర్లు మాత్రమే తెలిసికొనిన పై పండితుల పరిశోధనలను, వివిధ శక్తికథా సంపాదనముతో నేను తుదిఁ దాకఁజేసితినని చెప్పవచ్చును.

ఈ సుదీర్ఘ ప్రకరణమునఁ జర్చింపఁబడిన వివిధాంశముల నిట్లు సమీకరింపవచ్చును:–

శక్త్యారాధనము భారతదేశమున నతిప్రాచీన కాలము నుండియుఁ గలదు. శక్తులు అంతవిధములు. ఇవన్నియును నాదిశక్తి యొక్క వివిధావతారములే. జానపదులు 'ఎల్లమ్మ, అంకమ్మ, గంగమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మ'– మున్నగు క్షుద్రశక్తుల నారాధింతురు. ఈ యారాధనారూపములే మన పల్లెలలో జరుపఁబడు గ్రామదేవతల జాతరలు. ఈ జాతరలలో నాయాశక్తుల కథలను మాలమాదిగలు గానము చేయుచుందురు. "ఎల్లమ్మకథలు, అంకమ్మకథలు, చౌడమ్మ పాటలు, పోలేరమ్మకథ, మాతపురాణము, ఆదిపురాణము (ఆరంజోతి కథ)" మున్నగునవి తెలుఁగులో వ్యాప్తియందున్న శక్తివీరగాథలు. వివిధ శక్తులన్నియును నాదిశక్తి అపరరూపములే కావున నీ వీరగాథల నన్నిటిని నొకేయొక వీరగాథావృత్తము (Ballad-cycle) గా భావించుట యుక్తము. ఈ గాథావృత్తమునకు 'శక్తి కథాచక్రము' అని పేరిడవచ్చును. (ఇట 'శక్తి' యనఁగా 'నాదిశక్తి' యని యర్థము.) ఈ శక్తి కథాచక్రములో ఎల్లమ్మకథలును, అంకమ్మకథలును దమతమ ప్రత్యేకతను జూపుచున్నవి. ఇవికూడ ప్రత్యేక కథాచక్రములుగా నేర్పడియున్నవి. నేను పరిశోధించినంత వఱకును ఎల్లమ్మ కథాచక్రమున తొమ్మిది గాథలు, అంకమ్మ కథాచక్రమున మూఁడు గాథలు కలవని తెలియుచున్నది. 'మఱ్ఱిచెట్టుకథ, జలగన్న పార్వతికథ, రేణుక పుట్టుక, రేణుక కల్యాణము లేక రేణుక రాయబారము, గిరిరాజు యుద్ధము లేక రేణుక యుద్ధము, పరశురాముని జననము, పరశురాముని యుద్ధము, గవరమ్మ గాజులు లేక గొంతెమ్మకథ (గొంతాలమ్మకథ), జంపన్న వెలిగొండ వెళ్లుట'– అనునవి ఎల్లమ్మ కథాచక్రములోని వివిధ వీరగాథలు. వీనిని 'పరశురాముని కథ' లనియు, 'గౌతుపురాణ' మనియుఁ బిలుచుచుందురు. 'అంకమ్మకథ రవద్దేవిరాజుకథ, గంగురాజుకథ' అనునవి అంకమ్మ కథాచక్ర సంబంధులైన వీరగాథలు. వీనికి 'అంకమ్మ పాంగెము' అని జానపదులలో వ్యవహారము. ఈ రెండు కథాచక్రములను నాదిశక్తి వీరగాథావృత్తము (శక్తి కథాచక్రము) లోని అంతశ్శాఖలుగాఁ దలంపవలెను. చౌడమ్మ పాటలు లఘువీరగాథలు (Balladings). వీని యితివృత్తములు వరుసక్రమమున లేకుండుటచే నివి కథాచక్రముగా నేర్పడలేదు. కాని 'చౌడు పురాణము' అను పేరుతో నొక ద్విపదకావ్యము కలదనియు, నందు ధారావాహిక కథనము కలదనియుఁ దెలియుచున్నది. పోలేరమ్మకథవంటివి విడిగానున్న శక్తికథలు. ❑

## జ్ఞాపికలు

1. *శ్రీమతి సరస్వతీ చెన్నకేశవన్, విజ్ఞాన సర్వస్వము, సంపుటి 7, పుట–725.*
2. *శక్తిపూజను గుఱించిన విశేషములను తెల్పిన మిత్రులు శ్రీ పి.వి.యల్.వి. ప్రసాదరావు (ప్రసాదరాయ కులపతి)గారికి కృతజ్ఞుఁడను.*
3. *ప్రభాకరశాస్త్రిగారి పట్టిక 'శృంగార శ్రీనాథము'న గలదు. తిమ్మావజ్ఝులవారి పట్టిక ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక (1953–54) పుట–33లోఁ గలదు.*
4. *డా॥ బి. రామరాజుగారు, తెలుఁగు జానపదగేయ సాహిత్యము. పుట– ౪౩౮*
5. *పశ్చిమ గోదావరీ మండలమున భీమవరములోనున్న కంట చిన్నయ్యదాసు అను జముకులవాఁడు పాడినది, 1964.*
6. *అదియే., 'రేణుక కల్యాణము' నుండి.*
7. *అదియే., 'జలగన్న పార్వతి' నుండి.*
8. *నెల్లూరుజిల్లా, కోవూరుతాలూకా, ఊటుకూరు గ్రామములో, దక్కా దేవదానం అను పంబలవాడు, 26–7–1966న పాడిన ప్రార్థన.*
9. *దేవదానం, అంకమ్మకథ, ప్రారంభము.*
10. *దేవదానం, అంకమ్మకథ, అంతము.*
11. *దేవదానం, రవద్దేవిరాజుకథ, 27–7–1966.*

12. అదియే.,

13. అంకమ్మను గొలిచిన ఈ మారసపురాజులును, పల్నాటియుద్ధములోని కొమ్మరాజాదులును చోడ(ళ)రాజులేమో అనెడి అనుమానముకూడ వచ్చుచున్నది. అంకమ్మకథలలో వచ్చు 'ధర్మసూదానిరాజు, అనుపేరులో 'సూదాని' అనునది 'చోడాని' శబ్దపరిణామము కావచ్చును. పల్నాటివీర కథలలో నాకు లభించిన యొక తాళపత్రమున కల్యాణమునేలు వీరసోమునిగూర్చి వర్ణించుచు "చోడవంశమునందు శోభిల్లురాజు" అని చెప్పఁ బడినది. రాయలసీమలో నాకు తటస్థపడిన ఒక గాథాకారుఁడు అంకమ్మ కథాస్థలము చిత్తూరు మండలమున సత్యవీడు తాలూకాలో నాగలాపురము కడ నున్నదని తెల్పినాఁడు. ఇట నున్న 'రామగిరి' యే గంగురాజుకథలోవచ్చు 'దక్షిణ రామగిరి' యనినాఁడు. దీనికిఁ బదిమైళ్లలోఁ గనక రావేంద్రుఁడు (గంగురాజు పినతండ్రి) వసించిన దేవగిరికోట యున్నదఁట. ఇచటి రామగిరిలో 'అంకమ్మ దేవళము, వెయ్యాద్రికోన, వెయిలింగాల పర్వతము గలవఁట. అంకమ్మకథలో వచ్చెడి అలగల నల్లచెఱువే ఇటనున్న 'నెంద్రచెఱు'వని ఈ గాథాకారుఁడు తెల్పినాఁడు. దీని సత్యాసత్యములను బరిశీలింపవలసియున్నది. 'కల్యాణ నగరము, దేవగిరి పట్టణము' అనునవి ప్రసిద్ధ చారిత్రక స్థలములు. ఇందు మొదటిది మైసూరు రాష్ట్రమున గుల్బర్గా మండలమున గల 'కల్యాణ్'. రెండవది మహారాష్ట్రమునఁగల 'దౌలతాబాద్'.

14. దేవదానం, పూర్వోక్తము, అంకమ్మకథ.

15. కృష్ణామండలములో 1964లో నాకు లభించిన తాళపత్రగ్రంథము, గంగురాజుకథ, పత్రము-7.

16. ఈ పేరెట్లు వచ్చినదో తెలియకున్నది. క్రీ.శ. పదునాల్గవ శతాబ్దిప్రారంభముననున్న గణపనారాధ్యుఁడను కవి 'స్వరశాస్త్రము' అను మంజరీ ద్విపదకావ్యమును రచించెను. ఇది కేవలము వేదాంత గ్రంథము. దీనిలో భావికాలమునుగూర్చి తెలిసికొనుటవంటి వేవియును లేవు. కాని పదునాలుగవ శతాబ్ది మధ్యకాలముననున్న గోనయామాత్యకవి రచించిన 'సస్యానందము' మాత్రము చౌడమ్మభక్తులు చెప్పు స్వరశాస్త్రమువలెనే యున్నది. అందు పంటలు పండుటనుగూర్చి, వర్షపాతమునుగూర్చి ముందుగాఁ దెలిసికొనుట యోట్లో వివరింపఁబడినది. ఈ సస్యానందమంతయు జానపదులనుగూర్చి వ్రాయబడినట్టిదే.

17. సీ॥ **"జాలువా బంగారు సరిగె చీర(యు) ధరించి,- కుంకుమా గంధంబు పొంకపరచి**
**వరుస గంటల నూలు వద్యాణ మమరించి- పముజుల కమ్మలే పదిల పరచి**
**ఆణిముత్యమ పేరు అందముగా దాల్చి- సొగసైన వజ్రాంగిజోడు తొడిగి**
**గుండు మల్లెలదండ పొసగ కొప్పున వుంచి- పొలపైన బగారు బొట్టు పెట్టి**

తే॥ **అభయ అస్తంబు కరుణ కటాక్ష మమర- వెలిసితివిగదమ్మ భక్తులపాలి కొమ్మ**
**నందవరమందు నెలకొన్న నైకదాంబ- సరస సద్గుణ నికురంబ! (శ్రీవీర) చౌడమాంబ!**

-శ్రీ చౌడేశ్వరీ పూజావిధానము, పుటలు159-160.

18. **"శ్రీ సింధురాజ లక్ష్మీనాథరాజుగారిచే లిఖింపఁబడిన శ్రీ చౌడేశ్వరీ పూజావిధానమునందు ప్రథమ, ద్వితీయ, తృతీయ ప్రకరణములు సమాప్తము. ఓం శాంతిః" -** శ్రీ చౌడేశ్వరీ పూజావిధానము, పుట-22.

19. చౌడమ్మనుగూర్చిన యితర కావ్యములును కొన్ని కలవు. నేను 1972లో బెంగుళూరులో తొగటవీర క్షత్రియ మహాసభల సందర్భమున "చౌడు పురాణము" అను తాళపత్రగ్రంథమును జూచితిని. ద్విపద రచన. దీనిని కోలారు చిత్తూరు జిల్లాలలో తొగటవీరుల నాశ్రయించుకొని యున్న కొందఱు వృత్తిగాయకులు పాడుచున్నారు. ఇందు ధారావాహికమగు కథాకథనము కలదు. చౌడమ్మనుగూర్చిన పద్యకావ్యములును కొన్ని కలవు. గోపాలుని సుబ్బరాయకవి రచించిన "చౌడేశ్వరీ మాహాత్మ్యము" అయిదాశ్వాసముల చంపూకావ్యము. ఇది ప్రబంధఫక్కిని కొనసాగిన ప్రౌఢకవిత్వము. రచనాకాలము శా.శ. 1849 (క్రీ.శ. 1927).

20. నెల్లూరు మండలమున కోవూరు గ్రామములోగల మాలపల్లెలో గున్నం మస్తాను పాడిన 'పోలేరమ్మ కథ'. 24-7-1966.

21. అదియే.

22. అదియే.



# పదునొకండవ ప్రకరణము

# పల్నాటి వీరకథాచక్రము

## (The Ballad-cycle of Palnadu)

**తె**లుఁగు వీరగాథా కవిత్వమునఁ బల్నాటి వీరకథలదొక ప్రత్యేకస్థానము. చారిత్రక ప్రాచీనతయందే కాక కవిత్వపటుత్వము నందును, ఇతర వీరగాథాలక్షణములందును ఇవి ప్రథమస్థానము నాక్రమించుచున్నవి. ఇది తెలుఁగులో నేర్పడిన సిసలైన వీరగాథా వృత్తము (బొబ్బిలియుద్ధము సిసలైన వీరగాథ, గుజ్జాల గోపిరెడ్డిపాట సిసలైన తెలుఁగు వీరగాథానిక). ఈ గాథావృత్తము కల్పితమును కట్టుకథయుఁగాక, చారిత్రక సత్యమగుట మఱియొక విశేషము. దీని ప్రాశస్త్యమునుగూర్చి క్రీ.శే. అక్కిరాజు ఉమాకాంతంగారిట్లు వక్కాణించి యున్నారు: "దీంట్లో ద్వితీయాక్షరపు ఆట లేకపోవడం సగం తుక్కు వదలడం మొదటి విశేషం. ఇది తెలుగు సంప్రదాయానికి సరిపడని సంస్కృత వృత్తాలైన శార్దూల మత్తేభాదుల్లో కాక, దేశ్యపద్యంలో బసవపురాణాదులవలె వుండడం రెండవ విశేషం. అనువాదం కాక మూలగ్రంథంగా వుండడం మూడవ విశేషం. మనకు సన్నిహితమైన స్థలాలు మహాశూరనిలయాలై నిద్రించే ఆంధ్రుల్లో వీరత్వాదులను ప్రబోధిస్తూ ఇందు కార్యరంగాలుగా వుండడం నాల్గవ విశేషం. వీరగీతాలనే వాఙ్మయశాఖయందిది ప్రథమగణ్యమై వుండడం ఐదవ విశేషం." [1]

పల్నాటి వీరచరిత్ర నిజమైన ప్రజాకవిత్వము. ఇట్టి స్వతంత్ర కావ్యముగాని, దేశిరచనకాని, మహాపురుషుల చరిత్రకాని, ఆంధ్ర సాహిత్యమున వేఱొకటి లేదు. [2] ఇతివృత్తము, భాష, ఛందస్సు- అను మూఁడంశములును దేశీయములై యుండుట దేశికవితయొక్క ప్రధానలక్షణము. ఈ ప్రధానలక్షణమును సంపూర్ణముగా సార్థకము చేసిన కావ్యములలోఁ బల్నాటి వీరచరిత్రయే మొట్టమొదటిది. ఈ పల్నాటి వీరకథా ప్రాశస్త్యము నుగ్గడించుచు, ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారిట్లు వ్రాసియున్నారు: "... పలనాటికథ యంతయు భారతకథతో సంవదించుట, యే కవియు చేసిన అభూతకల్పన కాదు. స్వతఃప్రవృత్తము. భారతకథ భారతజాతికెల్ల విస్మరింపరానిదైనట్లే, పలనాటికథ విశేషించి ఆంధ్రులకు విస్మరింపరానది. పాండవవీరులు సమస్త భారతావనికి ఎట్టి చిరస్మరణీయులో పల్నాటి వీరులు సర్వాంధ్రులకు అట్టి చిరస్మరణీయులు. అందుచేత ఇతర చారిత్రక పదములకు లభింపని ప్రతిపత్తి, యీ పలనాటి పదమునకు లభించెను.

"రెండవ కారణము: బొబ్బిలికథ మొదలైన చరిత్రలను పదములుగా వ్రాసిన రచయితలు, ఈ పలనాటి పదమును వ్రాసిన కవులతో సాటిరాగల కవితాప్రజ్ఞ కలవారు కారు. ఆ కథలు పాడుచుండగా వినుచున్నంతవరకే హృదయావర్జకములుగా నుండును గాని, చదువబూనగా రచన అంతగా రుచింపదు. పలనాటి చరిత్రను పిచ్చుకుంట్లు పాడునప్పుడు కలిగెడి భావోద్రేకము మాట అటుండగా, గ్రంథము చేతబట్టి చదువుట మొదలిడినచో ప్రౌఢపద్యకావ్యోచితములైన పెక్కు సొగసులు, రసభావస్ఫోరకములైనవి అసకృత్తుగా ప్రత్యక్షమగును. ఈ రెండు కారణములవల్ల ఈ పలనాటి పదము ఆంధ్ర చారిత్రక పదకవిత్వశాఖలో అగ్రతాంబూలార్హతను గడించుకొన్నది." [3]

పలనాటి వీరచరిత్రనుగాని, కాటమరాజు చరిత్రనుగాని, ఒకే వీరగాథగా భావింపరాదు. ఇవి బహువీరగాథల సమాహారములైన కథాచక్రములు. ఇవి వీరగాథావృత్తములని సూచించుటకే కాఁబోలు మద్రాసు ప్రభుత్వ ప్రాశ్య లిఖితపుస్తక భాండాగారము (MGOML) లోని వ్రాఁతప్రతులలో సి.పి.బ్రౌనుదొరగారు 'పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు చరిత్ర' అని యీ రెండింటికిని చివర 'చరిత్ర' యను శబ్దమును వాడియున్నారు. ఇతిహాసములవలె నీ గాథావృత్తములలో ననేక కథలుండును. పలనాటి వీరగాథావృత్తమున, నేను బరిశోధించినంతవఱకు, నిరువదియైదు వీరగాథలున్నవని తేలినది. జానపదులు ఈ గాథావృత్తమును 'చెన్నుడు కథ' అందురు. తాళపత్ర గ్రంథములలో 'పలనాటి వీరుల భాగవతము', 'పలినాటి వీరుల భాగవతము' అను పేర్లు గానవచ్చుచున్నవి.

'పలనాడు' ప్రస్తుతము గుంటూరుమండలమున నొక తాలూకా. దీని ముఖ్యగ్రామము గురిజాల. పలనాటిసీమ కృష్ణాతీరమున సముద్రమునకు సుమారు 120 మైళ్ల దూరములో నున్నది. దీనికి నుత్తరమునను బడమటను 75 మైళ్ల పొడవున కృష్ణానది ప్రవహించుచున్నది. దక్షిణమునఁ గొండలచేతను సాంద్రారణ్యముల చేతను నావరింపఁబడియున్నది. తూర్పునఁ జిన్న చిన్న యడవులు వ్యాపించియున్నవి. దీని వైశాల్యము ఇంచుమించుగ 1050 చదరపు మైళ్లు. నాగులేఱు, చంద్రవంక యనునవి యిచ్చటి ముఖ్యనదులు. వీరచరిత్రలోఁ బ్రధానముగ వచ్చు కార్యమపూడి, మాచెర్ల పట్టణములలో మొదటి నాగులేటి తీరమునను, రెండవది చంద్రవంక యొడ్డునను నున్నవి. [4] ఈ పల్నాటిసీమ వైశాల్యము 1090 చ.మై. అని 'స్యూయల్' (Sewell) పండితుఁడు చెప్పియున్నాఁడు. [5]

మెకంజీదొర పల్నాటిసీమ యెల్లల నిట్లు నిర్ధరించినాఁడు: "Thus on the north and west, Palnad is separated from the Nizam's dominions by the Krishna, and the jungles on the south, divide it from the more open palins of Vinukonda, Narasaraopet and Sattenapalli taluqs of Guntur district."[6]

ఈ సీమకు బహునామములు ప్రాచీనకాలమునుండియు వ్యవహరింపఁబడుచున్నవి. **'పల్లెనాడు, పలనాడు, పలినాడు, పల్నాడు'** ఇత్యాదిగా వివిధ నామములు శాసనములలోను కవుల కావ్యములలోను వాడఁబడినవి. శ్రీ రావిపాటి లక్ష్మీనారాయణగారు తమ 'పల్నాటి చరిత్ర' (1953)లో నీ ప్రయోగములనన్నిటిని బేర్కొన్నారు (చూ. పుటలు 2, 3). మాచెర్ల ఆదిత్యేశ్వరాలయ శాసనములో 'పల్లిదేశ' మని కలదు. అమరావతీ శాసనములో 'పలనాడు' అని కలదు. కారెమపూడి తూర్పువైపు నల్లాంచక్రవర్తుల శాసనములో 'పలినాటివారు' అని కలదు. పూర్వకవులు 'పల్లెనాడు' అని గ్రంథస్థము చేసిరి. శ్రీనాథుని చాటుపద్యములలో **'పల్లెనాటి సీమ పల్లెటూళ్లు– రసికుఁడు పోవఁడు పల్నాడు– పన్నుగఁ బలినాటి సీమ ప్రజలందఱికిన్– పలినాటికి మాటికిఁ బోవనేటికిన్– కారెమపూడి పట్టణము కాశిగదా పలినాటి వారికిన్'** అను ప్రయోగములున్నవి. ప్రభావతీ ప్రద్యుమ్నములోఁ బింగళి సూరన తనవారు **'పలనాటను బాకనాటనున్'** ప్రసిద్ధులైనట్లు వ్రాసికొనినాఁడు. వీరభద్రకవి **'సన్మానంబొప్ప నొసంగెఁ బుత్రికకుఁ బల్నాడైదు దేశంబులన్'** అని పలనాటి వీరభాగవతమను పద్యకావ్యములో వ్రాసినాఁడు. 'ప్రబంధరాజ విజయ వేంకటేశ్వర విలాసము'లో గణపవరపు వేంకటకవి **'పలనాటి గొల్లల పాటజాతి'** అని వ్రాసెను. అప్పకవి **'పల్లెనాటను నూటతొంబదియు నాల్గు గ్రామముల'** అని వ్రాసెను. ఇట్లీసీమకు వివిధ నామములు ఉపయోగింపఁబడినను నేఁడు **'పలనాడు, పల్నాడు'** అను రెండు శబ్దములు మాత్రము రూఢములైనవి.

ఈ శబ్దోత్పత్తినిగూర్చి పలువురు పలువిధముల నూహించిరి. పల్లవులు పాలించుటచే **'పల్లవనాడు'** అని పేరువచ్చి, తరువాత **'పలనాడు'**గను, **'పల్నాడు'**గను మాఱినదని చిలుకూరి వీరభద్రరావు గారు 'ఆంధ్రుల చరిత్ర'లో వ్రాసియున్నారు. మెకంజీ దొరగారు, పల్లెలుండుటచే **'పల్లెనాడు'** అని వచ్చినదనియు, నచ్చట దొఱకు పాలఱాతినిబట్టి, **'పాలనాడు> పలనాడు'** అయినదనుట యింకను సమంజసమనియు నభిప్రాయపడినారు.[7] అక్కిరాజు ఉమాకాంతం గారు, పల్లముగా నుండుటచే **'పల్లునాడు'** గానై, జడ్డకు లోపము వచ్చి **'పలునాడు'**గా మాఱి, తరువాత **'పలనాడు, పల్నాడు'** అయినదని భావించిరి.[8] నేఁడు లభించుచున్న ప్రయోగములలోకెల్ల మాచెర్ల ఆదిత్యేశ్వరాలయ శాసనములోని **'పల్లిదేశ'** శబ్దము ప్రాచీనమైనది. దీనినిబట్టి రావిపాటి లక్ష్మీనారాయణగారు, పల్లెలుండుటచే **'పల్లెనాడు> పల్నాడు'** అను పేరు వచ్చియుండునని తలపోయుచున్నారు. నాకు లభించిన తాళపత్ర గ్రంథములలో **'పలినాటి వీరుల భాగవతము'** అనియు, **'పలునాటి వీరుల భాగవతము'** అనియుఁ గలదు. పాలఱాయి లభించుటచేఁ గాఁ బోలును, నాకు లభించిన కోడిపోరు ప్రథమభాగము తాళపత్ర గ్రంథమున **'పాలవాయి రెంటాల పాలబయలు చౌట'** అనియు, **'పాల్వాయి రెంటాల పాలచౌళ్లందు'** అనియు, **'మాచెర్ల పట్నమున మరి పాలచౌళ్ల'** అనియు వ్రాయఁబడి యున్నది. దీనిని బట్టి, పాలఱాయి విస్తారముగా లభించుటచే **'పాలనాడు>పలనాడు> పల్నాడు'** అయినదను మెకంజీదొరగారి యూహ సమంజసమేమో యని యనిపించుచున్నది.

## 1. పల్నాటి హైహయ రాజవంశము

పల్నాటిరాజులు హైహయవంశమునకుఁ జెందినవారు. ఇది మిక్కిలి ప్రాచీనమైన రాజవంశము. మహాభారతములోని అనుశాసనిక పర్వమునందును, హరివంశమునందును, నీ హైహయ రాజవంశ ప్రసక్తి యున్నది. ఈ రాజులు భారతదేశమున (ఉత్తరమునను దక్షిణమునను) వివిధ కాలములలో వివిధ ప్రాంతములను బరిపాలించియున్నారు. "The Haihayas distinguished themselves in the map of India - political and cultural- right upto the Maratha conquest in the North and the close of the 15th century A.D. in the South. The Haihayas of Mahakosala, the Kalachuri Haihayas of Chedi with the capital at Tripuri, the Kalachuris of Kalyani, the Malaiyamans in the district of South Arcot, the Haihayas of Kona, of Panchadharala, of Nizam's dominions and of Palnad were the important Haihaya Kingdoms in the medieval India."[9]

కాఁబట్టి, భారతదేశమునఁగల అనేక హైహయ రాజవంశములలో నాంధ్రదేశములోని పల్నాడును బాలించిన హైహయవంశ మొకటి. ఈ వంశము క్రీ.శ. 1100 నుండి 1481 వఱకును బల్నాటి సీమను బాలించినది. ఈ వంశము కోనమండల హైహయ వంశము నుండి పదునొకండవ శతాబ్ది చివరగాని, పంద్రెండవ శతాబ్ది ప్రారంభమునఁగాని చీలిపోయియుండును. ఈ పల్నాటి హైహయుల ఇంటిపేరు 'చాగి' వారు లేక 'సాగి' వారు.

పల్నాటి హైహయ వంశములోని రాజుల చరిత్రను దెలిసికొనుటకుఁ గొన్ని శాసనములును; శ్రీనాథుఁడు, మల్లయ్య, కొండయ్య, ముదిగొండ వీరభద్రకవి (1860 ప్రాంతము)– అను నలుగురు కవులు రచించిన కావ్యములును; మెకంజీ వ్రాఁతప్రతులును, స్థానిక చరిత్రలును ఆధారములుగా నున్నవి. ఈ యాధారములనుబట్టి కీ.శే. అక్కిరాజు ఉమాకాంతంగారు, శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు, శ్రీ కలవల వెంకట సుబ్బారావుగారు (మాచెర్ల), ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, కీ.శే. మల్లపల్లి సోమశేఖరశర్మగారు– మున్నగువారు పల్నాటి వీరకథాచక్రములోని చారిత్రకాంశములను దడవియున్నారు. ఈ విమర్శకులలోఁ గొందఱిచ్చిన పల్నాటి హైహయరాజ వంశవృక్షములను బరిశీలింపవలసియున్నది. అక్కిరాజువారు పల్నాటి వీరచరిత్రకుఁ దాము రచించిన ప్రథమ భూమికలోను (వావిళ్ల ప్రతి), యశోదాదేవిగారు రాజమహేంద్రవరములోని ఆంధ్ర చారిత్రక పరిశోధన సంఘమువారు ప్రకటించు పత్రిక (సంపుటము XIX) లోను, కలవల వెంకట సుబ్బారావుగారు తాము రచించిన 'భక్త పలనాటి వీరచరిత్ర' (అముద్రితము)లోను పల్నాటి హైహయరాజ వంశవృక్షముల నిచ్చియున్నారు.

## అక్కిరాజు ఉమాకాంతంగారు ఇచ్చిన పల్నాటి హైహయ వంశవృక్షము



## శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు ఇచ్చిన పల్నాటి హైహయ వంశక్రమము




## శ్రీ కలవల వెంకట సుబ్బారావుగారు (మాచెర్ల) ఇచ్చిన పల్నాటి హైహయ రాజవంశము

ఆత్రేయ గోత్రజులును, సాగివారును నగు పల్నాటి హైహయులలో విష్ణువునుండి మొదటి బేతరాజు వఱకును నిరువది తరములు చెప్పిరి: "విష్ణువు–బ్రహ్మ–జీవనాథుఁడు–సింధుసోముఁడు– బుధుఁడు– పురూరవుఁడు– పుష్పనాభుఁడు– యదురాజు– దుందుభుఁడు– శానభీతుఁడు– చంద్రుఁడు– కృతవీర్యుఁడు– కార్తవీర్యుఁడు– 0 – విజయుఁడు– అర్థవిజయుఁడు– యోజనబాహు– ఉద్దానబాహు– భీమరాజు– తంబి రుద్రరాజు– కామరాజు లేక మొదటి బేతరాజు." ఈ కామరాజు లేక మొదటి బేతరాజునుండి వంశవృక్ష మిట్లున్నది:–

**కామరాజు లేక మొదటి బేతరాజు (క్రీ.శ. 1056–1103) భార్య: మేడాంబిక**




మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పల్నాటి వీరకథలలోని చారిత్రకాంశములనుగూర్చి కొంత సంశయమును వెలిబుచ్చినారు.[10] ఆంధ్రదేశమునేలిన సామంతరాజవంశములపై సమగ్ర పరిశోధన చేసిన డాక్టరు వారణాసి యశోదాదేవిగారు మాత్రము పల్నాటి వీరచరిత్రలోని చారిత్రకాంశములను చర్చించినారు. పల్నాటి హైహయ రాజ్యము క్రీ.శ. 1103వ సంవత్సరమున 'మందడి రేవినాయకుఁ' డను సామంతుని సహాయమున స్థాపింపఁబడినది. ఈ మందడి రేవినాయకునకు 'మాహిష్మతీ దేశ రట్టడి, హైహయరాజ్య ప్రతిష్ఠాచార్య, మల్లవోలు పురవరాధీశ్వర, శనివారసిద్ధి' అను నాలుగు బిరుదు లున్నవి. ఈ రాజవంశము కోనమండల హైహయులనుండి చీలుటచేఁ గాఁ బోలును, వీరియందును ఉమ్మడి పరిపాలన (conjoint rule) కానిపించుచున్నది. చాగి బేతరాజు( (క్రీ.శ. 1103–1110)ను, ఇతని పుత్రుఁడు మొదటి వీరకాముఁడు (1111–1118)ను, ఇతని పుత్రులు రాజరాజు (1118–1129), రెండవ బేతరాజు (1118–1134) లును బల్నాటిని బాలించినట్లు శాసనములవలనఁ దెలియుచున్నది. ఇందు రాజరాజు, రెండవ బేతరాజులు క్రీ.శ. 1118 నుండి 1129 వఱకును గలిసి పాలించిరి. 1129– నుండి 1134 వఱకును రెండవ బేతరాజొక్కఁడే పాలించినట్లున్నది. ఈ రెండవ బేతరాజు తరువాత కొద్దిపాటి వ్యవధానమున్నది. ఈ వ్యవధానములోఁ బల్నాటి హైహయులు రాజ్యమును గోల్పోయియుందురు. క్రీ.శ. 1132లో గోదావరీ తీరమునఁ బశ్చిమ చాళుక్యులకు సహాయము చేయుటచేఁ దమ రాజ్యమును గోల్పోయియుందురు. తూర్పు చాళుక్యులకు సహాయము చేసిన దుర్జయులు పల్నాటి నాక్రమించి, తరువాత కొంతకాలమునకు అనుఁగురాజును హైహయునకుఁ దమ బిడ్డనిచ్చి, మరల పల్నాటి నరణముగా నిచ్చిరి. అనుఁగురాజు మొదట నుత్తరదేశమునఁగల 'పాలమాచాపురి' లేక 'జంభనాపురి'ని బాలించు చుండినట్లు తెలియుచున్నది. పల్నాటిలో నితని పరిపాలన క్రీ.శ. 1134 తరువాత రెండు మూఁడేండ్లకుఁ బ్రారంభమై క్రీ.శ. 1147 వఱకును గొనసాగినట్లు తెలియుచున్నది. రెండవ బేతరాజునకును అనుఁగురాజునకును మధ్య కొద్ది వ్యవధానముండుటయే కాక, వీరిద్దఱికిని గల సంబంధ బాంధవ్యములును దెలియుట లేదు.[11]

ముదిగొండ వీరభద్రకవి తన 'వీరభాగవతము'న అనుఁగు రాజును 'అలుగురాజు' అని పేర్కొన్నాఁడు. అంతేకాక, యీ యలుగురాజు 'సుందర చక్రవర్తి' పుత్రుఁడనినాఁడు. ఇది సరికాదు. అనుగుఁగురాజు తండ్రి వీరకామేంద్రుఁడనుటయే సమంజసము. 'సుందర చక్రవర్తి' యనునది వీరకామేంద్రుని బిరుదము కావచ్చును.

వీరభద్రకవి వీరకామేంద్రుఁడను నామమునకు బదులుగా సుందర చక్రవర్తియను బిరుదును బేర్కొనియుండును.

అనుఁగురాజునకు మైలమదేవినిచ్చి పెండ్లిచేసిన దుర్జయుఁడు రెండవ గొంకరాజు లేక వెలనాటి కులోత్తుంగచోడ గొంకరాజు (క్రీ.శ. 1132-1161). యశోదాదేవిగారే కాక మల్లంపల్లివారును నిదే యభిప్రాయమును గలిగియున్నారు.[12] ఈ రెండవ గొంకరాజునే ముదిగొండ వీరభద్రకవి ధవళశంఖుఁడని పేర్కొనినాఁడు. ఈ గొంకరాజు సహాయముతో ననుఁగురాజు తన రాజ్యమును విస్తరింపఁ జేసికొనెను. పల్నాడులో నైదుభాగములకు మాత్రమే అధిపతియగు నితఁడు తన చివరికాలములోఁ గమ్మనాటి కంతటికిని బ్రభువయ్యెను.

అనుఁగురాజు మరణానంతరము క్రీ.శ. 1147లో నలకామ రాజు రాజ్యమునకు వచ్చెను. ఇతఁడు క్రీ.శ. 1170లో రాజ్యమునకు వచ్చినట్లుగా నొక పూర్వచరిత్రకారుఁడు వ్రాసెననియు, నది సరికాదనియు యశోదాదేవిగారు ఖండించినారు.[13] అనుఁగురాజు మంత్రి దొడ్డనాయఁడు. ఇతని జ్యేష్ఠపుత్రుఁడు పెద్దన్న. బ్రహ్మనాయఁడు ఈతని ద్వితీయ పుత్రుఁడు. నలగామరాజాదులు పుట్టుటకుఁ బూర్వము అనుఁగురాజు పెద్దన్నను దత్తుచేసికొనెను. అనుఁగురాజు తరువాతఁ తన పుత్రుఁడగు పెద్దన్నయే సింహాసన మెక్కవలెనని దొడ్డనాయఁడు ఆశించెననియు, అనుఁగురాజు అందులకు సమ్మతింపకుండుటచే దొడ్డనాయఁడు తన మంత్రిత్వమును వదలుకొని, తన ద్వితీయ పుత్రుఁడగు బ్రహ్మనాయని కప్పగించెననియు, ఆ బ్రహ్మనాయఁడు అనుఁగురాజును దన తండ్రి దొడ్డనాయనిఁగూడ వధించి నలకాముని సింహాసనమెక్కించెననియు 'స్యూయల్' (Sewell) అను చరిత్రకారుఁడు వ్రాసినాఁడు.[14] కాని బ్రహ్మనాయఁడిట్లు రెండు హత్యలు చేయుటకుఁగల కారణములు మాత్రము తెలియవచ్చుట లేదని యశోదాదేవిగారు వ్యాఖ్యానించారు.

నలకామరాజునకు 'మైలలదేవి కామరాజు' అనియు, 'అనుంగు కామరాజు' అనియు నామాంతరములున్నవి. 'మైలలదేవి కొడుకైన కామరాజు' అనియు, 'అనుఁగురాజు కొడుకైన కామరాజు' అనియు వీని కర్థములు. (ఈ నామాంతరములు అనుఁగురాజునకుఁ జెందినవని పింగళివారు తలంచుట ప్రామాదికము.) క్రీ.శ. 1147లో రాజ్యమునకు వచ్చిన నలగామరాజు శాసనాధారములనుబట్టి 15 సంవత్సరములు రాజ్యము చేసినట్లు తెలియుచున్నది. కాని సాంప్రదాయిక కథలనుబట్టి అనేక సంవత్సరములు రాజ్యము చేసినట్లున్నది. పల్నాటియుద్ధమను నంతర్యుద్ధము ఈ నలగాముని కాలమున జరిగినది.[15]

## నా పరిశీలనము:-

పల్నాటి వీరకథాచక్రమునకు సంబంధించి తాళపత్ర గ్రంథములు నాకు మూఁడు లభించినవి. ఒకటి పల్నాడులోఁ గారెంపూడి గ్రామమున పల్నాటి వీరాచార పీఠాధిపతుల కడను, తక్కిన రెండు గ్రంథములును నెల్లూరు మండలమున వెంకటగిరి తాలూకా ఆల్తూరుపాడు గ్రామములోను లభ్యములైనవి. ఇంతవఱకును ముద్రితములైన గ్రంథములలో లేని కొన్ని అపూర్వ విషయములు ఈ తాళపత్రగ్రంథములలో గలవు. పైన చర్చించిన చారిత్రక పండితుల యభిప్రాయములను, నాకు లభించిన తాళపత్రగ్రంథములలోని విషయములతో సరిపోల్చుకొన్నచో మఱికొన్ని నూతనాంశములు వెల్లడియగుచున్నవి. కారెంపూడి తాళపత్రగ్రంథమున అనుఁగురాజు వంశక్రమ వర్ణనమున్నది. తెప్పలినీడు ఊరకోటరాజును జయించి అచ్చట వేయించిన శాసనములో అనుఁగురాజు పుట్టుపూర్వోత్తరములు, బ్రహ్మనాయని పుట్టుపూర్వోత్తరములు ఈ క్రింది విధముగా లిఖింపఁబడినవఁట:

*"శ్రీ పుణ్యపురుషునకు బ్రహ్మజన్మించె*
*ఆ బ్రహ్మకు నలదుండు[16] పుణ్యపురుషుందు*
*పుణ్యతాయునకును[17] పూర్వతనయుండు*
*అతనికి జన్మించినట్టి నలుగురును*
*తనయులు నల్గురిలో తగు నవుతార*
*పురుష కృతావీరు పుణ్యుదోయనగ*
*ఆ కృతావీరునకు ఆ కృతయనగ*
*సతిపతు లిద్దరికి సరగున మరియు*
*అవుతరించినవాడు ఆ కార్తవీర్య*
*దతని యున్నతమిపుడు అమరంగనిపుడు*
*పదిశత బాహులు పఱిగ నేనూఱు*
*జిహ్వలు గలిగుందు[18] ఆ నాన్వయునకును*
*పదిలక్ష సతులును బాగొప్ప నుంద్రు*
*కోటిపుత్రులు మరి నాలుగుకోట్ల*
*అల్లుంద్రు గలిగిన యట్టి రాజేంద్రు*
*పదునాల్గు కోట్లును పరగ మనుమలును*
*క్షోణి అక్షోణియు పదునొకండనగ*
*కంచు రథములు జాల గలవు అతనికి...*

*ఆ కార్తవీర్యని కటు నారొ[19] పురుష*
*వీరకామేంద్రుదు వీరమాచాంబ*
*సతిపతులిరువురకు సరగున బుట్టి*
*నట్టి యనుగురాజు నతని సోదరులు*
*బిరుదురాజను నొకదు మరి యర్థరాజు*
*తెప్పలిరాజన తేజస్సువాదు*
*అటువంటి అనుగుభూ నయోధ్యరాజు*
*సృష్టిగల రాజులు స్త్రీలను బోల*
*పుదమి నన్గురాజు పురుషుదనబోలు*
*అట ననుగురాజున కయిన ప్రధాని*

*కేతినాయని పుత్రు భేతినాయండు*
*భేతినాయని పుత్రు దొడ్డనాయండు*
*దొడ్డనాయండన దోర్బల ఘనుడు*
*శంఖుల మఠమున చెలగి వరిగున్న*[20]
*జమదగ్ని రుషియన చెలగు నామమున*
*అతని కులాంగన అయిన సుపత్ని...*

*అవుతారమెత్తేను అట్టి శీలమ్మ*
*అటు దొడ్డనాయనికి అంత శీలమకు*
*ఉదయించినట్టి యా ఉత్తమ పుత్రు*
*రేచర్ల గోత్రుండు రణసాహసుండు*
*బాదమువారింట భక్తితో నపుడు*
*జన్మించి నాతడు జగము లెఱుగగను"* [21]

దీని తరువాత, బ్రహ్మనాయఁడు దశావతారములెత్తిన విష్ణుమూర్తి యనియు, నతఁడు గొప్ప మహిమలు గలవాఁడనియుఁ, త్రికాల విషయములు తెలిసినవాఁడనియు వర్ణింపఁబడినది. కార్తవీర్యార్జునునిచేఁ జంపఁబడిన జమదగ్నియే దొడ్డనాయఁడుగా జన్మించెననియు, జమదగ్ని భార్యయగు రేణుకయే శీలమ్మ యనియు, రేణుకా జమదగ్నుల పుత్రుఁడగు పరశురాముఁడే బ్రహ్మనాయఁడుగా నవతరించెననియుఁ బై గ్రంథమునఁ గలదు.

కార్తవీర్యార్జునునకు నాఱవ తరమువాఁడు వీరకామేంద్రుఁ డని పై గ్రంథమునందుఁగలదు. ఇది సరికాదు. కార్యవీర్యార్జునుఁ డు పురాణపురుషుఁడు. ఇతడేకాలము వాఁడో చెప్పలేము. కొందఱు పరశురాముఁడు క్రీ.పూ. 1176లో కేరళ దేశమును జయించెనని చెప్పుచున్నారు. కావున, నితఁడు ఆ ప్రాంతము వాఁడే కావచ్చును. మొదటి వీరకామేంద్రుఁడు క్రీ.శ. 1111-1118లో పల్నాడును పాలించినాఁడు. ఇతనికిని కార్తవీర్యార్జును నకును రెండువేల సంవత్సరములుపైఁగా నంతరమున్నది. ఈ మధ్యకాలమున నైదుతరములు మాత్రమే కలవనుట విమర్శసహము కాదు. చారిత్రకులు తరమునకు ముప్పది సంవత్సరములు గణింతురు. అయిదు తరములనఁగా నూటయేబది సంవత్సరములకన్న మించదు. మొదటి వీరకామునిపైన నొకతరము తెలియుచునే యున్నది. ఇతని తండ్రి మొదటి బేతరాజు లేక చాగి బేతరాజు. కాఁగా, ఈ బేతరాజు నకును కార్తవీర్యార్జునకును నాలుగు తరముల భేదమే కలదని చెప్పవలసి వచ్చును. ఇది మతింత హాస్యాస్పదము.

తాళపత్రగ్రంథముల ననుసరించి, అనుఁగురాజు ఉత్తర దేశమునఁగల 'పాలమాచాపురి' లేక 'జంభనాపురి' (నేటి జబల్‌పూర్ కావచ్చును.) నుండి వచ్చిన రాజు.[22] తమ తాతయగు కార్తవీర్యార్జునుఁ డు చేసిన పాతకములను బోఁగొట్టుకొనుటకై నల్లని నూనె గుడ్డలు ధరించి తీర్థయాత్రలు చేయుచు నాంధ్రదేశమునకు వచ్చెను. అమరావతి దగ్గఱ కృష్ణానదిలో స్నానము చేయఁగా నతఁడు ధరించిన నల్లని నూనెబట్టలు తెల్లగా మాఱెనఁట. (పింగళివారు పరిష్కరించిన ప్రతిలో అనుఁగురాజు మోటుపల్లె దగ్గఱ సముద్ర స్నానము చేయఁగా నల్లగుడ్డలు తెలుపాయెనని కలదు. పల్నాటి వీరకథలను పాడు గాథాకారులు కొందఱు అనుఁగురాజు మాచెర్ల దగ్గఱ చంద్రవంకలో స్నానము చేసెననియు, నప్పుడాతని నల్లబట్టలు తెల్లగా మాఱెననియుఁ జెప్పుచున్నారు.) అప్పుడు చందవోలును బాలించుచున్న రాజు తన కూఁతురు మైలమదేవిని అనుఁగురాజునకిచ్చి వివాహము చేసి, పలనాటిసీమ నరణముగా నిచ్చెననియుఁ, గార్తవీర్యుఁడు చేసిన పాపములు జంభనాపురి పట్టణము నంటియుండుట వలనఁ దిరిగి స్వదేశమునకుఁ బోవుటకు ఇలువేల్పగు చెన్నుఁడు సమ్మతింప లేదనియు, నందుచే ననుఁగురాజు పల్నాడులో స్థిరపడెననియు నాకు లభించిన తాళపత్రగ్రంథమునఁ గలదు. ముదిగొండ వీరభద్రకవి పద్యకావ్యమునందును పూర్వకథ యిట్లే యున్నది. ఈ కవికూడ అనుఁ గురాజు 'జబలాపురంబు' (జబల్‌పూర్) నుండి వచ్చినట్లుగానే వర్ణించినాఁడు. ('కాంతా సహితంబుగా భల్లాతకి తైలార్ద్ర వస్త్రంబులు కట్టికొని జబలాపురంబుజేరి...' వీరభాగవతము.)

శాసనములనుబట్టి హైహయులు మొదట రాజ్యము చేసినది నర్మదానదీ ప్రాంతదేశము. దీనికి చేదిదేశమని పేరు. పురాణేతి హాసములలోఁ బేర్కొనఁబడిన శిశుపాలుఁడును, కార్తవీర్యార్జునుఁడును ఈ చేదిదేశమును బాలించిన హైహయరాజులు. నేఁటి జబల్‌పూర్ (మధ్యప్రదేశ్) చుట్టుప్రక్కల దేశమే నాఁటి చేదిదేశము. హైహయ వంశస్థుఁడగు అనుఁగురాజు ఈ చేదిదేశములోని జంభనాపురము నుండి ఆంధ్రదేశమునకు వచ్చియుండును. ఈతఁడిట్లు వలస వచ్చుటకుఁ గారణము తాళపత్రములలోఁ జెప్పఁబడినట్లు పాపవిమోచనమున కనుట చారిత్రక సత్యము కాదు. చేదిదేశము నేలెడి హైహయరాజులకు మహమ్మదీయులవలనఁగాని, యితర శత్రురాజులవలననఁగాని వచ్చిన యొత్తిడి కారణమై యుండును. ఇట్లు దక్షిణదేశమునకు వలసవచ్చినవాఁడు అనుఁగురాజనుట కూడ నమ్మఁదగినది కాదు. ఏలన, అనుఁగురాజునకు ముందే హైహయులలో రెండు మూఁడు తరములు పలనాడును పాలించినట్లు శాసనాధారములున్నవి. కాఁబట్టి అనుఁగురాజునకుఁ బూర్వులెవరో ఉత్తరదేశమునుండి వచ్చియుందురు. అనుఁగురాజును నయోధ్య రాజని వీరగాథలలోఁ బేర్కొనుట కవిసమయమువంటిది. ఉత్తర హిందూదేశమునుండి వచ్చిన ప్రతిరాజును అయోధ్యరాజనుట మన కవులకుఁ బరిపాటి. ఈ హైహయుల రాజధాని జంభనాపురమే కాని అయోధ్య కాదు.

అనుఁగురాజునకు ముగ్గురు భార్యలు: వీరవిద్యాదేవి (వీరవిజ్జలదేవి), భూరమాదేవి, మైలమదేవి (మైలలదేవి). ఇందు వీరవిద్యాదేవి పట్టపురాణియని తెలియుచున్నది. అనుఁగురాజు ఈమెనే

మొదట పరిణయమాడియుండును. తరువాతఁ దన యాత్రలలోఁ గాశియందు భూరమాదేవిని, ఆంధ్రదేశమున చందవోలునందు మైలమదేవిని బెండ్లియాడినట్లు వీరగాథలలోఁ గలదు. ఈ ముగ్గురు రాణుల వైవాహిక క్రమమిట్లున్నను, సంతానవతులగుటలో మాత్రము మైలమదేవి ప్రథమురాలు, భూరమాదేవి ద్వితీయురాలు, వీరవిద్యాదేవి తృతీయురాలు. ఈ రాజ్ఞీత్రయమందు అనుఁగురాజునకు ఎనమండుగురు కుమారులు ఉదయించిరి. మైలమదేవికి నలగాముఁడు (లేక రెండవ వీరకాముఁడు); భూరమాదేవికి కామరాజు, నరసింగరాజు, పెరుమాళ్లరాజు, ఝుట్టిరాజు అను నలుగురు పుత్రులును; వీరవిద్యలదేవికి పెదమలిదేవుఁడు, పినమలిదేవుఁడు, బాలమలిదేవుఁడను ముగ్గురు పుత్రులును జన్మించినట్లు వీరగాథలను బట్టి తెలియుచున్నది. నాకు లభించిన కారెంపూడి తాళపత్రగ్రంథమున నలగామరాజాదుల జననక్రమ మిట్లు వర్ణింపఁబడియున్నది:-

*"అంత ననుగురాజు కాపత్నులైన*
*<u>వీరవిజ్జలదేవి</u> యిటు పెద్దభార్య*
*మరియు <u>భూరమాదేవి</u> <u>మైలమాదేవి</u>*
*యీ సతులకు పుత్రులిక పెద్దదనగ*
*వీరవిజ్జలదేవి కింటివేల్పనగ*
*చెన్నుని నోములు చెలియంత నోమె*
*మరియు భూరమాదేవి <u>మైలమాదేవి</u>*
*పార్వతీశ్వరు నోము పరగ నోమగను*
*<u>మైలమాదేవికి</u> మరియు <u>నలగాము</u>*
*భూరమాదేవికి పుత్రులనంగ*
*<u>కామరాజును</u> బుట్టె కదురమ్యముగను*
*<u>నరసింగరాజు</u>ను నంత <u>పెరుమాళ్లు</u>*
*<u>ఝుట్టిరాజ</u>నగను జయశీలుడతడు*
*ఈ తీరు జన్మించిరింతుల కపుడు*
*సంతానమీరీతి చాలబుట్టగాను*
*వీరవిజ్జలదేవి కిష్టవేల్పనగ*
*చెన్నుని వ్రతములు చాల నోమగను*
*ఆ చెన్నుడపుడు ఆ సతిని మెచ్చ*
*<u>ముగురు మలిదేవులు</u> మోదమున నపుడు*
*జయశీలు రనగను జన్మించిరపుడు."* [23]

ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్కరించిన గ్రంథములో జ్యేష్ఠానుక్రమము తప్పినను పుత్రులు మాత్రము ఎనమండుగురే యనియు, వారు పై విధముగనే ఆయా రాణులకుదయించి రనియుఁ జెప్పఁబడినది (చూ. పల్నాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రచురణ, పుట 30). నాకు లభించిన తాళపత్రగ్రంథమున భూరమాదేవి పుత్రుల క్రమము 'కామరాజు, నరసింగరాజు, పెరుమాళ్లరాజు, ఝుట్టిరాజు' అని యుండఁగా, పింగళివారి ప్రతిలో మూడవవాఁడు ఝుట్టిరాజుగను, నాల్గవవాఁడు పెరుమాళ్లరాజుగాను నున్నారు. అంతేకాక పింగళివారి ప్రతిలో మొదట వీరవిద్యలదేవి సంతానము, తరువాత భూరమాదేవి సంతానము, ఆ పిమ్మట మైలమదేవి సంతానము చెప్పఁబడినది. దీనినిబట్టి యిదియే జ్యేష్ఠానుక్రమమని చదువరులు పొరఁబడవచ్చును. రాణులకిది జ్యేష్ఠానుక్రమమైనను సంతానమునకు మాత్ర మిది కాదు. అనుఁగురాజు పుత్రులెనమండుగురిలోను నలగామరాజు పెద్దవాఁడు. ఇతని తరువాత భూరమాదేవి పుత్రులు పుట్టిరి. వీరుపుట్టిన తరువాత చాలాకలమునకుఁగాని వీరవిద్యలదేవి పుత్రవతి కాలేదు. మలిదేవత్రయము నలగామాదుల కన్న వయసులో మిక్కిలి చిన్నవారు. కావున నేను పైనుదాహరించిన క్రమమే సక్రమమైనది.

భూరమాదేవి పుత్రులలో పెరుమాళ్లరాజు-ఝుట్టిరాజులలో నెవరు పెద్దయను విషయమంత ముఖ్యమైనది కాదు. ఇందెవరు పెద్దయైనను నొక్కటే. కాని అనుఁగురాజు సంతానములో నలగామరాజు తరువాత ద్వితీయస్థాన మెవరిదియను ప్రశ్న మాత్రము విషమ సమస్యగాఁ బరిణమించినది. జన్మక్రమమునుబట్టి చూచినచో భూరమాదేవి పుత్రులలో జ్యేష్ఠుఁడగు కామరాజునకు ద్వితీయస్థానము రావలెను. ఇతఁడే యౌవరాజ్య పదవిని జేపట్టియుండవలసినది. కాని వీరగాథలలో నితనికేవిధమగు ప్రాముఖ్యమును లేకపోఁగా, నితని తరువాతివాఁడగు నరసింగరాజు యువరాజుగా నత్యంత ప్రధాన పాత్రను నిర్వహించియున్నట్లు స్పష్టమగుచున్నది. దీనికి సమాధానమో యనునట్లుగా శ్రీ కలవల వెంకట సుబ్బారావుగారు నలగామరాజును నరసింగరాజును నొకేతల్లిబిడ్డలు, అనఁగా నిరువురును మైలమదేవి పుత్రులేయని సూచించినారు. భూరమాదేవి జ్యేష్ఠపుత్రుఁడగు కామరాజును వీరు చెప్పలేదు. ఆమెకు గట్టురాజు, పెరుమాళ్లరాజు అను నిర్వురు పుత్రులు కలరని తెల్పినారు. వీరు చెప్పిన దానినిబట్టి నరసింగరాజు యొక్క ద్వితీయస్థానము నిరాక్షేపణీయమగుచున్నది. పల్నాటివీరకథలను గానముచేయు 'వీరవిద్యావంతు'లను గాథాకారులు కూడ నలగాముఁడును నరసింగరాజును మైలమదేవి పుత్రులేయని చెప్పుచున్నారు. కారెంపూడిలో నున్న పల్నాటి వీరాచార పీఠాధిపతులగు శ్రీ పిడుగు నరసింహంగారుకూడ నిదే యభిప్రాయమును వెలిబుచ్చినారు. పల్నాటి ప్రజలలో నీ వాడుక ప్రచురముగా నున్నది. అనఁగా నలగామునకుఁ బెద్దతమ్ముఁడు నరసింగరాజు. ఇరువురును నేకగర్భవాసులు; మైలమదేవి కన్న కొడుకులు. అందువలననే నలగాముఁడు రాజునుగా, నరసింగరాజు యువరాజుగాను వీరగాథలలో మనకు ద్యోతకమగుచున్నారు. భూరమాదేవి పుత్రులందఱును నరసింగరాజుకన్న చిన్నవారే.

పై యభిప్రాయము నాకు సమంజసముగనే తోఁచుచున్నది. నరసింగరాజు నలగాముని తరువాతివాఁడు కానిచో నతఁడు యువరాజువలెఁ బ్రవర్తించుట పొసగదు. పల్నాటి వీరగాథావృత్తమున నితఁడత్యంత ప్రధానపాత్రను నిర్వహించినాఁడు. నాగమ్మ

సహాయమున రాజ్యమును కబళింపనెంచి, అలరాజుహత్యలోఁ బాలుపంచుకొనినాఁడు. మలదేవాదుల సైన్యమునకు బాలచంద్రుఁడు సైన్యాధ్యక్షుఁడు కాఁగా, నలగాముని సైన్యములకు ఈ నరసింగరాజు నాయకత్వమును వహించినాఁడు. కావున నితఁడు భూరమాదేవి ద్వితీయ సుతుండగుచో నింతటి ప్రాముఖ్యము నందుటకు వీలు కలుగదు. ఇతఁడు మైలమదేవి సుతుఁడైనను లేక భూరమాదేవి సుతుఁడైనను మొత్తమునకు వయస్సులో నలగాముని తరువాతివాఁడనుట సత్యము. అంతేకాని వీరగాథలలోనున్నట్లుగా నితడు భూరమాదేవికి ద్వితీయ పుత్రుఁడనుట పొసగదు. అనుఁగురాజు పుత్రులెనమండుగురిలోను నలగామరాజు, నరసింగరాజు, పెదమలి దేవుఁడు– ఈ ముగ్గురును రాజకీయ ప్రాధాన్యముగల వ్యక్తులుగాఁ బల్నాటి వీరకథాచక్రమందంతటను మనకు గోచరింతురు. పల్నాటి వీరగాథలలోఁ బెదమలిదేవుని తమ్ముల ప్రసక్తియైనను గొంత కలదు కాని, భూరమాదేవి పుత్రులుగాఁ జెప్పఁబడిన 'కామరాజు, ఝట్టిరాజు, పెరుమాళ్లరాజు'ల ప్రసక్తి బొత్తిగా లేదు. వీరవిద్యావంతులు కామరాజును గూర్చి యేమియుఁ జెప్పరు కాని, ఝట్టిరాజు పెరుమాళ్ల రాజులు మాత్రము బాల్యమందే గతించిరని చెప్పుచుందురు. భూరమాదేవికిఁ బ్రముఖుఁడైన పుత్రుఁడు లేకపోవుటచేతనే ఆమెను గూర్చిన శాసనములేవియు లభ్యమగుటలేదు. నలగాముఁడును, మలిదేవుఁడును దానమిచ్చిన దానశాసనములలోఁ దమ తమ తల్లుల నామములు లిఖించి యున్నారు. కాఁబట్టి నరసింగరాజు మైలమదేవికి ద్వితీయ పుత్రుఁడైనను గావలెను, లేదా మైలమ యేకపుత్రికయని భావించినచో, నితఁడు భూరమాదేవి జ్యేష్ఠపుత్రుఁడైనను గావలెను.

ముదిగొండ వీరభద్రకవి తన వీరభాగవతమున 'నలసింగరాజు' అను వింతనామమును సృష్టించినాఁడు. 'రలయో రభేదః' అను సూత్రము ననుసరించి నరసింగరాజునే యితఁడు నలసింగరాజుగా సంభావించెనని తలంపవచ్చును. కాని, వీరభద్ర కవి ఈ నలసింగరాజే వేఁటకుఁ బోయినట్లును, నట నాగమ్మచే సత్కృతుఁడైనట్లును, బ్రహ్మనాయని మంత్రిపదవినుండి తప్పించినదీ నలసింగరాజే యనియు వ్రాసినాఁడు. దీనినిబట్టి వీరభద్రకవి నలగామరాజునే నలసింగరాజుగాఁ బేర్కొనినట్లు భావింపవలసి యున్నది. కాని, చివరలో బాలచంద్రుఁడు చంపినదీ 'నలసింగరాజు'నే యని వ్రాసినాఁడు. మొత్తమునకు వీరభద్రకవి 'నలసింగరాజు' శబ్దము నస్తవ్యస్తముగాఁ బ్రయోగించినాఁడని చెప్పవలసియున్నది. లేదా యిది ముద్రాపకుల దోషమైనను గావచ్చును. వీరభద్రకవి రచించిన తాళపత్ర గ్రంథమును జూచి కాని యే విషయమును జెప్పఁజాలము.

నలగామరాజునకు వీరకామేంద్రుఁడను నామమే కాక "మల్లాలదేవి కామరాజు (మైలలదేవి కామరాజు), అనుగు కామరాజు (అనుంగు కామరాజు, అనుగుం గామభూపతి), అయిహయవంశ కామరాజు"– అను మఱి మూఁడు నామములున్నవని శాసనములను బట్టి తెలియుచున్నది. ఇందు మొదటిది ఈతని తల్లియగు మైలమదేవి (మైలలదేవి) ని బట్టియు, రెండవది తండ్రియగు నసుఁగురాజును బట్టియు, మూఁడవది వంశమునుబట్టియు వచ్చిన నామములనుట నిస్సంశయము. తలిదండ్రులనుబట్టి యిట్టిపేర్లు వచ్చుట నేఁటికిని గలదు. బ్రహ్మనాయని తల్లిపేరు శీలమ్మ. అందుచే నతనిని 'శీలమ బ్రహ్మి', 'శీలమ బ్రహ్మనాయఁడు' అని పిలుచుచున్నట్లు వీరగాథలలో సాక్ష్యములున్నవి. బ్రహ్మనాయని యింటిపేరు బాదంవారైనను, బాదం బ్రహ్మనాయఁడను పేరు వ్యాప్తియందు లేదు; శీలం బ్రహ్మనాయఁడనియే వాడుక. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు తమ పల్నాటి వీరచరిత్ర పీఠికలో క్రీ.శ. 1147లో రాజ్యమునకు వచ్చిన నలగామరాజును అనుఁగురాజుగా భ్రమించి, యీ భ్రమకారణముగా 'అనుంగు కామరాజు', 'మైలలదేవి కామరాజు' అను పేర్లను సమర్థించుటలోఁ బ్రమాదమునకు లోనైరి (చూ. విశాలాంధ్ర ప్రతి పీఠిక, పుటలు 9, 10). భార్యనుబట్టి అనుఁగురాజునకు 'మైలలదేవి కామరాజు' అని పేరువచ్చినదని చెప్పి, 'సీతారాముఁడు, రాధాకృష్ణుఁడు' దీనికుదాహరణములుగాఁ జూపిరి. ఇది సరికాదు. వీరిచ్చిన యుదాహరణము లెక్కువగా 'సీతారాములు, రాధాకృష్ణులు' అని ద్వంద్వ సమాసములుగాఁ బ్రయోగింపబడుచుండును; విశేషణ పూర్వపద కర్మధారయములుగా వీని ప్రయోగము మిక్కిలి తక్కువ. భారతాది గ్రంథములలో 'కుంతీసుతుఁడు, గాంధారీనందనుఁడు' ఇత్యాది ప్రయోగములున్నవి కాని, 'ద్రౌపదీభర్త, భానుమతీపతి' యను రీతిగాఁ బ్రయోగములు లేవు. పౌరాణిక ప్రయోగముల మాట యెట్లున్నను, చరిత్రలో మాత్రము పలువురు రాజులు తమతమ తల్లుల పేర్లతోఁ బిలువఁబడినట్లు సాక్ష్యములు కొల్లలుగా నున్నవి. 'మురి' యను స్త్రీకిఁ బుట్టినరాజు 'మౌర్యచంద్రగుప్తుఁడు'; శీలమ్మ కొడుకు 'శీలమ బ్రహ్మనాయఁడు'; అట్లే మైలలదేవి కొడుకు 'మైలలదేవి కామరాజు'– అని పిలువఁబడెననుట సమంజసము. (మైలమదేవికి 'మైలలదేవి, మల్లాలదేవి' అను నామాంతరములున్నవి.) ఈ మైలమదేవి పుత్రుఁడగు కామరాజు నల్లనివర్ణమువాఁడని నేనూహించుచున్నాను. భూరమాదేవి జ్యేష్ఠపుత్రుని పేరును కామరాజే; మైలమదేవి పుత్రుని పేరును కామరాజే. వీరిరువురను వేరుపఱచుటకుఁ గాఁబోలును, ప్రజలు శరీరచ్ఛాయ నాధారముగాఁ జేసికొని మైలమపుత్రుని 'నల్లకామరాజు' (ఇదియే క్రమముగా జడ్డకు లోపము వచ్చి 'నలకామరాజు', సరళాదేశముచే 'నలగామరాజు'గా మాఱినది) అనియుఁ, తల్లియగు మైలలదేవి నాధారముగాఁ జేసికొని 'మైలల కామరాజు' అనియుఁ బిలిచియుందురని నా యూహ. పై చర్చలను సమన్వయ పఱచి హైహయరాజుల వంశక్రమము నిట్లు చూపవచ్చును:–

## కారెంపూడిలో నాకు లభించిన తాళపత్త్రగ్రంథము ననుసరించి పల్నాటి హైహయరాజ వంశక్రమము



## చారిత్రకముగా (శాసనాదులనుబట్టి) పల్నాటి హైహయరాజ వంశక్రమము

పల్నాటిరాజుల వంశము 'హైహయవంశము'. వీరు కార్తవీర్యార్జునుని సంతతివారు. వీరి యింటిపేరు: 'చాగివారు' లేక 'సాగివారు'. పల్నాటి హైహయరాజుల పాలనాకాలము: క్రీ.శ. 1100 నుండి 1481 వఱకు. ఇది కోనమండల హైహయులలోని ఒక శాఖ. వీరి మూలపురుషుఁడు 'సాగి బేతరాజు'.



## వెలనాటి దుర్జయులు లేక వెలనాటి చోడులు (గొంక రాజులు)

అనుఁగురాజునకు మైలమదేవినిచ్చి పెండ్లిచేసిన 'చందోలురాజు' వెలనాటి దుర్జయవంశమునకుఁ జెందినవాఁడు (రెండవ గొంకరాజు). ఈ వంశములో 'చోడ, గొంక' అను నామధేయములుండుట వలన వీరిని 'వెలనాటి చోడు' లనియు, 'వెలనాటి గొంకరాజు' లనియుఁ బిలుతురు. ఈ రాజులు క్షత్రియులు కారు, చతుర్థ కులజులు. వీరి రాజధాని సనదప్రోలను నామాంతరముగల ధనదుప్రోలు. ఇది గుంటూరు జిల్లా, రేపల్లె తాలూకాలోని ఇప్పటి 'చందవోలు'. వీరు చాళుక్య చోళుల సామంతులు.

**సామంతులు**
**(వెలనాటి చోడులు)**

**మొదటి గొంకయ (క్రీ.శ. 1076-1108)**

**మొదటి కులోత్తుంగ రాజేంద్ర చోడయ (1108-1132)**

- **రెండవ కులోత్తుంగ చోడ గొంకరాజు, లేక రెండవ గొంకరాజు (1132-1161)** (అనుఁగురాజునకుఁ బిల్లనిచ్చిన దీతఁడే)
  - **రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడయ (1161-1181)** (ఇతఁడు స్వతంత్రుఁడయ్యెను. పల్నాటి యుద్ధమీతని కాలముననే జరిగినది. ఇతని భార్య పేరు అక్కమదేవి)
    - **మూఁడవ గొంకరాజు (1181-1186)**
      - **పృథ్వీశ్వరుఁడు (1186-1203)** (ఇతఁడు 1203లో కాకతి గణపతిదేవునిచేఁ జంపఁబడెను)
  - **మైలమదేవి** **(భర్త: అనుఁగురాజు)**
- **సబ్బాంబిక** **(భర్త: కోట దొడ్డభీమరాజు)**

**చక్రవర్తులు**
**(చాళుక్య చోళులు)**

**మొదటి కులోత్తుంగ రాజేంద్రచోడ చక్రవర్తి (క్రీ.శ. 1070-1120)**

**విక్రమ చోడుఁడు (1118-1135)**

**ఇమ్మడి కులోత్తుంగ రాజేంద్ర చోడుఁడు (1133-1150)**

**రెండవ రాజరాజ చోడుఁడు (1145,46-1173)**

(ఆధారము:- మల్లంపల్లి సోమశేఖరశర్మగారి 'చాళుక్య చోళులు' వ్యాసము, తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటి-1, పుటలు 218, 219.)

## నాకు లభించిన తాళపత్రగ్రంథముల ననుసరించి అలరాజు వంశక్రమము:

అలరాజుది 'చోడవంశము', 'కాశ్మీర గోత్రము', వీరు కల్యాణపట్టణము నేలెడి రాజులు. తాళపత్రముల ననుసరించి అలరాజు మూలపురుషుఁడు– 'గణపతి వీరసోమరాజు'. ఇతనికిఁ బదునొకండుగురు సోదరులు గలరట. వారి పేర్లు వరుసగా 'అల్లాంరాజు, భల్లాణరాజు, గయ గంగరాజు, గయ చోడరాజు, వీర సోమరాజు, విజయ సోమరాజు, కంచు సోమరాజు, పెంచు సోమరాజు, నంది సోమరాజు, నాగ సోమరాజు, జల సోమరాజు.




---

**చారిత్రికుల దృష్టిలో:–**

### కల్యాణి కలచూరులు (క్రీ.శ. 1156–1181)

**కృష్ణ (మూలపురుషుఁడు)**

**కన్నమ**

**రాజ**

**అమ్ముగి** | **శంకమ–I** | **జోగమ**

జోగమ → **పెర్మాడి లేక హెమ్మాడి క్రీ.శ. 1129**
(చాళుక్య మూఁడవ సోమేశ్వరుని సామంతుడు)

**బిజ్జల క్రీ.శ. 1147–1165 లేక 1168**
(బిరుదులు: 'త్రిభువన మల్ల, నిశ్శంక మల్ల, శనివార సిద్ధి, గిరిదుర్గ మల్ల' ఇతఁడు చాళుక్య రెండవ జగదేకమల్లునకు సామంతుఁడుగానుండి, మూడవ తైలపుని కాలములో క్రీ.శ. 1156లో స్వతంత్రుఁడయ్యెను. 1160 నాటికి కల్యాణము నాక్రమించెను.)

| | | | | |
|---|---|---|---|---|
| **సోమేశ్వర (క్రీ.శ. 1165 లేక 1168–1177)** (నామాంతరములు: 'సోమదేవ, సోవిదేవ'. బిరుదము: 'రాయ మురారి') | **శంకమ–II (క్రీ.శ. 1177–1180)** | **ఆహవ మల్ల (క్రీ.శ.1180–1183)** (ఇతఁడు 1181లో కల్యాణమును గోల్పోయెను) | **సింఘణ (1183–1184)** (చాళుక్య నాల్గవ సోమేశ్వరుని సామంతుఁడు) | **సిరియాదేవి** (భర్త: రెండవ సింద చావుండ. 'ఏరంబరగె' పాలకుఁడు) |

క్రీ.శ. 1184 తరువాతఁ గల్యాణము నేలిన కలచూరి వంశమునుగూర్చి తెలియుట లేదు.

చారిత్రకాధారము: D.C. Ganguly, Later Chalukyas and Kalachuris of Kalyana, Bharatiya Vidya Bhavan's History and Culture of The Indian People, Volume V, pp. 179-182.

### నాకు లభించిన తాళపత్రగ్రంథము ననుసరించి బ్రహ్మనాయని వంశక్రమము

| | | |
|---|---|---|
| బ్రహ్మనాయని గోత్రము | - | రేచర్ల గోత్రము |
| ఇంటి పేరు | - | బాదరాజువారు |
| తల్లినిబట్టి వచ్చిన పేరు | - | శీలం బ్రహ్మనాయఁడు |
| మూలపురుషుఁడు | - | కేతినాయఁడు |



నలగామరాజాది పుత్రులెనమండుగురును బుట్టుటకుఁ బూర్వము అనుఁగురాజు సంతానమునకై పరితపించుచుఁ దనమంత్రి యగు రేచర్ల దొడ్డనాయని జ్యేష్ఠకుమారుఁడు పెద్దన్న ('బాదనాయఁడు'–'బాదరాజు' అని నామాంతరములు) ను బెంచుకొనుచుండెను. ఈ పెద్దన్నకుఁ గంచెర్లపట్టణమునేలు కృష్ణగంధర్వుని కుమార్తె లఘువమ్మను బెండ్లిచేసెను. ఈ పెద్దన్న పల్నాటి వీరులఱువది యార్గురలోను బ్రథముఁడు. 'పెద్దన్న బాదరాజు'– 'అన్న పెద్దన్న' అను పేర్లు వీరగాథలలోఁ బెద్దన్నపరముగాఁ గానవచ్చుచున్నవి. ఈ పెద్దన్న అనుఁగురాజునకు దత్తపుత్రుఁడు. నలగామరాజాదులు పుట్టుటకుఁ బూర్వమే అనుఁగురాజునకుఁ బెంపుడుకొడుకు. అందుచే నితఁడు రాజ్యమునకు వారసుఁడని దొడ్డనాయఁడు భావించుటలోఁ దప్పులేదు. పెద్దన్నకు రాజ్యము రావలెనని తలంచిన దొడ్డనాయఁడు తన మంత్రి పదవిని త్యజించెననియు, నతని ద్వితీయపుత్రుఁడు బ్రహ్మనాయఁడు ప్రధానమంత్రిపదవిని గ్రహించి, అనుఁగురాజును తనతండ్రి దొడ్డనాయని సంహరించి, నలగాముని సింహాసనమెక్కించెననియు 'స్యూయల్' చరిత్రకారుఁడు వ్రాసినట్లుగా శ్రీమతి వారణాసి యశోదా దేవిగారు పేర్కొన్నారు. కాని బ్రహ్మనాయడిట్లు రెండు హత్యలు కావించుటకుఁగల కారణములను మాత్రము ఆమె యూహింపలేక పోయిరి.

అపరవిష్ణుమూర్తిగను, పరశురాముని యవతారముగను, పల్నాటి కృష్ణునిగను బూజింపఁబడుచున్న బ్రహ్మనాయఁడు, అనుఁగురాజును దనతండ్రి దొడ్డనాయని హత్యచేసెనని 'స్యూయల్' చరిత్రకారుఁడు వ్రాయుట పలువురకు ఆశ్చర్యమును గల్గింపవచ్చును, నమ్మశక్యము గాకపోవచ్చును. కాని నాకుఁ గారెంపూడిలో లభించిన తాళపత్రగ్రంథమున రెండు తావులందీ విషయమును (బ్రహ్మనాయఁడు కావించిన హత్యావిషయమును) బలపఱుచు పంక్తులున్నవి. నాగమ్మ, వేటకువచ్చిన అనుఁగురాజును సత్కరించి, ఆతని మెప్పు సంపాదించి, బ్రహ్మనాయనిపైఁ గొండెములు చెప్పఁదొడంగెను. ఆ కొండెములలో, బ్రహ్మనాయఁడు గర్వముతో అనుఁగురాజునకు నమస్కరించుటలేదనునది యొకటి. బ్రహ్మనాయఁడు సభలోనికి వచ్చినప్పుడు అనుఁగురాజునకు నమస్కరింపకపోవుట యథార్థమే. అందుచే అనుఁగురాజు నాగమ్మ కొండెములను విశ్వసించి బ్రహ్మన్న గర్వమునుగూర్చి దొడ్డనాయనిఁ బ్రశ్నించెను. దొడ్డనాయఁడు పుత్రునితో నీ విషయమును జెప్పెను. బ్రహ్మన్న, తానవతార పురుషుఁడననియు, నందుచేఁ దాను నమస్కరించినచో అనుఁగురాజు మరణించుననియుఁ దెల్పెను. దొడ్డనాయఁడు తన మంత్రిత్వమును త్యజించి, బ్రహ్మనాయనికి ఆ యుద్యోగమిచ్చెను. బ్రహ్మన్న ప్రధాన మంత్రిత్వమును స్వీకరించి అనుఁగురాజు సభలోనికి వచ్చి, అనుఁగురాజును సింహాసనమునుండి లెమ్మని చెప్పి, ఆ సింహాసనమునకుఁ జేతులెత్తి నమస్కరించెను. వెంటనే యా సింహాసనము పెరిల్లున పగిలి ముక్కలుముక్కలై పోయెను. ఆ ముక్కలలో ఒక ముక్క వచ్చి అనుఁగురాజు వీపునకుఁ దగిలెను. దానితో నతఁడు మంచముపట్టి యమయాతన పడుచుండెను. ఆ బాధను భరింపలేక అనుఁగురాజు, ఆ బాధనుండి తన్ను రక్షించి కైలాసమునకుఁ బంపుమని బ్రహ్మనాయనిఁ గోరెను.[24] బ్రహ్మన్న యందులకంగీకరించెను. కాని, అనుఁగురాజు, తానొంటరిగాఁ బోజాలననియుఁ, దనకుఁదోడు నొసఁగవలసిన దనియు వేఁడికొనెను అందుచే బ్రహ్మనాయఁడు తన తండ్రికి వార్త నంపి, అతనిని గూడఁ కైలాసమునకుఁ బయనము కమ్మని చెప్పి, యిరువురను బరలోకమునకుఁ బంపించెను. ఇది నాకు లభించిన తాళపత్ర గ్రంథమున మంజరీ వికారమగు రచనలోఁగల విషయము. కవిత్వము కావునఁ గొలఁది యాచ్ఛాదనమున్నది కాని, హేతువాద దృష్టితో నీ కథను బరిశీలించినచో బ్రహ్మనాయఁడు తన తండ్రిని, అనుఁగురాజును హత్యచేసెనని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. బ్రహ్మనాయని యందు అమిత పక్షపాతముతో వ్రాయఁబడిన యీ పల్నాటి వీరగాథలలో నతనికి దైవత్వమారోపింపఁబడి, యాతఁడు కావించిన దారుణహత్య, కోరినవారిని క్షణములోఁ గైలాసమునకుఁ బంపఁగల యలౌకికశక్తిగా నిరూపింపఁబడినది.

నాకు లభించిన పై తాళపత్రగ్రంథమందే వేఱొక తావునందుఁ గూడ బ్రహ్మనాయని రాజహంతగా నిరూపించునంశమున్నది. నాగమ్మచే మండాదిలో మందపోటు జరిగిన పిమ్మట బ్రహ్మనాయఁడు మిక్కిలి కోపించి, తాను గురిజాల పట్టణమును బొడిచివత్తుననియు, నందుల కనుజ్ఞ నీయవలసినదనియు మలిదేవరాజును గోరును. అప్పుడు మలిదేవరాజు, "ఓ బ్రహ్మనాయఁడా, నీ చేత నా తండ్రి మృతిఁ జెందెను. నీటముంచినను పాలముంచినను నీదే భారము" అనును.

*"మసలక గురిజాల మరువ పొడుతు*
*............... (శిథిలము)................*
*సెలవియ్యి రాజేంద్ర! సెలవియ్యి రాజా!"*
*ఆ మాటవిని బాల (మలిదేవరాజు)*
*"వినవయ్య నాయుడ నా విన్నపంబు*
*నీ చేత మృతిబొందె నపుడు నా తండ్రి*
*అన్గురాజేంద్రుండు అతివేగముననుు*
*మ్రొక్కువేసిన ఘనత మిక్కుటంబాయె*
*............ (శిథిలము).... దప్పేరు*
*పాలనేతను ముంచి పాలించవయ్య*
*ఏమేలు జేసిన ఇదియు నీ మేలు"*
*అని పల్కి రాజంత అటు...* [25]

దీనినిబట్టి పరిశీలించినను అనుఁగురాజు మరణమునకు బ్రహ్మనాయఁడే కారణమని తెలియుచున్నది.

బ్రహ్మన్న దైవాంశ సంభూతుఁడని నిరూపించుటకు మాత్రమే పై విధముగాఁ గవి కల్పించెననియు, దానిచే బ్రహ్మన్నను హంతగా నిరూపించుట తగదనియు నెవరైన వాదింపవచ్చును. పల్నాటి వీర కథలన్నియును బ్రహ్మనాయని విష్ణ్వంశ సంభూతునిగా నిరూపించు కథలనుట సత్యమే. అయినను బ్రహ్మనాయని కుచ్చితత్త్వమును, రాజకీయపుటెత్తుగడలను, కుట్రలను నిరూపించు కథలుకూడ నొకటి రెండు లేకపోలేదు. ఉదాహరణకు, అలరాజు మరణమునకు బ్రహ్మనాయఁడే ప్రధానకారకుఁడని నిరూపించు కథ యొకటి పల్నాడులో నాకు లభించినది. దీనిపేరు 'అలరాచమల్లుగారి గురిజాల రాయబారము'. దీనికి సంబంధించిన రెండు ప్రతులు గలవు. ఒకటి తాళపత్రప్రతి, మఱియొటి కాగితపుఁబ్రతి. అలరాజు మహాబలవంతుఁడనియు, నాతనివలనఁ దనకు ముప్పువాటిల్లఁగలదనియు భయపడి, బ్రహ్మనాయఁడు మాయోపాయముచే నలరాజును రాయబారిగాఁ బోవుటకొప్పించి, గురిజాలకుఁ బంపినాఁడు. అట నాగమ్మచే నితఁడు హతుఁడగునని బ్రహ్మనకుఁ దెలియును. తెలిసియే పంపినాఁడు. అట్లు పంపునప్పుడు తన పుత్రుల్యుఁడగు కన్నమదాసును తోడిచ్చి, అలరాజు నొకరీతిగను, కన్నమదాసును వేఱొకరీతిగను దీవించినాఁడు బ్రహ్మన్న. కన్నమను పోయిరమ్మనినాఁడు; అలరాజును పొమ్మనినాఁడేగాని, పోయిరమ్మనలేదు. బ్రహ్మనాయని దీవెనలోని కాపట్యమును గ్రహించిన అలరాజు తల్లి చల్లమాదేవి యిట్లు వాపోయినది:–

***"ఓ యన్న నాయుడా! ఓ నీలవర్ణ!***<br>
***కపటనాటక సూత్రధారి! ఓ కార్యవేది!***<br>
***కపటబుద్ధులు నీవు ఏల గైకొంటివయ్య?***<br>
***నాయుడ బ్రహ్మ! నీవు***<br>
***పొమ్మన్నవారికి పోకటే నిజము***<br>
***రమ్మన్నవారికి రాకటే నిజము***<br>
***నా కుమారుని పొమ్మంటివి***<br>
***నీ కొమారుని పోయిరమ్మంటివి***<br>
***నా కొమారుని బంప నాయముగాదయ్య నాయుదు బ్రహ్మ."[26]***

బ్రహ్మనాయఁడు దైవాంశసంభూతుఁడనియు, ధర్మమూర్తి యనియు గ్రుడ్డిగా నమ్మువారికీ కథ విద్యుద్ఘాతము వంటిది. (పింగళి వారి ప్రతిలోనున్న 'అలరాజు రాయబారము'లో నీ విషయములు లేవు. అది ప్రమాణప్రతి కాదు. పల్నాటి వీరకథాచక్రములో నొక్క బాలచంద్రుని యుద్ధము తప్ప తక్కినవేవియును తెలుఁగు సాహిత్య లోకమున కింతవఱకును సమగ్రముగాఁ దెలియవనుట సత్యము. పింగళివారి ప్రతియే యీ సత్యమును జాటుచున్నది.)

అలరాజు హత్యకు బ్రహ్మనాయఁడే ప్రధానకారణమని నిరూపించు నీ కథను క్రీ.శ. 1862లో వీరభాగవతమును రచించిన ముదిగొండ వీరభద్రకవి కూడ గ్రంథస్థము చేసినాఁడు. అలరాజు పెద్దనల యాశ్వికులు కలహించుట, పెద్దన్నపేర నలరాజు తన గుఱ్ఱము కాలికి బొమ్మకట్టుట, వారిరువురును ద్వంద్వయుద్ధము చేయుట, బ్రహ్మనాయఁడు వారి పోరును మాన్పి, అలరాజు దురహంకారము నణఁచుటకై సంధికిఁబంపనెంచుట, పెక్కు మిషలచేత వీరులను అలరాజు తల్లిదండ్రులను ఒప్పించి యాతనిని సంధికిఁ బంపుట, అలరాజుతల్లి యెదురుగాఁ దాను అలరాజు మెడలో వేసిన తులసి వనమాలను (ఇది మృత్యువునుండి కాపాడు నట్టి వనమాల) మాయోపాయమున బాలచంద్రునిచేఁ దస్కరింపఁజేయుట– మున్నగు బ్రహ్మనాయని కుట్రలన్నియును వీరభద్రకవి విపులముగా వర్ణించినాఁడు. ఈ కథ బ్రహ్మనాయని పాత్రలోని నీలినీడలను స్పష్టముగాఁ బ్రదర్శించుచున్నది.

గురిజాలలో ననేక సంవత్సరములు తెలుఁగు పండితుఁడుగాఁ బనిచేసి, పల్నాటి వీరగాథలనుగూర్చి పరిశోధించి, దానిని పద్యకావ్యముగా వెలయించిన కీ.శే. ఏటుకూరి వెంకట నరసయ్యగారు కూడ బ్రహ్మనాయని మాయోపాయములను, ఓర్వలేనితనమును, కౌటిల్యమును దెలుపు నీ కథను తమ 'అలరాజు' పద్యకావ్యమున కెక్కించినారు. కాబట్టి, ఈ యలరాజు కథలోని బ్రహ్మనాయని పాత్రను బట్టి కూడ ఇతఁడు అనుఁగురాజును దొడ్డనాయని జంపియుండునని సులభముగా నూహింపవచ్చును.

అనుఁగురాజు నాగమ్మను జేరనిచ్చుచుఁ దన్ను అలక్ష్యము చేయుచున్నాఁడనియు, తనతండ్రి తరువాత ప్రధానమంత్రి పదవి తనకు రాకుండ నాగమ్మ హరించుననియు భయపడి, బ్రహ్మనాయఁడు అనుఁగురాజును తన తండ్రిని సంహరించి, తన చెప్పుచేతులలో నుండునను నమ్మకముతో నలగాముని సింహాసనమెక్కించి యుండును. బ్రహ్మనాయని యందలి పక్షపాతముతో వ్రాసిన యీ గాథారచయిత యీ విషయమును మసిపూసి మారేడుకాయఁ జేసినాఁడు. బ్రహ్మనాయఁడు నమస్కరింపఁగా సింహాసనము ముక్కలగుట, యా ముక్క వచ్చి యనుఁగురాజు వీపునకుఁ దగులుట, దానిచే నతఁడు బాధపడగా బ్రహ్మన యతనిని గైలాసమునకుఁ బంపుట, (వైష్ణవుఁడగు బ్రహ్మనాయఁ డితనిని వైకుంఠమునకుఁ బంపక, కైలాసమున కేల పంపెనో తెలియరాదు), అనుఁగురాజుతోపాటు నిక్షేపముగా నింటకాలక్షేపము చేయుచున్న దొడ్డనాయఁడుకూడఁ దోడుగాఁ బంపఁబడుట– మున్నగునవి యీ పాక్షికకవి చేసిన విమర్శ సహములుకాని కల్పనలు. ఎచటికైనను తోడువత్తురు కాని, చనిపోవునప్పుడు తోడువచ్చువారు ఈ ప్రపంచమున నుందురా? అట్లు తోడువచ్చుట కూడ నైచ్ఛికముగా జరుగలేదు, బ్రహ్మనాయని యాజ్ఞానుసారము జరిగినది. దీనినిబట్టి బ్రహ్మనాయఁడు తన ప్రాధాన్యమును గాపాడుకొనుటకు అనుఁగురాజును దొడ్డనాయని సంహరించె ననుటలో సందేహము లేదు.

బ్రహ్మనాయని తరువాత చర్యలు కూడఁ బై విషయములకుఁ బోషకములుగా నున్నవి. తాను నమ్మి ప్రతిష్ఠించిన నలగాముఁడు కూడ నాగమ్మ కనుసన్నలలో మెలఁగుచున్నాఁడని తెలియఁగనే, బ్రహ్మన సైన్యాధ్యక్షుఁడగు కన్నమనీని లోఁబఱుచుకొని, గురిజాల కోటను దిగ్బంధము చేసి, కన్నమను బంపి మలిదేవాదులకుఁ బాలుపంచుమని నలగామును భయపెట్టినాఁడు. పెద్దఱికమును వెలుఁ గఁబెట్టెడి తాను నలగాముని స్వేచ్ఛగా నడుగవచ్చును గదా? ఇట్లు బందిపోటువలెఁ గోటను దిగ్బంధము చేయవలసిన యావశ్యకమేమి? ఇది తన మంత్రిత్వమును నిలువఁబెట్టుకొనుటకై బ్రహ్మన చూపిన దౌష్ట్యము తప్ప వేఱుకాదు. కోటను దిగ్బంధము చేసినప్పుడు నలగాముఁడు కన్నమతో పలికిన పలుకులు ఈ విషయమును స్పష్టము చేయుచున్నవి:

*"కంఠమ్ముపై బ్రహ్మి ఖడ్గమ్ము మోపి*
*అన్నదమ్ముల పాళ్ల నడుగగానేల?*
*నయశాలియైనట్టి నాయుడు వచ్చి*
*ఎవరి భాగము వారి కిప్పింప తగును*
*కాదందునా నేను కన్నమ, చెపుమ? "* [27]

అసలు, నలగామునకుఁ దనతల్లి పక్షమున నరణముగా వచ్చిన రాజ్యములో సవతితల్లిబిడ్డలును, కనిష్ఠులును నగు మలిదేవరాజులకు హక్కెట్లుండునో నాకు బోధపడకున్నది. ఈ యన్యాయము రాజపుత్ర జ్యేష్ఠులకు భారతకాలమునుండియు జరుగుచునే యున్నది.

పై చర్చనుబట్టి, బ్రహ్మనాయఁడు అనుఁగురాజును దొడ్డనాయని సంహరించి, నలగాముని సింహాసనమెక్కించెనను 'స్యూయల్' చరిత్రకారుని వ్రాఁతలు విశ్వసింపఁదగినవనియు, వీనికి వీరగాథల సాక్ష్యముకూడ లభించుచున్నదనియుఁ దేలుచున్నది. అంతేకాదు, దైవాంశసంభూతుఁడని పల్నాటి కృష్ణుఁడని ప్రసిద్ధికెక్కిన బ్రహ్మనాయఁడుకూడ కొన్ని విషయములలో పరమ లౌకికుఁడనియు, శ్రీకృష్ణునివంటి తెలివిగల రాజకీయవేత్తయనియు; ధర్మస్వరూపుఁడని పేరుగాంచిన యీ బ్రహ్మనాయఁడు నిజమునకు ధర్మరాజువంటి "మెత్తని పులి" యనియు విశదమగుచున్నది.

## 2. యుద్ధకాల నిర్ణయము

పల్నాటి యుద్ధకాలమునుగూర్చి ప్రముఖ చారిత్రక విమర్శకులును పండితులును విశేషముగా శ్రమించి, అతికష్టము మీఁదఁ గొన్ని నిర్ణయములు కావించి, యుద్ధకాలమును క్రీ.శ. 1181 ప్రాంతమని నిశ్చయించిరి. శ్రీయుతులు అక్కిరాజు ఉమాకాంతంగారు, చిలుకూరి వీరభద్రరావుగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు, ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, శ్రీ కలవల వెంకట సుబ్బారావుగారు– వీరు పల్నాటి యుద్ధకాల నిర్ణయము చేసిన విమర్శకులు.

అక్కిరాజు ఉమాకాంతంగారు పల్నాటి వీరకథాచక్రమునఁ బేర్కొనఁబడిన కొందఱు చారిత్రక పురుషులను, కొన్ని సంఘటనలను, శైవ వైష్ణవ మత ప్రసక్తులను ఆధారముగాఁ జేసికొని యుద్ధకాలమును నిర్ణయించిరి. ఇందు వారు సేకరించిన తాళపత్రప్రతులు విశేషముగాఁ దోడ్పడినవి. [28]

### 2.1. వైష్ణవమత ప్రసక్తి:–

బ్రహ్మనాయఁడు వైష్ణవమతము నవలంబించినట్లును, కన్నమ నీనివంటి నిమ్నకులములవారుకూడ నీ మతమును స్వీకరించినట్లును పల్నాటికథలలోఁ గలదు. అందుచే రామానుజుఁడు వైష్ణవమతమును స్థాపించిన తరువాతనే యీ యుద్ధము జరిగియుండును. రామానుజుఁడు క్రీ.శ. 1017లో జన్మించెను. కావునఁ బల్నాటి యుద్ధము క్రీ.శ. పదనొకండవ శతాబ్దమునకుఁ బూర్వము జరుగలేదు.

### 2.2. శైవమతము– లింగపూజ, జంగముల ప్రసక్తి:–

'అలరాచమల్లుగారి గురిజాల రాయబారము' అను కథలో అలరాజు భోజనము చేయుటకుఁ బూర్వము లింగపూజ చేసినట్లును, రాయబారమునకుఁ బోవుటకుముందు లింగపూజ చేసి విభూతిరేఖలు దిద్దినట్లును గలదు. [29] అతని భార్య రత్నాలపేరమ్మ సహగమనము చేయుటకుఁ బూర్వము జంగములను బిలిపించి సత్కరించినది. [30] రాచగావుకథలో నలరాజు తాత వీరసోముఁడు శివనందులకోటకై దండెత్తిపోవునప్పుడు అతనితో వడియజంగాలు వేలకొలఁది పోయిరని వర్ణింపఁబడినది. ఇట అక్కమహాదేవి, కక్కయ్య, నిజలింగ చిక్కయ్యవంటి శివభక్తులపేర్లు కూడఁ జెప్పఁబడినవి:–

*"గుఱి శివనందుల కోటకు వారు*
*యుద్ధసన్నద్ధులై ఉర్వి కంపింప*
*వారి తోడనె కూడి వడియజంగాలు*
*నల్లబొంతలవారు నాలుగువేలు*
*..............................*
*వారి పేరులు కొన్ని వరుస జెప్పెదను*
*మేదయ్య పడమటి మేటి బస్వయ్య*
*బోడశివయ్య బొబ్బోడి బుగ్గయ్య*
*..............................*
*కఱకంఠ లింగయ్య కల్యాణ బసువ*
*అక్కయ్య కక్కయ్య ఆదిమల్లయ్య*
*..............................*
*నిజలింగ చిక్కయ్య నీలకంఠయ్య*
*ఉరమున లింగాలు మెఱసెడివారు*
*గళముల రుద్రాక్ష కలిగినవారు"* [31]

దీనినిబట్టి లింగధారిమతము స్థాపింపఁబడి, జంగములు బయలుదేరిన తర్వాతనే పల్నాటియుద్ధము జరిగెనని చెప్పవచ్చును. లింగధారిమతము బసవేశ్వరునిచే స్థాపింపఁబడినది. ఇతఁడు కల్యాణము నేలిన బిజ్జలుని దండనాథుఁడు. ఈ బిజ్జలుఁడు పశ్చిమ చాళుక్యుఁడైన రెండవ తైలపుని సామంతుఁడు. ఈ తైలపుని కాలము క్రీ.శ. 1150–1163. కాఁబట్టి యీ యుద్ధము క్రీ.శ. 1150 తరువాతనే జరిగియుండును.

## 2.3. కల్యాణరాజగు వీరసోముని కూఁతురును మలిదేవుఁడు వివాహమాడుట:–

మలిదేవుఁడు మాచెర్ల రాజ్యమును పొందిన తరువాత, కల్యాణము నేలుచుండిన వీరసోముని కూఁతురు సిరాదేవిని బెండ్లియాడినట్లుగా వీరగాథాచక్రమునఁ గలదు. ఈ వీరసోమున కేడ్గురు సోదరులును, నలుగురు పుత్రులును, నొక పుత్రికయుఁ గలరని అక్కిరాజువారికి లభించిన ప్రతిలోఁ గలదు. (నాకు లభించిన ప్రతిలో వీరసోమునకుఁ బదునొకండుగురు తమ్ములున్నారు.) కల్యాణపురము నేలిన కలచూరివంశపు రాజులలో (వీరును హైహయులలో నొక శాఖయే యని శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు తెల్పియున్నారు) నొక వీరసోముఁడును, చాళుక్యవంశపు రాజులలో నల్వురు వీరసోములును గలరు. చాళుక్య వీరసోములలో మొదటి మువ్వురును బసవేశ్వరునకుఁ బూర్వులే. కావున, మలిదేవుని మామ చాళుక్య నాల్గవ వీరసోముఁడు గాని, కలచూరి వీరసోముఁడు గాని కావలెను. చాళుక్య వీరసోముని కాలము క్రీ.శ. 1179–1190. కలచూరి వీరసోముని కాలము క్రీ.శ. 1165–1176. కలచూరి రాజులు పశ్చిమ చాళుక్యులకు సామంతులు. కాని క్రీ.శ. 1151 లోఁగలచూరి బిజ్జలుఁడు చాళుక్య చక్రవర్తియగు మూఁడవ తైలపునిపై దిరుగఁబడి, 1156లోఁ గల్యాణకటకము నాక్రమించెను. ఈ బిజ్జలుని కుమారుఁడే కలచూరి వీరసోముఁడు. కల్యాణమును గోల్పోయిన చాళుక్య తైలపుని రెండవ కుమారుఁడు నాల్గవ వీరసోమేశ్వరుఁడు. ఇతఁడు క్రీ.శ. 1182లోఁ గల్యాణమును దిరిగి స్వాధీనము చేసికొనెను.

అలరాజు రాయబారము నాఁటికి మలిదేవుని మామయగు వీరసోముఁడు మరణించెనని వీరగాథలనుబట్టి తెలియుచున్నది. మలిదేవుని పెండ్లికాలమున మాత్రము ఇతఁడు జీవించియే యున్నాఁడు. (ఈ పెండ్లికిని రాయబారమునకును బదిసంవత్సరముల వ్యవధానమున్నది.) అలరాజు రాయబారము కథలోఁ గొమ్మరాజు భార్య చల్లమాదేవి బ్రహ్మనాయనితో నిట్లనెను:

*"వినవయ్య నాయుడ విన్నవించెదను*
*తరుణి మా యత్తకు తనయు లేడుగురు*
*ఏడ్వురి కొక్కడె యెలమి నా సుతుడు*
*కల్యాణమేలుచు ఘనుఁడు మా మామ*
*ఆడదేవత గొల్చి హరిపురి కేగె*
*బదుగురు తనయులు బదితెర్వులైరి."* [32]

అలరాజు రాయబారము జరిపిన సంవత్సరములోనే పల్నాటి యుద్ధము జరిగినది. (అలరాజు హత్య వినిన వెంటనే మలిదేవాదులు కోపోద్రిక్తులై యుద్ధమును బ్రకటించిరి.) చాళుక్య వీరసోముఁడు 1182లోఁ గల్యాణమును స్వాధీనము చేసికొని, పల్నాటి యుద్ధము జరిగిన తరువాతఁగూడఁ గొన్నినాళ్లు రాజ్యమేలినట్లు చరిత్ర చెప్పుచున్నది. కావున నితఁడు మలిదేవునకుఁ గూఁతునిచ్చుట సంభవము కానేరదు. మలదేవుని మామయగువాఁడు బసవేశ్వరునకుఁ దరువాతివాఁడును, బెండ్లికాలమున జీవించియున్నవాఁడును, రాయబార కాలమున లేక యుద్ధకాలమున మరణించిన వాఁడును నయి యుండవలెను. క్రీ.శ. 1165–1176లోఁ బాలించిన కలచూరి సోమేశ్వరునియందే యీ లక్షణములు కన్పట్టుచున్నవి. కావున నితఁడే మలిదేవుని మామయుఁ, గొమ్మరాజు తండ్రియు, నలరాజు పితామహుఁడును నగు వీరసోముఁడు.[33]

యుద్ధకాలమునాఁటికిఁ గలచూరి వీరసోముఁడు మరణించి యుండుటచే నీ యుద్ధము క్రీ.శ. 1176 తరువాతనే జరిగియుండవలెను. యుద్ధకాలమునాఁటికి గలచూరి వంశము మిక్కిలి క్షీణదశయందున్నదనియు, క్రీ.శ. 1182 నాఁటికిఁ బూర్తిగ నశించినదనియుఁ దెలియుచున్నది. 1182లో చాళుక్య నాల్గవ వీరసోముఁడు కల్యాణమును స్వాధీనము చేసికొని కాలచుర్యులను బూర్తిగ నణఁగఁ ద్రొక్కెను. కాఁబట్టి పల్నాటి యుద్ధము క్రీ.శ. 1182కు పూర్వము కడు స్వల్పకాలముననే జరిగియుండవలెను. యుద్ధకాలమునఁ గల్యాణమున కలచూరివంశము క్షీణదశలో నున్నదనుటకు 'కొమ్మరాజుయుద్ధ' మను వీరగాథలో నంకాళశక్తి బ్రహ్మనాయనితోఁ బలికిన యీ క్రింది వాక్యములు ఉదాహరణములు:

*"శీలము రఘురామ చెప్పెద వినుము*
*మావారు కల్యాణమందున నుండి*
*ఘనరాజ్య సంపదల్ కడకు బోదోలి*
*పొలుపొందగా విష్ణుపోరు కందఱము*
*లోనయి వచ్చుట లోకంబు లెఱుగు*
*నీవు పెట్టిన చిక్కు నీ వెఱుంగుదువు*
*అందఱ మాయచే హతము గావించి*
*పరగ నీ విటువంటి పని యూహచేసి*
*నన్నెడబాపుట న్యాయమా నీకు?"* [34]

కల్యాణ కలచూరులకు అంకాళశక్తి యిలవేల్పనియుఁ, గొమ్మరాజు మరణముతో నామె నిరాశ్రయురాలైన దనియుఁ బై వాక్యములవలనఁ దెలియుచున్నది.

## 2.4. కోట కేతరాజు:-

యుద్ధప్రారంభమునకు ముందు నాయకురాలు సంధికై బ్రహ్మనాయని యొద్దకుఁ బంపిన రాయబారులలో కోటకేతుని నామమున్నది.[35] శాసనాధారములనుబట్టి యితఁడు ధరణికోటరాజ నియు, నీతని పరిపాలనాకాలము క్రీ.శ 1182-1240 అనియుఁ దెలియుచున్నది. పల్నాటి యుద్ధము ఈ రాజు సింహాసనము నధిష్ఠింపక పూర్వమే జరిగినదని తెలియుచున్నది. ఏలయన, నలగాముఁడు వ్రాసిన లేఖలలో నాఁడు ధరణికోటనేలురాజు భీమదేవుఁడని కలదు.[36] ఈ భీమదేవుఁడు కోటకేతుని తండ్రి. ఇతని కాలము క్రీ.శ. 1140-1182. పల్నాటి యుద్ధము జరుగునప్పటికిఁ గోటకేతుఁడు సింహాసన మధిష్ఠింపకపోయినను, రాయబారము వంటి రాచకార్యములు నిర్వర్తించుటకుఁ దగిన వయస్సు కలవాడై యుండును. కావున పల్నాటి యుద్ధము క్రీ.శ. 1182కు పూర్వము కొద్దికాలము క్రిందటనే జరిగియుండును. క్రీ.శ. 1176-1182 మధ్యకాలమున నెప్పుడో జరిగియుండునని చెప్పవచ్చును.

## 2.5. వీర భల్లాణుఁడు:-

నలగాముఁడు, యుద్ధమునఁ దనకు సాయము చేయవలసి నదిగా లేఖలు వ్రాసినవారిలో వీరభల్లాణుఁడును గలఁడు ('వీరప్రతాపుడౌ వీరసేనునకు, వీరభల్లాణునకు విక్రమపతికి').[37] లింగాయతమతము స్థాపింపఁబడిన తరువాత నున్నది, రెండవ వీర భల్లాణుఁడు. ఇతఁడు ద్వారసముద్రము రాజధానిగా క్రీ.శ. 1173 నుండి 1224 వఱకును రాజ్యము చేసెను. కాఁబట్టి పల్నాటి యుద్ధము క్రీ.శ. 1173 నకుఁ బూర్వము జరుగలేదు. ఇట్లే 'సాగి పోతరాజు' (క్రీ.శ. 1199కిఁ బూర్వమువాఁడు) కూడ నలగామునకు సహాయముగా వచ్చినట్లున్నది.

## 2.6. వెలనాటి చోడుఁడు:-

మందపోటుకథలో నాగమ్మ, వెలనాటి చోదుని సాహాయ్య మర్థించుమని నలగామునితోఁ జెప్పినట్లుగాఁ గలదు:

*"ఏందత్తైనను మననేమి చేసెదరు?*
*భల్లాణదేవుండు పంచపాండ్యుండు*
*తెలియగ విజ్జల దేశింగు విభుడు*
*కాశీమహారాజు గంగుదయుండు*
*వెలనాటి చోడుడు విక్రమాఢ్యుండు*
*మలిదేవుడన్నను మందుచుందుదురు."* [38]

ఇందు పేర్కొనఁబడిన వెలనాటి చోడుఁడు, అనుఁగురాజు నకుఁ బిల్లనిచ్చిన రెండవ గొంకరాజు (వెలనాటి కులోత్తుంగ చోళ గొంకరాజు (క్రీ.శ. 1132-1161) కుమారుఁడగు వెలనాటి కులోత్తుంగ రాజేంద్రచోడుఁడు. ఇతనిని రెండవ చోడరాజందురు. వెలనాటి చోడుఁడనియు నితనికి నామాంతరము. ఇతనికి కాలమును అక్కిరాజువారు క్రీ.శ. 1158-1200 అని ఇచ్చిరి. కాని మల్లంపల్లి వారు క్రీ.శ. 1161-1181 అనిరి. ఇతఁడు వెలనాటిని స్వతంత్ర ప్రతిపత్తితోఁ బాలించిన దుర్జయరాజు. (ఈ వెలనాటి చోడుఁడు మైలమదేవికి సోదరుఁడు, నలగాముని మేనమామ, పిల్లనిచ్చిన మామ కూడఁ గావచ్చును.)

పై విధముగాఁ జర్చించి, అక్కిరాజు ఉమాకాంతగారు ఈ పల్నాటి యుద్ధము క్రీ.శ. 1178-1182 మధ్యకాలములో జరిగెనని తీర్మానించిరి. పింగళి లక్ష్మీకాంతంగారుకూడ నిట్లే గ్రంథస్థ సాక్ష్యములనుబట్టి, ఈ యుద్ధము క్రీ.శ. 1181-82 మధ్యకాలమున జరిగియుండునని యూహించిరి. వీరు, అనుఁగురాజుయొక్క పలనాటి రాజ్యసంపాదనము, మలిదేవుఁడు కల్యాణరాజు కుమార్తెను వివాహమాడుట, కార్యమపూడి యుద్ధము- అను మూఁడు ప్రధానమైన చారిత్రక ఘట్టముల ననుసరించి యుద్ధకాలమును నిర్ణయించిరి. ఈ మూఁడింటికిని గ్రంథస్థ సాక్ష్యములున్నవి. ఈ మూఁడింటిలోఁగూడ వీరు కార్యమపూడి యుద్ధమునఁ బాల్గొన్న లేదా సహాయము చేసిన కాకతీయ రుద్రదేవుఁడు లేక మొదటి ప్రతాప రుద్రుఁడు (క్రీ.శ. 1158-1195), ధరణికోట భీమదేవుఁడు (క్రీ.శ. 1153-1182), కోటకేతన్న (1182-?)- అను ముగ్గురు చారిత్రక పురుషుల నాధారముగాఁ జేసికొని చర్చ సాగించిరి. "పల్నాటి యుద్ధము క్రీ.శ. 1181-82ల మధ్యకాలమున జరిగియుండునని ఊహించుట అసమంజసము కాదు. యుక్తులు వేరైనను శ్రీ అక్కిరాజు ఉమాకాంతముగారును యుద్ధకాలము నిట్లే నిర్ణయించిరి. శ్రీయుతులు చిలుకూరి వీరభద్రరావుగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగార్ల అభిప్రాయమును ఇదియే"[39] అని పింగళివారు తీర్మానించిరి. అక్కిరాజువారు తమ పీఠికలోఁ బలువురు చారిత్రక వ్యక్తులను జర్చించిరి కాని, కాకతి ప్రతాపరుద్రుని (రుద్రమదేవుని) ప్రసక్తి తీసికొని రాలేదు. బహుశః ఈ ప్రసక్తియున్న పాదములు వారికంటఁ బడియుండవు.

'మెకంజీ' లిఖితగ్రంథములను విమర్శించిన 'విల్సన్' (Wilson) దొర పల్నాటి యుద్ధకాలమునుగూర్చి యిట్లు వ్రాసినాఁడు: ''Account of seven year war from 1080 A.D. to 1087, which was carried by Brahma Nayudu and twelve others land-holders and graziers against two towns, Gurzala and Macherla in Palnad country and which originated in a dispute at a cook-fight.''[40] కాని, ఈ 'విల్సన్' తానిట్లు నిర్ణయించిన యుద్ధకాలమున కేవియాధారములో చెప్పలేదు. గతానుగతికులైన 'Taylor' మున్నగు పాశ్చాత్య పండితులిట్లే నిరాధారములును, విపరీతములును నగు వ్రాంతలను వ్రాసినారు. 'స్యూయల్' (Sewell) చరిత్రకారుఁడు ఈ పల్నాటి యుద్ధమును పదునాల్గవ శతాబ్దమున జరిగినట్టుగాఁ జెప్పుట మిక్కిలి హాస్యాస్పదముగా నున్నది.

యుద్ధప్రారంభమున నలగాముండు, సహాయము నర్థించుచు వివిధ రాజశేఖరులకు లేఖలు వ్రాసినట్లుగా వీరగాథలలోఁ గలదు. ఈ రాజన్యుల నామములనుబట్టి పల్నాటియుద్ధము క్రీ.శ. 1178–1185 మధ్యకాలమున జరిగినదని శ్రీమతి వారణాసి యశోదాదేవి గారు నిశ్చయించినారు. నలగాముండు ఈ క్రింది రాజులకు లేఖలు వ్రాసెను:–

*"మామ గుండముకోట మనుజేశునకును*
*ధరణికోటపురికి దక్షుడైనట్టి*
*భీమదేవుండును పృథ్వీశునకును*
*గోలంకిభర్తకు ఘూర్జరపతికి*
*ఉరగసేనుండను ఉర్వీశునకును*
*ఏడుమాడెములేలు ఎరుకు కామునికి*
*పొన్నాళ్ల భూపతి పొదిలె రాజులకు*
*కటకాధిపతికిని కల్వరాయనికి*
*దేవాద్రి నేలెడు తెలుగు బిడ్డలకు*
*పెద్దబాహు భూపతి భీమసేనులకు*
*సూర్యకుమారాఖ్య చోళరాజునకు*
*సంగ్రామ విజయుడౌ జయదేవునకును*
*జయసింగు నృపతికి చంద్రాద్రిపతికి*
*ధీరవిక్రముడైన తిరునాళ్లపతికి*
*ప్రాభవాఢ్యుడు వీరభల్లాణునకును*
*అరవ సింగాళ్లున కర్ణమాపతికి*
*బంగాళపతికిని పాండ్యేశునకును*
*మళయాళ కర్ణాట మానవేంద్రులకు*
*వ్రాయించి పంపిన..."* [41]

ఇందుఁ బేర్కొనఁబడిన రాజులను బరిశీలించి యశోదాదేవి గారిట్లు వ్రాసిరి: "The battle must have been about A.D. 1178 to 1185 as the most of the kings mentioned above, live at that time, or a little earlier from A.D. 1176 to 1182." [42]

శ్రీ కలవల వెంకట సుబ్బారావుగారు తమ 'భక్త పలనాటి వీరచరిత్ర' యను పరిశోధన గ్రంథమున నీ యుద్ధము క్రీ.శ. 1180–81లో జరిగినదని వ్రాసిరి. ఒక్క యుద్ధకాలమునే కాక, శాసన సహాయమునను కథాభాగముల యాధారమునను వీరచరిత్రలోని ప్రధాన ఘట్టముల కన్నిటికిని వీరు కాలనిర్ణయము చేసి చూపినారు:

| | | | |
|---|---|---|---|
| బాలచంద్రుని జననము | క్రీ.శ. | 1153 | ఆరంభము |
| కుక్కుటాహవము<br>మండాది వలస<br>బాలచంద్రుని వివాహము | ,, | 1173 | |
| మందపోటు | క్రీ.శ. | 1176 | |
| త్రిపురాంతకము, మేడపి వలసలు | ,, | 1177 | ఆరంభము |
| అలరాజు రాయబారము | ,, | 1180–81 | |
| వీరయుద్ధము | ,, | 1180–81 | |

**నలగామునకు సహాయము చేసినవారు:**

1. భీమసేనుఁడు క్రీ.శ. 1140–1182
   కోటకేతుఁడు ,, 1182–1240
2. వీరభల్లాణుఁడు (బల్లాల–II) ,, 1173–1220
3. రుద్రదేవుఁడు (ప్రతాపరుద్ర–I) ,, 1158–1196
4. ధనర దాస్యుఁడు (ధనదుపురము =చందోలు) వెలనాటి గొంక–II) ,, 1137–1162
   చోడ–II... ,, 1163–1180
   గొంక–III (?)....... ,, 1181–?
5. బర్బరపతి, మాళవాధీశుఁడు, కేరళవిభుఁడు, కర్నాట భూమీశుఁడు.

**మలిదేవునకు సహాయులుగా నుండఁదగినవారు:**

1. సోవిదేవ లేక సోమేశ్వర క్రీ.శ. 1167–1177
2. ఆహవమల్ల ,, 1180–1181
   వీరిద్దఱును బిలువఁబడినట్లు లేదు
3. ఆవాల నాయఁడు, సుంకర నాయఁడు, చెవుల నాయకులు, జంగిలి నాయకులు, పెలమాలవారు, సంపెట నారన్నలు, మన్నెదార్లు.
4. కొమ్మభూమీశుఁడు.

క్రీ.శ. మల్లంపల్లి సోమశేఖరశర్మగారుకూడ యుద్ధకాలమును క్రీ.శ. 1176–1182 మధ్య జరిగినదని నిర్ణయించిరి: "పలనాటి వీరచరిత్రలో నుదాహృతులైన చారిత్రకవ్యక్తుల ననుసరించి ఈ యుద్ధము శకవర్షములు 1098–1104 మధ్య జరిగినట్లు విశద మగును... నలగామరాజునకు సాయముగ కాకతి రుద్రదేవరాజు కారెంపూడికి కొంతసైన్యముతో వచ్చెనని పలనాటి వీరచరిత్ర తెలుపుచున్నది. కళచురి సైన్యముకూడ పెదమల్లిదేవునికి సహాయముగ వచ్చెనేమో; ఈ సందర్భమున కావచ్చును వెలనాటి రాజ్యముపై కల్యాణము రాజధానిగ పరిపాలించుచుండిన కళచురి సైన్యము కావణయ్య దండనాయకుని ఆధిపత్యమున సంకమదేవుని రాజ్యకాలములో వెలనాటి రెండవ కులోత్తుంగ చోదరాజ్యముపై దండెత్తి వచ్చినది. సంకమదేవుఁడు వీరబిజ్జలరాయని కుమారుడు. వీరసోమేశ్వరుని తరువాత కల్యాణ కటకము రాజధానిగా శకము

1099–1100ల నుండి పరిపాలించిన అతని సోదరుడు. పెదమల్లి దేవరాజునకు సాయముగ వచ్చినచో ఈ కారెంపూడి యుద్ధము సంకమదేవుడు రాజ్యమునకు వచ్చిన తరువాత శకవర్షము 1099–1100 లకును, 1104 కు మధ్య జరిగియుండవలెను. మొత్తము మీద అతడు సాయముగ వచ్చినను యుద్ధమున పెదమల్లిదేవునకు విజయము లభింపలేదు. మల్లిదేవునకు సాయముగ వచ్చెనను విషయము ఎంతవరకు సత్యమో తెలియదు."[43]

పలనాటి హైహయలు మొట్టమొదట పశ్చిమ చాళుక్యులతోఁ గలసి తెలుఁగుదేశమునకు వచ్చియుందురు. వీరిది చాగివంశము. ఋగ్వేదము పదపాఠము నధ్యయనము చేసిన కామనూరి బ్రాహ్మణుఁడొకఁడు మాధవీపట్టణము (గురిజాల) లోఁ గట్టించిన త్రిమూర్త్యాలయమునకు, 'బిరుదంక రుద్ర' బిరుదాంకితుఁడైన మహామండలేశ్వర చాగి బేతరాజు కొంత భూమి దానముచేసి సౌమ్య సంవత్సరమునకు సరియైన శకవర్షము 1051 (క్రీ.శ. 1129)లో వ్రాయించిన శాసనమున భూలోకమల్ల సోమేశ్వర చక్రవర్తిని దన యధిపతిగాఁ బేర్కొన్నాఁడు. దీనినిబట్టి పలనాటి హైహయులు పశ్చిమ చాళుక్యులకు సామంతులని తెలియుచున్నది. వెలనాటి దుర్జయులుకూడఁ బశ్చిమ చాళుక్యులచే జయింపఁబడి సామంతులైరి. ఇది వెలనాటి కులోత్తుంగ రాజేంద్రచోదుని కాలమున (క్రీ.శ 1108–1132) జరిగినది. ఇతని కుమారుఁడైన వెలనాటి కులోత్తుంగ చోడ గొంకరాజు (రెండవ గొంకరాజు) చోళులతోఁ గుట్రపన్ని, పశ్చిమ చాళుక్యులను వేంగినుండి తఱిమివేసెను. ఈ సందర్భముననే చాగివారు పల్నాటిని గోల్పోయిరి. ఈ రెండవ గొంకరాజు అనుఁగురాజునకు తన కూఁతురు మైలమదేవి నిచ్చి వివాహము చేసి, తిరిగి పల్నాటి నరణమిచ్చెను. ఈ రెండవ గొంకరాజు పాలనా కాలము క్రీ.శ. 1132–1161. ఈ రెండవ గొంకరాజు సోదరి 'సబ్బాంబిక'ను కోట రెండవ భీమరాజు (క్రీ.శ. 1140–1182) వివాహమాడెను. ఈ దంపతులకుఁ బుట్టినవాఁడే రెండవ కోట కేతరాజు (క్రీ.శ. 1183–1240). పల్నాటియుద్ధ ప్రారంభమున నలగాముని పక్షమున రాయబారము నెఱపిన దీతఁడే.

అనుఁగురాజు మామగారైన వెలనాటి రెండవ గొంకరాజు పుత్రుఁడు రెండవ చోడరాజు. ఇతని పూర్తిపేరు రెండవ వెలనాటి కులోత్తుంగ రాజేంద్ర చోడరాజు– (క్రీ.శ. 1161–1181). అనఁగా నితఁడు మైలమదేవి సోదరుఁడు, నలగాముని మేనమామ, పిల్లనిచ్చిన మామకూడ కావచ్చును. ఏలయన, నలగాముఁడు యుద్ధమున సహాయము నర్థించుచు వివిధ రాజన్యులకు లేఖలు వ్రాయు సందర్భమున 'మామగు తమ గొంక మహిపాలునకును' అని మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారప్రతిలో నున్నది. (Madras Government Oriental Manuscripts Library- సంక్షిప్తముగా 'మద్రాసు GOML'). (అక్కిరాజువారి ప్రతిలో 'మామ గుండముకోట మనుజేశునకును' అని యున్నది. పింగళివారి ప్రతిలోను నిట్లేయున్నది.) వెలనాటి దుర్జయులందఱకును గొంకరాజులని సాధారణ వ్యవహారము. దీనినిబట్టి నలగాముఁడు మేనఱికమును జేసికొనెనని చెప్పవచ్చును. అతని భార్య పేరు మాత్రము తెలియుట లేదు.

వేంగి విషయమై పశ్చిమ చాళుక్యులకును, చాళుక్య చోళులకును తఱచు యుద్ధములు జరిగెడివి. క్రీ.శ. 1132లో జరిగిన గోదావరీ యుద్ధమునఁ బలనాటి హైహయులు పశ్చిమ చాళుక్యులను సమర్థింపఁగా, దుర్జయ గొంకరాజులు (రెండవ గొంకరాజు) చోళులను సమర్థించిరి. ఈ యుద్ధమునఁ బశ్చిమ చాళుక్యు లోడిపోయిరి. అందుచే వారిని సమర్థించిన పల్నాటివారును రాజ్యమును గోల్పోయిరి. ఇట్లు కోల్పోయిన పలనాటిరాజు బిరుదంకరుద్ర బేతరాజు (క్రీ.శ. 1118–1134) కావచ్చును. అందువలననే ఈ బేతరాజు తరువాత అనుఁగురాజు వచ్చువఱకును గొంత వ్యవధానమున్నట్లు శాసనముల వలన స్పష్టమగుచున్నది. బేతరాజు 1132లో (గోదావరీ యుద్ధానంతరము) రాజ్యమును గోల్పోయియుండును. అనుఁగురాజు 1134 తరువాత రాజ్యమునకు వచ్చెను. మధ్యగల రెండు మూఁడు సంవత్సరముల వ్యవధానములోఁ బల్నాడు దుర్జయుల యధీనములో నుండి యుండును.

ఆంధ్రదేశమును బాలించిన రాజవంశములలోఁ గాకతీయుల కంటెఁ బెద్దదగు రాజవంశము లేదనవచ్చును. ఈ కాకతీయులు క్రీ.శ.1000 నుండి 1323 వఱకును అవిచ్ఛిన్నముగా రాజ్యమేలిరి. వీరి చరిత్ర సమగ్రముగా లభ్యమగుచున్నది. ఆంధ్రదేశములోని వీరగాథల ముఖ్యసంఘటన లన్నియు వీరికాలములో జరిగినవే (ముఖ్యముగాఁ బల్నాటి వీరగాథలును, కాటమరాజు కథలును కాకతీయుల కాలమునాఁటివి). ఈ రాజులను, వారి వారి కాలములను బ్రమాణముగాఁ గైకొన్నచో, వీరగాథల కాలనిర్ణయము మఱింత సులభమగును. పల్నాటి వీరకథలలోఁ బ్రతాపరుద్రుని ప్రసక్తియున్నది. నలగాముఁడు వివిధ రాజన్యుల సహాయమర్థించుచు లేఖలు వ్రాయఁగాఁ, బ్రతాపరుద్రుఁడు కొంతసైన్యమును బంపెనఁట.

*"కదియ తొమ్మిదివేల కాలరిబంట్లు*
*నమ్మదగినయట్టి నాయకచయము*
*ఒకవేయి అశ్వాల నొనర ప్రతాప*
*రుద్రుడు పంపించె..."* [44]

కాకతీయ రాజవంశమున నిరువురు ప్రతాపరుద్రులున్నారు. క్రీ.శ. 1158–1195లోఁ బాలించిన రుద్రదేవమహారాజునకు మొదటి ప్రతాపరుద్రుఁడని కొందఱు చారిత్రకులు పేరిడిరి. ఇతఁడు రెండవ ప్రోలరాజు కుమారుఁడు. క్రీ.శ. 1289–1323

మధ్యకాలమునఁ బాలించిన ప్రతాపరుద్రుఁడు (రుద్రమదేవి దౌహిత్రుఁడు) రెండవ ప్రతాపరుద్రుఁడు. పల్నాటి యుద్ధమున ధరణికోట భీమరాజు (క్రీ.శ. 1140-1182) నలగామునకు బాపటగా నిల్చినట్లు స్పష్టముగాఁ దెలియుచున్నది. కావున నీ భీమరాజునకు ఏ ప్రతాపరుద్రుఁడు సమకాలికుఁడగునో అతఁడే పల్నాటియుద్ధమునకు సైన్యసహాయము చేసినవాఁడగును. దీనినిబట్టి నలగామునకు సహాయము చేసినవాఁడు మొదటి ప్రతాపరుద్రుఁడే యని తెలియుచున్నది. ఇతనికి రుద్రదేవుఁడను పేరు ప్రసిద్ధమైనది. ఇతఁడు క్రీ.శ. 1182లో ధరణికోట రాజ్యమును వశపఱుచుకొని రెండవ భీమరాజును జంపి, యతని పుత్రుఁడగు కోటరాజును సామంతునిఁ జేసికొనెను. కాఁబట్టి పల్నాటి యుద్ధము క్రీ.శ. 1182 నాఁటికిఁ గొంచెము ముందుగ జరిగినదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును.

ఇట్లే, కాటమరాజు కథాచక్రమున 'కతియావులరాజు కథ'లో నోరుగల్లును ప్రతాపరుద్రుఁడు పాలించుచున్నట్లుగాఁ జెప్పఁబడినది. ఇతఁడు రెండవ ప్రతాపరుద్రుఁడు. కావున మొదటి ప్రతాపరుద్రుని (రుద్రదేవుని) కాలమునఁ బల్నాటి యుద్ధమును, రెండవ ప్రతాపరుద్రుని కాలమున కాటమరాజు-నల్లసిద్ధిరాజుల యుద్ధమును జరిగెనని నిర్ణయింపవచ్చును.

ప్రతాపరుద్రునితోపాటు, నలగామునకు సైన్యసహాయము చేసిన మఱికొందఱు ప్రసిద్ధరాజులను వీరచరిత్రకర్త పేర్కొన్నాఁడు. "శ్రీ వీరభల్లాణి, పొన్నాడ భూపతి, మాళవపతి, బాచిదేవుఁడు, బంగాళవిభుఁడు, బలదేవ పురుషోత్తముఁడు, ధనద దాసుఁడు, మహదేవ దాసుఁడు, ద్రావిడ కేరళ ధరణీశులు, పద్మసేనుఁడు, శివకీర్తి, గట్టుభూముల రాజులు, సాని పోతమరాజు, సత్యాఖ్య ప్రెగడ, గుండమదేవుఁడు, గొబ్బూరిరాజు" మున్నగువారు నలగామునకు సహాయపడిరి (చూ. పల్నాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుటలు 345, 346). ఈ రాజులు ఏయే కాలములనకుఁ జెందినవారో చారిత్రకులు పరిశీలింపవలసియున్నది. పల్నాటి హైహయవంశము తెలుఁగుదేశమున నొక చిన్నసీమను బాలించిన సామంతరాజ వంశము. కాకతీయులు, చాళుక్యులు మున్నగు పెద్దరాజవంశములపైఁ జేసినంత పరిశోధన, ఈ చిన్నరాజవంశములపై జరుగలేదు. ఇట్టి సామంత రాజవంశములనుగూర్చిన పరిశోధన జరిగినప్పుడుగాని వీరగాథలలోని చారిత్రక పురుషుల వృత్తాంతము తెలిసికొనుటకుఁ గాని, కాలనిర్ణయము చేయుటకుఁగాని సాధ్యము కాదు.

పల్నాటి యుద్ధము క్రీ.శ. 1386లో జరిగినట్లుగాఁ జెప్పు చాటుపద్యమొకటి వాడుకలోనున్నది.[45] కాని ఇది విశ్వసింపఁదగినది కాదు. 1386 నాఁటి కాంధ్రదేశము కొండవీటిరెడ్ల యధీనమున నున్నది.

ఈ పలనాటి వీరచరిత్ర ముప్పదియాఱు సంవత్సరముల కాలము రెండు తరములమధ్య వర్తించిన కథావృత్తాంతమని పింగళివారు చర్చించి సిద్ధాంతము చేసిరి. యుద్ధము క్రీ.శ. 1181-82లో జరిగియుండునని చెప్పిరి.

## 3. యుద్ధకారణములు

పల్నాటి యుద్ధమునకు శైవ-వైష్ణవ మత విద్వేషములే ప్రధాన కారణములను అపోహయొకటి నేఁటి విమర్శక లోకమున వ్యాపించి యున్నది. "కృష్ణా గోదావరీ మధ్య దేశానికి శైవవైష్ణవాల సంఘర్షణ పన్నెండవ శతాబ్దమునకే దాపురించినది. పల్నాటి యుద్ధము ఆ సంఘర్షణకు తొలి ఫలము."[46] ఇట్టి సిద్ధాంతములన్నియు నవిచార మూలకమగు భ్రమతోఁగూడినవి. ఈ భ్రమతోడనే ఆధునిక కవులనేకులు పల్నాటికథల ఇతివృత్తములతో నాటకములు, నవలలు, కథలు రచించి ప్రజలను తప్పుత్రోవ పట్టించుచున్నారు. ఇది పరిశోధకులకు మిక్కిలి బాధాకరమగు విషయము. ప్రధానమంత్రి పదవికై నాగమ్మకును బ్రహ్మనాయనికిని జరిగిన పెనఁగులాటయే ఈ యుద్ధమునకు ముఖ్యకారణము కాని, మతవిద్వేషము ఏ మాత్రమును గారణముకాదు. దీనిని నిరూపించుటకుఁ బల్నాటి వీరకథాచక్రమున నెన్నియో యుదాహరణము లున్నవి. అందుఁ గొన్ని ముఖ్య నిదర్శనముల నిటఁ జర్చింతును:-

1) అనుఁగురాజు తన కులదైవమగు చెన్నునితో నుత్తరదేశమునఁ బాలాచాపురినుండి దక్షిణదేశమునకు యాత్రవచ్చి, చందవోలురాజు కూఁతురును వివాహమాడి, తిరిగి తనదేశమునకుఁ బ్రయాణమగు చుండఁగా, మార్గమధ్యమున నొకచోట చెన్నుని పీఠము భూమిలో దిగఁబడిపోయినది. అక్కడనే పట్టణము కట్టుకొని యుండుమని చెన్నుఁ డాదేశింపఁగా, నట గురిజాల పట్టణమును గట్టుకొని, యా పట్టణమునఁ జెన్నకేశవుని యాలయమును బ్రతిష్ఠించెను. ఆ యాలయముతోపాటు శివాలయమునుగూడ నిర్మించెను. హరిహరు లిరువురకును నుత్సవములు చేయించెను. ఈ విషయము నాకు లభించిన తాళపత్రప్రతిలో స్పష్టముగా నున్నది. (ఇప్పుడు గురిజాలలోఁ జెన్నునిగుడి కానరాదు, మాచెర్లలో మాత్రమే కలదు. గురిజాలలో ననుఁగురాజు కట్టించిన చెన్నుని యాలయము నశించి పోయియుండవచ్చును.)

*"చెన్నకేశవులకు చెలువగ్గళింపు*
*కోవెల గట్టిరి కొమరు దీపింప*
*అంతరాళములు మరి అటు ముఖమంటపములు*
*ఉత్సవములు చేయ హొయలు స్థానములు*
*చేసేటి వైఖరి చెలువమైనట్టి*
*చుట్టు ప్రాకారముల్ గట్టిగా గట్టి*
*ఈ రీతి చెన్నునికి ఇల్లు గోపురములు*
*కట్టిరి వారలు కడు వేగమునను*

*శివునకు నాలయము శీఘ్రమే కట్టి*
*...............................*
*చెన్ననికి శివునకు చెలువమరగాను*
*పికిలి కూటంబులు ప్రియమొంద గట్టి*
*చెన్నని శివునపుడు చెలగి వేడుకల*
*వేంచేవు జేసియు హెచ్చుగా వారు"* [47]

దీనినిబట్టి పల్నాటి హైహయులు అనుఁగురాజుకాలము నుండియు శైవపక్షపాతము కాని, వైష్ణవపక్షపాతము కాని లేని అద్వైతులని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. నలగాముఁడు శైవపక్షపాతియై నాగమ్మ నభిమానించెననుట అసంబద్ధము.

2) సంతాన ప్రాప్తికై అనుఁగురాజు భార్యలు ముఫ్వురిలో వీరవిజ్జలదేవి తమ తమ ఇంటివేల్పయిన చెన్నని నోములు నోచఁగా, మైలమదేవియు, భూరమాదేవియుఁ బార్వతీశ్వరు నోములు నోచిరఁట.

*"వీరవిజ్జలదేవి కింటివేల్పనగ*
*చెన్నని నోము చెలి యంత నోమె*
*మరియు భూరమాదేవి మైలమాదేవి*
*పార్వతీశ్వరు నోము పరగ నోమగను"* [48]

3) అనుఁగురాజు కాలమున మతసమన్వయమిట్లుండఁగా, నసలీ భ్రమకుఁ గారణుడైన బ్రహ్మనాయఁడే వీరవైష్ణవుఁడుగాఁ దోఁచడు. మలిదేవునిపెండ్లికథలో బ్రహ్మన్న శ్రీశైలమున మల్లికార్జునునిఁ బూజించెను (చూ. పల్నాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 61). మందపోటు తరువాత గురిజాలను పొడువవలెనన్న కోపముతో వచ్చు బ్రహ్మనాయఁడు మాచెర్లలోఁ జెన్నకేశవు నెంత భక్తితోఁ బూజించెనో, గురిజాలలోని కామేశ్వరునిగూడ నంత భక్తితోను బూజించెను. గురిజాల కామేశ్వరుని భక్తితో స్తుతించి, పసిడిపూవులతోఁ బూజచేసినట్లుగా 'గురిజాల యుద్ధ' మను కథలో స్పష్టముగా నున్నది:

*"గురిజాల కేతెంచి కోరికమించ*
*కామేశ్వరుని గుడి గ్రక్కున చొచ్చి*
*గుడిమంటపములోన కుంతంబు నిల్పి*
*కరములు ముకుళించి కట్టెదుట నిల్చి*
*'సర్వలోకారాధ్య, సర్వేశ' యనుచు*
*మనమలర కనకమున మరియు పూజించి*
*విఘ్ననాయకునకు వీరభద్రునకు*
*దండంబు పెట్టి తా తడయక యపుడు*
*పరివార దేవతల ప్రార్థించి యచట*
*నిద్రింప దొడగెను నీరజోదరుడు."* [49]

అంతేకాక, ఈ వీరగాథారచయిత బ్రహ్మనాయని గొప్ప శివభక్తుల కోవలోని వానినిగాఁ బేర్కొన్నాఁడు. ప్రపంచములోఁ గన్నడ బ్రహ్మ, చోడడు, కన్నప్పరాయఁడు, కరికాలచోడుఁడు, చిఱితొండ నంబి, శీలమ బ్రహ్మనాయఁడు– వీరార్గురు మాత్రమే శివుని బంగారు పూలతోఁ బూజించు మహాభక్తులఁట. బ్రహ్మనాయఁడు మలిదేవాదులతో నరణ్యవాసము చేయుచు మందాదినుండి మేడపికి వలసపోవునప్పుడు శ్రీశైలమల్లికార్జును నెంతయో భక్తితోఁ గొలిచెను. 'కల్లుప్రతిష్ఠ' కథలోఁ ద్రిపురాంతకమున మహాదేవునకు సాష్టాంగపడి స్తుతించినాఁడు (చూ. పల్నాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 299). బ్రహ్మనాయఁడు మహాశూరుఁడు. ఆతనికడ నొక గొప్ప కుంతమున్నది. దానిపేరు 'నృసింహ కుంతము'. ఆతని శూరత్వము సగమీశూలముపైనే ఆధారపడియున్నది. అతనికీ మహత్తర శూలమును బ్రసాదించినది పరమేశ్వరుఁడే కాని విష్ణువు కాదు. ఈ విషయమును బ్రహ్మనాయఁడే స్వయముగాఁ జెప్పుకొనెను:–

*"ముగురు మూర్తులలోన ముఖ్యుఁడైనట్టి*
*ఈశ్వరు డీశూల మిచ్చెను నాకు"* [50]

4) వీరశైవులగు కల్యాణ వీరసోముని కొమార్తె సిరాదేవిని, జెన్నని కొలిచెడి పెదమలిదేవుఁడు పరిణయమాడెను. వీరశైవులును, నిత్యజంగమారాధన లింగార్చన చేసెడి కొమ్మరాజు, అలరాజు లిరువురును బ్రహ్మనాయని పక్షములోని అగ్రశ్రేణికిఁ జెందిన వీర శిఖామణులు.

5) శివపూజాధురంధరురాలగు నాగమ్మ, నిజముగా వైష్ణవ విద్వేషిణియు, శైవాభిమానియు నగుచో, సాటి వీరశైవుఁడగు నలరాజును గౌరవింపక, విషప్రయోగముచే నేల చంపినది? అలరాజునకు విషపూరిత పుష్పముల నొసంగినది 'తంబళ్లపెద్దు' అను శివబ్రాహ్మణుఁడే యనుట మఱువరాదు. కాఁబట్టి దాయవిభాగమును గూర్చిన రాజకీయ కారణములే యుద్ధమును దెచ్చినవి కాని, శైవవైష్ణవ మతభేదములు యుద్ధమునకుఁ గారణములైనవనుట అసంబద్ధ ప్రలాపము. ఆనాఁటి మతభేదములను సూచించు వీరగాథ కనీస మొక్కటియైనను బల్నాటి వీరకథాచక్రమునఁ గానరాదు. మంత్రిత్వాధికారమునకై, నాగమ్మ బ్రహ్మన్నల నడుమ చెలరేఁగిన విద్వేషాగ్నికీలలే పల్నాటి యుద్ధమును సృజించినవనుట నిస్సంశయము. డా॥ బి. రామరాజుగారును నిదే యభిప్రాయమును గలిగియున్నారు: "బ్రహ్మనాయఁడు మరియు నాతని సేవలోనున్న కొందరు దక్క, తక్కినవారందరును శైవులే. మలిదేవరాజాదులు, కొమ్మరాజు, సేనలోనున్న కొందరు ప్రముఖ వీరులును శైవులే. బ్రహ్మనాయఁడుగూడ శైవద్వేషిగాడు. శివపూజ చేసినట్లు పదములో పెక్కుచోట్ల కాననగును. (పలనాటి యుద్ధకారణములందు శైవవైష్ణవ ద్వేషమొకటియని మన పండితులందురు. అట్లనుట కాధారము లేమికలవో! పదములందు మాత్రము బ్రహ్మనాయు దెచ్చటను శివద్వేషి యన్నట్లు లేదు.)"[51]

6) బ్రహ్మనాయని పక్షమున నున్న మహావీరులలో 'ఆణెమువారు' (మహదేవుఁడు మున్నగువారు) వీరశైవులు. వీరు బ్రహ్మనాయఁడు ప్రతిపాదించిన చాపకూటిని వ్యతిరేకించినారు. చాపకూటినేల భుజింపరని బ్రహ్మనాయఁడు వీరిని బ్రశ్నింపగా, శివుని ప్రభావముచే నా కూడు అంతకుఁ బూర్వమే తమ పొట్టలలోఁ బ్రవేశించినదనియుఁ దామింక భుజింప నక్కఱలేదనియుఁ జెప్పి, కత్తులతోఁ దమ పొట్టలు చీల్చుకొని యన్నమును జూపిరఁట బ్రహ్మనాయఁడు సంతోషించి, వారి శైవమహిమను మెచ్చి, తన ప్రభావముచే వారి పొట్టలను యథాప్రకారముగాఁ జేసెనఁట (చూ. బాలుని యుద్ధము, మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములోని వ్రాఁతప్రతి, డి.నెం. 1126).

7) క్రీడాభిరామకర్త పల్నాటియుద్ధమునకుఁగల ప్రథమ కారణములను బేర్కొనినాఁడు. అందు నాయకురాలి దుర్మంత్రము, కోడిపోరు, చాపకూటి కుడుపు తెలుపఁబడినవి కాని మతభేదముల ప్రసక్తిలేదు.[52] ఈ మహాకవి 15వ శతాబ్దివాఁడు కావున నితని మాటలు మనకు మిక్కిలి ప్రమాణభూతములు. నిజముగా శైవవైష్ణవ భేదములే పల్నాటియుద్ధమునకుఁ గారణములైనచో నీ విషయము ప్రాచీనకాలమునుండియుఁ బ్రజలలో వ్యాపించియుండవలెను. ప్రజాజీవితమును స్పష్టముగాఁ జిత్రించిన క్రీడాభిరామకర్త దీనిని విస్మరించుటయు అసంభవము. కాఁబట్టి మతభేదములు పల్నాటి యుద్ధమునకుఁ గారణములనుట ఆధునిక కాలమున బయలుదేరిన ఒక నీరస దుర్వాదము.

## 4. యుద్ధావసానము

పల్నాటి వీరకథాచక్రమున నలగామరాజు పక్షము వహించిన యాతని మంత్రిణి నాగమయను నాయకురాలికిని, పెదమలిదేవాదుల పక్షము వహించి మంత్రిత్వము నెఱపిన బ్రహ్మనాయకునికిని అధిక ప్రాధాన్యమీయఁబడినది. ఇది యటుండ, నీ వీరగాథారచయితలు బ్రహ్మనాయని మీఁద నెక్కువ యభిమానముంచి, అతనిని పలనాటి వీరయుద్ధపు కృష్ణునిగాను, నాయకురాలిని కపటిగను, దుస్తంత్ర పరాయణగను, దుష్టురాలుగను జిత్రించి చూపుటవలన, బ్రహ్మనాయని పక్షమే విజయము పొందెనని వేఱుగాఁ జెప్పఁ బనిలేదు.[53] కాని, పరంపరగా వచ్చు గాథల ననుసరించి నలగామ భూపతి విజయుఁడయ్యెననియు, పెదమల్లిదేవాదు లతనితో సంధికి రాఁక తప్పలేదనియుఁ దెలియుచున్నది.[54]

''According to Viracharitra Brahma amd his partisans were victorious, Nayakuralu fled and Brahma enthroned Nala Kama once again. But tradition records that Nala Kama was victorious, Brahma was forced to make peace with him and left Palnad on a religious mission.''[55]

యుద్ధావసానమును పూర్తిగ వర్ణించు వీరగాథ, శ్రీనాథ విరచితమగున దేదియును లభింపలేదు. మల్లయ్య, కొండయ్య యను కవులు రచించిన 'బ్రహ్మనాయని విఱుగు' అను కథాప్రతులు మదరాసు GOML లోఁ గలవు. ఇవి కూడ నసమగ్రముగనే యున్నవి. దీనినిబట్టి యుద్ధావసానమున బ్రహ్మనాయఁడును పచకుల బ్రహ్మన్నయుఁ బోరాడిరనియు, బ్రహ్మనాయఁడు పచకుల బ్రహ్మన్నను జంపి, చింతపల్లిరెడ్డిని మూర్ఛిలఁజేసి, నాయకురాలెక్కిన గుఱ్ఱమును బొడువఁగా, నామె నలగామునితోఁ గలసి కొదమగుండ్లకుఁ బాఱిపోయెననియు, బ్రహ్మనాయఁ డచటికిఁ దఱుముచుఁ బోగాఁ, గొదమగుండ్లలోని బ్రాహ్మణులు వచ్చి నలగాముని మన్నింప వలసినదిగా నాయని బ్రతిమాలిరనియు, నతఁడు వారల కోరికను మన్నించి నలగాముని తిరిగి గురిజాల సింహాసనమెక్కించెననియుఁ దెలియుచున్నది. వీరభద్రకవి కావ్యములో బ్రహ్మనాయఁడు, యుద్ధమున మరణించిన వీరుల నందఱను బ్రతికించి, వెంటఁ బెట్టుకొని, గుత్తికొండ బిలములోఁ బ్రవేశించెననియు, నచట నందఱును నిజస్వరూపములను గైకొనిరనియు, నందు బ్రహ్మనాయఁడు విష్ణురూపమును, నాయకురాలు యోగమాయారూపమును బొందిరనియుఁ గలదు. ఈ కవి, యుద్ధమున నలగాముఁడు కొమ్మరాజుచే హతుఁడయ్యెనని వ్రాసినాఁడు.

మొత్తముపై యుద్ధమునకుఁ దరువాత హైహయరాజు లెక్కువ కాలము పాలించినట్లు లేదు. యుద్ధానంతరము ఏబది సంవత్సరముల వఱకును హైహయరాజుల శాసనము లేవియుఁ గానవచ్చుట లేదు. క్రీ.శ. 1235లో నొకశాసనములో 'అనుఁగుదేవ మహారాజు' పేరు కానవచ్చుచున్నది. ఇతఁడు నలగాముని పుత్రుఁడు కావచ్చును. కాలము తెలియని తేరాల శాసనములో 'మల్లిదేవరాజు' కనఁ బడుచున్నాఁడు. ఇట్లు చెదురు మదురుగా నొకరిద్దఱు రాజులు కన్పించినను, కారెంపూడి యుద్ధము తరువాతఁ బల్నాటి హైహయ రాజవంశము క్షీణించినదనియే చెప్పవలెను. క్రీ.శ. 1481 వఱకును నామమాత్రముగా నుండి పిమ్మటఁ బూర్తిగా నశించినది.

పల్నాటియుద్ధ ఫలితము లీ క్రింది విధముగాఁ జరిత్ర పుటలలోని కెక్కినవి:- ''The civil war in Palnad and the battle of Karempudi resulted in the immediate destruction of the wealth of the country in men and money. The Haihaya Kingdom in Palnad ended thus though the heroes of war were immortalised in the minds of the masses, in literature and architecture of the country and were deified in course of time. The war hastened the fall of Velanadu Kingdom and other minor powers in Vengi and brought in its train the invasion of Rudradeva in A.D. 1186.''[56]

## 5. "పల్నాటి వీరుల" సంఖ్య

'పలనాటి వీరు'లను పేరు మలిదేవుని పక్షమునఁ బోరిన వీరులకే కలదు కాని, నలగాముని పక్షమువారికి లేదు. పెద్దన్న బాదరాజు, కొమ్మరాజు, బ్రహ్మనాయఁడు, కన్నమదాసు, బాలచంద్రుఁడు మున్నగువారు పలనాటి వీరులు. వీరి సంఖ్యనుగూర్చి వీరగాథలలో మూఁడు విధములుగా నున్నది: 65, 66, 67. క్రీడాభిరామమునఁ బల్నాటి వీరుల సంఖ్య 'అఱువదియేగురు' (65) అని కలదు:

***"కులము దైవతంబు గురిజాల గంగాంబ***
***కలని పోతులయ్య చెలిమికాఁడు***
***పిఱికి కండలేని యఱువది యేగురు***
***పల్లెనాటి వీరబాంధవులకు"***

– వేటూరు పరిష్కృత ప్రతి, పద్యము 118.

పింగళివారు పరిష్కరించిన పల్నాటి వీరచరిత్రలో 'అరువదేగురు' (65) అని చాలచోట్లఁ గలదు. ఒకటి రెండు తావులందు మాత్రము 'అరువదార్గురు' అని యున్నది. నాకు లభించిన తాళపత్రగ్రంథములలో 'అర్వదేగురు'– 'అర్వదార్గురు'– 'అర్వదేడ్గురు' అని రకరకములుగా నున్నది. జనవ్యవహారమున మాత్రము పలనాటి వీరులు అఱువదియాఱుగురనియే కలదు. కారెంపూడిలోని పల్నాటి వీరాచార పీఠాధిపతులగు శ్రీ పిడుగు నరసింహంగారు, 1966 ఆగస్టు నెలలో నేను వారిని గలిసినప్పుడు, వీరుల సంఖ్య అఱువదియాఱనియే తెల్పిరి. కారెంపూడిలోఁగల వీరులగుడిలో నఱువదియాఱు లింగములే కలవు. యుద్ధమునఁ బాల్గొన్న ఒక్కొక్క వీరుఁడు తనపేర నొక్కొక్క లింగమును బ్రతిష్ఠించినాఁడు కావున నీ లింగముల సంఖ్య వీరుల సంఖ్యను నిస్సంశయముగాఁ దెల్పుచున్నదని తలఁపవచ్చును.

పైదానికిఁ బోషకముగా నెల్లూరు మండలమున నాకు లభించిన యొక తాళపత్రగ్రంథములో వీరుల పూర్వజన్మమును వర్ణించుచు వారి సంఖ్య అఱువదియాఱని స్పష్టముగాఁ జెప్పఁబడినది. ఇది 'బాలునికథ'. బాలచంద్రుఁడు పూర్వజన్మలో 'శంకర ప్రమథుఁడు' అను భక్తుఁడు. ఇతఁడు తన శిరస్సును అఱువదియాఱు మాఱులు నఱికికొని, బెజవాడ మల్లేశ్వరునకు నైవేద్యమిచ్చును:–

***"అప్పుడు బెజవాడ మల్లేశ్వరుడు***
***గజగజా వణికి 'హొరినీ, శంకర ప్రమదుడా,***
***మెచ్చితిని, అడుగరా వరంబు' అనెను***
***నీవు మెచ్చినందుకు మేము వరమడిగినందుకు***
***నా బొందియందు బుట్టిన అరువైయారు శిరసులకు***
***అరవైయారు బొందులు ఇచ్చి***
***అరవైయారు బొందులకు ప్రాణములు దయసేయమనెను.***
***బెజవాడ మల్లేశ్వరుడు అటువలె ఇచ్చెను వరంబు***
***అరవై ఆర్గురు వీరనాయకులు పుట్టి***
***అరవైయారు పల్లెలలో గండగత్తెర్లు అందుకొని***
***శీలంవారికి వంకిదేవరాజులకు***
***వాలావాల గోయిందయని వరుసగా లేసిరి వీరనాయకులు"*** [57]

నాకుఁ గారెంపూడిలో లభించిన తాళపత్రగ్రంథములోఁ గూడ నెక్కువచోట్ల వీరులసంఖ్య అఱువదియాఱనియే యున్నది. ఈ వీరులందఱిలోను పెద్దన్న బాదరాజు పెద్దవాఁడు. ఈతనితోనే ఈ వీరనామములు ప్రారంభమగును. కారెంపూడి తాళపత్ర గ్రంథమున 150వ పత్రములో పెద్దన్న బాదరాజును గూర్చి ఇట్లున్నది:

***"విద్యలకును పెద్ద, విలువిద్యలకు పెద్ద,***
***చదువులకు పెద్దయు, శాస్త్రమునకు పెద్ద,***
***సీలమ్మకును పెద్ద, ఆ చెలువుడు ఇపుడు***
***అరువైయార్గురు వీరులందరికి పెద్ద".***

ఈ తాళపత్రప్రతిలోనే 161వ పత్రము వెనుకభాగమునఁ గూడ వీరులసంఖ్య అఱువదియాఱుగనే యున్నది:

***"అరువైయ్యార్గురు వీరులందరు మరియు***
***గూర్చుండి రప్పుడు కుంభిణియందు"***

నాకు పల్నాడులో 1966లో 'గురిజాల రాయబారము' అను వ్రాఁతప్రతి లభించినది. దీనియందును వీరుల సంఖ్య 66 అనియే యున్నది:

***"కోరి దెబ్బది రెండు గోత్రాల వారు***
***అరవయి ఆర్గురు వీరనాయకులు***
***దెబ్బయి యేడ్గురు పోటు మన్నీలు"*** (పుట 49)

నాకు లభించిన తాళపత్రగ్రంథములలో నొక్క 'అర్ధనాల చిట్టి మల్లడు' అను వీరగాథలో మాత్రము వీరుల సంఖ్య 67 అని కలదు.

***"మలిదేవరాజులు మన్నె సింహములు***
***అర్వదేడ్గురు వీరులధిక శూరులును"***

–కారెంపూడి తాళపత్రప్రతి, పత్రసంఖ్య 235. 'అర్వదేగురు' (65) అనుటకు లేఖకుఁడు పొరపాటున 'అర్వదేడ్గురు' అని వ్రాసినాఁడేమో. 'అర్వదేగురు', 'అర్వదేగురు' అను ప్రయోగములు చాలచోట్లఁ గలవు. 'అర్వదేడ్గురు' అను ప్రయోగము మాత్రము పైన తెల్పిన దొక్కటే కనిపించుచున్నది.

పైన చూపిన ఆధారములనుబట్టి వీరుల సంఖ్య అఱువది యాఱనుట నిస్సంశయము. కొన్నిచోట్ల 'అర్వదేగురు' అను ప్రయోగము లుండుటకుఁ గారణము అలరాజుయొక్క అకాల మరణమేమో. అలరాజు యుద్ధమునఁ బాల్గొనకుండ మరణించినాఁడు. అందుచే నఱువదియార్గురలో నొకఁడు తగ్గి 'అఱువదేగు'రయి యుందురని యూహింపవచ్చును. వీరులగుడిలో 66 లింగము

లుండుటకుఁ గారణము, కొమ్మరాజు తన పేరనే కాక, పుత్రుఁడగు నలరాజు పేరనుగూడ నొక లింగమును బ్రతిష్ఠించియుండుట కావచ్చును.

## 6. వీరగాథలు- వివిధప్రతులు

కాకతీయ చక్రవర్తులలో రెండవ ప్రతాపరుద్రుని కాలము నాఁటికే, అనఁగా క్రీ.శ. 1289-1323 నాఁటికే ఈ పల్నాటి వీరులకు నోరుగల్లులో గుడి కట్టఁబడినట్లును, నీ వీరగాథలు జనసామాన్యముచేఁ బాడఁబడుచున్నట్లును క్రీడాభిరామ కావ్యము సాక్ష్యమిచ్చుచున్నది. ఈ పల్నాటి వీరగాథావృత్తమును మొట్టమొదట రచించిన కవి శ్రీనాథుఁడని తెలియుచున్నది. కాని యీ కవిసార్వభౌముఁడు రచించిన కథలలోఁ గొన్నిమాత్రమే నేఁడు లభ్యమగుచున్నవి. మల్లయ్య, కొండయ్య అను మఱి యిద్దఱు కవులు రచించిన వీరగాథలు కూడ నేఁడు కానవచ్చుచున్నవి. ఇవి కూడ కొన్ని కొన్ని కథాభాగములే లభ్యమగుచున్నవి కాని కథాచక్రమంతయు సమగ్రముగా దొరకుట లేదు.

శ్రీనాథుఁడు పల్నాటివీరచరిత్రను రచించుటకుఁగల కారణము లనుగూర్చి ప్రజలలోఁ గొన్ని కథలు ప్రచారమందున్నవి. అతఁడు నారికుఱుపుచే బాధపడుచు శోకభారమున నీ కథల చెప్పెనని కొందఱందురు. మఱికొందఱీవిధముగాఁ జెప్పుదురు:- "శ్రీనాథుడు తన యౌవనకాలమున విషయలంపటుఁడై, వార్ధక్యమున బాధపడుచుఁ, బల్నాటి సంచారము చేయుచు, మాచెర్ల దగ్గఱ జంద్రవంకలో స్నానము చేసి చెన్నకేశవుని దర్శించెను. అప్పుడాతని రోగము కొంత యుపశమించెను. ఆ రాత్రి చెన్నకేశవుఁడాతని స్వప్నమునందు సాక్షాత్కరించి, తన భక్తులైన పల్నాటి వీరులపై నొక కావ్యమును రచించి తనకంకితమిమ్మని యాజ్ఞాపించెను. శ్రీనాథుఁడు మిక్కిలి సంతసించి, యేడుగురు శిష్యులను లేఖకులుగా నియోగించుకొని, ఆ చెన్నునిగుడిలోనే కూర్చుండి, రెండు మాసములలోఁ బల్నాటి వీరచరిత్రమును సమగ్రముగా రచించెను. ఈ వీరకావ్యము పూర్తియగు సరికి శ్రీనాథుని రోగము కూడ సంపూర్ణముగాఁ బోయెను. కాని, రోగము పోయినదను ధైర్యముతోఁ గాఁబోలు, నతఁడు మఱల స్త్రీలౌల్యమును బ్రదర్శించెను. అతని ప్రవర్తనకుఁ జెన్నుఁడు కోపించి, స్వప్నమందుఁ గనఁబడి 'నీవు పతితుఁడవైతివి గాన నీ గ్రంథమును నేను బరిగ్రహింపఁజాలను. అది మాలమాదిగల పాలౌఁగాక!' యని శపించెను. శ్రీనాథుఁడా యశుభస్వప్నమునకు వగచి, నిస్పృహతో 'భగవంతుఁడు గ్రహింపని ఈ కావ్యమేల?' యను దుఃఖావేశముతో మఱునాఁడాగ్రంథమును ముక్కలు ముక్కలుగాఁ జింపి పాఱవైచెను. మాలలు, మాదిగలు నెవరికి దొరకిన పత్రములను వారు ఏఱుకొనిరి."[58] ఈ కథలోని సత్యమెట్లున్నను, నేఁడు పల్నాటి వీరచరిత్ర సమగ్రముగా లభించుటలేదనుట మాత్రము సత్యము. ఇది నేఁటికిని మాలలు, పిచ్చుకుంట్లు మున్నగు నిమ్నకులములవారి యధీనమందే యుండి, ఒకరి యొద్దఁ గొంత, మఱియొకరి యొద్దఁ గొంతగా లభించుచున్నది.

క్రీ.శ. 1862 ప్రాంతమునఁ బల్నాడులో సత్తెనపల్లి తాలూకా నందిగామ వాస్తవ్యుఁడగు ముదిగొండ వీరభద్రకవి 'వీరభాగవతము' అను పద్యకావ్యమును రచించెను. ఇది సంక్షిప్తమైనను, వీరగాథా వృత్తములోని కథయంతయు సమగ్రముగా వర్ణింపఁబడిన కావ్యము. ఈ కవి తన కాలమున జనులలో వ్యాపించియున్న ద్విపదలలోను మంజరీద్విపదలలోను గల కావ్యముల నన్నిటిని సంపాదించి, క్షుణ్ణముగాఁ బఠించి, కథాఖ్యానమును సమగ్రముగాఁ దీర్చిదిద్ది యుండును. కావునఁ బల్నాటి వీరకథాచక్రములోఁగల వివిధ కథల సమన్వయమునకును, క్రమపరిశీలనమునకును, నీ వీరభద్రకవి కావ్యప్రణాళికయే మనకు శరణ్యము. ఈ వీరభాగవతము 1912 (పరీధావి సంవత్సరము)లో ముద్రింపఁబడినది. ఇది నేఁడలభ్యము. నేనీ ప్రతిని బల్నాడులో రెంటచింతల గ్రామమున నొక యుపాధ్యాయుని దగ్గఱ జూచితిని. ఇది ఆఱాశ్వాసముల కావ్యము. నేను చూచిన గ్రంథములో మధ్య కొన్ని యాశ్వాసములు నష్టమైనవి. దైవవశమున నుపోద్ఘాతము, విషయసూచిక నష్టము కాలేదు. ఇందలి ఉపోద్ఘాతమును వ్రాసినవారు జానపాటి పట్టాభిరామశాస్త్రిగారు. మద్దులపల్లి గురుబ్రహ్మవర్మగారు పల్నాటి క్షేత్రముల మాహాత్మ్యమును వివరించుచు నొక యవతారికనుగూడ వ్రాసియున్నారు. ఉపోద్ఘాతము వ్రాసిన శాస్త్రిగారు పల్నాటి వీరగాథలను ద్విపద వికారములుగా రచించిన కవులు నల్వురని యూహించినారు: శ్రీనాథుఁడు, మల్లన్న, కొండయ్య, బలరామిసెట్టి. ఇందు శాస్త్రిగారు కొండయ్య తండ్రి బలరామిసెట్టినిగూడ ప్రత్యేకకవిగా భ్రమించిరి. 'కొమ్మరాజు యుద్ధము'ను రచించిన కొండయ్య, గ్రంథావతారికలోఁ దాను బలరామిసెట్టి పుత్రుఁడనని చెప్పుకొన్నాఁడు. (లేక, శాస్త్రిగారికి బలరామిసెట్టి రచనలేవైన లభించినవేమో తెలియదు.) ఈ పట్టాభి రామశాస్త్రిగారు, వీరభద్రకవి పద్యకావ్యము శ్రీనాథుని దివ్పద కావ్యమునకు భిన్నముగా నున్నదనియు, నందుచే నితఁడు తక్కిన మల్లయ్య, కొండయ్య యను కవుల ద్విపద కావ్యములలో నేదియో యొకదాని నాధారముగాఁ జేసికొని వ్రాసియుండుననియు నభిప్రాయ పడినారు. వీరభద్రకవి, చతుర్థకులజుఁడగు సుంకర పుల్లయ్య యనువాని కోరికపై నీ కావ్యమును రచించెననియుఁ, గృతికర్త కృతిభర్త లిరువురును మొదట నందిగామ వాసులే యనియు, వీరభద్రకవి కుమారుఁడు శ్రీముదిగొండ శంకరయ్యగారు సజీవులనియు (ఉపోద్ఘాతము వ్రాయునాటికి), కొఱ్ఱిపాడు గ్రామములో నున్నారనియు పట్టాభిరామశాస్త్రిగారు వ్రాసియున్నారు. ఈ కవి ఈ కావ్యమును రచించుటకు రెండుమూఁడు సంవత్సరములు పట్టెననియు, 1862 నాఁటికిఁ బూర్తి చేసెననియుఁ దెలియుచున్నది.

237 పుటలు గలిగి ఆఱాశ్వాసముల వీరభాగవతములోఁ గథాప్రణాళిక యీ విధముగా నున్నది: “పెద్దన్న పెండ్లి– బ్రహ్మనాయని జననము– అనుఁగురాజు తీర్థయాత్రలు చేయుట, మైలమదేవి వివాహము– దొడ్డనాయని ఆర్లగండి యుద్ధము– నలసింగరాజు వేఁట, నాగమ్మ మంత్రిణి యగుట, బ్రహ్మనాయఁడు మలిదేవులతో మాచెర్లకుఁబోవుట– బాలుని జననము, వివాహము– బ్రహ్మనాయఁడు నాగమ్మతోఁ గోడిపందెము నొప్పుకొనుట– రాయవీరుఁడు చిట్టిమల్లుని దెచ్చుట– బాలగోపన్న×మువ్వల భీముఁడు కోడి పందెమాడుట– మండాదివలస, మందపోటు– అలరాజు పెద్దన్నల యుద్ధము– అలరాజు రాయబారము– బాలున కథ: (బొంగరాలు, మంచాల మేడ, యుద్ధము)– పెద్దనాయఁడు ఘోరసంగ్రామము చేయుట– కొమ్మరాజు నలగాముని తల దునుముట– వీరుల మరణము– కన్నమదాసు యుద్ధము– బ్రహ్మనాయఁడు వైష్ణవవేషమున మేడపికి వచ్చుట– వీరులు లింగప్రతిష్ఠ చేయుట– బ్రహ్మనాయఁడు వీరులతోఁ గలసి గుత్తికొండ బిలమును బ్రవేశించుట.”

శ్రీనాథుఁడు, మల్లయ్య, కొండయ్య అనుకవులు రచించిన ద్విపద గ్రంథములలో ముదిగొండ వీరభద్రకవి యేకవి గ్రంథము ననుకరించెనో సరిగాఁ జెప్పలేము. ముగ్గురి గ్రంథములను అనుకరించి యుండును. లేదా ఒకరిద్దరి గ్రంథములనే అనుకరించి యుండును. నాకు లభ్యమైన వీరగాథలకును, వీరభద్రకవి కథా ప్రణాళికకును నొకటి రెండు కథలలోఁ దప్ప, తక్కిన వానికన్నిటికిని సమన్వయము కుదిరినది. ఈ క్రింది విషయములు భేదించినవి:–

1) నాకు లభించిన ‘ఆరణగండ్లయుద్ధ’ మను వీరగాథలో బ్రహ్మనాయఁడు ప్రధానపాత్ర వహించినట్లుండఁగా, వీరభాగవతమున దొడ్డనాయఁడు ప్రధానవ్యక్తిగాఁ జిత్రింపఁ బడినాఁడు.

2) ఎక్కువ వీరగాథలలో అనుఁగురాజు వేటకుఁబోయినపుడు నాగమ్మ విందుచేసినట్లుండఁగా, వీరభాగవతమున ‘నలసింగరాజు’ (నరసింగరాజు కాఁబోలు?) వేఁటకుఁ బోయినట్లున్నది. నాకు లభించిన వేఱొక వీరగాథలో నలగాముఁడు వేఁటకుఁబోయినట్లున్నది. వీరభద్రకవి ‘నలసింగరాజు’ అను వింతనామమును బ్రయోగించుటచే నది నలగామునకు వర్తించునో లేక నరసింగరాజునకు వర్తించునో తెలియకున్నది.

3) ‘బ్రహ్మనాయని విఱుగు’ అను వీరగాథలో, సంగ్రామానంతరము నలగాముఁడు మఱలఁ బట్టాభిషిక్తుఁడైనట్లుండగా, వీరభద్రకవి పద్యకావ్యమునఁ గొమ్మరాజుచే నలగాముఁడు హతుఁడైనట్లుగా నున్నది.

4) కోడిపోరులో బాలగోపన్న చంపఁబడినట్లును, అట్లే మందపోటుకథలో లంకన్న చంపఁబడినట్లును వీరగాథలలో నున్నది. వీరభాగవతమున బ్రహ్మనాయఁడు చనిపోయిన బాలగోపన్నను, లంకన్నను తిరిగి బ్రతికించినట్లుగా నున్నది.

5) వీరగాథలన్నింటను నలగాముఁడే గురిజాలను బాలించిన రాజుగా నుండఁగా, వీరభద్రకవి ‘నలసింగరాజు’ను రాజుగాఁ జిత్రించినాఁడు. ఇతఁడే వేటకుఁబోయినట్లును, ఇతఁడే నాగమ్మకు వరమిచ్చినట్లును, బ్రహ్మనాయని మంత్రిపదవి నుండి తొలగించినది ఈతఁడే యనియు, అలరాజు సంధి వాక్యములు చెప్పినది ఈతనితోడనే యనియు వీరభద్రకవి వ్రాయుట వింతగానున్నది. దీనినిబట్టి నలగామునే ‘నలసింగరాజు’గా సంబోధించినాఁడని తలఁపవలసి యున్నది. కాని చివఱ మఱల బాలచంద్రునిచే జంపఁబడిన వాఁడు “నలసింగరాజు”ని చెప్పినాఁడు. దీనినిబట్టి వీరభద్రకవి నరసింగరాజును, ‘నలసింగరాజు’గాఁ దెల్పెనని చెప్పవలసి యున్నది. మొత్తముపై వీరభద్రకవి ‘నలసింగ’ శబ్దము చిక్కులు పడ్డ దారపుటుండవలె నున్నది.

6) వీరగాథాచక్రమునఁగల ‘మలిదేవుని పెండ్లికథ, రాచగావుకథ (బ్రహ్మనాయఁడు శివనందుల కోటపై దండెత్తుట), గురిజాల యుద్ధము’– అను మూఁడు ప్రధాన వీరగాథలు వీరభద్రుని పద్యకావ్యమున లేవు.

7) తెప్పలినీని ఊరకోట యుద్ధము, పెద్దన్న బాదరాజు కారెంపూడి యుద్ధము (గుఱ్ఱాల సవరణ) వీరగాథలలో విపులముగాఁ బ్రత్యేకగాథలుగా నుండఁగాఁ, బద్యకావ్యమున వీని ప్రసక్తి మిక్కిలి సంక్షిప్తముగానున్నది. వీరభాగవతములోని తక్కిన కథాభాగవతములన్నియు వీరగాథలుగాఁగూడ లభ్యమగుచున్నట్టివియే.

అక్కిరాజు ఉమాకాంతముగారు పల్నాటి వీరచరిత్రకు వ్రాసిన భూమికలలోఁ దమ కీ క్రింది తాళపత్రగ్రంథములు లభించినవని తెల్పియున్నారు:–

1) వీరచరిత్ర– ప్రథమభాగము (అనుఁగురాజు వృత్తాంము) శ్రీనాథ విరచితము.

2) మండాదివలస.

3) మందపోటు కథ.

4) అలరాజు రాయబారము కథ.

5) బాలచంద్రుని యుద్ధము– శ్రీనాథ విరచితము: ఇందు బాలుని కథ, బాలుని యుద్ధము అనుకథలే కాక, ‘కల్లుప్రతిష్ఠ’ అను కథ కూడఁ గలసియున్నది. ఇందు మొత్తము 5454 మంజరీ పాదములున్నవి. అక్కిరాజువారు ముద్రించినది ఈ ప్రతినే.

6) బాలచంద్రుని యుద్ధము– బలరామిసెట్టి కొడుకు కొండయ్య రచించినది. దీనిలో 'బొంగరము పుట్టుక', 'అంతర్వేదిగాని కథ' (సబ్బాయి తమ్ముఁడు) అను రెండు నూతన గాథలున్నవి. ఇవి యితర ప్రతులలోఁ గానరావు. నన్నెచోడుఁడు పార్వతీ సౌందర్యమును వర్ణించుచుఁ జెప్పిన కందపద్యము కూడ నీ ప్రతిలోఁ గానవచ్చుచున్నది.

7) బాలచంద్రుని యుద్ధము– మల్లయ్య విరచితము.

8) కొమ్మరాజు యుద్ధము.

ఇట్లు బాలచంద్రుని పరముగా భిన్నకవులు రచించిన మూఁడు వీరగాథలు లభించినను, అక్కిరాజువారు, పండితపక్షపాతముచేఁ గాఁబోలు, శ్రీనాథుని రచనను మాత్రము వెలుఁగులోనికిఁ దెచ్చి, తక్కిన వాని నణఁగద్రొక్కిరి. మల్లయ్య, కొండయ్యలు రచించిన బాలచంద్రుని యుద్ధములనుగూడ ననుబంధములుగా ముద్రించి యున్నచో వారికి నాంధ్రజాతి మఱింత ఋణపడియుండెడిది. జానపదత్వము (Folk element) శ్రీనాథుని రచనలలోకన్న, కొండయ్య, మల్లయ్య రచనలందే యెక్కువ. ఏలన, శ్రీనాథుఁడు ప్రాచీనుఁడు. అతని తరువాత జానపదులు పాడుటలో నీ కథలలో నెన్నియో మార్పులు వచ్చియుండును. ఆ మార్పులను కొండయ్య, మల్లయ్యలు తమతమ రచనలలోనికిఁ దీసికొనిరి. "బొంగరము పుట్టుక, అంతర్వేదిగానికథ"– అను గాథలిట్లు జానపదులలోఁ బుట్టినవే కావచ్చును. 'మందాది వలస, మందపోటు, అలరాజు రాయబారము, బాలచంద్రుడు, కొమ్మరాజు యుద్ధము'– అను నైదు వీరగాథలను అక్కిరాజువారు వచనరూపమునఁ బ్రకటించిరి. మల్లయ్య, కొండయ్యల రచనలను వీరేమిచేసిరో తెలియకున్నది. నేను పల్నాడులో వారి స్వగ్రామమునకు (గుత్తికొండ) వెళ్లి, వారి వంశీకులతోఁ జర్చించితిని. కాని ఫలితము లేకపోయెను.

1961లో ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారి సంపాదకత్వమున విశాలాంధ్రవారు ప్రచురించిన 'పల్నాటి వీరచరిత్ర'లో నీ క్రింది వీరగాథలున్నవి: 1) అనుఁగురాజు పలనాటి సంపాదనము (998 మంజరీద్విపద పాదములు), 2) పల్నాటి రాజ్య విభాగము (789 పాదములు), 3) కోళ్లపోరు– గోపన్న విరుగు (2833 పాదములు, మల్లయ్య రచన), 4) అరణ్యవాసము (200 పాదములు), 5) మందపోటు–లంకన్న విరుగు (394 పాదములు), 6) గురజాల యుద్ధము (938 పాదములు), 7) అలరాజు రాయబారము (765 పాదములు), 8) కల్లుప్రతిష్ఠ (1590 పాదములు, శ్రీనాథుని రచన), 9) బాలచంద్రుని యుద్ధము (4343 పాదములు, శ్రీనాథుని రచన), 10) కొమ్మరాజు యుద్ధము (984 పాదములు, కొండయ్య రచన), 11) బ్రహ్మన్న విరుగు (210 పాదములు).

అక్కిరాజు ఉమాకాంతంగారు 'కల్లుప్రతిష్ఠ, బాలునికథ, బాలుని యుద్ధము–మరణము'– అను మూఁడు వీరగాథలను గలిపి "బాలచంద్రుని యుద్ధము" అను పేరుతో బ్రకటించిరి. పింగళి లక్ష్మీకాంతంగారు 'కల్లుప్రతిష్ఠ'ను వేఱుగా విభజించియు, 'బాలునికథ, బాలుని యుద్ధము–మరణము' అను రెండు కథలను గలిపి 'బాలచంద్రుని యుద్ధ'మనుపేర నొకే కథగాఁ బ్రకటించిరి. అట్లే పింగళివారు 'కోళ్లపోట్లాట– గోపుయుద్ధము', 'కన్నమనేని యుద్ధము– గోపు సంస్కారము'– అను రెండు కథలను "కోళ్లపోరు–గోపన్న విరుగు" అను నొకే వీరగాథగాఁ బ్రకటించిరి. "మందాది వలస కథ" అని జానపదులలో వ్యవహారమునన్న చక్కని తెలుఁగు పదమును దొలగించి, దానికి "అరణ్యవాసము" అను కృత్రిమమగు పండిత నామమును బెట్టిరి. అసలు ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు తమకు లభించిన వీరగాథల నేయే తాళపత్రగ్రంథముల నాధారముగాఁ బరిష్కరించిరో స్పష్టముగాఁ దెలుపలేదు. ఇవి కొంతవఱకును తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధన సంస్థా గ్రంథాలయము (Sri Venkateswara Orietal Research Institute Library- సంక్షిప్తముగా 'SVORIL') లోఁగల కాగితపుఁబ్రతిని (నెం. 7211, ఏ.బి.) బోలియున్నవి. పింగళివారి ప్రతిలో 'కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము' అను రెండు కథలను దప్పించి, తక్కిన వన్నియును మిక్కిలి సంక్షిప్త రచనలు, అప్రమాణములు. 'అనుఁగురాజు పలనాటి సంపాదనము' జానపద వ్యవహారమునఁగల నాలుగు సుదీర్ఘ వీరగాథలకు సంక్షిప్తరూపము. ఇందు "దక్షిణాదియాత్ర కథ, పేర్నీఁడు చందోలు యుద్ధము, తెప్పలినీఁడు ఊరకోట యుద్ధము, అనుఁగురాజు మరణము"– అను నాలుగు సుదీర్ఘములును బ్రత్యేకములును నగు వీరగాథలు రూపురేఖలు లేకుండఁ గుదింపఁ బడినవి. అట్లే 'పల్నాటి రాజ్యవిభాగము' అను శీర్షిక కూడ సంక్షిప్త రూపమే. ఇందు జానపదులలో వ్యాపియందున్న "మలిదేవుని పెండ్లికథ, రాచగావు కథ, కోడిపోరు ఒప్పందము, అర్ధనాల చిట్టిమల్లుఁడు కథ'' అను నాలుగు ప్రత్యేక వీరగాథలు నామరూపములు లేకుండఁ గుదింపఁబడినవి. శీర్షికలనుంచుటలోఁ గూడ జానపదులలో వ్యాప్తియందున్న చక్కని నుడికారమును విస్మరించి, కృత్రిమ నామముల నుంచినారు. పింగళివారు పరిష్కరించిన 'పల్నాటి వీరచరిత్ర' కొంతవఱకు తిరుపతి SVORIL లోని ప్రతితోఁ బోలియున్నను, దానిలో నున్న పాదసంఖ్య, పింగళివారి ప్రతిలో లేవు. పింగళివారు తమ గ్రంథమును, ఉన్నవ లక్ష్మీనారాయణగారొసఁగిన ఒకానొక హ్రస్వప్రతినుండి సృజించిరని తెలియుచున్నది. ఈ సంక్షిప్త ప్రతి ననుసరించుటచేతనే పింగళివారి వీరగాథలలో జానపదత్వము సన్నగిల్లి, వీరగాతా లక్షణములు నశించి, నిర్జీవములుగాఁ దయారైనవి. వీనికిఁ మద్రాసు గ్రంథాలయములోని వ్రాఁతప్రతులతోఁగాని, జనవ్యవహారమున నున్న కథలతోఁగాని యే విధమగు సంబంధమును గానవచ్చుటలేదు. వీనిలో ననేక ముఖ్య సంఘటనలు వదలివేయఁబడినవి. తెలుఁగులో నింతవఱకును

సరియగు వీరగాథాసంకలనగ్రంథము వెలువడకుండుట ఆంధ్రుల దురదృష్టములలో నొకటి.

తిరుపతిలోనున్న SVORIL లోఁ గల పల్నాటి వీరచరిత్ర వ్రాఁతప్రతిలో నీ క్రింది వీరగాథలున్నవి: ('SVORIL' ఇప్పుడు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాంగణములోనున్నది).

***పల్నాటి వీరచరిత్ర-1, కాగితపుఁబ్రతి, నెం. 7211, ఏ:-***

1. కోళ్ల జగడము- పుటలు 1-258.
2. అలరాచమల్లుగారి రాయబారము-పుటలు 258-320.
3. గురిజాల యుద్ధము- పూర్వభాగము, పుటలు 321-461.
4. కల్లుప్రతిష్ఠ- పుటలు 462-569.

***పల్నాటి వీరిచరిత్ర-2, కాగితపుఁబ్రతి, నెం. 7211, బి:-***

1. బాలునికథ- పుటలు 1-238.
2. కొమ్మరాజు యుద్ధము- పుటలు 239-325.
3. శీలం బ్రహ్మినాయడి విరుగు- పుటలు 326-352.

తిరుపతి SVORIL లోఁగల పై కథలన్నియును మద్రాసు GOML లో నున్న ప్రతులకు పుత్రికలే. కాని మద్రాసు గ్రంథాలయములోఁగల 53 పల్నాటి వీరకథాప్రతులలో నివి వేనికిఁ బుత్రికలోఁ దెలియవచ్చుట లేదు. లేఖకుని వ్రాతనుబట్టి 'శీలం బ్రహ్మినాయడి విరుగు' మాత్రము మద్రాసు గ్రంథాలయములోని డి.నెం. 1148కిఁ బుత్రికయని స్పష్టమగుచున్నది. తక్కిన కథలకు లేఖకుఁ డేవియు గుర్తుల నీయలేదు. రెండవ ప్రపంచ యుద్ధకాలమున మద్రాసు GOML తిరుపతికిఁ దరలింపఁబడినది. అప్పుడు పల్నాటి వీరకథాప్రతులలోఁ గొన్నిటికి సాహితీ తపస్వులగు వేటూరి ప్రభాకర శాస్త్రిగారు పుత్రికలను వ్రాయించిరఁట. ఇటీవలి కాలమునఁ బల్నాటి వీరకథలకు సంబంధించిన రెండు తాళపత్ర గ్రంథములు మద్రాసు నుండి తిరుపతికిఁ దరలింపఁబడినవి. అవి: 'కొమ్మరాజు యుద్ధము' (డి.నెం. 1061), బాలుని కథ (డి.నెం. 1062).

పింగళి లక్ష్మీకాంతంగారి సంపాదకత్వమున వెలువడిన 'పల్నాటి వీరచరిత్ర'లోని వివిధ గాథలను, తిరుపతి SVORIL లోని వీరగాథలతోఁ బోల్చి చూచినచో, పింగళివారి కథలెంత సంక్షిప్తములో సులభముగా బోధపడును.

| **పింగళివారి సంపాదకత్వమున వెలువడిన పల్నాటి వీరచరిత్ర** | **తిరుపతి ప్రాచ్య లిఖిత గ్రంథాలయములోని పల్నాటి వీరచరిత్ర** |
|---|---|
| 1. కోళ్లపోరు: గోపన్న విరుగు 2833 పాదములు | కోళ్ల జగడము- 3862 పాదములు |
| 2. గురజాల యుద్ధము-938 పాదములు | గురజాల యుద్ధము: పూర్వ భాగము- 2110 పాదములు |
| 3. అలరాజు రాయబారము-765 పాదములు | అలరాజుమల్లుగారి రాయబార ము- 929 పాదములు |
| 4. కొమ్మరాజు యుద్ధము-984 పాదములు | కొమ్మరాజు యుద్ధము-1290 పాదములు |
| 5. బ్రహ్మనాయని విరుగు-210 పాదములు | శీలం బ్రహ్మనాయడి విరుగు 391 పాదములు. |

పై పరిశీలనమునుబట్టి కొంత కథాసామ్యమున్నను, తిరుపతి SVORIL లోని ప్రతిని పింగళి లక్ష్మీకాంతంగారు అనుసరింపలేదని తెలియుచున్నది. పింగళివారు 'నూఱు పాదముల నొక్క పాదముగాఁ గుదించినారా?' అను అనుమానము వచ్చెడి తాళపత్రగ్రంథములు నాకు లభించినవి. ముఖ్యముగా పింగళివారి 'అనుఁగురాజు పలనాటి సంపాదనము', 'పల్నాటి రాజ్యవిభాగము' అను మొదటి రెండు విభాగములును నిట్లు కుదింపఁబడినవని చెప్పవచ్చును. ఉదాహరణమునకు మొదటి విభాగమున తెప్పలినీఁడు ఊరకోట రాజును జయించి అటశాసనము వేయించిన విషయము పింగళివారి ప్రతిలో 'ముచ్చముగా మూఁడు' పాదములలోఁ జెప్పఁబడినది:

> ***"అవని పాలకులెల్ల సతివలె చూడ***
> ***పుడమి ననుగురాజె పురుషుడన చెల్లు***
> ***అని శాసన మొకటి యచట చెక్కించి"*** [59]

నాకు లభించిన కారెంపూడి తాళపత్రగ్రంథమున నీ శాసన విషయము మూఁడువందల పాదములలో నున్నది. ఇందు అనుఁగురాజు వంశవృక్షము, బ్రహ్మనాయని వంశవృక్షము, బ్రహ్మన యవతార పురుషత్వము విపులముగా వర్ణింపఁబడినవి. అట్లే అనుఁగురాజు మరణమునుగూర్చి తొమ్మిది తాళపత్రములలో 468 పాదములుగా నున్న ప్రత్యేకకథ ఆల్తూరుపాడు గ్రామమున నాకు లభించినది. పింగళివారు అనుఁగురాజు మరణవిషయమును పదునేడు పాదములలో ముగించివేయుట శోచనీయముగా నున్నది. కాఁబట్టి పింగళివారి గ్రంథమున 'కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము' అను రెండు కథలు తప్ప, తక్కినవన్నియు నమ్మఁదగిన వీరగాథలు కావు. కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము అను రెండు కథలను అక్కిరాజు ఉమాకాంతంగారు ఒకే కథగా నీ శతాబ్ది ప్రారంభముననే ముద్రించి యున్నారు. కావునఁ బింగళివారికిఁ జెందవలసిన ఘనత యేమియుఁ గానవచ్చుట లేదు. పింగళివారి పల్నాటి వీరచరిత్రము అసలు కథ కాదనియు, సంక్షిప్తరూపమనియు శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు గమనించియున్నారు. పైగా ఈ శాస్త్రిగారు పల్నాటి వీరచరిత్ర వ్రాసిన శ్రీనాథుఁడు పల్నాటి కవియేకాని, కవిసార్వభౌముఁడు కాడని వాదించినారు. [60]

**మదరాసు GOML లో నున్న పల్నాటి వీరగాథావృత్తములోని వివిధ గాథలు:**

1) 'పల్నాటి వీరచరిత్ర'– పూర్వభాగము. రెండు ప్రతులు: డి.నెం. 1140, 1153. కార్తవీర్యార్జుననినుండి బాలుఁడు బొంగరములాడి ఇంటికి వచ్చువఱకును గల కథాభాగము. ఇందు వివిధ వీరుల పూర్వజన్మలు తెలుపబడినవి.

2) 'కోళ్ల పోట్లాట'– నాలుగు ప్రతులు: డి.నెం. 1112, 1121, 1130, 1149.

3) 'కన్నమనేని యుద్ధము'– నాలుగు ప్రతులు: డి.నెం. 1118, 1127, 1136, 1158.

4) 'గురజాల యుద్ధము'– నాలుగు ప్రతులు: డి.నెం. 1114, 1123, 1132, 1151.

5) 'రాచమల్లు రాయబారము'– నాలుగు ప్రతులు: డి.నెం. 1113, 1122, 1131, 1150.

6) 'కల్లుప్రతిష్ఠ'– ఆఱు ప్రతులు: డి.నెం. 1115, 1124,1133, 1145, 1152, 1159.

7) 'బాలుని కథ'– పంద్రెండు ప్రతులు: డి.నెం. 1116, 1125, 1134, 1139, 1142, 1146, 1155, 1156, 1160, 1162 (తాళపత్రప్రతి), 1163, 1164.

8) 'బాలుని యుద్ధము'– నాలుగు ప్రతులు: డి.నెం.1117, 1126, 1135, 1157.

9) 'కొమ్మరాజు యుద్ధము'– ఎనిమిది ప్రతులు: డి.నెం. 1119, 1128, 1137, 1141, 1143, 1147, 1154, 1161 (తాళపత్రప్రతి).

10) 'బ్రహ్మనాయని విఱుగు'– ఐదు ప్రతులు: డి.నెం. 1120, 1129, 1138, 1144, 1148.

ఇట్లు మద్రాసు GOML లోఁ బల్నాటి వీరకథాచక్రమునకు సంబంధించిన పది వీరగాథలకు 53 ప్రతులు లభించుచున్నవి. ఇందు డి.నెం. 1161, 1162 అను రెండు తాళపత్రప్రతులు, (వీనిని తిరుపతి SVORILకుఁ జేర్చినారు). తక్కిన వన్నియును కాగితపుఁ బ్రతులే. ఈ కథల ఇతివృత్తములనుగూర్చి డా॥ బి. రామరాజుగారు విపులముగా వ్రాసియున్నారు (తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౧౭౭–౨౦౨).

**నాకు లభించిన పల్నాటివీరకథల తాళపత్రగ్రంథములు:–**

1) ***'పలినాటి వీరుల భాగవతము' ఆల్తూరుపాడు ప్రతి–1:–*** ఇది 22–7–1966న నెల్లూరు మండలములో, వెంకటగిరి తాలూకా, ఆల్తూరుపాడు గ్రామమున లభించిన మొదటి తాళపత్రగ్రథము. ఇందు ఎక్కువ భాగము మల్లయ్యమంత్రి రచన. దీనిలో సమగ్రాసమగ్రములైన అయిదు వీరగాథలున్నవి:

1. అరణగండ్ల యుద్ధము–మల్లయ్యమంత్రి రచన–2700 పాదములు.
2. అనుఁగురాజు మరణము– శ్రీనాథుని రచన–900 పాదములు.
3. గుఱ్ఱాల సవరణ లేక పెద్దన్నబాదరాజు కారెంపూడి యుద్ధము– 1200 పాదములు.
4. బాలుని కథ– శ్రీనాథుని రచన, 2800.
5. పలినాటి వీరుల భాగవతము– 500 పాదములు.

ఇందు మండాదివలస, మందపోటు, గురిజాల రాయబారము, సంక్షిప్తముగా నున్నవి. ఇది అలరాజు రాయబారకథకుఁ బ్రస్తావన కానోపును.

2) ***'పలునాటి వీరుల భాగవతము'– ఆల్తూరుపాడు ప్రతి–2:–*** అల్తూరుపాడులో లభించిన రెండవ తాళపత్రగ్రంథము: ఇది కూడ మల్లయ్య రచనవలెనే యున్నది. ఇది మిక్కిలి శిథిలమగుటచేఁ కొన్ని కథలు దురవగాహములుగా నున్నవి. దీనియందును నైదు వీరగాథలున్నవి. కొన్ని సమగ్రములు, మరికొన్ని అసమగ్రములు.

1. బాలుని కథ–అనపోతు మరణము వఱకును గలదు, 5040 పాదములు.
2. నాయకురాలి కథ– 300 పాదములు.
3. కోడి పుట్టుక– కోడిపోరు– 1140 పాదములు.
4. నాయుడి పుటక– 420 పాదములు.
5. గురిజాల రాయబారము– 1320 పాదములు.

3) ***కారెంపూడి తాళపత్రగ్రంథము:–*** గుంటూరు మండలమున, పల్నాడు తాలూకా కారెంపూడి గ్రామము (పల్నాటి వీరుల యుద్ధక్షేత్రము)లో 27–8–1966న పల్నాటి వీరాచార పీఠాధిపతులగు శ్రీ పిడుగు నరసింహంగారు ఒసంగిన తాళపత్ర గ్రంథము. సగము బాగున్నది, సగము శిథిలమైనది. ఇదియంతయు శ్రీనాథుని రచనయే. కవిసార్వభౌముని పేరిందు స్పష్టముగా నున్నది. ఇందు మొదటి అఱువది పత్రములు నష్టమైనవి. చివర గురిజాల యుద్ధమునుండి తక్కిన కథలన్నియు నష్టమైనవి. ఆరణగండ్ల యుద్ధమునుండి మందపోటుకథవఱకును గల పది వీరగాథలు దీనిలోఁ గలవు. ఆరణగండ్ల యుద్ధమునకు ముందు దక్షిణాది యాత్ర కథలోఁ జివరి భాగము కొంతయున్నది. శ్రీనాథుఁడు పల్నాటి వీరగాథాచక్రమంతటిని రచించెననుటకు ఈ ప్రతి చక్కని యుదాహరణము.

1. బ్రహ్మనాయుని ఆరణగండ్ల యుద్ధము– 2200 పాదములు.
2. నాయకురాలి కథ– 2600 పాదములు.
3. రాచగావు కథ– 1260 పాదములు.
4. రాజుల పెండ్లికథ (మలిదేవాదుల పెండ్లి)– 1440 పాదములు.
5. కోడిపోరు ఒప్పందము– 2000 పాదములు.
6. పెద్దన్నబాదరాజు పెండ్లి లేక పెద్దన్న పెండ్లిరాయబారము– 4030 పాదములు.
7. అర్ధనాల చిట్టిమల్లుడు కథ– 3000 పాదములు.
8. బాలగోపన్న కోడిపందెము కథ– 2730 పాదములు.
9. మందాది వలస కథ.
10. మందపోతు కథ.

4) ***గురిజాల రాయబారము:–*** గాథాకారుల పాటననుసరించి వ్రాయబడిన కాగితపుఁబ్రతి. పల్నాడు తాలూకా, జానపాడు గ్రామములో 1966 సెప్టెంబరు నెలలో లభించినది. దీనిలో 1840 పాదములున్నవి.

5) ***కాకినాడ ప్రతి:–*** కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషత్ గ్రంథాలయమున 'పల్నాటి వీరచరిత్ర– ప్రథమ భాగము'నకు సంబంధించిన (అనఁగా 'అనుఁగురాజు వృత్తాంతము'నుండి 'మందపోతు' వఱకునుగల) వ్రాఁతప్రతి యొకటి యున్నదనియు; దీనిని పోలవరము జమీందారుగారు 1900 సంవత్సర ప్రాంతమున 268 తాటియాకులుగల ప్రతినుండి యెత్తి వ్రాయించినారనియు శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు తెలియజేసినారు. (ఆ గ్రంథాలయమంతయు వెదకితిని. కాని అది నాకు లభింపలేదు. బహుశః చిలుకూరివారి యింటిలో నుండియుండును.)

పల్నాటి వీరకథాచక్రమునకుఁ బ్రజలలో 'పలనాటి వీరభాగవతము' అను పేరు ప్రాచీనకాలమునుండియుఁ గలదని తెలియుచున్నది. కొందఱు జానపదులు ఈ కథాచక్రమును 'చెన్నుఁడు కథ' అని పిలుచుచున్నారు. 'పల్నాటి వీరచరిత్ర' యను నామము పండితసృష్టి; ఆధునికమైనది. 'పల్నాటి వీరభాగవతము, చెన్నునికథ' అను నామములు ప్రాచీనమైనవి. ముదిగొండ వీరభద్రకవికూడ ప్రాచీన నామమునే పరిగ్రహించినాఁడు. నేను పరిశీలించినంత వఱకును ఈ కథాచక్రమున సుమారుగా నిరువదియైదు వీరగాథలు కలవని తెలియుచున్నవి. ఈ కథలనన్నిటిని పలనాటి వీరభాగవత మను పేరుతో శ్రీనాథుఁడు సంపూర్ణముగా రచించినాఁడు. మరల నీ కథలకే జనవ్యవహారముననున్న మఱికొన్ని నూతనాంశములను జేర్చి మల్లయ్యమంత్రి, కొండయ్య యను కవులు రచించియుందురు. వీరు కూడఁ బలనాటి వీరభాగవతమను పేరఁ గథాచక్రమునంతటిని వ్రాసియుందురు. కాని నేఁడు మన దురదృష్టముచే ఏ కవి రచనయు సంపూర్ణముగా లభించుట లేదు. మల్లయ్య, కొండయ్యలు లుప్తభాగములను బూరించుట కాక, సంపూర్ణముగా గాథాచక్ర మంతయు వ్రాసిరని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఏలన, ఒకే కథకు ఇద్దఱు ముగ్గురు కవుల రచనలు లభించుచున్నవి. అక్కిరాజు ఉమాకాంతంగారికి బాలచంద్రునికథకు సంబంధించి ముగ్గురు కవుల రచనలును లభ్యమైనవి. అక్కిరాజుగారు బాలునికథలో నొకే సన్నివేశమును ఈ ముగ్గురు కవులును ఏయే తీరులలో వర్ణించినారో సప్రమాణముగా నిరూపించియున్నారు (చూ. అక్కిరాజువారి ప్రథమ భూమిక, పుటలు 77–79). కాని వారు శ్రీనాథుని రచనను మాత్రమే ముద్రించిరి. నాకు 'ఆరణగండ్ల యుద్ధము' అను వీరగాథ మల్లయ్య మంత్రి రచన యొకఁటి, శ్రీనాథుని రచన వేఱొకటి లభించినవి. అట్లే గురిజాల రాయబారమునకును రెండు భిన్నరచనలు లభించినవి. కారెంపూడిలోఁ బల్నాటి వీరాచార పీఠాధిపతుల కడ శ్రీనాథ విరచితమగు పల్నాటి వీరకథాచక్ర మంతయుఁ గలదు. 1966లో నేను వారిని గలసినప్పుడు వారికడ నున్న తాళపత్రగ్రంథము నొకదానిని నాకొసఁగిరి. కాని అప్పటికి ఆ గ్రంథములో మొదటి అఱువది పత్రములును నష్టమైనవి. అనఁగా దక్షిణాది యాత్రకథ పోయినది. చివర కూడ గురిజాల యుద్ధమునుండి క్రిమిదష్టమై నశించి పోయినది. అయినను నీ తాళపత్రగ్రంథమున ఆరణగండ్ల యుద్ధము నుండి మందపోటుకథ వఱకును, మొత్తము పదికథలు, శ్రీనాథ విరచితమైనవి, వరుసగా నున్నవి. దీనినిబట్టి శ్రీనాథుఁడు ఒక్క బాలచంద్ర యుద్ధమునే కాక మొత్తము పల్నాటి కథాచక్రము నంతటిని వ్రాసెనని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. అట్లే మల్లయ్యయు, కొండయ్యయు, వేర్వేరుగా నీ కథాచక్రమంతటిని వ్రాసియుందు రనుటలో సందేహము లేదు. కావునఁ బై ముగ్గురు కవులును నెవరికి వారు ప్రత్యేకముగా పలనాటి వీరభాగవతమను పేర మొత్తము కథాచక్రమంతటిని రచించిరనుట నిశ్చయము. ముదిగొండ వీరభద్ర కవి పైవారిలో మల్లయ్యకవి రచనను గాని, కొండయ్యకవి రచనను గాని ఆధారముగాఁ జేసికొని పద్యకావ్యమును రచించియుండును. మల్లయ్య రచించిన 'కోళ్లపోట్లాట', కొండయ్య రచించిన 'కొమ్మరాజు యుద్ధము' మద్రాసు, తిరుపతి ప్రాచ్య లిఖిత గ్రంథాలయములలోఁ గలవు. కాని యీ కథలలోని యితివృత్తములకును, వీరభద్రకవి కావ్యములోని యితివృత్తమునకును మిక్కిలి భేదమున్నది. కాఁబట్టి వీరభద్రకవి మల్లయ్య, కొండయ్యల రచనల ననుకరించెనని కూడ నిశ్చయముగాఁ జెప్పలేము.

## 7. పల్నాటి వీరగాథావృత్తము- ఇతివృత్తములు

పల్నాటి వీరకథాచక్రములోని వివిధ గాథల ఇతివృత్తములను నిర్ణయించుటలో నాకు లభించిన తాళపత్రములే ప్రధానాధారములు. ముదిగొండ వీరభద్రకవి రచించిన 'వీరభాగవతము' (పద్యకావ్యము), అక్కిరాజు ఉమాకాంతంగారు పరిష్కరించిన బాలచంద్రుని యుద్ధము, పింగళి లక్ష్మీకాంతంగారు సంపాదించిన పల్నాటి వీరచరిత్ర- ఈ మూఁడు ముద్రిత గ్రంథములును కొంతవఱకుఁ దోడ్పడినవి.

### 7.1. 'పెద్దన్న పెండ్లిరాయబారము' లేక 'పెద్దన్నబాదరాజు పెండ్లికథ:-

పల్నాటి వీరకథాచక్రమున నిది మొదటి వీరగాథగాఁ గన్పట్టుచున్నది. ముదిగొండ వీరభద్రకవియు దీనిని తన కావ్యప్రారంభము నందే వర్ణించినాఁడు. కాని నాకు లభించిన కారెంపూడి తాళపత్ర గ్రంథమున నీ కథ, మాచెర్లలో మలిదేవాదుల పెండ్లి అయిన తరువాతఁ జెప్పఁబడినది. ఇది రెండు రాత్రులు పాడఁబడు కథ.

పాలమాచాపురి నేలు అనుఁగురాజునకు (వీరభద్రకవి యితని 'అలుఁగురాజు' అనినాఁడు) సంతానము లేకపోవుటచేఁ దనకడ మంత్రిగానున్న దొడ్డనాయనికి జ్యేష్ఠపుత్రుఁడగు పెద్దన్నను దత్తు చేసికొనెను. అనుఁగురాజు చంద్రవంశ క్షత్రియుఁడు. పెద్దన్న వెలమ కులమువాఁడు. అందుచే నతని పెండ్లి యొక పెద్ద సమస్యయైనది. అనుఁగురాజు పెద్దన్నకుఁ దగిన కన్యను వెదకుటకై బ్రాహ్మణులను బంపెను. వారు వివిధ దేశములు తిరిగి, కంచెర్ల (గుంటూరు మండలమునఁ గలదు) నేలు కృష్ణగంధర్వుని కూఁతురు లఘువాంబను నిశ్చయించిరి. కృష్ణగంధర్వుఁడు పెద్దన్నను క్షత్రియునిగానే భావించెను. వివాహము జరిగిపోయెను. ఒకప్పుడు పెద్దన్న అత్తవారింటి కేగెను. అట తోడియల్లుండ్రతో నొక పందెమునఁ బాల్గొనెను. అందీతని వెలమతనము బయటపడినది. కృష్ణగంధర్వుఁ డాగ్రహముతోఁ బెద్దన్నను శిక్షింపఁబోవును. అక్కడ జరిగిన యుద్ధమునఁ గృష్ణగంధర్వుఁడును నాతని యల్లుండ్రును పెద్దన్నతోఁ బోరి మరణింతురు. పెద్దన్న అత్తగారు ముక్తాలవాంబ అగ్నికుండమునఁ బడినది. కంచెర్ల పట్టణమును బాడుచేసి, పెద్దన్న 'కార్యబొల్లఁడు' (కార్బొల్లఁడు, కారుబొల్లఁడు) అను తన గుఱ్ఱమునెక్కి సతీసమేతముగాఁ బాలమాచాపురి చేరును. (నాకు లభించిన తాళపత్రమున పెద్దన్న మాచెర్లకుఁ జేరినట్టున్నది.) మార్గమధ్యమునఁ బెద్దన్న పానుగల్లు పట్టణములో విశ్రమించును. అప్పుడాతని గుఱ్ఱము 'కార్బొల్లఁడు' కాలితో భూమిపై రాయఁగా, నటనుండి యొక కోడిపుంజు బయటకు వచ్చును. ఇట నా కోడిపూర్వజన్మము, పరాక్రమాతిశయము వర్ణింపఁబడినవి. 'అర్ధనాల చిట్టిమల్లఁడు' అను పేరుగల యీ కోడిపుంజే తరువాతి కాలమున 'రావీరపడాలు'నిచే మాచెర్లకుఁ గొనిరాబడి, బ్రహ్మనాయని పక్షమునఁ గోడిపోరులోఁ బాల్గొనెను.

### 7.2. 'బ్రహ్మనాయుఁడు పుటక' (బ్రహ్మనాయని పుట్టుక):-

ఇది ఒకరాత్రి కథ. దొడ్డనాయని ద్వితీయపుత్రుఁడు బ్రహ్మనాయఁడు. ఈ బ్రహ్మనాయని తల్లి శీలాంబ లేక శీలమ్మ. ఈ శీలమ్మ రేణుక యవతారమనియు, బ్రహ్మనాయఁడు పరశురాముని యవతారమనియుఁ జెప్పఁబడినది. పరశురాముని యంశచే శీలమ్మ గర్భమందుఁ బ్రవేశించిన బ్రహ్మనాయఁడు తల్లి కడుపులోఁ జిరకాలముండును. మంత్రశక్తి పాలమాచాపురంబునకు వచ్చి శీలమ్మకు మంత్రసానిగాఁ గుదురును. ఆమె బ్రహ్మనాయఁడు జన్మించునట్లు చేయును. జన్మించుటతోడనే బ్రహ్మనాయఁడు తల్లి శీలమ్మతో సహా పాతాళలోకమునకుఁ బోవును. శీలమ్మ పాతాళ లోకమున స్నానము చేయుటకు నీళ్ళు లభింపక దుఃఖించును. నవబ్రహ్మలు ప్రత్యక్షమై శీలమ్మకు నీళ్ళిచ్చి, స్తన్యముదయించునట్లు చేయుదురు. వారు శీలమ్మ కొక దివ్యప్రభావముగల బొంగరమునుగూడ నిత్తురు. (ఈ బొంగరమే తరువాతి కాలమున బాలచంద్రునిచే నాడఁబడును.) పిమ్మట శీలమ్మ కుమారునితోఁ గలసి భూలోకమునకు వచ్చును. ఆమెకుఁ దరువాత వరుసగా పేర్నీఁడు, సూర్నీఁడు, మలినీఁడు అను ముప్వురు కుమారులుదయింతురు.

### 7.3. 'యాత్రకథ' లేక 'దక్షిణాది యాత్రకథ':-

తన పూర్వుఁడగు కార్తవీర్యార్జునుఁడు చేసిన బ్రహ్మహత్యా పాతకమును బాపుకొనుటకై అనుఁగురాజు, నీలికోకలు ధరించి, మంత్రియగు దొడ్డనాయనితోను, ఆతని పుత్రులు పెద్దన్న, బ్రహ్మన్న, పేర్నీఁడు, సూర్నీఁడు, మలినీఁడులతోను, సైన్యాధ్యక్షుఁడగు 'తెప్పలినీఁడు'ను, అంతఃపుర పరివారాది సర్వసంపదలును వెంటరాఁగా, నిలువేల్పగుఁ జెన్నకేశవుని పీఠమును దీసికొని తీర్థయాత్రలు సేవింప నేఁగును. అతఁడు కాశీ, గయ, ప్రయాగాదులను దర్శించెను. గయాక్షేత్రమున భీమరాజు పుత్రికయగు భూరమాదేవిని వివాహమాడెను. ఏ తీర్థమునందును దన నీలికోకలు తెల్లఁబడక పోవుటచే ననుఁగురాజు దక్షిణాదికిఁ దరలి వచ్చెను. అతఁ డాంధ్రదేశములోని అమరావతీ క్షేత్రమును జేరెను. అట కృష్ణానదిలో స్నానము చేయఁగనే అతని నీలికోకలు తెల్లఁగా మాఱి, పాపపరిహార మయ్యెను.

ఇట్లు పాపపరిహారమైన స్థలవిషయమై వీరగాథలలో నేకవాక్యత లేదు. పింగళివారు ప్రకటించిన పలనాటి వీరచరిత్రలో మోటుపల్లి దగ్గఱ సముద్రస్నానము చేయగా ననుఁగురాజు నీలికోకలు తెల్లఁ బడెనని కలదు. పల్నాటి వీరగాథలను గానముచేయు వీరవిద్యావంతులు, పిచ్చుకుంట్లు మున్నగు గాథాకారులలోఁ గొందఱు మాచెర్ల దగ్గఱఁ జంద్రవంకలో స్నానము చేయఁగా ననుఁగురాజు నీలికోకలు తెలుపెక్కెనని చెప్పుచున్నారు. మఱికొందఱు గాథాకారులు అమరావతి దగ్గఱ నున్న కృష్ణానదినే పేర్కొనుచున్నారు. వీరభద్రకవి పద్యకావ్యమున నమరావతి యనియే కలదు.

### 7.4. 'పేర్నీఁడు యుద్ధము' లేక 'పేర్నీఁడు చందోలు యుద్ధము':-

అనుఁగురాజు నీలికోకలు తెల్లఁబడిన అమరావతి దగ్గఱ 'చందోలు' (చందవోలు) అను పట్టణమున్నది. దానిని ధవళశంఖుఁడనురాజు పాలించుచుండెను. అతనికడ నిద్దఱు మాష్టీలున్నారు. వారు మిక్కిలి బలవంతులు. ఆ మాష్టీలకడ రెండు పిచ్చుక లున్నవి. అవి బ్రాహ్మణులు నుదుటఁ బెట్టుకొన్న గంధాక్షతలను భక్షించుచుండును. ఆ మాష్టీలకు భయపడి యెవ్వరును ఆ పిచ్చుకల నదలించుట లేదు. ఆ చందోలురాజు భట్టు అనుఁగురాజుకడకు వచ్చి తన రాజు గొప్పతనమును పొగడును. బ్రహ్మనాయఁడు కోపించి, ఆ భట్రాజు కంఠమున గడ్డపాఱను జుట్టి పంపించును. పిమ్మట బ్రహ్మనాయఁడును, పేర్నీఁడును బ్రాహ్మణ వేషధారులై చందోలునకుఁ బోవుదురు. వారి నుదుట గంధాక్షతలను పిచ్చుకలు భక్షింపఁబోవ పేర్నీఁడా పిచ్చుకలను జంపును. మాష్టీలు కోపించి బ్రహ్మన పేర్నీలతోఁ గలహింతురు. పేర్నీఁడు విజృంభించి, మాష్టీలను మఱికొంత సైన్యమును సంహరించును. ధవళశంఖుఁడు వారితో సంధిచేసికొని, తనకూఁతురు మైలమదేవిని అనుఁగురాజునకిచ్చి వివాహము చేసి, పల్నాటిసీమను అరణముగా నిచ్చును. పేర్నీఁడు చందోలులోఁ బాపసాని యను వేశ్యతో సుఖించును.

### 7.5. 'తెప్పలినీఁడు యుద్ధము' లేక 'తెప్పలినీఁడు ఊరకోట యుద్ధము:-

పశుగ్రాసము కొఱకు అనుఁగురాజు, సేనాధిపతియగు తెప్పలినీని ఆరణగండ్లకుఁ బంపెను. అతఁడు మేఁతలను గొని తిరిగి వచ్చుచు, దారిలో నూరకోట దగ్గఱ నొక జొన్నచేనులో నున్న పెద్ద పెద్ద కంకెలను జూచి ఆశ్చర్యపడి, వానిని గొన్నిటిని దీసికొని వచ్చి తన రాజునకుఁ జూపెను. ఆ జొన్నలు ముత్యములవలె నుండెను. అట్టి జొన్నలను దమ దేశమునఁ బైరుచేయవలెనను తలంపుతో, నాతఁడా జొన్నవిత్తులను బైకమిచ్చి తెమ్మని తిరిగి తెప్పలినీని బంపెను.

తెప్పలినీఁడు ఊరకోట దగ్గఱకుఁబోయి, ఆ చేనుగల రెడ్డిని జొన్నవిత్తులిమ్మని యడిగెను. అతఁడు వానినమ్ముటకు నిరాకరించెను. ఎంత చెప్పినను ఆ రెడ్డి యంగీకరింపకుండుటచేఁ దెప్పలినీఁడు బలప్రయోగము చేసి, యా చేనంతయుఁ గోసికొని పోవుచుండెను. ఆ రెడ్డి పోయి తన రాజుతో మొఱవెట్టుకొనెను. ఊరకోటరాజు పెద్దసైన్యముతో వచ్చి తెప్పలినీని నెదిరించెను. ఇరువురకును ఘోరయుద్ధము జరిగినది. ఆ యుద్ధమునఁ దెప్పలినీఁడు ఊరకోట రాజును చంపెను. ఆతని సైన్యము పాఱిపోయెను. అతనిపుత్రుఁడగు నుత్తరుఁడు తెప్పలినీని శరణుజొచ్చెను. తెప్పలినీఁడాతనిని విడిచిపుచ్చి, జొన్నవిత్తులను దీసికొని, అనుఁగురాజు కడకుఁ బోవుచు, సృష్టిలో అనుఁగురాజొక్కడే పురుషుఁడనియుఁ, దక్కినరాజులందఱును స్త్రీలే యనియుఁ దెల్పుచు నొక శాసనమును జెక్కించి, ఊరకోటలోఁ బ్రతిష్ఠించి, వెడలిపోయెను.

ఈ కథ, అనుఁగురాజు మోటుపల్లిరేవులోఁ బాపవిముక్తుఁడైన తరువాత జరిగినట్లుగాఁ బింగళివారిప్రతిలోఁ గలదు. వీరభద్రకవి కావ్యమున అనుఁగురాజు గురిజాల పట్టణమును గట్టుకొని పల్నాడును బాలించుచుండగా, దొడ్డనాయఁడు మృగయావిహారమున కేఁగినపుడు జరిగినట్లుగాఁ గలదు. నాకు లభించిన తాళపత్రగ్రంథమున నిది ఆరణగండ్ల యుద్ధమునకు ముందు క్లుప్తముగాఁ జెప్పఁబడినది.

### 7.6. 'ఆరణగండ్ల యుద్ధము' లేక 'బ్రహ్మనాయని ఆరణగండ్ల యుద్ధము':-

మైలమదేవిని పెండ్లాడిన అనుఁగురాజు తిరిగి పాలమాచాపురికిఁ బ్రయాణము కాఁగా, మార్గమధ్యమునఁ జెన్నుని పీఠము భూమిలో దిగబడిపోయెను. బ్రహ్మనాయఁడెంత ప్రయత్నించినను నది కదలలేదు. చెన్నుఁడొక బ్రాహ్మణ వేషమున వచ్చి, కార్తవీర్యార్జునుఁడు చేసిన పాపములు పాలమాచాపురిలో నుండుటచే నటకుఁ బోవలదనియు, నిచ్చటనే యొక పట్టణము కట్టుకొని పాలింపవలసినదనియుఁ జెప్పెను. అనుఁగురాజు చెన్నుని పీఠము దిగఁబడినచోట గురిజాల పట్టణమును గట్టుకొని, చెన్నునకు గుడికట్టి, పల్నాడును బాలించుచుండెను.

అనుఁగురాజునకు మైలమదేవియందు నలగాముఁడును, భూరమాదేవియందు కామరాజు, నరసింగరాజు, ఝుట్టిరాజు, పెరుమాళ్లరాజు– అను నల్వురు పుత్రులును, వీరవిజ్జలదేవియందు ముగ్గురు మలిదేవులును బుట్టిరి. తెప్పలినీనికిఁ దన భార్యయగు 'సూరమాదేవి' యందుఁ గన్నమనీఁడు పుట్టెను. కొంతకాలము గడచెను.

తన తండ్రిని తెప్పలినీఁడు చంపెననియు, నవమానకరమగు శాసనమును వేయించెననియుఁ గోపముతో నూఱకోటరాజగు నుత్తరుఁడు తక్కిన రాజులతోఁ గలసి, గురిజాలపై దండెత్తి వచ్చుచుండెను. అనుఁగురాజునకు ఈ వార్త తెలిసి, సైన్యములనిచ్చి తెప్పలినీనిఁ బంపెను. తెప్పలినీఁడు వారిని ఆరణగండ్ల దగ్గఱ నెదిరించెను. ఆ యుద్ధమునఁ దెప్పలినీఁడు మరణించెను. పిమ్మట బ్రహ్మనాయఁడు తన బావమఱఁదియగు సుంకరి దామనాయనితోను, పుత్రతుల్యుఁడు కన్నమదాసుతోను గలసి యుద్ధమునకేఁగెను. పదునాల్గు రోజులు ఘోరయుద్ధము చేసి, బ్రమ్మనాయఁడు ఆ రాజుల నందఱను శిక్షించి, కప్పములు గొని, తిరిగి గురిజాలఁ బ్రవేశించెను. బ్రహ్మనాయని ఆరణగండ్ల యుద్ధమును దేవతలు సహితము చూచి ఆనందించిరఁట.

ఇది శ్రీనాథుని రచనము. ఇందు 2200 పాదములున్నవి.

మల్లయ్యమంత్రి రచించిన ఆరణగండ్ల యుద్ధము మఱియొకటి నాకు లభించినది. అందు 2700 పాదములున్నవి. వేఱొక గాథలో దొడ్డనాయఁడే యీ యుద్ధమును జేసినట్లును, దొడ్డనాయఁడు వేటకుఁ బోయినప్పుడు జొన్నకంకుల వివాదము వచ్చినట్లును గలదు. వీరభద్రకవి పద్యకావ్యమునఁగూడ నిట్టికథయే యున్నది. వీరభద్రకవి 'ఆరణగండ్ల'ను 'ఆర్లగండ'గాఁ బేర్కొన్నాఁడు. వీని యన్నింటను శ్రీనాథ విరచితమగు కథయే ప్రశస్తముగా నున్నది.

## 7.7. 'నాయకురాలి కథ':-

పరశురాముఁడు క్షత్రియసంహారము చేయుచుండఁగాఁ, గార్తవీర్యుని మనుమలు భయముతో నొక రెడ్డి మఱుఁగును జొచ్చిరి. పరశురాముఁడు వారిని వెంబడించుచు ఆ రెడ్డి కడకురాఁగా, ఆ రెడ్డి భయపడి గర్భిణియగు తన భార్యను అడ్డుపెట్టెనఁట. పరశురాముఁడు ఆగ్రహావేశమున స్త్రీ యని సంకోచింపక ఆ గర్భిణిని సంహరింపఁగా, ఆమె గర్భమున నున్న శిశువు పరశురామునితోఁ దనకుఁ బగ యిమ్మని కోరెను. పరశురాముఁ డాశ్చర్యపడి, తాను కలియుగమున బ్రహ్మనాయఁడుగాఁ బుట్టినప్పుడు, ప్రమథవర్గము పల్నాటి వీరులుగాను, ఆ శిశువు నాగమ్మగాను జన్మింతురనియు, ఆనాఁడు పగయిత్తుననియుఁ దెల్పెను. ఈ పూర్వజన్మ వృత్తాంతము మద్రాసు ప్రా.లి.పు.భాం.న గల డి.నెం. 1140, 1141 ప్రతులలో నున్నది. శ్రీమతి పేరమ్మగారు రచించిన 'యోగామృత సారము' అను గుత్తికొండబిల మాహాత్మ్యమునఁగూడఁ బల్నాటివీరుల పూర్వజన్మలనుగూర్చిన విషయములున్నవి కాని, అవి అభూత కల్పనలతో నస్తవ్యస్తముగా నున్నవి.

'జిట్టగామాలపాడు' అను గ్రామమున 'పొట్టి నాగిరెడ్డి' (రామిరెడ్డి అని కొందఱు) అను పేద రైతునకుఁ బొలములో నాగులేటి తీరమున నొక స్త్రీశిశువు దొరికినది. ఆమెకు 'నాగమ్మ' యని పేరిడి పెంచుకొనుచుండెను. ఆమె వచ్చిన నాటినుండియు నా రెడ్డి మిగుల సంపన్నుఁడయ్యెను. కొన్నినాళ్లకు ఆమెకు వివాహము చేసెను. నాగమ్మకు వివాహము నాఁడే మగఁడును, అత్తమామలును, తల్లిదండ్రులును మరణించిరి. అయినను ఆమె నిరుత్సాహము చెందక, యుద్ధవిద్యలందును, రాజకీయశాస్త్రమందును ఆఱితేరి, 'నాయకురాలు' నామమును ధరించి, ప్రజలకుఁ దీర్పరియై, ఆ చుట్టుప్రక్కల నొక రాణివలె మెలఁగుచుండెను.

ఇట్లుండ, నొకనాఁడు అనుఁగురాజు జిట్టగామాలపాడు ప్రాంతమందలి అరణ్యమునకు వేఁటకు వచ్చెను. (నలగాముఁడు వేఁటకు వచ్చినట్లుగాఁ గొన్ని వీరగాథలలోఁ గలదు. వీరభద్రకవి 'నలసింగరాజు' వేఁటకు వచ్చెనని వ్రాసెను.) వేఁటయందలసిపోయిన రాజునకును ఆతని పరివారమునకును నాగమ్మ గొప్ప విందు చేసెను. అనుఁగురాజు మిక్కిలి సంతసించి, ఆమెకేదైన నొక వరము నీయ సంకల్పించెను. నాగమ్మ యేడుజాములు గురిజాల సింహాసన మెక్కుట కనుజ్ఞ కోరెను. (వీరభద్రకవి కావ్యమున నొకజాము సింహాసన మెక్కుట కనుమతిని గోరెనని కలదు. పింగళివారి ప్రతిలో 'ఆరునొక గడియ' మంత్రిత్వమును గోరెనని కలదు.) అనుఁగురాజు సమ్మతించి, పత్రము వ్రాసి ఆమెకిచ్చెను. అప్పటినుండియు నాగమ్మ గురిజాల కోటకు వచ్చిపోవుచుండెను.

అనుఁగురాజు సభలో నాగమ్మకుఁ బలుకుఁబడి హెచ్చుచుండెను. అందఱును ఆమెకు విధేయులగుచుండఁగా నొక్క బ్రహ్మనాయఁడు మాత్రము ఆమెను లెక్కింపకుండెను. అందుచే నాగమ్మ బ్రహ్మనాయని ద్వేషించి, అనుఁగురాజుతో బ్రహ్మనాయనిపైఁ గొండెములు చెప్పసాఁగెను. బ్రహ్మనాయఁడు కొలువుకూటమునకు వచ్చినప్పుడు రాజునకు నమస్కరించుట లేదనుట ఆ కొండెములలో నొకటి. బ్రహ్మనాయఁడు అనుఁగురాజున కెప్పుడును నమస్కరింపక పోవుట సత్యమే. అందుచే అనుఁగురాజు నాగమ్మ కొండెములను నమ్మి దొడ్డనాయనితోఁ జెప్పెను. దొడ్డనాయఁడు కొడుకునకు మంత్రిపదవి నిచ్చి తాను వైదొలఁగెను. అప్పుడు బ్రహ్మనాయఁడు కొలువు కూటమునకు వచ్చి, అనుఁగురాజును సింహాసనమునుండి లేచి ప్రక్కకుండుమని కోరి, ఆ సింహాసనమునకు నమస్కరించెను. అది వెంటనే ముక్కలు ముక్కలుగాఁ బగిలిపోయి, ఒక ముక్క యెగిరి వెళ్లి అనుఁగురాజు వీఁపునకు దగిలెను. అతఁడా దెబ్బతో మంచమునఁబడి, బ్రహ్మనాయని వేఁడుకొని, దొడ్డనాయని తోడుగాఁ గొని కైలాసమున కేఁగెను.

అనుఁగురాజు మరణానంతరము బ్రహ్మన్న నలగాముని రాజుగాఁజేసి, తాను మంత్రిత్వమును నెఱపుచుండెను. ఒకనాఁడు నాగమ్మ, అనుఁగురాజు తనకు వ్రాయించి యిచ్చిన రాగిరేఁకును దెచ్చి నలగామునకుఁ జూపెను. అతఁడు తండ్రి యిచ్చిన వాగ్దానమును గౌరవించి, నాగమ్మకు ఏడు జాములు గురిజాల సింహాసన మిచ్చెను. ఆ పరిమిత కాలములో నాగమ్మ కఠినచర్యలను గైకొని ప్రజలనుండి రావలసిన పన్నులన్నింటిని వసూలు చేసినది. (నాగమ్మ ప్రజలను మండుటెండలో రేగుకంపలపై నిలువఁబెట్టి పన్నులు వసూలు చేసినదని గాథాకారులు చెప్పుచుందురు.) నలగాముఁడా ధనమును జూచి ఆశ్చర్యపడెను. ప్రజలలో నింతధనముండఁగా బ్రహ్మన వసూలు చేయక ఉపేక్షించుచున్నాఁడని తలంచెను. నాగమ్మ సామర్థ్యమును గుర్తించి, బ్రహ్మనాయని మంత్రిపదవినుండి తొలఁగించెను.

నాగమ్మ అంతటితో నూరకొనలేదు. వీరవిజ్జలదేవి కుమారులగు మలిదేవాదులను జంపింప యత్నించినది. వారిచే దుడుకు పనులు చేయించి, వారిపై నలగామునకుఁ గోపము వచ్చునట్లు చేసినది. నలగాముఁడు బాలురగు మలిదేవులను జంప నాజ్ఞాపించెను. కాని బ్రహ్మనాయఁడు ఆ బాలురను రక్షించి, వారికిఁగొంత రాజ్యము నిమ్మని నలగామునిపై వొత్తిడి తెచ్చెను. బ్రహ్మనాయఁడు

మలిదేవులతోఁ గలసి గురిజాలను వీడి, చంద్రవంక తీరమును జేరి, అటనున్న అరణ్యమును నఱకి, 'మాచెర్ల' యను పట్టణమును గట్టించి, మలిదేవుని పక్షమునఁ దాను బాలించుచుండెను.

పింగళివారి ప్రతిలో, నాగమ్మ నలగామునిచేఁ దన కీయఁ బడిన యేడుగడియల కాలములో భటులను బిలిచి, బ్రహ్మన చెలికాండ్ర యిండ్లను దోపిడి చేయించి, ధనమును సమకూర్చినట్లు గలదు. బ్రహ్మనాయఁడు మలిదేవునకుఁ బట్టము గట్టఁ బ్రయత్నించు చున్నాఁడని నాగమ్మ చెప్పగా, నలగాముఁడు మలిదేవులను చెఱసాలలో వేసినట్లున్నది కాని, చంప యత్నించినట్లు లేదు. బ్రహ్మన కన్నమనీనిచే వారిని చెఱవిడిపించి, గురిజాల చుట్టును సైన్యములను మోహరించి, మలిదేవులకు రాజ్యభాగము నిమ్మని నలగాము నొత్తిడిచేసెను. నలగాముఁడు మాచెర్లను విభజించి మలిదేవున కిచ్చెను.

వీరభద్రకవి పద్యకావ్యమున 'నలసింగరాజు'నకుఁ బ్రాముఖ్య మీయఁబడినది. నలసింగరాజు నాగమ్మ దుర్బోధచే మలిదేవులను జంప నాజ్ఞాపించును. బ్రహ్మనాయఁడు వారిని రక్షించి, గురిజాలను విడిచిపోవును. గురిజాల పౌరులు బ్రహ్మన్నతో వత్తుమందురు. చంద్రవంక తీరమున నరణ్యమును నఱికి, మాచెర్లపట్టణమును గట్టి, బ్రహ్మనాయఁడా పట్టణములోఁ గనకవర్షము కురిపించును.

### 7.7.1.నాయకురాలినిగూర్చి కొన్ని నూతన విశేషములు:-

వీరభద్రకవి కావ్యమున నాగమ్మను పెంచిన రెడ్డిపేరు 'పొట్టి నాగిరెడ్డి' యని కలదు. అక్కిరాజు ఉమాకాంతంగారు నాగమ్మ తండ్రి (పెంపుడు తండ్రి) "చౌదరి రామిరెడ్డి" యనియు, మేనమామ "మేకపోతు సింగారెడ్డి" యనియు, ఇంటిపేరు "ఆరవల్లివారు" అనియుఁ దెల్పిరి (చూ. వారి పల్నాటి వీరచరిత్ర, ప్రథమ భూమిక). ఈ ఆరవల్లివారనునది ఆమె అత్తవారింటిపేరో, లేక పుట్టింటిపేరో తెలియుట లేదని ఉమాకాంతంగారు సందేహించిరి. పింగళి లక్ష్మీకాంతంగారు తాము పరిష్కరించిన పల్నాటి వీరచరిత్రలో నాగమ్మ పెంపుడు తండ్రి 'వీర జగ్గారెడ్డి' యనియు, మేనమామ 'మేకపోతుల రెడ్డి' యనియుఁ దెల్పినారు:-

*"పంటరెడ్డివారి పడతియు మరియు*
*వీర జగ్గారెడ్డి వేడుక పుత్రి*
*మేకపోతుల రెడ్డి మేనకోడలును*
*నాగమ్మయను ఒక నారీలలామ"* [61]

ఇందు జగ్గారెడ్డికి 'వీర' విశేషణమును, నాగమ్మకు 'నారీలలామ' యను వివరణమును, పింగళివారు కల్పించినట్లున్నది. నాగమ్మ యింటిపేరు వీరి ప్రతిలో లేదు. నాకు లభించిన కారెంపూడి తాళపత్ర గ్రంథమున నాగమ్మనుగూర్చి యిట్లున్నది:-

*"పంటరెడ్డివారి పణతి యనంగ*
*ఎలమి జగ్గారెడ్డి వేడుక పుత్రి*
*మేకపోతులరెడ్డి మేనకోడలును*
*ఆరవెల్లివారింటి అమర కోడలును*
*తరుణి నాగమయును తక్షణమందు"* [62]

ఈ తాళపత్రగ్రంథమునుబట్టి నాగమ్మనుగూర్చిన పెక్కు సందేహములకు నివృత్తి లభించుచున్నది. అక్కిరాజువారు 'ఆరవెల్లి వారు' అనునది నాగమ్మ పుట్టింటి పేరో లేక అత్తవారింటి పేరో తెలియుట లేదనిరి. నాకు లభించిన తాళపత్రప్రతిలో నిది అత్తవారింటి పేరని స్పష్టముగా నున్నది. 'వేడుకపుత్రి' యనుటచే నీమె జగ్గారెడ్డికిఁ బుట్టినది కాదని స్పష్టమగుచున్నది. 'మేన' శబ్దముచే నీమె తల్లిగారింటి పేరు మేకపోతులవారని తెలియుచున్నది. ఈమె మేనమామ పేరు 'సింగారెడ్డి' అని అక్కిరాజుగారు తెల్పియున్నారు. పింగళివారిప్రతిలోను, నా ప్రతిలోను 'సింగా' శబ్దములోపించినది (బహుశః గణము కొఱకు లోపించినదేమో). 'మేన' శబ్దముచే నితఁడు నాగమ్మ నిజమాత సోదరుఁడే కావలెను. 'పంటరెడ్డివారు' అనునది నాగమ్మ పుట్టింటిపేరు కావచ్చును (అనఁగా జగ్గారెడ్డి యింటిపేరు లేదా, నాగమ్మ అసలుతండ్రి యింటిపేరు). లేదా యిది రెడ్లలో నీమె శాఖను దెల్పునది కావలెను. (నేఁడు 'పంటరెడ్డి' యనునది రెడ్లశాఖలలో నొకటిగా మాత్రమే ప్రచారమున నున్నది. 'పంటరెడ్డి వారు' అనునది యింటిపేరుగా నున్నట్లు తెలియవచ్చుట లేదు.)

నాకుఁ బల్నాడులో లభించిన 'గురిజాల రాయబార'మను వేఱొక వ్రాఁతప్రతిలో నాగమ్మ తండ్రిపేరు 'చౌదరి రామిరెడ్డి' యని కలదు. జగ్గారెడ్డి యీమె తండ్రిగాఁ గాక, మేనమామగాఁ జెప్పఁ బడినాడు:

*"ఏకనాటి మధ్యమున ఏనరు వేగమున*
*జిట్టగామాలపాటి గట్టి నాయకురాలు*
*చవుదరి రామిరెడ్డి చక్కని కూతురు*
*మేకపోతుల జగ్గారెడ్డి మేనకోడలేమి*
*వున్నది గామాలపాట వుచితంబుగాను"* [63]

శ్రీ కలవల వెంకట సుబ్బారావుగారు తమ 'భక్త పలనాటి వీరచరిత్ర'లో నాగమ్మనుగూర్చి కొన్ని క్రొత్త విశేషములు బయట పెట్టిరి. ఈమె పల్నాటికిఁ జెందినది కాదనియు, కరీంనగరు మండలములోని 'ఆరువెల్లి' గ్రామమునకుఁ జెందినదనియు, అక్కడ నేఁడు నాగమ్మపేర నొక దేవాలయము కలదనియు, ఆ దేవాలయమున నేఁటికిని నామెకుఁ బూజాపునస్కారములు జరుగుచున్నవనియుఁ దెల్పియున్నారు. "కరీంనగరు జిల్లానుండి యీమె గామాలపాడు చేరుట కనేక మార్గము లుండియుండును. రామిరెడ్డి అనపత్యుఁడైనందున నీ బిడ్డను బసిపాపగనుండఁగనే అచటినుండి తెచ్చికొని యుండ వచ్చును. లేక యీమె జననీ జనకులే యే కారణముననో యీ బిడ్డ నిచట రామిరెడ్డియొద్ద వదలి వెళ్లియుండవచ్చును. ఆ కాలమున

ఓరుగల్లు రాధానీనగరమునుండి జనుల రాకపోకలు తఱచుగా నుండెడివి"[64] అని వ్రాసి, పల్నాటికిని తెలంగాణమునకును రాఁకపోఁకలు జరుగుచుండెననుటకు నోరి నరసింహశాస్త్రిగారి 'రుద్రమదేవి' యను చారిత్రక నవల సాక్ష్యమిచ్చుచున్నదని తెలిపినారు.

సుబ్బారావుగారి నిరూపణము సమంజసముగనే యున్నది. నాగమ్మ జిట్టగామాలపాడులో నొక పేదకాఁపునకు నాగులేటి తీరమున లభించినట్లుగా వీరగాథలలోఁ జెప్పఁబడినది. అతఁడు పెంచిన తండ్రిగనే చెప్పఁబడినాఁడు కాని, కన్నతండ్రిగా నెచ్చటను లేదు. ఈమె 'ఆరువెల్లి' గ్రామమునుండి వచ్చియుండుటచే నారువెల్లి నాయకురాలుగాఁ బిలువఁబడియుండును. గ్రామనామమే యింటి పేరుగా మాఱిన సంఘటనలు పెక్కు గలవు. (ఒకవేళ తెలంగాణములోని 'ఆరువెల్లి' యీమె అత్తవారి గ్రామమైనను గావచ్చును.)

ముద్రితాముద్రతములగు వీరగాథలలోఁ దెలుపఁబడిన అంశములనుబట్టి నాగమ్మను పెంచిన తండ్రి పేరు "పొట్టి నాగిరెడ్డి, జగ్గారెడ్డి, చౌదరి రామిరెడ్డి" యని మూఁడు విధములుగా నున్నది. ఇందు 'చౌదరి రామిరెడ్డి' యను నామమునకే పల్నాడులో ప్రచారమున్నది. ఇదియే విశ్వసింపఁదగినది. నాగమ్మ మేనమామ పేరు కూడ "మేకపోతు సింగారెడ్డి, మేకపోతుల రెడ్డి, మేకపోతుల జగ్గారెడ్డి" అని మూఁడు విధములుగా నున్నది. నాగమ్మ మేనమామ పేరుమాట యెట్లున్నను, ఆతని ఇంటిపేరు మాత్రము మూడింటను సమానముగా నున్నది. కాఁబట్టి నాగమ్మ కన్నతల్లియొక్క పుట్టింటి పేరు 'మేకపోతులవారు' కావచ్చును. మేనమామ పేరు సింగారెడ్డియో, జగ్గారెడ్డియో కానోపును. ఈమె ఆరవెల్లివారింటి కోడలనుట మాత్రము స్పష్టముగాఁ దాళపత్రగ్రంథమునఁ గలదు. 'నాయకురాలు' ఈమె బిరుదము. ఈమె రెడ్లలోఁ బంటరెడ్డి శాఖకుఁ జెందినదని తెలియుచున్నది. (నేఁడీ పంటరెడ్లు నెల్లూరు మండలమున విస్తారముగా నున్నారు.)

మాచెర్ల వాసియగు డా॥ కె. బసవలింగదేవర యను రచయిత పల్నాటియుద్ధ కథావృత్తమును గ్రహించి 'వీరభూమి' యను బుఱ్ఱకథను రచించి 1953లోఁ బ్రచురించెను. ఈయన కూడ నాగమ్మ పెంపుడుతండ్రిపేరు 'రామిరెడ్డి' యనియే తెలిపిరి. ఇందు నాగమ్మ భర్తనుగూర్చి యిట్లు వ్రాసిరి: "ఆమె కైదవయేడు రాఁగానే మాచెర్ల వాసియగు నోబళరెడ్డి కుమారుడు సింగారెడ్డికిచ్చి పెండ్లి చేసిరి" (పుట 31). దీనికి వారికే ప్రమాణము దొరకినదో, లేక యిది వారి కల్పనయో తెలియరాదు.

కారెంపూడిలో నున్న పల్నాటి వీరాచార పీఠాధిపతులు శ్రీ పిడుగు నరసింహంగారు నాయకురాలిని గూర్చి 27-8-1966న నాతో నిట్లు చెప్పిరి: "నాయకురాలు శక్తిస్వరూపిణి. జిట్టగామాలపాడులో రామిరెడ్డి యను రైతుండెను. అతఁడు నిఱుపేద. అతనిది ఒంటెద్దు వ్యవసాయము. ఒకరోజున తన ఒంటెద్దుతో నాగులేటి తీరమునఁగల పొలమునకుఁబోయెను. చేను కంచెలలో శిశురోదనము వినఁబడెను. సంతానము లేని రామిరెడ్డి ఆ శిశువు నింటికిఁ దెచ్చి, అల్లారుముద్దుగాఁ బెంపసాఁగెను. ఆ పాప దొరికినప్పటినుండియు రామిరెడ్డి స్థితిపరుఁడు కాసాగెను. నాగులేటి తీరమున లభించుటచే నామెకు 'నాగమ్మ' యని పేరు పెట్టెను. ఒక బ్రాహ్మణునియొద్ద సకల విద్యలు నేర్పించెను. విద్యావతియైన తరువాత నాగమ్మ 'నాగాంబ' అయినది. ఆమెకుఁ బండ్రెండవ యేట రామిరెడ్డి పెండ్లి చేసెను. కాని యామె పోలులోనే ముండమోసెను. ('పోలు' అనఁగా బెండ్లియైన పదునాఱవనాఁడు చేయు పండుగ.) ఈమె మిక్కిలి ప్రజ్ఞావంతురాలు. తన తెలివితేటలతోఁ దన గ్రామము చుట్టుప్రక్కల గొప్పపేరు సంపాదించెను. ప్రజలకు న్యాయవిచారణ చేయుచుఁ దీర్పులిచ్చుచుండెను.

"అలుగురాజు మంత్రి దొడ్డనాయఁడు మెత్తనివాఁడు. ప్రజల నుండి శిస్తు సరిగా వసూలు చేయలేకపోయెడివాఁడు. నాగమ్మ అతని అసమర్థతను గుర్తించినది. 'ఈ వెఱ్ఱిబాగుల ముసలివాఁడా పల్నాటి రాజ్యమునకు మంత్రి? నేనెందులకుఁ గారాదు?' అని ఆలోచించినది. గురిజాలకు వచ్చి రాణియగు మైలమదేవి ద్వారా రాజునకు 'సిఫార్సు' చేయించుకొన్నది. సాటి స్త్రీ యను నభిమానముతో మైలమదేవియుఁ దన భర్తతో నాగమ్మ విషయమై గట్టిగాఁ జెప్పి, ఆమెకు కొలువులోఁ బ్రవేశమిమ్మని కోరినది. కాని అలుఁగురాజు, ఆఁడుది యను నిరసన భావముతో నాగమ్మ విషయము పట్టించుకొనలేదు. శిస్తు వసూలుచేయుటలో దొడ్డనాయని అసమర్థతనుగూర్చి నాగమ్మ అలుగురాజుతోఁ జెప్పినది. బ్రహ్మనాయనిపైఁగూడ చాడీలు చెప్పినది. అలుఁగురాజు నాగమ్మ ఆంతర్యమును గ్రహించినాఁడు. నలగామునకుఁ బట్టము కట్టవలసినదనియు, భావిలో రాజకుమారులలో స్పర్ధలు వచ్చినచో మలిదేవాదులకు మాచెర్ల భాగమును బంచి యీయవలసినదనియు, బ్రహ్మనాయనితోఁ జెప్పి, ఆతఁడు తనువు చాలించెను. ఇట్లు రాజ్య విభాగము నలుఁగురాజే ముందు సూచించినాఁడు. దైవభక్తి పరాయణుఁడగు బ్రహ్మన్నకూడ తండ్రివలెనే పన్నులు వసూలుచేయుటలోఁ గాఠిన్యమును వహింపలేకపోయెను. రాజకీయదృష్టితోఁ జూచినచో నిది లోపమే. మంత్రిగా బ్రహ్మనాయనికన్న నాగమ్మయే సమర్థురాలు. ఆమె గురిజాలకోటకు వచ్చుచుఁ బోవుచు, రాణులమూలమున నలగామునిపై నొత్తిడి తెచ్చుచుండెను.

"ఒకనాఁడు నలగాముఁడు వేఁటకు వెళ్లెను. నాగమ్మ ఆతనికిని ఆతని పరివారమునకును గొప్ప విందు చేసెను. రాజు మెచ్చి, ఆమెను వరము కోరుకొనుమనఁగా, నాగమ్మ మూఁడు ఘడియలు మంత్రిత్వమును గోరెను. ఆ స్వల్పకాలములోఁ బ్రజలనుండి అశేష ధనమును స్వీకరించి నలగామునకుఁ జూపెను. నలగాముఁడు నాగమ్మ సామర్థ్యమును గుర్తించి ఆమెను వెంటనే ప్రధానమంత్రిణిగా

స్వీకరించెను. అప్పటినుండియు 'నాగాంబ' 'నాయకురాలు'గా మాఱెను. ఈమె విషప్రయోగముచే మలిదేవాదులను జంప యత్నించినది. బ్రహ్మనాయఁడది దివ్యదృష్టిచేఁ గనుగొని, వారిని రక్షించి, మాచెర్లను బంచుకొని, మలిదేవాదులను దీసికొని వెడలిపోయెను."

నాగమ్మ చాణక్యునివంటి ప్రజ్ఞాశాలిని! తిమ్మరుసువంటి ధీశాలిని! ఆచంద్రతారార్క మాంధ్రులు గర్వింపఁదగిన ఆడుపడుచు!! నాయకురాలను బిరుదము ఈమెకు అన్వర్థనామధేయము. రాయలసీమలో నాగమ్మపేరుతో నొక నుడికారము వ్యాప్తియందున్నది. మగవానివలె ధైర్యసాహసములు ప్రదర్శించు స్త్రీని రాయలసీమలో (ముఖ్యముగా కడప మండలమున) 'పల్నాటి నాగమ్మ' అని వ్యాఖ్యానించుట నేఁటికిని గలదు.

(నాగమ్మ ఎంత ప్రజ్ఞాశాలినియైనను ఈమె దుర్యోధనునివలె మిక్కిలి ఈర్ష్యాళువు. కర్ణుఁడు అర్జునునియందువలె, నీమె బ్రహ్మనయందు స్పర్ధాళువు. ఆ యీర్ష్యతో శకుని కపటద్యూతమువలె మోసముతో కోడిపందెము గెలుచుట, మలిదేవుని ఆలమందను పొడిపించుట, విషప్రయోగమున నలరాజును చంపుట– వంటి ఘోరకృత్యములెన్నియో చేసెను. వీని నెవ్వరును సమర్థింపలేరు. మహాభారతములోని కర్ణశకునులవలె నీమె నలగామునిని పాపకార్యములకుఁ బురికొల్పెను; తప్పుత్రోవఁ బట్టించెను.)

## 7.8. 'అనుఁగురాజు మరణము' లేక 'మైలమ్మ సాగుమానము' (మైలమదేవి సహగమనము):–

అనుఁగురాజు మరణమును ప్రత్యేకముగా వర్ణించు వీరగాథ యొకటి నాకు లభించిన అల్లూరుపాడు తాళపత్రగ్రంథమునఁ గలదు. ఇది శ్రీనాథుని రచన. సుమారు 900 మంజరీ పాదములలో నున్నది. దీనికి 'మైలమదేవి సహగమనము' లేక 'మైలమ్మ సాగుమానము' అని నామాంతరము.

అనుఁగురాజు తన పుత్రులందఱకును వివాహములు చేసెను. అతని వీపున రాచపుండు పుట్టెను. ఎన్ని ప్రయత్నములు చేసినను అది తగ్గలేదు. అనుఁగురాజు బ్రహ్మనాయనిఁ బిలిచి, తన కుమారుల నందఱను అతనికి అప్పగించెను. నలగాముని రాజుచేసి మంత్రిత్వమును నెఱపుమని చెప్పి తనువు చాలించెను. మైలమదేవి భర్తతో సహగమనము చేసినది. గురిజాల ప్రజలు మైలమ్మను దలఁచుకొని కన్నీరు మున్నీరుగా శోకించిరి.

ఈ కథకు మైలమ్మ సాగుమానమను పేరు జానపదులలో వ్యాప్తియందున్నది. క్రీడాభిరామమున **"నిజ మనుశుద్ధికై నిప్పుల యేటిలో, నోలాడె నిచ్చోట బీలసాని"** అను ప్రసక్తి (122వ పద్యము) మైలమదేవి సహగమనగాథకు సంబంధించినదేమో పరిశీలింపవలసి యున్నది. లేక 'బీలసాని కథ' వేఱుగా నున్నదేమో తెలియదు.

## 7.9. 'రాచగావు కథ':–

'శివనందులకోట యుద్ధము' అని దీనికి నామాంతరము. ఇది రెండు రాత్రుల కథ. 'రాచగావు' అనఁగా మేకపోతు. బ్రహ్మనాయఁడు మాచెర్లలో మలిదేవాదులతో నుండి, ఆ రాజులకుఁ బెండ్లిండ్లు సేయ సమకట్టి, కల్యాణపురమునకుఁ బోయెను. కల్యాణము నేలు వీరసోముని పుత్రిక సిరాదేవిని పెదమలిదేవున కిమ్మని యడిగెను. బ్రహ్మనాయఁడు వైష్ణవుఁడగుటచే, శైవుఁడగు వీరసోముఁడందుల కియ్యకొనలేదు. బ్రహ్మన తిరిగి మాచెర్లకు వెడలిపోయెను.

ఇటఁ గల్యాణపురమున వీరసోముని తమ్ముఁడగు నందిసోముని పుత్రిక 'నాగులాదేవి'ని (ఈమె పేరు 'శివనాగులదేవి' అనియు, నీమె వీరసోముని పుత్రిక యనియుఁ గొన్ని వీరగాథలలోఁ గలదు) ఆమె మేనత్తకొడుకు శివసింగు ప్రేమించి, నందిసోముఁడు పూజించు మహంకాళి పీఠముతో సహా నాగులాదేవిని రహస్యముగాఁ దన 'శివనందులకోట' (శివనంద్లకోట యని పింగళివారి ప్రతిలోఁ గలదు) కుఁ గొనిపోయెను. వీరసోముఁడును అతని సోదరులును శివనందుల కోటపై దండెత్తిరి. ఆ కోట చాల గొప్పది. దానిని నిరంతరము శక్తులు పోతురాజు కాపాడుచుందురు. వీరసోముఁడు పెక్కేండ్లు పోరాడినను ఫలితము లేకపోయెను. పోతురాజు బ్రాహ్మణవేషమున వచ్చి బ్రహ్మనాయఁడొక్కడే ఆ కోటను గెలువఁ గలఁడని చెప్పెను. అప్పుడు వీరసోముఁడు తన పుత్రికను పెదమలిదేవున కిత్తుననియు, శివనందులకోటను జయించుటలోఁ దనకు సహాయము చేయవలసిన దనియు బ్రహ్మన్నకుఁ గబురు పంపెను.

కన్నమనీఁడు, గండు కన్నమనాయఁడు తోడురాఁగా బ్రహ్మన్న తల్లి దీవెనపొంది, శివనందులకోటపై దండెత్తెను. పోతురాజు తనకు 'తాటంతపోతు, మేటంత ముద్ద' ఆహారముగాఁ బెట్టినచో నా కోట లొంగునట్లు చేయుదునని చెప్పఁగా బ్రహ్మనాయఁ డంగీకరించెను. శివనందులకోట బ్రహ్మన్నకు లొంగిపోయెను. శివసింగురాజు, శివనాగులదేవి విషము మ్రింగి చనిపోయిరి. ఆ దంపతుల కొక మగపిల్లవాఁడు నొక యాడుపిల్ల కలరు. బ్రహ్మనాయషడు ఆ యాడుపిల్లకు 'పిన్నయక్క' అనియు, మగవానికి 'లంక పోతన్న' అనియు నామకరణము చేసి, వారిని దనతోఁ గొనిపోయి ప్రేమతోఁ బెంచుకొనెను.[65] ఆ కోట వీరసోముని స్వాధీనమయ్యెను. అందఱును ఆ కోటను దోఁచుకొనిరి.

ఈ శివనందులకోట యుద్ధమున యాదవులుకూడ బ్రహ్మనాయనికి సహాయము చేసిరి. అందుచేఁ గోటదోఁపులో లభించిన 'ఇరుగుల గంగ', 'పోతురాజు', 'వీరత్రాడు' అను మూఁడు వస్తువులను బ్రహ్మన యాదవులకిచ్చెను. ఆ మూఁడు రూపములును ఎఱ్ఱగడ్డపాటికిఁ బోయెను. బ్రహ్మన్న యీ కోటలో లభించిన నాగారపు స్తంభమును గొనిపోయి త్రిపురాంతకమునఁ

బ్రతిష్ఠించెను. ఈ స్తంభమే యుద్ధకాలమునఁ గారెంపూడిలోఁ బాతఁ తఁబడినది. 'కల్లుప్రతిష్ఠ' కథ దీనినిగూర్చియే వర్ణించును.

బ్రహ్మన్న పోతురాజునకు మేకపోతును బలియిచ్చినాఁడు. 'తాటంత పోతు' (=తాడిచెట్టంత పోతు) నిచ్చెదనని మొదట నంగీకరించిన బ్రహ్మన్న, త్రాటితోఁగట్టిన మేకపోతును పోతురాజునకు బలియిచ్చెనఁట. అట్లే 'మేటంత ముద్ద' అనఁగా 'గడ్డిమేటివలెనుండు ముద్ద' యని పోతురాజు నభిప్రాయము. కాని బ్రహ్మనాయఁడు దానిని గూడ యుక్తితోఁ దప్పించి, మామూలు నైవేద్యమునే పెట్టెనఁట. ఇట్లు పోతురాజునకు మేకపోతును బలియిచ్చుటచే దీనికి 'రాచగావు కథ' యని పేరు.

## 7.10. రాజుల పెండ్లికథ:-

మలిదేవరాజుల పెండ్లిండ్లను వర్ణించు కథ. శివనందులకోటను గెలుచుటలో సాహాయ్య మొనర్చినందులకు సంతసించి వీరసోముఁడు తన కుమార్తె సిరాదేవిని పెదమలిదేవరాజున కిచ్చుటకు సమ్మతించెను. పినమలిదేవ, బాలమలిదేవులకు వీరసోముని సోదరుల పుత్రికల నీయ సంకల్పించిరి. మలిదేవరాజుల మువ్వురను, పరివారమును, బంధువులను వెంటఁబెట్టుకొని, బ్రహ్మనాయఁడు కల్యాణపురమున కేఁగెను. అట వైభవముగాఁ బెండ్లి జరిగెను. బెండ్లి సందర్భమున వీరసోముని కొలువులో నున్న ముగ్గురు గొల్లబంట్ల పరాక్రమమును జూచి ఆశ్చర్యపడి, బ్రహ్మన్న మలిదేవరాజు భార్యతో నా గొల్లబంట్ల నరణముగాఁ గోరుమని చెప్పెను. వీరసోముఁడు కూఁతురు కోర్కె ననుసరించి 'రాయబోయఁడు, రాయపడాలు, బాలగోపన్న' అను ముగ్గురు సోదరులగు నెట్టిగొల్లవీరులను,[66] గోవులను, గొఱ్ఱెలను అరణముగా నిచ్చి పంపెను.

ఇట్లు రాజులు ముగ్గురకును బెండ్లిండ్లు చేసి, తిరిగి మాచెర్లకు వచ్చుచు, బ్రహ్మన్న కొల్లాపురికి వెళ్లి, దత్తాత్రేయ గురువును బ్రార్థించి, అతనిని మాచెర్లకు వచ్చి మలిదేవునకుఁ బట్టాభిషేకము చేయవలసినదిగాఁ గోరును. బ్రహ్మనాయని కోరికను మన్నించి ఆ దత్తాత్రేయ పీఠాధిపతి మాచెర్లకు వచ్చి, మలిదేవునకుఁ బట్టాభిషేకము చేయును. (ఇంతవఱకును మాచెర్లను బాలుఁడగు మలిదేవుని పక్షమున బ్రహ్మనాయఁడే పాలించుచువచ్చెను. ఇప్పుడు మలిదేవులకు ముగ్గురకును బెండ్లిండ్లు చేసి, అందు పెదమలిదేవుని మాచెర్ల రాజ్యమునకుఁ బట్టాభిషిక్తునిఁ జేసెను.) ఈ సందర్భముననే కంచెర్ల నేలు కృష్ణగంధర్వుఁడు మాచెర్లకు వచ్చి, పెద్దన్న బాదరాజును శోభనమునకై తన నగరికిఁ గొంపోవును.

వీరభద్రకవి కావ్యమున మొట్టమొదట పెద్దన్న పెండ్లికథ వర్ణితమైనది. ఇది అనుఁగురాజు పాలమాచాపురిలో నుండగనే జరిగినట్లు కలదు. కాని నాకుఁ గారెంపూడిలో లభించిన తాళపత్ర ప్రతిలో (ఇది శ్రీనాథకృతము) పెద్దన్నపెండ్లి అనుఁగురాజు గురిజాలను బాలించుచుండగా జరిగినట్లు కలదు. ('అనుఁగురాజు మరణము' అను కథలోఁగూడ నిట్లే యున్నది.) పెద్దన్న వెలమయని తెలియుట, పెద్దన్న గుఱ్ఱము కంచెర్లను పాడుచేయుట, అతఁడు తన షడ్డకులను మామను సంహరించుట, మున్నగు కథాభాగములు మాత్రము, బ్రహ్మనాదులు మాచెర్లకు వచ్చి, మలిదేవులకుఁ బెండ్లి చేసిన తర్వాత జరిగినట్లుగా వర్ణింపఁబడినది. కాని యీ కథ యంతయుఁ బల్నాటి వీరకథాచక్రమున మొదట నుండుటయే సమంజసమని తోఁచుచున్నది. ఏలన, ఈ పెద్దన్న వీరులందఱిలోను బెద్దవాఁడు. అనుఁగురాజు తనకు సంతానము లేని దినములలోనే యితనిని బెంచుకొనెను. కాఁబట్టి యీతని వృత్తాంతము పాలమాచాపురిలోనే జరిగినదనుట యుక్తము. (లేదా గురిజాలలో నలగామాదులు పుట్టుటకు ముందు జరిగియుండవచ్చును.) అనుఁగురాజు గురిజాలను జేరిన తరువాత నలగామాదులు జన్మించిరి. ఈ బాలుర పెండ్లిండ్లును పెద్దన్నపెండ్లియు నొక్కసారి జరిగినవనుట యుక్తము కాదు.

## 7.11. బాలుని పుటక:-

మాచెర్లలో, బ్రహ్మనాయని తల్లియగు శీలమ్మతో నైదుగురు కోడండ్రును దమ సంతాన వాంఛను దెలిపిరి. ఆమె వారిని చెన్నకేశవుని పూజింపవలసినదిగా నాజ్ఞాపించినది. బ్రహ్మన్న భార్య ఐతాంబ తోడికోడండ్రతోఁ గలసి చెన్నుని బూజించెను. చెన్నుఁడు ఆమె కొక గజనిమ్మపండు నిచ్చెను. దానిని తోడికోడండ్రు స్వీకరింపలేదు. అందుచే నామె యా ఫలము నేడు ముక్కలుగాఁ గోసి, తానొకటి తీసికొని, తక్కినవి తన సఖియలగు బ్రాహ్మణాది వివిధ వర్ణముల స్త్రీలకిచ్చెను. ఐతాంబకు బాలచంద్రుఁడును, తక్కిన స్త్రీలకు "అనపోతు (బ్రాహ్మణుడు), దోర్నీఁడు (వెలమ), కమ్మర కాచన, కుమ్మరి పట్టి (పేరులేదు), చాకలి చందు, మంగలి మాధవు (మల్లు-అని కొన్ని ప్రతులు), కంసాలి చందు"- అను నేడ్గురు బాలురును జన్మించిరి. వీరిలో అనపోతు పెద్దవాఁడు, బాలచంద్రాదులీతని తరువాత పుట్టినారు. (గజనిమ్మపండు ముక్కను మొదట బ్రాహ్మణ స్త్రీ తినినది. తరువాత తక్కినవారు భుజించిరి. వారికిఁ బుత్రోదయము కూడ నదే వరుసక్రమమున జరిగినది.)

అక్కపిన్నక్క బ్రహ్మనాయనికిఁ బుత్రోత్సవమును నివేదించెను. బ్రహ్మనాయఁడు జ్యోతిషులను రప్పించి, కుమారుని లగ్నఫలంబును గూర్చి ప్రశ్నించెను. నాగమ్మ పంపిన మాయాబ్రాహ్మణుఁ డొకఁడు, బాలుఁడు దుష్టనక్షత్రమున జన్మించెననియు, నాతనివలన దేశమున కరిష్టము వాటిల్లఁగలదనియుఁ జెప్పెను. బ్రహ్మనాయఁడు కన్నమనీని బిలిచి, బాలుని నొక పెట్టెలోఁబెట్టి సముద్రమునఁ బాఱవైచి రమ్మనెను. కన్నమనీఁడు రాత్రివేళ నా పెట్టె నెత్తుకొని సముద్రమునకుఁ బోవుచుండెను. మార్గమధ్యమునఁ బెట్టె తెఱచి చూచెను. బాలుఁడు ధగద్ధగాయమానముగా వెలిఁగిపోవుచుండెను. ఇంతలోఁ బేర్నీఁడు,

చందవోలులోనున్న పాపసానియను వేశ్యదగ్గఱకుఁబోయి మాచెర్లకు తిరిగివచ్చుచు,[67] నరసింగపాడు దగ్గఱ (గుళ్లపాడు– నగరికల్లు మధ్య) కన్నమనీని జూచెను. ఆ చీకటిలో నొకరినొకరు గుర్తింపలేక పోరాడిరి. కొంతసేపటికి గుర్తెఱింగి పోరు చాలించిరి. విసయమును గ్రహించి పేర్నీఁడు బాలుని రక్షింపఁదలంచి, తీసికొనిపోయి, రహస్యముగా భార్య గౌరమ్మకిచ్చి పెంచుమనెను. సంతానములేని గౌరమ్మ స్తన్యమునకై చెన్నుని ప్రార్థించినది. ఆమె బాలునితోపాటు బ్రాహ్మణ అనపోతు మున్నగు సంగడీలను గూడఁ బెంచినది. ఏడ్గురు బాలురును గలసిమెలసి యుండెడివారు.

ఒకనాఁడు బ్రహ్మనాయఁడు కొలువుదీఱి యుండగా నాతని బావమఱఁదియగు గండు కన్నమనీడు శీలమువారింటఁ బిల్లవాఁడున్నచోఁ దనపిల్లనిచ్చి యుండెడివాఁడను గదా యని నిర్వేదమును వెలిబుచ్చెను. అది చూచి పేర్నీఁడు బాలుని సభకు రప్పించినాఁడు. బ్రహ్మనాయఁడు బాలుని గుర్తించి దేశారిష్టమునకై పుట్టినవాఁడగుటచే, శూలారోహణమున ఆ బాలుని జంపుఁడని యాజ్ఞాపించెను. ఇట్టి శిక్ష విధింపఁబడిన బాలుని జూచి ప్రజలు మిక్కిలి దుఃఖించిరి. బాలుని భూలమున వేయఁగా నది విఱిగి ముక్కలు ముక్కలయ్యెను. బ్రహ్మనాయఁడు బాలుని అవతారపురుషునిగా నెఱింగి శాంతించెను. బాలుఁడు కుమారస్వామియంశతో జన్మించిన మహాశూరుఁడు.

గండు కన్నమనీఁడు తన కుమార్తె మాంచాల నీయ సంకల్పించెను. బ్రహ్మన్న కన్నమకుఁ గోరినంత ధనమును కన్యాశుల్కముగా నిచ్చెను. బాలునకు మాంచాలకు మహావైభవముగా వివాహమయ్యెను.

## 7.12. కోడిపోరు:–

పల్నాటి వీరకథాచక్రమున నీ 'కోడిపోరుకథ' 'బాలునికథ' అను రెండును మిక్కిలి దీర్ఘములైన ఉత్తమ వీరగాథలే కాక, కథాచక్రమునకు మూలస్తంభములైన వీరగాథలు. కండపట్టుగల వీరగాథలును నివియే యనవచ్చును. పల్నాటియుద్ధమునకు ముఖ్యకారణ మీ కోడిపందెమే. ఇది ఒక్క కథకాదు. దీనిలో నాలుగు భాగములున్నవి. దీనిని నాలుగుకథల సమాహారముగాఁ జెప్పవచ్చును. (బాలునికథలోఁ గూడ నాలుగు భాగములు స్పష్టమగుచుండును). 1) కోడిపోరు ఒప్పందము, 2) అర్ధనాల చిట్టిమల్లుఁడు కథ, 3) బాలగోపన్న కోడిపందెము, 4) కన్నమనేని యుద్ధము. కోడి పూర్వజన్మ వృత్తాంతమును దెల్పు కథ యొకటి ప్రత్యేకముగా నున్నది. దానిని గూడ వీనికిఁ జేర్చుకొన్నచో నైదు కథలగును. ఇట్లొక పెద్ద వీరగాథలోఁ బ్రత్యేక కథలా యనిపించు నంతర్గాథలను జానపదులు 'కాండలు' అందురు.

### 7.12.1. కోడిపోరు ఒప్పందము:–

ఇది రెండు మూఁడు విధములుగా నున్నది. శ్రీనాథుని రచనలో, బ్రహ్మనాయఁడు మలిదేవాదుల పెండ్లిండ్లు చేసి, కానుకలు తీసికొని, నలగామాదులను జూచుటకై గురిజాలకు వచ్చినప్పుడు, నాగమ్మ యతనిని కవ్వించి పందెమున కొప్పించినట్లుగా నున్నది. వేఱొక జానపద రచనలో, నీ యొప్పందము భిన్నముగా నున్నది. నాగమ్మ మాచెర్లను దోచుటకై దొంగలను బంపఁగా, కన్నమనీఁడు ఆ దొంగలను దఱిమికొనుచు గురిజాలకు వచ్చును. అట నాయకురాలిచేఁ గవ్వింపఁబడి కన్నమనీఁడే కోడిపందెము నొప్పుకొని మాచెర్లకు దిరిగివచ్చును. (ఈ కథ నాకు అల్లూరుపాడులో లభించిన తాళపత్ర గ్రంథమునఁ గలదు). వీరభద్రకవి పద్యకావ్యమునఁగూడఁ గొంతవఱకుఁ పై జానపద కథవలెనే యున్నను, చివర భిన్నముగా నున్నది. కన్నమనీఁడు దొంగలను దఱిమికొనుచు గురిజాలకురాఁగా, నతనిని వెదకికొనుచు బ్రహ్మనకూడ గురిజాలకు వచ్చును. అప్పుడు నాగమ్మ (శ్రీనాథుని కథలోవలెనే) బ్రహ్మన్నను గవ్వించి పందెమున కొప్పించును. పద్యకావ్యములో నున్న యీ కథ శ్రీనాథుని రచనకును, జానపద రచనకును సమన్వయము సాధించినట్లుగా నున్నది.

#### 7.12.1.1. శ్రీనాథుని రచన:–

బ్రహ్మనాఁడు మలిదేవుని పెండ్లి పట్టాభిషేకములు పూర్తిచేసికొని, మలిదేవుని యాజ్ఞఁబొంది, కానుకలు గైకొని, పల్లకీలో గురిజాలకు వచ్చును. నలగామాదు లతనిని ప్రేమతో గారవింతురు. నాగమ్మ, బ్రహ్మనాయని జంపుటకై విషాన్నమును బెట్టును. అవతార స్వరూపుఁడగు బ్రహ్మన్న దానిని జీర్ణించుకొనును. నాగమ్మ, బ్రహ్మనాయని విడిది దగ్గఱ, పిచ్చుకల పందెము, గొఱ్ఱెపొట్టేళ్ల పందెము వేయించి నాయనిఁ గవ్వింపఁజూచును. కాని నాయఁడు చలింపలేదు. వెలమలకుఁ గోడిపందెమన్న నెక్కువ యిష్టమని గ్రహించి, కోడిపందెమును వేయును. ఓడి పాఱిపోవుచున్న పుంజును జూపి నాగమ్మ, అది బ్రహ్మనాయని పుంజని పరిహసించును. నాయఁడు మనుసులోఁ జెన్నుని దలంచుకొనఁగా, నోడి పాఱిపోయెడి యా పుంజు వెనుదిరిగి నాగమ్మ పుంజును జంపును. ఇరువురకును పౌరుషములు హెచ్చి, రాజ్యముల నొడ్డి, కోడిపోరు జరుపుట కొప్పుకొందురు. రెంటాల పాలవాయి వీరబయళ్లలోఁ గోడిపందె మాడుటకు బ్రహ్మన అంగీకరించెను. కోడిపందెమున బ్రహ్మన ఓడిపోయినచో నేలేశ్వరము రేవునఁ గృష్ణనుదాటి, మందాదికి నేఁడేండ్లు వలస పోవలెను. ఇట్లు కోడిపందెము నొప్పుకొని బ్రహ్మనాయఁడు మాచెర్లకు వచ్చెను.

మలిదేవుని సభలోని రాజులు ఆడుదానితోఁ గోడిపందెమొప్పి నందులకు నాయని గర్హించిరి. బ్రహ్మన్న, గురిజాలలో జరిగిన విషయమంతయు వివరించెను. మలిదేవుని పక్షమువారు పందెమునకుఁ దగిన కోడిపుంజును సంపాదింప యత్నించిరి. కాని నాగమ్మ భూలోకములోని కోళ్లన్నియును తనవేయని చాటించెను.

బ్రహ్మన్నకుఁ గోడి యెచ్చటను దొరకునట్లు లేదు. అప్పుడు మలిదేవుని సభలోని రాజులు భయపడి, మధుమక్షికములవలన గజరాజు పట్టణమునకుఁ జేటువచ్చినట్లుగా, నీ కోడిపందెమువలన మాచెర్లకు మోసము వచ్చునని ఒక ఉపకథను జెప్పిరి.

ఎఱుక యొకఁడు తేనెనమ్ముకొనుచు గజరాజుపట్టణమునకు వచ్చెను. అచ్చట పోలిసెట్టి యను వైశ్యుఁడు తేనెఁజూపుమని కోరగా, నా యెఱుక తేనెకుండపై మూఁతఁ దీసి, అందుఁ జచ్చిపడియున్న యీఁగను జేతితోఁ దీసి గోడపైకి విసరెను. గోడపైఁబడ్డ యా మక్షికమును వెంటనే యొక బల్లి మ్రింగెను. ఆ బల్లి నొక యెలుక చంపెను. ఆ యెలుకను పోలిసెట్టి పెంపుడు పిల్లి చంపెను. ఆ పిల్లిని ఎఱుకతోనున్న కుక్క చంపెను. తన పిల్లిని చంపినదన్న కోపముతో సెట్టి ఆ కుక్కను జంపెను. తన కుక్కను జంపినాఁడన్న రోషముతో నెఱుక యా సెట్టిని జంపెను. తమతండ్రిని జంపినాఁడని యా సెట్టి పుత్రులు మేనల్లుంద్రు కలిసి యా యెఱుకవానిని హతమార్చిరి. మఱునాఁడు ఆ యెఱుకవాని భార్య భర్తను వెదకికొనుచు వచ్చి, విషయమును గ్రహించి, దాని పట్టణమునేల రాజునకు విన్నవింపఁ గా నతఁడనాదరించి, ఆమెను మెడపట్టి గెంటించెను. ఆ యెఱుకత తనవారినందఱను రప్పించి, యా గజరాజుపట్టణమును కొల్లగొట్టించి, కసి తీర్చుకొనెను. (సరిగా నీ కథ యెట్లు జరిగినదో పల్నాటికథయు నట్లే జరిగినదని చెప్పవచ్చును. కోడిపోరు కడఁ బ్రారంభమైన స్వల్పకలహము యుద్ధముగాఁ బరిణమించి, ఆ యుద్ధము కారెంపూడిలో ఘోరయుద్ధమై, బాలచంద్రాది మహావీరులను బలిగొన్నది. కవి దీనిని దృష్టియందుచుకొనియే పై యుపాఖ్యానమును గల్పించెనని నా యభిప్రాయము.)

ఈ యుపకథను విని, బ్రహ్మనాయఁడు భయపడవలదని రాజుల నూఱడించి, కంచెర్లకుఁబోయిన బాదరాజు తప్పక కోడి వృత్తాంతమును దెలిసికొని వచ్చునని చెప్పెను.

### 7.12.1.2. జానపద రచన:-

దొంగలను తఱిమికొనుచు గురిజాలకుఁ బోయిన కన్నమనీఁ డు, నాగమ్మ దగ్గఱ కోడిపందెము నొప్పుకొని, తిరిగి మాచెర్లకు వచ్చి బ్రమ్మనాయనితోఁ జెప్పును. ఇందు నాగమ్మ, కన్నమనీనిఁ గవ్వించుటకై రాముఁడు లక్ష్మణుఁడు అను రెండు కోడిపుంజులను బోరించినదనియు, రాముఁడను కోడి పాఱిపోవుచుండఁగా నాగమ్మ 'వాడుగో నాయఁడు వెళ్లె వెళ్లె నన్నది' అనియుఁ గలదు. అప్పుడు కన్నమ యా కోడికెదురుగాఁబోయి తన పండ్రెండు మూరల భైరవకత్తిని కోడికడ్డముగాఁబెట్టి 'వెళ్లితే కోడి! మా తండ్రి బ్రహ్మనాయని పాదంబులాన' అనఁగా, నా వెళ్లెడి కోడి తిరిగి లక్షుమన్న యనెడి కోడిని గూలఁదన్నెనని యున్నది.

### 7.12.1.3. వీరభద్రకవి రచన:-

ఇందు 'రాచగావుకథ', 'మలిదేవుని పెండ్లి' విడువఁబడినవి. బాలుని పుట్టుక, బాలుని వివాహము చెప్పి తరువాత కోడిపోరు ఒప్పందము తెలుపఁబడినది.

మాచెర్లలో బాలునకు వివాహము చేసి, బ్రాహ్మణులకు విరివిగా సంభావనలిచ్చి, బ్రహ్మనాయఁడు సుఖముగానుండెను. అప్పుడు నాగమ్మ మాచెర్ల పురవృత్తాంతమును దెలిసికొనుటకై 'ఎల్లఁడు' అను వేగులవానిని బంపెను. ఆ వేగులవానిని బ్రహ్మన పట్టుకొని, యుల్లసమాడి విడిచి పుచ్చెను. ఎల్లఁడు గురిజాలకు వచ్చి, నాగమ్మతో మాచెర్ల పురవైభవంబును వర్ణించి చెప్పెను. నాయకురాలికి ద్వేషము పెచ్చుపెరిగి, మాచెర్లను దోచిరండని కొందఱు దొంగలను బంపెను.

నాయకురాలు పంపిన దొంగలను కన్నమనీఁడు పట్టుకొని, వారిని గురిజాల యూరిబయట దొడ్డిని దోలెను. కన్నమజాడను దెలిసికొనుటకై బ్రహ్మనాయఁడు గురిజాలకు వచ్చెను. నాయకురాలు బ్రహ్మనాయనికి విషాన్నము పెట్టినది, కాని ఫలితము లేకపోయెను. నాయఁడు నలసింగరాజునకు దొంగల నప్పగించెను. (వీరభద్రకవి నలగామునిఁ గాక నరసింగరాజునే గురిజాలకుఁ బ్రభువుగాఁ జిత్రించుట శోచనీయము.) కోడిపందెమున నాయకురాలు బ్రహ్మనాయని కవ్వించినది. పందెము నొప్పుకొని బ్రహ్మనాయఁడు మాచెర్ల కేతెంచెను.

### 7.12.2. 'అర్ధనాల చిట్టిమల్లఁడు కథ' లేక 'రావీరపదాలు కోడినితెచ్చే కాండ':-

నాగమ్మ భూలోకములోని కోళ్లన్నియుఁ దనవని చాటింపఁ గా, బ్రహ్మనాయఁడు మున్నగువారు కోడిని తెచ్చుకొనుటకు మిక్కిలి ప్రయాసపడుచుండిరి. ఇంతలోఁ గంచెర్లనుండి పెద్దన్న బాదరాజు వచ్చినాఁడు. (అనుఁగురాజు గురిజాలనేలుచుండఁగా పెద్దన్న పెండ్లి జరిగినదనియు, మలిదేవాదులు మాచెర్లలో నుండగాఁ గంచెర్ల విధ్వంసము జరిగినదనియు శ్రీనాథుని రచనలోఁ గలదు. ఇందు కోడిపోరు ఒప్పందము జరిగిన తరువాత పెద్దన్న కంచెర్లను జయించి వచ్చుచుఁ గోడివృత్తాంతము నరసినట్లున్నది. కాని, పెద్దన్నపెండ్లి, అతఁడు కంచెర్లను జయించుట అను రెండు విషయములును నీ కథాచక్రమున మొట్టమొదటనే జరిగినవని చెప్పు వీరగాథలున్నవి. అనఁగా అనుఁగురాజు పాలమాచాపురిలో నుండగాఁ జరిగినవనుట. అప్పుడు పెద్దన్న కోడివృత్తాంతమును తన ప్రాచీనానుభవముగాఁ జెప్పును. పింగళివారి ప్రతిలో నిట్లే యున్నది.)

కంచెర్లను జయించి వచ్చుచుండగాఁ బానుగల్లు పట్టణమునఁ దనకుఁ గలిగిన యనుభవముతోఁ బెద్దన్న కోడివృత్తాంతమును దెల్పెను. పానుగల్లులో శనైశ్చరుఁడను చట్టుబండ క్రింద 'అర్ధనాల చిట్టిమల్లఁ' డను కోడి కలదనియు, నది దైవాంశచే నుద్భవించిన

కోడి యనియుఁ జెప్పెను. బ్రహ్మనాయఁడు అన్నగారి పల్కులు విని, 'రావీరపడాలు' (రాయవీరపడాలు– సిరాదేవికి సరణముగా వచ్చిన గొల్లబంటు) అను వీరునిఁ బంపెను. అతఁడు పానుగల్లు పట్టణము నకుఁబోయి, అటనున్న బేతాళుని జయించి, అర్ధనాల చిట్టిమల్లుని దీసికొని పరుగు పరుగున మాచెర్లకు వచ్చుచుండఁగా, మార్గమధ్యమున చోరులడ్డగించిరి. రావీరుడు ఆ దొంగల నెదిరించి దూలాల పోతిరెడ్డి మున్నగువారిని జంపి, కోడిని సురక్షితముగా మాచెర్లకుఁ జేర్చెను.

### 7.12.3. కోడి పూర్వజన్మ వృత్తాంతము:–

ఈ కోడి పూర్మజన్మ వృత్తాంతము 'పెద్దన్న పెండ్లిరాయబారము' కథలో వచ్చును. వీరభద్రకవి యీ కథను గావ్య ప్రారంభమందే చెప్పినాఁడు. కారెంపూడి తాళపత్రప్రతిలో నిది మలిదేవునిపెండ్లి తరువాత వచ్చినది. కాని నాకు లభించిన ఆల్తూరుపాడు తాళపత్రప్రతిలో కోడిపూర్వజన్మకథ, పెద్దన్న పెండ్లిరాయబారములో భాగముగాఁ గాక, కోడిపోరునకు ముందు ప్రత్యేకముగాఁ జెప్పబడినది.

### 7.12.3.1. వీరభద్రకవి రచన:–

పూర్వకాలమున ఫలదుఁడను మహర్షి ముగ్గురు దస్యులను కోడిగ్రుడ్లుగా బుట్టదని శపించెను. వారొక వనములో నవురుదుంప క్రింద మూఁడు కోడిగ్రుడ్లుగా జన్మించిరి. వాని నొక చెంచులతేఁడు తనయింటికిఁ దీసికొనిపోయి భద్రపఱచెను. అందులో నొక గ్రుడ్డు కుళ్లిపోయి మఱుజన్మమున బాలగోపన్నగా జన్మించెను. ఇంకొక గ్రుడ్డు, పెట్టగా మాఱి, వెంటనే చనిపోయి పేరాదేవిగాఁ బుట్టెను. మిగిలిన గ్రుడ్డు పుంజుగాఁ బెరిగి పెద్దదయ్యెను. అదియే అర్ధనాల చిట్టిమల్లఁడు. ఒకనాఁడు వనమున వేఁటాడ వచ్చిన అఱువదియార్గురు పానుగంటి రాజపుత్రులకుఁ జెంచులతేఁడు ఆతిథ్యమిచ్చెను. చిట్టిమల్లఁడు ఆ రాజుపుత్రుల వేఁటడేగలను జంపి, వారి మరణమునకుఁ గారణమయ్యెను. ఆ రాచబిడ్డల భార్యలు సహగమనము చేసిరి. దీనికంతటికిని గారణమగు చిట్టిమల్లునకు భయపడి చెంచులతేఁడు ఆ కోడిపుంజు నొక యినుపపెట్టెలోఁ బెట్టి పానుగంటి కోటబయట భూస్థాపితము చేసెను. పెద్దన్నబాదరాజు కంచెర్లనుండి వచ్చుచుఁ బానుగంటి సమీపమున విశ్రమించెను. అతని గుఱ్ఱము 'కాఱుబొల్లఁడు' నేలపైఁ కాలితో దువ్వఁగాఁ జిట్టిమల్లఁడు బయటకు వచ్చెను.

### 7.12.3.2. జానపద రచన:–

నాకు లభించిన ఆల్తూరుపాడు రెండవ ప్రతిలో కోడిపూర్వజన్మ వేఱుగానున్నది. అహల్యను పెండ్లాడుటలో ఇంద్రుఁడు గౌతముఁడు పోటీపడుదురు. గౌతముఁడు కామధేనువు సహాయముతో దేవతలు చెప్పిన పారిజాత పుష్పము నింద్రునికన్న ముందుగాఁదెచ్చి, అహల్యను వివాహమాడును. ఇంద్రుఁడు పగబట్టి, యెట్లయినను అహల్యను పొందవలెనని, సూర్యుఁడు, శుక్రుఁడు, బృహస్పతి– ఈ ముగ్గురును తోడురాఁగా, గౌతముని యాశ్రమమునకు వచ్చును. ఇంద్రుడు నెమలికూఁత కూసి గౌతముని మోసగించి, అహల్యను పొందెను. అహల్యను ఇంద్రుఁడు కలిసికొనఁగా వాలి, సూర్యుఁడు కలిసికొనఁగా సుగ్రీవుఁడు పుట్టిరఁట. గౌతముఁడు వారి మోసమును గ్రహించి, శపించెను. ఆ శపించుటలో బృహస్పతిని అడవి కోడిగాఁ బుట్టుమనెను. అతఁడే అర్ధనాల చిట్టిమల్లఁడు.[68]

### 7.12.4. బాలగోపన్న కోడిపందెము కథ లేక పాలవాయి కోడిపందెము కథ:–

ఈ కోడిపందెము గురిజాలకును మాచెర్లకును మధ్యగల 'పాలవాయి', 'రెంటాల' యను గ్రామములకు దగ్గఱనున్న వీరబయళ్లలో జరుగుటచే దీనిని 'పాలవాయి కోడిపందెము కథ' అనియుఁ బిలుచుట కలదు. పింగళివారిప్రతిలో నీ కోడిపందెము గురిజాలలో జరిగినట్లుగా నున్నది. ఇది తప్పు. నాకు లభించిన శ్రీనాథకృతమగు తాళపత్రగ్రంథమున నాగమ్మ, బ్రహ్మనాయనితో నిట్లనును:–

*"పాల్వాయి రెంటాల వర వీరబైళ్ల*
*కోడిగుట్టల కాడ గొబ్బున నాడ*
*వోడ గెల్పులు రెండు వనరుగా మనకు*
*కనిపించు నప్పుడు ఘనముగా మనకు"*[69]

నాగమ్మ దగ్గఱఁ గోడిపందెము నొప్పుకొని బ్రహ్మనాయఁడు మాచెర్లకుఁ దిరిగి వచ్చి మలిదేవాదులతో నిట్లనును:–

*"పాల్వాయి రెంటాల పాలబయలు చౌట*
*కోడిగుట్టల కాడ గొబ్బున నాడ*
*అచ్చోట పందెంబు అతివ నా చేత*
*వప్పించుకున్నది వామాక్షి నాతో"*[70]

నేఁడు, పల్నాడులో పాలవాయి 'రైల్వేస్టేషను గేటు' దగ్గఱ నున్న రెండు పెద్దఱాళ్లగుట్టల కడఁ గోడిపందెము జరిగినదని ప్రజలు అనుశ్రుతముగాఁ జెప్పుచున్నారు. ఆ నాఁటి కోడిపందెమునకు వచ్చిన అసంఖ్యాక జనసందోహము కూర్చొనుటకు ఉపయోగించిన గుండ్రని ఱాళ్లే ఆ గుట్టలని జనశ్రుతి. పందెము గురిజాలలో జరిగినదనుట అవిచారితము.

మఱునాఁడు పందెమనఁగా నర్ధనాల చిట్టిమల్లునిఁ దన దగ్గఱకుఁ బంపుమని శీలమ్మ బ్రహ్మనాయనిఁ గోరినది. బ్రహ్మన యా పుంజును దల్లికడకుఁ బంపెను. ఆమె కోడి నలంకరించి మెడలో ముత్యాలహారము వేసి, తన కుమారునకు విజయమును జేకూర్చుమని ప్రార్థించినది. మఱునాఁడు బ్రహ్మన కన్నమదాసుతోఁ గలసి

కోడిపందెమునకు బయలుదేరుచుండెను. ఆ వార్త విని 'గొట్టిపాళ్ల'లో నున్న 'బాలగోపన్న' కూడ బయలుదేరెను. (పింగళివారి ప్రతిలో 'చెవుల గోపన్న' యని యున్నది. 'చెవుల' యనునది యింటిపేరు కాఁబోలును.) బ్రహ్మన రావలదని యెంత వారించినను నతఁడాగలేదు. చివరకు బ్రహ్మన్న సమ్మతించి, చిట్టిమల్లుని గోపన్నచేతి కిచ్చెను. మాడుగుల గ్రామమున రెడ్డి బ్రహ్మనాయనికి విందు చేసెను. బ్రహ్మనాయఁడు గోపన్నకు వైష్ణవమిచ్చి 'గోపాల దాసి' యని పేరు పెట్టెను. ఆనాఁటికి అక్కడ నాగి, మరునాఁడు, 'పాలవాయి రెంటాల వీరబయళ్ల'కుఁ జేరిరి.

కోడిపందెములో మొదటి పందెమున బ్రహ్మనాయఁడు గెలిచెను. నాగమ్మ మాఱుపందెమున కొప్పించినది. ఆ రోజునకుఁ బందెమాయెను. నాఁటిరాత్రి నాగమ్మ బ్రహ్మనాయనికి విషాన్నము బెట్టెను. కాని ఫలితము లేకపోయినది. గంగవరమునకుఁ గబురు పెట్టి కట్టుబోతులను రప్పించినది. పందెము జరుగు స్థలములో బ్రహ్మనాయఁడు కూర్చుండుచోట తమగము త్రవ్వి, కీలు నేర్పాటు చేసియుంచినది. మఱునాఁటి పందెములో మాచెర్లకోడికిఁ గట్టుకట్టించి ఓడించినది. అట జరిగిన కలహములో బాలగోపన్న మరణించెను.

మాచెర్లరాజుల పుంజుపేరు 'అర్ధనాల చిట్టిమల్లఁడు' కాఁగా, గురిజాలరాజుల పుంజుపేరు 'నల్లమల్లఁడు'. కోడిపందెమంతయుఁ గోడిని వదలు పందెగానిపై నాధారపడియుండును. మాచెర్లపుంజును బాలగోపన్నయు, గురిజాలపుంజును మువ్వల భీముఁడును పందెమునకు వదలినట్లుగా వీరభద్రకవి 'వీరభాగవతము'నఁ గలదు. గురిజాల పుంజును చింతపల్లిరెడ్డి వదలినట్లుగా పింగళివారి ప్రతిలోఁగలదు. ఇది సమంజసముగాదు. చింతపల్లిరెడ్డి నలగామునిమంత్రులలో నొక ప్రధానవ్యక్తి. ఇతఁడు పందెగాడు కాడు. పల్నాటిలో జనవ్యవహారమునఁగూడ మువ్వల భీముని పేరే వినఁబడుచున్నది.

పింగళివారి ప్రతిలో (అనఁగా మల్లయ్య రచనలో) చిట్టిమల్లునిపై నాగమ్మ మంత్రాక్షలు చల్లి చంపించినదని యున్నది. వీరభాగవతములోను, తక్కిన వీరగాథలలోను, జనవ్యవహారమునను, నాగమ్మ గురిజాలకు దగ్గఱలోనున్న 'గంగవరము' (దీనికి నేఁటికిని 'కట్టుబోతుల గంగారం' అనియే పేరు) అను గ్రామమునుండి, కట్టబోతులను రావించి, వారిచేఁ జిట్టిమల్లని కన్ను పోఁగొట్టించెనని యున్నది.

మల్లయ్య రచనలో, నలగాముని లెంకలపై విజృంభించిన చెవుల గోపన్నను ఆరె జోగన చంపినట్లుగాఁ గలదు. వీరభాగవతమున బాలగోపన్న తన కోడి ఓడిపోయెనన్న విరాగముతోఁ దన్ను జంపుమని మువ్వల భీమునిఁ గోరినట్లున్నది. నాకు లభించిన తాళపత్ర గ్రంథములో బాలగోపన్న విరక్తితోఁ దన్ను జంపుమని 'ఆరెవారి జోగిరౌతు' అనువానిని గోరినట్లున్నది. బ్రహ్మనాయఁడా జోగిరౌతును బట్టుకొని 'నీవేల గోపన్నను జంపితి'వని యడుగఁగా నతఁడిట్లనెను: గోపన్న తన్ను జంపుమని జోగిరౌతును గోరఁగా నతఁడు సంకోచించినాఁడఁట.

> *"నేను వెనుకముందాడితిని*
> *నీకు బయమేమి వెరుపేమి వెయ్యమని పలికె*
> *అందుకని బాణము అటు వేసినాను*
> *కాబట్టి గోపన్న వరగినా డనెను*
> *నీవు ఎదిరించి విద్ధము శాయలేదా యనెను*
> *వెయ్యమంటే వేస్తిని నేను*
> *ఎదిరించి విద్ధము శాయలేదనెను"* [71]

వీరభాగవతమున చనిపోయిన గోపన్నను బ్రహ్మనాయఁడు తిరిగి బ్రతికించినట్లుగాఁ గలదు. మల్లయ్య రచనలో, గోపన్నను జంపిన ఆరె జోగనను కన్నమనీఁడు సంహరించినట్లుగా నున్నది. నాకు లభించిన తాళపత్రప్రతిలో ఆరెవారి జోగిరౌతును బ్రహ్మనాయఁడు పై విధముగాఁ బ్రశ్నించి విడిచిపుచ్చినట్లున్నది. ఇందు కన్నమనేని యుద్ధము లేదు. మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములోని ప్రతులలో 'కన్నమనేని యుద్ధము– గోపు సంస్కారము' అనునది ప్రత్యేకకథగా నున్నది. బాలగోపన్న కోడిపందెమును 'గోపుయుద్ధ' మనియుఁ బిలుచుట కలదు.

### 7.12.5. 'కన్నమనేని యుద్ధము– గోపు సంస్కారము':–

కొన్ని ప్రతులలో 'కన్నమనేని యుద్ధము' అని మాత్రమే కలదు. అంతమున నిది శ్రీనాథుని రచనగా నున్నది. కాని రచనావిధానమును బట్టి ఇది మల్లయ్య రచన కావచ్చునని రామరాజుగారు భావించుచున్నారు.

కోడిపందెమున నోడిపోయిన బ్రహ్మనాయఁడు కన్నమతోఁ గలసి మాచెర్లమార్గమునఁ బోవుచుండెను. బాలగోపన్న కూలిన సంగతి బ్రహ్మన్నకుఁ దెలియదు. బాలగోపన్నను గూల్చిన ఆరె జోగన అంతటితో నాగక, సైన్యమును వెంటఁబెట్టుకొని బ్రహ్మనాయని వెన్నంటెను. ఆ కలకలమును జూచి బ్రహ్మన్నయుఁ గన్నమనీఁడును వెనుదిరిగి చూచిరి. వెంటనే కన్నమ విజృంభించి, ఆరె జోగన్నను జంపి, శత్రుసైన్యమును గురిజాలవఱకును దఱిమెను. బ్రహ్మనాయఁడు ప్రాణావశిష్టుండైన బాలగోపన్నకుఁ దులసితీర్థమిచ్చి స్వర్గమున కంపెను. గోపుశవమును పాలకిలో మాచెర్లకుఁ దెచ్చెను. గోపన్న తల్లి 'దారసాని' మిక్కిలి దుఃఖించెను. నాకు లభించిన యొక కథలో (కారెంపూడి తాళపత్రప్రతి) బాలగోపన్న (గోపు) భార్య 'గోపితులసి' యని యున్నది. ఆమె భర్తతో సహగమనము చేసినట్లుగా వర్ణితమైనది.

## 7.13. 'మందాది వలస కథ' లేక 'వలస కథ' లేక 'మందాది వలసలు':-

పాలవాయి కోడిపందెమున నోడిపోయిన బ్రహ్మనాయఁడు, మాచెర్లను వీడి, మలిదేవరాజాదులతోను, అంతఃపురస్త్రీలతోను, వీరనాయకులతోను, కృష్ణానదీ తీరమునఁగల యేలేశ్వరము రేవునకు వచ్చెను. చీఁకటి పడఁగా నటనున్న పెందోటలో విడిసెను. చెన్నకేశవుని భూషణములు మోసెడి కంట్లపుకోడె నొక పెద్దపులి చంపెను. ఆలమందలను గాయుచున్న లంకన్న పులిని జంపఁబోగా, నది మనుష్య భాషణములతోఁ దనకు బ్రహ్మనాయనిచేతఁగాని మరణము లేదని చెప్పెను. లంకన్న పోయి బ్రహ్మనకుఁ జెప్పఁగా నతఁడు వచ్చి పులిని కత్తితో వ్రేసెను. ఆ పులి గంధర్వరూపమును దాల్చి, తన పూర్వజన్మ వృత్తాంతము నెఱిఁగించి, ఆకాశపథమున గంధర్వలోకమునకుఁ బోయెను. కంట్లపుకోడెను పులి చంపుచుండఁగా నూరకుండుటచే బ్రహ్మన్న లంకన్నపైఁ గోపించి, ఆడకట్టుకట్టి ఆలమందను కాయుమని ఆజ్ఞాపించెను.

మఱునాఁడు ఏలేశ్వరము రేవునఁ గృష్ణానదిని దాటుచుండఁగా, నొక కారుమొసలి వారి నడ్డగించెను. బ్రహ్మన నదిలో దుమికి ఆ మొసలిని జంపఁగా, అది గంధర్వస్త్రీగా మాఱి, తన పూర్వజన్మమును జెప్పి మాయమయ్యెను. మయనిర్మితమైన మధురానగరమున, 'సుందుఁడు-సుంద' అను గంధర్వదంపతులుండెడివారు. ఒకనాడు దుర్వాసుఁడు ఆ నగరమునకు రాఁగా. కామలోలురైన ఆ దంపతులు అతని నాదరింపలేదు. అందుచే నతఁడు కోపించి సుందుని వ్యాఘ్రముగాను, సుందను మరికగాను పుట్టుఁడని శపించెను. కలియుగమున నాదివిష్ణువు బ్రహ్మన అవతారమెత్తినప్పుడు అతనిచే వారికి శాపవిముక్తి కలుగునని చెప్పెను. బ్రహ్మనాదులు రేవును దాఁటి మందాదిని చేరిరి. అట మూఁడేండ్లు గడచెను.

ఈ వలసకథ వీరభద్రకవి పద్యకావ్యమున నించుక భిన్నముగా నున్నది. "బ్రహ్మనాయఁడు వలసపోవునప్పుడు దేవునిపెట్టె మోసెడి యొద్దును బులి పట్టుట- పులి పూర్వజన్మ వృత్తాంతము- నావికులు బ్రహ్మనాయకునికిఁ గృష్ణలో మొసలి యున్నదని చెప్పుట- అలరాచమల్లు మొసలిని ఖడ్గముతో వ్రేయుట- బ్రహ్మనాయఁడు మొసలి కడుపులో మూఁడు దినములుండుట- మొసలి చచ్చి, స్త్రీయై, బ్రహ్మనాయనితోఁ దన పూర్వజన్మ వృత్తాంతమును జెప్పుట" అను రీతిగా సాఁగినది పద్యకావ్యములోని కథాప్రణాళిక.

## 7.14. మందపోటు కథ:-

నాకు లభించిన శ్రీనాథుని రచనలో నితివృత్త మిట్లున్నది.

మలిదేవాదులు మందాదిలో సుఖముగా నున్నారని తెలిసి, నాగమ్మ ఓర్వలేక, వారి ఆలమందను తోలితెచ్చుటకు నలగామునిఁ బురికొల్పెను. నలగాముఁడు అర్ధవీటిలోనున్న 'పీదుల పలినీఁడు' అను వీరుని బిలిపించి, మందాదినున్న మలిదేవుని ఆలమందను గొనితెమ్మనెను. పలినీఁడు సైన్యముతో మందాది సమీపమునకుఁ బోయి, వేగులను బంపి, మందాది నగరములోని ఆలమందల రహస్యములను గనుగొనెను. ప్రొద్దుగ్రుంకిన తరువాత, లంకన్న ఆలమందకుఁ బాలు పితికించుచుండఁగా పలినీఁడు సైన్యముతో వారిపైఁబడెను. ఘోరయుద్ధము జరిగెను. లంకన్న విజృంభించి పలినీని తలఁద్రుంచెను. పలినీని సైనికులు బాణములతో లంకన్నను గూల్చి, ఆలమందను దోలుకొని పోవుచుండిరి. ఈ వార్త విని బ్రహ్మన కన్నమను బంపెను. కన్నమనీఁడు పలినీని సైన్యము నడ్డగించి హతమొనర్చి, ఆలమందను మరలించుకొని మందాదికిఁ దెచ్చెను.

వీరభద్రకవి రచనలో, నాయకురాలు మందపోటును గావింప బోయలను బంపినట్లును, వారు వచ్చి ఆలమందను దోలుకొని పోవుచుండఁగా, ఆవుల కాళ్లక్రిందఁబడి లంకన్న చనిపోయినట్లును, అతనిని బ్రహ్మన్న తిరిగి బ్రతికించినట్లును, కన్నమనీఁడు బోయలను వధించి, ఆలమందను దెచ్చినట్లును గలదు.

## 7.15. 'గురిజాల యుద్ధము':-

మద్రాసు GOML లో నున్న కొన్ని ప్రతులలో 'గురిజాల యుద్ధము- పూర్వభాగము' అని కలదు. అనఁగా నుత్తరభాగము కథ వేఱుగా నున్నదని తోచుచున్నది. లేదా కారెంపూడి యుద్ధమును ద్వితీయభాగముగా భావించి, కవి దీనిని పూర్వభాగమనినాఁడేమో తెలియకున్నది.

నలగాముఁడు, నాయకురాలి మాటవిని, మందాదిలోనున్న తనమందను బొడిపించి, లంకన్నను జంపినందులకుఁ బ్రతిక్రియగా, బ్రహ్మనాయఁడు గురిజాలను బొడుతునని ప్రతిజ్ఞపట్టి బయలుదేరెను. మలిదేవుఁడు తన అన్నలను జంపవలదని వేఁడుకొనెను. వీరవిజ్జలదేవి మాచెర్ల చెన్నునకు మ్రొక్కులు చెల్లింపుమని కోరినది. శీలమ్మ తన కుమారునకు యుద్ధధర్మములను బోధించి, దీవించి పంపెను. బ్రహ్మనాయఁడు గంగ్రకోట, అనుఁగురాజుపల్లె, ఆణెముపల్లె గడచి మాచెర్లకు వచ్చెను. చెన్నునకు మ్రొక్కులు చెల్లించెను. పిమ్మట కంభముపాడు, మంచికల్లు, మాడుగుల, గాడ్దెలవాగు గడచి 'రేవంతు బయలు' చేరుకొనెను. అక్కడ నాగమ్మచేఁ గొఱతవేయఁబడిన కొర్తి వీరునకు బంధవిముక్తిని జేసి, వైష్ణవము ప్రసాదించి, పుణ్య లోకములకుఁ బంపెను. (ఇట 'కొరితి వీరుని' పూర్వవృత్తాంతము తెలుపఁబడినది.) బ్రహ్మన్న గురిజాల చేరి, ఆ రాత్రికిఁ గామేశ్వరుని గుడిలోఁ బరుండి, తెల్లవారురుఝామున 'తమ్మల కొమ్మన' యను నా గుడి పూజారి మూలమున నలగామునకుఁ దనరాక నెఱింగించెను. నాగమ్మ సైన్యమును సిద్ధమొనర్చెను. ఊరిలోని ప్రజలందఱును భయభ్రాంతులైరి. బ్రహ్మనాయని యుద్ధమిట నత్యద్భుతముగా వర్ణింపఁబడినది. నాయని ధాటికి నిలువలేక, నాగమ్మ సైన్యము కాలికి

బుద్ధిచెప్పెను. నలగాముఁడు గంగగుడికిఁ బాఱిపోయెను. రాజకుమారుల భార్యలు బ్రహ్మన్నను బ్రార్థించిరి. బ్రహ్మన వారికి అభయ మిచ్చి గంగగుడి కేఁగెను. గంగ ప్రత్యక్షమై నలగాముని మన్నింపుమని బ్రహ్మన్నను వేఁడెను. బ్రహ్మన శాంతించి, నలగామునకుఁ బట్టముగట్టి, తిరిగి మాచెర్లమీదుగా మండాదికిఁ జేరెను.

మద్రాసు GOML లోఁ గల ప్రతిలో నీ కథ చివరిభాగమున బైకథకన్నఁ గొంచెము భిన్నముగా నున్నది. బ్రహ్మనాయని తీవ్ర యుద్ధమునకు నిలువలేక నాగమ్మ సైన్యములు చెదరిపోఁగా, నలగాముఁడును నాగమ్మయును 'కొదమగుండ్ల' యను గ్రామమునకుఁ బాఱిపోయిరనియు; బ్రహ్మన వారిని వెంబడింపఁగా కొదమగుండ్లలోని బ్రాహ్మణులు వచ్చి నలగాముని క్షమింపవలసినది గాఁ బ్రార్థించిరనియుఁ గలదు. బ్రహ్మనాయఁడు నలగాముని క్షమించి, పట్టము గట్టి, మరల మండాదికి వచ్చుచుండగా, ఏలేశ్వరముకడ 'పంతాల పలినీఁడు' అను వీరుఁడు అతని నెదిరించెననియు, నిర్వురకును గొప్ప యుద్ధము జరిగెననియు, నా యుద్ధమున బ్రహ్మనాయఁడు పలినీని శిరసు నఱికి గంగకు నైవేద్యము పెట్టెననియుఁ గలదు.

గురిజాల యుద్ధమను నీ వీరగాథను శ్రీనాథుఁడు రచించినాఁడని చెప్పవచ్చును. శ్రీనాథ విరచితమగు 'మందపోటు కథ' నాకు లభ్యమైనది. ఆ కథలోఁ జివరి భాగమునఁ దాను ముందు ముందు గురిజాల యుద్ధమును, వీరపుంగవుల యుద్ధమును, కొమ్మరాజు యుద్ధమును వర్ణింపఁబోవుచున్నానని శ్రీనాథుఁడే స్పష్టముగాఁ జెప్పియున్నాడు:-

***"మందపోటను కథయు మరియు నీ వరకు***
***సమపూర్తిగా జెప్పె సజ్జనుల్ మెచ్చ***
***ఘనుడైన శ్రీనాథ కవిరాజమౌళి***
***విరచించె ఈ కథ విఖ్యాతిగాను***
***ఆచంద్రతారార్కమై యుండుకొరకు ॥శ్రీ శ్రీ శ్రీ॥***
***ముందు కథాస్థితి ముదముతో వినుడ***
***చెన్నకేశవమూర్తి సెలవగు రీతి***
***శ్రీ వీరపుంగవులు అట కొమ్మరాజు***
***చేసి (న యు) ద్ధములు చెప్పగోచరము***
***గురిజాల యుద్ధంబు గణుతింతు మరియు***
***ఆ కథ యెట్లన్న అమర జెప్పుదును." [72]***

దీనినిబట్టి శ్రీనాథుఁడు ఒక్క బాలచంద్రుని యుద్ధమునే కాక పల్నాటి వీరకథాచక్రము నంతటిని రచించెననుటలో సందేహము లేదు. అంతేకాక, వీరభద్రకవి తన వీరభాగవతమున గురిజాల యుద్ధమను కథను బూర్తిగా విస్మరించినాఁడు. అందుచే వీరభద్రకవి శ్రీనాథుని వీరగాథల నేమాత్రమును ననుసరింపలేదని స్పష్టమగుచున్నది. వీరభద్రకవి మల్లయ్య, కొండయ్యల రచనలను, జనవ్యవహారమును ననుసరించియుండును.

బ్రహ్మనాయఁడు గురిజాలను బొడుతునని ప్రతిజ్ఞ చేసియుండుటచేఁ దన ప్రతిజ్ఞ నెఱవేర్చుకొనుటకు గురిజాలను దగ్ధము చేయనెంచెను. కాని, తన తల్లి శీలమ్మ బోధించిన యుద్ధధర్మములను దృష్టియందుంచుకొని, ప్రజలకు హాని కలుగకుండఁగను, తన ప్రతిజ్ఞ నెఱవేరునట్లుగను, గురిజాలలోని పౌరులను బయటకు రప్పించి, యా పట్టణమును దగ్ధము చేసెనఁట. ఇట్లు దగ్ధమైన గురిజాలను 'పాత గురిజాల' అని నేఁటికిని బిలుచుచున్నారు. ఇది ప్రస్తుతమున్న గురిజాలకు ఉత్తరముగా మైలుదూరమున నుండెడిదఁట.

## 7.16. అలరాచమల్లుగారి గురిజాల రాయబారము:-

దీనిని 'గురిజాల రాయబార'మనియు, 'అలరాజు రాయబార'మనియుఁ బిలుతురు. ఇందు 'అలరాజు రాయబారము' అను పేరును శిష్టులు కల్పించినారు. జానపదులీ కథను 'అలరాచమల్లుగారి గురిజాల రాయబారము' అనియే పిలుచుచున్నారు. ప్రస్వత కొఱకు 'గురిజాల రాయబారము' అనుటయుఁ గలదు. 'అలరాజు రాయబారము' అను పేరు జానపదులలో లేదు. మదరాసు గ్రంథాయలమున 'రాచమల్లు రాయబారము' అను పేరుతోఁ బ్రతులున్నవి.

పల్నాటి వీరకథాచక్రమున వచ్చు వీరులందఱిలోను అలరాజు మిక్కిలి గొప్పవాడు. ఈ గాథలలో వచ్చు నే వీరుఁడైనను నితనికిఁ దక్కువవాఁడే! పెద్దన్న, బ్రహ్మన్న మున్నగు మహావీరులు సైతము ఇతని తరువాతఁ జెప్పఁదగినవారే. కాని తెలుఁగు విమర్శకలోక మీతని గొప్పదనమును గాని, యీతనికి జరిగిన అన్యాయమును గాని గుర్తించినట్లు లేదు. ఆంధ్రులు ఇతనిని నాగమ్మ విషప్రయోగమున మరణించిన అర్భకునిగా జమకట్టిరి. బ్రహ్మనాయనికి లేని ప్రాముఖ్యము నంటఁగట్టిరి. అతనిని నాగమ్మ పంపిన విషాన్నమును జీర్ణించుకొనిన అవతారమూర్తిగాఁ జిత్రించిరి. అలరాజునకు వీరగాథలలోనే కాక, కీర్తిప్రతిష్ఠలయందును అన్యాయము జరిగినది. ఈతనికి రావలసిన కీర్తి బాలచంద్రునకుఁ దక్కినది. ఈతని దుర్మణమునకు నాగమ్మకంటె బ్రహ్మనాయఁడే ముఖ్యకారకుఁడు.

అలరాజు కల్యాణమునేలిన వీరసోముని పౌత్రుఁడు. (ఈ వీరసోముఁడు కాలచుర్య బిజ్జలుని పుత్రుఁడని చారిత్రకులు భావించుచున్నారు. వీరగాథలలో నితఁడు చోళరాజని యున్నది.) కొమ్మరాజు చెల్లమాదేవుల యేకైక పుత్రుఁడు. (కొమ్మరాజునకు 'వంకిదేవరాజు' అనియు నామాంతరము.) ఈ అలరాజు నలగాముని యేకైక పుత్రికయగు రత్నాల పేరమ్మను వివాహమాడెను. అలరాజు మేనత్తయగు సిరాదేవి పెదమలిదేవుని భార్య. అటు నలగామునకును, ఇటు మలిదేవునకును ఆప్తబంధువు అలరాజు. మైలమదేవికి

అరణముగా వచ్చిన పల్నాటికి నలగాముఁడు రాజయ్యెను. పుత్రులులేని యీ నలగాముని రాజ్యమునకు రత్నాల పేరమ్మ భర్తయగు అలరాజే వారసుఁడు. ఈ చిక్కును గుర్తించియే కాఁబోలు, నరసింగరాజునకుఁ బట్టమును గట్టనెంచిన నాగమ్మ, యీతనిపై విషప్రయోగము చేసినది.

అలరాజు మహాశూరుఁడు. నూర్గురు రాజులను జయించి "రాజమల్లు" అను బిరుదమును వహించెను. ఈతని ఖడ్గము పేరు "సూర్య భేతాళము". ఇతని అశ్వము పేరు "సవరాల జిమ్మఁడు". 'సరవాల గోడిగ', 'శివక అశ్వము' అని దీనికి నామాంతరములు. (శూరుని శూరత్వమున సగభాగము ఆతఁడు ధరించు నాయుధము పైనను, ఎక్కెడి అశ్వముపైనను నాధారపడి యుండును.) ఈ గుఱ్ఱము కాలికి అలరాజుచే జయింపఁబడిన నూర్గురు రాజుల బొమ్మలుగల పెండెరముండును. ఈతఁడే కనుక నాగమ్మ విషప్రయోగమునకు గుఱికాకున్నచో బల్నాటి యుద్ధమన్ని దినములు జరిగెడిది కాదు. ఒకటి రెండు దినములలో నలగాముని వీరులందఱిని తుడిచిపెట్టఁ గల సమర్థుఁడు అలరాజు. ఈ విషయము నితఁడు నలగాముని నిండు పేరోలగమున నెలుఁగెత్తి చాటినాఁడు:-

*"దళములు గలవని దర్పమాడితివి*
*ఏడువేల్ గుఱ్ఱము లేకమైనపుడె*
*బాదరాజొక్కడె పట్టి సాధించు,*
*మున్నూరు శూలాలు ముద్రగజములకు*
*ముగ్గురు సుంకర్లు ముదమొప్ప సాటి,*
*ఇరువదినాల్గు వే లెసగు బంటులకు*
*ఏడ్గురు గోసంగు లెలమితో సాటి,*
*అధిక బిరుదుల కెల్ల అలరాజు చాలు*
*అరులకు నంకుశ మ్మల్లు మల్లన్న"* [73]

అలరాజు నలగామునకు అల్లుఁడును, రాచమల్లు బిరుదాంకితుఁడును అగుటచే నితనిని 'అల్లు మల్లన్న' యని ముద్దుగాఁ బిలిచెడి వారని తెలియుచున్నది.

అలరాచమల్లు మహావీరుఁడనుటకు మఱియొక తార్కాణ మున్నది. అతఁడు తన యొరనుండి సూర్య భేతాళమును బయటకుఁ దీసినచో దానిని బ్రయోగింపకుండ వ్యర్థముగా మరల లోపలఁబెట్టఁ డు. ఇది శూరకులమునఁ గానవచ్చు గొప్పనియమము. (నేఁటి ప్రపంచమున వీరజాతులుగాఁ బ్రసిద్ధికెక్కిన శిక్కులలోను, ఘూర్కాల లోను నిట్టి నియమము కలదని విందుము.) అలరాజు పెద్దన్న నెదిరించి, కంభంపాటి మిట్టలపైఁ బోరునప్పుడు బ్రహ్మనాయఁడు వచ్చి వారి యుద్ధమునాపి, "అల్లుఁడా! కత్తిని ఒరచెయ్యి" అని అలరాజును కోరఁగా, అలరాజు తన ఖడ్గమున కాహారము లేనిదే ఉపసంహరింపజాలనని తెల్పెను. అప్పుడు బ్రహ్మనాయఁడు అలరాజు సూర్య భేతాళమునకు 'ఏడు దున్నపోతులు, ఏడు బద్దెగోర్లు, ఏడు గాణక్కణిజలు' ఆహుతిగాఁ బెట్టెనని నాకు లభించిన గురిజాల రాయబారామను వ్రాంతప్రతిలో నున్నది. ఇట్లే అలరాజు, నలగాముని కొలువుకూటమునకు రాయబారమునకుఁ బోయినప్పుడు, నాగమ్మ మాటలకుఁ గోపించి కత్తి దూసినాఁడు. నాగమ్మ భయపడి నలగాముని చాటునకుఁ దప్పుకొన్నది. అలరాజంతటితో దన కత్తిని దించలేదు. దానికాహారము పెట్టికాని యుపసంహరింపడు కదా! రౌద్రమూర్తియై యెదురుగాఁ జూచినాఁడు. సభాభవనమున నుక్కుస్తంభమున్నది:-

*"సూర్య భేతాళమను సురియు ఝుళిపించి*
*మొగసాల ముందర ముదముతోనున్న*
*ఉక్కు కంబము నరికె నుగ్రకోపమున"* [74]

అలరాజు నాగమ్మ విషప్రయోగముచేఁ జనిపోవుచుఁ దన బిరుదులన్నియు బాలచంద్రునికిచ్చెను. ఈ సూర్య భేతాళ ఖడ్గము కూడ బాలచంద్రునకు దక్కినది. ఈ మహాఖడ్గముతో యుద్ధము చేయుటవలన బాలచంద్రుని శౌర్యము ద్విగుణీకృతమైనదని నా నమ్మకము.

నాగమ్మ విషప్రయోగముచే దుర్మరణము నొందుచున్న భర్తను జూచి, శోక సంతప్తురాలై పేరాదేవి ఆతని బలశౌర్యముల నిట్లు ప్రశంసించును:-

*"అలరాజ! సకల విద్యాప్రసంగముల*
*తులతూగ నీ సాటి దొరలెందు లేరు*
*విలసిల్లు నా తెరవేట కయ్యమున*
*ఇలలోన దెబ్బదియే దండలముల*
*మనుజనాథుల నిముసమాత్రాన చంపి*
*ఘనశౌర్య సంపద గంటి వదిగాక*
*తక్కక నీవు హోదాటి కయ్యమున*
*ఒక్కడె గెలిచిన యురుబలాఢ్యుడవు*
*తగిన కులమున పుట్టి తగని యీ చావు*
*మీకెట్లు సిద్ధించె మేదిని మీద*
*అట్టి సాహసమెందు అణగెనోరాజ!*
*ఎట్టి యౌదార్యంబు లింకెనోరాజ!"* [75]

ఇంతటి మహావీరుఁడగు అలరాచమల్లు పల్నాటి రాజ్యమునకు వారసుఁడనియు, యుద్ధము వచ్చినచోఁ దమ్మునందఱను దుడిచి పెట్టువాఁడనియు భయపడి, నలగాముని తరువాత నరసింగరాజును సింహాసనమెక్కింపఁ దలంచిన నాగమ్మ, ఇతనిని మాయోపాయముచేఁ జంపినది. (పల్నాటి వీరకథాచక్రమున నీ యలరాజుకథ మిక్కిలి హృదయవిదాకరమైనది.) దీనినిబట్టి అలరాజు మరణమునకు నాగమ్మయే కారణమని అందఱును దలంచుట సంభవించినది. ఇది

కేవలము భ్రమయనియు, అలరాజు మరణమునకు నాగమ్మ యెంతకారణమో బ్రహ్మనాయఁడును నంతే కారణమనియు నిరూపించెడి వీరగాథ యొకటి నాకుఁ బల్నాటిలో లభించినది. నెల్లూరు మండలమునఁగూడ నిట్టి కథయున్న తాళపత్రప్రతి లభ్యమైనది. ఈ కథలను బరిశీలించినచో అలరాజు మరణమునకు బ్రహ్మనయే ముఖ్యకారకుఁడనియు, నాగమ్మ నిమిత్తమాత్రురాలనియు స్పష్టమగును.

'అలరాచమల్లుగారి గురిజాల రాయబారము' అను నీ కథ రెండు రాత్రుల కథ. అలరాజు– పెద్దనల యుద్ధము ఒకరాత్రి, రాయబారము– మరణము రెండవరాత్రి. వీనిని 'పూర్వభాగము– ఉత్తర భాగము' అనియుఁ బిలువవచ్చును. ముద్రితమైన పింగళివారిప్రతి (విశాలాంధ్రప్రతి)లోఁగాని, అముద్రితములుగానున్న మద్రాసు GOML ప్రతులలోగాని ఈ రెండు భాగములును గల రాయబారపు కథలు లేవు. వీనిలో నుత్తరభాగము మాత్రమే యున్నది. కావున నివి అసమగ్రములనుట నిస్సంశయము. నాకు లభించిన కథలే సమగ్రములైనవి.

అవి మలిదేవుఁడు మాచెర్లను బాలించుచున్న రోజులు. మహర్నవమిపండుగ వచ్చినది. అలరాజు గుఱ్ఱమును మేపు 'గంగాధరుఁడును', పెద్దన్నబాదరాజు గుఱ్ఱమును మేపు 'దాదివారి మల్లు'ను గలహించిరి. దాదివారి మల్లు అలరాజు గుఱ్ఱమును కొట్టినాఁడు. ఆ గుఱ్ఱము మేఁతమాని చిక్కిపోయెను. అలరాజు అశ్వశాలకు వచ్చి, గుఱ్ఱమేల చిక్కిపోయినదని గంగాధరుని బ్రశ్నింపఁగా వాఁడు జరిగిన విషయమంతయుఁ జెప్పెను. ఆనాఁటి కలహమున దాదివారి మల్లు, అలరాజు గుఱ్ఱముకన్న పెద్దన్న గుఱ్ఱము గొప్పదనియు, అలరాజుకన్న పెద్దన్న గొప్పవాఁడనియు, నందుచేఁ దాను పెద్దన్న గుఱ్ఱమును దోలుకొని వచ్చునప్పుడు, దారి నీయవలెననియుఁ బల్కెనఁట. అలరాజు ప్రశ్నకు సమాధానముగా గంగాధరుఁడీ విషయమును దెల్పెను. పెద్దన్న గర్వముతో నున్నాఁడనియు, నందుచే నాతని గుఱ్ఱమును మేపువాఁడును గర్వించి యున్నాడనియు నలరాజు భావించి, పెద్దన్నకంటెఁ దానే అన్ని విధముల నున్నతుఁడనని నిరూపింపఁదలంచెను. పెద్దన్నబొమ్మను జేసి తన యశ్వపాదమునకుఁ గట్టెను. అది చూచి పెద్దన్న ఆగ్రహించెను. ఇరువురును తమతమ బలాబలములను దేల్చుకొనుటకై కంభంపాడు మిట్టలపైకిఁ బోయి హోరాహోరిగఁ బోరాడసాగిరి. బ్రహ్మనాయఁడది తెలిసికొని, పరుగుపరుగునఁబోయి, వారిని విడఁదీసెను. బ్రహ్మనాయఁడు సహితము పెద్దన గుఱ్ఱము ('కారు బొల్లఁడు') నాపఁగలిగినాఁడు కాని, రాచమల్లు గుఱ్ఱము ('సవరాల జిమ్మఁడు') నాపలేకపోయినాఁడు. పెద్దనకంటెను, తనకంటెనుగూడ అలరాచమల్లు బలశాలి యని బ్రహ్మన గుర్తించినాఁడు. అతనివలన నెప్పటికైనను దనకు ముప్పు రాఁగలదని గ్రహించినాఁడు: "అరెరె, ఇది పెదుము మించినపల్లు! ఇతను నన్ను కాచేవాఁడు కాదు. ఏ పొక్క నేర్పునైన నేను ఈ పంటిని పూడపీకించవలెను" అని బ్రహ్మన నిశ్చయించినాఁడు. అందుచేతనే భట్లు బ్రాహ్మణులు పోఁదగిన రాయబారమునకు నలరాజును బంపవలెనని తలఁచినాఁడు. అట్లు చేసినచో నతఁడు నాగమ్మ చేతిలో హతుఁబగునని బ్రహ్మనకుఁ దెలియును. భట్టును, బ్రాహ్మణుఁడును నగు రాయబారియైనచో నెవరును జంపఁబూనరు. అలరాజు క్షత్రియుఁడగుటచేతనే నాగమ్మ పాపభీతి లేకుండఁ జంపివేసినది.

అలరాజును రాయబారిగాఁ బంపుటకుఁ దండ్రి కొమ్మరాజు ఎట్టకేలకు అంగీకరించినను, తల్లి చల్లమాదేవి మిక్కిలి భయపడి తిరస్కరించినది. బ్రహ్మన ఆమెనోదార్చి, తన మెడలోనున్న తులసి వనమాలను అలరాజు మెడలో వేసి, తనపుత్రుఁడు బాలచంద్రునిఁ గొమ్మరాజున కిల్లడమిచ్చి, అలరాజునకుఁ గన్నమనీని సాయమిచ్చి, నమ్మించి యొప్పించెను. పోవునప్పుడు కాపట్యముతో దీవించినాఁడు. "పోవోయి అల్లుఁడా!" అనినాఁడేకాని, 'పోయిరమ్ము' అని యనలేదు. బ్రహ్మనాయఁడు విషవాక్కు అమృతవాక్కు కలవాఁడు. అతఁడు పొమ్మన్న వారికిఁ బోకడే కలుగును; రమ్మన్నవారికి రాకడే కలుగును. అలరాజు మెడలోఁ దులసి వనమాల యున్నంతవఱకును నతనికి మరణము లేదు. అతఁడు మరణింపక తిరిగి వచ్చినచోఁ దన పాచిక పాఱదు. అందుచే బ్రహ్మన బాలచంద్రునిఁ బిలిచి, మార్గమధ్యమున ఏ మిషతోనైనను ఆ వనమాలను గ్రహించి తెమ్మనెను. బాలచంద్రుఁడు తన 'వేడుక పోతేలు' నెక్కి అలరాజు వెనువెంటఁబోయి, అతనితోఁ 'గండ్లయేఱు'ను గుఱ్ఱములు దూకించు పందెము చఱచి, అలరాజు నుండి వనమాలను గ్రహించి, అతఁడు వెనుదిరిగి రాకుండ ఆనలు వెట్టి, తండ్రికి ఆ వనమాల నిచ్చెను.

అలరాజు త్రిపురవరము, మటుకుల, మట్టివేముల, కంబాల కనుమ, చంద్రవంక, కంభముపాడు, గోలేరు, రెంటాల మున్నగు గ్రామములు గడచి, తెల్లవారుసరికి గురిజాల చేరుకొనెను. గురిజాల పరిసరములకు రాఁగానే తన రాఁకను సూచించుటకై భేరి మ్రోయించి, తన సూర్య భేతాళమును ఝుళిపించెను. అలరాజు భేరివిని గురిజాలకోటలోనివారి గుండెలదిరెను. అతఁడు ఝుళిపించిన సూర్య భేతాళ కాంతులు స్వాతిమెఱపులవలె మెఱసెను. నాయకురాలు గడగడ వణఁకెను. అలరాజు నలగాముని కొలువుకూటములోనికి వచ్చి సంధివాక్యములు పలికెను. మాచెర్ల రాజ్యమును మరల మలిదేవుల కిచ్చుటకు నలగాముఁ డంగీకరింపలేదు. అతఁడు కొంత మెత్తబడినను నాగమ్మ అడ్డు తగిలెను. అలరాజు కోపముతో నాగమ్మను నఱుకఁబోయెను. ఆమె నలగాముని వెనుకకుఁ దప్పుకొనఁగా నలరాజు తానెత్తిన ఖడ్గమును దింపక మొగసాల ముందఱ నున్న ఉక్కుకంబమును నఱికివైచెను. కారెంపూడిని రణరంగముగాఁ బేర్కొని, అలరాజు సభనుండి నిష్క్రమించెను. కన్నమనీఁడు వలదని

చెప్పుచున్నను, అలరాజు రత్నాల పేరమ్మను జూడవలెనను తలంపుతో నా రోజు గురిజాలలోనే గుడారము లెత్తించెను. నాగమ్మ అలరాజును జంపుటకై విషాన్నమును బంపెను. అలరాజు దానిని గుర్తించి పాఱవైచెను. మఱునాఁడు అలరాజు తిరుగుప్రయాణమయ్యెను. నాయకురాలు, పూవులయందు విషయము నుంచి 'తమ్మళ్ల'కిచ్చి (తంబళ్లు= శివాలయములోని పూజారులు), మార్గమధ్యమున అలరాజున కిండని చెప్పి పంపెను. అలరాజు చెర్లగుడిపాడు కడకు వచ్చుసరికి తమ్మళ్లు వచ్చి అతనికిఁ బూవులను బహూకరించిరి. ఆ పూల నాఘ్రాణించి అలరాజు స్పృహతప్పి పడిపోవుచు, భార్యను దోడితెమ్మని కన్నమదాసును గురిజాలకుఁ బంపెను. కన్నమనీఁడు గురిజాలకుఁ బరుగు పరుగునఁ బోయి రత్నాల పేరమ్మ కీ వార్త నెఱింగించి, ఆమెను దోడితెచ్చెను. రత్నాల పేరమ్మ తండ్రిని శపించి, భర్తకడకు వచ్చి మిక్కిలిగ దుఃఖించెను. ప్రాణావశిష్టుఁడైన అలరాజు ఆమెనోదార్చి, తన బిరుదులన్నియును బాలచంద్రున కిమ్మని కన్నమదాసుతోఁ జెప్పి కన్నుమూసెను. రత్నాల పేరమ్మ క్రుంగి పోయెను. భర్తశవమును పల్లకియందుఁ జేర్చుకొని, మిరియాల, కంబాల కనుమ, మట్టివేముల, మటుకుల మీఁదుగా ఆ రాత్రి యంతయును బ్రయాణముచేసి వీరమేడపి చేరుకొనెను. జంగములను బూజించి, మేడపిలో రాచరావులకడఁ బతిశరీరముతో సహగమనము చేసెను.

అలరాజు–పెద్దన్నలు యుద్ధము చేసినట్లును, బ్రహ్మన్న కుటిల బుద్ధితో నలరాజును జంపవలెననెడి నిశ్చయముతో రాయబారము నకుఁ బంపినట్లును గల యీ కథ పింగళివారి ప్రతిలోఁగాని, మదరాసు GOML ప్రతులలోగాని లేదని తెలిసికొంటిమి. కాని వీరభద్రకవి పద్యకావ్యమున మాత్రము ఇది స్పష్టముగాఁ జిత్రింపఁ బడినది. మందాదినుండి బ్రహ్మనాయఁడు వీరులతోఁ గలసి శ్రీశైలము వచ్చి, మల్లికార్జునుని దర్శించి, 'మాకురాజు' కడ తన ఆయుధములను కుదువఁబెట్టి, ధనమును దీసికొని మారకాపురము జేరి, వీరమేడపిని గట్టుకొనెను. అనుకొన్న గడుపు పూర్తికాఁగానే, అలరాచమల్లును రాయబారమునకుఁబంప నిశ్చయించెను. ఈ సందర్భమున అలరాజు తల్లి చెల్లమాదేవి బ్రహ్మనాయని 'ప్రాంతపగ లేమైన మనసున బెట్టుకొని నా కుమారుని సంధికిఁ బంపుచుంటివా?' అని ప్రశ్నించును. బ్రహ్మన, ప్రాంతపగ యన నేమియో తెలుపుమని కోరును. అప్పుడు చెల్లమాదేవి పూర్వము జరిగిన పెద్దన–అలరాజుల కలహమునుగూర్చి చెప్పును. (నాకు లభించిన వీరగాథలలోఁ గూడ పూర్వభాగ వివరణ మీ సందర్భముననే యున్నది.) అలరాజు పెద్దనల యాశ్వికులు పరస్పరము కలహించుట– పెద్దనచేఁ బంపఁబడిన భట్రాజు అలరాచమల్లుతో గుఱ్ఱపు కాలికి పెద్దన పేర బొమ్మ కట్టఁదగదనుట– అలరాజు పెద్దనను దిరస్కరించుట– అలరాజు, పెద్దన్నలు పోరునెడకు బ్రహ్మనాయఁడు బంధువులతో నేఁగి వారిపోరు నివారింపఁజేయుట– బ్రహ్మనాయఁడు అలరాజు దురహంకారమును గనిపెట్టి సంధికిఁ బంపనెంచుట– అందులకై వీరుల నొడంబఱచుట– బ్రహ్మనాయఁడు అలరాజు తల్లియగు చెల్లాంబ ననుమతి గోరుట– పుత్రుని సంధికిఁ బంపఁజాలక చెల్లాంబ దుఃఖించుట– తుదకు బ్రహ్మన యామె నొప్పించుట– తులసిమాల నలరాజు మెడనువేసి పంపుట– అలరాజు, బాలుఁడును వాహనములచే నదిని దాటించుటకై పందెములు పూనుట– అలరాజు గుఱ్ఱమోడిపోవ బాలుఁడతని తులసీమాలను గొనుట– ఇత్యాది కథను వీరభద్రకవి తన వీరభాగవతమున స్పష్టముగా వర్ణించినాఁడు.

పింగళివారి ప్రతిలో అలరాజు– పెద్దనల కలహమును గూర్చిన ప్రథమభాగమే గాక, అలరాజు రాయబారము నెఱపిన దినము గురిజాలలో విడిసిన సంగతి కాని, నాగమ్మ విషాన్నమును బంపిన విషయము కాని లేవు. సంధి విషయములు మాటాడిన వెంటనే అలరాజు ప్రయాణమైనట్లుగా నున్నది. ఇది సరికాదు. నాగమ్మ అలరాజుపై విషాన్న ప్రయత్నము, విషపుష్పముల ప్రయత్నము– రెండింటిని జేసినట్లు జానపదులలో వాడుక కలదు. అంతేకాదు, నరసింగరాజు మార్గమధ్యమునఁ బొంచియుండి, అలరాజును జంపెనను వాడుక కూడఁ గొందఱు ప్రజలలోఁగలదు. ఇది అంత విశ్వసింపఁదగినదిగా లేదు. నరసింగరాజువంటి వారిని వందమంది నైనను అలరాజు అవలీలగాఁ జంపఁగలఁడు. పైగా, మహావీరుఁడగు కన్నమనీఁడు ఆతనికి అంగరక్షకుఁడుగా నున్నాఁడు. కాని, నరసింగరాజు సింహాసనము తనకు దక్కఁగలదను నాసతో, రాజ్యావారసుఁడగు నలరాజును జంపుటలో నాగమ్మకుఁ దోడ్పడి యుండును. లేనిచో బాలచంద్రుఁడీతనిని జంపెదనని పట్టుపట్టుటలో నర్థములేదు. నలగాముఁడు పేరునకు మాత్రమే రాజు. అధికార మంతయు నాగమ్మ– నరసింగరాజుల చేతులలోనే యున్నది. దీనివలననే వీరభద్రకవి నలసింగరాజును పాలకునిగాఁ జిత్రించినాఁడేమో(?).

పింగళివారి ప్రతిలో నాగమ్మ అలరాజును జంపఁ బోవుచున్నట్లుగా ముందు నలగామునితోఁ జెప్పి యొప్పించినట్లున్నది. ఎంతటి కఠినాత్ముఁడైనను అల్లునిఁ జంపుట కంగీకరించునా? కాని నాగమ్మ అతనితండ్రి అనుఁగురాజుపై నొట్టుపెట్టి, నలగాముని నిరుత్తరునిగాఁ జేసినదఁట!

మదరాసు లిఖిత ప్రతులలోఁగూడ నలరాజు సంధివాక్యము లాడిన దినము గురిజాలలో విడిది చేసినట్లుగ నున్నది. విషాన్నముఁ బంపిన సంగతియు నిందుఁగలదు. మఱునాఁడు కాని, అలరాజు చెర్లగుడిపాడు మీఁదుఁగా బ్రయాణము కాలేదు. పెద్దన్న అలరాజుల కలహవిషయము, బ్రహ్మనాయని కుటిలయత్నము తప్పఁ దక్కిన వన్నియును మదరాసు లిఖిత ప్రతులలోఁ గలవు.

పింగళివారి ప్రతిలో అలరాజునకు విషపుష్పముల నిచ్చినది 'కొమ్మ జియ్యరు' అని కలదు. ఇతఁడొక్కడే యిచ్చినట్లున్నది. మదరాసు

ప్రతులలో 'తమ్మళ్లు' ఇచ్చినట్లున్నది. బహువచన ప్రయోగమునుబట్టి వీరిద్దరు ముగ్గురు గలరని యూహింపవచ్చును. జనవ్యవహారమున 'తంబళ్ల పెద్దు' అనువాఁడీ పనిని చేసినట్లు కలదు. అతఁడు అలరాజునకుఁ బూలచెండు నిచ్చిన ప్రదేశము చెర్లగుడిపాడు గ్రామమునక కుత్తరదిశలో నేఁటికిని గలదు. అట తంబళ్ల పెద్దు విగ్రహమున్నది. (నా పల్నాటి యాత్రలో దీనిని జూచితిని.) అట్లే అలరాజు ఒఱిగిపోయిన ప్రదేశముకూడ చెర్లగుడిపాడునకు దక్షిణదిశలో నున్నది. అక్కడ నొక శిలాఫలకమును, దానిపై అలరాజు శిల్పమును గలవు. దీనిని "అలరాజు ఒఱగు ఱాయి" అందురు. ఇది మిక్కిలి ప్రాచీనమైన శిల్పము.

రెండు రాత్రులు పాడఁబడు అలరాజు రాయబార కథలో మొదటి రాత్రిని 'పెద్దన పోరు' అనియు, రెండవ రాత్రిని 'అలరాజు మరణము' అనియు గాథాకారులు వ్యవహరింతురు.

## 7.17. 'కల్లు ప్రతిష్ఠ':-

అక్కిరాజు ఉమాకాంతంగారు ప్రకటించిన బాలచంద్ర యుద్ధమను గ్రంథమున మొదటి 37 పుటలలోనున్న కథ 'కల్లు ప్రతిష్ఠ'. పింగళివారు దీనిని బ్రత్యేక కథగాఁ బ్రకటించుట ముదావహము. మదరాసు GOML లో దీనికి నాఱుప్రతులున్నవి. ఈ వీరగాథలను జానపదులును, గాథాకారులును 'నాగారపు స్తంభం కథ' అని పిలిచెదరు.

రాయబారిగాఁ బంపిన అలరాజును జంపించుటచే, వీరులు నలగామునిపైఁ గోపించి యుద్ధసన్నద్ధులైరి. మేడిపిలోఁ బెదమలిదేవుని పుత్రుఁడగు బిరుదురాజునకుఁ బట్టము గట్టి, బాలచంద్రునకు మంత్రిత్వమును, అనపోతునకుఁ గరణీకమును నప్పగించి, కార్యమపూడి రణరంగమునకు బయలుదేరిరి. బ్రహ్మన, శివనందుల కోటను గెలిచినప్పుడు తెచ్చి, త్రిపురాంతకములోనుంచిన భూతరాట్ స్తంభమును, వీరులు బండ్లపై వేసికొని, మట్టివేముల, గుమ్మడంపాడు, గరికెపాడు, పైడిపాడు గ్రామాలు గడచి, మేళ్లవాగున నిల్చిరి. చీఁకటి పడఁగా, బ్రహ్మనాయఁడు ముందు కన్నమను కారెంపూడి యుద్ధక్షేత్రమునకుఁ బంపి, తరువాత తానే స్వయముగా వెళ్లి, వర్షము కురిపించి, రణరంగమును శుభ్రపఱిచెను. మఱునాఁడు మలిదేవాదులందఱును నాగారపు స్తంభమును దీసికొని కారెంపూడి ('కార్యమపూడి' అనుట పండిత సృష్టిగా నున్నది) కిఁ జేరి దానిని సాక్షిగా నచటఁ బ్రతిష్ఠించిరి. వీరులందఱును 'గంగధార మడుగు'లో స్నానములు చేసి, తమ తమ పేర నట లింగములు స్థాపించిరి. నలగామిని దగ్గఱకు భట్టును రాయబారమంపిరి. భట్టు నలగామునితో సంధివచనములు పలుకఁగా, నాయకురాలు కోపించి అతనిని మందలించెను. నలగాముఁడును వివిధ రాజన్యులకు లేఖలు వ్రాసి, మహాసైన్యముతోఁ గొదమగుండ్ల మీఁదుగాఁ గార్యమపూడికిఁ జేరెను. కొమ్మరాజు తన గురువు 'బలభద్ర రఘుపతి'ని దలఁచి, ఒక బాణమును వదలి నలగామిని గుడారమును గూల్చెను. నలగామిని సైన్యములో కొందఱు భయపడి పాఱిపోయిరి. బ్రహ్మనాయఁడు మంచి ముహూర్తమునకై కాలజ్ఞులతో సంప్రదించెను.

వీరభద్రకవి వీరభాగవతమున ఈ కల్లుప్రతిష్ఠ కథాభాగము లేదు.

## 7.18. బాలుని కథ:-

'బాలుని కథ' వేఱు, 'బాలుని యుద్ధము' వేఱు. (పింగళివారి ప్రతిలో ఈ రెండును గలుపఁబడి 'బాలచంద్రుని యుద్ధము' అను నొకే కథగాఁ బ్రకటింపఁబడినవి.) బాలుఁడు బొంగరము లాడుట మొదలుకొని కారెంపూడికి వచ్చువఱకును బాలుని కథ. వీరుల లింగాల ప్రతిష్ఠ, మలిదేవుల మేళ్ళవాగు యుద్ధము, బాలుని యుద్ధము- మరణము- రెండవ కథ. ఈ రెండును భిన్నగాథలుగనే మద్రాసు GOML లోఁ గలవు. అట బాలుని కథకుఁ బండ్రెండు ప్రతులును, బాలుని యుద్ధమునకు నాలుగు ప్రతులును గలవు.

బాలుని కథ జగత్ప్రసిద్ధమగుటచేఁ గాథాఖ్యాన వివరణ మనావశ్యకము. బాలుని కథ పల్నాటి వీరకథలన్నింటికిని శిరోభూషణముగాఁ దీర్చిదిద్దబడినది. విద్వాంసుల దృష్టికి వచ్చిన వీరగాథ యిది యొక్కటియే. అక్కిరాజువారు ప్రకటించినది శ్రీనాథ విరచితమైనది. పింగళివారు ప్రకటించిన కథ దీనికిఁ బుత్రికయే కాని అన్యము కాదు. శ్రీనాథుఁడు ఈ కథ నొక్కదానినే వ్రాసెననియు, దీనిని జూచి మల్లయ్య, కొండయ్య యను కవులు తక్కిన వీరగాథలను రచించిరనియుఁ గొందఱూహింపవచ్చును. ఇది సరికాదు. శ్రీనాథుఁడు, మల్లయ్య, కొండయ్య- ఈ ముగ్గురు కవులును నెవరికి వారు ప్రత్యేకముగాఁ బల్నాటి వీరకథాచక్ర మంతటిని రచించియున్నారు. కాని నేఁడు మనకు వీరి రచనలలోఁ గొన్ని భాగములు మాత్రమే లభించుచున్నవి. శ్రీనాథుఁడు ఒక్క బాలునికథనే కాక, వీరకథాచక్ర మంతటిని రచించెననుటకు నాకు లభించిన శ్రీనాథ విరచితములగు మందపోటు కథ, ఆరణగండ్ల యుద్ధము, పెద్దన్నపెండ్లిరాయబారము మున్నగు వీరగాథలు సాక్ష్యమిచ్చుచున్నవి. మల్లయ్య, కొండయ్య యను కవులు రచించిన బాలునికథలు అక్కిరాజు ఉమాకాంతంగారికి లభించినవనుటకు వారి భూమికలే గొప్ప నిదర్శనములు. ఉమాకాంతంగారు బాలచంద్రుని కథలలోఁ గోమటి స్త్రీకి బొంగరము తాఁకిన ఘట్టమునుండియు, వృద్ధవేశ్యావర్ణనమునుండియు శ్రీనాథ, కొండయ్య, మల్లయ్యల రచనలనుండి కొన్ని పాదములను తులనాత్మక దృష్టిలో నుదాహరించియున్నారు (చూ. వారి 'పల్నాటి వీరచరిత్ర'- వావిళ్లప్రతి, ప్రథమ భూమిక, పుటలు- 77-79). మల్లయ్య రచనలలోఁ జాలవఱకు శ్రీనాథుని వాక్యములే కలవనియు, కొండయ్య శబ్దసౌష్ఠవమును బాటింపక యిచ్చవచ్చినట్లు చెప్పినాఁడనియు

ఉమాకాంతంగారు తెల్పినారు. కాఁబట్టి శ్రీనాథుఁడు, మల్లయ్య, కొండయ్యలు ముగ్గురును వేఱు వేఱుగాఁ బల్నాటి వీరకథాచక్రములోని కథలనన్నింటిని సంపూర్ణముగా వ్రాసిరనుట నిశ్చయము.

మద్రాసు GOML లోని ప్రతులనుబట్టి 'బాలుని కథ' 'బాలుని యుద్ధము' వేర్వేఱు రచనలని తెలియుచున్నను, గాథాకారులు మాత్రము ఈ రెండింటిని గలిపి 'బాలుని కథ' పేరుతోనే ఆఱురాత్రుల కథగాఁ బాడుచున్నారు. జానపదులు ఈ కథను ఆఱుకాండలని చెప్పుదురు: 1) బొంగరాలాట, 2) సబ్బాయి చాటువ, 3) మంచాల మేడ సవరణ, 4) అనపోతురాజు ఒరుగు, 5) మేళ్ళవాగు యుద్ధము, 6) బాలుని కారెంపూడి యుద్ధము. కొండయ్య రచననుబట్టి ఈ బాలునికథలో పై ఆఱుకాండలే కాక మఱిరెండు కాండలును గలవని తెలియుచున్నది. అవి "బొంగరం పుట్టుక", "అంతర్వేదిగాని కథ" (సబ్బాయి తమ్ముఁడు). ఇవి రెండును అక్కిరాజు ఉమాకాంతంగారికి లభించినవని వారి ప్రథమ భూమికనుబట్టి నిశ్చయింపవచ్చును. ఇందు బొంగరాలాటలో 'బొంగరం పుట్టుక'యు, సబ్బాయిచాటువలో 'అంతర్వేదిగాని కథ'యు వచ్చును. కాఁబట్టి బాలుని కథలో నెనిమిది కాండలున్నవని చెప్పవచ్చును. ఇట్టి కాండలే కాలక్రమమునఁ బ్రత్యేక వీరగాథలుగా మాఱి, వీరగాథావృత్తముగా నేర్పడు నవకాశమున్నది.

అక్కిరాజు ఉమాకాంతంగారు తాము ప్రకటించిన బాలచంద్రుని యుద్ధములో, రచనను మార్చివేయుటయే కాక, పాత్రల నామములనుగూడ దమ ఇచ్చవచ్చిన రీతిగా మార్చుట విచారకరము. బాలచంద్రుని వేశ్యపేరు 'సబ్బాయి' లేక 'సబ్బసాని'. దీనిని అక్కిరాజు వారు 'శ్యామాంగి'గా మార్చినారు. ఈ మార్పువలనఁ జక్కని తెలుఁగు మాటను నాశము చేయుటకన్న వారేమి సాధించిరో తెలియరాదు. పింగళివారిప్రతిలో 'సబ్బాయి' అనియే కలదు. వీరభద్రకవి యీమెను 'సబ్బసాని' అనియు, నీమెతల్లిని 'బొల్లసాని' అనియుఁ దెలిపినాఁడు. వీరభద్రకవి మాంచాలను 'మంచాల' అనియు, అనపోతురాజును 'మనుబోతురాజు' అనియుఁ బేర్కొనినాఁడు. పింగళివారిప్రతిలో 'మంచాల', 'మాంచాల' అను రెండు విధముల ప్రయోగములును గలవు. అక్కిరాజువారు 'మాంచాల' అని సర్వత్ర ఒకే విధముగాఁ బ్రయోగించినారు. మాంచాల తల్లి– బాలచంద్రుని అత్తగారు 'రేఖాంబ' అని అక్కిరాజుగారి గ్రంథమునఁ గలదు. పింగళివారిప్రతిలో నీమె పేరు 'రేకమ్మ' అని కలదు. ఇదియే అసలు పదము కాఁగా, అక్కిరాజువారు దీనిని సంస్కృతీకరించియుందురు. వీరభద్రకవి మాంచాలతల్లి పేరు 'ముగ్ధాంబ' అనినాఁడు. బాలుని బొంగరము తాఁకిన వైశ్యవనితపేరు పింగళివారి ప్రతిలో 'అన్నమ్మ' అని యుండగా, వీరభద్రకవి కావ్యమున 'వేషాంబ' అని యున్నది. వీరభద్రకవికూడఁ గొన్ని పేర్లను సంస్కృతీ కరించినట్లున్నాఁడు.

జానపద గాథాకారులు బాలచంద్రుఁడు తన బ్రహ్మచర్యమును సబ్బాసాని దగ్గఱఁగాని, మాంచాల దగ్గఱఁగాని కోల్పోవలేదని చెప్పుచుందురు. కాని వీరగాథలనుబట్టి పరిశీలించినచో బాలుఁడు సబ్బాసానితోఁ గూడినాఁడనియు, మాంచాల దివ్యసౌందర్యమును గాంచి, చంచలుఁడై ఆమెను గవయనుంకింపఁగా, నామె తన తల్లి యాజ్ఞప్రకారము ఆతనిని మభ్యపెట్టి మఱపించినదనియుఁ దెలియుచున్నది.

అక్కిరాజువారి ప్రతిలో మాంచాల అలంకరించుకొని భర్త దగ్గఱకుఁ బోవుచున్నప్పుడు తల్లియగు రేఖాంబ, ఆమెను నిగ్రహము ప్రదర్శింపుమనియు, లోఁబడినచో నామెమోహమునఁబడి బాలుఁడు యుద్ధవిముఖుఁడగుననియుఁ జెప్పినది. రాకరాక తన దగ్గఱకు వచ్చుచున్న భర్తయెడ తానంత కఠినముగా నెట్లు ప్రవర్తింపఁ జాలుదునని మాంచాల తల్లిని బ్రశ్నింపఁగా, తల్లి యామెకు వేదాంతజ్ఞానమును బోధించినది. ఈ జ్ఞానబోధ సుమారు ముప్పది పాదములున్నది (చూ. పుట. 76). పింగళివారి ప్రతిలో నీ జ్ఞానబోధ యంతయు లుప్తమైనది.

బాలుని సంగడీల సంఖ్యనుగూర్చి కూడ విచారింపవలసి యున్నది. బాలచంద్రుని యుద్ధఘట్టమున "ఆర్గురు సంగడీలతో అన్న బాలుండు" అని గాథాకారులు పాడుచుందురు. కారెంపూడిలోని వీరాచార పీఠాధిపతులును నిట్లే సెలవిచ్చినారు. దీనినిబట్టి సంగడీలు బాలచంద్రునితో గలిపి యేడుగురని తెలియుచున్నది. కాని బాలచంద్రుని పుట్టుకనుగూర్చి చెప్పుచు, ఐతమ్మ తనకుఁ జెన్నుఁడిచ్చిన నిమ్మఫలమును విప్రభామిని కీయఁగా, దానినామె యెనిమిది ఖండములుగఁ జేసి, ఆర్వురు కాంతలకు ఆఱుఖండములిచ్చి, ఐతమ్మ కొకటిచ్చి, తానొకటి తినెనని వ్రాయఁబడినది.

*"విజనమౌ దెసకేగి విప్రభామినికి*
*ఫలమిచ్చి మాకెల్ల పంచి యిమ్మన్న*
*ఎనిమిది ఖండంబు లేర్పడ జేసి*
*ఆర్వురు కాంతల కారు ఖండములు*
*మేరతోడుత నిచ్చి మేలైన దొకటి*
*నా చేతి కందిచ్చి నాతి తా నొకటి*
*పుచ్చికొన్నపుడు..."* [76]

ఆ యష్టకాంతలును గర్భవతులైరి; ఎనమండుగురు పుత్రులు ఉదయించిరి. దీనిననుసరించి బాలుని సంగడీలేడ్గురనియు, బాలునితోఁ గలిసి యెనమండుగురనియుఁ దెలియుచున్నది. కాని ఈ యెనమండుగురిలో అనపోతు యుద్ధమునఁ బాల్గొనలేదు. అందుచే బాలచంద్రయుద్ధ ఘట్టమున "ఆర్గురు సంగడీలతో అన్న బాలుండు" అనుట సమంజసమే కాఁగలదు. యుద్ధమునకు బయలుదేరునప్పుడు ఏడ్గురు సంగడీలున్నారు. బాలచంద్రుఁడు అత్తవారింట నున్నప్పుడు ఆ గండువారి ద్వారముకడ నేడ్గురు సోదరులును నఱచుచున్నారని తెలుపఁబడినది:

*"తమ్ములందరు నప్పు తత్తరపడుచు*
*ఘన రౌద్రముగ నుండు కత్తులు దూసి*
*వెడలిన కోపాగ్ని వీరు లేద్వురును*
*మారెరుంగక నుండు మదకరులట్లు"* [77]

యుద్ధమునకు బయలుదేరిన యేడ్గురు సంగడీలలో అనపోతు మార్గమధ్యమున నాత్మహత్య చేసికొనినాఁడు. అందుచే నార్గురు సంగడీలతో బాలుఁడు యుద్ధభూమిని బ్రవేశించినాఁడు. బాలచంద్రుని సంగడీల పేర్లు: "బ్రాహ్మణ అనపోతు, వెలమ దోర్నీఁడు, కమ్మర కాచన, కుమ్మరి పట్టి (ఇతని పేరు తెలియుట లేదు), చాకలి చందు, కంసాలి చందు, మంగల మల్లు ('మంగల మాధవు' అని కొన్ని ప్రతులలోఁ గలదు)." ఇట్లు బాలచంద్రునితోఁ గలసి మొత్తము బాలవీరు లెనిమిదిమంది. వీరిలో బ్రాహ్మణుఁడగు అనపోతు అందఱికన్నను పెద్దవాఁడు. బాలచంద్రుడు ద్వితీయుఁడు. తక్కినవారంఱును దరువాతివారు. ఏలయన, నాఁడు బ్రాహ్మణులు అగ్రవర్ణముగా మిక్కిలి గౌరవింపఁ బడుచుండెడివారు. ఐతమ్మ తనకు చెన్నకేశవుఁ డిచ్చిన వరప్రసాదమగు గజనిమ్మపండును వెంటనే తన సఖియలలో బ్రాహ్మణ వనితయగు పేరమ్మ కిచ్చినది. దానినందఱకును బంచి యిమ్మని పేరమ్మను గోరినది. తాను మహామంత్రి భార్యనను గర్వమును లేశమైనను జూపక పేరమ్మకు ఆ గౌరవము నొసంగినది. పేరమ్మ నిమ్మపండు నెనిమిది ముక్కలుగఁ గోసి అందఱకును బెట్టఁగా, ఐతమ్మ, పేరమ్మ తన ముక్కను భక్షించువఱకును దక్కినవారెవ్వరును దమ ముక్కలను భక్షింపవలదని శాసించినది. (ఇది నాఁటి సంఘమున బ్రాహ్మణులకుఁగల మహోన్నతస్థానము!). పేరమ్మ మొదట తినినది. ఆ తరువాత నైతమ్మ భక్షించినది. పిమ్మటఁ దక్కిన వారందఱును దినిరి. అందుచే అనపోతు ముందు జన్మించినాఁడు. తరువాత బాలచంద్రాదులు పుట్టిరి. అనపోతు పెద్దవాఁడును అగ్రవర్ణుఁడును అగుటచేతనే బాలుని వేశ్యాలోలత్వమును నిందింపఁగలిగినాఁడు. అనపోతు వేదాది విద్యల నభ్యసించిన విజ్ఞాని యనియు, నితని ఇంటిపేరు 'ఒడ్డి' వారనియు, తాత 'పెద్దన' యనియు, తండ్రి 'మల్లపరా'జనియుఁ, దల్లి 'పేరమ్మ' యనియు వీరగాథలనుబట్టి తెలియుచున్నది. ఇతఁడు ఆఱువేల నియోగి బ్రాహ్మణుఁడు.

బాలచంద్రుఁడు మాంచాలను ఉపేక్షచేసి, వేశ్యయగు సబ్బాయితోఁ గాలము గడుపుటకును, అతఁడు వివాహానంతరము ఒక్కసారియైనను అత్తవారింటికి ఏఁగకుండుటకును గల కారణమును ఏ విమర్శకుఁడును బరిశీలింపలేదు. కవులుకూడ నీ విషయమును స్పష్టముగా వ్రాయలేదు. నే నీ విషయమునుగూర్చి పల్నాటి వీరగాథలు పాడెడి వీరవిద్యావంతులను బ్రశ్నించితిని. వారు చెప్పినదిది: బాలచంద్రునకును మాంచాలకును వివాహము మిక్కిలి బాల్యదశ యందు జరిగినది. క్రమక్రముగా వారు యౌవనదశయందు అడుగిడిరి. కాని వెలమస్త్రీలకు 'ఘోషా' హెచ్చు. మాంచాల యెట్లున్నదో తెలిసికొనవలె ననెడి కోరిక బాలునకుదయించెను. అనపోతు బ్రాహ్మణుఁడగుటచే నాతని కంతఃపుర ప్రవేశమున కాటంకము లేదు. అతఁడు ప్రతిదినమును ఆయవారమునకు గండువారింటికి ఏఁగెడివాఁడఁట. అట సౌందర్యరాశియగు మాంచాలను జూచుచుండెడివాఁడు. చిన్ననాఁడెప్పుడో పెండ్లియయిన బాలుఁడు యౌవనవతియగు భార్య సౌందర్యమును దెలిసికొననెంచి, "మాంచాల యెట్లున్నది?" అని ప్రియసఖుఁడగు అనపోతును బ్రశ్నించెనఁట. మాంచాల అతిలోక సౌందర్యమును యథార్థముగాఁ జెప్పినచో బాలుఁడామె మోహమునఁ బడిపోయి, రాఁబోవు యుద్ధమునఁ బ్రముఖపాత్ర వహింపడని భయపడి, అనపోతు మాంచాల మిక్కిలి అసహ్యముగా నున్నదని చెప్పెనఁట. అందుచే బాలుఁడాతని పలుకులు విశ్వసించి అత్తవారింటికేఁగ సంకల్పింపక, వేశ్యయగు సబ్బాయియే సౌందర్యవతియని నమ్మి ఆమెకడనే యుండెడివాఁడఁట. అనపోతు చెప్పిన అసత్యము మాంచాలకుఁ దెలిసి, కోపించి "నీవు నీ తమ్మునకుఁ గాకుండ పోదువు" అని అనపోతును శపించినది. ఈ శాపము ననుసరించియే బాలుఁడు సంగడీలతో యుద్ధమున కేఁగుచుండఁగా, అనపోతు దుర్మరణము నొందవలసివచ్చెనఁట.

ఇది కొంతవఱకు సమంజసముగనే యున్నది. ఇది జానపదులు కల్పించినది కాదు. ఈ కథాభాగముగల పాదములు మనకు లభించిన ప్రతులలో లోపించియుండును. రేఖాంబ మాంచాలకు జ్ఞానబోధ చేసిన ఘట్టము పింగళివారి ప్రతిలో నష్టమైనట్లుగనే యిదియును నష్టమై యుండును. పై విషయమును సూచించు పాదములు మాత్రము అక్కిరాజువారి ప్రతిలో స్పష్టముగా నున్నవి. మాంచాల సంగడీల దగ్గఱకు వచ్చినప్పుడు బ్రాహ్మణుఁడగు అనపోతును భర్తయగు బాలచంద్రుఁడును దప్పఁ దక్కిన వారందఱును లేచినిలుచుందురు. అనపోతు– బాలచంద్రులలోఁ దన భర్త యెవరో గుర్తింపలేక, మాంచాల, అనపోతునే భర్తయని భావించి పాదములు కడుగఁబోయెను. అప్పుడు అనపోతు తన నామమును దెలిపి ఆమె భర్తను జూపెను. అంత మాంచాల తన దురవస్థకుఁ జింతించుచు, అనపోతును దెప్పి పొడుచుచున్నట్లుగా నిట్లు పల్కినది:

*"వినవయ్య విప్రుడ విన్నపంబొకటి*
*ఇద్దరికిని మీర లెలమితో పెండ్లి*
*చేసెదు నాడొక చెనటి విప్రుండు*
*చూడగా లేక అసూయ పెంపొంద*
*సౌందర్యమన్నది చానకు సున్న*
*యెట్లు గావించినా రీ వివాహంబు*
*అని పల్కినో యేమొ యటు కాకయున్న*
*బాలుడివ్విధమున భావంబు విడిచి*

*నన్నేల విడనాడు నయ మార్గమెడలి*
*పరిచయమే లేదు పతికిని నాకు"* [78]

వీరభద్రకవి పద్యకావ్యమునఁగూడ అనపోతు బాలుని మాంచాలగృహమున కేఁగవలదని చెప్పినట్లుగాఁ గలదు (చూ. వీరబాగవతము, పుట 191). ఇది కూడ జానపదులు చెప్పిన కారణమును బలపఱుచుచున్నది. ఏదియేమైనను, బాలుఁడు మాంచాల యెడ విముఖుఁడగుటకు ఇట్టి చెప్పుడు మాటలేవియో కారణములై యుండుననుట మాత్రము సత్యము.

## 7.19. బాలుని యుద్ధము (ఉత్తర భాగము) – మరణము:–

ఈ పేరుతో మద్రాసు GOML లో నాలుగు ప్రతులున్నవి. మలిదేవరాజు తన బలముతోఁ గారెంపూడియందు విడిసి, యుద్ధమునకై వేచియుండెను. నాయఁడు గంగాధరమడుగులో మునిఁగి, లింగములు తీసి, వీరులపేరఁ బ్రతిష్ఠించెను. బ్రహ్మన, కొమ్మరాజు తండ్రి వీరసోముని పేర లింగమును బ్రతిష్ఠించి దానిని పలికించెనఁట. మఱునాఁడు చాపకూడు భుజించిరి. అందు ఆణెమువారు వీరశైవులగుటచేఁ జాపకూడు భుజింపనొల్లక, తమ పొట్టలు చీల్చుకొని తమ మాహాత్మ్యమును జూపిరి. బ్రహ్మన వారిని మెచ్చి, తిరుమంత్రము పఠించి, మరల వారి పొట్టలనతికించెను.

నాగమ్మ సైన్యములను సమకూర్చుకొని గురిజాలనుండి వచ్చుచుండెను. బ్రహ్మనాయఁడు యుద్ధము చేయవలసిన వీరులను మాత్రము కారెంపూడిలోనుంచి, తక్కిన మలిదేవరాజులను, బ్రాహ్మణులను, భట్లను, కోమట్లను కొంత సైన్యమును దోడుగా నిచ్చి మేడపికిఁ బంపివేసెను. నాగమ్మ కీ విషయము తెలిసి, మలిదేవ రాజాదుల నడ్డగింప 'పెమ్మినీఁడు' అను వీరుని సైన్యముతోఁ బంపెను. ఆ వీరుఁడు మలిదేవులను 'మేళ్ళవాగు కనుమ' కడ నెదిరించెను. (మేళ్ళవాగు కనుమ– గుంటూరు జిల్లా, వినుకొండ తాలూకాలో 'బొమ్మరాచపల్లె' యను గ్రామము దగ్గఱ నున్నది.) కాని మలిదేవాదులతో నున్న ఝుట్టిబోయఁడు విక్రమమును జూపి, గురిజాల సైన్యమును హతమార్చి, మలిదేవులను మేడపికిఁ జేర్చెను. తరువాత బాలుఁడు విక్రమమును జూపి, కారెంపూడిలోఁ జేసిన యుద్ధము వర్ణింపఁబడినది.

అక్కిరాజువారి ప్రతిలో 101వ పుట నుండి చివరివఱకును బాలునియుద్ధమే కలదు. కాని దీనిలో లింగప్రతిష్ఠ, మేళ్ళవాగు యుద్ధము లేవు. నల్లమలకొండ నెక్కిన బాలునకు యుద్ధభూమి యందలి దేరాలను వీరులను గూర్చి వివరించి చెప్పినది వెలమ సంగడీఁడగు 'దోర్నీఁడు' అని అక్కిరాజువారి ప్రతిలోను, పింగళివారి ప్రతిలోను గలదు. కాని, వీరభద్రకవి వీరభాగవతమున కమసాలి సంగడీఁడు 'చందు' చెప్పినట్లుగా నున్నది.

## 7.20. 'గుఱ్ఱాల సవరణ' లేక 'పెద్దన్న ఒప్పిచెర్ల యుద్ధము' లేక 'పెద్దన్న బాదరాజు యుద్ధము':–

ఇందు 'గుఱ్ఱాల సవరణ' అనుపేరే జానపదులలో మిక్కిలి ప్రచారమందున్నది. బాలచంద్రుఁడు వీరవిహారము చేసి మరణించిన తరువాత, బ్రహ్మనాయని అన్నయగు పెద్దన్న బాదరాజు యుద్ధమునకు వెడలును. ఇతఁడు గొప్ప యాశ్వికుఁడు. ఈతని గుఱ్ఱము పేరు 'కారుబొల్లఁడు'. ఇది దైవాంశగల గుఱ్ఱము. గుఱ్ఱమును యుద్ధమున కాయత్తము చేయుచు నలంకరించుటను 'సవరణ' యందురు. (ఈ పదము తిక్కన భారతమునఁ గూడఁ బ్రయోగింపఁబడినది.) పెద్దన్న బాదరాజు తన గుఱ్ఱమును, తక్కిన రౌతుల గుఱ్ఱములను అలంకరింపఁ జేసి యుద్ధమున కాయత్తమగును. ఇతఁడు ఘోరయుద్ధముచేసి, నలగాముని పక్షములోని గుఱ్ఱపుదళము నంతను నాశముచేసి, చివరకుఁ దానును కారుబొల్లనితో సహా రణరంగమునఁ గూలిపోవును. ఈ విషయము బ్రహ్మన్నకుఁ దెలిసి, గరిగ మాదచిని బోయి తన యన్నను జూచిరమ్మనును. నాకు లభించిన ఆల్తూరుపాడు తాళపత్ర గ్రంథమున నింతవఱకే యున్నది. ఆ తరువాత పెద్దన్న భార్యయగు లఘువమ్మ సహగమనము చేయును గాఁబోలును.

'గుఱ్ఱాల సవరణ' యను నీ వీరగాథ పింగళివారి ప్రతిలోఁ గాని, మద్రాసు ప్రతులలోగాని లేదు. నెల్లూరు మండలమున వెంకటగిరి తాలూకా ఆల్తూరుపాడు గ్రామమున నొక వీరవిద్యావంతుఁడు పాడుచుండఁగా దీనిని వింటిని. అతని దగ్గఱఁగల తాళపత్రప్రతిని గూడ సంపాదించితిని. ఇందు సుమారు 1200 పాదములున్నవి. కవిత్వము రసవంతముగా నున్నది.

పింగళివారి ప్రతిలో బాలచంద్రుని యుద్ధము తరువాత కొమ్మరాజు యుద్ధమున్నది. ఇది సరికాదు. బాలుని యుద్ధమునకఁ బిమ్మట జరిగినది పెద్దన్న బాదరాజు యుద్ధమే కాని కొమ్మరాజు యుద్ధము కాదు. (పెద్దన్న మరణించిన తరువాత కాని కొమ్మరాజు యుద్ధము చేయలేదు.) ఈ విషయము కొమ్మరాజుయుద్ధ కథా ప్రారంభమున సూచింపఁబడినది:–

*"బాలుండు దివికేగ బాదరాజపుడు*
*కారుబొల్లని నెక్కి కలనికి నడిచి*
*ఘోటక ఘనభట కోట్లను దునిమి*
*తనపాలి మొనలన్ని తానుగ్గు చేసి*
*మడిసెను చెన్నుని మది తలంచుచును"* [79]

ముదిగొండ వీరభద్రకవియు బాలచంద్రుని యుద్ధము తరువాతఁ బెద్దన్న యుద్ధమును వర్ణించినాఁడు (చూ. వీరభాగవతము పుట– 255).

పల్నాటి వీరకథలను గానముచేయు వీరవిద్యావంతులు, పెద్దన్న కారెంపూడికిఁ బడమటగా నొక క్రోసు దూరమునఁగల 'ఒప్పిచెర్ల'

యను గ్రామముకడ సాయెబ్బులతో యుద్ధము చేసెనని చెప్పుదురు. (కాని పల్నాటి యుద్ధకాలమునకు మహమ్మదీయులు దక్షిన హిందూ దేశమునకు రాలేదు.) వీరులందఱును గారెంపూడిలోనే యుద్ధము చేసిరని తలఁచుట తప్పు. (కారెంపూడిలో యుద్ధము చేసినది ఒక్క బాలచంద్రుఁడు మాత్రమే.) ఏలయన నాగమ్మ సైన్యము ఒక్క కారెంపూడికి మాత్రమే పరిమితమగునది కాదు. కారెంపూడి చుట్టుప్రక్కలఁ బంద్రెండు గ్రామములకు నిండుగా వ్యాపించి యుండునంత మహాసైన్యమును సమకూర్చినది నాగమ్మ. ఈ సైన్యవిస్తీర్ణతను గాథాకారులిట్లు పాడుదురు:-

*"సన్నిగళ్ల, సాతి జూలకల్లు,*
*చెట్లలో ఉన్న జానపాడు,*
*చిన్ని నెమిలిపురి, పెద్ద నెమిలిపురి,*
*గుత్తికొండ, గుఱ్ఱబ్బోళ్లు, గుళ్లేపిల్లి,*
*నగరికంటి కనుమ నాగమ్మ హద్దు"* [80]

పైన తెల్పిన గ్రామములు కనుమలు కారెంపూడికిఁ జుట్టుప్రక్కల నున్నవి. కాఁబట్టి యుద్ధమొక్క కారెంపూడిలో నాగులేటి తీరమున మాత్రమే జరిగినదని తలంచుట సరికాదు.

ఇట్లు నాగమ్మ కూర్చిన మహాసైన్యము నెదిరించుటకుఁ బల్నాటి వీరులొక్కొక్కరి వంతునకు వేసికొనిరి. అట్లు పంచుకొనుటలో "ఏనూట ముప్పై యుద్ధాలు బాలుని పేర సెలవయిన" వనియు, బాలుఁడొక్కొక్క సంగడీనికిఁ దొమ్మిది లక్షల రాయదళమును భాగము చేసెననియు వీరవిద్యావంతులు పాడుచుందురు. బాలచంద్రుఁడు 'కారెంపూడి'లోను, పెద్దన్న 'ఒప్పిచెర్ల'లోను, కన్నమనీఁడు 'చింతపల్లి' (కారెంపూడికి ఉత్తర దిశగా రెండు మైళ్లలోఁ గలదు) లోను, పేర్నీఁడు- సూర్నీఁడు-మలినీఁడు అను బ్రహ్మనాయని తమ్ములు 'సన్నిగళ్ల' (కారెంపూడికి తూర్పుదిశగా రెండు మైళ్లు) దగ్గఱను నాగమ్మ సైన్యము నెదిరించి పోరాడినట్లుగా గాథాకారుల పాటలవలన స్పష్టమగుచున్నది. ఈ గాథాకారులొక వీరుఁడు చేసిన యుద్ధమును, నా ప్రదేశ నామముతోఁ బిలుచుచుందురు. "బాలుని కారెంపూడి యుద్ధము, పెద్దన్న ఒప్పిచెర్ల యుద్ధము, కన్నమనీని చింతపల్లి యుద్ధము, పేర్నీఁడు సన్నిగళ్ల యుద్ధము" ఇత్యాదిగాఁ బిలుతురు. ఇట్లే అనుఁగురాజు తరములో జరిగిన యుద్ధములను "పేర్నీఁడు చందోలు యుద్ధము, తెప్పలినీఁడు ఊరుకోట యుద్ధము, బ్రహ్మన ఆరణగండ్ల యుద్ధము"- మున్నగు రీతిని బిలుచుచుందురు.

## 7.21. అమ్మవారి పుట్టుక:-

కొమ్మరాజు యుద్ధములో వచ్చు అంకాళశక్తి ప్రసక్తి సందర్భమున నామె పుట్టుక నొక ప్రత్యేకకథగా వీరవిద్యావంతులు పాడుచున్నారు. ఇది కొమ్మరాజు యుద్ధమునకు ముందే పాడఁబడును. ఇది నాకు లభింపలేదు. అంకమ్మ కథాచక్రములోని అంకమ్మ కథకును, దీనికిని నేమైన సంబంధమున్నదేమో పరిశీలింపవలసి యున్నది. అంకమ్మ కథాచక్రమున, కల్యాణనగరములో వీరసోముఁడు ఆఁడు దేవతను గొలుచుట కిష్టములేక పల్నాటివారిలోనికి వచ్చెననియు, అయినను ఆ శక్తి యెట్లైనను ఆ రాజుచేఁ బూజలు గొనవలెనని పల్నాటికి వచ్చి 'పల్నాటి అంకమ్మ' అయినదనియుఁ జెప్పఁబడినది.

కొమ్మరాజు అంకమ్మను గొలిచినట్లుగాఁ బల్నాటి వీరకథలలోఁ బలు తావులందు గలదు. కారెంపూడిలోఁ గొమ్మరాజు ప్రతిష్ఠించిన అంకమ్మ నేఁటికిని గలదు. ఈమెను. 'ఈర్ల అంకమ్మ' (=వీరుల అంకమ్మ) అందురు.

పల్నాటి వీరకథాచక్రమును, అంకమ్మ కథాచక్రమును మాలవారే పాడుచుందురు. కావునఁ బల్నాటికథలలో అంకమ్మ ప్రసక్తి వచ్చినచోట నామె పుట్టుకనుగూర్చి పాడుట సాధారణమే కావచ్చును. కాటమరాజుకథలను, పరశురామునికథలను పాడువారు మాదిగలు. అందుచే కాటమరాజుకథలలోఁ గొన్నింటఁ బరశురామునికథలు ఉపకథలుగా వచ్చినవి. వీనిని 'చాటువ' లందురు. భక్తిరన్నకథలో వచ్చు 'గౌతమ చాటువ' యిట్టిదే. కాఁబట్టి అంకమ్మ కథాచక్రములోని కథయే పల్నాటి వీరకథలలోఁ బ్రవేశించియుండునని తలంపవచ్చును.

## 7.22. కొమ్మరాజు యుద్ధము:-

పింగళివారు ప్రకటించిన 'కొమ్మరాజు యుద్ధము' కొండయ్య రచన. అందుఁ గథ యిట్లున్నది: బాలచంద్రుఁడు మడిసిన పిమ్మట పెద్దన్న బాదరాజుకూడ ఘోరయుద్ధముచేసి వీరస్వర్గమలంకరించెను. అంతటఁ గొమ్మరాజు యుద్ధమున కేఁగెను. బ్రహ్మన యాజ్ఞలేకుండ వెడలుటచే నతని కన్నుల కంధకారము గప్పెను. తిరిగివచ్చి బ్రహ్మన్నను స్తుతించి యుద్ధమున కనుజ్ఞ వేడెను. కొమ్మరాజు నావహించియున్న కులదేవత అంకాళశక్తిని దించి, యుద్ధమున కేఁగుమని బ్రహ్మన చెప్పెను. (ఆ శక్తి యాతని నావహించియే యున్నచో నతనికి మరణము లేదు. అందుచే బ్రహ్మన యట్లు చెప్పెను.) కొమ్మరాజు తన్నావహించియున్న శక్తిని దించి యుద్ధమున కేఁగెను. కొమ్మరాజు ధాటికి నిలువలేక నాయకురాలి సైన్యము పాఱిపావు చుండెను. అప్పుడు నాయకురాలు కొమ్మరాజు నెదుర్కొనుటకు 'జోదుల సోమశేఖరుఁ' డను ధనుర్విద్యాచార్యునిఁ బంపెను. అతఁడు సోదరులతోఁ గూడి కొమ్మరాజు నెదిరించెను. కొమ్మరాజు సోదరులు సోమశేఖరుని సోదరులను జంపిరి. సోమశేఖరుఁడు ఉగ్రుఁడై కొమ్మరాజు సోదరులను గూల్చెను. అంత కొమ్మరాజు విజృంభించి సోమశేఖరుని తలఁద్రుంచెను. నాయకురాలు తన సైన్యమును కొమ్మరాజుపై దొమ్మియుద్ధమునకుఁ బురికొల్పెను. కొమ్మరాజు విజృంభించి, శత్రుసైనికులను గుప్పలు కుప్పలుగాఁ గూల్చి, రాజులందఱ నోడించి, వీరస్వర్గమును గోరి, తన దివ్యాస్త్రముల

నన్నింటిని నాయని దగ్గఱకుఁ బంపి, కుంతమును గైకొని కొంతసేపు పోరాడి నేలకొరిగెను. కొమ్మరాజు కూలిన వార్తవిని మలిదేవుఁడు దుఃఖించి, తమ్ములతోఁ గలిసి హతాన్మరణము నొందెను. మలిదేవాదుల మరణమునకు సంతసించి, నాయకురాలు బ్రహ్మనాయనిఁ బట్టుటకై పచకుల బ్రహ్మన్నను బంపెను. బ్రహ్మనాయఁడాతని నెదిరించుటకై అడప కేశవదాసిని పంపఁగా, పచకుల బ్రహ్మన్న యతనిని సంహరించెను.

మద్రాసు GOML లోఁ గొమ్మరాజు యుద్ధమునకు సంబంధించిన యెనిమిది ప్రతులున్నవి. వీనిలో నొకదానిలోఁ గథా ప్రారంభమున క్లుప్తముగా 'కల్లుప్రతిష్ఠ, బాలుని మరణము, బాదరాజు మరణము' చెప్పఁబడినవి. కొమ్మరాజు బ్రహ్మనాయని స్తుతించు ఘట్టమున 'ప్రమథులకథ, కామవల్లికథ' అను రెండుకథలు చెప్పఁ బడినవి. కొమ్మరాజు రణరంగమునకేఁగి తాను వచ్చినట్లుగా నలగామునకుఁ దన భట్టుచేఁ గబురంపెను. ఇంతటితో నీ కథ అసంపూర్ణముగా నాఁగిపోయినది.

వీరభద్రకవి రచనలోఁ గొమ్మరాజు నలగామునితో యుద్ధము చేసి ఆతని తల దునిమినట్లు చెప్పఁబడినది. అంకమ్మ పుట్టుక ఒక రాత్రియుఁ, గొమ్మరాజు యుద్ధము వేఱొక రాత్రియుఁ బాడఁబడును.

## 7.23. సన్నిగళ్ల యుద్ధము:-

అలభ్యము. బ్రహ్మనాయని తమ్ములగు పేర్నీఁడు, సూర్నీఁడు, మలినీఁడులు 'సన్నిగళ్ల' యను గ్రామము దగ్గఱ నలగాముని సైన్యముల నెదిరించి, ఘోరయుద్ధము చేసి, వీరస్వర్గమున కేఁగుదురు.

## 7.24. కన్నమనీఁడు చింతపల్లి యుద్ధము:-

అలభ్యము. కన్నమనీఁడు బ్రహ్మనాయని అనుమతిని గొని చింతపల్లి గ్రామము దగ్గఱ నలగాముని సైన్యము నెదిరించి నిరవశేషముగా నఱికివేయును. తరువాతఁ గొంత విశ్రాంతి తీసికొని, మేడపికిఁ బోయి, స్త్రీలను తోడితెచ్చును.

## 7.25. బ్రహ్మన్న విఱుగు:-

ఇది పల్నాటి వీరకథాచక్రమునఁగల చివరి గాథ. మద్రాసు GOML లో దీనికి నైదు వ్రాఁతప్రతులున్నవి. కాని, యివన్నియును నసమగ్రములే. కొమ్మరాజు యుద్ధానంతరము నాగమ్మచే బ్రహ్మనాయనిపైకిఁ బంపఁబడిన పచకుల బ్రహ్మన్న, అడప కేశదాసిని జంపి నాయనిపైకి రాసాఁగెను. అది చూచి బ్రహ్మనాయఁడే స్వయముగా యుద్ధమునకు బయలుదేరెను.

పచకుల బ్రహ్మనయు, శీలం బ్రహ్మనాయఁడును సహాధ్యాయులఁట. అందుచే బ్రహ్మనాయఁడాతనితోఁ బోరుటకు శంకించును. పచకుల బ్రహ్మన్నను వెనుదిరిగి పొమ్మని చెప్పును. అతఁడు వినలేదు. అందుచే శీలం బ్రహ్మన పచకుల బ్రహ్మనను జంపి, ఆతని కోరిక ననుసరించి ఆ పచకుల బ్రహ్మనను కూడ వీరులలో నొక వీరునిగాఁ జేసెను.

పచకుల బ్రహ్మన్న మరణానంతరము, కార్యమపూడిరాజు బ్రహ్మన నెదుర్కొనెను. బ్రహ్మన అతనిని గూడఁ జంపివేసెను. అది చూచి చింతపల్లిరెడ్డి బ్రహ్మనాయని ఢీ కొనెను. బ్రహ్మన అతనిని మూర్ఛితుని గావించి, విజృంభించెను. నలగాముఁడు భయపడి కొదమగుండ్లకుఁ బాఱిపోయెను. అప్పుడు అశ్వారూఢయై నాయకురాలే స్వయముగా బ్రహ్మనాయని నెదిరించెను. స్త్రీలతో యుద్ధము చేయుట ధర్మవిరుద్ధము గావున, బ్రహ్మనాయఁడు నాయకురాలి అశ్వమును గూల్చెను. ఆమె ప్రక్కకుఁ దొలఁగెను. అంతట బ్రహ్మన నలగామునిఁ బట్టదలఁచి కొదమగుండ్లకుఁ బోయెను. అట బ్రాహ్మణులు బ్రహ్మనాయని బ్రార్థించి శాంతునిఁ జేసిరి. అతఁడు నలగాముని క్షమించి, పట్టముగట్టి, హితోపదేశము చేసి, నలగాముఁడు సాఁగనంపఁగాఁ దిరిగి రణభూమి మధ్యకు వచ్చెను. ఆ రణభూమి యెట్లున్నదనఁగా-

మద్రాసు ప్రతులలో నీ కథ యింతటితో నాగిపోయినది. (తిరుపతి ప్రతిలోఁగూడ నింతవఱకే యున్నది.) నలగామునకుఁ బట్టముగట్టి బ్రహ్మన్న హితోపదేశము చేయు సందర్భమునఁ గొంత గ్రంథపాతమై, మరల నాలుగు పాదములుండి, అసంపూర్ణముగా ఆగిపోయినది.

***"వినవయ్య జెప్పెద వీరగామేంద్ర***
***గాజువారును మరి కనకంబువారు***
***గొట్టటివారును గోవిందువారు***
***పట్టు జాజులవారు పద్మనాయకులు***
***వన వసంతునివారు వర బలాధికులు***
***ఇట్లు జేసినవార లెవ్వరు లేరు***
***నీ మన్నెనాయకుల్ నీ సేన లెల్ల***
***మడిసిరి యీ కలన మరి సమముగాను***
***నినుదోలి పట్టంబు నిలిపితి నేడు***
***......................"*** (గ్రంథపాతము)
***"విజయంబు నీదేను వినుము బ్రహ్మన్న"***
***యని చెప్ప రాజుచే నంపించుకొనియె***
***కదువేడ్క నాయదు కలని మధ్యముకు***
***ఆ కలను అట్లుండె నమరులు పొగడ.*** [81]

తిరుపతి SVORIL లోని వ్రాఁతప్రతి యందును నంతమిట్లే యున్నది. పింగళివారు పరిష్కరించిన 'బ్రమ్మన విరుగు'లో నంతము పైదానికన్న భిన్నముగా నున్నది-

*"వినవయ్య చెప్పెద వీరకామేంద్ర*
*గాజువారలును మరి కనకంబువారు*
*గొడ్డటివారును గోవిందువారు*
*పట్టుజాజులవారు పద్మనాయకులు*
*వన వసంతునివారు వర బలాధికులు*
*ఇట్లు చేసిన వారెవ్వరు లేరు*
*ఇకనైన నెమ్మితో నిల నేలు" మనును*
*అందరు చూడంగ అభయపట్టంబు*
*కట్టించె బ్రహ్మన్న కడుశాంతమునను*
*అంతట నలగాముడతులిత భక్తి*
*"నీకు దాసుడ నేను నిజము నా మాట*
*విజయంబు నీ దేను వీరపుంగవుడ!*
*అనఘాత్మ! నీ మహిమంతయు తెలిసె*
*ధరలోన దాతవు దైవంబ వగుచు*
*గురువులకును పరమ గురుడ వీవగుచు*
*ఈ వీరులకు నీవు నీశ్వరుడ వగుచు*
*నిలిచితి వటుగాన నీ మూర్తివలన*
*పలనాటి వీరుల పరమ చరిత్ర*
*ఆచంద్ర తారార్కమై యుండగలదు"*
*అని పల్క అతనిచే నంపించు కొనియె.* [82]

మద్రాసు, తిరుపతి గ్రంథాలయములలోఁగల ప్రతులలోని గ్రంథపాతములను, సందిగ్ధపాదములను పింగళివారు స్వకపోల కల్పితముగాఁ బూరించినట్లున్నది. తమ గ్రంథమునకు మద్రాసు GOML లోని ప్రతులే ఆధారములని తెల్పిన పింగళివారి ప్రతిలోని అంతమునకును, మద్రాసు గ్రంథాలయ ప్రతిలోని అంతమునకును నెంతయో భేదము కన్పించుచున్నది. పల్నాటిసీమ నేలిన సుక్షత్రియుఁ డగు నలగాముఁడు తన మంత్రియుఁ జతుర్థకులజుఁడును నగు బ్రహ్మనాయని 'నీకుదాసుడ నేను నిజము నామాట' అనుట అనౌచిత్యదూషిత మగుచున్నది. మద్రాసు ప్రతిలోఁ జివరనున్న "కదువేద్క నాయడు కలని మధ్యముకు, ఆ కలను అట్లుండె నమరులు పొగడ" అను రెండు పాదములను పింగళివారు పరిహరించి, గ్రంథాంతము సంపూర్ణ స్వరూపము నందుటకుఁ గాఁబోలును "అనఘాత్మ నీ మహిమ అంతయుఁ దెలిసె..." ఇత్యాది 'బ్రహ్మన స్తోత్రము'ను చేర్చిరి. ఇది వారి కెక్కడ లభించినదో తెలియకున్నది. అందుచే దీనిని వారే కల్పించియుందురని ఊహించుచున్నాను.

మద్రాసు, తిరుపతి వ్రాఁత ప్రతులలో, కొదమగుండ్లలో నలగాముని కభయమిచ్చిన బ్రాహ్మణుల పేర్లు, వారు బ్రహ్మనాయని కెదురేఁగిన తీరు, నిరువది పాదములలో అతి మనోహరముగా హాస్య రసపూరితముగా వర్ణితమైనది:–

*"అని విప్రులకు నెల్ల నందంద మ్రొక్క*
*విని యట విప్రులు వేగనందరును*
*విడుదులు జూపిరి వినుతులు జేసి*
*కదిలిరి బ్రాహ్మలు కడువేగమునను*
*బొజ్జప్ప, తిప్పన్న, బోన కూచిభొట్లు,*
*కవిత భాస్కర భొట్లు, కంతి మెదయ్య,*
*తడిధోవతుల సోము, దల్లాణి భొట్లు,*
*వఝల పెదసోము, వఝులప్పన్న,*
*పప్పు కేశవభొట్లు, పాపన భొట్లు,*
*వంటి సింగా భొట్లు, వామన భొట్లు,*
*ఎఱ్ఱి మాచన భొట్లు, ఎనమంద్ర సూరు,*
*కూచివారపున్న, గోచుల పెద్ది*
*భొట్లు, సోమనవారి బొక్కిన భొట్లు,*
*పెదబండ్ల మాచన, పెద్దయ్యగారు,*
*నెనయ వీరాదిగా నిందరు గూడి*
*ధోవతుల్ వీడంగ తొట్రుపాటొదవ*
*బొజ్జలు గదలంగ పాడిసిగల్ వీడ*
*కణగి యొగిరింపుచు కాముని కొరకు*
*నెనసి విప్రులు గూడి యా బ్రహ్మి జూచి*
*యాశీర్వదించిరి యపుడు బ్రాహ్మణులు"* [83]

పింగళివారిప్రతిలోఁ బై సన్నివేశమంతయుఁ బరిహరింపఁ బడినది. ఈ ఘట్టము ముక్తసరిగా మూఁడు ముక్కలలో ముగింపఁ బడినది. చూడుఁడు:–

*"అనిన విప్రులకెల్ల నందంద మ్రొక్క*
*వినియట విప్రులు వేగ నందరును*
*పరుగున వచ్చెడి బ్రహ్మిని చేరి"* [84]

'బ్రహ్మన్న విఱుగు' అనఁగా నిది శీలం బ్రహ్మనాయని విఱుగో, లేక పచకుల బ్రహ్మన్న విఱుగో తెలియుట లేదు. విఱుగు అనఁగా నోడిపోవుట యని యర్థము. లభ్యమగుచున్న కథాభాగమునుబట్టి ఇది పచకుల బ్రహ్మన్న విఱుగే కావలెను. కాని యతఁడంత ప్రధాన వ్యక్తికాదు. అతని మరణానంతరము పెక్కు సంఘటనలు వర్ణితమైనవి. కావున నిది శీలం బ్రహ్మనాయని విఱుగే కావలెను. తిరుపతి SVORIL లోఁగల ప్రతిలో మొదట 'శీలం బ్రహ్మనాయడి విరుగు' అని వ్రాయఁ బడియున్నది (చూ. పల్నాటి వీరచరిత్ర–2, వ్రాఁత ప్రతి, నెం. 7211–బి, పుట 326). ఇది లేఖక దోషమేమో తెలియదు.

'విఱుగు' శబ్దము పండిత కల్పితమని నా అభిప్రాయము. పల్నాటి ప్రజలలోఁగాని, వీరవిద్యావంతులలోఁగాని, ఈ శబ్దము వాడుకలో లేదు. కారెంపూడిలోని వీరాచార పీఠాధిపతులతోఁగూడ నేను సంప్రదించితిని. వారు కూడ 'ఒఱగు' శబ్దమే ఒప్పనియు,

'విఱుగు' శబ్దము పండిత కల్పితమనియు సెలవిచ్చినారు. 'బాలగోపు ఒఱగు', 'లంకన్న ఒఱగు', 'కల్లి ఒఱగు' అను కథానామములే జానపదులలో వ్యాప్తియందున్నవి. 'ఒఱగు' అనఁగా 'యుద్ధమునఁ గూలిపోవుట'. ఈ శబ్దము నుపయోగించినప్పుడే ఆ వీరగాథల శీర్షిక అన్వర్థములగును కాని, 'విఱుగు' శబ్దముతో నీ యర్థము రాదు. గుంటూరు మండలమున నేఁటికిని యుద్ధమున వీరుఁడు మరణించుటను 'ఒఱగు' అనియే వ్యవహరించుచున్నారు. ('బరిమీద ఒరగాలి' అని జన వ్యవహారము.) కాఁబట్టి 'బ్రహ్మనాయని విఱుగు' అను శీర్షిక తప్పు. జానపదులలో నీ వీరగాథ కీ పేరు లేదు. కారెంపూడి వీరోత్సవమున పల్నాటి వీరకథలలోని చివరికథను ఆఖరు దినమునఁ బ్రదర్శింతురు. దానికి "కల్లి ఒఱగు" అని పేరు. యుద్ధమున వీరులందఱును నొఱగిపోవుట యని దీనికర్థము. దీనిని 'కల్లిపాడు కథ' అనియుఁ బిలుచుచుందురు. ('ఒఱగు' లేదా 'ఒరగు' అను సాధుశబ్దమే జానపద వ్యవహారమున 'ఒఱుగు' లేదా 'ఒరుగు' అయినది.)

ఈ 'బ్రహ్మనాయని విఱుగు'లో నింకను కథాభాగమున్న దనుటకు వీరవిద్యావంతులపాటలు, జనవ్యవహారము, వీరభద్రకవి పద్యకావ్యము సాక్ష్యమిచ్చుచున్నవి. వీరవిద్యావంతుల పాటల ననుసరించి పల్నాటి వీరకథాచక్రములోని చివరి ఘట్టమిట్లుండును: "యుద్ధానంతరము నాయకురాలు– బ్రహ్మనాయఁడు వీరిరువురే మిగిలిరి. నలగాముఁడుకూడఁ జనిపోయెను. నాయకురాలి కనుమలో నాఱువేల గుఱ్ఱపుదళము, మూఁడువేల దండు దాచినది నాగమ్మ. యుద్ధానంతరము సంగడీలు నాగులేటి పచ్చబండలమీఁద నిద్రించు చుండిరి. వారిని నాగమ్మ పొడిపించినది. అది చూచి కన్నమదాసు నాగమ్మను నఱకుటకై వెంటఁబడినాఁడు. ఆమె కనుమదగ్గఱకుఁ బోయి పంగచాచి నిలబడినది. కన్నమదాసు ఆమె కాళ్లను నఱికినాఁ డు. ఆమె రక్తపుబొట్లలో నుండి రాక్షసులు పుట్టి కన్నమనెదిరించిరి. కన్నమ మనసులో బ్రహ్మనాయనిఁ దలఁచుకొనెను. బ్రహ్మన తన చేతిలోనున్న నాగబెత్తమును నడిమికిఁ ద్రుంచి 'ఎడాపెడా' వేసినాఁ డు. అప్పుడు నాగమ్మ కాళ్లు తెగి పడిపోయినవి"– ఇది గాథాకారులు చెప్పు చివరి ఘట్టము. దీనిలో శక్తికథాప్రభావము గోచరించుచున్నది. నాగమ్మ శక్తిస్వరూపిణియను నమ్మకము ప్రజలలో వ్యాపించి యుండుట, పల్నాటి కథలు పాడువారును, శక్తికథలు పాడువారును నొకే కులమువారగుట (మాలలు) యీ ప్రభావమునకుఁ గారణము.

యుద్ధానంతరము బ్రహ్మనాయఁడు చనిపోయిన వీరులందఱిని బ్రతికించి, వారితో గుత్తికొండ బిలములోఁ బ్రవేశించెనని జనవ్యవహారము. వీరభద్రకవి పద్యకావ్యమునఁగూడ నిట్లే యున్నది.

మద్రాసు, తిరుపతి ప్రాచ్య లిఖిత గ్రంథాలయములలోని వ్రాఁత ప్రతులనుబట్టియు, పింగళివారు పరిష్కరించిన గ్రంథమును బట్టియు, 'కొమ్మరాజు యుద్ధము' తరువాత వెంటనే 'బ్రహ్మనాయని విఱుగు' ప్రారంభమైనదని తెలియుచున్నది. కాని వీరవిద్యావంతుల పాటలను, వీరభద్రకవి పద్యకావ్యమును బరిశీలించినచో నిది సరికాదని తేలును. కొమ్మరాజు యుద్ధము తరువాత పేర్నీఁడు, సూర్నీఁ డు, మలినీఁడు అనువారు కావించిన 'సన్నిగళ్ల యుద్ధము', కన్నమదాసు కావించిన 'చింతపల్లి యుద్ధము' అను మఱి రెండు వీరగాథలున్నవని తెలియుచున్నది. కాఁబట్టి బాలచంద్రుని కారెంపూడి యుద్ధము తరువాత వరుసక్రమమున "పెద్దన్న బాదరాజు ఒప్పిచెర్ల యుద్ధము; పేర్నీఁడు, సూర్నీఁడు మలినీడుల సన్నిగళ్ల యుద్ధము; కన్నమదాసు చింతపల్లి యుద్ధము; కల్లి ఒఱగు (బ్రహ్మనాయని విఱుగు)"– అను వీరగాథలున్నవని నిశ్చయింపవచ్చును. జనశ్రుతి, వీరభద్రకవి కావ్యము దీనికిఁ బ్రబల తార్కాణములు. వీరభద్రకవి కావ్యమున బాలుని యుద్ధానంతర కథ ఈ క్రింది ప్రణాళికతోఁ గొనసాగినదది:–

"బాలుని స్వచ్ఛంద మరణమును విని నాయకురాలు మరల సైన్యముల బంపుట– పెద్దనాయఁడు ఘోరసంగ్రామంబు చేయుట– కొమ్మరాజు నలగామరాజు తలదునుముట– బాలమల్దేవాదులు కొమ్మరాజాదుల స్వేచ్ఛామరణానంతరము బ్రహ్మనాయఁడు కన్నమదాసును యుద్ధమునకుఁ బంపుట– పేర్నీఁడు మున్నగువారు వీరశయనంబొనర్చుట–కన్నమదాసు సైన్యమున్నిరవశేషంబుచేసి, విరామమునకై బ్రహ్మనాయని యాజ్ఞఁగోరుట– బ్రహ్మనాయఁడు కన్నమదాసుని మేడపిలోని స్త్రీలను దోడ్కొనిరా బంపుట– బ్రహ్మనాయఁ డు వైష్ణవవేషంబున మేడపిలోని పురోద్యానముం బ్రవేశించుట– శీలాంబ వైష్ణవవేషధరుండగు బ్రహ్మనాయని పాదతీర్థము గొనుట– వీరులు దమ పేరులతో నాగులేటి దరిని లింగములన్నిలుపుట– నాయకురాలు బ్రహ్మనాయని పాదస్పర్శచే బూర్వజ్ఞానము నొందుట– బ్రహ్మనాయఁడు వీరుల గుత్తికొండబిల జలంబులముంచి దేవతలలోఁ గలుపుట– ధర్మప్రసంగుఁడు మునులతో వీరులు స్వాంశంబులం గలిసిన వివరణముం జెప్పుట– బ్రహ్మనాయఁడు నిజధామంబగు వైకుంఠముం జేరుట." [85]

దీనినిబట్టి యిప్పుడు లభించుచున్న 'బ్రహ్మన్న విఱుగు' అను కథ అసంపూర్ణమనియు, దీనికిని– కొమ్మరాజు యుద్ధమునకును మధ్య మఱిరెండు కథలున్నవనియు, బ్రహ్మన నలగామునిచే నంపించుకొనిన తరువాతఁ జాల కథ యున్నదనియు స్పష్టమగు చున్నది.[86]

పైన జరపిన సుదీర్ఘచర్చనుబట్టియు, నాకు లభించిన తాళపత్ర గ్రంథములను బురస్కరించుకొనియుఁ బల్నాటి వీరకథాచక్రమున నీ క్రింది వీరగాథలున్నవని చెప్పఁగలుగుచున్నాను. (ఈ వీరగాథలపేర్లు నేను పెట్టినవి కావు. జానపదు లీ వీరగాథల నెట్లు పిలుచుచున్నారో నేనును వానినట్లే వ్రాయుచున్నాను.)

1. 'పెద్దన్న పెండ్లి రాయబారము' లేక 'పెద్దన్న బాదరాజు పెండ్లి'.
2. 'బ్రహ్మనాయఁడు పుటక'.
3. 'యాత్రకథ' లేక 'దక్షిణాది యాత్రకథ'.
4. 'పేర్నీఁడు యుద్ధము' లేక 'పేర్నీఁడు చందోలు యుద్ధము'.
5. 'తెప్పలినీఁడు యుద్ధము' లేక 'తెప్పలినీఁడు ఊరకోట యుద్ధము'.
6. 'ఆరణగండ్ల యుద్ధము' లేక 'బ్రహ్మనాయని ఆరణగండ్ల యుద్ధము'.
7. 'నాయకురాలి కథ' (అనుఁగురాజు మరణము వఱకును ఒక కథ; తరువాత మలిదేవాదులు మాచెర్ల కేఁగుట రెండవ కథ కావచ్చును).
8. 'అనుఁగురాజు మరణము' లేక 'మైలమ్మ సాగుమానము' (మైలమదేవి సహగమనము). –క్రీడాభిరామమునఁ బ్రసక్తమయిన 'బీలసానికథ' ఇదియేనేమో (?)
9. 'రాచగావు కథ' లేక 'శివనందులకోట దోఁపు' లేక 'శివనందుల కోట యుద్ధము'.
10. 'రాజులపెండ్లి' (మలిదేవుల పెండ్లికథ).
11. బాలుని పుటక– (బాలచంద్రుని పుట్టుక, వివాహము.)
12. కోడిపోరు– దీనిలో నైదు కాండలున్నవి:
    1) 'కోడిపోరు ఒప్పందము.
    2) 'అర్ధనాల చిట్టిమల్లఁడు కథ' లేక 'రావీరపడాలు కోడిని తెచ్చే కాండ'.
    3) కోడి పూర్వజన్మ.
    4) 'బాలగోపన్న కోడిపందెము' లేక 'పాలవాయి కోడి పందెము'.
    5) 'కన్నమనేని యుద్ధము– గోపు సంస్కారము'.
13. 'మందాది వలస కథ' లేక 'మందాది వలసలు' లేక 'వలస కథ'.
14. 'మందపోటు కథ' లేక 'మందపోటు– లంకన్న ఒఱగు'.
15. 'గురిజాల యుద్ధము' (గురిజాల యుద్ధము– పూర్వభాగము).
16. 'అలరాచమల్లుగారి గురిజాల రాయబారము', లేక 'గురిజాల రాయబారము' లేక 'రాచమల్లు రాయబారము' లేక 'అలరాజు రాయబారము' లేక 'రాయబారము కథ'.
17. కల్లు ప్రతిష్ఠ.
18. 'బాలుని కథ'– దీనిలో నెనిమిది కాండలున్నవి:
    1) బొంగరం పుట్టుక.
    2) బొంగరాలాట.
    3) అంతర్వేదిగాని కథ.
    4) సబ్బాయి చాటువ.
    5) మాంచాల మేడ సవరణ.
    6) అనపోతురాజు ఒఱగు.
    7) మేళ్ళవాగు యుద్ధము.
    8) బాలుని కారెంపూడి యుద్ధము.
19. 'బాలుని యుద్ధము– ఉత్తర భాగము, మరణము'.
20. 'గుఱ్ఱాల సవరణ' లేక 'గుఱ్ఱాల చాటువ' లేక 'పెద్దన్న యుద్ధము' లేక 'పెద్దన్న బాదరాజు ఒప్పిచెర్ల యుద్ధము'.
21. 'అమ్మవారి పుట్టుక'.
22. 'కొమ్మరాజు యుద్ధము'.
23. 'పేర్నీఁడు సన్నిగల్ల యుద్ధము'.
24. 'కన్నమీనఁడు చింతపల్లి యుద్ధము'.
25. 'కల్లి ఒఱగు' లేక 'కల్లిపాడు కథ' లేక 'బ్రహ్మనాయని విఱుగు'.

## 8. పల్నాటి వీరగాథల కవిత్వము

తెలుఁగు వీరగాథలలోఁ గవిత్వ పరిపుష్టి విషయమున మొట్టమొదట చెప్పఁదగినవి పల్నాటి వీరకథలు. తరువాత నెన్నఁదగినవి కాటమరాజు కథలు. తక్కినవన్నియును పాడునప్పుడు మాత్రమే రసతృప్తినిచ్చునవి, వానిని చదివి ఆనందించుట అసాధ్యము. కాని పల్నాటి వీరకథలు పాడునప్పుడే కాక, చదువునప్పుడును మార్గకావ్యములవలె మన హృదయములో రసోత్పత్తిని జేయ సమర్థములు. అట్లని పల్నాటి వీరకథలు ఆద్యంతమును రసపుష్టి కలవని చెప్పరాదు. వీరగాతావృత్తములు ఇతిహాస లక్షణములతో నొప్పుచుండును. ఇతిహాస కవిత్వములో నాద్యంతమును గవిత్వము నాశించుట దురాశ. కొన్ని విశిష్ట సన్నివేశములలో మాత్రమే కవిత్వముండును. భావనిర్భరమగు కథాంశమున్నప్పుడే రచన రసవంతముగా నుండును. తక్కినచోట్ల కథాఖ్యానప్రధానముగా రచన సాగును. మహాభారతాదులగు నితిహాసములన్నియును నిట్టివే. కాఁబట్టి వీరగాథాచక్రములందును నేవియో కొన్ని ముఖ్యఘట్టములలో– అనఁగా కథాంశము భావనిర్భరమై ఘట్టములలోఁ గవిత్వము జాలువారుచు, మిగిలిన తావులలోఁ గేవలము కథాకథనమే కొనసాఁగిపోవునని చెప్పవచ్చును.

వీరగాథల కవిత్వము ఆఖ్యానకవిత్వము. ఈ యాఖ్యాన కవిత్వమును సృజించుకవి పాటింపవలసిన ముఖ్యధర్మములు కొన్ని కలవు. అవి, కథను నిర్వక్రముగా నడుపుట, కథాగతికి నుపహతి

కలిగించు నప్రస్తుత ప్రసంగములు చేయకుండుట, కథ నలంకరించెడి యుద్దీపనవిభావాత్మకమైన వర్ణనలు చేయుట, కథారంగమును, గథాపురుషుల మూర్తులను ప్రత్యక్షగోచరమగునట్లు వర్ణించుట, ఆయాసందర్భముల, నాయాపాత్రలచేతఁ దదుచిత సంభాషణములు చేయించుట, కార్యవశమునఁ గొంత, వాక్యవశమునఁ గొంత, పాత్రల స్వభావాదులను నిరూపించుట మొదలైనవి.[87] పల్నాటి వీరగాథలను రచించిన శ్రీనాథుఁడు, మల్లయ్య, కొండయ్య అను కవులు ముగ్గురును పై కావ్యాంశముల నన్నిటిని యథాభావరసావస్థముగఁ బ్రదర్శించి, కథామూర్తిని సర్వాంగసుందరముగా నిర్మించి, రసవద్ఘట్టములలో రసప్లుతిని గలిగించి చరితార్థులైన మహాకవులే. ఇందు శ్రీనాథుని రచన (ముఖ్యముగా బాలునికథ) పాల్కురికి సోమనాథుని కవిత్వమునకుఁగాని, రంగనాథ రామాయణ కవిత్వమునకుఁగాని యే విధముగాను దీసిపోవునది కాదు. బరిమీఁదఁ బోరెడి కోళ్లవర్ణనము (చూ. పల్నాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుటలు 141, 142) మల్లయ్య రసవద్రచనకు మచ్చుతునుక:-

*"పోరుకు విడిచిన పుంజులు రెండు*
*పొంగుచు రెక్కలు పొరిపొరి నార్చి*
*కనుల నిప్పులురాలు కైవడి రవులు*
*ఉగ్రంపు దృష్టిని నొండొంటి చూచి*
*కులగిరు లదరంగ కూయుచు చేరి*
*ముక్కుముక్కున చేర్చి మొనసి రోషమున*
*మెడయీక లుబ్బగా మెడవంచి రెండు*
*ఉప్పరం బెగయుచు నురవడి తన్ను*
*తన్నిన తూలక దట్టంపు గోళ్ళ*
*మిట్టిమీదికి నెగసి మీరుచు తన్ని*
*కరవంగ వచ్చిన గతిచూచి బరిని*
*వలయంబుగా వచ్చి వడి తన్నుటయును*
*చిరచిర తిరుగుచు చేరి యాలోన*
*ఉరవు వ్రేయగచూచి యొక్కటై యుబ్బి*
*రెక్కల పెల్లార్చి రేగి మొత్తంగ*
*పెంధూళి యెగసియు పెంపగుచుండ*
*సంగ్రామకేళికి సంతసంబంది*
*ఊకించి తన్నగా నురములనాటి*
*రక్తంబు దొరగంగ రాగంబునొంది*
*తన్నుట తాకుట తమకు నొచ్చుటయు*
*తలపగ మగటిమి తలకొని రెండు*
*తలపడె నట దేవతలు చోద్యపడగ.*
*వృత్రాసురుండు దేవేంద్రుండు, మరల*
*వైరముల్ పొడమగా వాలి యీ పగిది*
*రూపులు మార్చి యారూఢి విక్రములు*
*కయ్యంబు చేయంగ కణగిరోయనగ,*
*పుటపుట దయ్యుట పొరలుట పడుట*
*ఘటితంబు లాదిగాగల చిత్రగతుల*
*కంటికి వేడుకల్ కలిగింప చూచి*
*భూమిలో ఈ పాటి పుంజులపోరు*
*చెప్పగా వినియును చేయ చూచియును*
*ఎరుగ మెన్నడు ననుచు నెల్లవారలును*
*వెరగంది పోరెడు విధము కన్గొనిరి"*

పొలికలను జూచుటకుఁ బోయిన కన్నమదాసు వర్ణనము (పుట 305):-

*"వాసిగా నురమున వనమాల కదల*
*కరముల గజ్జరి కడియముల్ మెరయ*
*నేతైన పిడిగంట నెమలి సోగలును*
*నల్లని దట్టిని నయమొప్ప కట్టి*
*అర్ధనారీజల్లు లమరవీపునను*
*ఘోర భైరవకత్తి కోరమీసములు*
*ఎగుభుజంబులు మించు నెరజీరకండ్లు*
*ఘనమైన దేహంబు కాలిపెండెరము*
*వెరవైన యిటువంటి వేషంబుతోడ*
*కదలె కన్నమనీడు కదనభూమికిని*
*కాటుక కొండయు కదలినయట్లు*
*గిరిగొన్న చీకటి క్రిక్కిరిసినట్లు*
*హరిహరాదులమూర్తి యతనికి గలిగి*
*నడుకలని కేతెంచి నలుదెసల్ చూచె."*

మాంచాల యలంకరణము (పుటలు 408-411), బాలచంద్రుని యుద్ధవర్ణనము (పుటలు 463, 464)- ఇవి కవిసార్వభౌముని భావనాశక్తికి ఎత్తిన విజయధ్వజములు. కొమ్మరాజు-జోదుల సోముల ద్వంద్వయుద్ధ వర్ణనము (పుటలు 508, 509) కొండయ్య కవిత్వ రసవత్తతకుఁ దార్కాణము. ఇట్లు ఆయా ఘట్టములలో రసవంతమగు కవిత్వమును రచించిన యీ వీరగాథా కవిత్రయము ఒకేఘట్టమును దమతమ ప్రత్యేక ధోరణులలో నెట్లు వర్ణించిరో తెలిసికొనుటకు బాలునికథలోని వృద్ధవేశ్యావర్ణనము తోడ్పడఁగలదు.[88] బాలచంద్రుని వేశ్య 'సబ్బాయి'. ఈమె తల్లి 'బొల్లసాని'. ఈ వేశ్యమాత రూపవర్ణన నీ జానపద కవిత్రయమిట్లు వర్ణించినారు:

*శ్రీనాథుఁడు:* *"కోఁతివంటిది వృద్ధ గురుతర కోపి*
*కోలపట్టుక వచ్చెఁ గూతు దగ్గఱకు*
*విఱిగిన రొండియు వ్రేలు చన్దోయి*

యుతిసిపోయిన యొళ్లు నూచలు కాళ్లు
వంగిన నడుమును వదలిన పండ్లు
పీలచేతులు గూని పీనుగు మోము
చిక్కగ నరిసిన చింపిరి తలయు
వ్రాలిన బొమముడి వదలిన మేను
మెడమీద గణతియు మీగాళ్ల బూత
పలుచని గడ్డంబుపైని బుల్పిరియు
మూతి మీసముమొల్క ముక్కు రోమములు
తలవడంకును మాట తబ్బిబ్బు మఱపు
చొల్లు గాఱెడు నోరశుభ్రంపు కంపు
కన్నులఁ బుసులును గాంక్ష మిక్కుటము”

కొండయ్య: “కల్లల పుట్టిల్లు కదు నొడలెల్ల
శిస్తువెడలిన చింత చివికిన గంత
పత్తి గింజల సంత పరదేశి బొంత
ఊదుపోవని డొక్క ఉరిపడ్డ నక్క...
ఉచితంబెఱుంగని యూదలి తొత్తు...
తెరలు యీదన వెల్లి దేవాంగ పిల్లి
మాయల కతకారి మందుల మారి
కాయని పదుచెట్టు కదుబాదు చెట్టు
దొందర తినగండి దొమ్మంద్ర దొండి
అందతుకుల బొడ్డి ఆమిదెపు మడ్డి
అఖిల కోతల వెల్లి యా సబ్బుతల్లి”

మల్లయ్య: “వృద్ధ వానరమైన వెసరాగ ముండ
దద్దరింపుచు లేచి తగు నూతకోల
వితిగిన రొండియు నూచలౌ కాళ్లు
ఉసిరిపోయిన యొళ్లు నూడిన తలయు
తోలు శల్యములతో దూగాడు నడుము
పీలచేతులు నడపీనుగు రీతి”

పై వర్ణనలో కొండయ్య శబ్దసౌష్ఠవమును బాటింపక యిచ్చవచ్చినట్లు చెప్పినాఁడనియు, మల్లయ్య చాలవఱకు శ్రీనాథుని కవిత్వమునే అనుకరించినాఁడనియుఁ దెలియవచ్చుచున్నది.

ఈ పల్నాటి వీరకథాచక్రమునఁ బ్రధానరసము– వీరము. ఇది యుద్ధవీరము. వీరరసము అంగియైనపుడు రౌద్ర బీభత్స భయానక రసములు విధిగా నంగములై తీరును. కరుణరసము ఆనుషంగిక మగును. ఈ యంగాంగి రసములన్నియును బల్నాటి వీరగాథలలో నాయా సన్నివేశములందుఁ జక్కగాఁ బోషింపఁబడినవి. (‘వీరగాథలు– రసపోషణ’ యను 17వ ప్రకరణమునఁ బల్నాటి వీరకథల రసవత్కవిత్వమునుగూర్చి విపులముగాఁ జర్చింపఁబడును.)

# 9. పల్నాటి వీరాచారము

## 9.1. వీరపీఠము– పీఠాధిపతులు:–

పల్నాటి వీరోత్సవములు, వీరకథాగానములు వందలాది సంవత్సరములనుండి జరుగుచున్నవి. ఈ వీరపూజ యొక ప్రత్యేకాచారముగాఁ బరిణమించినది. దీనికి ‘పల్నాటి వీరాచార’ మని పేరు. ఈ వీరాచారమునకు రణక్షేత్రమగు కారెంపూడిలో నొక పీఠమున్నది. ‘పిడుగువారు’ అను ఇంటిపేరుగల ఆఱువేల నియోగి బ్రాహ్మణులు ఈ పీఠమునకు గురువులు. వీరిని ‘పల్నాటి వీరాచార పీఠాధిపతులు’ అనియు, ‘బాదం బ్రహ్మనాయనింగారి ముద్రకర్తలు’ అనియుఁ బిలుతురు. వీరు బాలచంద్రుని సంగడీఁడగు అనపోతు వంశమువారని నా యూహ. కారెంపూడిలోఁ బ్రతిసంవత్సరము వీరోత్సవము, వీరకథాగానము నీ పీఠాధిపతుల యాధ్వర్యములోనే జరుగుచుండును. ఆ యుత్సవములో నీ పీఠాధిపతి బ్రహ్మనాయని వేషమును ధరించును. ప్రస్తుతము (1966లో) పిడుగు భద్రయ్యగారి కుమారులు నరసింహంగారు పల్నాటి వీరాచార పీఠాధిపతిగా నున్నారు.

ఈ వీరాచార పీఠాధిపతులకు అనాదిగా వచ్చుచున్న యొక బిరుదుగద్య యున్నది. పల్నాటి వీరకథాగానమునకు ముందు, ఈ బిరుదుగద్య పఠింపఁబడును. బిరుదు ఈక్రింది విధముగా నుండును–

“స్వస్తి శ్రీమతు పలనాటి ఉద్దండ వీర తిరుపతి మహాస్థలమైన కార్యమపూడి యుద్ధ మధ్య రంగస్థలపతులును; ఉదయాస్తాచల సేతు శీతనగ మధ్య అఖండ వీరభాగవతాచారోద్ధారకులును; ప్రతివాద మదగజ పంచాననులును; నవరత్నఖచిత సింహాసనాసీనులై కూర్చున్న శ్రీగిరిలింగము శ్రీ చెన్నకేశవస్వామివారి పాదపద్మారాధకులును; అలుఁగురాజు, కొమ్మరాజు, అలరాజు, బాదం దొడ్డనాయఁడు, పెద్దన్న, పేర్నీఁడు, వీరసోముఁడు, గంగుల పోతురాజు వీరు మొదలగు కోరి డెబ్బదిరెండు గోత్రాలవారున్ను; పరగ పంద్రెండిండ్ల పద్మనాయకులును; శ్రీమన్ముకుంద చరణారవింద మకరంద రసాస్వాదన నిష్ఠాగరిష్ఠ నియమాద్యష్టాంగయోగ పారాయణులును; షడ్దర్శన స్థాపకులున్ను; బాదం బ్రహ్మనాయనింగారి ముద్రకర్తలును, అగు పిడుగు నరసింహం అయ్యవారు.”

## 9.2. ‘వీరవిద్యావంతులు’:–

పల్నాటి వీరకథలను బిచ్చుకుంట్లు పాడుచుందురను వింత ప్రచారమొకటి విద్వాంసులచే సృజింపఁబడి దేశమున వ్యాపించి యున్నది. పల్నాటి యుద్ధమునకు శైవ వైష్ణవ మతభేదములు కారణమను దుష్టప్రచారమువలెనే ఇదియును బండితలోకమునఁ బాతుకొనిపోయియున్నది. పల్నాటి వీరకథలకును పిచ్చుకుంట్లకును నే విధమగు సంబంధమును లేదు. గుంటూరు మండలమునఁ గొన్ని ప్రాంతములలోఁ బిచ్చుకుంట్లు కొందఱు పల్నాటి వీరకథలను

బాడుచుండుట గలదు. ఇది యిటీవలి కాలమునఁ బొట్టకూటికై వీరు చేపట్టినదే కాని, ప్రాచీనకాలమునుండియు దీనిని బాడెడివారు వేఱుగానున్నారు. పల్నాటి వీరకథలను గానముచేయు హక్కు పిచ్చుకుంట్లకు లేదు. వీరి ప్రధానవృత్తి రెడ్లకు గోత్రములు చెప్పుట. రెడ్లకు సంబంధించిన వీరగాథలను వీరు పాడుచుందురు. రాయలసీమలోని పిచ్చుకుంట్లు 'కుంటి మల్లారెడ్డికథ' యను రెడ్లపురాణమును, 'ఎలనాగిరెడ్డికథ'ను, 'నారసింహారెడ్డికథ'ను బాడుచుందురు. గుంటూరు మండలములోఁ గొందఱు పిచ్చుకుంట్లు కమ్మవారికి సహితము గోత్రములు చెప్పుచున్నారు.

పల్నాటి వీరగాథలను బాడెడి హక్కు మాలవారిది. వీరిని "వీరవిద్యావంతులు" అనియు, "పల్నాటివారు" అనియు బిలుతురు. కారెంపూడి వీరోత్సవమునఁ బల్నాటికథలను బాడుహక్కు నేఁటికిని వీరికే కలదు. (పిచ్చుకుంట్ల నా పరిసరములకుఁగూడ రానీయరు.) ఈ వీరవిద్యావంతులు పల్నాటి వీరచరిత్రలోని కన్నమదాసు సంతతివారని నా యభిప్రాయము. ఈ మాలవారే కాక, కొందఱు తెలగ, కమసాలి వర్ణములకుఁ జెందినవారు సహితము పల్నాటి వీరకథలను గానముచేయుచున్నారని తెలియుచున్నది.

పల్నాడులోఁ బిచ్చుకుంట్లు కొందఱు అనధికారముగా మాత్రమే పల్నాటి వీరకథలను బాడుచున్నారని తెలిసికొనవలెను. పల్నాటి వీరాచార పీఠాధిపతుల యనుమతి లేనిదే కత్తిపట్టి వీరకథా గానము చేయు నధికార మెవ్వరికిని లేదు. పీఠాధిపతులు వీరవిద్యావంతులకు మాత్రమే యిట్టి యనుమతి నిచ్చియున్నారు; పిచ్చుకుంట్ల కీయలేదు. ఇటీవలి కాలమునఁ బిచ్చుకుంట్ల కుటుంబములు కొన్ని కారెంపూడి పీఠాధిపతుల కడకువచ్చి పల్నాటి వీరకథలను బాడుకొని జీవించుట కనుమతిని గోరిరి. ఒకటి రెండు పిచ్చుకుంట్ల వంశములు వీరాచారమును సహితము స్వీకరించినవఁట. ఇట్లు వీరాచారమును బుచ్చుకొన్న పిచ్చుకుంట్లు ఒంగోలు తాలూకా కందులూరులోను, మల్లవరములోను గలరు. తక్కిన పిచ్చుకుంట్లెవరును వీరాచారమును స్వీకరించినవారు కారు. కొందఱు పీఠాధిపతికడ ననుమతిని దీసికొని కథలను బాడుచున్నారు. ఎక్కువమంది అనధికారముగనే గాథాగానము చేయుచున్నారు. కారెంపూడి వీరోత్సవములోఁ గథలు చెప్పెడి యధికారము మాత్రము ఏ విధమగు పిచ్చుకుంట్లకును లేదు.

పల్నాటి వీరవిద్యావంతులు గుంటూరు, నెల్లూరు మండలము లలో నధికముగా నున్నారు. గుంటూరు మండలమున "లాం, వేమవరము, ఆకుల అల్లూరు" మున్నగు చోట్లను; నెల్లూరు మండలమున "ఆల్తూరుపాడు, మొగుళ్లూరు, శ్రీరామపురము, గజ్జలకొండ, అన్నారెడ్డిపాలెము" మున్నగు ప్రాంతములందును వీరు గలరు. కృష్ణామండలమున మక్కపేట దగ్గఱ రాచంద్రాపురములోఁ గూడ వీరవిద్యావంతులు గలరని తెలియుచున్నది.

## 9.3. వీరగానము:–

పల్నాటి వీరకథాగానమున వీరజోదు (పంబజోదు), దానిపై రెండు గంటలు, తిత్తి, తాళము, కత్తి, డాలు ఉపయోగింతురు. కథను బాడెడి ప్రధానవ్యక్తి పల్నాటివీరునివలెనే వేషము వేసికొనును. ఇతఁడు పండ్రెండు బిరుదులను ధరింపవలెనని నియమము. అవి: "కాశికోక, తలగుడ్డ, కలికితురాయి, ఉమ్మాహుపిట్ట (వెండిరేకుతోఁ జేయఁబడినది), చంద్రవంక, అందె, కత్తి–డాలు, వీరజోదు, తిత్తి, తాళము, బొడ్డుగంట, జంజాగుడ్డ". డాలుకు బదులు కొందఱు చిన్న పిడికత్తిని బుచ్చుకొందరు. దీనిని 'జమజాల' అందురు. పెద్దకత్తిని 'అడ్డకత్తి' యందురు. కుడిచేతిలో నడ్డకత్తి, ఎడమచేతిలో జమజాల, కుడికాలికి బిరుదుఅందె, పండ్రెండు మూరల తలగుడ్డ, తలగుడ్డలోఁ గలికితురాయి, ఆ కలికితురాయికిఁ గుడిప్రక్కన చంద్రవంక, ఉమ్మాహుపిట్ట; మెడలో పింజమలదండ; నొసటను, మెడక్రింద, కుడివైపున ఱొమ్మునకుఁ దిరుమణి (తెలుపు మధ్య ఎఱుపు); ఎడమవైపు ఱొమ్మున 'జంజెంగుడ్డ' (తెలుపు ఎఱుపు– రెండు రంగులలో నేడు మూర లుండును); షరాయి, జంజెము, బొడ్డుగంట (త్రికోణాకారములో నుండు గుడ్డ, దానిచుట్టును బూసలు, మధ్య గంట కుట్టబడియుండును); కుడవైపున తొడమీదికి వ్రేలాడుచు 'కురుపోతు సవరము' (వింజామర)– ఇది కథకుని వేషము. ఇట్లు పండ్రెండు బిరుదులు ధరించి కత్తి త్రిప్పుచు వీరావేశముతోఁ గథను బాడుచుండగా, నాఁటి పల్నాటి బాలచంద్రుడే దివినుండి భువికి దిగివచ్చినట్లుగా నుండును!!

ఈ వీరావేశము ఒక్క గాయకునిలోనే కాక, ఒక్కొక్కప్పుడు శ్రోతలయందును బ్రస్ఫుటమగుచుండును. పల్నాటి వీరకథలను మహావేశముతోఁ బాడునప్పుడు– ముఖ్యముగాఁ గన్నమదాసు వీరత్వమును బ్రశంసించునప్పుడును, నాతని యుద్ధకౌశలమును వర్ణించునప్పుడును శ్రోతలుగానుండెడి కొందఱు మాలలకుఁ బూనకము వచ్చుచుండును. అప్పుడు కథకుని చేతిలోని కత్తిని (అడ్డకత్తిని) ఆ పూనకము వచ్చిన శ్రోతకిచ్చెదరు. అతఁడాకత్తితోఁ దన గుండెలపైఁ జీరుకొనును. నెత్తురు బొటబొట కారును. అప్పుడు కాని యా పూనకము తగ్గదు. ఇది పల్నాడులో నేఁటికిని జరుగుచున్న యథార్థ సంఘటన.

పల్నాటి వీరగానమునఁ గథకునితోపాటు ముగ్గురు వంత లుందురు. ఒకఁడు వీరజోదును వాయించును. రెండవవాఁడు తిత్తిని బట్టును. మూఁడవవాఁడు తాళము వేయుచు 'ఆ' కొట్టును. కథకుఁడు వంతలు– అందఱును నిలువఁబడియే యుందురు. ఈ వీరగానములోఁ గొంత అభినయము, కొంత నాట్యము (చిందు) కూడ మిళితమై యుండును. (పల్నాటి వీరకథాగానము క్రీడాభిరామమున సీసపద్యములో విపులముగా వర్ణింపఁబడినది.) ఈ వీరగానము ఎక్కువగా నేకతాళములో నడచును. సందర్భమునుబట్టి

అటతాళము, ఆదితాళము కూడఁ బడుచుండును. పల్నాటి వీరకథ లెక్కువగా రాత్రివేళ వెన్నెలలోఁ బాడఁబడుచుండునే కాని, దీపకాంతిలోఁ బాడఁబడవు. ఈ యాచార మెందువలన వచ్చినదో తెలియకున్నది.

పల్నాటి వీరకథలను 'పంబజోడు (వీరజోడు), కత్తి, డాలు, తిత్తి' వీనితోడనే చెప్పవలెనుగాని, తంబుఱ, గుమ్మెటలతోఁ జెప్పరాదు. ఇది పీఠాధిపతుల శాసనము. ఈ శాసనమును ధిక్కరించిన వారిపై సివిలు క్రిమినలు చర్యలు తీసికొనెడి యధికారము పీఠాధిపతులకుఁ గలదు. అసలు, పీఠాధిపతుల యనుమతి లేనిదే కత్తిపట్టి పల్నాటి వీరగాథల నెవ్వరును బాడరాదు. దీనిని అతిక్రమించినవారిపై పీఠాధిపతులు చర్యలు తీసికొందురు. నిజమునకు వీరజోడు, తిత్తి మున్నగు వాద్యములతో వచ్చు నావేశము, తంబుఱ గుమ్మెట్లతో రాదు.

## 9.4. వీరప్రార్థన:-

పల్నాటి వీరకథలను గానముచేయు వీరవిద్యావంతులు మొట్టమొదట వీరుల కులదైవమగు చెన్నకేశవునిఁ బ్రార్థింతురు. తరువాత ఆదిశక్తి అంకాళదేవిని ప్రార్థింతురు. పిమ్మట నఱువది యార్గురు వీరనాయకులను బ్రార్థింతురు. కొందఱు దైవాంశవలనఁ బుట్టిన పెద్దనగుఱ్ఱము కారుబొల్లని కూడఁ బ్రార్థితురు. ఇందు వీరుల ప్రార్థన అత్యంత వీరరసస్ఫోరకముగా నుండి, శ్రోతల హృదయములను భేరీధ్వానమువలెఁ గలఁచి వేయును. ఇది మిక్కిలి రసవంతమగు జానపద కవిత్వము. అఱువదియార్గురు పల్నాటి వీరులెట్టివారనఁ గా-

*"చెన్నుని గొలిచేటివారు*
*దాసానదాసులు దండి నాయకులు*
*ఎటువంటివారు ఏ వన్నెవారు*
*మిక్కుటంబగు కోరమీసములవారు*
*ఎగభుజంబులమించు ఎరజేరుగుద్దు*
*అడ్డము ఎదరొమ్ము అటు మూడు మూళ్లు*
*నిలువు తొమ్మిది మూళ్లు నిష్ట యోస్తనియలు*
*పాదంబు మూరెడు భద్రగజములు వారు*
*అంధి సరసని వీరులు ఆజాన బాహులు*
*తొండ మొక్కటి లేదు దొడ్డ ఏనిగలు*
*మిన్నువచ్చి మీద వరిగిన గాని*
*అరిచేత వక్షణము ఆని పట్టగలవారు*
*పునుగు గంధము గాని పుయ్యగలవారు*
*చెన్నుని వనమాల పేరులవారు*
*తరుచైన వనమాల దండలవారు*
*పెక్కైన వనమాల పేరులవారు*
*ఇటువంటి వీరాధివీరులు వీరమాఘనులు*
*నల్లగొండలు తిరిగిన తిరగనివారు*
*నాగులేరు పొంగినగాని పొంగనివారు*
*వారాధి కలగిన కలగనివారు*
*వసుమతి కుంగినగాని కుంగనివారు*
*కయ్యమన్న వీరధీవీరులు కాలుదువ్వెదరు*
*మసలని యెవరైన మర్దించువారు*
*వెన్ను చూపనియట్టి వీరమానసులు*
*ఏట్లకు పోట్లకు ఎరువనివారు*
*ఇటువంటి వీరాధివీరులు వీరమాఘనులు*
*అంత కార్యమపూడి అయ్యలందరూను*
*కలను కార్యమపూడి కలవీర మధ్యరంగాన*
*ఆర్గురు సంగడీలకు అన్న బాలునకు*
*ఎత్తి వచ్చిన బాణాలు ఎదములు నాటి*
*జారివచ్చిన బాణాలు జబ్బలు నాటి*
*కూడివచ్చిన బాణాలు గుండెలు నాటి*
*గల్లేరాకువంటి యలుగులు గరగర నాటినగాని*
*వలపల వేసిన జమదండ పోట్లు దాపట నాటినగాని*
*దాపట వేసిన జమదండ పోట్లు వలపట నాటినగాని*
*కుంకుమ పూతవంటి రక్తము గుబగుబ కారినగాని*
*గుబగుబ రక్తము గుబ్బటిలినగాని*
*హరి హరి శ్రీమన్నారాయణ యనే వాక్యమే గాని*
*అయ్య అమ్మను వాక్యము వారి ఆత్మందు రాదు*
*ఇతర వాక్యము లేదు వీరమాఘనులు"* [89]

ఈ ప్రార్థనలే కాక, కథాప్రారంభమునకు ముందు గాథా కారులు పాడు సాధారణాంశములు (commonplaces) ను గొన్ని కలవు. "ఆడనేర్చిన అయ్యలకు అడియణ్ణి నేను, పాడనేర్చిన అయ్యలకు పాదసేవకుణ్ణి, తప్పులు ఒప్పులు మీ బిడ్డవలె సవరించరయ్య" అను పాదములను ప్రతికథకుఁడును పాడు చుండును. ఇవి జానపద కళాకారుల వినయమునకు మచ్చుతునుకలు. వీరు మార్గకవులవలె 'కుకవినింద' యను పేరుతో సమకాలికులను దూషింపరు. వినయ సౌశీల్యములు వీరికి వెన్నతోఁబెట్టిన విద్యలు. "సభాకల్పతరుం వందే..." అను నీతిశాస్త్రములోని శ్లోకమునుగూడఁ గథారంభమునకు ముందు గాథాకారులు పాడుచుందురు.

## 9.5. 'వీరాచారవంతులు' - 'దేవుళ్లవాళ్లు':-

పల్నాటి వీరకథలను పాడెడి వారిని వీరవిద్యావంతులని పిలిచినట్లే, చెన్నకేశవుని కులదైవముగాఁ గొలుచు వర్ణముల వారిని 'ఆచారవంతులు' అందురు. వీరు హిందువులలో అన్నివర్ణములందును గలరు. కమ్మ, ఈడిగ, కుమ్మరి, చాకలి, మాల, కోమటి, రెడ్డి, వెలమ, తెలగ మున్నగు వర్ణములవారు 'కరమంత్రము' రోజున (చనిపోయిన

నాఁటినుండి పదునైదవరోజున) పల్నాటి వీరకథలను బాడింతురు. కారెంపూడిలోని వీరులగుడిలోను, చెన్నకేశవుని గుడిలోను వీరుల ఆయుధములున్నవి. వీరోత్సవమునాఁడు కొన్ని వర్ణములారు ఈ ఆయుధముల నలంకరించి పూజింతురు. వీరిని 'దేవుళ్లవారు' అందురు.

## 9.6. వీరోత్సవము:-

కారెంపూడిలోని యుద్ధక్షేత్రమునఁ బ్రతి సంవత్సరము కార్తిక బహుళ అమావాస్య దినము రాత్రి మొదలుకొని ఐదురోజులు వీరోత్సవము జరుగును. ఈ యుత్సవములో వీరగాథలను కేవలము పాడించి ఊరకొనరు. 'కోడిపోరు, రాగావుకథ, లంకన్న ఒఱగు' మున్నగు వీరగాథలను పాడుచు, వేషములు ధరించి ప్రదర్శింతురు. మొదటి రోజున 'రాచగావుకథ'ను, రెండవ రోజున 'అలరాచమల్లుగారి గురిజాల రాయబారము'ను, మూఁడవ రోజున 'మందపోటుకథ'ను, నాల్గవ రోజున 'కోడిపోరుకథ'ను, అయిదవ రోజున 'కల్లిపాడుకథ'ను పాడించి ప్రదర్శింతురు. ఇట్లు ఈ ఉత్సవము అమావాస్యనుండి అయిదు రోజులు జరిగినను, దీని ప్రారంభము మాత్రము పూర్ణిమనాఁడే జరుగును. పల్నాటియుద్ధమున బ్రహ్మనాయఁడు తప్పఁ దక్కిన వీరులందఱును జనిపోయిరనియు, బ్రహ్మన నేఁటికిని గుత్తికొండ బిలములోఁ దపస్సు చేసికొనుచున్నాఁడనియు, నతఁడు ప్రతి సంవత్సరము కార్తిక శుద్ధ పూర్ణిమనాఁడు గుత్తికొండ బిలమునుండి కారెంపూడిలోని వీరులగుడిలోఁ బ్రవేశించుననియు, ఈ వీరోత్సవమును జేయు పల్నాటిప్రజల విశ్వాసము. ఇట్లు బ్రహ్మనాయఁడు వీరులగుడిలోఁ బ్రవేశించునప్పుడు కొన్ని శబ్దములు వినవచ్చునఁట. ఈ కార్తిక శుద్ధ పూర్ణిమనాఁడు వీరులగుడిలో నుత్సవము చేసి, ఆ గుడిలోనున్న పోతురాజునకు 'ఆనకట్టు' కట్టుదురు. పోతురాజునకు నూలుపోగులు చుట్టి, గుడిని రక్షింపుమని చెప్పుటయే 'ఆనకట్టు'. మఱునాఁడు ఉదయము గురువు (పీఠాధిపతి) సమక్షములో నాలుగు దేశములకు బిరుదులతో నాహ్వాన పత్రికలు వ్రాయించి, వానిని బూజింతురు. 'నాయకురాలి జెండా, బ్రహ్మనాయని జెండా' అను రెండు జెండాలను ఎదురెదురుగానున్న చెట్లపైఁ గట్టుదురు. తరువాత యుద్ధాహ్వాన పత్రికలను నలుగురు కన్నమదాసులచే (ఆచార సంప్రదాయమునకుఁ జెందిన మాలలు) నాలుగు దేశములకుఁ (నాలుగు దిక్కులకు) బంపింతురు. ఒక్కొక్క కన్నమదాసు ఒక్కొక్క దిక్కులో రెండు మైళ్లలోనున్న ఊరిలో నా పత్రికనిచ్చును. అచ్చటి మాలవారు ఆ పత్రికను మఱియొక యూరిలో నిత్తురు. ఇట్లీ యుద్ధాహ్వాన పత్రికలు నాలుగుదిశలలోను జాలదూరము వ్యాపించును. ఈ ఆహ్వాన పత్రికల నందుకొని, అమావాస్యనాటికి 'దేవుళ్లవాళ్లు' (ఆయుధములను బూజించువారు), 'ఇలగాపులు' (ఆచారవంతులు), 'పోతురాజులు' (మాలలు), 'కొమ్మరాజులు' (సాలెవారు), 'వీరవిద్యావంతులు' (గాథాకారులు- మాలలు), 'కన్నమనీలు' (మాలలు) మున్నగువారు, వారి వారి 'అడియారములు' (వీరజోళ్లు, లేక పంబజోళ్లు), కుంతములు (త్రిశూలములు), శామంతములు (చిన్న త్రిశూలములు), అరిగెలు (డాలులు), భైరవులు (కత్తులు) మున్నగు వానితోవచ్చి వీరోత్సవమునఁ బాల్గొందురు.

## 9.7. వీరపూజ- 'వీరగల్లు':-

పల్నాటి వీరులను రెండవ ప్రతాపరుద్రుని కాలము క్రీ.శ. 1289-1323) నాఁటికే దేవతలుగా భావించి, ఆలయములు నిర్మించి పూజించుచున్నట్లు తెలియుచున్నది. నేఁటికిని ఈ వీరమతము పల్నాటిలో వ్యాపించియున్నది. ప్రతిసంవత్సరమును ఈ వీరులకు ఉత్సవముచేసి పూజించుచున్నారు. ఇట్లు పల్నాటివీరులవలె దైవత్వ మారోపింపఁబడి, పూజితులగుచున్న యుద్ధవీరులు ఇంతవఱకును ఒక్క ఆంధ్రములో తప్ప, భారతదేశమున వేఱొకచోటఁ గానరారు. ఈ వీరమతము ఆంధ్రదేశపు గొప్ప విశేషముగాఁ గనఁబడుచున్నది. మహమ్మదీయులు 'మొహరమ్' పండుగ సమయములో నాచరించెడి ఆరాధన కొంతవఱకుఁ బల్నాటి వీరారాధనమును బోలియుండును. స్కాండినేవియా యందలి నార్సుమతము, జపాన్‌లోని షింటోమతము, యుద్ధవీరారాధనతో సంబంధము కలవని తెలియుచున్నది. 'కార్లైల్' వీరపూజనుగూర్చి యూరపుఖండమున విశేషప్రచార మొనరించినాఁడు.[90]

చనిపోయిన వీరుని జ్ఞాపకార్థము ఆతఁడు చనిపోయిన ప్రదేశములోఁ బాతఁబడిన ఱాయికాని, విగ్రహము కాని 'వీరగల్లు' అనఁబడును. కన్నడమున దీనిని 'వీరకల్లు' అందురు. 'వీరగల్లు' జానపద వ్యవహారమున నున్న యింపైన దుష్టసమాసము. 'వీరశిల' అను శిష్టసమాసము 'వీరగల్లు' వలెఁ బుష్టికరముగా ధ్వనింపదు. ఈ వీరగల్లులు దేవతావిగ్రహములవలెనే పూజింపఁబడును. కారెంపూడిలోని పల్నాటి వీరులగుడిలోనున్న లింగము లన్నియును వీరగల్లులే! చెర్లగుడిపాడులో నలరాజు చనిపోయిన ప్రదేశమున నున్న 'ఒఱగుఱాయి' యును వీరగల్లే!

వీరపూజనుగూర్చియు వీరగల్లులనుగూర్చియు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇట్లనిరి: "... ఒక యుత్తమాశయముకొరకు, ఒక యుత్తమాదర్శముకొరకు గ్రామరక్షణార్థము ఆత్మబలి యిచ్చిన వీరుల విగ్రహములు చేసి పూజించుట ఆచారమైనది. వీటికి వీరశిలలని పేరు. కన్నడమున వీటిని 'వీరకల్లు' లందురు. ఇటువంటి వీరుల విగ్రహములు కర్నూలుజిల్లాలోని త్రిపురాంతకములోను, కడపజిల్లా యందలి మోపూరులోను, గుంటూరుజిల్లాయందలి కారెంపూడి, మాచెర్ల గ్రామములలోను, ఓరుగంటిలోను, ఇంకను ననేక శైవ క్షేత్రములందును గాన్పించుచున్నవి." [91]

## 9.8. వీరగ్రామములు:-

నాఁటి పల్నాటి వీరుల నామములతోఁ గట్టిన గ్రామములు గుంటూరు మండలమున నేఁటికిని గానవచ్చుచున్నవి. అనుఁగురాజు లేక అలుఁగురాజుపేర 'అలుఁగురాజుపల్లె', అలరాచమల్లుపేర 'రాచమల్లుపాడు', ఘట్టిరాజుపేర, 'ఘట్టిపాలెము', పెదమలిదేవుని పేర 'మల్లవరము', దొడ్డనాయనిపేర 'నాయునిపల్లె' మున్నగు గ్రామములు పల్నాటిలో వెలసినవి. ఇవి ఆ వీరులకాలములోనే నిర్మితమైనవి. నేఁటి చీరాల బ్రహ్మనాయని తల్లియగు శీలాంబపేరను, పేరాల నాయని తమ్ముఁడగు పేర్నినిపేరను గట్టఁబడినవని చెప్పుదురు. కారెంపూడికిని, మేళ్లవాగునకు నడుమగల యొక కనుమను 'నాయకురాలి కనుమ' యందురు. ఇచ్చట నామె చాలచంద్రుని నడ్డగించినదఁట.

అనుఁగురాజు పరివారము గురివిందపొదలు నఱికి కట్టిన పట్టణమగుటచే 'గురిజాల' అని పేరు పెట్టిరఁట. వీరభద్రకవి దీనిని 'మాధవీపుర' మనినాఁడు. 'మాధవి' యనఁగా గురివిందతీఁగ. 'మాచెర్ల'యను పేరునుగూర్చి రెండు మూడు వ్యుత్పత్తులు చెప్పుచున్నారు. మారీచుఁడేలిన పట్టణము కావున 'మాచెర్ల' అని కొందఱు (ఖరుఁడేలినది 'కారెంపూడి', దూషణుఁడేలినది 'దుర్గి' యని చెప్పుదురు); బ్రహ్మనాయఁడు మలిదేవాదులతో గురిజాలనుండి వచ్చుచు మజిలీ చేసిన చోటు కావున 'మాచెర్ల' యని మఱికొందఱు చెప్పుచున్నారు. ఆదిత్యేశ్వరాలయములోని శాసనములో 'మహాదేవి తటాక'మని మాచెర్లకు వాడఁబడినది. మాచెర్ల దగ్గఱ నున్న 'మహాదేవి చెఱువు'ను బట్టి యీ పట్టణమునకు 'మాచెర్ల' యను నామము వచ్చియుండునని కొందఱు భావించుచున్నారు. ఇదియే సమంజసముగా నున్నది.

## 9.9. 'నెత్తురు పట్టు':-

శౌర్య సాహసములు చూపి, యుద్ధములోఁ బోరాడి, క్షతాంకులైన వారికి రాజు ఇచ్చు మాన్యమునకు 'నెత్తురు పట్టు' అని పేరు. దీనినే కన్నడములో 'నెత్తురు కొడగె' అనియు, 'రక్త కొడగె' అనియుఁ బిలుతురు. శాసనములలో నెత్తురు పట్టునకే 'నెత్తురువిద్ధ' అను పేరుకూడ కనఁబడుచున్నది.[92] ఇట్టి నెత్తురు పట్టులు పల్నాడులో నున్నవి.

# 10. సారాంశము

ఈ సుదీర్ఘ ప్రకరణమునఁ జర్చింపఁబడిన వివిధవిషయముల సారాంశము నిట్లు చెప్పవచ్చును:-

వీరగాథావృత్తముల సర్వలక్షణములను 'పుణికి పుచ్చుకొన్నది' పల్నాటి వీరకథాచక్రము. ప్రాచీన తాళపత్రగ్రంథములలో నీ కథాచక్రమునకు 'బల్నాటి వీరభాగవత' మను పేరు కానవచ్చుచున్నది. 'పల్నాటి వీరచరిత్ర' యను పేరు ఆధునిక విమర్శకులు పెట్టినట్టిది. జానపదులు ఈ గాథాచక్రమును 'చెన్నుఁడుకథ' యందురు. ఇది చారిత్రక వీరగాథాచక్రము. క్రీ.శ. 12వ శతాబ్దమునాఁటి సంఘటన. తెలుఁగున లభ్యమగుచున్న వీరగాథలలో నిది ప్రాచీనతమైనది. ఇంతకన్నఁ బ్రాచీనమైన వీరగాథలు ఇతర భారతసాహిత్యములందును గానరావు. పండ్రెండవ శతాబ్దముకంటెఁ బ్రాచీనమైన వీరగాథలు ప్రపంచమందెచ్చటను లేవని పాశ్చాత్య విమర్శకులు నిర్ణయించినారు. దీనినిబట్టి మన పల్నాటి వీరగాథల ప్రాశస్త్యము మఱింత ప్రస్ఫుట మగుచున్నది.

పల్నాడు, నేఁటి గుంటూరు మండలమున నొక ప్రాంతము. దీనిని క్రీ.శ. పండ్రెండవ శతాబ్దమున హైహయవంశపు రాజులు పాలించిరి. వీరు కార్తవీర్యార్జునుని సంతతివారు. పల్నాడును బాలించుటచే వీరిని పల్నాటి హైహయులందురు. వీరు ఆత్రేయ గోత్రజు లనియు, నింటిపేరు చాగి (సాగి) వారనియుఁ దెలియుచున్నది. ఈ పల్నాటి హైహయవంశ స్థాపకుఁడు 'మందడి రేవినాయకుఁ'డను సామంతుఁడు. ఈ వవశమునఁ దెలియవచ్చు మొదటి పాలకుఁడు సాగి బేతరాజు (క్రీ.శ. 1103-1110). పల్నాటిని క్రీ.శ. 1134 నుండి (?) 1147 వఱకును 'అనుఁగురాజు' అను హైహయుఁడు పాలించెను. ఇతని పుత్రులే నలగామరాజు, పెదమలిదేవరాజు. వీరు సవతి తల్లుల బిడ్డలు. అనుఁగురాజు మరణానంతరము, కొంత కాలమునకుఁ బల్నాటి రాజ్యము విభక్తమయ్యెను. నలగాముఁడు గురిజాలను, మలిదేవుఁడు మాచెర్లను బాలింపఁదొడఁగిరి. 'నాయకురాలు' అను నాగమ్మ నలగామున మంత్రిణి. బ్రహ్మనాయఁడు మలిదేవుని మంత్రి. ఈ మంత్రులిర్వురును బరస్పరము స్పర్ధించుటచే నంతర్యుద్ధము జరిగెను. ఈ యంతర్యుద్ధము క్రీ.శ. 1178-1182 మధ్యకాలమున జరిగెనని చారిత్రకులు నిర్ణయించిరి. ఇంకను కొందఱు క్రీ.శ. 1181-82 సంవత్సరములలో జరిగెనని నిర్ధరించిరి.

అనుఁగురాజునకుఁ దన కూతురు మైలమదేవినిచ్చి పెండ్లి చేసిన చందవోలురాజు వెలనాటి రెండవ గొంకరాజు (రెండవ కులోత్తుంగ చోడ గొంకరాజు) అని చారిత్రకులు చెప్పుచున్నారు. ఇతని కాలము క్రీ.శ. 1132-1161. ఇతని పుత్రుఁడు వెలనాటి చోడుఁడని నామాంతరము గల రెండవ చోడరాజు లేక రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడయ. ఇతని కాలము క్రీ.శ. 1161-1181. ఇతఁడు నలగామున మేనమామ. పిల్లనిచ్చిన మామకూడ కావచ్చును (మేనఱికము). యుద్ధమున నితఁడు నలగామునకు సహాయము చేసినట్లు తెలియుచున్నది.

మలిదేవునకుఁ బిల్లనిచ్చిన వీరసోముఁడు కల్యాణము నేలిన కలచూరి బిజ్జలుని పుత్రుఁడగు సోమేశ్వరుఁడు (సోవిదేవ, రాయమురారి నామాంతరములు) అని చారిత్రకుల మతము. ఈ

కలచూరి సోమేశ్వరుని కాలము క్రీ.శ. 1165–1177. మలిదేవుని మామయగు వీరసోముని పుత్రుఁడు కొమ్మరాజనియు, నతని పుత్రుఁడు అలరాజనియు వీరగాథలనుబట్టి తెలియుచున్నది. కాని చరిత్రలోఁ గలచూరి సోమేశ్వరుని పుత్రపౌత్రుల ప్రసక్తి లేదు. నాకు లభించిన తాళపత్రగ్రంథమున వీరసోముఁడు చోడవంశమువాఁడనియుఁ గాశ్మీరగోత్రమువాఁడనియుఁ గలదు.

పల్నాటి వీరగాథలలో నెక్కువ భాగము బ్రహ్మనాయని యందుఁ బక్షపాతమును జూపుచు వ్రాయఁబడినట్టివే. ఇవి బ్రహ్మనాయని అవతార పురుషునిగాఁ జిత్రించినవి. ఈ చిత్రణము నమ్మఁదగినది కాదు. బ్రహ్మనాయనియందును గొన్న లోపమున్నవి. అతని శీలమందును గొన్ని నీలినీడలు కానవచ్చుచున్నవి. ఇట్టి నీలినీడలను బ్రదర్శించు వీరగాథలు నాకు లభించినవి. బ్రహ్మనాయఁడు అనుఁగురాజును, తన తండ్రియగు దొడ్డనాయనిఁ జంపి, నలగాముని సింహాసనమెక్కించెనని 'స్యూయల్' అను చరిత్రకారుఁడు వ్రాసినాఁడు. దీనిని సమర్థించు వీరగాథ నాకు లభించినది. అలరాజు మరణమునకు బ్రహ్మనాయఁడే ముఖ్యకారకుఁడని తెల్పు వీరగాథ కూడ నాకు లభించినది. బ్రహ్మనాయఁడు తన కంటెను, తన అన్న పెద్దన్న కంటెను మహాబలశాలియగు అలరాజును ఏవిధముగానైనను జంపింపవలెనను కుట్రతో గురిజాల రాయబారమునకుఁ బంపినాఁడని ఈ వీరగాథలో నున్నది.

నాగమ్మ వీరగాథలలోఁ జిత్రింపబడినట్లు దుష్టురాలును, నీచురాలును గాదు. ఆమె అనల్పమగు రాజకీయ ప్రతిజ్ఞ కలిగిన బుద్ధిశాలిని! 'నాయకురాలు' ఆమెకు అన్వర్థ నామధేయము. ఈ నాయకురాలికిని బ్రహ్మనాయనికిని మధ్యగల రాజకీయస్పర్ధలే పల్నాటి యుద్ధమునకు ముఖ్యకారణములు కాని, శైవ వైష్ణవ మతభేదములెంత మాత్రమును గాఁజాలవు. అసలు అట్టి భేదములు ఆ కాలములో లేవు. బ్రహ్మనాయఁడు గొప్ప శివభక్తులలో నొకఁడు. వీరగాథలనుబట్టి బ్రహ్మనాయఁడు జయించినట్లుగాఁ గనఁబడుచున్నను, స్థానిక చరిత్రలనుబట్టి నలగాముఁడే జయించినట్లు తెలియుచున్నది. యుద్ధావసానమున బ్రహ్మనాయఁడు నలగామునకు మరలఁబట్టము గట్టెనని కొన్ని వీరగాథలలో నున్నది. మఱికొన్ని వీరగాథలలో నలగాముఁడు కొమ్మరాజుచేఁ జంపఁబడెననియు, యుద్ధానంతరము 'బ్రహ్మనాయఁడు, కన్నమదాసు' వీరిరువురే మిగిలిరనియు, బ్రహ్మనాయఁడు యుద్ధమున మరణించిన వీరులందఱును బ్రతికించి, వారితో గుత్తికొండ బిలమును బ్రవేశించెననియుఁ గలదు.

ఈ యుద్ధముతోఁ బల్నాటి హైహయరాజవంశము అంతరించెనని చెప్పవచ్చును. ఈ ప్రాంతమును కాకతీయులాక్రమించిరి. ఈ యుద్ధమున మలిదేవుని పక్షమునఁ బోరిన పెద్దన్న, కొమ్మరాజు, బ్రహ్మనాయఁడు, కన్నమదాసు, బాలచంద్రుఁడు– మున్నగు వీరులకు మాత్రమే 'పల్నాటివీరు'లని పేరు. నలగాముని పక్షములోని వీరులకు ఈ పదము వర్తింపదు. ఈ పల్నాటి వీరుల సంఖ్య అఱువదియాఱు అనుటకు ఎక్కువ ప్రమాణములున్నవి.

పల్నాటి వీరకథాచక్రములో నొక్క బాలచంద్రునికథ మాత్రమే పండితలోకమునకుఁ బరిచితమైనది. దీనిని మొట్టమొదట ప్రకటించిన వారు అక్కిరాజు ఉమాకాంతంగారు. ఇది శ్రీనాథ విరచితము. పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్కరించిన 'పల్నాటి వీరచరిత్ర'లోఁ బదునొకండు వీరగాథలున్నవి. కాని, నా పరిశోధనమువలన నీ కథా చక్రమున సుమారు ఇరువదియైదు వీరగాథలున్నవని తేలుచున్నది. వీనిలోఁ బెక్కుకథలు తాళపత్రగ్రంథములందు జివికిపోవుచు, గాథాకారుల జిహ్వాగ్రములయందుఁ గొనయూపిరితో నున్నవి.

శ్రీనాథుఁడు, మల్లయ్య, కొండయ్య అను కవులు రచించిన వీరగాథలు కొన్ని నేఁడు లభించుచున్నవి. ఈ కవులలో నొక్కొక్కరు ప్రత్యేకముగా నీ గాథాచక్రమంతటిని వ్రాసియుందురు. కాని ఇట్లు ప్రత్యేకముగా నొకే కవి విరచితముగా నున్న సంపూర్ణ గాథాచక్ర మేదియు నేఁడు లభించుట లేదు. కొన్ని వీరగాథలు ఒక కవివి, మఱికొన్ని వీరగాథలు వేఱొక కవివి లభించుచున్నవి. ఆరణగండ్ల యుద్ధము నుండి మందపోటుకథ వఱకును, వరుసక్రమమునఁగల పది వీరగాథలు, శ్రీనాథవిరచితమైనవి నాకు లభించినవి. అక్కిరాజు ఉమాకాంతంగారికి పై ముగ్గురు కవులు రచించిన మూడు రకముల బాలచంద్రుని కథలు లభించినవి.

1862 ప్రాంతమునఁ బల్నాడులోనున్న ముదిగొండ వీరభద్రకవి యనునతఁడు పల్నాటి వీరగాథల నన్నింటిని అనుసరించి 'వీరభాగవతము' అను పద్యకావ్యమును రచించెను. పల్నాటి వీరకథాచక్రముయొక్క సంపూర్ణేతివృత్తమును తెలిసికొనుటకు ఈ పద్యకావ్యము మిక్కిలిగఁ దోడ్పడుచున్నది.

మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమునను, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్యపరిశోధనాసంస్థవారి లిఖితపుస్తక భాండాగారమునను (ఇది ఇప్పుడు శ్రీ వేంకటేశ్వర విశ్వవిద్యాలయ ప్రాంగణములో నున్నది), కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషద్గ్రంథాలయమునను, గుంటూరు, నెల్లూరు మండలములలోనున్న వీరవిద్యావంతుల కడను, పల్నాటి వీరగాథలకు సంబంధించిన తాళపత్రప్రతులు, వ్రాతప్రతులు పెక్కు గలవు. గుంటూరు, ప్రకాశం, నెల్లూరు మండలములలోఁ బర్యటింపఁగా నాకు ఇరువది వీరగాథలున్న మూఁడు తాళపత్రగ్రంథములు లభించినవి. వీనిలోఁ బెక్కుగాథలు సాహిత్య లోకమునకుఁ బరిచయములేని వినూత్న వీరగాథలు.

పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్కరించిన 'పల్నాటి వీరచరిత్ర' లో 'కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము' అను రెండు వీరగాథలు

తప్పఁ దక్కిన వన్నియును మిక్కిలి సంక్షిప్తరూపములు. ఇవి విశ్వసింపఁదగినవి కావు. వీనికిని జానపదులలో వ్యాప్తియందున్న వీరగాథలకును నే విధమగు సంబంధమును లేదు.

పల్నాటి వీరగాథలను పిచ్చుకుంట్లు పాడుదురనుట తప్పు. పిచ్చుకుంట్లకు ఈ కథలు పాడెడి హక్కు లేదు. వీనిని పాడువారు 'వీరవిద్యావంతు' లనఁబడెడి మాలలు. వీరు గుంటూరు, ప్రకాశం, నెల్లూరు మండలములలో వ్యాపించియున్నారు. ఈ వీరగాథాగానమున వీరజోడు (పంబజోడు), తిత్తి, కత్తి, డాలు ఉపయోగింతురు. ఈ వీరవిద్యావంతులకు యుద్ధక్షేత్రమగు కారెంపూడిలో గురుపీఠమున్నది. పిడుగువారను నియోగి బ్రాహ్మణులు దీని కధిపతులు. వీరిని 'పల్నాటి వీరాచార పీఠాధిపతులు' అందురు. పల్నాటి వీరారాధన మొక ప్రత్యేక మతముగా ఆచరింపఁబడుచున్నది. ఈ వీరారాధకులు అన్నివర్ణముల లోను గలరు. వీరిని 'ఆచారవంతులు' అందురు. వీరందఱికిని పీఠాధిపతియే గురువు. యుద్ధక్షేత్రమగు కారెంపూడిలో వీరుల గుడి దగ్గఱఁ బ్రతిసంవత్సరమును కార్తికమాసములో వీరోత్సవము జరుగుచున్నది.

*(గమనిక:-* 1974లో అమెరికాలోని విస్కాన్‌సిన్ విశ్వవిద్యాలయములో 'పల్నాటి వీరచరిత్ర'ను గుఱించి పరిశోధన చేయుచున్న Mr. Jane H. Roghair అను పరిశోధకుఁడు బెంగుళూరు వచ్చి, నన్ను కలిసి, నా సిద్ధాంతగ్రంథమును 8-11-1974 నుండి 14-11-1974 వఱకును క్షుణ్ణముగా చదివి, నోట్సు తీసికొని వెళ్ళినాఁడు. తరువాత 1982లో Oxford University Press, New York వారు అతని సిద్ధాంత గ్రంథమును "The Epic of Palnadu" అను పేరుతో ముద్రించినారు.) ❑

## జ్ఞాపికలు

1. *పల్నాటి వీరచరిత్ర, వావిళ్ల ప్రతి, ద్వితీయ భూమిక, పుట- 29, (10-7-1938లో వ్రాసినది.)*
2. *"ఈ పలనాటి పదము ప్రౌఢసాహిత్యమున స్థానమాశింపనే లేదు. పండిత పఠనయోగ్యము కావలెనని అభిలషింపను లేదు. ప్రజలకొరకే పుట్టి, ప్రజలకే ఆదర్శపాత్రమై, వారిమెప్పునే ఆశించి, తానుతరించి, వారిని తరింపజేయు ప్రజాకవిత్వమిది. ఈ దృష్టితో చూచినచో, ఇట్టి స్వతంత్ర కావ్యము కాని, దేశిరచనకాని, మహాపురుషుల చరిత్రకాని, ఆంధ్రసాహిత్యమున ఇంకొకటిలేదని, పూర్వపక్షభయము లేకుండ చెప్పవచ్చును." ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రచురణ, పీఠిక. పుట 27.*
3. *పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రచురణ, పీఠిక, పుట 29.*
4. *చూ. అక్కిరాజు ఉమాకాంతంగారి పల్నాటి వీరచరిత్ర, ద్వితీయ భూమిక, పుట 2.*
5. *List of Antiquities, Vol. I, App. A, p. 1.*
6. *Krishna District Manual, p. 151.*
7. *"The name is derived from Pallenadu, land of hamlets. A more poetical derivation of Palnad is Palanadu (milk land) from the light cream coloured marble that abounds there." ibid.*
8. *"ఈ సీమ ఉన్నతములయిన కొండలచేఁ జుట్టు నావరింపఁబడి, నడుమ పల్లముగా నుండుటవలన 'పల్లునాడు'నాఁ బేరొంది, 'పల్లునాడు' పల్లు, విల్లు, ముల్లు శబ్దంబులబోలె జడ్డకు లోపంబు రాగా పల్నాడై, 'పలనాడు' 'పల్నాడు' అను రెండు రూపములు మాత్రము వ్యవహరింపఁబడుచు వచ్చెనని నా అభిప్రాయము"- పల్నాటి వీరచరిత్ర, ప్రథమ భూమిక, పుట 8.*
9. *Smt. V. Yasodadevi, The History of Andhra Country, (1000 A.D. to 1500), Subsidiary Dynasties, Ch.II, The Haihayas, JA.H.R.S., Vol. xix, p.l. (J.A.H.R.S.= Journal of Andhra Histrorical Reseach Society.)*
10. *"ఈ పలనాటి వీరచరిత్రలో చరిత్ర, కల్పన రెండును పెనవేసికొనిపోయి యున్నవి. ఇందలి విషయములకు శాసనప్రామాణ్యము దొరకదు. అందువలన ఈ పలనాటి వీరచరిత్ర పూర్తిగా సత్యచరిత్రమని విశ్వసింపను, పూర్తిగా కొట్టివేయను వీలుకాదు. ఈ గ్రంథములో వచ్చు వ్యక్తులు అందరును కాకపోయినను కొందరు మాత్రము చారిత్రక వ్యక్తులు అనక తీరదు."- తెలుగు విజ్ఞాన సర్వస్వము, సంపుటి 1, పుట 219.*
11. *"No sons of Betha II are heard of. There seems to have been a short gap in the history of Palnad after Betha-II and prior to the accession of Anuguraja. Neither the realtionship between Betha II and Anuguraja is known." - Smt. V. Yasodadevi, J.A.H.R.S. Volume. xix, p. 31.*

12. ఈ రెండవ గొంకరాజు తన పుత్రికయగు మైలమదేవి ననుఁగురాజున కిచ్చుటయే కాక, తన సోదరియగు 'సబ్బాంబిక'ను ధరణికోటకుఁ బ్రభువైన భీమదేవుని కిచ్చెనను విషయమునుగూడ మల్లంపల్లివారు వెల్లడించిరి. ఈ భీమదేవుని పుత్రుఁడగు కోటకేతరాజు పల్నాటి యుద్ధమున రాయబారమును నెఱపెను.
13. *"Nalakama succeeded his father in A.D. 1147 and not in A.D. 1170 as has been suggested by a previous writer."- Smt. V. Yasodadevi, Vol. XIX, p.32.*
14. *"The chronicle says that Dodda was bothered aout his son's succession, resigned his premiership in favour of his son Brahmanayudu, who killed both Dodda and Alugu and then enthroned Nalakama." - Sewell, Antiquites, Vol. I, App. A., p.5.*
15. *"His rule lasted for 15 years as seen from records, and for many more years according to tradition, and the civil war in Palnad was fought in his reign."- Smt. V. Yasodadevi J.A.H.R.S., Vol. XIX, p. 33.*
16. 'నారదుండు' అనుటకు 'నలదుండు' అనినాఁడు. ఇది లేఖక దోషము.
17. ఆయువు.
18. కలియుండు.
19. అటు నాఱవ.
20. ఒఱగియున్న
21. కారెంపూడి తాళపత్రగ్రంథము (1966 ఆగస్టు నెలలో లభించినది), పత్రములు 65, 66.
22. **"అంతకు మునుకథ అదియెట్లటన్న- అన్నరాజేంద్రుడా అయ్యోధ్యరాజు**
**తమ తాత చేసిన తగు పాతకములు- పోగొట్టవలెనని పొందుగా దలచి**
**ఉత్తరాదినుంచి ఉర్వీశు డపుడు- ఘన దక్షిణాదికి కదలొచ్చు వెనక**
**అరయ నూటఎనిమిది దివ్యదేశములు- సేవించెద నేనని చెలగి యా రాజు**
**అయ్యోధ్య మొదలుగా ఆ గయ కడకు- వచ్చిరి బలమెల్ల వసుధ కంపిప"** -- కారెంపూడి తాళపత్రప్రతి, పత్రసంఖ్య 64- బి.
23. కారెంపూడి తాళపత్రప్రతి, పత్రసంఖ్య 64-ఎ.
24. **"ఈ కళేబరమును ఈశ్వరుతావు- కైలాసమునకును కడకు పంపించు**
**నాయుడ నీ కప్పు నదె వచ్చె నిపుడు- వంటిగా నచటికి జంటలే కిపుడు**
**నే బోవ జాలనని అపుడు బలికినను- అని యిట్లు రాజాడునట్టి మాటలకు**
**నాయిడు యోచించి నా క్షణమందు- తన తండ్రి నప్పుడు తాను బిలిపించి**
**నా తండ్రి నాయుడా నతివేగమునను- అనుగురాజును గలసి ఆ కొత్తజోడుగను**
**కైలాసమునకును కదలిపోవగను- ఆ సాంబమూర్తిపు దాబోతు నంపె**
**తమకు ప్రయాణమని తనయుడు చెప్ప- అతి సమ్మతించెను అపు డతని తండ్రి**
**యిద్దరు కూడుక యిచ్చోట నున్న- అంతటా బ్రహ్మన అతివేగమందు**
**తన ఆజ్ఞవల్లను తగు రథంబొకటి- గావించి యుంచిన కదురథముపైని**
**ఇద్దరు గూర్చుండియున్నంత జూచి- కైలాసగిరికిపుడు కదలిపోరయ్య**
**అటుల నిద్దరిమరి అచటికంపించి- షోడశదానములు సొంపుగానపుడు**
**బ్రహ్మన్న మొదలుగా పరగ రాజులును- బ్రాహ్మల కిచ్చిరి పరమదానములు"** - కారెంపూడి తాళపత్రప్రతి, పత్రములు, 105-బి, 106-ఎ.
25. శ్రీనాథ విరచితమగు మందపోటుకథ, కారెంపూడి తాళపత్రప్రతి, పత్రసంఖ్య 358-ఎ.
26. 'గురిజాల రాయబారము', ఆల్తూరుపాడు తాళపత్రప్రతి-II; ఆకు-9-బి.
27. పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 53.
28. చూ. పల్నాటి వీరచరిత్ర, వావిళ్లప్రతి, 1955, ప్రథమ భూమిక, పుటలు 18-32.
29. **'విరజాజి మల్లెలు విభూతిప్రతి, లింగన కీరీతి పూజలు చేసి'**- అదియే., పుట 18.
**'లింగపూజలు చేసి నిజముగా దాను, విభూతిరేఖలు తిన్నగా దీర్చి'**- అదియే., పుట 19.
30. **"పిలువని జంగాల పిలిపించె- వచ్చిరి అప్పుడు పుణ్యజంగాలు**
**పసిడి పాత్రల వారు పదులఋవదులు- పెదమటము జంగాలు పెద్దల బిలిపించిరి"**- అదియే.
31. అదియే., పుటలు 19, 20.

32. అదియే., పుట 33.
33. ఇట్లు అక్కిరాజు ఉమాకాంతంగారి వలెనే, శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, కలవల వెంకట సుబ్బారావు గారు, పింగళి లక్ష్మీకాంతంగారు– మున్నగు వారందఱును మలిదేవునకుఁ బిల్లనిచ్చినవాఁడు కలచూరి వీరసోముఁడనియే తీర్మానించిరి. కాని కారెంపూడిలో నాకు లభించిన యొక తాళపత్రగ్రంథమున మలిదేవుని మామయగు వీరసోముఁడు కాశ్మీరగోత్రమునకుఁ జెందిన చోడవంశపు రాజుగాఁ బేర్కొనఁబడినాఁడు. **'చోడవంశమునందు శోభిల్లు రాజు, కాశ్మీరగోత్రమున ఘనమైన రాజు'** అని వర్ణింపఁబడినాఁడు. ఈ వీరసోముని పుత్రుఁడు (మలిదేవుని బావమఱఁది) కొమ్మరాజు. కొమ్మరాజు కొడుకు అలరాజు. అలరాజు మరణవార్త విన్నప్పుడు కొమ్మరాజు దుఃఖమును వర్ణించు సందర్భమున **'చోళరాజంతట శోకంబునొందె'** అని కొమ్మరాజును చోళరాజుగాఁ జెప్పుట జరిగినది. (చూ. పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 283.)
34. పల్నాటి వీరచరిత్ర, వావిళ్లప్రతి, ప్రథమ భూమిక, పుట 34.
35. **"కొండ అన్నమరాజు కోటకేతుండు– కూరిమిహితుఁడు మాడ్గుల వీరరెడ్డి పరమాప్తుడౌ చింతపల్లి రెడ్డియును"** –– పల్నాటి వీరచరిత్ర, అక్కిరాజు పరిష్కృతము, బాలచంద్ర యుద్ధము, పుట. 83.
36. **"ధరణికోటపురికి దక్షుడైనట్టి – భీమదేవుండును పృథ్వీశునకును"**– అదియే., పుట 26.
37. కల్లుప్రతిష్ఠ, పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 333.
38. పల్నాటి వీరచరిత్ర, వావిళ్లప్రతి, ప్రథమ భూమిక, పుట 32.
39. పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పీఠిక, పుట 15.
40. Indian Antiquary, Vol. I, p. 273.
41. అక్కిరాజు పరిష్కృత 'బాలచంద్ర యుద్ధము', పుటలు 26, 27.
42. J.A.H.R.S., Vol. XIX, p. 34.
43. 'చాళుక్యచోళులు' అను వ్యాసము, తెలుఁగు విజ్ఞాన సర్వస్వము, సంపుటి 1, పుట 219.
44. కల్లు ప్రతిష్ఠ, పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రచురణ, పుట 345.
45. క. **'గజ నభ గుణ చంద్రాదుల, భజనుండాషాఢశుద్ధ పక్షంబందున్ విజయసమ బాహుబలుఁ డ, కృజముగఁ బల్నాటి గజ మనిఁ బడియెన్'** –– అక్కిరాజువారి ప్రథమ భూమిక, పుట 36.
46. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, కిన్నెర, డిసెంబరు 1953, పుట 555.
47. కారెంపూడి తాళపత్రప్రతి, దక్షిణాది యాత్రకథ, పత్రసంఖ్య 63.
48. అదియే., పత్రసంఖ్య 64–ఎ.
49. పలనాటి వీరచరిత్ర, విశాలంధ్రప్రతి, పుట 240.
50. పలనాటి వీరచరిత్ర, బ్రహ్మన్న విరుగు, పుట 528
51. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట ౧౯౨.
52. **"ఆరువల్లి నాయురాలి దుర్మంత్రంబు– కోడిపోరు, చాపకూటి కుదుపు ప్రథమ కారణములు పల్నాటి యేకాంగ– వీరపురుష సంప్రహారమునకు."**–– క్రీడాభిరామము, వేటూరి పరిష్కృతము, పద్యము 119.
53. నిజమునకు నాయకురాలు వీరచరిత్రలోఁ జూపఁబడినంత దుష్టురాలు కాదు. రాజకీయదృష్టితోఁ జూచినచో బ్రహ్మనాయనికన్న నీమె వేయిరెట్లు గొప్పది. చాణక్యుఁడు చెప్పిన రాజలక్షణము లీమెలో మూర్తీభవించి యున్నవి. ఇట్టివారివలననే రాజ్య మభివృద్ధిఁ గాంచును. బ్రహ్మనాయఁడును నాతని తండ్రి దొడ్డనాయఁడును కరుణాంతఃకరణులు. వీరి మెత్తఁదనము నూతగాఁగొని ప్రజలు పన్నులు కట్టెడివారు కారు. రాజధనాగారము శూన్యముగా నుండెడిది. దొడ్డనాయని కాలమందే ఈ ధనాభావము ప్రారంభమైనది. నాగమ్మ దొడ్డనాయని అసమర్థతను గ్రహించినది. రాజ్యపాలనలోఁ గొంత కఱకుఁదనము లేనిచో నెగ్గుట దుర్లభము. నాగమ్మ తనకిచ్చిన యేడుజాముల వ్యవధిలోను ప్రజలనుండి కోట్లకొలఁది దనమును వసూలుచేసి తనప్రజ్ఞను జాటినది. పన్నులెగవేసినవారిని మండుటెండలో రేఁగుకంపలపై నిలువఁబెట్టినదఁట. బ్రహ్మనాయనిలో వేఱొక విధమగు గొప్పతనమున్నది. వర్ణభేదములు పాటింపకుండుట, దైవభక్తిని గలిగియుండుట, ఆర్ద్రమనస్కత, ధర్మబద్ధమగు జీవితమును గడపుట– ఇత్యాది గుణములలో నితఁడు దైవసమానుఁడని చెప్పవచ్చును. బ్రహ్మనాయఁడు భారతము నందలి ధర్మజునివంటివాఁడు. ఇట్టివాఁడు పరిపాలనా యంత్రాంగమున నెక్కువగ రాణింపఁడు.
54. చూ. మల్లంపల్లి సోమశేఖరశర్మగారి వ్యాసము, 'చాళుక్య చోళులు'. తెలుఁగు విజ్ఞాన సర్వస్వము, సంపుటి1, పుట 219.
55. Smt. V. Yasodadevi, 'The History of Andhra Country', J.A.H.R.S., Vol.. XIX, p. 35.
56. ibid.

57. ఆల్తూరుపాడు తాళపత్రప్రతి, మొదటిది, బాలునికథ. 22-7-1966న లభించినది.
58. చూ. పల్నాటి వీరచరిత్ర, అక్కిరాజువారి ప్రథమ భూమిక, పుటలు 69, 70.
59. పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుటలు 26, 27.
60. "ఈ మధ్యనే విశాలాంధ్ర ప్రచురణాలయమువారు శ్రీ పింగళి లక్ష్మీకాంతంగారి పీఠికతో సహా 800 పుటలలో పల్నాటి వీరచరిత్ర కథ అంతయు సంక్షేపరూపములో ప్రకటించినారు"- "పలనాటి చరిత్ర రచించిన శ్రీనాథుఁడు పలనాటికవే: కవిసార్వభౌముడు కాదు" వ్యాసము, ఆంధ్రప్రభ (దినపత్రిక, ఆదివారపు సంచిక), వివిధ వ్యాసానుబంధము, 6-5-1962.
61. పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 41.
62. కారెంపూడి తాళపత్రగ్రంథము, ఆకులు 86, 87.
63. 'గురిజాల రాయబారము', వ్రాఁతప్రతి, పల్నాడులో జానపాడు గ్రామమున 1-9-1966 నాడు లభించినది.
64. 'భక్త పలనాటి వీరచరిత్ర', వ్రాఁతప్రతి, మాచెర్లలోఁ గలదు.
65. ఈ లంక పోతన్నయే మందపోటుకథలో మరణించిన లంకన్న యని నా నమ్మకము. 'పిన్నక్క' బాలునికథలో 'అక్క పిన్నక్క' అను పేరుతో నంతఃపురాధికారిణిగా బ్రత్యక్షమగును. కారెంపూడి యుద్ధక్షేత్రమునకు ఆహారపదార్థములు తెచ్చినది ఈమెయేయని గాథాకారులు పాడుచుందురు.
66. వీరసోముఁడు కూఁతురికిచ్చిన ఎఱ్ఱగొల్లబంట్లు నలుగురని నాకు లభించిన తాళపత్రగ్రంథమున గలదు:

**"రాయన బోయుడు రాయపదాలు- పదాలు తమ్ముడు బాలగోపన్న**
**యిప్పుడీ నలుగుర నిక బంచితేను"**- (-కారెంపూడి తాళపత్రప్రతి, ఆకు 142).

కాని యిందలి పేర్లనుబట్టి చూచినచో నీ వీరులు ముగ్గురనియే తెలియును: "రాయన బోయఁడు, రాయ పదాలు, బాల గోపన్న". లేదా 'రాయన' వేఱు, 'బోయఁడు' వేఱు అని తలఁచినచో నలుగురు సరిపోవుదురు. లేదా 'నలుగు' రనుట లేఖక దోషము కావచ్చును. పింగళివారిప్రతిలో సిరాదేవి కరణమీయఁబడిన గొల్లబంట్లు ముగ్గురనియే కలదు:

**"గుండు బోయని సుతులు గురుతైన వారు- రాయబోయండును రాయపదాలు**
**పదాలు తమ్ముడు బాలగోపన్న- వారు ముగ్గురు కూడి వరుసగా కాచు**
**గోవులు వెయ్యియు గొఱ్ఱెలు వెయ్యి"**-- పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రచురణ, పుట 69.

67. అనుఁగురాజు దక్షిణాదియాత్ర సందర్భమున, పేర్నీఁడు చందోలురాజును జయించి, ఆతని పుత్రికయగు మైలమను అనుఁగురాజునకిచ్చి వివాహముగావించి, తాను ఆ పట్టణమునఁగల పాపసాని యను వేశ్యను బొందెను. అప్పటినుండియు నతఁడు గురిజాలలో నున్నప్పుడును, ఆ తరువాత రాజులకు దాయభాగము లేర్పడి మాచెర్లలో నున్నప్పుడును, ప్రతిదినము రాత్రి చందోలునకుఁబోయి తెల్లవారుసరికి తిరిగి వచ్చెడివాఁడు
68. "అర్ధనాల చిట్టిమల్లఁడు"- ఇది బ్రహ్మనాయని కోడిపుంజుయొక్క ముద్దుపేరు. దీని యర్థమునుగూర్చి నేను కొంత ఆలోచన చేసినాను. "చిట్టిమల్లఁడు" అనఁగా "చిన్నవస్తాదు" లేక "ముద్దువచ్చే యోధుఁడు" అని యర్థము. "అర్ధనాల" అను శబ్దము "అడ్డనాల" లేదా "ఒడ్డనాల" అను శబ్దమునుండి ఏర్పడియుండవచ్చును. "అడ్డనాల" కాలక్రమమున "అర్ధనాల" అయినది. ఇది ప్రమాణాభాసము (Hyper Standardization) వలన "అర్ధనాల" అయినది.

"అడ్డనము" = ఇది వైకృత శబ్దము. దీనికి "ప్రేము మొదలైన వానితో చేసిన డాలు" అని యర్థము.

"ఒడ్డనము"= ఇది యుగళశబ్దము. అనఁగా కొన్ని యర్థములందు దేశ్యమును, మఱికొన్ని యర్థములందు వైకృతమును అయిన పదము.

"ఒడ్డనము"= (దేశ్యము)= 1 పందెము, 2 వ్యూహము.

"ఒడ్డనము" (వైకృతము)= 1 బెత్తము లోనగువానిచేతఁ జేయబడిన కేడెము (డాలు), 2 కేడెము.

"అడ్డనాల"= శత్రువు దెబ్బలను డాలువలె నెదుర్కొనునది. "ఒడ్డనాల"= పందెపుకోడి.

ఒడ్డనాల> అడ్డనాల> అర్డనాల> అర్ధనాల: ఇది ఈ శబ్ద పరిణామక్రమము కావచ్చును.

నాయకురాలి కోడిపుంజు పేరు "నల్లమల్లఁడు". అనఁగా "నల్లగానుండెడి వస్తాదు" అనఁగా నల్లకోడి. (నలుపురుంగులోని భేదములనుబట్టి నల్లనికోడిని పందెకాండ్రు "కాకి" అని "నెమలి" అని పిలిచెదరు.)

69. కారెంపూడి తాళపత్రప్రతి, ఆకు 159-బి.
70. అదియే., ఆకు 163-బి.
71. ఆల్తూరుపాడు తాళపత్రగ్రంథము, పత్రసంఖ్య, 108-ఎ.
72. కారెంపూడి తాళపత్రప్రతి, పత్రసంఖ్య, 358-ఎ.
73. పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 271.
74. మద్రాసు వ్రాఁతప్రతి, డి.నెం. 1113.

75. పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 280, 281.
76. పల్నాటి వీరచరిత్ర, (బాలచంద్ర యుద్ధము), వావిళ్లప్రతి, పుట 58 (ఉమాకాంత పరిష్కృతము).
77. అదియే., పుట 77.
78. అదియే., పుట 74.
79. పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 486.
80. గుంటూరు ప్రక్కనున్న 'లాం' గ్రామములో శ్రీ మేడికొండు కోటయ్య అను వీరవిద్యావంతుడు 9-9-1966న పాడిన పాట.
81. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారము, డి.నెం. 1148.
82. పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్రప్రతి, పుట 530.
83. తిరుపతి SVORIL లోని వ్రాఁతఁప్రతి, నెం. 7211-బి., పుటలు 346, 347.
84. విశాలాంధ్రప్రతి, పుట 529.
85. చూ. వీరభాగవతము, పుటలు 224-237.
86. పల్నాటిసీమలోని కారెంపూడికిఁ జెందిన కీ.శే. డా॥ పి.వి.ఆచార్యగారు పల్నాటి వీరకథల ముగింపును చిత్రముగాఁ జెప్పుచున్నారు (చూ. వారి గ్రంథము 'పల్నాటి వీరుల చరిత్ర', 2002, పుటలు 85-87). యుద్ధానంతరము బ్రహ్మనాయఁడు నలగామునకు మరల పట్టము కట్టెను. యుద్ధభూమికి వచ్చి, అఱువదియార్గురు వీరనాయకులను పునర్జీవితులను గావించి, వారితో గుత్తికొండ బిలమునకుఁ బోవనెంచెను. మేడపిలో నొంటరిగా నున్న తమ అంతఃపుర కాంతలను గూడ తమతోఁ దీసికొనపోవఁదలంచెను. కాని దివ్యతేజస్సుతో, దైవాంశతో నున్న వీరులతోఁ గలసి వారి వీరపత్నులు కూడ స్వర్గమునకుఁ బోవలెనన్నచో, వారును పవిత్రులై యుండవలెను. అందువలన, బ్రహ్మన సంకల్పమాత్రమున వీరులతోఁగలసి మేడపి చేరి, తల్లి శీలమ్మను దర్శించి, వీరులు తమ తమ భార్యలతోఁగలసి బంతిభోజనము చేయుటద్వారా వారి పవిత్రతను గుర్తించిన పిమ్మట, వారందఱితోఁగూడి గుత్తికొండ బిలమును బ్రవేశించెనఁట (వివరములకు చూడుడు: అనుబంధము-I). నేఁటికిని, నెల్లూరు ప్రకాశం జిల్లాలలోని వీరవిద్యావంతులు, "కల్లి ఒఱగు" కథానంతరము" మేడప్రక్కల బంతి" (మేడపి+ప్రక్క+బంతి) అను పేరుతో, భార్యాభర్తలు కలిసి భోజనము చేయుట మూలమున ఈ సంఘటనను ఒక వీరాచారముగాఁ బ్రదర్శించుచున్నారు. దీనినిబట్టి "మేడప్రక్కల బంతి" అను పేరుతో నొక ప్రత్యేక వీరగాథ కలదేమో పరిశోధింపవలసియున్నది.
87. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, పలనాటి వీరచరిత్ర పీఠిక, పుట! (పీఠికలో ద్వితీయ భాగము).
88. చూ. అక్కిరాజు ఉమాకాంతంగారి ప్రథమ భూమిక, పల్నాటి వీరచరిత్ర, వావిళ్లప్రతి, పుటలు 78, 79.
89. గురిజాల రాయబారము, వ్రాఁతప్రతి, 1-9-1966 పల్నాడులో జానపాడు గ్రామమున లభించినది.
90. చూ. అక్కిరాజు ఉమాకాంతంగారి ద్వితీయ భూమిక, పల్నాటి వీరచరిత్ర, వావిళ్లప్రతి, 1955, పుట 55.
91. 'వీరపురుషులు-వీరపూజ', తెలుగు విజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము, పుట 1090.
92. శ్రీ మల్లంపల్లి సోమశేఖరశర్మగారి 'చాళుక్య చోళులు' వ్యాసము, తెలుగు విజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము, పుట 216.



# పంద్రెండవ ప్రకరణము

# కాటమరాజు కథాచక్రము

## (The Ballad-cycle of Katama Raju)

తెలుఁగు వీరగాథాసంపదలోఁ బల్నాటి వీరగాథల తరువాతఁ బేర్కొనఁదగినవి 'కాటమరాజు కథలు'. వీనికి 'యాదవరాజుల కథలు, యాదవభారతము, యదుశాస్త్రము' అను నామాంతరములు గలవు. ఇవి ఆంధ్రప్రదేశమునందంతటను పాడఁబడుచున్నను, నెల్లూరు మండలమున దర్శి, కనిగిరి, కందుకూరు, ఉదయగిరి, నెల్లూరు ప్రాంతములందు ఈ కథలకు విశేష ప్రచారమున్నది. గుంటూరు, కడప, కర్నూలు మండలములందును కాటమరాజు కథల కాదరము మెండు. పల్నాటి వీరకథలవలెనే ఇవియును చారిత్రక వీరగాథలు. పల్నాటి వీరకథలు క్రీ.శ. 12వ శతాబ్దమున జరిగిన సంఘటనలు కాఁగా, నీ కాటమరాజు కథలు 12-13వ శతాబ్దముల నాఁటివని తెలియుచున్నది. ఇవి మొత్తము ముప్పదిరెండు కథలున్నవని యాదవ గాథాకారులవలనఁ దెలియుచున్నది. ఈ కథలన్నియుఁ గాటమరాజునకును, నాతని సోదరసోదరీమణులకును, పితృపితామహులకును సంబంధించిన ప్రశస్త సాంప్రదాయిక వీరగాథలు. ఈ ముప్పదిరెండు వీరగాథలును జక్కని వరుసక్రమమున నొక పెద్ద కథాచక్రముగా నేర్పడియున్నవి. వీనిని 'కాటమరాజు కథాచక్రము'గా బిలువవచ్చును. ఈ కథాచక్రము ఐతిహాసిక దశకు మిక్కిలి దగ్గఱలో నున్నది.

### 1. కాటమరాజు కథల సంఖ్య

'కాటమరాజు కథ, కాటమరాజు కథ' అనుటయే కాని దీనిని గూర్చిన సంపూర్ణ విషయములేవియుఁ దెలుఁగు సాహిత్య లోకమునకు నేఁటి (1967) వఱకును దెలియవు. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములో నాఱు కథలున్నవి. వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పరిశోధనలవలన నిందలి కథలు నాలుగు ముద్రింపఁబడినవి. ఇవి తప్ప తక్కినవేవియు నాంధ్రసాహిత్య సంసేవ్యులకుఁ దెలియవు.

'కాటమరాజు కథ' అను నేకవచన ప్రయోగము తప్పు. ఏలయన, ఇది ఒక్క కథ కాదు, ముప్పదిరెండు కథల సువిశాల చక్రము. ఈ చక్రములోని ప్రధానవ్యక్తి కాటమరాజైనను, నీ ముప్పదిరెండు కథలలోను నే కథకును 'కాటమరాజు కథ' అని పేరు లేకపోవుట ఆశ్చర్యకరము! ఇవి వీరగాథాచక్రమని సూచించుటకే కాఁబోలును, జానపదులు 'కాటమరాజు కథలు' అను బహువచన రూపమునే వాడుచున్నారు. పల్నాటి వీరకథలును కాటమరాజు కథలును వీరగాథావృత్తములని తెలిసియే కాఁబోలు బ్రౌనుదొరగారు వీని చివర 'చరిత్ర' అను శబ్దమును జేర్చి ప్రయోగించినారు ('పల్నాటి వీరచరిత్ర', 'కాటమరాజు చరిత్ర'). వేటూరి ప్రభాకరశాస్త్రిగారు 'కాటమరాజు కథ' అను పేరుతో సంగ్రథితము చేసినది నిజమునకు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' అను నొక్క వీరగాథ మాత్రమే. వేటూరివారి ఛాత్రులును, మద్గురువర్యులును నగు శ్రీ తిమ్మావజ్ఝుల కోదండ రామయ్యగారు ఈ 'కాటమరాజు కథ' కాటమరాజు చరిత్రను సంపూర్ణముగా నభివర్ణించు గ్రంథమని ప్రశంసించిరి.[1] ఇది ప్రామాదికము. వేటూరివారిచేఁ బరిష్కరింపఁబడి, 'కాటమరాజు కథ'గాఁ బ్రకటితమైన యీ కథ, సుదీర్ఘమగు కాటమరాజు కథాచక్రమున నొక భాగము మాత్రమే. ఈ కథాచక్రము, కాటమరాజు పితామహుఁడగు వల్లురాజుకథతోఁ బ్రారంభమై, కాటమరాజు సోదరుఁడగు భక్తిరన్నకథతో నంతమగును. ఈ రెండు కథలకును మధ్య అనేక కథలున్నవి. వానిలో నెఱ్ఱగడ్డపాటి పోట్లాట యొకటి. ఇదియే కాటమరాజు వృత్తాంతమును సంపూర్ణముగా నభివర్ణించుననుట పొసగదు.

ఈ కాటమరాజు కథాచక్రమున ముప్పదిరెండు కథలున్నవని చెప్పుటయే కాని, ఆ ముప్పదిరెండు కథల నామములను వరుసగాఁ జెప్పఁగలిగిన గాథాకారుఁడెవ్వఁడును నాకు తటస్థపడలేదు. మద్రాసు GOML లో బల్నాటి వీరకథ లెక్కువగా నున్నవి కాని, కాటమరాజు కథలు మాత్రము మిక్కిలి తక్కువగ నున్నవి. ఇందున్న మొత్తము కథలు ఆఱు మాత్రమే. తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక (1953-54)లో మదరాసు గ్రంథాలయమునఁగల ఈ యాఱుకథలనుగూర్చి విపులముగాఁ జర్చించియున్నారు. వేటూరివారు పరిష్కరించిన 'కాటమరాజు కథ'ను 1953లో మదరాసు GOML వారు ప్రకటించిరి. దీనికి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పీఠిక వ్రాయుచు, నీ కథాచక్రమున నింకను మఱికొన్ని కథలుండియుండుననియు, నవి మదరాసు గ్రంథాలయమందు సహితము లేవనియు నొక చక్కని ఊహను వెల్లడించిరి:

> "The story proper or the section, dealing with the original agreement and the cause of the quarrel, in not found here in this work. Hence, it seems, that there should be some more sections in this work which even the Government Oriental Library does not possess."[2]

సత్యాన్వేషణము పరిశోధకుల లక్షణము. అట్టి యన్వేషణమున నూటికి నూఱుపాళ్లును గృతార్థులైనవారు మల్లంపల్లివారు. వారు పైన

వెలిబుచ్చిన ఊహయే నాకు కరదీపిక కాఁగా, నీ కథాచక్రమందలి తక్కిన వీరగాథలను సంపాదించుటకు నడుముకట్టి ఆంధ్రదేశ మంతయు శోధించితిని. యాదవ వృద్ధులను అనేకులను సంప్రతించి తిని. ఆంధ్రదేశమున వివిధ ప్రాంతములందుగల గాథాకారులను గలసికొంటిని. సుమారు ఇరువది వఱకును తాళపత్రగ్రంథములను సంపాదించితిని. ఈ త్రివిధ పరిశీలనముతో నీ కాటమరాజు కథాచక్రమునఁగల ముప్పదిరెండు వీరగాథల నామములను జాల భాగము నిర్ణయింపఁ గలిగితిని. నాకుఁ దెలిసినంత వఱకును కాటమరాజు కథాచక్రమున నీ క్రింది వీరగాథలున్నవి:

1. 'వల్లురాజు కథ' లేక 'వలురాజు కథ' లేక 'ఆవుల వలురాజు కథ'. (వలరాజు> వలురాజు> వల్లురాజు).
2. 'పంపాద్రి కథ'.
3. 'పెద్దిరాజు కథ.'
4. 'సింహాద్రిరాజు కథ' (అలభ్యము).
5. 'ఎఱనూకరాజు కథ'.
6. 'నలనూకరాజు కథ' (అలభ్యము).
7. 'పోలురాజు కథ' లేక 'శివపురాణము'. దీనిలో నాఱు చాటువలు కలవు.
   1) 'చంద్రగుప్తుని చాటువ'.
   2) 'మల్లికాదేవి చాటువ'.
   3) 'ముక్కంటి చాటువ' లేక 'బ్రాహ్మణ చాటువ'.
   4) 'జంగాల చాటువ'.
   5) 'కపోత చాటువ'.
   6) 'గయుని చాటువ'.
8. 'బల్లికురువ పోట్లాట'.
9. 'కఱియావులరాజు కథ'.
10. 'కాటమరాజుకు పట్నంకట్టిన కథ' లేక 'కాటమరాజు పట్టాభిషేకము'.
11. 'పాపనూక కథ'.
12. 'ఆవులమేపు'– నామాంతరములు: 'ఉత్తరాది ఆవులమేపు'– 'కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు'– 'ఆవులమేపు: ఉత్తరకాండము'. (ఉత్తరాది= ఉత్తరదిక్కు).
13. 'పాలేటి కథ' లేక 'గంగతర్కము', లేక గంగ– కాటమరాజు తర్కవాదము'.
14. 'ఎఱ్ఱయ్య తరకవాదము'.
15. 'జన్నివాడ కథ'– దీనికి అయిదు నామాంతరములు: 'దక్షిణాది ఆవులమేపు'–'కాటమరాజు దక్షిణాది ఆవులమేపు'–'ఆవులమేపులు: దక్షిణకాండము'–'చదరంగం కథ'–'పుల్లరి కథ' (దక్షిణాది= దక్షిణదిక్కు)
16. 'భట్టు రాయబారము' లేక 'కల్లి రాయబారము'.
17. 'కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ'.
18. 'బొంగరాల కథ'– మూఁడు నామాంతరములు– 'ముమ్మయ్య– పోచయ్య బొంగరాలు'– 'వేడుక బొంగరాల కథ'– 'అలుగులపోలు'.
19. 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'– దీనిలో నేడు కాండ లున్నవి:
   1) 'చల్లవారి జగడము' లేక 'ఈర్లమాని కథ' లేక 'తిక్కనామాత్యుని కథ'.
   2) 'బొల్లావు జగడము'.
   3) 'బీర్నీఁడు యుద్ధము'.
   4) 'అయితమరాజు– కఱియావులరాజుల యుద్ధము'.
   5) 'బాలరాజుల యుద్ధము'.
   6) 'ఆవుల యెద్దుల జగడము'– 'ఎఱ్ఱయ్యల యుద్ధము'.
   7) 'కాటమరాజు యుద్ధము'.
20. 'అగుమంచి కథ'.
21. 'పాపనూక వలపోత'.
22. 'భక్తిరన్న కథ'.

ఈ కథలో పెద్దిరాజు కథ, పోలురాజు కథ, కఱియావులరాజు కథ, గంగతర్కము, భట్టురాయబారము, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, భక్తిరన్న కథ– అను ఏడు వీరగాథలు ఎక్కువగా పాడబడుచుండును.

పై కథలలో 'సింహాద్రిరాజు కథ'– 'నలనూకరాజు కథ'– అను రెండు వీరగాథలు తప్ప తక్కినవన్నియును నాకు లభించినవి. ఈ రెండు కథలకును ప్రచారము తక్కువ. అందుచే లభించుట కష్టము. ఇంకను "అగుమంచి వలపోత, గంగ పుట్టుక, పల్లికొండ పుట్టుక, భైరవకురువ యుద్ధము" అను మఱి నాలుగు వీరగాథలున్నవని తెలియుచున్నది. ఇవి నిజముగా లోకమున నున్నవో లేవో చెప్పలేను. ఇటీవల (2010లో) ఆంధ్రవిశ్వవిద్యాలయమునకు చెందిన ప్రొ॥ మఱ్ఱిబోయిన జయదేవ్‌గారు 'పాపనూక వలపోత'ను సేకరించి ప్రచురించినారు. కాటమరాజు ముత్తాత (ప్రపితామహుఁడు) అయిన 'కవులావుల గంగురాజుకథ'ను తెలంగాణములోని 'మదెచ్చులవారి' నుండి శ్రీ రంగు రాజపాపయ్యగారు సేకరించినారు (కాకతీయ విశ్వవిద్యాలయము, 1996). కాని యిది వీరగాథవలె లేదు, కల్పిత జానపదకథవలె నున్నది. కాటమరాజు కథలతోపాటు యాదవ గాథాకారులు తఱచుగాఁ బాడుచుండు 'కంసుఁడుకథ' లేక 'కృష్ణభాగవతము' లేక 'విష్ణుభాగవతము'ను గూడ దీనికిఁ జేర్చవలెనని

కొందఱు చెప్పుచున్నారు. కాటమరాజు విష్ణుమూర్తి యవతారమే కావున, 'కృష్ణభాగవతము' కాటమరాజు యొక్క పూర్వజన్మకథ యగును.

ఈ విధముగాఁ బైన తెల్పిన 22 కథలకు "అగుమంచి వలపోత, గంగపుట్టుక, పల్లికొండ పుట్టుక, కంసుఁడుకథ" అను నాలుగు వీరగాథలను జేర్చినచో మొత్తము ఇరువదియాఱు వీరగాథలగును. ఇంకను నాఱు కథలు తగ్గుచున్నవి. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలోని ఏడు కాండలను ఏడు ప్రత్యేక వీరగాథలుగా భావించినచో నీ చిక్కు తొలఁగిపోవును. (ఈ కాండలేడును బ్రత్యేక వీరగాథలవలెనే పాడఁబడుచుండును.) అప్పుడు కాటమరాజు కథాచక్రములోని మొత్తము వీరగాథలు ముప్పదిరెండగును. లేదా అగుమంచి వలపోత మొదలగు నాలుగు కథలును నీ కథాచక్రమున లేవనియుఁ గంసుఁ డుకథ దీనికిఁ జేర్చరాదనియు భావించినచో, నెఱ్ఱగడ్డపాటి పోట్లాటను ఏడు ప్రత్యేక గాథలుగా నిర్ణయించుటతోపాటు పోలురాజుకథను గూడ ఆఱు ప్రత్యేక గాథలుగాఁ దలంపవలెను. (కాని పోలురాజుకథలోని చాటువలు ప్రత్యేక కథలనదగినంత పెద్దవికావు.) అప్పుడు కథాచక్రమున ముప్పదిరెండు కథలసంఖ్య సరిపోవును. బొంగరాలకథలోను, భక్తిరన్నకథలోను వచ్చిన ప్రసక్తిని బట్టి "భైరవకురువ యుద్ధము" అను వీరగాథ కలదని అనుమానము వచ్చుచున్నది. ఇది చిట్టినూక భర్తయగు 'కల్లందుల పోల్నీఁడు' చేసిన యుద్ధపరాక్రమమును దెలుపు కథయై యుండును.

1909లో బత్తుల లక్ష్మయ్యగారు రచించిన 'రాజవంశ ప్రదీపిక' యను గ్రంథమును బేతపూడి జోగిసూర్యప్రకాశరావుగారు (తెనాలి) ప్రకటించినారు. ఇందు కాటమరాజు కథాచక్రమున వచ్చు యాదవవీరుల ప్రసక్తి కొంతకలదు. 1917లో 'కాటమరాజుకథ' అను ద్విపదకావ్యము ముద్రింపఁబడెనని ఆంధ్రవాఙ్మయసూచి (పుట 94) ని బట్టి తెలియుచున్నది. ఇది 'నందుల కాటమరాజు' అను కవిచే రచింపఁబడి, యం. సంజీవకవిచేఁ బరిష్కరింపఁబడినది. ఇది అలభ్యము. 1926వ సంవత్సరమున ఆంధ్ర యాదవ సంఘమువారు (ఎడవూరు) గుఱ్ఱముకొండ భక్తవత్సలకవి రచించిన 'కరియావుల కాటమరాజు చరిత్ర' అను పద్యకావ్యమును బ్రకటించిరి. ఇందు పెద్దిరాజుకథ మాత్రమే చెప్పఁబడినది. ముదిగొండ వీరభద్రకవి తన పద్యకావ్యమునఁ బల్నాటి వీరచరిత్ర నంతటిని వ్రాసినట్లుగా నీ కవి కాటమరాజు సంపూర్ణ చరిత్రను తన పద్యకావ్యమున వ్రాయకపోవుట విచారకరము.

1947 జనవరి నెలలో శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు క్రీ.శ. 1000-1599 మధ్యకాలమున నాంధ్రదేశమును బాలించిన సామంత రాజవంశముల చరిత్రనుగూర్చి అద్భుతమగు పరిశోధన చేసి, ఆ పరిశోధన వ్యాసమును మద్రాసు విశ్వవిద్యాలయమునకు సమర్పించిరి. అందు ఎఱ్ఱగడ్డపాడు, అలవులపాడులను పాలించిన యాదవులనుగూర్చి, నెల్లూరునేలిన తెలుఁగు చోడులనుగూర్చి చక్కగా వివరించిరి.

శ్రీ హరి ఆదిశేషువుగారు మదరాసు GOML లోని కాటమరాజు కథలనుగూర్చి 1953లోఁ గొంత విమర్శ చేసిరి (చూ. జానపద గేయవాఙ్మయ పరిచయము, పుటలు 23-29). దీనిలో వీరు ఖడ్గతిక్కన యుద్ధమును మాత్రమే యెక్కువగఁ జర్చించినారు. ఈ కథ క్రీ.శ. 1170లో జరిగినదనియు, నిది పల్నాటి యుద్ధముకన్నఁ బ్రాచీనమైనదనియు వీరు వ్రాయుట సహేతుకముగా లేదు. ఇదే సంవత్సరము శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు మదరాసులోని కాటమరాజు కథాప్రతులనుగూర్చియు, నితర విశేషాంశములనుగూర్చియు ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో నొక అత్యుత్తమ వ్యాసమును బ్రకటించిరి. ఇందు కాటమరాజు కథ, భట్టురాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, వల్లురాజు యుద్ధము, అగుమంచికథ- అను నాఱు వీరగాథలనుగూర్చి వీరు సాకల్యముగాఁ జర్చించిరి. (మదరాసు GOML లోఁగల కథలు ఈ ఆఱు మాత్రమే. ఇందలి చివరి రెండు కథలును నేఁడు తిరుపతి ప్రాచ్య లిఖిత గ్రంథాలయమునకుఁ దరలింపఁబడినవి.) శ్రీ కోదండరామయ్యగారు తమ వ్యాసమునకు వేరొక అనుబంధమును భారతిలోఁ బ్రకటించినారు. ఈ అనుంధ వ్యాసములో వారు కాటమరాజు యుద్ధకాలమును గూర్చి చర్చించినారు. మదరాజు GOML వారు, వేటూరివారు పరిష్కరించి యుంచిన 'కాటమరాజుకథ'ను మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పీఠికతో 1953లోనే ప్రకటించిరి. ఇందొక ప్రధానకథ, మూఁడు అనుబంధ కథలు గలవు. ప్రధానకథకు 'కాటమరాజుకథ' అని పేరిడిరి. కాని ఇది నిజమునకు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'. అనుబంధకథలలో 'భట్టు రాయబారము', 'కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ' 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' అను మూఁడు కథలున్నవి. ఈ యనుబంధమందలి ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటకును, ప్రధానకథకును సంబంధము లేదు. ఇవి రెండును భిన్నకవుల రచనలు. ప్రధానకథారచయిత కొమనాల గోత్రమునకుఁ జెందిన గంగుల పినయెల్లయ. ఇతని తండ్రి యెల్లయ్య, సోదరుడు సర్వన. అనుబంధములలోని కథారచయితల పేర్లు తెలియుట లేదు. జానపదగేయములనుగూర్చి విశేష పరిశోధన చేసిన డా॥ బి. రామరాజుగారు ఏలనో యీ ముద్రిత గ్రంథములోని నాలుగు కథలను మాత్రమే ముచ్చటంచి యూరకొనిరి (చూ. వారి తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౨౦౨-౨౧౬ ). వేటూరి ప్రభాకరశాస్త్రిగారి పుత్రుఁడు శ్రీ ఆనందమూర్తిగారు 1955లో 'పరిశోధన' 5, 6, 7 సంచికలలో 'అగుమంచికథ'ను బ్రకటించిరి. ఇది కాటమరాజు కథాచక్రమునఁ జివరి భాగమునకుఁ జెందినది.

1959లో శ్రీ ఆరుద్రగారు అగుమంచి పాత్రను గుఱించి ఒక చిన్నవ్యాసమును బ్రకటించిరి (చూ. "అగుమంచి అబ్బురపు పాత్ర", భారతి, ఆగస్టు సంచిక, 1959). శ్రీ ఆరుద్రగారే 1960లో వేఱొక వ్యాసమును వ్రాయుచు, నెల్లూరి రాజులతోఁ బోరాడిన కాటమరాజు విశాఖమండలమునకుఁ జెందినవాఁడని నిరూపించిరి (చూ. ఆంధ్రప్రభ, దినపత్రిక, ఆదివారము, సారస్వతానుబంధము, 27-11-1960).

1962లో శ్రీ గోవుల నాగేశ్వరకవిగారు 'మదన కుంభినీ యుద్ధము అను పెద్దిరాజు నాటకము'ను రచించెను. దీనిని కనిగిరికిఁ జెందిన మద్దెబోయిన రోశయ్యగారు ప్రకటించిరి. ఇదికూడ భక్తవత్సలకవి పద్యకావ్యమువలెనే పెద్దిరాజుకథను మాత్రమే వర్ణించుచున్నది. (పంపాద్రికథలోని చివరిభాగముకూడ కొంత ప్రసక్తమైనది.)

1967లో (10-5-1967నాఁడు) ఆంధ్రప్రదేశ్ యాదవ సంఘ ప్రధాన కార్యదర్శియు, నుత్తమ సంస్కారియు, వృద్ధయాదవుఁడును అగు శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు (తెనాలి తాలూకా, యడవూరు గ్రామము) 'వలురాజు చరిత్ర' అను వీరగాథను బ్రకటించిరి. ఇది కాటమరాజు కథాచక్రమున మొట్టమొదటి వీరగాథ. దీని రచయిత 'మద్దులేటి కవి' అని తెలియుచున్నది. మదరాసు GOML లో వల్లురాజు యుద్ధమను పేరుఁగల కథ నిజమునకు వల్లురాజుకథ కాదు. అది ఆద్యంత రహితమైన పోలురాజుకథ మాత్రమే. ఈ సంవత్సరములోనే (19-7-1967నాఁడు) శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు 'బల్లికురువ యుద్ధము'ను గూడ బ్రకటించిరి. తరువాతి కాలములో వీరు 'పోలురాజు చరిత్ర'ను, 'కఱియావులరాజు చరిత్ర'ను సేకరించి ప్రకటించిరి. పిమ్మట 'వేడుక బొంగరాల కథ'ను, 'యరనూకరాజు కథ'ను సేకరించి నాకొసంగిరి. కాటమరాజు కథాసాహిత్యమునకు పిచ్చయ్యగారు చేసిన సేవ అమూల్యమైనది.

1969లో (1-8-1969 నుండి 24-10-1969 వఱకును) 'ప్రగతి' వారపత్రికలో శ్రీ ఆరుద్రగారు "కాటమరాజు కథ" అను పేరుతో నొక గొప్ప నాటకమును వ్రాసిరి. ఇందు 'పుల్లరి కథ'- 'భట్టు రాయబారము'- 'తిక్కనామాత్యుని కథ'- 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'- అను వీరగాథలలోని యితివృత్తములను ఆరుద్రగారు చక్కఁగ నుపయోగించుకొనిరి.

## 2. కాటమరాజు చరిత్ర

### 2.1. చారిత్రకాంశములు:-

కాటమరాజు-నల్లసిద్ధులనుగూర్చిన చారిత్రకాంశములను మొట్టమొదట తడవినవారు శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు. ఈమె 1947లో రచించిన తన పరిశోధన వ్యాసమున అలవులపాడు యాదవులనుగూర్చియు, ఎఱ్ఱగడ్డపాడు యాదవులనుగూర్చియుఁ జర్చించిరి (చూ.రాజమండ్రి ఆంధ్ర చారిత్రక పరిశోధక సంఘము వారి పత్రిక, సంపుటము 23, పుటలు 12-14). కాని యశోదాదేవి గారు కేవలము గుండ్లపాలెములో లభించిన యొక శాసనమును బట్టియు, నితర స్థానిక చరిత్రలనుబట్టియు నీ యాదవచరిత్రలను జర్చించిరి. కాటమరాజునకు సంబంధించిన వీరగాథల నీమె పరిశీలించినట్లుగా లేదు. (1947 నాఁటికి కాటమరాజు వీరగాథ లేవియు ముద్రింపఁబడలేదు.) అందుచే నీమె యిచ్చిన అంశములలోఁ గొన్ని తప్పులు దొరలినవి. నెల్లూరు చోళరాజ్యములోనే యున్న అలవులపాడును వల్లురాజు, ఆల పోలురాజు పాలించిరనియు, ఎఱ్ఱగడ్డపాడును కాటమరాజు పాలించెననియు వ్రాసిరి. ఆల పోలురాజు నెల్లూరునేలిన తెలుఁగు చోళులలో మూఁడవ మనుమసిద్ధితోఁ బుల్లరి విషయమై పోరాడెననియు, నా యుద్ధము క్రీ.శ. 1259లో లింగాలకొండ, ఎఱ్ఱగడ్డపాడు దగ్గఱ జరిగెననియు, నల్లసిద్ధి అనినను, మనుమసిద్ధి అనినను నొక్కరే యనియు, నతని కాలము క్రీ.శ. 1248-1267 అనియు యశోదాదేవిగారు తెల్పి యున్నారు. ఇదియంతయు అలవులపాడు యాదవులనుగూర్చిన వృత్తాంతములో నిచ్చిరి. మరల ఎఱ్ఱగడ్డపాడు యాదవులనుగూర్చి వ్రాయుచు, కాటమరాజు మూఁడవ మనుమసిద్ధి లేక మూఁడవ నల్లసిద్ధితోఁ బుల్లరి విషయమై పోరాడెనని తెల్పిరి. వల్లురాజుకూడ మనుమసద్ధితోఁ బోరాడెనని చెప్పిరి. కాని వల్లురాజునకును ఆల పోలురాజునకును గల సంబంధమునుగూర్చి కాని, వీరిరువురితో కాటమరాజునకుఁగల సంబంధమునుగూర్చి కాని తనకుఁ దెలియదనిరి. ఎఱ్ఱగడ్డపాడు అనునది గుంటూరు మండలమున ఒంగోలు తాలూకాలో నున్నదనిరి. వ్యక్తుల నామములుకూడ తప్పుగా నిచ్చిరి. ఆవుల పోలురాజును 'అల పోలురాజు' అనియు, కఱియావుల రాజును 'కరియొరరాజు' (Kareoraraja) అనియు, కాటమరాజును 'కంటమరాజు' (Kantamaraja) అనియు దెల్పిరి. ఆల పోలురాజు, కాటమరాజు, కాకతి గణపతిదేవుని కాలము వారని చెప్పిరి. గుండ్లపాలెము శిలాశాసనములో ప్రతాపునిపేరుండుట పొరపాటనిరి. గణపతిదేవుఁడు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో ఆవుల పోలురాజునకు సహాయము చేసెనఁట.

కాటమరాజు కథాచక్రమును బరిశీలించినచో యశోదాదేవి గారు వెలిబుచ్చిన అభిప్రాయములు చాలవఱకు నిలువజాలవు. వల్లురాజు కాటమరాజునకుఁ బితామహుఁడు. ఇతఁడు 'యల మంచి'ని పాలించెను గాని 'అలవలపాడు'ను బాలించినవాడు కాఁడు. ఈ యలమంచి నేటి విశాఖమండలమున 'ఎలమంచిలి' అను పేరుతోనున్న పట్టణము. వల్లురాజు కొడుకు పెద్దిరాజు, పెద్దిరాజు కొడుకు కాటమరాజు. పోలురాజు, కాటమరాజునకుఁ బినతండ్రి (పెద్దిరాజునకు కడగొట్టు తమ్ముడు). ఇతఁడు సిద్ధిరాజుతో యుద్ధమొనర్చెననుట సరికాదు. పోలురాజు, నల్లసిద్ధి పూర్వుఁడైన

చోడానితోఁ బోరాడి చనిపోయెను. నల్లసిద్ధితో యుద్ధము చేసినది కాటమరాజొక్కడే. ఇతని తాత వల్లురాజును, పినతండ్రి పోలురాజును నల్లసిద్ధితోఁ బోరిరనుట అసంగతము. వీరు నల్లసిద్ధికంటెఁ బూర్వులు. తమ పితామహుఁడగు ఆవుల వలురాజు పేరుతో కాటమరాజాదులే 'అలవలపాడు' గ్రామమును నిర్మించి యుందురు. ఇది ఎఱ్ఱగడ్డపాడునకు మిక్కిలి సమీపమున నున్నది. కాఁబట్టి అలవలపాడు నేలిన యాదవులు వేఱనియు, ఎఱ్ఱగడ్డపాడును బాలించిన యాదవులు వేఱనియు భావించుట సరికాదు.

కాటమరాజు పాలించిన ఎఱ్ఱగడ్డపాడు కనిగిరి తాలూకాలో పెదఅలవలపాడునకు సమీపమునకుఁగల పంచలింగాలకొండకు ఉత్తర భాగముననున్న పాలేటితీరమే కాని, ఒంగోలు తాలూకాలోనున్న ఎఱ్ఱగడ్డపాడు గ్రామమనుట సరికాదు. యుద్ధభూమియగు ఎఱ్ఱగడ్డపాడు కనిగిరి సమీపములో పంచలింగాలకొండ ప్రక్కనే యున్నది కాని, గుంటూరు మండలమున లేదు. మెకంజీ వ్రాఁతప్రతులలో రణరంగము గుంటూరు మండలమున నమరావతి దగ్గఱనని యున్నది.[3] ఇది మఱింత హాస్యాస్పదము. కనిగిరికిఁ దూర్పుగా పది పంద్రెండు మైళ్ల దూరములో పంచలింగాలకొండ యున్నది. ఆ కొండ దిగువనే కాటమరాజుకోట, యుద్ధభూమియగు నెఱ్ఱగడ్డపాడును గలవు.

యశోదాదేవిగారు మనుమసిద్ధియే నల్లసిద్ధియనుట, యుద్ధకాలము క్రీ.శ. 1259 అనుట,ఇది గణపతిదేవుని కాలమున జరిగెననుట, ఎఱ్ఱగడ్డపాటి యుద్ధమున ఈ గణపతిదేవుఁడు ఆవుల పోలురాజునకు సహాయము చేసెననుట సంశయాస్పద విషయములు.[4] చోడతిక్కని పుత్రుఁడైన మనుమసిద్ధికి ముగ్గురు కొడుకులనియు, నందు రెండవవాఁడు నల్లసిద్ధియనియు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తెలుపుచున్నారు (చూ. కాటమరాజుకథ, పీఠిక, పుట xxvii ). గుంటూరుజిల్లా నరసరావుపే శాసనముకూడ దీనిని బలపఱచుచున్నది. వీరగాథలలో నెచ్చటను 'మనుమసిద్ధి' పేరు లేదు, 'నల్లసిద్ధి' యనియే కలదు. కాఁబట్టి మనుమసిద్ధి కుమారుడైన నల్లసిద్ధికాలము (క్రీ.శ. 1270/75-1297) లోనే ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట జరిగినదని చెప్పవలెను. క్రీ.శ. 1282 యుద్ధకాలమని శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు నిర్ణయించినారు (భారతి, జులై, 1966). కాటమరాజును నల్లసిద్ధియు కాకతీయ ప్రతాపరుద్రుని కాలము వారనుటకు గుండ్లపాలెము శాసనమే కాక, 'కఱియావుల రాజుకథ' యను వీరగాథయు సాక్ష్యమిచ్చుచున్నది. (ఈ వీరగాథయొక్క తాళపత్రప్రతి నాకు లభించినది.) తెలుఁగు చోళులు మొదట పల్లవ సామంతులైనను తరువాత కాకతీయ సామంతులు. ముఖ్యముగా చోడతిక్కరాజును (క్రీ.శ. 1209/10-1249/50), అతని పుత్రుఁడు మనుమసిద్ధియు (క్రీ.శ. 1249/50-1270/75) గణపతిదేవునకు విశ్వాసపాత్రులగు సామంతులు. వీరికి వ్యతిరేకముగా గణపతిదేవుఁడు యాదవులకు సహాయము చేసెననుట సరికాదు. యాదవులకును కాకతీయులకును అనాదిగా వైరములున్నవి. గణపతిదేవుని తండ్రిని పెదతండ్రిని దేవగిరి యాదవులు చంపిరి. కాఁబట్టి శ్రీమతి వారణాసి యశోదాదేవిగారిచ్చిన చారిత్రక విషయములు- ముఖ్యముగా యాదవులకు సంబంధించినవి సందిగ్ధముగానున్నవి కాని, స్పష్టముగా లేవని చెప్పవలెను. ఈమె వీరగాథలను బరిశీలింపకుండుటయే ఈ సందిగ్ధతకుఁ గారణము.

## 2.2. చారిత్రక సంశయములు:-

చారిత్రక విద్వాంసులు, విమర్శకులు కాటమరాజు కథాచక్రము యొక్క చారిత్రకమగు విలువను శంకించుట విచారకరము. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు కాటమరాజుకథలనుగూర్చి ఇట్లనినారు:-

"Though the story is very interesting it lacks historicity. Except the names of Nallasiddhi and Kadga Tikkana there is nothing historical in this work. The story might be true; but there is no evidence to prove its historicity. Nor is there any evidence to show that the persons mentioned either on the side of Katamaraju or on the side of King Nallasiddhi are historical."[5]

చారిత్రకులు ఇట్లు అనుమానించుటకుఁ గారణమున్నది. ఈ కథాచక్రమున ముప్పదిరెండు వీరగాథలుండఁగా, నీ చారిత్రకులకుఁ బండితులకుఁ దెలిసిన కథలు మూఁడు, నాలుగు మాత్రమే. ఈ సుదీర్ఘ కథాచక్రమందలి వివిధ కథలను వ్యక్తులను బరిశీలించి నిర్ణయము చేయవలెను గాని, యేవియో రెండు మూఁడు కథలనుబట్టి సిద్ధాంతములు చేయరాదు. నాకు లభించిన 'కఱియావులరాజుకథ' అను వీరగాథలో ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమున అయితమరాజు, పల్లికొండ, కఱియావులరాజు భట్టావుల వల్లభన్న, పుత్తమరాజు, పుల్లావుల కేశవయ్య అను ఆఱుగురు యాదవవీరులు శంభుని తిరునాళ్లను జూచుటకై యోరుగల్లు నగరమునకు వచ్చిరనియు, నచట సాహసకృత్యములను జేసిరనియు, ప్రతాపరుద్రుఁడు వారిని జంప యత్నించెననియు స్పష్టముగా నున్నది. దీనినిబట్టి కాటమరాజుకథలు కాకతీయ ప్రతాపరుద్రుని కాలమునాఁటి వనుట నిస్సంశయము కదా!

ఆంధ్రప్రదేశ్ చరిత్రలోఁ బ్రధాన రాజవంశములనుగూర్చియే ఇంతవఱకును బరిశోధన జరిగినది కాని, సామంతరాజు వంశములకును, చిన్నచిన్న రాజవంశములకును సంబంధించిన చరిత్ర చీకటిలోనే మూలుగుచున్నది. శ్రీమతి వారణాసి యశోదాదేవి గారు సామంతరాజన్యుల చరిత్రపైఁ బరిశ్రమించినట్లుగా, నేఁటి చరిత్రకారు లొక్కొక్క మండలమునుగూర్చి సమగ్రపరిశోధన జరుపవలెను. అప్పుడు కాని వీరగాథలలోని సంఘటనలకుఁ జారిత్రక ప్రామాణ్యము లభింపదు. వీరగాథలన్నియును స్థానిక సంఘటనలపై నాధారపడి పుట్టునుగాని, పెద్దపెద్ద రాజవంశముల మహాయుద్ధములపై వీరగాథలేర్పడవు. (బొబ్బిలియుద్ధముపై వీరగాథ యున్నది కాని, తళ్లికోటయుద్ధము లేక 'రక్కసి- తంగడి' యుద్ధముపై వీరగాథ లేదు

కదా!). కావున నిట్టి సూక్ష్మచారిత్రక పరిశోధనము అత్యవసరము. అట్టి పరిశోధన జరుగువఱకును, కాటమరాజుకథల చారిత్రక ప్రామాణ్యమును శంకించుటకు ఏ చరిత్రకారునకును అధికారము లేదు.

వీరగాథలు కేవలము పుక్కిటిపురాణములైనచోఁ బ్రజల హృదయముల నుఱ్ఱూతలూఁగించుచు, వీరరసావేశమున శివమెత్తించు శక్తి వానికుండదు. పైరాణికగాథను బాడునప్పుడు, స్థానిక చారిత్రక వీరగాథను బాడునప్పుడున్నంత రసావేశముండదు. వీరగాథలలో నెక్కువ భాగము చారిత్రకములే. అవి చక్రవర్తులకు సంబంధించిన చరిత్రలు కాకపోవచ్చును. తెనుఁగుగడ్డపై స్థానికముగాఁ బ్రసిద్ధికెక్కిన కొందఱు సామంతరాజన్యుల, పాళెగాండ్ర, జమీందారుల, శూరుల, సాహసుల, బందిపోట్ల వీర సాహస కృత్యముల నభివర్ణించు చరిత్ర లనుటలో మాత్రము సందేహము లేదు.

నల్లసిద్ధి చోడరాజని చరిత్రలోను, స్థానిక చరిత్రలలోను, కైఫీయతులలోను నుండఁగా, గాథాకర్త నల్లసిద్ధిని పల్లవరాజనుట పొరపాటు కావచ్చును. మన కవులకు ఉత్తరాదిరాజులందఱును అయోధ్య రాజులైనట్లే, దక్షిణాదిరాజులందఱును పల్లవులుగనే కాన్పింతురు. గాథాకర్త చోళుఁడైన నల్లసిద్ధిని పల్లవరాజుగాఁ బేర్కొనుటకుఁగల కారణమును రామరాజుగారు చక్కగా నూహించిరి: "ఖడ్గతిక్కన నల్లసిద్ధిని పలుమారీ గేయమున 'పల్లవ నలసిద్ధి పట్టాభిరామ' అని సంబోధించినట్లున్నది. నల్లసిద్ధి నిజముగా చోళుడు. చోళులు, పల్లవ వంశము తరువాత నధికారమునకు వచ్చినారు. మొదట వీరు పల్లవులకు సామంతులై వారి బిరుదములను దాల్చియుందురు. ఇదియునుగాక ఆంధ్రదేశమందలి సామంత రాజకుటుంబములెన్నియో పల్లవులచే స్థాపింపబడినవని తెలియవచ్చు చున్నది. వారి గౌరవ సూచకముగ పల్లవ బిరుదమును తెలుగుచోళులు దాల్చియుందురు. మొదటి కాకతీయులు తమ యేలికలైన పశ్చిమ చాళుక్య చక్రవర్తుల బిరుదావళిని దాల్చుట మనమెఱిగిన విషయమే."[6]

## 2.3. కథాప్రసక్తి-శాసనప్రమాణము:-

కాటమరాజునకును నల్లసిద్ధికిని జరిగిన యుద్ధమునుగూర్చి మెకంజీ స్థానికచరిత్రలు (Local Records) పదునెన్మిదవ సంపుటములో విపులముగా నున్నది. దీనినే వేటూరి ప్రభాకరశాస్త్రి గారు తెలుఁగు ద్విపదకావ్యములను గుఱించిన విశేషవివరణ గ్రంథపట్టిక (Descriptive Catalogue) లో నిచ్చియున్నారు. దీనినే మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మదరాసు GOML వారు ప్రకటించిన 'కాటమరాజుకథ' పీఠికలో నిచ్చి యున్నారు. ఇందు కాటమరాజు తన విస్తారమైన గోగణమును కడప, కర్నూలు మండలములలో లంకమల, పాలకొండ, నల్లమల మొదలగు పర్వత ప్రదేశములందు మేపుకొనుచు, నట వర్షాభావముచేత కసపు లభింపమి నెల్లూరు మండలమునకు వచ్చి, నల్లసిద్ధి చోళమహారాజునకుఁ బుల్లరిగాఁ దమ మందలోఁ బుట్టెడి కోడెదూడలను గొన్ని యిచ్చునట్లు నిర్ణయించుకొని, పశువులను మేపుకొనసాగెనని కలదు. ఈ స్థానికచరిత్రలలో యుద్ధకారణములు మూఁడు చెప్పఁబడినవి:-

1) నెల్లూరు సీమలోఁగూడ క్షామము వ్యాపింపఁగా, కాటమరాజు తన గోవులకు బీళ్లలోఁ బచ్చిక సరిగా దొరకనందున, నెల్లూరు రాజ్యమందలి పంటపొలములనుగూడ మేపసాగెను. ఇది నల్లసిద్ధికిఁ గోపకారణమయ్యెను.

2) అరణ్యములోని క్రూరమృగములను యాదవులు వేఁటాడుచుండుట వలనను, వారి మందల విస్తార సంరంభము వలనను అరణ్యమందలి మృగములు నశించి, మృగవధయే వృత్తిగాఁగల కిరాతులకు జీవనభృతి కష్టమై, వారు కాటమరాజునందు ద్వేషులై యుండిరి.

3) ఇదికాక, నల్లసిద్ధిరాజుగారు ఉంచుకొనిన బోగముదాని పెంపుడు చిలుకను కాటమరాజు పినతండ్రి పోలురాజు బాణముతోఁ గొట్టి చంపెను. ఈ విషయమును కిరాతులు ఆమెతోఁ జెప్పిరి. ఆమె మిక్కిలి కోపించి మృగములను వేఁటాడు మిషతోఁ గాటమరాజుయొక్క ఆవులమందను జంపుడని కిరాతులను బ్రోత్సహించెను. వారి చర్యలను గ్రహించి, కాటమరాజు ఉగ్రుడై, ఆ కిరాతులను జంపి, నల్లసిద్ధికిఁ బుల్లరి నిచ్చుట మానివేసెను.

ఇంకను గొన్ని స్థానికచరిత్రలలోఁ గాటమరాజు విషయ మున్నది. వానినిబట్టి యుద్ధము చిత్రభాను సంవత్సరమున జరిగినట్లు తెలియుచున్నది.

ఈ కాటమరాజు కథాచక్రమునకు సంబంధించిన విషయములు స్థానికచరిత్రలలోనే కాక, నెల్లూరు మండలములోని కందుకూరు తాలూకా 'గుండ్లపాలెము' గ్రామములో, బ్రహ్మేశ్వరస్వామి ఆలయము దగ్గఱ నొక శిలమీద చెక్కిన శాసనములోఁ గూడ స్పష్టముగా నున్నవి. ఈ శాసనమును బట్టర్వర్త్, వేణుగోపాలశెట్టిగార్లు సంపాదించి, తమ "నెల్లూరుమండల శాసనములు"- రెండవ సంపుటములోఁ బ్రకటించిరి. వీరు దీనిని క్రీ.శ. 1258-59 సంవత్సరమునకు సంబంధించినదిగా ననుమానించిరి. ఇందు వైశంపాయనుఁడు పరీక్షిత్తునకుఁ జెప్పినట్లుగా యాదవవంశ మంతయు నభివర్ణింపఁబడుటయే కాక, కాటమరాజునకు నల్లసిద్ధితోఁ దగవునకుఁ గారణము, యుద్ధకాలము మున్నగునవి తెలుపబడినవి. ఈ శాసనము మొదటిప్రక్క 55 పంక్తులు, రెండవప్రక్క 54 పంక్తులు, మూడవప్రక్క 42 పంక్తులు, నాల్గవప్రక్క 34 పంక్తులు గలవు. ఇది పైకి గద్యశాసనముగాఁ గానవచ్చినను నచ్చటచ్చట కొన్ని పద్యములును గలవని తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు నిరూపించియున్నారు. (చూ. వారి వ్యాసము 'కాటమరాజుకథ',

ఆంధ్రపత్రిక, విజయ సంవత్సరాది సంచిక, 1953–54.)

ఈ గుండ్లపాలెము శాసనములోని కథలో, స్థానికచరిత్రలలోని కథవలె వివరములు లేవు. స్థానికచరిత్రలలో నల్లసిద్ధికిని కాటమరాజునకును యుద్ధము చిత్రభాను సంవత్సరమున జరిగినట్లుండఁగా, నీ శాసనములో శాలివాహన శకవర్షంబులు 1170 అగు కాళయుక్తి సంవత్సరమున జరిగినట్లున్నది.[7] (అనఁగా క్రీ.శ. 1248).

కాటమరాజు యుద్ధవిషయము, ముఖ్యముగా ఖడ్గతిక్కన యుద్ధఘట్టము పట్టపురావి కైఫీయతులో నున్నది. ఇందు కాటమరాజు, కోడెదూడలను పుల్లరిగా నిచ్చుట కంగీకరించుట, యాదవులు మొదట నరణ్యమందును బచ్చికబీడులందును పశువులను మేపుకొనుచు, వర్షాభావముచేఁ గసవు చాలక నెల్లూరురాజ్యములోని వరి పొలములనుగూడ మేపుట, ఖడ్గతిక్కన యుద్ధము చేసి పట్టపురావి గ్రామసమీపమున మరణించుట తెలుపఁబడినవి.[8]

## 2.4. ఓరుగంటి ప్రతాపుని కాలమే కాటమరాజు కాలము:–

గుండ్లపాలెము శాసనములోఁ గాటమరాజు ఓరుగంటి ప్రతాపుని కాలము వాఁడని స్పష్టముగా నున్నది. రాజవంశ ప్రదీపిక ననుసరించి, శ్రీకృష్ణుని మునిమనుమఁడగు వజ్రునితో ద్వాపరయుగ మంతమై, ఆ వజ్రుని పుత్రుఁడగు ప్రతిబాహునితోఁ గలియుగము ప్రారంభమైనది. ఆ ప్రతిబాహునినుండి కాటమరాజు వఱకును బదునేడుమంది యాదవరాజులున్నారు. “శ్రీకృష్ణుఁడు, ప్రద్యుమ్నుఁడు, అనిరుద్ధుఁడు, వజ్రుఁడు, ప్రతిబాహుఁడు, సుబాహుఁడు, ఉగ్రసేనుడు, శృతసేనుఁడు, ఉపనందుఁడు, అమృతాంభోజుఁడు, విజయాంభోజుఁడు, కనకాంభోజుఁడు, గజాంభోజుఁడు, రాయాంభోజుఁడు, రత్నాంభోజుఁడు, వీరవిజయుఁడు, పద్మరాజు, కూర్మరాజు, సింహాద్రిరాజు, గంగురాజు, వలరాజు, పెద్దిరాజు, కాటమరాజు”. ఈ వరుసలోని విజయాంభోజునినుండి కాటమరాజు వఱకును గల రాజన్యుల కాలములు గుండ్లపాలెము శాసనములోఁ దులనాత్మకముగా నిరూపింపఁబడినవి. ఒక్కొక్కరాజు ఎన్నేండ్లు పాలించెనోకూడ చెప్పఁబడినది. ఇందు కాటమరాజు ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమున ముప్పదిరెండు సంవత్సరములు రాజ్యము చేసి, లింగాలకొండ ఎఱ్ఱగడ్డపాడులో నల్లసిద్ధిరాజుతో యుద్ధముచేసి మరణించినట్లుగా నీ శాసనములో స్పష్టముగా నున్నది. కాటమరాజు యుద్ధమున మరణించునాటికిఁ గలియుగము చొచ్చి 3965 సంవత్సరములైనదని ఈ శాసనము నిరూపించుచున్నది.

“... కలియుగాబ్దాః సూద్రికి రాజకాలమున విజాంభోజాబ్దాః –౯౩౦– కనకాంభోజాబ్దాః–౪౮౦ –విక్రమార్కుని కాలమున గయాంభోజాబ్దాః–౪౩౦–రాయాంభోజాబ్దాః–౪౨౦ –రత్నాంభోజాబ్దాః – ౪౦౨ –వీరవిజయః రాజాబ్దాః–౩౮౦ –శాలిశానునికాలమున పద్మనరాజాబ్దాః–౩౯౪ –శ్రీ కూర్మిరాజాబ్దాః– ౩౪౦ –భోజరాజు కాలమున సింహాద్రి రాజాబ్దాః– ౩౦౦ –చోడాని కాలము వల్లురాజాబ్దాః –౧౮౯ –పోలురాజాబ్దాః–౭౨ –వోరుగంటి ప్రతాపుని కాలమున కాటమరాజు–౩౨ –రాజ్యంసేసి లింగాలకొండ యరగడ్డపాటను నలసిద్ధిరాజుంగూడి యుద్ధంబుసేసి బడుగులవారు చనిపొయ్యేనాఁటికి కలియుగంచొచ్చి–౩౮౬౯ – యెండ్లాయను...”[9]

ఇందు ప్రసక్తమైన ‘ఓరుగంటి ప్రతాపుడు’ ఎవరో తెలిసికొనినచోఁ గాటమరాజు కాలము తెలియును. ఓరుగల్లు రాజ్యమునేలిన కాకతీయ వంశమున నిద్దఱు ప్రతాపరుద్రులు కలరని చెప్పుట వాడుక. కాని ఇది చాలా తప్పుడు వాడుక యని కాకతీయ వంశముపై సమగ్ర పరిశోధన చేసిన ఆంధ్ర చారిత్రక విద్వాంసులు డా॥ మారేమండ రామారావుగారు తెల్పియున్నారు. వాడుకలోనున్న మొదటి ప్రతాపరుద్రుఁడు ‘రుద్రదేవుఁడు’. ఇతని కాలము క్రీ.శ. 1158–1195. పల్నాటి యుద్ధము ఈతని కాలమున జరిగినది. కాటమరాజు ఇంత ప్రాచీనుఁడు కాఁడు. ఈ రుద్రదేవునకు ‘రుద్రదేవ మహారాజు’ అను పేరు శాసనములలోఁ గానవచ్చుచున్నది కాని, ‘ప్రతాపరుద్రుఁడు’ అను నామమెచ్చటను లేదని రామరావుగారు నిరూపించినారు. ఇఁక వాడుకలో రెండవ ప్రతాపరుద్రుఁడుగా నున్నవాఁడే అసలు ప్రతాపరుద్రుఁడు. ఇతని కాలము క్రీ.శ. 1289–1323 లేదా క్రీ.శ. 1296–1323. ఇతఁడు రుద్రమదేవి దౌహిత్రుఁడు. రుద్రమదేవి కాలము క్రీ.శ. 1262–1289 లేదా క్రీ.శ. 1262–1296. ఈ ప్రతాపరుద్రుఁడు క్రీ.శ. 1289లో లేదా క్రీ.శ. 1296లో రాజ్యమునకు వచ్చినను, 1280 నుండియు యువరాజుగా నుండి, తిరుగుబాట్లు చేయుచున్న సామంతరాజుల నణఁచుటలో రుద్రమదేవికిఁ దోడ్పడుచుండెను. కాఁబట్టి క్రీ.శ. 1280 నుండియు నీ ప్రతాపరుద్రునకుఁ గాకతీయ రాజకీయ వ్యవహారములతో మిక్కిలి పరిచయమున్నది. కావునఁ గాటమరాజు కూడ క్రీ.శ. 1280–1323 మధ్యకాలమున నుండి యుండును. పై శాసనము క్రీ.శ. 1258–59 నాఁటిది కాఁగా, 1280 నాఁటి ప్రతాపరుద్రుని ప్రశంస దానిలో నుండుట అసంబద్ధము కదా! కాని గుండ్లపాలెము శాసనము యొక్క కాలము నిర్ధరించి చెప్పినది కాదు. దాని పరిష్కర్తలు, శ్రీయుతులు బట్టర్వర్త్, వేణుగోపాలశెట్టిగారలు, శాసనకాలమును క్రీ.శ. 1258–59 అని వ్రాసి, దాని తర్వాత నొక ప్రశ్నార్థకము నుంచిరి. మల్లంపల్లివారు ఈ గుండ్లపాలెము శాసనము తప్పులతడక యనిరి. కావున దీని ప్రాచీనత నంగీకరింపలేము. ఇది ప్రతాపరుద్రుని కాలమునకుఁ దరువాతదియై యుండును. ఈ గుండ్లపాలెఉ శాసనము 23–10–1438 నాఁటిదని దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు (భారతి, మే, 1965); 15వ శతాబ్ది ఉత్తర భాగమునకుఁ జెందినదని ఆరుద్రగారును (భారతి, డిసెంబరు 1960); క్రీ.శ. 1632–1672 మధ్యకాలమునకుఁ జెందినదని మల్లంపల్లివారును (కాటమరాజుకథ, పీఠిక) భావించినారు.

ఈ గుండ్లపాలెము శాసనము మూఁడవ ప్రక్కఁగూడ పుల్లరి యొడంబడిక, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట ప్రతాపరుద్రుని కాలముననే జరిగినట్లు మరలఁ జెప్పఁబడినది. కాటమరాజు కథేతివృత్తమంతయు నిందు స్పష్టముగా నున్నది. "(అ)రుంటలకోన అమరవతి సింహ్యాది యెలమంచ్చి యేలేను వల్లురాజులె ఆలవల్లపురము అచట కొన్నాళ్లు అడిదెవిటేలెను ఆలుపోలురాజు ప్రతాపుని కాలమున యెదుకులాత్మజులు దనుము కొండ మందలుడు, పినయెర్ప పెదయెర్ప యేలంగగ యెర్పలకు అనావ్రిష్టి దాంకి ధేనువులకు మేంత లేదని రాజున్ పద్మనాయండున్ వివరించ్చుకొని ధేనువులున్ దారు కదిలిరి పాంకనాడు సిద్ధిరాజుకు పుల్లరి వొడంబడి భూమి చొచ్చి మేపిరి మెపుత నలనన్న ధేనువులుందాను దక్షణాదనువుకోటికి కదిలిపోయి దనువుకో వల్లభుని దశిౕంచ్చి నలనన్న దెనువులుం దాను మరిలిదిన నిధుల పొందం గదలి వచ్చి పెన్న వెంట విడిసిరి. నలసిద్ధివారు యెద్దుల యెసిరి ఆదవుల వందను ఆండం తరుచాయ అడవుల వంక్క రంతువదె నెల్లూర ధేనువులుం దారు వదిలి యఱగడ్డపాట నిలిచెను నలసిద్ధి రాయబారి పుల్లరికి వచ్చెను వట్టించి రాయబారిని పుల్లరిలేదు పొమ్మనిరి లేదుపొమ్మంటేను నెల్లూరి నలసిద్ధిరాజు యఱ్ఱగడ్డపాటికి యెత్తివచ్చెను..."[10] కాఁబట్టి కాటమరాజు కాకతీయ ప్రతాపరుద్రుని కాలమువాఁడనుట నిస్సంశయము. వీరగాథలును ఈ విషయమును బలపఱుచుచున్నవి.

కాటమరాజు కథాచక్రములోని కఱియావులరాజుకథలోఁ బ్రతాపరుద్రుని ప్రసక్తి పలుతావులందు వచ్చినది. అయితమరాజు, పల్లికొండ, పుత్తమరాజు, కఱియావులరాజు, పుల్లావుల కేశవయ్య, భట్టావుల వల్లభన్న మొదలగు యాదవవీరులు ఓరుగల్లులో జరుగు శంభుని తిరునాళ్లకుఁ బోయిరి. అప్పుడు ప్రతాపరుద్రుఁడు వారికెదురేగి ఆహ్వానించినట్లుగా నాకు లభించిన తాళపత్రగ్రంథమునఁ గలదు:-

*"ఎల్లటేనుగ మీద రయితాంగమాయెను పఠాబ్బిరుద్రుదు*
*పుట్టకోట బయటికి భూపతి యెదురేగి వచ్చెను*
*సాధంధ పాలకీలు తగ్గించినారు*
*పఠపేనిగెను దిగెను పఠాబ్బిరుద్రుండు*
*స్తిరమందులవారు దిరిగి పాలకీలు*
*జముకాదిణము పరపించి చదురు ఏరుపరచి*
*వారిచేతి తాంబూలము వీరందుకొనిరి*
*అంతట పఠాబ్బిరుద్రుదు అదె నొకమాట*
*మీరున్ను మేమున్ను గోత్రదాయాదులము*
*ఆవుల పోలురాజు మాకు అయ్యగావలెను*
*అయితమరాజు మా కన్న గావలెను*
*స్తిరమందుల పల్లికొండ మాకు బావగావలెను*
*పుత్తమరాజు మాకు మరది కావలెను*
*అని వరుస క్రమము అటు దెల్పుకోని*
*సాధంధ పాలకీలు తర్లిచ్చుకోని*
*వోరుగంటి పట్నానికి వొచ్చిరి రాజులు"* [11]

ఈ కఱియావులరాజుకథలో నోరుగంటి ప్రతాపరుద్రునకును, యాదవరాజులకును జరిగిన అనేక సంఘర్షణలు చిత్రింపఁబడినవి. ప్రతాపరుద్రుఁడు యాదవరాజులను జంపుటకు విషాన్నము పెట్టును; కత్తుల తమకము నేర్పాటు చేయును; మొండి గుఱ్ఱమును స్వారి చేయుఁడని కోరును. అయితమరాజును పుత్తమరాజును విష్ణుస్వరూపుఁడగు పల్లికొండ సహాయమున నీ యుపద్రవములన్నిటిని సురక్షితముగా దాటుదురు. కఱియావులరాజు ప్రతాపరుద్రుని సేనాధిపతియగు బేతాళునితో ద్వంద్వయుద్ధము చేసి, ఆతని బిరుదులన్నియును గైకొనుట ఈ వీరగాథలోని ప్రధానేతివృత్తము. 'బేతాళుఁడు' లేక 'బేతాళరెడ్డి' కాకతీయ ప్రతాపరుద్రుని సైన్యాధ్యక్షుఁడనుట చారిత్రక సత్యము. వేదమూరి నాటకములోఁగూడ నీ చేతాళుని ప్రసక్తి యుండుట గమనింపఁదగినది. కావున, కాటమరాజు, కాకతీయ ప్రతాపరుద్రుని కాలమువాఁడని ఈ వీరగాథయును సాక్ష్యమిచ్చుచున్నది. 'జన్నివాడకథ' యను వీరగాథలోఁగూడ ప్రతారుద్రుని ప్రసక్తి యున్నది. నాకు కృష్ణామండలమున లభించిన ఈ కథయొక్క తాళపత్రప్రతిలోని ఈ క్రింది విధముగా నున్నది:-

*"ఆవేళ ఓరుగంటి ప్రతాపరుద్రుండు పంపిన పరిచారకులును"* (పత్రము 26).

*"అందుకు ప్రతాపరుద్రుండును మహాసంతోషించి*
*యిట్లని పలికె*
*ఓయీ గొల్లరాజా! ఇప్పటివారిలోకి*
*నీవు భక్తుండవైతివి ఆ నీలకంఠునికి*
*మెచ్చితినోయి గొల్లరాజుకి ఇచ్చెను పచ్చల పల్లకి*
*ఆ ప్రతాపరుద్రుని మాట రాజు మనసుకు దెచ్చుకోని*
*గొల్లరాజు పొదవమన్న మాట విని సిద్ధిరాజు*
*పాలపొలపొక్కెను"* (పత్రము 27).

కాఁబట్టి, కాటమరాజు కాకతీయ ప్రతాపరుద్రునకు సమకాలికుఁడనుటలో సందేహము లేదు. శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు కాటమరాజు కాకతీయ గణపతిదేవుని కాలమువాడనిరి.[12] కాని దీనిని ఏ ప్రమాణముతోఁ జెప్పిరో తెలియకున్నది.

## 2.5. మనుమసిద్ధి-నల్లసిద్ధి-ఖడ్గతిక్కన:-

పల్నాటి యుద్ధమునకు శైవ-వైష్ణవ మతభేదములు కారణములను దురభిప్రాయము వ్యాపించినట్లుగనే, కాటమరాజుతో యుద్ధము చేసిన రాజు 'నెల్లూరు మనుమసిద్ధి' యను నొక తప్పుడు ప్రచారము తెలుఁగు దేశమునఁ గొనసాగుచున్నది. కాటమరాజునకును మనుమ

సిద్ధికిని నెట్టి సంబంధమును లేదు. కాటమరాజు కథాచక్రమునఁ గల ముప్పదిరెండు కథలలోను ఏ ఒక్క కథయందును మనుమసిద్ధి ప్రసక్తిలేదు. కాటమరాజుతోఁ బోరినది 'నల్లసిద్ధిరాజు', అతని తమ్ములు పాపసిద్ధి, ఎఱ్ఱసిద్ధి, కొండికసిద్ధి, కొమారసిద్ధి రాజులని వీరగాథలలో నున్నది. ఈ నల్లసిద్ధిరాజెవరో నిరూపించుట చారిత్రకుల పని. యశోదాదేవిగారు మనుమసిద్ధికిని నల్లసిద్ధికిని నభేదమును బాటించిరి. మల్లంపల్లివారు మనుమసిద్ధి రెండవ కొడుకు నల్లసిద్ధి యనిరి.

కాటమరాజు కథాచక్రమున 'నల్లసిద్ధిరాజు' 'ఖడ్గతిక్కన' లేక 'రణతిక్కన' (పట్టపురవా కూఫీయతులో నితనికి 'కార్యతిక్కన' అని మఱియొక పేరు కానవచ్చుచున్నది)– ఈ యిరువురును బ్రసిద్ధ చారిత్రక వ్యక్తులు. నల్లసిద్ధి పల్లవరాజని, ముక్కంటి సంతతివాఁడని, భరద్వాజ గోత్రుఁడని, సూర్యవంశపు రాజని 'భట్టురాయబారి' మను వీరగాథలో నున్నది. ఈ ముక్కంటి పల్లవుఁడు. ఇతఁడు ధరణికోట అమరలింగమున కొక బ్రాహ్మణ కన్యవలనఁ బుట్టినట్లున్నది (చూ. మదరాసు GOML వారి కాటమరాజు కథ, పుట 159). నెల్లూరు జిల్లా తల్పిగిరి కైఫీయతులో త్రిలోచనుఁడను పల్లవరాజు బ్రాహ్మణ కన్యకు జన్మించినట్లున్నది. (అసలీ పల్లవరాజు లందఱును బ్రాహ్మణులనియు, భారతమందలి అశ్వత్థామ సంతతి వారనియుఁ జారిత్రకులలో నొక సిద్ధాంతమున్నది.) ఈ త్రిలోచన పల్లవుని గుఱించిన గాథలనేకములు కడప, కర్నూలు, నెల్లూరు, గుంటూరు, కృష్ణామండలముల స్థానిక చరిత్రలవలనఁ దెలియుచున్నవి. వీనిలో నితఁడు కఱికాలచోళుని సమకాలికుఁడుగా నున్నాఁడు. కాటమరాజు కథలలోఁ జెప్పఁబడిన ముక్కంటి పల్లవుఁడును, నీ స్థానిక చరిత్రలలోని త్రిలోచన పల్లవుఁడును నొక్కరే యని చెప్పవచ్చును. కాని పల్లవరాజుల శాసనములలో మాత్రము ఇతని పేరు కానవచ్చుట లేదు. పల్లవులు భారద్వాజస గోత్రులైనను, సూర్యవంశోద్భవులు మాత్రము కారు.

"ముక్కంటిని గుఱించిన విశేషములు కాటమరాజుకథలో తెలుపబడలేదు" అని మల్లంపల్లివారు వాపోయినారు (చూ. కాటమరాజుకథ, పీఠిక, పుట xxiv ). కాని యిది సరికాదు. మల్లంపల్లి వారికిఁ దెలిసిన కాటమరాజుకథలు మూఁడు నాలుగు మాత్రమే. నాకు లభించిన 'పోలురాజుకథ' (లేక శివపురాణము) అను తాళపత్ర గ్రంథములో నీ ముక్కంటి పుట్టుపూర్వోత్తరములను దెల్పు నొక అంతర్గాథ (చాటువ) కలదు. దీనికి 'ముక్కంటి చాటువ' లేక 'బ్రాహ్మణ చాటువ' అని పేరు. ఈ ముక్కంటి కొడుకు జనోధీరుఁడు– జనోధీరుని కొడుకు మనోధీరుఁడు– మనోధీరుని కొడుకు మన్మసిద్ధి– మన్మసిద్ధి కొడుకు నలసిద్ధి.

స్థానిక చరిత్రల ననుసరించి నల్లసిద్ధిరాజు చోళకులజుఁడు, సూర్యవంశోద్భవుఁడు. శాసనములనుబట్టి ఈ తెలుఁగు చోళులు కాశ్యపగోత్రులు, కఱికాల చోళుని సంతతివారు. ఖడ్గతిక్కన చోళుల కొలువులోని వాఁడే కాని పల్లవుల కొలువులో నుండినవాఁడు కాదు. ఖడ్గతిక్కన, అతని తండ్రి సిద్ధన, సోదరులు భాస్కర కేతనలు, పినతండ్రి యగుకొమ్మన కుమారుఁడైన కవితిక్కన– వీరందఱును నెల్లూరును బాలించిన చోళరాజుల కొలువులోనివారే. కావున వీరగాథా రచయిత నల్లసిద్ధిని పల్లవరాజనుట పొరపాటు. ఈ తెలుఁగు చోళులు మొదట పల్లవుల సామంతులనుటలో మాత్రము సందేహము లేదు. (గణపతి దేవుని కాలమునుండి కాకతీయ సామంతులు.) నేఁటివఱకును లభించుచున్న నెల్లూరి తెలుఁగు చోళుల శాసనములనుబట్టి చారిత్రకులు వారి వంశక్రమము నిట్లు చూపిరి:–

**2.6. యశోదాదేవిగారు:-**

**నెల్లూరి తెలుఁగు చోళుల వంశక్రమము**

**శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు- 1947 (J.A.H.R.S.- Vol. xxiii, pp 68-114) లో నెల్లూరి తెలుఁగు చోళుల వంశక్రమమును ఈ క్రింది విధముగాఁ జూపిరి:-**



శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు నెల్లూరి తెలుగుచోళుల కాలమును జక్కcగా నిచ్చిరి. కాని వంశక్రమమున కొందఱు రాజులను విస్మరించిరి. మూcడవ మనుమసిద్ధికిని నల్లసిద్ధికిని నభేదము పాటించిరి. ఇది సరికాదు. మూcడవ మనుమసిద్ధికిcగల ముగ్గురు పుత్రులలో ద్వితీయ పుత్రుcడు నల్లసిద్ధి. ఇతcడే కాటమరాజునకు ప్రత్యర్థి. మనుమగండ గోపాలుcడు మనుమసిద్ధికి పుత్రుcడనుట సరికాదు. ఇతcడు నల్లసిద్ధి కుమారుcడు; మనుమసిద్ధికి మనుమcడు. 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట'లో నీ మనుమగండ గోపాలుcడును బాల్గొనినాcడు. నల్లసిద్ధియు, మనుమగండ గోపాలుc డును మనుమసిద్ధికిc బుత్రపౌత్రులను విషయము గుంటూరుజిల్లా నర్సారావుపేట శాసనములో స్పష్టముగా నున్నది: (చూ. భారతి, జూలై 1966, కలగూరగంప).




## 2.7. మల్లంపల్లివారు:-

యశోదాదేవిగారిచ్చిన వంశక్రమములో తెలుcగు విద్య తరువాత 'దాయభీమ' అను నతcడును, రెండవ మనుమసిద్ధికి నగ్రజుcడగు 'నల్లసిద్ధి'యును, మూcడవ మనుమసిద్ధియొక్క ద్వితీయ తృతీయ పుత్రులగు 'నల్లసిద్ధి, గోపినాథ' అనువారును సూచింపc బడలేదు. ఈ లోపములనన్నిటిని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు పూరించిరి. శర్మగారు నెల్లూరి తెలుcగు చోళుల వంశక్రమమును ఈ క్రింది విధముగాc జూపిరి:- (చూ. పుట. 298).

**కీ.శే. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు– 1953 (కాటమరాజుకథ, పీఠిక, పుట xxvii)**



ఈ వంశవృక్షములో ముగ్గురు నల్లసిద్ధిరాజులున్నారు. వీరిలో ఏ నల్లసిద్ధిరాజు కాటమరాజుతో యుద్ధము చేసెనో పరిశీలింపవలసి యున్నది. 1965 మార్చి నెల భారతిలో దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డి గారిచ్చిన నెల్లూరి చోడవంశము పైదానికన్న కొంచెము భిన్నముగా నున్నది. దేవరపల్లివారు రెండవ మన్మసిద్ధియొక్క తండ్రిని ఎఱ్ఱసిద్ధిగాఁ గాక, రాజేంద్రచోడనిగాఁ బేర్కొనిరి. యశోదాదేవిగారు 'విజయగండ గోపాల' నామము మూఁడవ మన్మసిద్ధి నామాంతరమో లేక ఆ మూఁడవ మన్మసిద్ధి సోదరుని నామమో తేల్చుకొనలేపోయిరి. దేవరపల్లివారు తెలుఁగు చోళుల శాసనములలోఁ జాల తఱచుగాఁ గాననగు గండగోపాల శబ్దములకు ఒక చక్కని సమన్వయమును సాధించిరి.

## 2.8. దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు-1985 (భారతి, మార్చి 1965, పుట 73)

వీరు క్రీ.శ. 1214 నాఁటి దూబగుంట శాసనమును, 1257 నాఁటి నందలూరు శాసనమును, నరసరావుపేట శాసనమును ఆధారముగాఁ జేసికొని నెల్లూరు చోడవంశ క్రమమును ఈ క్రింది విధముగా నిర్మించిరి:-




ఖడ్గతిక్కన తండ్రియగు సిద్ధన చోడతిక్కన నృపాలుని ప్రధాన మంత్రి. నెల్లూరి రాజ్యముపై సేవణసైన్యము దండెత్తి వచ్చినప్పుడు ఖడ్గతిక్కనకుఁ దమ్ముఁడును, సిద్ధన ద్వితీయ పుత్రుఁడును నగు 'బాచఁడు' అను 'భాస్కరమంత్రి' యెదుర్కొని, యుద్ధము చేసి, ఆ సైన్యమును సంహరించెనని కేతన దశకుమారచరిత్రలోని పద్యము వలనఁ దెలియుచున్నది.[13] ఈ సేవణదేశాధీశ్వరుఁడగు సింఘణదేవుని పరిపాలనాకాలము క్రీ.శ. 1210-1247. కావున ఖడ్గతిక్కనయు నీ కాలమువాఁడు కావలెను. (భాస్కరమంత్రి క్రీ.శ. 1275-77 ప్రాంతము వాఁడని దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారి భావన). చోడ తిక్కనకు ముందున్న యిరువురు నల్లసిద్ధులతో మనకుఁ బని లేదు. క్రీ.శ. 1250వ సంవత్సరమునకుఁ జెందిన పల్లవ నల్లసిద్ధిని జెప్పు శాసనములు కొన్ని లభించుచున్నవి. కాని, ఆ నల్లసిద్ధి కాంచీపుర ప్రాంతమువాఁడు. నెల్లూరి నేలిన నల్లసిద్ధియే మనకుఁ బ్రసక్తుఁడు. కావున నా పల్లవ నల్లసిద్ధితో మనకుఁ బనిలేదు. కాని ఆచార్య మారేమండ రామారావుగారు కాకతీయ సామంతులైన యీ తెలుగు చోళుల రాజ్యము దక్షిణమునఁ గాంచీపురము వఱకును గలదని

చెప్పుచున్నారు. కాంచీనగరముకూడ నెల్లూరిరాజ్యములోని భాగమనియే రామారావుగారి యభిప్రాయము. చోడతిక్కరాజును, అతని పుత్రుఁడగు మనుమసిద్ధియు, నెల్లూరు కాంచీపురములను రెండింటిని బాలించిరని వీరు వ్రాసిరి. "తిక్కరాజునకు పిదప నెల్లూరు, కాంచీనగరములను పాలించినవాఁడు అతని కుమారుడగు మనుమసిద్ధి దేవచోడదు" (తెలుగు విజ్ఞాన సర్వస్వము, మూడవ సంపుటము, పుట 231). పాండ్యులు అనేకపర్యాయములు ఈ కాంచీపురము నాక్రమింపఁగా, కాకతీయులు వచ్చి తెలుఁగు చోళులను పునఃప్రతిష్ఠించిరి. ఇట్లు తెలుఁగు చోళులు మిక్కిలి దక్షిణ ప్రాంతమగు కాంచీపురమును బాలించుటచేతనే గాథాకర్త వీరిని పల్లవరాజులని సంబోధించియుండును.

సిద్ధన కొలిచిన చోడతిక్కరాజు శాసనములు క్రీ.శ. 1209-10 నుండి కానవచ్చుచున్నవి. చోడతిక్కరాజు కుమారుఁడగు మనుమసిద్ధి శాసనములు క్రీ.శ. 1249-50 నుండి లభించుచున్నవి. కాఁబట్టి చోడతిక్కరాజు కాలము క్రీ.శ. 1209-1250 అని చెప్పవచ్చును. ఇదియే సిద్ధనకాలము. కావున సిద్ధన కుమారుఁడగు ఖడ్గతిక్కన 13వ శతాబ్దము వాఁడని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. క్రీ.శ. 1258లో సుందర పాండ్యుఁడు నెల్లూరి రాజ్యముపై దండెత్తి చోడతిక్కరాజును జంపెనని ఆచార్య మారేమండ రామారావుగారు తెలుపుచున్నారు. అందుచే చోడతిక్కని కాలము క్రీ.శ. 1209-1258 అని చెప్పవలసియుండును.

సిద్ధన, చోడతిక్కరాజుకడ ప్రధానమంత్రిగా నుండఁగా, నాతని పుత్రులు ఖడ్గతిక్కన, బాచఁడు అనువారు సైన్యాధక్షులుగా నుండిరని తెలియుచున్నది. చోడతిక్కరాజు కుమారుఁడు మనుమసిద్ధి రాజ్యమునకు రాఁగా, కవితిక్కన ప్రధానమంత్రి యయ్యెను, ఖడ్గతిక్కన సైన్యాధ్యక్షుఁడుగా నుండెను. నిర్వచనోత్తర రామాయణమున మనుమసిద్ధిని స్మరించిన కవితిక్కన మహాభారతమున నతనిని విస్మరించినాఁడు. అనఁగా తిక్కన భారతరచనాకాలమునాఁటికి మనుమసిద్ధి చనిపోయినాఁడు. ఇతని మరణముతోఁ గవితిక్కన మంత్రిపదవిని త్యజించి యజ్ఞముచేసి, సోమయాజియై మహాభారత రచనకు ఉపక్రమించెనని సాహిత్య విమర్శకులు చెప్పుచున్నారు. మనుమసిద్ధి మరణానంతరము అతని పుత్రుఁడు నల్లసిద్ధి రాజయ్యెను. (ఇది క్రీ.శ. 1270లో జరిగియుండును.) కవితిక్కన మంత్రిపదవిని త్యజించుటచే, ఖడ్గతిక్కన సైన్యాధ్యక్ష పదవితోపాటు మంత్రిపదివిని కూడ నిర్వహించెనని నా అభిప్రాయము. దీనికిఁ గాటమరాజు కథలలోఁ బెక్కు సాక్ష్యములున్నవి:-

> *"మనుజేశు నలసిద్ధి మంత్రియైనట్టి*
> *కరుణాకటాక్షుండు గాంభీర్య ఘనుఁడు*
> *స్థిరకీర్తి యగునట్టి తిక్కన్న పొగడ"* [14]

యుద్ధమునకు వివిధరాజన్యుల నాహ్వానించుచు సిద్ధన కుమారుఁడగు తిక్కనయే లేఖలు వ్రాసినట్లు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' లోఁ గలదు. ఇది ప్రధానమంత్రి చేయుపని:-

> *"సిద్ధన్న తిక్కన్న శీఘ్రమే పిలిచి*
> *లేఖ లుద్దగిరికి లిఖియించు మనెను*
> *కోట్ల పర్యంతము కూడును దండు*
> *చీట్లు వ్రాయించుమీ శీఘ్రాన తిక్క!...*
> *అనిన తిక్కనమంత్రి యన్ని దిక్కులకుఁ*
> *గడు వేగమునఁ బంపెఁ గమ్మ రమ్మనుచు"* [15]

ఇట్లు ప్రధానమంత్రి బాధ్యతలను నిర్వహించిన సిద్ధన తిక్కనయే, మరల చల్లవారిదండును జూచి భయపడుచున్న నల్లసిద్ధిరాజుతో సైన్యాధ్యక్షునివలెఁ బౌరుషవాక్యములాడును:-

> *"పల్లవ నలసిద్ధి! పట్టాభిరామ!*
> *చల్లవారిని జాల సన్నుతించకుము*
> *మనముందు వారెంత మాత్రంబుగారు*
> *చల్లవారెంత? యీ సైన్యంబదెంత?*
> *యాదవబలమది యంతయు నెంత?...*
> *ఓ సిద్ధిరాజ! నేనొకడనే పోయి*
> *సమయించి వత్తును శత్రుసైన్యంబు*
> *గహ్వరంబున రాజు గద్దించినట్లు*
> *చల్లవారందఱిని సమయించి వత్తుఁ*
> *జక్కుగా నఱుకుదు సమరంబులోను*
> *పల్లవాధిప! రాజ! పంపుము నన్ను!"* [16]

లేఖలు వ్రాయుటలో మంత్రిగా వ్యవహరించిన ఖడ్గతిక్కనయే, యిట మనకు సైన్యాధ్యక్షుఁడుగాఁ బ్రత్యక్షమగుచున్నాఁడు. కాఁబట్టి మనుమసిద్ధి కాలమునఁ గేవల సైన్యాధిపతిగానున్న ఖడ్గతిక్కన, నల్లసిద్ధి కాలమున ప్రధానమంత్రిపదవినిగూడ నిర్వహించెనని యూహించుట కవకాశమున్నది.

చోడతిక్కరాజును, ఖడ్గతిక్కన తండ్రియగు సిద్ధనమంత్రియు నొకతరమువారు. చోడతిక్కన పుత్రుఁడగు మనుమసిద్ధియు, కవితిక్కన, ఖడ్గతిక్కన, బాచనలు రెండవ తరమువారు. నల్లసిద్ధి మూఁడవ తరమువాఁడు. రెండవతరములోనున్న ఖడ్గతిక్కనయే మరల మూఁడవ తరమునఁగూడ మంత్రి-దళవాయి పదవుల నిర్వహించి యుండునా యని అనుమానము వచ్చుట సహజము. ఈ ఖడ్గతిక్కన మనుమసిద్ధికి మంత్రిగానున్న కవితిక్కనకుఁ బెదతండ్రి కుమారుఁడగుటచే నీ యనుమానము మఱింత బలపడుచున్నది. పెదతండ్రి కుమారుఁడగుటచే నీ ఖడ్గతిక్కన, కవితిక్కనకంటె వయసులోఁ బెద్దవాఁడై యుండునని యీ సంశయాస్పదుల నమ్మకము. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మనుమసిద్ధి కుమారుఁడగు నల్లసిద్ధియే కాటమరాజునకు సమకాలికుఁడని ఒకప్రక్క నిర్ణయించియుఁ, బై యనుమానముచే దానిని మరల కొట్టివేసిరి. చూడుడు:-

"చోడతిక్క భూపతియు, అతని కుమారుఁడు మనుమసిద్ధి భూనాథుఁడును క్రీ.శ. 1209-10, 1249-50 సంవత్సరముల నుండి పాలించినట్లు వారి శాసనములవలనఁ దెలియుచున్నట్లు ఇది వఱకే చెప్పఁబడినది. అట్లయినచో కాటమరాజుకథలోని నల్లసిద్ధి,

మనుమసిద్ధి ద్వితీయపుత్రుఁడైనఁ గావలెను; లేదా చోడతిక్కరాజు పెదతండ్రియో, పెదతాతయో యైన నల్లసిద్ధియైనఁ గావలెను. ఖడ్గతిక్కనతండ్రియైన సిద్ధనామాత్యుఁడు చోడతిక్కరాజు మంత్రి యైనప్పుడు, ఖడ్గతిక్కన చోడతిక్కరాజు పూర్వులైన నల్లసిద్ధి భూవరులయొద్దనుండుట యసంభవము. మనుమగండ గోపాలుఁడు క్రీ.శ. 1297 ప్రాంతమున నున్నవాఁడగుటచేత అతని తండ్రియు, చోడతిక్కభూపతి మనుమఁడును అయిన నల్లసిద్ధిరాజు క్రీ.శ. 1270-1275 ప్రాంతమున నుండవలెను. కాని, కవితిక్కన పెదతండ్రి కుమారుఁడయిన ఖడ్గతిక్కన, మనుమసిద్ధి కుమారుఁడైన నల్లసిద్ధికి మంత్రియగునా యని సంశయము." [17]

ఈ సంశయము నిరాధారమైనది అనియు, అనావశ్యకమనియు నిరూపించుటకు నేను రెండు ప్రధాన కారణములను జూపుచున్నాను. అందొకటి చారిత్రకమైనది; రెండవది లోకజ్ఞాన సంబంధమైనది.

## 2.9. ప్రొ॥ మారేమండ రామారావుగారు:-

మనుమసిద్ధి కాలానుగుణముగా మరణించినచో, నాతని తరములోనున్న ఖడ్గతిక్కన తరువాతి తరమున మంత్రిత్వ సైన్యాధ్యక్ష పదవులను నిర్వహించుట కవకాశము లేదు. కాని మనుమసిద్ధి యుద్ధమున నకాలమరణము నొందినాఁడు. ప్రొ॥ మారేమండ రామారావుగారి ప్రకారము ఇది క్రీ.శ. 1290 ప్రాంతమున రుద్రమదేవి కాలమున జరిగినది. ఈ మనుమసిద్ధి దుర్మరణమునకుఁ గారకుఁడు ఓరుగంటి ప్రతాపరుద్రుఁడు. మనుమసిద్ధి మొదటినుండియు కాకతీయ సామంతుఁడు. ఒకప్పుడు పాండ్యులచే రాజ్యము గోల్పోయి, గణపతిదేవుని దయవలన మరల పొందినాఁడు. కవితిక్కన గణపతిదేవుని దర్శించి, తన భారతమును వినిపించి, మనుమసిద్ధికి రాజ్యమిప్పించినట్లుగా జనశ్రుతియుఁ గలదు. (రుద్రమదేవి పాలనాకాలమున గణపతిదేవుఁడుండునా యని సంశయింపఁ బనిలేదు. రాజ్యవ్యవహారములను రుద్రమదేవి చూచుకొనుచుండఁగా, 'కృష్ణా రామా యనుకొనుచు' భారతాది గ్రంథములయందాసక్తుఁడైన వృద్ధుడుగా గణపతిదేవుడుండుటలో నసంభవమేమియు లేదు.) ఇది క్రీ.శ. 1260లో జరిగినది. 1262లో గణపతిదేవుఁడు మరణించెను. క్రీ.శ. 1290 ప్రాంతమున మనుమసిద్ధి మరల పాండ్యులచేఁ దఱుమఁబడెను. కాకతి రుద్రాంబ మొదట అంబదేవుఁడను సేనానిని నెల్లూరుకు పంపెను. ఆ యంబదేవుఁడు మనుమసిద్ధితోను, పాండ్యులతోను కుట్రపన్ని రుద్రమదేవిపైఁ దిరుగఁబడఁగా, యువరాజుగానున్న ప్రతాపరుద్రుఁడు వచ్చి అంబదేవు నోడించి, యీ మనుమసిద్ధిని జంపి, పాండ్యులను దఱిమివేసినాఁడు. ఈ చారిత్రకాంశమును మల్లంపల్లివారు గమనించినట్లు లేదు. కాకతీయ రాజవంశమునుగూర్చి గొప్ప పరిశోధన చేసిన ప్రొ॥ మారేమండ రామారావుగారు, యువరాజుగా నున్న ప్రతాపరుద్రుఁడు మనుమసిద్ధిని జంపుటనుగూర్చి యిట్లు వ్రాసినారు:-

"క్రీ.శ. 1290 ప్రాంతమున దక్షిణదిశను పాండ్యులు విజృంభించి, కాంచీ-నెల్లూరులను వశపరచుకొని, కాకతీయ సామంతుఁడగు మనుమసిద్ధిని తరిమివేసిరి. అంబదేవు డీ పాండ్యులను వెడలించి తిరిగి మనుమసిద్ధిని నెల్లూరున ప్రతిష్ఠించెను. కాని, ఈ యంబదేవుడు ఏ కారణమువలననో పాండ్యులతోను, యాదవులతోను చేరి, మనుమసిద్ధితోకూడ రుద్రాంబపై తిరుగుబాటు చేసెను. ఈ ప్రమాదమును ఎదుర్కొనుటకై యువరాజగు ప్రతాపరుద్రదేవుడు ససైన్యముగ దక్షిణదిశకు ఏగెను. గోన విఠ్ఠలనాథుడను సేనాని బళ్లారిమండలము ప్రవేశించి, యాదవులను ఓడించి, పెక్కు దుర్గములను జయించెను. అడిదమ్మయను మరియొక సేనాని మనుమసిద్ధిని చంపి, అంబదేవుని ఓడించెను. ప్రతాపరుద్రదేవుడు స్వయముగ పాండ్యులపై బడి వారిని పారద్రోలెను." [18]

దీనినిబట్టి, అడిదమ్మ యను కాకతీయ సేనానిచే క్రీ.శ. 1290 ప్రాంతమున మనుమసిద్ధి చంపఁబడెనని స్పష్టమగుచున్నది. మనుమసిద్ధి కాటమరాజుతోఁ బోరి మరణించెననుట యెంత అసంగతమో దీనివలనఁ దెలియుచున్నది. మనుమసిద్ధి చంపఁబడునాఁటికి రుద్రమదేవి కాకతీయ సామ్రాజ్యమునకు మహారాజ్ఞి. ప్రతాపరుద్రుఁడు యువరాజు. ఇట్లు మనుమసిద్ధి అకాలమరణము నొందుటచే నల్లసిద్ధి రాజగుటయు, నతనికి మరల ఖడ్గతిక్కనయే సైన్యాధ్యక్షుడును ప్రధానమంత్రియు నగుటయు సంభవమగుచున్నది. ఇది క్రీ.శ. 1290 ప్రాంతమున జరిగినది. నల్లసిద్ధి క్రీ.శ. 1270-75 ప్రాంతమున నుండియుండునని మల్లంపల్లి వారూహించిరి. ఆ యూహ కన్న నితఁడు క్రీ.శ. 1290 ప్రాంతమున సింహాసనమెక్కెనని పై చర్చనుబట్టి నిశ్చయింపవచ్చును. చోడతిక్క రాజు క్రీ.శ. 1209-10 నుండి 1249-50 వఱకును బాలించెనని శాసనములనుబట్టి తెలియుచున్నను, నితఁడు క్రీ.శ. 1258లో సుందరపాండ్యునిచేఁ జంపఁబడుటనుబట్టి యితని కాలమును క్రీ.శ. 1209-1258 అని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. ఇతని పుత్రుఁడగు మనుమసిద్ధి క్రీ.శ. 1258-1290 వఱకును బాలించెనని విస్పష్టమగుచున్నదది. మనుమసిద్ధి పుత్రుఁడగు నల్లసిద్ధి క్రీ.శ. 1290 ప్రాంతమున సింహాసనమెక్కెను. ఈ నల్లసిద్ధి పుత్రుఁడు మనుమగండ గోపాలుఁడు క్రీ.శ. 1297 ప్రాంతమున నున్నట్లుగా నొక శాసనము వలనఁ దెలియుచున్నదని మల్లంపల్లివారు సెలవిచ్చిరి. కాఁబట్టి నల్లసిద్ధి క్రీ.శ. 1290-97 వఱకును నెల్లూరును బాలించెనని చెప్పవచ్చును. మనుమసిద్ధి అకాలమరణము నొందుటచే నతని కొలువులోనున్న ఖడ్గతిక్కనయే, నల్లసిద్ధినిగూడ సేవించియుండుట అసంభావ్యము కానేరదు.

ఇఁక లోకవృత్తమును బరిశీలించి చూచినచో, పెదతండ్రి కుమారుఁడైనంత మాత్రమున వయస్సులోఁ బెద్దవాఁడుగా నుండుననియుఁ, బినతండ్రి కుమారుఁడైనంత మాత్రమునఁ జిన్నవాఁడుగా నుండుననియుఁ జెప్పఁజాలము. ఖడ్గతిక్కన, కవితిక్కన కన్నఁ

జిన్నవాఁడగుటయు సంభవమే. సిద్ధనమంత్రికి తన తమ్ముఁడగు కొమ్మనకంటె సంతానమాల్యముగాఁ గలిగియుండవచ్చును. లేదా కొందఱు పుత్రికలు ముందుపుట్టి, తరువాత ఖడ్గతిక్కన జనించియుండవచ్చును. కొమ్మనకుఁ గవితిక్కనయే జ్యేష్ఠపుత్రుఁడుగాఁ బుట్టియుండవచ్చును. మేనమామలకంటె మేనల్లుండ్రును, పెదతండ్రి కుమారులకంటె పినతండ్రి కుమారులును వయస్సులోఁ బెద్దవారుగా నుండుట లోకమున మనము చూచుచునేయున్నాము. కాఁబట్టి, కవితిక్కనకంటె, నతని పెదతండ్రి కుమారుఁడైనను ఖడ్గతిక్కన వయస్సులో జిన్నవాఁడై యుండును. అందుచే నల్లసిద్ధి కాలమున కవితిక్కనకు వయసు మళ్లియుండును, (లేదా కవితిక్కన మరణించి యుండును); ఖడ్గతిక్కన నడివయస్సులో నుండియుండును. ఈతఁడు యాదవులతోఁ బోరిన తీరు చూడఁగఁగా మిక్కిలి శరరీదార్ఢ్యముగల యోధాగ్రేసరుఁడుగాఁ గాన్పించును. కావున ఖడ్గతిక్కన మనుమసిద్ధి కాలమున యువకుఁడుగను, నల్లసిద్ధి కాలమున నలుబది యేండ్ల నడిమి వయస్కుఁడుగను నుండియుండునని నా నమ్మకము. మనుమసిద్ధి కాలమున మంత్రిగా నున్న కవితిక్కన, నల్లసిద్ధి కాలమున గతించియుండును.

ఈ కాటమరాజు యుద్ధము మనుమసిద్ధికాలమున (క్రీ.శ. 1250–90) గాక, ఆతని కుమారుఁడగు నల్లసిద్ధి కాలమున (క్రీ.శ. 1290–1297) జరిగినదనియు, నప్పటికి మనుమసిద్ధియే కాక కవితిక్కనయు మరణించెననియుఁ దెల్పుటకొక ప్రమాణమున్నది. కాటమరాజు కథాచక్రమునకు సంబంధించిన వీరగాథలలో 'జన్నివాడ కథ' యొకటి. దీని తాళపత్రప్రతి నాకు లభించినది. ఇది యెఱ్ఱగడ్డపాటి పోట్లాటకుఁ గొంచెము పూర్వము జరిగిన కథ. ఇందు కాటమరాజు 'జన్నివాడ' గ్రామమున గుడారము లెత్తించి, పద్మనాయనితోఁ బగడసాలాడుచు నెల్లూరిసీమలోఁ బశువులను మేపుట వర్ణితమైనది. కాటమరాజును, పద్మనాయఁడును గూర్చుండి పగడసాలాడిన యొక పెద్ద గుండుఱాతిని జన్నివాడ గ్రామమున నేఁటికిని బ్రజలు చూపుచున్నారు. ఈ 'జన్నివాడ' నేఁటి నెల్లూరు ప్రక్కనున్న 'జొన్నవాడ'. దీని అసలుపేరు 'జన్నవాడ'. ఇది కవితిక్కన జన్నముచేసిన ప్రదేశము కావున 'జన్నవాడ' అయినది. ఈ జన్నవాడ యనుగ్రామము కాటమరాజు కాలమునాఁటికే యేర్పడినదని పై వీరగాథనుబట్టి తెలియుచున్నది. మనుమసిద్ధి మరణానంతరము తిక్కన యజ్ఞముచేసి భారతరచన ప్రారంభించెనని కదా జనశ్రుతి! అనఁగా కాటమరాజు జన్నివాడకథ నాఁటికే మనుమసిద్ధి మరణించుట, తిక్కన యజ్ఞము చేయుట, ఆ ప్రదేశమున నొక గ్రామము వెలయుట జరిగిపోయినది. కావున కాటమరాజు యుద్ధకాలమునాఁటికి కవితిక్కన ఉండియుండఁడు. ఉన్నచోఁ బదునైదు పర్వముల మహాభారతమును రచించిన ఈ మహాకవి, తన వీరసోదరునికై దుఃఖించుచుఁ గనీసమొక కందపద్యము నైనను చెప్పియుండును కదా! ఇట్లు, కవితిక్కన సోదరుఁడగు ఖడ్గతిక్కన ప్రసక్తి తీసికొని రాకపోవుటకూడ, యుద్ధకాలమున నతఁడు లేఁడని నిరూపించుచున్నది. కవితిక్కన, ఖడ్గతిక్కన కన్న వయసులోఁ బెద్దవాఁడై, అతనికన్న ముందే గతించియుండును. క్రీ.శ. 1290 ప్రాంతమున మనుమసిద్ధి చంపఁబడెను. తరువాత నాలుగైదు సంవత్సరములలోఁ గవితిక్కనయు గతించియుండును. ఆ పిమ్మటనే యీ కాటమరాజు యుద్ధము (ఖడ్గతిక్కన మరణము) జరిగియుండును.

చోడతిక్కరాజు శాసనములు క్రీ.శ. 1209–10 నుండి లభించుచున్నవి. క్రీ.శ. 1258లో చోడతిక్కరాజు సుందర పాండ్యునిచేఁ జంపఁబడెనని తెలియుచున్నది. మనుమసిద్ధి శాసనములు క్రీ.శ. 1249–50 నుండి లభ్యమగుచున్నవి. కాటమరాజు ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమువాఁడని గుండ్లపాలెము శిలాశాసనము సాక్ష్యము నిచ్చుచున్నది. మనుమసిద్ధి క్రీ.శ. 1290 ప్రాంతములో కాకతీయ సేనానియగు అడిదమ్మచేఁ జంపఁబడెనని స్పష్టముగాఁ దెలియుచున్నది. ఖడ్గతిక్కన తమ్ముఁడగు బాచఁడు సేవణ సైన్యమును జయించినట్లు తెలియుచున్నదది. ఈ బాచఁడు క్రీ.శ. 1275–1277 ప్రాంతము వాఁడని దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు నిర్ణయించినారు (చూ. భారతి, మార్చి1965). మనుమసిద్ధి కుమారుఁడగు నల్లసిద్ధి క్రీ.శ. 1270–1275 ప్రాంతమున నుండి యుండునని మల్లంపల్లి వారు నిర్ణయించియున్నారు. మనుమసిద్ధి మనుమఁడును, నల్లసిద్ధి కుమారుఁడును నగు మనుమగండ గోపాలుఁడు క్రీ.శ. 1297 ప్రాంతముల నున్నట్లు తెలియుచున్నది. ఈ మనుమగండ గోపాలుఁడును కాటమరాజు యుద్ధమునఁ బాల్గొన్నాడు. కటియావులరాజు – ఎఱ్ఱసిద్ధిరాజుతోను, భట్టావుల వల్లభన్న– పాపసిద్ధిరాజుతోను,, అయితమరాజు– గండగోపాలరాజుతోను యుద్ధము చేసినట్లుగా నెఱ్ఱగడ్డపాటి పోట్లాటలోఁ గలదు.[19] కాటమరాజు సోదరుఁడగు కటియావులరాజు ఓరుగంటి ప్రతాపరుద్రుని సేనానియని బేతాళుని ద్వంద్వయుద్ధమునఁ జంపినట్లుగా నున్న వీరగాథ లభ్యమగుచున్నది. ఇన్ని విషయములు ప్రబల సాక్ష్యమిచ్చుచుండగాఁ గాటమరాజుకథల చారిత్రకత్వమును శంకించుట సరికాదని నా యభిప్రాయము.

పై విషయములనుబట్టి కాటమరాజుకథలలో వచ్చు ఖడ్గతిక్కన, నల్లసిద్ధిరాజు, కాటమరాజు, గండగోపాలుఁడు చారిత్రక పురుష లనియు, నీ యుద్ధము ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమున– ముఖ్యముగా 13వ శతాబ్దము చివరిభాగములో, క్రీ.శ. 1290–97 మధ్యకాలమున జరిగినదనియు నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. పై చర్చనుబట్టి నల్లసిద్ధిరాజు పితృపితామహులయొక్కయు, వారి వారి మంత్రులయొక్కయుఁ గాలము లిట్లుండును: (ప్రొ॥ మారేమండవారి ప్రకారము).

*కాకతి గణపతిదేవుని సామంతుడు:* – చోడ తిక్కరాజు (క్రీ.శ. 1209–1258)– సిద్ధన ప్రధానమంత్రి.

*గణపతిదేవ, రుద్రాంబల సామంతుడు:* – మనుమసిద్ధి (క్రీ.శ. 1258–1290)– కవితిక్కన (మంత్రి); ఖడ్గతిక్కన (సేనాధిపతి).

*ప్రతారుద్రుని సామంతులు:* – 1) నల్లసిద్ధి (క్రీ.శ. 1290–1297)– ఖడ్గతిక్కన (మంత్రి మఱియు సేనాధిపతి)– 2) మనుగండ గోపాలుఁడు (క్రీ.శ. 1297–1313). కావున, కాటమరాజు క్రీ.శ. 1290–1297 మధ్యకాలములో నెప్పుడో నల్లసిద్ధితో యుద్ధము చేసి

మరణించియుండును. కాకతీయ సామంతులగు తెలుఁగు చోళుల కాలమును దెలిసికొనుటకు, కాకతీయ చక్రవర్తుల వంశక్రమమును బరిశీలించుట యవసరము. (చూ. క్రింది కాకతీయ చక్రవర్తుల వంశక్రమము):-

*ఆచార్య మారేమండ రామారావుగారి సిద్ధాంత ప్రకారము:-*




***గమనిక:-*** విజ్ఞాన సర్వస్వము, తెలుగు సంస్కృతి, మొదటి సంపుటములో (పుట 338లో) డా॥ పుచ్చా వాసుదేవ పరబ్రహ్మశాస్త్రిగారు ఇచ్చిన స్వతంత్ర కాకతీయ చక్రవర్తుల కాలములు పైన తెల్పిన ప్రొ॥ మారేమండ రామారావుగారి కాలములకన్న కొంత భిన్నముగా నున్నవి. మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇచ్చిన నెల్లూరి తెలుగు చోళులకాలములు (చోడతిక్క-మనుమసిద్ధి- నల్లసిద్ధి కాలములు) కూడ ప్రొ॥ మారేమండవారి కాలములకన్న కొంత భిన్నముగా నున్నవి. రుద్రమదేవి క్రీ.శ. 1262-1289; ప్రతాపరుద్రుడు యువరాజుగా: క్రీ.శ. 1280-1289; చక్రవర్తి: క్రీ.శ. 1289-1323. చోడతిక్క: క్రీ.శ. 1209 లేదా 1210 నుండి 1249 లేదా 1250 వఱకు; మనుమసిద్ధి: క్రీ.శ. 1249 లేదా 1250 నుండి 1270 లేదా 1275 వరకు; నల్లసిద్ధి: క్రీ.శ. 1270 లేదా 1275 నుండి 1297 వఱకు.

మనుమసిద్ధి కుమారుఁడు (ద్వితీయ పుత్రుఁడు) నల్లసిద్ధి యని తెలుఁగు చోళుల శాసనములలో స్పష్టముగా నుండగాఁ, గొందరు మనుమసిద్ధియే నల్లసిద్ధి యని భ్రమించి, మనుమసిద్ధి కాటమ రాజుతోఁ బోరాడెనని విపరీతవాదమును బ్రచారమొనరించిరి. 1909లో, 'రాజవంశ ప్రదీపిక' కర్తయగు బత్తుల లక్ష్మయ్యగారు, కాటమరాజుతో యుద్ధము చేసినది 'మనుమసిద్ధి' అనియే వ్రాసిరి. నల్లసిద్ధిని, మనుమసిద్ధి తమ్మునిగాఁ బేర్కొనిరి.[20] 1953లో కాటమరాజుకథలపై నత్యుత్తమ వ్యాసమును బ్రకటించిన తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు సహితము మనుమసిద్ధి నల్లసిద్ధులకు అభేదమును పాటించి, తమ వ్యాసమునందంతటను నల్లసిద్ధికి బదులు మనుమసిద్ధి నామమునే వాడుట విచారకరము. మనుమసిద్ధినిగూర్చి వీరిట్లు వివరించిరి. "మనుమసిద్ధి-ఇతడు నెల్లూరును పరిపాలించిన రాజు. నల్లసిద్ధియని యీతనికి వ్యవహారము కలదు. ఈతడు అమరావతి లింగేశ్వరునికిని బార్వతికిని బుట్టిన ముక్కంటికి పుత్రుఁడు."[21] ఇట్లు మనుమసిద్ధియు నల్లసిద్ధియు నొక్కరనుట సరికాదు. మనుమసిద్ధియొక్క ద్వితీయ పుత్రుఁడు నల్లసిద్ధి యని శాసనములు నిరూపించుచున్నవి. తెలుఁగు చోళుల శాసనము లనుబట్టి మనుమసిద్ధికి ముగ్గురు పుత్రులు: తిక్కభూప, నల్లసిద్ధి, గోపినాథ. యాదవగాథాకారులు నల్లసిద్ధికి నలుగురు సోదరులున్నారని చెప్పుచుందురు: "ఎఱసిద్ధిరాజు, నలసిద్ధిరాజు, పాపసిద్ధిరాజు, కొండిక సిద్ధిరాజు, కొమార సిద్ధిరాజు" అని పాడుచుందురు. కాని వేటూరివారు పరిష్కరించిన 'భట్టురాయబారము' అను వీరగాథలో నీ యైదుగురి పేర్లును భిన్నముగా నున్నవి. "మన్మసిద్ధిరాజు, కొండొక సిద్ధిరాజు, కొమార సిద్ధిరాజు, కస్తూరిరాజు, గండ గోపాలరాజు" అని కలదు.[22] కోదండరామయ్యగారు, స్థానికచరిత్రల నాధారముగాఁ జేసికొని కాఁబోలు, మనుమసిద్ధి ముక్కంటి పుత్రుఁడనిరి. భట్టురాయబారముకథలో మనుమసిద్ధి ముక్కంటికి మూడవతరము వాడుగాఁ జెప్పఁబడెను:-

> ***"ముక్కంటి కొమరుండు మొగి జనోధీరుఁడు***
> ***జనోధీరుని కుమారుఁడు మనోధీరుఁడు***
> ***మనోధీరుని కుమారుఁడు మన్మసిద్ధిరాజు"*** [23]

తెలుఁగుచోళుల శాసనములనుబట్టి మనుమసిద్ధి, చోడతిక్కరాజు ద్వితీయ పుత్రుఁడు.

## 2.10. యుద్ధకాల నిర్ణయము:-

నల్లసిద్ధిరాజు నెల్లూరును పాలించిన కాలము క్రీ.శ. 1270-1275 నుండి 1297 వఱకు (శ్రీ మల్లంపల్లి) లేదా క్రీ.శ. 1290-97 (ప్రొ॥ మారేమండ) అని పైన నిరూపించితిని. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట యీతని పాలనా కాలములోనే జరిగియుండవలెను. ఇది యే సంవత్సరమో నిరూపించుటకు విమర్శకులు కొంత ప్రయత్నము చేసియున్నారు. ఖడ్గతిక్కన- బ్రహ్మరుద్రయ్యల యుద్ధము (ఇదియే యాదవుల ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటకు నాంది) మాఘ బహుళ అమావాస్య మంగళవారమునాఁడు జరిగినట్లుగా 'చల్లవారి జగడము' అను వీరగాథలోఁ గలదు.[24] నాకు లభించిన 'ఆవుల మేపులు' అను తాళపత్రగ్రంథమున ఎఱ్ఱగడ్డపాటిలో యాదవులు చిత్రభాను సంవత్సరమునఁ జెల్లఁగలరని బ్రహ్మదేవుఁడు చెప్పినట్లుగాఁ గలదు:

> ***"ఏటిమీద ఆరు నెలలకు ఎద్దులు యాదవులు***
> ***చిత్రభాను సంవత్సరాన చెల్లనున్నారు"***

స్థానిక చరిత్రలలోఁగూడ నీ యుద్ధము చిత్రభాను సంవత్సరమున జరిగినట్లుగనే యున్నది. ఈ చిత్రభాను సంవత్సరము నకు సరియైన శకవర్షములు నాలుగున్నవి: 1024, 1084, 1144, 1204. ఈ నాల్గింటిలో దేనిలో మాఘ బహుళ అమావాస్య మంగళవారమునాఁడయ్యెనో పరిశీలించినచో నదియే ఈ యుద్ధము జరిగిన సంవత్సరమగును. ఈ పరీక్ష ఒక్క 1084కు మాత్రమే సరిపోవుచున్నది. అనఁగా శకవర్షము 1084 (క్రీ.శ. 1163) ఖడ్గతిక్కన యుద్ధకాలమగుచున్నది. కాని యిది సరికాదు. అప్పటికి ఖడ్గతిక్కన కాదు కదా, అతని తండ్రి సిద్ధనమంత్రికూడ నుండి యుండుట కవకాశము లేదు. కావు. చిత్రభాను సంవత్సరమునుబట్టి యుద్ధకాల నిర్ణయము చేయఁజాలము. (నా అభిప్రాయమున శకవర్షము 1204 చిత్రభాను సంవత్సరము కాటమరాజు యుద్ధకాలమునకు సరిగా సరిపోవును. క్రీ.శ. 1282-1283 మధ్య చిత్రభాను సంవత్సరము వచ్చును. శకవర్షము 1204లో మాఘబహుళ అమావాస్య మంగళవారమే అగుచున్నది. అది ఆంగ్ల కాలమానము ప్రకారము: 5-2-1283 అగును.)

గుండ్లపాలెము శాసనములో నొకచోట యుద్ధకాలము శకవర్షము 1170 కాళయుక్తి సంవత్సర కార్తిక శుద్ధ పంచమి గురువారమని కలదు: "స్వస్తిశ్రీ శాలివాహన శకవర్షంబులు ౧౧౭౦ అగునేంటి కాళయుక్తి సంవత్సర కార్తిక శుఞు నెల్లూరి నలసిద్ధిరాజు సర్వసెన్నాహం మెరసి- లింగాలకొండ యఱ్ఱగడ్డపాటి కూడలి సోమేశ్వరుని సందలిసనాన ఆత్రియగోత్ర యాదవక్షత్రియ మధురాపుర మందీశ్వర శ్రీవిష్ణు యోగమాయ దివ్యశ్రీపాదక బ్రకట శాత్రవ భంజన నచ్చెర వుంది పౌత్ర లాయత్తవం గౌరవ పౌరువుండు ద్వారాకాపురి గోపికా వల్లభుని పౌత్రుండు వల్లురాజు లతని సుతులు పోలురాజు పెద్దురాజు వారి పుత్రులు మొదలైన యాదవులు నల్లసిద్ధింగూడి యుద్ధము చేసి మృతులైరి."[25] ఈ శాసనవిషయమునుబట్టి కాటమరాజు-నల్లసిద్ధిరాజుల యుద్ధము శకవర్షము 1170 అనఁగా క్రీ.శ. 1248లో జరిగెనని చెప్పవలెను. కాని ఇందుఁ జెప్పఁబడిన శకవర్షంబునకును, తిథి వార సంవత్సర నామములకును పొత్తు కుదురుట లేదు. ఈ శాసనములోని యుద్ధకాల సంవత్సరమును గూర్చి మల్లంపల్లి సోమశేఖరశర్మగారు ఇట్లు సెలవిచ్చినారు: "ఇది

కూడ సరియైన తేదిగఁ గనఁబడదు; ఎందువల్ల ననఁగా శకవర్షము 1170కి సరియైన బార్హస్పత్యమానాబ్దము కీలక కాని, కాళయుక్తి కాదు. కాళయుక్తియే సరియైన సంవత్సరమని, శకవర్షసంఖ్యయే తప్పుగా చెక్కఁబడియుండునని యనుకొన్నచో, దానికి సరియైన శకవర్షము 1180 అగును. ఈ 1180, కాళయుక్తి సంవత్సరమున కార్తిక శు 5 గురువారమునాఁడయినదేమో విచారింపవలసియున్నది. ఆ సంవత్సరమున అధికమాసము వచ్చినది. ఇది కార్తికమే. అధిక కార్తికమున శుద్ధపంచమీ తిథి శనివారమయినది కాని, గురువారము కాలేదు; నిజకార్తికమున నైనను శుద్ధ పంచమి శనివారమే అయినది. అందువలన శకవర్షము 1180 కార్తిక శుద్ధ పంచమీ గురువారము కూడ సరియయిన తేదిగాఁ గన్పట్టదు. శకవర్షము 1170 సరియైనదేమో యనుకొన్న నా సంవత్సరముననైనను కార్తిక శు.5 శుక్రవారమైనది కాని గురువారము కాలేదు. అందువలన నీ గుండ్లపాలెము శాసనము నందిచ్చిన యుద్ధకాలముకూడ సరియైనది కాదు. అందువలన నెల్లూరి నల్లసిద్ధిరాజునకును కాటమరాజునకును యుద్ధమెప్పుడు జరిగినదియు నిప్పటికి గల యాధారములతో నిర్ణయించుటకు వీలుకాదు."[26] ఒకవేళ నిందలి తిథి వార పక్షములను నమ్మకుండ, శకవర్షమునే ప్రమాణముగా గ్రహింతమన్నచో, క్రీ.శ. 1248 నాటికి, నల్లసిద్ధి పాలన కాదుకదా యతని తండ్రి యగు మనుమసిద్ధి పాలనకూడ ప్రారంభము కాలేదు. అది కాకతీయ గణపతిదేవుని కాలము. నెల్లూరును చోడతిక్కరాజు పాలించుచుండెను. కాని కాటమరాజు ప్రతాపరుద్రుని కాలమువాఁడుగా నీ గుండ్లపాలెము శాసనములోనే రెండు మూఁడు తావులందున్నది. చోడతిక్కని కుమారుఁడగు మనుమసిద్ధి కాకతీయ గణపతిదేవుని కాలమునఁ గొంత, రుద్రమదేవి కాలమందు మఱికొంత జీవించినవాఁడు. (గణపతిదేవుని కాలము: క్రీ.శ. 1198/99–1262; రుద్రమదేవి కాలము: క్రీ.శ. 1262–1289/1296. మనుమసిద్ధి కాలము: క్రీ.శ.1249/50–1270/75 లేదా క్రీ.శ. 1258–1290. నల్లసిద్ధియు నతని ప్రత్యర్థియగు కాటమరాజును రుద్రమదేవి చివరి కాలమందును, ప్రతాపరుద్రుని యౌవరాజ్య కాలమందును జీవించి యుందురు. ప్రతాపరుద్రుని యౌవరాజ్యకాలము: క్రీ.శ. 1280–1289 (డా॥పుచ్చా); లేదా క్రీ.శ. 1290–1296 (ప్రొ॥ మారేమండ). కాఁబట్టి క్రీ.శ. 1280–1296 మధ్యకాలమందే యుద్ధము జరిగియుండును.

ఈ గుండ్లపాలెము శాసనములోనే రెండవప్రక్క 40–44 పంక్తులలో, కాటమరాజు ఓరుగంటి ప్రతాపుని కాలమున ముప్పది రెండు సంవత్సరములు రాజ్యముచేసి, పంచలింగాల కొండ దగ్గఱ నున్న యెఱ్ఱగడ్డపాటిలో నల్లసిద్ధిరాజుతో యుద్ధముచేసి చనిపోవు నాటికిఁ గలియుగము ప్రవేశించి 3965 ఏండ్లాయెనని యున్నది. దీనినిబట్టికూడ యుద్ధకాలమును నిశ్చయింపవచ్చును. 1967 ప్లవంగ నామ సంవత్సరమునాఁటికి కలియుగము ప్రవేశించి 5068 సంవత్సరములయినది. కాటమరాజు యుద్ధకాలము నాఁటికిని దీనికిని భేదము 5068–3965= 1103 సంవత్సరములు. అనఁగా కాటమరాజు యుద్ధము క్రీ.శ. 1967–1103= క్రీ.శ. 864లో జరిగియుండవలెను. ఇది మిక్కిలి అసమంజసముగా నున్నది. ఈ యుద్ధము ఇంత ప్రాచీనమైనదనుట హాస్యాస్పదము.

సి.పి.బ్రౌనుదొరగారు కాటమరాజుయుద్ధము క్రీ.శ. 1159లో జరిగినదని భావించిరి. వీరు 1842 ఆగష్టు 10వ తేదిన వ్రాయించిన 'భట్టురాయబార'మను ప్రతిలో ముఖపత్రమున దొరగారు స్వహస్తములతో నిట్లు లిఖించియున్నారు:

"The occurences described in this poem took place at the time when Bhuja Bala Vira Nalla Siddha Deva Chola Maharaz (a little baron with a logn name) ruled Nallore. And it has been ascertained that this was in the year 1081 of Salivahana or A.D. 1159."[27]

ఇందు సంఘటన నల్లసిద్ధికాలముననే జరిగినట్లుగాఁ జెప్పఁబడినను, యుద్ధకాలము మాత్రము సరిగా నీయఁబడలేదు. క్రీ.శ. 1159 నాఁటికి ఖడ్గతిక్కనతండ్రికూడ పుట్టియుండడు.

స్యూయల్ (Sewell) చరిత్రకారుఁడు సిద్ధిరాజును యాదవులను క్రీ.శ. 12వ శతాబ్దమువారుగా నిరూపించెను. ఇది తప్పు. శ్రీమతి వారణాసి యశోదాదేవిగారు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట క్రీ.శ. 1259 జరిగినదని వ్రాసిరి (చూ. J.A.H.R.S. Volume xxiii, p. 13). మూఁడవ మనుమసిద్ధి క్రీ.శ. 1248–1267 మధ్య నుండుటయే దీనికిఁ బ్రమాణము కాఁబోలు. వీరగాథలలోఁ జెప్పఁబడినట్లుగా మనుమసిద్ధి యీ యుద్ధమున జనిపోలేదనియు, క్రీ.శ. 1267 వఱకును నతని శాసనములు లభించుచున్నవనియు నీమె తెల్పియున్నారు. మనుమసిద్ధికిని నల్లసిద్ధికిని నభేదమును బాటించుటచే, నీమె యిచ్చిన యుద్ధకాలము విశ్వసింపదగినది కాదు. ఇందొక తరము వెనుకబడినది. మెకంజీ వ్రాఁతప్రతులలో నీ యుద్ధము క్రీ.శ. 1263లో జరిగినట్లుగాఁ జెప్పఁబడినది.[28] క్రీ.శ. 1259 యుద్ధకాలముగా భావించిన యశోదాదేవిగారు 1263ను గూడ కొంతవఱకు నంగీకరించుచున్నారు. ఏమైనను నీ యుద్ధము కాకతి గణపతిదేవుని కాలముననే జరిగినదని యీమెగారి వాదము.

"This battle evidently took place in Ganapati's reign and not in Prataparudra's as Manmasiddhi, contemporary of Ganapati, figures as the king in the battle. The battle is palced in A.D. 1263 and Manmasiddhi along with Tikka is said to have lost his life in it. Even accepting the date of the battle as A.D. 1263 Manmasiddha did not lose life in that year, as his records attest his rule till A.D. 1267."[29]

మనుమసిద్ధి గణపతిదేవునకు సామంతుడనుటలో సందేహము లేదు కాని, కాటమరాజుతో యుద్ధము చేసినది మాత్రము మనుమసిద్ధి

కాదు, అతని కుమారుఁడు నల్లసిద్ధి. ఇతఁడు ప్రతాపరుద్రుఁడు యువరాజుగా నున్నప్పుడు నెల్లూరు నేలినవాఁడు. రుద్రాంబకు సమకాలికుఁడు. అందుచే యశోదాదేవిగారి వాదము పరాస్తమగు చున్నది. కాటమరాజుయుద్ధము గణపతిదేవుని కాలమునఁ గాదు, ప్రతాపరుద్రుని కాలముననే జరిగినది. బహుశః ప్రతాపరుద్రుఁడు యువరాజుగానున్న కాలమున (క్రీ.శ. 1280-1296 మధ్య) జరిగియుండును. దీనికిఁగల సాక్ష్యములను నేను వెనక వివరించి యుంటిని.

యశోదాదేవిగారుకాని, మల్లంపల్లివారుకాని కాటమరాజు వీరగాథలనన్నింటిని బరిశీలింపలేదు. అందుచే నీ చారిత్రకులు కాటమరాజు యుద్ధమును సరిగా అంచనా వేయలేకపోయిరి. యశోదాదేవిగారైనను నొక సంవత్సరము (క్రీ.శ. 1259) నిచ్చిరి కాని, మల్లంపల్లివారు యుద్ధకాలము నిర్ణయించుటకే వీలుకాదని నిస్పృహ చెందిరి. "... గుండ్లపాలెము శాసనము నందిచ్చిన యుద్ధకాలము సరియైనది కాదు. అందువలన నెల్లూరి నల్లసిద్ధిరాజు నకును కాటమరాజునకును యుద్ధమెప్పుడు జరిగినదియు నిప్పటికిఁ గల యాధారములతో నిర్ణయించుటకు వీలుకాదు."[30] కాటమరాజు కథాచక్రమున ముప్పదిరెండు వీరగాథలుండఁగా, నొక్క గుండ్లపాలెము శిలాశాసనమును మాత్రమే ఆధారముగా గ్రహించుట పాడికాదు. తాళపత్రములలోఁ జివికిపోవుచున్న ఆ వీరగాథలలోని చారిత్రకాంశములనుగూడఁ బరిశీలింపవలసియున్నది. అప్పుడే కాలనిర్ణయము సమగ్ర పరిశీలనమగును. ఇట్టి సమగ్ర పరిశీలనము చేసినవారు శ్రీ దేవరపల్లి వెంకటకృష్ణారెడ్డిగారు. ఈ రెడ్డిగారు తమ యొద్దనున్న తాళపత్రగ్రంథముల నాధారముగాఁ జేసికొని, ముఖ్యముగా 'ఆవులమేపు' అను వీరగాథను దీసికొని, కాటమరాజు నల్లసిద్ధితోఁ గావించుకొన్న పుల్లరియొదంబడికను, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటను తారీఖులతో సహా నిర్ణయించినారు:-




"కాటమరాజు పుల్లరియుద్ధకాలము నిర్ణయించుటకు గుంటూరుజిల్లా నర్సారావుపేట శాసనము చక్కగా తోడ్పడుచున్నది. అందలి నెల్లూరు చోడవంశమూ, కాలము పనికి వచ్చును.

"ఈ నెల్లూరు చోడవంశమందలి 'నల్లసిద్ధి'యే కాటమరాజుతో పుల్లరియుద్ధము కావించినట్లు ద్విపదచరిత్ర సూచించుచున్నది.

*"తనర వ్రాయించ్చిరి తిక్కన చాత*
*విరుషు సంవత్సర కాలము కార్తిక*
*యా శుద్ధ విదియ యలమి గురువారము*
*..................................*
*..................................*
*యిలలోన నలసిద్ధిరాజిచ్చిన కవులు"*

(ఆవులమేపు, 1-59 తాటియాకు)

"ఈ ద్విపదలో శకవర్షములు చెప్పకపోయినను, శాసనమందలి శా.శ.౧౨౧౮ అగు, హేమలంబి కాలముకంటే కొంచెము ముందు కాలమనుట కాక్షేపము లేదు. కాకతీయ 'ప్రతాపరుద్ర భూపతి' కాలమునాటిదన వీలున్నది. కాబట్టి, నెల్లూరి పుల్లరికవులు శా.శ. 1203 అగు విష్ణుసంవత్సర కార్తిక శు2 గురువారమూ- అనగా 16-10-1281 తేది నెల్లూరు కరణము తిక్కన వ్రాసినట్లు స్పష్టమగుచున్నది. క్రీ.శ. 1281 నాటికి నెల్లూరు చోడరాజు నల్లసిద్ధి రాజ్యము సాగినట్లున్నది. క్రీ.శ. 1282 చిత్రభానులో పుల్లరియుద్ధమూ పరిసమాప్తమయినట్లు ద్విపద కాలచరిత్ర తెల్పుచున్నది.

*"చిత్రభాను సంవత్సరము చెలగి కార్తిక*
*చెతుర్ దశి దినమున శనివారమునాడు*
*ఆ రాత్రి వేగిన ఆవుల పబ్బమూ"*

(ఆవులమేపు. 1-32 తాటియాకు)

"శా.శ. 1204 అగు చిత్రభాను సంవత్సరము కార్తిక బ14 శనివారము 17-3-1282 తేదితో సమకాలమగుచున్నది."[31]

పై విధముగాఁ దెల్పిన దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారి అభిప్రాయముతో నేకీభవించుటకు నా కెట్టి యభ్యంతరమును లేదు. వీరు కేవలము శాసనములనే కాక, వీరగాథలనుగూడ పరిశీలించిన మనీషి. వీరిది సమగ్ర పరిశీలనము. కాని వీరి లెక్కలోని కార్తికమాసము అక్టోబరు- నవంబరు నెలలలో వచ్చును కాని, మార్చి నెలలో రాదు. క్రీ.శ. 1290 ప్రాంతమునఁ గాకతీయ యువరాజగు ప్రతాపరుద్రుఁడు నెల్లూరిపై దండెత్తి, కుట్రపన్నిన మనుమసిద్ధిని జంపెనని తెల్పు ఆచార్య మారేమండ రామారావుగారి వాక్యములు వెంకట కృష్ణారెడ్డిగారు నిర్ణయించిన కాలమునకుఁ గొంచెము బాధాకరముగా నున్నవి. దీనినొక విధముగాఁ దొలఁగింపవచ్చును. మారేమండ రామారావుగారు ప్రతాపరుద్రుఁడు మనుమసిద్ధిని జంపినది క్రీ.శ.

1290 ప్రాంతమనిరి కాని సరిగా 1290 అని నిర్ధరించలేదు. అది 1290కి ముందు కావచ్చును లేదా తరువాత కావచ్చును. ఏమైనను, కాటమరాజు యుద్ధము మనుమసిద్ధి మరణానంతరము జరిగినది. మనుమగండ గోపాలుఁడు క్రీ.శ. 1297 ప్రాంతమున నున్నట్లుగా శాసనాధారమున్నది. క్రీ.శ. 1267 వఱకును మనుమసిద్ధి శాసనములు లభించుచున్నవని యశోదాదేవిగారు తెల్పుచున్నారు. కాఁబట్టి యీ యుద్ధము క్రీ.శ. 1267-1297 మధ్యకాలములో నెప్పుడో జరిగియుండును. ఇది ప్రతాపరుద్రుని కాలమున జరిగెనని గుండ్లపాలెము శాసనమును, వీరగాథలును దెల్పుచున్నవి. ప్రతాపరుద్రుని పాలనాకాలము క్రీ.శ.1289/1296-1323. కాని యితఁడు యువరాజుగా నున్నప్పుడు మనుమసిద్ధిని జంపెనని మారేమంద రామారావుగారు తెల్పుచున్నారు. ఇతఁడు రుద్రమదేవి పాలనాకాలములో (1262-1289/1296) క్రీ.శ. 1280లో యౌవరాజ్య పట్టాభిషిక్తుఁడయ్యెను. అందుచే కాటమరాజు-నల్లసిద్ధిరాజుల యుద్ధము క్రీ.శ. 1267-1297 మధ్య జరిగెననుటకన్న క్రీ.శ. 1280-1296 మధ్య జరిగెననుట మఱింత సమంజసము. ఆ యుద్ధము జరిగిన సంవత్సరము దేవరపల్లి వెంకట కృష్ణారెడ్డిగారు చెప్పినట్లుగా క్రీ.శ. 1282 కావచ్చును. అదియే చిత్రభాను సంవత్సరమగుట వీరి వాదమునకు మఱింత బలము నొసంగుచున్నది. క్రీ.శ. 1290 ప్రాంతమున మనుమసిద్ధి ప్రతాపరుద్రునిచేఁ జంపఁబడెనను మారేమంద రామారావుగారి వాక్యములనే ఆధారముగాఁ గైకొన్నచో, నీ యుద్ధము క్రీ.శ. 1290-1297 మధ్యకాలములో జరిగియుండునని చెప్పవలెను.[32] మొత్తమున కీ యెఱ్ఱగడ్డపాటి పోట్లాట క్రీ.శ. 1280-1296 మధ్యకాలములో (అనఁగా రుద్రమదేవి చివరికాలమున- ప్రతాపరుద్రుని యౌవరాజ్యకాలమున) జరిగెననుట నిస్సంశయము. చిత్రభాను సంవత్సరమునకు ఈ మధ్యకాలములోని క్రీ.శ. 1282-83 సరిగా సరిపోవుటవలన అదియే యుద్ధకాలము కావచ్చును. 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' మాఘ ఫాల్గుణ మాసములలో జరిగినట్లు గ్రంథస్థ సాక్ష్యమున్నది. కావున ఈ పోట్లాట క్రీ.శ. 1283 ఫిబ్రవరి-మార్చి నెలలో జరిగియుండునని నేను భావించుచున్నాను. (క్రీ.శ. 1282 ఏప్రిల్ నుండి 1283 మార్చి వఱకు చిత్రభాను సంవత్సరము కావచ్చును.)

## 2.11. యుద్ధకారణములు:-

కాటమరాజు కడప కర్నూలు మండలములలో లంకమల, పాలకొండ, నల్లమల మున్నగు పర్వతారణ్య ప్రదేశములందుఁ దన విస్తారమైన గోగణమును మేపుకొనుచు, నచ్చట అనావృష్టిచేఁ బశువులకుఁ గసవు లభింపమి నెల్లూరిసీమకు వచ్చి, నల్లసిద్ధిరాజుతోఁ దనమందలోఁ బుట్టెడి కోడెదూడలను బుల్లరిగా నిర్ణయించుకొని, నెల్లూరిసీమలోని పచ్చికబీళ్లను మేపుకొనుచు, నొడంబడికకు విరుద్ధముగా వరిపైరులను గూడ మేపివైచుట; యాదవులు అరణ్యములలోని కిరాతుల జీవనభృతికి నడ్డుతగులుట; నల్లసిద్ధిరాజు ఉంచుకొనిన బోగముదాని పెంపుడు చిలుకను కాటమరాజు బంధువులు చంపుట- అను మూఁడు కారణములచే యుద్ధము సంప్రాప్తమైనదని స్థానిక చరిత్రలు పదునెన్మిదవ సంపుటములో వివరముగా నున్నది.[33]

కాటమరాజు పుల్లరియొప్పందము తరువాత, నెల్లూరు రాజ్యములోని అరణ్యములందుఁ బశువులను మేపుకొనుచు, నచ్చటఁ గూడ ననావృష్టిచేఁ గసవు లభ్యము కాకపోఁగా, నెల్లూరిసీమలోని పైరుచేలను మేపినట్లుగాను, నదియే యుద్ధకారణమైనట్లును, పట్టపురావి కైఫీయతులోఁ గలదు. "... ఈ ప్రకారము కొన్ని దినములు జరిగిన తరువాతను నెల్లూరిసీమలోను మహత్తు అయిన క్షామం వచ్చి వర్షంలేక పచ్చికపట్లు యెండిపోయి అరణ్యములయందున్న కసవు లేక కాటమరాజుగారి గోసంరక్షణ అయ్యేది బహుప్రయాసము కాగా, నెల్లూరిసీమలో కపిలభావుల ఆసరాను యేరుల ఆసరాను యెక్కడెక్కడ ఆకరం చేసిన పైరువుండగా కాటమరాజువారు గోగణమును ఆ పైరులకు తోలుకపోయి పొలాలు మేపినారు. అందువల్ల నెల్లూరి నల్లసిద్ధిదేవ చోళమహారాజులవారికిన్ని కాటమరాజువారికిన్ని విరోధం పుట్టి..."[34]

నల్లసిద్ధిరాజువేశ్యయొక్క పెంపుడుచిలుకను జంపినది కాటమరాజు పినతండ్రి యగు పోలమరాజు (పోలురాజు) అని స్థానిక చరిత్రలలోఁగలదు. ఇది అసమంజసము. కాటమరాజు నెల్లూరి సీమలోఁ బశువులను మేపుకొనుచున్నప్పుడు పోలురాజు లేఁడు. పెద్దిరాజు మరణించినప్పుడే ఆతని నల్వురు సోదరులును వివిధ ప్రదేశములలోఁ జనిపోయినట్లు వీరగాథలలోఁ గలదు. పోలురాజు చిలకలమఱ్ఱి రాణ్యమున ముక్కంటిచే హతుఁడయ్యెను. ఆ పోలురాజు పగ తీర్చుకొనుటకే కాటమరాజు సిద్ధిరాజు రాజ్యమునఁ బ్రవేశించెను. సిద్ధిరాజువేశ్యయొక్క పెంపుడుచిలుకను పల్లికొండ వారించుచున్నను వినక, కాటమరాజే స్వయముగాఁ జంపెనని గాథాకారులు చెప్పుచుందురు. నాకు లభించిన తాళపత్రగ్రంథమునఁ జిలుకను జంపినది పద్మరాఘవుఁడని యున్నది.

సాంప్రదాయికముగాఁ గాటమరాజుకథలను గానముచేయు గాథాకారులు యుద్ధకారణములను మరియొక రీతిగాఁ జెప్పుచున్నారు: నల్లసిద్ధి నల్లమల ప్రాంతారణ్యమునఁ గొంత భూమిని తన సోదరి యగు కుందమాదేవికి నరణముగా నిచ్చెను. కాటమరాజు వర్షాభావము వలనఁ గఱవేర్పడగాఁ దన గోవులకుఁ బూరియు నీరును లేక, పద్మనాయని ప్రోత్సాహమున నల్లసిద్ధి యాస్థానమునకు వచ్చి, యతని బీడులలోఁ దన పశువులను మేపుకొనుట కనుమతి నీయవలసి నదని ప్రార్థించెను. అందులకుగా సంవత్సరమున కింతయని పుల్లరి

యిత్తునని యాతఁడొడంబడెను. కార్యావసరమునుబట్టి తన సోదరికిఁ దరువాతఁ దెలుపుకొనవచ్చునని ఆమె పక్షమునఁదానే కాటమరాజు కడఁ గవులుపత్రములు వ్రాయించి పుచ్చుకొనెను. నల్లసిద్ధి సోదరికి ఈ విషయము తెలియదు. కాటమరాజు ఆనాఁటినుండియు నల్లమల ప్రాంత భూములలోఁ దన పశువులను మేపుకొనఁదొడఁగెను. తన యనుమతి లేనిదే తన భూములలోఁ గాటమరాజు పశువులను మేపుకొనుచున్నాఁడని తెలిసి నల్లసిద్ధి సోదరి మిక్కిలి కోపించి, యాతని పశువులకు నష్టము కలిగింపవలసినదని అచటి బోయలకాజ్ఞాపించెను. వారును అట్లు చేయుచుండఁగాఁ గాటమరాజు, నల్లసిద్ధియే ఇట్లు తన పశువులను జంపించుచుండెనని భావించి ఆతనియెడ మిక్కిలి కుపితుఁడై యుండెను. ఇంతలో సంవత్సరము మితి గడచినది. కాటమరాజు కడనుండి పుల్లరి వచ్చునేమో యని నల్లసిద్ధి యెదురు చూచుండెను. అతఁడు పుల్లరిచెల్లించు ప్రయత్నముననే లేఁడని తెలిసి నల్లసిద్ధి యాతని కడకు 'రాయశృంగావళి' యను నొక భట్టును బంపెను. కాని కాటమరాజు, నల్లసిద్ధి అనుమతి నిచ్చినట్టే యిచ్చి, అడవులలో మేయుచుండిన తన పశువులను వ్రేయించెననియు, నతనికిఁ దామీయవలసిన పుల్లరికిని, దమకుఁ గలిగిన నష్టమునకును సరిపోయినదనియు, నందుచే నతనికిఁ జెల్లింపవలసిన దేదియు లేదనియు భట్టునకుఁ దెలిపెను. రాయబారము విఫలము కాఁగా భట్టు నెల్లూరికిఁ దిరిగివచ్చెను. కాటమరాజు గోవులమందలో నష్టమేర్పడిన విషయము తనకుఁ దెలియకపోవుటచేఁ, బుల్లరి నెగవేయుటకే కాటమరాజు ఆ యెత్తు వేసినాఁడని నల్లసిద్ధి తలంచి, ఆతని మీదికి యుద్ధమునకుఁబోవ నిశ్చయించెను.[35]

కుందమాదేవి కారణముగాఁ గాటమరాజును నల్లసిద్ధియు నొకరిపైనొకరు అపోహపడిరని పైనఁ దెల్పిన విషయమునుబట్టి తెలియుచున్నది. కాని ఈ కారణములో రెండు అసంగతములున్నవి. పుల్లరి వ్రాయించుకొనిన విషయము నల్లసిద్ధి తన సోదరికి సంవత్సరము వఱకును జెప్పకుండుట; పరిస్థితి యుద్ధమువఱకును వచ్చినను కుందమాదేవియుఁ దాను పశువులను వ్రేయించిన విషయము తన సోదరునకుఁ దెలుపకుండుట– అనునవి అసమంజస విషయములు. అసలు కుందమాదేవి నల్లసిద్ధికి చెల్లెలుగా ఏ వీరగాథలోను లేదు. ఈమె నల్లసిద్ధి రెండవభార్య యనియుఁ, దన పెంపుడు చిలుకను కాటమరాజు పరివారములోనివారు చంపుటచే, బోయలను ప్రోత్సహించి వారి పశువులను వ్రేయించెననియుఁ, గాటమరాజువారు కోపించి, బోయలను జంపి, పుల్లరి నెగవేసెననియు వీరగాథలలోఁ గలదు. స్థానికచరిత్రలలో కుందమాదేవిపేరు లేదుకాని, 'నల్లసిద్ధిరాజువారి బోగంది' అని కలదు.

యుద్ధకారణములనుగూర్చి కనిగిరిసీమలోని గాథాకారులు నాకు ఈ క్రింది విషయములను జెప్పిరి:– కాటమరాజు, నల్లసిద్ధిరాజు సభలోనికిఁబోయి, పచ్చికబీళ్లను పుల్లరికిమ్మని కోరఁగా, యాదవులు వెట్టివారనియు, వారిదగ్గఱనుండి అత్యధికముగా ధనమును గుంజవచ్చుననియు నల్లసిద్ధి తలఁచి, పుల్లరియొడంబడికలో నెక్కువ నియమముల నుంచెనఁట:

**"ఆకురాసే కరణానికి ఆరువేల వరహాలు**
**ఎఱసిద్ధిరాజుకు ఏడు వేల వరహాలు**
**పాపసిద్ధిరాజుకు పదివేల వరహాలు**
**కొండికసిద్ధిరాజుకు కోటివేల వరహాలు**
**కుందమాదేవులకు కుంకుమ పసుపులకు**
**పదివేల వరహాల పైకమిచ్చేరా?"** [36]

అని ప్రశ్నించినాఁడట నల్లసిద్ధిరాజు. "ఆరుపుట్ల నేయి మాది, ఆవుకు పుట్టిన కోడెల్ల మాది" అని కూడ నియమమును జెప్పెనఁట. కాటమరాజు అతని దురాశను గ్రహించి, తెలివిగా మఱియొక నియమమును జెప్పెనఁట, "ఆవుకు పుట్టిన కోడెల్ల మీది, నీరున పుట్టిన పూరెల్ల మాది" అని ప్రకటించెనఁట. సిద్ధిరాజు అందులకు అంగీకరించెను. ఈ యొప్పందముచేఁ బచ్చిక బీళ్లేకాక, వరిపొలము లును యాదవులవే యగుచున్నవి. వరికూడ నీరునఁ బుట్టినదే కదా! అందుచే వరిపొలములను మేపుకొనుటకుఁగూడ యాదవులకు హక్కున్నదఁట. పైగా, కుందమాదేవి 'చుండి'[37] బోయలచేఁ గాటమరాజుయొక్క ఆవులను జంపించిన తరువాతనే, యాదవులు కోపముతోఁ బైరుచేలను మేపినారఁట. అంతకుఁబూర్వము పచ్చికబీళ్లలోనే మేపుకొనుచుండిరఁట. 'నీరున పుట్టిన పూరెల్ల మాది' అనుటచే వరిపొలములే కాక, నెల్లూరి ప్రజలును యాదవులసొత్తే యగుదురని యీ గాథాకారులు వాదింతురు. మానవుఁడును నీరులోనుండి పుట్టిన వాఁడేనఁట! "ఆవుకు పుట్టిన కోడెల్ల మీది– నీరున పుట్టిన పూరెల్ల మాది" అని యాదవులు రాగిశాసనము వ్రాయించుకొనిరి. దేవసాక్షులను బెట్టుకొనిరి. అందుచే కాటమరాజు గారి తప్పేమియు లేదని కనిగిరి సీమలోని గాథాకారులు వాదించుచున్నారు.

కాటమరాజు పుల్లరి యుద్ధమునకు దారితీసిన కారణములను సమగ్రముగాఁ జర్చించు వీరగాథ 'జన్నివాడకథ'. దీనికి "పుల్లరికథ, దక్షిణాది ఆవులమేపులు, ఆవులమేపులు– దక్షిణ కాండము, చదరంగముకథ" అను నామాంతరములున్నవి. ఈ కథగల తాళపత్ర గ్రంథము నాకు కృష్ణామండలమున 1964లో లభించినది. అందు కనిగిరిసీమలోని యాదవగాథాకారులు పైన చేసిన వాదమును పూర్వపక్షముచేయు అంశములనేకములున్నవి. 'చుండి' బోయలు ఆవులను వ్రేయుటకు ముందుగానే కాటమరాజు పైరులను మేపినట్లుగా నీ కథలో నున్నది. స్థానికచరిత్రలు పదునెన్మిదవ సంపుటములోఁగూడ ముందు కాటమరాజు నెల్లూరిసీమలోని వరి పైరును మేపినట్లును, తరువాత కుందమాదేవి చిలుకను యాదవులు చంపినట్లును, ఆమె ఆలమందను పొడిపించినట్లును గలదు.

వర్షాభావముచేఁ బచ్చికబీళ్లు ఎండిపోఁగా, కాటమరాజు నెల్లూరి రాజ్యములోని వరిచేలను మేపినట్లుగాఁ బట్టపురావి కైఫీయతు కూడ సాక్ష్యమిచ్చుచున్నది. కుందమాదేవి ఆవులను జంపెనను కోపముతో, యాదవులు వరిచేలను మేపినట్లుగా నెచ్చటను లేదు. 'నీరున పుట్టిన పూరెల్ల మాది' అను ఒప్పందముచే వరిచేలును, కడకు నెల్లూరి ప్రజలను యాదవుల సొత్తుగుననుట పిడివాదము. పచ్చికబీళ్ల వఱకే యాదవుల హక్కు. పైఁగా, కాటమరాజు నల్లసిద్ధితో ఏదో విధముగాఁ దగవుపెట్టుకొని, పోలురాజునాఁటి పగలు తీర్చుకొనవలెనను సంకల్పముతోనే నెల్లూరిసీమకు వచ్చినట్లుగా 'జన్నివాడకథ'లో స్పష్టముగా నున్నది. కాటమరాజు తన విస్తారమైన పశుగణమును మేపుకొనుచు, దేశమంతయును బరిభ్రమించుచు, తన తండ్రులనాఁటి పగలను దీర్చినట్లుగా నీ కథలోఁ జెప్పఁబడినది. ఈ కథా ప్రారంభమునఁ గాటమరాజు తన సోదరులను బిలిచి, తమ తండ్రి తాతల పగవారి నందఱిని దాను జంపితిననియు, నిఁక పోలురాజు పగవాఁడైన ముక్కంటి వంశములోనివాఁడగు నల్లసిద్ధితోఁ బోరాడవలె ననియు, నాతనితోఁ బొందు చేసికొనరాదనియు నిట్లు చెప్పును:-

*"ముందు మన పెద్దలు మూడు లోకములు*
*కదనిల్పె వలురాజు ఘనుడు మన తాత*
*అతని కుమాళ్లు ఎంచితే అతి బాలదేవులు*
*పంచమ వేదాంతులు బల్లిదు రేగురును*
*మించిన దేశాధిపతులు మెచ్చి కొనియాడ*
*వంచితమ్ముగ కవులావులు పాళ్లు పంచుకోని*
*అంచితమ్ముగ పుణ్యులై అటు చెల్లినారు*
*వారిని చంపిన వారిని తా జెప్పెద వినుడి*
*ముత్తాత పగవాణ్ణి మొత్తి వేసితిని*
*తమతాత పగవాణ్ణి సంహరించితిని*
*సింహాద్రిరాజు పగవాణ్ణి చేరి వేసితిని*
*పెద్దిరాజు పగవాణ్ణి పెరికి వేసితిని*
*ఎఱనూకరాజు పగవాణ్ణి ఏపణగించితిని*
*నలనూకరాజు పగవాణ్ణి నఱికి వేసితిని*
*పోలురాజు పగవచ్చె తమ్ములారా! పోరాదు మనము*
*వాదు దగ్గఱకు వచ్చెను సిద్ధిరాజులవారికి మనకు*
*పొందులు చేసికొని పోరాదు మనము"* [38]

దీనినిబట్టి నల్లసిద్ధిరాజు తాత చోడతిక్కయో, లేక తండ్రి మనుమసిద్ధియో, కాటమరాజు పినతండ్రియగు పోలురాజును జంపెనని చెప్పవచ్చును. చోడతిక్కరాజే చంపియుండును. దీనికొక దృష్టాంతమున్నది. గుండ్లపాలెము శిలాశాసనములో "చోడాని కాలమున వల్లురాజాబ్దాః-౧౯౫ - పోలురాజాబ్దాః- ౮౨" అని కలదు. కావున చోడతిక్కరాజు పోలురాజునకు సమకాలికుఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. 'చోడాని' పంపిన 'ముక్కంటి'చే పోలురాజు హతుఁ డయ్యెనని పోలురాజుకథలోఁగూడ నున్నది. కాఁబట్టి చోడతిక్కరాజే (క్రీ.శ. 1209-1249) పోలురాజును జంపియుండునని నేనూహించుచున్నాను. కాని యీ చోడాని శ్రీరంగపట్టణము నేలుచున్నట్లుగాఁ బోలురాజుకథలో నున్నది. ఇది నల్లసిద్ధి పల్లవ రాజనుటవంటి అసంగతమే కావచ్చును. (చరిత్రలోని త్రిలోచన పల్లవుఁడే పోలురాజుకథలోని 'ముక్కంటి'గాను, కరికాలచోళుడే 'చోడాని'గాను చెప్పబడినారని అనుమానించుటకు వీలున్నది కాని, వారి కాలములు అతుకవు.)

ఈ జన్నివాకథలో కుందమాదేవి నల్లసిద్ధిరాజునకు రెండవ భార్యగాఁ జెప్పఁబడినది. ఈమె పెంపుడు చిలుక అరణ్యములోనికి వచ్చి కూయుచుండఁగా కాటమరాజు ఆలమంద బెదరెననియు, నందుచే పద్మరాఘవుఁడు (కాటమరాజు చెలికాఁడు) దానిని బాణముతోఁ గొట్టినాఁడనియు నీ కథలోఁ గలదు.

## 2.12. న్యాయాన్యాయములు:-

ఇరుపక్షములవారును ఎవరికి వారు తమదే న్యాయమనియు, ఎదుటివారిది అన్యాయమనియు భావించినప్పుడే యుద్ధము వచ్చును. ఏ యుద్ధమందును ఒక పక్షమువారిది న్యాయమనియు మఱియొక పక్షమువారిది అన్యాయమనియు మనము చెప్పలేము. పాక్షికదృష్టితో వ్రాయఁబడిన కావ్యములనుగాని, పాడఁబడు వీరగాథలనుగాని నమ్మరాదు. రామాయణ మహాభారతముల వంటి గొప్ప ఇతిహాసములే పాక్షికదృష్టితో వ్రాయఁబడినవని కొందఱు విమర్శకుల అభిప్రాయము. ఈ దృష్టి వీరగాథలలో మఱింత స్పష్టముగా గోచరించును. పల్నాటి వీరకథలు బ్రహ్మనాయని పక్షమువైపు మ్రొగ్గుసూపి, ఆతనిని సాక్షాత్తు విష్ణుమూర్తిగాఁ జిత్రించుచు రచింపఁబడినవి. ఇందు నాగమ్మ బహుదుష్టురాలుగాఁ జూపఁబడినది. నిజమున కామె గొప్ప రాజకీయ ప్రజ్ఞాధురంధరురాలు. బొబ్బిలికథ బొబ్బిలిరాజులయందు అభిమానముఁ జూపుచు వ్రాయఁబడినది. ఇందు విజయరామరాజు పాత్ర చాలా నీచముగఁ జిత్రింపఁబడినది. ఇది సత్యదూరమగు చిత్రణము. కాని కాటమరాజుకథలు వీరగాథాకవిత్వమునఁ దప్పఁ బుట్టినవని చెప్పవచ్చును. కఱియావులరాజుకథలో నాతని శౌర్యసాహసము లెట్లు కీర్తింపఁబడెనో, చల్లవారి జగడములో ఖడ్గతిక్కన శౌర్యసాహసములును అట్లే చిత్రింపఁబడినవి. చల్లవారి జగడమునకు 'తిక్కనామాత్యునికథ' యను నామాంతరముకూడ కలదు. ఇది యాదవ గాథాకారుల యొక్కయుఁ, గవులయొక్కయు హృదయ వైశాల్యమునకు గీటుఱాయి. లేగదూఁడలవంటి అమాయకులైన యాదవుల నిర్మలహృదయము ఇందుఁ బ్రత్యక్షమగుచున్నది! కావున యుద్ధములోని న్యాయాన్యాయములను విచారించుటకు నిష్పక్షపాతముగా రచింపఁబడిన యాదవరాజుల వీరగాథలే మనకు సాక్ష్యములు.

నల్లసిద్ధిరాజ్యములోని వరిపైరులన్నియును కాటమరాజు యొక్క గోగణముచే నాశనమైనవి– ఇది సత్యము. కాటమరాజుయొక్క ఆలమంద బోయలచేఁ బొడవఁబడినవి–ఇదియును సత్యమే. ఇట్లు ఇరువురకును నష్టము వాటిల్లినను, మొదట చేసికొనిన ఒడంబడికను మీఱుట మాత్రము పాడికాదు. తమకు నష్టము వాటిల్లినదని తెలిసికొనిన మఱుక్షణమే ఒడంబడికను రద్దుచేసికొని, అప్పటివఱకును నొడంబడిరలో నున్న ప్రకారము పాటించి, యెవరిదారిని వారు పోయినచో యుద్ధము జరిగెడిది కాదు. కాని కాటమరాజు అట్లు చేయలేదు. తనకుఁ గలిగిన నష్టమును పుల్లరి నెగవేయుట ద్వారా 'భర్తీ' చేసికొన్నాఁడు. ఇది యొడంబడికకు విరుద్ధము. ఒడంబడిక రద్దుచేసికొని, తిరిగి పోవునాఁటి వఱకును, లేదా బోయలు పశువులను జంపునాఁటి వఱకును నల్లసిద్ధికిఁ జెందవలసిన కోడెదూడల నిచ్చియుండవలసినది. కాని కాటమరాజు నెల్లూరిసీమనుండి వెడలిపోవుచు, నొడంబడిక ప్రకారము నల్లసిద్ధికిఁ జెందవలసిన కోడెదూడలను సహితము తరలించుకొని పోయినాఁడు. ఈ విషయము పట్టపురావి కైఫీయతులో స్పష్టముగా నున్నది. "... నెల్లూరి నల్లసిద్ధదేవ చోళమహారాజులవారికిన్ని కాటమరాజు వారికిన్ని విరోధంపుట్టి కాటమరాజువారు తమ గోగణమును అదివరకు మందలోవున్న కోడెదూడలు సహా మళ్లించుకొని నెల్లూరి సీమ విడిచి పట్టపురావికిన్ని పినాకినీనదికిన్ని వుత్తరభాగమందుల పైనవ్రాసిన పర్వతప్రదేశమునకు లేచి వస్తుండగా..."[39] పుల్లరి యొడంబడిక ప్రకారము 'అదివరకు మందలో వున్న కోడెదూడలు' నల్లసిద్ధికిఁ జెందును. వానిపై కాటమరాజుకు హక్కులేదు. అతఁడు తన గోగణమును మాత్రమే మరలించుకొని పోయిన బాగుండును. కాని కాటమరాజు 'అదివరకు మందలోవున్న కోడెదూడలు సహా మళ్లించుకొని' పోయినాడు. ఇది కయ్యమునకుఁ గాలుదువ్వుటవంటిది. మొదట, నొడంబడిక ప్రకారము పుల్లరి నిచ్చి వేసి, తరువాత తనకింత నష్టము వచ్చినదనియు, దానికిఁ బరిహారము చెల్లిపవలసినదనియు నల్లసిద్ధిని కోరియుండవచ్చును. లేదా మధ్యవర్తులను నియమించి న్యాయము చేకూర్చుఁడని యడుగవచ్చును. రాయబారులను బంపవచ్చును. ఇట్లు చేయకపోవుట కాటమరాజులోని తొందరపాటును సూచించును. ఈ తొందరపాటునకుఁ గారణము పోలురాజునాఁటి ప్రాంతపగలే కావచ్చును.

అట్లే ఒకప్రక్క పుల్లరిని దీసికొనుచుఁ, దన రాజ్యమున మేయుచున్న గోగణముల క్షేమము నరయకుండుట నల్లసిద్ధి తప్పు. ఒకదానినుండి ఫలితమును పొందగోరినప్పుడు, దానిని సంరక్షింప వలసిన బాధ్యతయు మనపై నుండును కదా! కుందమాదేవి 'చుండి' బోయలచే (లేదా 'కోయ'బోయలచే) గోహత్య చేయించునప్పుడు, నల్లసిద్ధి దానిని ముందుగాఁ దెలిసికొని వారించియుండవలసినది. అతఁడట్లు చేయలేదు. గోహత్య నుపేక్షించుట నల్లసిద్ధిరాజు కావించిన మహానేరము.

కాటమరాజును నల్లసిద్ధియుఁ దమతమ విద్వేషములను వితర్కించుకొని సర్దుకొనెడివారే! కాని కుందమాదేవి వారిరువురి మధ్యను స్పర్ధను రగుల్కొల్పినట్లుగాఁ గనఁబడుచున్నది. కాటమరాజునకు 'కుదిరితే ఆఱామడ– చెదిరితే పన్నెండామడ' విస్తరించియుండు గోగణమున్నది. క్షామమేర్పడినప్పుడు ఇంత పెద్ద గోగణమును బోషించుట యెంతకష్టమో ఊహించుకొనుఁడు. అతఁడు శ్రీశైల ప్రాంతమున క్షామము వచ్చుటచే నెల్లూరిసీమకుఁ దరలివచ్చినాఁడు. అతని దురదృష్టముచే నీ నెల్లూరుసీమయందును వర్షాభావముచేఁ బశువులకుఁ గసవు కఱవయ్యెను. ఆకలిచే నకనకలాడు నా పశువులను బట్టుట దుర్భరమై వరిపొలములపైకి వదలియుండును, లేదా ఆ పశువులే పొరపాటునఁ బాలకుల అప్రమత్తతవలనఁ బైరుచేలలోఁ బడియుండవచ్చును. ఈ కారణముచే నతని యాలమందను బొడిపించుట మహాపాపము! 'పశువులను జాగ్రత్త పఱచుకొనుము' అని హెచ్చరించినచో సరిపోయెడిది. ఈ మందపోటును నల్లసిద్ధి చేయించలేదు. అందుచే నిది యాతని తప్పు కాదు. ఈ దుష్కార్యమును కుందమాదేవి చేయించినది. దీనిని నల్లసిద్ధియే చేయించినాఁడని కాటమరాజు అపోహపడినాఁడు. కావున నీ యుద్ధమునకుఁ బ్రధాన కారణము కుందమాదేవియే. కాటమరాజు– నల్లసిద్ధి– ఈ యిరువురును నిర్దోషులే యని నా నమ్మకము.

ఈ దుష్కార్యము చేసిన కుందమాదేవికిని నొక కారణమున్నది. తన పెంపుడు చిలుకను యాదవులు చంపినారనుట ఈ కారణము. ఇది బలమైన కారణము కాదు. పెంపుడు చిలుకను జంపినంత మాత్రమున గోహత్యకుఁ బూనుకొనుట మహాపాపము! అది పెంపుడు చిలుక యని యాదవులకుఁ దెలియకపోవచ్చును. దాని కూఁతలకు గోవులు మేఁతలు మాని, బెదరి లేగలను త్రొక్కుకొనుచు పాఱిపోవు చున్నవి. అట్టి పరిస్థితులలోఁ బసులకాపరులు దానిని గూల్చుట తప్పు కాదు. బాణప్రయోగము జరిగిన తరువాత నది పెంపుడు చిలుక యని యాదవులు గ్రహించియుందురు.

## 2.13. జయాపజయములు:–

పల్నాటి వీరకథలలో బ్రహ్మనాయఁడు విజయుఁడైనట్లుగనే, కాటమరాజుకథలలో యాదవులే విజయులైనట్లుగా వర్ణింపఁబడినది. యుద్ధానంతరము కాటమరాజును అయితమరాజును సజీవులై యున్నట్లు కలదు. దేవతలు పుష్పవర్షము కురిపింపఁగా, మరణించిన యాదవవీరులును, ఆవులును, ఎద్దులును తిరిగి బ్రతికినట్లుగా వర్ణింపఁ బడినది (చూ. కాటమరాజుకథ, వేటూరిపరిష్కృతము, పుట 152). కాని స్థానికచరిత్రలనుబట్టి నల్లసిద్ధియే విజయుఁడని తెలియుచున్నది. మల్లంపల్లి సోమశేఖరశర్మగారును ఈ యభిప్రాయమునే వ్యక్తము చేసిరి. "Finally, the Yadavas are said to have become victorious according to this work; but Local Records say that the King Nallasiddhi carried the day." [40]

## 3. కాటమరాజు వంశవృక్షము

కాటమరాజు చంద్రవంశ క్షత్రియుడు. చంద్రునినుండి కవులావుల గంగురాజు వఱకును పూర్వవంశము, అక్కడనుండి కాటమరాజు వఱకును ఉత్తరవంశము. పూర్వవంశము పౌరాణికము, ఉత్తరవంశము చారిత్రకము. యాదవుల పూర్వవంశవృత్తాంత మంతయు గుండ్లపాలెము శాసనములో వివరముగా నున్నది. ఇది వైశంపాయనుడు పరీక్షిత్తునకుఁ జెప్పినట్లుగాఁ గలదు. అదితి కశ్యపులకు వైవస్వతమనువు జన్మించెను. ఆ వైవస్వతమనువునకు యముఁడు, శనేశ్వరుఁడు అను నిర్వురు కుమారులును, యమున, తపతి అను నిర్వురు కూతుండ్రును, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులైన మానవులును బుట్టిరి. ఈ చతుర్విధ మానవులకు శేన ప్రముఖులైన రాజలెనమండుగురు జన్మించిరి. ఇక్కడితో నీ వంశక్రమము తెగిపోయినది. దీని తరువాతఁ 'ఆ మునిపుత్రియైన యిలగన్యకు, సోమపుత్రుఁడైన బుధునకు పురూరవ చక్రవర్తి పుట్టె'నని కలదు. ఇచట 'ఆముని' యనఁగా నెవరో తెలియరాదు. కశ్యపుఁడు కావచ్చును. చంద్రునినుండి వంశక్రమము ఈ క్రింది విధముగా నున్నది:-

"చంద్రుఁడు-బుధుఁడు (భార్య ఇలగన్య)- పురూరవ చక్రవర్తి- ఆయువు- నహుషుఁడు- యయాతి- యదువు- ఆసూరునుఁడు- వసుదేవుఁడు- కృష్ణుఁడు- వజ్రధరుఁడు- దధిసంగుఁడు, కృష్ణుని రెండవ కుమారుఁడు అమృతగోవిందుఁడు- 0- ఉపనందు- అమృతాంభోజుఁడు- వినయాంభోజుఁడు- కనకాంభోజుఁడు- గజయాంభోజుఁడు- రాయాంభోజుఁడు- రత్నాంభోజుఁడు- వీరవిజయరాజు- పద్మనరాజు- శ్రీకూర్మిరాజు- సింహాద్రిరాజు- వల్లురాజు- పోలురాజు- కాటమరాజు".

కాని ఈ శాసనములోఁ దప్పులు మెండుగానున్నవి. యాదవుల పూర్వవంశమే కొంత వివరముగాఁ జెప్పఁబడినది కాని ఉత్తరవంశము మిక్కిలి అసమగ్రముగ నున్నది. వలురాజు పుత్రులు, పౌత్రులు సరిగాఁ జూపఁబడలేదు. వలురాజు తరువాత పోలురాజును, అతని తరువాత కాటమరాజును గలరు. కాటమరాజునకుఁ బోలురాజు పినతండ్రియే కాని తండ్రి కాఁడు. కాటమరాజు తండ్రి పెద్దిరాజు. వలురాజునకైదుగురు పుత్రులుండఁగా, నైదవవాఁడగు నొక్క పోలురాజు మాత్రమే చెప్పఁబడినాఁడు. పెద్దిరాజాదులు లేరు. అట్లే వలురాజు తండ్రియగు గంగురాజును నిందు లేఁడు. పూర్వవంశమునఁగూడఁ గృష్ణుని తరువాత నుపనందుని వఱకును వంశక్రమము సరిగాలేదు.

యాదవుల పూర్వవంశమునుగూర్చి 'రాజవంశ ప్రదీపిక'లో సర్వసమగ్రముగ నున్నది. ఇందు నారాయణమూర్తి- బ్రహ్మ- అత్రి- చంద్రుఁడు- బుధుఁడు- పురూరవుఁడు మున్నగువారు మొదలుగాఁ



గలియుగ ప్రారంభమునఁగల పరీక్షిన్మహారాజు వఱకును గల 617 మంది చంద్రవంశజుల నామములు, పుత్ర పౌత్రాది బాంధవ్యములు సంపూర్ణముగా నీయఁబడినవి. ఇది మొదటి భాగము. రెండవ భాగమునఁ గలియుగములోని చంద్రవంశ క్షత్రియులు తెలుపఁ బడినారు. అందు యదువంశ క్షత్రియులనుగుఱించి వ్రాయఁబడిన విషయములను ఈ క్రింది విధముగాఁ జూపవచ్చును:-

బత్తుల లక్ష్మయ్యగారు రచించిన రాజవంశ ప్రదీపికలో మూఁడు దోషములు కొట్టవచ్చినట్లు కనబడుచున్నవి:-

1) వీరగాథలనుబట్టి కవులావుల గంగురాజునకు నల్గురు పుత్రులనియు, వారిలో ఆవుల వలురాజు జ్యేష్ఠుఁడనియు, నా వలురాజునకు సింహాద్రదిరాజాదులైదుగురు తనయులనియుఁ దెలియుచుండఁగా, రాజవంశ ప్రదీపికలో ముగ్గురు వలరాజులు, ఇద్దఱు గంగురాజులు చెప్పఁబడిరి. సింహాద్రిరాజునకు గంగురాజు మూఁడు తరములపై వానిగాఁ జూపఁబడినాఁడు. ఇది సరికాదు. సింహాద్రిరాజు పితామహుఁడే గంగురాజు. ఈ గంగురాజుతండ్రి మరల వలరాజని లక్ష్మయ్యగారు వ్రాసిరి. దీనికేమి ప్రమాణమున్నదో తెలియదు. నాకు లభించిన తాళపత్ర గ్రంథము ('జన్నివాడకథ') లో గంగురాజుతండ్రి 'యయాద్రి' అనియున్నది. గోవుల నాగేశ్వరకవిగారు తమ పెద్దిరాజు నాటకమున గంగురాజుతండ్రి సింహాద్రిరాజని వ్రాసిరి. శాసన ప్రమాణమునుబట్టియు, పురాణములనుబట్టియు గంగురాజుతండ్రి సింహాద్రిరాజు, సింహాద్రిరాజుతండ్రి శ్రీకూర్మరాజు.

కాటమరాజుకథాచక్రమున మొట్టమొదటికథ 'వలురాజుకథ'. ('వలరాజు' అను శబ్దమే జనవ్యవహారమున 'వల్లురాజు'గను 'వలురాజు'గను మాఱియుండును.) ఈ వల్లురాజు (వలురాజు)ను 'ఆవుల వలురాజు' అందురు. ('ఆవుల' ఇంటి పేరు కానోపును.) ఇతఁడు కవులావుల గంగురాజు- గంగమ్మ అను దంపతులకుఁ బుట్టెననియు, నితనికి హరిగోపాలుఁడు, నందగోపాలుఁడు, గోవర్ధనుఁడు అను ముప్వురు తమ్ములు గలరనియు, నితఁడు ఖండెమొండెముల కోటనేలు కలభూత గంగురాజుతో యుద్ధము చేసెననియు, నితని పుత్రులే సింహాద్రి-పెద్ది-ఎఱనూక-నలనూక-పోలు రాజులనియు నాకు లభించిన 'వల్లురాజుకథ' తాళపత్రగ్రంథములో స్పష్టముగా నున్నది. ఆరాధ్యుల పిచ్చయ్యగారు ప్రకటించిన 'వలురాజుచరిత్ర' యందును నిట్లే యున్నది (చూ. పుటలు 1, 2). కాఁబట్టి లక్ష్మయ్యగారిచ్చిన 'కవులావుల గంగురాజు-వలరాజు (ముగ్గురు తమ్ములు)- గంగురాజు- ఆవుల వలరాజు- సింహాద్రిరాజు, పెద్దిరాజు మున్నగువారు' అను వంశక్రమము తప్పు. హరిగోపాలాదులను సోదరులుగాఁ




గలిగిన 'వలరాజు'ను, సింహాద్రిరాజు పెద్దిరాజులను బుత్రులుగాఁ గలగిన 'ఆవుల వలరాజు'ను నొక్కరే. వీరిరువురను వేర్వేరుగాఁ జూపి, వీరిమధ్య మరల నొక గంగురాజును జూపుట అసంగతముగా నున్నది. కావున నీ చారిత్రక వంశక్రమ ప్రారంభము పై రీతిని చూపవచ్చును:-

2) బత్తుల లక్ష్మయ్యగారు, సింహాద్రిరాజు కుమారుఁడగు కఱియావులరాజును, సింహాద్రిరాజు పుత్రికయగు చిట్టినూకను, నలనూకరాజు సంతానముగాఁ జూపిరి (చూ. రాజవంశ ప్రదీపిక, పుట 136). ఇది రెండవ తప్పు. కఱియావులరాజును, అతని చెల్లెలు చిట్టినూకయు సింహాద్రిరాజు సంతానము కాని, నలనూకరాజు సంతానము కాదు. నలనూకరాజునకు పెయ్యల ఎఱ్ఱయ్య అను పుత్రుఁడును, పొట్టినూక అను పుత్రికయుఁ గలరు.

3) కాటమరాజు కథాచక్రమునుబట్టి, పోలురాజునకు ముగ్గురు కుమారులు, ఒక కుమార్తె. భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య అనువారు పుత్రులు; అగుమంచి పుత్రిక. ఈ అగుమంచి, కొమరమ్మ

(కాటమరాజు మేనత్త) పుత్రుఁడగు పుత్తమరాజును వివాహమాడెను. కాని బత్తుల లక్ష్మయ్యగారు "బత్తినిరాజు, అయితమరాజు, ముమ్మరాజు, అగుమంచిరాజు– యీ నలుగురు పోలురాజు కుమార్లు. వీరిలో బత్తినిరాజు అనువాడు శ్రీశైలమఠములో నున్నాడు. తక్కినవారందరు యఱ్ఱగడ్డపాటి యుద్ధములో చనిపోయినారు."[41] అని వ్రాసిరి. ఇది మూఁడవ తప్పు. అగుమంచి స్త్రీయేకాని పురుషుఁడు కాఁడు.

లక్ష్మయ్యగారు నలసిద్ధిరాజు సోదరులనుగూడ సరిగాఁ జూపలేదు. "నలసిద్ధిరాజు, ఎఱసిద్ధిరాజు, పాపసిద్ధిరాజు, కొండికసిద్ధిరాజు, కొమారసిద్ధిరాజు" అను నైదుగు రన్నదమ్ములను గాథాకారులు తఱచు పేర్కొనుచుందురు. కాని లక్ష్మయ్యగారు కొండికసిద్ధిరాజును బేర్కొనక, 'మనుమసిద్ధి' నామమును బ్రథమమునఁ జేర్చిరి. మొత్తము మీఁద బత్తుల లక్ష్మయ్యగారు కాటమరాజు పూర్వికుల పురాణవంశ వృక్షమును విపులముగా నిచ్చిరి. కాని, చారిత్రక వంశవృక్షమును తప్పులతడకగాఁ జేసిరి.

1953–54లో తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు ఆంధ్రపత్రిక సంవత్సరాది సంచికలో ప్రకటించిన వ్యాసములో యాదవరాజుల వంశక్రమము నిచ్చిరి. వీరు చారిత్రక వంశక్రమమును (వీరగాథల నాధారముగాఁ జేసికొని చెప్పినది) చక్కఁగా విడఁదీసిరి కాని, పురాణ వంశక్రమమును సరిగాఁ జర్చింపలేదు. వీరిచ్చిన పురాణవంశ క్రమమిట్లున్నది: "ఆనందగోపాలుఁడు–వసుదేవుఁడు–శ్రీకృష్ణుఁడు– మన్మథుఁడు– అనిరుద్ధుఁడు– ఇంద్రదేవుఁడు– వజ్రవుఁడు– సాత్య– కురవలుఁడు– కవులావుల గంగురాజు". ఈ వంశక్రమము కప్పదాటులవలె నున్నది. కురవలుని కుమారుఁడే గంగురాజనుట అసమంజసము. ఈ గంగురాజు శ్రీకృష్ణునకు ఏడవ తరమువాఁడనుట హాస్యాస్పదము! వీరిచ్చిన ఈ వంశ క్రమమంత యును దప్పు. దీనిని వీరెక్కడ సంపాదించిరచో తెలియదు.

తాళపత్రగ్రంథములోని వీరగాథల నాధారముగాఁ జేసికొని, 1962లో శ్రీ గోవుల నాగేశ్వరకవిగారు 'మదన కుంభినీ యుద్ధమను పెద్దిరాజు నాటకము'ను రచించిరి. ఈ నాటకాంతమున వీరు 'యదువంశ క్రమము'ను విపులముగా నిచ్చియున్నారు:–

"మొదట విష్ణువు, ఆయనకు బ్రహ్మ, ఆ పిమ్మట క్రమంబుగా అత్రి, చంద్రుడు, బుధుడు, పురూరవుడు, ఆయువు, నహుషుడు, యయాతి, యదువు, కోష్టువు, వృజినవంతుడు, శ్వాహితుడు, బేరుశేకుడు, చిత్రరథుడు, శశిబిందుడు, పృధుశ్రవుడు, ధర్ముడు, ఉశనుడు, రుచికుడు, జ్యాముఖుడు, విదర్భుడు, కృధుడు, కుంతి, దృష్టి, నిర్వృతి, దశార్హుడు, వ్యోముడు, జీమూతుడు, వికృతి, భీమరథుడు, నవరథుడు, దశరథుడు, శకుని, కుంతి, దేవరాతుడు, దేవక్షత్రుడు, మధువు, కురువశుడు, వసువు, పురహోత్రుడు, అంశువు, సాత్వతుడు, భజమానుడు, అంధకుడు, విధూరథుడు, భోజుడు, హృదికుడు, దేవమీఢుడు, శూరుడు, వసుదేవుడు, కృష్ణుడు, ప్రద్యుమ్నుడు, అనిరుద్ధుడు, వజ్రుడు, ప్రతిబాహుడు, సుబాహుడు, ఉగ్రసేనుడు, శృతసేనుడు, ఉపనందుడు, అమృతాంభోజుడు, విజయాంభోజుడు, కనకాంభోజుడు, గజాంభోజుడు, రాయాంభోజుడు, రత్నాంభోజుడు, వీరవిజయుడు, పద్మరాజు, కూర్మరాజు, సింహాద్రిరాజు, గంగురాజు, వలరాజు, పెద్దిరాజు, కాటమరాజు."

దీనినిబట్టి కాటమరాజు విష్ణుమూర్తికి డెబ్బదినాల్గవ తరమువాఁడు, శ్రీకృష్ణునికి ఇరువదిమూఁడవ తరమువాఁడు. కాటమరాజునకు సంబంధించిన పురాణవంశక్రమములలో నిది మిక్కిలి సమంజసముగా నున్నది. గుండ్లపాలెము శిలాశాసనముకూడ దీనిని బలపఱుచుచున్నది.

కాటమరాజు కథాచక్రమునఁ గొన్ని వీరగాథలలో నీ వంశక్రమ వర్ణనలున్నవి. నెల్లూరు మండలమున కనిగిరిసీమలో 'కంకణంపాడు' అను గ్రామములో 1966లో నాకు లభించిన 'పోలురాజుకథ' అను తాళపత్రగ్రంథమునఁ జివరి యాకులలోఁ గాటమరాజు వంశక్రమ వర్ణన మీ క్రింది విధముగా నున్నది:–

*"ఆదినారాయణ వంశంబు గనుక*
*వేదాంత ముఖ్యుండు ఆదిబ్రహ్మంబు*
*ఆదిబ్రహ్మము సుతుడు అరులకురాజు*
*తేజరిల్లగ మహదేవేంద్ర ఘనుఁడు*
*ఆ యింద్రునకు సుతుడు కాలయముండు*
*తొడబడ యతనికి దుందుమారుండు"*

ఈ దుందుమారునకు సూర్యవంశంబున వరుసగా "త్రిశంకుఁడు– హరిశ్చంద్రుఁడు– లోహితుఁడు, పునోరవుఁడు– ఇక్ష్వాకురాజు– సూరప్రముఖుండు– అమరుఁడు– అరణ్యుఁడు– అజవు–రఘువు– దశరథుఁడు– శ్రీరాములు– కుశలవులు– లవునకు ప్రతాపుఁడు" పుట్టినట్లుగా వర్ణింపఁబడినది. ఆ తరువాత, దుందుమారునకు సోమవంశంబునఁ గలిగిన రాజుల వంశక్రమము చెప్పఁబడినది:

*"అంత సోమవంశంబున సూరప్రమణ*
*సూరప్రమణ కొమారుడు పూరుడు*
*పూరుని తమ్ముడు యదుండు*
*యదునకు శీలగోపాలు*
*శీలగోపాలుని కొమారుడు సూరసేనుడు*
*సూరసేనుని కొమారుడు వసుదేవుడు*
*వసుదేవుని కొమారుడు శ్రీకృష్ణుడు*
*శ్రీకృష్ణుని కొమారుడు మన్మథుడు*

*మన్మథుని కొమారుడు అంభజుడు*
*అంభజుని కొమారుడు రాయంభోజు*
*రాయంభోజుని కొమారుడు రత్నంభోజు*
*రత్నంభోజు కొమారుడు విభూతి భాస్కరుడు*
*విభూతి భాస్కరుని కొమారుడు జడల శంఖరయ్య*
*జడల శంఖరయ్య కొమారుడు విరిజ్జపరాజు*
*విరజ్జపరాజు కొమారుడు అగ్గణాల వొలురాజు*
*అగ్గణాల వొలురాజు కొమారుడు ఆవుల వొలురాజు*
*ఆవుల వొలురాజు కొమారుడు పెద్దరాజు*
*పెద్దిరాజు కొమార సద్గుణాకార*
*కదయంతమంథున వోరన్న కాటమరాజా!"*

ఇందలి వంశక్రమమునకును, గోవుల నాగేశ్వరకవిగారిచ్చిన వంశక్రమమునకును భేదమున్నది. కాటమరాజు సోమవంశము వాఁడు కాఁగా, నిందు సూర్య సోమ వంశములు రెండును జెప్పఁబడినవి. నాగేశ్వరకవి శ్రీకృష్ణునినుండి కాటమరాజువఱకును నిరువది మూఁడు తరములు చెప్పఁగా, నీ తాళపత్రమునఁ బండ్రెండు తరములు మాత్రమే చెప్పఁబడినవి. పేర్లు కూడ భిన్నముగా నున్నవి. ఆవుల వలురాజు తండ్రి గంగురాజనియు, తాత సింహాద్రిరాజనియు, ముత్తాత కూర్మరాజనియు నిత్యాదిగా... నాగేశ్వరకవి నాటకమున నుండఁగా, నీ తాళపత్రగ్రంథమున ఆవుల వలురాజు తండ్రి అగ్గణాల వలురాజనియు, తాత విరిజ్జపరాజనియు, ముత్తాత జడల శంకరయ్య అనియు- నిత్యాదిగా నున్నది.

నాకు కృష్ణామండలమున కైకలూరు తాలూకా 'పెరికగూడెం' గ్రామములో 1964లో లభించిన 'జన్నివాడకథ అను తాళపత్ర గ్రంథమున యదువంశక్రమము పైరెండింటికన్నను భిన్నముగా నున్నది. ఇందు సూర్య సోమ వంశములు రెండును సుదీర్ఘముగా వర్ణింపఁబడినవి. కాటమరాజు నెల్లూరు పచ్చికబీళ్లలోఁ బశువులను మేపుచుండఁగా, నెల్లూరులోని పల్లికొండపెరుమాళ్లు బ్రాహ్మణ రూపమున వచ్చి, అతనితో యాదవవంశక్రమము నిట్లు చెప్పును:-

*"మందరాద్రి సముద్రము దరవంగ మరి గోవు పుట్టె*
*గోవుల వెంటనే గోవుల రక్షకుడు పుట్టె*
*గోవుల రక్షకుండు తెచ్చిన అమృతము*
*హరి దేవాదిదేవతలకు పంచిపెట్టించెను*
*ఆ యుగం పొడిమారి ఆదియందుండెను*
*గోవుల రక్షకునికి జయంత్రుడు అని ఒక కుమారడు జన్మించెను*
*ఆ కుమారునికి అగసనందనుండు ఒక కుమారుడు జన్మించెను*
*ఆ మహారాజుకి అగసనందన కుమారుడు సింహనందనుండు*
*సింహనందను కుమారుడు అగసనందనుడు*
*అగసనందను కుమారుఁడు ఆదినారాయణుండు*
*ఆదినారాయణుని కుమారుడు బ్రహ్మ*
*బ్రహ్మ కుమారుడు భృంగుమహాముని*
*భృంగుమహాముని కుమారుడు అమృతుండు*
*అమృతుని కుమారుడు ఆదివిశ్వబ్రహ్మ"*

ఈ ఆదివిశ్వబ్రహ్మనుండి రాజులు, తండ్రి- కొడుకుల వరుసలో, నిట్లు చెప్పఁబడిరి: "ఆదివిశ్వబ్రహ్మ కుమారుడు సూర్యుఁడు-శనేశ్వరుఁడు-నయనేంద్రుడు-కాలశంకరుండు- త్రిశంకరుండు- హరిశ్చంద్రుండు- లోహితాస్యుండు- దుందుభానుండు- యవనాశ్వుండు- మహందాత- కృతాసంధనుండు- దాత్వసందనుండు- కనస్తుండు- కల్మష బాంధవుండు- అమిత సాత్వుండు- అంబరీషుండు- సోమంతు- డిల్లీబు- బగిరాజు- రఘు- భాస్కరుఁడు- అగ్నివరుండు- శీఘ్రగతుండు- బసాసు- మగిలి- పులివారి- ధీరుఁడు- యక్షధీరుండు- కుక్షి- వినకుక్షి- విస్సట- హరి- హర్జుఁడు- దశరథుఁడు- శ్రీ రాఘవుండు- కుశలవులు- కుంచ గోపాలకుండు- సర్వేశ్వరుండు- కేళగోపాలకుండు- ఆనందగోపాలకుండు- వసుదేవుఁడు- శ్రీకృష్ణుఁడు- మన్మథుఁడు- ఇంద్రదేవుఁడు- ఆనందసేనుండు- ఆంభోదు- ఘట్టంభోది- వీరంభోది- విజయంభోది- రాయంభోది- చుంచుంభోది- జలంభోది- కనకంభోది- యయాద్రి-"

*"యయాద్రి కుమారుడు కవులావుల గంగురాజు*
*కవులావుల గంగురాజు కుమారుడు ఆవుల భూపతి*
*ఆవుల భూపతి కుమారుడు ఆవుల అమృతయ్య*
*ఆవుల అమృతయ్య కుమారుడు ఆవుల వలురాజు*
*వలురాజు కుమారులు ఐదుగురు వారు ఎవరెవరంటే*
*౧సింహాద్రిరాజు, ౨పెద్దిరాజు, ౩ఎరసూకరాజు*
*౪నలసూకరాజు, ౫పోలురాజు..."* [42]

మహాభారతము ప్రపంచ ప్రసిద్ధికెక్కిన ఇతిహాసము. ఇందలి శ్రీకృష్ణుఁడు దైవాంశ సంభూతుఁడు. ఇతఁడు చంద్రవంశ క్షత్రియుఁడగు యాదవుఁడు. శ్రీకృష్ణభగవానునినుండి కాటమరాజువఱకును గల తరములను బరిశీలించుట ఆవశ్యకము. పల్నాటి వీరకథా చక్రమున బ్రహ్మనాయఁడు కృష్ణుని యవతారముగా భావింపఁబడి 'నీలవర్ణుని'గాఁ బలుమాఱులు సంబోధింపఃబడెను. అట్లే యాదవ భారతమని పిలువఁబడు కాటమరాజు కథాచక్రమున కాటమరాజు కూడ కృష్ణుని యవతారముగాఁ జెప్పఁబడి 'నలనన్న' యను పేరుతోఁ దఱచు ప్రసక్తుఁడగుచుండును. మహాభారతమున శ్రీకృష్ణుఁడే అపర విష్ణువగుట ప్రసిద్ధము. కావున శ్రీకృష్ణుఁడు- కాటమరాజు అను నీ రెండు తరముల మధ్యను ఎన్ని తరములు దొరలినవో గమనించుట ముఖ్యము (చూ. తరువాతి పుటలో నున్న పట్టిక):-

**1**

**(తిమ్మావఝ్ఝుల వారిచ్చినది)**

- శ్రీకృష్ణుడు
- మన్మథుఁడు
- అనిరుద్ధుఁడు
- ఇంద్రదేవుఁడు
- శజ్రవుఁడు
- సాత్య
- కురువలుఁడు
- కవులావుల గంగురాజు
- ఆవుల వలురాజు
- పెద్దిరాజు
- కాటమరాజు

(11 తరములు)

**2**

**(కంకణంపాడు తాళపత్ర గ్రంథము: 'పోలురాజుకథ')**

- శ్రీకృష్ణుఁడు
- మన్మథుఁడు
- అంభజుఁడు
- రాయంభోజు
- రత్నంభోజు
- విభూతి భాస్కరుఁడు
- జడల శంకరయ్యు
- విరిజ్జపరాజు
- అగ్గణాల వొలురాజు
- ఆవుల వొలురాజు
- పెద్దురాజు
- కాటమరాజు

(12 తరములు)

**3**

**(గుండ్లపాలెము శిలాశాసనము)**

- శ్రీకృష్ణుఁడు
  - వజ్రధరుఁడు
    - దధిసంగుఁడు
  - అమృతగోపుఁడు
    - ఉపనందు
    - అమృతాంభోజుడు
    - వినయాంభోజుడు
    - కనకాంభోజుఁడు
    - గజాయాంభోజుఁడు
    - రాయాంభోజుఁడు
    - రత్నాంభోజుఁడు
    - వీరవిజయరాజు
    - పద్మనరాజు
    - శ్రీ కూర్మరాజు
    - సింహాద్రిరాజు
    - వల్లురాజు
      - పోలురాజు
      - పెద్దిరాజు
        - కాటమరాజు

(17 తరములు)

**4**

**(పెరికగూడెము తాళపత్రప్రతి: 'జన్నివాడకథ')**

- శ్రీకృష్ణుఁడు
- మన్మథుఁడు
- ఇంద్రదేవుడు
- ఆనందసేనుండు
- ఆంభోదు
- ఘట్టంభోది
- వీరంభోది
- విజయంభోది
- రాయంభోది
- చుంచుంభోది
- జలంభోది
- కనకంభోది
- యయాద్రి
- కవులావుల గంగురాజు
- ఆవుల భూపతి
- ఆవుల అమృతయ్యు
- ఆవుల వలురాజు
- పెద్దిరాజు
- కాటమరాజు

(19 తరములు)

**5**

**(గోవుల నాగేశ్వరకవి గారిచ్చినది: పెద్దిరాజు నాటకము)**

- శ్రీకృష్ణుఁడు
- ప్రద్యుమ్నుఁడు
- అనిరుద్ధుఁడు
- ప్రతిభాహుఁడు
- సుబాహుఁడు
- ఉగ్రసేనుఁడు
- శృతసేనుఁడు
- ఉపనందుఁడు
- అమృతాంభోజుఁడు
- విజయాంభోజుఁడు
- కనకాంభోజుఁడు
- గజాంభోజుఁడు
- రాయాంభోజుఁడు
- రత్నాంభోజుఁడు
- వీరవిజయుఁడు
- పద్మరాజు
- కూర్మరాజు
- సింహాద్రిరాజు
- గంగురాజు
- వలరాజు
- పెద్దిరాజు
- కాటమరాజు

(23 తరములు)

భారత భాగవతములలోని శ్రీకృష్ణపాత్ర ప్రాముఖ్యమును జూచి, జానపద కవులు బ్రహ్మనాయని పాత్రను, కాటమరాజుపాత్రను అలౌకిక శక్తులతో తీర్చిదిద్దియుందురని నా యనుమానము. కాటమరాజునకు పూర్వము సుమారు నాలుగువేల సంవత్సరముల నాఁడున్న శ్రీకృష్ణునకును– కాటమరాజునకును మధ్య 17 నుండి 23 తరములు మాత్రమే ఉన్నవనుట సరికాదు. తరమునకు 30 సం॥లు లేదా మూడు తరములకు 100 సం॥లు లెక్కకట్టుట చారిత్రకుల పద్ధతి. ఈ పద్ధతిని చూచినచో శ్రీకృష్ణుడు–కాటమరాజుల మధ్య కనీసము 120 నుండి 130 తరములవఱకును నుండవలెను. ఈ వంశవృక్షము లలోని పేర్లు కొన్ని కల్పిత నామములవలె నున్నవి.

శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు శ్రీకృష్ణునినుండి కాటమరాజువఱకును పదనొకండు తరములను మాత్రమే గుర్తించి నారు. ఇందు 'శత్రుఁడు, సాత్య, కురవలుఁడు' అనునవి నూత్న నామములు. ఇవి యే యితర పట్టికయందును లేవు. ఇందుఁ జాల తరములు వదలివేయఁబడినవి.

కంకణంపాడు తాళపత్రప్రతిలోఁ (పోలురాజుకథ) బండ్రెండు తరములున్నవి. ఇందు కవులావుల గంగురాజుపేరు లేదు. ఆవుల వలురాజు తండ్రిపేరు 'అగ్గణాల వొలురాజు' అని యున్నది.

గుండ్లపాలెము శిలాశాసనములో 17 తరములు చెప్పఁ బడినవి. ఇందు శ్రీకృష్ణునినుండి ఉవనందునివఱకును వంశక్రమము అస్తవ్యస్తముగా నున్నది. కంకణంపాడు ప్రతిలోవలెనే దీనియందును ఆవుల వలురాజుతండ్రియగు కవులావుల గంగురాజు పేర్కొనఁ బడలేదు. కాటమరాజుతండ్రి పెద్దిరాజుకాఁగా, నిందుఁ బినతండ్రి యగు పోలురాజు ప్రముఖముగాఁ బేర్కొనఁబడెను.

పెరికగూడెం తాళపత్రప్రతియగు 'జన్నివాడకథ'లో శ్రీకృష్ణుని నుండి కాటమరాజువఱకును 19 తరములు పేర్కొనఁబడినవి. కాని 'అనిరుద్ధుఁడు, వజ్రుఁడు, ప్రతిబాహుఁడు, సుబాహుఁడు' మున్నగు వారు ఇందు లేరు. 'భోజుఁడు' అను శబ్దము ఇందు 'భోది' అని యున్నది. ఈ 'భోది' నామము అంతమునఁగల రాజులు ఇందెక్కువగా నున్నారు. ఆవుల వలురాజుతండ్రి 'కవులావుల గంగురాజు' అని వ్యవహారమునను 'వల్లురాజుకథ' అను వీరగాథలోను నుండగా, నీ జన్నివాడకథలో గంగురాజు– వలురాజుల మధ్య 'ఆవుల భూపతి'– 'ఆవుల అమృతయ్య', అను మఱి యిద్దరు రాజులున్నట్లుగాఁ గలదు.

గోవుల నాగేశ్వరకవిగారు తమ నాటకములో నిచ్చిన వంశక్రమము కొంత హేతుబద్ధముగా నున్నది. ఇందు కాటమరాజు శ్రీకృష్ణునకు ఇరువదిమూఁడవ తరమువాఁడుగాఁ జూపఁబడినాఁడు.

పై పట్టికలనుబట్టి, కాటమరాజు పూర్వవంశక్రమము, ముఖ్యముగా నావుల వలురాజునకుఁ బూర్వము పరస్పర విరుద్ధముగా నున్నదని తెలియుచున్నది. ఆవుల వలురాజునుండి ఉత్తర వంశక్రమము సరిగానున్నది అనవచ్చును. ఈ యుత్తరయదువంశ క్రమమునకుఁ గాటమరాజువీరగాథలు, జనవ్యవహారము నాధారములు.

కాటమరాజు కథాచక్రమున ముప్పదిరెండు కథలున్నవని ముందు తెలిపియుంటిని. ఈ ముప్పదిరెండు కథలును మూఁడు తరములకుఁ జెందినవి– ఆవుల వలురాజు తరము, పెద్దిరాజు తరము, కాటమరాజు తరము, ఈ మూఁడు తరముల వీరగాథలను బరిశీలించినచోఁ గాటమరాజుయొక్క ఉత్తరవంశక్రమము లేక చారిత్రకవంశక్రమము (అనఁగా కాటమరాజు ప్రపితామహుఁడగు కవులావుల గంగురాజునుండి కాటమరాజువఱకును గల వంశక్రమము) సుస్పష్టమగును. శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్య గారు యాదవుల పూర్వవంశక్రమమును సరిగా నిర్ణయింపకున్నను, ఈ యుత్తరవంశక్రమమును మాత్రము చాలఁ జక్కఁగ విడఁదీసినారు. ఇట్టి వంశవృక్షము నిచ్చినవారిలో వీరే ప్రథములు. ఒకటి రెండు స్వల్పదోషములున్నను మొత్తముపై నిది సమగ్రమని చెప్పవచ్చును:–

**తిమ్మావజ్ఝులవారు ఇచ్చినది:-**




తిమ్మావజ్ఝులవారు మద్రాసు GOML లో నున్న అయిదు కథలను, స్థానికచరిత్రలను, కృష్ణామండలములో నందిగామతాలూకా 'గండరాయి' గ్రామమునకుఁ జెందిన మార్గపూడి రంగయ్య కుమారుఁడు గురవయ్య యను కొమ్మలవాఁడు చెప్పిన విషయములను– ఈ మూఁడింటిని ఆధారముగాఁ జేసికొని పై వంశక్రమమును నిర్మించి యున్నారు. నేనింకను గొంచెము ముందునకుఁబోయి ఈ కాటమరాజు కథాచక్రమునకు సంబంధించిన నూతనగాథలను పదునాటింటిని సంపాదించి, ఆంధ్రదేశమందలి వివిధప్రాంతముల యాదవులతోను, కొమ్ములవారితోను సంప్రతించి, కనిగిరి దొనకొండ ప్రాంతములను దర్శించి, యీ వీరగాథలలోని వ్యక్తులకు సంబంధించిన మఱికొన్ని క్రొత్తవిషయములను కనుగొంటిని. నా పరిశీలనమునుబట్టి, తిమ్మావజ్ఝులవారిచ్చిన పై వంశక్రమమున మూఁడు తప్పులును, రెండు అధికముగాఁ జేర్చవలసిన అంశములును గలవని తేలుచున్నది.

పోలురాజు కుమార్తెయైన అగుమంచి భర్తపేరు 'ఉత్తమరాజు' అనుట మొదటి తప్పు. ఇతని పేరు 'పుత్తమరాజు' కాని ఉత్తమరాజు కాదు. ఇతని ప్రసక్తి వచ్చిన ప్రతివీరగాథలోను 'పుత్తమరా'జనియే కలదు. కఠియావులరాజుకథలో నోరుగంటికిఁబోయిన పల్లికొండ, అయితమరాజులతో నితఁడును గలఁడు. ప్రతాపరుద్రుఁడిచ్చిన మొండిగుఱ్ఱమును లొంగఁదీసిన వీరుఁడితఁడే! ఇతఁడు పెద్దిరాజు సోదరియైన కొమరక్క పుత్రుఁడు. మూఁడు తరములనుండి యాదవులకు మంత్రిగానుండిన పల్లికొండకు తమ్ముఁడగును. ఈ వీరగాథలో నితని పేరు పుత్తమరాజని పలుపుతావులందున్నది. ఇతఁడు అశ్వము నధిరోహించుట కాయత్తపడుట యిట్లు వర్ణింపఁబడినది:

***"అన్న చూచిన చూపులకు పుత్తమరాజు తన ఆత్మయందు***
***తెలిసి, తిమురుచు లేచి పుత్తమరాజు ధీరత సింహంబు రీతి***
***లగువు చల్లడము బిగువుగా దొడిగినాడు***
***కనకపూల దట్టి కాశగా గట్టి***
***వలపట పైడికుప్పె వొంకిమర జెక్కి***
***దాపట పైడికుప్పె జముధాళము దొడిగి***
***జంద్రకావి రుమాల చేతబట్టినాడు***
***అన్న కొలువుకు పుత్తమరాజు ఆధికొనివచ్చి..."*** [43]

'బల్లికురువ యుద్ధము' అను వీరగాథలో యతిస్థానమున రెండు చోట్ల ఈ 'పుత్తమరాజు' శబ్దమున్నది. **"పుత్తన్న నగ్నికి పొసగ నర్పింతు"** (పుట 5), **"పుత్తన్న, నేలిన ముద్దన్నఘనుడు"** (పుట 18).

పోచయ్యను, అగుమంచికి పుత్తమరాజునకును జన్మించిన పుత్రునిగాఁ జూపుట తిమ్మావజ్ఝులవారి పట్టికలోని రెండవ తప్పు. పోచయ్య, సింహాద్రిరాజు కూఁతురును, కఱియావులరాజు చెల్లెలును అగు చిట్టినూక పుత్రుఁడు. ఇతని తండ్రిపేరు 'కల్లందుల పోలినేఁడు' (కన్నందుల పోల్నేడు' అని రాజవంశ ప్రదీపిక). ఈ పోలినేఁడు పోలురాజుమంత్రులలో నొకఁడగు కల్లందుల మారినేని కుమారుఁడు. ఈ వీరుఁడు భైరవుని కురువ దగ్గఱ జరిగిన యుద్ధములో మరణించెను. (పోలినేని తండ్రియగు మారినేడు బల్లికురువ యుద్ధములో మరణించినాడు. అప్పటికి పోలినేడు పసివాఁడు. అందుచే బల్లికురువ యుద్ధమునకును– భైరవకురువ యుద్ధమునకును సంబంధము లేదని భావించుట కవకాశము కలుగుచున్నది. బల్లికురువ వేఱు, భైరవకురువ వేఱు. మొదటిదాని దగ్గఱ తండ్రియగు మారినేడును, రెండవదాని దగ్గఱ పుత్రుఁడగు పోలినేడును వీరస్వర్గ మలంకరించినారు.) అప్పుడీతని భార్యయగు చిట్టినూక సహగమనము చేయఁబోవుచుఁ, దన పుత్రుఁడును ఏడు నెలల పసిబాలుఁడును నగు పోచయ్యను, అగుమంచికి అప్పగించెను. అప్పటినుండియు బోచయ్యను అగుమంచియే పెంచినది. ఇతఁడు అగుమంచికిఁ బెంపుడుకొడుకు మాత్రమే. ఈ విషయము 'వేడుక బొంగరాల కథ' అను వీరగాథలో స్పష్టముగా నున్నది. పోచయ్యయే స్వయముగాఁ దన జన్మవృత్తాంతమును దెల్పును. కాఁబట్టి పోచయ్య అగుమంచికిఁ బెంపుడుకొడుకే కాని, గర్భవాసమునఁ గన్నవాఁడు కాడు. కావున తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు తమ వ్యాసములో అగుమంచినిగూర్చి వ్రాయుచు "ఉత్తమరాజు ఈమె భర్త. పోచయ్య యీమె కుమారుఁడు'' అని వ్రాయుట అవిచారమూలకమని చెప్పవలసివచ్చుచున్నది. (ఇట్లే ఆరుద్రగారు కూడ తమ 'కాటమరాజు' నాటకములో పోచయ్య పాత్రచే "అందుకే అభిమన్యుడానాడు అన్యాయంగా నేలకూలాడు. ఆ అప్రతిష్ఠ తొలగించడానికే ఈనాడు ఈ అగుమంచి ఉత్తమరాజుల కుమారుడయి ఈ అభిమన్యుడు పుట్టాడు. పదమామా!" అని అనిపించుట కూడ తప్పే.)

కోదండరాయ్యగారు పల్లికొండను కొమరమ్మకు జ్యేష్ఠ పుత్రునిగాఁ జూపినారు. ఇది సరికాదు. పోచయ్య అగుమంచికిఁ బెంపుడు కొడుకైనట్లుగనే, పల్లికొండకూడఁ గొమరమ్మకుఁ బెంపుడు కొడుకు; నిజపుత్రుఁడు కాడు. పల్లికొండ వరప్రసాది. ఆవుల వలురాజును అతనిమంత్రియగు తిరుమందుల ముత్తంరాజును, ఒక నాఁడు వేఁటకుఁబోఁగా, నట నరణ్యమున నొకసరస్సులోఁ గమలము నందొక బాలుఁడు కనఁబడెను. వలురాజు ఆ బాలునిఁ దెచ్చి, అప్పటికి సంతానములేని తన కుమార్తె కొమరమ్మకిచ్చెను. ఆమె బాలునిఁ బెంచి పెద్దఁజేసినది. అతఁడే పల్లికొడ. అతని బుద్ధికుశలతకు, నద్భుతశక్తికి మెచ్చి వలురాజాతనిని మంత్రిగా నియమించెను. ఆ వలురాజు తరమునుండి కాటమరాజు తరము వఱకును యాదవులకు ఈ పల్లికొండయే మహామంత్రి. యాదవులీతనిని విష్ణుని అవతారముగా భావించి, యితని యాజ్ఞను శిరసావహించుచుండిరి. ఇతఁడు యాదవులకు 'హరిగురువు'; (భక్తిరన్న 'శివగురువు'). కావున పల్లికొండ పందుముల పాపినాయని భార్యయగు కొమరమ్మకుఁ బెంపుడుకొడుకు మాత్రమే. (ఈ పల్లికొండ పుట్టుక 'ఆవుల వలురాజుకథ'లో వచ్చును.) దీనిని కోదండరామయ్యగారి పట్టికలోని మూఁడవ తప్పుగాఁగాక, పైన తెల్పిన రెండవ తప్పులోని అంతర్భాగముగా బరిగణించుచున్నాను. శ్రీవారి మూఁడవ తప్పునుగూర్చి దిగువ ముచ్చటించుచున్నాను.

కోదండరామయ్యగారిచ్చిన వంశవృక్షములో నలనూకరాజు పుత్రుఁడు 'చట్టువారి ఎఱ్ఱయ్య' యని కలదు. వారి వ్యాసములో వేఱొక చోఁ బయ్యావుల యెఱ్ఱయ్యనుగూర్చి వ్రాయుచు "ఈతనికే చట్టావుల యెఱ్ఱయ్యయని నామాంతరము కలదు. ఇతఁడు నలనూకరాజు యొక్క కుమారుడు" అని వ్రాసిరి. దీనినిబట్టి 'చట్టువారి యెఱ్ఱయ్య'యు 'పయ్యావుల యెఱ్ఱయ్య'యు నొక్కరేయని శ్రీవారి భావముగా స్పష్టమగుచున్నది. ఇది సరికాదు. ఈ యిర్వురు ఎఱ్ఱయ్యలును వేఱు వేఱు వ్యక్తులు. నలనూకరాజు కొడుకుపేరు 'పయ్యావుల యెఱ్ఱయ్య' లేక 'పెయ్యల యెఱ్ఱయ్య'. ఇతనికి 'బెజవాడ బెబ్బులి' అని బిరుదు. ఇతఁడు కాటమరాజునకు సోదరుఁడు (పితృవ్య పుత్రుఁడు). అందుచే నితనికి 'నలనన్న ఎఱ్ఱయ్య' అనియు నామాంతరమున్నది. ఇతఁ డెప్పుడును కాటమరాజుయొక్క ఆలమందలతో నుండువాఁడు. 'చట్టువారి యెఱ్ఱయ్య' వేఱు. ఇతఁడు కాటమరాజునకు మఱఁది యగును. (పల్లికొండకు సోదరుఁడు.) కోటపాడునుండి తాటి వృక్షమును బెఱికి తెచ్చిన వీరుఁడు ఈ చట్టువారి యెఱ్ఱయ్యయే. ఇతఁడు కొమరక్క పుత్రుఁడు.

ఈ యిరువురు ఎఱ్ఱయ్యలును వేఱనుటకు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' యను వీరగాథలో 'ఆవుల యెద్దుల జగడ'మను కాండమున స్పష్టమగు నిదర్శనమున్నది. మంత్రి పల్లికొండ యీ యిరువురు ఎఱ్ఱయ్యలకును బంపులేర్పఱుపఁగా, కాటమరాజు వీరిలో నొకరిని దమ్మునిగాను, వేఱొకరిని మఱఁదిగాను సంబోధించి, ఉత్సాహము నిచ్చి, యుద్ధముచేయుటకు అనుజ్ఞనొసంగును:

*"పేర్పేర నలనన్న పిలిచె నందఱిని*
*తమ్ముని నెర్రయ్య దాయంగఁ బిలిచి*
*మఱఁదిని నెర్రయ్య మతి వేగఁ బిలిచి*
*యిద్దరు నిలిచియు యుద్ధంబు సేయుఁ*
*దని చెప్పి యిరువురి నటు కౌగిలించి*
*'మా కోర్కె పగఱపై మనసు రంజిల్ల...*
*మించి పగతుర మెదడు మేదిని మీఁదఁ*
*గుప్పలుగ రాలంగ ఘోరయుద్ధంబు*
*ఓ తమ్ముడా! మఱఁది! యుదయాస్తమానము*
*సీతాపతి కృపను చేయుఁడాలంబు' "*[44]

అని కాటమరాజు సెలవీయఁగా, 'బెజవాడ బెబ్బులి' యగు పెయ్యల యెఱ్ఱయ్యయు, చట్టువారి యెఱ్ఱయ్యయు యుద్ధసన్నద్ధులై వెడలినట్లుగాఁ గలదు. దీనినిబట్టి ఎఱ్ఱయ్యలు ఇరువురున్నారనియు, నందు నలనూకరాజు పుత్రుఁడును, కాటమరాజు సోదరుఁడును, 'బెజవాడ బెబ్బులి' బిరుదాంకితుఁడును నగువాఁడు 'పెయ్యల యెఱ్ఱయ్య' అనియు; కాటమరాజునకు మఱఁదదియు, పల్లికొండకు నయితమరాజునకుఁ దమ్ముఁడును, కొమరక్క పుత్రుఁడును అగువాఁడు 'చట్టువారి యెఱ్ఱయ్య' అనియు స్పష్టమగుచున్నది. 'ఎఱ్ఱయ్య తర్కవాదము' అను వీరగాథలో గంగతో తర్కవాదము జరిపినాడు పెయ్యల యెఱ్ఱయ్య. 'కోటపాటి తాటివృక్షం తెచ్చేకథ' అను వీరగాథలో కోటపాడు గ్రామమునకుఁ ఓయి, అనేక వీరులను జయించి, తాటిచెట్టును దెచ్చినాఁడు చట్టువారి యెఱ్ఱయ్య.

తిమ్మావజ్ఝులవారు పెద్దిరాజు తరములోని రాణివాసము నిట్లు గుర్తించిరి: సింహాద్రిరాజుభార్య సింహాద్రిసీత, పెద్దిరాజుభార్య పెద్దమ్మ, ఎఱనూకరాజుభార్య ఎఱనూకసీత, నలనూకరాజుభార్య నలనూకసీత, పోలురాజుభార్య సిరిదేవి. కాని గుఱ్ఱముకొండ భక్తవత్సలకవి రచించిన 'కఱియావుల కాటమరాజు చరిత్ర' అను పద్యకావ్యమున సింహాద్రిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, భార్యలపేర్లు భిన్నముగా నున్నవి. సింహాద్రిరాజుభార్య 'నరసాంబ' అనియు, నెఱనూకరాజుభార్య 'ఎఱ్ఱాంబ' అనియు, నలనూకరాజు భార్య 'నల్లాంబ' అనియు నీ పద్యకావ్యమున నున్నది. పెద్దమ్మ, సిరిదేవుల నామములు మాత్రము యథాతథముగనే యున్నవి. 'రాజవంశ ప్రదీపిక'లో సింహాద్రిరాజుభార్యపేరు చెప్పఁబడలేదు. పెద్దిరాజుభార్య 'పెద్దమ్మ' అనియు, నెఱనూకరాజుభార్య 'సీతమ్మ' యనియు, నలనూకరాజుభార్య 'సీతాంబ' యనియు, పోలురాజు భార్య 'సిరిదేవి' యనియుఁ గలదు. మొత్తమునకు పెద్దమ్మ, సిరిదేవి కొమరక్కల పేర్లు ప్రసిద్ధమైనట్లుగాఁ దక్కినవారి పేర్లు అంత ప్రసిద్ధములు కావు. గంగురాజుభార్య గంగమ్మ, వల్లురాజుభార్య వల్లమ్మ, పెద్దిరాజుభార్య పెద్దమ్మ– ఇత్యాది నామములను బరిశీలించినచో, భర్త నామమునను సరించియే భార్యనామమునుండుట ఆనాఁటి సంప్రదాయముగాఁ గానవచ్చుచున్నది. అట్లే 'సింహాద్రిసీత'– 'ఎఱనూకసీత'– 'నలనూకసీత' అను పేర్లనుబట్టి 'సీత' అను శబ్దము 'భార్యా' శబ్దపరముగా వాడబడినట్లుకూడ తెలియుచున్నది. పోలురాజు భార్య 'సిరిదేవి'కి 'నూకాంబ' అను నామాంతరము గలదు. అట్లే 'కొమరమ్మ'కు 'కొమరిగిరి'– 'కొమరక్క' అను నామాంతరములు గలవు. ఈ యాదవరాజులు 'నూకాలమ్మ' అను గ్రామదేవతకు భక్తులైయుందురు. తమయింటఁ బుట్టిన ఆడపిల్లలకు (ఇంచుమించు అందఱికిని) ఈమె పేరు పెట్టినారు. ఉదా॥ నూకాంబ, చిట్టినూక, పాపనూక, పొట్టినూక.

ఇట్లు కోదండరామయ్యగారిచ్చిన వంశవృక్షమునఁ దప్పులే కాక, దానికిఁ జేర్చవలసిన యంశములును గొన్ని కలవు. కాటమరాజు మేనత్త యగు కొమరమ్మకు 'పల్లికొండ, ఉత్తమరాజు, నాచకూళ్లనాయుడు' అను ముప్వురు పుత్రులు గలరని వారు చూపినారు. ఇందు పల్లికొండ కొమరమ్మకుఁ బెంపుడు కొడుకనియు, ఉత్తమరాజుపేరు 'పుత్తమరాజు'గా నుండవలెననియుఁ బైన నిరూపించితిని. కొమరమ్మ భర్త పందుముల పాపినాయఁడు. ఇతఁడు పోలురాజు మంత్రి. ఈ దంపతులకుఁ బల్లికొండ యను పెంపుడు కొడుకుతోపాటు 'పుత్తమరాజు, నాచకూళ్లనాయఁడు, చట్టువారి ఎఱ్ఱయ్య, పుల్లావుల కేశవయ్య' అను నల్వురు నిజపుత్రులును గలరు. ఇందు చట్టువారి ఎఱ్ఱయ్యను, పుల్లావుల కేశవయ్యను కోదండరామయ్య గారు గుర్తించలేదు. ఇందు కేశవయ్య ప్రసక్తి కఱియావులరాజు కథలో వచ్చును. ఇతఁడు కఱియావులరాజునకుఁ జెలికాఁడు, మంత్రి. ఆ బావమఱఁదు లిరువురును పగడసాలాడుచుందురు. కోదండరామయ్య గారు చట్టువారి ఎఱ్ఱయ్యను నలనూకరాజు పుత్రునిగా భ్రమించిరి.

అయితమరాజునకు 'అల్లు దాడెన్న' యను పుత్రుఁడే కాక 'సిరిగిరమ్మ' యను పుత్రికయుఁ గలదు. ఈమె ప్రసక్తి 'అగుమంచి కథ'లో వచ్చును. ఈ సిరిగిరమ్మ అగుమంచి పెంపుడుకొడుకగు పోచయ్యభార్య. అగుమంచికథలో నామెకుఁ దలంటిపోసినదీ సిరిగిరమ్మయే! ఈమెను కోదండరామయ్యగారు గుర్తింపలేదు.

తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు పెద్దిరాజుతరములోని రాణులను మాత్రమే గుర్తించిరి. నేను కాటమరాజుతరములోని రాణివాసమునుగూడ గుర్తించితిని. కాటమరాజుభార్య 'మర్లవారి వీరగంగ'. కఱియావులరాజుభార్య 'నాగమాంబిక' లేక 'కఱియావుల నాగ'. భట్టావులరాజుభార్య 'సూరమ్మ' లేక 'సూరమాంబిక'. పెయ్యల యెఱ్ఱయ్యభార్య 'భయ్యమాంబిక'. భక్తిరన్నభార్య పేరు 'నల్లమేడ' లేక 'నల్లమాంబ'. అయితమరాజుసతీమణి 'నేతివారిపోతు'. ముమ్మయ్యసతి 'చినమల్లు'. పుత్తమరాజుభార్య 'అగుమంచి'. పోచయ్యభార్య 'సిరిగిరమ్మ'. వీరందఱును అగుమంచికథలోఁ బ్రసక్తమగుదురు. అగుమంచికి 'అక్కప్ప' యను నామాంతరము కూడఁ గలదు.

నేను సూచించిన పై సవరణలతోఁ గాటమరాజు వంశవృక్ష మిట్లుండవలెను:– (చూ. తరువాతి పుట).

నా పరిశోధనను బట్టి:-

## కాటమరాజు వంశవృక్షము



### 3.1. యాదవుల రాజధానులు:–

ఈ యాదవరాజులు 'ఎలమంచి, పంపాద్రి, అర్థవీడు, ధనము కొండ' అను ప్రదేశములలో రాజ్యము లేలినట్లుగా వీరగాథలవలనఁ దెలియుచున్నది. కవులావుల గంగురాజును, ఆవుల వలురాజును ఎలమంచిని బాలించిరి (ఆవుల వలురాజు కనిగిరి ప్రక్కనున్న పెద అలవలపాడును బాలించెనని కొందఱందరు). వలురాజు తరువాత పెద్దిరాజు ఎలమంచిని పదేండ్లు పాలించి, పిమ్మట సోదరులతోఁ గలిసి పంపాద్రికి వచ్చెను. పంపాద్రిలో నేడేండ్లు పాలించిన తరువాత పెద్దిరాజు సంతానముకొఱకు కల్యాణకటకమునకుఁ బోయెను. తక్కిన సోదరులు నలుగురును పంపాద్రిలో నుండిరి. పెద్దిరాజు ఆర్లపెంట యుద్ధములో మరణించెను. అదే సమయములో పెద్దవాడైన సింహాద్రి రాజు, యువరాజైన ఎఱనూకరాజు, నలనూకరాజు, ఆలమందలకు అధినాథుఁడుగాఁ జేయఁబడిన పోలురాజు, శరణాగత రక్షణార్థము వివిధప్రదేశములలో యుద్ధములుచేసి ఆత్మబలిదానముఁ గావించిరి. పోలురాజు సుతుఁడైన అయితమరాజు మొదట ఎలమంచిని తరువాత ధనముకొండను బాలించెను. కాటమరాజు నిరంతరము నాలమందలతోఁ గలసి దేశభ్రమణము కావించుచున్నట్లుగాఁ దెలియుచున్నది. ఇతఁడు బాల్యమున కల్యాణపట్టణములో నుండెను. తరువాత భక్తిరన్నచే నెలమంచికిఁ దేఁబడెను. పిమ్మట శ్రీశైల ప్రాంతమున నాలమందను మేపెను. అటనుండి కనిగిరిసీమకు, నెల్లూరిసీమకు వచ్చెను. ఇతని కోట కనిగిరి దగ్గఱ పంచలింగాలకొండ దిగువున నున్నది. ఈ యాదవరాజుల రాజధానులలో ఎలమంచి, పంపాద్రి అనునవి నేఁటి విశాఖమండలమునఁ గలవు. అర్థవీఁడు కర్నూలుజిల్లా కంభముతాలూకాలో నున్నది. ఇట పల్లికొండ బాలరాజులతో నొక్కరాత్రి మాత్రమే గడపెనందురు. నేఁటి ప్రకాశంజిల్లా దర్శితాలూకాలోని 'గంగదొనకొండ'యే నాఁటి ధనముకొండ లేక ధనుముకొండ. ఇట అయితమరాజుకోట శిథిలములు నేఁటికిని గలవు. అట్లే పంచలింగాలకొండ దగ్గఱ కాటమరాజుకోటకు గుర్తులు కనఁబడుచున్నవి.

### 3.2. కాటమరాజు జననము:–

ధాతనామ సంవత్సర ఫాల్గుణ శుద్ధ పంచమి గురువారమునాఁడు కల్యాణనగరమున సోమేశ్వరుని వరముచే పెద్దిరాజు పెద్దమ్మ దంపతులకు కాటమరాజు జన్మించెను. ఈ విషయము పెద్దిరాజు కథలోను, పాపనూకకథలోను గలదు. ఫాల్గుణ శుద్ధపంచమి యాదవులకు నేఁటికిని పర్వదినముగా నున్నది. (కాటమరాజు జననము ఆంగ్లకాలమానము ప్రకారము: క్రీ.శ. 1217, ఫిబ్రవరి 19వ తేది గురువారమగును.)

### 3.3. కాటమరాజు కులగోత్రములు:–

కాటమరాజు యదుకులమునకుఁ జెందిన చంద్రవంశ క్షత్రియుఁడు. ఆత్రేయ గోత్రజుఁడు. 'అమ్మగారి వారు, అయ్యగారి వారు. దేవాదులవారు, మారాచపువారు, బడుగులవారు, శివగణము– దేవగణము' అను షడ్దర్శనములలో కాటమరాజు బడుగుల దర్శనమునకుఁ జెందినవాఁడు. అందువలననే వీరగాథలలోఁ బలుతావులందు కాటమరాజు 'బడుగులరాజు'గా స్తుతింపఁబడినాఁడు. ఈతని కులదైవము ఆదిశక్తియవతారమగు గంగ. 'వల్లవులు–స్తిరమందులు' అను యాదవ ప్రధానశాఖలలోఁ గాటమరాజు వల్లవుల శాఖకుఁ జెందినవాఁడు. ఈ వల్లవులు రాజ్యమును బాలించువారు. స్తిరమందులవారు వీరికడ మంత్రిత్వమును నెఱపుచుందురు.

### 3.4. కాటమరాజు ఇంటిపేరు:–

గుబ్బముకొండ భక్తవత్సలకవి వ్రాసిన పద్యకావ్యమునుబట్టి కాటమరాజు ఇంటిపేరు 'కఱియావులవారు'. వల్లురాజుకథయను వీరగాథనుబట్టి కాటమరాజు ముత్తాత 'కవులావుల గంగురాజు' ఇందు 'కవులావుల' యనునది ఇంటి పేరుగాఁ గానవచ్చుచున్నది. ఈ కవులావుల నామమునే భక్తవత్సలకవి 'కఱియావుల'గా మార్చి యుండును. లేదా కాటమరాజు పెదతండ్రి కుమారుఁడగు 'కఱియావులరాజు' పేరునే గృహనామముగా భ్రమించియుండును. కాటమరాజుతాత 'ఆవుల వలురాజు'. ఇందు 'ఆవుల' అనునది గృహనామముగాఁ గన్పట్టుచున్నది. వలురాజుతండ్రి కాలములో 'కవులావుల' అను నింటిపేరు, వలురాజుకాలములో 'ఆవుల'గా మాఱియుండును. కావున తాత ముత్తాల పేర్లనుబట్టి కాటమరాజు ఇంటిపేరు మొదట 'కవులావులవారు'గా నుండెడిదనియు, నది క్రమముగా 'ఆవులవారు'గా మాఱినదనియుఁ జెప్పవచ్చును. వీరికిఁ గల విస్తారమైన గోగణముచే నిట్టి యింటి పేర్లుండుట సహజమే. భక్తవత్సలకవి చెప్పిన 'కఱియావుల' అను నింటిపేరు వీరగాథలలో నెచ్చటను గానవచ్చుట లేదు. ("కవులావులవారు" అనఁగా 'కపిల గోవులు కలవారు" అని అర్థము. "కఱియావులవారు" అనఁగా "నల్లని ఆవులు కలవారు" అని అర్థము.)

### 3.5. కాటమరాజు పేర్లు:–

కాటమరాజునకు మొత్తము ఆఱు పేర్లున్నట్టుగా వీరగాథల వలనఁ దెలియుచున్నది. అవి: 'నలనన్న, ఆవులన్న, పశువులన్న, కాటకోటేశ్వరుఁడు, కాటమరాజు, కత్రేయుఁడు'. నరజన్మ మెత్తుటచే నలనన్న యనియు, ఆవులను గాచుటచే ఆవులన్న యనియు, పశువులను పట్టము కట్టఁబడుటచే పశువులన్న యనియు నామములు గలిగినవి. కాటకోటేశ్వరుని వరముచేఁ బుట్టుటచే కాటకోటేశ్వరుఁడు, కాటమరాజు, కత్రేయుఁడు అను పేర్లు వచ్చియుండును.

### 3.6. కాటమరాజు బిరుదులు:-

కాటమరాజునకు డెబ్బదియేడు బిరుదులున్నవని తెలియు చున్నది. "అంభోజ బిరుదు, ప్రళయకాల బిరుదు, సింగిణీ తోరణాలు, కనకసింగిణీలు, విష్ణుబిరుదు, చంద్రబిరుదు, గరుడశార్దూల, కనక పడగలు, పిగిలి తలాటము, పిగిలి కుచ్చులు, పంచలోహ తలాట, భస్మశంకర"- ఇత్యాదిగా డెబ్బదియేడు బిరుదులున్నవఁట.

### 3.7. కాటమరాజు ఆలమంద:-

యాదవులకు గోగణమే ప్రధాన సంపద. కాఁగా యాదవ చక్రవర్తియొక్క గోసంపదనుగూర్చి ప్రత్యేకముగాఁ జెప్పఁబనిలేదు. కాటమరాజు ఆలమంద అతివిస్తారమైనది. దీని అసంఖ్యాకత్వమును వర్ణించుచు గాథాకారులొక చక్కని ప్రమాణమును జెప్పుచుందురు. "ఘనుఁడు కాటమరాజు ఆవులమంద, కుదిరితే ఆఱామడ, చెదిరితే పన్నెండామడ" అని పాడుచుందురు. జానపదుల కెంతటి అద్భుతమగు కవితాశక్తియున్నదో తెలుపుటకు ఈ ఒక్క వాక్యము చాలును. "కుదిరితే ఆరామడ, చెదిరితే పన్నెండామడ" అనునది తలఁచినకొలదియుఁ బరవశత్వమును గలిగించు ప్రయోగము. అతివిస్తారమైన కాటమరాజు గోగణము దగ్గఱగాఁ గుదిరియున్నచో నాఱామడల వైశాల్యముగల భూమినాక్రమించునఁట! ఆ గోవులు తమ యిచ్చవచ్చినరీతి చెదరి మేయసాగినచోఁ బంన్రెండామడల వైశాల్యముగల భూమినాక్రమించు నఁట! ఈ ప్రయోగమే నాకు లభించిన 'జన్నివాడకథ' తాళపత్ర గ్రంథములో నిట్లున్నది.

*"కుదురు ఆరామడ, కదులు పన్నెండామడ*
*కదిలినవోయి కామధేనువులు, కాంబోధి మేసెను"*

-(పత్రసంఖ్య-17)

ఈ విస్తారమైన గోగణమును కాటమరాజు మొదట కడప మండలమునఁగల పాలకొండ ప్రాంతమునను, తరువాత కర్నూలు లోని నల్లమల ప్రాంతమునను మేపి, ఆ పిమ్మటఁ గనిగిరి మీఁదుగా నెల్లూరిసీమ కేఁగెను. అందువలననే కాఁబోలును, ఈ కథలకుఁ బ్రచారముకూడ కడప, కర్నూలు, నెల్లూరు మండలములలో హెచ్చుగా నున్నది. ఈ మండలములలోఁ గాటమరాజునుగూర్చిన అనేక విషయములు జనశ్రుతిలో నున్నవి. రాయలసీమ నుడికారమును పుణికి పుచ్చుకొనిన నా మిత్రులు దుంపా శ్రీరాములు రెడ్డిగారు (కడపజిల్లా, పులివెందుల తాలూకా, బొజ్జాయిపల్లె గ్రామము) కాటమరాజు గోగణమునుగూర్చి కడపమండలమునఁ బ్రసిద్ధికెక్కిన ఒక సామెతను, దాని వ్యుత్పత్తిని నీ క్రింది విధముగాఁ జెప్పిరి:-

"మల్లేల కొండ గడ్డితిని, మద్దులపాయ నీళ్లుతాగితే, చిట్టెలుక కూడ చిట్టెడు పాలిస్తుంది"- అను సామెత నేఁడు రాయలసీమలో వ్యవహరింపఁబడుచున్నది. ఈ మాటలను కాటమరాజు స్వయముగా అనినాఁడని ప్రజలు చెప్పుదురు. కాటమరాజుయొక్క ఆలమంద మిక్కిలి పెద్దది. అది యెంత పెద్దది యనఁగా- ఆ మహాగోణము కదలుచుండఁగా, ముందరనడచు నావులు గడ్డినిమేయుచు పోవుచుండ, వాని వెనుక వచ్చెడి యావులు గడ్డిమోళ్లను కొరుకుచుఁ బోయెడివఁట. ఇంకను వెనుక వచ్చెడి ఆవులు గడ్డివేళ్లను పెరికి మేయుచుఁ బోయెడివఁట. ఇఁక నా యాలమందలోఁ జిట్టచివర వచ్చెడి యావులకుఁ గసవు వేళ్లు సహితము లభింపక, తమముందు పోయెడి యావులు వేసిన పేఁడను దినుచుండెడివఁట. ఇంత విస్తారమైన గోగణమును మేపుటకు దేశమున నే ప్రాంతమును కాటమరాజున కనుకూలింపలేదు. అతఁడు ఈ యసంఖ్యాకమగు నాలమందతో దేశములన్నియుఁ బరిభ్రమించుచుండెను. తన యాలమంద కంతటికిని పుష్కలముగాఁ బచ్చిక సమకూర్పంగల తావు ఆతనికిఁ గనపడలేదు. అట్లు కాటమరాజు దేశములు దిరుగుచు కడప జిల్లాలోని పులివెందుల ప్రాంతమునకు వచ్చెనఁట. అక్కడ మల్లేల గ్రామము దగ్గఱనున్న 'మల్లేలకొండ' లేక 'బాణాసురుఁడు గుట్ట' (ఇట బాణాసురుఁడు తపస్సు చేసెనని ప్రతీతి) మాత్రము కాటమరాజు యొక్క ఆలమందకు ఒకటిన్నర దినము పచ్చిక నీయఁగలిగినదఁట! అప్పుడు కాటమరాజు 'మల్లేలకొండ గడ్డితిని, మద్దులపాయ నీళ్లుత్రాగితే, చిట్టెలుకకూడ చిట్టెడు పాలిస్తుంది' అనినాఁడని రాయలసీమలోని గ్రామవృద్ధులు చెప్పుచుందురు. ('ముద్దులపాయ' బాణాసురునిగుట్టదగ్గఱ ప్రవహించెడి సెలయేఱు.)

### 3.8. కాటమరాజు వివాహము:-

కాటమరాజు భార్యపేరు 'మర్లవారి గంగ'. ఈమెను 'వీరగంగ' యనియుఁ బిలుతురు. ఈమె ఆదిశక్తియగు గంగమ్మ యవతారము. కాటమరాజు కల్యాణపట్టణమున ఏడు సంవత్సరముల బాలుఁడుగా నున్నప్పుడు అతనితండ్రి పెద్దిరాజు వాలికేతువరాజుపై దండెత్తిపోయి ఆర్లపెంటరణమున మరణించెను. అప్పుడు కాటమరాజు తన తండ్రిపగ తీర్చుటకై ఆర్లపెంటరణమునకేఁగి వాలికేతువరాజును జంపెను. ఆ రణభూమిలో నాదిశక్తి గంగ యతనినిజూచి మోహించి, తన్నుఁబెండ్లియాడుమని కోరెను. కాటమరాజు అందులకంగీకరింపక, ఆ యాదిశక్తిని మర్లవారింటఁ బుత్రికగాఁ బుట్టవలసినదనియుఁ, దాను పశువులను దోలుకొని ఉత్తరభూములకేఁగి, తిరిగి దక్షిణ భూములకు మరలునప్పుడు, తప్పక ఆమెను వివాహమాడగల ననియుఁ జెప్పి యొప్పించెను. కాటమరాజు దక్షణిభూములకు మరలునప్పుడు, పాలేటికడ నాదిశక్తి గంగ యతనినడ్డగించెను. మొదట వ్యతిరేకించినను గడకు కాటమరాజు ఆమెకుఁ జేయెత్తిమ్రొక్కెను. అప్పుడు మర్లవారు వచ్చి తమ బిడ్డను వివాహమాడవలసినదని కాటమరాజును బ్రార్థించిరి. కాటమరాజు కత్తికి పుస్తెకట్టి మర్లవారింటి పడుచును వివాహమాడెను.

కాటమరాజుతండ్రి పెద్దిరాజు మదనకుంభినులపై యుద్ధమునకుఁ బోవుచు, నొక సన్న్యాసులమఠమును ముట్టడించెను.

అప్పుడాసన్న్యాసులు: "మావలెనే నీ బిడ్డలుకూడ సన్న్యాసులుగా బ్రదుకుదురు" అని శపించిరి. అందువలన కాటమరాజునకు సంతానము లేదు. కాటమరాజు మర్లవారి వీరగంగను వివాహమాడి నట్లున్నది కాని, ఆమెతోఁ గాపురము చేసినట్లుగా నే వీరగాథలోను లేదు. వీరగంగ ఎల్లప్పుడును దొనకొండ అంతఃపురములో నుండెను; కాటమరాజు తన ఆలమందలతో దేశాటనము చేయుచుండెను. పాపనూకకు అసలు వివాహమే జరుగలేదు. పెద్దిరాజునకుఁగల శాపముచే పాపనూకకువలెనే కాటమరాజునకుఁగూడ అసలు వివాహమే జరుగలేదని కొందఱు గాథాకారులు చెప్పుదురు. ఇది సరికాదు. "కాటమరాజుకు పట్నంకట్టిన కథ" ('కాటమరాజు పట్టాభిషేకము')లో భక్తిరన్న కల్యాణనగరమునకుఁబోయి, సువ్విపాటలు పాడుచున్న పాపనూకను గుర్తించి, ఆమెను కాటమరాజును ఎలమంచికిఁ దీసికొని వచ్చినప్పుడు, కాటమరాజునకు 'మర్లవారి వీరగంగ' నిచ్చి వివాహము చేసినట్లు స్పష్టముగా నున్నది. కాటమరాజుభార్యగా నీ వీరగంగప్రసక్తి 'పాపనూకకథ'లోను, 'అగుమంచికథ'లోను, 'భక్తిరన్నకథ'లోను వచ్చును. కాఁబట్టి కాటమరాజునకు వివాహము జరిగినది కాని, అతఁడు భార్యతోఁ గాపురము చేయలేదు.

### 3.9. 'వల్లవులు-స్తిరమందులు':-

యాదవులలో 'వల్లవులవారు' అనియు, 'స్తిరమందులవారు' అనియు రెండు ప్రధానశాఖలున్నవి. యయాతికి శుక్రాచార్యుని కూఁతురు దేవయానియను బ్రాహ్మణకన్యవలనఁ గలిగిన సంతానము 'స్తిరమందులవారు'. వీరు ఏడువేలమంది కలరఁట. యయాతికి శర్మిష్ఠయను రాచకన్యవలనఁ గలిగిన సంతానము 'వల్లవులవారు'. వీరు ఆఱువేలమంది. ఈ వల్లవులు రాజ్యమును బాలించురాజులు. స్తిరమందులవారు వీరికడ మంత్రులుగా నుందురు. అందుచే వల్లవులను 'రాజులవారు' అనియు, స్తిరమందులను 'ప్రధానులవారు' అనియుఁ బిలుచుట కలదు. ఈ వల్లవులవారును స్తిరమందులవారును వియ్యమందుచుందురు. ఆఱువేలమంది వల్లవులతో, స్తిరమందులలోని ఆఱువేలమంది వియ్యమందవలసినదనియు, నిక స్తిరమందులతో నధికముగానున్న వేయిమందిలో నైదువందలమంది ఒకవైపునను, మిగిలిన ఐదువందలమంది మఱియొక వైపునను వియ్యమందుఁ డనియు పల్లికొండ చెప్పెనఁట.

కాటమరాజు వంశవృక్షములో వలురాజు, సింహాద్రిరాజు, పెద్దిరాజు, కఱియావులరాజు, కాటమరాజు మున్నగుఁ బురుష సంతతి వారందఱును వల్లవులు. వీరి భార్యలందఱును స్తిరమందుల వారి ఆడుబిడ్డలు. అట్లే వల్లవుల పుత్రికలందఱును- కొమరమ్మ, చిట్టినూక, అగుమంచి మున్నగువారు స్తిరమందులవారింటి కోడండ్రు. పందుముల పాపినాయఁడు, పల్లికొండ, పుత్తమరాజు, కల్లందుల పోల్నేఁడు మొదలగు వారందఱును స్తిరమందులవారు. వీరు వల్లవుల యల్లుండ్రు, మంత్రులు కూడ. వలురాజు కుమార్తెయగు కొమరమ్మను స్తిరమందుల వంశమువాఁడైన పందుముల పాపినాయఁడు వివాహమాడెను. సింహాద్రిరాజు కుమార్తెయగు చిట్టినూకను పోలురాజు మంత్రియగు కల్లందుల పోల్నేఁడు వివాహమాడెను. పెద్దిరాజు కుమార్తెయగు పాపనూకను కొమరమ్మపుత్రుఁడగు నాచకూళ్ళ నాయనికిచ్చి పెండ్లిచేయ సంకల్పించిరి. కాని పాపనూక దుష్టనక్షత్రమున జన్మించుటచేతను, కొమరమ్మ తన కుమారుని ఇల్లఱికమునకు పంపుటకు అంగీకరింపకపోవుటచేతను ఈ పెండ్లి ఆగిపోయెను. వల్లవుల పోలురాజు పుత్రికయగు నగుమంచిని, స్తిరమందుల పుత్తమరాజునకిచ్చి పెండ్లిచేసిరి. వల్లవుల అయితమరాజు పుత్రికయగు సిరిగిరమ్మను, స్తిరమందుల పుత్తమరాజు పెంపుడు కొడుగు పోచయ్యకిచ్చి వివాహము చేసిరి. ఇట్లు వల్లవులును స్తిరమందులును పరస్పరము వియ్యమందుచుండుట కాటమరాజు కథాచక్రమందంతటను గాననగును.

నేఁడు గొల్లలలోఁగల వివిధ శాఖలలో ఎఱ్ఱగొల్లలు వల్లవు లనియు, పూజగొల్లలు స్తిరమందులనియుఁ జెప్పవచ్చును. కొన్ని వీరగాథలలో 'తిరమందులవారు' అని యుండుటవలన నీ శబ్దనిష్పత్తి "స్థిరమంత్రులు> స్తిరమందులు> తిరమందులు"గా భావింపవచ్చును.

### 3.10. యాదవులు శైవులే:-

కాటమరాజును విష్ణుమూర్తియొక్క అవతారముగా భావించు యాదవులు శైవులగుట విచిత్రము. 'విష్ణువే కృష్ణుఁడు, కృష్ణుఁడే కాటమరాజు' అని యాదవుల నమ్మకము. కాటమరాజే కాక బొల్లావుకూడ విష్ణుమూర్తి యవతారమని యాదవులు విశ్వసింతురు. కాటమరాజు కథలతోపాటు విష్ణుభాగవతము (లేక, కంసుఁడుకథ)ను గూడ యాదవగాథాకారులు పాడుచుందురు. కాని యాదవులు వైష్ణవమతస్థులైనట్లుగా ఏ వీరగాథలోను గానరాదు. పైపెచ్చు, ఎక్కడ చూచినను శైవమతప్రసక్తియే కానవచ్చును. చల్లపిన్నమనేని మంత్రి బ్రహ్మారుద్రయ్య శివబ్రాహ్మణుఁడు. పెద్దమ్మ, అగుమంచి జంగమారాధన చేసిరి. పోలురాజు సాక్షత్తు శివాంశతోనే పుట్టినాఁ డని చెప్పఁబడినది. ఈ పోలురాజుకథలో 'చంద్రగుప్తుని చాటువ, మల్లికాదేవి చాటువ' అను శ్రీశైలక్షేత్ర మాహాత్మ్యమునుగూర్చిన శైవపురాణగాథలు చెప్పఁబడినవి. ఈ పోలురాజుకథకు 'శివపురాణ' మను నామాంతరమున్నది. సాక్షాత్తు శివుఁడే భక్తిరన్నగా జన్మించెనని చెప్పఁబడినది. ఇట్లు కాటమరాజు కథాచక్రమున శైవమత ప్రసక్తియే అడుగడుగునను బ్రత్యక్షమగుచుండును. వైష్ణవమునకు సంబంధించి, సింహాద్రిరాజు శ్రీకూర్మమందలి శ్రీవైష్ణవుల కభయమిచ్చినట్లుగా నొక్కసంఘటన మాత్రమున్నది. ఇది తప్ప మఱియొచ్చటను వైష్ణవమత ప్రసక్తి కానరాదు. కావున యాదవ వీరులందఱును శైవులే! పల్నాటి వీరకథలలోఁగూడ వైష్ణవమతప్రసక్తికన్న శైవమతప్రసక్తియే హెచ్చుగా నున్నది. తెలుఁగుదేశమున శైవమతవ్యాప్తియుఁ, దెలుఁగుసాహిత్యమున

వీరగాథల విజృంభణమును నేక కాలమున జరిగినవని నా యభిప్రాయము. ('హంసవింశతి' కావ్యకర్త అయ్యలరాజు నారాయణా మాత్యుని కాలమునాఁటికి, అనఁగా క్రీ.శ. 1750 ప్రాంతమునాఁటికి యాదవ గాథాకారులలో కొందఱు వైష్ణవము స్వీకరించినట్లున్నది.)

## 4. శ్రీనాథుని కర్తృత్వము

'పలనాటి వీరభాగవతము' అనుపేర నా కథాచక్రమంతటిని మంజరీద్విపదగా రచించిన కవిసార్వభౌముఁడగు శ్రీనాథుఁడే 'కాటమరాజు చరిత్ర'నుగూడ ద్విపదగా రచించెనని జనవ్యవహారము. దీనికొక చక్కని కథను జెప్పుదురు:–

శ్రీనాథుఁడు పల్నాటి వీరభాగవతును బాడుకొనుట కనువుగా రచించినాఁడని తెలిసి, కొందఱు యాదవులు ఆతనికడకుఁ బోయి, 'స్వామీ! తమకుఁ దూమెడు వరహరహాలనిత్తుము. మా కాటమరాజు చరిత్రను బాగటగా వ్రాసిపెట్టుఁడు' అని కోరిరఁట. శ్రీనాథుఁడందుల కంగీకరించి, తూమెఁడు వరహాలు లభించునన్న యాశతో, నడుములు విఱుగునట్లు దీక్షతోఁ గూర్చుండి, యాదవ భారతమంతటిని ద్విపదగా రచించెను. కాని యాదవులు తూమెఁడు వరహాల నిచ్చుటకు లోభించిరి. గొడ్డలిలో నినుప భాగమునకుఁ గట్టెను బిగించు రంధ్రమును గూడ 'తూము' అనియే పిలుతురు. అందుచే యాదవులు ఒక గొడ్డలితూములో మూఁడు వరహాలను కాసులు, రువ్వలుగా మార్చి పోసి, శ్రీనాథునకిచ్చిరఁట. శ్రీనాథుఁడు కోపించి "ఇదేమిరా! తూమెఁడు వరహాలనిత్తుమంటిరి కదా?" అని ప్రశ్నించెను. "తూము అంటే ఇదే స్వామీ!" అని యాదవులు సమాధానమిచ్చిరి. శ్రీనాథుఁడు వారి మోసమును గ్రహించెను. హృదయము భగ్నమండెను. ఆశించిన ఫలితము దక్కలేదన్న విరక్తితోఁ దాను కష్టపడి వ్రాసిన కాటమరాజుచరిత్రనంతయు విసరి యొక నదిలోఁ బాఱవేసెను. ఆ యాకులు నదిలోఁ దేలుచుఁ గొట్టుకొనిపోవుచుండెను. యాదవులలోఁ గొందఱు నదిలో దుమికి యెవరికి దొరకిన యాకులు వారు తీసికొనిరి. ఆ చరిత్రలోఁ గొందఱకు మధ్యభాగము, మఱికొందఱకు మొదటి భాగము, నింకను గొందఱికిఁ జివరి భాగము లభించెనఁట. కాని ఆ యాకులకు శ్రీనాథుఁడింకను సంఖ్యా క్రమమును గుర్తింప లేదఁట. రాగతాళములును సూచింపలేదఁట. అందుచే యాదవులు మరల శ్రీనాథునికడకు వచ్చిరి. అతఁడు యాదవులు చేసిన మోసమునకుఁ గ్రుద్ధుడై, వేగముగా నడచి పోవుచుండెను. యాదవులాతని వెనుకఁబడిపోవుచు నా పత్రములకు వరుససంఖ్యలను గుర్తింపుఁడనియుఁ, గనీసము రాగతాళములైనను దెల్పుఁడనియు శ్రీనాథుని బ్రాధేయపడుచుండిరి. కోపముతోనున్న శ్రీనాథుఁడు వారి ప్రార్థనలను గణింపక పోవుచుండెను. ముందు శ్రీనాథుఁడు, వెనుక యాదవులు–ఇట్లు కొంతదూరము పోవుసరికి నొక యెఱుకలగూడెము వచ్చెను. అట నొక యెఱుకత అల్లరి చేయుచున్న తన బిడ్డను విసుగుతో వీఁపుపైఁ జఱచెను. ఆ బిడ్డ కెవ్వున నేడ్వఁదొడఁగెను. ఆ యేడ్పును విన్న శ్రీనాథుఁడు, తన్ను బీడించుచు వెనుక వచ్చుచున్న యాదవులతో నిట్లనెను: "ఓరీ! మీ పాటకు ఆ యేడుపురాగమును బెట్టుకొనుఁడు, పొండు!" అని కసిరికొట్టెను. అమాయకులగు యాదవులు అది నమ్మి తమ కథలకు ఆ యేడుపురాగమునే పెట్టుకొనిరి.[38]

ఈ కథలోని సత్యాసత్యము లెట్లున్నను, నేఁడు కాటమరాజు చరిత్ర యంతయు నే యొక్కరిదగ్గఱను లభింపకుండుట, యీ గాథాగానమంతయు నెక్కువగా శోకభూయిష్ఠమై యుండుట మాత్రము సత్యములే! ఈ సత్యములను దృష్టిలో నుంచుకొని ఎవరో పై కథను అల్లియుందురు.

శ్రీనాథుఁడు కాటమరాజుచరిత్రను రచించినాఁడనుటకుఁ బైనదెల్పిన జనశ్రుతియే కాక, యిరువురు కవులును సాక్ష్యమిచ్చు చున్నారు. ఈ కవులుకూడ నేవియో కావ్యములను రచించిన కవులు గాక, కాటమరాజుకథలను రచించినవారే యగుటచే వీరివాక్యములు మఱింత విశ్వసనీయములగుచున్నవి. గుఱ్ఱముకొండ భక్తవత్సలకవి 'కఱియావుల కాటమరాజుచరిత్ర' యను పద్యకావ్యమును రచించెను. (ఇది కాటమరాజుచరిత్రను సంపూర్ణముగావర్ణించు కావ్యముకాదు. ఇందు పెద్దిరాజుకథ, కాటమరాజు ఆర్లపెంటయుద్ధము మాత్రమే వర్ణింపఁబడినవి.) దీని యవతారికలోఁ గవి తనకు శ్రీనివాసుఁడు కలలోఁ బ్రత్యక్షమై శ్రీనాథుఁడను కవిశ్రేష్ఠుండు కాటమరాజుచరిత్రను ద్విపదగా రచించెనని చెప్పినట్లు వ్రాసికొన్నాఁడు:

*"... హరికథ విని యారాత్రి నిద్రింప*
*శ్రీనివాసుండిట్లు చెప్పెఁగలను*
*శ్రీనాథుఁడను కవిశ్రేష్ఠుండు ద్విపదగా*
*రచియించెఁ గాటమరాజుచరిత*
*మది నీవు నాపేర నంకితంబుగఁ బద్య*
*గద్యాత్మకంబుగా ఘనత నుడువు*
*మని చెప్పి తిరోహితుఁడయ్యె..."*[46]

ఈ కాటమరాజు కథాచక్రమున నేఁడు లభ్యమగుచున్న కొన్ని వీరగాథలకుఁ గర్త 'గంగుల పినయెల్లయ్య' యని తెలియుచున్నది. ఈ కవి రచించిన కథలలో 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట ఒకటి. (ఇది మదరాసు ప్ర.ప్రా.లి.పు.భాం.న 'కాటమరాజుచరిత్ర' అను పేరుతో నున్నది: డి.నెం. 1040. దీనిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరింపఁగా నా గ్రంథాలయమువారు 1953లో 'కాటమరాజుకథ' యను పేరుతోఁ బ్రచురించిరి. కాని యిది నిజమునకు 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' మాత్రమే). దీని అవతారికయందుఁ దాను వ్రాయుచున్న యదుశాస్త్ర చరిత్రమంతయు మున్ను శ్రీనాథుఁడు రచించెననియు, నదియే తనకు మార్గదర్శకమనియు స్పష్టముగాఁ దెల్పియున్నాఁడు:–

*"హరిపాద సేవకుఁ డతిభక్తిపరుఁడు*
*గురుతైన కొమనాల గోత్రాబ్ధి చంద్రుఁ*
*డెనయంగ గంగుల యెల్లయ్య కూర్మి*
*తనయుఁడు సర్వన తగు సహోదరుఁడు*
*పినయెల్ల యనువాఁడు ప్రియము దీపింప*
*వలనొప్పు శ్రీనాథు వచన పద్ధతిని*
*సలిపెను యదుశాస్త్రచరిత మంతయును"* [47]

ఇందలి 'శ్రీనాథు వచన పద్ధతిని' అను మాట విమర్శకులకుఁ బనిగల్పించినది. "పూర్వము శ్రీనాథుఁడు వచనముగా వ్రాసిన కాటమరాజుచరిత్రనుబట్టి గంగుల పినయెల్లయ్య యిప్పుడు మంజరిగా తిరిగి రచించెను" అను నట్లుగా వాక్యార్థమునుబట్టి స్ఫురించును. కాని యిది సరికాదు. తెలుఁగు సాహిత్యమునఁ బూర్వకవులు కొందఱు తాము రచించిన పద్యప్రబంధములనుగూడ 'వచన కావ్యము'లని పేర్కొనినారు. హరిబట్టు అను కవి తన వరాహపురాణమను ప్రబంధమమును,[48] లోకేరావు సోమన యను కవి తన శివరాత్రి మాహాత్మ్యమను పద్యకావమును వచనకావ్యములుగాఁ బేర్కొని యున్నారు. కావున శ్రీనాథుఁడు కాటమరాజుచరిత్రను ద్విపదచ్ఛందముననే రచించియుండును కాని, వచనమున వ్రాసియుండఁడు. భక్తవత్సలకవి శ్రీనాథుఁడు కాటమరాజుచరిత్రను ద్విపదగా రచించెనని స్పష్టముగా వ్రాసియున్నాఁడు.

ఇట 'శ్రీనాథుని వచన పద్ధతిని' అనఁగా 'శ్రీనాథుఁడు చెప్పిన విధము ననుసరించి' అని శ్రీ తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు అర్థము చెప్పిరి.[49] మల్లంపల్లి సోమశేఖరశర్మగారును నిట్లే యర్థము చెప్పిరి: "ఇక్కడ వచనమనగా 'ఉక్తి, చెప్పబడినది, వాక్రువ్వబడినది' అను నర్థమునఁ జెప్పుకొనవలసినట్టున్నది. 'ఆంధ్రభాషాభవ్యంబగు వచన రచనాకావ్యంబుగా' అని హరిభట్టు చెప్పిన దానిలోని వచనమన్న దానికి 'శబ్దము, ఉక్తి, పలుకు, నుడికార'మనియే యర్థము. అందువలన 'వచన పద్ధతి' యనఁగా 'చెప్పిన పద్ధతి' యని యర్థము చేసికొనవచ్చును." [50]

డా॥ బి. రామరాజుగారు మాత్రము ఈ 'వచన పద్ధతి'కి మఱియొక యర్థమును సూచించిరి. " 'వచన పద్ధతిని' అన్న మాటలు చిత్రములు. శ్రీనాథుడు వచించిన పద్ధతి యని కొందరు సర్దుకొని నటుల కానవచ్చును. నాకు జూడగా 'వచన పద్ధతి' యనగా 'పాడిన పద్ధతి' యని తోచుచున్నది."[51] అని చెప్పి, ఏగంటివారి వచనములును, కృష్ణమాచార్యులవారి సింహగిరి వచనములును పాడఁబడుట నుదాహరించిరి. తాళ్లపాకవారి వచనములు రాగయుక్తముగా నున్నవి. ఇట్టి వచనములను బాడుపద్ధతిలోనే. శ్రీనాథుని కాటమరాజుకథ కూడ పాడఁబడుచుండెడిదని రామరాజుగారు ఊహించినారు. ఒక్కతీరుగా నుడువని కాటమరాజు కథాచ్ఛందము కూడ దీనికిఁ దార్కాణమనిరి. రామరాజుగారి యూహ సమంజసముగనే యున్నది. ఏలయన, దొనకొండలో నేఁటికిని భట్టు రాయబారము కథ వచనపద్ధతినే పాడఁ బడుచున్నది. మిగిలిన కథలలోఁ గూడ, శోకాలాపన కొంతయున్నను, వర్ణన తీవ్రముగానుండు యుద్ధ ఘట్టములందు మాత్రము వచన పద్ధతిని బాడఁబడుచుండుట నేను స్వయముగా వింటిని.

పై చర్యను బట్టి 'వచనపద్ధతి'కి ఏ యర్థము చెప్పుకొన్నను, మొత్తము మీఁద శ్రీనాథుఁడు కాటమరాజుచరిత్రను ఛందోబద్ధముగనే రచించెను కాని, వచనము (Prose) గా వ్రాయలేదనుట మాత్రము స్పష్టము.

కాని, శ్రీనాథుఁడు రచించిన కాటమరాజుకథలలో నొక్కటి కూడ నేఁడు లభించుట లేదు. అయినను గొన్నికథలు రచనా విధానమునుబట్టి శ్రీనాథకృతములై యుండునని యూహింపఁ బడుచున్నవి. వీనియందుఁ గవినామము చెప్పఁబడలేదు. (పల్నాటి కథలలో నిట్లుగాక, శ్రీనాథకృతములని స్పష్టముగా నవతారికలలోఁ గల వీరగాథలు లభ్యములగుచున్నవి.) అట్టి వానిలో 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' ఒకటి. వేటూరి పరిష్కృత కాటమరాజుకథలో నిది అనుబంధముగా నీయఁబడినది. (కాటమరాజుకథ అను పేరుతో ప్రధానకథగా ముద్రింపఁబడినది గంగుల పినయెల్లయ్య రచించిన ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట.) దీనిని గుఱించి తిమ్మావజ్ఝల వారిట్లూహించినారు: "కవిత్వము రసవంతముగా నుండి, రచన మేలయినదిగా నుండుటచే నిది శ్రీనాథ రచనమేమో యని కూడ ననుమానింపఁ దగియున్నది. ఇందలి రచనము పలనాటి వీరచరిత్ర రచనమును అనేక విధములఁ బోలియుండుటయే యీ యనుమానమునకుఁ గారణము."[52] ఇట్లూహించునట్టి కథలే కాని, పల్నాటికథలలోవలె శ్రీనాథకృతములని ప్రత్యక్షముగాఁ గనఁ బడునట్టివి కాటమరాజుకథలలో లభ్యమగుటలేదు.

## 5. వెలుఁగునకు వచ్చిన క్రొత్త కవులు

కాటమరాజు కథాచక్రమున ముప్పదిరెండు వీరగాథలున్నవని నా పరిశోధనవలనఁ దెలిసికొంటిని. ఇందు సాహిత్యలోకమునకుఁ దెలిసినవి అయిదు కథలు మాత్రమే. ('ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, భట్టు రాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ, అగుమంచి కథ, ఆద్యంత రహితమైన పోలురాజుకథ'– ఈ అయిదును మదరాసు, తిరుపతి ప్రా.లి.పు.భాం.లలో నున్నవి.) తక్కిన యిరువదియేడు కథలలో నేను శ్రమపడి, ఆంధ్రదేశమునఁ బర్యటించి మఱి పదునేడు కథలను సంపాదింపఁగలిగితిని. వీనిలో ఏడు కథలలోఁ గవుల నామము లున్నవి. మిగిలిన పదికథలలో లేవు. నాకు లభించిన యీ వీరగాథలను బట్టి గంగుల పినయెల్లయ్యతోపాటు, మఱి యార్గురు క్రొత్తకవులు వెలుఁగులోనికి వచ్చిరి.

### 5.1. వడరుప(?) మద్దులేటి కవి:-

ఈ కవి కాటమరాజు కథాచక్రమందలి ప్రథమవీరగాథయగు 'వలురాజుకథ'ను ద్విపదగా రచించెను. ఇతని తాతపేరు 'మూలయ్య', తండ్రి 'పెద్దనార్యుఁడు'. ఇతని యింటిపేరు 'ఘనవర్తి'యో లేక 'వడరుప' యో కావలెను. లేదా 'వడరుప' అనునది గోత్రనామమైన కావలెను. వలురాజు కథాంతమునఁ దన్నుగూర్చి యిట్లు చెప్పుకొనెను:

*"అనుమతి వడరుపాన్వయుడైన*
*ఘనవర్తి మూలయ్య కలిత పౌత్రుండు*
*పెద్దనార్యుని కూర్మి ప్రియనందనుండు*
*మద్దులేటను బుద్ధిమంతు డొలురాజు*
*చరితను పూర్ణంబు చేయంగ దలచి*
*యిరువంద రచియించె ఇవరమంతయును"* [53]

### 5.2. మల్లయ్య:-

ఇతఁడు 'పంపాద్రికథ'ను ద్విపదగా రచించెను. ఇతని తండి 'జంగమయ్య'. 'సలిపెను యదుశాస్త్రచరిత మంతయు' అని చెప్పుకొనిన గంగుల పినయెల్లయ్యవలెనే, యీ మల్లయ్యకూడ యాదవచరిత్ర మంతటిని వ్రాసియుండునని అవతారికనుబట్టి తెలియుచున్నది. ఇతఁడును, గంగుల పినయెల్లయ్యయు నొక్కరు కాదనుటకు 'మల్లయ్య' యను పేరు యతిస్థానమునఁ బ్రయోగింపఁ బడి యుండుట గొప్ప నిదర్శనము. ఇతఁడు తన అవరతారికలో 'తెరచీర భక్తుల'ను స్మరంచినాఁడు. తెరచీర భక్తులనఁగా కాటమరాజుకథలు పాడు 'సుద్దుల గొల్లలు'. ఈ మల్లయ్య రచించిన తాళపత్రగ్రంథము నాకు 'గంగదొనకొండ' (నెల్లూరుజిల్లా, దర్శితాలూకా) గ్రామములో 1966 సెప్టెంబరు నెలలో లభించినది. ఈ మల్లయ్య యాదవచరిత్రను వ్రాయుటయే కాక, పాడి, ప్రజలను మెప్పించి, గుఱ్ఱములు గొడుగులు, అరిగెలు, ధనధాన్యవస్తువులు బహుమానముగాఁ బడసెనఁట:-

*"రయమొప్ప యాదవరాజుల చరిత*
*చెప్పేను వినరయ్య జనులార మీరు*
*వాకలిగి తనకీర్తి వహియించి మించి*
*ప్రాకటముగ జెప్పి ప్రజల మెప్పించి*
*గుఱ్ఱము గొడుగులు గురుతైన అరిగెలు*
*మేరువడి త్యాగములు మెండుగా నంది*
*ధనధాన్య వస్తువులు తనర అమృతము*
*అనుదినము తనయింట అతితుష్టిగాను*
*వేమారు కీర్తుల వెలసిన ఘనుఁడు*
*జంగమయ్య సుతుండు జనులు మెచ్చంగ*
*సంగతిగ కవిత్వ సారస్య మెరిగి*
*దిట్టముగ యాదవధీరులచరిత*
*గట్టిగా జెప్పేను కణగి సభవారు*
*ఆటంకారముగ నవరస అలంకారమున గూర్చి*
*మాటలు రత్నాలుగాను మల్లయ్య యనువాడు*
*సొంపుతో వినరయ్య చోద్యవేద్యముగ*
*పంపాద్రికథ చెప్పేను ప్రఖ్యాతిగాను"*

పల్నాటి వీరకథాచక్రమందలి 'కోడిపోరు' కథను రచించిన మల్లయ్యయు నితఁడును నొక్కరో లేక భిన్నులో తెలియకున్నది. కోడిపోరు రచించిన మల్లయ్య తన తండ్రిపేరు చెప్పుకొనలేదు.

### 5.3. కనకబండి ఘట్టయ్య:-

ఈ కవి రచించిన 'పోలురాజుకథ' తాళపత్రగ్రంథము నాకు నెల్లూరుమండలమున దర్శితాలూకా గంగదొనకొండ సమీపమునఁ గల 'ఎఱ్ఱబాలెం' గ్రామములో 17-9-1966న లభించినది. ఈ కథావతారికయందు ఇష్టదేవతా ప్రార్థనము తరువాత, కవి తన్నుగూర్చి చెప్పుకొన్నాఁడు. ఈ కవిపేరు 'ఘట్టయ్య' అనియు నింటిపేరు 'కనకబండివారు' అనియు, తండ్రి 'కొండప్ప' అనియు, స్వగ్రామము 'కొండపల్లె' యనియు, నితనిది 'కన్నెసిరుల గోత్ర' మనియుఁ గథతావతారికనుబట్టి స్పష్టమగుచున్నది:-

*"వింతగా చౌషష్టి విద్యలకు నెలవు*
*పంతమున ఆ కొండపల్లె లోపలను*
*కొనసాగు కన్నెశిర్ల గోత్ర పావనుండు*
*గొనకొని కనకబండి కొండప్ప సుతుఁడు*
*నెట్టింప ఘట్టయ్య నేర్చిన కొలది*
*తేటతెల్లముగాను తెల్పి చెప్పెదను...*
*ఆవుల పోలురాజుకథ ఆలించి వినుడ"*

ఈ కనకబండి ఘట్టయ్య యనుకవి పోలురాజుకథనే కాక, 'దక్షిణకాండము' ('జన్నివాడకథ'), 'కంసుఁడుకథ' లేక 'విష్ణుభాగవతము' అను కథలనుగూడ రచించెను. కంసుడుకథ తాళపత్రగ్రంథముకూడ నాకు లభించినది. ఈ కంసుని కథావతారిక యందును పై వివరములే యున్నవి.

### 5.4. పినయెల్లన:-

ఈ కవి రచించిన 'కఱియావులరాజుకథ' నాకు లభించినది. ఇతనిది కొమనాల గోత్రము, యాదవ కులము, తల్లి చెన్నమాంబ. ఇతఁడును, మదరాసు ప్ర.ప్రా.లి.పు.భాం. వారు ప్రకటించిన వేటూరి పరిష్కృత 'కాటమరాజుకథ'ను రచించిన గంగుల పినయెల్లయ్యయు నొక్కరే కావచ్చును. అతనిది కూడ కొమనాల గోత్రమే. కాని యీ

కతియావులరాజుకథలో పిన్నయెల్లన యింటిపేరుగాని, తండ్రిపేరు కాని కానవచ్చుటలేదు. ఆ భాగము శిథిలమైనది. సోదరుని పేరు మాత్రము 'సరువ ధీమణి' అని యున్నది. గంగుల పినయెల్లయ్య సోదరుఁడు 'సర్వన' అని మనమెఱుఁగుదుము. కాటమరాజుకథా రచయిత తన తల్లిపేరు చెప్పుకొనలేదు. కాని ఈ కతియావులరాజు కథారచయిత తనతల్లి 'చెన్నమాంబ' యని చెప్పుకొన్నాఁడు.

నాకు లభించిన కతియావులరాజుకథ తాళపత్రగ్రంథము. ఇది పల్నాడులో గామాలపాడు గ్రామమున 31-8-1966న లభించినది. దమ్మాలపాటి లింగప్ప యను యాదవుఁడు దీనినొసంగి నాఁడు. ఈ గ్రంథమున నవతారికలో నిష్టదేవతా ప్రార్థనము తరువాతఁ గవినిగూర్చి యిట్లున్నది:-

*"కొమనాల గోత్రుండు గుణవిశాలుండు*
*కొమరొప్పు యాదవ కులవంశ (ఘను) డు*
*అతని కు(లసతియగు)గు చెన్నమాంబ*
*అంగన చెన్నమాంబకు వరసుతుండైన*
*ధీరుడైన సరువ ధీమణి సౌమిత్ర*
*ఆరూఢి పినయెల్లన అతి (మోద) మునను*
*కరియావులరాజును ఘనతతో తలచి*
*రంగుగ కరియావులరాజు చరిత్ర*
*సంగతి చెప్పెను శ్రవణానందముగాను"* (పత్రసంఖ్య-1)

తండ్రిపేరు, ఇంటిపేరు లేకున్నను, కొమనాల గోత్రము, సోదరుఁడు సర్వన పేర్కొనఁబడుటచే నితఁడు కాటమరాజుకథ (ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట)ను రచించిన గంగుల పినయెల్లయ యనియే తలఁపవలసియున్నది. ఇతఁడు యాదవకులమువాఁడనియు, నితని తల్లి చెన్నమయనియు నాకు లభించిన తాళపత్రప్రతినిబట్టి తెలియవచ్చు నధికాంశములు. ఈ గంగుల పినయెల్లయ లేక పినయెల్లన యదుశాస్త్రచరిత్రమందటిని (కాటమరాజు కథాచక్ర మంతయు) రచించెనని వేటూరివారు పరిష్కరించిన 'కాటమరాజు కథ'లో నున్నది. నాకు లభించిన కతియావులరాజుకథ దీనికి బలమును జేకూర్చుచున్నది.

## 5.5. కట్టెబోయిన మారయ్యకవి:-

ఇతఁడు యాదవగాథాచక్రమున 'కాటమరాజుకు పట్నంకట్టిన కథ'ను రచించెను. దీనికి 'కాటమరాజు పట్టాభిషేక' మను నామాంతరము గాథాకారులలో వ్యవహారమున నున్నది. 'పట్టము' అను శబ్దమును జానపదులు 'పట్నం'గా నుచ్చరించుచున్నారు. ఈ తాళపత్రగ్రంథమును నేను 1964వ సంవత్సరములో కృష్ణా మండలమున గుడివాడ తాలూకా కుచ్చికాయలపూడి గ్రామములో కొడాలి సీతారామాంజనేయులు అను కొమ్ములవానికడ




సంపాదించితిని. ఈ కథకు ముందు పెద్ద అవతారిక యున్నది. మొదటి మూఁడు పత్రములలోను కవియున్న పట్టణవర్ణనము, కవి వంశాదికము, కృతిపతి వంశాదికము వివరముగా వర్ణింపఁబడినవి. కవి తన యూరిపేరును జెప్పలేదు. కాని, ప్రబంధధోరణిలోఁ బురవర్ణన చేసినాఁడు. కృతిభర్త కవికి బావగారు. అతని పేరు 'జంగమయ్య'. ఇంటిపేరు 'గంగాళపువారు'. ఇతఁడు కొమనాలగోత్రుఁడని చెప్పఁబడినది. ఇందుఁ జేయఁబడిన కృతిభర్త వంశక్రమవర్ణన పై రీతిని చూపవచ్చును:-

కవియగు కట్టెబోయిన మారయ్య, కృతిభర్తయగు జంగమయ్య భార్య గంగమ్మకు సోదరుఁడు. అనఁగా నీ కవి తన బావగారిపేర వీరగాథ నంకితము చేసెను.

*"ఎసగ నా గంగ ప్రాణేశు పేర*
*వరుస గంగాళపు వంశజుని పేర*
*గురుతైన కొమనాల గోత్రుని పేర*
*ధరనెంచ రాఘవయ్య తనయుని పేర*
*చప్పన్న దేశాది జంగము పేర*
*చెప్పునిట్లు బలి ప్రవిద్దంబుగాను*
*కాటమరాజునకు పట్నముగట్టిన కథయు"* (ఆకు-3)

అవతారికనుబట్టి యీ కవి యింటిపేరు కట్టెబోయిన వారనియు, నితఁడు సకల యాదవకథలను జదివి చెప్పఁగలవాఁడనియుఁ దెలియుచున్నది. కృతిభర్తయగు జంగమయ్య, కవిని బిలిచి యిట్లు చెప్పినట్లుగా మారయ్య తన కథావతారికలో వ్రాసికొనినాఁడు:-

*"తన బావమరదిని మారయ్యను తప్పక చూచి*
*యెనయంగ కట్టెబోయ్నువారింట*

*మతిగలవాడవు మరి చెప్ప జదువ*
*నతి నేర్పులయందు నమర మారయ్యవు*
*సకల యాదవ కథలు చదివి చెప్పితివి*
*వకటి నిన్నటి గాదు వనర గావించు*
*ఆవులను కల్యాణ మందుండి*
*యే విధంబున దెచ్చిరి యెవ్వరింట పెండ్లి*
*యే విధంబున జేసిరి యెల్ల యాదవులు*
*సుముఖుండై తొల్లి కృష్ణుండు దెచ్చినట్టి*
*తముక మెక్కించి రే తగవున నతని*
*మట్టసంబుగ ఆవుల మందల కెల్ల*
*పట్నంబుగట్టి రే పగిది చేపట్టి*
*ఆ కథ నా పేర అంకితముగాను*
*చేకొని చక్కంగ చెప్పి అంపుమనుచు"* (ఆకు-3)

'సకల యాదవ కథలు' అను ప్రయోగముచే నీ కవి కాలము నాఁటికే కాటమరాజునకు సంబంధించి అనేక వీరగాథలున్నవనియు, కాటమరాజుకథ యనునది ఒక్క వీరగాథ మాత్రమే కాదనియు, నది యొక సుదీర్ఘ కథాచక్రమనియు స్పష్టమగుచున్నది.

## 5.6. కదిరి మంగళము వెంకటాద్రి లేక మంగళపురి వెంకటాద్రి:

ఈ కవి 'పాపనూకకథ'ను రచించెను. ఈ వీరగాథకు సంబంధించిన మూఁడు తాళపత్ర గ్రంథములు నాకు లభించినవి. 19-7-1966 నాఁడు చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకా పెదకంటి పల్లెలో లభించిన ప్రతిలో నవతారిక యిట్లున్నది:-

*"కదిరి మంగలము చినబసవయ్య సుతుడు*
*శేషవాల్మీకుడు చెలువొప్ప వెంకటాద్రి చెప్పిన కథయు*
*ప్రజలకు ఇంపుగాను పాపనూకకథయు*
*చెప్పేను వినవయ్య చెవులపండువుగాను"*

దీనినిబట్టి యీ కవిపేరు 'వెంకటాద్రి' యనియు, 'శేషవాల్మీకుఁడు' అనునది యితని బిరుదమో లేక నామాంతరమో యనియుఁ, దండ్రిపేరు 'చినబసవయ్య' యనియు, నింటిపేరు 'మంగళమువా' రనియు, నివాసము 'కదిరి' యనియు గ్రహింపవచ్చును. లేదా "కదిరి మంగళము" అనునదియే యింటిపేరు కావచ్చును.

5-9-1964 నాఁడు కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, కుచ్చికాయలపూడి గ్రామములో లభించిన ప్రతిలో నవతారిక యిట్లున్నది:-

*"భావింపంగ మంగళపురి చిన్ని*
*బస్వన్న పుత్రుండు ప్రఖ్యాతిగాను*
*శేషువాల్మీకుండు చెలువొప్ప వెంకటి*
*ప్రజలకు ఇంపుగాను పాపనూకకథయు*
*రాజితంబుగా ఈ కథ రయమున గూర్చి*
*గొనకొని చెప్పెను కులము వినరయ్య"*

ఇందు 'కదిరి' పేరు లేదు. ఇంటి పేరు 'మంగళపురి' అని కలదు. తండ్రిపేరు పెదకంటిపల్లెప్రతిలో 'చిన బసవయ్య' అని యుండఁగా, దీనిలో 'చిన్న బసవన్న' అని యున్నది. (రెండింటికిని భేదము లేదు.) కవిపేరు 'వెంకటి' అని యున్నది. 'శేషవాల్మీకుఁడు' అను బిరుదమును జెప్పఁబడినది. కుచ్చికాయలపూడిలోనే లభించిన వేఱొక తాళపత్రప్రతిలో నక్షరములన్నియును దప్పులుగా నున్నవి. అందు 'కదిరి' నామమున్నది. కవి పేరు 'వెంకట' అని కలదు.

మొత్తముపై పైనదెల్పిన మూఁడు ప్రతులకును రచయిత యొక్కడే యనుట స్పష్టము. అతని పేరు 'వెంకటాద్రి' లేక 'వెంకటి'. అతని తండ్రి 'చిన బసవయ్య' లేక 'చిన్ని బసవన్న'. ఇతని యింటి పేరు 'మంగళపురి' కాని 'మంగళము' కాని యగును. ఇతఁడు కదిరి గ్రామమునకుఁ జెందినవాఁడని యూహింపవచ్చును. లేదా మొత్తము "కదిరి మంగళము" అనునదియే యితని యింటిపేరో లేక గ్రామము పేరో కావచ్చును. (ఎక్కువగా గ్రామములపేర్లే యింటిపేర్లుగా నుండును.)

## 5.7. జరుగుపల్లె చెన్నయ్య:-

ఇతఁడు 'అగుమంచికథ'ను రచించిన జానపద కవి. తాను అరుంధతి పుట్టింటి ఘనుఁడనని చెప్పుకొనుటచే నితఁడు మాదిగ కులమునకుఁ జెందినవాఁడుగాఁ గన్పట్టుచున్నాఁడు. అరుంధతి తమయింటి యాడుబిడ్డయనియుఁ, దాము జాంబవంతుని వంశము వారమనియు మాదిగల విశ్వాసము. ఇతఁడు పూర్వకవి స్తుతిలో కాళిదాసుని పేర్కొనుటచే మంచి సంస్కారముగల కవి యని చెప్పవచ్చును. ఈతని రసవంతమగు కవిత్వమును దీనికిఁ బోషకముగా నున్నది. ఈ చెన్నయ్యకవి కాళిదాసుని స్తుతించిన తరువాత బాణావీరుల ప్రజ్ఞను గొనియాడినాఁడు. ఇష్టదేవతా ప్రార్థన, పూర్వకవిస్తుతి తరువాతఁ దన్నుగూర్చి యిట్లు వ్రాసికొన్నాఁడు:-

*"వాలాయముగ నందరిని వాక్కున దలచి*
*సంధిలక్షణ మెరిగి చెప్పనేర్చిన యట్లు*
*ముందుగ సంభువులు ముద ...*
*... ... ... ... ఘనత విలసిల్లు*
*చెలగి జరుగున పల్యా చెన్నయ్యను వాడు*
*పుడమి అరుంధతికి పుట్నింటి ఘనుడు*
*కడు వేగ అ(గుమంచ్చి కథ)...*
*శ్రీకరంబుగ చెప్పెద చెలగి యాదవులకథ*
*ప్రాకటంబుగ వినుడా ప్రఖ్యాతిగాను"* (పత్రము-1)

ఈ అగుమంచికథ తాళపత్రగ్రంథము చిత్తూరుజిల్లా, చంద్రగిరి తాలూకాల, పెడకంటిపల్లె గ్రామములో 1966 మార్చి1వ తేదిని లభించినది. తోడేటి సుబ్రహ్మణ్యము అను భట్టువాఁడు (కొమ్ములవాఁడు) ఇచ్చినాఁడు. ఈ గ్రంథలేఖకుఁడు తోడేడి పాపయ్య కుమారుడు కోటయ్య యనియు, నితఁడీ వ్రాఁతను క్రీ.శ. 1891లోఁ జేసెననియు గ్రంథాంతమున నున్నది. నాకు ఈ గ్రంథము నిచ్చిన తోడేడి సుబ్రహ్మణ్యము, పాపయ్య కోటయ్యల వంశములోనివాఁడే యని ఆ గ్రామవృద్ధులు నాకుఁ జెప్పిరి. ఈ లేఖకునకు 'పల్లె' అను శబ్దమును 'పల్యా' అని వ్రాయు నలవాటు కలదు. గ్రంథాంతమున 'పెడకంటిపల్లె గ్రామం' అని వ్రాయుటకు బదులు "పెడకంటి పల్యా గ్రామం" అని వ్రాసినాఁడు. దీనినిట్టి, యితఁడు వ్రాసిన 'పల్యా చెన్నయ్య' యను కవినామము నిజమునకు 'పల్లె చెన్నయ్య' అని గ్రహింపవలసి యున్నది.

'చెలగి జరుగున పల్యా చెన్నయ్యనువాడు' అను పాదములో 'జరుగున' అను శబ్దమునకు అర్థము కుదురుటలేదు. ఇది కూడ కవి యింటిపేరులోని భాగమేమో! అగుచో కవి పూర్తిపేరు 'జరుగు(న) పల్లె చెన్నయ్య' కావచ్చును. నెల్లూరుజిల్లా, గూడురు తాలూకాలో 'జరుగుపల్లె' (జరుగుమిల్లి) అను గ్రామమున్నది. ఈ గ్రామనామము గృహనామముగాఁ గలవారు ఉండియుందురు. కాబట్టి ఈ కవిపేరు "జరుగుపల్లె చెన్నయ్య" అని నిర్ధరింపవచ్చును.

వేటూరి ఆనందమూర్తిగారు పరిశోధన సంచికలోఁ బ్రకటించిన 'అగుమంచికథ'యు, నాకు లభించిన తాళపత్ర గ్రంథమును నొక్కటే! కాని ఆనందమూర్తిగారి గ్రంథమున మొదటి అవతారికతోపాటు కథాభాగమును జాలవఱకును లోపించినది (చూ. పరిశోదన 5, 6, 7 సంచికలు, 1955). నా తాళపత్రప్రతిలో మొదట నేడు పత్రములలో నున్న కథాభాగము వారుప్రకటించిన దానిలో లేదు. అనఁగా సుమారు 500 పాదములు ఆనందమూర్తిగారి గ్రంథమున లోపించినవి. అందుచే దానినిబట్టి కవినామమును వారు నిర్ణయింపలేకపోయిరి.

ఇట్లు నాకు లభించిన తాళపత్రగ్రంథములనుబట్టి కాటమరాజు కథాచక్రములోని వివిధ గాథలను రచించిన యేడ్గురు నూతన జానపద కవిపుంగవులు తెలియవచ్చుచున్నారు. నేను చెప్పిన 'పినయెల్లన'యు, మదరాసు ప్ర.ప్రా.లి.పు.భాం.వారు ప్రకటించిన 'కాటమరాజుకథ'నుబట్టి తెలియుచున్న 'గంగుల పినయెల్లయ్య'యు నొక్కరే యగుచో, నార్గురు నూతన కవులు నా పరిశోధన మూలమున వెలుఁగునకు వచ్చిరని చెప్పవలెను.

## 6. కాటమరాజు కథాచక్రము–వివిధ వీరగాథలు

### 6.1. వలురాజు కథ లేక ఆవుల వలురాజు కథ:–

ఇది కాటమరాజు కథాచక్రమున మొట్టమొదటి వీరగాథ.[54] ఆవుల వలురాజు కాటమరాజునకుఁ బితామహుఁడు. ('వలరాజు' అను పేరే జానపద వ్యవహారమున 'వల్లురాజు' అనియు 'వలురాజు' అనియు 'పొలురాజు' అనియు మాఱినది 'వలరాజు' అనఁగా 'మన్మథుడు'.) దీని రచయిత వడరుప (లేక ఘనవర్తి?) మూలయ్య పౌత్రుఁడును, పెద్దనార్యుని పుత్రుఁడును నగు మద్దులేటికవి యని గ్రంథాంతమునఁ గలదు. ఇది ద్విపద చ్ఛందమున నున్నది. వల్లురాజు యుద్ధమనియు, వలురాజు చరిత్రమనియు దీనికి మఱి రెండు నామములున్నట్లు తెలియుచున్నది.

మదరాసు GOML లో వల్లురాజు యుద్ధమను కాగితపుఁబ్రతి కలదు (ఆర్.నెం. 642). ఇది ప్రస్తుతము తిరుపతి SVORIL కుఁ దరలింపఁబడినది. కాని యిది ఆద్యంత రహితమైన పోలురాజు కథ కాని, వల్లురాజుకథ కాదు. నాకుఁ బల్నాడులో గామాలపాడు గ్రామమున నొక తాళపత్రగ్రంథము లభించినది. కాని అది అసమగ్రముగా నున్నది. చివర కొంతకథ లోపించినది. సంపూర్ణమైన కథను ఆంధ్రప్రదేశ్ యాదవసంఘ ప్రధానకార్యదర్శి యగు ఆరాధ్యుల పిచ్చయ్యగారు (ఎడవూరు) 1967 మే నెలలో'వలురాజుచరిత్ర' అను పేరుతోఁ బ్రకటించిరి.

ఆవుల వలురాజు ఎలమంచి (యలమంచి) పట్టణమేలు ప్రభువు. ఇతని తండ్రి కవులావుల గంగురాజు, తల్లి గంగమ్మ. ఈ దంపతులకుఁ గలిగిన నలుగురు పుత్రులలో వలురాజు పెద్దవాఁడు. హరిపాలుఁడు, నందగోపాలుఁడు, గోవర్ధనుఁడు ఇతని తమ్ములు. తిరుమందుల తరిముత్తరాజు ఇతనికిఁ బ్రధానిగా నుండెను.

యలమంచికి ఉత్తరముగా నున్న కండెమొండెముల కోటను కలభూత గంగురాజు పాలించుచుండెను. అతఁడు బాలుఁడుగా నున్నప్పుడు ఆ రాజ్యమునకుఁ బ్రధానులుగానున్న 'అయ్యలరాజు, శివరామరాజు, భాస్కరరాజు, దత్తరాజు, కన్నమరాజు' అను నైదుగురు నియోగి బ్రాహ్మణులు సర్కారు పైకమును నాలుగు లక్షలు అపహరించిరి. కలభూత గంగురాజు పెద్దవాఁడైన తరువాత భీమరాజు అను మఱియొక మంత్రి, ఆ ప్రధానులు చేసిన దొంగతనమును బయటపెట్టెను. గంగురాజు కోపముతో వారిని శిక్షింపఁబోగా, నా ప్రధానులు ఆఱు నెలల గడువును కోరి, యలమంచి పట్టణమునకుఁ బాఱివచ్చి, వలురాజును శరణువేడిరి. వలురాజు వారి కభయమిచ్చెను. అంత కలతభూత గంగురాజునకును, వలురాజునకును యుద్ధమయ్యెను. వలురాజు సోదరులు ముగ్గురును, సేనాధిపతి పులిమద్దుల రామన్నయు, భండారు మల్లఁడును యుద్ధమునకేఁగి, కలభూత గంగురాజు సోదరులగు రంగధామరాజు, రఘురామరాజు, చినగంగరాజు– అను వారితోడను; సేనానులగు రామలింగన్న పాపన్నలతోను ఘోరయుద్ధము చేసి వీరస్వర్గము నలంకరించిరి.

పిమ్మట వలురాజే స్వయముగా యుద్ధమునకేఁగ నిశ్చయించెను. తన పుత్రులగు సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజులను, కూఁతురు

కొమరక్కను పల్లికొండ కప్పగించెను. సింహాద్రిరాజు పెద్దవాఁడైనను, బ్రాహ్మణులు చెప్పిన జ్యోతిషమునుబట్టి రెండవ కుమారుఁడైన పెద్దిరాజునకుఁ బట్టము గట్టెను. పుత్రులకు బుద్ధులు గఱపి, తాను యుద్ధమున కేగెను. కలభూత గంగురాజుతో వలురాజు ఘోరయుద్ధము చేసెను. కడకు గంగురాజును జంపి, అతని భార్య శరణు వేడుటచే గంగురాజు కుమారునకు రాజ్యమిచ్చి, పూర్వపు ప్రధానులను దిరిగి తమ తమ ఉద్యోగములందు నిలిపి, యుద్ధమునఁ దగిలిన గాయములతో వలురాజు వైకుంఠమునకేఁగెను. వల్లమ్మ సహగమనము చేసెను.

ఈ వలురాజు కథాప్రసక్తి 'వేడుక బొంగరాలకథ', 'అగుమంచి కథ', 'భక్తిరన్నకథ' మున్నగు నితర వీరగాథలలోఁ గూడఁ గానవచ్చు చున్నది. బొంగరాలకథలో పోచయ్య తన మామయగు ముమ్మయ్యతో వలురాజునుగూర్చి యిట్లు చెప్పును:-

*"వావిళ్ల గుట్టల వంగల బైట*
*కాపుల కరణాల వెనక వేసుకుని*
*కలభూత గంగురాజు మీద*
*కదిసి యుద్ధము చేసిన ఘనుడు మీ తాత వలురాజు*
*కాలము కురుదాలించ, గంగ దయతప్ప*
*వురుస్తలాలు మీ తాతకు గాయాలు నాటి*
*వక్షమున పోట్లు నాటి వరిగె మీ తాత"* [55]

అగుమంచికథలో కొమరక్క తనతండ్రినిగూర్చి అగుమంచితో నిట్లనును:-

*"మా అయ్య వొలురాజు మండలేశ్వరుఁడు*
*దయకలిగి కరుణాల వెనక వేసుకుని*
*కరణాలకొరకు కన్నెమొగిలి వీరబయట*
*శ్రీ వీరకల్లుగా చెల్లె మా తండ్రి*
*అరువై అందలాలు ఆద రుత్తలాయె*
*తరమునాటి పెద్దలు మా తండ్రివద్ద చెల్లిరి*
*రాళ్లబండి కనుముకాడ రక్తము ఏరులై పారెను."* [56]

భక్తిరన్నకథలోఁ గాశీయాత్రకుఁ బోయిన భక్తిరన్న గయా క్షేత్రములో యాదవవీరులకుఁ బిండప్రదానము చేయుచుఁ దమ తాతయగు వలురాజు నిట్లు కీర్తించును:-

*"కరణాలకొరకై కదసి దండెత్తి*
*కండె మొండెముల యేలేటి కలభూత గంగురాజుమీద*
*ఆలంబు చేసి హతముగ చెల్లితిరి*
*మెండయిన శాన (సేన) మీద మెరసి దండెత్తి*
*దండి శానల మీద తగు పోరిపోరి*
*వొళ్లెల్ల గాయాలు వుక్కుటలుగులు నాటి*
*వొలురాజ! వో తాత! వొసుధపై వొరిగితివి*
*అగ్నినోములు నోమితివి హరమరయనుచు*
*బొగ్గులపాలయిపోతివి పొలతి వల్లమ్మ"* [57]

## 6.2. పంపాద్రి కథ:-

ఆవుల వలురాజు మరణించిన తరువాత సోదరుల సహాయ ముతో పెద్దిరాజు యలమంచి పట్టణమును పది సంవత్సరములు నిరాఘాటముగాఁ బాలించెను. పిమ్మటఁ దండ్రియుఁ బినతండ్రులును గతించిన ఆ యలమంచి పట్టణమున నుండుట కిష్టములేక సింహాద్రిం రాజాది సోదరులేరువురును, అల్లుఁడు పల్లికొండతోఁ గలిసి పంపాద్రికిఁ బయనమై వచ్చిరి. అక్కడ పెద్ద పట్టణమును నిర్మించుకొని సుఖముగాఁ బాలించుచుండిరి. ఈ పంపాద్రిలో నేడేండ్లు గడపిరి.

సింహాద్రిరాజు పెద్దిరాజాదుల భార్య లేవురును సంతానమును బడయఁగోరి పంపాద్రి బసవన్నకు నోములు నోచిరి. అందఱికిని సంతానము కలిగినది కాని, ఒక్క పెద్దిరాజు భార్యయగు పెద్దమ్మకు మాత్రము సంతానము కలుగలేదు. బసవన్న ఆమె నోమును తిరస్కరించెను. ఆమె మిక్కిలి పరితపింపసాగెను. అంత నొకనాఁడు పెద్దమ్మకు స్వప్నమునఁ గల్యాణపట్టణమున వెలసియున్న సోమేశ్వరుఁ డు సాక్షాత్కరించి 'నేను నీకు సంతానము నిత్తును. నా కల్యాణ నగరమునకు రమ్ము' అని చెప్పెను. ఆమె మేల్కొని, భర్తతోఁ దన స్వప్నవృత్తాంతమును జెప్పెను. 'ఆ దేవుఁడు నాకు గనపడినప్పుడు వెళ్లుదము' అని పెద్దిరాజు ఉపేక్షించెను. మఱికొంతకాలమునకుఁ గల్యాణ సోమేశ్వరుఁడు పంపిన కామధేనువు పెద్దిరాజు స్వప్నమునఁ గన్పించి ఆహ్వానించెను. ఇఁకఁ దడవుచేయుటకు వీలులేదని, పెద్దిరాజు తన సోదరులతో నాలమందలు పంచుకొని, తమ్ముఁడు పోలురాజునకు నావుల పట్టమును గట్టి, పెద్దిరాజు తన భార్య పెద్దమ్మతోఁ గలిసి కల్యాణపట్టణమునకుఁ బ్రయాణమయ్యెను. ఇది పంపాద్రికథ. దీనిని 'పంపాద్రి నోములు' అనియుఁ బిలుతురని తెలియుచున్నది. నాకు లభించిన తాళపత్రములలో 'పంపాద్రికథ' అనియే కలదు.

నాకు ఈ పంపాద్రికథకు సంబంధించిన తాళపత్రప్రతులు రెండు లభించినవి. ఒకటి కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, కుచ్చికాయలపూడి గ్రామములోను, రెండవది నెల్లూరుజిల్లా, దర్శితాలూకా, గంగదొనకొండ గ్రామములోను దొరికినవి. మొదటిప్రతిలో 'పంపాద్రికథ' యనునది, పెద్దిరాజు పల్లికొండతోఁ దాము పంపాద్రికి వచ్చి యెన్నేండ్లయినదో తెలిసికొనుటతోఁ బూర్తి అయినట్లున్నది. సోదరుల పంకములు, పెద్దిరాజు ప్రయాణము అను కథాంశములు దీని తరువాత వచ్చు పెద్దిరాజుకథలోనికిఁ గొనిపోఁ బడినవి. ఇది సరికాదేమో! పెద్దిరాజు తన సోదరులతో నాలమందలను బంచుకొని, కల్యాణనగరమునకుఁ బ్రయాణమగు నంతవఱకును బంపాద్రికథయే యని తలఁపవచ్చును. ఆ తరువాత

పెద్దిరాజు కల్యాణమును జేరుట, అట వాలికేతువరాజుతోఁ బోరుట– ఇత్యాది కథ పెద్దిరాజుకథకు సంబంధించును. కొన్ని గ్రంథములలో 'పంపాద్రికథ' యనునది ప్రత్యేకముగా లేక, పెద్దిరాజుకథతోఁ గలిసియేయుండును. రెండింటిని గలిపి 'పెద్దిరాజుకథ' యనియే పిలుతురు. అప్పుడీకథ పెద్దిరాజు మరణముతో నాఁగిపోవును. బాలుఁడగు కాటమరాజు తండ్రిపగ తీర్చుకొనుటకు 'కాటమరాజు ఆర్లపెంట యుద్ధము' అను పేరుతోఁ బ్రత్యేకముగాఁ జెప్పుదురు.

### 6.3. పెద్దిరాజు కథ:–

పెద్దిరాజు సోదరులతో నాలమందలు పంచుకొని, సంతానార్థమై భార్యాసహితంబుగాఁ బంపాద్రినుండి బయలుదేరి, వీరగంటిపట్టణము, విజయపట్టణము, నవరత్నపట్టణము, ఓరుగంటి పట్టణము, రేపల్లిభద్రాచలము, మాహేశ్వరనగరము– మున్నగు పట్టణములందలి రాజులచే సన్మానింపఁబడి, అవి యన్నియు నధిగమించి, కల్యాణపట్టణము చేరెను. అప్పుడు కల్యాణము నేలుచున్న మారాసపు గంగురాజు పెద్దిరాజును మిక్కిలిగ నాదరించెను. పెద్దిరాజును బెద్దమ్మయుఁ గలసి కల్యాణ సోమేశ్వరునిఁ బ్రార్థింపఁగా, పెద్దిరాజునకు అఱువదియవయేటఁ గాటమరాజు జన్మించెను. ఆ తరువాత నేడేండ్లకుఁ బాపనూక యను పుత్రికయు జన్మించెను. ఈమె దుష్ట నక్షత్రమునఁ బుట్టినది. చిత్రభాను సంవత్సరమున ఫాల్గుణ మాసమున బుధవారమునాఁడు మధ్యాహ్నవేళ, తల్లిగండమునను, తండ్రిగండమునను, ధనధాన్యముల గండమునను, ఆవుల గండము నను పాపనూక జన్మించెను. ఈ పాపనూక పుట్టిన యేడవనాఁడే పెద్దిరాజు మారాసపువారి పగ దీర్చుటకై వాలికేతువరాజుపై దండెత్తిపోయి, ఆర్లపెంట రణరంగమున మరణించెను. అప్పటికి ఏడు సంవత్సరముల బాలుఁడైన కాటమరాజు తండ్రి పగఁదీర్పనెంచి, వాలికేతువరాజుపై దండెత్తిపోయి, ఆతనిని సంహరించి, తండ్రిశవమును దీసికొని యింటికి వచ్చెను. తల్లి పెద్దమ్మ భర్తశరీరముతో సహగమనము చేసెను. పసివాండ్రగు కాటమరాజును పాపనూకయు, మారాసపువారి యింటఁ బెరుగుచుండిరి. పెందోట ముద్దమ్మ వారిని బెంచుచుండెను. తరువాత కొంతకాలమునకు కాశికిఁ బోయెడి భక్తిరన్న వచ్చి, వారిని గుర్తించి మారాసపువారికి ఆనవాళ్ళు చూపి, కాటమరాజును పాపనూకను యలమంచికిఁ గొనిపోయెను.

కాటమరాజు కథాచక్రమున నెక్కువ ప్రచారముగల వీరగాథలలో నిది యొకటి. పెద్దిరాజుకథ, పోలురాజుకథ, గంగతర్కము, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, భట్టు రాయబారము, భక్తిరన్నకథ, కఱియావులరాజుకథ– ఇవి తఱచుగాఁ బాడఁబడుచుండును. వేడుక బొంగరాలకథలోను, అగుమంచికథలోను, భక్తిరన్నకథలోను నీ పెద్దిరాజుకథాప్రసక్తి వచ్చును.

నాకుఁ బెద్దిరాజుకథకు సంబంధించిన మూఁడు తాళపత్ర గ్రంథములు లభించినవి. కాని దేనిలోను నాద్యంతములు స్పష్టముగాఁ దెలియుట లేదు. 'కాటమరాజు ఆర్లపెంట యుద్ధము'లేక 'కాటమరాజు యుద్ధము– ప్రథమకాండము' అని పిలువఁబడుచున్న వేఱొక వ్రాఁతప్రతి కృష్ణామండలమున లభించినది. అందు కాటమరాజు తన తండ్రి పెద్దిరాజు మరణవార్త విని, వాలికేతువరాజుపై దండెత్తిపోవుట, యుద్ధమున నాతనింజంపుట, పెద్దమ్మ సహగమనము, కాటమరాజును, అతని చెల్లెలు పాపనూకయు పెందోట ముద్దమ్మ యను మారాసపురాణిచేఁ బోషింపఁబడుట వఱకును గథ గలదు. దీనిఁ బట్టి పెద్దిరాజుకథ వేఱనియు, కాటమరాజు ఆర్లపెంట యుద్ధము వేఱనియుఁ దోఁచుచున్నది. అట్లే పంపాద్రికథను బెద్దిరాజుకథతో ముడిపెట్టరాదు. కాఁబట్టి వల్లురాజు మరణానంతరమునుండి, భక్తిరన్న కల్యాణమునుండి కాటమరాజును పాపనూకను యలమంచికిఁ దెచ్చువఱకును గల కథాభాగములో మూఁడు ప్రధాన కథలున్నవని చెప్పవచ్చును.

1) వలురాజు మరణించిన తరువాతఁ బెద్దిరాజు రాజుగా సింహాద్రిరాజాది సోదరులందఱును బదిసంవత్సరములు యలమంచిలో నుండి, పిమ్మట వారందఱును పంపాద్రికిఁ దరలి వచ్చి, పట్టణనిర్మాణము గావించుకొని సుఖముగా నుండుట, వారి భార్యలందఱును పంపాద్రి బసవనినోములు పట్టుట, ఒక్క పెద్దమ్మకుఁ దప్ప తక్కిన వారందఱికిని సంతానము గలుగుట, పెద్దమ్మ చింతతోనుండుట, ఆమెకు స్వప్నము వచ్చుట, యిట్లు పంపాద్రిలో ఏడు సంవత్సరములు గడచుట– ఇంతవఱకును 'పంపాద్రికథ' లేక 'పంపాద్రి నోములు'.

2) కల్యాణ సోమేశ్వరుఁడు పంపిన కామధేనువు పెద్దిరాజునకు స్వప్నమునఁ గనఁబడుట, పెద్దిరాజు సోదరులతో భాగము లేర్పఱచుకొని పంపాద్రినుండి కల్యాణమునకు వచ్చుట, కాటమరాజు పాపనూకల జననము, వాలికేతువరాజుతో యుద్ధముచేసి పెద్దిరాజు కూలుట, తన మరణవార్తను భట్టుచేఁ గుమారునకును, భార్యకును దెలియఁజేయుట– ఇంతవఱకును 'పెద్దిరాజుకథ' కావలెను.

3) ఏడేండ్ల బాలుఁడైన కాటమరాజు తండ్రిపగఁదీర్ప వాలికేతువరాజుపై దండెత్తి పోవుట, ఆతని యుద్ధవర్ణనము, గంగతోడి సంవాదము, వాలికేతువరాజును జంపుట, తండ్రిశవమును గనుగొనుట, గంగ తండ్రిని బ్రతికించగా తండ్రితో మాటాడుట, ఆ శవము నింటికిఁ దెచ్చి తల్లికిచ్చుట, తల్లి సహగమనము చేయుట, మారాసపువారి యింటిలో నలనన్న పాపనూకలు పెరుగుచుండుట, భక్తిరన్న వచ్చి వారిని యలమంచికి దోడ్కొని పోవుట– ఇంతవఱకును 'కాటమరాజు ఆర్లపెంట యుద్ధము' లేక 'కాటమరాజు యుద్ధము– ప్రథమ

కాండము', (కాటమరాజు ఎఱ్ఱగడ్డపాడులోఁ జేసిన యుద్ధము ద్వితీయ కాండమగును).

కాని గోవుల నాగేశ్వరకవిగారు తమ 'పెద్దిరాజు నాటకము'లో పంపాద్రిలోఁ బెద్దిరాజు అన్నదమ్ములతో భాగము లేర్పఱుచుకొనుట నుండి, భక్తిరన్న వచ్చి కాటమరాజును పాపనూకను దోడ్కొని పోవుట వఱకును గల కథాభాగము ననుసరించినారు. ఏమైనను, దీనిని బైవిధముగా మూఁడు కథలుగా భావించుట యుచితమని తోఁచుచున్నది.

## 6.4. సింహాద్రిరాజు కథ:–

కాటమరాజు కథాచక్రమునఁ గొన్ని కథలకు విశేష ప్రచారమున్నది. మఱికొన్ని కథలకు అసలు ప్రచారమే లేదు. ఇట్లు ప్రచారశూన్యములైన కథలలో సింహాద్రిరాజుకథ, ఎఱనూకరాజుకథ, నలనూకరాజుకథ చేరును. అంతమాత్రమున నీ కథల యస్తిత్వమును శంకించుటకు వీలులేదు. (ఈ కథలు నెల్లూరుజిల్లా, దర్శితాలూకా గంగదొనకొండ గ్రామము ప్రక్కనున్న ఎఱ్ఱబాలెములో నొక సుద్దులవానికడ నుండుట 1966లో నేను జూచితిని.) వీని ప్రసక్తి యితర వీరగాథలలోఁగూడ కానవచ్చుచున్నది. ప్రచారము తక్కువగుటచే వీనికిఁ బ్రతిక లెక్కువగాఁ బుట్టలేదు. దేశమున రెండు మూఁడు తావులందు ఇవి యున్నవని తెలియుచున్నది. నాకు లభించిన 'వేదుక బొంగరాలకథ'లోను, 'అగుమంచికథ'లోను, 'భక్తిరన్నకథ'లోను వీని ప్రసక్తి వచ్చినది. స్థానికచరిత్రలందును ఈ రాజుల వివరములున్నవి.

సింహాద్రిరాజు, ఆవుల వలురాజు పెద్దకుమారుఁడు. యాదవ రాజ్య సింహాసనము నిజమున కీతనికి రావలెను. కాని పండితులు, జ్యోతిషశాస్త్రమును బరిశీలించి పెద్దిరాజే సింహాసనమునకు సమర్థుఁడని నిర్ణయించుటచే, పల్లికొండసలహాతోఁ దండ్రి యితని నొప్పించి, చిన్నవాడైన పెద్దిరాజునకుఁ బట్టము కట్టెను. ఈ విషయము 'వలురాజుకథ'లో నున్నది. ఇది సింహాద్రిరాజుయొక్క మంచితనమును నౌదార్యమును, దండ్రియెడగల విధేయతను జాటుచున్నది. (నెల్లూరు జిల్లా, దర్శితాలూకా, గంగదొనకొండలో 12-9-1966నాడు నాకు లభించిన "పంపాద్రికథ" వేఱొకప్రతిలో సింహాద్రిరాజే రాజైనట్లుగా వ్రాయఁబడియున్నది.)

పంపాద్రిలోఁ బంపకము లయిన తరువాత పెద్దిరాజు కల్యాణ నగరమునకుఁ బోయెను. సింహాద్రిరాజు, ఎఱనూకరాజు, నలనూక రాజు, పోలురాజు పంపాద్రిలో నుండిపోయిరి. (ఈ నలుగురురును నాలుగు దేశములకుఁ బోయిరని కొన్ని ప్రతులలో నున్నది.) అప్పుడు శ్రీకూర్మపట్టణమున సింధుభళ్లానిరాజు శ్రీ వైష్ణవులపై దొంగతనమును మోపి వారిని బాధింపఁ జొచ్చెను. ఆ శ్రీవైష్ణవులు పంపాద్రికిఁ బాఱి వచ్చి సింహాద్రిరాజును శరణువేడిరి. అందుచే నితఁడు శ్రీకూర్మముపై దండెత్తిపోయి, ఘోరయుద్ధము చేసి, సింధుభళ్లానిరాజును జంపి, ఆ యుద్ధమునఁ దగిలిన గాయములతో మరణించెను. అతని భార్య 'సింహాద్రిసీత' సహగమనము చేసెను. ఈ దంపతులకు 'కఱియావుల రాజు' అను కొడుకును, 'చిట్టినూక' అను కుమార్తెయుఁ గలరు. ఈ కఱియావులరాజు మహాశూరుఁడు. ఏ యాదవవీరుఁడైనను నితని తరువాతఁ జెప్పవలసినవాడే! భూమాటి శంకరయ్య యను నతఁడు సింహాద్రిరాజునకు సేనాధిపతి. ఇతఁడును బై యుద్ధమున మరణించెను. ఇతని భార్య భూమాటి శంకరమ్మ గుండమునఁ బడెను.

వేదు బొంగరాల కథలో సింహాద్రిరాజుకథాప్రసక్తి యున్నది. పోచయ్య తన మేనమామయగు ముమ్మయ్యతో నిట్లనును:–

> *"శ్రీకూర్మముమీద మీ పెదతండ్రి సింహాద్రిరాజు*
> *శ్రీవైష్ణవులకొరకు సింధుభళ్లానిరాజులమీద*
> *యిడిబడి యుద్ధము చేసి*
> *గట్టిగ యెదురొమ్ము గాయాలు నాటి*
> *సింధుభళ్లానిరాజుల శిరసులు నరికి*
> *చంద్రాయుధములు నాటి చెల్లె మీ తండ్రి."* [58]

అగుమంచికథలోఁ గొమరక్క తన కోడలు అగుమంచితో సింహాద్రిరాజుకథను జెప్పును. ఇట సింహాద్రిరాజు యుద్ధవర్ణన మత్యద్భుతముగాఁ గొనసాఁగినది:–

> *"శ్రీకూర్మము బోయెను సింహాద్రిరాజు*
> *శ్రీవైష్ణవులకొరకు సింధుభళ్లానిరాజుల మీద*
> *పోరిపోరి వైరుల పొట్టలు జీరి*
> *వుక్కుటలుగుల మీద రాజుల వుక్కణగించి*
> *దండిగా పగతుల తలలుత్తరించి*
> *వుక్కు జీరా రాజుల వుక్కణగించి*
> *గొడుగులు దప్పించి పడగల నరికిరి*
> *పడగలు దప్పించి గొడుగుల నరికిరి*
> *పడగల కింద రాజుల గొంతులు కోసిరి*
> *చక్రాల కొందరి(ని) శిరసులు ఖండించిరి*
> *పగవారి ఆయుధములు భారంబులాయె*
> *ఈటెల పోట్లకు ఈవలావల వెడలి*
> *వాటముగ వచ్చిన ఆయుధములు పక్కలునాటి*
> *సింధుభళ్లానిరాజుల శిరసులు ఖండించి*
> *వరిగెను మా యన్న వల్లవులరాజు"* [59]

భక్తిరన్నకథలోఁ గాశీయాత్రకుఁ బోయిన భక్తిరన్న గయ యొద్దఁ బితృదేవతలకుఁ బిండప్రదానము చేయుచు, సింహాద్రిరాజును గుఱించి యిట్లు ప్రశంసించును. (ఈ ప్రశంసలో రసవంతమగు గవిత్వమును ప్రత్యక్షమగును.)

*"శ్రీకూర్మముమీదను చెలగి దండెత్తి*
*సింహాద్రి వో తండ్రి! చనుదెంచిపోతివి*
*మూకలయి వొక్కరొక్కరిని మొనకట్టి చంపితివి*
*చేకొని వారిని చెండాడి చంపితివి*
*బారులకు ఎదిరించి పగతుర ద్రుంచి*
*దురములో రిపులను త్రుళ్ళణచి నీవు*
*సింధుభళ్లానిరాజు శిరస్సు తెగనరికి*
*చంద్రాయుధాలు తాకి చెల్లితివి నీవు*
*సింహాద్రి వో సీత! సిరిగల కాంత!*
*అయ్యగూడి ప్రాణంబు అప్పగించితివి*
*హంసవలె వో తల్లి! అగ్నిలో మడిస్తివి*
*నిమిషంబు లోపల నీఱయి పోతివి*
*కాశిలో అన్నంబు గైకొందు మీరు!"* [60]

## 6.5. ఎఱనూకరాజు కథ:–

ఇతఁడు ఆవుల వలురాజు తృతీయ పుత్రుఁడు. వలురాజు ననంతరము పెద్దిరాజు సింహాసనము నధిష్ఠింపగా నీ యెఱనూక రాజు యువరాజపదవి చేపట్టెను. ఇతని భార్యపేరు ఎఱనూకసీత. కుమారుఁడు భట్టావులరాజు. పులిమద్దుల రాఘవుడు ఇతని సేనాని.

ఎఱనూకరాజు ఒకప్పుడు ఏనుగనాథుని కొండకుఁ బోగా, అక్కడ నెఱుకలకు సంబంధించిన యొక బెబ్బులి వ్రేటుబడి యెఱనూకరాజు మఱుగుఁ జొచ్చెను. అతఁడా బెబ్బులికిని, నెఱుకలకును నభయమిచ్చి, యెఱ్ఱభూపతిరాజుతో యుద్ధముచేసి మరణించెను. ఎఱనూకసీత భర్తతో 'సాగుమానము' చేసినది. ఎఱనూకరాజుసేనాని పులిమద్దుల రాఘవుఁడును నీ రణమున మరణించెను. అతని భార్యయగు 'దేశమ్మ' అగ్నికుండమునఁ బడెను. వేడుక బొంగరాల కథలో నీ యెఱనూకరాజుకథాప్రసక్తి యిట్లున్నది:

*"ఎరుకల పగలకు ఎరనూకరాజు*
*ఏనుగనాథుకొండకు ఏతెంచిపోయి*
*ఎఱ్ఱభూపతితో ఎదిరించి (పోరి)*
*ఎదురొమ్ము గాయాలు ఏకముగ నాటి*
*ఏనుగకొండ తావాయెను ఎరనూకరాజుకు"* [61]

అగుమంచికథలోఁ గొమరక్క తన యన్న యెఱనూకరాజు నిట్లు ప్రశంసించును:–

*"ఏనుగునాథుకొండకు బోయె ఎరనూక మా యన్న*
*ఎరుకల కొరకై ఏటుబడి బెబ్బులి*
*ఎరనూక మా యన్న మరుగు జొచ్చెను*
*మరుగుజొచ్చిన బెబ్బులికొరకై మా యన్న*
*నూటొక్క రాజుల నుగ్గుగా జంపి*
*వురవడిని బాణాలు వుక్కుటలుగులు నాటి*

*ఈటెల పోట్లును ఎదురొమ్ము తగిలి*
*బల్లాల పోట్లును భారంబు లాయె*
*ఎర్రభూపతిరాజు ఏపణగించిఁ*
*ఏనుగుకొండను ఎరనూక వొరిగె"* [62]

## 6.6. నలనూకరాజు కథ:–

ఇతఁడు ఆవుల వలురాజునకు నాల్గవ కుమారుఁడు. ఇతని భార్య నలనూకసీత; పుత్రుఁడు 'పెయ్యల యెఱ్ఱయ్య' లేక 'పయ్యావుల యెఱ్ఱయ్య; మంత్రి 'చటమారయ్య'. ఒకప్పుడు నలనూకరాజు 'నున్నబెజవాడ' (ఇది నేఁటి విజయవాడ కాదఁట. ఇది వేఱొక బెజవాడ యఁట) పట్టణమున కేఁగెను. ఆ పట్టణమునేలు 'నున్నభూపతి' నలనూకరాజును సుంకము చెల్లింపుమని నిర్బంధించెను. (ఈ నున్న భూపతి స్త్రీల వక్షోజములకుఁ గూడ పన్ను వసూలుచేసెడివాఁడని గాథాకారులు చెప్పుచుందురు.) ఆ రాజుదౌష్ట్యము నంతమొందింపఁదలంచి, నలనూకరాజతనికి సుంకమును జెల్లింపక నున్నభూతియగు నందికేశవరాజుతో యుద్ధము చేసి, 'దిగ్విదేవుని పెంట' దగ్గఱఁ గూలిపోయెను. నలనూకసీత సహగమనము చేసెను. నలనూకరాజుమంత్రియగు చటమారయ్య కూడ నీ యుద్ధమున మరణింపఁగా, నతని భార్య 'మారమ్మ' గుండమునఁబడెను. నలనూకరాజు పుత్రుఁడగు పెయ్యల యెఱ్ఱయ్య నున్నభూపతిని జంపి, 'బెజవాడ బెబ్బులి' యని పేరు మోసెను.

'వేడుక బొంగరాల కథ'లో నీ నలనూకరాజు కథాప్రసక్తి యున్నది. పోచయ్య తన మేనమామయగు ముమ్మయ్యతో నిట్లనును:

*"నున్నబెజవాడను మీ తండ్రి నలనూకరాజు*
*కచ్చెకు కాలుదువ్వి కదిసి పోరాడి*
*నందికేశవరాజుచేతి నరుకులు దగిలి*
*నడికల్లున చెల్లె మీ అయ్య నలనూకరాజు"* [63]

అగుమంచికథలోఁ గొమరక్క తన అన్నయగు నలనూకరాజు నిట్లు తలపోయును:–

*"నున్నబెజవాడకు పోయిన నలనూకరాజు*
*కంచుకు పెంచుకు అక్కలగాజుకు*
*సుంకము లేదని నున్నభూపతి రాజుల నుగ్గుగా జంపెను*
*వుక్కు జీరా రాజుల వుక్కణగించి*
*దండిగా పగతుల తలలుత్తరించి*
*వొళ్లెల్ల గాయాలు వుక్కుటలుగులు నాటి*
*నున్నభూపతిరాజుమీద వొరిగె మా యన్న!"* [64]

సింహాద్రిరాజుకథ, నలనూకరాజుకథ– ఈ రెండు వీరగాథలును నాకు లభింపలేదు. ఆంధ్రదేశమున– ముఖ్యముగాఁ గనిరిగిరి సీమలోఁ బర్యటించి, వీనిని శోధించి సంపాదింపవలసియున్నది.

## 6.7. 'పోలురాజు కథ' (ఆవుల పోలురాజు కథ) లేక 'శివపురాణము':

కాటమరాజు కథాచక్రమునఁ బోలురాజుకథకున్న ప్రశస్తి ప్రచారములు మఱియే యితర కథకును లేవు. దీనికి 'శివపురాణ'మను నామాంతరము కలదని నాకు లభించిన ఒక తాళపత్రగ్రంథమును బట్టి తెలిసికొంటిని. పోలురాజు, వలురాజునకుఁ గనిష్ఠ పుత్రుఁడు. ఇతఁడు ఈశ్వరాంశతోఁ బుట్టినవాఁడు. గొప్ప శివభక్తుఁడు. ఇతని భార్యపేరు 'సిరిదేవి' లేక 'నూకాంబ'. ఇతనికి భక్తిరన్న, అయితమ రాజు, ముమ్మయ్య అను ముగ్గురు పుత్రులును, 'అగుమంచి' యను పుత్రికయుఁ గలరు. పెద్దిరాజు కల్యాణనగరమునకుఁ బోవుచుఁ బోలురాజునకు నావులపట్టముఁ గట్టెను. అందుచే నితనిని 'ఆవుల పోలురాజు' అనియుఁ బిలుతురు. లేదా 'ఆవుల' అనునది యింటిపేరు కావచ్చును.

ఈ పోలురాజు చెఱుకూరి దగ్గఱ నాలమందతో నుండగా, శ్రీరంగపట్టణమునేలు చోడానిరాజు పెట్టు బాధలు పడలేక చెఱుకూరిలోని జంగములు పోలురాజును శరణువేడిరి. పోలురాజు వారికభయమిచ్చెను. కావేరీనదికిఁ గట్టఁగట్టుటకై వెట్టిచేయవలసి నదిగా జంగముల నాజ్ఞాపించుచు చోడానిరాజు పురహరుఁడను యోధునిఁబంపెను. జంగములు ఆ పురహరునకు లక్షరూప్యములు లంచమిచ్చి ఒకరాత్రికి నిలిపిరి. ఈ లోగాఁ దాము పోలురాజు మఱుఁగుఁ జొచ్చిరి. కల్లందుల మారినీఁడు, మసిలినాయఁడు మున్నగు వీరులను దోడిచ్చి, పోలురాజు ఆ జంగములను శ్రీశైలమునకుఁ బంపివేసెను. పురహరుఁడు శ్రీరంగమునకుఁబోయి, చోడానితో జరిగిన విషయము చెప్పెను. చోడాని మండిపడి, పోలురాజుపైకి 'ముక్కంటి' యను వీరునిఁ బంపెను. పోలురాజునకును ముక్కంటికిని జెఱుకూరి దగ్గఱఁ జిలకలమట్టి ఠాణ్యమున గొప్ప యుద్ధము జరిగెను. యాదవ వీరులెందఱో ఆ యుద్ధమున మరణించిరి. కడకుఁ బోలురాజును నొఱిగిపోయెను. పోలురాజు చనిపోవుచుఁ దన పుత్రులను మేనల్లుఁడగు పల్లికొండ కప్పగించును. ఇది యీ వీరగాథలోని ప్రధానకథ. వేడుక బొంగరాల కథ, అగుమంచికథ, భక్తిరన్నకథ– అను మూఁడు ఇతర వీరగాథలలోఁగూడ నీ పోలురాజుకథాప్రసక్తి వచ్చును.

పోలురాజుకథ మిక్కిలి ప్రచారమందున్న వీరగాథయే కాక, మిక్కిలి దీర్ఘమైన వీరగాథ కూడ. ఇందలి ప్రధానకథలో మధ్య మధ్య కొన్ని ఉపకథలున్నవి. ఈ యుపకథలను జానపదులు 'చాటువలు' అందురు. అట్టి చాటువలు పోలురాజు కథలో నాఱున్నవి: 1) చంద్రగుప్తుని చాటువ, 2) మల్లికాదేవి చాటువ, 3) ముక్కంటి చాటువ లేక బ్రాహ్మణ చాటువ, 4) జంగాల చాటటువ, 5) కపోత చాటువ, 6) గయుని చాటువ. ఇందు మొదటి రెండు చాటువలును శ్రీశైల మాహాత్మ్యమునకు సంబంధించిన కథలు. ఇవి పోలురాజు పూర్వజన్మమునుగూర్చి వివరించును. చంద్రగుప్తుని చాటువలో వచ్చు గంగమైలావే పోలురాజుగా జన్మించెననియుఁ, జంద్రగుప్తుని కుమార్తెయగు మల్లికాదేవియే సిరిదేవిగాఁ బుట్టి పోలురాజునకు భార్యయైన దనియుఁ జెప్పఁబడినది. ఈ దంపతులిరువురకు శ్రీశైలమల్లికార్జునుఁడు భక్తిరన్నగాఁ బుట్టెనఁట. ముక్కంటి చాటువ లేక బ్రాహ్మణ చాటువ యనునది చోడాని పోలురాజుపైకి పంపిన ముక్కంటి యను బ్రాహ్మణుని జన్మ వృత్తాంతమును దెల్పు కథ. జంగాల చాటువలోఁ జోడానిచేఁ బీడింపఁబడిన జంగాలు వచ్చి పోలురాజును శరణువేఁడుట కలదు. కపోత చాటువ శిబిచక్రవర్తికథ, గయుని చాటువ గయోపాఖ్యానకథ. ఈ రెండును పోలురాజు జంగముల కభయమిచ్చు సందర్భమునఁ జెప్పఁబడినవి.

నాకు, ఈ పోలురాజుకథకు సంబంధించి, మూఁడు తాళపత్ర ప్రతులు లభించినవి. నెల్లూరుజిల్లా, దర్శితాలూకా, ఎఱ్ఱబాలెము గ్రామములో లభించినప్రతి సమగ్రప్రతి. కనిగిరితాలూకా కంకణం పాడు గ్రామములో లభించినది అసమగ్రప్రతి. కృష్ణాజిల్లా, గుడివాడ తాలూకా, కుచ్చికాయలపూడి గ్రామములో లభించినప్రతి శిథిలమై అక్షరములు సరిగాఁ దెలియుట లేదు. ఇందు ఎఱ్ఱబాలెము ప్రతిలోఁ గవిపేరు కనకబండి ఘట్టయ్య యని కలదు. ఇది 'ఆవుల పోలురాజుకథ' అను పేరుతో నున్నది. కాఁబట్టి కాటమరాజు ఇంటిపేరు ఆవులవారనుట రూఢియగుచున్నది.

ఇంతవఱకును జెప్పఁబడిన యాదవవీరులకథలలో నొక గొప్ప గుణము కొట్టవచ్చినట్లు కనఁబడును. ఆవుల వలురాజును, నతని పుత్రులేవురును పరోపకారార్థమై తమ ప్రాణములను తృణప్రాయముగా నెంచి త్యజించిన మహానుభావులు! వలురాజు మొదలుకొని పోలురాజు వఱకును వారు చేసిన యుద్ధములలో స్వార్థము లవలేశమైనను లేదు. అగ్రజన్ములగు బ్రాహ్మణులను, నితర భక్తులను, ఎఱుకలవంటి గిరిజనులను, ఆపదలనుండి కాపాడుటకై తమప్రాణములను బలివెట్టిరి. ఇట్టి వీరచరిత్రలనుబట్టియే 'పరకార్యంమీద పాడై పోయింది. యాదవకులం' అను లోకోక్తి పుట్టినది. ఈ లోకోక్తిని సుద్దులవారు తఱచుగఁ జెప్పుచుందురు. ఖడ్గతిక్కనయుద్ధములోఁ జల్లపిన్నమనీఁడు తమ 'తరమునాటి పెద్దల' గొప్పతనము నిట్లు చాటును:–

*"తరముల తాతతండ్రులు మేము*
*భట్టుల బ్రాహ్మల వైష్ణవోత్తముల*
*వెట్టిచెరల్ మాన్పి వెనుకవేసికొని*
*ప్రాణాలొసఁగి కీర్తి ప్రబలియున్నాము"* [65]

ఇట్లు పరోపకారము చేసిన సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు– ఈ యైదుగురన్నదమ్ములును వివిధ రణంగములలో నేకకాలమున మరణించిరఁట. ఆర్లపెంట రణములో నొఱిగిపోయిన పెద్దిరాజునకుఁ దన సోదరుల మరణవార్తలు తెలియును.

## 6.8. 'బల్లికురువ పోట్లాట':-

లేఖకుఁడు దీనిని 'బల్లికురువ యుద్ధము' అనినాఁడు. అవతారికలోఁ గవి మాత్రము 'బల్లికురువ పోట్లాట' అనియే పేర్కొనెను ("ఆచంద్రతారార్కమై వెలసినట్టి, బల్లికురువ పోట్లాట ప్రజలార వినుండి"). కవినామము తెలియవచ్చుట లేదు. దీని తాళపత్ర గ్రంథము నాకు నెల్లూరుజిల్లా, దర్శితాలూకా గంగదొనకొండ గ్రామములో 1966లో లభించినది. 19-7-1967నాడు శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు దీనిని ముద్రించినారు.

చెఱుకూరిలోఁ జిలకలమఱ్ఱి రాణ్యమున ముక్కంటితోఁ బోరి, పోలురాజు మరణించఁగా, పల్లికొండ బాలరాజులను దీసికొని (భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య- వీరు బాలరాజులు), ఆలమందలను దోలుకొని అర్థవీడుననకు వచ్చెను. (ఈ అర్థవీడు నేఁడు కర్నూలుజిల్లా కంభముతాలూకాలోఁ గలదు.) ఆ పట్టణమేగు సరికిఁ బ్రొద్దుగ్రుంకెను. అందుచే పల్లికొండ ఆ పట్టణ సమీపమునఁ గల బల్లికురువ దగ్గఱ ఆలమందలతోను, బాలరాజులతోను విశ్రమించెను. చిలకమఱ్ఱి దగ్గఱ పోలురాజును జంపిన ముక్కంటి యొక్క మనుమలు, బాలరాజులను జంపుటకై బల్లికురువపైకి దండెత్తి వచ్చిరి. పల్లికొండ శ్రీహరిని ప్రార్థించెను. శ్రీహరి బొల్లావును బంపెను. అది గొప్పయుద్ధముచేసి ముక్కంటి మనుమలను దఱిమివేసెను. ఈ యుద్ధమున యాదవులతో మసిలినీఁడను గోసంగి వీరుఁడును, కల్లందుల మారినీఁడను తిరుమందుల వీరుఁడును మరణించిరి. మసిలినీనిభార్య 'మారెమ్మ' సహగమనము చేసెను. మఱునాఁడు పల్లికొండ బాలరాజులను దీసికొని పంపాద్రిమీఁదుగా యలమంచికి వచ్చెను. అప్పుడు యలమంచిని కాటమరాజు పినతల్లి పుత్రులగు చల్లవారు పాలించుచుండిరి. పల్లికొండ ఆ చల్లవారిని మోసగించి ఆ రాజ్యమును హరించి, పోలురాజు ద్వితీయ పుత్రుఁడైన అయితమ రాజునకుఁ బట్టము గట్టెను. ఈ కథ యింతటితో ముగియును.

చల్లవారు ఏడుగురు అన్నదమ్ములు. వీరిలోఁ జల్ల పిన్నమనీఁడు పెద్దవాఁడు. ఈ అన్నదములేడ్గురును మహావీరులు. పల్లికొండ బాలరాజులతో వచ్చుచున్నాఁడని తెలిసి, చల్ల పిన్నమనీఁడు సింహాసనము దిగి యెదురేఁగెను. పల్లికొండ అయితమరాజునకుఁ గన్నుగీటెను. అయితమరాజు తిన్నగాఁ బోయి పిన్నమనీని సింహాసనముపైఁ గూర్చుండెను. పల్లికొండ వెంటనే అయితమరాజునకుఁ జేతులెత్తి మ్రొక్కెను. అవతార పురుషుఁడగు పల్లికొండ నమస్కరించుటచేఁ దక్కిన సభవారందఱికిని అయితమరాజునకు మ్రొక్కక తప్పలేదు. ఈ మోసముచేఁ జల్లవారికి రాజ్యము పోయెను. చల్లవారు, పల్లికొండ చేసిన ఈ మోసమును సహించియుండిరి. కాటమరాజు యుద్ధమున మాత్రము వీరు పల్లికొండతో "రాజ్యమును మోసము చేసి అయితమరాజున కిప్పించినను, మా శౌర్యమును మాత్రము మోసగింపలేవు. యుద్ధమున మొట్టమొదటి ఠాణా మాది" అనిరి. పల్లికొండ సమ్మతించి, వారికి మొదటి ఠాణా నిచ్చెను. చాగలకందదగ్గఱఁ జల్లవారిఠాణా వెలసెను. ఈ చల్లవారిని జూచి నల్లసిద్ధి గడగడ వణఁకెను. మహావీరుఁడగు ఖడ్గతిక్కన నల్లసిద్ధి భయమును బాపి, చల్లవారిపై బెబ్బులివలె దండెతివచ్చెను. కాని చల్లవారిని గెలువలేకపోయెను.

## 6.9. 'కాటమరాజుకు పట్నం కట్టిన కథ' లేక 'కాటమరాజు పట్టాభిషేకము':-

నాకు లభించిన తాళపత్రగ్రంథమున నీ వీరగాథ శీర్షిక యిట్లే యున్నది. 'పట్టము' అనుటకు జానపదులు 'పట్నం' అందురు. దీనిని 'పట్టణము'గా భ్రమింపరాదు. కాఁబట్టి యీ కథాశీర్షిక 'కాటమరాజు నకు పట్టము కట్టిన కథ' అని యుండఁదగును. అందుచేతనే గాథాకారులు దీనిని 'కాటమరాజు పట్టాభిషేకము' అనియుఁ బిలుచుచున్నారు. కావున నీ శీర్షికలోని 'పట్నం' అను మాటకు 'పట్టాభిషేకము' అని అర్థము.

పోలురాజు మరణానంతరము పల్లికొండ, బాలరాజులను అంతఃపురకాంతలను దీసికొని, పంపాద్రిమీదుగా యలమంచికి వచ్చును, సర్వసిద్ధిలో నిలిచి చల్ల పిన్నమనీనికి వార్తనంపును. (చల్ల పిన్నమనీఁడు కాటమరాజునకుఁ బినతల్లికుమారుఁడు; యలమంచిని బాలించుచుండెను.) పిన్నమనీఁడు తన పరివారముతోఁ బల్లికొండను జూడవచ్చును. పల్లికొండ, పిన్నమనీనితో పోలురాజు కథను, బల్లికురువ పోట్లాటను వివరించి చెప్పును. తరువాత బాలరాజులతో పల్లికొండ యలమంచిని బ్రవేశించును. పల్లికొండ ప్రేరణతో నలయితమరాజు తిన్నగా వెళ్ళి పిన్నమనీని సింహాసనముపై కూర్చుండును. పల్లికొండ అతనికి నమస్కరించును. అతనితోపాటు మిగిలిన అందఱును నమస్కరింతురు. పల్లికొండ చేసిన మోసమును గ్రహించియుఁ బిన్నమనీఁడు మిన్నకుండును. (పల్లికొండ దైవాంశ సంభూతుఁడని యాదవుల నమ్మకము.)

కల్యాణములోఁ బెరుగుచున్న కాటమరాజును పాపనూకను యలమంచికిఁ దీసికొనిరావలెనని పల్లికొండ ప్రతిపాదించును. అయితమరాజు తన అన్న భక్తిరన్నను కల్యాణనగరమునకుఁ బంపును. భక్తిరన్న జంగమవేషములోఁ గల్యాణమున సంచరించుచు, యాదవుల గోత్రములను సువ్విపాటగాఁ బాడుచున్న పాపనూకను గుర్తించును. కాటమరాజును పాపనూకను తనతోఁబంపుడని భక్తిరన్న కల్యాణపు గంగురాజును, పెందోట ముద్దమ్మను కోరును. వారు అతని మాటలను విశ్వసింపకపోవుటచే భకిరన్న పెద్దమ్మ గుండము దగ్గఱ సాక్ష్యము పలికించును. అప్పుడు వారు పసివాండ్ర నిచ్చుట కంగీకరింతురు.

కాటమరాజు, గంగురాజు బిరుదులను స్వీకరించును. భక్తిరన్న, కాటమరాజు పాపనూకలను దీసికొని యలమంచికి వచ్చును.

'మర్లవారి గంగ' నిచ్చి కాటమరాజునకు వివాహము చేయుదురు. పల్లికొండ, కాటమరాజునకు ఆవులపట్టము కట్ట ప్రతిపాదింపగా, నతఁడు అందఱికన్న చిన్నవాఁడగుటచేఁ బిన్నమనీఁడు మున్నగు దాయాదులు ఆక్షేపింతురు. పల్లికొండ, బసవన్న యిష్టము ననుసరింత మనును. బసవన్న కాటమరాజును ఆవులరాజుగా నెన్నికచేయును. అప్పుడు యాదవులు తమ ఆలమందలకు కాటమరాజును అధిపతిగా పట్టాభిషిక్తుని జేయుదురు. కాటమరాజు శ్రీకృష్ణుని తమకముపైఁ గూర్చుండి, తాను విష్ణుస్వరూపుఁడనని నిరూపించును.

భక్తిరన్న, కాటమరాజు పాపనూకలను దీసికొని వచ్చుటకు ముందు, యాదవులు సింహాద్రిరాజు కొడుకులను యలమంచిలో నిలిపి, అందఱును బయలుదేరివెళ్ళి, ఓరుగంటికి సమీపములో వేఱొక యలమంచిని నిర్మించుకొనినట్లుగా నీ వీరగాథలోఁ గలదు.

ఈ కథ గల తాళపత్రగ్రంథము నాకు కృష్ణామండలమున 1964లో లభించినది. దీని కవి కట్టెబోయిన మారయ్య. కృతిభర్త గంగాళపు జంగమయ్య. ఇతఁడు కవికి బావగారు. అక్కడక్కడ ప్రాసభంగములున్నను మొత్తముమీఁద నీ కథ ద్విపదచ్ఛందముననే కలదు.

## 6.10. కఱియావులరాజు కథ:-

ఇతఁడు సింహాద్రిరాజు కుమారుఁడు. పల్నాటివీర చరిత్రమున అలరాజెంతటి మహావీరుఁడో, కాటమరాజు చరిత్రమున నీ కఱియావులరాజు అంతటి మహావీరుఁడు. ఇతని భార్యపేరు నాగాంబిక లేక కఱియావుల నాగ. ఇతఁడు నల్లని ఆలమందలకధిపతి యగుటచే నిట్టిపేరు వచ్చినదేమో! చిట్టినూక యితని తోఁబుట్టువు. పల్లికొండ తమ్ముఁడగు పుల్లావుల కేశవయ్య ఇతనికి మంత్రిగా వ్యవహరించుచుండును. కఱియావులరాజు బలశౌర్యములను నిరూపించుకథయే ఈ వీరగాథ.

పల్లికొండ అయితమరాజాదులతో యలమంచిలో నుండఁగా ఓరుగల్లుపట్టణమునుండి 'బాచయ్య' యను బ్రాహ్మణుఁడు యలమంచికి వచ్చెను. ఆ సమయమున నయితమరాజు గంగజాతరను మహావైభముగా జరిపించుచుండెను. బాచయ్య ఆ తిరునాళ్లను, యాదవుల వైభవమును జూచి ఆశ్చర్యపడెను. కఱియావులరాజు శౌర్యము నాతఁడు వినియున్నాఁడు. ఆతని నెట్లయినను నోరుగంటికిఁ దీసికొనిపోయి, అచటనున్న బేతాళుని నోడించి, వాని గర్వము నణఁచవలెనని బాచయ్య నిశ్చయించుకొనెను. (ఓరుగంటిలో నున్న బేతాళుఁడు ఒకప్పుడు బాచయ్యను అవమానించెనఁట. ఆ పగ అతని మనస్సులో నున్నది.) అందుచే బాచయ్య యాదవులను ఓరుగంటిశంభుని తిరునాళ్లకు రండని ఆహ్వానించి వెడలిపోయెను.

అయితమరాజు, పుత్తమరాజు, కఱియావులరాజు, పల్లావుల కేశవయ్య, పల్లికొండ మొదలగు యాదవవీరు లందఱును నంతఃపురాది సమస్త బంధుజనములతో యలమంచినుండి బయలుదేరి, ఓరుగల్లు సమీపమునకు వచ్చి, డేరాలనెత్తిరి. ఓరుగంటి ప్రతాపరుద్రుఁడు, యాదవులు తమపై దండెత్తివచ్చినారని తలంచి రాయబారులను బంపెను. యాదవులు తాము ఓరుగంటిశంభుని తిరునాళ్లను జూడవచ్చితిమని తెల్పిరి.

ఏడు ఘడియలలోఁ దిరిగి వత్తుమని చెప్పి, కఱియావుల రాజును డేరాలకడ నుంచి అయితమరాజు, పుత్తమరాజు, పల్లికొండ ముగ్గురును ఓరుగల్లుపట్టణములోని కేఁగిరి. ప్రతాపరుద్రుఁడు వారి నెట్లైనను జంపవలెనని తలంచి, కత్తులతమకమును జేయించి ఆహ్వానించెను. పల్లికొండ విష్ణుమూర్తిని, తరమునాఁటి పెద్దలను దలఁచుకొని అయితమరాజును దానిపైఁ గూర్చుండబెట్టెను. ఆతని కేవిధమగు నపాయమును జరుగలేదు. తరువాత ప్రతాపరుద్రుఁడొక మొండిగుఱ్ఱమును స్వారిచేయుఁడని కోరెను. ఆ గుఱ్ఱమెట్లైనను యాదవులను తుదముట్టించునని యాతఁడు తలపోసెను. కాని పల్లికొండమాహాత్మ్యముచేఁ బుత్తమరాజు ఆ గుఱ్ఱమునెక్కి నిర్భయముగా స్వారిచేసెను. అప్పుడు ప్రతాపరుద్రుఁడు వారికి విషాన్నమును బెట్టెను. పల్లికొండ హరిస్మరణచేసి ఆ యన్నమును భుజించెను. అంతఁ బ్రతాపరుద్రుఁడు ఆ యాదవవీరుల గొప్పతనమును గుర్తించి, వారిని సన్మానించి, పచ్చల పల్లకీని బహూకరించెను. ఓరుగంటి శంభుని సేవించుటకు అనుమతించెను.

ఇంతలో పల్లికొండ చెప్పిన యేడు ఘడియల కాలము గడచిపోయెను. ఊరిబయట డేరాలకడనున్న కఱియావులరాజు ఆవేశమును, ఉత్సాహమును బట్టలేక, గుఱ్ఱమునెక్కి ఓరుగంటి పట్టణములోనికిఁ జొరఁబడెను. మార్గమధ్యమున భేతాళుని పూలతోటలోఁ బూలుకోసి, తన గుఱ్ఱము నలంకరించెను. అచటి బోడికలను జంపి పూలతోటను ధ్వంసము చేసెను. ఓరుగంటి నగరవీథులలో బేతాళుఁడు తన బిరుదులను వ్రేలాఁడగట్టెను. ఆ బిరుదులక్రిందుగా దూఱిపోవుట వీరుఁడైనవానికి నవమానము. వానిని విప్పుమని కఱియావులరాజు బేతాళునికిఁ గబురుపెట్టెను. ఆతఁడు వినలేదు. అందువలన కఱియావులరాజు ఆ బిరుదులను దన కత్తితోఁ దెగనఱికెను. ఇది బేతాళునకుఁ గోపకారణమయ్యెను. అతఁడు కఱియావులరాజును ఏకాంగి జగడమునకు ఆహ్వానించెను. మహాసంతోషముతోఁ గఱియావులరాజు గరిడిలోని కుఱికెను. ఇరువురకును ఘోరయుద్ధము జరిగెను. వీరాధివీరుఁడగు కఱియావుల రాజు బేతాళుని సంహరించి, ఆతని బిరుదులన్నియును గైవసము చేసికొనెను. బేతాళునిభార్య 'చిట్టిగోపు' సహగమనము చేసెను. యాదవవీరులు ఓరుగంటి శంభుని సేవించి తిరిగిపోవుచుండఁగాఁ బ్రతాపరుద్రుఁడు వారిపై దండెత్తెను. కఱియావులరాజు సహాయముతో

నయితమరాజు ప్రతాపుని సేనల నోడించి తఱిమివేసెను. చివరకు యాదవులు:-

> ***"ఆస్తులు బాలలు ఆడశ్రీలతోను***
> ***పసిబిడ్డ బాలాది బంధువర్గముతోను***
> ***ఆవగింజంత ముల్లు అరికాల నాటకుండాను***
> ***క్షేమాన యలమంచి చేరిరి వారు"*** [66]

ఈ కథాప్రసక్తి 'జన్నివాడకథ'లోఁగూడ వచ్చినది.

ఈ కఱియావులరాజుకథకు సంబంధించి 'ముగ్గురు మాష్టీల కథ' అనియు 'ఒంటి మాష్టీని కథ' యనియు రెండువిధములగు రచనలున్నవి. ఓరుగల్లులో కఱియావులరాజుతోఁ బోరాడిన బేతాళుఁడు మాష్టీఁడు. ఇతనికి 'కన్నమాధీరుఁడు, రంపాల కేశవుఁడు' అను మఱి యిద్దఱు సోదరులు గలరు. వీరును వీరులే. కఱియావులరాజు ఏకాంగిజగడమున బేతాళునిఁ జంపఁగా, బేతాళుని సోదరులును యుద్ధసన్నద్ధులయిరి. వీరిలోఁ గన్నమాధీరునిఁగూడ కఱియావుల రాజు చంపెను. రంపాల కేశవుని భట్టావులరాజు చంపెను. ఇట్లున్న కథను 'ముగ్గురు మాష్టీల కథ' యందురు. ఒక్క బేతాళుని వృత్తాంతముతోఁ బూర్తియగు కథను 'ఒంటి మాష్టీని కథ' యందురు. ఈ రెండును భిన్నకవుల రచనలు. అనఁగా 'కఱియావులరాజు- ఒంటి మాష్టీని కథ' ఒక కవి రచన, 'కఱియావులరాజు- ముగ్గురు మాష్టీల కథ'- అనునది వేఱొక కవి రచన. రెండింటికిని కథాకథనమున కొంత భేదమున్నది. ముగ్గురు మాష్టీలకథలో యాదవవీరులు ఓరుగంటికి వచ్చునప్పుడు శుభశకునములు, దుశ్శకునములు రెండును అగుట, పల్లికొండ వానిని విప్పి చెప్పుట కలదు. ఇందు ప్రతాపరుద్రుఁడు ధర్మవీరుఁడగు చక్రవర్తిగాఁ జిత్రింపబడెను. ఆతని సమక్షములోనే కఱియావులరాజు బేతాళునితోఁ బోరును. ఆ పోరును వారించుటకై ప్రతాపరుద్రుఁడు ప్రయత్నించెను. కాని బేతాళుఁడు వినలేదు. బేతాళుని మరణము. అతని భార్య చిట్టిగోపు సహగమనముతో నిందు కథ ముగింపఁబడినది. ఈ ముగింపు అసంపూర్ణముగ నున్నది. దీని రచయిత 'గంగుల పినయెల్లయ' యని అవతారికలో నున్నది.

ఒంటి మాష్టీని కథలో కథాప్రారంభమున కొంతభాగము శిథిలమైనది. అందువల్ల కవి పేరు తెలియలేదు. ఇందు ప్రతాపరుద్రుఁడు కుటిలపరుఁడుగా, కొండెములను ప్రీతితో విడనెడి రాజుగా చిత్రింపఁబడెను. బేతాళుఁడు చంపఁబడిన తరువాత నితఁడు కఱియావులరాజును జంపింపయత్నించెను. తిరిగి పోవుచున్న యాదవులపై దండెత్తివెళ్ళును. ఆతని సైన్యములను కఱియావులరాజు ఓడించి తఱిమివేసెను.

నాకుఁ బై రెండు విధములగు రచనలును లభించినవి. 'ముగ్గురు మాష్టీల కఱియావులరాజుకథ' పల్నాడులో గామాలపాడు గ్రామమునను, 'ఒంటిమాష్టీని కఱియావులరాజుకథ' చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా పెడకంటిపల్లె గ్రామములోను లభించినవి. ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమివారు నా సంపాదకత్వమున 1976లో ప్రచురించిన 'కాటమరాజుకథలు' మొదటి సంపుటములో ముగ్గురు మాష్టీల కథను ప్రధానకథగాను, ఒంటి మాష్టీని కథను అనుబంధము లోను జేర్చితిని. ఇందు ముగ్గురుమాష్టీల కథారచయిత కొమనాల గోత్రుఁడును, యాదవకుల భూషణుఁడును, చెన్నమాంబ పుత్రుఁడును నగు పినయెల్లన. (కాటమరాజుకథను రచించిన గంగుల పినయెల్లయ యితఁడే కావచ్చును.) ఇందలి ఛందస్సు అక్కడక్కడ ద్విపదవలె నున్నను మొత్తముపై మంజరియే. ఒంటిమాష్టీని కథారచయిత తన నామము నెచ్చటను దెలుపుకొనలేదు. ఇది మంజరీ వికారమగు రచన. గణములు శిథిలమై, సాఁగిపోయి, లయాత్మక వచనమువలె నున్నది. ప్రొద్దుటూరులో నొక యాదవగాథాకారుఁడు పాడిన కఱియావులరాజుకథ పై రెండింటి కన్నను భిన్నముగా నున్నది. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో నీ కఱియావులరాజు ఎఱ్ఱసిద్ధిరాజుతోఁ బోరి యతనిని జంపును.

ఆరాధ్యుల పిచ్చయ్యగారు 20-5-1976 నాడు ప్రచురించిన 'కఱియావులరాజు చరిత్ర' (ద్విపదకావ్యము) పైన తెల్పిన రెండు కథలకన్న భిన్నమైన రచన. అవతారికలో ఇష్టదేవతాస్తుతి ఉన్నది కాని, కవినామము లేదు. అయినను సంపూర్ణమగు రచన; నిర్దుష్టమగు శైలి. ఇదియును ఒక రకముగా ముగ్గురు మాష్టీల కథయే. యాదవులను జంపుటకై ప్రతాపరుద్రుడు చేసిన కుటిల యత్నములు కూడ నిందుఁగలవు. అందువలన నిది రెండు కథల సమన్వయమని చెప్పవచ్చును.

## 6.11. పాపనూక కథ:-

పాపనూక కాటమరాజునకుఁ జెల్లెలు. ఈమె దుష్టనక్షత్రమున జన్మించినది. ఈమె పుట్టిన యేడవనాఁటికే తండ్రి పెద్దిరాజు 'అర్లపెంట' రణరంగములో హతుఁడయ్యెను. తల్లి అగ్నికుండమునఁ బడెను. భక్తిరన్న యీమెను దెచ్చి యలమంచిలో నున్న తన తల్లి సిరిదేవి కప్పగించి అగుమంచితో సమముగాఁ బెంచి పోషింపుమని చెప్పి, తాను కాశీయాత్రకుఁ బోయెను. తరువాత యాదవులు ధనుముకొండకు వచ్చి స్థిరపడిరి.

ధనముకొండలో పాపనూక యాదేరి యింటనున్నది. పల్లికొండ యీమెకు వివాహముచేయ సంకల్పించెను. తన తమ్ముఁడు నాచకూళ్లనాయునకిచ్చి పెండ్లిచేయవలసినదని అయితమరాజును సిరిదేవిని గోరినాఁడు. అయితమరాజాదులు పురోహితులను బిలిచి పాపనూక జాతకమును జూడుడనిరి. పురోహితులు ఆమె జాతక చక్రమును బరిశీలించి, ఆ పాపనూక ఫాల్గుణమున బహుళమందు నాలుగు ఘడియల జమిలి నక్షత్రమున బుధవారమునాఁడు పట్టపగటి వేళ భూమినిదన్నుచుఁ బుట్టినదనియు, ధనధాన్యముల గండమునను,

తల్లిదండ్రుల గండమునను, గోత్రగండమునను పాపనూక జన్మించెననియు, నందుచే నామెకు వివాహము చేసినచో–

> **"ఇచ్చినవారిండ్లు ఇలమీద క్రుంగును**
> **పుచ్చుకున్నవారిండ్లు భూమిమీద వెలుసును**
> **ఎదురిండ్లు మనవయ్య ఏక పుణికెల పాపకు**
> **విధి అమిశతోఁ బుట్టెను వినవయ్య చెల్లెలు**
> **మధ్యానాన బుట్టింది మగువ పాపన్న**
> **వద్దయ్య నగరువెళ్ల వణితె నియ్యరాదు**
> **మంచిదిగాదయ్య మనుములు ఇచ్చినయపుడె**
> **కొంచ పడక మీరు గోకులాధీశ**
> **ఇంటనే వుంచరయ్య యిల్లువెళ్లకుండా**
> **మాటవాసి దక్కదు మన్నర్కము లేదు.**
> **రాజలక్ష్మి తొలగును నగరు వెళ్లిన యపుడె**
> **పూజలక్ష్మి తొలగును పుట్టింటనె వుంచుదా**
> **ఇల్లటముగాను ఇంటనే పెండ్లి**
> **చెల్లెలు పాపనూకపెండ్లి చేయుదా మీరు"** [67]

అని అయితమరాజుతోఁ జెప్పిరి. యాదవులు ఈ వృత్తాంతమును విని భయపడిరి. పాపనూకపెండ్లి చేసి, నాచకూళ్లనాయని నిల్లఱిక ముంచుకొనవలెనని అయితమరాజును, సిరిదేవియుఁ దలంచిరి. కాని కొమరక్క తన కుమారుని నిల్లఱికముంచుట కిష్టపడలేదు. అందుచే పాపనూక వివాహ మాగిపోయెను. అవివాహితగాఁ బాపనూక యింటనుండుట దోషమనియు, నట్లున్నచో యాదవవంశమంతయు నాశమగుననియు, నామె నొంటిరిగా నూరిబయట నొక మేడలో నుంచుఁడనియుఁ బురోహితులు చెప్పిరి. అట్లు చేయుటకు సిరిదేవి మిక్కిలి తొందరపడెను. కాని ముందువెనుక లాలోచించి, అయితమ రాజు తన తల్లిని వారించి, పాపనూకను మేడపెట్టు విషయము మందలోనున్న కాటమరాజునకు లేఖమూలకమునఁ దెల్పెను. ఆ విషయము తెలిసి కాటమరాజు మిక్కిలి దుఃఖించెను. అయితమ రాజునకుఁ దన యనుమతిని బంపెను. ఆ యనుమతిని జూచిన తరువాత, నయితమరాజు, ఊరిబయట రక్తచందనముతో నేడంతస్తుల మేడ కట్టించి, దానికిఁ జక్కని యలంకరణము చేసి, పాపనూక నందులో నుంచెను. సిరిదేవి, కొమరక్క మున్నగు యాదవ కాంతలందఱును బాపనూక నా మేడలో దిగవిడిచి వెడలిపోయిరి. అప్పుడు పాపనూక తన బంధువులందఱును గలిసి తన్నొంటరి దానినిగాఁ జేసిరను తీవ్రదుఃఖావేశమున, యాదవులెల్లరును యుద్ధమున మరణింతురు గాక యని శపించినది.

ఈ కథకు సంబంధించి నాకు మూఁడు తాళపత్రగ్రంథములు లభించినవి. మూఁడును నేక కవి కర్తృములే. కవి పేరు – కదిరి మంగళము లేదా మంగళపురి వెంకటాద్రి. దొనకొండలో పాపనూక నివసించిన మేడశిథిలములు నేఁటికిని గలవు. అట నతిప్రాచీనమైన పాపనూక విగ్రహము లభించినది. దానిని దొనకొండ గంగగుడిలో భద్రపఱచినారు. యాదవీరులందఱును నెఱ్ఱగడ్డపాడులో మరణించి నప్పుడు ఈమెకూడ నగుమంచితోఁ గలసి చిచ్చుఱికినది! ఈమె జీవితము మొగ్గగా నున్నప్పుడే వాడిపోయినది! ఇది మిక్కిలి విషాదపూరితమైన కథ. ఆ కాలములో యాదవరాజులు జ్యోతిషమునకు మిక్కిలి ప్రాధాన్యమిచ్చిరని ఈ కథ రుజువు చేయుచున్నది. (అవుల వలురాజు తన తరువాత పెద్దకొడుకైన సింహాద్రిరాజును తప్పించి, రెండవ కొడుకైన పెద్దిరాజును గద్దెనెక్కించుటకూడ యాదవుల జ్యోతిషాభిమానమును వెల్లడించు సంఘటనయే.)

## 6.12. 'కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు':–

ఈ కథకు 'ఆవులమేపు', 'ఉత్తరాది ఆవులమేపు', 'ఆవుల మేపులు– ఉత్తరకాండము' అను మఱిమూఁడు నామాంతరము లున్నవి. ఈ కథాచక్రమునఁగల ముప్పదిరెండు వీరగాథలలోను, కాటమరాజునకుఁ బూర్తిగా సంబంధించినకథ యిదియొక్కటే! ('మేపు' అనఁగా 'మేయఁజేయు'. ఈ ప్రేరణ శబ్ద మిచట జానపదులచే నామవాచకముగాఁ బ్రయోగింపఁబడినది. 'మేపు' అనఁగా 'మేపుట' అని యర్థము.)

కాటమరాజు తన విస్తారమైన గోగణమును శ్రీశైలప్రాంతా రణ్యములలోఁ బండ్రెండు సంవత్సరములు మేపెను. ఇతనితోఁ గూడఁ బల్నాటి ప్రభువగు వెలమ పద్మరాఘవుఁడును, కాటమరాజు పినతండ్రి నలనూకరాజు పుత్రుఁడగు 'పెయ్యల యెఱ్ఱయ్య'యు నుందురు. కాటమరాజుశ్రీశైలప్రాంతములందే యున్నచో దక్షిణదేశమునఁ బోలురాజుపగ నెఱవేరుటగాని, తన్మూలమున యాదవవినాశముగాని సంభవింపదు. అందుచే హరుఁడు బ్రహ్మనడిగి యాదవుల ఆయుః ప్రమాణమును దెలిసికొనఁగోరెను. "ఏటిమీద ఆరునెలలకు ఎద్దులు యాదవులు, చిత్రభాను సంవత్సరాన చెల్లనున్నారు!" అని బ్రహ్మ చెప్పఁగా, నీశ్వరుఁడు కాటమరాజును దక్షిణభూములకుఁ బంపనెంచి, నల్లమల ప్రాంతమునఁ బచ్చగడ్డి లేకుండఁ జేసెను. నీరును, పూరియు లేక ఆలమందలు మలమల మాడిపోవుచుండెను. త్రిమూర్తులు బలిజవేషములలో వచ్చి, కాటమరాజుతో దక్షిణాదిని నెల్లూరిసీమలో వలసినంత పచ్చికయు, నీరును లభించుననియు, నాలమందల నటకు మళ్లించుకొని పొమ్మనియుఁ దెల్పిరి. కాటమరాజు పద్మరాఘవునితో నాలోచించి, దక్షిణాది భూముల కేఁగ నిశ్చయించెను. తరువాత నతఁడు ధనముకొండ కేఁగి, పినతల్లి సరిదేవితోను, అయితమరాజాది సోదరులతోను, తన దక్షిణాదియాత్రనుగుఱించి చెప్పెను. పోలురాజు నాఁటి ప్రాఁతపగలు తిరుగఁదోడునేమోయని సిరిదేవి మిక్కిలి భయపడి అతనిని వారింపఁ జూచెను. కాని కాటమరాజు వినలేదు. దక్షిణ

భూములకేఁగి, ముక్కంటివంశమువాఁడగు నల్లసిద్ధితోఁ బ్రాంతపగలు తీర్చుకొని వత్తునని ప్రతిజ్ఞపట్టి, తన మందను మరలించుకొని, పాలేటి యొద్దనకు వచ్చి చేరెను.

ఈ కథకు సంబంధించి నాకు రెండు తాళపత్రగ్రంథములు లభించినవి. రెండును నేకకర్తృకములే కాని, కవిపేరు తెలియవచ్చుట లేదు.

## 6.13.'పాలేటికథ' లేక 'గంగతర్కము' లేక 'గంగ-కాటమరాజు తరకవాదము':-

ఉత్తరాదినుండి కాటమరాజునకుఁగల 'కుదిరితే ఆరామడ, చెదిరితే పన్నెండామడ' విస్తరించియుండు మహాగోగణమంతయు వచ్చి, పాలేటియొద్దన విడిసెను. తాళ్లూరి మిట్టల దగ్గఱఁ గొన్ని మందలు, బొమ్మిరెడ్డిపల్లి మిట్టల దగ్గఱ మఱికొన్ని మందలు, ఇంకను గొన్ని మందలు చాకిరేవు మిట్టలు, ఆలవలపాటిరేవు, ముద్దుపాటిరేవు, మంగోలుపాటిరేవు, కోటపాటిరేవు, లింగాలకొండ కెదురుగాను విడిసినవి. ఈ మందలన్నిటిని బాలేఱుదాటించి, దక్షిణభూములకేఁ గవలెనని కాటమరాజు తలంపు. కాని యాదవుల కులదైవమగు గంగ, ఆ పాలేటికడ ప్రత్యక్షమై "నేను నీ కులదేవతను. నన్నుఁ బూజింపుము. నాకుఁ జేయెత్తి నమస్కరింపుము" అని హెచ్చరించును. కాటమరాజు ఆమెను లక్ష్యపెట్టక, "నీవు ఆడుదానవు. నీకు నేను చేయెత్తి నమస్కరింపను" అని సమాధానమిచ్చును. గంగయుఁ గాటమరాజును నిట్లెంతయోసేపు వాదించుకొందురు. గంగ యెంత భయపెట్టినను కాటమరాజు చలింపఁడు. అప్పుడామె పాలేటిని విపరీతముగాఁ బొంగించి, ఆలమందలు నదిని దాటుటకు వీలులేకుండఁ జేయును. కాటమరాజునకుఁ బ్రియమైన 'మట్టెపెయ్య' నొక గుండురాతిక్రింద దాఁచివేయును. అయినను కాటమరాజు గంగకుఁ జేయెత్తి మ్రొక్కఁడు. అంత గంగాదేవి పాలేటిలో నొక్క చుక్క నీరు లేకుండఁ జేయును. పశువులు త్రాగుటకు నీరులేక మూర్ఛపోవును. ఆ పశుఘోష వినలేక, కాటమరాజు గంగను బూజించుట కొప్పుకొనును. ఆమెకు జాతరలు చేయుటకును, కులదైవముగాఁ బూజించుటకును నంగీకరించి, చేయెత్తి మ్రొక్కును. అంత గంగమ్మ సంతసించి, మట్టెపెయ్య నిచ్చి, ఆలమందకుఁ బుష్కలముగా నీటి నొసంగెను. (మట్టెపెయ్య= బట్టచాఱలు గలపెయ్య.)

కాటమరాజు కథాచక్రమున మిక్కిలి ప్రచారమునున్న వీరగాథలలో నీ 'గంగతర్కము' కథ యొకటి. గంగజాతరలలో నీ కథను దప్పక పాడుచుందురు. గంగవేషము, కాటమరాజువేషము ధరించి, చేతిలోఁ గత్తులు పట్టుకొని సంవాదరూపమున దీనిని బాడునప్పుడు వినుట జీవితమున నొక అపూర్వానుభవము! రాయలసీమలో, ముఖ్యముగా కడప, కర్నూలు మండలములలో నిట్టి అనుభూతులు తఱచుఁ గలుగుచుండును.

ఈ పాలేటికథకు నాకు మూఁడు తాళపత్రగ్రంథములు లభించినవి. మూఁడును నొకే అజ్ఞాతకవి కృతములు.

## 6.14. ఎఱ్ఱయ్య తరకవాదము:-

ఇది కృష్ణామండలమున లభించిన మఱియొక నూతన వీరగాథ (తాళపత్రగ్రంథము). ఇతివృత్తము పైరీతిగనే యుండును. గాని, అందలి కాటమరాజు స్థానమును దీనిలో పెయ్యల యెఱ్ఱయ్య ఆక్రమించును. ఆలమందలో గంగ భయంకర వేషమునఁ బ్రత్యక్షమై యెఱ్ఱయ్యను భయపెట్టఁ జూచును. కాని యెఱ్ఱయ్య ఆమెను లెక్కచేయఁడు. తన్ను గొల్వుమని చెప్పు గంగను ఎఱ్ఱయ్య ధిక్కరించి ప్రశ్నించును. గంగ యెన్నియో మాయలు చూపును. ఎఱ్ఱయ్య చలింపఁడు. అంత గంగ మహాకోపముతో-

*"పోలురాజుపగలు పోకుండ నిలిపి*
*వారికి మీకును వైరంబు చేసి*
*సరివీర కల్లుగా సంపింతు నేను*
*ఏనుగులు గుఱ్ఱాలు ఎద్దులావులను*
*శానపశానలు సంపింతు నేను"*

అని ప్రతిజ్ఞపట్టి అదృశ్యయగును.

ఒక విధముగా, 'పాలేటికథ' సుఖాంతమని చెప్పవచ్చును. అందు గంగ చివరకు శాంతించి మాయమగును. కాని, ఈ 'ఎఱ్ఱయ్య తరకవాదము'లో గంగమాత్రము యాదవులను శపించి మాయ మగును. కావున దీనిని విషాదాంత మనవచ్చును.

## 6.15.'కాటమరాజు దక్షిణాది ఆవులమేపు' లేక 'జన్నివాడ కథ':-

ఈ కథకు మఱి నాలుగు పేర్లున్నవి: "దక్షిణాది ఆవులమేపు, ఆవుల మేలుపులు- దక్షిణకాండము, చదరంగంకథ, పుల్లరికథ" వీనిలో 'జన్నివాడకథ', 'పుల్లరికథ' అను పేర్లకుఁ బ్రాచుర్యమెక్కువ.

గంగకుఁ బాలేటికడఁ జేయెత్తి మ్రొక్కిన కాటమరాజు, తన ఆలమందలతోపాటు పాలేటిని దాడి, నెల్లూరిసీమ కేఁగినాఁడు. పోలురాజునాటి పగలు తీర్చవలెనని సోదరులతోఁ జెప్పినాఁడు. నెల్లూరును బాలించు నల్లసిద్ధిరాజుకడకుఁ దన మిత్రుఁడు పద్మరాఘవుని బంపి, "నీరున బుట్టిన పూరెల్ల మాది, ఆవుకు బుట్టిన కోడెల్ల మీది" అని రాగిశాసనములు వ్రాయించుకొని, పెన్నయొద్దునఁ గల రంగనాథస్వామి దేవాలయములోని దేవసాక్షులను బెట్టుకొని, నెల్లూరి పచ్చికబీళ్లలోఁ దన పశుగణమును మేపుకొనుచుండెను. కాటమరాజు ఆలమందలు పచ్చికబీళ్లనే కాక, నెల్లూరిసీమలోని వరిపొలములనుగూడ మేసివైచెను. పొలములలోని కాపులు నెల్లూరునకుఁ బోయి, నల్లసిద్ధిరాజు రెండవభార్యయగు కుందమా

దేవితో మొఱపెట్టుకొనిరి. కుందమాదేవి కాటమరాజుపైఁ గోపించి, ఆతని ఆలమందను బోయలచేఁ బొడిపింతుననెను. ఆమె యన్నగారు 'భావరాజు' అట్టి పని చేయవలదని చెల్లెలిని వారించెను. అందుచే నామె తన పెంపుడు చిలుకను ఆలమందలున్న తావునకుఁ బంపెను. ఆ చిలుక పలురకముల కూఁతలు కూయుచుఁ గాటమరాజుఆవులను బెదరించెను. ఆ యావులు విపరీతముగా భయపడి లేగలను ద్రొక్కుకొనుచు పరుగిడసాఁగెను. పద్మరాఘవుఁడు ఆ చిలుకను దన బాణముతో నేసెను. ఆ చిలుక కుందమాదేవికడకు వచ్చి ప్రాణములు విడిచెను. కుందమాదేవి ఆగ్రహావేశముతో కోయబోయలను బంపి కాటమరాజు మందను బొడిపించెను.

ఆలమంద రక్తము వఱదలై పాఱెను. గాయపడిన ఆవులు, ఎద్దులు జన్నివాడగుంటిచుట్టును జేరెను. గాయపడిన వానిని, చనిపోయిన వానిని జూచి కాటమరాజు శోకించెను. సభచేసి, సిద్ధిరాజును తోడితెమ్మని కంపటీలను పంపెను. సిద్ధిరాజు వచ్చుటకు ప్రయత్నింపఁగా కుందమాదేవి వారించెను. అతఁడు తన పరివారమును బంపెను. సత్యమును బలికింపుఁడని యాదవులు సిద్ధిరాజు పరివారమును సవాలుచేసిరి. కుందమాదేవి పెంపుడుకొడుకు పిన్నయ్య సత్యప్రమాణముచేసి చనిపోగా, తిక్కనమంత్రి వానిని తిరిగి బ్రతికించెను. ఆవులను వేసిన బోయల బాణములను యాదవులు భద్రపరచి తిక్కనమంత్రికిఁ జూపిరి. దేవతలు యాదవులయెడ పక్షపాతబుద్ధితో నున్నారనియు, తన్నవమానించిన మూఢశివభక్తులనే శివుఁడు కాపాడినాడనియు, తిక్కనమంత్రి యాదవులు చూపిన ప్రమాణములను తిరస్కరించెను. అప్పుడు– గోసంగివీరులు బోయల తలలు నఱికితెచ్చి సత్యము పలికించిరి. సిద్ధిరాజు బలములు పాఱిపోయెను. చెల్లెలు మాటలు విని భావరాజు గోహత్య చేయించెనని ప్రజలు సిద్ధిరాజుతోఁ జెప్పిరి. సిద్ధిరాజు భావరాజును బోయలను బంధించెను. మేడ ఎక్కుచుండగా సిద్ధిరాజునకు మెట్టు జాఱి కాలిగోరు విఱిగి బొటబొట రక్తము కాఱెను. గోహత్యాపాతకమే ఆ విధముగా గోరును చుట్టుకొనెనని 'అడప మాధవుఁడు' చెప్పెను. సిద్ధిరాజు తల్లియైన గుణమతిదేవి, రెండవ భార్యయైన కుందమాదేవిని విడిచి, పెద్దభార్యయైన త్రిభువనదేవిని ఏలుకొనుమని కుమారునకు హితవు చెప్పెను. యాదవులు తమ ఆలమందలతో నెల్లూరుకోటను ముట్టడించి ధ్వంసము చేసిరి. కాటమరాజు ఎఱ్ఱగడ్డపాటికి మరలిపోయి అక్కడ గుడారము లెత్తించెను.– ఇది 'జన్నివాడకథ'.

నాకు, ఈ కథాసంబంధమగు తాళపత్రగ్రంథము కృష్ణా మండలమున, కైకలూరుతాలూకా 'పెరికగూడెము' అను గ్రామములో గుజ్జర్లపూడి చింతాలు అను కొమ్ములవాని కడ 21-9-1964 నాఁడు లభించినది. దీనిలో నవతారికాభాగము, పుల్లరి యొప్పందపు విరములు లేవు.

### 6.15.1. 'జన్నివాడకథ'లో 'పుల్లరికథ':–

"పుల్లరికథ/ పుల్లరి ఒప్పందము/ కొలుకథ/ కొలు ఒప్పందము"– అను పేర్లతో నొక ప్రత్యేక వీరగాథ లేదు అని నేను భావించుచున్నాను. 'జన్నివాడకథ' అను 'కాటమరాజు దక్షిణాది ఆవులమేపు' కథకే 'పుల్లరికథ' అని కూడ పేరు. పుల్లరి ఒప్పంద వివరములు జన్నివాడ కథాప్రారంభములోనే ఉండును. కాని నేను సేకరించినకథలో మాత్రము అవి లేవు. ఇష్టదేవతాస్తుతి కవివంశాదికము కూడ లేవు. 1997లో డా॥ కనకబండి మోహనరావుగారు తమ 'కాటమరాజు చరిత్ర' అను గ్రంథములో ప్రచురించిన కథకు కూడ 'పుల్లరికథ' అను పేరు లేదు; 'దక్షిణకాండము' అని మాత్రమే ఉన్నది. కాని మోహనరావుగారి దానిని 'జన్నివాడకథ' అను పేరుతో ముద్రించినారు. దీనిలో నిష్టదేవతాప్రార్థన, కవివంశాదికము, పుల్లరి ఒప్పంద వివరములు 1144 మంజరీద్విపద పాదములలో (19 పుటలలో) స్పష్టముగా నున్నవి. కావ్యముపేరు "దక్షిణకాండము"– అనఁగా "కాటమరాజు దక్షిణాది ఆవులమేపు" దీని రచయిత– "కన్నెసిరుల గోత్రుఁడు, యదువంశ తిలకుఁడు, కనకబండి కొండయ్య నందనుఁడు అయిన గట్టయ్య (ఘట్టయ్య)". (ఇతఁడు 'పోలురాజుకథ'ను, 'కంసుఁడుకథ' లేక 'విష్ణుభాగవతము'ను కూడ రచించినాఁడు.) ఈ కథలో పుల్లరి ఒప్పంద వివరము లిట్లున్నవి:–

కాటమరాజు గంగతో పాలేటిఒడ్డున తర్కవాదము చేసిన తరువాత, ఆమెకు చేయెత్తి మ్రొక్కి, గంగజాతర జరిపించి, తన విస్తారమైన ఆలమందలతో పాలేఱుదాటి, తన పినతండ్రి పోలురాజు లింగరూపుడై వెలసిన పంచలింగాలకొండను దర్శించి పూజించినాఁడు. తన తండ్రిపగ తీర్చినట్లుగనే పినతండ్రిపగ కూడ తీర్చెదనని ప్రతిజ్ఞ చేసినాఁడు. అక్కడనుండి చిలకమఱ్ఱి దగ్గరనున్న చెఱకువాడకు వెళ్ళి, అక్కడివారి ఆశీస్సులందుకొనెను. తరువాత పాకనాటికి వచ్చి, నెల్లూరునకు తూర్పు దక్షిణ దిక్కులలో గుడారములెత్తించి, భేరీలు మ్రోగించినాఁడు. అదివిని అదిరిపడిన నల్లసిద్ధిరాజు తన మంత్రి భీమినీఁడును పన్నిద్దఱు దళములతోఁ బంపును. భీమినీఁడు పద్మరాఘవుని (పద్మనాయని) బాల్యమిత్రుఁడు. ఇరువురును ఆప్యాముగాఁ బలుకరించుకొందురు. తనతండ్రి చేసిన గోహత్యా దోషమును తొలగించుకొనుటకై తాను కాటమరాజుగారి ఆలమందలతో నుంటినని పద్మనాయఁడు చెప్పును. కాటమరాజు భీమినీని సత్కరించును. నల్లసిద్ధిరాజునకు ఎంత ధనమైనను ఇచ్చి పుల్లరి ఒప్పందము చేసికొనిరమ్మని కాటమరాజు పద్మరాఘవుని భీమినీనితో నెల్లూరునకు బంపును.

నల్లసిద్ధిరాజు దురాశతో నెన్నియో షరతులు పెట్టును; ఎన్నియో కోర్కెలు కోరును. తన నగరములో నీలకంఠుఁడు, పల్లికొండ,

సంగమేశ్వరుఁడు మున్నగు దేవతలకును; కస్తూరిసిద్ధిరాజు, ఎఱ్ఱసిద్ధిరాజు, పాపసిద్ధిరాజు, గోపాలసిద్ధిరాజు, కుమారసిద్ధిరాజు– మొదలైన తన తమ్ములకును పుత్రులకును వేలకొలది వరహాలను పుల్లరిగా చెల్లింపఁగోరును.

తన అక్క చెల్లెండ్రకు అరణముగా పదివేల వరహాలడుగును. "ఆకురాసే కరణానికి ఆరులక్షల వరహాలు" అడుగును. పద్మరాఘవుడు ప్రతి నియమమును మిక్కిలి ఓర్పుతో నంగీకరించి, నల్లసిద్ధిరాజుతో "మీరు ధర్మము తప్పరాదు. ఆడినమాట తప్పరాదు. మా ఆలమందలకు ఏ విధమగు హాని జరిగినను, ఏ కొంచెము హాని జరిగినను పుల్లరినీయము" అని నిష్కర్షగాఁ జెప్పును:–

*"తనువునా ధర్మంబు తప్పక మీరు*
*ఆడిన మాటలు ఆడి తప్పకుడి*
*కోడెల ఆవులకు కటకొ్రు దిగినాగాని*
*కోరిన పుల్లరి కొంచపోలేరు*
*ఆవుకాలు ఎద్దుకాలు అతిభారమైతేను*
*మీరు అడిగిన పుల్లరి మేము యిచ్చేది లేదు*
*ధరణీశ! మీ వల్ల ధర్మంబు దప్పిన*
*చాకవిండ్లవారు చెణికినాగాని*
*ధరపతీ! పుల్లరి యడుగ ధర్మంబుగాదు"*

– కాటమరాజు చరిత్ర (జన్నివాడకథ), పుట 138

తమ పుల్లరి ఒప్పందమునకు మానవసాక్షులు లేకుండ సకల దేవతలను, నదులను, నిధులను, పారేటి పెన్నను, భామ్యాకాశము లను, సూర్యచంద్రులను సాక్షులుగాఁ జెప్పును పద్మరాఘవుఁడు. నల్లసిద్ధిరాజు ఈ షరతులకు సాక్ష్యములకు అంగీకరించి, మంత్రి ఖడ్గతిక్కనచేత పుల్లరి కమ్మలు వ్రాయించి, దేవుని సన్నిధిలోనుంచి, పద్మరాఘవునకిచ్చును.

*"పారేటి పెన్న (సాక్షి) భైరవుని సాక్షి*
*సంగమేశ్వరుండు సదాశివుని సాక్షి*
*భూమి ఆకాశంబు బొంకని సాక్షి*
*హరిహరాదులు దేవతలు అయిసాక్షిగాను*
*కమ్మలు వ్రాసిరి ధరసాక్షిగాను*
*దేవుని ముందరకు తెచ్చిరి కమ్మలు*
*తీర్థప్రసాదముల్ తెఱగొప్ప నందిరి*

– కాటమరాజుచరిత్ర (జన్నివాడకథ), పుట 139,

ఈ పుల్లరి ఒప్పందము తరువాత నల్లసిద్ధిరాజు, కాటమరాజు గారి ఆలమందలకు నేవిధమగు హానియుఁ జేయరాదని తన వారిని హెచ్చరించెను.

ఇంతవఱకునుగల కథ 976 పాదములలోఁ జెప్పఁబడినది. 977 నుండి 1024వ పాదము వఱకునుగల 48 పాదములలో 'కాటమరాజు నల్లసిద్ధిరాజుపై పోలురాజు పగను తీర్చుకొనగోరుట, యాదవులు నెల్లూరిభూములలోఁ దమ కవులావులను మేపుట వర్ణింపబడినది. "వాదు దగ్గరకు వొచ్చింది శిద్ధిరాజులవారికి మనకు, పొందులు చేసికొనిపోరాదు మనము" నుండి – "ఆదూరి పెంట్రాల అన్నెబోయినవల్లి వేరగాను, యగవిడిసిరి కవులావుల యారాళముగను" వఱకును గల 48 పాదములు నేను సేకరించిన జన్నివాడకథతో సంవదించుచున్నవి. కాఁబట్టి నేను సంపాదించిన కథారచయిత కూడ కనకబండి ఘట్టయ్యయే అని తేలుచున్నది.

దీని తరువాత మోహనరావుగారి కథలో 122 పాదములలో నందివాడ బేతినీఁడును, చట్టువారి ఎఱ్ఱయ్య చంపుట అను సంఘటన చెప్పబడినది. ఇది నా కథలో లేదు. కాటమరాజులవారి ఆలమందలు యథేచ్ఛగా కడుపునిండుగా పచ్చిక మేసి, నీళ్ళు త్రాగుటకు 'నందివాడ చెఱువు' దగ్గఱకు వెళ్ళెను. అక్కడ "నన్నూరు మూకతో నందివాడ బేతినీడు" ఆలమందలను నీళ్ళు త్రాగకుండ నడ్డగించెను. చట్టువారి ఎఱ్ఱయ్య ఆగ్రహించి, కాటమరాజుగారి అనుజ్ఞ పొంది, ఆ బేతినీఁ డును అడ్డముగా నఱికెను. పిమ్మట "ఆ నెత్తురు వస్త్రములు నెల్లూరు కంపిరి". ఇక్కడితో మోహనరావుగారి కథ ముగిసినది. ఇది అసంపూర్ణము. మిగిలిన కథ అంతయు నేను సేకరించిన జన్నివాడ కథలో మిక్కిలి విస్తరముగా, సుమారు 3760 పాదములలో (94 పుటలలో) వర్ణింపఁబడినది. కాఁబట్టి పుల్లరి ఒప్పందముతోఁగూడిన సంపూర్ణమైన కథకే 'జన్నివాడకథ' లేక 'కాటమరాజు దక్షిణాది ఆవులమేపు' అని పేరు. దీనిని 'పుల్లరికథ' అని కూడ పిలిచెదరు.

## 6.16. 'భట్టురాయబారము' లేక 'కల్లిరాయబారము':–

ఎక్కువగాఁ బాడఁబడుచున్న కాటమరాజుకథలలో నిది యొకటి. దీనిని దొనకొండ గంగజాతరలోను, పాలేటి గంగజాతర (ఎఱ్ఱగడ్డపాడు దగ్గఱ)లోను బ్రతిసంవత్సరమును బాడుచున్నారు. దీనికి సంబంధించిన వ్రాఁత ప్రతులు మదరాసు GOML లో మూఁడున్నవి (డి.నెం. 1041, 1042, 1043). ఈ ప్రతులలో 'భట్టురాయబారము' అని యున్నను, జానపదులలో నీ కథకు 'కల్లిరాయబారము' అనియే ప్రసిద్ధి.

దీనికర్త యెవరో తెలియరాదు. బ్రౌనుదొరగారు ఒక వ్రాఁత ప్రతిలో దీనికర్త 'రాయశృంగావళి' అని వ్రాసినారు. ఇది తప్పు. రాయశృంగావళి యనువాఁడు నల్లసిద్ధిచేఁ గాటమరాజుకడకుఁ బంపఁబడిన భట్టు. దొరగారు పొరబడి యితఁడే దీని రచయితయని భావించిరి.

తన భూములలోఁ బశువులను మేపుకొని, పుల్లరినీయకుండ నెఱ్ఱగడ్డపాటికి వచ్చిన కాటమరాజుకడకు, నెల్లూరి నల్లసిద్ధిరాజు ఒక భట్టును రాయబారమంపెను. అతనిపేరు 'రాయశృంగావళి', బ్రాహ్మణుఁడు. అతఁడు కాటమరాజుసభకు వచ్చి పుల్లరి చెల్లింపుడని

యాదవులను గోరును. అతనికి సమాధానము చెప్పుటకై కాటమరాజు తన పక్షమున 'కొమార బంగారము' అను మఱియొక భట్టును సభకు రప్పించును. ఈ యిరువురు భట్లును దమతమ యేలికల పక్షమునఁ గాటమరాజు కొలువులో భాషించుకొనుట యీ వీరగాథలో సంభాషణాత్మకముగా రచింపఁబడినది. ఒక భట్టు భాషించిన పిమ్మట మఱియొక భట్టు భాషించుటగా నీ కథారచన సాగును. రాయ శృంగావళిభట్టు తన వాదమంతయును వినిపించి కడపట– "బుద్ధిమాలియు వెఱ్ఱిబుద్ధులు పోక, పెద్దఱికాల్ మాని పెట్టు పుల్లరిని" అనును. ఇతని వాదమునకు సమాధానము చెప్పి, కాటమరాజు పక్షమువాఁడగు కొమార బంగారభట్టు– "వదరక పలుమాఱు వసుధేశు నెదుట, కదలి రమ్మనుమి మీ కలవారినెల్ల" నను‌ను. ఇట్లొక్కొక్కఁడును దన యేలికనుగూర్చి, తమ బలసంపదనుగూర్చి వీరావేశముతో గొప్పలు చెప్పుకొనును. ఒకఁడు చెప్పుకొనిన గొప్ప మఱొకనికిఁ గోపకారణమగును. ఆ కోపముతో వారాడుకొనిన పలుకులయందు ఎన్నియో సామెతలు, పలుకుబళ్లు, దేశీయోపమలు కొల్లలుగా దొరలును. కడకు రాయశృంగావళి కోపముతో కాటమరాజుతో నిట్లనును:–

> *"దబ్బఱకాదు మా ధనమును నిపుఁడు*
> *గొల్ల వంకర బుద్ధి గొబ్బున మాని*
> *చెల్లించుమీ రాజ! చెడిపోక మీరు"*

ఈ మాటతోఁ గాటమరాజు ఉగ్రుడై లేచి, మాటి మాటికి 'గొల్లగొల్ల' యనుచున్న భట్టును జంపఁబోవును. ఆ భట్టు భయపడి పద్మనాయని చాటునకుఁ దప్పుకొనును. పద్మనాయఁడు కాటమ రాజును శాంతచిత్తునిఁ జేసి, భట్టునకుఁ గట్నాలిప్పించి పంపెను. యాదవులభట్టు తమవీరులందఱును యుద్ధమునకు సిద్ధముగా నున్నారనియు, సిద్ధిరాజు నెత్తిరమ్మనుమనియు రాయశృంగావళిని హెచ్చరించును. రాయబారము విఫలము కాఁగా, రాయశృంగావళి నెల్లూరునకు వెడలిపోయెను.

కాటమరాజు కథాచక్రమున నీ 'భట్టురాయబారము' నొక ప్రత్యేక పద్ధతిలోఁ బాడుదురు. దీనిని బాడుదురనుటకన్న 'చదువుదు' రనుట సమంజసము. ఇందు రాగ వైవిధ్యము లేక, భావగర్భితముగా నాయా భాగములకు యుక్తమైన 'ఊత' (accent) తో వచన కవిత్వములెఁ జదువుదురు. గాథాకారులు రెండు వర్గములుగాఁ జీలిపోవుదురు. ఒక వర్గమువారు నల్లసిద్ధిపక్షమునకుఁ జెందిన భట్టువలెను, రెండవ వర్గమువారు కాటమరాజుపక్షమునకుఁ జెందినభట్టువలెను నటింతురు. దొనకొండలో గంగగుడికి ముందు రెండరుగులున్నవి. ఈ అరుగులపై నీ భట్లు ఒకరికొకరు ఎదురుగా నిలబడి రాయబారముకథను కొనసాఁగింతురు. ఒక పక్షమువాఁడు ఒకభాగమును జదువఁగా, రెండవ పక్షమువాఁడు దానికి సమాధానముగా మఱియొక భాగమును జదువును. పిమ్మట మొదటి పక్షములో మఱియొకవ్యక్తి పాటనందుకొనును. దానికి రెండవ పక్షములోని వేఱొకవ్యక్తి సమాధానము చెప్పును. ఇట్లు భట్టురాయబారమంతయుఁ బాడుచుఁ గడు రమణీయముగాఁ బ్రదర్శింతురు. ఈ గాథాకారులు నిలబడి పాడెడి అరుగులను 'కల్లి అరుగులు' అని పిలుతురు. కల్లిరాయబార కథను పాడు అరుగులు కావున నీ పేరు వచ్చినది. ఎఱ్ఱగడ్డపాడు దగ్గఱ గంగగుడిలో జరుగు జాతరలో నీ కల్లిరాయబారముకథను పాలేటి మధ్యగల నల్లని గుండురాళ్లదగ్గఱఁ బాడుదురు. ఈ రాళ్లను 'కల్లిగుండ్లు' అందురు.

## 6.17. కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ:–

వేటూరి పరిష్కృతమగు కాటమరాజుకథలో నిది రెండవ అనుబంధముగా ముద్రింపఁబడినది. దీని వ్రాఁతప్రతులు మదరాసు ప్ర.ప్రా.లి.పు.భా.న గలవు. కవి అజ్ఞాతుఁడు.

ఇది భట్టురాయబారమునకుఁ దరువాత జరిగిన కథ. నెల్లూరి భట్టురాయబారము విఫలమైనది. కాటమరాజు యుద్ధసన్నద్ధుఁడు కాసాఁగెను. నల్లసిద్ధితోఁ దనకు రాబోవు యుద్ధములో సహాయపడ వలసినదిగా ధనముకొండలో నున్న తన సోదరుఁడు అయితమరాజు నకుఁ గమ్మవ్రాయుమని పద్మదనాయనితోఁ జెప్పును. కమ్మ వ్రాయుటకు వ్రాలాకులు లేవని పద్మనాయఁడు పలికెను. కాటమరాజు పంచలింగాలకొండకు దగ్గఱలోనున్న 'కోటపాడు' గ్రామములో మంచి వ్రాలాకులున్నవని తెలిసికొని, చుట్టువారి యెఱ్ఱయ్యను బిలిచి వానిని దెమ్మనెను. అతఁడా కోటపాటికిఁబోయి, తన్నడ్డగించిన అనేక వీరులను జయించి, వ్రాలాకుల మంచిచెడ్డలు తనకుఁ తెలియపోవుటచే నా తాటిచెట్టునే పెల్లగించి తెచ్చివేసెను. పద్మనాయఁడు కరణములచేఁ గమ్మలు వ్రాయించి, కాలారిచేతికిచ్చి దొనకొండలో నున్న అయితమరాజు కడకుఁ బంపెను.

అయితమరాజు తనకు వచ్చిన కమ్మయొక్క శుభాశుభము లెఱుఁగ గోరి ఫలములు నింపిన యొక పళ్లెరమున నా కమ్మనుంచి, ఛప్పన్నభాషలు తెలిసిన సిరిదేవిముందు పెట్టెను. ఆమె మొదట కమ్మను దాఁకక ఫలములను దాఁకినచో యాదవులకు శుభమనియు, నట్లుకాక కమ్మనే తాఁకినచో నశుభమనియు నతఁడు భావించెను. సిరిదేవి మొదట కమ్మనే ముట్టినది. కమ్మ చదివి వినిపించినది. కాటమరాజు నకు సహాయము చేయుటకై యెఱగడ్డపాటికిఁ బోవలయునని యెల్లరును నిశ్చయించిరి. బాలరాజులను (ముమ్మయ్య–పోచయ్యలను) మాత్రము ధనముకొండ రక్షణకై అచటనే నిలిపి, తక్కిన యాదవ వీరులందఱును నెఱ్ఱగడ్డపాటికిఁ దరలిపోయిరి.

కాటమరాజు తనకడకు వచ్చిన సోదరులను బంధువులను ఆహ్వానించి గౌరవించెను. కాశికిఁబోయిన భక్తిరన్న రాలేదని అందఱును నొకప్రక్క విచారించుచు, వేఱొకప్రక్క నల్లసిద్ధితో యుద్ధము చేయుటకై ఉవ్విళ్లూరుచుఁ బగవాటి పంతములు పల్కుచుండిరి. (ఈ

'కోటపాడు' నేఁటికిని బంచలింగాలకొండకుఁ దూర్పుగా మూఁడు మైళ్ళదూరమునఁ బాలేటి యొడ్డున నున్నది. నేను చూచితిని.)

ఈ కథనుగూర్చి వ్రాయుచు తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు, "ఇది యసంపూర్ణముగా మాత్రమే యుపలబ్ధమగుచున్నది. తక్కిన గ్రంథభాగము దొరకునేమో పరిశోధింపవలసిన యవసరమున్నది" అనిరి. ఇది ప్రామాదికము. వేటూరివారిచ్చిన అనుబంధములో నీ కథ సంపూర్ణముగనే యున్నది.

## 6.18. 'బొంగరాల కథ' లేక 'వేడుక బొంగరాల కథ':–

దీనికి 'ముమ్మయ్య–పోచయ్య బొంగరాలు', 'అలుగుల పోలు' అను మఱి రెండు నామాంతరములున్నవి. ఇది పల్నాటివీరకథా చక్రములోని బాలచంద్రుని బొంగరాలకథనుబట్టి వ్రాసినట్లుగా నున్నది. ఈ రెండు ప్రసిద్ధ వీరగాథాచక్రములును నొకే కవిసార్వభౌముని చేతినుండి వెలువడియుండుటచే నిట్టి కథాసామ్యములున్నవని తలఁపవచ్చును.

పోలురాజు మూఁడవ కుమారుఁడు ముమ్మయ్య. చిట్టినూక కన్నకొడుకును, నగుమంచి పెంపుడుకొడుకును నగువాఁడు పోచయ్య. ఈ మేనమామ–మేనల్లుఁడు– ఇరువురును గలసి ధనముకొండలో బొంగరములాడుట యిందు వర్ణితము. ఈ కథయొక్క తాళపత్రప్రతి చిత్తూరుజిల్లా, చంద్రగిరితాలూకా పెడకంటిపల్లెలోను, కాగితపు ప్రతులు కడపజిల్లా ప్రొద్దుటూరులో నొకటి, గుంటూరుజిల్లా, తెనాలి తాలూకాలో యడవూరులో మఱియొకటి నాకు లభించినవి. కాని వీనిలో నేదియు సమగ్రముగా లేకపోవుట దురదృష్టము.

అయితమరాజాదులు ఎఱ్ఱగడ్డపాడులో నల్లసిద్ధితో యుద్ధము చేయుచుండిరి. ధనముకొండలో నున్న ముమ్మయ్య పోచయ్యల కీ విషయము తెలియదు. సిరిదేవి వారించినను వారు వినక, 'దేవతా బొంగరాల'ను దీసికొని సంగడీలతోఁగలసి, చాలురావులకడ బొంగరాల నాడసాఁగిరి. మామయు నల్లుఁడును బందెములొడ్డి పంతముతో నాడసాఁగిరి. ధనముకొండలోని స్త్రీలు ఆ బొంగరాలాటను జూడవచ్చిరి. బాలరాజులు విసిరిన బొంగరమొక వైశ్యకాంతకుఁ దగిలి ఆమె మూర్ఛపోయెను. మూర్ఛనుండి తేరి, ఆమె బాలరాజులను దూషించెను. ఆమె దూషణనుబట్టి కాటమరాజాదులు ఎఱ్ఱగడ్డపాడులో యుద్ధముచేయుచుండిరని బాలరాజులు గ్రహించిరి. వెంటనే తల్లుల యనుమతిని గైకొని పాలేటికిఁ బయనమైరి. వారికిఁ గొన్ని దుశ్శకునములయ్యెను. ఆ శకునములనుగూర్చి మామ ముమ్మయ్య అల్లుఁడగు పోచయ్యను బ్రశ్నించెను. అల్లుఁడు ఆ శకునఫలములను జెప్పును. (ఇంతటితో నాకు లభించిన ప్రతులలోఁ గథ నిలిచిపోయినది).

ప్రొద్దుటూరులో శూలం రామగోవిందప్ప యను యాదవ గాతాకారుఁడు తరువాతి కథనిట్లు చెప్పినాఁడు. "బాలరాజులు పాలేటికి వచ్చుసరికి యుద్ధము పరిపూర్తియైనది. కాటమరాజు పంచలింగాలకొండపైకి బోవుచుండెను. ఈ బాలరాజులను జూచి, శత్రువులని భ్రమించి తన చేతనున్న బల్లెమును వారిపై విసిరెను. దానిచే బాలరాజులు కూలిపోయిరి. పిమ్మట కాటమరాజు వారిని 'ముమ్మయ్య–పోచయ్య'లుగా గుర్తించి, చేసిన పనికి విచారించి, తానును నాత్మహత్య చేసికొనెను. బాలరాజులిట్లు అలుగుచే నొఱగిపోయిరి కావున దీనికి 'అలుగుల పోలు' అని పేరు వచ్చినది".

కాని పై కథాపూరణము సత్యముగాఁ దోఁపదు. ఏలయన, 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' యను తరువాతికథలో ముమ్మయ్య, పోచయ్యలు యుద్ధముచేసినట్లుగా స్పష్టముగా వర్ణింపఁబడినది. 'బాలరాజుల యుద్ధము' అను పేరుతో వీరి యుద్ధమును వర్ణించుచు నొక ప్రత్యేకకాండ యున్నది. కావున ధనముకొండనుండి బయలుదేరిన బాలరాజులు ఎఱ్ఱగడ్డపాటికి వచ్చి, నల్లసిద్ధిరాజు సైన్యముతో యుద్ధముచేసి వీరస్వర్గ మలంకరించి రనుటయే బొంగరాల కథకు సరియగు పూరణము. ముమ్మయ్య–'ఉండవెల్లి విరిగోవు' అను శత్రువీరునితోను, పోచయ్య– 'తిర్ణమల తిప్పయ్య' యను పగవానితోను యుద్ధముచేసిరని ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో స్పష్టముగా నున్నది. ఈ బొంగరాలకథలో వలురాజునుండి పోలురాజువఱకును గల పూర్వవీరుల కథలన్నియును బ్రసక్తమగును.

## 6.19. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట:–

ఈ వీరగాథకు సంబంధించిన వ్రాంతప్రతులు మదరాసు ప్ర.ప్రా.లి.పు.భాం.న నాలుగున్నవి: (డి.నెం. 1031, 1032, 1033, 1034). ఈ నాలుగును 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' అను పేరుతోనే యున్నవి. ఇదే కథ 'కాటమరాజు చరిత్ర' యను పేరుతోఁగూడ రెండు ప్రతులలో నున్నది: (డి.నెం. 1040, 1044). ఈ ప్రతులలో డి.నెం. 1040 అనుదానిని వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరింపఁగా, నా గ్రంథాలయమువారు మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పీఠికతో 1953లోఁ బ్రకటించియున్నారు. (ఈ ప్రతులలోని నామమును జూచియే కాఁబోలును దీనికి 'కాటమరాజుకథ' అని పేరుపెట్టినారు. ఇది సరికాదు. దీనిని 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' అనుటయే సమంజసము. ఈ కథాచక్రమున నే యొక్క వీరగాథకును 'కాటమరాజుకథ' అను పేరు లేదు. ఆద్యంతమును కాటమరాజునకు సంబంధించిన వీరగాథలకుఁగూడ 'కాటమరాజుకథ' అను పేరు లేదు.) దీని రచయిత గంగుల పినయెల్లయ్య.

ఈ యెఱ్ఱగడ్డపాటి పోట్లాట నంతటిని నొకే వీరగాథగా భ్రమింపరాదు. ఇది యేడు కథల గుత్తి. ఈ యేడింటిని 'కాండలు' అందురు. ఈ కాండల వరుస క్రమమిట్లుండును:– 1) చల్లవారి జగడము, 2) బొల్లావు జగడము, 3) బీర్నీఁడు యుద్ధము, 4) అయితమరాజు– కతియావులరాజుల యుద్ధము, 4) బాలరాజుల

యుద్ధము, 6) ఆవుల యెద్దుల జగడము– ఎఱ్ఱయ్యల యుద్ధము, 7) కాటమరాజు యుద్ధము. గాథాకారులు ఈ యేడు కథలను వేఱువేఱుగనే పాడుచున్నారు. వేటూరివారు అన్నింటిని గలిపిఁ 'కాటమరాజుకథ' యని ప్రకటించుట సమంసజము కాదేమో!

ఈ యేడుకథలలోను మొదటి రెండుకథలకు నాకుఁ దాళపత్రగ్రంథములు లభించినవి. ఈ మొదటి రెండుకథలకే విశేష వ్యాప్తియున్నది.

### 6.19.1. చల్లవారి జగడము:–

(మాఘబహుళ అమావాస్య మంగళవారము నుండి ఫాల్గుణ బహుళ దశమి గురువారము వఱకును). దీనికి 'తిక్కనామాత్యుని కథ' యనియు, 'ఈర్లమానికథ' (=వీరుల మ్రాను కథ) యనియు రెండు నామాంతరములున్నవి. కాటమరాజు పినతల్లి కుమారులేడ్గురు గలరు: 'చల్లపిన్నయ్య, చల్ల గోవిందు, చల్ల అనంతుఁడు, కోనేరు, అచ్యుతుఁడు, పుణ్యుఁడు, వెంకటాద్రి'. వీరింటి పేరు చల్లవారు. యలమంచి కధిపతులైన వీరేడ్గురును మహావీరులు. వీరు యుద్ధములో మొట్టమొదటి ఠాణా నాక్రమించిరి. 'చాగలకొండ– చల్లగెరిగల' యొద్ద వీరి ఠాణా. ఈ చాగలకొండ, పంచలింగాలకొండకు దక్షిణముగా నిరువదినాల్గు మైళ్ల దూరమునఁ గలదు. నల్లసిద్ధి యీ ఠాణాను జయించి కాని, కాటమరాజున్న యెఱ్ఱగడ్డపాటికిఁ బోలేఁడు. ఈ చల్లవారు ఖడ్గతిక్కనతోను, నల్లసిద్ధితోను గావించిన యుద్ధమును వర్ణించు కథయగుటచే దీనిని 'చల్లవారి జగడము' అందురు. ఇది ఖడ్గతిక్కన్న చూపిన మహాశౌర్యమును బ్రదర్శించు కథయగుటచే, దీనిని 'తిక్కనామాత్యునికథ' యనియుఁ బిలుతురు. చల్లవారిపక్షమున ఖడ్గతిక్కనతోఁబోరి మరణించిన 'బ్రహ్మరుద్రయ్య' యను శివబ్రాహ్మణుని గౌరవార్థము యాదవులు జమ్మిచెట్టు క్రింద యజ్ఞము చేసి, అతనికి 'వీరబోనము' నర్పించి, బ్రహ్మహత్యా దోషమును బాపుకొనిరి. జమ్మిచెట్టునకు 'వీరవృక్ష'మని పేరు. అనఁగా 'వీరుల మ్రాను'. పదాది 'వ' కారము లోపించుట జానపదుల భాషలోఁ గానవచ్చు నొక ముఖ్యలక్షణము. 'వీ' లోని వకారము లోపించి, 'ఈరుల మాను>ఈర్లమాను' అయినది. యాదవులు జమ్మిచెట్టుక్రింద బ్రహ్మరుద్రయ్యనుగూర్చి యజ్ఞముచేసిన కథ కావున దీనికి 'ఈర్లమాని కథ' అని కూడ పేరువచ్చినది.

కాటమరాజు కథాచక్రములో ఖడ్గతిక్కనకథకున్న లోకవ్యాప్తి మఱియే కథకును లేదు. ఇతఁడు పుట్టుకచే బ్రాహ్మణుఁడైనను, గొప్ప క్షాత్రమును బ్రదర్శించుటచే నితనికింత పేరు వచ్చినది. చల్లవారిని జూచి భయపడుచున్న నల్లసిద్ధిని, దన్ను యుద్ధమునకుఁ బంపుమని రణతిక్కన కోరుట, తిక్కన్న చాగలకొండ దగ్గఱ నున్న చల్లవారి ఠాణాకు వచ్చుట, అతఁడు చల్లవారితోఁ బోరి, సైన్యము నష్టము కాఁగాఁ దిగిరి నెల్లూరు చేరుట, తల్లిండ్రులును భార్యయు నతనిని అవహేళన చేయుట, ఖడ్గతిక్కన రెండవమారు యుద్ధమునకు వచ్చుట, చల్లవారు బ్రహ్మహత్యాదోషమంటునని భయపడుట, చల్లవారిమంత్రి బ్రహ్మరుద్రయ్య యను శివబ్రాహ్మణుఁడు ఖడ్గతిక్కనతోఁ బోరుట, వారిరువురును మరణించుట– తిక్కనకథలోని ప్రధానాంశములు. ఖడ్గతిక్కన– బ్రహ్మరుద్రయ్య యిరువురును మాఘమాసమున అమావాస్య తిథిని మంగళవారము మధ్యాహ్నవేళ మడిసిరని కథలో నున్నది. వీరిరువురియుద్ధము లోకోత్తరముగా వర్ణింపఁబడినది. తెలుఁగు సాహిత్యమున వ్రేళ్లపై లెక్కింపఁదగిన యుద్ధవర్ణనలలో నిది యొకటి:–

*"అప్పుడు తిక్కన్న యగ్ని చందమునఁ*
*గదిసెను గోపాగ్ని కన్నుల నురల*
*నందలించి రుద్రుని నడ్డాన వైచె*
*వడి రుద్రుఁడంత నా వాటు దప్పుకొనెఁ*
*గరవాలు గైకొని కదిసె రుద్రుండు*
*విడిబడి రిద్దఱు వీరయుద్ధమున*
*ధరణిపై నొండొరుం దప్పించుకొనుచు*
*లంఘించి వెనుకకు రాగడిల్లుచును*
*బ్రాకుచు దూఁకుచుఁ బైకి రేఁగుచును*
*దాటించి నఱుకుచుఁ దాఁకి పొడ్చుచును*
*నురవడితో వచ్చి పరువడి సేసి*
*కటపెట ఖంఖంగ ఘల్లుఘల్లనుచు*
*మెఱుపులవలె మీఱి మెఱయుచుఁ బిడుగు*
*చఱపులవలె గొప్ప సడిని వ్రేయుచును*
*నిర్వురు పోరిరి దుర్వారులగుచుఁ*
*దిక్కఁడుద్రిక్తుఁడై తెగవ్రేయ రుద్రుఁ*
*దక్కడఁ జెక్కలై యవనిపై బడియెఁ*
*బడుచునే రుద్రుఁడాపక ఖడ్గధారఁ*
*దడయక యా మంత్రితలఁ ద్రుంచివైచె"* [69]

ఇట్లు సజీవుఁడైన ఖడ్గతిక్కనయే కాదు, విగతజీవుఁడైన ఖడ్గతిక్కనకూడ మహాశౌర్యమును బ్రదర్శించెను. ఖడ్గతిక్కనతండ్రియగు సిద్ధనామాత్యుఁడు, కుమారుని మరణమును విని యుద్ధభూమికి వచ్చి, యాతని కళేబరమును గనుగొనజాలక వెదకుకొనుచుండెనఁట. అప్పుడు తెగిపడిన తిక్కనకండలు పౌరుషముతో నెగిసెగిసి పడుచుండెనఁట. శరీరమంతయు రూపఱి ముక్కలు ముక్కలగు వఱకును బోరిన మహాశూరుఁడు ఖడ్గతిక్కన! వీరజనకుఁడగు సిద్ధన ఆ కండలనే మూటగట్టుకొని నెల్లూరి కేఁగినాఁడు:–

*"జలనిధిలో మీనముల్ చలియించునట్లు*
*నెత్తుటి వఱ్ఱులోఁ దుత్తునియలుగఁ*
*దిక్కన్న కండలు తేలాడుచుండె*

*నెగిసెగిసి పడుచుండె నీవలావలకుఁ*
*గనుగొని యవిసూచి కన్నీరుగార్చి*
*కావిధోవతిని నా కండలు పొదివి*
*యాతఁడు నెల్లూరి కప్పుడేతేరఁ"* [70]

ఇట నొక ముఖ్యవిషయము గమనింపవలసి యున్నది. యాదవకవులు యాదవుల ప్రత్యర్థియైన ఖడ్గతిక్కన శౌర్యమునుగూడ నింత ప్రశస్తముగా వర్ణించిరి. ఇది వీరగాథల చరిత్రలో నపూర్వ విషయము. సాహిత్యమున, ముఖ్యముగా వీరగాథలలో నిట్టి నిష్పక్షపాత వైఖరి మఱియెచ్చటను గానరాదు. ఇది యాదవుల హృదయ నైర్మల్యమునకు మచ్చుతునుక!

ఇట్లు ఖడ్గతిక్కన- బ్రహ్మరుద్రయులు పరస్పరము ఖండించుకొని మరణించిన తరువాత నల్లసిద్ధియే స్వయముగాఁ జల్లవారిపై దండెత్తి వచ్చును. చల్లవారు గొప్పయుద్ధముచేసి, నల్లసిద్ధి సోదరుఁడగు కొమార సిద్ధిరాజును గూల్తురు. అంత కస్తూరి సిద్ధిరాజు విజృంభించును. చల్లవారేడ్గురును ఆతనితోఁ గొంతతడవు పోరి మరణించిరి. ఇక్కడితోఁ జల్లవారి జగడము పూర్తియగును. దశమి గురువారమునాఁడు చల్లవారు చనిపోయిరఁట. ఈ దశమినుండి మరల వరుసగా నమావాస్య వఱకును యుద్ధములు చెప్పఁబడినవి. కాటమరాజు యుద్ధము అమావాస్యనాఁడు జరిగినదఁట. అనఁగా ఖడ్గతిక్కన యుద్ధమునకును కాటమరాజు యుద్ధమునకును సరిగా నొక నెలరోజుల వ్యవధానమున్నది. ఖడ్గతిక్కన యుద్ధము మాఘమాసమున నమావాస్య మంగళవారమునాఁడు కాఁగా, కాటమరాజు యుద్ధము ఫాల్గుణ మాసమున నమావాస్య మంగళవారమునాఁడు జరిగియుండునని యూహింపవచ్చును. కాఁబట్టి చల్లవారి జగడము దశమి గురువారమునాఁడని వీరగాథలోఁ నున్నదానినిబట్టి, అది ఫాల్గుణ బహుళ దశమియని యూహించుట సమంజసము. వీరగాథలనుబట్టి యీ సంవత్సరము పేరు 'చిత్రభాను'. ఖడ్గతిక్కన మరణమునకును చల్లవారి మరణమునకును చాల వ్యవధానమున్నది. దాదాపు 25 రోజుల యెడమున్నది. ఈ వ్యవధానములో నల్లసిద్ధి వివిధ రాజన్యులనుండి సైన్యములను సమకూర్చుకొని యుండును. మాఘబహుళ అమావాస్య మంగళవారము ఖడ్గతిక్కన బ్రహ్మరుద్రయ్యలు మరణించిన రోజు. అనఁగా ఖడ్గతిక్కన మొదటి దండయాత్ర యీ యమావాస్యకుఁ బూర్వమే జరిగినది. బహుశః చతుర్దశినాఁడు జరిగియుండును. వీరగాథనుబట్టి రెండు దండయాత్రలకును నొక్కరోజు కన్న నెక్కువ వ్యవధానము లేదు.

ఈ వీరగాథలో ఖడ్గతిక్కన చాగలకొండ దగ్గఱ చల్లపిన్నమనేని మంత్రియగు బ్రహ్మరుద్రయ్యతోఁ బోరి మరణించినట్లున్నది. కాని పట్టపురావి కైఫీయతులో నీ ఖడ్గతిక్కన వృత్తాంతము భిన్నముగా నున్నది. తిక్కన మొదటి యుద్ధము పట్టపురావి గ్రామమునకు ఈశాన్యముగాఁ బరుగుదూరమునఁ బెన్నానదికి ఉత్తర భాగమందుఁ గల సోమశిల పట్టణము దగ్గఱ జరిగినట్లున్నది. ఈ మొదటి యుద్ధమున నితఁడు చల్లవారితోఁ బోరినట్లు లేదు. కాటమరాజుతోను, కఱియావులరాజుతోను బోరినట్లున్నది. ఖడ్గతిక్కన అపజయము నొంది, నెల్లూరునకుఁ బోయి తిరిగి సైన్యముతో వచ్చినప్పుడు చేసిన రెండవ యుద్ధముకూడ సోమశిల పట్టణము నొద్ద పెన్నానదీ తీరముననే జరిగినట్లున్నది. ఈ రెండవ యుద్ధమున ఖడ్గతిక్కన కాటమరాజును, కఱియావులరాజును, వారి సహాయముగా వచ్చిన చల్లవారిని విఱుగఁబొడిచి, పట్టపురావి గ్రామమునకు ఉత్తరమునఁ గల పెన్నానదీ తీరము వఱకును వారిని దఱిమికొట్టినట్లుగాఁ గలదు. అక్కడ దైవబలము చాలక తిక్కన మరణించినట్లుగాఁ జెప్పఁబడినది. ఖడ్గతిక్కన మరణించిన యా ప్రదేశమును 'తిక్కనపాడు' అని నేఁటికిని బిలుచుచున్నారఁట. అక్కడ గుట్టముపై నధిరోహించిన ఖడ్గతిక్కన విగ్రహముకూడఁ గలదు (చూ. 'కాటమరాజుకథ'కు మల్లంపల్లివారి పీఠిక, పుట- xix). వీరగాథలోఁ జెప్పఁబడిన చాగలకొండ ప్రదేశముగాని, బ్రహ్మరుద్రయ్య పేరుగాని యీ పట్టపురావి కైఫీయతులో లేవు. తిక్కన మొదటిసారి చేసిన యుద్ధము చల్లవారితోఁ జేసినట్లుగా లేదు.

### 6.19.2. బొల్లావు జగడము: (ఏకాదశి):-

మాఘమాసమున నమావాస్య మంగళవారమునాఁడు ఖడ్గతిక్కన బ్రహరుద్రయ్యల యుద్ధము జరిగినట్లును, దశమి గురువారమునాఁడు చల్లవారు రణమునఁ గూలినట్లును వెనుకటి వీరగాథలో నున్నది. అనఁగా, చల్లవారు ఫాల్గుణ బహుళ దశమి గురువారమునాఁడు చనిపోయినారని తలంపవచ్చును. ఈ బొల్లావు జగడము ఏకాదశినాఁడు జరిగినట్లుగా నున్నది. అనగా ఫాల్గుణ బహుళ ఏకాదశి శుక్రవారమని యూహింపవచ్చును.

చాగలకొండ ఠాణాలోఁ జల్లవారు మడియఁగా, నల్లసిద్ధిరాజు తన సైన్యముతో మఱికొంత ముందునకు నడచి 'అడ్డావుకట్ట' కడ నిలిచెను. అతని అపార సేనావాహిని "దిరిసెల, కఱియెద్దు కురువ, ఆదూరు, పెంట్రేల, అన్నెబోయినపల్లె, ఈదల భీమవరము, చీమపెంట, చిటిమడుగుపాడు, ఆఱుమూఁడు గుళ్లు, మారినీనిపల్లె, మంగల్లిపాడు, దామిసెట్టి చెఱువు, కంపమడుగుపాడు, గుజ్జర్లవాగు, వెలుగోడు"- మొదలగు ప్రదేశములందు విడిసినది. ఆ నల్లసిద్ధి సైన్యములోఁ గొన్ని అపశకునములైనవి. యుద్ధమునఁ దమ సైన్యములన్నియు మడియఁగలవని సంధ్యగోపాలుఁడు ఆ శకునములను వివరించెను. కాని వీరనాయకులు అతని మాటలను లెక్కింపలేదు.

ఆనాఁడు ఏకాదశి, పల్లికొండ నాఁటియుద్ధము బొల్లావు వంతని గ్రహించెను. యాదవులు బొల్లావు నలంకరించి, యుద్ధము చేయవలసినదిగాఁ బ్రార్థించిరి. అవతారమూర్తియగు నా బొల్లావు

వారిప్రార్థన నంగీకరించి, నల్లసిద్ధిసేనపైఁ బడదుమికి, వేలకొలఁది భటులను బరిమార్చి, వీరులను నేలఁగూల్చెను. ఇట బొల్లావు చేసిన ఘోరయుద్ధము అత్యద్భుతముగా వర్ణింపఁబడినది:-

*"ఘన రౌద్రకోపమున ఘంట మువ్వలును*
*జలరేగి మ్రోగంగఁ జౌకళింపుచును*
*ఘల్లునఁ బై దూకె ఘనులఁ బడఁ దాకె*
*లేవకుండగఁ ద్రొక్కి రేచి కోపాన*
*నాదుటందెలు మ్రోగ నాల్గు పాదములఁ*
*బాదాలు తాటించెఁ బగతుర పైనఁ*
*దన్నె సమ్మెట వ్రేట్లు తాకిన యట్లు*
*పఱియలై పుఱ్ఱెలు పడఁగ నాదాడ*
*బ్రద్దలై గుండెలు వఱగంగ దళము*
*పొడమాపి పగతుర బొల్లియావపుడు*
*సుడిసి తన్నఁగఁ బ్రేవు చుట్టుకొని వచ్చెఁ*
*గొందఱు విల్మొక గుంపులై యున్నఁ*
*గొమ్ము చక్కఁగ వంచి కుదురుగాఁ బొడిచె*
*పెడమొగంబుగ వెంటఁ బ్రేగులు వెళ్ల*
*వాలము మెడఁజుట్టి వడి నేలఁగొట్టి*
*పాలేట గంగభూపాలునిఁ జంపె*
*నందికనుమ నాగరాజు నడికలనఁ జచ్చెఁ*
*గొందఱు మన్నీలు గుట్టలై పడిరి*
*యెడలేక చంపెను వెస నాదిమూర్తి"* [71]

ఈ విధముగా యుద్ధముచేయుచున్న బొల్లావునుజూచి నల్లసిద్ధిసైన్యములు పరుగుపెట్టినవి. బెదరి పాఱిన సేన తమ యేలికయగు సిద్ధిరాజుతో మొఱవెట్టుకొనెను. బొల్లావుయొక్క బొద్దుగంట మాహాత్మ్యమును సంధ్యగోపాలుఁడు నల్లసిద్ధి కెఱింగించెను. కాని నల్లసిద్ధి దానిని లెక్కసేయక, గొప్పవీరులను గొందఱిని ఏఱి ఆ బొల్లావుపైకిఁ బంపెను. మాయోపాయమున నా యావు వీరులను జంపినది. పాఱివచ్చిన కొందఱువీరులు బొల్లావు గొప్పతనమును నల్లసిద్ధి కెఱింగించిరి. సిద్ధిరాజు వారి ప్రశంసను విని మండిపడి బొల్లావుపైకి బోయవీరులను బంపెను. ఆ బోయలు బొల్లావుతో నొక రేయి ఒక పగలు యుద్ధముచేసి, బల్లెములతో దానికి బలమైన గాయములు చేసిరి. అప్పుడు బొల్లావు శౌర్యము అభిమన్యుని శౌర్యమువలె నతిలోకసుందరముగా వర్ణింపఁబడినది:-

*"పెక్కు ముంగిసలతోఁ బెద్ద శేషుండు*
*సాహసంబున బోరు చందాన నావు*
*కొమ్ములఁ జిమ్ముచు గొరసెల మట్టి*
*యాకొని బొల్లావు అలుగులఁ దినుచు*
*దాహంబుగొని రక్తధారఁ ద్రావుచును*
*ధీరులౌ బోయల దిండ్లు ద్రిప్పుచును*
*వింతగాఁ బున్నమ వెన్నెలగాయ*
*నంతంత బిల్లదీపు లాడినయట్లు"* [72]-

-యుద్ధము చేయుచుండెను. బొల్లావు జగడమునకు నమరులు మెచ్చి కనకరథమును బంపిరి. ఏకాదశిరోజున నిరువదియేడు గడియలకు **"కరివరదు దంపిన కనకరథమెక్కి, యరిగెను బొల్లావు నా విష్ణుకడకు."**

కొమ్ములవారు చాలతఱచుగాఁ బాడెడి వీరగాథలలో నీ 'బొల్లావు జగడ' మొకటి. తానకముల రోజున దీనిని తప్పక పాడుదురు.

### 6.19.3. బీరినీఁడు యుద్ధము: (ద్వాదశి):-

ఫాల్గుణ బహుళ ఏకాదశినాఁడు బొల్లావు వైకుంఠమేఁగఁగా, ద్వాదశినాఁడు బీరినీఁడు యుద్ధము చేసెను. (ఆ రోజు శనివారము కావలెను). ఇతఁడు 'మంగల్లిపాడు' ఠాణ్యమున వేచియున్న గోసంగి వీరుఁడు. ఆరువేల గోసంగి వీరదళమునకు నాయకుఁడు. కొంగవాలు కత్తి గోసంగివీరుల ఆయుధము. ఇతని తండ్రి 'మసిలినీఁడు' బల్లికురువ యుద్ధమున మరణించెను. తల్లి 'మారెమ్మ' సహగమనము చేసినది.

బీరినీని పుట్టుకనుగూర్చి కొమ్ములవారొక వింతకథను జెప్పుచుందురు. పార్వతీదేవి బీరతీఁగలలోఁ దన మైలబట్టను బడవేయఁగా బీరినీఁడు పుట్టినాఁడఁట. ఆ బీరతీఁగలలోని బాలుని సిరిదేవి పెంచినది. బీరతీఁగలలోఁ బుట్టుటచే బీరినీఁడని పేరిడిరి. ఇతఁడు యాదవుల ఆలమందలతోనుండు మాతంగివీరుఁడు (మాదిగ). ఇతనికన్న ముందు 'ఉలవన్న' యను మాలవీరుఁడు యాదవుల ఆలమందకడ నుండెడివాఁడు. తరువాత నతఁడు ఏ కారణముననో యాదవులకు దూరమైనాఁడు. ఆ 'ఉలవన్న'నుగూడ పోలురాజు భార్యయగు సిరిదేవియే పెంచినది. ఆమె తన కుడిచంటి పాలతో బీరినీని, నెడమచంటిపాలతో ఉలవన్నను పెంచినదఁట. కుడిచంటి పాలుత్రాగుటచే బీరినీఁడు యాదవులతోఁ గూడియున్నాడనియు, నెడమచంటిపాలు త్రాగుటచే ఉలవన్న ఎడముగాఁ బోయినాఁడనియు గాథాకారులు చెప్పుచుందురు.

బీరినీనితోపాటు 'చిన్నయ్య' యను మఱియొక గోసంగివీరుఁడును గలఁడు. వీరిరువురకును నిద్దరిద్దఱు తమ్ములుగూడఁ గలరు. "చిన్నగబ్బి, పెద్దగబ్బి- చిన్నయ్య తమ్ములు; పినరంతు పెదరంతు- బీరన్న తమ్ములు" అని గాథాకారులు పాడుచుందురు.

'అడ్డావులకట్ట' దగ్గఱ బొల్లావు మరణింపఁగా, నల్లసిద్ధి సైన్యములు ఆ ఠాణాను గడచి, మఱికొంత ముందుకు నడచి, మంగల్లిపాటికి వచ్చి నిలిచెను. సిద్ధిరాజురాకను జూచి బీరినీఁడు తన గోసంగివీరులను బిలిచెను. నాలుగువేల గోసంగులు వచ్చి

బీరన్నను గీర్తించిరి. బీరన్న యా గోసంగివీరులతోఁ గలసి, అయితమరాజు కడకేగి యుద్ధమున కనుజ్ఞవేడెను. తరువాత వీరభద్రునిఁ బ్రార్థించి, యాతని విశ్వరూపమును బొంది, తన కత్తిపదును చూచుటకై యొక మద్దిమానును నఱికినాఁడు. (గంగ జాతరలో 'మద్దిమాను నఱుకుట' యొక్క ముఖ్యభాగము. బీరినీఁడు వేషమువేసినవ్యక్తి కత్తిని జేతఁబట్టి, ఊరి బయటకుఁ బోయి, అట భూమిలోఁ బాతఁబడియున్న అరఁటి బోదెను నఱకును.) తరువాత తన గోసంగులతోఁ గలసి నల్లసిద్ధి సైన్యముపైఁ బడెను:-

*"బారులై యుండెడు బలములఁ జూచి*
*యుగ్రుఁడై బీరన్న యుఱిమి తాఁజూచి*
*చేతి పట్టకత్తి చెలఁగి జళిపించె*
*తళుకు తళ్కున మెఱసెఁ దందర కుదువ*
*బాతుపై నెగసేటి భైరవువలెను*
*గొదకొని బీరన్న గోసంగు లంత*
*మదగజంబుల మీఁద మతివేగఁ గదిసి*
*కదిసిన యా భద్ర గజముల నెదిరి*
*మసిలమ్మ పుత్రుఁడు మార్కొని నిలిచి*
*యదలించి మెరువడి నంజె తాటించి*
*దట్టించి యందెలు ధళధళ యనఁగ*
*నేటికి మత్స్యంబు లెదురెక్కినట్టు*
*కొండలై వచ్చేటి ఘోరగజములను*
*దొండముల్ తెగ నఱుకఁ దునియులై రాలి*
*మొండెము లెగుర నని మొఱవెట్టుచుండు"* [73]

ఇట్లు ఘోరరణము చేయుచున్న గోసంగివీరులను జూచి, నల్లసిద్ధిరాజు కలవరమంది, తన సరదారుల పరాకును బాపెను. వారును నుత్సాహపూరితులై గోసంగులపై విజృంభించిరి. గోసంగులును బీరినీఁడును గొంతతడవు యుద్ధము చేసి-

*"కుడియెడమ నొఱగిరి గోసంగులంత*
*జాగిలాల్ బీరన్న సరసను నొఱగె*
*దండి గోసంగులు ద్వాదశినాడు*
*వైకుంఠమునకై వఱగి రావేళ*
*బీరన్న చెల్లెను బృథ్వి కంపింప"* [74]

బీరినీఁడును గోసంగులును మరణించుసరికి ప్రొద్దు క్రుంకెను. నల్లసిద్ధి, అట దగ్గఱలోనున్న 'కొప్పుకొండ'లో గుహలెక్కువగాఁ గలవని విని, అట విశ్రమింపఁదలంచి, తన సైన్యముతో నా కొండకడకేఁగెను. ఆ కొండదగ్గఱ కాచియున్న 'కొమ్ము కసినేఁడు', తలికొండ పాడులో నున్న 'దార సంబినేఁడు' అను వీరులిర్వురు నల్లసిద్ధి నెదిరించిరి. వీరును కాటమరాజు పక్షమునకుఁ జెందిన గోసంగి వీరులే. వీరితోఁ బోరుసరికిఁ దెల్లవారెను.

## 6.19.4. అయితమరాజు కఱియావులరాజుల యుద్ధము: (త్రయోదశి):

బీరినీఁడు యుద్ధము తరువాత, మఱునాఁడు అయితమరాజు కఱియావులరాజుల యుద్ధము జరిగినది. కావున దీనిని ఫాల్గుణ బహుళ త్రయోదశి ఆదివారముగా నూహించుట యుక్తము.

నల్లసిద్ధిరాజు సైన్యముతోఁగూడి చాగలకొండ, అడ్డావుకట్ట, మంగల్లిపాడు ఠాణాలను జయించి వచ్చుచున్నాఁడని తెలిసి, యెఱ్ఱగడ్డపాడులోని యాదవులు యుద్ధసన్నద్ధులైరి. అయితమరాజు, కఱియావులురాజు వంటి తక్కిన సోదరులతోఁ గలసి కాటమరాజు కడకు వచ్చెను. తామందఱును యుద్ధమున మరణించినచోఁ దమ యాదవవంశము నాశముకాకుండ, నయితమరాజు పుత్రుఁడగు అల్లుదాడెన్నకు నాలమందనిచ్చి, గోపాలకులతోసహా కటకమునకుఁ బంపివేసిరి. యుద్ధము చేయవలసిన వీరులుమాత్రము ఎఱ్ఱగడ్డపాడులో నిలిచిరి. అయితమరాజు కోరికపై మంత్రి పల్లికొండ యాదవ వీరులకు ఈ క్రింది విధముగాఁ బగల నేర్పాటు చేసెను. ఏ వీరుఁడు ఏ వీరునితోఁ బోరాడవలెనో నిర్ణయించుటయే 'పగల యేర్పాటు'. (నేఁడు ఆటలపోటీలలోఁ జేయు నేర్పాటువంటిదే యీ పగల యేర్పాటు.)

| | | |
|---|---|---|
| కఱియావులరాజు | × | ఎఱ్ఱసిద్ధిరాజు |
| భట్టావుల వల్లభన్న | × | పాపసిద్ధిరాజు |
| అయితమరాజు | × | గండగోపాలరాజు మఱియు కస్తూరి రాజు |
| ముమ్మయ్య | × | ఉండవెల్లి విరిగోవు |
| నేతివారి ముద్దయ్య | × | పెదవేగి భావరాజు, పెదవరుడరాజు |
| నాచకూళ్లనాయఁడు | × | గుత్తి భీముఁడు |
| పోచయ్య | × | తిర్ణమల తిప్పయ్య |
| కొండవారి కొండయ్య, గోవుల గంగయ్య | × | నల్లసిద్ధి సైన్యము |

అయితమరాజు మూఁడు నదులు కలిసిన కైలాస సమమగు ఘనగంగలో 'కన్నిక గుండము'లో స్నానముచేసి, అతిభక్తితో శివపూజ చేసి, శివుని ప్రార్థించి, 'అనికి ముస్తీబగుట' (యుద్ధ సన్నద్ధుఁడగుట) అద్భుతముగా వర్ణింపబడినది:

*"శరణు గిరిజనాథ! శరణు లోకేశ!*
*శరణయ్య భూదేవ! శరణు పరమేశ!*
*భవదూర! త్రిపురారి! భక్తమందార!*
*నందివాహనుఁడ! యానంద! భూతేశ!*
*యిందుశేఖర! మాకు నిహపరము లిమ్ము!"*

*అని మ్రొక్కి పరమేశు నపుడు ప్రార్థించి*
*అనికి ముస్తీబాయె నయితమరాజు*
*చల్లడమును దొడిగె సరిప్రొద్దువేళ*
*నొనర శ్రీగందంబు నొప్పుగాఁ బూసె*
*ఆలంబునను గుండ్లు నాయుధంబులును*
*నఱికినఁ దెగకుండ నటు తూఱకుండ*
*వజ్రాంగి తొడిగెను వల్లపులరాజు*
*వింతగా శిరమందు వీరజడ యల్లి*
*విరజాజులు తుఱిమి వేడుక మీఱ*
*పరఁగ మాణిక్యాల పతకంబుఁ దాల్చి*
*పచ్చల కడియముల్ పసిఁడుంగరములు*
*మెచ్చైన నేవళము మెడనూలు వేసి*
*అడపకాఁడంతట నాకు చుట్టీయఁ*
*బనుపడి తేజీల పల్లంబు గట్టఁ*
*బయనంబు కాఁగను పట్టపురాజు"* [75]

ఇదే విధముగాఁ గఱియావులరాజు యుద్ధ సన్నద్ధతకూడ వర్ణింపబడినది.

ఇట్లు అయితమరాజు తమ్ములతోను మఱఁదులతోను యుద్ధ సన్నద్ధుఁడై, 'అపర సరస్వతి' యను భట్టును సిద్ధిరాజుకడకుఁ బంపి యుద్ధమున కాహ్వానించెను. నల్లసిద్ధిరాజు సైన్యములును నయితమరాజు సైన్యములును రణరంగమున ఢీకొన్నవి. ఆ సమయమున గాటమరాజును, పద్మరాఘవుఁడును 'కనక తమకము' పైఁ గూర్చుండి, పగడసాల నాడుచుందురు. ఈ యాటను వారు యాదవుల యుద్ధముతోఁ బోల్చి యాడుదురు.

ఈ అయితమరాజు యుద్ధము 13 పుటలలో 400 మంజరీ ద్విపద పాదములలోఁ జక్కగా వర్ణింపఁబడినది. దీని చివర కఱియావులరాజు ఎఱ్ఱసిద్ధిరాజును జంపుట తెలుపఁబడినది:-

*"ఎఱసిద్ధిరాజెక్కు నేనుఁగు మీఁదఁ*
*గరియావులన్న తా గజము నడిపింప*
*నమిత విక్రమశాలి యా నలనన్న*
*తమకంబుపైనుండి తాఁజూడఁగాను*
*నేనుఁగుపై నెక్కి యెఱసిద్ధిరాజు*
*క్రమ్ముక రాఁగాను గరియావులన్న*
*కరులపై నుఱికింపఁ గణకతోడుతను*
*దిరికట్టి మూకలఁ దెగువతో నఱికె*
*నినుపరాగోలల నిట్టిట్టు నార్చి*
*యే కాండమునఁ గొట్టె నెఱసిద్ధిరాజు*
*నెఱసిద్ధిరాజు తానెక్కిన గజము*
*బోరునఁ గొండవలె భూమిపై నొఱగె*
*కరియావులన్న తా ఖండించి వైచె"* [76]

ఈ విధముగాఁ గఱియావులరాజు యుద్ధము అయితమరాజు యుద్ధములో భాగముగనే యున్నది కాని, ప్రత్యేకముగా లేదు.

### 6.19.5. బాలరాజుల యుద్ధము (త్రయోదశి):-

ఆ భీకర యుద్ధమున బాలరాజులగు ముమ్మయ్య పోచయ్యలు విజృంభించి శత్రుసైన్యములను నుగ్గునుగ్గు చేయుచుండిరి. పోచయ్య కన్నెకొమారకము నేలు కనకము గంగురాజుతోను, చెన్నపట్టణమేలు చంద్రశేఖరునితోను, తిర్ణమల తిప్పయ్యతోను ఘోరయుద్ధమును జేసి, ఆ ముగ్గరి తలలు ఖండించి, ఆ తరిగిన శిరసులను దనచేతఁ బట్టి, నలనన్న తమకముకడకువచ్చి, పగతుర తలలతో నతనికిఁ 'బాదకానుక' వెట్టెను. ఒకప్పుడు ఆరవెల్లి దగ్గఱ పోచయ్య పశువులను బిలువగా నవి రాలేదు. అది చూచి కాటమరాజు సోదరపక్షపాతముతో ముమ్మయ్యను బొగడి, పోచయ్యను బరిహసించెనఁట. ఆ పరిహాసమును బాపుకొని, తాను వీరుఁడననియు, ముమ్మయ్యకంటె గొప్పవాఁడననియుఁ జాటుకొనుటకై పోచయ్య ఇట్టి కానుకను కాటమరాజున కొసంగెను. అయినను మొదట కాటమరాజు ఆ శిరస్సులు పోచయ్య నఱికినవని నమ్మలేదు. అప్పుడు పోచయ్య శ్రీహరిని ప్రార్థించి, ఆ శిరస్సులను బలికించెనఁట. అప్పుడు కాటమరాజు నమ్మి, ఆతని శౌర్యమును బ్రశంసించెను. వీడెమునిచ్చి మరల పోచయ్యను యుద్ధమునకుఁ బంపెను.

పోచయ్య నలనన్నకడనుండి తిరిగి యుద్ధభూమికి వచ్చుసరికి ముమ్మయ్య మరణించెను. పోచయ్య తన మామకై మిక్కిలి దుఃఖించి, రెట్టించిన కోపముతో విజృంభించెను:-

*"ఉగ్రుఁడై పోచయ్య యశ్వంబు నెక్కి*
*కాలు తాటించి కరాళించి దూకెఁ*
*జేరి విమతులతోడఁ జేసె యుద్ధంబు*
*పోచయ్య యొక్కఁడే పోసఁగఁ బదివేల*
*నప్పుడే వెన్నంటి హతము సేయంగఁ*
*కాల్బలంబుల నఱికి కల్లుగాఁ జంపి*
*యామీఁదఁ బగతుర నాముకొని కదిసి*
*జళిపించి బల్లాల సంధించగాను*
*చాచి బల్లాలపైఁ జౌకళించియును*
*దడయని కోపాగ్నిఁ దలలు ఖండించి*
*యాముకొని పోచయ్య హతము సేయంగ*
*ఘోరు ఘోరనియెడి గోపాలు రెల్ల*
*వేడుక మీఱుచు వెలయ నుఱుమాడి*
*యేన్గుల నశ్వాల నెన్నంగ బలము*
*విరివిగా రణమందు వఱిగిన విధము*
*ఘోరాజిఁ బీనుగుల్ గుట్టలై యుండె*
*దురములో శిరసులు దొంతుల భంగి*
*గుట్టలై యుండేను కొదవ లేకుండ"* [77]

యాదవీరులందఱును దమతమ కేర్పాటుచేసిన పగలను సాధించి, తమ యశ్వములు రణములోఁ గూలఁగా, నెదుఱొమ్ము గాయాలు తగిలి, పూచిన తంగేడుచెట్లవలె నలనన్న కడకు వచ్చిరి. నలనన్న వారినందఱ నోదార్చెను.

ఈ బాలరాజుల యుద్ధము పల్నాటి వీరచరిత్రలోని బాలచంద్రుని యుద్ధమువలె నున్నది. శత్రువుల తలలు నఱికి, పంతిమీఁదేర్చుకొనిన పోచయ్య అచ్చముగా బాలచంద్రునివలెనే కన్పట్టును. బ్రహ్మనాయనివలెనే కాటమరాజుకూడ మొదటఁ బోచయ్యను బరిహసించును. ఇట్టి సన్నివేశ సామ్యములు, పల్నాటి వీరభాగవతమును రచించిన శ్రీనాథకవిసార్వభౌముఁడే యాదవ భారతమునుగూడ రచించెననుటకుఁ బ్రబలమగు తార్కాణము.

### 6.19.6. ఆవుల యెద్దుల జగడము- ఎఱ్ఱయ్యల యుద్ధము- (చతుర్దశి):-

త్రయోదశి ఆదివారమునాడు అయితమరాజు బాలరాజుల యుద్ధము జరుగఁగా, చతుర్దశినాఁడు ఆవుల యెద్దుల సహాయముతో ఎఱ్ఱయ్య లిరువురును యుద్ధముచేసిరి. ఒకే రోజున రెండు తిథులుండ వచ్చును. కాని యీ వీరగాథలలోఁ జెప్పినదానినిబట్టి చూడఁగా నుదయమునుండి సాయంకాలమువఱకును నొక యుద్ధము జరిగినట్లుగా నున్నది. కావున నిందలి ఒక తిథి ఒకరోజును సూచించును. కాఁబట్టి త్రయోదశి ఆదివారమునాఁడు అయితమరాజు బాలరాజుల యుద్ధము కాఁగా, చతుర్దశి సోమవారమునాఁడు ఆవుల యెద్దుల జగడము- ఎఱ్ఱయ్యల యుద్ధము జరిగినవని చెప్పవలెను.

యుద్ధమునందు అలసిపోయిన యాదవులను నలనన్న ఓదార్చి నాఁడు. మఱునాఁడు మంత్రి పల్లికొండ చట్టువారి యెఱ్ఱయ్యకును, సలుగుటెద్దులకును, పుల్లెద్దు బసవన్నకును బంతము కలదని చెప్పెను. పాపసిద్ధిరాజు తన దండుతోఁ బయనమై వచ్చినాఁడు. సంధ్యగోపాలుఁడు ఆవులగొప్పతనమునుగూర్చి చెప్పఁగా వీరులు తిరస్కరించిరి. యాదవులు తమ నఱ్ఱావుల నశ్వములపైకిని, సలుగుటెద్లను మదగజములపైకిని నుఱికించిరి. పాపసిద్ధిసైన్యము ఆలమందపై గుబగుబయని ధర గుబ్బటిలునట్లుగాఁ దుపాకులు కాల్చిరి. అయినను నావులు లేగలు బెదరలేదు. శత్రువులపై విజృంభించి మహాయుద్ధము చేసినవి. అవి-

*"మేదినిపైఁ జూచి మెండైన దళముఁ*
*దాటించి తన్నినఁ దలలూడి పడెను*
*గాలు దాటింపుచుఁ గడు వేగ నెగసి*
*లేళ్లపై సింహముల్ లేచిన యట్టు*
*లెడపక పగతుర యెదములు పగుల*
*దన్నుచుఁ ద్రొక్కుచుఁ దళములఁ గూల్చి*
*నాలుకల్ చాచియు నతికోపమునను*
*బగవారు శత్రువులు పట్టవచ్చినను*
*నుఱికి తలపునుకలు నూడిపడఁ దన్ను"* [78]

ఇట్లు యుద్ధముచేయుచున్న యాదవుల, ఆవుల లేగల ధాటికాఁగలేక పాపసిద్ధిసైన్యము పాఱిపోసాఁగెను. అంతలో కాటమరాజు పల్లికొండతో నాలోచించి, చట్టువారి యెఱ్ఱయ్యకును పెయ్యల యెఱ్ఱయ్యకును బగల నేర్పఱచి పంపెను. వారిరువురును రణరంగమునకు వచ్చి, యెద్దులను ఆవులను బేరుపేరున నాహ్వానించి శత్రుసైన్యముపైఁ బురికొల్పిరి. ఎద్దులు చెలరేఁగి యేన్గులను జంపెను. నఱ్ఱావులు చెలరేఁగి గుఱ్ఱములఁ జంపెను-

*"ఎద్దులు చెలరేఁగె నేన్గుల మీఁద*
*దంతి ఘటములతోఁ దగిలి పోరాడె*
*కొమ్మునఁ జిమ్మినఁ గుంభముల్ పగిలి*
*యేనుఁగు లన్నియు నిలఁ గూలిపోయె*
*ముమ్మరముగ నెద్దులు మొత్తముగఁ గూడి*
*చిమ్మి యేన్గులఁ గూల్చి చీదరరేఁగి*
*యెఱ్ఱయ్య చూడంగ నెగసి మావటులఁ*
*దలలూడఁ దన్నుచుఁ దగఁ బొడ్చి చంపు*
*గుఱ్ఱాలమీఁదను గొదగొని కదిసి*
*నఱ్ఱావు లన్నియు నతికోపమునను*
*బాదముల్ తాటించి వాలంబు లెత్తి*
*చెలఁగి రోషంబునఁ జెవులు రిక్కించి*
*తురగంబులను బొడిచెఁ దుదిపదముగాను*
*వెనువెంట నెఱ్ఱయ్య వెసకొల్పుచున్న*
*చంగలింపుచు నెగసి శంకయే లేక*
*అశ్వాల రౌతుల నటు తన్నఁగాను*
*తన్నుకుఁ దలలన్ని తల్లడిల్లుచును*
*నఱచుచు ధరణిపై నన్నియు వ్రాలి*
*అగచాట్లు పడుచుండె నా తలలన్ని*
*బావ మఱఁది చూచి పకపక నగుచు*
*నడచె శిరసులపైన నఱ్ఱావులెల్ల*
*నశ్వాల కెదురెక్కి హతము సేయంగ*
*సలుగుటెద్దులు నేను సాహసంబునను*
*జెక్కిళ్ళఁ బొడిచినఁ జెవులకు దూరు*
*పక్కలఁ బొడిచిన బరులకు వెడలుఁ*
*గుతికెలఁ బొడిచిన గొంతులు చినుఁగు*
*వెన్నునఁ గొమ్ములు వెళ్ళ గుమ్ముచును*
*బకాళించి తన్నఁ గుంభంబులు పగిలి*
*మెదడు కుప్పలు గాఁగ మేదిని మీఁద*
*నెరనన్న యెఱ్ఱయ్య వేడుక పడుచుఁ*
*గరుల నుఱుమాడుచుఁ గలనిలోపలను*
*గాలావు లెద్దులుఁ గలను సేయంగ*
*నెరనన్న యెఱ్ఱయ్య వెసకొల్పఁగాను"* [79]

ఇట్లు యుద్ధముచేయుచున్న యెద్దులావులను జూచి పాపసిద్ధి రాజు చోద్యపడెను. వాని పోరునకు దేవతలును హర్షించిరి. కొంత తడవు పోరాడి, యెద్దులును ఆవులును అనిలో నొఱగినవి. అప్పుడు చట్టువారి యెఱ్ఱన్న, ఆవుల యెఱ్ఱయ్య- ఈ యిరువురును శ్రీకంఠరాజుపైకుఱికి అతనిని జంపిరి. తరువాత పాపసిద్ధిరాజుతోఁ బోరి, అతనితల నఱికిరి. భానుఁడు గ్రుంకఁగా వారిరువురును నలనన్నకడకు వచ్చిరి.

ఇతివృత్తమునుబట్టి చూడ ఆవుల యెద్దుల జగడమును, ఎఱ్ఱయ్యల యుద్ధమును నొకేకాండగా భావింపవచ్చును. మొదట నావులు, యెద్దులు యుద్ధము చేసినవి. పాపసిద్ధి సైన్యము పాఱిపోయెను. అప్పుడు ఎఱ్ఱయ్య లిరువురును యుద్ధమునకు వచ్చిరి. ఎద్దులను ఆవులను బురికొల్పిరి. పిమ్మట వారే యుద్ధము చేసిరి. ఈ యుద్ధమంతయు నొకేరోజున జరిగినట్లున్నది. కావున పై రెండు కాండలను నొకే కాండగా భావించుట యుక్తము. అప్పుడు మొత్తము కాండలు ఏడగును. ఇది సంప్రదాయసిద్ధముగా వచ్చుచున్న 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట ఏడుకాండలు' అనుదానికి సరిపోవును. నాకీ కాండలనుగూర్చి చెప్పిన దొనకొండలోని పూజారి బోదయ్య యను గాథాకారుఁడు, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట ఏడుకాండలని చెప్పియు, నుదాహరణముల నిచ్చుటలో నెనిమిది పేర్లిచ్చినాఁడు. అతఁడు చెప్పిన కాండలు: "చల్లవారి జగడము, బొల్లావు జగడము, బీరినీఁడు యుద్ధము, బాలరాజుల యుద్ధము, ఆవుల యెద్దుల జగడము, ఎఱ్ఱయ్యల యుద్ధము, కఱియావులరాజు యుద్ధము, కాటమరాజు యుద్ధము". 'కాండలు ఎనిమిదియా?' అని ప్రశ్నించినచో నా గాథాకారుఁ డొప్పుకొనలేదు. కాండలు మాత్రము ఏడే యనుచున్నాఁడు. ఉదాహరణల నెనిమిదింటి నిచ్చినాఁడే దీనినిబట్టి చూచినచో 'ఆవుల యెద్దుల జగడము- ఎఱ్ఱయ్యల యుద్ధము' అనునవి ఒకే కాండయని స్పష్టమగుచున్నది. అప్పుడు మొత్తము కాండల సంఖ్యయు మాఱదు. కావున 'కఱియావులరాజు యుద్ధము' అను కాండ యొకటి ప్రత్యేకముగా నున్నదని తెలియుచున్నది. అది నాకు లభింపలేదు. నేను చర్చించుచున్న ఈ యెఱ్ఱగడ్డపాటి పోట్లాటలో కఱియావులరాజు యుద్ధము అయితమరాజుయుద్ధముతోఁ గలసియున్నది.

వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన 'కాటమరాజుకథ'లో కఱియావులరాజు యుద్ధము, తక్కిన యుద్ధములవలెఁ బ్రత్యేకముగా వర్ణింపఁబడలేదు. అట్లని పూర్తిగా వర్జింపఁబడినదని చెప్పలేము. పల్లికొండ పగలనేర్పాటు చేయుచు మొట్టమొదట కఱియావులరాజు పేరును పేర్కొనును. అతనిని ఎఱ్ఱసిద్ధిరాజుతోఁ బోరాడవలసినదిగా నాజ్ఞాపించును. (**"కఱియావులస! నీవు కదిసి బలంబు, నెఱసిద్ధి రాజుతో నెదిరించి నిలుము"-** పుట 104.) అనఁగా కఱియావుల రాజు ఎఱ్ఱసిద్ధిరాజుతో యుద్ధము చేసెనని తెలియుచున్నది. బీరినీని యుద్ధము తరువాత అయితమరాజుతోపాటు కఱియావులరాజు కూడ యుద్ధమునకు సమాయత్తమగుట వర్ణింపఁబడినది. అయితమరాజును కఱియావులరాజును యుద్ధసన్నద్ధులై నలనన్నకడకు వచ్చినట్లుగాఁ జెప్పఁబడినది. అందు కఱియావులరాజు యుద్ధాలంకరణ మిట్లున్నది:

*"కరియావులన్నయుఁ గడుసాహసమున*
*ధరుఁడై నెలవంక తిరుమణి దిద్ది*
*యురగమున గందంబు నొప్పుగాఁ బూసి*
*కరములఁ జేమపూ కడియముల్ పెట్టి*
*మేలైన రత్నాల మెడసూలు వేసి*
*దాకాలి పెందెంబు ధరియించె నంత*
*బిరుదులు ధరియించి పరువడి వచ్చి*
*నలభైమూళ్ల దట్టి నడుమునఁ గట్టి*
*యేకాంగి భీముని యినుప రాగోల*
*వంకిణీఁ జేపట్టి యోపిన యట్లు*
*వన్నైన చెంగావి వలిపంబు గట్టి*
*కరియావులన్నయు గజముపై నెక్క"* [80]

ఇట్టి వర్ణనలనుబట్టి కఱియావులరాజు యుద్ధమును వర్ణించు ప్రత్యేకకాండమొకటి కలదని ఊహించుటకు వీలగుచున్నది. లేదా ఆవుల యెద్దుల జగడము, ఎఱ్ఱయ్యల యుద్ధము- రెండును నొకే కాండమైనట్లు, అయితమరాజు యుద్ధము- కఱియావులరాజు యుద్ధము నొకే కాండము కావచ్చును. ఇది వరుసక్రమమున బీరినీని యుద్ధము తరువాత నుండియుండును.

మఱునాఁడు అమావాస్యయని చెప్పఁబడినది కావున నీ ఎఱ్ఱయ్యల యుద్ధము చతుర్దశినాడు జరిగినదని తలంపవచ్చును. ఈ ఆవుల యెద్దుల యుద్ధము పల్నాటివీరభాగవతములోని 'గుఱ్ఱాల సవరణ' యను కథను బోలియున్నది.

### 6.19.7. కాటమరాజు యుద్ధము: (అమవాస్య):-

యుద్ధములో గాయపడిన యాదవవీరులందఱును జతుర్దశి నాఁటి రాత్రి శివపురాణమును వినిరి. మఱునాఁడు అమావాస్య. చతుర్దశి సోమవారము కావున నీ యమావాస్య మంగళవారమగును. నల్లసిద్ధిరాజు దండుతో నేతెంచెను. అప్పుడు నలనన్న పద్మరాఘవుఁడు- ఇరువురును యుద్ధమున కాయత్తపడిరి:-

*"కట్టిరి హనుమంత కాశలు వేగ*
*హనుమంత కాశపై రేమంత ముండ్లు*
*చేమంతి బంతులు చెలఁగుచు వేసి*
*కనక వడ్డాణంబు కట్టిరి మీఁద*
*మేలు తుమ్మెదతెక్క మీఱిన వన్నె*
*సంపెంగ నూనెచే వంపించి కురులు*
*వీరజడ లల్లిరి వేడుకపడుచు*

*ముడిచిరి గేదగుల్ ముంచుకొని యుండ*
*ఫాలమునఁ గస్తూరి బాగుగా దిద్ది*
*పచ్చల పులిగోరు పతకముల్ దాల్చి*
*సన్నపు రుద్రాక్ష సరులు ధరించి*
*వన్నెగా బిరుదులు వరుస ధరించి"* [81]

ఈ విధముగా యుద్ధసన్నద్ధుఁడైన కాటమరాజు, కాశినుండి భక్తిరన్న రాలేదని విచారించును. కాశిలోనున్న భక్తిరన్నకు ఈ యుద్ధము సంగతి తెలియదనియుఁ, దెలిసినవెంటనే కనకరథముపై ధనముకొండకు రాఁగలఁడనియుఁ బల్లికొండ చెప్పును. అప్పుడు కాటమరాజు పల్లికొడదగ్గఱ సెలవుతీసికొని **"ముమ్మూర్తు లిచ్చిన ముక్కమ్మి కుంతంబు, డాచేతఁ గోర్కెతో దాయంగ బట్టి"** (సరిగా పల్నాటి యుద్ధములో బ్రహ్మనాయని కుంతమును నిట్టిదిగనే చెప్పఁ బడినది), చెలికాఁడు పద్మనాయనితోఁ గూడి, నల్లసిద్ధిపైకి వెడలెను. కాటమరాజుతోఁ గటార్లు పట్టిన లక్ష గోపకులు నడచిరి. దేవతలు దివినుండి చూచుచుండిరి. బాజాభజంత్రీలతోఁ, బంచవాద్యములతోఁ, ద్రిజగంబులును దిగులు పొందునట్లుగా, నవపింజ గొడుగులక్రింద నలనన్న కదలెను.

ఇట్లు తనపై నెత్తివచ్చిన నలనన్న విగ్రహమునుజూచి నల్లసిద్ధి రాజు ఆశ్చర్యపడెను. ఇరు సైన్యములును ఢీకొని ఘోరయుద్ధము చేయసాఁగెను. కొంతవడికి నల్లసిద్ధియుఁ గాటమరాజును దలపడిరి. వీరి యుద్ధము అత్యద్భుతముగా వర్ణింపఁబడినది:-

*"దక్షుండు శంభుండు తారసిల్లినట్లు*
*ధరణి గహ్వర మెగయఁ దగను బోరాడి*
*కడు రామరావణుల్ కదిసిన యట్లు*
*పృథివి ఘూర్ణిల్లగా బోరిరిద్దఱును*
*మత్స్యంబు మత్స్యంబు మల్లాడినట్లు*
*వారిధి వారిధి వడిఁ గలిసినట్లు*
*వడికొని పోరిరి వసుధపై నంత*
*మేరువు మేరువు తారసిలినట్లు*
*సాహసంబునఁ బోర సాహసాత్మకులు*
*ధరణి ధూమము నెగసె తందర నొంది*
*సురలు మూసిరి కండ్లు చోద్యంబు నంది*
*సూర్యునికిఁ గావురు చుట్టినట్లాయెఁ*
*గడువేగ చంద్రునిఁ గప్పినట్లాయె"* [82]

ఇట్లు యుద్ధము చేయుచుండఁగా గాటమరాజు కాలాంతకుని వలె లంఘించి, తన కుతముతో సిద్ధిరాజు నెదుఱొమ్మునఁ బొడిచెను. గుండెలు పగిలి నలసిద్ధి రణములోఁ గూలుచు, నలనన్న యురమునఁ బొడిచెను. కాటమరాజునకు గాయములాయెను.

సిద్ధిరాజు చనిపోఁగా నతని ప్రధాని చింకర్ల భీమన, కాటమరాజు సంగడికాఁడగు పద్మరాఘవునితోఁ గదిసెను. ఇరువురును గొంత తడవు పోరాడఁగా భీమినీఁడు నేలఁగూలెను. పద్మరాఘవునకు బాణములు నాటెను. తరువాత బీభత్స రస ప్రధానముగా యుద్ధభూమి వర్ణింపఁబడినది (చూ. కాటమరాజుకథ, పుటలు 151, 152). ఈ రణభూమివర్ణన నన్నెచోడ, తిక్కనల రణభూమివర్ణనలతో నే మాత్రమును దీసిపోవునది కాదు.

ఇట్లు మొత్తముపై నెఱ్ఱగడ్డపాటి పోట్లాటలో నేడుకాండలున్నవని చెప్పవచ్చును: 1) చల్లవారి జగడము (నామాంతరములు: తిక్కనా మాత్యునికథ, ఈర్లమానికథ= వీరులమ్రానుకథ), 2) బొల్లావు జగడము, 3) బీర్నీడు యుద్ధము, 4) అయితమరాజు కఠియావుల రాజుల యుద్ధము, 5) బాలరాజుల యుద్ధము, 6) ఆవుల యెద్దుల జగడము- ఎఱ్ఱయ్యల యుద్ధము, 7) కాటమరాజు యుద్ధము. ఇందు అయితమరాజు కఠియావులరాజుల యుద్ధము ఏ తిథిని జరిగినదో యీ కథలో లేదు. వర్ణననుబట్టి చూచినచో నది బాలరాజుల యుద్ధము నాఁడే జరిగియుండునని ఊహింపవచ్చును. తక్కిన యుద్ధము లీ క్రింది తిథులలో జరిగినవని వీరగాథలనుబట్టి తెలియుచున్నది. ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట- చిత్రభాను సంవత్సరమున జరిగినది. (ఈ చిత్రభాను సంవత్సరము క్రీ.శ. 1282 ఏప్రిల్ నెలనుండి క్రీ.శ. 1283 మార్చి నెల వఱకును ఉండియుండునని నా ఊహ. శకవర్షము 1204.)

**1. చల్లవారి జగడము:-**

**అ) ఖడ్గతిక్కన × చల్లవారు... మాఘ బహుళ చతుర్దశి సోమవారము (4-2-1283)**

**ఆ) ఖడ్గతిక్కన × బ్రహ్మరుద్రయ్య- మాఘ బహుళ అమావాస్య, మంగళవారము, మధ్యాహ్నవేళ (5-2-1283)**

**ఇ) చల్లవారు × కొమరసిద్ధి, కస్తూరిసిద్ధి- ఫాల్గుణ బహుళ దశమి గురువారము (2-3-1283)**

**2. బొల్లావు జగడము... ఫాల్గుణ బహుళ యేకాదశి, శుక్రవారము. (3-3-1283)**

**3. బీర్నీఁడు యుద్ధము... ఫాల్గుణ బహుళ ద్వాదశి, శనివారము. (4-3-1283)**

**4. అయితమరాజు కఠియావులరాజుల యుద్ధము- ఫాల్గుణ బహుళ త్రయోదశి ఆదివారము (?) (5-3-1283)**

**5. ముమ్మయ్య- పోచయ్యల యుద్ధము... ఫాల్గుణ బహుళ త్రయోదశి, ఆదివారము. (5-3-1283)**

**6. ఆవుల యెద్దుల జగడము- ఎఱ్ఱయ్యల యుద్ధము... ఫాల్గుణ బహుళ చతుర్దశి, సోమవారము. (6-3-1283)**

**7. కాటమరాజు × నల్లసిద్ధిరాజు యుద్ధము, మఱియు పద్మరాఘవుడు× చింకర్ల భీమన్న యుద్ధము... ఫాల్గుణ బహుళ అమావాస్య, మంగళవారము. (7-3-1283).**

ఈ విధముగా మొత్తము ఈ యెఱ్ఱగడ్డపాటి పోట్లాట అంతయును శకవర్షము 1204లో చిత్రభాను సంవత్సరమున మాఘ బహుళ చతుర్దశి సోమవారము (4-2-1283) నాఁడు ప్రారంభమై, ఫాల్గుణ బహుళ అమావాస్య మంగళవారము (7-3-1283) నాఁడు అంతమైనదని చెప్పవచ్చును. అనఁగా నీ యుద్ధము సుమారు ఒక మాసము జరిగినదని చెప్పవలెను. కాని యిందులో యథార్థముగా యుద్ధము జరిగినది యెనిమిది దినములు మాత్రమే. ఖడ్గతిక్కన, బ్రహ్మరుద్రయ్యల యుద్ధమునకును, చల్లవారు- కొమరసిద్ధి కస్తూరిసిద్ధులతోఁ బోరుటకును మధ్య సుమారు ఇరువదియైదు దినముల వ్యవధానమున్నది. ఈ వ్యవధానమున నల్లసిద్ధిరాజు సైన్యమును సమీకరించుకొనెనని తలఁపవలసియున్నది.

ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో యాదవులు గెలిచిరి. వారి గెలుపునకు హరిహరులు మెచ్చి పుష్పవర్షమును గురిపించిరి. మంత్రి పల్లికొండ, ముమ్మయ్య పోచయ్యలను బిలిచి, రణవార్త నెఱింగింప వలసినదిగాఁ గాశిలోనున్న భక్తిరన్నకడకుఁ బంపెను. కాటమరాజు పగ మిగులకుండఁ బగతీర్చుకొనెను. ఇట యాదవులు చేసిన యుద్ధమంతయు సమీక్షింపఁబడినది (చూ. కాటమరాజుకథ, పుటలు- 152, 158). కాటమరాజు పాలేటి గంగకుఁ బగవానిశిరసు 'పాదకానుక' వెట్టి, కాశినుండి భక్తిరన్న వచ్చువఱకును రణభూమిని గాపాడుమని కోరెను. గంగ తన తమ్ముఁడగు పోతురాజుతోఁ గలసి, రణభూమిలోని శవములు క్రుళ్లిపోకుండఁ, గాకుల గ్రద్దల పాలు గాకుండఁ గాపాడుచుండెను. ఇంతటితో నెఱ్ఱగడ్డపాటి పోట్లాట యను సుదీర్ఘ వీరగాథ సమాప్తమగును. దీని తరువాత, దొనకొండలో నున్న అన్నలకై ఆందోళనముఁ జెందు 'అగుమంచికథ', ఊరిబయట నొంటరిగా నొంటిస్తంభపు మేడలోఁ గడచిపోయిన తన దురదృష్ట జీవితమును గుఱించి దుఃఖించు 'పాపనూక వలపోత', బాలరాజుల వలన సోదరుల మరణవార్తను విని, కాశినుండి తిరిగి వచ్చిన 'భక్తిరన్నకథ' వచ్చును.

## 6.20. అగుమంచి కథ:-

అగుమంచి పోలురాజుకూఁతురు. అయితమరాజునకు చెల్లెలు. కొమరమ్మ పుత్రుఁడగు పుత్తమరాజుభార్య. కాటమరాజు, కఱియావులరాజు, భట్టావులరాజు, ఎఱ్ఱయ్య, భక్తిరన్న, అయితమ రాజు, ముమ్మయ్య మున్నగు నన్నలందఱును నీమెను మిక్కిలి గారాబముతోఁ జూచుచుందురు.

కథాప్రారంభమునఁ గవి యీమెనుగూర్చి యిట్లు చెప్పును:

*"భక్తుని చెల్లెలు భామలలోను*
*పుత్తమురాలు అగుమంచి పుత్తడిబొమ్మ*
*కాటమరాజుకు ఘనమైన చెల్లెలు*
*మేటి గుణములతోను మెలగు అగుమంచి*
*అయితన్న చెల్లెలు ఆణిముత్యపు బొమ్మ*
*భట్టావులరాజుకు బాగైన చెల్లెలు*
*చుట్టాల సురభియా సుందరి అగుమంచి*
*కరియావులరాజుకు గాంభీర్యపు చెల్లెలు*
*మరియాద గలిగిన మగువ అగుమంచి*
*ఎరనన్న చెల్లెలు హేమంపు బొమ్మ*
*ముమ్మన్న చెల్లెలు ముద్దురామచిలుక*
*కొమ్మలలోకెల్ల పూగొమ్మ అగుమంచి*
*బీరన్న చెల్లెలు పృథివి లోపలను*
*పొందుగా నిల్లాలు పుత్తమరాజుకు*
*కుందనపుబొమ్మ కులసతి అగుమంచి"* [83]

యాదవకాంత లందఱిలోను నీమె గొప్ప సౌందర్యవతి. **'ఆడువారిలోకెల్ల అగుమంచి తీరు, మొగవారిలోకెల్ల ముమ్మయ్య తీరు'** అని వాడుక. సింహాద్రిరాజుకూతురు చిట్టినూక సహగమనము చేయఁగా నామె పుత్రుఁడగు పోచయ్యను ఈమె పెంచి పెద్దచేసినది. అగుమంచికి 'అక్కన్న' యను నామాంతర మున్నది.

అగుమంచియన్న లందఱును నెఱ్ఱగడ్డపాటికి యుద్ధమునకై పోయిరి. ఈమె ధనముకొండలో నున్నది. పావురములచే వార్తల నంపెదమన్న అన్నలనుండి యేమియు వార్తలు రాలేదు. అగుమంచి దిగులు చెందినది. శివరాత్రి వచ్చినది. ఆనాఁడు అగుమంచి ఉపవాస ముండి జంగమార్చన చేయనెంచెను. అత్తయగు కొమరమ్మ "శివరాత్రి మనకుఁ బనికిరాదు. నేనిదివరలో శివరాత్రిచేయుటచే నా యన్న లందఱును రణములో నొఱగిపోయినారు" అని హెచ్చరించినది. ఈ సందర్భమునఁ గొమరక్క తన తండ్రి వలురాజుకథను, అన్నలగు సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజుల కథలను నగుమంచికిఁ జెప్పినది. అయినను నగుమంచి తన నిశ్చయమును విడనాడలేదు. శివరాత్రిచేసి జంగమార్చన చేసినది. మఱునాఁడు అగుమంచి తలంటుకొనఁదలఁచెను. తల్లి సిరిదేవి తన కోడండ్ర నొక్కొక్కరినే పిలిచి, తన కూఁతురు అగుమంచికిఁ దలంటు పోయుఁడని కోరును. భక్తిరన్నభార్యయగు నల్లమేడను మొదట కోరును. ఆమె **"రాజుల చెల్లెలు రమణి అగుమంచికి, తేజముతో సిరుసంట తీరుగాదమ్మ"** అనును. అంత సిరిదేవి కాటమరాజుభార్య యగు వీరగంగను గోరును. **'అతివ శిరసంట అత్త నే వెరతు'** ననెను. ఇట్లే అయితమరాజుభార్య నేతివారిపోతు, భట్టావులరాజుభార్య సూరమ్మ, కఱియావులరాజుభార్య నాగాంబిక, ఎఱ్ఱయ్యభార్య భయ్యమాంబిక, ముమ్మయ్యభార్య చినమల్లు- వీరందఱును నగుమంచికిఁ దలంటిపోయుటకు భయపడుదురు. అప్పుడు

పోచయ్యభార్య సిరిగిరమ్మను బిలుతురు. ఆమె అంగీకరించి, బంగారుగిన్నెతోఁ దలచమురు తెచ్చుచుండఁగా ద్వారబంధము తగిలి నూనె యొలుకును. దాని నశుభముగాఁ దలంతురు. అగుమంచి, యావకాంత లందఱను మఱునాఁడు 'సాగుమానము' చేయవలసి యున్నదనియు, ధనముకొండ కాలిపోవుననియు శకునము చెప్పును. అగుమంచి స్నానమాడిన నీరు పెసలకు, నిమ్మలకుఁ బాఱును. కొమరక్క మొదలగు స్త్రీలు అది చూచి, దుశ్శకునముగాఁ దలంతురు. కొమరక్క తన కాలమునఁ గూడ నిట్లే జరిగెననియు, నప్పుడు తన యన్న లేవురును మరణించిరనియుఁ జెప్పును.

తలంటు పోసికొనిన అగుమంచి తన అన్నలిచ్చిన ఆభరణములను చీరలను ధరించి, అద్దములోఁ జూచుకొనును. ఏ యన్నయిచ్చిన వస్తువులు ధరించినను నవి వెలవెలపోయినట్లు కనఁబడును. అప్పుడామె తన యన్నల కాపదవచ్చెనని తలంచును. తమ కులదైవమగు గంగగుడికిఁబోయి, బోనములు వేటలు చెల్లించి, తన యన్నల కుశలవార్త లడుగును. గంగవిగ్రహము వెలవెలపోవును. అగుమంచి కోపించి, గంగను దూషించి, యింటికి వచ్చి, ఆ రాత్రి నిద్రించును. ఆమెకలలో గంగమ్మ కనిపించి, ఆమెయన్నలు పాలేటియొడ్డున నెఱ్ఱగడ్డపాడులోఁ గూలిరని తెల్పుటకుఁ గొన్ని సంకేతములను జెప్పును. అగుమంచి ఉలికిపడి మేల్కాంచి ఆ రాత్రికి రాత్రే తన అత్తింటినుండి పుట్టింటికేఁగి, తల్లితోను, వదినెలతోను, తన స్వప్నవృత్తాంతమును జెప్పును. కాటమరాజుభార్యయగు వీరగంగ, అగుమంచి స్వప్నమున కర్థము చెప్పును. అగుమంచి తన కలను జెప్పుచుండగా, వీరగంగ యా కలను విప్పుచుండెను. ఇట్లు అగుమంచి స్వప్నవృత్తాంతమంతయు వ్యాఖ్యానింపఁబడుసరికిఁ దెల్లవారెను.

ఇంతటితో నాకు లభించిన కథ పూర్తియైనది. ఇట్లున్న యీ కథను వేటూరి ఆనందమూర్తిగారు అసంపూర్ణమని భావించిరి. (వారు పరిశోధనలోఁ బ్రకటించిన అగుమంచికథకూడ నీ ఘట్టముతోనే ఆగిపోయినది.) కాని ఇది సరికాదు. అగుమంచికథ యింతటితో సంపూర్ణమే. నాకు లభించిన తాళపత్రగ్రంథమున నీ కథాభాగము తరువాత "అగుమంచికథ సంపూర్ణము" అని కలదు. తరువాత పాలేటి నుండి బసవదేవుఁడు వార్తలు తెచ్చుట, అగుమంచి, పాపనూక- ఇత్యాది యాదవకాంతలు అగ్నిలోఁబడుట అను కథాంశములు దీని తరువాత వచ్చు 'భక్తిరన్నకథ'లో నుండును.

నేను పైన వివరించిన అగుమంచికథ చిత్తూరుజిల్లా చంద్రగిరి తాలూకా పెడకంటిపల్లెలో నొక భట్టువానికడ లభించిన తాళపత్ర గ్రంథములోనిది. ఈ యగుమంచికథకు మద్రాసు ప్ర.ప్రా.లి.పు.భాం.న నొక తాళపత్రప్రతియు (ఆర్.నెం. 664), తిరుపతి SVORIL లో నొక కాగితపుఁబ్రతియుఁ (నెం. 1599) గలవు. తిరుపతిప్రతి మద్రాసుప్రతికి పుత్రికయే. ఈ మద్రాసుప్రతి నాధారముగాఁ జేసికొని శ్రీ వేటూరి ఆనందమూర్తిగారు 1955లో పరిశోధన 5, 6, 7 సంచికలలో నగుమంచికథను బరిష్కరించి ప్రకటించిరి. దీనిలోఁ బ్రారంభమున నున్న కాటమరాజుప్రశస్తి యీ కథకు సంబంధించినది కాదు. ఇందు కథాభాగములో మొదట 350 పాదములు (నాకు లభించిన తాళపత్రగ్రంథమున ఏడు తాళపత్రములలోని విషయము) లోపించినది. ఈ లుప్తభాగములో నవతారిక, అగుమంచి సౌందర్యవర్ణన, ఆమె శివరాత్రి నవలంబించుటకుఁ దలపోయుట- అను నంశములున్నవి. (నాకు లభించిన తాళపత్రగ్రంథమున నివియన్నియును గలవు.) నా ప్రతిలోని యవతారికనుబట్టి దీనిరచయిత జరుగుపల్లె చెన్నయ్య అని తెలియుచున్నది. ఇందలి కవిత్వము మిక్కిలి ప్రశస్తమైనది. అగుమంచి సౌందర్యవర్ణన ప్రబంధ కవిత్వమును మించియున్నది:-

*"................ (గ్రంథపాతము)*
***నల్లతుమ్మెద బోలు నాతి తలకురులు***
***అలరు చంద్రుని బోలు అతివ నీ ముఖము***
***మెరుగుటద్దముల బోలు మెలత చెక్కిళ్లు***
***(కాముచెఱకు) విండ్లగతి నుండు బొమలు***
***చెలువంపు బేడిసకు సరివచ్చు కనులు***
***నిండు సంపెంగ మొగ్గ నెలత నాసికయు***
***కనకకాంతిని బోలు కాంత దేహంబు***
***దానిమ్మ విత్తుల దనరు పల్వరుస***
***తామరతూడులు తరుణి హస్తములు***
***కనకకలశంబులు కాంత కుచములును***
***కొదమసింహము బోలు కోమలి నడుము***
***నీళ్లసుడిని బోలు నెరవైన నాభి***
***అరటి స్తంభముల బోలు అతివ పెనుదొడలు***
***పాటకర్ర లనవచ్చు బిగువారు పిక్కలు***
***చిగురుటాకుల బోలు చెలియ పాదములు***
***పగడవపు మొగ్గల బోలు పాదముల వ్రేళ్లు***
***నక్షత్రముల బోలు నఖముల తీరు***
***కామధేనువు బోలు కమలాక్షి మోము***
***భూదేవి సాక్షిగా పొగడంగ తగును***
***తరుణి కీర్తి గంధంబు తగు చంద్రబింబ"*** [84]

## 6.21. పాపనూక వలపోత:-

దుష్టనక్షత్రమునఁ బుట్టినదను భయముచే, సిరిదేవియు నతయితమరాజును గాటమరాజు చెల్లెలగు నీ పాపనూకను ధనము కొండ బయట నేడంతస్తులమేడ కట్టి యందుంచిరి. కాశికిఁ బోయిన భక్తిరన్న కీ విషయము తెలియదు. తరువాత, నెఱ్ఱగడ్డపాటి పోట్లాటలోఁ గాటమరాజాది యాదవవీరులందఱను మరణించినట్లు కాశిలోనున్న

భక్తిరన్నకుఁ దెలియును. అతఁడు ఆఘమేఘములమీఁద ధనుము కొండకు వచ్చును. అక్కడ అంతఃపురములో నందఱును గనిపింతురు కాని, పాపనూక కనిపింపదు. భక్తిరన్న "పాపనూక ఏది?" అని తల్లి సిరిదేవిని ప్రశ్నించును. ఆమె ముఖము వెలవెలపోవును. పల్లికొండ భార్య 'పందుముల ఎరినప్ప' భక్తిరన్నతో పాపనూకను ఊరిబయట నొంటిస్తంభపు మేడలో నుంచిన విషయము చెప్పును. తన తల్లి చేసిన పనికి భక్తిరన్న మిక్కిలిగా దుఃఖించును. తల్లిని నిందించును. పాపనూకను జూచినకాని అన్నము ముట్టనను. అప్పుడు పల్లికొండ భార్య 'ఎరినప్ప', వెలమ పద్మరాఘవుని భార్య 'పైడి ఎల్లప్ప'- ఇద్దఱును కలిసి, పాపనూక చెలికత్తెలను గూడ వెంటబెంటుకొని, పాపనూకను పిలుచుకొని వచ్చుటకై వెడలుదురు. వారు ఏడంతస్తుల పాపనూక యొంటి స్తంభపుమేడలో నాఱవ యంతస్తు చేరగనే, అచ్చటి చిలుకలు, పావురాలు మొదలైన పక్షులు విపరీతముగా రొదచేయును. ఆ రొదనుబట్టి పందుముల ఎరినప్ప- ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో యాదవులు, పద్మరాఘవుడు గాయాలతో నొఱగిపోయిరని 'పైడి ఎల్లప్ప'తో చెప్పును. వారు ఏడవ అంతస్తులోని పాపనూకను జేరి, కాశినుండి భక్తిరన్న వచ్చెననియు, నామెను తోడి తెమ్మని చెప్పెననియుఁ దెలియజేసిరి. కల్యాణములో 'కలబోతుల గంగమ్మ' దగ్గఱ హాయిగానున్న తన్ను దాయాదుల దగ్గఱకుఁ జేర్చి, తన దురదృష్టమునకు మూలకారకుఁడైన భక్తిరన్నపై పాపనూకకు మిక్కిలి కోపము వచ్చెను. తరువాత కోపము నణచుకొని, తన ఒంటరి జీవితమును, తనకు జరిగిన అన్యాయమును దలఁచుకొని, తన కెవ్వరును బంధువులు లేరనియు, తాను మేడదిగి రాజాలననియుఁ దెలుపును. ఈ సందర్భమున పాపనూక వలపోత మహాద్భుతముగా వర్ణింపఁబడనది:-

*"అన్న లనకె ఎరినప్ప ఆరదు మంట*
*నన్ను కిన్నద జేసిన అన్నలింకెవరు? తమ్ములింకెవరు?*
*నమ్మించి తెచ్చిన నాకేటి అన్నలు?*
*అన్నలు నాకెవరు? ఆసపడ నేటికి?*
*కన్నవారికి నేను కడుద్రోహి నైతి!*
*చిలుకలు నా తోడు, జింకలు నా తోడు*
*పావురములు నాతోడు, బత్తుడన్న ఎవరు?*
*జీవిలేని ప్రతిమను నేను అయితి*
*వేటగాని పక్షి వెగసిన రీతి*
*గూట వేసిన పున్యగురువు వారెవరు నాకు?*
*తమ్ములకు చెల్లెలు అగుమంచి గాక*
*నన్ను సొదజేసిన నాకేటి అన్నలు?*
*పున్యము గలవారికి అన్నలుగాని*
*అన్నెకారిని నేను అన్నలింకెవరు?*
*అగుపడ్డ పులికి ఆవు వెగసిన రీతి*
*పరవాని బాలలకు బత్తుడన్న ఎవరు?*
*చెరవుంచిన చెల్లెలుకు అన్నలింకెవరు?*
*బత్తుడన్నకు నా మీద బక్తియున్నదో లేదో*
*ఆకాసమే తండ్రి బూకాంతయే తల్లి*
*ఎక్కడ కన్నవారు ఎరినప్ప నీవు*
*కడమేడ పుట్నిల్లు కంబే అన్నలు!*
*కడమేడ పుట్నిల్లు కంబమే నా తోడు!*
*కర్రలే చుట్నిలు నిప్పులే బంధువులు!*
*మేడమీది దూలాలు మేనత్తలు నాకు!*
*నేనెట్లు వస్తునే అప్ప ఎరినప్ప?*
*అన్నదమ్ములు లేక ఆత్మబంధవులు లేక*
*బావమరుదులు లేక బంధువులు లేక*
*శివుడు నా బతుకు ఒంటిజేసె నోయమ్మ!*
*కటకటా!" యనుచు కన్నీరు కార్చె.* [86]

అక్కడ సిరిదేవిమేడలోనున్న భక్తిరన్న తన దివ్యదృష్టితోఁ జూచి, పాపనూక మేడదిగిరాదని తెలిసికొని, ధనుముకొండతోపాటు పాపనూకమేడకూడ నగ్గిపాలగునని శపించి, ఎఱ్ఱగడ్డపాటికి పోవును. అతని శాపము ప్రకారము అగ్నిజ్వాలలు చెలరేగి, ధనుముకొండను పాపనూకమేడను దహించివేయును. ఆ మంటలలో యాదవస్త్రీలతో పాటు పాపనూకకూడ కాలిపోవును. కాటమరాజుకథలలో "పాపనూక కథ- పాపనూక వలపోత" ఈ రెండును మిక్కిలి హృదయవిదారక మైన కథలు.

## 6.22. భక్తిరన్న కథ:-

ఇది కాటమరాజు కథాచక్రమున చిట్టచివరి కథగాఁ దోఁచు చున్నది. బక్తిరన్న పోలురాజునకుఁ బెద్దకొడుకు. ఈశ్వరాంశతోఁ బుట్టిన శివభక్తుఁడు. ఎఱ్ఱగడ్డపాడులో యుద్ధము జరుగునప్పుడితఁడు కాశిలో నున్నాఁడు. ఈ యుద్ధమునకుఁ జాలకాలము ముందుగనే భక్తిరన్న శ్రీశైలపర్వతములోఁ దన తపస్సు చాలించి ధనుముకొండకు వచ్చును. పాపనూకయన్నచో నితనికి మిక్కిలి యభిమానము. తల్లిదండ్రులులేని యా పాపనూక నితఁడు కంటికి రెప్పవలెఁ జూచుకొనువాఁడు. ఆమెను నగుమంచితో సమముగాఁ జూచుకొనుమని తన తల్లి సిరిదేవితోఁ జెప్పి, యితఁడు తరమునాటి పెద్దలకుఁ బిండప్రదానము చేయు నుద్దేశముతోఁ గాశికిఁబోవును. గయలో వల్లురాజు, సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు మున్నగు వల్లవులకును, వారివారి ప్రధానులగు తిరుమందులకును భక్తిరన్న పేరుపేరునఁ బిండములు వదలుచుండును. అంతలో నాశ్చర్యముగా బాలరాజులు పిండములకై చేతులు చాచుదురు. భక్తిరన్న నిశ్చేష్టుఁడై 'ఇదియేమి?' అని యడుగగాఁ దాము ఎఱ్ఱగడ్డపాటి రణములో మరణించిన విషయము నా ముమ్మయ్య పోచయ్య లెఱిఁగింతురు. అంత భక్తిరన్న అచటి

మునులను బ్రార్థించి, మేఘరథమును బొంది, దానిపై ధనముకొండకు వేంచేయును. పాపనూకను దనతల్లి సిరిదేవి మేడపెట్టినదని తెలిసి మిక్కిలి దుఃఖించును. పాపనూక మేడకుఁ గాశితీర్థమును బ్రసాదమును బంపించును. తల్లి సిరిదేవి అతనికి భిక్షపెట్టఁగా దానిని భుజింపక, యెఱ్ఱగడ్డపాడులోఁ గూలిన తన సోదరులకుఁ బిండప్రదానము చేయుటకై కొనిపోవును. పాలేటినుండి బసవదేవుఁడు వార్తలు తెచ్చుననియు, నప్పుడు అంతఃపుర స్త్రీలందఱును నగ్నిప్రవేశము చేయవలసినదనియు, నాజ్ఞాపించి, భక్తిరన్న పాలేటికిఁ బయనమగును. మార్గమధ్యమున మూసినది దగ్గఱ బసవదేవుఁడు, రణమున నాఁటిన గాయములతో భక్తిరన్న కెదురగును. భక్తిరన్న యెఱ్ఱగడ్డపాటికిఁ బోయి, యుద్ధమున మరణించిన తన సోదరులను జూచి దుఃఖించి, వారికి 'కైలాసబండ' కడఁ బిండప్రదానము చేయును. మంగల్లిపాడుఠాణాకుఁ బోయి, అటఁబడియున్న బీరినీని, జెన్నప్పను జూచి, యాదవవీరులతోపాటు ఆ గోసంగి వీరులకుఁ గూడ 'వీరకత్తులు' చేయించి, జాతరలలోఁ గొల్పులు చేయించెదనని వారితోఁ జెప్పును. ఆ వీరులు తృప్తిగాఁ గన్నులుమూసి కైలాసమేఁగిరి. తాను కాశినుండి వచ్చువఱకును బీనుగులు చెడిపోకుండ రణభూమిని గాచియున్న గంగకు, బలులు, బోనములతో నేటేట జాతరలు చేయింతునని ప్రకటించెను.

దొనకొండలో బసవదేవుఁడు తెచ్చిన వార్తలు విని యాదవ కాంతలందఱును గడు దుఃఖించి, చిచ్చుఱికి, కనకరథములపైఁ గైలాసమేఁగిరి. ధనముకొండలోని లక్కసిరి మేడలన్నియును కాలి భస్మమైనవి. (ఈ కాలిపోయిన కోట శిథిలములను నేఁటికిని దొనకొండలోఁ జూడవచ్చును. యాదవులు నివసించిన 'పెయ్యల తిప్ప', పాపనూకమేడ యుండిన స్థలము, గంగగుడి నేఁటికిని నచటఁ బ్రత్యక్షమగును.)

నాకు ఈ భక్తిరన్నకథకు సంబంధించి రెండు తాళపత్ర ప్రతులును, నొక కాగితపుఁబ్రతియు లభించినవి. కృష్ణాజిల్లా గుడివాడ తాలూకా కుచ్చికాయలపూడి గ్రామములో నొక తాళపత్రగ్రంథము, నెల్లూరు జిల్లా కనిగిరితాలూకా వెంగళాపురములో మఱియొక తాళపత్ర గ్రంథము (ఈ వెంగళాపురము పంచలింగాల కొండకు దగ్గఱలో నున్నది) లభించినవి. గుంటూరుజిల్లా తెనాలితాలూకా 'యడవూరు' గ్రామములో నొక కాగితపుఁబ్రతి దొరకినది. ఈ మూడింటను కథ అసమగ్రముగనే యున్నది. తాళపత్రప్రతులు రెండింటను, భక్తిరన్న కాశినుండి వచ్చి, పాపనూకమేడకుఁ గాశితీర్థమును బంపుటతోఁ గథ యాగిపోయినది. కుచ్చికాయలపూడిప్రతిలో లేఖకుఁడు తాను భక్తిరన్నకథ సంపూర్ణముగా వ్రాసినానని చెప్పుకొన్నాఁడు. ఇదియే సత్యమైనచో నీ భక్తిరన్నకథ తరువాత నొకటి రెండుకథలు ఉండి యుండవలెను. 'పాపనూక వలపోత, అగుమంచి వలపోత' యను కథలున్నవని కొందఱు గాథాకారులు చెప్పుచున్నారు. ఈ రెండు కథలును దీని తరువాతవి కానోపును.

కాని దొనకొండ సమీపమునఁగల యెఱ్ఱబాలెము గ్రామములో నొక యాదవ గాథాకారుని యింటిలో నేనొక తాళపత్ర గ్రంథమును జూచితిని (తేది: 17-9-1966). అది భక్తిరన్నకథ. దాని యంతమున నగుమంచి మున్నగు యాదవ కాంతలందఱును నగ్నిలోఁబడి మరణించినట్లున్నది. కావున పై ప్రతులు మూఁడును నసమగ్రములనియే తలఁపవలసియున్నది. లేఖకుఁడు పొరపాటున సంపూర్ణమని వ్రాసియుండును. అయినను 'పాపనూక వలపోత, అగుమంచి వలపోత' అను కథలు లభించువఱకును నే విషయమును జెప్పలేము. 'ఎఱ్ఱబాలెము'లో నేను జూచిన భక్తిరన్నకథలో నంత్యమిట్లున్నది: (ఇదియే కాటమరాజు కథాచక్రమునకు భరత వాక్యము కానోపును).

*"మంటలు మండెను మింటి పొడవునాను*
*పంతమున వచ్చేను బాలరాజుల చెల్లెలు*
*వచ్చి చంపుడు కట్ట వరుసతో నెక్కెను*
*హస్తములు మొగిచి అగ్ని దేవునికి*
*ప్రస్తుతింప దొడగె పాలేటి వీరుల*
*గగనంబు భూదేవి వలరాజు దలచి*
*వప్పుగా వరములు వనరంగ నిచ్చె*
*హస్తములు ముకుళించె సభవారి కపుడు*
*గుప్పున అగుమంచి గుండాన దుమికె*
*చమురు కుండలు వేసి సఖియలు అడిలిరి*
*పొగలుచు వెలవెలపోయి రందరును*
*బంగారు కంబాన వరిగెను బసువన్న యపుడు*
*ముగురు మూర్తుల దలచి ముక్కన్ను దెరిచె*
*భాషింప ధనువుకొండ భస్మమైపోయె*
*లక్కసిరి కూటాలు రాచ లోగిండ్లు*
*చిచ్చులు తగిలి కాలె సిరిదేవి కూటాలు*
*కొమరగిరి కూటాలు కొలిమి మంటలై మండె*
*అగుమంచి కూటాలు అగ్గి తగులు బడెను*
*కాటమన్న నలగంగ కూటాలు కనుకులై మండె*
*బత్తుని నల్లమేడ భద్రాక్ష కూటాలు*
*భద్రాక్ష కూటాలు కాలి భస్మంబు లాయె*
*చిత్తర్వు కూటాలు చిచ్చులు తగిలె*
*కొల్లారు కూటాలు కొలిమి మంటలై మండె*
*కైలాసగిరికి కాంతలు పయనమైరి*
*కనకరథములు ఎక్కిరి గోపకాంతలందరును*
*పాపనూకమేడమీదికి పరమేశ్వరుండు*
*చిత్రబాణములు శివుడు శీఘ్రమె పంపె*
*పాపనూకమేడ భగ్గున మండె*
*పాపనూక అగుమంచి పషిణిరథ మెక్కిరి*

*యరణప్ప తల్లప్ప యాణాక్షి అక్కప్ప*
*సిరిదేవి, కొమరక్క, సీతలందరూను*
*మరివేగ అగ్నిచే మడిసి రందరూను*
*బత్తుని నల్లమేడ పణతి వీరగంగ*
*కరియావులనాగ కాంతలందరును*
*కనకరథములు ఎక్కి కైలాస మేగిరి*
*కాంతలు రాగాను కరకంఠకుండు*
*బత్తినన్న కైలాసబండ కడ నుండి*
*పాలేటి వీరులు ప్రఖ్యాతిగాను*
*బసువన్నకు దండప్రమాణము చేసిరి*
*కరుణతో యాదవులు కైలాసమేగిరి"* [85]

"శ్రీముఖనామ సంవత్సరము మోడి కొండప్ప కుమారుడు ముసలయ్య వ్రాసిన భక్తుని కథ".

ఈ భక్తిరన్నకథలో 'గౌతమ చాటువ' అను నొక యుపకథ వచ్చును. ఇది పరశురాముని కథాచక్రములోని 'మఱ్ఱిచెట్లకథ' కానోపును.

యాదవగాథాకారులు చెప్పుదానినిబట్టియు, నితర వీరగాథల లోని ప్రసక్తినిబట్టియు, జనశ్రుతినిబట్టియు నీ కాటమరాజు కథాచక్రమున నింకను నీ క్రింది వీరగాథలున్నవని యూహించుటకు వీలు కలుగుచున్నది:-

## 6.23. అగుమంచి వలపోత:-

బసవదేవుఁడు పాలేటి వార్తలు తేఁగా, నీమె తన యన్నల మరణమును విని వారికై మిక్కిలిగా వలపోసియుండును. అన్న లందఱను నీమెను మిక్కిలి యభిమానముతోఁ జూచి యుండుటచే, వారికై యీమె కడుంగడుఁ బరితపించియుండునని సులభముగా నూహింపవచ్చును. (ఈ కథ లభించినచో దీనిని "పాపనూక వలపోత" తరువాత, "భక్తిరన్న కథ"కు ముందు చేర్చవలెను.)

## 6.24. పల్లికొండ పుట్టుక:-

ఆవుల వలురాజును అతని మంత్రి తరిముత్తరాజును వేఁటకుఁబోయి, దప్పిక కాఁగా, నొక సరస్సులో నీరు త్రాగఁబోయిరి. ఆ సరస్సులో నొక కమలము గిరగిర తిరుగుచుండుట జూచిరి. పరిశీలింపఁగా నా కమలమున నొక చక్కని బాలుఁడుండెనఁట. రాజు, మంత్రి- యిరువురును ఆ బాలుని కొఱకై చేతులు చాపిరి. రాజుచేతలలోని కాబాలుఁడు వచ్చినచో నతఁడు రాజగుననియు, మంత్రిచేతులలోనికి వచ్చినచో మంత్రియగుననియు తీర్మానించు కొనిరి. ఆ బాలుఁడు మంత్రిచేతులలోనికి వచ్చెను. అందుచే నతఁడు మంత్రి యగునని నిశ్చయించిరి.

వలురాజు ఆ బాలుని దీసికొనిపోయి తన కూఁతురు కొమరక్క కిచ్చి, పెంచుమని చెప్పెను. ఆ బాలుఁడు పెరిగి పెద్దవాఁడు కాఁగా నతని తెలివితేటలను జూచి వలురాజాతనిని మంత్రిగాఁ జేసెను. అతఁడే పల్లికొండ. ఈ పల్లికొండ, రఘుపతి విష్ణుమూర్తి అవతారమని యాదవుల నమ్మకము. ఇతఁడు త్రికాలజ్ఞుఁడు. యాదవులలో మూఁడు తరముల వఱకును నితఁడే మంత్రి. వల్లురాజు, పోలురాజు అయితమరాజు- ఈ మూఁడు తరములలోను బల్లికొండయే మంత్రి. ఇతఁడు కొమరక్క పెంపుడు కొడుకగుటచే, నితనిని వల్లురాజు మనుమనిగాను, పోలురాజాదులు అల్లునిగాను, కాటమరాజాదులు బావగాను సంబోధింతురు. ఇతని పుట్టుకను దెల్పు పై కథను సేకరింప వలసియున్నది.

''పల్లికొండ'' అనఁగా 'శ్రీరంగనాథస్వామివారు'. శ్రీరంగములోను, నెల్లూరులోను వెలసిన శ్రీరంగనాథస్వామివారికి "పల్లికొండ పెరుమాళ్ళు" అని పేరు. 'పల్లికొండ' శబ్దము తమిళము నుండి వచ్చినది. తమిళములో "పళ్ళికొండ" అనఁగా "పండుకొన్న" అని యర్థము. స్వామివారు శేషతల్పముపై శయనించి యుందురు.

## 6.25. గంగ పుట్టుక:-

ఇది కంసునికథలోఁ గొంత సూచింపఁబడును. దీనిని గూర్చిన ప్రత్యేకకథ కలదని తెలియుచున్నది. కంసుఁడు దేవకీ వసుదేవులను జెఱలోనుంచును. దేవకి యష్టమ గర్భమునఁ గృష్ణుఁడు జన్మింపఁగా, వసుదేవుఁ డతనిని రేపల్లెకుఁ గొనిపోయి, నందునకిచ్చి, కృష్ణమాయ వలన నా నందునకుఁ బుట్టిన బాలికను దెచ్చి దేవకిప్రక్కలో నుంచును. కంసుఁడు వచ్చి, దేవకికి అష్టమగర్భమున జన్మించినది ఆ శిశువని భ్రమించి, ఆమెను నఱకుటకై ఆకాశమున కెగురవేయును. ఆమె పైకెగిరిపోయి, కంసునితోఁ 'నిన్ను చంపువాఁడు రేపల్లెలోఁ బుట్టి పెరుగుచున్నాఁడులే' అని చెప్పి మాయమగును. అట్లు మాయమైన కృష్ణమాయయే భూలోకమున గంగగా నవతరించినది. కృష్ణుఁడే కాటమరాజుగా నవతరించినాఁడు. ఈ విధముగానుండు 'గంగపుట్టుక' యను వీరగాథను సహితము సంపాదింపవలసియున్నది.

## 6.26. భైరవకురువ యుద్ధము:-

'వేడుక బొంగరాల కథ'లోను, 'భక్తిరన్న కథ'లోను వచ్చిన ప్రసక్తులనుబట్టి కాటమరాజు కథాచక్రమున 'భైరవవకురువ యుద్ధము' అను వీరగాథ యొకటి యుండితీరవలెనని నేనూహించు చున్నాను. కఱియావులరాజుబావయు, చిట్టినూకభర్తయు నగు 'కల్లందుల పోలినీఁడు' దీని నాయకుఁడు. ఈ తిరుమందుల వీరుఁడు భైరవుని కురువలో జలోధీరుఁ డనువానితో యుద్ధముచేసి మరణించినట్లును, అతనిభార్య చిట్టినూక సహగమనము చేసినట్లును,

ఈ దంపతులకుఁ బుట్టిన పోచయ్యయను పసికూనను అగుమంచి పెంచసాఁగెననియుఁ బై రెండు కథలలోను బ్రసక్తమైనదది. బొంగరాల కథలో పోచయ్య, మామయగు ముమ్మయ్యతోఁ దన తల్లిదండ్రులను గూర్చి యిట్లు చెప్పును:–

*"కల్లందుల పోలినేడు రాళ్లదిద్ది భైరవుని కురువ దగ్గర*
*జలోధీరుని జంపి సేనల నరికి*
*గట్టిగా ఎదురొమ్మున గాయములు నాటి*
*చిత్తు చిత్తుగా నరుకులు తగిలిననాడు*
*అప్పుడు మా తల్లి చిటినూక*
*గుండానికి సాగుమానము కావలెనని సయ్యన లేచి*
*పయనమై అప్పుడు పరుగున రాగ*
*ఏడు నెలల బాలుడయి వుంటిని నేను*
*వల్లవులు కాంతలు తిరుమందుల కాంతలు శీఘ్రముగ వచ్చిరి*
*చిటినూక కొల్లు సిరిదామర కొల్లు*
*పోచయ్యను పెంచుకునేము అని వచ్చిరి*
*అప్పుడు అగుమంచి అతిత్వరగ వచ్చె*
*వచ్చిన అగుమంచిచేతికి వయ్యన చిటినూక*
*అందముగ నిమ్మపండు అగ్నిదేవునికి ఇచ్చిన చందాన*
*ఇచ్చేను అగుమంచిచేతికి వయ్యన చిటినూక*
*మండలాపతితోడ మడిసె గుండమున"* [87]

'భక్తిరన్నకథ'లో భక్తిరన్న కాశియాత్రకుఁబోయి, అట గయలోఁ బితృదేవతలకుఁ బిండప్రదానము చేయుచు, వలురాజు, సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు, బల్లికురువ వీరులు– వీరందఱను వారివారి మంత్రులతో సహా తలఁచి, వారివారి పిండములు వేయును. చిట్టచివరన, భైరవరాజుకురువ దగ్గఱ మరణించిన కల్లందుల పోలినేనిఁ దలఁచి, పిండప్రదానము చేయుచు నాతనికథ నిట్లుచెప్పును:–

*"రాళ్లదిడి భయిరవరాజు కురువ వొద్ద*
*జలోధీరుని చంపి సేనల నరికి*
*పోట్లు నాటి కల్లందుల పోలినీడ! చెల్లితివి!*
*నిప్పుల లోపల నిలిచి కలె కాలితివి*
*అప్పా! చిటినూక; నీ అబ్బురపు కొడుకును*
*చెల్లెండ్లకు వొప్పగించి చిచ్చులో పడితివి*
*కలకంఠి చిటినూక! కాంతరో! నీవు*
*కాశిలో అన్నము గయికొండు మీరు."* [88]

ఇందలి 'రాళ్లదిద్ది' లేక 'రాళ్లదిడి' యనునది, భైరవ రాజకురువ దగ్గఱనున్న యూరుపేరు కావచ్చును. ఈ కథ యున్న దనుటకు 'వేడుక బొంగరాల కథ' యు, 'భక్తిరన్న కథ'యు గొప్ప సాక్ష్యము నిచ్చుచున్నవి. కావున నీ 'భైరవకురువ యుద్ధము' ను గూడ సంపాదింపవలసియున్నది.

'బల్లికురువ యుద్ధము' ఈ 'భైరవ కురువ యుద్ధము' నొక్కటే యని భ్రమింపరాదు. ఏలయన, భక్తిరన్నకథలో బల్లికురువ వీరులను స్మరించిన తరువాతనే, యీ భైరవకురువ వీరుఁడగు కల్లందుల పోలినీఁడు ప్రత్యేకముగాఁ జెప్పఁబడినాడు. కావున రెండును వేఱు వేఱు కథలు. 'బల్లికురువ యుద్ధము' నాకు లభించినది. దాని యితివృత్తమునకును, ఈ పోలినీని యితివృత్తమునకును సంబంధము లేదు. బల్లికురువ పోట్లాలో మరణించినవారు: కల్లందుల పోలినేని తండ్రియగు 'కల్లందుల మారినేఁడు' (ఇతని భార్య మారెమ్మ); గోసంగి వీరుఁడగు 'మసిలినీఁడు' (ఇతని భార్యపేరుకూడ మారెమ్మయే). ఈ యిరువురు వీరులును ముక్కంటి మనుమలతోఁ బోరాడిరి. భైరవరాజు కనుమలో మరణించినది ఒక్క కల్లందుల పోలినేఁడు మాత్రమే. ఇతఁడు సింహాద్రిరాజున కల్లుఁడు. చిట్టినూక భర్త. ఇతని ప్రత్యర్థి 'జలోధీరుఁడు'. కాఁబట్టి బల్లికురువ యుద్ధమునకును భైరవకురువ యుద్ధమునకును సంబంధము లేదనుట స్పష్టము.

## 6.27. కంసుఁడు కథ లేక విష్ణు భాగవతము:–

దీనినిగూడ యాదవగాథాకారులు తఱచుగాఁ బాడుచుందురు. కాటమరాజు విష్ణుస్వరూపుఁడుగా భావింపఁబడుటచేతను, గంసుని కథలోని 'కృష్ణమాయ'యే గంగగా నవతరించెనని చెప్పఁబడుటచేతను, నీ కథకూడఁ గాటమరాజు కథాచక్రమునకు సంబంధించినదిగా భావింపవచ్చును.

ఈ కథకు నాకు మూఁడు తాళపత్రప్రతులు లభించినవి. చిత్తూరు మండలమున లభించిన రెండు ప్రతులును నసమగ్రములుగా నున్నవి. నెల్లూరు మండలమున దొనకొండ ప్రాంతమున లభించిన ప్రతి సమగ్రముగా నున్నది. పోలురాజుకథను రచించిన 'కనకబండి ఘట్టయ్య' యను కవియే యీ విష్ణుభాగవతమును గూడ రచించెను. ఇతఁడు కొండయ్య కుమారుఁడనియు, కన్నెసిరుల గోత్రమువాఁ డనియు గ్రంథమునుబట్టి తెలియుచున్నది.

ఈ వీరగాథ ద్విపదచ్ఛందమున నున్నది. కంసుని పుట్టుక, ఆతని దౌష్ట్యములు, కృష్ణుని జననము, బలరామకృష్ణులు కంసుని జంపి, తలిదండ్రుల చెఱలు బాపి, ప్రజలను గాపాడుట– ఇందు వర్ణింపఁబడినవి.

ఇట్లు, మొత్తముపైఁ గాటమరాజు కథాచక్రమున జ్ఞాతాజ్ఞాతము లైన కథలు సుమారు ముప్పదిరెండు కలవని నిస్సంశయముగాఁ జెప్పవచ్చును. ఈ గాథాగానము, నీ సంప్రదాయములు నశించిపోవక మునుపే, వీనిని సంపాదించి, ముద్రించి తరువాతి తరములవారి కందించవలసిన బాధ్యత ప్రతియాంధ్రునిపైనను గలదు.

# 7. ఇతర విషయములు

## 7.1. 'గొల్ల'- 'యాదవ' శబ్దములు:-

'గొల్ల' శబ్దము వృత్తివాచకమనియు, 'యాదవ' శబ్దము కులవాచకమనియు రాజవంశప్రదీపికలో నిరూపింపఁబడినది. యాదవులు చంద్రవంశ క్షత్రియులనుటలో సందేహము లేదు. కాని వీరికి 'గొల్లవారు' అను పేరుకూడఁ జాలకాలమునుండి వ్యాప్తి యందున్నది. గొల్ల శబ్దము సచ్ఛూద్రకుల సూచకము. క్షత్రియునకుఁ గాపుస్త్రీయందు జనించినవాఁడు గొల్లయని పరాశరస్మృతిలోఁ గలదు.[89] కాఁబట్టి గొల్లశబ్దమును యాదవ పరముగా వాడరాదని నేఁడు ఆ కులమువారు అభ్యంతరముఁ జెప్పుచున్నారు.

గోవులను బాలించువారు 'గోపాలురు', ఈ 'గోపాల' శబ్దమే 'గొల్ల'గా మాఱియుండును (గోపాల > గోఆల > గోల > గొల్ల). లేదా వీరికి గొఱ్ఱెలు మున్నగు జంతువులుండుటచే, 'గొఱ్ఱెలవారు' అని పిలువఁబడి, ఇదే కాలక్రమమున 'గొర్లవారు' > 'గొల్లవారు'గా మాఱియుండును. గోపాల శబ్దమునుండి పుట్టినదనుటయే యెక్కువ సమంజసము. ఏలయన, భారత భాగవత కాలమునుండియు నీ గొల్ల (ఘోష) శబ్దము కనఁబడుచున్నది. యాదవులకుఁ బూర్వ కాలమున గోగణమే ప్రధానముగా నుండెడిది. ఆధునిక కాలమున వీరికి గోగణము లేదు. గొఱ్ఱెలు, మేకలు నున్నవి. ఏది వ్యుత్పత్తిక్రమమైనను యాదవులకు గొల్లశబ్దము వృత్తివాచకమనుటలో సందేహము లేదు. (సంస్కృతములో "ఘోష"= గొల్లపల్లె; ఘోషుఁడు= గొల్లవాఁడు.)

కాని నేఁడు యాదవులే కాక కొందఱు నిమ్నకులములవారును 'గొల్ల'శబ్దముచేఁ బిలువఁబడుచున్నారు. వీరికి గొల్లశబ్దము కులవాచకమనియే చెప్పవలసియున్నది. నేఁడు పంద్రెండు రకముల గొల్లలున్నారని జానపదవ్యవహారమునుబట్టి తెలియుచున్నది: 'పూజగొల్ల, ఎఱ్ఱగొల్ల, పూనాటిగొల్ల, గుజరాజుగొల్ల, వెయ్యిగొల్ల, పెయ్యిగొల్ల, కురపగొల్ల, ముష్టిగొల్ల, సజ్జనపుగొల్ల, పెద్దీటిగొల్ల, కర్ణగొల్ల, రాజగొల్ల'. రాజవంశప్రదీపికలో నెనిమిది రకములు గొల్లలు మాత్రము పేర్కొనఁబడినారు: (పూరిగొల్ల-పూజగొల్ల-ఎఱ్ఱగొల్ల-పూనాటిగొల్ల-వృష్టిగొల్ల-కర్ణగొల్ల-మందగొల్ల-కురుపగొల్ల). ఈ వివిధ శాఖలలో నెఱ్ఱగొల్లలు అందఱికన్నను గొప్పవారని చెప్పఁబడుదురు. వీరే నిజమగు యదువంశ క్షత్రియులు కావచ్చును. తక్కినవారిలోఁ జాలమంది నిమ్నకులములవారుగనే కన్పట్టుదురు. ఉదాహరణమునకు 'పెద్దీటిగొల్లలు' పాములను పట్టుకొని జీవింతురు. తెలంగాణములోని కొన్ని శాఖలవారు కేవలము భిక్షువులుగానే ఉన్నారు.

'గొల్ల'శబ్దము అచ్చమైన తెలుఁగుశబ్దమనియు, 'యాదవ' శబ్దము దానికి సంస్కృతీకరణమనియు నా యభిప్రాయము. వర్తమాన కాలమున మాలమాదిగలవంటి వెనుకబడిన కులములవారివలెనే యాదవులందును ఆత్మన్యూనతాభావము (Inferiority complex) ప్రబలినది కాఁబోలు. అందుచే 'గొల్ల' శబ్దమును తెలుఁగు భాషనుండి బహిష్కరింపవలెనని యత్నించుచున్నారు. ఇది విచారింపఁదగ్గ విషయము. ఒక విధముగా భాషకు అపచారము. శబ్దప్రయోగము జాతికి జన్మహక్కు. "బాపఁడు, రాచవాఁడు, కోమటి, గొల్ల, కంసాలి, ఈడిగ, చాకలి, మంగలి, బోయ, మాల, మాదిగ"- మొదలగు శబ్దములు సిసలైన తెలుఁగు శబ్దములు. "వీనిని బ్రయోగింపరాదు, వీనికి బదులు మేము సంస్కృతీకరించిన బ్రాహ్మణ, క్షత్రియ, ఆర్యవైశ్య, యాదవ, విశ్వబ్రాహ్మణ, సెట్టిబలిజ, రజక, నాయీబ్రాహ్మణ, వాల్మీకి, హరిజన, ఆదియాంధ్ర- ఇత్యాది సంస్కృత శబ్దములనే ప్రయోగింపవలెను" అని శాసించుటకు ఏ సంఘము నకును అధికారము లేదు. పైన తెలిపిన అచ్చతెలుఁగు శబ్దప్రయోగముతో నాయాకులములవారిని కించపఱచినప్పుడే తప్పగును కాని, అసలా శబ్దప్రయోగమే చేయరాదనుట సమంజసము కాదు. దీనివలన తెలుఁగు నుడికారమునకు గొప్ప అపకారము జరుగఁ గలదని నేను భావించుచున్నాను. (ఇటీవలి కాలములో దళితులు చైతన్యవంతులై, ఆత్మన్యూనతాభావమునుండి బయటపడి, "శాస్త్రి, శర్మ, రాజు, శ్రేష్ఠి, రెడ్డి, చౌదరి, గౌడ" మున్నగు కులసూచక శబ్దములవలెనే "మాల"- "మాదిగ" శబ్దములను తమ పేర్ల చివర సగర్వముగా వ్రాసికొనుచున్నారు. గొల్లవారు కూడ "యాదవ" శబ్దమును నామాంతరమునఁ జేర్చుకొనుచున్నారు. ఇది ఒక విధముగా శుభసూచకము.)

## 7.2. గాథాకారులు:-

కాటమరాజుకథల నెక్కువగాఁ గొమ్ములవారు పాడుచుందురు. వీరు మాదిగలలో నొక తెగ. కథాస్థానమైన కనిగిరిసీమలోఁ గొమ్ములవారే కాక, గొల్లలలో పూజగొల్లలుకూడ నీ కథలను బాడుచున్నారు. కందుకూరు తాలూకాలో 'పికిలివారు' పాడుచున్నారు. వీరును గొల్లలే. రాయలసీమలో భట్టువాళ్లు (మాదిగలు), ఎఱ్ఱగొల్లలు; తెలంగాణమున నెఱ్ఱగొల్లలు, మందెచ్చులవారు. బీరన్నలవారు; ఉత్తరాంధ్రలో (విజయనగరం జిల్లాలో) జంగము కులమునకుఁజెందిన 'పొడపోతులవారు' యాదవకథలను పాడు గాథాకారులు.

నెల్లూరు మండలమునఁ గామటరాజుకథలను పాడు పూజగొల్లలను 'యాచకులు' అని పిలుతురు. తెలంగాణమున వీరికి 'తెరచీర భక్తులు' అని పేరు. రాయలసీమలో, ముఖ్యముగా కర్నూలు మండలమున వీరిని 'సుద్దులన్నలు' అందురు. పంపాద్రికథను రచించిన మల్లయ్యకవి కృత్యవతరణికలోఁ దెరచీరభక్తులను స్మరించినాఁడు.

### 7.3. కొమ్ములవారు:–

పల్నాటివీరకథలను బాడెడిహక్కు కన్నమదాసు సంతతివారుగా నూహింపఁబడుచున్న వీరవిద్యావంతుల కున్నట్లే, కాటమరాజుకథలను పాడెడిహక్కు బీరినీని సంతతివారగు కొమ్ములవారికి మాత్రమే కలదు. నిజమునకు గొల్లలు వీనిని బాడరాదు. పల్నాటివీరకథలను తెలగలు, కంసాలులు, పిచ్చుకుంట్లు, మున్నగువారు పాడుచున్నట్లే, కాటమరాజుకథలను వివిధశాఖలకుఁ జెందిన గొల్లలు పాడుట జరుగుచున్నది. (కొమ్ములవారికి వాక్శుద్ధి తక్కువయను తలంపుతోఁ దాము ఈ గాథాగానమునకు ఉపక్రమించితిమని కొందఱు యాదవ గాథాకారులు నాతోఁ జెప్పియున్నారు.) యుద్ధానంతరము భక్తిరన్న బీరినీని సంతతివారగు మాదిగలను బిలిచి, యాదవకథలను లోకమున వ్యాప్తిచేయుటకై అనుమతి నిచ్చెనని చెప్పుదురు. భక్తిరన్న కాశినుండి తనతోపాటు పండ్రెండుమంది శిష్యులను దెచ్చెను. వారందఱును యాదవకథలను వ్యాప్తిచేయుటకే నియోగింపఁబడిరి. తన శిష్యులతోపాటు కొమ్మువారును, పదమూడవ భాగమున కర్హులని భక్తిరన్న కొమ్ములవారితోఁ జెప్పెనఁట.

ఈ కొమ్ములవారు ఏ యాదవుని యింటిముందు కథచెప్పినను అతఁడు వీరిని సన్మానించి తీరవలెను. అట్లు చేయనిచో నీ కొమ్ముల వారు ఆతని యింటిముందు గుడారు నెత్తుదురు. (ఇది కూడ భక్తిరన్న శాసనమే యఁట.) ఇట్లు గుడారు నెత్తినచో నా యింటివారికి నశుభము కలుగును. ఇట్లు గుడారు నెత్తినప్పటికిని నా యింటివారు ఈ కొమ్ములవారిని గౌరవింపనిచో, నా గుడారమును గూల్చిరండని భక్తిరన్న చెప్పెనఁట. ఇట్లు ఇంటిముందు గుడారును గూల్చినచో నా యింటిలోని యాదవులందఱును నశించిపోవుదురని భక్తిరన్నశాపమఁట. కావున కొమ్ములవారిని యాదవులు అత్యంత భక్తిశ్రద్ధలతో నాదరింతురు. ఈ భక్తిరన్న శాపముమాట యెట్లున్నను, దమ పూర్వులకథలను గాపాడినవారగుటచే నీ కొమ్ములవారిపై యాదవులకు అభిమానముండుట సహజము కదా!

కాటమరాజుకథలు పాడు గాథాకారులు బడుగుల ఆచారమునకుఁ జెందినవారు. ఈ బడుగుల ఆచారమునకు ఆఱు ముఖ్యవస్తువులు ఉండవలెను. అవి 'గుడారు, కొమ్ము, వీరణము, బొల్లావు, వీరద్రాడు, బసవదేవుఁడు'.

### 7.4. గుడారు:–

కథను జెప్పెడి ప్రదేశములో గుడ్డలతోఁ బెద్ద గుడారమును వేయుదురు. ఆ గుడారములోపల గోడలకు యాదవుల కులదైవమగు గంగను, కాటమరాజుకథలలోని ప్రధానఘట్టములను రంగులలోఁ జిత్రించిన పెద్దపెద్ద గుడ్డల నతికింతురు. ఈ గుడ్డలకు 'తెరచీర' లని పేరు. ఈ తెరచీరలనుబట్టియే యీ గాథాకారులకు 'తెరచీర భక్తులు' అను పేరు వచ్చినది. తెలంగాణమునఁ బాండవులవారను గాథాకారులును నిట్లే కథలోని ప్రధాన ఘట్టములను జిత్రరూపమునఁ బ్రదర్శించి భారతకథలను బాడుచుందురఁట. ఇంగ్లండువంటి విదేశములలోఁగూడ వీరగాథాగానమున నీ చిత్రరూపప్రదర్శన మున్నది.

### 7.5. కొమ్ము:–

ఇత్తడితోఁ జేయఁబడి, వంకరగాఁ, బొడవుగానుండు గొట్టమునకుఁ గొమ్ము అని పేరు. కథాగానమును బ్రారంభించుటకు ముందును, యాదవుల గోత్రములను జెప్పునప్పుడును, తానకము లను పాడు సమయమందును కొమ్ముల నూఁదుదురు. ఈ కొమ్ముల ధ్వని శంఖారావమువలె భయమును గొల్పును.

### 7.6. వీరణములు:–

అంకమ్మకథలలోను, పల్నాటివీరకథలలోను నుపయోగించెడి పంబజోడు వంటివే యీ వీరణములుకూడ. కాని పంబజోడుకును వీనికిని గొంచెము భేదమున్నది. పంబజోడు పెద్దది. శబ్దము చాల యెక్కువ. దానిపై గంటలుండును. పల్నాటికథలలో నుపయోగించు పంబజోడును 'వీరజోడు' అందురు. ఈ కాటమరాజుకథలలో నుపయోగించెడి వీరణములు వీరజోడుకన్న చిన్నవి. శబ్దమును దక్కువయే. పంబజోడువలెనే వీరణములును రెండుండును. ఒకటి వాద్యకారుని తొడలపై నానుకొని యుండును. దీనిపై నానుకొని రెండవది యుండును. మొదటిది శ్రుతి తక్కువ, రెండవది శ్రుతి యెక్కువ. మొదటి వీరణము వేప, లేక రేలచెక్కతోఁ జేయఁబడి యుండును. రెండవది ఇత్తడితోఁ జేయఁబడును. (పల్నాటి వీరకథలలో నుపయోగించెడి వీరజోడులో రెండును నిత్తడితోఁ జేయఁబడినట్టివే.) ఈ వీరణములు మానికంత లావున రెండు జేనల పొడవుండును. పల్నాటి వీరజోడులో మొదటిది యించుమించు వీరణమంతే యుండును గాని, రెండవది మాత్రము దీనికి రెట్టింపు ప్రమాణమున నుండును. ఈ వీరణములకు మేక లేక జింకచర్మముల నుపయోగింతురు.

### 7.7. బొల్లావు:–

ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలోఁ బాల్గొన్న ఒంటికొమ్ము బొల్లావు యొక్క బొమ్మయిది. దీనిని జెక్కతోఁగాని, యిత్తడితోఁగాని చేయుదురు. తానకములు పాడునప్పుడు, తానకములవారు దీనిని నెత్తిపైఁ బెట్టుకొని, శివమెత్తి గంతులు వేయుదురు.

### 7.8. వీరద్రాడు:–

పల్నాటి యుద్ధమున బ్రహ్మనాయఁడు జరిపిన శివనందుల కోట యుద్ధములో యాదవులు అతనికిఁ తోడ్పడిరఁట. అందుచే

నతఁడు యాదవులకు శివనందులకోట దోఁపులో లభించిన గుడారు, వీరద్రాళ్లు, గంగ పోతురాజుల విగ్రహములు బహూకరించెనఁట. తానకములు పాడునప్పుడు శివమెత్తి గంతులు వేయువారిని వీరద్రాళ్లతో కాళ్లమీఁదను, జేతులమీఁదను గొట్టుదురు. ఈ వీరద్రాళ్ళు మూఁడు ముళ్లతో నుండు బారెడేసి పగ్గములు.

## 7.9. బసవదేవుఁడు:–

ఎఱ్ఱగడ్డపాడులో యాదవులొఅగిరను విషయమును దొనకొండకుఁ దెచ్చినవాఁడు బసవదేవుఁడు. ఈ బసవదేవుని విగ్రహముకూడ గాథాకారులకడ నుండును. దీనిని వారు పూజింతురు.

గాథాకారు లీ కథలను బాడునప్పుడు వీరణములనే కాక, శ్రుతిని నిలుపుకొనుటకుఁ దిత్తి, లయకుఁ దాళములను గూడ నుపయోగింతురు. ఇందుఁ ప్రధాన కథకునకుఁ బల్నాటికథకున కున్నంత వేషముండదు కాని, నిలువుటంగీ, పన్నెండు మూరల పాగా, కాళ్లకు గజ్జెలు, నడికట్టు, చేతిలో పిడిగుడ్డ మాత్రముండును. 'గంగతర్కము' కథను బాడునప్పుడు ఒకరు గంగవేషమును, మఱియొకరు కాటమరాజువేషమును వేసికొని, యెదురెదురుగా నిలుచుండి, చేతిలోఁ గత్తిపట్టుకొని, యా కత్తిచివర నొక నిమ్మపండును గ్రుచ్చి, కాళ్లకు గజ్జెలుకట్టుకొని, గంతువేయుచుఁ, గత్తిని ద్రిప్పుచు, గంగ–కాటమరాజు పరస్పరము వాదించుకొన్నట్లుగా నటింతురు. కడప, కర్నూలు మండలములలో గంగతిరునాళ్ల సమయమున నీ గంగతర్కముకథను దఱచుగాఁ బాడుచుందురు.

ప్రధానకథకునకు వంతలు ముగ్గురుందురు. వీరిలో నొకఁడు తిత్తిని బట్టును. రెండవవాఁడు వీరణములను వాయించును. మూఁడవవాఁడు తాళము వేయును. ఈ ముగ్గురిలోను ఇద్దరు 'ఆ' కొట్టుదురు.

## 7.10. గాథాకారుల ప్రార్థనలు:–

కథకుఁడు మొదట గణనాయకునిఁ బ్రార్థించును. పిమ్మట గంగను బ్రార్థించును. తరువాతఁ గొన్ని చిల్లరపాటలు పాడును. (ఈ చిల్లరపాటలను వంతలుకూడ పాడుచుందురు.) ఇందు సాధారణముగా బొల్లావుపాట, ఏరువగంగపాట, పాపనూక సువ్విపాట ఉండును. తరువాత కథాప్రారంభము జరుగును.

మొట్టమొదటచేయు గణపతిప్రార్థన ఈ క్రింది విధముగా నుండును:–

*"గణనాయకా శివా గణనాయకా– గరళాకంధరుడవు గణనాయకా*
*హరహరా మహదేవ ,, హరుని కొమారుడవు ,,*
*శివ శివా మహదేవ ,, శివునీ కొమారుడవు ,,*
*బ్రాహ్మణులే నిను గొల్వ ,, బ్రహ్మదేము దందురయ్య ,,*
*రాజులే నిను గొల్వ ,, రాయబార మందురయ్య ,,*
*కోమట్లే నిను గొల్వ ,, కోటిలాభ మందురయ్య ,,*
*వెలమలే నిను గొల్వ ,, వేణునాద మందురయ్య ,,*
*ఎఱుకలు నిను గొల్వ ,, కొల్లాపురి యందురయ్య"* [90]

తరువాత "తొండము నేక దంతమును..." అను పద్యమును, "తల్లీ నిన్ను దలంచి" అను పద్యమును జదువుదురు. పిమ్మట గంగ ప్రార్థన:–

*"వాలుజడల శూలము భాగీరథి గంగా–వైభోగ రాణివో భాగీరథి గంగా!*
*పల్లా జడల శూలము ,, పరమకల్యాణివో*
*ఎద్దులావులు ఏరుదాటంగ ,, మొద్దులెక్కి మర్లు పిల్చేవు ,,*
*మర్లవారి మట్టెపెయ్యాను ,, మాటినావు గుంటిమరుగునా,,*
*ఇసుక నిప్పులు చేసేవు ,, నీరు మంటలు పెట్టేవు ,,"* [91]

దొనకొండలోఁ బూజగొల్లలు చేయు గంగప్రార్థన దీనికన్న భిన్నముగా నున్నది:–

*"శ్రీమహాదేవుని శృంగారరాణి*
*కామితార్థము లిచ్చు కంజాతపాణి*
*మౌనుల పాలిటి మందారవల్లి*
*దీనుల పాలిటి దివ్య గీర్వాణి*
*కొల్లాపురంబున గొలువిచ్చు దేవి*
*చల్లంగ రక్షించు చంద్రికా దేవి*
*కనకము గురియించు కనకదుర్గాంబ*
*శ్రీధనముకొండలో స్థిరముగా ఉన్న*
*నీకు మ్రొక్కెద నమ్మ నీరజవేణి*
*బ్రహ్మ గవేంద్రుని పాళెంబు తల్లి*
*సీత నీ పుట్టిల్లు శ్రీపర్వతములు*
*మగువ నీ పుట్టిల్లు మాల్యవంతములు*
*తుంగభద్ర వార్నాశి దోర్దండ నిధులు*
*గంగాజల నిధులు కలుగని నాళ్లు*
*ఎవని మీదుంటివే ఎవరి శిరంబు మీద*
*ఉత్తరాదిని పుట్టి ఉంటి మేల్గిరుల*
*దక్షిణాదిని వెలసి ధనముకొండలో నిలచి*
*పాలేట పూజగొన్న పరమ కల్యాణి*
*కొమ్మా! లేవమ్మ ఓ కొమ్మ శారదాంబ!*
*కొమ్మ! ముగ్గురి గన్న కోమలి లేవె!*
*కామధేనువు అరిచె గంగ మేల్కోవె*
*మేలుకో శాంభవీ మేలీయవమ్మ*
*వాక్కివ్వవే మాకు ఓ శారదాంబ*
*నీ సేవ నే జేతు నీతిమార్గమున*

*పరసేవ నేనెరుగ పరమ కల్యాణి*
*నిండు చేతులను పన్నెండాయుధముల*
*పట్టిన గంగమ్మ పరమ కల్యాణి*
*నీ కథల్ చెప్పంగ నిశ్చయించితిని*
*వినరయ్య జనులార విశదంబుగాను"* [92]

ఈ ప్రార్థన తరువాత కథ ప్రారంభమగును. కొందఱు గణేశ్వరప్రార్థనకును, గంగప్రార్థనకును మధ్య కొన్ని చిల్లరపాటలు పాడుదురు. ఈ పాటలు ముఖ్యముగా దొనకొండ ప్రాంతమందలి గాథాకారుల దగ్గఱ వినఁబడుచున్నవి. ఈ క్రిందిది దొనకొండగంగను గూర్చిన ప్రార్థన: (మాత్రలు- పాదమునకు 6+6+6+4).

*"నీలీపూ నీలీచీర నీరేజా గంధీ*
*పన్నెందూ ఆయూధాల ప్రబలీనావమ్మా*
*వన్నేరో తలకురులూ ముడిచీనావమ్మా*
*కన్నేరో ధనముకొండా గంగా లేవమ్మా*
*పుడిలీవీ కనకాద్రీ భూముల్లాలోనూ*
*వస్తీవీ ఓగంగా వలగొన్నావమ్మా*
*వలగొన్నా వలగొన్నా వలగొన్నావమ్మా*
*వలగోనీ పూజాలూ వలచీనావమ్మా*
*ఎలయంగా గంగూలా ఎల్లయ్యా నగరూ*
*ఎలమీ సంపదలిచ్చూ ఎలమంచీ గంగా*
*రంగూగా దొనకొండా రాయీ మల్పించీ*
*కట్టీరీ దొనకొండా గంగమ్మా నగరూ*
*చుట్టూరూ కొండల్లో నడుమా దొనకొండా*
*దొనకొండా వెలసీనా దుర్గా మాయమ్మా*
*చుట్టూరూ ఏరుల్లో నడుమా పాలేరూ*
*పాలేటా వెలసీనా పరమా కల్యాణీ!"* [93]

పై పాటలో గంగుల యెల్లయ్య ప్రసక్తి కలదు. కావున ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట రచించిన గంగుల పినయెల్లయ్య తండ్రి యెల్లయ్యయే పై పాటను రచించియుండునని తలంపవచ్చును.

### ఏఱువ గంగ పాట (పాలేటి గంగ పాట):-

*"గంగను కొలిచేరూ- ఏరువ*
*గంగను కొలిచేరూ*
*ఆకసాన సుల్లాడుతు రాగా*
*గంగను కొలిచేరూ- పాలేటి*
*గంగను కొలిచేరూ*
*మేఘము లోపల మెఱుపులు మెరిసిన*
*గంగను కొలిచేరూ- దొనకొండ*
*గంగను కొలిచేరూ"* [94]

### బొల్లావు పాట:-

*"కనకరాళ్ల బోటి మీద*
*కనక వరుషమూ- ఆవుకు*
*కనక వరుషమూ!*
*ఉద్దాగిరి ముద్దా పసుపు*
*ఆవుకొచ్చెనూ- బొ*
*ల్లావు కొచ్చెనూ"* [95]

### పాపనూక సువ్విపాట:-

*"సువ్వీ సువ్వన్నాలారా! సువ్వన్నాలారా!*
*సువ్వన్నీ పాపమ్మా! వేయన్నా పాడూ!*
*మచ్చావాతారూదే మాయావు లన్నా*
*హెచ్చుగా దక్షిణాది ఆవులా మేపూ*
*పచ్చొడ్లూ నే దంచీ పాలెసరూ పెట్టీ*
*పాయాకా నే జూతూ పాలేటీ త్రోవా*
*కట్టామీ దంగళ్లూ గంగా రేగుల్లూ*
*ఘనమైనా గుడిపాడూ గంగా పుట్టిల్లూ*
*మొగిలీపూ తీరమ్మా మొగసాలా తీరూ*
*మొగవారీ లోకెల్లా ముమ్మయ్య తీరూ*
*ఆవంపూ తీరమ్మా అద్దములో తీరూ*
*ఆడవారి లోకెల్లా అగుమంచీ తీరూ*
*చేరేడూ చేరేడూ చెలవూలా పోగుల్లూ*
*చెలువూడు కాటమరాజు చెల్లెల్నీ నేనూ*
*కాశీకీ బొయ్యేటి ఓ యన్నలారా!*
*కాశీకీ పడమాటా గంటా మ్రోగిందీ*
*పాటీ మీది పుచ్చుల్లే పైనా దోసల్లే*
*పెద్దమ్మా పెట్టిందీ వెలలేని సొమ్మూ*
*కాకారా పూసిందీ వెలలేని పూతా*
*పెద్దమ్మా పెట్టిందీ వెలలేనీ సోమ్మూ"* [96]

### 7.11. గంగ జాతర లేక గంగ తిరునాళ్లు:-

యాదవుల కులదైవము గంగ. ఈమె శక్తిస్వరూపిణి. ప్రధాన గ్రామదేవతలలో నొకతె. ఆంధ్రదేశమున ననేక గ్రామములలో నీ గంగకు దేవాలయములున్నవి. నెల్లూరు, కర్నూలు, కడప మండలములలో నీ గంగగుడులు హెచ్చు. ఈ గంగకుఁ బ్రతి సంవత్సరమును గొప్ప యుత్సవములు చేయుదురు. ఈ యుత్సవము లను 'గంగ జాతరలు' లేక 'గంగ తిరునాళ్లు' అందురు. ఈ జాతరలలోఁ గాటమరాజుకథలు పాడింతురు. పశువులను బూజింతురు. తానకములు పాడుదురు. రాయలసీమలో నీ జాతరను 'ఆవుల పబ్బం' అని కూడ పిలుతురు. కర్నూలు మండలమున కోవెలకుంట్ల తాలూకా

పెదయెమ్మనూరు గ్రామములో కుందునదియొద్దనఁ బ్రతి సంవత్సరము చైత్రమాసమున గొప్ప గంగజాతర జరుగును. (1966 ఏప్రిల్ నెలలో నీ గంగజాతరను నేను జూచి యానందించితిని. 12–4–1966వ తేది రాత్రియంతయు కుందునది యిసుకతిన్నెలలోఁ గూర్చుండి, 'గంగ–కాటమరాజు తర్కము'ను యాదవగాథాకారులు వేషములు ధరించి పాడుచుండఁగా శ్రవణానందముగా వింటిని. అదియొక అపూర్వానుభవము.)

## 7.12. దొనకొండ గంగ తిరునాళ్లు:–

నెల్లూరు మండలమున గథాస్థలములైన ధనముకొండ (నేఁటి గంగదొనకొండ), పంచలింగాలకొండల యొద్ద గంగదేవళము లున్నవి. ఇవి అతిప్రాచీనములైనవి. నాఁటి యాదవులు పూజించిన విగ్రహము లివియే. దొనకొండలో చైత్రశుద్ధ దశమి మొదలు తొమ్మిది రోజులు గంగకు ఉత్సవములు జరుపుదురు. ఏడు దినములు గంగకు ఊరేగింపు చేయుదురు. ఎనిమిదవ దినమున సుదులు, బోనములు, జరుపుదురు. తొమ్మిదవనాఁటి రాత్రి 'భట్టు రాయబారము కథ'ను బాడింతురు. దొనకొండలో గంగగుడిముందు రెండరుగులున్నవి. ఈ యరుగులపై సుద్దులవారు రెండు వర్గములుగాఁ జేరి నిలబడుదురు. ఒక వర్గమువారు కాటమరాజుభట్టులవలెను, రెండవ వర్గమువారు సిద్ధిరాజుభట్టులవలెను వ్యవహరించి, పరస్పర నిందలతో రాయబార కథనంతటిని బాడుదురు. ఈ యరుగులను 'రాయబారపు అరుగులు' లేక 'కల్లి అరుగులు' అందురు. గంగదేవళముముందు పెద్ద గుడారమును వేయుదురు. దీని పేరు 'సందుల గుడారు'. ఈ గుడారులోఁ బగటిపూఁటఁ గాటమరాజుకథలు పాడుచుందురు. ఈ యుత్సవములో నాఖరురోజున బొల్లావుప్రతిమను అగుమంచి బావికడకుఁ దీసికొనివెళ్లి, అక్కడ ముగ్గువేసి, బొల్లావు నెత్తుకొని, యావేశముతోఁ బరుగుపెట్టుచు, కల్లియరుగులకడకు వచ్చి, అక్కడ మరల ముగ్గువేసి, షడ్దర్శనములవారిని సెలవడిగి, భట్టురాయబారము కథను బ్రారంభింతురు.

ఈ దొనకొండ ప్రాంతమునఁ బల్లెలలో నొక వింత సామెత యున్నది: "దొనకొండపోయి గంగను కొని తెచ్చుకున్నావు" అనునది. కష్టముల నే వ్యక్తియైనను దనంత తానుగాఁ దెచ్చుకొన్నప్పుడు దీని నుపయోగింతురు. దీని వ్యుత్పత్తి తెలియవచ్చుట లేదు.

## 17.13. పాలేటిగంగ తిరునాళ్లు:–

కనిగిరిసీమలోఁ బెదఅలవలపాడు గ్రామసమీపమునఁ గల ఎఱ్ఱగడ్డపాడు, పంచలింగాలకొండ ప్రాంతమున పాలేటిగంగ గుడి కలదు. ఇక్కడ వైశాఖ బహుళ పాడ్యమి మొదలు పంచమి వఱకును గంగతిరునాళ్లు జరుగును. ఈ జాతరకు ఆ చుట్టుప్రక్కల ప్రజలందఱును కుంకుమబండ్లతో ప్రభలుకట్టుకొని వచ్చి, పాలేటి యొద్దన గంగమ్మకును కాటమరాజువారికిని పశుక్షేమమును గోరి పొంగళ్లు పెట్టుదురు. కొమ్ములవారు పాలేటి యిసుక తిప్పలపై రాత్రివేళ కాటమరాజుకథలు పాడుదురు.

కాటమరాజు ఉత్తరాదినుండి దక్షిణాదికిఁ బోవునప్పుడు ఆతని పశువులమందను గంగ అడ్డగించిన ప్రదేశము ఇక్కడనే కలదు. ఇక్కడ పాలేటి మధ్యగల యొక పెద్ద గుండురాతిపై గంగవిగ్రహము చెక్కఁబడియున్నది. దీనిని 'గుంటిగంగమ్మ' అందురు.[97] కాటమరాజు నడ్డగించిన గంగ యీమెయే. ఈ గుండుదగ్గఱనే భక్తిరన్న, యుద్ధానంతరము కాశినుండి వచ్చి యాదవవీరులకుఁ బిండ ప్రదానము చేసెను. ఇక్కడనుండియే యాదవులు కైలాసమున కేఁగుటచే దీనిని 'కైలాసబండ' యందురు. దీనిప్రక్కనే గోసంగివీరుఁడగు బీరినీని విగ్రహముచెక్కిన ఱాయి మఱియొకటి కలదు. ఈ ప్రాంతమున నేటిలో నొక రావిచెట్టున్నది. యాదవవీరులు యుద్ధానంతరము తమ కత్తులను పాలేటిలోఁ గడిగి యీ చెట్టుదగ్గఱ పాతిపెట్టిరని ప్రతీతి. ఈ రావిచెట్టుదగ్గఱనే 'భట్టురాయబారము, భక్తిరన్నకథ' మున్నగునవి పాడుదురు.

పాలేటిగంగ తిరునాళ్లనుగూర్చి వెంగళాపురమునకుఁ జెందిన బొడ్డెబోయిన అయ్యన్న కుమారుఁడు గంగయ్య యను యాదవగాథా కారుఁడు ఈ క్రింది వివరముల నిచ్చినాఁడు:–

"పాడ్యమినాఁటి రాత్రి పెదఅలవలపాడు దగ్గఱఁ బాలేటిలో నున్న 'కోసలేటిగంగ' కడకుఁ బ్రజలు తమతమ బొల్లావులను మేళతాళములతోఁ దీసికొనిపోయి, పొంగిళ్లుపొంగించి, నివేదనలిచ్చి, వేటలు వేయుదురు. ఆ రాత్రి అక్కడనే గడపెదరు.

"విదియనాఁటి ఉదయమునకు ఎఱ్ఱగడ్డపాడుదగ్గఱ పాలేటిలో నున్న గుంటిగంగమ్మ కడకు వత్తురు. ఇక్కడ యాదవీరులకుఁ బిండప్రదానము చేయుదురు. 'బద్దెగొఱ్ఱె'ను నఱకి, దాని గుండెకాయను దీసి, ముక్కలు ముక్కలుగాఁగోసి, యొక్కొక్క పిండపుముద్దలో నొక్కొక్క ముక్క పెట్టుదురు. వచ్చిన ప్రజలకు మాంసముకలిపిన అన్నముఁ బంచిపెట్టుదురు. తరువాత గుంటిగంగనుండి పాతగంగగుడిదగ్గఱకు వచ్చి (ఇదియును బాలేటిలోనే కలదు), అమ్మవారిని బూజించి, అచ్చటినుండి ప్రస్తుతమున్న గంగగుడి (పాతగుడికి దక్షిణముగాఁ బాలేటియొద్దనఁ గలదు) కడకు వచ్చి, అచట నఖండమును వెలిగింతురు. (ప్రస్తుతమున్న గుడి అర్వాచీనమైనది. ప్రాచీనమైన గుడి, దీనికి ఉత్తరముగా నొక ఫర్లాంగు దూరములో, పాలేటికిని 'రకత కాల్వ'కును మధ్య నుండెడిది. పాలేరు పొంగి అది నాశనమైనదఁట.) విదియనాఁటి రాత్రి, పాలేటి యిసుకతిన్నెలపై 'గంగతర్కము' కథను పాడుదురు.

"తదియనాఁడు పగలు గంగగుడిదగ్గఱ సుడిమాను నెత్తుదురు. రాత్రి అమ్మవారి ఉత్సవవిగ్రహము నూరేగింతురు. ఆ రాత్రి యంతయు నూరేగింపు జరుగుచునే యుండును. తెల్లవారుసరికి తిరిగి గుడికి వత్తురు.

"చవితినాఁడు 'గావు' చేయుదురు. గావు చేయుట యనఁగా బలిపశువును నోటితోఁ గొఱికిఁ జంపుట. ఇట్లు చంపిన బలిని (మేకపోతును) కొమ్ములవారికిత్తురు. బండ్లు, ప్రభలు మున్నగు నుత్సవమంతయు నీ చవితిరోజుననే జరుగును.

"పంచమినాటి రాత్రి, పాలేటి యిసుకతిన్నెలలోఁగల గుండురాళ్లదగ్గఱ 'కల్లి రాయబారము' లేక 'భట్టు రాయబారము' కథను బాడుదురు. ఈ గుండురాళ్లను 'కల్లిగుండ్లు' అందురు. దొనకొండలో నరుగుల నుపయోగించినట్లుగా నిట ఱాతిగుండ్ల నుపయోగింతురు. అనఁగా భట్టురాయబారములోని యిరుపక్షములును రెండు ఱాతి గుండ్లపై నెక్కి వాదించుకొందురు. ఈ కల్లిగుండ్లు గుంటిగంగకుఁ దూర్పుగా నున్నవి.

"షష్ఠినాఁడు వసంతము చల్లుకొనుచు నమ్మవారిని పాలేటిగుడి నుండి వెంగళాపురము గ్రామములోనికిఁ దీసికొనిపోవుదురు.

"ఈ తిరునాళ్ల సమయమునఁ బ్రాఁతవడిపోయిన వీరద్రాళ్లు, శిథిలమైపోయిన తాళపత్రగ్రంథములు పాలేటిగంగలోఁ బడవేయుట ఆచారము".

## 7.14. పంచలింగాల కొండ:-

ఈ గంగగుడికి సమీపమునఁ దూర్పుగా పంచలింగాలకొండ యున్నది. ఈ కొండదిగువన కాటమరాజుకోట యున్నది. ఆ కోటబురుజులు, అతని తమకముండిన చింతచెట్టు ('తమకము చింత'), అతని గుడారున్న స్థలము ('గుడారుగుట్ట')- మున్నగు వానిని బ్రజలు నేఁటికిని జూపుచున్నారు. ఈ యెఱ్ఱగడ్డపాడుదగ్గఱ పాలేటిలో నేరెళ్లవాగు కలియుచుండును. ఈ రెండు నదులను గలుపుచు వేఱొక చిన్న పాయ కలదు. దీనిని 'రకత కాలవ' (రక్త కాలువ) యందురు. ఎఱ్ఱగడ్డపాడులో యుద్ధముచేసిన యాదవవీరుల రక్తము ప్రవహించిన కాలువ యగుటచే దీనికి 'రక్త కాలువ' యను పేరు వచ్చినదఁట.

## 7.15. ఎఱ్ఱగడ్డపాడు:-

'ఎఱ్ఱగడ్డపాడు' అనునది ఊరుపేరు కాదు. ఇక్కడ నే పల్లెయు నేఁడు కానరాదు. పూర్వముండెడిదేమో తెలియదు. ఇది యాదవులు యుద్ధముచేసిన ప్రదేశము. "యాదవులు చెల్లింది ఎఱగడ్డపాడు" అను వాడుక గలదు. ఈ యెఱ్ఱగడ్డపాడు నేఁటి నెల్లూరిజిల్లా, కనిగిరి తాలూకాలో, పెద అలవలపాడు గ్రామమునకుఁ దూర్పుగా రెండుమైళ్లదూరమునఁ బాలేటియొడ్డునఁ గలదు. దీనికుత్తరమునఁ బాలేరు, దక్షిణమున నేరేళ్లవాగు- పంచలింగాలకొండ, తూర్పున కాటమరాజుకోట బురుజు, పడమర నేఁటి గంగగుడి- రకత కాలవ సరిహద్దులని చెప్పవచ్చును. ఈ స్థలమంతయు సుమారొక చదరపుమైలు వైశాల్యమున నుండును. 'యాదవులు చెల్లింది ఎఱ్ఱగడ్డపాడు' అనియు, 'అల్లివాగు-నెల్లివాగు-నెరా నేరేళ్లవాగు'ల మధ్యప్రదేశము ఎఱ్ఱగడ్డపాడనియు గాథాకారులు పాడుచుందురు. ఇచట మట్టి యెఱ్ఱగానుండుటచే నీ పేరు వచ్చినదేమో. ఈ యెఱ్ఱగడ్డపాడునకు దక్షిణముగా నఱమైలు దూరమున 'వెంగళాపుర' మను గ్రామము గలదు. పశ్చిమముగా రెండుమైళ్ల దూరమున 'పెద అలవలపాడు' గ్రామమున్నది. పూర్వము కాటమరాజుతండ్రియగు పెద్దిరాజు దీనికధిపతియని చెప్పుదురు.

చిత్తూరు మండలమున తిరుపతిలోఁగూడ గంగజాతర మహా వైభవముగా జరుపఁబడును. కాని అక్కడ కాటమరాజుకథలు పాడఁ బడకపోవుట విచారకరము.

## 7.16. ఆవుల పరుపు- తానకములు:-

రాయలసీమలో గంగతిరునాళ్ల సమయమున నావులకుఁ బొంగళ్లు పెట్టుట, అలంకరించుట, యెద్దులతో బరువులు లాగు పందెములు వేయుట- మొదలగు వేడుకలు జరుగుచుండును. అందువలననే యీ గంగజాతరకు 'ఆవుల పబ్బ' మని పేరు వచ్చినది. కాని యావుల పబ్బము వేఱు, గంగజాతర వేఱు అని రాయలసీమలోని పెద్దలు కొందఱు చెప్పుచున్నారు. ఆవుల పబ్బము యాదవులు మాత్రమే చేయు వేడుక యనియు, గంగజాతరను ఏ కులమువారైనను జేయవచ్చుననియు వీరి యభిప్రాయము.

నేఁడు రాయలసీమలో నావుల పబ్బముపేరఁ బిలువఁబడునదే పూర్వకాలమున 'ఆవుల పరుపు'గా వ్యవహరింపఁబడుచున్నదని తెలియుచున్నది. కడపజిల్లా సిద్ధవటము కైఫీయతులో (క్రీ.శ. 1800 ప్రాంతము) నీ యావుల పరుపునుగూర్చి సమగ్రముగా నున్నది.[98] కాటమరాజు నల్లసిద్ధితో చేసిన యుద్ధమున మరణించిన ఆవుల ఆకృతులను శిలలపైఁ జిక్కించి, ఒక ప్రదేశమున నుంతురు. ఈ ప్రదేశమునకు 'ఆవుల మాలె' అని పేరు. నిజముగా ఆ నాఁడు మరణించిన ఆవుల పుఱ్ఱెలను శృంగసహితముగాఁ గాపాడుకొనుచు వచ్చిన కుటుంబములుకూడ కొన్ని కలవఁట. వీనిని 'దేవరావులు' అందురు. ఈ పండుగనాఁడు ఆ పుఱ్ఱెలనుగూడఁ దెచ్చి, కొమ్ములకుఁ బసుపు రాసి పూజింతురు. ఈ సంబరమును జరుపు యాదవులలో 'కాటమరాజు పొంగెస్తులు' అనువారు కలరు. వీరికి 'తానకములు' అనునవి కలవు. వెల్లెద్దు తానకము, బొల్లెద్దు తానకము, బోడెద్దు తానకము, కఱెద్దు తానకము, పైయెద్దు తానకము- మొదలగు రీతిని బెక్కు తానకములు గలవు. వీరణములు వాయించుచు నొక్కొక్క తానకమును బాడునప్పుడు ఆ తానకమునకు సంబంధించిన పొంగెస్తులకు శివమెత్తును. తానకమనఁగా పరాక్రమ వర్ణన. వెల్లెద్దు తానకమనఁగా వెల్లెద్దు పరాక్రమమును దలఁచి, అది మేయుట, నీరుత్రాగుట, గంతులువేయుట, యుద్ధమున నది చూపిన పరాక్రమము మొదలగునవి వర్ణించుచుఁ బాడఁగా, నా తానకము నాశ్రయించియుండు పొంగెస్తులకుఁ బూనకము వచ్చును.

ఈ తానకములు ఆవులకు నెద్దులకు మాత్రమే కాక, యాదవ వీరులపైనను గలవు. అట్టివి నాలుగు తానకము లున్నవి: 1) కాటమరాజు తానకము, 2) భక్తిరన్న తానకము, 3) బాలరాజుల తానకము, 4) పల్లికొండ తానకము. వీనిలో నాయావీరుల పరాక్రమము, వారు యుద్ధమున నొఱగిన తీరు– వర్ణింపఁబడును. ఆయా వీరగాథలలోని పంక్తులే తానకములుగా నుపయోగింపఁబడు చుండును. ఉదాహరణమునకు బాలరాజుల తానకమిట్లుండును:

*"ఎత్తివచ్చిన బాణాలు బాలరాజులకు ఎదయందు నాటినాయి*
*జారివచ్చిన బాణాలు బాలరాజులకు జబ్బలను నాటినాయి*
*తుపాకి వేట్లకు తునతునకలాయె"*

పై నాలుగు తానకములును రెండు ప్రధాన భాగముల క్రిందికి వచ్చును. కాటమరాజు తానకము, భక్తిరన్న తానకము– ఈ రెండును 'వల్లవుల తానకములు' లేక 'రాజుల తానకములు'. బాలరాజుల తానకము, పల్లికొండ తానకము– ఈ రెండును 'స్తిరమందుల తానకము' లేక 'ప్రధానుల తానకములు'. వీరణములు వాయించుచు రాజుల తానకములు పాడునప్పుడు రాజులకును (వల్లవులకును), ప్రధానుల తానకములు పాడునప్పుడు ప్రధానులకును (స్తిరమందులకును) శివమెత్తును. వారు పూనకముతో నూఁగుచు గంతులు వేయుదురు. ఇట్లు శివమెత్తినవారి చెవికడఁ గొమ్ములు హోరున నూఁదఁబడుచుండును. వీరణములు ఫెళఫెళ వాయింపఁ బడును. ఈ భయంకర శబ్దముల నడుమ పొంగెస్తుఁడు శివమెత్తి నృత్యము చేయుచుండును వీరద్రాళ్లతో నాతని కాలుసేతులపై కొట్టుచుందురు. దానిచేఁ బూనకము మఱింత హెచ్చును. ఆ తానకము నాపుటకు యాదవులు హరిగురువైన పల్లికొండమీఁద, శివగురువైన భక్తిరన్నమీఁద, విష్ణుస్వరూపిణియగు బొల్లావుమీఁద నానలు పెట్టుదురు:–

*"హరిగురువు పల్లికొండ పాదమాన*
*శివగురువు భక్తిరన్న పాదమాన*
*బొల్లావు పాదమాన, చిరంజీవి... చిరంజీవి"*

అందురు. అప్పుడు ఆ తానకమెక్కినవానికిఁ బూనకము తగ్గును. తాండవమాఁగి పోవును. ఈ తానకములు నెల్లూరు మండలమున దొనకొండలో నేఁటికిని బాడఁబడుచున్నవి.

రాయలసీమలో కర్నూలు మండలమున కోవెలకుంట్ల తాలూకా 'పెదయెమ్మనూరు' గ్రామమున జరుగు గంగతిరునాళ్లలోఁ గూడ తానకములు పాడఁబడుచును. కాని ఇక్కడి తానకములలో నొక వింతపద్ధతి యున్నది. గంగతిరునాళ్లనాఁటి రాత్రి 'గంగ– కాటమరాజు తర్కవాదము' కథను బాడింతురు. ఆ కథలో గంగ వేషము వేయువాఁడు ముందుగా వేషముతో నూరంతయుఁ దిరుగును. తానకములున్న ఆయా గోత్రముల గొల్లలు గోవులవలెఁ జేతులతోను, గాళ్లతోను నేలపైఁ బ్రాకుచు గంగవేషమున కడ్డుగా వత్తురు. ఈ వింతగోవున కొకచెవిలోఁ గొమ్ము నూఁదుచు, మఱియొక చెవిలోఁ గోత్రమును చెప్పుదురు. అప్పుడా యావునకుఁ బూనకము వచ్చును. గోత్రము సరిగాఁ జెప్పినచో నా 'యావు' గంగవేషము వెనుకనే పోవును. తప్పు చెప్పినచో దూరముగాఁ బాఱిపోవును. ఈ రకపుటావులకు ముందు ఎవ్వరును కాలిజోడు తొడుగరాజు. అట్లు తొడిగినవారి నీ 'వింత గోవులు' క్రుమ్మివేయును. ఈ విధమగు తానకములు రాయలసీమలో మాత్రమే కలవని భావించుచున్నాను.

'ఆవుల పరుపు' శబ్దమునకు మల్లంపల్లి సోమశేఖరశర్మగారు 'ఆవులకు సంబంధించిన వేడుకలు జరుగు ప్రదేశము' అని యర్థము చెప్పిరి. 'పరుపు' శబ్దము తప్పనియు, నది 'పరపు'గా నుండవలె ననియు, నప్పుడు 'పరపు'నకు 'ప్రదేశము' అను నర్థము వచ్చుననియు వీరు తలంచిరి. 'ఆవుల పరుపు' (ఆవుల పబ్బం) అను పేరుతో నొక ప్రత్యేక వీరగాథ కలదని తెలియుచున్నది. దీని వివరములు డా॥ బి. రామరాజు డా॥ నాయని కృష్ణకుమారిగారల సంపాదకత్వమున వెలువడిన 'జానపదగేయములు– సాంఘిక పద్ధతులు' అను గ్రంథమునఁ జూడవచ్చును.

## 7.17. "వీరబోనము":–

ఇది గంగతిరునాళ్లలో జరుగు మఱియొక యాచారము. కాటమరాజువారి పక్షమున ఖడ్గతిక్కనతోఁ బోరి మరణించిన 'తంబళ్ల బ్రహ్మరుద్రయ్య' యను శివబ్రాహ్మణునకు యాదవులుచేయు గౌరవమే వీరబోనము. 'ఈర్లమాను' (=వీరులమాను= జమ్మిచెట్టు) క్రింద బ్రహ్మరుద్రయ్య పేర యజ్ఞము చేసి, జంధ్యములు వేసికొని, వేటలు కోసి, ముద్దలెగురవేయుదురు. సోలెడు గిద్దెడు బియ్యము, దక్షిణ తాంబూలము, కొబ్బరి గిన్నె, వేటలు కొమ్ములవాని కిత్తురు.

## 7.18. కాటమరాజు విగ్రహములు:–

గంగగుడియున్నచోట్ల సాధారణముగాఁ గాటమరాజు విగ్రహముకూడఁ గనఁబడుచుండును. ఎఱ్ఱగడ్డపాడులోఁగల పాలేటి గంగగుడిలో కాటమరాజు, ముమ్మయ్య, పోచయ్య, భక్తిరన్న విగ్రహము లున్నవి. కనిగిరిసీమలోఁ గాటమరాజునకుఁ బ్రత్యేకముగా గుళ్లు లేచినవి కూడ. అట మారెళ్లప్రాంతమందు కాటమరాజు శిలావిగ్రహము లున్నవి.

కర్నూలుజిల్లా, కంభంతాలూకాలో రాజమలారణ్యమునఁ గాటమరాజు దేవాలయమొకటి కలదు. ఇందు కాటమరాజు విగ్రహమును గంగవిగ్రహమును గలవు. ఈ రెండు విగ్రహములకు మధ్య నొకరిముఖ మొకరికిఁ గనఁబడకుండ నొక ప్రాను గలదు. ఈ ప్రాఁకును "ఒరగోగు మాను" అందురు. ఇక్కడి కాటమరాజును "ఏనూతల కాటమరాజు" అందురు. ఈ నిర్జనారణ్యమునఁగల

కాటమరాజుగుడి దగ్గఱ ప్రతిసంవత్సరమును నుగాదికి గొప్ప దిరునాళ్లు జరుగును.

### 7.19. "దూబగుండం బావి":-

ఈ 'ఏనూతల కాటమరాజు' గుడి సమీపమున నొక బావి కలదు. దీనిని దూబగుండం బావి' యందురు. ఇది యీశ్వరుఁడు తన గజాశూలమును భూమిలో దింపి, గడ్డ పెల్లగించి, త్రవ్విన బావి యని జనశ్రుతి. ఈ ప్రాంతమందుఁ గాటమరాజు తన యావుల మందను మేపుచుండఁగా, నొకప్పుడు ఆవులు నీళ్లులేక అల్లాడిపోయిన వఁట. ఆ యావులబాధ చూడలేక కాటమరాజు తన గజాశూలము నాకాశమునకు విసరి యెదురొమ్ము నొడ్డినాఁడఁట. అప్పుడు ఈశ్వరుఁడు ప్రత్యక్షమై ఆకాశమునుండి పడుచున్న గజాశూలమును బట్టుకొని, ఆపి, బావిని త్రవ్వినాఁడు. ఆ బావికడఁ గాటమరాజు ఆలమంద తృప్తిగా నీళ్లుత్రాగి సుఖించినది.

### 7.20. కాటమరాజు సమాధి:-

కనిగిరిసీమలో పాలేటి తీరమునఁగల 'గొల్లపల్లె' దగ్గఱ కాటమరాజు సమాధి కలదని తెలియుచున్నది. అట ప్రతి సంవత్సరమును ఉగాది పండుగ నాఁటినుండి మూడు దినములపాటు 'కాటమరాజు తిరునాళ్లు' వైభవముగా జరుగును.

## 8. సారాంశము

ఈ సుదీర్ఘ ప్రకరణమునఁ జర్చింపఁబడిన వివిధ విషయములను ఈ క్రింది విధముగా సంగ్రహింపవచ్చును:-

ప్రాచీనమును బ్రశస్తమును నగు చారిత్రక వీరగాథలలోఁ బల్నాటివీరకథల తరువాత నన్నెఁదగునవి కాటమరాజుకథలు. ఇవి యొక సుదీర్ఘ కథాచక్రముగా నేర్పడియున్నవి. కాని పల్నాటి వీరకథలపై జరిగినంత పరిశోధనము వీనిపై జరుగలేదు. అందుచే నీ కథాచక్రములోని పెక్కుకథలు సాహిత్యలోకమునకు అపరిచితములుగ నుండిపోయినవి. తెలుఁగు వీరగాథలలో నింత పెద్ద గాథావృత్తము మఱియొకటి లేదు. దీనిలో మొత్తము ముప్పదిరెండు వీరగాథలున్నవని నా పరిశీలనమువలనఁ దేలినది. యథాప్రకారమున వాని నామములు:

"వల్లురాజుకథ, పంపాద్రికథ, పెద్దిరాజుకథ, సింహాద్రిరాజు కథ, ఎఱనూకరాజుకథ, నలనూకరాజుకథ, పోలురాజుకథ (ఆఱు చాటువలు), బల్లికురువ పోట్లాట, కఱియావులరాజుకథ, కాటమరాజుకు పట్టంకట్టిన కథ, పాపనూకకథ, ఉత్తరాది ఆవులమేపు, పాలేటికథ లేక గంగతర్కము, ఎఱ్ఱయ్య తరకవాదము, జన్నివాడ కథ లేక దక్షిణాది ఆవులమేపు, భట్టురాయబారము లేక కల్లి రాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ. వేడుక బొంగరాల కథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట (ఏడు కాండలు), అగుంచికథ, పాపనూక వలపోత, భక్తిరన్న కథ, కంసుఁడు కథ లేక విష్ణుభాగవతము."

ఈ కథలేకాకుండ ఇంకను "అగుమంచి వలపోత- గంగపుట్టుక- పల్లికొండ పుట్టుక- భైరవకురువ యుద్ధము" అను నాలుగు కథలు కలవని తెలియుచున్నది. ఇటీవలికాలములో (1966-2010 మధ్య) కొందఱు పరిశోధక మిత్రులు కాటమరాజు ప్రపితామహుఁడగు "కవులావుల గంగురాజుకథ"ను, జన్నివాడ కథాప్రారంభములో నుండు "పుల్లరి ఒప్పందపు కథ"ను, "పాపనూక వలపోత"ను సంపాదించిరి.

ఈ కాటమరాజు కథాచక్రమున నల్లసిద్ధిరాజు, ఖడ్గతిక్కన చారిత్రక వ్యక్తులు. ఓరుగంటి ప్రతాపరుద్రుని ప్రసక్తి కల వీరగాథలును నాకు లభించినవి. పల్నాటి యుద్ధము క్రీ.శ. 12వ శతాబ్ది చతుర్థ పాదమున జరుగగా, కాటమరాజు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట క్రీ.శ. 13వ శతాబ్ది చతుర్థపాదము జరిగినది. ఇది కాకతీయ మహారాజ్ఞి రుద్రమదేవి పాలనాకాలము చివరి భాగమున, నన‌ఁగా ప్రతాపరుద్రుఁడు యువరాజుగా నున్నప్పుడు జరిగినదని శాసనాధారములనుబట్టియు, వీరగాథలనుబట్టియుఁ దెలియుచున్నది. అనఁగా కాటమరాజు నల్లసిద్ధిరాజుల యుద్ధము క్రీ.శ. 1280-1289 మధ్య కాలములో జరిగినది. మనుమసిద్ధియే నల్లసిద్ధి యనుట సరికాదు. మనుమసిద్ధి పుత్రుఁడు నల్లసిద్ధి. ఇతఁడు నెల్లూరును బాలించిన తెలుఁగు చోళుఁడు. ఇతని పాలనాకాలము: క్రీ.శ.1270-1297. ఈ నల్లసిద్ధియే కాటమరాజునకుఁ బ్రత్యర్థి.

నెల్లూరు రాజ్యములోని పచ్చికబీళ్లలోఁ దన గోగణమును మేపుకొనుటకు కాటమరాజు నల్లసిద్ధితోఁ బుల్లరియొడంబడిక చేసికొనెను. నెల్లూరుసీమలో నున్నంతకాలము తన మందలోఁ బుట్టిన కోడెదూడలను నల్లసిద్ధి కిత్తునని యొప్పుకొనెను. కాని అతఁడు ఒడంబడికను మీఱి పచ్చికబీళ్లనే కాక వరిపొలములను సహితము మేపివైచెను. నల్లసిద్ధి రెండవ భార్య కుందమాదేవి బోయలచేఁ గాటమరాజు నాలమందను బొడిపించెను. నల్లసిద్ధికి ఈ విషయము తెలియదు. ఈ పనిని నల్లసిద్ధియే చేయించెనని కాటమరాజు భావించి, దీనికిఁ బ్రతీకారముగాఁ బుల్లరి నెగవేసెను. అందుచే నిర్వురకును యుద్ధము సంభవించెను.

కాటమరాజు చంద్రవంశ క్షత్రియుఁడు. ఇతఁడు విష్ణుమూర్తికి డెబ్బదినాల్గవ తరమువాఁడనియు. శ్రీకృష్ణునకు ఇరువదిమూఁడవ తరమువాఁడనియుఁ గొన్ని కథలలో నున్న వంశవృక్షములనుబట్టి తెలియుచున్నది. ఈ కథాచక్రమునఁ గాటమరాజు పితామహుఁడగు ఆవులవలురాజునుండి కాటమరాజువఱకును మూఁడు తరములకు సంబంధించిన ముప్పదిరెండు వీరగాథలున్నవి. ఈ వీరగాథల యితివృత్తములును, వాని పరస్పర సంబంధమును నీ క్రిందివిధముగా నుండును:-

ఎలమంచి పట్టణమును బాలించు కవులావుల గంగురాజునకు గంగమ్మయను భార్యయందు వలురాజు, హరిపాలుఁడు,

నందగోపాలుఁడు, గోవర్ధనుఁడు– అను నల్వురు పుత్రులుదయించిరి. వీరందఱును ఖండెమొండెములకోట నేలు కలభూత గంగురాజుతోఁ గరణములను గాపాడునిమిత్తమై యుద్ధముచేసి మరణించిరి. ఆవుల వలురాజుభార్య వల్లమ్మ. ఈ దంపతులకు సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు– అను నైదుగురు పుత్రులును, కొమరమ్మ లేక కొమరక్క యను పుత్రికయుఁ గల్గిరి. వల్లురాజు తరువాత నతని ద్వితీయ పుత్రుఁడగు పెద్దిరాజు సింహాసన మెక్కెను. ఇతఁడు ఎలమంచిని పదియేండ్లు పాలించెను. తరువాత నితఁడు సోదరులతోఁగూడి పంపాద్రికిఁ దరలివచ్చెను. పంపాద్రిలో నేడేండ్లు పాలించెను. పెద్దిరాజునకుఁ దప్పఁ దక్కినవారందఱికిని సంతానము గలిగెను. పెద్దిరాజుదంపతులు సంతానార్థమై కల్యాణ పట్టణములోనున్న సోమేశ్వరుని సేవింపఁబోయిరి. అట పెద్దిరాజు నకుఁ గాటమరాజను పుత్రుఁడును, బాపనూకయను పుత్రికయుఁ గలిగిరి. పాపనూక దుష్టనక్షత్రమున జన్మించినది. అందుచే పెద్దిరాజు కల్యాణమునేలు గంగురాజును రక్షింపనెంచి, వాలికేతువరాజుతో యుద్ధముచేసి ఆర్లపెంట రణమున మరణించెను. ఏడేండ్ల బాలుఁ డైన కాటమరాజు వాలికేతువరాజుపై దండెత్తి, ఆతనిని జంపి, తండ్రిపగ తీర్చెను. పెద్దమ్మ సహగమనము చేసెను.

సరిగాఁ బెద్దిరాజు మరణించిన సమయముననకే, ఆతని సోదరులు నలుగురును వివిధ స్థలములలోఁ, బరోపకారార్థము యుద్ధములు చేసి, తమతమ శరీరములను త్యజించిరి. సింహాద్రిరాజు శ్రీవైష్ణవులను గాపాడుటకై శ్రీకూర్మముపై దండెత్తి, సింధుభళ్లాని రాజుతోఁ బోరాడి చనిపోయెను. ఎఱనూకరాజు ఎఱుకలను కాపాడుటకై ఏనుగునాథునికొండ దగ్గఱ నెఱ్ఱభూపతితో యుద్ధముచేసి చనిపోయెను. నలనూకరాజు నున్నబెజవాడకుఁబోయి, దానిని బాలించు నందికేశవరాజు పన్నులచేఁ బ్రజలను బాధించుచుండఁ గా, నాతనితో యుద్ధముచేసి మరణించెను. పోలురాజు చెఱుకూరి దగ్గఱ మందలను మేపుచు, శ్రీరంగపట్టణమేలు చోడాని దౌష్ట్యమునకు గుఱియైన జంగముల కభయమిచ్చి రక్షించి, చోడాని పంపిన ముక్కంటితో యుద్ధముచేసి మరణించెను. ఇట్లు యాదవకులము, ఆవుల వలురాజునుండి పోలురాజు వఱకును, 'పరకార్యముకొఱకు పాడైపోయినది'. ఇవి రెండు తరముల కథలు. కాటమరాజుది మూఁ డవ తరము.

సింహాద్రిరాజుభార్య సింహాద్రిసీత. ఈ దంపతులకు కఱియావులరాజను పుత్రుఁడును, చిట్టినూకయను పుత్రికయుఁ గలరు. కఱియావులరాజు ఓరుగంటి ప్రతాపరుద్రునికి సేనానియగు బేతాళునితో 'నేకాంగి కయ్యము' చేసి జయించెను. ఇతని భార్యపేరు నాగమాంబిక లేక కఱియావులనాగ. చిట్టినూక భర్తపేరు కల్లందుల పోలినేఁడు. ఇతఁడు భైరవకురువ యుద్ధములోఁ జనిపోయినాఁడు. ఇతని పుత్రుఁడు పోచయ్య.

పెద్దిరాజుభార్య పెద్దమ్మ యనియు, వీరికిఁ గాటమరాజను కుమారుఁడును, పాపనూకయను కుమార్తెయును గలిగిరనియు ముందు తెల్పియుంటిని. తల్లిదండ్రులు మరణింపఁగా వీరు కల్యాణములో మారాసపువారి యింటఁ బెరిగిరి. తరువాత పోలురాజు పుత్రుఁడగు భక్తిరన్న వచ్చి వీరిని ఎలమంచికిఁ గొనిపోవును. యాదవులు తమ గోగణమంతటికిని రాజుగా కాటమరాజునకుఁ బట్టాభిషేకము చేసిరి. ఈతఁడు తన యాలమందతో దేశములన్నియుఁ బరిభ్రమించి తండ్రితాతల పగలు తీర్చినాఁడు. పాపనూక దుష్ట నక్షత్రమున జన్మించుటచే నామె అవివాహితగా నుండిపోయెను. దొనకొండలో నూరిబయట నొక మేడలో నేకాంతవాసము గడపెను.

ఎఱనూకరాజుభార్య ఎఱనూకసీత. వీరి పుత్రుఁడు భట్టావుల రాజు. ఇతఁడు ఓరుగల్లులో బేతాళుని తమ్మునితో ద్వంద్వయుద్ధము చేసి ఆతనిని చంపినాఁడు. ఇతని భార్యపేరు సూరమ్మ లేక సూరమాంబిక. నలనూకరాజుభార్య నలనూకసీత. వీరి పుత్రుఁడు పెయ్యల యెఱ్ఱయ్య. ఇతఁడు నున్నబెజవాడ నేలెడి నందికేశవరాజును జంపి, తండ్రిపగ తీర్చి, 'బెజవాడ బెబ్బులి' యను బిరుదమును వహించెను. ఈ యెఱ్ఱయ్య కాటమరాజుతోఁ గలసి ఆలమందలను మేపుచుండును. కాటమరాజువలెనే యితఁడును బాలేటిగంగతోఁ దర్కవాదము చేయును. ఇతని భార్య భయ్యమాంబిక.

పోలురాజుభార్య సిరిదేవి. ఈమెకు భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య యను ముగ్గురు కుమారులును, అగుమంచి యను కుమార్తెయుఁ గలిగిరి. పోలురాజుమంత్రి పల్లికొండ. పోలురాజు చెఱుకూరి కడ మరణింపఁగా, పల్లికొండ బాలరాజులను దీసికొని పంపాద్రికిఁ బోవుచుండెను. మార్గమధ్యమున బల్లికురువయొద్ద ముక్కంటి మనుమలు బాలరాజుల నెదిరించిరి. పల్లికొండ బొల్లావును ప్రార్థింపఁగా నదివచ్చి శత్రువులను దఱిమివేసెను. పోలురాజు పుత్రులలో నయితమరాజు మొదటి ఎలమంచికి, తరువాత దొనకొండకుఁ బాలకుఁడయ్యెను. భక్తిరన్న కాశికిఁబోవుచు, కల్యాణ పట్టణములోనున్న కాటమరాజును, పాపనూకను ఎలమంచికిఁ దెచ్చెను. భక్తిరన్నభార్య నల్లమేడ లేక నల్లమాంబ. ఈ భక్తిరన్న కాశికిఁ బోయి, తాతయగు వల్లురాజునకును, తండ్రులగు సింహాద్రి రాజాదులకును, వారివారి మంత్రులకును, సహగమనము చేసిన తల్లులకును, గయలోఁ బిండప్రదానము చేసెను. ఇతఁడు కాశిలోనుండఁగాఁ గాటమరాజాదులు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలోఁ గూలిరని విని, వెంటనే మేఘరథములో దొనకొండకు వచ్చి, పాపనూకను ఒంటరిగా మేడలో నుంచినందులకు దుఃఖించి, పాలేటి వార్తలు తెలిసిన వెంటనే యాదవకాంతలందఱును సహగమనము చేయవలసినదిగా నాజ్ఞాపించి, యెఱ్ఱగడ్డపాటికిఁబోయి, సోదరులకు నితర బంధువులకుఁ బిండప్రదానము చేయును. అయితమరాజు భార్యపేరు 'నేతివారిపోతు'. ఈ దంపతులకు 'అల్లు దాడెన్న' యను

పుత్రుఁడును, 'సిరిగిరమ్మ' యను పుత్రికయుఁ గలరు. యుద్ధ సమయమునఁ దమ వంశాకురమును నిలుపుకొనుటకై యాదవులు అల్లు దాడెన్నను కటకమునకుఁ బంపి వేసిరి. సిరిగిరమ్మను జిట్టినూక పుత్రుఁడగు పోచయ్యకిచ్చి పెండ్లిచేసిరి. ముమ్మయ్యభార్య చినమల్లు. ఈ ముమ్మయ్యయుఁ బోచయ్యయు యుద్ధసమయమున దొనకొండలో బొంగరములాడుదురు. అగుమంచి భర్తపేరు పుత్తమరాజు. ఇతఁడీమెకు మేనత్తకొడుకు (కొమరమ్మ పుత్రుఁడు). ఈ పుత్తమరాజు ఓరుగల్లులోఁ బ్రతాపరుద్రుని మొండిగుఱ్ఱమును స్వారిచేసిన వీరుఁడు. పోచయ్య పసిబాలుఁడుగా నున్నప్పుడు అతని తల్లియగు చిట్టినూక సహగమనము చేయుటచే, నా బాలుని నగుమంచి పెంచి పెద్దచేసినది.

పెద్దిరాజాదుల సోదరియగు కొమరక్క లేక కొమరమ్మ భర్తపేరు పందుముల పాపినాయఁడు. ఇతఁడు పోలురాజుకడ మంత్రి. పల్లికొండ కొమరక్కకుఁ బెంపుడు కొడుకు. పుత్తమరాజు, నాచకూళ్ల నాయఁడు నీమె నిజపుత్రులు. చట్టువారి యెఱ్ఱయ్య, పుల్లావుల కేశవయ్య యను నిర్వురుగూడ నీమె పుత్రులుగా వీరగాథలనుబట్టి తెలియుచున్నారు. కొమరమ్మ పుత్రులలో పల్లికొండ వరపుత్రుఁడు. ఇతఁడు వల్లురాజు, పోలురాజు, అయితమరాజులకు మంత్రిగా నున్నాఁడు. ఇతఁడు విష్ణుమూర్తి యవతారమని యాదవులు భావింతురు. పుత్తమరాజు అగుమంచి భర్త, నాచకూళ్ల నాయఁడు పాపనూకను బెండ్లాడవలసినవాఁడు. కాని ఇల్లరికముంచవలెననెడి నియమము కారణముగా నా పెండ్లి తప్పిపోయినది. చట్టువారి యెఱ్ఱయ్య కోటపాడునుండి తాటివృక్షమును బెకలించి తెచ్చిన మహావీరుఁడు. పుల్లావుల కేశవయ్య కఱియావులరాజునకుఁ జెలికాఁడు, మంత్రి.

కాటమరాజుతరములో కఱియావులరాజు మొదలుకొని పుల్లావుల కేశవయ్య వఱకును దెలుపఁబడిన వీరులందఱును నల్లసిద్ధి రాజుతో జరిగిన యెఱ్ఱగడ్డపాటి పోట్లాటలోఁ బాల్గొనిన వారే.

యాదవుల గోగణమున కధిపతిగాఁ జేయఁబడిన కాటమరాజు, తమ్ముఁడు పెయ్యల యెఱ్ఱయ్యతోను, చెలికాఁడగు వెలమ పద్మరాఘవునితోను గలసి, శ్రీశైలప్రాంతమున నాలమందలను మేపుకొనుచుండెను. అక్కడఁ బండ్రెండేండ్లు గడపెను. తరువాత నట విపరీతమగు క్షామము వచ్చుటచే, దక్షిణ భూములకుఁ దఱలి వచ్చుచు, కనిగిరిసీమలోఁ బాలేటికడ గంగతోఁ దర్కవాదము జరిపినాఁడు. మొదట వ్యతిరేకించినను జివరకుఁ జేయెత్తి గంగకు మ్రొక్కినాఁడు. ఆలమందలతో నెల్లూరిసీమలోఁ బ్రవేశించి, నల్లసిద్ధితోఁ బుల్లరి యొప్పందము చేసికొనెను. తన యాలమందలకు బోయలచే నష్టము వాటిల్లుటచే, నల్లసిద్ధికిఁ బుల్లరి నీయక, తిరిగి యెఱ్ఱగడ్డపాటికి వచ్చెను. నల్లసిద్ధిపంపిన భట్టురాయబారము ఫలించలేదు. ఎఱ్ఱగడ్డపాడులో జరిగిన ఘోరయుద్ధములో కఱియావులరాజు–ఎఱ్ఱసిద్ధిరాజుతోను, భట్టావులన్న– పాపసిద్ధిరాజుతోను, అయితమ రాజు–గండ గోపాలరాజు కస్తూరిరాజులతోను, ముమ్మయ్య–ఉండవెల్లి విరిగోవుతోను, నాచకూళ్ల నాయఁడు–గుత్తి భీమునితోను, పోచయ్య–తిర్ణమల తిప్పయ్యతోను, కాటమరాజు–నల్లసిద్ధితోను, పద్మరాఘవుఁడు– చింకర్ల భీమన్నతోను బోరాడిరి. కడకు యుద్ధమున యాదవులు జయించిరి. **"పగ మిగులకుండఁగఁ బ్రఖ్యాతిగాను, బగదీర్చె నెఱగడ్డపాట నలనన్న!"**

ఈ కథాచక్రమును శ్రీనాథుఁడు రచించినట్లుగా జనశ్రుతియే కాక, కొందఱు గాథాకవుల వాక్యములును సాక్ష్యమిచ్చుచున్నవి. కాని శ్రీనాథునిపేరుతోనున్న వీరగాథ ఒక్కటికూడ నేఁడు లభించుట లేదు. గంగుల పినయెల్లయ్య రచించిన ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటను వేటూరివారు పరిష్కరించిరి. ఈ గంగుల పినయెల్లయ్యయే కాక, నాకు లభించిన వీరగాథలలో మఱి యార్గురు ప్రాచీన జానపదకవులు వెలుఁగునకు వచ్చిరి. వారి పేర్లు: "వడరుప మద్దులేటికవి, మల్లయ్య, కనకబండి ఘట్టయ్య, కట్టెబోయిన మారయ్యకవి, కదిరి మంగళము (మంగళపురి) వెంకటాద్రి, జరుగుపల్లె చెన్నయ్య".

కాటమరాజుకథలను 'కొమ్ములవారు' అను మాదిగలు పాడుచుందురు. వీరు యాదవులను యాచించి జీవింతురు. యాదవులలోఁ గొన్ని శాఖలవారును ఈ కథలను బాడుచున్నారు. వీరిని 'సుద్దుల గొల్లలు', 'తెరచీర భక్తులు' అను నామములతో వ్యవహరింతురు. యాదవుల కులదైవము గంగ. ఈమె ఆంధ్రదేశమునఁగల ప్రధాన గ్రామదేవతలలో నొకతె. కొన్ని గ్రామములలో నీ గంగజాతరలు అతివైభవముగా జరుపఁబడు చుండును. ఇట్టి గంగ జాతరలలోఁ గాటమరాజుకథలు పాడుట ఆచారము. ❑

**(*గమనిక:–*** రష్యా దేశములోని లెనిన్‌గ్రాడ్ విశ్వవిద్యాయలములో ANNA NEYVIRT అను మహిళ కాటమరాజు కథలనుగుఱించి పరిశోధన చేయుచున్నది. ఈమె 15-8-2012 నాఁడు బెంగుళూరు వచ్చి నన్ను సంప్రతించినది.)

**అలభ్య వీరగాథావృత్తము:–**

## 9. వెలకంటి వీరుని కథాచక్రము

ఇది జంగములు పాడెడి వీరగాథావృత్తము. రాయలసీమలో ముఖ్యముగా రేనాడులో విశేషవ్యాప్తియందున్నది. ఇది శివపురాణమునకు సంబంధించిన కథవలె నున్నది. 'ముక్కంటి వీరుఁడు, వీరనాయఁడు, వెలకంటి వీరుఁడు, భూపతి కన్నయ్య, కన్న కైరుఁడు'– అను నైదు తరముల వీరులకు సంబంధించిన కథలు ఇందు వచ్చును. ఇది పదిరాత్రులు పాడఁబడు కథాచక్రము. ఈ కథలనన్నింటిని కర్నూలు మండలమున నంద్యాలలో 'ఇప్పె రుద్రప్ప' అను వృద్ధ జంగము మహాద్భుతముగాఁ బాడుచున్నాఁడు. వీనిని గ్రంథస్థలము చేయవలెనన్నచోఁ గనీసము నెలరోజులైనను బట్టును. పైగా, నా జంగము విపరీతమైన త్రాగుబోతు. నిరంతరము 'సురలోకము'లో విహరించుచుండును. అతనితో వేగుటకుఁ జాల యోర్పుండవలెను. ఈ కష్టములను బడలేక, నేనీ కథాచక్రమును సంపాదింపలేదు. అయినను, నిందలి కథలనుగూర్చి కొన్నివివరములు ఆ జంగమునుండి తెలిసికొంటిని.

ఈ కథాచక్రమున నైదు కథలున్నవి. అవి వరుసగా– 'ముక్కంటి వీరుని కథ, వీరనాయఁడు కథ, వెలకంటి వీరుని కథ, భూపతి కన్నయ్య కథ, కన్న కైరుఁడు కథ'. ఇవన్నియును తండ్రి కొడుకులకుఁ జెందిన ఐదుతరముల కథలు. ఈ కథాచక్రమున నైదు కథలున్నను, జానపదులలో వీనియన్నింటికిని 'వెలకంటి వీరుని కథ' అని యొకే నామము వ్యవహరింపఁబడుచున్నది.

1) ముక్కంటి వీరుని కథ:– ఇతని భార్యపేరు 'మూగలదేవి'. వీరనాయఁడీతని పుత్రుఁడు. ఈ ముక్కంటి వీరుఁడు వెలకంటి వీరుని తాత.

2) వీరనాయఁడు కథ:– ఇతఁడు ముక్కంటి వీరునకును, మూగలదేవికిని ఈశ్వరుని వరమువలనఁ బుట్టినాఁడు. ఇతఁడు దేవలోకమునకుఁబోయి దేవసుందరిని వివాహమాడి, ఆమెను భూలోకమునకుఁ దెచ్చెను.

3) వెలకంటి వీరుని కథ:– ఇతఁడీ కథాచక్రమునఁ బ్రధానవ్యక్తి. ఇతఁడు దేవసుందరికి శివుఁడిచ్చిన వెలగపండునుండి పుట్టినాఁడు. ఈ వెలకంటి వీరుఁడు ఐరావత గజముతోఁ బదునాల్గు దినములు భీకరయుద్ధము చేసి దానిని జంపెనఁట. బాలబ్రాహ్మణుని పుత్రిక యగు 'వీరాభలవంతి'ని వివాహమాడెను. ఈ కథను మూఁడు రాత్రులు పాడుదురు.

4) భూపతి కన్నయ్యకథ:– ఇతఁడు వెలకంటి వీరునకును వీరాభలవంతికి బుట్టినవాఁడు. కంచి వరదరాయల పుత్రికయగు 'చంద్రమాదేవి'ని వివాహమాడెను. ఇతఁడు తండ్రితోఁ గలసి శత్రురాజుల ధనమును దోచుకొని వచ్చుచుండఁగాఁ దండ్రి మరణించును.

5) కన్న కైరుఁడు కథ:– ఇతఁడు భూపతి కన్నయ్య పుత్రుఁడు. వెలకంటి వీరుని మనుమఁడు. ఇతఁడీశ్వర భక్తురాలును, దేవగిరిరాజు కూఁతురును నగు 'పద్మావతి'ని మంచముతో సహా యెత్తుకొని వచ్చి పరిణయమాడును. ఈ కన్న కైరుఁడు ఈశ్వరునిచేతిలో మరణించి 'ఒంటివీరుఁ' డైనాఁడు.

ఇట్లీ కథాచక్రము వెలకంటి వీరుని తాతనుండి, వెలకంటి వీరుని మనుమని వఱకును గల ఐదు తరముల కథలను వివరించుచున్నది. ఇది యెక్కువగా నాదితాళములో నడుచు పాట. దీని ప్రారంభ మిట్లుండును:

*"అరెరే.....*
*దక్షిణాదీ భాగమందూ వాలుగొండా పట్నమోయీ– భళా...*
*ఆ పట్నమేలే రాజులెవరూ... దైవమా.. తందనానా తందానా*
*వాలుగొండా ఏలిందీ వాల్మీకీ రాజులలోయీ– భళా*
*వాలుగొండా ఏలిందీ ముక్కంటి వీరుండూ– భళా*
*ముక్కంటి భార్యా, మూగల దేవమ్మా– తందనానా తందానా*
*అరెరే....*
*కట్టేదే లింగంబూ పెట్టేదే ఈబూదీ– భళా*
*పెట్టేదే ఈబూదీ చేసేదే శివపూజా– భళా*
*వాళ్ల లింగాబోయాలూ– తందనానా తందానా*
*చుట్టేదు కోటలూ సురస్వాఖ వీధూలు– భళా*
*నవరంగ గరిడీలు నాటకాశాలలు– భళా*
*ఏ భూమూలు ఎక్క హయము లున్నావే– తందనానా తందానా"* [99]

ఇతివృత్తమునుబట్టి యిది తమిళదేశమునకుఁ జెందిన శైవమత సంబంధమగు వీరగాథగాఁ గానవచ్చుచున్నది. ఇందలి వ్యక్తుల పేర్లు చారిత్రక వ్యక్తుల పేర్లవలె నున్నవి. ఈ విషయమై పరిశోధన జరుపవలసియున్నది.

## 10. వీరకథాచక్రముల పరస్పర సంబంధము

వెనుకటి ప్రకరణములలోఁ దెలుఁగునఁగల ప్రసిద్ధ వీరగాథా వృత్తములు నాల్గింటిని జర్చించితిని. మఱియొకటి వ్యాప్తియందుఁ గలదని నిరూపించితిని. ఎల్లమ్మ కథాచక్రము లేక పరశురాముని కథాచక్రము, అంకమ్మ కథాచక్రము, పల్నాటి వీరకథాచక్రము, కాటమరాజు కథాచక్రము– ఈ నాలుగు ప్రసిద్ధ వీరగాథావృత్తములలోను మొదటి రెండును శక్తికథాచక్రములు, తక్కిన రెండును చారిత్రక కథాచక్రములు.

ఒక వీరగాథాచక్రములోని వివిధగాథలలోఁ బరస్పర సంబంధము సాన్నిహిత్యము నుండుట సహజము. శక్తికథలన్నింటను

నొక సామ్యమున్నది. ఏ శక్తికథయైనను నాదిశక్తి రూపమే కావున, వానినన్నింటిని నొకే కథాచక్రముగా భావించినను దప్పులేదు. కాని, అంకమ్మకథలలోఁ గొంత చారిత్రకతత్త్వ ముండుటచే వానిని బ్రత్యేకించి చెప్పవలసివచ్చినది. ఇవి కల్యాణి కలచూరులకో లేక కల్యాణి చాళుక్యులకో సంబంధించిన కథలుగాఁ గన్పట్టుచున్నవి. పల్నాటి వీరకథాచక్రములోని కథలన్నియు నవతార పురుషుఁడగు బ్రహ్మనాయనిచుట్టును నేర్పడినవి. వాని సాన్నిహిత్యము క్రమబద్ధముగా నున్నది. కాటమరాజు కథాచక్రములోని కథలన్నియును విష్ణుస్వరూపుఁడగు కాటమరాజును జుట్టుకొని యున్నవి. వీని సాన్నిహిత్యమును గూడ శంకింపఁ బనిలేదు.

ఇట్లొక గాథాచక్రములోని కథలకు సాన్నిహిత్యముండుటయే కాక, పై నాలుగు కథాచక్రములకును గొంత కొంత సంబంధము కనఁబడుచున్నది. ఒక వీరగాథాచక్రమున మఱియొక దాని ప్రసక్తియుఁ గలదు. పరశురాముని కథాచక్రమునఁ బల్నాటి వీరకథలలోని కోడిపందెములప్రసక్తి యున్నది. అంకమ్మకథా చక్రమునఁ (రవద్దేవిరాజుకథలలో) బల్నాటికథలలోని బాలచంద్రుని బొంగరాలాటప్రసక్తి యున్నది. (అసలు, బొంగరాలాట పై నాలుగు కథాచక్రములందును వర్ణింపఁబడినది.)

పల్నాటి వీరకథాచక్రమున రాచగావుకథలో యాదవులు బ్రహ్మనాయనికిఁ దోడ్పడినట్లును, బ్రహ్మనాయఁడు సంతసించి వారికి గంగను, వీరత్రాడును, గుడారును బహూకరించినట్లును గలదు.

కార్యవీర్యార్జునుని జంపిన పరశురాముఁడే బ్రహ్మనాయఁడుగా జన్మించినట్లును, రేణుకయే శీలమ్మ అనియు, జమదగ్నియే దొడ్డనాయఁడనియు, పరశురాముఁడు చంపిన కాపువనిత గర్భస్థశిశువే నాగమ్మగాఁ బుట్టినట్లును పల్నాటివీరకథలలోఁ బ్రారంభమునఁ గలదు.

అంకమ్మను గొలిచిన మారాసపురాజులు ఏడ్గురన్నదమ్ములు. వీరిలో నేడవవాని పేరు 'వీరసోముఁడు'. ఈ వీరసోముఁడు పల్నాటి వారితోఁ గలసిపోయెనని అంకమ్మకథలలోఁ జెప్పఁబడినది. ఈ వీరసోముని పుత్రుఁడు కొమ్మరాజు, పుత్రిక సిరాదేవి. సిరాదేవిని మలిదేవుఁడు పెండ్లాడినట్లుగాఁ బల్నాటివీరకథలలో నున్నది. కొమ్మరాజు పుత్రుఁడు, అనఁగా వీరసోముని మనుమఁడు అలరాజనియుఁ బల్నాటికథలలోఁ గలదు. కొమ్మరాజు మారాసపు రాజనియు, నతఁడు అంకమ్మను గొలిచినట్లును నిందున్నది. పల్నాటి కథలలో నంకమ్మపుట్టుకను దెల్పు ప్రత్యేకకథ యొకటి కలదని తెలియుచున్నది. ఈ విధముగా అంకమ్మకథలకును, పల్నాటివీర కథలకును చాల దగ్గఱ సంబంధమున్నదని స్పష్టమగుచున్నది.

కాటమరాజుకథలలో భక్తిరన్నకథయందు 'గౌతమచాటువ' వచ్చును. ఇది పరశురామునికథలకు సంబంధించినది. గౌతముని కొడుకు జమదగ్ని, జమదగ్ని కొడుకు పరశురాముఁడు. పరశురాముని కథలలోని 'మఱ్ఱిచెట్టు కథ' యే భక్తిరన్నకథలోని 'గౌతమ చాటువ' యని చెప్పవచ్చును.

కాటమరాజుతండ్రి పెద్దిరాజు. ఇతఁడు కల్యాణమునకుఁ బోయి మారాసపు గంగురాజుతోఁ జెలిమిచేసినట్లున్నది. కాటమరాజును, నతని చెల్లెలు పాపనూకను బెంచినది మారాసుపు వారే. (మారాసపువారినే 'ముత్రాసు' లందురని తెలియుచున్నది.) ఈ మారాసపువారు అంకమ్మను గొలిచిన రాజులు. గంగురాజును గూర్చి అంకమ్మకథలలో నొక ప్రత్యేకగాథ యున్నది. అతఁడు కల్యాణపట్టణమునేలిన గంగురాజుగనే చెప్పఁబడినాఁడు. అతనికి 'కల్యాణపు గంగురాజు' అని నామాంతరముకూడఁ గలదు. కాఁబట్టి అంకమ్మకథలలోని గంగురాజును, కాటమరాజుకథలలో (పెద్దిరాజుకథలలో)ని గంగురాజును నొక్కరేయని భావింపవచ్చును.

బాలచంద్రుని సైన్యములో గోసంగులుండిరనియు, వారు యుద్ధమునకు ముందు తామే పోవలసివచ్చునని భయపడుచుండిరనియు, బ్రహ్మనాయఁడు వారి యాంతర్యమును గ్రహించి శపించెననియు, నప్పుడా గోసంగులు బాలచంద్రుని సైన్యమునుండి తప్పుకొని, యెఱ్ఱగడ్డపాడులోనున్న కాటమరాజు సైన్యములోఁ జేరిరనియుఁ బల్నాటికథలను బాడు వీరవిద్యావంతులు చెప్పుచున్నారు. దీనిలోని సత్యాసత్యము లెట్లున్నను, నేఁడు మాదిగలకుఁ బల్నాటి వీరాచారముతో నెట్టి సంబంధమును లేదు.

పై నాలుగు గాథావృత్తములలోను అంకమ్మకథలకును, పల్నాటివీరకథలకును మిక్కిలి సాన్నిహిత్యమున్నది. ఈ రెండింటిని నొక్క మాలలే పాడుట దీనికిఁ గారణము కావచ్చును. అట్లే పరశురామునికథలకును, కాటమరాజుకథలకును సాన్నిహిత్య మెక్కువగా నున్నది. ఈ రెండు కథాచక్రములను నొక్క మాదిగలే పాడుచుండుట దీనికి హేతువు కావచ్చును.

ఐరోపా ఖండములోని వివిధ దేశముల వీరగాథలన్నింటను సమానత్వమున్నదని పాశ్చాత్య విమర్శకులు నిర్ణయించి యున్నారు. ఇట్లొక ఖండములోని వీరగాథలలోనే పరస్పర సంబంధ ముండఁగా, నొకే భాషలోని వివిధ వీరగాథావృత్తములలో సమానాంశము లుండుట వింతకాదు.

ఇంతవఱకును దెలుఁగునఁగల వీరగాథావృత్తములనుగూర్చి ముచ్చటించితిని. ఇక రాఁబోవు ప్రకరణములలో వీరగాథలనుగూర్చి చర్చింతును. బొబ్బిలియుద్ధమువంటి వీరగాథలనుగూర్చి ఒక ప్రకరణమందును, పదములు– జంగంకథలు అనువానినిగూర్చి వేఱొక ప్రకరణమందును విపులీకరింతురు. ఈ వీరగాథల తరువాత లఘువీరగాథలనుగూర్చి ఒక ప్రకరణమందును, వీరగాథానుకరణము లగు బుఱ్ఱకథలనుగూర్చి వేఱొక ప్రకరణమందును జెప్పఁబడును. ❑

## జ్ఞాపికలు

1. చూ. వారి 'కాటమరాజుకథ' అను వ్యాసము, ఆంధ్రపత్రిక విజయ సంవత్సరాది సంచిక (1953-54), పుటలు 33-56.
"వీనిలో కాటమరాజుకథ యనునది కాటమరాజు చరిత్రమును సంపూర్ణముగా నభివర్ణించు గ్రంథము" (పుట 36). "గంగుల పినయెల్లయ రచించిన కాటమరాజుకథ, కథావృత్తాంతమును దొలినుండి తుదిదాక నభివర్ణించుచుండగా..." (పుట. 44).
2. కాటమరాజుకథ, ఆంగ్లపీఠిక. పుట vii.
3. *"Mackenzie Mss. say that Katamaraju was the ruler of Amaravati and Yerragaddapadu and that the site of the battle was located in the vicinity fo Amaravati"-- J.A.H.R.S., Vol. xxiii, p. 14. (Taylor: Mac. Cat. pp. 725, 727).*
4. *''The date of the battle is A.D. 1259. Nallasiddha is identaical with Nallasiddha III alias Manmasiddha III (A.D. 1248-1267) and Siddiraja of the Gundlapalem record is identical with Manmasiddha III. Sewell is worng in placing Siddhiraja and the Yadavas in the 12th Century A.D... The Kakatiya ruler in this period was Ganapati. Pratapa, in the Gundlapalem inscription is a mistake for Ganapati. Prabably, Alapolu had the support of the Kakatiyas in opposing Manmasiddha III." -- J.A.H.R.S., Vol. xxiii, p. 13.*
5. కాటమరాజుకథ, ఆంగ్లపీఠిక, పుట xi.
6. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట ౨౦౭.
7. ఈ శకవర్షంబులనే హరి ఆదిశేషువుగారు క్రీస్తుశకముగా భ్రమించి, కాటమరాజుయుద్ధము పల్నాటియుద్ధము కన్న ముందు జరిగినదని తమ జానపద గేయవాఙ్మయ పరిచయమున వ్రాసిరి. ఇది ప్రామాదికము. పల్నాటియుద్ధము క్రీ.శ. 1181 ప్రాంతమున జరిగినదని పలువురు చారిత్రకులు నిర్ణయించినారు. కాటమరాజుయుద్ధము దీనితరువాత సుమారు వంద సంవత్సరములకు జరిగియుండవలెను. కాటమరాజు చెలికాడు పద్మనాయఁడను వెలమవీరుఁడు ఈ వీరగాథలలోఁ దఱచుగాఁ బేర్కొనఁబడెను. ఇతఁడు పల్నాటిపాలకుఁడు. నలగామరాజాదులు హైమయవంశస్థులు. ఈ హైహయవంశము తరువాతనే పద్మనాయకులు పల్నాటిరాజ్యము నాక్రమించిరి. ఈ విషయముకూడ కాటమరాజు కథలు పల్నాటికథలకన్న నర్వాచీనములని ధ్రువపఱచుచున్నది.
8. చూ. 'కాటమరాజుకథ'కు మల్లంపల్లివారు వ్రాసిని పీఠిక, పుటలు xviii, xix.
9. గుండ్లపాలెము శిలాశాసనము, రెండవ ప్రక్క, పంక్తులు 32 మొదలు 44 వఱకును.
10. గుండ్లపాలెము శిలాశాసనము, మూడవ ప్రక్క, పంక్తులు 20-42.
11. కఱియావులరాజుకథ, పెదకంటిపల్లె తాళపత్రప్రతి, ఆకులు 2, 3.
12. "... ఇక దక్షిణమున గణపతిదేవుని సమకాలికుఁడగు నల్లసిద్ధి యెఱ్ఱగడ్డపాటిలో పోట్లాటలో చచ్చిపోయినాడు. విజయియైన కాటమరాజుకథ ఈ పేరుతో మాత్రమే కాక, భట్టురాయబారము, కోటపాటి తాటివృక్షము తెచ్చే కథ, వల్లురాజు యుద్ధము, అగుమంచికథ వంటి అనేక రూపాలుగా వచ్చింది".- కిన్నెర, డిసెంబరు 1953, పుట- 555.
13. **"ఉరపడి నుగ్రసేవణ పయోనిధి బాడఁబవహ్ని చాడ్పునన్
దరికొని కుంభజన్మక్రియఁ ద్రాగి రఘుక్షితినాథుమాడ్కి న
చ్చెరువుగ నింకజేసెనని చెప్పు జనప్రకరంబు విక్రమా
భరణుని సిద్ధనార్యసుతు బాచని నన్నన గంధవారణున్"**
14. భట్టురాయబారము, కాటమరాజుకథ, అనుబంధము, పుట 159.
15. కాటమరాజుకథ, పుట 10.
16. అదియే., పుటలు 15, 16.
17. అదియే., పీఠిక, పుట xxviii.
18. విజ్ఞాన సర్వస్వము, సంపుటము 3, పుట 233.
19. చూ. కాటమరాజుకథ, వేటూరి పరిష్కృతము, పుటలు 104, 105.
20. "మనుమసిద్ధిరాజు, యర్రసిద్ధిరాజు, పాపసిద్ధిరాజు, నలసిద్ధిరాజు, కుమారసిద్ధిరాజు ఈ సూర్యవంశ క్షత్రియులు అయిదుగురు అన్నదమ్ములు- రాజవంశ ప్రదీపిక, పుట 138.

21. ఆంధ్రపత్రిక, విజయ సంవత్సరాది సంచిక, పుట 56.
22. కాటమరాజుకథ, అనుబంధము, పుట 159.
23. అదియే.
24. అదియే., పుట 28.
25. గుండ్లపాలెము శిలాశాసనము, నాల్గవ ప్రక్క పంక్తులు 1-17.
26. కాటమరాజుకథ, పీఠిక, పుటలు xxix, xxx.
27. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములోని ప్రతి, డి.నెం. 1043.
28. Taylor: Mac. Cat. p. 727, details of battle A.D. 1157.
29. J.A.H.R.S., Volume xxiii, p. 14.
30. కాటమరాజుకథ, పీఠిక, పుట xxx.
31. 'కాటమరాజు: పుల్లరియుద్ధకాలము', కలగూరగంప, భారతి, జూలై 1966, పుట 76.
32. రాజవంశ ప్రదీపికా కర్తయగు బత్తుల లక్ష్మయ్యగారు కాటమరాజు యుద్ధము క్రీ.శ. 1300లో జరిగినదని వ్రాసిరి. (చూ. రాజవంశ ప్రదీపిక, పుట 138). కాని దీనికిఁగల ప్రమాణమును మాత్రము వారు చూపలేదు.
33. చూ. కాటమరాజుకథ, మల్లంపల్లి సోమశేఖరశర్మగారి పీఠిక, పుటలు xii, xiii.
34. అదియే., పుట xix.
35. ఈ కారణమును శ్రీ తిమ్మావజ్ఝుల కోదండరామయ్యగారు తమ వ్యాసములో నుట్టంకించియున్నారు. కాని నల్లసిద్ధికి బదులు మనుమసిద్ధి నామమును బ్రయోగించి వ్రాసిరి. చూ. ఆంధ్రపత్రిక, విజయ సంవత్సరాది సంచిక (1953-54), పుట 38.
36. నెల్లూరుజిల్లా, దర్శితాలూకా, గంగదొనకొండ గ్రామమునకుఁ జెందిన పూజారి సుబ్బయ్య అను వృద్ధగాథాకారుఁడు 12-9-1966న నాకు పాడి వినిపించినది.
37. 'చుండి' యనునదొక బోయపల్లె. కనిగిరినుండి నెల్లూరునకు పోవు మార్గములో పామూరు-నెల్లూరు మధ్య కలదు. ఈ బోయపల్లె పాలకులను 'బోయ దొరలు' అందురు. కుందమాదేవి ఈ గ్రామమునుండి బోయలను రప్పించి, కాటమరాజు నాలమందను బొడిపించెనని గాథాకారులు పాడుచుందురు. కాని "దక్షిణాది ఆవులమేపు" లేక "జన్నివాడకథ"లో వీరు "కోయ బోయలు" అని యున్నది.
38. 'జన్నివాడకథ', తాళపత్రగ్రంథము, పెరికగూడెము ప్రతి, ఆకులు 1, 2.
39. చూ. కాటమరాజుకథ, పీటిక xix.
40. Katama Raju Katha, Preface, p. xi.
41. రాజవంశ ప్రదీపిక, పుట 138.
42. 'జన్నివాడకథ', పెరికగూడెము తాళపత్రప్రతి, ఆకులు 8, 9, 10, 11.
43. కరియావులరాజుకథ, తాళపత్రగ్రంథము, పెదకంటిపల్లెప్రతి, (1966), ఆకు 11.
44. కాటమరాజుకథ, పుటలు 130, 131.
45. ఈ కథను నెల్లూరుజిల్లా, నెల్లూరుతాలూకా, నరసాపురము అను గ్రామములోనున్న 'సుబ్బయ్య' అను కొమ్ములవాఁడు 25-7-1966న నాకుఁ జెప్పినాఁడు.
46. కఱియావుల కాటమరాజు చరిత్రము, ఆంధ్ర యాదవసంఘ ప్రచురణ, 1926, పుట 3.
47. కాటమరాజుకథ (వేటూరి పరిష్కృతము), పుట 1.
48. "శబ్ద భావ నవరసాలంకారానుబంధురంబుగా నొక్క ప్రబంధం బాంధ్రభాషాభవ్యంబగు వచనరచనాకావ్యంబుగా రచియింపంబూనిన సమయంబున"- వరాహపురాణము, అవతారిక.
49. "ఇచట 'శ్రీనాథుని వచనపద్ధతి' యనఁగా 'శ్రీనాథుఁడు చెప్పిన విధము ననుసరించి' యనియే యర్థము చేసికొనవలసియున్నది. అంతియే కాని దీనిఁబట్టి శ్రీనాథుఁడు కాటమరాజుకథను వచనములో వ్రాసినాఁడనియు, దానిఁబట్టి యీతఁడు ద్విపదగా దీని రచించెననియుఁ జెప్పఁ గుదురదు". -- కాటమరాజుకథ, వ్యాసము, ఆంధ్రపత్రిక, విజయ సంవత్సరాది సంచిక, పుట- 35.

50. కాటమరాజుకథ, పీఠిక, పుట– xxi.

51. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట– ౨౦౫.

52. కాటమరాజుకథ, వ్యాసము, ఆంధ్రపత్రిక, విజయ సంవత్సరాది సంచిక, పుట– 46.

53. ఆంధ్రప్రదేశ్ యాదవసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు ప్రకటించిన 'వలురాజు చరిత్ర', పుట– 62.

54. ఆవుల వలురాజు తండ్రి "కవులావుల గంగురాజు". ఈయన కాటమరాజునకు ప్రపితామహుఁడు. ఈయనను గూర్చిన కథయొకటి తెలంగాణమున మందెచ్చులవారి దగ్గఱ లభించినది. (చూ. "మందెచ్చులవారు– జీవనవిధానము", శ్రీ రంగు రాజపాపయ్య, ఎం.ఫిల్, సిద్ధాంతవ్యాసము, అముద్రితము, కాకతీయ విశ్వవిద్యాలయము, వరంగల్లు, 1966). శ్రీ రాజపాపయ్యగారు ఈతనిని "కఱియావుల గంగురాజు"గాఁ బేర్కొన్నారు. ఇతడు "యయాద్రి" కుమారుఁడుగాఁ జెప్పినారు. కృష్ణాజిల్లాలో నాకు లభించిన తాళపత్రగ్రంథములోఁ గల కాటమరాజు వంశవృక్షములో యయాద్రి కుమారుఁడైన కవులావుల గంగురాజు ఆవుల వలురాజునకు ప్రపితామహుఁడుగాఁ జూపఁబడినాఁడు (యయాద్రి– కవులావుల గంగురాజు– ఆవుల భూపతి– ఆవుల అమృతయ్య– ఆవుల వలురాజు).

కథ:– యయాద్రి కుమారుఁడైన గంగురాజు ఉత్తరాది ద్వారకాపురి పట్టణమును బాలించుచుండెను. అతనికి ఐదుగురు భార్యలు: "దన లచ్చిమి, దాన్య లచ్చిమి, సంపూర్ణ లచ్చిమి, అన లచ్చిమి, అమృత లచ్చిమి". వీరిలో నెవ్వరికిని సంతానము కలుగలేదు. అందువల్ల గంగురాజు 'ఇలంబిపుర పట్టణ' మేలు రాచబ్రాహ్మడైన 'ఇలంబి మహారాజు' కూతుండ్రు "చంద్రకాంత"ను, "సూర్యకాంత"ను పెండ్లియాడెను. తాతలనాఁటి బావిదగ్గఱనున్న మామిడి చెట్టుకుఁగల ఒకే ఒక పండు ఈశ్వరుని మహిమవలన సూర్యకాంత కొంగులోఁబడును. దానిని తిని ఆమె గర్భవతి యగును. ఆఱుగురు తోడికోడండ్రు అసూయాగ్రస్తులై ఆమె గర్భమును పోగొట్టవలెనని ప్రయత్నింతురు. ఆ ప్రయత్నములు ఫలింపవు. అందువలన మంత్రసానికి లంచమిచ్చి, ఆమెకు పుట్టిన బిడ్డను అడవిలో పాడునూతిలో పడవేయింతురు. ఆ బాలుఁడు "వలరాజు" నాగలోకమునకుఁ బోయి, నాగకన్యచేఁ బెంచఁబడును. ఆర్గురు తోడికోడండ్రును భర్తయగు గంగురాజుతో కొండెములు చెప్పి, సూర్యకాంతను అడవికిఁ బంపివేయుదురు. ఆ బాలుఁడు వలరాజు వచ్చి, తండ్రితో ద్వంద్వయుద్ధముచేసి, అతనిని మెప్పించి, తానతని కుమారుఁడనని నిరూపించుకొనును. అడవిలోనున్న తల్లిని తీసికొనివచ్చి తండ్రికి అప్పగించును. సూర్యకాంత తన తోడికోడండ్ర నందఱిని క్షమించి వదలివేయును.

ఇది అభూత కల్పనలతోఁగూడిన జానపదకథవలె నున్నది కాని, వీరగాథవలె లేదు. తక్కిన కాటమరాజుకథలతో దీనికి ఏవిధమైన సంబంధమును కనపడదు. శరణాగత రక్షణము, గోబ్రాహ్మణ రక్షణము, వీరము, శౌర్యసాహసములు– కాటమరాజుకథల ప్రధాన లక్షణములు. ఈ ప్రధాన లక్షణములు ఈ కథలో మృగ్యము. కాటమరాజుకథలన్నియు ద్విపదలోను, మంజరీద్విపదలోను నుండగా, ఈ కథ పాటరూపములోను, వచనరూపములోను ఉన్నది.

55. 1967 మే నెలలో, తెనాలి తాలూకా యడవూరు గ్రామములో లభించిన కాగితపుఁబ్రతి, పుట 13. దీనిని ఆంధ్రప్రదేశ్ యాదవసంఘమువారు నా కొసంగిరి.

56. చిత్తూరుజిల్లా, చంద్రగిరితాలూకా, పెడకంటిపల్లెలో 1–3–1966న లభించిన తాళపత్రగ్రంథము, పత్ర సంఖ్య–18.

57. నెల్లూరుజిల్లా, కనిగిరితాలూకా, పంచలింగాలకొండ ప్రక్కనున్న వెంగళాపురములో 1966 సెప్టెంబరు నెలలో లభించిన తాళపత్రగ్రంథము, ఆకు–15.

58. యడవూరు కాగితపుఁబ్రతి, పుట–13.

59. పెడకంటిపల్లె తాళపత్రప్రతి, ఆకు–18.

60. వెంగళాపురము తాళపత్రగ్రంథము, పత్రసంఖ్య–16.

61. యడవూరు కాగితపుఁబ్రతి, పుట–14.

62. పెడకంటిపల్లె తాళపత్రప్రతి, ఆకు–18.

63. యడవూరు కాగితపుఁప్రతి, పుట– 14.

64. పెడకంటిపల్లె తాళపత్రప్రతి, ఆకులు– 18, 19.

65. వేటూరి పరిష్కృతమగు 'కాటమరాజుకథ', పుట– 18.

66. పెడకంటిపల్లె తాళపత్రప్రతి, పత్రసంఖ్య–66 ఏ.

67. పాపనూకకథ, తాళపత్రగ్రంథము, కుచ్చికాయలపూడిప్రతి, 1964, ఆకులు–10, 11.
68. కృష్ణాజిల్లా, కైకలూరుతాలూకా, పెరికగూడెములో 9-9-1964 నాడు లభించిన తాళపత్రప్రతి, ఆకు–33.
69. కాటమరాజుకథ, వేటూరి పరిష్కృతము, పుటలు– 26, 27.
70. అదియే., పుట– 29.
71. అదియే., పుట– 53.
72. అదియే., పుట–75.
73. అదియే., పుటలు–89, 90.
74. అదియే., పుట–94.
75. అదియే., పుటలు– 98, 99.
76. అదియే., పుట– 110.
77. అదియే., పుటలు– 116, 117.
78. అదియే., పుట– 129.
79. అదియే., పుటలు– 134, 135.
80. అదియే., పుటలు– 99, 100.
81 అదియే., పుట– 140.
82. అదియే., పుట–148.
83. పెదకంటిపల్లె తాళపత్రగ్రంథము, ఆకు–2.
84. అదియే.
85. ఎఱ్ఱబాలెము తాళపత్రప్రతి, ఆకులు– 43, 44.
86. ఆచార్య మట్టిబోయిన జయదేవ్, 'యాదవుల జానపద ప్రదర్శన కళలు', 2010, పుటలు– 406, 407.
87. యడవూరు కాగితపుఁబ్రతి, పుట– 16.
88. వెంగళాపురము తాళపత్రప్రతి, ఆకు– 19.
89. **"క్షత్రియా చ్ఛూద్ర కన్యాయాం సుతో జాయేత నామతః**
**స గోపాల ఇతిజ్ఞేయో భోజ్యో విప్రయినన్ సంశయః"**–– అధ్యాయము 11, శ్లోకము 23.
90,91. కృష్ణాజిల్లా, కైకలూరుతాలూకా, పెరికగూడెములో గుజ్జర్లపూడి మస్తాను అను కొమ్ములవాఁడు పాడిన ప్రార్థనలు. సేకరణ: 21-9-1964.
92. నెల్లూరుజిల్లా, దర్శితాలూకా, గంగదొనకొండ గ్రామములో పూజారి బోదయ్య అను పూజగొల్ల పాడిన ప్రార్థన. సేకరణ: 12-9-1966.
93,94,95,96. ఈ నాలుగు పాటలను గంగదొనకొండకుఁ జెందిన మోడి గంగులు అను పూజగొల్ల పాడి వినిపించెను. సేకరణ: 17-9-1966.
97. దర్శితాలూకా, 'తూర్పుగంగవరము' గ్రామములో వేఱొక 'గుంటిగంగ' కలదనియు, నటఁ దిరునాళ్ళు విశేషముగా జరుపఁబడుననియు, వానికి 'గుంటిగంగ తిరునాళ్ళు' అని పేరనియు మిత్రులు శ్రీమాన్ కె. రామానుజాచార్యులవారు తెలియఁజేయుచున్నారు.
98. చూ. కాటమరాజుకథ, మల్లంపల్లివారి పీఠిక, పుట–xxxiv.
99. కర్నూలుజిల్లా నంద్యాలలో ఇప్పెరుద్రప్ప అను జంగము 1966లో పాడిన పాట.

# పదమూఁడవ ప్రకరణము

# బొబ్బిలివరుస కథలు

వెనుకటి ప్రకరణములలో వీరగాథావృత్తములనుగూర్చి చర్చించితిమి. అవి యొక ప్రసిద్ధ వీరునకు సంబంధించిన వివిధ వీరుల కథలుగాఁ గాని, ఒక ప్రధాన కులదైవమును గొలిచిన రాజన్యుల కథలుగాఁ గాని యుండును. అవి నెలల తరబడి పాడినను తఱుగునవి కావు (పల్నాటి వీరగాథాచక్రమును గాథా కారులు రెండు మూఁడు నెలలు పాడుదురు). అట్లు చక్రములుగాఁ గాక, ఒకే వీరునకు సంబంధించిన ఒక కథను జెప్పునవి వీరగాథలు (Ballads). ఇవి రెండు మూఁడు రాత్రులలోఁ బూర్తియగును. సర్వాయి పాపని కథవంటివి కొన్ని ఒకే రాత్రిలోఁ గూడఁ బూర్తి యగుట కలదు. సాధారణముగా నీ వీరగాథలు వేయి మొదలుకొని రెండువేల పాదములవఱకును నుండును. రెండువేల పాదములు దాటిన వీరగాథలలోఁ గాండము లేర్పడి తీరును (జానపదులీ కాండములను 'చాటువ'లందురు). ఇట్టి దీర్ఘ వీరగాథలు మూఁడు నాలుగు రాత్రుల వఱకును బాడఁబడుచుండును. ఒక రాత్రిలో 800 మొదలు 1000 పాదముల కథ జరుగును.

తెలుఁగునఁగల యిట్టి వీరగాథలలో మూఁడు ప్రధాన విభాగములను గుర్తింపవచ్చును: 1) బొబ్బిలివరుస కథలు; 2) పదములు; 3) జంగం కథలు. 'కిటతక కిటతక' యను నెనిమిది యక్షరముల యావృత్తులు నాలుగు ఒక పాదముగాఁ బాడఁ బడునవియు, వాని ప్రభేదములును బొబ్బిలివరుస కథలనఁబడును. ఇవి పాడఁబడునప్పుడు మాత్రమే పైరీతిగా పాదమునకు 8×4=32 మాత్రలుండును. రచనలో నిట్లుండవు. 8+8+9 (లేక 10) మాత్రలొక పాదముగా వీని రచన సాఁగును. పెద్ద బొబ్బిలిరాజు కథ, దేసింగు రాజు కథ, సర్వాయి పాపడు కథ, చిన్నపరెడ్డి కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మ కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ, ముగ్గురు మరాఠీల కథ (ఆరె మరాఠీల కథ), సదాశివరెడ్డి కథ మొదలగునవి. బొబ్బిలివరుస కథలకు ఉదాహరణములు.

'కిటతకిట' అను నైదక్షరముల ఆవృత్తులు ఒక్కొక్క పాదమున కెనిమిదిగాఁ బాడఁబడునవి పదములు. ఇవి "హరిహరీ నారాయ ణాదినారాయణా, కరుణించి మమ్మేలు కమల లోచనుఁడ" అను వరుసలో నుండుట, దీనినే పల్లవిగా గలిగి యుండుట కారణముగా నీ పదములను 'హరిహరీ పదము' లనుటయుఁ గలదు. శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు వీని కీ పేరునే వాడియున్నారు (చూ. కిన్నెర, సంక్రాంతి సంచిక, 1955). యక్షగానములలో నీ వరుసను 'జంపె వరుస' యందురు. అంత్యప్రాసలతో నటతాళమున దరువులుగా సాఁగు శారద వరుసలను గూడ పదములలో నొక విభాగముగా స్వీకరింపవచ్చును. అప్పుడు పదములు 'హరిహరీ పదములు, శారద పదములు' అని ద్వివిధముగా భావింప వలసి యుండును. శతకంఠ రామాయణము, లక్ష్మణమూర్ఛ, గంగా వివాహము, కుసలాయకము, విరాటపర్వము, సారంగధర, సుందర కాండము, ధర్మాంగద చరిత్ర మున్నగునవి తెలుఁగునఁ గల ప్రసిద్ధ హరిహరీ పదములు. శారద రామాయణము, శారద హరిశ్చంద్ర, గోపికా వస్త్రాపహరణము, సారంగధర (శారద వరుస) మున్నగునవి శారద పదముల కుదాహరణములు.

రగడలు, పద్యములు, అర్ధ పద్యములు, దరువులు, కీర్తనలు, మున్నగు వివిధ ఛందస్సులో నడచుచు, యక్షగానములను హరికథలను బోలిన రచనలు 'జంగంకథలు'. జంగంకథలలోని రగడ, బొబ్బిలికథ వరుసలోనే యుండును కాని, యతిప్రాసల బిగింపు దీని ప్రత్యేకత. 8+8+9 (లేక 10) మాత్రలొక పాదముగా సాఁగు రచనలోఁ బదునాఱు మాత్రల తరువాత యతి, ప్రతి రెండు పాదములకును బ్రాస నియతముగా నుండును. శ్రీయాళమహారాజు చరిత్రము, భళ్లాణరాయని చరిత్రము, నలోపాఖ్యానము, రుక్మిణీ కల్యాణము, నిజలింగ చిక్కయ్య చరిత్ర, వామన చరిత్ర, గయోపాఖ్యానము, రుక్మాంగద చరిత్ర మున్నగునవి జంగంకథలకు లక్ష్యములు.

పైరీతిగాఁ జేసిన త్రివిధ విభజనము ఛందస్సునుబట్టి చేసినట్లుగా పైకిఁ గనబడినను, ఇతివృత్తములందుఁగూడ నివి వేఱగు చుండుట గమనింపవచ్చును. బొబ్బిలివరుస కథలెక్కువగాఁ జారిత్రక సాంఘికేతివృత్తములను గలిగియుండును. పదములు పురాణగాథలు. జంగంకథలు శైవవైష్ణవ పురాణగాథలు. బొబ్బిలివరుస కథలు మొదటి నుండి చివరి వఱకును నొకే ఛందస్సులో నడచును. పదములును నిట్టివే. కాని జంగంకథలు మాత్రము విభిన్న ఛందస్సులలో నుండును. అయినను, వీనిలోఁ బ్రధానకథ మాత్రము రగడయను నేకచ్ఛందము ననే సాఁగును.

బొబ్బిలివరుస కథలలో నెక్కువ భాగము ప్రాచీనమైనవి. పదములు క్రీ.శ. 1850 నుండి బయలుదేరినవి. జంగంకథలు నిన్నమొన్నటివి; అనఁగా 20వ శతాబ్ది ప్రారంభమునుండి (1900 ప్రాంతమున) ప్రచారమునకు వచ్చినవి.

ఇతివృత్తములనుబట్టి పరిశీలించినచో బొబ్బిలివరుస కథలలోఁ గొన్ని ప్రధాన వర్గములును, ఆ వర్గములలోఁ గొన్నిటికి అంత ర్భాగములును గోచరించును. ముద్రితములై రోడ్లప్రక్కన లభించు ప్రసిద్ధములైన వీరగాథలు గాక, జంగముల జిహ్వాగ్రములపైఁ దాండవ మాడుచున్న కథలలో వివిధ ప్రాంతములందు వ్యాప్తిగాంచియున్న వానిని సుమారు అఱువది వీరగాథలను నేను సంపాదించియుంటిని.

వీని యితివృత్తములన్నింటిని బరిశీలింపఁగా, నీ వీరగాథలన్నియు 'చారిత్రకములు, సాంఘికములు, జానపదములు, పౌరాణికములు' అను నాలుగు ప్రధానశాఖలుగా విడిపోవునని తెలియనగును. ఇందు చారిత్రకములలో మరల 'స్పష్ట చారిత్రకములు, అస్పష్ట చారిత్రకములు' అనుసంతర్భాగములును; సాంఘికములలో 'పేరంటాండ్రు, సాహసికులు, బందిపోట్లు, గజదొంగలు, గ్రామకక్షలు- హత్యలు, కుటుంబ కలహములు, లేచిపోవుటలు' ఇత్యాది యంతశ్శాఖలును గోచరించును. ఇట్లు ఇతివృత్తములనుబట్టి బొబ్బిలివరుస కథలలోఁ గాసనగు శాఖోపశాఖలను, వానికి ఉదాహరణములుగా నేనీ ప్రకరణముసఁ జర్చింపఁబోవు ముద్రితాముద్రిత వీరగాథలను ఈ క్రింది విధముగాఁ జూపవచ్చును.

### 1. చారిత్రకములు:-

**1.1. *స్పష్ట చారిత్రకములు:*** బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, జగపతిరాజు కథ, కొమార రాముని కథ, రాణి శకరమ్మ కథ, సదాశివరెడ్డి కథ, నల్ల సోమనాద్రి కథ (గద్వాల సోమనాద్రి కథ), రాజా రామేశ్వరరావు కథ, కర్నూలు నవాబు కథ, ఉయ్యాలవాడ నారసింహరెడ్డి కథ

**1.2. *అస్పష్ట చారిత్రకములు:*** బంగారు తిమ్మరాజు కథ, ముగ్గురు మరాఠీల కథ, బాలనాగమ్మ కథ, కుంతి మల్లారెడ్డి కథ, వేమన కథ, బల్మూరి కొండల్రాయని కథ.

### 2. సాంఘికములు:-

**2.1. *పేరంటాండ్రు:*** కన్యకామ్మవారి కథ, కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, మండపేట పాపమ్మ కథ, శృంగవరపుకోట ఎఱుకమ్మ కథ, తిరుపతమ్మ కథ, లక్ష్మమ్మ కథ, వీరరాజమ్మ కథ, చిన్నమ్మ కథ, ఎఱుకల నాంచారి కథ, రావులమ్మ కథ, నల్లతంగాళ్ కథ, అంజమ్మ కథ, ఉయ్యారు వీరమ్మ కథ లేక గొల్లల వీరమ్మ కథ, గూడూరు నారాయణమ్మ కథ, సతీ రంగమ్మ కథ, ఈడిగ దేవమ్మ కథ, సరోజనమ్మ కథ.

**2.2. *సాహసికులు:*** సర్వాయి పాపడు కథ, చిన్నపరెడ్డి కథ.

**2.3. *బందిపోట్లు:*** మలగర బాలేసాబ్ కథ.

**2.4. *గజదొంగలు:*** మియాసాబ్ కథ, పండుగ శాయన్న కథ, దువ్వన్నదొర పాట, సక్కపల్లి రాముడు కథ.

**2.5. *గ్రామకక్షలు- హత్యలు:*** కుంటి పుల్లారెడ్డి కథ, యల్లమంద నాయఁడు కథ, చెన్నకృష్ణారెడ్డి కథ, పరిగ రామకృష్ణారెడ్డి కథ, దొర్నిపాటి వెంకటరెడ్డి కథ, ఒడ్డుకింద భయ్యారెడ్డి కథ(?), సుబ్బిరెడ్డి కథ, కలిచెర్ల నరసింహారెడ్డి కథ.

**2.6. *కుటుంబ కలహములు:*** కందెపు సుబ్బయ్యగారి కథ.

**2.7. *లేచిపోవుటలు:*** మందలోడు కథ.

### 3. జానపదములు:

గాంధారికథ, కాంభోజరాజు కథ, కమ్మవారి పడఁతి-పసల బాలరాజు కథ, ఎలనాగిరెడ్డి కథ, రక్తకొమారుని కథ, రత్నాంగి కథ, కాశీమజిలీ కథలు, విక్రమార్కుని కథలు.

### 4. పౌరాణికములు:

రామకథాసుధార్ణవము, ఆండాళ్ చరిత్రము లేక శ్రీరంగ మాహాత్మ్యము, వరాహావతార చరిత్రము (పందికథ), పెద్దకాపుగారి కథ, వేంకటేశ్వరుని కథ, మల్లికదేవమ్మ కథ, జలాచంద్రుని కథ (జరాసంధుని కథ), కవిశాంభవరాజు కథ (కౌశాంబిరాజు కథ), పర్వతాల మల్లారెడ్డి కథ, కొమిరెల్లి మల్లన్న కథ.



# 1. చారిత్రకములు

## 1.1. స్పష్ట చారిత్రకములు

వీనిలో బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, జగపతిరాజు కథ, కొమార రామునికథ మున్నగునవి ముద్రితములైన ప్రసిద్ధ వీరగాథలు. ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ, కర్నూలు నవాబుకథ, రాణి శంకరమ్మ కథ, సదాశివరెడ్డి కథ, రాజా రామేశ్వరరావు కథ, నల్ల సోమనాద్రి కథ (గద్వాల సోమనాద్రి కథ) మున్నగునవి నేను సేకరించిన అముద్రిత వీరగాథలు.

### 1.1.1. బొబ్బిలి కథ:-

తెలుఁగు వీరగాథలన్నింటిలోను అత్యంత ప్రసిద్ధమైనది 'బొబ్బిలి కథ'. నాటకములలో చిలకమర్తివారి గయోపాఖ్యానమున కెంత ప్రచారమున్నదో, వీరగాథలలో బొబ్బిలికథకు అంత ప్రచారమున్నది. ఆ నాటకము ఆడఁబడని పల్లె ఆంధ్రదేశమున లేనట్లే, యీ వీరగాథ పాడఁబడని పల్లెయు లేదనవచ్చును. వానలోఁ దడియనివారు లేరు. అట్లే గయోపాఖ్యాన నాటకమును జూడని తెలుఁగువాఁడు కాని, బొబ్బిలి వీరగాథను వినని తెలుఁగువాఁడు కాని లేడనుటలో నతిశయోక్తి లేదు. దీనికి మూఁడు రకముల ప్రతులున్నవి: 'బొబ్బిలి కథ, బొబ్బిలిరాజు కథ, పెద్ద బొబ్బిలి మహారాజు కథ'. వీనిలో 'బొబ్బిలి కథ'కు వ్రాఁత ప్రతులు రెండు మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమునఁ (ఇఁక మీఁదట 'మద్రాసు ప్రా.లి.పు.భా.') గలవు (డి.నెం. 2550, 2551). వీనిని మల్లంపల్లి సోమశేఖరశర్మగారు తమకు లభించిన మఱిరెండు ప్రతులతో (ఒకటి నెల్లూరు జిల్లాలోను, వేఱొకటి రాజమండ్రిలో రోడ్లప్రక్కనను లభించినవఁట) సరిపోల్చి, పరిష్కరించి, ఆ గ్రంథాలయ పక్షమున 1956లో 'బొబ్బిలి యుద్ధ కథ' అను పేరుతోఁ బ్రకటించిరి. బొబ్బిలిరాజు కథ'ను 'కొ.నృసింహాచారి' రచించినట్లును, అది 1896లోఁ బ్రకటింపఁబడినట్లును, పిఠాపురములోని సూర్యరాయ విద్యానంద గ్రంథాలయములోఁగల పుస్తకముల పట్టికనుబట్టి తెలియుచున్నది. (నేఁడీ కథ ఆ గ్రంథాలయములో లేదు. ఎవరో ప్రబుద్ధులు కాఁజేసినారు.) ఇట్టి ప్రతి యొకటి డా॥ రామరాజుగారి కంటఁ బడినట్లున్నది. వారు దీనినిగూర్చి వ్రాయుచు, ఈ కవి పూర్తిపేరు కొంతం నృసింహాచార్యు లనియు, నితఁడు పార్లపల్లి గ్రామవాసి యనియుఁ, దీని నాల్గవకూర్పు 1896లో వచ్చినదనియు, నాకూర్పునకుఁ బరిష్కర్త ప్రభల సీతారామయ్య యనియు, కాపీరైటు గుదిమెళ్ల వరదాచార్యుల దనియుఁ దెలిపియున్నారు (చూ. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుట ౩౩౫). ఇక మూఁడవ ప్రతియైన 'పెద్ద బొబ్బిలి మహారాజు కథ'ను 1912లో మద్రాసు భరద్వాజ ముద్రాక్షరశాలవారు ప్రకటించిరి. దీనిని నేఁడు 'పెద్ద బొబ్బిలిరాజు కథ' అను పేరుతో ననేక ప్రకాశకులు ముద్రించి ప్రకటించుచున్నారు. ఏ రోడ్డు ప్రక్కనైనను లభించును. ఈ పెద్ద బొబ్బిలిరాజు కథను మొదట ధేనువకొండవారు ప్రకటించిరనియు, నిది నృసింహాచారి రచనకు సంక్షిప్తమనియు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారును, రామరాజుగారును దెల్పియున్నారు. ఈ గుజిలీప్రతిలోఁ గోడిపందెములున్నవి. మద్రాసు వ్రాఁతప్రతిలోఁ గోడిపందెములు లేవు. తక్కిన కథయంతయు నించుమించు రెండింటను సమానమే. మొత్తమునకు మద్రాసు వ్రాఁతప్రతి ప్రాచీనమైనది, ఎక్కువ ప్రామాణికమైనది. కాకినాడ ఆంధ్రసాహిత్య పరిషత్ గ్రంథాలయములోఁ గూడ బొబ్బిలికథకు సంబంధించిన యొక వ్రాఁతప్రతి యున్నదని తెలియుచున్నది. (నేను పోయి పరిశీలింపగా నది లేదు.)

ఈ బొబ్బిలి కథను మొట్టమొదట సేకరించిన మహానుభావుడు సి.పి.బ్రౌనుదొర. క్రీ.శ. 1842 ప్రాంతములో ఆయన మద్రాసులో నొక జంగము వానిని తన దగ్గఱనే యుంచుకొని, వానిచేత 'బొబ్బిలి కథ, కామమ్మ కథ, కొమార రాముని కథ' పాడించి, అతఁడు పాడుచుండఁగా వానిని యథాతథముగా వ్రాయించినారు. ఈ విషయమును దొరగారే స్వహస్తములతో లిఖించియున్నారు (చూ. డి.నెం. 2550 వ్రాఁతప్రతిలో మొదటి పుట). ఈ బొబ్బిలి కథ చివరలో వచ్చు "పెద్దాడ నాగేశం కొడుకు మల్లేశం చెప్పిన కథ వినుడీ" అను వాక్యమునుబట్టి పెక్కురు విమర్శకులు 'పెద్దాడ మల్లేశం' బొబ్బిలి కథను రచించిన కవి యని తలంచినారు. నాకుఁ జూడఁగా నిది యీ కథను బ్రౌనుదొరగారికిఁ బాడి వినిపించిన జంగము పేరు మాత్రమే యని తోఁచుచున్నది. ఏ జానపద కవియుఁ దన పేరును గ్రంథాంతమునఁ జెప్పుకొనలేదు. కాటమరాజు కథలు రచించిన ఆర్గురు నూతన కవులను నేను గనుగొంటిని. వీరిలో నే యొక్కరును దన నామమును గథాంతమునఁ జెప్పుకొనలేదు. పైఁగా నిది మల్లేశం 'చెప్పిన' కథయే కాని 'వ్రాసిన' కథకాదు. ఇది ముఖ్యముగా గమనింపవలసియున్నది. నిజముగా నితఁడే కవియైనచోఁ దల్లిదండ్రుల పేర్లు, గోత్రము పేరు, ఊరిపేరు- అన్నియును జెప్పుకొని యుండును. తెలుఁగు కవి యెవ్వఁడును దన ప్రవరను జెప్పుకొనకుండఁ బొడిగాఁ తన పేరును దన తండ్రిపేరును మాత్రమే చెప్పి యూరకొనుట యే యితర గ్రంథములోను మనము చూడము. కావున 'పెద్దాడ మల్లేశం' అను నతడు 1842లో బ్రౌనుదొరగారి యెదుట బొబ్బిలి కథను బాడిన యొక జంగము మాత్రమే! పైఁగా, బ్రౌనుదొరగారు ఈ కథను ఒకరు పాడుచుండఁగా వ్రాయించిరేగాని, ఒక కవి వ్రాసిన ప్రతిని (పల్నాటి కథలు, కాటమరాజు కథలు మున్నగు వానివలె) సంపాదించి యుండలేదు. ఇది అత్యంత ముఖ్యమైన విషయము. పెద్దాడ మల్లేశం గాథాకారుఁడు మాత్రమే యనుటకు దీనిని మించిన సాక్ష్యము లేదు. నోటిపాట పాడు గాథాకారుఁడు కవి నామమును జెప్పుట అసంభవము. (కామమ్మ కథలో, కవి, కథలో నొక పాత్ర కావున నతని నామము వీరగాథలో మిళితమైపోయి గాథాకారులచేఁ బాడఁబడుచున్నది. ఇట్టిది మఱియొక కథలో

నెచ్చటను గానవచ్చుటలేదు.) నేను సేకరించిన పెక్కు కథలలో జంగములు కథాంతమునఁ దమ పేరు చెప్పుట వినియుంటిని. "ఫలానావాడి కొడుకు ఫలానావాడు చెప్పిన కథ ఇక్కడికి సంపూర్ణం" అని చెప్పుట గాథాకారులలోఁ గానవచ్చు సాధారణ విషయము. పెద్దాడ మల్లేశమును నిట్లు చేసిన వాఁడే! అసలు బొబ్బిలికథపై కవి చేయిపడినట్లు లేదు. ఇది జానపదుల యాశువుగానే నేఁటికిని నిలియుచున్నదని నా నమ్మకము. యతి ప్రాసలు లేని శిథిల రచనయే నేఁటికిని నిందుఁ బ్రత్యక్షమగుచున్నది. దేసింగురాజుకథతో దీనిని బోల్చినచో నీ విషయము స్పష్టమగును. దేసింగురాజుకథలో యతి ప్రాసలు చక్కగాఁ గూర్పఁబడి, రగడ రూపమునఁ గవి ప్రత్యేక శిల్పము సాక్షాత్కరించును. బొబ్బిలికథలో నిట్టి శిల్పము కానరాదు. గుజిలీ ప్రతిని కొంతం నృసింహాచార్యులు రచించియుండును గాని, మద్రాసు గ్రంథాలయములోని వ్రాఁతప్రతి మాత్రము సేకరింపఁబడిన మౌఖిక వీరగాథ మాత్రమే. దీనికి బ్రౌనుదొరగారే సాక్ష్యము. ఇట్టి మౌఖికగాథలోఁ గవి నామాదులుండుట యసంభవము.

నేను బొబ్బిలి, బిజయనగర ప్రాంతములలోఁ బర్యటించి, ఈ బొబ్బిలికథకు సంబంధించిన కొన్ని నూతనాంశములను గమనించితిని. ఆ ప్రాంతములలో నీ కథ మూఁడు విధములుగాఁ బాడఁబడుచున్నవి. బొబ్బిలి ప్రాంతములో దీనిని మాలదాసరులు పాడుదురు. బొబ్బిలి ప్రక్కనే యున్న 'కోమటిపల్లె' యను గ్రామములో నీ దాసరులు నేఁటికిని గలరు. వీరు తరతరములనుండి యీ కథను బాడుచున్న గాథాకారులు. 20వ శతాబ్ది ప్రారంభములో బొబ్బిలి మహారాజావారు ఈ కోమటిపల్లి దాసరులను మద్రాసు రప్పించి, బొబ్బిలి కథను బాడించి, ఆకాశవాణి కేంద్రమునుండి ప్రసారము చేయించి రని తెలియుచున్నది. ఈ బొబ్బిలి ప్రాంతములో నీ కథ, నేఁడు మనకు లభ్యమగుచున్న ధోరణిలో, నసఁగా బొబ్బిలివారివైపు పక్షపాతము చూపుచుఁ బాడఁబడును. ఇందుఁ బ్రధాన నాయకులు రంగారావు, వెంగళరావులు. పాపారాయని ప్రసక్తి యిందుఁ దక్కువ. పాపారాయని స్వస్థలమైన 'రాజాం' ప్రాంతములోని గాథాకారులు తాండ్ర పాపారాయని నాయకునిగాఁ చేసి, యాతని పుట్టు పూర్వోత్త రములను సాహసములను వివరించుచు బొబ్బిలికథను బాడుచున్నారు. విజయనగర ప్రాంతములందు బొబ్బిలికథను జంగములు పాడుదురు. విజయనగరము ప్రక్కనేయున్న 'మట్టిపల్లె'లోని జంగములు ఈకథను బాడుటలో మిక్కిలి ప్రావీణ్యము గలవారు. ఈ జంగములు విజయరామరాజునకుఁ బ్రాధాన్యమిచ్చి పాడుదురు. ఇప్పటికిని విజయనగర ప్రజలు బొబ్బిలివారి శౌర్యమును మనవలెఁ బ్రశంసింపరు. బొబ్బిలివారిదే తప్పనియు, వారు విజయరామరాజు నవమానించిరనియు, వెంగళరాయని పొగరుబోతుతనమే యుద్ధమునకుఁ గారణమనియు, వెంగళరాయని వివాహ సమయములో విజయరామరాజు బొబ్బిలిపై దండెత్తెననుట పచ్చి అబద్ధమనియు, నది మూఢమాసమగుటచే నప్పుడు వివాహము జరుగుటకే ఆస్కారము లేదనియు, బొబ్బిలివారు తాము బుస్సీని దర్శింపక పోవుట కొక సాకును జూపనెంచి వెంగళరాయని పెండ్లి యని అబద్ధమాడిరనియు విజయనగర ప్రాంత ప్రజలు నేఁటికిని జెప్పుచున్నారు.

తాండ్ర పాపారాయఁడు విజయరామరాజును బొడిచి చంపినట్లుగా వీరగాథలోఁ గలదు.[1] విజయరామరాజు, తన్నుఁ బొడిచిన పాపారాయని తిరిగి కత్తితోఁబొడిచి చంపినట్లుగా విజయనగర ప్రజలు చెప్పుచున్నారు. ఇట్లు పాపారాయనిఁ బొడిచిన కత్తి విజయనగరపు కోటలో నేఁటికిని భద్రపఱుపఁబడియున్నది. జనవ్యవహారమునను, వీరగాథలలోను నింత ప్రసిద్ధమైన తాండ్ర పాపారాయని ప్రసక్తి చరిత్రలో నెచ్చటను గానరాదు. బొబ్బిలియుద్ధ కాలమునకు సమకాలికుడైన 'రాబర్ట్ ఆర్మ్' (Robert Orme, A.D. 1728-1801) అను చరిత్రకారుఁడు ఈ యుద్ధమును సంపూర్ణముగా వర్ణించినాడు.[2] అందు తాండ్ర పాపారాయని నామము లేదు. రంగా రాయని అనుచరులు నలుగురు కలిసి, విజయరామరాజును జంపుటకు నిశ్చయించుకొని, అందులో నిద్దరొక దళముగా ముందు వెడలి, విజయనగరభటుల వేషముతో రామరాజుడేరాలోఁ బ్రవేశించి, నిద్రించుచున్న వానిని బొడిచి చంపిరనియు, వెంటనే విజయనగర సైనికులు మేల్కాంచి, విజరామరాజును చంపిన ఆ యిరువురు సైనికులను తుపాకులతోఁ గాల్చివేసిరనియుఁ గలదు.

చారిత్రకముగా ఈ యుద్ధము క్రీ.శ. 1757 జనవరి 24వ తేది శుక్రవారము నాఁడు జరిగినది. ఆ దినము తెల్లవారుజామున యుద్ధము ప్రారంభమైనది. కోటలో నున్న రంగారావు సైన్యము 250 మంది వీరులు మాత్రమే. స్త్రీలు, పిల్లలు, ఇతరులు కలసి దాదాపు 500 మంది కలరు. వీరిపై దండెత్తిన శత్రుసైన్యములో పెద విజయరామరాజుది 10,000 సైన్యము, బుస్సీది 250 గుఱ్ఱపు రౌతులు, 750 యూరోపియన్ కాల్బలము, నాలుగు ఫిరంగులు. ఇంత మహాసైన్యమును 250 మంది బొబ్బిలివీరు లెదిరించిరి! తమకు సంఖ్యాబలము లేకపోయినను వెలమవీరులు మహాశౌర్యముతోఁ బోరాడిరి. తెల్లవారు జామున బ్రారంభమైన యుద్ధము మధ్యాహ్నము రెండుగంటల వఱకును నుద్ధృతముగా సాఁగినది. మధ్యాహ్నము రెండుగంటల సమయమునకుఁగూడ నొక్క శత్రుసైనికుఁడైనను బొబ్బిలికోట గోడపైకి ఎక్కలేక పోయెనఁట. వెలమవీరుల పౌరుషమునకును యుద్ధనైపుణ్యమునకును నిది ప్రబల నిదర్శనము! ఇఁక లాభము లేదని తలంచిన శత్రువులు మధ్యాహ్నము రెండుగంటల తరువాత ఫిరంగులతో విజృంభించిరి. బొబ్బిలివీరులును ఇమ్మడిగా ముమ్మడిగా రెచ్చిపోయిరి. కోటను కాపాడుకొనుట అసాధ్యమని గ్రహించిరి. ప్రాణముకన్న మానమెక్కువ యని నిశ్చయించుకొనిన ఆ మహాశూరులు, తమ యంతఃపుర స్త్రీలు శత్రువులకుఁ జిక్కకుండ నుండుటకై వారిని తెగనటికి మంటలలోఁ బాఱవైచిరి. పసిబాలురు కూడ ఈ మారణహోమమున కాహుతియైరి. ఈ దారుణ కృత్యమును

జూచి శత్రువులుకూడఁ గంటఁ దడివెట్టిరి! తెగించిన బొబ్బిలివీరులు మాటలతోఁ జెప్పరాని మహావేశముతో శత్రువు నెదుర్కొనిరి. సాయంకాలమగు సరికి బూడిద బుంగలుగాఁ బడియున్న బొబ్బిలికోట బుస్సీకి వశమైనది. ఈ యుద్ధము మిక్కిలి హృదయ విదారకమైనది. మాన సంరక్షణార్థమై ప్రాణములను దృణప్రాయముగాఁ త్యజించిన మహాపురుషులు బొబ్బిలి వీరులు! వెలమవీరుల పౌరుషము, శౌర్యము, ఆత్మాభిమానము ఆచంద్రతారార్కము నిలిచియుండును!

ధర్మము, న్యాయము బొబ్బిలివారివైపే యున్నను, విజయ రామరాజు మాత్రము వీరగాథలోఁ జిత్రింపబడినంత పిఱికిపందయు, పౌరుష హీనుఁడును, క్రూరుఁడును గాదు. ఈ గాథరచయిత (లేదా దీనినాశువుగా నల్లిన గాథాకారుడు) చారిత్రకాంశముల నూఁతగాఁ గాని, కొంత కల్పన చేసి, వెలమల శౌర్యమును విపరీతమగు భక్తితో వర్ణించినాడు. ఇతఁడు తప్పక బొబ్బిలి ప్రాంతము వాఁడై యుండు ననుటలో సందేహము లేదు. రచయిత పాక్షికదృష్టితో రచన సాఁగించెనని మల్లంపల్లి సోమశేఖరశర్మగారును అంగీకరించియున్నారు. "ఈ బొబ్బిలికథ ప్రధానముగా బొబ్బిలి యధిపతుల శౌర్యసాహస పరాక్రమముల నభివర్ణించుటకే రచియింపఁ బడినది. గ్రంథకర్త బొబ్బిలి పక్షపాతి, బొబ్బిలి నివాసి కూడ అగునేమో. అందువలననే అతడీ కథలో రంగారావును ఉత్తమ నాయకునిగాను, అతని ప్రత్యర్థిని ద్వితీయ నాయకునిగాను చేసెను. పెద విజయరామరాజు కథలో చిత్రింపఁబడినంతటి క్రూరుఁడును, దుష్టస్వభావుఁడును కాడని అతని చరిత్రవలన విశదమగును. కథానాయకుడయిన రంగారావు పాత్రకు ఆధిక్యము కల్పించుటకే ప్రతిపక్ష నాయకుని పాత్రను ఆ విధముగా చిత్రించెననుట స్పష్టము".[3]

రసదృష్టితోఁ జూచినప్పుడు వీథులలో దొరకు గుజిలీ ప్రతుల కన్న మద్రాసు గ్రంథాలయములో బ్రౌనుదొర సేకరించిన కథయే అన్ని విధముల నుత్తమమైనది. ఆ కథారచయిత బుస్సీసైన్యముతో కూడఁ బ్రయాణము చేసి మజిలీలను వర్ణించినాడా అని అనిపించును. కాని ఈ కవి (దీనికిఁ బ్రత్యేక కవి లేఁడు, మొదట నాశువుగాఁ బాడిన గాథాకారుఁడే దీని కవి. అతని పేరు మనకుఁ దెలియదు) దీనిని విషాదాంతముగాఁ జేయుటకుఁ గాఁబోలు, కొన్ని చారిత్రక విషయములను తాఱుమాఱు చేసినాఁడు. బొబ్బిలి యుద్ధము రాత్రి ప్రారంభమైన దనుట, వెంగళరావు ఆత్మహత్య, హైదర్‌జంగ్ ఆత్మహత్య సరికావు. చారిత్రకముగా ఈ యుద్ధము తెల్లవారుజామునఁ బ్రారంభమై సాయంకాలము వఱకును సాఁగినది. అట్లే వెంగళరావు ఆత్మహత్యయు సత్యముగాదు. వెంగళరావు తన అన్నకుమారుఁడైన వెంకట రంగారావును వెంటఁబెట్టుకొని, యుద్ధమునుండి తప్పించుకొని, భద్రాచలమునకుఁ బాఱిపోయి రెండు సంవత్సరములకుఁ దరువాత వచ్చి, రాజాము కోటను పట్టుకొనెను. అప్పుడు విజయనగరము నేలుచున్న ఆనందరాజు, వెంగళరావుతో సంధి చేసికొనెను. ఇది చారిత్రక సత్యము. హైదర్‌జంగ్ ఆత్మహత్య చేసికొనెననుట కూడ నిజము కాదు. యుద్ధానంతరము హైదర్‌జంగ్ బుస్సీతోఁ గలసి ఔరంగాబాదు వెళ్లెను. అక్కడ 'సలాబతుజంగు' సోదరుఁడగు 'నిజామలీ' చే హైదర్‌జంగ్ చంపఁబడెను. ఈ వీరగాథలోని యుద్ధకాల సన్నివేశములన్నియును రసపోషణకై కవి కల్పించినవే కాని, చారిత్రకములు కావు. "Though the theme is historical, there is less of history and more of tradition... Mallesam borrowed his theme from history and developed it into a classical folk-song Kavya".[4]

ఇట్లు చారిత్రక సత్యములు కొన్ని లోపించినను, ఈ బొబ్బిలి కథ తెలుఁగు వీరగాథలలో అగ్రగణ్యమగుటయే కాక, ప్రపంచోత్తమ వీరగాథలలో లెక్కింపఁదగినది. వీరగాథాలక్షణము లన్నియును దీనికిఁ బరిపూర్ణముగాఁ బట్టినవి. దుస్సాధ్యమైన వీరగాథానిర్వచనము ఈ ఉత్తమ వీరగాథచే సుసాధ్యమగుచున్నది. "బొబ్బిలికథ వంటివి వీరగాథలు" అని ఒక్క ముక్కలో నిర్వచింపవచ్చును. అందుచేతనే రామరాజుగారు దీనిని సిసలైన జానపద గేయముగా నభివర్ణించిరి. "తెలుగువారు వీరవిక్రములనియు, ధైర్యసాహసోపేతులనియు, అభిమానధనులనియు, వారి శౌర్యమఖండమనియు, చేయెత్తి చాటినది బొబ్బిలికథ. ఈ కథ నెరుగనివారు (జానపదులు) తెలుగు దేశమున నొక్కరైన నుండరన్న అతిశయోక్తి కాదు. వీరగీతములందింత సార్వజనీనత గల పదమింకొకటి లేదు. సిసలైన జానపద గేయమున కుండవలసిన లక్షణములన్నియు దీనికున్నవి. నుడికారము, భాష భావములు, పద్ధతి, పూర్తిగా జానపదులవి"[5] ఇట్టి అత్యుత్తమ వీరగాథను ఏట్స్‌దొర ఆంగ్లములోనికిఁ బరివర్తించెనని గిడుగు సీతాపతిగారు 1965లో నాతోఁ జెప్పియున్నారు. కాని ఆ యాంగ్లప్రతి నేఁడలభ్యము. ఆ యేట్స్‌దొర ఆంగ్లములో Marginal Notes వ్రాసికొనిన తెలుఁగు ప్రతి యొకటి సీతాపతిగారి కడఁ గలదు.

బొబ్బిలికథలోని వీరరసస్ఫోరకమగు కవిత్వమున కొక చిన్న యుదాహరణము:- విజయరామరాజు తన కోటపై దండెత్తిరాఁగా, రంగారావు తన బావమఱఁదియగు తాండ్ర పాపయ్య కోటలో నున్నచో నేడేండ్లు పోరాడినను దన కోట స్వాధీనమయ్యెడిది కాదని వాపోవు చుండును. పాపారాయఁడప్పుడు 'రాజాం' కోటలో నున్నాడు. అందుచేఁ దనకును బొబ్బిలికోటకును ఋణము తీరినదని రంగారావు విచారపడుచుండెను. అన్నగారి విచారమును జూచి తమ్ముఁడు వెంగళరావు ఎటువంటి వీరలాపము లాడుచున్నాఁడో చూడుడు:

***"మహాప్రభో! పిరికి మాటలా ఆడిపోతిరి యేలినవారేమి***
***నాకు సెలవులు యివ్వమంటాదు తమ్ముడెంగళ్రావూ***
***సెలవులు యిస్తే నవాబుదేరా సెలగని పొడిచొస్తు***
***దిగుతూ దిగుతూ వున్న దేరా వెనుకకు పట్టిస్తు***
***గోల్కొండ దరబారులో బూసికి గోరీ కట్టిస్తు***
***గోరీమీదా సున్నపునీళ్లు చల్లించక మాన***
***ఏరుదాటి యేలూరిదాకా బైలుగ నరికిస్తు***

*రాజమహేంద్రము గోదావరిలో ఈటెలు కడిగిస్తు*
*దనిగద్దకూ పీనుగులాను వొంటెల తోలిస్తు*
*రపద్ధాళిగా విజేనగరమే తలుపులు కొట్టిస్తు*
*అన్నయ్యా, విజేనగరము సందున రాజును దహనం చేయిస్తు...*
*అన్నయ్యా, బూసిగారి బలములు అన్నీ జాతికొంగలేమి*
*జాతికొంగల మీదికి నేను సాళువ దేగాను*
*రాజుగారివో బలములు అన్నీ పరిగెగుంపులేమి*
*పరిగెగుంపుల మీదికి నేను భైరవ దేగాను".*[6]

ఇట్లు వెంగళరాయని పలుకులు వీరరసస్ఫూర్తికిఁ బ్రతీకలుకాఁగా, మల్లమదేవి విజయరామరాజునకు వ్రాసిన లేఖ కరుణరసమునకుఁ బరాకాష్ఠ (చూ. బొబ్బిలియుద్ధకథ, మల్లంపల్లి పరిష్కృతము, పుట 57). వీరగాథలలో వీర కరుణములు రెండే యెక్కువగాఁ బోషింపఁ బడుచుండును.

### 1.1.2. దేసింగురాజు కథ:-

దీనికి ముగ్గురు రచయితలు తెలియుచున్నారు. 'రావూరి వేంకట సుబ్బయ్య, నిడిగంటి వీరయ్య దేవర, జంగం సుబ్బయ్య దేవర'. క్రీ.శ. 1892లో మద్రాసునుండి అజ్జి షణ్ముగప్పశెట్టిగారు ప్రకటించిన దేసింగురాజుకథలో ముఖపత్రమున నిట్లున్నది: "శ్రీ క్షణికాద్రిపురవరాధీశ్వరు కృపాకటాక్ష వీక్షణాలంకార సంగీత సాహిత్య రచనా చమత్కారులగు రావూరు వేంకటసుబ్బయ్యగారిచే నిఖిల జనానందకరంబుగా రచియింపబడిన దేసింగురాజుకథ". దీని యవతారికలో నిట్లున్నది-

*"ఈ వసుధను పెరుగమిపుర వాసుడ నింపు మీర నేను*
*రావూర్వేంకట సుబ్బయాఖ్యుడను రంజితంబుగాను*
*సంతసమున దేసింగురాజు కథ చక్కగ జెప్పెదను".*

ఇది వేటపాలెము సారస్వత నికేతన గ్రంథాలయమునఁ గలదు. 1923లో వావిళ్లవారు దీనినే మరలఁ బ్రకటించిరి.

1912లో మదరాసు 'ఆర్.కె.రాజు అండ్ కో' వారు ప్రకటించిన 'దేసింగురాజు చరిత్రము'లో 'నెల్లూరుపుర నివాసియగు నిడిగంటి వీరయ్యగారిచే వచన రూపముగా రచియింపబడినది' యని కలదు. ఇక్కడ 'వచన' శబ్దము 'శ్రీనాథుని వచనపద్ధతి' యను ప్రయోగములోని (చూ. కాటమరాజు కథ, గంగుల పినయెల్లయ రచన) వచన శబ్దము వంటిదేయని తలఁపవచ్చును. రావూరు వేంకట సుబ్బయ్య పాటగా రచించిన కథలో నీ వీరయ్య మధ్యమధ్య వచనములు చేర్చినాఁడని తలఁచుటకు వీలులేదు. ఈ 'దేసింగురాజు చరిత్రము' కూడ నాద్యంతము పాటరూపముననే యున్నది. ఇది రాజమండ్రి గౌతమీగ్రంథాలయమునఁ గలదు.

1919లో భాస్కర్ని ఎతిరాజులుశెట్టి(చెన్నపురి)గారు ప్రకటించిన 'దేసింగురాజు చరిత్రము'లో నవతారికలో 'జంగం సుబ్బయ్య దేవర' పేరు కానవచ్చుచున్నది.

*"ఈ వసుధను నెల్లూరిపుర నివాసుడ నింపుమీర నేను*
*జంగం సుబ్బయ్య దేవరాఖ్యుడను రంజితంబుగాను"*

దీని ముఖపత్రమున "నెల్లూరిపుర నివాసియగు నిడిగంటి వీరయ్య గారిచే వచన రూపముగా రచియింపబడిన" అని కలదు. దీనినిబట్టి దేసింగురాజుకథను మొదట వీరయ్య వచన రూపమున వ్రాయఁగా, సుబ్బయ్య పాటగా మలఁచెనని చెప్పవలసి యున్నది. ఈ జంగం సుబ్బయ్యయు, రావూరి వేంకటసుబ్బయ్యయు నొక్కరేమో తెలియదు. లేదా ఈ సుబ్బయ్య నిడిగంటి వీరయ్య పుత్రుఁడేమో. ఈ కథ వేటపాలెము గ్రంథాలయమునఁ గలదు. (1933లో ఎస్.వి.గోపాల్ అండ్ కో వారు ప్రచురించిన గుజిలీ ప్రతిలో రచయిత పేరు లేదు. 'నెల్లూర్పుర నివాసి' అని మాత్రమున్నది.)

పై పరిశీలనమునుబట్టి 'దేసింగురాజు కథ' యను పేరుతో నొక రచన, 'దేసింగురాజు చరిత్రము' అను పేరుతో వేఱొక రచన కలవని తెలియుచున్నది.

దేసింగురాజుకథ క్రీ.శ. 1713 జనవరి 17వ తేదిని చెంజికోటలో జరిగిన చారిత్రక వృత్తాంతమని హరి ఆదిశేషువుగారు నిర్ణయించిరి. 1714 అక్టోబరు 3వ తేది శనివారము సాయంకాలము దేసింగురాజు మరణించెనని డా॥ బి.రామరాజుగారు చెప్పిరి. చెంజికోట నేఁటి మద్రాసు రాష్ట్రమున దక్షిణ ఆర్కాటు జిల్లాలో కలదు. వీరగాథలో 'దేసింగు'గా నున్న పేరు చారిత్రకముగా 'తేజసింగు'. ఈ తేజసింగు బుందేల్‌ఖండ్ రాజపుత్రుఁడు. ఇతని తండ్రి సురూప్‌సింగ్. క్రీ.శ. 1700 ప్రాంతములో ఔరంగజేబు పాదుషా సురూపసింహుని శౌర్యమునకు మెచ్చి 'జింజి' కోట (లేక 'చెంజి' కోట)ను ఇనాముగా నిచ్చెను. ఈ సురూప్‌సింగ్‌కును ఇంగ్లీషువారికిని క్రీ.శ. 1710 నుండి 1713 వఱకును గొన్ని వివాదములేర్పడినవి. 1713లో రాజ్యమునకు వచ్చిన 'తేజసింగు' (దేసింగు) తాను ఆర్కాటు నవాబునకు సామంతుఁడను గానని తిరుగఁబడెను. ఆంగ్లేయుల సహాయముతో ఆర్కాటునవాబు చెంజికోటపై దండెత్తెను. 1713 జనవరి 17వ తేదిని గొప్ప యుద్ధము జరిగెను. ఆ సంఘటనయే ఈ వీరగాథ. దీనినిగూర్చిన ఇతర చారిత్రకాంశములను దక్షిణ హిందూదేశ చరిత్ర నాధారముగాఁ జేసికొని డా॥ రామరాజుగారు విపులముగాఁ జర్చించి యున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౨౨౮-౨౩౫).

వీరగాథలో నున్న 'బారాహజారి' గుఱ్ఱము విషయము కవి కల్పితము. దేసింగు అయిదు సంవత్సరముల బాలుఁడుగా నున్నప్పుడు ఢిల్లీపాదుషా గుఱ్ఱమును లొంగఁదీసి, చెంజికోటను బహుమతిగాఁ బడసెనట! ఆర్కాటు నవాబు 'సాదుల్లా ఖానుడు' దేసింగును పన్ను కట్టుమనెను. పాచ్చావు (పాదుషా) నుండి బహుమతి పొందిన తన కోటకుఁ బన్ను కట్టవలసిన అగత్యము లేదని దేసింగు జవాబిచ్చెను. అందుచే నిరువురకును యుద్ధమయ్యెను. ఈ యుద్ధమున దేసింగు

పక్షమున 'మహబ్బత్‌ఖాన్' అను మహమ్మదీయ వీరుఁడు చేసిన రణము అత్యద్భుతముగా వర్ణింపఁబడినది. మహబ్బత్‌ఖానుని గుఱ్ఱము పేరు 'నీలవేణి' యఁట. దేసింగురాజు గుఱ్ఱము పేరు 'బారాహజారి'.

అభూత కల్పనలతో పౌరాణిక ధోరణిలో సాఁగిన ఈ వీరగాథ మొదట తమిళదేశమునఁ బుట్టినది. తరువాత తెలుఁగు దేశమునకు వ్యాపించినది. నేఁడిది తెలుఁగున బొబ్బిలికథవలెనే అత్యంత ప్రసిద్ధమైన వీరగాథ. దీని రచన బొబ్బిలివరుసకు యతిప్రాసలు బిగించినట్లుగ నున్నది. కాని ఈ రచన బొబ్బిలి రచనవలెఁ బ్రాచీనమైనది కాదు. 20వ శతాబ్ది ప్రారంభమున రచింపఁ బడినట్లున్నది.

బొబ్బిలికథవలెనే ఇదియును వీరరసప్లావితమగు కవిత్వముతో నొప్పు కథ. దావూద్ ఖానుఁడు దేసింగురాజు పైకి నైదువందల గుఱ్ఱపు దళమును బంపినాఁడు. దేసింగురాజు తన 'బారాహజారి' గుఱ్ఱముపై స్వారీచేయుచు ఆ గుఱ్ఱపు దళము నంతను నూచముట్టుగా నఱకివేయుట యెట్లు వర్ణితమైనదో చూడుఁడు:-

*"మందు పోటుకును గుండు పోటుకును సందేహించకను*
*సరగున బడి దూరుచు పైకెగురుచు సరగున హయములను*
*గిరగిర ద్రిప్పుచు నెగరవేయుచు కరికరి సేయుచును*
*సరగుఁన దండు తండంబుల సవ్యాపసవ్యములు గాను*
*తరుముచు నరికెను దేశింగుడును కరకు కరకు మనుచు*
*మరి గుఱ్ఱంబుల తుండ్లు తుండ్లుగా నరికి నరికి వేసి*
*అరటి కంబముల నరికిన కరణిని యంత దండునెల్ల*
*సొరకాయల తెగ నరికిన కరణిని సొరిది సేనలెల్ల*
*జొన్నదంట్ల తెగవేసిన తీరున చొరబడి దండులను*
*ఉన్నవారి నటు చాపకట్టుగా నుక్కడంచుచును"* [7]

దావూద్‌ఖాన్ అఱువదివేల మదపుటేనుగులతో దేసింగురాజును జుట్టుముట్టెను. అప్పుడు దేసింగురాజు చేసిన వీరవిహార మత్యద్భుతముగా వర్ణింపఁబడినది:-

*"తొండంబుల నెల్లను పడనరికెను తుండ్లు తుండ్లుగాను*
*కంఠస్థలముల గ్రుచ్చి యెత్తెను కంకులు రాలగను*
*మొండెములుగ తెగనరికెను యాబల్ తుండంబుల నెల్ల*
*మెండుగ నెత్తురు యేరై పారెను మేటి దండు నెల్ల*
*వరవడి కుంభస్థలములు పొడియై పడె నప్పుడు కొన్ని*
*నరికినంతలో రెండు తుండ్లుగా నట గూలెను కొన్ని*
*కాళ్లు చేతులు తోకలు విరిగి కదిసి కూలె కొన్ని*
*ఒళ్లెలను చిల్లులు పోటుబడి వొరిగె నంత కొన్ని*
*వేగులు కండలు వేరు వేరులై మూల్గి కూలె కొన్ని*
*సాగిలపడి పొర్లింతలు పెట్టెను చయ్యన నట కొన్ని*
*ఆ రీతి టార్ టార్ జేసెను అప్పుడు దేశింగూ"* [8].

## 1.1.3. జగపతిరాజు కథ:-

దీనిని 'పెద్దాపురం కోడిపుంజుల కథ' అను పేరుతో మంగు వెంకట రంగనాథరావుగారు (కాకినాడ) 1914లో ప్రచురించిరి.[9] దీనికి 'పెద్దాపురం కోడిపుంజుల కథ' యను పేరు ప్రచురణ కర్తలు పెట్టినట్లున్నది. జానపదులలో దీనికి 'జగపతిరాజు కథ' అనియే వ్యవహారము. దీని ఇతివృత్తమునుగూర్చి డాక్టరు బి. రామరాజుగారు విపులముగాఁ జర్చించి యున్నారు (చూ. తెలుఁగు జానపద గేయ సాహిత్యము, పుటలు ౨౪౧-౨౪౮). విశాఖ, గోదావరి జిల్లాలలో ఈ కథకు విశేష వ్యాప్తి యున్నది. ఇది బొబ్బిలియుద్ధము జరిగిన రెండేండ్లకు అనగా క్రీ.శ.1759లో జరిగినది. పెద్దాపురము నేలు వత్సవాయి జగపతిరాజు దీనికి నాయకుఁడు. విజయనగరము నేలు పూసపాటి ఆనందగజపతి ప్రతినాయకుఁడు. వీరిరువురును సోదర తుల్యులు. వీరిలో ఆనందగజపతి బొబ్బిలియుద్ధములో మరణించిన విజయరామరాజునకు అన్నకొడుకు. వత్సరాయి జగపతి, విజయ రామరాజు భార్యయగు చంద్రమదేవికి అప్పకొడుకు. ఆనందగజపతి జగపతిరాజుతో మత్సరించి, మాయోపాయముచే యుద్ధమున నాతనిఁ గడతేర్చెను. వత్సవాయి జగపతిరాజు పాలనాకాలము క్రీ.శ. 1749-1758. ఇతడు క్రీ.శ. 1759 ప్రమాది పుష్య శుద్ధ నవమినాఁడు వీరస్వర్గ మలంకరించెనని 'పెద్దాపుర సంస్థాన చరిత్ర'లోఁ గలదు.

పల్నాటి వీరగాథాచక్రము వలెనే ఈ వీరగాథ యంతయుఁ గేవలము కోడిపోరుపైనే ఆధారపడియుండును. అందువలననే దీనికి 'పెద్దాపురం కోడిపుంజుల కథ' యను నామాంతరము కలిగి యుండును. ఇది బొబ్బిలికథతోఁ దులతూఁగు రచన. ఇందుఁ గోడిపుంజుల పోరాట మత్యద్భుతముగా వర్ణింపఁబడినది. కోడిపుంజులను పందెము కట్టు తీరు, వాని మనస్తత్త్వము, పోరాట విధానము, పందెగాండ్ర ప్రతిభ మున్నగు విశేషము లీ వీరగాథలోఁ జక్కని నుడికారముతోఁ జిత్రింపబడినవి. నిఘంటువుల కెక్కని పలుకు బళ్లెన్నియో ఇందుఁ బ్రత్యక్షమగును.

ఆనంద గజపతి కోడిపుంజు పేరు 'విడికోడి'. జగపతిరాజు కోడిపుంజు పేరు 'పూలకోడి'. ఆనందరాజు పక్షమున 'వసంతు రామన్న', జగపతిరాజు పక్షమున 'చల్లా రాజన్న' కోడిపుంజులను వదులు పందెగాండ్రు. కోడిపందెమంతయుఁ బుంజును వదలెడి పందెగానిపై నాధారపడి యుండునఁట. ఈతఁడు ప్రతిభావంతుఁడు కానిచో నెంతగొప్ప పుంజైనను నెగ్గలేదు. అందువలననే కోడి పందెమును వర్ణించునప్పుడు పుంజులను వదలు పందెగాండ్రను దప్పక చెప్పుదురు. ఇది కోడిపందెములున్న ప్రతివీరగాథయందును గాననగును. జగపతిరాజుకథలోఁ బందెము ప్రారంభింపఁబడుటకు ముందు పందెగాండ్రిరువురును కమ్మరి పాపయ్యను పిలిచి, ఉక్కు కత్తులకు సానపట్టించి కోళ్లకుఁ గట్టిరట. (ఈ దిగువ నేనిచ్చెడి యుదాహరణములన్నియును 1914లో మంగు వెంకట రంగనాథరావు గారు కాకినాడనుండి ప్రకటించిన ప్రతిలోనివి.)

*"వుక్కు కత్తులు కోడికత్తులు సానేపట్టాడు*
*పచ్చినెత్తురు ధారే పోసి సానపట్టినారు*
*దూది వేసితే యేటికి తెగే కత్తులు వున్నాయి*
*వహ్వా! విడికోడికీ పూలకోడికీ కత్తులు వేశారు".*

జగపతిరాజు పందెగాఁడు చల్లా రాజన్న 'పిల్లపాతలు' (కోడి కాలికిఁ జుట్టు గుడ్డపేలికలు) తెచ్చుకొనుట మఱచిపోయినాడఁట. రాజుతోఁ జెప్పినచోఁ గోపగించునని, నాలుగువేల రూపాయలు ఖరీదు చేసెడి జగపతిరాజు పెండ్లినాటి శాలువను చించి, దానిని బిల్లపాతలుగా నుపయోగించినాఁడట! పందెములోఁ బంతము లిట్లుండును. పిల్లపాతలు మఱచిపోయిన చల్లా రాజన్న–

*"జగపతిరాజు పెండ్లినాటిది పెద్ద శాలువండి*
*నాలుగువేలా నాణెపు శాలువ నడుముకు చించాడు*
*వత్సవాయ సంస్థానము వుంటే శాలువలే లేవా?*
*శాలువగుడ్డ పట్టుదారముతో కత్తికి కట్టాడు*
*వహ్వా! విడికోడికి పూలకోడికి కత్తి వేసినారు*
*వుత్తరదిశకు దక్షిణదిశకూ బర్లు దిద్దినారు*
*వహ్వా! కరిపించారు మొగిపించారు కదలిక జేశారు*
*జోడు బారలు ఎడముంచారు వదలివేసినారు".*

రాజుల మనస్సు కోళ్లకుఁ దెలియునఁట. కోళ్ల పౌరుషములు ఆ రాజులకుఁ దెలియునఁట. అన్నదమ్ములు వదలిన కోళ్లగుటచే నవి పోరాడక నిలిచియున్నవి.

*"పింజం పింజం కలిసినగాని యెగరలేదు కోడి*
*బరి మీదనూ ఎగర దాయెను వక్కటయిన కోడి*
*రెక్క మెదిపితే కొడదామాని పూలా గాసిందీ*
*కాలు మెదిపితే కొడదామానీ విడీ గాసినాది*
*దేని పాదులో అదే కోడీ కాపు గాసినాయి*
*నేలమేతలే మేయుచున్నదీ పూలకోడిపుంజు*
*పొదుగులు పొదుగులు పొదుగుచున్నదీ విడీకోడిపుంజు"*

ఉదయమునుండి మధ్యాహ్నమువఱకును కోళ్లిట్లే యున్నవి. రాజులకు భోజనపువేళ అతిక్రమించెను. ఆనందరాజు తన విడికోడికిఁ బౌరుషమెక్కించెను. అన్నగారికోడిని 'పెంపుడుకోడి' అని దెప్పిపొడిసెను. అది చూచి జగపతిరాజు కోపించి తన పూలకోడితోఁ బౌరుష వాక్యములు పలికెను. అన్నదమ్ముల మాటలు విని కోడిపుంజులు పౌరుషాగ్నులచే భగ్గునమండి పోరాటమున కుద్యమించినవి. ఇట వర్ణనము లోకోత్తరముగాఁ గొనసాఁగినది–

*"రాజులయొక్కా మాటలు విన్నవి కోడిపుంజులండి*
*అన్నదమ్ములా మాటలు విన్నవి కోడిపుంజులండి*
*నిలువున యెగిరే పుంజులంతటా కలపటమైనాయి*
*తడపడ తడపడ రెండు ఝాములూ యెగిరి దెబ్బలాడే*
*కొండలు కొండలు తాకినట్లుగా కొట్టుకున్నవండి*
*నిప్పుల వర్షము కురిసినట్లుగా నిల్చి పోరినాయి*
*విడీకోడికి చంకను కత్తీ తగులుకున్న దండి*
*వక్క పోటుకే గుండె పేగులు చీలిపోయినాయి"*

అప్పుడు ఆనందగజపతి ఉక్రోషముతో 'పెంపుడుకోడి పొడిచి పోయెరా వసంతు రామన్న!' అనినాఁడట, 'పెంపుడుకోడి కాదు, పేరెక్కిన కోడి' అని జగపతిరాజు సమాధానమిచ్చెను. దెబ్బతిన్న విడికోడి 'పడుతూ లేస్తూ' పూలకోడి దగ్గఱకు వెళ్లి, బవిరె పట్టుకొని పొడిచి, నేలపైఁ బడినది. చల్లా రాజన్న పూలకోడిని పట్టుకొని కత్తితాళ్లు విప్పెను. తాను బ్రతికియున్నచో జగపతిరాజునకుఁ బ్రమాదము వాటిల్లునని భావించి, పూలకోడికూడ మరణించినదఁట!

*"పూలకోడికీ పౌరుషంబులూ చెప్పతరము గాదు*
*నేనే వుంటే అన్నయ్య పెద్దాపురము చేరగలదా?*
*వత్సవాయి సంస్థానమునకే పేరే తెచ్చింది*
*జోడు రెక్కలూ కిల్లార్చినది కొక్కురో కూసింది*
*సర్దారు రాజన్న చేతిలో జీవము వదిలింది".*

ఈ కోడిపందెపు వర్ణనలో 'పిల్లపాతలు, కరిపించుట, మొగిపించుట, కత్తివేయుట, పింజం, పాదు, కలపటమగు, బవిరె, కిల్లార్చు'– మున్నగు చక్కని తెలుఁగు పలుకుబళ్లు కలవు. ఇవి నిఘంటువుల కెక్కలేదు. ఇది జానపద వ్యవహారమున నున్న ముఖ్యముగాఁ గోడిపందెములకు సంబంధించిన పరిభాష.

### 1.1.4. కొమార రాముని కథ:–

క్రీ.శ. 1300 తరువాత ఆనెగొంది నేలిన కంపిలిరాయని కొడుకు కుమార రామనాథుఁడు. ఇతడు గొప్ప శౌర్యవంతుఁడు. తండ్రితోపాటు ఢిల్లీ సుల్తానుతో యుద్ధము చేసి, హతుఁడైనాఁడు. ఈతని గాథకి విశేష కల్పనలు చేరి 'కొమార రాముని కథ' యయినది. ఇది ప్రాచీనమైన వీరగాథ. దీనినిగూర్చి రామరాజుగారు విపులముగాఁ జర్చించియున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౨౧౬–౨౧౮).

బ్రౌనుదొర సేకరించిన 'కొమార రాముని కథ' వ్రాతప్రతులు రెండు మద్రాసు ప్రా.లి.పు.భా.లో నున్నవి (డి. నెం. 2516, 2517). నేలటూరి వెంకట రమణయ్యగారిచే ఈ కథను బరిష్కరింపఁజేసి, విపులమైన పీఠికతో మద్రాసు గ్రంథాలయము వారు దీనిని 1955లోఁ బ్రకటించియున్నారు. కన్నడమునఁగూడ ఈ వీరగాథకు విశేష ప్రచారమున్నది. తెలుఁగు వీరగాథనుగూర్చి నేలటూరి వెంకటరమణయ్య గారు క్రింది విధముగా వ్రాసియున్నారు.

"The Kumara Ramuni Katha is an anonymous ballad written in the spoken dialect by a person of little education and no learning. The verse has neither metre nor rhyme; and it is interspersed with prose passages

which form nearly a third of the bulk of the ballad. The lines are uneven and rugged and the reciter has to follow his own devices by lengthening or shortening syllables to recite them rhythmically. The language is simple, free from unnecessary ornamentation and descriptions, and the narrative direct" [10].

పోర్చుగీసు చరిత్రకారుడు నూనిజ్ కాని, మహమ్మదీయ చరిత్రకారులు కాని ఈ కుమార రామునిగూర్చి వ్రాయలేదు. కాని క్రీ.శ. 15వ శతాబ్ది పూర్వార్ధములోని శాసనములలోఁ గుమార రాముని ప్రసక్తి స్పష్టముగా నున్నది. అందుచే నీతని చారిత్ర కాస్తిత్వమును శంకింపఁబని లేదు. "The evidence of epigraphy has, however, established beyond the shadow of doubt that not only was Kumararamanatha a historical person but most of the events mentioned in the literary works were quite authentic"[11].

ఈ వీరగాథలోఁ బరిపాలనా సంబంధమగు పెర్షియన్ పదము లత్యధికముగా నున్నవి. కొన్ని యాంగ్లపదములును గానవచ్చుచున్నవి. అందుచే ఈ వీరగాథా రచన క్రీ.శ. 19వ శతాబ్దము పూర్వార్ధమున జరిగెనని చెప్పవచ్చును. ఆ కాలములోనే మహమ్మదీయుల రాజకీయ ప్రాభవముతగ్గి, ఆంగ్లేయుల యధికారము సర్వత్ర బలపడసాఁగినది.

### 1.1.5. రాణీ శంకరమ్మ కథ:-

క్రీ.శ. 18, 19 శతాబ్దములలోఁ దెలంగాణమున మెదకు, గద్వాల, వనపర్తి మున్నగు సంస్థానములకుఁ జెందిన రెడ్డిరాజులు, హైదరాబాదు నిజాములతోను, కర్నూలు నవాబులతోను జేసిన యుద్ధములపై నెన్నియో వీరగాథలు ప్రచారమున నున్నవి. రాణి శంకరమ్మ కథ, సదాశివరెడ్డి కథ, గద్వాల సోమనాద్రి కథ, రాజా రామేశ్వరరావు కథ, సవై వెంకటరెడ్డి కథ మున్నగునవి ఇట్టి ప్రసిద్ధ చారిత్రక వీరగాథలు.

మెదకు సంస్థానము నేలిన రాజులలో శంకరమ్మ పంద్రెండవ తరమునకుఁ జెందినది. ఈమె కాకతీయ రుద్రమదేవిని బోలిన వ్యక్తి. ఈమె భర్త రాజా వెంకట నరసింహారెడ్డి. ఇతఁడు చార్మినార్ బురుజుపై బంగారు సిరిగిన్నెను గొట్టి, నిజాముచే గొప్ప బిరుదు లందెనని శంకరమ్మ కథలోఁ గలదు. శంకరమ్మకు 'రాజ్ఞి రాయెబాగన్' (పెంటి సింగపురాణి) అని పేరు. ఈమె హైదరాబాదు నేలిన ఆసఫ్జా వంశమున రెండవ సుల్తానగు నిజామలీకి సమకాలీనురాలు. ఈమె ఖర్డ్లా యుద్ధమున నిజాము ప్రాణములను గాపాడినదఁట. అందుచే నిజామీమెకుఁ బదునెనిమిది వీరలాంఛనముల నిచ్చి గౌరవించెను. కాని నిజాము తన ముఖ్యమంత్రియగు 'మీరాలం నవాబు' చేతిలోఁ గీలుబొమ్మ. ఆ 'మీరాలం'కు మెదకు సంస్థానముపై ద్వేషము. అతఁడు రాణిని జంపుటకుఁ బ్రయత్నించెను గాని ఫలింప లేదు. సదాశివరెడ్డి శంకరమ్మకు దత్తపుత్రుఁడు. (రుద్రమదేవికిఁ బ్రతాప రుద్రుడు దత్తపుత్రుఁడు. ఇదియొక విచిత్ర సామ్యము.) ఇతఁడు శంకరమ్మ చెల్లెలగు రంగమ్మ కుమారుఁడని చరిత్రలోఁ గలదు. వీరగాథలో సదాశివరెడ్డి శంకరమ్మకు మేనల్లుఁడని చెప్పఁబడినది. అట్లే ఈమె భర్తపేరుకూడ వీరగాథలో భిన్నముగా నున్నది.

ఈ కథ 'రాయుడా! రామన్న రాయుడా-వస్తాదు' అను వరుసలో నున్నది. ఇది దీనిలోఁ బునరావృత్తి. ఈ వీరగాథను మహబూబ్నగర్ మండలములో షాద్నగరము దగ్గఱ నున్న బాల్నగరములో వానరాసి లక్ష్మన్న యను నెనుబది సంవత్సరముల వృద్ధజంగము పాడుచుండఁగా వ్రాసికొంటిని (18-6-1966). ఇది తెలంగాణా మాండలికములతోను, ఉర్దూ పదములతోనూ నిండి యున్నది. గాథాకారుడు మిక్కిలి వృద్ధుఁడగుటచే నుచ్చారణ స్పష్టముగాఁ దెలిసికొనలేకపోయితిని. నేను తెలంగాణా మాండలికమున కపరిచితుఁడ నగుట కూడ కొంత కష్టమును కలిగించినది.

అందోలు జోగిపేటను బాలించు 'అల్లమా చౌదరికి' 'శంకరమ్మ', 'రంగమ్మ' అను నిర్వురు భార్యలు. హైదరాబాద్ నవాబు చార్మినార్పై బంగారు సిరిగిన్నెను గట్టి, దానిని గొట్టినవారికి బహుమతి నిత్తుననెను. ఎవరి వలనను గాలేదు. అల్లమాచౌదరి మట్టెల పాపనితోఁ గలసి గుఱ్ఱమెక్కి రంగంపేట, బలుకూరు, బిక్కనూలు, వడ్లకొండ, పొట్టచెఱువు, పెద్దపాత వాలాద్రి, మీఁదుగా చార్మినార్ చేరెను. 'అద్దమరేత్తిరి, అమాసపొద్దు, కలికి కలికి గాంధారి పొద్దున, ఆ సిరిగిన్నె నవలీలగాఁ గొట్టెను. అప్పుడు నవాబు అల్లమా చౌదరికి 'ఏడూళ్లు ఇనాము, పన్నెండూళ్లు మొఖాసు, బిళ్లల మొలత్రాడు, ముంజేతికి కడియం, జోడు దుశ్శాలువలు, వొరుమా కంఠీలు, బహద్దరు బిరుదు' ఇచ్చెను.

శంకరమ్మ యెన్ని నోములు నోచినను బిల్లలు పుట్టలేదు. అందుచే సంగిరెడ్డిపేటలో నున్న తన యన్న దగ్గఱకు వెళ్లి, మేనల్లుఁడు సదాశివరెడ్డిని దెచ్చుకొని దత్తుచేసికొనెను. అతఁడు పెరిగి పెద్దకాఁగా, శంకరమ్మ గద్వాలకుఁ బోయి, ఆ రాజు పుత్రికలు 'చినారి శివమ్మ, పెదారు పార్వతమ్మ, అనంతమ్మ, జగ్గమ్మ' యను నల్వురిని బెండ్లిచేసెను. సదాశివరెడ్డి గద్వాలలో నేలబొయ్యారములోని పెంకి గుఱ్ఱమును లొంగఁదీసి, ఆ కన్యలను వివాహమాడినట్లు చెప్పఁ బడినది. శంకరమ్మ సదాశవరెడ్డితోను కోడండ్రతోను అంగోలు జోగిపేటకుఁ దిరిగి వచ్చెను.

ఒక సాలెవాఁడు ఒక గొప్ప చీరను నేసెను. 'పక్కన పదినూర్ల కత్తులు, ఎడమకు ఏడునూర్ల కత్తులు, నడుమ నాగబండ్లు' వేసి, యా చీరను నేసెను. దానినెవ్వరును గొనలేకపోయిరి. ఆ చీర సొగసును జూచి ఆశ్చర్యపడి, శంకరమ్మ దానిని గొనెను. రంగంపేట బోగమువాండ్రు, జోగిపేటలో నెవ్వరును లేని సమయమును జూచి, శంకరమ్మను బంధించి, ఆ చీరతోసహా ఆమెను రంగంపేట

కెత్తుకొనిపోయిరి. 'మట్టెల పాపడు' అను వీరుఁడు రంగంపేటకు వెడలి, ఆ బోగమువారితో యుద్ధము చేసి, రాణీ శంకరమ్మను విడిపించి తెచ్చెను. ఈ మట్టెల పాపని యుద్ధము చక్కఁగా వర్ణింపఁ బడినది:–

*"కొట్టంగ జూసె వహ్వో కొవ్వుదబ్బలు*
*నరకంగ జూసె వహ్వో నల్లగుండెలు*
*పొర్లాదె మొండాలు, ఆవలిచ్చె పీనిగలు*
*కాయగూర తరిగినట్లు– చెఱకు నరికిన విధమే*
*తలపండ్లు కోస్తవుంటే వహ్వో వహ్వో*
*ఏనిగరకతం పీనిగరకతం– ఏటుకు డొల్లబట్టే*
*కాలవలు వారబట్టె– తరిమి తరిమీ కొట్టినాదే".*

ఈ కథ రాణీ శంకరమ్మను గూర్చినదైనను, ఆమె శౌర్య ప్రతాపములిందు వర్ణితములు కాలేదు. ఆమె భర్తకథ, మట్టెల పాపని యుద్ధము మాత్రమిందుఁ బ్రశంసింపఁబడినవి. దీనికింకను బ్రత్యంత రములను సంపాదించినఁగాని, ఈ గాథలోని సంపూర్ణేతివృత్తమును నిర్ణయింపలేము. చారిత్రకముగా జరిగిన శంకరమ్మ పాల్గొన్న 'ఖర్డ్లాయుద్ధము'ను వర్ణించు గాథలేవైన లభించునేమో పరిశీలింపవలసియున్నది.

### 1.1.6. సదాశివరెడ్డి కథ:–

ఇతఁడు మెదక్ రాణియగు శంకరమ్మకు దత్తపుత్రుఁడు. 'నిజామలీ' పుత్రుఁడగు 'అలీజా'ను రక్షించుటకై నిజాముతో యుద్ధము చేసి, సిద్ది అబ్దుల్లాను జంపి, నిజామును గడగడలాడించిన మహా వీరుఁడు. కడకు నవాబితనిని మోసగించి బంధించి కారాగారమున నైచెను. బంధింపఁబడియున్న ఇతనిని సిద్ది అబ్దుల్లా కుమారుఁడు పౌరుషహీనముగాఁ జంపెను. వెంటనే సదాశివరెడ్డి భార్య పార్వతమ్మ ఆ తురకవానిపైఁ బడి మహాకాళివలె వాని గొంతు పిసికి చంపినది. ఆతని బాకుపోటుచే నామెయు మరణించినది.

ఈ సదాశివరెడ్డి యుద్ధము క్రీ.శ. 1795లో జరిగెను. దీనిని గూర్చి డా॥ బి.రామరాజుగారు మిక్కిలి విపులముగాఁ జర్చించి యున్నారు (చూ. తెలుగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౨౫౨, ౨౬౧). ఈ కథ 'మేలుభళీ' వరుసలో నున్నది. పాదమునకుఁ బదిమాత్రలుండును. ప్రతి పాదాంతముననను వంతలు 'మేలుభళి' యందురు. ఒక చరణము (Stanza) పూర్తిగాఁగానే 'మేల్‌భళిభళి' యందురు.

### 1.1.7. నల్ల సోమనాద్రి కథ లేక గద్వాల సోమనాద్రి కథ:

గద్వాలను బాలించిన 'సోమనాద్రి' లేక 'నల్ల సోమనాద్రి' పైన తెల్పిన సదాశివరెడ్డికి మేనల్లుఁడని ఈ వీరగాథనుబట్టి తెలియుచున్నది. నల్ల సోమనాద్రి తల్లియగు 'కేశమ్మ', సదాశివరెడ్డికి స్వయముగా చెల్లెలని ఈ క్రింది పాటవలన విశదమగుచున్నది. కేశమ్మ తల్లిదండ్రులనుగూర్చి చెప్పు సందర్భమున నీ కథలో నిట్లున్నది–

*"కేశమ్మ పుట్టిల్లు మేలు భళి – సతాశివనంపేట మేలుభళి*
*తల్లి శివరంగమ్మ ,, తండ్రి వుదిమారెడ్డి ,,*
*ఒక్కతే కుమార్తె మేలు భళి"*

సదాశివరెడ్డి కథలో నాతని తల్లిదండ్రుల పేర్లును సరిగా నిట్లేయున్నవి–

*"సతాశివనంపేట మేలుభళి – ఏలేవాడు రాజు మేలుభళి*
*రెడ్డి వుదిమారెడ్డి ,, వుదిమరెడ్డి భార్య ,,*
*తల్లి శివరంగమ్మ ,, శివరంగమ్మ కన్న కొడుకు ,,*
*ధాల్ బహద్దర్ శివారెడ్డి – మేల్ భళిభళి"*

దీనినిబట్టి కేశమ్మయు సదాశివరెడ్డియు నేకగర్భవాసులని స్పష్టమగు చున్నది. అంతేకాక, నల్ల సోమనాద్రి కథలో నొకచోట సోమనాద్రిని గూర్చి ఇట్లున్నది:–

*"నా పేరు నలసోమ భూపాలుడు మేలు భళి*
*మా తల్లి కేశమ్మాను ,,*
*మా తండ్రి తిమ్మారెడ్డి ,,*
*మేనమామ సదాశివారెడ్డి మేలు భళి"*

ఇఁక నల్ల సోమనాద్రికి సదాశివరెడ్డి మేనమామ యనుటలో సందేహమున కాస్కారమే లేదు. కావున నల్లసోమనాద్రి కూడ క్రీ.శ. 1795 ప్రాంతము వాఁడేయని నిశ్చయింపవచ్చును. ఈ మేనమామ, మేనల్లుఁడు – ఇరువురును వేంకటేశ్వరస్వామి వరము వలనఁ బుట్టి నారనియు, మరణానంతరము తిరుపతిలో దేవునికడ శిలలై వెలసి నారనియు రెండు వీరగాథలలోను జెప్పఁబడినది. నల్ల సోమనాద్రి కథాంతమున నిట్లున్నది:–

*"వెంకటేశ్వరుని మదిలో దలచినవాడు మేలు భళి*
*మఱ్ఱిచెట్టు క్రింద పాన్పువేసి ,,*
*గంటన్నరలో నిద్దురపట్టెను ,,*
*నిదురలోన దేవతలు వచ్చిరయ్య ,,*
*పండుకున్న రెడ్డిని గుంజిరయ్య ,,*
*తిరుపతిలో ప్రతిమయై నిలిచినాడు మేలు భళి"*

సదాశివరెడ్డికథలోఁ జివర నల్లసోమనాద్రి పేరుకూడఁ గలదు. ఇరువురును వేంకటేశ్వరునకుఁ జెఱియొక వైపునను బ్రతిమలై నిలిచినారు:–

*"వెంటేశ్వర్లు రథము తెచ్చినాడు మేలు భళి*
*రథము మీద ఎక్కినారు ,,*
*తిరుపతిలో అతనిని నిలిపినారు ,,*

*స్వామి ఎడమకు సదాశివరెడ్డి ,,*
*స్వామి కుడి ప్రక్కన నల్లసోమనాద్రి మేలు భళి"*

నల్లసోమనాద్రికథలో సగము వఱకును నతని తల్లిదండ్రులను గూర్చిన కథ యున్నది. అతని తండ్రి తిమ్మారెడ్డి, తల్లి కేశమ్మ. వీరు పాకనాటి రెడ్లు. కల్వకుర్తి జిల్లా 'వెంకటలక్ష్మీపేట'లో నుండెడి వారు. వీరు మిక్కిలి సంపన్నులు. ఒకప్పుడాదేశమున నొకపెద్ద క్షామము సంభవించెను. ప్రజలు తిండిలేక మలమలమాడి పోవుచుండఁగా, దయాపరుఁడైన తిమ్మారెడ్డి తన ధనధాన్య సంపదల నన్నిటిని దానము చేసెను. కడకు భార్యమెడలోని తాళిబొట్టును గూడ ప్రజలకై వెచ్చించెను. ఇట్లు దానధర్మములచే నిఱుపేదలుగా మాఱిన యా దంపతులు తమ గ్రామమును విడిచి, ఇలువేల్పు చెన్నకేశవుని తలఁచుచు, బహుదూరము పయనించి, కర్నూలు జిల్లాలోని కొఱ్ఱపోలూరికి వచ్చిరి. ఆ యూరి తలారి మంగన్నతో వీరు తమ దీనత్వము నిట్లు చెప్పుకొందురు:–

*"నడిచిన యీ కాళ్లు– బొగ్గలు ఎత్తినవి*
*ఊపిన యీ చేతులు– ఉరువులు దిగినావి*
*కంటికి నిదురలేదు– మా కాలికి ఉర్వడి లేదు*
*అన్నమొక్క బెల్లమాయె– అంబలొక్క తేనె ఆయె"*

ఆ దంపతులు కొఱ్ఱపోలూరులో పాగ పుల్లారెడ్డి యను వానికడఁ గొంతభూమిని దీసికొని, సేద్యము చేసి జీవింపసాఁగిరి. కష్టజీవులైన వారు క్రమక్రమముగా ధనవంతులు కాఁసాగిరి. కేశమ్మ గర్భవతి యాయెను. పాగ పుల్లారెడ్డి వారిని జూచి యోర్వలేక, కర్నూలు నవాబు దగ్గఱకు వెళ్లి, ప్రధాని 'నందర్‌ఖాన్'తోఁ జెప్పి, తిమ్మారెడ్డిని బంధించి కొట్టించెను. తిమ్మారెడ్డి చెఱసాలలోఁ జనిపోయెను. అతని పశువులను పుల్లారెడ్డి నాశనము చేసెను. కేశమ్మ ఆ యూరు విడిచి 'రాజోలు ఘడి'కి వచ్చినది. ఆ యూరిలోని అటకరి నారాయణ, బ్రాహ్మణ కేశవులు, బ్రాహ్మణ శంకరయ్యలు ఆమెను మిక్కిలి యాదరించిరి. ఆ యూరిలో నామె నలసోమ భూపాలునిఁ బ్రసవించెను. ఆ బాలుఁడు:–

*"కిష్ట రూపు కల్లవాడు రాజు*
*పుట్టు తిరుమణి కల్లవాడు రాజు*
*భీమ టోపము కల్లవాడు రాజు*
*అయిదు రేఖలు కల్లవాడు రాజు*
*వూరను వూరంత కలదు ప్రేమ"*

ఈ బాలుడు కృష్ణునివలె నల్లగా నుండుటచే 'నల్ల సోమనాద్రి' యని పేరు వచ్చెను. బ్రాహ్మణులు పంచాంగమును జూచి, యతడు గొప్ప రాజగునని చెప్పిరి. తుమ్మలపల్లె గ్రామమున నొకప్పుడు ఆ బాలున కొక సర్పము గొడుగు పట్టినదికూడ.

నల్ల సోమనాద్రి క్రమముగాఁ బెరిగి పెద్దవాఁడయ్యెను. తిరుపతినుండి 'కావేరమ్మ' యను గొప్ప గుఱ్ఱమును దెప్పించినాఁడు. మూఁడు నూర్ల తుపాకులవారిని, ఆఱునూర్ల గుఱ్ఱపు సిపాయిలను వెంటఁబెట్టుకొని పుదూరి మిట్టలపైకి వేఁటాడ నేఁగెను. ఒక గద్ద గుండుకడ ధనము లభింపఁగా, దానితో నటఁ గోటకట్టి 'గద్వాల ఘడి' యను పేరుపెట్టెను. కాని యా కోటకట్టిన స్థలము ఉప్పేటి తాలూకాలోనిది. అది 'సైదుమియ్య' యను మహమ్మదీయ సర్దారునిది. అతఁడు తన స్థలములోఁ గోట కట్టినందులకు నైదు లక్షల దుడ్డును చెల్లింపవలసినదిగా సోమనాద్రికిఁ గబురుపెట్టెను. సోమనాద్రి యంగీకరింపలేదు. సైదుమియ్య గద్వాలపై దండెత్తి రాఁగా, సోమనాద్రి యాతనిని ద్రిప్పికొట్టెను. సైదుమియ్య హైదరాబాదుకుఁ బాఱిపోయి నవాబుతో మొఱపెట్టుకొనెను. నవాబు, దక్షిణాదిని 'అదపనెల్లి కోట' నేలు 'లక్ష్మరావు'నకును సోమనాద్రికిని గలహము పెట్టెను. సోమనాద్రి లక్ష్మరావు నవలీలగా నోడించెను. ఉప్పేటి సైదుమియ్య మరల హైదరాబాదు నవాబు దగ్గఱకు వచ్చి పండ్రెండులక్షల దండులేపి, గద్వాలకు వచ్చెను. సోమనాద్రితల్లి కేశమ్మ గోల్కొండ దండును జూచి భయపడెను. కాని సోమనాద్రి తల్లితో "నీకు చూడ గోలుకొండ నమ్మ, నాకు చూడ గొర్లదొడ్డి అమ్మ!" అని నిజాము సైన్యముపై నుఱికెను. ఇట సోమనాద్రి యుద్ధము మహాద్భుతముగా వర్ణింపఁ బడినది–

*"కేకవేసి మీసము దువ్వినాడు*
*గుర్రాన్ని గుప్పించి ఎక్కినాడు*
*మందికి భోరు కొల్పినాడు*
*వచ్చి నడిదండులో దుమికినాడు*
*తరువాత వాండ్ల ముక్కులు కోసితేను*
*అల్లా అల్లా అంటరయ్య*
*ధీను ధీను పానీ అంటరయ్య*
*పానీ లేపన లేదు*
*చెరుకు నరికిన రీతి కొట్టిరి*
*కోసి కుప్పలు పెట్టిరయ్య*
*ఆవలించే శిరస్సు లయ్య*
*దొల్లాడె మొండాలున్న వయ్య*
*మొత్తుకుంట నైజాం దేరాకు వచ్చినారు"*

ఇట్లు వీరవిహారము చేయుచు వచ్చెడి నల్ల సోమనాద్రి మహోన్నతమైన శరీరమును జూచి, నిజాము పాదుషా గడగడ వణఁకినాఁడఁట! సోమనాద్రి శరీరము తీర్చిదిద్దిన విగ్రహము–

*"నడుము పిడికెడు ఉన్నదయ్య*
*రొమ్ము గజము వున్నదయ్య*
*పురచడేసి కన్నులవాడు రెడ్డి*
*అతని చూచి గడగడ వణకె బాదుష"*

నిజాము సోమనాద్రి శౌర్యమునకు సంతసించి, తనతో హైదరాబాదు తీసికొనిపోయి, గౌరవించి పంపెను. సోమనాద్రి తన భార్యలగు లింగమ్మ చుక్కమ్మలతో గద్వాలకోటలో సుఖముగా నుండెను. ఇది ఉప్పేటి సైదుమియ్యకుఁ గన్నెఱ్ఱగా నుండెను. సైదుమియ్య తన బావమఱఁది 'గుత్తి మురారు ఖాన్'తోఁ గలసి కుట్రపన్ని, పండ్రెండు వేల పఠానీలతోను, నాఱువేల అరబ్బీలతోను, వందలక్షల తురంగములతోను గద్వాల కోటపై దండెత్తెను. గద్వాల కెటుచూచినను దండే-

*"కర్నూలు మిట్టలమీద దండు*
*జోళాపురం మిట్టమీద దండు*
*ఋధారుపేట మిట్టలమీద దండు*
*పులిచేల పూరాకిట్ల దండు"*

అయినను సోమనాద్రి ధైర్య మిసుమంతయును జలింపలేదు. ఇది తన కడసారి యుద్ధమనియు, దాను తిరిగి ఇంటికి రాననియుఁ, దల్లితోను, భార్యలతోను జెప్పినాఁడు. 'కావేరమ్మ'పై నధిరోహించి, రణరంగమున దుమికి, ఘోరయుద్ధము చేసి, నాలుగు దిక్కులకును విజృంభించి, నవాబు ప్రధాని నమధరుఖానుని, కొఱ్ఱపోలూరు పుల్లారెడ్డిని (తన తండ్రిని జంపిన వాఁడితఁడే), గుత్తి మురారుఖానుని, పాఱిపోవుచున్న సైదుమియ్యను 'శాలిబాష దరగ' యొద్దఁ బట్టి చంపెను. తరువాత సోమనాద్రి ఆలంపూరుకు వచ్చి జోగులాంబకు మ్రొక్కి, కోనేటిపల్లెకు వచ్చి వేంకటేశ్వరుని దలఁచుచుఁ బ్రాణములు వదలెను. తిరుపతిలోఁ బ్రతిమయై నిలచెనఁట!

ఈ వీరగాథలో 'నందరిఖాన్, సైదుమియ్య' యను పేర్లు వచ్చినవి. సరిగా నివే పేర్లు 'కర్నూలు నవాబు కథ'లోఁ గూడ వచ్చినవి. నల్ల సోమనాద్రి సదాశివరెడ్డికి మేనల్లుఁడు కావునఁ దరువాతి తరమునకుఁ జెందిన వానినిగా భావించినచోఁ, గర్నూలు నవాబునకు సమకాలికుఁడగును. కర్నూలు నవాబు పతనము క్రీ.శ. 1834లో జరిగినది. సదాశివరెడ్డి యుద్ధము క్రీ.శ. 1795లో జరిగినది. కాఁ బట్టి నల్లసోమనాద్రి యుద్ధములు 1795-1834 మధ్యకాలములో జరిగినవని తీర్మానింపవచ్చును.

సదాశివరెడ్డికథ వలెనే నల్లసోమనాద్రికథ కూడ 'మేలు భళి' వరుసలో నున్నది. దీనిని మొదట సురవరం ప్రతాపరెడ్డిగారు సేకరించి నట్లున్నది. రాణీ శంకరమ్మ కథ, సదాశివరెడ్డి కథ, గద్వాల సోమనాద్రి కథ, మియాసాబ్ కథ, సవై వెంకటరెడ్డి కథ, రాజా రామేశ్వరరావు కథ మున్నగు ప్రసిద్ధమగు తెలంగాణా వీరగాథలను గూర్చి మొట్ట మొదట తెలియజేసినవారు ప్రతాపరెడ్డిగారే. ఈ వీరగాథలన్నియు వారు సంపాదించియున్నారు. ఈ రెడ్డిగారు సేకరించిన వీరగాథల ప్రతులు కొన్ని డా॥ బి.రామరాజుగారికడ నున్నవి. ఈ గద్వాల సోమనాద్రి కథను రామరాజుగారు నాకొసంగిరి. నేను 11-6-1966న వారిచ్చిన ప్రతికిఁ బ్రతికను వ్రాసికొంటిని. పైనుదాహరించిన భాగములన్నియు నీ ప్రతిలోనివే.

### 1.1.8. రాజా రామేశ్వరరావు కథ:-

ఇది వనపర్తి సంస్థానమునకుఁ జెందిన రెడ్డివీరుని కథ. ఇది 19వ శతాబ్దములోని కథగాఁ గన్పట్టుచున్నది. ఇదికూడ సదాశివరెడ్డి కథ, నల్ల సోమనాద్రి కథల వలెనే 'మేలు భళీ' వరుసలో నున్నది. ఈ కథను డా॥ బి. రామరాజు నాకొసంగినారు (11-6-1966).

పూర్వము ఏటిగడ్డన సూగూరి సముదులో 'పాతపల్లి ఘడి'ని కట్టి 'బొగ్గు తమాషకాడు' అను బోయవాఁడు పండ్రెండేండ్లు పాలించెను. ఆ తరువాత 'బలిజ సూగన్న' సూగూరు కట్టించి, పండ్రెండేండ్లు పాలించెను. పిమ్మట తిరుపతిదేశపు కాపులు సవై చినజానకమ్మ, సవై పెదజానకమ్మ, అచట రాజ్యమేలిరి. సవై చినజానకమ్మ, 'బండమీది రంగాపురము'లో ఇవరముపేట ఫకీర్రెడ్డి-రమణమ్మ యను దంపతులకుఁ బుట్టిన రాజా రామేశ్వరరావును దత్తునకుఁ దెచ్చుకొనెను. ఈ రాజా రామేశ్వరరావు మహావీరుఁడు. గాథాకారుఁడీతని నెట్లు వర్ణించెనో చూడుడు:

| | |
|---|---|
| *"ఖైరు బహద్దరు పిట్ట* | *మేలు భళి* |
| *మగలాయి బంగరు పిట్ట* | ,, |
| *మన్నెరుసుము తినేవాడు* | ,, |
| *క్రిష్ణరూపు కల్లవాడు* | ,, |
| *ముల్లుకట్టె చేతుల వుంటె* | ,, |
| *మూడునూర్ల మంది అగరు* | ,, |
| *ఎడమచేతి డాలు కింద* | ,, |
| *ఏడునూర్ల పౌజు అగదు* | *మేల్ భళిభళి"* |

ఈ రాజా రామేశ్వరరావునకు అన్ని చదువులును వచ్చును కాని, జాతివాని భాష రాదు. ఫరంగీల చదువు రాదు. చెన్నపట్టణము పోయి ఆఱునెలలలో 'అంగ్రేజుభాష' తెచ్చెదనని, రాజా రామేశ్వర రావు తన మంది మార్బలముతో నటకేఁగ నిశ్చయించెను. అతనితో పాటు అయిదునూర్ల అరబ్బులు, మూఁడునూర్ల ముసద్దీలు కూడ బయలుదేరిరి. సూగూరునుండి బయలుదేరిన రాజా రామేశ్వరరావు పెబ్బేరు, మాలాపల్లె, అప్పరాల, ఆత్మకూరు, కొల్హాపూరు, మఖ్తలు, ముదుమాల, రాయచూరు, బళ్లారి మీఁదుగా చెన్నపట్టణము చేరెను. అంగ్రేజుభాష నేర్చుకొనుటకు రాణి యాతనిని పండ్రెండు 'లైనులు' కట్టుమన్నది. రామేశ్వరరావు దగ్గఱ దుడ్డు చాలలేదు. అరబ్బుల 'తాలందౌలా' దగ్గఱ మూఁడు లక్షలు అప్పుగాఁ దీసికొని రామేశ్వరరావు రాణికిఁ బైకమును జెల్లించెను. మూఁడు నెలలలో అంగ్రేజుభాష సొంతము నేర్చుకొనెను. రాణి అతని చదువు విని మెచ్చుకొన్నది. కంఠహారము వేసి, పెద్ద గుఱ్ఱమును బహుమతిగా నిచ్చెను. రాజా రామేశ్వరరావు తన సైన్యముతో బయలుదేరి యింటికి వచ్చెను.

కుంభవృష్టిగా వర్షములు కురియుటచే రామేశ్వరరావు రాజ్యములోని శ్రీరంగము చెఱువుకట్ట తెగిపోయినది. రైతుల పంటలు

పాడయ్యెను. రామేశ్వరరావు సైన్యమును తగ్గించుమని 'నిస్సల్‌దారు' నితోఁ జెప్పెను. అరబ్బుసైన్యము కొలువు చాలించిరి. అరబ్బు తాలందౌలా తన కీయవలసిన పైకము నిమ్మని రామేశ్వరరావు నడిగెను. రామేశ్వరరావు తన దేశములోఁ బంటలు పాడైనవనియు, నందుచేఁ దనకు ఆఱునెలల వ్యవధి నీయవలసినదనియు తాలం దౌలాను గోరెను. కాని యతఁడంగీకరింపలేదు. గట్టిగాఁ బట్టుపట్టినచోఁ బుచ్చిన గవ్వకూడ నీయనని రామేశ్వరరావు బెదరించెను. రామేశ్వరరావు కడనున్న డబ్బు "ఏనుఁగునోటిలోని చెఱకు వంటిదనియు, ఏట్లో ఉన్న మాన్యము వంటిదనియు" భావించి, తాలందౌలా తన అయిదు నూర్లమందిని వెంటఁబెట్టుకొని, హైదరాబాదునకుఁ బోయి కొత్వాలుతో మొఱవెట్టుకొనెను. ఇరువురును రామేశ్వరరావుపై పగతీర్చుకొనుటకుఁ బన్నాగములు పన్నుచుండిరి.

ఆఱునెలల తరువాత రామేశ్వరరావు అంగ్రేజుభాష నేర్చెనని నిజాము విని, ఆతనిని హైదరాబాదున కాహ్వానించెను. రామేశ్వర రావు వంటచేసెడి బుచ్చమ్మతోను సిద్దిఅబ్దుల్‌గానితోను గలసి గుఱ్ఱమెక్కి హైదరాబాద్ వెళ్లెను. అక్కడ అంగ్రేజు మాటాడి నిజామును సంతోషపఱచి, కొడవలికల్లు, వుమ్మాపురము గ్రామముల నీనాములుగాఁ బడసి వచ్చుచుండెను. గొల్లన్‌దాసుతోట కడకు వచ్చుసరికి తాలందౌలా కొత్వాలుతోఁ గుఱ్ఱపన్ని, రామేశ్వరరావును నిర్బంధించి ఖైదుచేసెను. రామేశ్వరరావు సిద్దిఅబ్దుల్‌గానిచే నూగూరులో నున్న తన తమ్ముఁడు రామకృష్ణారెడ్డికిని, నిస్సల్‌దారునికిని దాను ఖైదుపడ్డ విషయము నెఱింగించెను. వారు పండ్రెండుమంది భటులతో హైదరాబాదునకు వచ్చి, ఒక బ్రాహ్మణుని గృహమును దీసికొని, యా బ్రాహ్మణునకుఁ దమరాజ్యములో కొత్తకోట దగ్గఱనున్న అగ్రహారము నిచ్చిరి. ఆ బ్రాహ్మణుని యింటినుండి చెఱసాలవఱకును రహస్యముగా నేల బొయ్యారము త్రవ్వి, రామేశ్వరరావు నా బొయ్యారము గుండా బయటకుఁ దీసి, అంచెల గుఱ్ఱములపైఁ గర్నూలునకు రప్పించిరి. ఇంతటితో కథ ఆగిపోయినది. ఇది అసమగ్రమని నా యభిప్రాయము. తాలందౌలా దండెత్తివచ్చుట, అతనిని రామేశ్వరరావు ఓడించుట అను కథ యున్నదేమో పరిశీలింపవలసియున్నది.

రాజా రామేశ్వరరావు అంచెల గుఱ్ఱములపైఁ దప్పించుకొని వచ్చుట బాగుగా వర్ణింపఁబడినది. ఈ మహావీరుఁడు స్వారి చేయుచుండగా, నా తీవ్రతకుఁ దట్టుకొనలేక ఒక అంచె కాఁగానే గుఱ్ఱము ప్రేవులు తెగి చచ్చిపోయెడిదట! గుఱ్ఱపు స్వారిలో నా మహావీరుని నైపుణ్యమంత గొప్పది, వేగమంత తీవ్రమైనది!

*"ఆడ యెక్కిన గుఱ్ఱమయ్యా మేలు భళి*
*పెద్ద జానముపేటకు వచ్చినది ,,*
*గుఱ్ఱము పేగులు తెగి చచ్చినది ,,*
*అక్కడ ఒక గుఱ్ఱం ఎక్కినాడు ,,*
*చిన్న జానముపేటకు వచ్చినాడు ,,*
*ఆడ గుఱ్ఱం పేగులు తెగి చచ్చె ,,*
*ఆడ ఒక గుఱ్ఱమును ఎక్కినాడు ,,*
*కొత్తకోటకు వచ్చినాడు ,,*
*అక్కడ గుఱ్ఱము పేగులు తెగిచచ్చె ,,*
*ఇంక ఒక గుఱ్ఱమును ఎక్కినాడు ,,*
*యాపర్లకు వచ్చినాడు ,,*
*గుఱ్ఱము నుంచి దిగినాడు ,,*
*కరకర ప్రొద్దు పొడిచినాది ,,*
*పెద్దేరు చిన్నేరు దాటి ,,*
*కర్నూలులో వచ్చి చేరినాడు మేల్ భళిభళి"*

ఇన్ని వందల మైళ్లు స్వారిచేయుటకు గొప్ప నేర్పు కావలెను. సరిగా నిట్టి వర్ణనయే 'జగపతిరాజుకథలోఁ' గూడ వచ్చును. అందు జగపతిరాజును ఆనందగజపతి విజయనగరము కోటలో బంధింపఁగా, పినతల్లి చంద్రమదేవి సహాయమునఁ దప్పించుకొని అంచెల గుఱ్ఱములపై పెద్దాపురము వచ్చిచేరును. గాథాకారుఁడు డక్కీని లయబద్ధముగా మ్రోఁగించుచు, ప్రతి అంచెను వర్ణించుచు, నుత్సాహ భరితముగాఁ గేకలు వేయుచు, వేగముగా గానము చేయుచున్నప్పుడు, ఎప్పుడో చనిపోయిన ఆ మహావీరుఁడు సజీవుఁడై మన కన్నుల యెదుట సాక్షాత్కరించును. ఆతఁడు వాయువేగ మనోవేగములతో గుఱ్ఱముపై స్వారిచేయుచున్నట్లుగా మనకుఁ బ్రత్యక్షమగును! సాహిత్య దృష్టితోఁ జూచినప్పుడు కేవలము పునరుక్తి దోషముతో నున్నట్లుగా గాన్పించు నీ పంక్తులు, గాథాకారుని నోటిలో మహాశక్తి సంపన్నములై శ్రోతలపై నద్భుత ప్రభావమును వెలార్చును. వారి హృదయముల నుత్సాహ పరిపూరితముచేసి, వీరరస ప్లావితము చేయును. ముందు జగపతిరాజు గుఱ్ఱముపై మహావేగమున పోవుచుండగా, వెనుక ఆనందగజపతి పండ్రెండుమంది సర్దార్లతో నాతనిని దఱుముచు ఫిరంగులు ప్రేల్చుచుండెనట! జగపతిరాజు స్వారిచేయుచున్న గుఱ్ఱము ఆ ఫిరంగిగుండ్లకన్న వేగముగాఁ బోవుచుండెనట! దీనినిబట్టి ఆతని అశ్వనైపుణ్య మెంత గొప్పదో తెలిసికొనవచ్చును. రాజా రామేశ్వరరావును ఇట్టి మహావీరుఁడే. ఆనందగజపతి, జగపతిరాజును వెంబడించినట్లుగానే, తురుష్క లీతనిని హైదరాబాదునుండి వెన్నాడియుందురు. వారికిఁ జిక్కకుండ వందలకొలఁది మైళ్లు మనోవేగమున స్వారిచేయుచు వనపర్తికిఁ జేరిన శూరుఁడు రాజారామేశ్వరరావు.

### 1.1.9. కర్నూలు నవాబు కథ:-

ఇది రాయలసీమలో కర్నూలు మండలముననుు, తెలంగాణమున మహబూబ్‌నగర్ మండలమునను వ్యాప్తి యందున్న కథ. దీనిని నంద్యాలలో 'ఇప్పె రుద్రప్ప' యను వృద్ధజంగము పాడఁ

గా 21-12-1965న వ్రాసికొంటిని. ఇదియును వెనుక వివరించిన తెలంగాణపు వీరగాథల వలెనే 'మేలు భళి' వరుసలో నున్నది. ఈ వరుసలో పాదమునకు పది మాత్రలుండును. ఇవి సాధారణముగా 3+4+3 యను క్రమములో నుండును. ప్రతి పాదమునకును వంతలు 'మేలు భళి' అనియు, చరణాంతమున "మేల్ భళిభళి" అనియు నూపు నిచ్చుచుందురు. "రజా భోగతి- గలిగి, రజా రాజాగారు" అనునది దీనిలోని పునరావృత్తి. కొన్ని తెలంగాణపు కథలలో నీ పునరావృత్తి "రాజా ఓ రాజా, రజా భోగతి గలిగి" అని కలదు.

ఆంగ్లేయులు కుట్రలు పన్ని, కర్నూలు నవాబును సింహాసనము నుండి కూలఁద్రోసి, ఆ రాజ్యము నాక్రమించుట యిందు వర్ణితము. కర్నూలును బాలించిన నవాబులలో నితఁడు కడపటివాఁడనియు, నీ సంఘటన క్రీ.శ. 1834లో జరిగినదనియు కీ.శే. సురవరం ప్రతాపరెడ్డిగారు నిర్ణయించిరి. 'కర్నూలు నవాబు కథ' ఈ క్రింది రీతిగాఁ బ్రారంభమగును-

*"రజా రాజాగారు మేలు భళి*
*రజాభోగతి గలిగి ,,*
*వినండి సభవారు ,,*
*చెప్పెదాను నవాబు కథ ,,*
*కర్నూలు దర్బారు ,,*
*అదియెట్ల వచ్చెనంటే ,,*
*పూర్వకాలమునాడు ,,*
*కర్నూలు అది కాదు ,,*
*అప్పట్లో కందెనపల్లె ,,*
*కందెనపల్లె ఏలేవాడు ,,*
*అబ్బ పకీరుసాబు ,,*
*అతని కొడుకు చూడు ,,*
*చౌర హల్లపుఖాను ,,*
*హల్లపుఖాన్ కొడుకు ,,*
*దొరా మన్నుమియ్య ,,*
*గులాం ఖదార్‌కాడు ,,*
*గులాం రసుల్‌కాడు మేల్ భళిభళి"*

కందనూలు రాజ్యము నేలు 'చౌర హల్లపుఖాన్' తన మూఁడవ పుత్రుఁడగు 'గులాం రసుల్‌ఖాన్'ను నవాబుగాఁ జేసి స్వర్గస్థుఁడయ్యెను. ఆ నవాబు ఎల్లప్పుడును భోగములలో మునిఁగి తేలుచుండెను. అతనికైదుగురు భార్యలు, మూఁడునూర్ల భోగమువారఁట! పాలెపు కొండ రంగసాని యతనికిఁ బెద్దలంజ. ఈ నవాబున కేడ్గురు మేనమామలున్నారు. వారిలోఁ బెద్దవాఁడు 'నందర్‌ఖాన్'. ఇతఁడు భోగలాలసుఁడగు నవాబును జంపి, రాజ్యమును గబళింప నెంచుచుండెను.

ఇట్లుండఁ గొంతకాలమునకు రోము దేశమునుండి అయిదు నూర్ల అరబ్బీలు, నాలుగు నూర్ల 'రోయిలాలు' కర్నూలు నవాబు సభకు వచ్చి, ఆతని దగ్గఱఁ గొలువునకుఁ జేరిరి. అరబ్బీ సైన్యమునకు జమేదార్ 'చావలిఖాన్', రోయిలాలకు జమేదార్ 'షేక్‌సయ్యద్'. వీరిరువురును మహావీరులు. ఈ వీరగాథలో వీరిరువురిదే నాయకత్వము. నవాబు మేనమామ నందరిఖాన్ ఆంగ్లేయులతోఁ గుట్రపన్ని వారిని గోటపై దండెత్తించును. అప్పుడు చావలిఖాన్ కోటలో లేఁడు. నందరిఖాన్ తెల్లవారి కన్ని రహస్యముల నెఱింగించెను. తెల్లవారు నవాబును మోసగించి, కోట వెలుపలికిఁ బంపి, కోటనాక్ర మించిరి. అప్పుడు నవాబు పక్షమున చావలిఖాన్, షేక్‌సయ్యద్‌లు వచ్చి, కోటలోనున్న ఆంగ్లేయులతో ఘోరయుద్ధము చేసి మరణింతురు. పిఱికిపందయగు నవాబును వంటవాఁడు హత్య చేయును. షేక్‌సయ్యద్, చావలిఖాన్‌లు 'భిళ్లందొర' యను నాంగ్లేయ సేనానితోఁ జేసిన యుద్ధపుతీరు రసోత్కటముగా వర్ణింపఁబడినది. నవాబును తెల్లవాఁడగు 'గంధల్‌దొర' మెడపట్టి గెంటఁగా, నవాబు ప్రక్కనేయున్న షేక్‌సయ్యద్ మహోగ్రుఁడై-

*"చూసెనయ్య షేకుసయిదు మేలు భళి*
*ఎక్కడ లేని కోపము గలిగి ,,*
*బొడ్లో ఉండె జంబె గుంజె ,,*
*ఊంచి ఒక్క పోటు పొడిచె ,,*
*రొమ్ములకాడ బొడిచినాడు-రాజా ,,*
*బొడ్డుదనుక చించినాడు ,,*
*గుండెలు పేగులు బయటపడి ,,*
*గడపమీద ఒరిగాడండి-రాజా- ,,*
*గంధల్‌దొర సచ్చినాడు- మేల్ భళిభళి"*

తరువాత ఆంగ్ల సైనికులను షేక్‌సయ్యద్‌కును జరిగిన ఘోర యుద్ధములో గుండుదెబ్బ తగిలి షేక్‌సయ్యద్ మరణించెను. అప్పుడు చావలిఖాన్ యుద్ధసన్నద్ధుఁడగును. అతఁడు చిన్నయేటికి నుఱుకుచుఁ బోయి, స్నానము చేసి-

*"అల్లాదేవుని తలనాడు మేలు భళి*
*నీల్‌పట్టు గుడిగి తొడిగి ,,*
*బంగరి పూలసెడ్డి తొడిగె ,,*
*అయిదు మణుగుల ఉక్కు అంగి ,,*
*సిలేబత్తర్ యేసినాడు ,,*
*దానిపైన చూడు ,,*
*బంగరిపూల అంగివేసె ,,*
*జల్తరి పేట గట్టి ,,*
*శాత నడుముకు చుట్టె ,,*
*మూడు మొకముల జంబె ,,*

*జంబె చేత బట్టె ,,*
*ఎడమచేత జంబె పట్టె ,,*
*కుడిచేత ఖాండకత్తి ,,*
*ఖాండకత్తి చేత బట్టి మేల్ భళిభళి"*

నవాబు దగ్గఱకు వచ్చినాఁడు. అతనిని దన వీపుపై నెక్కుమని కోరినాఁడు. కాని నవాబు యుద్ధమునకు సుముఖత చూపలేదు. చావలిఖాన్ అతనిని నిందించినాఁడు. "నీవు అసలైన తురక పుట్టుక పుట్టలేదు. నీవు భోగముదానికి పుట్టినావు. అందుచేతనే నీకు పౌరుషము లేదు. ఛీ!" అని నవాబునకొక చెంపపెట్టు పెట్టి, తానొక్కఁడే కోటపైకి నుఱికెను. ఆంగ్లేయ సేనాని 'కడప ఖిల్లందొర' తొమ్మిది పటాలముల సైన్యమును చావలిఖాన్ పైకిఁ బంపెను. ఆ సైన్యము చావలిఖాన్ చుట్టును గ్రమ్మినది. అప్పుడు:-

*"సూసెనయ్య శావలికాడు మేలు భళి*
*మనము, పుట్టేదె ఒకనాడు ,,*
*గిట్టేదె ఒకనాడు ,,*
*సచ్చిన బతికిన లచ్చీ ,,*
*పేరు ఉండవాలె ,,*
*అప్పుడు శావలిఖాను ,,*
*పల్టిమీద పల్టివేసి ,,*
*ఒదగొన్న పులిరీతి ,,*
*జాతివాండ్ల దండులో దుమికి ,,*
*కాండకత్తి గిరగిర తిప్పె రాజా! ,,*
*ఓయ్, చెఱుకు నరికినట్లూ ,,*
*జాతివాండ్లను నరుకుతాదు ,,*
*జొన్న నరికిన రీతి ,,*
*వరికోసిన రీతి ,,*
*ఏయ్, కొడితే పడివుందు ,,*
*కొవ్వు కండలు లచ్చీ ,,*
*నరికితే పడివుందు ,,*
*రక్త బక్కలు చూడు ,,*
*అయ్, బలిగు దాడిన రీతి ,,*
*చెదుగు దాడిన రీతి ,,*
*కత్తి కిరగద లేదు ,,*
*టోపులే దొల్లాదె ,,*
*పీనుగు పెంటలాయె ,,*
*రక్త కాల్వలు పారె ..*
*వచ్చిన జాతివాండ్లు ,,*
*తొమ్మిది పటాలాలు ,,*
*యాడివాడు ఆణ్ణే తండ్రి ,,*
*అంత హతమయ్యారు మేల్ భళిభళి"*

అప్పుడాంగ్లేయులు చావలిఖాన్‌పై ఫిరంగి ప్రేల్చఁ జూచిరి. వెంటనే చావలిఖాన్ పల్టీమీద పల్టీకొట్టి, ఫెళీమని కేకవేసి, ఫిరంగి దగ్గర కుఱికినాఁడు. ఫిరంగి వత్తు కాల్చువానిని బట్టి, ఫిరంగిమీఁద పడుకోబెట్టి, తన ఖాండకత్తితో నఱుకఁగా, వాఁడు రెండు తుండెము లగుటయే కాక, ఫిరంగి కూడ మూఁడు వ్రేళ్ల లోతు తెగెనఁట! అతని భుజశక్తికి గాథాకారుఁడే ఆశ్చర్యమును బ్రకటించుచున్నాఁడు-

*"వాణ్ణి-ఫిరంగి మీద పండబెట్టి - కాండకత్తి గిరగిర త్రిప్పి-*
*ఠాం అంట ఏటు నడిపె - చెరుకు తుంటె లెక్క-*
*వాడు రెండుగ తెగిపాయె - ఆ ఫిరంగి మూడు వేళ్లు తెగె-*
*ఆతని ముష్టి ఏమనవచ్చు రాజా!- (మేలు భళి)*
*కాండకత్తి ఏమనవచ్చు?"- (మేల్ భళిభళి॥)*

## 1.1.10. ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ:-

దేశికవితాప్రియు లింతవఱకును గుర్తింపని ఉత్తమ చారిత్రక వీరగాథలలో నిదియొకటి. రాయలసీమలోను, కడప-కర్నూలు జిల్లాలలోను దీనికి గొప్ప ప్రచారమున్నది. నారసింహారెడ్డి పందొమ్మిదవ శతాబ్ది మధ్యభాగమున రేనాటిసీమ నేలిన మహావీరుఁడు. ఇతఁడు 'నొస్సం' కోటను బాలించిన చెంచుమల్ల జయరామిరెడ్డి దౌహిత్రుఁడును, దత్తపుత్రుఁడును అని తెలియుచున్నది. కడప, కర్నూలు, అనంతపురము, బళ్లారి జిల్లాలలో నఱువదియాఱు గ్రామముల కధిపతి నారసింహారెడ్డి. రూపనగుడి, ఉయ్యాలవాడ, ఉప్పలూరు, గుళ్లదుర్తి, గిద్దలూరు మున్నగు గ్రామములలో నితఁడు నిర్మించిన కోటలు నగరులు నేఁటికిని గలవు. ఉప్పలూరు సంస్థానాధీశులగు 'పేరావారు' నారసింహారెడ్డి మూలపురుషులని రేనాటిలోని పెద్దలవలనఁ దెలియుచున్నది. కావున నీతని ఇంటిపేరు పేరావారై యుండవలెను. పేరావారిది సగునాల గోత్రము. కాని, నారసింహారెడ్డిపై పిచ్చుకుంట్లు పాడుచున్న యొక లఘువీరగాథలో నితని ఇంటిపేరు 'మద్దెలవారు' అనియు, తండ్రిపేరు 'పెద్దిరెడ్డి' యనియు, తాతపేరు 'జయరామిరెడ్డి' యనియుఁ గలదు.

*"తండ్రిపేరే పెద్దిరెడ్డి- తాతపేర్ జయరామిరెడ్డి*
*ఇంటిపేరే మద్దెలోళ్లు- తానపేర్ నరసింహారెడ్డి*
*వౌహుహ! నరసింహారెడ్డి! నీ పేరంటే- రాజా నరసింహారెడ్డి!"*[12].

కాని, కలెక్టర్ కాక్రేన్ మద్రాసు గవర్నరుకు వ్రాసిన లేఖలనుబట్టి నారసింహారెడ్డి ఇంటిపేరు "మజ్జరివారు."

ఇతఁడు 'రూపనగుడి' గ్రామములోఁ బుట్టెననియు, 'ఉయ్యాలవాడ'లోఁ బెరిగెననియు, పాలు అన్నము తినినది గుళ్లదుర్తి గ్రామమనియు నీ వీరగాథానికలోఁ గలదు. ఉయ్యాలవాడలోఁ బెరిగి పెద్దవాఁడగుటచేఁ గాఁబోలును ఇతనికి 'ఉయ్యాలవాడ నారసింహారెడ్డి' యని పేరు వచ్చినది. ఇతఁడు రెడ్లలో మోటాటి వంశమునకుఁ

జెందినవాఁడు. మోటాటి రెడ్లలోఁ గూడ వీరిది రాజవంశము (మామూలు మోటాటి రెడ్లకును వీరికిని సంబంధము లేదు). అందుచే వీరిని 'దొరవారు' అని పిలుతురు. వేఱొక కోలాటపు కోపులో నితఁడు 'దొరవారి నరసింహారెడ్డి' అని సంబోధింపఁబడినాఁడు. నారసింహారెడ్డి వంశీకులు 'నగరి' (కోట)లో నివసించుటచే వీరిని 'నగరివారు' అనియుఁ బిలుతురు. అఱువదియాఱు గ్రామముల కధిపతులగు వీరిని 'జమేదారులు' అందురు.

నారసింహారెడ్డి పితామహుఁడు బుచ్చిమల్లారెడ్డి ఉయ్యాలవాడ జాగీర్దారు. ఈ జాగీరునకు ప్రతి సంవత్సరము 30 వేల రూపాయల 'రెవెన్యూ' వచ్చెడిది. ఆంగ్లేయులు ఈ జాగీరును లాగుకొని, బుచ్చిమల్లారెడ్డికి నెలకి 70 రూపాయల 'తవర్జీ'(భరణము) ఏర్పాటు చేసిరి. బుచ్చిమల్లారెడ్డికి ఇద్దఱు కొడుకులు. పెద్దమల్లారెడ్డి, చిన్నమల్లారెడ్డి. వీరికి తవర్జీ 35 రూపాయల చొప్పున వచ్చినది. పెద్దమల్లారెడ్డి కొడుకులు ముగ్గురిలో నారసింహారెడ్డి ఒకఁడు. ఈ కొడుకులు ముగ్గురును తవర్జీని పంచుకొనగా, నారసింహారెడ్డి భాగమునకు 11 రూపాయల 10 అణాల 8 పైసలు వచ్చినది.

నారసింహారెడ్డి మాతామహుఁడైన 'చెంచుమల్ల' జయరామిరెడ్డి నొస్సం జమేదారు. ఈ జమేదారీకి ఏఁడాదికి 22 వేల రూపాయల 'రెవెన్యూ' వచ్చెడిది. ఈ జమేదారీని కూడ ఆంగ్లేయులు తమ కైవసము చేసికొని, ఆయనకు నెలకు 1000 రూపాయల తవర్జీని ఏర్పాటు చేసిరి. జయరామిరెడ్డి కొడుకు నొస్సం నరసింహారెడ్డి నిస్సంతుగా చనిపోవుటతో, ఆయన తన దౌహిత్రుఁడైన నారసింహారెడ్డిని దత్తు చేసికొనెను. కాని ఆంగ్లేయులు ఆ దత్తస్వీకారమును గణింపక, నొస్సం జమేదారీకి రావలసిన తవర్జీని నారసింహారెడ్డికి ఇచ్చుటకు అంగీకరింపలేదు. నొస్సం నరసింహారెడ్డి భార్యయైన 'సిద్దమ్మ'కు ఇచ్చిరి. ఆంగ్లేయులపై నారసింహారెడ్డికిఁగల కోపకారణములలో నిదియును నొకటి.

ఉయ్యాలవాడ జాగీర్దారు వంశములోనివాఁడుగా తనకు 1846 మే నెలకు రావలసిన తవర్జీ కొఱకు, నారసింహారెడ్డి 1846 జూన్ నెలలో, కోవెలకుంట్ల తాహశ్శీలుదారైన రాఘవాచార్యుల దగ్గఱకు ఒక మనిషిని పంపెను. తాహశ్శీలుదార్ తవర్జీ నీయకుండుటయే కాక, నారసింహారెడ్డిని దుర్భాషలాడెను. "ఆ నరసింహదాసరి క్రింద మఱియొక దాసరియా? ఆ దాసరినే రమ్మనుము పొమ్ము!" అని భటునికడ నీసడించెనట! (నారసింహారెడ్డి విష్ణుభక్తుఁడు. నుదుటిపై పెద్ద తిరుమణి ధరించెడివాఁడు). ఆ భటుఁడు ఉయ్యాలవాడకుఁ బోయి, నారసింహారెడ్డితో జరిగిన సంగతి చెప్పెను. అది విని, నారసింహారెడ్డి దండతాడిత భుజంగమైనాఁడు. అట్టి యవమానమును భరించుటకంటె చచ్చుటయే మేలని నిశ్చయించుకొనినాఁడు.

"రేపు మధ్యాహ్నము పండ్రెండు గంటలకు నరసింహ దాసరియే నీ కడకు వచ్చును, కాచుకొనుము" అని తహశీల్దారునకుఁ గబురు వెట్టెను. మఱునాఁడు అయిదువందలమంది బోయసైన్యమును దీసికొని పట్టపగలు కోవెలకుంట్ల పట్టణముపై దండెత్తెను. తహశీల్దారునిఁబట్టి తలగొట్టి, ధనాగారము కడనున్న బొందెలవాఁడు 'వార్‌సింగ్'ను జంపి, దానిని దోచుకొని, తహశీల్దారు శిరస్సును, వారసింగ్ శిరస్సును తెచ్చి, నొస్సం దగ్గఱ 'నయనాలప్పకొండ'లోఁ గల ఒక శివాలయమున గుహలో దాచినాఁడు. (చారిత్రకముగాఁ జూచినచో నారసింహారెడ్డి తాహశ్శీలుదారు రాఘవాచార్యులను చంపలేదు. బందీగా మాత్రమే పట్టుకొనెను. బ్రాహ్మణుడైన తాహశ్శీలుదారును చంపుట బ్రహ్మహత్యాపాతకము కదా! బొందెలవానిని మాత్రము చంపినాడు.) కడపలోనున్న కలెక్టరుకును, పోలీసు సూపరింటెండెంటుకును ఈ హత్యావిషయము తెలిసి, అన్వేషణ ప్రారంభించిరి. నారసింహారెడ్డి కడకు వచ్చిరి. కోవెలకుంట్లలో జరిగిన హత్యనుగుఱించి అతనినినే ప్రశ్నించిరి. నారసింహారెడ్డి తనకేమియుఁ దెలియదనియు, బహుశః ఔకురాజులీ పనిని జేసియుందురనియుఁ దెల్పెను. అందుచే నాంగ్లేయులు ఔకురాజులగు నంద్యాల నారాయణరాజుగారిని, చిట్వేలి తవర్జీదారుఁడగు నంద్యాల వేంకట రామరాజుగారిని బంధించి కారాగారములో నుంచిరి. అపరాధపరిశోధకులు పరిశీలన ప్రారంభించి, నయనాలప్పకొండలోఁ గల శిరస్సులను గనుగొనిరి. నారసింహారెడ్డి అనుచరులగు గోసాయి వెంకన్న, ఒడ్డె ఓబన్న యనువారలను బంధించి, సత్యమును గనుగొనిరి. నారసింహా రెడ్డిని బంధించుటకుఁ గొందఱు పోలీసులను ఉయ్యాలవాడకుఁ బంపిరి. వారు నారసింహారెడ్డిని బట్టుకొనుటకు బదులుగా, నతనిచేఁ దన్నులు తిని, శిక్షింపఁబడి, ప్రాణములతో బయటపడిరి. పోలీసువారు నారసింహారెడ్డిని బట్టుకొనుటకు భయపడుచుండిరి. అందుచే నాంగ్లేయులు లెఫ్టినెంట్ వాట్సన్, కెప్టెనె నాట్, కెప్టెన్ రసెల్ అను సేనానుల నాయకత్వమునఁ బెద్ద దండును బంపిరి. నారసింహారెడ్డియు వేలకొలఁది సైన్యములను సమకూర్చుకొని గిద్దలూరు ముండ్లపాదుల దగ్గఱ వారితో రెండు దినములు ఘోరయుద్ధము చేసి, తన సైన్యము నష్టము కాఁగా, నల్లమల కొండలలోనికి తప్పించుకొనెను. అటనుండి ఎఱ్ఱమలలోనికిఁ బాఱిపోయెను. ఆంగ్లేయు లాతనిని బట్టుట కెన్నియో ప్రయత్నములు చేసిరి. కాని ఫలించలేదు. కొంతకాలము గడచెను. నారసింహారెడ్డి జగన్నాథపురము కొండపై నుండెను. అతనికడ నొక వంటమనిషి యుండెను. (ఈమె వంటమనిషి కాదనియు, నారసింహారెడ్డి యుంపుడుకత్తె యనియు, నీమె స్వగ్రామము 'గొల్లవిండ్లపల్లె' యనియుఁ గొందఱు చెప్పుచున్నారు. వీరగాథలో నీమె యుంపుడుకత్తెగానే యున్నది. పేరు 'జానకమ్మ' యని కలదు.) బ్రిటిషవారు ఆమెకు లంచమిచ్చి, నారసింహారెడ్డిని బట్టుకొనిరి. ఆ

వంటమనిషి నారసింహారెడ్డికి విపరీతముగా సారాపట్టించి, యాతని తుపాకిలో నీళ్లు పోసినదఁట. నారసింహారెడ్డిని కోవెలకుంట్లకుఁ దెచ్చి, జుఱ్ఱేటి యొద్దున నురి తీసిరి.

ఇట్లు భారతదేశమున స్వాతంత్ర్యమునకై, మానధనమును గాపాడుకొనుటకై ఆంగ్లేయులతోఁ పోరాడిన మొట్టమొదటి వీరుఁడు నారసింహారెడ్డి. ఇతఁడు భారత ప్రథమ స్వాతంత్ర్య సమరము (1857) కన్న పది సంవత్సరములు ముందుగనే ఆంగ్లేయులను ఢీకొన్న వీరశిఖామణి! ఇతఁడీ యుద్ధమును క్రీ.శ. 1846-47 సంవత్సరములలో జరిపినాఁడని యాంగ్లేయులు వ్రాసికొనిన రాష్ట్రపరిపాలనా చరిత్రలనుబట్టియు, మాండలిక చరిత్రలనుబట్టియుఁ దెలియుచున్నది. మద్రాసురాష్ట్ర పరిపాలనాచరిత్ర రెండవ సంపుటములో నారసింహారెడ్డి కావించిన విప్లవము క్రీ.శ. 1846లో జరిగినట్లున్నది:

''In 1846, a descendant of the dispossessed poligars of Nossam, dissatisfied with the pension he received, attempted to excite a general rebellion, and collected on the frontiers two forces of several thousand men. Each was promptly defeated by British detachments, and before the end of the year quiet was completely restored. Since that time no event of historical importance has occured''[13].

బ్రిటిషువారు వ్రాసికొన్న యీ వ్రాఁతలను బట్టి నారసింహారెడ్డి విప్లవము చిన్నది కాదనియు, వేలకొలఁది సైన్యములను సమకూర్చుకొని, యతఁడు 1846లోనే రెండు పర్యాయము లాంగ్లేయుల నెదిరించెననియు విశదమగుచున్నది. పై గ్రంథములోనే 1846వ సంవత్సరమునుగూర్చి మఱియొక పుటలో నిట్లున్నది: (నారసింహారెడ్డి కాలమున నేఁటి కర్నూలు జిల్లాలో నున్న కోవెలకుంట్ల ప్రాంతము కడపజిల్లాలో నుండెడిది.

''1846- Serious disturbances in the Cuddapah district. Troops sent to put them down''[14]. కావున నారసింహారెడ్డి ఆంగ్లేయులను జాల తీవ్రముగ నెదిరించెనని స్పష్టమగుచున్నది.

మద్రాసురాష్ట్ర పరిపాలనాచరిత్ర మూఁడవ సంపుటములో నారసింహారెడ్డి విప్లవము క్రీ.శ. 1847లో జరిగినట్లున్నది. ఇందు 'ఉయ్యాలవాడ' గ్రామచరిత్రను వ్రాయుచు, నారసింహారెడ్డి విప్లవమును, నతఁడు 'లెఫ్టినెంట్ వాట్సన్'తో గిద్దలూరు కడచేసిన యుద్ధము, 'పేరుసోమల' యను గ్రామము నొద్దఁ బట్టుబడుట, ఉరితీయఁబడుట మొదలగునవి మాత్రమే కాక, మఱియొక క్రొత్త విషయము కూడ నిందుఁ జెప్పఁబడినది. ఉరితీసిన నారసింహారెడ్డి శిరస్సును బ్రిటిషువారు (కోవెలకుంట్ల) కోటలో ఉరికొయ్యకు 1877 వఱకును వ్రేలాడఁదీసి యుంచిరఁట. భారతీయుల స్వాతంత్ర్యేచ్ఛను బ్రిటిషువారు ఎంత క్రూరముగా సణఁచివేసిరో దీనినిబట్టి గుర్తింపవచ్చును.

''Ooyyalavauda:- In 1847, a disturbance was caused by Narasimha Reddy, pensioned poligar of this place and grandson of Jayaram Reddy, the last powerful Zemindar of Nossam. He unsuccessfully attacked Coilcoontla treasury and sheltered himself in hill forests of Yerramalas and Nullamullays. At Giddalore he gave battle to Lieutenant Watson and killed the Tahsildar of Cumbam. He then escaped into Nullamullays, and was subsequently captured near Perusomala in Coilcoontla talook and hanged. His head was kept hung in the fort on the gibbet till 1877''[15].

నారసింహారెడ్డి శిరస్సును కోటబురుజునకు వ్రేలాడఁ గట్టిన విషయము "దొరవారి నరసింహారెడ్డి! నీ దొరతనము కూలిపోయె రాజా!" అను లఘువీరగాథ (కోలాటపు కోపు)లోఁ గూడఁ దెలుపఁబడినది.

*"కండ్లకూ గంతాలు కట్టీ, నోటినిండా బట్లు పెట్టీ*
*నిలువునా నీ తలా గొట్టీ, కోటబురుజుకు గట్టిరీ"* [16]

26-11-1850లో కడపజిల్లా చిట్టివేలు తాలూకా తవర్జీదారు నంద్యాల వేంకట రామరాజుగారు రెవిన్యూబోర్డు వారికి వ్రాసిన లేఖలో నారసింహారెడ్డి విప్లవము, పరాభవనామ సంవత్సరము క్రీ.శ. 1845లో జరిగినదని కలదు.[17] అనఁగా నారసింహారెడ్డి తిరుగుబాటు క్రీ.శ. 1845, 1846, 1847 మూఁడు సంవత్సరముల లోను జరిగినదని నిశ్చయింపవలసియున్నది. 1845లో నితఁడు ఆంగ్ల ప్రభుత్వము విధించిన అధికమైన భూమిశిస్తునకు వ్యతిరేకముగా రైతులను సమీకరించి, అలజడులు రేపియుండును. ప్రభుత్వము ఈనాములు తొలగించిన 'కట్టుబడు'ల చేత కూడ తిరుగుబాటు చేయించెను. 1846 జూలై 10వ తేదిని కోవెలకుంట్లపై దండెత్తి తహశ్శీలుదారును బందీగా తీసికొనిపోయెను. 1846లో నారసింహారెడ్డి వేలకొలఁది సైన్యములను సమీకరించుకొని రెండు పర్యాయము లాంగ్లేయులతోఁ బోరాడెను. 1846 జూలై 23వ తేదిని 'గిద్దలూరు' దగ్గఱ లెఫ్టినెంట్ వాట్సన్ సైన్యంతోను, మరునాడు (జూలై 24వ తేదిని) 'ముండ్లపాడు' దగ్గఱ కెప్టెన్ నాట్, కెప్టెన్ రసెల్ సైన్యాలతోను ఘోరయుద్ధము చేసి, నల్లమల అరణ్యములలోనికిఁ దప్పించుకొనెను. ఆ సంవత్సరమే (1846) అక్టోబరు 6వ తేదిని 'పేరుసోమల' దగ్గఱనున్న జగన్నాథుని కొండపై జరిగిన యుద్ధములో పట్టుబడెను. కేసు నడచెను. ఉరిశిక్ష విధింపబడెను. 1847 ఫిబ్రవరి 22వ తేది సోమవారము ఉదయము 7 గంటలకు, కోవెలకుంట్లలో జుఱ్ఱేటి యొద్దున రెండువేలమంది ప్రజల సమక్షంలో కలెక్టర్ కాక్రేన్ నారసింహారెడ్డిని ఉరితీయించెను.

నారసింహారెడ్డి నిగూర్చిన చారిత్రక విషయముల నాధారముగాఁ జేసికొని 1925వ సంవత్సరములో శ్రీ కలపటాల జయరామారావుగారు 'రేనాటి వీరుఁడు' అను నవలను రచించి

ప్రకటించిరి. ఇందు సత్యముతోఁ గొంత కల్పనయు జోడింపఁబడి యున్నది.

ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కడ 'ఓబళాచార్యుఁడు' అను నాస్థానకవి యుండెనని తెలియుచున్నది. ఈ యోబళాచార్యునకును, ఆకాలమున కర్నూలు మండలమునఁ బ్రసిద్ధికెక్కిన కృష్టిపాటి వేంకట కవికిని నశ్యము నిమిత్తమై సంభాషణాత్మకముగా జరిగిన రెండు పద్యములను వేటూరి ప్రభాకరశాస్త్రిగారు తమ చాటుపద్య మణిమంజరిలో నిచ్చియున్నారు (చూ. చాటుపద్య మణిమంజరి, రెండవ భాగము, పుటలు 133, 134). అందు వేటూరివారు వేంకటసుబ్బకవినిగూర్చి వ్రాయుచు "ఈయన కర్నూలు మండలవాసి. ఇప్పటికి డెబ్బది యేండ్లకుఁ బూర్వమున్నవాఁడు" అనిరి. దీనినిబట్టి నారసింహారెడ్డి కాలము నూహింపవచ్చును. ఈ చాటుపద్య మణిమంజరి 'దుందుభి జ్యేష్ఠమునఁ' బ్రకటింపఁబడినది. అనఁగా క్రీ.శ. 1922. ముద్రింపఁబడునాఁటికి రెండు మూఁడేండ్ల క్రిందటనే శాస్త్రిగారు ఈ పద్యములను సంపాదించి పరిష్కరించి యుందురు. అనఁగా 1919–1920 ప్రాంతమున నీ మాటలను శాస్త్రిగారు వ్రాసియుందురని తలఁపవచ్చును. అప్పటికి డెబ్బదియేండ్ల పూర్వమనఁగా క్రీ.శ. 1849–1850 ప్రాంతమగుచున్నది. ఇది వేంకట సుబ్బకవి కాలము. ఇదియే నారసింహారెడ్డి యాస్థాన కవియగు నోబళాచార్యుని కాలము కూడ. ఆస్థానకవి 1850 ప్రాంతమువాఁడు కాఁగా, తత్పోషకుఁడు 1847 ప్రాంతమున నుండుటలో విప్రతిపత్తిలేదు. తూమాటి దొణప్పగారు తాము సేకరించిన కోలాటపు పాటకు వ్రాసిన లఘువివరణములో నారసింహారెడ్డి సంఘటన క్రీ.శ.1800–1825 నాటిదని తెల్పిరి. ఇది ప్రామాదికము. ఈ నారసింహారెడ్డి విప్లవము క్రీ.శ. 1845–47 మధ్యకాలమున జరిగినది. నాఁటి ఆంగ్లపాలకులే దీనిని గ్రంథస్థము చేసియున్నారు.

ఈ నారసింహారెడ్డిపైఁ బ్రజలలో రెండు వీరగాథానికలును, ఒక వీరగాథయు వ్యాప్తియందున్నవి. "దొరవారి నరసింహారెడ్డి నీ దొరతనము కూలిపోయె రాజా..." అను కోలాటపుపాటను శ్రీ తూమాటి దొణప్పగారు అనంతపుర మండలమున సంపాదించిరి (చూ. త్రివేణి, పుట 270–271). "వాహువా, నరసింహారెడ్డి, నీ పేరంటే రాజా నరసింహారెడ్డి..." అను పిచ్చుకుంట్లపాటను నేను కర్నూలు మండలమున సేకరించితిని. ఈ రెండును లఘువీరగాథలు. ఇవి కాక, బొబ్బిలిపాట వరుసలోనున్న పెద్ద వీరగాథయు నొకటి కలదు. దీనిని నేను కడప మండలమున నొక జంగమునుండి సేకరించితి.[18] ఈ వీరగాథలోఁ బైన దెల్పిన చారిత్రక నామములు లేకున్నను, కథయంతయును నొకటి రెండు స్వల్ప భేదములతో నట్లే యున్నది. దీని ప్రారంభమిట్లున్నది–

*"రామరామ రఘురామ రామయా రామయ రఘురామా*
*రెడ్డి కాదు బంగారపు కడ్డీ నారసింహారెడ్డీ*
*పుట్టిందీ మా గుళ్లదుర్తిలో నారసింహారెడ్డీ*
*వచ్చింది ఆ రూపన గుడికీ నారసింహారెడ్డీ*
*నరిసీరెడ్డీ యింటికి నేడు దత్తుకొచ్చినాడూ"*

నారసింహారెడ్డి రూపనగుడి గ్రామములోనే యుండి, ఉయ్యాలవాడకుఁ బోయి వచ్చుచుండెననియు, నుయ్యాలవాడ గ్రామకక్షలలో నొక హత్య జరిగినప్పు డచ్చట తహశ్శీల్దారుకును నారసింహారెడ్డికిని వాగ్వాదము జరిగెననియు, నుయ్యాలవాడ గ్రామములోనే తహశ్శీల్దార్ రెడ్డి నవమానించెననియు నిందుఁ జెప్పఁబడినది. నారసింహారెడ్డి తవర్జీ కొఱకుఁ దన సేవకుని కోవెలకుంట్లకుఁ బంపిన విషయము ఈ కథలో లేదు.

నారసింహారెడ్డి కోవెలకుంట్లపై దండెత్తినప్పుడు తహశ్శీల్దారును చంపలేదు. ధనాగారమును గాపాడుచున్న 'వారసింగు'ను మాత్రమే చంపినాడు. తాలూకా కచేరిని ధ్వంసము చేసినాఁడు. ఈ విధ్వంసములో ఒక దఫేదారును, అయిదుగురు పోలీసు బంట్రోతులను చంపివేసినారు. అనేకులు గాయపడినారు. ఇది చారిత్రక సత్యము. కాని ఈ వీరగాథలో నారసింహారెడ్డి కోవెలకుంట్ల నంతటిని గొల్లకొట్టినట్లు చెప్పఁబడినది. 'హుసేన్' అను పఠాను వీరునితోఁ గూడ నారసింహారెడ్డి యుద్ధము చేసినట్లు వర్ణింపఁబడినది. తహశ్శీల్దారుని పేరు వీరగాథలో 'జిలేదారుఁడు' అని యున్నది. 'జిల్లా అధికారి' యని దీని కర్థము కాఁబోలు. తహశ్శీల్దారు శిరస్సును, బొందిలవాఁడైన వారసింగు శిరస్సును నఱికి, రెండు శిరస్సులను నయనాలప్పకొండలో దాచెనని జనశ్రుతి. నేను సేకరించిన పిచ్చుకుంట్ల పాటతోఁ గూడ నీ విషయమున్నది. కాని వీరగాథలో నీ వృత్తాంతము లేదు. తాసిల్దారును జంపినట్లు మాత్రమే కలదు. శిరస్సు దాచినట్లు లేదు.

గిద్దలూరు దగ్గఱ లెఫ్టినెంట్ వాట్సన్‌తో నారసింహారెడ్డి యుద్ధము చేసెను. కాని వీరగాథలో నా యుద్ధము జగన్నాథము కొండ దగ్గఱ జరిగినట్లు వర్ణింపఁబడినది. (కోవెలకుంట్లనుండి బనగానపల్లె పోవు మార్గములో జగన్నాథపురముకొండ కలదు). ఈ జాతిసైన్యము బళ్లారినుండి వచ్చినదని గాథాకారుఁడు పాడుచున్నాఁడు. ఈ జగన్నాథపురముకొండ దిగువన 'గొల్లవిండ్లపల్లె' అను గ్రామమున్నదనియు, నాగ్రామములో 'జానకమ్మ' యను పెడకంటి కాపువనిత కలదనియు, నీమెకును నారసింహారెడ్డికిని సంబంధమున్నదనియు, నాంగ్లేయు లీమెకు లంచమిచ్చి నారసింహారెడ్డిని బట్టిరనియు వీరగాథలోఁ గలదు. కాని నారసింహారెడ్డి దగ్గఱ నొక వంటమనిషి యుండెడిదనియు, నామె మూలకముగనే ఆంగ్లేయు లాతనిని బట్టిరనియు జనశ్రుతి. ఆ వంటమనిషి పేరు తెలియదు. 'జానకమ్మ' యను నామమును గాథాకారుఁడు కల్పించి నాఁడని నాయనుమానము.

నారసింహారెడ్డిది బోయసైన్యము. దీనిని సుంకేశల, ముక్కమళ్ల, ముదిగోడు, కానాల, సంజామల, కొండకరటాల– అను

గ్రామములనుండి సమకూర్చినాఁడఁట. కఱవు కాటకములు వచ్చినప్పుడు నారసింహారెడ్డి ఈ బోయలను మిక్కిలి యాదరించెడి వాఁడఁట. ఆ కృతజ్ఞతచే వారందఱును రెడ్డి పిలిచిన వెంటనే ఆయుధ పాణులై ఆనందముతో వచ్చిరి.

*"కరువు వచ్చినా కాలమొచ్చినా ఆదరించె రెడ్డీ*
*అట్టి వక్క మన రెడ్డి మాటలూ చిన్న చెయ్యరాదు*
*నాలుగు గ్రామాలమందిగా తాము లేచినారు*
*మూఁడు నూర్లకూ ముకుంద బల్లెం మురవక లేచినది*
*ఆరు నూర్లకూ అలుగు ఈటెలే అదలక లేచినవీ"*

ఈ బోయసైన్యమునకు 'ఎల్లాపుల రాణువ' అని పేరు. ఈ సైన్యమును వెంటఁబెట్టుకొని నారసింహారెడ్డి కోవెలకుంట్లపైకి దండెత్తగాఁ బ్రజలు హడలెత్తిపోయిరి. ఇతఁడు కోవెలకుంట్లను కొల్లగొట్టుట, అక్కడ నాంగ్ల ప్రభుత్వము వారితో నితఁడు కావించిన యుద్ధము వీరరసస్ఫూర్తితో వర్ణింపఁబడినది:-

*"అడిగోవచ్చే ఇడిగోవచ్చే నారసింహారెడ్డీ*
*పళపళ పళపళ కేకలేసెరా నారసింహారెడ్డీ*
*చంద్రాయుధమూ చేతబట్టెనే నారసింహారెడ్డీ*
*కోబలీ రణబలీ యన్నదే నారసింహారెడ్డీ*
*ఆవుల మందలొ పులీ దుమికినా చందము దుమికినదూ*
*రెడ్డి యెక్కినా గుఱ్ఱము లమిడీ ఏ విధమొచ్చినదీ?*
*కుప్పిటి గంతుల మీద వచ్చెరా బారాహజ్జారీ*
*వచ్చిన వక్కా సైన్యము అంతా ముందుకు దుమికినది*
*వంచినట్టి బల్లెముల పైనను వాలలాడుతారు*
*సానజేసినా కత్తులమిందా సవకళించినారు*
*అరవైవొక్కా తుపాకులండీ ఫెళఫెళ వాగినవి*
*విరగ నరుకుతా పోతాడయ్యా నారసింహారెడ్డి*
*తాటి పుచ్చులా చందము నేడు తలలే పోతావి...*
*ఆలగోడురా బాలగోడురా కొయిల్‌కుంట్లలోన*
*ఎక్కడ చూచిన పీనుగుపెంటలు కోయిల్‌కుంట్లలోన"*

కోవెలకుంట్ల నీ విధముగాఁ గొల్లగొట్టుచుండఁగా 'హుసేన్' అను పఠానువీరుఁడు రెడ్డి నెదిరించెను. (లఘు వీరగాథలో 'వారసింగు' అను బొందిలివాడు నారసింహారెడ్డి నెదిరించినట్లున్నది.) మొదట హుసేన్ వ్రేటు నడపినాఁడు.[19] నారసింహారెడ్డి తన శరీరమంతయు డాలుచాటున పెట్టి, యా వ్రేటునుండి తప్పించుకొనెను. తరువాతఁ దన వ్రేటు నడపుచు:-

*"పటపట పటపట కొరికెరా నారసింహారెడ్డీ*
*తెల్లని కళ్లకు రకతము దింపెను నారసింహారెడ్డీ*
*కుడీ లొడ్డూ తాను గొట్టెరా నారసింహారెడ్డీ*
*మొలక మీసము గోటదిద్దెరా నారసింహారెడ్డీ"*

ఇట్లు నారసింహారెడ్డి విజృంభించి, చేతి చంద్రాయుధమును గిరగిర త్రిప్పి, శక్తికొలఁదిని గొట్టఁగా, హుసేన్ శిరస్సు పుట్టచెండువలె నెగిరి పడినదఁట! తరువాత నారసింహారెడ్డి జిలేదారుని (తాసిల్దార్) కడకుఁబోయి, "అప్పుడన్నమాట లిప్పుడు పలుకుము" అని బెదరించి, యాతనిపై నెట్లు పగదీర్చుకొనెనో చూడుఁడు:-

*"పళపళ పళపళ కేకలేసెనే నారసింహారెడ్డీ*
*రాజారావూ రాజబహద్దరు నారసింహారెడ్డీ*
*కోయిలకుంట్లా జిలేదారునీ రెట్టబట్టినాడు*
*కుర్చీమిందా జిలేదారునీ రెట్టబట్టి యిగ్గె*
*జిలేదారునీ టోపీ గట్టిగ మూడు దొర్లు దొర్లె*
*టవును బయటికీ ఎత్తి కొట్టెరా నారసింహారెడ్డీ*
*నక్కనోటి జమదండము బాకూ పైకి ఎత్తినాడు*
*పద్రు పద్రునా బొజ్జను కోసి పగల జీల్చినాడు*
*సన్నపేగును జంజమేసెరా నారసింహారెడ్డి*
*వాని రకతమూ సుక్కబొట్టుగా తాను బెట్టినాడు*
*పళపళ పళపళ కేకలేసిరీ ఎల్లాపుల రాణ్వా"*

కడపలోని పోలీసువారికి నారసింహారెడ్డిని పట్టుకొనుటకు సాధ్యము గాక, బళ్లారినుండి జాతిసైన్యమును దెచ్చిరఁట, ఆ జాతి సైన్యము వచ్చి జగన్నాథుని కొండదగ్గఱ డేరాల నెత్తిరి.

*"ఎండలాకు బల్ ఎత్తిరి దేవా ఎండిపట్టు డేరా*
*కార్యానికి ఎత్తిరి దేవా కాయిపట్టు డేరా*
*పొద్దు పొడుపులకు ఎత్తిరి దేవా పొగడపట్టు డేరా"*

ఈ జాతిసైన్యమునకును నారసింహారెడ్డి బోయసైన్యమునకును గొప్ప యుద్ధము జరిగినది. నారసింహారెడ్డి బోయసైన్యము యొక్క యుత్సాహమును గాథాకారుఁ డత్యద్భుతముగా వర్ణించినాడు-

*"ఈటెలు వేసీ ఈటెలమ్మటే పరవడి గొట్టేది*
*బాకులు వేసీ బాకులమ్మటే అంతర్లు గొట్టేది*
*రెడ్డి సుట్టునా వాళ్లు గనుకనూ గోల్ తిరుగుతారు"*

నారసింహారెడ్డి తన దివ్యాశ్వము నెక్కి యుద్ధసన్నద్ధుఁడు కాఁగా, నా యశ్వపదఘట్టమున-

*"కాలిదుమ్ము కైలాస మేగెరా గుఱ్ఱము ఘాతాకు*
*చారెడేసి యా పలుగు రాళ్లురా పిండి పిండి యగును"*

ఏలబోయి ఈ ప్రపంచమును దిరిగి యేలబోమనియు, 'పుట్టబోయి మన తల్లి కడుపున మళ్లీ పుట్టబోమనియు పాళెగాండ్రు తెంపుజేసికొని యుద్ధమునకేఁగిరి. ఈ యుద్ధములో గాథాకారుఁడు ఆంగ్లేయ సైన్యమును, మహమ్మదీయ సైన్యమును వర్ణించినట్లుగా వర్ణించినాఁడు. దీనికొక ముఖ్యకారణమున్నది. మన ప్రాచీన వీరగాథలలో తురుష్కసైన్య వర్ణనమున్నది కాని, ఆంగ్లసైన్య వర్ణన

మెచ్చుటను లేదు. హిందీ, ఉర్దూ పదములు దొరలినట్లుగా గాథాకారున కాంగ్లపదములు రావు. అందుచే విదేశీయుల భాషను సూచించుటకు, వారేజాతివారైనను మహమ్మదీయులుగ వర్ణించుటయే పరిపాటియైనది. జాతివారు తమ భాషలో నఱచుచుండఁగా, వారిని నారసింహారెడ్డి సైన్యము విఱుగఁబొడిచినది. నాకుఁ గథను పాడి వినిపించిన గాథాకారుఁడు తనకు బాగుగా వచ్చిన దేశింగురాజు కథవంటి ప్రసిద్ధకథలలో వచ్చు తురకసైనికుల యుద్ధవర్ణనలనుండి కొన్ని మాటలను గ్రహించి, జాతివారితో నారసింహారెడ్డి చేసిన యుద్ధమును వర్ణించినాఁడు:-

*"మారో మారో మారో అంటరు జాతులవారి బలము*
*మారో అన్నా మాదరు చేదా ఈటె చూడు లఖ్డీ*
*పకడో పకడో పకడో అంటరు జాతులవారి బలము*
*పకడో అన్నా ధకిడీ కొడకా బాకు చూడు లఖ్డీ*
*గోవిందా నారాయణంటనూ విరగ నరుకుతారు*
*అరెరెరె రెరెరే.....*
*పొదుస్త వుంటే పడుతున్నావీ పొట్టపేగులండి*
*నరుకుత వుంటే పడుతున్నావీ నల్లగుండులోయి*
*చీరుత వుంటే పడుతున్నావీ చిన్న పేగులోయి*
*వాళ్లు త్రాగినా కల్లూ సారయి వరదలు పోతాది*
*వాళ్లు తిన్నా పప్పు కూడురా కుప్పలు తెప్పలురా*
*ఒకణ్ణి మీదా ఒకణ్ణి వేసి ఈటెల గ్రుద్దేది*
*అట్లగాను రణవిరుద్ధం చేసి నారసింహరెడ్డీ*
*కొట్టి కొట్టి మా కొల్లలాడెరా నారసింహరెడ్డీ".*

నారసింహారెడ్డిధాకు ఆఁగలేక, జాతివారి సైన్యము పలాయన మంత్రము పఠించినది. వారు పాఱిపోవునప్పుడు హాస్యరసము చక్కగఁ బోషింపఁబడినది. తొందరలో టోపీలు, కత్తులు పోఁగొట్టుకొని, గుఱ్ఱములు చనిపోఁగా దేరాలనెక్కి, అవియే గుఱ్ఱములని భ్రమించి 'రైటో రైటో' అని తోలసాగిరఁట; మఱికొందఱు గుఱ్ఱముల మూతికి నుండెడు లగామును దోకకుఁగట్టి, తోకకు నుండెడి దానిని మూతికిఁ గట్టి, గుఱ్ఱములు కట్టఁబడిన గూటముల నైనను నూడఁబెఱుకక పరుగులు పెట్టుచుండిరఁట. ఆ గూటములు గుఱ్ఱముల కాళ్ల కద్దుపడి, వెనుకవాటున లేచివచ్చి, టోపీలులేని వారి తలలకుఁ గొట్టుకొను చుండెనఁట!

వీరగాథలలోఁ దఱచుగా వచ్చెడి సాధారణ ప్రయోగములు లేక వారానువర్తనములు (commonplaces), యుద్ధనినాదములు, తీవ్రసంకల్పములు మున్నగునవి ఈ కథలో మెండుగా నున్నవి. నారసింహారెడ్డినిగూర్చి చెప్పునపుడు ఈ క్రింది వాక్యములు తఱచుగాఁ బ్రయోగింపఁబడుచుండును:-

*"అదిగోవచ్చే ఇదిగోవచ్చె నారసింహరెడ్డి*
*రాజారావు రాజబహద్దరు నారసింహరెడ్డి*
*రెడ్డికాదు బంగారపు కడ్డీ నారసింహరెడ్డీ*
*ములుకోలకట్టె చేతులో ఉంటే మున్నూటికి మొనగాడు"*

బొబ్బిలియుద్ధములోఁ దఱచుగా వచ్చు "రామ రామ రా మనంతకాలము రాజ్యము యేలేరా? యుగములు జగములు గలంతకాలము భూములు యేలేరా?" అను దానిని బోలిన యుద్ధ నినాదము (was cry) నారసింహారెడ్డికథలోఁగూడ వచ్చును. యుద్ధమున కుఱుకునప్పుడు నారసింహారెడ్డి సైన్య మిట్లందురు-

*"ఈ ప్రొద్దు విదియ రేపు తదియ నరుని ప్రాణమోయి*
*నీటి మీదను బుగ్గ తోటిదీ నరశరీరంబు*
*ఏలబోయి ఈ ప్రాపంచములో మరల ఏలబోము*
*పుట్టబోయి మనతల్లి కడుపునా మళ్లీ పుట్టేమా?"*

ఈ కృతనిశ్చయముతోనే, తెంపరితనముతోనే నారసింహా రెడ్డియు నతని బోయసైన్యమును ఆంగ్లసేనావాహినిని ఢీకొనిరి.

నారసింహారెడ్డి పరాక్రమముపైనను, బలముపైనను ఎన్నియో జనశ్రుతులున్నవి. అవి యన్నియును వీరగాథలోని కెక్కలేదు. రేనాటి వీరుఁడు నవలలోఁ గూడ నివిలేవు. అట్టి కథలను గొన్ని నేను సేకరించితిని. నారసింహారెడ్డి తాను చేసిన కోవెలకుంట్ల హత్యలను ఔకురాజులపైఁ బెట్టెను. దీనినిబట్టి నారసింహారెడ్డికిని ఔకు రాజులకును శత్రుత్వమున్నదని తెలియుచున్నది. కాని ఈ శత్రుత్వ కారణము 'రేనాటి వీరుఁడు' నవలలోఁ దెలుపఁబడలేదు. నారసింహా రెడ్డికిని ఔకురాజులకును విరోధమేర్పడుటకుఁ గల కారణములను దెల్పు కథ యొకటి నేను సంపాదించితిని. ఇది గ్రామవృద్ధులు చెప్పు వచనకథ. దీనికి 'సీతఁడు కథ' యని పేరు. నారసింహారెడ్డి దగ్గఱ యుద్ధమునకుఁ బూర్వము 'సీతఁడు- కలికి నారిగాఁడు' అను నిరువురు నమ్మినబంట్లు కలరు. (యుద్ధకాలమున 'గోసాయి వెంకన్న, ఒడ్డె ఓబన్న' అనువారు నమ్మిన బంట్లు. నాకు లభించిన లఘువీర గాథలో వీరి ప్రసక్తి యున్నది.) వీరిలో 'సీతఁడు' మహావీరుఁడు. నారసింహారెడ్డికి నుద్దియగువాఁడు. ఈ సీతఁడు ఉయ్యాలవాడలో నుండెడివాఁడు. కలికి నారిగాడు హనుమద్గుండములో నుండెడి వాఁడు. నారసింహారెడ్డి యెచటికిఁ బోయినను సీతఁడాతని ప్రక్కనే యుండువాఁడు. ఔకురాజులు ప్రతిసంవత్సరము వేసవికాలమున నొక గొప్పవిందు చేసెడివారు. వేసవిలో నౌకుచెఱువులో నీరు తగ్గిపోవును గావున నందలి చేపలను బట్టి, సాటి జమీందారులకు విందు చేసెడివారు. ఆ విందునకుఁ బ్రతిసంవత్సరము నారసింహారెడ్డినిగూడ నాహ్వానించెడివారు. ఒకసారి రెడ్డి యా విందునకుఁ బోవుచు సీతనిగూడ ప్రయాణము కమ్మనెను. సీతఁడు వీరవేషమును ధరించి, బల్లెము చేతఁబట్టి రెడ్డి ననుసరించెను. నారసింహారెడ్డి గుఱ్ఱముపై దౌడు తీయుచుండఁగా, సీతఁడాతని ప్రక్కనే

కాలిపరుగు పెట్టుచు గుఱ్ఱముకన్న పదిబారలు ముందుగనే యుండెనఁట! ఔకుపట్టణము సమీపించుచుండెను. వీరవేషమును ధరించిన సీతఁడు నడుముదట్టిని నేలకు జీరాడునట్లుగాఁ గట్టుకొనినాఁడు. రాజులు మాత్రమే అట్లు కట్టుకొనవలెను. తక్కినవారు అట్లు కట్టుకొనినచో తమ్మవమానము చేసినట్లును, ద్వంద్వయుద్ధమున కాహ్వానించినట్లును రాజులు భావింతురు. అది ఆనాఁటి వీరాచారము. సీతని వేషమును గమనించిన నారసింహారెడ్డి, ఔకురాజులతో వృథాకలహము వచ్చునని యోచించి "ఒరే! సీతా! నీ నడుము దట్టిని కొంచె మెగఁగట్టుము" అనెను. ఆ మాటలు విని సీతఁడుగ్రుఁడై "దొరా! నీవు దొరవు కావు!" అని యధిక్షేపించెను. నారసింహారెడ్డి వాని పౌరుషమునకు మెచ్చుకోలుగా నొక్క చిఱునవ్వు నవ్వెను. సీతఁడు నడుముదట్టి జీరాడుచుండగా ఔకుపట్టణమును బ్రవేశించెను. విందులో నౌకురాజులు సీతని నడుముదట్టిని జూచి కోపించిరి. నారసింహారెడ్డికి ఫిర్యాదు చేసిరి. నారసింహారెడ్డి సీతని వారింపఁ జూచెను. కాని యా వీరుఁడు వినలేదు. ఆ విందులోఁ బాల్గొనిన యెవరితోనైనను సరియే తా నొంటిపోరునకు సిద్ధముగా నున్నానని సీతఁడు దండోరా వేయించెను. వాని శౌర్యము నెఱిగిన వారగుటచే నౌకురాజులు కాని, బనగానపల్లె నవాబులు కాని మాఱు మాటలాడలేదు. అప్పుడు సీతఁడు హేళనగా "ఈ యౌకు దాసరులు, పల్లె ఫకీర్లు నాతో నొంటిపోరునకు రాఁగలవారా?" అనెనఁట. వారికది మఱింత క్రోధకారణమయ్యెను. తరువాతఁ గొన్ని దినములకు ఔకురాజులు హనుమద్గుండము గ్రామపు పొలిమేర ఱాతిని దిరిగివచ్చెద మనియుఁ, జేతనైనచో దమ్మెదుర్కొనవచ్చు ననియు, కలికి నారిగానికిఁ గబురుపెట్టిరి. అతఁడు భయపడి, వెంటనే ఉయ్యాలవాడకుఁ బరుగెత్తికొనివచ్చి, సీతని కీ విషయమును దెలియఁ జెప్పెను. సీతని కెక్కడలేని యుత్సాహమును వచ్చెను. నౌకురాజులతోఁ బోరాటమతనికి సంబరముగా నుండెను. నారసింహారెడ్డికిఁ జెప్పినచోఁ బోనీయడని, సీతఁడు రహస్యముగాఁ దన బల్లెముఁ దీసికొని, కోటబయటకు వచ్చి, యుద్ధార్థియై పోవుచున్నాడు కావున, చేతనున్న సురఁటిని గంటను కోటలోనికి విసరివైచి, నారిగానితోఁ గలసి హనుమద్గుండమునకుఁ బోవుచుండెను. కలికి నారిగాఁడు వివాహితుడు. సీతఁడు బ్రహ్మచారి. భార్యాపుత్రులను దలఁచుకొనుచు కలికి నారిగాఁడు కొంచెము వెనుకడుగు వేయుచుండెను. సీతఁడది గ్రహించి, తానొక్కఁడే ఔకురాజుల నెదిరింతునని చెప్పి, కలికి నారిగాని నింటికిఁ బొమ్మనెను. పొలిమేరఱాతిదగ్గఱ గుఱ్ఱములపై నున్న పంద్రెండుగురు ఔకువీరులను సీతఁడొక్కడే తన బల్లెముతోఁ గ్రుమ్మి గాయపఱచెను. సీతఁని శౌర్యమునకు ఔకురాజులు భయపడిరి. అతనిని జంపనిచో నెప్పటికైనను బ్రమాదమని గ్రహించి, అందఱు నొక్కుమ్మడిగా సీతనిపైఁబడిరి. పద్మవ్యూహమున నభిమన్యుని జంపినట్లుగా నధర్మయుద్ధమున సీతని బరిమార్చిరి. ఔకురాజులు సీతని శవమును ఉయ్యాలవాడకుఁ బంపిరి. ఇది నారిసింహారెడ్డికిఁ గోపకారణమయ్యెను. నాఁటితో ఔకురాజులతో నతనికిఁ గల స్నేహము భగ్నమయ్యెను. ఉయ్యాలవాడ గ్రామమునకుఁ దూర్పుదిశలో నేఁటికిని సీతని గోరీ యున్నది.[20]

నారసింహారెడ్డి మహాబలవంతుఁ డనియు, నతఁడు చెట్టు క్రిందఁ బండుకొని, నోటిలో గువ్వరాళ్లు పోసికొని, 'ఉఫ్' అని పైకి నూదినచోఁ జెట్టుపైనున్న పక్షులు చచ్చి క్రిందపడెడివనియు రేనాటి జనపదములలోఁ జెప్పుకొందురు. రూపనగుడిలో నితఁడు కట్టిన కోట శిథిలములను 'నారసింహారెడ్డి గోడలు' అని నేఁటికిని వ్యవహరించుచున్నారు. ఇతఁడు గొప్ప శక్త్యారాధకుడనియుఁ దెలియుచున్నది. ఇతని కోట శిథిలములలో దుర్గగుడి యున్నది. జగన్నాథుని కొండమీఁద ఆదిశక్తి దేవాలయమున్నదనియు, నామె తోడ్పాటుతో నారసింహారెడ్డి అయిదువందల శత్రుసైనికులను నఱికినాఁడనియు నాకు లభించిన వీరగాథానికలో నున్నది.

నారసింహారెడ్డి కేవలము యుద్ధవీరుఁడే కాదు, గొప్ప సాహిత్యపోషకుఁడు కూడ. ఈతని కడ 'ఓబళాచార్యులు' అను నాస్థానకవి యుండెడివాడు. ఇతఁడు రచించిన కావ్యము లేవియు నేఁడు తెలియరాకున్నను, ఒక పద్యము మాత్రము వేటూరి ప్రభాకరశాస్త్రిగారి చాటుపద్య మణిమంజరిలోఁ గానవచ్చుచున్నది. ఇతనికిని కృష్ణిపాటి వేంకట సుబ్బకవిని నశ్యమునుగూర్చి జరిగిన సంభాషణ రూపమున నీ పద్యమున్నది. మొదట కృష్ణిపాటి వేంకటసుబ్బకవి ఓబళాచార్యునితో నిట్లనెను:–

*"నశ్యము లేదుగా పవననందన దివ్య కటాక్ష వీక్షణా*
*వశ్య వరప్రభావ విభవానుభవాద్భుత భూమిభృద్ధనుః*
*కైశ్య ఘుమం ఘుమం ఘుమిత గాంగ ఝరీ విలుఠ త్తరంగ సా*
*దృశ్య కవిత్వ తత్త్వ ముఖరీకృత వేంకట సుబ్బసూరికిన్"*

దీనికి సమాధానముగా నారసింహారెడ్డి ఆస్థానకవియగు నోబళాచార్యుం డిట్లనెను:–

*"కోకో! నశ్యమవశ్య మీశ్వర జటాకోటీరటద్వ్యోధునీ*
*ప్రాకాశ్యోర్మి సకాశ పేశల సుశబ్ద ప్రక్రియోపక్రమా*
*నేక గ్రంథ నిబంధ నార్జిత సమున్నిద్ర ప్రతాప ప్రథా*
*స్తోక శ్రీకర కృష్ణిపాటి కులసింధు స్వచ్ఛ చంద్రోదయా!"*

ఈ పద్యమునుబట్టి ఓబళాచార్యుఁడు గొప్ప వ్యుత్పత్తిగల ప్రౌఢకవియని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. ఈతఁడు నారసింహారెడ్డి జీవితముపై కావ్యము నల్లియుండినచో దిట్టకవి నారాయణ కవి రంగరాయచరిత్రమువలె భాసిల్లియుండెడిది! అతఁడు కావ్యమును వ్రాయలేదో, లేక వ్రాసియున్నను అది కాలగర్భమునఁ గలసి పోయినదో నిశ్చయముగాఁ జెప్పలేము.

## 1.2. అస్పష్ట చారిత్రకములు

కథలోని వ్యక్తులు సంఘటనలు చారిత్రకమువలె నున్నను, చరిత్రకందని వీరగాథలు అస్పష్ట చారిత్రకములను వర్గము క్రిందికి వచ్చును. బాలనాగమ్మ కథ, బంగారు తిమ్మరాజు కథ, ఆరె మరాఠీల కథ, బల్మూరి కొండల్రాయుని కథ, కుంటి మల్లారెడ్డి కథ, వేమన కథ మున్నగునవి ఈ వర్గమునకుఁ జెందును.

### 1.2.1. బాలనాగమ్మ కథ:–

భారతదేశమున రామాయణమునకు ఎంత వ్యాప్తియున్నదో, తెలుఁగు దేశమున బాలనాగమ్మకథకు అంతవ్యాప్తి యున్నది. సీతవంటి బాలనాగమ్మ, రావణునివంటి మాయల ఫకీరు తెలుఁగు వారికిఁ జిరపరిచితులు. ఇది అద్భుతరస ప్రధానముగా సాఁగిన వీరగాథ. చారిత్రికేతివృత్తములోనే కొన్ని అభూత కల్పనలు ప్రవేశించినట్లున్నది. ఈ కథలో వచ్చు పానుగల్లు, గండికోట, నాగళ్లపూడిగట్టు– మున్నగునవి చారిత్రక ప్రదేశములని విమర్శకులు తలఁచుచున్నారు. క్రీ.శ. 1542–43లో తిరుమలరాయలకును పెమ్మసాని తిమ్మానాయనికిని జరిగిన గండికోటయుద్ధమే బాలనాగమ్మ కథలోఁ బేర్కొనఁబడినదనియు, క్రీ.శ. 1528లో శ్రీకృష్ణదేవరాయలు త్రవ్వించిన నాగలాపురి చెఱువే 'నాగళ్లపూడిగట్టు'గాఁ బేర్కొనఁ బడినదనియు శ్రీ హరి ఆదిశేషువుగారు తలఁచుచున్నారు. కాని యీ కథలో శైవమత ప్రసక్తి యెక్కువగ నుండుటచే నిది కాకతీయుల కాలమునాఁటిదనియు, తెలంగాణమునకు సంబంధించినదనియు డా॥ బి.రామరాజుగారి యభిప్రాయము. పానుగల్లు మహబూబునగరు జిల్లాలో నొకటి, నల్లగొండ జిల్లాలో వేఱొకటి కలవు. అట్లే గండికోట వరంగల్లు జిల్లాలో నొకటి, కడపజిల్లాలో వేఱొకటి కలవు. కాఁబట్టి ఈ కథ రాయలసీమకు సంబంధించినదో లేక తెలంగాణమునకు సంబంధించినదో నిశ్చయముగాఁ జెప్పలేము. బాలనాగమ్మకథలోని స్మృతులు చారిత్రక వీథులలో దూరదూరముల నస్పష్ట ధ్వనులతో వినవచ్చుచున్నవని ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు అభిప్రాయ పడిరి. మొత్తము మీఁద నిది దక్షిణభారతమునఁ దురకలు పాదుకొన్న తరువాత జరిగిన కథ కావచ్చును. ఇది శ్రీకృష్ణదేవరాయల కాలము నాఁటిదనుటకన్న కాకతీయుల కాలమునాఁటిదనుట సమంజసముగాఁ దోఁచుచున్నది. కాకతీయుల తరువాత తెలుఁగునాటి నేలిన ఒడ్డెరాజులతో మంత్రతంత్రములతోఁ గూడిన వారి కథల ప్రభావము మన కథలపై వచ్చెనని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారి యభిప్రాయము.

బాలనాగమ్మకథలో రెండు ప్రధానభాగము లున్నవి. పూర్వ భాగమును 'భూలక్ష్మీదేవి కథ' యనియు, నుత్తర భాగమును 'బాలనాగమ్మ కథ' యనియుఁ బిలుతురు. 20వ శతాబ్ది ప్రారంభమున నీ రెండు విభాగములును వేర్వేరుగా ముద్రింపఁ బడుచుండెడివి. 1902లోఁ బ్రకటింపబడిన 'శ్రీలక్ష్మీదేవమ్మ కథ' (భూలక్ష్మీదేవి కథ)లో నిడిగంటి వీరయ్య, కదూరి చెంగల్వరాజు అను నిరువురు కవులు దానిని రచించినట్లుగా నున్నది. ఇది యెంతవఱకు సత్యమో తెలియదు. ఈ యిరువురిలో నొకఁడైన కదూరి చెంగల్వరాజే దీనికిఁ బ్రకాశకుఁడు కూడ. 1908లో 'శ్రీలక్ష్మీదేవమ్మ కథ' యను పేరుతో భూలక్ష్మీదేవి కథయు, 'బాలనాగమ్మ కథ' పేరుతో ద్వితీయ భాగమును కె. కనకరాయ ముదలియారు (మద్రాసు) ప్రచురించెను. భూలక్ష్మీదేవి సంతానమునకై పడినపాట్లు, ఏడుగురు బాలికలను గని యామె నాగేంద్రున కాహారమగుట, నవాభోజరాజు ద్వితీయ వివాహము, సవతితల్లి యా బాలికలను గష్టపెట్టుట, భార్యమాటలు విని రాజు తన బిడ్డల నరణ్యములో వదలివచ్చుట, వారు పానుగల్లు పురము చేరి వివాహితులై సుఖముగా నుండుట, వారి భర్తలు గండికోట యుద్ధమునకుఁ దరలిపోవుట– ఇది పూర్వభాగమగు శ్రీలక్ష్మీదేవమ్మ కథ. ఉత్తరభాగమగు బాలనాగమ్మ కథలో బాలవర్ధిరాజు జననము, మాయల ఫకీరు మోసములు, బాలనాగమ్మ చెఱఁబోవుట, బాలవర్ధిరాజు పెద్దవాడై తల్లిచెఱను విడిపింపఁబోవుట, యాతని యద్భుత కృత్యములు వర్ణింపఁబడినవి. బాలనాగమ్మ కథ అద్భుతరస ప్రధానముగా సాఁగినదనుట కీ క్రింది యుదాహరణములను గమనింపవచ్చును. బాలనగామ్మ భర్త కార్యవర్ధిరాజు సోదరులను సైన్యమును వెంటఁబెట్టుకొని మాయల ఫకీరుపై దండెత్తెను:–

***"కత్తులు తీసుక నరుకసాగిరి– మూరెడు మూరెడు కండలూడె నేమి***
***నాలుగు గడియలు కొట్టిరి వాని–తూరుపు దండ్లో తలగొట్టినారు***
***పడమటి దండ్లో పుట్టెను ఫకీరూ–అక్కడ వానిని తలకోసినారూ***
***దక్షిణపు దండ్లో పుట్టెను ఫకీరూ–అక్కడ వానిని తలదీసినారూ***
***ఉత్తరపు దండ్లో పుట్టెను ఫకీరూ–అక్కడ వానిని తలగొట్టినారూ***
***కాల్చి వానినీ భస్మము చేసిరీ–బూడిదంత జలమున గలిపిరి***
***జలమునందు పుట్టెను ఫకీరు"***

ఈ మాయల ఫకీరు వర్ధిరాజుల సైన్యముపై మంత్ర విభూతి చల్లినంతనే:–

***"యేనుగులన్నీ నల్లరాళ్లయ్యె–రాజులంతా చాపబండలైరి***
***వొంటెలన్నీ ఎఱ్ఱబండలాయె–ఫిరంగులన్నీ నీటికుండలాయె***
***పన్నెండువేల బలముల ఫకీరూ–రాళ్ళగుట్టలూ చేసె నమ్మలారా!"***

ఇది తందాన వరుసలో నున్న కథ. పాదమునకు 8+9= 17 మాత్రలుగా సాఁగిన రచన. ఈ కథకు గుజిలీ ప్రతు లనేకములు లభించుచున్నవి. మదరాసు ప్రా.లి.పు.భా.లో దీనికి రెండు వ్రాఁత ప్రతులున్నవి (డి.నెం. 2547, 2548).

### 1.2.2. బంగారు తిమ్మరాజు కథ లేక 'దేవరాయలు కథ':

ఇది రాయలవారు పెనుకొండ నేలుచుండఁగా జరిగినట్లున్నది. ఈ రాయలవారు శ్రీకృష్ణదేవరాయలేమో పరిశీలింపవలసి యున్నది. ఈ కథలో రాయలవారికి సంతానము లేదు. ఇతఁడు పెనుకొండ

బెల్లము కొండల నేలుచుండెను. ఇతనికిఁగల యేడుగురు తమ్ములలో రఘుపతిరాజొకఁడు. ఆయనకుఁగల ముగ్గురు పుత్రులలో బంగారు తిమ్మరాజు పెద్దవాఁడు. అతఁడు వేంకటేశ్వరుని వరమువలనఁ బుట్టినవాఁడు. రఘుపతిరాజు శేషపట్టణము చెంగల్పట్టులను బాలించుచుండెను. రాయలవారికిఁ బదునొకండుగురు పట్టపుదేవులు, నొక బోగము రంగసాని కలరు. ఈ రంగసానియు, నీమె తమ్ముఁడు సవరపు నారప్పయుఁ గుయుక్తులు పన్ని, బంగారు తిమ్మరాజును పెనుకొండకు రప్పించి, రాయలవారి మనసును విఱచి, తిరుపతి దగ్గఱ జరిగిన యుద్ధములో రాయలచే నతనిని జంపించిరి.

ఈ కథ బొబ్బిలివరుసలో నున్నది. ఇందు బోగము రంగసానికిని బంగారు తిమ్మరాజునకును పెనుకొండలో జరిగిన యుద్ధమున, తిమ్మరాజు పక్షమున పల్లెపు రమణమ్మ యను వీరవనిత కావించిన యుద్ధము రమణీయముగా వర్ణింపఁబడినది:-

***"చెడ్డీ, లాగూ తొడిగిందయ్యా పల్లెపు రమణమ్మా***
***పురుష వేషమే వేసినదయ్యా పల్లెపు రమణమ్మా***
***డాలు, కత్తులూ చేత బట్టెనూ పల్లెపు రమణమ్మా***
***మేఘరంజి గుఱ్ఱము నెక్కెను పల్లెపు రమణమ్మా***
***ఆరువేలనూ గడియలోపలా నిలువున నరికింది***
***యేనుగులానూ గుఱ్ఱములానూ వేలకొద్ది నరికే***
***పడ్డ సైన్యమును జూచి సానీ పరుగులు పెట్టింది"***

ఈ బంగారు తిమ్మరాజు కథకు గుజిలీప్రతు లనేకములు లభించుచున్నవి. అనంతపురము, కడప మండలములలో నీ కథను 'దేవరాయలు కథ' యనియుఁ బిలుచుచున్నారు.

### 1.2.3. ఆరె మరాఠీల కథ లేక ముగ్గురు మరాఠీల కథ:

ఈ కథలో 'సోమోజీ, ఫిరోజీ, సుబందిరావు' అను ముగ్గురు అన్నదమ్ములుండుటచే దీనికి 'ముగ్గురు మరాఠీల కథ' అను పేరు జానపదులలో వ్యాప్తికి వచ్చినది. వీరు 'ఆరె' కులమునకుఁ జెందినవారు. 'ఆరె' అనునది మహారాష్ట్రులలో నొక తెగ. ఈ 'ఆరె' శబ్దమే భ్రష్టమై 'ఆఱు'గా మాఱినది. అందుచే దీనిని 'ఆఱు మరాఠీల కథ' యనుటయుఁ గలదు. కాని దీనికి 'ఆఱుగురు మరాఠీల కథ' అని యర్థము చెప్పుకొనరాదు. 'ఆరె జాతికి చెందిన మరాఠీల కథ' అని దీని యర్థము. ఈ కథలో రెండు తరముల ప్రసక్తి యుండును. మొదటి తరమున ముగ్గు రన్నదమ్ములు, రెండవ తరమున ముగ్గురన్నదమ్ములు కలరు. అయినను దీనిని 'ఆఱు మరాఠీల కథ' యను నర్థమునఁ బ్రయోగింప రాదు.

ప్రత్తికొండ తాలూకాలో (కర్నూలు మండలము) మరాఠీలు పంద్రెండు కోటలు కట్టుకొని పాలించుచుండిరి. వారిలో 'భాయి భజే రావు' ఒకఁడు. అతనికి 'నారాయణరావు, సిద్ధోజిరావు, కంఠేరాయఁడు' అను ముగ్గురు కొడుకులు కలరు. వీరు దాయభాగములు పంచుకొనునప్పుడు నారాయణరావు తన కడనున్న మూఁడు కుక్కలను మాత్రము పంచలేదు. అది తమ్ములకు, ముఖ్యంగా సిద్ధోజీకిఁ గోపకారణమయ్యెను. నారాయణరావు 'కరిణికల్లు' కోటను బాలించు చుండెను. అతనికి ముగ్గురు సంతానము. పెద్దవాఁడు సోమోజీ, రెండవవాడు చెవులపోగుల ఫిరోజీ, మూఁడవవాఁడు చేతుల కడియాల సుబందిరావు. కఱవు వచ్చి ఈ సోదరుల తండ్రి తాతలు, అక్కసెల్లెండ్రు మరణించిరి. వీరు తమ పినదండ్రికి లేఖ వ్రాయగా, సిద్ధోజి వచ్చి నిర్దాక్షిణ్యముగా నీ బాలుర కోటను దోచి, వారిని నిర్వాసితులను జేసెను. వారు అరణ్యములకుఁబోయి, పాలకొండ సమీపమున మరల నొక కోటను గట్టుకొని సుఖముగా నుండిరి. సిద్ధోజీ వారిని జంపుటకై దొంగలను బంపెను. ఆ దొంగలు వచ్చి, కోట బయటకు వచ్చిన సోమోజీని జంపి, యాతని శిరస్సును తీసికొని పోవుచుండిరి. ఫిరోజీకి ఈ విషయము తెలిసి, కుక్కలతో దొంగలను వెన్నంటి తఱిమెను. కుక్కలు దొంగలను జంపినవి. అన్న శిరస్సును దెచ్చి, దహనక్రియలు నెఱవేర్చి, ఫిరోజీ రాజ్యపాలన చేయసాగెను.

ఈ కథ ఒక ప్రత్యేకమైన ఛందస్సులో నున్నది. దీనిని 'సైసై వరుస' యందురు. తెలుఁగు వీరగాథలలో సర్వాయి పాపని కథ, చిన్నపరెడ్డి కథ, ముగ్గురు మరాఠీల కథ- ఇవి మూడును మూఁడు ప్రత్యేకమగు వరుసలు. వీనికివే లక్ష్యములు. సైసై వరుసలో నొక్కొక్క పాదమున 12 మొదలు 15 మాత్రల వఱకు నుండవచ్చును. చరణాంతమున పై పాదములలోకంటె నొక్క మాత్ర యెక్కువగా నుండును (సాధారణముగా 15 మాత్రలుండును). వంతలు 'సై' యనుచుఁ బ్రతి పాదమునకు రెండు మాత్రల నూఁతగా గలుపుచుందురు. ఆధునికములగు బుఱ్ఱకథలలో నీ యనుకరణము హెచ్చుగా నున్నది. వీరరసస్ఫూర్తికి దీనిని మించిన ఛందస్సు, (నాకుఁ దెలిసినంత వఱకు) వేఱొకటిలేదు. "భళానంటి భాయి తమ్ముడా- సై, మేలుభళా నోయి దాదానా" అనునది ఈ వరుసలో వచ్చు పునరావృత్తి.

నిరాయుధుఁడైన సోమోజీపై దొంగలు పడినప్పుడు అతని చేతిలో నొక చెంబు మాత్రమున్నది. ఆ వీరుఁడు ఆ చెంబునే డాలుగాఁ, జేతులనే కత్తులుగా భావించి యుద్ధము చేసినాడఁట:-

***"చెంబె డాలు అన్నాడురా -సై***
***చేతులె కత్తు లన్నాడురా - సై***
***ఆ- అయిదుగురు దొంగ వాండ్లను - సై***
***ఒకరిమీద నొకర్ని వేసెను- సై***
***పడవేసి దిగువా కొట్టెను- సై***
***బొడ్లో బాకు తీసుకున్నడు- సై***
***గిరధాల గిరుమోజీనిరా -సై***
***కొంకిరాలు కోసినాడురా - సై***
***కోటలోకి దూకినాడురా ॥భళానంటి॥"***

ఏదో ఒక ప్రాంతము నందే కాక, ఆంధ్రదేశమంతయు వ్యాపించిన వీరగాథలలో నిదియొకటి. బొబ్బిలికథ, దేసింగురాజు

కథ, ముగ్గురు మరాటీల కథ, బంగారు తిమ్మరాజు కథ, లక్ష్మమ్మ కథ, కామమ్మ కథ, చిన్నమ్మ కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ– ఇవి పాడఁబడని పల్లె ఆంధ్రదేశమున లేదనవచ్చును. 1914లో కె.గోవిందస్వామి మొదలారి (చెన్నపట్టణము) ప్రకటించిన 'ఆరె మరాఠీల కథ' గుజిలీ ప్రతులలోఁ బ్రాచీనమైనదిగాఁ గన్పట్టు చున్నది. నేఁడు లభించు గుజిలీ ప్రతులన్నియుఁ దప్పుల తడకలుగా నున్నవి. వీనికన్న సమర్థుఁడగు గాథాకారుఁడు పాడిన వీరగాథలే రసవంతములుగా నుండును. రాయసీమలో నేను సేకరించిన 'ముగ్గురు మరాటీల కథ'లో నొక రసఖండమును జూడుడు– నారాయణరావు పుత్రుల వర్ణన:–

*"పన్నెం దేండ్ల వాడు సోమథీ– సై*
*తొమ్మి దేండ్ల వాడు సూపంధీ– భళానంటి॥*
*ఇద్దరికి చిన్నవాడుగా – సై*
*బంగారి కడియాల బాలుడు– సై*
*ముత్యాల పోగుల ఫిరోజి –సై*
*వేండ్లాకు చిన్నవాడురా– సై*
*వేచనాకు దొడ్డవాడురా– సై*
*మనిషిలో మర్మంబు తెలుసును– సై*
*మానిలో చేవా తెలుసును– సై*
*గంగల లోతే తెలుసును– సై*
*సచ్చేది బతికేది తెలుసూనూ" భళానంటి॥*

దొంగలను తఱుముచున్న బాలవీరుల వర్ణన:–

*"బాలులు పొయ్యే రద్దూకూ– సై*
*భూలోకము తల్లటిచ్చేనూ– సై*
*భూతాల్ గడగడ వణికేనూ– సై*
*భూమికి తిమిరే పట్టేనూ– సై*
*చుక్కలు జలజల రాలేనూ– సై*
*సూర్యుడు దారీ తప్పేనూ– సై*
*రేయే పగలూ వైనాదీ– సై*
*పగలే రేయీ వైనాదీ"– ॥భళానంటి॥*

### 1.2.4. కుంటి మల్లారెడ్డి కథ లేక రెడ్ల పురాణము:–

రెడ్లు (కాపులు) దేవగిరి పట్టణమునుండి ఆంధ్రదేశమునకు వచ్చుటను, మార్గ మధ్యమున వారియందు మోటాటి, పెడకంటి, పంట, పాకనాటి, దేశూరు మొదలగు శాఖలేర్పడుటను దెల్పు కథ. దీనిలోఁ బిచ్చుకుంట్ల పుట్టుకకూడఁ జెప్పఁబడినది. రెడ్లు ఆంధ్రదేశమునకు సంబంధించినవారు కారనియు, మహారాష్ట్రము నుండి ఇటకు వచ్చి తెలంగాణా రాయలసీమలలో స్థిరపడిరనియుఁ జరిత్ర తెల్పుచున్నది. ఏ శతాబ్దమున వీరు వలస వచ్చిరో చారిత్రకులు నిర్ణయింపవలయును. రాష్ట్రకూటులే రెడ్లు కావచ్చునని కొందఱు తలఁచుచున్నారు. ఇది శూరకులము. దీనివలన నాంధ్ర వీరగాథా కవిత్వము సుసంపన్నమైనది. ఈ వీరగాథలో శ్రీకృష్ణదేవరాయలవారి కాలమున రెడ్లు ఆంధ్రదేశమునకు వచ్చినట్లుగాఁగలదు. కాని శ్రీకృష్ణదేవరాయలకుఁ బూర్వమునుండియు నాంధ్రదేశమున రెడ్లున్నారు.

కుంటి మల్లారెడ్డి కథను రాయలసీమలోఁ బిచ్చుకుంట్లు పాడుచున్నారు. వీరు రెడ్లను, ముఖ్యముగా రాజవంశీకులగు మోటాటి రెడ్లను యాచింతురు. తంబుఱ శ్రుతితో, చిన్న చిన్న గుమ్మెట్ల తాళముతో నీ కథను బాడుచుందురు. ఇది లయాత్మక వచనమున నున్నది. వంతలు గుమ్మెట్లను మ్రోగించుచు 'ఆ' కొట్టుచుండగా, కథకుఁడు తంబుఱ శ్రుతితోఁ గథను ముందుకు నెట్టును. ఈ కథ లయాత్మక వచనమువలె నున్నను, గొన్నిచోట్ల శిథిలమైన ద్విపదచ్ఛాయలు గానవచ్చుచున్నవి. వచనముగాఁ గనఁబడు నీ పాటలోఁ బ్రాస నియమము లెక్కువగాఁ గనబడుచుండుటచేఁ బూర్వమీకథ ద్విపదలో నుండి, నిరక్షరాస్యులైన గాథాకారుల నోళ్లలో శిథిలమై, సాఁగిపోయిన దని తలఁపవచ్చును.

ఈ వీరగాథను నేను కర్నూలు మండలమున నందికొట్కూరు తాలూకా, 'చెలిమళ్ల రుద్రవరము' అను గ్రామములో 18–4–1966వ తారీఖున పిచ్చుకుంట్ల చిన్ననాగన్న పాడఁగా వ్రాసికొంటిని. దీని ప్రారంభమిట్లుండును:–

*"త్రేతాయుగం, ద్వాపరయుగం, కలియుగం*
*కలియుగం పుట్టుదల కాపుల పురాణము*
*అగునేటి రాక్షస నామ సంవత్సరం కల్పవృక్షం అనే రెడ్డి పుట్టెను*
*కల్పవృక్షం క్రింద ఆదిరెడ్డి పుట్టెను*
*ఆదిరెడ్డి భార్య ఆదెమ్మ, కుమారుదు బచ్చిరెడ్డి*
*బచ్చిరెడ్డి భార్య పొన్నమ్మ*
*విష్ణుకు సరివొచ్చు బవధారి మడుగు వొడ్డున*
*శివగిరి పట్టణం సరివొచ్చు దేవగిరి పట్టణం*
*దేవగిరి పట్టణం ఏలుతున్నారు దేశాయి రెడ్లు*
*కలియుగం ఆదిరెడ్డి కుమారుదు బచ్చిరెడ్డి*
*బచ్చిరెడ్డి పొన్నమ్మకు పన్నెండుమంది కొమాళ్లు"*

దేవగిరి పట్టణమేలు బచ్చిరెడ్డికి ఉత్తమారెడ్డి, సత్యమారెడ్డి మున్నగువారు పండ్రెండుగురు పుత్రులు. ఇందు ఉత్తమారెడ్డి సంతతి వారే నేఁటి రెడ్లు. సత్యమారెడ్డికి కుంటిమల్లారెడ్డి పుట్టెను. ఈ కుంటి మల్లారెడ్డి భార్య పిచ్చిది. ఈతని సంతానమే పిచ్చికుంట్లు.

ఒకప్పుడు దేవగిరి పట్టణమునకు వచ్చిన పఠాను నవాబునకు బచ్చిరెడ్డి విందు చేసెను. ఆ నవాబు ఉత్తమారెడ్డి కుమార్తె అమ్మోజమ్మను, సత్యమారెడ్డి కుమార్తె తిమ్మోజమ్మను జూచి మోహించి, వారిరువురను దనకిచ్చి వివాహము చేయుఁడని రెడ్లను కోరెను. తురకవానికిఁ గూతుండ్ర నీయనొల్లక, రెడ్లు ఒకనాటి యర్ధరాత్రమున, శివభక్తుఁడగు కుంటి మల్లారెడ్డి సహాయమున, దేవగిరి పట్టణమును

వదలి దక్షిణాదికి వలస వచ్చుచుండిరి. దారిలో నేఱు పొంగినది. వెనుకనుండి నవాబు తతిమికొని వచ్చుచుండెను. ఉత్తమారెడ్డి కడగొట్టు తమ్ముఁడగు వీరనాగిరెడ్డి యా యేటికి బలియయ్యెను. అంత నేటి పొంగు తగ్గినది. రెడ్లు తమ తమ బండ్లలో నదిని దాటిరి. నవాబు సైన్యము వచ్చుసరికి నేఱు మరల పొంగి దానిని నశింపఁజేసినది. తమ కారణముగా రెడ్ల కవమానము వచ్చినదని, అమ్మోజమ్మ, తిమ్మోజమ్మలు ఏటియొడ్డున నగ్నికుండము నేర్పఱుచుకొని దాని కాహుతియైరి. ఏఱుదాటిన రెడ్లు మోటాటి, పెడకంటి, పాకనాటి, దేశూరి మున్నగు వివిధ శాఖలుగాఁ జీలిపోయిరి. వారిలో మోటాటి రెడ్లు శ్రీకృష్ణదేవరాయలు పాలించు ఆనెగొందికిఁబోయి, రాయల మెప్పు పొంది, అటనుండి రాయలసీమలో పారుమంచాల, నందికొట్కూరు, టంగుటూరు, పాసెంపల్లి మున్నగు ప్రదేశములందు స్థిరపడిరి.

ఈ కథలో శ్రీకృష్ణదేవరాయల ప్రసక్తియు, తెనాలి రామలింగని ప్రసక్తియు వచ్చును. దక్షిణాదికి వచ్చుచున్న రెడ్ల ప్రాభవమును జూచి శ్రీకృష్ణదేవరాయలు ఆశ్చర్యపడెను. తన రాజ్యమున వారికి మాన్యము లిచ్చెను. బచ్చిరెడ్డి దానధర్మములను జూచి, రాయలు సంతోషించి యతనిపై నొక పద్యమును జెప్పెనఁట! కావున నీ ప్రసక్తులనుబట్టి శ్రీకృష్ణదేవరాయల కాలమున రెడ్లు మహారాష్ట్రమునుండి యాంధ్ర దేశమునకు వచ్చిరని చెప్పవలసియున్నది. కాని కృష్ణదేవరాయల కన్న ముందే (ప్రౌఢదేవరాయల కాలమందే) రెడ్లు కొండవీటిని బాలించినట్లుగాఁ జరిత్ర చెప్పుచున్నది. కాకతీయుల పతనానంతరము ఆంధ్రదేశము నేలినవారు రెడ్లు. 14, 15 శతాబ్దములలో వీరి పాలన జరిగినది. ఈ కథనుబట్టి శ్రీకృష్ణదేవరాయల కాలమున రెడ్లు రాయలసీమకు వ్యాపించిరని చెప్పుట కొంత సమంజసముగా నుండును. నాఁటి దేవగిరిపట్టణమే నేఁటి దౌలతాబాదు. అట పెచ్చు పెరిగిన మహ్మదీయుల తాకిడికిఁ దట్టుకొనలేక, రెడ్లు వలస వచ్చి యుందురు.

ఈ కథ లయాత్మక వచనమును బోలియున్నను, దీనియందుఁ గవిత్వ పటుత్వ మేమాత్రమును లోపింపలేదు. ఉత్తమారెడ్డి భార్య పెదమంగమ్మయు, సత్యమారెడ్డి భార్య చినమంగమ్మయు సంతానము కొఱకు బాధపడుచు నిట్లు వాపోవుదురు:–

*"సంతులేనివారి బ్రతుకు సావిటి కొట్టముతో సమానము*
*సంతులేనివారి బ్రతుకు వాగున పారు ఉదకము చందము*
*ధనము సంపాదించిన దాయాదుల పాలు*
*దాయాదులు లేకుంటె ధరణిపాలు*
*కోట్లకు సంపాదించిన ధనము దొంగలపాలు*
*కండలు కాటిపాలు, ఎముకలు ఏటిపాలు*
*కననివారి బ్రతుకు చీకటి కోనలు"*

ఈ తోడి కోడండ్రిరువురును సంతానార్థమై యెన్నియో పుణ్యకార్యములు చేసిరి. ఇది రమణీయముగఁ జిత్రింపబడినది. (ఈ వీరగాథయొక్క ప్రాచీన రూపము ద్విపద యనుటకు ఈ క్రింది వర్ణనలో నియతముగఁ బాటింపఁబడిన యతియే తార్కాణము.)

*"ఎగరాని గుళ్లకు ఎగుతాపలు కట్టించినారు*
*దిగరాని గుళ్లకు దిగుతాపలు కట్టించినారు*
*పాదూరు గుళ్లకు బచ్చెర్లు పోయించినా గాని*
*బయటి లింగాలకు మరుగులు కట్టించినా గాని సంతానము లేదు*
*నోమి నోమి మోచేతులు కాయలు కాసినాయి*
*నొసలక పెడతల కట్టినాది*
*వొంటి వొంటి నరువు నరిసినాది వొళ్లు రెయిగప్పినాది*
*దంతువలు వొదిలినాయి తాంబూలము రుచి దప్పినాది"*

ఈ కుంటి మల్లారెడ్డి కథలోని కవిత్వము కొన్ని తావులలో తాళ్లపాక పెద్ద తిరుమలాచార్యుని వేంకటేశ్వర వచనములను మించి యున్నది. శ్రీశైలములోఁ దపస్సు చేసికొనుచున్న కుంటిమల్లారెడ్డి, నవాబు దౌష్ట్యమునుండి తన సోదరులను రక్షించుటకై దేవగిరి పట్టణము చేరవలెనని తలఁచును. తన్ను వెంటనే దేవగిరి పట్టణము పంపుమని శ్రీశైలమల్లికార్జును నిట్లు ప్రార్థించును:–

*"నా శిరసు నీ పాదాన పెట్టుతాను*
*నా నేత్రములు తీసి నీకు దీపాలు పెట్టుతాను*
*నా గుండెలు తీసి నీకు గుత్తులు కట్టుతాను*
*నా దొమ్మలు తీసి నీకు తోరణాలు గావిస్తాను*
*నా పేగులు తీసి నీకు వుత్తర జందెము లేస్తాను*
*నా రక్తము తీసి నీకు శ్రీ గంధము నిస్తాను"*

రెడ్ల మార్గమున కడ్డముగాఁ బొంగిన యేటికి వీరనాగిరెడ్డి బలికాఁ గాఁ, బ్రకృతి యెట్లు క్షోభించినదో చూడుడు:–

*"యీరనాగిరెడ్డి వొరిగే వేళకు– భూములు తల్లడించె*
*దిక్కులు పిక్కటిల్లె, సూర్యుడు గతి తప్పె*
*వచ్చే చంద్రునికి వరదగూడు కట్టె*
*కాసే చంద్రునికి కనక పొడి రాలె.*
*యీరనాగిరెడ్డి వొరిగే వేళకు*
*దేవాన దేవతలు కొలువు దీరిరి*
*కంచు రథంబు, కలియ రథంబు,*
*వుక్కు రథంబులు కొలువు దీరె*
*దిగద్దె పీఠములు గడగడ వొణికి*
*దక్షిణ సముద్రానికి వొరుగంగ సాగెను".*

ఈ కథకుఁ బూర్వరూపము ద్విపదయే యనుటకుఁ బై పంక్తులు కూడ సాక్ష్యమిచ్చుచున్నవి. ఈ కథ సుదీర్ఘ శోకాలాపనతో కాటమరాజుకథలవలెఁ బాడఁబడును. ఇది తంబుఱ గుమ్మెట్లతోఁ బాడఁబడుచున్నది కావున బొబ్బిలివరుస కథలలోఁ జేర్చితిని.

### 1.2.5. వేమన కథ:-

ఇది సంఘసంస్కర్తయు, శతకకర్తయు, యోగిపుంగవుడును నగు వేమనకథ యగుచోఁ జారిత్రకమే యగును. కాని ఇది యెవరో కటారుపల్లె (అనంతపుర మండలము)లోని మఱియొక వ్యక్తిపైఁ బుట్టిన కథగా నున్నది. అభూత కల్పనలతో జానపదత్వమును పుంజుకొన్నది. వేమన గుఱ్ఱము నెక్కి, తిరుపతికి వచ్చి, వేంకటేశ్వరునితో వాదించుట, చెన్నపట్టణమునకు పోయి భూచక్ర గొడుగును, పచ్చల పిడిబాకును దెచ్చుట యిందు వర్ణింపబడును. ఇది జాగటకథ. దీనిఁ బాడువారిని 'గెడస్తంభం దాసర్లు' అందురు. వీరు 'పూసల బలిజవారు' అను గాథాకారులు. వీరు కంచినుండి చిత్తూరుజిల్లాకు వచ్చి స్థిరపడినారు. వీరి గురువులు కంచిలోని శ్రీవైష్ణవులు. ఈ పూసల బలిజలలోఁ గొందఱు 'గెడస్తంభం దాసర్లు' అను పేరుతో వేమనకథను, వేంకటేశ్వరుని కథను బాడుచున్నారు. తక్కినవారు జంగముల వలెనే తంబుఱ గుమ్మెట్లతో బొబ్బిలి కథలను బాడుచున్నారు. వేమన కథ యెక్కువగా చిత్తూరు మండలమునఁ బాడఁబడుచున్నది.

**'బల్మూరి కొండ్రాయుని కథ'** యను తెలంగాణా అస్పష్ట చారిత్రక వీరగాథనుగూర్చి డా॥ బి.రామరాజుగారు విపులముగాఁ జర్చించియున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు- ౨౬౨-౨౬౬).

## 2. సాంఘికములు

రాజులకు రాజ్యములకు యుద్ధములకు సంబంధించిన వీరగాథలు చారిత్రకములు కాఁగా, సంఘములోని సామాన్యులు, పతివ్రతలు, సాహసులు, బందిపోట్లు, గజదొంగలు, గ్రామకక్షలు, కుటుంబ కలహములు, హత్యలు-మున్నగు వానికి సంబంధించిన వీరగాథలు సాంఘికములు. బొబ్బిలివరుస కథలలోఁ జారిత్రక శాఖవలెనే ఈ సాంఘిక శాఖయు నధికముగా నున్నది.

### 2.1. పేరంటాండ్రు

ఇవి కరుణరసప్రధానమైన కథలు. వీరగాథలలో వీరము తరువాత గరుణమునకే ప్రాధాన్యము. ఈ కరుణగాథలలో త్యాగ వీరము మెండు. పత్యైక జీవనలై సహగమనము చేసిన సాధ్వీమణులును, గృహచ్ఛిద్రములకులోనై అష్టకష్టములు పడిన అత్తింటి కోడండ్రును, మాన సంరక్షణార్థమై వీరత్వమును జూపిన నారీమణులును దేవతలుగా వెలసి, జానపదులచే గుడిగోపురములలోఁ బూజింపఁబడుచున్నారు. మానవత్వమునుండి దైవత్వము నొందిన ఈ నారీమణులను 'పేరంటాండ్రు' అందురు. ప్రాచీన వీరగాథలలోఁ గూడ నీ పేరంటాండ్ర ప్రసక్తి యున్నది. పల్నాటి వీరగాథలలో అనుగు రాజుభార్య మైలమ్మ, అలరాజుభార్య రత్నాల పేరమ్మ పేరంటాండ్రే! అట్లే, కాటమరాజు కథలలో అగుమంచి, ఖడ్గతిక్కన భార్య జానమ్మ పేరంటాండ్రు. కాని, యిట్టి కథలలో వీరిభర్తలకే ప్రాముఖ్యమున్నది కాని వీరికి లేదు. పాశ్చాత్య సాహిత్యములందుఁగూడ నిట్టి గృహచ్ఛిద్రములకు సంబంధించిన వీరగాథలున్నవి. వీనిని ''Ballads of Domestic Tragedy'' అందురు.

మన పురాణములలో దక్షయజ్ఞములోని సతీదేవియు, చరిత్రలో కన్యకామ్మవారును, సాంఘికముగా కామమ్మయు మొట్టమొదటి పేరంటాండ్రు. దక్షయజ్ఞము నేఁడు స్త్రీలపాటగా మాత్రమే ప్రసిద్ధిలో నున్నది. బొబ్బిలివరుసలో నీ పాట కానరాదు. జంగములు కొందఱు దక్షయజ్ఞమును బాడుచున్నారు కాని, దాని స్వరూపమెట్టిదో సంపాదించినఁగాని తెలియదు. ఈ జంగములు బసవపురాణములోని కథను బొబ్బిలివరుసలోనికి ఆశువుగా మార్చి పాడుచున్నారేమో! వచనకథలను సహితము జంగములు బొబ్బిలివరుసలలోనికి అవలీలగా మార్చఁగలరు (ఉదా॥ కాశీమజిలీకథలు).

చారిత్రకముగా కన్యకామ్మవారి పాట ప్రాచీనమైన పేరంటాలు కథ. ఇది రాజరాజ నరేంద్రుని తండ్రియగు విష్ణువర్ధన విక్రమాదిత్యుని కాలము నాఁటిది (క్రీ.శ. 11వ శతాబ్ది పూర్వభాగము). ఈ సంఘటన పశ్చిమ గోదావరీ మండలమున, తణుకు తాలూకా, పెనుగొండ గ్రామములో జరిగినది. కుసుమశ్రేష్ఠికిని, కుసుమాంబకును జన్మించిన జగదేకసుందరి వాసవకన్య. విక్రమాదిత్యుడామెను జూచి వివాహ మాడఁ దలఁచెను. వర్ణభ్రష్టత్వమున కిష్టములేక, రాజును ధిక్కరించెడి శక్తిలేక వైశ్యులు విచారించుచుండిరి. వాసవకన్య రాజును శపించి, అగ్నికుండమున దుమికి మానము కాపాడుకొనెను. ఈమె శాపముచే రాజు మరణించెను. ఈమెను పార్వతి అపరావతారముగా వైశ్యులు నేఁటికిని బూజించుచున్నారు.

కన్యకామ్మవారి కథనుగూర్చి తెల్పుచు రామరాజుగారు "ఈయమ గాథను శిష్టలోకమునకు ప్రజాకవి శ్రీ గురజాడ అప్పారావు గారు 'పూర్ణమ్మ' పేరుతో పరిచయ మొనర్చిరి" అని వ్రాసిరి (చూ. తెలుగు జానపద గేయ సాహిత్యము, పుట ౫౯౩). ఇది ప్రామాదికము. 'పూర్ణమ్మకథ'కును, 'కన్యకామ్మవారికథ'కును నేవిధమగు సంబంధమును లేదు. అప్పారావుగారు వ్రాసినది 'కన్యక' యను గేయము. ఇదియే వాసవకన్యక గాథ. పూర్ణమ్మకథ యనునది బాల్య వివాహములు కూడవని తెల్పుచు అప్పారావుగారు కల్పించిన కథ.

ఈ కన్మకామ్మవారిపై పాటలు, కీర్తనలు, మంగళహారతులు, పెక్కు గలవు. కాని వీనిలో నే యొక్కటియు జానపదత్వమున లేవు. వైశ్యులను యాచించెడి 'వీరముష్టు'లను గాథాకారులు కన్యకామ్మ వారికథను బాడుదురట! అది యెట్టిదో తెలియరాదు. నాకొక ప్రాచీనమైన పాట లభించినది. అది ద్విపదలో నున్నది. బొబ్బిలి పాట వరుసలోఁగాని, దాని భేదములలో గాని యున్న పాట యేదియు లభింపలేదు.

ఇఁకపోఁగా, కామమ్మకథయే మొదటి పేరంటాలు కథగా నేఁడు లభ్యమగుచున్నది. ఇట్టి కథలన్నియు రాజా రామమోహన

రాయ్ క్రీ.శ. 1829లో ఆంగ్లప్రభుత్వముచే సహగమన నిషేధశాసనము చేయించిన తరువాత జరిగినట్టివి. ఈ సాధ్వీమతల్లులు ప్రభుత్వమునుండి ప్రత్యేకానుమతిని బడసి గుండమునఁ బడిరి.

ఈ క్రింద చర్చింపఁబోవు పేరంటాండ్ర కథలలో కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, మండపేట పాపమ్మ కథ, శృంగవరపుకోట యెఱుకమ్మ కథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మ కథ, వీరరాజమ్మ కథ, నల్లతంగాళ్ కథ ముద్రితములు. ఎఱుకల నాంచారి కథ, తిరుపతమ్మ పాట ముద్రితములైనను, అవి జానపదులలో నున్నవి యథాతథముగా ముద్రింపఁబడలేదు. సేకరించినవారు వానిని దిరిగి వ్రాసినట్లే యున్నవి. ఎఱుకల నాంచారి కథకు రుక్మాభట్ల విధుమౌళిశర్మగారును, తిరుపతమ్మ పాటకు బాలకవి కృష్ణారావును కర్తలే కాని సంపాదకులు కారు. జానపదులు పాడుకొను కథలు వీనికన్న భిన్నముగా నున్నవి. కావున నీ రెండు వీరగాథలును ముద్రింపబడినట్లుగా లెక్కింపరాదు. ఇఁక నేను వివరింపఁబోవు నముద్రిత వీరగాథలు: 'రావులమ్మ కథ, సరోజని కథ, ఈడిగ దేవమ్మ కథ, అంజమ్మ కథ, ఉయ్యూరు వీరమ్మ కథ, గూడూరు నారాయణమ్మ కథ, రంగమ్మ కథ (కోయంబత్తూరు)'.

### 2.1.1. కామమ్మ కథ:-

దీనికి రోడ్లప్రక్కన గుజిలీప్రతు లనేకములు లభించుచున్నవి. మద్రాసు ప్రా.లి.పు.భా.లో నీ కథకు రెండు వ్రాఁత ప్రతులున్నవి (చూ. డి.నెం. 2501, 2502). ఇది తూర్పుగోదావరీ మండలమున సామర్లకోటలో తిరుపతి మారెయ్య భార్య కామమ్మ చేసిన సహగమనగాథ. దీని రచయిత మాదాసు వెంకయ్య. సహగమన కాలమున నతనికి కామమ్మయే పాతిక వరహాల నిచ్చి తన కథను వ్రాయుమనినదఁట. కామమ్మ పుట్టిల్లు పిఠాపురము. చిన్నతనములోనే ఈమె తల్లిదండ్రులు గతింపగాఁ బెదతండ్రి రామన్న, అతని భార్య వెంకమ్మ ఈమెను బెంచి, సామర్లకోటలో నున్న మేనల్లుఁడు మారెయ్యకిచ్చి పెండ్లి చేసిరి. మారెయ్య తల్లి చెల్లమ్మ. పెండ్లియైన కొలది కాలమునకే మారెయ్య చెన్నపట్టణము పోయి 'వాలీసు'దొర దగ్గఱ పెద్ద 'బోయి'గాఁ జేరెను. అక్కడ నాలేండ్లున్న తరువాత నింటికిఁ బోఁదలఁచి సెలవు కోరెను. వాలీసుదొర బెంగుళూరు కోటను బట్టుకొనిన తరువాత కాని సెలవు దొరకలేదు. మారెయ్య కాలినడకను 27 రోజులు ప్రయాణము చేసి సామర్లకోటను జేరెను. దారిలోనే అతఁడు వ్యాధిగ్రస్తుఁడై, ఇంటికిఁ జేరిన కొలఁది దినములలో నట్లతద్ది పండుగనాఁడు మరణించెను. అతని తమ్ముఁడు పిఠాపురము వెళ్లి కామమ్మను దోడితెచ్చెను. ఆమె తనభర్త శరీరముతో సహగమనము చేయనెంచెను. కాని కాకినాడ కలెక్టరు అనుమతి నీయలేదు. ఆమె చెన్నపట్టణమునుండి యనుమతిఁ దెచ్చుకొనెను. కామమ్మ తన మాహాత్మ్యముచే మద్రాసులోని 'వాలీసు (Wallis), మెడోస్ (Meadows), పెన్నిస్‌గిరి (Pennisgiri), ఓక్స్ (Oaks)' – అను నల్వురు దొరలను, నయనప్ప ముదలియారును ఆశ్చర్యపఱచెను. వారు ఆమె సహగమనమున కంగీకరించి, దానిని జూచుటకై వారిలోఁ గొందఱు సామర్లకోటకుఁగూడ వచ్చిరఁట. కామమ్మ మద్రాసునుండి తిరిగివచ్చు సరికి మారెయ్య దహనము కొంతపూర్తియైనది. పతియస్థులతో నామె యగ్నికుండమున నుఱికెను. సహగమనము చేయుటకు ముందు కామమ్మ యెన్నియో మహిమలను జూపినది. ఆమెకు సామర్లకోటలో గుడికట్టిరి. అట ప్రతిసంవత్సరము కార్తిక పూర్ణిమనాఁడు గొప్ప యుత్సవమును జేయుచున్నారు.

ఈ కథ 18వ శతాబ్దము చతుర్థపాదమున జరిగినదనుటకొక గట్టి ప్రమాణమున్నది. మారెయ్య 'వాలీసు' దొరను సెలవుకోరఁగా, నతఁడు బెంగుళూరు కోటను బట్టుకొను వఱకును మారెయ్యకు సెలవు నీయలేదని యీ కథలో నున్నది. అదియును గాక దీనిలో 'మెడోస్, పెన్నిస్‌గిరి, ఓక్స్' అను దొరల పేర్లును గలవు. కథలోని వాలీసు దొరయే క్రీ.శ. 1790లో ఆంగ్లేయ గవర్నర్ జనరల్ 'కారన్ వాలీస్'. మెడోస్ దొరయే అప్పటి మద్రాసు గవర్నరగు 'జనరల్ మెడోస్'. వీరు బెంగుళూరు కోటను బట్టుకొనుట మూఁడవ మైసూరు యుద్ధమును సూచించును. చారిత్రకముగా మూఁడవ మైసూరు యుద్ధము క్రీ.శ. 1790-92 మధ్యకాలమున జరిగెను. 1790లో గవర్నర్ జనరల్ కారన్ వాలీస్ మద్రాసు గవర్నరగు జనరల్ మెడోస్‌తోఁ గలసి టిప్పుసుల్తానుపై దండెత్తి, సత్యమంగలము కడ మిక్కిలిగా నష్టపడెను. 1791లో ఆంగ్లేయులు బెంగుళూరు కోటను బట్టుకొనిరి. 1792లో శ్రీరంగపట్టణసంధి జరిగెను. కామమ్మ, సహగమనము చేయుట కనుమతిని గోరి మద్రాసు వచ్చి, తన మహిమను జూపుసరికి వాలీస్, మెడోస్ దొరలు శ్రీరంగపట్టణమును గుత్తిని జయించి తిరిగి వచ్చిరని విశేష వివరణ పట్టికలోఁ గలదు.[21] కావున కామమ్మ సహగమనము క్రీ.శ. 1792లో జరిగినదని నిశ్చయముగాఁ జెప్పవచ్చును. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారును దీనిని 18వ శతాబ్దపు సంఘటనగనే పేర్కొనిరి.[22] ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనముగారు "ఉత్తమ శీలము, త్యాగము, పాతివ్రత్యము మొదలగు సద్గుణములు తక్కువ కులమువారియందు కూడ నుండునని కామమ్మకథ నిదర్శనమిచ్చుచున్నది" అని ప్రశంసించిరి.[23] కామమ్మ పల్లె(బెస్త)కులమునకుఁ జెందిన మహాపతివ్రత.

### 2.1.2. సన్యాసమ్మ కథ:-

ఇది విశాఖమండలమునకు సంబంధించిన కథ. కవిపేరు తెలియదు. ఇది కామమ్మ కథను జూచి వ్రాసినట్లున్నది. రెండును నొకే వరుసలో నున్నవి. రెండింటి ఇతివృత్తములకును సామ్యములు హెచ్చుగా నున్నవి. సన్యాసమ్మ భర్త చెంచన్న కూడ ఆంగ్లేయుల కొలవులో నుద్యోగి. ఇతఁడు బందరులో నుండెడివాడు. సన్యాసమ్మను అత్త దాలమ్మయుఁ, దోడి కోడండ్రును అనేక బాధలు పెట్టిరి. భర్త చెంచన్న వచ్చి వేఱుపడఁ జూచెను. అన్నగారంగీకరింపక పోఁగా

నతఁడాత్మహత్య చేసికొనెను. భర్తతో సన్యాసమ్మ సహగమనము చేసినది. కామమ్మ కథలో కన్న నిందుఁ గవిత్వము బింకముగా నున్నది. సన్యాసమ్మ సౌందర్యమును గవి యిట్లు వర్ణించెను:–

*"బంగార మొకచాయ బాలొక్క చాయ– సన్యాసి*
*నిండు పున్నమ నాటి చంద్రుండు చాయ– సన్యాసి*
*దేవళములుంటేను దేవతందురుగా– సన్యాసి"* [24]

సన్యాసమ్మ రజస్వల యైనప్పుడు జానపదకవి ప్రబంధములను మించిన వర్ణన సాగించినాఁడు:–

*"చిగురుటాకుల బోలి చిగురించు తావీ– హస్తములు*
*పెసరకాయల బోలి వికసించు తావీ– తనవ్రేళ్లు*
*పిడికెడు నడుమాయె పిరుదులూ బరువాయె– బాలకును*
*అరటి బోదెల బోలు అతివ పెందొడలు– బాలకును*
*ఓరచూపుల బాల ఒయ్యారి నడకల బాల– సన్యాసి*
*రొమ్ములు బరువాయె సోబన మెచ్చాయె– బాలకును"*

ఈ కథ 'బాల సన్యాసమ్మ కథ' యను పేరతో వెండితెర కెక్కినది. దీనికి గుజిలీప్రతు లనేకములు లభించుచున్నవి.

## 2.1.3. మండపేట పాపమ్మ కథ:–

తూర్పుగోదావరి, కృష్ణామండలములు కథాస్థానములు. ఈమె కాపు (తెలగ) కులమునకుఁ జెందినది. పుట్టినిల్లు తూర్పుగోదావరీ మండలములోని మండపేట గ్రామము. కొప్పిరెడ్డి లక్ష్మీకాంతమ్మ, మూలయ్య దంపతులకుఁ బార్వతీదేవి వరమునఁ బుట్టినది పాపమ్మ. చిన్నతనముననే ఈమె తల్లిదండ్రులు చనిపోయిరి. పెదతండ్రి రామయ్య, పెదదల్లి సీతమ్మ, పాపమ్మను బెంచిరి. ఈమెను కృష్ణా మండలమందలి రాచర్లపురములోని కుంబె బాపనమ్మ, రంగయ్యనాయఁడు– అను దంపతుల రెండవ కుమారుఁడైన పాపయ్య కిచ్చి పెండ్లి చేసిరి. అత్తగారు ఈమెను పెక్కు బాధలఁబెట్టెను. భర్త చనిపోఁగా నీమె సహగమనము చేసినది. సంక్రాంతి పండుగనాఁడు పుట్టిల్లగు మండపేటలోను, అత్తవారి గ్రామమగు రాచర్ల పురములోను పాపమ్మకు ఉత్సవములు జరుగును.

ఈ కథను బళ్లా స్వామికవి సేకరించి, 1934లో "మండపేట పాపమ్మ పేరంటాలమ్మ కథ" అను పేరుతోఁ బ్రకటించెను. రామరాజు గారు ఈ బళ్లా స్వామికవినే రచయితగాఁ బేర్కొనిరి. ఇది ప్రామాదికము.

## 2.1.4. శృంగవరపుకోట ఎఱుకమ్మ పేరంటాలు కథ:–

విశాఖ మండలమునఁ గల శృంగవరపుకోట కథాస్థలము. ఎఱుకమ్మ భర్తయగు అప్పన్న వేకువజామున నువ్వుచేనుకుఁ గంచె వేయుటకై పోయి, పులివాతఁ బడెను. పతివ్రతయగు ఎఱుకమ్మ ఆనంద గజపతి నడిగి యెకరము నేల సాగుమానమునకై తాకీదు పుచ్చుకొనెను. భర్తశరీరముతో నగ్నికుండమునఁబడి పేరంటాలయ్యెను. శృంగవరపుకోటలో నేఁటికిని ఈమెకు తిరునాళ్లు జరుగుచున్నవి. ఈ కథలో విజయనగరము నేలిన ఆనంద గజపతి ప్రసక్తి వచ్చుటచే నిది క్రీ.శ. 1895 ప్రాంతమున జరిగిన కథగా నిర్ణయింప నగును. రచయిత పేరు తెలియరాదు. దీనిలో ఎఱుకమ్మ యెడమచేతితోఁ బులిని జంపుట వంటి అద్భుత కల్పనలు కొన్ని కలవు.

## 2.1.5. 'లక్ష్మమ్మ కథ' లేక 'లక్షుమమ్మ కథ':–

తెలుఁగున అతిప్రసిద్ధములైన వీరగాథలలో నిది యొకటి. గుంటూరుజిల్లా పల్నాడులోని "దుర్గి" ఈమె పుట్టిల్లు. లింగాలపురము అత్తవారిల్లు. భర్త చిరుమామిళ్ల వెంకయ్య నాయఁడు. తండ్రి దిగుమర్తి ముసలప్పలనాయఁడు. కులము కమ్మవారు. ఈ లక్ష్మమ్మ తన యత్త యగు వెంకమ్మచేతను, నాడుబిడ్డయగు పిచ్చమ్మచేతను ఘోరనరకము ననుభవించి కడకు భర్తచే హత్య చేయఁబడెను. ఇతివృత్తము ప్రసిద్ధము. ఈ కథ నొకే పర్యాయము రెండు సంస్థలు వెండితెర కెక్కించినవి.

దీనికి గుజిలీప్రతు లనేకములు లభించుచున్నవి. దీనిని 'కమ్మ లక్షుమమ్మ కథ' అని జానపదులు వ్యవహరింతురు. క్రీ.శ. 1908లో నిది మొదట ముద్రింపఁబడినప్పు డీ పేరుతోనే యున్నది. ఈ కథ తందాన వరుసలో 8+10 మాత్రలొక పాదముగా సాఁగిన రచన. లక్ష్మమ్మపై బొబ్బిలివరుసలో నున్న కథయే కాక, యొక లఘు వీరగాథ కూడను న్నది. దానిపేరు 'లచ్చిమమ్మ పాట'.

ముద్రిత గ్రంథములనుబట్టి ఈ కథకు ముగ్గురు కవులు మూడు విధముల రచనలు చేసినట్లు తెలియుచున్నది. 8–1–1911లో పమ్మి అరుణాచలంశెట్టి (మదరాసు) గారు ప్రకటించిన 'లక్ష్మమమ్మ కథ'లో దాని రచయిత నెల్లూరుజిల్లా వడ్లపూడి గ్రామమునకుఁ జెందిన నిడిగంటి వీరయ్యదేవర యని యున్నది. ఇది రాజమహేంద్ర వరమున గౌతమీ గ్రంథాలయమునఁ గలదు. ఎల్లంకి వెంకయ్య రచించిన 'లక్ష్మమ్మ కథ' కూడ నీ గ్రంథాలయమున నున్నది. 1951లో ఎన్.వి. గోపాల్ అండ్ కో వారు ప్రకటించిన గుజిలీప్రతిలోఁ గథాంతమున గద్య యిట్లున్నది– "ఇది శ్రీ సకల సుజన వినుత కాళికాదేవి పరమేశ్వర ప్రసాద సేవాధురంధర చెన్ననగర నివాస కౌండిన్య మహాఋషి గోత్రోద్భవుండును ఆపస్తంభ సూత్ర కాకర్ల వంశ పయః పారావార రాకాసుధాకర రంగరాజ ద్వితీయ పుత్రుండగు కాకర్ల రాజు వుటిగంటి వీరయ్యదేవరగారిచే బ్రణీతంబయిన లక్షుమమ్మ కథ సమాప్తము".

అమెరికన్ డైమండ్ ప్రెస్‌వారు (వెస్టువార్డ్ అండ్ కంపెనీ) ప్రకటించిన గుజిలీ ప్రతిలో గూడ నిట్లేయున్నది. మొత్తముపై 'వీరయ్య దేవర' అనుకవి లక్ష్మమ్మకథను రచించెనని తెలియుచున్నది. కాని, యితని యింటిపేరు 'వుటిగంటి' యనియు, 'నిడిగంటి' యనియు రెండు విధములుగాఁ గానవచ్చుచున్నది. ఈ వీరయ్యదేవర రచించినట్లుగాఁ గల దేసింగురాజు చరిత్రము, చిన్నమ్మ కథ, సర్వాయి

పాపని కథ– మున్నగువానిలో 'నిడిగంటి' యని కలదు. అందుచే 'నిడిగంటి వీరయ్యదేవర– వుటిగంటి వీరయ్యదేవర'– వీరిరువురును భిన్నులని తలఁచుటకుఁగూడ నవకాశమున్నది. దీనికి మఱియొక యాధారముగూడ నున్నది. నిడిగంటి వీరయ్యదేవర నెల్లూరు దగ్గఱ 'వడ్లపూడి' గ్రామవాసి యని పెక్కు కథలలోఁ గలదు. కాని వుటిగంటి వీరయ్యదేవర చెన్ననగర నివాసియని అంత్య గద్యలో స్పష్టముగా నున్నది. ఇతని యింటిపేరునకు ముందు 'కాకర్లరాజు' అని యున్నది. ఈ 'కాకర్లరాజు' అనునది యింటి పేరేమో! 'కాకర్లవంశ పయః పారావార' అని వెస్టువార్డు కంపెనీ వారి గుజిలీప్రతిలో నున్నది. కావున నితని ఇంటిపేరు 'కాకర్లవారు' కావలెను. అయినచో 'వుటిగంటి' యేమిటో? 'కాకర్లరాజు వుటిగంటి వీరయ్యదేవర' అను దానిలో నేది యింటి పేరో తెలియకున్నది.

కావున నిడిగంటి వీరయ్యదేవర, కాకర్లరాజు వుటిగంటి వీరయ్యదేవర, యల్లంకి వెంకయ్య– అను ముగ్గురు కవులు లక్ష్మమ్మ కథకు మూఁడు రకముల రచనలు చేసినారని తలంపవలసియున్నది. కాని నేఁడీ మూఁడు రకముల రచనలును లభించుట లేదు. ఒకే రచన లభించుచున్నది. అందుచేఁ బైవారి కర్తృత్వములను శంకింప వలసియున్నది.

### 2.1.6. 'చిన్నమ్మ' కథ లేక 'సాసవల చిన్నమ్మ కథ':–

ఇది అనంతపుర మండలమునకు సంబంధించిన వీరగాథ. ఈమె విష్ణుభక్తురాలు. పాకనాటి రెడ్డికులస్థురాలు. శైవులైన అత్తవారింట భర్తచేతను, బావగార్లచేతను, అత్తగారిచేతను అనేక బాధలు పడి, కడకు కదిరి లక్ష్మీనృసింహస్వామిలో నైక్యమైనది. ఈమె విగ్రహము నేఁటికిని ఆ గుడిలో నున్నది. ఈమె కట్టించిన గోపురము మాత్రము కూలిపోయినది.

గుజిలీప్రతిగా లభించు కథ విశ్వసింపఁదగినది కాదు. దానిలో ననేక ముఖ్యవిషయములు వదలివేయఁబడినవి. రాయలసీమలో గాథాకారులు పాడుచుండు సంపూర్ణ కథను నేను సేకరించితిని. అది మూఁడు రాత్రుల కథ. చిన్నమ్మ బాల్యము, పెండ్లి, అత్తవారింటికిఁ జేరుట మొదటి రాత్రి కథ. అత్తవారింట బాధలు పడుట రెండవ రాత్రి కథ. అత్తవారు జంగమార్చన చేయుట, చిన్నమ్మ వైకుంఠమునకుఁ బోవుట మూఁడవ రాత్రి కథ. ఇంత సుదీర్ఘమగు వీరగాథ గుజిలీప్రతిలోఁ జాల సంక్షిప్తముగా నున్నది.

ఏ వీరగాథ యే ప్రాంతమున జరిగినదో, యా ప్రాంతమున సేకరించుట వలన మంచి ఫలితము వచ్చును. కథ విపులముగా విస్పష్టముగా లభించును. పల్నాటి వీరకథలను బల్నాటిలోను, కాటమరాజు కథలను కనిగిరి సీమలోను, బొబ్బిలికథను శ్రీకాకుళ విజయనగర మండలములలోను సంపాదించుట మంచి పద్ధతి. అట్లే చిన్నమ్మకథను అనంతపుర మండలమున సేకరింపవలెను. ఆ మండలమున నీ కథను 'సాసవల చిన్నమ్మకథ' యందురు. చిన్నమ్మ అత్తవారింటిపేరు 'సాసవలవారు'. ('సాసువులు' అనగా 'ఆవాలు'. కన్నడములో 'సాసవ'). ఈమె పుట్టింటిపేరు 'శీలమువారు'. తండ్రి శీలము కొండారెడ్డి, తల్లి కొండమ్మ. అత్త సాసవల నాగమ్మ మామ సాసవల రెడ్డి. భర్త వెంగళరెడ్డి. బావగారు–కోటిరెడ్డి, పెద్ద తోడికోడలు గవరమ్మ (ఈమె తంబళ్ల బసిరెడ్డి కూతురు). చిన్నమ్మ పుట్టిల్లు పడమట దేశమున మైసూరు విలాకు 'పావుగొండ్ల పట్టణము'. అత్తవారి యూరు అనంతపుర మండలమున 'ఓలుగొండ పట్టణము'. ఇది బొబ్బిలికథ వరుసలో నున్న గేయము (8+8+10 మాత్రలు). సాసవల చిన్నమ్మ కథ మైసూరు రాష్ట్రమునఁ గూడ మిక్కిలి ప్రసిద్ధికెక్కిన వీరగాథ. కన్నడములో నీ కథ ప్రచారమున నున్నది. కన్నడిగులు దీనిని వెండితెరకుఁ గూడ నెక్కించి యున్నారు.

చిన్నమ్మ కథను 'చెంగల్వరాజు' అను నతఁడు రచించినట్లుగాఁ గొన్ని పుస్తకములలోఁ గలదు. కాని 1910లో పమ్మి అరుణాచలం శెట్టి ప్రకటించిన చిన్నమ్మకథలో దాని రచయిత 'నెల్లూరుజిల్లా వడ్లపూడి గ్రామములో నిడిగంటి వీరయ్యదేవర' యని కలదు. ఈ వీరగాథా రచయితలను నమ్ముటకు వీలులేదు. వీరిలోఁ జాలమంది యీ కథలను సేకరించి ప్రకటించిన ప్రచురణకర్తలు, పాడిన జంగములును. వీరందఱును దమపేర్లను రచయితలుగాఁ బ్రచారము చేసికొనినట్లు కన్పట్టును. ఈ చెంగల్వరాజు ప్రకటనకర్తగాఁ దోచును. అట్లే లక్ష్మమ్మ కథారచయిత నిడిగంటి వీరయ్యదేవర, చిన్నమ్మ కథను బాడిన జంగముగాఁ దోఁచును. ఈ 'చెంగల్వరాజు– వీరయ్య దేవర' యిరువురును గలసి కుమ్మరి గుండయ్య కథపైనను, శ్రీ లక్ష్మీదేవమ్మ కథపైనను (1902), సర్వాయి పాపని కథపైనను (1909) తమ పేర్లను కవులుగా ముద్రించుకొనినారు.

### 2.1.7. వీరరాజమ్మ కథ:–

ఇది పల్నాటి సీమకు సంబంధించిన కథ. సాధారణముగాఁ బేరంటాండ్ర కథలలోఁ గరుణమే ప్రధానము కాఁగా, నీ కథలోఁ బేరంటాలు వీరముఁ గూడ బ్రదర్శించినది. ఇది పల్నాటి 'గద్ద దినుసు' ప్రభావము కాఁబోలు!

బాపిరాజు ప్రోత్సాహమున 'యం. అప్పల నరసయ్య' ఈ కథను రచించెను. దీనిని రాజమహేంద్రవరమున కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు వారు ముద్రించి ప్రకటించిరి. అద్భుత కల్పనలు మాహాత్మ్యములు లేక యథాతథముగాఁ గథ చెప్పఁబడినది. వీరరాజమ్మ అత్తవారి యూరు పల్నాటి సీమలోని 'రెంటచింతల'. (పల్నాడులో నీ పేరుతో రెండు గ్రామములున్నవి. కథలోని వేసవి వర్ణనను బట్టి ఇది గురజాలకు మాచెర్లకు మధ్యగల రెంటచింతలయే యని తలఁప వచ్చును.) ఈమె యత్తమామలు సూరమ్మ, నాగిరెడ్డి. భర్తపేరు పేరిరెడ్డి. ఈమె మిక్కిలి సౌందర్యవతి. అత్త సూరమ్మ ఈమెను విపరీతముగా బాధించెను. పేరిరెడ్డి యింటలేని సమయమున నత్తగారు రాజమ్మను హింసించి, యింటినుండి వెడలఁగొట్టెను.

రాజమ్మ దుఃఖించుచు బిడ్డను జంకను వేసికొని పుట్టింటి త్రోవఁ బట్టెను. మార్గమధ్యమున పెద్ద గాలివాన రాఁగా నొక యింటి పంచను నిలిచెను. ఆ ఇంటిలో నున్న దొంగలామెను సాదరముగా లోనికిఁ గొనిపోయి, ఆమె సౌందర్యమును జూచి ఆశ్చర్యపడి, ఆమెను బలాత్కరింప సాఁగిరి. ఆమె వారిని మభ్యపెట్టి, బయటకు వచ్చి, తలుపులు బంధించెను. ఆ దొంగలు తలుపులు తీయుమని ఆమెను గోరిరి. రాజమ్మ వినలేదు. అందుచే నింటిలోపలనున్న ఆమె బిడ్డను ముక్కలు ముక్కలుగాఁ గోసి, కిటికి గుండా బయటకుఁ బడవైచిరి. ఈ ఘోరదృశ్యమును జూచిన రాజమ్మ అపరకాళియైనది. ఆ మార్గమునఁ బోవు బండ్లవారిని పిలిచి, వారి సహాయముతో నా దొంగలపై విజృంభించినది. కత్తిని గొని వీరనారియై ఆ దొంగలను జంపి, తనకుఁ దగిలిన గాయములతో నామెయు మరణించినది. ఆ బండ్లవారు రాజమ్మ కక్కడ నొక గుడిని గట్టించిరి. నేఁటికిని నా గుడిదగ్గఱ రాజమ్మకుఁ బూజలు జరుగుచున్నవి. మానమును గాపాడుకొనుటకై కన్నబిడ్డ ప్రాణములను బలియిచ్చి, మహిషాసుర మర్దినివలె దొంగలను జంపిన వీరనారీమణి వీరరాజమ్మ. ఈ కథ పల్నాటిసీమకుఁ దగినట్లుగనే యున్నది.

ఈ కథలోఁ గవిత్వము చాల రసవంతముగా నున్నది. వేసవి వర్ణన, వీరరాజమ్మ సౌందర్య వర్ణన ప్రత్యేకముగాఁ బేర్కొనఁదగినది.

## 2.1.8. నల్లతంగాళ్ కథ:-

దేసింగురాజుకథవలెనే తమిళదేశమునుండి తెలుఁగులోఁ బ్రవేశించిన కథలలో నిది యొకటి. సరిహద్దు మండలమైన చిత్తూరులో నిది యెక్కువగఁ బాడఁబడుచున్నది. తమిళమున దీనిని కోళప్పం జేరీపురికిఁ జెందిన 'చెల్లప్ప మొదలారు' రచించెను. దానిని తెలుగులో 'సుబ్బరాయలు నాయఁడు' వ్రాసెను. 'షట్ సహోదరి చరిత్ర' యనియు దీనికి నామాంతరము గలదఁట. తమిళదేశములోని మధుర కథాస్థలము. ఈ కథలో వచ్చు సద్వంశీయుఁడగు పాండ్యరాజు నాధారముగాఁ జేసికొని శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు దీనిని క్రీ.శ.7వ శతాబ్దమునాఁటి రచనగా భావించిరి (చూ. 'బాల', ఏప్రిల్, 1953). 'నల్లతంగాళ్' అనఁగా 'మంచి చెల్లెలు' అని యర్థము. ఈమె మధుర నేలిన రామలింగరాజు-ఇంద్రాణి దంపతుల బిడ్డ. ఈమె యన్న నల్లతంబి. ఈ నల్లతంబి తన తలిదండ్రుల మరణానంతరము చెల్లెలిని కాశీరాజున కిచ్చి వివాహము చేసెను. నల్లతంగాళ్‌కు ఏడుగురు సంతానము గలిగిరి. ఆమె కొంతకాలము సుఖముగ నుండెను. ఇంతలో నా కాశీరాజ్యమునఁ బండ్రెండేండ్లు దుర్భర క్షామము సంభవించెను. పిల్లలకుఁ దనకుఁ దిండిలేక నల్లతంగాళ్ అన్నగారింటికి వచ్చెను. వదిన 'మూళియలంగారి మూదేవి చండాలి' నల్లతంగాళును, పిల్లలను మిక్కిలిగా హింసించెను. ఆ బాధలు పడలేక నల్లతంగాళు పిల్లలతో సహ అరణ్యమున నొక పాడుబావిలోఁబడి ఆత్మహత్య చేసికొనెను. నల్లతంబి క్రూరురాలైన తన భార్యను జంపి, తానును ఆత్మహత్య చేసికొనెను.

## 2.1.9. తిరుపతమ్మ కథ:-

క్రీ.శ. 1928లో బాలకవి కృష్ణారావు రచించిన 'తిరుపతమ్మ పాట' యొకటి కలదు. ఇది మార్గ రచనవలె నున్నది కాని జానపద రచనవలె లేదు. జానపదులలో వ్యాపించియున్న కథను యథాతథముగా కృష్ణారావు సంపాదింపలేదు. జానపదకథ నాధారముగఁ జేసికొని, తిరిగి తాను స్వయముగ దరువులలో నీ పాటను రచించెను. ఇది శృంగవరపుకోట ఎఱుకమ్మ పేరంటాలు కథ ననుసరించి వ్రాయఁబడినట్లున్నది. తిరుపతమ్మ పెనుగంచిప్రోలు కమ్మవారు శివరామరాజు- రంగమాంబలకు వేంకటేశ్వరుని వరము వలనఁ బుట్టినది. ఈమె భర్త గోపరాజు అరణ్యమున గోవులను గాయుచుఁ బులిచేఁ జంపఁబడెను. భర్తశవముతో తిరుపతమ్మ సహగమనము చేసెను. ఇది ముద్రిత గేయమగు 'తిరుపతమ్మ పాట'నుబట్టి తెలియవచ్చు విషయములు.

1964లో కృష్ణామండలమున నే నొక జంగమునుండి తిరుపతమ్మ కథను సేకరించితిని. దీనిలోఁ గథ పైదానికన్నఁ గొంత భిన్నముగా నున్నది. ఈ కథ శిథిలమైన ద్విపదలో నీ క్రింది విధముగాఁ బ్రారంభమైనది (6+6+6+4-4+4. మాత్రలు).

*"రామా రామణు రామా, శ్రీరామా రామా  రామా రామా*
*శ్రీశైలా నాథూనీ శిలమొప్పా దలచీ  రామా రామా*
*గైకోను వో శారాదంబాకూ మ్రొక్కీ  రామా రామా*
*అంచితంబుగ నేడూ అనిగిల్లాపురమూ  రామా రామా*
*అనిగిల్లాపురమూలో ఆ కమ్మవారూ  కమ్మావారూ*
*ఆ కొల్లూ సోమయ్యా కొల్లూ రంగమ్మా  కమ్మావారూ*
*ధనహాని కారెంతో ధనరీకు లండీ  కమ్మావారూ*
*ఏడూ అంత్రాలాదీ మేడున్నాదమ్మా  రామా రామా*
*లేదమ్మా రంగమ్మకూ సంతూ లేదమ్మా  రామా రామా"*

ఇది కృష్ణా మండలమున జరిగిన కథ. జగ్గయ్యపేట దగ్గఱున్న 'పెదకంచిప్రోలు' లేక 'పెనుగంచిప్రోలు' తిరుపతమ్మ అత్తవారి యూరు. పుట్టిల్లు 'అనిగిళ్లపురము'. తలిదండ్రులు కొల్లి సోమయ్య, రంగమ్మ. భర్త కాకాని గోపయ్య. అత్తమామలు వెంకమ్మ, కృష్ణయ్య.

అనిగిళ్లపురములో కొల్లి సోమయ్య రంగమ్మ దంపతులకు లేక లేక వేంకటేశ్వరుని వరమువలన తిరుపతమ్మ పుట్టినది. పుట్టఁ గనే ఈమె తన దైవాంశను జూపించినది:-

*"వాలా వాలంటాను జన్మించినాది - ఆ బాల*
*ఎడమ చేతిలోనూ ఏపామండాలమ్మా- రామా రామా*
*కుడి హస్తములోనూ కుంకాలా భరిణీ  ,,*
*ఏపా మండలలోను ఎండీ బెత్తాలూ  ,,*
*ఆ యెండీ బెత్తాలూ ఎదరా జూపిందో  ,,*
*ఎదరున్నా ఏడిళ్లూ దహనమైనాయో  ,,*
*ఈదిలో ఆ మానూ ఇరిగే పడ్డాదో  రామా రామా"*

ఈ బాలకు మూఁడవయేట మ్రొక్కు చెల్లింతుమని తల్లి దండ్రులు వేంకటేశ్వరునికడ మ్రొక్కుకొనియుండిరి. కాని మ్రొక్కు చెల్లించుట మఱచిపోయిరి. తిరుపతమ్మ పెరిగి పెద్దది కాఁగా, పెదకంచిప్రోలులోఁ బేదవారైన కాకాని కృష్ణయ్య వెంకమ్మల కొడుకు గోపయ్యకిచ్చి పెండ్లి చేసిరి. వేంకటేశ్వరుఁడే ఈ పెండ్లి జరుగునట్లు చేసెను. కోడలు వచ్చినప్పటినుండి వారు ధనవంతులైరి. తల్లి రంగమ్మకు స్వప్నములో వేంకటేశ్వరుఁడు కనుపట్టి తిరుపతమ్మ మ్రొక్కు సంగతి జ్ఞప్తికిఁదెచ్చెను. రంగమ్మ సోమయ్య కలసి తిరుపతి వెడలిరి. కాని తిరుపతమ్మను దీసికొని పోలేదు. తిరుపతిలో సోమయ్యకు దేవుని గుడిముందు పాతుటకై రెండు స్తంభములు కావలసివచ్చెను. అతఁడు గొడ్డలి పుచ్చుకొని కొంగల మల్లయ్య పర్వతము మీఁదనున్న 'ఆకుసన్న ఆడమాను, కొమ్మసన్న కోటాలమాను' నఱుకుచుండెను. వేంకటేశ్వరుని మహిమవలన నిక్కడ తండ్రి చెట్లకొమ్మలు నఱకుచుండఁగా, నక్కడ పెదకంచిప్రోలులో తిరుపతమ్మకు వ్రేళ్లూడిపోయి, చీము రక్తముతోఁ గుష్ఠరోగము వచ్చెను. తిరుపతమ్మ భర్త, గొల్లవారి కనకమ్మను, చాకలి జగ్గయ్యను నామెకు సేవచేయుటకై పెట్టెను. కాని అత్తగారు మాత్రము తిరుపతమ్మను మిక్కిలిగ హింసించి, గోపయ్య యూరలేని సమయమున నామె నింటినుండి గెంటివైచెను. తిరుపతమ్మ ఆ యూరంతయుఁ గాలిపోవునట్లు శపించి, తండ్రితోఁ బుట్టింటికిఁ బోయెను. గోపయ్య మందనుండి వచ్చి, మరల భార్యను దీసికొని వచ్చెను. తిరుపతమ్మకు వ్యాధి సోకుటతో నామె సౌందర్య మంతయుఁ బోయినది. గోపయ్య విరక్తి చెంది, కొంగల మల్లయ్య పర్వతముపై మంద కట్టెను. అక్కడ 'తోకతో తొమ్మిది మూళ్లు' పెద్దపులి యున్నదనియు, నక్కడ మంద కట్టవలదనియు తిరుపతమ్మ భర్తను వారించినది. ఎన్ని చెప్పినను గోపయ్య వినలేదు. గోపయ్య మందలో నిద్రించుచుండఁగా నర్ధరాత్రి వేళ పెద్దపులి వచ్చి, ఆతని మంచము ప్రక్కనే యున్న 'జన్యావు'ను జంపివేసినది. గోపయ్య కోపముతోఁ బండ్రెండు కట్ల బాణాకఱ్ఱను జేతఁబట్టి, పులిని వెంబడించెను. దానితో గంటసేపు యుద్ధము చేసి, కడకుఁ బ్రాణములు గోల్పోయెను. తమ్ములతని పాదమును హస్తమును దెచ్చి తిరుపతమ్మకిచ్చిరి. వానితోఁ దిరుపతమ్మ పెదకంచిప్రోలులో మాదిగ రామయ్య పొలములో సహగమనము చేసెను. గుండమునఁ బడుటకు ముందు తల్లి దండ్రులకు వంశముండదనియు, నత్తవారు నిఱుపేదలగుదురనియు శపించెను. వ్యాధితో బాధపడుచున్న కలెక్టరుగారికి వ్యాధి పోఁగొట్టినది. పెదకంచిప్రోలులోఁ దిరుపతమ్మకు గుడికట్టించిరి. అక్కడ చైత్రశుద్ధ పూర్ణిమ నాఁడు ఏటేట తీర్థము జరుగుచున్నది.

ఈ మౌఖికగాథ యొడిదుడుకులు లేని ప్రసన్నమగు శైలిలో సాఁగినది. తిరుపతమ్మ తండ్రి సారెకోరుమని యడుగఁగా తిరుపతమ్మ:-

**"పుట్టూ సారె లేందే పెట్టూ సారేలా? - కన్నాతండ్రీ**
**పసుపు కుంకుమ ఉంటే పది లక్షాలందీ-తిరుపాతమ్మా**
**పసుపు కొడతా తల్లి పాటాపాడిందో- ,,**
**శుభమంట కన్నోరిళ్లు సుఖము కోరిందీ- ,,**
**జయమంట అత్తోరిళ్లు జయమూ కోరిందో- ,,**
**ఇరుగు పొరుగోరంతా దీవించారండీ- తిరుపాతమ్మని**
**వర్ధిల్లు తిరుపాతీ! వర్ధిల్లావమ్మా- తిరుపాతమ్మా**
**కూతుళ్లా తల్లీవై కోరీవర్ధిల్లూ- ,,**
**కోమాళ్లా తల్లీవై కోరీ వర్ధిల్లూ- తిరుపాతమ్మా"**

సౌందర్యరాశియగు భార్యకుఁ గుష్ఠరోగము సోఁకినదని విచారించుచున్న గోపయ్యకు, నత్తవారిచ్చిన 'జన్యటావు'ను పులి చంపగా మనోవేదన మఱింత హెచ్చినది. "ఇంటిదగ్గఱ లక్ష్మి రోగముచే నట్లైనది; మందదగ్గఱ లక్ష్మి పులిచే నిట్లయినది" అని యతఁడు తమ్ముళ్లతో వాపోవుట కడు హృదయవిదారకముగా నున్నది. రాత్రివేళ వచ్చి పులి, జన్యావును జంపి కొండబిలములోనికిఁ దీసికొనిపోయినది:-

**"భళ్లూనా తెల్లారె భూనూదుదయించే- రామా రామా**
**చూచాడూ గోపయ్య ఏమన్నాడండీ- గోపయ్యా**
**పోయింది మన కొంపా ఇహమూలో పోయే- తమ్మూలారా**
**ఇంటికాడ లక్ష్మిమికీ వ్యాధి ఖర్మ మాయే- తమ్మూలారా**
**దొడ్డికి లక్షీమీ తొలగే పోయిందో- తమ్మూలారా**
**చస్తానా పులినోటా చస్తానూ నేనూ- తమ్మూలారా**
**కొడతానా పులినైనా కొడతానూ నేనూ- తమ్మూలారా"**

ఈ తిరుపతమ్మకథ చలనచిత్రముగా గూఁడఁ దీయబడినది. కాని యందుఁ గథయంతయు మార్చివేయఁబడినది. తిరుపతమ్మ భర్త వేశ్యాలోలుఁడై భార్యను అనాదరించును. అత్త, ఆడుబిడ్డలు తిరుపతమ్మను బాధింతురు. ఆమెపై రంకుతనమును మోపుదురు. క్రోధముతో భర్త ఆమెను హత్యచేసి, పిదప సత్యమును గ్రహించి తానును హత్యచేసికొనును. ఇట లక్ష్మమ్మకథ అనుకరింపఁబడినట్లున్నది.

## 2.1.10. ఎఱుకల నాంచారి కథ:-

ఇది తెలంగాణమునకు సంబంధించిన కథ. ఇందు గోల్కొండ నవాబు ప్రసక్తి యుండుటచే క్రీ.శ. 18వ శతాబ్దమునకుఁ జెందిన కథగాఁ దలపఁవచ్చును. తెలంగాణమున శారదకాండ్రు దీనిని బాడుదురు. ఆంధ్రప్రాంతమున జంగములు పాడుచున్నారు. కృష్ణా మండలమున నొక జంగము దీనిని బాడుచుండఁగా నేను సేకరించితిని. తెలంగాణమున శారదకాండ్రు పాడు కథను రుక్మాభట్ల విధుమౌళిశర్మగారు సంపాదించి, సంస్కరించి ప్రకటించియున్నారు. డా॥బి. రామరాజుగారు ఆ కథనుగూర్చి విపులముగా వ్రాసియున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౬౨౭-౬౩౪).

నాంచారి తంగెళ్లపల్లెలో వెలమ కోటన్న-నాగమ్మ దంపతులకు దుష్టనక్షత్రమునఁ బుట్టినది. అందుచేఁ దలిదండ్రులామె నెఱుకల వారికిచ్చివేసిరి. ఆ బాలిక యెఱుక చెప్పుటలో గొప్ప ప్రజ్ఞ సంపాదించి, గోల్కొండ నవాబును గూడ మెప్పించెనఁట. చివరకు నాంచారి గర్భిణిగా నున్నప్పుడు కొల్లాపురి గట్టున నొక లంబాడీ తండలో నెఱుకఁ జెప్పుచు, నా లంబాడీలచే బలిగా జంపఁబడినది. గోల్కొండ నవాబీమెకు తంగెళ్లపల్లెలో గుడి కట్టించెను. ఇది తెలంగాణమునఁ బ్రచారముననున్న కథ.

1964లో నేను కృష్ణామండలమున సంపాదించిన కథలో నెఱుకల నాంచారి స్వగ్రామము పల్నాటిలోని 'గురజాల' యనియు, నామె తలిదండ్రులు వెలమ నరసయ్య- వెలమ సీతమ్మ యనియు, భర్త యెఱుకల నాయకుఁడగు చోడన్న యనియు, అత్తగారు ఎలమంచమ్మ యనియుఁ గలదు. ఇందు కొన్ని అద్భుత కల్పనలు కలవు. లంబాడీవాని యెదుట నాంచారి నిప్పును జెంగులో వేసికొనుట వంటి కొన్ని అద్భుత చర్యలు చేసెననియు, లంబాడీవారు బలి యిచ్చుటకై తన్ను జంపఁబోగా, నాంచారి పిట్టగా మాఱి ఆకాశమున కెగిరి పోయినదనియు, నప్పుడు లంబాడీవాడు డేగగా మాఱి యా పిట్టనుబట్టి దెచ్చెననియు నిందు గలదు. నేను సేకరించిన మౌఖికగాథలోఁ జక్కని కవితారసమున్నది. విధుమౌళిశర్మగారి వంటి పండితులచేత సంస్కరింపఁబడకుండగనే, ఈ వీరగాథలో జానపదుల సహజ నిర్మలకవిత్వ మెడనెడ గోచరించును. "రామా రా, మఱురామా, శ్రీరామా, రామా- ఓశ్రీరామా, రామా" (6+6+6+4-2+6+4) అను వరుసలో నీకథ కొనసాఁగును. నాంచారి వెలమల యింట దుష్టనక్షత్రమునఁ బుట్టుటను జానపద గాథాకారుఁ డెట్లు వివరించినాఁడో చూడుఁడు:-

| | |
|---|---|
| *"వెలమోరీ ఆ బాలా వేలా కలగిందీ-* | *ఓ వేలా కలిగిందీ* |
| *పుట్టూ పూదారమునా ఓ బాలగంధీ-* | *ఓ బాలాగంధీ* |
| *పుట్టూ కోరలతోనూ జన్మించేనండీ-* | *ఓ జన్మించే నండీ* |
| *వేలుదేసీ గోళ్లాతో బాలా కలిగిందీ-* | *ఓ బాలా కలిగిందీ* |
| *అమ్మాయి కలిగేనా గడి చూదారండీ-* | *ఓ గడి చూదారండీ* |
| *ముచ్చాలా దర్బాజీ ముందూ కొరిగిందీ-* | *ఓ ముందూ కొరిగిందీ* |
| *పగడాలా దర్బాజీ పడిపోయేనండీ-* | *ఓ పడిపోయేనండీ* |
| *ఆరూ దొడ్డెల మందా ఆవూలా మందా-* | *ఓ ఆవూలామందా* |
| *ఆవూలా మందంతా అతమయ్యానాదీ-* | *ఓ అతమయ్యానాదీ"* |

వెలమలు నాంచారి నెఱుకలవారి కిచ్చివేసిరి. ఆమె యెఱుకల యింటఁ బెరుగుచు ననేక మంత్ర తంత్ర విద్యలు నేర్చినదఁట. ఆమె మంత్ర కౌశలమునుగూర్చి గాథాకారుఁడిట్లు పాడెను:-

*"ఇక ఏడూ సమచ్చరాలూ ఎళ్లా సదివిందీ*
*మడివేలా మంత్రాలూ బాగా నేర్చిందీ*
*పొడిచేటీ పొద్దూనా నెలగడుతాయుందీ*
*పారేటీ గంగానీ ఆగడతాయుందీ*
*పచ్చానీ ముచ్చాలూ ఎండాగడుతుందీ*
*మేసేటీ బసవయ్యా మేరాగడుతుందీ*
*ఈడేరే ఆ బాలా యింటా నున్నాదీ"*

నాంచారి కామె భర్త చౌడన్న యెఱుకల బుట్టనల్లి యిచ్చుట యెంతయో స్వభావసిద్ధముగా వర్ణింపఁబడినది:-

*"కట్టామీదా కత్తికి పదునెట్టీనాడూ*
*తనువుండే వనమూకూ తావెళ్లీనాడూ*
*చిక్కముతో కోశాడూ చిట్టీతా చువలూ*
*ప్రేమాతో కోశాడూ పెద్దీతా చువలూ*
*ఇకమూడూ రోజూలూ ఆరేసీనాడూ*
*సుక్కూరారము నాడూ సువ్వా సించాడూ*
*మంగాళారము రోజూ మట్టల్లీనాడూ*
*బుధావారము రోజూ బుట్టల్లీనాడూ*
*కుంచేడూ ముచ్చాలూ కుదకూర్చిన బుట్టా*
*మానేడు ముచ్చాలూ మలచీనా బుట్టా"*

ఇంతవఱకును ముద్రితములై ప్రసిద్ధమగు పేరంటాండ్ర కథలనుగూర్చి చర్చింతిని. వీనినిగూర్చి పలువు రీ వఱకే విపులముగా విమర్శించి యుండుటచే నేను సంక్షిప్తముగాఁ జెప్పితిని. ఇఁక నేను సంపాదించిన అముద్రిత వీరగాథలనుగూర్చి ముచ్చటింతును. పైన దెల్పిన తిరుపతమ్మ కథ, ఎఱుకల నాంచారి కథ- యను రెండును గూడ యథాతథముగా ముద్రింపఁబడలేదు కావున నముద్రిత వర్గము క్రిందికే వచ్చును.

## 2.1.11. రావులమ్మ కథ:-

ఇది తెలంగాణమునకు- ముఖ్యముగా నల్లగొండ మండలము నకు సంబంధించిన కథ. అముద్రితము. దీనికి రెండు రకముల పాటలు వ్యాప్తియందున్నవి. జానపదులు కోలాటము వేయుచుఁ బాడు పాట యొకటి. ఇది తెలంగాణమున వ్యాప్తియందున్నది. ఇది లఘు గేయము; సంభాషణాత్మకము. జంగములు బొబ్బిలి కథ వరుసలోఁ బాడుచున్న పాట వేఱొకటి. ఇది పెద్ద కథ; ఆఖ్యానాత్మకము. రామరాజుగారు మొదటి రకపు పాటను సంపాదించి, దానిని వివరించి యున్నారు. నేను జంగములు పాడు బొబ్బిలివరుసలోని పాటను 1964లో పశ్చిమ గోదావరీ మండలమున సంపాదించితిని.

'రాములమ్మ' శబ్దమే జానపద వ్యవహారమున 'రావులమ్మ'గా మాఱినది. ఈమె కన్నవారి యూరు 'వినుకొండ' యనియు, అత్తవారి యూరు 'ధనికొండ' యనియు గాథాకారుఁడు దెల్పియున్నాఁడు. ఈమె భర్త భీమిరెడ్డి, కుమారుడు సూర్యరెడ్డి, అత్తగారు వెంకాయమ్మ, మామ బసివిరెడ్డి, కులము బూనిస రెడ్లు. తల్లిదండ్రులు మంద సుబ్బిరెడ్డి, అచ్చమ్మ. ఈ రావులమ్మకథ బాలనాగమ్మకథను బోలియుండును.

కడుపునొప్పితో బాధపడుచున్న రావులమ్మను లంబాడివాఁడు మోసగించి తీసికొనిపోవును. అట నామె లంబాడివానికి లొంగక వ్రతము నారంభించును. పావురముచే భర్తకు వార్త నంపును. భర్త భీమారెడ్డి లంబాడివానిపై దండెత్తిరాఁగా, లంబాడివాఁడతనిని శిలగా మార్చివేయును. రావులమ్మ పుత్రుఁడు వచ్చి ఆమె చెఱను బాపును. తండ్రిని బ్రతికించును. (దీనిని బట్టి ఇది యచ్చముగా బాలనాగమ్మ కథ వలెనే యున్నదని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును.) లంబాడి వాని చెఱలో నుండుటచే రావులమ్మను బరిగ్రహించుటకు భీమారెడ్డి సంశయించెను. అందుచే రావులమ్మ యగ్నికుండమున దుమికి తన పాతివ్రత్యమును జాటెను. భీమారెడ్డి యామె పాతివ్రత్యమును నమ్మి యింటికిఁ దోడ్కొని పోయెను. కాని ఇరుగు పొరుగువారు రావులమ్మను సూటిపోటి మాటలాడసాఁగిరి. జనులలో గుసగుసలు హెచ్చెను. తన మూలమునఁ దన భర్తకు అవమానము వచ్చుచున్నదని రావులమ్మ రెండవ మాఱు అగ్నికుండమునఁబడి దేహమును దృజించి, పేరంటాలయ్యెను. భర్త ఆమెకు గుడిని గట్టించి, జాతరలు చేయించెను. నేను సంపాదించిన కథ ఈ క్రింది విధముగాఁ బ్రారంభమగును:-

***"పదమటా రాజ్యాన రావులమ్మో రావులమ్మ-సిరిగల్ల దేవతా రావులమ్మ***
***మందవారి కూతురా ,, ,, రెడ్డివారి కోడాలూ ,,***
***అత్తవారు ధనికొండా ,, ,, కన్నవారు వినుకొండ" ,,***

ఇది ప్రారంభములోఁ గాననగు వరుస. మధ్యలో నింకను రెండు మూఁడు వరుసలున్నవి. రావులమ్మభర్త లంబాడితండా మీఁదఁబడి యుద్ధము చేయుట బాగుగా వర్ణింపఁబడినది:-

***"ఆరు లక్షలా రెడ్డివారూ లంబాడి తండమీద పడ్డారూ***
***నరుకుత వుంటే నాయినా నల్లశిరసులే రాలేను***
***కొడతావుంటే నాయినా కొవ్వుదబ్బలే పడేను***
***రకతకాలవై పోతుంది లంబడితండా పోతుంది***
***ఎఱ్ఱకొండలే పోయాయీ ఏరులు సాగేపోయాయి"***

## 2.1.12. సరోజిని కథ:-

ఇది కూడ తెలంగాణమున వ్యాప్తి గాంచిన కథయే. దీనిపైఁ జిన్నపాట యొకటి, పెద్దకథ మఱియొకటి కలవు. పెద్దకథను కర్నూలు మండలమున నొక జంగము పాడుచుండఁగా నేను వ్రాసికొంటిని. రామరాజుగారు సంపాదించిన చిన్నపాటను గూడఁ బరిశీలించితిని. ఇది యేక తాళమున, రూపకగతిలో, 6+6+6+6 మాత్రలొక పాదముగా సాఁగు చక్కని వరుసలోనున్న కథ. **"వందనమమ్మా! నా తల్లీ! చక్కని బాలా సరోజినీ!"** అనునది పాదాంత పదము. ఇది మాత్రము 4+4+6- 4+4+6 మాత్రులుగా నడచుచున్నది.

నల్లగొండ మండలములోఁ బుట్టిన సరోజినికిఁ జిన్నతనము ననే తల్లిదండ్రులు గతించిరి. పెద్దయన్న ప్రతాపరెడ్డి, వదిన నీలమ్మ ఈమెను బెంచసాగిరి. తక్కిన యన్నలు వదినలు నీమెను గడు గారాబముతోఁ జూచుచుండిరి. ఈమె పుట్టిన తరువాత వారు ధనధాన్య సంపదలతోఁ దులఁదూఁగుచుండిరి. అందుచే నీ సరోజినికిఁ బెండ్లి చేసి, యత్తవారింటి కంపుటకు వారి కిష్టము లేకుండెను. ఆమె కూడఁ దనకుఁ బెండ్లి వలదనియే చెప్పుచుండెను. కొంతకాలమునకు వదినె లామెను జిత్రహింసలు పెట్టసాఁగిరి. ఇంటిలోని పనులన్నియు నామెచేతనే చేయించుచుండిరి. అన్నలకు ఈ విషయము తెలియదు.

ఒకనాఁడు సరోజిని వారి జీతగానితోఁ గలసి ఆవుల వెంటఁ బోయెను. ఆ యరణ్యమున నామెకు మిక్కిలి దాహమయ్యెను. ఎక్కడను నీళ్లు లభింపలేదు. దప్పికకుఁ దాళలేక ఆమె యెద్దుమూత్రమును ద్రాగెను. ఇట్లు త్రాగఁగా నామెకు గర్భము వచ్చెను. వదిన లామె ననుమానించిరి. ఆమె శీలమును శంకించి మఱింతగ బాధింపఁ జొచ్చిరి. ఆమెయన్నలతోఁ జెప్పి, సరోజినిని జంపివేయుఁడనిరి. భార్యల మాటలు విని ఆమె యన్నలు సరోజిని నరణ్యమునకుఁ గొనిపోయి చంపివేసిరి. ఆమె గర్భమునుండి కోడె పుట్టెను. ఆమె శక్తి రూపమును ధరించి ఊరికిఁబోయి, అన్నలను వదినెలను జంపి, ఆ గ్రామమంతయు నాశము చేసెను. ఊరూరను ఆమెకు గుళ్లు గోపురములు గట్టి, ప్రజలు పూజింపసాఁగిరి:-

***"వందనమమ్మా నా తల్లీ! చక్కని బాలా సరోజినీ!***
***ఏదేశానో పుడితమ్మా కాపోల్లా సరోజినీ!***
***నిండూగా తూరుపూ నలగొండా దేశాన***
***పయిమూలా దేశములో నువు బుట్టేనావమ్మా!"***

ఈ విధముగాఁ బ్రారంభమగును. సరోజిని అదృష్టదేవత యని ఆమెకు ఏడేండ్ల ప్రాయముననే మనువునడుగ వచ్చిరఁట:-

***"ఏడేండ్లా ప్రాయానా తల్లికి మనుమూ లొచ్చేనూ***
***ఎక్కడెక్కడీ కాపులమ్మ తల్లీ నడగా వచ్చీరీ***
***అంబారీ మీదమ్మా తల్లీ నడగా వచ్చీరీ***
***పచ్చానీ పాలకి మీదా తల్లీ నడగా వచ్చీరీ***
***రాజాధీ రాజూలూ తల్లీ నడగా వచ్చీరీ***
***తక్కెట్లో బంగారం తల్లికి పెడతా మన్నారూ"***

అన్నలామెకుఁ బెండ్లిచేయ తలంచగా, సరోజిని వారితోఁ బలికిన తీరు హృదయమును గరఁగించును:-

***"నేనూ గట్టేటి చీరాలూ మీకూ బరువూ లైనాయా?***
***నేనూ బెట్టేటి సొమ్మూలూ మీకూ బరువూ లైనాయా?***
***నేనూ తినేటి భోజనమూ మీకూ యాష్టకొచ్చిందా?***
***వొద్దొద్దూ వోరన్నా నన్నూ మనుమూ లీయకురా!...***
***గోడుగోడునా నా తల్లీ గోటా కన్నీరు తీసింది***
***కండ్లా నీరూ నా తల్లీ కడవాలాకు దీసిందీ"***

### 2.1.13. ఈడిగ దేవమ్మ కథ:–

ఇది తెలంగాణమున వ్యాప్తియందున్న మఱియొక పేరంటాలు కథ. దీనిని మహబూబునగర మండలమున జడ్చర్లలో సంపాదించితిని. ఇది 20వ శతాబ్దమున నిటీవలనే జరిగిన కథగా నున్నది. సరోజినికథ వరుసలోనే యున్నది. మాత్రలు పాదమునకు 6+6+6+6. దీని ప్రారంభమిట్లుండును: పాడుటలో నొక్కొక్కప్పుడు గణములు సాఁగి మిశ్రగతియు గోచరించును. అప్పుడు పాదమునకు 28 మాత్రలుండును. 14 మాత్రలకు విఱుగును. ఈ 14 మాత్రలును 4+4+4+2గా నుండును.

*"వందనమమ్మా! దేవమ్మా! ఈడీగోళ్ల దేవమ్మా!*
*నీ వూరూ నీపల్లే నీ దేశా మెక్కడనూ? ॥వందన॥*
*మాగీలో నీవూరూ మాగీ వున్నది దేవమ్మ ,,*
*నీ మగడూ సూర్యగౌడు నీ కొడుకూ దేవగౌడు ,,*
*మాగీలో నీవూరూ మఱి ఎట్లాగున్నదిరా ,,*
*ముత్యాలా ముగ్గులూ రత్నాలా రంగిల్లీ ,,*
*ఏడేడీ ఏడౌలా ఏడంత్రాల మేడమ్మా" ॥వందన॥*

ఇది మహబూబునగరు మండలమున భావనగరము తాలూకా 'మాగి' అను గ్రామములో జరిగిన సంఘటన. ఈ సంఘటన జరిగినది సంగారెడ్డిపాలెమని మఱికొందరు చెప్పుచున్నారు. దేవమ్మ, కల్లుగీసి యమ్ముకొను సెట్టిబలిజ కులమునకుఁ జెందినది. వీరిని ఈడిగ వారనియుఁ బిలుతురు. ఈమె భర్తపేరు సూర్యగౌడు; కుమారుడు దేవగౌడు. వీరు 'దండు ఈడిగ' వారఁట. మాగి గ్రామములోఁ దమయింటి ముందున్న కలివేప చెట్టుక్రింద గద్దెపీటపై కూర్చుని కల్లు అమ్ముచుండెది దేవమ్మ. ఈమె మిక్కిలి కరుణామయురాలు. పేదలకుఁ జాలతక్కువ వెలకే కల్లు పోసెడిది. ఇట్లుండ, మాగి గ్రామములో నొక పెద్ద చెఱువును ద్రవ్వవలసి వచ్చినది. వందల కొలఁది 'వడ్డివాళ్లు, ఉప్పరవాళ్లు, కాశివాళ్లు, తెలుగువాళ్లు' ఆ చెఱువు త్రవ్వుటలో నిమగ్నులైరి. వీరందఱకును మేస్త్రి ఉప్పరి బచ్చన్న. ఈ బచ్చన్న ఆ కూలీలందఱకును నీడిగ దేవమ్మ దగ్గఱ నప్పుపెట్టి కల్లు పోయించుచుండెను. గుత్తదారుఁడు రాగానే ఆమె పైకము నిచ్చివేయుదుననియు, ఆమెకుఁ జీర రవిక పెట్టుదుననియు బచ్చన్న ఆమె నొప్పించెను. దేవమ్మ ఆతనిని నమ్మి కూలీలకుఁ గల్లు పోయుచుండెను.

'కట్టమీద మైసమ్మ' యను గ్రామదేవత తనకు బలినీయకుండ బచ్చన్న చెఱువు త్రవ్వించుచుండెనని కోపించి, యా చెఱువుకట్టను బడఁగొట్టుచుండెను. రాత్రి వేసిన కట్ట పగలు పడిపోవుచుండెను. పగలు వేసిన కట్ట రాత్రి పడిపోవుచుండెను. కూలీలందఱికిని జ్వరములు వచ్చి పడిపోయిరి. కొందఱు చనిపోయిరి. బచ్చన్న కేమియుఁ దోచక యెఱుకల నాంచారిని రప్పించి, యెఱుక చెప్పించెను. ఆ యెఱుకలో మైసమ్మ పూని, తనకుఁ జెఱువునకు నిండు చూలాలిని బలి యిచ్చినచోఁ జనిపోయిన కూలీలను బ్రతికింతు నని చెప్పెను. బచ్చన్న యొప్పుకొనెను.

ఉప్పరి బచ్చన్న గర్భిణి స్త్రీకై వెదుక నారంభించెను. ఆతని కొక యాలోచన తట్టెను. ఈడిగ దేవమ్మను జెఱువునకు బలి యిచ్చినచోఁ దానీయవలసిన బాకియుఁ దీరును, దన మ్రొక్కుబడియు నెఱవేరును. అప్పుడామె నిండుగర్భిణియుఁగూడ. అందుచే నతఁడు మైసమ్మగుడి ముందు పెద్ద గోతిని త్రవ్వి, దానిపైఁ గట్టెలు పఱచి, ఆ కట్టెలపై సన్నని జల్ల పఱచి, ఆపైన గుర్తు తెలియకుండ పలుచగా నిసుకఁ జల్లినాఁడు. దేవమ్మను బిలిచినాడు. ఆమెకు దుశ్శకునము లాయెను. ఆమె రానన్నది. బచ్చన్న ఆమెను బ్రతిమాలి చీరయు రవికెయుఁ బెట్టెదననియు, కట్టమీఁదఁ బైకము లెక్కపెట్టి యిత్తుననియుఁ జెప్పెను. ఆమె అలంకరించుకొని వచ్చినది. ఆ కప్పుపెట్టిన గోతిపై రూపాయలను బోసి, లెక్కపెట్టుకొనుమని జెప్పెను. ఆమె నడచి వెళ్లినది. ఆ గోతిలోఁ బడిపోయినది. వెంటనే బచ్చన్న యామెపై మట్టిని బోయించినాఁడు. ఆమె చనిపోయి దేవతయై వెలసినది. బచ్చన్న కన్నులు పోఁగొట్టినది. పేరంటాలైన ఈడిగ దేవమ్మ ప్రజలకు ఈప్సితార్థముల నిచ్చుచు నేఁటికిని బూజింపఁబడుచున్నది.

మేస్త్రీ బచ్చన్న కాపట్యముతో దేవమ్మను బైకముఁ దీసికొనుటకుఁ గట్టుమీఁది కాహ్వానించుట, ఆమె రాననుట, బచ్చన్న ఆమెను చెల్లెలిగా సంబోధించి, చీర రవికె పెట్టెదనని యాశపెట్టుట, ఆమె స్నానము చేసి, అలంకరించుకొని బయలుదేరుట– కడుఁ జక్కగ వర్ణింపఁబడినవి:–

*బచ్చన్న: "రావమ్మా! దేవమ్మా!– కట్టామీదికి దేవమ్మా!*
*చెరువూ ముగిసీ పోయిందీ– కట్టా ముగిసీ పోయిందీ*
*లెక్కలు మాకయినావీ– గుత్తాదారు ఓయమ్మ*
*పైకము మాకిచ్చిండూ– నీ బాకీ నీకిస్తాము"*

*దేవమ్మ: "అయితే తేరా బచ్చన్నా!– ఉప్పారీ బచ్చన్నా!"*

*బచ్చన్న: "కట్టామీదికి రావమ్మా!–నీ కల్లూ పైకము ఇస్తాము"*

*దేవమ్మ: "నీ కట్టామీదికి రానన్నా–నా కల్లూ పైకము ఇవ్వన్నా"*

*బచ్చన్న: "అట్లాకాదు ఓయమ్మా!– నీకు– కొత్తా చీరా పెడతాము*
*అట్లాకాదు ఓయమ్మా!– నీకు కొత్తా రయికా పెడతాము*
*నీ కొచ్చీన భయమేమీ?– నీ కొచ్చీన చింతేమీ?*
*నా చెల్లేల దేవమ్మా!– ఈడీగోళ్ల దేవమ్మా!*
*రావమ్మా దేవమ్మా! – ఈడిగోళ్ల దేవమ్మా!"*

అప్పుడు దేవమ్మ అతని మాటలు నమ్మినది. 'అయితే మంచిది నిలబడు బచ్చన్నా! –నేను స్నానము చేసి వస్తాను' అన్నది. ఆమె స్నానము చేసి ఆలంకరించుకొని బయలుదేరుట యెంత రమణీయముగ వర్ణింపఁబడినదో చూడుడు:–

*"జాలారూ బండెక్కీ - జలకంబూ లాడిందీ
ఏడూ వరుణల సొమ్మైన - అమ్మావారు పెట్టిందీ
పట్టూ మందోళి చీరేను- పగులూ చుక్కల రవికేను
తీరైనా బొమ్మల్లే- తిరుమణి రేఖా పెట్టిందీ
కుచ్చూగా చెప్పూలూ- కాళ్లాకూ ఏసింది
కడప బయటకూ ఎళ్లిందీ- అమ్మావారూ దేవమ్మ!"*

నాటకములోని 'గండము'వలె సాఁగిన ఈ సంభాషణ, వర్ణన రాబోవు ఘోరహత్యను సూచించుచు శ్రోతల హృదయములను గలఁచి వేయును.

గోతిలోఁ బడిపోయిన నిండు చూలాలు దేవమ్మ, ఉప్పరి బచ్చన్నను బ్రతిమాలుట మిక్కిలి హృదయవిదారకముగా నున్నది:-

*"అన్నా రారా బచ్చాన్నా!- మేస్త్రీరోళ్ల బచ్చన్నా!
ఏ పాపం చేస్తన్నా?- ఏమీ దోషము చేస్తన్నా?
నీకు కల్లు ఊరికే పోస్తన్నా!- నేను పైసలు అడుగా బోనన్నా!
పైసలు ఏమీ ఒల్లన్నా,- నన్నూ మీదికి తీయన్నా
కల్లు పైసలూ అడుగనురా,- నీ కాళ్లు మొక్కుత బచ్చనా!
నేనూ ఆడా పిల్లనురా- మేస్త్రీరోళ్ల బచ్చన్నా!
నాకొక్క కొడుకన్నా - మేస్త్రీరోళ్ల బచ్చన్నా!
కొడుకు ముద్దులూ తీరాలేదు- మేస్త్రీరోళ్ల బచ్చన్న!"*

తన్ను బ్రతికించినచోఁ గల్లుబాకీ చెల్లించ నక్కఱలేదఁట; కల్లు యూఱకయే పోయునఁట; తనకుఁ గొడుకుముద్దులు తీరలేదట. పాపము, ఆ రాక్షసుని క్రూరకృత్యమున కా నిండు చూలాలి ప్రాణమెంతగ క్షోభించినదో కదా! ఇంత బ్రతిమాలినను ఆ కర్కశుని హృదయము ద్రవించలేదు. అతఁడెంత రాక్షసత్వమును బ్రదర్శించెనో చూడుఁడు:-

*"ఎక్కడి అన్నా ఓయమ్మా!- ఎక్కడి చెల్లెలు ఓయమ్మా!
కల్లూ బాకీ తీరింది- నా దేవుని మొక్కూ చెల్లిందీ"*

### 2.1.14. అంజమ్మ కథ:-

ఇది పశ్చిమ గోదావరీ మండలమున పోలవరము తాలూకా పట్టిసీమ గ్రామములో జరిగిన యొక గర్భిణిస్త్రీ హత్య. అముద్రితము. దీనిని గోదావరి, కృష్ణా మండలములలోని జంగములు పాడు చుందురు. పశ్చిమ గోదావరి జిల్లా పెరవలి గ్రామములో 28-6-1964న నీ కథను సేకరించితిని. ఇంగువ నరసన్న యను జంగము దీనిని బాడి వినిపించెను. ఇది ద్విపద వికారమైన రచన. కాని పాడుటలోఁ బాదమునకు 12+10+5 మాత్రలుగా సాఁగుచుండును. కామమ్మ కథలో వలెనే శోకాలాపన హెచ్చు.

పశ్చిమ గోదావరి జిల్లా, పోలవరము తాలూకాలోని పట్టిసీమ యను గ్రామమీమె పుట్టిల్లు. తెలగ (కాపులు) వర్ణమునకుఁ జెందిన పూసల వెంకమ్మ, రామన్న యీమె తల్లిదండ్రులు. ముగ్గురన్నల తరువాత అంజమ్మ పుట్టినది. చిన్నతనముననే తల్లిదండ్రులు గతించఁగాఁ బెద్దన్న యగు నప్పన్నయు, వదినయగు భద్రకాళియు నీమె నతిగారాబముగాఁ బెంచి, కృష్ణా మండలములోని రాళ్ల గణపవరమునఁగల ఆకిన గంగయ్య కిచ్చి బెండ్లి చేసిరి. కొంత కాలమున కీమె యన్నదమ్ములు తమ నూటయేబదియేడు ఎకరముల భూమిని పంచుకొనిరి. ముగ్గురును మూఁడేబదులు పంచుకొని, పైనున్న యేడెకరముల భూమిని దాయాది భాగముగా అన్న యప్పన్న కిచ్చినారు. అది యూషర క్షేత్రము. అందుఁ బల్లేరుకాయలు తప్ప నేమియుఁ బండవు. అప్పన్న ఆ పొలమును దున్ని, అక్కడనున్న నూతిలో నీరు త్రాగఁబోవ, నా బావిలో నేడు కాగుల ధనము గనఁబడినది. ఆ ధనశక్తి తనకు గర్భిణిస్త్రీయగు అంజమ్మను బలి యిచ్చినచో అప్పన్న ఇంటికి వత్తుననెను. ధనమున కాశపడి, వారము రోజులలో బలి యిత్తునని అప్పన్న యొప్పుకొనెను. గణపవరమునకుఁ బోయి, తన భార్యకు జబ్బుగా నున్నదని చెప్పి, అంజమ్మను దీసికొని వచ్చినాఁడు. భార్యతోఁ గలసి అంజమ్మ పొలము వచ్చునట్లు చేసి, నూతి దగ్గఱ నామెను బలి యిచ్చినాఁడు. ధనమంతయు నింటికిఁ జేరవేసినాఁడు. అంజమ్మ తనభర్త స్వప్నములోఁ గనబడి, జరిగిన సంగతి చెప్పినది. దొంగలను గావించి తన పెద్దన్న ఇంటిలోని ధనమంతయు దోఁచునట్లు చేసినది. అప్పన్న దంపతులు గడుపేదవారై ముష్టియెత్తుకొని జీవించుచుండిరి. అంజమ్మ భర్త వచ్చి, నూతి దగ్గఱ గుండమును ద్రవ్వించి, ఆమె శిరస్సును మొండెమును దానిలో వైచి, తానుగూడ ఆ అగ్నిలోఁబడెను. అంజమ్మ బంగారు ప్రతిమయై గుండములోఁ బుట్టెను. అంజమ్మభర్త వెండిప్రతిమయై పుట్టెను. ఆ గుండము దగ్గఱనే ఆమెకు గుడి కట్టినారు. అక్కడ నేడాది కొకమాఱు 'వీరుల సంబరము' జరుపుదురు. ఆమె చిన్నన్నలకు సంతానము కలుగునట్లు దీవించినది. పెద్దన్నను తన గుడిముందర ఱాయికమ్మని శపించినది. ఆమె గుడికి వచ్చువారు ఆ ఱాతిని ద్రొక్కి అంజమ్మకుఁ గొబ్బరికాయను గొట్టుదురు. ఈ కథ ఇట్లు ప్రారంభమగును:-

*"శ్రీరామా జయరామా శృంగారా రామా- రామయ్య
ఉత్తరాదినీ ఉందీ అది పట్టీసీమా- ఆ సీమ
పట్టిసీమాలోనూ పరువైనావారూ- కాపూలు
వారింటీ పేరండీ పూసాలావారూ-కాపూలు
పూసాలావారింటా పుణ్యాదాబిడ్డా- అంజమ్మ
ముగ్గూరన్నల తోడా జలిమించీనాదీ- అంజమ్మ"*

ఈ కథలోఁ గల్పనలును, అద్భుత విషయములును లేవు. యథాతథముగా సాగినది. ఈ కథలో మంచి నుడికారము కానవచ్చు చున్నది. అప్పన్న తన చెల్లెలు అంజమ్మను మోసగించి, పట్టిసీమకు రప్పించుటకై ఆమె యత్తవారింటికేఁగినప్పుడు చేసిన వర్ణనలోఁ "కన్నీరు పెట్టు, గొల్లుమను, నెత్తీనోరూ బాదుకొను, పోయే ప్రాణమే కాని వచ్చే ప్రాణం కాదు" మొదలగు చక్కని తెలుఁగు పలుఁకుబడులు గానవచ్చును.

*"చెల్లెలకు ఎదరొచ్చీ కన్నీరెట్టాడూ-అప్పన్నా*
*అన్ననూ జూచింది గొల్లుమన్నాదీ- అంజమ్మ*
*ఏమీరా మా యన్న! ఏడుస్తున్నావూ- మా యన్న*
*మా ఒదిన భద్రకాళి బాగున్నదంట్రా- అన్నయ్య*
*నేనేమీ చెప్పానూ ఎర్రీ చెల్లేలా- చెల్లేలా*
*పదిహేనూ రోజులుగా జబ్బొచ్చీనాదీ- చెల్లేల*
*పోయే ప్రాణం కానీ వచ్చేదీ లేదు- చెల్లేల*
*నెత్తీనోరూ తాను బాదుకున్నాదీ- అంజమ్మ*
*పదరోరీ మా యన్నా నే నొస్తానోరీ- అన్నయ్య"*

ఈ అంజమ్మకథకు వేఱొక పాఠమునుగూడ నేను సంపాదించితిని. ఇది పశ్చిమ గోదావరి జిల్లా, కొవ్వూరు తాలూకా, వాడపల్లి గ్రామములో, శ్రీమతి గెల్లా అరవాలమ్మ యను మాతంగ స్త్రీ పాడినది. ఇది పొలములలోఁ గలుపుతీతవంటి పనిపాటులలోఁ బాడఁబడుచుండును. జంగము పాడిన పై కథలో కన్న, నీ జానపద స్త్రీ పాడిన పాటలోఁ గవిత్వము రసవంతముగా నున్నది. ఇది కొంత గొబ్బిపాటగాను, మఱికొంత కామమ్మకథ వరుసలోను సాఁగినది. అంజమ్మ అత్తవారింటిలోని వైభవము, జానపద స్త్రీలకు సహజమగు ధోరణిలో వర్ణింపఁబడినది. ఇది స్త్రీల భావనాబలమునకు మచ్చుతునుక:-

*"ఏడు అంత్రాలమ్మ మేడల్లలోనే- చెల్లేలు*
*అన్ననే చూసింది తల్లి యిల్లాలో- అంజమ్మ*
*ఎండి మేడల్లోను కలయెల్లి కోటా- అంజమ్మ*
*ఏడు అంత్రాలమ్మ మేడల్లలోనే- ఆ తల్లి*
*పన్నెండు మందమ్మ దాసి కన్నేలో- ఇల్లాలు*
*బంగారి ఉయ్యాల సవ్వారి తూగో- అంజమ్మ*
*పైడి చెంబుల్లోను పాలోసుకుందో- అంజమ్మ*
*జాతి చెంబుల్లోను నీళ్లుచ్చుకుందో- అంజమ్మ*
*అన్న కేడదుగులూ ఎదురొచ్చేనమ్మా- అంజమ్మ*
*అన్నకూ బంగారి కుర్చీలేసిందో- అంజమ్మ*
*కుర్చీల మీదండి కొలువు దీరాడో- అప్పన్న"*

అంజమ్మ పుట్టింటివారు ధనము దొరకకముందు నిఱు పేదలని చెప్పుట కీ మాతంగ స్త్రీ యెంత రసవంతముగాఁ బాడినదో చూడుడు:-

*"రేపు తింటే ఆరికి మాపు లేదమ్మా- కాపులకు*
*కూలిపని సెయ్యందే కుండలెక్కావో- కాపులకు*
*ఈతాకు ఇల్లమ్మ తాటాకు దళ్లో- కాపులకు"*

జంగముకథలోవలెఁ గాక ఈ జానపదకథలో నద్భుత కల్పనలు గూడ నున్నవి. అంజమ్మను నూతికడ హత్యచేసిన తరువాత, నామె పడియున్న చోటును, నామె కిన్నెరగా మాఱిన విధానమును నిట్లు పాడఁబడినది. ఇది మిక్కిలి రమణీయమగు వర్ణనము:-

*"రామ రామా రామ శ్రీరామ రామా - రామయ్య*
*నూతికాడా తల్లి ఎటులున్నదమ్మో - అంజమ్మ*
*చేతులద్దాకాడ చెరుకు బోదుల్లో - ,,*
*కాళ్లు బద్దాకాడ గరిడిస్తంభాలో - ,,*
*తలలు బద్దాకాడ తామర్ల బావీ - ,,*
*మొలలు బద్దాకాడ మోదుగుల చెరువో - ,,*
*తన రెండు రొమ్ములూ కిన్నెరైనాయో - అంజమ్మకి*
*కిన్నెర్ల అంజమ్మ కీలుతున్నాదో - అంజమ్మ"*

### 2.1.15. ఉయ్యూరు వీరమ్మ కథ లేక గొల్లల వీరమ్మ కథ:

వీరమ్మ కృష్ణామండలములోని ఉయ్యూరు గ్రామమున వెలసిన పేరంటాలు. గ్రామమునుబట్టి 'ఉయ్యూరు వీరమ్మ కథ' అనియుఁ కులమునుబట్టి 'గొల్లల వీరమ్మ కథ' అనియుఁ బేర్లు వచ్చినవి. మాన సంరక్షణార్థమై సహగమనము చేసిన సాధ్వీమణి వీరమ్మ. ఈమె 'యాదవకాంత (ఎఱ్ఱగొల్లలు). తల్లిదండ్రులు: బొడ్డు చంద్రయ్య, పార్వతి. భర్త- పానుపుల చింతన్న. అత్తగారు-దేవాక్షి. వీరమ్మ పుట్టిల్లు 'పోతుమట్టి', అత్తవారిల్లు 'ఉయ్యూరు'. వెనుకటి కథవలెనే ఇదియును కామమ్మకథ వరుసలోనే యున్నది:-

*"శ్రీరామా జయరామా శృంగార రామా- రామయ్య*
*ఉయ్యూరూ పట్నమునా ఎఱగొల్లాలమ్మా- రామయ్య*
*పానుపులా దేవాక్షి పెద్దకోడాలూ- వీరమ్మ*
*బొడ్డూ పార్వతిదేవీ ముద్దూ కూతూరూ- వీరమ్మ*
*బొడ్డూ చంద్రయ్యా ముద్దూ కూతురూ- వీరమ్మ"*

ఇత్యాదిగా ప్రారంభమగు నీ కథలోఁ గామమ్మ కథవలెనే శోకాలాపన హెచ్చు.

ఉయ్యూరులోఁ బానుపుల దేవాక్షియను నెఱ్ఱగొల్ల వనితకుఁ బెద్దకోడలు వీరమ్మ. వీరమ్మ భర్తపేరు చింతన్న. ఈ వీరమ్మ కాపురమునకు వచ్చి పదునైదు రోజులు మాత్రమే అయినది. భర్త చింతన్న బుడమేరు కాలువకడ మందను గట్టియున్నాడు. వీరికి నేడువందల నల్లమేకలు, నాలుగువందల నల్లఆవులు, మూఁడు వందల యెఱ్ఱగొఱ్ఱెలు గలవఁట. చింతన్న మందకడనుండి, తమ్ముఁడు భోగయ్యచేఁ బంద్రెండు కావిళ్ల పాల నింటికిఁ బంపినాడు. ఆ పాలను జిలుకుటకై మంచినీరు తెచ్చుటకు వీరమ్మ బయలుదేరెను. క్రొత్తకోడలుకదా యని యత్తగారు వారించినది. కాని వీరమ్మ వినలేదు. కరణము సుబ్బయ్య నూతికడకుఁ బోవద్దని దేవాక్షి వీరమ్మతోఁ జెప్పినది. కాని వీరమ్మ పొరపాటునఁ గరణము నూతికే వెడలినది. ఆ కరణము సుబ్బయ్య కడు దుర్మార్గుఁడు. స్త్రీ లోలుఁడు. నూతి దగ్గఱ నీళ్లు తోడుచున్న వీరమ్మను జూచి 'ఘల్లున' నవ్వి నాడఁట కరణము. ఆమె సౌందర్యమునకు మూర్ఛపోయినాడఁట.

*"ఇక మూడు గడియలూ మూర్ఛపోయినాడు-కరణాము*
*నూతికాడా వీరమ్మ తళుకుగా మెరిసే-వీరమ్మ*
*తళకుగా మెరవంగ ఉలికిపడ్డాడూ- కరణాము*
*గిజగిజా గిజగిజా గింజుకున్నాడూ- కరణాము*
*రాసేటి ఆ దస్తూ మానేసినాడూ- కరణాము*
*అంతల్లో చూచారూ బంట్రోతులండి- ఆ వేళ*
*ఏమీటీ సుబ్బయకి ఈ విధమూగుండే- ఈ వేళ*
*కాకి మూర్ఛాచేత పడిపోయినాడా- కరణాము"*

అప్పుడు కరణము జవాన్ల నందఱును బయటకుఁ బంపివైచి, వీరమ్మను బలాత్కరింపఁ బోయెను. ఆమె తప్పించుకొని ఇంటికిఁ బోయినది. మజ్జిగ చిలికి నెత్తిని బెట్టుకొనిఁ గంటి కోటకుఁ బ్రయాణమయ్యెను. దారిలోఁ గరణమయ్య యడ్డగించెను. ఆమె తప్పించుకొని పాఱిపోయెను. వీరమ్మ 'మేడూరు, పామఱ్ఱు, తాడంగి, మట్టాడ, పెదమట్టి, పోతుమట్టి' మున్నగు గ్రామములకుఁ బోయి, వతనలున్న చోటులఁ బాలు, పెరుగు, మజ్జిగలు పోసి, తిరిగి సాయంకాల మింటికి వచ్చుచుండెను. కరణము దారికాసినాఁడు. మరల వీరమ్మను బలాత్కరింపఁ బోయెను. ఆమె యెట్లో తప్పించుకొని ఇంటికిఁ జేరెను. అత్తతోఁ గరణము విషయము చెప్పలేదు. ఇట్లెన్నియో మాఱు లా కరణము వీరమ్మను బలాత్కరింప యత్నించెను. పతివ్రత యగు వీరమ్మ యతనికి లొంగలేదు. ధనము నెఱగాఁ జూపెను. అయినను వీరమ్మ చలింపలేదు. అందుచే నతఁడు కోపముతో బుడమేఱు దగ్గఱకుఁబోయి మందకడనున్న ఆమెభర్తను బశువులను చేతబడి చేసి చంపివైచెను. వీరమ్మ తన భర్తవచ్చి మంచినీళ్లడిగినట్లుగాఁ గలగని, ఉలిక్కిపడి లేచి, అత్త సెలవంది, మందకడకుఁ బోయెను. ఆమె వచ్చుసరికే చింతన్న చనిపోయెను. వీరమ్మ మిక్కిలి దుఃఖించి, ఉయ్యూరు బయటనున్న గంగచెఱువు గట్టున భర్తతో సహగమనము చేసినది. ఈ వీరమ్మ కూడ కామమ్మ వలెనే భర్తతో సంసార సుఖమును జవిచూడక ముందే మరణించిన మహాసాధ్వి. ఆమె 'సాగుమానము' చేసిన చోటున గుడి కట్టించిరి. ప్రతిసంవత్సరము నుగాది పండుగ నాఁడు అక్కడ గొప్ప తిరునాళ్లు జరుగును.

ఈ కథలో బింకమగు కవిత్వ మెడనెడ గోచరించుచున్నది. కరణము సుబ్బయ్య ప్రయాణమగుట సహజముగా హాస్యరస పూరితముగా నున్నది.

*"మూడు బిందెలతోను తానమాడాడూ- కరణాము*
*కాటిరేవుల పంచె కాసోసినాడూ- కరణాము*
*తొడిగితే చొక్కాయి మరిచాలదండి- కరణాము*
*ఆ కిరుకు జోడైన కాళ్లకేశాడూ- కరణాము*
*ఎండిపొన్నుల కఱ్ఱ చేత బట్టాడూ- కరణాము*
*కడవెడంతా బొజ్జ కదలేసినాడూ- కరణాము"*

నూతికి నీళ్లకై పోవునప్పుడు వీరమ్మ 'కాట్రేపుల చీర కాశపోసి, ఉడుత వన్నెల బగ్గిరవిక తొడిగి' వెళ్లినదఁట. వీరమ్మ చల్లలమ్ముటకై పోవునప్పటి వర్ణన మత్యద్భుతముగా నున్నది:-

*"కదిలింది వీరమ్మ కది లెళ్లుతోందీ- వీరమ్మ*
*వీరమ్మ కదిలితే ఎంతందమండీ- వీరమ్మ*
*తళుకు తళుకూ బాల అద్దాల మెరుపూ- ఆ బాల*
*గుడిలోను ఉంటేను ప్రతిమంటరండీ- బాలాను*
*కోవెల్లో ఉంటేను దేవతంటారూ- బాలాను*
*వన్నె చిన్నెల పోలు అది యందమండీ- ఆ బాల*
*ఘల్లు ఘల్లుమంట గంటలందంబూ- ఆ బాల*
*గంగిరెద్దూలాగ ఘల్లుమంటాదీ- ఆ బాల"*

ఈ వీరమ్మ కథకుఁ గృష్ణా గోదావరి మండలములలో విశేష ప్రచారమున్నది. శ్రీ యమ్.ఆర్. నాగేశ్వరరావు (గుడివాడ) దీనిని నవలగా రూపొందించియున్నారు. నే నీకథను పశ్చిమ గోదావరీ మండలమున, తణుకు తాలూకా, పెరవలి గ్రామములో 26-8-1964న ఇంగున నరసన్న యను జంగము పాడుచుండగా వ్రాసికొంటిని.

## 2.1.16. నారాయణమ్మ కథ:-

ఇది సుమారు 140 ఏండ్ల క్రిందట (క్రీ.శ. 1824లో) నెల్లూరు మండలమున గల గూడూరులో, విగత జీవుఁడైన భర్తతో సహగమనము చేసిన పతివ్రతగాథ. ఈ కథ అచ్చముగాఁ గామమ్మ కథను బోలియుండుట విచిత్రము. దీనిని బైనీడివాండ్రు జముకులతోఁ బాడుచున్నారు. నేను ఈ కథను 1964లో, గూడూరు దగ్గఱనున్న 'తుమ్మూరు' గ్రామములో, గుమ్మడి పండయ్య యను బైనీడివాఁడు పాడుచుండఁగా సేకరించితిని. ఈ కథనుగూర్చిన ఇతర వివరములను నాకు దయతో నొసంగిన మిత్రులు శ్రీ ముదిపర్తి కొండమాచార్యుల వారికి మిక్కిలి కృతజ్ఞుఁడను. ఆచార్యులవారు ఈ పేరంటాలు గాథను తేనెలొలుకు తెనుఁగు నుడికారముతోఁ జక్కని పద్యకావ్యముగా మలఁచియున్నారు. మన పేరంటాండ్ర కథలన్నియు నిట్లు కావ్యములుగా మలఁచిన గాని శిష్టులకు వీనియందు అభిరుచి యేర్పడదు.

నారాయణమ్మ రెడ్డివనిత. ఈమె పుట్టినిల్లు 'వెడిచర్ల'. ఇది గూడూరునకు నైరృతి దిశలో నాఱుమైళ్ల దూరమున నున్నది. తలిదండ్రులు: ఎఱమాకుల ఎల్లపరెడ్డి, పాపులమ్మ. నారాయణమ్మ మెట్టినిల్లు గూడూరు. భర్త పాపిరెడ్డి. అతని తమ్ముఁడు వీరారెడ్డి. (కొందఱు వృద్ధులు నారాయణమ్మ భర్త పేరే వీరారెడ్డి యనియు, మఱఁది పాపిరెడ్డి యనియుఁ జెప్పుచున్నారు). పాపిరెడ్డి ఇంటిపేరు 'బిరుదవోలు' వారని కొందఱును, 'యాదపల్లి' వారని మఱికొందఱును దెల్పుచున్నారు. యాదపల్లివారు నేఁటికిని గూడూరులోఁ గలరు. నారాయణమ్మ యుత్సవములో నీ ఇంటివారు నేఁటికిని జీరయు

రవికయుఁ బంపుచున్నారు. నారాయణమ్మ సహగమనమున కనుమతించినవాఁడు చిట్వేలి చిన్నపనాయఁడు. చిట్వేలి కడప మండలములో నున్నది.

బైనీడివారు పాడుచున్న పాటలో బింకము లేదు. కథాఖ్యానము గూడఁ గ్రమబద్ధముగా లేదు. 'రైలుకట్ట' మొదలగు నాధునిక స్థలముల నిందుఁ గలిపి వైచినారు. కావున నారాయణమ్మ కథను సమగ్రముగాఁ దెలిసికొనవలెనన్న, నెల్లూరి మండలములో గూడూరు ప్రాంతమందలి జనపదములలో వృద్ధులు తమ తండ్రితాతలనుండి విని చెప్పుచున్న విషయములే మనకు శరణ్యములు. ఇవియే ప్రమాణమైనవి కూడ. నారాయణమ్మకథనుగూర్చి ముగ్గురు వృద్ధులు చెప్పిన వివరముల నీ క్రిందఁ బొందుపఱచుచున్నాను:

1) శ్రీ గొర్తల వేంకట రామయ్యగారు, చిల్లకూరు గ్రామము, వయస్సు 75 సంవత్సరములు. వీరు 20-7-1964న నారాయణ్మనుగూర్చి ఈ క్రింది విషయములను దెలియఁ జేసిరి:-

''నారాయణమ్మ ఇంటిపేరు 'ఎఱమాకుల'. భర్తపేరు 'బిరుదవోలు పాపిరెడ్డి'. పాపిరెడ్డి యెద్దుల బేరమునకై కొందఱు స్నేహితులతోఁ గలసి, యుత్తర దేశమునకుఁ బోయి యెద్దులను దోలుకొని గోలుకొండలో విశ్రాంతికై దిగెను. రాజు పారావచ్చునప్పుడు ఆ యెద్దులను జూచెను. రాజు 'ఈ యెద్దు లెవరి'వని యడుగఁగా, నక్కడివారు పాపిరెడ్డివని చెప్పిరి. ఆ యెద్దులలో నొక మంచి గిత్తను జూచి 'మీ యెద్దులు నిచ్చటికి దెచ్చినందులకు ఈ కోడెను మాకిమ్ము' అని పాపిరెడ్డిని గోరెను. పాపిరెడ్డి యా కోడెను దప్ప మఱి దేనినైనను గోరుకొనుమని చెప్పెను. అందుల కుగ్రుఁడైన రాజు తీక్షణమైన దృక్కులతోఁ జూడఁగాఁ బాపిరెడ్డికి దృష్టిదోషము తగిలెను. పాపిరెడ్డియు వారి బృందము బయనమైరి. కొంతదూరము వచ్చుసరికిఁ బాపిరెడ్డి పడిపోయెను. మరలఁ దేరుకొని మఱికొంత దూరము వచ్చిపడిపోయెను. పాపిరెడ్డిని తోడనున్నవారు మోసి తెచ్చి గూడూరులోఁ జేర్చిరి. పరిచారకునితో నారాయణమ్మకుఁ గబురు పంపిరి. ఆమె పయనమై వచ్చుచుఁ బ్రస్తుత దేవాలయమున్న ప్రదేశమున దన కాలిమెట్టెలూడఁగా, నామె తన తండ్రితో నచ్చట నగ్నికుండము నేర్పరుపుమని చెప్పి, భర్తదగ్గఱకు వచ్చెను. ఆమె వచ్చిన రెండు మూఁడు దినములకు భర్త మరణించెను. గూడూరులో ఆనాఁటి ప్రసిద్ధ రెడ్డి కుటుంబము పెల్లేటి రాఘవరెడ్డిగారిది. ఆనాఁడు గూడూరులో నున్న జలాశయములు, 'కుమ్మరవాడి చెలమ, తమ్మిసెట్టి గుంట, వేంకటేశ్వరుల గుంట, తోటకూర బావి' మున్నగునవి. నారాయణమ్మ పినతండ్రిపేరు రామయ్య.

2) శ్రీ కొల్లు వేంకట రామిరెడ్డిగారు, వయస్సు 80-85 సం॥లు., చిల్లకూరు గ్రామము. వీరు నారాయణమ్మనుగూర్చి 23-7-1964న ఈ క్రింది విషయములను దెలియఁ జేసిరి:

''నారాయణమ్మ పేరంటాలు. ఎఱమాకవారి యాడుపడుచు. యాదపల్లివారి కోడలు. ఈమె భర్తపేరు వీరారెడ్డి. మేనమామలు బిరుదవోలు వంశమువారు-మంగలపూరు. నారాయణమ్మ పుట్టిల్లు వెడిచర్ల గ్రామము. గూడూరు వాస్తవ్యుడగు వీరారెడ్డి యెద్దుల బేరమునకై భద్రాచలము పోయెను. అక్కడ నొడలు జబ్బుచేసినది. తరువాత వీరారెడ్డి తిన్నగాఁ బుట్టిల్లు చేరెను. అక్కడనుండి వెడిచెర్లకు మనుష్యునిఁ బంపెను. నారాయణమ్మ బయలుదేరి 'కుప్పంచిపాడు' (నేటి గూడూరులోని నెహ్రూనగర్) దగ్గఱకు వచ్చుసరికి కాలిమెట్టె యూడి క్రిందఁబడినది. అక్కడ నామె మూఁడు ఱాళ్లు గుర్తుపెట్టినది. ఆమె వచ్చునప్పటికి భర్త పండుకొనియుండెను. ఆమె భర్తచుట్టును ప్రదక్షిణము చేసి, కాళ్ళు కన్నులకద్దుకొన్నది. ఆ వెంటనే యామెభర్త చనిపోయెను. తరువాత ఆమె అమలుదారయిన 'నాన్నప్ప', కరణము 'సాయిత్ర రంగయ్య', మునసబు 'మనుబోలు రమణారెడ్డి' వీరి ముగ్గురి దగ్గఱకును బోయి, తన భర్తతోఁ గూడ దహనమైపోవుటకుఁ గుండమునకు సెలవు నడిగెను. దానికి వారొప్పుకొనలేదు. 'మేము చిట్వేల నవాబున కుత్తరము వ్రాయుదుము. రేపే సంగతియుఁ జెప్పెదము' అనిరి. ఆ రాత్రి నారాయణమ్మ నవాబుకలలోఁ గనపడి 'రేపు మీ కుత్తరము వచ్చును. మీరేమియు నాటంకము చెప్పవద్దు' అనెను. నవాబు తెల్లవారి లేచి, కలవిషయ మాలోచించుచుండగా నుత్తరము వచ్చెను. అతఁడాటంకము లేదని జవాబు వ్రాసెను. ఆ జాబు వచ్చిన వెంటనే యేదుబండ్ల కట్టెలను గుండమునకుఁ దోలించిరి. తరువాత నారాయణమ్మ 'పడమట నారపరెడ్డి' ఇంటికిఁబోయి గుఱ్ఱము నడుగఁగా "మేము అడ్డబొట్టు పెట్టేవారము కాదు. ఆడువాండ్ర కశ్వము నీయము" అని చెప్పిరి. నారాయణమ్మ గడప దాటఁగనే, వారికి వాంతులు భేదులు నయ్యెను. వారామె కాళ్లు పట్టుకొనగా వ్యాధి నిమ్మళించెను. వారంతట అశ్వమును సింగారించి, నారాయణమ్మకు మెడలోఁ బూలదండవేసి, గుఱ్ఱముపై నెక్కించి, భర్త దగ్గఱకుఁ దీసికొని వచ్చిరి. ఊరంతయు నుత్సవముతో, ముందు భర్త శవమును, వెనుక నామెను దీసికొని కాష్ఠము దగ్గఱకు వచ్చిరి. నారాయణమ్మ భర్తశవమును గట్టెలపైనుంచి, తలకొఱవి పెట్టఁగా నాల్గువైపులను ధగధగ మండెను. అప్పుడామె మంటలోనికిఁ బోయి మూఁడు వాక్యములు చెప్పినది. "పశువుల కేజబ్బు వచ్చినను నిక్కడికిఁ దీసికొని వచ్చి దీనిని ద్రొక్కింపుఁడు.

మనుష్యుల కేదైన జబ్బువచ్చినఁ బొంగళ్ళు పెట్టుకొనవలసినది. ఇఁక నేను మాటాడను" ఇట్లు చెప్పి, ఆ కాష్ఠములోఁబడి చనిపోయినది. ఆ కాలములోఁ బ్రసిద్ధ రెడ్డి కుటుంబము "ఏలూరు నారపరెడ్డి" గారిది. ఈ సంఘటన జరిగి సుమారు 140 యేండ్లయినది. ఆనాఁటి ప్రసిద్ధ రెడ్ల కుటుంబముల పేర్లు– "సిద్దారెడ్డి ముత్యాలరెడ్డి, నలంగిరెడ్డి వేమారెడ్డి, మనుబోలు రంగారెడ్డి, మనుబోలు రమణారెడ్డి, పేరమారెడ్డి రమణారెడ్డి, వేగూరు పోలిరెడ్డి, నాగాడి నరసారెడ్డి, నాగాడి పేరారెడ్డి".

3) శ్రీ మోపాటి రాఘవరెడ్డిగారు, వెడిచర్ల గ్రామము, వయసు 70 సం॥లు. వీరు 15-7-1964న నారాయణమ్మనుగూర్చి ఈ క్రింది యంశమును దెల్పిరి:

"భర్త రోగమును విని నారాయణమ్మ వెడిచర్ల, పాడిచెర్ల బాటలో నడచి వచ్చినది. గూడూరు సమీపమున నామె కాలిమెట్టె లూడిపోయినవి. ఆ మెట్టెలూడిన స్థలములో గుండము నేర్పాటు చేసికొన్నది. నారాయణమ్మ కాలమునఁ బ్రసిద్ధికెక్కిన కొన్ని రెడ్డి కుటుంబములు, వాని యజమానులు: "ఎల్లా సూరారెడ్డి, మోపాటి బసవలింగారెడ్డి, అంబటి బోడిరెడ్డి, అలిమిలి గోవిందరెడ్డి".

బైనీడివారు పాడు కథలోఁగూడ నితివృత్తము కొంచెది మార్పులతోఁ బైరీతిగనే యున్నది. ఈ కథలో నారాయణమ్మ భర్తపేరు 'బిరుదవోలు పాపిరెడ్డి' యనియే కలదు. అతని కిరువురు తమ్ములు. వేమారెడ్డి, వీరారెడ్డి. ఇందు నెద్దుల బేరమునకుఁ బోయిన పండ్రెండు మంది కాపుల పేర్లలోఁ గొన్ని చెప్పఁబడినవి. ఇవి గాథాకారుని స్వకపోల కల్పితములు కాఁబోలును. గోలుకొండలో జబ్బుచేసిన పాపిరెడ్డిని బెజవాడ, నెల్లూరుల మీఁదుగా గూడూరునకుఁ దెచ్చినట్లున్నది. మార్గమధ్యమున బెజవాడ కనకదుర్గకును, నెల్లూరు రంగనాయకులకును, ఇందూరులోఁ బడమటమ్మకును, గూడూరులోఁ దాళమ్మకును నాపదమ్రొక్కులు మ్రొక్కిరి. పాపిరెడ్డి తనభార్యను దోడితెచ్చుటకుఁ దమ్ములను బంపినట్లున్నది. భర్తకు వచ్చిన యాపద నారాయణమ్మకు ముందుగనే కలవచ్చును. ఆమె పాడిచెర్ల నాయుడు కాలువ మీఁదుగా గూడూరునకు వచ్చుచుండఁగా వెంపలిచెట్టు దగ్గఱ కుడికాలి మెట్టె యూడినది. అట మూఁడు ఱాళ్లు గుర్తుపెట్టినది. గూడూరులో నారపరెడ్డిని, వేగూరి నరసారెడ్డిని ముందు గుండమున కనుమతి నిండని కోరినదఁట. అందులకుఁ దమకధికారము లేదని వారంగీకరింపలేదు. చిట్వేలి చిన్నప్ప నాయఁడు, సుఖభోగి భగవంతం నాయఁడు, తంబూరు ముసలి నాయఁడు– ఈ ముగ్గురును నాటి పాలకుఁట. వీరిలో చిట్వేలి చిన్నప్ప నాయని కలలో నారాయణమ్మ కనఁబడినదఁట. గూడూరులో నారపరెడ్డి సంస్థానమువారిని గుఱ్ఱము నడిగినది. గుఱ్ఱము నీయకపోఁగా, నా గుఱ్ఱమునకు శూలకుట్టు రప్పించినదఁట. వారంత భయపడి ఆమెకు గుఱ్ఱము నిచ్చిరి. ఆమె గుఱ్ఱముపై గ్రామమంతయు నూరేఁగి, గుండమునఁ బడినది. ఆ గుండము చల్లారిన పిమ్మట, దానిలోఁ గుడికాలు మెట్టెలు, కుడిచేతి గాజులు, మంగళసూత్రము, పచ్చి పసుపు ముద్ద, భర్తధరించు పావుకోళ్లు, చేతిబెత్తము కనఁబడినవఁట. ప్రజలు ఆమెకు ఆ ప్రదేశమున గుడికట్టి, ప్రతియుగాదికిని బూజ చేయుచున్నారు. గుండములోఁ బడుటకు ముందు, కామమ్మకథలో కామమ్మవలెనే, నారాయణమ్మయు నెవరో 'చైనాగొలుసు'ను బోగొట్టుకొనఁగా దాని వివరములను జెప్పును. ఈ కథ యిట్లు ప్రారంభమగును:–

*"గ్రామముకైతే గ్రామదేవతా!– వెలసినావు వెడిచెర్లా లోనూ*
*పన్నెండేండ్లా బాలికవమ్మా– బిరుదవోలు మరి పాపీరెడ్డీ*
*బిరుదవోలు సంస్థానములోనా– పెద్దవాడుగా పాపీరెడ్డీ*
*పన్నెండుమందీ కాపులు వారూ– బిరుదవోలువారి కోడలివమ్మా*
*సత్యమైన ఓ నారాయణమ్మా!"*

ఇట్లు ప్రారంభములో ఛందస్సు 8+8 మాత్రలతోఁ గ్రమబద్ధముగా నున్నను, పోనుపోను పాడిమాటలవలెఁ దేలి పోయినది. జముకు వాద్యముపై లయవిరహితములైన వాక్యములను గూడ శ్రావ్యముగాఁ బాడవచ్చును. సహగమనమునకు ముందు నారాయణమ్మ అలంకరించుకొని ఊరేఁగుట బాగుగా వర్ణింపఁ బడినది:–

*"పట్టూ వస్త్రం కట్టిందీ– దువ్వీ జడలూ వేసిందీ*
*కాటుక కండ్లకు పెట్టిందీ– వట్టివేళ్ల చాపమీదనూ*
*పాపిరెడ్డిని పండబెట్టిందీ– పైనా శాల్వ కప్పిందీ...*
*పాపిరెడ్డికి పాడిగట్టారూ– గీతారాగం నవబత్తు ఊదుతూ*
*ఉరవళ్లూ పరవళ్లు త్రొక్కుతూ– కుందేటి లగువులు తోలుతూ*
*గుర్తుపెట్టినా వెంపటివృక్షం కాడికి– పన్నెండు మందీ రెడ్లు వచ్చారూ".*

## 2.1.17. రంగమ్మ కథ:–

దేసింగురాజు కథ, నల్లతంగాళ్ కథ తమిళ భాషనుండి తెలుగు లోనికిఁ బ్రవేశించిన కథలు కాఁగా, రంగమ్మకథ తమిళదేశమునందే తెలుఁగుభాషలో వ్యాపించియున్న పేరంటాలుకథ యగుట విచిత్రము. కాకతీయ సామ్రాజ్య పతనానంతరము కొన్ని తెలుఁగు వీరవంశములు తమిళ దేశమునకుఁ బోయి స్థిరపడినవి. అట్టివారిలోఁ గమ్మవారెక్కువ. కోయంబత్తూరు, రాజప్పాళయము, మధుర, తంజావూరులలో నేఁటికిని నీ కుటుంబములవారున్నారు. ఈ కథ కోయంబత్తూరు ప్రాంతమందు జరిగినది.

పశ్చిమ గోదావరీ మండలమున, తణుకు తాలూకా ఉండ్రాజవరము జమీందారులును, సాహితీవల్లభులును నగు శ్రీ ముళ్లపూడి తిమ్మరాజుగారు ఈ కథను 1954లో సంపాదించి, వచన రూపమునఁ బ్రకటించియున్నారు.[25] దీనిని పాడిన గాథాకారుఁడు

కోయంబత్తూరునకు అరమైలు దూరములో నున్న కృష్ణరాయపాలెము కాపురస్థుఁడగు చంద్రగిరి కొండస్వామి. "ఆ కథకుడు సతీరంగమ్మ కథను పాడునప్పుడు తమిళ మిశ్రముగానున్న ఆ భాష కొంత మాకు శ్రమ కలిగించినను, అందలి విషయములు ఒడలు పులకింపఁ జేసినవి" అని తిమ్మరాజుగారు తొలిపలుకులో నుడివియున్నారు.

ఈ కథ మిక్కిలి ప్రాచీనమైనదిగాఁ గన్పట్టుచున్నది. ఇది కాకతీయుల కాలమునాఁటిదని చెప్పవచ్చును. ఇందు రేణుక పూజ, అంకాళమ్మ పూజలు చెప్పఁబడినవి. రంగమ్మ జననము క్రీ.శ. 1321 దుర్ముఖి సంవత్సరమనియు, సహగమనము చేసినది క్రీ.శ. 1344 తారక సంవత్సరమనియు తిమ్మరాజుగారు విశేష పరిశ్రమ చేసి గుర్తించిరి. ఇది సత్యమైనచోఁ బేరంటాండ్ర కథలలోఁ గన్యకామ్మవారి కథ తరువాత నిదియే ప్రాచీనమైనది యగును. కాని ఈ కథలో సహగమనమునకై నవాబు అనుజ్ఞనిచ్చినట్లున్నది. కావున నిది సహగమన నిషేధ చట్టము ప్రవేశింపఁబడిన తరువాత పుట్టిన కథయే కావలెను. అనఁగా క్రీ.శ. 18వ శతాబ్దమునకుఁ జెందిన దనవలసి యున్నది.

కర్మగిరి పట్టణములో లక్ష కులముల కమ్మదొరలు నివసించు చుండిరి. వారు అంకాళ దేవత పూజలు చేయుచుండిరి. ఢిల్లీ నవాబు కొడుకు ఆ వేడుకలు చూచుటకు వచ్చి, కాకర్ల వెంకటపతినాయని కూఁతురు సత్తిపేరమ్మను జూచి మోహించి ఆమెను తనకిచ్చి పెండ్లి చేయుఁడని పట్టుపట్టెను. కమ్మదొరలకది ఇష్టము లేక, ఢిల్లీ నవాబునకు భయపడి, పాలేరును దాటి దక్షిణ దేశములందు స్థిరపడిరి. ఇట్లు స్థిరపడినవారిలోఁ జంద్రగిరికి వచ్చినవాఁడు నంబూరి కొండమ నాయఁడు. ఇతని భార్య మంగమ్మ. చంద్రగిరి ప్రాంతములందు కఱవేర్పడఁగాఁ గొండమనాయఁడు బంధువులతోఁ గలసి చెన్నమల దేశమునకుఁ బోయెను. అక్కడ నతఁడు 'కంబళంమెట్టు' అను గ్రామమును గట్టుకొని యందుండెను. దుగ్గెన నారప్పనాయఁడు 'ఊంజపాళియం' అను గ్రామమును గట్టుకొని, తన బంధువులతో నటనుండెను.

కొండమ నాయనికి సంతానము లేదు. అతని భార్య మంగమ్మ చెన్నమల దేవతను సేవించి, ఆమె వరమున 'శ్రీరంగమ్మ'ను గనెను. బిడ్డపుట్టిన కొలఁది దినములకే మంగమ్మ గతించెను. కొండమ నాయుడు రంగమ్మను ప్రేమతోఁ బెంచుచుండెను. కొన్నాళ్లకతఁడు ఊంజపాళియములోని దుగ్గెన నారప్పనాయని కుమార్తె కోనమ్మను ద్వితీయ వివాహమాడెను. ఆమెకు అప్పయ్యనాయఁడు, లక్ష్మమ్మ అను నిరువురు సంతానము గలిగిరి. కోనమ్మ సవతిబిడ్డయగు రంగమ్మను బెక్కు హింసలు పెట్టుచుండెను. కడకామెను, వెట్టివాఁ డును, దొడ్డికాళ్లవాఁడును నగు తన తమ్ముడు పేరినాయనికిచ్చి పెండ్లి చేసెను. ఉత్తమ సాధ్వియగు రంగమ్మ తల్లిదండ్రుల నిర్ణయమును సంతోషముతో నంగీకరించెను. పుట్టింట సవతితల్లివలెనే, అత్తింట అత్తగారు ఏలమ్మ కూడ రంగమ్మను మిక్కిలిగా బాధింపసాఁగెను. భర్త వెట్టివాఁడు. భార్యను జూచి భయపడిపోయి, తప్పించుకొని తిరిగెడివాఁడు. రంగమ్మ అంకాళదేవతను బూజించుచుండెను. అత్తగారు పెట్టు బాధలు మఱింత హెచ్చిపోఁగా, మామ నారప్ప నాయఁడామెను బుట్టింటికి పంపివేసెను.

ఊంజపాళియములో పేరినాయనిపైఁ గోపగించిన మాదారి చెన్నడఁను జీతగాఁడు ఆతనిపై మంత్రప్రయోగము చేసెను. ఒడలంతయు బొబ్బలెక్కి, మూడు దినములు బాధపడి, పేరినాయడు మరణించెను. దుగ్గెన నారప్పనాయఁడు ఆ మాదారి చెన్ననిచేతనే కంబళంమెట్టులో నున్న రంగమ్మకుఁ గబురు పెట్టెను. రంగమ్మ శాపముచే చెన్నఁడు మరణించెను. నంబూరివారితోఁ గలసి రంగమ్మ తన యత్తవారింటికి వచ్చినది. భర్తను పొలములో దహనము చేయుఁ డని ఆమె కోరినది. పండ్రెండవ నాఁడు భర్తకుఁ గర్మ చేయునప్పుడు తాను అగ్నికుండమునఁ బడుటకు నవాబునుండి అనుజ్ఞను దెప్పింపుమని రంగమ్మ తన తండ్రిని గోరినది. ఆ రాత్రి నంబూరివారి కులదైవము రేణుక నవాబుకలలోఁ గన్పించి అనుజ్ఞ నిచ్చునట్లు చేసెను. నవాబునుండి అనుజ్ఞ రాఁగా, సహగమనము చేయుటకై రంగమ్మ తన పుట్టింటినుండి అత్తింటికి బయలుదేరుచుండెను. పుట్టింటి బంధువులు తమకుఁ బొలములోఁ బనులున్న వనియు, నందుచేఁ దావెవ్వరును నామెతో రాఁజాలమనియుఁ జెప్పిరి. రంగమ్మ కోపించి, మేఘములు కురిపించి, వారి ధాన్యమును దడిపివేసెను. అప్పుడు వారు భయపడి ఆమెవెంట వచ్చిరి. ఊంజపాళియములో నఱువది యడుగుల పొడవు, ముప్పది యడుగుల వెడల్పు గల గుండము నేర్పాటు చేసిరి. మామగారు గుండమునకు నిప్పుపెట్టెను. మూఁడు దినములు గుండము మండెను. రంగమ్మ తన తండ్రి నడిగి, చెన్నమల పట్టణమునుండి గెదవర్ణపుఁ బట్టు చీరను దెప్పించుకొని కట్టుకొన్నది. గుండమునఁ బడుచుఁ దన పూర్వజన్మ వృత్తాంతమును దెల్పినది. తన పుట్టింటి నంబూరివారి పెద్దలకును, నత్తింటి దుగ్గెనవారి పెద్దలకును గొన్ని నియమములు పెట్టినది. తన శాపముచే మరణించిన మాదారి చెన్ననికి, తనతోపాటుగ నొక పిండమును వేయుఁడన్నది. ఆమె గుండమునఁ బడబోవుచుండగా, నిదివరలోఁ దాను శ్రీరంగమునుండి తీసికొనివచ్చిన గొల్లపిల్లవాఁడు, రంగమ్మ ఆభరణములను పట్టుచీరను తన కిమ్మని కోరినాఁడు. ఆమె ఆభరణముల నిచ్చియుఁ, దిరిగి పట్టుచీరను గోరినందుల కా గొల్లవానిపైఁ గోపించి శపింపఁగా నతఁడు చనిపోయెను. ఆ గొల్లబాలునకుఁగూడ తనతోఁ బిండమును వేయుఁడని రంగమ్మ తనవారిని గోరినది. చెన్నమల బండల దగ్గఱ, తెల్లజిల్లేడు చెట్టు దగ్గఱ నున్న ఱాతిని దెచ్చి తనకు గుడి కట్టింపవలెనని చెప్పి, రంగమ్మ అగ్నికుండమున దుమికెను. ఆమె కోరిన ప్రకారము అట నొక దేవాలయమును గట్టిరి. అక్కడ 'మాదుగట్టిపురము' వెలసెను.

### 2.1.18. ఇతర పేరంటాండ్ర కథలు:-

శ్రీకాకుళ మండలమున మశూచిచే మరణించిన 'పార్వతమ్మ కథ' వ్యాప్తియందున్నది. దీని నా ప్రాంతమున 'బుడబుడకలవాళ్లు' (జముకులమువారు) పాడుచున్నారు. 1910లో శ్రీ జ్ఞానాంబగారు రచించిన 'శ్రీ మహాదేవి సత్యవతి చందమ్మ కథ' ప్రకటితమైనది (ప్రకాశకులు ఆత్మూరి రామమోహనరాయ్, మచిలీపట్టణము). ఇది పేరంటాలుకథ యగునేమో పరిశీలింపవలసియున్నది. 1917లో గట్టు వేంకట రామదాసు రచించిన "శ్రీ గట్టు సీతమ్మ పేరంటాలు కీర్తనలు" ప్రచురింపఁ బడినవి. ఇందు ప్రకటనకర్త పేరులేదు కాని, ఇది రాజమహేంద్రవరమునుండి వెలువడినట్లు మాత్రము తెలియు చున్నది. వరకవి వెంకటదాసు అనునతఁడుగూడ 'సీతమ్మ పేరంటాలు కీర్తనలు' వ్రాసినాఁడు. ఈ కవిది పశ్చిమ గోదావరి జిల్లా పురుషోత్తమ పట్టణము. దీనినిబట్టి "గట్టు సీతమ్మ పేరంటాలు కథ" యొకటి గోదావరీ మండలమునఁ బ్రచారమున నున్నదని యూహింప నగును. పై మూఁడు గ్రంథములును రాజమహేంద్రవరములో గౌతమీ గ్రంథాలయములో నున్నవి.

పేరంటాండ్ర కథలన్నియు నొక ప్రత్యేక వర్గముగా భాసిల్లును. ఇందు యుద్ధవీరము కాక, త్యాగవీరము లేదా సహనవీరము ప్రదర్శితమగును. ఇవి కరుణరసాత్మకములు. పతిభక్తి పరాయణలగు నీ పేరంటాండ్ర కథలలోఁ గొన్ని వారానువర్తనములు (common places) కొట్టవచ్చినట్లు కనఁబడుచుండును. చిన్నతనముననే పేరంటాలునకుఁ దల్లిదండ్రులు చనిపోవుట, పుట్టింటను అత్తింటను గూడ నామెకు సుఖము లేకపోవుట, భర్తతో సాంసారిక సుఖమును జవిచూడకుండుట, భర్త అకాలమరణము నందగాఁ సహగమనము చేయుట, దేవతగా మాఱి పూజలందుకొనుట– ఇవి ఈ పేరంటాండ్ర కథలన్నింటను బ్రత్యక్షమగుచుండును. ఈ పేరంటాండ్రందఱును మానవత్వము నుండి దైవత్వము నందుకొన్న సాధ్వీమతల్లులనుటలో మాత్రము సందేహము లేదు. ఈ కథలలో నెక్కువ భాగము 19వ శతాబ్దమునకుఁ జెందినవి. ఈ పేరంటాండ్రలో బలవన్మరణము చెందిన లక్ష్మమ్మ, వీరరాజమ్మ, ఈడిగ దేవమ్మ మున్నగువారు కొందఱున్నను, ఎక్కువ భాగము సహగమనము చేసినవారే. ఆ కాలమున సహగమనము చేయుటయే యొక గొప్ప సాహసము. నాఁటి యాంగ్ల ప్రభుత్వము సహగమనమును నిషేధించెను. అయినను బతివ్రతా శిరోమణులగు యువతులు విగతభర్తృకలై జీవింపనొల్లక, ప్రభుత్వమునుండి అనుమతిని బొంది సహగమనము చేసి, ప్రజల నాశ్చర్య చకితులను జేసి, వారిచేఁ బూజలను గైగొనిరి. అమ్‌హెర్‌స్ట్ బెంటింక్ ప్రభువు, రాజా రామమోహన రాయ్ (క్రీ.శ. 1780–1833) సహాయముతో క్రీ.శ. 1829లో సహగమనమును నిషేధించుచు శాసనమును జేసెను. పేరంటాండ్ర కథలు 19వ శతాబ్దమందే విరివిగఁ బుట్టుటకు ఈ శాసనమే కారణము.

## 2.2. సాహసికులు

తమ భుజశక్తిచేఁ బట్టపగలే యూళ్లను దోచువారు బందిపోట్లు. ఒక విధముగా రాజులు గూడ బందిపోట్లే. పరరాజ్యములపై దండెత్తుట, వానిని దోచుకొనుట, శత్రునగరముల నగ్నికాహుతి సేయుట మొదలగు పనులు రాజులుగూడఁ జేయుదురు. కావున వీరును నొక రకమగు బందిపోట్లే. వీరి దోపిడులు బందిపోట్ల దోపిడుల కన్న నెక్కువ యెత్తున జరుగును. ఈ క్రిందఁ జర్చింపఁ బోవు బందిపోట్లు రాజులకంటెఁ జిన్నవారు, గజదొంగలకంటెఁ బెద్దవారు. దొంగలు, గజదొంగలు రాత్రివేళ నిండ్లకుఁ గన్నములు వేసి, రహస్యముగా దొంగిలింతురు. బందిపోట్లు కొందఱనుచరులను వెంటనిడుకొని, పట్టపగలే ఒక ఇంటిని గాక, గ్రామములకు గ్రామములే దోచివైచెదరు. ఇట్టి బందిపోట్లలోఁ గొందఱు సాహసికులు రాజరికమున కెగుర యత్నించిరి.

ఈ బందిపోట్లు చేయునవి క్రూరకృత్యములైనను, వీరి సాహసమును, వీరమును జానపదులు కీర్తింతురు. వ్యక్తి యెట్టివాడైనను ఆతనిలోని గొప్పతనమును గుర్తించెడి శక్తి ఒక్క జానపదులకు మాత్రమే కలదు. వీరుని యథాతథముగాఁ జిత్రింతురే కాని, మార్గకవులవలె లోపములను గప్పిపుచ్చి, పాత్రలను నిర్జీవములగు రాతివిగ్రహముల వలెఁ జెక్కుట వీరికి అలవాటు లేదు.

తెలుఁగులో బందిపోట్లకు సంబంధించిన వీరగాథలేవి యని ప్రశ్నింపఁగా వెంటనే సర్వాయి పాపని కథను, చిన్నపరెడ్డి కథను జెప్పుట పరిపాటియైనది. ఇది సరికాదు. ఈ వీరగాథల రచనా విధానమును బరిశీలించినప్పుడు వారు బందిపోట్లవలెఁ గాన్పించి నను, చారిత్రక విషయములను కూలంకషముగా మథించి చూచినప్పుడు ఈ నిర్ణయము అసంగతమని ధ్రువపడును. సర్వాయి పాపడు, చిన్నపరెడ్డి– వీరిరువురును సాహసికులే కాని బందిపోట్లు కారు. వీరు స్వాతంత్ర్యమునకై తమ కాలములోని దుష్టశక్తులపైఁ బోరు సల్పిన మహావీరులు. సర్వాయి పాపఁడు తన శౌర్యముతో మహమ్మదీయుల దౌష్ట్యము నెదుర్కొని గోల్కొండ నాక్రమింపఁ దలంచెను. చిన్నపరెడ్డి అంగ్లేయుల క్రౌర్యము నెదిరించిన వందేమాతరం ఉద్యమ జాతీయ నాయకుఁడు. మహమ్మదీయ చరిత్రకారులు సర్వాయి పాపని, ఆంగ్ల చరిత్రకారులు చిన్నపరెడ్డిని బందిపోట్లుగాఁ జిత్రించిరి. ఇది వారి పాక్షిక దృష్టికిఁ బ్రబల నిదర్శనము. సర్వాయి పాపఁడు మహావీరుఁడే కాని బందిపోటు కాడనియు, ముస్లిములను ముప్పుతిప్పలు పెట్టిన గొప్ప సాహసికుఁ డనియు, మహమ్మదీయ చరిత్రకారుల వ్రాఁతలు బూటకములనియు డా॥ బి.రామరాజుగారు సప్రమాణముగా నిరూపించియున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౨౨౪-౨౨౮). చిన్నపరెడ్డి వందేమాతరమ్ ఉద్యమమునఁ బాల్గొన్న అకలంక దేశభక్తుఁ డనియు, బ్రిటిషు పాలకులకు సింహస్వప్నమువంటివాఁడనియు

నిరూపించుటకు నా యొద్ద గట్టి ప్రమాణములున్నవి. ఇక పోఁగా, సిసలైన బందిపోటు కథ యొకటి తెలంగాణమున నాకు లభించినది. దానిపేరు 'మలగర బాలేసాబు కథ'. హైదరాబాదు రాష్ట్రమున జరిగిన రజాకార్ల దుండగముల కీతఁడు వెన్నెముక!

## 2.2.1. సర్వాయి పాపని కథ:-

ఔరంగజేబు కొడుకు 'కాంబక్షు' కాలములోఁ దెలంగాణమున విజృంభించిన సాహసికుఁడు పాపఁడు. ఇతని తల్లి పేరు 'సర్వమ్మ' యగుటచే నితనికి 'సర్వాయి పాపఁడు' అని పేరు వచ్చినది. ఉపలబ్ధ వీరగాథనుబట్టి పాపఁడు పుట్టినది 'పులగాము', పెరిగినది 'తాటికొండ', కులమందు గవండ్లవాడు. ఇతని ఇంటిపేరు 'నాసనోళ్లు'. 'అసేన్, వుసేన్, తుర్కా హిమాన్, దూదేకుల పీరు, ముక్కులు కోసే నక్కల పెరుమాళ్లు, నెల్లూరి హనుమంతు, చాకలి సర్వన్న, మంగలి మాసన్న, కుమ్మరి గోవిందు' మున్నగు వారు ఈ పాపని యనుచరులు. ఈ యనుచరులతో నితఁడు కడప, కర్నూలు, నెల్లూరు మండలముల లోను, మైసూరు మండలములోను అనేక పట్టణములను దోచెను. చెన్నపట్టణము, గోల్కొండ బస్తీలు, ఢిల్లీ దర్బారులు పాపని పేరు చెప్పినచో గడగడ వణఁకి పోవునఁట! అంతేకాదు:-

*"పాపని యొక్క పేరు చెప్పితే*
*ఊర పిచ్చుక ఊరు చేరదు*
*పొట్టి పిచ్చుక పొలము చేరదు*
*కౌజులూ కారాడుతుండు*
*నక్కలూ నాట్యాలు దొక్కూ*
*పందికొక్కూ డోలు కొడతాడో- వాడేటంటే*
*దొతికుండలు గంతులేస్తాయి ,,*
*పసి బిడ్డలు పాలు తాగరురా ,,*
*గుఱ్ఱాలు గుగ్గిళ్లు తినవూర ,,*
*యేనుగులు మేత అందావూ - వాడి పేరంటే"*

ఇంత భయంకరుఁడైన పాపఁడు పల్లెలను బట్టణములను దోచుటలోఁ దృప్తిపడలేదు. అతఁడు చిన్నతనములోఁ బశువులను గాయుచు నిద్రపోఁగా, బన్నెండు సిరసుల నాగుపాము వాని కెండ పొడ తగులకుండ పడగెత్తి గొడుగు పట్టినదఁట. కాశినుండి రామేశ్వరము పోవు బ్రాహ్మణులు ఆతనికి ఏడుఘడియలు గోలుకొండ సింహాసనమేలు పంతమున్నదని చెప్పిరఁట. ఆ మాటలు నమ్మి పాపఁడు తల్లిని బెదరించి ధనమును గుంజి, ఆ ధనముతో సైన్యములను గూర్చుకొని, గోల్కొండపై దండెత్తెను. ఆతని జాతక ప్రభావమును గుర్తించి, యేడు ఘడియలు నవాబు మిన్నకుండెను. పాపఁడా యేడు ఘడియలలోను గోల్కొండ కోటను వశపఱుచుకొనెను. ఏడవ ఘడియ దాటఁగనే నవాబు వాని నెదిరించెను. పాపని సైన్యమంతయు నష్టము కాఁగా నతఁడు కడకు ఆత్మహత్య చేసికొనెను. ఇది యీ వీరగాథలోని యితివృత్తము.

ఈ కథకు గుజిలీ ప్రతులు కొన్ని లభించుచున్నవి. వీనికన్న మౌఖిక ప్రచారమునఁ దెలంగాణము రాయలసీమలలో వ్యాపించియున్న యీ కథను సేకరించుట యుత్తమము. అట్టి దానిని నేను రాయలసీమలో సంపాదించితిని. గుజిలీప్రతిలోకన్న నిందు కథ మఱింత విపులముగ నుండుటయే కాక, అనేక క్రొత్త విషయము లున్నవి. ఈ కథను మొట్టమొదట సేకరించినది జె.ఎ.బోయల్ దొరగారు. వీరు క్రీ.శ. 1874లో దీనిని కడప మండలమున నొక బోయవాని కడ సంపాదించిరి. బ్రౌనుదొరగారు సేకరించిన బొబ్బిలి కథ, కామమ్మ కథ, కుమార రాముని కథలను దప్పించినచోఁ దెలుఁగులో నతిప్రాచీనకాలమున సేకరింపఁబడిన వీరగాథ సర్వాయి పాపని కథ యనవచ్చును. బోయలుదొరగారు సంపాదించిన కథకును నేఁడు లభించుచున్న గుజిలీప్రతికిని గూడఁ బెక్కు భేదములున్నవి. దొరగారు సేకరించిన ఈ క్రింది పంక్తులు గుజిలీప్రతిలో లేవు.

*"పాపడు తాగేటి కల్లు*
*ఏతాటి తాటికల్లు*
*వేలుపెట్టితే వేలు తెగును*
*దివిటి పెట్టితే భగ్గున మండును*
*తాగేటప్పుడు తియ్యగ వుండును*
*తాగిన వాణ్ణి లేవనియ్యదు*
*లేచిన వాణ్ణి పోనివ్వదు"*

నేను సంపాదించిన పాటలోఁ గూడ కల్లు వర్ణనమున్నది. పాపడు గుఱ్ఱముకొండలోఁ గల్లు ద్రాగెనఁట. ఆ కల్లు ఎట్టిదనఁగా:-

*"కల్లు మిందా బొరుగు తీసీ*
*పచ్చగడ్డీ పైన యేస్తే*
*అగ్గిలేకా భగ్గున మండూర- ఆ కల్లు"*

నేను సంపాదించిన సర్వాయి పాపని కథ ఈ క్రింది విధముగాఁ బ్రారంభమగును:-

*"రాయుడా సర్వాయి పాపాడా! మొగలాయి పాపా!*
*ఈడిగోళ్లా చిన్నవాడేరా- సర్వాయి పాప*
*ఈదులు గీసే ఈడిగోడమ్మ- సర్వాయి పాప*
*ఈడిగోళ్లా చిన్నవాడు- ఇప్పా పువ్వంటివాడు*
*మల్లెలా మొగ్గంటి వాడు- మఘలీ రేకంటి వాడేరా- సర్వాయి పాపా!"*

నాకీ పాటను వినిపించిన పూసల బలిజవాఁడు, పాపఁడు అనంతపురము జిల్లా, కదిరి తాలూకాలోని ఓరుగల్లులోఁ బుట్టెనని చెప్పెను. పాపఁడు పులగాములోఁ బుట్టి, తాటికొండలోఁ బెరిగెనని గుజిలీప్రతిలోఁ గలదు. 'బెల్గాము' నే 'పులగాము' అనినాఁడేమో కవి. తాటికొండ అనంతపురము జిల్లాలోఁ గలదు. గుజిలీప్రతిలోఁ బాపని తల్లి సర్వమ్మ మాత్రమే పేర్కొనఁబడినది. నేను సేకరించిన

రాయలసీమ పాటలో నితని తండ్రి 'వెంకటన్న' అనియుఁ దల్లి 'సారమ్మ' అనియు, నితఁడు ఓరుగంటి యెల్లమ్మ వరపుత్రుడనియుఁ గలదు. గుజిలీప్రతిలో పాపఁడు గోల్కొండపై యుద్ధమునకుఁ బోవుచుఁ గల్లు త్రాగినది 'మొగల్‌గుంట'లో ననియు, నంతకుఁ బూర్వము త్రాగినది 'రేణికుంట'లో ననియుఁ గలదు. నేను సేకరించిన కథలో పాపఁడు 'గుబ్బముకొండ'లో కల్లు నమ్మెనని కలదు. ఈ గుబ్బముకొండ చిత్తూరుజిల్లా వాయల్‌పాడు తాలూకాలో నున్నది. ఇక్కడ 'వ్రేలు పెట్టితే వ్రేలు తెగేటి' కల్లు నేఁటికిని లభించుచున్నదఁట! ఈ పాటనుబట్టి సర్వాయి పాపఁడు రాయలసీమ వాఁడుగనే తోఁచును. బోయల్‌దొరగారుకూడ బళ్లారిజిల్లాకుఁ జెందిన గాథాకారునినుండి కథను సేకరించి, పాపఁడు రాయలసీమ వాఁడని తీర్మానించిరి. కాని డా॥ బి. రామరాజుగారు సర్వాయి పాపఁడు తెలంగాణపువాఁడని నిర్ణయించిరి. వారు పాపనిగూర్చిన చారిత్రకాంశములను బూర్తిగా బయటపెట్టిరి. పాపఁడు తెలంగాణములోని ఓరుగల్లునుండి గోల్కొండవఱకును అనేక దుర్గముల నాక్రమించుకొని, మహమ్మదీయ పాలకులను గడగడలాడించిన మహావీరుఁడు. ఈతఁడు బందిపోటు కాదు. (చారిత్రకముగా నితఁడు గొప్ప వీరుఁడైనను కథావిధానమును బట్టి ఈ వర్గమునఁ జేర్చితిని.) ముస్లిము చరిత్రకారులు ఈతనినిగూర్చి చాల హీనముగాఁ బక్షపాతదృష్టితో వ్రాసిరి. వారి వ్రాఁతలు నమ్మదగినవి కావు. 'సర్వాయ' వేఱనియు, 'పాపఁడు' వేఱనియుఁ గొందఱు వ్రాసిరి. కథనుబట్టి ఇతని తల్లి సర్వమ్మ యగుటచేతనే ఇతనికి 'సర్వాయి పాపఁడు' అని పేరు వచ్చినట్లు తెలియుచున్నది. క్రీ.శ. 1708లో పాపడు ఓరుగల్లు కోటను ముట్టడించినట్లు చరిత్రలోఁ గలదు. కావునఁ బాపని విజృంభణము పదునెనిమిదవ శతాబ్ది ప్రారంభమున జరిగియుండును. ఇతఁడు ఔరంగజేబు కుమారుడగు 'కాంబక్షు' కాలమువాఁడు. నాకుఁ జూడ, దేసింగురాజు కథయు సర్వాయి పాపని కథయు నొకే కాలము నాఁటివిగాఁ గన్పట్టుచున్నవి. ఢిల్లీ సుల్తాను పంపిన యూసఫ్‌ఖాన్ పాపనిఁ జంపినట్లుగాఁ జరిత్రలోఁ గలదు. ఈ కథనుగూర్చిన చారిత్రక విషయములు మల్లంపల్లి సోమశేఖరశర్మ గారి 'అమరావతీ స్తూపము'లోను, 'ఖాఫీఖాన్ చరిత్రము- రెండవ భాగము' అను పారశీక గ్రంథములోను, T.W.Haig రచించిన ''Historic land marks of Deccan'' అను గ్రంథములోను గలవు.

"నీచకులమున జన్మించి, కల్లుగీత వృత్తిగా, పశువుల మేపుట వృత్తిగా, మొదట బ్రతికిన పాపడు తెలుగు దేశమును గడగడ లాడించుటయే కాక, ఢిల్లీ చక్రవర్తికి సైతము తీరని సమస్యగా పరిణమించినాడన్న ఆతని ధైర్యసాహసములు వీరవిక్రమములు కొనియాడఁదగినవి."[26] నేను సంపాదించిన మౌఖికగాథలో నితని శౌర్యమిట్లు ప్రశంసింపఁబడినది:-

*"అదిగొ వచ్చే పాపడంటేనూ- భూలోకమంతా*
*నక్కలే నట్టావు దొక్కేదీ- పాపన్న దెబ్బ*
*నక్కలే నట్టావు దొక్కు- జింకలే జిడిగుడు కూసు*
*కొంగలే కోలాటమేసు- పాములే పల్లాయి దొక్కూ*
*పూరేళ్లే పూడిపోవు-లేవకలే లేసిపొయ్యేదీ- పాపన్న దెబ్బ"*

నాకు లభించిన పాటలోఁ బాపని బల్లెమును గూర్చిన వర్ణన యున్నది. ఇది గుజిలీప్రతులలోఁ గానరాదు.

*"వాడు పట్టే బల్లెమున్నాదీ- పాపిష్టి బల్లెం*
*అక్కడిక్కడ ఎండి కట్టూ*
*నడుమనా బంగారి కట్టూ*
*మంచపేలా మల్లకచ్చూ*
*మొంచు ఏలా సుట్టకొస్తుందీ- ఆ బల్లెము"*

గుజిలీప్రతిలోఁగూడఁ గొన్ని రసవత్తర ఘట్టములు లేకపోలేదు. పాపని తల్లి సర్వమ్మ 'కలవిద్యలు ఎన్ని అయినా కులవిద్యకు సాటిరావు' అని కుమారునితోఁ జెప్పి, తమ యింటి యావులను మేపుచు, నీతచెట్లను గీయుమని కోరును. ఆపాదమస్తకము శౌర్యరక్తము ప్రవహించు వీరశిఖామణి యగు పాపఁడు తల్లికిట్లు జవాబు చెప్పును:

*"ఈదుల గీస్తే ఈంద్రవాడు- కల్లుగట్టితే గవండ్లవాడు*
*కత్తిపట్టితే మేదరవాడు- కుండబట్టితే కుమ్మరవాడు*
*మొనగాడీ చట్టమొచ్చూనా- సర్వమ్మ తల్లి*
*పాళెగాడీ చట్టమొచ్చునా- సర్వమ్మ తల్లి*
*పూరుకొడితే ఏమి ఫలము?- పల్లెకొడితే ఏమి ఫలము?*
*కొడితే గోల్కొండ కొట్టాలే సర్వమ్మ తల్లీ!*
*పడితే బందారు పట్టాలె- సర్వమ్మ తల్లి*
*కడపా జిల్లాల్ కొట్టాలే- సర్వమ్మ తల్లి*
*కందనూలు మాలు కొట్టాలె- సర్వమ్మ తల్లి*
*అరె- మైసూర్ జిల్లాల్ కొట్టాలే- సర్వమ్మ తల్లి*
*చెన్నాపట్నం కొట్టాలే!"*

అని తన నిశ్చయమును బ్రకటించును. గొల్కొండపై దండెత్తుటకు ముందు సర్వాయి పాపఁడు నేస్తగాండ్రతో 'మొగల్‌గుంట' కల్లు త్రాగుటకుఁ బోవును. అతఁడు పూర్వము రేణిగుంట కల్లు త్రాగినాఁడఁట. ఆ కల్లు కేవలము కన్నులెఱ్ఱజేసి పోయెనే కాని, లాహిరి యెక్కింపలేదఁట. అందుచే మొగలుకుంటకు రాఁగా అక్కడ:-

*"మాట్లాడే కల్లు వుంది- మైకమెత్తే కల్లు వుంది*
*నిద్రబొయ్యే కల్లువుంది- జూదమాడే కల్లు వుంది*
*దోవనడిచే కల్లు వుంది- జగడమాడే కల్లువుంది*
*ఏలుపెడ్తే ఏలుమందు- కాలుపెడ్తే కాలుమందు*
*కత్తి పెడ్తే కత్తిరించాలె- ఆ కల్లూ!"*

ఇన్ని రకముల కల్లులోఁ బాపనికి ఏ కల్లును నచ్చలేదు. అతనికి 'నఱుకులాడే కల్లు' కావలయునఁట! తాడిచెట్టుకూడ నతనికి భయపడి వంగి కల్లుపోసినదఁట! ఆ 'నఱుకులాడే కల్లు' త్రాగి పాపడు నేల పల్లటీలు కొట్టినాఁడఁట. 'అంతర పల్లటీలు' వేసినాఁడఁట! పాపఁడు గోల్కొండకఁడ జేసిన యుద్ధము బొబ్బిలియుద్ధము వరుసలోఁ జక్కగాఁ వర్ణింపబడినది. పండ్రెండువేల దండురాఱువను వెంటఁ బెట్టుకొని, గోల్కొండపైఁబడి, రెండు చేతులతోను గత్తులు పట్టి పాపడు యుద్ధము చేయుచుండఁగా శత్రుసైన్యమెట్లు చితికిపోయినదో చూడుఁ డు:-

***"కొట్టితేనుగా పడి ఉన్నావి క్రొవ్వి దబ్బాలు***
***నరికితేను మరి పడి ఉన్నావి నాలికె పేగూలు***
***చేరు చేరు బంగీఆకు ముద్దలే భూమిన పడుతావి***
***అప్పుడు తిన్నా పప్పూఅన్నమే తెప్పలు బడుతుంది***
***యెగిరే వొక్కా శిరస్సులాకు ఎడాసందులేదు***
***వాలేటి వో శిరస్సులాకు ఎడా సందులేదు".***

బొబ్బిలికథవలెనే దీనికిని ఉత్తమ వీరగాథా లక్షణములున్నవి. దీని నడక వీరగాథలన్నిటిలోను ప్రత్యేకమైనది. దీనికిదియేసాటి. తెలుఁగు వీరగాథలలో ముగ్గురు మరాటీల కథ, సర్వాయి పాపని కథ- ఈ రెండును వీరరసము పరవళ్లు త్రొక్కెడి వరుసలలో నున్నవి. ఇంతటి ఉత్తమగతిలో సాఁగెడి వీరగాథలు తెలుఁగులో మఱిలేవు. ఆధునికులగు బుఱ్ఱకథా రచయితలుగూడ నీ నడక నెక్కువగ ననుకరించుచున్నారు. సర్వాయి పాపని కథ తెలుఁగు జానపద గేయములలో ఏలపాటల నడకలో నున్నది. ఇది కొంత వఱకును హరిణగతి రగడను బోలునని చెప్పవచ్చును. 7+7= 14 మాత్రలొక పాదముగా సాఁగును. ఇది ఒక్క రాత్రి కథ. జంగములు దీనిని బాడుచున్నారు. మిక్కిలి ప్రసిద్ధమైన వీరగాథలలో నిది యొకటి.

లభ్యములగు గుజిలీప్రతులనుబట్టి, నిడిగంటి వీరయ్య, కదూరి చెంగల్వరాజు అను నిరువురు కలసి ఈ సర్వాయి పాపని కథను రచించినట్లు తెలియుచున్నది. 1909లో ప.యతిరాజులు నాయుఁడు గారు (చెన్నపట్టణము) ప్రకటించిన 'సర్వాయి పాపఁడు కథ'లో నీ క్రింది విధముగా నున్నది:

"సర్వాయి పాపఁడు అను నీ శూరుని చరిత్రము సకలజన మనోల్లాసంబుగ నుండునటుల నెల్లూరుజిల్లాలోఁ జేరిన వడ్లపూడి గ్రామములో నివసించియుండు నిడిగంటి వీరయ్యగారిచేతను, కదూరి చెంగల్వరాజుగారిచేతను వ్రాయఁబడి..."

కాని ఈ కర్తృత్వ విషయము విశ్వసింపఁదగినది కాదు. ఈ కథ 1909వ సంవత్సరమునకు ముప్పదియైదేండ్లు ముందుగనే మిక్కిలి ప్రచారమున నున్నది. క్రీ.శ. 1874లో జె.యె.బోయల్‌దొరగారు దీనిని రాయలసీమలో సేకరించియున్నారు. పైన తెలుపఁబడిన నిడిగంటి వీరయ్య జంగము. చెంగల్వరాజు ప్రకటన కర్త. ఇరువురును గలిసి తమ నామములను గవులుగా ముద్రించుకొనిరి. ఈ నిడిగంటి వీరయ్య యను జంగముచేఁ బ్రసిద్ధకథలను బాడించి, మద్రాసులోని ప్రకటనకర్తలు ముద్రించియుందురు. దేసింగురాజు కథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మ కథ మున్నగు గుజిలీప్రతులలో నిడిగంటి వీరయ్య పేరు ఇట్లెక్కినదే కాని, ఇతఁడు రచయిత కాఁడు. సర్వాయి పాపని కథలోఁ దన పేరును గవిగా నెక్కించుకొనిన ప్రకటకర్తయగు చెంగల్వరాజు, చిన్నమ్మకథలో వీరయ్యపేరును దప్పించి, తానే కవి నన్నాఁడు. తరువాతి కాలమున మద్రాసునుండి 'వెస్టువార్డు అండ్ కంపెనీ వారు'; రాజమహేంద్రవరమునుండి కొండపల్లి వీరవెంకయ్యగారు, కాళహస్తి తమ్మారావుగారు నీ సర్వాయి పాపని కథను బ్రచురించుచు వచ్చిరి. తెలంగాణమున సర్వాయి పాపనిగూర్చి శారదపదములు కూడ వ్యాప్తిలో నున్నవి.

### 2.2.2. చిన్నపరెడ్డి కథ:-

సాహసమున 'రాబిన్‌హుడ్'ను, అశ్వారూఢ నైపుణ్యమున 'రిచెర్డు' చక్రవర్తిని మించిన మహావీరుఁడు చిన్నపరెడ్డి. ఇది గుంటూరు మండలమునఁ గోటప్పకొండ దగ్గఱ శివరాత్రి తిరునాళ్లలో జరిగిన సంఘటన ప్రధానముగాఁగల వీరగాథ. ఇది సర్వాయి పాపని కథవలె నంత ప్రాచీనమైనది కాదు. ఇది 20వ శతాబ్ది ప్రారంభమున 1909 ఫిబ్రవరి 18వ తేదిని జరిగిన సంఘటన. చిన్నపరెడ్డి వంశ్యులు నేఁటికిని చేబ్రోలుదగ్గఅనున్న 'కొత్తరెడ్డిపాలెము'లో నున్నారు. గాథాకారులు నాగస్వరము, చిఱుతలు (చిటితాళము), కంజీరాలతో నీ కథను బాడుదురు. నెల్లూరు మండలమున పెద్దేటి గొల్లలు, గుంటూరు మండలమున గుఱ్ఱముల నాడించువారు చిన్నపరెడ్డికథను బాడుదురు. జంగములు దీనిని బాడఁగా నేను వినలేదు.

చిన్నపరెడ్డికథకు గుజిలీప్రతి లభించుచున్నది. ఇది విశ్వసింపఁ దగినది కాదు. ఇది మిక్కిలిగ సంక్షిప్తము చేయఁబడిన రచన. దీనిని పెద్దేటి గొల్లలు రెండు రాత్రులు పాడఁగా నేను 1964లో తిరుపతిలో విని యున్నాను. చిన్నరెడ్డి పుట్టుక, పెరిఁగి పెద్దవాఁడగుట, మైసూరు పోయి యెద్దులను గొనితెచ్చుట- ఇంతవఱకును మొదటి రాత్రి కథ. కోటప్పకొండ ప్రభల తిరునాళ్లు, చిన్నపరెడ్డి మదరాసు పోయి గుఱ్ఱమును గొని తెచ్చుట, ప్రభుత్వమువారు ఇతనిని మోసగించి పట్టుకొనుట, చిన్నపరెడ్డి ఉరికంబమును గోరుకొనుట- రెండవ రాత్రి కథలో వచ్చును.

సర్వాయి పాపని కథవలెనే చిన్నపరెడ్డి కథకూడ వీరరస స్ఫోరకమగు నడకలో నున్నది. ఏడు మాత్రల ఆవృత్తులు రెండొక పాదముగా సర్వాయి పాపనికథ సాగఁగా, నెనిమిది మాత్రల ఆవృత్తులు రెండొకపాదముగా చిన్నపరెడ్డికథ సాఁగును. "సైసైరా! చిన్నప్పారెడ్డీ! నీపేరే బంగారపు కడ్డీ!" అనునది దీనిలోని పాదాంత పదము. ఈ వీరగాథ ననుసరించి చిన్నపరెడ్డి పుట్టినది రెడ్డిపాళెములో, పెరిగినది చేబ్రోలులో. తండ్రి సుబ్బారెడ్డి, తల్లి లింగమ్మ, సోదరులు

నలుగురు. పెదరామిరెడ్డి, చినరామిరెడ్డి, రాఘవరెడ్డి, నరిసిరెడ్డి. ఈ నలుగురికన్నను చిన్నవాడు చిన్నపరెడ్డి. ఇతని భార్య రత్నమ్మ, ఉంపుడు కత్తె జానకమ్మ. పలకలూరు తిమ్మారెడ్డి, పడిదరము మునసబు అప్పయ్య, దూదిపల్ల గోవిందు– అనువారీతని యనుచరులు. వీరిని గూర్చుకొని, నాలుగు భాషలు నేర్చిన తన దివ్యాశ్వముపై నధిరోహించి, చీరాల, పేరాల, ఒంగోలు, బాపట్ల, పొతకమూరు, నెల్లూరు, వినుకొండ, గుంటూరు నగరములను కొల్లగొట్టినాఁడు. చేబ్రోలునకుఁ జుట్టును బంద్రెండామడ దూరము నిప్పులేక మండించిన మహాసాహసి చిన్నపరెడ్డి! ప్రభుత్వమువారు ఇతనిని జూచి గడగడలాడెడివారు. గుఱ్ఱము నెక్కిన చిన్నపరెడ్డిని బట్టుకొనుట బ్రహ్మకైనను తరముగాదు. గోరంచు పంచెను గట్టి, చిలకల తలపాగను జుట్టి, వెల్లగుఱ్ఱము నెక్కి పోవుచున్న చిన్నపరెడ్డిని జూచి, చుట్టుప్రక్కల కమ్మవారు భయవిహ్వలు లయ్యెడివారు:–

*"ఎక్కేదీ మరి ఎల్లగుఱ్ఱమూ*
*కట్టేదీ గోరంచుల పంచే*
*చుట్టేదీ చిలకల తలగుడ్డా*
*గోరంచులా పంచెను గట్టీ*
*చిలకలాను తలగుడ్డను జుట్టీ*
*రెడ్డిపాళెమూ బయలూదేరీ*
*చేబ్రోలైనా వెళ్లుతవుంటే*
*చుట్టునొక్కా పన్నెండామడ*
*నిప్పులేక మండిస్తివి రెడ్డి!*
*చుట్టునొక్కా నాలుగామడా*
*బందిపోటు కొట్టిస్తివి రెడ్డీ!"*

నడివీథిలో నిలువఁబడి చేబ్రోలుకమ్మవారిని నిలువఁబడి నీళ్లు త్రాగనీయనని ప్రతిజ్ఞ పట్టిన ధీశాలి చిన్నపరెడ్డి! తన్ను గుఱ్ఱము దిగుమని కోరిన ప్రత్తిపాడుకమ్మవారిని "నేను గుఱ్ఱము దిగను. చేతనైనచో మీ గ్రామమంతయుఁ గలసి నాతోఁ బోట్లాడుఁడు" అని సవాలు చేసినాఁడు. వారాతనిపై యుక్తిని జూపిరే కాని, శక్తిని జూపలేక పోయిరి. చిన్నపరెడ్డి 'యాభై మూళ్ల ప్రభ'ను గట్టుకొని కోటప్పకొండ తిరునాళ్లకు బయలుదేరుట చాల నద్భుతముగ వర్ణింపఁబడినది:–

*"యాభై మూళ్లా ప్రభను గట్టెను*
*నాలుగు గాండ్లా యెద్దులు గట్టెను*
*బండి ప్రభా వెంబడి రెడ్డీ*
*ఏ విధంబుగా బయలుదేరెనూ*
*ఎల్లగుర్రానికి కళ్లెమేసెనూ*
*తెల్లకోటునూ తొడిగినాడుగా*
*తెల్లహసారం తొడిగినాడుగా*
*నల్లకోటునూ తొడిగినాడుగా*
*అయిదున్నరా కిఱ్ఱు చెప్పులూ*
*కాళ్లకైన మరి వేసినాడుగా*
*చిత్రము గొడుగును బట్టినాడుగా*
*బండి ప్రభా వెంబడి రెడ్డి*
*ఏ విధంబుగా బయలుదేరెనూ*
*పాళెగానితో సమానంగనూ*
*బయలు దేరెనూ చిన్నపరెడ్డీ"*

కోటప్పకొండలోఁ బోలీసువారు ఈతని ప్రభ నటకాయించిరి. చిన్నపరెడ్డి వారిని లెక్కచేయలేదు. పోలీసులు మూఁడువందల తుపాకులు ప్రేల్చిరి. చిన్నపరెడ్డి తన యశ్వమును బోలీసుల మీఁద నుండి దూకించి పాఱిపోయెను. ఈ గందరగోళమునఁ దిరునాళ్లలోని ప్రజలు నలఁగిపోయిరి. ఇట జానపదకవి యెట్లు వర్ణించెనో చూడుడు:

*"మూడువందలా తుపాకి పోగలో*
*వొకరి ముఖమును వొకరు గానకను*
*తమలో తామే కొట్టుకొనుచును*
*తలగుడ్డలు పడిపోయిన దెరుగరు*
*తల్లి పిల్లలూ పోయిన దెరుగరు*
*అన్నదమ్ములూ పోయిన దెరుగరు*
*ఆలు మొగుడును పోయిన దెరుగరు*
*తెచ్చిన యంగడి పోయిన దెరుగరు*
*కాళ్లు చేతులు విరిగిన దెరుగరు"*

ఈ చిన్నపరెడ్డి కొక చెల్లెలు గలదఁట. ఈమె వీరవనిత. అన్నతో సమముగా శౌర్యమును బ్రదర్శించి పోలీసు బలగమును జీల్చి చెండాడినది. ఈమె ప్రసక్తి వీరగాథలో లేదు కాని, చిన్నపరెడ్డిపై వ్యాప్తియందున్న వేఱొక గాథానికలోఁ గలదు:–

*"చిన్నపరెడ్డీ చెల్లెలంటా!*
*తురుక పాలెమున ఉన్నాదంటా!*
*అయిదువందలా జనాన్నిగొట్టీ!*
*అన్నగారిలో గలిసిందంటఁ*
*నాయనా! చిన్నపరెడ్డీ!*
*నీ పేరే బంగారపు కడ్డీ!"*

మహాసాహసికుడైన ఈ చిన్నపరెడ్డి నేఁటి స్వతంత్ర భారతమున జీవించియున్నచో సర్వసైన్యాధ్యక్ష పదవికి నర్హుఁడుగా నుండెడివాడు.

వీరగాథలోని కొన్ని పంక్తులును, ఆంగ్లేయుల పాక్షిక రచనలును చిన్నపరెడ్డిని బందిపోటుగాఁ జిత్రించుచున్నవి. ఇది మిక్కిలి అసంగతమగు విషయము. చిన్నపరెడ్డి భారత స్వాతంత్ర్యోద్యమమున, ముఖ్యముగా వందేమాతరమ్ ఉద్యమమునఁ బాల్గొన్న జాతీయ నాయకుడు. ఆంగ్లేయుల దౌర్జన్యము నెదిరించిన ధీరుఁడు. చిన్నపరెడ్డికథలోని చారిత్రకాంశములను బరిశీలించినచో నీ విషయము స్పష్టమగును. దేశభక్తులగు అయ్యదేవర కాళేశ్వరరావుగారు చిన్నపరెడ్డికథలోని యథార్థ విషయముల నిట్లు వెల్లడించిరి:–

"1909 సంవత్సరం ఫిబ్రవరిలో నరసరావుపేట తాలూకా కోటప్పకొండ వద్ద జరిగిన శివరాత్రి యుత్సవమునకు అదివర కేటేట జరిగినటులే వేలకు వేల ప్రజలు పోగైరి. వారిలో చాలమంది మంచి మంచి ఎద్దులను బాగుగా నలంకరించి ప్రభలు కట్టుకొని వచ్చిరి. అటులనే చిన్నప్పరెడ్డి యను రెడ్డినాయకుడును అతని మిత్రులును మంచి ఎద్దులతో గొప్ప ప్రభలను కట్టుకొని వచ్చినారు. పోలీసు హెడ్డు కానిస్టేబులు ఇతర కానిస్టేబులులు లా అండ్ ఆర్డరు అను పేరుతో ప్రభలుకట్టి తెచ్చినవారిమీద అనవసరముగ దౌర్జన్యము చేయుచు, త్రోవలు సరిగా నుండవలెనని మనుష్యులను ఎడ్లను బెత్తములతో కొట్టసాగిరి. ఈ విధముగనే చిన్నప్పరెడ్డిమీద దౌర్జన్యము చేసి, అతని ఎద్దులను కొట్టగా, అవి బెదరి స్వాధీనము తప్పే స్థితిలోకి రాసాగినవి. అందు మీద పోలీసులు తుపాకులు కాల్చి చిన్నప్పరెడ్డి ఎడ్లను చంపినారు. అప్పుడు చిన్నప్పరెడ్డి, అతని మిత్రులు పోలీసులమీద గొప్ప తిరుగుబాటు చేసినారు. పోలీసులు ప్రజలమీద కాల్చినారు. కొందరు హతులైనారు. ప్రజలందరు చిన్నప్పరెడ్డితో చేరినారు. స్త్రీలుకూడ ఇనుపకడ్డీలతో పోలీసులమీదకు పోయినారు. పోలీసు హెడ్‌కానిస్టేబులును, ఇంకా కొంతమంది కానిస్టేబుల్స్‌ను పట్టుకొని, మంటలలో వేసి హత్య గావించినారు. తక్కిన పోలీసువారు, మేజిస్ట్రేటు, ఉద్యోగస్తులు పారిపోయినారు. ఆ సమయములో 'వందేమాతరం! బ్రిటిషు గరవ్నమెంటును పారత్రోలండి! స్వరాజ్యము కావాలి' అనే నినాదములు నలుదిశల మారుమ్రోగినవి. అల్లర్లు ముదరగానే ఎక్కడి వారక్కడ వెళ్లిపోయినారు. చిన్నప్పరెడ్డి గొప్ప ధీరుడైనాఁడు. తరువాత ఆయనను, ఇంకా కొంతమందిని అరెస్టు చేసి, ఉరితీసినారు. మరి కొందరికి దీర్ఘశిక్షలు వేసినారు. అప్పుడు 'కెరషాస్పు' సబ్ కలెక్టరుగ నుండెను. రాజీనామానిచ్చి వెళ్లిపోయినాడు. కొందరు వుద్యోగస్తులను పిరికితనము క్రింద తమ పనిని సకాలములో సక్రమముగా నెరవేర్చనందుకు క్రింది ఉద్యోగములలోనికి వేసినారు. ఇది కూడ స్వరాజ్యోద్యమమునకు తోడ్పడినది. చిన్నప్పరెడ్డి మహాధీరుడని పొగడుచు ఉద్రేకమైన కీర్తనలు కట్టబడినవి. ఇప్పటికీ ఆ వైపుల ప్రజలచే పాడబడుచున్నవి."[27]

ఒక సాహసిక సంఘటన జరిగిన వెంటనే వీరగాథ యుద్భవించు ననుట కీ చిన్నపరెడ్డి కథ ప్రజల తార్కాణ మగుచున్నది. ఈ వీరగాథ సంఘటన జరిగిన వెంటనే పుట్టుటయే కాక, ఐదేండ్లలో నిది ముద్రితమై యావదాంధ్ర దేశమునకుఁ బ్రాకిపోయినది. క్రీ.శ. 1909లో సంఘటన జరిగినది. 29-8-1914న ఈ వీరగాథ మద్రాసు నుండి కో. గోవిందరాజ మొదలియార్‌గారిచేఁ బ్రకటింపఁ బడినది. ఈ ప్రాచీనప్రతి వేటపాలెము గ్రంథాలయాధ్యక్షులగు శ్రీ అడుసుమిల్లి శ్రీనివాసరావుగారికడ నున్నది. దీని ముఖపత్రమున నిట్లున్నది:-

***"కోటప్ప కొండలో జరిగిన 'చిన్నప్పరెడ్డి కథ'***
***బెజవాడ: కంగా వెంకటరత్నం, పండితులచే పరిష్కరింపబడి***
***కో. లక్ష్మణ మొదలియార్ కొమారుడగు***
***కో. గోవిందరాజ మొదలియార్‌గారిచే ప్రకటింపబడెను.***
***Madras 1914".***

దీని ప్రకాశకుడు గోవిందరాజ మొదలియార్ కాఁగా 'బెజవాడ కంగా వెంకటరత్నం' ఎవరో తెలియుటలేదు. ఇతఁడు బహుశః ఈ కథను సేకరించినవాఁడో లేక రచయితయో కావలెను. దీనినే 1928లో 'అమెరికన్ డైమండ్ ప్రెస్సు' వారు ప్రకటించిరి. పిమ్మట రాజమండ్రినుండి కొండపల్లి వీరవెంకయ్యగారు, కాళహస్తి తమ్మారావుగారు దీనిని బ్రకటించుచు వచ్చిరి.

నేను 11-6-1971లో కావలివెళ్ళి శ్రీ కె.వి.రమణారెడ్డిగారిని కలిసినాను. 'చిన్నపరెడ్డికథ'ను గురించి వారితో జరిపిన గోష్ఠిలో వెల్లడియైన కొన్ని నూతన విశేషములు:-

1. చిన్నపరెడ్డి కథలోని సంఘటన కోటప్పకొండలో 1909 ఫిబ్రవరి 18వ తేది శివరాత్రినాఁడు జరిగినది.
2. ఈ సంఘటన 1909 ఫిబ్రవరి 21వ తేది 'కృష్ణాపత్రిక'లో ఒక వార్తగా వచ్చినది.
3. ఈ కథాకాలమునాఁటి పోలీసు ఇన్‌స్పెక్టరు శ్రీ సన్యాసయ్య. సూపరింటెండెంట్: శ్రీ ఆరణి సుబ్బారావు పంతులు. సబ్-కలెక్టర్: శ్రీ P. Kershasp (పార్శి). ఈ ముగ్గురను బ్రిటిషు ప్రభుత్వము సస్పెండ్ చేసినది.
4. 1909 మార్చి 21వ తేది కృష్ణాపత్రికలో, Time పత్రిక వ్రాతలను గుఱించి Hindu పత్రిక స్వకీయ విలేఖకుని విమర్శ ప్రకటింపఁబడినది.
5. ఆ కాలములో మద్రాసు గవర్నరు: Sir Arthur Lally

## 2.3. బందిపోట్లు

### మలగర బాలేసాబు కథ:-

ఇది సిసలైన బందిపోటు కథ యనుటలో నెట్టి సందేహము లేదు. భారత స్వాతంత్ర్యము సిద్ధించు సమయమున హైదరాబాదు రాష్ట్రమున జరిగిన రజాకార్ల దౌష్ట్యముల కీతని క్రూరత్వములు మిక్కిలి దోహద మొనర్చినవి. ఇది తెలంగాణమున మహబూబునగరు మండలమున వ్యాప్తియందున్న బందిపోటు కథ. రజాకార్ల దుండగముల కైదు సంవత్సరములు ముందుగనే ఈ బందిపోటు విజృంభించి, ధనికులైన హిందువులను బెక్కు హింసలపాలు జేసి, వారి యాస్తిపాస్తులను దోచివైచెను. తరువాత రజాకార్లతోఁ గలసి, యనేకములగు నాగడములను జేసెను. 1948లో మన ప్రభుత్వము హైదరాబాదును లొంగదీసికొనినప్పుడు ఈ మలగర బాలేసాబు పాకిస్థానుకుఁ బాఱిపోయెను. ఇతని క్రూరకృత్యములు 1940

ప్రాంతములోఁ బ్రారంభమై 1948 వఱకును గొనసాగినవని చెప్పవచ్చును.

ఈ మలగర బాలేసాబుపై రెండురకముల కథలున్నవి. ఒకటి జంగములు పాడు తంబుఱకథ. రెండవది దక్కలవారు పాడు కిన్నెర కథ. దక్కలవారు మాదిగలను యాచించెడి యొక నిమ్నజాతి. మెట్లకిన్నెర యను వాద్యముతో వీరు దొంగలనుగూర్చిన వీరగాథలను బాడుచుందురు. నేను 1-7-1966న మహబూబునగరు జిల్లా జడ్చర్లలో జంగంకథను సేకరించితిని. దీనిని శివజంగం దేవయ్య యను నతఁడు పాడినాఁడు. ఈ కథను 'కవిచేసినవాడు' (=ఆశువుగా నల్లినవాఁడు) కూడ నితఁడే నఁట! ఇది కొంతవఱకును 'ఆరె మారాటీల కథ' వరుసలో నున్నదని చెప్పవచ్చును. పాదమునకు 20 మాత్రలు: 6+4+6+4 గా నుండును. ఈ జంగము ఈ వీరగాథా సంఘటనను గన్నులారఁ గాంచిన వ్యక్తి. ఈ కథ యిట్లు ప్రారంభమగును:-

*"భళిరా భళి తమ్ముడ-దాద మేరె దాదా! (ఇదియే పాదాంత పదము)*
*పాలమూరు జిల్లా-పాలమూరు తాలుకా ॥భళిరా భళి తమ్ముడ॥*
*చిన్న దొక్క గ్రామము-మలగరపల్లున్నది ,,*
*మలగరా పల్లెలో-మొల్ల బాలెసాబూ ,,*
*కూటికేమి లేకా-ఆకులమ్ముచుండెరా ॥భళిరా భళి తమ్ముడ॥*

మహబూబునగరునకుఁ దెలుఁగు పేరు 'పాలమూరు'. వీరగాథ లన్నిఁటను నిట్లేయుండును. 'మొల్ల' యనునది మహమ్మదీయులలో నొక తెగ. దూదేకులవారు కాఁబోలును.

మలగరపల్లెలో నున్న మొల్ల బాలేసాబు గర్భదారిద్ర్యము ననుభవించుచు నాకులమ్ముకొని జీవించుచుండెను. ఇతని భార్య 'బాలిబీ', చెల్లెలు 'జాంగిర్‌బీ'. ఇతనికిద్దరు పిల్లలు: 'సయ్యదునీ, మమ్మదునీ'. బాలేసాబు మహబూబునగరునకు వచ్చి అమీన్ (సబ్ ఇన్స్‌పెక్టరు) 'మనసరఖాన్' దగ్గఱ వంటవాఁడుఁగాఁ గుదిరెను. ఇచ్చట నుండఁగనే దొంగతనములోఁ గొంత ప్రవేశము నందెను. తరువాత నింటికిఁబోయి, త్రాగిన కోపావేశముతో నొడలు తెలియక తన భార్యను హత్యచేసెను. ఆ 'హత్యానేరము'ను దప్పించుకొనుటకై అమీన్ మనసరఖాన్‌కుఁ దన చెల్లెలి నిచ్చి పెండ్లిచేసెను. ఆ అమీన్‌కు లంచము లిచ్చి, దేశముపైఁబడి దోఁపిళ్లు సాఁగించెను. మలగరపల్లెలో నున్న కృష్ణారెడ్డిని దోఁచి, కేసులేకుండ పోలీసులకు లంచమించెను. మద్దిగట్ల గ్రామములో నున్న పటేల్ గట్టారెడ్డిని దోఁచి, ఆ ధనముతో గొప్ప గుఱ్ఱమును గొనెను. దానిపేరు 'భీం పాత్'. అది అచ్చని తెల్లగుఱ్ఱము. అందుచే గాలిలో నెగిరెడి తెల్లని వస్త్రమును జూచినప్పుడుకూడ అది బాలేసాబు గుఱ్ఱమేమో యని ప్రజలు భ్రాంతిజెంది గడగడలాడిపోయెడువారఁట! గట్టారెడ్డి దగ్గఱనున్న ఆయుధములు తుపాకి తీసికొనెను. సమధికోత్సాహముతో విజృంభించెను. గొంటె గ్రామములోని నారన వెంకటరెడ్డిని దోఁచి యయిదువేలు సంపాదించెను. కప్పెట, పోలకంపల్లె, రాగులపల్లె, అల్లమాయపల్లె, గణాపురము, తిరుమలాయపల్లె, చేకుంట, ఎనికిచెర్ల-మొదలగు గ్రామములవారి కందఱికి, నూరికి నైదువందల రూపాయల చొప్పున నపరాధము (జుల్మానా) విధించెను.

*"ఊరికైదు వందలు-తాను జుల్మా నేసిందు*
*ఇస్తె మంచి దన్నదు-ఇవ్వకుంటె ఇంటికొస్త నన్నదు*
*ఊరి కైదు వందలు-వచ్చి యింటికిచ్చిరి*
*కోమటి వాండ్లు ఉంటెను-బియ్యం ఊరికె ఇవ్వాలి*
*ఉప్పు మిరపకాయలు-ఊరికేనె ఇవ్వాలి*
*కుర్వగొల్లల బిలిచిందు- వాళ్లకు జుల్మానేసిందు*
*మందకు నాలుగు ఏటలు- మరి నా కివ్వమన్నదు*
*మరి యివ్వకుండినా- మందలు మలుపుత నన్నదు"*

ఇట్లు బాలేసాబు ప్రజలను బెక్కు బాధలు పెట్టుచుండెను. నాఁటి మహమ్మదీయ ప్రభుత్వము బాలేసాబును జూచియుఁ జూడనట్లు ఉపేక్షించెను. ఒక విధముగా ప్రభుత్వము ఈతని క్రూరకృత్యములను బ్రోత్సహించెను.

కొంతకాలమునకు బాలేసాబు కర్నగ్రామములో నున్న కృష్ణారెడ్డి యను పటేలును దోఁచి, ఆతని భార్య భీములమ్మ నవమానించెను. అతనికి భయపడి కృష్ణారెడ్డి భార్యతోఁగలసి తప్పించుకొని, గొరిటె, జడ్చర్ల మీఁదుగా గణాపురము వచ్చెను. అక్కడ పెద్దగూడెమునకుఁ జెందిన కరణము లక్ష్మారాయఁడుగారిని జూచి, ఆయన కాళ్లపైఁబడి వేఁడికొనెను. ఆయన కృష్ణారెడ్డిని జూచి జాలిపడి, మహబూబ్‌నగర్ కోర్టులో దావా వేసెను. బాలేసాబు లంచమిచ్చుటచే లక్ష్మారాయని కేసు పోయెను. అంతటితో వదలక లక్ష్మారాయఁడుగారు హైదరాబాదు హైకోర్టులో దావావేసి, మలగర బాలేసాబుకు యావజ్జీవ ఖైదును వేయించెను. బాలేసాబు భయపడిపోయి, లక్ష్మారాయని శరణు వేడి, రాజీ చేసికొనెను. కోర్టులో నతని కాళ్లుపట్టుకొనెను. లక్ష్మారాయఁడు కనికరించి వదలి వేసెను. కాని బాలేసాబు నిండుసభలోఁ దనకు జరిగిన అవమానమునకుఁ బగపట్టియుండెను. పైకి స్నేహమును నటించెను. లక్ష్మారాయఁడు కృష్ణారెడ్డితోఁ గలసి కర్న గ్రామమునకు వచ్చెను. బాలేసాబు బాధలనుండి రక్షించినందులకుఁ బ్రజలందఱును లక్ష్మారాయనిఁ బ్రస్తుతించిరి. మఱునాఁడు లక్ష్మారాయఁడు గుఱ్ఱమునెక్కి తన పెద్దగూడెమునకుఁ బ్రయాణమయ్యెను. బాలేసాబు దొంగతనముగా వచ్చి, ఆ బాటలోనున్న యొక మఱ్ఱిచెట్టుపై నక్కి కూర్చుండి, వచ్చెడి కరణమును దుపాకితోఁ గాల్చి చంపెను. కరణముగారి దుర్మరణమునకుఁ బ్రజలు మిక్కిలి విచారించిరి. ఆయన తమ్ముఁడు కాంతారావు బాలేసాబును జంపఁజూచెను. బాలేసాబు పాకీస్థానుకుఁ బాఱిపోయెను.

ఈ కథ చక్కని తెలంగాణపు నుడికారముతో జాతీయములతో నొప్పుచున్నది. హైకోర్టులో మలగర బాలేసాబు కరణము లక్ష్మారాయని బ్రార్థించుట చూడుఁడు:-

*"నీ కాళ్లు మొక్కుత నన్నడు– నీ కడుపున పుడత నన్నడు*
*నీతో ఏగ నన్నడు– నీకు దండ మన్నడు*
*నీవే తల్లి వన్నడు– నీవే తండ్రి వన్నడు*
*చేతులు పట్టుకున్నడు– కడుపులో తలలు బెట్టిండు"*

కర్న గ్రామమునఁ బటేలు కృష్ణారెడ్డియు నతని భార్య భీములమ్మయు బాలేసాబు బాధల నందఱతోను జెప్పుకొని దుఃఖించుట కడు దైన్యముగా నున్నది:–

*"భార్య భర్తలు వాండ్లు– తలలు బట్టుకున్నరు*
*గోడు గోడున వాండ్లు– గోట కన్నీరు దీసిండ్రు*
*తురకవారి బాధా– పెద్ద నరకమున్నదీ*
*తురకవాండ్ల నుంచి– మనము మరణమౌతము*
*మలగర బాలేసాబు– మనకు యముడై నిలిసెనా"*

దోపిడీలకు బయలు దేరునప్పుడు బాలేసాబు క్రౌర్యము నెట్లు వర్ణించెనో చూడుడు: మద్దిపట్ల గ్రామపు పటేలు గట్టారెడ్డి తన మాటలను దిరస్కరించెనని బాలేసాబు:–

*"పటపట పండ్లు కొరికెను– గిరగిర మీసం దువ్వెను*
*తెల్లనీ కండ్లకూ– ఎర్రంగ రకతం దెచ్చెను*
*నల్ల షేర్వాణ్ తొడిగెను– షుర్మన్ లాగు ఏసెనా*
*తోటాల్ తుపాకి తీసెనా– ఈపున గట్టుకున్నడు*
*తోల్ కుళాయి తీసెనా– నెత్తికి బెట్టుకున్నడు*
*చెదావు లేసుకున్నడు– భయిల్‌దేరి వెడలెనా"*

ఇట్లు బయలుదేరి, మద్దిపట్లకు వచ్చి, కుర్చీమీద కూర్చున్న గట్టారెడ్డిని ఝాడించి తన్ని క్రింద పడవేసి:–

*"ఏదన కాలు వెట్టెను– గొంతున కత్తి పెట్టెను*
*నీ యమ్మకి మిండణ్ణన్నడు– నీ యాలికి మిండణ్ణన్నడు*
*తలువు తలువు గట్టరెడ్డి– నీ తాత పెద్దల తలవరా*
*తలువు తలువు గట్టరెడ్డి– నీ తలి దండ్రుల తలవరా"*

బాలేసాబు తన భార్యను హత్యచేయగా, నతని పిల్లలిద్దఱును దల్లి శవముపైఁ బడి 'కంట్లో కన్ను పెట్టి, నోట్లో నోరుపెట్టి' ఏడ్చిరఁట! బాలేసాబు తనకు డబ్బు నిమ్మని గట్టారెడ్డికిఁ గబురు సేయఁగా, గట్టారెడ్డి 'వాని తాత సొత్తు ఉన్నదా? వాని యబ్బ సొత్తు ఉన్నదా?' యనుట, అటకుఁ బంపఁబడిన 'మస్కరి'వాఁడు తిరిగి బాలేసాబు దగ్గఱకు వచ్చి 'నా చెంపలు పగిలిపోయెను, నా చెవులు పీకి పెట్టిండు' అనుట తెలుఁగు పలుకుబడికి మచ్చు తునుకలు. 'కాళ్లు మొక్కుత నన్నడు, కడుపులో తలలు బెట్టిండు', 'హబ్బ సస్తి నన్నడు–అమ్మ సస్తి నన్నడు', 'తెల్లని కాయితం బట్టిండు– నల్లని గీతలు గీసిండు', 'కిలకిలా నవ్విండు– మీసమైన దువ్విండు'– మున్నగున వెన్నియో నుడికారములీ కథలో నున్నవి. మలగర బాలేసాబు కథ 'కిన్నెర కథ'గా కూడా వ్యాప్తియందున్నది.

## 2.4. గజదొంగలు

గజదొంగల చోరకౌశలము కూడ జానపదులకు సంస్తుత్యమే. ఈ దొంగలు ముందుగాఁ జెప్పి కన్నము వేయుట, పోలీసులకు దొరకకుండ తప్పించుకొనుట మొదలగు సాహసములను గీర్తించు గాథలు తెలుఁగులోఁ గొన్ని గలవు. తెలంగాణమున 'మియాసాబ్ కథ', 'పండుగ శాయన్న కథ'; రాయలసీమలో 'నక్కపల్లి రాముఁడు కథ'; శ్రీకాకుళ మండలమున 'దువ్వన్నదొరకథ' మున్నగునవి ఇట్టి గజదొంగలకు సంబంధించిన వీరగాథలు. చిత్తూరు మండలమున 'అంబోతుల గిడ్డడు' అను గజదొంగ నిన్న మొన్నటి వఱకును నుండెడివాఁడు. కాని ఇతనిపై పాటయేదియును బ్రాచరమున నున్నట్లు లేదు. మిక్కిలి వెనుకబడిన కులములలో దుర్భర దారిద్ర్య ముండును. అందువలన వీరిలో కొందఱు దొంగతనములపై నాధారపడి యుందురు. మన హైందవ సమాజములో దొంగతనమే వృత్తిగాఁ గల కులములును కొన్ని కలవు. ధనికులకు–పేదలకు నడుమగల అంతరమును తొలగించుటకు మనవారు ఇట్టి కులములను సృజించియుందురు. ఈ విధముగా దొంగతనములు చేయువారికి ఈ గజదొంగలు ఆరాధ్యవీరులు!

ఈ గజదొంగల కథల నెక్కువగా మాలమాదిగలను యాచించు 'మాష్టీలు', 'డక్కలవారు' పాడుచుందురు. తెలంగాణమున నీ దొంగల కథలు కిన్నెరకథలుగాఁ బాడబడుచున్నవి. వీని నడక విచిత్రముగా నుండును. తక్కిన బొబ్బిలివరుస కథలకును వీనికిని భేదమున్నది. ఈ కిన్నెరకథలలో వంతయుండదు. కథకుఁ డొక్కడే కూర్చుండి పాటపాడును.

### 2.4.1. మియాసాబ్ కథ:–

ఇది చాలా ప్రాచీనమైన తెలంగాణపు కథ. మహబూబ్‌నగర మండలము దీని కథాస్థలము. ఈ కథను సురవరము ప్రతాపరెడ్డిగారు పేర్కొనియున్నారు. మహబూబ్‌నగర మండలమున షాద్‌నగర్ తాలూకాలో 'పిడికిరాల' యను గ్రామమున 30–6–1966న నేనీ కథను సంపాదించియుంటిని. ఇటికాల నరసఁడు అను మాష్టీఁడు మెట్ల కిన్నెరపై దీనిఁ బాడి వినిపించెను. ఇది ఈ క్రింది విధముగా 7 (4+3) మాత్రల ఆవృత్తులు నాలుగొక పాదముగా సాఁగును.

**"ఇంటీపేరె గుఱ్ఱాలోళ్లు– తండ్రీ పేరె బందియసాబు**
**అరే– తండ్రీపేరె బందియ సాబు– తల్లీ పేరు ఆశాబీబి**
**అమ్మ– పిల్లల్లేరు ఏమీ లేరు– గొడ్డుదోయి ఆశాబీబి**
**అమ్మ– మొక్కారాని దేవస్తానికి– మొక్కూతాది ఆశాబీబి**
**వచ్చీ ఏడు ఏండ్లా కోయి– బాలుదు చాల జల్మించాదు"**

బందియసాబు ఆశాబీబి దంపతులకు లేక లేక పుట్టిన మియాసాబు, శిశువుగా నున్నప్పుడు బిగ్గఱగా నేడ్చుచుఁ బాలు ద్రాగకుండెనఁట. ఎందఱు వైద్యులు వచ్చి చూచినను అతని రోగము కుదురకుండెను. 'ఎడ్లమీద పాపమ్మ' అను నామె వచ్చి అతఁడు

భీమఘడియలలోఁ బుట్టినాఁడనియు, దొంగబుద్ధి పొర్లినదనియు, రెండు గొఱ్ఱెపోతులను బలియిచ్చినచో నతని రోగము తగ్గుననియుఁ జెప్పెనఁట. వారట్లు చేయఁగనే ఆ బాలుఁడు పాలుత్రాగుటకు మొదలిడెను. అతఁడు పెరిగి పెద్దవాఁడయ్యెను. పంద్రెండేండ్ల వయసులోనే ఇల్లు వదలిపోయెను. అలంపూరు జమేదారుని కుస్తీలోఁ జంపెను. దొంగతనములలో నారితేరిన మియాసాబు:-

*"యాబయి మంది లంబాడీల- ఎంటా సాల దీసూకోని*
*నడీ జాము లేచీనాడు- నవాబుపేట దోచీనాడు*
*ఏగీ జాము లేచీనాడు- ఏములగండ్ల దోచీనాడు*
*పట్టాపగలు లేచీనాడు- పాలామూరు దోచీనాడు*
*మునీ మాపు లేచీనాడు- ముచ్చెంతలను దోచీనాడు*
*ముచ్చెంతలను దోచీనాడు- మూలా బురుజు గట్టీనాడు*
*గద్వాలైన దోచీనాడు- గాలీగోపురం గట్టీనాడు"*

ఇట్లు పంద్రెండు గ్రామములను దోఁచినాఁడు. పానుగంటి ఖిల్లామీద విశ్రమించెను. ప్రజలు వనపర్తి శంకరమ్మతోఁ దమ బాధలను జెప్పుకొనిరి. ఆమె కల్వకుర్తి జమేదారునకును కందనూలి దఫేదారునకును గొప్ప గుఱ్ఱపు దళము నిచ్చి పానుగంటి ఖిల్లా పైకిఁ బంపెను. వారు ఖిల్లాను జుట్టుముట్టిరి. మియాసాబుకు చిలకగూడెము జోగనయ్య యను నెఱుకలవాఁడు మిత్రుడు. అతఁడు మంత్ర తంత్రముల నెఱిగినవాఁడు. ఆ గుఱ్ఱములు కదలకుండ నతఁడు తన మంత్రశక్తిచే బంధించి, ఖిల్లాపైనున్న మియాసాబుకు వార్తను జేరవేసెను. మియాసాబు ఆ గుఱ్ఱములపై దుమికి, వాని తోకలు కోసి, మున్నూఱు గుఱ్ఱములను దఱిమివేసెను. వనపర్తి శంకరమ్మ మిక్కిలి అవమానము పొంది, పట్టణమునకు వార్త నంపెను. పంద్రెండువేల గుఱ్ఱముల నిచ్చినచోఁ దాను మియాసాబును బట్టి తెత్తునని 'నాదంసాబు' అను సర్దారు చెప్పెను. శంకరమ్మ అందులకు సమ్మతించి పంద్రెండువేల గుఱ్ఱపు దళము నిచ్చి నాదంసాబును మియాసాబుపైకిఁ బంపెను. పానుగంటి ఖిల్లా దగ్గఱ నాదంసాబు డేరాలు వేసెను. మియాసాబు సుందరమగు స్త్రీ వేషమున వచ్చి, నాదంసాబును మోహవశునిఁ జేసి, గుఱ్ఱముల తోకలు కోసి, నాదంసాబుకు వాతలు పెట్టి తఱిమివైచెను.

ఈ కథ 19వ శతాబ్దపు నాఁటిదని తెలియుచున్నది. కప్పగంతుల లక్ష్మణశాస్త్రిగారు ఈ పాటను సంపాదించి 18-3-1954న డా॥ బి.రామరాజుగారికిఁ బంపియున్నారు. అందులో శాస్త్రిగారిట్లు వ్రాసినారు- "19వ శతాబ్దిలో మా గ్రామం వైపున మియ్యాసాబ్ అనే గజదొంగ అనేక ఆగడాలు చేస్తూ వచ్చినాడు. అతన్నిగూర్చి పాటలు పదాలు మావైపు పిచ్చుగుంట్లువాండ్లు, ఇతరులు పాడుకుంటూ ఉంటారు".

చక్కని హాస్యముతోను, చిక్కని కవిత్వముతోను, వింతయగు నడకతోను, నున్న ఈ మియాసాబుకథ మెట్లకిన్నెరపై బాడుచుండఁగా బహుశ్రావ్యముగా నుండును. మియాసాబ్ యుద్ధసన్నద్ధుఁడగుట యెంత రమ్యముగ వర్ణింపఁబడినదో చూడుఁడు:-

*"వక్కా బట్టి కాపూసార- వక్కా పూటకె తాగీనాడు*
*ఇరవై యారు కోడీపుంజులు- సారాలోన హద్దుకు తిన్నడు*
*మూడూ దొరిల కుంజల బింగో- నడీ బొడ్లో పెట్టీనాడు*
*ఉక్కూ బీగ కందూకోని - చేతుల కందు బెట్టీనాడు*
*పెద్దాపాము తోలూ బీగ- పేటీ సాల గట్టీనాడు*
*ఎద్దూతోలు జట్టీలాగు- తొడిగీనాడ పులీరాజు*
*పన్నెండీయ తామంచాలు- కుడీపక్కను చెక్కీనాడు*
*పన్నెండీయ తామంచాలు- ఎడమా డొక్కకు చెక్కీనాడు"*

మలగర బాలేసాబు కథవలెనే ఈ కథలోఁగూడ నడగడుగునను దెలంగాణపు నుడికారము తటస్థపడుచుండును. "మూడొద్దుల పురుడు నాడు- పుట్టరాని బాలుడు పుట్టె- పుండొక తావున వుంటే మందొక తావున బెడితిమి- నిదరకెంత అడుగుతావు?- మిట్టమిట్ట మొగము సూస్తడు" ఇత్యాదులు ఉదాహరణములు. వీరగాథల సాధారణ ప్రయోగములు (వార్తానువర్తనములు) గూడ దీనిలో నధికముగా నున్నవి. "వద్దన్నా నేను బోత, పొమ్మన్నా నేను బోత"- 'కుడీమీస మొడీ ఏసి, యాల్ మొగిల్దీన్ అన్నడు'- 'కాల్మొక్కుత మియాసాబు'- 'ఏమీసేతు ఎట్లా సేతు, వెదా వెదా గుదద్దూకొనెను' అను ప్రయోగములు పదే పదే ఈ కథలో వచ్చుచుండును. మియాసాబును దఱచుగా 'పులిరాజు' అని సంబోధించుట వీరరసస్ఫూర్తికిఁ బోషకముగా నున్నది. 'పుట్టారాని బాలుడు పుట్టె- పులీవంటి మియాసాబు', 'పాన్గంటి ఖిల్లియ మీద- పండీనాడు పులీరాజు' ఇత్యాదులు. ఇతని చోరకళాకౌశలమును దెలుపుటకోయన 'చుక్కావంటి మీయాసాబు-చూడాబోతె కానారాడు' అని పాడఁబడుచుండును. మాష్టీలు, దక్కలవారు మున్నగు నిమ్న కులములవారు పాడుటచేఁ గాఁబోలు నీ కథలోఁగొన్ని మోటు మాటలును దొరలుచుండును.

## 2.4.2. పండుగ శాయన్న కథ:-

ఇది మహబూబునగర మండలమున వ్యాప్తియందున్న మఱియొక గజదొంగ కథ. దక్కలవాళ్లు, మాష్టీలు, మెట్లకిన్నెర మీదను, జంగములు తంబుఱ గుమ్మెట్ల మీఁదను ఈ కథను బాడుచున్నారు. అనఁగా దీనికి రెండు రకముల కథలున్నవని తెలియుచున్నది- ఒకటి కిన్నెరకథ, రెండవది జంగంకథ. ఇవి రెండును మౌఖికగాథలే. ముద్రితములు కాలేదు. నేను ఈ రెండింటిని సంపాదింపఁగలిగితిని.

పండుగ శాయన్న 20వ శతాబ్ది ప్రారంభమున విజృంభించిన గజదొంగ. మహబూబునగరు జిల్లా, షాద్నగర్ తాలూకా 'మెరుగోని పల్లె' అనునది ఈతని స్వగ్రామము. ఇతఁడు తెలగ కులమునకుఁ జెందినవాఁడు. ఇది మియాసాబుకథ వలెనే సాఁగును. కాని నడకలోఁ

గొంచెము భేదమున్నది. మియాసాబుకథలోఁ బాదమునకు 7(4+3) మాత్రల ఆవృత్తులు నాలుగుండగా, నీ పందుగ శాయన్నకథలో నైదు మాత్రల ఆవృత్తులు పాదమునకు నాలుగున్నవి. కిన్నెరకథ ఇట్లు ప్రారంభమగును:-

*"పుట్టిండె శాయన్న మెరుగోని పల్లెలో*
*నిండు బోగైనాడు సుక్కల్లా సెంద్రుండు*
*కూలాన తెలగోడె ఆ పందుగ శాయన్న*
*యా దినము పుట్టిండు సుక్కల్లా సెంద్రుండు*
*దంసినడు పుట్టిండు ఆ పందుగ శాయన్న*
*తల్లీనె రామక్క తండ్రీనె గిరిరాజు*
*అయ్యయ్యొ శాయన్న ఆ పందుగ శాయన్న*
*అరె-తల్లీ సచ్చీనప్పుడు మూడొద్దుల బాలూడు"*

రామక్క, గిరిరాజు అను దంపతులకుఁ బుట్టిన శాయన్నకుఁ జిన్నతనములోనే మాతృవియోగము కలిగినది. కంచిమేకల పాలు, కఱ్ఱియావుల పాలు త్రాగి పెద్దవాఁడైనాఁడు. కులకశర్ల రామిరెడ్డి దగ్గఱఁ బశువులను గాయుటకుఁ గుదురుకొనెను. కురువెల్ల మాదిగ వానితోను, కొల్లూరి మొగలంసాబుతోను స్నేహము చేసి, ముగ్గురును గలసి దొంగతనములు ప్రారంభించిరి. మంత్రములు చేతబడులు నేర్చుకొనెను. అజామల్లీఖాన్ అంగడిని, కమాన్‌సాబు బంగారపు కొట్టును, సవుదూరి భీమారాయని ఇంటిని దోఁచెను. కలిగిన వారిని గొట్టి, పేదవారిని నడపినవాఁడు పందుగ శాయన్న. మహిబల్లి పాదుషా ఇతనిని బట్టుకొనుటకుఁ బ్రయత్నింపఁగా, శాయన్న మాఱు రూపమునఁ దప్పించుకొనెను. మియాసాబు పానుగంటి ఖిల్లామీద పండుకొన్నట్లే, పందుగ శాయన్న 'పాడావుల బండ' మీఁద పండుకొనెడి వాఁడు.

ఈ పందుగ శాయన్న కూడ వనపర్తి శంకరమ్మ కాలములోని వాఁడేయని ప్రజలు చెప్పుదురు. ఆమె ఈతని రక్షించుటకుఁ బ్రయత్నించినదఁట. కాని నిజాము సర్దారయిన 'సిద్ది అబ్దుల్లా' కుఁ బందుగ శాయన్న యనినఁ గోపము. కులకచెర్లలో నున్న మాదిగ తుప్పలికాడు శాయన్నకు మిత్రుఁడు. చేపలగూడెములో నున్న 'బుడ్డమ్మ' యను యువతి శాయన్నకు ఉంపుడుకత్తె. తుప్పలికానికిని బుడ్డమ్మకును లంచమిచ్చి, సిద్ది అబ్దుల్లా పందుగ శాయన్నను బట్టుకొనెను. బుడ్డమ్మ సారాయిలో విషము కలిపి, శాయన్నను బట్టించినది. శాయన్నను మహబూబునగరులోఁ దిరుమలదేవుని గుట్టదగ్గఱ నురితీసిరి. శాయన్న పిశాచమై తన్నన్యాయముగా జంపిన తురకలను బట్టి పీడించెనఁట. అందుచేఁ బ్రతి శుక్రవారమునాఁడును అతని సమాధి దగ్గఱ మహమ్మదీయులు ఉత్సవముఁ జేయుచున్నారు. ఇది నేఁటికిని జరుగుచున్నది.

శాయన్న దొంగతనమునకు బయలుదేరునప్పటి వేషవర్ణన రమణీయముగ నున్నది:-

*"ఏడూ జాండ్లాదైన తాడూనే తూపాకి*
*మేక దిగ జట్టిలాగు మరితాను దొడిగిండు*
*చేమంతి పువ్వూల బల్లెం చేత బట్టిండు*
*పన్నెండు తామంచెల్ ముడ్డీసుట్టు బెట్టిండు*
*తాడూనే తూపాకి బుజం మీద పెట్టిండు*
*అంతూరణ వేసిండు కుప్పీలను గొట్టిండు*
*కిలకిలా నగిండు సుక్కల్లా సెంద్రుండు*
*కెవ్వూన కూత బెట్టె సద్రూనా వచ్చేను".*

"పొట్టబత్తెం, పాడావుల బండమీద పండియుండు, జాలారు బండమీద జలకమాడు, చెట్టుకొకరు పుట్టకొకరు నయిరి, ఏతల్లి కన్నదో ఏ హంస కన్నదో" -ఇత్యాదులగు తెలుఁగు నుడికారము లెన్నియో ఈ కథలోఁ గలవు.

## 2.4.3. దువ్వన్నదొర కథ:-

ఇది శ్రీకాకుళ మండలమున వ్యాపించిన గజదొంగ కథ. ఇతఁడు నిన్న మొన్నటివాఁడు. 1966 మే నెలలోఁ జనిపోయినాడు. మనము ఏ ప్రాంతము వెనకబడిన ప్రాంతముగా భావింతుమో, ఆ ప్రాంతములో నత్యుత్తమమగు వీరగాథలు, సంఘటన జరిగిన మఱుక్షణములోఁ బుట్టుచుండును. ఏ ప్రాంతములను నాగరిక ప్రాంతములుగా భావింతుమో అట వీరగాథలు నశించిపోవును. ఎంత గొప్ప సంఘటన జరిగినను అట వీరగాథలు పుట్టవు. అల్లూరి సీతారామరాజుపై నింతవఱకును గోదావరీ మండలమున వీరగాథ పుట్టకపోవుటకు ఈ నాగరికతయే కారణము.

ఈ దువ్వన్నదొర కథను 16-8-1966న మిత్రులు శ్రీ కోట లక్ష్మీనారాయణగారు బొబ్బిలి ప్రాంతమున సేకరించి నాకుఁ బంపినారు. ఈ కథను జముకులవారు పాడుచుందురు. ఈ జముకుల వారిని శ్రీకాకుళ మండలమున 'బుడబుడకలవా'రనియు, 'దాసరు' లనియుఁ బిలుతురు.

దువ్వన్నదొర (ప్రజావ్యవహారమున 'దువ్వందొర') నూకదొరల తెగలోని వాఁడు. శ్రీకాకుళము జిల్లా, చీపురుపల్లి తాలూకా, 'ఊటపల్లె' గ్రామ కాపురస్థుఁడు. తండ్రి అప్పన్నదొర, తల్లి ఆదమ్మ. ఇతఁడు 1904-1905 ప్రాంతములో జన్మించెను. 1966 వేసవిలో మరణించెను. ఇతఁడు జీవించి యుండగనే ఇతని సాహసములను గీర్తించుచుఁ బాట బయలుదేరెను. (వీరుఁడు సజీవుఁడై యున్నప్పుడే పాటపుట్టిన సందర్భము రాయలసీమలోఁ గూడఁ గలదు. చిత్తూరు మండలమున మదనపల్లె తాలూకాలో కలిచెర్ల నరసింహారెడ్డిగారికిని, తంబళ్లెపల్లె నాగిరెడ్డిగారికిని కక్షలున్నవి. నరసింహారెడ్డిగారిపై చందమామ పదము వరుసలో నొక వీరగాథ ప్రచారమున నున్నది.)

దువ్వన్నదొర మంచి ఆస్తిపరుఁడు. దొంగతన మితనికి నుబుసుపోకకే కాని సంపాదనకుఁ గాదు. ఇది బాల్యస్నేహితుల వలన నలవడినది. తాను దొంగిలించిన ధనము నితఁడుపయోగించు

కొనెడివాఁడు కాడు. బీదసాదలకు స్థల కుల విచక్షణలు లేక ధనమును బంచి యిచ్చెడివాడు. అనాథస్త్రీలు నిఱుపేదలు నితనిని 'కొండరాజు' అని పిలిచెడివారు. ఇతఁడు పేదవారికి సహాయపడుటకును ధనమదాంధులను హద్దులో నుంచుటకును చోరవృత్తిని సాధనముగా నుపయోగించినట్లు కనఁబడును. తెలంగాణములోని పండుగ శాయన్నయు నిట్టివాఁడే.

దువ్వన్నదొర గొప్ప గళసాధకుడు. బంగారు ముక్కలు, వజ్రములు, కెంపులు మొదలగునవి గళములో దాచుకొనెడివాఁడు. చదువుకొనిన పేద కవి పండితులకు ఇవి గళమునుండి తీసి, అర్థతలను బట్టి యిచ్చి పంపుచుండెడివాఁడఁట. ఇట్లు దువ్వన్నదొర నిఱుపేదలకుఁ గల్పవృక్షముగా నుండుటచే నితని ఆచూకి నెవరును జెప్పెడివారు కారు. పోలీసుభటులు ఇన్‌స్పెక్టర్లు కూడ నితని పలుకుబడిలో నుండెడివారు. పేదలగు పోలీసులెందఱో ఇతని సహాయమును బొందియున్నారు.

దువ్వన్నదొరను జుట్టుప్రక్కల గ్రామములవారు మిక్కిలి గౌరవముగాఁ జూచెడివారు. దొంగతనమున కెంతదూరము పోయినను దెల్లవారు సరికిఁ దన గ్రామములో నుండెడివాఁడు. రాత్రి దొంగతనమున సంపాదించిన ధనమును బేదలకుఁ బంచి, రిక్తహస్తములతో నింటికిఁ దిరిగి వచ్చెడివాఁడు. ఇతఁడు ముందునకే కాక, వెనుకకును బరుగెత్తగలిగిన సమర్థుఁడఁట.

ఊటపల్లెకుఁ దూర్పున 'జన్నివలస'యను గ్రామమున్నది. అచటఁ దెలగ కులమునకుఁ జెందిన యువకులిద్దఱు, కొప్పు వెలమ యువకులు ముగ్గురు దువ్వన్నదొరకడకు వచ్చి, అతనిని బొగడి, భక్తి గౌరవములు చూపినట్లు నటించి, త్రాగించి, వారి గ్రామమునకుఁ దీసికొనిపోయి, ఒక యింటఁ గొంతరాత్రి వఱకును గాలక్షేపము చేసి, హఠాత్తుగాఁ బట్టి బంధించి, చావమోఁది, దొంగిలించెనని నిందమోపి, స్మృతి తప్పిన దువ్వన్నదొరను గ్రామము వెలుపల చెట్టుక్రింద విడిచిరని ఒక వదంతి. దువ్వన్నదొర జాతివారే చిట్టడవిలో నతనిని జంపి, వెలుపలి పొలిమేరలో విడిచిపోయిరని మఱియొక వదంతి. 1966 వేసవిలో నితఁడు పైన జెప్పిన మార్గములలో నేదియో విధమున శత్రువులచేఁ జంపఁబడెను. ఈ కథ యిట్లు ప్రారంభమగును:–

*"ఊటపల్లి గ్రామంబూ – దువ్వం దొరగారూ!*
*శామ వలస స్నేహితంబు ,,*
*సిల్వర జోడొకటి ,,*
*చేత నగ్గిపెట్టె యొకటి ,,*
*కడకాలు సన్నమయ్య ,,*
*సాటుబలము ఎక్కువయ్య ,,*
*పిడికిలంత నడుమయ్యా ,,*
*పిగిలిపిట్ట సందమయ్య ,,*
*బుట్టక్రాపింగు వాడు ,,*
*మా– భూక్రమంగ ఉంటాడు ,,*
*గ్లాస్కో పంచొకటి ,,*
*మా– ఘనముమీద కడతాడు ,,*
*మెద్రాసు లాల్చొకటీ ,,*
*మా–మేలుగాను తొడిగేడూ ,,*
*ఎడమ చెయ్యికి ఒక్కా ,,*
*ఆ–రిస్టువాచి కడతాడూ ,,*
*పగలల్లా నాయుడయ్య ,,*
*పొద్దుపోతె కన్నగాడు ,,*
*పెద్దోళ్ళను కొడతాడూ ,,*
*పేదరోదల్ని పెంచేడు ,,*
*ధర్మంలో కెల్లానూ ,,*
*దానకర్ణు డంటారు – దువ్వం దొరగారూ!"*

ఈ దువ్వన్నదొర అయిదువందలిచ్చి కోడెలను గొనెను. ఆ కోడెలను శామలవలస గ్రామములోని మీసాల నాయఁడదుగఁగా నిచ్చెను. ఆ నాయఁడు డబ్బు నీయకుండనే ఇచ్చితినని బొంకెను. దానితో దువ్వన్నదొరకుఁ గోపమువచ్చి, 'నీ ఇంటికిఁ గన్నము వేయుదు' నని ప్రతిజ్ఞ పట్టెను. మీసాల నాయఁడు "నా యింటికిఁ గన్నము వేయుటకు నీకెన్ని గుండెలున్నవి? నీవు కన్నము వేసినచో 30 గరిసెల పల్లపు భూమియు, 8 గరిసెల మెట్ట భూమియు నీకు విడిచిపెట్టెదను" అనినాఁడఁట. అప్పుడు దువ్వన్నదొర "నీ ఇంటిని నేను దోచలేనప్పుడు 8 గరిసెల మెట్టభూమిని, నేను దోచిన ఆభరణములను నీకిచ్చి వేసి, దేశమును వదలిపోయెదను" అని ప్రతిజ్ఞ పట్టెను. ఇట్లు చెప్పి దొంగతనములుచేసిన మఱికొన్ని సంఘటనలు వర్ణించి, ఈతఁడు దుర్మరణము చెందిన విషయముతో నీ కథ ముగియును. ఆధునికమైన కథ యగుటచే నాధునిక వర్ణన లెన్నియో ఇందు దొరలినవి. ఆంగ్లపదములును హెచ్చుగా నున్నవి.

## 2.5. గ్రామకక్షలు–హత్యలు

కక్షలు లేని గ్రామము ఆంధ్రదేశమున మృగ్యము. గ్రామకక్షలు, తన్మూలముగా హత్యలు తెనుఁగుగడ్డపైఁ బరిపాటి. వెనుకబడిన ప్రాంతములో నిది మఱింత హెచ్చు. రాయలసీమలోని కడప కర్నూలు మండలములు హత్యాదోషములు చేయుటలోఁ బ్రథమస్థానమును వహించును. హత్యలెక్కువగా నుండు ప్రాంతములలో వీరగాథలు హెచ్చుగా నుండును. కుంటి పుల్లారెడ్డి కథ (రేనాడు), యల్లమంద నాయఁడు కథ (చిత్తూరు జిల్లా), సుబ్బిరెడ్డి కథ, చెన్నకృష్ణారెడ్డి కథ, దొర్నిపాటి వెంకటరెడ్డి కథ,కలిచెర్ల నరసింహారెడ్డి కథ మున్నగునవి రాయలసీమలో గ్రామకక్షల మూలముగా నుద్భవించిన వీరగాథలకుఁ జక్కని యుదాహరణములు.

### 2.5.1. కుంటి పుల్లారెడ్డి కథ:-

కడపజిల్లా, జమ్మలమడుగు తాలూకా, 'చిన్నపసుపుల' గ్రామ మీతని స్వస్థలము. ఇతనికిని ఆ ప్రక్కనేయున్న 'పెద్దపసుపుల' గ్రామములోని శివారెడ్డిగారికిని గక్షలుండెడివి. 1946 ఆగష్టు 4వ తేదిని కోవెలకుంట్లలో నీ పుల్లారెడ్డి హత్యగావింపఁబడెను. 1940 నుండి 1946 వఱకును నీ పుల్లారెడ్డి రేనాటిని గడగడ లాడించినాడు. ఉయ్యాలవాడ నరసింహారెడ్డి తరువాత నింత ప్రతాపముఁ జూపిన వీరుఁడు మఱియొకఁడు లేడు. ఈతనిపై 'మేలు భళీ' వరుసలో నొక వీరగాథను రేనాటిలో జంగములు పాడుచున్నారు. సదాశివరెడ్డి కథ, కర్నూలు నవాబు కథ వలె నీ కుంటి పుల్లారెడ్డి కథయును మిక్కిలి వీరరసావేశమునఁ బాడఁబడుచుండును.

పుల్లారెడ్డి ఇంటిపేరు 'ధనిరెడ్డి' వారు. నడచునప్పుడు ఒక కాలు కొంచెము ఎత్తి వేయుటచే నితనిని 'కుంటి పుల్లారెడ్డి' యనెడివారు. ఇతని తండ్రి నరిసిరెడ్డి, తల్లి నాగమ్మ, అన్న నందిరెడ్డి. వీరు మోటాటి రెడ్లు. 1910 ప్రాంతములో నితఁడు జన్మించెను. విద్యావంతుడు. 1932-36 మధ్యకాలములోఁ జిన్నపసుపుల గ్రామములో ఆకుల బుగ్గిసెట్టి కుమారుఁడు 'చంటన్న' యను బలిజనాయకుఁ డెదురు లేకుండ నధికారమును జెలాయించుచుండెను. ఇతఁడు పుల్లారెడ్డి వదిన నవమానించెను. రెడ్ల నందఱను అణఁచి పెట్టెను. ఈ చంటన్న త్రాగుబోతు, మిక్కిలి క్రూరుఁడు. 1936లో పుల్లారెడ్డి బందరులోఁ జదువుఁ జాలించి, చిన్నపసుపులకు వచ్చి, చంటన్న దౌష్ట్యము నరికట్టి, యాతనిఁ జంపివేసెను. ఆ తరువాత నంద్యాలలో గొంతకాల ముద్యోగము చేసి, 1939లోఁ దిరిగి చిన్నపసుపులకు వచ్చి, యా చుట్టుపక్కల చండశాసనుఁడయ్యెను. ధనవంతుల వలనఁగాని, క్రూరుల వలనఁ గాని యే యర్భకునకు అన్యాయము జరిగినను పుల్లారెడ్డి సహించెడివాఁడు కాఁడు. ఎంతటి వానినైనను ధిక్కరించెడివాఁడు. ఇతని పేరు చెప్పినచో నా చుట్టుప్రక్కల పెత్తందార్లందఱును గడగడ వణఁకిపోయెడివారు. పుల్లారెడ్డి దుర్బలులకుఁ బెట్టని కోటగా నుండెడి వాఁడు. దుశ్శీలురనుగూడ శిక్షించుచుండెను. వ్యభిచారము, త్రాగుడు, దొంగతనములు మున్నగునవి లేక ఈతని కాలమున చిన్నపసుపుల గ్రామము రామరాజ్యమువలె నుండెను. శీలము లోపించుటచేతనే తన నమ్మినబంటగు నూనెపల్లె సుబ్బన్న (నంద్యాల సుబ్బన్న)ను గూడఁ బుల్లారెడ్డి తఱిమివేసెను. ఈ సుబ్బన్న పెద్దపసుపులలోని శివారెడ్డిపక్షమునఁ జేరి, పుల్లారెడ్డిపైఁ దిరుగఁబడెను.

చిన్నపసుపుల గ్రామములో జంగము బుస్సయ్య యను కొండె కాడుండెను. ఇతఁడు పెద్దపసుపులలోని ఎద్దుల శివారెడ్డిగారికిని, చిన్నపసుపులలోని పుల్లారెడ్డికిని మనస్స్పర్థలు కల్పించెను. అందుచే పుల్లారెడ్డి బుస్సయ్యయాస్తిని లాగుకొని అతని నూరినుండి వెడలఁ గొట్టెను. అతఁడు పెద్దపసుపుల శివారెడ్డి కడకుఁబోయి శరణు వేఁడెను. చిన్నపసుపులలోనున్న బుస్సయ్యభూమిని శివారెడ్డిగారు సాగుచేయుటకుఁ బ్రయత్నించెను. పుల్లారెడ్డి ప్రతిఘటించెను. ఈ భూమివిషయమై వీరి కనేక సంఘర్షణలు జరిగినవి. కడకు రాజీ యయిరి. 1946లో పుల్లారెడ్డి యేదియో కోర్టు వ్యవహారములను బరిష్కరించుటకై కోవెలకుంట్లకుఁ బోయి, అక్కడ నొక హోటలులో నుండఁగా, జంగము బుస్సయ్య కుమారుఁడు పుల్లన్న యనువాఁడు హఠాత్తుగా మీదఁబడి, కత్తితోఁ బొడిచి చంపెను. ఈపని శివారెడ్డిగారే చేయించెనని తెలిసినది. పుల్లారెడ్డి యనుచరులు సంవత్సరము తిరుగకుండ శివారెడ్డిని జంపివేసిరి. పుల్లారెడ్డి మరణముతో రేనాటికిఁ గళ పోయినది. ఇతనికి భార్యయు నిరువురు కూతుండ్రును గలరు. భార్యపేరు నారాయణమ్మ. పుల్లారెడ్డి హత్య తరువాత రెండు మూడేండ్లకు నీమెయు మరణించినది. పుల్లారెడ్డి పెద్దకర్మ రోజున నారాయణమ్మగారు యడవల్లి రామలింగము అను జంగము వానిని పిలిచి, నూతన వస్త్రములతో సత్కరించి, తన భర్త చేసిన సాహస కృత్యములను వీరగాథగా గానము చేయుమని కోరినది. ఆ జంగము తన చెల్లెలు గుమ్మెట కొట్టుచుండగాఁ బుల్లారెడ్డికథ నాశువుగా గానము చేసెను. ఇది క్రమముగా రేనాడంతయు వ్యాపించిపోయినది. ఈ జంగమిప్పుడు (1966 నాఁటికి) 85 సం॥ల వృద్ధుడు. అంధుడు కూడ. ఈతని దగ్గఱనే నేనీ కథను సేకరించితిని (15-4-1966). కర్నూలు జిల్లాలో పెద్దయెమ్మనూరు గ్రామములోను, దొర్నిపాడు గ్రామములోను, ఇతర జంగములనుండి, ఈ కథకుఁ బ్రత్యంతరములను సంపాదించి సరిపోల్చుకొంటిని. ఈ కథ యిట్లు ప్రారంభమగును:-

*"రజా రాజాగారు మేలు భళి*
*రజా భోగతి గలిగి ,,*
*మనది యా దేశంబు ,,*
*మనది యా జిల్లాను ,,*
*కడప జిల్లాలోన ,,*
*ఉలవపల్లె గ్రామమండి ,,*
*మోటాటి కాపులు వాళ్ళు ,,*
*'ధనిరెడ్డి' గోత్రమైన ,,*
*ప్రభువు నరిసిరెడ్డి ,,*
*నరిసిరెడ్డి భార్య ,,*
*మా తల్లి నాగమ్మాను ,,*
*మొదట ఉలవపల్లె ,,*
*మద్దిన చేరిందేమి ,,*
*మొగలాయి చిన్నపసుపుల ,,*
*అక్కడ కలిగినాడు ,,*
*ప్రభువు పుల్లారెడ్డి మేల్ భళిభళి॥"*

ఈ కథలో ఏవిధమగు నతిశయోక్తులును లేక, జరిగిన సంఘటనలు యథాతథముగా వర్ణింపఁబడినవి. పుల్లారెడ్డి శౌర్యము,

సాహసము, మనోనిశ్చయము చాల నుత్సాహజనకముగాఁ జెప్పఁ బడినవి. పుల్లారెడ్డికి ముఖ్యమైన యనుచరు లైదుగురు– "గొల్లపెద్దన్న, కమ్మరి నాగన్న, తలారి సంజన్న, మాలా ఏసోబు, తురక దస్తగిరి". వీరుగాక తన బంధువులలోఁ జిన్నపుల్లారెడ్డి, రంగారెడ్డి, తిమ్మారెడ్డి, సన్నకొండారెడ్డి– అనువారుండెడివారు. ఈ యనుచరులతోఁ బుల్లారెడ్డి పోట్లాటకు బయలుదేరుటను గాథాకారుఁడు రమ్యముగా వర్ణించెను:–

*"ఎనిమిది మంది వస్తాదులు మేలు భళి*
*ఎడమచేతిలో టుపాకి ,,*
*కుడిచేతిలో రైఫోల్ ,,*
*ఒళ్ళోన పిడిబాకు ,,*
*లేచినాడు రెడ్డి ,,*
*రెడ్డి పుల్లారెడ్డి ,,*
*కుంటి పుల్లారెడ్డి ,,*
*చిన్నపసుపుల పుల్లారెడ్డి ,,*
*రెడ్డి కాదు బంగరు మొలక ,,*
*రెడ్డి కాదు ఉక్కు తునక ,,*
*అదురు పిక్క లేనివాడు ,,*
*అదురు గుండె లేనివాడు ,,*
*మంది మారుబలము ,,*
*ఈటె కట్టెల మంది ,,*
*గండ్ర గొడ్డళ్ల మంది ,,*
*యాట కొడవళ్ల మంది ,,*
*కోబలీ రణబలీ యంటా ,,*
*పుల్లారెడ్డి లేచినాడు మేల్ భళిభళి"*

బొబ్బిలి యుద్ధములోను, నారసింహారెడ్డి కథలోను దఱచుగా వినఁబడు యుద్ధనినాదము, జీవితముపై వేదాంత దృక్పథము, తన్మూలకమగు వీరావేశము నీ గాథలోఁగూడ నెక్కువగా వినఁబడును. కుంటి పుల్లారెడ్డి తన బలగముతో నిట్లనెను:–

*"లెయ్యండి కొడుకులార– మేలు భళి*
*లెయ్యండి పాలెగాళ్లు ,,*
*ఈ పొద్దు యింట్లోన ,,*
*రేపు మంట్లోన ,,*
*నూరేండ్లు బ్రతికిన గాని ,,*
*సాపు తప్పదు మనకు ,,*
*వెయ్యేండ్లు బ్రతికినగాని ,,*
*వేరు తప్పదు మనకు ,,*
*సచ్చిన బతికిన గాని ,,*
*పేరు ఒక్కటి చాలు మేల్ భళిభళి"*

ఈ కథలో సగభాగము ఆకుల చంటన్నతో పుల్లారెడ్డి జరిపిన పోరాటము వర్ణింపఁబడును. మిగిలిన సగభాగము పెద్దపసుపుల శివారెడ్డిగారితోడి ఘర్షణ. ఈ కథలో నెన్నియో రాయలసీమ పలుకుబడులు, సామెతలు నున్నవి. 'పులి దుమికినట్లు పుల్లారెడ్డి దుమికినా' డనుట, 'కంకులు కోసినట్లు తలకాయ లెగురు'ననుట, 'చొప్ప కోసినట్లు నీ మందిని కోస్తా' ననుట, చంటన్న పాదదుప్పిని వర్ణించుచు 'దానమ్మ కడుపుకాల పాడి ఎనుమంత ఉంది' అనుట, బలిజ చంటన్న పుల్లారెడ్డి నాక్షేపించుచు 'తుమ్మనాగలి దున్నువాడు, ఎద్దుముద్దు పొడిచేవాడు, అంబలిదుత్త తాగేవాడు' అనుట మున్నగు తెలుఁగు నుడికారము లీ కథలో కొల్లలుగాఁ గాననగును. ఈ కుంటి పుల్లారెడ్డిగారు ప్రముఖ రాజకీయవేత్తయైన శ్రీ నీలం సంజీవరెడ్డి గారి సహాధ్యయియఁట!

## 2.5.2. యల్లమంద నాయఁడు కథ:–

చిత్తూరు జిల్లా, వాయలపాడు తాలూకా, యల్లమంద గ్రామములో 1950 ప్రాంతమున జరిగిన హత్యపై నీ వీరగాథ పుట్టినది. యల్లమంద గ్రామములోఁ బడమటి భాగమును 'యల్లమంద నగరి' యందురు. తూర్పుభాగమును 'రెడ్డివారిపల్లె' యందురు. ఈ రెండింటికిని మధ్య 'సాయెబ్బుల పల్లె' యున్నది. ఈ మూడు పల్లెలను గలిపి 'యల్లమంద' యందురు. యల్లమంద నగరిలో నేకిలదొరల వంశమునకుఁ జెందిన చెన్నప్ప నాయని పుత్రుఁడు కొండప్ప నాయఁడుగారు ఉండెను. ఈయనకు 'యల్లమంద నాయఁడు' అనిపేరు. రెడ్డివారిపల్లెలో కోడి భయ్యారెడ్డి యను పోకనాటి రెడ్డిగారు ఉండెడివారు. వీరిరువురకును గక్షలు పెరిగినవి. మొదట కొండప్ప నాయఁడుగారును భయ్యారెడ్డిగారును మిత్రులుగనే యుండిరి. ఒక యుగాదికి కర్నం వారిపేటలో జరిగిన పంచాంగ శ్రవణమున రెడ్డిగారు నాయఁడుగారి నవమానకరముగా మాటాడెనఁట. దానితో విరోధము ప్రారంభమైనది. సాయెబ్బులపల్లె దగ్గఱ నొకప్పుడు యల్లమంద నాయఁడు భయ్యారెడ్డిని జెప్పుతోఁ గొట్టెను. తరువాత విరోధము మఱింత హెచ్చి, యొకరి పంటలను మఱియొకరు నాశము చేసెడివారు. యల్లమంద సంతలో రెండు 'పార్టీ'లకును పెద్దయెత్తున దొమ్మీ జరిగినది. భయ్యారెడ్డిగారి పుత్రుఁడు విజయభాస్కరరెడ్డినిగూడ నాయని మనుష్యులు చెప్పులతోఁ గొట్టిరి. దానితోఁ గక్షలు బడబాగ్నివలెఁ బ్రజ్వరిల్లినవి. కొండప్పనాయఁడుగారికడ నమ్మకముగానున్న 'వెంకట సుబ్బడు' అను బోయవానిని భయ్యారెడ్డి పుత్రులు (భాస్కరరెడ్డి, విజయభాస్కరరెడ్డి) లోఁబఱుచుకొని, అతనిచే నాయని హఠాత్తుగాఁ జంపించిరి.

ఈ కథను మొదట 'లక్ష్మయ్య' యను దక్కలవాఁడు ఆశువుగా గానము చేసెనఁట. ఆ తరువాత నిది పూసల బలిజవారిచే తంబుఱ కథగాఁ జెప్పఁబడుచు వచ్చినది. ఇది బొబ్బిలి వరుసలో '8+8+9 (10)' మాత్రలొక పాదముగా సాఁగు రచన. నేనీ పాటను తుపాకుల మారయ్య, చెన్నూరి వెంకటస్వామి అను పూసల బలిజలు పాడుచుండఁగా 8–12–1965న వాయలపాడు తాలూకా, గానుగ చింతనగరులో సంపాదించితిని.

*"రామ రామ జయ, రామయ రామా, రామయ రఘురామా!*
*అరియ (హరే) రామ జయ, రామయ రామా, అచ్యుత గుణధామా!*
*భార మండలము లక్ష కళింగము బాలుదేలుతాడా*
*ఆ ప్రభువు ఇంచినా దేశమందునా యల్లమంద గలదా*
*చిత్తూరు జిల్లా, వాయలపాడు తాలూకా, యల్లమందలోనే*
*యల్లమంద సరిగ్రామములోనే మట్టిగుంట కలదు"*

అని ప్రారంభమగును.

అతిశయోక్తులు లేకుండ సూటిగా సాఁగినదీ కథ. గ్రామ కక్షలలోని స్పర్ధా మనస్తత్వమును జక్కఁగాఁ జూపినది. భయ్యారెడ్డి అవమానించెనని బాధపడుచున్న యల్లమంద నాయని మనోవేదనను గాథాకారుఁడెట్లు చెప్పెనో చూడుఁడు: ఇది మయసభలోఁ బరావింపఁ బడిన సుయోధనుని మనోవేదనవలె నున్నది.

*"గారకూటముకు పరుగులెత్తెను కొండమ నాయుడూ*
*ఇంటిలోనికి తరలివచ్చెను కొండమ నాయుడూ*
*కూర్చోబోతే బుద్ధి కుదరదు కొండమ నాయునికీ*
*లెయ్యబోతే మనసు నిలవదూ నాయని కావేళా*
*యోచన చేసే యోచన చేసే కొండమ నాయుడూ*
*కాగితంబునూ కలంపుల్లనూ చేతబట్టినాడూ*
*గరగర గరగర జాబులు రాసే కొండమ నాయుడూ*
*రమ్మంటా పొమ్మంట జాబులు తరలి వ్రాసినాడు"*

కొండమ నాయని తల్లి చెన్నమ్మ. ఈమె భయ్యారెడ్డితో విరోధము వలదని కుమారునిఁ గోరఁగా, నతఁడుగ్రుఁడై తల్లిని దూషించెను:-

*"పిరికి మాటలే పలుకుతున్నవూ ఎల్లపొద్దు నీవు*
*రెడ్డి కిందనే తగ్గి తిరగమని పలుకుతునున్నావు*
*గొప్పవారికీ లుచ్ఛాబుద్ధులు ఏలవచ్చినాయి?*
*నిన్ను పొడుతునా చెన్నమ తల్లీ పొట్టలు చినగంగా*
*నరుకుదునా చెన్నమ్మా నిన్నూ నడుముకు రెండుగనూ"*

## 2.5.3. సుబ్బిరెడ్డి కథ:-

ఇది రాయలసీమలో వ్యాప్తియందున వీరగాథ. సుమారు 1946 ప్రాంతములో చిత్తూరు జిల్లా, మదనపల్లి తాలూకాలో జరిగిన సంఘటన. ఇందు హత్య లేకపోయినను, గ్రామకక్షలకుఁ బట్టింపులకు నిది చక్కని యుదాహరణముగా నున్నది. వీరరసస్ఫూర్తితోఁ జక్కని నడకలో నున్న గాథ. పూసల బలిజవారు దీనిని బాడుచుందురు.

మదనపల్లి తాలూకాలో బేరంగి, క్రొత్తకోటలకు దగ్గఱనున్న కానుమాకులపల్లెకు 'రెడ్డి' (మునసబు) సుబ్బిరెడ్డి. ఇతఁడు బలిజ కులమునకుఁ జెందినవాఁడు. తండ్రి కొండా మలిరెడ్డి, తల్లి నారమ్మ. ఇతఁడు మిక్కిలి సాహసికుఁడు. ఇతనికిని 'ఎనుములబడి' గ్రామములో నున్న కోమటి శేరుమండ్ల సుబ్బయ్యకును 'పార్టీ' యున్నది. తుమ్మలపల్లి రామచంద్రారెడ్డి, ఎఱ్ఱబల్లి గ్రామములోని గంగిరెడ్డి, రామానాయని కోటలోని వెంకట సుబ్బారెడ్డి- ఈ ముగ్గురును సుబ్బయ్య పక్షమున సుబ్బిరెడ్డిపైఁ గక్షఁగట్టిరి. కాని సుబ్బిరెడ్డి వీరినెవ్వరిని లెక్కసేయలేదు. గుడిసిమానులవంకలో జరిగిన అయిదు ఖూనీల నితఁడు మాపు చేసెనఁట.

ఒకనాఁడు సుబ్బిరెడ్డి మంచముకోళ్లు చేయుటకై కట్టెలు కొట్టి తెమ్మని తనఁ'తోటి' వాని నడవికిఁ బంపెను. ఆ తోటివాడు మైసూరు విలాకులోని గుడిసిమానులవంకకుఁ బోయి, వేంకట రామయ్య బావుల దగ్గఱనున్న శ్రీగంధపు వనములోఁ గట్టెలు కొట్టుచుండెను. ఎనుములబడిలోని కోమటి సుబ్బయ్యకు ఈ విషయము తెలిసి, ఆ తోటివానిని సుబ్బిరెడ్డిని గూడ దూషించి, పోలీసువారిని రప్పించి, వానిని గొట్టించెను. గ్రామాంతరమునకేఁగిన సుబ్బిరెడ్డి సాయంకాల మింటికిరాఁగాఁ తోటివాఁడు జరిగిన విషయమంతయును జెప్పెను. అప్పుడు సుబ్బిరెడ్డి పట్టుదలతో రాత్రికి రాత్రి బయలుదేరి, ఆ శ్రీగంధవన మంతయును నఱికివేసి, పండ్రెండు 'లారీ'లతో నా కట్టెలు తెచ్చి ఎనములబడి గ్రామములోఁ గుప్పవోసెను. కోమటి సుబ్బయ్య, కక్షను సాధించుటకై కోలారు 'కోర్టు'లో 'ఫిర్యాదు' చేసెను. 'మేజిస్ట్రేటు' జవాన్లను బంపెను. అప్పటికి సుబ్బిరెడ్డి ఆ కట్టెలను దెచ్చి కోలారు బజారులో వేలము వేయుచుండెను. జవానులాతనిని బ్రతిమాలి కోర్టునకు దీసికొని వచ్చిరి. సుబ్బిరెడ్డి మేజిస్ట్రేటును ధిక్కరించెను.

*"కుడిమీసం పురీపెట్టీ- నిమ్మపండూ నిలబెట్టీ*
*పాళెగాడూ సుబ్బిరెడ్డి- సారయి సీసను చేతబట్టీ*
*గటగటా సారాయి కోర్టులో తాగెను"*

కోలారు మేసిస్ట్రేటు ఈ కేసును బెంగుళూరునకుఁ బంపెను. సుబ్బిరెడ్డి బెంగుళూరు వెళ్లెను. బెంగుళూరు గవర్నరు కూఁతురు 'సీనమ్మ' సుబ్బిరెడ్డిని జూచి ప్రేమించెను. బెంగుళూరునుండి ఈ కేసు వేలూరునకుఁ బోయెను. అక్కడ సుబ్బిరెడ్డి కేసు నెగ్గెను. సీనమ్మను బెండ్లాడి కానుమాకులపల్లికి వచ్చెను. ప్రభుత్వ మీతనికిఁ గల్లు సారాయిల నమ్ముట కనుమతి నిచ్చెను. కొన్నాళ్లకు సారాయి నెక్కువగాఁ ద్రాగుటచే గుండె పాడైపోయి సుబ్బిరెడ్డి మరణించెను.

ఆఱు మాత్రల యావృత్తులు నాలుగొక పాదముగా రచన సాఁగినది. దీని ప్రారంభమిట్లుండును (పాడుటలోఁ గొన్ని తావులలో నేడు మాత్రలు ధ్వనింప వచ్చును):-

*"ఎంత మోసా మాయె రోరన్నా! మన సుబ్బిరెడ్డి*
*కేనాడూ తెలియలేదన్నా!* ॥ఎంతమోసా॥ *(వంత పాట)*

*చిత్తూరు జిల్లాలో- మదనపల్లి తాలూకా*
*బేరంగే కొత్తకోట- కానూమాకులా పల్లె*

*కానుమాకుల పల్లెలోన- కులమూనా బలిజోళ్లు*
*కొండా మ(ర్రెడ్డి కొడుకు- పాళెగాడు సుబ్బిరెడ్డేగా! ॥ఎంత॥*

ఈ కథ యాధునికమైన దగుటచే వర్ణనలు గూడ నాధునికము గనే యున్నవి. 'షర్టు, సిగరెట్టు, క్రాపింగు' మున్నగు నాంగ్లపదములు విరివిగా వాడఁబడినవి. కేసు విచారణకు కోలారు కోర్టుకు హాజరగుచున్న సుబ్బిరెడ్డి వర్ణనమెట్లున్నదో చూడుడు:-

*"స్నాన పానము లాడినాడు- పాళెగాడూ సుబ్బిరెడ్డి*
*సలవ పంచెను కట్టినాడు- సాదుసుక్కా వెట్టినాడు*
*షర్టు మీందా కోటు ఏసి- పాళెగాడూ సుబ్బిరెడ్డి*
*నీటుగా క్రాపింగు దువ్వీ- నోటిలో సిగరెట్టు పెట్టి*
*అయిదు సారయి సీసాలు- జేబులోన పెట్టినాడు*
*అయిదు నిమ్మా పండ్లు తీసి- జేబులోన పెట్టినాడు*
*బందూకా అయితేనూ- భుజమందూ నిల్పినాడు*
*ఏదీ మరచినాగానీ- సారాయీ మరవాడూ*
*సారయి మరచినాగానీ- బందూకా మరవాడూ*
*చెవులో తెల్లరాళ్ల పోగులు- చేతులకు బంగారు కాపులు*
*ఎడమ చేతిలో చెయినుగొల్సు- కుడిచేతిలో బందూకా*
*కాకిరెక్కా కనుసోగా- కళ్లుండే సుబ్బిరెడ్డి*
*కోలారూ కోర్టూకూ- ప్రయాణామైనాడూ"*

## 2.5.4. చెన్నకృష్ణారెడ్డి కథ:-

ఇది రాయలసీమలో వ్యాప్తియందున్న మఱియొక వీరగాథ. పూసల బలిజలే దీనిని బాడుచున్నారు. సుమారు 1946 ప్రాంతములో గ్రామకక్షల మూలమున జరిగిన హత్యలు ఇందలి ఇతివృత్తము.

కడపజిల్లా, రాయచోటి తాలూకాలో, పందెల్లపల్లె గ్రామమున్నది. ఈ పందెల్లపల్లెకుఁ దూర్పునఁగల దిన్నెపల్లెలో చెన్నకృష్ణారెడ్డి యను పేరుమోసిన రెడ్డి యుండెను. పందెల్లపల్లెకుఁ బడమట మూఁడు మైళ్లలోఁ 'పూలకుంట్ల రెడ్డివారిపల్లె' యున్నది. అక్కడ చెంచురెడ్డి యను నాతఁడుండెను. అతఁడు దుర్మార్గుడు. చెంచురెడ్డియు చెన్నకృష్ణారెడ్డియు అక్కచెల్లెండ్ర కొడుకులు. ఇరువురకును గక్షలు పెరిగినవి. చెన్నకృష్ణారెడ్డి శౌర్యముముందు చెంచురెడ్డి ఆగలేక నాతని నెట్లయినను జంపవలెనని కుట్రపన్నుచుండెను. ఒకనాఁడు చెంచురెడ్డి తాటిగుట్టోళ్ల మామిడితోఁపులో కోడిపందెము పెట్టి, దానికి చెన్నకృష్ణారెడ్డి నాహ్వానించెను. ఆ తోఁటలో నేబదిమంది కుంచెయెఱుకలను బోయవాండ్రను గాపువెట్టి, చెన్నకృష్ణారెడ్డిని జంపఁదలఁచెను. చెన్నకృష్ణారెడ్డి యేదుమంది జింకావాండ్రను వెంటఁబెట్టుకొని 'డబుల్ బార్ తుపాకి' చేతఁబట్టి ఆ కోడిపందెమునకు వచ్చెను. అక్కడ జరిగిన కోడిపందెములోఁ జెన్నకృష్ణారెడ్డి పందెమును గెలిచెను. చెంచురెడ్డి బోయవాండ్రను జెన్నకృష్ణారెడ్డిపైకిఁ బంపెను. చెన్నకృష్ణారెడ్డితోనున్న జింకావాండ్రేద్గురును విజృంభించి, ఆ బోయలను, చెంచురెడ్డిని, అతని కొడుకు నాగిరెడ్డిని తతిమి వేసిరి. వారు తమ కోళ్లను అల్లెత్రాళ్లను వదలి పాఱిపోయిరి.

తరువాత చెంచురెడ్డి మఱింత పట్టుదలతో 'రౌడీ'లకుఁ బ్రసిద్ధి కెక్కిన 'ఒదేటి' గ్రామపు మంగలివాండ్ర నైదుగురను దిన్నెపల్లెకుఁ బంపెను. వారు ఊరిబయటనున్న బావిదగ్గఱ మాటు కాసిరి. ఉదయము ఏడుగంటలవేళ చెన్నకృష్ణారెడ్డి బావికడకు వచ్చి ముఖము కడుగు కొనుచుండగా, నా మంగలివాండ్రు ఆతనిపైఁబడి, ప్రక్కనున్న జొన్న చేనులోనికిఁ దీసికొనిపోయి చంపివైచిరి. చెన్నకృష్ణారెడ్డి పుత్రులు రామమోహనరెడ్డి, సీతాపతిరెడ్డి, దీనికిఁ బ్రతీకారముగాఁ జెంచురెడ్డిని నాతని కుమారుడు నాగిరెడ్డిని జంపిరి.

ఈ కథ వీరరసము తొణకిసలాడు బొబ్బిలికథ వరుసలో సాఁగినది. చెన్నకృష్ణారెడ్డి కలెక్టరును గలిసికొనుటకు లకిరెడ్డిపేట కోర్టుకుఁబోవు సమయమున వర్ణన చూడుడు:-

*"మూరెడు పొడుగూ తోక బూట్లయో కాళ్ల కేసుకోనీ- రెడ్డి*
*డబుల్ బూరుది జోడుగుళ్లదీ టుపాకి తీసేనూ- రెడ్డి*
*టుపాకి తీసి బుజాన బెట్టెను చెన్నకృష్ణరెడ్డీ- రెడ్డి*
*ఏడు మందియో జింకావాళ్లను ఎంటదీసుకోనీ- రెడ్డి*
*లకిరెడ్డిపేటా కోర్టుకైననూ రెడ్డీ వచ్చేనూ- అప్పుడు"*

కోడిపందెమునకుఁ బోవుటకై సందేహించుచున్న చెన్నకృష్ణారెడ్డితో నతని యనుచరులగు జింకావాండ్రు పలికిన వీరాలాపములు, సేవాధర్మముఁ జూడుఁడు:-

*"ఏమయ్యా చెన్నకృష్ణారెడ్డి ఆలోచన చేస్తావూ- ఇపుడు*
*నీకు వచ్చినా భయమే లేదూ పందె మొప్పుకోండీ- రెడ్డి*
*నీ చెమట పడినా చోటునందు మా రకతము పడవాలా- రెడ్డి*
*నీ రకతము బడినా చోటునందు మా ప్రాణము బోవాలా-రెడ్డి"*

చెంచురెడ్డి పందెమునకై తెప్పించిన కోళ్ల వర్ణనలో మంచి నుడికారమున్నది:-

*"పందెము గెలిచిన పెద్ద బెడసలా కోళ్లే దెస్తాడూ- రెడ్డి*
*ఈకె వరసనా ఇరవై వన్నెల కోళ్లే దెస్తాడూ- రెడ్డి*
*పందెమొరసనా పదైదు వన్నెల కోళ్లే దెస్తాడూ- రెడ్డి*
*పిఠాపురమూ కాకి నెమళ్ళా రెడ్డీ దెస్తాడూ- రామ*
*గొట్టిగెల్లు చిన్నల్లా కోళ్లు రెడ్డీ దెస్తాడూ- రామ*
*ఒంటి ఒంటికీ పదైదు వన్నెల కోళ్లే దెస్తాడూ- రెడ్డి"*

## 2.5.5. దొర్నిపాటి వెంకటరెడ్డి కథ:-

ఇది రేనాడులోఁ బుట్టిన యత్యాధునికమైన వీరగాథ. ఇది ఇంకను జననావస్థయందే కలదని చెప్పనగును. ఇంకను బ్రజల నోళ్లలో నలుగుచు రూపమును దిద్దుకొనుచున్నది. 1964 మార్చి 30వ తేదిని నంద్యాల 'బస్టాండు'లో దొర్నిపాడు గ్రామమునకుఁ

జెందిన పైడేల వెంకటరెడ్డిగారు హత్యకావింపఁబడినారు. వారి సాహసములను గీర్తించు కథ యిది.

కర్నూలు జిల్లా, కోవెలకుంట్ల తాలూకా, 'దొర్నిపాడు' గ్రామములో పైడేల అంకిరెడ్డి- నందమ్మ అను స్థితిపరులైన రైతు దంపతులకు 1920 ప్రాంతమునఁ బుట్టిన యేకైక పుత్రుఁడు వెంకటరెడ్డి. వీరు పెడకంటి రెడ్లు. గొప్ప ఆస్తిపరులు. వీరికి ఆఱువందల యెకరముల మాగాణి భూమి కలదు. కడప జిల్లాలోని చిన్నపసుపుల కుంటిపుల్లారెడ్డిగారికి ఈ వెంకటరెడ్డిగారు ఆప్త మిత్రులు. పుల్లారెడ్డివలెనే వెంకటరెడ్డియు నతిసాహసికుఁడు.

దొర్నిపాటి గ్రామములో బండారు చిన్నన్న యను యాదవుఁడు చండశాసనుఁడై ప్రజలను బాధించుచుండెను. స్త్రీలను జెఱపట్టుచుండెను. వెంకటరెడ్డిగారప్పటికి యువకుఁడు అయినను బండారు చిన్నన్నను ధిక్కరించి, చంపించి, తాను గ్రామమునకుఁ బెత్తన దారయ్యెను. ఈతని 'హయాము'లో నాగ్రామమునఁ జోరభయములు లేక రైతులు నిశ్చింతగా నుండిరఁట. గ్రామములో నెవరి పొలములో నేమి పోయినను దానే 'జవాబుదారి' నని రెడ్డి ప్రకటించెనఁట.

దొర్నిపాడు ప్రక్కనేయున్న 'చాగరాజు వేముల' యను గ్రామమునఁగల కమ్మవారితో వెంకటరెడ్డికిఁ గక్షలు పెరిఁగెను. 1957లో నారాయణస్వామి యను వ్యక్తిని వెంకటరెడ్డి హత్య చేయించెను. అతని పుత్రులు, మిత్రులు, వెంకటరెడ్డిపైఁ బగఁబూని 1964లో నంద్యాలలోఁ బట్టపగలు హత్యచేసిరి. రెడ్డి మరణముతో దొర్నిపాటి గ్రామమునకఁ గళపోయినది.

దొర్నిపాడు గ్రామములో బయల్పాటి జమ్మన్న యను జంగమీ కథ నాశువుగా గానము చేయుచున్నాడు. 16-12-1965న నేనా గ్రామమునకుఁబోయి, యీ పాటను వ్రాసికొంటిని. పాదమునకు ముప్పది మాత్రలున్నవి. పదునైదు మాత్రల తరువాత విరామము. 7+8+7+8 గా సాగును. ఈ కథ యిట్లు ప్రారంభమగును:-

*"భళి కర్నూలు జిల్లాలోనా- కోయిలకుంట్లా తాలుకలోనా*
*దొర్నిపాటీ గ్రామమునందే- ఉండెనమ్మా పాపిరెడ్డీ*
*పాపిరెడ్డీ కోమారుడే - ఉత్తమైనా అంకిరెడ్డీ*
*అంకిరెడ్డీ కోమారుడే- ఉన్నాడమ్మా ఎంకటరెడ్డీ*
*చుట్టు ఏడు పల్లెలకమ్మా- శూరుడమ్మా ఎంకటరెడ్డి*
*మించినోళ్లకు మిండాడమ్మా- పేదవోళ్లకు దేమూడమ్మా"*

పాడునప్పుడు మాత్రమే ఈ కథలో '7+8+7+8' అనుగతి తోచుచున్నది. ఇందలి సంగీత దీర్ఘములను దొలగించినచో, సాహిత్యాక్షరములు రూపకగతిలో '6+6+6+6' అను రీతిగా సాఁగునని చెప్పవలసి యున్నది ("దొర్నిపాటి గ్రామమందె-ఉండెనమ్మ, పాపిరెడ్డి... ఇత్యాది).

గ్రామకక్షలుండుటచే వెంకటరెడ్డి యేయూరు పోయినను 'ఫిస్తోలు' బొడ్డునఁ బెట్టుకొని యీటెలతో మందిని వెంటబెట్టుకొని వెడలెడివాఁడు. మందిమార్బలములతో వెంకటరెడ్డి ప్రయాణమగుటను బ్రజలాశ్చర్యముతోఁ జూచెడివారఁట. గాథాకారుఁ డీ వర్ణన నత్యద్భుతమగాఁ జేసినాఁడు:-

*"నల్లనల్లని వాడూ రెడ్డీ-కోరమీసం వాడూ రెడ్డీ*
*రెడ్డి బయటకు ఎల్తే రాజా- పులి దూకిన తీరూ రాజా*
*మున్నూటికి దండును లేపీ- రెడ్డి బండిని కట్టీనాడే*
*బండినిండా ఈటెలు ఏసీ- ఇన్నూటికి పాలేగాళ్లూ*
*బండి కమ్మంటె లేసీనారూ- బయదెల్లీ పోతావుంద్రి*
*నల్లనల్లని రూపూరెడ్డి- కోరమీసం వాడూ రెడ్డీ*
*రెడ్డి బొడ్లో రైఫోలమ్మా- రెడ్డి సుట్టూ ఈటెలమందీ*
*మున్నూటికి ఈటెల చేతా- రెడ్డి అయినా పోతావుంటే*
*చుట్టు నాలుగు గ్రామాలమ్మా- చూడవస్తారమ్మా రెడ్డిని*
*కోతకోసే కూలీవాళ్లూ- కొడవళ్లు కిందా ఏసీ*
*హబ్బ హబ్బా! అంటారమ్మా- అట్టె సూస్తా ఉంటారమ్మా!"*

## 2.5.6. కలిచెర్ల నరసింహారెడ్డి కథ:-

ఇది చిత్తూరు కడప మండలములలో విశేష వ్యాప్తి యందున్న వీరగాథ. పూసల బలిజలు తంబుఱ గుమ్మెట్లతో దీనిని బాడుచున్నారు. 'చందామామా! చక్కని చందామామా!, అను పునరావృత్తితోఁ బాడఁబడును. ఈ వీరగాథలోని వీరుఁడు సజీవుఁడై యుండుట యొక విశేషము. ఇది ఇటీవలి కాలమున (1955 ప్రాంతములో) బయలుదేరిన వీరగాథ. కాఁగా, నిది వీరగాథోత్పత్తి క్రమమును సప్రమాణముగా నిరూపించుచున్నది. ఈ గాథ పుట్టి పదిపండ్రెండు సంవత్సరములే యైనను (1954-1956) దీనియందు సాంప్రదాయిక వీరగాథల లక్షణములన్నియును ఇమిడియుండుట మఱియొక విశేషము. ఇది పూసల బలిజలను గాథాకారులలో నాశువుగా జనించుటయే ఇందులకుఁ గారణమై యుండును. వీరగాథోత్పత్తి రాయలసీమలో నేఁటికిని సజీవమై యున్నదనుటను ఈకథ నిరూపించుచున్నది.

యథార్థ సంఘటన లెట్లున్నవో తెలియవు కాని, పాటనుబట్టి యితివృత్తము ఈ క్రింది విధముగా నున్నది:-

చిత్తూరు జిల్లా, మదనపల్లె తాలూకా, కలిచెర్ల గ్రామములోఁ గడపవారి కొండిరెడ్డి గొప్ప భూస్వామి. ఈయనకు సంతతి లేదు. అందుచే వాయలపాడు తాలూకా 'తరిగొండవారిపల్లె' యను గ్రామములో నున్న తన మేనల్లుఁడు (చెల్లెలి కొడుకు) నరసింహారెడ్డిని దెచ్చుకొని సాకుకొనుచుండెను. కొన్నాళ్లకుఁ గొండిరెడ్డి తన యాస్తినంతయు నరసింహారెడ్డికి వ్రాసి చనిపోయెను. ఈ కొండిరెడ్డి దాయాది మిట్టపల్లె పాపిరెడ్డి. ఈయనను "చీనీచెట్ల పాపిరెడ్డి" యందురు (ఈయనకుఁ జీనీతోటలధికముగా నున్నవి కాఁబోలును). కొండిరెడ్డి, తనకు రావలసిన యాస్తిని నరసింహారెడ్డికిచ్చెనని ఈ పాపిరెడ్డికిఁ గన్నెఱ్ఱగా నుండెను. అందుచే నరసింహారెడ్డినిఁ జంపి,

ఆతని యాస్తినంతయుఁ గాఁజేయవలెనని ఈ పాపిరెడ్డి విశ్వప్రయత్నము చేసెను, కాని ఫలింపలేదు.

నరసింహారెడ్డి 'చేయెత్తు మనిషి'. గొప్ప బలశాలి, ధైర్యశాలి. 'నక్కపోతు నయనాలు, పులిరూపు కలిగిన రెడ్డి, బీదసాదలకు దేవుఁడు"– అని గాథాకారుని వర్ణన. నరసింహారెడ్డి కోడిపందెమాడుటలో రాయలసీమకంతకును పేరుమోసినవాఁడు. ఈయన కోడిపందెము రాజ్యములను బణమొడ్డి యాడిన నాఁటి పల్నాటి వీరుల కోడి పందెమును జ్ఞప్తికిఁ దెచ్చునని చూచినవారు చెప్పుదురు. నరసింహారెడ్డి ఇలువేల్పు పోలేరమ్మ. ఈయనకు కల్లునంగళ్లు నడపుటకును, కోడిపందెము లాడుటకును, పోలేరమ్మ తిరునాళ్ల జరుపుటకును ప్రభుత్వమువారు అనుమతినిచ్చిరఁట. ఈ నరసింహారెడ్డి ఇలువేల్పగు పోలేరమ్మ ఇతని నెల్లవేళలఁ గంటికి రెప్పవలెఁ గాపాడుచుండెను. అందుచేఁ జీనీచెట్ల పాపిరెడ్డి ఈయనను జంపుట కెన్ని ప్రయత్నములు జేసినను ఫలింపలేదని ఈ కథలోఁ బదేపదే వర్ణింపఁబడినది. తంబళ్లపల్లె కృష్ణారెడ్డి, యఱ్ఱబల్లి గంగిరెడ్డి, గంజివారిపల్లె చిన్నరామిరెడ్డి యనువారుగూడఁ జీనీచెట్ల పాపిరెడ్డితోఁ గలిసి నరసింహారెడ్డిపై వైరముఁ బూనినారు. వీరు నలుగురును పెద్దమండెము మామిడితోఁపులోఁ గోడిపందెముఁ బెట్టి, నరసింహారెడ్డిని బిలిచి చంపఁబూనిరి. పోలేరమ్మ మహిమవలన నరసింహారెడ్డి తప్పించుకొనెను. రాయచోటి దగ్గఱ నున్న ఓజేటి మంగలివాండ్రను మాఱువేషములలోఁ గలిచెర్లకుఁ బంపి, నరసింహారెడ్డిని హత్యచేయఁ బ్రయత్నించిరి. అదియును నిష్ఫలమయ్యెను. 'బండిరేవు' గ్రామములో బండెమ్మ దేవత జాతరకు నరసింహారెడ్డిని పిలిచిరి. అట నిరుపక్షములకును పెద్ద 'దొమ్మీ' జరిగెను. అందు శత్రువర్గమువారే గాయపడిరి. మఱియొకమాఱు, మదనపల్లెకుఁబోవు త్రోవలో లోతుగా గోతిని ద్రవ్వి, యొక పెద్ద వేపమ్రానును రోడ్డుకడ్డముగాఁ బడవైచి, నరసింహారెడ్డిని జంపఁ దలంచిరి. సాహసికుఁడగు నరసింహారెడ్డి తన 'జీపు'ను మ్రానుపైనుండి గోతియావలకు దూకించి, ఇంటికి క్షేమముగా వచ్చెను. ఈ యన్ని హత్యాప్రయత్నములందును నిలువేల్పగు పోలేరమ్మ నరసింహారెడ్డిని రక్షించెను. ఇందులో నెంత సత్యమున్నదో తెలియదు కాని, ఈ పోలేరమ్మ వృత్తాంతము నరసింహారెడ్డి కథకుఁ బ్రాచీన సాంప్రదాయిక వీరగాథల లక్షణముల నాపాదించుచున్నదనుట మాత్రము సత్యము.

ఈ గ్రామకక్షలు, దేవతామాహాత్మ్యములు మాత్రమే కాక, ఈ కథలో నరసింహారెడ్డి శౌర్యమును బ్రత్యేకముగాఁ జెప్పు సంఘటనయు నొకటి కలదు. పాలకొండ దగ్గఱ 'గురికాలపల్లె'లో నడవినుండి నక్కపోతొకటి వచ్చి పశువులను జంపుచుండెను. ఆ యూరి ప్రజలు వచ్చి నరసింహారెడ్డికి విన్నవింపఁగా నతఁడు దానిని వేఁటాడఁ బోయెను. నరసింహారెడ్డి నిరాయుధుఁడై యుండఁగా నక్కపోతు అతనిపైఁబడెను. వీరుఁడగు నరసింహారెడ్డి యే మాత్రమును భయపడక, దానితో జాలాసేపు పోరి, దానిని పిడిగ్రుద్దులు గ్రుద్ది చంపివైచెను. ఈ ఘట్టమున వర్ణన చక్కఁగ సాఁగినది. ఈ పాట 'కిటతక కిటతక' యను నెనిమిది యక్షరముల యావృత్తులు నాలుగొక పాదముగా సాఁగును. రెండావృత్తుల కొకసారి వంతల పునరావృత్తి వచ్చును:–

*"వంక నారవలో వాయిలు సెట్లలో–సందామామా! సక్కని సందామామా!*
*అణగ దేసింది నక్కపోతురా ,, ,,*
*ఒంటిగాడు నరసింహారెడ్డిపై ,, ,,*
*ఉరుకుత వచ్చెను నక్కపోతురా ,, ,,*
*యాభైరూపాయల శాలవదీసీ ,, ,,*
*ఎడమ సేతికి గట్టిగ సుట్టెను ,, ,,*
*ఎడమ సేతికీ గట్టిగ సుట్టీ ,, ,,*
*నక్కపోతుకీ నోటికిచ్చెనూ ,, ,,*
*కుడి సేతితో నక్కపోతునూ ,, ,,*
*కుమ్ముచుండె నరసింహారెడ్డిరా ,, ,,*
*నక్కసేతికి రెడ్డి దొరకదూ ,, ,,*
*రెడ్డి సేతికీ నక్కదొరకదూ ,, ,,*
*అది– పొడలా పొడలా నక్కపోతురా ,, ,,*
*నరసింహారెడ్డినీ పట్టియున్నదీ ,, ,,*
*దెబ్బ దెబ్బతో రెడ్డి నాయనా ,, ,,*
*నక్కపోతునూ గుద్దు తున్నదూ ,, ,,*
*గోండ్రు గోండ్రునా నక్కపోతురా ,, ,,*
*గోరులతోనా రెడ్డిని జీల్చూ ,, ,,*
*రెడ్డి రకతమూ దరణీమిందా ,, ,,*
*ఏరులు వయ్యీ దొర్లిపోయెనే ,, ,,*[28]

రాయలసీమలో కడప మండలమున 'రాఘవరెడ్డి కథ' – ఒడ్డుకింద భయారెడ్డి కథ'; అనంతపుర మండలమున 'బియా వెంకటరెడ్డి కథ' అనునవి ఈ వర్గమునకుఁ జెందిన వీరగాథలు. గుంటూరు మండలమునఁ బల్నాటిలో 'ఎఱ్ఱం పేరయ్య కథ'యు గ్రామ కక్షలకుఁ జెందినదే. తెలంగాణమున రాజకీయ కక్షలకుఁ జెందిన వీరగాథలలో నల్లగొండ జిల్లాలోని 'రేనికుంట రామిరెడ్డి కథ' ప్రసిద్ధమైనది. మహబూబునగర మండలమున వ్యాప్తియందున్న 'పరిగ రామకృష్ణారెడ్డి కథ' గ్రామ కక్షలకు, ముఖ్యముగా హిందూ–ముస్లిముల కక్షలకు లక్ష్యమనఁ దగియున్నది.

## 2.6. కుటుంబ కలహములు

**కండెపు సుబ్బయ్యగారి కథ:–**

గ్రామకక్షలు గాక, కుటుంబ కలహములలో జరిగిన హత్యకు కండెపు సుబ్బయ్యగారి కథ చక్కని యుదాహరణము. ఇది పశ్చిమ గోదావరీ కృష్ణామండలములో విశేషవ్యాప్తియందున్న వీరగాథ. 'పరిక ముగ్గులవారు' అను గాథాకారులు దీనిని బాడుచున్నారు. కృష్ణాజిల్లా,

కైకలూరు తాలూకా, నరసన్న పాలెములో దేగల సుబ్బారావు అను పరిక ముగ్గలవాఁడు పాడుచుండగా 19-9-1964న దీనిని వ్రాసికొంటిని. పశ్చిమ గోదావరి జిల్లా, ఏలూరు తాలూకా, జగన్నాథ పురములో 1923లో జరిగిన హత్యయే ఈ వీరగాథలోని ఇతివృత్తము.

జగన్నాథపురములో కండెపు రామయ్య 19వ శతాబ్ది చివరలో నున్న గొప్ప రైతు. కమ్మకులమునకుఁ జెందినవాఁడు. ఇతనికి రామమ్మ, సూరమ్మ యను నిర్వురు భార్యలు. పెద్దభార్యయగు రామమ్మ గారికి నలుగురాడపిల్లలు, ఇద్దఱు మగపిల్లలు: వెంకమ్మ, చెల్లమ్మ, లక్ష్మమ్మ, కోటమ్మ, సుబ్బయ్య, రత్తయ్య. రెండవ భార్యయగు సూరమ్మ గారికి రామమ్మయను కూఁతురును, సూరయ్య, లక్ష్మణదాసు అను నిరువురు కొడుకులును గలరు. రామయ్యగారి మరణానంతరము సుబ్బయ్యగారు ఆ యింటికి యజమాని యయ్యెను. చెల్లెండ్రకుఁ దమ్ముండ్రకుఁ బెండ్లిండ్లు చేసెను. తన సవతి తమ్ముఁడగు లక్ష్మణదాసు నకుఁ దన సొంత యక్క చెల్లమ్మగారి పుత్రిక శేషమ్మనిచ్చి వివాహము చేసి, మిక్కిలి యభిమానముతోఁ జూచుచుండెను. లక్ష్మణదాసు అందఱిలోను జిన్నవాఁడగుటచే సుబ్బయ్యగారి కీతనియెడ ప్రేమ మెండు.

సుబ్బయ్యగారికి నాగయ్య, జన్నయ్య యను నిరువురు పుత్రులును, లక్ష్మమ్మయను పుత్రికయుఁ గలరు. ఇందు లక్ష్మమ్మను దన యక్క చెల్లమ్మగారి మూఁడవ కుమారుఁడైన పుల్లయ్యకిచ్చి పెండ్లి చేసెను. ఇట్లు సుబ్బయ్యగారికిఁ దన యక్కగారైన చెల్లమ్మగారితో రెండు రకముల బాంధవ్యము కలిసియున్నది (చెల్లమ్మ పుత్రికయగు శేషమ్మ, సుబ్బయ్యగారి తమ్ముని భార్య; సుబ్బయ్యగారి పుత్రికయగు లక్ష్మమ్మ, చెల్లమ్మ కోడలు). ఇదియే వీరి ప్రాణమునకుఁ గీడు తెచ్చినది.

సుబ్బయ్యగారి అక్క చెల్లమ్మది శ్రీరామవరము. ఆమె భర్త కామిరెడ్డి జన్నయ్య. చెల్లమ్మ 'మహాగయ్యాళి'. తన తమ్ముఁడగు సుబ్బయ్య కూఁతురును, దన మూఁడవ కోడలును నగు లక్ష్మమ్మను బెక్కు హింసల పాలుసేసి, పుట్టింటికిఁ దఱిమివేసెను. ఇది సుబ్బయ్యగారికి దెలిసి, తన సోదరుడు లక్ష్మణదాసుతోఁ జెప్పి, అతని భార్యయుఁ దన్నయక్క చెల్లమ్మ కూఁతురును నగు శేషమ్మను బుట్టింటికిఁ (శ్రీరామవరము) బంపివేసెను. ఇది లక్ష్మణదాసున కిష్టములేదు. అయినను అన్నకు భయపడి భార్యను బంపక తప్పలేదు. సుబ్బయ్యగారికినిఁ జెల్లమ్మగారికిని బట్టింపులు హెచ్చిపోయెను. చెల్లమ్మ తన యల్లుఁడు లక్ష్మణదాసును బిలిచి, సుబ్బయ్య బ్రతికి యున్నంత కాలము తన కూతుఁరు సంసారము బాగుపడదనియు, నాతనిని జంపివేయు మనియుఁ బ్రోత్సహించెను. అవివేకియగు లక్ష్మణదాసు చెల్లమ్మ సలహాను బాటించి, కొందఱు మాలవాండ్రను జేరఁదీసి, రాత్రివేళ సుబ్బయ్యగారు ఏలూరునుండి జగన్నాథపురము వచ్చుచుంగా దారిలోఁ బొడిచి చంపించెను. ఈ హత్య 1923 ఆగష్టు 27 మంగళవారము నాఁడు జరిగెను. ఈ హత్యలోఁ బాల్గొన్నవారి కందఱకును ద్వీపాంతరవాస శిక్షలు పడెను.[29]

లక్ష్మమ్మకథ వలెనే ఇదికూడఁ గుటుంబ కలహములతోఁ, బట్టుదలలతో, నత్తగారి యారళ్లతోఁ, గోడండ్ర గోడుతో, హృదయమును గరఁగించు సన్నివేశములతో నొప్పు నుత్తమ వీరగాథ. సుబ్బయ్యగారు మహాబలశాలి. ఆఱడుగుల యెత్తు, పెద్దఛాతి కలవాఁడు. ఇతఁడన్నచో సమష్టి కుటుంబములోని వారికే కాక, యూరిలోని వారందఱికిని భయమే. ఇతఁడు గొప్ప న్యాయవేత్త. ఈ కథ శోకాలాపముతో, మిక్కిలిగా సాఁగఁదీయఁబడిన ద్విపద పాదములతో 12+10+8 మాత్రలొక పాదముగా సాఁగును. కామమ్మకథవరుసలో నున్నదని చెప్పవచ్చును. ఈ కథ ఇట్లు ప్రారంభమగును:-

*"రామా రామను రామా, శ్రీరామా రామా- రామారామా*
*(రామ రామను రామ శ్రీరామ రామ-రామరామ)*
*ఏలూరు తాలూకా జగనాథపురము-రామారామా*
*జగనాథపురమేలు ఆ కమ్మవారు- కమ్మావారు*
*వారింటి పేరండి కండేపువారు ,,*
*ఘనమైన కండేపు రామయ్యగారు ,,*
*కండేపు రామయ్య తన గర్భమందు ,,*
*సుబ్బయ్య రత్తయ్య ఒక తల్లివారు రామారామా*
*సూరయ్య దాసయ్య ఒక తల్లివారు ,,*
*తల్లులిద్దరు గాని తండ్రి వొక్కడుగ ,,*
*సవతి బిడ్డలు వారు అన్నదమ్ములుగ రామారామా"*

కండెపు సుబ్బయ్యగారి విగ్రహమును బ్రతాపమును ఇట్లు వర్ణింపఁబడెను:-

*"పిడి తక్కువ మూరెడు పాదమున్నాది- సుబ్బయ్యకు*
*రెండు మూళ్లది రొమ్ము ఛాతి ఉన్నాది ,,*
*ఏలూరు కోర్టులో పంచాయతిదారి సుబ్బయ్య*
*గ్రామాని కధికారి గ్రామ మునసీబు ,,*
*సరకార్ని మెప్పించి సెలవు తెచ్చాడు ,,*
*కర్రకత్తిని వొకటి సెలవు దెచ్చాడు ,,*
*నెలకు మూఁడు ఖూనీలు సెలవు దెచ్చాడు ,,*
*కర్రకత్తీ తనకు చేత ఉంటేనా ,,*
*అరవై మందినీ గదిమి కొడతాడే ,,*
*ముల్లు కర్రా తనకు చేత నుంటేనా ,,*
*ముప్ఫయిమందినీ తరిమి కొడతాడూ సుబ్బయ్య"*

సుబ్బయ్య తన అక్క చెల్లమపైఁ గోపగించుట చక్కఁగ వర్ణింప బడినది:-

*"తెచ్చేను కోపాలు నయనాలకండో- సుబ్బయ్య*
*పటపటా సుబ్బయ్య పండ్లు కొరికాడో ,,*

*ఆగ్రుడై తానపుడు మండిపడ్డాడే ,,*
*అరలోది ఆ కత్తి బర్రూన లాగే ,,*
*కత్తి మెరుపూలేమొ మెరిపించినాడూ సుబ్బయ్య"*

ఈ కత్తి మెఱపులు 'కళ్లఁ జూచి' చెల్లమ్మ పాఱిపోయినది. కాని తమ్మునిపైఁ బగఁబట్టినది. ఆ పగను దమ్ముని కూతురుపైఁ దీర్చుకొన్నది. తన తమ్మునిట్లు హెచ్చరించినది:

*"చూదరా నా దెబ్బ చూపించుతాను- తమ్మూద!*
*కూర్చోని అన్నామె తిననివ్వ నయ్య- లక్షిమీని*
*నిలబాడి నీళ్లేమొ తాగ నివ్వాను ,,*
*దండాన్ని చీరలే కట్టనివ్వాను ,,*
*పెట్టెలో వస్తువులు పెట్టనివ్వాను ,,*
*కూర్చుంటె ఒక తన్ను నేను తన్తాను ,,*
*నుంచుంటె ఒక తన్ను నేను తన్తాను ,,*
*పనిపాటల కాడ ఆరుపోరయ్య - లక్షిమికిని*
*నీ కూతురిని పుట్టింటికి వెళ్లదరిమెదను-తమ్మూద!"*

అత్తగారి క్రౌర్యమంతయును పైపంక్తులలో వెడలఁగ్రక్కినది చెల్లమ్మ.

## 2.7. లేచిపోవుటలు (Elopements)

**మందలోడు కథ:-**

లంబాడీలు, మందులవాండ్రు, కోయవాండ్రు మున్నగువారు మంత్రతంత్ర శక్తులు గలవారని జానపదుల నమ్మకము. వీరు ఆస్తిపరులైన స్త్రీలను మంత్రించి యెత్తుకొని పోవుదురని నమ్మట పల్లెలలోఁ గలదు. ఇది కేవలము నమ్మకము మాత్రమే కాదు. ఇట్టి సంఘటనలు గూడఁ గొన్ని యథార్థముగా జరిగినవి. ఈ విధముగా మందులవాని మాయలోఁబడి, యొక సంపన్న గృహస్థురాలు ఆతనితో లేచిపోవుటయే ఈ 'మందలోడు కథ'. ఇది శ్రీకాకుళ మండలమున విశేషవ్యాప్తియందున్నది. అట మాలదాసరులు దీనిని జముకులతోఁ బాడుచున్నారు. ఇది ఇటీవలనే- సుమారేడెనిమిదేండ్ల క్రిందట (1958-1959లో) జరిగిన సంఘటన. ఈ కథను 24-5-1966న శ్రీకాకుళము ప్రక్కనే యున్న 'తోటపాలెము' గ్రామములో దాసరి బండారు అను నతఁడు పాడుచుండఁగా వ్రాసికొంటిని.

తండ్రినిగాని మగనినిగాని విడచి, విటగానితో లేచిపోవుట నాంగ్లమున 'elopement' అందురు. ఇట్లు 'లేచిపోవుట' హిందూ దేశమునఁగూడఁ గలదు. కాని, పాశ్చాత్య దేశములలో నున్నంత బహుళముగా లేదు. పాశ్చాత్య దేశములలో నీ లేచిపోవుటలపైఁ బెక్కు వీరగాథలున్నవి. మనకట్టివి లేవనియే చెప్పవచ్చును. ఉన్న కొద్దిపాటి కథలలో నీ 'మందలోదుకథ' నుదాహరణముగా స్వీకరింప వచ్చును. కాని ఈ కథలో నాయిక మందుప్రభావమున మరులు గొన్నదే కాని, స్వతస్సిద్ధముగాఁ బ్రేమించి లేచిపోలేదు. కావున దీనిని మందులవారి మాయల కుదాహరణముగాఁ గైకొనవలెనే కాని, లేచిపోవుటకు లక్ష్యముగా స్వీకరించుట సమంజసము కాదను శంక పొడమును. కాని కట్టుకొనిన భర్తను విడిచి, పరాయి మగవానితో వెడలిపోవుట- అది యేకారణము వలననైనను 'లేచిపోవుట' యే యని చెప్పవలెను.

శ్రీకాకుళము జిల్లా, పాలకొండ తాలూకాలో, 'ఇసకలూరుపేట' యను గ్రామమున్నది. అట రామానాయఁడు, పాపమ్మ యను దంపతులు గలరు. వీరిది తెలగ కులము. వీరికి ముగ్గురు కొడుకులు, 'నారాయణమ్మ' యను కూఁతురు గలరు. ఈ నారాయణమ్మ యువతి. 'స్కూలు ఫైనలు' వఱకును జదివినది. ఈమె భర్త పేరు 'గోపి చిన్నవాఁడు'. ఒకప్పుడీమె కడుపునొప్పితో బాధపడుచుండెను. ఆ గ్రామమున కొక తరుణప్రాయుడైన మందులవాఁడు వచ్చెను. (ఈ మందులవారు గాడిదలను, పందులను గాయుచుఁ బూసలను నాటుమందులను అమ్ముకొని జీవింతురు. 'మందులవాఁడు' అను శబ్దమే జానపద వ్యవహారమున 'మందలోడు' అయినది. 'మందలోడికథ' అనఁగా 'మందులవాని కథ' అని గ్రహింపవలెను.) నారాయణమ్మ ఆ మందులవానిని బిలిచి తన కడుపునొప్పికి మందునడిగెను. ఆమె సౌందర్యమును జూడఁగా వానికి దుర్బుద్ధి పొడమెను. ఆ మందులో నేదియో మరులు గొల్పు పదార్థమును గలిపి ఆమెకిచ్చినాఁడు. ఆమెకు మరుల కాటుకను బెట్టినాఁడు. నారాయణమ్మ వాఁడిచ్చిన మందును సేవించినది. కడుపునొప్పి తగ్గినది కాని, ఆ మందుల వానిపై నామెకు విపరీతమగు మోహము జనించెను. ఆ మోహములో నాతని గూర్చిన వివరము లడిగినది. వానికిఁ బాతిక రూపాయల బహుమతి నిచ్చి, సారాయి పోయించి, కోడినిఁగోసి భోజనము పెట్టి, వానిని బంపి, తాను దరువాత వత్తుననెను.

మరులమందు నిచ్చివాఁడే కాని, నారాయణమ్మ తనతో వత్తుననఁగా మందులవానికి భయము పుట్టెను. అందుచేఁ దాను మందతో విడిసియున్న ఓటిగడ్డ మిట్టలకుఁబోయి, సారాయి మత్తు వదలిన తరువాత భార్యల నిరువురను వెంటఁనిడుకొని, మందలను మరలించుకొని, 'ఇలమండ్ల' యను గ్రామమునకుఁ బోయినాఁడు. ఇట నిసకలూరిపేటలోని నారాయణమ్మ తన తలిదండ్రులతోఁ దాను తాతగారింటికి వెడలుచుంటినని చెప్పి, అలంకరించుకొని, తన యాభరణముల నన్నింటిని ధరించుకొని, బయలుదేరి ఓటిగడ్డ మిట్టలకు వచ్చినది. అచట 'మందలోడు' లేకపోఁగా, గాడిద మందలు పోయిన మార్గమును బట్టి ఇలమండ్లకుఁ జేరినది. భయపడుచున్న 'మందలోడి'కి ధైర్యము చెప్పి, వానికి భార్యయై మందులవారిలోఁ గలసిపోయినది.

నారాయణమ్మ తండ్రియగు రామానాయఁడుగారు మందల వానిపై 'కేసు' పెట్టినారు. కాని 'కోర్టు'లో విచారణ జరుగుచున్నప్పుడు నారాయణమ్మ మందులవాని దేమియును తప్పులేదనియుఁ, దానే

యిష్టపడి యతనితో నుంటిననియు సాక్ష్యమిచ్చెను. రామానాయని గారి 'కేసు' నెగ్గలేదు. చేయునదిలేక ఆయన 'హీరకుండలము'న నొక 'దాబా'ను గట్టించి, కూఁతురికిచ్చెను. ఆ యింటికి 'సంజీవికొండ' యని పేరుపెట్టి, నారాయణమ్మ యా మందుల వానితోఁ గాపురము చేయుచున్నది. (వీరు నేఁటికిని –1966 నాటికి– హీరమండలమునఁ గలరు.)

ప్రబంధములవలె సాఁగు హరిహరీ పదములను పాడు జముకులవారిచేఁ జెప్పఁబడుచుండుటచేఁ గాఁబోలు నీ కథలోఁ జిక్కని కవితారసము జాలువారుచున్నది. ఈ కథా ప్రారంభ మెంత రమ్యముగ నున్నదో చూడుఁడు:–

*"మందలోడా! ఓరి మాయలోడా!*
*సిన్నవాడా! ఓరి సిన్నవాడా!* ॥మంద॥

*పొద్దు పొద్దున లేసి పొద్దున్నె లేసి నాడురా* ॥మంద॥
*పాపేడి సెట్టెక్కి పలుదోము తీసినాడురా* ,,
*ముచ్చాల రాయిమీద మునిపల్లు తోమినాడురా* ,,
*వజ్రాల రాయిమీద వాన్నీళ్లు తీసినాడురా* ,,
*మూడు ముంతల నీళ్లు మునిమొకము కడిగినాడురా* ,,
*సెంబుదు నీళ్లల్లో సెయ్యి జబ్బ కడిగినాడురా* ,,
*నిలువు టద్దములోన నీడలే సూసినాడురా* ,,
*ఎర్రపంచొకటి పాగలే సుట్టినాడురా* ,,
*మందులా కావిడీ బుజమానుకున్నాడయా* ,,
*పందుల దుడ్డొకటి సేతనే పట్టినాడురా* ,,
*నాగ సరసు కాయ నోట నాదించినాడురా* ,,
*పంచమా రాగాలు వొంచొంచి పాడినాడురా* ,,
*ఎండి పిడినీ కర్ర ఏళ్ల సందించినాడురా* ,,
*కృష్ణావతారాలు ఎంచెంచి పాడినాడురా* ,,
*ఇసకలోడిపేట గ్రామాని కెళ్లినాడురా* ॥మంద॥"

ఈ కథ మిక్కిలి అర్వాచీనమైన దగుటచేఁ గాఁబోలు 'కరంటు' 'రిపోర్టు', 'కోర్టు' మున్నగు నాంగ్ల పదములెన్నియో ఇందు దొరలినవి. 'మందలోడు' నారాయణమ్మకు మరులమందు నిచ్చు సందర్భము చక్కగా వర్ణింపఁబడినది:–

*"ధాతువును సూసేడు మాతరేశాడమ్మా*
*సిక్కుదాకుల పసరు శిరసు కేసినాడురా*
*ఎడమ సేతికి మంచి రచ్చొకటి కట్టాడురా*
*అరవైయారు దుంపాలు ఏగమే దీశాడయ్యా*
*గాడిద పాలైనా ఏగమే పిండాడయ్యో*
*వేడు మాత్తర్లు వేక పుటము సేశాడయ్యో*
*కాకరాకుల పసరు కాటుకలు సేశాడేమో*
*మరులకాటుక తీసి కలుపుడు సేసినాడురా*
*కాటుక పెట్టినాడు కరంటు లాగినాడురా*
*మరుల మాతరతోను మనసే యిరిసినాడురా"*

వెనుకఁబడిన ప్రాంతముగా భావింపఁబడుచున్న శ్రీకాకుళ మండలమునఁ బ్రశస్తమగు వీరగాథలున్నవనుటకు ఈ 'మందలోడు కథ' ప్రబలమగు తార్కాణము.

## 3. జానపదములు (Folk Ballads)

బొబ్బిలివరుస కథలలోఁ జారిత్రక సాంఘికేతివృత్తములే అధికముగా నున్నను, కొన్ని కల్పిత కథలు కూడఁ గానవచ్చుచున్నవి. జానపదులకు అద్భుత రసమునందు అభిరుచి యెక్కువగుటచే నిట్టి కల్పిత కథల నల్లుకొనుచుందురు. చారిత్రక సంఘటనలోఁ గల్పనలెక్కువగాఁ బ్రవేశించుటచేఁ గొన్ని చారిత్రక కథలుకూడ జానపదరూపము నందియుండవచ్చును. బాలనాగమ్మ కథ, బంగారు తిమ్మరాజు కథ యిట్టివే. గాంధారి కథ, కాంభోజరాజు కథ, కమ్మవారి పడతి– పసల బాలుని కథ, ఎలనాగిరెడ్డి కథ, రక్తకొమారుని కథ, రత్నాంగి కథ– మున్నగునవి సంపూర్ణ జానపద కల్పనాజన్య వీరగాథలకు ఉదాహరణములు. ఇందు మొదటి మూఁడును ముద్రితములు, తక్కినవి నేను సేకరించిన మౌఖికగాథలు. సి.పి.బ్రౌనుదొరగారు క్రీ.శ. 1843 ఆగష్టు 17వ తేదిని నిరక్షరకుక్షియగు నొక కాఁపువాఁడు పాడుచుండఁగా 'బాలవిక్రమార్కుని పెండ్లికథ' యను దానిని సేకరించినారు. ఇది మదరాసు ప్రా.లి.పు.భా.లో గలదు (కాగితపుఁ బ్రతి డి.నెం. 2549). ఇది కూడ జానపద వీరగాథయే. కాశీమజిలీ కథలు, భట్టివిక్రమార్కుని కథలు, మదనకామరాజు కథలు మున్నగునవి వచనరూపమున నున్న జానపదకథలు. ఇవి అద్భుతరస ప్రధానములు. ఇట్టి వచనకథలను గూడఁ గొందఱు జంగములు రగడలుగా మలఁచుకొని, తంబుఱ గుమ్మెతలతోఁ బాడుచున్నారు.

### 3.1. గాంధారి కథ:–

గాంధారికథ అతి ప్రసిద్ధమైనదే కాక అతి ప్రాచీనమైన కథగాఁ గూడఁ గాన్పించుచున్నది. కొమార రాముని కథను రచించిన కవియే దీనినిగూడ రచించియుండును. రెండింటి ప్రారంభము నొకేలాగునఁ గలదు. ఇది మొదట కుమారరాముని కథ వలెనే ఆద్యంతమొకే ఛందస్సులో నుండియుండును. తరువాత కొందఱు దీనిలో దరువులు కీర్తనలు ప్రవేశపెట్టిరి. ఇట్లు దరువులు కీర్తనలు ప్రవేశపెట్టఁబడిన గ్రంథము క్రీ.శ. 1893లో నేలటూరు వెంకట సుబ్బశాస్త్రులుగారిచేఁ బ్రకటింపఁబడినది. అందుఁ బూర్వకవి రచనగా నీ కథ పేర్కొనఁ బడెను. దీనికిని బాలనాగమ్మ కథకును గొన్ని సంవాది రచనలున్నవి. దీని పూర్వరూపము బొబ్బిలికథవంటి యేకచ్ఛందమే యనుటకు మఱియొక ప్రబల తార్కాణమున్నది. గాంధారికథకు రెండు వ్రాఁతప్రతులు మద్రాసు ప్రా.లి.పు.భా.లో గలవు (డి.నెం. 2518, 2519).

ఈ రెండు ప్రతులలోను నాద్యంత మొకే ఛందస్సు గలదు. కీర్తనలు, దరువులు లేవు.

వాలుగొండ పట్నమేలు మంధాతరాజునకు 'సోయితరాజు' అను కొడుకును, 'పద్మగంధి' యను కూఁతురును గలరు. పద్మగంధి తారశిల పట్టణమేలు వశపతిరాజు భార్య. ఆమెకు గాంధారియను పుత్రిక పుట్టెను. ఈ గాంధారిని తన సోదరుఁడగు సోయితరాజున కిచ్చి పెండ్లి చేయవలెనని పద్మగంధి తలంచెను. కాని గాంధారి కది యిష్టములేదు. ఆమె తన మేనత్త కొడుకు 'బాలరాజు'ను ప్రేమించెను. బాలరాజుతల్లి (అనఁగా వశపతిరాజు సోదరి) వేడుక రామక్క, తండ్రి గాండీవరాజు. వీరిది సుందరగిరి పట్టణము. గాంధారి బాలరాజులు చిన్నతనమునుండియుఁ గలసిమెలసి తిరుగుచు, నొకేచోటున విద్యాభ్యాసము చేసిరి. గాంధారి మంత్ర తంత్ర విద్యలెన్నియో నేర్చెను. వాని ప్రభావముచే మేనమామయగు సోయితరాజును దిరస్కరించి, తాను ప్రేమించిన బాలరాజును వివాహమాడెను.

'తందానతానె' యనునది దీనిలోని పల్లవి. జంగంకథలలోని రగడ వంటిది యిందులేదు. కావున దీనిని జంగంకథగాఁ బేర్కొనరాదు. ఇది 11-12 శతాబ్దములకుఁ జెందిన రచన యని హరి ఆదిశేషువుగారు తలంచుచున్నారు. శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావు గారు గాంధారి కథ క్రీ.శ. 1300 ప్రాంతపు రచనమనియు, దీనిలోని గాంధారిపాత్ర కాకతీయ రాజ్యమునేలిన రుద్రమదేవి యనియు నభిప్రాయపడిరి. డా॥ బి.రామరాజుగారు గాంధారికథయొక్క ప్రాచీనత నంగీకరించియు, విస్పష్టాధారము లేవియు లేకుండ నిట్టి ఊహలు సేయుట తగదని నిరసించిరి.

## 3.2. కాంభోజరాజు కథ:-

అద్భుత విషయములకు, అమానుష చర్యలకు నాలవాలమైనది కాంభోజరాజు కథ. ఈ కథలో వచ్చు కాంభోజ కర్నాట శబ్దములు, కథాస్థలము, నాగులు, రాక్షసులు, దాసులు, రామలింగస్వామి ప్రతిష్ఠ, నరమేధము, గ్రామనామము, సాంఘిక పరిస్థితులు- మున్నగు వానిని బట్టి టేకుమళ్ల కామేశ్వరరావుగారు దీనిని క్రీ.పూ. ఒక వేయి సంవత్సరముల నాఁటి కథగా నిర్ణయించి యున్నారు (చూ. గృహలక్ష్మి జూన్, సెప్టెంబరు సంచికలు- 1954). కాని, కాలము, కథారంగము కవిప్రసక్తి మున్నగునవి జానపద సాహిత్యమున నంతగా లెక్కింప దగినవి కావని రామరాజుగారు తలంచుచున్నారు.

ఇది యద్భుత విషయములతోఁ గల్పించిన కథ. సవతుల ఈర్ష్యాద్వేషములు, అన్నదమ్ముల అసూయలు, బోగము రంగసాని టక్కు టమార విద్యలు, గచ్చాకు పుచ్చాకు వైద్యములు, వీరభద్రుని యుత్సవములు, జంగమార్చనలు, మాటాడెడి నిర్మలమందు, సముద్రములను దాటెంచెడి కీలుగుఱ్ఱము, సంతులిచ్చెడి వ్రతములు- మున్నగునవి యీ కథలో కొల్లలుగా నున్నవి. జానపదులలో మిక్కిలి ప్రచారముందున్న వీరగాథలో నిదియొకటి.

ఈ కథను జంగం సుబ్బయ్యదేవర రచించినట్లు తెలియు చున్నది. దీని గుజిలీప్రతులు లభించుచున్నవి. ఇది చక్కని తందాన వరుసలోనున్న కథ. ఇందుఁ బలురకములు తందానవరుస లున్నవి. నేఁటి బుఱ్ఱకథలలో వినఁబడు తదానవరుస లన్నియును కాంభోజ రాజుకథలోని వరుసల కనుకరణములే. ఈ కథలలో నెక్కువ భాగము 8+8 మాత్రలొక పాదముగా సాఁగినది.

## 3.3. పసల బాలుఁడు కథ లేక బాలరాజు కథ:-

కిన్నెర నాగయ్య కొడుకు వీరాస్వామి రచించిన 'కమ్మవారి పణతి- పసల బాలరాజు కథ' అనునది యొకటి నేఁడు గుజిలీ ప్రతిగా లభించుచున్నది. గాంధారికథవలెనే ఇదికూడ బొబ్బిలివరుస కథనుండి జంగంకథగా మార్చబడినట్టిది. ఇందు కీర్తనలు దరువులు లేవుకాని, పద్యములు వచనములు గలవు. ఈ జంగంకథకు మూలమగు బొబ్బిలివరుసకథ 'కమ్మవారి పడతి' యను పేరఁ గలదని శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు చెప్పుచున్నారు (చూ. కిన్నెర, డిసెంబరు 1953, పుట 556). ఇది నాకు లభింపలేదు. 'పసలబాలుడు కథ' లేక 'బాలరాజు కథ' యను పేరుతో గాథాకారులు దీనిని బాడుచుండగా మాత్రము వింటిని. కిన్నెర వీరాస్వామి జంగం కథారచన మెచ్చఁదగినదిగా లేదు. ఇది గాంధారికథకు అనుకరణము.

మహానందిని బాలించు కలికిరాజునకు నాగేటి చాలులో నొక బాల లభించెను. ఆమెకు 'సీత' యని పేరు పెట్టెను. ఆమె యాదేరి పశువులను మేఁపు వెలమదొరబిడ్డ బాలరాజును ప్రేమించినది. కాని ప్రేమయన నేమియో తెలియని బాలరాజు ఆమెను జూచి భయపడెను. సీతను వదలించుకొనుటకై యెన్నియో అసాధ్యమగు కార్యములను జేయుమనెను. ఆమె తన పాతివ్రత్య మహిమచే నవి యన్నియు నవలీలగాఁ జేసినది. దానితో నా సీత మంత్రకత్తెయని బాలరాజు మఱింత భయపడసాఁగెను. ఒకప్పుడు బాలరాజు ఆమె దగ్గఱనున్న నగలు తీసికొని కోమటింటికిఁ బోఁగా నా కోమటి యాతని హస్తమును ఖండిచెను. ఆ బాధతో నా బాలరాజు దగ్గఱలోనున్న ఆకుతోటలోనికిఁ బోఁగా, నక్కడి కాఁపులతనిని దొంగయని తలంచి చంపివైచిరి. సీత తన ప్రియుని వెదకికొనుచు వచ్చి, అతనితో సహగమనముచేసి, శాపవిమోచనము నందినది.

సాంఘికగాథయే కల్పనలు చేరుటచే నిట్లు జానపదగాథగా మాఱెనని నా యభిప్రాయము. దీని శీర్షికయే మన కీ రహస్యమును జెప్పుచుననది. సీత కమ్మవారి యాడుబిడ్డ. ఆమె పశువులనుగాయు వెలమయువకునిఁ బ్రేమించి, ఆతనితో వెడలిపోయినది. అనేక కష్టములుపడి, కడకాతనితో సహగమనము చేసినది. కల్పనలను దీసివేసినచో నిది చక్కని పేరంటాలుకథ కాఁగలదు. ఈ కథ 1948లో 'బాలరాజు' అను పేరుతోఁ జలన చిత్రముగాఁ దీయఁబడి బహుజనాదరణ పాత్రమైనది.

### 3.4. 'బాలవిక్రమార్కుని పెండ్లికథ':-

ఇది బ్రౌను సేకరించిన వ్రాఁతప్రతి. బలభద్రరాజు తృతీయ కుమారుఁడగు బాలవిక్రమార్కుఁడు అనేక శ్రమలకోర్చి, మైలాపురాధీశ్వరుఁడగు దేవేంద్రగిరిరాజు కుమార్తెయగు మగువ మద్దిరేనిని వివాహమాడు కథ యిందు వర్ణింపఁబడినది. ఇది జానపద కల్పిత గాథ. దీని ప్రారంభమిట్లుండును:-

*"శరణు శరణు ఓ రామ శరణయ్య రామా, ఆ. ఆ.*
*మేలుకో మేలుకో అక్క నలగంగ*
*ఇంతంత నీ బొజ్జ యిత్తళి జలపోతా*
*కాసంత నీ బొజ్జ కంచు జలపోతా*
*నీ బొజ్జ కేమి ఆరగింపులోయి యినాయకా!*
*కొండనెల్లికూర గోవుల మజ్జిగ నెట్టగల్ల టెంకాయ*
*నెయ్యి నీ కారగింపులు అక్క నలగంగా!*
*..............................................*

ఈటి పాయక పంద్రెండామడ బలభద్రరాజు పెండ్లాము చుక్కల సూర్యకాంతి. ఆ చుక్కల సూర్యకాంతికి ముగ్గురు కొమాళ్లు, చిన్నవాడి పేరు చినసోమినాయుడు, పెద్దోడి పేరు పెదసోమి నాయుడు, కడగోటివాడి పేరు బాలవిక్రమార్కుడు. ఆ. ఆ."

కాటమరాజుకథలలో వలె నిందు వంతలు 'ఆ' కొట్టుట కలదు. కావున దీనిని 'ఆకపద'మని పిలువవచ్చును.

### 3.5. ఎలనాగిరెడ్డి కథ:-

ఇది యొక అద్భుత కాల్పనిక గాథ. దీనిని రాయలసీమలోఁ బిచ్చుకుంట్లు పాడుచున్నారు. ఇది యెనిమిది రాత్రులు పాడఁబడు సుదీర్ఘ కథనముతో నొప్పుచున్నది. ఎలనాగిరెడ్డి యను మోటాటి కాఁపు యువకుఁడు శ్రీశైల మల్లికార్జునస్వామి కరుణచే ననేక కష్టములను గడచి, కల్యాణపట్టణమును జయించి, దారిద్ర్యముతో బాధపడుచున్న తన సోదరులను తలిదండ్రులను రాజకుటుంబముగా మార్చుట ఇందలి కథాంశము. ఇందెన్నియో అభూత కల్పనలున్నవి. శైవమత ప్రశంస యెక్కువగా నున్నది. పిచ్చుకుంట్లు దీనిని తంబుఱతోను, చిన్న చిన్న కంచు గుమ్మెతలతోను బాడుచుందురు. తందాన వరుసలలో నీ కథ సాఁగును. కర్నూలు జిల్లా, నందికొట్కూరు తాలూకా, 'చెలిమళ్ల రుద్రవరము' గ్రామములోఁ బిచ్చుకుంట్ల చిన్న నాగన్న యనునతఁడు పాడుచుండఁగా నేనీకథను వ్రాసికొంటిని (20-4-1966). దీని ప్రారంభమిట్లుండును:-

| | |
|---|---|
| *"అబ్బిరెడ్డి ముద్దమ్మ కొడుకులూ* | *తందానా తందాన తందనా* |
| *ఏడుమంది వాళ్లన్నదమ్ములూ* | ,, |
| *తిందామంటే తిండి లేదుగా* | ,, |
| *కడదామంటే వస్త్రము లేదు* | ,, |
| *నిఱుపేదలూ కాపులున్నరూ* | ,, |
| *...............................* | *తందానా తందాన తందనా"* |

ఎలనాగిరెడ్డి శివునిఁ బ్రార్థించి, చచ్చిన పొట్టేలును బ్రతికించి, దానిని గల్యాణపురి పట్టణముపై వదలెను. ఆ పొట్టేలు సైనికులను జంపుచుఁ గోటలను బగులఁగొట్టుట వీరరసస్ఫూర్తితో వర్ణింపఁ బడినది. (8+3 మాత్రలొక పాదముగా సాఁగినది.)

| | |
|---|---|
| *"భళారాను భళ నేడు* | *తందన తందన తానో* |
| *సచ్చినట్టి పొటేలీ* | ,, |
| *ఉరమటించి లేచేర* | ,, |
| *పొటేలీకి దైవమా* | ,, |
| *జానేడూ జానేడు* | ,, |
| *దాని రోమమున్నాది* | ,, |
| *నాల్గు కాళ్లు తెలుపూర* | ,, |
| *నడినెత్తిన సుక్కార* | ,, |
| *తోకరా పూదోక* | ,, |
| *పంచదీర కల్యాణి* | ,, |
| *జింక కొమ్ములా రీతి* | ,, |
| *దాని కొమ్ము లున్నాయి* | ,, |
| *రోహిణి వాండ్ల దండోయి* | ,, |
| *అరబ్బీల దండోయి* | ,, |
| *పొదసండీ పొదసండి* | ,, |
| *నరకండీ నరకండి* | ,, |
| *రోహిణి వాండ్ల దండూను* | ,, |
| *పొటేలు సూసింది* | ,, |
| *ఎడమ తట్టు మందీని* | ,, |
| *కుడితట్టుకు వొలి పేర* | ,, |
| *ఎనికి పర్వడి సేత* | ,, |
| *ఏడడుగు లొచ్చేర* | ,, |
| *జక్కించి తగిలేర* | ,, |
| *కాళ్లు విరిగి నోళ్లోయి* | ,, |
| *చేతు లిరిగి నోళ్లోయి* | ,, |
| *తలలు పగిలి నోళ్లోయి* | ,, |
| *ఏడు పొరాల మంది* | ,, |
| *పారి పారి పోతారు* | ,, |
| *భళే-కంచుకోట కొచ్చేర* | ,, |
| *కోటకెళ్లి జూసింది* | ,, |
| *ఎనక పర్వడి చేత* | ,, |
| *ఏడడుగు లొచ్చింది* | ,, |
| *ముందు పర్వడి చేత* | ,, |

| | | |
|---|---|---|
| మూడడుగు లొచ్చింది | ,, | |
| ఒరేయ్–జక్కించి ఎగిరేరా | ,, | |
| కోట ఎగిరి ధుంకింది | ,, | |
| కళియ కోట కొచ్చేర | ,, | |
| కోట ఎగిరి ధుంకింది | ,, | |
| ఇత్తడి కోట కొచ్చేర | ,, | |
| కోట ఎగిరి ధుంకింది | ,, | |
| ఇజయ కోట కొచ్చేర | ,, | |
| కోట ఎగిరి ధుంకింది | తందన తందన తానో" | |

## 3.6. రక్తకొమారుని కథ:–

ఇది తెలంగాణములో వ్యాప్తియందున్న వరినాటు పాట. ఇది 'చుట్టు కాముఁడు పాట'గాఁ గూడఁ బాడఁబడుచున్నది. వెన్నెల రాత్రులలో గ్రామీణస్త్రీలు గుండ్రముగాఁ దిరుగుచుఁ, జప్పట్లు చఱచుచు, నొకసారి లేచి, మఱియొకసారి వంగి పాడు పాటలను దెలంగాణమునఁ జుట్టు కాముఁడు పాటలందురు. ఈ పాటను నేను 1966 జూలై నెలలో నల్లగొండ మండలమున సంపాదించితిని.

ధర్మాంగ పట్టణమునేలు ధర్మాంగరాజునకుఁ బద్మావతి యను భార్యయందు లేక లేక శివుని వరమున రక్తకొమారుఁడను బాలుఁడు జన్మించెను. అతనికి 'గిరియావతి' యను కన్యనిచ్చి పెండ్లి చేసిరి. ఆ రాజొక బావిని ద్రవ్వింపఁగా దానిలో నెంతకును నీరు పడలేదు. బ్రాహ్మణుల నడిగి దానికి నరబలి కావలయునని తెలిసికొనెను. ఆ రాజు తనకన్న కుమారుని బలినీయఁ జూచును. తల్లి ఆ బాలునిఁ దప్పించి, ఱెక్కల యశ్వమునిచ్చి అరణ్యములకుఁ బంపివేయును. ఆ బాలుఁడు భార్యతోఁ గూడి అరణ్యములకుఁ బోయి అనేక కష్టము లనుభవించెను. అడవిలో భార్యదొకదారి, తనదొకదారి యగును. గర్భవతియగు గిరియావతి చెంచువాడలోఁ బెరుగుచు, 'శివకుమారు'నిఁ గనును. ఒక రాక్షసుఁడు రక్తకొమారుని రూపమున వచ్చి, గిరియావతిని బలాత్కరింపఁ బోవును. శివకుమారుఁడా రాక్షసునిఁ జంపి, తల్లిదండ్రులను గలుపును. అందఱును గలిసి ధర్మాంగ పట్టణమునకుఁ బోవుదురు.

జానపదస్త్రీలు పాడుపాట యగుటచేఁ జక్కని కవిత్వము, ప్రసన్నమగు శైలి, అద్భుత కల్పనలు నీ కథలో నడుగడుగునను సాక్షాత్కరించును. ఇది ఊయలపాట. అనఁగా ద్విపదచ్ఛందమునను, ఖండగతియందును సాఁగు రచన యని యర్థము. అయినను వీరరస ప్రధానమైన ఇతవృత్తమునుబట్టి దీనిని బొబ్బిలివరుస కథలలోఁ జేర్చితిని. బొబ్బిలివరుస కథలనఁగా ఛందస్సునందుఁగాని, ఇతివృత్తము నందుఁగాని బొబ్బిలియుద్ధకథను బోలియుండునని గ్రహింపవలెను. రక్తకొమారునికథ ఈ క్రింది విధముగాఁ బ్రారంభమగును:–

| | | | |
|---|---|---|---|
| "రామ రామా రామ–ఉయ్యాలో– | శ్రీరామ రామా– | | ఉయ్యాలా |
| ఆదిపట్నపు రామ | ,, | అయోధ్య రామా | ,, |
| ధర్మాంగ పట్నాన | ,, | ధర్మాంగుడను రాజు | ,, |
| సంతు లేకా రాజు | ,, | సాల సిన్నా బోయె | ,, |
| తిరపతీ దాకనే | ,, | నోమెనే ఆ రాజు | ,, |
| తిరపతిలో ఎత్తించె | ,, | దివ్వెనే స్తంభాలు | ,, |
| కాశి నీ దాకనే | ,, | నోమెనే ఆ రాజు | ,, |
| కాశిలో ఎత్తించె | ,, | గరుడా స్తంభాలు | ,, |
| అందునా సంతానం | ,, | అందకా పాయెనే | ,, |
| అన్ని నోములు నోమి | ,, | ఆ సక్కనీ తల్లి | ,, |
| ఏడ్సి ఏడ్సీ తల్లి | ,, | యాష్టలూ పడెనే | ఉయ్యాలా" |

పద్మావతీదేవీ ఈశ్వరుని కృపవలన గర్భిణి కాఁగా నామె కోరికలను జానపద స్త్రీలు ఎంత మధురముగా నూహించిరో చూడుడు:

| | | | |
|---|---|---|---|
| "ఒక్కొక్క గడియకూ– | ఉయ్యాలో | ఓకిరింతా లాయె– | ఉయ్యాలా |
| రెండో గళ్లకూ | ,, | రోతల్లు పుట్టెనే | ,, |
| మూడో గళ్లకూ | ,, | ములక పండ్లూ అడుగు | ,, |
| నాలుగో గళ్ళకూ | ,, | నానబియ్యా మడుగు | ,, |
| అయిదో గడియకూ | ,, | అరటి పండ్లూ అడుగు | ,, |
| ఆరో గళ్లైన | ,, | దగ్గరొచ్చీనాయి | ,, |
| ఏడో గడియకూ | ,, | ఎలగ పండ్లూ అడుగు | ఉయ్యాలా" |

భర్త, కుమారునిఁ జంపనున్నాఁడని తెలిసి పద్మావతీదేవి, రక్తకుమారునకు ఱెక్కలయశ్వము నిచ్చి రాత్రివేళ పంపెను. ఆ యర్ధరాత్రి వర్ణనము, ఆ ప్రయాణ వర్ణనము నెంత రమ్యముగా నున్నవో చూడుడు:–

| | | | |
|---|---|---|---|
| "అద్దమ్మ రేత్తిరీ– | ఉయ్యాలో– | నిద్ర పొద్దూ ఏళ– | ఉయ్యాలా |
| కలికీ గాంధారి | ,, | మాంధారి ఏళా | ,, |
| బావుల్లో నీళ్లు | ,, | తొణకన్ని ఏళా | ,, |
| పసిబిడ్డ పాలు | ,, | సీకన్ని ఏళా | ,, |
| బయదెల్లినాడు | ,, | రక్త కోమారుడు | ,, |
| సీమల్లు దూరనీ | ,, | సిట్టడవి లోనా | ,, |
| కాకులూ దూరనీ | ,, | కారండ పడవిలో | ,, |
| గద్దలూ దూరనీ | ,, | పెద్దడవి లోనా | ,, |
| అద్దాన పడవిలో | ,, | సెత్రీ మజ్జాన్న | ,, |
| గజ్జ గోరిందలూ | ,, | కలదాటినాడు | ,, |
| ఒద్దులూ మారేళ్లు | ,, | దాటెనే బాలుడూ | ఉయ్యాలా" |

రక్తకొమారుని పుత్రుఁడగు శివకుమారుఁడు 'తల్లి కోసిన బొడ్డు తడియారకుండనే' పెద్దపులిని జంపినాఁడఁట. ఇట్టి లోకోత్తర వర్ణనలు పలుకుబళ్లు ఈ కథలో కొల్లలు.

## 3.7. రత్నాంగి కథ:–

ఇది రాయలసీమలో జానపదస్త్రీలు పాడు వరినాటుపాట. దీనిని కర్నూలు మండలమున సంపాదించితిని. ఇది కూడ ఉయ్యాల వరుసలోనే కలదు:–

**"తూర్పునా వున్నాడు ఉయ్యాలో– తుల్లాన రాజమ్మ – ఉయ్యాలా**
**పరమటా వున్నాడు ,, బల్లాన రాజమ్మ ,,**
**బల్లాన రాజుకూ ,, ఎందరే కొడుకులూ? ,,**
**ఎందరో ఎక్కడిది ,, ఒక్కడే శంకరుడు ,,**
**తుల్లాన రాజుకూ ,, ఎందరే బిడ్డలూ? ,,**
**ఎందరో ఎక్కడిది ,, ఒక్కతే రత్నాంగి ,,**
**ఎంచంగ పెంచంగ ,, ఏడేండ్ల బాలాయె– ఉయ్యాలా"**

ఈ విధముగాఁ బ్రారంభమగు భల్లాణరాజు కొడుకు శంకరునకును తుల్లాణరాజు కుమార్తెయగు రత్నాంగికిని వివాహమయ్యెను. శంకరుడు వర్తకమునకై యోడలో దూరదేశములకుఁ బోయెను. ఇక్కడ రత్నాంగి పెరిగి రజస్వలయయ్యెను. ఆ రోజు బ్రహ్మదేవుఁడామెకుఁ బ్రత్యక్షమై "ఈ రాత్రి నీ భర్తతో నుండుము. నీకు ముత్యాల కొడుకు పుట్టును. లేనిచో నీవరణ్యమున బ్రమానుగా నయ్యెదవు. నరులు నిన్ను నఱికి వేయుదురు" అని చెప్పెను. సముద్రముల కావలనున్న శంకరుఁ డెట్లు వచ్చును? అందుచే రత్నాంగి యేడ్చుచుండెను. ఆమె శోకమును 'ధర్మనే పక్షులు' విని, శంకరుని కడకుఁబోయి, తమఱెక్కలపై నాతని నెక్కించుకొని రత్నాంగి కడకుఁ దెచ్చెను. శంకరుఁడు మూఁడు రోజులు రత్నాంగితో రహస్యముగా నుండి, తిరిగి సముద్రాల కావలకుఁ బోయెను. రత్నాంగి గర్భవతి యయ్యెను. అత్తమామలామెను శంకించి, యింటినుండి తఱిమి వేసిరి. ఆమె పుట్టింటికిఁ బోఁగా నట తండ్రి కూడ నాశ్రయమీయలేదు. అప్పుడు రత్నాంగి 'ఉలియంద' పట్టణము నకుఁ బోయి, అక్కడ ముత్యాల కుమారునిఁ బ్రసవించినది. ఆమెకుఁ బురుడు పోసిన దాసి ముత్యాల కుమారునిఁ గోనిపోయి, ఆ పట్టణమేలు రాజుగారి భార్య ప్రక్కలోనుంచి, అదే సమయమున నామెకుఁ బుట్టిన మొద్దురామునిఁ దెచ్చి రత్నాంగి ప్రక్కలోఁ బరుండఁ బెట్టెను. రత్నాంగి చేయునది లేక దుఃఖించెను. ఇంతలో శంకరుఁ డు దూరదేశములనుండి తిరిగి వచ్చి రత్నాంగిని వెదకుచుండెను. అతనికి గంగ ప్రత్యక్షమై రత్నాంగి ఉలియంద పట్టణములోఁ గలదని చెప్పఁగా నతఁడు సాధువేషమున వచ్చి భార్యను గలిసికొనెను. ఆ యూరి రాజుతోఁ దమ కుమారునిఁగూర్చి శంకరుఁడును రత్నాంగియును 'ఫిర్యాదు' చేసిరి. ఆ రాజు రత్నాంగి ముందు ఏడు తెరలు అడ్డము కట్టించి, ఆ యేడుతెరల చాటున నిరువురు బాలుర నుంచెను. రత్నాంగి చనుబాలు పొంగి ముత్యాల కుమారునిపైఁ బడెను. ఆ బాలుఁడు రత్నాంగి కొడుకేయని రాజు నిశ్చయించి వారి బాలుని వారికిచ్చివేసెను. ఆ బాలునిఁ దీసికొని భార్యాభర్తలు తమ భల్లాణ పట్టణమునకేఁగి సుఖముగ నుండిరి.

'ఎంచంగ పెంచంగ ఏడేండ్ల బాలాయె'– 'మా కొడుకు వస్తేను మా తలలు పోతవి'– 'అత్తకు కానపుడు మనకందువౌతాదా?'– 'గోదు గోదున తల్లి గోడాడ సాగింది'– మున్నగు పలుకుబడులకు ఈ కథ కాణాచి.

## 3.8. ఇతర కథలు:–

తెలంగాణలో నల్లగొండ మండలమున స్త్రీలు వరినాటు పాటలుగాను, చుట్టుకాముఁడు పాటలుగాను బాడుచున్న 'నులిచుక్క కథ', 'నీలవర్ణుని కథ' మున్నగునవి కూడ జానపద వర్గమునకుఁ జెందిన వీరగాథలే. ఇట్లు జానపదులు కల్పించుకొనిన కథలకుఁ దోడు, కృష్ణా గోదావరీ మండలములలోఁ గాశీమజిలీ కథలు గూడ జంగములు బొబ్బిలివరుసలోఁ దంబుఱ గుమ్మెతలపైఁ బాడి వినిపించుచున్నారు. అట్టి కథలలోఁ గొన్ని పేర్లు– "విజయభాస్కర మహారాజు కథ, రాజహంస కథ, బుద్ధిసాగరుఁడు– కాంబాలుఁడు కథ, సముద్రవీరుఁడు కథ, నవకళకాంతుఁడు కథ, నల్లగులాబి కథ, పగడవృక్షం కథ, పగిడవరాజు – చంద్రపరాజు కథ, నవ్వితే నవరత్నాలు కథ, సాగరకన్య కథ, గగన వీరుఁడు కథ, గాంభీరుఁ డు– నరహరుఁడు కథ, నూఱు చిలుకల కథ, మన్మథాశీలు మహారాజు కథ, తీగనెంబరు చిన్నదాని కథ, చేప నవ్విన కథ, తాబేలురాజు కథ, నాగరాజు కథ, సంతు వసంతరాజు కథ, పురద్దేశిణి కథ, వరప్రసాదుని కథ, అపూర్వచింతామణి కథ, అదృష్టదీపుఁడు కథ, సూర్యప్రతాపుఁడు కథ, గులేబకావళి కథ, మృగరాజు కథ" మొదలగునవి పెక్కు గలవు. పశ్చిమ గోదావరీ మండలమున పాలకొల్లు సమీపమునఁగల 'చించినాడ' గ్రామములోని టేకి కోటేశ్వరరావు అను జంగమును, కృష్ణామండలమున, కైకలూరు తాలూకా, మండవల్లి దగ్గఱ 'కుమ్మర్ల గన్నవరము' అను గ్రామములోని ఇంగువ వెంకటస్వామి యను జంగమును పై కాశీమజిలీ కథలన్నింటిని బొబ్బిలివరుస కథలుగాఁ బాడుచుండఁగా నేను వింటిని (1963–64). వచనములోనున్న మదనకామరాజు కథలను, భట్టి విక్రమార్కుని కథలను గూడ జంగములు ఆశువుగా రగడలలోనికి మార్చి పాడుచున్నారు (మదనకామరాజు కథలను బొబ్బిలివరుస కథగాఁ బాడు జంగము తిరుపతియందే కలఁడు).

# 4. పౌరాణికములు (Mythological Ballads)

బొబ్బిలిపాట వరుసలోను, తద్భేదములలోను గొన్ని పౌరాణిక కథలు గూడ వినఁబడుచున్నవి. ఇట్టివానిలో 'వరాహావతార చరిత్రము' లేక 'పందికథ', రామకథాసుధార్ణవము, ఆండాళ్ చరిత్రము లేక శ్రీరంగ మాహాత్మ్యము, పెద్దకాపుగారి కథ, భారతకథాసుధార్ణము, ముద్రితములైన పౌరాణిక గాథలు. వేంకటేశ్వరుని కథ, మల్లిక దేవమ్మ కథ, జలాచంద్రుని కథ, కవిశాంభవరాజు కథ, పర్వతాల మల్లారెడ్డి కథ–మున్నగునవి నేను సేకరించిన పౌరాణిక గాథలు. మద్రాసు

ప్రా.లి.పు.భా.లో 'సారంగధర కథ' యను బొబ్బిలి వరుసలోనున్న కథ యొకటి గలదు. దీని రచయిత తూళ్లూరు మాధవరాయ కవి. ఇది తాళపత్రప్రతి – (ఆర్. నెం. 69). ఈ ముద్రితాముద్రిత పౌరాణిక వీరగాథల నన్నింటిని నాలుగు అంతర్విభాగములుగాఁ జేయవచ్చును. రామాయణ సంబంధములు, భారత సంబంధములు, శైవపురాణ గాథలు, వైష్ణవపురాణగాథలు. పై కథలలో రామకథాసుధార్ణవము రామాయణగాథయే. ఇది లాడె సుందర నారాయణగారి రచన. భారతకథాసుధార్ణవము భారతగాథ. దీని రచయిత నెమలిపురి రామస్వామి. ఇవి ముద్రితములు. అముద్రితములలో జలాచంద్రుని కథ, కవిశాంభవరాజు కథ భారత సంబంధమైనవి. జరాసంధుని కథయే జానపద వ్యవహారమున 'జలాచంద్రుని కథ' యైనది. ఇందుఁ గొన్ని కల్పనలున్నను మూలకథ జరాసంధుని పుట్టుక, భీమునితోఁ బోరాడి మరణించుట యను ఘట్టములతోఁ గూడినదియే. శ్రీకృష్ణుఁడు భీమార్జునులకు గర్వభంగము చేసిన కథయే కవిశాంభవరాజు కథ. ఇది భారత పాత్రలతోఁ గల్పించిన కథవలె నున్నది. మూల భారతములలో నీ కథ లేకున్నను, జానపదులలో నిట్టి కథలు పెక్కు గలవు (1964లో కృష్ణా మండలమున నొక పరిక ముగ్గులవాఁడు 'సహదేవుని పెండ్లికథ' యను వీరగాథను బాడుచుండగా నేను వింటిని). హరిదాసులు గూడ వీని వ్యాప్తికిఁ గారకులనవచ్చును.

మల్లిక దేవమ్మ కథ, పర్వతాల మల్లారెడ్డి కథ, కొమిరెల్లి మల్లన్న కథ, సారంగధర కథ– ఇత్యాదులు శైవపురాణగాథలు. ఇవి శ్రీశైల క్షేత్ర మాహాత్మ్యములు. వరాహావతార చరిత్రము, శ్రీరంగమాహాత్మ్యము, పెద్దకాపుగారి కథ, వేంకటేశ్వరుని కథ మున్నగునవి వైష్ణవపురాణగాథలు.

పురాణములు ప్రసిద్ధములు గావునఁ బై కథలను గూర్చిన వివరణ మనావశ్యకము. కాని వేంకటేశ్వరుని కథ, మల్లిక దేవమ్మ కథ, పర్వతాల మల్లారెడ్డి కథ– అను మూఁడింటను గొంత జానపద త్వము గనఁబడుచున్నది. ముద్రితములలో వరాహావతార చరిత్రము, పెద్దకాఁపుగారి కథ పేర్కొనఁదగినవి. కావున వీనిఁ గూర్చి క్లుప్తముగా వివరింతును.

## 4.1. వరాహావతార చరిత్రము:–

వీరశైవ–వీరవైష్ణవముల సంఘర్షణ మిందుఁ జిత్రింపఁబడెను. ఇది సర్వాయి పాపని కథ, చిన్నపరెడ్డి కథలవలె మంచి యుత్సాహమును గలిగించు నడకలో నున్నది. పాదమునకుఁ బదునాఱు మాత్రలు 8+8 గా నుండును. 'అభివర్ధిత పునరుక్తి' వంటి వీరగాథా లక్షణములు దీనిలో హెచ్చుగా నున్నవి. ఈ కథలో శైవ వైష్ణవ సంఘర్షణ తెలుపఁబడి, చివరకు హరిహరులకు అభేదము ప్రతిపాదింపఁబడినది. శ్రీశైలము, అహోబిలము కథారంగములు. వీరశైవుఁడగు భయ్యన్న లింగమును గూర్చిన వర్ణన చూడుఁడు:–

*"గుండుపల్లి భయ్యన్న లింగమూ*
*భటుడందే సామాన్యుడు కాదు*
*కూరుచుంటె ఒక గున్న చింత*
*లేచితేను ఒక తాటి పొడుగు*
*ఆజాను బాహువులు కలిగినవాడు*
*అతని పేరు భయ్యన్న లింగము"*

ఆదివిష్ణు స్వరూపమగు వరాహమును శైవభటు లిట్లు దూషింతురు:–

*"అత్తెరి నీయమ్మా ముండా*
*నగరికి వెళ్లు మనేటి దానవు*
*పరగడ దిరిగే మృగ జంతువూ*
*గరిక వేళ్లు నమిలేటి దానవూ*
*అడవులన్ని తిరిగెడి దానవు*
*బురదలోను పొర్లేటి దానవు*
*నీవు అనగా నీ ప్రతాప మెంత?"*

ఈ కథలో నీ వర్ణన పదే పదే వచ్చుచుండును. ఇది దీనిలోని వారానువర్తన (commonplace) మని చెప్పవచ్చును. వరాహమును గూర్చిన వర్ణన కూడ నిట్టి వారానువర్తనమే. ఇది స్త్రీలపాటగాఁ గూడఁ బ్రచార మందున్నది. రాయలసీమలో దీనిని పూసల బలిజవారు 'పందికథ' యను పేరుతోఁ బాడుచున్నారు. దీనికి గుజిలీప్రతులు విరివిగా లభించుచున్నవి.

## 4.2. పెద్దకాపుగారి కథ:–

ఇది కృష్ణా మండలమున వ్యాప్తియందున్న కథ. కాకినాడ మంగు వెంకట రంగనాథరావుగారు దీనిని 1911లో నొకసారి ముద్రించిరి. ఆ తరువాత దీనినెవ్వరును మరలఁ జేపట్టలేదు. రంగనాథరావుగారి ప్రతి రాజమండ్రి గౌతమీ గ్రంథాలయములోఁ గలదు. నేను మౌఖిక ప్రసరణమున నున్న గాథను సంపాదించితిని. కృష్ణా మండలమునఁ గైకలూరు తాలూకా 'కుమ్మర్ల గన్నవరము' అను గ్రామములో 6–9–1964న ఇంగువ వెంకటస్వామి యను జంగము పెద్దకాపుగారి కథను బాడఁగా విని వ్రాసికొంటిని.

కొమఱ్ఱూరు గ్రామములో 'పెద్దకాపు' అను విష్ణుభక్తుడుండెను. అతని భార్య ఆదిలక్ష్మి. అతనికిఁ బదునొకండుగురు సవతి తమ్ము లున్నారు. వారందఱును పెద్దకాపు దంపతుల ననేక బాధలకు లోను జేయుదురు. ఊరిలోని 'కామరాజు, జోగిరాజు' అను పెత్తనదార్లు కూడ నీ దంపతులను బాధింతురు. శ్రీరామచంద్రుఁడు వీరి నెల్లవేళలఁ గాపాడుచుండుటచే నా కష్టములన్నియును దప్పించుకొని కడకు వైకుంఠమును జేరిరి. దేవత లా కొమఱ్ఱూరు గ్రామమును 'కొల్లేఱు'గా శపించిరి. కామరాజు భోగరాజులను, మిగిలిన గ్రామ ప్రజలను నీగలు దోమలుగా నగునట్లు చేసిరి. ఆ పెద్దకాపుగారే కొల్లేటిలో

గోకనాథస్వామిగాను, నతని భార్యయగు నాదిలక్ష్మి పెద్దింట్లమ్మగానూ వెలసిరఁట. ఫాల్గున శుద్ధ పూర్ణిమనుండి తొమ్మిది దినము లక్కడఁ బ్రతిసంవత్సరమును దిరునాళ్లు జరుగును.

ఈ కథ 'రామానుజా' యను పునరావృతితోఁ బ్రారంభ మగును. ఒక్కొక్క పాదమునకు నెనిమిది మాత్రల యావృత్తులు నాలుగుండును. పదునాఱు మాత్రల తరువాత పునరావృత్తి వచ్చును.

*"రామ రామశ్రీ, రామరాఘవా- రామానుజా*
*శ్రీ రామా రఘురామ రాఘవా- రామానుజా!*

| | |
|---|---|
| *ఊరు పేరు కోమళ్లూరయా-* | *రామానుజా* |
| *కొమళ్లూరూ పట్నమందునా* | ,, |
| *పన్నెండు లక్షల కోమళ్లూరుకూ* | ,, |
| *పన్నెండొక్కా కచ్చేరులున్నవీ* | ,, |
| *కోమళ్లూరు పట్నమందునా* | ,, |
| *ఎవరెవరండీ పెత్తందార్లూ* | ,, |
| *కరణంగారూ కామరాజుగా* | ,, |
| *పెత్తందారే భోగిరాజయా* | ,, |
| *ఏడు మూడు పురుషుదాలమట్టీ* | ,, |
| *కాపుయింట మునిసీబు హోదా* | ,, |

-ఇత్యాదిగాఁ బ్రారంభమగును.

## 4.3. వేంకటేశ్వరుని కథ:-

ఇది చిత్తూరు మండలమునఁ బూసల బలిజవారను గాథాకారులచే నెక్కువగాఁ బాడఁబడుచున్నవి. ఈ కథలోని ఇతివృత్తమునకును వేంకటేశ్వర స్థలమాహాత్మ్యములోని ఇతివృత్తము నకును నెట్టి సంబంధమును లేదు. ఈ వేంకటేశ్వరుని కథ పూర్తిగా జానపదుల కల్పనవలె నున్నది. ఇందు వేంకటేశ్వరుఁడు పౌరాణిక పురుషుఁడుగాఁ గాక, జానపద వీరుఁడుగాఁ జిత్రింపఁబడినాఁడు. ఈ చిత్రణము శ్రోతల కత్యాశ్చర్యమును గొల్పునదిగా నున్నది. గాథాకారులు దీనిని 'ఎంకటేశుని కత' అనియు, 'ఎంకటేశ్వర మహాచ్చెం' అనియుఁ బిలుతురు. చిత్తూరు మండలమున జనపదముల లోఁ గొందఱు స్త్రీలు దీనిని వరినాటు పాటగాను, గొబ్బి పాటగాను గూడఁ బాడుచున్నారు.

పూసల బలిజలు పాడు నీ కథ మూఁడు రాత్రుల కథ. వేంకటేశ్వరుఁడు భద్రాచలములోఁ బుట్టుట, వైష్ణవద్వేషి యగు విళా నరసింహుఁడను సుగాలి (లంబాడి) వానిని జంపుట, తల్లియగు పేరూరమ్మతోఁ గలిసి తిరుపతికి వచ్చుట మొదటిరాత్రి కథ. తిరుపతి కొండపై గుడికట్టుకొనుట, అలివేలుమంగను బెండ్లాడుట రెండవ రాత్రి కథ. ఢిల్లీకిఁబోయి, పాదుషా కూతురగు బీబీనాంచారినిఁ బ్రేమించి, పెండ్లాడి తెచ్చి, అలివేలుమంగ గర్వమును బాపుట మూఁడవరాత్రి కథ.

ఈ కథ బొబ్బిలికథ వరుసలో 8+8+10 మాత్రలొక పాదముగా నడచుచుఁ జక్కని రసావేశమును నుత్సాహమును గలిగించును. వేంకటేశ్వరుని పాత్ర చెక్కిన విగ్రహమువలె నిర్జీవముగా నుండక, సాహసముల నొనరించు జానపద వీరునివలె సజీవముగా నుండుట ఈ కథలోని ప్రత్యేకత. వేంకటేశ్వరుని స్వగ్రామము భద్రాచలమఁట. అతనిది పాకనాటి రెడ్డికులమఁట. వేంకటేశ్వరుని తల్లి పేరూరమ్మ, తండ్రి శేషాద్రి. ఇతని ఆఱుగురు అన్నలు కలరఁట. వారు 'పెన్నోబళేశు, చిన్నోబళేశు, కదిరి నరసింహ, ఘన మద్దులేటి స్వామి, పెంచల నరసింహ, గోవిందరాజస్వామి'. వేంకటేశ్వరుని మొదటి భార్య తిరుచానూరులోని భూదేవరాజు సావిత్రమ్మల పుత్రిక యగు అలివేలుమంగ; రెండవ భార్య ఢిల్లీ పాదుషా కూఁతురు బీబీ నాంచారి. 16-2-1966 చిత్తూరు జిల్లా పీలేరు దగ్గఱ 'బోడింపల్లె' కుఁ జెందిన కొండీటి వెంకట రమణ యను పూసల బలిజవాఁడు వేంకటేశ్వరుని కథను బాడఁగా నేను వ్రాసికొంటిని. అది ఇట్లు ప్రారంభమగును:-

*"రామరామ ఓ రామా రామా- ఓ రామా రామా*
*అరియ రామ గోవిందా రామా- గోవిందా రామా*
*ఇక్కడి కీ మూన్నూరి యామడా మైసూరీలాకూ*
*మైసూరీ తను విలాకిలోనా మచ్చుల్ బందారీ*
*మచ్చు లొక్క బందారీలోనా మావిడి దేశంరా*
*మావీడొక్క దేశంబూలోనా తను భద్రాచలమూ*
*భద్రాచలమూ ఏలుతున్నదూ తండ్రీ శేషాద్రీ*
*తండ్రి పేరు తా శేషాచలమూ తల్లీ పేరూరమ్మ"*

వైష్ణవద్వేషియగు విలానరసింహుని క్రూరకృత్యముల వర్ణన చూడుఁడు:-

| | |
|---|---|
| *"గోయిందంటే గొంతులు కోస్తదు-* | *విలా నరిసిముదూ* |
| *నారాయణంటే నాలికలు దీసును-* | ,, |
| *నామం పెడితే నొసలు గోసునూ-* | ,, |
| *హరి అంటే ఆర్తాలు దీసునూ-* | *విలా నరిసిముదూ"* |

వేంకటేశ్వరుని, వివాహము చేసికొనుమని తల్లి పేరూరమ్మ కోరును. అప్పుడు వేంకటేశ్వరుఁడు తాను బెండ్లాడఁబోయెడి పిల్లకీ క్రింది లక్షణము లుండవలెనని తల్లి యగు వేరూరమ్మతోఁ జెప్పును:-

| | |
|---|---|
| *"నారి కాయలా నడుముండాలా-* | *ఆ చిన్నా దాన్కి* |
| *పొన్నకాయలా శిరసుండాలా-* | ,, |
| *గురివింజకంటే వెరుపుండాలా-* | *గుత్తమైన చిన్నాది"* |

అంతేకాదు, తనకుఁ గాఁబోయే భార్యకు "అరికాల తామర పుష్పము, అరిచేతిలో వైకుంఠము, పండ్లయందు పణసవీణలు,

నాలికను నక్షత్రములు, వీపున వింజామరులు, శిరస్సున పూల కిరీటము" నుండవలెనని చెప్పినాఁడు. అప్పుడు తల్లి పేరూరమ్మ కొడుకును దెప్పిపొడిచినది:-

*"నువు- నల్లనల్లగా పుట్టుండవురా ననుగన్నా కొడకా!*
*అటువంటి స్త్రీ అయితే కొడకా నిన్నెపూ్పతుందా?"*

పెండ్లాడుటకుఁ బడుమటి దేశము, నుత్తర దేశము, దక్షిణ దేశముఁ బోవుటకు వేంకటేశ్వరుఁ డంగీకరింపలేదు. అతఁడు తూర్పు దేశము పోఁదలఁచెను. తల్లి చద్దికూడు వండి మూటకట్టి యిచ్చినదఁట. ఆ చద్దిమూట చంకను వేసికొని వేంకటేశ్వరుఁడు తూర్పు యాత్రకుఁ బోయెనఁట. ఈ కథలో వేంకటేశ్వరుఁడు భగవంతుఁడుగాఁగాక, కేవల మొక జానపద వీరునిగాఁ జిత్రింపఁబడెననుట కిది మంచి యుదాహరణము. తల్లి పేరూరమ్మ చద్ది వండుట, వేంకటేశ్వరుఁడు ప్రయాణమగుట యెంత జానపద సహజముగా వర్ణింపఁబడినదో చూడఁడు:-

*"చిట్టిదేను బియమేసీ తల్లీ- పట్టెడు సద్దొండే*
*పట్టెడు సద్దిలోకీ సామీ- ఏమేమీ కూరా?*
*మూడునెల్లు ఊరుండాదమ్మా- ముల్లుచ్చీ కాయా*
*ఆరునెల్లు ఊరిందో సామీ- అల్లములో కొమ్మూ*
*అడవి లోనిదీ నెల్లికాయరా- ఆవులదీ యెన్నా*
*కొండా నెల్లీ కాయా సామీ- కొలచింతాపండూ*
*సద్దిలోకి ఇవరించి కట్టెనూ- తల్లీ పేరూరూ*
*సద్దిమూటలే సంకనేసెరా- సామెంకట్రమణా*
*పావుకోళ్లే కాళ్లకేసెనూ- పరమాత్ముండపుడూ*
*పషిణి బెత్తమూ చేతబట్టెనూ సిరి యెంకట్రమణా*
*పక్షలారమూ మెడకు ఏసెనూ పరమాత్ముండపుడూ*
*ముచ్చాల పావడ కల్కి తురాయో ధరియించీ నాడూ*
*పొయివస్తా పొయివస్తా తల్లీ- పేరూరీ దేవీ!*
*పొయిరాండీ పొయిరాండీ కొడకా- సామెంకట్రమణా!*
*షేమానా యిక పోయీ కొడకా- లాబానా రారా!!"*

అలివేలుమంగను బెండ్లాడుటకై వేంకటేశ్వరుఁడు ఎఱుకలసాని వేషమును గట్టుట, సోది చెప్పుట మున్నగు జానపదవర్ణనలు, "వెండికుండలో వేన్నీళ్లు, పైడికుండలో చన్నీళ్లు" పోసికొని, జాలారు బండెక్కి జలకములాడుట, ముత్యమంత చుట్ట చేసి నెత్తిని పెట్టుకొనుట వంటి వారానువర్తన ప్రయోగములు నీ కథలోఁ జాల కలవు. ప్రశస్త వీరగాథా లక్షణము లన్నియు దీనియందుండి, ఇది పురాణ కథ యనుటను మఱపించుచున్నవి.

## 4.4. మల్లిక దేవమ్మ కథ:-

ఇది శ్రీశైలక్షేత్ర మాహాత్మ్యమునకు సంబంధించిన కథ. కర్నూలు మండలమున జంగములు దీనిని పాడుచున్నారు.

నిరేంద్రపురి పట్టణమును చంద్రగుప్తరాజు పాలించుచుండెను. అతని భార్య హంసయాన. అతనికిఁ బండ్రెండువేల గోవులున్నవి. అందొక మైలావు తన పాలనన్నింటిని నొక పుట్ట కర్పించి వచ్చుచుండెను. రాజు తన సైన్యముతో నా పుట్టదగ్గఱకుఁబోయి, దానిని ద్రవ్వించుచుఁ బండ్రెండేండ్లు అక్కడనే యుండెను. సైన్యమంతయు నశింపఁగాఁ దిరిగి తన పట్టణమునకు వచ్చెను. ఇతఁడు వచ్చుసరికి హంసయానకు మల్లిక దేవమ్మ యను కుమార్తె పుట్టి పెరిఁగియున్నది. చంద్రగుప్తరాజు ఆమెను జూచి మోహించెను. భార్య యెంతగఁ జెప్పినను వినలేదు. మల్లిక దేవమ్మ భయపడి పాఱిపోవుచుండెను. తండ్రి యామెను వెన్నాడుచుండెను. మల్లిక దేవమ్మ పుట్టదగ్గఱకుఁ బోయి మాయమయ్యెను. మాయమగుటకు ముందు దుష్టుఁడైన తన తండ్రినిఁ బాతాళగంగలోఁ బచ్చలఱాయిగాఁ బడియుండుమని శపించెను. నిరేంద్రపురి పట్టణమును నిర్జీవ పట్టణముగా మార్చివైచెను.

ఈశ్వరుఁడు మల్లిక దేవమ్మను మఱియొక జన్మమెత్తుమని చెప్పెను. అందుచే నామె రెడ్లపల్లెలో 'బొమ్మిరెడ్డి, లక్ష్మీదేవమ్మ' యను దంపతుల గర్భమున జన్మించినది. ఈశ్వరుఁడు మల్లారెడ్డిగా జన్మించి, యామెను బెండ్లాడెను. ఇరువురును వ్యవసాయము చేయుచుండఁగా, శివుని మహిమచే బంగారు అనుములు పండెను. వానితో మల్లారెడ్డి శ్రీశైలమున గుడిగోపురములు నిర్మించెను. ఆ దంపతు లిరువురును నగ్నికుండమున దుమికి, ఈశ్వరునిలో లీనమైరి.

ఈ కథ నడక బాగుగ నున్నది. కాని కవిత్వము చదువుట కంత రసవంతముగా లేదు. పాడునప్పుడు మాత్రము శ్రావ్యముగనే యున్నది. ప్రారంభమున నిట్లు కలదు:-

*"గంగకు ఇక ఏమీ- తందన*
*మూల భాగమందూ ,,*
*తూరుపు భాగమునా ,,*
*నిరేంద్రపురి భల్ పట్నమున్నదయ్యో- తందా... నే...*
*తందనా తందాన తందనానో- తందానో॥*

*పట్నమేలు రాజూ- తందన*
*మానుభావుడండీ ,,*
*చంద్రగుప్తరాజూ ,,*
*అతనీ భార్యా హంసయాన కలదో-తందా... నే...*
*తందానా తందాన తందనానో, తందానో॥*

*చంద్రగుప్త రాజో తందన*
*మందీ మార్బలమూ ,,*
*వీరభటులు గలరూ ,,*
*ధూమకేతులండీ ,,*
*పన్నెండు వేల గోవులు కలవయ్యో- తందా... నే...*
*తందానా తందాన తందనానో, తందానో॥"*

కఱవు కాలమున నెత్లో కొన్ని అనుములు సంపాదించి, మల్లారెడ్డియు నతని భార్యయగు మల్లిక దేవమ్మయుఁ బొలములో వానిని జల్లుచుండఁగా శివుఁడు వారినిఁ బరీక్షింప నెంచి, జంగము వేషమున వచ్చి, అనుములు భిక్షమడుగును. అవి వరహాకొక అనపగింజ చొప్పునఁ గొన్నవి. అయినను మల్లిక దేవమ్మ యేమియు సంకోచింపక దానము చేయును. శంకరుఁడు మల్లారెడ్డి తోలుచున్న కొఱ్ఱు ముందఱ ప్రత్యక్షమగుట, శంఖమును బూరించి భిక్షమడుగుట చక్కఁగ వర్ణింపఁబడినది:–

*"గౌర్రుకైన శివుడూ– తందన*
*ఈబూదీ రాసే ,,*
*ఘణ ఘణ ఆ శివుడూ ,,*
*గంట కొట్టినాడూ ,,*
*భుంభుంభూ అనుచూ ,,*
*శంఖు పట్టినాడూ ,,*
*గురిదర్మా కోదాండ బిచ్చమనెనే– శంకారుండో*
*తందానా తందాన తందనానో– తందానో"*

*"ఏడుఏళ్ల కరువూ– తందన*
*కరువున న్యాకైనా ,,*
*కడుపున పేగులునూ ,,*
*కాటుక బట్టినవి ,,*
*మలమల యిక నేనూ ,,*
*మాడుతు వచ్చితినీ ,,*
*అయిదూ దోసిళ్లనుములు పెట్టావే– కాపుకొడుకా!*
*తందానా తందాన తందనానో– తందానో"*

ఈ మల్లిక దేవమ్మ కథలో చిఱుతొండనంబి కథ కూడ నంతర్గాథగా వచ్చును. ఈ మల్లిక దేవమ్మ కథయే కాటమరాజు కథాచక్రమున పోలురాజుకథలోఁగూడ నొక 'చాటువ' గాఁ బ్రత్యక్ష మగును.

## 4.5. పర్వతాల మల్లారెడ్డి కథ:–

దీనిని 'గోపిరెడ్డి కథ' అని కూడఁ బిలుతురు. ఇదియును మల్లికదేవమ్మ కథవలెనే శ్రీశైల మల్లికార్జునుని మహిమను దెలుపు శైవపురాణ గాథ. తందాన వరుసలో నున్న కథ. ఇది యెక్కువగా రాయలసీమలోను, తెలంగాణలోను వ్యాప్తియందున్నది. ఈ కథలోని మల్లారెడ్డికిని, మల్లిక దేవమ్మ కథలోని మల్లారెడ్డికిని సంబంధము లేదు. ఇందున్న మల్లారెడ్డి పసిబాలుఁడు, శివభక్తుఁడు, సిరియాళుని వంటివాఁడు.

శ్రీశైల పర్వతము దగ్గఱ 'తంగెళ్లపూరు' గ్రామములో ముక్కెరోళ్ల గోపిరెడ్డి, రెడ్డిసాని యను దంపతులు గలరు. వీరు పాకనాటి రెడ్లు. మిక్కిలి పిసినిగొట్టులు. పిల్లికిఁగూడ బిచ్చము పెట్టరు. గోపిరెడ్డి మిక్కిలి ధనవంతుఁడు. అతని మరణానంతరము ఆ ధనమేమగునో యని ఈశ్వరుఁడు వారికొక పుత్రునిఁ బ్రసాదించెను. అతని పేరు మల్లారెడ్డి. మల్లారెడ్డి మిక్కిలి ధర్మాత్ముడు. ఇతఁడు పుట్టిన యేడేండ్లకు గొప్ప కఱవు వచ్చెను. ప్రజల బాధలు చూచి మల్లారెడ్డి దుఃఖించి, వారిని రక్షింపుమని శివునిఁ బ్రార్థించి, పెక్కు మ్రొక్కులు మ్రొక్కెను. శివుఁడు గొప్ప వర్షమును గురిపించెను. ప్రజలు సుఖపడిరి. గోపిరెడ్డి తన పంటపొలములో 'మసాపూరి కొఱ్ఱపంట' పండించెను. ఆ పంటచేనుకు మల్లారెడ్డినిఁ గాపుంచెను. ఈశ్వరుఁడు ఈ మల్లారెడ్డి దాతృత్వమును బరీక్షింప నెంచి జంగము వేషములో రాఁగా, మల్లారెడ్డి మూఁడు కంకులు కోసి, ఆ జంగమునకు దానము చేసెను. పిసినిగొట్టువాఁడైన గోపిరెడ్డి వచ్చి చూచి, కోపించి, మల్లారెడ్డినిఁ జంపి, కొఱ్ఱచేనుకు బలియిచ్చెను. శివుఁడు మల్లారెడ్డిని బ్రతికింపఁగా, గోపిరెడ్డియు నాతని భార్యయుఁ బుత్రుని మరలఁ జంపిరి. ఈశ్వరుఁడు కోపించి, వారిద్దఱిని శిలలుగా మార్చివేసెను. మల్లారెడ్డినిఁ దనలోఁ గలుపుకొనెను. మల్లారెడ్డి శ్రీశైలపర్వతముపై శివలింగమయ్యెను. పర్వతముపై వెలసినవాఁడగుటచేఁ బర్వతాల మల్లారెడ్డి యయ్యెను.

తెలంగాణమున వ్యాప్తియందున్న మల్లారెడ్డికథను డా॥ బి.రామరాజు గారు నాకొసంగిరి. రాయలసీమలోనున్న కథను నేను సేకరించియుంటిని. ఈ కథ యిట్లు ప్రారంభమగును:–

*"శీలశీల సౌ పర్వత మంచూన– తందాన తాన*
*చిన్న యేటికీ దగ్గఱ భగమంత ,,*
*పన్నెండు మంది పట్టె కాపులయ్య ,,*
*అరవై యిద్దరు గోనె కాపులయ్య ,,*
*అక్కడ– తంగెళ్లపూరు పట్నమున్నదయ్య ,,*
*ఆ పట్నములోనా రైతు లెవ్వరయ్యా? ,,*
*పాకనాటివాండ్లు కాపువాండ్లు నయ్య ,,*
*శీలమెత్తుక చిన్నారెడ్డయ్య ,,*
*బోనమెత్తుక బుద్ధారెడ్డయ్య ,,*
*తంగెళ్లపూరి మాసిరెడ్డి కలదు ,,*
*అనుములపల్లి బ్రహ్మారెడ్డయ్య ,,*
*భిక్షమివ్వని లింగారెడ్డయ్య ,,*
*అందరి కంటే మించిన కాపెవరు? ,,*
*ఇంటి పేరుగా ముక్కెరోళ్లయ్య ,,*
*కొండాలతడు గోపిరెడ్డి కలదు ,,*
*భార్య పేరుగా రెడ్డిసాని భామ ,,*
*పన్నెండు కొప్పెర్ల ధనము వున్నదయ్య ,,*
*అరువై యెద్దుల కాపూదనమయ్య ,,*
*ముప్పై మంది జీతగాండ్లు గలరు తందాన తాన"*

ఈ పర్వతాల మల్లారెడ్డి లేక గోపిరెడ్డి కథలోఁ జక్కని వరుసతోపాటు రసవంతమగు కవిత్వమును గలదు. ఏడేండ్ల కఱవు వచ్చుట, మల్లారెడ్డి శివునకు మ్రొక్కుట యిట్లు వర్ణింపఁబడినది:-

*"అన్నము లేకా నరులు సస్తరండి తందాన తాన*
*గడ్డిలేక గోవులును సస్తవండి ,,*
*మన్ను దిన్న యా కామధేనువులూ ,,*
*మాకుల మీదా వరిగి సస్తవయ్య ,,*
*చెదలు తిన్న యా గొడ్డెలు పసువులును ,,*
*చెట్ల మీదనే వరిగి సస్తవయ్యా ,,*
*గోవుల ఘోషా రెడ్డి చూడలేదు ,,*
*ఆవుల చావూ అతడు చూడలేడు ,,*
*కొంగు వేసికొని అతడు మ్రొక్కుతాడు ,,*
*విష్ణువీశ్వరా! నీకు దండమయ్య! ,,*
*బ్రహ్మదేవుడా! నీకు శరణు సామీ! ,,*
*మొలకల పున్నమ నాటికైన నేమి ,,*
*మల్లి పోయినా వర్షం కురిసెను ,,*
*చెర్లు కుంటలూ ఏకంబయితేను ,,*
*అయ్యగారి కారగింపు చేసేను ,,*
*దాసులకు దాసంగము పెట్టేను ,,*
*బ్రాహ్మణులకు సమారాధన చేసేను తందాన తాన"*

మూఁడు కొఱ్ఱకంకులు కోసి దానము చేసినాఁడను కోపముతోను, బాగుగాఁ బండిన చేనుకు నరబలి నీయవలెననెడు తలంపుతోను కన్నకొడుకును గోపిరెడ్డి తెగనఱకుట, మరణించుచు మల్లారెడ్డి విలపించుట కరుణరసభరితముగా వర్ణింపఁబడినది. గోపిరెడ్డి బాలుఁడైన మల్లారెడ్డినిఁ బిలిచి, చేనుకు మ్రొక్కుమనినాఁడు. పసిబాలుఁడును, నమాయకుఁడును నగు మల్లారెడ్డి తండ్రి చెప్పినట్లే చేనుకు మ్రొక్కి తిరిగి లేవఁబోయినాఁడు. అప్పుడు క్రూరుఁడగు గోపిరెడ్డి చర్య యిట్లు చెప్పఁబడినది:-

*"మ్రొక్కి దిగ్గునా లేవబోతడయ్య తందాన తాన*
*చెప్పుల కాలు వీపున తొక్కినడు ,,*
*కొడుకు జడలనూ పట్టె గోపిరెడ్డి ,,*
*గొంతుమీద కొడవలిని పెట్టినాడు ,,*
*'నా మాట యింటివా కొడుక మల్లరెడ్డి! ,,*
*విననిదానికిది శిక్ష నీకు జూడు' ,,*

*'నాయనా! నన్నెందుకు సంపుతవు ,,*
*నా సాటి కాపువారి తావున నేనైన ,,*
*కొంగు పట్టుకొని భిక్షము తెచ్చెదను ,,*
*నీ కొఱ్ఱలు నీకూ తెచ్చి యిచ్చెదాను ,,*
*ప్రాణముతోను నన్ను విడువు తండ్రి' ,,*
*'కొడుకా! ఇడిచేదానిక నిన్ను బట్టినాను?' ,,*
*మ్రొక్కిన విడువక గొంతు కోసినాడు ,,*
*దోసిట రకతము ఎత్తి పట్టినాడు ,,*
*కొఱ్ఱచేనులో పొలిగ చల్లినాడు ,,*
*నాల్గు తుంటలుగ శవము నరికినాడు ,,*
*కొఱ్ఱచేనులో పూడిచిపెట్టాడు తందాన తాన"*

## 4.6. ఇతర కథలు:-

తెలంగాణమున విశేష వ్యాప్తినందిన 'కొమిరెల్లి మల్లన్న కథ' కొమిరెల్లి శైవక్షేత్ర మాహాత్మ్యమును దెలుపును. చెర్విరాల భాగయ్య గారు దీనిని సంపాదించి సంస్కరించిరి. గొల్లలును, బీరన్నలవారును ఈ కథను బాడుచుందురు. గొల్లకురుమలకు కొమిరెల్లి మల్లన్న కులదైవము. ఈ కథనుగూర్చి డా॥ బి.రామరాజుగారు మిక్కిలి విపులముగాఁ జర్చించియున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౩౨౦-౩౨౫). ఇది త్రిశ్రగతిలో నడచిన కథ.

పాల్కురికి సోమనాథుని బసవపురాణములోని కథలను, ఇతర శైవపురాణములలోని గాథలను గూడ జంగములు బొబ్బిలి వరుసలోనికి మార్చుకొని పాడుచున్నారు. అట్టివానిలోఁ గొన్ని- "కక్కయ్యగారి చరిత్ర, రుద్రాక్ష మాహాత్మ్యము, అమరలింగ, నిజలింగ చిక్కయ్య కథ, భల్లాణరాజు కథ, చిఱుతొండ భక్తుని కథ, బసవేశ్వరుని కథ, మడివాళ్ల మాచయ్యగారి కథ, కూన పాండ్యరాయని కథ, కుమ్మరి గుండయ్య కథ, దక్షయజ్ఞము, పార్వతీ కల్యాణము, త్రిపురాసుర సంహారము, మన్మథ దగ్ధము, గంగా వివాహము, కుమారస్వామి జననము" మున్నగునవి. జంగము లీ కథలను 'బసవపురాణము' అను పేరుతోఁ బదునెన్మిది రాత్రులు పాడుదురఁట.

మొత్తము మీఁద బొబ్బిలివరుస కథలలో నర్ధభాగము కవిత్వము, నర్ధభాగము సంగీతము నుండును. అందుచే వీనికిఁ బాడునప్పు డున్నంత పరిపుష్టి చదువునప్పు డుండదు. (అసలు వీరగాథలు చదువుట కుద్దేశించినవి కావు. వీనిని పాటలు, పదములు, కీర్తనలవలె పాడునప్పుడు మాత్రమే వినవలెను.) పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను సంగీతము కన్న సాహిత్యాంశమే అధికము గావునఁ బాడునప్పుడే కాక, చదువునప్పుడు సహితము నవి రసావేశమును గలిగింప సమర్థములు. బొబ్బిలివరుస కథలట్లు కావు. తంబుఱశ్రుతితో మేళవించి, గుమ్మెతల లయతోఁ బాడునప్పుడు మాత్రమే ఇవి హృదయావర్జకములుగా నుండును. కేవల పఠనముచే నివి రసతృప్తి నీయఁజాలవు. కథాప్రధానములగుటచే వీనిలో రసవద్ఘట్టములు గూడ నక్కడక్కడ మాత్రమే తటస్థపడుచుండును. (మార్గ కవిత్వములోని ఇతిహాస ప్రక్రియ కూడ నిట్టిదే.అది యాద్యంతమును రసవంతముగా నుండదు. ఇతిహాసములచే రసతృప్తి కలుగని కారణముననే మనకవులు ప్రబంధములను సృష్టించుకొనిరి.) ఈ బొబ్బిలివరుస కథల కవిత్వమునుగూర్చి శ్రీపాద

గోపాలకృష్ణమూర్తిగారు ఇట్లు చెప్పియున్నారు: "బొబ్బిలిపాటలవంటి కథలలో మాత్రము రసమయ ఘట్టాలు- మల్లమ్మ లేఖా, పెద్దాపుర జగపతి ఆపదమొక్కులూ, సర్వాయి పాపని ఆత్మహత్యా, కోటప్ప కొండలో చిన్నపరెడ్డి తప్పుకుపోవడమూ, దేసింగురాజు శౌర్యమూ అక్కడక్కడ ఉంటాయి. కామమ్మ, పాపమ్మ, యెరుకమ్మ కథలలో ఆ పేరంటాండ్రు సాగుమానానికని భూమినడిగే ఘట్టాలు హృదయ విదారకాలు. అయితే ఈ కథలలో మొత్తపుకథ అంతా గుండెకు తగలకుండానే దాటిపోతుంది."[30]

ఈ సుదీర్ఘ ప్రకరణము నందలి సారాంశము నిట్లు చెప్ప వచ్చును:-

నెలల తరబడి పాడఁబడుచున్నవి వీరగాథాచక్రములు కాఁగా, రెండు మూఁడు రాత్రులలోఁ బాడఁబడునవి వీరగాథలు. ఈ వీరగాథలలో 'బొబ్బిలివరుస కథలు, పదములు, జంగం కథలు' అను మూఁడు ప్రధాన విభాగములను గుర్తింపవచ్చును. ఇందు బొబ్బిలివరుస కథ లెక్కువగాఁ జారిత్రక, సాంఘిక సంఘటనా జనితములు. 'హరిహరీ నారాయ ణాది నారాయణా, కరుణించి మమ్మేలు కమలలోచనుఁడ' యను జంపెవరుసలో నుండు కథలును, 'శారద వరుస'లో నుండు కథలును 'పదము' లనఁబడును. రగడలు, పద్యములు, దరువులు, కీర్తనలు కలిగి, యక్షగానములను హరికథలను బోలిన రచనలు 'జంగంకథలు'. బొబ్బిలివరుస కథ లెక్కువగాఁ జారిత్రక సాంఘికేతి వృత్తములను గలిగియుండగాఁ, బదములును, జంగంకథలును బ్రధానముగాఁ బౌరాణికేతివృత్తములను గలిగియుండును.

ఇతివృత్తములనుబట్టి బొబ్బిలివరుస కథలను నాలుగు వర్గములుగా విభజింపవచ్చును: 'చారిత్రకములు, సాంఘికములు, జానపదములు, పౌరాణికములు'. ఇందుఁ జారిత్రకములలో 'స్పష్ట చారిత్రకములు, అస్పష్ట చారిత్రకములు' అను రెండంతశ్శాఖలు గలవు. అట్లే సాంఘిక వర్గమునఁగూడ 'పేరంటాండ్రు, సాహసికులు, బందిపోట్లు, గజదొంగలు, గ్రామకక్షలు-హత్యలు, కుటుంబ కలహములు, లేచిపోవుటలు' అను ఏడు అంతశ్శాఖలను గుర్తింపవచ్చును. బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, జగపతిరాజు కథ, కొమార రాముని కథ, రాణీ శంకరమ్మ కథ, సదాశివరెడ్డి కథ, నల్ల సోమనాద్రి కథ, రాజా రామేశ్వరరావు కథ, కర్నూలు నవాబు కథ, ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ మున్నగు వీరగాథలు స్పష్ట చారిత్రకములకు ఉదాహరణములు. బంగారు తిమ్మరాజు కథ, లేక దేవరాయలు కథ, ముగ్గురు మరాటీల కథ, బాలనాగమ్మ కథ, కుంటి మల్లారెడ్డి కథ, వేమన కథ, బల్మూరి కొండ్రాయని కథ మున్నగునవి అస్పష్ట చారిత్రకములకు ఉదాహరణములు. సాంఘికములలో "కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, మండపేట పాపమ్మ కథ, శృంగవరపుకోట యెఱుకమ్మ కథ, లక్ష్మమ్మ కథ, సాసవల చిన్నమ్మ కథ, వీరరాజమ్మ కథ, నల్లతంగాళ్ కథ, తిరుపతమ్మ కథ, ఎఱుకల నాంచారి కథ, రావులమ్మ కథ, సరోజిని కథ, ఈడిగ దేవమ్మ కథ, అంజమ్మ కథ, ఉయ్యూరు వీరమ్మ కథ లేక గొల్లల వీరమ్మ కథ, నారాయణమ్మ కథ, సతీ రంగమ్మ కథ" మున్నగునవి పేరంటాండ్ర కథలు. సర్వాయి పాపఁడు కథ, చిన్నపరెడ్డి కథ వంటివి సాహసికుల కథలు. మలగర బాలేసాబు కథ బందిపోట్లను నంతశ్శాఖ కుదాహరణము. మియాసాబు కథ, పండుగ శాయన్న కథ, దువ్వన్నదొర పాట, నక్కపల్లి రాముఁడు కథ మున్నగునవి 'గజదొంగ'లను నంతశ్శాఖకుఁ జెందును. ఈ సాంఘికములలో 'గ్రామకక్షలు-హత్యలు' అను నంతశ్శాఖకు కుంటి పుల్లారెడ్డి కథ, యల్లమంద నాయుఁడు కథ, చెన్నకృష్ణారెడ్డి కథ, దొర్నిపాటి వెంకటరెడ్డి కథ, పరిగె రామకృష్ణారెడ్డి కథ, సుబ్బిరెడ్డి కథ- ఇత్యాదులు ఉదాహరణములు. కండెపు సుబ్బయ్యగారికథ కుటుంబ కలహమునకు సంబంధించినది. మందలోడుకథ 'లేచిపోవుట'కు ఉదాహరణము. ఇఁక గాంధారి కథ, కాంభోజరాజు కథ, కమ్మవారి పడతి, ఎలనాగిరెడ్డి కథ, రక్తకొమారుని కథ, రత్నాంగి కథ, కాశీమజిలీ కథలు మొదలగునవి జానపద వీరగాథలు. రామకథాసుధార్ణవము, ఆండాళ్ చరిత్రము లేక శ్రీరంగ మాహాత్మ్యము, వరాహావతార చరిత్రము లేక పందికథ, పెద్దకాపుగారి కథ మొదలగునవి పౌరాణిక వీరగాథలు.

మొత్తముపై బొబ్బిలివరుస కథలలో నర్ధభాగము కవిత్వము, నర్ధభాగము సంగీతము నుండును. అందుచే వీనిని బాడునప్పు డున్నంత రసపరిపుష్టి, చదువునప్పుడుండదు. పల్నాటి వీరకథలలోను కాటమరాజు కథలలోను సంగీముకన్న సాహిత్యాంశము కెక్కువ ప్రాధాన్యముండుటచే నవి పాడునప్పుడే కాక, చదువునప్పుడును రసవంతములుగనే యుండును. బొబ్బిలివరుస కథలిట్లు కాక, తంబుఱ శ్రుతితో గుమ్మెట్ల లయతోఁ బాడునప్పుడు మాత్రమే హృదయా వర్జకములుగ నుండును. కథాప్రధానములగుటచే వీనిలో రసవద్ఘట్టములు కూడ అక్కడక్కడ మాత్రమే గోచరించును. ❐

## జ్ఞాపికలు

1. తాంద్ర పాపారాయఁడు విజయరామరాజును బొడిచిచంపుటయే కాక, ప్రేవులు తీసి మెడలో వేసికొనినట్లుగా శ్రీపాద కృష్ణమూర్తిగారు తమ బొబ్బిలియుద్ధ నాటకములో వ్రాసినారు. ఇది అభూత కల్పన. విజయనగరమువారిని వీరగాథాకర్తయే యెక్కువ కించపరచినాఁడు. ఇది శాస్త్రిగారి అభూత కల్పన యగుటయే కాక, నాటకలక్షణముల కత్యంత విరుద్ధమైన సన్నివేశము కూడ. మహాపండితులుగాఁ ప్రసిద్ధికెక్కిన శాస్త్రిగారు, రంగస్థలమున లాక్షణికులు నిషేధించిన ఈ సన్నివేశము నేల ప్రవేశపెట్టిరో యర్థము కాకున్నది. ఇది యొకవేళ సత్యమైనచోఁ గొంత వఱకును సర్దుకొనవచ్చును. కాని యిది శుద్ధ కల్పన. ఈ విషయమై నేను శ్రీ శాస్త్రిగారిని 1956లో రాజమహేంద్రవరములోఁ బ్రశ్నించితిని. "అది తప్పే, నాటక లక్షణాలకి విరుద్ధం. ఏదో రంగస్థలంమీద రక్తికడుతుందికదా అని అలా వ్రాసివేశాను" అని వారు సమాధానమిచ్చిరి. కాని, ఈ సన్నివేశము మన యాంధ్రదేశమున నితర ప్రాంతములలో రక్తికట్టుచున్నది కాని, విజయనగర ప్రాంతములవారిని మాత్రము క్రోధవివశులను జేయుచున్నది. సర్కారు జిల్లాలలో, ముఖ్యముగా విశాఖ, శ్రీకాకుళ మండలములలో బొబ్బిలియుద్ధ నాటకమును విశేషముగాఁ బ్రదర్శించుచున్న శ్రీ కనకదుర్గ నాట్యమండలి (మండపాక, పశ్చిమగోదావరి జిల్లా) వారిని నేను సంప్రతించితిని. విజయనగర ప్రాంతములలో ఈ నాటకమును బ్రదర్శించునప్పుడు తాంద్ర పాపారాయఁడు విజయరామరాజును జంపి, ప్రేవులు తీసి మెడలో వేసికొనుట్టి రంగమును వదలివేయుదురఁట. ఈ మధ్య బొబ్బిలి యుద్ధముపై తీసిన చలనచిత్రము విజయనగరములో మూఁడు రోజులు మించి యాడలేదు. విజయనగర ప్రజలకును బొబ్బిలి ప్రజలకును మధ్య నాఁటి కక్షలు నేఁటికిని రగులుచునేయున్నవి. బొబ్బిలివారి శౌర్యమును మనము కీర్తించినట్లుగా విజయనగర ప్రజలు నేఁటికిని గీర్తించుట లేదు. బొబ్బిలి యుద్ధముపై వీరగాథలు నాటకములు మిక్కిలి పాక్షికదృష్టితో వ్రాయఁబడినవని తెల్పు విజయనగర ప్రజల వాదములో సత్యమున్నది.
2. History of Hindoostan by Robert Orme, Vol. II, Pp. 255-260.
3. బొబ్బిలియుద్ధ కథ, పీఠిక, పుట. Li
4. M. Somasekhara Sarma, Introduction to Bobbili Yuddha Katha, p.xiii.
5. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట ౨౩౫.
6. బొబ్బిలియుద్ధ కథ, మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారము వారి ప్రచురణము, పుటలు 39, 40.
7. దేసింగురాజు కథ, ఎన్.వి.గోపాల్ అండ్ కో. వారి ప్రతి, పుట–85.
8. అదియే., పుటలు 86, 87.
9. పిఠాపురము సూర్యారాయాంధ్ర విద్యానంద గ్రంథాలయములోని పుస్తక సూచికలో 'పెద్దాపురం కోడిపుంజుల కథ' యున్నది కాని, ఆ పుస్తకము మాత్రము గ్రంథాలయములో లేదు. పిఠాపురములో, 'ఆవంత్స సోమసుందర్' అను నొక నవ్యకవి ఇంటిలోనున్న యొక ప్రతినిఁ జూచి, నే నా వీరగాథ నాద్యంతము వ్రాసికొంటిని. దీనికిఁదోడు, పశ్చిమగోదావరి మండలములో మౌఖిక ప్రసరణమున నున్న వేఱొక పాఠమును సేకరించితిని. ఈ రెండింటిని సమన్వయ పఱచి, ఈ కథను బరిశీలించితిని. 1943లో రాజమహేంద్రవరములోని కొండపల్లి వీరవెంకయ్యగారు, నేదునూరి గంగాధరంగారిచేఁ బరిష్కరింపఁబడిన 'పెద్దాపురపు కోడిపందెముల పాట'ను బ్రకటించిరి. ఇది డా॥ బి. రామరాజుగారికి లభించినది. ఈ ప్రతి నాకు దొరకలేదు.
10. Kumara Ramuni Katha, Preface, Madras Govt. Oriental Series, No. XCI, 1952.
11. ibid.
12. కర్నూలు జిల్లా, నందికొట్కూరు తాలూకా, చెలిమళ్ల రుద్రవరములో పిచ్చుకుంట్ల చిన్ననాగన్న పాడిన పాట (1966).
13. Manual of the Administration of the Madras Presidency, Volume II, p. 75.
14. ibid, p. 265.
15. Manual of the Administration of the Madras Presidency, volume III, p. 251.
16. త్రివేణి, పుట 270.
17. రేనాటి వీరుఁడు, పుటలు 104–106.
18. కడపజిల్లా, ప్రొద్దుటూరు తాలూకా, రాజుపాళెం దగ్గఱనున్న, అయ్యలవారిపల్లెలో 15–3–1966నాఁడు గుండా లాలన్న అను జంగము పాడినాఁడు.
19. జానపదులలో 'ఏటు నడువు' అను విచిత్ర ప్రయోగమొకటి వాడుకలో నున్నది. ఆంగ్లమున గల 'attack, offence' అను మాటలకిది సమానార్థకము. ఒక వీరుఁడు ముందు attack చేయును. ఆ విజృంభణమునుండి రెండవ వీరుఁడు తన్ను రక్షించుకొనును. దీనిని 'defence' అందురు. తరువాత

రెండవ వీరుఁడు తన 'ఏటు' నడుపును. అప్పుడు మొదటి వీరుఁడు దానిని దప్పించుకొనుటకుఁ బ్రయత్నించును. ద్వంద్వయుద్ధ మెప్పుడును యిట్లే జరుగును.

20. ఈ 'సీతఁడు - కలికి నారిఁగాడు కథ'ను నాకు కర్నూలు జిల్లా, కోవెలకుంట్ల తాలూకా, ఉయ్యాలవాడ గ్రామములో 'దస్తగిరి' యను డెబ్బది సంవత్సరముల వృద్ధుఁడు 17-4-1966 నాఁడు చెప్పినాఁడు.

21. *"Messrs. Wallis, Meadows (took the fort of Srirangapatnam and Gooty returned), Pennisgiri, Oaks, and Nayanappa Mudaliar of Madras were pleased with her greatness, granted the permission for Sati and even attended it.- Descriptive Catalogue, D.No. 2501.*

22. "కామమ్మ కథే, దక్షయజ్ఞపు సతీదేవినీ, కన్యకామ్మవారినీ విడిచిపెట్టితే, మొదటి పేరంటాలు కథ. పద్దెనిమిదో శతాబ్దము నాటిదనిపిస్తోంది". కిన్నెర, డిసెంబరు 1953, పుట 557.

23. ఆంధ్ర సాహిత్యచరిత్ర సంగ్రహము, పుట 332.

24. గుజిలీప్రతి.

25. 'సతీ రంగమ్మ' -రచయిత మేడూరి కృష్ణమూర్తి, నరేంద్రనాథ సాహిత్యమండలి, తణుకు 1954.

26. డా॥ బి. రామరాజుగారు, తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట ౨౨౮.

27. 'నా జీవితకథ- నవ్యాంధ్రము', ఆదర్శ గ్రంథమండలి, విజయవాడ, 1959, పుటలు 112, 113.

28. 6-8-1967న తిరుపతిలో గోవింద వెంకటరాము అను పూసల బలిజయు నాతని భార్యయుఁ బాడిన 'కలిచెర్ల నరసింహారెడ్డి కథ' లోని భాగము.

29. ఈ కథలోని యథార్థ సంఘటనలన్నింటిని 1965లో కండెపు సుబ్బయ్యగారి పుత్రుఁడైన నాగయ్యగారు నాకు వివరముగాఁ దెల్పియున్నారు. వారికి మిక్కిలి కృతజ్ఞుఁడను.

30. విజ్ఞాన సర్వస్వము, నాలుగవ సంపుటము, పుట. 805.

# పదునాల్గవ ప్రకరణము

# పదములు- జంగంకథలు

వెనుకటి ప్రకరణమున వీరగాథలలోని బొబ్బిలికథవంటి వీరగాథలనుగూర్చి చర్చించితిని. వీరగాథలలోని 'పదములు, జంగం కథలు' అను మఱి రెండు అంతశ్శాఖలనుగూర్చి ఈ ప్రకరణమున వివరింతును.

## పదములు లేక హరిహరీ పదములు:-

*"హరి హరీ నారాయ ణాది నారాయణా!*
*కరుణించి మమ్మేలు కమల లోచనుడ!"*

అను వరుసలో, సీసపద్య రచనను బోలిన ఛందస్సులో సాఁగుచు, జముకులపైఁ బాడఁబడు వానిని 'పదములు' అందురు. "హరిహరీ నారాయణా..." అనునది వీని వరుసయే కాక పురనరావృత్తి కూడ. ఈ పునరావృత్తినిఁబట్టి శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు వీనిని 'హరిహరీ పదాలు' అని పిలిచినారు.[1] ఇవి క్రీ.శ. 1850 నుండి విశాఖ మండలమున విశేషముగా విజృంభించినవి. "జానపద సారస్వతము విశాఖమండలమునించి వచ్చినంతగా మరొక మండలమునించి రాలేదు. స్త్రీలగేయకథలు ఇంచుమించు అన్నీ అక్కడివే. వాటి వాడుకా, ప్రచారమూకూడ నేటికీ అక్కడే ఎక్కువ... పదములన్న పేరుతో చాలా కావ్యములు విశాఖమండలంనించి వచ్చాయి. ఇవి 'శ్రీరామ జయరామ సీతాపతే రామ, నీకు వందన మయ్య లోకనాయకుడ' అన్న ప్రారంభపదాలతో 'హరిహరీ నారాయ ణాదినారాయణా, కరుణించి మమ్మేలు కమలలోచనుడ' వరుసలో ఉంటాయి."[2]

యక్షగానములలోఁగూడ నీ పదముల వరుసలోఁ గొన్ని పాటలున్నవి. వానిని 'జంపెలు' అందరు. ఈ పదములు బొబ్బిలివరుస కథలవలెనే మొదటినుండి చివరివఱకును నొకే ఛందమున నుండును. వీనిలో జంగంకథలలోవలె మధ్యమధ్య దరువులు, కీర్తనలు, పద్యములు మున్నగునవి యుండవు. ఈ పదముల ఇతివృత్తము లన్నియును పౌరాణికములే. అందునను రామాయణ సంబంధము లెక్కువ. మద్రాసు ప్రా.లి.పు.భా.లోఁ దాళపత్రప్రతులలోఁ బదములు లభించుటచే నివి 19వ శతాబ్ది ప్రారంభము నుండియుఁ గలవని తలఁపవచ్చును.

వీరగాథలలో నాలుగు 'కిటతకిట' ఆవృత్తులతో సాఁగు పాదములు గల రచనలు ప్రాచీనమైనవి. ఈ నడకను 'ఖండగతి' యందురు. శక్తికథలలోఁ జాలభాగ మీ నడకలోనివే. పల్నాటి కథలలోను, కాటమరాజుకథలలోను గూడఁ గొన్ని యీ నడకలో నున్నవి. ఈ ఖండగతినుండియే ద్విరదగతి రగడ, ద్విపద, మంజరీ ద్విపద మున్నగునవి లాక్షణికు లేర్పఱిచియుందురు. నిజమునకు ద్విపదచ్ఛందముగూడఁ బాడునప్పుడు ఖండగతివలెనే యుండును. ఈ ఖండగతినుండి 18వ శతాబ్దమున బొబ్బిలివరుస కథలును, 19వ శతాబ్దమునఁ బదములును బరిణమించినవి. ఇందుఁ బదములు ఖండగతి ద్విపదల సమ్మేళన మనవచ్చును. వీనిలో మొదటి పాదము "5+5+5+5" అను మాత్రలతో ఖండగతిలో నుండును. రెండవ పాదము "5+5+5+3" అను మాత్రలతో నుండు ద్విపద పాదము. ఈ రెండును నొకే పాదమనువారును గలరు. అప్పుడు పాదములో ప్రథమ దళము ఖండగతిలోను, రెండవ దళము ద్విపదచ్ఛందమునను గలదని చెప్పవచ్చును. ఉదాహరణమునకు 'ధర్మాంగద చరిత్ర' లోని ఈ క్రింది పంక్తులను జూడుఁడు:

**5 5 5 5**
*"సంగీత, సాహిత్య, - సరసవి, ద్యలు గలిగి*

**5 5 5 3**
*వేదములు, వల్లించు- విప్రులే, కలరు*

**5 5 5 5**
*చదువు సా, ముల చేత, - చాల పెం, పొందుచును*

**5 5 5 3**
*రాజులా, పురిలోన, - తేజమున, గలరు*

మద్రాసు ప్రా.లి.పు.భా.లోఁ దాళపత్ర ప్రతులుగా మూఁడు పదములును, కాగితపుఁ బ్రతులుగా మూఁడు పదములును లభించుచున్నవి. లక్ష్మణమూర్ఛ (ఆర్.నెం.252), ఇంద్రజిత్తు యుద్ధము (ఆర్.నెం. 253), రామాయణ పదములు- యుద్ధకాండము (ఆర్.నెం. 634)- ఇవి తాళపత్ర గ్రంథములు. తారాశశాంకము (ఆర్.నెం. 256), గంగావివాహము (ఆర్.నెం. 557), గౌరీవివాహము (ఆర్.నెం. 574)- ఇవి కాగితపుఁ బ్రతులు.

ముద్రితములైన పదములు కొల్లలుగా నున్నవి. అన్నిటికినిఁ గవులు తెలియుచున్నారు. అయ్యగారి కూర్మనాథుని విరాట, కర్ణ, శల్య పర్వములు; చంద్రగిరి తాతయ్య రచించిన ఉత్తర-దక్షిణ గోగ్రహణములు; గోపాలరాయని వైకుంఠ మాహాత్మ్యము; ముడుంబ లక్ష్మణాచార్యుని శ్రీరామకథ (1895); చిత్రాడ కామేశము రచించిన త్రినాథుని చరిత్ర; పూడిపెద్ది బుచ్చన్న సంస్కరించిన లక్ష్మణమూర్ఛ; అతఁడు రచించిన ఇందుమతీ పరిణయము, సీతాకల్యాణము, సుందర కాండము, రామరావణ యుద్ధము; నీవూరి[3] నారాయణరాజు రచించిన ధర్మాంగద పాముపాట (1874); నీవూరి[4] రామచంద్ర

రాజు కుశలాయకము (1862); మంథా రాయుడుశాస్త్రిగారి పాతాళ హోమము (1922); బొట్టి నరసింహదాసు (మదిశావ గోపాలుఁడు?) సుందరకాండము; నడిమింటి రామయోగికవి బాణాసుర యుద్ధము (1864); పసగాడ సన్యాసి రచించిన సారంగధర చరిత్ర, శతకంఠ యుద్ధము, గంగావివాహము (1856); తోలేటి సీతారామయ్యగారి శశిరేఖా పరిణయము (1883), నలచరిత్ర (1900), ప్రహ్లాద చరిత్ర (1804); కటోజు వీరాచారి భల్లాణిరాయ పదము; వీరభద్రయ్య గౌరీవివాహము; పొడుగు రామబ్రహ్మకవి హరిశ్చంద్రోపాఖ్యానము, గయోపాఖ్యానము; నిజలింగ చిక్కయ్య చరిత్ర, కృష్ణావతారము, వైకుంఠ మాహాత్మ్యము; విశాఖపట్టణము అందే కృష్ణమూర్తి అండ్ కంపెనీ వారు ప్రకటించిన సింహాచల మాహాత్మ్యము, రామాయణ పదము; బెహరా నరసయ్య విరచితమగు మైరావణ చరిత్ర; బెహరా రామకృష్ణకవిది నలచరిత్రము; మంగిపూడి సూర్యనారాయణగారి సుగ్రీవ విజయము, అంగద రాయబారము అను వారధికట్టు (1925); చెఱువు అప్పల నరసింహదాసుది శ్రీయాళ చరిత్ర; ఆకెళ్ల సూర్యనారాయణ రచించిన బాణాసుర యుద్ధము (1915); కొత్తపల్లి సూర్యారావు రచించిన శ్రీ హరిశ్చంద్ర మహారాజు కథ (1906)– మున్నగునవి ముద్రితములైన పదములు. నందిరాజు చలపతిరావుగారు స్త్రీలపాటలుగా భావించి ముద్రించిన 'బ్రాహ్మణుని పాట, కుచేలోపాఖ్యానము' కూడఁ బదములే.

ఈ పదములలో స్వకపోల కల్పితములు తక్కువ. ఇవన్నియు నితర మార్గరచనలను జూచి రచించినట్టివే. ఇట్లు పరివర్తించుటకుఁ గారణమున్నది. విద్యావంతులు పురాణములను ప్రబంధములను జదివి యానందింపఁగలరు. నిరక్షరాస్యులకది సాధ్యము కాదు. వారి యంతస్తునకుఁ దగిన రచనలు గావలెను. కావున జానపదకవులు ఈ ప్రాకృత జనులకొఱకు మార్గకావ్యములలోని కథలను, భాగములను అనుసరించి పదములుగా వెలయించిరి. తామట్లు చేయుచుంటిమని కొందఱు కవులు తమ కావ్యములలోఁ దెలియఁజేసియున్నారు. పూరి రామచంద్రరాజు తన కుశలాయకములో నిట్లనెను:–

*"కఠినంబు కాంచితే కాపులకు తెలియదని*
*మరుగులుంచుట మాని మాటలుంచితిని"*

అయ్యగారి కూర్మనాథుఁడు తన విరాటపర్వము పదములో నిట్లు చెప్పుకొనెను:–

*"ప్రబల ప్రబంధములు పండితార్హము లనుచు*
*పామరుల కొరకు నీ పదము చెప్పెదను*
*కఠిన శబ్దములున్న కాపులకు తెలియదని*
*మరుగు పదములు మాని మాటలుంచెదను".*

ఈ పదములలో రామాయణకథకు సంబంధించినవి అధికముగా నున్నవి. ఈ రామాయణకథలోని కల్పన జానపదులకుఁ జాలలేదు. అందుచే నద్భుతములు, నతిశయోక్తులును జేర్చి శతకంఠ రామాయణము, సహస్రకంఠ రామాయణము సృష్టించుకొనిరి. శ్రీరామకథ, లక్ష్మణమూర్ఛ, సీతాకల్యాణము, సుందరకాండము, రామరావణ యుద్ధము, కుశలాయకము, పాతాళ హోమము, శతకంఠ యుద్ధము, రామాయణ పదము, మైరావణ చరిత్ర, సుగ్రీవ విజయము, అంగద రాయబారము మున్నగునవి రామాయణ సంబంధమగు పదములు.

భారతమునుండికూడ అనేకకథలు స్వీకరింపఁబడి పదములుగాఁ బరివర్తితములైనవి. విరాట–కర్ణ– శల్యపర్వములు, ఉత్తర గోగ్రహణము, దక్షిణ గోగ్రహణము, శశిరేఖా పరిణయము, నలచరిత్ర, హరిశ్చంద్రోపాఖ్యానము, గయోపాఖ్యానము మున్నగునవి ఇట్టివి.

బాణాసుర యుద్ధము, ప్రహ్లాద చరిత్ర, కృష్ణావతారము మున్నగునవి భాగవతమునుండి గ్రహింపఁబడిన పదములు. నిజలింగ చిక్కయ్య చరిత్ర, భల్లాణిరాయ పదము, శ్రీయాళ చరిత్ర– ఇత్యాదులు శైవమత సంబంధములు. సింహాచల మాహాత్మ్యము వైష్ణవ క్షేత్ర మాహాత్మ్యము. వైకుంఠ మాహాత్మ్యము, త్రినాథుని చరిత్ర ఇతర పురాణములనుండి గ్రహింపఁబడినవి.

ఈ పదములలో నొక గొప్పతన మున్నది. బొబ్బిలివరుస కథలు, జంగంకథలు పాడునప్పుడు మాత్రమే రసతృప్తినిచ్చును. శక్తికథలలోఁ గూడఁ జాలభాగమిట్లే యుండును. చదువునప్పుడు వీనియందుఁ గవిత్వము గోచరింపదు. బొబ్బిలివరుస కథలలోఁ గొన్ని సన్నివేశములందు మాత్రము హృదయమును గదలించుశక్తి యున్నను, జంగంకథలలో నీ మాత్రపుఁ గవిత్వముకూడ మృగ్యము. కేవల కథాకథనము తప్ప వానియందితర గుణములు పూజ్యము. పదము లిట్టివి కావు. ఇవి వీరగాథా కవిత్వమునకుఁ బేరు తెచ్చునవి. పల్నాటి వీరకథలవలెను, కాటమరాజు కథలవలెను నీ పదములు పాడునప్పుడును జదువు నప్పుడును గూడ రసతృప్తి నిచ్చు రచనలు. ఈ పదములను శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారిట్లు ప్రశంసించి యున్నారు:

"పదాలు మాత్రం దేశిసారస్వతానికి శిరోభూషణాలు. రావణుని సింహాసనం ఎదుటను కూర్చున్న హనుమంతుడు జ్ఞాపకాని కొస్తాడు వీటిని ప్రబంధాలతో పోల్చితే. ప్రబంధాల కాల్పనిక వాతావరణం వీటి నైసర్గిక సౌందర్యంముందు సిగ్గుపడవలసినదే. సమాసాల బాదరబందీ లేని అనుష్టుప్పులవంటి జంపెవరుసలూ, పాదాంత విరామమూ కవియొక్క స్వంత రచనకు బాగా అవకాశం కల్పించాయి. ఏ పూడిపెద్ది బుచ్చన్న వంటి వారో పాత గ్రంథాలలోని భావాల్ని ఎరువు తెచ్చుకున్నా, పసగాడ సన్యాసి, నడిమింటి రామయోగి వంటి కవులు ఈ రకపు రచనకి అమరత్వము గడించి పెట్టారు. తెలుగు కవుల నైసర్గిక రచనను ఆనందించాలంటే పదాలే చదవాలి."[5]

ఈ పదకర్తల వైశిష్ట్యమును, ఈ పదములలోని కవితా సౌందర్యమును బ్రదర్శించుచు శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారు

'కిన్నెర' (జనవరి, 1955)లో నొక చక్కని వ్యాసమును బ్రకటించి యున్నారు.

పసగాడ సన్యాసి యను జానపద పదకవి 1850 ప్రాంతము వాఁడు. ఇతఁడు సారంగధర చరిత్ర, శతకంఠ యుద్ధము (శతకంఠ రామాయణము), గంగావివాహము– అను మూఁడు పదములను రచించెను. వీనిలో గంగావివాహము మిక్కిలి ప్రశస్తమగు రచనము. దీనిని కవి నలనామ సంవత్సరము (క్రీ.శ. 1856)లో రచించినట్లు చెప్పుకొనినాఁడు. ఇది 1901లో ముద్రింపఁబడినది (ప్రకాశకులు: పమ్మి అరుణాచలశెట్టి, మద్రాసు). ఇది స్కాందపురాణములోని కథ. సన్యాసికవి ఈ కథకుఁ జక్కని తెలుఁగు వాతావరణమును గల్పించినాఁడు. ఏలూరును కథాస్థలముగాఁ జెప్పినాఁడు. అవకాశ మున్నచోటులందెల్ల పురవర్ణన, నగలు, విందులు మున్నగు వర్ణనలు చేసినాఁడు. ఏలూరులో నలుబదినాలుగు కులములవారు గలరఁట. ఈ నలుబదినాలుగు కులములవారికిని నలుబదినాలుగు వీథులున్నవఁట. ప్రతికులమునకును నొక్కొక్క రకము మొక్క గుర్తఁట.

'గంగావివాహము'లోని సంభాషణలు అతిసహజముగను, సంవాదములు చమత్కారములుగను నున్నవి. గంగా– గౌరుల సంవాదములోఁ దెలుఁగు మాటల నానార్థ చమత్కారమును జూడుఁడు:–

*గౌరి: "ఉన్న చోటన నన్ను ఉండమన్నందుకు*
*తప్పక నీ జిహ్వా తరిగింతు గంగ"*

*గంగ: నీవు తరిగిన కూర నేను తరిగిన కూర*
*వండి వడ్డింతుమే వనిత గౌరమ్మ!*

*గౌరి: చెంపకాయలు గొట్టి చెవులూడ దీతునా*
*జగడ పోతులమారి జాలారి గంగ!*

*గంగ: నీవు గొట్టిన కాయ నేను గొట్టిన కాయ*
*గంప నింపింతుమే కాంత గౌరమ్మ!"*

ఈ పసగాడ సన్యాసి కవిత్వము నిండ లోకోక్తులు, నానుడులు, జాతీయములు నున్నవి. ఒక ప్రక్క సులభశైలిలో వ్రాయుచునే, కొన్ని చక్కని భాషాలంకారములను గూడఁ బ్రదర్శించినాఁడు. గంగాదేవిని వర్ణించుచుఁ గవి యిట్లనును:–

*"ఇతర మెరుగని బాల, ఎన్నంగ కడులోల*
*ఘనత సద్గుణ జాల, కడు పుణ్యశీల*
*వన్నె మీరిన కలువ, వాసించు చెంగలువ*
*అలరు కప్పుర గంధి, అందాల గంధి"*

వివాహ సందర్భమున గంగకు శివుఁడు మంగళసూత్రమును గట్టఁగాఁ గవి యిట్లు చమత్కరించును:–

*"అఖిల బంధము లెల్ల నణగించు గంగను*
*బంధించె పోగుచే పార్వతీశుండు*
*పదునాల్గు లోకములు ప్రౌఢిమీరిన గంగ*
*తనరంగ నూలుపోగున గట్టబడెను"*

మార్గకవులనుండియుఁ, బూర్వగ్రంథములనుండియు నితివృత్తముల ననుకరించుటయే కాక, వర్ణనలను సహితమనుకరించి, సులభశైలిలో రచించిన పదకవులును గలరు. అట్టి వారిలోఁ బూడిపెద్ది బుచ్చన్నపంతులుగారొకరు. ఈయన 20వ శతాబ్ది ప్రారంభమున విశాఖపట్టణములో 'గవర్నర్సు ఏజంటు కోర్టు'లో న్యాయవాదిగా నుండెను. ఈయన సంస్కరించిన లక్ష్మణమూర్ఛ విశేషప్రచార మందినది. ఇందితఁడు భాస్కర రామాయణ కథను గ్రుడ్డిగా ననుకరింపక, కొన్ని సందర్భములలో నితర పూర్వకవుల వర్ణనలను దృష్టిలోనుంచుకొని పెంచి రచించినాఁడు. భాస్కర రామాయణములో నొక్క కందపద్యములోఁ జెప్పబడిన కాలనేమి తపోవన వర్ణనను బుచ్చన్నకవి యెట్లు పెంచెనో చూడుఁడు:–

భాస్కర రామాయణములోని వర్ణన:–

*క॥ "తమలోన సహజమగు వై*
*రము దక్కి, మృగేంద్ర కుంజరంబులు, శార్దూ*
*ల మృగములు, బర్హిణ భుజం*
*గమములు, మక్కువలు గలిగి కడునొప్పారన్"*

బుచ్చన్నకవి ఇదే సందర్భమున లక్షణమూర్ఛలోఁ జేసిన వర్ణన:–

*"హంసలు చిలుకలు అరమరలు లేకుండ*
*నొండొరులతో గలిసియుండు నీ వేళ*
*ఎలుకలును పిల్లులును ఏమి వైరము లేక*
*కూడి యాడుచునుండు వేడుకలు మీర*
*సింహంబు లేనుగులు చింతాకువాసైన*
*వైరంబు లేకుండ వనములను దిరుగు*
*పులులు మందలు గలిసి పోరేమియును లేక*
*సంతసింపుచునుండు సర్వకాలములు*
*నెమిలి బృందములును నేటైన పాములును*
*కూడి మసలుచునుండు కుదురుగా నెపుడు"*

బుచ్చన్నకవి జేసిన పై వర్ణన, నన్నయ ఆదిపర్వములో దుష్యంతుని కథలో వచ్చు తపోవన వర్ణనను జ్ఞప్తికిఁ దెచ్చుచున్నది.

పూర్తిగాఁ బ్రబంధ ధోరణిలో నడిచిన పదములును గలవు. అట్టి వానిలో పూరి నారాయణరాజు రచించిన 'ధర్మాంగద చరిత్ర– పాముపాట' యెన్నఁదగినది. ఇది అద్భుత ప్రధానమైన రచన. కవి దీనిని 'ఆశ్చర్యకథ' యనినాఁడు. ఈ కథను గౌతముఁ డహల్యతోఁ జెప్పినట్లు గలదు. కాశ్మీర దేశము నేలు ధర్మాంగదరాజునకు నర్మిలీ దేవియందు చిత్రాంగదుఁడను పాముపుట్టెను. మాణిక్య పురమునేలు

రత్నాంగుని పుత్రిక త్రైలోక్య సుందరిని ఆ పామునకుఁ బెండ్లి సేయుదురు. ఆ సుందరి యా పాముతో దివ్యక్షేత్రములన్నియును దిరిగి, మహర్షుల కరుణచే నా పామునకుఁ దిరిగి మనుష్యరూపమును గలిగించుకొనుట యిందలి కథ. ఈ కథలోఁ బురవర్ణనలోఁ బ్రబంధములలో వలెనే చాతుర్వర్ణ్య, గజ, హయ, వేశ్యావర్ణనలు గలవు:–

*"సంగీత సాహిత్య సరసవిద్యలు గలిగి*
*వేదములు వల్లించు విప్రులే కలరు*
*చదువు సాములచేత చాల పెంపొందుచును*
*రాజు లా పురిలోన తేజమున గలరు*
*అల కుబేరుని రాజ్య మతని పట్టణమెల్ల*
*కుదువ బట్టగ జాలు కోమట్లు గలరు*
*పలుకు బొంకులు లేక పలు సంపదలతోను*
*శూద్రులా పురిలోన సొంపొంద గలరు"*

ధర్మాంగుని పుత్రునకుఁ బెండ్లిసేయుటకై అన్వేషించుచు బ్రాహ్మణులు ముప్పది నాలుగు దేశములు తిరిగినట్లు వర్ణింపఁబడినది:

*"అంగ వంగ కళింగ బంగాళ నేపాల*
*పాంచాల మలయాళ బహురాజు లిండ్లు*
*కాంభోజ సింహళ కామరూపాధీశ*
*పాంచాల సౌవీర జననాథు లిండ్లు*
*మాళవ మహారాష్ట్ర మలయాళ కురుభోజ*
*ద్రవి డాంధ్ర కర్నాట ధరణీశు లిండ్లు"*

త్రైలోక్య సుందరి విరాగిణీ వేషమునఁ దలపైఁ బాముల బుట్టనుంచుకొని నూటపదునాఱు దివ్యస్థలములు తిరిగినట్లుగా వర్ణింపఁబడినది. ఇట్టీకథ ప్రబంధమార్గమున నడచినది.

ఈ పదకవుల నామములతోపాటు కాలమును గొంత వఱకును దెలియుచున్నవి. పసగాడ సన్యాసి క్రీ.శ. 1850 ప్రాంతము వాడు, పూరి రామచంద్రరాజు 1862 ప్రాంతమువాఁడు, పూరి నారాయణరాజు 1874 ప్రాంతమువాఁడు, తోలేటి సీతారామయ్యది 1880 ప్రాంతము, మదిశావ గోపాలునిది 1890 ప్రాంతము, పూడిపెద్ది బుచ్చన్నది 1896 ప్రాంతము, మంథా సుబ్బరాయశాస్త్రిది 1922 ప్రాంతము, అయ్యగారి కూర్మనాథుఁడు 20వ శతాబ్దము వాఁడు.

ఈ పదకవులందఱును విశాఖ–విజయనగర– శ్రీకాకుళ మండలములవారు. ఇవి అక్కడి జానపదులలో మిక్కిలి ప్రచారమున నున్నవి. మాల మాదిగలు 'దాసరు'లను పేర వీనిని జముకులపై శ్రావ్యముగాఁ బాడుచుందురు. ఈ పదముల వరుసలత్యంత మధురముగా నుండును. ఆధునికములగు బుఱ్ఱకథలలోఁగూడ నీ పదముల వరుస 'జముకుల వరుస' యను పేర ననుకరింపఁ బడుచున్నది. కొందఱు ఆధునికులు బొబ్బిలివరుస కథలకును జంగంకథలకును అనుకరణములుగా బుఱ్ఱకథలు రచించినట్లే, మఱికొందఱు ఈ పదముల కనుకరణములుగా 'జముకుల కథలు' వ్రాయుచున్నారు. అట్టివారిలోఁ బశ్చిమ గోదావరి జిల్లా, తాడేపల్లిగూడెము తాలూకా, 'కృష్ణాయపాలెము'లో నున్న వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు పేర్కొనఁదగినవారు. వీరు 1947–1956 మధ్యకాలములో "ఆజాదు హిందుఫౌజు, రాణీ సంయుక్త, అజామిళోపాఖ్యానము, భక్తప్రహ్లాద, గాంధీజీ నిర్యాణము, నేతాజీ సుభాసుచంద్ర బోసు అంతర్ధానగాథ"– మున్నగు జముకుల కథలను రచించియున్నారు.

## శారద పదములు:–

ఇట్లు ఖండగతి ద్విపదచ్ఛంద సమ్మేళనమున సాఁగెడి హరిహరీ పదములే కాక, 'శారదపదము'లను వేఱొక ప్రక్రియ కూడఁ దెలుఁగునందుఁ గానవగును. శారదపదములొక ప్రత్యేకచ్ఛందమున నంత్యప్రాసలతో సాఁగు దరువులు. సాధారణముగాఁ బాదమునకుఁ బదునాఱు మాత్రలుండును. వీనియందు తాళపు బిగుతు హెచ్చు. వీని నొక విధముగా నృత్తగీతములు (dance songs) అనవచ్చును. ఇవి యెక్కువగా అటతాళమున సాఁగుచుండును. సంగీతజ్ఞానము లేనివారికిఁ గీర్తనలగాథలు రుచింపనట్లే, తాళజ్ఞానము లేనివారికి ఈ శారదపదములును రుచింపకపోవచ్చును. అందుచే వీనిని జానపద కవిత్వ మనుటకంటె, జాతిదేశి కవిత్వమనుట సమంజసము.

తెలంగాణమున 'శారదకాండ్రు' అను గాథాకారులున్నారు. వీరు పాడుచుండు కథలగుటచే వీనికి 'శారద కథలు' లేక 'శారద పదములు' అను పేరు వచ్చియుండును. ఈ శారదకాండ్రకు అంత్యప్రాస యనిన మిక్కిలి యిష్టమఁట. శారదపదము లన్నియును నంత్య ప్రాసలలోనే యుండును. కాని తెలంగాణములోని శారదకాండ్రు పూర్వము ఈ శారదపదములను బాడెడివారేమో కాని, నేఁడు వీరెక్కువగా బొబ్బిలివరుస కథలనే పాడుచున్నారు. కావున శారదకాండ్రు పాడెడి పాటలన్నియును శారదపదము లనుట పొసగదు. జంగంకథలన్నియును నేఁడు జంగములచేఁ బాడఁ బడుటలేదు. నేఁడు జంగములుకూడఁ జారిత్రక సాంఘిక ఇతివృత్తములలో నున్న బొబ్బిలివరుస కథలనే పాడుచున్నారు. అంత్యప్రాసల నియమముతో నుండు నీ శారద వరుసలు యక్షగానములలోను, వీథినాటకములలోను, స్త్రీలపాటలలోను గూడఁ గానవచ్చుచున్నవి. ఈ శారదపదములలో "ఔ శారదా కరుణానిధీ!" అనియు, "ఓ భారతి కరుణా మతి, భళి శారద కరుణానిధి" అనియుఁ బ్రతిచరణాంతమునను బల్లవి యుండును. ఈ పల్లవినిఁబట్టి కూడ 'శారదపదము'లను పేరు వచ్చియుండును. 'జంగంకథ' యను శబ్దము వీరగాథల శీర్షికలకుఁ జివర చేరఁగా, నీ 'శారద' శబ్దము వీరగాథల

శీర్షికలకు ముందు చేర్చి వ్యవహరింపఁబడుచుండును. "శారద రామాయణము", "శారద హరిశ్చంద్ర"- ఇత్యాది.

ఈ శారదపదములు తాళప్రధానమగు వరుసలో నుండుటయే కాక, సాహిత్యమునందుఁ గొంత మార్గధోరణినిఁగూడఁ బ్రదర్శించు చుండును. "ఈ రచనములందు అంత్యప్రాస నియమముండును. ఇతర జానపదగేయములకన్న నీ పాటలందు కొంత సాహిత్యభాగము అధికము."[6] ప్రత్యేక శిల్పమును జూపుచు రచింపఁబడిన ఈ శారద పదములు జానపదగేయములు కానేరవు.

ఈ శారదవరుసలో నొక్కొక్క పాదమున మాత్రల క్రమము 3+5+5+3 గా నుండును. ఒక్కొక్కప్పుడు మొదటి గణములో రెండు మాత్రల సాహిత్యాక్షరమే యుండును. కాని పాడునప్పుడది మూఁడు మాత్రలుగనే యుండును. రామభక్తకవివర్యుఁడు రచించిన శారద రామాయణము[7]లోని ఈ క్రింది చరణములు శారదవరుసకు ఉదాహరణములు కాఁగలవు.

ఆడు॥ *"తల్లి, కొడుకు నెత్తుక ముద్దు, లాడు*
*మోద, మలరంగ, ననుగన్న, వాడు*
*నా, వెలలేని, మానికము, వీడు*
*నా, కులదీప, కుండైన, వాడు*
*నా, ముద్దుల, య్యకు జోడు, లేడు*
*నా, పురుష సిం,హపు పిల్ల, వీడు*
*నా, పంజరపు, పై చిలుక, వీడు*
*అనుచు, కౌసల్య, యిటుముద్దు, లాడు*
*ఔ శారదా! కరుణానిధీ!"* (-బాలకాండము, పుట.2)

అట్టె॥ *"అంత, సుగ్రీవు, డొక బొబ్బ, పెట్టె*
*వాలి, కప్పుడే, కోపంబు, పుట్టె*
*ఇద్దరికి పెద్ద, యుద్ధంబు, బుట్టె*
*రామ, చంద్రుండు, కాచి కని, పెట్టె*
*చెట్టు, చాటున, విల్లెక్కు, పెట్టె*
*దెబ్బ, తో వాలి, నపుడు పడ, గొట్టె*
*ఓ శారదా! కరుణానిధీ!"*

ఈ శారదవరుసలో రామభక్తకవి రామాయణమే కాక మఱికొన్ని కథలుగూడ నున్నవి. సారంగధర చరిత్ర, గోపికా వస్త్రాప హరణము (పూడిపెద్ది బుచ్చన్న రచన 1898), శ్రీ శారద హరిశ్చంద్ర పదము (వేదా వెంకటకృష్ణయ్య రచన, 1908), మైరావణ చరిత్ర, రుక్మిణీ కల్యాణము మున్నగునవి శారదపదములే.

## జంగంకథలు:-

'జంగములు పాడెడి కథలు జంగంకథ'లను నిర్వచనము వీనికి సరిపడదు. బొబ్బిలివరుస కథలనుగూడ జంగములు పాడుచున్నారు. అంతమాత్రమున నవి జంగంకథలగుట లేదు. అట్లే 'శైవమతమునకు శైవభక్తులకు సంబంధించిన కథలు జంగంకథ' లనుటయుఁ బొసగదు. రుక్మిణీ కల్యాణము, వేణుగోపాలస్వామి పరిణయము, రామదాసుకథ మున్నగు వైష్ణవగాథలును జంగంకథలుగా రచింపఁబడియున్నవి. అందుచేతనే శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారిట్లనినారు: "జంగంకథ అన్నపేరు శైవమును ధ్వనించినా, ఆ రీతి పక్షపాతము ఈ కథలలో కనబడదు."[8] కావున జంగంకథ లనునవి యక్షగానములు, హరికథలు, పదములు, స్త్రీలపాటలు మున్నగువానివలె దేశిసాహిత్యమునకుఁ జెందిన యొక ప్రత్యేక రచనాప్రక్రియ యని గ్రహింపవలెను. ఈ ప్రక్రియయొక్క ప్రత్యేకతను నిరూపించుటకే కాఁబోలును శీర్షిక కనుసంధింపఁబడి 'జంగంకథ' యను పేరుండును. ఉదా॥ 'వామనచరిత్ర జంగంకథ', 'గయోపాఖ్యానము జంగంకథ' ఇత్యాది. ఒకే కథకు స్త్రీలపాట, జంగంకథ, పదము, యక్షగానము, హరికథ, చిఱుతలకథ-మున్నగు రూపము లుండుటవలనఁ గూడ నివి ప్రత్యేక లక్షణములతో నొప్పు భిన్నప్రక్రియలని నిరూపితమగుచున్నది.

పదములు విశాఖ మండలమునుండి వచ్చినట్లే, ఈ జంగంకథ లెక్కువగా గుంటూరు మండలమునుండి వచ్చినవి. ఇవి పదములంత ప్రాచీనమైనవికావు. పదములవలెఁ దాళపత్ర రూపమున నున్న జంగం కథలేవియును గ్రంథాలయములలో లభించుటలేదు. కావున వీని ప్రాచీనత (1967 నాఁటికి) యఱువది డెబ్బది యేండ్లకన్న వెనుకకుఁ బోదు. క్రీ.శ. 1850 నుండి పదములు వ్యాపింపఁగా, నీ జంగంకథలు 20వ శతాబ్ది ప్రారంభమునుండి ముప్పది నలుబది యేండ్లపాటు ప్రచారమున నున్నవి. తరువాత నీ జంగంకథలే బుఱ్ఱకథలుగాఁ బరిణమించినవి.

జంగంకథలను సృజించినవారు జంగములే. ప్రాచీన కాలమునఁ బాదమునకు నాలుగు 'కిటతకిట' యావృతములుండు జానపదచ్ఛందస్సులనుండి పాల్కురికి సోమనాథునివంటి పండిత కవులు ద్విపదను సృజించినట్లే, ఈ జంగములు పదునెన్మిదవ శతాబ్దమునుండియు వ్యాపించియున్న బొబ్బిలివరుసకు (8+8+9 లేక 10 మాత్ర లొకపాదముగా నుండు వరుసకు) యతిప్రాసలు బిగించి 'రగడ' నేర్పఱిచి, ఈ రగడతోఁ గథను వివరించుచు, మధ్య మధ్య కీర్తనలు, దరువులు, పద్యములు, అర్ధపద్యములు, వచనములు చేర్చి 'జంగంకథ'ను సృష్టించిరని నా తలంపు. ఈ కీర్తనలను దరువులను వాగ్గేయకారులనుండియు, యక్షగానములనుండియు గ్రహించియుందురు. జంగంకథలలోని 'రగడ'కు ఈ క్రింది పాదములు ఉదాహరణములు:

**8 + 8 + 9**

***"ఇందిర కుచముల, పై మర్యాదన్, జెందు కరద్వయము***
***క్రిందైె పయినా, హస్తములుండుట, కీర్తి కాదె నాకు"***

(వామనవిజయము జంగంకథ)

ఇందు 1-17 అక్షరములకు యతి. ప్రతి రెండు పాదములకుఁ బ్రాస యుండును. కొన్నిట నంత్యప్రాసయుఁ గాననగును.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు మన జంగంకథలు మహారాష్ట్రుల 'కాలక్షేపము'లకు 'తర్జుమా' లని తలంచుచున్నారు. ఇదియును సమంజసముగనే యున్నది. మహారాష్ట్రులలోనున్న 'డోరా' లేక 'తౌహరా' అను ఛందస్సునకును నీ జంగంకథలలోని 'రగడ'కును జాల దగ్గఱ సంబంధ మున్నది. హరికథలలోని 'మంజరి' లేక 'మంజుగతి' యను ఛందస్సుకూడ మహారాష్ట్రుల డోరాలనుండి పుట్టినదే. జంగంకథల యుత్పత్తి ప్రాచీనతలనుగూర్చి శ్రీపాదవారి యభిప్రాయమిట్లున్నది: "అందముగా అలంకరించుకుని అడుగులు వేస్తూ కథలు చెప్పే స్థలపతి జంగములు కీర్తనలనూ, వచనాలనూ, పద్యార్ధ దరువులనూ చేర్చి జంగముకథలను నిర్మించారు. ఇది ఇటీవలనే జరిగియుండవలెను. ఏమంటే, జంగముకథలు నూటికి తొంభయి గుంటూరు జిల్లాలో ఇటీవల రచింపబడి అచ్చైనవే కనబడుతున్నాయి. ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములలో తాటాకు పుస్తకాల మీద ఏవీ కనబడటము లేదు. అంటే ఇవి (1967 నాటికి) నూరేండ్ల-కాదు అరవై యేండ్ల లోపువే ననాలేమో! మహారాష్ట్రుల 'కాలక్షేపము'లకు తెలుగువారి జంగంకథలు ప్రతిబింబాలనవచ్చునేమో! హరికథలన్నవి నారాయణదాసుగారు అవతరించేదాకా వన్నెకెక్కి ప్రచారము పొందలేదు. కనక జంగంకథలే కాలక్షేపములకు తెలుగు తర్జుమాలనాలి."[9]

డా॥ బి.రామరాజుగారు దక్షిణదేశములోని యక్షగాన ప్రభావముచే నీ జంగంకథ లేర్పడినవని భావించుచున్నారు. "తెలుగునాటి యక్షగానము తంజావూరికి తరలిపోవుటతో దక్షిణాదిలో పాటలుగా వ్యాప్తినందిన పదములు, దరువులు, తలుపు దగ్గర పాటలు (విజయరాఘవుని విప్రనారాయణ చరిత్రలోవలె) యక్షగానములలో ప్రవేశించినవి. ఈ యక్షగానములు కూచిపూడివంటి భాగవత కేంద్రములకు తిరిగి వచ్చినవి. వీనియందలి దరువుల యుద్ధృతిలో జానపద గేయకథలలో కీర్తనలు ప్రవేశించినవి. గుంటూరు మండలమున నీ శతాబ్ది ప్రారంభమున పుట్టిన జంగంకథలన్నిటను రగడరూపములో కథయును, మధ్య మధ్య కీర్తనలు, దరువులు, వచనములు కనబడుచున్నవి."[10]

'జంగంకథ-హరికథ-యక్షగానము' ఈ మూఁడింటికిని భేదము చాల తక్కువ. రాయలసీమలోని వీధినాటకములు (బయలాటలు), తెలంగాణములోని చిఱుతలకథలు గూడఁ గొంతవఱకును బైవానిని బోలియుండును. వీనియన్నింటను గీర్తనలు, దరువులు, పద్యములు, పద్యార్ధములు, వచనములు సాధారణము. కాని జంగంకథ, హరికథ యను ప్రక్రియలు శ్రవ్యరూపమునఁ గథాఖ్యానమునకు ఉద్దేశించినట్టివి. యక్షగానములోఁ గొంత దృశ్యము కొంత శ్రవ్యము. దృశ్యముకన్న శ్రవ్యమే అధికమని చెప్పవచ్చును. అందుచేతనే 'రాములవారి యెఱుక, సుగ్రీవ విజయము' మున్నగు యక్షగానములు కొన్ని స్త్రీలపాటలుగాఁ జెలామణి యగుచున్నవి (వీనిని ముత్తయిదువలు పాడుచుండగా నేను వినియున్నాను). యక్షగానములు ప్రదర్శనమునకుఁగాక శ్రవ్యరూపమునఁ గథాఖ్యానమున కుద్దేశించిన వనియు, ముఖ్యముగా స్త్రీలు పాడుకొనుట కుద్దేశించిన వనియుఁ గొందఱు యక్షగానకవులే చెప్పుకొని యున్నారు. 'తులాభారము' లేక 'పుణ్యక వ్రతము' అను యక్షగానమున దాని రచయిత ఫలశ్రుతిగా నిట్లు వ్రాసెను: "ఉవిదలు ఈ పాట పాడినను వినిన, సిరియు సంపద గలిగి స్థిరముగా నుంద్రు". ఆదిభట్ల నారాయణదాసుగారు శ్రవ్యమున కుద్దేశించిన తన హరికథల నన్నింటిని 'యక్షగానము'లని పిలిచినారు. మొత్తముమీఁద యక్షగానములలో దృశ్యము కొంత, శ్రవ్యము కొంత కలదని యంగీకరింపవలెను. వీథినాటకములు, చిఱుతలకథలు మాత్రము పూర్తిగా దృశ్యమున కుద్దేశించినవే.

జంగంకథకు యక్షగానముతోకన్న హరికథతో దగ్గఱ సంబంధమున్నది. హరికథలోఁ గథాఖ్యానము 'మంజరి'లో నడచును. జంగంకథలో 'రగడ'లో నడచును. ఈ యొక్క భేదము తప్ప, తక్కిన దంతయు రెండింటికిని సమానమే. ఈ మంజరి-రగడలకుఁ గూడ భేద మెక్కువగా లేదు. రెండును నొకే నడకలో నుండును. మంజరీ పాదముచివర, రగడ పాదముకన్న రెండు మాత్ర లెక్కువగా నుండును. అంతియ భేదము. యక్షగానములలోఁ గథ ద్విపదలలోఁ జెప్పఁబడును. జంగంకథ హరికథలలో లేని పాత్రప్రవేశము యక్షగానములో నుండును. జంగంకథకును యక్షగానమునకును గల భేదము లీ రెండే.

పదములవలెనే జంగంకథలుకూడఁ బౌరాణికేతివృత్తములు కలిగియుండును. పదము లెక్కువగా రామాయణకథలను స్వీకరింపఁగా, జంగంకథలు, భారతమునుండి యెక్కువ కథలను స్వీకరించి నట్లున్నవి. జంగంకథలలోఁ గీర్తనలుండుటవలన రచయిత నామమును సులభముగాఁ గనుగొనవచ్చును.

ధేనువకొండ వెంకయ్య లేక వెంకటాచలపతి- విరాటపర్వము (ప్రథమ ద్వితీయాశ్వాసములు), గయోపాఖ్యానము, వామన విజయము; ఉప్పలపాటి వెంకటరామయ్య- అంబరీషోపాఖ్యానము, శ్రీకృష్ణ విజయమను బాణాసుర యుద్ధము; గంజి నాగదాసు లేక నాగయ్య వరకవి- శ్రీయాళమహారాజు చరిత్రము, కామమ్మ చరిత్రము; గ్రంధి వెంకట సుబ్బరాయగుప్త- దేవయాని చరిత్రము, వామన విజయము; రూపెనగుంట్ల సీతారామదాసు- హరిశ్చంద్రోపాఖ్యానము, మార్కండేయోపాఖ్యానము, యల్లమంద కోటీశ్వర చరిత్ర; కిలారి బ్రహ్మయోగి- భల్లాణ రాయచరిత్రము; పుసులూరి వేంకట సుబ్బరాయ కవి- యక్షప్రశ్నలు; మారెళ్ల కుప్పుస్వామినాయుడు- అర్బత్ నాట్ హావుస్ చరిత్రము; చంద్రగిరి చిన్నయ్య- శశిరేఖా పరిణయము, విరాటపర్వము దక్షిణగోగ్రహణము (తృతీయాశ్వాసము); మేడూరి నరసింహాచార్య కవి- అహల్యా సంక్రందనీయము, వామన చరిత్రము;

కంకిపాటి వెంకట సుబ్బరాయగుప్త- తులసీ మాహాత్మ్యము; వేంకటపతిదాసు- మల్లమ్మదేవి చరిత్రము; చిల్లర వేంకటేశ్వరకవి- సారంగధర చరిత్రము; అన్నమరాజు సుబ్బారావు- చంద్రహాసుని కథ; తూళ్లూరు మాధవరాయకవి- నిజలింగ చిక్కయ్య కథ; ఉద్దండ నాగలింగం- కాళీయమర్దనము; జి. గోపాల్‌నాయుడు- పద్మవ్యూహము; పులికొండ పరబ్రహ్మకవి-'పోతులూరి వీరబ్రహ్మస్వామి'; కంచర్ల సూర్యనారాయణరావు- చిత్రకేతూపాఖ్యానము; సరికొండ వెంకట అప్పలరాజు- శాకుంతల చరిత్రము; బత్తుల లక్ష్మయ్య- సులభోపాఖ్యానము, మంగళాచల మాహాత్మ్యము, సావిత్రీ కల్యాణము, దక్షిణ గోగ్రహణము; కిన్నెర వీరాస్వామి- 'కమ్మవారి పణతి: పసల బాలరాజు కథ'; మాణిక్యము రచించిన రుక్మిణీ కల్యాణము; అడిగోపుల వెంకట రంగకవి ద్రోణపర్వము; నాగలింగము- సారంగధర చరిత్రము; గాయకవాడ పెద్దన- నలోపాఖ్యానము; చీమకుర్తి వీరరాఘవయ్య- రామదాసు జంగంకథ, వేణుగోపాలస్వామి పరిణయము; రామానుజదాసు- అంగమ్మ చరిత్ర; రాయపురపు సుదర్శనదాసు- పురందరదాసు చరిత్ర, ఘోరా కుంభారు చరిత్రము, సక్కుబాయి చరిత్రము- ఇవన్నియును కవుల నామములు తెలిసిన జంగంకథలు. కవుల పేర్లు తెలియక గ్రంథముల నామములు మాత్రము తెలిసినవి: సైంధవ పరాభవము, రుక్మాంగద చరిత్ర, అనసూయ జంగంకథ, విరాటపర్వము-ఉత్తర గోగ్రహణము, చిత్రసేన మహారాజు కథ మొదలగునవి.

పైన తెల్పిన జంగంకథలన్నియును ముద్రితములైనవే. అముద్రితములగు కొన్ని జంగంకథల వ్రాతప్రతులు నాకుఁ గృష్ణా మండలమున లభించినవి. ఇందుఁ గొన్నిటికిఁ గవులు తెలియు చున్నారు. మఱికొన్నింటికిఁ దెలియుట లేదు.

తారాచంద్ర విలాసము- తూళ్లూరి పిచ్చయ్య

ద్రౌపదీ కల్యాణము- ?

హరిశ్చంద్ర కథ - ?

సావిత్రీ కల్యాణము - ?

భీమార్జున గర్వభంగము- గుడివాట కుటుంబదాసు

పద్మవ్యూహము - భట్టు కోటయ్యదాసు

ద్రోణ సంహారము - భట్టు కోటయ్యదాసు

నెల్లూరు మండలమున నాకు అడిగోపుల వెంకట రంగకవి రచించిన 'పోతులూరి వీరబ్రహ్మంగారి జీవితగాథ, శ్రీ భావనాముని చరిత్ర, భీష్మపర్వము' అను జంగంకథల వ్రాతప్రతులు లభించినవి.

పైన తెలుపఁబడిన ముద్రితాముద్రితములగు జంగంకథలలో విరాటపర్వము (ప్రథమ ద్వితీయాశ్వాసములు), ఉత్తర గోగ్రహణము, దక్షిణ గోగ్రహణము, గయోపాఖ్యానము, దేవయాని చరిత్రము, హరిశ్చంద్రోపాఖ్యానము, యక్షప్రశ్నలు, చంద్రహాసునికథ, పద్మవ్యూహము, శాకుంతల చరిత్రము, ద్రోణపర్వము, నలోపాఖ్యానము, సైంధవ పరాభవము, చిత్రసేన మహారాజు కథ, ద్రౌపదీ కల్యాణము, భీష్మపర్వము, భీమార్జున గర్వభంగము, శశిరేఖా పరిణయము- మున్నగునవి భారత సంబంధములగు కథలు. వామన విజయము, అంబరీషోపాఖ్యానము, బాణాసుర యుద్ధము, తులసీ మాహాత్మ్యము, కాళీయమర్దనము, రుక్మిణీ కల్యాణము, రుక్మాంగద చరిత్ర, అనసూయ కథ- మున్నగునవి భాగవత సంబంధమగు పురాణ గాథలు. నిజలింగ చిక్కయ్య కథ, సారంగధర చరిత్ర, శ్రీయాళ మహారాజు చరిత్ర, భళ్లాణరాయ చరిత్రము, మార్కండేయో పాఖ్యానము- మొదలగునవి శైవమత సంబంధములు. రామదాసుకథ, పురందరదాసు చరిత్ర, ఘోరా కుంభారు చరిత్రము, సక్కుబాయి చరిత్రము- ఇవి విష్ణుభక్తుల గాథలు. కామమ్మ చరిత్రము, అర్బుత్‌నాట్ హవుస్ చరిత్రము- సాంఘికములు.

మొత్తముపై జంగంకథలలో మహాభారత సంబంధములగు కథలు ఎక్కువగా నున్నవి. వీరగాథలలో పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు, పదములు- వీనిని పాడునప్పుడే కాక మార్గకావ్యములవలె చదువునప్పుడు కూడ నానందింపఁగలము. శక్తికథలు, బొబ్బిలివరుస కథలు- వీనిని పాడునప్పుడు సంపూర్ణ తృప్తికలుగును; చదువునప్పు డక్కడక్కడ మాత్రమే రసవద్ఘట్టములు మనస్సు నలరించును. ఇఁక నీ జంగంకథలు కేవలము పాడునప్పుడు వినవలసినవి మాత్రమే. వీనిని చదివి యానందించుట ఇసుమునఁ దైలము తీయుటయే! కవితారసహీనములును కథాఖ్యాన ప్రధానములును నగు నీ రచనలు గుమ్మెటల యార్భాటముతో, గజ్జెల చిందులతో, ఛందోవైవిధ్యముతోఁ బాడునప్పుడు రసవంతములుగఁ గన్పట్టును. శ్రీపాదవారు జంగం కథల కవితారాహిత్యము నిట్లు వెల్లడించిరి: "జంగంకథలలో కథ నేరుగా సాగిపోతుంది. కథనము తప్ప కవితా సౌందర్యమేమీ వుండదు వాటిలో. ఆ లోటు కప్పిపుచ్చడానికేనేమో కథకుని వేషమూ, చిందులూ, గుమ్మెటల ఘుంమంఘుమలున్నూ. ఛందోవైవిధ్యంకూడా కొంత తోడ్పడుతుంది వీటికి."[11]

డా॥ బి. రామరాజుగారుకూడ జంగంకథలు కవితా పాటవమున బొబ్బిలివరుస కథలకు దీటురావని భావించుచున్నారు: "జంగంకథ కథనముకన్న కాలక్షేపము వైపునకే ఎక్కువ మ్రొగ్గు చూపినది. కనుకనే కాబోలు జంగంకథలలో సొగసులు చాల తక్కువగా నుండును. కథనమునకే యధిక ప్రాధాన్యమిచ్చి, రగడయందే సాగిన బంగారు తిమ్మరాజు కథ, బొబ్బిలి కథ, దేశింగురాజు కథ వంటి కథాగేయములు దేశమంతటను వ్యాపించి సర్వజన సమ్మతమైనది."[12]

హరికథలవలెను, యక్షగానములవలెను, జంగంకథలుగూడఁ బ్రౌఢరచనలే కాని జానపదరచనలు కావు. జానపదరచనలగు బొబ్బిలివరుస కథలకును వీనికిని పోలికయే లేదు. ఇతివృత్తములు పౌరాణికములు, భాష-మార్గమునకుఁ జెందినది, ఛందస్సులో నొక్క

రగడ తక్క తక్కినవన్నియును మార్గచ్ఛందములే. సంగీతాంశముగూడ సాధారణ వీరగాథలకన్న హెచ్చు. అనేక రాగతాళములు వీనియందు ఉపయోగదును. ఇందలి రగడకూడ బొబ్బిలికథలోని ఛందస్సువలె అనిబద్ధముగానుండదు. యతులతోను, నాద్యంతప్రాసలతోను కరదుగట్టి యుండును. కావున జంగంకథలు సిసలైన వీరగాథలు కావు. అయినను నివి బొబ్బిలివరుస కథల నాధారముగాఁ జేసికొని పరిణమించినవగుటచేతను, బొబ్బిలివరుస కథలను పాడు జంగములే వీనినిగూడఁ బాడుచుండుటచేతను, గొన్ని వీరగాథాలక్షణములు వీనియందుఁ గానవచ్చుటచేతను, నీ జంగంకథలను వీరగాథలలో నొక భాగముగా స్వీకరింపవలసివచ్చినది.

అభివర్ధిత పునరుక్తి (Incremental Repetition) వీరగాథల ముఖ్యలక్షణములలో నొకటి. ఇది జంగంకథలలో నచ్చటచ్చట కానవచ్చుచున్నది. అన్నమురాజు సుబ్బారావుగారు రచించిన 'చంద్రహాసుని కథ'లో (దీనిని మద్రాసునుండి వి.మధురముత్తు ముదలియారు 1908లోఁ బ్రకటించెను) చంద్రహాసుని తండ్రి శత్రురాజుచేఁ జంపఁబడఁగా నతని తల్లి శోకించు సందర్భమున నీ యభివర్ధిత పునరుక్తి కాననగును (చూ. పుట.5). అట్లే కుంతల నగరమునఁగల మంత్రి చంద్రహాసునిఁ జంపించుటకై అరణ్యము నకుఁ బంపఁగా, నట బాలుఁడగు చంద్రహాసుఁడు రంగనాథునిఁ బ్రార్థించు సమయమునఁగూడ నీ యభివర్ధిత పునరుక్తి యున్నది.

కొన్ని సందర్భములందు సహజతకొఱకై పేర్లను వరుసగా ఏ కరువు పెట్టుట వీరగాథలలోఁ గాననగు నొక వారానువర్తనము (commomplace). పల్నాటి వీరకథలలో మలిదేవుని సభలోఁ గూర్చున్న వివిధ వీరుల వంశముల పేర్లు, మందపోటు చేసిన బోయల పేర్లు, ఆలమందలోని ఆవులపేర్లు, నలగాముని రక్షించిన కొదమగుండ్ల బ్రాహ్మణుల పేర్లు, కాటమరాజుకథలలో ఎద్దుల ఆవుల పేర్లు మున్నగునవి యిట్టివి. బొబ్బిలివరుస కథలలో వీరుల మిత్రుల పేర్లును నిట్లు పట్టికగాఁ జెప్పఁబడుచుండును. జంగంకథలలోఁ గూడ నీ లక్షణము కనఁబడుచున్నది. చంద్రహాసుని కథలోఁ జంద్రహాసుని పెండ్లికి సంభావనకై వచ్చిన వైదిక బ్రాహ్మణుల పేర్లు వరుసగాఁ జెప్పఁబడినవి. ఇందు హాస్యరసమున్నది:-

*"కాకినాడ శివ్వావధానులు - కౌతా సాంబయ్య*
*రేకపల్లి నరసింహశాస్త్రులు- తోకల మంగయ్య*
*చింతల తిమ్మన సోమయాజులు- చీకుల కోటయ్య*
*గంతుల పోతన, గంగన, చింపన- గరుగుల కోనయ్య*
*నక్కల వెంకన, నరుకుల భీమన- నాగుల శంభన్న*
*ముక్కు పొడుగు హనుమన్న, పావులూరి- తిక్కన్న గోపన్న*
*బోసినోటి లక్ష్మావధానులు- బోడి ప్రకాశయ్య*
*పూసపాటి నాగేశ్వరశాస్త్రి- పువ్వుల రంగయ్య*
*చేటచెవుల పరిదేశి, బట్టతల- సీతారామయ్య*
*పూట కూటికిని లేని రామయ్య- పోపూరి లింగయ్య"* (పుట. 22)

చంద్రహాసుని పెండ్లికి మంగళములు పాడవచ్చిన స్త్రీల పేర్లు గూడ నిట్లు వరుసగాఁ జెప్పఁబడినవి. సాధారణముగా నివన్నియును గల్పితములైనను, నిట్లు వరుసగాఁ గొన్ని పేర్లను ఏకరువుపెట్టుట వీరగాథా లక్షణము. (బొబ్బిలివరుస కథలలో వాని ఇతివృత్తములవలెనే ఈ పట్టికలు గూడ సత్యములే కాని కల్పితములు కావు. కుంటిపుల్లా రెడ్డి మిత్రులపట్టిక, రాజా రామేశ్వరరావు పరిచారకుల పట్టిక యథార్థములే.)

జంగంకథలలోఁ జెదురుమదురుగాఁ గొనింటఁ గొన్ని వర్ణనలలో, కొంతలోఁగొంత కవిత్వము ప్రదర్శింపఁబడుచున్నది. గంజి నాగదాసు రచించిన శ్రీయాళ మహారాజు చరిత్రములో, సంతానమును బడయుటకై కాశీ విశ్వనాథునిఁగూర్చి తపస్సు చేయఁదలఁచి శ్రీయాళ రాజు తన భార్య దేవమణిని బిలుచును. అప్పుడామె సౌందర్యమును, ఆమె యలంకరించుకొని సభకువచ్చిన తీరును కవి కడు రమణీయ ముగా వర్ణించినాఁడు:-

*"పున్నమ చంద్రుని మించిన మోము నెన్న దగిన కళలు*
*సరసీరుహముల బోలుచున్నవి సఖియ నేత్రయుగము*
*పల్కులు చిల్కల గారవించును పరమ సాధ్వికపుడు*
*తుమ్మెద వ్యూహము కన్న మించును కొమ్మ కురుల తీరు*
*నడకల జూచియు హంసలు చేరెను వడిగ సరసులకును*
*వింతగ కాముని హస్తము మెరయు పూబంతి యనగ నొప్పి...*
*సింగంబుల పరిహాసము చేయును అంగనామణి నడుము*
*కాంచన వడ్డాణంబు నడుమున మించి వెలుగ గాను*
*గజ్జెలందెలు కాళ్లయందున ఘల్లున మ్రోయగను*
*ముజ్జగములు మోహింప జేయగల మోహిని యనగాను*
*కాముని రాణి యటంచు జనంబులు ప్రేమతోను బొగడ*
*అత్యాశ్చర్యము నొంద జనంబులు నా సభ కరుదెంచె."*[13]

శ్రీయాళరాజ దంపతులు కన్నబిడ్డయగు సిరాలునిఁజంపి, యాతని మాంసమును వండి మాయాశివునకుఁ బెట్టు సందర్భమునఁ గరుణ బీభత్స రసములు బాగుగాఁ బోషింపఁబడినవి. శ్రీయాళ దంపతులు పుత్రునిపైఁగల ప్రేమతోఁ దలకాయనుదాచి, తక్కిన మాంసమును శివునకు వడ్డించిరి. అప్పుడు శివుఁడు వారినిఁ జూచి ఇట్లనును:-

*"ఓహో! రాజా! మాయ జేసితివి యొప్పుగాను వినుము*
*తలనులేని మాంసంబు భుజించుట తగదుర రాజేంద్ర!*
*కలనైనా భుజియింపగ జాలను గష్టము పెట్టకుము*
*తలను దెచ్చియును నీ సతి నీవును వెలయగ నొక రోట*
*త్రొక్కియు పెట్టగవలయును మీరును మక్కువతోడుతను"* [14]

చేయునదిలేక గుండెను ఱాయిచేసికొని, యా భక్తదంపతు లట్లే కుమారుని శిరస్సును దెచ్చి యొకరోటను వేసి దంచుచుఁ గన్నీరు

మున్నీరుగా నేడ్చుచుండిరి. అప్పుడు శివుఁడు వారిని మఱింత కఠినముగాఁ బరీక్షింపనెంచి ఇట్లనెను:–

*"ఊరికె త్రొక్కుట కాదుర రాజా ఒప్పుగాను వినుము*
*చిన్నవాడు పుట్టినదియు మొదలుగ నిన్నటి రోజునకు*
*వాడు నీ యింటిలో నడచిన నడవడి వేడుక లన్నియును*
*పాటలు బాడుచు ద్రొక్కగవలయు ముమ్మాటికి నాముందు*
*మరియును గంటను నీరును వదలిన మానుదు నీ భిక్షా*
*ఆకలి నాకును నతిశయమాయెను నతివేగమె మీరు*
*పూనియు జేయుడి త్వరితముగను మానవేంద్ర యనిన"* [15]

అన్నమురాజు సుబ్బారావుగారు రచించిన చంద్రహాసుని కథలో కుంతలనగర ప్రాంతమునఁ గల నందనోద్యానమునఁ బ్రధాని కూఁతురగు 'విషయ' చెలికత్తెలతో వివరించుట బాగుగ వర్ణింపఁ బడినది:–

*"ఇంతుల గూడుక నుద్యానంబున సంతస మొందుచును*
*కాంతములగు పుష్పంబులుగల తరుసంతానంబులను*
*మల్లెలు మొల్లలు పొన్నలు పొగడలు మరి చామంతులును*
*కొల్లగ గోయుచు వళ్లునిండ దమ కోరిక లెసగగను*
*వింతగొనుచు నా తుమ్మెద సంచయ రంతులకును జెలగి*
*పంతము వేసుక పరుగులెత్తుచును వనమంతయు దిరిగి*
*నిగ నిగ పగడము లెసగుచు నుండెడి చిగురుల గొరకగను*
*నగముల కెగరెడి మగకోయిల వర తెగలను జూచుచును*
*అందముగా మాకంద చాయ దామందరు గుంపుగను*
*చిందులు త్రొక్కుచు నా వనమంతయు సందడి నొందగను"* [16]

చంద్రహాసుని వివాహమున కెందరో వైదిక బ్రాహ్మణులు సంభావనకై వచ్చుచుండిరి. వివాహమునుగూర్చియు, నచట తమకు లభింపబోవు సంభావననుగూర్చియు వీరు తమలోఁదాము చర్చించుకొనుటలోఁ జక్కని తెనుఁగు నుడికారమును సహజత్వమును గనఁబడుచున్నవి:–

*"అడ్డులేక నీ బ్రాహ్మణు లందరు నతి వేగంబునను*
*బుద్ధిచెంబు లంగోస్త్రములను చేబుచ్చుక గుంపుగను*
*మించిపోయె సంభావన మనకిపు డంచుఁ బారువారు*
*మంచివాడు మదనుండు మనల నాదరించు ననెడువారు*
*మూడు రూకలకు దక్కు విప్పదని ముందె సెప్పువారు*
*మాడకు దక్కువ నిచ్చిన గైకొన మంచు బల్కువారు*
*ఏళ్లుదాటి మనమింత పరుగిడనేల ననెడువారు*
*కాళ్ల త్రిప్పటేకాని వాడు బహు కఠినుం డనువారు*
*ఇన్ని మాటలేల రెండు జాము లగుచున్న దనెడువారు*
*అన్నంబైనను పెట్టకుండునా యనుచు బల్కువారు*
*మందిర ద్వారము ముందర మొరలిడుకొంద మనెడువారు*
*సందియమేలను దెబ్బలైన పది తింద మనెడువారు"* [17]

మొత్తముపై జంగంకథలలో నిట్టి రసవద్ఘట్టములు నూటికిని కోటికిని ఒక్కటి తటస్థపడుచుండును. నీరస రచనములే హెచ్చు.

'పదములు–జంగంకథలు' అను నీ లఘుప్రకరణము నందలి సారాంశమునిట్లు చెప్పవచ్చును:–

వీరగాథలలో "బొబ్బిలివరుస కథ" లను ప్రక్రియ తరువాత నెన్నఁదగినవి పదములు, జంగంకథలు. ఇందుఁ బదములు రెండు విధములు: హరిహరీ పదములు, శారద పదములు, 'హరిహరీ నారాయ ణాది నారాయణా, కరుణించి మమ్మేలు కమలలోచనుడ' యను పునరావృత్తితోను, ఇదే వరుసలోను నుండు పదములు హరిహరీ పదములు. ఇవి ఖండగతి ద్విపదచ్ఛందముల సమ్మేళనమున నేర్పడినవి. ఇవి యన్నియును పౌరాణికేతివృత్తములను గలిగియుండును– ముఖ్యంగా రామాయణ సంబంధము లెక్కువ. ఈ పదములు పాడునప్పుడే కాక చదువునప్పుడు సహితము రసతృప్తి నిచ్చు కవితాపుష్టిగల రచనములు. ఇవి దేశిసాహిత్యమునకు శిరోభూషణములని విమర్శకుల మెప్పు. పసగాడ సన్యాసివంటివారు ఉత్తమ పదకవులు. హరిహరీ పదములు క్రీ.శ. 1850 నుండి విశాఖమండలమున విజృంభించినవి. శారదపదములు, హరిహరీ పదములంత ఉన్నతమైనవి కావు. ఇవి నృత్తప్రధానములగు దరువులు. అంత్యప్రాస నియమము వీనియందు నియతము. తెలంగాణమున శారదకాండ్రు వీనిని బాడుచుందురు. ఇవి యెక్కువగా మార్గధోరణిని నృత్య సంగీత ధోరణినిఁ బ్రదర్శించుచుండును.

బొబ్బిలికథ వరుసకు యతిప్రాసలు బిగించుటచే జంగంకథ యేర్పడినదని నా నమ్మకము. మన జంగంకథలు మహారాష్ట్రుల 'కాలక్షేపము' లకుఁ బ్రతిబింబములని కొందఱు విమర్శకుల తలంపు. ఇవి హరిహరీ పదములవలెఁ బ్రాచీనమైనవి కావు. ఈ శతాబ్ది ప్రారంభమున గుంటూరు మండలమునఁ దలయెత్తినవి. జంగము కథకు హరికథతోను, యక్షగానముతోను మిక్కిలి సన్నిహిత సంబంధమున్నది. ముద్రితములైన జంగము కథలు కొల్లలు. కవిత్వ విషయమున మాత్రమివి గుల్లలు. రసవద్రచన నూటికి కోటికి నొకటి ప్రత్యక్షమగును. తంబుఱ గుమ్మెతల యార్భాటముతోఁ బాడునప్పుడు మాత్రమే ఇవి రసవంతములు. వీనిని జదివి యానందించుట కష్టము. [18] 

## జ్ఞాపికలు

1. "ఆంధ్ర జానపదగేయ వాఙ్మయంలో హరిహరీ పదాలు ఒక శాఖ... ఈ పదాల వరస, లక్షణం ఒక్కటే. అన్నీ 'హరిహరీ నారాయణ ఆదినారాయణ, కరుణించి మమ్మేలు కమల లోచనుడ" అను వరుసలోను, లక్షణంలోను ఉంటాయి. కాబట్టి ఈ గుంపంతటికీ హరిహరీ పదాలను పేరు ఏర్పరిచెను". – కిన్నెర, జనవరి 1955, పుట 100.
2. శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, 'దేశిసారస్వత విభూతి' యను వ్యాసము, కిన్నెర, డిసెంబరు, 1955, పుట–556.
3, 4. ఈ కవుల ఇంటిపేర్లు రకరకములుగా నున్నవి. శ్రీపాదవారు 'నీవూరి' అనఁగా, టేకుమళ్లవారు 'వూరి' అన్నారు. 'ఈవూరి' 'ఈవూరి' 'వూరి' అను నామములుగూడ గుజిలీప్రతులలో నున్నవి. 'వూరి' యే సమంజసముగా నాకుఁ దోచుచున్నది. నారాయణరాజుగారికి రామచంద్రరాజుగారు అగ్రజుఁడని ధర్మాంగదచరిత్రనుబట్టి తెలియుచున్నది. వీరు పాపరాజు– జగ్గమ్మల పుత్రులనియుఁ దెలియుచున్నది.
5. విజ్ఞాన సర్వస్వము, నాలుగవ సంపుటము, పుట. 805.
6. డా॥ బి.రామరాజుగారు, తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట. ౭౬౫.
7. ఈ శారద రామాయణము మొట్టమొదటిసారిగా క్రీ.శ. 1893లో మద్రాసునుండి ప్రచురింపఁబడినది. ఈ ప్రతి పిఠాపురములోని శ్రీ సూర్యరాయ విద్యానంద పుస్తక భాండాగారమునఁ గలదు.
8. కిన్నెర, జనవరి, 1955, పుట. 93.
9. అదియే.
10. డా॥ రామరాజుగారు, పూర్వోక్తము, పుట. ౭౮౮.
11. విజ్ఞాన సర్వస్వము, పూర్వోక్తము.
12. డా॥ రామరాజుగారు, పూర్వోక్తము.
13. శ్రీయాళ మహారాజు కథ, వెష్టువార్డు అండ్ కంపెనీ, చెన్నపురి, 1953, పుటలు. 4, 5, 34.
14. అదియే.
15. అదియే.
16. చంద్రహాసుని కథ, వి.మధురముత్తు మొదల్యారు ప్రకటించినది, మద్రాసు 1903, పుటలు. 18, 19.
17. అదియే., పుటలు. 22, 23.
18. ఈ ప్రకరణమున 'జంగంకథ' యనువ్యావహారిక రూపమును గ్రహించితిని. గ్రాంథిక రూపమున పుంప్వాదేశము వచ్చి 'జంగపుఁగథ' యగును. ఇది మిక్కిలి కృతకముగా నున్నది. కావున సహజమును బ్రచురమును నగు 'జంగంకథా' శబ్దమును బ్రయోగించితిని.

# పదునైదవ ప్రకరణము

# వీరగాథానికలు లేక లఘు వీరగాథలు (Balladlings)

వెనుకటి ప్రకరణములలో సుదీర్ఘములైన వీరగాథావృత్తము లనుగూర్చియు, దీర్ఘములైన వీరగాథలనుగూర్చియుఁ దెలుపఁబడినది. ఈ ప్రకరణమున వీరగాథానికలు లేక లఘు వీరగాథలనుగూర్చి తెలిసికొందము.

ఒక అరగంటలోఁగాని, లేదా కొలఁది నిమిషములలోఁగాని పాడఁబడు గేయకథలు లఘు వీరగాథలు లేక వీరగాథానికలు లేక వీరగీతములు. వీనిని పాశ్చాత్యులు 'Balladlings' అందురు. వీరగాథల వలెనే ఇవియును ఎక్కువగా వీరరస లేదా కరుణరస ప్రధానములుగా నుండును. ఇవి పది పాదములనుండి నూఱు పాదములవఱకును నుండవచ్చును. ఈ వీరగాథానికలలోఁ జాలభాగము వీరగాథలకుఁ జేయఁబడిన సంక్షిప్తీకరణములే. గాథాకారులు వీనిని పగలు బిచ్చమెత్తకొనునప్పుడు మాత్రమే పాడుచుందురు. రాత్రివేళ 'కథ'గాఁ జెప్పుట కివి చాలవు. కొన్ని లఘు వీరగాథలు పొలము పనులలోను, గ్రామములలో వెన్నెల రాత్రులందును జానపదస్త్రీలచేఁ బాడఁబడు చుండును.

ఈ వీరగాథానికలను ప్రధానముగా రెండు వర్గములుగా విడఁదీయవచ్చును: 1) కథాత్మకములు, 2) కథాసూచకములు. కథాఖ్యానము, వీరగాథలలో నున్నంత సుదీర్ఘముగాఁ గాకపోయినను, నొక అర గంటకు సరిపడునంతగా నుండు గాథానికలు కథాత్మక వర్గమునకుఁ జెందును. కథాఖ్యానము లేకుండ సూచన ప్రాయముగా కథను దెల్పునవి కథాసూచకములు. ఇది కథాఖ్యానమును దృష్టిలో నుంచుకొని చేసిన వర్గీకరణము. బుడ్డా వెంగళరెడ్డి పాట, అప్పలాపురం చెన్నారెడ్డి పాట, చిన్నమునెమ్మ పాట, బొత్తుఁడు పాట, చాకలి దుడునున్న పదము, వాసదేవుని పాట, రేనికుంటదొర పాట, రాజ నరసయ్య పాట, విసునూరిదొర పాట, ఎఱ్ఱపాప పాట, చిలకమ్మ పాట, మున్నగునవి కథాత్మకములగు వీరగాథానికలు. గుఱ్ఱాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, నారసింహారెడ్డి పాట, ధర్మాపురం నరసింహుని పాట, అద్దాల సుబ్బులు పాట మున్నగునవి కథా సూచకములగు వీరగాథానికలు. 1960 డిసెంబరు నెలలో ఆంధ్రప్రదేశ్ సంగీత నాటక అకాడెమీవారు ప్రకటించిన 'త్రివేణి' యను జానపదగేయ సంపుటమునఁగల 'కన్నీటిపాట'లను విభాగ మంతయును గాథాసూచక వీరగాథానికలే. అట్లే 1956లో 'కృష్ణశ్రీ' గారి సంపాదకత్వమున వెలువడిన 'పల్లెపదాలు' అను గ్రంథమున 'వీరగాథలు' అను శీర్షిక క్రింద నున్న అయిదు పాటలు గూడ నిట్టి కథాసూచకములే. ఇవి కథాత్మకములు గాకపోవుట చేతనే వీని నాయా సంపాదకులు జానపదగేయ విభాగమున సూచించుట జరిగినది.

వీరగాథానికలలోఁ గథాఖ్యానము హ్రస్వముగా నుండుటచే వీనిని గాథాకారులు 'పాటలు- పదములు' అను పేర్లతో వ్యవహరింతురు కాని, 'కథలు' అనునామమును వీనికుపయోగింపరు. బొబ్బిలి, దేశింగురాజు, లక్ష్మమ్మ మున్నగువానికి మాత్రమే కథా శబ్దమును జేర్చి వ్యవహరించుట పరిపాటి. గేయ (lyric) లక్షణమును, స్మృతిగీత (elegy) లక్షణమును ఈ వీరగాథానికలలో హెచ్చుగా నుండును.

'పల్లెపదాలు', 'త్రివేణి' మున్నగు జానపదగేయ సంకలన గ్రంథములలోను, ఆంధ్రప్రభ వారపత్రికలలోను బ్రచురితములైన వీరగాథానికలు గాక, నేను మౌఖికప్రచారమున నున్నవానిని సుమారు ఎనుబదివఱకును సంపాదించితిని. వీనినన్నిటినిఁ బరిశీలింపఁగా నితివృత్తములనుబట్టి ఈ వీరగాథానికల నీ క్రింది విధముగా వర్గీకరింపవచ్చునని తేలినది:-

**I చారిత్రకములు: 1) వీరమరణములు**

**2) వీరప్రశంసలు**

**II విప్లవ జన్యములు**

**III సాంఘికములు: 1) గ్రామకక్షలు-హత్యలు**

**2) స్వైరిణులు-భర్తృహంతలు**

**3) పందెములు**

**4) ఆత్మత్యాగములు- కట్టపదములు**

**5) విధివైపరీత్యములు- ప్రమాదములు**

**IV దానవీర ప్రశంసలు**

**V జానపదములు**

**VI పౌరాణికములు**

చారిత్రక సంఘర్షణలలోను, రాజకీయ సంఘర్షణలలోను మరణించిన వీరులనుగూర్చియు, గ్రామకక్షలలో హత్య చేయఁబడిన పెత్తనదార్లనుగూర్చియుఁ, బ్రకృతి తెచ్చిన ప్రమాదములను గూర్చియుఁ, గట్టలు తెగి పొంగిన చెఱువులకు నాత్మబలిదానము చేసిన సాధ్వీమణులనుగూర్చియు, జానపదులు నిర్భర కరుణ రసావేశమున శోకగీతుల నాలపింతురు. వీనిని 'జాలిపాటలు' లేక 'కన్నీటి పాటలు' అనవచ్చును. "జానపదుల హృదయము బహు సున్నితమైనది; శౌర్యాన్ని అరమర లేకుండా పూజిస్తుంది. ఆవగింజంత అన్యాయానికి కూడా సహించదు. కుత్సితుని వీరము కనబడినా కళ్లు మూసుకోదు; వాని ఠీవిని, రాజసమూ, ఏదో గుణాన్ని ఎక్కడికక్కడే మెచ్చుకుంటుంది.

హంతకుడినైనా సరే చిత్రవధచేస్తే భరించలేదు. జాలిపాటలు పాడుకుంటుంది. లోకోపకారికి సాష్టాంగము పడుతుంది"[1] పాశ్చాత్య జానపద సాహిత్యములందును నిట్టి జాలిపాట లున్నవి. ఇటి వానిని 'coronach' or 'lament ballads' అందురు. వీరగాథానికలలో నెక్కువ భాగము ఈ కన్నీటి పాటలే. చారిత్రక వీర మరణములు, విప్లవ వీరమరణములు, గ్రామకక్షల మూలమున సంభవించిన హత్యలు, ప్రకృతి తెచ్చిన ప్రమాదములు, ఆత్మ త్యాగములు- ఇవి కరుణరస ప్రధానముగా నుండును. వీనిలోఁ గరుణము అంగిరసముగాను వీరము అంగరసముగాను నుండునని చెప్పవచ్చును. జానపదశాఖకుఁ జెందిన వీరగాథానిక లెక్కువగా నద్భుతరస ప్రధానములు. పౌరాణికములలో భక్తిరసముండును. దానవీరుల పాటలలోఁ బ్రజలకు వారియెడఁ గల కృతజ్ఞతయుఁ, బందెములలో నుత్సాహమును, భర్తృహంతలగు స్వైరిణులకు సంబంధించిన పాటలలో వారి క్రౌర్యగర్హణమును ద్యోతకమగును.

## 1. చారిత్రకములు

చారిత్రకములగు వీరగాథానికలలో రెండతశ్శాఖలున్నవి: వీరుని మరణమునకై చింతించు జాలిపాటలు (coronaches); కేవలము వీరుని శౌర్యమును బ్రశంసించుచు, శత్రువుల పిఱికి తనమును వర్ణించు పాటలు. నారసింహారెడ్డి పాట (కోలాటపు కోపు), ధర్మాపురం నరసింహుని పాట, చిన్నపరెడ్డి పాట, అల్లూరి సీతారామ రాజు పాటలు, మున్నగునవి వీరమరణమును చిత్రించు జాలిపాటలు. నారసింహారెడ్డి పాట (పిచ్చుకుంట్లు పాడెడిది), మరుట్ల చిన్న మల్లేశుని పాట, ఓబులరెడ్డి పాట, పెనుగొండ కోట, కృష్ణదేవరాయలనాటి వీరోక్తి మున్నగునవి వీరప్రశంసను జేయు గాథానికలు.

### 1.1. వీరమరణములు

#### 1.1.1. నారసింహారెడ్డి పాట- (కోలాటపు కోపు):-

ఉయ్యాలవాడ నారసింహారెడ్డిపై బొబ్బిలి కథయే కాక, రెండు లఘువీరగాథలును రాయలసీమలో వ్యాప్తియందున్నవి. ఇందొకటి కోలాటపు కోపు. వేఱొకటి పిచ్చుకుంట్లు పాడు పాట. కోలాటపు కోపును తూమాటి దొణప్పగారు అనంతపుర మండలమున సంపాదించి 'త్రివేణి'లోఁ జేర్చినారు (చూ.పు. 270). పిచ్చుకుంట్లు పాడు పాటను నేను కర్నూలు మండలమున సేకరించితిని. (ఉయ్యాలవాడ నారసింహారెడ్డిని గూర్చిన చారిత్రక వివరములకు బొబ్బిలివరుస కథలను వెనుకటి ప్రకరణమును జూడుఁడు.) కోలాటపు పాట కథాసూచకము మాత్రమే. ఇది కరుణరసస్ఫూర్తితో సాఁగిన గేయము. ఇది-

*"దొరవారి నరసింహ్వారెడ్డి*
*నీ దొరతనము కూలిపోయె రాజా నరసింహ్వారెడ్డి"*

అను శోకాలాపముతోఁ బ్రారంభమగును. ఇదియే ఈ పాటలోని పునరావృత్తి. నారసింహారెడ్డి శౌర్యముగూడ నిందుఁ బ్రశంసింపఁ బడక పోలేదు. నారసింహారెడ్డినిఁ జూచినంత మాత్రమున నాంగ్ల ప్రభుత్వము గడగడలాడెడిదఁట:-

*"కోయిలకుంట్లా గుట్టలెంటా- కుందేరూ వొద్దులెంటా*
*గుఱ్ఱమెక్కి నీవు వస్తే- కుంపిణీకి గుండె దిగులూ"* ॥దొరివారి॥

#### 1.1.2. ధర్మాపురం నరసింహుని పాట:-

దీనిని కర్నూలు మండలమునఁ బిచ్చుకుంట్లు పాడుచుండఁగా నేను సంపాదించితిని. ఈ గాథానికలోఁ గథ సూచన ప్రాయముగ నుండుటచే నందలి చారిత్రకాంశములనుగూర్చి మనకేమియుఁ దెలియకున్నది. జమ్మలమడుగు (కడప జిల్లా) సమీపమున 'ధర్మాపురము' అను గ్రామమున్నది. ఈ పాటలోని ధర్మాపురమదియే కావచ్చును. అనంతపురము జిల్లాలో ధర్మవరమున్నది. కర్నూలు మండలమున ధర్మపురి యున్నది. ఈ రెండింటిలో నొకటి యైనను గావచ్చును.

ధర్మాపురము నరసింహుఁడు బాలించు రాజ్యము పరరాజుల పాలైనట్లును, నాతని యన్న వెఱ్ఱివాఁడనియు, తమ్ముఁడు చిన్నవాఁడనియు, నంద్యాలలోను, పాలమూరిలోను నతనిని నిర్బంధించి రనియు, శత్రువు లీతని సంపదను దోఁచి రైలు మీఁదఁ గొనిపోవుచుండిరనియు, బొగులోనిపల్లె బోయవాండ్రు, చౌదరిపల్లె కాపువాండ్రు నితని నేస్తకాండ్రనియు నీ గేయమునుబట్టి తెలియుచున్నది. ఇతని భార్య పేరు నీలమ్మ, ఉంపుడుకత్తె పేరు రొక్కమ్మ. నరసింహుఁడు నిర్బంధింపఁబడఁగా వీరిరువురును మిక్కిలి దుఃఖించిరఁట. కర్నూలు మండలమున నందికొట్కూరు తాలూకా చెలిమళ్ల రుద్రపరమను గ్రామములలో 21-4-1966న నిర్లం చిన్న నాగన్న యను పిచ్చుకుంటు పాడుచుండఁగా దీనిని సంపాదించితిని. ఇది చక్కని వరుసలో, రూపకగతిలో, నీ క్రింది విధముగా సాఁగును:-

*ఏ తల్లీ కన్నదిరో-ఏ అంసా (హంసా) కన్నదిరో*
*ఏ అంసా కన్నదిరో- దర్మాపురాము నరసింహ!*
*ఏ తల్లీ కన్నదిరో- దర్మాపురము నరసింహ!* ॥ఏతల్లీ॥

*నీ యన్నా యెఱితోడు- నీ తమ్ముఁడు సిన్నోడు*
*నువ్వేలే రాజ్యంబు- పరరాజూల పాలయెరో*
*దర్మాపురాము నరసింహ!* ॥ఏ తల్లీ॥

*నంద్యాలా కచ్చిరులు- పన్నెండూ కచ్చిరులు*
*ఏ కచ్చేట్లుండవురో- దర్మాపురము నరసింహ*
*ఏ దర్వాజి నొస్తవురో- దర్మాపురాము నరసింహ!* ॥ఏ తల్లీ॥

*నువ్వెక్కే గురహోలు- నీళ్లామీది తేజంబు*
*పరరాజూల పాలయెరో- దర్మాపురము నరసింహ!* ॥ఏ తల్లీ॥

### 1.1.3. చిన్నపరెడ్డి పాట:–

చిన్నపరెడ్డిపై వీరగాథ ప్రసిద్ధమైనది. వందేమాతరమ్ ఉద్యమ కాలములో నితఁడు కోటప్పకొండలో నాంగ్లేయులపై మహావిప్లవమును లేవఁదీసిన జాతీయ వీరుఁడని వెనుకటి 'బొబ్బిలివరుస కథలు' అను ప్రకరణమున వివరించితిని. ఆ వీరగాథయే కాక ఇతనిపై వేఱొక గాథానికయు వ్యాప్తియందున్నది. వీరగాథ వీరరసప్రధానముకాఁగా, నీ గాథానిక కరుణరసప్రధానము (జాలిపాట). దీనిని నేను కడప మండలమున సంపాదించితిని. ఇది చిన్నపరెడ్డి జైలులో నిర్బంధింపఁ బడిన తరువాత నతనికై విలపించుచుఁ జెప్పిన గీతమువలె నున్నది. చిన్నపరెడ్డి రాజువలె విహరించి, జైలులోఁబడి 'గొడ్డుకారము, బద్దల సంగటి' తినుచున్నాఁడని గాథాకారుఁడు శోకించును. దీని ప్రారంభ మిట్లున్నది:–

*"సైరా! సిన్నాపా రెడ్డీ!*
*నీ పలుకూ బొంబాయి పలుకు*
*సైరా! సిన్నాపారెడ్డీ!*
*నీమాటా మాణిక్యమయ్య*
*సైరా! సిన్నాపా రెడ్డీ!*
*నీ యెంటా ఎయినూటి మంది*
*బాబూ! సిన్నాపా రెడ్డీ!*
*సిన్నపరెడ్డీ తినేవన్నం*
*సారవలేని సన్నొడ్లకూడు*
*ఆవునెయ్యి కందిపప్పు*
*అర్ధశేరు నేతిబొట్టు*
*పావలాది పంచదార*
*పాపిష్టి కోర్టులోన*
*గొడ్డుకారం బద్దల సంగటి ప్రాపతమాయె" ॥సైరా॥*

తెల్లగుఱ్ఱమునెక్కి, నీలిగొడుగును బట్టి, నీలిగొడుగుల నీడల క్రింద నిలిచి యుద్ధముచేసెనఁట చిన్నపరెడ్డి! ఈ లఘుగీతమున వీరగాథలోని విషయము లన్నియును జెప్పఁబడినవి. కోటప్ప కొండలోఁ బోలీసులతోడి సంఘర్షణము, ప్రత్తిపాడు వీథిలో కమ్మవారితోఁ బట్టింపు సూచింపఁబడినవి. మద్రాసులో గుఱ్ఱము కొనిన విషయము మాత్రమిందు లేదు. వీరగాథలో లేని క్రొత్త విషయమొకటి ఇందుఁగలదు. చిన్నపరెడ్డి పట్టువడిన తరువాత తురక పాలెములో నున్న యాతని చెల్లెలు వీరనారియై విజృంభించి, అయిదువందల పోలీసులను గొట్టిన విషయ మీ వీరగాథానికలోఁ గలదు:–

*"సిన్నపరెడ్డీ సెల్లే లంట*
*తురక పాలెములో ఉన్నాదంట*
*అయిదువందలా జనాన్ని గొట్టీ*
*అన్నగారిలో గలిసిందట!*
*నాయనా సిన్నాపా రెడ్డీ*
*నీ పేరే బంగారపు కడ్డీ!"*

### 1.1.4. అల్లూరి సీతారామరాజు పాటలు:–

1922–24 మధ్యకాలమునఁ దూర్పుగోదావరి, విశాఖ మండలములలో నాంగ్లేయులపై మహావిప్లవమును లేవఁదీసిన అల్లూరి సీతారామరాజుపై నిట్టి జాలిపాటలు గొన్ని కలవు. వీనినిగూర్చి డా॥ బిరుదురాజు రామరాజుగారు ముచ్చటించియున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౨౫౧, ౨౫౨). వై.కృష్ణారావుగారు 'అల్లూరి సీతారామరాజు కీర్తనలు' రచించి, 1928లో మద్రాసునుండి ప్రకటించిరి. "అల్లూరి సీతారామరాజ! కల్లాకపటం లేని చల్లనీ మారాజ!'' అను పాట యొకటి వ్యాప్తియందున్నది. ఇది జానపదగేయమో లేక ప్రత్యేకకవి కృతమో తెలియుట లేదు. విశాఖ మండలమున మన్యములో వసించు కోయ జాతియందొక గేయము ప్రచారమున నున్నదని పడాల రామారావు గారు (రాజమండ్రి) తెలియఁజేయుచున్నారు.

ఇట్టి చారిత్రక శోకగీతముల నింకను సేకరింపవలసి యున్నది. ఈ కన్నీటి పాటలలోఁ గొంత వీరప్రశంసయు నుండక పోదు. అయినను నివి కరుణరస ప్రధానము లనియే చెప్పవలెను. వీనిలోఁ గరుణ మంగిరస మనియు, వీర మంగరస మనియుఁ దెలియనగును. ఇట్లుగాక, ఒక్క వీరమే యేకైక రసముగా నున్న గాథానికలును గలవు. వానిలోఁ గరుణ మంగముగాఁ గూడ నుండదు. ఇట్టి గాథానికలను 'వీరప్రశంస' లను శీర్షిక క్రిందఁ జర్చించుచున్నాను.

## 1.2. వీరప్రశంసలు

### 1.2.1. నారసింహారెడ్డి పాట– (పిచ్చుకుంట్లు పాడునది):–

ఉయ్యాలవాడ నారసింహారెడ్డిపైఁగల కోలాటపు కోవును గూర్చి వెనుక వివరించితిని. ఇపుడు చర్చింపఁబోవునది కర్నూలు మండలమునఁ బిచ్చుకుంట్లు పాడు గాథానిక. ఈ మౌఖిక గాథానికను నేను 1966లో సంపాదించితిని. ఇది ఇట్లు ప్రారంభమగును:–

*"వాహువా![2] నరసింహ్వారెడ్డీ!*
*నీ పేరంటే– రాజా నరసింహ్వారెడ్డీ ॥వాహువా॥*

*పుట్టిందీ రూపనగూడి*
*పెరిగిందుయ్యాలవాడ*
*పాలువణ్ణము దీనిందీ*
*గుల్లదుర్తీ గ్రామంలో ॥వాహువా॥*

*నారసింహారెడ్డి దెబ్బా*
*భూమి గడగడా వొణికే*
*భూమిలుండే ఆదిలచ్మీ*
*తోడు బలికిన్నాది కాదా" ॥భళిరే నరసింహ్వారెడ్డీ॥*

నారసింహారెడ్డి దెబ్బకు భూమియంతయు గడగడ వణఁకఁగా, భూమిలో నున్న యాదిలక్ష్మి తోడు పలికినదనుట యెంత తీవ్రమైన భావము! ఇట్టి యద్భుత భావములతోఁ బ్రత్యక్షరమును వీరరసము చిప్పిలుచున్న గేయమిది. దీర్ఘములగు వీరగాథలలో రసఘట్టము లచ్చటచ్చట మాత్రమే గోచరమగును. వీరగాథానికలలో నట్లుగాక, ఆద్యంతమును గవితారస ముట్టిపడుచుండును. రసవిషయమున నితిహాసమునకును, భావకవిత్వమునకును నెంత భేదమున్నదో, వీరగాథకును వీరగాథానికకును నంత భేదమున్నదని చెప్పవచ్చును. నారసింహారెడ్డి శౌర్యము, రీవి కన్నులకుఁ గట్టినట్లుగ నెట్లు వర్ణిత మైనదో చూడుఁడు:–

*"కొయిలకుంట్లా గొట్టినాడూ*
*గిద్దలూరూ దోచినాడూ*
*కుడీ మీసా మొదాదిద్దీ*
*రచ్చ కట్టన కొలువుదీరే" ॥భళిరే॥*

నారసింహారెడ్డి దేశమును సంక్షుభితము గావించె ననుటకు జానపదకవి చక్కని కల్పనా చమత్కృతినిఁ జూపినాఁడు:–

*"గోలు కొండది గొద్దు గొల్లా*
*బుక్కపట్నం సన్న బియ్యం*
*కాలవాడీ ఉడికె తప్పుడు*
*కల్లి బిల్లీ లేపినాడూ" ॥సైరా నరసింహారెడ్డీ॥*

దీనిని బట్టి గోలుకొండనుండి బుక్కపట్టణము వఱకును నారసింహారెడ్డి గడగడ లాడించెనని యూహింపనగును.

కథాత్మకమగు నీ వీరగాథానికలో నారసింహారెడ్డి తన యనుచరులగు గోసాయి వెంకన్నను, ఒడ్డె ఓబన్నను వెంటఁబెట్టుకొని అయిదు వందలమంది సైన్యముతో కోవెలకుంట్లను కొల్లఁగొట్టి, తాసిల్దారును, బొందిలివాఁడగు 'వారసింగు'ను జంపి, వారి శిరస్సులను దెచ్చి నయనాలప్పకొండలో దాచుట, గిద్దలూరుకడ మహాయుద్ధమును జేయుట, గోలుకొండనుండి బుక్కపట్టణము వఱకును భయంకర విప్లవమును లేవఁదీయుట, జగన్నాథునికొండ దగ్గఱ నాదిశక్తి సహాయముతో నైదువందలమంది శత్రువుల కుత్తుకలు గోయుట వర్ణింపఁబడినది. ఇతని తండ్రిపేరు 'పెద్దిరెడ్డి' యనియు తాతపేరు 'జయరామిరెడ్డి' యనియు, నింటిపేరు 'మద్దెలవారు' అనియు నీ గేయమునఁ దెలుపఁబడినది.

## 1.2.2. మరుట్ల చిన్నమల్లేశుని పాట:–

అనంతపుర మండలమున హండేవారు (హండే హనుమప్ప నాయని కాలమునఁ గాఁబోలును) దోపిడి నడపినప్పుడు మరుట్ల పాలెములోని గొల్ల చిన్నమ్మ కొడుకు చిన్నమల్లేశ ప్రజలకు నాయకుఁడై దోపిడిగాండ్ర నెదిరించి పోరినాఁడఁట. ఆ చిన్నమల్లేశపై నొక వీరగీతమున్నది. దీనిని తూమాటి దొణప్పగారు సేకరించినారు. ఇది ఆంధ్ర విశ్వకళాపరిషత్పత్రికలోఁ బ్రకటింపఁబడినది.[3] ఇది కోలాటపు పాట. "రామ రామా కోదండా రామా భై" అనునది ఇందలి పునరావృత్తి.

హండేరాముఁడు రేణికుంట దొరసాని దీవెనల నందుకొని గుఱ్ఱపు దళముతోఁ బల్లెలను దోచుకొన సాఁగెను. ఇంగ్లీషువారి గుఱ్ఱపు దండు, హండేవారి గుఱ్ఱపు దండు మరుట్ల పాలెమునకు వచ్చినవి. అప్పుడు గొల్ల చిన్నమ్మ కొడుకు చిన్నమల్లేశ పగడసాలాడుచున్నాఁడు. శత్రువు రాకను విని యతఁడు–

*"ఆడేటి పగిడిసాలు అంతరానె నిల్పినాడు*
*కూడేటి పగడిశాలి కుడికాల దన్నినాడు*
*రామరామన్నాడు రణములోన దుంకినాడు*
*కోటకొమ్ము లెక్కినాడు కోటికూత లేసినాడు*
*రామరామా కోదండా రామా భై॥*

*అండీ అనంతపురం అండి రాముదెల్లినాడు*
*గొల్లా సిన్నమ్మ కొడుకు కండ్లార జూసినాడు*
*బుజం మింద బల్లె మిసిరి మొలకమీసం దిద్దినాడు!*
*రామరామా కోదండా రామా భై॥"*

## 1.2.3. ఓబులరెడ్డి పాట:

ఇతఁ డే ప్రాంతమువాఁడో తెలియుట లేదు కాని, గురప్పకొండ దగ్గఱ శత్రుదళములు రాకుండఁ దన యాశ్వికదళము నడ్డిన వీరుడు ఓబులరెడ్డి యని తెలియుచున్నది. ఇది కోలాటపు కోపు. శత్రువుల దాడినుండి తమ్ము రక్షించిన ఈ వీరుని నితని గుఱ్ఱమును జానపదులు భక్తితోఁ బూజించుటయే ఇందలి విషయము. ఇది కథా సూచకమగు గాథానిక. ఇది కృష్ణశ్రీగారి సంకలన గ్రంథమగు పల్లెపదాలలోఁ గలదు:–

*"గుట్ట గురప్ప కొండ గురి దప్పకుండా*
*పై దళము రాకుండ పడెరా నీ జెండా*
*సైరా! ఓబుల రెడ్డీ! నెలవన్నెకాడా!...*
*నీకు పూలూ నీదు కత్తికీ పూలూ*
*నీ చేతికీ వన్నె బంగారు రవలు*
*ఎఱ్ఱాది గుఱ్ఱము ఎండి కళ్లెమురా*
*దూకించె గుఱ్ఱాన్ని దుమ్మెల్ల రేగ*
*బూడిద గుఱ్ఱాము బుగడ కళ్లెమురా*
*బుగడ కళ్యాణికి బొందు మల్లెలురా" ॥సైరా॥*

## 1.2.4. పెనుగొండ కోట:–

ఇది క్రీ.శ. 15, 16 శతాబ్దములలో విజయనగరరాజు లేలిన కోట. అనంతపుర మండలమునఁ గలదు. దీని ప్రాభవము నుగ్గడించు గేయమొకటి వ్యాప్తియందున్నది. ప్రయాగ నరసింహశాస్త్రి గారు దీనిని సేకరించి ప్రకటించినారు.[4] నాకుఁ జూడఁగా నిది జానపదులలో

సహజముగాఁబుట్టిన గేయమువలెఁ గన్పడుట లేదు. ఎవరో పండితకవి చేయి పడినట్లున్నది (ఇది రాళ్లపల్లి అనంతకృష్ణ శర్మగారి రచనయని కొందఱు అనుమానించుచున్నారు). కవిత్వము బింకముగా నున్నది. పది చరణములలో నీ పాట చక్కఁగా సాఁగినది. ఖండగతి రచనము:–

*"కొండ గల్గిన కోట, కోట గల్గిన కొండ*
*కోట కొండలలోన మేటి యా పెనుగొండ॥*
*ఏనుగుల ఎలుగుతో రౌతుల రవళితో*
*మేనాల మెరుపుతో మెరిసింది పెనుగొండ॥*
*కులికేటి గానాలు కుణిసేటి ఖడ్గాలు*
*పలికేటి ఘంటలు ప్రబలింది పెనుగొండ"॥*

– ఇత్యాదిగా సాఁగును. భళ్లరాయఁడు, బుక్కరాయఁడు, సాళ్వ నరసింహయ్య, తిరులమ తాతయ్య, తెనాలి రామలింగకవి, భట్టుమూర్తి మున్నగువారు పెరిగి తిరిగిన ప్రదేశమే పెనుగొండ యని స్తుతింపఁ బడినది:–

*"తిట్లలో తిమ్మయ్య, కవితలో బ్రహ్మయ్య*
*తెనాలి రామయ్య తిరిగింది పెనుగొండ॥*
*బాపనయ్యల నడుమ పల్లకీ నెక్కించి*
*భట్టుమూర్తికి కీర్తి తెచ్చింది పెనుగొండ"॥*

### 1.2.5. రాయల జైత్రయాత్ర:–

సురవరం ప్రతాపరెడ్డిగారు సంపాదించిన వీరగీతములలో 'వీరభద్రారెడ్డి' గేయము సాధారణ ప్రశంస మాత్రమే. ఇది వీరప్రశంస కాదు. రెడ్డిగారు సేకరించిన ఈ క్రింది రెండు నుడుగులు మాత్రము వీరోక్తులనుటలో సందేహము లేదు.

*"కొండవీడు మనదేరా కొండపల్లి మనదేరా*
*కాదని వాదుకు (ఎవడైనా) వస్తే కటకందాకా మనదేరా!"*

శ్రీకృష్ణదేవరాయలు జైత్రయాత్రకుఁ బోవు సమయమున నొక చాకలి యథాలాపముగాఁ బాడిన పాట యిది.

## 2. విప్లవ జన్యములు

సుమారు 1945 నుండి 1949 వఱకును దెలంగాణమున కమ్యూనిస్టులు గొప్ప విప్లవమును లేవఁదీసిరి. ఈ విప్లవము హైదరాబాద్ సంస్థానాధీశుఁడగు నిజామునకును, కర్కోటకులగు నాతని రజాకార్లకును వ్యతిరేకముగా జరుపఁబడినది. ఈ విప్లవము నకుఁ గీలకస్థానము నల్లగొండ జిల్లా. ఎందఱో యువతీ యువకు లీ విప్లవమునఁ జేరి, రజాకార్లతోఁ బోరాడి, తమ ప్రాణములను బలివెట్టిరి. అట్లు పోరాడిన వీరులపై నెన్నియో గీతములు జనించినవి. ఇవి శ్రీయుతులు తిరునగరి రామాంజనేయులు, సుద్దాల హనుమంతు మున్నగు కవులచే రచింపఁబడినను, ప్రజల నోళ్లలోఁబడి నలిగి నలిగి, కాఠిన్యమును గోల్పోయి, నేఁడు చక్కని వీరగీతములుగా రూపొంది నవి. వీనిని కర్షకులును శ్రామికులును పొలము పనులలోఁ బాడుకొను చున్నారు. వెన్నెలరేలలో జానపదస్త్రీలు వీనిని 'చుట్టుకాముఁడు పాటలు' గాఁగూడఁ బాడుచున్నారు. వీనిని రచించిన కవులు జానపద గేయములను బాగుగా నాకళింపు చేసికొని, ఆ వరుసలలోనే రచించిరి. ఈ పాటలలోఁగూడ నన్నియుఁ గవులు రచించినవి కావు. కొన్ని ప్రజలే అల్లుకొని పాడుకొనుచున్నారు. మఱికొన్ని జంగములు, శారదకాండ్రు నాశువుగా గానము చేయుచున్నారు. ఇవన్నియు నేఁడు నల్లగొండ మండలమున సాంప్రదాయిక వీరగాథలుగా, వీరగాథానికలుగా విశేషవ్యాప్తి నందియున్నవి.

ఈ రాజకీయ విప్లవ గేయములన్నియును సాంప్రదాయిక వీరగాథలుగాఁ బరిణమించునని డా॥ బి.రామరాజుగారు ముందుగనే యూహించిరి. 1958లో వారు ప్రకటించిన 'తెలుఁగు జానపదగేయ సాహిత్య' మను గ్రంథమున నిట్లు వక్కాణించిరి. "హైదరాబాదు స్వాతంత్ర్య సమరమున వ్యక్తులుగా, సంఘములుగా సాయుధులుగా పోరాడి నిరంకుశ ప్రభుత్వము నెదిర్చి తమ ప్రాణము లొడ్డిన మొన్నటి స్వాతంత్ర్య వీరుల గాథలు సముద్ర తరంగములట్లు అంతటను వ్యాపించుచున్నవి. వానికింకను సార్వజనీనత కలిగిన తరువాత పూర్వ చారిత్రక గేయములవలె వింత వింత మార్పుల నందుననుటలో సందియము లేదు" (పుట. ౨౫౨). రామరాజుగారిట్లు వ్రాసిన నాఁటికిఁ తెలంగాణా విప్లవము చల్లారి దాదాపు పది సంవత్సరములు మాత్రమే యయినది. నేను 1966 జూన్ నెలలో నల్లగొండ మండలమును దర్శించు నాఁటికి ఇరువది సంవత్సరములు గడచినవి. రామరాజుగారి ప్రోత్సాహమున నేను నల్లగొండ మండలమునఁ గొన్ని వీరగాథానికలను సేకరించితిని. వీనిని బరిశీలింపఁగా రామరాజుగారు పదియేండ్లనాఁడు చెప్పిన జోస్యము సత్యమైనది. ఇవి యన్నియు నేఁడు సిసలైన జానపద గేయములుగాఁ బరిణమించినవి.

దొడ్డికొమరయ్య, రేణుకుంట (చింతలపూడి) రామిరెడ్డి, గొట్టెముక్కల గోపాలరెడ్డి, యలకలపల్లి యాదగిరి, పసునూరు వెంకటరెడ్డి, వీరమళ్ల వెంకయ్య, కొంతం కొండలరెడ్డి, అనిరెడ్డి రామిరెడ్డి, మట్టారెడ్డి అనంతారెడ్డి, నక్కా అండాలమ్మ– మున్నగు వీరులపై నెన్నియో పాటలు వ్యాప్తియందున్నవి. ఈ గాథానికలలోఁ గొన్ని కవి చేతనాశిల్పమును గనఁబరుచుచున్నవి. కొన్ని అచేతనా శిల్పముతో జానపదగేయములైపోయినవి. ఈ వీరులపైఁ గవులు ప్రత్యేకముగా రచించిన పాటలును, జానపదులు తమంతఁదాము అల్లు కొనిన పాటలును– రెండును లభించుచున్నవి. ఈ తెలంగాణా విప్లవ వీరులనుగూర్చి గంగినేని వెంకటేశ్వరరావుగారు 'ఎఱ్ఱ జెండాలు' అను గ్రంథమున విపులముగా వ్రాసియున్నారు.

## 2.1. పసునూరి వెంకటరెడ్డి పాటలు:-

ఇతఁడు విద్యార్థి నాయకుఁడు. నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకా 'సందుపట్ల' గ్రామమునకుఁ జెందినవాడు. 1947 ఏప్రిల్ 12వ తేదిని రజాకార్లచేఁ జంపఁబడెను. రజాకార్లు పెద్ద గుఱ్ఱపు దళముతో వచ్చి, ఇతనిని నలువైపుల నుండియుఁ జుట్టుముట్టి తఱిమి తఱిమి చంపిరఁట. నల్లగొండ జిల్లాలో 'చెఱువు అన్నవర'మను గ్రామమున నీతని సమాధి నేఁటికిని గలదు. అట ప్రతి సంవత్సరము ఏప్రిల్ 12వ తేదిని ఉత్సవము జరుపుదురు. వెంకటరెడ్డినిగూర్చి పాటలు పాడుదురు.

ఇతనిపై గుఱ్ఱాల గోపిరెడ్డి పాట వరుసలో నొక పాట యున్నది. ఇది చేతనాశిల్పముగాఁ గన్పట్టు చున్నది:-

*"ఓ... ఎఱ్ఱ సైనిక వెంకట్రెడ్డీ!*
*విప్లవా జోహారు లివిగోరా!*
*కామ్రేడా! పసునూరూ! నిన్నుగన్నా కాసనగోడూ*
*కాశిక్షేత్రంబయి వెలుగొందోయ్"*

– ఇత్యాదిగాఁ గొనసాఁగును. ఇతని నొక యవ్వ దాచి యుంచినదట. ఇతఁడు మరణింపఁగా నామె మిక్కిలి దుఃఖించినదఁట. "ఆకుచాటున నిన్ను దాచిన అవ్వ దుఃఖం మాన్పలేమూరా!" అని వాపోవుట ఈ గేయమునఁ గలదు.

ఈ పసునూరి వెంకటరెడ్డిపై గుఱ్ఱాల గోపిరెడ్డి పాట వరుసలోనే కాక, ఊయలపాట వరుసలోఁగూడ మఱియొక గేయము జానపదులలో వ్యాపించియున్నది. ఇది పల్లె ప్రజల ఆశురచనము.

## 2.2. రేనుకుంట రామిరెడ్డి పాటలు:-

ఇతని ఇంటిపేరు 'చింతలపూడి' వారు. ఇతని స్వగ్రామము రేనుకుంట యగుటచే నితనిని 'రేనికుంట రామిరెడ్డి' యనియు, 'రేనుకుంట దొర' యనియుఁ బిలుతురు. తెలంగాణా పోరాటమున నీ చింతలపూడి రామిరెడ్డి మిక్కిలి ప్రముఖపాత్రను నిర్వహించెను. ఇతఁడు 1947 రజాకార్ పోరాటములోఁ జనిపోయెను. ఇతఁడు మహాశూరుఁడు. ఇతనిపై అనేక గేయములు పుట్టినవి. శారద కాంద్రు ఇతనిపై పెద్దకథను తందానవరుసలోఁ బాడుచున్నారు. ఇది వీరగాథావర్గమునకుఁ జెందును. ఊయల పదముగా నొక కలుపు పాటను జానపదులు సృజించియున్నారు. చేతనాశిల్పముతోఁ గూడిన కవి రచనయు వేఱొకటి కలదు. ఈ రెండును లఘువీరగాథలు. తిరునగరి రామాంజనేయులుగారు 'రేణికుంట పోరాటము' అను బుఱ్ఱకథను రచించినారు. దీనిని విశాలాంధ్రవారు ప్రకటించి యున్నారు. చేతనాశిల్పమగు వీరగాథానికను గొంత, కలుపుపాటను పూర్తిగాను నేను సంపాదించితిని. ఇందు మొదటిది ఇట్లు ప్రారంభ మగును:-

*"ఎంత ధీరుడు రెడ్డి బిడ్డన్నా!*
*మన రేనికుంటా-*
*చింతలాపుడి రాంరెడ్డన్నా!*
*ఒట్టి మాటలు కావు వినుమన్నా*
*లారీల నొకపది*
*చుట్టుముట్టాడించె నోయన్నా!*
*పంతముగ నీజాము కుక్కల*
*పాడుమూకల భీకరంబుగ*
*సొంతముగ సాధించె భళి భళి"* ॥ఎంత॥[5]

ఈ గేయము కథాసూచకము మాత్రమే. ఊయల పదముగా నున్న కలుపుపాట కథాత్మకమైనది. దీనిని నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా, నూతనకల్లు గ్రామములో 'పులుసు నాగడు' అను నిరక్షరకుక్షి యొకఁడు పాడఁగా విని వ్రాసికొంటిని (1966). ఇది జానపదుల హృదయములనుండి సహజముగాఁ బుట్టినట్టిది. దీని ప్రారంభ మిట్లుండును:-

| | | | |
|---|---|---|---|
| *"భారతీ భారతీ-* | *ఉయ్యాలో,* | *మాతల్లి భారతీ-* | *ఉయ్యాలా* |
| *మముగన్న తల్లికీ* | ,, | *మంగళా హారతీ* | ,, |
| *రేనికుంటాలోని* | ,, | *దొర రామిరెడ్డీ* | ,, |
| *కమినిస్టి లోపలా* | ,, | *పెద్ద కామండరీ* | ,, |
| *ఆయనికి పోటీని* | ,, | *ఎవ్వరూ కలిగిరీ* | ,, |
| *మోదీని పురమూన* | ,, | *మోదీని ఆమీను* | ,, |
| *ఆయనికి పోటిని- ఉయ్యాలో,* | | *తురకోదు కలిగెనే ఉయ్యాలా"* | |

చింతలపూడి రామిరెడ్డి పేరు మ్రోసిన నాయకుఁడు. అతని దగ్గఱ 'యాభైదెబ్బల యెండిరైఫోలు' ఉన్నదఁట. అది యున్నంత కాలము ఆతని నెదిరించుటకు రజాకార్ల చేతఁగాలేదు. అందుచే మోదిన్ అమీన్ ('అమీన్' అనఁగా సబ్ ఇన్‌స్పెక్టరు) అనునతఁడు పంద్రెండు మంది జవాన్లను వెంటఁబెట్టుకొని అర్ధరాత్రివేళ రేణికుంటపై దండెత్తెను. రామిరెడ్డి దగ్గఱ పనిచేయు మాదిగ మల్లను, గొల్ల మల్లన్నను, మాల దస్తగిరిని, ఆతని భార్య తేరోజను అమీన్ మిక్కిలిగ హింసించెను. రామిరెడ్డి రైఫిల్ ఎక్కడ నున్నదో చెప్పుఁడని బాధించెను. కాని యెంత బాధించినను వారు రైఫిల్ ఎక్కడ నున్నదియుఁ జెప్పలేదు. గొల్ల మల్లన్నకు లంచమిచ్చి, ఆతని వేషమును అమీను ధరించి, రామిరెడ్డి ఇంటిలో రాత్రిపూట పాలు పితుకుటకై వచ్చి, రైఫిలును దీసికొని పాఱిపోయెను. దాసి లక్ష్మి యాతని నడ్డగింపఁ బోఁగా నామెను గొట్టెను. ఆమె యల్లరి చేసినది. ఆ యల్లరికి దొర నిద్రలేచినాఁడు. సంగతి తెలిసికొని, కుడి హస్తము వంటి రైఫిలు పోయిన తరువాత నిఁక బ్రతుకేలయని ఆత్మహత్య చేసికొనెను. అతనితోపాటు అతని యుంపుడుకత్తె గమళ్ల పుల్లమ్మ కూడఁ జనిపోయెను. ఇంతలో కమ్యూనిస్టుల సైన్యము ఆ యూరిపైకి వచ్చెను. ఆ సైన్యమును జూచి అమీను భయపడి, వారి చేతికిఁ జిక్కకుండ ఆత్మహత్య గావించుకొనెను. తక్కిన పోలీసులు పాఱిపోయిరి.

ఈ ఊయల పదములో వీరగాథాలక్షణములు చక్కఁగా నమరి యున్నవి. 'యాబయ్యి దెబ్బలా యెండి రైపోలైన, ఎండి రైపోలైన ఎక్కడా ఉంటదీ?' అను వాక్యములు ఈ గాథానికలోఁ బదే పదే వచ్చి, కథాగమనమున కొక వినూత్న లక్షణమును, నుత్కంఠను గలిగించుచున్నవి. 'ఓనాటి మధ్యాన వరసకాలాన' అనునది, 'గొడ్డళ్ల నూరుకోని గొంగట్ల బెట్టుకోని– కత్తుల్ల నూరుకోని కడుపుల్ల దోపుకోని' అనునది, 'కుడికంటి శోకంబు కుండనే వర్సంబు– ఎడమకంటి శోకంబు ఏరులయ్యా పారు' అనునది తెలంగాణా వీరగాథలలోఁ దఱచుగాఁ గాననగు వారానువర్తనములు (commonplaces). ఇట్టివి ఈ గాథానికలలో కొల్లలు. తెనుఁగు నుడికారముగూడ దీనిలోఁ బ్రస్ఫుటముగాఁ గానవచ్చుచున్నది. 'నీ తోడు నా తోడు– పెట్టినా బొట్టుతోడు', 'మొగోళ్లు అయితేను–మొలతాడు గడితేను' మున్నగునవి. ఉర్దూభాషతో మిశ్రమములైన తెలుగు పదములెన్నియో దీని యందున్నవి. మాల దస్తగిరి భార్య తేరోజ సౌందర్యమును జూచి పోలీసు లాశ్చర్యపడిన ఘట్టము చక్కఁగ వర్ణింపఁ బడినది:–

*"మాలోని బారియా–ఉయ్యాలో, మాసక్క నున్నది– ఉయ్యాలా*
*వారి కండ్లూ వయిన ,, భగ్గునా మండెనూ ,,*
*సీకటీ కోనములో ,, ద్రియ్యో[6] బెట్టీనట్లు ,,*
*మాలదీ సూస్తేను ఉయ్యాలో, మాసక్క నున్నదీ ఉయ్యాలా"*

## 2.3. యలకపల్లి యాదగిరి:–

1947లో తిరుమలగిరి దాడిలోఁ జనిపోయెను. ఇతనిపై నొక గేయము, ఒక కోలాటము పాట వ్యాప్తియందున్నవి. గేయము 'చెయ్యెత్తి జై కొట్టు తెలుగోడా' అను వరుసలో నున్నది. దీనిలో కొంత భాగమిట నుదాహరింతును:–

*"అందుకో జోహార్లు యాదన్నా*
*నీ పేరు నిలబెడతాము యాదన్నా ॥అందుకో॥*

*తొంద్రాయి మొంద్రాయి తిరుమలాగిరి వద్ద*
*మొండి పోలీసోళ్ల దండి బల్లముతోడ*
*ఎంత దండెత్తి వచ్చినా యాదన్నా*
*ఇసుమంత భయపడక యాదన్నా*
*మొండి గుండే తోడ యాదన్నా– బల్*
*దండిగా పోరావు యాదన్నా!*
*కోటపాటీ దాడి యాదన్నా– బల్*
*భేషుగా చేశావు యాదన్నా" ॥అందుకో॥*

## 2.4. గొట్టెముక్కల గోపాలరెడ్డి:–

నల్లగొండ జిల్లాలోని 'ఆత్మకూరు' ఈతని స్వగ్రామము. 1949లో కాంగ్రెసు ప్రభుత్వముతో కమ్యూనిస్టులు జరిపిన పోరాటములో 'పాతర్లపాడు' గ్రామమున నితఁడు చనిపోయెను. 1947 వఱకును రజాకార్లతోను, ఆ తరువాత కాంగ్రెసు వారితోను పోరాటము జరిపిన ధీరుఁడు. ఇతనిపై చిన్నపరెడ్డి పాట వరుసలో నొక గేయము వ్యాప్తియందున్నది. దీనిని తిరునగరి రామాంజనేయులు రచించెను. ఇది వీరరసస్ఫూర్తితో హృదయము నుఱ్ఱూఁతలూఁచు గేయము:–

*"సై సై గోపాలారెడ్డీ! రెడ్డీ– నీవు నిలిచావు ప్రాణాలొడ్డీ ॥సైసై॥*
*ఔరౌర! నీ పేరు జెప్పితే–హడలు దోపిడీ బదాదొరోళ్లకు*
*పౌరుషంబుగల తెల్గుజాతి–గౌరవంబు నిల్ప నొరిగావు యుద్ధమున ॥సైసై॥*

*ఆరువందలా ఏడులనుండీ– క్రూరులు ఆసఫ్ జాహి రక్కసులు*
*మజాకోసమై మనుషుల రక్తం– మహిషాసురులై పీల్చి మదించిరి*
*చిక్కి శల్యమై కృశించు మనుషుల– నొక్కసారి గమనించి నీవు ఆ*
*రక్క సాధములపై పగబట్టి– రేచులాగు రణమందు దూకితివి ॥సైసై॥"*

ఈ గొట్టెముక్కల గోపాలరెడ్డి రజాకార్ల క్రూరకృత్యములను సహింపక, ప్రజానాయకుఁడై వారి నెదిరించెను. తరువాత వచ్చిన కాంగ్రెసు ప్రభుత్వము క్రూరులగు జమీందార్లకు రక్షణ నిచ్చుటచే గోపాలరెడ్డి యా ప్రభుత్వముతోఁగూడఁ బోరు సల్పెను. ఇతఁడు పల్నాటి యుద్ధములోని బాలచంద్రుని వంటివాఁడు శత్రువులీతనిని జుట్టుముట్టఁగా, గుండె చెదరక 'రైఫోల్' ప్రేల్చుచు, శత్రువలయము నకు గండికొట్టుటకై చండప్రచండముగా గంటసేపు పోరి తన యుద్దండతను జూపిన గండరగండఁడు! శత్రువుల బ్రెన్‌గన్ నుండి యగ్నివర్షము కురియఁగా నందలి యొకగుండు వచ్చి ఇతని పొట్టకుఁ దగిలి ప్రేగులు బయటపడెను. అయినను నాతఁడధైర్యపడక, బాలచంద్రునివలెనే వ్రేలాడెడి యా ప్రేగులను లోపలికిఁ ద్రోసికొని, పైగుడ్డదీసి నడికట్టుకట్టుకొని, రైఫిల్ చేతఁబటి, తోటాలన్నియును బూర్తియగు వఱకును బోరి, తన రైఫిలు శత్రువులకిచ్చుట కిష్టము లేక, నేలకుఁ గొట్టి ముక్కలు ముక్కలు చేసెనఁట. నిన్న మొన్ననే, మనకన్నుల యెదుటనే ఇట్టి మహావీరులుండఁగాఁ, బల్నాటి యుద్ధ కాలమున బాలచంద్రాదులుండుటలో నాశ్చర్యమేమున్నది? ఈ గొట్టెముక్కల గోపాలరెడ్డి యుద్ధమును వర్ణించుచుఁ గవి మహోద్రేకము తో, ద్విత్వటకార ప్రాసతో నెట్లు వర్ణించెనో చూడుఁడు:–

*"చుట్టి సేన గురిపెట్టి బ్రెన్ను నీ–పొట్టను జీల్చగ, పేగులు వెళ్లగ*
*నెట్టి పేగులను పొట్టలోకి, పై– బట్టతోను నడికట్టు గట్టి, తొడ*
*గొట్టి దాపుగల తోటాలన్నీ– పట్టు విడక ఫట్ ఫట్ మని పేల్చి*
*తుట్ట తుదకు నీ రైఫుల్ నేలకు– గొట్టి, ముక్కలుగ జేసిన ధీరా–*
*॥సైసై॥"*

గోపాలరెడ్డి స్వగ్రామమగు నాత్మకూరులో దేగల మధుసూదన్ అనునతఁ డీ పాటను బాడినాఁడు. దీని కవియగు తిరునగరి రామాంజ నేయులుగారిని గుంటూరు మండలమునఁ బల్నాటి సీమలో

మాచెర్ల యందు 1966లో నేను కలసినప్పుడు వారు తమ దగ్గఱ నున్న గేయమును (వ్రాఁతప్రతిని) నాకుఁ జూపినారు.

## 2.5. కొంతం కొండలరెడ్డి పాట:-

నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా, విస్సాళ్లపురము ఈతని గ్రామము. ఇతనిపై నీ క్రింది రీతిని పాట వ్యాప్తియందున్నది:-

*"కొండవంటి కొండల్‌రెడ్డి పోయాడోయ్*
*మన కందరికి దారి చూపి పోయాడోయ్ ॥కొండవంటి॥*

*వీరుడూ కొండయ్య విస్సాళ్లపురమందు*
*రెడ్డీ కులమున బాహు దొడ్డా వాడై పుట్టి*
*దోపిడి పాలాన గూల్చుటకు తాను*
*గెరిల్లా దళమందు చేరాడోయ్" ॥కొండవంటి॥*

ఇతఁడు నశ్యంపేట, ఆత్మకూరు, మిరియాల, ఎఱ్ఱబాడు- మొదలగు గ్రామములపై జరిగిన దాడులలో పోలీసులను గెల్చినాఁడట. తన దళమంతయు దెబ్బ తినఁగాఁ గ్రొత్త దళమును దయారు చేసికొని, పాతసూర్యాపేటలో 'చక్రయ్య బోడెక్కి చక్కాగ పడుకుంటె' పోలీసులు వచ్చి ముట్టడించిరి. ఆరుగంటలసేపు ఘోరయుద్ధము చేసి వీరమరణము నందెను.

## 2.6. విసునూరిదొర పాట:-

వరంగల్ జిల్లా, జనగాం తాలూకా, 'విసునూరు' గ్రామమున రామచంద్రారెడ్డి యను జమీందారు రజాకార్లకాశ్రయమిచ్చి, వారి సహాయమునఁ బ్రజలను జాల హింసించెను. దొడ్డి కొమరయ్య యను వీరుఁడు ప్రజలకు నాయకత్వము వహించి, ఈ దొరపైఁ దిరుగుబాటు చేసెను. దీనిపైఁ జక్కని ఊయలపాట యున్నది. దీనిని సూర్యాపేట తాలూకా (నల్లగొండ మండలము) నూతనకల్లు గ్రామములో వరినాటు పాటగాఁ బాడుచుండఁగా సంపాదించితిని. కోలాటపు కోపుగాఁ గూడఁ దీనిని బాడుచున్నారు.

*"విసునూరు గ్రామాన-ఉయ్యాలో- ఎసుమంటి సంగతీ ఉయ్యాలా*
*ఎసుమంటి సంగతీ ,, ఏ తీరుగున్నదీ ,,*
*ఆ వూళ్లో దోరోడు ,, ఏమేమి సేసెనే ,,*
*విసునూరు దోరోడు ,, ఎంత పాపిష్టోడు ,,*
*ఊళ్లో అందరిని ,, యాసార్న గొట్టెరా ,,*
*దోరోడు గట్టేది ,, పన్నెండు వరకలూ ,,*
*పన్నెండు వరకల్ల ,, పష్టు బండెడ్లురా ,,*
*సారంగి యెద్దురా ఉయ్యాలో- సందమా మెద్దురా ఉయ్యాలా"*

– ఈ విధముగాఁ బ్రారంభమగును. ఈ విసునూరిదొర దగ్గఱ నున్న 'యాభై దెబ్బల యెండికట్ల రైఫోలు'ను సిరిపట్ల గ్రామములోని దొర దొంగిలించెను. విసునూరిదొర తన దగ్గఱనున్న యెఱ్ఱగొల్ల మల్లన్న యను జీతగాని ప్రోత్సాహమున, గొల్ల వేషమునఁ బోయి తన రైఫిలును దెచ్చుకొనెను. తరువాతఁ దన ఇరువది యకరముల భూమిని దున్నించి వరినాటుటకై మూఁడు వందల కూలీలను రప్పించెను.

*"సగమీదు పోయినోళ్లు-ఉయ్యాలో- ఒక వందమందీ -ఉయ్యాలా*
*పదుసు ఆడోళ్లయిన ,, ఒక వందమందీ ,,*
*పసిపిల్ల తల్లులూ ,, ఒక వందమందీ ,,*
*కరకరా ప్రొద్దయిన ,, పొడుచుతున్నప్పుడు ,,*
*ఊరుదగ్గర దొరా ,, పొలము పట్టిచ్చెరా" ,,*

ఉదయమునుండి రాత్రి పండ్రెండు జాముల వఱకును వారిచేఁ బని సేయించెనఁట. ఈ మధ్యలో వారిని భోజనమునకు వదల లేదు. గుఱ్ఱములను కొట్టు కొరడా చేతఁబట్టి-

*"పోతనన్నా దాన్ని ఉయ్యాలో పొర్లిచ్చి కొడతాడె ఉయ్యాలా*
*పసిబిడ్డ తల్లులకు ,, పాలు చేపులు వచ్చె" ,,*

అయినను దొర వారిని కనికరించలేదు. కుమ్మరి వెంకును బిలిచి, నూఱు బొడ్డుగిన్నెలను దెప్పించి, అందుఁ బాలు పిండుకొనుడని చెప్పెనఁట. చీకటి పడఁగా దీపములు తెప్పించి పొలములోఁ బెట్టి పని చేయించెనఁట. రాత్రి పండ్రెండు ఝాములకు మల్లన్న భార్య, గొల్ల సత్తెమ్మ యను నామె ధైర్యము వహించి, స్త్రీలకు నాయకత్వము వహించి దొరపైఁ దిరుగఁబడెను. దొర యామెను కొరడాతోఁ గొట్టెను. ఇంతలో పొలము దున్ని అలసిపోయిన మల్లన్న యటకు వచ్చెను. దొర కోపముతో వానినిగూడఁ గొట్టఁబోయెను. అప్పటికే మిక్కిలిగ నలసిపోయియున్న మల్లన్న యుగ్రుఁడై, కాడిమానుతో దొరను జావమోఁదెను. నమ్మిన బంటే తిరుగఁబడగాఁ జేయునదిలేక దొర గుఱ్ఱముపై నెక్కి పాఱిపోయెను.

## 2.7. దొడ్డి కొమరయ్య:-

విసునూరి దొరయగు రామచంద్రారెడ్డి క్రూరకృత్యములను ధైర్యముతో నెదిరించి 1946లో మరణించిన వీరుఁడితఁడు. ఆంధ్ర మహాసభ కార్యకర్త. ఇతనిది ఓరుగల్లు మండలమున జనగామ తాలూకాలోని 'కడవెండి' గ్రామము. నల్లగొండ మండలమున నాకు లభించిన వీరగాథానికలనుబట్టి, చింతలపూడి రామిరెడ్డి, దొడ్డి కొమరయ్య, గొట్టెముక్కల గోపాలరెడ్డి యను ముగ్గురు వీరులు తెలంగాణా విప్లవమునఁ బ్రముఖ పాత్రను వహించినట్లుగా దెలియుచున్నది. కొమరయ్యపై నీ క్రింది పాట వ్యాపించియున్నది:-

*"అమరజీవివి నీవు కొమరయ్యా*
*అందుకో జోహార్లు కొమరయ్యా ॥అమర॥*

*విశ్వరాక్షసుడైన విసునూరి దేశముఖు*
*పాలించుచున్న యా పల్లె కడవెండిలో*
*ప్రజల రక్షణ కొరకు కొమరయ్యా, నీవు*

*ప్రాణాల నిచ్చావ కొమరయ్యా* *॥అమర॥*

..................................

*కడవెండిలో నిన్ను కొమరయ్యా*
*కాల్చిరా ద్రోహులూ కొమరయ్యా*
*నినుగొన్న యట్టి యా నీచులను దునుమాడి*
*నినుగన్న యట్టి యీ తెలుగు గడ్డను మేము*
*స్వాతంత్ర్యముగ జేసి శాంతించెదమె కాని*
*నీ పేరు నిలుపకనె కొమరయ్యా, మేము*
*నిదురైన పోమోయ్ కొమరయ్యా!*[7] *॥అమర॥*

## 2.8. నైజాము పాట:-

వీరమరణ ప్రశంసయేకాక, క్రూరగర్హణముకూడ నీ విప్లవ కాలమున జరిగినది. నైజాము క్రౌర్యముపై నొక చక్కని పాట వ్యాప్తి గాంచెను. దీని నొక నిరక్షర కుక్షి ఆశువుగాఁ బాడెనఁట. ప్రసిద్ధమగు నొక ప్రాచీన సాంప్రదాయిక జానపదగేయము దీనికి మూలము. "నైజాము సరకరోడ! నాజీల మించినోడ!..." అను నీ పాటనుగూర్చి 'వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు' అను నాల్గవ ప్రకరణమునఁ జర్చించితిని (చూ. పుట.72).

## 2.9. చెన్నారెడ్డి ప్రతాపరెడ్డి:-

ఇతఁడు నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా, ఎఱ్ఱబాడు గ్రామములోని జమీందారు. ఇతనిని 'ఎఱ్ఱబాడుదొర' యనియుఁ బిలుతురు. విప్లవకాలమున రజాకార్లతోఁ గలిసి ప్రజలను చిత్రహింసలు పెట్టిన క్రూరుఁడు. విప్లవకారులీతని యాస్తిని ధ్వంసము చేసిరి. ప్రజ లీ దుర్మార్గు నెట్లు తిట్టిపోసిరో చూడుఁడు:-

*"బండెనుక బండికట్టీ- పదహారు బండ్లు కట్టీ*
*ఏ బండ్లో పోతవు కొడుకో- నా కొడుక ప్రతాపరెడ్డి* *॥బండె॥*

*దొడ్లన్ని కాలిపాయె-ఎడ్లన్నీ ఎల్లిపాయె*
*ఇకనైనా లజ్జ లేదా కొడుకో-నా కొడుక ప్రతాపరెడ్డి* *॥బండె॥*

*గొల్లోళ్ల గొర్లు వొడిసె-రైతోళ్ల బియ్యం వొడిసె*
*ఇక ఏమి తింటవు కొడుకో-నా కొడుక ప్రతాపరెడ్డి* *॥బండె॥*

*పెదపంది సూరిగాడు-సినపంది మల్లిగాడు*
*మీ యిద్దర్నీ తింటం కొడుకో-నా కొడుక ప్రతాపరెడ్డి"* [8] *॥బండె॥*

ప్రజలకు ఈ ప్రతాపరెడ్డిపై నెంత కసి యున్నదో పై గీతము వెల్లడించుచున్నది. ప్రతాపరెడ్డి కడ 'సూరిగాడు, మల్లిగాడు' అను నిర్వురు బంట్లు కలరఁట. వీరు యజమానిని మించిన క్రూరులు. అందుచే వీరినిద్దఱిని హతమార్చఁగలమని ప్రజలు ప్రతిజ్ఞ పట్టు చున్నారు. వీరిద్దఱును స్థూలకాయులగుటచే పందుల యుపమానము వచ్చినది.

## 2.10. చిలకమ్మ పాట:-

తెలంగాణా విప్లవమునకు సంబంధించిన సిసలైన వీరగాథానిక ఈ చిలకమ్మ పాట. దీనిని 23-6-1966న నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా, నూతనకల్లు గ్రామమున సంపాదించితిని. బండపల్లి లింగయ్య యను కర్షకుఁడు పాడెను. ఇది కోలాటపుపాట. వరినాట్లలోఁగూడ దీనిని పాడుట కలదు. తెలంగాణా విప్లవమునఁ బురుషుల పౌరుషమే కాక, ఇట్టి వీరనారీమణుల శౌర్యమును బ్రదర్శితమైనది. ఈమెను పట్టుకొనుటకు పోలీసు లెంతయో ప్రయత్నించిరి. కాని లాభము లేకపోయెను. దనసాయిపేట 'దొరోడు' ఈమెపై పగఁబట్టెను. పోలీసులకు లంచమిచ్చెను. చిలకమ్మను పోలీసులు తఱుముకొనిరాఁగా నామె వారికన్నులలోఁ గారము చల్లి పాఱిపోసాఁగెను. అయినను పోలీసులామెను వెంబడించిరి. చిలకమ్మ పరుగెత్తుకొనిపోయి యొక బావిలో దుమికినది. పోలీసులామెను వెన్నాడి, బావిలోకి దుమికి, చనిపోయిన యామె శరీరమును బయటకు లాగి, కసి తీరక యా శవమును చావమోఁదిరట. ఈ చిలకమ్మ పాటతో నల్లగొండ మండలమంతయుఁ బ్రతిధ్వనించుచున్నది. ఇది వరినాటులలోను, చుట్టుకాముఁడు పాటగాను, కోలాటపు కోపుగాను పాడఁబడుచున్నది. ఈ పాటను అల్లిన కవి ఈమెను 'నా సెల్లెల సిలకమ్మా' అని చేయు సంబోధన శ్రోతల గుండెలను పట్టివేయును. ఇదియే ఇందలి పునరావృత్తి. ఈ గాథానిక ప్రారంభమిట్లుండును:-

*"ఏ దేశాన పుట్టినవే — నా సెల్లెలసిలకమ్మా!*
*ఏ దేశాన పెరిగినవే ,, ,,*
*నువు పుట్టింది గిరిపురమే ,, ,,*
*నువు పెరిగింది గిరిపురమే ,, ,,*
*నువు పుట్టీ నప్పుడే ,,*
*కత్తికి కమినిష్టంటీవే ,, ,,*
*బాలల సంగం గట్టితివే ,, ,,*
*మయిలా*[9] *సంగం గట్టితివే ,, ,,*
*నిన్నిచ్చింది గదిపల్లే -నా సెల్లెల సిలకమ్మా"*

ఈమె భర్త కాంగ్రెసు కమాండరఁట. ఈమె కమ్యూనిస్టు. చిలకమ్మ పుట్టిల్లు గిరిపురము. ఇది వరంగల్లు జిల్లా, మహబూబా తాలూకాలో మానుకోట దగ్గఱ నున్నది. ఈమె అత్తవారి యూరు గదిపల్లె (నేఁటి నల్లగొండ మండలమునఁగల గెడ్డిపల్లె కాఁబోలు). ఈమెను జంపుటకై పగబట్టినవాఁడు 'దనసయిపేట దొరోడు'. రంగసాయిపేటయే ఈ పాటలో 'దనసయిపేట'గాఁ బేర్కొనఁబడి యుండవచ్చును. చిలకమ్మ చనిపోయినవార్త ఊరూరను వ్యాపించెనఁట. కోలాటములలోను వరినాట్లలోను ఈ వీరసోదరిని గీర్తించుచుఁ బ్రజలు మఱువకుండ నుండిరఁట.

*"ఊరూరూకు పత్రికలూ  నా సెల్లెల సిలకమ్మా!*
*ఊర్లన్నీ ఏగేనే  ,,  ,,*
*కోలాటంలో నీ పదమే  ,,  ,,*
*నాట్లల్లా నీ పదమే  ,,  ,,*
*నిన్నూ మరవాకుంటానే  ,,  ,,*
*నిన్నూ ఏగిస్తుండారే  నా సెల్లెల సిలకమ్మా!"*

తెలంగాణా మాండలికమున 'ఏగు' అనఁగా 'ప్రచారము పొందు' అని యర్థము. (ఇది "ఊరేగు" పదములో నితర ప్రాంతములందును గలదు).

## 2.11. విప్లవ గీతము:-

రజాకార్లు, సైనికులు స్త్రీలను మానభంగము చేయుచుండఁగా, విప్లవ వీరులు స్త్రీలకిచ్చిన సందేశమును దెలుపు నద్భుతమగు వీరగీత మొకటి కలదు. దీనిని నల్లగొండ మండలమున శ్రీపాద నరహరి యను జానపదుఁడు పాడఁగా విని వ్రాసికొంటిని. తెలంగాణా విప్లవము ఆబాలగోపాలమును ఎట్లు వీరులుగా మార్చివేసినదో, ఆ విప్లవమెంత మహోద్ధృతముగా జరిగినదో తెల్పు గేయమిది. ఇది 'చెయ్యెత్తి జైకొట్టు తెలుఁగోడా' అను పాట వరుసలో పాడఁబడును.

*"రణమందు దూకోయి తెలుగోడా!*
*వణికించు శత్రులా మొనగాడా!!  ॥రణమందు॥*

*చిన్ని చెల్లెళ్లార చిన్న బాకుంచండి*
*చిట్టెడూ కారాన్ని చేతబట్టండి*
*కళ్లల్లో గుప్పాలి అక్కయ్యో...*
*కత్తితో పొడవాలి చెల్లయ్యో...  ॥రణమందు॥*

*పశువులగు సైనికులు పట్టుకుంటే మిమ్ము*
*పండ్లతో కొరకండి, కండ్లల్లో పొడువండి*
*జాడిచ్చి ఒక తన్ను తన్నాలోయ్...*
*జెండాను మదిలోన తలవాలోయ్..."  ॥రణమందు॥*

ఇది స్త్రీలకిచ్చిన సందేశము. ఇఁక గెరిల్లా యుద్ధము చేయు పురుషుల కిచ్చిన సందేశమును జూడుఁడు:-

*"చెట్టు చాటుందరా, పట్టరా ఒడిశాల*
*కొట్టరా ఒక దెబ్బ పొట్టపగిలేటట్టు*
*నట్టడవి లోపలా కూలన్నా! నిన్ను*
*పట్టవశమూ కాదు రైతన్నా!"*

## 2.12. నల్లగొండ పాటలు:-

ఈ తెలంగాణా మహావిప్లవమునకు స్థావరమైనదది నల్లగొండ మండలము. ఇది విప్లవకారుల కంచుకోట. దీనిని బ్రశంసించుచుఁ గూడఁ గొన్ని పాటలున్నవి. అట్టి వానిలో 'వీరభూమి', 'నల్లగొండ' అను రెండు చక్కని పాటలు నాకు లభించినవి. ఇందు వీరభూమి యను గేయము "నిను గన్న దీ తెనుగు తల్లేరా, కనక రాసుల కల్పవల్లేరా" అను పునరావృత్తితో నుండును. ఇందు నైజాము కర్కశ పాలన, రజాకారుల దౌష్ట్యములు, దేశముఖుల క్రౌర్యములు– వీని నన్నింటి నెదిరించి పోరాడిన నల్లగొండ మండల ప్రశంస యున్నది. నల్లగొండ 'కష్టజీవుల కందదండ' యనుట, 'తెలుగోడి రక్తంబు ఒలకబోసిన సీమ' యనుట ఈ గేయములోని కవిత్వపటుత్వమునకు మచ్చుతునుకలు. నల్లగొండ మండలము–

*"కర్కశుల గుండెపై కత్తి యై మెరిసింది*
*కర్షకుల కండపై కవచమై మురిసింది*
*కష్టజీవుల కంద దండేరా*
*కల్పపూదండ నల్లగొండేరా  ॥నిన్నగన్న దీ తెనుగు॥*

*తెలుగోడి రక్తంబు ఒలక బోసిన సీమ*
*వెలలేని మాగాణి తెలగాణ నీదెరా*
*సుందరయ్య[10] ను కన్న గడ్డేరా*
*రావిరెడ్డీ[11] తెలుగు బిడ్డేరా!"  ॥నిన్నగన్న దీ తెనుగు॥[12]*

'నల్లగొండ' యను వేఱొక కోలాటపుపాట సూర్యాపేట ప్రక్కనున్న రాయనగూడెములో లభించినది. ఇది వీరరసము పరవళ్లు త్రొక్కుచున్న మహోత్కృష్టమగు గీతము. ఆంధ్రుల ప్రాచీన శౌర్యమును జ్ఞప్తికెలయించుచు, నల్లగొండ మండలమును బ్రశంసించుచు, ప్రజలను కార్యోన్ముఖులను చేయుచున్న విప్లవగీతము. ఇంతమంచి గేయములు సకృత్తుగా నుండును:-

*"సైసై ఓ నల్లగొండ ధీరుండా!*
*నీ వెత్తేదే ఎఱ్ఱా జెండా!  ॥సైసై॥*

*నల్లగొండ నీ పేరు చెప్పితే*
*ఢిల్లి కోటలో గుండె ఝల్లుమను*
*తెల్ల దొరలె మీ నల్లగొండకు*
*టోపీ లెత్తీ సలాము జేసిరి  ॥సైసై॥*

*హైదరాబాదు నవాబు దండుల*
*రజాకారులా రక్తపిశాచుల*
*గుద్దుకు గుండెలు బ్రద్దలు జేసి*
*తన్నుకు టోపీ మిన్నుకు లేపిన"  ॥సైసై॥*

జమీందారుల భూములను, జాగీరుదారుల భూములను కష్ట జీవులకుఁ బంచియిచ్చిన వీరుల ప్రశంస, బెబ్బులి పిల్లలగు బొబ్బిలి వీరులను, పల్నాటి వీరులను జ్ఞిప్తికెలయించుట, రుద్రమాంబ, నాగమ్మ మున్నగు వీరనారీమణులను జ్ఞాపకము చేయుట ఈ గేయమునఁ గలదు. తెలంగాణా వీరుఁడు ఫిరంగి మీఁద మీసము దువ్వి, తుపాకిపై తొడఁగొట్టి నిలఁబడినాఁడఁట. మూఁడువేల వీరులు ఆత్మ బలిదానము చేసిన పుణ్యక్షేత్రమఁట నల్లగొండ!

*"ఫిరంగి మీదా మీసము దువ్వి*
*తుపాకిపై తొడగొట్టి నిలబడి*
*చిత్తు చేసి నీ శత్రుమూకలా*
*నెత్తురు కండ్లా చూసిన ధీరా* ॥సైసై॥

*ఎఱ్ఱబావుటా నీడల క్రిందా*
*వెచ్చని నెత్తురు ఏరులు పార*
*మూడువేల మృతవీర సమాధుల*
*పుణ్యక్షేత్రమీ నల్లగొండరా౹"* ॥సైసై॥

రాయలసీమలోవలెనే తెలంగాణమునఁగూడ రెడ్డికులము వారు హెచ్చు. పల్లెలలో నూటికి డెబ్బదివంతు లీకులమువారే యుందురు. ఇది సాహస కులము. తెలంగాణా విప్లవమునఁ బాల్గొన్న వీరులలోఁ జాలభాగము వీరే. ఈ విప్లవమున నసువులు బాసిన రెడ్డికులముయొక్క ఔరసత్వ మీ గేయమున సముచితముగా నిరూపింపఁబడినది:–

*"నల్లగొండ నావాబు కెదురుగా*
*కొండవీటిపై కొలువు దీరినా*
*అనవేముల ప్రభు వారసత్వలిట*
*అసువులు బాసిన రైతుబిడ్డలు"* ॥సైసై॥

## 3. సాంఘికములు

### 3.1. గ్రామకక్షలు–హత్యలు

గ్రామకక్షలవలనను, దొంగతనములవలనను, స్త్రీ సంబంధ మగు స్పర్థలవలనను హత్యలు జరుగుచుండును. ఇట్లు హతులైన వారిపై జానపదులు జాలిపాటలు పాడుకొందురు. గుఱ్ఱాల గోపిరెడ్డి, మానందిరెడ్డి, మల్లన్న, కోరుమన్న, విరూపాక్షరెడ్డి, ఈడిగ రామన్న, బండోళ్ల కురుమలయ్య, రాచోటి రామయ్య, కొత్తకోట వెంకట్రామరెడ్డి, గడేకల్లు నాగిరెడ్డి, వెంకటరామరెడ్డి, గుడిపాటి చలమయ్య, మల్లారెడ్డి, దువ్వూరి సీతారామయ్య, సలపల అమ్మినాయఁడు, రాజనరసయ్య, పోట్ల బూదయ్య, నీలం జగనీలు, నారమ్మ– మున్నగువారిపై నిట్టి కన్నీటి పాటలు తెలుఁగు దేశమున వివిధ ప్రాంతములలో వ్యాపించి యున్నవి.

#### 3.1.1. గుఱ్ఱాల గోపిరెడ్డి పాట:–

ఇతఁడు గుంటూరు మండలమునఁ బల్నాడు తాలూకాలోని 'దాచేపల్లి' గ్రామములోఁ జేలనడుమ చంపఁబడెను. ఆ ప్రాంతమందే యున్న 'పిల్లుట్ల' ఇతని స్వగ్రామము. (ఈతని హత్యను గూర్చిన పూర్తి వివరములకుఁ జూడుఁడు– భారతి, సెప్టెంబరు, 1958.) ఈ గోపిరెడ్డిపై **"ఓ గుఱ్ఱాలా గోపిరెడ్డీ! దాచేపల్లికి దానమైతివా"** అను పునరావృత్తితో నొక చిన్న గేయమున్నది (చూ. పల్లెపదాలు, పుట. 78). ఇందు వివరములంతగా లేవు. గోపిరెడ్డి వర్ణన, దాచేపల్లి చేలలోఁ జంపఁబడినందులకై తల్లి దుఃఖించుట మాత్రమిందున్నది.

***"శేరు శేరు ఎండి మురుగుల్ చేతులాకు బెట్టుకోని***
***కట్టవ మీద వస్తావుంటే కలకటే రనుకొంటిర కొడకా!"***

ఇంతకన్న పెద్దగేయ మొకటి కలదు (చూ. త్రివేణి, పుట. 248). అందుఁ గొన్ని వివరములున్నవి. గోపిరెడ్డిది గొప్ప సంపన్న కుటుంబము. సంక్రాంతి పండుగ నాఁడితఁడు పందెమునఁ బదివేలు గెలిచెనఁట. ఎవరో పిల్ల ఇతనిని జూచి కన్నుగీటినదఁట. ఇందుకూరు పేట పిచ్చిరెడ్డితో నితనికి సహవాసము. గోపిరెడ్డి తాత పిచ్చిరెడ్డి ఆ సహవాసము చేయవలదని మనుమని హెచ్చరించినాఁడట. అయినను గోపిరెడ్డి వినలేదు. ఫలితముగా హత్య చేయఁబడెను. గోపిరెడ్డి తల్లి పేరు అచ్చమ్మ, చెల్లెలు చెంచమ్మ, తమ్ముఁడు రంగయ్య. ఈ గోపిరెడ్డి తన యాలిని బిడ్డను విడిచి, అందమగు యువతి నెవతెనో చేరి, హత్య చేయఁబడెను. ఇది స్త్రీ సంబంధమైన హత్యగాఁ దోఁచుచున్నది. ఈ గేయమున నితని గ్రామము దాచేపల్లి 'దాసుపల్లి' యని చెప్పఁ బడినది:–

*"అడవిలోన అడుగు బెడితివే*
*ఓ గోపిరెడ్డి నీవు*
*దాసుపల్లినే వదలి పోతివే* ॥అడవిలోన॥

*బిగువైన నడుమూలకు*
*బిళ్లలా మొలతాడే ఓ గోపిరెడ్డి*
*శేరు శేరు కడియాలు నీవు*
*దరియిస్తే ఓ గోపిరెడ్డి*
*చూడలేక ఆ పిల్ల నిన్ను కన్నుగీటెనే* ॥అడవిలోన॥

*కట్టేది కాయ పంచెలు నీవు*
*చుట్టేది నీలి గుడ్డలు*
*తొడిగేది యెఱ్ఱ చొక్కాయ నీవు*
*అడిగేది వక్కాకులు"* ॥అడవిలోన॥

#### 3.1.2. మానందిరెడ్డి పాట:–

ఇది రాయలసీమలో ప్రొద్దుటూరు ప్రాంతమున జరిగిన హత్య. ఈ మానందిరెడ్డి తండ్రి రామిరెడ్డి. స్వగ్రామము ప్రొద్దుటూరు దగ్గఱ కొత్తపేట. కొట్టాల కొండరెడ్డి ఇతనికిఁ గోరి బిడ్డనిచ్చి పెండ్లి చేసెనఁట. తండ్రియగు రామిరెడ్డి కొడుకు మరణమునకు దుఃఖించుచున్నట్లుగా నీ గేయమున్నది. 'పల్లెపదాలు' అను సంకలన గ్రంథములో 'నందిరెడ్డి' యను శీర్షికతో నీ గేయమున్నది. ఈ శీర్షిక తప్పు. ఇతని పేరు 'మానందిరెడ్డి' కాని, 'నందిరెడ్డి' కాదు. 'మానందిరెడ్డి' యను పేరు 'మహానందిరెడ్డి' యనుదానికి భ్రష్టరూపము. రాయలసీమలో 'మహానంది' యను పుణ్యక్షేత్రమున్నది. ఈ క్షేత్రనామమును

రాయలసీమ ప్రజలు ధరించుట పరిపాటి. పల్లెపదాలను సంకలనము చేసిన 'కృష్ణశ్రీ'గారు (శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు) మానందిరెడ్డిని నందిరెడ్డిగాఁ బొరపడుటయే కాక, 'కాంతాలోలుపత్వమే అతని పాటుకు కారణమేమో ననిపిస్తుంది' అని వ్రాసినారు. 'త్రివేణి' యను జానపదగేయ సంకలనమునఁగూడ నిట్లే యున్నది.[13] ఇది సరికాదు. ఈ మానందిరెడ్డి గ్రామకక్షలవలన మరణించెనే కాని స్త్రీలోలుపత్వమువలనఁ గాదు. 'పల్లెపదాలు'లోఁ బ్రకటింపఁబడిన గేయముకాని, 'త్రివేణి'లోఁ బ్రచురితమైన గేయముకాని సమగ్రములు కావు. సమగ్రమగు మానందిరెడ్డి పాటను నేను కడప మండలమున సేకరించితిని (ఒక కుంచెపురి యెఱుకత పాడినది). దీనిలో నితని హత్యాకారణములు విపులముగా నున్నవి. తుమ్మమండ్ల 'కేసు'లో నితనికి మేనమామతో పగలు వచ్చినవి.

*"కొట్లూరు కొమ్మలూరు-మేలైనా తుమ్మలూరు*
*తుమ్మమండ్లా కేసులోన- మేనమామా పగలాయె"*

ఎఱ్ఱగుంట్లలో నితఁడు నూటికి నూఱు వేలు పోసి కేసు గెలిచినాఁడు. దానితో నితని బాల్యసఖులే ఇతని మేనమామ పక్షమునఁ జేరి, బొల్లారము-చవటపల్లె గ్రామముల సందున 'అఱుపులు' కాసి, ఇతనిని హత్యచేసిరి. ఇది 1966 నాఁటికి సుమారు ముప్పది యేండ్ల క్రిందట (1936లో) జరిగిన సంఘటన.

*"కొడుకా! మానందీరెడ్డీ!*
*నీకిలలో బత్తెము తీరెనో...*
*రాజా మానందీరెడ్డీ!"*

ఇది ఈ పాటలోని పునరావృత్తి. దీని తరువాతఁ బ్రారంభమిట్లుండును:

*"కొత్త పేటా రామిరెడ్డి- కోరి బిడ్డా నిచ్చి చేసె*
*కొట్టాల కొండరెడ్డి- కోరి బిడ్డానిచ్చి చేసె*
*ఆలి సుకమూ నీకు లేక- ఆరు నెల్లా పొద్దాయెరా" ॥కొడుకా॥*

మానందిరెడ్డి సిరిగల యింటఁబుట్టినాఁడు. నూఱుగాండ్ల యెద్దులు, నూఱుమంది సేద్యగాండ్రు కలరఁట. ఈతని మరణముతో కాడి కట్టెడి దిక్కులేక 'కాకిశోకమాయెు' నఁట. ఇతనికి అక్కసెల్లెండ్రుగాని, అన్నదమ్ములుగాని లేరఁట. ఇతనిని అఱుపులు కాసి చంపినవారు ఈతని బాల్యమిత్రులే యఁట.

*"క్రొరపాటి కోమటయ్య- మంగపట్నం సింగిరెడ్డి*
*బొల్లారం బైపిరెడ్డి- చెట్టిపల్లి నారాయణరెడ్డి*
*చిన్న అండ్లూర్ శివారెడ్డి- పొద్దుటూరు రామిరెడ్డి*
*చిన్న నాటీ నేస్తగాళ్లు- ఒక్క కంచాన తినేటోళ్లు*
*ఒక్క మంచాన పండేటోళ్లు- నీకు అఱుపులు గాసిరా.." కొడుకా॥*

ఈ మానందిరెడ్డి ప్రభుత్వములో గొప్ప పలుకుబడి కలవాఁడు. కడప కచ్చేరిలోను, జడ్జి కోర్టులోను, మంగపట్టణములోని సింగిదొర లీతనికి వంగి వంగి దండములు పెట్టెడివారఁట. ఈ పలుకుబడితో నితఁడు ఎఱ్ఱగుంటలో నొక కేసును నెగ్గెను. దానితో నితనికి మేనమామతో పగలు వచ్చెను. పైన తెల్పిన మిత్రులందఱును మేనమామ పక్షమునఁ జేరిరి.

*"బొల్లారం చవటపల్లె- రెండూళ్లా సందూన*
*సలదీ తుమ్మలా కాద- బెలిదీ సింతలా కాద*
*మంచి నీల్లా బాయికాడ- మల్లెపూల తోటకాడ*
*సన్నదుమ్ము సెట్లల్లో- నీకు అఱుపులు గాసిరా ॥కొడుకా॥*
*సరకల్లా దీసుకోని- ఎద్దుల బండీ కట్టుకోని*
*బల్ బల్ తెల్లారె తలుకు- బారెదే పొద్దెక్కె తలుకు*
*ఎండికుచ్చుల పిడిబాకుతోన- ఏటుకే పడబొడిసిరా" ॥కొడుకా॥*

ఒక్కగానొక్క కొడుకిట్లు చంపఁబడఁగా తండ్రి రామిరెడ్డి హృదయము మిక్కిలి క్షోభించెను. ఈ క్షోభను జానపదులెంత హృదయ విదారకముగా వెలువరించిరో చూడుఁడు. మానందిరెడ్డికి బాల్యముననే మాతృవియోగము కలిగినది కాఁబోలును. తండ్రి యతనిని మిక్కిలి గారాబముతోఁ బెంచెను.

*"కంచి మేకను దెచ్చి- కందూరు వండించి*
*పచ్చిపాలాతోనా- ఎత్తి సాకితిరో ॥కొడుకా॥*
*సిటికె నేలిది సిన్న ఉగ్రం- సిలకలాదీ ముద్దుటుంగ్రం*
*ఎవరి ఏలికి పెడుదురా? - నేను, ఎవరి ముచ్చట చూతురా?"*

జానపదుల కవిత్వమున నెంత పటుత్వమున్నదో తెలిసికొనుటకు పై ఖండిక యొక్కటి చాలును. గుఱ్ఱాల గోపిరెడ్డివలెనే మానందిరెడ్డియు గొప్ప నీటుకాఁడు. ఆతని సౌందర్యమునుగూడ తండ్రి రామిరెడ్డి తలఁచి తలఁచి దుఃఖించినాఁడు.

*"నున్నంగ తలదువ్వి- నూగాయ జడలేసి*
*పిడికెడాకులు సేతబట్టి- పిడికెడక్కలు సేతబట్టి*
*కట్టమిందా బోతవుంటే- కలకటేరనుకుందురా -కొడుకా"[14]*

ఈ వీరగాథానికను 1-5-1966న కడపలో చిన్న రామక్క యను నెఱుకత పాడినది. "కలకటేరనుకుందురా" అనుదానికి 'కదిరి తేరనుకుందురా' అను పాఠాంతరమున్నది. అదియే సమంజసముగా నున్నది.

### 3.1.3. మల్లన్న పాట:-

ఇతని పూర్తి పేరు బొమ్మనిపాటి మల్లన్న. ఇతఁడు గజదొంగ. చిన్నతనముననే తల్లిదండ్రులను గోల్పోఁగా నొకామె ఇతనిని బెంచినది. ఈ మల్లన్నను బట్టుకొని ప్రభుత్వమువారు ఉరి తీసిరి కాఁబోలు. 'బోరు బోరు బొగుడుల్లా, కాసోడు కొట్టిన కక్కూసపు రాళ్లలో వీనికి గోరి కట్టిరఁట. పెంచిన మమతచే నా తల్లి ఇతనిని

దలcచుకొని తలcచుకొని దుఃఖించినది. ఆమె దుఃఖమే ఈ గాథానిక (చూ. పల్లెపదాలు. పుట. 77. మఱియు త్రివేణి, పుట. 274).

### 3.1.4. కోరుమన్న పాట:–

కోరుమన్న రాయలసీమలో రేనాటివాcడు. గాండ్లవాcడు. ఇతcడేమి నేరము చేసెనోకాని పోలీసులీతనిని జంపుటకై వెదకసాc గిరి. పోలీసులు వచ్చిరని ఇతనినొక స్త్రీ హెచ్చరించుచున్నట్లున్నది ఈ గేయము. "గాండ్లొల్ల కోరుమన్నా! బొలు రండలో వుండావు గాండ్లొల్ల కోరుమన్నా!" అనునది ఇందలి పునరావృత్తి. 'పోలీసులు నిన్ను పట్టి చంపెద'రను భావమెంత తీవ్రముగc జెప్పcబడినదో చూడుcడు:

*"చిట్లిన్న నెత్తూరు సీసాల్కి నించుకోని*
*సిందంద లాడేరు కొడుకా ॥గాండ్లొల్ల॥*
*కారిన్న నెత్తురుని కడవలకి నింపుకోని*
*కల్లంటు అమ్మేరు కొడుకా" ॥గాండ్లొల్ల॥[15]*

వచ్చిన పోలీసులు ఊరికి నర్ధపరుగు దూరములో నారంగి వనములో కోరుమన్నను నఱికి వేసిరి.

### 3.1.5. విరుపాక్షరెడ్డి పాట:–

ఇది కోలాటపు పాట. ఇతనినిగూర్చిన వివరములు తెలియుట లేదు. ఇది కర్నూలు మండలమున సేకరింపcబడిన పాట యగుటచే నితcడు రాయలసీమ వాcడని మాత్రము చెప్పcగలము. దీని పునరావృత్తి:–

*"యిటువంటి యిరుపాసిరెడ్డి యిగ బుట్టదమ్మా*
*దేవుడే యిరుపాసిరెడ్డీ యిలగలగదమ్మా" ॥యిటు॥*

ఈ విరూపాక్షరెడ్డి ఒకరి యాలినిc బట్టcగాc, గొన్ని యూళ్లు గలిసి ఇతనిని కొట్టి, కోర్టులో లంచములిచ్చి, తప్పించుకొనిరని ఈ క్రింది చరణములనుబట్టి యూహింపనగును.

*"వొగనాల్ని పట్టే దెందుకీ – వూరూరు కలిసే దెందుకీ*
*పదిమంది కూడే దెందుకీ – పంచాతి జేసే దెందుకీ ॥యిటు॥*

*వొంటిగాణ్ణి గొట్టే దెందుకీ – వూరూరు కూడే దెందుకీ*
*మంచాలు ఎక్కే దెందుకీ – లంచాలు తినే దెందుకీ" ॥యిటు॥[16]*

### 3.1.6. ఈడిగ రామన్న పాట:–

ఇదియును కోలాటపు కోపే. ఈడిగ రామన్ననుగూర్చిన వివరములు తెలియుట లేదు. ఈ పాటయొక్క వ్యాప్తినిcబట్టియు, దీనిలో నుదాహరింపcబడిన బొలికొండ రంగస్వామి దేవాలయమును బట్టియు నీ రామన్న గుత్తి ప్రాంతము వాcడని యూహింపనగును. ప్రారంభము:–

*"రామన్నా రామన్నా యీడీగే రామన్నా*
*యెందుండాడనీ జూతునో రామన్నా*
*రామన్నా పెండ్లాము సూడ సక్కనిదన్న*
*పగవాణి పాలాయెనే రామన్నా" [17]*

కాళ్లకు సంకెళ్లు, చేతులకు బేడీలు వేసి, రామన్నను బాధించిరట. ఇతని కన్నతల్లి దాక్షమ్మ. ఈ గాథానికలోc గవిత్వము బింకముగా నున్నది. సౌందర్యవతి యగు నీతని భార్య దుఃఖించి నట్లుగా నీ గీతము నడచినది.

*"యెలనాగా తమీ నిలుపా*
*యేమి సేయుదు ముద్దా*
*పలుకే బంగారమాయెనే రామన్నా" [18]*

### 3.1.7. బండోళ్ల కురుమలయ్య పాట:–

ఇతనినిగుఱించిన వివరములు తెలియుటలేదు. రాయలసీమలో రేనాటివాcడు కావచ్చును. కడప జిల్లా బద్వేలి తాలూకాలో డా॥ తూమాటి దొణప్పగారు ఒక గేయమును సంపాదించిరి (చూ. త్రివేణి, పుట. 263). ఓరుగల్లు మండలమున హనుమకొండలో డా॥ బి.రామరాజుగారు వేఱొక పాటను సేకరించిరి (చూ.త్రివేణి, పుట. 278). ఇందు పేరు 'బండోళ్ల గురువన్న' అని యున్నది. రామరాజుగారు సంపాదించిన పాటలో 'గొడ్డండ్లు దీసికొని గొంగట్లో పెట్టుకొనుట'– 'కారిన రక్తమంతయుc గడవలలోనికి నింపుకొనుట'– 'చిట్లిన రక్తమంతయు సీసాలకు నింపుకొనుట'– 'బండెనుక బండి కట్టి పదహారు బండ్లు కట్టి' మున్నగు వారానువర్తనములు (commonplaces) కొల్లలుగా నున్నవి. నేను కడపజిల్లా రాయచోటి తాలూకాలో నీ గురవన్నపై నొక జక్కికపాటనుగూడ సంపాదించితిని. శత్రువులీతనిని మిక్కిలి హింసించి చంపిరి. ("బండెంట బండి కొడుకా! వో బండోల్ల కురుమలయ్యా" అనునది ఇందలి పునరావృత్తి).

*"కాలికి కాలు గట్టీ – కాలికీ బేడీలు పెట్టీ*
*కట్టేసి కొట్టిరే కొడుకా ॥బండెంట॥*

*రెట్టాకు రెట్ట గట్టీ– రెట్టాకు తాడు గట్టీ*
*మంచానికే గుంజిరే కొడుకా ॥బండెంట॥*

*బైరాగికుంటకాడా పంచాంగం చెట్టుకింద*
*నీ తలా కొట్టిరి కొడుకా" ॥బండెంట॥" [19]*

### 3.1.8. రాచోటి రామయ్య పాట:–

ఆదోనిలో రాచోటివారు కోటికిc బడగలెత్తిన కోమటులు. రాచోటి వీరన్న కొడుకు రామయ్య. 1930–35 ప్రాంతమువాcడు. ఆదోని పురపాలక సంఘాధ్యక్షుడు. కొంగనపల్లి కృష్ణారావు, కోసిగ

హనుమప్ప నాయఁడు నితనికి నేస్తకాండ్రు. మారెమ్మ జాతరలోఁ జెలరేఁగిన కొట్లాటలో నొక బలిజవాఁడు ఇతనిని తుపాకితోఁ గాల్చి చంపెను.

*"రామ రామా కోదండా రామా భై*
*రామ రామా కోదండా రామా"*

అనునది ఇందలి పునరావృత్తి.

రాయలసీమలో కోలాటపు పాటల కన్నిటికిని సాధారణముగా నిదియే పునరావృత్తిగా నుండును.

*"ఒంటిగాను పాతావె- జంటెవరు లేరు తండ్రి ॥రామ॥*

*తలవాకిలి దాటుతూనె తల్లి దండ్రి తుమ్మినారు*
*సందు గొందులు దాటుతూనె చాకలి మాద లడ్డమాయె ॥రామ॥*

*జోడుగుండ్లు బారుజేసి కాల్చెనమ్మ బలిజోడు*
*కొండ కూలిపోయినట్లు కూలిపోయె రామయ్య" ॥రామ॥[20]*

ఇది కోలాటపు పాట.

### 3.1.9. కొత్తకోట వెంకట్రామరెడ్డి పాట:-

ఇదియును కోలాటము పాటయే. కథానాయకుఁడు కొత్తకోట వెంకటరామరెడ్డి. ఇతనినిగూర్చిన వివరము లెక్కువగాఁ దెలియుట లేదు. కథారంగము మహబూబునగర మండలము. ఇతఁడు మొదట గొప్ప జమీందారుగా నుండెననియుఁ, దరువాత నా యైశ్వర్య మంతయుఁ బోఁగా నితఁడు నిఱుపేద యయ్యెననియుఁ, బ్రభుత్వము వారీతనిని బంధించిరనియుఁ దెలియుచున్నది. తండ్రియో తల్లియో దుఃఖించుచున్నట్లుగా నీ పాట నడచును (చూ. త్రివేణి, పుటలు. 266, 267).

### 3.1.10. గడేకల్లు నాగిరెడ్డి పాట:-

ఇది 1880-1925 ప్రాంతముల గాథ. ఈ నాగిరెడ్డి అనంతపుర మండలమున గడేకల్లు గ్రామములో వెలసియున్న భీమేశ్వరస్వామి వరప్రసాదియని చెప్పుదురు. ఇతఁడు దౌర్జన్యవాది. శ్రీమంతుల ఇండ్లు దోచి బీదలకుఁ బంచిపెట్టెడివాఁడట. బళ్లారి ఖజానా దోచి పేదలకుఁ బంచియిచ్చెనఁట. ఇతని ఇంటిపేరు బొబ్బిళ్లవారు. తల్లి గౌరమ్మ. ఈతఁడు శూరుఁడగుటయే కాక పేదల పాలిటి దేవుఁడు కూడ:-

*"చుట్టు ముట్టూ పల్లెల కెల్ల శూరుడమ్మ నాగిరెడ్డి*
*డెబ్బైయేడు పల్లెలకెల్ల దేవుడమ్మ భీమలింగ ॥రామ॥*

*పక్కనున్న పల్లెలకెల్ల పాళెగాడు నాగిరెడ్డి*
*దిక్కు దిక్కుల పల్లెలకెల్ల దేవుడమ్మ భీమలింగ ॥రామ॥[21]*

ఈ నాగిరెడ్డి దివిటీలు పట్టుకొని వెళ్లి మోపిడి ముష్టూరు గ్రామములో అగడీ హనుమంతప్పగారి ఇల్లు దోచెను. బళ్లారి కచ్చేరీకిఁ బట్టపగలే అగ్గిపెట్టెను. ఇటువంటి రెడ్డి యొకప్పుడు బండిపై వచ్చుచుండఁగాఁ బదిమంది చుట్టుముట్టిరి. 'చిన్న ఆలూరు' గ్రామమునకుఁ జెందిన మాదిగవాఁడు ఇతనిని పండఁబెట్టి గొంతుకోసి చంపెను. నాగిరెడ్డి తల్లి గౌరమ్మ పుత్రుని కొఱకు దుఃఖించినది. బొబ్బిళ్ళవంశ మితనితో నంతరించినది.

### 3.1.11. వెంకట రామరెడ్డి పాట:-

వెనుక చెప్పిన కొత్తకోట వెంకట్రామరెడ్డియు నితఁడును నొక్కరే కావచ్చును. పాటలు మాత్రము కొంచెము భిన్నముగా నున్నవి. వెలగల వస్తువులన్నియును నష్టమాయెనని చెప్పు రెండు చరణములు మాత్ర మొకే తీరుగా నున్నవి. ఈ పాటలో వెంకట రామరెడ్డి కల్లుగీత కట్టె కోపులకు గుత్తేదారుఁడు. 'దూసుగామకట్ట' మీఁద 'మున్నూరోని బాయికాడ' యెవరో పదిమంది కలిసి త్రాగి యితని ప్రాణము తీసిరఁట. ఇతని పుత్రుఁడు లింగారెడ్డియుఁ, బుత్రిక శాంతాబాయియుఁ దండ్రి మరణమునకు దుఃఖించిరి. కొన్ని ఉర్దూ పదములను బట్టి ఇది తెలంగాణా గేయమని చెప్పవచ్చును. 'మావులాలు' (మొ ఆమిలా), 'కాలాలి' (కలాలీ)- ఇవి ఉర్దూ పదములు. ఇందు మొదటి పదమునకు వ్యాపారమనియు, రెండవ పదమునకు 'ఎక్సైజ్' అనియు నర్థములు. ఈ గేయమున 'పోరడు' అను శబ్దము కూడ నున్నది. ఇది తెలంగాణ మాండలికము. 'యువకుఁడు' అని దీని యర్థము. మున్నూరోళ్ల పోరఁడు ఈ వెంకట రామరెడ్డినిఁ జంపుచుండఁగాఁ బ్రతిమాలుట హృదయ విదారకముగా వర్ణింపఁబడినది.

*"ఒక్క సంచి పైకమిత్తా- వేయి రూపాయలిత్తా*
*నువ్వు నన్ను సంపకురా- కొడుకో మున్నూరోల్ల పోరడా!*
*సెయ్యెత్తి మొక్కవోతె- సెయ్యి ముందు నరికినారే*
*నీ పానం దీసిరయ్యా- కొడుకో యెంకట్రామరెడ్డి!" [22]*

ఇంతవఱకును నేను చర్చించిన 'గ్రామకక్షలు-హత్యలు' అను నంతర్భాగమునకుఁ జెందిన సాంఘిక వీరగాథానికలలో నొక్క 'మానందిరెడ్డి పాట' తప్పఁ దక్కిన వన్నియును ముద్రితములు. ఇఁక నేను సంపాదించిన కొన్ని అముద్రిత వీరగాథానికల నిటఁ బరిశీలింతము.

### 3.1.12. గుడిపాటి చలమయ్య పాట:-

ఇది 1950 ప్రాంతములో కడప మండలమున ప్రొద్దుటూరు తాలూకా 'గుడిపాడు' గ్రామములో జరిగిన హత్యనుగూర్చిన పాట. గుడిపాటి వెంకట చలమయ్యగారు బ్రాహ్మణుఁడు. ఈయనకు నాయూరి కరణమగు ఈశ్వరయ్యకును కక్షలున్నవి. చలమయ్య పక్షమున నిరువదియాఱుమందియుఁ, గరణము పక్షమునఁ బదునాఱుమందియుఁ గలరు. చలమయ్య తమ్ముఁడు కృష్ణయ్య, భార్య

సుబ్బమ్మ. ఒకనాఁడు చలమయ్యగారు పొలములో బావినిఁ జూచుటకుఁ బోఁగా, అక్కడ కరణముగారి పక్షమునఁగల వెంకటరెడ్డి, గోపిరెడ్డి, తిక్కోళ్ల బైపిరెడ్డి, అటంకాలు వెంకటరెడ్డి యను నలుగురు అణువులు కాసి చంపిరి. తమ్ముఁడు కృష్ణయ్య అన్నకుఁ జేయి యడ్డుపెట్టఁగా నతని చేతి వ్రేళ్లు నఱికిరి. ఇది చలమయ్య పక్షము వారికిఁ దెలిసినది. అందఱును కరణమయ్య మీఁదికి లేచిరి. 'తలారోళ్ల చిన్నమ్మ' యను స్త్రీ ఇంటిలో దాగియున్న కరణమయ్యను బయటకులాగి చంపివైచినది. వెంకటరెడ్డి, గోపిరెడ్డి మున్నగువారు స్త్రీ వేషములతోఁ బాఱిపోయిరి. వారినిఁ బ్రభుత్వమువారు పట్టుకొని గల్లుకుఁ బంపిరి. చలమయ్య శవమును ప్రొద్దుటూరులో నూరేగించి మంచిగంధపు చెక్కలతో దహన క్రియలు చేసి, యా బూడిదను గుడిపాటికిఁ దెచ్చి, బావి దగ్గఱ సమాధి కట్టిరి. ఈ పాటను కడప కర్నూలు మండలములలోఁ గుంచెపురి యెఱుకలవారు పాడు చుందురు. 1-5-1966న కడపలో చిన్న రామక్క యను నెఱుకత పాడఁగా నేనీ పాటను వ్రాసికొంటిని. ఇది 'రామసిలుకా!' అను పాదాంత పదముతోఁ గొనసాఁగును.

***"మల్లె మొగ్గంటోడు రామసిలుకా-మొనగాడు సెలమయ్య రామసిలుకా!***
***తమ్ముదే కృష్ణయ్య ,, కరణమే ఈశ్వరయ్య ,,***
***బీదలకు మంచోడు ,, ఎంకటా సెలమయ్య ,,***
***సెలమయ్య తట్టోళ్లు ,, ఇరవైయారుమందీ ,,***
***కరణమయ్య తట్టోళ్లు ,, పదారుమందీ రామసిలుకా"***

– ఈ విధముగాఁ బ్రారంభమగును. ఇది కథాత్మకమగు గాథానిక. తలారివారి చిన్నమ్మ ద్రోహియగు కరణమయ్యపై విజృంభించుట చక్కఁగా వర్ణింపఁబడినది.

***"నూసెనమ్మ సిన్నదీరామసిలుకా– తలారోళ్ల సిన్నమ్మ రామసిలుకా!***
***నడికట్టు కట్టెనే రామసిలుకా– ఈటెకట్టె సేతబట్టె రామసిలుకా"***

కరణమయ్య కూఁతురు తలారి చిన్నమ్మకు మడిమాన్యము లిత్తుననియుఁ దనతండ్రినిఁ జంపవలదనియు బ్రతిమాలినది. అయినను చిన్నమ్మ వినలేదు. కరణమయ్య యేడు పరువుల క్రింద దాగినాఁడఁట. అప్పుడు చిన్నమ్మ:–

***"ఏడు వాకిండ్లెగరగొట్టిరామసిలుకా-ఏడుపరువు లెగరగొట్టి రామసిలుకా!***
***గిట్టకాల్ పట్టుకొని ,, బయటికే ఈడ్చుకొచ్చి ,,***
***యెదలపైని గూర్చొని ,, తల్లి, నొయ్యకుండ గొంతుకోసె"***

కథాంతము నీతిబోధకముగా నున్నది. చెప్పుడు మాటల వలనఁ గక్షలు పెరుగుననియు, నందుచే గ్రామములు చెడిపోవు ననియు, బోధింపఁబడినది (**"చెప్పుడూ మాటలాకు రామసిలుకా! చెడిపోయె గుడిపాడు రామసిలుకా!")**.

ఈ గుడిపాటి చలమయ్యపై నొక భజనకీర్తన కూడ వ్యాప్తియందున్నది. దీనినిగూడఁ గుంచెపురి యెఱుకలే పాడు చుందురు. ఇది జానపద తత్త్వగీతముల వరుసలో నున్నది.

***"చెన్న కేశవులు సాక్షిగా-చెడిపోయె గుడిపాడు–***
***॥చెయ్యండి రాములా భజనా॥***

***పగలు పనులకు పోండి– రేయి భజనకు రాండి***
***వచ్చినా వారెల్ల వరుసగా చెయ్యండి –***
***॥చెయ్యండి మన రామ భజనా॥***

***గుడిపాటి చలమయ్య బీదలకు మంచోడు***
***ఎంకటాచలమయ్య పేదలకు మంచోడు***
***అరుతంగ జీవునీ అన్యాయము సేసిరి"***
***॥చెయ్యండి మన రామ భజనా॥***

– ఈ రీతిగా సాఁగును. గుడిపాడులోని ఇరుపక్షములవారిని నైక్యము చేయవలెనని బాలాయపల్లెలోని వీరరాఘవరెడ్డి, దువ్వూరు గ్రామములోని సెట్టి శివయ్య, పోలి సుబ్బారెడ్డి మున్నగు వారెంత చెప్పినను ఫలితము లేకపోయెను. ఇరుపక్షముల వారును బెడచెవినిఁ బెట్టిరి. అందుచే గుడిపాడు గ్రామము చెడిపోయినదని ఈ గేయమునఁ గలదు. గ్రామకక్షలతో గుడిపాడు ఎట్లు నలఁగిపోయెనో చూడుఁడు:

***"రాళ్లు రప్పాలాయె – ఈటె బల్లాలాయె***
***యాట కొడవండ్లాయె– ఎంపళ్ల సంతాయె***
***కత్తి కటారాయె – కడప కచ్చేరాయె***
***జమల్‌మడుగు వాయిదాయె– జడ్జి కోరుటులాయె" ॥చెయ్యండి॥***

### 3.1.13. మల్లారెడ్డి పాట:–

కడప మండలమున కొమ్ములూరు గ్రామములో సుమారు 1960 ప్రాంతమున జరిగిన హత్య యిందు సూచింపఁబడినది. ఇదియును కుంచెపురి యెఱుకలు పాడు పాటయే. "చెల్ మోహనరంగా..." వరుసలో నున్నది. మల్లారెడ్డి చెల్లెలు శంకరమ్మ. అన్న చెల్లెళ్ల కేవియో పట్టింపులు వచ్చినవి. చెల్లెలు శంకరమ్మకున్న 'కాసెపూసే నిమ్మవనము'ను 'నిలువునా' నఱికించినాఁడు మల్లారెడ్డి. ఈ వనహత్యాదోషము రెడ్డికిఁ దగిలినదఁట. కొన్నాళ్ల కితనిని పట్టపగలే యెవరో శత్రువులు హత్య చేసిరఁట. ఇతని చెల్లెలగు శంకరమ్మయే యీ హత్య చేయించినదని యీ పాట నాకుఁ బాడి వినిపించిన కుంచెపురి యెఱుకలు చెప్పినారు. కాని యీ గేయములో 'అన్నయో.. మల్లారెడ్డి' అను సంబోధన యుండుటచే దీనిని సోదరి శోకగీతముగా భావింప వచ్చునేమో! కాని యీ భావనకు ఒక యాటంకమున్నది. ఈ గేయాంతమున **"తోడబుట్టిన తోడునుగాను, చెల్లెలు శంకరమ్మను గాను"** అని యున్నది. కొన్ని చరణములలో నిది ప్రేమికురాలి విలాపమువలె నున్నది. ఏమైనను ఈ గాథానికలోని కవిత్వము మిక్కిలి రసవంతముగా నున్నది. సంఘటన జరిగిన అయిదారేండ్లలోనే ఇంత చక్కని పాటపుట్టుట ఆశ్చర్యకరము. ఈ గాథానిక అముద్రితము. రసఘుటికయగు నీ గేయమంతయును

నుదాహరింపఁ దగినదే కాని, స్థలాభావముచే నచ్చటచ్చట మాత్రమే సూచించుచున్నాను.

*"అంగిదొడిగి టోపీ దొడిగి-రంగుమా గుడ్డాలూ గట్టీ*
*బంగారూ బొమ్మవనుకొందూ*
*సైరో... మల్లారెడ్డీ బంగారూ బొమ్మవనుకొందూ -సైరో*

*కాసె పూసే నిమ్మవనమే- నిలువునా నరికిస్తివి రెడ్డీ*
*వనము హత్యా నీకు దగిలెనుగా-... -సైరో*

*కాకి బేగడ మాలు గట్టి- పైనా పన్నీరు జల్లి*
*కురిసి మిందా కొలువు దీరితివా*
*సైరో...మల్లారెడ్డీ- మాలుపైన మరణమైతివిరా!...*

*మటమటా మద్దేన్నమప్పుడు- మర్రేరు చెట్లకాడ*
*పండబెట్టీ పానము దీసిరిగా-*
*అన్నయ్యో... మల్లారెడ్డీ! కూచ్చో బెట్టీ కుత్తిక గోసిరిగా*
*నీ శిరసూ గోసుకోనీ- ఆసుపత్తిరి కెత్తుకోనీ*
*ఆరుదుత్తల రగత మొంచిరిగా-*
*సైరో... మల్లారెడ్డీ మూడు తట్లా కొవ్వు తీసిరిగా" -సైరో* [23]

### 3.1.14. దువ్వూరి సీతారామయ్య పాట:-

ఇది మఱియొక రాయలసీమ వీరగాథానిక. సీతారామయ్య యనునతఁడు కడప మండలములోని గండికోటలో నొక హత్యను జేసి, కర్నూలు మండలములోని దువ్వూరు గ్రామమునకు వచ్చి చేరినాడు. ఇతఁడు నాటకములను వేయించుచుండెడివాఁడు. గాజుల సుబ్బయ్య యనునాతఁడు ప్రొద్దుటూరునుండి వచ్చి దువ్వూరులో సీతారామయ్యను జంపెను. సీతారామయ్య తమ్ముఁడు ఆ సుబ్బయ్యను బరిమార్చెను. ఇది సుమారు పది సంవత్సరముల క్రిందట (1956లో) జరిగెనని దీనిని బాడిన యెఱుకలు చెప్పినారు. సీతారామయ్య వేయించిన నాటకమున కాహ్వానించుచున్నట్లుగ నీ పాట ప్రారంభమగును.

*"పందెర్లపాటీ డ్రామా మీరూ పేరుగ జూడాలా*
*సతీ పురుషులకు సమానమైనవి సపోట పండ్లన్నా!*
*కొనండి బాబూ తినండి బాబూ తిని రుచిచూడండీ*
*తినీ తినక మీరెనక్కి పోతే దొరకదు పండన్నా!"*

చాకలి నరసయ్య, కుమ్మరి నాగోజి, రాజంపేటలో సారాయి యమ్మెడి కరీము, చలపతి, నాయనపేట నవాబులు ఈ పాటలోఁ బేర్కొనఁ బడిరి. పందెర్లపాడు, ప్రొద్దుటూరు, గండికోట, నాయనపేట, రాజంపేట- మున్నగు గ్రామముల పేర్లు వచ్చినవి. ఖూనీలు చేయువారు కల్లు త్రాగుదురు. కావున ఆ కల్లు వర్ణన మిందుఁ జక్కఁగా నున్నది.

*"రాజంపేటలో కరీముకాసిన డిపోలో సారాయ*
*తాగి జూస్తే తమాసగుండును డిపోలో సారాయ*
*నాలుగు ముంతల కల్లు తాగితే జోరు కైపన్నా*
*గంటకు నాలుగు కూనీలు పడతయ్ సెలపతి కల్లన్నా!"* [24]

### 3.1.15. సలపల అమ్మినాయుడు పాట:-

ఇది కథాత్మకమైన గాథానిక. దీనిని శ్రీకాకుళ మండలమున సేకరించితిని. ఆ మండలమున దీనిని మాలదాసరులు జముకులపైఁ బాడుదురు. శ్రీకాకుళము జిల్లా, చీపురుపల్లి తాలూకా 'గుత్తవెల్లి' గ్రామములో సలపల అమ్మినాయఁడను కాళింగి కులస్థునకును, నీలం అప్పన్నయను తెలగ నాయనికినిఁ గక్షలున్నవి. అమ్మినాయఁడా యూరికి మునసబు. ఇతఁడు నీలం అప్పన్న ననేక విధముల బాధించెను:-

*"నీలమో రాడోళ్లు నీలకెళ్ల బోతేను*
*బారికను మంగలిని కాపులుంచే వోడు*
*తెలకలోళ్లని కూడ సమురు లమ్మనివ్వడు*
*మంగలోళ్లని కూడ సవరం సెయ్యనివ్వడు*
*సాకలోళ్లని కూడ బట్టలుతకనివ్వడు*
*కుమ్మరోళ్లని కూడ కుండలివ్వనివ్వడు*
*కోమటోళ్లని కూడ సామానమ్మనివ్వడు"* [25]

నీలం అప్పన్న తన పొలములో వరినాట్లు వేసికొనఁగా, వాని నమ్మినాయఁడు తిరుగ దున్నించెడివాఁడట. అప్పన్న తన పెరటిలో నుయ్యి త్రవ్వించుకొనఁగా అమ్మినాయఁడు దానిని బూడ్పించెనఁట. చుట్టు ప్రక్కల గ్రామములోని రైతుల నందఱను గలుపుకొని నీలం అప్పన్నను బాధింప సాగెను. ఈ బాధల కోర్వలేక అప్పన్న యే విధముగనైనను అమ్మినాయనిఁ జంపెదనని ప్రతిజ్ఞ పట్టెను. అప్పన్న యిట్లు తలపోసెను:-

*"ఎంతకని యీ బాధ పడుదునోయి దేముడా*
*కాని మంచిది లేరా కాళింగి నాయుడా*
*దొరికే తప్పుడు నువ్వు దొరకవట్ర నాయుడా*
*కనిపించిన కాడల్ల నరుకుతానన్నడు నీలమప్పడు దొరగారు"* [26]

ఒకప్పుడు అమ్మినాయఁడు రాజాంకోర్టుకుఁ బ్రయాణ మగుచుండఁగా, ఆయన అన్నకుమారుఁడు సుబ్బారాయఁడు, తనకు దాయాది పగలుండుటచే నా విషయమును నీలం అప్పన్నకుఁ జెప్పి ప్రోత్సహించెను. అతఁడు కత్తి చేతఁబట్టి, అమ్మినాయని నెదిరించి, అతిక్రూరముగాఁ జంపెను.

*"ఏడేడు నరకులికి తెగనరికి వేశాడు*
*ఎచ్చురత్తం దీసేడు ఈరగందం బూసేడు*
*అగ్గిపుల్లా గీసి సుట్ట గాలుస్తున్నాడు*

**ఇది ఎవరిది పొగ?– అమ్మినాయుడి దన్నాడు**
**పగలైన దీర్చేను పొగలే జూసేను"**

అమ్మినాయఁడు రాజాంకోర్టుకుఁ బ్రయాణమగుట బాగుగా వర్ణింప బడినది:–

**"కాయిపంచెలజోడు మరి కట్టుకున్నాడు**
**పైడి పంజా లాల్చి మరి తొడుక్కున్నాడు**
**సుట్టంచుల జలతారి రూమాలు చుట్టేడు**
**మూడువందల రూపాయలు మూటగట్టుకున్నాడు**
**మూడు పుంజల చుట్లు మొల దోపుకున్నాడు**
**పండుటాకుల కట్ట సేతబట్టుకున్నాడు"**

నీలం అప్పన్న తన్నుఁ జంపుచుండఁగా అమ్మినాయఁడు బ్రతిమాలినట్లు కలదు. ఇది హత్యా సంబంధములగు గాథానికలలో సర్వసాధారణాంశము. వీరగాథల వారానువర్తన లక్షణమునకిది లక్ష్యము. ఇందలి పునరావృత్తి మధురముగా నున్నది: **"ఎంత కుందన మోయి సలపలమ్మి నాయడూ! సాలి కుందన మోయి సలపలమ్మి నాయడూ!".** ఇది సుమారు ఇరువది సంవత్సరముల క్రిందట– అనఁగా 1943 ప్రాంతమున జరిగిన హత్య.

### 3.1.16. రాజనరసయ్య పాట:–

ఇది తెలంగాణములోని గాథానిక. ఊయలపాట. నల్లగొండ మండలమున, సూర్యాపేట తాలూకా, సింగారము గ్రామములో నిటీవలనే (1962 ప్రాంతమున) జరిగిన దారుణ హత్య. రాజనరసయ్యయు నతని తమ్ముఁడు రంగయ్యయు భూముల విషయముగాఁ గలహించిరి. ఆ యూరి దొర, రంగయ్య పక్షము. ఆ దొర యుంచుకొన్న గమళ్ల సత్తెమ్మను రాజనరసయ్య హత్య చేసెను. అందుచే నా దొర, రాజనరసయ్య నతిక్రూరముగా హత్య చేయించెను. ఈ పాటలోఁ జిక్కని కవిత్వమున్నది. దీనిని స్త్రీలు వెన్నెల రాత్రులలోఁ జుట్టుకాముఁడు పాటగాఁ బాడుచున్నారు. రాజనరసయ్యయు నతని సోదరుఁడును నెలకారము గుట్టలలోఁ బోట్లాడుకొనిరి. అక్కడ నెవ్వరును లేరు. ఈ సంఘటనను గాథాకారుఁ డెంత రమణీయముగాఁ వర్ణించెనో చూడుఁడు:–

**"పైన జూస్తేనూ ఉయ్యాలో – పక్షులూ లేవు ఉయ్యాలా**
**భూదేవి మీదనూ ఉయ్యాలో – సీమలూ లేవు ఉయ్యాలా"**

అన్నదమ్ములిద్దఱును గొంతసేపు పోరిన తరువాత విసిగిపోయి, జ్ఞానము తెచ్చుకొని, అన్న తమ్మునితో నిట్లనును:–

**"వారండ పడవిలో ఉయ్యాలో– గుట్టలా లోపలా ఉయ్యాలా**
**కొట్టుకొని సస్తేను ఉయ్యాలో– అడ్డమెవరూ తమ్ముడ ఉయ్యాలా**
**ఎంగిలీ పాలనూ ఉయ్యాలో– సీకినా వానివీ ఉయ్యాలో"**

ఇట్లు జ్ఞానము తెచ్చికొని, అన్న చేయి తమ్ముఁడును, తమ్ముని చేయి అన్నయుఁ బట్టుకొని సింగారము గ్రామములోనికి వచ్చిరఁట. ఇట్లు కథావర్ణనమే కాక ఈ గాథానికలో ప్రకృతి వర్ణనలును బహురమణీయముగా నున్నవి. ఉదయకాల వర్ణనము:–

**"పొన్నపూవువోలె ఉయ్యాలో– పొద్దు పొడిచింది ఉయ్యాలా**
**బొమ్మంత పొద్దెక్కి ఉయ్యాలో– బోజనం ఏలాయె ఉయ్యాలా"**

అర్ధరాత్రి వర్ణన జానపదుల భావనాబలమునకు మచ్చు తునుక.

**"అద్దమ్మ రేత్తిరీ ఉయ్యాలో– నిద్దరా పొద్దేల ఉయ్యాలా**
**కలికి కలికీ ఏల ,, గాందారి ఏలా ,,**
**పసిపిల్ల లయినాను ,, పాలు సీకని ఏల ,,**
**బసవ దేవూడైన ,, మేతమెయ్యని ఏల ,,**
**బావుల్లొ జలాలు ,, మల్లి పోయిన ఏల ఉయ్యాలా"**

'అమ్మటేల' (= అంబటి వేళ), 'కవులు దప్పు' (=స్పృహ తప్పు) మున్నగు పదప్రయోగములును, 'కారుదున్నపోతులవలె కలబడి' రనుట. 'చేలబడ్డ గొడ్డువలె కొట్టి' రనుట, 'చొప్పకట్టవలె చేత బట్టి' రనుట– మున్నగు జానపదోపమానములును నిందు హెచ్చుగా నున్నవి. ఈ గాథానికను 22-6-1966న నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా, నూతనకల్లు గ్రామములో పులుసు నాగడు అను జానపదుఁడు పాడఁగా విని వ్రాసికొంటిని.

### 3.1.17. పోట్ల బూదయ్య పాట:–

ఇది గుంటూరు మండలమునఁ బల్నాడులో వ్యాపించియున్న గాథానిక. పోట్ల బూదయ్యగారు కమ్మవారు. పల్నాడులోని జూలకల్లు ఈయన స్వగ్రామము. మంచి బలశాలి; పందెగాఁడు. ముప్పది సంవత్సరముల వయస్సు. ఈ బూదయ్యగారికిని, అదే గ్రామమున నున్న మన్నెం శివారెడ్డిగారికినిఁ గక్షలున్నవి. ఈ బూదయ్యగారొక రోజున బస్సులో పిడుగురాళ్ల యను గ్రామమునకుఁ బోయి తిరిగి వచ్చుచుండఁగా, దారిలో పందిరిపాలెమను గ్రామము దగ్గఱ బస్సు నాపి, శివారెడ్డి పక్షమునకుఁ జెందిన మనుష్యులు ముప్పది మంది ఈటెలతో, బరిసెలతో నితనిని బొడిచి చంపిరి. ఇది 1953 ప్రాంతమున జరిగిన సంఘటన. బూదయ్యను జంపిన వెంటనే యాతని కుమారుఁడు వెంకటేశుఁడు శివారెడ్డి ఇంటిపైఁబడెను. గోగులపాటి నాగమ్మ యను నామె వెంకటేశుని వారించినది. బూదయ్యకు జూలకల్లులో సమాధి కట్టిరి.

ఈ జూలకల్లు గ్రామము యుద్ధక్షేత్రమగు కారెంపూడికిఁ దూర్పుగా నాలుగుమైళ్ల దూరమున నున్నది. దీని 'గడ్డదినుసు' ప్రభావమేమియో కాని, ఇక్కడ ప్రతి సంవత్సరము నొక హత్య జరుగు చుండును. ఈ యూరిలోని కమ్మవారికిని రెడ్లకును పగలు నిత్యాగ్ని

హోత్రములవలె రాజుకొనుచునే యుండును. ఈ గ్రామములోఁ బురుషు లెవ్వరును నిండ్లకడ నుండరఁట. ఎల్లప్పుడును పార్టీలతో కోర్టుల చుట్టును దిరుగుచుందురు. అందుచే నీ గ్రామమున స్త్రీలే వ్యవసాయము చేయుచుందురు. ఈ జూలకల్లు పూర్వకాలమునఁ బల్నాటి నాగమ్మ సైన్యములు నిలిపిన ప్రదేశము.

జానపాడు గ్రామమునకుఁ జెందిన బొగ్గవరపు కోటయ్య యను నతఁడీ గాథానిక నల్లినాడు. ఇతఁడు సంఘటనను స్వయముగాఁ జూచినవాఁడగుటచేఁ జక్కఁగ వర్ణించినాఁడు. దీని ప్రారంభ మిట్లుండును.

*"ఏమీ యీ వింతా! ఎన్నడు ఎరుగము*
*పల్నాటీలో జరిగెను బహువింతా ॥ఏమీ॥*

*శౌరయగారీ కారంటే బహు*
*పేరు చెందినా పెద్ద బస్సురా*
*బస్సులొ ఎక్కిన పందెగాడురా*
*పల్నాటీకే వీరుడు అతడూ ॥ఏమీ॥*

*మూరెడు గడ్డము బారెడు మీసము*
*ఉదరము నాలుగు జానలుండునూ*
*నడుమైతే బహుమందము కానీ*
*ఎత్తు జూచితే ఎంతో చక్కన" ॥ఏమీ॥*

పందిరిపాలెము దగ్గఱకు బస్సు రాఁగా 'ఎండి కర్రలూ పమిడి బరిసెలూ, ఎర్రగ తెల్లగ భగ్గున మెరసిన' వఁట! అయినను శత్రువులను జూచి బూదయ్య భయపడలేదు.

*"బరిసె మెరుపులే బూదయ్య చూసీ*
*పండ్లు కొరుకుచూ గుడ్లు దిప్పుచూ*
*ఆయుధముంటే నలుగురినన్నా*
*నాతోబాటూ ఆహుతి పెడుదూ"*

–అని తలపోసినాఁడఁట. శత్రువు లాతని వెన్నున నిరువది బరిసెల పోట్లు, ఉదరమున ముప్పది కత్తిపోట్లు పొడిచిరఁట. బూదయ్య రక్తము–

*"సిలుకు చొక్కాయా చిందికొట్టెనూ*
*పేటు పంచెయా తడిసిపోయెనూ*
*కారులొ కారిన రకతమంతయూ*
*కాలువలయ్యా పారసాగెనూ"*

బూదయ్యగారి మరణమునకు జనులిట్లు శోకించిరఁట.

*"మల్లెపువ్వులా వరషము రీతీ– సన్నజాజులా జల్లుల రీతీ*
*ముచ్చం రత్నం రాలేటట్టుల– ఏడువ సాగిరి జనమంతా"*

సగము సముద్రపు టుప్పును దెచ్చి, వేలకొలఁది కొబ్బరి కాయలు తెచ్చి, అత్తరు పన్నీరు పువ్వులు బుక్కాయితో బూదయ్యకు సమాధికట్టిరి. అతని భార్య 'పేరమదేవి' పౌరుషముఁ జూడుడు.

"గోరి చూచి బహు గోపించుతది– పేరు జెందినా పేరమదేవి
అవతల పార్టీ గోరీ నేడు– కొద్దిరోజులకు తయారు అంటది"

### 3.1.18. నీలం జగనీలు పాట:–

ఇది మహబూబునగరు మండలములోని సంఘటనవలె నున్నది. దీనిని నేను కర్నూలు మండలమున సేకరించితిని (23–4–1966). నందికొట్కూరు తాలూకా, చెలిమళ్ల రుద్రవరమున, శ్రీమతి చిట్టాల బాలమ్మ యను స్త్రీ పాడినది. ఈమె పుట్టిల్లు మహబూబు నగర మండలము. ఈమె ఈ పాట నక్కడనే నేర్చినదఁట. 'నీలం జగనీలు' అనువాని మరణమున కాతని తల్లియో, తండ్రియో దుఃఖించుచున్నట్లుగా నీ గీతమున్నది. నీలం జగనీలు పుట్టినది పెరిగినది 'మందడి' గ్రామమని పాటలోఁ గలదు. తల్లి జానకమ్మ, తండ్రి నరసింహ, సాకిన తల్లి జానకమ్మ. ఆ గ్రామమునఁ గక్షలున్నవట. అందీతఁడు మరణించెను.

### 3.1.19. నారమ్మ పాట:–

'పల్లెపదాలు' అను గ్రంథమున నున్న 'నీలాటి రేవు' అను వెన్నెల పదమున కిది విపులీకరణము వలె నున్నది. నారమ్మ నీలాటి రేవునకుఁ బోయి, కడవ ముంచి, దానినెత్తుటకై చెఱువు గట్టుపైఁ బోవుచున్న పెదతండ్రి కొడుకు 'సిరినాయు'నిఁ బిలిచినది. అతఁడు కడవనెత్తినందులకు లంచముగా నామెను గోరినాఁడు. 'నేను నీ చెల్లెలిని. నీవు నా యన్నవు. ఇది తప్పు' అని చెప్పినను వినలేదు. రాత్రి ఇంటికి రమ్మని కోరినది. ఇంటి దగ్గఱఁ దన యన్న రామన్నతో నీ విషయము చెప్పినది. అతఁడుగ్రుఁడై, చెల్లెలి వేషమును దాను ధరించి గదిలో నుండెను. సిరినాయఁడలంకరించుకొని గదిలోనికి రాఁగా, మాఱువేషమున నున్న రామన్న యతనిని బట్టి బాకుతోఁ బొడిచి చంపెను. ఈ పాటను కొడితల రామారావుగారు సేకరించి 1954లో ఆంధ్రప్రభలోఁ బ్రచురించినారు. ఇది జానపదుల కల్పనయో, లేక నిజముగా జరిగినదో తెలియుట లేదు. హత్య మాత్రమున్నది. ఇది స్త్రీ సంబంధమగు హత్య. నారమ్మ, సిరినాయుడు, రామన్న అను పేర్లనుబట్టి యథార్థ సంఘటనగాఁ దోఁచుచున్నది. ఇందలి వర్ణన లన్నియు జానపద గేయములలోని వర్ణనలవలె నున్నవి. చక్కని కవిత్వము. నారమ్మ అలకరించుకొని నీలాటి రేవునకుఁ బయనమగుట అత్యద్భుతముగా వర్ణింపఁబడినది. ఇదియే దీని ప్రారంభము కూడ.

*"నోము నోముల్లాల తుమ్మెదా– రామనమ్మల్లార తుమ్మెదా*
*పొద్దు పొద్దున లేచి ,, పొద్దున్న నారమ్మ ,,*

| | | | |
|---|---|---|---|
| *ఇల్లు వాకిలి తుడిచి* | ,, | *ముగ్గులను వేసింది* | ,, |
| *పట్టి నేరెడు కసవు* | ,, | *పెంటమీద పోసింది* | ,, |
| *దాని కంటి కిలువైన* | ,, | *కొమర కాటుకలుంచి* | ,, |
| *దాని నొష్ట కిలువైన* | ,, | *చేరచుక్కుంచింది* | ,, |
| *నున్నంగ తలదువ్వి* | ,, | *నొనముడి వేసింది* | ,, |
| *చక్కంగ తలదువ్వి* | ,, | *జారుజడ లేసింది* | ,, |
| *కడదొంతి కెళ్లింది* | ,, | *కడవేమొ తెచ్చింది* | ,, |
| *సూరి పెడకెళ్లింది* | ,, | *సుమ్మేమొ తెచ్చింది* | ,, |
| *బంగారు కడవే* | ,, | *సిరనుపై పెట్టింది* | ,, |
| *ఉంగరాలు దాని సెయ్యి* | ,, | *ఊపుకొని నడిచింది* | ,, |
| *బొందుల్ల దాని కాళ్లు* | ,, | *పొందదుగు లేసింది* | ,, |
| *మట్టెళ్ల దాని కాళ్లు* | ,, | *మరిజాన లేసింది తుమ్మెదా"* | |

### 3.1.20. ఇతరములు:-

కడప మండలమున గునిరెడ్డి నారాయణరెడ్డి పైనను , పొట్టిపాటి నరసింహారెడ్డి పైనను, పెద్దపసుపుల శివారెడ్డి పైనను మూఁడు వీరగాథానికలు వ్యాప్తియందుఁ గలవు. పులివెందుల తాలూకాలో 20వ శతాబ్ది ద్వితీయ పాదమున గునిరెడ్డి నారాయణరెడ్డిగారు తన కెదురు లేకుండ నధికారమును నెఱపిన చండశాసనుఁడు. కడప మండలమున, జమ్మలమడుగునకును ముద్దనూరునకును మధ్యగల కొండను 'ఎఱ్ఱకొండ' యందురు. అనంతపుర మండలమున కదిరికడనున్న కొండను 'పెద్దకొండ' యందురు. ఈ రెండు కొండల మధ్యను పులివెందుల తాలూకా వ్యాపించియున్నది. గునిరెడ్డి నారాయణరెడ్డి గారు "ఎఱ్ఱకొండకును పెద్దకొండకును మధ్య నేను మగవాళ్లకు మగడను" అని చాటించిన మొనగాఁడు. వీరి స్వగ్రామము 'కసునూరు'. వీరొకప్పుడు సింహాద్రిపురములోఁ దన యుంపుడుకత్తె ఇంట భోజనము చేయుచుండెను. 'పిస్టలు' ప్రక్కనే యుంచుకొనెను (ఇది ఆయన కలవాటు). ఈయన యనుచరులలో నొకనికి లంచమిచ్చి శత్రువు లీయన రహస్యమును గనుగొనిరి. ఆ యింటి పెరటి మార్గమునఁ బ్రవేశించి, హఠాత్తుగా మీఁదఁబడి, 'పిస్టలు'ను గాఁజేసి, భుజించుచున్న వానిని బంధించిరి. ఈ శత్రువులు నారాయణ రెడ్డిగారినిఁ ద్రాళ్లతోఁ గట్టివైచి, యెద్లబండిపైఁ బడవేసి, యూరి బయటకుఁ గొంపోయి, యా బండితోసహా వారిని సజీవదహనము చేసిరి. ఈ ఘోరహత్యకు జానపదుల హృదయము ద్రవించినది. ఫలితముగా నారాయణరెడ్డిగారిపై నొక కోలాటపు కోపు తయారైనది. బొజ్జాయిపల్లె చుట్టుప్రక్కల నీ పాట వ్యాపించియున్నది. ఇట్లే యీ తాలూకాలో కోడిపందెముల నత్యద్భుతముగా జరిపించిన పొట్టిపాటి నరసింహారెడ్డి (పొట్టిపాడు) గారిపైఁ గూడ నొక కోలాటపు పాట వ్యాప్తియందున్నది.

జమ్మలమడుగు తాలూకాలో చిన్నపసుపుల పుల్లారెడ్డిగారి కథ (కుంటి పుల్లారెడ్డి కథ)ను గూర్చి 'బొబ్బిలివరుసకథలు అను ప్రకరణమునఁ జర్చించితిని. ఈ పుల్లారెడ్డి ప్రత్యర్థి పెద్దపసుపుల గ్రామమునకుఁ జెందిన యెద్దుల శివారెడ్డిగారు. ఈయన 1947లో చిన్నపసుపుల పుల్లారెడ్డిని కోవెలకుంట్లలో హత్య చేయించెను. సరిగా నొక్క సంవత్సరమైనను దిరుగకముందే 1948లో నీ శివారెడ్డిగారిని శత్రువులు హత్య గావించిరి. పెద్దపసుపుల చెఱువుకట్టపై నొక చెట్టుకింద నిద్రించుచుండఁగా పట్టపగలు చంపివేసిరి. ఈ శివారెడ్డి గారిపైఁ గూడ నొక కోలాటపు పాట ప్రచారమున నున్నది.

## 3.2. స్వైరిణులు-భర్తృహంతలు

భర్త చనిపోయినప్పుడు మాఱుమనువునకు వీలున్న కులములలో సహితము కొందఱు పుణ్యవతులు సహగమనము చేసిరి. సహగమనము చేయుట నిషేధింపఁబడినను బ్రభుత్వము వారినుండి ప్రత్యేకానుమతిని బడసి చిచ్చుటికిన మహాపతివ్రతలు కామమ్మ, సన్యాసమ్మ, ఎఱుకమ్మ, నారాయణమ్మ, రంగమ్మ మున్నగువారు. వీరు దేవతలుగా వెలసి, నేఁటికినిఁ బూజలందుకొనుచున్నారు. వీరిపై వీరగాథలు పాడఁబడుచున్నవి. ఆ పుణ్యకాలము పోయినది. పాశ్చాత్య నాగరికతా ప్రభావము ముదిరిపోయినది. పుణ్య పాప వివక్ష నశించినది. పాపభీతి కలలోఁ గూడ లేదు. ఇంద్రియములకు లొంగి స్వేచ్ఛా విహారము హెచ్చినది. విగత జీవుఁడైన భర్తతో 'సాగుమానము' మాట దేవుఁడెఱుగు, సజీవుఁడైన భర్తను నిలువునను హత్య చేసిన ప్రబుద్ధురాండ్రు బయలుదేరిరి. మిండగాండ్రతోఁ గలిసి భర్తల నతి ఘోరముగాఁ జంపిన క్రూరురాండ్రు బయలుదేరిరి. పేరంటాండ్ర గాథలున్నట్లుగనే ఈ స్వైరిణులపై గాథానిక లున్నవి. ఎట్టి ఇతివృత్తము నైనను స్వీకరించుట వీరగాథాకవిత్వ లక్షణము కదా! అద్దాల సుబ్బులు, చిన్నమునెమ్మ, వీరసోమి, గుంటూరు ఆదెమ్మ- మున్నగువారు ఇట్లు పాటల కెక్కిన స్వైరిణులు.

### 3.2.1. అద్దాల సుబ్బులు పాట:-

ఇది రాయలసీమకుఁ జెందిన గాథానిక. ఇది సుమారు పది పదునొకండు సంవత్సరముల క్రిందట (అనఁగా 1955, 56 ప్రాంతములో) కర్నూలు మండలమున దువ్వూరు దగ్గఱ నున్న 'జున్నూరు' అను గ్రామములో జరిగినది. సుబ్బులు బలిజ కులమునకుఁ జెందినది. గొప్ప సౌందర్యరాశి. అందుచే నీమెను 'అద్దాల సుబ్బులు' అని పిలుతురు. జొన్నారం వెంకట సుబ్బయ్య ఈమె భర్త. జొన్నారం బాలయ్య ఉపభర్త. ఈ యుపభర్తతోఁ గూడి భర్తను జంపి నూతిలోఁ బాఱవేసినది. దువ్వూరులో 'కేసు' జరిగినను నీమె విడుదలైపోయినది. ఈ అంకుటాండ్రు పోలీసులను గూడ వశపఱుచుకొని, 'హత్యానేరముల' నుండి తప్పించుకొందురు. ఈ పాటను కడపలో 1-5-1966న శ్రీమతి చిన్నరామక్క యను

కుంచెపురి యెఱుకత పాడఁగా విని వ్రాసికొంటిని. ఈ యద్దాల సుబ్బులు నేఁటికిని (1966 నాఁటికి) బ్రతికి యున్నది. ఈ గేయ మెక్కువగా నీమె మాటలతోనే నడచును.

*"నీ రంగం నా రంగం- బాయీకడ బయిరంగం*
*బయిరంగా మన్నాదా- బాతలకరి బాలయ్య*
*బట్టాబయి లన్నాడో- బాతలకరి బాలయ్య ॥నీ రంగం॥*

*సిలకాలూరి కల్లూ తాగి- పలకల బండెక్కూదాము*
*ఏ బండ్లో వస్తాదే- బాతలకరి బాలయ్య ॥నీ రంగం॥*

*అద్దేడిస్తా గిద్దేడిస్తా- గుడ్లామీద పెట్టానిస్తా*
*సారయి సీస సేతికిస్త- నా సెల్లెల్ని నీకు ఇస్త*
*నీకూ నేనూ లంజానవుత- నా మొగుణ్ణీ సంపారా*
*జొన్నారం బాలయ్య ॥నీ రంగం॥*

*జొన్నారం నేలటూరు టంగుటూరు మూడూర్లా సందూనా*
*రాగీమానున్నాదీ- రచ్చాబండున్నాదీ*
*పాడూబాయున్నాదీ- ఈతాసెట్లున్నాయీ*
*మొగ్గుణ్ణి గొంతుకోసి- ఆ పాడుబాయిలో పారేసి*
*కచ్చీరి కొచ్చిందీ- అద్దాలా సుబ్బులూ*
*ఏమీ లయ పడతాదో- పిల్లా చిన సుబ్బాలు!"*

### 3.2.2. చిన్న మునెమ్మ పాట:-

ఇది తమిళ దేశమున, సేలం మండలమున, జరిగిన కథ. దీనిని చిత్తూరు జిల్లాలో పూసల బలిజలను గాథాకారులు పాడుచుందురు. సేలం పట్టణమున చిన్నమునెమ్మ యను స్త్రీ కలదు. ఈమె కంబళ్లు నేసెడి 'కురువ గౌడ' లను కులమునకుఁ జెందినది. భర్త సూర్యగౌడు. అంకుమగఁడు ఎదురింటి రంగప్ప. చిన్నమునెమ్మ పరమాన్నమును వండి దానిలోఁ బాషాణమును గలిపి, భర్తకుఁ బెట్టినది. దానిని దిని భర్త విలవిల తన్నుకొనుచుండఁగా నెదురింటి రంగప్పను బిలిచి యాతనిచే భర్తను బూర్తిగాఁ జంపించినది. భర్త శరీరమును ముక్కలు ముక్కలుగాఁ గోసి నీళ్లదొడ్డిలోఁ బాతినది. ఈ విషయము కుందేటి పట్టణములో నున్న సూర్యగౌడుని యల్లుఁడు మల్లయ్యకుఁ దెలిసి, యతఁడు వచ్చి, ముచ్చుబాకుతో అత్తను పొడిచి చంపినాఁడు. ఈ గాథానిక ఇట్లు ప్రారంభమగును.

*"అబ్బా! నేనేమి చెప్పాదు ఆడదాని మహిమా!*
*రంగప్పా! నేనేమి చెప్పాదు ఆడదాని మహిమా! -అబ్బా*

*సేలము జిల్లాలోను- సేలమూ పోస్టులోన*
*అన్నికారి సినమునీ- పాపజాతి సినమూనీ -అబ్బా*

*ఆదీవారంనాడు- అట్టువకు నిచ్చె నేసి*
*అరవీసె బెల్లం తీసి- అద్ద సేరు నూక తీసి*
*పరమాన్నం చేసింది- పాషాణం కలిపింది*
*ఉట్టె మింద పెట్టింది సినమునీ" -అబ్బా[27]*

కోర్టునుండి భర్త రాఁగానే ఈ పరమాన్నమును బెట్టినది. అతఁడు విలవిల తన్నుకొనుచుండఁగా నెదురింటి రంగప్పను బిలిచి యెంత క్రూరముగా భర్తను హతమార్చినదో చూడుఁడు:-

*"ఎగవింటి రంగప్పను తానేమొ పిలిచింది*
*పట్నమూ చాకుతీసి చేతేమొ పట్టింది*
*ఎగవింటి రంగప్పచేత కాలుసేతు లణగబట్టించి*
*మొగుడి ఎంటికలేమొ కాలికింద ఏసుకోని*
*- గొంతుకేమొ కోసింది సినమునీ -అబ్బా*

*కీలు కీళ్లు కోసింది కడవకేమొ ఏసింది*
*జల్దారులొ పూడ్సింది సినమునీ -అబ్బా*

*మొగుడీ సిరసు దీసి రుబ్బురాతి కిందేసి*
*నున్నంగ రుబ్బింది సినమునీ-*
*నున్నంగ రుబ్బింది కుక్కలకు ఏసింది సినమునీ" -అబ్బా[28]*

### 3.2.3. వీరసోమి పాట:-

ఇది తెలంగాణమున వ్యాప్తియందున్న గాథానిక. నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా, ఆత్మకూరు గ్రామములో 1956 ప్రాంతమున జరిగిన హత్య యిందలి యితివృత్తము. వీరసోమి గొల్లకులమునకుఁ జెందిన యువతి. ఆవుల దుర్గయ్య కూఁతురు. ఈమె పుట్టిల్లు 'ఆత్మకూరు', అత్తిల్లు 'పస్తాల'. భర్తయందిష్టములేక యత్తవారింటికిఁ బోలేదు. ఆత్మకూరులో నొక కుమ్మరి ఈమెకు మిండగాడు. వీరసోమి అన్నపేరు లింగమన్న. ఇతఁడాస్తిపరుఁడు. ఈ యాస్తికొఱకు వీరసోమి తన మిండగానితోఁ గలిసి తన యన్నను జంపివేసినది. ఇది కోలాటపు పాట. 'రాంభజనో' యనునది పాదాంత పదము. నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా పాతర్లపాడు గ్రామమున 20-9-1966న పిట్టల లక్ష్మీనరసయ్య యను నతఁడు దీనిని పాడి వినిపించెను. దీని ప్రారంభమిట్లుండును:-

*"ఆత్మకూరు గ్రామములో రాంభజనో-ఆవుల దుర్గయ్యబిడ్డ రాంభజనా*
*లంజిదీ యీరసోమి ,, దొంగదీ యీరసోమి ,,*
*పస్తాల అత్తగారు ,, తల్లిగారు ఆత్మకూరు ,,*
*అమ్మరో ఓ యమ్మ ,, నేను బోనమ్మ ,,*
*మొగడు సిన్నవాడు ,, నేను బోనమ్మ ,,*
*అత్త తిట్టూతాది ,, మామ తిట్టూతాడు ,,*
*నేను బోను తల్లి ,, నేను వానికి బోను ,,*
*అటు యిటు నూసింది ,, కుమ్మరోని జూసింది" ,,*

### 3.2.4. గుంటూరు ఆదెమ్మ పాట:-

ఇది యత్యాధునిక సంఘటన. గుంటూరు జిల్లా, పల్నాడు తాలూకా, జానపాడు గ్రామములో 2-8-1966న జరిగిన హత్యను గుఱించిన పాట. ఈ హత్య జరిగిన నెలరోజులకే దీనిపైఁ జక్కని పాట పుట్టినది. "నాయుడో రింటికాడ, నల్లతుమ్మ చెట్టుకాడ" యను పాట వరుసలో నిది యుండును. ఈ జానపాడు గ్రామములోనే యున్న బొగ్గవరపు కోటయ్యగారు ఈ పాటను గట్టిరి. పోట్ల బూదయ్య పాటనల్లినదియు నీయనే. ఈయన యే విధమగు కృత్రిమత్వమును లేకుండ జానపదగేయముల నవలీలగాఁ జెప్పఁగల సహజకవి.

గుంటూరు ఆదెమ్మ యను స్త్రీ కమ్మకులమునకుఁ జెందినది. భర్త కృష్ణమూర్తి. ఉపభర్త హనుమయ్య. ఈ యువభర్తతోఁ గలిసి భర్తను దారుణముగా హత్యచేసి, శవము నూరిబయట చెఱువులో వేసి, పైకిఁ దేలకుండ నుండుటకై గునపమును పాతెను. మామగారు పుత్రుని విషయమై యెన్నిమాఱు లడిగినను ఆదెమ్మ అతఁడు పొరుగూరికిఁ బోయెననియుఁ, ద్వరలో రాఁగలఁడనియుఁ జెప్పు చుండెను. ఇంతలోఁ జెఱువు నీరు తీసిపోవుటచే శవము బయట పడినది. పోలీసులు వచ్చి, ఆదెమ్మను హనుమయ్యను నిర్బంధించి జైలుకు దీసికొనిపోయిరి.

ఇది నిన్న మొన్నటి సంఘటన యైనను, దీనిపైఁ బుట్టిన పాటలో జానపదగేయ లక్షణములన్నియును సంపూర్ణముగా నున్నవి. ఇది మౌఖికప్రసరణమున మఱికొంత కాలము నలఁగినచో మఱింత వన్నెకెక్కును. తెలంగాణములోని "నైజాము సరకరోడ" యను పాటవలె నిది యచ్చముగా జానపదుల పరిభాషలో, వారికి మిక్కిలి పరిచితమైన ఛందస్సులో నల్లఁబడుటచే ననతికాలములోనే దీనికి విశేష వ్యాప్తి వచ్చి, చక్కని వీరగాథానికగా వెలుఁగొందఁగల సూచనలున్నవి. పోలీసునకును ఆదెమ్మకును జరిగిన సంభాషణగాఁ గథనము జరుగును. ప్రారంభమిట్లుండును:

*పోలీసు: "పల్లెడో రింటికాడ-బాయి కెదురు ఇల్లుగట్టి*
*చెలమ చాలి యింటి కెదురు- వడే రాజుల యింటికాడ*
*చీమలోరి యిల్లు గోని- చిచ్చుపెట్టి నావె నీవు ఆదెమ్మా!*
*అబ్బ నా గుండె జల్లుమన్నదోలె ఆదెమ్మ!"*

ఆదెమ్మను పోలీసు పుట్టుపూర్వోత్తరము లడుగును. ఆదెమ్మ తానుఁ బల్నాడు తాలూకా జానపాటి గ్రామములో రేగుల వారింటి బిడ్డననియు, గుంటూరివారి కోడల ననియుఁ, దన భర్త కృష్ణమూర్తి యనియుఁ జెప్పును. అప్పుడు పోలీసామెతో నిట్లనును.

*"కృష్ణమూర్తి భార్యనాని- కులుకుతావు పలుకుతావు*
*అంచు చీర గట్టినావు- అడ్డ పాపిడి తీసినావు*
*జారు జడలు ఏసినావు- జరిగినిషయం చెప్పవమ్మ ఆదెమ్మా!"*

దీనికి ఆదెమ్మ యిట్లు జవాబిచ్చును:-

*"అంచు చీరగట్టుకోని - అడ్డ పాపిడి దీసుకోని*
*అరుగుమీద గూర్చుంటే- ఏడు కొండలసామి రీతి*
*ఎంకటసామి కొడుకు వచ్చి - ఎదురుగాను నిలుచుండె పోలిసా!*

......................................

*కంటిలోన మెరుపు మెరిసె - కలవరింత పుట్టెనాకు*
*ఎంకటసామి కొడుకు కాదు- ఏడు కొండల సామి కాదు*
*రాచవారి చిన్నవాడు- రాగిమీసా లనుమయ్య పోలిసా*
*అబ్బ నా గుండె జల్లుమన్నదీర పోలిసా!"*

ఈ గాథానికలలోని యుపమానములుగాని, పదములుగాని కృత్రిమముగా నొక కవి ప్రయత్నపూర్వకముగా వ్రాసినట్లు కాక, జానపదులు ఆశువుగా అల్లినట్లుండుట కోటయ్యగారి నిసర్గ కవితాశక్తికిఁ దార్కాణము. వీరగాథలలోఁ దఱచుగాఁ గాననగు క్రౌర్యము, 'కారిన రక్తమును గడవలకుఁబట్టుట, పారిన రక్తమును బానలకుఁబట్టుట' వంటి వారానువర్తన లక్షణము లీ పాటలో కొల్లలుగా నున్నవి. హనుమయ్య కృష్ణమూర్తినిఁ జంపుటకాయత్త మగుట యెంతటి రస స్ఫూర్తితో వర్ణింపఁబడినదో చూడుఁడు:-

*"నీమ జామ కట్టినాడు- నిలువుటంగి తొడిగినాడు*
*కత్తి కర్ర చేతబట్టి- గండ్రగొడ్డలి దీసికోని*
*నల్లమందు కైపుతోను- కాయ సారయి తాగినాడు*
*కండ్లు ఎర్ర జేసెవరకు- నిలువు గుండె పగిలె నాకు పోలిసో!"*

ఆదెమ్మ తన మిండగానితోఁ గలిసి భర్త నెంత క్రూరముగాఁ జంపినదో చూడుఁడు:-

*"రెక్కముక్క నరికినారు - రెండుగాను చీల్చినారు*
*కాలు సెయ్యి కోసినారు- కంఠమేమొ దీసినారు*
*పడమటింటి తలుపు తీసి- పాదుగొయ్యి తొవ్వినారు*
*ఉప్పుబోసి కృష్ణమూర్తి- నూరగాయ జేస్తినయ్య పోలిసా!"*

## 3.3. పందెములు- స్పర్ధలు

యుద్ధవర్ణనలలో నెంత వీరరస ముత్పన్నమగునో పందెముల వర్ణనలలోఁ గూడ నంత రస ముత్పన్నమగును. ఆటలు, పందెములు- యుద్ధములకుఁ బ్రచ్ఛన్న రూపములని చెప్పవచ్చును. తెలుఁగులో కోడిపందెములు లేని వీరగాథ లేదనవచ్చును. కోడిపందెముల వలననే మనకు సగము వీరగాథలు పుట్టినవి. తెనుఁగునాట కోడిపందెములతో పాటు పొట్టేళ్ల పందెములు మున్నగునవి పేర్కొనఁబడినవి. పల్నాటి వీరకథాచక్రమునఁ గీలకస్థానమంతయు కోడిపోరులోనే కదా యున్నది! పెద్దాపురము జగపతిరాజు కథయంతయు కోడి పందెములమీఁదనే ఆధారపడి యున్నది. ఈ 'జగపతిరాజు కథ'కు

'పెద్దాపురం కోడిపుంజుల కథ' యను నామాంతరముకూడఁ గలదు. రాయలసీమలో అప్పలాపురము చెన్నారెడ్డి యెద్దుల పందెముపైనను, పొట్టిపాటి నరసింహారెడ్డి, కలిచెర్ల నరసింహారెడ్డిగారల కోడిపందెముల పైనను వీరగాథలు వీరగాథానికలు వ్యాప్తియందున్నవి. శ్రీకాకుళ మండలమున నరసన్నపేట, పార్శలరెల్లివలస గ్రామవాసులకు మధ్య జరిగిన గొఱ్ఱెపోతు పందెములపైఁగూడ నొక పాట ప్రచారమున నున్నది.

### 3.3.1. ఎద్దుల పందెము-అప్పలాపురము చెన్నారెడ్డి కథ:-

రాయలసీమలో నెద్దుల పందెములు హెచ్చు. ఆవుల పబ్బములలోను, గంగజాతరలలోను, ఉగాది పండుగనాఁడును ఎద్దుల పందెములు వేయుచుందురు. ఎద్దులకు బండలనుగట్టి లాగించుట, యిసుక బండ్లను లాగించుట, చక్రములు కట్టివేసి బరువు బండ్లను లాగించుట మున్నగు సాహస కార్యములు చేయుదురు. ఈ పందెపు టెద్ల నతి జాగ్రత్తతో మేపుచు ఏనుఁగులవలెఁ దయారు చేయుదురు. ఇది రాయలసీమలోఁ బ్రతి రైతునకును సాధారణమగు నలవాటు.

ఈ యెద్దుల పందెములలో రాయలసీమలో విశేష ఖ్యాతి గడించినవాఁడు అప్పలాపురము చెన్నారెడ్డి. ఇతఁడు సుమారుగ నేబది సంవత్సరముల క్రిందటివాఁడు (1915 ప్రాంతము వాఁడు). కర్నూలు మండలమున బనగానపల్లె తాలూకాలోని అప్పలాపుర గ్రామమీతని స్వస్థలము. ఇతని కడ రెండు గొప్ప యెద్దులుండెడివి. అందొకటి ఉయ్యాలవాడలోని బుడ్డా వెంగళరెడ్డిగారి దగ్గఱ కొనినాఁడు. ఈ యెద్దు ముఖముపైన ఆంజనేయుని రేఖ యున్నదఁట. రెండవ యెద్దును ఏళ్లూరులో జిల్లెళ్ళ నాగిరెడ్డి దగ్గఱ కొనెను. దీని చెండు(మూపురము)పై సీతమ్మ పాదములున్నవఁట. ఈ రెండు ఎద్దులను మహాద్భుతముగా మేపి, యెన్నియో పందెములను గెలిచెను. బనగానపల్లెలో నొకప్పుడు నవాబు కూడ పందెమునకు వచ్చెను. చెన్నారెడ్డి పెద్ద ఱాతిబండ నెద్దులకుఁగట్టి, యేటి యిసుకలో లాగించుచుండెను. ఒక చింతవేరు ఆ బండకు అడ్డు తగిలెను. నవాబు ప్రధాని గులామల్లీఖాన్ అదిచూచి, ఆ చింతవేరును నఱికించెదననియు, నంతవఱకును ఎద్దుల నాపవలసినదనియు చెన్నారెడ్డినిఁ గోరెను. చెన్నారెడ్డి అందులకంగీకరింపలేదు. ద్విగుణీకృతమైన పౌరుషముతో చెన్నారెడ్డి "ఈ యెద్దులు దీనిని లాగక పోయినచో తుపాకి బారువేసి, పకీరువాళ్లకు రొట్టెలపై మాంస మిడుదును'' అనెనఁట. వెంటనే ముల్లుగఱ్ఱతో నెద్దులను హెచ్చరించెను. ఆ యెద్దులు చింతవేరుతో సహా బండను బరబర లాగివైచి జుఱ్ఱేటిలోఁ బడదుమికినవఁట! నవాబు ఆయెద్దుల శౌర్యమును జూచి ఆశ్చర్యపోయెను. "ఎద్దున కేడువందల యేబది రూపాయ లిత్తును, నాకిమ్ము" అని గులామల్లీఖాన్‌చే నడిగించెను. చెన్నారెడ్డి యంగీకరింపలేదు. మరల తరుతూరు తిరునాళ్లలోను, వేల్పనూరి తిరునాళ్లలోను చెన్నారెడ్డి యెద్దులు గొప్ప పందెములను గెలిచెను. చెన్నారెడ్డి కీర్తి దేశమంతయుఁ బ్రాఁకిపోయెను. అతని దాయాదులకిది కంటగింపయ్యెను. వారికి మాత్సర్యము హెచ్చెను. అందుచే 'చేతబడి' చేయించి, ఒక యెద్దును జంపించినారు. ఆ చనిపోయిన యెద్దు కొఱకు బెంగపెట్టుకొని రెండవ యెద్దు మేఁతమాని కృశించి చనిపోయెను. ఎద్దులనే తన పంచ ప్రాణములుగా భావించు చెన్నారెడ్డి హృదయము బ్రద్దలయ్యెను. నిరంతర మా యెద్దులనే తలపోయుచుఁ బిచ్చియెక్కి, మంచముపట్టి స్వర్లోకమున కేగెను. అప్పలాపురములో టంగుటూరునకుఁ బోవు త్రోవలో నీ యెద్దుల సమాధి నేఁటికినిఁ గలదు. ఎద్దులు చనిపోయిన తరువాత చెన్నారెడ్డి, నందవర గ్రామములోఁ బ్రతిసంవత్సరము నా యెద్దుల పేరిట గొప్ప తిరునాళ్లు జరిపి, కుంటిగ్రుడ్డివారికి నన్నదానము చేసెడివాఁడఁట. ఈ తిరునాళ్లు నేఁటికిని గొన సాఁగుచున్నవి.

ఈ యప్పలాపురము చెన్నారెడ్డిపై జంగములు పాడు నొక బొబ్బిలివరుస కథయును, గుంటిగ్రుడ్డివారు పాడుకొను నొక వీరగాథానికయు రాయలసీమలో వ్యాప్తియందున్నవి. బొబ్బిలివరుస కథ పేరు "అప్పలాపురం చెన్నారెడ్డి యెద్దు కథ" అని యుండును. ఇది నాకు లభించలేదు. వీరగాథానికను నంద్యాలలో మామద్దు నరసన్నయను నొక యంధుఁడు పాడుచుండఁగా వ్రాసికొంటిని (19-12-1965). ఇది వీరరసము చిప్పిలుచున్న గేయము. ఇందలి పునరావృత్తి:-

*"అప్పలాపురా మేలే చెన్నారెడ్డి దీ యెద్దూ*
*ఎద్దు ఎద్దుకు పందెమంటడు-*
*ఎద్దు తగ్గేపోతె నేమో- సతువ కడవకు తగ్గనంటడు- అప్పాలా"*

తన యెద్దులు పందెమున నోడిపోయినచోఁ దాను 'సతువ కడవ' కు సిద్ధమని చాటెనఁట చెన్నారెడ్డి. 'సతువ కడవ' అనఁగా 'సత్తువ కడవ'. ఇది రాయలసీమలోఁ బ్రచారమునను్న మఱియొక పందెము. ఇది శక్తిని బరీక్షించునది. ఒక పెద్ద కడవనిండుగా నిసుక పోసి, కొంచెము నీళ్లు కలిపి, ఆ కడవ నెత్తుట. (ఇందు 50 పళ్ల ఇసుకయు, 10 పాళ్లు నీళ్లు పోయుదురు.) బనగానపల్లెలో జుఱ్ఱేటి ఇసుకలోఁ బందెము జరుగునప్పుడు చెన్నారెడ్డి పౌరుషమును జూడుడు:-

*"మొగలాయీ తాలూకా- పాళెగాడు చెన్నరెడ్డీ*
*కుడీమీసం ఒడీవేసీ- గుడ్లెఱ్రజేసె రెడ్డీ*
*ఎద్దులైనను తోలుకొచ్చి- బండకైనను కట్టె రెడ్డీ*
*బండకైనను కట్టి రెడ్డి- జోకొట్టీ సదాయించీ*
*బండకైనను రెడ్డి అప్పుడు- బారుగను టెంకాయ కొట్టీ*
*ముల్లుగఱ్రను చేత బట్టీ- ఎద్దులను ఒక యేటుగొట్టెను*
*హర హరా అంట యెద్దులు- అరవయి గజాలు గుంజెను"*

బండకు చింతవేరు తగిలి యెద్దులాగినవి. గులామల్లీఖాన్ వేరును నతికింతుననెను. చెన్నారెడ్డి యంగీకరింపలేదు. అతఁడు రోషముతో నెద్దులవైపుగా-

*"ఎండికట్లా తూపాకీ- బారైనను జేసె రెడ్డీ*
*ఎద్దు తగ్గే పోతె నేమొ- పకీరోళ్లకు రొట్టె మీదకు*
*మాంసమేమో పెడతనన్నడు..."*

ఎద్దులు యజమానికన్నను పౌరుషవంతములు! తమ యజమాని భావమును గ్రహించినవి కాఁబోలును, కాలుదువ్వి ఖణీలు మని అంకెవేసినవి! చెన్నారెడ్డి వానిని జోకొట్టి, సముదాయించి, ఒక వ్రేటుకొట్టెను. ఆ యెద్దులు చింతవేరుతో సహా బండను బరబర లాగి జుట్టేటిలోఁ బడదుమికినవి. అప్పుడు చెన్నారెడ్డి-

*"కుడీ మీసా మొడీ ఏసీ- గుడ్డైనా ఎర్రజేసి*
*మాదిగోళ్లను బిలిపించెను - మంగలోళ్లను బిలిపించెను*
*కాలి కొమ్ములు కనక తప్పెట- కంచుమేళము తోన*
*బోగమోళ్లను ఆడుకుంటను- బట్రాజులు పొగుడుకుంటను*
*ఏడు వందల దెబ్బయి రూపయిలు- ఎద్దుమీద ఎగరేసె రెడ్డి"*

### 3.3.2. గొఱ్ఱెపోతుల పందెము:-

రాయలసీమలో ఎద్దుల పందెములు విరివిగా నున్నట్లే, విశాఖ, విజయనగర, శ్రీకాకుళ మండలములలో గొఱ్ఱెపోతుల పందెములు హెచ్చు. శ్రీకాకుళ మండలమున 'గొఱ్ఱెపోతుల పందెము' అను నొక వీరగాథానిక వ్యాప్తియందున్నది. ఇది బొబ్బిలికథ వరుసలో నున్నది. దీనిని మాలదాసరులు జముకులు వాయించుచుఁ బాడుచుందురు. ఈ పాటను 24-5-1966న శ్రీకాకుళము ప్రక్కనే యున్న తోటపాలెములో అలమండ తాతయ్య యను దాసరి పాడఁగా వ్రాసికొంటిని. ఆధునిక పదజాలముతో సాఁగిన వర్ణనలనుబట్టి ఇది ఇటీవలి కాలమున జరిగిన పందెమువలె నున్నది. సుమారు పది సంవత్సరములు లోపుననే (1956లో) జరిగియుండును.

నరసన్నపేటలో నక్క జానకి యను వెలమకడ 'సింకిజెల్ల' యను గొఱ్ఱెపోతు గలదు. పార్శల రెల్లివలస గ్రామములో గోపాలరావు, ప్రకాశరావు అను నిరువురు అన్నదమ్ము లుండిరి. వీరు తెలగ కులస్థులు. వీరు పెద్దల కాలమునుండియు గొఱ్ఱెపోతుల పందెములోఁ బ్రసిద్ధికెక్కినవారు. ప్రకాశరావు నరసన్న పేటకు వచ్చి, నక్క జానకిని సవాలు చేసి, గొఱ్ఱెపందెమున కొప్పుకొనెను. గోపాలరావు పడమటి దేశము పోయి 'రాగికళ్ల రాసమండి'నిఁ దెచ్చెను. మూఁడు వేలరూపాయల పందెము కాసిరి. కూర్మనాథపురము మొక్కతోటలో పందెము నిర్ణయించిరి. పందెమును గుఱించి పత్రములు ముద్రించి పంచిపెట్టిరి. చుట్టుప్రక్కల గ్రామములనుండి వేలకొలఁది జనము వచ్చి, ఆ తోటలో నిండిపోయిరి. అంగళ్లు స్థాపింపఁబడెను. ఆ తోట యంతయుఁ దిరునాళ్ళుగా మాఱిపోయెను. ఈ జనసందోహ వర్ణన మత్యద్భుతముగా సాఁగినది:-

| | |
|---|---|
| *"పేపరు జూసీ జనమే గనకా ఏ రీతి గొస్తారో-* | నాయన |
| *సన్న పిల్లలూ తల్లులు సైతము సూడను వస్తారో* | ,, |
| *ఊక పోసితే ఊక కిందికీ వాలక వున్నాదో* | ,, |
| *పట్ట జాలకా జనమే గనకా చెట్టు లెక్కినారూ* | మేలుభళాజీ |
| *పళపళ పళపళ చెట్టుకొమ్మలే విరుగుచునున్నావీ* | ,, |
| *పేపరు జూసీ సామాను లే రీతిగా వచ్చాయీ* | ,, |
| *చెప్పశక్యము కాని రీతిగా సెరకుబొద్దు లొచ్చే* | ,, |
| *మల్లంటా మామిడిపళ్లూ దుకాణాలొచ్చే* | ,, |
| *పక్క పక్కనే పేక దస్తలా ఆటలాడినారూ* | ,, |
| *ఉత్తర భాగము నున్నాయండి ఉండల కొట్టాలూ* | ,, |
| *పడమటి భాగము నున్నాయండీ పచ్చి చేపలేమో* | ,, |
| *సోకు కొద్దీ పేలించినారుగా సోడా బుడ్డీలూ* | ,, |
| *ఎదురు తడకలా ఏడి కాపీలు ఎగురుతునున్నాయీ* | ,, |
| *గట్టువారనీ సారయి కూజలు ఎగురుతునున్నాయీ"* | ,, |

ఆదివారము పంద్రెండు గంటలకుఁ బందెము ప్రారంభ మయ్యెను. గొఱ్ఱెపోతుల కెనిమిది 'కలుపులు' కలిపి, ఎనిమిది 'తీపులు' తీసిరి. పదునాఱు 'కిల్లల'తో గోపాలరావుపోతు ఓడియెను. నక్క జానకి 'సింకిజెల్ల' గెలిచెను. గోపాలరావు పౌరుషముతో మరలఁ బందెమొప్పుకొనెను. మఱుసటి యాదివారము నాఁడు, అదే తోటలోఁ బందెము జరిగెను. గోపాలరావు 'మైనపుగోర' యను క్రొత్త పోతును దెచ్చెను. అదియును 'సింకిజెల్ల' చేతిలో నోడిపోయెను. గోపాలరావు పౌరుషము ద్విగుణీకృతమయ్యెను. మరల వారము రోజులలోఁ బందెమొప్పుకొనెను. ఈసారి 'బళ్లారిచుంచు' అను గొఱ్ఱెపోతును దెచ్చెను. కాని అదియును నోడిపోయెను. ఇట్లు వరుసగా నెనిమిది పందెములు గోపాలరావు ఓడిపోయెను. అతని సిరిసంపదలు, తోటలు, దొడ్లు, భూములు మున్నగున వన్నియును నీ పందెములలోఁ బోయినవి. అయినను నతని పౌరుషాగ్ని చల్లార లేదు. ఎనిమిది పందెముల తరువాతఁ దొమ్మిదవ పందెము నొప్పుకొనెను. ఈ తొమ్మిదవ పందెమున గోపాలరావు దేశమంతయును గాలించి 'సంజీవు' అను గొఱ్ఱెపోతును దెచ్చెను. ఈ పందెమున గోపాలరావు గెలిచెను. అతని పంతము నెఱవేరెను. కాని ఆస్తి నశించిపోయెనను బెంగతో నతఁడు గుండె యాగిపోయి, పందెము దగ్గఱనే ప్రాణములు విడిచెను.

గోపాలరావు పట్టుదల, బొబ్బిలివీరుల పట్టుదలవలెనే యున్నది. పందెమున నోడిపోయి మరల పందెమును గాయుచు నతఁడు తమ్మునితో నిట్లనును:-

*"యుగమూ జగమూ ఉన్నంత వరకూ ఉండబోరు ఎవరూ- నాయన*
*పుట్టబోయి మూడు యాబైలు బతకబోరు ఎవరూ- తమ్ముడ*
*పొడిసిన పోటూ సేసిన దర్మం కీరితి వుంటుందో- నాయన"*

ఈ పాటలో విశాఖ– విజయనగర– శ్రీకాకుళ మాండలిక పదములు, నుడికారములు కొల్లలుగాఁ బ్రత్యక్షమగును. "పుట్టి మూడు యాభైలు బ్రతికినవాడెవడు?" అనునది యా ప్రాంతమందలి సామెత. గొఱ్ఱెపోతు పందెములకు సంబంధించిన పలుకుబడులెన్నో ఈ పాటలో నున్నవి. 'కలుపులు, తీపులు, కిల్లలు, పందెము, పైపందెము' మున్నగునవి. గొఱ్ఱెపోతుల ముద్దుపేర్లెంత చక్కగ నున్నవో చూడుఁడు. "సింకిజెల్ల, రాగికల్ల రాసమండి, మైనపుగోర, బళ్లారిచుంచు, కాసులపోతు, మైనపుడేగ, కలవలపోతు, తారాజువ్వ, సంజీవు".

## 3.4. ఆత్మత్యాగములు– కట్టపదములు

వీరగాథలలోఁ బేరంటాండ్ర కథలెట్టివో, వీరగాథానికలలో నాత్మత్యాగమునకు సంబంధించిన పాటలట్టివి. వీరగాథలు ముఖ్యముగా వీరరస ప్రధానములైనను, గరుణరస ప్రధానములైన కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, నారాయణమ్మ కథ మున్నగునవి అందుఁ దావు ఏర్పఱుచుకొని, ఒక ప్రత్యేకశాఖగా విలసిల్లుచున్నవి. అట్లే వీరగాథానికలు మొదట వీరుని మరణమునకు శోకించుచు, యుద్ధవీరునిఁ బ్రశంసించుచున్నను, గ్రమక్రమముగా నిందలి కరుణము నాధారముగాఁ జేసికొని కొన్ని ప్రాస్తావిక గీతములు గూడ నిందుఁ దావేర్పఱుచుకొన్నవి. ప్రమాదములకు సంబంధించిన పాటలు, నాత్మత్యాగమునకు సంబంధించిన పాటలు నిట్టి ప్రాస్తావిక గీతములే. పేరంటాండ్రందఱును భర్తశరీరముతోపాటు సహగమనము చేసినట్లే, ఆత్మత్యాగ విభాగములోని స్త్రీలందఱును సాంఘిక క్షేమమునకై ఉప్పొంగిన చెఱువులకు బలియైరి. 'సాగుమానము' చేసిన పతివ్రతల కథలను 'పేరంటాండ్రకథ'లని పిలిచినట్లే, ఈ యాత్మత్యాగము చేసిన 'మహాతల్లుల' పాటలను 'కట్టపదము'లని పిలువవచ్చును. జానపదు లీ పాటల నీ పేరుతోనే పిలుచుచున్నారు. 'కట్ట' యనఁగా 'చెఱువుకట్ట'. చెఱువు పొంగిపోయి, కట్ట తెగిపోయి, ఊరు మునిఁగిపోవుటకు సిద్ధముగా నుండఁగా, నరబలి (అందునను గర్భిణిస్త్రీ యగుచో మఱింత శ్రేష్ఠము) నిచ్చినచోఁ గట్ట నిలుచును. కట్ట నిలుచుటకై బలియైనవారినిఁగూర్చిన పదములు కావున నివి 'కట్టపదము' లనఁబడును.

ఈ కట్టపదము లన్నియును నరబలులు వాడుకలోనున్న కాలమునాఁటివి. అనఁగా 18, 19 శతాబ్దములలోనివని చెప్ప వచ్చును. కొన్ని పాటలలోఁ జెఱువుకట్టలేకాక, కోటగోడలు కూలిపోవునప్పుడు గూడ నిట్టి నరబలులిచ్చినట్లుగాఁ గలదు. బోన కాటపరెడ్డి పాట ఇట్టిదే. అనంతపుర మండలములోని బుక్కరాయ సముద్రపు చెఱువునుగూర్చిన 'ముసలమ్మ గండి పాట'ను ప్రయాగ నరసింహశాస్త్రిగారు ప్రకటించినారు (చూ. తెలుగు పల్లెపాటలు, పుటలు 35–37). కంబము చెఱువునకు సంబంధించిన 'వరదరాజమ్మ పాట'ను తూమాటి దొణప్పగారు సేకరించిరి (చూ. స్రవంతి, డిసెంబరు, 1958). జానపదగేయ సంకలనమగు త్రివేణిలోఁ గూడ నొక కట్టపదము ప్రకటింపఁబడినది (చూ. పుటలు 251–255). ఇవి కాక మఱి నాలుగు పాటలను నేను రాయలసీమలో సంపాదించితి. అది 'సిద్ధాపురము కట్టపదము, లలికట్టపదము, ఒద్దిరాజుల పాట, బోన కాటపరెడ్డి పాట' అనునవి. ఈ నాలుగు పాటలను కర్నూలుజిల్లా, నందికొట్కూరు తాలూకా, చెలిమళ్ల రుద్రవరమునకుఁ జెందిన శ్రీమతి మూలల్ల రోజమ్మ పాడి వినిపించినది (23–4–1966). ఇవన్నియును వరినాట్లలోను, వేరుసెనగకాయల నొలుచునప్పుడును పొలయులలో పాడఁ బడుచుండును.

### 3.4.1. సిద్ధాపురము కట్టపదము:–

ఇది కర్నూలు మండలమున ఆత్మకూరు దగ్గఱనున్న సిద్ధాపుర మను గ్రామములోఁ జెఱువునకు బలియైన 'అంతుబాయి' యను మాదిగపడుచు గాథ. సిద్ధాపురము చెఱువునకుఁ గట్ట కట్టుచుండఁగా, రేపు కట్టినచో మాపు పడిపోవుచున్నదఁట. రెడ్డి కరణములు గంగమ్మను బ్రార్థించిరి. ఊరిలోని మాదిగ చెన్నరాయని కోడలు 'అంతుబాయి'ని హారమడిగినది గంగమ్మ. రెడ్డి, చెన్నరాయనికిఁ గబురు పంపెను. అతఁడు విచారముతో నింటికడఁ బరుండెను. ఆ విషయమును గ్రహించిన అంతుబాయి సంతోషముగా ముందుకు వచ్చి చెఱువునకు బలియయ్యెను. చతురశ్రగతిలో సాఁగిన ఈ పాట ప్రారంభమిట్లుండును:–

*"ఉప్పరివారూ పనులు జేస్తరూ– తానే తందన్నా*
*రేపే కడితే మాపే పడతది ,,*
*రెడ్డీ కరణము చూడా బొయ్యిరి ,,*
*ఏమీ వరములు అడుగూతావే ,,*
*అడుగావే ఓ గంగమ్మ తల్లీ ,,*
*మాదీగన్నా చెన్నారాయుడు ,,*
*చెన్నారాయుని చిన్నీ కోడలు ,,*
*ఆమె పేరూ అంతూబాయీ ,,*
*ఆమెను అయితే కట్టా నిలుస్తది– తానే తందన్నా"*

### 3.4.2. లలికట్ట పదము:–

ఈ చెఱువెక్కడున్నదో తెలియుట లేదు. పాటనుబట్టి 'లలికట్ట' యను గ్రామమున్నదని తోఁచుచున్నది. లలికట్ట పుట్టినప్పుడే సిరిమల్లు పుట్టినాఁడఁట. ఈ బాలుని 'ఏరూరు'కుఁ దెచ్చి పెంచుచుండిరి. బాలచంద్రుని కథవలె మరల నిచట బొంగరాలాట వర్ణింపఁబడినది. ఆ బొంగరాలాటలో సిరిమల్లు బొంగరమొక కోమటిస్త్రీ కడవకుఁ దగిలినది. ఆమె సిరిమల్లును దూషించినది. ఆ దూషణలో సిరిమల్లు అక్క లలికట్టలో నున్నదని తెలిసినది. సిరిమల్లు తల్లి వలదన్నను వినక, లలికట్టకుఁబోయి, అక్క జ్ఞానమ్మను జూచినాఁడు. అచటినుండి

ఆ యూరి చెఱువును జూచుటకుఁబోఁగా, నచటివారు ఆ బాలుని బలి ఇచ్చుటకై పట్టుకొనిరి. అక్క జ్ఞానమ్మ అడ్డువచ్చినది. ఆ చెఱువు దగ్గఱివారు ఆ యిరువురిని గూడ బలిఇచ్చిరి. ఇది ఊయలపదము. కోమటిస్త్రీ సిరిమల్లును దూషించుట సహజముగా నున్నది:-

*"ఏ ముండ గన్నదిర-ఉయ్యాలో ఏ రండ గన్నదిర- ఉయ్యాలా*
*సెల్లెండ్లు లేనిదీ ,, ఏసేడె కన్నదిర ,,*
*కొడుకుల్లు లేనిదీ ,, ఏ కొరివి కన్నదిర ,,*
*అక్కల్లు లేరు తల్లి ,, అన్నల్లు లేరు తల్లి ,,*
*నీ అక్క జ్ఞానమ్మ ,, లలికట్ట కిచ్చిలేర ఉయ్యాలా"*

### 3.4.3. ఒద్దిరాజుల పాట:-

ఇందుఁ గథ మఱికొంత మెలిదిరిగి యున్నది. కొత్తపేట గొల్ల యువతి మిక్కిలి యందగత్తె. ఆమె సౌందర్యము ఒద్దిరాజు లేద్దురకును దెలిసినది. చల్లలమ్మవలసినదిగా నూరూరునకును జాటినారు. కొత్తపేట గొల్లయువతి చల్లలమ్మ బయలుదేరినది. అత్తయు భర్తయు వలదని వారించినారు. కాని ఆమె వినలేదు. తొలికోడి కూసినప్పుడు తోడువేసి, మలికోడి కూసినప్పుడు మజ్జిగజేసి, కడవనిండుగాఁ బోసి, స్నానము చేసి, అలంకరించుకొని బయలుదేరినది. ఒద్దిచెట్టు దగ్గఱ నున్న ఒద్దిరాజుల కామె సౌందర్యము మిఱుమిట్లు గొల్పఁగా వారామె చెఱఁగుఁబట్టుకొనిరి. ఆమె యెంతవారించినను వారు వినలేదు. తాను అంటయి యుంటినని పలికినది. కాగులలోనున్న నీటితో స్నానమాడుమనిరి ఒద్దిరాజులు. అటువంటి నీళ్లతోఁ దనయంటు వదలదనియు, అత్తమామలు త్రవ్వించిన అయోధ్యచెఱువులో స్నానమాడెదననియుఁ జెప్పినది. వారామె నా చెఱువు కడకుఁ గొనిపోయిరి. స్నానమాడెదనను నెపముతో నా గొల్లయువతి యా చెఱువులో మునిఁగి ఆత్మహత్య చేసికొన్నది.

ఈ కథ సంఘశ్రేయస్సుకై ఆత్మబలిదానము చేసిన కథ కాదు. మాన సంరక్షణార్థమై ఆత్మహత్య చేసికొనిన కథ. అయినను దీని తత్త్వమునుబట్టి ఇది యీ వర్గమునకే చెందును. చెఱువులోఁబడి చనిపోవుట యను సాధారణాంశమిందుఁ గలదు. ఇది తుమ్మెద పదము. ఇందలి కవిత్వ మత్యద్భుతముగా నున్నది. జానపదుల కల్పనలకు నూహలకు నిది పరాకాష్ఠవలె నున్నది. కన్నుల మిఱుమిట్లు గొల్పు సౌందర్యవతియగు నా యాదవకాంతను జూచిన ఒద్దిరాజుల సంభ్రమాశ్చర్యములెట్లు చెప్పఁబడినవో చూడుఁడు:-

*"మూడమి లేదు మబ్బు లేదు- తుమ్మడీలో*
*ఉత్తమెరుపూ మెరిసెరన్నా ,,*
*మెరుపు గాదూ తమ్ముాదా ,,*
*గొల్లదానీ రూపురేఖా ,,*
*మూడమి లేదు మబ్బు లేదు ,,*
*ఉత్త ఉరుము ఉరిమెరన్నా ,,*
*ఉరము కాదూ తమ్ముదా ,,*
*గొల్లదానీ మెట్టెల మోతా- తుమ్మడీలో"*

యాదవకాంత తొలికోడి కూసినప్పుడు తోడువేసి, మలికోడి కూసినప్పుడు మజ్జిగచేసి, కడవ నిండుగ పోసికొని, స్నానము చేసి, ఉఱుమువన్నె చీరఁగట్టి, మెఱుపువన్నె రవిక తొడిగి, కడవ నెత్తిన పెట్టుకొన్నదఁట. ఇట నీమె స్నానము చేయుట, అలంకరించుకొనుట అత్యద్భుతముగా వర్ణింపఁబడినది:-

*"ఎండి కుండల్లోను-తుమ్మడీలో-ఏణ్ణీలు కాసింది- తుమ్మడీలో*
*ఏణ్ణీళ్లు సన్నీళ్లు ,, ఏకములు జేసింది ,,*
*తూరుపు గుండెక్కి ,, తూలిడిచె తలకురులు ,,*
*జాలాటి బండెక్కి ,, జలకంబు లాడింది ,,*
*రవరవా గాలీకి ,, ఆరిపింది తలకురులు ,,*
*ఎండీ సిత్కెంటాతో ,, ఎలసిక్కూ తీసిందీ ,,*
*పైడీ దువ్వేనాతో ,, పాపిడులు తీసిందీ ,,*
*ఉరుమెన్నె సీరగట్టి ,, మెరుపొన్నె రయిక తొడిగె ,,*
*అన్నీ సొమ్ములూ పెట్టి ,, అద్దములో నీడ జూసె ,,*
*అద్దములో గొల్లాది ,, దిద్దీనట్టున్నాదీ తుమ్మడీలో"*

ఇట్లు అలంకరించుకొని, చల్లకడవ దగ్గఱకు వచ్చి-

*"అత్తమామల తలచినాది-తుమ్మడీలో- అరిచేయి ఒడ్డింది-తుమ్మడీలో*
*భూదేవిని తలచినాది ,, బుజాని కెత్తింది ,,*
*తల్లిదండ్రుల దలచినాది ,, తలమీనా బెట్టింది తుమ్మడీలో"*

### 3.4.4. బోన కాటపరెడ్డి పాట:-

ఇది కడప మండలములోని రాయచోటికోటకు సంబంధించి న కథ. బోన కాటపరెడ్డి ఆ కోటను గట్టించుచుండఁగా, కోటలోని మాసెమ్మ గోడలను గూలద్రోసినది. ఏమి బలియిచ్చెదమన్నను నంగీకరింపలేదు. కాటపరెడ్డి యొక్క కొడుకులను కోడండ్రను బలిగాఁ గోరినది మాసెమ్మ. కాటపరెడ్డి తన కుమారుల నిచ్చుట కిష్టపడినాఁడు కాని గోడండ్రను నిచ్చుట కిష్టపడలేదు. కాని పెద్దకోడలు పేరమ్మ తానుగా ముందునకు వచ్చినది. బలి యగుటకు సమ్మతించినది. తక్కిన కోడండ్రును ఆమె ననుసరించిరి. బోన కాటపరెడ్డి తన కొడుకులను కోడండ్రను మనుమలను కోటగోడలకు బలియిచ్చెను. కాటపరెడ్డి భార్య కాశమ్మ కడుపు 'కాలేటి మంగలములో కలిపోసినట్లుగా కాలిన'దఁట. ఎంత తీవ్రమగు భావన!

ఒక ప్రక్కనుండి ఉప్పరులు కోటగోడను నిర్మించుచుండగా వేఱొక ప్రక్కనుండి గోడ పడిపోవుట చక్కఁగ వర్ణింపఁబడినది.

*"బోనా కాటపారెడ్డి-తుమ్మడీయలో-రాజా కాటపారెడ్డీ-తుమ్మడీయలో*
*కలిగిన్నా వాడమ్మా ,, కలిరాల్లా వాసూడు ,,*

కట్టించే కలిరాళ్లా ,, రాచోటీ కోటమ్మ ,,

.............................................................

వక్కేసీ రాయితో ,, వరుసేరుపరిచీరి ,,
రెండేసి రాళ్లాతో ,, జోడేరూపరిచీరి ,,
మూడేసి రాళ్లాతో ,, మూలేరుపరిచీరి ,,
ఏడేసి రాళ్లాకు ,, ఎగిసింది ఆ కోట ,,
తొమ్మీది రాళ్లాకు ,, తొలిగింది ఆ కోట ,,
పాదేసి రాళ్లాకూ ,, పడుతాది ఆ కోట తమ్మడీయలో"

## 3.5. విధివైపరీత్యములు-ప్రమాదములు

వీరగాథానికలలోని కరుణరసము నాధారముగాఁ జేసికొని వీరములేని కేవల కరుణరసాత్మక సంఘటనలపైఁ గూడఁ బాటలు పుట్టినవి. వీనితో వర్ణనతప్ప కథనమేమియును గానరాదు. వీర గాథానికలలోఁ గొన్నింటఁ గథాకథనము లేకున్నను గథాసూచన మున్నది. (కట్టపదములు కరుణరసప్రధానములైనను వానియందుఁ గథాకథనమున్నది.) ఇట్టి సూచనకూడ నీ రకపు పాటలలో మృగ్యము. ఇవియన్నియు నెక్కువగా నదులు పొంగినప్పుడు కలిగిన జననష్టమును వర్ణించు పాటలు. ఇవి నిజమునకు జానపదగేయవర్గమునకే చెందును గాని, వీరగాథానికలుగాఁ జెల్లుబడి కావేమోయని నా యనుమానము.

హైదరాబాదులో మూసినది పొంగిన కథ (ఊయల పదము), నెల్లూరు మండలమున నెల్లల చెఱువు పొంగిన పాట, 1936లో వచ్చిన చీరాల-పేరాల గాలివానను గూర్చిన పాట (నూకల సుబ్బారావు రచన), పెన్నేటి పొంగు పాట, 27-9-1954న జరిగిన జనగామ రైలుప్రమాదమునుగూర్చిన పాట (బతుకమ్మ పాట), 1-9-1956న జరిగిన జడ్చర్ల-మహబూబునగరము రైలు ప్రమాదముపై పాట (బతుకమ్మ పాట), 28-9-1964లో చంద్రవంక పొంగి మాచెర్లపట్టణమును ముంచిన సంఘటననుగూర్చి పుట్టిన 'పల్నాటిలో ప్రళయం' అను పాట (రచన: జి.యల్. సత్యబాబు)- మున్నగునవన్నియును విధివైపరీత్యములకును బ్రమాదములకును సంబంధించిన పాటలు. 1953లో సంభవించిన గోదావరి వఱదలపైఁ గూడఁ బాటలు ప్రచారమున నున్నవి. రాయలసీమలో రేనాడులో సుమారు ఏబది యేండ్ల క్రిందట (1916-1917లో) బనగానపల్లె దగ్గఱ 'కుక్కలగండి చెఱువు' పొంగిన సంఘటనపై నొక పాట ప్రచారమున నున్నది.

రాయలసీమలో నాకొక క్రొత్తరకమగు పాట లభించినది. దీని పేరు 'అల్లుని పాట'- ఇది విమాన ప్రమాదమునకు సంబంధించిన పాట. విమాన చోదకుఁడుగా నున్న 'దొరకృష్ణయ్య' యను నతఁడు తన యత్తవారి యూరి సమీపమున విమానము కూలిపోఁగా మరణించును. ఇది నాకుఁ గర్నూలు మండలమున లభించినది. అత్తమామ లీ దొరకృష్ణకై దుఃఖించుచున్నట్లుగా నీ పాట నడచును. (ఉస్మానియా విశ్వవిద్యాలయోపాధ్యక్షులగు డా॥ డి.ఎస్. రెడ్డిగారి యేకైక పుత్రుఁడిట్లే మరణించెను. ఇది యాతనిపైఁ బుట్టిన పాటయేమో పరిశీలింపవలసియున్నది.) 'అల్లుడ దోర కృష్ణయ్యా' అనునది ఈ పాటలోని పాదాంతపదము. దొరకృష్ణయ్య అల్లుఁడనియు, నితని మామ 'లక్ష్మారావు' అనియు, నీ విమాన ప్రమాదము కొల్లాపురములో జరిగినదనియు, నీ పాటను నాకుఁ బాడి వినిపించిన (చాకలి నడిపన్న భార్య) బాలమ్మ చెప్పినది. ఈమె పుట్టిల్లు మహబూబునగర మండలమునఁ గలదు. అత్తవారియూరు కర్నూలు మండలమున నందికొట్కూరు తాలూకాలోని 'చెలిమళ్ల రుద్రవరము'. ఈ పాట ప్రారంభమిట్లుండును:-

"పుట్టిందీ యావురో- అల్లుడ దోర కృష్ణయ్యా
పెరిగిందీ యావూరో ,,
పుట్టిందీ కొల్లాపురం ,,
పెరిగిందీ నూజేడు అల్లుడ దోర కృష్ణయ్యా"

వైమానిక దళములోఁ బనిచేయుచుఁ జనిపోయిన దొర కృష్ణయ్యకు కొల్లాపురము 'కచేరి'రో 'ఫోటో' తీసి, ఆతని సమాధికడ నా ఫోటో నుంచిరఁట.

"అయిదేళ్లా కైనానూ- అల్లుడ దోర కృష్ణయ్యా
బంగారీ ఉంగరాలూ ,, ,,
నీ ఫోటో దింపినరు ,, ,,
ఒకసేతా బెత్తామూ ,, ,,
ఒక సేతా టూపాకీ ,, ,,
మనిషీనీ ఏసెతట్టూ ,, ,,
బారైనా పెట్టింద్రో ,, ,,
పెద్దాపులి నీవయ్యో- అల్లుడ దోర కృష్ణయ్యా"

# 4. దానవీర ప్రశంసలు

వీరగాథలలోను వీరగాథానికలలోను దఱచుగా యుద్ధవీరమే ప్రశంసింపఁబడుచుండును. పేరంటాండ్ర కథలలోను, కట్టపదముల లోను మాత్రము త్యాగవీరమున్నది. దానవీరమును బ్రశంసించు గాథానికలు గూడఁ దెలుఁగులోఁ గొన్ని కలవు. మానవసేవయే మాధవసేవగా భావించి, కఱవుకాటకములందు సాటిమానవులకుఁ దమ సర్వస్వము నిచ్చివేసిన దానకర్ణులపైఁ గూడ జానపదులు భక్తి ప్రపత్తులతో పాటలు పాడుకొందరు. రాయలసీమలో బుడ్డా వేంగళరెడ్డి, సుద్దపల్లి లక్ష్మమ్మ, సుద్దపల్లి రామచంద్రారెడ్డి, యాదాళ్ళ నాగమ్మ, చిన్నఅండ్లూరి శివమ్మ, మోదిన్ పకరుద్దీన్ మున్నగువారి పైనను, నెల్లూరు మండలమున కోడూరి బాలకోటారెడ్డిగారి పైనను, గోదావరీ మండలమున డొక్కా సీతమ్మగారి పైనను నిట్టి పాటలున్నవి. ఇవి

కేవలము ప్రశంసలైనచో జానపద గేయములగును గాని గాథానికలు కానేరవు. కాని వీనిలో బుడ్డా వెంగళరెడ్డిగారి పాట, డొక్కా సీతమ్మగారి పాట మున్నగు వానితోఁ గథాకథనమున్నది. కావున నివి వీరగాథానికలే.

ఈ విభాగమునకుఁ జెందిన పాటలలో బుడ్డా వేంగళరెడ్డిగారి పాట ప్రశస్తమైనది. దీనికున్న వ్యాప్తి రాయలసీమలో మఱియే ఇతర గేయమునకును లేదు. రాయలసీమలో– ముఖ్యముగా రేనాడులో రైళ్లలోను, బస్సులలోను, తిరునాళ్లలోను నెక్కడఁబట్టిన నక్కడ నీ పాట వినిపించుచుండును. దీనినెక్కువగా కుంటి గ్రుడ్డివారు పాడుచుందురు.

బుడ్డా వేంగళరెడ్డి రేనాటి దానకర్ణుఁడు. రేనాటికి నుయ్యాల వాడ నారసింహారెడ్డి సూర్యుఁడు కాఁగా, నీ వేంగళరెడ్డి చంద్రుఁ డైనాఁడు. ఈ సూర్యచంద్రులిరువురును నుయ్యాలవాడ గ్రామమునకే చెందిన వారగుట మఱియొక విశేషము. ఈయన క్రీ.శ. 1822లో జన్మించి, 1900లో (31-12-1900నాడు) స్వర్గస్థుఁడయ్యెను. నారసింహారెడ్డి విప్లవకాలమున వేంగళరెడ్డి యువకుఁడుగా నుండియుండును. క్రీ.శ. 1866లో విక్టోరియా మహారాణి వేంగళరెడ్డిగారి దానశీలత కబ్బురపడి ఆయనకు ఒక స్వర్ణపతకమును బహూకరించెను. ఇది ఉయ్యాలవాడలో వారి వంశస్థుల కడ నేఁ టికినిఁ గలదు (1966లో నేనా గ్రామమునకుఁ బోయి దానిని జూచితిని). ఈ స్వర్ణపతకముపై ముందు భాగమున నాంగ్లములోను వెనుక భాగమునఁ దెలుఁగుతోను నీ క్రింది విధముగా వ్రాయఁ బడియున్నది.

**"Presented to Budda Vengala Reddy as a token of the high appreciation of Her Majesty's Government of his munificent liberality to his destitude countrymen in the famine of 1866".**

**"౧౮౬౬ సంవత్సరములో సంభవించిన క్షామకాలమందు నిరాధారముగా వుండిన తన స్వదేశస్థులపట్ల జరిపించిన వుత్కృష్టమయిన ఔదార్యమునకు గాను హర్ మెజిస్టీ రాణిగారివల్ల చేయబడిన శ్రేష్ఠమయిన గణ్యతకు ఆనవాలుగా బుడ్డా వెంకళరెడ్డిగారికి బహుమానము యివ్వబడ్డది".**

క్రీ.శ. 1866లో రాయలసీమలో గొప్ప క్షామము వచ్చినది. అది ధాత నామ సంవత్సర మగుటచే దానిని 'ధాత కఱవు' అని పిలిచిరి. ఇది ముఖ్యముగా అనంతపుర మండలమున సంభవించెను. బుడ్డా వెంగళరెడ్డిగారు క్షామపీడితులైన ప్రజలకు మూఁడు నెలల పాటు అన్నవస్త్రములిచ్చి కన్నతండ్రివలెఁ గాపాడెను. పండ్రెండు పాతరల ధాన్యమును ఖర్చుచేసెను. తన దగ్గఱనున్న ధాన్యమయిపోఁ గా, మిత్రుల దగ్గఱ నప్పుచేసి క్షుధార్తులను బోషించెను. శిబి, కర్ణ, దధీచుల కోవలోనివాఁడు వేంగళరెడ్డి.

బుడ్డా వేంగళరెడ్డిగారి తండ్రి నల్లపరెడ్డి. ఉయ్యాలవాడ గ్రామము వీరి స్వస్థలము. నల్లపరెడ్డిగారికి వేంగళరెడ్డి జ్యేష్ఠపుత్రుఁ డు. ఇతని తరువాత తిమ్మమ్మ యను కూఁతురును, ఈశ్వరరెడ్డి యను మఱియొక పుత్రుఁడును, సుబ్బమ్మయను వేఱొక పుత్రికయుఁ గలిగిరి. వేంగళరెడ్డిగారికి వెంకటమ్మ, చెన్నమ్మ యను నిరువురు భార్యలు కలరు. కాని వీరిలో నేయొక్కరికిని సంతానము గలుగలేదు (ఇప్పుడు ఉయ్యాలవాడ గ్రామములో నున్న బుడ్డా దస్తగిరిరెడ్డిగారును, శివారెడ్డిగారును వేంగళరెడ్డిగారి తమ్ముఁడగు నీశ్వరరెడ్డిగారి మనుమలు).

వేంగళరెడ్డిగారి ఇంటిపేరు పూర్వము 'మద్దెల' వారనియుండెడి దనియు, వేంగళరెడ్డిగారు గొప్ప దానపరుఁడై కీర్తిగడించిన తరువాత 'గొప్పవాఁడు వేంగళరెడ్డి' యను నర్థమున 'బడా వెంగళరెడ్డి' యని పిలువఁబడుచుండెననియు, నా 'బడా' శబ్దమే జానపదుల యుచ్చారణలో 'బుడ్డా'గా మాఱినదనియు రేనాటిలోఁ గొందఱు పెద్దలు చెప్పుచున్నారు. నారసింహారెడ్డి ఇంటిపేరు కూడ మద్దెలవారేయని యొక వీరగాథానికనుబట్టి తెలియుచున్నది. నారసింహారెడ్డి– బుడ్డా వేంగళరెడ్డి ఇరువురును పూర్వకాలమున నొకే వంశమువారు, జ్ఞాతులు కూడ. ఇరువురును మోటాటి రాజవంశీకులే. కాని నారసింహారెడ్డి తాత ముత్తాతల కాలమున నీ రాజ కుటుంబములు రెండుగాఁ జీలిపోయినవి. అప్పటి నుండియును వీరికిని వారికిని వైవాహిక సంబంధములు లేవు. ఆచార వ్యవహారములును భిన్నములైనవి. చిరకాలముగా వచ్చుచున్న మోటాటి రాజకుటుంబము 'నారసింహారెడ్డి గుంపు' అనియు 'కృష్ణారెడ్డి గుంపు' అనియు రెండుగా విడిపోయినది. బుడ్డా వేంగళరెడ్డిగారు కృష్ణారెడ్డి గుంపునకుఁ జెందిన మోటాటి రాచరెడ్డి.

బుడ్డా వేంగళరెడ్డిగారు చేసిన దానధర్మములపై నెన్నియో కథలు జనపదములలో వ్యాప్తియందున్నవి. అందుఁ గొన్ని కథలు మాత్రమే పాటలోఁ బేర్కొనఁబడినవి. ఈ పాటకు నేను కర్నూలు మండలమున మూఁడు ప్రతులను సేకరించితిని. నంద్యాలలో నొకటి, కోవెల కుంట్లలో మఱియొకటి, కాకరవాడలో వేఱొకటి. స్వల్ప భేదములు తప్ప నీ మూఁడును నొకేరకముగా నున్నవని చెప్పవచ్చును. వీని ప్రారంభమిట్లుండును:

***"ఉత్తరాది ఉయ్యాలవాడలో– ఉన్నది ధర్మం చూడరయా***
***నేటికి బుడ్డా యెంగళరెడ్డీ–దొడ్డ ప్రభువనీ తెలియరయా–***
***॥ఉత్తరాది॥"***

ఇది యీ పాటకుఁ బునరావృత్తి. వేంగళరెడ్డిగారి మూర్తి చిత్రణమంతయు నీ క్రింది పంక్తులలోఁ గాననగును:

***"దొడ్డ ప్రభువనీ దొరలు మెచ్చగా–ఇదుపున గూర్చో నుందునయా***
***ఇదుపున గూర్చో నెంగళరెడ్డీ–ఇకయిక నగుతా నుందునయా"***

ధాతకఱవులోఁ దమ ప్రాణములను నిలిపిన రేనాటి దానకర్ణునిఁ బ్రజలిట్లు దీవింతురు:-

*"దానం ధర్మం గ్యానం తెలిసీ- ధర్మరాజువలె ఏలెనయా*
*సచ్చిన బతికిన ఎంగళరెడ్డికి- సర్గలోకమే ఉన్నదయా ॥ఉత్తరాది॥*

*పుణ్యం చేసిన ఎంగళరెడ్డికి- పూలపానుపే ఉండునయా*
*మాటాసొచ్చం తెలిసిన ప్రభువని-మల్లెపూల పాన్పేతురయా"*
*॥ఉత్తరాది॥*

పుణ్యము చేసిన వేంగళరెడ్డిగారికి స్వర్గములో మల్లెపూలపాన్పు వేయుదురఁట. ఎంత చల్లని దీవెన! దీని తరువాత బ్రాహ్మణునకు ఎనుమును దానము చేసిన కథ చెప్పఁబడును. (ఆవును దానము చేసెనని కొన్ని కథలలోఁ గలదు.) వేసవిలో నొక బ్రాహ్మణుఁడు ఉయ్యాలవాడలో వెంగళరెడ్డిగారి యింటికి వచ్చి, మజ్జిగ దాహమిమ్మని కోరెను. రెడ్డిగారి చిన్నభార్య చెన్నమ్మగారు లేచుటకు బద్ధకించి 'మజ్జిగలేదు, పొందు' అనెను. ఈ మాటలు అరుగుమీఁదఁ గూర్చున్న వేంగళరెడ్డిగారికి వినఁబడినవి. ఆయన దిగ్గున లేచి, తిరిగిపోఁ బోవుచున్న బ్రాహ్మణునాపి, ఇంటిలోనికిఁబోయి కడవతీసి చూచెను. కడవనిండుగా మజ్జిగ యున్నది. లేదని చెప్పిన మజ్జిగను మరల నిచ్చినచోఁ బాపమని భావించి, ఆ బ్రాహ్మణుపకుఁ బంచభక్ష్య పరమాన్నములతో భోజనము పెట్టించెను. 'మజ్జిగ లేనిచో మన కీ యెనుమెందులకు?' అని భార్యతోఁ జెప్పి, పాడిగేదెను దూడను నా బ్రాహ్మణునకు దానము చేసెను. ఎవరైన నా బ్రాహ్మణుని 'ఈ యెనుమెక్కడిది?' యని ప్రశ్నించినచో, వెంగళరెడ్డిదని చెప్పవల దనియు, నట్లు చెప్పినచోఁ దాను ఋణపడియుండుననియు, నందుచే నా యెనుము దేవునిదని చెప్పవలసినదనియు వేంగళరెడ్డిగారు ఆ బ్రాహ్మణునిఁ గోరిరఁట. దాహమును దీర్చుకొనుటకై కొంచెము మజ్జిగ నడుగఁగా ఎనుమునే తోలి యిచ్చిన మహాదాత వేంగళరెడ్డి.

ఒకనాఁడొక ఫకీరుస్త్రీ వేంగళరెడ్డిగారింటికి భిక్షమునకై వచ్చెను. ఆమెకు వేంగళరెడ్డి యొక పట్టుచీరను దానము చేసెను. ఆ పట్టుచీర రెడ్డిగారి భార్యయగు చెన్నమ్మకుఁ బుట్టింటివారు పెట్టినది. పెరటిమార్గమునఁ జెన్నమ్మ వచ్చి, యా బిచ్చగత్తెకడనుండి చీరను లాగుకొనెను. అది వెంగళరెడ్డిగారికిఁ దెలిసి, బాధపడి, పట్టుదలతో సరిగా నట్టి చీరనే నేయించి ఆమెకు దానమిచ్చుటయే కాక, యా ఫకీరుస్త్రీకిఁ దోబుట్టువుకన్న మిన్నగాఁ జీరసారెలు పెట్టి సాఁగ నంపెనఁట.

వేంగళరెడ్డిగారు గుఱ్ఱమెక్కి చెన్నపట్టణములోనున్న రాణి కడకేఁ గెను. ఆ రాణి రెడ్డినిఁ జూచి ఏడువేల రూపాయలనిచ్చి దానము చేయుమని కోరెను. ఆ సభాప్రాంగణము దాటుసరికే యా ధనమంతయు వేంగళరెడ్డి దానము చేసివైచెను. అతని వితరణ శక్తికి విక్టోరియారాణి ఆశ్చర్యచకితయయ్యెను.

*"కురసీమిందా రాణెమ్మ తల్లీ- గుండెలావటిల నిలిసెనయా*
*వీడు ఎక్కడీ నరుడూ కాదూ- చక్రవర్తి యనుకున్నదయా-*
*॥ఉత్తరాది॥*

*కిలకిల కిలకిల రాణి నగీ-*
*ఎండి బంగరూ అచ్చు పారమూ- ఆగదంటనే పలికెనయా*
*కిలకిల కిలకిల రాణి నగీ-*
*రాణి బిళ్ల మెడకేసెనయా- రత్నాలదండ మెడకేసెనయా"*
*॥ఉత్తరాది॥*

అంతేకాదు. ఆ రాణి పండ్రెండు పుట్ల ధాన్యము పండెడి వేంగళరెడ్డిగారి పొలమునకుఁ బన్ను లేకుండఁ జేసెను. కాని వేంగళరెడ్డి రాఁబోవు కాలమెట్లుండునో యని సగము పన్ను కట్టెదనని చెప్పెను. అప్పటినుండి యకరమునకు మూఁడు కాసుల వంతునఁ బన్ను చెల్లించుచుండెను.

వేంగళరెడ్డిగారి దగ్గఱ మిక్కిలిగ బలిసిన చక్కని యెద్దొకటి యుండెను (ఈ యెద్దునే తరువాత అప్పలాపురము చెన్నారెడ్డి కొనెను). ఒకనాఁడు మాలమాదిగల పిల్లలు ఆటలాడుకొనుచు, బలిసియున్న వేంగళరెడ్డిగారి యెద్దును జూచి, ఆ యెద్దునిచ్చినచోఁ దమకుఁ బందుగ వెదలిపోవునని పల్కిరి. రెడ్డిగారి జీతగాండ్రా మాటలు విని కోపించి, ఆ పిల్లలవెంటఁబడి, తటిమి తటిమి కొట్టిరి. వేంగళరెడ్డి గారికీ విషయము తెలిసి, మాలమాదిగల పిల్లలందఱను రప్పించి, వారి దెబ్బలకుఁ జికిత్స చేయించి, వారికిఁ గడుపులనిండుగా భోజనములు పెట్టించి, ఆ యెద్దును వారికిఁ దోలించెను. (పాటతో నింతవఱకే యున్నది. కాని జనశ్రుతినిఁబట్టి చెప్పుకథలో నా మాల పిల్లల పెద్దలు వెంగళరెడ్డిగారి దగ్గఱకు వచ్చి, మరల నా యెద్దును దోలితెచ్చి, 'మహాప్రభో, పిల్లలు తెలియక తప్పుచేసిరి, క్షమింపుఁడు' అని బ్రతిమాలిరఁట. ఇదియే సమంజసముగాఁ దోచును.)

వెంగళరెడ్డిగారు ఎప్పుడును రాత్రులందే ప్రయాణములు చేయు చుండెడివారు. ఒకప్పుడు విరూపాక్షికిఁ బోఁదలఁచి బయలుదేరెను. నలుగురు 'గొరక దొంగలు' రెడ్డిగారినిఁ జంపుటకై యడ్డగించిరఁట. వేంగళరెడ్డిగారు 'నాయనా, మీరాఁకలిగొని యున్నారు. అన్నము తినిన తరువాత నన్నుఁ జంపుఁడు' అని యా దొంగల నింటికిఁరప్పించి, కడుపునిండుగా భోజనములు పెట్టి, పిమ్మట 'నన్నుఁ జంపుడు' అనెనఁట. దొంగలు నలుగురును ఆయన కాళ్లపైఁబడి, క్షమింపవేఁడిరి. ఆ దొంగల భార్యాపుత్రు లిండ్లకడ నెదురు చూచుచుందురని తలఁచి, నలుగురు దొంగలకును నాలుగు బియ్యపు మూటలు గాడిదలపై వేయించి, త్రోవ ఖర్చులిచ్చి, ఆ దొంగలను సాఁగనంపెను. గాంధీజీ పుట్టక పూర్వమే అహింసా సిద్ధాంతము నమలు జరిపిన మహానుభావుఁడు వేంగళరెడ్డిగారు.

ఒకనాఁడు రెడ్డిగారు పచ్చగుఱ్ఱము నెక్కి చెన్నంపల్లెకుఁ బోవుచుండెను. ఆ చెన్నంపల్లెలో వేంగళరెడ్డినిఁ జంపవలెనని కొందఱు

శత్రువులు మాటుపెట్టిరఁట. ఆ శత్రువుల యింటనున్న మాలవాఁడొకఁడు వచ్చి, ఆ విషయమును వేంగళరెడ్డిగారికి విన్నవించెను. ఆ మాలవానికిఁ దనయందుఁగల భక్తికి మెచ్చి, వానిని తనదగ్గఱనే యుంచుకొని, పెంచి పెద్దజేసి, వైభవోపేతముగా వానికిఁ బెండ్లిచేసెను. మూఁడు దినములు జరిపిన యా మాలవాని పెండ్లికి దానకర్ణుఁడగు వేంగళరెడ్డిగారు ప్రజలకెట్టి శాసనము చేసెనో చూడుఁడు:–

*"చుట్టూవుండే ఆమడ పొడుగూ–లోపల మూడూ దినముల వరకూ*
*కుండపెట్టి కూడొండిన వాడికి– జులుమానుందని పలికెనయా"*

ఉయ్యాలవాడ గ్రామమునకుఁ జుట్టుప్రక్కల నామడయేరలోఁగల గ్రామవాసులందఱును మూఁడు దినములపాటు తన ఇంటనే భోజనము చేయవలెనఁట. దీనినతిక్రమించి, స్వయముగా వంట చేసికొన్నవారికి జుల్మానా విధించునఁట.

ఒకప్పుడు వేంగళరెడ్డిగారు తమ చేలలోఁ గంకుల కోఁతకు మాల మాదిగలను బిలిచి 'కంకులన్నియును మీరు కోసికొని వట్టి చొప్పను నాకుఁబంపుడు' అని చెప్పెను. వారట్లు చేయఁగా, వేంగళరెడ్డిగారి బంధువులు కోపించి, ఆ మాలమాదిగలను బట్టుకొని కొట్టి చావడిలో బంధించిరి. అది వేంగళరెడ్డిగారికిఁ దెలిసి యెంత క్షోభించెనో చూడుఁడు:–

*"ఎవరు కొట్టిరో నా పిల్లలనూ– ఎవరు తిట్టిరో నా పిల్లలనూ*
*మూడునూర్లా దుడ్డుపోసీ– మందినెల్ల యిడిపించెనయా"*

ఈ వీరగాథానికలో వేంగళరెడ్డిగారి దాతృత్వము బ్రశంసించు కొన్ని కథలు మాత్రమే చెప్పఁబడినవి. ఇంకను ఎన్నియో కథలు వచన రూపమున జనపదములందు వృద్ధులచేఁ జెప్పఁబడుచున్నవి (ఇట్టి వచన కథలను నేను నలుబది వఱకును సంపాదించితిని). ఈ గాథానికలో మఱియొక విశేషమేమన, నిందుఁ గేవలము కథా కథనమే కాక, రసవంతమగు కవిత్వమును నుండుట. బలిసియున్న వెంగళరెడ్డిగారి కోడెను జూచి, ఆటలాడుచున్న మాలమాదిగల పిల్లలు తమలోఁ దాము భాషించుకొనుట చాల సహజముగా వర్ణింపఁబడినది:–

*"ఒరె మల్లుగా ఇటు చూడరా– ఒరె యెల్లుగా ఇటు చూడరా*
*ఎంగళరెడ్డివి ఈరయెద్దులూ– ఎంగళరెడ్డివి ఈరకోడెలూ*
*కాటుక కన్నుల కర్రెకోడెరా– కార్తిక మాసంలో రెడ్డి పట్టినదు*
*నాలుగుకాళ్లా మట్టమున్నదీ– నడినెత్తిన మరి సుక్క ఉన్నదీ*
*బిళ్లకొమ్ములా కర్రెకోడెరా– బిగువుకండలా ఈరకోడెరా*
*పందుంబియ్యం గిత్తయితే మా– పండగవుతదని పలికిరయా"*

ఈ యెద్దును మాలవాడలకుఁ దోలుచు వేంగళరెడ్డి మిక్కిలి దుఃఖించెను:–

*"ఏమీ ఎరగని యెద్దు గిత్తకూ– పుటిక మేతలే పెట్టెనయా*
*చెవులోననే ఎంగళరెడ్డి– 'నాయనా, ఓ బసవదేవుడా,*
*నీకూ నాకూ ఋణాలు దీరెను– మాలవాళ్ల ఇండ్లకు నీవు*
*ఒద్దేలి కట్టెకు పూజకెల్లమని చెప్పెనయా"*

వేంగళరెడ్డిగారి కీర్తి యెండకాసిన మండలమంతయుఁ బ్రాకిపోయెనఁట. 'ఎండగాసినా మండలానికీ– ఎరుకగలిగినా రెడ్డివయా'.– ఈ విధముగా నెవరైనను బొగడినచో వీథియరుగుపైఁ గూర్చొని వికవిక నవ్వుచుండెడివాఁడఁట వేంగళరెడ్డి. ఈయన చెంగావి పంచెలు సింగారించుకొని, గుఱ్ఱమెక్కి చెన్నపట్టణము పోఁగా, నా పట్టణములో సాహెబుదొరలు, ఇన్‌స్పెక్టర్లు, పోలీసు జవాన్లు వేంగళరెడ్డిగారికి 'సాబు సలాములు చేసిరయా, వొంగొంగి సలాములు చేసిరయా'. బుద్ధా వేంగళరెడ్డిగారు ఎన్ని రకముల దానములు చేసిరో తెలుపుచు నీ పాటలో నొకచో నిట్లున్నది:–

*"హరినారాయణ అన్నవారికీ– అన్నవస్త్రము లిప్పించెనయా*
*గోయిందాయని పాడే జనులకు– గోవుదానమే చేసెనయా*
*పాలులేని పసిబాలులకెల్లా– పాలచలేంద్రలు పెట్టెనయా*
*పెళ్లిళ్లు కానీ బీదజనులకూ– పెళ్లిళ్లే చేయించెనయా*
*కాలులేని కరమొండివాళ్లకూ– ఒంటెద్దు బళ్లు చేయించెనయా*
*కుంటివాళ్లకూ గుడ్డివాళ్లకూ– ఈడుజోడూ మనుములు చూసీ*
*పెళ్లిళ్లే చేయించెనయా*
*పుణ్యము చేసిన యెంగళరెడ్డికి– పూలపానుపే వచ్చునయా*
*మాటాసొచ్చము తెలిసిన ప్రభువని– మల్లెపూల పాన్పేతురయా!"*

ఉయ్యాలవాడలోఁగల వేంగళరెడ్డిగారి వంశమువారికడ నేఁటికిని నీ దాతృత్వగుణమున్నది.[29] ప్రతి సంవత్సరమును ఉగాది పండుగ నాఁడు వెంగళరెడ్డిగారి సమాధి దగ్గఱ కుంటి గ్రుడ్డివారికిఁ బంచభక్ష్య పరమాన్నములతో గొప్ప అన్నదానము జరుగును. ఈ యపూర్వమగు నన్నదానమును వేంగళరెడ్డిగారి వంశస్థులే నిర్వహింతురు. బస్తాలకొలఁది బియ్యమును వండి, అన్నమును రాసులుగాఁ బోయుదురు. దేశము నలుమూలల నుండియు వేలాదిగా బిచ్చగాండ్రు ఉయ్యాలవాడకుఁ జేరుదురు. ఈ బిచ్చగాండ్రందఱును భోజనము చేయుటకు ముందు వేంగళరెడ్డిగారికి రాణి యిచ్చిన స్వర్ణ పతకమును గన్నుల కద్దుకొందురు. గ్రుడ్డివారు సహితము పతకమును జేతులతోఁ దడిమి యా చేతులను గన్నుల కద్దుకొందురు. ఈ పని చేయకుండ నొక్క బిచ్చగాఁడైనను ముద్ద యెత్తఁడు. ఈ దానకర్ణుఁడు యశఃకాయుఁ డనుటలో నిఁక సందేహమేమున్నది?

వేంగళరెడ్డిగారు ఎప్పుడును పేదలకు అన్నదానమే చేసెడివారు కాని, ధనదానము చేసెడివారు కారు. మానవుని ప్రాణములను నిల్పునది పరబ్రహ్మ స్వరూపమగు అన్నమే యని యాయన నమ్మకము. అందుచేఁ బ్రాణాధారమగు అన్నమునే దానము

చేసెడివారు. ఒకవేళ, నెప్పుడైనను దబ్బిచ్చినచో నొక్క దమ్మిడీ మాత్రమే ఇచ్చెడివారు. అందుచే కొందఱు బిచ్చగాండ్రు **'బుడ్డా ఎంగళరెడ్డి దమ్డీ దమ్డీ, ఎన్నాళ్లు బ్రతికినా దమ్డీ దమ్డీ'** యని పాడెడివారు. వేంగళరెడ్డిగారి జీవితమంతయు సమగ్రముగాఁ జిత్రించుచు 'బందుమియ్య'యను ముస్లిముకవి చక్కని ద్విపదకావ్యమును రచించెను. ఈ బందుమియ్య బుడ్డా వేంగళరెడ్డిగారికి సమకాలికుఁ డని నేను భావించుచున్నాను.

దానపరురాలైన డొక్కా సీతమ్మగారిపైఁ గూడ నిట్టి కథాత్మక గేయమొకటి తూర్పు గోదావరీ మండలములోఁ బాడఁబడుచున్నదని తెలియుచున్నది.

## 5. జానపదములు

అద్భుతరస ప్రధానముగా జానపదులు కల్పించుకొనిన చిన్నచిన్న కథాత్మక గేయములును గలవు. ఇవి తరతరములనుండి పాడఁబడుచున్నవి. జానపదగేయ లక్షణము లన్నియు నిట్టివాని కుండును. కథాకథనము తప్ప జానపద గేయములకును వీనికిని భేదము లేదు. రసవంతమగు కవిత్వ విషయమున బొబ్బిలివరుస కథలకును హరిహరీ పదములకును నెంత భేదమున్నదో, చారిత్రక వీర మరణములపై నున్న గాథానికలకును, ఈ జానపద గాథానికలకును నంత భేదమున్నది. వీనిలో జానపదుల నుడికారము, సహజ వర్ణనలు, అభివర్ధిత పునరుక్తులు, వారానువర్తనములు కొల్లలుగా నుండును. వీనిని జానపదస్త్రీలు పొలములలోఁ బనిపాటులు చేసికొను నప్పుడును, వెన్నెలరాత్రులలో గుండ్రముగాఁ దిరుగుచుఁ, జప్పట్లు చఱచుచు చుట్టుకాముఁడు పాటలుగాను, జక్కికలుగాను, సంక్రాంతి పండుగ సమయమున గొబ్బిపాటలుగాను బాడుకొనుచుందురు. ఇట్టి వానిలోఁ గొలఁది మాత్రమే ముద్రితములైనవి. అముద్రితములుగా నెన్నియో గాథానికలు జనపదములలో మౌఖిక ప్రచారమున నున్నవి. ఇట్టి మౌఖిక గాథానికలను గొన్నింటిని నేను సంపాదించితిని. ఎఱ్ఱిపాప పాట, బత్తినన్న పదము, చాకలి దుదుమన్న పదము (లేక వీరనాగమ్మ పాట), వానదేవుని పాట (లేక అక్కెమ్మ పాట), భూపతిరాజు పదము, ఒలియ పాచ్చావు పదము, బొత్తుదుపాట, బ్రతుకమ్మ పాట– మున్నగునవి నేను సేకరించిన జానపద లఘువీరగాథలు. కథనముగల జానపదగేయము లన్నియు నీ వర్గమునకే చెందును. ఈ జానపద గాథానికలలోఁ జాలభాగము జంగములు పాడు సుదీర్ఘ గాథలకు సంక్షిప్త రూపములు. జంగములు పాడు బొబ్బిలిరాజు కథ, కామమ్మ కథ, లక్ష్మమ్మ కథ, కాంభోజరాజు కథ, పసలబాలుడు కథ మున్నగునవి విని, జానపదస్త్రీలు తమధోరణిలో వీని నూయల పదములుగాఁ, దుమ్మెద పదములుగా, వెన్నెల పదములుగా మలఁచుకొని పాడుకొనుచున్నారు. తెలంగాణములో నేఁడు పుట్టుచున్న బ్రతుకమ్మ పాటలలో సగమిట్టివే. ప్రసిద్ధమగు బొబ్బిలివరుస కథల నూయల పదములుగా మార్చినట్టివే.

### 5.1. ఎఱ్ఱిపాప పాట:–

ఇది చిత్తూరు మండలమున చంద్రగిరి తాలూకాలోని కొటాల గ్రామమున సేకరించిన పాట. తుమ్మెద పదము, సూర్యచంద్ర గ్రహణములపై జానపదులు కల్పించిన గాథ. ఏడుగురు రామన్నలు వేఁటకుఁబోయిరి. ఏడవవాఁడు  చిన్నరామన్న అడవిలో వెదురు బొంగును నఱికినాఁడు. అందులో నెఱ్ఱిపాప యున్నది. ఆమెనింటికిఁ దెచ్చి పెంచసాఁగిరి. ఒకప్పుడా యేడ్గురన్నదమ్ములును మరల వేఁటకుఁబోయిరి. ఎఱ్ఱిపాప నీలాటిరేవునకుఁ బోఁగా 'నాగులస్వామి' ఆమెను బలాత్కరించెను. ఆమెను నాగలోకమునకుఁ గొంపోయెను. అన్నలు వేఁటాడి ఇంటికివచ్చి, చెల్లెలు మాయమగుటచే నామెను వెదకికొనుచు నాగలోకము పోయిరి. నాగులస్వామినిఁ జంపి, ఎఱ్ఱిపాపను దోడితెచ్చుచుండిరి. అప్పటి కామె గర్భవతి. మార్గమధ్యమున నొక్కొక్క గ్రుడ్డే నేలఁబడుచుండెను. క్రిందఁబడిన గ్రుడ్డును వెనుక వచ్చుచున్న యన్నలు తమ కాళ్లతో రాచి నాశనము చేయుచుండిరి. ఒక్క గ్రుడ్డు మాత్రము నేల నెఱియలోఁబడి తప్పించుకొన్నది. దానినుండి నాగేంద్రుఁడు పుట్టి మేనమామలను గఱవఁబోయెను. వారు భయపడి సూర్యచంద్రుల మఱుఁగుఁ జొచ్చిరి. సూర్యచంద్రులా యన్నల కభయమిచ్చి, వారినిఁ గఱచు కాట్లు తమ్ముఁ గఱవమనిరి. నాగేంద్రుఁడు ఏడాది కొకమాఱు సూర్యచంద్రులను గఱచుచుండెను. సూర్యగ్రహణము, చంద్రగ్రహణము కలుగుటకు ఇదియే కారణము. ఈ గ్రహణములు పట్టినప్పుడు జనులు పచ్చపొలిని, ఎఱ్ఱిపొలిని జల్లుచుందురు. గ్రహణము పట్టినప్పుడు పసుపు కలిపిన అన్నమును జల్లుదురు. ఇది పచ్చపొలి. గ్రహణము విడిచినప్పుడు పసుపు సున్నము కలిపిన అన్నమును జల్లుదురు. ఇది యెఱ్ఱిపొలి. ఈ పాట ప్రారంభమిట్లుండును:–

**"ఏడుగూరూ రామన్నగోరూ – తుమ్మెదా**
**ఏడు కొండా లేటబోతారూ ,,**
**అమ్మ రాయే ననుగన్న తల్లీ ,,**
**సద్దికూడూ సాల బొయ్యమ్మా ,,**
**సద్దికూడూ సాల బోసిందో ,,**
**సల్లంగా దీవ నిచ్చిందో ,,**
**ఏడుమందీ రామన్నలేమీ ,,**
**ఏడుకొండా లేటాణ్ణి బొయిరీ ,,**
**కురచకురచా అడివీలు దాటీ ,,**
**నేలకురచా అడివీలు రామా తుమ్మెదా"**

ఈ గాథానికలోఁ గవిత్వము రసవంతముగా నుండుటయే కాక, వీరగాథా లక్షణములెన్నియో ఇందుఁ బ్రత్యక్షమగుచున్నవి.

'మాటలొచ్చూ మరి తప్పులొచ్చూ తుమ్మెదా, తప్పితేనూ తలకాయకొచ్చూ తుమ్మెదా' అను నుడికారములు, 'చెప్పితేనూ నరికేను రన్నా– చెప్పకున్నా నరికేను రన్నా', 'చెప్పితేను తెచ్చేనమ్మా– చెప్పకున్నా తెచ్చేనమ్మా'– మొదలగు వారానువర్తనములు పెక్కు కలవు. అభివర్ధిత పునరుక్తియుఁ బలుతావులందుఁ గాననగును. ఎఱ్ఱిపాప నీళ్లకుఁ బోవు వర్ణన చూడుఁడు:–

*"కట్లకట్లా కడవెత్తినాదో – తుమ్మెదా*
*బుజానా వుంచీనాదో ,,*
*బూజానా వుంచీనాదో ,,*
*మెట్లబాయికి నీళ్లాకు బోయే ,,*
*మెట్ల బాయికి నీళ్లాకు బోయే ,,*
*ఎంచి యేదూ మెట్లే దిగెనో ,,*
*ఎంచి యేదూ మెట్లే దిగెనో ,,*
*ఎంచకేదూ మెట్లే దిగెనో ,,*
*అల తోసీ నీళ్లే ముంచే ,,*
*అట్ట ఇట్టా సూసీనాదో– తుమ్మెదా"*

## 5.2. వానదేవుని పాట:–

దీనిని 'అక్కెమ్మపాట' యనియుఁ బిలుతురు. జానపద గాథానికలలో నిది మిక్కిలి వ్యాప్తియందున్న పాట. ఇది యాంధ్ర దేశమంతటను వ్యాప్తియందున్న పాటగాఁ దోఁచుచున్నది. దీనిని నేను కర్నూలు మండలమున సంపాదించితిని. 'అక్కెమ్మ' యను నామము జానపద సాహిత్యమునఁ దఱచుగా వినఁబడుచుండును. కామేశ్వరియే ఈ యక్కెమ్మ కాఁబోలును. రాయలసీమలో కడప మండలమున 'అక్కలదేవత కొండ' కలదు. ఈ ప్రాంతమున జానపద స్త్రీలు వెన్నెలలోఁ బాడు పాటలను 'జక్కిక' లందురు. జక్కులవాంధ్ర పాటలే ఈ పేరును ధరించియుండును. లేదా అక్కలదేవినిగూర్చిన పాట 'అక్కిక' యయి, క్రమముగా నదియే 'జక్కిక'గా మాఱి యుండును. ఏది యేమైనను, నీ వానదేవుని పాటలోని అక్కెమ్మకును కామేశ్వరికథలోని అక్కలకును ఏవిధమగు సంబంధమును లేదు. ఆ పాట వేఱు, ఈ పాట వేఱు. వానదేవునిపాట లేక అక్కెమ్మపాట జానపదుల కల్పనవలె నున్నది. వెనుక చెప్పిన యెఱ్ఱిపాపపాట సూర్యచంద్రుల గ్రహణములకుఁ గల్పన కాఁగా, నీ వానదేవునిపాట ఉఱుములకు మెఱపులకుఁ జేపిన కల్పన.

భీమన్న అచ్చమ్మ యను దంపతుల కేడ్గురు పుత్రుల వెనుక అక్కెమ్మ పుట్టినది. ఈమె దుష్ట నక్షత్రమునఁ బుట్టుటచే నూరిబయట మేడకట్టి యందుంచిరి. ఆమెకడ లక్షల కొలఁది చిలుకలు, హంసలు నుండెను. వానిమేఁతలకై యామె యొకప్పుడు తన యన్నలు వేసిన యెఱ్ఱజొన్నచేను కడకుఁ బోయి తిరిగి వచ్చుచుండెను. దారిలో వానదేవుఁడు 'చేటంత మొగిలొడ్డి చెఱువు కుంటలు నించెను'. అక్కెమ్మ అమాయకముగా 'ఇప్పుడొచ్చిన వానదేవ, మాపటికి రాకూడదా?' అన్నది. వాన తగ్గిపోయినది. ఆ రాత్రి వానదేవుఁడు అక్కెమ్మ మేడకు వచ్చెను. ఆ ముగ్ధ ఆశ్చర్యపోయినది. ఇరువురును గలిసి రెండు నెలలు ఆ మేడలో సుఖముగా నుండిరి. ఇంతలో వానదేవుని పట్టణమున వర్షములు లేక కఱవు వచ్చెను. ఆ పట్టణములోని ఒక 'తెలుగమ్మ' (పల్లె స్త్రీ) వచ్చి, వానదేవునిఁ దన మేడలో నిలుపుకొన్నందులకు అక్కెమ్మను దూషించెను. అందుచే నక్కెమ్మ వానదేవునిఁ బంపివేసెను. మూఁడు నెలలకుఁ దాను దిరిగి వచ్చెదననియు, నీలోపున నామెకు మూఁడు నెలలు పోతపోసిన అవికను బహుమతిగాఁ బంపెదననియుఁ జెప్పి వానదేవుఁడు వెడలిపోయెను.

వానదేవుఁడు తన పట్టణమునకుఁబోయి, మూఁడు నెలలు పోతపోసిన అవికను అక్కెమ్మకుఁ బంపుచుండఁగా నతని భార్య చూచి, మాత్సర్యముచే రహస్యముగా నా అవిక నపహరించి, దానికి బదులుగాఁ బల్లేరు కాయలు గ్రుచ్చియున్న వేఱొక అవికను బంపెను. అక్కెమ్మ ప్రియుఁడు కానుకఁ బంపెనను నుత్సాహముతో స్నానము చేసి యా అవికను ధరించినది. పల్లేరుకాయలు గ్రుచ్చుకొనఁగా విపరీతమగు బాధపడి, వానదేవుఁడు తన్ను మోసగించెనని అతనిని దూషించినది. పల్లేరుకాయల బాధతో 'నబ్బా' యని కన్నులు మూసికొన్నది. మూఁడు నెలల యనంతరము వానదేవుఁడు వచ్చినాఁడు. ఎంత బ్రతిమాలినను అక్కెమ్మ పలుకలేదు, మూసిన కన్నులు తెఱవను లేదు. వానదేవున కర్థము కాలేదు. తన భార్య చేసిన మోసమాతనికిఁ దెలియదు. అక్కెమ్మ నెట్లైనను మాటాడించవలెనని పట్టుపట్టెను. ఆమె యున్న దేశమున గొప్ప క్షామమును సృజించెను. ఆ క్షామకాలమున అక్కెమ్మ తల్లియగు అచ్చమ్మ, కూఁతురితోఁ గలిసి వానదేవుని పట్టణమునకు వెడలెను. అక్కడ వానదేవుఁడు అక్కెమ్మ ననేక విధములఁ బరీక్షించెను. అయినను నామె కన్నులు తెఱవలేదు. వానదేవునితోఁ బెదవివిప్పి మాటాడలేదు. అచ్చమ్మ తన కూతురి నట వదలి వచ్చివేసెను. వానదేవుని తల్లి అక్కెమ్మకు జడవేయుచు నామె వానదేవునితో మాటలాడకపోవుటకుఁ గల కారణమడిగెను. అక్కెమ్మ జరిగిన విషయమంతయును పూసగ్రుచ్చినట్లు చెప్పెను. ప్రక్కనే దాగియుండి, ఆమె చెప్పుచున్న విషయమంతయు వినుచున్న వానదేవుఁడు హఠాత్తుగా అక్కెమ్మ చెఱఁగుఁ బట్టుకొనఁబోయెను. కాని అక్కెమ్మ అతనికిఁ జిక్కక మెఱపుగా మాఱిపోయెను. వానదేవుఁడు ఊరకొనలేదు. తాను ఉఱుముగా మాఱి అక్కెమ్మను నేఁటికినిఁ దఱుముచునే యున్నాఁడు.

ఎఱ్ఱిపాపపాటవలెనే ఈ వానదేవునిపాటయు సిసలైన జానపద లక్షణములుగల గేయము. ఇందుఁ దెలుఁగు నుడికారము తొణికిసలాడుచున్నది. ఖండగతిలో సాఁగినది. పది మాత్రల తరువాత విఱుపు. ఆ విఱుపు దగ్గఱ నొకమాఱు, పాదాంతమున వేఱొకమాఱు 'రామోజీ రామ' యను పునరావృత్తి వచ్చును. దీని ప్రారంభ మిట్లుండును:–

"ఒకఊరి పట్నాన రామోజి రామ-ఒకరాజు భీమన్న రామోజిరామ
భీమన్న పెండ్లాము ,, అచ్చమ్మ గలదమ్మ ,,
సక్కన్ని భీమనకు ,, ఎందారు కొడుకులూ ,,
ఎందారొ ఎక్కడిది ,, ఏడుమంది కొడుకులే ,,
ఏడుగురికి ఎనకనే ,, అక్కెమ్మ జలిమించె" ,,

వానదేవుఁడు అవికను బంపఁగా అక్కెమ్మ సంతోషముతో స్నానము చేసి ముస్తాబగుట జానపద ధోరణిలో నతిరమణీయముగ వర్ణింపఁబడినది. జానపదగేయములలోను వీరగాథలలోను నిట్టి వర్ణనలు చాలఁదఱచుగ వచ్చుచుండును. ఇది యొక వారాను వర్తనము.

"ఎండి కళాయిలోరామోజిరామ- ఎలనీళ్లు గాసింది రామోజిరామ
పైడి కళాయిలో ,, పాట్లయిన జేసింది ,,
తూరూపు గుండెక్కి ,, తూలిడిచె తలకురులు ,,
పరమటీ గుండెక్కి ,, పాలిడిచె తలకురులు ,,
జాలాటి బండెక్కి ,, జలకంబు లాడింది ,,
రవరవా గాలికీ ,, ఆర్పింది తలకురులు ,,
ఎండి సిక్కెటతోను ,, ఎలసిక్కు దీసింది ,,
పయిడి దువ్వేనతో ,, పాపిడిలు దీసింది ,,
తన పాది ఏళ్లాతో ,, కొప్పైన కట్టింది ,,
పట్టావి సీరెల్లు ,, కట్టెనే అక్కెమ్మ ,,
వానదేవుని రయిక ,, తొడిగెనే అక్కెమ్మ ,,
అన్ని సొమ్ములు పెట్టి ,, అద్దములొ సూసింది ,,
అద్దములొ అక్కెమ్మ ,, దిద్దినట్టున్నాది" ,,

## 5.3. భూపతిరాజు పదము:

ఇది కూడ జానపద గాథానికయే. ఇది ఊయల పదము. భూపతిరాజు పుత్రిక అక్కెమ్మ; పుత్రుఁడు రామన్న; కోడలు సిరిదేవి. ఈ సిరిదేవి అక్కెమ్మపై దోషారోపణము చేసి, భర్తచే నామెను జంపించెను. రామన్న తన చెల్లెలి నరణ్యమునకుఁ గొంపోయి చంపును. అట దేవాలయమును కోనేరును ఏర్పడెను. అక్కెమ్మ తన భర్తయగు భీమన్నకలలోఁ గనఁబడి అన్నయగు రామన్న తన్నుఁ జంపెనని చెప్పినది. భీమన్న వచ్చి భార్య చనిపోయినచోట మంటలోఁ బడి ఆత్మాహుతి చేసికొనెను. వీరగాథలలోని వారానువర్తనమొకటి ఈ పాటలోఁ గానవచ్చుచున్నది. హత్య చేయఁబడినచోట హతుని చేతులు చెఱకుతోట లాయెననుట, కాళ్లు అరఁటిబోదె లాయెననుట సాధారణము. అక్కెమ్మను జంపినచోట నామె అవయవములెట్లు మారెనో చూడుఁడు:-

"అక్కెమ్మ దొక్కనే ఉయ్యాలో - కోనేరు వాయెనే ఉయ్యాలా
అక్కెమ్మ సేతులు ,, సెరుకు తోటాలాయె ,,
అక్కెమ్మ కాళ్లైన ,, అరటి మాకూలాయె ,,
అక్కెమ్మ పేగులూ ,, మల్లె తీగాలాయె ,,
అక్కెమ్మ శిరసునే ,, దేవళము ఆయెనే ,,
అక్కెమ్మ కన్నులూ ,, పావురాలాయెనే" ,,

సరిగా నిట్టి వర్ణనమే 'అంజమ్మ కథ' యను పేరంటాలు కథలోఁ గూడ నున్నది.

## 5.4. బత్తినన్న పదము:-

కర్నూలు మండలమున 'బత్తినన్న పదము' అను జానపద గాథానిక లభించినది. 'భక్తిరన్న' శబ్దమే జానపదులలో 'బత్తినన్న'గా వికృతి చెందినది. అయినను కాటమరాజు కథాచక్రములోని భక్తిరన్న కథకును దీనికిని సంబంధము లేదు. ఈ గాథానికలో 'భక్తిరన్న' 'ఆవులన్న' యను పేర్లు మాత్రము గలవు. ఈ పేర్లతో జానపదు లీ కథను గల్పించియుందురు. బత్తినన్న నీలాటి రేవులో స్నానము చేసి వెడలఁగా, రేపల్లెలోని రెడ్డిసాని యను స్త్రీ ఆ రేవునకు వచ్చి, బత్తినన్న తలవెంట్రుక యటనుండుటఁ జూచి, యాతనిని మోహించెను. ఆ రోజు రెడ్డిసాని ఆవులన్న కడకుఁ బోయి, రాత్రివేళ తాను బత్తినన్నకొఱకు ఆవులదొడ్డికి వత్తుననియుఁ, దన్నుఁ బులియని భావించి బాణములతోఁ గొట్టవలదనియు, బత్తినన్నకీ విషయముఁ దెలియఁజేయుమనియుఁ దెల్పెను. ఆవులన్న యంగీకరించెను. కాని బత్తినన్నతోఁ జెప్పుట మఱచిపోయెను. రాత్రియగుసరికి రెడ్డిసాని యలంకరించుకొని, పులివన్నె చీరకట్టి, నెమలివన్నె అవికతొడిగి, ఆవులదొడ్డి కడకు వచ్చి గోడదుమికెను. ఆవులు బెదరెను. పులివచ్చినదని తలఁచి గొల్లలు బాణములను విడిచిరి. రెడ్డిసానికి బాణము తగిలి పడిపోయినది. బత్తినన్న ఆమెను జూచి చింతించి, యామె నెత్తుకొని యింటికిఁ దెచ్చెను. ఆవుల దొడ్డిలోఁ గలియావుకొమ్ము తగిలినదని రెడ్డిసాని భర్తతోఁ జెప్పెను. ఆమె చనిపోయినది. ఆమె కాష్ఠము కాలుచుండఁగా బత్తినన్న కూడ నందు దుమికి ప్రాణత్యాగము గావించెను. బత్తినన్నను జూచి ఆవులును జిచ్చుఱికినవి. ఇది తందాన వరుసలో నున్న చక్కని పదము. దీనిని బొలములలోఁ బనిపాటులందు స్త్రీలు పాడుచున్నారు. దీని ప్రారంభ మిట్లుండును:-

"తందన్నా రామరామ తందన్నా రామరామ - తందన్నా
రేపల్లె రెడ్డిసాని- నీళ్లాకూ వచ్చినాది ,,
బంగారీ బిందెల్లూ- భామారో సేతబట్టె ,,
ఎండీవీ బిందెల్లూ- ఎలదీరో సేతబట్టె ,,
ఇరుగు పొరుగు అమ్మలార- నీళ్లాకూ వస్తారా ,,
ఇప్పుడే తెచ్చినాము- ఇవిగొ నమ్మ సుట్టల్లూ తందన్నా"

ఇందలి రసవంతమగు కవిత్వమున కుదాహరణముగా రేపల్లె రెడ్డిసాని బత్తినన్నన కడకుఁబోవుటకై యలంకరించుకొను సన్నివేశమును జెప్పవచ్చును. స్త్రీలు స్నానమాడి యలంకరించుకొను

ఘట్టము ప్రతిగాథానికలోను నొకేవిధముగా నుండును. ఇది వీరగాథల వారానువర్తన లక్షణములలో నొకటి. వెండికుండలలో వేణ్ణీళ్లు కాచుకొనుట, పైడి కుండలలోఁ జన్నీళ్లు పోసికొనుట, వేణ్ణీళ్లను చన్నీళ్లను నేకము చేయుట, జాలారు బండెక్కి జలకంబులాడుట, తూరుపు బండెక్కి తలకురులు తూలించుట, రవరవ గాలికిఁ దలకురు లార్చుకొనుట, వెండిచిక్కట్టుతోఁ జిక్కు తీసికొనుట, పైడిదువ్వెనతోఁ బాపిడులు తీసికొనుట సాధారణముగా వర్ణింపఁబడు నంశములు. రెడ్డిసాని ఈ పనులన్నియు జేసినది. అంతేకాక–

**"కాయల్ల కాటుకలు కండ్లకే పెట్టింది** *తందన్నా*
**బరిణల్లొ కుంకుమలు నొష్టకే పెట్టింది** ,,
**పులివొన్నె సీరగట్టి నెమిలొన్నె రైక దొడిగె** ,,
**నెమిలొన్నె సీరగట్టి పులివొన్నె రైక దొడిగె** ,,
**అన్ని సొమ్ములు పెట్టి అద్దములొ సూసింది** ,,
**అద్దములొ రెడ్డిసాని దిద్దినట్టున్నాది** *తందన్నా"*

### 5.5. చాకలి దుడుమన్న పదము లేక వీరనాగమ్మ పాట:–

ఇది సాంఘిక సంఘటనయే కల్పనలు పెంచుకొని జానపద మైనదాయని యనిపించునట్టి పాట. వీరనాగమ్మయుఁ జాకలి దుడుమన్నయు దేవుని వరమునఁ బుట్టిరఁట. వీరనాగమ్మ యత్తగారును తోడికోడండ్రును ఆమెకు దుడుమన్నతో అంకుఁగట్టగా వీరనాగమ్మ భర్త దుడుమన్నను జంపెను. నాగమ్మ కూడఁ బ్రాణములు వదలెను. ఇరువురును గైలాసమేఁగిరి.

### 5.6. 'ఒలియ పాచ్చావు' పదము:–

ఇది శ్రీయాళుని చరిత్రకుఁ బ్రతిబింబము. జంగము వేషమున వచ్చిన శివునకుఁ బుత్రునిఁ జంపి కూరవండిపెట్టుట ఇందలి కథ. చిఱుతొండని పేరునకు బదులు 'శాలి పాచ్చావు' పేరును, శ్రీయాళునకు బదులు 'శ్రీ బాలకృష్ణయ్య' పేరును నిందుఁ గలవు.

### 5.7. 'బొత్తుఁడు పాట':–

ఇది చిత్తూరు మండలమునఁ బూసల బలిజలు పాడు గాథానిక. అమాయకుఁడైన బొత్తుని, అతని భార్య, కాళింగి మడుగులోని పూలుతెమ్మని మభ్యపెట్టి చంపుట ఇందలి ఇతివృత్తము.

### 5.8. బ్రతుకమ్మ పాట:–

విష్ణుమూర్తి బ్రతుకయ్య; లక్ష్మీదేవి బ్రతుకమ్మ. ఈ బ్రతుకమ్మ పుట్టుకనుగూర్చి భట్టు నరసింహకవి వ్రాసిన చందమామ పదమొకటి వ్యాప్తియందున్నది (చూ. పల్లె పదాలు, పుట 115). దీనిని 'బ్రతుకమ్మ పాట' యందురు. ఇట్లు బ్రతుకమ్మనుగూర్చి చెప్పు పాటలే మొదట బ్రతుకమ్మ పాటలని వ్యవహరింపఁబడుచుండెడివి. ఇవి సాధారణముగా ద్విపద, మంజరీ ద్విపద, ఖండగతులలో సాఁగుచుండును. ఇందు 'ఉయ్యాలో', 'వలలో' 'చందమామా' యను పునరావృత్తు లుండును. కాలక్రమమున నితివృత్తము బ్రతుకమ్మను గూర్చియుండకపోయినను, పై పునరావృత్తులున్న పాటలన్నియు బ్రతుకమ్మ పాటలుగాఁ జెలామణి కాసాఁగినవి. ఇది అతి వ్యాప్తిదోషము. సాంప్రదాయికములైన పురాణములను వీరగాథలను ననుకరించు పాటలును, రాజకీయ ప్రబోధములైన ఇతివృత్తములు గల పాటలును 'ఉయ్యాలో' యను పునరావృత్తితో వ్రాయఁబడి, 'బ్రతుకమ్మ పాటలు'గాఁ దెలంగాణమున వ్యవహరింపఁబడుచున్నవి. కాని నిజమునకు బ్రతుకమ్మనుగూర్చిన పాటలు మాత్రమే జానపద వర్గమునకుఁ జెందును. వేపూరి బ్రతుకమ్మ పాట (కుశలవుల కథ), బాలనాగమ్మ బ్రతుకమ్మ పాట ప్రాచీనమైనవి. దమయంతిపాట, శకుంతలపాట మున్నగు పౌరాణిపు బ్రతుకమ్మ పాటలును, సాంఘికములు రాజకీయ సంబంధములు నగు బ్రతుకమ్మ పాటలును గలవు. కాని ఇవి యన్నియును సాంప్రదాయికముగా వచ్చుచున్న బ్రతుకమ్మ పాటల కనుకరణములు మాత్రమే. వీని నసంఖ్యాకముగా ముద్రించుచున్నారే కాని, వీనికి మౌఖికప్రచార మున్నట్లు నిదర్శనములు లేవు.

## 6. పౌరాణికములు

రామాయణమునుండియు, నితర పురాణములనుండియుఁ గొన్ని ఘట్టములు గ్రహింపఁబడి, చిన్న చిన్న కథాగేయములుగా జానపదస్త్రీలచేఁ బొలములలోఁ బాడఁబడుచున్నవి. రాములపాట, సీతమ్మచెఱ, గరుటపచ్చిపాట, అశోకవనము, ముద్దుటుంగరము, లక్ష్మణమూర్ఛ, సీతపాట లేక కుశలవుల పుట్టుక, మాయలేడిపాట, హనుమద్దాసు రచించిన వేపూరి బ్రతుకమ్మ పాట మున్నగునవి రామాయణమునకు సంబంధించిన గాథానికలు. మంగమ్మపాట, తురక బూబమ్మ పాట, జాలోరిగంగ, పెన్నోబళేశుని పెండ్లిపాట, చెంచీతపాట మున్నగునవి ఇతర పురాణ సంబంధములగు గాథానికలు.

జానపద గాథానికలోవలెనే పౌరాణిక గాథానికలలోఁగూడఁ జక్కని కవిత్వము కాననగును. జానపదుల యద్భుత కల్పనలు, నుడికారములు, పలుకుబడులు, సామెతలు సహజవర్ణనలు కొల్లలుగా నుండును. మూల పురాణకథలకును వీనికిని సంబంధము తక్కువ. ఇందుఁ బురాణపురుషులు కూడ సాధారణ జానపదులవలెనే చిత్రింపఁబడుదురు. కొన్ని అమూలకములగు కల్పనలచే నిందలి పాత్రలత్యద్భుతముగా నుండును. రామాయణ సంబంధమగు పాటలలో నిట్టి కల్పనలు హెచ్చుగా నున్నవి.

### 6.1. 'రాముల పాట':–

దీనిలో సీతారామలక్ష్మణులు అరణ్యమునకేఁగు కథ చెప్పఁబడినది. ఇందు లక్ష్మణుఁడు తన భార్య ఊర్మిళతో **'బావ నడిచిన**

**బాట బదులు నడవా రాదు ఇక్కణ్ణే ఉండుమనెను'**. ఎంత చెప్పినను ఆమె వినలేదు. అప్పుడు లక్ష్మణుఁడు 'గోరంత యాబూది' తీసి మంత్రించి యామెపైఁ జల్లెనఁట. ఊర్మిళాదేవి నిద్రలో మునిఁగిపోయెను. ఆమెకు 'వీపున విల్లెలు, ఎదన ఎదరు గుమ్ములు, నెత్తిన పుట్టలు' పెరిగినవఁట. ముక్కులలో గిజిగాళ్లు గ్రుడ్లుపెట్టసాఁగెనఁట. ఇదంతయును అమూలకమగు కల్పనయే. ఇట్టి కల్పనలు తక్కిన పాటలలోఁ గూడఁ గలవు.

## 6.2. 'సీతమ్మ చెఱ':–

'సీతమ్మ చెఱ' యను పాటలో మాయలేడినిఁ జూచి సీత 'దానిని జంపి, దాని తోలుతో నాకు అవికలు తెమ్ము' అని రామునిఁ గోరును. సీతను రావణుఁడు ముట్టుకొనలేదు. గడ్డపాఱతో సీత నిలుచున్న గడ్డను బెల్లగించి, ఆ గడ్డతోసహా సీతను దనరథములోఁ బెట్టుకొనును. సీత ఆకాశమునఁబోవుచు **'వొంగొంగి వరిమళ్లు కోసేటి అమ్మలారా, సీత చెరబోయెనని శ్రీరాములకు దెలుపండి'** అని కోరినదఁట. ఈ పాటను వరిమళ్లలో స్త్రీలు పాడుచుందురు కావున నా స్త్రీలు తమకుఁగూడ నీ పాటలోఁ బ్రవేశమును గల్పించు కొనినారు. రావణుఁడు సీత సౌందర్యమును బొగడుచు **'నావైపు చూచి నవ్వనైనను నవ్వుము'** అనఁగా, సీత అతనిని **'అన్నా'** అని సంబోధించుచు **'మా వదిన మండోదరి నవ్వదా?'** అని రావణునకు బుద్ధిగఱపఁ బ్రయత్నించును. ఇది జానపదుల లోకోత్తర భావనాశక్తికి మచ్చుతునుక. ఇది అమూలకము. అయినను రసవంతము.

*రావణుఁడు:* ***"కాటుకెంతా నలుపు–కన్నులెంతా తెలుపు***
***సుందారి నీ నడుము తొలుకారి మెరుపు***
***నా తట్టు సూడవే నగనన్న నగవే?***
***మూసిన్న కన్నులూ తెరసింది జూడవే?"***

*సీత:* ***"నేనేడ జూనేను అన్నరో రావణుడ***
***మా వొదిన మండువా సూడదా ఓయన్న***
***నేనేడ నగేను అన్నరో రావణుడ***
***మా వొదిన మండువా నగదా ఓయన్న"*** [30]

## 6.3. 'సీతపాట':–

'సీతపాట' యను కుశలవుల పుట్టుక యంతయుఁ గల్పనయే. అసలు, ఉత్తర రామాయణమే కల్పన యందురు. దానికి జానపదులు మఱికొన్ని కల్పనలఁ జేర్చిరి. దీని ప్రకారము సీతకొక్కఁడే బాలుఁడు పుట్టెను. ఆ బాలుని తొట్టెలోనుంచి, అంధుఁడైన తండ్రి జనకు నా తొట్టెకుఁ గావలియుంచి, యేటికి నీళ్లకుఁ బోవుచుండెను. దారిలో నొక చెట్టుపైఁగల కోతిపిల్లలను జూచి, సీత తన కుమారునిపై మరులుగొని, వెంటనే ఇంటికి వచ్చి బాలునెత్తుకొని యేటికిఁ బోయెను. గ్రుడ్డివాఁడైన జనకుఁడిది గమనింపలేదు. సీతయును జెప్పలేదు. సీత యేటికిఁబోయిన తరువాత నతఁడు తొట్టి తడవి చూచెను. అందు బాలుఁడు లేడు. సీతవచ్చి దుఃఖించునని భయపడి మట్టితో నొక బాలుని సృష్టించి, ప్రాణమును బోసి, యా తొట్టెలోఁ బరుండఁబెట్టెను. ఇంతలో సీత బాలునిఁ జంకఁ బెట్టుకొని యేటి నుండి తిరిగి వచ్చినది. తొట్టెలో వేఱొక బాలుఁడుండుట చూచి సీత ఆశ్చర్యపడెను. 'నా బాలుడేమోను నా సంకనున్నాడు. ఇది యెవరి కూసిలన్నా?' అని తండ్రినిఁ బ్రశ్నించినది. దీనికి జనకుఁడెంత గొప్పగా సమాధానమిచ్చెనో చూడుఁడు: **'నొప్పులకు నోయిలకు–తొలుగలేనీ తల్లి– ఇద్దర్ని కన్నవమ్మా'.** ఇందు జనకునకుఁ గూఁతురుపైఁగల యనురాగము హాస్యరస గర్భితముగాఁ దెలుపఁబడినది. ఇది యపూర్వమగు కల్పన.

## 6.4. రామలక్ష్మణ సంవాదము:–

ఇట్లీ పురాణగాథానికలలో నమూలకములగు కల్పనలే కాక, జానపద వాతావరణ చిత్రణముగూడ నత్యద్భుతముగా నుండును. వీనిలోని పాత్రలు సామాన్యుల కందరాని యున్నత పురుషులుగాఁ గాక, జానపదులవలెనే చిత్రింపఁబడుదురు. అడవికిఁబోవు సీతా రాములవెంట లక్ష్మణుఁడుకూడ పయనముకాఁగా, వారా లక్ష్మణునిఁ దమతో రావలదని నిరుత్సాహపఱచుట, అతఁడు వారి ప్రశ్నలన్నింటికిని సరియగు సమాధానములిచ్చి, వెనువెంటనే పోవుట, చమత్కారముగా జానపద ధోరణిలో వర్ణింపఁబడినది. ఇందు మొదటి పాదము రాముని ప్రశ్న, రెండవ పాదము లక్ష్మణుని జవాబు:–

***"మాయెంట వొచ్చేవు–మంచినీళ్లడిగేవు–మేమేడ దెత్తుమనెనూ***
***మనముండె కోనలో–మంచినీళ్లా చెలిమె– ఓయన్న అడుగనేలా?***

***మాయెంట వొచ్చేవు– సన్నబియ్యమడిగేవు– మేమేడ దెత్తుమనెనూ***
***సన్నబియ్యముకన్న– ఎదురు బియ్యమె మేలు– ఓయన్న అడుగనేలా?***

***మాయెంట వొచ్చేవు–ఆవునెయ్యడిగేవు–మేమేడ దెత్తుమనెనూ***
***ఆవునేతులకన్న– జుంటితేనెలు మేలు– ఓయన్న అడుగనేలా?***

***మాయెంట వొచ్చేవు–పట్టుధోవతులడిగేవు–మేమేడ దెత్తుమనెనూ***
***పట్టుధోవతులకన్న– నారబట్టలు మేలు– ఓయన్న అడుగనేలా?***

***మాయెంట వొచ్చేవు–పట్టిమంచమడిగేవు–మేమేడ దెత్తుమనెనూ***
***పట్టిమంచముకన్న– పరుపుబండలు మేలు– ఓయన్న అడుగనేలా?***

***మాయెంట వొచ్చేవు–గద్దెపీటలడిగేవు–మేమేడ దెత్తుమనెనూ***
***గద్దెపీటలకన్న– గజ్జిగుండ్లే మేలు– ఓయన్న అడుగనేలా?"*** [31]

## 6.5. శ్రీ వేంకటేశ్వరుని పాటలు:–

చిత్తూరు మండలమునఁ బూసల బలిజలు అను గాథాకారులు 'ఎంకటేశుని కత' యను దానిని బొబ్బిలికథ వరుసలో మూఁడు రాత్రుల కథగాఁ బాడుచున్నారు (ఈ కథను గూర్చిన వివరములకు

'బొబ్బిలివరుస కథ' లను పదమూఁడవ ప్రకరణమున జూడుఁడు). దీనిని జానపద స్త్రీలు విని, తమ ధోరణిలోఁ బాటగాఁ గట్టి, గొబ్బివరుసలోఁ బాడుచున్నారు. మూఁడు రాత్రుల కథను మూఁడు చిన్న చిన్న పాటలుగా మలఁచు కొన్నారు. వేంకటేశ్వరుని పుట్టుక యొక పాట, మంగమ్మ పెండ్లి మఱియొక పాట, తురక బూబమ్మ పెండ్లి వేఱొక పాట. ఇందు మంగమ్మ పాటలో నాదిలక్ష్మి యవతారమగు నలివేలుమంగ సాధారణ జానపద స్త్రీవలెనే చిత్రింపఁ బడినది. ఆమె ప్రొద్దునలేచి పాచిపనులు చేసికొని వంటవండుట, వేంకటేశ్వరుఁడు భోజనము చేయుట, అతి సహజముగా వర్ణింపఁ బడినది. జానపదులు తమకుఁ బరిచితమగు జీవన విధానమునే తాము సృష్టించిన దైవములకును నాపాదింతురని చెప్పవచ్చును. అలివేలు మంగమ్మ–

*"పొద్దుపొద్దున లేచి పొద్దున్నె లేచి–పగడాల పొరకెత్తి పైచెత్త తోసి*
*ముత్యాల పొరకెత్తి మునిచెత్త తోసి– కస్తూరి కల్లాపు కలుజిలకరిచ్చి*
*ముత్యాల ఒక ముగ్గు మూలేరిపించి– రత్నాల ఒక ముగ్గు రంగేరిపించి*
*పంచెవన్నెల ముగ్గు మించమరబోసి– బంగారు బిందెత్తి బూజాన బెట్టి*
*ఎఱ్ఱగుంటా నీళ్లు ఎయికడవ దెచ్చి– పచ్చగుంటా నీళ్లు పదికడవ దెచ్చి*
*ఇటికి రాళ్లాబావి అతిక తేటల్లు– సంద్రపూ చలనీళ్లు సాలన్ని దెచ్చి*
*కాలి కుదురుజేసి కడవాదదించి– చేమంతి పువులేరి చెంబులే తోమి*
*గన్నేరు పువులేరి గిన్నెలే దోమి– పల్లేరు పువులేరి పళ్లేలు దోమి*
*పొంత కడవలు కడిగి ఎసరమర బెట్టి–అవిసాకు కూరాలు అరవైలు ఒండి*
*ములగాకు ఒక కూర ముప్పైలు ఒండి–కూడుకూరాలొండి కుదుటాన దించి*
*రావోయి ఓసామి, అన్నము తిందువు– పాలు కూడూ మంగ పళ్లాన బెట్టె*
*మారుకూడూ బెట్టి మజ్జిగలు బోసె– బోంచేసె ఎంకటేశు బొజ్జల్లు నింద."* [32]

ఇట్లు వర్ణనమంతయు జానపదులకుఁ బరిచితమైన ధోరణిలోనే సాఁగినను, పాత్రల దైవత్వమును మాత్రము వారు విస్మరింపరు. సాధారణ జానపదస్త్రీలు మామూలు పొరకలతో నూడ్వఁగా నలివేలు మంగ యాదిలక్ష్మి యవతారమగుటచేఁ బంగారు పొరకతో నూడ్చినది. అట్లే ఈమె అంట్లుతోముటకుఁ జింతపండును నిసుకను నుపయోగింపలేదు. చేమంతిపూలతోఁ జెంబులు తోమినది, గన్నేరు పూలతో గిన్నెలు తోమినది. ఇట్టి వర్ణనలచే నాయా పాత్రలు దైవస్వరూపులను సంగతిని జానపదులు మఱవలేదని మనము గుర్తింపవలసియున్నది.

## 6.6. రసవంతమగు కవిత్వము:–

రసవంతమగు కవిత్వముకూడ నీ పౌరాణిక గాథానికలలోఁ దఱచుగ గోచరించుచుండును. 'సీతమ్మచెఱ' యను పాటలో సీత మాయలేడికేక విని లక్ష్మణునితో 'అడవిలో మీయన్న కతిభార మాయెనే' యనును. అప్పుడు లక్ష్మణుఁ డిట్లనును:

*"అడవిలో మాయన్న కతిభారమైతేను– సూర్యగాణం బట్టి సుక్కలల్లాడు*
*చంద్రగాణం బట్టి జగములల్లాడు–నీళ్లకూ నెదలంటు సెరుకులే సేదౌను"*

రాముఁనిఁ దృఢీకరించుచు రావణుఁడు సీతతో నిట్లనును:–

*"ఒంటి శిరసూవాని బంటుతన మెంత?*
*పది శిరసులున్నట్టి బలము గలవాణ్ణి"*

## 6.7. కరుణ రసము:–

"లక్ష్మణ మూర్ఛ" పాటలో రామునిశోకము కడు హృదయ విదారకముగా వర్ణింపఁబడినది:–

*"కూర్చిన్న ముత్యాల కుచ్చులోలే మనము–*
*కూడి ఉంటిమి తమ్ముడా లచ్చణో... దాగి ఉంటిమి తమ్ముడా*
*కట్టిన్న బట్టలూ కదలన్న మాయలేదు–*
*కలికి ముద్దుల తమ్ముడా లచ్చణో... కలికి ముద్దుల తమ్ముడా*
*పెట్టిన్న తిరుమణీ పేదైన లేవలేదు–*
*పేరు ముద్దుల తమ్ముడా లచ్చణో... చిన్ని ముద్దుల తమ్ముడా*
*ఇద్దరము వస్తిమీ ఒక్కణ్ణి నేను బోయి–*
*అమ్మకేమని చెప్పుదూ? లచ్చణో... తల్లికేమని చెప్పుదూ?"* [33]

## 6.8. లోకోత్తర వర్ణన:–

"తురక బూబమ్మ పాట"లో వేంకటేశ్వరుని తల్లియగు పేరూరమ్మ తన కుమారునకుఁ బాన్పు సిద్ధముచేయుట లోకోత్తరముగా వర్ణింపఁబడినది. ఇది అభివర్ధిత పునరుక్తితో సాఁగిన వర్ణనము.

*"దిండ్లు మిందా దిండ్లే బరిసే – దివియ రతనాల పరుపే పరిసే*
*దివియ రతనాల పరుపూ మిందా– లేత దవనం పానూపు ఏసే*
*లేత దవనం పానుపుమిందా– సన్నజాజుల సరాలు బరిసే*
*సన్నజాజుల సరాలమిందా– మల్లెపూలా పానుపు ఏసే*
*మల్లెపూలా పానుపుమిందా– పునుగు జవ్వాది పూతలు ఏసే*
*పునుగు జవ్వాది పూతలమిందా– అత్తరు పన్నీరు జల్లీనాదీ*
*అత్తరు పన్నీరు పాన్పులమిందా– పవ్వళించే సిరియెంకటేశ!"* [34]

## 6.9. నుడికారములు–సామెతలు:–

పౌరాణిక వీరగాథానికలలోఁ గల్పనలు వర్ణనలు మాత్రమే కాక, జానపదుల నుడికారములు, పదబంధములు, సామెతలు గూడఁ బెక్కు గలవు:–

*"తేలేని మగవారు తేటలే మాటలు*
*పోలేని మగవారు పొందునే మాటలు"* **(సీతమ్మ చెఱ)**

*"సేనుగట్టూ సేను సేలోకె గలదన్న*
*అన్నజస్తే ఆలు తమ్ములకె గలదన్న"* **(సీతమ్మ చెఱ)**

"ఒంటి శిరసూవాని బంటు తనమెంత?" (సీతమ్మ చెఱ)

"ఎంగిలీ ప్రాణములు ఏలనయ్యా స్వామి?
సవరించు నన్ను దేవా!" (గరుటపచ్చి పాట)

"కట్టిన బట్టలూ కడలన్న మాయలేదు" (లక్ష్మణ మూర్ఛ)

"కూడుకూరలు వొండినాది– కుదుటాను వొంచినాది
పాలుకూడు అలివేలుమంగ– పళ్లాన ఒడ్డించినాది
మారుకూడూ పెట్టినాది మజ్జిగలూ పోసినాది" (తురక బూబమ్మ పాట)

## 6.10. ప్రసిద్ధ వీరగాథల సంక్షిప్త రూపములు:–

జంగములు పాడు ప్రసిద్ధ వీరగాథలను విని, వాని ననుకరించుచుఁగూడ జానపదస్త్రీలు తుమ్మెద పదములు, ఊయల పదములు సృజించుకొందురు. కాంభోజరాజు కథ, చిన్నమ్మ కథ, బొబ్బిలి కథ, లక్ష్మమ్మ కథ, వేంకటేశ్వరుని కథ మున్నగు సాంప్రదాయిక వీరగాథలు చిత్తూరు మండలమునఁ బల్లెపట్టులలో గొబ్బిపాటలుగాఁ బాడఁబడుచున్నవి. రావులమ్మ పాట, లచ్చిమమ్మ పాట, అప్పలాపురం చెన్నారెడ్డి పాట, కర్నూలు నవాబు పాట మున్నగునవి కూడ వీరగాథాజన్యములగు గాథానికలు. ఇవి రాయలసీమలోను ఇతర స్థలములలోను బ్రచారమున నున్నవి. తెలంగాణమున నల్లగొండ మండలమున గొల్లలు పాడు కాటమరాజు కథలను విని, సూర్యాపేట తాలూకా నూతనకల్లు గ్రామములో జానపద స్త్రీలు 'బత్తినన్న పదము, బీరన్న పదము, ఎఱ్ఱన్న పదము' మున్నగు రీతి ఊయల పదములు సృజించుకొని పాడుట నేను వినియున్నాను. ప్రసిద్ధ సాంప్రదాయిక వీరగాథలగు బాలనాగమ్మ, శ్రీయాళచరిత్ర, శశిరేఖా పరిణయము, బాలరాజు, రుక్మాంగద, ధర్మాంగద, చంద్రహాస చరిత్ర, ఎఱుకల నాంచారి, కాంభోజరాజు, లక్ష్మమ్మ మున్నగునవి తెలంగాణమున బతుకమ్మ పాటలుగా నవతరించినవి. ఇవన్నియును లఘువీరగాథలే.

## 6.11. మొహరము గీతికలు:–

మహమ్మదీయమత సంబంధములగు వీరగాథానికలు గూడ రాయలసీమలో అనంతపుర మండలమున వ్యాపించియున్నవి. ఇవి మొహరం పండుగలలోఁ బూజింపఁబడు హసేన్– హుసేన్ అను వీరుల మరణమును గూర్చిన శోకగీతములు (coronaches). హసేన్–హుసేనులు చేసిన కర్బలా యుద్ధగీతము, వారి అంగరంగ భోగముల పాట, క్రొత్త పెండ్లికొడుకు ఖాసిమునుగూర్చిన పాట, గూళపాలెము లాలుస్వామి పీరు మహిమ– నాగిరెడ్డి పాట, అల్బీదా శోకగీతము మున్నగునవి ఈ తరగతికిఁ జెందిన పాటలు. ఈ పాటలను డా॥ తూమాటి దొణప్పగారు సంపాదించి సమగ్రముగాఁ జర్చించి యున్నారు (చూ. 'మొహరము గీతికలు' అను వ్యాసము, భారతి, సెప్టెంబరు 1961).

'వీరగాథానికలు' లేక 'లఘువీరగాథలు' అను నీ ప్రకరణము నందలి ముఖ్యాంశముల నీ క్రింది విధముగాఁ జెప్పవచ్చును:–

ఒక అర గంటలోపులోఁగాని, లేదా కొలఁది నిమిషములలోఁ గాని పాడఁబడు గేయకథలు 'వీరగాథానికలు' లేక 'లఘువీరగాథలు' లేక వీరగీతములు. వీనిని జానపదులు 'పదములు, పాటలు' అను పేర్లతో వ్యవహరింతురు. ముద్రితములైన లఘువీరగాథలు కాక, నేను మౌఖిక ప్రసరణముననున్న గాథానికలను సుమారు ఎనుబదివఱకును సేకరించితిని. కథాఖ్యానముయొక్క నిడివినిబట్టి వీనిని ప్రధానముగా రెండు వర్గములుగా విడఁదీయవచ్చును: 'కథాత్మకములు, కథా సూచకములు'. బుడ్డా వెంగళరెడ్డిపాట, అప్పలాపురం చెన్నారెడ్డి పాట, చిన్నమునెమ్మ పాట, చాకలి దుడుమన్న పదము, వానదేవుని పాట మున్నగునవి కథాత్మకములగు వీరగాథానికలు. ఇవి యొక అర గంట వ్యవధిలోఁ బాడఁబడును. గుఱ్ఱాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, నారసింహారెడ్డి పాట మున్నగునవి కథాసూచకములు. వీనిని గొలఁది నిమిషములలోఁ బాడవచ్చును.

ఇతివృత్త దైర్ఘ్యమునుబట్టి కాక, ఇతివృత్త తత్త్వమునుబట్టి పరిశీలించినచో లఘువీరగాథలలో నాలువర్గములు గోచరించును: 'చారిత్రకములు, విప్లవ జన్యములు, సాంఘికములు, దానవీర ప్రశంసలు, జానపదములు, పౌరాణికములు'. ఇందుఁ జారిత్రకము లలో 'వీరమరణములు, వీరప్రశంసలు' అను రెండంతశ్శాఖలు గలవు. అట్లే సాంఘికములలో 'గ్రామకక్షలు–హత్యలు, స్వైరిణులు–భర్తృహంతలు, పందెములు–స్పర్థలు, ఆత్మత్యాగములు–కట్టపదములు, విధివైపరీత్యములు–ప్రమాదములు' అను అయిదు అంతశ్శాఖలను గుర్తింపవచ్చును. ఉయ్యాలవాడ నారసింహారెడ్డి పాట (కోలాటము పాట), ధర్మాపురం నరసింహుని పాట, చిన్నపరెడ్డి పాట, అల్లూరి సీతారామరాజు పాట మున్నగునవి వీరమరణములకుఁ జెందిన చారిత్రక గాథానికలు. ఉయ్యాలవాడ నారసింహారెడ్డి పాట (పిచ్చుకుంట్లు పాడునది), మరుట్ల చిన్నమల్లేశుని పాట, ఓబులరెడ్డి కోలాటపు కోపు, పెనుగొండ కోట మున్నగునవి వీరప్రశంస చేయు చారిత్రక గాథానికలు. తెలంగాణమున నల్లగొండ జిల్లాలోని పాటలు– ముఖ్యముగా రేణికుంట రామిరెడ్డి పాట, చిలమ్మ పాట, పసునూరి వెంకటరెడ్డి, యలకపల్లి యాదగిరి, గొట్టెముక్కల గోపాలరెడ్డి, కొంతం కొండలరెడ్డి, దొడ్డి కొమరయ్య, వీరమళ్ల వెంకయ్య, అనిరెడ్డి రామిరెడ్డి, మట్టారెడ్డి అనంతారెడ్డి, నక్కా అండాలమ్మ మొదలగు వీరులపైఁగల పాటలు విప్లవజన్యములగు వీరగాథానికలు.

సాంఘిక వీరగాథానికలలో గుఱ్ఱాల గోపిరెడ్డి, మానందిరెడ్డి, గడేకల్లు నాగిరెడ్డి, బండోళ్ల కురుమలన్న, గుడిపాటి చలమయ్య, మల్లారెడ్డి, సలపల అమ్మినాయఁడు మున్నగు వారిపైఁగల పాటలు 'గ్రామకక్షలు–హత్యలు' అను నుపశాఖకుఁ జెందును. అద్దాల సుబ్బులు పాట, చిన్నమునెమ్మ పాట, వీరసోమి పాట, గుంటూరు

ఆదెమ్మ పాట మున్నగునవి 'స్వైరిణులు-భర్తృహంతలు' అను సాంఘికోపశాఖకుఁ జెందును. అప్పలాపురం చెన్నారెడ్డి పాట, గొఱ్ఱెపోతుల పందెము మున్నగునవి 'పందెములు-స్పర్థలు' అను నుపశాఖకుఁ జెందును. లలికట్ట పదము, ఒద్దిరాజుల పాట, బోన కాటపరెడ్డి పాట, ముసలమ్మ గండి, వరదరాజమ్మ పాట ఇత్యాదులు ఆత్మత్యాగమునకు సంబంధించిన కట్టపదములు. ఎల్లలచెఱువు పొంగిన పాట, మూసి పొంగిన పాట, పల్నాటి ప్రళయము (చంద్రవంక పొంగి మాచెర్లను ముంచుట), పెన్నేటి పొంగు, అల్లుని పాట, జనగామ రైలుప్రమాదము, జడ్చర్ల రైలుప్రమాదము మొదలగునవి 'విధివైపరీత్యములు- ప్రమాదములు' అను నుపశాఖకుఁ జెందును.

దానవీరప్రశంసలగు గాథానికలలో 'బుడ్డా వెంగళరెడ్డి, సుద్దపల్లి లక్ష్మమ్మ, యాదాళ్ల నాగమ్మ, చిన్న అండ్లూరి శివమ్మ, డొక్కా సీతమ్మ' మున్నగు వారిని గూర్చిన పాటలు చేరును. ఎఱ్ఱిపాప పాట, చాకలి దుడుమన్న పదము లేక వీరనాగమ్మ పదము. వానదేవుని పాట, భూపతిరాజు పదము, బొత్తుఁడు పాట, ఒలియ పాచ్చావు పాట మున్నగునవి జానపదములు. రాములపాట, మాయలేడి పాట, సీతమ్మ చెఱ, గరుటపచ్చి పాట, అశోకవనము, ముద్దుటుంగరము, లక్ష్మణ మూర్ఛ, కుశలవుల పుట్టుక, మంగమ్మ పాట, తురక బూబమ్మ పాట, జాలోరిగంగ, చెంచీతపాట ఇత్యాదులు పౌరాణిములగు వీరగాథానికలు.

వీరగాథానికలలోఁ జారిత్రక వీరమరణములు, విప్లవ వీర మరణములు, గ్రామకక్షల మూలమున సంభవించిన హత్యలు, ఆత్మత్యాగములకు సంబంధించిన కట్టపదములు, ప్రకృతి తెచ్చిన ప్రమాదములు- ఇవియన్నియును కరుణరసప్రధానములు. ఇట్టి కన్నీటి పాటలను (లేక జాలిపాటలను) పాశ్చాత్యులు 'coronaches' అందురు. వీరప్రశంసలలో వీరము, పందెములలోఁ బట్టుదల, భర్తృహంతలగు స్వైరిణుల పాటలలో వారి క్రౌర్యగర్హణమును ద్యోతకమగును. దానవీరప్రశంసలలోఁ బ్రజలకు వారియెడఁగల కృతజ్ఞత వెల్లడియగును. జానపద వీరగాథానికలలో నద్భుతరసము, పౌరాణిక వీరగాథానికలలో భక్తిరసము ప్రధానముగాఁ బోషింపఁ బడుచుండును.

వీరగాథానికల వర్గీకరణమును శాఖోపశాఖల రూపములో నీ క్రింది విధముగాఁ బ్రదర్శింపవచ్చును:-



## జ్ఞాపికలు

1. కృష్ణశ్రీ, పల్లెపదాలు, పుట. 76.
2. పునరావృత్తి ప్రారంభముననున్న ఈ 'హొహువా' యను శబ్దమునకు బదులుగాఁ గొన్నిచోట్ల 'భళిరే' అనియు, మఱికొన్నిచోట్ల 'సైరా' అనియు వచ్చుచుండును.
3. Andhra University College Magazine and Chronicle, 1953, p. 13.
4. చూ. తెలుగు పల్లెపాటలు, 1960, పుటలు. 38, 39.
5. నల్లగొండ జిల్లా, సూర్యాపేట తాలూకా, నూతనకల్లు గ్రామములో, 1966 జూన్ నెలలో, పొన్నం వెంకయ్య యను గమళ్లవాఁడు పాడఁగా విని వ్రాసికొంటిని.
6. దివ్వె.
7. ఇది కోలాటపు పాట. 25-6-1966న నల్లగొండ మండలమున సూర్యాపేట ప్రక్కనున్న రాయనగూడెం గ్రామములో శ్రీమతి మల్లు స్వరాజ్యమ్మగారు పాడిన పాట.
8. 22-6-1966న నల్లగొండ జిల్లా సూర్యాపేట తాలూకా నూతనకల్లు గ్రామములో శ్రీపాద నరహరి పాడిన పాట.
9. మహిళా.
10. పుచ్చలపల్లి సుందరయ్యగారు, ప్రముఖ కమ్యూనిస్టు నాయకులు, తెలంగాణా విప్లవ సూత్రధారి.
11. రావి నారాయణరెడ్డిగారు, తెలంగాణా కమ్యూనిస్టు నాయకుఁడు.
12. నల్లగొండ జిల్లా సూర్యాపేటలో ఎస్.గోపాలరెడ్డి పాడిన పాట, సేకరణ 24-6-1966.
13. 'స్త్రీలోలతయే ఇతని పతనమునకు హేతుభూతమయినది'- త్రివేణి, పుట. 258.
14. దీనికిఁ బాఠాంతము: "నున్నంగ తలదువ్వి నూగాయ జడలేసి- సొందు వెంబడి బోతువుంటె సందమామనుకొంటి కొడుక"- అదే.
15. అదే., పుట. 259.; 16. అదే., పుట. 260.
17. అదే., పుట. 261. ; 18. అదే.
19. అదే., పుట. 263. ; 20. అదే., పుట. 265.
21. అదే., పుట. 268. ; 22. అదే., పుటలు. 272, 273.
23. 1-5-1966న కడపలో శ్రీమతి చిన్న రామక్క యను కుంచెపురి యెఱుకత పాడిన పాట. ఇది ఈమె ఆశురచన యఁట.
24. అదే.

25, 26. శ్రీకాకుళమునకుఁ బ్రక్కనే యున్న తోటపాలెం గ్రామములో 24-5-1966న వృద్ధుఁడగు నొక మాలదాసరి పాడఁగా విని వ్రాసికొనిన పాటలోని భాగములు.

27, 28. చిత్తూరు జిల్లా, వాయలపాడు తాలూకా, బోడింపల్లెకుఁ జెందిన కొండీటి వెంకటరమణ యను పూసల బలిజవాఁడు 20-2-1966న పాడిన పాట.

29. ఈ గాథానికను ఇతర విషయములను సేకరించుటకై నేను 17-4-1966న ఉయ్యాలవాడ గ్రామమునకేఁగి బుడ్డా దస్తగిరిరెడ్డిగారిని, శివారెడ్డిగారిని దర్శింపఁగా, వారు నన్ను అపూర్వముగా సత్కరించుటయే కాక, వెండిపళ్లెరముతో షడ్రసోపేతముగా భోజనము పెట్టి, తాంబూలమిచ్చి, పట్టుపరుపులపై నొక గంట విశ్రమించిన తరువాతఁగాని నన్నుఁ బోనీయలేదు. వారి మన్నన నీ జన్మలో మఱువలేను.
30. కర్నూలు జిల్లా, నందికొట్కూరు తాలూకా, చెవిమళ్ల రుద్రవరములో శ్రీమతి మూలల్ల రోజమ్మ పాడిన పాటలోని భాగము. తేది: 23-4-1966.
31. అదే.
32. చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, కొటాల గ్రామములో 14-1-1966న శ్రీమతి దారా ఎఱ్ఱక్క యను స్త్రీ తన బృందముతో దీనిని గొబ్బి పాటగాఁ బాడి వినిపించినది.
33. శ్రీమతి మూలల్ల రోజమ్మ పాడినపాట, చెలిమళ్ల రుద్రవరము, కర్నూలు మండలము, 23-4-1966.
35. శ్రీమతి దారా ఎఱ్ఱక్క పాడిన పాట, కొటాల, చిత్తూరు మండలము, 14-1-1966.

## పదునాఱవ ప్రకరణము

# వీరగాథానుకరణములు - బుఱ్ఱకథలు

వెనుకటి ప్రకరణములలో 'వీరగాథావృత్తములు, వీరగాథలు, వీరగాథానికలు' అను త్రివిధవ్యాప్తిగల తెలుఁగు సాంప్రదాయిక వీరగాథాకవిత్వము కూలంకషముగాఁ జర్చింపఁబడినది. ఇట్టి సాంప్రదాయిక వీరగాథాకవిత్వము ననుకరించుచు నాధునిక కాలమున బయలుదేరిన వివిధ ప్రక్రియలనుగూర్చి– ముఖ్యముగా నేఁటి బుఱ్ఱకథలనుగూర్చి ఈ ప్రకరణమునఁ దెలుపఁబడును.

శక్తికథలు, పల్నాటి కథలు క్రీ.శ. 13, 14 శతాబ్దముల నాఁటికే ఆంధ్రదేశమున వ్యాపించియున్నట్లు ప్రమాణములున్నవి. 14, 15 శతాబ్దములలోఁ గాటమరాజు కథలు, కొమార రాముని కథ, గాంధారి కథ మున్నగునవి బయలుదేరి యుండును. 18వ శతాబ్దపు టుత్తరార్ధము నుండి 19వ శతాబ్దపు పూర్వార్ధము వఱకును గల మధ్యకాలములో బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, పేరంటాండ్ర కథలు పుట్టినవి. 19వ శతాబ్ది మధ్యలో అనఁగా క్రీ.శ. 1850 నుండి హరిహరీ పదము లుద్భవించినవి. ఇవి 1925 వఱకును విరివిగా నుత్పత్తియైనవి. విశాఖ, విజయనగర, శ్రీకాకుళ మండలములు వీనికి ఆటపట్టులు. 20వ శతాబ్ది ప్రారంభమున యక్షగాన ప్రభావముతోడను, మహారాష్ట్రుల కాలక్షేపముల ప్రభావముతోడను బొబ్బిలివరుస కథలనుండి జంగంకథలు పరిణమించినవి. వీని జన్మస్థానము గుంటూరు మండలము. ఈ జంగంకథల విజృంభణము 1900 నుండి 1940 ప్రాంతము వఱకును సాఁగినదని చెప్పవచ్చును. 1942 ఆగష్టు విప్లవము స్వాతంత్ర్యసమర చరిత్రలో నూతనాధ్యాయమును సృష్టించినది. దేశప్రజల నుత్తేజితులను జేయవలసిన ఆవశ్యక మేర్పడినది. జాతీయ ప్రబోధము జానపదులకుఁగూడఁ దెలిసెడి రీతిలో సాఁగింపవలసివచ్చెను. ఏతత్ఫలితముగా జంగంకథ 'బుఱ్ఱకథ'గా నవతారమెత్తినదది. బొబ్బిలివరుస కథలోఁ గీర్తనలు, దరువులు, పద్యములు ప్రవేశించి జంగంకథ యేర్పడఁగా, బొబ్బిలివరుస కథలలో రాజకీయప్రబోధము ప్రవేశించి, జంగంకథనుగూడఁ గలుపుకొని, బుఱ్ఱకథ పుట్టినది. ఈ పుట్టుక 1942 ప్రాంతమున జరిగినది. అనఁగా రెండవ ప్రపంచయుద్ధ కాలమున జరిగినదని చెప్పవచ్చును. జంగంకథలవలెనే బుఱ్ఱకథలుగూడ మొట్టమొదట గుంటూరు మండలములోనే తలయెత్తినవి.

'బుఱ్ఱకథ' నామోత్పత్తినిగూర్చి రెండు సిద్ధాంతములున్నవి. ఈ కథలను బాడుటలోఁ తంబుఱను గుమ్మెటలను నుపయోగింతురు. 'తంబుఱ'తోఁ జెప్పెడి కథ కావున దీనికి 'తంబుఱకథ' యను పేరు వచ్చి, ఈ పేరులోని 'తం' అను మొదటి యక్షరము లోపించి 'బుఱకథ'గా మాఱి, రేఫకు జడ్డరాఁగా 'బుఱ్ఱకథ' అయినదని కొందఱ తలంపు. మఱికొందఱు వేఱుగాఁ దలంచుచున్నారు. గుమ్మెటకు 'బుఱ్ఱ' యను పేరు గలదఁట (ఆంధ్రదేశమున నొక్క గుంటూరు మండలమున మాత్రమే ఇట్టి వాడుక కలదని తెలియుచున్నది). బుఱ్ఱలు వాయించుచుఁ జెప్పెడి కథ కావున 'బుఱ్ఱకథ' యను పేరు వచ్చినదఁట. ఇందు మొదటి సిద్ధాంతమే నాకు సమంజసముగాఁ దోఁచుచున్నది. గుమ్మెటలకు బుఱ్ఱలను పేరు ఎక్కువ ప్రచారమున లేదు. ఒకవేళ నిట్టిదున్నను, ఇది అజ్ఞానముచే వచ్చిన అర్థపరిణామము కావచ్చును. 'తంబుఱకథ', 'తంబుఱాకథ' అను పేర్లు జానపద గాథాకారులలో నేఁటికిని విరివిగా వ్యాప్తియందున్నవి. అసలు 'తంబుఱ' శబ్దములోనే 'బుఱ్ఱ' శబ్ద మిమిడి యున్నది. తంత్రి+బుఱ్ఱ= తంబుఱ. కాఁబట్టి 'తంబుఱకథ' యను పేరునుండియే 'బుఱ్ఱకథ' యను పేరు వచ్చియుండుననుట సమంజసము.

బుఱ్ఱకథ వివిధములకు వీరగాథల సమాహారకళ యన వచ్చును. సంప్రదాయ సిద్ధముగా వచ్చుచున్న బొబ్బిలివరుస కథలలోని మూఁడు వరుసలను (బొబ్బిలి వరుస, తందాన వరుస, సైసై వరుస); జంగంకథలలోని రగడ, పద్యములు, వచనములు, కీర్తనలు మున్నగు వానిని; ప్రసిద్ధ భజనకీర్తనలను అనుకరించి బుఱ్ఱకథ లేర్పడినవి. బొబ్బిలికథలోని 'రామ రామ శ్రీ, రామ రాఘవా, రామా రఘురామా' అను వరుస, కాంభోజరాజుకథలోని 'తందాన తాన' వరుసలు, ముగ్గురు మరాటీల కథలోని 'సైసై వరుస' బుఱ్ఱకథలలోఁ బ్రధానముగా నుండును. కొన్నింటిలో సర్వాయి పాపని కథవరుస కూడ మధ్య మధ్య ప్రవేశపెట్టఁబడుచుండును. మఱికొన్నింటిలో హరిహరీ పదముల ననుకరించుచు జముకుల వరుసలు ప్రయోగింపఁబడును. జంగంకథలనుండి– యతి, ఆద్యంత ప్రాసలు గలిగిన రగడలోఁ గథచెప్పుట; కీర్తనలు, దరువులు, పద్యములు, వచనములు మున్నగు వాని నుపయోగించుట నేర్చిన వీ బుఱ్ఱకథలు. చలనచిత్రముల పాటల ననుకరించిన బుఱ్ఱకథలును గలవు.

బుఱ్ఱకథయను నీ ప్రక్రియ ప్రాచీన యక్షగానములనుండి పరిణమించినదని నాజర్, శ్రీనివాస చక్రవర్తి మున్నగువారు తలంచుచున్నారు (చూ. 'నాజర్ సన్మాన సంచిక', భీమవరము 1962). నాకుఁ జూడఁగా నిది ప్రాచీన సాంప్రదాయిక వీరగాథలనుండియు, మహారాష్ట్రుల కాలక్షేపములకుఁ బ్రతిబింబములుగా నీ శతాబ్ది ప్రారంభమున బయలుదేరిన జంగంకథలనుండియుఁ బరిణమించిన దని తోఁచుచున్నది. 'హరికథ, యక్షగానము, జంగం కథ, బుఱ్ఱకథ'–

ఇవి వేనికవే ప్రత్యేకమైన ప్రక్రియలు. ఒకదానినుండి మఱియొకటి కొన్ని యంశములను గ్రహించియుండును. అంతేకాని, ఒకదాని నుండి మఱియొకటి పుట్టినదనుట సరికాదు. జంగంకథలలోని రగడ, కీర్తనలు, వచనములు బుఱ్ఱకథలలోఁ బ్రవేశించినవి. అట్లే బొబ్బిలి వరుస కథలలోని తందాన వరుసలు, సైసై వరుసలు గూడ నీ బుఱ్ఱకథలలోఁ బ్రముఖస్థానమును వహించినవి. కావున బొబ్బిలి వరుస కథల, జంగంకథల సమాహారమే బుఱ్ణకథ యని చెప్పవచ్చును. దీనిని పాడుటలో సిద్ధహస్తులైన నాజర్ ప్రభృతులు కొందఱు దీనియందు దేశికీర్తనల నెక్కువగ జోడించి, దీనిని యక్షగానమువలె భ్రమింపఁజేయుచున్నారు. అంతేకాని, ఇది యక్షగాన సంబంధి కాదు.

క్రీ.శ. 1929 ప్రాంతములో దొడ్డవరపు వెంకటస్వామి యను నాయన, ధేనువకొండ వెంకయ్యగారు రచించిన ఉత్తర గోగ్రహణమను జంగంకథను పాడుచుండెడివాఁడు. దేవగాంధారి రాగమును ప్రచారము చేసిన దీ వెంకటస్వామిగారే. బుఱ్ఱకథ యవతరణమునకు వీరి జంగంకథా ప్రచార మెంతయో దోహదమొనర్చినది.[1] మొట్టమొదటి సారిగా జంగంకథనుండి బుఱ్ఱకథను సృజించిన కీర్తి మాత్రము సామ్యవాదులదే. 1942 ప్రాంతములో గుంటూరు మండలమున బాపట్ల ప్రాంతమువారగు కాకుమాని సుబ్బారావుగారు జంగంకథను బొబ్బిలివరుస కథలను అనుకరించుచు 'బాబూరావు బుఱ్ఱకథ'ను రచించిరి. ఈ సుబ్బారావుగారే దీనిని స్వయముగా గానము చేసెడివారు. నాకుఁదెలిసినంతవఱకుఁ దెలుఁగులో నిదియే మొట్టమొదటి బుఱ్ఱకథ. తరువాత ఈ కాకుమాని సుబ్బారావుగారే 1943లో 'టాన్యా' అను మఱియొక బుఱ్ఱకథను రచించిరి. రెండవ ప్రపంచయుద్ధ కాలమున మాతృదేశ రక్షణకై పోరాడిన యొక రష్యన్ బాలిక పేరు 'ట్యాన్యా'. ఈ బుఱ్ఱకథనుగూడఁ బ్రారంభమునఁ గవియైన సుబ్బారావుగారే గానము చేయుచుఁ బ్రచారము చేయు చుండిరి. చింతలపాటి సూర్యనారాయణ, కంఠంనేని వెంకటసుబ్బయ్య యనువారీ సుబ్బారావుగారికి వంతపాట పాడెడివారు. ఆంధ్రదేశమున మొట్టమొదటి బుఱ్ఱకథదళ మిదియే యని చెప్పవలెను. తరువాత నీ 'ట్యాన్యా' బుఱ్ఱకథను ఆంధ్రుల వీరవైతాళికుఁడును బుఱ్ఱకథా పితామహుఁడును నగు షేక్ నాజర్ చేపట్టినాఁడు. 1943లోనే సుంకర సత్యనారాయణగారు సామ్యవాద సిద్ధాంత ప్రబోధముగా 'కష్టజీవి' యను బుఱ్ఱకథను రచించిరి. దీనినిగూడ షేక్ నాజర్ గానము చేసి ప్రచారమునకుఁ దెచ్చెను. ఈ కష్టజీవి బుఱ్ఱకథ, గయోపాఖ్యాన నాటకమువలె నాంధ్రదేశమందంతటను బ్రాకిపోయినది. అనేక ముద్రణలు పొందినది. 'టాన్యా' 'కష్టజీవి' యను బుఱ్ఱకథలను గానము చేయుటచే నుత్తమ గాథాకారుఁడుగా నాజర్ కొంత స్థిరపడినాఁడు. (1944లో క్రొత్తపల్లి రంగారావు అను కవికూడ 'టాన్యా' బుఱ్ఱకథను రచించి ప్రకటించినట్లు తెలియుచున్నది. చూ. ఆధునిక తెలుగు రచయితలు, దక్షిణ భాషా పుస్తక సంస్థ ప్రచురణ, 1962, పుట 49.)

1944లో బెంగాలులో దుర్భరక్షామము సంభవించెను. బుఱ్ఱకథాగానము చేయుచుండిన నాజర్ స్వయముగా నీ కఱవుపై నొక బుఱ్ఱకథ నల్లినాఁడు. 'బెంగాల్ కఱవు' అను నీ బుఱ్ఱకథా గానముతో నాజర్ కీర్తి దశదిశల వ్యాపించినది బుఱ్ఱకథాగానమున నతనికతఁడే సాటి యనిపించుకొనెను. ఈతని ప్రచారముచే బుఱ్ఱకథలు పుంఖాను పుంఖముగా బయలుదేరినవి. కమ్యూనిస్టులు, కాంగ్రెసువారు మున్నగు రాజకీయ పక్షములు తమ తమ సిద్ధాంత వ్యాప్తికొఱకును, జాతీయ ప్రబోధముకొఱకును బుఱ్ఱకథారచనను గానమును సాధనములుగాఁ జేసికొన్నవి.

1945 అక్టోబరు 17వ తేదిన బెజవాడ ప్రజాశక్తి ప్రచురణా లయమువారు సుంకర సత్యనారాయణగారు రచించిన 'రైతు విజయము' అను బుఱ్ఱకథను బ్రకటించిరి. అబ్బరాజుశర్మగారు రచించిన 'స్వతంత్ర పోరాట'మను బుఱ్ఱకథయు నీ సంవత్సరములోనే ప్రకటింపఁబడినది (30-11-1945).

1946లో గుంటూరు జిల్లా, పొన్నూరు దగ్గఱ నున్న బ్రాహ్మణ కోడూరు గ్రామములోని యువజన కాంగ్రెసు అధ్యక్షుఁడు ముప్పాళ్ళ నాగేశ్వరరావుగారు 'రైతు విజయము' అను బుఱ్ఱకథను రచించిరి. దీనిని 'సుందర రామా అండ్ సన్సు, తెనాలి' వారు ప్రకటించిరి. అప్పటి కింకను బుఱ్ఱకథా నామము ప్రచురము కాలేదు. అందుచే నీ పుస్తక శీర్షిక క్రింద కుండలీకరణమున 'కాంగ్రెసు జంగము కథ' అని యున్నది. ఈ బుఱ్ఱకథ యప్పటి మదరాసురాష్ట్ర ప్రధానియగు ఆంధ్రకేసరి టంగుటూరి ప్రకాశంపంతులుగారికి అంకితమీయఁ బడినది. 1946 లోనే తెంగాణములో వరంగల్లు పట్టణమున కాంగ్రెసువారు 'హైదరాబాద్ సంస్థాన రాజ్యాంగ సంస్కరణలు' అను బుఱ్ఱకథను బ్రచురించిరి. దీని రచయిత అద్లూరి అయోధ్య రామయ్యగారు.

1946-1948 మధ్యకాలములో భారత జాతీయ నాయకుల జీవితములపై నెన్నియో బుఱ్ఱకథలు బయలుదేరినవి. ఈ బుఱ్ఱకథలను ముద్రించుటలో రాజమహేంద్రవరములోని కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు వారు, కాళహస్తి తమ్మారావు అండ్ సన్సు వారు ముందంజ వేసిరి.

3-1-1947న పశ్చిమగోదావరీ మండలమున, తాడేపల్లి గూడెము తాలూకా, కృష్ణాయపాలెమునకుఁ జెందిన శ్రీ వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు 'నేతాజీ' యను బుఱ్ఱకథను రచించిరి. ఇది అముద్రితము. సత్యనారాయణశాస్త్రిగారు 'జాతీయ కవిభూషణ' బిరుదాంకితులు. జాతీయ ప్రబోధమును, సాంఘిక ప్రబోధమును జేయుచు వీరు అనేక కథలను రచించిరి. వీరు ఉమర్ ఆలీషా కవిగారి శిష్యులు.

1948లో జంపన చంద్రశేఖరరావుగారు 'నేతాజీ జీవిత చరిత్ర'యను బుఱ్ఱకథను రచించిరి. బద్దిరెడ్డి కోటేశ్వరరావుగారు రచించిన 'నైజాం రజాకార్ల దురంతాలు' కూడ నీ సంవత్సరముననే

వెలువడినది. తెలంగాణమున కమ్యూనిస్టులు నడిపిన నైజాము వ్యతిరేక పోరాటముపై 'తెలంగాణా వీరులు' అను బుఱ్ఱకథను తిరునగరి రామాంజనేయులుగారు రచించిరి. భారత స్వాతంత్ర్యోద్యమము ముగిసిన తరువాత ఆంధ్ర రాష్ట్రోద్యమముపైఁ గూడ బుఱ్ఱకథలు పుట్టినవి.

1948లో రాజమండ్రి కొండపల్లి వీరవెంకయ్యగారు భారత జాతీయోద్యమముపై రచింపఁబడిన పెక్కు బుఱ్ఱకథలను బ్రచురించిరి: "అరుణా అసఫాలీ, ఆంధ్రకేసరి ప్రకాశం, అజాద్ హింద్ ఫౌజు, కాంగ్రెస్ విజయం, గాంధీనిర్యాణం, జవహర్‌లాల్ నెహ్రూ, జైప్రకాశ్ నారాయణ్, డాక్టర్ పట్టాభి, నైజాంమీద పోలీసు చర్యలు, మాయా బజార్ (బ్లాక్‌మార్కెట్), రాజగోపాలాచారి, రౌడీ రజాకార్లు, సర్దార్ పటేల్, సుభాస్‌చంద్ర బోసు, స్టేట్ కాంగ్రెస్ సాహస చర్యలు, హైదరాబాద్ తుఫాను, హైదరాబాద్ ప్రజావిప్లవం" మున్నగు బుఱ్ఱకథలు 1948లోఁ బ్రకటింపఁబడినవి. ఈ సంవత్సరముననే రాజమండ్రిలోని కాళహస్తి తమ్మారావుగారుకూడ జాతీయ నాయకుల పైనను, దేశ సమస్యల పైనను రచింపఁబడిన కొన్ని బుఱ్ఱకథలను బ్రచురించిరి: "ఆంధ్రరాష్ట్రం, కాంగ్రెస్ విజయం, కొల్లేటి రైతు, గాంధీజీ హత్య, డాక్టర్ కొట్నీస్ అమర్ కహానీ, జమీన్ రైతు, చీకటి మార్కెట్, జయప్రకాష్, జయ్ హింద్ నేతాజీ, నిజాంపై పోలీసు చర్యలు, నిజాం స్టేట్ కాంగ్రెస్, పండిట్ నెహ్రూ, బాపూజీ, రజాకార్ల దుండగాలు, రాజాజీ, సంస్థానాధీశుల దుండగాలు, సర్దార్ పటేల్, హిందూస్థాన్ స్కాట్" మున్నగునవి వీరు ప్రకటించిన బుఱ్ఱకథలు.

ఇట్లు రాజమహేంద్రవరమున కొండపల్లివారును, కాళహస్తి వారును పోటీలు పడి బుఱ్ఱకథలను బ్రచురించుట ముదావహము. ఒకే కథను భిన్న రచయితలచే వ్రాయించి వీరు ప్రచురించినట్లు తోఁచును. 1948 ప్రాంతమున నీ జాతీయ ప్రబోధకములగు బుఱ్ఱ కథలను రచించిన కవులలో శ్రీయుతులు భువగిరి సత్యనారాయణా చారి, మెరపల సూర్యనారాయణ, పతివాడ సూర్యనారాయణ, గూడపాటి పోతరాజు, యస్.యం. హౌతా, దంటు కృష్ణమూర్తి, ద్వారంపూడి పుత్రారెడ్డి, కర్రి రామారావురెడ్డి మున్నగువారు గలరు.

నాజరు 1944లో 'బెంగాలు కఱవు' రచించిన తరువాత మఱికొన్ని రచనలు చేసెను. వీనిలో 'రాయలసీమ కఱవు, పల్నాటి యుద్ధము, బొబ్బిలి యుద్ధము' అను రచనలు ముద్రింపఁబడినవి. బెంగాల్ కఱవు, వీరాభిమన్య, గాంధీ జీవితం, అల్లూరి సీతారామరాజు, ఊరూ–పేరూ' మున్నగునవి అముద్రితములు. నాజరు తన కథలతోపాటు సుంకర సత్యనారాయణగారు రచించిన 'కష్టజీవి'నిఁ గూడఁ బాడుచున్నాఁడు. ఈ కథలలో నితఁడెక్కువగాఁ జెప్పినది పల్నాటి యుద్ధము. ఇదియే ఇతనిని తారాపథమునకుఁ గొనిపోయినది. నాజరు పల్నాటి యుద్ధమును మూఁడు గంటల కాలము గానము చేయును. నాజరు పాడుచుండఁగాఁ బల్నాటి యుద్ధము బుఱ్ఱకథను విని ఉఱ్ఱూతలూఁగుట మానవ జీవితమున సకృత్తుగా లభించు గొప్ప యనుభూతులలో నొకటి. ఇది కేవలము అనుభవైక వేద్యమే కాని వర్ణించుట వలనఁ దెలియునది కాదు. ఈ వీరవైతాళికుఁడు క్రీ.శ. 1920లో గుంటూరునకు సమీపముఁగల పొన్నికల్లు గ్రామమున జన్మించెను. ఇతఁడు మొట్టమొదట చెప్పిన బుఱ్ఱకథ 'టాన్యా' (1943). తరువాతది 'కష్టజీవి'. ఇదియును 1943లోనే మొదలుపెట్టెను. 1944లో 'బెంగాల్ కఱవు'ను స్వయముగా రచించి గానము చేయ నారంభించెను. ఆ తరువాత పల్నాటి యుద్ధమును చేపట్టెను. 1958లో కాకినాడలో నాజరుకు సన్మానము చేసి 'బుఱ్ఱకథా పితామహ' బిరుదము నొసంగిరి. తెలంగాణ ప్రజలు 'బుఱ్ఱకథా సమ్రాట్' అను బిరుదునిచ్చిరి. 1962లో పశ్చిమ గోదావరీ మండలములోని భీమవరములో నాజరుకుఁ గనకాభిషేకము చేసి, కాలికి గండపెండెరముఁ దొడిగి ఘనముగా సన్మానించిరి. ఈ నాజరు దళములో మొదట 'రామకోటి, పురుషోత్తం' అను వారు వంతలుగా నుండెడివారు. తరువాత 'వెల్లంకి కోటేశ్వరరావు, చిన్నబ్బాయి' అనువారు వంతలుగా నుండిరి. రాజమహేంద్రవరములోని "నిడుదవోలు అచ్యుతరామయ్యగారి దళము"; విజయనగరములోని "కుమ్మరి మాస్టారి దళము"; హైదరాబాద్‌లోని "బెనర్జీదళము"; కడపలోని "కమ్మునోదరుల దళము"– నాజరు తరువాత ఎన్నదగిన కొన్ని ప్రసిద్ధ బుఱ్ఱకథా గాయకుల దళములు.[2]

బుఱ్ఱకథా గానమున నాజరు ఎంత గొప్పవాడో, బుఱ్ఱకథా రచనలో శ్రీ సుంకర సత్యనారాయణగారు అంత గొప్పవారు. వీరు రచించిన అల్లూరి సీతారామరాజుకథ బుఱ్ఱకథాసాహిత్యమునకు లక్షణగ్రంథ మనవచ్చును. వీరి ఇతర రచనలు: "అమరజీవి, రుద్రమదేవి, వీరేశలింగం, కర్ణుడు, చల్లపల్లి నారాయణరావు, కుమ్మరి మొల్ల" మున్నగునవి. ఆధునిక కాలమున ఎందఱో యువకులు బుఱ్ఱకథా రచనను చేపట్టియున్నారు. వీరు వందలకొలఁది బుఱ్ఱకథలను సృజించుచున్నారు.

బుఱ్ఱకథ మొదట రాజకీయ ప్రబోధాత్మకముగా నవతరించి నను, తరువాత దీనిలో నితర ప్రబోధములు, చారిత్రక గాథలు, పౌరాణిక గాథలు చోటుచేసికొన్నవి. కొన్ని సాంప్రదాయిక వీరగాథలు గూడ బుఱ్ఱకథలుగాఁ దిరిగి వ్రాయఁబడినవి. కావున నేఁడు లభించుచున్న బుఱ్ఱకథలను నాలుగు ప్రధాన వర్గములుగా విభజించ వచ్చును. 'ప్రబోధాత్మకములు, చారిత్రకములు, పౌరాణికములు, వీరగాథాజన్యములు'. ఇందుఁ బ్రబోధాత్మకములలో 'రాజకీయ ప్రబోధకములు, జాతీయ ప్రబోధకములు, సాంఘిక ప్రబోధకములు, ప్రభుత్వ ప్రచారాత్మకములు' అను నాలుగంతశ్శాఖలను గుర్తింప వచ్చును. బాబూరావు కథ, టాన్యా, కష్టజీవి, రైతు విజయము, కాంగ్రెసు విజయము, తెలంగాణా వీరులు, హైదరాబాద్ ప్రజావిప్లవము, కొల్లేటి రైతు, జమీన్ రైతు, చల్లపల్లి నారాయణరావు, రజాకార్ల దుండగాలు మున్నగు బుఱ్ఱకథలు రాజకీయ ప్రబోధమున

కుద్దేశించినట్టినవి. అల్లూరి సీతారామరాజు, నేతాజీ సుభాస్‌చంద్ర బోసు, గాంధీజీ, నెహ్రూ, ఆంధ్రకేసరి, సర్దార్ పటేల్ మున్నగు బుఱ్ఱకథలు ప్రజలలో జాతీయ ప్రబోధమును గావించెను. ఆంధ్రరాష్ట్రము, అమరజీవి పొట్టి శ్రీరాములు మున్నగునవి ఆంధ్రజాతీయోద్యమమున కుద్దేశించినవి.

ఇట్లు రాజకీయ, జాతీయ ప్రబోధములు చేయు బుఱ్ఱకథలే కాక, సాంఘిక ప్రబోధములు చేయు బుఱ్ఱకథలును విరివిగాఁ గలవు. మాయా బజార్ (బ్లాక్ మార్కెట్), హిందూస్తాన్ స్కౌటు, జాతీయ క్రీడా రంగము, కన్న కూతురు, పుత్తడిబొమ్మ పూర్ణమ్మ, వీరేశలింగం చరిత్ర, వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు రచించిన "కట్నంలేని కమలమ్మ పెండ్లి, గ్రామ పారిశుద్ధ్యము, విద్యార్థుల ధర్మములు" మున్నగు బుఱ్ఱకథ లన్నియును సాంఘిక ప్రబోధమును జేయుచున్నవి. రేనాటి దానకర్ణుఁడగు బుద్ధా వేంగళరెడ్డిగారి దాతృత్వమును బ్రశంసించుచు 'వెంపో'గారు ఒక బుఱ్ఱకథను రచించిరి. ఇదియును నీ వర్గమునకే చెందును.

బుఱ్ఱకథల ప్రచారశక్తిని గుర్తించి ప్రభుత్వమువారుకూడఁ దమ ప్రణాళికలను బుఱ్ఱకథలుగా వ్రాయించి పాడించుచున్నారు. 'గిలకమ్మ కథ, పంచవర్ష ప్రణాళిక, కుటుంబ నియంత్రణము' మున్నగు బుఱ్ఱకథలు ప్రభుత్వ ప్రచారాత్మకములుగా వెలసినట్టివే. చిత్తూరు మండలమున నటవీశాఖవారు అరణ్యములకు నిప్పుపెట్టరాదనియుఁ, జెట్లను నఱకరాదనియు, వన్యప్రాణులను వేటాడరాదనియుఁ బ్రజలకు బోధించుటకై, నా చేత 'వనదేవత' యను బుఱ్ఱకథను వ్రాయించి, పల్లెలలో దానిని పాడించి ప్రచారము చేయుచున్నారు. నేడు ఆకాశవాణియు నీ బుఱ్ఱకథా ప్రక్రియను మిక్కిలిగ నాదరించుచున్నది.

పైన తెల్పిన వన్నియును బ్రబోధాత్మకములగు బుఱ్ఱకథలు. బుఱ్ఱకథల సంఖ్యలో నీ ప్రబోధాత్మక వర్గమే హెచ్చుగా నుండును. అయినను చారిత్రకములగు బుఱ్ఱకథలును కొన్ని లేకపోలేదు. 'ఛత్రపతి శివాజీ, రుద్రమదేవి, మంత్రి యుగంధరుఁడు, ఝాన్సీరాణి, తిమ్మరుసు మంత్రి'– మున్నగు బుఱ్ఱకథలు చారిత్రకములకు ఉదాహరణములు. భక్తరామదాసు, పోతులూరి వీరబ్రహ్మము మున్నగువారిపైఁ గూడ బుఱ్ఱకథలున్నవి.

పురాణసంబంధములగు బుఱ్ఱకథలును బయలుదేరినవి. 1966లో 'నదీరా' (ఎన్.వి.యస్.శర్మ) యనుకవి రామాయణము నంతను ఏడు బుఱ్ఱకథలుగా రచించెను: 'శ్రీరామ జననము, సీతా కల్యాణము, పాదుకాపట్టాభిషేకము, సుగ్రీవ విజయము, లంకా దహనము, రావణసంహారము, లవకుశ'. భారతకథలలో 'మహారథి కర్ణ, వీరాభిమన్య' మిక్కిలి ప్రసిద్ధికెక్కిన బుఱ్ఱకథలు. భగవద్గీతవంటి వేదాంతపరమగు కథనుగూడ బుఱ్ఱకథగా మలఁచియున్నారు. పౌరాణికములగు బుఱ్ఱకథలుగూడ నెక్కువగా నభిమన్యుఁడు, కర్ణుఁడు, లవకుశులు మున్నగు వీరుల చరిత్రలనే ఇతివృత్తములుగా గ్రహించునుగాని, వీరరస ప్రాధాన్యములేని ఘట్టములనుగాని, కథలనుగాని గ్రహింపవు.

ఇట్లు బుఱ్ఱకథలు సాంప్రదాయిక వీరగాథలనుండి పరిణమించినవైనను మాతృకల గొప్పతనము నివి విస్మరింపలేదు. బుఱ్ఱకథల విజృంభణముచే సాంప్రదాయిక వీరగాథల ప్రభావ మేమియును దగ్గలేదు. అందుచే నా మూలకథలను గూడ నితివృత్తములుగా స్వీకరించి కొన్ని బుఱ్ఱకథలు వెలసినవి. ఇట్లు వీరగాథేతివృత్తములతో బయలుదేరిన బుఱ్ఱకథలలోఁ బల్నాటి యుద్ధము, వీరబొబ్బిలి, బాలనాగమ్మ, కాంభోజరాజు, దేసింగురాజు, ఖడ్గతిక్కన, కామమ్మ మున్నగునవి కలవు.

స్థానికమగు సంఘటన జరిగిన వెంటనే వీరగాథ పుట్టునట్లే, రాజకీయ సంఘటన జరిగిన వెంటనే బుఱ్ఱకథ పుట్టును. 1962లో కమ్యూనిస్టు చైనా మనదేశముపై దురాక్రమణ జరిపినది. వెంటనే 'లడక్ వీరులు, చైనా దురాక్రమణ, కనువిప్పు, చైనా ద్రోహం, వీర భారత్, పాంచజన్యం' వంటి బుఱ్ఱకథలు కొల్లలుగాఁ బుట్టినవి.

మొత్తముపై నీ బుఱ్ఱకథలన్నియును వీరగాథానుకరణములే యగునుగాని, వీరగాథలు కానేరవు. సాంప్రదాయిక వీరగాథలకును నీ బుఱ్ఱకథలకును హస్తిమశకాంతరమున్నది. బుఱ్ఱకథలలోని ఛందస్సు మాత్రమే సాంప్రదాయిక వీరగాథలనుండి గ్రహింపఁబడినది. తక్కిన ఇతివృత్తము, భాష, భావములు మున్నగునవన్నియును మార్గధోరణికిఁ జెందినట్టివే. (సంగీతము, ఛందస్సులో నంతర్గతముగనే యుండును కావున నది దేశియే.) బుఱ్ఱకథలలోని ఇతివృత్తములు రాజకీయ సమస్యలకు సంబంధించినవై క్లిష్టముగా నుండును. వీరగాథలలోని యితివృత్తములు స్థానిక సంఘటనాజనితము లగుటచే శ్రోతలకు మిక్కిలి పరిచితములై యుండును. బుఱ్ఱకథలోని భాష, వర్ణనలు, భావములు మార్గకవుల సరణిలో నుండును. ఇవి కవులు ప్రయత్న పూర్వకముగా వ్రాసినట్టివి. ఉదాహరణమునకు సుంకర సత్యనారాయణగారు రచించిన అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథను బరిశీలింతము. దీనిలో భాష యెంత కఠినముగా నున్నదో చూడుఁడు:–

*"సంగరరంగ విహారా ధీరా శాత్రవ సంహార*
*ధీర విచారా ఆంధ్ర కుమారా దీనజనోద్ధార*

*.........................................*

*కీకారణ్యంబది సూర్యోజ్జ్వల– కిరణంబులె చొరవు*
*భీకర ఘాతుక మృగసంతతి గం–భీర నినాదములు*
*కోవ పుట్టల భయంకర సర్పాల్– ద్రోవలగమ్యములు*
*దీవిశాలు దొంగరిగా రాత్రుల– తిరుగసాగె నచట"*

ఈ భాష నుచ్చరింపఁగల జానపద గాథాకారుఁ డింత వఱకును తెనుఁగుగడ్డపైఁ బుట్టలేదు. దీని నుచ్చరించినవాఁడు జానపదుఁడు కానేకాఁడు.

ఇందు భాష ఇట్లుండఁగా, భావములెట్లున్నవో చూడుఁడు: కటికి నలుపుగాఁ గనఁబడు అల్లనేరేడుపండ్లు వనదేవీముఖ విషాద చిహ్నములఁట. జలజల ప్రవహించెడి సెలయేరులతోఁ, బలురకముల పక్షుల కలకలనాదములతోఁ దమ గొంతుకలను గలిపి పాటపాడఁగా 'స్వాతంత్ర్యమె నా జన్మహక్కె యని శబ్దించును వనము'. ఇట్టి భావములను జానపదు లూహింపలేరు. ఇవి ప్రబంధకవులకు మాత్రమే సాధ్యములు. ఇదంతయుఁ బ్రయత్న శిల్పము. బొబ్బిలి వరుస కథలను పాడినప్పుడు విని యానందింపఁగలము గాని, చదివి యానందించ లేము. ఈ బుఱ్ఱకథలు ప్రయత్నశిల్ప సమన్వితము లగుటచేఁ జదివినప్పుడుగూడ రసానందము గలుగును.

సాంప్రదాయిక వీరగాథలిట్టివి కావు. వానితో జానపదుల పరిభాష, పలుకుబడులు, ఉపమానములు నుండును. అవి ఆశువుగా, జానపదుల హృదయములనుండి సహజముగాఁ బట్టినట్టివే కాని కృతకములు కావు. సుంకర సత్యనారాయణగారు రచించిన అల్లూరి సీతారామరాజు కథను చదువు సంస్కారములు గల నాగరికులు మాత్రమే పాడఁగలరు. జానపదులు దీనిని బాడుట యసంభవము. (నాజరు రచించిన బుఱ్ఱకథలలోఁ గొంతవఱకు జానపద లక్షణము లుండునని చెప్పవచ్చును.) అసలు బుఱ్ఱకథ లన్నియును సంస్కారులచేతనే పాడఁబడుచున్నవి. విద్యావంతు లగువారు ముద్రింపఁబడిన బుఱ్ఱకథలను జదివి కంఠస్థము చేసి పాడుదురు. సాంప్రదాయిక వీరగాథలను నిరక్షరకుక్షులగు జానపద గాథాకారులు వినికిడివలన నేర్చి పాడుదురు. ఇది వారికి వంశపారంపర్యముగా వచ్చును. తండ్రి పాడు కథలను కుమారుఁడు విని పాడును. వీరగాథల ముఖ్యలక్షణములలో నొకటియగు మౌఖికప్రసరణము బుఱ్ఱకథలలో మృగ్యమని దీనినిబట్టి చెప్పనగును.

బుఱ్ఱకథలు రాజకీయ ప్రచారమువంటి యొక ప్రయోజనము నుద్దేశించి పాడఁబడును. కావున వీనిలోఁ గథాచమత్కారము కుంటుపడును. నీతిబోధవంటి రాజకీయ సిద్ధాంతబోధ యుండును. సాంప్రదాయిక వీరగాథలిట్టివి కావు. అందుఁ గథాకథనమే ప్రధానము. శ్రోతలను గథాద్భుత సంఘటనలతో నుక్కిరి బిక్కిరి చేసి, వీరకరుణ రసములచే నానందింపఁ జేయుటయే వాని ముఖ్యప్రయోజనము.

పైన తెల్పిన విభేదములనుబట్టి బుఱ్ఱకథలు సాంప్రదాయిక వీరగాథలు కానేరవని తేలుచున్నది. ఇవి వీరగాథానుకరణములు మాత్రమే. అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథను హరి ఆదిశేషువుగారును, డా॥ బి.రామరాజుగారును సాంప్రదాయిక వీరగాథలతోఁ గలిపి చర్చించుట ప్రామాదికము. నండూరి సుబ్బారావుగారు, అడివి బాపిరాజుగారు, కవికొండల వెంకటరావుగారు జానపదగేయముల ననుసరించినట్లుగానే, సుంకర సత్యనారాయణగారి వంటి రాజకీయ కవులు సాంప్రదాయిక వీరగాథల ననుసరించిరి; అంతే! ఎంత యనుకరించినను 'ఎంకిపాటలు' జానపదగేయము లెట్లు కావో, అట్లే బుఱ్ఱకథలును సాంప్రదాయిక వీరగాథలు కానేరవు. జానపద గేయములకును, ఆధునిక కవుల అభ్యుదయ గేయములకును నెంత భేదమున్నదో, సాంప్రదాయిక వీరగాథలకును, బుఱ్ఱకథలకును అంత భేదమున్నది.

బుఱ్ఱకథాగానమున ముగ్గురు వ్యక్తులుందురు. మధ్య కథకుఁడును, నతని కిరుప్రక్కల వంతలును నిలుచుందురు. కథకుఁడు వంతలకు మధ్యనుండుటచే నినతని 'సెంటరు' అనియుఁ బిలుతురు. ఇతఁడు తంబుఱ శ్రుతితో, అందెల తాళముతో కథను పాడుచుండును. కుడిచేతితో తంబుఱను మీటును, ఎడమ చేతితో అందెలు వాయించును. కాళ్లకు గజ్జెలు కట్టుకొని రసావేశము ననుసరించి, చిందులు ద్రొక్కుచు గంతులు వేయుచుండును. వంతలలో నొకఁడు హాస్యము నందించుచుండును. వేఱొకఁడు కథకుఁడు పాడిన దానిని వివరించుచు రాజకీయప్రబోధము చేయుచుండును. వంతలిరువురును గుమ్మెటలను వాయించుచుఁ గథకునకుఁ దాళము నందింతురు. విదూషకపాత్రను నిర్వహించు వంతను 'హాస్యము' అనియు, వ్యాఖ్యానకారుఁడగు వంతను 'రాజకీయము' అనియుఁ బిలుచుట పరిపాటి. అనఁగా 'సెంటరు, రాజకీయము, హాస్యము' అను ముగ్గురు వ్యక్తులతో బుఱ్ఱకథాగానము సాఁగునని చెప్పవలెను.

సాంప్రదాయిక వీరగాథానుకరణములలో బుఱ్ఱకథలు ప్రధానమైనవి. ఇవి బొబ్బిలివరుస కథలను జంగంకథలను అనుకరించి యేర్పడినవి. సాంప్రదాయిక వీరగాథలలోని తక్కిన శాఖలకుఁగూడ మఱికొన్ని యనుకరణములున్నవి. హరిహరీ పదముల ననుకరించుచు 'జముకుల కథలు'ను, కాటమరాజుకథల ననుకరించుచు 'గొల్లసుద్దులు' లేక 'సుద్దుల కథలు'ను, తెలంగాణమునఁ గేవలము బొబ్బిలివరుస కథలను మాత్రమే యనుకరించుచు 'తందాన కథలు'ను, బ్రతుకమ్మ పాటల ననుకరించుచుఁ గొన్ని పాటలును బయలుదేరినవి.

**జముకుల కథలు:–**

జముకుల కథలు, హరిహరీ పదములవలెనే జంపెవరుసలో నుండును. వీనిని జముకులను వాద్యములతోఁ బాడుచుందురు. పెక్కు బుఱ్ఱకథలు రచించిన జాతీయ కవిభూషణ బిరుదాంకితులు శ్రీ వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు జముకుల కథలనుగూడ విశేషముగ రచించియున్నారు. 30–12–1947లోనే వీరు 'అజాద్ హింద్ ఫౌజ్' అను జముకుల కథను రచించిరి. దీనిని కీ.శే. పుట్టా సుబ్బారావుగారు (కృష్ణాయపాలెము, పశ్చిమగోదావరీ మండలము) తమ 'నెహ్రూదళము'తోఁ బాడుచుండెడివారు. శాస్త్రిగారు రచించిన మఱికొన్ని జముకుల కథలు: 'నేతాజీ సుబాసుచంద్ర బోసు అంతర్ధాన

గాథ (1947), రాణీ సంయుక్త (1950), అజామిళోపాఖ్యానము (1951), భక్తప్రహ్లాద (1951), గాంధీజీ నిర్యాణము' (1956). ఇవి యన్నియును నముద్రితములే. (వీనిని బరిశీలించుటకు దయతో నాకొసంగిన శాస్త్రిగారికిఁ గృతజ్ఞుఁడను.) ముద్రితములైన జముకుల కథలలో పీసా లక్ష్మణరావుగారి 'కన్యక'; ప్రయాగ నరసింహశాస్త్రిగారి 'నేతాజీ సుభాసబోసు వీరగాథ', 'బాపూజీ మహాత్ముని జీవితగాథ'; నేదునూరి గంగాధరంగారి 'ఆంధ్రరాష్ట్ర ప్రబోధము'; వేటపాలెము గ్రంథాలయములోనున్న 'దేశీయ పదము' పేర్కొనఁదగినవి. ఇట్లు కేవలము పౌరాణికేతివృత్తములతో నుండు హరిహరీపదములను గూడ రాజకీయపక్షములవారును నితరులును జాతీయప్రబోధమునకై యుపయోగించుకొని, పదముల ఇతివృత్తములలో మార్పులుతెచ్చి జముకులకథలను సృజించిరి.

## సుద్దుల కథలు:-

తెలంగాణా విప్లవముపై బుఱ్ఱకథను రచించిన తిరునగరి రామాంజనేయులుగారు 1952లో 'రాష్ట్రవాంఛ' యను సుద్దుల కథను రచించిరి. ఇది ఆంధ్రరాష్ట్ర సిద్ధిని గాంక్షించుచు వ్రాసిన కథ. కాటమరాజుకథలు పాడు గొల్లలను జక్కఁగా ననుకరించుచు నిది వ్రాయఁబడినది. ఇందు నాలుగైదు సుద్దుల వరుసలున్నవి. దీనికి విశేషమైన ప్రచారము వచ్చినది. 'నవయుగ పబ్లిషింగ్ హౌస్' వారు దీనిని 1953లో ముద్రించిరి. ఈ రామాంజనేయులుగారు 'మన్యం విప్లవం' అను పేరుతో అల్లూరి సీతారామరాజు కథనుగూడ సుద్దుల కథగా రచించెను. ఇది అముద్రితము. వారణాసి సత్యనారాయణ శాస్త్రిగారు 1954లో సతీముసలమ్మకథను సుద్దులకథగా వ్రాసి యున్నారు. ఇదియును నముద్రితవే. ఈ సుద్దులకథలు ద్విపదచ్ఛందమున నుండును.

## తందనాన కథలు:-

సాంప్రదాయికములగు బొబ్బిలివరుసకథల ననుకరించుచుఁ దెలంగాణమున బయలుదేరిన ప్రౌఢరచనలు 'తందనాన కథలు'. ఇవి ఇటీవలనే- 1950 ప్రాంతమునఁ బుట్టినవి. ఇవి నాలుగైదు తందనాన వరుసలలో వ్రాయఁబడుచుండును. రుక్మాభట్ల విధుమౌళి శర్మగారు ఇట్టి తందనానకథల నెన్నింటినో రచించియున్నారు. 'తందనాన కృష్ణలీలలు (1951), తందనాన దేవీభాగవతము (1952), తందనాన జైమినీ భారతము (1952), తందనాన ఉత్తర రామాయణము (1953), తందనాన రామాయణము (1956)'- ఇవి విధుమౌళిశర్మగారి రచనలు, ముద్రితములు. 'తందనాన సంపూర్ణ భారతము. తందనాన తిరుపతమ్మ చరిత్రము' అను గ్రంథములను గూడ విధుమౌళిశర్మగారు రచించినట్లు తెలియుచున్నది. మంచాల గురవయ్యగుప్త 'తందనాన పంచపాండవుల వనవాసము' (1953)ను రచించెను. యామవరము రాజయ్యశాస్త్రిగారు 'తందనాన కన్యకాపరమేశ్వరి' (1953)ని రచించిరి. ఈ తందనాన కథలు గూడ బుఱ్ఱకథలవలెనే ప్రౌఢములు. ఇవి సరళమైన జానపద ప్రక్రియకు శిష్టులు చేసిన ప్రౌఢానుకరణములు.

## బ్రతుకమ్మ పాటలు:-

బొబ్బిలికథాదులవలెనే తెలంగాణమునఁ దరతరముల నుండి పాడఁబడుచుండిన జానపద గాథానికలు 'బ్రతుకమ్మ పాటలు'. ప్రచారైక జీవనులగు నాధునికులు వీనిని సహితము వదిలిపెట్టలేదు. కాని బుఱ్ఱకథలవలె నీ పాటలు వీరి ప్రచారమున కెక్కువగా నుపయోగ పడలేదు. పౌరాణికగాథలను జెప్పుటకును, సాంప్రదాయిక వీరగాథలను దిరిగి బ్రతుకమ్మవరుసలోఁ జెప్పుటకును నివి యుపయోగింపఁబడినవి. సాంఘికవిషయములపైనను, రాజకీయ విషయములపైనను బ్రతుకమ్మపాటలు చాల తక్కువగఁ బుట్టినవి.

బ్రతుకమ్మ యనఁగా లక్ష్మీదేవి (బ్రతుకయ్య యనఁగా విష్ణుమూర్తి). ఈమె పుట్టుకనుగూర్చి చెప్పుపాట, భట్టు నరసింహకవి రచనమొకటి చందమామపదముగా లభించుచున్నది. ఇది ప్రాచీనమైనది. అట్లే పనుస హనుమద్దాసు రచించిన 'వేపూరి బ్రతుకమ్మ పాట' యను లవకుశ కథ, 'బాలనాగమ్మ బ్రతుకమ్మ పాట' ప్రాచీనములుగాఁ గన్పట్టుచున్నవి. ఇవి 1930లో ముద్రింపఁ బడినవి. 1948లో వట్టెము దశరథరామయ్యగారి 'శశిరేఖా పరిణయము', వేదాంతి పంచాక్షరిగారి 'సిరియాళ చరిత్ర' ప్రకటింపఁ బడినవి. ఇవియును బ్రాచీనములే కానోపును. ఈ ప్రాచీనములగు బ్రతుకమ్మ పాటలననుకరించుచు 1950 నుండి నేఁటివఱకును హైదరాబాదులో నెన్నియో గుజిలీప్రతులు బయలుదేరినవి. రాజమండ్రినుండి కొండపల్లివారు కాళహస్తివారు బుఱ్ఱకథల నసంఖ్యాకముగా ముద్రించినట్లే, సికింద్రాబాదునుండి చందా నారాయణశ్రేష్ఠిగారును, కొండా శంకరయ్య అండ్ సన్సువారును బ్రతుకమ్మపాటలను వందలకొలఁదియు ముద్రించుచున్నారు. సికింద్రాబాదులో నివసించుచున్న బూరెల సత్యనారాయణమూర్తిగారు ఇట్టి బ్రతుకమ్మ పాటల నెన్నింటినో రచించియున్నారు. ఈ పాటలు 'ఉయ్యాలో' యను పునరావృత్తితో నాలుగు 'కిటతకిట'ల యావృత్తులలోఁ గొనసాఁగుచుండును. పాదములోఁ బదిమాత్రల తరువాత నొకమాఱు, పాదాంతమున వేఱొకమాఱు పునరావృత్తి వచ్చును. కొన్ని పాటలలో 'వలలో' యను పునరావృత్తి కాననగును. ఇట్టిపాటలలో రచన ద్విపదచ్ఛందమున సాఁగును. ప్రాచీనమగు 'బ్రతుకమ్మపాట' (భట్టు నరసింహకవి రచన) 'చందమామా' యను పునరావృత్తిలో నున్నది. మొత్తముమీఁద బ్రతుకమ్మపాటలలో 'వలలో, చందమామా' యను పునరావృత్తులకన్న 'ఉయ్యాలో' యను పునరావృత్తియే అధికముగాఁ గానఁబడును. కావున బ్రతుకమ్మ పాటలన్నియును 'ఊయల పదము' లని చెప్పవచ్చును.

ఇతివృత్తములనుబట్టి ఈ యాధునికములగు బ్రతుకమ్మ పాటలను నాలుగు వర్గములుగా విభజింపవచ్చును: 'పౌరాణికములు, వీరగాథాజన్యములు, సాంఘికములు, రాజకీయ సంబంధములు'. బుఱ్ఱకథలలో నున్నట్లుగాఁ జారిత్రకేతివృత్తములతో బ్రతుకమ్మ పాటలు లేవు. ఇది శోచనీయము. రుక్మిణీ కల్యాణము, సావిత్రి, దమయంతీ దేవి, రుక్మాంగద చరిత్ర, కుచేలోపాఖ్యానము, చంద్రహాస చరిత్రము, ధర్మాంగద, ద్రౌపది, సత్యభామ, సతీతులసి, మార్కండేయ, శృంగార శాకుంతలము, కన్యకా పరమేశ్వరి, సతీ అనసూయ, సత్యహరిశ్చంద్ర, సీతాకల్యాణము, సీతాదేవి, సుమతీదేవి, శ్రీకృష్ణలీలలు, సీతారాముల బ్రతుకమ్మ పాట- మున్నగునవి పౌరాణిక వర్గమునకుఁ జెందినవి. బాలరాజు, ఎఱుకల నాంచారి, కామమ్మ, కాంభోజరాజు, లక్ష్మమ్మ, బాలనాగమ్మ- ఇత్యాదులు వీరగాథాజన్యములగు బ్రతుకమ్మ పాటలు. జనగామ రైలుప్రమాదము, జడ్చర్ల- మహబూబ్‌నగర్ రైలు ప్రమాదము మున్నగునవి సాంఘికేతివృత్తముల కుదాహరణములు. చైనా దురంతాలు, చైనా దుండగాలు- అనునవి రాజకీయ సంబంధములైన బ్రతుకమ్మ పాటలు. బుఱ్ఱకథలలోఁ బ్రబోధాత్మకము లధికముగా నుండఁగా, బ్రతుకమ్మ పాటలలోఁ బౌరాణికము లధికముగా నున్నవి. సాంఘికములు, రాజకీయసంబంధములు మిక్కిలి తక్కువ.

పై పాటలన్నియు, సంప్రదాయ సిద్ధముగా వచ్చుచుఁ, బొలములలోను బండుగలలోను జానపదస్త్రీలచేఁ బాడఁబడుచున్న బ్రతుకమ్మపాటల కనుకరణములు. సాంప్రదాయిక గేయములకున్న మౌఖికప్రసరణము, బహుజనాదరపాత్రత ఈ యాధునిక గేయములకు లేవు. వీనిని జదివి యానందింపవలసినదే కాని, పాడువారెవ్వరును గానరారు.

ఈ బ్రతుకమ్మ గేయానుకరణములు చేసిన కవులలో బూరెల సత్యనారాయణమూర్తిగారే కాక, కొండూరి నారాయణగుప్త, నరసింహమూర్తి, వి.యస్. నరహరి, జగ్గయ్య, చెర్విరాల భాగయ్య మున్నగువారును గలరు.

ఈ యాధునికములగు బ్రతుకమ్మ పాటలను తెలంగాణమున రైళ్ళలోను, బస్సులలోను బాడుచు నమ్ముచుందురు. వీని ముద్రణము విచిత్రముగా నుండును. అఱచేతి వైశాల్యముననుండు పుస్తకములోఁ బదునాఱు పుటలలో నొక బతుకమ్మ పాట ముద్రింపఁబడును. ఇంగ్లండు దేశములోని ''Broadside Ballads'' ను మన బ్రతుకమ్మ పాటలతోఁ బోల్చవచ్చును.

ఈ ప్రకరణమునందలి ముఖ్యాంశముల నిట్లు సమీకరింప వచ్చును:- 'వీరగాథాచక్రములు, వీరగాథలు, వీరగాథానికలు' అను త్రివిధవ్యాప్తిగల సాంప్రదాయిక గాథాకవిత్వములోని వివిధ ప్రక్రియల ననుకరించుచు నాధునిక కాలమున 'బుఱ్ఱకథలు, జముకుల కథలు, సుద్దుల కథలు, తందనాన కథలు, బ్రతుకమ్మ పాటలు' అను ప్రక్రియలు పరిణమించినవి. ఈ యనుకరణ ప్రక్రియలలో నేఁడు 'బుఱ్ఱకథలు' విశేష ప్రచారమున నున్నవి. ఇవి బొబ్బిలివరుస కథలనుండియు, జంగంకథలనుండియు రాజకీయప్రబోధ మితివృత్తముగా 1942 ప్రాంతమునఁ బ్రభవించినవి. గుంటూరు మండలము వీని జన్మస్థానము.

తంత్రి+బుఱ్ఱ= తంబుఱ్ఱ> తంబుఱ. ఈ తంబుఱతోఁ జెప్పుకథలు 'తంబుఱ కథలు'. ఉచ్చారణమున నీ పదములోని 'తం' యను నక్షరము లోపించి, 'బుఱకథలు'గా మాఱి, శకటరేఫకు ద్విత్వము వచ్చి 'బుఱ్ఱకథలు'గా నయియుండును. లేదా గుమ్మెటలకు 'బుఱ్ఱలు' అను వ్యవహారము కొన్ని ప్రాంతములలోఁ గలదు. బుఱ్ఱలు వాయించుచుఁ జెప్పుకథలు కావున 'బుఱ్ఱకథలు' అయియుండ వచ్చును.

ఈ బుఱ్ఱకథలలో సాధారణముగా జంగంరగడ, సైసై వరుస, తందనాన వరుసలు ప్రయోగింపఁబడుచుండును. సర్వాయి పాపని కథ వరుస, జముకుల వరుస, శారద వరుసలు కూడఁ బ్రవేశపెట్టుట కలదు. శ్రీయుతులు సుంకర సత్యనారాయణ, వారణాసి సత్యనారాయణశాస్త్రి మున్నగువారు చేయితిరిగిన బుఱ్ఱకథా రచయితలు. ఈ బుఱ్ఱకథాగానమున గుంటూరులో నివసించు షేక్ నాజర్ అమోఘ ప్రజ్ఞాశాలి. ఈ వీరవైతాళికుఁడు ఆంధ్రప్రజలచేఁ గాలికి గండపెండేరమును దొడిగించుకొనిన 'బుఱ్ఱకథా పితామహుఁడు'. 1946-1948 మధ్యకాలములో భారత స్వాతంత్ర్యోద్యమ నాయకులపై బుఱ్ఱకథలు కోకొల్లలుగా బయలుదేరినవి. రాజమహేంద్రవరములోని కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు వారును, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ వారును బుఱ్ఱకథల నసంఖ్యాకముగా ముద్రించుచున్నారు.

ఈ బుఱ్ఱకథలలోఁ బ్రబోధాత్మకములు హెచ్చు. చారిత్రకములు పౌరాణికములు, వీరగాథాజన్యములు నను వర్గములకుఁ జెందునట్టి బుఱ్ఱకథలును గలవు. ప్రబోధాత్మకములగు బుఱ్ఱకథలలో రాజకీయ, జాతీయ, సాంఘిక ప్రబోధముల కుద్దేశించినవియుఁ, బ్రభుత్వ ప్రచారమున కుద్దేశించినవియుఁ గలవు.

హరిహరీ పదముల ననుకరించుచుఁ బుట్టిన ఆధునిక ప్రక్రియ 'జముకుల కథలు'. కాటమరాజుకథలకు అనుకరణములు 'సుద్దుల కథలు'. తెలంగాణామున బొబ్బిలివరుస కథల ననుకరించుచు 'తందనాన కథలు'ను, సాంప్రదాయికములగు బ్రతుకమ్మ పాటల ననుకరించుచు నాధునికములగు సంఘటనలపై బ్రతుకమ్మ పాటలును బయలుదేరినవి. ఈ వివిధ వీరగాథానుకరుణ ప్రక్రియల నీ క్రింది విధముగాఁ జూపవచ్చును:-




## జ్ఞాపికలు

1. *"బుఱ్ఱకథా పితామహ" బిరుదాంకితుఁడైన శ్రీ షేక్ నాజరు కంటె ముందుగా, 20వ శతాబ్ది రెండవ పాదములో భారత స్వాతంత్ర్యమునకుఁ బూర్వము నలుగురు మహానుభావులు ఈ బుఱ్ఱకథా ప్రక్రియను సుసంపన్నులు చేసినారని, నాజరుగారి బుఱ్ఱకథ దళములో వంతగానుండిన ప్రసిద్ధ జానపద కళాకారుఁడు శ్రీకర్నాటి లక్ష్మీనరసయ్యగారు (విజయవాడ) 22-3-2002 నాఁడు నాతోఁ జెప్పినారు:-*

   *"మొదటి వ్యక్తి:- కీ.శే. మొర్జంపాటి పోతువీరయ్య దేవరగారు (జంగము), గుంటూరు జిల్లా, సత్తెనపల్లి తాలూకా, 'రెంటపాళ్ళ' గ్రామములో నుండెడి వాఁడు. ఇతఁడు పుట్టుగ్రుడ్డి. ఇతనిని 'రెంటపాళ్ళ గ్రుడ్డి జంగము' అని పిలిచెడివారు. ఈయన కొడుకు లిద్దఱు ఈయన కథాగానమునకు వంతలుగా నుండెడివారు. జంగం కథాగానములలో ఈ గ్రుడ్డి జంగమును మించినవారు లేరు. ప్రజలను ఉఱ్ఱూతలూగించెడివాఁడు. నాయభిప్రాయములో నితఁడే నిజమైన 'బుఱ్ఱకథాపితామహుఁడు'. జంగంకథ నుండి బుఱ్ఱకథ పరిణమించినదనుటకు నీ 'రెంటపాళ్ళ గ్రుడ్డిజంగము' చక్కని యుదాహరణము.*

   *రెండవ వ్యక్తి:- కీ.శే. 'దొడ్డవరపు' వెంకటస్వామిగారు. 'దొడ్డవరము' ఈయన గ్రామము పేరు. నేటి ప్రకాశము జిల్లా ఒంగోలుకు సమీపములో నున్నదది. ఈయన ఇంటిపేరు 'అమృతమువారు'. ఈయన తెనాలి దగ్గఱ 'దావులూరు'లో స్థిరపడినారు.*

   *మూఁడవ వ్యక్తి:- కీ.శే. శిర్విశెట్టి సుబ్బారావుగారు, కృష్ణాజిల్లా, దివి తాలూకా, 'విశ్వనాథ కొత్తపల్లె'.*

   *నాల్గవ వ్యక్తి:- కీ.శే. కాకుమాని సుబ్బారావుగారు, గుంటూరు జిల్లా, బాపట్ల ప్రాంతము వాఁడు".*

   *మొదటి యిద్దఱి గాయకుల కాలములో 'జంగం కథఁ'గాఁ బిలువఁబడిన ప్రదర్శనము, తరువాతి యిద్దఱి కాలములో 'బుఱ్ఱకథ'గాఁ బేరు మార్చుకొనినది.*

2. *భారత స్వాతంత్ర్యమునకుఁ బూర్వము 'రెంటపాళ్ళ గ్రుడ్డి జంగము', దొడ్డవరపు వెంకటస్వామి, శిర్విశెట్టి సుబ్బారావు, కాకుమాని సుబ్బారావు- అను నలుగురు జంగంకథాగానము (బుఱ్ఱకథాగానము)లో వేసిన బాటలో పయనించిన షేక్ నాజర్, స్వాతంత్ర్యానంతరము (1947-1975 మధ్య) 20వ శతాబ్ది మూఁడవ పాదములో నఖండకీర్తి నార్జించినాఁడు. నిడుదవోలు అచ్యుతరామయ్యగారు (రాజమండ్రి), కుమ్మరి మాస్టారు (విజయనగరము), కమ్మ సోదరులు (కడప) నాజరు సమకాలికులైన కొందఱు ప్రసిద్ధ బుఱ్ఱకథాగాయకులు. 20వ శతాబ్ది నాల్గవ పాదములో (1975-2000 మధ్య) నిట్టల సోదరులు, బెనర్జీదళము (హైదరాబాద్), శ్రీమతి మహంకాళి దళము (కాకినాడు), పందు మాస్టారి దళము (అమలాపురము), గొఱ్ఱెల రాము దళము (రామచంద్రాపురము) ఒంగోలు సిస్టర్స్ దళము- మొదలగునవి ప్రముఖమైన కొన్ని బుఱ్ఱ కథాగాన దళములు.*

# పదునేడవ ప్రకరణము

# వీరగాథలు- రసపోషణ

**ఈ** సిద్ధాంత వ్యాసమున ఏడు ప్రకరణముల సమాహారమగు ద్వితీయ భాగములో 'శక్తి కథాచక్రము, పల్నాటి వీరకథాచక్రము, కాటమరాజు కథాచక్రము' అను తెలుఁగు వీరగాథావృత్తములను గూర్చియు, 'బొబ్బిలివరుస కథలు, పదములు, జంగంకథలు' అను వీరగాథలనుగూర్చియు, వీరగాథానికలు లేక లఘువీరగాథలను గూర్చియు, బుఱ్ఱకథాది వీరగాథానుకరణ ప్రక్రియలనుగూర్చియుఁ గూలంకషముగాఁ జర్చింపఁబడినది. ఇఁక నీ తృతీయ భాగమున 'వీరగాథల రసపోషణ, వీరగాథా కవిత్వములోని వారానువర్తనములు, వీరగాథల భాష, వీరగాథల ఛందోరీతులు, వీరగాథాగానము నందలి సంగీతము' అను విషయములు పరిశీలింపఁబడును.

## వీరరసము

వీరగాథలు వీరరసప్రధానములని వాని నామధేయమే చెప్పుచున్నది. నవరసములలో శృంగార వీరములు ప్రధాన రసములు. దృశ్యశ్రవ్య కావ్యములలో నీ శృంగార వీరములే అంగిరసములుగాఁ బ్రయోగింపఁబడవలెనని లాక్షణికులు శాసించిరి. ఈ రెండింటిలోఁ గూడ శృంగారముకన్న వీరమే గొప్పదని కొందఱు విమర్శకులు భావించుచున్నారు.[1] వీరమునకు స్థాయిభావము ఉత్సాహము; శృంగారమునకు స్థాయిభావము రతి. వీరములేని రతి శోభావిహీనము. శృంగారము యువతీయువకులు మాత్రమే అనుభవించి ఆస్వాదించు రసము. బాలురు వృద్ధులు దీనిని అనుభవింపఁజాలరు. 'బాల్యము అవిదిత కామము, వార్ధక్యము అనాదృతకామము' అని నిశ్చయింపఁ దగియుండుటచే, కామము జీవిత సాకల్యవర్తి యని చెప్పవీలులేదు. ఉత్సాహము స్థాయిగాఁగల వీరము అట్లు కాక, జీవిత పాత్రము నంతను అన్ని యవస్థలయందును ఏదోయొక రూపమున ఆశ్లేషించియే యుండుననుట అనుభవసిద్ధము.[2] శూరుల యుద్ధోత్సాహమే కాక, బాలురలోఁ బెద్దలయందును విద్యాసాధనమునందును జూపు శ్రద్ధాయుతమైన భక్త్యుత్సాహమును, వృద్ధులలో యోగతపోమోక్షాదుల సాధనమందుఁజూపు నుత్సాహమును గమనింపవచ్చును.

"వీరరసము ఉత్తమనాయకము. దీనికి స్థాయిభావము ఉత్సాహము. దీనికి అధిదేవత ఇంద్రుఁడు. వర్ణము హేమవర్ణము (గోమేధిక వర్ణమని నరసభూపాలీయము). ప్రతినాయకుఁడు ఆలంబన విభావము. వాని యుత్కర్ష యుద్దీపన విభావము. చాతుర్యము, ఆమంత్రణము (మిత్రాదులతో నాలోచించుట), స్థైర్యము, ప్రసాదము (ప్రసన్నత- అనఁగా నలజడిని బొందకుండుట) మొదలగునవి అనుభావములు. క్రోధము, అభిమానము, హాసము మొదలగునవి వ్యభిచారిభావములు. (ఈ వీరమున రౌద్రస్థాయియగు క్రోధము, హాస్యస్థాయియగు హాసమును వ్యభిచారులగును)."[3]

వీరశబ్దమునకుఁ గోశాదులలో నీయఁబడిన యర్థ విశేషముల నాధారముగాఁ జేసికొని కావ్యకళాతత్త్వ ప్రకాశికా కారుఁడు వీరరసము నిట్లు నిర్వచించినాఁడు: "వీరరసము- శక్తిమత్త్వమును, ధీరత్వమును, దురాకృత్య నిర్వాహమును, వ్యాపకత్వమును, చలనమును, చాలనమును, విహారమును, విషయ (భావ) గర్భితత్వమును, అభిలాషయును, ప్రేరకత్వమును, ధీరభాషణమును, నెట్టుకొనిపోవునట్టి లక్షణమును, మార్గదర్శకత్వ లక్షణమును, ప్రక్షేపణమును అనెడి అర్థవిశేషములు కలిగి, తదాలంబనభూతుఁడగు నాయకుని యందీ లక్షణములున్నియు మూర్తీభవించునట్లు చేయఁగలుగునని యూహింపవచ్చును. ఈ శబ్దార్థ విశేషముల నిరూపణముచేతనే తన్నాయకుని జీవితచర్యా స్వరూపములు తేటపడఁ గలవు కూడ."[4]

వీరరస నిర్వచనోదాహరణములనుబట్టి వీరమనఁగా యుద్ధ వీరమనియే పలువురు లాక్షణికుల యభిప్రాయముగాఁ దోఁచుచున్నది. కాని ఇటీవలి పరిశోధనలవలన ఈ రసమున నిరువదినాలుగు ప్రభేదములు గుర్తింపఁబడినవి. భరతుఁడు 'దానవీరము, ధర్మవీరము, యుద్ధవీరము' అను మూఁడు భేదములను మాత్రమే గుర్తించెను. ధనంజయుఁడు, భరతుఁడు చెప్పిన ధర్మవీరమును బరిత్యజించి, దానికి బదులుగా 'దయావీరము'ను బ్రతిపాదించెను. విశ్వనాథుఁడు, భరత ధనంజయుల మతములను సమన్వయ పఱిచి 'దానవీరము, ధర్మవీరము, దయావీరము, యుద్ధవీరము' అను నాలుగు భేదములను జెప్పెను. రసగంగాధరకారుఁడు 'యుద్ధ-దాన-దయా-ధర్మ-సత్య-పాండిత్య-క్షమా-బలవీరము'లని యెనిమిది భేదములను జెప్పెను. అచ్యుతరాయలు తన 'సాహిత్య సారము'లో వీరరసమున నిఱువది యొక్క భేదములను గుర్తించెను: "1) యుద్ధ, 2) దాన, 3)దయా, 4) ధర్మ, 5) సత్య, 6) విద్యా(పాండిత్య), 7) తపో, 8)బల (యత్న), 9) త్యాగ, 10) యోగ, 11) క్షమా, 12) జ్ఞాన, 13) సంపత్, 14) రూప, 15) కళా, 16) గాన, 17) అహింసా, 18) ఐశ్వర్య, 19) కవిత్వ, 20) శ్రద్ధా, 21) భక్తి వీరములు". 'వీరరసము' అను గ్రంథమున గూడ వేంకట సుబ్రహ్మణ్యముగారు పై ఇరువదియొక్క భేదములకును మఱి మూఁడు భేదములను జేర్చి, వీరరసమున నిరువది నాలుగు భేదములున్నవని తెల్పిరి. వీరు చేర్చిన ఇతర వీరములు: 'స్వాతంత్ర్య వీరము, యశోవీరము, మానవీరము'.

ఇట్లు వీరరసమున నిరువది నాలుగు భేదములున్నను దీనిలో యుద్ధవీరమునకుఁ బ్రత్యేకస్థానమున్నది. ఈ భేదములన్నింటను దీనిదే ప్రథమస్థానము. వీరగాథలలో నెక్కువగా యుద్ధవీరమే వర్ణింపఁ బడినది. వీరగాథలలోఁ బేరంటాండ్ర కథలను, జంగంకథలను పదములను, గొన్ని పౌరాణికకథలను దప్పించినచోఁ దక్కిన వన్నియును యుద్ధవీరప్రధానములే. సూక్ష్మముగాఁ బరిశీలించినచో యుద్ధవీరమునందే తక్కిన వీరములును గోచరించును. ఉదాహరణము నకుఁ బల్నాటి వీరకథాచక్రమున నీ క్రింది వీరములను గుర్తింపవచ్చును.

1. భట్టు రాయబారము– ధర్మవీరము.
2. నలగామ ధిక్కారము– మానవీరము.
3. ఇరుపక్షములవారి స్వీయబల నిరూపణము– బలవీరము.
4. నలగాముఁడు గజారూఢుఁడై వివిధ రాజబృందములతో రణమున కాయత్తపడుట– రణోత్సాహము లేక యుద్ధవీరము.
5. బ్రహ్మనాయని పక్షపు వీరులు యుద్ధమునకుఁ ద్వరపడుట– యుద్ధవీరము.
6. బ్రహ్మనాయఁడు బాలచంద్రునకు రణనీతిని బోధించుట– ధర్మవీరము.
7. బాలచంద్రుఁడు తన తల్లి ఐతమ్మతోఁ దాను మోక్ష పురుషార్థము తప్పఁ దక్కిన వన్నియును, సర్వశాస్త్రములను యుక్తవయస్సునందే చదివితిననుట– విద్యావీరము.
8. బాలచంద్రుఁడు తల్లికి వైరాగ్యమును బోధించుట. రేఖాంబ కూఁతురు మాంచాలకు వైరాగ్యమును బోధించుట– జ్ఞానవీరము.
9. బాలచంద్రుఁడు శత్రుసేన నుఱుమాడుట, నరసింగరాజుతో ద్వంద్వయుద్ధము చేయుట, అతని శిరస్సు నఱుకుట– యుద్ధవీరము.
10. బాలచంద్రుఁడు తన్ను విమర్శించిన తండ్రితో నభిమాన ముట్టిపడ గర్వాతిశయముతోఁ బలికిన పలుకులు– మానవీరము.
11. గురిజాల యుద్ధమున బ్రహ్మనాయఁడు నలగాముని క్షమించుట, కారెంపూడి యుద్ధమున కొదమగుండ్ల విప్రుల కోరికపై నలగాముని తిరిగి క్షమించుట– క్షమావీరము.[5]

ఇట్లే తక్కిన వీరగాథలలోను నీ వీరరస ప్రభేదములను గుర్తింప వచ్చును. కాటమరాజుకథలలో నెల్లిగడ్డపాటి పోట్లాట యంతయు యుద్ధవీరమే. వలురాజుకథలోను, సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజాదుల కథలలోను నాయా వీరులు శరణన్నవారిని రక్షించుటకై ప్రాణములను సహితము లెక్కింప కుండుట చిత్రింపఁబడినది. ఇది దయావీరమునకును ధర్మవీరము నకును నుదాహరణములు. బొబ్బిలివీరులు బుస్సీతోఁ బోరాడుట, దేసింగురాజు ఆర్కాటునవాబుతోఁ బోరాడుట మానవీరమున కుదాహరణములు. బుడ్డా వేంగళరెడ్డిగారి పాటలోను, డొక్కా సీతమ్మగారి పాటలోను దానవీరము, దయావీరము గోచరించును. పెద్దకాపుగారి కథ, పర్వతాల మల్లారెడ్డి కథ, మల్లికదేవమ్మ కథ, సిరియాళుని కథ,నిజలింగ చిక్కయ్య కథ మున్నగు వీరగాథలలో భక్తివీరము ప్రదర్శింపఁబడినది. పేరంటాండ్ర కథలలో ధృతి ప్రధానమైన ధర్మవీరమును, వీరగాథానికలలోని కట్టపదములలో నాత్మబలిదానము చేసిన స్త్రీల త్యాగవీరమును గోచరించును. రాజా రామేశ్వరరావు కథలో విద్యావీరము చూపఁబడినది. ఉయ్యాల వాడ నారసింహారెడ్డియు, అల్లూరి సీతారామరాజును ఆంగ్లేయులతోఁ బోరాడుట స్వాతంత్ర్యవీరమున కుదాహరణములు.

యుద్ధవీరమునకు బాలచంద్రుని కారెంపూడి యుద్ధవర్ణనను మించిన యుదాహరణము తెలుఁగు సాహిత్యమున మఱియొకటి లేదు. బాలచంద్రుఁడు తెలుఁగువారి అభిమన్యుఁడు! ఇతఁడు కారెంపూడి రణరంగమున నలగాముని చతురంగ బలములపై విజృంభించి వానిని తుత్తునియలు చేయుట లోకోత్తరముగా వర్ణింపఁ బడినది. మొదటఁ గాల్బలములను, బిమ్మట గజబలములను, నా తరువాత నశ్వబలములను రూపుమాపినాఁడు. బాలచంద్రుఁడు కాల్బలములను కసిమసంగుట యెంత అద్భుతముగా వర్ణింపఁ బడినదో చూడుఁడు:–

*"అతి సాంద్రమైవచ్చు నాసైన్యమెల్ల,*
*బాలచంద్రుఁడు చూచి భ్రాతలు తాను*
*శుష్కాటవుల నగ్ని సుడిసినయట్లు,*
*కోయని యార్చుచు కుప్పించి యురికి*
*బలముపై వ్రాలెను పౌరుషాధికత,*
*కుంతముల్ చేనంది గుదులుగా బొడిచి*
*కత్తుల చేతులు ఖండించివైచి,*
*మణికట్లు దునుమాడి మస్తకవితతి*
*ధరమీద దొర్లంగ దట్టించి నరికి,*
*మోచేతు లెడచేసి ముక్కులు చెక్కి*
*పక్కలు ఖండించి పాదముల్ నరికి,*
*దవడలూడగ బొడిచి దంతముల్ డ్రుంచి*
*కనుగ్రుడ్లు పగులంగ కర్ణముల్ వ్రాల,*
*బలువైన రొమ్ములు పరియలు గాగ*
*తొడలు తుత్తునుకలై తూగాడుచుండ,*
*జానువులూడంగ జంఘముల్ విరుగ*
*చీలలన్నియు వదలి చీకాకు నొంద,*

*ఇటువలె గొంతసే పెక్కువౌ తమిని*
*అనుజులతో గూడ ననిచేసి పిదప..."* [6]

ఇట్లు కాల్బలములను జంపిన తరువాత బాలచంద్రుఁడు నలగాముని గజబలంబును, నశ్వబలంబును నలినలి చేసినాఁడు:-

*"దంతావళంబుల దట్టంబు చూచి,*
*బాలుడు కోపంబు ప్రకటంబుగాగ*
*బలిమియై కుంభముల్ పగులంగమోది,*
*తొండముల్ తోకలు తునుకలు జేసి*
*మావంతులను గొట్టి మరణ మొందించి,*
*పైనున్న దొరలను పడిపోవ నరికి*
*దీర్ఘదంతంబులు తెగపడగొట్టి,*
*చెవులను కత్తితో చీలికల్ జేసి*
*పిల్లదంతంబుల పెకలించివైచి,*
*ఘనపదంబుల దున్మి కంఠముల్ నరికి*
*కొంతసే పిమ్మాడ్కి గురుశౌర్య మలర,*
*సమరంబు గావించి-సాహిణితతిని*
*చక్కాడ పైబడి సాహస గరిమ,*
*ఖడ్గకుంతంబులు కరముల బట్టి*
*పైనున్న రాహుత్త పటలిని చంపి,*
*తొడగిన జోళ్లన్ని తునుకలు జేసి*
*సింగిణి విండ్లను చిద్రుప లొనర్చి,*
*బాణతూణీరముల్ భగ్నంబు చేసి*
*ఖడ్గఖేటకములు ఖండించి మించి,*
*మెడలు రెండుగజేసి మేనులు చించి*
*ఎదురొమ్ములను లెస్స యీటెలు పొడిచి,*
*కొంకులు తెగగొట్టి ఖురములు దునిమి*
*బాలుడిటువలెను బవరంబు చేయ..."* [7]

## వీరము- పోషక రసములు

వీరరసమునకు రౌద్రము, అద్భుతము, శృంగారము పోషక రసములు. ఈ వీరము బీభత్సమునకుఁ బోషకము. భయానకము, శాంతము వీరమునకు విరోధిరసములు. వీరరసము ఉత్తమ ప్రకృతికమును, ఉత్సాహాత్మకమునునగు రసము (ఉత్సాహాత్మకో వీరః). పేరంటాండ్ర కథలవంటి యొకటి రెండు వర్గములు తప్పించినఁ, దక్కిన వీర గాథలన్నియు నుత్సాహాత్మకములే.

ఇట్లు వీరగాథలలో వీరరసమును తద్భేదములును ప్రాధాన్యమును వహించినను, పోషకరసములగు రౌద్ర బీభత్సాద్భుత కరుణాదులు అంగరసములుగాఁ దఱచు వర్ణింపఁబడుచుండును.

### వీరము-రౌద్రము:-

రౌద్రమునకు స్థాయి క్రోధము. 'శత్రుకృతాపచారేణ మనః ప్రజ్వలనం క్రోధః' అని ప్రతాపరుద్రీయము. ఈ క్రోధము యుద్ధవీరమున్న ప్రతివీరగాథలోను గోచరించుచుండును. శత్రువు చేసిన యపరాధములకు నాయకుఁడు కోపించుట వర్ణితమగు చుండును. పల్నాటి వీరగాథావృత్తమున దీనికిఁ జక్కని యుదాహరణ మున్నది. నాయకురాలు మందపోటు చేయింపఁగా బ్రహ్మనాయఁడు క్రుద్ధుఁడై గురిజాలను బొడుతునని ప్రతిజ్ఞపట్టును. ఈ సందర్భమున మలిదేవుఁడు శత్రుకృతాపరాధములను వరుసగాఁ జెప్పఁగా బ్రహ్మనాయఁడు క్రోధవివశుఁడగును.

*"క్రోధియై నాయురాల్ కోడిపోరునను,*
*ఈవు చూడగ కోడి నింద్రజాలమున*
*కట్టించి చంపెను ఖండించె గోవు,*
*మన లంకపోతును మందబోయిలను*
*వధియించి కాముడు వాలియున్నాడు,*
*ఇక నేమిచేయుచో యెరుగంగ రాదు*
*అన విని నాయుండు ఆరాజు కనియె,*
*'నీవేల తలరెదు నేనుండగాను*
*నీవెరుంగవు నన్ను నిఖిలంబు లెరుగు,*
*కావరుదయ్యె నా కామభూవరుడు*
*కాముని నణతును ఘనుడ, నీ యాన,*
*పోవలె గురిజాల పోటుకు నేను...*
*ఆవులపోటుకు నరసి గురజాల,*
*కోట సాధించెద కుంభిని యదర*
*రాజుల దొరలను రౌతుల నెల్ల,*
*లెంకకై కాముని లెంకల నెల్ల*
*పొంక మణచెద నెల్లి ప్రొద్దున' ననగ..."* [8]

రాయబారమునకు వచ్చిన అలరాజు, రాజ్యమునఁ బాలిచ్చుట కంగీకరింపని నలగాముని నాగమ్మను జూచి క్రుద్ధుఁడగుట:-

*"ఆ మాటలకు... అలరాజు*
*భగ్గుభగ్గున మండి బ్రహ్మాండమంటి*
*మిక్కుటంబుగ కోరమీసంబు గీటి*
*కుడిమీసమున్ దువ్వి (అలరాజు) గుడ్లెర్రజేసి*
*పెటపెట దంతముల్ (అలరాజు) పేటార్చి కొరికి"* [9]

బ్రహ్మనాయనిఁ గ్రుద్ధునిఁజేసిన శత్రుకృతాపరాధములు 'గురిజాల రాయబారము' కథా ప్రారంభమునఁ జక్కగాఁ జెప్పఁ బడినవి:-

*"కోడిపోరున వకటి, దోపుతో రెండు,*
*మందపోటున మూడు, మరి లంకన్నతో నాల్గు,*

*రాయబారముతో అయిదు, రాజుతో ఆరు,*
*ఏడింట బ్రహయ్య యేధిస్తయున్నాడు"* [10]

## వీరము– బీభత్సము:–

బీభత్సమునకు స్థాయిభావము జుగుప్స. 'అర్థానాం దోష సందర్శనాధిభిర్గర్హణా జుగుప్సా' అని ప్రతాపరుద్రీయము. యుద్ధవీరాదులలో నాయక రణోత్సాహ ఫలితముగా రక్తసిక్తమైన రణరంగాదులను వర్ణించునప్పుడు వీరమున కది అంగముగా నుండఁ గలదు. లాక్షణికులు బీభత్సమునకుఁ బోషకముగా వీరమును జెప్పిరి కాని, వీరమునకుఁ బోషకముగా బీభత్సమును జెప్పలేదు. ఏలయన బీభత్సము ప్రత్యక్షముగా వీరమును బోషింపదు; పరోక్షముగా మాత్రమే వీరమునకుఁ బోషకమగుచున్నది. రక్తసిక్తమై శవములతో నిండి జుగుప్సావహముగా నున్న రణభూమినిఁ జూచి, దానికిఁ గారకుఁడైన వీరుని వీరము నూహింపవచ్చును. 'ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట' లో యాదవరాజులు నల్లసిద్ధితోఁ జేసిన యుద్ధానంతరము రణరంగ మిట్లు వర్ణింపఁబడినది:–

*"చినిగిన డొక్కలు, చిదికిన తలలు,*
*పాఱేటి రక్తానఁ బడిన మొండాలు*
*వక్కలు ముక్కలై పరఁగ రణమందు,*
*బెదవులు దంతముల్ పెనగొని యుండెఁ*
*జెక్కిళ్లుఁ జెవులును జేతులు మఱియు,*
*మోకాటి చిప్పలు ముంజేతి వ్రేళ్లు*
*కనుగ్రుడ్లు నాదాద కండలు నుండుఁ,*
*బుఱ్ఱెలుఁ బునుకులు ప్రోగులై యుండెఁ*
*బండ్లసందును గఱచిపట్టి నాయకులు,*
*తఱచుగా రణమునఁ దలలు పడియుండె*
*బాకులు చేపట్టి పరఁగ విడువకను,*
*నటు ఒక్క ప్రాణాన నల్లాడు నరులు*
*మొన దెగిన హస్తముల్ మోపులై యుండెఁ,*
*గుమ్మరి చేసిన కుండల కుదురు*
*గూర్చినట్లు తలలు గుట్టలై యుండె,*
*గజములు నశ్వాలు కాలుబలములును*
*రణమందు నరలేక రాసులై యుండె"* [11]

ఈ వర్ణనలోని బీభత్సమునుబట్టి కాటమరాజాదుల శౌర్యము నూహింపవచ్చును. బాలచంద్రుని యుద్ధములోఁగూడ రణభూమి ఇట్లే జుగుప్సావహముగా వర్ణింపఁబడినది (చూ. పల్నాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రచురణము, పుటలు 470,471). ఇట శవసమూహముతో నున్న రణరంగము సముద్రముతోఁ బోల్పఁబడినది. ఈ బీభత్సవర్ణన బాలునిశౌర్యమునకుఁ బోషకముగా నున్నది.

గాథాకారులు పాడునప్పుడు కొన్ని బొబ్బిలివరుస కథలలో బీభత్సము వీరమునకుఁ బ్రత్యక్ష పోషకముగా నున్నట్లు వర్ణితమగుచుండును. ముద్రితమైనది కాక, మౌఖికప్రసరణమున నున్న దేసింగురాజుకథలో యుద్ధవర్ణన మిట్లున్నది:–

*"అద్దకుండ పెద్దపులి దొడ్లో బడినట్టు*
*పెయ్యలదొడ్లో పెద్దపులి పడిన సందము*
*ఎర్రోడైన జొన్నచేను ఇడగోసినట్లు*
*తాటికాయలు తరిగినట్టు తరుగుతొస్తడు*
*ఒక్కర్ని యిద్దర్ని బట్టుకు ఒక్క యేటుకు*
*అంతరబొయ్యే దాకటర్ల కిందికి నూకేది*
*పాలెగాళ్ల తలలు గొట్టి పందిరి పెట్టేది*
*గురికాళ్ల తలలు గొట్టి గుట్టలు పెట్టేది*
*అప్పుడు తిన్న పప్పుకూడు కుప్పలు తెప్పలు*
*అప్పుడు తాగిన కల్లూ సారయి వంకలు దొర్లేది*
*వేనిగి రకతం పీనిగి రకతం వేరై దొర్లేది*
*తణ్ణీ తణ్ణీ తణ్ణీమంటా అరవపీనిగ*
*తణీగాదు తల్చుకోండి తల్లిదండ్రులా*
*పానీ పానీ పానీ అంటా తురక పీనిగ*
*పానీ కాదు పేరు చూడు పేరు ముమ్మత్త*
*ఎత్తిగొట్టినా ఫిరంగిగుండ్లు పూలహారాలు*
*నల్లమందు నలుగుతవుంది నవాబు దండ్లోన*
*వేనిగ రకతం పీనిగ రకతం వసంత మయ్యేది"* [12]

ఇందు బీభత్సము వీరము పరస్పర పోషకముగా వర్ణింపఁబడినవని చెప్పవచ్చును. సిరియాళునికథలో మాయాజంగముచేఁ గల్పింపఁబడిన బీభత్సము చిఱుతొండని భక్తివీరమునకుఁ బోషకముగా నున్నది. కన్నబిడ్డను జంపి, కూరవండి, తలపండు రోటిలో వేసి, మెత్తగా దంచుచుఁ గంటనీరుపెట్టకుండఁ, గుమారుని చేష్టలను రోకటిపాటగాఁ బాడవలెనని మాయాజంగము శాసించెను. జంగమభక్తితత్పరుఁడగుఁ జిఱుతొండఁడును నతని భార్యయు నీపనిని జేసిరి. కావుననే ఇట జుగుప్స భక్తివీరమునకుఁ బోషకమనుట.

వీరగాథానికలలోఁగూడ నీ బీభత్సరసవర్ణన యున్నది కాని, అది నాయకుని వీరమునకుఁ బ్రతిబంధకముగా నున్నది. 'కారిన రక్తమును గడవలకుఁ బట్టుట, చిట్లిన రక్తమును సీసాలకుఁ బట్టుట' మున్నగు రీతిలో నుండెడి ఇందలి బీభత్సము వీరుఁడు చేసినది కాదు; శత్రువు లీ వీరునిఁ జంపి చేసిన బీభత్సము. కావున నిట బీభత్సము వీరమునకు విరోధిరసముగాఁ బరిణమించినది. అయినను నిది కన్నీటిపాట (coronaches) లను వర్గమునకుఁ జెందిన వీరగాథానికలలోఁ బ్రధాన రసమగుఁ గరుణమునకుఁ బోషకముగనే యున్నదని చెప్పవలెను.

**వీరము –కరుణము: –**

ప్రతినాయకగతమగు కరుణము నాయకుని యుత్సాహము నకుఁ బోషకమగును. బాలచంద్రుఁడు రణరంగమున వీరభద్రుని వలె విలయతాండవ మాడుచుండఁగా, శత్రుసైనికులు కొందఱాతనిని బ్రతిమాలుచు నేడ్చుచున్నారు. ఇట వీరి కరుణము బాలచంద్రుని వీరమునకుఁ బోషకమగుచున్నది: –

*"పారిపోవగలేక బ్రతుకుపై నాస,*
*బ్రతిమాలుచుండెడి బలముల గుంపు*
*'ఇటువంటి జగడంబు లెన్నడే మెరుగ,*
*మెటుబోదు'మని భీతి నేడ్చెడువారు*
*'ఆలుబిడ్డలబాసి యన్నంబు కొరకు,*
*వచ్చితి మీ నేల వ్రాసెను చావు'*
*అని దుఃఖపడుచును అసురుసు రనుచు,*
*విధిలేక ప్రాణముల్ విడిచెడువారు*
*బహుదినంబులు మేము పాలేరుచేసి,*
*ములుకోలలెల్లను ముంజూర్ల దోపి*
*పణతులు దిట్టిన పడలేక వచ్చి,*
*నెలలేదు మా కొల్వు నిత్యభత్యంబు*
*మాత్రమే యెక్కువ మాకేమి లేదు,*
*బోయవారము మేము పూర్వంబు నందు*
*భుజముల కాయలు పూని కన్గొనుడి,*
*'పగవారు మిముగని పారిపోవుదురు*
*మీకేమి భయమని' మెలత నాగమ్మ,*
*బాగుగా నమ్మించి పంప వచ్చితిమి*
*జీవముల్ దక్కిన చిన్నల గలిసి,*
*బ్రతికెదము బహుకాష్ఠ భార విక్రయత*
*మీరు పిల్చినవేళ మేము వచ్చెదము'*
*అని మొక్కుచును జీవితాశను విడక*
*మగసిరి విడిచిన మానహీనులును..."* [13]

వీరగాథానికలలోఁగూడ నిట్లు బ్రతిమాలుట కలదు. కాని యట నాయకుఁడే తన్నుఁ జంపఁబోవు శత్రువులను బ్రతిమాలుటచే వీరము రసాభాసయైనది. నాయకుఁడు ధనము నిచ్చెదననియుఁ, దన్నుఁ జంపవలదనియు బ్రతిమాలుచు శత్రువులకుఁ జేతులెత్తి మ్రొక్కఁగా, శత్రువు లాతని చేతులను నఱికినట్లుగా వీరగాథానికలలో వర్ణింపఁబడుచుండును. ఈ కరుణరసవర్ణనమంతయు నాయక గతమగుటచే వీరమునకు విరోధమగుచున్నది.

ప్రతినాయకగతమగు కరుణయే కాక, నాయకగతమగు కరుణము కూడ నొక్కొక్కప్పుడు వీరమునకుఁ బోషకమగుచుండును. అభిమన్యుని మరణమునకై అర్జునుఁడు విలపించును. కాని వెంటనే ఆ శోకము సైంధవునిపైఁ గ్రోధముగా మాఱిపోవును. ఇట్టి యుదాహరణములుగూడ వీరగాథలలో నుండుట ముదావహము. పల్నాటి వీరకథలలో నాగమ్మ మదపోటు జరిపించి లంకన్నను జంపించినది. ఆ లంకన్న మరణమునకై బ్రహ్మనాయఁడు మిక్కిలిగ శోకించెను: –

*"మందలోనికి వచ్చి మదనుడు బ్రహ్మ,*
*వాలిన మన్నీల వరుసను జూచి*
*వగచుచు లంకన్నవద్ద కూర్చుండి,*
*'ఒరిగితివి లంకన్న; యొంటిగానీవు*
*ఏమని చెప్పుదు నేమనిపోదు,*
*ఏలిక ముఖము నే నేమని చూతు*
*సుతునిగా భావించి శూరుడ! నిన్ను,*
*పెంచుకొంటిని నేను ప్రేమతో నెపుడు*
*మందలో నిన్నిట్లు మడియంగ జేసి,*
*కదలంగ నాకెట్లు కాళ్లాడగలవు*
*పలుకరా! నాతోడ పంతమ్ము విడిచి"* [14]

ఈ మందపోటుతోను, లంకన్న మరణముతోను బ్రహ్మనాయఁడు విపరీతమగు శోకభరమునఁ గ్రుంగిపోయెను: –

*"మందాది నుండంగ మందను పొడిచి,*
*తనవాని చంపిన తలవంపులాయె*
*నని బ్రహ్మనాయుండు నాత్మలో గుంది,*
*తల్లికి మ్రొక్కదు తనమదిలోన*
*తలచడు చెన్నుని తనరాజు గొనడు,*
*కొడుకు బాలునిమీద కృపయింత లేక*
*పళ్లెమున గుడువడు పగలును రేయి,*
*పలుమారు లెంకకై పలువరింపుచును"* [15]

నాకుఁ గారెంపూడిలో లభించిన శ్రీనాథకృతమగు నొక తాళపత్రప్రతిలో లంకన్న మరణించిననాఁటి రాత్రి బ్రహ్మనాయఁడు తన గుడారములోఁ బట్టెమంచముపైఁ బరుండి, నిండుగా ముసుఁగు పెట్టుకొని, దుఃఖావేశమున 'లంకన్నా, లంకన్నా' యని పలుమార్లు పలువరించెనని చెప్పఁబడినది. ఇది మిక్కిలి సహజముగా నున్న శోకవర్ణన: –

*"ఆ రాత్రి వీరులు అటు చింతనుండి,*
*ఆ సమయంబున అంత బ్రహ్మన్న*
*మనసున చెన్నుని మరువక తలచి,*
*శంఖుచక్రాల గుడారు చెలువు దెత్తించి*
*ఆ గుడారులోన అపుడు బ్రహ్మన్న,*
*పట్టెమంచముపైని పవళించి తాను*
*నిండారుగా ముసుగు నేర్పు... గమ్మి,*
*పలుమారు 'లంకన్న' యని పలువరించి"* [16]

ఇట్లు లంకన్న మరణమునకై శోకించి క్రుంగిపోయిన బ్రహ్మనాయని విషయమున నింత కరుణరసము వర్ణింపఁబడినను, నిదియంతయు నొక్కమాఱు క్రోధముగా మాఱిపోయి, అతఁడు గురిజాలపై దండెత్తునట్లు చేసినది. అందచే నాయకగతమగు నీ కరుణము ఆ నాయకుని వీరమునకే పోషకమైనది:–

*"పలుమారు లంకకై పలువరింపుచును*
*గురిజాల పొడుతునని క్రోధంబుతోడ*
*భారమౌ వ్రతమును పట్టి నాయుండు,*
*పగగొన్న సింహంబు భాసిల్లు భంగి*
*కైలాస బండపై కదుమించి యుండ"* [17]

లంకన్న మరణించిననాఁడు అంతగా దుఃఖించిన బ్రహ్మనాయఁడు మఱునాఁడు ఉదయమున మలిదేవుని సభకువచ్చి, ఆతనితో నిట్లనెను:–

*"వినవయ్య రాజేంద్ర! మలిదేవరాజ!*
*మందలు పొడిపించి మరియు నాగమ్మ*
*కొమరుగా నిప్పుడు కూర్చున్న దదియు,*
*సెలవియ్యి రాజేంద్ర గురిజాలకేగ*
*మసలక గురిజాల మరువక పొడుతు,*
*మీ భావయ... పెరుమాళ్లరాజు*
*నతి వేగమున నేను చంకప విడువ,*
*అట్టి గురిజాలకు నటు వుత్తరమున*
*అర్జులగుంటలోకి... రక్తంబు,*
*నిండిన దనుకను నే నిట్లు విడవ*
*విడువను ఈ పట్టు ఇచ్చులో నేను,*
*ఇటు చేయకుంటినా ఈ సమయమందు*
*సెలవియ్యి రాజేంద్ర! సెలవియ్యి రాజ!"* [18]

లంకన్న మరణించిననాఁటి రాత్రియందున్న కరుణరస వాతావరణము, మఱునాఁడు ఉదయమున వీరరసముగాఁ బరిణమించె ననుటకిది చక్కని లక్ష్యమగుచున్నది. కాఁబట్టి నాయకగతమగు శోకముగూడ నొక్కొక్కప్పుడు క్రోధముగాఁ బరిణమించి వీరమున కుత్కర్ష నాపాదించుననుట సత్యము.

### వీరము–భయానకము:–

వీరమునకు భయానకము విరోధిరసముగా లాక్షణికులు చెప్పిరి. భయానక స్థాయి భావము భయము. ఈ భయము ఉత్తరుని యందువలె నాయకాశ్రితమైనచో వీరమునకు విరోధియే యగును. కాని శత్రునాయకాశ్రితమగు భయము వీరమునకు అంగమగుననుటలో సందేహము లేదు. 'అలరాచమల్లుగారి గురిజాల రాయబారము' అను కథలో కన్నమనేఁడు భయంకర వేషముతో గురిజాలసభలోని కుఱుకఁగా, నలగాముని గుఱ్ఱములు, ఏనుగులు గొలుసులు త్రెంచుకొని పరుగుపెట్టినవనియు, నాయకురాలు గడగడ వణఁకినదనియు వర్ణింపఁబడినది. ఈ భయము కన్నమనేని వీరమునకుఁ బోషక మగుచున్నది. కన్నమనేఁడు:–

*"ఆరుమూళ్ల కంచుటరిగె యెడమ హస్తమున బట్టి*
*పన్నెండు మూళ్ల భైరవకత్తి కుడిహస్తమున బట్టి*
*దిగ్గున లేచి కన్నమ ధీరత నిలచి*
*హహోయని చెప్పి అరిగె మీద దెబ్బ అటు బడవైచి*
*సభాకచ్చేరులో కన్నమ ధూకుచున్నాడు*
*ధూకేటప్పంటికి కన్నమనేడు ధాకాకు*
*నలగామరాజు అశ్వములు నాలుగుకాళ్లు పంబదన్ని*
*లద్ది పంచితము దిబ్బలుగ పెడుతయున్నాయి*
*కన్నమనేడు ధాకాకు నలగామరాజు ఏనుగలు*
*గొలుసులు తెంపుకొని నల్లకొండలకు పారిపోతాయి*
*కన్నమనేడు ధాకాకు నాయకురాలు గద్దె గడగడ వణకి*
*నాయకురాలి పారాలు బరాబరులుగా తెగుతయున్నాయి*
*తెగి నాయకురాలు గడగడ వణకి*
*గురిజాల కోటలో దాగుచున్నాది"* [19]

ఇట్లే తెలంగాణములోని 'మియాసాబ్ కథ, పండుగ శాయన్న కథ' మున్నగు కిన్నెరకథలలోఁగూడ శత్రుసైన్యములు భయపడి పాఱిపోవుట వర్ణింపఁబడినది. బాలచంద్రుని యుద్ధమున నతనిఁ గని భయమంది వేగముగాఁ బాఱిపోయెడి పిఱికిభటసమూహము వర్ణింపఁబడినది. రణరంగమునఁ దనసైన్యములను దుత్తునియలు చేయుచు వీరవిహారము చేయుచున్న బాలునిఁగని నరసింగరాజు మేనఁ గంపము భయము పుట్టినవి:–

*"కనుగొని నరసింగు కంపంబు గదుర,*
*తలయూచి శ్రీహరి దలచి నెమ్మదిని*
*వ్రేలిడి ముక్కుపై వెరగంది కుంది,*
*'ఇతడు బాలుండని యేలాగు పలుక*
*శూరత బలముల సుడివడ గొట్టె,*
*ఇతనితో పోరాడ నేది నా బలము*
*గ్రక్కున మాయన్న కడకేగి దెత్తు'*
*అని భయంబున నేగె నన్నను జూడ".* [20]

ఈ నరసింగుని భయవర్ణన బాలచంద్రుని వీరమునకుఁ బోషకమగుచున్నది. అట్లే కోడిపోరు తరువాత జరిగిన కన్నమనేని యుద్ధమున గురిజాల పౌరులు బ్రహ్మన్న శౌర్యమునకు గడగడవణఁకి, పరిపరివిధంబుల వాపోవుచుఁ దమ్ముఁదాము దూషించుకొనుచు భయవిహ్వలులైరి. ఇది బ్రహ్మన్న వీరమునకు ఉత్కర్షము నాపాదించు

చున్నది. నాకు లభించిన 'అలరాజు రాయబారము' అను తాళపత్ర గ్రంథమున, నలరాజు గురిజాల పోరుబయళ్లలో డేరానెత్తించి భేరివేయింపఁగా **'గురిజాల పట్నము బెదరె నట్టిట్టు, తల్లడపడి నాయకురాలు తత్తరపోయె'**నని యున్నది. అలరాజు తన సూర్యభేతాళమను సురియ ఝళిపింపఁగా, గురిజాల పోరుబైళ్లలో స్వాతిమెఱపులు మెఱసెనఁట. శత్రునాయకాశ్రితమగు నీ భయానక వర్ణనలోఁ గొంత హాస్యమును తొంగిచూచుచుండుట సహజము.

## వీరము-హాస్యము:-

యుద్ధవీరాదులయందు నాయకుని యుత్సాహాతిశయమును గాంచి శత్రువులు భయముచే వణఁకుటయే కాక, ప్రాణముల యందాశచేఁ జేయు కొన్ని చేష్టలలో హాస్యము కాననగును. (ఈ హాస్యము భయానక వర్ణనమందును గొంత చూపట్టునని చెప్పి యుంటిని.) బాలచంద్రుని ధాకకు నిలువలేక చచ్చినవారు చావఁగా, మిగిలినవారు నలుదెసలకుఁ బరుగెత్తుచుఁ, బ్రాణములపైఁ దీపిచే వారు చేసిన పనులు కొంత హాస్యజనకములుగా నున్నవి:-

***"కూడదోలిన బంట్లు గుంపులై చెదరి,***
***చాలించి రణమును చనియెడువారు***
***చనలేక భయమున చచ్చినవారి***
***మీద తోసుకపడి మెదలనివారు***
***చచ్చిన విధమున సమరోర్వియందు,***
***పలుకక యూరక పడియున్నవారు***
***చచ్చిన గజముల చాటున డాగి,***
***పందతనమ్మున పడియుండువారు***
***పెండ్లాల దలచుక బిట్టేడ్చువారు,***
***వల్మీకముల మీద వసియించువారు***
***గడ్డిలో జొరబడి కదలనివారు"*** [21]

కాటమరాజుకథలలోఁగూడ నిట్టి యుద్ధభీరువుల వర్ణన లున్నవి. ఇట్టి వర్ణనలలో వాక్చేష్టల వికృతికి సంబంధించిన హాస్య ముండును. భట్టురాయబారముకథలోని యర్థసంబంధమగు వికృతి గల హాస్యము, నల్లసిద్ధి-కాటమరాజుల శౌర్యమునకుఁ బోషకముగాఁ గొనసాఁగినది. దేసింగురాజుకథలో దేసింగుశౌర్యముముందు నిలువలేక తోండ్రమల్లు భయపడుచు భయపడుచు, దేసింగురాజు వైష్ణవుఁడు కావునఁ దానును వైష్ణవవేషమును ధరించినచోఁ జంపక విడిచిపెట్టునని భావించి, యా వేషమును ధరించి పాఱిపోవు సందర్భమునఁ జక్కని హాస్యమున్నది. వైష్ణవనామమును బెట్టుకొనుటకు యుద్ధభూమిలో నతఁ డుపయోగించిన పదార్థములు చూడుఁడు:-

***"పూని యెంగిలి యుమిచి సున్నమున పోసగ నామమేసి***
***యేనుగు నెత్తురు నడినామముగా మానితముగ వేసి"***

ఇట్లు ప్రతినాయకగతమగు హాస్యము గూడ నాయకుని వీరమునకుఁ బోషకమగుచున్నది.

## వీరము-శృంగారము:-

వీరగాథలలో శృంగారము చాలఁ దక్కువగ వర్ణింపఁబడు చుండును. కథావశమున వీరరస నాయకునకు నాయికా సంబంధము కలిగినప్పుడు, వీరరసాంగభూతముగా శృంగారము సంధింపఁబడును. పల్నాటి వీరకథాచక్రమున పెద్దన్న బాదరాజు పెండ్లికథ, మలిదేవుని పెండ్లి (రాచగావుకథ), పేర్నీడు చందవోలులోని పాపసానిని రమించుట (దక్షిణాది యాత్ర కథ), బాలచంద్రుఁడు సబ్బసానిని గూడుట, భార్యయగు మాంచాలతో సల్లాపములాడుట (బాలునికథ) మున్నగు నవన్నియును వీరమునకును సంధింపఁబడిన శృంగార రసవర్ణనలుగా గ్రహింపవచ్చును. పరశురాముని కథాచక్రమున జమదగ్ని మాయజోగి జంగమయ్య వేషమునఁబోయి రేణుకను బెండ్లాడి వచ్చుటకూడ నిట్టిదే. దేసింగురాజు కథ, పెద్ద బొబ్బిలిరాజు కథ, సదాశివరెడ్డి కథ మున్నగు వానిలో వీరదంపతుల ఉత్తమ శృంగారమున్నది. బంగారు తిమ్మరాజు కథలో రంగసాని ప్రణయము వేశ్యాశృంగారము. పల్నాటి వీరకథలలో పేర్నీఁడు-పాపసాని శృంగారము, బాలుఁడు- సబ్బసాని శృంగారము వేశ్యాశృంగారములు. తక్కినవి దంపతుల ఉత్తమ శృంగారములే. బాలుఁడు- మాంచాల శృంగారము: అతిలోక సుందరివలె నలంకరించుకొని వచ్చిన మాంచాలను జూచి బాలుఁడు-

***"ఎక్కడ సౌందర్య మెంత యొయ్యార,***
***మేమని యెన్నుదు నీ చెలువ చెలువు***
***నరలోక సురలోక నాగలోకముల,***
***సరిలేరు నెలతకు సౌందర్యమునను"*** [22]

అని యాశ్చర్యపడి, తన వేశ్యాలోలత్వమును నిందించు కొనుచుండగా-

***"అని చింత చేసెడి ఆ బాలుజేరి,***
***మంచాల గూర్చుండె మక్కువతోను***
***బాలుండు మోహంబు ప్రకటంబుగాగ,***
***చేవేగమున చీరచెర గొడిసిబట్టె***
***పట్టిన నా చీరపై నున్నయట్టి,***
***ముత్యాల చేరులు మొదటికి తెగెను***

.................................

***'చింతింపవలదు నీ చిత్తంబులోన,***
***అంతకు మిక్కిలి నమరింతు చీర'***
***అని లేచి మోహంబు నాత్మలో నణచి,***

*చెక్కులు కరముల చెన్నుగా నిమిరి*
*అక్కున జేర్చుక నతివను తాను..."* [23]

మాంచాల-బాలచంద్రుల శృంగారము రసాభాసమైనను, నిది బాలుని వీరమునకుఁ బోషకముగాఁ బరిణమించినది. (రసాభాసము గూడ రసమే యని కొందఱ మతము.) తన దివ్యసౌందర్యమునకు ముగ్ధుఁడై శృంగారరసమునఁ దేలియాడ నుంకించిన భర్తను నిలువఁ బెట్టి, రణోన్ముఖునిఁ గావించిన మహాసాధ్వి మాంచాల!

జారిణీశృంగారముగూడ వీరుల కుద్దీపనమే యనవచ్చును. యుద్ధమునకేఁగు వీరభట సమూహము వెంబడి వేశ్యలుగూడ వెడలెడి యాచారము గలదు. ఇట్టి వేశ్యలను 'దండు పాపలు' అనియు, 'దండు ముండలు' అనియుఁ బిలిచెడివారు. యుద్ధమున నలసిపోయిన వీరుల కీ వేశ్యలు ఉత్సాహము నిచ్చెడివారు. పల్నాటి యుద్ధమున బాలచంద్రుఁడు యుద్ధమునకుఁ దరలిపోవుచు సబ్బసాని దగ్గఱకు వెడలి, ఆమెను దనతో రమ్మని కోరును. ఆమె కపట శృంగారము నభినయించి, బాలుని యొద్దనున్న ధనమును గుంజి, యుద్ధమునకు రానని చెప్పును. వేశ్యాశృంగారమున కీ సబ్బసాని వృత్తాంతము చక్కని యుదాహరణము (చూ. పల్నాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రచురణము, పుటలు 399, 400).

## వీరము- అద్భుతము:-

అద్భుతరసముయొక్క స్థాయిభావము ఆశ్చర్యము. జానపదులకు అద్భుతరసము నెడఁ బ్రీతి హెచ్చు. అందుచేఁ బ్రతికథలోను నెంతయో కొంత యద్భుతరసమును జొప్పింపక మానరు. అద్భుతరస ప్రధానములగు కథలలో ఈ రసముండుట సహజము. కాని జానపదులు దీనిని జారిత్రక సత్యములును, వీరరస ప్రధానములును నగు కథలలోఁగూడఁ బ్రవేశపెట్టుట కలదు. ఆశ్చర్యము దీని స్థాయిభావము. అతిమానుషములును నలౌకికములును నగు కార్యములు చేయుటవలన నీ యాశ్చర్యము జనించును. అసలు, వీరుల యుద్ధ సాహసాదులే సాధారణ మానవుల కాశ్చర్యమును గలిగించును. ఇట్టి వీరునకు అలౌకిక చర్యలు గూడ నాపాదింపఁబడినచో నతని వీరమునకు దైవత్వము సిద్ధించును. అతఁడు దేవుఁడుగాఁ బూజింపఁబడును. పల్నాటి యుద్ధమున బ్రహ్మనాయఁడు మహాశూరుఁడు. ఈతని వీరమునకు అద్భుతరసము జోడింపఁబడినది. అందుచే నితఁడు విష్ణ్వంశ సంభూతుఁడుగా భావింపఁబడి, యాతని నడ్డువారెవ్వరును లేరని తలఁపఁబడినది. బ్రహ్మనాయఁడు చచ్చినవారిని దిరిగి బ్రతికించుట, శవముల శిరస్సులచేఁ బలికించుట చేసినాఁడు. నాఁటి రేణుకయే శీలమ్మగా జన్మించెననియు, నా పరశురాముఁడే బ్రహ్మనాయఁడుగా నవతరించె ననియు భావింపఁబడినది. బ్రహ్మనాయని యద్భుతశక్తు లిట్లు వర్ణింపఁబడినవి:-

*"నిప్పులయందున నీరుయందునను,*
*ఆరునొక్క ఘడియ నతడుండువాడు*
*చవిచూడకనె రుచుల్ చవిగొన్నవాడు,*
*చూడకనె లోతులు సొరది గనువాడు*
*మూడామడ ముచ్చట ముందు గనువాడు,*
*ఏడామడ ఏకాంతము ఎరిగినవాడు*
*పాయక పరుగులు పరగ గనువాడు,*
*షోడశ కళలచే శోభిల్లువాడు*
*పదునొకండవ అవతారము పరగున యెత్తు,*
*మసలక రుషివంశమున మానక పుట్టు*
*నరలోకమునకును నాయుడై యతడు,*
*జన్మించె నిప్పుడు జగము లెరుగగను"* [24]

అంతేకాదు, బ్రహ్మనాయఁడు 'విషవాక్కు అమృతవాక్కు కలిగిన వాడు; పొమ్మన్నవారికి పోకలు గలవు; రమ్మన్నవారికి రాకలు గలవు"[25]

ఇట్లే కాటమరాజుకథలలో బొల్లావు, భక్తిరన్న, పల్లికొండ మొదలగువారు అలౌకిక శక్తిసంపన్నులుగా వర్ణింపఁబడిరి. పోచయ్య రణరంగమునఁ దాను నఱికిన మూఁడు శత్రుశిరస్సులను బలికించి కాటమరాజుచే స్తుతింపఁబడెను. పల్నాటి వీరకథలలో అలరాజును, బంగారు తిమ్మరాజు కథలో బంగారు తిమ్మరాజును దేవుని సహితము గడగడలాడించిన వీరులుగా వర్ణింపఁబడిరి. పెనుకొండ కేఁగుచున్న బంగారు తిమ్మరాజునకు వేంకటేశ్వరుని యెదుట దుశ్శకునము లయ్యెను. అతఁడు కోపించి, కత్తిదూసి, వేంకటేశ్వరుని ఖండింపఁ బోవును. అప్పుడు వేంకటేశ్వరుఁడు గడగడ వణఁకి మాయమయ్యెనఁట.

*"వెంకటేశుని కండ్లజూచెనే బాబు తిమ్మరాజు*
*కళ్ల నిప్పులు రాలుతు తాను కత్తి బట్టినాడు*
*నరుకుదు నిన్నూ వెంకట్రెడ్డీ! నాలుగు ముక్కలుగా*
*నిన్నూ చంపీ నేనే చస్తూ వో వెంకట్రమణా*
*గడగడ వణకి మాయంబాయెను తిరుపతి వెంకన్నా*
*పెనుగొండా వెళ్లీ మేమూ మళ్లీ వస్తాము*
*కంచి గుళ్లూ త్రవ్వి మేము ఏట కల్పుతాము*
*రాజు మాటలకు బయపడ్డాడు వెంకట్రమణయ్య"* [26]

ఇట్లు నాయకగతమైన అద్భుతరసము ఆతని వీరమునకుఁ బోషకమగుచున్నది.

పరశురాముని కథలలోఁ గూడ నాయకపరముగా నద్భుతము వీరమునకు అంగరసముగాఁ బలుచోట్ల వర్ణితమైనది. 'పరశురాముని జననము' అను కథలో జమదగ్ని కడనున్న కామధేనువు కార్తవీర్యార్జు నుని సైన్యముపైఁ బడఁబోవుటకుముందు ఱాతిపర్వతమునకుఁ బోయి, డెక్కలు కొమ్ములు పదును నూఱుకొన్నదఁట! అడవిలోఁ

బారవేయఁబడిన పసిబాలుఁడగు పరశురాముఁడు, తన్ను భక్షించుటకై రామలక్ష్మణులను భయంకరమగు రాబందులు రాఁగా, నతఁడు వానినదలించి, తన బొడ్డును ద్రెంచి వాని కాహారముగా వేసెనఁట! ఆ బొడ్డును **'కోటివేల రాబందులు పైపక్క తింటూంటే, కిందిపక్క పురుగులు పడుతోం'**దఁట! కన్నులు తెఱవని పసికూనగా నున్నప్పుడే ఇంత శక్తిమంతుఁడు కాఁగాఁ, బెరిగి పెద్దవాఁడైన పరశురాముఁడెంత శక్తిసంపన్నుఁడగునో దీనినిబట్టి యూహింపనగును. పరశురాముని పితామహుఁడగు సత్యగౌతుని తపోవీరముగూడ నద్భుత రసాంగముతోఁ జెప్పఁబడినది: సత్యగౌతుఁడు **"... నిలువారా చెదపట్టేసి ఉన్నాడు. ముక్కున చెముడు కాకులు గూళ్లుపెట్టి పిల్లలు చేస్తున్నాయి. చెవిలో సాలెగూళ్లు గుడ్లుపెట్టి పిల్లల్ని చేస్తున్నాయి. తన తండ్రి పాపకర్మను బాపుకొనుటకై మట్టిలో మట్టి అయిపోయి తపస్సు చేస్తున్నాడు."** [27]

అద్భుతరసము నాయకగతముగా కన్న, ప్రతినాయకగతము గానే యెక్కువ వర్ణింపఁబడుచుండును. అప్పుడుగూడ నది నాయకుని వీరమునకు ఉత్కర్షమునే కలిగించును. ఉదాహరణమునకు బాలనాగమ్మకథలోఁ బ్రతినాయకుఁడగు మాయల ఫకీరు మొదట నద్భుతశక్తిసంపన్నుఁడుగాఁ జిత్రింపఁబడినాఁడు. ఇట్టి యద్భుత శక్తిసంపన్నుని బాలవద్దిరాజు చంపివేసినాఁడు. అనఁగా నితఁడు మాయల ఫకీరుకన్న గొప్పవాఁడని తేలుచున్నది. కావున నాయకుఁడగు బాలవద్దిరాజు శౌర్యమునకు ఫకీరువాని యద్భుతశక్తి యుత్కర్ష నాపాదించినది. నాయకోత్కర్ష చిత్రణయందిది యొక పద్ధతి. పరశురామునికథలలోఁగూడ నీ పద్ధతి యవలంబింపఁబడినది. కార్తవీర్యార్జునుని ఆకారము, చేతులు, కోపము, అలౌకికశక్తి మున్నగునవి ముందుగఁ జెప్పఁబడినవి. అతడు చేసిన అద్భుత కార్యములును వర్ణింపబడినవి. ఈ కార్తవీర్యార్జునుఁడు తన చిటికెనవ్రేలి కొనగోరు నేఁబది యామడలు పెంచి, ఆ గోరుతో నరణ్యమునఁ దపస్సు చేసికొనుచున్న జమదగ్ని శిరస్సు నుత్తరించెనని 'పరశురాముని జనన' మను కథలోఁ జెప్పఁబడినది. ఇంతటి యద్భుతశక్తిసంపన్నుఁడగు కార్తవీర్యార్జుననిఁ బరశురాముఁడు చంపుటచే నాతని శౌర్యమునకు ఉత్కర్షము కలిగినది.

వీరగాథలలో వర్ణింపఁబడు దుస్స్వప్నములుగూడ నద్భుత రసప్రధానములే. ఇవి శత్రువులపై వచ్చినప్పుడు నాయకునకు ఉత్కర్ష హేతువులే యగుచున్నవి. పరశురామునికథలలో నెల్లమ్మకుఁ దన తమ్ములైన కార్తికరాజులమీఁద దుస్వప్నము వచ్చును. ఆమె "వీధిలో ఉన్న విరజాజిమాను విరిగి మూడుముక్కలైనట్లు కలగంటోంది. దాని తమ్ములు కార్తికరాజులు ఆడుకున్న బంగారపు చదురుమీద పల్లేర్లు జిల్లేళ్లు మొలిచిపోయినట్టు కలగంటోంది. దాని పెద్ద తమ్ముడు శాత్రవీరార్జునుడు ఎక్కిన మదకలభటేనుగ భాండ్రున అరిచి చచ్చిపోయినట్టు కలగంటోంది. తన తమ్ముని భార్యలు, గొంతికాంత లన్నవాళ్లు, గడికో గడికో గోదారిగట్టున వరుసగా ముండేకులు ఒడుకుతున్నారని కలగంటోంది. జిలుగుకోళ్ళు, జిల్లేడుపట్టెలు తట్టించి నేసిన తరుకోళ్ళ పట్టెమంచం, దానికదే విరిగిపోయి, భగ్గున వెలిగి భస్మం అయిపోయిన కలగంటోంది". [28] శత్రువుపై నద్భుత రసాత్మకముగాఁ గొనసాఁగిన ఈ స్వప్నము పరశురాముని వీరమునకుఁ బోషకమగుచున్నది.

## వీరము-విరోధి రసము (శాంతము)

బుఱ్ఱకథలలో వీర రౌద్ర కరుణములు పోషింపఁబడు చుండును. శాంతమునుగూడ రసముగా నంగీకరించినచో వీరమున కిది విరోధి రసమగును. కాని, గాంధీ, పొట్టిశ్రీరాములు మున్నగు వారిపై బుఱ్ఱకథలు రచించినప్పుడు శాంతరసమే ప్రధానముగా నుండుట గమనింపవచ్చును. అట్లయినచో నాలంకారికులు పిచ్చివారా? కారు. ఉత్సాహాత్మకమగు వీరమునకు శాంతమెప్పుడును విరోధిరసమే. ఈ విరోధి రసప్రధానమగు కథ వీరగాథ కానేరదు. కావున గాంధీజీపై రచించిన బుఱ్ఱకథ వీరగాథ కాదు. నేతాజీ సుభాష్ చంద్ర బోసుపై రచించిన బుఱ్ఱకథయే నిజమగు వీరగాథ. గాంధీజీ కథలో వీరమునకు రసభంగము జరిగినది. కావుననే ఈ కథను వినునప్పుడు చప్పగానుండును. బోసుకథలో నట్లుకాక, అడుగడుగున నుత్సాహము రేకెత్తును. గాంధీజీవంటివారిని 'అహింసా ప్రవక్త' లనవచ్చును గాని 'అహింసా వీరుల'నుట సమంజసము కాదు.

వీరమునకు అంగరసముగాఁగూడ శాంతము పనికిరాదు. వీరగాథలలో రాయబార ఘట్టములందు శాంతము సూచింపఁ బడినను, అది వీరమునకు విరోధమే కాని పోషకము కాదు. అలరాజు రాయబారమే ఫలించినచో మనకు గర్వింపఁదగిన పల్నాటి వీరగాథలు దక్కెడివి కావు. అట్లే భట్టురాయబారము ఫలించినచో కాటమరాజు కథలు పుట్టెడివి కావు. అసలు, ఈ రాయబారపు ఘట్టములందుఁ గూడ శాంతమున్నదని గట్టిగాఁ జెప్పలేము. ఇట ధర్మవీరము కలదని విమర్శకులు తలంచుచున్నారు. మొత్తము మీఁద వీరమునకు శాంతము సర్వేసర్వత్ర విరోధమే కాని, పోషకము కాఁజాలదని గుర్తింప వలెను.

## వీరరసాభాసములు

సముచిత విభావాలంబనము కలది రసము కాఁగా, అనుచిత విభావాలంబనము కలది రసాభాసమగును. 'అనౌచిత్యాదృతేనాఽన్యత్ రసభంగస్య కారణమ్' అనినాడు ఆనందవర్ధనుఁడు. అయినను 'రసభంగము' వేఱు, 'రసాభాసము' వేఱు. రెండింటికిని అనౌచిత్యమే కారణమైనను, రసభంగము దోషము, రసాభాసము రసమే! వరూధినీ ప్రవరాఖ్యుల వృత్తాంతము రసాభాసమైనను రసమువలెనే ఆస్వాదింపఁ బడుచున్నది కదా!

వీరరసాభాసమును వివిధలాక్షణికు లిట్లు నిర్వచించిరి: 'బ్రహ్మ వధాద్యుత్సాహేఽధమపాత్రగతే తథా వీరే'- కావ్యప్రకాశిక. 'హీనపాత్రేషు తిర్యక్షి... తథాభాసం విజానతే'- సరస్వతీ కంఠాభరణము. 'వీరో భయానకావిష్టో వీరాభాస ఉదీరితః'- భావ ప్రకాశిక.

కాబట్టి వీరరసాభాసము నాలుగు విధములుగా నేర్పడుచుండు నని చెప్పవచ్చును:-

1) బ్రహ్మహత్యాది మహాపాతకములు చేయుటయందలి యుత్సాహమును వర్ణించినప్పుడు- ఉదా॥ హంసడిభకులు దుర్వాసుని బాధించుట.

2) అధమపాత్రగతమైన యుత్సాహమును వర్ణించినప్పుడు- ఉదా॥ సైంధవుఁడు పాండవుల నడ్డగించుట.

3) తిర్యగ్జడాదులయందు దృష్టమైన యుత్సాహమును వర్ణించినప్పుడు- ఉదా॥ గోవు సత్యవీరమును వర్ణించుట.

4) భయానక రసావిష్టమైన వీరరసమును వర్ణించుట - ఉదా॥ ఉత్తరుఁడు శత్రుసైన్యములను గని పాఱిపోవుట.

పైన తెల్పిన నాలుగు విధముల రసాభాసములును వీర గాథలలో నున్నవి. 1944-48 సంవత్సరములలోఁ దెలంగాణమున మహబూబునగరు మండలమున 'మలగర బాలేసాబు' అను రజాకారుఁడు విజృంభించెను. ఇతఁడెన్నియో హత్యలు చేసెను. ధనవంతులగు హిందువులను దోచెను. హిందువుల నవమానించెను. తన న్యాయశాస్త్ర వైదుష్యముతో నితని అత్యాచారముల నణఁచివేసిన లక్ష్మారావను బ్రాహ్మణుని అతఁడు నమ్మించి, మోసగించి, చాటుగా దాఁగియుండి, తుపాకితోఁ గాల్చి చంపెను. ఈతనిపై నొక వీరగాథ తెలంగాణమున జంగములచేఁ బాడఁబడుచున్నది. ఈ కథయంతయు మొదటి విధమగు వీరరసాభాసమునకు ఉదాహరణముగా నున్నది.

గజదొంగల కథలలో నథమపాత్రగతమైన యుత్సాహము వర్ణింపఁబడినది. మియాసాబుకథలో నతఁడు వనపర్తి శంకరమ్మ సైన్యము నెదిరించి జయించెనని చెప్పఁబడినది. అట్లే పండుగ శాయన్నకథ, దువ్వన్నదొరకథ, నక్కపల్లి రామునికథ మున్నగునవి అథమపాత్రగతమగు నుత్సాహమునే వర్ణించినవి. ఇది పైన తెల్పిన రెండవరకమగు వీరరసాభాసము.

తిర్యక్ సంబంధమగు నుత్సాహమును వర్ణించిన వీరగాథలును గలవు. పరశురాముని కథాచక్రమున 'గవరమ్మ గాజులు' అను కథలోఁ గార్తిక మల్లనిచే బంధింపఁబడిన జంపయరాజును బరశురాముని మైలపురిదేగ రక్షించును. ఈ కథలో నీ మైలపురిదేగయొక్క ప్రతాపము విశేషముగా వర్ణింపఁబడినది. అట్లే పల్నాటి వీరకథాచక్రమున పెద్దన్న గుఱ్ఱము 'కార్యబొల్లఁడు' (కారుబొల్లఁడు) అమిత పరాక్రమ వంతమైనదిగాఁ బ్రశంసింపఁబడినది. కృష్ణగంధర్వుని నగరమంతయు నీ కారుబొల్లఁడే నాశము చేసెను. కోడిపోరు వర్ణనము రసాభాసమే. కాటమరాజుకథాచక్రమున బొల్లావుశౌర్యము విశేషముగాఁ బ్రస్తుతింపఁబడినది. ఎఱ్ఱగడ్డపాటిపోట్లాటలో ఈ బొల్లావు జగడముపై నొక ప్రత్యేక కాండమున్నది. ఆవులు, ఎద్దులు, లేగలు కూడ యుద్ధము చేసినట్లుగా నెఱగడ్డపాటిపోట్లాటలో వర్ణింపఁబడినది. ముగ్గురు మరాఠీలకథలో వీరులకన్న, వారియొద్దఁగల మూఁడు కుక్కలకే ప్రాధాన్యమీయఁబడినది:-

*"పెద్దకుక్క పెద్దపులిరా సై*
*చిన్నకుక్క చిఱుతగండురా సై*
*నడిమికుక్క నాగుబాముర సై"*

ఈ మూఁడు కుక్కలును శత్రువుల జాడలు పసిగట్టి, వెంటాడి, వారిపైఁబడి గొంతులు కొఱికి చంపినవి. ఇట్లు తిర్యక్సంబంధమగు నుత్సాహము వర్ణింపఁబడుటచే నివియన్నియును వీరరసాభాసములే యగును.

ఇఁక నాల్గవ విధమైన వీరరసాభాసము- శత్రువులెదుర్కొన్నప్పుడు భయపడుట, వారిని బ్రతిమాలుట, చేతులెత్తి వారికి నమస్కరించుట మున్నగు పనులు చేసినట్లుగా 'గ్రామకక్షలు-హత్యలు' అను వర్గమునకుఁ జెందిన వీరగాథానికలలోఁ గలదు.

*"ఒక్క సంచి పైకమిత్త- వేయి రూపాయ లిత్త*
*నువ్వు నన్ను సంపకురా- కొడుకో మున్నూరోల్ల పోరడా*
*సెయ్యెత్తి మొక్కబోతే- సెయ్యి ముందు నరికినారె*
*నీ పానం దీసిరయ్యా- కొడుకో వెంకట్రామరెడ్డి"* [29]

వెంకటరామిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, సలపల అమ్మినాయఁడు పాట మున్నగు లఘువీరగాథలలో నిట్టి వీరరసాభాసములున్నవి. ఇవి భయానక రసావిష్టములైన వీరరసాభాసమునకు ఉదాహరణములు.

రసాభాసము రసమే కావున పైన చెప్పిన వీరరసాభాసము లన్నియును హృద్యములుగనే యుండును.

## వీరేతర రసముల ప్రత్యేక వర్ణనలు

పైన చర్చింపఁబడిన రీతిగా వీరగాథలలో యుద్ధవీరము, తదితర వీరరస ప్రభేదములు, వీరరస అంగరసములు, వీరరసాభాసములు చక్కఁగా నిమిడియున్నవి. వీరగాథలు మొదట వీరరస ప్రధానములుగా నున్నను కాలక్రమమున వీనిలో అంగరసములు కొన్ని ప్రాధాన్యమును వహించి, క్రొత్తరకముల వీరగాథలు బయలు దేరుట సంభవించినది. ఇట్లు అంగిరసములుగా మాఱిన అంగరసము లలోఁ గరుణాద్భుతములు పేర్కొనఁదగినవి. కన్యకామ్మవారి కథ, కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, లక్ష్మమ్మ కథ, మండపేట పాపమ్మ

కథ, శృంగవరపుకోట ఎరుకమ్మ కథ, తిరుపతమ్మ కథ, అంజమ్మ కథ, ఉయ్యూరు వీరమ్మ కథ, నారాయణమ్మ కథ, రంగమ్మ కథ, నల్లతంగాళ్ కథ, ఎఱుకల నాంచారి కథ మున్నగు పేరంటాండ్ర కథలన్నియును కరుణరస మంగిరసముగాఁగల వీరగాథలు. ఇందు వీరము ఏమాత్రమును గోచరింపదు. అయినను నివి వీరగాథలలో నొక వర్గముగనే పరిగణింపఁబడుచున్నవి. ఇందు ధర్మవీరము గలదనుట కేవలము సమర్థించుకొనుటకే యనిపించును. వీరగాథానిక లన్నియు నించుమించు కరుణరస ప్రధానములే.

అద్భుతరసప్రధానముగాఁ గూడఁ గొన్ని వీరగాథలు పుట్టినవి. బాలనాగమ్మ కథ, గాంధారి కథ, కాంభోజరాజు కథ, కమ్మవారి పణతి–పసల బాలరాజు కథ (పసలబాలుఁడు కథ), ధర్మాంగద పదము– మున్నగు వీరగాథలు అద్భుతరసప్రధానములని చెప్పవచ్చును. ఇట్టివానిలో జానపదులు సాధారణ విషయములందు అద్భుతములు నలౌకికములు నగు కల్పనలు చేర్చి కథను పెంపుచేయుదురు. ఇది వారికి వినోదమును, భక్తిని, భయమును కలిగించును. ఈ కథలలో కష్టములు వచ్చినప్పుడు దేవతలో, మంత్రదండమో, పావుకోళ్లో, సంచియో, భూతద్దమో, బీజాక్షరములో సాయపడి, కష్టమును దొలఁగించి ముందుకు నడపును. ధర్మాంగద, బాలరాజు మున్నగు కథలలోఁ బతివ్రతల మాహాత్మ్యమే పలురకముల అద్భుతములను బ్రదర్శించును.

వీరమునకుఁ బరోక్షపోషకమగు బీభత్సమే కాక, ప్రత్యేకముగా బీభత్సరసము వర్ణింపఁబడిన ఘట్టములును వీరగాథలలోఁ గలవు. వీరగాథలలో– ముఖ్యముగా శైవసంబంధమగు కథలలో జంగము వేషము తప్పక వర్ణింపఁబడుచుండును. పరశురాముని కథలలోను, మల్లికదేవమ్మ కథలోను, పర్వతాల మల్లన్న కథలోను, ఎలనాగిరెడ్డి కథలోను, సిరియాళుని కథలోను 'జోగి జంగమయ్య' వేషము విపులముగా వర్ణింపఁబడినది. సాధారణముగాఁ బరమేశ్వరుఁడే ఈ వేషము కట్టుచుండును. ఒక్కొక్కప్పుడు (పరశురాముని కథలలో వలె) నాయకుఁడు ఈ వేషమును వేయుట కలదు. ఈ జంగము వేషము దుర్భరమగు వాసనతోఁ, గ్రుళ్లి పురుగులోడుచున్న కుష్ఠరోగిగా వర్ణింపఁబడును. ఇది బీభత్సరసమునకుఁ బరాకాష్ఠ. పరశురాముని కథాచక్రమున 'రేణుకాకల్యాణ' మను కథలో జమదగ్నియు, 'గవరమ్మగాజు' లను కథలో కార్తిక మల్లఁడును, జోగి జంగమయ్య వేషమును గట్టుదురు. జమదగ్ని జంగము వేషవర్ణన: 'కుడి అస్తంతో గంటపట్టుకొని, ఎడమ అస్తంతో శంకుపట్టుకొని, మాయకుంచుల బొంత తొడుక్కొని– మాయకుంచులబొంత అంటే ఎటువంటిదీ?– కూర్చుంటే కుంచెడు పురుగులు రాలుతున్నాయి. నిలబడితే నిలువుడు పురుగులు రాలుతున్నాయి. వాడు దగ్గి ఊసినట్లయితే అవశిష్టము తాటికాయల్లా పడుతోంది. వాడు గాలిపై ఉన్నాడంటే, గాలికింద ముప్పయిమూడు యోజనాలు వెడుతోంది నీచువాసన. అలాంటి పాడువేషం వేశాడు జమదగ్ని'.[30]

పైన చెప్పిన బీభత్సమువలెనే, హాస్యముగూడ వీరమునకుఁ బోషకముగాఁగాక, ప్రత్యేకముగా వర్ణింపఁబడిన ఘట్టములును గలవు. బ్రాహ్మణుల వర్ణన హాస్యరసమును సులభముగా సృజింపఁగలదు. పల్నాటి వీరకథాచక్రమునఁ జిట్టచివరికథయగు 'కల్లి ఒఱగు' (బ్రహ్మన్న విఱుగు)లో బ్రహ్మనాయఁడు నలగాముని వెన్నాడుచు కొదమగుండ్లకు వచ్చుచుండఁగా, కొదమగుండ్లలోని బ్రాహ్మణులు నలగాముని క్షమింపుమని వేడుటకై బ్రహ్మనాయని కెదురేఁగు సందర్భమున వర్ణన హాస్యరసపోషకముగా నున్నది (చూ. పల్నాటి వీరకథాచక్రమను పదునొకండవ ప్రకరణము). అట్లే చంద్రహాసుని జంగంకథలో (అన్నము సుబ్బారావుగారి రచన, ప్రాచీనమైనది) చంద్రహాసుని వివాహమునకు వచ్చిన బ్రాహ్మణుల వర్ణనము గొప్ప హాస్యరసమును గల్పించుచున్నది. ఆ బ్రాహ్మణుల పేర్లలోను, వారిని ప్రధాని కొట్టినప్పటి సంఘటనలోను నిట్టి హాస్యము ప్రదర్శితమైనది. చంద్రహాసుఁడును, ప్రధాని కుమారుఁడగు మదనుఁడును వివాహమునకు వచ్చిన బ్రాహ్మణులను మిగుల గౌరవించి, గోదాన భూదానములు చేసి, భోజనములు పెట్టిరి. ఆ బ్రాహ్మణులందరును తృప్తిగా భోజనము చేసి, భుక్తాయాసమున మందమంద గమనములతో మందిర ద్వారము కడకు వచ్చిరి. ఇంతలో పరగ్రామమున కేగిన ప్రధాని తిరిగివచ్చి, ఇక్కడి సంగతు లేవియును దెలియక, ఆ బ్రాహ్మణులు తన గృహమును దోచుకొని పోవుచున్నారని తలఁచి, కోపముతో వారినందఱిని చావమోఁదెను. అసలే భుక్తాయాసముతో నున్న యా బ్రాహ్మణుల యవస్థ కడుపుబ్బునంతటి హాస్యముతో వర్ణింపఁబడినది:–

*"పైబడ పైవస్త్రంబులు వదలుక–పరుగులెత్తువారు*
*కాబీరునిచే దెబ్బల కోర్వక– కదలలేనివారు*
*పట్టు వస్త్రముల బుద్దిచెంబులను– పారవైచువారు*
*పుట్టంబులు పాదాలకడ్డపడి– బోర్లపడెడివారు*
*పాడు వివాహము కెందుకొస్తిమని– పల్కుచుండువారు*
*నేడె మన మరణంబు సిద్ధమని– యెంచుచుండువారు*
*బూతుల దిట్టుచు పురము వెలుపలికి– బోవుచుండువారు*
*చేతుల నూపుచు దమతమ యూళ్లకు– జేరనేగువారు"* [31]

ఇట్లు వీరరసమునకుఁ బోషకముగాఁగాక, ప్రత్యేకముగాఁ గొన్ని రసము లెడనెడ వర్ణింపఁబడినను, మొత్తముపై వీరగాథల యందు నవరసములలో వీరరసమునకే అగ్రతాంబూల మీయఁబడినదనుట స్పష్టము. ఈ వీరరసములోఁగూడ యుద్ధవీరమునకే సార్వభౌమత్వము కట్టఁబడినది. ❐

## జ్ఞాపికలు

1. చూ. గూడ వేంకట సుబ్రహ్మణ్యముగారి (డా॥ జి.వి.సుబ్రహ్మణ్యంగారి) 'వీరరసము- ఆంధ్రసారస్వతము', హైదరాబాదు, 1961.
2. ఆచార్య ఖండవల్లి లక్ష్మీరంజనంగారు, స్థాపన, వీరరసము, పుట IX.
3. పోణంగి శ్రీరామ అప్పారావుగారు, 'నాట్యశాస్త్రము', పుట 435.
4. శ్రీ గూడ వేంకట సుబ్రహ్మణ్యము, వీరరసము, పుట 52.
5. ఈ వీరప్రభేదములన్నియు డా॥ జి.వి.సుబ్రహ్మణ్యంగారి "వీరరసము" గ్రంథమునుండి గ్రహింపబడినవి. వారికి కృతజ్ఞుఁడను.
6. పలనాటి వీరచరిత్ర, పింగళి పరిష్కృతము, విశాలాంధ్ర ప్రచురణము, పుట 463.
7. అదే., పుటలు 463, 464.
8. అదే., పుటలు 222, 223.
9. పల్నాడు తాలూకా, జానపాడు గ్రామమున 1-9-1966న లభించిన 'అలరాచమల్లుగారి గురిజాల రాయబారము' వ్రాఁతప్రతి నుండి.
10. అదే.
11. వేటూరి పరిష్కృతమగు కాటమరాజుకథ, పుటలు 151, 152.
12. చిత్తూరు మండలమున, వాయలపాడు తాలూకా, గెర్నిమెట్టలో, కొండీటి (కొండవీటి) వెంకటరమణ యను పూసల బలిజవాఁడు పాడిన పాట (1966).
13. పలనాటి వీరచరిత్ర, పూర్వోక్తము. పుట 465.
14. అదే., పుట 213.
15. అదే., పుట 220.
16. పలనాటి వీరభాగవతము, కారెంపూడి తాళపత్రప్రతి, ఆకు 357.
17. పలనాటి వీరచరిత్ర, పూర్వోక్తము. పుట 220.
18. పల్నాటి వీరభాగవతము, కారెంపూడి తాళపత్ర ప్రతి, ఆకు 358.
19. పల్నాడు తాలూకా జానపాడు గ్రామములో లభించిన వ్రాతప్రతి, పుటలు 94, 95.
20. పలనాటి వీరచరిత్ర, పూర్వోక్తము. పుట 469.
21. అదే., పుటలు 465, 466.
22. అదే., పుటలు, 415, 416.
23. అదే.
24. పల్నాటి వీరభాగవతము, కారెంపూడి తాళపత్రప్రతి, ఆకు 67.
25. అదే., ఆకు 105.
26. బంగారు తిమ్మరాజు కథ, గుజిలీప్రతి.
27. 'జలగన్న పార్వతికథ'- పశ్చిమ గోదావరీ మండలమున 1964లో నేను సేకరించిన మౌఖిక వీరగాథ.
28. 'పరశురాముని యుద్ధము'- పశ్చిమ గోదావరీ మండలమున 1964లో నేను సంపాదించిన మౌఖిక వీరగాథ.
29. వెంకటరామరెడ్డి, త్రివేణి, పుట. 272.
30. 'రేణుకాకల్యాణము'- పశ్చిమ గోదావరీ మండలమున 1964లో నేను సేకరించిన మౌఖిక వీరగాథ.
31. చంద్రహాసుని కథ, వి.మధురముత్తు మొదల్యారు 1903లో ప్రకటించిన ప్రతి, పుటలు, 23, 24.

## పదునెనిమిదవ ప్రకరణము

# వీరగాథా కవిత్వము- వారానువర్తనములు

**మా**ర్గసాహిత్యమునఁ బ్రబంధములవలె, దేశిసాహిత్యమున వీరగాథలన్నియు నొకే మూసలోఁ దయారయినట్లుండును. ప్రపంచమున నేసాహిత్యమును బరిశీలించినను వీరగాథలన్నియు నొకే పద్ధతిలో నున్నట్లు స్పష్టమగును. ఇంచుమించుగ నొకే రకమగు కథాప్రణాళిక, యొకే రకమగు వర్ణనలు, అలంకారములు, పదబంధములు నుండును. ఇట్లు వీరగాథలలోఁ దఱచుగాఁ గానఁనగు సమానాంశము లను 'వీరగాథల వారానువర్తనములు' (Ballad Commonplaces) అందురు. సిసలైన వీరగాథలో నీ వారానువర్తనములు తప్పక యుండి తీరును. (ఈ వారానువర్తనములను గూర్చి 'వీరగాథా లక్షణము'లను ఎనిమిదవ ప్రకరణమునఁ గొంత చర్చించితిని).

ఈ వారానువర్తనములు ఐరోపాఖండము వంటి యొక ఖండములోని వివిధ దేశముల వీరగాథలన్నిటిలోను సమానముగా గాననగును. భారతదేశము వంటి యొక దేశములోని భిన్నభాషల వీరగాథలందును సమానముగా గాననగును. ఆంధ్రప్రదేశమువంటి యొక రాష్ట్రములోని యొకే భాషలోఁగల వివిధ వర్గములకుఁ జెందిన వీరగాథలలోను తుల్యముగా గోచరించును. కాని, యొక ఖండములోని వీరగాథలకన్న నొకదేశము లోని వీరగాథలలోను, నొకదేశములోని వీరగాథలకన్న నొకే భాషలోని వీరగాథలలోను నీ వారానువర్తనముల సామ్యములు ఉత్తరోత్తర సాంద్రతరములై యుండుట గమనింపవచ్చును. ఒక భాషలోఁగూడ వివిధ వర్గముల గాథలలో నీ పడికట్టు పదముల సాన్నిహిత్యము ప్రత్యేక పరిశీలనార్హమై యుండును.

తెలుఁగు వీరగాథాకవిత్వములో నీ వారానువర్తనములు కొల్లలుగా నున్నవి. ఏ వర్గమునకుఁ జెందినవైనను దెలుఁగు వీరగాథా ప్రణాళిక యెప్పుడు నిట్లుండును:– మొదటఁ బ్రార్థన యుండును. ఈ ప్రార్థనలోఁగూడ వినాయకుని ప్రార్థన, శారద ప్రార్థన తప్పక యుండును. వీరగాథానాయకుని పితృపితామహుల వర్ణనతో, వారు చేసిన అద్భుత కార్యముల ప్రశంసలతోఁ గథ ప్రారంభమగును. నాయకుని తల్లిదండ్రులు సంతానము లేక బాధపడుచు 'నోయరాని నోములు' నోచెదరు. ఇట వారు 'కాశితీర్థము గంగకు నోమి' నట్లును, 'గంగతీర్థము కాశికి నోమి' నట్లును జెప్పుట వారానువర్తనము. పుణ్యక్షేత్రముల దర్శింతురు. ఏ దేవుఁడో ఒక ఫలము నిచ్చును. ఆ ఫలమును భక్షించుటచే గర్భము వచ్చును. వీరుఁడు జన్మించును. ఈతఁడూరకే పుట్టఁడు. వీపున వింజామరతోను, అటికాలున 'తామర పద్మము'తోను, బొడ్డున మాణిక్యముతోను, కన్నుల చింతామణితోను, పండ్లను పరుసవేదితోను బుట్టును. 'వేదబ్రాహ్మల'ను బిలిచి జాతకమును జెప్పింతురు. ఈ బ్రాహ్మణు లెప్పుడును శుభమును జెప్పరు. తండ్రి గండమునో లేక మేనమామల గండమునో చెప్పుదురు. పరశురాముఁడు, బాలచంద్రుఁడు, పాపనూక, ఎఱుకల నాంచారి మున్నగువారు పుట్టినప్పు డిట్లే జరిగినది. తల్లిదండ్రులు ఆ బాలునిఁ బరిత్యజించుటో, లేక చంపఁ బ్రయత్నించుటో చేయుదురు. బాలుఁడు దైవముచే రక్షింపఁబడి వేఱొక తావునఁ బెరుగును. ఆ బాలుఁడు 'ఎంచంగ పెంచంగ ఏడేండ్లవాఁ' డగును. తోడి బాలురతో నాటలాడు చుండును. ఏ ఆట ఆడినను ఆడకపోయినను బొంగరాలాట మాత్రము తప్పక ఆడును. ఆ బాలుని బొంగరము (అదేమి కర్మమో!) ఎప్పుడును నొక్క కోమటి స్త్రీకే తగులును. ఆమె బాలుని దూషించును. అ దూషణలో వీరుని చనిపోయిన తండ్రి ప్రసక్తియో, లేక చెఱఁబడ్డ తల్లి ప్రసక్తియో వచ్చును. బాలునిలో శౌర్యము ప్రకోపింపఁబడును. (ఈ విధమగు బొంగరాలాటలు తెలుఁగునఁగల నాలుగు ప్రసిద్ధ వీరగాథాచక్రములలోను వర్ణింపఁబడినవి. ఎల్లమ్మ కథాచక్రమునఁ బరశురాముని బొంగరాలాట, అంకమ్మ కథాచక్రమున రవద్దేవిరాజు బొంగరాలాట, పల్నాటి వీరకథా చక్రమున బాలచంద్రుని బొంగరాలాట, కాటమరాజు కథాచక్రమున ముమ్మయ్య– పోచయ్యల బొంగరాలాట ఒకేతీరుగా వర్ణింపఁబడినవి. వీనిలో బాలచంద్రుని బొంగరాలాట తక్కిన వానికి మూలమైయుండును. సాధారణ వీరగాథలలో బాలనాగమ్మకథలోను, లఘువీరగాథలలో 'లలికట్ల పదము'లోను నిట్టి బొంగరాలాటలున్నవి.) ఇట్లు బొంగరాలాటలోని యుపాలంభనతో రౌద్రప్రకోపము జరిగిన బాలవీరుఁడు తల్లి దగ్గఱకుఁ బోయి తండ్రినిగూర్చి ప్రశ్నించును. లేదా, పెంచుచున్నవారి దగ్గఱకుఁ బోయి తల్లిదండ్రులగూర్చి ప్రశ్నించును. **'చంద్రాయుధమును జేతఁబట్టి'** తల్లినిగాని తండ్రినిగాని బంధించినవారిపై యుద్ధమునకుఁ బోవ నుద్యుక్తుఁడగును. తల్లి యెప్పుడును మొదట వలదని వారించును. ఎంత చెప్పినను బాలవీరుఁడు వినఁడు. **'అమ్మా, నీవు పొమ్మన్నా పోతాను, వొద్దన్నా పోతాను'** అనును. ఇదే మాటలతో నిట్లనుట ప్రతి వీరగాథలోను జూడవచ్చును. ఎట్టకేలకుఁ దల్లి దీవించును: **'పగవాని చేయి కిందుకావలెను, నీ చేయి మీదుకావలెను'** అని దీవించును. ఏ వీరగాథలోని తల్లియైనను నిదే వాక్యములతో దీవించును. కుమారుఁడు యుద్ధమునకుఁ బోవుచుఁ, దాను మరణించి నట్లు తెలిసికొనుటకుఁ గొన్ని యానవాళ్లు చెప్పును. తాను రణమునఁ

గూలినచో నింటిదగ్గఱనున్న గజనిమ్మచెట్టు వాడిపోవుననియు, పట్టపగలు చుక్కలు పొడుచుననియు, కలునంది అంకెవేయుననియుఁ జెప్పును. తరువాత వీరుని యుద్ధయాత్రావర్ణనముగూడఁ బటికట్టు పదములతోనే సాఁగును. కథాకాలమెంత ప్రాచీనమైనను సైన్యములోఁ దుపాకులవారు, ఫిరంగులవారు, తురకలు, పచ్చిమాంసమును దినెడి పరాసువారు నుందురు. వీరుల యుద్ధవర్ణనలన్నియు నొకే రీతిగా నుండును. 'నఱుకతవుంటే నల్లశిరసులు రాలు'ట, 'పొడుస్తవుంటే పొట్టపేగులు పడు'ట, 'కొడతావుంటే కొవ్వుదబ్బలు పడు'ట మున్నగునవి సాధారణము. పిమ్మట వీరుని మరణము, లేదా జయము వర్ణితమగును (సాధారణముగా మరణమే హెచ్చుగా నుండును). ఇంటి దగ్గఱ వీరుని భార్యకుఁగాని, తల్లికిఁగాని యా రాత్రి కలవచ్చును. ఆమె యెఱుకతచేఁగాని, ఇతరులచేఁగాని యా కలను విప్పించుకొనును. పరశురామునికథలలో ఎల్లమ్మకును, కాటమరాజు కథలలో పెద్దమ్మకును, అగుమంచికిని నిట్టి స్వప్నములు వచ్చినవి. తెల్లవారి కల నిజముకాఁగా, వీరవనిత సాగుమానము (సహగమనము) చేయును. (పల్నాటి వీరకథాచక్రమునను, కాటమరాజు కథాచక్రము నను నించుమించుగఁ బ్రతికథలోను వీరపత్నీసహగమనము వర్ణింపఁబడినది. పెద్దన్న బాదరాజు పెండ్లికథలో ముక్తాలవాంబ, అనుగురాజు మరణమను కథలో మైలమదేవి, కోడిపోరు కథలో బాలగోపన్న భార్య గోపితులసి, అలరాజు రాయబారము కథలో రత్నాల పేరమ్మ, కాటమరాజుకథలలో ఖడ్గతిక్కన భార్య జానమ్మయు, అగుమంచి, పాపనూక మున్నగు యాదవకాంతలును సహగమనము చేసిరి. పదునెనిమిదవ శతాబ్దములో నీ సహగమనమే ప్రధానే తివృత్తముగా వీరగాథలు పుట్టినవి. వీనిని పేరంటాండ్ర కథలని పిలుతురు.) ఈ చెప్పిన దానిలో నొకటి రెండు స్వల్పమగు మార్పు లున్నను తెలుఁగు వీరగాథల కథాప్రణాళిక యెల్లప్పుడును నిట్లే యుండునని చెప్పవచ్చును.

ఇట్లు వీరగాథల కథాప్రణాళికలోని సామ్యములకు కారణము వానిలో సాధారణముగా నుండెడి "మోటిఫ్స్" (motifs). కథా కథనములో అతిప్రధానమైన ఒక కనిష్ఠాంశమును ఆంగ్లమున ''Motif'' అందురు. తెలుగులో దీనిని "మూలాంశము" అనవచ్చును. (కన్నడములో దీనిని 'ఆశయ'– 'ప్రేరక'– 'కథనఘటక' అని భాషాంతరీకరణము చేసినారు.) ఈ "మోటిఫ్"నకు కథాగమనమును మార్చగలిగిన శక్తియుండును. కథను చెప్పువాడు దీనిని మరచుటకు వీలులేదు. ఈ "మూలాంశములు" లేదా "కథన ఘటకములు" (motifs) పైన చెప్పినట్లు "బొంగరాలాట" వంటి సంఘటనలు (incidents)కావచ్చును. లేదా "సవతితల్లి" (బాలనాగమ్మ కథ), "పేదరాసి పెద్దమ్మ", "కడగొట్టు కొడుకు లేదా కూతురు" (వీరు సాధారణముగా మూడవవారుగా కాని, ఏడవవారుగా కాని యుందురు); విశేషమైన శక్తులు గలిగిన "చిలుక", "కుక్క", "పాము" (ధర్మాంగద చరిత్ర), "గుఱ్ఱము" (పల్నాటి వీరకథలలో అలరాజు గుఱ్ఱము ''సవరాల జిమ్మడు'', పెద్దన్న బాదరాజు గుఱ్ఱము "కారుబొల్లడు"), "కోడిపుంజు" (పల్నాటి వీరకథలలోని బ్రహ్మనాయని పుంజు "అర్ధనాల చిట్టిమల్లుడు", నాగమ్మ పుంజు "నల్లమల్లుడు") మొదలగు పాత్రలు (characters) కావచ్చును. లేదా ''మంత్రదండము''– ''చంద్రాయుధము'' (బ్రహ్మనాయుని "నృసింహకుంతము", బాలచంద్రుని "సామంతరాగోల", అలరాజు "సూర్యభేతాళము" మొదలగునవి)– "ఎగిరెడి రత్నకంబళి"– "ఎగిరెడి చెప్పులు"– "చావురానీయని తులసివనమాల" (బ్రహ్మనాయడు అలరాజు మెడలో వేసినట్టిది)– మొదలగు వస్తువుల (things) రూపమున నుండవచ్చును. ఉదాహరణకు "రాముడు క్రొత్తదుస్తులు ధరించి ఊరికి వెళ్ళెను" అను వాక్యము సాధారణ వాక్యము. దీనిలో "మోటిఫ్స్" లేవు. అట్లు కాక, "బాలనాగమ్మ కొడుకు బాలవర్ధిరాజు గండభేరుండ పక్షినెక్కి, ఏడు సముద్రములు దాటి, సంజీవిగడ్డలో దిగి, ముంతమామిడిచెట్టు తొఱ్ఱలో నున్న పంచవన్నెల రామచిలుకను పట్టి తెచ్చినాడు'' అను వాక్యములో విశేషాంశములు లేక మూలాంశము లెన్నో కలవు. బాలనాగమ్మ కొడుకు, గండభేరుండ పక్షినెక్కుట, ఏడు సముద్రములు దాటుట, సంజీవిగడ్డ, ముంతమామిడిచెట్టు తొఱ్ఱ, పంచవన్నెల రామచిలుకను పట్టుట– అనునవి యిందలి మూలాంశములు (motifs). ఇవి వీరగాథలలో కన్న జానపద కథలలో (folk tales లో) ఎక్కువగా నుండును.

ఈ మూలాంశములు లేక కథన ఘటకములు కథా కథనమునకే కాక, ఒక్కొక్కప్పుడు పదప్రయోగములకు, సంఖ్యా వాచకములకు సంబంధించి కూడ నుండవచ్చును. అట్టివానిని "శబ్ద కథన ఘటకములు" (word motifs) అనియు, "సంఖ్యావాచక కథనఘటకములు" (number motifs) అనియు నందురు. "అళ్ళున నవ్వి"– "గళ్ళున నవ్వి"– "ఆగ్రుడైమండి"– "కండ్లజూచి" మొదలైనవి శబ్ద కథన ఘటకములు. జానపదులు "ఏడు" సంఖ్యావాచకము నెక్కువగా ప్రయోగింతురు. తరువాతి "మూడు"– "తొమ్మిది"– "నూటఒకటి" వారికి ఇష్టము. ఇవి సంఖ్యావాచక కథనఘటకములు. నేను చెప్పబోవు వారానువర్తనములన్నియు నొకరకముగా శబ్దకథ ఘటకములే అని చెప్పవచ్చును. వీరగాథలలో పదేపదే వచ్చు ఒకేరకమైన వర్ణనలు కూడ వారానువర్తనములే. వీనిని "వర్ణన కథన ఘటకములు" (description motifs) అనవచ్చును.

యావత్ ప్రపంచములోని, వివిధ దేశములలోని, వివిధ భాషలలోని, వివిధ జానపదకథలలోని (వీరగాథలలోని) మూలాంశములన్నింటిని సేకరించి, వానిలోని సమానాంశములను బట్టి వానిని వర్గీకరించి, వానికి క్రమసంఖ్యల నిచ్చి, Stith Thompson అను అమెరికన్ జానపద విజ్ఞానవేత్త ''Motif Index of Folk-literature'' అను పేరుతో ఆఱు సంపుటములను ప్రకటించినాఁడు.

జానపద కథలలోని (లేదా వీరగాథలలోని) మూలాంశములను తులనాత్మకముగా పరిశీలించుటకు ఈ గ్రంథము మిక్కిలిగా తోడ్పడును.

వీరగాథల వర్ణనలోఁ దఱచుగా కోపము, శోకము వర్ణింపఁ బడుచుండును. ఈ వర్ణనలు ఏ వీరగాథలో వచ్చినను, నొకే విధముగా నుండును. కోపమును వర్ణించునప్పుడు: **'తెల్లని గుడ్లకు తెచ్చె రకతంబు'– 'కుడిమీస మొడివేసి గుడ్లెర్రజేసె'– 'ఎర్రని గుడ్లకు ఎక్కె కోపములు'– 'పెటపెట పండ్లు పేటార్చి కొరికె'– 'అగ్గుడై మండి'–** అను వాక్యములు పదే పదే ప్రయోగింపఁబడుచుండును. శోకమును వర్ణించునప్పుడు **'గోడు గోడున దుఃఖపోవు'– 'కొండ గొర్రెలా గోలపెట్టు'– 'కుడికంటి వుదకాలు కుంభవరషము లాయె– ఎడమకంటి వుదకాలు ఏరులై పారె'** అను వాక్యములు ఉపయోగింపఁ బడుచుండును. ఒక్కొక్కప్పుడు కరుణరస వర్ణన మఱింత రసవంతముగా జరుగును:–

*"వలవల కన్నీరు వలపొయ్యసాగె*
*ముత్యపు కన్నీరు ముక్కంట రాల్చె*
*పగడపు కన్నీరు పలువరస జారె*
*నడుము నక్కున విరిగి నేలకు వరిగె"*

*"కుడికంటి శోకంబు కుంభద్వార మాయె*
*ఎడమకంటి శోకంబు ఏరులై పారుతున్నది"*

*"ఈకంట కన్నీరు ఆ కంట పోసె"*

నవ్వు: **'అళ్లున నవ్వి', 'గళ్లున నవ్వి', 'సిత్తారినోటితో సిక్కున నవ్వాడు –బంగారి నోటితో పక్కున నవ్వాడు', 'చెక్కిట భాగాలు చెదరంగ నవ్వెను', 'పుక్కిట వీడెము చెదర నవ్వెను'**

చూపు: **'కండ్లజూచి'–** 'చూచి' యను ప్రయోగముండవలసిన తావులందన్నింటను నిది ప్రయోగింపఁబడుచుండును.

సంభాషణ: వీరుఁడు మాటాడుచున్నాఁడని కవి చెప్పునప్పుడు **'అప్పుడు (వీరుని పేరు) ఆడె నొక మాట'** అను వాక్యము విధిగా నుండును. **'అప్పుడు బ్రహ్మన్న ఆడె నొకమాట'** (పల్నాటి వీరకథలు)**– 'అప్పుడు అయితన్న ఆడె నొకమాట'** (కాటమరాజు కథలు)

ఇట్లే ఒక వీరుఁడేదైనను నొక విషయమును జెప్పఁ బోవుటకు ముందీ క్రింది పడికట్టు వాక్యమును దప్పక ప్రయోగించును:

**'వినవయ్య (నాయుడా) విశదంబుగాను' (పల్నాటి వీర కథలు)**
**'వినవయ్య (రాజేంద్ర) విశదంబుగాను' (పల్నాటి వీరకథలు)**

ఈ విధమగు కవివాక్యములు, సంభాషణ ప్రారంభములు పల్నాటి కథలలోను, కాటమరాజు కథలలోను దఱచుగాఁ బ్రత్యక్షమగు చుండును.

విశేషణములను ద్రిప్పి చెప్పుట:–

*"ఎండిదే జాలె–పయిడిదే బొంగరము*
*బయిడిదే జాలె– యెండిదే బొంగరము"* (రవద్దేవిరాజు కథ)

*"ఎండిదే సుట్ట–పైడిదే తట్ట*
*పైడిదే సుట్ట– ఎండిదే తట్ట"* (అంకమ్మ కథ)

**విశేష్యములను ద్రిప్పి చెప్పుట:–**

*"కన్నులజూచి అల్లుని మనసున దీవించెను*
*మనసున జూచి అల్లుని కన్నుల దీవించెను"* (గంగురాజు కథ)

*"క్షేమాన బోయి అల్లుడా! లాభాన రమ్మి*
*లాభాన బోయి అల్లుడా! క్షేమాన రమ్మి"* ( ,, )

*"చుక్కపెయ్య లరువంగ చూడియావుల వేసిరి*
*చూడియావు లరువంగ చుక్కపెయ్యల వేసిరి*
*పాడియావు లరువంగ పక్కలేగల వేసిరి*
*పక్కలేగలు అరువంగ పాడియావుల వేసిరి"* (జన్నివాడ కథ)

*"ఎద్దుల జ్ఞానమ్ము ఎర్రయకు దెల్సు*
*ఎర్రయ్య జ్ఞానమ్ము ఎద్దులకు దెల్సు"* (ఆవులమేపు కథ)

*"గొడుగుల దప్పించి పడిగల నరికిరి*
*పడిగలు దప్పించి గొడుగుల నరికిరి"* (అగుమంచి కథ)

రాత్రి వర్ణన:–

*"కలికి కలికి ఏళ గాంధారి ఏళ*
*రాయి రాయి కరిగే ఏళ*
*మానుమాను వరిగే ఏళ*
*బావుల్లో నీళ్లు నిద్రపొయ్యే ఏళ*
*కొరివి దయ్యాలు కొట్లాడే ఏళ*
*బసవదేవుడు మేతమెయ్యని ఏళ*
*పసిబిడ్డ తల్లిపాలు తాగ మరచిన ఏళ"*

ఈ వాక్యములే త్రిప్పి త్రిప్పి చెప్పబడుచుండును.

ఎఱుకలసాని వేషము, జంగము వేషము తెలుఁగు వీరగాథలలోఁ దఱచుగా వచ్చుచుండును. ఇందు ఎఱుకలసాని వేషము స్వభావోక్త్యలంకారముతోను, జంగము వేషము బీభత్స రసప్రధానముగాను వర్ణింపఁబడుచుండును. ఎఱుకల వేషమును వర్ణించుటకు ముందు ఎఱుకలబుట్ట నల్లుట అతి సహజముగా మనోహరముగా వర్ణింపఁబడును. పరశురాముని కథలలో గవరమ్మ

యెఱుకల వేషమును గట్టఁగాఁ, బరశురాముఁడామెకు ఎఱుకలబుట్ట నల్లి ఇచ్చినాఁడు:–

| | | | |
|---|---|---|---|
| "పెద్దకొండకు బోయి రామన్నా రాము– | | పేపరువ్వలు కోసిరామన్నారాము | |
| చిన్నకొండకు బోయి | ,, | చీపురువ్వలు కోసి | ,, |
| ఎండికత్తీ తోని | ,, | ఎదురొకటి కొట్టాడు | ,, |
| ఆడు బంగారి గోల్లాతో | ,, | బద్దలను జేశాడు | ,, |
| చిత్తారి గోల్లాతో | ,, | చీరి పోగెట్టాడు | ,, |
| ఎండలో రువ్వాలు | ,, | ఎండ ఏసీనాడు | ,, |
| మంచులో రువ్వాలు | ,, | మాగ ఏసీనాడు | ,, |
| మంగళోరం నాడు | ,, | మగలి నచ్చత్రమున | ,, |
| బుదవోరం నాడు | ,, | బుద్దిగల రోజూన | ,, |
| బూమి కుదురగ తవ్వి | ,, | బుట్టమొద లేశాడు | ,, |
| వజ్రాలు పోశాడు | ,, | వారలల్లీనాడు | ,, |
| ముత్యాలు పోశాడు | ,, | మూలలల్లీనాడు | ,, |
| ఆరికన వర్ణాన్ని | ,, | అంచులల్లీనాడు | ,, |
| మిగిలినా రేకూలు | ,, | గిలకలల్లీనాడు | ,, |
| బాలవాళ్లకు తగిన | ,, | బంతులల్లీనాడు | ,, |
| సిన్నవాళ్లకు తగిన | ,, | సిలకలల్లీనాడు | ,, |
| వా రవ్వ తాతలిని | ,, | బుట్టపై నేశాడు | ,, |
| ఈత రేకుల బుట్ట | ,, | ఇమ్ము గల్లీనాడు | ,, |
| తాటి రేకుల బుట్ట | ,, | తామాష గల్లాడు" | ,, |

ఈ యెఱుకల బుట్టను 'కొల్లాపురి బట్ట' అందురు. ఈ బుట్ట నల్లు వర్ణన వేంకటేశ్వరునికథలోను, చిన్నమ్మకథలోను గూడ వచ్చును. ఆ కథలలో నిట్టి మాటలతోనే యున్నది. ఎఱుకలబుట్ట వర్ణన తరువాత నెఱుకలసాని వేషవర్ణనముండును. ఇదియును వారానువర్తనమే. ఏ వీరగాథలోనైనను నొకే రీతిగా నుండును. ఈ యోఱుకలసాని వర్ణనము యక్షగాన ప్రభావము కావచ్చును.

జంగమువేషము పరశురాముని కథలలోను, మల్లిక దేవమ్మ కథలోను, పర్వతాల మల్లన్న కథలోను, సిరియాళుని కథలోను, ఎలనాగిరెడ్డి కథలోను విపులముగా వర్ణింపఁబడినది. అన్నింటను నొకే విధమగు వర్ణనము. శైవసంబంధమగు కథలలో నిది యెక్కువగా వచ్చుచుండును. సాధారణముగాఁ బరమేశ్వరుఁడే జంగమువేషము కట్టినట్లుగా వర్ణింపఁబడుచుండును. ఈ జంగము దుర్భరమగు వాసనతోఁ గ్రుల్లి పురుగులోడుచున్న కుష్ఠరోగిగా వర్ణింపఁబడు చుండును.

సైన్యవర్ణనలో నౌచిత్యముండదు. అతిప్రాచీన కథలలోఁ గూడఁ బచ్చిమాంసమును దిను పరాసువారు, తురకలు నున్నట్లుగా వర్ణింపఁ బడుచుండును. పరశురాముని కథలలో సైన్యవర్ణన చూడుఁ డు:–

"వారశిఖలావారు వాజానుబాహూలు
నూనూగు మీసాల నూటి కెలమా దొరలు
పచ్చిమాంసం తిన్న పారాసు వారయ్య
చూపితే పొడిచేటి శూరకత్తులవారు
నరికితే కానారు నల్లతుమ్మ తురకాలు
ఏనుగులు గుఱ్ఱములు పయనమైనారయ్య"

పల్నాటి వీరకథలలోఁ గూడఁ దురకలు వర్ణింపఁబడిరి (కోడిపోరు కథ). పండ్రెండవ శతాబ్దమున దక్షిణదేశమున నింకను తురకలు వ్యాపింపలేదు. కాని ఇట్టి వర్ణనలు కవి రచనాకాలము నాటివిగా మనము భావింపవలెను. అట్లే కాటమరాజు కథాకాలమునఁ దుపాకులు, ఫిరంగులు లేకపోయినను నా కథలలో వర్ణింపఁబడినవి. అంకమ్మ కథలలోఁ గూడఁ దుపాకులు ఫిరంగులు వర్ణింపఁబడినవి. గంగురాజు కథ (అంకమ్మ కథాచక్రము)లోని సైన్యవర్ణన చూడుఁ డు:–

"విచ్చుకత్తులవారు వీటెలవారు
పట్టాకత్తులవారు బాణాలవారు
అంబుల తరకాచులవారు ఆయుధాల బంట్లు
ముకుంద బల్లేలవారు మున్నూరు కోట్లు
ఏట తుపాకుల వారు ఎన్నూరు కోట్లు
ఘన యాటకాళ్ల గద్దరి బోయలు
దాగి పోట్లాడేటి దండినాయకులు
వరుస పోట్లాడేటి వాలుమన్నీలు
ధాబ కత్తులతోను తరమేటివారు
సొక్క చువ్వ వీటెలు సుక్కలంటి వున్నారు
సాన కత్తులతోను సాగేటివారు
అంబుల తరకాచులవారు ఆయుధాలవారు
గోడిగల నెక్కిరి కొందరు వారు
మిన్నంది వచ్చిరి మీనుటెక్కెములవారు
ఆకాశమున ఆడు ఆలవట్టములు
డాలులు ఎన్నూరు దమామీలు ఎన్నూరు
పెద్ద పెద్ద బాణాలు పెద్ద ఫిరంగీలు
అక్షోణి అక్షోణి పన్నెండు వేల చతురంగ బలము"

యుద్ధ వర్ణన, రణభూమివర్ణన వీర బీభత్స రసములతో నొప్పుచుఁ బ్రతి వీరగాథలోను సమానమగు పదవాక్య ప్రయోగములతో నొప్పుచుండున. మౌఖిక ప్రచారమునఁగల దేసింగురాజు కథలోను, సర్వాయి పాపని కథలోను, నారసింహారెడ్డి కథలోను నిట్టి సారూప్య వర్ణనలను జూడవచ్చును. జానపదకవి ఒకేరకమగు రూపకములు నుపమానములు ప్రయోగించుచు, నొకేరకమగు దృశ్యములు వర్ణించుచుండును. వీరుఁడు సైన్యమునఁ బడదుమికి నఱకుచుండఁ

గా **'పెద్దపులి పెయ్యల దొడ్లో పడినట్లు'- 'వెట్టివాడు జొన్నచేను విడగొసినట్లు'** నుపమింపఁబడుచుండును. **తాటికాయలు తరిగినట్లుగాఁ దలలు తరుగుట, ఇద్దఱు ముగ్గురనుబట్టి యొక్క వ్రేటునకే నఱకుట, పాళెగాండ్ర తలలు కొట్టి పందిరిపెట్టుట, గుతికాండ్ర తలలు కొట్టి గుట్టలు పెట్టుట-** ఇత్యాది వర్ణనలు యుద్ధవీరమున్న ప్రతివీరగాథలోను ప్రత్యక్ష మగును. **'నరుకుతవుంటే నల్లశిరసులు రాలు'ట, 'కొదుతూవుంటే కొవ్వు దబ్బలు పదు'ట, 'పొడుస్తవుంటే పొట్టపేగులు పదు'ట, 'చీరుతవుంటే చిన్నపేగులు పడు'ట, 'అప్పుడు తిన్న పప్పు అన్నము కుప్పలు తెప్ప'లగుట, 'అప్పుడు తాగిన కల్లూ సారాయి వరదలుగా' పారుట, 'ఏనుగ రకతం పీనిగి రకతం ఏకమగు'ట-** మున్నగు వర్ణనలు బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, సర్వాయిపాపని కథ, నారసింహారెడ్డి కథ, ఇంకను నితర వీరగాథలలోను యుద్ధఘట్టములందు వచ్చు వారానువర్తనములు. తురకపీనుగ 'పానీపానీ' అని యరుచుట, అరవపీనుగ 'తణ్ణీతణ్ణీ' యనుట, వీరుని సైన్యము వారిని హెచ్చరించి కత్తులతో బల్లెములతోఁ బొడుచుట కూడ వీరగాథలలోఁ గానవచ్చు వారానువర్తనమే. వీరుల ద్వంద్వయుద్ధము **'కొదమ సింగములు రెండు కోరాడినట్లు, మత్తగజములు రెండు మల్లాడినట్లు, తాడిచెట్టులు రెండు తారాడినట్లు'** అను నుపమానములతో వర్ణింపఁబడుచుండును.

మరణింపఁబోవు వీరులకు దుశ్శకునములగుట, వీరమాతలకు వీరపత్నులకు దుస్స్వప్నములు వచ్చుట వారానువర్తనము. ఈ దుస్స్వప్నములను దివ్యజ్ఞానము కలిగిన ప్రత్యేక వ్యక్తులకు విన్నవించి, వారిచే ఫలితములను విప్పి చెప్పించుకొందురు. ఒక్కొక్కప్పుడు ఎఱుకతచేఁ గూడఁ జెప్పించుకొందురు. కోడిపోరుకథలో బ్రహ్మనాయఁడు తనకు వచ్చిన దుస్స్వప్నమును బాలగోపన్నచేఁ జెప్పించుకొనును. పెద్దిరాజుకథలో పెద్దమ్మ కల్యాణరాజు పుత్రికలచే స్వప్నఫలితముల నెఱుంగును. అగుమంచికథలో నగుమంచి తన కలను కాటమరాజు భార్యయగు వీరగంగకుఁ జెప్పి విప్పించుకొనును. పరశురాముని కథలో నెల్లమ్మ తన కల నెఱుకతచే విప్పించుకొనును. ఈ దుస్స్వప్నములలో కీడు యథాతథముగా ప్రత్యక్షము కాదు. కొన్ని ప్రత్యేక సంజ్ఞలచే ప్రతీకలచే వీరుఁడు మరణించినట్లుగా సూచింపఁ బడును. ఈ సంజ్ఞలను ప్రతీకలను వినువారు గుర్తించి వ్యాఖ్యానింతురు. పేరంటాండ్ర కథలలోఁ గూడ నీ దుస్స్వప్నము లున్నవి.

వీరగాథలలోఁ గొన్ని వస్తువుల పేర్లు పదే పదే వచ్చుచుండును. **"చంద్రాయుధము, పన్నెండు మెట్ల పైడికిన్నెర, పన్నెండు భద్రాయుధాలు, పక్షల పిడిబాకు, గాజు స్తంభము, రవధూళి, కనక తప్పెట, మూడువేలు చేసే ముద్దుటుంగరము, పదివేలు చేసే పచ్చల కంఠమాల, భూచక్ర గొడుగు"** మున్నగునవి. యుద్ధమునకు ముందు రణభూమిలో నిరుసైన్యములవారును దేరాలను వేసికొందురు. ఈ దేరాల వర్ణన ప్రతి వీరగాథలోను నొకే రీతిగా నుండును: ఎండలకు వెండిపట్టు దేరాలెత్తుట, నీడలకు నీలిపట్టు దేరాలెత్తుట సాధారణము:

*"ఎద్దులకు ఎత్తించినారు ఎన్నపట్టు ధేరాలు*
*ఎండలకు ఎత్తించినారు ఎండిపట్టు ధేరాలు*
*నీడలకు ఎత్తించినారు నీలిపట్టు ధేరాలు"* (పల్నాటి వీరకథలు)

*"ఎండలకు ఎత్తించె రాజు ఎండిపట్టు గుదార్లు*
*నీడలకు ఎత్తించె రాజు నీలిపట్టు గుదార్లు*
*మంచలకు ఎత్తించె రాజు మైనపుజిడ్డి గుదార్లు"* (కాటమరాజు కథలు)

నారసింహారెడ్డి కథ వంటి వీరగాథలలో సహితమిట్టి వర్ణనమే కాననగును. ఈ దేరాలవర్ణన తెలుఁగు వీరగాథాకవిత్వమున ప్రస్ఫుటముగాఁ గానవచ్చు వారానువర్తనము.

వీరుఁడొక ప్రయాణమును జేయునప్పుడు మార్గమధ్యమున అనేక గ్రామములను దాటినట్లు చెప్పఁబడుచుండును. పల్నాటి వీరకథలలో బ్రహ్మనాయఁడు మండాదినుండి గురిజాలకు వచ్చునప్పుడు మార్గమధ్యమునఁగల ఊళ్ళ పేర్లన్నియు వరుస క్రమమున వర్ణింపఁబడినవి. అట్లే బ్రహ్మనాయఁడు గురిజాలనుండి తిరిగి మండాదికేఁగు నప్పుడు సహితము మార్గములోని గ్రామముల పేర్లను జెప్పుట వీరగాథాకవి మఱచిపోడు. అలరాజు మేడపినుండి గురిజాలకు వచ్చినప్పుడును ఇట్లే మార్గములోని గ్రామముల పేర్లు చెప్పఁబడినవి. ఇట్లే కాటమరాజుకథలలో నల్లసిద్ధిరాజు సైన్యము నెల్లూరునుండి ఎఱ్ఱగడ్డపాడున కేయే గ్రామములు దాటి వచ్చినదో స్పష్టముగా వర్ణింపఁబడినది. బొబ్బిలికథలో బుస్సీసైన్యము హైదరాబాదునుండి బొబ్బిలికి వచ్చుట, విజయరామరాజు విజయనగరమునుండి రాజమహేంద్రవరమునకు వచ్చుట ఇదే రీతిలో వర్ణింపఁబడినవి. మార్గమధ్యమునఁగల గ్రామములను వరుస తప్పకుండా వర్ణించుట వీరగాథల వారానువర్తనములలో ముఖ్యమైనది. మఱికొన్ని వీరగాథలలో నాయకుఁడొక గ్రామమునుండి మఱియొక గ్రామమునకుఁ గాక, ఒకే నగరములోఁ బయనించు సందర్భమున, బంగారు మొగసాలలు, ఇత్తడి మొగసాలలు, కంచు మొగసాలలు, వివిధ వర్ణములవారి వాడలు దాటి వెడలినట్లు వర్ణింపఁ బడుచుండును. చిన్నమ్మకథలోను, ఎలనాగిరెడ్డికథలోను నిట్టి వర్ణనలను జూడవచ్చును. వీరుఁ దరణ్యమునఁ బయనించునప్పుడు చీమలు దూఱని చిట్టడవిని దాటినట్లును, కాకులు దూఱని కారడవిని దాటినట్లును, గ్రద్దలు దూఱని పెద్దయడవిని దాటినట్లును వర్ణింపఁ బడుట వారానువర్తనము. ఈ ప్రయాణములకు ముందు వీరుఁ డెప్పుడును 'ఎంచిన ఎల్లగుఱ్ఱము' నెక్కుచుండును.

వీరునితోనున్న సేవకుల పేర్లు, సంగాతకాండ్ర పేర్లు వరుసగా నేకరువుపెట్టుట వీరగాథలలోని మఱియొక వారానువర్తనము. నల్లసోమనాద్రి కథలోను, రాజారామేశ్వరరావుకథలోను, కుంటిపుల్లారెడ్డికథలోను నిట్టి జాబితాలను జూడవచ్చును. పల్నాటివీరకథలలోఁ గూడ మలిదేవునిసభలోని వీరులపేర్లు వీరవంశముల పేర్లు, నలగాముని కొలువులోని రెడ్లపేర్లు వరుసగాఁ బదే బదే చెప్పఁబడినవి.

(మహాభారతాదులగు నితిహాసములతో మునుల పేర్లు నిట్టివే.) మనుష్యులే కాక జంతువుల ప్రసక్తి వచ్చినప్పుడు కూడ నిట్లు పట్టిక నిచ్చుట వీరగాథలలోఁ గానవచ్చుచున్నది. పల్నాటి వీరకథాచక్రమున మందపోటుకథలోను, కాటమరాజుకథాచక్రమున ఆవులమేపు కథలోను, ఎఱ్ఱగడ్డపాటిపోట్లాటలోను ఆవుల ముద్దుపేర్లు వరుసగాఁ జెప్పఁబడినవి. ఆవులమేపుకథలో నెన్నియో పచ్చగడ్డిపేర్లు చెప్పఁబడినవి. జన్నివాడకథలోఁ బెక్కు వరివంగడపు పేర్లీయఁబడినవి.

సంఖ్యావాచకములలో ఏడు శబ్దముపై జానపదులకు మోజు హెచ్చు. **'ఏడేడు పధ్నాలుగు లోకాలు' 'ఏడడుగు లెదురెల్లింది'– 'ఏడు గడియలలోన ఏకాంతమాడేను'– 'ఎడలేక ఏడేళ్లు బ్రతికాడంటే'** – మున్నగు ప్రయోగములు కొల్లలుగా నున్నవి. అన్నదమ్ములెక్కువగా నేడుగురే యుందురు. నాయకుఁడెప్పుడును నేడవవాఁడుగా నుండును. **'పెద్దవాఁడు పెద్దిరెడ్డి, చిన్నవాడు చెన్నారెడ్డి, నడిపివాఁడు నారాయణ రెడ్డి'** – ఇత్యాదిగా యతిని బాటించుచు నొక ప్రత్యేక పద్ధతిలో నన్నదమ్ములపేర్లు చెప్పఁబడుచుండును. ముగ్గు రన్నదమ్ము లున్నప్పుడు పైరీతిగాఁ జెప్పఁబడును. ఏడుగు రన్నదమ్ము లున్నప్పుడు– పెద్దవాని పేరు 'అందరికి పెద్దవాఁడు' అను విశేషణముతో ముందుచెప్పి, 'అతనికన్న చిన్నవాఁడు' అనువిశేషణముతోఁ దరువాత నైదుగురి పేర్లు చెప్పి, ఆఖరివానిని జెప్పునప్పుడు 'అందరికి చిన్నవాఁడు' అను విశేషణమును వాడుట పరిపాటి. కాటమరాజు కథాచక్రమున చల్లవారి యేడుగురన్నదమ్ముల వర్ణన ఈ రీతిలోనే సాఁగినది. నల్లసోమనాద్రికథలో 'పాగా పుల్లారెడ్డి' అన్నదమ్ములును, రాజారామేశ్వరరావుకథలో 'అప్పరాల రెడ్ల' వర్ణన, ఎలనాగిరెడ్డికథలో నాయకుని అన్నదమ్ముల వర్ణన ఇట్టివే. వేంకటేశ్వరునికథలో నాతని అన్నదమ్ముల వర్ణన ఇట్లుండును: **"అందరికి పెద్దోడు పెన్నోబళేశు, ఆయనకు చిన్నోడు చిన ఓబళేశు, ఇద్దరికి చిన్నోడు కదిరి నరసింహ, ముగ్గురికి చిన్నోడు గనమద్దులేటిసామి, నలుగురికి చిన్నోడు పెంచల్ నరసింహ, అయిదుమందికి చిన్నోడు గోయిందరాజసామి, అందరికీ చిన్నవాడు సిరియెంకటరమణ".** ఏడు సంఖ్య తరువాత మూఁడు, తొమ్మిది, నూటయొకటి సంఖ్యావాచకము లెక్కువగా నుపయోగింపఁబడుచుండును.

వీరగాథలలోఁ గొన్న పట్టణముల పేర్లు చాల తఱచుగా వచ్చుచుండును, **"వాలుగొండ పట్నము, వెలిగొండ– సలిగొండ, కల్యాణపురి పట్నము, దేవగిరి పట్నము, ఓరుగంటి పట్నము"** మున్నగు పేర్లు సాధారణముగా వినఁబడుచుండును. **'పగలు చూచిన పట్నము మల్లె పూచినట్లు'**ను **'రేయి చూచిన పట్నము రేల పూచినట్లు'**ను నున్నదనుట సాధారణము. కొన్ని వీరగాథలలో నీ పట్టణవర్ణనము కొంచెము భిన్నముగా నున్నది. **'ప్రొద్దుపోయి చూచిన పొన్న పూచినట్లు, జాముపోయి చూచిన జాజి పూచినట్లు'** కలదని వర్ణింపఁబడినది. వీరుని శౌర్యమును వర్ణించుచు– **'అదురుగుండె లేనివాఁడు'– 'అదురుపిక్క లేనివాడు'– 'పిరికికండ లేనివాడు'– 'ఉక్కుతునక'–** మున్నగు వాక్యము లుపయోగింపఁబడుచుండును. వీరుఁడు రెడ్డికులమునకుఁ జెందినవాఁడగుచో **'రెడ్డికాదు బంగారపు కడ్డీ'– 'రెడ్డికాదు వరాల బుడ్డి'– 'రెడ్డీ, నీ పేరే బంగారపు కడ్డీ'** – అను వాక్యములతో వర్ణింపఁబడును. తెగించి యుద్ధమున దుముకు వీరులు జీవితము బుద్బుద ప్రాయమను ధోరణిలో వేదాంతపు మాటలను జెప్పుట వీరగాథలలోఁ గానవచ్చుచున్నది. యుద్ధమునకేఁగు బాలచంద్రుఁడు, తల్లికి వేదాంతమును బోధించును. గండు రేఖాంబ, తన కూతురు మాంచాలకు వేదాంతము నుపదేశించి, బాలచంద్రుని యుద్ధమునకుఁ బంపునట్లు చేసినది. బొబ్బిలి వీరులు **"రామరామ రామనంతకాలము రాజ్యము ఏలేర? యుగములు జగములు గలంత కాలము భూములు ఏలేర? తిరిగిపోయి మీ తల్లి కడుపునా మళ్ళీ పుట్టేర? చస్తేను మన పేరుండును బ్రతికితేను లేదు!"** అని మాటి మాటికి ననుచుందురు. ఇట్లే నారసింహారెడ్డికథలో **"ఈ పొద్దిదియ రేపు తదియ నరుని ప్రాణమోయి/ నీటిమీదను బుగ్గతోటిదీ నరాశరీరమ్ము/ ఏలబోయి ఈ ప్రాపంచంలో మరల ఏలబోము/ పుట్టబోయి మన తల్లి కడుపునా మళ్లీ పుట్టేమా?"** అను పాదములు పదే పదే వచ్చుచుండును. కుంటి పుల్లారెడ్డి కథలోఁ గూడ నిట్టి తెగింపు పలుకులున్నవి. **"చచ్చేది ఒకనాడు బతికేది ఒకనాడు, సచ్చి బతికినగాని పేరు నిల్వావాలె".** వీరుఁడు ఆత్మహత్య చేసికొనఁ దలఁచినప్పుడు చంద్రాయుధమును పైకెగురవేసి 'ఎదురొమ్ము ఒడ్డును'. ఇది పెక్కు వీరగాథలలోఁ గానవచ్చుచున్నది. పైనుండి వచ్చెడి చంద్రాయుధమును భగవంతుఁడు పట్టుకొని ఆపుచేయును (కాటమాజు కథలు).

వీరునకు గొప్ప చిత్తస్థైర్యమున్నట్లుగా వీరగాథలన్నింటను గానవచ్చుచున్నది. ఘోరయుద్ధములు జరుగుచున్నను, నొక ప్రక్క బంధుమిత్రులు నశించిపోవుచున్నను వీరుఁడు చలింపఁడు. నిశ్చింతగా ధైర్యముతోనుండి 'కులాసా'కొఱకు పగడసాల నాడుచున్నట్లుగా వర్ణింపఁబడును. పల్నాటియుద్ధములో బ్రహ్మనాయఁడు, కాటమరాజుకథలలోఁ గాటమరాజు నిట్లే వర్ణింపఁబడిరి. కాటమరాజు పద్మరాఘవునితో బంగారు తమకముపైఁ గూర్చుండి పగడసాల నాడుచుండును. చిన్నపరెడ్డికథలో నతఁడూళ్ళను గొట్టి, పోలీసులను తన్ని, ఇంటికివచ్చి నిశ్చింతగాఁ జీట్లపేక నాడుచుండును. గజదొంగలగు మియాసాబ్, పండుగ శాయన్న మున్నగువారు దోపిడులు, హత్యలు చేసివచ్చి, పానుగంటి ఖిల్లామీద నిశ్చింతగాఁ బండుకొనినట్లు చెప్పఁబడును. మరుట్ల చిన్నమల్లేశుని పాటవంటి వీరగాథానికలలోఁగూడ నిట్టి చిత్తస్థైర్యము వర్ణింపఁబడినది. వీరులకుఁ బిక్కలలోఁ దాయెత్తులున్నట్లును, నా తాయెత్తులు పెఱికినప్పుడు కాని వారికి మరణము రానట్లును జెప్పఁబడుచుండుటయు వీరగాథల వారానువర్తనమే (ఉదా: సదాశిరెడ్డి కథ, పండుగ శాయన్న కథ).

**'పాలు అన్నము తినుట'- 'పైడిగిన్నెలో పాలు తాగుట- ఎండిగిన్నెలో ఎన్న తినుట'** వీరుల భోగైశ్వర్యములకుఁ జిహ్నములుగా వర్ణింపఁబడుచుండును. స్త్రీల స్నానవర్ణన, అలంకరణ వర్ణన పెక్కు వీరగాథలలోఁ గానవచ్చుచున్నది. అన్నింటను నొకే తీరుగ నుండు వర్ణనము- **"ఎండికడవలతో ఏన్నీళ్లుపెట్టి, పైడికడవలతో సన్నీళ్లుపెట్టి, ఏన్నీళ్లు సన్నీళ్లు ఏకములు జేసి, నిమ్మల నీడల క్రింద జాలారు బండెక్కి జలకములాడుట"** వీరగాథలలో వర్ణింపఁబడుచుండును. స్త్రీలు వస్తువులన్నియు నలంకరించుకొని **'నిలువుటద్దములో నీడలు చూచు' కొందురు.**

వీరగాథలలోని కథయు వర్ణనలు 'సభివర్ధిత పునరుక్తి' (Incremental Repetition) తో సాఁగుచుండును. ఇది ముక్తపద గ్రస్తము వంటిది. ఇది వీరగాథల ముఖ్యలక్షణములలో నొకటి. (దీనిని గూర్చిన సమగ్రచర్చ 'వీరగాథా లక్షణము' లను ఎనిమిదవ ప్రకరణమునఁ గావింపఁబడినది.) ఒక వీరుఁడు యుద్ధమునకు సిద్ధమగునప్పుడు అభివర్ధిత పునరుక్తితో వర్ణన మీక్రింది విధముగా సాఁగును:-

***"కాశమీదను కాశ మనుమంత కాశ***
***హనుమంత కాశపై రేవంత ముల్లు***
***రేవంత ముల్లపై పింజమల దండ***
***పింజమల దండపై బిసరు కురువేరు***
***బిసరు కురువేరుపై బిగువైన బాకు"***

వీరుఁడు రణరంగమునకుఁబోయి, మరణించిన తన తండ్రిని బ్రతికించుకొని, యాతనిని దన వీపునఁగట్టుకొని, యుద్ధము చేసి, శత్రువులను జంపి, తండ్రి పగతీర్చినట్లుగా వీరగాథలతో వర్ణింపఁ బడుచుండును. పరశురాముని కథలలోఁ బరశురాముఁడు జమదగ్నిని నడ్డికిఁ గట్టుకొని కార్తివరాజులతో యుద్ధము చేసినాఁడు. పెద్దిరాజు కథలోఁ గాటమరాజుకూడ నిట్లే పెద్దిరాజును నడ్డికిఁ గట్టుకొని వాలికేతువరాజుతోఁ బోరినాఁడు. వీరుఁడు తపస్సు చేయునప్పుడు **'శిరసు కిందికి, సిరిపాదములు పైకి పెట్టి'** తపస్సు చేయును. సంతానము లేని దంపతులు (వీరుని తలిదండ్రులు) **'కాశీతీర్థము గంగకు, గంగతీర్థము కాశికి నోముట'** యే కాక, **'రాతిరాతికి మొక్కుట, గుంటగుంటను మునుగుట, పెండ్లిండ్లు లేని బ్రాహ్మణులకుఁ బెండ్లిండ్లు చేయించుట, వడుగులులేని బ్రాహ్మణులకు వడుగులు చేయించుట, ఉగ్గులేని బాలురకు ఉగ్గుదానము, పాలులేని బాలురకు పాలు దానము చేయుట'** వీరగాథలలో వారానువర్తనమగు వర్ణనము.

అలంకారములలో నుపమాలంకారమే హెచ్చుగాఁ బ్రయోగింపఁబడుచుండును. ఈ యుపమానములు పల్లెప్రజలకు మిక్కిలి పరిచితములైనవి. కొన్ని ప్రాంతీయములగు నుపమానములును వాడఁబడుచుండును. తెలుఁగుభాషలోని సిసలైన సామెతలు, జాతీయములు, పలుకుబడులు వీరగాథాకవిత్వమున నడుగడుగునను దొరలుచుండును. నిఘంటువుల కెక్కని అపూర్వమగు దేశిపదజాల మెంతయో వీరగాథలలో మూలుగుచున్నది.

ఇట్లు తెలుఁగు వీరగాథాకవిత్వ మంతకును వర్తించు వారానువర్తనములే కాక, ఒక్కొక్క వర్గమునందుఁ బ్రత్యేకముగాఁ గాననగు వారానువర్తనములును గొన్ని కలవు. అనఁగా శక్తికథ లన్నింటి ని బ్రత్యేకమగునవి, పల్నాటి వీరకథాచక్రమునకుఁ బరిమితమైనవి. కాటమరాజు కథాచక్రమునకుఁ బరిమితమైనవి. బొబ్బిలివరుస కథలలోఁ గానవచ్చునవి, వీరగాథానికల (లఘు వీరగాథల)లో గోచరించునవి కొన్ని కలవు. వీనినిగూర్చి స్థూలముగాఁ బరిశీలింతము:-

## శక్తికథల వారానువర్తనములు:-

ఏ శక్తియైనను ఈశ్వరుని పుత్రికగనే చెప్పఁబడును. ఈమె ఈశ్వరుని చెమట బిందువునుండి పుట్టినట్లుగా వర్ణింపఁబడును (ఒక్క ఎల్లమ్మ మాత్రము పుట్టలోఁ బుట్టినది). ఈ శక్తి రాక్షసులను జంపుటలోఁ దన తండ్రికిఁ దోడ్పడును. ఎల్లమ్మ తన తండ్రి గిరిరాజు నకును, పోలేరమ్మ చౌడమ్మలు ఈశ్వరునకును సహాయము చేసినట్లు చెప్పఁబడెను. అంకమ్మ గంగురాజునకు యుద్ధములలో సహాయకారి యయ్యెను. రాక్షస సంహారము, ముఖ్యముగా రక్తబీజుల సంహారము శక్తి చేయును. శక్తి యుద్ధమున కేఁగునప్పుడు ఆమె తమ్ముఁడు పోతురాజెప్పుడును వెంబడి నుండును. అమ్మవారి స్నానవర్ణన, అలంకరణవర్ణన రమణీయముగాఁ జేయఁబడును. అమ్మవారి భోజన పరాక్రమము మాత్రము అతిమానుషముగా వర్ణింపఁబడును.

భార్య తన భర్తను దలఁచుకొనునప్పుడుగాని, సంబోధించు నప్పుడుగాని **'నా తలమీది తలగొడుగ, నా ధర్మరాజ'** అనుచుండును. కోడలినిగాని కూతురునుగాని పిలుచునప్పుడు తల్లి **'వాడలమీదొచ్చిన వడ్డిరామసిలకా, పడవలమీదొచ్చిన పావురాల సిలకా'** అని సంబోధించుచుండును. కోడలు చూపిన పాతివ్రత్య మహిమలు తనకుఁ గ్రొత్త కావనియు, వానిచేఁ దానేమియు నాశ్చర్యపోవుట లేదనియుఁ దెల్పుచు, గయ్యాళిగంపయగు నత్తగారు పదే పదే **'ఈలాంటి సత్తేలు నా అరసేతినున్నాయి, కొనగోటి నున్నాయి'** అని వెక్కిరించుచుండును. పరశురామునివంటి వీరుఁడు నవ్వునప్పుడు **'సిత్తారినోటితో సిక్కున నవ్వును, బంగారి నోటితో పక్కున నవ్వును'.** సౌందర్యవతియగు స్త్రీ **'వాలారి చూపులతో- వయ్యారి నడకలతో, పచ్చారి చూపులతో- పార్వతీ నడకలతో'** పయనించుచుండును.

## పల్నాటి వీరకథాచక్రము- వారానువర్తనములు:-

పల్నాటి వీరకథాచక్రమున నేను పరిశీలించినంత వఱకును సుమారు ఇరువదియైదు వీరగాథలున్నవి. వీనియన్నింటను ప్రత్యేకమగు వారానువర్తనములున్నవి. పల్నాటివీరకథల వారాను వర్తనములను బరిశీలించుటకు ముద్రిత గ్రంథములను జూచినచోఁ

ప్రయోజనము లేదు. అవి వీరగాథాతత్త్వమును గోల్పోయిన జీవచ్ఛవములు. నేను సంపాదించిన తాళపత్ర గ్రంథములనుండి కొన్ని వారానువర్తనములను జూపుదును.

పల్నాటి వీరకథాచక్రమునఁ బ్రధానవీరుఁడు బ్రహ్మనాయఁడు. ఇతని వర్ణన యే కథలో వచ్చినను నీక్రింది విధముగనే యుండును:–

*"నిప్పులయందున నీరుయందునను*
*ఆరునొక్క ఘడియ నతడుండువాడు*
*చవిచూడకనె రుచులు చవిగొన్నవాడు*
*చూడకనె లోతులు సొరది గనువాడు*
*మూడామట ముచ్చట ముందు గనువాడు*
*ఏడామ టేకాంతము ఎరిగినవాడు*
*పాయక పరుగులు పరగ గనువాడు*
*షోడశ కళలచే శోభిల్లువాడు*
..............................
*విషవాక్కు అమృత వాక్కు కలిగినవాడు*
*పొమ్మన్నవారికి పోకలు గలుగు*
*రమ్మన్నవారికి రాకలు గలుగు"*

– కారెంపూడి తాళపత్ర గ్రంథము, ఆకులు 67, 105

కొలువు కూటము సమావేశమగు వర్ణన యెచ్చట వచ్చినను ఈ క్రింది విధముగనే యుండును. అది అనుగురాజు కొలువు కూటమైనను, నలగాముని కొలువు కూటమైనను, మలిదేవుని కొలువు కూటమైనను భేదముండదు:–

*"ఆ రోజు కందరు నంత నిద్రించి,*
*మరునాటి వుదయాన మరియంత లేచి*
*కొల్వుకూటము కొచ్చి గొబ్బునవారు,*
*దిండ్లు తివాశీలు తీరు బరపించి*
*వరుస గద్దెలమీద వారు గూర్చుండి,*
*కాపుల కరణాల కలజనులెల్ల*
*పిలిపించగా వారు ప్రేమతో వచ్చి..."*

–కారెంపూడి తాళపత్ర గ్రంథము, ఆకు 149

కొలువు కూటములలోఁ గూర్చున్న వీరులను వర్ణించునప్పు డెల్లప్పుడు నొకే విధమగు విశేషణములు వాడఁబడుచుండును. ఆయా వీరుల కెప్పుడును కొన్ని ప్రత్యేక విశేషణములే ప్రయోగింపఁబడును.

బ్రహ్మనాయఁడు: ***'పులితోలు గద్దెపై భూమి తీర్పరియు***
***బలుదైన శీలము బ్రహ్మనాయుండు'***

ఈ పాదములు పల్నాటి వీరకథలలో సుమారు ఇరువది ముప్పది పర్యాయములైనను వచ్చియుండును. ఇతర వీరుల గద్దెల వర్ణనయు నెల్లప్పుడు నొకే విధముగా నుండును. **"మాణిక్యాల గద్దెలపై మలిదేవ రాజులును, కోటిలింగముల గద్దెపై కొమ్మభూవిభుఁడును, చిలుకల గద్దెపై శీలము పేర్నీడుసు, హంసల గద్దెపై అన్న పెద్దన్నయు, గెద్దమూర గద్దెపై కన్నమనేడును"** గూర్చుందురు. సభ యెల్లప్పుడును **"రాజులు గూర్చుండు రాయమొగసాల, వీరులు గూర్చుండు వీరమొగసాల"** అని చెప్పఁబడును. సభలోని వీరవంశములను గూర్చియు, వీరనాయకులను గూర్చియు నొకేవిధమగు వర్ణనలు పదే పదే వచ్చును. అట్టివానిలోఁ గొన్ని–

*"వలపల గద్దెల వాలునాయకులు*
*దాపల గద్దెల దండినాయకులు"*

*"కోరి డెబ్బదిరెండు గోత్రాలవారు*
*పరగ పన్నెండిండ్ల పద్మనాయకులు"*

*"ఆవాలవారును అచ్యుతునివారు*
*భావజాకారులు బలుమూరివారు*
*కొండవిండ్లవారు గోవిందువారు*
*ముత్తసానివారు ముయ్యూరువారు*
*అట్లూరి మట్లూరి యాఖ్యలవారు*
*చెవులవారు మరి చిల్లరవారు*
*బాదంవారును బహుమన్నెవారు*
*శంకలేనియట్టి సుంకరవారు*
*కాపులు కరణాలు కలజనులెల్ల"*

*"అరవైయార్గురు వీరనాయకులు*
*డెబ్బయియేడ్గురు పోటుమన్నీలు"*

ఈ వీరవంశముల వర్ణన అనుఁగురాజుసభలోను, నలగాముని సభలోను, మలిదేవునిసభలోను నొకేవిధముగానుండును. అనుఁగురాజు గురిజాలపట్టణమును గట్టించుట, బ్రహ్మనాయఁడు మాచెర్లపట్టణమును గట్టించుట యొకేరీతిగా వర్ణింపఁబడినవి. వడ్రంగులను బిలిచి తాంబూలమిచ్చుట, వారు ప్రతివర్ణమునకును నొక్కొక్కవాడ చొప్పునఁ బురమును నిర్మించుట చెప్పఁబడును. తరువాత నాయా ఇంటిపేర్లుగల వీరుల వంశ నామముల వర్ణనయుండును.

పెద్దన్న బాదరాజు వర్ణన పల్నాటి వీరకథలలో నెచ్చట వచ్చినను నీ క్రింది విధముగా నుండును:–

*"విద్యలకు పెద్ద, విలువిద్యలకు పెద్ద,*
*చదువులకు పెద్దయు, శాస్త్రమునకు పెద్ద,*
*శీలమ్మకును పెద్ద, ఆ చెలువుడు ఇపుడు*
*అరువైయార్గురు వీరులందరికి పెద్ద"*

పల్నాటి వీరకథలలో నాగమ్మ వర్ణనయు నిట్టి వారానువర్తనమే:–

*"నీమామీద జామా కట్టి, జామామీద నీమా కట్టి*
*కాలు విజాయి కవాయి కట్టు*
*మూడుమూళ్ల రవికె ముద్దు భాభలిగ తొడిగి*
*ఏనుగుతొండాము లావు జడ ఎన్నుయీపున ఏసి*
*ఏడు సానలు తీసిన వుక్కు సానాకత్తి బుజాన బెట్టి*
*వుజార్న పారాయిస్త వున్నాది మంత్రి నాయకురాలు"*

కన్నమనేని వర్ణన యెచ్చట వచ్చినను 'ఆరుమూళ్ల కంచుటరిగె, పన్నెండు మూళ్ల భైరవకత్తి' పట్టుకొనినట్లుగాఁ జెప్పఁబడుచుండును.

ఆనలు పెట్టుట పల్నాటి వీరకథలలోఁ దఱచుగాఁ గాన నగును. కోడిపోరుకథలో గోపన్నకు బ్రహ్మన్నయు, బాలునికథలో అనపోతునకు బాలచంద్రుఁడును, గురిజాల రాయబారము కథలో అలరాజునకు బాలచంద్రుఁడును ఆనలు పెట్టుదురు.

*"శ్రీగిరి లింగం బాన, మాచెర్ల చెన్నుని యాన*
*పోలుపొందు గంగుల పోతురాజాన*
*బలుడగు మా తండ్రి బ్రహ్మయ్య పాదమాన*
*త్రోసివచ్చితివంటోయి ద్రోహమంటేని"*

- అలరాచమట్లుగారి గురిజాల రాయబారము, వ్రాఁతప్రతి.

పల్నాటి వీరకథలలోని మఱికొన్ని వారానువర్తనములు:-

*"వినవయ్య (నాయుడ) విశదంబుగాను".*

*"అప్పుడు (బ్రహ్మన్న) ఆడె నొకమాట".*

*"తెల్లని కన్నులకు తెచ్చె కోపంబు"*

*"ఆనాడు నిద్రించి అటు మరునాడు".*

*"కాపులు కరణాలు కలజనులెల్ల".*

*"మరికొన్ని రోజులు మరిగిన వెనుక"*
*('మరికొన్ని ఏండ్లును మరిగిన వెనుక')*

*"విద్యలకు పెద్ద, మరి బుద్ధికి పెద్ద*
*చదువునకు పెద్ద, మరి సామునకు పెద్ద"*

*"కార్తవీర్యుని నాటి కంచు రణభేరి"*
*"ఆటలవారు మరి పాటలవారు*
*నాటలవారు మరి నాడేటివారు"*

*"వరుస గద్దెలపైని వారు గూర్చుండి"*

*"బ్రాహ్మలు దీవింప భట్లు పొగడగను"*

*"కాశమీదను కాశ హనుమంత కాశ*
*హనుమంత కాశపై రేవంత ముళ్లు"*

*'గొబ్బున'- 'అతివేడ్క'-'కడువేడ్క'-'కడువేగ'-'ఘన'* మొదలగు శబ్దములు తఱచుగా నుపయోగింపఁబడుచుండును.

**కాటమరాజు కథాచక్రము- వారానువర్తనములు:-**

పల్నాటి వీరకథలలోవలెనే కాటమరాజు కథలలోఁగూడ కొన్ని ప్రత్యేకములగు వారానువర్తనములున్నవి. ప్రార్థనలో సాధారణముగా **'శ్రీ జాహ్నవీ గంగఁ జిత్తమున దలఁచి'** అను వాక్యము వచ్చుచుండును. ఆవులను పేరుపేరునఁ బిలుచుట పెక్కు కథలలోఁ గలదు (ఆవులమేపు, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట, కంసుఁడు కథ). పాలు పితుకునప్పుడు **'తొలిచుక్క పొదవంగ దొరావుల బితికి, మలిచుక్క పొదవంగ మైలావుల బితికి'** అని వర్ణింపఁబడుచుండును. సందర్భము వచ్చినప్పుడెల్ల కాటమరాజు వంశవర్ణన చేయఁబడినది. విష్ణువునుండి కాటమరాజువఱకును గల తరములు చెప్పఁబడినవి. కాటమరాజు యొక్క ఆలమంద విస్తారమైనదని చెప్పుటకుఁ బదేపదే **'కుదురు ఆరామడ, కదులు పన్నెండామడ'** అనియు, **'కుదిరితే ఆరామడ, చెదిరితే పన్నెండామడ'** అనియుఁ జెప్పఁబడుచుండును. విశేషణ విశేష్యములను బరస్పరము మార్చి, త్రిప్పి చెప్పుట కాటమరాజు కథలలో నెక్కువగాఁ గాననగును.

పల్నాటి వీరకథలలో గానవచ్చు వారానువర్తనములు కొన్ని కాటమరాజు కథలలోను గన్పట్టుచున్నవి. పురనిర్మాణవర్ణన పల్నాటి కథలలోవలెనే యున్నది- (వలురాజు పుత్రులు పంపాద్రిపురమును గట్టించుట). **'కాశమీదనుకాశ అనుమంతకాశ, అనుమంతకాశపై రేమంతముళ్లు'** అను వర్ణనము, **'బ్రాహ్మణులు దీవింప భట్లు పొగడంగ'** అనునది పల్నాటికథలలోని వారానురవర్తనముల వంటివే.

గంగవర్ణన కాటమరాజుకథలన్నింటను నొకేవిధముగా నున్నది. పండ్రెండు చేతుల భాగీరథి గంగ, పండ్రెండు భద్రాయుధము లతో భయంకరముగా వర్ణింపఁబడుచుండును. పెద్దిరాజు కథ (నాకు లభించిన వ్రాతప్రతి)లో గంగవర్ణన:-

*"పన్నెండు చేతుల భద్రాయుధములు,*
*అసురుల మర్దించు అంబు వకచేత*
*దుష్టుల మర్దించు దుడ్డు వకచేత,*
*శూలము వకచేత సింగిణొకచేత*
*కరవాల మొకచేత కత్తి వకచేత,*
*శంఖము వకచేత చక్రమొకచేత*
*పరశువు శూలధారి హరినీలవేణి,*
*విరివిగ జడలన్ని విరబోసికొనియు"*

యుద్ధములో యాదవవీరులు మరణించినప్పుడు ఈ గంగ యాదవ కాంతలకుఁ గలలోఁ బ్రత్యక్షమై కీడును దెలియఁజేయును. పెద్దిరాజుకథలోను, అగుమంచికథలోను నిట్లు జరిగినది.

కరణములచేఁ గమ్మలు వ్రాయించుట, కాలారిచే నా కమ్మలు పంపించుట కాటమరాజుకథలలోఁ దఱచుగా వచ్చును. ఏ కథలో నైనను కాటమరాజు పద్మరాఘవునితోఁ బగడపాలాడుచున్నట్లుగనే వర్ణింపఁబడుచుండును. ఇది శ్రోతలకు విసుగు కలుగునన్ని సారులు చెప్పఁబడును.

వీరగాథాకవిత్వములో నొక విచిత్రమగు వారానువర్తన మున్నది. ఒకపని నొక వ్యక్తికిఁ జెప్పఁగా నతఁడాపనిని వెంటనే చేసినట్లుగా వీరగాథలలో నుండదు. ఎందఱినో యడుగఁగా, వారందఱును దిరస్కరించినట్లును, కడకొక ప్రత్యేకవ్యక్తి నడిగినట్లును, అతఁడాపని చేసినట్లును చెప్పఁబడును. అగుమంచికథలో నామెకుఁ దలంటు పోయవలసివచ్చెను. ఆమె తల్లియగు సిరిదేవి తన కోడండ్ర నందఱను వరుసగా నొక్కొక్కరినే పిలిచి, అగుమంచికిఁ దలంట వలసినదిగాఁ గోరును. వారెవ్వరును సమ్మతింపరు. కడకు సిరిగిరమ్మ (పోచయ్య భార్య) ఆమెకుఁ దలంటుట కంగీకరించును. సిరిదేవి పెద్దకోడలిని బిలిచెననియు, నామె యంగీకరింపలేదనియు, రెండవ కోడలిని బిలిచెననియు, నామెయు నంగీకరింపలేదనియు, నిట్లే తక్కిన కోడండ్ర నైదుగురను గోరెననియు, వారెవ్వరును నంగీకరింపకపోఁ గాఁ జివరకు సిరిగిరమ్మను గోరెననియు మనము తేల్చివేయుదుము. వీరగాథాకవి యట్లు వదలఁడు. సిరిదేవి ఒక్కొక్కరినే పిలుచుట, వారు సమ్మతింపకుండుట మెల్లగా వర్ణించును. సిరిదేవి కోరు మాటలును, కోడండ్రు తిరస్కరించు మాటలును నొకేమూసలోఁ బోసినట్లుండును. సిరిదేవి, సిరిగిరమ్మతోఁ గలిపి మొత్తము ఎనమండుగురు కోడండ్రను బ్రశ్నించినది. ఈ యెనిమిది సంభాషణలను వీరగాథాకవి పునరుక్తి దోషమునకు వెఱవక విపులముగా వర్ణించును. ఇది యొక వారానువర్తనము. (పల్నాటివీరకథలలో బాలచంద్రుఁడు గూడ నిట్టి పనినే చేయును. సంగడీలతో యుద్ధమునకుఁ బోవుచు ననపోతును వెనుకకుఁ బంపు నెపముతో మాంచాల నడిగి తన ముద్దుటుంగరమును గొనితెమ్మని వెంటనే అనపోతును గోరఁడు. మొదట నొక సంగడీనిఁ గోరును. అతఁడంగీకరింపక పోఁగా మఱియొకనిని గోరును. ఇట్లార్గురు సంగడీలను గోరి, కడకు అనపోతును గోరును. లఘువీరగాథలలోఁగూడ నిట్టి వారానువర్తనము కాననగును. ఉదా॥ "కలవారి కోడలు కలికి కామాక్షి" అను జానపద గేయములో నిటువంటి వారానువర్తనమే కలదు.)

కాటమరాజుకథలలోఁ జాలఁదఱుచుగా వచ్చు మఱికొన్ని వారానువర్తనములు:-

*"తరమునాటి పెద్దలు"*

*"శ్రీవీరకల్లుగా చెల్లె"*

*"గట్టిగా ఎదురొమ్ము గాయాలు నాటి"*

*"యదుబలంబులకు ఏట్లు పోట్లాయె"*

*"ఎదురొమ్ము గాయాలు ఏట్లు పోట్లు బడి*
*పగవారి ఆయుధములు భారంబులాయె"*

*"అంతట గాయాలు అతిభారమాయె"*

*"ఎత్తివచ్చిన బాణాలు ఎదురొమ్ము నాటినాయి*
*జారివచ్చిన బాణాలు జబ్బలు నాటినాయి"*

*"వుక్కుటలుగులమీద వొరిగిరి రాజులు"*

*"అన్నలకు తమ్ముడు ఆ పోలురాజు"*

*"వలపట పార్శ్వాన వంకిళ్లు నాటె*
*దాపట పార్శ్వాన తగిలె నరుకులును".*

**బొబ్బిలివరుస కథలు- వారానువర్తనములు:-**

బొబ్బిలియుద్ధకథలో బుస్సీదొర మజిలీలు చేయుచు రాజమహేంద్రవరము వచ్చునప్పుడు, ప్రతియొక్క మజిలీలోను ఆ ప్రాంతపు జమీందారులను భయపెట్టి కప్పములు గొనుట యొకే రీతిగా నుండును. ప్రతియొక్క మజిలీయందును బుస్సీ ఇట్లనును:-

*"దివాణమంటే గడనలేదుగా జమీందార్లకేమి*
*కరకర కరకర జాబులు వ్రాయి లక్షుమన్న నీవు"*

అప్పుడు దుబాసి లక్ష్మన్న ఆ ప్రాంతపు జమీందారున కీ క్రింది విధముగా జవాబు వ్రాయును:-

*"కూర్చుంటే కూర్చున్న లాగున భేటికి రావాలె*
*నిలుచుంటే నిలుచున్న పాటున భేటికి రావాలె"*

ప్రతియొక్క మజిలీలోను ప్రతియొక్క జమీందారునకును నిట్లే జాబు వ్రాయును. ఆ జమీందారు 'కట్నకానుకల'తో వచ్చినప్పుడు బుస్సీకి సలాము చేయుట, బుస్సీ తిరిగి సలాము చేయుట ఒకే విధముగా వర్ణింపఁబడును:-

*"సలాం నీకూ సలాం నీకూ బూసీ దొరగారు*
*సలామనగనే సలామన్నడూ బూసీదొరగారు"*

ఏ మజిలీలో జమీందారు వచ్చి సందర్శించినను పై వాక్యములే పునరుక్తము చేయఁబడును. బొబ్బిలికథవలెనే 'రాజారామేశ్వరరావు కథ'లోఁ గూడ నతఁడు చెన్నపట్టణమేఁగు నప్పుడు మార్గమధ్యమునఁ బ్రతిగ్రామమునను నొకేవిధముగాఁ బ్రశ్నింతురు; అతఁడొకే విధముగా జవాబు చెప్పును.

పన్ను చెల్లింపుఁడని చక్రవర్తి కోరఁగాఁ, దిరుగుబాటు చేసిన సామంతరాజు వెటకారముగా మాటలాడుట బొబ్బిలివరుసకథలలోఁ గొన్నింట గాననగును. దేసింగురాజుకథలో, ఆర్కాటు నవాబు సాదుల్లాఖాన్, దేసింగురాజును పన్నుకట్టుమని యాజ్ఞాపించుచు తోండ్ర మల్లోజీనిఁ బంపఁగా, దేసింగురాజాతనితో నిట్లు పరిహాస మాడును:-

*"కోట వెలుపటి గుండురాళ్లను ఎంచుక పొమ్మనుము*
*ఏటి యిసుక వున్నది వొంటెలపై నెత్తుక పొమ్మనుము*
*వరద వచ్చినపు డీ యేటిలో బురద నిలిచె మెండుగాను*
*పరువునన్ విరగనెండి చెక్కలై యున్నవి గొనిపొందు"*

బంగారు తిమ్మరాజు కథలోఁగూడ నిట్టి వెటకారమున్నది. నారప్ప తండ్రి చవల గోవిందు శిస్తు వసూలుకొఱకు శేషుపట్టణము రాఁగా, నచట తిమ్మరాజు తండ్రియు బంధువులును నతని నిట్లు పరిహసింతురు:-

*"కోట యివతలీ సున్నపురాళ్లూ తీసికెళ్లమనిరీ*
*బురుజుమీదదీ అరికగడ్డి పట్టుకెళ్లమనిరీ*
*డాలు కత్తిలో పైసా యున్నది-తీసికెళ్లమనిరీ"*

యుద్ధవర్ణనలోని బీభత్సవర్ణన బొబ్బిలికథనుండి తక్కినవానికి వ్యాపించినట్లుగాఁ దోఁచుచున్నది. దేసింగురాజుకథ, సర్వాయి పాపని కథ, ఉయ్యాలవాడ నారసింహారెడ్డికథలలో బీభత్సవర్ణనలు బొబ్బిలి కథలోవలెనే యున్నవి.

'కూర్చొనియుండు' అను నర్థమున 'కొలువుదీరు' అను శబ్దము పదేపదే వాడఁబడుచుండును. 'కుర్చీమీద కొలువుదీరు'- 'గుఱ్ఱంమీద కొలువుదీరు' ఇత్యాది ప్రయోగములు బొబ్బిలివరుసకథలలో నున్నవి.

వీరుఁడు పుట్టినప్పుడు **'వీపున వింజామర, అఱికాలున తామర పద్మము'** నున్నట్లు వర్ణింపఁబడుచుండును. బొబ్బిలికథలోను, గాంధారికథలోను నిట్టి వర్ణనలున్నవి. తెలంగాణా వీరగాథలలో వీరుఁడు వేంకటేశ్వరుని వరముచేతఁ బుట్టెననియుఁ, బుట్టుతిరుమణి కలవాఁడనియు, నయిదురేఖలు గలవాఁడనియు వర్ణింపఁబడుచుండును.

జంగమవేష వర్ణనలో నా జంగము **'కురుదండ కోదండ బిచ్చ'** మడిగెనని పదేపదే చెప్పఁబడును. జాబులు వ్రాయునప్పుడు **'గరగర గరగర'** వ్రాసినట్లును, జాబులు చదువునప్పుడు **'పళపళ పళపళ'** చదివినట్లును వర్ణింపఁబడుచుండును. బొబ్బిలికథలో మాత్రము 'గరగర' శబ్దమునకు బదులు 'కరకర' శబ్దము వాడఁబడినది. తెలంగాణా వీరగాథలలో జాబులు చదువుట **'గిరగిర గిరగిర'** శబ్దములతోఁ జెప్పఁబడును. వీరుఁడు గుఱ్ఱము నధిరోహించినపుడు **'కుప్పించి గుఱ్ఱము నెక్కెను'** అని చెప్పఁబడుచుండును.

ఆపదమొక్కులు మొక్కుట బొబ్బిలివరుసకథలలో సామాన్యముగాఁ గానవచ్చుచుండును. జగపతిరాజుకథలోను, నల్లసోమనాద్రికథలోను, రాజారామేశ్వరరావుకథలోను నిట్టి వర్ణనలు విపులముగా నున్నవి. వీరుఁడు బాలుఁడుగా నున్నప్పుడే గొప్ప శౌర్యమును బ్రదర్శించినట్లుగా బొబ్బిలివరుసకథలలోఁ గాననగును. ఆ బాలుఁడు తినుబండారములను వదలి కత్తిని పట్టుకొనినట్లు చెప్పుట ఈ కథలలో సాధారణము. బొబ్బిలికథలో వెంకటరావు, రాణీ శంకరమ్మకథలో సదాశివరెడ్డి ఇట్లు చేసినట్లు చెప్పఁబడినది. వీరుఁడు నిద్రించుచుండఁగా 'నాగసర్పము' గొడుగుపట్టుటకూడ వారానువర్తనమే. సర్వాయిపాపనికథలోను నల్లసోమనాద్రికథలోను నిట్టి వర్ణనలు గలవు.

తెలంగాణా వీరగాథలన్నియు సర్వసాధారణముగా నీ క్రింది వాక్యములతోఁ బ్రారంభమగుచుండును:-

*"రాజా ఓ రాజా! రజా భోగతి గలిగి*
*మనది యా దేశంబు? మనది యాదీ భూమి?*
*మనది యా జిల్లాను? మనది యా తాలూక?"*

తెలంగాణా వీరగాథలలో హైందవవీరుఁడు తురకవానిని దిట్టునప్పుడును, తురకవీరుఁడు హైందవవీరుని (ముఖ్యముగా రెడ్డి వీరుని) దిట్టునప్పుడును నొకే విధమగు మాటలు ప్రయోగింపఁ బడుచుండును. తురకవానిని దిట్టుట: **'వినరా తురకవాడ, గొడ్లకోసె మదరచోద, అడుక్కుతినే ఫకిరువాడ'**. రెడ్డివీరుని దిట్టుట: **'ఎద్దుముడ్లు పొడిచె కాపుకొడుకు, ఏటి మడులు దున్నె కాపుకొడుకు, అంబలిదుత్త తాగేవాడు, నాకు సమము రాబోయినాడ'.** ఈ తెలంగాణా వీరగాథలలో **'అరబ్బీలదండు, రోహిణీలదండు'** తఱచుగాఁ బ్రసక్తమగుచుండును.

ఒకవ్యక్తిని బిలిచినప్పుడు అతఁడు వచ్చి **'నన్ను పిలిచినా కారణమేమీ? నాతో పనియేమి?'** అని ప్రశ్నించుచుండును. ఒక వ్యక్తి మఱొక వ్యక్తికడకు వచ్చినప్పుడు దండములు పెట్టినట్లు చెప్పుట బొబ్బిలివరుసకథలలో సాధారణము. ఈ వారానువర్తనము ననుకరించుటలో జానపద గాథాకారులు ఒక్కక్కప్పుడు ఔచిత్యమును గూడఁ బాటింపరు. చిన్నవారు పెద్దవారి కడకేఁగినప్పుడు దండములు పెట్టుట సమంజసమే కాని, గాథాకారులీ దండములు పెట్టుట ప్రతి వ్యక్తిని ఉపయోగింతురు. అన్న తమ్మునిదగ్గఱకు వచ్చి దండములు పెట్టును. యజమాని సేవకునికడకు వచ్చి దండములు పెట్టును. వారానువర్తనలక్షణము నంధముగా ననుకరించుటలో వచ్చిన ప్రమాదమిది.

బొబ్బిలివరుసకథలలోఁ బేరంటాండ్రకథలదొక ప్రత్యేక వర్గము. ఇవన్నియుఁ గరుణరసప్రధానములు. ఈ పేరంటాండ్ర కథలలోఁ గొన్ని ప్రత్యేక వారానువర్తనము లున్నవి. (వీరగాథలలో నొక్కొక్క వర్గమునకుఁ బ్రత్యేకమైన వారానువర్తనము లున్నవని మొదటనే మనవి చేసితిని.) పేరంటాలునకుఁ జిన్నతనముననే తల్లిదండ్రులు చనిపోవుదురు. అన్నయో లేక పెదతండ్రియో పెంచును. అత్తవారీమెను మిక్కిలిగ హింసింతురు. చివర భర్త చనిపోఁగా నీమె 'సాగుమానము' చేయుట, లేదా ఈమె శీలమును శంకించి భర్త హత్యచేయుట జరుగును. సాగుమానమే హెచ్చుగా నుండును. పేరంటాలు సహగమనము చేయుటకై ప్రభుత్వమును కోరఁగా మొదట నిరాకరింపఁబడుట, పై యధికారి కలలోఁ బేరంటాలు కనబడి తనకనుమతి నీయవలసినదిగాఁ గోరుట, తన మాహాత్మ్యమును జూపుట అన్ని కథలలోను గలదు. కామమ్మకథ, నారాయణమ్మకథ, రంగమ్మకథలలో నిట్టి సన్నివేశములున్నవి. పుట్టింటికడనున్న పేరంటాలునకు మఱంది వార్తను (భర్త మరణవార్తను) దెచ్చుట అన్ని

పేరంటాం[డ్ర] కథలలోను గలదు. పేరంటాలు భర్తకీడునుగూర్చి ముందుగా దుస్స్వప్నమును గనుటయు వారానువర్తనమే (ఎఱుకమ్మ, నారాయణమ్మ మొ॥ వారు). భర్త చనిపోయినవార్త వినఁగానే ప్రతియొక్క పేరంటాలును ఫక్కున నవ్వును (ఏడ్చినట్లుగా నే పేరంటాలుకథలోను లేదు). సహగమనము చేయుటకు ముందుకూడ పేరంటాలు ఫక్కున నవ్వుట, దొంగతనములు చెప్పుట, సత్యములను జూపుట, పిల్లలు లేనివారికిఁ బిల్లలను బ్రసాదించుట, ఆ పుట్టఁ బోవువారికిఁ దనపేరు పెట్టుఁడని చెప్పుట, అగ్నిలో దుముకుటకు ముందు నిమ్మపండ్లు మంటలలో వేయుట, మంటలలోఁబడి పేరంటాలు బంగారుప్రతిమ యగుట, ఆమె భర్త వెండిప్రతిమ యగుట– ప్రతిగాథలోను వచ్చు వారానువర్తనములు. బొబ్బిలివరుస కథలన్నింటికిని యుద్ధవర్ణనాది వారానువర్తనములలో బొబ్బిలికథ మూలమైనట్లే, ఈ పేరంటాం[డ్ర] కథలన్నింటికిని కామమ్మకథ మూలమని నా యభిప్రాయము. కామమ్మకథలోని సంఘటనలే అన్ని పేరంటాం[డ్ర]కథలలోను ననుకరింపఁబడినవి.

**వీరగాథానికలు– వారానువర్తనములు:–**

బలవన్మరణము చెందిన వీరునకై పరితపించుట ప్రతి వీరగాథానికలోను (లఘువీరగాథలోను) సాధారణమగు నితివృత్తము. వీరుఁడు మిక్కిలి యందగాఁడనియు, నతఁడలంకరించుకొని కట్టవ మీఁద బోవుచుండఁగా 'కలకటేరు' ('కదిరితేరు') గాఁ గనఁబడుటయు నొక వారానువర్తనము.

***"శేరు శేరూ ఎండి మురుగుల్– చేతులాకూ బెట్టుకోనీ***
***కట్టవమీందా పోతవుంటే– కలకటేరనుకొంటిర కొడకా..."***
– (గుఱ్ఱాల గోపిరెడ్డి పాట.)

***"నీలికోటూ దొడుక్కోనీ – నిల్వుసెత్రీ బట్టుకోనీ***
***కట్టమిందా బోతవుంటే– కదిరితేరనుకొంటి కొడకా"***
–(మానందిరెడ్డి పాట.)

వీరుఁడు హత్యచేయఁబడఁగా నింటిలో దిక్కులేక 'కాకిశోక మాయె' నని చెప్పుట వేఱొక వారానువర్తనము. ఈ 'కాకిశోకము' ప్రతి లఘువీరగాథలోను దప్పక యుండితీరును.

***"యింటిలో మగదిక్కు లేక– యెద్దులిడిసే దిక్కులేక***
***సాకిరేవూ బండ్లకాదా–కాకిశోకం జేసెనన్నా"*** (విరూపాక్షరెడ్డిపాట)

***"నూరుగాండ్లా యెద్దులంట– నూటిమంది సేద్యగాళ్లు***
***కాడిగట్టే దిక్కులేకా–కాకిశోకా మాయెరా"*** (మానందిరెడ్డి పాట)

వీరగాథానికలలోఁ జనిపోయిన వీరుని 'కొడుకా' యని సంబోధించుచు దుఃఖించినట్లుగా వ్రాయఁబడుట సాధారణము. **'కొడుకా, మానందీరెడ్డీ' 'కొడుకా, ఎంకట్రామిరెడ్డీ'** మున్నగు పునరావృత్తులుగల పాటలు ఉదాహరణములు. వీరుని జంపఁబోవునప్పుడు బ్రతిమాలుట, డబ్బునిచ్చెదననుట, యెంత బ్రతిమాలినను శత్రువులు వినకుండుట, అతఁడు చేయెత్తి హంతలకు మ్రొక్కఁబోఁగా, వారు ఆ చేతిని ముందు నఱకిరనుట– వీరగాథానికలలోఁ జాలఁదఱచుగా వర్ణింపఁబడుచుండును. హత్యచేయఁబడుటకుముందు వీరుఁడు బయలుదేరఁగా నెవరో తుమ్మిరనుట, జోడు కట్టిపిల్లులు శకునమైన వనుట వర్ణింపఁబడుచుండును.

రాయలసీమ లఘువీరగాథలలో **'పండబెట్టి గొంతుకోసిరి'– 'కరకర గొంతుకోసిరి'–'పండబెట్టి పానంతీసిరి'– 'కూచ్చోబెట్టి గొంతుకోసిరి'–** అను వాక్యములు పదే పదే వచ్చుచుండును. తెలంగాణా లఘువీరగాథలలో **"కారిన నెత్తురును కడవలకు బట్టుట, చిట్లిన నెత్తురును సీసాలకు బట్టుట, గొడ్డళ్లు నూరుకొని గొంగట్లో పెట్టుకొనుట, కత్తులు నూరుకొని కడుపుల్లో పెట్టుకొనుట"** మిక్కిలి తఱచుగా వర్ణింపఁబడుచుండును. తెలంగాణా వీరగాథానికలలోఁ బ్రచురముగా నుండు మఱిరెండు వారానువర్తనములు:–

***"బండెనుక బండి కట్టి– పదహారు బండ్లు కట్టి***
***ఏ బండ్లో వస్తవు కొడుకో– నా కొడుకా..."***

***"చుట్టూన సూర్యపేట – నట్టనడుమ నల్లగొండ***
***అవతాల హైదరబాద– దానవతల గోలుకొండ"***

చనిపోయిన వీరుని శరీరమునుండి దుత్తలకొలఁదియు రక్తమును దీసిరనుట, తట్టలకొలఁదియుఁ గ్రొవ్వు తీసిరనుట రాయల సీమ పాటలలోఁ గాననగును.

జానపద లఘువీరగాథలలో స్త్రీలు ముఖప్రక్షాళనము, స్నానము మున్నగునవి యొకే తీరున వర్ణింపఁబడుచుండును. **'పాపేడి సెట్టెక్కి పలుపుల్ల (పలుగర్ర) యిరుసుట, ముత్యాల రాయెక్కి మునిపల్లు తోముట, పగడాల రాయెక్కి పలువరస తోముట, నలుపైన రాయెక్కి నాలుకను గీసుట, ముంతెడు నీళ్లతో మునిమొకము కడుగుట, చారెడు నీళ్లతో చెయిజబ్బ కడుగుట'** – సర్వసాధారణము. **'వెండి కడవలతో వేన్నీళ్లు చేసి, పైడి కడవలతో చన్నీళ్లు తీసి, జాలారు బండెక్కి జలకములాడుట'** వారానువర్తనము. ఇట్లు స్నానముచేసిన స్త్రీ **'రవరవ గాలికి తలకురులు ఆరబెట్టుకొనుట, ఎండి సిక్కెటతో ఎలసిక్కు తీయుట, పైడి దువ్వెనతో పాపిళ్లు తీయుట'** చేయును. ఆభరణములు అలంకరించుకొని **'నిలువు టద్దములో నీడలు చూసు'కొనును.** వానదేవుని పాటలో అక్కెమ్మ, ఒద్దిరాజుల పాటలో గొల్లపడుచు, బత్తినన్నపదములో రెడ్డిసాని ఇట్లే చేయుదురు.

ఈ జానపద లఘువీరగాథలలో భార్యాభర్తల శృంగారము బహు సున్నితముగా వర్ణింపఁబడును. భార్యాభర్త లిరువురును–

**"ఆకునా కాసేపు ఆటలాడేరు**
**సున్నాన కాసేపు జూదమాడేరు**
**పోకనా కాసేపు పొద్దుల్లు పోయె"**

ఈ వర్ణనము వారానువర్తనమే. వానదేవునిపాట, రంగసాని పాట మున్నగువానిలో నిదే రీతి వర్ణనలున్నవి. కథాప్రారంభమునఁ దల్లిదండ్రుల పేర్లు చెప్పి 'వారికెందఱు కొడుకులు?' అను ప్రశ్న వేయుట, 'ఎందరో ఎక్కడిది ఏడుగురె కాదా' అను రీతిలో సమాధానమును జెప్పుట ప్రతి వీరగాథానికలోను (జానపద సంబంధములు) గానవచ్చుచున్నది. భూపతిరాజు పదము, చాకలి దుడుమన్న పదము, వానదేవునిపాట మున్నగువాని ప్రారంభము లిట్లే యున్నవి. జానపద గాథానికలలోఁ గాననగు మఱికొన్ని వారాను వర్తనములు:-

1) ఒక పనిని 'నీవు చెప్పినను చేసెదను చెప్పకున్నను చేసెదను' అను నర్థమున వారానువర్తనము:-

**'చెప్పితేను సరికే రన్నా- చెప్పకున్నా సరికే రన్నా'**
**'చెప్పితేను తెచ్చే నమ్మా- చెప్పకున్నా తెచ్చే నమ్మా'**

2) ఏడుగు రన్నదమ్ము లుండుట, ఏడుగు రన్నల వెనుక చెల్లెలుండుట.

3) **'ఎంచంగ పెంచంగ ఏడేండ్ల బాలాయె'**

4) ఒక స్త్రీని చంపినప్పుడు చేతులు చెఱకుతోటలగుట, కాళ్లు అరఁటి ప్రానులగుట, చన్నులు వెండికట్ల కిన్నెర యగుట మున్నగు వర్ణనము.

5) చనిపోయినవారిని మరల బ్రతికింపఁగా వారు **'ఎంగిలి పానములు నాకేల?'** యని తిరిగి చనిపోవుట.

6) గాథానిక ప్రారంభమున **'పుట్టిందీ యావూరో? పెరిగిందీ యావూరో?'** అను ప్రశ్నలుండుట, పుట్టినయూరు ఇది యనియుఁ, బెరిగినయూరు ఇదియనియుఁ జెప్పుట.

వీరగాథాకవిత్వములోఁ బ్రధానలక్షణముగా నున్న ఈ వారానువర్తనములు గాథాకారులకు అత్యంతోపయోగకరములుగా నున్నవి. గాథాగానము చేయువారందఱును నిరక్షరకుక్షులే. అయినను వీరిలో నొక్కొక్కరికి ముప్పది నలుబది వీరగాథ లవలీలగా వచ్చును. దీనికిఁ గారణము కవిసమయములవంటి వీరగాథల వారాను వర్తనములే. వీరగాథలలోఁ గాథాకథనమునను, పాత్రల నామముల విషయమునను ఈషద్భేదమే కాని, తక్కిన వర్ణనలు, అలంకారములు, పదజాలము మున్నగు నంశములు అన్ని కథలకును నొకేతీరులో నుండును గదా! అందువలన విద్యాగంధములేని వృత్తిగాయకులు వీనిని సులభముగా జ్ఞప్తియందుంచుకొని పాడగలుగుచున్నారు.

ఇట్లు వారానువర్తనములు హెచ్చుగానున్నను, వీరగాథలలోని పాత్రలు తమతమ వైశిష్ట్యమును నిలబెట్టుకొనుట విశేషము. సర్వసాధారణమగు వర్ణనలుండుటచేత, వివిధ వీరగాథలలోని పాత్రలన్నియును ఒకే రకముగా- ఒకదానికొకటి "కార్బనుకాపీ"లవలె నుండునని తలంపరాదు. అలంకారములు, వర్ణనలు తక్కువగా నున్నను, వీరగాథలలోని ఉత్సాహోద్రేకములు, శైలిలోని సహజ సారళ్యము, ప్రత్యక్షీకరణము, వీనిని రసవంతములుగా నుంచుచున్నవని J.Kinsley అను పండితుడు అభిప్రాయపడినాడు- (చూ. "వీరగాథా లక్షణములు" అను ఎనిమిదవ ప్రకరణము). వీరగాథలలో ధ్వని, వక్రోక్తి మున్నగు అలంకారములుండవు. ఇతివృత్తము ప్రాంతీయ సంఘటనకు సంబంధించి యుండును. అందువలన ఎంత త్రిప్పి చెప్పినను పామరులందఱికిని సులభముగా నర్థమగుచుండును. శైలీసారళ్యముతో, సర్వసాధారణ ప్రయోగములతోఁ గూడిన వారానువర్తనములతో, సహజ సుందరముగా సాఁగు పరిశుద్ధరచనలు వీరగాథలు. కావుననే Francis B. Gummere అను పండితుడు ఇట్లనినాడు: "They (ballads) are fresh with the open air; wind and sunshine play through them." ❐

# పందొమ్మిదవ ప్రకరణము

# వీరగాథల భాష

వీరగాథలలోని రసపోషణనుగూర్చియు, వారానువర్తనము లనుగూర్చియు వెనుకటి ప్రకరణములలో వివరించితిని. ఈ ప్రకరణమున వీరగాథల భాషనుగూర్చి స్థాలీపులాక న్యాయముగఁ జర్చింపఁబడును. వీరగాథలలోని సహజాలంకారములు, సామెతలు, జాతీయములు, పలుకుబడులు, పదజాలము మున్నగునవి దిఙ్మాత్రముగఁ బ్రదర్శింపఁబడును.

వీరగాథల భాష వ్యావహారిక భాష. అనఁగా జీవద్భాష. ఈ వ్యావహారికముకూడ శిష్టవ్యావహారికముగాక, జానపదుల వ్యావహారికమగుటచే మఱింత జీవకళ యుట్టిపడుచుండును. ఈ భాష సహజమై, సూటియై, సుందరమై, మధురాతిమధురమై దేశీయతను పుక్కిలించుచుండును. 'అల్పాక్షరముల ననల్పార్థ రచన కావించుటయ కాదె కవి వివేకంబు' అను పాల్కురికి సోమనాథుని సూక్తికి వీరగాథల భాష చక్కని యుదాహరణ మనవచ్చును. ''శిష్టసాహిత్యము సాంస్కృతికమగు ప్రౌఢమార్గమున, వ్యాకరణాలంకార శాస్త్రనియమ బద్ధమై, దీర్ఘసమాస గుంఫనముతో ఏరికోరి తెచ్చిపెట్టిన శబ్దవిన్యాసముతో నడచును. ఇఁక జానపద సాహిత్యమన్ననో దేశీయమగు సరళమార్గమున వ్యాకరణాలంకార నియమములకు కట్టువడక అలతి యలతి పదములతో అప్రయత్నముగా వెడలెడు వ్యావహారిక భాషలో నుండును.''[1]

## 1. అలంకారములు

వీరగాథలలో నర్థాలంకారములే కాననగును గాని శబ్దాలంకారము లుండవని చెప్పవచ్చును. ఈ భాషయంతయు నిసర్గ మధురముగా నుండును గావున శబ్దాలంకారము లుండుటకుఁ దావు లేదు. అర్థాలంకారములలోఁగూడ ఉపమాలంకారమునదే అగ్రస్థానము. దృష్టాంతము, రూపకము, స్వభావోక్తి, అప్రస్తుత ప్రశంస వంటి అలంకారములు చెదురు మదురుగాఁ గాననగును. శబ్దాలంకారము నూటికిని కోటికిని నొకటి యెదురుపడవచ్చును. అడుగడుగునను ఉపమాలంకారము మాత్రము ప్రత్యక్ష మగుచుండును. దీనిలోని యుపమానములు జానపదుల నిత్య జీవితములోఁ దారసిలునట్టివే కాని, అలౌకిక వస్తువులు కావు. వీరగాథలలో నచ్చటచ్చటఁ గొన్ని ఉక్తివైచిత్రులును గానవచ్చుచున్నవి. నేను సేకరించిన మౌఖికగాథలనుండియుఁ, దాళపత్ర గ్రంథముల నుండియు, ముద్రితగ్రంథములనుండియు నలంకారములకుఁ గొన్ని యుదాహరణములు ఈ దిగువ నీయఁబడుచున్నవి:–

## 1.1. అర్థాలంకారములు

### 1.1.1. ఉపమాలంకారములు:–

***శక్తికథలు:*** – ఎల్లమ్మకథలు లేక పరశురామునికథలలోఁ గానవచ్చు కొన్ని ఉపమలు:–

*'కొంగ రెక్కల బోలు కోకలను గట్టింది'*
*'కొర్ర ఎన్నూలాగ కొన మాడిపొయ్యాడు'*
*'కొర్ర ఎన్నూలాగ కొన సాగియున్నావు'*
*'గాలివాన రీతిగా గగ్గులించింది'*
*'తొలకరీ మెరుపల్లె తళతళను మెరిశాడు'*
*'కొండ గొఱ్ఱెలాగ గోలపెడుతున్నాది'*
*'తాటాకు మంటవలె దరికొని మండె'*

అంకమ్మకథలోఁ గానవచ్చు నుపమలలోఁ గొన్ని:–

*'పెరుగు బుడ్డివలె శిరస్సు పక్కున పగిలింది'*
*'నాగస్వరమువంటి నడములు రాజులకు నక్కున విరిగెను'*
*'ఈ బాలుణ్ణి అరటిపండు దిగమింగిన చందంగా మింగివేస్తారు'*
*'ఏసింది అమ్మవారు ఏనుగుతొండమంత కీలుగంటు సిగ'.*

***పల్నాటి వీరకథలు:*** – అలరాజును పెద్దన్న బాదరాజును ద్వంద్వ యుద్ధము చేయుచుండఁగాఁ జక్కని యుపమానములు వాడఁబడినవి:

*"రాముడు రావణుఁడు తారసిలి నట్లు*
*కర్ణుడు అర్జునుడు కదిసిన రీతి*
*వాలిసుగ్రీవులు వడిపడ్డ విధము*
*పోతుటెద్దులు రెండు పోరాడినట్లు*
*మత్తగజములు రెండు మల్లాడినట్లు*
*అడవిలో పెద్దపులి ఆవులను అదలించినట్లు"* [2]

యుద్ధమునకేఁగు బాలచంద్రునిఁ జూచి ఐతమ్మ శోకించుట:

*"మనుజ రక్షణ లేని మల్లెపూదోట*
*వడి చూరబోయిన వడుపయ్యో తండ్రి"*

*"జల ముద్దు పెనముపై చల్లిన భంగి*
*కప్పిన కుంపటి కాల్చిన రీతి*
*అణిగిన వగపెల్ల అధికమై పొరలె"*

*"నీడ నిధానంబు నిలిచి కన్నట్లు*
*వడ్లలో వజ్రంబు వడిగన్న మాడ్కి*

*గుడిజొచ్చి దేవుఁ గన్గొనిన విధంబు*
*కంటిని పుత్రుడ కాంక్షతో నిన్ను"*

*"తాదెక్కు పురుషుని తల్లికి అట్లె*
*గడమీద నాడు కర్కశుని తల్లికిని*
*శూరుని తల్లికి సుఖమేమి లేదు".*

బాలచంద్రుడుని వీరాలాపములు:

*"కుమ్మరామమునందు కుటిలత గచ్చు*
*ఫలము వేసిన భాండపటలంబు పగిలి*
*పెంకులై పడ్డట్లు పెనుకంప మొంది*
*విడిబడి యేనుగుల్ వీథుల బార".*

బోగము సబ్బాయి పురుషులను నమ్మరాదనుట:

*"పర్ణాగ్రములయందు పట్టుక వ్రేలు*
*జలబిందుతతివలె చలనంబు నొందు*
*మనసొక చందంబు మాటొక తీరు".*

యుద్ధఘట్టములలోని యుపములు:

*"గాడి వీపున వెళ్లి గ్రక్కున అలుగు*
*మొగిలిపూభంగిని మొనచంద మమర".*

*"తెర గొప్ప నెలుగుచే దెబ్బలు బడియు*
*వెనుక మంగలమునకు వెరచిన యట్లు"*

*"నెట్టున బోయిన నీళ్లకు కట్ట*
*గట్ట నూహించిన గతి గాదె యిపుడు".*

***కాటమరాజు కథలు:–*** నెల్లూరిసీమలో మేయుచున్న కాటమరాజు ఆలమందను బోయలు బాణములతోఁ గొట్టిరి. ఆ బాణముల పోట్లతో నెఱ్ఱగా రక్తము కాఱుచున్న యా తెల్లని యావు లెంత యద్భుతోపమలతో వర్ణింపఁబడెనో చూడుఁడు:

"మోదుగులు పూసి బూరుగలుమీద వ్రాలినట్లుండెను
బూరుగలు పూసి మోదుగులమీద వ్రాలినట్లుండెను
నెత్తురు మడుగులు నేలను పగిలిన రీతి
కోసారక వేట్లు పడెను గోవులిచ్చట." [3]

కాటమరాజుకథలలోని మఱికొన్ని యుపములు:

*"అందంబుగా వెదురాకు చందమున*
*తిరుమణి తిరుచూర్ణము దిద్దిరి తోడ"*

*'కందుకంబును బోలె కాంతిలో నెగసి'*

*"పెక్కు ముంగిసలతో పెద్దశేషుండు*
*సాహసంబున బోరు చందాన నావు"*

*'బాతుపై నెగసేటి భైరవు వలెను'*

*'ఏటికి మత్స్యంబు లెదురెక్కినట్టు'*

*"ప్రత్తి గింజలవలె పండ్లు దెరచెదవు*
*నూతిలో గప్పవలె గాతరించేవు"*

*"ఆకులన్నియు బండి యా మర్రిమీద*
*వడిజేసి సుడిగాలి సుడిసిన యపుడు*
*కారాకు దుల్లిన కైవడితోను".*

*"కాకరకాయలు కడు పెద్ద కాగ*
*చేదెక్కువవునట్లు చెలగె నీ గుణము"*

*'అందెల బండివలె ఆరడికి సైచి'*

*'మొట్టె గోడిగవలె మిట్టిపడియేవు'.*

***బొబ్బిలివరుస కథలు, పదములు, జంగం కథలు:–***

'పూచిన మోదుగచెట్టు రీతి తన పోటర్లుండుటచే' (దేసింగురాజు కథ)

'చూరునీళ్లలాగున రక్తము కారుతున్నది'. (బొబ్బిలి కథ)

"పగలు చూచిన పట్నం మల్లెపూచినట్లు
రేయి చూచిన పట్నం రేలపూచినట్లు" (ఆరె మరాటీల కథ)

'పూచినట్టి తంగేడు చందమున భూమియందు పడిపోయెను బంటు'
'ఏనుగుమీద సింహమువలెను పడియున్న కళేబరములు'
(వరాహావతార చరిత్ర)

"కుమ్మరి వాము రగులుకున్న రీతి
గుమ్మడి పండ్లే కుళ్లిన చందాన"

లక్ష్మమ్మ కుమిలిపోవుచుండెనని వర్ణింపఁబడినది. (లక్ష్మమ్మ కథ)

"ఒడ్డిరిగి వృక్షమూ గడ్డపడినట్లు
నిలుచున్న పాటున ధరణిపై వొరిగె"

"తాబేలు వర్షాన తరలుచున్నదిగా ఆ పేడ
కప్పలాగున పేడ దాటెళ్లుతుందీ ఆపేడ'' (సన్యాసమ్మ కథ)

కుష్ఠరోగికి మందుచే రోగము కుదిరిపోవఁగా–
"వ్రేళ్లు మోదుగ మొగ్గల రీతి ఆయెను" (కాంభోజరాజు కథ)

"విభుని సౌఖ్యము లేని వెలది శృంగారంబు
అడవిలోపల నెమళ్లాడినటులుండు" (ధర్మాంగదచరిత్ర పదము)

'ఆకుచాటున కాయ అమిరియున్న విధాన'
(గంగావివాహము పదము)

'దారము తెగిన గాలిపడగవలె తల్లడమందుచును'
(శ్రీయాళ మహారాజు చరిత్రము– జంగంకథ)

'చలిది కూటిపై వెన్నచందమున నిలిచిన డీ విటుడు'
(భల్లాణరాయచరిత్ర– జంగంకథ)

పసలబాలుఁడు– కమ్మరి పణతి యొకచోఁ గూడియుండఁగా–
"జోడు చంద్రులు పొడిచిన విధముండె"
(కమ్మవారి పణతి– పసల బాలరాజు కథ).

**1.1.2. దృష్టాంతము:–**

"స్వామీ, విత్తనం లేకుండా మొక్క యెట్లా పుట్టును? ఆగము లేనిదే మేగ మెక్కడ ఉంది? మేగము లేనిదే మెరుపెలా మెరిసింది? చమురు లేకుండా జ్యోతి వెలుగుతుందా? సతిపతుల ధర్మం లేకుండా సంతు ఎలా కలుగుతుంది?" (ఎల్లమ్మ కథలు).

"బాలుడనని నన్ను భావింప వలదు,
చిన్న మిరియమునందు చెడునె కారంబు"

"పిడ్గు చిన్నది కాదె భేదించు కొండ
చిన్న మిర్యము నందు చెడునె కారంబు
ఘన కపాలము కెక్కి కాక నొందించు
మానక నోరంత మందును లెస్స" (పల్నాటి వీరకథలు)

"కదనంబు కేగిన కాటి గుఱ్ఱాలు–
చెదరక జగడంబు సేయంగ గలవె"

"నల్రావుల కదుపు నాణ్యంబె యైన–
గుఱ్ఱంపు పౌజుతో గూడంగ గలదె"

"బూరుగు తానెంత పొడుగు బెరిగినను–
చందనంబుతో నది సరితూగ గలదె"

"ఎలమి జీలుగుచెట్టదెంత లావైన–
నల మేడకంబాల నాచంగ గలదె"

"పాములు బారలు పదినూరులైన–
విష్ణు వాహనముతో వివదింప గలవె"

"ఎలమి దూదికొండ లెంత ఘనమైన–
ననలంబు నొకయింత యణపంగ గలవె"

"మదియించియున్నటి మత్తేభములును–
బొదిలి సింహముగూడి పోరంగ గలవె"

"ఉప్పెన కదులునే ఉడుత చప్పుడుకు"

"యతి ప్రాసలుండని యాకైతలేల?
సుతిగూడి నడువని సొగసు పదమేల?
పతిసూచి మెచ్చని బంటుతనమేల?
ఇతరులు మెచ్చని యీటె సాధనమేల?" (కాటమరాజు కథలు)

**1.1.3. రూపకము:–**

సంతానము లేనివారి ఇండ్లు 'కందులు కొట్టిన కళ్లమందు రేమి, కాయలు కొట్టిన మానులందురేమి?' (బాలనాగమ్మ కథ).

*"రావమ్మ కోడలా! రాచవారీపట్టి!*
*ఓడల మీదొచ్చిన ఒడ్డిరామ సిలకా!*
*పడవల మీదొచ్చిన పావురాల సిలకా!"*
(– పరశురాముని కథాచక్రము, జలగన్న పార్వతి కథ.)

అంకమ్మ కథాచక్రమునగల గంగురాజుకథలో జెట్టీల వర్ణన మందు లోకోత్తరములగు రూపకాలంకారము లున్నవి:

*"గుద్దులకు దొడ్డవాడు గుఱ్ఱపుజెట్టి వకడు*
*వీడెములకు దొడ్డవాడు వీరజెట్టి వకడు*
*పందిరిమీది గుండు వకడు పైబడ్డ పిడుగు వకడు*
*నీళ్లలో ముల్లు వకడు నిబ్బరమైన బంటు వకడు*
*కానరాని ముల్లు వకడు అంగిట గాల మొకడు*
*తాటాకుమంట వకడు దరిగొన్న చిచ్చు వకడు"*

**1.1.4. అప్రస్తుత ప్రశంస:–**

పల్నాటి వీరకథలలో, లేకలేక పుట్టి, అల్లారుముద్దుగాఁ బెరిగి, కడకు యుద్ధము పాలగుచున్న బాలచంద్రునిఁ దలఁచుకొని ఐతమ్మ దుఃఖించు సందర్భమున నామె ఇట్లనును:

*'వేములు పూసెను వేములు కాసె*
*కడసారి ఫలములు కాకుల కాయె'*

ఇట్లే బాలుఁడు తన భార్య నలక్ష్యము చేసి సాని సబ్బాయితోఁ గాలక్షేపము చేసినందులకు విచారించుచు నిట్లనును:

*'ఇంటిలో భోజనం బిచ్చుకు రాక*
*పరుల యెంగిలి కాసపడితిని గాదె'*

కాటమరాజుకథలలోఁ బితికివాని బింకమునుగూర్చి చెప్పుచు 'ఏకులతో బాకు లెంత లేసినను, నాటనోపున యవి నలియును గాక' అని అప్రస్తుత ప్రశంస చేయఁబడినది.

**1.1.5. స్వభావోక్తి:–**

పల్నాటి వీరకథాచక్రములోని కోళ్ల పోట్లాట స్వభావోక్త్య లంకారమునకు గొప్ప యుదాహరణము. ఇట్టి వర్ణనలు సాహిత్యమునఁ జాల సకృత్తుగా లభించుచుండును:–

*"పోరుకు విడిచిన పుంజులు రెండు,*
*పొంగుచు రెక్కలు పొరిపొరి నార్చి*
*కనుల నిప్పులు రాల్చుకైవడి నవి,*
*ఉగ్రంపు దృష్టిని నొండొంటి చూచి*
*కులగిరు లదరంగ కూయుచు చేరి,*
*ముక్కు ముక్కున చేర్చి మొనసి రోషమున*
*మెడయీక లుబ్బగా మెడవంచి రెండు,*
*ఉప్పరం బెగయుచు నురవడి తన్ను*
*తన్నిన తూలక దట్టంపు గోళ్ల,*

మిట్టిమీదికి నెగసి మీరుచు తన్ని
కరవంగ వచ్చిన గతి చూచి బరిని,
వలయంబుగా వచ్చి వడి తన్నుటయును
చిరచిర తిరుగుచు చేరి యాలోన,
ఉరవు వ్రేయగ చూచి యొక్కటై యుబ్బి
రెక్కల పెల్లార్చి రేగి మొత్తంగ,
పెంధూళి యెగసియు పెంపగుచుండ
సంగ్రామకేళికి సంతసంబంది,
ఊకించి తన్నగా నురముల నాటి
రక్తంబు దొరగంగ రాగంబు నొంది,
తన్నుట తాకుట తమకు నొచ్చుటయు
తలపక మగటిమి తలకొని రెండు,
తలపడెనట దేవతలు చోద్యపడగ". [4]

## 1.2. శబ్దాలంకారములు

### 1.2.1. ముక్తపదగ్రస్తము:-

వీరగాథలలోఁ గానవచ్చు కొన్నిరకముల యభివర్ధిత పునరుక్తులు (Incremental Repetitions) లాక్షణికులు తెల్పిన ముక్త పదగ్రస్తముల వలెనే యున్నవి. నాకు లభించిన పల్నాటి వీరకథలలో 'పెద్దన్న బాదరాజు పెండ్లి' యను కథలో నిట్లున్నది:

"కాశమీదను కాశ హనుమంత కాశ
హనుమంత కాశపై రేవంత ముళ్లు
రేవంత ముళ్లపై పింజమల దండ
పింజమల దండపై బిసరు కురివేరు
బిసరు కురివేరుపై బిగువైన బాగు".

ఈ యభివర్ధిత పునరుక్తిని ముక్తపదగ్రస్త మనుటలో నెట్టి సందేహమును లేదు. ఇట్టి ముక్తపదగ్రస్తమును 'పాదాంత పాదాది ముక్తపదగ్రస్తము' అని నరసభూపాలీయకర్త, 'అంతాది యమకము' అని ప్రకాశకారుఁడును బిలిచిరి.

### 1.2.2. వృత్త్యనుప్రాసము:-

తెలంగాణమున గొట్టెముక్కల గోపాలరెడ్డిపై వ్యాప్తియందున్న యొక లఘువీరగాథలో ద్విత్వ 'ట' కారముతో వృత్త్యనుప్రాసము కానవచ్చుచున్నది.

"చుట్టిసేన గురిపెట్టి బ్రెన్ను, నీ
పొట్టను జీల్చగ, పేగులు వెళ్లగ
నెట్టి పేగులను పొట్టలోకి, పై
బట్ట తోను నడికట్టుగట్టి, తొడ
గొట్టి దాపుగల తోటాలన్నీ
పట్టు విడక ఫట్ ఫట్‌మని ప్రేల్చి
తుట్టతుదకు నీ రైఫుల్ నేలకు
గొట్టి ముక్కలుగ జేసిన ధీరా... సైసై గోపాలారెడ్డీ..."

## 2. ఉక్తి వైచిత్రి

'ఏపకాయంత గర్భం ఎన్నున ఏర్పడింది'
'చేతంట మేఘము చెదరి కురిసేను, గంపంత మేఘము గాదరించేను'
'కొండంత బొజ్జపై ఎన్నడు కూలు బాణాలు' -శక్తికథలు

"సిరి పొత్తు చేయుట చెల్లును కాని
ఆజ్ఞ పొత్తిచ్చుట అది నీతి కాదు". -పల్నాటి వీరకథలు

"అల్లటి వేసియు ఐతన్న మ్రొక్కి" -కాటమరాజు కథలు

'గాంధారి నాసికము గద్దగోరు వర్ణము
గాంధారి వ్రేళ్లేమి పిల్లిపెసరకాయలు' -గాంధారి కథ

"చెక్కిళ్లు తీసేను చేరి ముద్దాడేను
ఏడు గడియలలోన ఏకాంతమాడేను
మూడు గడియలలోన ముచ్చట్లు ఆడేను" -ఎల్లమ్మ కథలు

'అలకల్ల మేడల్లో సిలకల్ల గౌరు' ,,

'పుట్టుక్కి చిన్నోడు, బుద్ధులకు పెద్దోడు' ,,

"కూడి గుంపైయున్న గున్నయొ చింత
చెట్టుక్రిందికి లేదు శిబిరమంతయును
మూకంత వరిమడి మూలకు లేదు" -పల్నాటి వీరకథలు

"ఆదమరచి నిద్రాపోతున్నారు తెల్గా బిడ్డాలు
గుర్రపు సందడి విన్నారయ్యా తెల్గా బిడ్డాలు
పడకయందే దట్టికట్టిరీ తెల్గా బిడ్డాలు" -బొబ్బిలి కథ

"మనిషికి వక్కా ముత్యం వేస్తే
తూమెడు అయినాయి" -జగపతిరాజు కథ

"ఏడు యోజనాలు ఎత్తి ముద్దాడింది
పదియోజనాలు పట్టి ముద్దాడింది" -ఎల్లమ్మ కథలు.

## 3. సామెతలు/లోకోక్తులు/ నానుడులు (Proverbs)

***శక్తికథలు:-***

'గొఱ్ఱె ఎన్ని కొండలు తిరిగినా బెత్తెడే తోక'
'కాకిపిల్ల కాకికే ఆశ, కోతిపిల్ల కోతికే ఆశ'
'అభ్యాసం కూసు విద్య'
'అట్టేసి తిరగేసి నట్టేగా'

'మానుపు కొనుటకు మసిబొట్టు కాదు'
'కొమ్మె వంగని దాన్ని మానై వంచంగ రాదు'
'కొద్ది నిప్పని కొంగున కట్టంగ తగదు'

***పల్నాటి వీరకథలు:***
"ముక్కు దూలము మీద బొడిచిన యపుడు
గుర్రు మనగలేని కోప మెన్నటికి?"

***కాటమరాజు కథలు:***
'పురణింప గవివాత పులియున్న యట్టు'.

"ఏఱ్నిండి పారగా నెంపలిచెట్టు,
పారకుండగ నాచి పట్టంగ గలదె"

'పులికడుపున గొఱ్ఱె పుట్టు చందమున'
'గొల్లమీద పుల్లరి గోగుమీద బచ్చలి'(cf. 'గోగుపెడుసు గొల్లబిరుసు)
'ఉలవ లెత్తామంటె ఊళ్ల నడిగెదవు'
'ఎద్దురూపము దప్పి ఏదురూపా మాయె'
'తెడ్డడిగినప్పుడే కొయ్యడిగినట్టు'
'పేదవాని కోపము పెదవుల తీట'
'పేరేమొ లొటపెటల్ పెదవులు మృదువు'

"రక్షించువారిని రమ్మని పిలిచి–
భక్షింపజూచిన పనియింతలేదు"

'బూరెగంపల కాడ పొర్లుదండాలు'
'శారికకు దెలుపను శాస్త్రమున్నాదె'

"దూరాన బెట్టిన తురాయుల దండు–
అలకోలపెట్లకు నాగదన్నట్లు"

'లోటచేత్తామని లోకంబు నెఱుగు'

***బొబ్బిలివరుస కథలు, పదములు, జంగంకథలు:–***
'దిక్కులేనివా దూరికి నెన్నగ నక్కపోతురాజు'
'ముంజేయి కంకణ మరయుటకు న్నిట ముకురము కావలెనా?'
'చల్లకోసము వచ్చి ముంత దాచంగనేల మనకూ'
'ఉసురువున్న ఉప్పమ్మ వచ్చును ఊరికి పోవన్నా'–దేసింగురాజు కథ.
'కొండలుబడ్డ కొన్నాళ్లకైన కోనలు పడుతుంది'
'పాసినకూట్లో కలిపోసితే పదునుకు వస్తుందా?' – బొబ్బిలి కథ
'ప్రాణములుంటే బల్సుకూర దిని బ్రతుకవచ్చు'
–శ్రీవరాహావతార చరిత్రము.

'పాముకాళ్లు పాముకె తెలుసును మరి పరుల కెరుగ వశమ'
–రామకథాసుధార్ణవము

'ఆడుది యన్నట్టి మాట గోడ బెట్టినట్టులుండు'
'ఏలేటి పురుషునకు ఏడుగురు భార్యలంచు'–కొమిరెల్లి మల్లన్నకథ

'ఇల్లు యిరకటమంచు ఆలి మరకటమంచు'
'ఉడుమునకేలరా ఊరి పెత్తనము' –వీరరాజమ్మ కథ

'ఆ ఉరుముకు ఈ చినుకులా'
'చాపకింది నీళ్లు సతులు మీ వలపు'
'ఆడవారి మాటలు అద్దములో తేటలు'
'కడవంత గుమ్మడి కత్తిపీటకు లోకువ'
'పక్షుల మాటలకు వృక్షాలూ గదులునా' –గాంధారి కథ

"కక్కూర్తి పడితేను కడుపు నిండగవలెను
కడుపు నిండని వట్టి కక్కూర్తి యేల"

"ఎద్దులు బండియు నేకమైతేను
ఎంతేసి గట్లైన ఎక్కి పోవచ్చు"

"ముదిత చల్లకువచ్చి ముంత దాచగనేల
అడుగ వలసిన మాట కనుమానమేల"

'కానవచ్చిన పనికి గట్టెక్కగానేల'
"ముందున్న శ్రవణముల కంటెను మిక్కిలి
వెనుక కొమ్ములు వాడి వినవె గౌరమ్మ"

"నుదుట వ్రాసిన వ్రాత నులిమితే చెడిపోదు
అనుభవింపక తీరదనుభవంబెల్ల"

'కాకిముక్కుకు దొండపండు గట్టినట్లు'
'దొప్పక్రిందను చేరి దోసిలొగ్గిన రీతి'
'తినక రుచి తెలియదు, చొరక లోతు తెలియదు'
–గంగావివాహము పదము

'ఈనగాచి నక్కల కిచ్చినాను'
'పాలగోవు మాలల కిచ్చినావా?'
'ఎలుకకై యింట మంటలిడినావా?'
–సారంగధరచరిత్ర–శారద పదము.

"అత్తలెల్లను మంచి అలవేము తియ్యన–
ఎందునైనా గలదె మందుకైనాను"

"పెదచెరువు నీళ్లకును పెద్దింటి నడువడికి–
తప్పులేదనుమాట ధరణిలో గలదు"

"రాజుల హృదయము రాయితో సమమంద్రు
నాడు సామెత లెల్ల నేడు నిజమయ్యె"

"హంసకులమున బుట్టి ఆరికలు తినుభంగి
సుతులయిన నేడు మీ గతి యిట్టులుండె"

"ఆడజన్మముకన్న అడవిలో మ్రానయి
పుట్టితే మేలనుచు బుధులు బల్కెదరు" –కుశలాయకము పదము

"ఆడబోయిన తీర్థ మరయ నెదురైనట్లు
మ్రొక్కబోయిన వేల్పు ముందరున్నట్లు"

"క్రొవ్వు మీరిన గొఱ్ఱె కొండకు దాకితే
కొదవేమి వచ్చునా కొండకేమైన"–శతకంఠరామాయణము పదము

'తను గట్టుటకు త్రాళ్లు తాదెచ్చుకొన్నట్లు'
'ఈతకుమించిన లోతుగలుగునా నాథ'
'విషమెక్కునే తలవెంట్రుకలు దాటి' –నలచరిత్ర పదము

'తానొకటి తలచితే దైవమొక్కటి దలచు'
'క్రొవ్వుచేతను బోయి కొరతబడ్డట్లు'
'వచ్చిన కార్యము వాకిటైనది యింక'
'వియ్యమందగ బోవ దయ్యంబు బట్టె'
–శశిరేఖాపరిణయము పదము

'రచ్చకెక్కి సభలోన రాయబారంబేల?'
"అత్తకును శాంతంబు కత్తికిని మెత్తన
కలదంటె యిలలోన కలికిరో వినవే" –ధర్మాంగదచరిత్ర పదము

'తన్నుగట్టను త్రాడు తాదెచ్చుకొంది'
'ముద్ది గొట్టిన మూతిపండ్లు రాలె'
–కమ్మవారి పణతి–పసలబాలరాజు కథ

"మేరగాదనుచు కొంగలు వంగలు మేసిన సామ్యముగ
నారికేళతరు దూడలు మేసిన తీరున బల్కెదవు"

'తాతకు దగ్గనేర్పిన గతి నా దగ్గర వదరెదవు'
–గయోపాఖ్యానము జంగంకథ

## 4. జాతీయములు (Idioms)

వీరగాథలలో సామెతలకన్న జాతీయము లత్యధికముగా నున్నవి. జాతీయములు భాషకుఁ బ్రత్యేకతను సంతరించును. వ్యావహారికభాష వీని యునికిపట్టు. వీరగాథ లాద్యంతము సజీవ వ్యావహారికభాషలో సాఁగును. కాఁగా నీ వీరగాథాకవిత్వము జాతీయముల పుట్టయని వేఱుగాఁ జెప్పఁ బనిలేదు.

***శక్తికథలు:–*** (నేను సేకరించిన మౌఖికగాథలు).

1. మెడకు ఉరి తెచ్చు= బాధలకు లోనుచేయు.
 'మేనరిక మిచ్చావూ నా మెడకు ఉరి తెచ్చావు'
2. అఱచేత నుండు, కొనగోట నుండు = అవలీలగాఁ జేయగలిగి యుండు
 'ఈలాటి సత్తేలు నా అరిసేతి నున్నాయి, కొనగోట నున్నాయి'
3. పేగు నిండు= కడుపు నిండు, ఆకలి తీరు.
 'నీ ఆకళ్లు తీరూనా? నీ పేగు నిండూనా?'
4. నిడుగంతలగు (నిడు కన్నులు కలదియగు)= ఆశ్చర్యపోవు.
 'నిచ్చల పోయింది నిడుగంత లయింది'
 'నిచ్చలా పొయినాది నిడుగంత లయినాది'
5. బిడ్డలగన్న తల్లి= జాలి కలిగిన స్త్రీ.
 'బిడ్డలగన్న తల్లియగుటచేత పేగులు పెరపెరలాడి'
6. నీళ్లన్నవారికి నీళ్లు, పాలన్నవారికి పాలు ఇచ్చు= కోరినవారికి కోరినది క్షణములో నిచ్చు
 "ఏడుగడియల్లో నీళ్లన్నవారికి నీళ్లు
 పాలన్నవారికి పాలు, పప్పన్నవారికి పప్పు ఒడ్డిస్తే"
7. భాండానికి దూరమగు = బహిష్ఠగు, రజస్వలయగు.
 'నేను భాండానికి దూరమయ్యాను'
8. ఇంటిగల యిల్లాలు= సంసార స్త్రీ.
 'నువ్వు ఇంటిగల యిల్లాలివేనా?'
9. తలకాయ బ్రద్దలగు= విసుగెత్తిపోవు.
 'నా తలకాయ బద్దలైపోతోంది'
10. 'చర్మమొలిపించు'= శిక్షించు.
11. 'బుఱ్ఱ పగులగొట్టు' = శిక్షించు.
12. వెనుకపెట్టి వెళ్లిపోవు = వెనుదిరిగి పోవు.
 'ఎల్లమ్మ ఎనకెట్టి యెళ్లిపోయింది'.
13. తెడ్డుపాము కఱపించు= అన్నము పెట్టకుండ మాడ్చివేయు.
 'నీకు తెడ్డిపాము కరిపిస్తాను'
14. వెళ్లిన అడుగులమీద మళ్లివచ్చు= వెనువెంటనే తిరిగివచ్చు
 'వెళ్లినడుగలమీద మళ్లిరమ్మన్నాది'
15. ఈడేరి యింట పడియుండు= పెండ్లికి ఎదిగియుండు, వయసు వచ్చిన కన్య.
 'ఎల్లమ్మ యీడేరి యింట పడిఉంది'
16. 'ఏడుకట్ల సవారీ ఎక్కు'= చనిపోవు.
17. 'పిల్లలు గలవాడు' = దయతలచఁ దగినవాడు.
18. నోరు డప్పుచేసి చాటు= అందఱకును దెలియఁజేయు.
 'నోరు డప్పుచేసి లోకంలో చాటెను'.

19. గంపెడు పేగులు పేసుకొని కను= కష్టపడి ప్రసవించు.

"గంపెడు పేగులేసుకుని కన్నానే
కన్న కొడుకుని తినెయ్యమని చెప్పనా?"

20. 'కడసారపువాడు'= గారాబముగాఁ జూడఁబడు కడగొట్టు కొడుకు, ముద్దుల కొడుకు.

21. 'దేశానికి దేముళ్లు, రాజ్యానికి రాజులు' = తమ ఆజ్ఞకుఁ దిరుగులేనివారు.

22. కాల్చి పిడికెడు బూడిద చేయు= దహన సంస్కారము చేయు.

"కార్తికమల్లుడు జమదగ్నిని కాల్చి పిడికెడు
బూడిద చేసి గృహమునకు వెళ్లిపోయెను"

23. నీ దిక్కుగల చోట చెప్పుకొనుము= నీ వెవరితోఁ జెప్పుకొనినను నాకు భయము లేదు.

"ముక్కు చెవులూ కోసి చేతిలోనే పెట్టి
నీ దిక్కుగల చోటాను చెప్పుకో మన్నాడు".

24. అఱచేయి యోగమును జూచికొను= తన యదృష్టమును బరీక్షించుకొను.

'పరశురాముడు అరిచెయ్యి యోగం చూసుకున్నాడు'

25. ఆడుపిల్ల ప్రాణము= సోదర ప్రేమగల ఆడుపడుచు.

"పాపం, ఆడపిల్ల ప్రాణం, తమ్ముణ్ణి అంత గారంగా ముచ్చటగా పెంచుకుంటోంది"

26. వంగముళ్లతో అంగుళ్లు వొత్తు= అతి జాగ్రత్తగాఁ బెంచు.

'వంగముళ్లాతోను అంగుళ్లు వొత్తేను'

27. "చిన్నవాళ్లతో చిరతలాడుకొనే ఈడు వచ్చింది
పెద్దవాళ్లతో బంతులాడుకొనే ఈడు వచ్చింది" = క్రమక్రమముగాఁ బెరుగు.

28. 'అది పాలుతాగిన సత్తువా? ఉగ్గుతాగిన సత్తువా?'
= పోతపాలు త్రాగిన దిక్కులేని వాడవు, ఇంత పొగరా?

"గాలిలో పుట్టావురా చిన్నవాడా
గండాన్ని పెరిగావురా చిన్నవాడా
అది పాలుతాగిన సత్తువా?
ఉగ్గు తాగిన సత్తువా?"

29. తలగొట్టి నూరేళ్లు తపస్సు చేయు= కష్టమైన పనిచేయు.

"తమ్ముడా, నన్ను తలగొట్టి నూరేళ్లు తపస్సు చెయ్యమన్నా చేస్తానుగాని ఇంతకు మిక్కిలి తలిదండ్రాదులను నేను ఎరుగను"

30. ఒడిగట్టి పెంచు= గారాబముగాఁ బెంచు.

'ఒక్క తమ్ముడవని ఒడిగట్టి పెంచాను'

31. 'అతని పప్పూ పలువరుస నేను ఏమి అనబగిస్తును?'
= అతనివలన నేనేమి సుఖింతును?

***పల్నాటి వీరకథలు:-***

32. పెట్టని తావుల పెట్టు= ఎంతో జాగ్రత్తగాఁ గాపాడు.

"పూబోణి నా దేహ పోషణార్థంబు,
పెట్టనితావుల పెట్టి దాచెదవు"

33. ముక్కుకు గానట్టి ముత్యము= తగని పని.

'ముక్కుకు గానట్టి ముత్యంబు వలదు'= తగనిపని చేయవలదు.

34. విస్తరి బండికన్నగు= భోజనము లేకుండపోవు.

'పగవాని విస్తరి బండికన్నగును'

***కాటమరాజు కథలు:-***

35. చెప్పని ఒక్క పొద్దు= అనాహూతుఁడై వచ్చుట, గౌరవము లేని పని చేయుట.

'ఊరకే చెప్పని ఒక్క పొద్దనగ'

36. ఉప్పుగల్లుగా చిదుము= చిత్తుగా నోడించు.

'కసిమసంగుచు నుప్పుగల్లుగా జిదిమె'

37. కవిలె కట్టుము= నోరు మూసికొనుము, మాటాడవలదు.

'కట్టుమా నీ కవిలె కట్టుమా చాలు'

38. వానలేని పిడుగు= హఠాత్తుగా సంభవించినట్టిది.

'వానలేని పిడ్గువలె మీదబడెను'

39. అశ్మిశకాంత్రంబు= హస్తి మశకాంతరము= మిక్కిలి భేదమగు, అతుకని, పరస్పర భిన్నమగు. (ఏనుగునకు- దోమకు ఉన్నంత భేదము)

'అశ్మిశకాంత్రంబు ఆడితి మాట'

40. ఒడికట్లుపడు= మెలిదిరుగు

'ఒకరిపైబడి యొకరు ఒడికట్లు బడిరి'

41. గమిడి తీసినట్లు= బాహాటమగు, సులభముగా లభించు, ఆటంకము తొలఁగిపోవు.

'వారి మందకు గమిడి వడి దీసినట్లు'

42. 'ఈగ వ్రాలకయుండ, నీలె యిడకుండ' = చెడిపోకుండ, క్రుళ్లిపోకుండ.

43. నక్కలే దిక్కగు= చనిపోవు, యుద్ధమున కూలు.

'నక్కలే దిక్కాయె నట్టడివి గదె'

44. ఆయువు నూరేడులగు= చనిపోవు.

'ఆయువు నూరేడులాయె నటంచు'

45. గోరుచుట్టుపై నీటె గ్రుచ్చినట్లు= కష్టముమీద కష్టము వచ్చు.

'గోరుచుట్టుపై నీటె గ్రుచ్చినట్లాయె'

46. పెట్టిన తిరుమణి పేడెత్తకుండ= ఏ మాత్రమును అలయక, సునాయాసముగా.

"పెట్టిన తిరుమణి పేడెత్తకుండ
పూసిన గంధంబు పురిచిట్లకుండ"

47. బద్దిగొర్ల జేయు = బలిగా యిచ్చు.

'బద్దిగొర్ల జేతుము భాగీరథికిని'

48. వసపోసినట్లు వదరు= ఎక్కువగా మాటాడు, అతివాగుడు.

'వసపోసినట్టుల వదరేవుగాక'

49. కుడుముల వేట= భోజనము చేయుట.

'పోట్లాట కుడుముల వేట్లాట కాదు'

50. కాకి నెపముల నెన్ను= కుంటిసాకులు చెప్పు.

"కరువుబడి వచ్చిన కాలమైతేను
కాకి నెపముల నెన్నఁగా దగు మీకు"

51. ఎడమచేయి కుడిచేయి ఎరుగనివాడు= ఏమియు తెలియని వాఁడు, యుక్తాయుక్త విచక్షణ లేనివాడు.

'ఎడమచే కుడిచేయి ఎరుగనివాడు'.

52. టముకు చేయు= అందఱకును దెలియఁ జెప్పు.

'డాకతో మారాజు టముకు సేయంగ'

53. కాకి పారగు= నాశమగు (?)

'కాకినాడంతయు కాకిపారాయె'

54. 'అదిగోను పులియంటె అదిగోను తోక'= గోరంతలు కొండతలుగాఁ జేయు, భయపడువారిని మఱింత భయపెట్టు.

55. చెఱఁగునఁ బైడి= కొంగు బంగారము= మన స్వాధీనములో సిద్ధముగా నున్నది.

'చెలికాండ్ల చిత్తము చెఱగునఁ బైడి'

56. చాటున కెక్కు= ప్రసిద్ధి కెక్కు.

'సాటున కెక్కిన సభవారి నంపి'

***బొబ్బిలివరుస కథలు, పదములు, జంగంకథలు:–***

57. ఉలువలు దంచిన రోకలివలె= కదలక మెదలక యుండువాఁడు.

"ఉలువలు దంచిన రోకలి వలెనే యూరక నిలుచున్న
తలచిన కార్యం బేమాయెను నిక తప్పక పలుకన్న"
(దేసింగురాజు కథ)

58. తలక్రింద గుండు= మిక్కిలి ప్రమాదకారియగు.

'తలక్రింద గుండాయె నవాబు తన యా దేశింగు'(,,)

59. కత్తిమొనను దీసికొనుట= యుద్ధము చేసి తీసికొనుట (cf. at the point of the sword)

'చెంజిపైకము తీసికొనుము నా చేతికత్తి మొనను'
(దేసింగురాజు కథ)

60. నువ్వులు చల్లిన రాలవు= కిటకిటలాడు జనసమూహము.

'నువ్వులు చల్లిన రాలదయ్య దండుకు లోగాను'
(బొబ్బిలి కథ)

61. నూనెపోసి యెత్తవచ్చు, పాలుపోసి యెత్తవచ్చు= నున్నగాఁ బరిశుభ్రముగా నున్న నేల.

"నూనెపోసి యెత్తవచ్చు మా రంగసాని మేడ
పాలుపోసి యెత్తవచ్చునూ రంగాని మేడ"
(బంగారు తిమ్మరాజు కథ)

62. 'గుంట లోపల పెట్టి గంటవాయించె'= ? (సమాధిచేయు)
(లక్ష్మణమూర్ఛ పదము)

63. మూఁడు లోకముల ముల్లు= త్రిలోక కంటకుడు, మూడు లోకములను బాధించువాఁడు.

"మూడు లోకము లెల్ల ముల్లుగా విహరించె
రక్కసుల రాజయిన రావణాసురుడు"(కుశలాయకము)

64. 'కడుపులోపలి చల్ల కదలకుండగను'= ఏమియు నలసట చెందకుండ. (శతకంఠ రామాయణము)

65. అగ్ని కొంగున ముడుచు= కష్టములకు లోనగు.

"అగ్ని కొంగున ముడువ నాపేక్ష పడ్డావు
ముందు వచ్చేటట్టి మోసమెరుగకను" ( ,, )

66. ఎసరుపెట్టు= ద్రోహము చేయు, కుత్రపన్ని కూల్చు.

'ఎందరు తుచ్ఛులు నా రాజ్యంబున కెసరుబెట్ట జూచిరి'
(ఆండాళ్ చరిత్రము)

67. సున్నమెయ్యని విడెము = వ్యర్థమగు పని.

'సుఖమెరుంగని బ్రతుకు సున్నమెయ్యని విడెము'.
(గంగావివాహము పదము)

68. పాలువంటి కాపురము= స్వచ్ఛమగు కాపురము, అరమరికలు లేని కాపురము.

'పాలువంటి కాపురంబు పాడుజేయ బూనిరపుడు'
(కొమరెల్లి మల్లన్న కథ)

69. పుక్కిట వీడెము చెదర నవ్వుట= బిగ్గఱగా నవ్వుట.

'పుక్కిట వీడెము చెదర నవ్వె రాజు'
(బాలనాగమ్మ కథ)

70. కడివెడు బాలలు= ఎక్కువమంది పిల్లలు. (గంపెడు పిల్లలు)
'కడివెడు బాలల నప్పగించితిని' (బాలనాగమ్మ కథ)

71. 'సొప్పసొరుగులగు' = మిక్కిలి కృశించిపోవు. ,,

72. 'చేతికందినది నోటికందలేదు'= చేఁజిక్కియు ననుభవమునకు రాలేదు. (కమ్మవారి పణతి– పసల బాలరాజు కథ)

73. 'ఈ కంటి కన్నీరు ఆ కంటబోసె' = మిక్కిలిగా దుఃఖించెను. (సన్యాసమ్మ కథ)

74. 'ఆకుచించుట' = ఆయువు మూడుట. (పాపమ్మ పేరంటాలు కథ)

75. బిందువు= రక్తము, బిందుపెట్టుట= జంతువును బలిపెట్టి దాని రక్తమును దేవతలకుఁ జల్లుట.
'అయిదు మేకలనపుడు ఆహారమిచ్చె, బిందు బెట్టించే' (ఎఱుకల నాంచారి కథ)

76. తలలోని నాలుక, పూసలలోని దారము= అందరితోను గలసి మెలసి యుండుట.
"తలలోను నాలుక దిరిగిన రీతి
పూసలలో దారంబు పోలిక'' (వీరరాజమ్మ కథ)

77. తలకట్టు= వ్యవహార దక్షుఁడగు.
'తలకట్టినావయ్య తండ్రివలె నీవు' (వీరరాజమ్మ కథ)

78. శనిగాడు= అడ్డువచ్చువాఁడు, ఆటంక పఱచువాఁడు.
'శనిగానివలె నీవు తగిలియున్నావు' ( ,, )

79. నోటిమీద పుండు పుట్టు= మాట పడిపోవు.
'నోటిమీద పుండు పుట్టదాయెనుగా వీరయ్య' ( ,, )

80. రాచి రంపాన పెట్టు= మిక్కిలి హింసించు.
'రాసి రాసి నిన్ను రంపాన బెట్టు రాజమ్మ' ( ,, )

81. వన్నెవన్నెల విసనకఱ్ఱ= సుకుమారి, సోకులాడి, టక్కులాడి.
'వన్నెవన్నెల విసనకఱ్ఱవే కోడల' ( ,, )

82. 'తేనె పూసిన కత్తి'= 'గడ్డి కప్పబడిన నూయి' = 'మేకవన్నెపులి'= పైకి మంచిగా నుండి, లోపల చెడ్డగా నాలోచించుట. ( ,, )

83. 'ప్రక్కలో నున్నట్టి పాము' = నిత్యమును ప్రమాదభరితమైనది,,

84. 'వచ్చే ప్రాణము, పోయే ప్రాణము' = చనిపోవుటకు సిద్ధముగా నుండు (కాంభోజరాజు కథ)

85. 'కొంగు వేయుట' = జారత్వము చేయు. ( ,, )

86. నేరము వొళ్లో పడవేయు = నేరమును నిరూపించు.
'నా నేరం నా వొళ్లో పడవేసి' (గాంధారి కథ)

87. 'దుమ్ము దులుపుట' = శిక్షించుట. ( ,, )

88. అరికాల ముల్లునాటిన మునిపంట దీయు= ఎల్లవేళల జాగరూకతతోఁ గాపాడు.
'నీ అరికాల ముల్లు నాటిన, నా మునిపంట దీసెదను' (గాంధారి కథ)

89. ముంజేతికి మీసముండు = అమిత పరాక్రమ శాలియగు.
'నాకు ముంచేత మీసమున్నది' (గాంధారి కథ)
'ముంచేతికీ మీసమున్నదీ రంగారాయుడికి' (బొబ్బిలి కథ)

90. మేకపోతు గాంభీర్యము= పైకి గొప్పగాఁ గనబడుచు, లోపల నేమియు సత్తువ లేకుండుట.
'మేకపోతు గాంభీర్యంబని నే మేదిని వినియుంటి' (దేసింగురాజు కథ)

91. ఋణము విప్పలేదు= వివాహము కాలేదు.
'చెంచన్నకు ఋణము విప్పలేదు' (సన్యాసమ్మ కథ)

## 5. పలుకుబడులు, నుడికారములు (Usages)

**శక్తికథలు** (నేను సేకరించిన మౌఖికగాథలు):–

1. 'వెలక్కాయల్లా రెండు ముద్దలు చేసి'
2. 'ఈగ కాలంత బెజ్జం పడితే'
3. 'గడ్డిబొద్దులాగ దొర్లగిస్త ఉన్నారు'
4. 'పెద్ద బొబ్బిలిపోతువలె దేవిడిదగ్గఱ పడివుంది'
5. 'పెద్ద దోసకాయంత చెంబు పట్టుకొని'
6. 'సన్నికల్లు మీద సాగ నూరుదును'
7. 'ఉరవడిని పరవడిని వచ్చు'
8. 'కర్మములు ఎరగను– మర్మములు ఎరగను'
9. 'ఉగమెల్ల నమ్మొద్ద– జగమెల్ల నమ్మొద్ద'
10. 'నలుపాయ తిరుగు'
11. 'మరుమొక్క నాటు'
12. 'ముంచీన కడవాను ముడికానుకున్నాది, ముడికిపై కడవాను శిరసానుకున్నాది'
13. 'ఎంచిన ఎల్లగుఱ్ఱం ఎక్కి'
14. 'బఱ్రున చీది పిఱ్రకి రాసుకుంది'
15. 'గోలుగోలుమని గోలపెడుతున్నాడు'
16. 'నిన్నే తల్లి కన్నదిరా?'
17. 'ఏడడుగులు ఎదురెళ్లు'

18. 'మెడమీద కర్రేసి గెంటించు'
19. 'నిలువుటద్దములోన నీడలు చూచుకొను'
20. 'నవకాయ పిండివంటలు నాలుగు రుచులు'
21. 'మాబాగు అన్నాడు-మంచిదన్నాడయ్యా'
22. 'ఈడైన భర్తవి- నా జోడైన భర్తవి'
23. 'ఆడి తప్పనివాణ్ణి-పలికి బొంకనివాణ్ణి'
24. 'అది కుళ్లో మళ్లో బయట పడిపోనీ'
25. 'అగులూ బొగులూ మనుచు'
26. 'కలంకారి మేడ'
27. 'కళ్లు జిగేలున మెరిశాయి'
28. 'ఉలుకుతావో పలుకుతావో'
29. 'శానాపశానలు'
30. "ఇద్దరు బిడ్డల్ని ఇరుచంక నేసుకొని,
ఎదురుగా జలమ్మ ఏడడుగు లెల్లింది"
31. 'ఏడేడు పధ్నాలుగు లోకాలు'
32. 'పెక్కున పేలిపోవు'
33. 'పక్కు పక్కున బుజ్జు పగులగొట్టు'

***పల్నాటి వీరకథలు*** (నేను సేకరించిన తాళపత్ర గ్రంథముల నుండి):

34. "ఆ నాటికిని తల్లి ఈ నాటికిని తల్లి,
నీకును తల్లి మరి నీ తండ్రికిని తల్లి"
35. "విద్యలకు పెద్ద- విలువిద్యలకు పెద్ద,
చదువులకు పెద్దయు శాస్త్రమునకు పెద్ద"
36. 'కాశమీదను కాశ-హనుమంత కాశ'
37. "కొండెముల కొరివది కొలవన రచ్చ
మాయల పెనురోగి మాయలజోగి
వద్దనుండె శతాపి పాపముల ముద్ద
ఆడ దనంగను అంగడి గవ్వ
తోసివేసిన గడ్డి తొమ్మంద్ర దొడ్డి
నీటిలోపలి ముల్లు నీచుల పెంట
సీమ మూలములుగూర్చిన చిత్తినిముండ"
38. "మూడామట ముచ్చట ముందు గనువాడు,
ఏడామ టేకాంతము ఎరిగినవాడు"
39. "పొమ్మన్నవారికి పోకలు గలుగు,
రమ్మన్నవారికి రాకలు గలుగు"
40. "వీరాధి వీరులు వీరమాఘనులు,
వేట్లకు పోట్లకు వెరవనివారు"
41. "రాజులు గూర్చుండు రాయమొగసాల,
వీరులు గూర్చుండు వీరమొగసాల"
42. "వుప్పు చప్పిడియైన, చెరుకు చేదైన,
నిప్పుకు నీగలు ముసిరిన, నీలకు చెదలంటిన"
43. "వలవల కన్నీరు ఆ రాజు వలపొయ్యసాగె
నడుము నక్కున విరిగి ఆ రాజు నేలకు వరిగె"
44. "క్షేమమున గురిజాల చేరంగ వెళ్లి
పొందుగ రాయభారము పొసగ మాట్లాడి
లాభతరంగ శ్రీవీరమేడపికి మళ్లిరావయ్యా"
45. 'గర్భవాసమున బుట్టు'
46. 'భగ్గు భగ్గున మండు'
47. 'పెటపెట దంతములు పేటార్చి కొరికి'

***కాటమరాజు కథలు:*** (నాకు లభించిన తాళపత్ర గ్రంథముల నుండి)

48. "ముత్తాత పగవాణ్ణి మొత్తివేసితిని,
పెద్దిరాజు పగవాణ్ణి పెరికివేసితిని"
49. "తొలిచుక్క పొడవంగ దోరావుల పితికి,
మలిచుక్క పొడవంగ మైలావుల పితికి"
50. 'తరమునాటి పెద్దలు'
51. "ఎత్తివచ్చిన బాణాలు ఎదురొమ్ము నాటినాయి
జారివచ్చిన బాణాలు జబ్బలు నాటినాయి"
52. 'పగవారి ఆయుధములు భారంబులాయె'
53. 'శ్రీవీరకల్లుగా జెల్లె మా తండ్రి'
54. 'పసిబిడ్డ బాలాది'
55. 'గట్టిగా ఎదురొమ్ము గాయాలు నాటి'
56. 'ఆగొఱ్ఱు గేయని ఆవులు అరచెను'
57. "సిరులు మించిన పసిడి పుట్టము గట్టి,
చిలుకల రవికె తొడిగి"
58. "కుదురు ఆరామడ కదులు పన్నెండామడ,
కదలినవోయి కామధేనువులు"
59. "చాల బొల్లావులు సంగటావులును
నేలయానిన రీతి నెల్లూరి యిరుమేల
తెల్ల బొల్లావులు ఒక్క దేముడెరుగు"

60. "పెదరేమిడి గడ్డి పెద్దావుల పొడుగు
గుణుగు చెంగల గడ్డి కుర్రలేగల పొడుగు
మళ్లు వక్కిన గడ్డి మనుజుల పొడుగు
చేదుబోద గడ్డి చెట్లపొడుగు గలదు
గోగడనెడి గడ్డి గొడ్డుటావుల పొడుగు
చిలకవాలు తెగడు చెలికలలో మేపులు
చెలికలలో ఆవులు చెదరి మేయగాను"

61. "కట్టని చీరెలు గావు ఓయమ్మ,
కన్న కడుపేమియు గాదమ్మ నీది"

62. "జళిపించి కటార్లు సాహసంబునను,
సూర్య సోమ వీథుల జొచ్చి నరుకంగ"

63. 'కంసబాధలు' = విపరీతమగు బాధలు.

***బొబ్బిలివరుస కథలు, పదములు, జంగం కథలు:–***

64. 'మండివేసుకొని సలాం చేసెను మరి పాచ్ఛావునకు'
(దేసింగురాజు కథ)

65. "వైరులచే తప్పించదలచి యా వన్నెమిగులు హయము
ముట్టికాలు తా వేసుక నిలిచెను ముదము మీరగాను"
(దేసింగురాజు కథ)

66. "జాబులెత్తుకొని వస్తున్నారు హర్కారు లైతేను
బొబ్బిలివారి దేవిడికాడికి టంకామైనారు"
(బొబ్బిలి కథ)

67. "మండిచేసి కొలువుదీరెను వెంగళ్రాయుండు'
(బొబ్బిలి కథ)

68. "కూర్చుంటే కూర్చున్నలాగున భేటికి రావాలె
నిలుచుంటే నిలుచున్నపాటున భేటికి రావాలె"
(బొబ్బిలి కథ)

69. 'ఏదుము సాంబ్రాణి యెత్తి పొగవేసి
పందుము సాంబ్రాణిపట్టి పొగవేసి"(కుంటి మల్లారెడ్డి కథ)

70. 'చల్లపొద్దునా జగపతిరాజు షికారొచ్చినాడు'
(జగపతిరాజు కథ)

71. "తెరవేట గొట్టెదను ధీరత్వమున నేను
పచ్చిపతనమునకు బహుగట్టివాడ" (నలచరిత్ర పదము)

72. 'గర్భంబున పిండంబు కదలికలాయెర–లంబాడివాడ'
(ఎఱుకల నాంచారి కథ)

73. 'మీ కెరుకచెప్పుట మా కచ్చిలేదయ్యా– లంబాడివాడ'
(ఎఱుకల నాంచారి కథ)

74. 'ఆడికలు సమకూడు అపకీర్తి వచ్చు'
(ధర్మాంగద చరిత్ర– పాముపాట)

75. 'ఆగడాల అండికాయ'(గాంధారి కథ)

76. 'ఆకుచాటున కాయ అమిరియున్న విధాన'
(గంగావివాహము పదము)

77. 'తంగం పాట'= శోభనపు పాట
(శ్రీయాళమహారాజు జంగంకథ)

78. 'కొలువు తీరు= కూర్చుండు.
'గుఱ్ఱము మీద కొలువు తీరు'– 'కుర్చీమీద కొలువు తీరు'

## 6. పదజాలము

### 6.1. అపూర్వ పదములు:–

వీరగాథలలో దేశ్యపదములు, వృత్తిపదములు ఎన్నియో కలవు. వీనిలోఁ జాలభాగము నిఘంటువులలోని కెక్కలేదు. కొన్ని శబ్దములను జానపదులు మనముపయోగించెడి యర్థములోఁగాక వేఱగు నర్థములో నుపయోగించుచున్నారు.

***శక్తికథలు:–***

వేగంతము= తొందర

చుమ్మగుడ్డ= నెత్తిపై కడవను మోయునప్పుడు గుండ్రముగాఁ జుట్టుకొని యుంచుకొను గుడ్డ.

గరివి= కడవ (గరివాల= కడవ)

గయినములు కట్టు= నడుముచుట్టును పైటచెంగును చుట్టుకొనుట. నీళ్లు మోయునప్పుడు జానపద స్త్రీలు గయనములు కట్టుకొందురు.

దొగ్గలి కూర= ముండ్ల తోటకూర; రక్తబాష్పమను మొక్క; చిఱ్ఱికూర.

మాళెమాయెను= తెలిసెను

మువ్వల కొరడా= గజ్జెలతో నలంకరించిన కొరడా

సెమసెయక= ఆలస్యము చేయక

పాపకారి, అన్నెకారి= పాపత్మురాలు, దుష్టురాలు.

పరగట= పచ్చిక బీడు (పరగడ= ఊరిబయట పొలము, బీడు)

గాదరించు = అఱచు

పొత్తుబట్టలు= పసిపిల్లలకు వేయు చిన్న మెత్తటి గుడ్డలు (పొత్తిళ్ళు)

శానాపతి గుణం= చెడ్డ గుణము

పరజ్ఞానంచే = పరులచేత

కోప దిమాషుడు= ఆగ్రహావేశుఁడు

వెలిసికొను= కడుగుకొను

ఊతకట్టి = ఊతగాఁగొను చేతికట్టి
చేబోటు = ,, ,,
బొడ్డన బావి = నడుమ పిల్లనూయిగల కోనేరు
ఆటచేపలు= నీటిలో నాడెడి చేపలు
అడ్డాలు = ఒడి
ఓడలు = మేదరి బుట్ట చుట్టు కైవారము
రువ్వలు = వెదురు బ్రద్దలు
ఒల్లీసు = జోలి
తెలిగల్చి = మేలుకొని
ముండేకులు = విధవలు వడకెడి యేకులు
దండు రాండవ = గొప్ప సైన్యము
గాండువా దూలము= పెద్ద కొమ్మ
సాకరు = మర్మము (?)
పటాకత్తెర = పెద్దకత్తెర
చదురు = అరుగు
దవడ సత్తువ = నోటి బలము
పుల్లటి= కోడిగ్రుడ్డులో నొకభాగము (చందమామ)
ముసిమార = ప్రేమగా (ముసిమి= ప్రేమానుబంధము)
గవిటి = గడప
ఒడ్డుకెళ్లు = పండుకొను
ముంజూరు = ముందు చూరు
ఊసి = మాట
నిక్కు-తక్కు = గర్వము
ఇంపితం = ఇష్టం
దసింపు = అభివృద్ధి (cf. నశింపు)
మండలు= చిన్నకొమ్మలు, అఱచేతులు
గడసరి = తెలివిగలవాఁడు (తెలివిగలది)
ఆబోరు = మర్యాద
పోకిళ్లు = గర్వచేష్టలు
వారకంపెట్టు= నీళ్లు త్రాగుటకు చేతిని పెదవుల దగ్గఱ దొన్నెవలెఁ బెట్టుకొను.
మనువడుగుట = పిల్లనిమ్మని యడుగుట
ఉప్పరితట్ట = మట్టి నెత్తిపోయు తట్ట
రెక్క = భుజము (cf. 'రెట్ట' రాయలసీమ)
కావిడి మట్టులు = కావడిలో బిందెలు పెట్టుకొనుటకుండు కుదురులు
పులివండ = పులి నివసించెడి ప్రదేశము
కాడు = చితి
మగటము = మాయ
బొరిగ = గడ్డిత్రవ్వెడి పనిముట్టు
గాగ= పక్షిగొంతు
అరుగులు = పక్షి మెడలు

సాహిత్యము = స్వయంపాకము

***పల్నాటి వీరకథలు:-***

మగకాశ = వీరులు కట్టుకొను కాశ, వీరకాశ.
రణభట్టు= రణమున రాయబారమునడపు భట్టు
జీవాళము = సారము, లేక జీవసారము
ఓజులు = బత్తులు
అస్వస్థత = బలహీనత
మరియాద= గౌరవము
గద్దనలు = గద్దరింపులు
పరిణామము = సంతోషము, అంతము
ఆడపాపలు = నాట్యకత్తెలు, వేశ్యలు
మగసిరి = పౌరుషము
చమురు = నేయి
మాలిమి = మైత్రి
విచ్చేయు = పోవు, వచ్చు
తలచెడు = పరాభవము పొందు
పరిగె = పరుగున
దృష్టము = దృష్టాంతము
అభిమానములు = అభిమాన వస్తువులు, పౌరుష వాక్యములు
పదుచువాడు = యువకుఁడు
గలభకారులు = అల్లరి మూక
పదిలుడు = జాగరూకత గలవాడు
పరమేశుడు= విష్ణువు
వింతవేడుక = అపూర్వానందము
ప్రాప్తంబు = విధిలిఖితము
కుంభము = అన్నపు రాశి
ప్రతిమలు = బొమ్మలు
చంపుడు కట్ట= సహగమనము చేయునప్పుడు దుముకు నెత్తైన దిబ్బ
కురువేరు= సువాసనగల ఒక జాతి ఔషధి

***కాటమరాజు కథలు:-***

కాలారి = కాలరి (దూత)
కాటార్లు = కటార్లు, కత్తులు
శాన = చాల
ఆగ్రుడై = ఆగ్రహియై
హాగ్రులై = ఆగ్రహులై
ఏక పొగడుచు = నిరంతరము పొగడుచు
గండపెండెములు = గండపెండేరములు
వలపక్షము = పక్షపాతము
అచ్చాళి మూక = జంజాటము లేని సైన్యము

రాగిడిలు = రాగిల్లు
గణిడీలు= (గరిడీలు) ?
చిల్సిపెలు =
మెండ్యెంబు= } మెండియము= చూపుడు వ్రేలికి పెట్టుకొను ఉంగరము
మేండ్యంబు= }
తరిమళ్లcబడి = ?
తండారి = చల్లారి, ఉపశమించి
సారసత్తు = సారెసత్తు= జంతిక, తినుబండారము
గమిడి = ఊరుచుట్టునున్న ఎల్ల, సరిహద్దు, పొలిమేర
(గవిని/ గవని/ గవను= కోటవాకిలి, పురద్వారం)
సిరికశలు = ?
కంపటీలు = ఆలమందలను కాపాడెడి సైనికులు (?)
పసినంబు = ?
తుది పదము = ?
గూబ జంకులు = ?
వడసారము = పూర్తిగా
తలపొలము = పొలిమేర వెంబడి యుండెడి భూమి
కంపటులు = ఆలమందను రక్షించెడి సైనికులు (?)
కైరగాండ్లు = ?
కూతుపంతాలు = వీరాలాపములు (?)
కమికెము= గుప్పిలి, పిడికిలి
కరపట్నాలు = కరవట్నాలు= సముద్ర తీరమందలి ప్రదేశాలు
ఆళువరికట్ట= వప్రము
అవుగుళాలు = ?
గముకులు = ?
పందువలు = కందువలు (?)
పయితల్లి = ?
కోరుదల = ?
సోకెత్తు = బాధపడు (?)
యంబెట్టవు = ?
దామెన = పెక్కు తలుగులు (పలుపులు) గల నిడివి త్రాడు, బందె
ఆరాళ్లములు = ?
కలనావి = ?
కోరితము = ?
అల్లటి = తొందర, చిరాకు (అల్లటపెట్టు=తొందర కలిగించు)

***బొబ్బిలివరుస కథలు- ఇతరములు:-***

ఎక్కుక కోళ్లు= కొల్లగొట్టుట (?)
రాయిగ = స్థాయిగ (?)
కోరుపులి = ?
గెట్టన = ఘట్టన (?)
ఆలంగారము = అలంగము
రవిడి గుండ్లు= కోటమీదినుండి శత్రువులపై దొరిలించెడి గుండ్లు
ఆర్లు = ఆరెలు
మోళీవిద్య = పోటీ, పందెము, (మోడీ విద్య= గారడివిద్య)
వేగుమానంబగు = వేకువ యగు
ఎట్టికొట్టము = వెట్టిపని
శాబ్ది = శపథము
రొడ్డ = కసవు, బురద
ఏపులు = కుక్కలు ('ఏపి'- ఏకవచనము)
చణుకులు = చెణుకులు= చమత్కారములు, నేర్పయిన మాటలు
హోల్లలు = ?
కుప్పటము= ఒక రకపు కుట్టుపని (?)
కొనవ = కుక్కమెడకుఁ గట్టెడి వంకెకట్టె
పోబిడి = (పోబడి) = జాడ
కరుగుల బిందెలు = ధనపు బిందెలు, లంకెల బిందెలు
(cf. కరకులు = రూకలు)
నోటిగామిడి = ?
చినదాయి = చిన్నపిల్ల (శ్రీకాకుళపు మాండలికము)
తలహోర స్నానము = శిరస్నానము
పట్టువేయు = ముగ్గువేయు
దొంద్రాంగి = గయ్యాళి
రొజ్జగాలి = చలిగాలి
సదావర్తి = సదావృత్తి= బైరాగులు లోనగు వారికిచ్చెడి వంట సామగ్రి
జోడాలవారు = వార్తాహరులు
మర్లుబాటు = తిరుగుబాటు
కుంది = క్రుమ్మి
ఆవజీవాలు = (?)
వైలు = వైళమ (?)
కోసమాటలు = కారొడ్డెములు
దూసుకొనుట = పారిపోవుట
కుందాయిపోట్లు = కుందపోట్లు
ఈపు = పురుగు
గోడ సరాలు = తెరలు
బగ్గంపాడు = పూర్తిగా నాశమగు
కామాటీలు = కూలీలు
సీమంతగాజులు = సీమంతమప్పుడు పెట్టెడు గాజులు
గశిమాడు = (?) (cf. కసిమసఁగు= ఖండించు, చంపు)
గండబండ = గండశిల
అగవు = ఆలస్యము
మండి వేసికొను = ఒకకాలు నేలమోకరించి దండము పెట్టు పద్ధతి

కణజము = ధాన్యముంచెడి పాత్ర, ధాన్యపు పాతర
('కణఁజు' లేక 'కడఁజు'= గోకర్ణమృగము)
దుదుకఁడు = దుష్టుఁడు, దుదుకుతనము కలవాఁడు
చదురుండు = చదురుపైఁ గూర్చుండు (cf. కొలువుండు)
ముట్టికాలు వేసికొను = గుఱ్ఱము నిలుచుండు పద్ధతి
పంజె = దరిద్రుఁడు; 'చారంగి' అను చెట్టు
టంకామగు = చేరుకొనిరి (?)
లకోట = పెద్దయుత్తరము
పురోణి = చిన్న యుత్తరము
కంచెలు = గడ్డి బీళ్లు
అగావు = పారితోషికము
సూవారము = భోజనము
చల్లప్రొద్దు = సాయంకాలము ఆరుగంటల నుండి రాత్రి ఎనిమిది తొమ్మిది గంటల వఱకును (రాయలసీమ మాండలికము)
పదనుకువచ్చు = తార్కాణమగు
అంబరించు = కురియు (?)
బిడములు = (?)
జీవదంతము = జీవకళ
కుండగోకిరి = వంటవాఁడు (కుండగోకరి)
అరివాణములు = ఒక రకపు గిన్నెలు
నీరుపాప = అగ్ని
గొంతిచెంప = కుడిచెంప
ఉడుకు మనసు = మన్మథ బాధాపీడితమైన మనస్సు
కుదులు = ప్రదక్షిణలు
జుల్మతీ గుఱ్ఱములు = (?)
కలువతోక = చివర తెల్లవెంట్రుకలున్న తోక
పుల్లరోమములు = తెల్లరోమములు
తంగంపాట = శోభనపు పాట (cf. తంగం= బంగారము) శోభనము నాఁటి రాత్రి, భర్త, భార్య కొంగున బంగారము కట్టుట దాక్షిణాత్యుల సంప్రదాయము.
సొప్పసొరుగులు = ఎండిన చొప్పవలె (?)
పుట్టకూడు = చీమలతోఁ గూడిన పుట్టమట్టి ముద్ద
కంకటిల్లు= ఏడ్చు, కక్కటిల్లు
సరిజాదవ = తోడికోడలు
కాకిశోకము = అధిక శోకము
కాంతాళము = తాలిమి లేమి; కోపము, ఈర్ష్య, అధైర్యము
బిందుపెట్టించు = బలిపెట్టి దాని రక్తమును దేవతలకుఁ జల్లుట
రతిపోయుట = కుప్పవోయుట
కలికలియగు = అవిసిపోవు
పొడిసిళ్లు = జాడలు
కొంగువేయు = జారత్వము చేయు
బిసల మంచము = మరల మంచము
జగ్గుమీరు = తళతళయను
ఆడికలు = నిందలు
వీరకాడు = వియ్యంకుఁడు
జంపు = ఆలస్యము
శతమానము = తాళిబొట్టు
అట్టెలు = బాధలు
వేలములు = శిబిరములు
రాకసము = రాక్షసము
దండాసివాడు = మాలవాఁడు

## 6.2. వైరి సమాసములు:–

**శక్తికథలు :–**

జీవిగడ్డ, నవకాయ పిండివంటలు, ధర్మచెలమ. మొ॥

**పల్నాటి వీరకథలు :–**

కులపగ, కనక తప్పెటలు, పాదకానుక, భూతరాట్కంబము, ప్రతిమోత, పుడమీశ మొ॥

**కాటమరాజు కథలు:–**

పాదకానుక, కనకపొడి, ఘనగుంపు, వీరజడ, రత్న కడియాలు, ఘనవాలు, కనకపువ్వుల దట్టి, మొ॥

**బొబ్బిలివరుస కథలు, ఇతరములు:–**

ఘనగుఱ్ఱము, ద్వాదశామడ, బహుగట్టివాడు, నవరత్నగద్దె, మూలదుంప, వృషభటెక్కెము, మలినకొంప, ఫలతోటలు, దశతలలు, దైత్యమూకలు, మొ॥

ఇట్లు వ్యాకరణ విరుద్ధములగు సమాసములే గాక, ఒకే యర్థమునిచ్చు రెండు శబ్దములను గలిపి ప్రయోగించిన వింతపదములును వీరగాథలలోఁ గలవు. ఉదాహరణమునకు 'మృగజంతువు– సప్తయేడు లోకములు– రణయుద్ధం– శరాబందిఖాన (చెర+ బందిఖాన)– క్షత్రియగొడుగు (ఛత్రము+గొడుగు)– తామరపద్మము– అగ్గినిప్పులు– ధరాభూమి– ఎన్నుఈపు– సభాకచ్చేరీ– మొ॥

ఇట్లు ఏకార్థమునిచ్చు రెండు శబ్దములను సమాసముగాఁ గాక, వివరణాత్మకముగాఁ జెప్పుటయుఁ గానవచ్చుచున్నది. నేను సేకరించిన ఎల్లమ్మకథ (పరశురామునికథ)లలో నిట్టి వివరణాత్మక పదములున్నవి. ఉదాహరణమునకు: "వటవృక్షమనే మఱ్ఱిచెట్టు, వాయువనే గాలి, వైశ్యరత్నమనే కోమటి, వింజామరనే చీపురు, కుంచె అనే చీపురు, ఛత్రాకమనే చాప, వేదాంతమనే పుస్తకం, పటాచిలకలనే కత్తిరిబాణాలు, ఘంటచక్రం అనే దీపం, వోణీ అనే పైటచెంగు,

కొరడా అనే కమిచీ, నొగలనే తొట్టి, జటాయువనే బొల్లిగద్ద, మీనములనే ఆటచేపలు". శ్రోతలెప్పుడును నిరక్షరాస్యులే కావున వారికి సులభముగా నర్థమగుటకై గాథాకారు లిట్టి పదబంధములను సృజించియుందురు.

## 6.3. వ్యావహారిక పదములు- వ్యాకరణాంశములు:-

వీరగాథలభాష వ్యావహారికభాష. ఇది ఆయా మాండలికములతో నొప్పుచుండును. మన వ్యావహారికభాష కింకను సరియగు వ్యాకరణము లేర్పడలేదు. అందుచే దీని స్వరూప స్వభావముల నరయుట దుర్ఘటము. ఇది చిన్నయసూరి సూత్రములకు లొంగదు.

1. వీరగాథలలో జానపదుల యుచ్చారణమునుబట్టియే సంధికార్యములు జరుగుచుండును. జానపదులు పదాది 'వ' కారములోని హల్లు నుచ్చరింపరు: ఆడు (వాడు), ఈడు (వీడు), ఏడి (వేడి), ఈర్లు (వీరులు) మొ॥. బొబ్బిలి యుద్ధము వీరగాథలో 'వెంగళరావు' అను శబ్దము 'ఎంగ్రావు'గా నుచ్చరిపంఁబడినది. ఈ 'ఎంగ్రావు' శబ్దములోనే సంధి చేయబడినది:

'తమ్ముడ+ఎంగ్రావూ= తమ్ముడెంగ్రావూ'

(తమ్ముడ వెంగళరావు).

2. జానపదులు వ కారము లేనిచోట వ కారమునుచ్చరింతురు. 'వెండ' (ఎండ), 'వితడు' (ఇతడు). ఇట్లే 'ఒఱగి' అను శబ్దమును 'వరిగి' అని యుచ్చరింతురు.

'శంఖుల మతమున చెలగి వరిగున్న' (పల్నాటి వీరకథలు)

'వరిగి+ఉన్న= వరిగున్న అనుటలో నిట క్త్వార్థంబైన ఇత్తునకు సంధి కనబడుచున్నది. ఇది వ్యాకరణ విరుద్ధము.

3. 'వచ్చు' శబ్దమును వ్యవహారములో 'ఒచ్చు' అందురు. ఈ వ్యావహారిక శబ్దముతోనే వీరగాథలలో సంధులు గానవచ్చుచున్నవి.

'అనుజుడు పేర్నీ దన్నకడకొచ్చి' (పల్నాటి వీరకథలు)

అన్నకడకు+ఒచ్చి = అన్నకడకొచ్చి.

ఇట్లే ఈ 'ఒచ్చు' శబ్దమునకు క్త్వార్థంబైన ఇత్తుతో సంధిచేయఁబడుట మఱియొక వింత.

'ఘనదక్షిణాదికి కదలొచ్చువేళ' (పల్నాటి వీరకథలు).

కదలి+ఒచ్చువేళ = కదలొచ్చువేళ.

4. క్త్వార్థంబైన ఇత్తునకు సంధులు- ఇతరోదాహరణములు:

కలిగి+ఉండు= కలిగుండు

'పదిశత బాహులు పరగ నేనూరు జిహ్వలు కలిగుండు ఆనాన్వయునకు' (పల్నాటి వీరకథలు).

మెరసి+ఆడు= మెరసాడు.

'మెండైన రాగాల మెరసాడసాగె' (కాటమరాజు కథలు)

దాగి+ఉండు= దాగుండు.

'తఱచు మాటలు మాని దాగుండు మనుము' (కాటమరాజు కథలు)

5. కర్మధారయంబులందుత్తున కచ్చు పరంబగు నప్పుడు టుగామము రాకపోవుట.

తప్పు+ఆనవాలు= తప్పానవాలు.

'తప్పానవాలని తలపకపోతి' (పల్నాటి వీరకథలు)

6. 'నుండి' అనుటకు 'నుంచి' అనునది వ్యావహారిక రూపము.

'ఉత్తరాదినుంచి ఉర్వీశుడపుడు' (పల్నాటి వీరకథలు)

7. 'అవతా'రమనుటకు 'అవుతార'మనుట వ్యావహారికము.

'తనయులలో దగు నవుతార పురుషు కృతావీరు...' (పల్నాటి వీరకథలు)

8. 'ఆఱవ' యనుటకు 'ఆరో' అనునది వ్యావహారికము.

'ఆ కార్తవీర్యున కటు నారో పురుషు' (పల్నాటి వీరకథలు)

9. 'స్త్రీ' అను శబ్దమును 'శ్రీ'గా నుచ్చరించుట జానపద వ్యవహారము. స్త్రీలను 'శ్రీలు' అనుట రాయలసీమలోఁ గలదు వీరగాథలలో నీ ప్రయోగము యతిస్థానములందున్నది.

'శ్రిష్టి గల రాజులు శ్రీలను బోల' (నాకులభించిన తాళపత్ర గ్రంథము- (పల్నాటి వీరకథలు).

'ఆడశ్రీలతో' (కాటమరాజు కథలు)

అట్లే 'సృష్టి'ని 'శ్రిష్టి' యని యుచ్చరింతురనుటకును బై యుదాహరణము సాక్ష్యము.

10. షష్ఠీ 'కు' వర్ణమునకు ముందు 'న' గాగమము రాకుండుట.

'కాటమరాజుకు గాయాలు నాటె' (కాటమరాజునకు)

11. 'మగడు' శబ్దమును 'మొగుడు'గా నుచ్చరించుట లోక వ్యవహారము. కాఁబట్టి 'మగతనము'ను 'మొగతనము'గా నుచ్చరించుటయుఁ బరిపాటి. ఈ వ్యావహారికపదమే పల్నాటి వీర కథలలో యతిస్థానమునఁ గాననగును.

'మొగతనము బాయక మొనలు చూచుచును'

12. ప్రాతిపదికకుఁ దప్ప, ప్రత్యయముకు బహువచన రూపమును జేర్చుట తెలుఁగు వ్యాకరణ మర్యాద కాదు. కాని వీరగాథలలోఁ బ్రత్యయమునకే బహువచన రూపములు చేరిన యుదాహరణము లున్నవి.

'అట కింద యంతరంబందుల చాల' (పల్నాటి వీరకథలు)

'ఏ పుంజులందుల నెరుగమే భూమి' ( ,, )

'అంతరంబులయందు'– 'ఏ పుంజులయందు' అనియుండుట సాధువు. కాని నాఁటి వ్యవహారమునఁ బై విధముగనే ఉండి యుండును. (ఈ ఉదాహరణములలోని "అందుల"లోని "ల" బహువచనము కాదు, "లో" అను షష్ఠీ విభక్తి రూపాంతరమని ఆచార్య రవ్వా శ్రీహరిగారి అభిప్రాయము.)

13. వస్తువు+లు= వస్తువులు. కాని శివకవులు ప్రథమావిభక్తి ప్రత్యయమును లోపింపఁజేసి 'వస్తులు' అను రీతిలోఁ బ్రయోగించిరి. ఇది ఆ యుగమునాటి జనవ్యవహారమై యుండును. వీరగాథా కవులును నిట్లే ప్రయోగించిరి.

'ఇతర వస్తులు మోసి యేతెంచునట్టి' (పల్నాటి వీరకథలు)

14. పల్నాటి వీరగాథలలో "వస్తిమి, పుడితే, అట్టులయితే, ఆనతిస్తిరి, వెళ్లితే, నరికితే" మొదలగు వ్యావహారిక రూపములు కొల్లలుగా నున్నవి. ఒక్క యుదాహరణము: 'నరికితే జలములు నడిమికి దెగవు'. ఇట్లే కాటమరాజు కథలలోఁ గూడ 'ఏక పొగడచు, మూస్తు, పోయిస్తే, చేస్తిమంత్రి' మొదలగు వ్యావహారిక రూపములు హెచ్చుగాఁ గాననగును.

'కొని ఏకపొగడచు కొండ సేసెదవు'

'మూస్తు తెఱచుచు వత్తు మురిపెమే లేక'

'గోలెలు దొలిపించి పాలు బోయిస్తే'

'పండిన చేలెల్ల పడి జేస్తిమంత్రి'

15. 'వస్తువులు' అను పదములోఁ బ్రథమావిభక్తి ప్రత్యయమును వ్యాకరణ విరుద్ధముగా లోపింపఁజేసిన జానపద కవి, 'ఎదలు' అను శబ్దములో లేని ప్రథమావిభక్తిని బ్రవేశపెట్టినాడు. 'ఎదములు' అని ప్రయోగించినాఁడు.

'ఎడపక వగతుర ఎదములు పగుల' (కాటమరాజు కథలు)

16. బొబ్బిలి యుద్ధము కథలో 'తయారు గన్నండి' (= తయారు గండు) 'భేటికి రన్నండి' (=భేటికి రండు), 'తెన్నండి' (=తెండు)– అను వ్యావహారిక రూపములున్నవి. దేసింగురాజుకథలో 'ఒడలికి' అనుటకు 'ఒళ్లుకు' అను వ్యావహారిక రూపము ప్రయోగింపఁబడినది.

17. తత్సమ శబ్దములకుఁ దెలుఁగు విభక్తులు చేర్చకుండ వాడుట శివకవుల సంప్రదాయము (ఇది వ్యాకరణ విరుద్ధము). వీరగాథా కవులు శివకవుల ననుకరించిరి (జనవ్యవహారము ననుసరించిరనుట ఇంకను సమంజసము). 'కలశ (కలశము), జల (జలము)' అను ప్రయోగములిందులకు ఉదాహరణములు.

'కలశ చేకొని జల బోయంగ' (నలచరిత్ర పదము)

18. భళ్లాణరాయ చరిత్రములో 'వల్లుకు (ఒడలికి), తప్పితము, ఒప్పితము' మొదలగు వ్యావహారిక రూపములు గలవు. బాలనాగమ్మ కథలో 'సలీంద్రలు' (చలివేందిరలు) లను శబ్దము; సన్యాసమ్మకథలో 'బాలకి (బాలిక), మూనాలు (మూడునాళ్లు), ముకుత (ముగ్ధ)' అను శబ్దములను; గాంధారికథలో 'కచ్చపాల' (కక్షపాల) శబ్దమును; రామకథాసుధార్ణవములో 'దుర్లక్షణి' శబ్దమును వ్యాకరణ విరుద్ధములైనను వ్యావహారికములని తెలియనగును.

## 7. అన్యదేశ్యములు

### 7.1. ఉర్దూ పదములు:–

**శక్తికథలలో** 'హర్కారు' అను శబ్దమున్నది. **పల్నాటి వీరకథలలో:** 'ముఖమల్లు గుడ్డలు' (మఖ్మల్), 'అన్నపు ఖర్చు' అను పదములున్నవి. **కాటమరాజు కథలలో** 'చీట్లు (చిఠ్ఠీ), వజ్రీలు (వజీర్), ముస్తీబు (ముస్తఈద్), సరదార్లు (సర్దార్), పారాలు, జముఖానంబు, నాడాలు, అవుదాలు (హౌదా), పౌజులు (ఫౌజ్), తాకీదు, కవులు, బాకీ, దిలాస, ఆర్కాతు, జవాబు, తురాయి, తురువు, హేజీబు, బందె, పల్లటి (పల్టీ), మొదమాదు (మోతెమద్), జండ (ఝండా)'– మున్నగు పదములున్నవి.

పల్నాటి వీరకథలును, కాటమరాజు కథలును ప్రాచీనము లగుటచే వానిలో నుర్దూ పదములు తక్కువగా నున్నవి. కాని యాధునికములగు బొబ్బిలివరుస కథలలోను, జంగము కథలలోను, పదములలోను, నీ యుర్దూ పదములు అసంఖ్యాకముగా నున్నవి.

**దేసింగురాజు కథ** = బాచ్చా, పాదుషా, బారాహజారి, హర్కారు, ఫకీరు, డేరా, పారా, తఖ్తు, దివాన్‌జీ, ఘోడా, ఖైదు, జల్దీ, అచ్చా, సలాం, దాఖల్, చిమ్టా, ఆజూబాజూ, నాజర్, నమ్మక్‌హరాం, వజీరు, దర్వాజా, మహలు, దర్బారు, మసీదు, కందీలు, అముల్‌దార్, నవాబు, ముసద్దీ, తయారు, చోబ్దారు, జోరు, నమూదు, కిస్తీపన్నులు, తఫ్సీలువారిగ, పేషఖబ్జు, సూబెదారు, బేగారు, భర్తీ (జేయించు), తయా (రించు) మొ॥.

**బొబ్బిలి యుద్ధము** = సర్దార్, తరపు, హుకుము, తాలూకా, లడాయి, పెళితా (ఫలీతా), వరదీ, వర్దీ, జమాబంది, షామిల్, డికావు, లష్కర్, హర్కారు, మొహర్జా, బైరో, తీన్, కూల్మీనులు మొ॥.

**ఇతర గాథలలో** = ఇభరాములు, మొబాసు, మసలందు (మస్నదు), మైన (గోరలు), బత్తీసు, జుల్మతీ, శమేనా (శామ్యాన), కీన్కాబు (కిమ్ఖాబు), నిశాన, నదురు, తాలింఖానా, జాగీరుదార్లు, జబర్దస్తు, బందోబస్తు, దరోబస్తు,

దివాన్‌ఖానా, మహల్, కచ్చేరి, చావడి, బతాయించి, దాకలా (దాఖలా), శేరిదారు, కోటిడి, తహశీలు, సత్కా (సద్ధా), బందు, ఆరాబు, ముస్తాబు, పర్మానా, జామీను, గాబర, గాభరా (గభ్‌రానా), మక్కారి (మక్కార్), అవుదా, కచేరి, బరకాస్తు, బహుజారు, సిర్‌వేష్, చబుకు, మాఖూబ్, కూచీలు (కూచ్), టోపీలు, జామాలు, జండాలు, కాసాలు, దుకాణాలు, రగడు (రాపిడి), పౌజు, బందీలు మొ॥.

## 7.2. ఆంగ్ల పదములు:-

తెలుఁగు సాహిత్యముపై నాంగ్లభాషా ప్రభావ మధునాతనము కావునఁ బ్రాచీన వీరగాథలలో నాంగ్లపదములుండుట కవకాశము లేదు. కాఁబట్టి శక్తికథలలోను, పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను నాంగ్లశబ్దము మనకొక్కటి కూడఁ గన్పింపదు. కాటమరాజుకథలలో 'ఘనముగా జలటైను గడు చెంద్రికలును' అను వాక్యములోని 'జలటైను' శబ్దమును 'Gelatine' అను నాంగ్ల శబ్దభవముగా డా॥బి.రామరాజుగారు అనుమానించుచున్నారు (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట ౬౬౬).

పదునెనిమిదవ శతాబ్దమునుండి వీరగాథలలో నాంగ్ల పదములు కొన్ని కానవచ్చుచున్నవి. దేసింగురాజుకథలో 'గ్లోబులు, ఫైర్, మేజరు, సిగ్నల్' వంటి పదములు కొన్ని కలవు. బొబ్బిలి కథలో నాంగ్లపదమును నుర్దూపదమును గలిపి యుచ్చరింపఁబడినవి. బుస్సీదొర విజయరామరాజును జూచి 'వచ్చికూర్చుండుము' అని చెప్పుటకు 'కంబైటో కంబైటో విజయరామరాజా' అనినాఁడు. ఇది 'Come + బైఠో' అను శబ్దముల సమ్మేళనము. బంగారు తిమ్మరాజు కథలో Gate అను నాంగ్లపదమున్నది. 'ఒకటి రెండో మూడు గేటు వరుసగ దాటాడు'. భళ్లాణరాయ చరిత్రము జంగంకథలో Dress శబ్దమున్నది. సారంగధర చరిత్ర శారదవరుసలో Fire శబ్దమున్నది. మొత్తముపై నుర్దూపదములతోఁ బోల్చినచో వీరగాథలలో నాంగ్లపదములు మిక్కిలి తక్కువయని చెప్పవలెను. ఆండాళ్ చరిత్రములో 'పత్తు' అను తమిళ శబ్దమొక్కటి కానవచ్చుచున్నది ('పగల్పత్తు రాప్పత్తుత్సవ వైభవమచట చూచువారు'). ❐

### జ్ఞాపికలు

1. *డా॥ బి. రామరాజుగారు, 'తెలుఁగు జానపదగేయ సాహిత్యము', పుటలు. ౬౬౧, ౬౬౨.*
2. *అలరాచమల్లుగారి గురిజాల రాయబారము, పల్నాటిలో లభించిన వ్రాఁతప్రతి.*
3. *జన్నివాడ కథ– కృష్ణా మండలమున లభించిన తాళపత్ర గ్రంథము.*
4. *పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రతి, పుటలు, 141, 142.*

## ఇరువదియవ ప్రకరణము

# వీరగాథల ఛందస్సు

వీరగాథల ఛందస్సు లక్షణగ్రంథములకు అందునదికాదు. లక్షణ గ్రంథములు కేవలము మార్గసాహిత్యమును బరిశీలించి యేర్పరచినవే కాని, దేశిసాహిత్యమును దృష్టియందిడుకొని చెప్పినవి కావు. అందు చేతనే వీని సూత్రములలో వీరగాథలు ఇముడకున్నవి.

ఆద్యంతము నొకే ఛందమున నుండుట వీరగాథల ముఖ్య లక్షణములలో నొకటి. ఈ లక్షణము ప్రతిదేశమందును బ్రతిసాహిత్య మందును గానవచ్చుచున్నది. పాశ్చాత్య వీరగాథలు– ముఖ్యముగా నాంగ్లవీరగాథలు చతుష్పదులుగా నుండును. దీనిని 'ఇయాంబిక్' (iambic) ఛందమందురు. దీనిలో ద్వితీయ చతుర్థ పాదములకు అంత్య ప్రాస యుండును (a, b, c, b). ఈ ప్రాసగల పాదము లొక్కొక్కటి ఆఱు 'సిలబిల్స్' (syllables) పొడవుండును. తక్కిన పాదములు (ప్రథమ, తృతీయ పాదములు) మాత్రము ఒక్కొక్కటి యెనిమిది 'సిలబిల్స్' పొడవుండును. వీరగాథలలోఁ దఱచుగా నీ ఛందస్సే వాడఁబడుచుండుటచే దీనికి 'వీరగాథాచ్ఛందము' ('Ballad Stanza') అని పేరు వచ్చినది. పాశ్చాత్యదేశము లందన్నిటను నిదే ఛందస్సు వాడుకలో నున్నదని యర్థము కాదు. దేశదేశమునకు నిది భేదించుచుండును. కాని యే సాహిత్యమందైనను నిట్టి సులభ చ్ఛందమొకటి వీరగాథలలో నూటికి ఎనుబదివంతులు వాడఁబడు చుండును. వీరగాథల ఛందస్సు కొన్ని సాహిత్యములందు నిబద్ధము గను మఱికొన్ని సాహిత్యములందు అనిబద్ధముగను గలదు.

"The characteristic English, Scandinavian, Czech and Hungarian ballad form is stanzaic. Spanish ballads aasonate rather than rhyme, with octosyllabic base and uniform metre and technique, but are not stanzaic. Esthonian ballads are in rhymeless octosyllables, Ukrainian in unrhymed free verse. Balkan and Russian ballads are unrhymed and not strophic. Danish ballads are arranged in couplets or quatrains, and so, on the whole, are English."[1]

యురేషియాయందువలెనే భరతఖండమునఁగూడ నొక్కొక్క ప్రాంతమందలి వీరగాథలలోఁ గొన్ని ప్రత్యేక ఛందోరూపములు వాడుక యందున్నవి. బెంగాలీ వీరగాథలలో 'బౌల్', 'భటియాలీ'; గుజరాత్‌లో 'గర్బ'; మహారాష్ట్రమున 'పొవాడా', 'లావణీ'; ఉత్తరప్రదేశ్‌లో 'ఛెయితీ', 'కజరీ'; కేరళలో 'కొల్కలి పత్తూస్'; అస్సాములో 'బిహూ'; రాజస్థానులో 'మాండ్', 'ఘుమార్'; కాశ్మీరమున 'రఫ్', 'ఛకరీ'; మధ్యప్రదేశ్‌లో 'సుఅ', 'సైరా'; గోవాలో 'ధలో', 'దకని' మున్నగు వీరగాథాచ్ఛందములు ప్రచారమున నున్నవి.[2] రాజస్థానులో 'పద్' అనునది ప్రాచీనమగు వీరగాథాచ్ఛందము.[3] పంజాబులో వీరగాథారచన 'బైత్' అను ఛందస్సులోఁ గొనసాఁగుచున్నది. మహమ్మదు ప్రవక్తకూడ నీ ఛందస్సులో రచనలు చేసినాఁడఁట.[4] ఇట్టి జానపదచ్ఛందములు భారతదేశమున రెండువందలకుఁ బైగా నున్నవని పరిశోధకులు నిర్ణయించినారు.

తెలుఁగులో 'ద్విపద'–'రగడ' అనునవి అతిప్రసిద్ధములైన వీరగాథాచ్ఛందములు. ఈ 'ద్విపద' మన లక్షణకర్తలు చెప్పిన ద్విపద వంటిది కాదు. ఈ 'రగడ'యు లాక్షణికుల సూత్రములకు లొంగునది కాదు. ఇవి ప్రాచీనమైన జానపదచ్ఛందములు. వీనినిబట్టి లక్షణములను గల్పింపవలెనను గాని, లక్షణములనుబట్టి వీనిని గొలుచుట నిష్ఫలము.

ఈ జానపద ఛందోరీతులు ప్రాఙ్నన్నయ యుగమునుండియుఁ గలవనుటకు శాసనప్రమాణమున్నది. ఇవియన్నియును లయాను గుణమగు మాత్రాగణబద్ధములు. సంస్కృతమునుండి వచ్చిన అక్షర గణములకును వీనికిని సంబంధము లేదు. ఈ జానపద ఛందోరీతులు ద్రావిడభాషలన్నింటను సమానముగ నున్నవి. ఈ జానపదచ్ఛందములనుండియే దేశికవిత్వము పుట్టినది.

డా॥ బి. రామరాజుగారు జాపదగేయముల వరుసలనుగూర్చి చెప్పుచు, లాక్షణిక నిర్దేశమునకు లొంగని వీనికొక ప్రమాణమును బ్రతిపాదించిరి: "... జానపద గేయముల ఛందోరీతులను వేలకొలఁదిగా గణవిభజన చేసిగాని, వైయాకరణు లేర్పరచిన కొలఁదిపాటి కొలత బ్రద్దలచేగాని ఇదమిత్థమని తేల్చజాలము... ఆదిమానవుడు సంతోష పారవశ్యమున చిందులు ద్రొక్కినప్పుడు ముద్రితములైన పదాంకములందే గేయముల రీతులును గలవు. కవిత్వారంభదశ, నాట్యారంభదశ, సంగీతారంభదశ అచ్చోటనే గలదు. స్పష్టాస్పష్టములగు నాయంకముల నూహించి 'జానపదగేయములు మూడు, నాలుగు, ఐదు, ఆరు, ఏడు, యెనిమిది, ఆవృత్తులలో నడచును' అని యొక ప్రమాణ మేర్పరచుకొన్న నెన్ని లక్షల గేయములనైన నీ సూత్రమున బంధింప వచ్చును".[5]

పద్యములలోని ఛందస్సునకును, పాటలలోని ఛందస్సునకును చాల భేదమున్నది. పద్యముల పాదములు గణములచేఁ గూర్పఁబడును. పాటల పాదములు (వీనిని చరణము లందురు) ఆవృత్తులచేఁ గూర్పఁబడును. పద్యగణములు అక్షరగణములు; గేయ గణములు

మాత్రాగణములు. పద్యపాదములోని గణములన్నియును సమాన కాలప్రమాణము కలవి కావు. గేయ చరణావృత్తులన్నియును కాలప్రమాణమున సమముగా నుండును. పద్యగణములు గురులఘువుల కూర్పుచే నేర్పడును. గేయావృత్తులు మాత్రలను కాలప్రమాణముచే నేర్పడును. పద్యగణములలో గురులఘువుల క్రమము నియతము. గేయావృత్తులలో గురులఘువుల క్రమమెట్లున్నను తప్పులేదు; మాత్రల కాలప్రమాణము సరిపోయినఁ జాలును.

గేయచరణావృత్తుల యందలి మాత్రలను 'త, క, కి, ట' యను నక్షరములచే సూచింతురు. ఇందొక్కొక్కటి యొక్కొక్క మాత్రా కాలమును సూచించును. సంగీతశాస్త్రమున నీ మాత్రలను 'అక్షరములు' అని పిలుతురు. సాహిత్యాక్షరములకును వీనికిని నర్థక్లేశము కలుగకుండుటకై వీనిని 'సంగీతాక్షరములు' అని పిలుచుట మంచిది. గేయచ్ఛందమును జెప్పునప్పుడు ఈ సంగీతాక్షరములనే చెప్పుదురు. ఇవి సాహిత్యాక్షరములతో సమముగా నుండవలసిన యవసరము లేదు. ఒకటి రెండు సాహిత్యాక్షరములు తక్కువయైనను, సాఁగఁదీసి పాడుటలో లోపించిన యక్షరములు పూరింపఁబడును. ఒక్కొక్కప్పుడు సాహిత్యాక్షరములు సంగీతాక్షరములకంటె నెక్కువగ నున్నచో నట మాత్రాకాలమునకు సరిపడునట్లుగా సాహిత్యాక్షరములు కుదింపఁబడును.

గేయగతిలో మూఁడేసి మాత్రల చేరిక (ఆవృత్తి) స్ఫురించినచో దానిని 'తకిట, తకిట, తకిట, తకిట' అని మూఁడక్షరములచే సూచింతురు. దీనిని 'త్రిశ్రగతి' యందురు. ఇట్లే నాలుగు మాత్రల యావృత్తులను 'కిటతక, కిటతక...' అను నక్షరముల చేతను, ఐదేసి మాత్రల యావృత్తులను 'కిటతకిట, కిటతకిట...' అనియు, ఆఱేసి మాత్రల యావృత్తులను 'తకిటతకిట, తకిటతకిట...' అనియు, ఏడు మాత్రల యావృత్తులను 3+4గా నున్నప్పుడు, 'తకిట కిటతక, తకిట కిటతక...' అనియు, 4+3గా నున్నప్పుడు 'కిటతక తకిట, కిటతక తకిట...' అనియు, ఎనిమిది మాత్రల యావృత్తములను 'కిటతక కిటతక, కిటతక కితటక...' అనియు సూచించుట పరిపాటి. మూఁడు మాత్రల యావృత్తుల నడకను త్రిశ్రగతియన్నట్లే, నాలుగు మాత్రల యావృత్తుల నడకను 'చతురశ్రగతి' యనియు, నైదుమాత్రల యావృత్తుల నడకను 'ఖండగతి' యనియు, నాఱేసి మాత్రల నడకను 'రూపకగతి' యనియు, నేడేసి మాత్రల నడకను 'మిశ్రగతి' యనియు, నెనిమిది మాత్రల నడకను 'ఆదిగతి' యనియుఁ బిలుతురు. తొమ్మిది మాత్రల యావృత్తులు గూడఁ గలవు. ఇవి హరికథలలో వచ్చుచుండును. ఈ తొమ్మిది మాత్రల నడకను 'సంకీర్ణగతి' యందురు. వీరగాథల ఛందస్సులన్నియును పై గతులలో నేదియో యొకదానిలో నిమిడి పోవును.

ఉపలబ్ధములగు వీరగాథలలో ద్విపద-ద్విపద భేదములు, రగడ-రగడ భేదములు ప్రధానములుగాఁ గానవచ్చుచున్నవి. శాసన ప్రమాణమునుబట్టి చూచినచోఁ దెలుఁగు ఛందస్సులలోఁ దరువోజ ప్రాచీనమైనదిగాఁ గన్పట్టుచున్నది (తొమ్మిదవ శతాబ్దమునాఁటి పండరంగని అద్దంకి శాసనము తరువోజచ్ఛందమున నున్నది). ఇది స్త్రీల రోఁకటిపాటలలో నుపయోగింపఁబడుచుండెనని విన్నకోట పెద్దన్న సాక్ష్యమిచ్చుచున్నాఁడు.[6] ఇందు నాలుగు పాదములుండును. ఒక్కొక్క పాదమున 3 ఇం.గ. + 1 సూ.గ. + 3 ఇం.గ. + 1సూ.గ. ఉండును. అనఁగా నిది రెండు ద్విపాదములు కలిసి యొక పాదముగా నేర్పడి నట్లున్నది. ఈ తరువోజ తరువాత 'ద్విపద' (పాల్కురికి సోమనాథుని కావ్యములు), ద్విపద తరువాత 'మంజరీ ద్విపద' (శ్రీనాథుని పల్నాటి వీరచరిత్ర) తెలుఁగు సాహిత్యమునఁ గాన్పించుచున్నవి. కాని దేశిచ్ఛందస్సుల క్రమపరిణామమునుబట్టి పరిశీలించినచో నీ వరుస క్రమము సరికాదని తెలియఁగలదు. "పద్యములేర్పడు సంప్రదాయమునుబట్టి చూచినచో చిన్న చిన్న పాదములు గల పద్యములే మొదటి వనియు, పెద్ద పెద్ద పాదములు గల పద్యములు తరువాత ఏర్పడిన వనియు చెప్పవచ్చును... పరిశీలించి చూచినచో తరువోజకన్నను ప్రాచీనమైనది ద్విపదయని చెప్పుటకు వీలుకలుగుచున్నది. ద్విపదయందు రెండు పాదములుండుటయు, అవియు నాల్గు గణములు మాత్రమే గల చిన్న పాదములగుటయు, ఇట్టి ద్విపదలు వరుసగా ఎన్నైనను వ్రాయుటకు వీలగుటయు, దీనికి గానయోగ్యత యుండుటయు కూడ దీని యొక్క ప్రాచీనతను సమర్థించుచున్నది."[7]

ఇట్లు తరువోజకన్నను బ్రాచీనతరమని భావింపనగు నీ ద్విపదలో యతిప్రాసల నియమమున్నది. ఇది గేయలక్షణము కాదు. యతిమాట యెట్లున్నను, రెండు పాదములకు వరుసగాఁ బద్యము లందువలెఁ బ్రాస నియతముగా నుండుట గేయలక్షణము కాదు. గేయములలో లయానుసారియైన మాత్రా సంఖ్యయే నియతము కాని, తక్కిన ప్రాసాదులన్నియు నైచ్ఛికములే. కావున నీ ద్విపదయొక్క మొదటి రూపము మంజరీ ద్విపదయై యుండవలెను. (ప్రాస నియమము లేని ద్విపదయే మంజరీద్విపద. ఇందు పాదమునకు మూఁడింద్ర గణములు నొక సూర్యగణము నుండును.) ఈ విధముగా తరువోజకన్న ద్విపదయు, ద్విపదకన్న మంజరీద్విపదయుఁ బ్రాచీనతరము లనుట సమంజసము.

కాని, పల్నాటి వీరచరిత్రకన్నఁ బ్రాచీనతరమగు మంజరీ ద్విపద కావ్యము కాని, బసవపురాణముకన్నఁ బ్రాచీనతరమగు ద్విపద కావ్యము కాని తెలుఁగునఁ గానవచ్చుట లేదు. 'సోమనాథునికి పూర్వము ఒక్క తెలుగునందే గాక, ఇరుగు పొరుగు భాషలయిన తమిళ కన్నడములయందును ద్విపద లేదు.'[8] జానపద గేయములను, వీరగాథలను బరిశీలింపఁగా, ఖండగతిలో నున్న పాటలు- ద్విపద, మంజరీద్విపదల కన్నఁ బ్రాచీనతరములని తెలియుచున్నది.

పాదమునకు నాలుగేసి 'కిటతకిట' లుండు నీ పాటలనుబట్టియే పాల్కురికి సోమనాథాది పండితకవులు ద్విపదను సృజించియుందురు. ఈ ఖండగతిలోఁ జివరి ఐదు మాత్రల ఆవృత్తిని మూఁడు మాత్రలుగా మార్చినచో ద్విపద పాదమగును. పండితులిట్లు ద్విపదను సృజించిరనుటకు మఱియొక తార్కాణమున్నది. ద్విపదచ్ఛందమునను, మంజరీద్విపదచ్ఛందమునను నుండు వీరగాథలను గాథాకారులు పాడునప్పుడు ఖండగతి స్పష్టముగా గోచరించును. చివరి సూర్యగణమును సాఁగఁదీసి, అయిదు మాత్రల కాలము పాడుదురు. కావున వారు పాడునప్పుడు సంగీతాక్షరములు నాలుగు 'కిటతకిట' లుగా నుండును. దీనినిబట్టి ఖండగతిలో సాఁగు జానపద గేయముల నుండి, మంజరీ ద్విపద, ద్విపద పుట్టినవనియు, నీ ద్విపదనుండి తరువోజ పరిణమించినదనియుఁ జెప్పవచ్చును. నిశితముగాఁ బరిశీలించినచో అక్కరలు సీసపద్యములు గూడ ద్విపద పరిణామములే యని తేలును.

మంజరీ ద్విపద, ద్విపద = 3 ఇం.గ. + 1 సూ.గ.

తరువోజ = 3 ఇం.గ. + 1 సూ.గ. + 3 ఇం.గ.+1 సూ.గ.

మధ్యాక్కర = 2 ఇం.గ.+1 సూ.గ. + 2 ఇం.గ.+ 1 సూ.గ.

సీసము = 6 ఇం.గ.+ 2 సూ.గ.

రెండు ద్విపద పాదములచేఁ దరువోజ యేర్పడును. ఈ తరువోజలో మధ్యనున్న సూర్యగణమును జివరకు నెట్టినచో సీసపద్య పాదమగును. తరువోజలోని ఇంద్రగణములలో నొక్కొక్కటి తగ్గించినచో మధ్యాక్కర యగును. ఇట్లు దేశిచ్ఛందోరీతులన్నిటికిని ద్విపద మూలరూపము. దీని జన్మకుఁ గారణమైనది జానపదుల ఖండగతి.[9] తెలుఁగు వీరగాథలలో శక్తికథలు, పల్నాటివీరకథలు, కాటమరాజుకథలు– ఈ మూఁడు వర్గములందును ఖండగతి, మందజరీద్విపద, ద్విపదచ్ఛందములు గోచరించుచున్నవి.

## 1. ఖండగతి

పాదమునకు నైదేసి మాత్రల యావృత్తులు నాలుగుండుట ఖండగతి యనఁబడును. ఇందు అయిదుమాత్రలును జేరికగా నున్నప్పుడు ఈ ఖండగతిని 'కిటతకిట, కిటతకిట, కిటతకిట, కిటతకిట' అని సూచింపవచ్చును. కాని, యొక్కొక్కప్పుడీ యైదుమాత్రలు 2+3గా కాని, 3+2గా కాని యుండుట తటస్థించును. అప్పుడీ ఖండగతిని 'తక తకిట, తక తకిట, తక తకిట, తక తకిట' అని కాని, 'తకిట తక, తకిట తక, తకిట తక, తకిట తక' అని కాని సూచింపవలెను. ఈ ఖండగతిలో '5+5+5+5' అను రీతిలో పాదమునకు ఇరువది మాత్రలుండును. పదిమాత్రల తరువాత యతి యుండును. ఇది నియతము కాదు. ఈ ఖండగతిచ్ఛందము శక్తికథలలో బహుళముగా గోచరించుచున్నది. పరశురాముని కథాచక్రమున 'రేణుకా కల్యాణము'లో జమదగ్నివర్ణన ఖండగతిలో సాఁగినది:–

*"చింతపు, వ్వులపంచ, చిలకట్టు, కట్టాడు*
*గామంచు, రూమాల , పైమీద, యేశాడు*
*బింక పం, కామైన, బిళ్లలా, మొలతాడు*
*పదియేళ్ల, కు పాదీ, బటువులే, సీనాడు"*

అంకమ్మ కథాచక్రము– గంగురాజు కథ:–

*"ఈడున దొడ్డవాడు బుద్ధిని దొడ్డవాడు*
*సామున దొడ్డవాడు (స) దృశాన దొడ్డవాడు*
*గరిడిని దొడ్డవాడు (గరిడి) సాముక దొడ్డవాడు*
*దీక్షకు దొడ్డవాడు (దీక్ష) సాముకు దొడ్డవాడు"*

ఇందలి పాదములు అయిదేసి మాత్రల యావృత్తులుగా లేవు (4+6) + (4+6) గా నున్నవి. అనఁగాఁ బాదములో నుండవలసిన మొత్తము మాత్రల సంఖ్య (20) సరిపోయినది. కుండలీకరణమున నున్న యక్షరములను బాడునప్పుడు నొక్కివేసి, వచనమువలె నుచ్చరింతురు. కావున మాత్రల సంఖ్య మించదు.

కాటమరాజుకథలలో నెక్కువ భాగము ద్విపద. అయినను అక్కడక్కడ నీ ద్విపద శిథిలమై ఖండగతివలె మాఱినది. కఱియావుల రాజు కథలోను, పాపనూక కథలోను గొన్ని భాగములందిట్టి గతిని జూడవచ్చును:–

*"రంగుగా, కరియావు, లారాజు, చరిత్రను*
*సంగతిగ, చెప్పేను, శ్రవణానందముగను*
*కలియుగభేతాళుడు, కన్నమా, ధీరుండు*
*రంపాల, కేశవుఁడు, రణశూరు, లుముగ్గురు"*

– కఱియావులరాజుకథ

ఇందుఁ గ్రీగీతలున్న భాగములలో పదిమాత్ర లొకే ఆవృత్తిగా నున్నవి. 5+5గా నివి విడుటలేదు. అయినను పాదమున మొత్తము మాత్రల సంఖ్య చెడదు. పాపనూకకథలో ఖండగతి ఇంతకన్న స్పష్టముగా నున్నది:–

*"యిచ్చినా, వారిండ్లు, యిలమీద, క్రుంగునూ*
*పుచ్చుకున్న, వారిండ్లు, భూమిమీ, ద వెలుసును*
*యెదురిండ్లు, మనవయ్య, యేకపుణి, కెలపాపకు*
*ఇది అమిశ, తో పుట్టె, ను వినవ, య్య చెల్లెలు".*

ఇందు 'పుచ్చుకున్న' 'కెలపాపకు' అను నా వృత్తులలో నాఱేసి మాత్రలున్నను, నివి పాడుటలో నైదుమాత్రలుగనే యుచ్చరింపఁ బడును. మొత్తముపైఁ గాటమరాజుకథలలో ఖండగతి చాలఁ దక్కువ యని చెప్పవలెను. పల్నాటికథలలో నీ ఖండగతి మచ్చునకైనను లేదు.

బొబ్బిలివరుస కథలలో 'మేలు భళీ' అను వంతతో 'రజా భోగతి గలిగి' అను వరుసలో నున్న కథలుగూడ ఖండగతిలో సాఁగునని చెప్పవచ్చును. ఈ మేలుభళీ కథలు తెలంగాణమున హెచ్చు. సదాశివరెడ్డి కథ, కర్నూలు నవాబు కథ, నల్ల సోమనాద్రి కథ, రాజా రామేశ్వరరావు కథ, రాయలసీమలోని కుంటి పుల్లారెడ్డి కథ మున్నగునవి ఈ వరుసలో సాఁగినవి. ఉదాహరణకు సదాశిరెడ్డి కథలో నీ క్రింది పాదములను జూడుఁడు:–

| **(5.5)** | + | **(5.5)** |
|---|---|---|
| **రజా భో, గతి గలిగి(మేలు భళి)** | | **రజా రా, జాగారు (మేలు భళి)** |
| **మనది యా, దేశంబు ( ,, )** | | **మనది యా, దీ భూమి ( ,, )** |
| **పట్నం పడమట దిక్కు ( ,, )** | | **రగా రంగం పేట ( ,, )** |
| **బీదరు తాలూకా ( ,, )** | | **అంథోళి జోగిపేట ( ,, )** |
| **సతాశివనం పేట ( ,, )** | | **ఏలేవాడు రాజు ( ,, )** |

ఇందు ఖండగతిలోవలె నాలుగు 'కిటతకిట'లు స్పష్టముగా లేవు. కాని ఖండగతి పాదములో వలెనే పాదమున కిరువది మాత్రలు మాత్రమున్నవి. పదిమాత్రల కొకసారి వంత 'మేలు భళి' అని యూపు నిచ్చుచుండును. ఇట్లు పదిమాత్రలకు ఊపునిచ్చుట ద్విపదకథలలోను గలదు. పల్నాటి వీరకథలలో 'రతిరాజ సుందరా– రణంగ ధీర' అను పాదములో, 'రతిరాజ సుందరా' యని కథకుఁడు పాడఁగానే వంత 'ఆఁ' అనును. కథకుఁడు మరల 'రణరంగ ధీరా...' అని పదిమాత్రల కాలము పాడును. అప్పుడు వంత మరల, మొదటి దానికన్న కొంచెము దీర్ఘముగా, 'ఆఁ' కొట్టును. కాటమరాజు కథలలోఁ గూడ నిట్లేయుండును. 'పెద్దిరాజనువాని ప్రియనందనుండు' అను పంక్తిలోఁ గథకుఁడు 'పెద్దిరాజనువానీ...' అని పాడి కొంచెమాగును. అప్పుడు వంతలు 'ఆఁ' అని కొంచెము లఘువుగా నందురు. తరువాత కథకుఁడు 'ప్రియనందనుండో...' అని దీర్ఘముగా రాగము తీయును. అప్పుడు వంతలు కూడ 'ఆఁ...' అని దీర్ఘము తీయుదురు. కాఁబట్టి పైన తెల్పిన మేలుభళీ కథలలోఁగూడ మొదట 'మేలుభళీ' యను వంతపదము వచ్చినంత మాత్రమునఁ బాదసమాప్తియని భావింప రాదు. వీనిలో నిరువది మాత్రలొక పాదము. అందుచేతనే ఖండగతి యనుట. వీరగాథలలో ఖండగతి సంగీత విద్వాంసులు చెప్పినట్లు సరిగా "5+5+5+5" అను రీతినే సాఁగదు. 10+10గా కూడ సాఁగవచ్చును. ఈ పదిమాత్రలు గూడ '5+5'గా మాత్రమే కాక, '3+4+3'గాఁ గూడ విఱుగుట కలదు:–

**"రజా, భోగతి, గలిగి– రజా, రాజా, గారు**
**రగా, రంగం, పేట– సతా, శివను, పేట"**

ఇత్యాది పాదములలోఁ బది మాత్రలు '3+4+3'గా విఱుగుట గమనింపవచ్చును. ఈ కథలలోఁ గొన్ని పాదములలోఁ బది మాత్రల యనంతరము యతిని బాటించుటయుఁ గలదు. అందువలననే ఈ కథలలో నిరువది మాత్రలొక పాదమనుట.

వీరగాథానికలలో నూయలపదములుగూడ ఖండగతిలోనే సాఁగుచుండును. ఇందుఁ బదిమాత్రల కొకసారి వంతలు 'ఉయ్యాలో' అని పునరావృత్తి నందించుచుందురు. తెలంగాణములోని 'విసునూరి దొర పాట'ను జూడుఁడు:–

| | | | |
|---|---|---|---|
| **"విసునూరు,గ్రామాన(ఉయ్యాలో)** | | **ఎసుమంటి, సంగతీ(ఉయ్యాలా)** | |
| **ఎసుమంటి, సంగతీ** | ,, | **ఏతీరు, గున్నదీ** | ,, |
| **ఆ వూళ్లొ, దొరోడు** | ,, | **ఏమేమి, సేసెనే** | ,, |
| **విసునూరు, దొరోడు** | ,, | **ఎంత పా, పిష్టోడు"** | ,, |

బ్రతుకమ్మపాట లెక్కువ భాగము ఖండగతిలోనే నడచును. బ్రతుకమ్మ పుట్టుకనుగూర్చిన ప్రాచీన గేయమును జూడుఁడు:–

| | | | |
|---|---|---|---|
| ***"ధర చోళ, దేశమున(చందమామ)*** | | ***ధర్మాంగు,డనురాజు చందమామ)*** | |
| ***ఆ రాజు, భార్యయు*** | ,, | ***అతిసత్య, వతియంద్రు*** | ,, |
| ***నూరు నో, ములు నోమి,*** | , | ***నూరు మం, దిని గాంచె*** | ,, |
| ***వారు శూ, రూలయ్యు*** | ,, | ***వైరులచె, హతమైరి"*** | ,, |

వేపూరి బ్రతుకమ్మపాట యను లవకుశ:–

| | | | |
|---|---|---|---|
| ***"మానితం, బుగ నదికి(ఉయ్యాలో)*** | | ***స్నాన మా, డగ వచ్చి (ఉయ్యాల)*** | |
| ***వైదేహి, శోకంబు*** | ,, | ***వాల్మీకి, ముని వినీ*** | ,, |
| ***చెంత జే, రగ బోయి*** | ,, | ***వింత యుప, కారించి*** | ,, |
| ***అమ్మ నీ, వెవరమ్మ*** | ,, | ***అడవి ను, న్నవు తల్లి"*** | ,, |

'చందమామ', 'ఉయ్యాలో', 'తుమ్మెదా'– ఇత్యాది పునరావృత్తులున్న గాథానికలు చాలభాగము ఖండగతిలో నుండునని చెప్పవచ్చును.

ఖండగతిలో రెండు పాదములు వ్రాసి, యాద్యంత ప్రాసలు కూర్చినచో 'ద్విరదగతి రగడ' యగును. ఈ రగడను లాక్షణికులు పేర్కొన్నారు. 1–3 గణములకు యతియు, నాద్యంత ప్రాసలును రగడలలో నియతముగా నుండును.

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు 'మాతంగికథ, మాహురమ్మ కథ' యను శక్తికథలును, కాటమరాజుకథలలోని 'అగుమంచికథ' యును ఖండగతిలో నున్నవని తెల్పినారు (చూ. విజ్ఞాన సర్వస్వము, నాల్గవ సంపుటము, పుట 805). డా|| బి. రామరాజుగారు కూడ 'మాహురమ్మ కథ, మాతపురాణము'– ఈ రెండును 'కిటతకిట' యను ఖండగతిలో నున్నవనిరి (చూ. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట ౭౮౩). కాని ఈ పెద్దలిరువురును ప్రమాదపడిరని చెప్పక తప్పదు. వీరు తెల్పిన పై మూఁడు కథలును స్వచ్ఛమగు మంజరీ ద్విపదలో నున్నవి:–

అగుమంచికథ: ***"శ్రీకృష్ణ, దేవుని– చిత్తాన, దలచి***
***ఆ శార, దాంబను– ఆత్మలో, దలచి***
***రమణ తో, దుత విష్ణు– రాజుకు, మ్రొక్కి***
***భ్రమరాంబి, కను మదిని– ప్రార్థన, జేసి"*** [10]

మాహురమ్మకథ: *"శ్రీ రాజాధిరాజు– రాజు గిరిరాజు*
*కలునంది కలుబెరిక– కలిగినా రాజు*
*కలనవోయిన భవులు– కలిగిన రాజు*
*రాయ కుంభిణియును– రక్త కుంభిణియు"* [11]

మాతపురాణము: *"శ్రీరామచంద్రుని– శ్రీకరంబుగను*
*వారిల నుండెడి– వారల దలతు*
*ముదముతో శ్రీలక్ష్మి – యా లోకమాత*
*మోదంబుతో నంత– మునిదత్తు దలతు."* [12]

శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు ఈ 'కిటతకిట' యావృత్తముల ఖండగతి రచనలకు జంపెలను పేరున్నట్లు తెల్పినారు.[13] ఇది సరికాదు. జంపెలనఁగా 'హరిహరీ నారాయణ' పదముల వరుస. ఇవి యక్షగానములలోను గలవు. ఒక ఖండగతి పాదమును, ఒక ద్విపద పాదమును గలిసినచో జంపెయగును (5+5+5+5; 5+5+5+3). అంతేకాని ఖండగతియే జంపెవరుస యనుటకు వీలులేదు. (అప్పకవి మతమున జంపెవరుసలోఁ జివర నాల్గుమాత్రల గణముండును.)

## 2. ద్విపద–మంజరీ ద్విపద (లేక ద్విపద మంజరి)

లాక్షణికులు చెప్పిన ద్విపదకును, వీరగాథలలోని ద్విపదకును చాల భేదమున్నది. లాక్షణికులు మూఁడింద్రగణములు నొక సూర్యగణము నొక పాదముగా రెండు పాదములు చెప్పి, ప్రాస కూర్చినచో 'ద్విపద' యనిరి. ప్రాసనియమము లేనిచో 'మంజరీ ద్విపద' యనిరి. వీనిలోఁ బ్రథమ తృతీయ గణాద్యక్షరములకు యతిమైత్రి. లాక్షణికులు సెప్పిన ఇంద్రగణములలోఁ గొన్ని నాలుగు మాత్రల గణములున్నవి. మఱికొన్ని అయిదు మాత్రల గణములున్నవి. ('నల' గణములోను, 'భ' గణములోను అక్షరముల మొత్తము నాల్గుమాత్రలే యగును. తక్కిన 'నగ, సల, ర, త' అను గణముల కైదు మాత్రలగును). అందుచే ద్విపద లక్షణము, లాక్షణికుల మతమున, నాలుగు మాత్రలతోఁగాని యయిదు మాత్రలతోఁగాని మూఁడు గణములుండి, ఆ తరువాత మూఁడు మాత్రల గణమొక్కటియున్నఁ జాలునని భావము. మూఁడింద్రగణములు నొక సూర్యగణము ననుదానికిదియే యర్థము.

వీరగాథలు గానప్రధానములు గావున, వానిలో నిట్లు గణముల మాత్రాకాలమున భేదముండుటకు వీలులేదు. కావున వీనిలోని ద్విపదలలో నయిదు మాత్రల గణములు మూఁడును, మూఁడు మాత్రల గణ మొకటియుఁ దప్పక యుండితీరవలెను. ద్విపద కావ్యములలోవలె వీరగాథలలోఁ గొన్ని నాలుగు మాత్రల గణములు, మఱికొన్ని యయిదు మాత్రల గణములు నుండుటకు వీలులేదు. ఇంద్రగణములన్నియును నైదు మాత్రల గణములుగనే యుండవలెను. అందుచే వీరగాథలలో 'నలల' 'భల' అను వింతగణములు రెండు ప్రత్యక్షమగుచుండును. అనఁగాఁ బాడునప్పుడు 'నల' గణమును 'భ' గణమును మఱియొక మాత్రకీడ్చుచుందురు. పాడునప్పుడే కాక జానపద కవులు రచించునప్పుడుకూడ నీ రెండు గణములకును మఱియొక లఘువును జేర్చుచుండుట పరిపాటి. ద్విపదను గాథాకారుఁడు పాడునప్పుడు చివరనున్న మూఁడు మాత్రల గణము కూడ సాఁగి, అయిదు మాత్రల కాలముననే యుచ్చరింపఁబడును. అందుచే వీరగాథలో సాహిత్యాక్షరములు 5+5+5+3 అను రీతిగా నున్నను, పాడునప్పుడు ద్విపదలు మంజరీ ద్విపదలు గూడ 5+5+5+5 అను ఖండగతివంటివే యని చెప్పవలెను. కాఁబట్టి వీరగాథలలో సాహిత్యచ్ఛందము వేఱు, గానచ్ఛందము వేఱు.

పాశ్చాత్యులకు 'Ballad Stanza' (వీరగాథా చతుష్పది) ఉన్నట్లుగా, మనకు 'వీరగాథా ద్విపద' (Ballad Couplet) కలదని చెప్పవచ్చును. ఈ వీరగాథా ద్విపదలోని సాహిత్యాక్షరముల నిట్లు చూపవచ్చును:–

5 + 5 + 5 + 3
కిటతకిట, కిటతకిత, కిటతకిట, తకిట

ఇది సరిగా లాక్షణికులు చెప్పిన 'కర్నాట చౌపద' వంటిదే. పాల్కురికి సోమనాథాదుల కావ్యములలోని ద్విపదను 'మార్గ ద్విపద' (Classical Couplet) అని పిలువ వచ్చును. ఇది వీరగాథా ద్విపదకన్న భిన్నమైనది. దీనిలో 'నల, నగ, సల, భ, ర, త' అను నింద్రగణములును 'హ, న' అను సూర్యగణములును బ్రయోగింపఁబడుచుండును. ఇంద్రగణములలో 'నల, భ' అనునవి నాల్గు మాత్రల గణములు. మిగిలినవి అయిదేసి మాత్రల గణములు. సూర్యగణములు రెండును మూఁడేసి మాత్రల గణములే. కావున 'మార్గ ద్విపద'లోని గణములను మాత్రలలోఁ జూపవలెనన్న నెనిమిది రకములుగాఁ జూపవచ్చును. ఇంద్రగణములలో 'నల, భ' అను గణములను దప్పించి వ్రాసినచో '5+5+5+3'. కేవలము 'నల, భ' అను గణములనే వాడినచో '4+4+4+3'. లాక్షణికులు చెప్పిన 'చౌపద'యు నిట్టిదే. కాని మార్గకవులు ద్విపదను వ్రాయునప్పుడు నాల్గుమాత్రల గణములను అయిదుమాత్రల గణములను గలిపియే వ్రాయుచుందురు. గణితశాస్త్రము ననుసరించి ఈ మిశ్రరూపము లాఱుకన్న నెక్కువ యుండుటకు వీలులేదు:–

5+4+5+3
4+5+4+3
5+5+4+3
4+4+5+3
5+4+4+3
4+5+5+3

కావున ద్విపదకావ్యములలో మాత్రాగణములను ఎనిమిది విధములుగాఁ బ్రయోగింపవచ్చును. వీరగాథలలో మాత్ర మెల్లప్పుడును '5+5+5+3' అను పద్ధతిలోనే గణము లుండును. ఒకవేళ నెచటనైనను మిశ్రరూపమున గణములున్నను, గాథాకారుఁ డావేశముతోఁ జదువునప్పుడు పైన చెప్పిన పద్ధతిలోనే (5+5+5+3) గా గణములను సర్దుకొనును. ఉదాహరణమునకుఁ బల్నాటి వీరచరిత్రలో **'సంజాత నవరస సంభృతి యొప్ప'** అను పాదములో '5+4+4+3' అను రీతిని గణములున్నవి. కాని గాథాకారుఁడు పాడునప్పుడు దీనిని **'సంజాత నవరసా సంభృతీ యొప్ప'** అనును. అప్పుడు మాత్రలు '5+5+5+3'గానే యుండును. సాధారణముగా వీరగాథాద్విపదలో 'నల, భ' గణములకు మఱియొక మాత్ర చేర్చి 'నలల' భల' అను వింత గణములు సృజింపఁబడుచుండును. పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను నిట్టి గణములు కొల్లలుగా నున్నవి:-

(భల)
**'విలసిల్లు, పలనాటి, <u>వీరచరి</u>, తమును'**
(-పల్నాటి వీరచరిత్ర, కృత్యాది.)

(భల)
**'పరగంగ, తెరచీర, భక్తులకు, మ్రొక్కి'**

(భల) (నలల)
**'సరవితో, <u>వ్రాయగల, చదువగల,</u> యట్టి'** (- పంపాద్రి కథ.)

దీనినిబట్టి వీరగాథా ద్విపదలో మూఁడు పంచమాత్రా గణములు నొక త్రిమాత్రాగణము నుండునని చెప్పవచ్చును. లేదా '<u>నలల,</u> నగ, సల, <u>భల,</u> ర, త' అను పంచమాత్రాక గణములును, 'హ, న' అను త్రిమాత్రాక గణములును వాడఁబడుచుండునని చెప్పవచ్చును. రెండు పాదములకుఁ బ్రాస పాటింపఁబడినప్పుడు దీనిని 'వీరగాథా ద్విపద' అనియుఁ, బ్రాసలేనప్పుడు 'వీరగాథా మంజరి' అనియుఁ బిలువవచ్చును. వీరగాథలలో రెండవ రకమే హెచ్చు. ఈ రెండింటను 1-3 గణాద్యక్షరములకు యతి. ఇదియును నొక్కొక్కప్పుడు ఉల్లంఘింపఁబడుచుండును.

పల్నాటి వీరకథలన్నియు నెక్కువగా 'మంజరీ ద్విపద'[14] లోఁ గలవు. చెదురుమదురుగా ద్విపదయుఁ గలదు. (కాటమరాజు కథలలో నెక్కువ భాగము ద్విపద. మంజరీ ద్విపద మిక్కిలి తక్కువగా నున్నది.) పల్నాటి వీరకథలలోని మంజరీ ద్విపదకు ఉదాహరణము:

***"ఈ రీతి, కొన్నాళ్లు, <u>ఇటు గడిచి,</u> నంత (నల)***
***అనుగురా, జప్పుడు, <u>అంత తెరు,</u> వేట (భల)***
***సమర స, న్నాహంబు, సరస గూ, ర్చుకొని***
***మార్గాన, బోవగా, మరి నంత, వారు"***
(- నాయకురాలి కథ, కారెంపూడి తాళపత్రప్రతి.)

క్రీడాభిరామములోని ప్రసక్తినిబట్టి ఓరుగంటి ప్రతాపరుద్రుని కాలమున (13 శతాబ్ది చివర) పల్నాటి వీరకథలు 'ద్విపద ప్రబంధము'న పాడబడుచున్నట్లు తెలియుచున్నది. ద్విపదకును మంజరీద్విపదకును పూర్వులు భేదమును పాటింపలేదో, లేక యా కాలమున ద్విపదరూపమున నున్న పల్నాటి వీరకథలు కాలక్రమమున మౌఖికప్రసరణమునఁ బ్రాసలు రాలిపోఁగా మంజరీరూపమును ధరించినవో తెలియకున్నది. నేఁడు మాత్రము ఇంచుమించుగఁ బల్నాటి వీరకథలన్నియును మంజరిలోనే కానవచ్చుచున్నవి. అక్కిరాజు ఉమాకాంతంగారు ప్రకటించిన బాలచంద్రుని యుద్ధము, పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్కరించిన పల్నాటి వీరచరిత్రలోని కథలు మంజరిలోనే యున్నవి. పింగళి పరిష్కృతమగు పల్నాటి వీరచరిత్రలో 'అనుగురాజు పలనాటి సంపాదనము' అను కథాప్రారంభమునఁ గొంత, 'అరణ్యవాసము, కొమ్మరాజు యుద్ధము' అను కథలలోను స్వల్పముగా ద్విపద కానవచ్చుచున్నది. కృత్యాదిలో శ్రీనాథుఁడే తా నీ వీరచరిత్రను మంజరీద్విపదగాఁ జెప్పుచున్నానని వ్రాసికొన్నాఁడు. (కాని ఇతఁడు వ్రాసిన పంక్తులు మాత్రము ద్విపదలోనే యుండుట వింత.)

***"వర భరద్వాజుని వంశానబుట్టి,***
***ధరణి శ్రీనాథుడన్ ధన్యుండు మహిమ***
***విలసిల్లు పలనాటి వీరచరితమును,***
***సలలితమ్ముగ జనుల్ చదువుట కొరకు***
***సంజాత నరవరస సంభృతి యొప్ప,***
***<u>మంజరీద్విపదగా</u> మన్నించి చేసె"***
(- పలనాటి వీరచరిత్ర, విశాలాంధ్ర ప్రతి, కృత్యాది)

'కల్లుప్రతిష్ఠ' యవతారికలోఁగూడ శ్రీనాథుఁడు 'మంజరీ ద్విపదగా మన్నించి నేను, చెప్పబూనితి వచఃశ్రీ మెరయంగ' అని వ్రాసినాఁడు. నాకు లభించిన తాళపత్ర గ్రంథములలోఁ గూడ నెక్కువ భాగము మంజరీ ద్విపదలే. రెండు కథలు మాత్రము ద్విపదలోనున్నవి. అందొకటి శ్రీనాథ విరచితమగు 'బాలుని కథ'. దీనిని ద్విపదగా రచించుచున్నట్లు కవియే స్వయముగాఁ జెప్పుకొన్నాఁడు. ముద్రిత గ్రంథముతోఁ (పింగళి పరిష్కృతము) దాను మంజరీద్విపదగాఁ బల్నాటి వీరచరిత్రను వ్రాయుచున్నానని తెల్పిన శ్రీనాథుఁడే నాకు లభించిన తాళపత్ర గ్రంథమునఁ బలనాటి వీరుల భాగవతమును ద్విపదగా రచించుచున్నానని తెల్పినాఁడు:-

ద్విపద:-

***"వేమారు సుకవులు వినుతిసేయంగ,***
***భూమిలో శ్రీనాథుడు పుణ్యాత్ము డనగ***
***వలను బరద్వాజ వంశవర్ధనుడు,***
***పలుమారు చెన్నుని భక్తి ప్రార్థించి***
***పలినాటి వీరుల భాగవతంబు,***

*తెలుగున ద్విపదగా తెరగొప్ప జేసి*
*శ్రీకారమైనట్టి శ్రీవీరచరిత,*
*ప్రాకటమైనట్టి పలినాటిలోను".* [15]

అలరాజురాయబారమునకు ఉపోద్ఘాతముగానున్న మఱియొక కథలోఁగూడఁ గవి (ఈ కవి యెవరో తెలియుట లేదు) తాను పలినాటి వీరుల భాగవతమును ద్విపదగా వ్రాయుచున్నానని చెప్పినాఁడు. చెన్నుఁడు ప్రత్యక్షమై తన్ను వీరచరిత్ర వ్రాయుమనినట్లు దీని యవతారికలో నుండుటచే నిది కూడ శ్రీనాథ కృతమని భావింప వచ్చునేమో. ఈ కవికూడ శ్రీనాథునివలెనే 'పలినాటి వీరుల భాగవత' మనినాఁడు:–

*"పలినాటి వీరుల భాగవతంబు,*
*చెలువొప్ప ద్విపదగా చేసియు వేడ్క*
*నా కంకితముచేయ ననువొప్ప ననుచు,*
*శ్రీకాంతు డప్పుడు చెప్పిన పిదప*
*మేలుకొని నేనెంత మేల్కట్ట ననుచు,*
*చాల నాశ్చర్యంబు నా సమయమందు*
*క్రమమొప్ప ద్విపదగా కావింతు నేను..."* [16]

ద్విపదలో రచించిపఁబడిన ఈ కథలో "మందాది వలస, మందపోటు, గురిజాల యుద్ధము" సంక్షిప్తముగా నున్నవి.

మద్రాసు ప్రా.లి.పు.భా.లో ఉన్న సి.పి.బ్రౌను దొరగారు సేకరించిన పల్నాటి వీరచరిత్ర తాళపత్ర ప్రతులలోఁ గొన్ని ద్విపదచ్ఛందమున నున్నవి. డి.నె. 1140 ప్రతి యిట్లు ప్రారంభ మగును:–

*"శ్రీవిష్ణునాభిని జెలువగ్గలించి,*
*భావిఁ జతుర్ముఖ బ్రహ్మ జనించె...*
*మనుమలు పదికోట్లు మహిని శోభిల్ల*
*ఘనగర్వమునఁ బొంగి కార్త వీర్యుండు"*

కొండయ్య రచించిన 'కొమ్మరాజు యుద్ధము' (డి.నెం. 1141) ద్విపదలోఁ గలదు:–

*"శ్రీరమ్య వక్షు దాశ్రిత వత్సలుండు*
*వారిజ నేత్రుండు వనజ నాభుండు"*

ఈ కొమ్మరాజు చరిత్రలోఁ గవియగు కొండయ్య తాను రాయబారముకథను ద్విపదలో వ్రాసినట్లుగాఁ జెప్పుకొన్నాఁడు:–

*"సామజంబులు పోవు జాడను చిన్న*
*చీమలు సంచరించిన విధంబునను*
*రాయబారము కవిరాజులు మెచ్చఁ,*
*జెచ్చెర ద్విపదగాఁ జేసితి మున్ను"*

అక్కిరాజు ఉమాకాంతంగారికి 'బాలునికథ'కు శ్రీనాథుఁడు, కొండయ్య, మల్లయ్య అను ముగ్గురు కవులు రచించిన మూఁడు వేర్వేఱు రచనలు లభించినవి. ఈ మూఁడింటినుండియు వారు ఉదాహరణముల నిచ్చియున్నారు (చూ. వారి పల్నాటి వీరచరిత్ర, ప్రథమ భూమిక, పుటలు 77–79). ఆ యుదాహరణములను బరిశీలింపఁగా, బాలునికథను శ్రీనాథుఁడు మంజరీ ద్విపదలలోను, కొండయ్య మల్లయ్యలు ద్విపదగాను రచించిరని తెలియుచున్నది. కాఁబట్టి పల్నాటి వీరకథలలో నెక్కువ భాగము మంజరీ ద్విపదలో నున్నను, ద్విపదలోనున్న రచనలును గొన్ని కలవని భావింపనగును. ముఖ్యముగా 'బాలుని కథ, రాయబారము, కొమ్మరాజు యుద్ధము, పల్నాటి వీరచరిత్ర పూర్వభాగము' మున్నగునవి ద్విపదలోఁ గలవని తెలియును.

పల్నాటి వీరకథలలో నెక్కువ భాగము మంజరీద్విపద (వీరగాథామంజరి)లో నుండఁగాఁ, గాటమరాజుకథలలో నెక్కువ భాగము ద్విపద (వీరగాథాద్విపద)లో నున్నవి. మద్రాసు ప్రా.లి.పు.భా. వారు వేటూరి ప్రభాకరశాస్త్రిగారిచేఁ బరిష్కరింపఁజేసి ప్రకటించిన కాటమరాజుకథలలోఁ బ్రధాన భాగము మంజరిలోనే యున్నది. (అనుబంధములు ద్విపదలోఁ గలవు.) మంజరిలోనున్న కథలలోగూడఁ బ్రారంభమున నవతారికా భాగమును ద్విపదలో రచించుట పరిపాటి. ఈ ప్రారంభమును జూచి దానిని ద్విపదగా భ్రమింపరాదు. గంగుల పినయెల్లయ కూడఁ దన కథావతరణిక ద్విపదలోనే యందుకొనినాఁడు:–

*"శ్రీజాహ్నవీ గంగఁ జిత్తమునఁ దలఁచి,*
*రాజితంబుగ విఘ్నరాజుకు మ్రొక్కి*
*కమలేశుఁ గీర్తించి కమలాప్తుఁ దలఁచి,*
*కరిచర్మధరుఁడైన ఘనునిఁ బ్రార్థించి*
*చవుషష్టి విద్యావిశారదులనెంచి,*
*కవివర్యులకు నమస్కారంబు సేసి"*

ఈ యవతరణికను విడచి కథలోనికి రాఁగా, మంజరియే సర్వత్ర గోచరించును:–

*"ఎలమి వైరంబున్న యెఱగడ్డపాటఁ,*
*బల్లవరాజుతోఁ బగవచ్చె ననుచు*
*వీరగంగమ ముందు వీరులై మేము,*
*పగఱతోఁ బోరాడి పగదీర్తు మనుచు*
*శ్రీకరంబైనట్టి సృష్టిలోపలను,*
*కాటరాజనువాడు ఘనపుణ్యపరుఁడు"*

ఈ గ్రంథమున అనుబంధముగా నీయఁబడిన "భట్టు రాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చేకథ, ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట", అను మూఁడు కథలును ద్విపదలోనే కలవు. ఇటీవల (1967లో) ఆచార్యుల పిచ్చయ్యగారు ప్రకటించిన 'వలురాజు చరిత్ర' ఆద్యంతమును చెక్కుచెదరని ద్విపదలో నున్నది.

నాకు లభించిన తాళపత్ర గ్రంథములలో ద్విపదలోనున్న కాటమరాజు కథలు: "వలురాజు కథ, పంపాద్రి కథ (దొనకొండ ప్రతి), పోలురాజు కథ (ఎఱ్ఱబాలెం ప్రతి), బల్లికురువ పోట్లాట, కాటమరాజుకు పట్నం కట్టిన కథ, పాపనూక కథ (కుచ్చికాయలపూడి ప్రతి), ఆవులమేపు (దొనకొండ ప్రతి), పాలేటి కథ, ఎఱ్ఱయ్య తర్కవాదము, వేడుక బొంగరాల కథ, అగుమంచి కథ, భక్తిరన్న కథ". ఇఁక మంజరీ ద్విపదలో నున్న కాటమరాజు కథలు:– "పంపాద్రి కథ (కుచ్చికాయలపూడి ప్రతి), పెద్దిరాజు కథ, కాటమరాజు యుద్ధము– ప్రథమకాండము లేక కాటమరాజు ఆర్లపెంట యుద్ధము, పోలురాజు కథ (కంకణంపాడు ప్రతి), కఱియావులరాజు కథ, పాపనూక కథ (పెదకంటిపల్లె ప్రతి), ఆవులమేపు (ఎడవూరు ప్రతి), గంగతర్కము, జన్నివాడ కథ, చల్లవారి జగడము (ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలో నొక కాండము), బొల్లావు యుద్ధము".

కాటమరాజు కథలలో బహుళముగాఁ గానగు ద్విపదలకు ఉదాహరణములు:–

*"వల్లురాజు[17] మొదలైన వరుస పెద్దలును,*
*చెల్లిరి యలమంచి స్థిరముగా వారు*
*వారు చెల్లిన వెనుక వారి కుమాళ్లు,*
*చేరి విచారము చేసి రందరును*
*పెద్దలు ఇచ్చోట పేరున చెల్లిరి,*
*వద్దికెతో యలమంచి వమ్మదు తమకు*
*ఏటికి యలమంచి ఏమి నిత్యంబు,*
*వాటముగ పంపాద్రికి వచ్చిరి వారు"*

– పంపాద్రి కథ (దొనకొండ ప్రతి)

*"ధనకొండ లోపల తగ వేడ్కతోను,*
*పనివడి కంఠసరి బాలలిద్దరును*
*బొంగరాలాడిన పూనిక వినుడి,*
*సంగతి చెప్పెదను శ్రవణానందముగ"*

–వేడుక బొంగరాల కథ

*"శ్రీకంతు మదిలోన చెలగి నుతియించి,*
*చేకొని శ్రీహరుని చిత్తాన దలచి*
*పంకజగర్భునకు ప్రణమిల్లి మొక్కి,*
*పొంకముగ శారదను బుద్ధిలో దలచి"* –భక్తిరన్న కథ

కాటమరాజు కథలలో సకృత్తుగాఁ గానగు మంజరీ ద్విపదలకు ఉదాహరణములు:–

*"అల్లుడ పల్లికొండ, అన్నసింహాద్రి,*
*వన్నెగల తమ్ములార! వసుధేశులార!*
*ఎన్నడు నా మాట కెదురాడ లేదు,*
*సోమప్ప కల్యాణము చూడ రమ్మనెను*
*వచ్చిన సంతాన మిత్తునని పలికె"*

–పెద్దిరాజు కథ (కుచ్చికాయలపూడి ప్రతి)

*"భోరున ఆ చల్ల భూనాథ సుతులు,*
*తమవంతు పగవార్ని ధాత్రిపై గూల్చి*
*అంచితముగ వారేగురన్నదమ్ములును,*
*పల్లవరాజుల బలములు ద్రుంచి"* –చల్లవారి జగడము

*"ఉగ్రుడై బీరన్న యుఱిమి తాఁజూచి,*
*చేతి పట్టకత్తి చెలగి జళిపించె*
*తళుకు తళ్కున మెఱసెఁ దందర కుడువ,*
*బాతుపై నెగసేటి భైరవువలెను"* –బీరినీడు యుద్ధము

తరతరములనుండి పాడుటవలనఁ గాఁబోలు నీ కాటమరాజు కథలలోఁ గొన్ని ద్విపద పాదములు, మంజరీద్విపద పాదములు శైథిల్యము నొంది ఖండగతిగా మాఱిపోయినవి. "కఱియావులరాజు కథ, పాపనూక కథ, గంగతర్కము, జన్నివాడ కథ, బొల్లావు యుద్ధము" అను వీరగాథలలో నిట్టి ఖండగతి కాననగును. కొన్నింట నీ శైథిల్యము మఱింత ముదిరిపోయి 'లయాత్మక వచనములా' యనునంతగా రూపఱియున్నవి. చిత్తూరు మండలమున, చంద్రగిరి తాలూకా పెదకంటిపల్లెలో నాకు లభించిన కఱియావులరాజు కథ (తాళపత్ర గ్రంథము)లో నిట్టి 'లయాత్మక వచనములు' గాననగును. కఱియావుల రాజునకును పల్లికొండకును జరిగిన సంభాషణము:–

*"ఎన్ని దినములు చూతు బావ– యెన్ని గెడియల కొచ్చేరు*
*మూడు దినములు చూడు మరిది–మూడు గెడియలు చూడు మరిది*
*అయిదు దినములు చూడు మరిది– అయిదు గెడియలు చూడు మరిది*
*మూడు దినములు చూడనె బావ–మూడు గెడియలు చూతుగాని"*

జన్నివాడ కథలో శైథిల్యమును జూడుఁడు:–

*"భూమిలో రాజులంతా పుల్లరికిత్తురుగాని*
*నీరున బుట్టిన పూరెల్ల ఇవ్వ నీతమా తమకు*
*ఆ ఖర్మడిచ్చిన నా కవుళ్లు కాలచేసి భూమిని*
*పాడుచేసి పోదామనిరి పాకనాటి ప్రజలు"*

గంగతర్కమును కథలోఁగూడ నిట్టి శైథిల్యము కాననగును:–

*"శ్రీ రాజాధిరాజు రాజు కాటమరాజు*
*దక్షిణాదికి ఆవుల తోలించుకోని*
*బలువైన సంపదలు వచ్చి పాలేటి నిలచి*
*ఆరునూరు గుత్తికవ్వములు యాదవులు కొందరు*
*తరమునాటి గోకులము వచ్చి తాళ్లూరి మిట్టల దిగెను"*

పైన తెల్పిన యుదాహరణములలో ఖండగతిలోని పంచమాత్రాకములగు నావృత్తుల నడక లేదు. కొన్ని పాదములలో

నించుమించుగ నిరువది మాత్రలు కిట్టుచున్నవి. మఱికొన్ని ఇంకను దీర్ఘముగా సాఁగియున్నవి.

ఇట్లు మంజరీద్విపద పాదములు, ద్విపద పాదములు ఖండగతిగా మాఱుటలో మఱియొక వింత ఛందస్సు బయట పడుచున్నది. ద్విపదకథలలో నన్నిపాదములును ఖండగతిగా మాఱినచోఁ జిక్కులేదు. కాని ఇందుఁ గొన్ని మాత్రమే మాఱి, తక్కినవి మంజరిగానో లేక ద్విపదగానో యుండిపోవును. అందుచే కథలోఁ గొన్ని తావులందు ఒక ఖండగతి పాదము నొక మంజరి పాదము నుండుట తటస్థించును. అప్పుడది హరిహరీపదముల వరుసగాఁ గన్పట్టును. ఇట్టి విచిత్ర పరిస్థితి పల్నాడులో నాకులభించిన కఱియావులరాజుకథలో నున్నది. (ఈ కథలోఁ బ్రధాన ఛందస్సు మంజరి. మధ్యమధ్య ఖండగతి యున్నది.)

***"వేదాద్రి నరసింహుల వేడుకలతో సేవించి*** *(ఖండగతి)*
***మరలి వోరుగంటికి మరి సాగిపోత*** *(మంజరీ ద్విపద)*
***తటాకములు మంచి తరుచైన మేడలు చూచి*** *(ఖండగతి)*
***గోపురములు ఆటకూటములు చూచి*** *(మంజరీ ద్విపద)*

***కొల్లారు మిద్దెలు కొలువు కూటములు చూచి*** *(ఖండగతి)*
***చల్లని చిత్తరువుల చవికెలు చూచి*** *(మంజరీ ద్విపద)*

***బహు బంతికూటములు భద్రశాలలు చూచి*** *(ఖండగతి)*
***సొంపైన సూర్యసోమ వీథులు చూచి"*** *(మంజరీ ద్విపద)*

ఇట్లు ఖండగతి పాదము మంజరీద్విపద పాదము కలిసిన ఛందస్సును 'జంపెవరుస' యందురు. (హరిహరీ పదములన్నియు నీ జంపెవరుసలోనే యున్నవి.) ఈ జంపెవరుసలో మాత్రాగణము లిట్లుండును: "5+5+5+5; 5+5+5+3". కొందఱు విమర్శకులు దీనినంతయు నొకే పాదముగా భావింతురు. మఱికొందఱు దీనినొకే పాదములో రెండు భిన్నదళములుగా నూహింతురు. తరువోజలోవలె నీ పాదమున కంతకును నొకే యతి పాటింపఁబడదు. మొదటి దళములో 1–3 గణాద్యక్షరములకున్న యతికిని, రెండవ దళములో 1–3 గణా ద్యక్షరములకున్న యతికిని సంబంధము లేదు. అందుచే నిదియంతయు నొకేపాదముగా భావించుటకన్న, రెండు దళముల కూడికచే నేర్పడిన పాదముగాఁ దలంచుట యుక్తము. జంపెవరుస యనఁగా నొక ఖండగతి పాదము, నొక మంజరీద్విపద పాదము కలియఁగా నేర్పడిన దనుట సమంజసము.

కాటమరాజుకథలలో నిట్లు ఖండగతి, మంజరీ పాదములు దగ్గఱగా నుండి జంపెవరుసలవలెఁ గాన్పించు కథలే కాక, ఈ రెండు పాదములకు నేకయతిని బాటించిన విచిత్రకథ కూడ నాకు లభించినది. (మొదటి దళమున ఖండగతి యుండుటచే దీనిని తరువోజ యనుటకు వీలులేదు. రెండును మంజరీ ద్విపద పాదములుగానే యుండి, యేకయతిని బాటించినచో నప్పుడు తరువోజ యగును.) నేను చిత్తూరు మండలమున 'గంగతర్క' మను కథను సంపాదించితిని. ఇందు ప్రారంభమునఁ గొన్ని పంక్తులు లయాత్మక వచనములె సాఁగి యున్నను మొత్తముపై ఖండగతి హెచ్చుగఁ దోఁచుచున్నది. కొన్ని పాదములలో మంజరీ ద్విపదయు గోచరించుచున్నది. దగ్గఱగానున్న రెండు పాదములకు భిన్నయతిని గాక, యేక యతిని బాటించుట ఇందలి విచిత్రము.

***"బొల్లావులు ఎద్దులు– భోగవతి నద్రావులు వొచ్చి***
***బొమ్మిరెడ్డిపల్లె మిట్టల వారి – బోదావులు దిగెను***
***జలతారు గుడార్లు– జగజంపు గొడుగులు***
***చల్లవారు ఏగురు– సాహస ఘనులు***
***సకలాంబర భూషిత – సంపన్నులై వొచ్చి***
***సాకిరేవు మిట్టల వారి– సలుగుటావులు దిగెను***
***కొమరొప్పు రెణభేరి– గోకులము వొచ్చి***
***కోపులేటి రేవున బసువన్న– గొబ్బున నిలచెను***
***ఆరువేల గోపాల్కులు– అందెలు ఎద్దులు***
***అలవలపాటి రేవున వారి– అందలావులు దిగెను***
***మూడువేల పాడావులు– ముద్దుమోము లేగలు***
***ముస్తీదులై వొచ్చి-ముద్దుపాటి రేవున వారి-ముచ్చటావులు దిగెను"***

పైపంక్తులలోఁగొన్ని జంపెవరుసలవలె నున్నవి. మఱికొన్ని శిథిలత్వము హెచ్చిన ఖండగతికి చిహ్నములుగా నున్నవి. ప్రతిపాద ద్వయమునకు నేకయతి విధిగా నున్నది. పూర్వమిది తరువోజ రూపమున నుండి, కాలక్రమమున నిట్లు శిథిలమైనదా యను ననుమానముకూడ వచ్చుచున్నది.

మొత్తముపైఁ గాటమరాజుకథల ఛందస్సులో ద్విపద, మంజరీద్విపద, ఖండగతి– పరస్పరము మిళితములగుట కానవచ్చు చున్నది. ద్విపదకన్న మంజరీద్విపదయే యెక్కువగా ఖండగతికిఁ ద్రోవతీసినది.

శక్తికథలలో నెక్కువ భాగము ఖండగతి ననుసరించినను గొన్ని కథలు మంజరీద్విపదలుగాఁగూడఁ గలవు. మాహురమ్మకథ, మాతపురాణము మంజరిలో నున్నవని వెనుక నిరూపించితిని. మంజరిలోనున్న ఇతర శక్తికథలు: 'ఏకవీరాంబకథ, ఎల్లమ్మకథ, పరశురామాయణము, మారాసపువారి అంకమ్మకథ, రవద్దేవిరాజు కథ' మున్నగునవి.

*ఏకవీరాంబ కథ:–*

(కృష్ణామండలమున నాకు లభించిన తాళపత్ర గ్రంథము).

***"శ్రీశారదాంబను– చిత్తమున దలచి,***
***చేకొని గణపతికి– చెయ్యెత్తి మ్రొక్కి***
***సరగున బ్రహ్మకు– సాష్టాంగమొనరించి,***
***శివుని పార్వతీదేవిని– చిత్తమున దలచి"***

*ఎల్లమ్మ కథ:–*

(డా॥ బి. రామరాజుగారు తెలంగాణమున సేకరించిన కథ).

**"ఎలిగొండ పుట్టంగ–సలిగొండ పుట్టె,**
**సలిగొండ పుట్టంగ– ఎలిగొండ పుట్టె**
**ఎలిగొండ సలిగొండ–ఏలేటివారు,**
**సత్యమైన గౌతుండు– సామానధీరుడు"**

*పరశురామాయణము:–*

(మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమున నున్న ప్రతి. డి.నెం. 1110).

***"శ్రీకరం బైనట్టి– చెల్వంబుగాను,***
***బ్రాకటంబుగ భువిని– ప్రస్తుతించంగ***
***శ్రీరంగనాయకుల– చెల్వంబుగాను,***
***ఆ శారదాంబకు– నర్థితో మ్రొక్కి"***

పైయుదాహరణములలో నెచ్చటైనను బ్రాస కనిపించినచో నది యాదృచ్ఛికమే కాని, ద్విపద లక్షణమును దృష్టిలో నుంచుకొని వాడినది కాదు. ఇట్లు కాకతాళీయముగాఁ బ్రాసలు పడుట మంజరీ ద్విపద కావ్యములందు అంతటను గానఁబడును. సకృత్తుగా నుండు నిట్టి పాదములచే వీనిని ద్విపదకావ్యములుగా భ్రమింపరాదు.

నిశితముగాఁ బరిశీలించినచోఁ బేరంటాండ్రకథలలోఁ గామమ్మకథ, సన్యాసమ్మకథ, వీరరాజమ్మకథ కూడ మంజరీ ద్విపదలోనే కలవని తెలియఁగలదు. కాని ఈ మంజరి యొక వింత పద్ధతిలోఁ గొనసాఁగుటచేతను, పాడునప్పుడు శోకాలాపనచే దీర్ఘము లెక్కువగా నుండుటచేతను దీనిని సులభముగా గుర్తింపలేము. ఈ వీరగాథామంజరిలోఁ బ్రాసయే కాక యొక్కొకచోట యతియును లుప్తమగుట సంభవించుచుండును. ప్రతిపాదమునకును చివఱ 'కామమ్మా'–'సన్యాసీ'–'రాజమ్మా'– మున్నగు సంబోధనలుండును. పాదములోఁ జెప్పఁబడు నర్థమునుబట్టి ఈ సంబోధనలు మాఱుచుండును. ఈ సంబోధనలు కథాఖ్యానమునకు మంచి యూపునిచ్చు వంతపదములు. వీనిని పునరావృత్తులుగా భావింప వచ్చును. పాటలలో ఛందోవిషయమునఁ బాదాంతపదములు లెక్కకు రావు. అందుచే వీనిని దొలఁగింపవచ్చును. ఈ పేరంటాండ్ర కథలలో నిట్టి పాదాంత పదములను దొలఁగింపగా మిగులునది మంజరియే. కామమ్మకథను జూడుఁడు:–

***"శుభమొంది, సామర్ల, కోటలో, నమ్మ –(కామమ్మ)***
***సుకపట్ల, లక్ష్మయ్య, ముద్దుకూ, తురుగ ,,***
***వెంకయ్య, గర్భాన, జననమై, నాది ,,***
***కరువులో, తలిదండ్రి, కాలమై, నారు ,,***
***పెత్తండ్రి, రామన్న, ప్రేమతో, పెంచె ,,***
***పెత్తల్లి, వెంకమ్మ, ప్రేమతో, పెంచె" ,,***

సన్యాసమ్మకథలోని ఛందస్సుకూడ నిట్టిదే:–

***"చల్లనీ, వేళలో, నినుదలతు, నమ్మ – (సన్యాసి)***
***కంఠమున, రంజిల్ల, కాపాడ, వమ్మ ,,***
***తూర్పు దే, శమునందు, జన్మించి, నావు ,,***
***పడమటీ, దేశములో, పేరెల్లి, నావు" ,,***

వీరరాజమ్మకథకూడ నిట్టి మంజరిలోనే నడిచినది:–

***"పరమ పా, వనమైన, భరత ఖం, డమున – (శ్రీరామ)***
***పాడి పం, టలు గల్గి, భాగ్యవం, తముగ ,,***
***చల్లనీ, తోటలా, చెరువులా, తోడ ,,***
***పలనాటి, సీమొకటి, పరుగుచుం, డెనుగ" ,,***

ఇట్లు పేరంటాండ్రకథలలోనే కాక, బ్రతుకమ్మపాటలలోఁ గూడ మంజరీద్విపద కానవచ్చుచున్నది. ముఖ్యముగా 'వలలో' అను పునరావృత్తితోఁ గూడిన పాటలలో నీ ఛందస్సు తప్పక కన్పించును. 'వేపూరి బ్రతుకమ్మపాట అను లవకుశ'లోఁ జూడుఁడు:–

| | |
|---|---|
| ***"చీటి మోమున జూచి–వలలో*** | ***చిరునవ్వు నవ్వి – వలలో*** |
| ***అయోధ్య దొరలాట ,,*** | ***అతిశూరులాట ,,*** |
| ***ఇలజాత తనయులు ,,*** | ***బలహీనులేమొ ,,*** |
| ***ఈ రీతి అశ్వాము ,,*** | ***విడరాదు అనుచు" ,,*** |

కాటమరాజుకథల కనుకరణములుగా నాధునిక కాలమునఁ బుట్టిన 'సుద్దుల కథలు' ద్విపద– మంజరీద్విపదలలోనే వ్రాయఁ బడుచున్నది. 1952లో తిరునగరి రామాంజనేయులుగారు రచించిన 'రాష్ట్రవాంఛ' సుద్దులకథ మంజరీద్విపదలో నున్నది. ఇందు సి.రాజగోపాలాచారిగారి వర్ణన చూడుఁడు:–

***"నల్ల కళ్లద్దాల– నామాల సామి,***
***నక్కజిత్తుల వాడు– నాలిముచ్చోడు***
***అరవధనికుల తొత్తు– ఆచార్యవరుడు,***
***కాంగ్రేసు నాయకుడు– గాంధి వారసుడు"***

1954లో వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు రచించిన 'సతీ ముసలమ్మ' సుద్దులకథ ద్విపదచ్ఛందమునఁ గలదు:–

***"గర్భంబు దాల్చిన– కాంత కావాలి,***
***నిర్భయము శీలము– నియతి నుండాలి***
***గొడ్డురా లైతేను– కూడదీ బలికి,***
***అడ్డంబు వచ్చును– హానియు వచ్చు"***

## 3. బొబ్బిలివరుస – తద్భేదములు

బొబ్బిలికథ తెలుఁగు వీరగాథాచరిత్రలో నొక యపూర్వ సృష్టి. ఇది ప్రపంచమునఁగల యుత్తమ వీరగాథలలో నొకటి. వీరగాథా లక్షణములన్నియును దీనియందు సంపూర్ణముగా నున్నవి. ఈ

సంఘటన క్రీ.శ. 1757లో జరిగినది. ఆ తరువాత కొలఁది కాలమునకే ఈ వీరగాథ పుట్టియుండును. అంతవఱకును ద్విపద ఛందస్సులలో వచ్చుచున్న వీరగాథల ధోరణిని తప్పించి, వీరరసావేశమునకు మఱింత అనువైన యొక నూతన ఛందస్సులో బొబ్బిలి కథ యవతరించినది. తరువాత దీనికిఁ బుత్రికలుగా నెన్నియో వరుసలు పుట్టినవి. బొబ్బిలివరుసలో మాత్రలిట్లుండును:-

**8 + 8 + 9**

**కిటతక కిటతక . కిటతక కిటతక . కిటతక కిటతకత**

***"కళింగరాజ్యం, కటకందాకా, బూసికి అములాయె***
***శికాకోళమే, సింధు కటకమే, బూసికి అములాయె"***

ఇది మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖిత పుస్తక భాండాగారమున నున్న ప్రతిలోని వరుస. గుజిలీ ప్రతులలోఁ గూడ నిట్టి వరుసయే యున్నది:-

**"బొబ్బిలికోటా, యేలేవాడూ, దొరా రంగరావు**
**విజయనగరమే, యేలేవాడూ, విజయరామరాజు"**

8+8+9 అను నీ మాత్రాగణముల నడకలోఁ జివర నొక్కొక్కప్పుడు దీర్ఘముండుట వలన మూఁడవ యావృత్తమునఁ దొమ్మిది మాత్రలకు బదులు పది మాత్రలుండవచ్చును. ఎక్కువగఁ దొమ్మిది మాత్రలే యుండును. ఇట్లు పాదమునకు 8+8+9= 25 మాత్రలుండును. ఇవి సాహిత్యాక్షరములు మాత్రమే. పాడుటలో వీని స్వరూపము పూర్తిగా మాఱిపోయి, 8+8+8+8గా నుండును. దీనిని 'ఆదిగతి' యందురు. సాహిత్యాక్షరములలో లోపించిన ఏడు మాత్రలను గథకుఁడు కొంతదీర్ఘము తీసి పూరింపఁగా, మఱికొంత వంత పూరించును. **'నాయన, మేలు భళాజీ, భళిభళీ'** అనునవి బొబ్బిలికథలోఁ దఱచుగా వచ్చు వంతపదములు.

(4)
**'కళింగరాజ్యం, కటకందాకా, బూసికి అములా, <u>యే...</u> నాయన'**

(4)
**'బొబ్బిలికోటా, యేలేవాడూ, దొరారంగరా, <u>వూ...</u> నాయన'**

ఈ గానమును దృష్టిలో నుంచుకొనియే కాఁబోలును శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు బొబ్బిలికథ 'కిటతక కిటతక' అను నెనిమి అక్షరముల యావృత్తులు నాలుగింటితో నేర్పడినదని చెప్పిరి (చూ. విజ్ఞాన సర్వస్వము, నాలుగవ సంపుటము, పుట 805). కాని రచనలో మాత్రము బొబ్బిలికథ '8+8+9'గానే సాఁగును. అనఁగా 'కిటతక కిటతక' అను నావృత్తులు మూఁడింటిపై నొక్క మాత్ర. ఈ వరుసలో యతిప్రాసలు లేవు. అప్రయత్నముగా నెచ్చటనైనను బడవచ్చును. అట్లు పడిన యతి 1-17 మాత్రలకుండును:-

***"లాగు తొడిగెనూ, కాసె పోసెనూ- రంగా<u>రా</u>యడు*** (3)
***సాగు యేదిరా, బల్లె మేదిరా- సేవక వీరేశ***

***సాగు బల్లెమూ, తీసుకున్నడూ- రంగా<u>రా</u>యడు*** (3)
***లక్షలు చేసే, పచ్చల బాకూ- మొలలో చెక్కాడు"***

ఒక్కొక్కప్పుడు మాత్రలు ఒకటి రెండు ఎక్కువగా నుండవచ్చును, లేదా తగ్గవచ్చును. ఈ హెచ్చుతగ్గులు పాడుటలో సర్దుకొనును. పై పాదములలోఁ జివర కొన్నింట 'రంగారాయడు' అని యున్నది. ఇది యెనిమిది మాత్రలే యగుచున్నది. కాని పాడుటలో 'రా' అను నక్షరముపై నొత్తిపలుకుటచే నది ప్లుతముగా మూఁడు మాత్రల కాల ముచ్చరింపఁ బడును. అప్పుడు గణములో మొత్తము తొమ్మిది మాత్రల కాలముండును. ఒక మాత్ర యెక్కువగా నున్నప్పుడు 'తో' 'లో' అను దీర్ఘాక్షరములు 'తొ' 'లొ' అని యుచ్చరింపఁబడును.

ఒక్కొక్కప్పుడు అర్థస్ఫూర్తికొఱకు ఈ బొబ్బిలివరున పాదమునకు ముందు 'ఈ, నీ, నా, నీకు, నాకు, నేను' మొదలగు పదములు చేర్చఁబడుచుండును. ఈ పదములు ఊఁతతో నుచ్చరింపఁ బడుచుండును గాని పాడఁబడవు. విజయరామరాజునకు మల్లమదేవి వ్రాసిన లేఖలో నిట్టి పదములు గలవు:-

***"<u>నేను</u>- పుట్టినాను సా, మర్లకోటలో, విజేరామరాజ***
***<u>నేను</u>- పెరిగినాను బొ, బ్బిలి కోటలో, తఖ్తుమీదనేమి***
***బొబ్బిలికోటా, విజేనగరమూ, కావడి కుండలుగా***
***<u>ఈ</u>- కావడి కుండలు, బోర్లదొయ్యకూ, కళింగ పెదరాజ***
***<u>నా</u>- వ్రేళ్లమట్టెలూ, నీళ్లగలపకూ, అన్నయ దొరగారు***
***<u>నా</u>- చేతెడు గాజులు, చెక్కుచెయ్యకూ, అన్నయ దొరగారు***
***<u>నీకు</u>- చేతెడు గాజులు, నిలిపిన కీర్తీ, జగతిని వుంటుంది"***

ఇట్లు కేవలము అర్థస్ఫూర్తికొఱకును, వాక్యాన్వయము చెడిపోకుండ నుండుటకును జేరిన శబ్దములు ఛందస్సులో గణనకు రావు. కాఁబట్టి బొబ్బిలి వరుసలో నెనిమిది మాత్రలగణములు రెండును, దొమ్మిది మాత్రల గణమొకటియు నుండుననుట సిద్ధాంతము.

బొబ్బిలివరుసలోని 8 మాత్రల గణములు 3+5గాఁ గాని, 3+3+2గాఁ గాని, 6+2గాఁ గాని యుండును. ఒక్కొక్కప్పుడెనిమిది మాత్రలు నొకే గణముగా నుండును. సకృత్తుగా 4+4గాఁ గూడ నుండును. చివరనున్న తొమ్మిది మాత్రల గణము 4+5గాఁ గాని, 3+3+3గాఁ గాని యుండుట పరిపాటి. ఈ బొబ్బిలివరుసను గాథాకారులు 'రామరామ' శబ్దముతో నిట్లు చూపుదురు:

*"రామరామశ్రీ, రామరాఘవా, రామా రఘురామ*
*అరియ రామశ్రీ, రామరాఘవా, అచ్యుత గుణధామ"*

దీనిని 'తందాన' శబ్దముతో నిట్లు చూపవచ్చును:-

*'తందానా తం, దాన తందనా, తాని తందనాన'*

యతిప్రాసలు నియతముకాని ఈ బొబ్బిలివరునకు యతిప్రాసలు (ఆది ప్రాసయే కాక అంత్యప్రాసయు) బిగించి, జంగం కథలలో 'రగడ' సృజింపబడినదని నా యభిప్రాయము. ఈ 'రగడ' జంగంకథలలోఁ గథాఖ్యానమునకు ఉపయోగింపఁబడుచు వచ్చినది. కావున దీనిని 'జంగంరగడ' యనవచ్చును. (రగడలలో లాక్షణికులు పలు భేదములను జెప్పిరి కావున, వానినుండి దీనిని వేఱుపఱచుటకై ఇట్టి నామమావశ్యకము.) ఈ జంగంరగడ వరుసలోనే దేసింగురాజు కథ వ్రాయఁబడినది. బొబ్బిలికథలో లేని ఆద్యంత ప్రాసలు, యతి దేసింగురాజుకథలో నియతముగాఁ బాటింపఁబడినవి. ఇది అర్వాచీన రచన యనుట కిదియొక యుదాహరణము. జంగంకథా ప్రక్రియ యేర్పడిన తరువాతనే దేసింగురాజుకథ రచింపఁబడియుండును.

*"శ్రీకరముగ గణ, నాథుని పదములు, చెలువుగ సేవించి*
*ప్రాకట పద్మజు, రాణిని చాలా, భక్తితోడ దలచి*
*ముదముతొ హరిహర, పరమేష్ఠులనూ- మదిలో నర్చించి*
*సదయులైన శ్రీ, గౌరీవాణుల- సంప్రీతితొ నెంచి*
*వరకవులగు నా, వాల్మీకాదుల- వందనములు చేసి*
*గురుతరముగ స, ద్గురువుల నెల్లను- గోర్కి బూజ చేసి"*

డా|| బి. రామరాజుగారు బొబ్బిలికథను, దేసింగురాజుకథను జతురశ్రగతిలో సాఁగు రచనలనిరి. ఇది సరికాదు. దీనిలో గణములు నాలుగు మాత్రలుగా విఱుగుట చాల నరుదు. ఎనిమిది మాత్రలును నొకే గణముగా నుండు సన్నివేశములే హెచ్చు (3+5గా నుండుట యుఁ బ్రచురమే). పాడునప్పుడుగూడ నీ యెనిమిది మాత్రలు నొకే బిగువున నుచ్చరింపఁబడును. కావున నీ వీరగాథలు ఆదిగతిలో నడచునవే కాని చతురశ్రగతి కలవి కావు. పాడునప్పుడీ రెండు కథలును నాదితాళములోనే నడచును. కావునఁ బాడుటలో నీ కథలు 'కిటతక కిటతక' యను నెనిమిది యక్షరముల యావృత్తులు నాలుగొక పాదముగా నుండుటయే సమంజసము. శ్రీపాదవారును నిట్లే చెప్పిరి. 'ఆమ్రేడితమైన చతురశ్రగతియే యాదిగతి కదా, రామరాజుగారు చెప్పినది సమంజసమే' యని కొందఱు భావింప వచ్చును. బొబ్బిలివరుసలోని యెనిమిది మాత్రల గణము ఎల్లప్పుడును 4+4గా నున్నచో రామరాజుగారి యూహ సమంజసమే యగును. కాని ఇట్లుండుట సకృత్తు. ఈ గణము 3+5గాను, 3+3+2గాను, 6+2గాను, లేదా మొత్తమంతయు నెనిమిది మాత్రలుగాను నుండుట పరిపాటి. వీనిలో 3+5 సమ్మేళనమునకుఁ బ్రాచుర్యమున్నది.

కోవెల సంపత్కుమారాచార్యగారు తమ 'ఛందోవికాసము'న దేసింగురాజు కథలోని ఛందస్సును 4+4+4+4+4+4+ గ' అని విడదీయుటకూడ సమంజసము కాదు. ఈ కథాప్రారంభమునఁ గొన్ని పాదములలో నాల్గు మాత్రల గణములు విఱిగినను, పోను పోను ఎనిమిది మాత్రల గణములే హెచ్చు. చూడుఁడు:-

*"చేతిపట్టు దా, వూదుఖానుడు- చెచ్చెర జొచ్చియును*
*ఘాతవేయుచును, పెద్దఫిరంగుల- కదువడి కాల్చుచును*
*నంతరేకలా, ఫిరంగీలనూ- కొంత కాల్చిరపుడు*
*నంత వెనుకయే, నూరు గుఱ్ఱముల- నమర జంపినాడు"*

ఇందు చివర 'గ' ఉండుననుట కూడ సత్యము కాదు. చివర రచయిత లఘువునే వ్రాయును. అది పాడుటలో గురువుగా వినఁ బడును. నిజమునకిది రెండుమాత్రల గురువుకూడఁ గాదు. దీర్ఘప్లుతము. ఇది సాధారణముగా నాలుగు మాత్రల కాలముచ్చరింపఁ బడుచుండును. పాడునప్పుడు దేశింగురాజుకథలోని వరుస స్వరూప మిట్లుండును:

*'శ్రీకరముగ గణ, నాథుని పదములు, చెలువుగ సేవిం, చీ[4]...*
*(నాయన)*

కాఁబట్టి బొబ్బిలివరుస యనునది సాహిత్యాక్షరములలో 8+8+9 మాత్రలతోను, సంగీతాక్షరములలో 8+8+8+8 మాత్రలతోను నుండుటననుట యుక్తము. యతిప్రాసల బిగింపుతో నున్న బొబ్బిలివరుసయే జంగంరగడ. ఈ జంగంరగడ నేఁటి బుఱ్ఱకథలలోఁగూడ బహుళముగా వాడఁబడుచున్నది. సుంకర సత్యనారాయణగారి 'అల్లూరి సీతారామరాజు' బుఱ్ఱకథా ప్రారంభమును జూడుఁడు:-

*"శ్రీలలరారెడు, తెలుగు దేశమున- జీవనదులు కలవు*
*మేలురకపు మై, దానము లడవులు- వేల గనులు కలవు".*

పాడునప్పుడీ బుఱ్ఱకథా గతియును '8+8+8+8 గా నుండును. జంగంరగడలో యతి, ప్రాస, అంత్యప్రాస విధిగా నుండును. (బొబ్బిలివరుస కిట్టి నియమములు లేవు. అందుచే నిది ప్రాచీనము.) పై పంక్తులు దీనికి ఉదాహరణములు. 'శ్రీ-జీ'= యతి; 'శ్రీల-మేలు' = ప్రాస; 'కలవు-కలవు' అంత్యప్రాస. లాక్షణికుల మతమున ప్రాసనియమ మున్న పద్యములలోఁ బ్రాసయతి వాడరాదు. కాని బొబ్బిలివరున నుండి యేర్పడిన జంగంరగడలోఁ బ్రాసనియమమున్నను బ్రాస యతియును సమ్మతమే. పై యుదాహరణమున రెండవ పాదమున 'మేలురకపు... వేలగనులు...' అని ప్రాసయతి ప్రయోగింపఁబడినది. ఆధునికములగు బుఱ్ఱకథలలోనే కాక ప్రాచీనములగు కథలలోను నీ ప్రాసయతి స్పష్టముగా నున్నది. దేసింగురాజుకథలోఁ జూడుఁడు:-

*'తోడనె రాజుల, గుండెలు పగిలెను- పోడిమి చెడి యటను'*
*'కోట యిడిసి పడి, నట్టు లుండెను - వీటి వారి కపుడు'*

బొబ్బిలికథలో నక్కడక్కడ నప్రయత్నముగాఁ బడిన యతి కనఁబడుచున్నది కాని, ప్రాసకాని, ప్రాసయతికాని లేదని చెప్ప వచ్చును. బొబ్బిలివరుసలో నున్న ఇతర ప్రసిద్ధ వీరగాథలు: 'జగపతి రాజు కథ (పెద్దాపురం కోడిపుంజుల కథ), బంగారు తిమ్మరాజు కథ, చిన్నమ్మ కథ, రామకథా సుధార్ణవము, ఆండాళ్ చరిత్ర, నారసింహారెడ్డి కథ, వేంకటేశ్వరుని కథ, యల్లమంద నాయుఁడు కథ, చెన్నకృష్ణారెడ్డి కథ' మొదలగునవి. ఒక్క దేసింగురాజు కథ మాత్రము బొబ్బిలివరుసనుండి పరిణమించిన జంగంరగడలో నున్నది.

**బొబ్బిలివరుస నుండి యేర్పడిన ఇతరములగు వరుసలు:–**
'8+8+9 లేక 10' అను బొబ్బిలివరుస నుండి మఱిరెండు వరుసలు పరిణమించినవి. 8+8 మాత్రలతో సాఁగువరుస యొకటి; 8+9 లేదా 10 మాత్రల వరుసలో సాఁగునది మఱియొకటి. 8+8 మాత్రలతో సాఁగు కథలలో కాంభోజరాజుకథ ప్రసిద్ధమైనది:–

*"ఉత్తరాదియా, భూమియందునా...– (తందానా తందానే)*
*కర్నాటాకా, భూమియందునా ,,*
*శాంబాపూరీ, పట్నమున్నదీ ,,*
*ఇంటిపేరు విత, కేళివారుగా ,,*
*వారి– తాతపేరు నల, నూతరాజుగా ,,*
*వాని– తండ్రిపేరు కాం, భోజరాజుగా (తందానా తందానే)"*

ఇందు యెనిమిది మాత్రల గణములెక్కువగా 3+3+2గా నున్నవి. అందుచే నీ కథాగతిని సంగీతాక్షరములతో నిట్లు నిరూపింప వచ్చును:–

**"తకిట, తకిట, తక + తకిట, తకిట, తక**
**ఇంటి, పేరు,విత + కేళి, వారు, గా**
**తాత, పేరు, నల + నూత, రాజు, గా"**

'వరాహావతార చరిత్ర' లేక 'పందికథ' కూడ కాంభోజరాజు కథవలెనే 8+8 మాత్రలుగా సాఁగును.

*"రాజువద్ద సెల, వందకున్నదూ*
*చలవాదీ ఛ, ల్లీలు దొడిగెనూ*
*బిళ్లలాది మొల, తాడును వేసెను*
*పాలపూల సం, కీలు దొడిగెనూ*
*మూపునాను పిడి, బాకు దోపెనూ*
*చిక్కులాది జం, దాను గట్టెనూ*
*కత్తిబట్టినా, నాయుడుగాడూ*
*కటారి బట్టిన, బంటూగాడూ*
*బల్లెం పట్టిన, దొరగాడండీ"*

ఈ కథలో 'రామ రామ రామా, కోదండ రామ పాహీ' అనునది పునరావృత్తి. ఇది మాత్రము 10+12 మాత్రలుగా నుండును. ఈ పందికథలోఁ గొన్ని పాదములలో మొదటి యెనిమిది మాత్రల గణము 3+3+2గాను, రెండవ యెనిమిది మాత్రల గణము 4+4 గాను గన్పట్టుచున్నవి. అందుచే వీనియందలి సంగీతాక్షరముల నిట్లు సూచింపవచ్చును:–

**'తకిట తకిట తక + కిటతక కిటతక'**

**3 + 3 + 2 + 4 + 4**

**"బిళ్ల, లాది, మొల + తాడును, వేసెను**
**కత్తి, బట్టి, నా + నాయుడు, గాడూ"**

కాని ఈ నడక అన్ని పాదములలోను లేదు. కొన్ని పాదములలో నొక్కొక్కప్పుడు రెండవ గణముకూడ 3 + 3 + 2 గానే వినఁబడుచున్నది. అప్పుడు నడక కాంభోజరాజుకథవలెనే 'తకిట తకిట తక + తకిట తకిట తక' అని సాఁగును.

**(3 + 3 + 2) + (3 + 3 + 2)**

**"రాజు, వద్ద, సెల + వందు, కొన్న, దూ**
**పాల, పూల, సం + కీలు, దొడిగె, నూ**
**మూపు, నాను, పిడి + బాకు, దోపె, నూ"**

(పై యుదాహరణములోని రెండవ గణమును 3 +5 అని కూడ నిరూపింపవచ్చును). ఇంకను కొన్ని పాదములలో మొదటి గణము రెండవ గణము కూడ 4+4 గానే వినఁబడుచున్నవి: అప్పుడు నడక: 'కిటతక కిటతక + కిటతక కిటతక'

**( 4 + 4 ) (4 + 4)**

**"కటారి, బట్టిన + బంటూ, గాడూ**
**బల్లెం, బట్టిన + దొరగా, దండీ"**

కావున, మొత్తముపై 8+8 మాత్రలతో వరాహావతార చరిత్ర నడచుననుటయే సమంజసము. ఆ యెనిమిది మాత్రల గణములలోని అంతర్భాగములను మాత్రము నిశ్చయముగా నిరూపింపలేము. అవి యొక్కొక్కప్పుడు 3+3+2గా నుండవచ్చును. మఱొకప్పుడు 3+5గా నుండవచ్చును. ఇంకొకప్పుడు 4+4 గా నుండవచ్చును. కొంతవఱకును 3+3+2 అను పోకడ హెచ్చని చెప్పవచ్చును.

చిన్నపరెడ్డికథ కూడ 8+8 గానే నడచినది. ఈ యెనిమిది మాత్రల గణములోని యంతర్భాగములకు, వరాహావతార చరిత్రలో వలెనే యొక నియతస్వరూపమును జెప్పలేము. 3+3+2; 3+5; 4+4; 6+2; 2+4+2 ఇట్లు అనేక విధములుగా నుండవచ్చును. అందుచే దీనిని గూడ 8+8 మాత్రాగణములచే నడచుననియు, 'కిటతక కిటతక, కిటతక కిటతక' అను సంగీతాక్షరము లుండుననియుఁ జెప్పుట సమంజసము.

*"సైసైరా చి, న్నాపారెడ్డీ*
*నీ పేరే బం, గారపు కడ్డీ*

*చిన్నపరెడ్డీ, యనేటివాడూ*
*ఏవిధంబుగా, జరుపుచున్నడూ*
*చీరాలా పే, రాల కొడితివీ*
*పొందుగాను నె, ల్లూరు గొడితివీ*
*యింపుగాను విను, కొండ కొడితివీ*
*సొగసుగాను గుం, టూరు కొడితివీ"*

ఈ 8+8 మాత్రల వరుసయే యక్షగానములలో 'మంజరి' యను వింతనామమునఁ గానవచ్చుచున్నది. ఇది ప్రాసరహితమగు ద్విపదవంటి మంజరి కాదు. హరికథలలోఁ గానవచ్చు మంజరి (లేక మంజుగతి, లేక డోరా) యును గాదు. ఇది ఒక్క యక్షగానముల లోనే ప్రత్యేకముగాఁ గానవచ్చుచున్నది. అందుచే దీనిని 'యక్షగాన మంజరి' యనవచ్చునేమో. ఈ రకమగు మంజరికి డా॥ యస్వీ జోగారావురావుగారు లీలావతీ కల్యాణమను యక్షగానమునుండి ఈ క్రింది యుదాహరణము నిచ్చియున్నారు (చూ. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, ప్రథమ భాగము, పుట 257).

*"ఈ రీతిగ ధర, ణీశుఁడు వెడలిన*
*సారివార్త తమ, చారులచే విని*
*వెఱచియు వెఱువని, వితమున విమతులు*
*గురిగల తమతమ, కులగతు లెన్నుచు"*

కాని, ఈ నడకకును వీరగాథలలోని నడకకును భేదమున్నది. వీరగాథలలో నెనిమిది మాత్ర లొకే గణముగా నుచ్చరింపఁబడును. ఇందు ఎనిమిది మాత్రలు 4+4గా నుచ్చరింపఁబడుచున్నవి. పై యుదాహరణములో నొక్క రెండవ పాదమునఁ దప్ప తక్కిన పాదములన్నింటను 4+4 గానే యున్నది. ఇందు నాల్గు పాదముల కును ప్రాసయు నియతముగా నున్నది. అందుచే దీనిని 'చతురశ్ర గతి' లేదా 'మధురగతి రగడ' యని పిలువవచ్చును. ఇట్లు పాడుటలో నాలుగు మాత్రలకు విఱిచి యుచ్చరించుట కాని, ప్రాస నియమము కాని లేకుండుటచే వీరగాథలలోని నడకను మధురగతి రగడ యనుటకు వీలులేదు. దానిని చతురశ్ర గతి యని కూడఁ బిలుచుట కవకాశము లేదు. దానిని ఆదిగతి యనుటయే సమంజసము. ఇది బొబ్బిలివరుసనుండి యేర్పడిన 8+8 మాత్రల వరుస.

ఇఁక బొబ్బిలివరుస నుండి 8+9 మాత్రలొక పాదముగా నేర్పడిన కథలలోఁ బ్రసిద్ధమైనది 'బాలనాగమ్మకథ':-

*"కాశికి పడమట, మున్నూరామడను - తందానే*
*ఆ- భూమిని యొక్కా, చక్రపట్నమేమి ,,*
*పట్నం యేలూ, నవాభోజరాజు ,,*
*రుంఫిని దుర్గా, లేలుతున్నదేమి ,,*
*అంత రాజు ని, ల్లాలూ లక్ష్మమ్మ ,,*
*సత్యమైన భూ, లక్ష్మీదేవమ్మ ,,*
*సంతులేక భూ, లక్ష్మీదేవమ్మ ,,*
*నొయ్యరాని యా, నోములు నోసేను- తందానే"*

ఈ వరుసను గాథాకారులు తందాన శబ్దముతో 'తందాన భాయి, రాజనందనాన' అనియు, 'తందానా భాయ్, దేవనందాన' అనియు నిరూపించుచుందురు. కథకునకు వంత 'తందానే' అని యాఱు మాత్రల నందించుచుండును. పసలబాలుడుకథ కూడ నిదే వరుసలో నున్నది.

లక్ష్మమ్మకథ కూడ బాలనాగమ్మకథ వలెనే 8+9 మాత్రలతో నడచినది. ఈ కథలోఁ దక్కిన కథలలోకన్న శోకాలాపన హెచ్చుగా నుండుటచేఁ జివరనున్న తొమ్మిది మాత్రల గణము చాల చోట్ల పది మాత్రలుగా సూచింపఁబడినది.

*"ఉత్తరాదియా, భూమే అమ్మయ్యా- తందాన తానే*
*అందమైన లిం, గాల పురము లోనూ ,,*
*ఇల్లు వెడలనీ, కమ్మవారు తల్లీ ,,*
*గోషా కలిగిన, సమస్థాన మమ్మా ,,*
*పెద్దవాడుగా, సుబ్బానాయుడూ ,,*
*రెండోవాడూ, కోటయ్యాగారూ ,,*
*మూడోవాడూ, వెంకయ్యనాయుడు- తందాన తానే"*

ఇందు 'సుబ్బానాయుడూ' 'వెంకయ్యనాయుడూ' అను శబ్దములలో 'నా' అను నక్షరము నొక్కిపలుకఁబడును. ఇవి బొబ్బిలి కథలోని రంగరాయుడు' 'వెంగళరాయుడు' అను శబ్దముల వంటివి. ఇవి మూడు మాత్రల ప్లుతములు. అప్పుడు కాని ఆ గణములు పదిమాత్రలు కానేరవు. వంతల ఊతపదములోని "తందాన తానే"లోని 'దా' అను నక్షరముకూడ అట్టి ప్లుతమే.

ఈ లక్ష్మమ్మకథలోఁ గూడ అన్నిచోట్లను 8+10గా రచన లేదు. 8+9 గా సాఁగిన పాదములును గలవు. చివరనున్న దీర్ఘము గుజిలీ ప్రతులను ముద్రించినవారు చేర్చియుండవచ్చును. చివరనున్న లఘువు గురువుగా నుచ్చరింపఁబడుట ప్రతిరచనలోను సాధారణము. దానిని సూచింప నవసరము లేదు. ఒక వేళ సూచించినను నష్టము లేదు. రెండవ గణము పదిమాత్ర లనుకొన్నను నిదికూడ బొబ్బిలి వరుసనుండి వచ్చినదే కాని ప్రత్యేక సృష్టికాదు. బొబ్బిలికథలోఁ గూడఁ గొన్ని తావులందుఁ బాదాంతమున దీర్ఘమున్నది. అప్పుడు నడక 8+8+10 గా సాఁగినది. చూడుఁడు:-

*"నిమ్మ పండ్లు మా, మీడి పండ్లుగా, చదుర్న వుంచీరీ*
*అటుకులు బెల్లం, పంచదారగా, చదుర్న వుంచీరీ*
*పావురాలా, సీమ చిలుకలూ, చదుర్న వుంచీరీ*
*బంగారంపూ, కోడిపుంజులా, చదుర్న వుంచీరీ"*

ఇట్టి బొబ్బిలివరుసనుండియే లక్ష్మమ్మకథ 8+10గాఁ బరిణమించి యుండును. ఈ బొబ్బిలివరుసను మూఁడు ముక్కలుగా

భావించినచో, నొకటి రెండు ముక్కల కలయికచే కాంభోజరాజు కథ, పందికథ వంటివి యేర్పడినవనియు; రెండు మూడు ముక్కల కలయికచే బాలనాగమ్మకథ, లక్ష్మమ్మ కథ వంటివి యేర్పడినవనియు నిర్ణయింపవచ్చును. ఇట్లు బొబ్బిలికథనుండి యుద్భవించిన 8+8 మాత్రల వరుసయు, 8+9 లేదా 8+10 మాత్రల వరుసయు నేఁటి బుఱ్ఱకథలలోఁగూడ విరివిగాఁ బ్రయోగింపఁబడుచున్నవి.

## 4.'ముగ్గురు మరాటీల వరుస' లేక 'సైసై వరుస'

వీరగాథలలో ముగ్గురు మరాటీల కథవరుస, లేక ఆరె మరాటీల కథవరుస ప్రత్యేకమైనది. ఇది బొబ్బిలికథనుండి పుట్టినది కాదు. దీనికిదియే సాటి. ఈ వరుసను "సైసై వరుస" యందురు. 'సైసై' అను వంత పాటనుబట్టి ఈ పేరు వచ్చినది. ఈ సైసై వరుస మిక్కిలి ప్రసిద్ధమై, అత్యంత వీరరసస్ఫోరకమై, ఆధునికములగు బుఱ్ఱకథలలోఁగూడ విరివిగాఁ బ్రయోగింపఁబడుచున్నది. ఈ వరుసను 'మరాటీల వరుస' యనియుఁ బిలుచుట కలదు.

ఈ 'సైసై వరుస' ఆరెమరాటీలకథ గుజిలీప్రతిలో సరిగా నిరూపింపఁబడలేదు. (ఈ గుజిలీ ప్రతులన్నియును డబ్బు చేసికొనుటకు ఉద్దేశించినవే కాని, వీరగాథలపై శ్రద్ధతో ముద్రించినవి కావు. ఇవన్నియును తప్పుల తడకలు.) వీరగాథల వరుసలను దెలిసికొనుటకు ఆయా గాథాకారులచేఁ బాడించి వినవలెను. నేను ముగ్గురు మరాటీల కథ నొక పూసల బలిజవాఁడు పాడుచుండఁగా వింటిని. ప్రతి వీరగాథలోను గాథాకారుఁడు ముందుగా వరుసను నిరూపించుటకు 'తందాన' శబ్దముతోఁగాని 'రామరామ' శబ్దముతోఁ గాని ఇతర శబ్దములతోఁగాని ఒకటి రెండు పాదములు చెప్పును. తరువాత కథను బ్రారంభించును. ఇట్లే ముగ్గురు మరాటీల కథలోని వరుసను నిరూపించుటకు ఈ క్రింది మాటలు ఉపయోగింతురు:-

*"భళా నోయి భాళ తమ్ముడూ - సై*
*భాయిార సవదారి దండామూ"*

ఇందలి మాత్రల నిట్లు చెప్పవచ్చును: 3+3+3+5+2
5+5+6

ఇందు వంత అందించు 'సై' అను మాటలోని మాత్రలు లెక్కకు రావు. వంతలు పాడెడి యే మాటలును ఛందస్సులోనికి రావు. అవి కథాగమనమునకు పుష్టి చేకూర్చునవి మాత్రమే. దీనినిబట్టి మరాటీలకథలోని వరుసలో మొదటిపాదమున 3+3+3+5= పదునాల్గు మాత్రలును, రెండవ పాదమున 5+5+6= పదునాఱు మాత్రలును ఉండునని చెప్పవచ్చును.

*"శక్తి, శార, దాంబ, దండమూ (సై)*
*గంగా భ, వానమ్మ, దండామూ"*

ఒక్కొక్కప్పుడు రెండవ పాదమున 16 మాత్రలకు బదులుగ 15 మాత్రలే యుండుట తటస్థించును. అనఁగా నిదికూడఁ గొంతవఱకును మొదటి పాదమువలెనే నడిచి, చివరి గణములో నొక మాత్ర యెక్కువ చేరును. అనగా నీ పాదము 3+3+3+6 గా నుండును. దీనినిట్లు చూపవచ్చును:-

*"భళా, నంటి, భాయి, తమ్ముడా- సై*
*భాయి, భళా, నోయి, దాదానా॥*
*పరమ, పాయి, కోళ్ల, భూమిలో- సై*
*పాళె, గాళ్ల, దేశ, మున్నాదీ॥*
*గుత్తి, య బ, ళ్లారి, సీమనా- సై*
*ఉరవ, కొండ, భూమి, వున్నాదీ॥*
*అగిరి, యేటి, గడ్డ, నున్నదీ- సై*
*కనే, గల్లి, కోట, వున్నాదీ॥"*

కాని, ఈ కథయంతయు నిదే క్రమమున నడువదు. 14 మాత్రలతోఁ గొన్ని పాదములు వరుసగాఁ జెప్పి, ఆఖరున ముక్తాయింపుగా 16 మాత్రల లేదా 15 మాత్రల పాదము చెప్పఁ బడును. ఈ పద్ధతియే కథలో నధికముగా నుండును. దీనిని మఱియొక విధముగాఁ గూడఁ జెప్పవచ్చును: "ఈ సైసై వరుసలో ముక్తాయింపు పాదమున నెప్పుడును వెనుకటి పాదముల కన్న నొకటి రెండు మాత్రలెక్కువగా నుండును". 'తమ్ముడా' 'దాదానా' అను శబ్దములలోనే ఈ భేదము సూచింపఁబడినది. పూర్వ పాదములోఁ జివరిగణమున నైదుమాత్రలుండగా, నుత్తర పాదమునఁ (ముక్తాయింపు పాదమున) జివరి గణమున నాఱు మాత్రలున్నవి. ముక్తాయింపు పాదములోనే కాక పూర్వపాదములలోఁ గూడ నొక్కొక్కప్పుడు 15 మాత్రలుండవచ్చును. మొత్తము మీదఁ బూర్వపాదములలో నెన్నిమాత్రలున్నను, ముక్తాయింపు పాదమున మాత్రము ఒక మాత్ర యెక్కువగనే యుండును. అనఁగాఁ బూర్వ పాదములలో పాదమునకు 14 మాత్రల చొప్పున నున్నచో ముక్తాయింపు పాదమున 15 మాత్రలుండును. పూర్వపాదములలో 15 ఉన్నచో నుత్తర పాదమున 16 ఉండును. కావున 'భళా నంటి భాయి తమ్ముడా' అను వరుసలో నుండు పూర్వపాదములలో 14 లేదా 15 మాత్రలుండును. 'భాయి భళా నోయి దాదానా' అను వరుసలో నుండు నుత్తరపాదము (ముక్తాయింపు పాదము) 15 లేదా 16 మాత్రలతో నడచును. పూర్వపాదములలో నొక్కొక్కప్పుడు 13 మాత్రలు, 12 మాత్రలుగూడ నుండవచ్చును. 13 మాత్రలున్నప్పుడు 'భళా భాళా నోయ్ తుమ్ముడా' (3+3+2+5= 13) అనియు, 12 మాత్రలున్నప్పుడు 'భళా భళా నోయ్ తమ్ముడ' (3+3+2+4= 12) అనియు నిరూపింపవచ్చును. కావునఁ బూర్వపాదములలో 12 మొదలుకొని 15 మాత్రల వఱకును బ్రత్యక్షమగుచుండునని చెప్పవచ్చును. ఉత్తరపాదమున 14 మొదలుకొని 16 మాత్రల

వఱకును నుండును. కాని యెక్కువగాఁ బూర్వపాదములలో 14 మాత్రలు, నుత్తరపాదమున 16 మాత్రలు నుండుట పరిపాటి.

పూర్వపాదములలోఁ బ్రత్యక్షమగు 14 మాత్రలెప్పుడును 3+3+3+5 గా నుండునని తలంపరాదు. 4+5+5 గాను, 5+4+5 గాను నుండవచ్చును. కాఁబట్టి దీనిని స్థూలముగా 9+5= 14 అను రీతిలో నుండునని చెప్పవచ్చును. పాదములో 15 మాత్రలుండు నప్పుడు 10+5 గా నుండును (ఇందలి 10 యెట్లైనను నేర్పడవచ్చును. 5+5 గా, 3+3+4 గా, 6+4 గా బహువిధములుగా నేర్పడి యుండ వచ్చును). పూర్వపాదము లన్నింటను మాత్రాగణము లొకే రీతిగా నుండవు. కొన్ని పాదములలో 13, కొన్నింట 14, ఇంకను గొన్నింట 15 మాత్రలుగా– ఇట్లు పలుతెఱంగుల నుండును. ముగ్గురు మరాటీల కథ నుండి ఈ క్రింది యుదాహరణమును గమనింపుఁడు:

**"పన్నెం[18], దేండ్ల, వాడు, సోమధీ–(సై)= (3.3.3) .5= 14**
**తొమ్మి, దేండ్ల, వాడు సూపధీ– (సై = (3.3.3) .5= 14**
**ఇద్ద, రీకి, చిన్న, వాడుగా–(సై) = (3.3.3) .5= 14**
**బంగారి, కడియాల, బాలుడూ–(సై) = (5.5).5= 15**
**ముత్యాల, పోగులా, ఫిరోజీ– (సై) = (5.5) .5 =15**
**వేం, డ్లాకు, చిన్న, వాడురా– (సై) = (2.3.3) . 5=13**
**వేచ, నాకు, దొడ్డ, వాడురా– (సై) = (3.3.3) .5= 14**
**మనిషిలో, మర్మం, తెలుసునూ– (సై) = (5.4) .5=14**
**మానిలో, సేవా, తెలుసునూ– (సై) = (5.4).5 =14**
**గంగల, లోతే, తెలుసునూ– (సై) = (4.4) .5= 13**
**సచ్చేది, బతికేది, తెలుసూనూ" (భళానంటి) = (5.5) .6= 16**

పై యుదాహరణములోని పాదాంత దీర్ఘములు పాడుటలో వచ్చినవే కావున రచనలో వీనిని జూపవలసిన యవసరము లేదని భావించినచో, నొక్కొక్కపాదములో నొక్కొక్క మాత్ర తగ్గిపోవును. అప్పుడు పై పాదములు వరుసగా "13, 13, 13, 14, 14, 12, 13, 13, 13, 12, 15" అగును.

ఈ యుదాహరణములో మొదటి పదిపాదములును బూర్వపాదములు, పదునొకండవ పాదము ముక్తాయింపు చేయు నుత్తర పాదము. పూర్వపాదములు పదింటిలోను మాత్రలు 13 మొదలుకొని 15 వఱకును గలవు. 14 మాత్రల పాదములు హెచ్చుగా నున్నవి. ఉత్తర పాదములో 16 మాత్రలున్నవి. ఈ పరిశీలనమును బట్టి మనమొక సిద్ధాంతమును జేయవచ్చును. "సైసై వరుసలోఁ బూర్వపాదములలో నెన్ని మాత్రా భేదములున్నను, ముక్తాయింపు చేయు నుత్తర పాదమున మాత్రము పూర్వపాదములలోకెల్ల నత్యధిక మాత్రలు గల పాదముకన్న నొక్కమాత్ర హెచ్చుగా నుండును". పై యుదాహరణమునఁ బూర్వపాదములలో నత్యధిక మాత్రలుగల పాదములలో 15 మాత్రలున్నవి. కాఁబట్టి ముక్తాయింపు పాదమున విధిగా 16 మాత్రలుండువలెను. అట్లే యున్నది.(ఈ యుదాహరణము లోఁ బాదాంత దీర్ఘమును హ్రస్వముగా మార్చినప్పుడు కూడఁ బై సిద్ధాంతమన్వయించును. అప్పుడు పూర్వపాదములలో నత్యధిక మాత్రలు 14. ముక్తాయింపు పాదమున దీనికన్న నొకటి యెక్కువ యుండవలెను. అనఁగా 15 ఉండవలెను. అట్లే యున్నది.)

ఈ యుదాహరణమునుబట్టి సైసై వరుసలోని మాత్రల సంఖ్యను, వాని వరుస క్రమమును గూడ నిర్వచింపవచ్చును: "సైసై వరుసలోఁ బూర్వపాదములలో సాధారణముగా 14 మాత్రలుండును. వీని క్రమము 9+5 గా నుండుట పరిపాటి. ఇందలి తొమ్మిది మాత్రల గణము సాధారణముగా 3+3+3 గా నుండునని చెప్పవచ్చును. ముక్తాయింపు చేయు నుత్తర పాదమున 16 మాత్రలుండుట సాధారణము. ఇవి 10+6 గా నుండును. ఇందలి పది మాత్రల గణము నింకను సూక్ష్మముగాఁ బరిశీలించినచో 5+5 గా నుండునని చెప్పవచ్చును. పూర్వపాదములలోఁ జివరి గణమెప్పుడును 5 మాత్రలతోనే యుండును. ఉత్తరపాదములలోఁ జివరిగణమెప్పుడును 6 మాత్రలతోనే యుండును. ఇది గమనింపవలసిన విషయము."

పై యుదాహరణమునుబట్టి మఱియొక సిద్ధాంతమునుగూడఁ బ్రతిపాదింపవచ్చును. "పూర్వపాదములలో మాత్రల సంఖ్య12కు తగ్గదు, 15 కు మించదు. అట్లే యుత్తర పాదమున మాత్రల సంఖ్య 14కు తగ్గదు, 16 కు మించదు".

ఈ సైసై వరుసను గాథాకారులు మూఁడు నాలుగు విధములుగా నిరూపించుచుందురు:–

*1.* ***'భళా నోయి భాయి తమ్ముదా–సై***
***మేలు భళా నోయి దాదానా'***

*2.* ***'భళా నంటి భాయి తమ్ముదా– సై***
***భాయి భళా నోయి దాదానా'***

*3.* ***'భళా నంటి భాయి తమ్ముదూ–సై***
***భాయిర సవదారి దండామూ'***

*4.* ***'భళక్కి భళాని తమ్ముదా– సై***
***భళని భళారే దాదానా'***

ఈ సైసై వరుసలో నెల్లప్పుడును 'భళానోయి భాయి తమ్ముదా' యను పూర్వపాదపు వరుసయే ముందునకుఁ బొడిగింపఁబడుచు, నుత్తరపాదపు వరుసతో– 'మేలు భళానోయి దాదానా' అనుదానితో ముక్తాయింపు చేయఁబడునని తలంపరాదు. ఒక్కొక్కప్పుడు వేఱొక క్రొత్త వరుస కూడఁ గానవచ్చుచున్నది. పూర్వపాదమునకును ఉత్తర పాదమునకును చివరిగణములలో నొక్కమాత్ర భేదమున్నది. పూర్వపాదాంతమున 5 మాత్రల గణముండఁగా, నుత్తరపాదాంతమున

నాలుమాత్రల గణమున్నది. ఈ రెండు పాదములను గలిపి సమానము చేసి, గాథాకారులు వేఱొకవరుసను సృజించియున్నారు. అందు గణములు (4+4) + 6 = 14 గా నుండును. అనఁగా నుత్తర పాదములోని జివరి గణమును దీసి పూర్వపాదమునకుఁ దగిలించిరని తలంపవచ్చును. దీనిని 'మిశ్రపు వరుస' యనవచ్చును. ముగ్గురు మరాటీల కథలోఁ దీవ్రత మఱింత హెచ్చుగా నున్నప్పుడు ఈ వరుసను పాడుచుందురు. దీనినిట్లు నిరూపింపవచ్చును:-

**8 + 6**
**"భళానంటి భాయ్, తమ్ముా దా**
**మేలు భళా నోయ్, దాదానా"**

సైన తెల్పిన సైసై వరుసలలో నాల్గవ దానిలో- 'భళక్కి భళాని తమ్ముడా- సై, భళని భళారే దాదానా' అను వరసలో నుత్తర పాదమున 8+6= 14 మాత్రలే కలవు. దీనిని బట్టి 'భళని భళారే దాదానా' అను నుత్తరపాదపు వరుసయే ఇట్లు పొడిగింపఁబడినదని భావించుటకుఁగూడ నవకాశమున్నది. అప్పుడు సైసై వరుసలో నెప్పుడును బూర్వపాదమే పొడిగింపఁబడదనియు, నొక్కొక్కప్పుడు ఉత్తరపాదము కూడఁ బొడిగింపఁబడుచుండు ననియుఁ దలఁపవలసి యున్నది. ఏమైనను నిది యొక క్రొత్త వరుస. సాధారణముగా సైసై వరుసలోఁ గానవచ్చు పద్ధతికన్న భిన్నమైనది. ఈ క్రొత్తవరుసలో 'సైసై' వంత యుండదు. ప్రతిపాదాంతమునను బునరావృత్తియే అందుకొనఁబడును. ఈ వరుసలో 8+6=14 మాత్రలుండును. ఇందలి 8 మాత్రల గణము సాధారణముగా 4+4 గా నుండుట పరిపాటి. ఒక్కొక్కప్పుడు 3+3+2 గాఁ గూడ నుండ వచ్చును. జానపదులీవరుసను 'తురువు కొట్టు' లేక 'ఒంటి కొట్టు' అందురు. (బుఱ్ఱకథలలో నీ వరుసను 'తథక్కతోం వరుస' అందురు). మామూలుగాఁ బైన తెల్పిన సైసై వరుసను బాడుచు, 'తథక్కితోం' అని యొక్కమాఱుగా నీ వరుసలోనికి దుముకుదురు. ఇది వీరరసము పరవళ్లు త్రొక్కు వరుస. ముగ్గురు మరాటీల కథలోని ఈ క్రింది పాదములను గమనింపుడు:-

**4 + 4 + 6**
***"బాలలు, పొయ్యే, రద్దూకూ***
***భూలో, కం తల, డిచ్చేనూ***
***భూతాల్, గడగడ, వణికేనూ***
***భూమే, తిమిరే, బట్టేనూ***
***చుక్కలు, జలజల, రాలేనూ***
***సూరుడు, దారీ, తప్పేనూ"***

ఈ ముగ్గురు మరాటీల కథలోని సైసై వరుసకే రెండు రెండు పాదములకు యతియు నంత్యప్రాసయు బిగించి, ఆధునికులు బుఱ్ఱకథలలోఁ బ్రయోగించుచున్నారు. అస్థిరముగా నున్న పూర్వపాదములలోని మాత్రాసంఖ్యలో నొక క్రమపద్ధతిని గూడ ఆధునికులు ప్రదర్శించుచున్నారు. నాజరు రచించిన పల్నాటి యుద్ధము బుఱ్ఱకథలో మూఁడు పూర్వపాదములు నొక యుత్తర పాదముఁ గలవు. పూర్వపాదములు మూడింటను మాత్రల సంఖ్య క్రమముగా 14, 15, 15 గా నుండి, నాల్గవ పాదమైన ముక్తాయింపు పాదమున 16 మాత్రలున్నవి. నాగమ్మ శౌర్యమును వర్ణించు ఘట్టమును జూడుఁడు:-

| | | | | |
|---|---|---|---|---|
| **"చిన్న, నాడె, విల్లు, బట్టెరా-(సై)** | = | **3+3+3+5** | = | **14** |
| **చిన్నపైై, విల్లెక్కు, బెట్టెరా- (సై)** | = | **5+5+5** | = | **15** |
| **నింగిలో, పిట్టనే, గొట్టెరా- (సై)** | = | **5+5+5** | = | **15** |
| **నీటిలో, చేపనే, గొట్టిందా (భళానంటి)** | = | **5+5+6** | = | **16** |
| **అల్ల, నాడె, కత్తి, దూసెరా- (సై)** | = | **3+3+3+5** | = | **14** |
| **అల్లపుడె, సాములకు, డాసెరా -(సై)** | = | **5+5+5** | = | **15** |
| **కత్తి, కదిలే, తీరు, గాంచితే- (సై)** | = | **3+4+3+5** | = | **15** |
| **కన్నులకు, మిరుమిట్లు, గొలిపేనా" (భళానంటి)** | | **5+5+6** | = | **16** |

ముగ్గురు మరాటీల కథలోని 'మిశ్రపు వరుస' (8+6) కూడ బుఱ్ఱకథలలోఁ బ్రయోగింపఁబడుచున్నది. నాజరు పల్నాటి యుద్ధములోని ఈ క్రింది వరుసను జూడుఁడు:-

***"నీటైన, బ్రహ్మయ్య, దేగరా- సై***
***అరవడి, పరవడి, జేసెరా - సై***
***తాటించి,తన్నా, సాగెరా- సై***
***నాగమ్మ, కోడీ, సోదరా- సై***
***తతక్క థోం-***

***(3+3+2) + 6***
***కావు కావు మని, అరచిందా***
***(4+4) +6***
***కాలికి బుద్దీ, చెప్పిందా ॥భళానంటి॥***
***(3+3+2) + 6***
***తవుడు మేసినా, కోడీరా***
***(4+4) + 6***
***తన్నుకు పారీ, పోయిందా" ॥భళానంటి॥***

ఇందు 'తతక్క థోం' అనునంతవఱకును మామూలు సైసై వరుస. తరువాత నున్నది 8+6=14 మాత్రలొక పాదముగా సాఁగిన 'తతక్క థోం వరుస'. ఈ సైసై వరుసలో నొక్క ముగ్గురు మరాటీల కథ తప్ప వేఱొక ప్రాచీనగాథ లభించుట లేదు. ఇటీవలి కాలమున తెలంగాణలో 'మలగర బాలేసాబు కథ' యనునది మాత్రము సైసై వరుసలో నున్నది. వీరగాథానుకరణములగు బుఱ్ఱకథలలో మాత్రమిది విరివిగాఁ బ్రయోగింపఁబడుచున్నది.

## 5. 'సర్వాయి పాపని వరుస' లేక 'ఏల వరుస'

వీరగాథలలో 'బొబ్బిలి వరుస' 'మరాటీల వరుస'ల వలెనే ఈ 'సర్వాయి పాపని వరుస'యు నొక ప్రత్యేకతను గలిగియున్నది. ఇది కూడ ఆధునికములగు బుఱ్ఱకథలలో విరివిగా నుపయోగింపఁ బడుచున్నది. నాలుగు పాదములుగల ఒక్కొక్క ఖండికలో దీని సంగీతాక్షరము లిట్లుండును:-

7+7
7+7
7+9+9
7+9

సర్వాయి పాపని కథలోని ఈ క్రింది యుదాహరణమును జూడుఁడు:-

*"ఊరుకొడితే, ఏమి ఫలమూ*
*పల్లె కొడితే, ఏమి ఫలమూ*
*కొడితే³ గోల్, కొండ కొట్టాలే- సర్వమ్మతల్లీ!*
*పడితే³ బం, దారు పట్టాలే"*

7+7= 14 మాత్రలతో రెండు పాదములు చెప్పి, మూడవ పాదములో 7+9= 16 మాత్రలు గడచిన తరువాత, తొమ్మిది మాత్రల సంబోధనము నూఁతగాఁ జెప్పి, నాల్గవ పాదములో మరల 7+9=16 మాత్రల ముక్తాయింపును వాడుట ఈ సర్వాయి పాపని వరుసలోని ప్రత్యేకత. ఇందలి యేడు మాత్రల గణములు సాధారణముగా 3+4 గా విఱుగుచుండును. మూఁడు నాలుగు పాదములలో ద్వితీయ గణములుగా నున్న తొమ్మిది మాత్రల గణములు 3+4+2 గాను, మూఁడవ పాదము చివర సంబోధనగా నున్న తొమ్మిది మాత్రలగణము 2+3+4 గాను విఱుగును. కొన్ని దీర్ఘాక్షరములను గేవలము రెండు మాత్రల గురువులుగాఁ గాక, గాథాకారుఁడు పాడు తీరునుబట్టి ప్లుతములుగా భావింపవలసి యుండును. పై యుదాహరణములో 'కొడితే, పడితే' అను మాటలలోని 'తే' అనునది మూఁడు మాత్రల ప్లుతము.

పై యుదాహరణము గుజిలీ ప్రతులలోనిది. నేను సేకరించిన మౌఖికగాథలో నున్న ఈ క్రింది పాదములను జూడుఁడు:-

*"ఈడి గోల్లా, చిన్న వాడూ*
*ఇప్పా³పు, వ్వంటి వాడూ*
*మల్లెలా మొ, గ్గంటి వాడేరా- సర్వాయి పాపా!*
*మగలీ³ రే, కంటి వాడేరా"*

ఇందు మొదటి రెండుపాదములను గలిపి పరిశీలించినచో యతి పాటింపఁబడినదని గుర్తింపగలము. అట్లే మూఁడు నాలుగు పాదములను బరిశీలించినచో వానికిని యతి పాటింపఁబడినదని తెలియగలదు. కావున ఒకటి రెండు పాదములను గలిపి ఒకే పాదముగా భావించుట సమంజసము. అట్లే మూఁడు నాలుగు పాదములను గలిపి ఒకేపాదముగా భావింపవలసియుండును. ఒకటి రెండు పాదముల నేక పాదముగా భావించినప్పుడు దాని నడక 'వృషభగతి రగడ' (7+7+7+7) యగును. లేదా దీనిని విడి పాదములుగా ననుకొన్నప్పుడు 'హరిణగతి రగడ' (7+7) యగును. మొత్తముపై సర్వాయి పాపని వరుస యొక ప్రత్యేకమగు నడకలో నున్నది.

ఈ సర్వాయి పాపని వరుసలోఁ బ్రతి గణాంతమునను వచ్చు సంగీతపుఁ 'సాఁగతీత'ను దొలఁగించినచో నిందలి మాత్రాగణము లిట్లుండును:-

6+6
6+6
6+8+8
6+8

కాని ఇట్టి నడక సకృత్తు. పాడుటలోఁ బ్రతిగణమును సాఁగఁదీయఁబడుచునే యుండును.

ఈ వరుసలో మూఁడవ పాదములోఁ జివర సంబోధనగాను, నూఁతగాను 'సర్వాయి పాపా'-'సర్వమ్మ తల్లీ'- 'వాడే³ టంటే'-'వడిపే³ రంటే'- 'ఆ రా³యుడూ'- అను మాటలు ఉపయోగింపఁ బడుచుండును. ఇవి కామమ్మకథవంటి పేరంటాండ్రకథలలో వచ్చు 'కామమ్మ'-'రాజమ్మ' వంటి యూఁతపదములే.

ఈ సర్వాయి పాపని కథ వరుస, యక్షగానములలోఁ జాలఁ దఱుచుగా వచ్చు ఏలపదముతో నన్నివిధముల సరిపోలుచున్నది. కందుకూరి రుద్రకవి రచించిన సుగ్రీవ విజయ మను యక్షగానమునఁ గల యేలపదము సరిగా సర్వాయి పాపని కథ వరుసలోనే యున్నది. చూడుఁడు:-

| | | |
|---|---|---|
| **"భానువంశా, మూన బుట్టీ** | **...** | **7+7** |
| **దానవా కా, మీని గొట్టీ** | **...** | **7+7** |
| **పూని మఖమూ, నిర్వహింపావా, ఓ రామచంద్రా!** | | **7+9+9** |
| **మౌనివరులూ, సన్నుతింపాగా"** | **...** | **7+9** |

పాపరాజు విష్ణుమాయావిలాస మను యక్షగానములో సంగీతపు 'సాఁగతీత' లేక 6+6 గా సాఁగిన యేల పదమున్నది.

| | | |
|---|---|---|
| **"మల్లె విరుల, జోడు తొడిగి** | **...** | **6+6** |
| **నల్ల చెఱకు, విల్లు బట్టి** | **...** | **6+6** |
| **మొల్ల తూపు, లుల్లసిల్లగ- ఓ పంచబాణ** | | **6+8+8** |
| **చెల్ల ఘనుల, నెల్ల నేచేవు"** | **...** | **6+8** |

గొల్లకలాపములలో వచ్చు సుంకరి కొండని యేలలన్నియు నీ సర్వాయి పాపని కథ వరుస వంటివే. అట్టి యేలలను జూచియే

సర్వాయి పాపని వరుస సృజింపఁబడియుండును. ఛందోవిషయమున నేలలకును సర్వాయి పాపని కథకును బోలికలున్నను, బాడుటలో రెండింటికిని జాల భేదమున్నది. ఏలలు శృంగార రసాత్మకముగా నిదానముగాఁ బాడఁబడును. సర్వాయి పాపని కథ వీరరసస్ఫూర్తితోఁ దొందరగాఁ బాడఁబడును.

గొల్లకలాపములలోనే కాక, జంగంకథలోఁగూడ నిట్టి యేలలున్నవి. కిలారి బ్రహ్మయోగి రచించిన శ్రీభల్లాణరాయ చరిత్రము జంగంకథలో నీ క్రిందియేల యున్నది:-

*"అమ్మలారా, అక్కలారా*
*రమ్మనారే, మనావారిని*
*కొమ్మరో యీ, కోమలాంగునీ– ఓ చెలియలారా!*
*బ్రహ్మదేవుం, డెటుల జేసేనే"*

ఇది సరిగా సర్వాయి పాపని వరుస వలెనే యున్నది. ఏలలన్నియు నిట్లే యున్నవి.

పై పరిశీలనమునుబట్టి సర్వాయి పాపని కథ యేలపదముల వరుసలో నున్నదని నిశ్చయింపవచ్చును. ఈ యేలశబ్దము హేలా శబ్ద భవమని పండితులు తలంచుచున్నారు. ఈ యేల సంకీర్తన లక్షణమున నిట్లు నిర్వచింపఁబడినది:-

*"నాయకాహ్వాన పూర్వమై నయము గలిగి*
*మ్లేచ్ఛ పరిభాషఁదగి రాగమిళితమైన*
*యేలపాట పదంబునా నిలఁ జెలంగు*
*మహిత నాయక సంబుద్ధి మధ్యమగుచు".*

కాని, ఈ లక్షణము స్పష్టముగాఁ జెప్పఁబడలేదు.

సర్వాయిపాపని కథ యెల్లప్పుడును బైనఁజెప్పిన రీతిలోనే సాఁగునని తలంపరాదు. అనఁగా నెల్లప్పుడును '7+7, 7+7, 7+9+9, 7+9' అను వరుసలలో నుండు నాలుగు పాదముల చరణముల (stanzas) తోనే సాఁగునని తలంపరాదు. ఒక్కొక్కప్పుడు చరణములో 7+9+9 అను మూఁడవ పాదమే చాల దూరము పొడిగింపఁబడుచుండును. ఈ క్రింది యుదాహరణమును జూడుఁడు:-

*"ఇంటి ఆవుల, మేపమంటాది సర్వమ్మతల్లీ*
*ఈతచెట్లే, గీయమంటాదీ ,,*
*తాటి కల్లే, కట్టమంటాదీ ,,*
*ఈత కల్లే, కట్టమంటాదీ ,,*
*ఈత బెల్లం, వండమంటాదీ ,,*
*అంచకల్లే, కట్టమంటాదీ సర్వమ్మతల్లీ"*

ఇట్లే 7+7 మాత్రలున్న మొదటి పాదము కూడ రెండు పాదములకన్న మించియుండవచ్చును. ఈ నడక అయిదుపాదముల వఱకును గొనసాఁగిన ఈ క్రింది యుదాహరణమును జూడుఁడు:-

*"పాపడొక్కా, పేరు చెప్తే*
*వూరబిచ్చుక, వూరు చేరదు*
*పొట్టి పిచ్చుక, పొలము చేరదు*
*కముజులూ కా, రాడుచుండూ*
*నక్కలూ నా, ట్యాలు దొక్కూ*
*పందులూ పరు, గెత్త సాగూగా– వాడేటంటే*
*పందికొక్కూ, డోలుకొడ్తాడో."*

ఈ సర్వాయి పాపని వరుసను బుఱ్ఱకథలలోఁ జాలచక్కఁగా వినియోగించిన కవి 'నదీరా' (ఎన్.వి.ఎస్.శర్మగారు). ఈయన రామాయణమంతటిని బుఱ్ఱకథారూపమున రచించిరి. అందులో వాలిసుగ్రీవుల యుద్ధఘట్టమున సర్వాయి పాపని వరుస నెంత యద్భుతముగా నుపయోగించిరో చూడుఁడు: సుగ్రీవుఁడు వాలిని యుద్ధమున కాహ్వానించెను. అప్పుడు వాలి:-

*"అట్టి మాటలు, విన్నవాలీ*
*అగ్గిపిడుగై, భగ్గుమంటూ*
*ఆగరా వ, స్తుంటి నన్నాడూ– నా సామిరంగా!*
*అణిచెదను నీ, పొగరటన్నాడూ.*

*భువిని తట్టీ, తొడను గొట్టీ*
*గదను పట్టీ, భుజము నెట్టీ*
*నడవరా యు, ద్ధానికన్నాడూ– నాసామిరంగా!*
*నవ్వులాటిది, కాదటన్నాడూ"*

సర్వాయి పాపని కథలో నొక్క యుద్ధఘట్టమున మాత్రము పైన తెల్పిన వరుస కాక, బొబ్బిలివరుస వాడఁబడినది. ఈ సర్వాయి పాపని వరుసలో వేరొక వీరగాథ కానరాదు. తెలుఁగు సాంప్రదాయిక వీరగాథలలో సర్వాయి పాపని కథ యొక్కటియే ఇట్టి ప్రత్యేకమగు వరుసలోఁ గనఁబడుచున్నది. దీనిని 'ఏలవరుస' యని పిలువవచ్చును.

## 6. 'హరిహరీ వరుస' లేక 'జంపె వరుస' లేక 'జముకుల వరుస'

19వ శతాబ్ది మధ్యభాగమునుండి విశాఖ, విజయనగర, శ్రీకాకుళ మండలములలో విరివిగా బయలుదేరిన 'పదములు' ప్రత్యేకమగు వరుసలో నున్నవి. వీని వరుసను 'జంపె వరుస' యందురు. ఈ గాథాకారులు 'జముకు'లను వాద్యముల నుపయోగించి పాడుటచే దీనిని 'జముకుల వరుస' యనియుఁ బిలుతురు. ఈ వరుసను సాధారణముగా **'హరిహరీ నారాయణాదినారాయణా, కరుణించి మమ్మేలు కమలలోచనుడ'** అను పాదములతో సూచించుచుందురు. అందుచే దీనిని 'హరిహరీ వరుస' యనియుఁ బిలువవచ్చునని నా యభిప్రాయము. ఒక ఖండగతి

పాదము, వేఱొక ద్విపదపాదము కలియుటచే నీ వరుస పుట్టియుండును. ఈ వరుసలోఁ బాదమున కెనిమిది గణములుండును. దీనిని రెండు దళములుగా భావింప వచ్చును. ప్రథమ దళమున నాలుగు గణములు, ద్వితీయ దళమున నాలుగు గణములు నుండును. ప్రతి దళమునందును 1-3 గణముల ప్రథమాక్షరములకు యతి. రెండు దళములకును ఏకయతి పాటింపఁ బడదు. కాని ప్రాస ఒక్కొక్కప్పుడు ఉండవచ్చును.

**5 + 5 + 5 + 5**
**హరిహరీ, నారాయ, ణాదినా, రాయణా**

**5 + 5 + 5 + 3**
**కరుణించి, మమ్మేలు, కమలలో, చనుడ**

ఒక్కొక్కప్పుడు ఈ వరుసను సూచించుటలోఁ జివర 'కమలలోచనుడా...' అని దీర్ఘము తీయుటయుఁ గలదు. కాని ఈ దీర్ఘము లెక్కింపఁ దగినది కాదు. పాదాంత దీర్ఘములను రచనలోఁ జూపవలసిన యావశ్యకత లేదు. డా॥ యస్వీ జోగారావుగారు ఈ దీర్ఘమును గూడ లెక్కకుఁ దీసికొని యక్షగానములలో జంపెరేకుగాఁ గనఁబడు నీ వరుసను "5×7+ 4" గా నిరూపించిరి (చూ. ఆంధ్ర యక్షగాన వాఙ్మయ చరిత్ర, ప్రథమ భాగము, పుట. 229). అప్పకవి చెప్పిన యక్షగాన లక్షణములలో జంపెయు నిట్లే (5×7+ 4) యున్నది.

ఈ జంపెవరుసను గానము చేయునప్పుడు చివరి త్రిమాత్రాక గణము పంచమాత్రాకముగా మాఱిపోవును. అప్పుడీవరుస సరిగా ద్విరదగతి రగడను బోలియుండును. ఈ జంపెవరుస పాదములోని రెండు దళములను రెండు భిన్నపాదములుగాఁ దలంచినప్పుడు ద్విరదగతి రగడ. అట్లుకాక, రెండు దళముల నొకే పాదముగా భావించినప్పుడిది 'జయభద్ర రగడ' యగును. (జయభద్రరగడ యనఁగా ద్విరదగతి రగడకు రెట్టింపు. ఇందు నైదు మాత్రల గణములు పాదమునకు నెనిమిది యుండును.) పాడుటనుబట్టి చూచినచో నీ జంపెవరుసలోని రెండు దళములు నొకే పాదమని స్పష్టమగును. శ్రీ టేకుమళ్ల కామేశ్వరరావుగారును ఇట్లే భావించుచున్నారు. "సర్వ సాధారణంగా ఒక చరణంలో ఏడు అయిదేసి మాత్రాగణాలు, చివర ఒక మూడు మాత్రలగణం ఉంటాయి. చరణం పొడుగుగా ఉండడం బట్టి రెండు పంక్తులుగా వ్రాయబడుతుంది. 'హరిహరీ నారాయణాది నారాయణా, కరుణించి మమ్మేలు కమలలోచనుడ'- అనుదానియొక్క లక్షణమదే అని చెప్పవచ్చు. ఒక్కొక్కప్పుడు గణంలో ఒక మాత్ర హెచ్చవచ్చు, తగ్గవచ్చు. కాని అది సకృత్తు".

ఈ జంపెవరుసలోని రెండు దళములను నొకేపాదముగా భావించుట కొక చిన్న యాటంకమున్నది. రెండు దళములకును నేకయతి లేదు. మొదటి దళమునందు 1-3 గణములకు వాడఁబడిన యతికిని, రెండవ దళమునందు 1-3 గణములకు వాడఁబడిన యతికిని సంబంధముండదు. రెండు ద్విపదపాదము లొక పాదముగా నేర్పడిన తరువోజలో మాత్ర మొకే యతి వాడఁబడును. కాఁబట్టి జంపెవరుసలోని రెండు దళములను రెండు భిన్న పాదములుగాఁ దలంపవలెనేమో! కాని ఈ తలంపు సరికాదనుటకు రెండు కారణములున్నవి. సీసపద్యపాదములో నెనిమిది గణములకును నేకయతి లేదు. మొదటి నాలుగు గణములు నొకదళము, రెండవ నాలుగు గణములు వేఱొక దళము. మొత్త మీ యెనిమిది గణములు నొకే పాదమని లాక్షణికులు సూచించియున్నారు. అట్లే ఈ జంపెవరుసలోని దళములనుగూడ నేకపాదముగాఁ దలంపవలసి యున్నది. కొన్ని పదములలో మొదటి యెనిమిది గణముల పాదమునకును, రెండవ యెనిమిది గణముల పాదమునకును ప్రాస పాటింపఁబడినది. దీనినిబట్టి కూడ రెండు దళములు నొకే పాదమని భావింపవలసియున్నది.

'పదము' లను పేరగల రచనలన్నియును ఏమాత్రమును భేదము లేకుండ, ఈ 'హరిహరీనారాయణా...' యను వరుసలోనే యుండును. అందుచే వీనిని 'హరిహరీ పదము' లనియుఁ బిలుతురు.

లక్ష్మణమూర్ఛ పదము:-

***"వింత ధూ, ళులు గ్రమ్మి, వివశుడై, పడియున్న,***
***తమ్ముని, బట్టుకొని, తాను శో, కించె***
***రాఘవులు, శోకింప, రాలె చు, క్కలు ధరణి***
***కపిసేస, లన్నియును, కావుమని, యేడ్చె"***

కుశలాయకము:-

***"ఆడజన్మముకన్న అడవిలో మ్రానునై***
***పుట్టితే మేలనుచు బుధులు పల్కుదురు***
***నాడు చెప్పిన మాట నేడు నిజమాయెను***
***ఏమి సేయుదునింక నెందు జొచ్చెదను".***

ఇందు రెండు దీర్ఘపాదములకును ప్రాస కనఁబడుచున్నది ('ఆడ-నాడు'). రెండవ దీర్ఘపాదమున 'నాడు-నేడు' అను ప్రాసయతి యును బాటింపఁబడినది.

గంగావివాహము పదములోఁ గొన్ని పాదములలో రెండు దళములకును నేకయతి పాటింపఁబడుట గమనింపవచ్చును:

***"పదివేల నేరములు భామరో నావల్ల***
***పదివేల దండములు భామరో నీకు***
***అంతఃపురంబులో కరిగి వారిద్దరు***
***హంసతూలిక తల్పమందు గూర్చుండి***
***అంతరంగమునందు నరమరలు లేకుండ***
***ఆనందులైయుండి రా వధూవరులు***
***కంఢ్లుగానని యంత గయ్యాళి నే గాను***
***గవురమ్మ ఆకాశ గంగనే నేను"***

కాని ఇట్టి పాదములు సకృత్తుగాఁ గానఁబడును.

విరాటపర్వము పదములోఁ గొన్ని దీర్ఘపాదములలో రెండు దళములకును నేక యతి లేకపోయినను, ఏక ప్రాసయతి కూర్పఁ బడినది:–

***"దొండపండును బోలు నిండైన యధరంబు***
***గండపాలిక లొప్పు మెండు తళుకులను***
***మాటి మాటికి ద్రాగి సూటిముదమున దోగి***
***గోటి గుబ్బల నాతి సాటి మెరసితివి"***

ఏమైనను, నిట్టి ప్రాసలు ప్రాసయతులు కవులు ఉత్సాహముతోఁ జేసినట్టివే కాని నియమములలోనివి కావు. ఈ హరిహరీపదముల వరుసలో దీర్ఘపాదములోని రెండు దళములకును నేకయతిని బాటింపవలసిన యవసరము లేదు. దేనికదే ప్రత్యేకయతిని గూర్చు కొనవచ్చును. అందుచే నీ రెండింటిని సీసపద్యములోవలె నేక పాదములోని రెండు దళములుగా భావించుట యుక్తము.

ఈ పదముల వరుసను 'హరిహరీ నారాయణా...' ఇత్యాది గానే కాక, ఈ క్రింది విధముగాఁగూడఁ గొందఱు కవులు నిరూపింతురు:–

**'శ్రీరామ జయరామ సీతాపతే రామ, నీకు వందనమయ్య లోకనాయకుడ'.** ఎట్లు నిరూపించినను మాత్రాగణములు మాత్రము '5+5+5+5, 5+5+5+3' అను రీతినే యుండును. రెండు దళములలోను 1–3 గణాద్యక్షరములకు యతినియమ మున్నది. అంతే.

ఆధునికు లీ పదముల ననుకరించుచు 'జముకులకథ' లను పేర రచనలు చేయుచున్నారు. వీరును బైలక్షణములనే పాటించు చున్నారు. శ్రీ వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు రచించిన 'అజాదు హిందుఫౌజు, రాణీసంయుక్త, అజామిళోపాఖ్యానము, భక్తప్రహ్లాద, గాంధీనిర్యాణము, నేతాజీ సుభాసుచంద్ర బోసు అంతర్ధాన గాథ' అను జముకుల కథలు పైన తెల్పిన హరిహరీ పదముల వరుసలోనే యున్నవి. అజాదు హిందుఫౌజు జముకుల కథలోని ఈ క్రింది పాదములు చూడుఁడు:–

***"కటికి చీ, కటిలోన, కనక సూ, ర్యుని వలెను***
***సింగపూ, రుకు బోసు, జేరె జై, యనగ***
***స్వతంత్ర, భారత, సైన్యంబు, నెలకొల్పి***
***భటులతో, నిట్లని, పల్కుచుం, దెనుగ"***

కొన్ని కథలలో సత్యనారాయణశాస్త్రిగారు పాదములోని రెండు దళములకు నేకయతిని బాటించిరి. నేతాజీ సుభాసుచంద్ర బోసు అంతర్ధాన గాథలో నిట్టి పాదములున్నవి:–

***"ధర్మంబు స్థాపింప– ధర్మదేవత యనగ***
***ధరబుట్టె నేతాజీ– దైవయంశమున***
***భరతమాత దాస్య– పగ్గముల్ త్రెంపంగ***
***పరుగు పరుగున బోయె – పరదేశములకు"***

కొన్ని బుఱ్ఱకథలలోఁ గూడ నీ 'జముకుల వరుస' కానవచ్చు చున్నది. నదీరాగారు రచించిన 'రామాయణము' బుఱ్ఱకథలో నిట్టి జముకుల వరుసలను జూడవచ్చును.

## 7. 'శారద వరుస'

హరిహరీ పదములవలెనే శారద పదములును నొక ప్రత్యేకమగు ఛందస్సులో నడచును. దీనిని 'శారద వరుస' యందురు. ఇది అటతాళమున నంత్యప్రాసతో సాఁగు దరువు. ఒక అంత్యప్రాసతో నిరువది ముప్పది పాదములు వ్రాసి, పునరావృత్తి యందుకొనఁ బడును. మరల వేఱొక అంత్య ప్రాసతో మఱికొన్ని పాదములు వ్రాసి పునరావృత్తి చెప్పఁబడును. ఇట్లు ప్రతి ఖండిక (stanza) కు నొక ప్రత్యేకమగు నంత్యప్రాస యుండును. ఈ యంత్యప్రాస ఖండికకు ముందు సూచింపఁబడుచుండును.

ఈ శారద వరుసలో నొక్కొక్క పాదమునఁ బదునాఱు మాత్ర లుండును. అవి 3+5+5+3 గా విఱుగును. పాడుటలో మొదటి మూఁడు మాత్రలను విఱిచి, తక్కిన పదమూడు మాత్రలను గొంచెము సన్నిహితముగా నుచ్చరింతురు. ముక్తాయింపులో మాత్రము నాలుగు గణములను నొకే బిగితోఁ బాడుదురు. మొదటి గణమున మూఁడు మాత్రలకు నొక గురువు నొక లఘువు కాని, మూఁడు లఘువులు కాని యుండవలెను. కాని యొక్కొక్కప్పు డొకే గురువుండుట తటస్థించును. ఇది సాహిత్యాక్షరము మాత్రమే. పాడుటలో నీ సాహిత్యాక్షరము ప్లుతముగా నుచ్చరితమై మూఁడు మాత్రలును గిట్టింపఁబడుచుండును. కాఁబట్టి శారద వరుసలో సంగీతాక్షరము లెప్పుడు 3+5+5+3 గానే యుండును. 'తకిట, కిటతకిట, కిటతకిట, తకిట' అనియు దీనిని నిరూపింపవచ్చును.

రామభక్తకవి శారద రామాయణము:–

**3 + 5 + 5 + 3**

ఆదు: ***"తల్లి, కొడుకు నె, త్తుక ముద్దు, లాడు***
***మోద, మలరంగ, ననుగన్న, వాడు***
***నా³, వెలలేని, మానికము, వీడు***
***నా³, కులదీప, కుందైన, వాడు"***

పూడిపెద్ది బుచ్చన్న పంతులు గోపికా వస్త్రాపహరణము:–

**3 + 5 + 5 + 3**

అంగ: ***"అపుడు, కృష్ణుండు, మోదమల, రంగ***
***గజ్జె, లందెలును, ఘనత మీ, రంగ***
***ఘల్లు, ఘల్లుమని, మ్రోయుచుం, దంగ***
***ముద్దు, నాట్యములు, సల్పుచుం, దంగ"***

వేదా వెంకట కృష్ణయ్యగారి శారద హరిశ్చంద్ర చరిత్ర:-

**3 + 5 + 5 + 3**

**అనెను:** ***"చంద్ర, మతి మేది, నీశుతో, ననెను***
***పుణ్య, మూర్తి ధ, ర్మజ్ఞుండ, వనెను***
***పాము, గరచె బా, లునకు నే, దనెను***
***దహన, ముకు కట్న, మియ్య లే, ననెను***
***దీను, రాల నే, దిక్కు లే, దనెను"***

ఈ శారదవరుసలో యతిప్రాసలు నియతముగా లేవు. కాని ప్రథమ తృతీయ గణాద్యక్షరములకుఁ (1-9 అక్షరములకు) కాకతాళీయముగా నెచ్చటనైనను యతి పడవచ్చును. పై యుదాహరణములలో 'గజ్జె లందెలును- ఘనత మీరంగ' 'దీనురాల నే దిక్కులేదనెను' అను పాదము లిట్టి కాకతాళీయ యతికి నుదాహరణములు కాగలవు.

ఈ శారద వరుసలో నొక్కొక్కప్పుడు మొదటి మూఁడు మాత్రల గణమును లోపింపఁజేసి '5+5+3' అను మూఁడు గణములతోనే రచన సాఁగించుట కూడఁ గలదు. సోమయాజుల రామజోగిశాస్త్రిగారి శారద సారంగధర చరిత్రలో నీ క్రింది పాదములను గమనింపుఁడు:-

**5 + 5 + 3**

**మేలు:** ***"ఆ రాజ, రాజ భూ, పాలు***
.............................
***దిద్దించె, చెంప ఖ, ల్లీలు***
***కస్తూరి, నిడుద తిల, కాలు***
***ఘుమఘుమా, దివ్య గం, ధాలు***
***చిత్రంపు, వన్నె పా, గాలు***
***ఆమీద, సకల పు, ష్పాలు***
***జలతారు, పువ్వు టం, గీలు***
***ఆపైని, రంగు వా, ణీలు"***

ఇట్టి శారదవరుసకే యతిప్రాసలు బిగించి బుఱ్ఱకథలలో 'భళిభళీ వరుస'గా నుపయోగించుచున్నారు: సుంకర సత్యనారాయణ గారి అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథలో నీ క్రింది పాదములను జూడుఁడు:-

**5 + 5 + 3**

***వీర వని, తలు పుట్టి, నారు భళి భళీ***
***విజయ భే, రిని గొట్టి, నారు ,,***
***రుద్రమాం, బనుమరచి, నావ ,,***
***రూపు మా, పిం దరుల, తెగువ ,,***
***వీర బొ, బ్బిలి కథలు, వినవ ,***
***వీర పూ, జలు చేయ, రావ ,,***

ఈ శారద వరుసలోని పాదములు పైన తెల్పిన రెండు విధములుగా నున్నను, పునరావృత్తి మాత్రము కొంచెము భిన్నముగా నున్నది. శారద పదములలో 'ఔ శారదా కరుణానిధీ' (శారద రామాయణము), 'చిన్నికృష్ణయా పొన్న దిగవయా' (గోపికా వస్త్రాపహరణము), 'సోమశేఖరా శ్రితవశీకరా' (శారద హరిశ్చంద్ర), 'చంద్రశేఖరా మంగళాకరా' (శారద సారంగధర) అను పునరావృత్తులు కనఁబడుచున్నవి. ఇందు మొదటిది తప్ప, తక్కినవన్నియును (3+5)+(3+5) అను మాత్రల నడకలో నున్నవి. సంగీతాక్షరములలో వీనడక నిట్లు చెప్పవచ్చును: 'తకిట కిటతకిట, తకిట కిటతకిట'. శారద రామాయణములోని పునరావృత్తి మాత్రము '(2+5) + (2+5)' అను మాత్రలలో నడచినది. పాడునప్పు డిది కూడఁ పై పునరావృత్తుల వలెనే యుండును గాఁబోలును.

## 8. 'జంగం రగడ'

జంగంకథలలోఁ గథాఖ్యానమున కుపయోగించు రగడను 'జంగం రగడ' యని పిలువవచ్చును. ఏలయన, రగడలలోఁ బెక్కు రకములున్నవి. హయప్రచార రగడ, మధురగతి రగడ, ద్విరదగతి రగడ, హరిణగతి రగడ, వృషభగతి రగడ మున్నగు తొమ్మిది రగడలను లాక్షణికులు పేర్కొన్నారు. జంగంకథలలోఁ గేవలము 'రగడ' యను పేరుతో మాత్రమే ఇది వ్రాయఁబడుచుండును. అందుచే స్పష్టత కొఱకు దీనిని 'జంగం రగడ' యనవలెను. వట్టి రగడ యని పిలిచినచో నర్థక్లేశము కలుగును.

8+8+9 (10) మాత్రలొక పాదముగా సాఁగునది జంగం రగడ. ఇది సరిగా బొబ్బిలికథ వరుస వంటిదే. కాని ఇందు రెండు రెండు పాదములకు నాదిప్రాస యంత్యప్రాస నియతముగా నుండును. 1-3 గణముల ఆద్యక్షరములకు (1-17 అక్షరములకు) యతి కూడ విధిగాఁ బాటింపఁబడును. బొబ్బిలివరుసలో యతిప్రాసల నియమము లేదు. దేసింగురాజుకథలోని రగడ జంగంరగడకుఁ జక్కని యుదాహరణము. జంగంకథలలోఁ గీర్తనలు, దరువులు, పద్యములు, వచనములు నెన్నియున్నను గథాఖ్యానమున నీ జంగం రగడనే ప్రయోగింతురు. ఈ జంగం రగడలోఁ జివర దీర్ఘము తీసినచో మూఁడవ గణము పది మాత్రలగును, లేనిచోఁ దొమ్మిది మాత్రలుగనే యుండును. చివరి దీర్ఘము పెక్కుచోట్లఁ జూపరు. రచనలో మూఁడవ గణమును దొమ్మిది మాత్రలుగనే వ్రాయుట పరిపాటి. జంగం రగడలోఁ బ్రాసయున్నను బ్రాసయతి కూడ వాడఁబడుచుండుట వింత. ఈ క్రింది యుదాహరణములను జూడుఁడు: (ఇందు మొదటి యుదాహరణములోఁ జివర దీర్ఘములేదు. రెండవ యుదాహరణమున దీర్ఘమున్నది).

**8 + 8 + 9**

***"పురవీథిని జను, దెంచుచుండగా- తరుణులు బొడగాంచి***
***అరుదుగాను ఆ, శ్చర్యపడుచునూ- ఆ రమణులు చెలగి"***

(-కిలారి బ్రహ్మయోగి, భల్లాణరాయ చరిత్రము జంగంకథ)

**8 + 8 + 10**

**"అడుగు ధరామర, యిచ్చెద నేనూ- అఖిలార్థము లెల్లా**
**పుడమిని కలుము ల, శాశ్వతంబులని- నుడివిరి సద్బుధులూ".**

(-గ్రంధి వెంకటరాయగుప్తగారి వామన విజయము జంగంకథ)

ఈ జంగంరగడ మన తెలుఁగులోనికి రెండు విధములుగా వచ్చియుండును. ప్రాచీనమైన బొబ్బిలికథలోని వరుసకే యతిప్రాసలు బిగించి, 20వ శతాబ్ది ప్రారంభమున బయలుదేరిన జంగంకథలలోఁ గథాఖ్యానమునఁ బ్రవేశపెట్టి యుందురు. లేదా, 19వ శతాబ్ది యుత్తరార్థమున ఆంధ్రదేశమునకు వచ్చిన ధార్వాడ నాటక సమాజములవారిచే నిది ప్రవేశపెట్టఁబడియుండును. ధార్వాడ వారి 'డోరా, తౌహరా, గజల్, లావణి' మున్నగు హిందూస్తానీ ఛందస్సులకును (వీనిని మనవారు 'పార్సీ మట్లు' అందురు) జంగం రగడకును చాల దగ్గఱి పోలికలున్నవి.

జంగంరగడకు బొబ్బిలివరుసతోఁగల సంబంధమునుగూర్చి వెనుకఁ జెప్పితిని. ఇప్పుడు డోరా, తౌహరా, గజల్ మున్నగు వానితో జంగంరగడకుఁ గల సంబంధమును జర్చింతును.

ధార్వాడ నాటక సమాజములవారి పార్సీమట్లు యక్షగానముల లోను, హరికథలలోను నెక్కువగాఁ బ్రవేశించినవి. ఈ నాటక సమాజములవారు మహారాష్ట్రులు. మహారాష్ట్ర వీరగాథలలో 'లావణి' యను ఛందస్సు విరివిగా వాడఁబడుచుండును. ఈ లావణిలో మన జంగం రగడకన్న సరిగా రెండు మాత్రలధికముగా నున్నవి. జంగం రగడ 8+8+9 లేక 10 మాత్రలతో నుండఁగా, నీ లావణిలో 8+8+11 లేక 12 మాత్రలుండును. గోపాల రామదాసకవి సీతా స్వయంవరమను యక్షగానమునుండి 'లావణి'కి నీ క్రింది యుదాహరణమును గ్రహింపవచ్చును (చూ. డా॥ యస్వీ జోగారావు గారి ఆంధ్ర యక్షగానవాఙ్మయ చరిత్ర, ప్రథమ భాగము, పుట 343).

**8 + 8 + 12**

**"కొంకణ దేశా, ధీశుని విలు చే- కొమ్మని జనకుం డనగా**
**కొంకక కదుపున, సంకటమనుచును- బొంకి యతఁడు పొమ్మనెనే"**

ఇందు రెండవ పాదమునఁ బ్రాసయతియుఁ గలదు. ఆంధ్ర యక్షగానవాఙ్మయ చరిత్రలో (ప్రథమభాగము, పుటలు 321, 325) జోగారావుగారు 'గజల్'కు 'డోరా'కు నిచ్చిన యుదాహరణము లచ్చుముగా జంగంరగడవలెనే యున్నవి. ఏ మాత్రమును భేదము లేదు.

**గజల్:-** బాగేపల్లివారి కుచేలోపాఖ్యానము యక్షగానమునుండి-

**8 + 8 + 9**

**"ఎన్ని దినంబులు, జీవించిన నరు- డీల్గుట సత్యంబు**
**ఎన్నో విధముల, ధనమార్జించుట - లేలా నిత్యంబు"**

**డోరా:-** గజేంద్రాళ్వారుని చరిత్ర యక్షగానమునుండి-

**8 + 8 + 9**

**"ఆ యిందిరయును, నతివిస్మితయై - యరుగుచుండె వెనుక**
**తోయజాక్షి తన, మనమున నేమియుఁ - దోఁచకుండె గనుక"**

పురాణం పిచ్చయ్యగారి 'కపటవేశ్యానాటకము'న 'డోరా గజల్మట్టు' అను నొక విశేష నామము గన్పట్టుచున్నది. ఈ డోరా గజల్ మట్టు కూడ నచ్చుముగా జంగంరగడవలెనే యున్నది:

**8 + 8 + 9**

**"వినవే తల్లీ, యీ రమ్యాంగుని- విషయము తెల్పెదను**
**వనజభవాన్వయ, వార్ధి సుధాకరు - డనఘుండీ ఘనుడు"**

ఇందు ద్వితీయ పాదమునఁ బ్రాసయతి పడినది.

ఇట్లు యక్షగానములనుబట్టి పరిశీలింపఁగా, 'గజల్, డోరా, డోరా గజల్ మట్టు'- అను పార్సీమట్టులే 'రగడ' యను పేరుతో జంగం కథలలోఁ బ్రవేశించెనని తోఁచుచున్నది. కాని కీర్తనల కథలలో నుపయోగింపఁబడిన 'డోరా'-'తౌహరా' అను ఛందస్సులు మాత్రము, యక్షగానములలోని 'డోరా, గజల్, డోరా గజల్' అను వానికంటె భిన్నముగా నున్నవి. ఇవి సరిగాఁ బైన తెల్పిన 'లావణి' ఛందస్సువలె నున్నవి.

కుచేలుని చరిత్ర (కీర్తనల గాథ)లోని 'డోరా':-

**8 + 8 + 11**

**"ఘనుడు కుచేలుం, డను నొక విప్రుఁడు-గలఁ డతి దారిద్రుండు**
**మనమున గృష్ణ ప, దాబ్జము లెప్పుడు-మానక తాఁ గనుచుండు"**

పెద్దదాసు చరిత్రము (కీర్తనల గాథ) లోని 'డోరా' కూడ నిట్లే యున్నది:

**8 + 8 + 12**

**"తల్లి దండ్రి తమ, తాపత్రయములు- దాసవరునితోఁ బల్కగ**
**చల్లదనంబున, శాస్త్రంబులచే - సాధుబృందములు దెలుపన్"**

'తిరుపతి రథోత్సవ మాహాత్మ్య'మను తౌహరా కావ్యములో 'తౌహరా' కూడ పై డోరాల వలెనే యున్నది:-

**8 + 8 + 12**

**"భజగోవిందం, హరిగోవిందం - భజగోవిందం బనరే**
**నిజమదిలో శ్రీ, వేంకట విఠలుని - నిత్యము భజించు కొనరే"**

'శ్రీవేంకటేశ్వరులు కోర్టులో సాక్షిచెప్పిన అద్భుత హరికథ'లో 'తోహర' యను పేరఁగల ఛందస్సును బైవానివలెనే యున్నది.

ఈ కీర్తనల గాథలే తరువాతి కాలమున 'హరికథ' లనఁ బడినవి. కీర్తనల గాథలలోని 'డోలా, తౌహరా, తోహర' అనుపేర్లు 'మంజరి' లేక 'మంజుగతి'గా హరికథలలో మాఱినవి. హరికథలలోని ఈ మంజరి, మంజుగతులు సరిగాఁ గీర్తనల గాథలలోని డోరా, తౌహరాల ఛందస్సులోనే యున్నవి కాని, యక్షగానములలోని గజల్, డోరాలవలె లేవు. శ్రీమదజ్జాడ ఆదిభట్ల నారాయణదాసుగారి ప్రహ్లాద చరిత్రము హరికథలోని 'మంజరి'ని జూడుఁడు:-

**8 + 8 + 11**

*"గురువునొద్ద ను, న్న సుతు బిలిపించి - గోరిక యువ్వెళు లూర*
*నరుదుగ దొడలం, దిదుకొని ముద్దిడి - యనియె స్వేదుక మీర"*

జగంరగడలో వలెనే ప్రాస నియతముగా నున్న ఈ ఛందస్సునఁ బ్రాసయతియు నచ్చటచ్చట గోచరించుట శోచనీయము. శ్రీ ములుకుట్ల పున్నయ్యశాస్త్రి భాగవతారు రచించిన సీతాకల్యాణము హరికథలోని 'మంజరి'ని జూడుఁడు:-

*"గురు సహితుండై, పంక్తిరథుడు ముని- వరున కెదురుగా వచ్చి*
*కరమద్భుత భ, క్తిని బూజసల్పి - వర పీఠంబును నిచ్చి"*

పై చర్చనుబట్టి మహారాష్ట్రులైన ధార్వాడ నాటక సమాజము వారిచే 19వ శతాబ్దపు టుత్తరార్ధమునఁ గొన్ని పార్శీమట్లు తెలుఁగు నకుఁ బరిచయము చేయఁబడిన వనియు, వానిలో 'లావణి, గజల్, డోరా, డోరా గజల్ మట్టు'- అనునవి యక్షగానములందును; 'డోరా, తౌహరా, తోహర'- యనునవి కీర్తనల గాథలలోను గాన్పించు చున్నవనియుఁ దెలియుచున్నది. యక్షగానములలోని 'గజల్, డోరా, డోరా గజల్ మట్టు' ఈ మూఁడును నొక్కటే (8+8+9). యక్షగానముల లోని 'లావణి', కీర్తనలగాథలలోని 'డోరా, తౌహరా, తోహర'- ఇవన్నియును నొకే ఛందస్సు: (8+8+11). యక్షగానములలోని గజల్, డోరా, డోరా గజల్ మట్టు- అనునవే జంగంకథలలో 'రగడ' యనుపేరఁ గనఁబడుచున్నవి. కీర్తనల గాథలలోని డోరా, తౌహరా, తోహర లే హరికథలలో 'మంజరి' లేక 'మంజుగతి' యను పేరఁ బ్రత్యక్షమగుచున్నవి. ఈ విధముగా జంగం రగడ మనకు మహారాష్ట్రులనుండి సంక్రమించి యుండును. (ముగ్గురు మరాటీల కథలోని సైసై వరుస కూడ నిట్లు మహారాష్ట్రుల నుండియే మనకు సంక్రమించి యుండునని నా యనుమానము).

ఒకే పేరుతోనున్న 'డోరా' యక్షగానములలో నొకతీరునను, గీర్తనలగాథలలో వేఱొకతీరునను నున్నది. ఇది యసమంజసము. యక్షగానకర్తలు గాని, కీర్తనలగాథాకర్తలు గాని, పొరఁబడి యుందురు. కీర్తనల గాథాకర్తలు లావణిని డోరాగా భ్రమించియుందురు. లేదా లావణియు డోరాయు నొక్కటేయగుచో యక్షగానకర్తలు గజల్‌ను డోరాగా భ్రమించియుందురు.

## 9. బుఱ్ఱకథల వరుసలు

బుఱ్ఱకథలు ప్రాచీన వీరగాథలకు రాజకీయానుకరణములు. సాంప్రదాయిక వీరగాథలలోవలె వీనిలో నాద్యంత మొకే ఛందస్సు మృగ్యము. జంగంకథలవలె నివి సమాహార రూపమున నుండును. జంగంకథలనుండి రగడ, కీర్తనలు, వచనములు బుఱ్ఱకథలలో గ్రహింపఁబడినవి. సాంప్రదాయిక వీరగాథలనుండి తందాన వరుసలు, సైసై వరుస, సర్వాయి పాపని వరుస మున్నగునవి స్వీకరింపఁబడినవి. (ఈ యనుకరణములనుగూర్చి ఆయా సందర్భములందుఁ గొంత చెప్పితిని. తక్కినవిటఁ జూపుదును.)

### 1. బుఱ్ఱకథలలోని జంగంరగడకు ఉదాహరణము:-

**8 + 8 + 9**

*"నగ శిఖరంబుల, నుండి దూకుటా - నదులకు అలవాటు*
*సొగసుగ తుంపర, లట తుషారమన - నెగసి యాడుచుండు"*

- సుంకర సత్యనారాయణగారి 'అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథ'

జంగంరగడలో వలెనే ఇందుఁ బ్రాసయతియుఁ బ్రయోగింపఁ బడినది.

### 2. బుఱ్ఱకథలలోని బొబ్బిలి వరుస:-

బుఱ్ఱకథా రచయిత లందఱును యతిప్రాసల బిగింపుతోనున్న జంగంరగడనే యనుకరింపఁగా, నొక్క నాజరు మాత్రము భావము దెబ్బతినునని తోఁచిన తావులలో యతిప్రాస రహితమగు బొబ్బిలి వరుసనే పాటించినాఁడు. అతని 'పల్నాటి యుద్ధము' బుఱ్ఱకథను జూడుఁడు:-

**8 + 8 + 9**

*"మాల కన్నమను, బ్రహ్మానాయుడే - ప్రేమతొ పెంచాడు*
*కన్నమదాసును, సేనాపతిగా - జేసెను బ్రహ్మయ్య"*

### 3. సైసై వరుస:-

బుఱ్ఱకథాకవులు ప్రాచీనమగు ముగ్గురు మరాటీల కథలోని సైసై వరుసను గ్రహించి, దానికి యతిని నంత్యప్రాసను గూర్చిరి. ఈ సైసై వరుసను పలువురు పలురకములుగా నిరూపించిరి.

వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు- భగవద్గీత బుఱ్ఱకథలో-

*"భళా, నోయి, భాయి, తమ్ముడా - సై*
*మేలు, భళా, నోయి, దాదానా"*

షేక్ నాజరు పల్నాటి యుద్ధము బుఱ్ఱకథలో...

*"భళా, నంటి, భాయి, తమ్ముడా- సై*
*మేలు, భళా, నోయి, దాదానా"*

సుంకర సత్యనారాయణగారు సీతారామరాజు బుఱ్ఱకథలో...

*"భళా, భళా, నోయ్, తమ్ముడా- సై*
*భాయి, భళా, నోయ్, దాదానా"*

'నదీరా'గారు తన లడక్ వీరులు బుఱ్ఱకథలో...

*"భళక్కి, భళాని, తమ్ముడా- సై*
*భళని భళారే, దాదానా"*

పై నాలుగు వరుసలలోను మొదటి రెండును నొక వర్గమునకుఁ జివరి రెండును వేఱొక వర్గమునకుఁ జెందును. ఒకటి, రెండు వరుసలకు 'భళానోయి'- 'భళానంటి' యను నొక్క శబ్దభేదము తప్ప మాత్రాభేదమేమియును లేదు. ఈ వరుసలలోని మాత్రల నిట్లు చూపవచ్చును: "(3+3+3) +5; (3+3+3)+ 6." పూర్వ

పాదములలో 14 మాత్రలు, ఉత్తరపాదమున 15 మాత్రలు. మూఁడు నాలుగు వరుసలకు శబ్దభేదము విశేషముగా నున్నది కాని, మాత్రాభేదము లేదు. పూర్వపాదములలో 13 మాత్రలు, ఉత్తర పాదమున 14 మాత్రలును గలవు. ఇట్లు మాత్రల మొత్తము సంఖ్యలో భేదము లేకున్నను, మాత్రల వరుస క్రమమున మాత్రము మూఁడు నాలుగు వరుసలకు భేదమున్నది. మూఁడవ వరుసలోని మాత్రలు: "(3+3+2) +5; (3+3+2) +6". నాలుగవ వరుసలోని మాత్రలు: "(4+4)+5; (4+4)+6". మూఁడవ వరుసలోని మాత్రలను (3+5) +5; (3+5)+6" అనియు నిరూపింపవచ్చును. మూఁడు నాలుగు వరుసలు సాధారణముగాఁ గలసియే యుండును. అసలు, రసాను గుణముగాఁ బైవరుసలన్నియుఁ గలిపి ప్రయోగింపఁబడుచుండును. ఒకటి రెండు వరుసలకు ఉదాహరణము:-

**(3 + 3 + 3) + 5**
***"నీతి, గల్ల, జాతి, కోడిరా, - సై***
***కూత, బెట్టి, మింటి, కెగసెరా-సై***
***నోట, బట్టి, పెట్ల, మారినీ- సై***
***(3 + 3 + 3 + ) + 6***
***పట్టి, నేల, కే..., కొట్టిందా-" ॥భళానంటి॥***

(-నాజరు, పల్నాటి యుద్ధము.)

మూఁడు నాలుగు వరుసలకు ఉదాహరణము:-

***"భగ్గు, భగ్గు, నే, మండిరీ- సై*** ***(3 + 3 + 2) + 5***
***పట్టి, మీసములు, దువ్వీరీ- సై*** ***(3 + 5) + 5***
***కరకర, కోరలు, నూరిరా- సై*** ***(4 + 4) + 5***
***కాకి, దేగ, నే, దించారా" ॥భళానంటి॥(3 + 3 + 2) + 6***

(- నాజరు, పల్నాటి యుద్ధము.)

అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథలో నీ క్రింది పాదములు '(3+3+2)+5' అను వరుసను స్పష్టముగాఁ జూపుచున్నవి:

***"అడవి, పండ్లు, వే, లున్నవీ-సై***
***అంటు, కుంటె, యమ, బాధరా- సై***
***కొండ, తేనె, లే, ఉన్నవీ- సై***
***పిండి, త్రాగ, దం, డింతురూ- సై"***

నాజరు పల్నాటి యుద్ధము బుఱ్ఱకథలో "(4+4) + 5; (4+4)+6" అను నాల్గవ వరుస చక్కఁగా నిమిడిన పాదములు కొన్ని గలవు.

**(4 + 4) + 5**
***"జిత్తుల, మారీ, నాయకీ - సై***
***నెత్తురు, జెండా, యెత్తెరా- సై***
***జుట్టును, తా విర, బోసెరా - సై***
***దయ్యము, లాగా, నాయకీ - సై***
**(4 + 4) + 6**
***ఆ- కయ్యము, లోనా, నిలిచిందా"- ॥భళానంటి॥***

ఇట్లు సైసై వరుసలో ననేకములగు నడకలను గుర్తింప వచ్చును. ఏ నడకయైనను, పూర్వపాదములు 9+5 =14 మాత్రలు గాఁ గాని, 8+5= 13 మాత్రలుగాఁ గాని సాఁగును. ముక్తాయింపు పాదము 9+6=15 మాతత్రలుగాఁగాని, 8+6= 14 మాత్రలుగాఁ గాని యుండును. ఇది సాధారణ విషయము. ఒక్కొక్కప్పుడు పూర్వపాదములు 10+5= 15 మాత్రలతో నుండవచ్చును. అప్పుడు ముక్తాయింపు 16 మాత్రలతో నుండును (10+6= 16). ఇందలి 10 మాత్రల సమాహారము 5+5 గా నుండవచ్చును. నిదానముగాఁ బాడునప్పుడు పూర్వపాదములలో 15 మాత్రలు లేదా 14 మాత్ర లుండును. ముక్తాయింపు చేయు చివరి పాదమున 16 మాత్రలు లేదా 15 మాత్రలుండును. వేగముగాఁ బాడునప్పుడు పూర్వపాదము లలో 13 మాత్రలు లేదా 12 మాత్రలు నుండి, ముక్తాయింపున 14 మాత్రలుండును. నాజరు పాడు 'తథక్కతోం వరుస'లో ముక్తాయింపు చేయు నుత్తరపాదమే నాలుగు పాదములుగాఁ బొడిగింపఁబడుట చూడవచ్చును. ఈ తథక్కతోం వరుస 'భళా నంటి భాయ్ తమ్ముడా, భాయి భళా నోయ్ దాదానా' అని యుండును. పాదమునకు 8+6= 14 మాత్రలుండును.

## 4. తందాన వరుసలు:-

కాంభోజరాజుకథలోని 8+8 గా సాఁగు వరుసకు యతి ప్రాసలు చేకూర్చి బుఱ్ఱకథలలో తందాన వరుసగాఁ బ్రయోగించు చున్నారు. ఇందు ముక్తాయింపుగా బొబ్బిలివరుస (8+8+9) పాదము నొకదాని నుపయోగింతురు. అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథలోని ఈ క్రింది పాదములు చూడుఁడు:

***8 + 8***
***ఆ జగజెట్టిని, రాజును చూపీ*** ***తందానా తం, దాన తందనా***
***బహుమానముగా, పదివేలిత్తుము*** ,,
***గామునోదరుల, గట్టి తెచ్చితిరొ*** ,,
***భూములిచ్చెదము, పోషించెదమూ*** ,,
***8 + 8 + 9***
***విప్లవ నాయక, వీరుల పదుగుర- వేగమె చూపండి***
***॥తందానా తం, దాన తందనా, తాని తందనాన॥"***

బాలనాగమ్మకథలోని '8+9' మాత్రల వరుసను గూడ యతి ప్రాసలతో బుఱ్ఱకథలలో నుపయోగించుచున్నారు. ఈ వరుసను 'తందాన' మాటలలో నిట్లు చెప్పుదురు: 'తంధన భాయీ, దేవనందనాన - తంధానో'. అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథనుండి ఈ క్రింది యుదాహరణమును గమనింపుఁడు:-

**8 + 9**

***"తెనుగువారి పు, ణ్యంబుల పంట రరె, తంధానో***
***దినమొక తీరుగ, బాలుడు పెరిగాడు ,,***
***పెద యుద్యోగాల్, జేయాలితడంటు ,,***
***పెద్ద లతనిపై, ఆశలు నిలిపారు ,,***

**(ముక్తాయింపు) తంధాన భాయీ దేవనందనాన తంధాని తాన."**

బుఱ్ఱకథలలోఁ బ్రధానముగా వాడఁబడునవి పై నాలుగు వరసలే; అనఁగా జంగంరగడ (మధ్యమధ్య బొబ్బిలి వరుస), సైసై వరుస, తందాన వరుసలు రెండు. ఇంకను జంగంకథలలో వలె పద్యములను కీర్తనలను కొందఱు ఉపయోగించుచున్నారు. బుఱ్ఱకథల లోని సర్వాయిపాపని వరుసను (ఏలవరుస) గూర్చి వెనుక వివరించి యుంటిని. జముకుల వరుసలు కూడ కొన్ని బుఱ్ఱకథలలోఁ గానవచ్చు చున్నవి.

### *5. 'భళిభళీ వరుస' లేక 'ఓ భారతీయుఁడా, ఓ వీరయోధుఁడా వరుస':–*

బుఱ్ఱకథలలోఁ బై నాలుగు వరుసలే కాక, వేఱొక వరుస కూడఁ జాలఁ బ్రచురముగాఁ గాననగును. ఈ వరుసలో 5+5+3 మాత్రలతోఁ గొన్ని పాదములు వ్రాసి, ముక్తాయింపులో (5+5)+(5+5) + 5+5+3 మాత్రల పాదమొకటి వ్రాయఁబడుచుండును. ఇది శారదవరుసలో నొకదాని కనుకరణము. దీనిలో ముక్తాయింపు వరుసలోనే పునరావృత్తి యుండును. ఈ పునరావృత్తిని సాధారణముగా 'ఓ భార, తీయుడా, ఓ వీర, యోధుఁడా, లేవయ్య, లేచిరా, వయ్య' అను మాటలతో సూచించుచుందురు. ఇందు వంత ప్రతిహ్రస్వ పాదమునకును జివర 'భళిభళీ' యని యయిదు మాత్రల నందించు చుండును. సుంకర సత్యనారాయణగారు అల్లూరి సీతారామరాజు బుఱ్ఱకథలో ఈ వరుసలోఁ జక్కని పాటను రచించి యున్నారు:

**(5 + 5) + (5 + 5) + 5 + 5 + 3**
**"ఓ తెలుగు, బిడ్డడా, ఓ వీర, యోధుఁడా,లేవయ్య, లేచిరా,వయ్య**

***5 + 5 + 3***
***బంగారు, నీ తెలుగు, తల్లి – భళిభళీ***
***పాడిపం, టల పాల, వెల్లి ,,***
***వీరాధి, వీరులను, గన్న ,,***
***వీరమా, త యెరుంగు, మన్న ,,***
***శాలి వా, హను డొక్క, నాడు ,,***
***శాత్రవుల, దునిమి యే, లాడు ,,***

***తెలుగువా, రల కీర్తి, దిగ్దిగం, తములందు, వ్యాపింప, జేసివ, చ్చాడు"***
***॥ఓ తెలుగు॥***

ఇందలి లఘుపాదములలో రెండు రెండింటికి యతిపాటింపఁ బడుటచే, నా రెండును నొకే పాదములో రెండు దళములని భావింప వలసియున్నది. చివరనున్న దీర్ఘపాదములో యతి కానరాదు. ఈ పాటను పాడునప్పుడు లఘుపాదముల చివరనున్న త్రిమాత్రాక గణము పంచమాత్రాక గణముగా మాఱిపోవును. వంత 'భళిభళీ' యనుటచే మఱియొక పంచమాత్రాక గణము నందించును. అప్పుడు ప్రతిపాదమును ఖండగతిగా మాఱిపోయి, ద్విరదగతి రగడను బోలియుండును. ఈ వరుసను సాధారణముగా బుఱ్ఱకథలలో చివర ప్రబోధమునకు ఉపయోగింతురు. దీనిని కొంతవఱకును శారదవరుస కనుకరణముగా భావింపవచ్చును. 'నదీరా' రచించిన 'లధక్ వీరులు బుఱ్ఱకథ'లోఁ గూడ నంత్యమున నీ వరుసయున్నది. త నడకలోని చిన్నపాదములు రెండింటిని కలిపినచో 'మధ్యాక్కర' యగును. (**"బంగారు నీ తెలుగు తల్లి– పాడిపంటల పాలవెల్లి".**)

## 10. ఇతరములు

వీరగాథలను గానము చేయునప్పుడు ద్విపదలలోను, ద్విపద మంజరులలోను, జంపెవరుసలలోను ఖండగతి స్పష్టముగా నున్నది. బొబ్బిలి వరుసలలో నాదిగతి యున్నది. సర్వాయిపాపనికథలో మిశ్రగతి కాననగును. తక్కిన త్రిశ్ర, చతురశ్ర, రూపక గతులకు వీరగాథలలో నుదాహరణములు తక్కువగ నున్నవి. జంగం రగడలలోని యెనిమిది మాత్రలగణము కొన్ని చోట్ల 4+4 గా విభక్తమగుచుండును. అట్టిచోట్ల దానిని చతురశ్రగతిగా భావింపనగును. (ఇట్టి పాదములు పాడుటలో 'హరిగతి రగడ' వలె నుండును.)

త్రిశ్ర, దీనికి రెట్టింపగు రూపక గతులకు ఉదాహరణములు చాలఁ దక్కువ. తెలంగాణ మందలి కిన్నెర కథలలోఁ ద్రిశ్రగతి తోఁ చుచున్నది. మియాసాబుకథను జూడుఁడు:–

***"తల్లి, పేరు, ఆశ, బీబి, – తండ్రి, పేరు, బంది, సాబు,***
***లేక , లేక, కొడ్కు, పుద్తె– కొడ్కు, కేమొ, నొప్పి, పుట్టె***
***అమ్మ, లార, అక్క, లార– సూతు, రాండ్రి, తల్లు, లార***
***సుక్క, వంటి, మియా, సాబు – సూత, మన్న, కాన, రాదు"***

ఇందు మూఁడు మాత్రల గణములు పాదమున కెనిమిది యున్నవి. కాబట్టి దీనిని 'తురగ వల్గన రగడ' యనవచ్చును. కాని ఈ పాట రచనలో త్రిశ్రగతిగా నున్నను పాడుటలో మిశ్రగతిగా మాఱిపోవుచున్నది. పాదమునఁ బ్రతిదళమునందును మొదటి గణము మూఁడవ గణము పాడుటలో సాగఁదీయఁబడి నాలుగు మాత్రలగుచున్నది:

***"తల్లీపేరు, ఆశాబీబి – తండ్రీపేరు, బందీసాబు***
***లేకాలేక, కొడ్కూపుద్తె, కొడ్కూకేమొ, నొప్పీపుట్టె***

***అమ్మాలార, అక్కాలార - సూతూరాంఢ్రి, తల్లూలార***
***సుక్కావంటి, మియ్యాసాబు - సూతామన్న, కానారాడు"***

ఇప్పుడిది '(4+3) + (4+3) + (4+3) + (4+3' అను మాత్రలు నడకతో, అనఁగా 7+7+7+7 మాత్రలుగా నడచుచున్నది. అనఁగా 'వృషభగతి రగడ' యనవచ్చును. 'కిటతక తకిట' అను నావృత్తములు పాదమునకు నాలుగున్నవి.

తెలంగాణమందలి మఱియొక కథ 'కొమిరెల్లి మల్లన్న కథ' కూడ త్రిశ్రగతిలోనే సాగుచున్నది:-

***"రూప, మందు, మన్మ, ధూడు - వోపి, కందు, ధర్మ, రాజు***
***ధైర్య, మందు, భీము, డయ్యు - శౌర్య, మందు, అర్జు, నూడు"***

ఇందు నాలుగు గణము లొక పాదముగా భావింపవలెను. ప్రతి రెండు పాదములకును ప్రాస పాటింపఁబడినది. అందుచే నిది అచ్చముగా 'హయప్రచార రగడ' (3+3+3+3) యనవచ్చును. లేదా, ఇందు ఎనిమిది గణములొక పాదముగా భావించినచో 'తురగవల్గన రగడ' యగును. హయప్రచారమునకు రెట్టింపు తురగవల్గనము. రగడలలో రెండు రెండు పాదములకుఁ బ్రాస విధిగా నుండును. అందుచేఁ బై యుదాహరణమున నాలుగు గణములొక పాదముగా భావించుటయే సమంజసమగును. అప్పుడది హయప్రచారమే యగును.

ఈ కొమిరెల్లి మల్లన్న కథలో సర్వేసర్వత్ర గణములు మూఁడు మూఁడు మాత్రలుగా వినఁబడుటలేదు. కొన్నిపట్ల మూఁడు మాత్రల గణములు రెండు రెండు దగ్గఱగాఁ జేరి యాఱు మాత్రల గణములుగా ధ్వనించుచున్నవి. అట్టిచోట్ల రూపకగతి యగుచున్నది. త్రిశ్రగతికి రెట్టింపు రూపకగతి. త్రిశ్రగతిలో నడచు పాటలన్నింటను నిట్టి మార్పు సాధారణముగాఁ గాననగును:-

***"మల్లేశుని, ఈనాడే, - మనవద్దకు, బిలిపించియు***
***ఇతరులు పరి, కించగాను - ఏమాత్రము, తెలియకుండ"***

కాని ఇట్లు రూపకగతిగా మాఱిన పాదములు చాలఁ దక్కువగ నున్నవి. మొత్తముపై నీ కథ త్రిశ్రగతిలో నడచినదనియే చెప్పనగును. ఏమైనను లాక్షణికులుగాని, సంగీతశాస్త్రజ్ఞులుగాని ఈ రెండు గతులకును భేదమును పాటింపరు. ఒకదానిలో మఱియొకటి గోచరించినను తప్పుకాదు.

ఇట్లే త్రిశ్రగతిలోను రూపకగతిలోను నున్న మఱియొక కథ 'నల్లతంగాళ్ కథ'. దీని ఛందస్సును తురగవల్గన రగడ యనవచ్చును:

3 3 3 3 6 6
***"నల్ల, తంగ, కథను, నేను - నాలుకతో, చెప్పుటకూ***

3 3 6 6 6
***నాకు, తోడు, రావయ్యా - నన్నేలూ, గణనాథా***

3 3 6 6 3 3
***వాక్కు, తోను, చెప్పుటకూ- వాణీ రా, వమ్మ, తోడు***

3 3 3 3 3 3 3 3
***మాస, మూడు, వరుష, మూలు- వరుస, గాను, గురియు, చుండు***

3 3 3 3 3 3 3 3
***పాడి, పంట, లధిక, మూగ - పండు, చుండు, దేశ, మిదీ"***

'సుబ్బిరెడ్డి కథ' యను వీరగాథ రూపకగతిలో నున్నది. ఇది త్రిశ్రగతినుండి యేర్పడిన రూపకగతి కాదు. ప్రత్యేకముగాఁ గానవచ్చు రూపకగతి:

***"చిత్తూరూ, జిల్లాలో, కానూమా, కులాపల్లె***
***కొలకానా, బలిజోడూ, కొండా మల్, రెడ్డి కొడుకు***
***పాళెగాడు, సుబ్బిరెడ్డి, ..........."***

## 11. వీరగాథానికల వరుసలు

వీరగాథానికలలో త్రిశ్ర, చతురశ్ర, ఖండ, రూపక, మిశ్రగతు లన్నింటికిని ఉదాహరణములు లభించుచున్నవి.

### 1. త్రిశ్రగతి లేక తురగవల్గన రగడ (3.3.3.3 - 3.3.3.3):

గుంటూరు ఆదెమ్మ పాట, మరుట్ల చిన్నమల్లేశ పాట మున్నగునవి త్రిశ్రగతిలో నున్నవి:-

***"కంటి, లోన, మెరుపు, మెరిసె - కలవ, రింత, పుట్టె, నాకు***
***ఎంకట, సామి, కొడుకు, కాదు - ఏడు, కొండల, సామి, కాదు***
***రాచ, వారి, చిన్న, వాడు- రాగి, మిసా, లనుమయ్యా"***

ఇది గుంటూరు ఆదెమ్మ పాటలోని భాగము. దీనిని తురగవల్గన రగడ యనవచ్చును. ఇందు 'ఎంకట' 'కొండల' అను పదములలో నాలుగు సాహిత్యాక్షరములున్నను, పాడునప్పుడు వీని సంగీతాక్షరములు మూఁడు మాత్రమే. మూఁడు మాత్రల కాలములోనే ఇవి పాడఁబడును.'అనుమయ్యా' అనునది ఆరుమాత్రల గణము.

మరుట్ల చిన్నమల్లేశుని పాట:-

***"కోట, కొమ్ము, లెక్కి, నాడు - కోటి, కూత, లేసి, నాడు***
***బుజం, మింద, బల్లె, మిసిరి - మొలక, మిసం, దిద్ది, నాడు"***

గడేకల్లు నాగిరెడ్డి పాట:-

***"బండి, మింద, రెడ్డి, లాగ - పదీ, మంది, చుట్టు, ముట్రి***
***చిన్న, లూరి, మాది, గోడు - పండ, బెట్టి, గొంతు, కోసె"***

### 2. చతురశ్రగతి లేక మధురగతి రగడ (4.4.4.4):-

చతురశ్రగతిలో పాటలు మిక్కిలి తక్కువ.

***"ఉప్పరి, వారూ, పనులూ, జేస్తరు -తానే తందన్న***
***రేపే, కడితే, మాపే, పడతది ,,***

**రెడ్డీ, కరణము, చూడా, బొయ్యిరి ,,**
**ఏమీ, వరములు, అడుగూ, తావే- ,,**

(- సిద్దాపురంకట్ట పదము)

### 3. ఖండగతి లేక ద్విరదగతి రగడ (5.5.5.5):-

ఖండగతిలో సాఁగు లఘువీరగాథలు చాలఁ గలవు.

'లలికట్ట పదము':-

*"ఏముంద, గన్నదిర (ఉయ్యాలో)- ఏరంద, గన్నదిర (ఉయ్యాలా)*
*సెల్లెండ్లు లేనిదీ ( ,, ) ఏసేదె గన్నదిర ( ,, )"*

'వానదేవుని పాట':-

*"ఎండ సి, క్కెటతోను(రామోజిరామ)-ఎలసిక్కు, దీసింది(రామోజీరామ)*
*పయిడి దు, వ్వెనతోను( ,, ) పాపిడులు, దీసింది( ,, )"*

'సీతచెఱ':-

*"నేనేడ, జూసేను - అన్నరో, రావణుడ*
*మా వొదిన, మండువా - సూడదా, ఓయన్న"*

నల్లగొండ పాట:-

*"కర్కశుల, గుండెపై - కత్తియై, మెరిసింది*
*కర్షకుల, కండపై- కవచమై, మురిసింది"*

### 4. రూపకగతి (6.6.6.6):-

రెండు రెండు గణములకుఁ బరస్పరము సాన్నిహిత్యమున్నచో త్రిశ్రగతిలో నున్న పాటలనే కొంతవఱకును రూపకగతిగా భావింప వచ్చును. కాని పెక్కుపాటలలో త్రిశ్రగతి స్పష్టముగా నున్నది. మూఁడు మాత్రల గణములకు సాన్నిహిత్యము తక్కువగ నున్నది. ఈ గణములకు సాన్నిహిత్య మెక్కువగ నున్నప్పుడు మాత్రమే త్రిశ్రగతిలో రూపకగతిని గుర్తింపఁగలము. కొన్ని రూపకగతులలో నాఱు మాత్రల గణము 3+3 గాఁ గాక, 2+2+2 గాను, 2+4 గాను, 4+2 గాను గనఁబడుచున్నది. అట్టి గణములతో నున్న పాటలను విధిగా రూపక గతికిఁ జెందినవని చెప్పక తప్పదు. అవి ప్రత్యేకముగా రూపకగతిలో నున్న పాటలే కాని, త్రిశ్రగతి యొక్క సాన్నిహిత్యము వలన నేర్పడిన రూపకగతిలోనివి కావు. అట్టి వీరగాథానికలలో 'అద్దాల సుబ్బులు పాట, అల్లుఁడుపాట, మల్లన్నపాట' మున్నగునవి పేర్కొనఁ దగినవి:

అద్దాల సుబ్బులుపాట:-

*"నీరంగం, నారంగం - బాయికాడ, బయిరంగం*
*బయిరంగా, మన్నాదా - బాతలకరి, బాలయ్యా"*

అల్లుఁడు పాట:-

*"పుట్టిందీ, యావూరో, అల్లుడదొర, కృష్ణయ్యా*
*పెరిగిందీ, యావూరో, అల్లుడదొర, కృష్ణయ్యా"*

మల్లన్న పాట:-

*"పాలోద్రై, పుడితివిరా - బొమనిపాటి, మల్లన్నా*
*పగదారై, పుడితివిరా - బొమనిపాటి, మల్లన్నా"*

### 5. మిశ్రగతి లేక వృషభగతి రగడ (7.7.7.7):-

ఇందలి యేడు మాత్రల గణములు 3+4 గాఁ గాని, 2+5గాఁ గాని, 5+2 గాఁగాని యుండవచ్చును.

అప్పలాపురం చెన్నారెడ్డి పాట:

**"బండికైనను, రెడ్డి అప్పుడు-బారుగను టెం, కాయ గొట్టీ**
**ముల్లుగర్రను, చేతబట్టీ - ఎద్దులను ఒక, ఏటు గొట్టెను"**

నారసింహారెడ్డి పాట:-

**"కొయిలకుంట్లా, కొట్టినాడూ - గిద్దలూరూ, దోచినాడూ**
**కుడీమీసా, మొదాదిద్దీ - రచ్చకట్టన, కొలువు తీరే"**

గుఱ్ఱాల గోపిరెడ్డి పాట:-

**"శేరుశేరూ, ఎండి మురుగుల్ - చేతులాకూ, బెట్టుకోనీ**
**కట్టమీదా, వస్తవుంటే - కలకటే రను, కొంటి కొడుకా"**

మొత్తముమీఁద నీ మిశ్రగతిలో త్రిశ్ర చతురశ్రగతుల సమ్మేళనమే కాననగును. ఈ మిశ్రము వలననే దీనికి మిశ్రగతి యను పేరు వచ్చియుండును. 'తకిట కిటతక' (3+4) అను రీతిలో నిది సాఁగును. పై మూఁడు యుదాహరణములు నిట్లే సాఁగినవి. మానంది రెడ్డి పాట కూడ నీ మిశ్రగతిలోనే నడచినది.

### 6. ఆదిగతి (8.8.8.8):-

బుడ్డా వేంగళరెడ్డి పాట:-

**"ఉత్తరాది ఉ, య్యాలవాదలో - ఉన్నది ధర్మం, చూదరయా...**
**నేటికి బుడ్డా, ఎంగళరెడ్డీ - దొడ్డ ప్రభువనీ, తెలియరయా..."**

ఈ పాటను పాడుటలోఁ జివరి 'యా' ను దీర్ఘముగాఁ బాడి మఱి రెండు మాత్రలను గిట్టింతురు. పోట్ల బూదయ్య పాటలో నిట్టి కిట్టింపు లేవియును లేకయే ఆదిగతి స్పష్టముగా నున్నది:

**"మల్లెపువ్వులా, వరషము రీతీ - సన్నజాజులా, జల్లుల రీతీ**
**ముచ్చం రత్నం, రాలేటట్టుల - ఏడువసాగిరి, జనమందరునూ"**

మొత్తముపై వీరగాథానిక లెక్కువగా ఖండగతిలోను మిశ్రగతిలోను గానవచ్చుచున్నవి. వీరగాథలలో ద్విపద, ద్విపద మంజరి, హరిహరీ వరుసలు పాడుటలో ఖండగతిలోనే యుండును. బొబ్బిలివరుసలలో నాదిగతి కానవచ్చును.

## 12. గాథాచ్ఛందస్సు-రగడలు, షట్పదులు

అప్పకవి వంటి లాక్షణికులు రగడలకు సూర్యేంద్ర గణములు సూచించినారు. ఇది సరికాదు. రగడలన్నియును మాత్రాగణబద్ధములే. రగడలలో రెండు రెండు పాదముల కంత్యప్రాసయు నాదిప్రాసయుఁ గూర్పఁబడుచుండును. ఈ ప్రాసలను లెక్కగొననిచో నీ రగడ లన్నియును వీరగాథలలోఁ గానవచ్చు కొన్ని గతులకు సరిగా సరిపోవును. ప్రథమ తృతీయ గణాద్యక్షరములకు యతి వీరగాథలలో నైచ్ఛికము, రగడలలో నియతము.

అప్పకవి తొమ్మిది విధముల రగడలను జెప్పినాఁడు. ఈ నవవిధ రగడలును వీరగాథలలోఁ గానవచ్చు గతులకు సరిగా సరిపోవుచున్నవి:-

1. హయప్రచార రగడ (3×4)- (యతి స్థానము) = 3+3+3+3= నాలుగు గణముల త్రిశ్రగతి. (– యతి)
2. తురగవల్గన రగడ = హయప్రచారమునకు రెట్టింపు (3×8)= ఎనిమిది గణముల త్రిశ్రగతి.
3. విజయమంగళ రగడ = తురగవల్గనమునకు రెట్టింపు (3×16)= ఎనిమిది గణముల రూపకగతి.
4. మధురగతి రగడ (4×4) = 4+4+4+4= నాలుగు గణముల చతురశ్రగతి.
5. హరిగతి రగడ = మధురగతికి రెట్టింపు (4×8) = ఎనిమిది గణముల చతురశ్రగతి.
6. ద్విరదగతి రగడ (5×4) = 5+5+5+5= నాలుగు గణముల ఖండగతి.
7. (వి) జయభద్ర రగడ = ద్విరదగతికి రెట్టింపు (5×8) = ఎనిమిది గణముల ఖండగతి.
8. హరిణగతి రగడ (7×2)= 7+7= రెండు గణముల మిశ్రగతి.
9. వృషభగతి రగడ = హరిణగతికి రెట్టింపు (7×4)= నాలుగు గణముల మిశ్రగతి.

పాదమునకు 5+5+5+3 గా సాగు వీరగాథా ద్విపద, లేక వీరగాథా మంజరి, లాక్షణికులు చెప్పిన 'కర్ణాట చౌపద'కు సరిగా సరిపోవును. తెలుఁగులో రగడలెక్కువ. కన్నడమున షట్పదులెక్కువ. మన రగడలకును వారి షట్పదులకును చాల దగ్గఱి చుట్టఱిక మున్నది. హయప్రచార రగడ- భోగషట్పదిని; మధురగతి రగడ-పరివర్ధినీ షట్పదిని; ద్విరదగతి రగడ- వార్ధక షట్పదిని; వృషభగతి రగడ- భామినీ షట్పదిని బోలియుండును.

కన్నడ షట్పదులలో ఆఱు పాదములుండును ("షట్పది" యను పేరులోనే ఈ విషయము తెలియుచున్నది). అన్నియు మాత్రాగణములే. 1, 2, 3 పాదములు ఒక దళముగాను, 4, 5, 6 పాదములు వేఱొక దళముగాను ఉండును. వీనిని 'పూర్వార్ధము'- 'ఉత్తరార్ధము' అని పిలువవచ్చును. పూర్వార్ధ మెట్లుండునో ఉత్తరార్ధమును అట్లేయుండును. కాబట్టి మొదటి దళమునకు లక్షణము చెప్పినచో, రెండవ దళమునకు కూడ చెప్పినట్లే యగును.

| | | |
|---|---|---|
| 1. శరషట్పది: | 4+4<br>4+4<br>4+4+4+2 | పూర్వార్ధము |
| | 4+4<br>4+4<br>4+4+4+2 | ఉత్తరార్ధము |
| 2. కుసుమ షట్పది: | 5+5<br>5+5<br>5+5+5+2<br>ఇట్లే ఉత్తరార్ధముండును. | |
| 3. భోగషట్పది: | 3+3+3+3<br>3+3+3+3<br>3+3+3+3+3+3+2<br>. . . . . . . | |
| 4. భామినీ షట్పది: | 3+4+3+4<br>3+4+3+4<br>3+4+3+4+3+4+2<br>. . . . . . . . | |
| 5. పరివర్ధినీ షట్పది: | 4+4+4+4<br>4+4+4+4<br>4+4+4+4+4+4+2<br>. . . . . . . . | |
| 6. వార్ధక షట్పది: | 5+5+5+5<br>5+5+5+5<br>5+5+5+5+5+5+2<br>. . . . . . . . . . | |

## 13. వీరగాథల యతిప్రాసలు

వీరగాథలలో యతిప్రాస లైచ్ఛికములే కాని నియతములు కావని చెప్పవచ్చును. అట్లని ఇవి పూర్తిగా వర్జింపఁబడినవని భావింపరాదు. పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను,

హరిహరీ పదములలోను, జంగంకథలలోను యతి సర్వత్ర పాటింపఁ బడినది. శిథిలములైన ద్విపద, మంజరీ ద్విపదలలోఁ గూడ గణములు శిథిలములైనవి కాని, యతిభంగము కాలేదు. ఉదాహరణకుఁ గాటమరాజు కథాచక్రములోని ఈ క్రింది పాదములు చూడుఁడు:–

*"తూర్పున ఆ రాజుకు – తుమ్మ వృక్షంబు నీడ*
*పడమట ఆ రాజుకు – ఫాలబ్రహ్మ వృక్షంబు నీడ*
*వుత్తరమున ఆ రాజుకు – వుసిరి వృక్షంబు నీడ*
*దక్షిణమున ఆ రాజుకు – దానిమ్మ వృక్షంబు నీడ*
*పాదాలకాడ ఆ రాజుకు – పషిణి తంగేడు"*

–(పెద్దిరాజు కథ, తాళపత్ర ప్రతి)

ద్విపదలో సాఁగిన వల్లురాజుకథలో యతియే కాక ప్రాసకూడ నెచ్చటను భంగము కాలేదు. పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను యతిభంగము గాకుండఁ గాపాడుటకై జానపద కవులు అర్థరహితములగు పదములను వేసి యతని గిట్టించిన సన్నివేశములు పెక్కు కలవు. ఉదాహరణమునకు నాకు లభించిన 'పల్నాటి వీర భాగవత' మను తాళపత్ర గ్రంథములోని ఈ క్రింది పాదములను జూఁడుడు:–

1. *'అంతట బ్రహ్మన్న అదిపట్టి తియ్య*
   *రాకపోయెను మరి రచటున్న గూడ'*
2. *'మాణిక్యముల గద్దెపై– మతడు గూర్చుండె'*
3. *'నా తండ్రి నాయుడా – నతి వేగమునను'*
4. *'కవుల గాయకులను కలసేన లెల్ల*
   *రావించి యిట్లనె – రప్పుడా బ్రహ్మ'*
5. *'శంఖు తీర్థమునుండి – చలగి అయ్యలును'*

ఇట్లు యతిమైత్రి కుదురని సందర్భములలో నపశబ్దములను వాడి మైత్రి చేకూర్చుట కాటమరాజు కథలలోఁ గూడఁ గలదు:–

1. *'పలలన్ని చాలుగా వడ్డుడీ చక్క'*
2. *'జలరేగి మ్రోగంగఁ జౌకళింపుచును'*
3. *'వైకుంఠమునకయి వఱిగి రావేళ'*
4. *'వళ్లెల్ల నేజాలు వడివడి నాటె'*
5. *'వక ఘటం బేనుఁగుల వడి మావటీలు.'*

అఖండ యతియును పలుతావులఁ బ్రయోగింపఁబడినది:–

1. *'నిద్రించి మరునాడు నిందరుగూడి'* (పల్నాటి వీరకథలు)
2. *'నాయునితోడను నాస్వామి బలికె'* (పల్నాటి వీరకథలు)
3. *'... కలభూత గంగు రాజేంద్రుఁ*
   *దెలమితో కండె మొండెమ్ముల కోట'*(కాటమరాజు కథలు)

ఈ వీరగాథలలో కొన్నిచోట్ల యతిభంగమై నట్లు శిష్టులకు గోచరించినను, జానపద పరిభాషలో, వారి యుచ్చారణలో ఆ పదమును పరిశీలించినచో యతిభంగము కాదు. ఉదాహరణకు ఈ క్రింది పాదములను జూడుఁడు:–

1. *'ఇరుగుల గంగయు వీరదాడొకటి'* (పల్నాటి వీరకథలు)
2. *'యరగడ్డపాటికి వెడలిపోదలచి'* ( ,, )
3. *'ఇలకీర్తి చెన్నొందు వీరశౌర్యంబు'* (కాటమరాజు కథలు)
4. *'ఏవేళ జూచిన వీరఘోషములు'* ( ,, )
5. *'విప్రు మాన్యంబులు ఇచ్చు కట్నములు'* ( ,, )

పై పాదములలో యతిభంగమైనట్లు కన్పట్టుచున్నది. ఇది సరికాదు. క్రీగీతలున్న పదములను జానపదు లావిధముగా నుచ్చరింపరు. 'వీరదాడు'ను 'యీరదాడు' గాను, 'వెడలి'ని 'యడలి'గాను, 'వీర' శబ్దమును 'యీర' శబ్దముగాను 'విప్ర'ను 'యిప్ర' గాను జానపదగాథాకారుఁ డుచ్చరించును. అప్పుడు యతిభంగ మెట్లగును? కావున వీరగాథలలోని యతులు జానపదుల యుచ్చారణానుసారముగఁ బ్రయోగింపఁబడుచుండునని చెప్పవలెను. వారియుచ్చారణ దృష్టితోనే వానిని మనము పరిశీలింపవలసి యున్నది.

ప్రాస విషయమునఁ గూడ వీరగాథలు లాక్షణిక మర్యాదలను బాటింపవు. ప్రాస పూర్వాక్షర మొక పాదములో దీర్ఘముగా నున్నచో, రెండవ పాదములోను దీర్ఘముగనే యుండవలెను గాని హ్రస్వముగ నుండరాదు. కాని వీరగాథలలో నొకపాదమునఁ బ్రాస పూర్వాక్షరము దీర్ఘముగాను, రెండవ పాదమున హ్రస్వముగాను నుండుట కలదు:

1. *"నియమంబుతో మ్రొక్కి నిలచి తరువాత*
   *గాయజు శత్రునకు గలిగినయట్టి"* *(వల్లురాజుకథ)*
2. *"దీవెన లిప్పించి తిరుమంద్లు తోను*
   *భవ గుణ సంపన్ను బాహువిక్రముడు"* ( ,, )

*'ద', కార 'ధ' కారములకుఁ బ్రాస పాటింపఁబడినది:–*

*"హృదయ పద్మమునందు నుంచి సేవించి*
*బుధులను గొనియాడి పూర్వ సత్కవుల"* ( ,, )

'వల్లురాజుకథ'లోఁ గొన్ని తావులందు లాక్షణికులు చెప్పిన ద్విప్రాస, త్రిప్రాస పాటింపఁబడినది:–

ద్విప్రాస:–

*"చేసిరి యాదవ శౌర్య విక్రములు*
*నేసిరి యాదవు లనేక పీనుగుల*
*కోసిరి చేతులు గొంతులు కాళ్లు*
*తోసిరి కలభూత దొర బంధుజనుల"*

*"మొట్టిరి క్షత్రియుల మెదడు వెళ్లరక*
*తట్టిరి చౌడోలి దంతీలపైన*
*పట్టిరి కడదొలగు పారు బంటులను*
*పెట్టిరి సరుదార్ల పేర్లు పదినూర్లు"*

త్రిప్రాస:–

*"పరిపిరి పగవారి పైన బాణాలు*
*నెరిపిరి యాదవుల నేకటంబుగను..."*

*"నిలిపిరి ప్రఖ్యాతి నెలయ లోకముల*
*కలిపిరి చెయ్యి చెయి కయ్యంబులంది*
*పులిపిరి శిరములు పుచ్చకాయలుగ*
*మలిపిరి పేర్వేర మన్నె నాయకుల"*

ఇట్లు వీరగాథలలో పల్నాటి వీరకథాచక్రముననుా, కాటమ రాజు కథాచక్రముననుా యతి ప్రాసలు బింకముగఁ బాటింపఁబడిన వని చెప్పవచ్చును. ఒక్క బొబ్బిలివరుస కథలలో మాత్రము యతి ప్రాస లైచ్ఛికముగా నున్నవని చెప్పక తప్పదు. పదములు, జంగము కథలు కూడ యతి ప్రాసల విషయమున శ్రద్ధను జూపిన ప్రక్రియలే.

ఈ ప్రకరణమందలి సారాంశము నిట్లు చెప్పవచ్చును:– వీరగాథల ఛందస్సు లక్షణగ్రంథముల కందునది కాదు. తెలుఁగులో ద్విపద వికారములును, రగడ వికారములును నగు వీరగాథా చ్ఛందములున్నవి. శాసన ప్రమాణమునుబట్టి తెలుఁగు ఛందస్సులలోఁ దరువోజ ప్రాచీనమైనదిగాఁ గన్పట్టును. కాని, ఛందః పరిణామమును బట్టి పరిశీలించినచో 'కిటతకిట, కిటతకిట, కిటతకిట, కిటతకిట' యని సాఁగు ఖండగతి అన్నిటికంటెను బ్రాచీనమైనది. పూర్వకాలమున వీరగాథలన్నియు నీ ఛందస్సులో నుండెడివి. ఈ ఖండగతినుండి మంజరీ ద్విపద, దీనినుండి ద్విపద, ఈ ద్విపదనుండి తరువోజ పరిణమించి యుండును. శక్తికథలలో ఖండగతి, పల్నాటి వీరకథలలో మంజరీద్విపద, కాటమరాజుకథలలో ద్విపద బహుళముగ గోచరించును. వీరగాథలలోని ద్విపదకాని మంజరీ ద్విపదకాని లాక్షణికులు చెప్పినట్లుగా నింద్ర సూర్యగణముల ప్రకారముండవు. ఒక్కొక్క పాదమునకు అయిదు మాత్రల గణములు మూఁడు, మూఁడు మాత్రల గణము ఒకటిగా వీని రచన కొనసాఁగును. యతిప్రాస లైచ్ఛికములే కాని నియతములు కావు. ఇంద్రగణములలో 'భ' గణము 'నల' గణము నాలుగు మాత్రలవే కావున, వీని కొక మాత్రను జేర్చి 'భల' 'నలల' అను రీతిలో వీరగాథలలోఁ బ్రయోగింపఁబడుచుండును. ఒక్కొక్కప్పుడీ ద్విపద – మంజరీ ద్విపదలు శిథిలములై ఖండగతిగా మాఱిపోవుచుండును. ఈ ఖండగతి కూడ శిథిలమై సాఁగిపోవుట కలదు.

బొబ్బిలివరుసలో నొక్కొక్కపాదమున '8+8+9 (10)' మాత్రలుండును. యతి ప్రాసలు కాకతాళీయములే కాని నిబద్ధములు కావు. ఈ బొబ్బిలివరుసనుండి 8+8 మాత్రలొక పాదముగా నొకవరుస, 8+9 (10) మాత్రలొక పాదముగా నొక వరుస పరిణమించినవి. కాంభోజరాజు కథ, వరాహావతార చరిత్ర (పంది కథ), చిన్నపరెడ్డి కథ మున్నగునవి 8+8 మాత్రలొక పాదముగా సాఁగు వీరగాథలు. బాలనాగమ్మ కథ, లక్ష్మమ్మ కథ, కమ్మవారి పణంతి– పసల బాలరాజు కథ మున్నగునవి 8+9 (10) మాత్రలొక పాదముగా సాఁగు వీరగాథలు. ముగ్గురు మరాటీల కథలోని వరుస, సర్వాయి పాపని కథలోని వరుస ప్రత్యేకములు. మరాటీల వరుసను 'సైసై వరుస' యందురు. ఇందు 12–15 మాత్రలతోఁ గొన్ని పాదములు చెప్పి, 14–16 మాత్రలుగల పాదములతో ముక్తాయింపు చేయఁబడును. ఈ వరుసలోని పూర్వపాదములు ఇట్లు విఱుగును: 8+4= 12; 8+5= 13; 9+5=14; 10+5=15. ఈ వరుసలోని ముక్తాయింపుపాదము ఇట్లు విఱుగును: 8+6= 14; 9+6= 15; 10+6= 16. ఇఁక సర్వాయి పాపని వరుసను 'ఏల వరుస' యని చెప్పవచ్చును. ఇందు 7+7= 14 మాత్రలతో రెండు పాదములును 7+9=16 మాత్రలలో రెండు పాదములును జెప్పఁబడును. మూఁడవ పాదము చివర తొమ్మిది మాత్రల సంబోధన మొకటి యుండును. ఇది సరిగా ఏలవరుసను బోలియున్నది.

ఒక ఖండగతిపాదమును ఒక ద్విపదమంజరి పాదమును గలిసి హరిహరీపదముల వరుస యేర్పడినది. దీనిని 'జంపె వరుస' యనియుఁ బిలుతురు. "5+5+5+5; 5+5+5+3 అని దీని గణములను నిరూపింపవచ్చును. యతిప్రాసలు, ప్రాసయతులు నిందుఁగాన నగును. '3+5+5+3' మాత్రలొక పాదముగా నంత్యప్రాసలతో నటతాళమున సాఁగెడి రచనలు 'శారద పదము' లనఁబడును. ఈ శారద వరుసలో నొక్కొక్కప్పుడు మొదటి మూఁడు మాత్రల గణము లోపించి 5+5+3 గా రచన సాఁగుటయుఁ గలదు.

8+8+9 (10) అను బొబ్బిలివరుసకు యతిప్రాసలు, నంత్యప్రాసను ఏర్పఱుచుటచే 'జంగంరగడ' యేర్పడియుండును. లేదా మహారాష్ట్రుల 'గజల్, డోరా, డోరా గజల్ మట్టు' అను ఛందస్సుల ప్రభావముచే నీ జంగంరగడ పుట్టియుండవచ్చును. యక్షగానముల లోఁ బ్రయుక్తములైన పై ఛందస్సులచ్చముగా జంగంరగడవలెనే యున్నవి.

వీరగాథానుకరణములగు బుఱ్ఱకథలలో బొబ్బిలివరుస– తద్భేదములు, సైసై వరుస, సర్వాయి పాపని వరుస, జముకుల వరుస, శారద వరుస మున్నగునవి కాననగును. తెలంగాణమునఁ బ్రసిద్ధికెక్కిన మియాసాబు కథ, కొమిరెల్లి మల్లన్న కథ మున్నగు వానిలో త్రిశగతి (3+3+3+3) కాననగును. నల్లతంగాళ్ కథ కూడ త్రిశ్రగతిలోనే సాఁగినది. సుబ్బారెడ్డి కథ రూపకగతి (6+6+6+6) లో నున్నది.

వీరగాథానికలలో త్రిశ్ర, చతురశ్ర, ఖండ, రూపక, మిశ్ర, ఆది గతులన్నింటికిని ఉదాహరణములు లభించుచున్నవి. గుంటూరు ఆదెమ్మపాట, మరుట్ల చిన్నమల్లేశుపాట, గడేకల్లు నాగిరెడ్డి పాట

త్రిశ్రగతిలో నున్నవి. సిద్దాపురం కట్టపదము చతురశ్రగతి (4+4+4+4). ఖండగతిలో లఘువీరగాథలు పెక్కు గలవు. లలికట్ట పదము, వానదేవునిపాట, సీతమ్మచెఱ, నల్లగొండపాట మున్నగున వన్నియును ఖండగతిలోనే యున్నవి. త్రిశ్రగతికి రెట్టింపు రూపకగతి. అద్దాల సుబ్బులు పాట, అల్లుడు పాట, మల్లన్న పాట రూపకగతికి నుదాహరణములు. మిశ్రగతి (7+7+7+7) లో నడచిన పాటలు-అప్పలాపురం చెన్నారెడ్డి పాట, గుజ్జాల గోపిరెడ్డి పాట మున్నగునవి. బుడ్డా వెంగళరెడ్డి పాట, పోట్ల బూదయ్య పాట ఆదిగతి (8+8+8+8)కిఁ జెందినవి.

లాక్షణికులు చెప్పిన నవవిధ రగడలకును వీరగాథల వరుసలకును మిక్కిలి సన్నిహిత సంబంధమున్నది. హయప్రచార, తురగవల్గన రగడలు- త్రిశ్రగతికిని; మధురగతి హరిగతి రగడలు- చతురశ్రగతికిని; ద్విరదగతి, జయభద్ర రగడలు- ఖండగతికిని; హరిణగతి, వృషభగతి రగడలు- మిశ్రగతికిని సరిగా సరిపోవును. ఈ రగడలకు కన్నడిగుల షట్పదులతోఁ గూడఁ బోలికలున్నవి.

పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను యతి ప్రాసలు చక్కగాఁ బాటింపఁబడినవి. కొన్ని కథలలో గణములు శిథిలములైనను యతిప్రాసలకు భంగము వాటిల్లలేదు. యతి భంగముగాఁ దోఁచు పదములలో జానపదుల యుచ్చారణను బరిగణింపవలసియున్నది. యతిభంగమును వారించుటకై జానపద కవులు అపశబ్దములను సహితము ప్రయోగించిరనుటకు దృష్టాంతము లున్నవి. అఖండయతి, ద్విప్రాస, త్రిప్రాసలు వీరగాథలలో నక్కడక్కడఁ గాననగును. ❐

## జ్ఞాపికలు

1. Prof. Louise Pound, The Encylopedia Americana, Volume III, p. 96.
2 Shyam Parmar, 'Folk music for teaching', Naya Shikshak, Volume VIII, No. 4. , April 1966.
3 ''Pad-an old style of legendary narration which porbably seemed to have imfluenced the popular ballad singing in Rajasthan'' -- Shyam Parmar, 'Ballad singing in India'. -- Folklore, August 1964.
4. ''Attempts were also made in Panjabi by exploiting 'Bait' metre for ballad composing. Mohammad tried this in the composition like 'Jag Singha', and 'Firangie'. -- ibid.
5. *తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుటలు ౭౭౮, ౭౭౯.*
6. *'తలకొని తలఁబ్రాలు దంపెడిచోటఁ దరుణులచే సొంపుఁ దనరుఁ దర్వోజ' - కావ్యాలంకార చూడామణి, (8-50).*
7. *కోవెల సంపత్కుమారాచార్య, తెలుగు ఛందోవికాసము, పుట. 31.*
8. *అదే., పుట 104.*
9. *'ద్విపదయొక్క ప్రాచీనత్వమిట్లు భావింపఁబడుచున్నను సరిగా ద్విపద ఏనాడు ప్రారంభమయినదో చెప్పుట కష్టము. జానపదులయందు దీని జన్మ కలిగినదని చెప్పవలయును. అనియత కర్తృకము, అజ్ఞాత కర్తృకము అనియమవంతము అయిన ఇది పండితులచే సంస్కరింపఁబడి సాహిత్య ప్రపంచమునకు తీసికొని రాబడియుండును'. - అదే., పుట 32.*
10. *చిత్తూరు జిల్లా, చంద్రగిరి తాలూకా, పెడకంటిపల్లెలో 1-3-1966న లభించిన తాళపత్ర గ్రంథము.*
11. *తిరుపతి ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారము, ఆర్.నెం. 694.*
12. *అదే., ఆర్. నెం.693.*
13. *'తొలిరోజుల్లో ఈ కథలు నాలుగు 'కిటతకిట' అవృతాల పాదాలతో జంపెలనే పేరుతో ఉండేవనీ, పాల్కురికి వంటి శివకవు లీ దేశిపద్ధతిని కొద్దిగా సంస్కరించి ద్విపద ప్రబంధాలు రచించారనీ నా విశ్వాసము'. - విజ్ఞాన సర్వస్వము, నాలుగవ సంపుటము, పుట 805.*
14. *ప్రాస విరహితమైన ద్విపద 'మంజరీ ద్విపద' యనఁబడును. నిజమునకీ నామ మర్థరహితమైనది. 'రెండు పాదములున్నప్పుడే, ఆ పద్యమునకు ద్విపద అను పేరు సార్థకమగును. కాని, ఏక పాదము గల పంక్తికి, ద్విపద అను పదము చెల్లనే చెల్లదు. అయినను, ఆ ఒక్క పాద లక్షణమును, ద్విపద లక్షణమే కనుక, ఆ మంజరిని కూడా మంజరీ ద్విపద అనీ, ద్విపద మంజరి అని పేర్కొనిరి. నిజమునకు ఇది అర్థములేని పదము'. - ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, పల్నాటి వీరచరిత్ర, పీఠిక, పుట vi.*
15. *నెల్లూరు జిల్లా, వెంకటగిరి తాలూకా, ఆల్తూరుపాడు గ్రామములో 22-7-1966న లభించిన తాళపత్ర గ్రంథము (మొదటిది). పత్ర సంఖ్య 75.*
16. *అదే., ఆకు 1.*
17. *పాడుటలో నీ శబ్దము 'వలురాజు' అని తేల్చి పలుకఁబడును.*
18. *ఇచ్చట 'పన్నెండు' శబ్దము 'పనెండు' గాఁ దేల్చి యుచ్చరింపఁబడును. అందుచే 'పన్నెం' అను పదాంశము 'పనెం' అని మూఁడు మాత్రలనే సూచించును.*

# ఇరువదియొకటవ ప్రకరణము

# గాథాగానము - సంగీతము

వీరగాథలలోని సంగీతమునుగూర్చి 'వీరగాథాలక్షణములు' అను ఎనిమిదవ ప్రకరణమునఁ గొంత చెప్పియుంటిని. గాథాగానమున గొంతు మంద్రస్థాయి నుండి తారస్థాయి కెత్తినను ఎక్కువ రాగభేదములను జూపక ఛందస్సును సూచించు వైవిధ్యముతో మాత్రమే పాడవలెననియు, స్వరముతో నక్షరములను మ్రింగివేయక స్పష్టముగా నుచ్చరింపవలెననియు నటఁ దెలిపియుంటిని.

గేయములలోని సాహిత్యాంశమును 'మాతువు' అనియు, సంగీతాంశమును 'ధాతువు' అనియుఁ బిలుతురు. గేయస్వరూపమున నుండు వీరగాథలలో ధాతువుకన్న మాతువే ప్రధానమైనది. అట్లని వీరగాథలు కేవలము కవిత్వమువలెఁ బఠింపఁబడునని భావింప రాదు. వీరగాథ లెప్పుడును ఏదేశమందైనను పాడఁబడునే కాని చదువఁబడవు. చదువఁబడునవి వీరగాథలు కానేరవు. పాడఁబడుట వీరగాథల జీవలక్షణములలో నొకటి. అనఁగా తగుమాత్రము ధాతువుతో మాతువును స్పష్టముగా నుచ్చరించుచు వీరగాథలు పాడఁ బడునని గమనింపవలెను. కాఁగా, నీ గాథాగానమున సంగీత లక్షణము లెంతవఱకు నున్నవి? యనునది ప్రశ్న.

వీరగాథల భాష మన నిఘంటువుల కందదు; వీరగాథల నడక మన ఛందోగ్రంథముల కందదు. అట్లే గాథాగానము కూడ మన సంగీత లక్షణగ్రంథముల కందునది కాదు. ఇట్లు లక్షణ విరుద్ధములగుట వీరగాథల తప్పుకాదు; దేశికవితల భాషాచ్ఛంద స్సంగీతములను విస్మరించిన లాక్షణికులదే యీ తప్పు. నాట్యశాస్త్రము, బృహద్దేశి వంటి కొన్ని సంస్కృత లక్షణగ్రంథములందు మాత్రము దేశిచ్ఛందములనుగూర్చియు, దేశిరాగములనుగూర్చియుఁ గొంత ప్రసక్తి యున్నది. (భరతుఁడు పేర్కొనిన ధ్రువాగానములో నొక భేదమే 'ద్రుతగతి'. మన పల్నాటి వీరకథలు ప్రతాపరుద్రుని కాలమున నోరుగల్లు నడివీథిలో ద్రుత తాళమునఁ బాడఁబడినవని క్రీడాభిరామ కర్త సాక్ష్యమిచ్చుచున్నాఁడు.) మొత్తముపై మన భాషకు మూలము జానపదుల భాషయనియు, మన ఛందస్సునకు మూలము జానపదుల ఛందస్సనియు, మన సంగీతమునకు మూలము జానపదుల సంగీత మనియు గ్రహించుట యవసరము.

పద్యములలో సంగీతము ఛందోరూపమున నంతర్గతముగా నుండును. గేయములలో నట్లుకాక సంగీతము బాహ్యముగనే అగపడుచుండును. అనఁగాఁ బద్యములలోకన్న గేయములలో సంగీతముపాలు హెచ్చు. అందుచే గేయకవితలోని ఛందస్సును జెప్పునప్పుడే కొంత సంగీతమును జెప్పవలసియుండును. గేయముల ఛందస్సంగీతములకు అవినాభావ సంబంధమున్నది. కావుననే గేయముల ఛందస్సంగీతములను విడివిడిగాఁ గాక సమ్మిళితముగనే 'వరుస' లను పేరుతోఁ జర్చించుట పరిపాటి. దీనినిబట్టి వెనుకటి ఛందఃప్రకరణముననే కొంత సంగీతాంశమును దెలుపఁబడినదని గమనింపవలెను. త్రిశ్ర, చతురశ్ర, ఖండ, రూపక, మిశ్ర, ఆది గతులలో సాఁగిన వీరగాథలనుగూర్చి వెనుకటి ప్రకరణములోఁ జర్చించితిని. అనఁగా నీ గతులన్నియును సంగీత పరిభాషలో తాళములే కదా!

జానపద కవిత్వములో సాహిత్యాంశమునుబట్టి ఛందస్సును నిర్ణయింపలేము. ఈ కవిత్వమంతయు మాత్రాగణబద్ధమైనను, నిందలి సంగీతాంశమును బరిశీలింపకయే, గురులఘువులనుబట్టి మాత్రలను నిర్ణయించుటవలన ఫలితము శూన్యము. గేయముల మాత్రలను నిర్ణయించుటలో గురువునకు రెండు మాత్రలు, లఘువునకు నొక్క మాత్ర యనునది వర్తింపదు. పాడెడి కాలమునుబట్టి మాత్రలను లెక్కింపవలసియున్నది. ఉదాహరణమునకు, బొబ్బిలివరుసలో సాహిత్యాక్షరములు 8+8+9 గా నున్నను, పాడునప్పుడు ఈ పాదము 8+8+8+8గా నుండును (చూ. వెనుకటి ప్రకరణము). 'త, క, కి, ట' అనునవి మాత్రాసంకేతములు. ఇవి యొక్కొక్కటి యొక్కొక్క మాత్రాకాలమును సూచించును.

'జాతి లేక గతి, లయ, తాళము, స్వరము' – ఇవి పరస్పర సంబంధము గల సంగీత పారిభాషిక పదములు. కొన్ని మాత్రల గుంపు 'జాతి, లేక గతి' యనఁబడును. ఉదాహరణమునకు మూఁడు మాత్రల గుంపును 'త్రిశ్ర జాతి' లేక 'త్రిశ్ర గతి' యందురు. అట్లే నాలుగు మాత్రల గుంపును 'చతురశ్ర జాతి' లేక 'చతురశ్ర గతి' యందురు. ఇట్టి జాతు లొక పాదమునఁ బెక్కుండవచ్చును. ఈ జాతుల గుంపును 'లయ' యందురు. ఇది గేయముయొక్క నడకలో సామ్యమును సూచించును ('లయః సామ్యమ్'). గుంపులో నీ జాతు లెప్పుడును సరిసంఖ్యలో నుండును. ఇట్టి గుంపులోని జాతుల లెక్కను (ఆవృత్తుల సంఖ్యను) దెలుపుట 'తాళము'. ఇది కాలమును గొలుచు క్రియ ('తాళం కాలక్రియా మానమ్'). ఇదియును సరిసంఖ్యలోనే యుండును (నాలుగు, ఎనిమిది, పదునాఱు ఇత్యాది...). ఈ తాళమును లయను అనుసరించి 'స్వరము' ఉండును. కాని జానపద కవిత్వములో స్వరముకన్న లయతాళములకే ప్రాధాన్యము హెచ్చు.

స్వరమనఁగా 'స్వకీయముగా రంజింపఁజేయునది' యని వ్యుత్పత్తి. 'స-రి-గ-మ-ప-ద-ని' అనునవి సప్తస్వరములు. ఈ

సప్తస్వరములకు ఇరువదిరెండు శ్రుతులుగలవు. సప్తస్వరములు ప్రకృతి వికృతి భేదములచేఁ బదియాఱు స్వరములుగా నగును. ఈ పదియాఱు స్వరములును ఆరోహణావరోహణ గతిగా మూర్ఛనయై, అనేక మూర్ఛనలచేత ననేక రాగములను గల్పించుచున్నవి.[1]

జాపపద కవిత్వము తాళ లయ ప్రధానమైనను, స్వరములు బొత్తిగా లేవని చెప్పుటకు వీలులేదు. సప్తస్వరములును పూర్తిగా నుండవు కాని, ఒకటి రెండు స్వరములుండును. వీరగాథలవంటి కథాగేయములలో కథనమునకే యెక్కువ ప్రాముఖ్యమున్నది కావున పాదములందు స్వరములు ఎక్కువగా నర్తించుటకు వీలులేదు. పాదమునకు మొదటఁగాని, చివరఁగాని యొక స్వరముండును. ఎక్కువగా నంత్యస్వరమే యుండును. ఇట్టి యేకస్వరమూర్ఛనతో సాఁగెడి దానిని సంగీత శాస్త్రజ్ఞులు 'ఆర్చికము' అందురు. జానపద గేయములలోకన్న స్త్రీలపాటలలో స్వరములు కొంచెము హెచ్చు. రాగచ్ఛాయలును వానిలోఁ గాననగును. అట్లే వీరగాథలలో వీరకథా చక్రములు, బొబ్బిలివరుస కథలు మున్నగు వానికన్న నర్వాచీనములైన జంగంకథలలోను బుఱ్ఱకథలలోను రాగచ్ఛాయలు హెచ్చుగా నుండును. స్త్రీలపాటలలోని లాలిపాటలలో – 'లాలీ' (రీసా) అను రెండు స్వరములు ప్రతిపాదాంతమున నుండును. ఇవి నవరోజు రాగమునకు సంబంధించినవి. ఇట్లు రెండు స్వరములతో సాఁగెడి దానిని 'గాధికము' అందురు. మేలుకొలుపులలో 'మేలుకో' అనుపదము ననుసరించి మూఁడు స్వరములుండును. దీనిని 'సామికము' అందురు. ఇట్లే నాలుగు స్వరముల మూర్ఛనతో సాఁగెడిదానిని 'స్వరాంతము' అందురు. 5, 6, 7 స్వరములు గలవానిని 'రాగములు' అందురు. జానపద గేయములందును గేయకథలందును సాధారణముగా 1 నుండి 4 వఱకును స్వరములు మాత్రమే వాడఁబడును; రాగములు ఉపయోగింపఁబడవు. స్త్రీలపాటలు జానపద గేయములు కావనియు, నవి జానపదగేయములకన్న నున్నతము లనియు, వానిని 'జాతిదేశి' యని పిలువవలెననియు మొదటి ప్రకరణముననే తెలిపియుంటిని. ఈ స్త్రీలపాటలలో, మేలుకొలుపులను భూపాల బౌళి రాగములలోను, లాలిపాటలను నవరోజు రాగములోను, జాజిరిపాటలను హిందోళ వసంత రాగములలోను పాడుట సంప్రదాయము. వీరగాథలలోని బుఱ్ఱకథలు ఎక్కువగా దేవగాంధారి రాగములోఁ బాడఁబడుచుండును. పాదములో సాహిత్యాక్షరములు తగ్గినచో స్వరము దీర్ఘముగా నుండును. కరుణరసమును జూపవసలసి వచ్చినప్పుడు లయవేగమును తగ్గించి, ముఖారివంటి రాగములలోఁ బాడుదురు. ఆవృత్తులలో నప్పుడు విశ్రాంతి యెక్కువగ నుండును. రౌద్రరసమును స్ఫురింపఁజేయవలసి వచ్చినప్పుడు లయవేగమును హెచ్చించి శ్రీరాగమువంటి రాగములలోఁ బాడుదురు. అప్పుడు పాదములో సాహిత్యాక్షరములు హెచ్చుగానుండును.

పై చర్చనుబట్టి వీరగాథలు తాళప్రధానములని తెలుచున్నది. లయ, జాతి అనునవి ఈ తాళములోని అంతర్భాగములు. వివిధ జాతులను, వాని లయలను ఈ క్రింది విధముగాఁ జూపవచ్చును:

| జాతి లేక గతి పేరు | ఒక ఆవృత్తిలోని మాత్రల సంఖ్య | ఆవృత్తి నిరూపణము |
|---|---|---|
| 1. త్రిశ్రజాతి(గతి) | మూఁడు మాత్రలు | తకిట |
| 2. చతురశ్ర జాతి | నాలుగు మాత్రలు | తకకిట |
| 3. ఖండజాతి | అయిదు మాత్రలు | కిటతకిట |
| | (2+3)గా నున్నప్పుడు | తక తకిట |
| | (3+2)గా నున్నప్పుడు | తకిట తక |
| 4. రూపకగతి | ఆఱుమాత్రలు | తకిట తకిట |
| | (2+4) గా నున్నప్పుడు | తక కిటతక |
| 5. మిశ్రజాతి | ఏడు మాత్రలు | |
| | (3+4) గా నున్నప్పుడు | తకిట కిటతక |
| | (4+3) గా నున్నప్పుడు | కిటతక తకిట |
| 6. ఆదిగతి | ఎనిమిది మాత్రలు | కిటతక కిటతక |
| | (3+5) గా నున్నప్పుడు | తకిట కిటతకిట |
| 7. సంకీర్ణజాతి | తొమ్మిది మాత్రలు | తకకిట కిటతకిట |

పై యేడు జాతులలోను ముఖ్యముగా మూఁడు జాతులు జన సామాన్యమున కందుబాటులో నున్న పాటలలో నుపయోగింపఁబడుచుండును. అవి: చతురశ్ర, త్రిశ్ర, ఖండజాతులు. మిశ్రజాతిని గూడ నొక్కొక్కప్పుడు ఉపయోగింతురు. ఈ నాల్గు జాతులలోను చతురశ్రజాతి మిక్కిలి ప్రశస్తమైనది. ఒకవిధముగాఁ జూచినచో దృశ్యమాన ప్రపంచమంతయు చతురశ్ర నిర్మితమే యని చెప్పవచ్చును. ఇది సంగీతమున నత్యుత్తమమైన జాతి. అందువలననే దీనిని 'బ్రాహ్మణజాతి' యందురు. ఇట్లే త్రిశ్రజాతిని క్షత్రియజాతితోను, ఖండజాతిని వైశ్యజాతితోను, మిశ్రజాతిని శూద్రజాతితోను బోల్చెదరు. నిజమునకు మిశ్రగతి–త్రిశ్ర, చతురశ్రగతుల కలయిక. అట్లే రెండు రెండు త్రిశ్రజాతులు కలసి నడచినచో 'రూపకగతి' యందురు. ఇది ఆఱు మాత్రల ఆవృత్తులు గలది. అట్లే రెండు చతురశ్రగతులు (4+4) కలిసి వచ్చినచో నెనిమిది మాత్రల ఆవృత్తులు సిద్ధించును. దీనికి 'ఆదిగతి' యనిపేరు. ఒక చతురశ్రగతియు నొకఖండగతియుఁ గలిసి యొక యావృతముగా వచ్చినో (4+5) దానిని 'సంకీర్ణజాతి' యందురు. దీనిని చండాలజాతిగా నిరూపించుట కలదు.[2]

సంగీతశాస్త్ర పరిభాషలో తాళమనఁగా 'హస్తద్వయమునందు సంయోగ వియోగంబులు గలిగి, దశప్రాణయుక్తమగునది' యని నిర్వచనము. ఇట దశప్రాణములనఁగా కాలము, మార్గము, క్రియ, అంగము, గ్రహము, జాతి, కళ, లయ, యతి, ప్రస్తారము. ఇందు

'అంగము' అనునది తాళసంఖ్యను దెలుపు సంజ్ఞావిశేషము. ఇది 'అనుద్రుతము, ద్రుతము, లఘువు, గురువు, ప్లుతము, కాకపాదము' అని ఆఱు విధములు. ఈ వివిధాంగములను, వాని స్వరూపములను, అక్షరకాలమును నీ క్రింది విధముగాఁ జూపుచుందురు:-

| అంగము పేరు | స్వరూపము | అక్షర కాలము |
|---|---|---|
| అనుద్రుతము | U | 1 |
| ద్రుతము | O | 2 |
| లఘువు | I | 4 |
| గురువు | ఠ | 8 |
| ప్లుతము | ఠ́ | 12 |
| కాకపాదము | + | 16 |

సంగీతశాస్త్రమున రూపకగతియు నాదిగతియు నిరూపింపఁ బడవు. చతురశ్ర, త్రిశ్ర, మిశ్ర, ఖండ, సంకీర్ణములను ఐదు జాతులు మాత్రమే చెప్పఁబడును.

సంగీతశాస్త్రమున సప్తస్వరములున్నట్లే సప్తతాళములును గలవు: ధ్రువ, మఠ్య, రూపక, జంపె, త్రిపుట, ఆట (లేక అట), ఏకతాళము లనునవి సప్తతాళములు. ఈ సప్తతాళములను వాని యంగలక్షణములను నిట్లు చూపవచ్చును:-

| తాళము పేరు | అంగలక్షణము | అక్షర కాలము |
|---|---|---|
| ధ్రువ తాళము | IOII | (లఘువు-ద్రుతము-లఘువు లఘువు)= అక్షర కాలము 4+2+4+4 =14 |
| మఠ్య తాళము | IOI | (లఘువు-ద్రుతము- లఘువు) = 4+2+4= 10 |
| రూపక తాళము | OI | (ద్రుతము-లఘువు)= 2+4=6 |
| జంపె తాళము | IUO | (లఘువు-అనుద్రుతము-ద్రుతము)= 4+1+2=7 |
| త్రిపుట తాళము | IOO | (లఘువు-ద్రుతము-ద్రుతము)= 4+2+2= 8 |
| ఆట తాళము | IIOO | (లఘువు-లఘువు-ద్రుతము-ద్రుతము) = 4+4+2+2= 12 |
| ఏక తాళము | I | (లఘువు) = 4 |

ఈ తాళములేడును, చతురశ్ర- త్రిశ్ర- ఖండ-సంకీర్ణము లను జాతులైదింటి వలనను ముప్పదియైదు తాళము లగుచున్నవి. ఇందు చతురశ్రజాతి త్రిపుటతాళమును 'ఆదితాళము' అందురు. దీని యంగసంజ్ఞ IOO (లఘువు- ద్రుతము- ద్రుతము).[3] వీరగాథలలో నెక్కువగా ఆట (అట) తాళము ఆదితాళమును ఉపయోగించుచుందురు. యుద్ధఘట్టములందు ఏకతాళము పడుచుండును. జంపె, త్రిపుట, రూపకములును అచ్చటచ్చట కాన నగును.

సాధారణముగా వీరగాథలలో నిదానముగా కథను చెప్పవలసినచోట్ల ఆదితాళమును వేయుదురు. లక్ష్మమ్మకథ, కామమ్మ కథలలోవలె శోకాలాపన హెచ్చినప్పుడీ నిదానము మఱింత హెచ్చును. అప్పుడు అటతాళమును వేయుదురు. ఆదితాళములో నొకటవ కాలము, రెండవ కాలము, మూఁడవ కాలముఁ గూడఁ బాటించుచుందురు. వేగము హెచ్చినకొలఁదిని కాలములును పెరుగుచుండును. జానపదులు త్రిపుట తాళమును 'మూడవ తాళము' అని పిలుతురు. ఆదితాళములో గుమ్మెట మధ్యలో రెండు దెబ్బలు, క్రింద అంచుపై నొక దెబ్బను వేయుదురు. ఈ అంచుపైఁ గొట్టు దెబ్బను జానపదులు 'లఘువు' అందురు. మధ్యలోఁగొట్టు దానిని 'దెబ్బ' లేక 'పైదెబ్బ' అందురు. కాఁబట్టి ఆదితాళములో రెండు దెబ్బలు (పైదెబ్బలు)ను నొక లఘువును వేయవలెను. ఆదితాళము ఒకటవ కాలములో 'మూడు దెబ్బలు- ఒక లఘువు' పడుచుండును. రెండవ కాలములో 'రెండు దెబ్బలు- ఒక లఘువు' పడును. ఏకతాళములో గుమ్మెటపై 'ఒకదెబ్బ- ఒక లఘువు' పడును. వీరగాథలు పాడునప్పుడు వీనిని స్పష్టముగా గమనింపవచ్చును. తెలంగాణములోని వీరగాథలలో 'జుల్వతాళము' తఱచుగఁ బ్రయోగింపఁబడుచుండును. ముగ్గురు మరాటీలకథలోని సైసై వరుస 'కుఱుజంపె తాళము'లో నడచును.

సంగీత పరిభాషలోని ఈ తాళముల పేర్లే క్రమముగా నాయాతాళములలో సాఁగెడి ఛందస్సులకుఁ పేర్లుగా మాఱినట్లు తెలియుచున్నది. అప్పకవి యక్షగాన లక్షణమును వివరించుచుఁ దాళములపేర్లతోఁ గొన్ని రచనా ప్రక్రియలను వివరించినాఁడు. ఈతని ప్రసక్తినిబట్టి 'త్రిపుట తాళము, జంపె తాళము, ఏక తాళము, అట తాళము' అనునవి కొన్ని రకముల ఛందస్సులని తెలియుచున్నది. ఈ నాల్గు తాళములతోపాటు అప్పకవి 'రచ్చరేకు, అర్ధచంద్రిక' అను మఱిరెండు ఛందస్సులను గూడ వివరించి, ఇవియన్నియును రగడ భేదములనినాఁడు. దీనినిబట్టి, ఆయా తాళములలో నడచు ఛందస్సులకు ఆయా తాళముల పేర్లే పెట్టఁబడినవని తలఁపవలసి యున్నది. అప్పకవి చెప్పిన ఈ తాళచ్ఛందము లిట్లుండును:

***త్రిపుట తాళము:-*** 'తుదనేడు లఘువులు తొలగించి చదివినఁ, ద్రిపుటకు వృషభగతి పదయుగము'. అనఁగా వృషభగతి రగడ (7+7+7+7) రెండు పాదములలోఁ జివర నుండు నేడు లఘువులను దొలఁగించినచో నది త్రిపుట తాళమగునని తాత్పర్యము. దీని నిట్లు చూపవచ్చును: "7+7+7+7+7+7+7" వీరగాథలలో సర్వాయి

పాపని కథ ఈ త్రిపుట తాళమున నడచును.

***జంపె తాళము:*** – 'లలిఁ గడపల నొక్క లఘువు మానిన, జంపెమను ద్విరదగతి సమపద యుగము'. అనఁగా ద్విరదగతి రగడ (5+5+5+5) రెండు పాదములలోఁ జిట్టచివర నొక లఘువును మానినచో జంపెతాళ మగునని యర్థము. దీని నిట్లు చూపవచ్చును: "5+5+5+5+5+5+5+4". 'హరిహరీ, నారాయ, ణాదినా, రాయణా, కరుణించి, మమ్మేలు, కమలలో, చనుడా' అను వరుసలో సాఁగెడి పదములన్నియును సరిగా నీ జంపెతాళములోనే నడచును.

***ఏక తాళము:*** – అప్పకవి మధురగతి రగడయే యేకతాళ మనినాఁడు. కావున దీని నిట్లు చెప్పవచ్చును: '4+4+4+4'. బొబ్బిలి వరుసలలోఁ జాలభాగము ఈ యేకతాళముననే ఇమిడిపోవును.

***అట తాళము:*** – 'అంఘ్రి కిర్వదినాలు గటతాళమున మాత్ర, లోలి విశ్రాంతి పద్నాలుగింట'. అనఁగా నటతాళమునఁ బాదమున కిరువది నాలుగు మాత్రలుండుననియు, 1–14 మాత్రలకు యతియనియు నర్థము. పాదమున కిరువది నాలుగు మాత్రలనఁగా నిది రూపకగతి యని చెప్పవచ్చును. (6+6+6+6). నల్లతంగాళ్ కథ ఈ యటతాళముననే నడచును. ఈ యటతాళములో సగమునే 'అర్ధచంద్రిక' యనినాఁడు. అనఁగా నర్ధచంద్రికలోఁ బాదమునకుఁ బండ్రెండు మాత్రలుండును. అప్పకవి మతమున 'రచ్చరేకు' అనఁ గాఁ దురగవల్గన రగడ (3+3+3+3+3+3+3+3). తెలంగాణము లోని కిన్నెర కథలు, కొమిరెల్లి మల్లన్న కథ రచ్చరేకులని చెప్పవచ్చును.

వీరగాథలు లయప్రధానములు గావున నీ లయకు సరిపడు వాద్యములే యెక్కువగ వాడుచుందురు. లయ తాళములను సూచించునవి తట్టువాద్యములు. కావున గాథాకారులు చేతితోఁగాని పుల్లతోఁగాని కొట్టి వాయించెడి వాద్యములను వాడుచుందురు. తెలుఁగు వీరగాథలలో ఎల్లమ్మకథలలో జమిడికలు (జముకులు); అంకమ్మ కథలలో పంబలు; పల్నాటివీరగాథలలోను కాటమరాజుకథలలోను వీరణములు (పెద్దసైజు పంబలు); బొబ్బిలివరుస కథలలోను, జంగంకథలలోను, శారదకథలలోను, బుఱ్ఱకథలలోను, గుమ్మెటలు; హరిహరీ పదములలో జముకులు; చిన్నపరెడ్డికథలో 'కంజిరా', చిటితలు; జాగటకథలలో జేగంట; పురుషులు పాడు వీరగాథానికలలో కోలాటపు పుల్లలు, స్త్రీలుపాడు వీరగాథానికలలో (గొబ్బిపాటలలో) చేతితప్పట్లు నుపయోగించుచుందురు. రాయలసీమలోని చౌడమ్మపాటలలో నిత్తడితాళములు ఉపయోగింతురు. ఈ వాద్యములలో పంబలు, వీరణములు, జేగంట అనునవి పుల్లలతో తట్టి వాయింపఁబడునట్టివి. గుమ్మెటలు, జముకులు, కంజిరా, చిటితలు– ఇవి చేతితో తట్టి వాయింపఁ బడును. ఈ తట్టువాద్యము లన్నియు వీరగాథలలోఁ బ్రధానమైన తాళమును సూచించుచుండును. తంత్రీవాద్యములలోని తంబుఱ, మెట్లకిన్నెరలు కూడఁ గొంతవఱకును లయను సూచించును. ఇఁక వీరగాథలలోని శ్రుతిని గాపాడుటకై యెల్లమ్మకథలలోను, అంకమ్మ కథలలోను, పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను 'తిత్తి' ఉపయోగింపఁబడుచుండును. శారదకథలు, జంగంకథలు, బుఱ్ఱకథలు– వీనిలోఁ తంబుఱను వాడుదురు. చిన్నపరెడ్డికథలో నాగస్వరము ఊఁదఁబడును. కాఁబట్టి వీరగాథలలో సంగీతాంశ మేమియు నుండదనియు, నివి కేవలము గాలిపాటలనియు భ్రమింపరాదు. జాతి, లయ, తాళము, స్వరము, రాగచ్ఛాయ వీరగాథలలో నతిస్పష్టముగా నుండునని గమనింపవలెను. వీరగాథలలో స్వరతాళములను సూచించుటకై ప్రత్యేక వాద్యములు ఉపయోగింపఁబడుచున్నవని తెలిసికొనవలెను.

భాష, కవిత్వము, ఛందస్సు మున్నగు ప్రక్రియలవలెనే వీరగాథల సంగీతముకూడ సరళమైనది. జానపద సంగీతమును బరిశీలించిన విద్వాంసులు దీని సారళ్యమునుగూర్చి కొన్ని ముఖ్యాంశములను వెల్లడించిరి. జానపద సంగీతములో స్వరపరిమితి తక్కువగా నుండును– సాధారణముగా నొక సప్తస్వరస్థాయిని మీఱిపోదు. పాడెడివారు సంగీతశిక్షణ పొందనివారు కనుక నిది సహజము. ఇది గమకమునకుఁ బ్రాధాన్యమిచ్చు సరళమైన సంగీత రచన. ఇందుఁ బ్రతి మధ్యమస్వరమును లోపించును. ఈ మధ్యమ స్వరము విద్వాంసుల స్వరమగుటచే నిది యశిక్షిత కంఠములకు లొంగదు. (స్త్రీలపాటలలో మాత్రము ఈ మధ్యమస్వర మున్నది. పంతువరాళి రాగములోఁ బాడఁబడు స్త్రీలపాటలు కలవు. కాని స్త్రీల పాటలు జానపద గేయములు కావు.) జానపద సంగీతములో 'కంపిత' మున్నగు కొన్ని గమకములను మాత్రమే వాడుదురు. సాహిత్యములో మాటలు మిక్కిలి యెక్కువగ వాడుచుందురు. అనఁగా గేమయున ధాతువు (సంగీతాంశము)కన్న, మాతువు భాగము (సాహిత్యాంశము) ఎక్కువగా నుండును. ఈ సంగీతమున సువ్యవస్థితములైన సంగతులు కాని, స్వర దీర్ఘీకరణములుగాని యుండవు. అర్థమేమియు లేని 'ఏలేలో' 'ఐలేసా' వంటి శ్రావ్యమగు శబ్దములు వాడఁబడుచుండును. (వీరగాథలలోని పునరావృత్తులనియు నిట్టి యర్థములేని శబ్దములే). ఈ గేయములలో తాళమును సూచించుటకు వీలుగా పదబంధముల కూర్పుండును. కొన్ని గేయముల ఫణితులను ఈ పదబంధములను బట్టియే జ్ఞాపకముంచుకొనవచ్చును.[4]

సాంప్రదాయిక వీరగాథలన్నియును ఎక్కువగా తాళ ప్రధానములే యైనను ఇటీవల వచ్చిన జంగంకథలలోను, వీరగాథాను కరణములైన బుఱ్ఱకథలలోను కొన్ని రాగములు సహితము సూచింపఁ బడుచున్నవి. ఈ రాగములకును సంగీత విద్వాంసులు పాడెడి రాగములకును సంబంధము లేదు. ఇవి దేశిరాగములు. జంగంకథలలోఁ గీర్తనలకే రాగతాళ నిర్దేశమున్నది కాని రగడకు లేదు. ఈ రగడ ఎక్కువగా దేవగాంధారి రాగములో పాడఁబడు చుండును. కీర్తనలలో వివిధ రాగములున్నవి. ఉదాహరణమునకు గ్రంథి వెంకట సుబ్బరాయగుప్త రచించిన వామన విజయము జంగం

కథలో 'ముఖారి, బిలహరి, సురట, హిందూస్తాని, శంకరాభరణ, శుద్ధ సావేరి, శుద్ధ కాంబోజి, కాంభోజి' అను రాగములు వాడఁబడినవి. ఈ కీర్తనలన్నియును ఇంచుమించు అటతాళములోనే సాఁగినవి. 'నదీరా' రచించిన లడక్‌వీరులు బుఱ్ఱకథలోను, సంపూర్ణ రామాయణము బుఱ్ఱకథలోను రగడలకే రాగములు సూచింపఁబడినవి. లడక్‌వీరులకథలో 'దేవగాంధారి, మాండ్, అఠాణా, శ్రీరాగము, కన్నడ, మోహన, సామ, శివరంజని, నాదనామక్రియ'– అనురాగములు రగడలకు ఉపయోగింపఁబడినవి. జంగంకథలలో అటతాళము ఎక్కువగ నుండఁగా, బుఱ్ఱకథలలో ఆదితాళము హెచ్చుగా నున్నది.

సాంప్రదాయిక వీరగాథలలో నాయా పేర్లతో రాగములు లేకపోయినను, రసానుగుణముగా వరుసలను మార్చుట కలదు. పరశురాముని కథలలో బవనీలు ఎన్నియో వరుసలను బాడుదురు. **'ఆలాపముల శుద్ధ సాళవ సంకీర్ణ, వివిధరాగంబుల చవులు చూపి'** బవనీల చక్రవర్తి పరశురాముని కథలను పాడినట్లుగా క్రీడాభిరామ కర్త సాక్ష్యమిచ్చినాఁడు. అంకమ్మకథలలో సుదీర్ఘాలాపములతోఁ గూడిన 'శోకము', తగు మాత్రముగాఁ బాడఁబడు 'వర్ణము', లయాత్మకముగాఁ బాడఁబడు 'మాటలు' అను మూఁడు వరుసలున్నవి (చూ. శక్తి కథాచక్ర మను పదియవ ప్రకరణము). పల్నాటి వీరకథలను పాడు వీరవిద్యావంతులు ముఖ్యముగా నాలుగు వరుసలను పాటింతురు: 'మామూలు వరుస, యుద్ధపు వరుస, సాయ పాట, అడుగు దరువు'. సాధారణ విషయములను జెప్పుచుఁ గథను నడుపునప్పుడు 'మామూలు వరుస'ను బాటింతురు. యుద్ధ ఘట్టములలోఁ గత్తిసాము చేయుచుఁ జిందుత్రొక్కుచుఁ బాడుదురు. దుర్భరమగు శోకమును జెప్పునప్పుడు (బాలచంద్రునిచేఁ బరిత్యజింపఁబడిన అనసోతు శోకము వంటిది) 'సాయ పాట' అనువరుసను బాటింతురు. సంతోషమును జూపు ఘట్టములందు (బాలచంద్రుఁడు మాంచాలతో సల్లాపములాడుట వంటివి) చిందుత్రొక్కుచుఁ బాటపాడుదురు. దీనిని 'అడుగు దరువు' అందురు. కాటమరాజుకథలలో నెక్కువ భాగము దీర్ఘాలాపములతోఁ బాడఁబడును. ఇది పల్నాటికథలలోని 'సాయ పాట' వరుసలో నుండును. యుద్ధఘట్టములందు దీర్ఘమును తగ్గించి లయానుగుణముగాఁ బాడుచుందురు. భట్టురాయబార మంతయు నిట్లే పాడఁబడును. ఇది పల్నాటికథలలోని యుద్ధపు వరుస వలెనే యుండును. బొబ్బిలివరుస కథలలో అటతాళము, ఆదితాళమున మూఁడు కాలములు, త్రిపుటతాళము, యుద్ధఘట్టములందు ఏకతాళమును బ్రయోగింపఁబడుచుండును. హరిహరీపదములన్నియును జంపెతాళమున సాఁగును. శారదపదములు అటతాళమున సాఁగు దరువులు. జంగంకథలలోఁ గీర్తనలందు వివిధ రాగములు వాడఁబడును. ఇవన్నియు నెక్కువగా అటతాళమున సాఁగును. బుఱ్ఱకథలలోఁగూడ వివిధరాగములు ఆదితాళములో సాఁగుట కలదు.

రసానుగుణముగా రాగములను పాడుటలో బుఱ్ఱకథా పితామహుఁడగు నాజరు సిద్ధహస్తుఁడు. యుద్ధఘట్టములందు ఇతఁడు ప్రత్యేకముగాఁ గొన్ని దేశివరుసలను సృజించినాఁడు. వానికి 'నాజరు వరుస'లని పేరు. షేక్ నాజరు తఱచుగా నుపయోగించెడి రాగములు:–

1. విషయ ప్రధానమగు ఘట్టములలో – దేవగాంధారి రాగము.
2. విచారమును సూచించు ఘట్టములలో (ఇది యేడ్చుటకు ముందుండెడి విచారము) – తోడి రాగాము.
3. పూర్తిగ శోకమును వ్యక్తము చేయవలసిన ఘట్టములలో – ఫీలు రాగము.
4. రౌద్రరసమును జూపవలసిన ఘట్టములలో – శ్రీ రాగము.
5. బీభత్సదృశ్యములను, భయానక దృశ్యములను వర్ణించునప్పుడు – మోహన రాగము.
6. సంతోషమును దెలియఁ జేయునప్పుడు, జోలపాటలు, లాలి పాటలు వగైరాలకు – శంకరాభరణము, ఆనందభైరవి రాగములు.

తాళములలో ఈ నాజరు అటతాళమును ఆదితాళమును ఎక్కువగా నుపయోగించుచుండును. అటతాళమున మూఁడు కాలములను బ్రయోగించును. మిక్కిలి నిదానముగా నున్నప్పుడు మొదటి కాలమును, నిదానముగా నున్నప్పుడు రెండవ కాలమును, వేగముగా నున్నప్పుడు మూఁడవ కాలమును పాటించును. అటతాళములోని మూఁడవ కాలమే ఆదితాళము.

తెలుఁగు వీరగాథలలోఁ బ్రయోగింపఁబడుచుండు తట్టు వాద్యములలో పంబలు (వీరణములు), జముకులు, గుమ్మెటలు– ఈ మూఁడును బ్రధానమైనవి. పెద్దవిగా నుండు పంబలను వీరణము లందురు. ఈ పంబలు రెండుండును కావున వీనిని 'పంబజోడు' అందురు. వంత లీ పంబజోడును మెడలో వ్రేలాడవేసికొందురు. ఒక పంబ తొడలపై నుండును, రెండవ పంబ దానిపై నెక్కియుండును. మొదటి పంబ తక్కువ శ్రుతిలో నుండును. రెండవ పంబ యెక్కువ శ్రుతిలోనుండును. వంతకాఁడు తన యెడమచేతితో మొదటి పంబను, కుడిచేతిలోని పుల్లతో రెండవ పంబను తట్టుచుండును. జముకులలో రెండు రకములున్నవి. ఒకటి చిన్నది, రెండవది పెద్దది. చిన్నదానిని 'శ్రుతి' యందురు. పెద్దదానిని 'జముకు' అందరు. పెద్ద జముకును కథకుఁడే వాయించుచుఁ బాడును. శ్రుతిని వంతలు వాయింతురు. పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను, అంకమ్మ కథలలోను, వాడఁబడు శ్రుతివాద్యము పేరు తిత్తి. దీనిని గొఱ్ఱెచర్మముతోఁ జేయుదురు. ఇది చిన్న గోనుసంచివలె నుండును. దీనికి రెండు వైపుల రెండు గొట్టములుండును. వంతలలో నొకఁడు దీనిని జేతఁబట్టి, యొక గొట్టమును జేతితో మూసి, రెండవ గొట్టమును

నోటిలోఁ బెట్టుకొని, తిత్తినిండుగా గాలినూఁది, చేతితో మూసిన మొదటి గొట్టమును దెఱచివేయును. గాలి యా గొట్టముగుండా పోవుచు శ్రావ్యమగు ధ్వనిఁజేయును. ఇది గాథాకారునకుఁ జక్కని శ్రుతి నిచ్చును. ఇఁక తట్టువాద్యములలో గుమ్మెటయు, తంత్రీవాద్యములలో తంబుఱయు నతి ప్రధానములైనవి. ఇవి పనిచేయు తీరునుగూర్చి సూక్ష్మముగాఁ దెలిసికొన్నచో వీరగాథల వరుసలింకను స్పష్టముగాఁ దెలియును.

గుమ్మెటను వంత మెడలో వేసికొనును. గుమ్మెట మూతి కుడిచేతి దగ్గఱను, గుమ్మెట సోగ యెడమచేతి దగ్గఱను నుండును. ఈ గుమ్మెట సోగ నెడమచేతితో మూయుచుఁ దెఱచుచుఁ, గుడిచేతితో గుమ్మెట మూతిని మ్రోగింతురు. ఇట్లు గుమ్మెటను వాయించుటలో మూఁడు రకముల ధ్వనులు వచ్చును. వీనికి 'మంద్రము, మధ్యమము, పంచమము' అని పేర్లు. ఎడమచేతి దగ్గఱనున్న గుమ్మెట సోగను దెఱచి, కుడిచేతితో గుమ్మెట మూతి మధ్యలోఁ గొట్టినచో 'ధిం' అను ధ్వని పుట్టును. దీనికి మంద్రమని పేరు. ఎడమ యఱచేతితో సోగను మూసి, కుడిచేతితో మూతిమధ్యలోఁ గొట్టినచో 'త్త' అను ధ్వని పుట్టును. ఈ ధ్వనికి మధ్యమమని పేరు. అట్లే సోగను మూసి, గుమ్మెట మూతిచుట్టును గల యంచుపై నెక్కడఁ గొట్టినను సరే–అనునాసిక సహితమగు 'ఠఁ' అను ధ్వని పుట్టును. దీనిని బంచమ మందురు. ఈ మూఁడు ధ్వనుల సమ్మేళనముతోడనే వీరగాథల తాళములన్నియును నడుచును. రెండు మంద్రధ్వనులు నొక పంచమధ్వనిని మ్రోఁగించినచో అటతాళమగును. రెండు మంద్రధ్వనులును, ఒక మధ్యమ ధ్వని, రెండు పంచమములు మ్రోగించినచో ఆదితాళము. ఒక మంద్రమును, ఒక పంచమమును వేగముగా మ్రోగించినచో 'దుడ్డింకి వరుస' పుట్టును. ఈ దుడ్డింకి వరుసను యుద్ధఘట్టములలో నుపయోగింతురు. ఈ వరుసలను నాయాధ్వనులను నిట్లు చూపవచ్చును:–

| | | | |
|---|---|---|---|
| 1. అట తాళము | = | **ధిం–ధిం**<br>**ఠఁ** | (మంద్రము, మంద్రము,<br>పంచమము) |
| 2. ఆది తాళము | = | **ధిమి–ధిమి**<br>**త్త**<br>**ఠింగ్–ఠింగ్** | (మంద్రము–మంద్రము<br>మధ్యమము<br>పంచమము–పంచమము) |
| 3. 'దుడ్డింకి వరస' | = | **ధిం**<br>**ఠఁ** | (మంద్రము<br>పంచమము) |

ఈ 3వ వరుసను వాయించు నప్పుడు 'దుడ్డింకి, దుడ్డింకి' అను శబ్దము వచ్చును.

వీరగాథలలో నెక్కువగా పైమూఁడు వరుసలే వాడఁబడు చుండును. కాని గుమ్మెటను వాయించుటలో విశిష్ట ప్రజ్ఞావంతులైన కొందఱు కరుణరస ఘట్టములలో (దుఃఖము మితిమీరినప్పుడు) అట తాళపు వరుసలోనే యొక ప్రత్యేకమగు వరుసను వాయింపఁ గలరు. ఈ ప్రత్యేకమగు వరుస ఈ క్రింది విధముగా నుండును:

**ధిం–ధిం**
**ఠఁ**
**ఠఁ**
**ధిం – ధిం**
**ఠఁ**

వీరగాథలలోని తంబుఱ శ్రుతికే కాక గతికిఁ గూడ నుపయోగించును. సాధారణముగాఁ దంబుఱకు మూఁడు తీగలే యుండుట పరిపాటి. కాని సరియగు తంబుఱకు నాలుగు తీగలుండ వలెను. ఈ నాలుగును బిగింపులో నసమానములుగా నుండును. ఈ యసమానత్వము బిగింపులోనే కాకుండ లావులోఁగూడ నుండును. మొదటి తీఁగ మంద్రస్థాయిని, రెండవ తీఁగ మధ్యమస్థాయిని, మూఁడవ తీఁగ (ఇది రెండులో నొక యంతర్భాగము) షడ్జమస్థాయిని, నాల్గవ తీఁగ తారస్థాయిని ధ్వనించుచుండును. వీని ధ్వనులను, 'స, ప, స, ప' అని చెప్పవచ్చును.

| | | |
|---|---|---|
| 1. మంద్రస్థాయి తీఁగ | = | ఇది లావుగా నుండి, ఇత్తడితోఁగాని, రాగితోఁగాని చేయఁబడును. |
| 2. మధ్యమస్థాయి తీఁగ | = | ఇది పైదానికన్న సన్నముగా నుండును. ఉక్కుతోఁ జేయఁబడును. |
| 3. షడ్జమస్థాయి తీఁగ | = | ఇది మధ్యమస్థాయి తీఁగవంటిదే కాని, దానికన్నఁ గొంచెము సన్నగా నుండును. ఈ తీఁగ నేఁటి తంబుఱల లోఁ బరిహరింపఁబడినది. |
| 4. తారస్థాయి తీఁగ | = | ఇది మిక్కిలి సన్నమైన తీఁగ. ఉక్కుతోఁ జేయబడును. |

ఇట్లు నాలుగు తీగలున్న తంబుఱను (లేదా మూఁడు తీగలున్న దానిని) కుడిచేతి చూపుడు వ్రేలుతోను బొటన వ్రేలుతోను మీటుదురు. ఈ మీటుట గతి ననుసరించి యుండును. గుమ్మెటలను వంతలు ధరింపఁగాఁ బ్రధాన కథకుఁడు తంబుఱను మీటుచు గానము చేయును. కుడిచేతితోఁ దంబుఱను మీటును. ఎడమచేతితో నందెలను మ్రోగించుచుండును. ఈ యందెలు సాధారణముగా మూఁడుండును. బొటనవ్రేలికి రెండు తగిలించుకొనును, అఱచేతిలో నొకటియుంచు కొనును. బొటనవ్రేలి యందెలు వచ్చి అఱచేతిలోనున్న యందెకుఁ దగులుచుండును. బొటనవ్రేలిని వదులుగా నాడించుచుండును. అందెలను వాయించుట అప్రయత్నముగా జరుగుచుండును. ధ్వనిని దగ్గింపవలసివచ్చినప్పుడు ప్రయత్నపూర్వకముగా నందెలను గొట్టవలెను.[5]

వీరగాథల సంగీతము శుద్ధ దేశిసంగీతము. పురందరదాసు కర్నాట సంగీతమును వ్యాపింపఁజేసిన తరువాత నీ దేశిసంగీతము

వెనుకఁబడుట ప్రారంభించినది. సిద్ధేంద్రయోగి తెలుఁగు దేశమునకు వచ్చిన తరువాత దేశిసంగీతము పూర్తిగా నణఁచి వేయఁబడినది. కూచిపూడి భాగవతము బ్రాహ్మణుల చేతిలోఁబడి రాజాస్థానములలో నుండెడిది. ఈ దేశిసంగీతము మాల, మాదిగ, చెంచు, కోయ, ఎఱుక, ఏనాది, గొల్ల భాగవతుల వంటి నిమ్నకులములవారి కడనుండి శిష్టులచే ననాదరింపఁబడినది. ప్రస్తుతమున్న కూచిపూడి భాగవతము యొక్క ప్రాచీనరూపము దేశియక్షగానమైనను, సంగీత సంప్రదాయము మాత్రము ప్రాచీనాంధ్ర యక్షగానములలోని దేశి కాదు. సిద్ధేంద్రయోగిచే కర్నాట బాణిలోనికి మలఁచఁబడిన మార్గసంగీతము. ప్రాచీనాంధ్ర యక్షగానములలోని దేశిసంగీతమును నేఁటివఱకును గాపాడినవి వీరగాథలు మాత్రమే యని గుర్తింపవలసియున్నది.

ఇట్లు వీరగాథలలో తాళ రాగ యుక్తమైన దేశిసంగీతమే కాక, దేశినృత్యముకూడ నున్నది. వీరగాథల నృత్యము నాలుగు విధములుగా నుండును: 'నడక, చిందు, గంతు, కుప్పిగంతు'. ఈ నాల్గును ఉత్తరోత్తరము ఉద్ధృతతరములగు ప్రక్రియలు. గాథాగానము లోని యావేశము ననుసరించి వీనియౌద్ధత్యమును పెరుగుచుండును. గాథాకారుఁడు బొమ్మవలె నిలబడి పాడువాఁడు కాఁడు. వీరావేశముతో నూఁగుచు, ముందుకు వెనుకకు నడచుచుఁ, జిందులు త్రొక్కుచు, గంతులు వేయుచుఁ పాడుచుండును. సాధారణ విషయ వివరణమును బాడునప్పుడు లయానుగుణముగా ముందునకు వెనుకకు నడచు చుండును. దీనిని 'నడక' యందురు. సంతోష విషయములను, నుత్సాహ జనకములగు విషయములను పాడునప్పుడు చిందులు త్రొక్కును. తీవ్రమగు యుద్ధఘట్టములను వర్ణించునప్పుడు గంతులును, కుప్పిగంతులును వేయును. ఇవియన్నియును దేశినృత్త భాగములే.

గాథాకారులందఱును వేషధారణ చేయుదురు. శక్తికథలను పాడువారు శక్తివేషమును ధరింతురు. పల్నాటి వీరకథలను పాడువారు పల్నాటి వీరునివలె వేషమును ధరింతురు. కాటమరాజు కథలను పాడువారు కాటమరాజు వేషమును ధరింతురు. ఇట్లే తక్కిన గాథాకారులును. గాథలను పాడునప్పుడు హావభావ యుక్తముగాఁ గొంత నటనను గూడఁ బ్రదర్శించుచుందురు. కావున వీరగాథలలో సంగీత నృత్యములతోపాటు, రూపకాంశములగు ఆహార్యమును, నటనయుఁ గొంత కలవని చెప్పవచ్చును.

వీరగాథలలోని సంగీతాంశమునుబట్టి వానిని మూఁడు వర్గములుగా విడఁదీయవచ్చును: 1) ఒకేవ్యక్తి పాడునవి, 2) ఒక వ్యక్తి పాడుచుండఁగా నిద్దఱు ముగ్గురు వంతపాడునవి, 3) అందఱును కలసి పాడునవి.

***1. ఒకే వ్యక్తి పాడు వీరగాథలు:–*** వీనిలో గాథాకారుఁడొక్కడే యుండును. ఇతనికి వంతలుండరు. ఇవి జానపద గేయములలోఁ గపిలపాటల వంటివి. వీరగాథలలో నిట్టి వర్గము చాలఁ దక్కువ. తెలంగాణములోని 'కిన్నెర కథలు', రాయలసీమలోని 'జాగట కథలు' ఈ వర్గమునకుఁ జెందును.

***2. ఒక వ్యక్తి పాడుచుండఁగా నిద్దఱు ముగ్గురు వంతపాడు వీరగాథలు:–*** ఇంచుమించు వీరగాథలన్నియును నీ వర్గమునకే చెందును. ఎల్లమ్మ కథలు, అంకమ్మ కథలు, పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు, హరిహరీ పదములు, శారద పదములు, జంగం కథలు, బుఱ్ఱకథలు మున్నగునవన్నియును నిట్లే పాడఁబడుచున్నవి.

***3. అందఱును కలసి పాడు వీరగాథలు:–*** ఇట్టి బృందగానములు లఘువీరగాథలలో నున్నవి కాని, దీర్ఘవీరగాథలలో లేవు. రాయల సీమలో చౌడమ్మ పాటలన్నియును బృందగానములే. అట్లే వీరగాథానిక లలో కోలాటము పాటలన్నియును నిట్టివే.

ఏది ఏమైనను వీరగాథలలోని భాషనుగూర్చి సమగ్రపరిశీలన మును జరుపుటకు భాషాశాస్త్రజ్ఞులు అవసరమైనట్లే, వీరగాథలలోని సంగీతాంశమునుగూర్చి కూలంకషముగాఁ జర్చించుట రాగతాళము లను గరతలామలకము చేసికొన్న సంగీతవిద్వాంసులకే సాధ్యమగును.

❒

## జ్ఞాపికలు

*1. శ్రీ ఏకా సుబ్బారావుగారి 'సంగీత గాన సుధ', పుటలు 2, 3.*

*2. సంగీతములోని ఈ జాతులనుగూర్చి వివరించిన పూజ్యులు శ్రీ రాళ్లపల్లి అనంతకృష్ణశర్మగారికి నమశ్శతములు.*

*3. శ్రీ ఏకా సుబ్బారావుగారి 'సంగీత గాన సుధ', పుటలు 5–7.*

*4. శ్రీ పి.సాంబమూర్తి, ఉపోద్ఘాతము, తెలుగు పల్లెపాటలు, పుటలు,* viii, ix.

*5. వీరగాథలలోని గుమ్మెట తంబుఱ ధ్వనుల విశేషములనుగూర్చి తెల్పిన మిత్రులు శ్రీ షేక్ నాజరు (గుంటూరు) గారికి మిక్కిలి కృతజ్ఞుఁడను.*

# ఇరువదిరెండవ ప్రకరణము

# వీరగాథల వైశిష్ట్యము

కడచిన తృతీయభాగమున వీరగాథల రసపోషణను గూర్చియు, వీరగాథాకవిత్వములోని వారానువర్తనములనుగూర్చియు, వీరగాథల భాషనుగూర్చియు, వీరగాథల ఛందోరీతులనుగూర్చియు, వీరగాథాగానములోని సంగీతమునుగూర్చియుఁ జర్చింపఁబడినది. ఇఁక నీ చతుర్థభాగమున 'వీరగాథల వైశిష్ట్యము, ఆంధ్రదేశములోని గాథాకారులు, వీరగాథల క్షీణతాకారణములు, వీరగాథల సేకరణము–పరిరక్షణము' అను నంశములనుగూర్చి చర్చింపఁబడును.

జానపదకవిత్వమునుండి దేశికవిత్వమును, దేశికవిత్వము నుండి మార్గకవిత్వమును గ్రమముగాఁ బరిణమించియుండునని పండితులు తలంచుచున్నారు. వీరగాథలు జానపద కవిత్వమునఁ బ్రధానభాగము. కాఁగా వీని వైశిష్ట్యమును బ్రత్యేకముగా నెన్నఁబని లేదు. వీరగాథలు స్వయంసంజాతములై, ఇతిహాసప్రభవములై, నిసర్గ మనోహరములై, జాతీయతాచిహ్నములై, స్వాతంత్ర్యపరిరక్ష కములై, ప్రజాజీవితప్రతిబింబములై, వీరరసప్రధానములై, వీర పునరుజ్జీవకములై, నిందానిరసనసమర్థములై తమ వైశిష్ట్యమును సహస్రముఖముల ఘోషించుచున్నవి. వీరగాథ మహాశక్తిసంపన్నమైన సాహిత్యప్రక్రియ. సర్వజనాకర్షణశక్తి, సంఘసంచాలకశక్తి, విచిత్రానుభూతిదాయకశక్తి– అను త్రివిధశక్తిసమన్వితములగు వీరగాథలు శిష్టకవులపై సహితము తమ ప్రభావమును జూపినవి. ఈ వీరగాథా కవిత్వమువలన భాషాసమాజములకుఁ గొన్ని విశిష్ట ప్రయోజనము లును సమకూడుచున్నవి.

## 1. స్వయం సంజాతములు:–

వీరగాథలు ప్రపంచమునఁ బ్రతిసాహిత్యమందును స్వయం సంజాతములై దేశీయములైన విశిష్ట ప్రక్రియయే కాని, కథానిక నవల మున్నగువానివలె నొకదేశమునుండి మఱియొక దేశమునకు సంక్రమించిన యెరువుసొమ్ములు మాత్రము కావు.

## 2. ఇతిహాస ప్రభవములు:–

వీరగాథ, ఇతిహాసమునకు మాతృక. ఒక జాతికి విశేష గౌరవ ప్రపత్తులను బ్రసాదించి, దాని సంస్కృతిని పట్టియిచ్చునది ఆజాతి యందలి ఇతిహాసకవిత్వము మాత్రమే. రామాయణ, మహా భారతములు లేనిచో భారతీయ సంస్కృతియే లేదు. 'ఇలియడ్, ఒడిస్సే, బియోవల్ఫ్' అనునవి లేనిచో పాశ్చాత్యులకు గర్వింపఁదగిన కారణ ముండదు. ఇట్టి మహోన్నతేతిహాసములకు మూలభూతమైనవి వీరగాథలు.

ఏ సాహిత్యమందైనను పాట ముందు పుట్టును. ఈ పాటలో స్వల్పముగా కథాకథనము ప్రవేశించుటచే గేయకథానిక (Balladling), దీర్ఘకథనము ప్రవేశించుటచే గేయకథ లేక వీరగాథ (Ballad), కొన్ని వీరగాథల సమాహారముచే వీరగాథాచక్రము (Ballad- cycle), ఈ వీరగాథాచక్రములనుండి ఇతిహాసములు (Epics) పరిణమించుచుండును. ఇట్టి క్రమపరిణామమును పాశ్చాత్యులు 'ఐతిహాసిక క్రమము' ('Epic Process') అని పిలుతురు. మన మహాభారతమునకు ఆదిరూపము 'జయ'మను వీరగాథయని విమర్శకులు భావించుచున్నారు.[1] మహాభారత యుద్ధకాలమునకుఁ బూర్వమునుండియుఁ బ్రజలలో వ్యాప్తియందున్న వీరగాథలెన్నియో ఈ యితిహాసమునఁ గలుపఁబడినవి. నలునికథ, హరిశ్చంద్రుని కథ, రామునికథ మున్నగునవి ఇట్టివే. అట్లే పాశ్చాత్యుల 'బియోవల్ఫ్' అను నితిహాసమున దానికిఁ బూర్వయుగమందలి వీరగాథలెన్నియో అంతర్భూతములైనవని విమర్శకుల తలంపు. అసలు, వీరగాథల సమాహారమే 'బియోవల్ఫ్' అనువారును గలరు. తెలుఁగు సాహిత్యమున బసవపురాణము, పండితారాధ్య చరిత్రము వీరగాథలనుండి యేర్పడిన వనుట స్పష్టము. పురాతన భక్తవితతిని గూర్చి ప్రజలు భక్త్యావేశముతోఁ బాడుకొను కథాగేయములే తాను వ్రాయఁబోవు నితిహాసమునకు మాతృకలని కవియగు సోమనాథుఁడే కంఠోక్తిగాఁ జెప్పుకొనెను.

పాటకాదు, వీరగాథయే కవిత్వమునకు ఆదిరూప మనువారును గలరు. మన వేదములు ప్రాచీనార్యుల జానపద గేయములనియు, నందలి ఉపాఖ్యానములే వీరగాథలనియు విమర్శకుల భావన. కాని పరాశ్రయ కవిత్వమగు వీరగాథకన్న నాత్మాశ్రయ కవిత్వమగు జానపదగేయమే (Folk song) ప్రాచీనమైనదని మఱికొందఱ భావన. ప్రాక్తన మానవుఁడు భావావేశమున 'ఏల' వంటి యొక గేయము నాలపించి యుండును గాని, కథాగేయము నాలపించి యుండుననుట క్రమవిరుద్ధము. జానపదగేయములు వీరగాథలు కలిసి జానపద కవిత్వమగును. మానవ నాగరికతాభివృద్ధిలో నీ జానపద కవిత దేశికవితగాను, నీ దేశికవిత మార్గకవితగాను బరిణమించి యుండును. ఛందోవికాసము కూడ నీ పరిణామమును సమర్థించుచున్నది. గణచ్ఛందములకంటెఁ బ్రాచీనమైనవి దేశిచ్ఛందములు, దేశిచ్ఛందములకంటెఁ బ్రాచీనమైనవి జానపద గేయములు. "సీసము, గీతము, ద్విపద, తరువోజ, రగడ, మధ్యాక్కర మున్నగు దేశీయచ్ఛందములు కొన్ని జానపద గేయముల కొలఁది మార్పులతో అల్లబడినవేయని నిశ్చయముగాఁ

దెలియుచున్నది."[2] కావున ఛందస్సులో పద్యమునకు మాతృక జానపదగేయమైనట్లే, కావ్యప్రక్రియలలో ఇతిహాసమునకు మాతృక వీరగాథ.

### 3. నిసర్గ మనోహరములు:-

వీరగాథలు సహజసుందరములు. ప్రజాజీవితమును జాతీయతను ప్రతిబింబించుటచే నివి నిసర్గమనోహరములు. "జానపద గేయము లాయాదేశములందలి మత పరిణామములను, మనస్తత్వములను, వీరుల యుదంతములను, పతివ్రతల కథలను, ఆచార వ్యవహారములను, విశ్వాసములను, వినోదములు, విందులను, వేడుకలను, అన్యోన్యానురాగములను, సంయోగ వియోగములను, సౌందర్య సౌభాగ్యములను, సుఖదుఃఖములను, జాతీయతను ప్రతిబింబించుటచే నీ జానపదగేయములు నిసర్గమనోహరములుగా నుండును."[3] అందుచే వీరగాథలు ఉత్తమ ప్రజాకవిత్వ మన దగియున్నవి. ఒక దేశములోని పాటలు పదములే దాని కవిత్వమందలి నిసర్గ భాగములు. అవియే ఆ దేశమందలి అసంఖ్యాక ప్రజల నిజకవిత్వము.[4] సహజత్వమే దీనికి జీవము. ఈ జీవముతోనే ఇవి శతాబ్దముల తరబడి బహుజనాదరపాత్రతను గలిగి మనఁ గలుగుచున్నవి. పండితులెంత నిరాదరించినను వీరగాథల ప్రాశస్త్యము తగ్గునది కాదు. ఒకజాతిని దాని సంస్కృతిని పట్టియిచ్చునది ఆ జాతి జానపదకవిత్వము మాత్రమే యని గుర్తింపవలెను. ఇట్టి ప్రశస్త కవిత్వమును బండితులు సీత్కరించుట నిజముగా విచారింపఁదగిన విషయము:-

"It is much to be regretted that this popular literature has not received the attention it merits. Orthodox critics look down upon it as literature of an inferior class. This judgement will not be endorsed by the modern student. Most of it exists in the form of oral literature, not yet reduced to print. When the industry of the research scholar makes it avilable for the critic to sift and winnow, it will be found that this literatue, scorned by the pandit, looked down upon by the learned, is the true heritage of the Andhras- their characteristic contribution to the commonwealth of letters- their true 'Gitanjali!"[5]

### 4. జాతీయతా చిహ్నములు:-

వీరగాథలు జాతీయతాచిహ్నములు. భారతదేశమందు భిన్నభాషలను మాటాడుచున్న విభిన్న జాతులవారున్నారు. కాని భారత దేశమంతయు నొకే సంస్కృతితో నొప్పారుచున్నది. ఈ యేక సంస్కృతిని వివిధ భారతీయభాషలలోని జానపదగేయములు వీరగాథలు మాత్రమే నిరూపించుచున్నవి. భారతదేశమంతయును దిరిగి, వివిధ ప్రాంతములనుండి వేలకొలఁది పామరగీతములను వీరగాథలను సంపాదించిన మహానుభావుఁడు శ్రీ దేవేంద్ర సత్యార్థిగారు. ఈయన 'ధర్తీ గాతీ హై' అను తన గ్రంథమున నిట్లు వ్రాసిరి: "ఉత్తరమునుండి దక్షిణము వఱకును, తూర్పునుండి పడమర వఱకును, నాలుగు దిశలందును నొకే పారంపర్యమును జూచి భారతమాత గర్వించును. ఒకే విధమగు ఆశానిరాశలు, ఒకేతీరు సుఖదుఃఖములు, ఒకేతీరు సంస్కారము, ఉత్సవములు, తిరునాళ్లు, భారతమాత ఏకతకు వివిధాంగములు. ప్రాంతప్రాంత జానపద గేయములందు భారతమాత యఖండ స్వరూపమును జూచియు, ఆయా భాషలందు నామాత హృదయ స్పర్శకములగు పలుకులు వినియు మనము గాఢ్ఢ ద్యమును బొందెదము. యుగ యుగాంతరములనుండి భరతమాతృ సంతానము ఐక్యతానుభవము నొందుచు వచ్చుచున్నది."[6]

ఇట్లు భారతదేశమే కాదు, ఐరోపాఖండమంతయు నొకే సంస్కృతి కలదని వీరగాథలు నిరూపించుచున్నవి. ఒక్క దేశమే కాదు, ఒక్క ఖండమే కాదు, సమస్త ప్రపంచమును ఒకే మానవ సంఘమునకుఁ జెందినదను నపూర్వరహస్యమును సహితము వీరగాథలు సుస్పష్టమొనర్చుచున్నవి. బాహ్యమగు రచనావిధానము నను, భాషలోను భేదములున్నను, ఆంతరమగు సుఖదుఃఖములు, రాగద్వేషములు, ఆశానిరాశలు, ప్రపంచ వీరగాథలన్నింటికిని సమానములే.

### 5. స్వాతంత్ర్య పరిరక్షకములు:-

ఒక దేశ స్వాతంత్ర్యము చెక్కుచెదరకుండ నిలువలెనన్నచో ఆదేశ ప్రజలలో వీరగాథాగానము విరివిగా సాఁగుచుండవలెను. దీనివలన ఆ ప్రజలలో సాహసము, దేశభక్తి, త్యాగశీలత, ధైర్యము మొదలగు గుణములు ప్రజ్వరిల్లి, వారు నిత్యజాగరూకులై యుందురు. పిలిచినవెంటనే శత్రువుల మూకపై నుఱుకుటకు సంసిద్ధులుగ నుందురు. "సాహసికుల సాహసకృత్యాలు అంతకంటె తక్కువ సాహసికులకి వెరపూ ఆశ్చర్యమూ కలిగిస్తాయి. అందుచేత సాహసికుల్ని మెచ్చుకోవడం, ఒక్కొక్కసారి అనుకరించే సాహసం కలగడం జరుగుతాయి. ఇది దేశం పరన్నపాధీనం కాకుండా కాపాడు కొనవలసిన కాలంలో అత్యగత్యమైంది. అందుచేతనే వీరకథాగాథలెన్నో గేయరూపంలో ప్రచారంలో నున్నాయి. అలాంటి వాటిలోనే కాటమరాజు కథ, పల్నాటి వీరచరిత్ర మొదలైనవి."[7]

### 6. జాతికి గర్వకారణములు:-

వీరగాథలు దేశమునకు గర్వకారణములు. చరిత్రలేని జాతి ఆనందవిహీనము. యోధుల సాహసకార్యములను మహోద్రేకము నఁ గీర్తించుచు జ్ఞాపకముచేయు వీరగాథలను వినఁగల జాతి యదృష్టవంతము.

"Unhappy the nation that has no history and happy the nation that can hear the ballads commemo-

rating the adventures of her warriors sung with fervour and happy the country that can point with pride on the pages of history to patriots who wept for their countries' wrongs, stood against the oppressor and the tyrant.''[8]

నూనతముగా స్వాతంత్ర్యము నొందిన దేశము తన జానపద గీతములను జూచి యుత్తేజము నొందితీరవలెనని దేవేంద్ర సత్యార్థి గారి యభిభాషణము. స్కాట్లండుదేశ నివాసియగు 'ఫ్లెచర్' (Fletcher) 1706 లో జానపద సాహిత్యమునుగూర్చి వ్రాయుచు "ప్రతిజాతి లేక దేశదేశపు జానపదగీతాలు ఆ ప్రాంతపు శాసనాలకంటే ఎక్కువ విలువైనవి"[9] అనినారు.

## 7. ప్రజాజీవిత ప్రతిబింబములు:–

మార్గ–దేశి సాహిత్యములలో వీరగాథలు దేశికి– అందునను శుద్ధదేశికిఁ జెందిన కవితా ప్రక్రియ యని ముందుగనే తెల్పియున్నాను (చూ. 'ఆముఖ' మను మొట్టమొదటి ప్రకరణము). శుద్ధదేశి యగు నీ వీరగాథలలో నితివృత్తము, భాష, ఛందస్సు– అను మూఁడును దేశిగనే యుండును. అందుచే నివి ప్రజాజీవితమును మణిదర్పణముల వలెఁ బ్రతిఫలింపఁజేయు నుత్తమ ప్రజాకవిత్వమైనవి.

వీరగాథలు ప్రజాజీవిత పత్రములనియు, మానవ స్వభావౌన్నత్యముల నెత్తిచూపు ప్రముఖ సాధనములనియుఁ బాశ్చాత్య విమర్శకుల మెచ్చుకోలు:

''The ballads form a leaf in the life of the people, they uphold the dignity of human nature, they carry us away to the legends, the romances, the beliefs, the traditions of our ancestors and take us out of ourselves to 'fleet the time carelessly, as they did in golden world.''[10]

వీరగాథల యుత్పత్తికిఁ గారణము ప్రాక్తన మానవుల సామూహిక నృత్యమగుటచే నివి యిప్పటికిని నా ప్రాచీన సంఘమునకు దగ్గఱగానుండు నిమ్నజాతులలోనే తలదాఁచుకొని, వారి జీవితమును యథాతథముగాఁ బ్రతిధ్వనించుచున్నవి. మహాసాగరమంతయుఁ దీరముననుండు నత్తగుల్లలోఁ బ్రతిధ్వనించునట్లు, కార్మిక కర్షక ప్రజల ఆత్మభారమంతయు నిసర్గమనోహరము లగు నీ వీరగాథలలోఁ బ్రతిధ్వనించుచుండును.[11] మార్గకవులు ఆదర్శ జీవితమును జిత్రించుటకై శాస్త్రములను జదివి, తమ పాండిత్య ప్రకర్షను జూపుచుఁ గవిత్వమును వ్రాయుదురు. జానపదకవులు జీవితమును బరిశీలించి, తమ ప్రవృత్తులను నభిరుచులను గవిత్వమునందుఁ జిత్రింతురు. పండితు లెంత నిరాదరించినను వీరగాథల ప్రాముఖ్యము తగ్గనది కాదు. గాలి యే దిశగా వీచుచున్నదో తెలిసికొనుటకు గడ్డిపరకను గాలిలోని కెగురవేయవలెనే కాని, రాతిని విసరినచోఁ బ్రయోజనముండదు. అట్లే ప్రజాజీవితము నరయుటకు సరళమును సహజసుందరమును నగు జానపద కవిత్వమును బరిశీలింపవలెను గాని, జటిలమును గృత్రిమమును నగు మార్గకవిత్వము వలన ఫలితము శూన్యము.[12]

భారతీయ సాహిత్యమంతయు నేఁటికిని నాత్మాశ్రయములగు భావోద్రేకములను, సంఘర్షణలను వెలార్చుచున్నదే కాని, ప్రజా జీవితమునకు ఏమాత్రమును సంబంధించి లేదనియు, బహుశః భావిసాహిత్యము జానపద గేయములలోను వీరగాథలలోను ఫలవంత మగు నూతనోత్తేజమును పొందఁగలదనియు పాశ్చాత్య విమర్శకులు ఊహించుచున్నారు.[13] హిందీ జానపదసాహిత్యముపైఁ బరిశ్రమించిన డాక్టర్ భగవాన్‌దాసుగారు "జానపద గీతములు వ్యాస, వాల్మీకి, భవభూతి, కాళిదాసు, తులసీదాసు, సూరదాసుల కావ్యముల కంటె నధికముగా రసవంతములైనవి" అని ప్రశంసించినారు.[14]

## 8. వీరరస ప్రధానములు:–

వీరగాథలు వీరరసప్రధానములగు రచనలు. నవరసములలో శృంగార వీరములకుఁ బ్రముఖస్థానమున్నది. దృశ్య శ్రవ్య కావ్యము లందు అంగిరసములుగా శృంగార వీరములు మాత్రమే ప్రయోగింపవలెనని పలువురు లాక్షణికులు తెల్పియున్నారు. ఏలయన "లోకము నందు శృంగారము సర్వప్రాణి సాధారణము. దీనివలన సంసార మేర్పడును. తద్రక్షణమున వీరమావశ్యకమగును– అని కొందఱును, కామము సకలజాతి సులభము. అది యందఱకును హృద్యమైనది. అందుచే శృంగారము మొదట చెప్పఁబడినదని అభినవగుప్తుడును వ్రాసియున్నారు."[15]

ఇట్టి ముఖ్యరసములు రెండింటిలో శృంగారముకన్న వీరమే అధిక ప్రాధాన్యమును, విస్తృత వ్యాప్తిని గలిగియున్నదని చెప్పవచ్చును. శృంగారము హృద్యముకాని జీవి యుండఁడనుమాట సత్యమైనను, దేశకాల పాత్రముల ననుసరించి సర్వప్రాణులును శృంగారము ననుభవింపలేవు. ఇది కేవలము యువతీ యువకులకు సంబంధించి నది మాత్రమే. బాలురును వృద్ధులును శృంగారము ననుభవింప జాలరు కదా! శృంగార రసస్థాయియగు కామము చతుర్విధ పురుషార్థములలో నొక్కటి మాత్రమే. తదితరములగు ధర్మార్థ మోక్షములను ప్రాణి సాధింపవలసియున్నది. కావున శృంగారము జీవితమున నాలుగింట నొక్క భాగమును మాత్రమే పూరించు రసము.

శృంగారముకన్న వీరమే ఉన్నతమైన రసమనుటకుఁ బైన తెల్పిన రెండు కారణములే కాక మఱియొక ముఖ్యకారణమున్నది. శృంగార స్థాయియగు కామమును మానవుఁడు పుట్టినది మొదలుకొని జీవితాంతము వఱకును అనుభవివపఁలేడు. వీరమట్లు కాక, జీవిత రంగము నందంతటను వ్యాపించియుండు రసము. దీనిస్థాయి యగు నుత్సాహమును పుట్టినదాది గిట్టునంతవఱకును మానవునిలోఁ జూడఁ గలుగుచున్నాము. బాలుఁడుగా నున్నప్పుడు పెద్దలయందును విద్యాసాధనమునందును శ్రద్ధాయుతమగు భక్త్యుత్సాహమును జూపును (ఉదా॥ ధ్రువుఁడు, ప్రహ్లాదుఁడు). యువకుఁడుగా నున్నప్పుడు రూప

కలా మాన కవిత్వ అహింసాదులయందును, ధర్మైశ్వర్య క్షమాదుల యందును నుత్సాహమును జూపును (ఉదా: కచుఁడు, యామునా చార్యుఁడు). వృద్ధాప్యమున యోగ తపో మోక్షాదుల సాధనయందు నుత్సామమును జూపును (ఉదా: విష్ణుచిత్తుఁడు, విదురుఁడు). భీమునివంటి వీరులు యుద్ధోత్సాహమును జూపుదురు. యుధిష్ఠిర, హరిశ్చంద్ర, దివోదాసాదులవంటి విజ్ఞులు దాన దయా ధర్మ త్యాగ యోగ పాండిత్య వాద సత్యాదులయందు నుత్సాహమును బ్రదర్శింతురు.[16] కావున వీరరసము జీవితరంగమందంతటను వ్యాపించియుండు నుత్తమరసము. ఇట్టి యుత్తమరసమును ప్రధాన భాగముగాఁ గలిగియున్న వీరగాథల వైశిష్ట్యమును వేఱుగాఁ జెప్పఁ బనిలేదు.

## 9. వీర పునరుజ్జీవకములు:-

గాథాగానము వీరులపాలిటి సంజీవని. పిఱికిపందలు మరణమునకు ముందే అనేక పర్యాయములు మరణింతురనియు, కాని వీరుఁడైన వాఁడు ఒక్కసారి మాత్రమే మరణించుననియు షేక్స్‌పియర్ మహాకవి వాక్రుచ్చినాఁడు.[17] వీరగాథల పరముగా నాలోచించినచో నీ మహాకవి సూక్తిని ద్రిప్పి చెప్పవచ్చును. శూరశిఖా మణులు జీవితములో నొకే పర్యాయము మరణించుటయే కాక, మరణించిన తర్వాత ననేక పర్యాయములు తిరిగి బ్రతుకుచున్నారు.[18] ప్రజాసమూహములలో జానపద గాయకులచే వీరగాథ పాడఁబడినప్పు డెల్ల, నా వీరుని సాహసకృత్యములను దలఁచుకొని జనత పులకరించు చున్నది. అనఁగా నా వీరుఁడు ప్రజాహృదయములలోఁ దిరిగి ప్రాణమును ధరించుచున్నాడు. వారి మనోనేత్రముల ముందు తాండవమాడుచున్నాఁడు. కావున పిఱికిపందలు జీవితములో మరణమునకు ముందు అనేక పర్యాయములు మరణించుచుండగా, వీరపుంగవులు జీవితములో నొకేయొకసారి మరణించి, ఆ మరణమునకుఁ తరువాత వీరగాథాగానముచే ననేక పర్యాయములు బ్రతుకుచున్నారు. ఇట్లు వీరగాథలు వీరులను పునర్జీవింపఁజేయ సమర్థము లగుచున్నవి. గాథాగానము మరణించిన వీరులకు సంజీవనీతుల్య మగుచున్నది. ఆదిరాజులు నేఁడు లేకపోయినను వారి యశస్సు సాహిత్య దర్పణములలోఁ బ్రతిబింబించుచున్నదని దండి తన కావ్యాదర్శనమునఁ బ్రవచించినాఁడు.[19] ఈ ప్రవచనమును నూటికి నూఱుపాళ్లను సఫలీకృతముచేయు ప్రక్రియ వీరగాథలు. వీరగాథలలో మృతవీరుల యశస్సు మాత్రమే కాక, మూర్తులు సహితము ప్రతిబింబించుచున్నవి.

## 10. నిందానిరసన సమర్థములు:-

మార్గకవిత్వము మాత్రమే 'బహుళాంధ్రోక్తిమయ ప్రపంచ' మని భావించు పండితులవలన మన సాహిత్యమున కొక నింద వచ్చినది. ఆంధ్రసాహిత్యమంతయు సంస్కృత పరివర్తనమే, సంస్కృతానుకరణమే యని కొందఱు తేలఁబలుకుచున్నారు. ఒక్క మార్గకవిత్వమును మాత్రము పరిశీలించినచో నీ తేలఁబలుకుట సమంజసముగనే తోఁపకమానదు. కాని, తెలుఁగులోని దేశిరచనలను గూడఁ బరిశీలించినచోఁ దెలుఁగు సాహిత్యమునకు వచ్చిన ఈ నింద అక్రమమైనదని రుజువగును. దేశికవితాప్రియులగు వేటూరి ప్రభాకరశాస్త్రిగారిట్లు సెలవిచ్చినారు: "ఆంధ్రప్రజల నాలుకల నాట్యమాడుచున్నవి, ప్రజాసామాన్యమునకు సులువుగాఁ దెలియఁ దగినవి, సంగీతవాననతోఁ జక్కఁగాఁ జదువఁదగినవి, యాంధ్రభాషకు సహజమయినవి యగు పై దేసిరచనా ప్రభేదములను, మఱియు కుచ్చెలకథ, లంకాయాగము, బొబ్బిలికథ, లంకాసారథి మొదలగు వందల కొలఁది పదములు గల గొప్ప పదరచనలను సర్వాంధ్రదేశము నుండి సేకరించి, మేలేర్చి, యందుండి పరిగ్రాహ్యము గ్రహించి, భావివాఙ్మయ వికాసమునకు యువకవులు ప్రయత్నింతురు గాక యని కోరుచున్నాను. ఆంధ్రవాఙ్మయ మంతటను సంస్కృత పరివర్తనమే, సంస్కృతానుకరణమే యని తేలఁబలుకువారు కొందఱున్నారు. ఆ నింద యక్రమ మయినది."[20]

ఏ సాహిత్యమందైనను మార్గకవిత్వమునకుఁ గల యౌన్నత్యము, పరిపుష్టి, అందలి మహోన్నతములును, పరాశ్రయ కవితతో దేశచరిత్రను జాతిచరిత్రను చిత్రించునవియు నగు ఇతిహాస ములవలననే వచ్చును. ఆత్మాశ్రయ కవిత్వమగు భావగీతముల (lyrics) వలన దేశమునకుఁగాని, జాతికిఁగాని గర్వింపఁదగిన కారణముండదు. భారతీయులకు రామాయణ మహాభారతములు, పాశ్చాత్యులకు Iliad, Odessey, Beowulf అనునవి ఆచంద్ర తారార్కమును గర్వకారణములే. అట్లే దేశికవిత్వమునకుఁ బరిపుష్టి, యౌన్నత్యము అను సుగుణములు, ఆత్మాశ్రయములును ముక్తకములును నగు జానపద గేయములకన్నఁ, బరాశ్రయములును, కథాశిల్ప సమన్వితములును నగు వీరగాథలవలన సిద్ధించును. ఆంధ్రుల దేశికవిత్వ పటుత్వము పల్నాటి వీరకథలవలనను కాటమరాజు కథలవలనను దెలియును గాని, పల్లెపాటల (Folk songs) వలనఁ దెలియరాదు. కాఁబట్టి వీరగాథలు, మార్గకవిత్వము వలన మన సాహిత్యమునకు సంక్రమించిన అపనిందను దొలఁ గించుటయే కాక, దేశికవిత్వమునకు తక్కిన ప్రక్రియ లీయఁజాలని యౌన్నత్యమును బ్రసాదించుచున్నవని చెప్పవచ్చును.

ఇంతవఱకును వీరగాథలెట్లు విశిష్టములో పదికారణముల వలనఁ దెలిసికొంటిమి. ఇఁకనిప్పుడు వీరగాథలకుఁగల మూఁడు మహత్తర శక్తులనుగూర్చి చర్చింతము. ఈ శక్తిత్రయము గూడ వీరగాథా వైశిష్ట్య పోషకమే.

## 11. సర్వజనాకర్షణ శక్తి:-

వీరగాథలు సరళశైలిలో, సహజసుందరములుగా, సుప్రసన్నముగా నుండును. ఈ సారళ్యము ఒక్క శైలికే కాక, ఛందస్సు, ఇతివృత్తము, భావము, సంగీతము- మున్నగు

వానికన్నింటికిని వర్తించును. కావున సామాన్యులకు సహితము అవగాహనమగును. జటిలత్వ రహితములై, రసపరిపుష్టములై ఈ వీరగాథలు ఎల్లరకును ఆస్వాదయోగ్యములై యున్నవి: "ఏ సాహిత్యమునందైనను శ్రోతనుగాని, పఠితనుగాని, రసప్రపంచయాత్ర చేయించునవి ప్రధానముగా గేయరచనలని చెప్పినచో సత్యదూరము కాదు. రసికులను సహృదయు లను ఆనందపరవశులజేయుటకు గేయములు ఉపకరించినంతగా రసవంతములైనను పద్యములు ఉపకరించవు. దీనికి కారణము గేయముల గానానుకూలతయే యని నా అభిప్రాయము."[21]

వీరగాథలు సరళములగుటయే కాక గానయోగ్యములును నగుటచే శ్రోతల నత్యద్భుతముగా నాకర్షించి, యాకట్టుచున్నవి. "పఠనయోగ్యమైన ప్రౌఢకావ్యము విద్యావంతులైనవారిని మాత్రమే యాకర్షింపగా, గానయోగ్యమైన పదకావ్యము ఆబాలగోపాల ప్రజను ఆకర్షించి, ఆకట్టి, గుంపులు గుంపులుగా మందవేసి నిలబెట్టును."[22] తెలుఁగు వీరగాథలలో మణిపూసయగు పల్నాటి వీరకథాచక్రమును ప్రజలెంత పరవశులై వినుచుందురో అక్కిరాజు ఉమాకాంతంగారు సెలవిచ్చినారు. "దీనినిఁ జెప్పుచుండఁ బల్నాటిలోఁ బెక్కు గ్రామముల వినియుంటిని. ఎచ్చటఁ జూచినను వాద్యసహితముగాఁ గథకుఁడీ కథను జెప్పఁదొడంగినప్పుడు పల్నాటి వీరవరుల సంకీర్తనము శ్రోత్రపుటంబులఁ బడఁగనే యాసక్తిగలవారందఱు శరీరము గగుర్పాటంద, మనోవిలీనంబులై యణఁగియున్న యంతశ్శక్తులు ప్రబోధము నొందఁ దత్తద్రసోచితంబుగ ముఖంబుల వికాసము మార్పు చెంద, నింద్రియంబు లన్యవిషయ పరాఙ్ముఖములై యుండఁ బరవశులై వినుచుందురు."[23]

## 12. సంఘ సంచాలక శక్తి:-

వీరగాథలకుఁగల సర్వజనాకర్షణశక్తినిబట్టియే వీనికి సంఘమును గదలించు మహాశక్తియు వచ్చినది. ఇట్టి సంఘసంచాలక శక్తినిబట్టి ఇది ప్రముఖ ప్రచారసాధనమైనది. జానపదగేయములవలెఁ గేవలము రసానందమునే కాక, హృదయము నుఱ్ఱూతలూగించు శక్తి వీరగాథలలోఁ బ్రత్యేకముగా నున్నది. కావుననే నిశిత విమర్శకులు వీరగాథనిట్లు ప్రశంసించినారు: "పదమునకు సంఘమును కదలింప గలిగిన నడిపింపగలిగిన మహాశక్తి యున్నది. మహోద్యమనాయకులకు పదకర్తల బాసట తప్పదు. ప్రబోధయుగ వైతాళికులు పదకర్తలే."[24]

వీరగాథలకుఁగల ఈ మహాశక్తిని గుర్తించి పాల్కురికి సోమనాథాదులు వీరశైవమతవ్యాప్తికి వీనిననుసరించిరి. ఆధునిక యుగమున సామ్యవాదులు బుఱ్ఱకథారూపమున వీరగాథను జక్కని ప్రచారసాధనముగాఁ జేసికొనిరి. ప్రభుత్వమువారును దీని ప్రచార శక్తిని గుర్తించి, తమ కార్యకలాపములను, జాతీయతా ప్రబోధమును గాథారూపముననే ప్రజలకందించుచున్నారు.

గాథాకర్త స్ఫురద్రూపియై, ప్రజల మనస్సులను గుర్తింపఁ గల సూక్ష్మబుద్ధి కలవాఁడై, వారి యభిరుచుల కనుగుణమగు పదజాలముతో రచనచేసినచో, నా వీరగాథ ప్రజలపై విశేష ప్రభావమును జూపి, నాలుగు మూలల నల్లుకొని, యావద్దేశమును భగ్గున మండించును.[25] స్వాతంత్ర్యోద్యమమున వందేమాతరము పాట భరతఖండము నూపివేసినది. తెలుఁగులోఁ బుట్టిన 'మాకొద్దీ తెల్లదొరతనమూ' పాట 'ఏదేశమేగినా ఎందుకాలిడిన' కవిత కూడ నిట్టివే. తిలక్, నేతాజీ, భగత్‌సింగులపై బయలుదేరిన బుఱ్ఱకథలు ప్రజల నుత్సాహపూరితులను జేసినవి. ఆంధ్రరాష్ట్రోద్యమమున 'మా తెలుగు తల్లికి మల్లెపూదండ' పాట, 'చెయ్యెత్తి జైకొట్టు తెలుఁగోడా' పాట, 'రాష్ట్రవాంఛ' సుద్దుల కథ ప్రముఖ పాత్రను వహించినవి. అట్లే 'టాన్యా', 'బెంగాల్ కఱవు', 'కష్టజీవి', 'అల్లూరి సీతారామరాజు', 'తెలంగాణా వీరులు' మున్నగు బుఱ్ఱకథలు సామ్యవాదులకు విశేషప్రచార మిచ్చినవి.

పాశ్చాత్య దేశములలో వీరగాథలు విప్లవములను సృజించినివి. ఫ్రెంచి మహావిప్లవము, క్రీ.శ. 1648 నాఁటి ఆంగ్లవిప్లవము వీరగాథలచేఁ బ్రభావితములైనట్టివే. 'షైరా' (Caira), 'కార్మగ్నోల్' (Carmgnole) అను వీరగాథలు ఫ్రెంచి మహావిప్లవమునకు దారితీసినవి. 'మొరీర్ పౌర్ లా పాత్రే' అను వీరగాథ 1848 నాఁటి విప్లవమునకుఁ గారణమైనది. 'లిల్లీ బర్‌లేరో' అనునది క్రీ.శ. 1688 నాఁటి ఆంగ్ల విప్లవమునకు నూపునిచ్చినది. దీని రచయితయగు 'లార్డ్ వార్‌టన్' తన కవిత్వము జేమ్సు చక్రవర్తిని రాజ్యమునుండి తఱిమివేసినదని సగర్వముగాఁ జెప్పుకొనెను.[26] 'డిబ్‌డిన్' రచించిన 'సాగర గీతములు' ఆంగ్ల నౌకాదళమును దేశభక్తితో ముంచెత్తి విజయమును జేకూర్చినవి.[27] అసలు సాహిత్యమే శక్తిమంతమైనది. అందు వీరరసప్రధానములును, గానయోగ్యములును నగు వీరగాథల శక్తినిగూర్చి వేఱుగాఁ జెప్పఁ బనిలేదు:-

*"Words are things, and a small drop of ink*
*Falling like dew upon a thought, produces*
*That which makes thousands,*
*perhaps millions think."* [28]

ఇట్లు హృదయములను ఘూర్ణిల్లఁజేయు వీరగాథల మహాద్భుత శక్తికి 'సర్ ఫిలిప్ సిడ్నీ' వంటి పండితకవి సహితము జోహారులర్పింపక తప్పలేదు. ఇతఁడు 'డగ్లస్ ట్రాజిడీ' అను వీరగాథ తన హృదయమును వీరణముకన్న నెక్కువగా నుఱ్ఱూతలూగించినదని ప్రశంసించినాఁడు.[29]

## 13. విచిత్రానుభూతిదాయక శక్తి:-

శూరుల-సురల-ఏఱుల జన్మములవలెనే వీరగాథల జన్మము గూడ దుర్జ్ఞేయము. అత్యంత ప్రాచీన కాలమున, సామాన్య జనుల ప్రశాంత హృదయములనుండియు, రహస్య స్థలములనుండియు

వచ్చిన ధ్వనులే వీరగాథలు. అందుచే నివి మనకు విచిత్రానుభూతి నిచ్చి కదల్చివేయును. ఈ యనుభూతి మిక్కిలి ఆత్మీయముగా నుండును. ఇట్టి విచిత్రమైన ఆత్మీయానుభూతిని, తలక్రిందులుగా తపస్సు చేసినను శిష్టసాహిత్యము ఈయజాలదు.[30]

## 14. శిష్టకవులపై ప్రభావము:-

వీరగాథ యనునది కవిత్వమున కంకురార్పణ కాకపోయినను, ఇతిహాసమున కంకురార్పణయని చెప్పవచ్చును. కడచిన రెండు మూఁడు శతాబ్దములలో నీ వీరగాథలు ఇతర దేశప్రక్రియలతోపాటు శిష్టకవులపైనను కవిత్వోద్యమములపైనను విశేషప్రభావమును నెఱపినవి. సాహిత్య చరిత్రకారుఁడు ఈ ప్రభావమును తప్పక గుర్తింపఁగలడు.[31] ఇంగ్లండు దేశమునను, జర్మనీ దేశమునను కాల్పనికోద్యమ కవులు (Romantic poets) వీరగాథలచే నధికముగాఁ బ్రభావితు లైనారు. వర్డ్స్‌వర్త్, కాల్‌రిడ్జ్ కవుల 'భావగీత గాథలు' (Lyrical Ballads) వీరగాథా ప్రభావమునకు ప్రబల నిదర్శనములు. జర్మనుదేశమున 'బూర్జర్' (Burger), 'ఉహ్‌లండ్' (Uhland), 'షిల్లర్' (Schiller), 'గెటే' (Goethe), అను కవిపుంగవులును; ఇంగ్లండు దేశమున 'స్కాట్' (Scott), 'కాల్‌రిడ్జ్' (Coleridge), 'కీట్స్' (Keats), 'మోరిస్' (Morris), స్విన్‌బరన్' (Swinburne) - అను కవిశేఖరులును వీరగాథల కవితాశక్తిని జీర్ణించుకొనుటచేతనే కాల్పనికోద్యమమున నద్భుత విజయములను సాధింపఁగలిగిరి.

మనదేశమునఁ బ్రాచీన కాలమున శివకవుల 'జానుతెనుఁగు, వస్తుకవిత, దేశికవిత' యను నుద్యమములును, ద్విపదకావ్య సృష్టియు, దేశికవితా ప్రభావమునకు నిదర్శనములు. నేఁటి అభ్యుదయ కవిత్వోద్యమమును నిట్లేర్పడినట్టిదే. గురజాడ అప్పారావుగారు సరళరీతిలో ననేక గేయకథలను వ్రాసిరి. శ్రీశ్రీ మహాప్రస్థానమునఁ గథాత్మక గేయములును గలవు. డా॥ సి.నారాణరెడ్డిగారు, మాత్రాచ్ఛందమున కథాగేయరచన చేసియున్నారు. సుంకర సత్యనారాయణగారు, వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు, ఇంకను అనేక యువరచయితలు 'బుఱ్ఱకథా రూపమున వీరగాథల ననుకరించుచున్నారు. నేఁటి బుఱ్ఱకథలు, జముకుల కథలు, సుద్దుల కథలు, తందనాన కథలు, బ్రతుకమ్మ పాటలు' మున్నగున వన్నియును వీరగాథానుకరణములే. కవికొండల వెంకటరావుగారు, అడవి బాపిరాజుగారు, నండూరి వెంకట సుబ్బారావుగారు, కొనకళ్ల వెంకటరత్నంగారు జానపద గేయములను మక్కికి మక్కిగా ననుకరించిన కవులు.

## 15. భాషా సమాజములకుఁ గలుగు విశిష్ట ప్రయోజనములు:-

ఒక్క హిందీ జానపద సాహిత్యమందేకాక, సమస్త భారత జానపద సాహిత్యము లందును విశేష పరిచయము గల విద్వాంసులు శ్రీ రామనరేశ త్రిపాఠీగారు. వీరు జానపద సాహిత్యము వలన భాషకును సమాజమునకును గలుగు విశిష్ట ప్రయోజనములనుగూర్చి తమ 'గ్రామ గీతములు' అను గ్రంథ భూమికలో విపులముగ వివరించి యున్నారు.[32] అందలి యేడు ముఖ్యాంశముల నిటఁ దెలియఁజేయు చున్నాను. 1) అనుశ్రుత వాఙ్మయమును లిపిబద్ధము చేసి సంరక్షింప వచ్చును. 2) స్త్రీల కవిత్వ శక్తిని, ఆ గీతములకు మన సాహిత్యములోఁ గల విలువను గ్రహింపవచ్చును. 3) భాషాశైలిలో మార్పు తీసికొని రావచ్చును. సహజత్వము జీవము భాషకు లభింపఁగలవు. 4) మన పూర్వకాలపు టాచారవ్యవహారములను, వేషభాషలను దెలిసికొన వచ్చును. వీనివలన నాయకులకు సంఘసంస్కర్తలకు ఎక్కువ మేలు చేకూరును. 5) పూర్వకాలములో రచింపఁబడిన గేయములలో స్త్రీ-పురుషులకుఁ దమ భర్త- భార్యల నెన్నుకొనెడి స్వాతంత్ర్యమున్నట్లు తెలియుచున్నది. ఈ నాఁడు కూడఁ బైన చెప్పిన స్వాతంత్ర్యమును హక్కును స్త్రీపురుషులకుఁ బ్రసాదించునట్లు తల్లిదండ్రుల హృదయముల నీ గీతములు మార్చగలిగినచో నంతకన్నఁ గలిగెడి పెద్ద ప్రయోజన మేమియుండఁగలదు? గీతముల లక్ష్యము సాధింపఁ బడినట్లే, బాల్యవివాహముల నరికట్టినట్లే కాఁగలదు. 6) జానపద సాహిత్యమున సహోదర ప్రేమ, పవిత్ర దాంపత్య ప్రేమ, విశ్వసౌభ్రాతృత్వము, పతివ్రతాధర్మము, ఏకపత్నీవ్రతము. ఇతరుల యెడ మెలఁగవలసిన పద్ధతులు- మున్నగున వన్నియును వివరింపఁ బడినవి. ఈ సాహిత్యద్వారమునఁ బ్రజాహృదయములను సంస్కరింపఁ గల్గినచో సాహిత్యధర్మము సంపూర్ణముగా నెఱవేఱినట్లే కాఁగలదు. 7) సాహిత్యములో సజీవములైన సామెతలు, జాతీయములు, పొడుపు కథలు, క్రొత్త శబ్దముల సంఖ్యను పెంపొందించుకొనఁగలము. ఇట్లు శబ్దజాలమును పెంపొందించి నప్పుడు భావప్రకటన సరళమై, భాష విశేషవ్యాప్తిని పొంది ప్రాణవంతము కాఁగలదు.

## 16. ఇతర విశిష్టతలు:-

'వీరగాథాలక్షణములు' అను ప్రథమ భాగములోని ఎనిమిదవ ప్రకరణములో వివరింపఁబడిన 'అనితర సాధ్యము, ఏకసూత్రత, ప్రాక్తన మానవసంఘ నిరూపణము, వసుధైక కుటుంబ నిరూపణము, నీతిధ్వని, జీవిత ప్రతిధ్వని'- అను నుపశీర్షికలు కూడ వీరగాథా వైశిష్ట్యమునకు నికషోపలములని గుర్తింపవలెను. వీరగాథలు సహజముగా ప్రజలలో నుత్పత్తి కావలెనే కాని, యెంతటి మహాకవియైనను వీనిని చేపట్టి వ్రాయలేఁడు. ఇవి సంస్కృతిలోని యేక సూత్రతను, ప్రాక్తన మానవ సంఘమును, వసుధైక కుటుంబమును నిరూపింప సమర్థములు. వీరగాథలు వాచ్యముగా నీతిని బోధింపక పోయినను 'విధి బలీయమైనది, మానవుఁడు నిమిత్తమాత్రుఁడు' అను ప్రాఁబడిన నీతిని నిశ్శబ్దముగా ధ్వనింపఁ జేయుచుండును. వీరగాథ సామాన్య సైనికునివలె, జీవిత సంగ్రామమును యథాతథముగా నివేదించును. ప్రతి ప్రస్థానము చివరను ఓటమి కలదను జీవిత విషాదమును వీరగాథ సుస్పష్టముగ ప్రతిధ్వనించుచుండును. ❐

## జ్ఞాపికలు

1. డా॥ బి. రామరాజుగారు, తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట ౩౩
2. అదే.
3. అదే., పుట ౨౯.
4. "The songs of a country are truly natural part of its poetry and really the only poetry of the great body of the people. Percy, in the dedication to his Reliques, calls ballads the 'barbarous productions of unpolished ages'. Nevertheless they are instinct with life, and live still, while much of the polished poetry of his age, which expelled nature from literature, is completely dead. Nature is the salt that keeps the ballad alive, and many have maintained a continuance of popularity for several centuries". - Henry B. Wheatley, General Introduction to Reliques of Ancient English Poetry, p. xxxii.
5. P. Chenchaiah and Raja M. Bhujanga Rao, 'A history of Telugu Literature'.
6. దీనిని డా॥ బి. రామరాజుగారు తమ 'తెలుఁగు జానపదగేయ సాహిత్యము' నందు ఉదాహరించిరి. (చూ.పు. ౩౨).
7. శ్రీ హరి ఆదిశేషువు, జానపద గేయవాఙ్మయ పరిచయము, పుటలు 22, 23.
8. అక్కిరాజు ఉమాకాంతంగారు, పల్నాటి వీరచరిత్ర (వావిళ్ల ప్రతి), ప్రథమ భూమిక, పుట. 1.
9. కిన్నెర, జనవరి 1955, పుట 8.
10. Frank Sidgwick, Popular Ballads of the Olden Time.
11. "As Andrew Lang, scholar and lover of balladry, wrote long ago: "Ballads sprang from the very heart of the people and flit from age to age, from lip to lip of shepherds, peasants, nurses, of all the class that continues nearest to the state of natural man. The whole soul of the peasant class breaths in their burdens as the great sea resounds in the shells cast up on the shores..."- Bliss Perry, A study of Poetry, p. 282.
12. "Though some make slight of Libels, yet you may see by them how the wind sits: As, take a straw, and throw it up into the air, you may see by that which way the wind is, which you shall not do by casting up a stone. More solid things do not shew the complexion of the times so well as Ballads and Libels." -- Selden's "Table-Talk" (cited in 'Reliques of Ancient English Poetry, vol. II, p.2)
13. ''Indian literature is still concerned with personal emotions and reactions. It has not on the whole been related to the life of the people, perhaps in the crude ballads and folk-songs of the peasentry the literature of the future may have its most fruitful stimulus." - 'The Present Condition of India' by Leonard M. Schiff.
14. చూ. బాలశౌరిరెడ్డిగారు రచించిన 'హిందీ జానపద వాఙ్మయము' అను వ్యాసము, కిన్నెర, జనవరి 1955, పుట. 179.
15. పోణంగి శ్రీరామ అప్పారావుగారి 'నాట్యశాస్త్రము', పుట. 216.
16. చూ. గూడ వేంకట సుబ్రహ్మణ్యముగారు రచించిన 'వీరరసము–ఆంధ్రసారసత్వము' అను గ్రంథము.
17. ''Cowards die many a time before their deaths. But a valiant never taste of death but once."- Julius Caesar, Act II, Scene.2
18. "Even as cowards die many times before their deaths, so must heroes live many times after theirs. This they are enabled to do through song and story, not only of the high faulting type but also, and even more so, of the type that is evolved by the simple rural folk by way of their unlettered muse." - Bind Rao, 'Folk tales of heroism and valour', Akash Vani, December (1-7), 1963, p.4
19. **'ఆదిరాజ యశోబింబ మాదర్శం ప్రాప్య వాఙ్మయమ్**<br>**తేషా మసన్నిధానేపి నస్వయం పశ్య నశ్యతి.'**
20. సింహావలోకనము, పుట 52.
21. రామరాజుగారు, పూర్వోక్తము, పుట ౨౯.
22. ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, పల్నాటి వీరచరిత్ర, పీఠిక, పుట 21.

23. అక్కిరాజుగారు, పూర్వోక్తము, పుట 2.

24. గురుదేవులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారి అముద్రిత వ్యాసములు.

25. *''The successful ballad-writer requires a quick eye and era to discern what is smouldering in the public mind, and then if his words fall in with the humour of the people, his productions will have a powerful influence, and may set the country in a blaze." - Henry B. Wheatley, Genreal Introdution to 'Reliques of Ancient English Poetry', vol.I, p.xxxi.*

26. *'' 'Caira' and the 'Carmagnole' had much influence on the progress of great French Revolution, as 'Mourir pour la Patrie' had upon that of 1848. 'Lilliburlero' gave the finishing stroke to the English Revolution of 1688,, and its author (Lord Wharton) boasted that he had rhymed King James out of his dominions" - ibid.*

27. *''There are recorded instances of the powerful influence of ballads, and we know how much Dibdin's sea-songs did for the Bristish navy, when they placed before the sailor an ideal of his own feelings, and painted men he wished to be like."- ibid., p. xxxii.*

28. *ibid.*

29. *See, 'Apologie for Poetrie', 1595.*

30. *''Ballads are a voice from secret places, from silent peoples and old times long dead; and as such they stir us in a strangely intimate fashion to which artistic verse can never attain." - Andrew Lang, (cited by Bliss Perry in 'A study of Poetry', p. 282).*

31. *''Whatever may be thought of the importance of such verse in its bearing on the origin of poetry in general, or of epic poetry in particular, the ballad like other forms of popular material, has in the last two centuries exercised a powerful influence on artistic literature and it will always have to be reckoned with by the literary historian."- G.L.Kitredge, in F.J.Child's 'English and Scottish Ballads'.*

32. చూ. బాలశౌరిరెడ్డిగారి 'హిందీ జానపద వాఙ్మయము' అను వ్యాసము, కిన్నెర, సంక్రాంతి. జనవరి 1955, పుట 182.

# ఇరువదిమూఁడవ ప్రకరణము

## గాథాకారులు (Minstrels)

**'గా**థాకారుఁడు' అను శబ్దమునకు 'వీరగాథలను కూర్చువాఁడు; వీరగాథలను పాడువాఁడు' అని రెండర్థములున్నవి. 'దేశద్రిమ్మరు' లగు గాయకభిక్షువులే వీరగాథలను కూర్చువారును పాడువారును గావున వారియెడ నీ శబ్దమన్వర్థమగుచున్నది. గాథాకారుఁడను శబ్దమే కాక 'గాథకుఁడు' అను వేఱొక శబ్దమున్నది. దీనికి 'వీరగాథలను పాడువాఁడు' అని ఒకే యర్థము కలదు. గాయక భిక్షువులు పాడు గాథలన్నియును వారు సమకూర్చినవి మాత్రమే కాదు. ప్రత్యేక కవులచే వ్రాయఁబడిన కథలును గలవు. కావున 'గాథక' శబ్దము గూడ నీ గాయక భిక్షువుల పరముగా వాడవచ్చును.

దేశద్రిమ్మరులగు నీ 'గాథాకారులు' లేక 'గాథకులు' ఆంగ్లదేశమున 'మిన్‌స్ట్రల్స్' (Minstrels) అని పిలువఁబడుచున్నారు. ఫ్రాన్సు దేశమున 'జాంగ్లీర్స్' (Jongleurs), 'త్రోబాదోర్స్' (Troubadours) అను పేర్లతో వ్యవహరింపఁబడుచున్నారు. 'మిన్‌స్ట్రల్స్' అనునది ఆధునిక ఆంగ్లపదము. ప్రాచీనాంగ్లమున గాథాకారుఁడు 'స్కాప్' (Scop) అని పిలువఁబడెడివాఁడు. ఐర్లండు దేశమున 'బార్డ్' (Bard) అనియు, స్కాండినేవియా (డెనార్మర్క్, నార్వే, స్వీడన్ దేశముల)లో 'స్కాల్డ్' (Skald) అనియు, జర్మనీదేశమున 'మిన్నేసింగర్' (Minnesinger) అనియు, స్పెయిను దేశమున 'త్రోబాదోర్' అనియుఁ బిలువఁబడుచున్నాఁడు.[1] అరేబియా దేశమున గాథాకారులను 'రావీ' లందురు.

భారతదేశమున నౌత్తరాహులు గాథకులను 'చారణు' లందురు. దేశమంతయు చరించువారు కావున చారణులు కాఁబోలును. వీరగాథల పుట్టిల్లయిన రాజస్థానమునందు 'భోపాలు' 'మిరోసీలు' అనువారు రావణహస్తముతో వీరగాథలను పాడుచుందురు. మధ్యప్రదేశ్‌లో 'రావత్' (Rawat) వర్ణమువారు వీరగాథలను గానము చేయుదురు. తెలుఁగులో 'జంగము' లను శబ్దము దేశసంచారులగు నీ గాథకులకు బాగుగా నన్వయించును. కాని శక్తికథలు, పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు మున్నగు నతిప్రసిద్ధ వీరగాథలను జంగములు పాడుట లేదు. అందుచే జంగమ శబ్దము అవ్యాప్తి దోషదూషితమని భావించి, గాథాకార శబ్దమును స్వీకరించుచున్నాను.

పూర్వకాలమున రాజాస్థానములలో నా రాజులయొక్కయు, వారి పూర్వులయొక్కయు కీర్తిప్రతిష్ఠలను, శౌర్యసాహసములను స్తుతించుటకై, బిరుదులను పఠించుటకై వందిమాగధులు, భట్లు మున్నగువారుండెడివారు. వీరే కాలక్రమమున నా రాజులు చేసిన యుద్ధములపై పాటలను కూర్చి పాడఁదొడఁగిరి. అవియే వీరగాథలు. వానిని పాడువారే 'గాథాకారులు' లేక 'గాథకులు'. ఈ పద్ధతి ప్రపంచమునఁ బ్రతిదేశమందును, బ్రతి రాజాస్థానమందును నుండెడిది. ఇది గాథాకారుల యవతరణమునఁ బ్రథమ ఘట్టము. కాని పాశ్చాత్య విమర్శకులలో 'గాస్టన్ పారిస్' (Gaston Paris) వంటివారు కొంచెతింకను వెనుకకుఁబోయి యూహించుచున్నారు. రాజాస్థానములలో మొదట కీర్తిగాయకు లుండెడివారు కారనియు, నాయా ప్రభువులే తమ సాహస గీతములను పాడుకొనెడివారనియు, నా తరువాతి కాలమున వారు గాథాకారుల నేర్పఱుచుకొనిరనియు నీ విమర్శకుల తలంపు.[2] దీనిచే రాజాస్థానములలో గాథాకారుల యువతరణమును రెండవ ఘట్టముగా భావింపవలసియున్నది.

రాజాస్థానములలోని గాథాకారులు ఆయా కులములవారికి 'యాచకులు'గా మాఱుట మూఁడవ ఘట్టము. రాజులు రాజ్యములు నశించి, ప్రజాస్వామ్యాది నూతన రాజకీయ వ్యవస్థలు తలలెత్తిన తరువాత, నీ గాథాకారులు రాజాస్థానములను వీడి, పూర్వకాలమున రాజ్యములేలిన ఆయా కులములవారిని యాచించుచు, వారి పూర్వుల గాథలను గానము చేయుచు బ్రతుకుచుండిరి. నేఁటి మన వర్ణ వ్యవస్థలోఁ బ్రతివర్ణము వారికిని నిట్టి యాచకులున్నారు. బ్రాహ్మణులకు 'విప్రవినోదులు' (సూర్యవంశ క్షత్రియులు), క్షత్రియులకు 'భట్రాజులు', వైశ్యులకు 'వీరముష్టులు', యాదవులకు 'కొమ్ములవారు' (మాదిగలు), రెడ్లకు 'పిచ్చుగుంట్లు', కమ్మవారికి 'భట్రాజులు' (గుంటూరు కృష్ణా మండలములలో కమ్మవారికిఁ గూడ పిచ్చుగుంట్లే గోత్రములను జెప్పుచున్నారు), వెలమలకు బలిజలకు 'మాలదాసరులు', కంసాలురకుఁ 'బనసవాండ్రు', సాలీలకు 'మిత్ర అయ్యవార్లు' (లేక 'మిత్తరిదాసరులు'), పంచములలో మాలలకు 'మాష్టీలు', మాదిగలకు 'డక్కలవారు' యాచకులుగాఁ గలరు. ఇట్టి యాచకులను బోషించు వర్ణములవారందఱును బూర్వకాలమున రాజ్యవ్యవస్థలో గొప్ప గొప్ప స్థానములను నిర్వహించియుందురు. బ్రాహ్మణులు మహామంత్రులుగను, దండనాథులుగను; క్షత్రియులు చక్రవర్తులుగను; వైశ్యులు పేరుమోసిన రత్నాల వ్యాపారులుగను; శూద్రులలో రెడ్డి, కమ్మ, వెలమ మున్నగువారు రాజులుగను దండనాథులుగను నుండియుందురు. ఈ వివిధమగు యాచకులు అప్పటినుండియు వీరిని ఆశ్రయించియుందురు.

ఈ యాచకులు సంచార గాయక భిక్షువులుగా మాఱుట గాథాకారుల చరిత్రలో నాల్గవ ఘట్టము. ఆధునిక కాలమున పాశ్చాత్య నాగరికత మహమ్మారివలె వ్యాపించి మన సంప్రదాయములను

సంస్కృతిని రూపుమాపుచున్నది. ఫలితముగా మన వర్ణవ్యవస్థలోని వివిధ వర్ణములవారు,తమ తమ యాచకులను సోమరులుగా భావించి నిర్లక్ష్యము చేయుట జరుగుచున్నది. దీనివలన గాథాకారులు క్షీణించు చున్నారు. ఇట్టి నిర్లక్షము పాశ్చాత్య నాగరికతా ప్రభావమనుటలో సందేహము లేదు. ఈ యాచకులే మన అమూల్య వీరగాథాసంపదను మౌఖిక సంప్రదాయమున తరతరములనుండి సంరక్షించిన వజ్రమంజూషికలని అధునాతన పశ్చిమబుద్ధ లెఱుంగకుండుట విచారకరము. ఇట్లు పాశ్చాత్య నాగరికతా ఫలితముగా యాచకులకు ఒకే వర్ణమును యాచించి బ్రతుకుట దుర్లభమైనది. అందుచే వారు అన్ని వర్ణములవారిని యాచించుచు సంచారభిక్షువులుగా మాఱి పోయిరి. వీరిలోఁ గొందఱు వేఱువృత్తులను స్వీకరించిరి. మఱి కొందఱు చదువుసాములు నేర్చి తమ కులవృత్తినే విస్మరించిరి. ఇది నేఁటి దైన్యావస్థ. ఆంధ్ర జానపదసాహిత్య చరిత్రలో నిది క్షీణ యుగము.[3] నాగరికతకు దూరముగా నున్న కొందఱు యాచకులు మాత్రము పూర్వపద్ధతిని వీరగాథల నింకను నెమరువేయుచున్నారు. వీరివలననే ఆంధ్రుల వీరగాథాజ్యోతి కొనయూపిరితోనైనను మినుకు మినుకు మనుచున్నది. ఈ యల్పజ్యోతి సహితము అనతి కాలముననే నాగరికతా ఝుంఝూనిలముచే 'కొండెక్కఁ'గలదు. దీపముండఁగనే ఇల్లు చక్కఁబెట్టుకొనుట వివేకవంతులగు ఆంధ్రుల కర్తవ్యము. రాఁబోవు పదిసంవత్సరములలో వీనిని సేకరించి భద్రపఱుచు కొననిచో, భవ్యాంధ్రులకు వీరగాథలు గగన కుసుమములు కాఁగలవు!

ఆంధ్రదేశమున సంచార గాయక భిక్షువులు పెక్కు రకముల వారున్నారు: బవనీలు, పంబలవారు, వీరవిద్యావంతులు, కొమ్ముల వారు, పిచ్చుకుంట్లు, పూసల బలిజలు, శారదకాండ్రు, వీరముష్టులు, జంగములు, దాసరులు, గరుడ స్తంభపు దాసరులు, భాగవతులు, బీరన్నలవారు, సుద్దులగొల్లలు, గంగిరెద్దులవారు, బాలసంతువారు, బుడబుక్కలవారు, చిందుమాదిగలు, జోగులవారు, జక్కులవారు, హట్కరులు, దక్కలివారు, మాష్టీలు, బొమ్మలాటగాండ్రు– మున్నగు వారలనేకులు గలరు. ఈ గాథాకారులు అతి ప్రాచీన కాలము నుండియుఁ దెలుఁగు నాట వ్యాపించియుండి రనుటకు శ్రీనాథుని (?) క్రీడాభిరామము, పాలవేకరి కదిరీపతి (1650) 'శుకసప్తతి', అయ్యలరాజు నారాయణామాత్య(1750)ని 'హంసవింశతి' మున్నగు కావ్యములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఈ గాథకులలో వీరగాథా గానము చేయుచున్న కొందఱు ముఖ్యులనుగూర్చి క్లుప్తముగాఁ జర్చింతును:

### బవనీలు: –

ఇది వీరికి పండితులు పెట్టిన పేరు. వీరి వాద్యమును బట్టి ఈ నామము వచ్చినట్లున్నది. వీరి వాద్యము పేరు 'జమిడిక'. జమిడికను శిష్టులు 'బవనిక' యందురు. బవనికను వాయించువారు కావున బవనీలు. సర్కారు జిల్లాలలో జమిడికను 'జముకు' అందురు. జముకులు వాయించువారు కావున వీరిని 'జముకులవారు' అందురు. శ్రీకాకుళ మండలమున బవనీలను 'బుడబుడకలవారు' అందురు (ఇది 'బుడబుక్కల' శబ్దము కాదు). వీరు తమ వాద్యమగు జమిడికను వాయించునప్పుడు 'బుడబుడక్– బుడబుడక్' అను రీతిని శబ్దము వచ్చుటచే వీరికి ఈ పేరు పెట్టిరని తెలియుచున్నది. తెలంగాణమున వీరిని 'బైండ్లవారు'–'పంబాలవారు' అను పేర్లతోఁ బిలుతురని డా॥ రామరాజుగారు తెలుపుచున్నారు (బవనీల శబ్ద భవమే 'బైండ్ల'). కాని నాకుఁ జూడఁగా బైండ్లవారు వేఱు, పంబాలవారు వేఱు అనిపించుచున్నది. బవనికను వాయించువారు బవనీలు లేక బైండ్లు అయినట్లే, 'పంబ' యను వాద్యమును వాయించువారు 'పంబలవారు' లేక 'పంబాలవారు' నయియుందురు. ఈ పంబయను వాద్యము జమిడికకంటె భిన్నమైనది. చిన్న 'సైజు' వీరణములవలె నుండునవి పంబలు. ఇవి రెండు కలిపి ఒక జంటగా నుండును. వీనిని 'పంబజోడు' అందురు. ఈ పంబజోడును వాయించుచు అంకమ్మకథలను పాడువారు పంబలవారు. వీరు మాలలు. జమిడికలు వాయించుచు పరశురాముని కథలను పాడువారు బవనీలు లేక బైండ్లవారు. వీరెక్కువగా మాదిగలు. (మాలలు కూడఁ గొందఱు జమిడిక వాయించుచుఁ బరశురాముని కథలను బాడుచున్నారు.) ఈ బవనీలు అమ్మగారి దర్శనమునకుఁ జెందినవారు, పంబలవారు అయ్యగారి దర్శనమునకుఁ జెందినవారు. కాఁబట్టి బైండ్లవారును పంబాలవారును నొక్కరేయని తలంచుట సమంసజము కాదు.

రాయలసీమలో నీ బవనీలను 'ఆసాదివారు' అనియు 'బైనీండ్లు' అనియుఁ బిలుతురు. ఈ బవనీలు చాల ప్రాచీన కాలము నుండియుఁ గలరని తెలియుచున్నది. ప్రతాపరుద్రుని కాలమున నోరుగల్లులో బవనీల చక్రవర్తి యేకవీరా మహాదేవి యెదుట నిలిచి, పరశురాముని కథలన్నియును ప్రౌఢితో పాడినట్లు క్రీడాభిరామకర్త సాక్ష్యమిచ్చుచున్నాఁడు. శ్రీకృష్ణదేవరాయలు తన ఆముక్తమాల్యదలో జమిడికను బేర్కొన్నాఁడు. ధూర్జటి తన శ్రీకాళహస్తీశ్వర శతకమున నూరూరను బవనీనికాండ్రే కవులుగాఁ జెలామణి యగుచున్నారని తెల్పినాఁడు. పాలవేకరి కదిరీపతి బవనీలను, జమిలికలను, పరశురాముని కథను పాడు మాతంగిని పేర్కొన్నాఁడు.

బవనీలు సాధారణముగా ఎల్లమ్మ (రేణుక)ను బూజింతురు. ఎల్లమ్మ కథలను (పరవురాముని కథలను) పాడుచుందురు. ఈ కథలకు గౌతుపురాణమనియు నామాంతరము గలదు. విశాఖ, విజయనగర, శ్రీకాకుళ మండలములలోని బవనీలు లక్ష్మణ మూర్ఛ, అంగద రాయబారము, గంగావివాహము మొదలగు హరిహరీ పదములను, బొబ్బిలి కథను గూడ పాడుచున్నారు. పరశురాముని కథలలో ఎల్లమ్మ తల్లిపేరు 'జమిలికా దేవి'. ఈమె నామమునుబట్టి వీరి వాద్యమునకు 'జమిడిక' (జముకు) అను పేరు వచ్చియుండునని నా యనుమానము. వీరు వాయించెడి రెండు రకముల జముకులలో చిన్నది శ్రుతికొఱకును, పెద్దది తాళమునకును ఉపయోగించును. ఈ బవనీలు అమ్మవారి జాతరలలో గావుపట్టుటవంటి భయంకర

కార్యములు చేయుదురు. (బలిపశువును నోటితోఁ గొఱికిఁ జంపుటను 'గావుపట్టుట' యందురు.) మంత్రగాండ్రుగాఁగూడ వీరు ప్రసిద్ధి కెక్కియున్నారు.

**పంబలవారు: –**

వీరినిగూర్చి పైన కొంత వివరింపఁబడినది. వీరు అయ్యగారి దర్శనమునకుఁ జెందిన మాలలు. వీరి వాద్యము పంబజోడు. ఈ పంబలనుబట్టి వీరికిఁ బంబలవారని పేరు వచ్చినది. వీరెక్కువగా అంకమ్మకథలను బాడుచుందురు. అంకమ్మను గొలుచు గమళ్ల, బలిజ, చాకలి, మాల, ముత్రాసులను వీరు యాచింతురు. నెల్లూరు గుంటూరు మండలములలో నీ పంబలవారు ఎక్కువగ నున్నారు. వీరు కొలిచెడి అంకమ్మను 'మారాసపు అంకమ్మ' యందురు. 'పల్నాటి అంకమ్మ' యను వేఱొక అంకమ్మ గలదు. ఆమెకును నీమెకును భేదమున్నది. మారాసపు అంకమ్మపైఁగల కథాచక్రమున 'అంకమ్మకథ, రవద్దేవిరాజు కథ, గంగురాజుకథ' అను మూఁడు కథలున్నవి. ఈ కథలనన్నిటిని పంబలవారు పాడుదురు. వంతలు పంబజోడును వాయించుచుఁ తిత్తిపట్టుచుండఁగా, కథకుఁడు రాజకుమారునివలె వేషమును ధరించి, కుడిచేతిలో పెద్ద కత్తిని, ఎడమచేతిలో 'జమజాల' యను చిన్నకత్తిని బట్టుకొని, వీరావేశముతోఁ జిందులు త్రొక్కుచుఁ గథను పాడుచుండును. ఈ పంబలవారు కూడ బనీలవలెనే అంకమ్మ జాతరలలో బలులను నఱకుట, మంత్రతంత్రములు నెఱపుట చేయుచుందురు.

**వీరవిద్యావంతులు (పల్నాటివారు): –**

వీరు చెన్నుని దర్శనమునకుఁ జెందిన మాలలు. గుంటూరు మండలమునందంతటను వీరు వ్యాపించి యున్నారు. కృష్ణా నెల్లూరు మండలములలోను కొందఱు గలరు. ఈ వీరవిద్యావంతుల గురువులు కారెంపూడిలో నున్న 'పిడుగువారు'. పిడుగువారు ఆఱువేల నియోగి బ్రాహ్మణులు.

వీరవిద్యావంతులు పల్నాటి వీరకథల నన్నిటిని ప్రశస్తముగాఁ బాడుచుందురు. అందుచే వీరిని పల్నాటివారనియుఁ బిలుచుట కలదు. వీరు వీరణములు, తిత్తి, కత్తి, డాలు నుపయోగించి పల్నాటి కథలను బాడుదురు. కథకుఁడు పల్నాటి వీరునివలెనే వేషము వేసికొని పండ్రెండు బిరుదులు ధరించి, ఒకచేతితో కత్తి, వేఱొక చేతితో డాలు పట్టుకొని, మహోద్రేకముతో వీరచరిత్రను గానము చేయును. చెన్నకేశవునిఁ గొలుచు వర్ణములవారందఱును వీరినాదరింతురు. వీరు పల్నాటి ప్లవవీరుఁడగు కన్నమదాసు సంతతివారై యుందురని నాయూహ. కారెంపూడి వీరోత్సవములో గాథలు పాడు నధికారము ఈ వీరవిద్యావంతులకు మాత్రమే కలదు. (ఈ వీరవిద్యావంతులను గూర్చిన ఇతర విషయములకు 'పలనాటి వీరకథాచక్ర'మను 11వ ప్రకరణమును చూడుఁడు.)

**కొమ్ములవారు: –**

వీరు గంగదర్శనమునకుఁ జెందిన మాదిగలు. వీరు తాము జాంబవంతుని వంశమువారమని చెప్పుకొందురు. ఈ కొమ్ములవారినే చిత్తూరు మండలమున 'భట్టువారు' అనియుఁ బిలుచుచున్నారు. కొమ్ముల వారు యాదవులను యాచింతురు. వారి గోత్రములను జెప్పుదురు. కాటమరాజుకథలను, విష్ణుభాగవతమను నామాంతరముగల 'కంసుఁడు కథ'ను వీరు పాడుచుందురు. ఈ కథలను పాడుటలో వీరణములు, తిత్తి, తాళములు, కొమ్ములు నుపయోగింతురు. తమ వీరగాథా సంపదను కాపాడుచుండిన వారగుటచే యాదవులు వీరిని మిక్కిలిగ నభిమానింతురు. కాటమరాజు కథలన్నియును వీరికడ తాళపత్ర రూపముననను, ముఖస్థములుగను నున్నవి. గంగజాతరలలో వీరు పాల్గొని, గావుపట్టుట, కొమ్ముల నూఁదుట, తానకములు పాడుట, కాటమరాజుకథలు చెప్పుట చేయుచుందురు. కాటమరాజు సైన్యమునఁ బ్రత్యేకముగా గోసంగిదళ మున్నట్లు కథలలోఁ జెప్పఁబడినది. దాని నాయకుఁడు బీరినీఁడు. ఇతఁడు మాతంగ వీరుఁడు. ఈతని సంతతివారే నాఁటినుండి నేఁటివఱకును నీ కథలను గానము చేయుచున్నారని నా యూహ. వీరే నేఁడు 'కొమ్ములవా'రని పిలువఁబడుచున్నారు. (ఈ కొమ్ములవారినిగూర్చిన ఇతర వివరములకు 'కాటమరాజు కథాచక్ర'మను 12వ ప్రకరణమును చూడుఁడు.)

**పిచ్చుకుంట్లు: –**

'పిచ్చుక గుంట్లు'– 'పిచ్చ కుంట్ల'– 'పిచ్చుక కుంట్ల'– 'భిక్ష కుంట్ల'– 'పిచ్చు కుంట్లు'– 'పిచ్చికుంట్లు'– ఇత్యాది వివిధ నామములతో వీరు పిలువఁబడుచున్నారు. 'పిచ్చుక' శబ్దము 'భిక్షుక' శబ్దభవమై యుండును. వీరు రెడ్లను, గొల్లలను యాచింతురు. గుంటూరు, కృష్ణా మండలములలో కమ్మవారికిఁగూడ పిచ్చుకుంట్లే గోత్రములను జెప్పుచున్నారు. ఏమైనను, వీరు ప్రధానముగా రెడ్లకు, అందునను మోటాటి రెడ్లకు వందిమాగధులు. రాయలసీమలో నీ మోటాటి రెడ్లు రాజ్యములేలిన ప్రభువులు. నొస్సంకోటను బాలించిన ఉయ్యాలవాడ నారసింహారెడ్డి మోటాటి కులమువాఁడే. ఈతని వీరగాథను పిచ్చుకుంట్లే పాడుచున్నారు. పాల్కురికి సోమనాథుఁడు తన పండితారాధ్య చరిత్రలో పిచ్చుకుంట్లను వికలాంగులుగాఁ బేర్కొన్నాఁడు.

ఈ పిచ్చుకుంట్ల పుట్టువునుగూర్చి రెండు వింతకథలను డా॥ బి. రామరాజుగారు చెప్పియున్నారు (చూ. తెలుఁగు జానపద గేయ సాహిత్యము, పుట ౨౬౩). నాకు వేఱొక కథ లభించినది. పిచ్చుకుంట్లు రెడ్లకు గోత్రములు చెప్పుటతోపాటు వారి పూర్వులనుగూర్చిన వీరగాథలనుగూడ గానముచేయుచుందురు. రాయలసీమలోని పిచ్చుకుంట్లు 'కుంటిమల్లారెడ్డి కథ' యను 'రెడ్ల పురాణము'ను,




'ఎలనాగిరెడ్డి కథ' యను శైవ జానపద గాథను, 'వేమారెడ్డి కథ, ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ' యను చారిత్రక వీరగాథలను పాడుచున్నారు. ఇందు కుంటిమల్లారెడ్డి కథలో బిచ్చుకుంట్లు రెడ్ల సంతానముగాఁ జెప్పఁబడినది:– (చూ. పైనున్న వంశవృక్షము).

కల్పవృక్షము క్రింద ఆదిరెడ్డి పుట్టెను. ఆదిరెడ్డి భార్య ఆదెమ్మ. ఈ దంపతులకు బుచ్చిరెడ్డి పుట్టెను. బుచ్చిరెడ్డి భార్య పొన్నమ్మ. ఈమెకుఁ బన్రెండుగురు పుత్రులు కలిగిరి. వీరిలోఁ బెద్దవాఁడు ఉత్తమారెడ్డి, రెండవవాఁడు సత్యమారెడ్డి. ఉత్తమారెడ్డి భార్య పెద్దమంగమ్మ, సత్యమారెడ్డి భార్య చిన్నమంగమ్మ. ఉత్తమారెడ్డి సంతానమే నేఁటి రెడ్లలోఁగల వివిధ శాఖలు. రెండవాఁడైన సత్యమా రెడ్డికి మల్లికార్జునుని వరముచే కుంటిమల్లారెడ్డి పుట్టెను. ఇతఁడు గొప్ప శివభక్తుఁడు. శ్రీశైలమునఁ దపస్సు చేసికొనెడివాఁడు. ఇతఁడు కుంటివాఁడు. అందుచేతనే కుంటిమల్లారెడ్డి యను పేరు వచ్చినది. ఇతని భార్య పిచ్చిదఁట. ఈ దంపతుల సంతానమే 'పిచ్చికుంట్లు'. పిచ్చిభార్యకును కుంటిభర్తకును గలిగిన సంతానమగుటచే వీరికి 'పిచ్చికుంట్లు' అని పేరు వచ్చినదఁట.

పై కథనుబట్టి పిచ్చికుంట్లు రెడ్లకు సోదరులని తెలియుచున్నది. నేఁటి రెడ్లు కూడ వీరిని సోదరతుల్యులుగనే యభిమానింతురు. రెడ్లలో ఎన్ని తెగలున్నవో ఈ పిచ్చుకుంట్లలోను అన్ని తెగలున్నవి. 'గొల్ల, తెలగ, గంట, తురక, తొగరు, మంద, తిత్తి'– మున్నగునవి పిచ్చికుంట్లలోని ఉపజాతులు.

పిచ్చుకుంట్లందఱును శైవులు. శ్రీశైలమల్లికార్జునుఁడు వీరి యారాధ్యదైవము. వీరు పాడు కథలన్నింటను మల్లికార్జున ప్రసక్తి తప్పక వచ్చును. జంగములు వీరికి గురువులు, పురోహితులును. రాయలసీమలోని పిచ్చుకుంట్లు 'ఎలనాగిరెడ్డికథ'ను ఎనిమిది రాత్రులు పాడుదురు. గుంటూరు మండలములోని పిచ్చుకుంట్లు పల్నాటి వీర కథలనుగూడఁ బాడుచున్నారు. పిచ్చుకుంట్లు మొదట గంట, తిత్తి మాత్రమే ఉపయోగించి కథలను పాడెడివారు. తరువాత, జంగముల ప్రభావముచేఁ గాఁబోలును, తంబుఱ గుమ్మెటలను ఉపయోగించు చున్నారు. కాని వీరు ఉయోగించెడి గుమ్మెటలు మిక్కిలి చిన్నవిగ నుండును. ఇవి ఇత్తడితోఁ జేయఁబడినవి. తెలంగాణములో జంగములు ఉపయోగించెడి 'బుడిగె' లిట్టివే. తెలంగాణమునఁ బిచ్చుకుంట్లు, జంగములు పాడు వీరగాథలనుగూడఁ బాడుచున్నారు.

## సుద్దుల గొల్లలు లేక గొల్లసుద్దులవారు:–

'గొల్లసూక్తులు' అను శబ్దమునుండి 'గొల్లసుద్దులు' అను శబ్దమేర్పడి, కాలక్రమమున నిది కాటమరాజు కథలను పాడు నొక వర్గమునకుఁ బేరైనది. ఈ గొల్లసుద్దులవారు బడుగుల యాచారము నకుఁ జెందిన గొల్లలలో నొకశాఖ. వీరు యాదవులను యాచింతురు. సుద్దులను పాడు గొల్లలగుటచే వీరికి 'సుద్దుల గొల్లలు' అనియు నామాంతరము. నెల్లూరు మండలమున వీరిని 'యాచకు' లనియు 'తెరచీరభక్తు'లనియుఁ బిలుతురు. వీరు పూజగొల్లలు. తెలంగాణమున ఎఱ్ఱగొల్లలు ఈ వృత్తియందున్నారు. భక్తిరన్న కాశినుండి తనతోఁ

బండ్రెండుగురు శిష్యులను తోడితెచ్చెననియు, వారిని కాటమరాజు కథలను గానముచేయుచు, యాదవులను యాచించి బ్రతుకుఁడని భక్తిరన్న చెప్పెననియు, ఆ శిష్యుల సంతానమే నేఁటి గొల్లసుద్దులనియు నొక ప్రతీతి. ఈ పండ్రెండుమంది శిష్యులకే కాక, పదమూఁడవ వానిగా కొమ్ములవానికిఁగూడ భక్తిరన్న యధికారమిచ్చెనని చెప్పుదురు. పల్నాటి వీరకథలను జెప్పు నధికారము మాలలగు వీరవిద్యావంతులకున్నట్లే, కాటమరాజు కథలను బాడు నధికారము నిజమునకు మాదిగలగు కొమ్ములవారికి మాత్రమే కలదు. గొల్లసుద్దులు లేక సుద్దులగొల్లలు కొమ్ములవారి తరువాత నెన్నఁదగినవారు మాత్రమే.

ఈ గొల్లసుద్దులవారు పెద్దగుడారమును వేసి, అందు కాటమరాజు కథావృత్తాంతములు బొమ్మల రూపమునఁ జిత్రింపఁబడిన తెరచీరను గట్టి, వీరణములు కొమ్ములు తాళములు తిత్తి మున్నగు వాద్యములతో నా గుడారమునందు కాటమరాజు కథలను పాడుదురు. వీరగాథలలోని ఘట్టములను బొమ్మల రూపమునఁ జూపుట తెలంగాణమున పాండవులవారును జేయుచున్నారు. విదేశములలోఁగూడ నిట్టి పద్ధతి కలదు.

అయ్యలరాజు నారాయణామాత్యుఁడు తన హంసవింశతిలో సుద్దుల గొల్లలను విపులముగా వర్ణించియున్నాఁడు (2-88, 89). ఈ గొల్లసుద్దులు మేకలను పెంచుచుందురు.

### పొడపోతులవారు:-

వీరు విశాఖమండలములో (నేటి విజయనగరము జిల్లాలో) నున్నారు. వీరు "చెఱుకూరి జంగముల" శాఖకు చెందిన జంగము కులమువారు. వీరు ప్రధానముగా ఉత్తరాంధ్ర జిల్లాలోని యాదవులను (ఆలగొల్లలను) యాచింతురు. ప్రస్తుతము వీరు ఉత్తరాంధ్ర జిల్లాలతోపాటు, ఉభయ గోదావరి జిల్లాలలోను, కృష్ణాజిల్లాలోను ఉన్న ఎఱ్ఱగొల్లలు, పూజగొల్లలు మొదలగువారిని కూడ యాచించు చున్నారు. అండమాన్- నికోబార్ దీవులలో స్థిరపడిన యాదవులను కూడ వీరు దర్శించి యాచించుట విశేషము.

ఈ పొడపోతులవారి ప్రధానవృత్తి కాటమరాజుకథలను పాడుచు యాదవులను యాచించుట. సంవత్సరములో ఆఱునెలల పాటు వీరు సంచార జీవనము చేయుచు, యాదవుల యిండ్ల దగ్గఱ కాటమరాజుకథలను చెప్పుదురు. వీరు కాటమరాజుకథలను చెప్పుటకుగల కారణము "పోలురాజుకథ"లో నున్నది. పోలురాజు 'చెఱుకూరు' దగ్గఱ తన ఆలమందలను మేపుకొనుచుండెను. అప్పుడు శ్రీరంగపట్టణమునేలు "చోడానిరాజు" కావేరి చెఱువు నిర్మాణములో వెట్టిచేయుటకు చెఱుకువాడలోని కొందఱు జంగములను నిర్బంధించెను. వారు పోలురాజు శరణుఁజొచ్చిరి. అతఁడు వారి కభయమిచ్చి, కల్లందుల మారినీఁడు, మసిలినాయఁడు మొదలగు యాదవవీరులను ఆ జంగములకు తోడుగా నిచ్చి, వారిని శ్రీశైలమునకు భద్రముగా పంపివేసెను. ఈ చర్యతో చోడానిరాజు కోపించి, "ముక్కంటి" అను వీరుని ససైన్యముగా పోలురాజుపైకి పంపెను. చెఱుకువాడ సమీపములోని చిలకలమఱ్ఱి రాణ్యము దగ్గఱ నిరుపక్షముల వారికిని పెద్దయుద్ధము జరిగెను. అందు పోలురాజు చనిపోయెను. తమ్ము రక్షించుటకై ప్రాణములొడ్డిన యాదవవీరులకు కృతజ్ఞతతో ఈ చెఱుకూరి జంగములు అప్పటినుండియు కాటమరాజు కథలను పాడుచున్నారఁట.

పొడపోతులవారి కథాగానములో ఒక కథకుడు, ఇద్దఱు వంతలు నుందురు. వీరు ఏ విధమైన వాద్యములను ఉపయోగింపరు. కాని వీరికడ నొక పెద్ద తెరపటము మాత్రముండును. దానిమీఁద మధ్యలో యాదవుల కులదైవమైన గంగమ్మ చిత్రము పెద్దదిగా నుండును. దానిచుట్టును దేవతల బొమ్మలు, ప్రసిద్ధ యాదవవీరుల బొమ్మలు ఉండును. ఈ బొమ్మలను చూపుచు కథకుఁడు కథను చెప్పును. ఇద్దఱు వంతలును "ఆఁ" కొట్టుదురు. ఈ పొడపోతులవారు కాటమరాజుకథలలోని పోలురాజుకథ, కాటమరాజు పుట్టుక (పెద్దిమాదేవి నోములు), చంద్రగుప్త మహారాజు కథ, దుర్వాస మహాముని కథ (ముసలందుద్దు పుట్టుక కథ), పల్లికొండ పుట్టుక, కాటమరాజు దక్షిణాది ఆవులమేపు కథ, ఆలవారి పాపమ్మ సువ్విపాటలు, పాపనూక కథ, పాపనూక వలపోత, కొచ్చర్లవారి కొమరమ్మ కథ, ఎఱ్ఱన్న కోటపాడు కోదాడు తేవడం, బొల్లావు పుట్టుక, బొల్లావు యుద్ధం, బత్తుడన్న కథ మొదలైన కథలు పాడెదరని వీరిని గుఱించి పరిశోధన చేసిన ఆచార్య మఱ్ఱిబోయిన జయదేవ్‌గారు తెలియజేయుచున్నారు (చూ. వారి "యాదవుల జానపద ప్రదర్శన కళలు", పుట 132).

### బీరన్నలవారు:-

యాదవులను కొమ్ములవారు, సుద్దులగొల్లలు, పొడపోతుల వారు యాచించినట్లే, తెలంగాణమున యాదవులలో నొకశాఖ యగు 'కురుమ గొల్లల'ను బీరన్నలవారు యాచింతురు. బీరన్న వీరి కులదైవము. ఆ బీరన్నకథలను బాడుటచే వీరికీపేరు సిద్ధించియుండును. వీరు వాయించెడి వాద్యమునకు 'ఒగ్గు' అని పేరు. ఇది బుడబుక్కలవారి చేతనుండు డమరుకముయొక్క ఆకారములో దానికన్నఁ బెద్దదిగా నుండును. ఈ యొగ్గును వాయించుటచే వీరికి 'ఒగ్గువారు' లేక 'ఒగ్గోళ్లు' అనియుఁ బేరువచ్చినది. వీరు చెప్పు కథలను 'ఒగ్గు కథలు' అందురు. వీరు యాచించు కురుమవారికి బీరప్ప లేక బీరన్న ఆరాధ్యదైవము. ఇతఁడు కాటమరాజుకథలోని బీరినీఁడు కావచ్చును. లేదా శైవుల దైవము 'వీరభద్రుడు' కావచ్చును. బీరన్న కథను, కొమిరెల్లి మల్లన్న కథను బీరన్నలవారు పాడుచుందురు. మల్లికార్జున స్వామికూడ కురుమలకు ఇలువేల్పు.

గాథాకారులందఱును తమ కథలను రాత్రులందుఁ బాడు చుండఁగా, నీ బీరన్నలవారు మాత్రము తమ కథలను మట్టమధ్యాహ్న వేళలలోఁ బాడుట విచిత్రముగా నున్నది. బీరన్నలవారు, కాపులకును బ్రాహ్మణులకును బుట్టియుందురని కొమిరెల్లి మల్లన్న కథనుబట్టి యూహింపవచ్చును. బీరన్నలవారు గాథాగానమున నొగ్గుతోపాటు పెద్ద పెద్ద డోళ్లు, తప్పెటలు కూడ నుపయోగించుచుందురు.

**జంగములు:–**

తెలుఁగులో పల్నాటి వీరకథలను కాటమరాజు కథలను పాడు గాథాకారుల తరువాత నెన్నఁదగినవారు జంగములు. తెలుఁగు వీరగాథాసంపదలో సగభాగ మీ జంగములవలననే పరిపుష్టమైనది. వీరావేశముతోఁ గథను బాడుటలో జంగములకు జంగములే సాటి. వీరు ఒక ప్రత్యేకమైన రగడలోఁ గథలను బాడుదురు. ఈ రగడ వీరావేశమునకుఁ దగినట్లుగా నుండును. బొబ్బిలి, దేసింగురాజు, ముగ్గురు మరాటీలు, కాంభోజరాజు, బాలనాగమ్మ మున్నగు వీరగాథలను వీరినోటనే వినవలెను. బొబ్బిలివరుసలో నుండు కథలను కీర్తనలతోను పద్యములతోను నింపి, యక్షగాన ధోరణికి మలఁచి, 'జంగంకథ'లను నొక ప్రత్యేక ప్రక్రియను వెలయించినది ఈ జంగములే. సిరియాళ చరిత్ర, భళ్లాణరాయ చరిత్ర, వామన విజయము, దేవయాని– మున్నగునవి ఇట్టి జంగంకథలకు ఉదాహరణములు. కథకుఁడు కుడిచేతితోఁ దంబుఱ మీటుచు, నెడమచేతితో నందెలు వాయించుచుఁ, గాళ్లకు గజ్జెలు కట్టుకొని గంతులు వేచుచు, మహోద్రేకముతోఁ గథను బాడుచుండఁగా, నతని కిరుప్రక్కలనుండు వంతలు గుమ్మెటలను ధణధణమ్రోఁగించు చుందురు. ఈ గుమ్మెటలను 'గుమ్మెత, బుడిగె, బుఱ్ఱ, డక్కీ, డిక్కీ, డిమ్కీ' అను పేర్లతో వివిధ ప్రాంతములందుఁ బిలుచుచున్నారు. తెలంగాణమున గుమ్మెటను 'బుడిగె' యందురు. బుడిగెల నుపయోగించు జంగములను 'బుడిగె జంగము' లందురు.

జంగము లందఱును వీరశైవులు. అన్ని జాతుల శైవులను వీరు యాచింతురు. తెలంగాణమున వీరు బలిజలను, పంచదాయ కులములవారిని, కోమటులను యాచింతురని రామరాజుగారు తెలుపుచున్నారు. అడిదము సూరకవి తన రామలింగేశ శతకమున 'జంగాలపాలు దేవాంగుల విత్తంబు' అనుటచే వీరు ప్రధానముగా దేవాంగుల నడిగికొని జీవింతురని భావింపవచ్చును. దేవాంగులనఁ గా వీరశైవులగు సాలెవారు.

జంగములు ప్రాచీనకాలమునుండియుఁ గథలుపాడుటలోఁ దెలుఁగునాట మిక్కిలి ప్రసిద్ధికెక్కి యున్నారు. ధేనువకొండవారి విరాట పర్వము జంగంకథలో జంగముల వర్ణన బాగుగనున్నది:–

*"భారతమొక కథచేయుమనుచు నను – ప్రార్థింపగ జూచి*
*నే రచియింపగబూనితి జంగము– వారికి నుపకృతిగా*
*నీటుగ విభూతిరేఖలు దీర్చియు – నిల్వుటంగీల్దొడిగే*
*వేటు రుమాలాల్ పేటుపాగా ల్వల్లె– వాటు లొనర దాల్చీ*
*జోడు గుమ్మెటల్ దట్టుచు వంతలు – బాడుచు మరియొకదు*
*పోడిమిగా చేబూని సితారా– భుజమున ధరియించీ*
*గజ్జెలు మువ్వలు అందెలు పదముల – ఘల్లని మ్రోయగనూ*
*తరుణత తకయని నాట్యము సల్పుచు – తంబుర మీటుచునూ*
*సంగతిగా సభవారికెల్ల ప్ర – సంగ పూర్వకముగా*
*చెంగున దుముకుచు జంగంబులకును – జీవనధన మనగా".*

**శారదకాండ్రు:–**

వీరు తెలంగాణమున వ్యాపించియున్నారు. వీరి వేషములు, కథలుచెప్పు తీరు నంతయును జంగములవలెనే యుండును. జంగములకు 'జంగం రగడ' వలెనే, శారదకాండ్రకును నొక ప్రత్యేక మగు వరుసయున్నది. దీనిని 'శారద వరుస' యందురు. (శారద వరుస లక్షణములకై 'వీరగాథల ఛందస్సు' అను 20వ ప్రకణమును జూడుఁడు.) ఇది అంత్యప్రాసలతో సాఁగు దరువు. శారద రామాయణము, శారద హరిశ్చంద్ర, శారద సారంగధర– మున్నగు కథలను వీరు పాడుచుందురు.

శారదకాండ్రు శైవులు. వీరిలోఁ గొందఱు లింగధారులు గలరు. వీరికి జంగములు గురువులు.

**పూసల బలిజలు:–**

రాయలసీమలో, ముఖ్యముగా చిత్తూరు మండలమున వీరు వ్యాపించియున్నారు. పూసలమ్ముచుండుటచే వీరికీపేరు వచ్చినది. వీరు జంగములను శారదకాండ్రను బోలియుందురు. వారివలెనే వీరగాథలను గానముచేయుదురు. బొబ్బిలి, దేసింగురాజు, బాలనాగమ్మ, కాంభోజరాజు, ముగ్గురు మరాటీలు, చిన్నమ్మ, లక్ష్మమ్మ, కామమ్మ మున్నగు సాంప్రదాయిక వీరగాథలను వీరు పాడుచుందురు. వీరి వేషమంతయు జంగముల వేషమువలెనే యుండును.

ఈ పూసల బలిజలు వైష్ణవులు. కంచి ప్రాంతములోని శ్రీవైష్ణవులు వీరి గురువులు. వీరు తమిళదేశమునుండి వచ్చి చిత్తూరు మండలమున స్థిరపడినట్లున్నారు. వ్యవసాయము, పూసలమ్ముకొనుట వీరి వృత్తులు. జంగములు వీరశైవులయినను వారు పాడెడి కథలలో శైవపక్షపాతము లేనట్లే, పూసల బలిజలు వైష్ణవులయినను వీరుపాడు కథలలో వైష్ణవపక్షపాతము లేదు. వీరు అన్నిరకముల కథలను బాడు చుందురు. అయినను, వీరు వేంకటేశ్వరుని కథను, వరాహావతార చరిత్ర (పందికథ)ను, చిన్నమ్మకథను కొంత ప్రత్యేకశ్రద్ధతోఁ బాడుదు రనుట సత్యమే. అట్లే జంగములు సిరియాళుని కథను, శ్రీశైల మాహాత్మ్యమును బాడుటలోఁ గొంత వైశిష్ట్యమును బ్రదర్శింతురు.

పూసల బలిజలు ప్రాచీనవీరగాథలనే కాక, ఆధునిక సంఘటనలపైఁగూడఁ గథలనల్లి పాడుచున్నారు. 'సుబ్బిరెడ్డి కథ,

చెన్నకృష్ణారెడ్డి కథ, యల్లమంద నాయుఁడు కథ, ఒడ్డుకింద భయారెడ్డి కథ, కలిచెర్ల నరసింహారెడ్డి కథ' మున్నగునవి చిత్తూరు మండలమునఁ పూసల బలిజలచే నల్లఁబడిన అత్యాధునిక వీరగాథలు.

ఈ పూసలబలిజలలోఁ గొందఱు 'గదస్తంభం (గరుడ స్తంభం) దాసరులు' అను పేర వైష్ణవ వేషముతో జేగంటను వాయించుచు వేంకటేశ్వరుని కథను వేమన కథను పాడుచున్నారు. వీనిని 'జాగట కథలు' అందురు. 'జేగంట కథ' లే జానపద వ్యవహారమున 'జాగట కథలు'గా మాఱినవి. ("జేగంట"= చేతిగంట.)

## దక్కలవారు- మాష్టీలు:-

మాదిగలను యాచించువారు 'దక్కలవారు'; మాలలను యాచించువారు 'మాష్టీలు'. వీరు హైందవ సంఘమున నత్యంత నిమ్నకులులుగాఁ దలంపఁబడుచున్నారు. వీరు రాయలసీమలోఁ కర్నూలు మండలమందును, తెలంగాణమున మహబూబునగరు మండలమందును నధికముగా నున్నారు. వీరి వాద్యము పేరు 'మెట్ల కిన్నెర'. ఇది మూఁడు సొరకాయలతోఁ జేయఁబడును. అత్యంత శ్రావ్యమగు ధ్వనినిచ్చును. మియాసాబు కథ, పండుగ శాయన్న కథ, వెంగళరెడ్డి కథ, మలగర బాలేసాబు కథ, నక్కపల్లి రాముఁడు కథ- మున్నగు గజదొంగల గాథలను వీరు పాడుచుందురు. ఇందు కథకుఁ డొక్కఁడే పాడును. వంతలుండరు. కథకుని గానమునకు మెట్లకిన్నెరయే మధురముగా వంతపలుకును. వంతలు లేకుండ గాథాగానమొనర్చుట ఈ కిన్నెరకథలలోని ప్రత్యేకత. ఈ కథలలో వేఱొక ప్రత్యేకత కూడఁ గలదు. వీరగాథలు ఆవేశప్రధానములు. కావున గాథాకారులెప్పుడును నిలబడి చిందులు త్రొక్కుచుఁ బాడుట పరిపాటి. కాని ఈ కిన్నెర కథలలో గాథకుఁడు కూర్చొనియే పాడును. ఇదియొక వింత. (పైన చెప్పిన పిచ్చుకుంట్లలో రాయలసీమలోని పిచ్చుకుంట్లు కూడఁ గూర్చొనియే గాథాగానము సాఁగింతురు.) వీరి మెట్లకిన్నెర ధ్వని అచ్చముగా 'బలు బులు తారు' ధ్వనివలె మిక్కిలి శ్రావ్యముగా నుండును.

ఆంధ్రదేశమున నింకను నిట్టి గాథాకారు లెందఱో కలరు. వారియందు ముఖస్థరూపముననున్న వీరగాథలు నాగరికతా ప్రభావముచే నశించిపోవకముందే వానిని సంరక్షించుకొనవలసిన బాధ్యత ప్రతి సాహిత్య తపస్వికిని గలదు.

(కొందఱు గాథాకారుల ఛాయాచిత్రములు అనుబంధములో నీయఁబడినవి.) ❒

## జ్ఞాపికలు

1. *The World Book Encyclopaedia, Vol. II, p. 5112.*
2. *"Anglo-Saxon and earlier Germanic fighting men, thinks Gaston Paris, had at first no class of minstrels to sing for them; every man could improvise and sing his own verses. The second period is that of the professional poet, the Jongleur,, minstrel, courtbard, who worked upon the old material into coherent and protractd lays."- F.B. Gummere, The Popular Ballad.*
3. *పాశ్చాత్య దేశములందును గాథాకారుల పరిస్థితి కడు దైన్యముగనే యున్నది. అట 15వ శతాబ్దము నాఁటికే వీరు సంఘమున గౌరవమును గోల్పోయిరి. ముద్రణ యంత్రము వీరి మౌఖికకళా క్షీణతకు దోహద మొసంగినది. ''By the 1400s, the minstrels had lost their position of respect. Their art died out completely after the invention of the printing press."- G.F.W., The World Book Encyclopaedia, Volume II, p. 5112.*

# ఇరువదినాల్గవ ప్రకరణము

# క్షీణతా కారణములు

**సా**హిత్యమున విశిష్టస్థానముగల వీరగాథలు నేఁడు నశించు చున్నవి ('నశించుచున్న' వనుటకన్న 'నశించిపోయిన' వనుటయే సమంజసము'). ఒక్క వీరగాథలే కాదు, జానపద గేయములు, స్త్రీల పాటలు, భజన కీర్తనలు, ద్విపద కావ్యములు మున్నగు వివిధ ప్రక్రియా సమన్వితమగు దేశిసాహిత్య మంతయును కృశించుచున్నది. దీనికి పెక్కు కారణములున్నవి. ప్రౌఢకావ్యప్రియులగు పండితాఖండుల యనాదరణము, నివి కేవలము గానోపజీవ్యములగుట, మహాకవులు వీనిని చేపట్టకపోవుట, సంఘ బహుముఖ నాగరికతాభివృద్ధి-ఇత్యాదులు క్షీణతాకారణములలో నతిముఖ్యములైనట్టివి.

పాషాణపాక ప్రియులగు పండితుల అనాదరణమే వీరగాథల క్షీణతకు ప్రథమకారణము. ప్రౌఢకావ్యములవలననే సాహిత్యమునకు సౌష్ఠవమేర్పడుననియు, చిల్లరకావ్యము లెన్నియున్నను ప్రయోజనము శూన్యమనియు వీరి విశ్వాసము. ఈ యంధవిశ్వాసమువలన సుసంపన్నమగు సాహిత్యమున నర్ధభాగము కృశించిపోయినది. ప్రపంచమున నేజాతియందైను పరిమితమగు మార్గకవిత్వముకన్న సార్వజనీనమగు దేశికవిత్వమే అత్యధికముగా నుండును. కాని పండిత నిరాదరణముచే కొన్ని సాహిత్యములందలి ప్రాచీనకాలము నాఁటి ఈ అమూల్య సంపద నశించిపోయినది. ఇట్లు ప్రాచీన దేశికవితా దారిద్ర్యము పట్టిన సాహిత్యములలో నాంధ్రి యొకటి. ఈ దారిద్ర్యముచేతనే, దీనిపుట్టువు పదునొకండవ శతాబ్దియని చెప్పుకొను దౌర్భాగ్యము మనకు సంప్రాప్తమైనది.

ఈ పండిత నిరాదరణము ప్రాచీనకాలమునుండియు జరుగుచునే యున్నది. ఎఱ్ఱన తన నృసింహపురాణములోఁ బ్రాఙ్నన్నయయుగపువారిని 'గాసట బీసటే చదివి గాథలు త్రవ్వ తెనుంగుజాతి' గా నిరూపించినాఁడు. జనసామాన్యమగు ద్విపద చ్ఛందమును కావ్యరచనకు నుపయోగించి, జానుతెనుఁగులో దేశికవిత్వమును వెలయించిన మహాకవి పాల్కురికి సోమనాథు నంతటివానినే పండితులు దూషించిరి. ఇఁక సామాన్య జానపద రచయిత వీరిదృష్టిలో నెంత హైన్యము నొందెనో వేఱుగాఁ జెప్పఁ బనిలేదు. ఒకనాఁడు కొందరు శివభక్తులు ఓరుగల్లులో స్వయం భూదేవాలయ మంటపమున గుమిగూడి బసవపురాణమును భక్తితో వినుచుండిరఁట. అంతట ప్రతాపరుద్ర చక్రవర్తి హరుని గొలుచుటకై యచటికి వచ్చెనఁట. ఆ భక్తుల సంభ్రమమును జూచి చక్రవర్తి ప్రశ్నింపఁగా, నటనున్న 'ధూర్తవిప్రుఁడొక్కఁడు' రాజును జేరి-

*'పాలకురికి సోమ పతితుఁడీ నడుమను*
*బెనచె మధ్యవల్లు బెట్టి ద్విపద*
*యప్రమాణమిది యనాద్యంబు పద'*మనెనఁట.[1]

శ్రీనాథుఁడు పదకవిత్వమును దూషించినట్లుగా నీ క్రింది చాటు వొకటి ప్రచారమున నున్నది:

*'ముదివిటులు, విధవ లంజలు,*
*పదకవితలు, మారుబాస బాపనవారల్*
*చదువని పండితవర్యులు,*
*కదనాస్థిర వీరవరులు కడిదిపురమునన్.'* [2]

కాని, తెలుఁగు వీరగాథలలో అతిప్రాచీనములును అతి ప్రశస్తములును నగు పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు చరిత్రలను రచించిన కవిసార్వభౌముఁడిట్లు పదకవిత్వమును నిరసించియుండునా యని నా సందేహము. పదకవితలయెడ వైమనస్యముకల ప్రబుద్ధుఁ డెవరో రచించి శ్రీనాథుని పేరు పెట్టియుండును. (శృంగార నైషధకర్తయు, కవిసార్వభౌముడును నగు శ్రీనాథుఁడు వేఱనియు, పల్నాటి వీరచరిత్రను రచించిన శ్రీనాథుఁడు వేఱనియు శ్రీ చిలుకూరి పాపయ్యశాస్త్రిగారు వాదించుటకు కూడ పండిత అనాదరణమునకు ప్రబల తార్కాణము.) 'ద్విపదకావ్యము, ముదిలంజ, దిడ్డికంత, ఇయ్యనేరని రండ' - ఈ నాల్గింటిని ఏకరాశిగా భావించినాఁడు వేణుగోపాలశతకకర్త. ఇట్లు శిష్టకవులు దేశికవితలను హీనాతిహీనముగా నిరసించుటయే కాక, వీరిలోఁ గొందఱు 'విశిష్టులు' ఈ జాతి కవితలను అసలు 'సాహిత్య'-'సారస్వత' శబ్దములతో నుచ్చరింపరాదనియు, 'జానపద గేయము' లనుపేరుతోఁ దృప్తిచెందవలె ననియుఁ దీర్మానించిరి.

ఆర్ష సాహిత్యమునఁ బ్రాకృత కవిత్వమును నిట్లే అనాదరింపఁ బడినది. అందు సంస్కృత కవిత్వము మార్గము, ప్రాకృత కవిత్వము దేశి. దేశియగు నీ ప్రాకృతమే ప్రాచీనమైనదనియు, నిదియే సంస్కరింపఁబడి సంస్కృతమైనదనియుఁ బలువురు తలంచుచున్నారు. ఈ ప్రాకృతము జానపదులకును స్త్రీలకును నందుబాటులో నుండి సరళముగా సహజ సుందరముగా నుండును. ఇట్టి దేశిని సంస్కృత పండితులు హీనముగాఁ జూతురన్న వారిదృష్టి యెంత సంకుచిత మైనదో గ్రహింపవచ్చును.

ఇట్టి పండితకృత అనాదరణమువలన సాహిత్యమునకు మహాపచారము జరిగినది. సహజసుందరములును నతిరమణీయ

ములును నగు దేశికవితలుగూడ సాహిత్యమున నొక భాగమే యను విషయమును మనము విస్మరింపరాదు. "వాటిని తృణీకరించి, ప్రౌఢ కావ్యముల యెడనే ఆదరము చూపుదుమేని వాఙ్మయశరీరములో అర్ధభాగము కృశించిపోయినట్లు అగును. మన వాఙ్మయములో కొంతవరకు అట్టిలోపమే జరిగినది. నన్నయ భారతమునకు పూర్వము ఎంతో పదకవిత్వము పేరిట వాఙ్మయము పుట్టినను, దాని నంతయు పౌఢకావ్యమునందలి ఆదరముచేత లోకము విస్మరించినది. అట్లే కాకున్న, నేడు అనుకొనుచున్నట్లు ఆంధ్రవాఙ్మయారంభము 11వ శతాబ్ది కాక, మరి నాలుగైదు వందల యేండ్లు పూర్వమేనని నిరూపించుటకు ఆధారములుండెడివి. నాఁడే కాదు, తరువాత వెలసిన చిల్లర రచనలయెడను మనకుగల ఈ అనాదరభావమువల్లనే వాఙ్మయ విస్తృతి ఉండలసినంత లేకపోయినది. ఎంతో మంది సహజకవులు నామరూపములు లేకుండ పోయిరి." [3]

ఇట్లు దేశికవితను నిరసించెడి పండితులను ధిక్కరించి, దాని ప్రశస్తిని గుర్తించిన మహానుభావులు లేకపోలేదు. ఆంధ్ర సాహిత్యమున దేశికవితా వైశిష్ట్యమును గుర్తించిన వారిలోఁ బ్రప్రథముఁడు కవిరాజ శిఖామణియగు నన్నెచోడుఁడు. దేశికవిత పుట్టుటచేతనే ఆంధ్రవిషయమునఁ దెలుఁగు నిలిచినదని గుర్తించినాఁడు. దేశిని అనాదరించెడి మార్గప్రియులపై నితఁడిట్లు దండెత్తినాఁడు:–

*"మార్గకు మార్గము దేశియ*
*మార్గము వగవంగఁ దమకు మదివదలక దు*
*ర్మార్గ పదవర్తుల నఁదగు*
*మార్గవులం దలఁప నలఁతి మహి సుకవులకున్"* [4]

పాల్కురికి సోమనాథుఁడు దేశికవిత్వమునకు మహోన్నత స్థానమును గల్పించినాఁడు. ద్విపద ప్రాశస్త్యమును ఇట్లు ఎలుఁగెత్తి చాటినాఁడు:–

*"ఉరుతర గద్య పద్యోక్తులకంటె,*
*సరసమై పరఁగిన జానుఁదెనుంగు*
*చర్చింపఁగా సర్వసామాన్యమగుటఁ,*
*గూర్చెద ద్విపదలు గోర్కి దైవాఱ."* [5]

సరసమును సర్వసామాన్యమును నగు జానుతెనుఁగు ద్విపదలలోఁ గూర్పఁ దగినదనియు, నిట్టి జానుద్విపదలు ప్రౌఢ కావ్యములకన్న మిన్న యనియు నీతని తలంపు. 'వడ్లను బెరుగు బిసుకు చందంబు బిలి బిలి కృతుల్ కృతులె' అని మార్గకావ్యముల నధిక్షేపించినాఁడు. శ్రీనాథుఁడు ప్రజల జిహ్వాగ్రములపైఁ దాండవ మాడు ప్రశస్త వీరగాథలను విని, 'చిత్తముప్పొంగి', వానికి సుస్థిర రూపమునిచ్చి సంరక్షించినాఁడు. తమ్ము అనాదరించెడి సంస్కృత కవులను 'వజ్జలగ్గ, జయవల్లభ' అను ప్రాకృతకవు లిట్లు తిరస్కరించినారు:–

*"లలియే మహురక్షరయే*
*జువ ఈ జణ వల్లహేస సింగారే*
*సంతే పాయి య కవ్వే*
*కోసక్కయి సక్కయం పఢివుం."*

తాత్పర్యము: ''లలితమై, మధురాక్షరమై, శృంగారమై, యువతీజనవల్లభమైన ప్రాకృతముండగా సంస్కృతము నెవ్వడు చదువును?" [6]

దేశికవితలు 'సారస్వత' శబ్దోచ్చారణకే యనర్హములను విశిష్ట పండితులకు శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు చెంపపెట్టువంటి సమాధానము నిచ్చినారు: 'ఏ రాజసభలలోనో పాండిత్య ప్రకటన కోసము రచించి లిఖించిన ప్రబంధాలూ, పురాణాలూ మాత్రమే బహుళాంధ్రోక్తిమయ ప్రపంచమని భావించడము మధ్యయుగాల వారికి చెల్లునేమో కాని ఆధునికులకు చెల్లదు. సారస్వత లక్షణాలూ, ఆదర్శాలూ చక్కగా గుర్తించుకోగల దేశిరచనలు సారస్వతమే అనడానికి ఎందుకు వెనకతియ్యాలో తెలుసుకోవడము కష్టము. ప్రబంధాలలో నూటికి తొంభయ్యింటిలోకంటె హరిహరీ నారాయణ పదాలలో మేలైన కవిత్వము కనబడుతుంది. ఒకమారు చదివి చూడండి. ప్రబంధాలలో కనబడే శృంగారపు ముఖాలు రెండూ మన జీవితానుభవాలకి భిన్నాలే. విప్రలంభ శృంగారమూ, సంభోగ శృంగారమూ పచ్చిగా ఉంటాయి వాటిలో. స్త్రీలపాటలలోనూ, పదాలలోనూ, పల్లెపాటలలోనూ కనపడే శృంగారమంతకంటె సున్నితమైనది. మరి వీటినన్నిటినీ దేశిసారస్వత మనడానికి అభ్యంతర మేమిటి? నాకు జూడగా మనదృష్టి కృతకమై పోయిందేమో అనిపిస్తుంది. అక్షరాస్యులూ, వ్రాయనేర్చినవారూ మట్టుకే సారస్వతు లన్న అభిప్రాయము మన మనసుల్లో బాగా నాటుకుపోయింది. వేదాలు నిన్నమొన్నటిదాకా అక్షరగతాలు కానేలేదు. అవి సారస్వతమేనా కాదా? కల్పన చెయ్యగలిగిన వారంతా– బాలురూ, బాలికలూ, యువకులూ, స్త్రీలూ, సాధువులూ, కర్షకులూ, శ్రామికులూ– రచించిన ఈ బృహత్తరాంధ్ర సారస్వతములో పండితుల రచనలు ఒక లంక. పండితుల రచనలు ఒక సరోవరమూ, దేశి సముద్రమూను. సారస్వతమన్న పేరుకు తగవా దేశిరచనలు? ఎవరా అనగలిగిన వారు?" [7] అని సింహగర్జన చేసినారు శ్రీపాదవారు.

ఈ జానపద సాహిత్య నిరాదరణము ప్రతిదేశమందును గానవచ్చుచున్నది. ఈ సాహిత్యము పఠనయోగ్యముగా నుండకపోవుట, విని యానందింపఁ గలవారికి మాత్రమే యుద్దేశింపఁ బడి యుండుట, శబ్దార్థాలంకారాది ప్రౌఢిమతోఁ బరితృప్తి నీయకుండుట–ఇట్టి నిరాదరణకు హేతువులు కావచ్చును. ఆంగ్లదేశమున ఎలిజబెత్తు యుగమున వీరగాథానిరసనము మిన్నుముట్టినది. పిచ్చిపాటలను బాడుచు రణగొణధ్వనిచేయు గాథాకర్తలు కొల్లలుగా నున్నారని 'వెబ్బే' (Webbe) నిందించినాఁడు.[8] 'ఛెట్టెల్' (Chettle) అను మఱియొక ప్రౌఢుఁడు వీరగాథల

విశేష వ్యాప్తిని జూచి కన్నుకుట్టఁగా నక్కసును వెలిగ్రక్కినాఁడు.[9] 'Bishop Hall' అనునతఁడు గాథారచన నెత్తిపొడుచుట మఱచిపోలేదు. అవశ్యము బహిష్కరింపవలసినవానిలో వీరగాథలను జేర్చినాఁడు. త్రాగుబోతులగు గాథాకారులు తమ పేర్లను అచ్చులోఁ జూచుకొని మురిసిపోవుదురనియు, నసంఖ్యాకములగు గుజిలీ ప్రతుల ముద్రణకు వీరే కారకులనియుఁ బరిహసించినాఁడు.[10] షేక్స్పియర్ మహాకవి గాథాకారుని 'Ballad-monger' అని అవహేళన చేసినాఁడు (ఈ పదమును సృజించిన దతఁడే). మఱియొక పండితుఁడు "అడ్డమైనవాఁడును రచయితయే! ప్రతి త్రాగుబోతు కలయు నొకపుస్తకమే! ఎట్టిని యేగాని విలువచేయని తన అల్ప ప్రతిభతో సమస్త ప్రపంచమును జుట్టఁబెట్టినట్లు ప్రగల్భములాడును" అని గాథకుని గర్హించినాఁడు.[11]

పైన తెల్పినదంతయుఁ బదునాఱవ శతాబ్ది యుత్తరార్ధమున జరిగిన అనాదరణము. పదునేడవ శతాబ్దములోఁ గూడ నీ పరిస్థితిలో మార్పు రాలేదు. గాథాకారుని విలువ యేమాత్రమును పెరుగలేదు. వారి కథావస్తువులు, అభూతకల్పనలు మున్నగునవి అతిశయోక్తులతోఁ బరిహసింపఁబడినవి:

"A ballad-monger is the ignominious nickname of a penurious poet, of whom he partakes in nothing but in povertie. He has a singular gift of imagination, for he can descant on a man's execution long before his confession. Nor comes his invention for short of his imagination. For want of truer relations, for a neede, he can finde you out a Sussex dragon, some sea or island monster, drawne out by some shoe-lane man in a Gorgon- like feature, to enforce more horror in the beholder"[12]

పదునెనిమిదవ శతాబ్దమున నధికార వర్గములలో వీరగాథాగానము మిక్కిలిగ నసహ్యించుకొనఁబడినది. తత్ఫలితముగా క్రీ.శ. 1716లో 'Middlesex' న్యాయాధికారులు, వీథులలోఁ బ్రజల మనస్సులను గలుషితము చేయు పిచ్చిపాటలను బాడుట ప్రశాంతతకు భంగకరమని వీరగాథాగానమును సంపూర్ణముగా నిషేధించిరి.

ఇంగ్లండు దేశమున నొకప్పుడు వీరగాథలలోనికెక్కుట మిక్కిలి హైన్యముగా భావింపఁబడెడిది. ఒక శత్రువుపైఁ గసి తీర్చుకొను పద్ధతులలో నతనిపై గాథను వ్రాయుదునని బెదరించుట యొకటిగా నుండెడిది.[13] ఒకని కన్నులను బెఱికివైచుట, యొకని పేరును గాథలోని కెక్కించి ప్రతి కల్లుదుకాణము నొద్దను బాడఁబడునట్లు చేయుట– ఈ రెంటిని సమానదోషములుగాఁ బరిగణించినాఁడు 'Fletcher' అను కవి పుంగవుఁడు. గాథాకారులు మిక్కిలి నీచముగాఁ జూడఁబడి 'నికృష్టభ్రష్టులు'గా దూషింపఁబడిరి. వీరు రెండుపైసల కల్లుతో ముక్కు పుటములలో త్రేతాగ్నిని కురిపింపఁగలరని పరిహసింపఁబడిరి.[14]

ఇట్టి పండిత పరిహాసములచే వీరగాథలు క్షీణించుచున్నవి. ప్రాచ్యదేశములలోను పాశ్చాత్యదేశములలోను వీనిపరిస్థితి నిరుత్సాహజనకముగనే యున్నది. ఇంగ్లండులో గాథల నెఱిఁగిన వ్యక్తులను వ్రేళ్లపై లెక్కింపవచ్చును. నాగరికతకు దూరముగా నుండి, పరస్పర సంబంధము తక్కువగానున్న ప్రాంతములలో మాత్రము నేఁటికిని గాథాగానము గాథాసృష్టి సజీవముగా నున్నది. తెలుఁగు దేశమున నాగరికత బలిసిన కృష్ణాగోదావరీ మండలములలో కన్న, వెనుకబడిన విశాఖ, విజయనగర, శ్రీకాకుళ మండలములలోను, రాయలసీమ తెలంగాణా ప్రాంతములలోను వీరగాథాసృష్టి ఈనాఁటికిని జరుగుచుండుట మనము గమనింపవచ్చును. యూరపు ఖండమున రష్యా ఉత్తర ప్రాంతము, తూర్పు బాల్టిక్ దేశములందును, అమెరికా ఖండమున నుత్తర కరోలినా (North Carolina) పర్వత ప్రాంతములందును గాథాసృష్టి, గాథాగానము నేఁటికిని గలదు. ఏమైనను విద్యావంతులు ముద్రిత గ్రంథముల నుండియే వీరగాథా పరిచయమును గలిగినవారు కాని, గాథలను సజీవముగా విని తెలిసికొనినవారు కారు. తాళపత్ర గ్రంథములను జూచియు, మౌఖిక గాథలను బాడుచున్న గాథాకారులను సంప్రదించియు దేశిసాహిత్య ప్రియులు గాథాసంకలన గ్రంథములను బ్రకటించిరి. ఇట్టివి డేనిష్, రష్యన్, స్పానిష్, జర్మన్, ఇంగ్లీష్ భాషలలో విరివిగా వెలువడినవి. వీనిని జదివి విద్యావంతులు నాగరికులు వీరగాథలనునవి కొన్ని కలవని గుర్తింపఁగలుగుచున్నారు. 1935లో సి.ఎ. మీనన్‌గారు మలయాళ వీరగాథలను సేకరించి ప్రకటించిరి. దీనికి ఉపోద్ఘాతము రచించిన ఒక ఆంగ్ల రాజకీయోద్యోగి కేరళదేశములోని విద్యావంతులు ఈ వీరగాథలయెడ నెంతటి విముఖులోఁ జక్కఁగ వివరించినాఁడు:

"Educated men, however, even Malayalis,are usally quite ignorant of the very existence of these ballads and those who do know of them would regard them as beneath the notice of people of culture and speak of them with a tolerant smile."[15]

ఆంగ్లేయులుకూడ, 1765లో 'బిషప్‌పెర్సీ' మహాశయుఁడు తన ప్రశస్త వీరగాథా సంకలన గ్రంథమును ప్రకటించువఱకును తమ దేశికవిత్వముగూడ సాహిత్యమున నొక విశిష్టభాగమని గుర్తింపలేకపోయిరి.

ఇట్లు పాశ్చాత్య దేశములలో వీరగాథలు 18వ శతాబ్దము వఱకును మఱుఁగు పడిపోయినను వీని వైశిష్ట్యమును గుర్తించిన ప్రాచీనులు లేకపోలేదు. ఎనిమిదవ హెన్రీ చక్రవర్తి వీరగాథలను విశేషముగా నాదరించుటయే కాక స్వయముగా గాథారచనకుఁ బూనుకొనిన సహృదయుఁడు. (ఇతఁడు మన నాయకరాజులలో రఘునాథ నాయకుని బోలిన వ్యక్తి.) ఈతని కాలమున గేయకవితలు విశేషాభివృద్ధిని సాధించినవి. షేక్స్పియర్ మహాకవి వీరగాథలను 'odious ballads' అనియు, 'thesse same ballad-mongers' అనియు నిరసించినమాట వాస్తవమే. అయినను నితఁడు తన 'కింగ్

లియర్' నాటకములోను, 'హామ్‌లెట్' నాటకములోను ప్రాచీన సాంప్రదాయిక వీరగాథలపైఁ దనకుఁగల విశేషాభిమానమును వెల్లడించినాఁడు. 'ట్వెల్ఫ్త్ నైట్' నాటకములో నొకచోట పనిపాటులు చేసికొను స్త్రీలకు గాథాగానముపై నెంత మక్కువయో వివరించినాఁడు.[16] 'డ్రైడన్' మహాకవి ప్రభాతపదములను ప్రశంసించినాఁడు.[17] 'డగ్లసు ట్రాజిడీ' అను వీరగాథను విని రసపరవశుఁడైన 'సర్ ఫిలిప్ సిడ్నీ' మెచ్చుకోలు జగత్ప్రసిద్ధము. క్రీ.శ. 1711లో Addison తన 'Spectator' పత్రికలో వీరగాథలను 'the darling songs of the common people' అని ప్రశంసించినాఁడు. 'Chevy Chase', 'Children in the Wood' అను గాథలను ప్రత్యేకముగా పొగడినాఁడు Rowe, Parnell, Tickell, Prior- వీరందఱును సాంప్రదాయిక వీరగాథల ప్రాశస్త్యమును గుర్తించిన మహానుభావులే.

పలువురు పాశ్చాత్యస్త్రీలు కూడ వీరగాథలకు జీవము పోసినారు. ఈ గాథలను జ్ఞప్తియందుంచుకొని, తఱచుగాపాడుచు, నశించిపోకుండఁ గాపాడినారు. ఇట్టి వారిలో 'Mrs. Brown' అను నామె యొకతె. ఈమె Rev. Dr. Brown భార్య. ఈమెకు వందల కొలఁది గాథలు వచ్చును. Scott, Jamieson అను పరిశోధకులు ఈమె దగ్గఱనుండి అనేక గాథలను సేకరించియున్నారు. శ్రీమతి బ్రౌను ఈ పదములను తన మేనత్తయగు Mrs. Farquhar దగ్గఱ నేర్చుకొన్నదఁట. ఈ 'ఫార్క్యుహార్' తన కాలము నెక్కువగాఁ బసుల కాపరులతోను, గొల్లవారితోను గడపినదఁట. Mrs. Arrot కూడ నిట్టిదే. (ఇట్టి స్త్రీలు మన తెలుఁగు దేశమునఁ బ్రతిపల్లెయందును బ్రత్యక్షమగు చుందురు.)

మొత్తముమీఁద నీ వీరగాథల వైశిష్ట్యమును గుర్తించి ప్రశంసించినవారికన్న, వీని పేలవత్వమును బరిహసించి తెగడినవారి సంఖ్యయే యెక్కువ. దీనికి రెండు ముఖ్యకారణములున్నవి. వీరగాథలు సాహిత్యమున నతిప్రధానమైన ప్రక్రియ యనుట సత్యము. ఈ సత్యమును పండితులు గుర్తింపలేకపోయిరి. ఇది మొదటి కారణము. అట్లని వీరగాథలే సాహిత్యమున సర్వసంపూర్ణమును, మహోన్నతమును నగు ప్రక్రియ యనియు, నందు లోపములు కించిత్తు కూడ లేవనియు నర్థము కాదు. లోపములున్నవి. ప్రౌఢకావ్యములిచ్చెడి పఠనతృప్తిని వీరగాథలీయఁజాలవు. వీనిని విని యానందింపవలసినదే కాని చదివి యానందింపలేమనుట చాలవఱకు సత్యమే. కాని అల్పమగు నిట్టి లోపములను మాత్రమే దృష్టియందుంచుకొని, అనల్పమగు గుణమును గణింపకుండుట అవివేకము కదా! పండితులు చేయుచున్న ఈ తప్పిదము నొక పాశ్చాత్య విమర్శకుఁడు చక్కని యుపమానముతోఁ జమత్కరించినాఁడు:

"The old balllds of England and Scotland are fine wine in cobwebbed bottles; and many have made the error of paying too much attention to the cobwebs and not enough attention to the wine. This error is as balmeworthy as its converse: we must take the inside and the outside together."[18]

కేవలము నిరక్షరాస్యుల కుద్దేశించిన జానపద సాహిత్యమును ప్రౌఢమగు శిష్టసాహిత్యముతోఁ బోల్చిచూచుట పండిత నిరసనకుఁ గల రెండవ కారణము. వసవాల్చు పసిబాలునకును, ఆరితేరిన పెద్దవానికిని పోల్చుట యెట్టిదో ఈ రెండు సాహిత్యములను పోల్చుటకూడ నట్టిదే. ఈ తులనాత్మక పరిశీలనము అన్యాయమైనది.[19] వీరగాథ పసిబాలుఁడు; ఇతిహాసము పరిణతిచెందిన ప్రౌఢుఁడు. వీని రెండింటిని బోల్చుట అక్రమము. 'వీరగాథలు విని యానందింపఁ గలవారికే' యను విమర్శకుల వాక్యములలో సత్యము లేకపోలేదు.[20]

ఈ పండిత అనాదరణమునకుఁదోడు మహాకవులు వీరగాథా రచనను చేపట్టకపోవుట వలనఁ గూడ గాథాకవిత్వము క్షీణించినదని చెప్పవచ్చును. సాధారణముగా గాథాకర్తలు ప్రాంతీయ యశస్సు కలవారేకాని మహాకవులు కారు. కాని తెలుఁగు సాహిత్యమున నొక్క శ్రీనాథుఁడును, ఆంగ్ల సాహిత్యమున నొక్క 'గోల్డ్ స్మిత్తు' మాత్రము వీరగాథారచనకుఁ గడంగిన కవిశ్రేష్ఠులుగాఁ గన్పట్టుచున్నారు. పల్నాటి వీరచరిత్ర, కాటమరాజు చరిత్ర యను రెండు ప్రశస్త చారిత్రక వీరగాథా చక్రములను కవిసార్వభౌముఁడు ఆంధ్రులకుఁ బ్రసాదించినాఁడు. ఆంగ్లమున 'ఆలివర్ గోల్డ్‌స్మిత్' కవి మన శ్రీనాథునివంటివాఁడే! శ్రీనాథుఁడు తన చరమదశలో దారిద్రము ననుభవింపఁగా, గోల్డ్‌స్మిత్ తన ప్రారంభదశలో దారిద్ర్యము ననుభవించెను. ఇతఁడు 'డబ్లిను'లో గర్భదారిద్ర్యమున బాధపడు రోజులలో కడపు కాలినప్పుడెల్ల వీరగాథలను వ్రాసెడివాఁడఁట. వ్రాసిన వెంటనే వానిని సందు గొందులలోఁ గాలక్షేపము చేసెడి చిన్నచిన్న గ్రంథప్రకాశకులకు ఇచ్చెడివాఁడు. ఆ ప్రకాశకు లొక్కొక్క గాథకు ఐదు షిల్లుంగు లిచ్చెడి వారు. దానితో నా రోజు గడచెడిది. (నేఁడు మన రాజమహేంద్ర వరమువంటి పట్టణములలో బుఱ్ఱకథలు ఇట్లే రచింపఁబడుచున్నవి.) ఆ మహాకవి తరువాతి దినములలోఁ దాను రచించిన గాథలు ఎట్లు గానము చేయఁబడుచున్నవో, సామాన్య ప్రజానీకము వానినెట్లు మెచ్చుకొనుచున్నదో తెలిసికొనుటకై మిక్కిలి కుతూహలమును జూపెడివాఁడఁట. తన గాథలను వినుటకై రహస్యముగా వీథులలో సంచరించెడివాఁడఁట.[21] ఏమైనను నిట్టి ప్రసిద్ధ కవులు గాథారచన చేయుట సకృత్తుగనే యున్నది.[22]

పై యాంగ్లకవికిని మన శ్రీనాథునకును మిక్కిలి పోలికలున్నవి. శ్రీనాథుఁడుకూడఁ దాను దారిద్ర్యమున బాధపడు రోజులలోనే దేశాటనము చేసి, పల్నాటి వీరకథలను కాటమరాజు కథలను వ్రాసియుండును. (యాదవులు ఈతనికి తూమెడు వరహాల నిత్తుమని ముందు వాగ్దానము చేసి, కాటమరాజు కథలను వ్రాయించు కొనినారనియుఁ, దరువాత లోభత్వమును జూపి గొడ్డలి తూముతో వరహాల నిచ్చిరనియు, శ్రీనాథుఁడు కోపించి తాను వ్రాసిన గ్రంథమును గంగపాలొనర్చెననియు కనిగిరి సీమలో నొక ఐతిహ్యము

గలదు.) పల్నాటి వీరభూమిని స్వయముగా దర్శించి, 'చిత్తముప్పొంగి', అత్యుత్తమ గాథారచన చేసిన ప్రజాకవి శ్రీనాథుఁడు. ఈతని కవిసార్వభౌమ బిరుదము మార్గసాహిత్యమునకు మాత్రమే పరిమిత మగునది కాదు. తెలుఁగు దేశిసాహిత్యమునకును నితఁడే 'కవిసార్వభౌముఁడు'! వీరగాథలు వీథులలోఁ బాడఁబడుటను స్వయముగా వినియుండుట చేతనే క్రీడాభిరామమున వాని ప్రశంస నంత మిక్కుటముగాఁ జేయఁగలిగినాఁడు.

ఇట్లు శ్రీనాథుఁడు, గోల్డుస్మిత్తు– వీరిద్దఱే ప్రపంచమున వీరగాథారచనకుఁ గడంగిన మహాకవులు. తక్కిన లబ్ధప్రతిష్ఠు లందఱును జేరి, పదకవితలపై నొక ఱాయి విసరిన ప్రబుద్ధులే! కాఁగాఁ, ప్రాంతీయ యశస్సముపార్జకులగు పామరకవులే గాథా రచనను గొనసాగింపవలసి వచ్చినది.[23] శ్రీనాథుఁడు గోల్డుస్మిత్తుల వంటి మహాకవులు గాథారచనను చేపట్టిన దృష్టాంతములు మిక్కిలి తక్కువగ నున్నవి.[24] ఇదికూడ వీరగాథాక్షీణతకుఁ బ్రముఖ కారణమైనది.

పల్నాటి వీరకథలను శ్రీనాథుఁడే కాక మల్లయ్య, కొండయ్య యను కవులు గూడ రచించినను, శ్రీనాథుఁడు రచించిన ప్రతులకే విశేషవ్యాప్తి కలిగినది. వీనినే పండితులు సేకరించి కాపాడినారు. తక్కినవానిని పామరరచనలని ఈసడించి సంరక్షించుట మానినారు. అక్కిరాజు ఉమాకాంతంగారికి శ్రీనాథ విరచితమగు 'బాలునికథ' యే కాక, మల్లయ్య కొండయ్యలు రచించిన బాలుని కథా ప్రతులు గూడ లభించినవి. కాని వారు శ్రీనాథుని రచనను మాత్రమే ప్రకటించి తక్కిన వానిని త్రొక్కిపెట్టిరి. వాని గతియేమైనదో నేఁటికిని దెలియ వచ్చుట లేదు. ఇట్టి పండిత పక్షపాతముచేఁగూడ ననేక వీరగాథలు మటుమాయమైనవి.

ప్రకటితములగు వీరగాథలలో సహితము పండితులు మార్పులు చేర్పులు చేయుటవలనఁగూడ వీరగాథలు క్షీణించుచున్నవని చెప్పవచ్చును. వీరగాథలలోఁ దమకు నచ్చని ఘట్టములను, నీరసముగా నున్న ఘట్టములను, వీరగాథా సహజములగు పునరుక్తులను పడికట్టు పదములను ఈ పండితులు తమ ఇచ్చవచ్చిన రీతిని మార్చివేసిరి. ఈ మార్పులవలన వాని జానపదత్వము (Folk element) నశించినది. అక్కిరాజు ఉమాకాంతంగారు ప్రకటించిన 'బాలచంద్రుని యుద్ధము', వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిన 'కాటమరాజు కథ' ఇందులకు ఉదాహరణములు. ఇట్లే యాంగ్లమున 'బిషప్‌పెర్సీ' కూడఁ దాను బ్రకటించిన 'రెలిక్స్ ఆఫ్ ఏనిషెంట్ ఇంగ్లీష్ పొయిట్రీ' అను గ్రంథమునఁ బెక్కు గాథలను మార్చివైచినాఁడు. కావుననే జానపద సాహిత్య విమర్శకులు వీనిలోఁ గొన్ని గాథల ప్రామాణ్యము నంగీకరించుట లేదు.

"His texts are not strictly authentic. He added, substracted, and altered, sometimes in a minor way, sometimes beyond recognition."[25]

ఇట్లు పండితులు వీనిని ప్రౌఢరచనలుగా మార్చుటకుఁ బ్రయత్నించుటకూడ వీని క్షైణ్యమునకు హేతువులుగా భావింప వచ్చును. ఏలయన, నీ మార్పులవలన వీరగాథా పావిత్ర్యము, నిసర్గ మనోహరత్వము నశించి, కృత్రిమత్వము వృద్ధియై, స్వస్వరూపము చెడిపోవును. ఇట్లు స్వస్వరూపము చెడిపోవుటకూడ క్షైణ్యమే కదా!

ఈ విధముగాఁ బండితులయొక్కయుఁ, మహాకవుల యొక్కయు నిరాదరణమే జానపద సాహిత్యక్షీణతకు ముఖ్యకారణము లని స్పష్టముగాఁ దెలియుచున్నను, కొందఱు విమర్శకులు దీని నంగీకరించుట లేదు. రసనాగ్ర సంచారిణిగ మాత్రమే మనఁగలిగిన ఈ సాహిత్యము ముద్రించుటవలననే నశించుచున్నదని వీరి మతము. జానపద సాహిత్యమును రక్షించుటకు తద్గాయక భిక్షువులను పోషింప వలెనే కాని, వానిని ముద్రింపరాదని వీరి యభిప్రాయము.

"ప్రౌఢకవితను మఱగిన పండితులను వీని పతనమునకుఁ గారకులుగ నిందించుట విచారకము. ఇది నిర్హేతుక జాయమాన మాత్సర్యము. విద్యకు లిపిమూలమని మనవారెన్నఁడును గణింపలేదు. పౌరత్వశిక్షణమును పురాణశ్రవణమే సమకూర్చినది. ఇట్టిచో లిపి రూపము దాల్చిన పాట చచ్చినదే! దానికి జీవము శ్రవణేంద్రియమే కాని కన్ను కాదు. దానినెవరైన ముద్రించి సాహిత్యమునఁ జేర్పవలె నన్నచో నది విస్మృతి పాలగుట తప్పదు."[26]

మన యాంధ్ర విమర్శకులవలెనే కొందఱు పాశ్చాత్య విమర్శకులుకూడ నిట్టి యభిప్రాయములను వెలిబుచ్చినారు. పాడుచున్నంతకాలమే వీరగాథ జీవించుననియు, ముద్రించిన తక్షణమే అది శవసదృశ మగుననియు, కావున ముద్రణ యంత్రములు వచ్చిన తరువాతనే వీరగాథాకవిత్వము నశించినదనియు వీరి భావన.[27] మౌఖికసంప్రదాయమున వీరగాథ వివిధ రూపములను దాల్చుచుండుననియు, నదియే దాని జీవలక్షణమనియు, ముద్రించినతోడనే ఇట్టి మార్పునకవకాశము లేక వీరగాథ మరణించుననియు వీరు తలంచుచున్నారు.[28]

వీరగాథాక్షీణతకు గ్రంథముద్రణమే కారణమనుట సమంజసము కాదు. ముద్రింపఁబడినంత మాత్రమున గాథా స్వరూపము స్థిరత్వము దాల్చునని చెప్పలేము. ప్రజలనోళ్లలోఁబడి అది మాఱుచునే యుండును. ఏఁబది యేళ్లనాఁడు ముద్రింపఁబడిన బొబ్బిలి యుద్ధమే నేఁటికిని పాడఁబడుచున్నదా? లేదు. ముద్రణ ప్రతివేఱు, పామరులందు మౌఖిక ప్రసరణమున వ్యాపించియున్నది వేఱు. మౌఖిక వీరగాథ నిరంతరము మాఱుచునే యుండును. కావున గాథలను సేకరించి ముద్రించుట తప్పుకాదు కాని, ఆయా సేకరణలో కొంచెము మెలఁకువను ప్రదర్శింపవలెను, అంతే!

ప్రథమమున జానపద గేయములను వీరగాథలను సేకరించు వారు వానిలోని సాహిత్యాంశమును మాత్రమే సేకరించుచు వచ్చిరి. ఇట్లు చేసినచో ముద్రణ వ్యతిరేకులు చెప్పినట్లు వీరగాథలు నిర్జీవము

లగుట తథ్యము. జానపద కవిత్వమున సంగీత సాహిత్యములకు సమప్రాధాన్యముండును. కావునఁ గేవలము 'మాతువు' (పాటలోని సాహిత్యాంశము)ను సేకరించి, 'ధాతువు' (పాటలోని సంగీతాంశము) ను వర్జించినచో నిర్జీవములు కాక మఱేమగును? పాశ్చాత్యులు ఈ లోపమును గుర్తించి, సాహిత్యాంశముతోపాటు వానిలోని సంగీతాంశమునుగూడ సంపాదించి సంరక్షించుకొనుచున్నారు. (మనము సాహిత్యాంశమునే సరిగా సేకరింపలేకున్నాము.) అందుచే గేయములను గేయకథలను సేకరించుట తప్పుకాదు! సాహిత్యాంశమును మాత్రమే సేకరించుట తప్పు. సంగీతాంశమునుగూడఁ దప్పక సంపాదింపవలెను. లేనిచో నది సంపూర్ణ సంచయన మనిపించుకొనదు. కాఁబట్టి గాథలు ముద్రించుటవలన నశించుట లేదు; సంగీతాంశమును భద్రపఱుచుకొననందున నశించిపోవుచున్నవి. దేశికవితాక్షీణతకుఁగల ప్రబల కారణములలో దీనినొకటిగాఁ బలువురు భావించిరి. "ఈ దుస్థితికి పెక్కు కారణములు గలవు. వాటిలో ఒకటి ఆ జాతి కవిత్వము ముఖ్యముగా పాడుకొన దగినది అగుట. పదములు, పాటలు, గేయములు మొదలగు మధుర కవితలు పాడెడివారు లేనంతనే అంతరించిపోవును." వర్తమాన కాలమున దేశికవితలను పాడెడివారు తగ్గిపోవుచున్నారు. కావున వానిని సేకరించి పరిరక్షించుకొనవలసిన బాధ్యత మనపై నున్నది. కాని ఈ సంచయనమున సంగీత సాహిత్యముల రెండింటిని భద్రపఱుచుకొన వలెనన్న విషయమును మాత్రము స్వప్నమునందు సహితము మనము విస్మరింపరానిది.

ఇట్లు సంగీత సాహిత్యములను సంపాదించి భద్రపఱుచుట కన్న మన పూర్వులవలెఁ దద్దాయక భిక్షువులనే యథోచితముగాఁ బోషింపవచ్చును గదా యను ప్రశ్న ఉదయింపవచ్చును. మన పూర్వులనాఁటి సంఘము వేఱు, నేఁటి సంఘము వేఱు. నేఁడు నాగరికత బలియుచున్నది. వర్ణాశ్రమ ధర్మములు నశించుచున్నవి. ఏ కులమువారు ఆ వృత్తిని చేయుదురన్న నమ్మకము లేదు. జంగములు, బవనీలు, వీరవిద్యావంతులు, పిచ్చుగుంట్లు– ఇత్యాది నిమ్నజాతులు (గాథకులు) వారి కులవృత్తులను వర్జించి, వ్యవసాయము, వ్యాపారము మున్నగు నితర వృత్తులను జేపట్టుచున్నారు. ఇట్టి వృత్తి సాంకర్యముతో సంప్రదాయములు నశించుచున్నవి. తరతరములనుండి వచ్చుచున్న గేయములు గేయకథలు తగ్గిపోవుచున్నవి. దీనికిఁదోడు సామూహిక విద్యావ్యాప్తి (Mass Education) యు గాథాక్షీణతకుఁ గారణమగుచున్నది. ఈ విద్యావ్యాప్తిచేఁ బామరులును నాగరికులగుచున్నారు. ఇది జాతికిఁ బురోగమనమే యైనను జానపద కవితకు మాత్రము తిరోగమనము! విద్యావ్యాప్తి జానపద సాహిత్యమునకుఁ బ్రబల శత్రువని పాశ్చాత్య విమర్శకులు సహితము అంగీకరించిన విషయము.

"To this oral literature, as the French call it education is no friend. Culture destroys it, sometimes with amazing rapidity, when a nation learns to read, it begins to disregard its traditional tales, it feels a little ashamed of them; and finally it loses both the will and the power to remember and transmit them. What was once the possession of the folk as a whole, becomes the heritage of the illiterate only, and soon, unless it is gathered up by the antiquary, vanishes altogether."[30]

కాఁబట్టి ఒక జాతి నాగరికమగుటతోడనే దాని జానపద సంపద విస్మృతి పాలగును. ఒకప్పుడు మనమందఱమును కథలు, పాటలు, వీరగాథలు విని ఆనందించినవారమే. నేఁడు నాగరికులమై వానిని మఱచిపోతిమి. ఫలితముగా నవి మన నాగరిక సంఘము నుండి నిష్క్రమించి, కర్షకులు, శ్రామికులు, పశుల కాపరులు, గొల్లలు మున్నగు జానపదులలోఁ దలదాఁచుకొన్నవి.[31] ఆ వర్గములవారును మనవలెనే నాగరికులై వానిని విస్మరించు లోపలనే మనము వానిని గాపాడుకొనవలెను. లేనిచో నీ యమూల్య సంపద మనకు దక్కదు. ఇప్పటికే జానపద సంఘములు నూటికెనుబది వంతులుపైఁగా నాగరికములైనవి. ఇఁక రాఁబోవు పదిసంవత్సరములలో తెలుఁగు పల్లెపట్టులలో చలనచిత్రగీతములు తప్ప, సాంప్రదాయిక వీరగాథలు పాటలు వినఁబడవన్నచో నతిశయోక్తి కానేరదు. ఇట్టి దుర్గతి పట్టిన దేశములు కొన్ని నేఁడున్నవి. నాగరికత బలిసిన ఇంగ్లండు స్కాట్లండు దేశములిందులకు చక్కని ఉదాహరణములు. అట ప్రాచీన సంప్రదాయము భగ్నమై ఛిన్నాభిన్నమైనది; ఏ తత్ఫలితముగా గాథా కవితారవి అస్తమించినాఁడు!

"The tradition was broken, and with the break has been lost the rare gift of story-telling in vivid and often poignantly lovely verse that once characterized the country people of England and Scotland. The Scots and the English have lost the power, too, and have nearly forgotten their ballads as well, which is all very sad, even if inevitable. The sun of balladry has indeed set."[32]

దీనినిబట్టి సంఘమెల్లప్పుడును అనాగరిక పంకమునందే కూరుకొనిపోయి యుండవలెనని నా యభిప్రాయము కాదు. కాలప్రవాహ మనివార్యము. నిరంతర పురోగామియగు నాగరికతా ప్రావృట్కాల నిర్ఝరీ మహావేగమును మన మడ్డుకొనలేము. అయినను ఆ మహాప్రవాహమున వేళ్లతోఁ బెల్లగింపఁబడి కొట్టుకొనిపోవుచున్న శ్రీ చందనవృక్షజాతమునైనను సంరక్షించుకొనఁ గలము కదా!

వీరగాథలెప్పుడును ప్రజలచే సృజింపఁబడి పాడఁబడు చుండును. కాని ఆధునిక కాలమున గ్రామఫోను, రేడియోలు ప్రచారమునకు వచ్చుటచేతను, ప్రాచీన పద్ధతి బృందగానములు తగ్గిపోవుటచేతను వీరగాథలు క్షీణించుచున్నవని 'ప్రొఫెసర్ లూయిస్ పౌండ్' వంటివారు అభిప్రాయపడుచున్నారు.[33]

పరిహసించుచున్న పండితులు, విస్మరించుచున్న మహాకవులు, నిరంతరాభివృద్ధి చెందుచున్న నాగరికత– ఈ మూఁడింటితోపాటు

నేఁటి చలనచిత్రములు (దూరదర్శిని) గూడ వీరగాథల క్షీణతకుఁ గారణమని నా యభిప్రాయము. తెలుఁగులోఁ బ్రసిద్ధ సాంప్రదాయిక వీరగాథ లన్నియుఁ జలనచిత్రములుగఁ దీయఁబడినవి. అతి ప్రసిద్ధములగు కొన్ని గాథలు (పల్నాటి యుద్ధము, బాలనాగమ్మ కథ మొదలగునవి) పాతిక ముప్పది సంవత్సరముల వ్యవధిలోపుననే రెండు పర్యాయములు చిత్రీకరింపఁబడినవి. 'సినిమా' జనసామాన్యమున కంతకును నానందమును బంచియిచ్చు కళ. ఇదియొక సమాహార కళ. దీనిలో నభినయము, నృత్యము, సంగీతము, కవిత్వము, చిత్రలేఖనము, శిల్పము మున్నగు కళలన్నియును సమీకరింపఁబడినవి. ఇది జనసామాన్యమున కందుబాటులో నుండును. కావుననే నేఁడు పల్లెప్రజలుగూడఁ గాలక్షేపమునకై పట్టణముల కెగఁబ్రాకుచున్నారు. ప్రాచీన కాలములలోవలెఁ బల్లెలలో జంగముల చేతను, దాసరులచేతను గథలు చెప్పించుకొని యానందించెడివారు నేఁడు మచ్చుకైనను గానరాకున్నారు. పట్టణవాసులతోపాటు పల్లీయులును 'సినీకాలక్షేపము'నకే యువ్విళ్లూరుచున్నారు. అన్ని వర్గముల ప్రజలును కోటీశ్వరులగు చలనచిత్ర నిర్మాతలనే పోషించు చున్నారు కాని, అద్భుతగాథల నెన్నింటినో పుక్కిటపట్టి, పొట్టచేతఁ బట్టుకొని దేశములు ద్రిమ్మరుచున్న నిర్భాగ్యదామోదరులగు గాథాకారుల నెవ్వరును నాదరించుట లేదు.

ఈ చలనచిత్రములకుఁదోడు నేఁటి భారతదేశమున విశృంఖలముగా జరుగుచున్న క్రైస్తవమత ప్రబోధముకూడ మన వీరగాథలను జానపదేయములను మటుమాయముచేయు మహమ్మారియగుచున్నది. ఈ అన్యమతవ్యాప్తి యెక్కువగా నిమ్నకులములలోనే జరుగుచున్నది. ఈ నిమ్నకులములవారే మన జానపదసంపదకు రత్నభాండాగారములు. మన గాథలలోను పాటలలోను హైందవ మతముయొక్క ఆస్తికత వెల్లివిరియుచుండును. వీనిని పాడువారు విదేశమతమును స్వీకరించిన వెంటనే ఈ జానపద కవితా సంపదను తృటిలో విస్మరింపఁ బ్రయత్నింతురు.

పూర్వము పల్లెలలో జాతరలు జరుగునప్పుడును, తిరునాళ్ల సమయములందును నీ గాథాగానము విరివిగాఁ గొనసాఁగెడిది. ఈ తిరునాళ్లలో గాథాగానమున పోటీలుకూడ జరుగుచుండెడివి. స్వాతంత్ర్యానంతరము మన ప్రజాప్రభుత్వము బౌద్ధమతవ్యాప్తికిఁ గంకణము కట్టుకొన్నది. జాతరలు, కోడిపందెములు నిషేధింపఁ బడినవి. వానితోపాటు వేడుకలు, వినోదములు, నాటపాటలును సన్నగిల్లినవి.

ఇట్టి క్షీణదశలోనున్న గాథలను సేకరించి, సంగీతాంశముల తోపాటు ప్రచురింపఁ బ్రయత్నింతమన్న మఱియొక చిక్కు ఎదురగుచున్నది. ఈ గాథాకారులలో – ముఖ్యముగా జంగములలో నొక్కొక్కనికి సుమారు నలుబది యేబది కథలవఱకును వచ్చును. (ముప్పది కథలకుఁ దక్కువ వచ్చిన జంగము ఆంధ్రదేశమున నాకెచ్చటను తటస్థపడలేదు.) వీనితో నాతని జీవితము హాయిగా గడచిపోవును. అందుచే వీనినాతఁడు రహస్యముగా నుంచుకొనును. ముద్రింపఁబోవుచున్నామని తెలిసినచో నీ జంగములు ఒక్క కథను కూడ మనకుఁ జెప్పరు. ఇవి ముద్రింపఁబడినచో నందఱకును దెలిసిపోయి, తత్ఫలితముగాఁ దమవృత్తి పడిపోవునని వీరి భయము. ఈ భయము జంగములకన్న కాటమరాజుకథలు పాడెడి కొమ్ములవాండ్ర కెక్కువగా నున్నది. ఈ కొమ్ములవారి యొద్దను, సుద్దుల గొల్లల యొద్దను కాటమరాజు కథాచక్రమునకు సంబంధించిన ముప్పదిరెండు వీరగాథలు తాళపత్ర రూపమునను వాగ్రూపమునను గలవు. 'యాదవ భారతము ఎద్దుమోత ప్రమాణ'మని చెప్పుదురు. కాని వీరెవ్వరును నీ తాళపత్ర గ్రంథములను కనీసము చూచుటకైనను మనచేతికీయరు. (వీరిదగ్గఱనుండి వీరగాథలను సంపాదించుటలో నేను పడినపాట్లు ఆ భగవంతునికెఱుక!'). విదేశములలోఁ గూడ గాథాకారుల స్వభావ మిట్లేయున్నది. అచ్చట రెండు తెగల గాథకులున్నారు: "Minstrels; Ballad- singers". ఈ రెండు తెగలవారును రెండు రకముల మనస్తత్త్వములను బ్రదర్శించు చుందురు.[34] ఇందు 'మిన్‌స్ట్రల్స్' అను మొదటి వర్గమువారు మన జంగములు. వీరు మన దాసరులు, బవనీలు– మున్నగువారివలెనే దేశద్రిమ్మరులగు గాథాకారులు. వీరు తమ కథలు ముద్రించుట కేమాత్రమును అనుమతింపరు. 'బ్యాలెడ్ సింగర్స్' అను రెండవ వర్గమువారు, మన దేశమున గుజిలీప్రతులను జంకనిడుకొని, రైళ్లలోఁ దిరుగుచుఁ, గొన్ని పాటలను స్వయముగాఁ బాడుచుఁ, బుస్తకముల నమ్ముకొని పొట్టపోసికొనునట్టివారిని బోలినవారు. వీరు నిత్యమును నూతనగాథలకై యన్వేషింతురు. వీరు అమ్ముచుండెడి గుజిలీప్రతులను వేలకువేలు ముద్రించు ప్రచురణ సంస్థలు వేఱుగా నున్నవి. ఇట్టి ప్రచురణ సంస్థలవారును, ప్రచారముచేసి అమ్ము వారును క్రొత్త కథలను సంపాదించి ముద్రించుటకై యువ్విళ్లూరుచుందురు. గాయక భిక్షువులిట్లు గాక తమకు వచ్చిన మౌఖికగాథలను ముద్రించుటకు ఏ మాత్రమును అంగీకరింపక, వానిని బహిర్గతమొనర్చుట లేదు. మనదేశమున జంగముల నాల్కలపై వందలకొలఁది గాథలు తాండవ మాడుచున్నవి. ఇంతవఱకును సాహిత్యలోకమునకు సరిగాఁ దెలియని మహత్తరమైన పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు వీరవిద్యావంతుల, కొమ్ములవాండ్ర పూరిగుడిసెలలో మ్రగ్గుచు, చెదపురుగుల కాహారముగా నుపయోగపడుచున్నవి. ఇట్లు నశించుట కైనను సమ్మతించుచున్నారు కాని, అవి ముద్రింపఁబడి లోకమున వ్యాపించుటకు వారంగీకరించుట లేదు. గాయక భిక్షువుల ఇట్టి మూర్ఖతచేఁగూడ వీరగాథలు నశించుచున్నవని చెప్పవచ్చును.

ఇన్ని విధములుగా క్షీణించుచున్న దేశిసాహిత్యము నుద్ధరించుటకు ప్రభుత్వమువారు శ్రద్ధపట్టవలెను; సాహిత్య సంస్థలు నడుము కట్టవలెను; యువపరిశోధకులు ముందునకుఱకవలెను. పెద్దలు శోధించిన తిక్కన కవిత్వమునే మరల మరల శోధించుట కన్న, నిర్ణయించిన పోతన కవితారసమునే తిరిగి తిరిగి నిర్ణయించుట కన్న, నశించిపోవుచున్న జానపద సాహిత్యమును కాపాడుట మన యాంధ్రి నుపాసించు తపస్వుల తక్షణ కర్తవ్యము! ❐

## జ్ఞాపికలు

1. *పిడుపర్తి సోమనాథుని బసవపురాణము.*
2. *వేటూరివారి చాటుపద్య మణిమంజరి (ప్రథమ భాగము).*

   *'చదువని విద్వద్వర్యులు– కదనార్భక వీరభటులు కడిదిపురమునన్' – అని పాఠాంతరము గలదు.*
3. *ఆచార్య పింగళి లక్ష్మీకాంతంగారు, 'నా రేడియో ప్రసంగాలు', పుటలు 135, 136.*
4. *కుమార సంభవము (1–28).*
5. *బసవపురాణము, వేటూరి పరిష్కృతము, పుట 4.*
6. *చూ. డా॥ బి. రామరాజుగారి– తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట. ౩౮.*
7. *కిన్నెర, జనవరి, 1955 (సంక్రాంతి), పుట. 95.*
8. *Discourse of English Poetrie, 1586.*
9. *"... now ballads are abusively chanted in every street; and from London, this evil overspread Essex and the adjoining countries." - Kind Hart's Dream, 1592.*
10. *"Some drunken rhymer thinks his time well spent,*  
    *If he can live to see his name in print;*  
    *Who, when he is once fleshed to the presse,*  
    *And sees his handsell have such faire successe*  
    *Sung to the wheele and sung unto the payle,*  
    *He sends forth thraves of ballads to the scale."* -(... cited in 'Reliques of Ancient English Poetry', General Introduction, p.xxxvi).
11. *"I lothe to speak it, every red-nosed rhymester is an auther, every drunken man's dream is a book; and he whose talent of little wit is hardly worth a farthing, yet layeth about him so outrageously as if all Helicon had run through his pen. In a word, scarce a cat can look out of a gutter, but out starts a half penny chronicler, and presently a proper new ballet of a strange sight is indited."- Martin Mar-sixtus, 1592.*
12. *''Whimzies", or "a New Cast of Characters", 1631.*
13. *"......................................... I will have thee*  
    *Pictur'd as thou art now, and thy whole story*  
    *Sung to some villaionous tune in a lewd ballad,*  
    *And make thee so notorious in the world,*  
    *That boys in the street shall hoot at thee".* - Massinger, ''Parliament of Love''.
14. *"(The ballad-writers a called base rogues, and said to) 'maintatine a St.Anthonie's fire in their noses by nothing but two-penny ale."- Dekker's "Honest W.", 1604, Act. I, Sc. i.*
15. *Percy Macqueen (I.C.S.), Foreword to, 'Ballads of North Malabar', Vol. I, p.i*
16. *"The spinsters and knitters in the sum,*  
    *And the free maids that weave their thread with bones*  
    *Do use to chant it."*- Twelfth Night, Act I, Sc. 4.
17. *''Thespis, the first professor of our art-*  
    *At country wakes sung ballads from a cart" - Dryden's 'Prologue' to Lee's 'Sophonisba'.*
18. *Frank Sidgwick, 'Popular Ballads of the Olden Time', Introduction.*
19. *"In truth the contrast is unfair to them, much as any contrast between children and grown folk would be unfair. They appealed to something young in the national mind, and the young still ramp through Percy's Raliques."*

20. "... వాఙ్మయమునందలి యొక్కొక్క శాఖ యొక్కొక్క యధికారికి లోఁబడియుండును. ఏ శాఖ యే యధికారి నుద్దేశించి వ్రాయఁబడినదో యంతవఱకే దాని ప్రయోజనము. అందఱి కొఱకు ననుట యాత్మవంచన. గేయవాఙ్మయము, విని యానందింపఁగలవారికే."– గురుదేవులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారి అముద్రిత వ్యాసములు.

21. *"... he used to stroll into the street to hear his ballads sung, and to mark the degrees of applause with which they were received." -Henry B. Wheatley, Genral Introduction to Reliques of Ancient English Poetry, p. xliii.*

22. *"There are few instances of true poets writing for the streets in later times, but we have one in Oliver Goldsmith." - ibid.*

23. *''Most of the modern ballad-writers have been local in their fame."- ibid.*

24. మరాటీ సాహిత్యమున మాత్రము శిష్టకవులలో నెక్కువ భాగము వీరగాథారచనకుఁ బ్రయత్నించినట్లు తెలియుచున్నది. అగ్నిదాసు, తులసీదాసు, రాంజోషి, సంగన్ బాహు, షహీర్ ప్రభాకర్, పత్తే బాబూరావు– మున్నగు ప్రసిద్ధ కవులు ఛత్రపతి శివాజీ వీరకృత్యములను గీర్తించుచుఁ బెక్కు వీరగాథలను సృజించిరి. ఇది మెచ్చుఁదగిన విషయము.

25. *Prof. Louise Pound, The Encyclopedia Americana, Vol. III, p. 94b.*

26. గురుదేవులు శ్రీ దిగుమర్తి సీతారామస్వామిగారి అముద్రిత వ్యాసములు.

27. *"The sole or main channel for literary entertainment is the ear. The words of a ballad may be written down (as in a ballet), but only as an aid to oral delivery; when ballads are printed, the fixed text kills the traditional freedom of variation, and when they are read by the eye they become a different kind of entertainment. Thus the introduction of printing ends the period of active ballad creation in most countries." - William James Entwistle, Chamber's Encyclopaedia, Vol.II, p. 73.*

28. *"It has passed through many mouths, and has been made over countless times. But once written down it ceases; the invention of printing has spoiled the powers of man's memory."- Frank Sidgwick, Introduction to "Popular Ballads of the Olden Time."*

29. ఆచార్య పింగళిగారు, పూర్వోక్తము, పుట 136.

30. *English and Scottish Ballads by F.J. Child.*

31. *"As civilization advanced, they were banished from polite society- but they lived on among the humble, among shepherds and plough boys and 'the spinters and the knitters in the sun', until even these became too sophisticated to care for them and they were heard no more."- ibid.*

32. *Gordon Hall Gerould, 'The Making of Ballads', Modern Philology, - Volume 21, p. 27.*

33. *The Encyclopedia Americana, Vol. III, p. 94. b.*

34. *"The objects of the minstrel and the ballad-singer were essentially different: thus the minstrel's stock of ballads usually lasted him his lifetime, and as his living depended upon them, they were jealously guarded by him for others. Nothing he objected to more than to see them in print. The chief aim of the ballad-singer, on the other hand, was to sell his collection of printed broadsides, and to obtain continually a new stock, so as to excite the renewed attention of his customers." - Henry B.Wheatley, Genral Introduction to 'Reliques of Ancient English Poetry. p. xxxiii.*

# ఇరువదియైదవ ప్రకరణము

# సేకరణ - పరిరక్షణ

'**క**డుపులో చల్ల కదలకుండ', ప్రశాంత గ్రంథాలయములలో విద్యుచ్ఛాలితములగు వింజామరల క్రింద మెత్తని ప్రేముకుర్చీలలోఁ గూర్చుండి, ముత్యాల కోవలవలె ముద్రింపఁబడిన గ్రంథములనుండి విషయ సముపార్జనఁ జేయుచుఁ బరిశోధన సలుపు 'సదృష్టవంతుల' పరిశ్రమకును– దేశిసాహిత్యము నుద్ధరింపవలెనను పట్టుదలతో ధైర్యమును జిక్కఁబట్టుకొని, తినినచోటఁ దినకుండఁ, ద్రొక్కినచోటు త్రొక్కకుండ, బంధుమిత్రులు లేని, పరిచయస్థులు లేని, భోజన సదుపాయములు లేని, నాగరికతలేని తెలుఁగు పల్లెలలో, నెండనక, వాననక కాలినడకను దిరుగుచుఁ, గర్షకులనుండి, శ్రామికులనుండి, పెదవి మెదపుటకే సిగ్గుపడిపోవు పల్లెపడుచులనుండి, 'దేశద్రిమ్మరు' లగు బిచ్చగాండ్రనుండి, గ్రుడ్డివాండ్రనుండి, త్రాగుబోతులనుండి, కోలాహలముతోఁ జెవులు చిల్లులు పడిపోవు తిరునాళ్లనుండి, పూరిగుడిసెలలోఁ జెదలుపట్టిన తాళపత్రములనుండి విషయ సంగ్రహణము చేయవలసిన 'దురదృష్టవంతుల' పరిశ్రమకును నెంత వ్యత్యాసమున్నదో విజ్ఞులు మాత్రమే విలువకట్టఁగలరు.

వీరగాథాసంచయనము అష్టకష్టములతోఁగూడిన పని. దేశసంచారులగు గాయక భిక్షువుల యునికిని దెలిసికొనుట మొదటి కష్టము. వారి కొక యూరు, నొక పల్లె యుండదు. ఏ తిరునాళ్లకో, యే జాతరకో, యెక్కడనో హఠాత్తుగాఁ బ్రత్యక్షమగుదురు. ఆ సమయము వఱకును మనము కాచుకొని కూర్చుండవలెను. లేదా వారి వెనుకనే మనమును పరిభ్రమింపవలెను. ఒకవేళ, కష్టపడి వారిని గుర్తింపఁగలిగినను, మనలను జూడఁగనే వారు బిత్తరపోవుదురు. గజగజ వణఁకిపోవుదురు. కొందఱు భోరున నేడ్చివేయుదురు. మనము ప్రభుత్వమువారి పనుపున వచ్చితిమనియు, వారిని నిర్బంధించి జైలులో వేయుదుమనియు, నేవేవో యూహించుకొని వైరీతి విభావానుభావములతో మనలకు నిరుత్సాహమును గలిగింతురు. వారినెట్లు సముదాయింపవలెనో తెలియని అయోమయస్థితిలో మనముండిపోదుము. గాథాకారులిట్లుండఁగా, నా గ్రామవాసులైనను సరిగా నుందురా? వీరగాథావస్తువు లెక్కువగా హత్యలకు సంబంధించి యుండుటచే మనము ప్రభుత్వ అపరాధ పరిశోధక వర్గము (సి.ఐ.డి.) నకుఁ జెందినవారమని గ్రామవాసులును మనల ననుమానింతురు. ఇఁక గ్రామములోని 'పెత్తందార్లు'– 'ఈ అడుక్కుతినే పాటలు నీకెందు కయ్యా? పోయి సదువుకోక' అని చీవాట్లు వేయుదురు. వారికి మన ప్రవర యంతయును విప్పి చెప్పవలెను. ఎంత విపులముగాఁ జెప్పినను వారి కర్థమగున దొక్కటియే. 'ఓహో!' అదా సంగతీ, తెలిసింది, తెలిసింది!... చినీమా తీత్తారా!' అని చుట్టగట్టిగాఁ బండ్లసందున నమలి కొఱుకుచు, మనము వచ్చిన సంగతిని తేల్చివేయును. ఇట్టి పెత్తందార్ల మాటలతో పాడవలెనని భావించుచున్న గాథాకారుఁడు గూడ బెదరిపోవును. 'సినీమా పిచ్చి' ప్రతి గ్రామమందును నంటువ్యాధి వలె వ్యాపించియున్నది. ఈ కథలను వ్రాసికొని, వీనితో మనము 'సినీమా' లను దీసి, లక్షలు సంపాదింపనున్నామనియు, నట్లు చేసినచో వారి కథలను వినువారింక నెవ్వరును నుండరనియు, వారి పొట్టను గొట్టుటకే మనము బయలుదేరినామనియు భావించి, ఆ నిర్భాగ్య దామోదరులు మనకొక్క పాటయైనను వినిపింపరు. ఇట్టి మూర్ఖులను బెలిపించి, బులిపించి, భయపెట్టి, సినీమాలలోఁ జేర్చెదనని యాశపెట్టి, ఫోటోలు తీసి, పల్లెలలోని సంస్కారవంతుల సహాయ మర్థించి, ఒక్కొక్క పాటకు నైదు మొదలుకొని పదిరూపాయల వఱకును దక్షిణ చెల్లించుకొని, మెల్లగాఁ బాడించుకొనవలెను. ఈ గాథలకులలోఁ గొందఱు విపరీతమగు త్రాగుబోతులు. కాపు సారాయి పోయించినఁగాని పెదవి విప్పరు. సారాయికంపుకొట్టు నోటితో వాఁడు పాడుచుండఁగా, మన ముక్కులు బ్రద్దలగుచున్నను నోర్పు వహించి, మెల్లగా వ్రాసికొనవలెను. కాఁబట్టి వీరగాథా సంచయనమన మాటలు కావు! తెలుఁగు జానపదగేయములను సేకరించుటలో డా॥బి. రామరాజుగారు ఎన్ని యవస్థలు పడిరో వారి గ్రంథములోని 'మనవి' ని దిలకించినచోఁ దెలియఁగలదు.

ఒక్క హిందీ జానపద సాహిత్యమునే కాక, యావద్భారత జానపద సాహిత్యమును ఉద్ధరించిన మహానుభావుఁడు శ్రీ రామనరేశ్ త్రిపాఠీగారు. వీరు తమ సేకరణలో నెన్ని కష్టములకు గుఱియైనారో చూడుఁడు. త్రిపాఠిగారు "ఉత్సాహముతో పల్లె పల్లె, వాడవాడ, ప్రాంత ప్రాంతాలకూ వెళ్లి, అన్ని ప్రాంతాల గేయాలు, కథలు సేకరించారు. వరిమళ్లలో కలుపు తీయునపుడు, పండుగల్లో, పెండ్లిండ్లలో, తిరునాళ్లలో ప్రవేశించి, అదే ఉద్దేశంతో పనిగట్టుకొని కొన్ని సంవత్సరాల పాటు పర్యటించి, ఎన్నో గీతాలు కథలు సేకరించారు. ఆయా ఋతువుల్లో ఆయాపాటలు పాడడం పరిపాటి. ఈయన పొలాల్లో ఏ చెట్టో పుట్టో దగ్గిర దాగియుండి, జానపదులు పాడుకుంటూంటే వ్రాస్తూయుండేవారు. ఎన్నో కష్టనష్టాలకు గురియై తన ఆశయాన్ని సాధించారు. పొలాల్లో తిరుగునప్పుడు సి.ఐ.డి. అనుకొని ప్రజలు పరుగులెత్తేవారు. దొంగయని, దేశద్రిమ్మరియని, పిచ్చివాడని ఎన్నో అపోహలు ఆయనను గూర్చి లోకులనుకున్నారు. అవన్నీ లెక్కచేయక కార్యసాధకుడై కార్యాన్ని సాధించాడు. ఈయన

జానపద వాఙ్మయ సేకరణకు సంబంధించిన కథలు వింటూంటే ఎంతో ముచ్చటగా ఉంటాయి. ఈ రీతిగా సేకరించిన సాహిత్యాన్ని 'గ్రామగీతాలు' అనే పేరుతో రెండు పెద్ద సంపుటాల్లో ప్రచురించారు".[1]

పై వివరములనుబట్టి వీరగాథలను సేకరించుటలో నెన్నియో కష్టములకు లోనుగావలెనని తెలియుచున్నది. ఇట్లు కష్టపడి సేకరించి నంత మాత్రమునఁ జాలదు. ఈ సేకరణమున నెన్నియో మెలఁ కువలు ప్రదర్శింపవలెను. గాథలో నెన్ని నడకలున్నవో వాని నన్నింటిని గుర్తింపవలెను. వట్టి సాహిత్య సంచయనము పనికిరాదు. దానిలోని సంగీతచ్ఛాయను పట్టవలెను. వరుసకొఱకు ఆ త్రాగుబోతుయొక్క శిష్యత్వమును బొంది పదిసారులు వానితోఁ గలిసి పాడవలెను. అంతేకాక, పాశ్చాత్య విమర్శకులు వేసిన ఈ క్రింది ప్రశ్న షష్ఠకమునకు సమాధానము వచ్చునట్లు సేకరించుచుంటిమా లేదా యని ఆత్మవిమర్శనము చేసికొనవలెను. 'హెచ్.ఎం. బెల్డెన్' అను అమెరికను పండితుఁడు జానపద కవితా సంచయనకారుని ఈ క్రింది విధముగాఁ బ్రశ్నించినాడు[2] :-

1) Have you given it just as you found it- mistakes, meaningless words and all?

2) Where, when, and from whom did you get it?

3) Did you take it down from singing, or from recitation, or copy it from Ms?

4) Where, when, and under what circumstances did your informant learn it?

5) What do you know of the antecedents (racial, stock, location, etc.) of your imformant?

6) Does your informant know of the piece in print?

ఈ ప్రశ్నలు ఆఱింటికిని చక్కని సమాధానములను పొందిన తరువాతనే వీరగాథా సంచయనమునకుఁ గడంగవలెను. ప్రతి గాథకును ముందు పై ప్రశ్నలాఱింటిని మననము చేసికొని సమాధానములు వ్రాసికొనవలెను.

ఇంతటి కష్టతమమైనను వీరగాథాసంచయనమును వర్జింప రాదు. ప్రభుత్వము, సాహిత్యసంస్థలు, పరిశోధకులు వీనిని పరిరక్షించుటకు బద్ధకంకణులు కావలెను. విదేశములలో వీరగాథా సంచయనము శతాబ్దముల తరబడి జరుగుచున్నది. ఇందులకై "Ballad Societies" అను ప్రత్యేక సంఘములు స్థాపింపఁబడినవి. 17వ శతాబ్ది ప్రథమ భాగముననే Shirburn, Percy అను వారు ఆంగ్లవీరగాథలను సేకరించిరి. కాని విద్వాంసుల సంచయన పరిష్కరణములు మాత్రము 18వ శతాబ్దమునఁ బ్రారంభమైనవని చెప్పవలెను. 19వ శతాబ్ది మధ్యభాగమున వీరగాథల స్వరప్రాధాన్యము గుర్తింపఁబడినది. క్రీ.శ. 1840 నుండి వీరగాథలు స్వరసహితములు గనే సేకరింపఁబడుచున్నవి. ఏమైనను సాంస్కృతికాభివృద్ధి అతివేగముగ జరిగెడి దేశములలో నీ గాథాసంచయనము చాల నాలస్యముగ జరిగినదని చెప్పవలెను. ఈ యాలస్యమునకుఁదోడు ఇందలి ప్రథమ సంచయనకారులకు ఈ గాథలపై 'సవతితల్లి ప్రేమ' యుండుట మఱియు విచారకరము. సంచయనమునందలి జాప్యమువలననే యెన్నియో గాథలు నశించిపోయినవి. సవతితల్లి ప్రేమతో సేకరింపఁబడిన గాథలలో వీరగాథాతత్త్వము, శక్తి, ధారాశుద్ధి నశించి, 'ఇవి వీరగాథలేనా?' అని యనుమానము కలుగును. (తెలుఁగులో నింతవఱకును బ్రకటింపఁబడిన పండిత పరిష్కృతములగు పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు నిట్లు పసచెడిన వీరగాథలే!). కాని, మౌఖిక ప్రచారము త్వరత్వరగా నశించు దేశములందు ఈ వీరగాథా సంచయనమువలన నొక మంచిపని జరిగినది. కొందఱు ఆధునిక కవులు ఈ వీరగాథలలోని జీవశక్తి నాకళింపు చేసికొని, వీని ననుకరించి కృతకృత్యులైనారు. ఇంగ్లండు జర్మను దేశములలోని కాల్పనికోద్యమ (Romantic Movement) కవులందఱును వీరగాథలచేఁ బ్రభావితులైనవారే!

భారతదేశమున అన్ని ప్రాంతముల జానపద సాహిత్య సంపదను సేకరించిన ఉత్తమ పరిశోధకుఁడు రామనరేశ్ త్రిపాఠి గారు. 'గ్రామగీతము'లను పేరుతో నీయన ప్రచురించిన రెండు సంపుటములు (చూ. 'కవితాకౌముది'- 5, 6 సంపుటములు) భారత జానపద గేయములే. ఇందు మొదటి సంపుటమున జానపద సాహిత్య జన్మవృత్తాంతము, పరిచయము 138 పుటలలో మనోరంజకముగాఁ దెలియఁజేసినారు. తరువాత 'వివాహ గీతములు, ఉపనయన గీతములు, శ్రావణ గీతములు, ఉయ్యాల పాటలు, గానుగ పాటలు, తిరునాళ్ల పాటలు, పన్నెండు మాసముల పాటలు' అను రకరకముల పేర్లతో నెన్నియో గీతములు 500 పుటలలోఁ బ్రచురించినారు. ఇఁక గ్రామగీతములు రెండవ సంపుటములో 'ఆల్హా, జోలపాటలు, గీతకథలు, కాశ్మీరు గీతములు, పంజాబు గీతములు, మార్వాడీ గీతములు, తెలుఁగు గీతములు, మేవార్ గీతములు, సింధీ గీతములు, మరాఠీ గీతములు, గుజరాతీ గీతములు, బెంగాలీ, అస్సామీ, మైథిలీ, నేపాలీ, ఆల్‌మోడా, గఢ్వాల్, ఘూఫ్ గీతముల పేర్లతో భారతదేశములోని సమస్త ప్రదేశముల గీతములు ప్రచురింపఁడినవి. వీనితోపాటు సామెతలు, పొడుపు కథలు, నింకను అనేక విధముల రచనలు ఏర్చి కూర్చి ఈ సంపుటిలో పొందుపఱిచినారు.

రామనరేశ్ త్రిపాఠీగారి తరువాత నీ జానపద క్షేత్రమున విశేషముగాఁ గృషి సల్పినవారు ఆచార్య దేవేంద్ర సత్యార్థిగారు. ఈయన పంజాబునుండి అస్సాము వఱకును, కాశినుండి కన్యాకుమారి వఱకును బర్యటించి, యెన్నియో వేల గీతములను సంగ్రహించినారు. పర్వతములు, నదులు, అడవులు, వేయేల? సమస్త ప్రదేశములలోను కాలినడకను పర్యటించి సేకరించినారు. ఈయన చేసిన జానపద సాహిత్యసేవనుగూర్చి విననివారుండరు. రవీంద్రనాథ్ టాగూర్, మహాత్మాగాంధీలు కూడ నీ సత్యార్థిగారి కృషిని మిక్కిలిగఁ బ్రశంసించి ప్రోత్సహించిరి. సత్యార్థిగారు ప్రచురించిన గ్రంథములలో

జాతి ప్రతిబింబములైన ఆచారములకు సంబంధించిన సమస్త గీతములును గలవు. గీతముల సంచయనోద్యమము సత్యార్థిగారి ద్వారా మఱింత విజృంభించిది. అప్పుడప్పుడీయన 'విశాల భారత్' 'మోడరన్ రివ్యూ' అను పత్రికలలో ననేక వ్యాసములను బ్రచురించిరి. అమెరికా పత్రిక 'ఏసియా'లోఁగూడ వీరు పఠాను జానపద గీతములనుగూర్చి యెన్నియో వ్యాసములు ప్రచురించిరి. తన జీవితమంతయు జానపదవాఙ్మయ సంచయన ప్రచారములలోనే గడపఁదలఁచుకొనిన వ్యక్తి శ్రీ సత్యార్థిగారు. ఈయనను 'జానపద వాఙ్మయాచార్య' అనినచో నత్యుక్తి కానేరదు.[3] సత్యార్థిగారు తాము సేకరించిన వేలకొలఁది గీతములను, కథలను, సామెతలను, నవకాశము లభించినప్పుడెల్ల పఠితృలోకమునకు అందఁ జేయుచున్నారు. వీరు వెలువరించిన కొన్ని ప్రసిద్ధ జానపదసాహిత్య గ్రంథములు: 'గిద్ధా (1936), దీవా బాలే సారీ ఖాత్ (1941), మైహుం భానా బదోశ్ (1941), గాయేజా హిందూస్థాన్ (1946), Meet My People (1946), ధరతీ గాతీ హై (1948), ధీరే బహో గంగా(1948), బేలాపూలే ఆధీరాత్ (1948)" మొదలగునవి. వీరు ప్రస్తుతము 'ఆజ్ కల్' అను హిందీ మాసపత్రికకుఁ బ్రధాన సంపాదకులుగాఁ బనిచేయుచున్నారు. ఈ పత్రికలో విభిన్న జానపద గీతములు, కథలు ప్రచురించుచున్నారు. 1954 మే నెలలో జానపదకథల ప్రత్యేక సంచికను వెలువరించి, అందు మన దేశమున ప్రధానమైన పదునాల్గు భాషల కథలనేకాక, ఫ్రెంచి, జర్మన్, రష్యా జానపద కథలనుగూడఁ బ్రచురించి, సమస్త దేశపుఁ బ్రజల మన్ననలను పొందినారు.

"నవభారత్ టైమ్స్, ధర్మయుగ, అజంతా, ప్రవాహ్" మున్నగు పత్రికలుగూడ జానపద సాహిత్యమునకు సంబంధించిన రచనలు ప్రచురించుచు హిందీ జానపద సాహిత్యాభివృద్ధికి విశేషముగాఁ దోడ్పడుచున్నవి. శ్రీ సంతరామ్, రిచర్డ్ సి.టెంపుల్ మున్నగువారు పంజాబీ జానపద గేయములను సేకరించి ప్రకటించుచున్నారు.

ఆంధ్రదేశమున మొట్టమొదట 'జానపదగేయముల'ను సేకరించిన మహనీయుఁడు జె.ఎ.బోయల్ (1874 ప్రాంతము) దొరగారని డా॥ బి. రామరాజుగారు అభిప్రాయపడినారు. ('జానపద గేయము' లనఁగా రామరాజుగారి మతమున నొక్క 'ఫోక్‌సాంగ్స్' మాత్రమే కావు. బ్యాలెడ్స్, స్త్రీలపాటలు, రామదాసు భజనకీర్తనలు మున్నగు నవన్నియును జానపద గేయములే.) రామరాజుగారి 'జానపదగేయ' శబ్దప్రయోగమునుబట్టి యిది సరికాదని చెప్పవలసి యున్నది. వీరి జానపదగేయ శబ్దమున వీరగాథలుకూడ గతార్థములగుచున్నవి కావున, రాజుగారి అభిప్రాయమున వీరగాథలు సేకరించిన మొదటి వ్యక్తి బోయల్‌దొర యని యర్థము. ఇది సరికాదు. ఆంధ్ర సాహిత్యమున వీరగాథలను సేకరించిన ప్రప్రథమ భాషోద్ధారకుఁడు సి.పి.బ్రౌనుదొరగారు (1842). డా॥ బి. రామరాజుగారు ఈ ప్రథమ తాంబూలమును బోయల్‌దొరగారి కిచ్చుట సమంజసముగా లేదు. రామరాజుగారు బోయల్‌దొరను గూర్చి వ్రాయుచు, నీ పాశ్చాత్య పండితుఁడు తొలిసారిగా జానపదగేయముల సేకరించుటకు బద్ధకంకణుఁడయ్యెననియు, శిష్టసాహిత్యమునకు బ్రౌనుదొరవలె జానపద గేయముల కీయన మాననీయుఁడనియు, నీ బోయల్‌దొరగారే జానపదగేయ ప్రథమోద్ధారకుఁడనియు రామరాజుగారు భావించుట యుక్తముగ లేదు.[4] అంతేకాక రామరాజుగారు తమ గ్రంథమున సి.పి.బ్రౌనుదొరనుగూర్చి వ్రాయుచు "శిష్టసాహిత్యోద్ధరణ సమయమున నాతనికన్ను జానపద గేయములపైఁగూడ పడినది కాని యాతడు శ్రద్ధచేయలేదు... ఆయనయే సేకరణకు పూనుకొన్నచో శిష్టసాహిత్యమెంత సమృద్ధిగా మనకు సంక్రమించినదో అంతియ జానపదగేయ సంపదకు మనము నోచుకొనియుందుము. ఆయన చేసిన సేవ వేరు."[5] అనుటకూడ సమంజసము కాదు. శిష్టసాహిత్యము నుద్ధరించినట్లే బ్రౌనుదొరగారు జానపద సాహిత్యోద్ధరణముఁగూడఁ గావించినాఁడు. 'దేశద్రిమ్మరి' యగు నొక జంగమును నెలరోజులపాటు తనయొద్ద నుంచుకొని, ఆతనికి వచ్చిన వీరగాథలన్నింటిని బాడించి వ్రాయించిన మహనీయుఁడు బ్రౌనుదొరగారు. తత్ఫలితములే 'బొబ్బిలి కథ, కామమ్మ కథ, కొమార రాముని కథ' అను ప్రసిద్ధ వీరగాథలు. ఈ విషయమును బొబ్బిలికథ వ్రాఁతప్రతిలో ముఖపత్రమున దొరగారే స్వహస్తములతో నిట్లు లిఖించియున్నారు:

"The following three tales, viz., Bobbili Catha, Comra Ramudi Catha, Camamma Catha, are popular Ballads or Histories, which are usually prescribed by oral recitation alone: but meeting with one of the wandering minstrels who subsist by these recitations. I employed him for about a month to recite all the Ballads he knew and these were written down to his dictation."[6]

ఇట్లే బ్రౌనుదొరగారు ఒక పల్లెకాఁపునుండి 'బాలవిక్రమార్కుని పెండ్లి కథ'నుగూడ సేకరించినారు: (చూ. డి.నెం. 2549, కాగితపుఁ బ్రతి). మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమునఁ బల్నాటివీర చరిత్రకు సంబంధించి 53 ప్రతులున్నవి. ఇవియన్నియును బ్రౌనుదొర గారి సేకరణయే యనుట మఱువరాదు. పల్నాటి వీరకథలను మొట్ట మొదట సేకరించిన ఘనతయు దొరగారిదే. వీరి సంచయనమే లేనిచో నేఁడు పల్నాటి వీరకథలు ఆంధ్రులకుఁ దక్కెడివికావు. 'ఏమున్నది గర్వకారణ' మను ప్రశ్న కాంధ్రులు నిరుత్తరులయ్యెడివారు. దొరగారు కాటమరాజుకథలనుగూడఁ గొన్నిటిని సేకరించి పదిలపఱిచిరి. కాఁబట్టి తెలుఁగులోఁ బ్రథమ వీరగాథోద్ధారకుఁడు (రామరాజుగారి ప్రకారము 'జానపద గేయోద్ధారకుఁడు') సి.సి.బ్రౌనుదొరగారే కాని, బోయల్‌దొరగారు కాదు. కేవలము జానపద గేయముల (Folk Songs)ను సేకరించిన వారిలో మాత్రము జె.యె.బోయల్‌దొరగారే ప్రథములు. ఈ బోయల్ దొరగారు క్రీ.శ. 1874లో రాయలసీమలో నుద్యోగిగా నున్నప్పుడు

సర్వాయిపాపఁడు వీరగాథను, మఱియైదు కపిలపాటలను సేకరించిరి. ఇందు 'కపిలపాట'లను జానపద గేయములను సేకరించుటచేత నీ బోయల్‌దొరగారికిఁ బ్రథమ జానపదగేయోద్ధారక బిరుదము దక్కినది కాని, సర్వాయి పాపఁడు వీరగాథను సేకరించుటవలనఁ గాదు. వీరగాథల నంతకుముందే, క్రీ.శ. 1842 ప్రాంతముననే, సి.పి.బ్రౌనుదొరగారు సంపాదించి యున్నారు. కాఁగా తెలుఁగు దేశిసాహిత్యమున 'ఫోక్‌సాంగ్స్'ను సేకరించిన మొదటి వ్యక్తి జె.యె.బోయల్ (1874); 'బ్యాలెడ్స్'ను సేకరించిన మొదటి వ్యక్తి సి.పి.బ్రౌను (1842). [నా మతమున 'ఫోక్‌సాంగ్'– (జానపద గేయము) వేఱు, 'బ్యాలెడ్'– (వీరగాథ) వేఱు. రామరాజుగారి మతమున రెండును నొక్కటే. రెండింటిని గలిపి వారు 'జానపదగేయ' శబ్దముతోనే సంభావించిరి. అందుచేతనే వారి వాక్యములను పూర్వపక్షము చేయవలసివచ్చినది. వీరగాథలనుగూడ జానపదగేయ శబ్దముతో సంభావించినప్పుడు సహితము ప్రథమ తాంబూలము బోయల్‌దొరకు దక్కదు. వీరగాథలే జానపద గేయములగుచో నట్టి 'జానపదగేయము'లను సంపాదించిన మొదటి వ్యక్తి బ్రౌనుదొరే!]. డా॥ దివాకర్ల వేంకటావధానిగారు మాత్రము బ్రౌనుదొరగారినే ప్రప్రథమ జానపదగేయవాఙ్మయోద్ధారకునిగాఁ గీర్తించియున్నారు: "తొలుత నీ జానపద గేయవాఙ్మయమునుగూర్చి లోకమునకు పరిచయము కలిగించినవారు బ్రౌనుదొరగారు. తరువాత జె.ఏ. బోయల్‌దొరగారు కొన్ని జానపదగేయములను సేకరించిరి."[7]

బ్రౌనుదొరగారి తరువాత, బోయల్ దొరగారు వచ్చు లోపల, క్రీ.శ.1871లో 'ఛార్లెస్ ఇ. గోవర్' అను నాంగ్లేయుఁడు 'ఫోక్‌సాంగ్స్ ఆఫ్ సదరన్ ఇండియా' అను గ్రంథమును బ్రకటించెను. ఇందుఁ దెలుఁగు వీరగాథలు గాని, వీరగాథానికలు గాని లేకపోవుట యటులుండ, జానపదగేయములలో నొక్కటి కూడ లేకపోవుట శోచనీయము. ఈ విదేశీయుఁడు మన వేమన పద్యములను జానపద గేయములుగా భ్రమించినాఁడు. కాఁగా, వీరగాథా సంచయనమున ద్వితీయస్థానము జె.ఎ.బోయల్ దొరగారిది. ఈయన క్రీ.శ. 1874లో రాయలసీమలో బళ్లారి వాస్తవ్యుఁడగు నొక బోయవాఁడు పాడఁగా 'సర్వాయి పాపఁడు కథ'ను సంపాదించెను. (ఇతఁడొక రాయలసీమ రైతునుండి కపిలపాటలనుగూడ సేకరించెను గాని, అవి కథారహితములగు శద్ధ జానపద గేయములగుటచే నా ప్రమేయము లోనికి రావు.)

పందొమ్మిదవ శతాబ్దపు టుత్తరార్ధమున మఱికొన్ని వీరగాథలు సేకరింపఁబడుటయే కాక ముద్రింపఁబడినవి కూడ. పౌరాణిక వీరగాథలలో నల హరిశ్చంద్రుల కథలకును, అస్పష్ట చారిత్రకములలో సారంగధర కథకును బ్రాచీనకాలమునుండియు విశేష ప్రచార మున్నది. కావున నీ కథలే ప్రప్రథమమున ముద్రణభాగ్యము నందినవి. కోదండరామయ్య విరచిత 'నలచరిత్ర' క్రీ.శ. 1869లోను, సంపత్తు దాస విరచిత 'సారంగధర చరిత్ర ' క్రీ.శ. 1870లోను ముద్రింపఁబడినవి. టి. కృష్ణదాసు 'భద్రాచల రామదాసు చరిత్ర' (1873)– రత్నకవి 'సుగ్రీవ విజయము' (1873)– చిదంబరకవి 'అంగద రాయబారము' (1874)– అప్పయ్య మంత్రి 'చెంచిత కథ' (1874)– పి. రామదాసు 'శారద రామాయణము' (1876)– కే. అనంతాచార్యుని 'కుశలవ కథ' (1880)– కె.యన్. రాజమణిశెట్టి 'భల్లాణరాజు చరిత్రము' (1890)– అజ్ఞాతకర్తృకమగు 'బొబ్బిలిరాజు జంగంకథ' (1890)– రామచంద్రరాజు 'కుసలాయకము' (1894)– ఈపూరి నారాయణరాజు ధర్మాంగద చరిత్ర (1895)– టి. సీతారామయ్య 'శశిరేఖా పరిణయము' (1896)– పూడిపెద్ది బుచ్చన్నపంతులు 'లక్ష్మణ మూర్ఛ' (1896)– కె. చెంగల్వరాజు కొమార రాముని కథ (1896)– 'లంకా యాగము' పదము (1897)– సి.చెంగల్వరాజు 'కాంభోజరాజు కథ' (1897)– కె. చెంగల్వ రాజు 'సర్వాయి పాపడు కథ' (1897)– గోవుపాట (1898)– నిరిగంటి వీరయ్య 'పెద్దబొబ్బిలి మహారాజు కథ' (1898)– వి. కన్నయ్యదాసు 'నూతన బొబ్బిలిరాజుకథ జంగంకథ' (1899)– ఇవన్నియును 20వ శతాబ్ది ఉత్తరార్ధము (1850–1900)లో నాయా సంవత్సరములలో ముద్రింపఁబడి ప్రచారమందిన ఇతర వీరగాథలు.[8] కాని పైన తెలుపఁబడిన నాయా రచయితలందఱును నిజమగు రచయితలు కారు. కొందఱు సంచయన కర్తలు, మఱికొందఱు గాథాకారులు, నింక కొందఱు గ్రంథప్రకాశకులు. నిజమగు కవులిద్దఱు ముగ్గురుండవచ్చునేమో. క్రీ.శ. 1842 నాఁటికే మౌఖిక ప్రసరణమున నున్న కొమార రాముని కథను బ్రౌనుదొరగారు సేకరించియుండఁగాఁ, దిరిగి 1896లో 'కె.చెంగల్వరాజు' దానినెట్లు సృజించియుండును? అట్లే 1874లో బోయల్‌దొరగారు సేకరించిన, మౌఖిక సంప్రదాయమున నున్న, సర్వాయి పాపని కథకు 1897లో కె. చెంగల్వరాజు ఎట్లు కర్తయగును? కావున వీరగాథల కర్తృత్వమును అంత సులభముగా నమ్ముటకు వీలులేదు.

ఇరువదియవ శతాబ్ది ప్రారంభమునుండి ఈ గాథలు వందల కొలఁది ముద్రింపఁబడుచు వచ్చినవి. ఈ గుజిలీ ప్రతులను ఇంగ్లండు దేశములోని 'బ్రాడ్‌సైడ్ బ్యాలెడ్స్' తోఁ బోల్పవచ్చును. కాని ఈ గుజిలీ ప్రతులన్నియును తప్పుల కుప్పలు. తెలుఁగులో వీరగాథల పండిత సంచయనము, విద్వత్పరిష్కరణము అక్కిరాజు ఉమాకాంతము గారితోఁ బ్రారంభమైనదని చెప్పవచ్చును. వీరు పల్నాటిసీమ (గుత్తికొండ) వారగుటచేఁ జిన్నతనమునుండియు వీరగాథలను విని విని, ఉత్సాహోద్రేకములు జనించి, వీరగాథలయెడ శ్రద్ధవహించి, పల్నాటి వీరకథలనెన్నింటినో సేకరించిరి. కాని యందు శ్రీనాథ విరచితమగు నొక్క బాలచంద్రుని యుద్ధమును మాత్రము ప్రకటించి యూరికొనిరి (1910). తక్కిన కొన్ని కథలను వచనరూపమునఁ బ్రకటించిరి. కాని వీరి ఛాందసము వీరగాథయందలి భాషనే కాక, వ్యక్తుల నామములను సహితము 'సంస్కరింపఁ' జేసినది. (ఉదాహరణమునకు 'బోగం సబ్బాయి' అను చక్కని తెనుఁగు మాటను వీరు భరింపలేక 'వేశ్య శ్యామాంగి'గా మార్చివైచినారు.)

20వ శతాబ్ది పూర్వార్ధమున, గాథాకారులు పాడుచుండఁగా యథాతథముగా వ్రాసికొనుట యను ప్రశస్త పద్ధతిలో వీరగాథలను సేకరించిన మహానుభావులు వేటూరి ప్రభాకరశాస్త్రిగారు. ఈ విద్వాంసునకు శ్రీనాథునివలె దేశికవితలపై నత్యంత ప్రీతియుండుట ఆంధ్రుల యదృష్టము. దేశము నలుమూలలనుండియు, ముఖ్యముగా గుంటూరు మండలమునుండి పల్నాటి వీరకథలను బాడు గాథాకారులను రావించి, గాథలనన్నింటిని బాడించి, వారు పాడు చుండఁగా యథాతథముగా వ్రాసి, పల్నాటి వీరగాథా చక్రమంతటిని శాస్త్రిగారు సిద్ధముచేసిరని తెలియుచున్నది. ఈ సేకరణలో వీరికి కృష్ణామండలములోని ముక్త్యాల జమీందారుగారు విశేషముగాఁ దోడ్పడిరి. రాజావారు ప్రత్యేకముగా మనుష్యులను బంపి, ఆ గాయక భిక్షువులను వెదకించి, వారిని లారీలలో ముక్త్యాలకు రప్పించి, భోజన సదుపాయాములన్నియు నేర్పాటు చేయించి, పాటలు పాడిన వారిని నూత్నవస్త్రములతో సత్కరించి పంపించిరఁట! (నేఁటి ప్రభుత్వము ఈ రాజావారిని జూచి యైనను నుద్బోధముఁ బడయును గాక!). శాస్త్రిగారీ విధముగా సంపాదించిన అమూల్య వీరగాథాసంపద ఇంతవఱకును వెలుఁగును జూడకపోవుట ఆంధ్రుల దురదృష్టములలో నొకటి. (ఇవి నేఁడు శాస్త్రిగారి తనూభవులగు ఆనందమూర్తిగారికడ నున్నవి.) ప్రభాకరశాస్త్రిగారు పల్నాటి వీరకథలనే కాక, కాటమరాజుకథలను గూడ విరివిగా సేకరించియున్నారు. అందు మూఁడు కథలను మల్లంపల్లి సోమశేఖరశర్మగారు మదరాసు ప్రభుత్వము తరపున బ్రకటించిరి (1952). వేటూరి ఆనందమూర్తి గారు మఱియొక కథను (అగుమంచి కథను) పరిశోధన 5, 6, 7 సంచికలలోఁ బ్రకటించి యున్నారు. తక్కినవన్నియును నజ్ఞాతముగనే పడియున్నవి.

రాజమహేంద్రవర వాస్తవ్యులు, నిరాడంబరులు, విశ్రాంతిఁ గొన్న ప్రాథమికోపాధ్యాయులు, జానపద గేయోద్ధారకులు నగు శ్రీ నేదునూరి గంగాధరంగారు పల్లెపాటలను, స్త్రీలపాటలను ఎక్కువగా సేకరించిరి కాని వీరగాథల నంతగాఁ బట్టించుకొనినట్లు లేదు. వీరు వందలకొలఁది జానపదగేయములను సేకరించిన విషయము సత్యమే యైనను వానిలో వీరగాథలనఁదగిన గేయకథలు మిక్కిలి తక్కువ.

వృత్తిచే శాస్త్రజ్ఞులైనను ఆధునికాంధ్ర సాహిత్యమున నిశిత విమర్శను వెలయించిన సూక్ష్మపరిశీలకులు శ్రీ శ్రీపాద గోపాలకృష్ణ మూర్తిగారు. వీరు మన దేశిసారస్వత విభూతిని విశ్వరూపముగఁ బ్రదర్శించి పండితుల కన్నులకు మిఱుమిట్లు గొల్పిన ప్రజ్ఞామూర్తి! వీరి యుత్తేజకర వ్యాసములు దేశిసాహిత్య పరిశోధకులకు నొజ్జబంతులుగా, కరదీపికలుగా, దిక్సూచులుగా నుపయోగించు చున్నవి. ఎన్నియో పల్లెపాటలను స్త్రీలపాటలను వీరు సేకరించి పదిలపఱిచిరి. ఆంధ్రసారస్వత పరిషత్తువారు వీరి సంపాదకత్వమున 'పల్లెపదాలు', 'స్త్రీల రామాయణపు పాటలు', 'స్త్రీల పౌరాణికపు పాటలు' ముద్రించియున్నారు. 'వీరగాథలు' కూడ ముద్రింప సంకల్పించినారు కాని యా సంకల్పము నెఱవేఱలేదు.

'కిన్నెర' సంపాదకులు శ్రీ పందిరి మల్లికార్జునరావుగారు 19, 20 శతాబ్దములలో ముద్రితములైన వీరగాథలను ఇతర దేశిప్రక్రియలను ఇరువది తొమ్మిది సంపుటములుగా 'బైండు' చేయించి తమ గ్రంథాలయములోఁ బదిలపఱుచుకొన్నారు. ఇవి దేశిసాహిత్య ప్రియులకు తేటనీటి చెలమలు.

శ్రీ టేకుమళ్ల కామేవ్వరరావుగారు వీరగాథలపై గృహలక్ష్మి పత్రికలో ఎన్నియో అమూల్య వ్యాసములను ప్రచురించినారు. 1953లో శ్రీ హరి ఆదిశేషువుగారు రచించిన 'జానపద గేయవాఙ్మయ పరిచయము' దేశిసాహిత్యముపై వచ్చిన మొదటి విమర్శక గ్రంథము. ఈ సంవత్సరములోనే గురువర్యులు శ్రీ తిమ్మావజ్ఝుల కోదండ రామయ్యగారు కాటమరాజు కథాచక్రముపై సుదీర్ఘ వ్యాసమును బ్రకటించిరి. కాటమరాజు యుద్ధకాలమునుగూర్చియు వీరు భారతి పత్రికలోఁ జర్చించిరి. ఆరుద్రగారుకూడ అగుమంచి పాత్రపై నొక వ్యాసమును ప్రచురించిరి. వేటూరి ఆనందమూర్తిగారు అగుమంచి కథను పరిష్కరించి 'పరిశోధన' పత్రికలోఁ బ్రకటించిరి.

డా॥ బిరుదురాజు రామరాజుగారు జానపద గేయసాహిత్యము పై బృహద్గ్రంథమును వెలువరించుటయే కాక, తెలంగాణమండలి ప్రశస్త వీరగాథలనెన్నింటినో సంపాదించియున్నారు. వీరి పరిశోధక గ్రంథమగు 'తెలుఁగు జానపదగేయ సాహిత్యము'లో నొక్కొక్క అధ్యాయముపై నొక్కొక్క పరిశోధకుఁడు ముందున కేఁగవచ్చును. డా॥ తూమాటి దొణప్పగారు రాయలసీమ జానపద గేయములపైఁ బ్రశస్తమగు కృషిని సల్పియున్నారు.

1961లో విశాలాంధ్ర ప్రచురణాలయమువారు ఆచార్య పింగళి లక్ష్మీకాంతముగారి సంపాదకత్వమున 'పల్నాటి వీరచరిత్ర'ను బ్రకటించిరి. ఇది పైకి సమగ్రముగాఁ గన్పించినను, మిక్కిలి అసమగ్రమగు గ్రంథమని వీరగాథా పరిజ్ఞాన మేమాత్రము గలవా రైనను నిర్ణయింపఁగలరు. దీనిలో 'కల్లుప్రతిష్ఠ, బాలచంద్రుని యుద్ధము' అను రెండు వీరగాథలు తప్ప తక్కినవన్నియును మిక్కిలిగా కుదించఁబడిన మరుగుజ్జుకథలే కాని, సమగ్ర సాంప్ర దాయిక వీరగాథలు కావు. వీరగాథలలో సర్వసాధారణమగు జానపదత్వము, శక్తి, ధారాశుద్ధి, వివరణ, అపూర్వ కల్పనలు, పడికట్టు పదములు, అభివర్ధిత పునరుక్తులు మున్నగు ముఖ్యలక్షణములు ఈ కథలలో పూజ్యము. మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారము నందలి కథలకును పింగళివారి కథలకును ఏ మాత్రమును పోలిక లేదు. ఉన్నవ లక్ష్మీనారాయణగారు పింగళివారి కొసంగిన ఒక అతి సంక్షిప్త ప్రతినుండి ఈ కథలు ముద్రింపఁబడినవని తెలియుచున్నది. అందుచేఁ బ్రజలలో వ్యాప్తియందున్న కథలకును వీనికిని సంబంధము లేకుండఁబోయినది.

1967లో ఆంధ్ర యాదవసంఘ ప్రధాన కార్యదర్శి శ్రీ ఆరాధ్యుల పిచ్చయ్యగారు 'వలురాజు చరిత్ర' యను వీరగాథను బ్రకటించిరి. ఇది కాటమరాజు కథాచక్రమున మొట్టమొదటి వీరగాథ. 'బల్లికురువ యుద్ధము' అను మఱియొక వీరగాథనుగూడ పిచ్చయ్య గారు ప్రకటించిరి. ఈ సంవత్సరములోనే ఆంధ్రప్రదేశ్ సాహిత్య అకాడమీవారు డా॥ బి. రామరాజుగారి సంపాదకత్వమునఁ దెలుఁగు వీరగాథలను బ్రచురింప నిశ్చయించిరి. ఇది దేశికి శుభసూచకము.

స్వాతంత్ర్య సిద్ధ్యనంతరము మన భారత ప్రభుత్వము బౌద్ధమత వ్యాప్తికి నడుము కట్టినది. ఫలితముగా జాతి నిర్వీర్యమైనది. తన వీరులను వీరగాథలను విస్మరించినది. 1962లో జరిగిన చైనా దురాక్రమణముతో మరలఁగొంచెము మేల్కొన్నది. వీరుల చరిత్రలతో బుఱ్ఱకథా ప్రబోధము ప్రారంభించినది.

నేఁడు తెలుఁగు సాహిత్య ప్రవంతి సాంఘిక నవలల 'సైదు కాల్వల' లోఁ బ్రవహించుచున్నది! అయినను గొన్ని వీరగాథలు బుఱ్ఱకథా రూపమునఁ బ్రబలుచుండుట ముదావహము. కోకొల్లలుగాఁ బుట్టుచున్న నేఁటి బుఱ్ఱకథలు రూపము మార్చుకొన్న వీరగాథలే యగుటవలన గాథాలోలురకుఁ గొంత యుపశమనము కలుగుచున్నది.

'రేడియో' శాఖవారు జానపదగేయములతోపాటు వీరగాథల కును గొంత ప్రోత్సాహమిచ్చుట మెచ్చఁదగిన విషయము. కాని వీరెక్కువగా వీరగాథానుకరణములైన బుఱ్ఱకథలనే ప్రచారము చేయు చున్నారు కాని, సాంప్రదాయిక వీరగాథలనుగూర్చి అంతగాఁ బట్టించుకొనుటలేదు. ఒక్కొక్కప్పుడు ఒకటి రెండు సాంప్రదాయిక వీరగాథలను ముద్రిత గ్రంథములనుండి గ్రహించియు, వానిని నిలయ గాయకులచేఁ బాడించుచున్నారు కాని, ఆయా గాథారులచేఁ బాడించుట లేదు. సాంప్రదాయిక వీరగాథలను గానము చేసెడి వివిధ గాథాకారులను రప్పించి, వారిచే నన్నిరకముల వీరగాథలను బాడించి, ఆయా వరుసలను 'రికార్డు' చేసి భద్రపఱుచుట భావితరములకు మహోపకారము సేయుట!

ఈ మహోత్తమ జానపద సాహిత్య సంపదను సంరక్షించు కొనుటకుఁ బెద్దలు కొన్ని సూచనలు చేసియున్నారు. సంగీతాంశముతో సహా వీరగాథలను సేకరించుట అవశ్యకర్తవ్యమని ఇదివరలో గ్రహించితిమి. దీనికిఁదోడు ఆయా సంప్రదాయములు నశించిపోకుండ నుండుటకై తద్గాయక భిక్షువులను బ్రోత్సహించు చుండుటకూడ నవశ్యాచరణీయమే. ముద్రించినంత మాత్రమున వానికి వ్యాప్తి యుండదు. ఏలయన ముద్రిత సాహిత్యము అక్షరాస్యులకు మాత్రమే అందుబాటులో నుండును. మన దేశమున నక్షరాస్యులకన్న నిరక్షరాస్యులే యధికము. వారికి వ్రాఁతకోఁతలతోఁ బనిలేదు. వినికియే ప్రధానము. మౌఖిక ప్రసరణమే వారి విద్యావిధానము. కావున నీ యధిక సంఖ్యాకులను దృష్టిలో నుంచుకొని వీని పరిరక్షణకుఁ బూనుకొనవలెను. దేశికవితలలోని సాహిత్యాంశమును యథాతథముగా ముద్రింపవలెను. సంగీతాంశమును 'టేప్ రికార్డు' చేయవలెను. సంగీతపు వరుసలను సాహిత్యము ప్రక్కనే గుర్తింపవలెను. మౌఖిక సంప్రదాయ పరిరక్షకులైన జానపదగాయకులను బ్రోత్సహింపవలెను. వీరగాథా సంచయనమున నొక ముఖ్య విషయమును గమనింపవలెను. ఏ వీరగాథ యే ప్రాంతమునఁ బుట్టినదో ఆ ప్రాంతముననే సేకరించుట మంచిది. సంఘటన జరిగిన ప్రదేశమునకుఁ జుట్టుప్రక్కల సేకరింపవలెను. ఇట్లు సేకరించుటవలనఁ బ్రశస్తమగు కథ లభించును. బొబ్బిలి కథ, లక్ష్మమ్మ కథ, చిన్నమ్మ కథ మున్నగు వీరగాథ లాంధ్రదేశ మందంతటను వ్యాపించియున్నను బొబ్బిలికథను శ్రీకాకుళ, విజయనగర మండలములలోనే సేకరించుట మంచిది. అట్లే లక్ష్మమ్మ కథను గుంటూరు మండలమునను, చిన్నమ్మకథను అనంతపుర మండలమునను సంపాదించుట వలనఁ బ్రశస్తమగు పాఠములు లభించును. పల్నాటి వీరకథలను పల్నాటిసీమలోను, కాటమరాజు కథలను కనిగిరిసీమలోను, సదాశివరెడ్డి కథను తెలంగాణమునను సేకరింపవలెను. దేశిసాహిత్య ప్రియులగు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారు ఈ మౌఖిక సాహిత్యమును రక్షించుకొనుటకు ఈ క్రింది సూచనలు చేయుచున్నారు:-

"దేశిసారస్వతము అచ్చూ పత్రికలూ లేనప్పుడు ఆనోటినుంచి ఈనోటికి వ్యాపించిందనీ, నేడు పత్రికలూ పఠనమూ విరివిగా వ్యాపించినవి కనుక ఈ సారస్వతము పత్రికాముఖమున వృద్ధి అవుతుందనీ, కనక నేడు ఈ సారస్వతాన్ని పెంచడానికి ప్రత్యేక యత్న మనవసరమనీ కొందరి అభిప్రాయము. అది సరికాదేమో నంటాను. దేశిరచన నిరక్షరకుక్షుల రచన. కల్పన, ఊహ, రచన అన్నది అక్షరాస్యతకు అమ్ముడుపోయిన వస్తువులు గాదు. నేడు అక్షరాస్యత ఎంతపెరిగినా, నిరక్షరులే జనులలో హెచ్చు. వీరిలో రచయితలుంటారు. వారి రచనలకు ప్రోత్సాహము ఇస్తే, బూర్జువా వర్గములో పుట్టి కార్మిక కర్షకులను ఉద్ధరిస్తున్నామనుకుని కృతక రచనలను గుప్పేవారికంటే చక్కగా రచిస్తారు వారు. అయితే ఈ ప్రోత్సాహము ఎలాగు జరగాలీ? అన్న ప్రశ్న పుట్టుతుంది. ఇది బ్రతికి ఉన్న సమస్య. దీనినెట్లు తీర్చవలెను? అన్నదానికి పలువురు పలు సమాధానములు చెప్పగలరు. నాకు తోచినవి రెండు:- ఒకటి- గ్రంథాలయాలలో లిఖితపుస్తక శాఖలను ప్రారంభించడము. మెకంజీ దొర ఒక్కడూ చేసిన పని దేశమంతటా ప్రతి సారస్వతుడూ ఎంతో కొంత చెయ్యాలి నేడు. పాటలు, కథలు, పదాలు, కీర్తనలు, జంగం కథలూ, ఏల పదాలూ, సామెతలూ ఎవరికందిన వాటిని వారు ఏదో ప్రసిద్ధ గ్రంథాలయమున కందించితే తరువాత పని దానంతట అదే జరుగుతుంది. రెండు:- దేవాలయాలూ, తీర్థాలూ దగ్గర తిరునాళ్లు జరిగినప్పుడు ఆ ప్రదేశమందున్న పెద్దలు పదాలపోటీ పెట్టి- ఉర్లాము పద్ధతిని- ఈ దేశిసారస్వతులకు చిన్న బహుమానములు ఇవ్వవలెను.

నేడు హరికథలు రూపఱిపోయినవి; బుర్రకథలు ప్రచారము పొందుతున్నాయి. వీటికి చక్కని రూపము వస్తుంది. ప్రోత్సహిస్తే. వర్గభేదములు సన్నగిల్లుతాయి. చెయ్యవలసినదల్లా శ్రీకూర్మము, అరసవెల్లి, ముఖలింగము, రామతీర్థము, సింహాచలము, అనకాపల్లి, ఉపమాక, పిఠాపురము, కోరుకొండ, పట్టిసము, భద్రాచలము, మంగళగిరి, తిరుపతి, కోటప్పకొండ వంటి క్షేత్రాలలో ఏడాదికొకమారు దేశిసారస్వత సేవ. తెగిపోయిన జాతీయతా సూత్రాలను మళ్లీ దొరకబుచ్చుకుని, తెలుగు జాతికి సహజమైన వృద్ధిని సమకూర్చుటకు నాకు తట్టిన సాధనాలివి. మేధావులు తర్కింతురు గాక!"[9]

ఇందు శ్రీపాదవారు సూచించిన వీరగాథల పోటీలు కన్నడ దేశమునఁ బందొమ్మిదవ శతాబ్దము నాఁటికే కలవని తెలియుచున్నది. జె.ఎఫ్.ఫ్లీటు దొరగారు సేకరించిన 'సంగయ్య నేరము-మరణము' అను కన్నడ వీరగాథలోఁ జివర యిట్లున్నది:-

*"తుకారామ నమ్మ వస్తాదరా*
*శాయిరా కవి అప్పు మాడిద తయార*
*దేమణ్ణ నక్షర ఇల్లదాంగ కసర*
*అవర దబ్బిన మేగ ముత్తిన తూరా, జర్తరా,*
*సంతు బసణ్ణ జీవద గెణెయరా*
*వైరిగి మాద్యర జేర*
*ఇలిత కలిగిగి నీరా*
*ఏర॥ మాదురావ కలిగిగె బిద్దాన గంటా*
*హాడిన వలగ ముక పాట."*[10]

ఇట గాథాకారులలో రెండు పక్షములకు గాథాగానమునఁ బోటీలు నిర్వహింపఁబడినవి. ఇందొక పక్షమువారు తమ గుమ్మెటలపై బంగారు తురాయిని ధరించినారు. వేఱొక పక్షము 'కలగీ' అను గుబ్బపు తురాయిని ధరించినది. ఒకరి తరువాత నొకరు పోటీలు పడి పాడినారు. బంగారు తురాయి గల పక్షము నెగ్గెను.[11] ఈ పక్షమునకు గురువు 'తుకారం'; వీరి గాథను 'అప్పు' అను నతఁడు రచించెను. 'సంతు, బసణ్ణ, మాధవరావు' అనువారలు ఈ గాథా గానమునఁ బాల్గొని విజయము సాధించిరి. ఇట్లు పోటీలు నిర్వహించుటవలన వీరగాథల నభివృద్ధి పఱుపవచ్చును.

"జానపద సాహిత్యమును సేకరించుట యనునది ఒంటి మానిసి చేయునది కాదు. ప్రభుత్వమో లేదా పూటిగా డబ్బున్న సంస్థలో ఈ పనికి పూనుకొనవలెను. వ్రాయసమువారు, టేపురికార్డర్లు, చిత్రకారులు, కెమెరాలవారు, స్వరజ్ఞానముగలవారు మున్నుగా గల బలగంబుతో కొందరు శ్రద్ధగలవారు బయలుదేరవలె. గ్రామ గ్రామమున గల ప్రతి కులమువారిని, ప్రతివృత్తికి చెందినవారిని కలిసికొనవలె. వారి అచ్చటలు ముచ్చటలప్పుడు, పండుగలు పబ్బము లప్పుడు, కాయకష్టము చేయునప్పుడు, ఆడుచుండగా పాడుచుండగా చాటుగా నేటుగా, బులిపించి బుజ్జగించి, అదరించి బెదరించి, లంచములిచ్చి, పంచలనిచ్చి, చివరకు కాల్చుటకు పొగాకు చుట్టలనిచ్చి, కల్లునీళ్లకు రాగిడబ్బు లిచ్చియైనను, ఏస లొక్కటి గూడ మాసిపోనీక, స్వరము లేమాత్రంబు జారనీక, తాళంపు క్రమమును తప్పగానీక, ఊతయు (accent) క్రమముగా ఉన్నదున్నట్లు, ఈ సాహితీ సంపద నంతటిని కొల్లగొట్టవలెను. ఈ విధముగా సేకరించిన ముడిసరుకును, మొదట తాలూకా స్థాయిలోను, తరువాత జిల్లా స్థాయిలోను, అటు తరువాత ఆంధ్రప్రదేశ స్థాయిలోను, ఏరి కూరి కుప్పలు బోసి, జల్లెడపట్టి, ఏ ప్రక్రియ కా ప్రక్రియగా టీకలతో టుప్పీకలతో వివిధ సంపుటములుగా ప్రచురించవలె. అప్పుడే సక్రమమైన శాస్త్రీయమైన పరిశోధనలు ఈ సాహిత్యమున జరుగగలవు. పాశ్చాత్యులును, కొందరు బుద్ధిమంతు లగు ఔత్తరాహులును ఇటులే చేసినారు".[12]

దూరదృష్టితో, స్వానుభవముతో, జానపద కవితాభిమానముతో పై విద్వాంసు లొసగిన అమూల్యములగు సూచనలను సలహాలను వెనువెంటనే పాటించి, క్రియాశీలురగు నాంధ్రులు నడుముకట్టి, కార్యరంగమునకుఱికి, మినుకు మినుకు మనుచున్న జానపద కవితా జ్యోతిని, శాస్త్రీయ సంచయనమను నాజ్యముచేఁ బ్రజ్వరిల్లఁజేసి, ఆ నిసర్గ కవితా ప్రభల ధగద్ధగలచే దశదిశలను సందీప్తము చేయవలసి యున్నది. భవతు॥ ❐

## జ్ఞాపికలు

1. బాలశౌరిరెడ్డిగారి 'హిందీ జానపద వాఙ్మయము' అను వ్యాసము, కిన్నెర, జనవరి 1955.
2. H.M. Belden, "The Study of Folk Song in America", Modern Philology, Vol.2, (1904-1905), p. 579.
3. చూ. కిన్నెర, జనవరి 1955, పుటలు 180, 181.
4. తెలుఁగు జానపదగేయ సాహిత్యము, పుట. ౫౩.
5. అదే., పుటలు ౫౨, ౫౩.
6. మద్రాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారము, డి.నెం. 2550, (flyleaf).
7. ఆంధ్ర వాఙ్మయ చరిత్రము, పుట 154.
8. చూ. ఆంధ్ర వాఙ్మయ సూచిక, మద్రాసు, 1927.
9. కిన్నెర, జనవరి 1955 (సంక్రాంతి సంచిక), పుట 95.
10. *"Tukaram is our teacher; the ballad- monger Appu has composed (this song); the hand - writing, in which there is no fault, is that of Demanna, on whose drum there is a plume of pearls, with feathers and tinsel, and gold and silver lace. Santu and Basanna, our firm friends, have completely overcome our enemies; defeat has come to the Kalagi. (Raising the voice)- Madhavarao became a sore trouble to the Kalagi; in singing he has everything at the tip of his tongue."- Indian Antiquary, Vol. xviii, (1889), pp. 358-359.*
11. *"The allusion here is to a singig-match between two rival parties of ballad-singers. The members of one party have on their drums the tura or 'plume of feathers and pearls and tinsel, with gold and silver lace'; and those of other party, a Kalagi which seems to be 'a plume of feathers for a horse's head'. The two parties sing alternately, until one is declared to have surpassed the others. In the present case the tura-party, to which belonged the composer of this ballad, is declared victorious."- ibid.*
12. డా॥ బి. రామరాజుగారు, 'త్రివేణి' (ఆంధ్ర జానపదగేయాలు), సంపాదకీయము, పుటలు iv, v.

# సింహావలోకనము

**'తెలుఁగు** వీరగాథాకవిత్వ' మను నీ పరిశోధక వ్యాసము ఇరువదియైదు ప్రకరణములలోఁ జర్చింపఁబడినది. ఈ యిరువదియైదు ప్రకరణములును నాలుగు భాగములుగా విభజింపఁ బడినవి. ప్రథమ భాగమున వీరగాథల నిర్వచన లక్షణ వర్గీకరణాదులును; ద్వితీయ భాగమున తెలుఁగు వీరగాథలలోని త్రివిధ వర్గములైన గాథాచక్రములు–గాథలు– గాథానికలును; తృతీయ భాగమున వీరగాథల కవిత్వ భాషాచ్ఛందస్సంగీతాదులును; చతుర్థ భాగమున వీరగాథల విశిష్టత– గాథకులు– అనాదరణాదులును చర్చింపఁబడినవి.

## ప్రథమ భాగము

తొమ్మిది ప్రకరణముల సమాహారమగు ప్రథమ భాగమున వీరగాథా కవిత్వమున కొక ఆముఖమును, వీరగాథా నిర్వచనము (ప్రాచ్య పాశ్చాత్య మతములు)ను, వీరగాథల ప్రాచీనతయు, వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములును, విదేశ భాషలలోని వీరగాథలనుగూర్చియు, భారతభాషలలోని వీరగాథలనుగూర్చియు, తెలుఁగులోని వీర గాథలనుగుఱించియు, వీరగాథల లక్షణములును, వీరగాథల వర్గీకరణమును దెలుపఁబడినవి.

### 1. ఆముఖము:

వీరగాథా కవితాప్రక్రియ ప్రపంచమునఁ బ్రతిసాహిత్య మందును గాననగును. ఆంధ్రసాహిత్యమున మనము గర్వింపఁ దగినన్ని వీరగాథలున్నవి. ఇవి మన సాహిత్యమునఁగల 'మార్గ– దేశి' విభాగములలో దేశికిఁ జెందినవి. దేశిసాహిత్యమందలి కవిత్వము నిబద్ధానిబద్ధములచే మరల రెండు విధములు. ఇందు వీరగాథలు 'అనిబద్ధదేశి' (శుద్ధదేశి)కిఁ జెందును. (ద్విపద కావ్యములు, యక్షగానములు, హరికథలు– మొదలగునవి నిబద్ధదేశికి చెందును.) ఇంకను సూక్ష్మపరిశీలనముచే అనిబద్ధదేశిలో 'పామరదేశి' (జానపదము), 'జాతిదేశి' అను మఱిరెండు శాఖలను గుర్తింపవచ్చును. ఇందు వీరగాథలు పామరదేశికిఁ జెందును. పల్లెపాటలు లేక జానపద గేయములు (Folk songs) వీనిసోదర శాఖ. (స్త్రీల పాటలు, పిల్లల పాటలు, భజన కీర్తనలు, పొడుపు కథలు మొదలగునవి జాతిదేశికి చెందును.)

ఈ వీరాథలు మార్గకవిత్వములోని ఇతిహాస ప్రక్రియకు మూలకందముగా భావింపఁబడుచున్నవి. (మహాభారతము 'జయ'మను వీరగాథనుండి పరిణమించినదని విమర్శకుల అభిప్రాయము.) 'జానపద విజ్ఞానము' (Folklore) నుండి, జానపద భాషను, జానపద శాస్త్రములను దప్పించినచో, 'జానపద సాహిత్యము' (Folk literature) మిగులును. ఈ జానపద సాహిత్యమున గేయములు (Folk songs), గేయకథలు (Popular Ballads), వచనకథలు (Folk tales)- అను మూఁడు ప్రక్రియలున్నవి. ఇందలి గేయకథా ప్రక్రియయే ఈ సిద్ధాంతవ్యాస ప్రమేయములోని వీరగాథలు!

### 2. వీరగాథా నిర్వచనము:–

'Ballad' శబ్దము 'ballaare' అను లాటిను శబ్దమునుండి పుట్టినది. దీనికి మొదట 'నృత్తగీత' మను నర్థమున్నను, నేఁడాయర్థము నశించి, 'గేయరూపమున నున్న కథ' యను నర్థము వ్యాపించియున్నది. Ballad అనునది బాహ్యస్వరూపమున lyric ను, ఆంతరస్వరూపమున epic ను బోలియుండునని పాశ్చాత్య విమర్శకులు నిర్ణయించిరి. ఇది గేయరూపమున నున్న చిన్న ఇతిహాసము, లేదా కథాత్మకమగు పెద్ద గేయము. Ballad శబ్దమునకు సరియైన తెలుఁగు శబ్దము 'వీరగాథ'. "జానపదగేయ రూపమున నుండి, వీరరస ప్రధానమగు కథను జెప్పుచు, సంచార గాయక భిక్షువులచేఁ బాడఁబడు సరళ కథాగేయమే వీరగాథ" అని తెలుఁగున నిర్వచింపవచ్చును. బొబ్బిలి కథ దేసింగురాజు కథ, బాలనాగమ్మ కథ, ముగ్గురు మరాటీల కథ, సర్వాయి పాపడు కథ, కాంభోజరాజు కథ వంటివి దీనికిఁ జక్కని లక్ష్యములు.

ఈ వీరగాథలు గాయక భిక్షువులచే రెండు మూఁడు రాత్రులు పాడఁదగిన పరిమాణములో నుండును. ఇట్టి వీరగాథలు కొన్ని ఒక ప్రముఖ వీరుని చుట్టును అల్లఁబడి, ఆతనిఁగూర్చియు, ఆతని బంధువులనుగూర్చియుఁ బెక్కుకథలను వర్ణించుచుండును. ఒక్కొక్కప్పుడు ఒక కులదైవమునకుఁ బ్రాధాన్యమిచ్చి, ఆ దైవమును గొలిచిన రాజుల వృత్తాంతములను అనేక వీరగాథలలో నొక వరుస క్రమమునఁ బెద్ద యితిహాసమువలెఁ జెప్పఁబడుచుండును. ఇట్టి వీరగాథల సమూహమును 'వీరగాథాచక్రము' (Ballad-cycle) అందురు. తెలుఁగులో పల్నాటి వీరకథలును, కాటమరాజు కథలును వీరగాథాచక్రములకుఁ జక్కని యుదాహరణములు. ఈ వీరగాథా చక్రములను గాథాకారులు లేక వృత్తిగాయకులు (Minstrels) నెలల తరబడి పాడుచుందురు.

మఱికొన్ని వీరగాథలు మిక్కిలి హ్రస్వములుగ నుండి జానపదులచేఁ బనిపాటులయందుఁగాని, గాయక భిక్షువులచేఁ

బగటిపూట బిచ్చమెత్తుకొనునప్పుడుగాని పాడఁబడుచుండును. ఇవి యొక అరగంట లోపుననే పూర్తియగును. వీనిలోఁగొన్ని కథాత్మకములుగను, మఱికొన్ని కేవల కథాసూచకములుగను నుండును. ఇట్టివానిని 'వీరగాథానికలు' లేక 'లఘువీరగాథలు' లేక 'వీరగీతములు' (Balladings) అందురు. తెలుఁగులో గుజ్జాల గోపిరెడ్డిపాట, మానందిరెడ్డిపాట, బుడ్డా వేంగళరెడ్డి పాట మున్నగునవి వీరగాథానికలకుఁ జక్కని యుదాహరణములు.

## 3. వీరగాథల ప్రాచీనత:-

గిరిగహ్వరవాసియగు ప్రాక్తనమానవుని లయాత్మక భాషణము నుండి కాని, నృత్తగీతమునుండి కాని కవిత్వము పుట్టియుండును. దీని ప్రాథమిక రూపము శుద్ధగేయము. దీనితోఁ గథాకథనము గలిసి వీరగాథ యేర్పడియుండును. ఈ గేయములు కథాగేయములు, పద్యకవిత్వము కన్నఁ బ్రాచీనములనుటలో సందేహము లేదు. గేయముల ఛందస్సులోఁ బద్యముల ఛందస్సుకన్న నియమములు తక్కువగ నుండుటకూడ గేయముల ప్రాచీనతకుఁ బోషకమగుచున్నది. క్రీ.పూ. 3000 సంవత్సరములనాఁడు ఆర్యులు మన దేశమునకు వచ్చుట ప్రారంభించిరి. అప్పటికి మనదేశముననున్న నల్లజాతులతో- ముఖ్యముగా ద్రావిడులలో నార్యులు యుద్ధములు చేసిరి. ఈ యార్య ద్రావిడ సంఘర్షణలో ననేక వీరగాథలు పుట్టియుండును. అట్టివానిలో రామాయణమొకటి. ఆర్యుల అంతఃకలహములలో (రాజవర్గములోని అంతఃకలహములలో) మహాభారతము, వర్గకలహములలో (పురోహితవర్గము- రాజవర్గముల కలహము) హరిశ్చంద్రునికథ పుట్టినవని చెప్పవచ్చును. క్రీ.పూ. 10,000 సంవత్సరములకుఁ జెందిన మన వేదములలో వీరగాథా బీజములున్నవి. ఈ వేదములు ప్రాచీనార్యుల జానపద విజ్ఞానమని విమర్శకుల తలంపు. ఇందలి ఉపాఖ్యానములు వీరగాథలే. వీనికి 'గాథలు'- 'నారాశంసులు'- 'ఇతిహాసములు' మున్నగు పేర్లు కలవు. త్రేతాయుగమున అనఁగా క్రీ.పూ. 6000 సంవత్సరములనాఁడు రచింపఁబడిన రామాయణము, క్రీ.పూ.3100 ప్రాంతమున రచింపఁబడిన మహాభారతము- ఈ రెండును ప్రాచీన వీరగాథలనుండి 'ఐతిహాసిక క్రమము'న (Epic Process లో) నేర్పడియుండును. 'నలుని కథ'- 'హరిశ్చంద్రుని కథ' ఈ రామాయణ మహాభారతముల కన్న ప్రాచీనములైన వీరగాథలు. ఇవి ఐతిహ్యములు (legends) గా భారతదేశమందంతటను వ్యాప్తినొందినవి.

'వీర'శబ్ద ప్రాచీనతనుబట్టి కూడ వీరగాథలు ప్రాచీనములని తలంపవచ్చును. వివిధ ప్రాకృతములలో వీరగాథలుండియుండును. అపభ్రంశములోని 'రాసములు' వీరగాథలు కావచ్చును. క్రీ.శ. మొదటి శతాబ్దమునాఁటి గుణాఢ్యుని 'బృహత్కథ' పిశాచములనఁబడు ఆటవికుల ముఖస్థ సాహిత్యమునుండి నిర్మింపఁడియుండును. ఈ పిశాచములు ఆదిమ ద్రావిడులని అనుమానింప వీలున్నది. కాళిదాసు కాలమున, వత్సరాజగు నుదయనుని సాహసగాథలు పల్లెలలోఁ బ్రచారమున నున్నవి. క్రీ.పూ. రెండవ శతాబ్దమునుండియు రాజస్థానములో వీరగాథలున్నవని తలంపవచ్చును. గ్రీకు, లాటిను, ఆంగ్లోశాక్జను, జర్మను, హీబ్రూ, చైనీస్- మున్నగు ప్రాచీన విదేశ సాహిత్యములందుఁగూడ వీరగాథలున్నవనుటకు సాక్ష్యములున్నవి. భారతదేశమున తమిళము, కన్నడము, పంజాబీ, అస్సామీ భాషలలోఁ బ్రాచీన వీరగాథ లున్నవని తెలియుచున్నది. సంగీత నాట్యశాస్త్ర గ్రంథములలోని దేశిరాగముల, గేయముల ప్రసక్తినిబట్టి కూడ వీరగాథల ప్రాచీనతను దెలియనగును. తెలుఁగులోఁ బ్రాఙ్నన్నయ యుగమున గేయములు, వీరగాథలు గలవనుటకుఁ బ్రబలమగు తార్కాణములున్నవి.

## 4. వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు:-

వీరగాథల ఉత్పత్తి కర్తృత్వములు వివాదగ్రస్తమైనవి. పాశ్చాత్యవిమర్శకులలోఁ గొందఱు, వీరగాథలు అతిప్రాచీన కాలమున జానపద సంఘములచే నృత్యమునందు ఆశువుగా సృజింపఁబడినవని సిద్ధాంతము చేసినారు. మఱికొందఱు ఈ సిద్ధాంతమును ఖండించి, వీరగాథలు మధ్యయుగములలో గాథాకారులచేతను, ప్రత్యేక కవుల చేతను రచింపఁబడినవనియు, వీనికిమూలము ప్రాచీన శిష్టసాహిత్య మనియు వాదించుచున్నారు.

ప్రాక్తమానవుని నృత్తగీతమున భావాత్మక మగు చిన్నపాట పుట్టునుగాని, కథాకథనముతోఁ గూడిన పెద్దపాట పుట్టుట స్వభావవిరుద్ధము. కావున వీరగాథ, జానపదగేయము కన్నఁ బ్రాచీనమైనది కాఁజాలదు. ఇతిహాసములకు మూలము వీరగాథలు కావచ్చును. అయినను, క్రీ.శ.పండ్రెండవ శతాబ్దముకన్నఁ బ్రాచీనమైన వీరగాథలు ప్రపంచమున నేదేశమందును నేఁడు లభించుట లేదు.

అన్ని వీరగాథలును నొకేవిధముగాఁ బుట్టవు. తెలుఁగులోఁ గొన్ని వీరగాథలు శ్రీనాథాది ప్రత్యేకకవులచే రచింపఁబడినవి, మఱికొన్ని వీరగాథలు జంగముల ఆశురచనలుగాఁ బుట్టినవి. వీరగాథ యీ రెండు విధములలో నేవిధముగాఁ బుట్టినను, సిసలైన వీరగాథాస్వరూప మేర్పడుటకు అది కొంతకాలము ప్రజలలో మౌఖిక సంప్రదాయము (Oral Tradition) లో జీవించి తీరవలెను.

నాగరికత వీరగాథోత్పత్తికిఁ బరమశత్రువు. ఆంధ్రదేశమున నాగరికములైన మాగాణి ప్రాంతములకన్న, అనాగరికములైన మెట్ట ప్రాంతములలో వీరగాథలు అధికముగాఁ బుట్టుచున్నవి. దేశ నైసర్గిక స్వరూపము, జాతి మనస్తత్త్వము, కులస్వభావము మున్నగునవి వీరగాథోత్పత్తిలోఁ గీలకస్థానమును వహించును.

## 5. విదేశ భాషలు- వీరగాథలు:-

ప్రపంచమున డెన్మార్కు, 'ఫెరో' ద్వీపములు (Faeroe islands), స్కాట్లండు, పోర్చుగల్, సిసిలీద్వీపము, స్పెయిన్

దేశములలో వీరగాథలు అత్యధికముగా నున్నవి. డెన్మార్కు దేశమందును, తత్సంబంధమగు ఫేరోద్వీపములందును కవిత్వమంతయు వీరగాథలతోనే నిండిపోయినది. ఒక్క డెన్మార్కునకే కాక తక్కిన స్కాండినేవియా కంతకును వీరగాథలు గర్వకారణమగు సాహిత్యముగాఁ బరిణమించి భాసిల్లుచున్నవి. స్పెయిన్ సాంప్రదాయిక వీరగాథలు వీనిని తలదన్నినవిగా నున్నవి. పోర్చుగీస్ సాహిత్యమున వీరగాథలు తప్ప వేఱొక ప్రక్రియ కానరాదు. ఇటలీదేశ విభాగమగు 'సిసిలీ' (Sicily) ద్వీపమున ఏడువేల వీరగాథ లున్నవని 'పిట్రే' (Pitre) వంటి పరిశోధకులు నిర్ణయించినారు. ప్రపంచమున కొద్దియో గొప్పయో వీరగాథలు లేని దేశము లేదని చెప్పవచ్చును.

## 6. భారత భాషలు– వీరగాథలు:–

భారతదేశమున రాజస్థాన్, మహారాష్ట్ర, ఆంధ్రప్రదేశ్, పంజాబ్ రాష్ట్రములలో వీరగాథలు కొల్లలుగా నున్నవి. వీరగాథాసంపదలో డెన్మార్కు, స్పెయిన్ దేశములతోఁ బోల్చఁదగినది రాజస్థాన్. హిందీ సాహిత్య చరిత్రమున వీరగాథలకొక ప్రత్యేకయుగమును సంతరింపఁ జేసినది రాజస్థానీ మాండలికమే. వీరగాథను రాజస్థాన్‌లో 'రాసో' అనియు, 'చారణగీత' మనియుఁ బిలుతురు. 'పృథ్వీరాజ రాసో' ప్రాచీనమును బ్రశస్తమునునగు వీరగాథ. మహారాష్ట్రమున శివాజీపై నెన్నియో వీరగాథలున్నవి. మహారాష్ట్రులు వీరగాథను 'పావాడే' అందురు; పంజాబీయులు 'వార్' అందురు. 'నాదిర్‌షా దీ వార్' పంజాబీలో మిక్కిలి ప్రసిద్ధికెక్కిన వీరగాథ. కన్నడమున వీరగాథను 'లావణి' యనుచున్నారు. ఇందు "కుమారరాముని కథె– కిత్తూరు చెన్నవ్వరాణి కథె– కరిబంటన కథె– కెరగెహార– గోవినహాడు" మొదలగునవి ప్రసిద్ధ వీరగాథలు. భారతదేశమున నితర భాషలందును వీరగాథలు పుష్కలముగాఁ గలవు.

## 7. తెలుగులో వీరగాథలు:–

భరతఖండమున వీరగాథాసంపదలో రాజస్థానముతో తులఁ దూఁగఁగల రాష్ట్రము మన ఆంధ్రదేశము. పౌరాణికములు, చారిత్రకములు, సాంఘికములు మున్నగు విభాగముల క్రిందికి వచ్చు వీరగాథలు తెలుఁగులో కోకొల్లలుగానున్నవి. సంఖ్యాబలముననే కాక, ప్రాశస్త్య ప్రాచీనతలలోఁగూడ నివి వన్నెకెక్కినవి. పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు క్రీ.శ. 12, 13 శతాబ్దములకే తెనుఁగు గడ్డపై మాఱుమ్రోఁగుచుండినవి. మన బొబ్బిలికథ ప్రపంచమున వ్రేళ్లపై లెక్కింపఁదగిన నత్యుత్తమ వీరగాథలలో నొకటి. ప్రాక్ప్రతీచీ విమర్శకులు చెప్పిన వీరగాథా లక్షణములన్నింటిని పుణికిపుచ్చుకొనిన పరమప్రశస్త వీరగాథ మన బొబ్బిలి యుద్ధము. తెలుఁగు సాహిత్యమున వీరగాథలు ఎక్కువగా నుండుటయే కాక, వీరగాథాచక్రములు (Ballad-cycles) ను నెక్కువగ నుండుట మఱియొక విశేషము. (తక్కిన భారతభాషలలో నిట్టి సుదీర్ఘ చారిత్రక వీరగాథాచక్రములు కానరావు.) పౌరాణికములలో పరశురాముని కథాచక్రము, అస్పష్టచారిత్రకములలో అంకమ్మ కథాచక్రము, చారిత్రకములలో పల్నాటి వీరకథాచక్రము, కాటమరాజ కథాచక్రము మిక్కిలి ప్రసిద్ధికెక్కినవి. బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, బాలనాగమ్మ కథ, కాంభోజరాజు కథ, ముగ్గురు మరాటీల కథ, లక్షుమమ్మ కథ, కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, చిన్నమ్మ కథ, ఎఱుకల నాంచారి కథ, పసల బాలుఁడు కథ, సర్వాయి పాపడు కథ, చిన్నపరెడ్డి కథ, సదాశివరెడ్డి కథ, కర్నూలు నవాబు కథ, రావులమ్మ కథ, బల్మూరి కొండ్రాయని కథ, బంగారు తిమ్మరాజు కథ, కొమార రాముడి కథ, గాంధారి కథ– మున్నగునవి తెలుఁగు నేలపైఁ దరతరములనుండి పాతుకొనిపోయిన వీరగాథలు! తెలుఁగు గాలిలోఁ జిరకాలముగా మాఱుమ్రోఁగుచున్న వీరగాథలు! తెలుఁగు రక్తములో జీర్ణించిపోయిన వీరగాథలు!

ప్రాచీన కవులలో నన్నెచోడుఁడు, పాల్కురికి సోమనాథుఁడు, క్రీడాభిరామకర్త, పాలవేకరి కదిరీపతి (శుకసప్తతి), అయ్యలరాజు నారాయణామాత్యుఁడు (హంసవింశతి) మున్నగువారు జానపద సాహిత్యప్రసక్తి నెక్కువగాఁ దెచ్చినారు. ఆంధ్ర వాగ్గేయకారుల రచనలు కొన్ని జానపద కవితానుకరణములు. తెలుఁగు దేశిరాగముల ప్రసక్తియు, గేయముల ప్రసక్తియుఁ గొన్ని సంగీత లక్షణగ్రంథములలో సహితము గలవు. ఊహనుబట్టి పరిశీలించినచోఁ దెలుఁగుభాష సుస్థిరరూపమును దాల్చినప్పటినుండియు, ననఁగా క్రీ.శ. 6, 7 శతాబ్దములనుండియు వీరగాథలుండియుండవలెను. ప్రాచీనకవుల ప్రసక్తినిబట్టి పరిశీలించినచో నన్నయకుఁ బూర్వమునుండియు వీరగాథలు కలవని తెలియుచున్నది. ఉపలబ్ధములనుబట్టియుఁ, జారిత్రక సంఘటనలనుబట్టియుఁ బరిశీలించినచోఁ దెలుఁగులో 'పల్నాటి వీరచరిత్ర' యను వీరగాథాచక్రము (Ballad-cycle) ప్రాచీనమైనదిగాఁ గన్పట్టుచున్నది. ఇందలి యితివృత్తము క్రీ.శ. పండ్రెండవ శతాబ్ది చతుర్థపాదమున (క్రీ.శ. 1178–1182) మధ్యకాలమున జరిగిన చారిత్రక సంఘటనము. ఉత్తర హిందూదేశమున క్రీ.శ. 12 వ శతాబ్దమునాఁటి 'పృథ్వీరాజ రాసో' యను రాజస్థానీ వీరగాథను, 13వ శతాబ్దమునాఁటి 'తుగ్లక్ షా ఖుస్రోన్‌ఖాన్ వార్' అను పంజాబీ వీరగాథను దప్పించినచో, మిగిలినవన్నియును పదునైదవ శతాబ్దమునకుఁ దరువాతివే. తెలుఁగులో క్రీ.శ. 12వ శతాబ్దమున 'సిరియాళుని కథ', 13వ శతాబ్ది యుత్తరార్ధమున పల్నాటివీరకథలు, పరశురాముని కథలు విరివిగాఁ బాడఁబడుచుండినట్లు ప్రబలసాక్ష్యము లున్నవి.

## 8. వీరగాథా లక్షణములు:–

డా॥ బి. రామరాజుగారు జానపదగేయ (Folk song) పరముగాఁ జెప్పిన పది లక్షణములలోను 'మౌఖిక ప్రచారము, సహజశైలి, పాడుటకు వీలుగా నుండుట, పునరావృత్తి, జనసామాన్య పరిచితవస్తువును గలిగియుండుట, ఆశురచనలు'– అను నాఱు

లక్షణములు వీరగాథలకుఁగూడ వర్తించుచున్నవి. 'బ్లిస్‌పెర్రీ' (Bliss Perry) అను పాశ్చాత్య విమర్శకుఁడు వీరగాథల నిస్సందేహ లక్షణములను విడమర్చి చెప్పినాఁడు. మొత్తముపై వీరగాథల కతిప్రధానములైన పదిలక్షణములుండునని నిశ్చయింపవచ్చును. వీరగాథ గేయస్వరూపమున నుండును- ఇది ప్రథమ లక్షణము. సరళచ్ఛందము, పునరావృత్తి (Refrain), గానయోగ్యత- అనునవి యిందలి ఉపలక్షణములు. వీరగాథ కథాఖ్యానాత్మకముగా నుండును- ఇది ద్వితీయ లక్షణము. నియమిత పరిమాణము, యథార్థ సంఘటనా జన్యత్వము, దేశీయేతివృత్తము, నాయకాభేదత, వీరరస ప్రాధాన్యము, కథాసారళ్యము, హఠాత్ప్రారంభత్వము, సంభాషణా సహితత్వము, వచన రాహిత్యము, విషాదాంతత, అభివర్ధిత పునరుక్తి (Incremental Repetition) అను పదునొకండును ద్వితీయ లక్షణములోని ఉపలక్షణములు. గాయకభిక్షువుల ఆశుకవనమున జనించుట వీరగాథయొక్క తృతీయ లక్షణము. కవి నామము తెలిసినను వీరగాథ అప్రధాన కర్తృకముగా నుండుట తృతీయ లక్షణములోని అవాంతర లక్షణము. మౌఖిక ప్రసరణము (Oral Transmission) న దేశమంతయు వ్యాపించుట, మౌకిక సంప్రదాయము (Oral Tradition) న తరతరములు జీవించుట, వీరగాథల నాల్గవ లక్షణము. బహుజనాదరపాత్రత లేక జనరంజకత్వము (Popularity) ఇందలి అవాంతర లక్షణము. వీరగాథ, నాటకమువంటి శుద్ధ పరాశ్రయ కవిత్వము (Objective Poetry). ఇది దీని ఐదవ లక్షణము.

వీరగాథలలో భాషయే కాక భావములును సరళముగా నుండును. వీరగాథలలోఁ గొన్ని పడికట్టు పదములు వర్ణనలు పదేపదే ప్రయోగింపఁబడుచుండును. వీనిని 'వీరగాథల వారానువర్తనములు' (Ballad Commonplaces) అందురు. ఇట్టి శైలీసారళ్యమును వారానువర్తనములను గలిగియుండుట వీరగాథల యాఱవ లక్షణము. ఎంతటి ప్రతిభావ్యుత్పత్తులుగల కవియైనను సాంప్రదాయిక వీరగాథను దనంతతాను సృజింపలేఁడు. వీరగాథ ప్రజలలో సహజముగాఁ బుట్టును; తరువాత దీనిపై కవి చేయి పడవచ్చును. ఇట్లు అనితర సాధ్యములుగా నుండుట వీరగాథల యేడవలక్షణము. ప్రపంచమున వివిధ దేశముల వీరగాథలలో నొక యేకసూత్రము కాన్పించును. అందుచే వీరగాథలు ప్రాక్తమానవ సంఘమును, వసుధైక కుటుంబమును నిరూపింప సమర్థములని చెప్పవచ్చును. ఇట్టి అద్వితీయ గుణము (unique character) ను గలిగియుండుట వీరగాథల యెనిమిదవ లక్షణము. వీరగాథలు నీతిని వాచ్యముగా బోధింపకున్నను, ధ్వనింపజేయును. 'విధి బలీయము, మానవుఁడు నిమిత్తమాత్రుఁడు' అనునదియే వీనియందు ధ్వనితమగు నీతి. ఇట్టి నీతిని ధ్వనింపఁ జేయుట వీరగాథల తొమ్మిదవ లక్షణము. వీరగాథలు జీవిత సంగ్రామమును సామాన్య సైనికునివలె యథాతథముగా మనకు నివేదించును, జీవితములోఁ బ్రతి ప్రస్థానము చివరను ఓటమి యున్నదను విషాద విషయమును బ్రతిధ్వనించుచుండును. ఇది వీరగాథల పదియవ లక్షణము. ఈ పది లక్షణములలోను గొన్ని వీరగాథల కెక్కువగా వర్తించును; మఱికొన్ని వీరగాథానికల (లఘువీరగాథల) కెక్కువగా వర్తించును. వీరగాథలలో నితిహాసలక్షణములును, వీరగాథానికలలో జానపదగేయ (Folk song) లక్షణములును హెచ్చుగాఁ గాననగును.

వీరగాథల ప్రాశస్త్యమును దెల్పు లక్షణములే కాక, వాని లోపములను దెల్పు లక్షణములును గొన్ని కలవు. సామూహిక రసానందమునే కాని, వ్యక్తిగత రసానందము నీయలేకపోవుట, పదములు వర్ణనలు పదేపదే పునరుక్తములగుట, కేవల పఠనము వలన నిందలి కవిత్వము రసతృప్తినీయకుండుట, సంఘటనలు ఘోరాతిఘోరముగా వర్ణింపఁబడుట, ఒకే పక్షమువారి నభిమానించుచు రచనసాగుట, పర్యవసానమున నేవిధమగు పరమార్థమును సాధింపకుండుట, ఛందోవైవిధ్యము లేకుండుట, మిక్కిలి పరిమితమగు పదజాలమును గలిగియుండుట- మున్నగునవి వీరగాథల ప్రధాన లోపములు.

వర్తమాన కాలమునఁ దెలుఁగు దేశిసాహిత్యమున విజృంభించిన 'బుఱ్ఱకథలు' వీరగాథానుకరణములే కాని, సాంప్రదాయిక వీరగాథలు కానేరవు. ఈ బుఱ్ఱకథలకుఁ బైన చెప్పిన ముఖ్యలక్షణములేవియు వర్తింపవు.

### 9. వీరగాథల వర్గీకరణము:-

ఏ సాహిత్యమందైనను వీరగాథలు ప్రధానముగా రెండు వర్గములుగా నుండును: తరతరములనుండి మౌఖికసంప్రదాయమున వచ్చుచున్న వీరగాథలు- మొదటి వర్గము. 'వీనిని సాంప్రదాయిక వీరగాథలు' (Traditional Ballads) అనియు, 'జనరంజక లేదా జనప్రియ వీరగాథలు' (Popular Ballads) అనియుఁ బిలుతురు. ఈ సాంప్రదాయిక లేక జనరంజక వీరగాథలకు అనుకరణములుగాఁ బ్రత్యేక కవులచే రచింపఁబడిన వీరగాథలు- రెండవ వర్గము. వీనిని 'సాహిత్య వీరగాథలు' (Literary Ballads) అందురు. ఇందు మొదటి వర్గము మాత్రమే ప్రధానముగాఁ బరిశీలింపఁబడుచున్నది. వీరగాథలనఁగా 'సాంప్రదాయిక వీరగాథ' లనియే భావము. ఇట్టి వీరగాథలను ఛందస్సునుబట్టి వర్గీకరించుటకన్న, నితివృత్తములనుబట్టి వర్గీకరించుట సమంజసము. 'ప్రొఫెసర్ లూయిస్ పౌండ్' (Prof. Louise Pound), 'ఫ్రాన్సిస్ బి. గుమ్మె' (Francis B. Gummere) మున్నగు పాశ్చాత్య విమర్శకులు వీరగాథల యితివృత్తములనే ప్రధానముగా గైకొని వర్గీకరించిరి.

తెలుఁగు విమర్శకులలో శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, హరి ఆదిశేషువుగారు, బి. రామరాజుగారు, నేదునూరి గంగాధరంగారు, పింగళి లక్ష్మీకాంతంగారు- వీరగాథల వర్గీకరణ విధానములను కొంతలోఁగొంత సూచించినారు. ఇందు శ్రీపాద గోపాలకృష్ణమూర్తి గారి వర్గీకరణము ప్రశస్తమైనది. వీరు 1953లో సూచించిన

వర్గీకరణముకన్న 1961లోఁ జేసిన వర్గీకరణము మఱింత హేతుబద్ధముగా నున్నది. వీరు జానపదగేయ వాఙ్మయమునంతటిని 'విడిగేయములు'– 'కథాగేయములు' అను రెండు ప్రధాన భాగములుగా విడదీసిరి. (ఇవి పాశ్చాత్యులు చేసిన 'Folk Songs' - 'Ballads' అను విభాగములకు సరిగా నన్వయించును). ఇందుఁ గథాగేయములలో 'జంగము కథలు, బొబ్బిలిపాటవంటివి, పదములు, స్త్రీల కథాగేయములు'– అను నాలుగు విభాగములను సూచించిరి.

తెలుఁగు వీరగాథలను వర్గీకరించుటలో మౌఖిక సంప్రదాయము, కాలప్రమాణము, భాషామాండలిక విభాగములు, ఇతివృత్తములు, ఛందస్సు, గాథాకారులు, పునరావృత్తి, జానపద వాద్యములు, ప్రధానవీరులు, కులదైవములు, దర్శనములు– మున్నగువాని నాధారముగాఁ జేసికొనవలెనని నా యభిప్రాయము. అయినను నీ వర్గీకరణములో నతిముఖ్యమైన జానపదవ్యవహారమును విస్మరింపరాదు. నా యభిప్రాయమున, 'జానపద కవిత్వము' (Folk Poetry) ను 'పల్లెపాటలు' లేక 'జానపద గేయములు' (Folk Songs) – 'వీరగాథలు' లేక 'జానపద గేయకథలు' (Ballads) అను రెండు ప్రధాన భాగములుగా విభజింపవచ్చును. ఇందు వీరగాథలలో మరల రెండు రకములున్నవి: 'సాంప్రదాయిక వీరగాథలు' (Traditional Ballads) లేక 'జనరంజక వీరగాథలు' (Popular Ballads) – 'వీరగాథానుకరణములు' (Imitative Ballads). ఇందు సాంప్రదాయిక వీరగాథలను (జనరంజక వీరగాథలను) మూఁడు ప్రధాన విభాగములుగా విడఁదీయవచ్చును: 'వీరగాథాచక్రములు' (Ballad-cycles), 'వీరగాథలు' (Ballads), వీరగాథానికలు లేక లఘువీరగాథలు (Balladings) వీనిలో మొదటి విభాగమైన వీరగాథా చక్రములలో నితివృత్తములనుబట్టి 'శక్తి కథాచక్రము, పలనాటి వీరకథాచక్రము, కాటమరాజు కథాచక్రము, వెలకంటి వీరుని కథాచక్రము' అను శాఖలను గుర్తింపవచ్చును. 'ఎల్లమ్మ కథాచక్రము, అంకమ్మ కథాచక్రము, చౌడమ్మ పాటలు, ఇతర శక్తికథలు'– శక్తి కథాచక్రములోని అంతశ్శాఖలు.

రెండవ ప్రధాన విభాగమైన వీరగాథలు ఛందస్సునుబట్టి 'బొబ్బిలివరుస కథలు, పదములు, జంగంకథలు' అను మూఁడు వర్గములుగా విడిపోవును. ఇందు పదములలో 'హరిహరీ పదములు, శారద పదములు' అను నంతర్భేదములు గానవచ్చును. 'బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, బాలనాగమ్మ కథ, లక్ష్మమ్మ కథ, కాంభోజరాజు కథ, ముగ్గురు మరాటీల కథ, చిన్నమ్మ కథ, కామమ్మ కథ, సర్వాయి పాపడు కథ, చిన్నపరెడ్డి కథ, సదాశివరెడ్డి కథ, కొమార రాముడి కథ' మున్నగునవి 'బొబ్బిలివరుస కథల'కు ఉదాహరణములు. లక్ష్మణ మూర్ఛ, గంగావివాహము, శతకంఠ రామాయణము, కుశలాయకము, ధర్మాంగద చరిత్ర– పాముపాట మున్నగునవి హరిహరీ పదములు. 'శారద రామాయణము, శారద హరిశ్చంద్ర, శారద సారంగధర' మున్నగునవి శారదపదములు. 'శ్రీయాళ మహారాజు చరిత్ర, భల్లాణరాయ చరిత్ర, నిజలింగ బిక్కయ్య కథ, విరాట పర్వము, వామన విజయము, దేవయాని చరిత్ర'– మున్నగునవి జంగంకథలకు ఉదాహరణములు.

పైన తెల్పిన మూఁడవ ప్రధాన విభాగమైన వీరగాథానికలకు (లఘువీరగాథలకు) 'గుఱ్ఱాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, ఉయ్యాలవాడ నారసింహారెడ్డి పాట, బుడ్డా వేంగళరెడ్డి పాట, ఓబులరెడ్డి పాట, కోరుమన్న పాట, విరూపాక్షరెడ్డి పాట, ఈడిగ రామన్న పాట, బండోళ్ల కురుమలన్న పాట, రాచోటి రామయ్య పాట, వెంకట్రామిరెడ్డి పాట, గడేకల్లు నాగిరెడ్డి పాట, మల్లన్న పాట, ధర్మాపురం నరసింహుని పాట' మున్నగునవి ఉదాహరణములు. ఇవి యన్నియును గొలఁది నిముషములలోఁ బాడఁబడు కథాత్మక లేదా కథాసూచక వీర గేయములు. వీరగాథాచక్రములు నెలలకొలఁది పాడఁబడు సుదీర్ఘ కథనమును గలిగియుండును. వీరగాథలు రెండు మూఁడు రాత్రులలోఁ బూర్తియగును. కాఁబట్టి 'వీరగాథాచక్రములు, వీరగాథలు, లఘువీరగాథలు' అను త్రివిధవర్గీకరణము కొంతవఱకును కాలప్రమాణమునుబట్టి చేయఁబడినదని చెప్పవచ్చును. ఇవి యన్నియును సాంప్రదాయిక వీరగాథలు.

ఈ సాంప్రదాయిక వీరగాథల ననుకరించుచు నేఁడు బయలుదేరిన 'బుఱ్ఱకథలు, జముకుల కథలు, సుద్దుల కథలు, తందనాన కథలు, బ్రతుకమ్మ పాటలు' అనునవి 'వీరగాథానుకరణము' లనఁబడును. వీనిలో బుఱ్ఱకథలు– బొబ్బిలివరుస కథలకును జంగంకథలకును అనుకరణములు. జముకుల కథలు– హరిహరీపదముల కనుకరణములు. సుద్దుల కథలు– కాటమరాజు కథలకును, తందనాన కథలు బొబ్బిలివరుస కథలకును, బ్రతుకమ్మ పాటలు– ప్రాచీనములైన బ్రతుకమ్మ పాటలకును అనుకరణములని చెప్పవచ్చును. (ఇది తొమ్మిదవ ప్రకరణము, దీనితోఁ బ్రథమ భాగము సమాప్తమయినది).

## ద్వితీయ భాగము

ఈ సిద్ధాంతవ్యాసమున ఏడు ప్రకరణముల సమాహారమగు ద్వితీయ భాగములో 'శక్తికథలు, పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు' అను తెలుఁగు వీరగాథాచక్రములను గూర్చియు, 'బొబ్బిలి వరుస కథలు, పదములు, జంగంకథలు' అను వీరగాథలను గూర్చియు, వీరగాథానికలు లేక లఘువీరగాథలను గూర్చియుఁ, బుఱ్ఱకథాది వీరగాథానుకరణ ప్రక్రియలను గూర్చియుఁ గూలం కషముగాఁ జర్చింపఁబడినది.

### 10. శక్తి కథాచక్రము:–

శక్త్యారాధనము భారతదేశమున నతిప్రాచీన కాలము నుండియుఁ గలదు. శక్తులు అనంత విధములు. ఇవి యన్నియును

నాదిశక్తియొక్క వివిధావతారములే. జానపదులు 'ఎల్లమ్మ, అంకమ్మ, గంగమ్మ, పోలేరమ్మ, ముత్యాలమ్మ' మున్నగు క్షుద్రశక్తుల నారాధింతురు. ఈ యారాధనా రూపములే మన పల్లెలలో జరుపఁబడు గ్రామదేవతల జాతరలు. ఈ జాతరలలో నాయాశక్తుల కథలను మాలమాదిగలు గానము చేయుచుందురు. 'ఎల్లమ్మ కథలు, అంకమ్మ కథలు, చౌడమ్మ పాటలు, పోలేరమ్మ కథ, మాతపురాణము, ఆదిపురాణము లేక ఆరంజోతి కథ' – మున్నగునవి తెలుఁగులో వ్యాప్తియందున్న శక్తి వీరగాథలు. వివిధ శక్తులన్నియును ఆదిశక్తి అపరరూపములే కావున నీ వీరగాథలన్నిటిని నొకేయొక వీరగాథాచక్రముగా భావించుట యుక్తము. ఈ గాథాచక్రమునకు 'శక్తి కథాచక్ర' మని పేరిడవచ్చును. ఇట 'శక్తి' యనఁగా 'ఆదిశక్తి' అని యర్థము. ఈ శక్తి కథాచక్రములో ఎల్లమ్మ కథలును, అంకమ్మ కథలును తమతమ ప్రత్యేకతను జూపుచున్నవి. ఇవి కూడఁ బ్రత్యేక కథాచక్రములుగా నేర్పడియున్నవి.

నేను పరిశోధించినంతవఱకును ఎల్లమ్మ కథాచక్రమునఁ దొమ్మిది గాథలును, అంకమ్మ కథాచక్రమున మూఁడు గాథలును గలవని తెలియుచున్నది. 'మఱ్ఱిచెట్టు కథ, జలగన్నపార్వతి కథ, రేణుక పుట్టుక, రేణుక కల్యాణము లేక రేణుక రాయబారము, గిరిరాజు యుద్ధము లేక రేణుక యుద్ధము, పరశురాముని జననము, పరశురాముని యుద్ధము, గవరమ్మ గాజులు లేక గొంతెమ్మ కథ (గొంతాలమ్మ కథ), జంపన్న వెలుగొండ వెళ్లుట' అనునవి యెల్లమ్మ కథాచక్రములోని వివిధ వీరగాథలు. వీనిని 'పరశురాముని కథ' లనియు, 'గౌతుపురాణ' మనియుఁ బిలుచుచుందురు. 'అంకమ్మ కథ, రవద్దేవిరాజు కథ, గంగురాజు కథ' అనునవి అంకమ్మ కథాచక్ర సంబంధులైన వీరగాథలు. వీనికి 'అంకమ్మ పాంగెము' అని జానపదులలో వ్యవహారము కలదు. ఈ రెండు కథాచక్రములను ఆదిశక్తి కథాచక్రములోని అంతశ్శాఖలుగాఁ దలంపవలెను. చౌడమ్మ పాటలు లఘువీరగాథలనవచ్చును. వీని యితివృత్తములు వరుస క్రమమున లేకుండుటచే నివి గాథాచక్రముగా నేర్పడలేదు. (చౌడు పురాణము' అను తాళపత్ర గ్రంథమున్నట్లు తెలియుచున్నది. అది ద్విపదలో నున్న వీరగాథాచక్రము కావచ్చును.) పోలేరమ్మ కథవంటివి విడిగానున్న శక్తికథలు.

## 11. పల్నాటి వీరకథాచక్రము:–

వీరగాథాచక్రముల సర్వలక్షణములను 'పుణికి పుచ్చుకొన్నది' పల్నాటి వీరకథాచక్రము. ప్రాచీన తాళపత్ర గ్రంథములలో నీ కథా చక్రమునకు 'పలనాటి వీరభాగవత' మనుపేరు కానవచ్చుచున్నది. 'పల్నాటి వీరచరిత్ర' యనుపేరు ఆధునికులు పెట్టినట్టిది. జానపదులీ గాథాచక్రమును 'చెన్నుఁడు కథ' యని పిలుచుచున్నారు. ఇది ఆంధ్రుల చారిత్రక వీరగాథాచక్రము. ఇది క్రీ.శ. 12వ శతాబ్దము నాఁటి సంఘటన. తెలుఁగున లభ్యమగుచున్న వీరగాథలలో నిది ప్రాచీనతమమైనది. ఇంతకన్నఁ బ్రాచీనములైన వీరగాథ లితర భారత సాహిత్యములందును గానరావు. పండ్రెండవ శతాబ్దముకంటెఁ బ్రాచీనమైన వీరగాథలు ప్రపంచమందెచ్చటను లేవని పాశ్చాత్య విమర్శకులు నిర్ణయించినారు. దీనినిఁబట్టి మన పల్నాటి వీరగాథల ప్రాశస్త్యము మఱింత ప్రస్ఫుటమగుచున్నది.

'పల్నాడు' నేఁటి గుంటూరు మండలమున నొక ప్రాంతము. దీనిని క్రీ.శ. పండ్రెండవ శతాబ్దమున హైహయ వంశపు రాజులు పాలించిరి. వీరు కార్తవీర్యార్జునుని సంతతివారు. పల్నాటిసీమను బాలించుటచే వీరిని 'పల్నాటి హైహయు'లందురు. వీరు ఆత్రేయ గోత్రజులనియు, నింటిపేరు 'చాగి (సాగి)' వారనియుఁ దెలియుచున్నది. ఈ పల్నాటి హైహయవంశము క్రీ.శ. 1103 ప్రాంతమున 'మందడి రేవినాయకుఁ' డను సామంతునిచే స్థాపింపఁబడెను. ఈ వంశమునఁ దెలియవచ్చు మొదటి పాలకుఁడు సాగి బేతరాజు (క్రీ.శ. 1103–1110).

ఈ పల్నాటిని క్రీ.శ. 1134 నుండి 1147 వఱకును 'అనుఁగురాజు' ('అలుఁగురాజు') అను హైహయుఁడు పాలించెను. ఇతని పుత్రులే నలగామరాజు, మలిదేవరాజు. వీరు సవతితల్లుల బిడ్డలు. అనుఁగురాజు మరణానంతరము పల్నాటి రాజ్యము విభక్తమయ్యెను. నలగాముఁడు గురిజాలను, మలిదేవుఁడు మాచెర్లను బాలింపఁదొడఁగిరి. శాసనములనుబట్టి నలగాముని పాలనాకాలము క్రీ.శ. 1147–1162. వీరగాథలనుబట్టి యితఁడు 1182 తరువాతఁగూడఁ బాలించెనని చెప్పవచ్చును. 'నాయకురాలు' నామాంతరముగల నాగమ్మ నలగాముని మంత్రిణి. బ్రహ్మనాయఁడు మలిదేవుని మంత్రి. నాగమ్మయు బ్రహ్మనాయఁడును బరస్పరము స్పర్ధాళువులగుటచే నంతర్యుద్ధము (civil war) జరిగెను. ఈ యంతర్యుద్ధము క్రీ.శ. 1178–1182 మధ్యకాలమున జరిగెనని చారిత్రకులు నిర్ణయించిరి. ఇంకను కొందఱు క్రీ.శ. 1181–82 సంవత్సరములలో జరిగెనని నిర్ధారించిరి.

అనుఁగురాజునకుఁ దనకూఁతురు మైలమదేవినిచ్చి పెండ్లిచేసి, పల్నాటిసీమ నరణముగా నిచ్చిన 'చందవోలురాజు'– వెలనాటి రెండవ గొంకరాజు (రెండవ కులోత్తుంగ చోడ గొంకరాజు) గాఁ జారిత్రకులు నిర్ణయించిరి. ఇతని కాలము క్రీ.శ. 1132–1161. ఇతని పుత్రుఁడు వెలనాటి చోడుఁడని నామాంతరము గల రెండవ చోడరాజు (రెండవ కులోత్తుంగ రాజేంద్ర చోడయ). ఇతని కాలము క్రీ.శ. 1161–1181. ఇతఁడు నలగాముని మేనమామ; పిల్లనిచ్చిన మామకూడఁ గావచ్చును. యుద్ధమున నితఁడు నలగామునకు సహాయము చేసినట్లు తెలియుచున్నది.

మలిదేవునకుఁ బిల్లనిచ్చిన 'వీరసోముఁడు' కల్యాణము నేలిన కలచూరి బిజ్జలుని పుత్రుఁడగు సోమేశ్వరుఁడని చారిత్రకుల మతము. 'సోవిదేవ' 'రాయమురారి' అనునవి యాతని బిరుదములు. ఈ

కలచూరి సోమేశ్వరుని కాలము క్రీ.శ. 1165–1177. మలిదేవుని మామయగు వీరసోమునకుఁ గొమ్మరాజను పుత్రుఁడును, అలరాజను పౌత్రుఁడును గలరని వీరగాథలనుబట్టి తెలియుచున్నది. కాని చరిత్రలోఁ గలచూరి సోమేశ్వరుని సోదరుల ప్రసక్తి యున్నది కాని పుత్రపౌత్రులనుగూర్చిన వివరము లేవియును లేవు. కనీసము నామములైనను లేవు. నాకు లభించిన తాళపత్ర గ్రంథములలో వీరసోముఁడు 'చోడవంశమునందు శోభిల్లురాజు, కాశ్మీర గోత్రమున ఘనమైన రాజు' అని వర్ణింపఁబడినాఁడు.

పల్నాటివీర కథలలో నెక్కువ భాగము బ్రహ్మనాయనియందుఁ బక్షపాతమును జూపుచు వ్రాయఁబడినట్టివే. ఇవి బ్రహ్మనాయని నవతార పురుషునిగాఁ జిత్రించినవి. ఈ చిత్రణము నమ్మఁదగినది కాదు. బ్రహ్మనాయని యందును గొన్ని లోపములున్నవి. అతని శీలమునందును గొన్ని నీలినీడలు గానవచ్చుచున్నవి. ఇట్టి నీలినీడలను బ్రదర్శించు వీరగాథలు నాకు లభించినవి. బ్రహ్మనాయఁడు అనుఁగురాజును, దనతండ్రియగు దొడ్డనాయని సంహరించి, నలగాముని సింహాసన మెక్కించెనని Sewell అను చరిత్రకారుఁడు వ్రాసినాఁడు. దీనిని సమర్థించు వీరగాథ నాకు లభించినది. ఇట్లే యలరాజు మరణమునకు బ్రహ్మనాయఁడే ముఖ్యకారకుఁడని నిరూపించు వీరగాథకూడ నాకుఁ బల్నాటిలో లభించినది. బ్రహ్మనాయఁడు, తనకంటెను, తన అన్నయగు పెద్దన్నకంటెను మహాబలశాలియగు నలరాజు నేవిధముగానైనను జంపింపవలెనను కుట్రతో నతనిని గురిజాల రాయబారమునకు పంపినాఁడని యీ వీరగాథలో నున్నది.

నాగమ్మ వీరగాథలలోఁ జిత్రింపఁబడినట్లు దుష్టురాలును, నీచురాలును గాదు. ఆమె అనల్పమగు రాజకీయప్రజ్ఞ కలిగిన బుద్ధిశాలిని. 'నాయకురాలు' ఆమెకు అన్వర్థనామధేయము. ఈ నాయకురాలికిని బ్రహ్మనాయనికిని మధ్యగల రాజకీయస్పర్ధలే పల్నాటి యుద్ధమునకు మూలకారణములు కాని, శైవవైష్ణవ మతభేదము లెంతమాత్రమును కాఁజాలవు. అసలు అట్టి భేదములు ఆ కాలములో లేవు. బ్రహ్మనాయఁడు శివుని బంగారుపువ్వులతోఁ బూజించు నగ్రశ్రేణికిఁ జెందిన శివభక్తుఁడు.

వీరగాథలనుబట్టి బ్రహ్మనాయఁడు జయించినట్లుగాఁ గనబడుచున్నను, స్థానిక చరిత్రలనుబట్టి నలగాముఁడే జయించినట్లు తెలియుచున్నది. యుద్ధావసానమున బ్రహ్మనాయఁడు నలగామునకు మరలఁ బట్టముగట్టినట్లుగఁ గొన్ని వీరగాథలలోఁ గలదు. మఱికొన్ని వీరగాథలలో నలగాముఁడు కొమ్మరాజుచేఁ జంపఁబడెననియు, యుద్ధానంతరము బ్రహ్మనాయఁడు, కన్నమదాసు– వీరిరువురే మిగిలిరనియు, బ్రహ్మనాయఁడు యుద్ధమున మరణించిన వీరులందఱను బ్రతికించి, వారితో గుత్తికొండ బిలమును బ్రవేశించెననియుఁ గలదు. ఈ యుద్ధముతోఁ బల్నాటి హైహయవంశ మంతరించెనని చెప్పవచ్చును. ఈ పల్నాటి ప్రాంతమును కాకతీయులు ఆక్రమించిరి.

ఈ యుద్ధమున మలిదేవుని పక్షమునఁ బోరిన పెద్దన్న, కొమ్మరాజు, బ్రహ్మనాయఁడు, కన్నమదాసు, బాలచంద్రుఁడు మున్నుగువీరులకు మాత్రమే 'పల్నాటి వీరు' లని పేరు. నలగాముని పక్షమునఁ బోరిన వీరులకీ పదము వర్తింపదు. ఈ పల్నాటి వీరుల సంఖ్య అఱువదియాఱు అనుటకు ఎక్కువ ప్రమాణము లున్నవి.

పల్నాటి వీరకథాచక్రములో నొక్క బాలచంద్రుని కథ మాత్రమే పండితలోకమునకుఁ బరిచితమైనది. దీనిని మొట్టమొదట ప్రకటించిన వారు అక్కిరాజు ఉమాకాంతంగారు. ఇది శ్రీనాథ విరచితము. పింగళి లక్ష్మీకాంతంగారు పరిష్కరించిన పల్నాటి వీరచరిత్రలోఁ బదునొకండు వీరగాథలున్నవి. కాని, నా పరిశోధనము వలన నీ కథాచక్రమున సుమారు ఇరువదియైదు వీరగాథలున్నవని తేలినది. వీనిలోఁ బెక్కు కథలు తాళపత్రగ్రంథములందుఁ జివికిపోవుచు, గాథాకారుల జిహ్వాగ్రములయందుఁ గొనయూపిరితో నున్నవి. శ్రీనాథుఁడు, మల్లయ్య, కొండయ్య యను కవులు రచించిన వీరగాథలు కొన్ని నేఁడు లభించుచున్నవి. ఈ కవులలో నొక్కొక్కరు ప్రత్యేకముగా నీ గాథాచక్రమంతటిని వ్రాసియుందురు. కాని యిట్లు ప్రత్యేకముగా నొకే కవి విరచితముగా నున్న సంపూర్ణ గాథాచక్రమేదియు నేఁడు లభించుట లేదు. కొన్ని వీరగాథలొక కవివి, మఱికొన్ని వీరగాథలు వేఱొక కవివి లభించుచున్నవి. నాకు శ్రీనాథవిరచితములై పరుసక్రమమున నున్న పదికథలు లభించినవి. అక్కిరాజువారికిఁ బై ముగ్గురు కవులు రచించిన మూఁడు రకముల బాలచంద్రుని కథలు లభించినవి.

1862 ప్రాంతమునఁ బల్నాటిలోనున్న ముదిగొండ వీరభద్ర కవియను నతఁడు, పల్నాటి వీరగాథల నన్నింటిని ననుసరించి 'వీరభాగవత'మను పద్యకావ్యమును రచించెను. పల్నాటి వీరకథా చక్రముయొక్క సంపూర్ణేతివృత్తమును దెలిసికొనుటకు ఈ పద్యకావ్యము మిక్కిలిగఁ దోడ్పడుచున్నది. మదరాసు ప్రభుత్వ ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారమునను, తిరుపతి శ్రీ వేంకటేశ్వర ప్రాచ్య పరిశోధనా సంస్థ లిఖితపుస్తక భాండాగారమునను, కాకినాడ ఆంధ్ర సాహిత్య పరిషద్గ్రంథాలయమునను(?), గుంటూరు, నెల్లూరు మండలములలో నున్న వీరవిద్యావంతులను గాథాకారుల కడను పల్నాటి వీరగాథలకు సంబంధించిన తాళపత్ర గ్రంథములు పెక్కుగలవు.

గుంటూరు నెల్లూరు మండలములలోఁ బర్యటింపఁగా నాకు నిరువది వీరగాథలున్న మూఁడు పెద్ద పెద్ద తాళపత్ర గ్రంథములు లభించినవి. వీనిలోఁ బెక్కుగాథలు సాహిత్యలోకమునకుఁ బరిచయములేని వినూత్న వీరగాథలు. విజయవాడ విశాలాంధ్ర ప్రచురణాలయమువారు 1961లోఁ బ్రకటించిన పల్నాటివీరచరిత్రలో

'కల్లుప్రతిష్ఠ- బాలచంద్రుని యుద్ధము' అను రెండు వీరగాథలు తప్పఁ, దక్కినవన్నియును మిక్కిలి సంక్షిప్తరూపములు. ఇవి విశ్వసింపఁ దగినవి కావు. వీనికిని జానపదులలో వ్యాప్తియందున్న పల్నాటి వీరగాథలకును నేవిధమగు సంబంధమును లేదు. నేను పరిశీలించినంతవఱకును, పల్నాటి వీరకథాచక్రమున నీ క్రింది వీరగాథలున్నవని తెలియుచున్నది: 1) పెద్దన్న పెళ్లి రాయబారము లేక పెద్దన్న బాదరాజు పెళ్లి కథ, 2) బ్రహ్మనాయుడి పుటక, 3) యాత్రకథ లేక దక్షిణాది యాత్రకథ, 4) పేర్నీడు యుద్ధము లేక పేర్నీడు చందోలు యుద్ధము, 5) తెప్పలినేడు యుద్ధము లేక తెప్పలినేడు ఊరకోట యుద్ధము, 6) ఆరణగండ్ల యుద్ధము లేక బ్రహ్మనాయని ఆరణగండ్ల యుద్ధము, 7) నాయకులరాలి కథ (దీనిలో నసుఁగురాజు మరణమువఱకును నొక కథ, తరువాత బ్రహ్మన మాచెర్లకేఁగుట వఱకును వేఱొకకథ కావచ్చును), 8) అనుఁగురాజు మరణము లేక మైలమ్మ సాగుమానము, 9) రాచగావుకథ లేక శివనందులకోట దోపు, 10) రాజుల పెళ్లికథ, 11) బాలుని పుటక (వివాహమును నిందే కలదు), 12) కోడిపోరు- గోపు ఒఱగు (దీనిలో నైదు కాండలు: కోడిపోరు ఒప్పందము, అర్ధనాల చిట్టిమల్లుడు కథ లేక రావీరపడాలు కోడినిదెచ్చే కాండ, కోడిపూర్వజన్మ, బాలగోపన్న కోడిపందెము లేక పాలవాయి కోడిపందెము, కన్నమనేని యుద్ధము- గోపు సంస్కారము), 13) మందాది వలస కథ, 14) మందపోటు కథ- లంకన్న ఒఱగు, 15) గురిజాల యుద్ధము, 16) అలరాచమల్లు గారి గురిజాల రాయబారము, 17) కల్లుప్రతిష్ఠ, 18) బాలుని కథ (దీనిలో మరల నెనిమిదికాండలు: బొంగరము పుట్టుక, బొంగరాలాట, అంతర్వేదిగాని కథ, సబ్బాయి చాటువ, మాంచాల మేడ సవరణ, అనపోతురాజు ఒఱగు, మేళ్లవాగు యుద్ధము, కారెంపూడి యుద్ధము), 19) బాలుని యుద్ధము - ఉత్తరకాండము- మరణము, 20) గుఱ్ఱాల సవరణ లేక గుఱ్ఱాల చాటువ, 21) అమ్మవారి పుటక, 22) కొమ్మరాజు యుద్ధము, 23) పేర్నీడు సన్నిగళ్ల యుద్ధము, 24) కన్నమనీఁడు చింతపల్లి యుద్ధము, 25) కల్లిపాడు కథ లేక కల్లి ఒఱగు (బ్రహ్మన్న విఱుగు).

ఈ పల్నాటి వీరకథలను పిచ్చుకుంట్లు పాడుదురనుట తప్పు. పిచ్చుకుంట్లకు ఈ కథలను బాడెడి హక్కులేదు. వీనిని బాడువారు 'వీరవిద్యావంతు' లనఁబడెడి మాలలు. వీరిని 'పల్నాటివారు' అనియుఁ బిలుచుట కలదు. వీరు గుంటూరు నెల్లూరు మండలములలో వ్యాపించి యున్నారు. ఈ వీరకథాగానమున వీరజోడు (పంబజోడు), తిత్తి, కత్తి, డాలు నుపయోగింతురు. ప్రధాన గాథకుఁడు పల్నాటి వీరుని వలెఁ బంగ్రెండు బిరుదులతో వేషమును ధరించును. ఈ వీరవిద్యావంతులకు యుద్ధక్షేత్రమగు కారెంపూడిలో గురుపీఠమున్నది. "పిడుగువారు" అను నియోగి బ్రాహ్మణులు దీనికధిపతులు. వీరిని 'పల్నాటి వీరాచార పీఠాధిపతు' లందురు. పల్నాటి వీరారాధన మొక ప్రత్యేక మతముగా నాచరింపఁబడుచున్నది. ఈ వీరారాధకులు అన్ని కులములలోను గలరు. వీరిని 'ఆచారవంతులు' అందురు. వీరందఱికిని పీఠాధిపతియే గురువు. యుద్ధక్షేత్రమగు కారెంపూడిలో పల్నాటివీరుల గుడియున్నది. ఈ గుడిదగ్గఱఁ బ్రతిసంవత్సరమును కార్తిక మాసములో వీరోత్సవము జరుగుచున్నది.

## 12. కాటమరాజు కథాచక్రము:-

ప్రాచీనమును బ్రశస్తమును నగు చారిత్రక వీరగాథలలోఁ బల్నాటి వీరకథల తరువాత నెన్నఁదగినవి కాటమరాజు కథలు. ఇవి యొక సుదీర్ఘ కథాచక్రముగా నేర్పడి యున్నవి. కాని, పల్నాటి వీరకథలపై జరిగినంత పరిశోధనము వీనిపై జరగలేదు. అందుచే నీ వీరగాథావృత్తములోని పెక్కుగాథలు సాహిత్యలోకమునకు అపరిచితములుగ నుండిపోయినవి. తెలుఁగు వీరగాథలలో నింతపెద్ద గాథావృత్తము మఱియొకటి లేదు. దీనిలో మొత్తము ముప్పదిరెండు వీరగాథలున్నవని నా పరిశీలనము వలనఁ దేలినది. యథాక్రమమున వాని నామములు: "వల్లురాజు కథ (వలురాజు కథ లేక ఆవుల వలురాజు కథ), పంపాద్రి కథ, పెద్దిరాజు కథ, సింహాద్రిరాజు కథ, ఎఱనూకరాజు కథ, నలనూకరాజు కథ, పోలురాజు కథ (ఈ పోలురాజు కథలో మరల నాఱు భాగములు: చంద్రగుప్తుని చాటువ, మల్లికాదేవి చాటువ, ముక్కంటి చాటువ లేక బ్రాహ్మణ చాటువ, జంగాల చాటువ, కపోత చాటువ, గయుఁడు చాటువ), బల్లికురువ పోట్లాట, కఱియావులరాజు కథ, కాటమరాజుకు పట్నంకట్టిన కథ లేక కాటమరాజు పట్టాభిషేకము, పాపనూక కథ, ఆవులమేపు (దీని నామాంతరములు: 'ఉత్తరాది ఆవులమేపు, కాటమరాజు ఉత్తరాది ఆవులమేపు, ఆవులమేపులు- ఉత్తరకాండము'), పాలేటికథ లేక గంగతర్కము లేక గంగ- కాటమరాజు తరకవాదము, ఎఱ్ఱయ్య తరక వాదము, జన్నివాడకథ (దీనికి నాలుగు నామాంతరములున్నవి: 'దక్షిణాది ఆవులమేపు, ఆవులమేపులు- దక్షిణకాండము, చదరంగం కథ, పుల్లరి కథ), భట్టుబారము లేక కల్లిరాయబారము, కోటపాటి తాటివృక్షం తెచ్చే కథ, బొంగరాల కథ (దీనికి మూఁడు నామాంతరములు: 'ముమ్మయ్య- పోచయ్య బొంగరాలు, వేడుక బొంగరాల కథ, అలుగుల పోలు'), ఎఱ్ఱగడ్డపాటి పోట్లాట- [దీనిలో ఏడు కాండలున్నవి: చల్లవారి జగడము (నామాంతరములు: 'ఈర్లమాని కథ, తిక్కనామాత్యుని కథ'), బొల్లావు జగడము, బీర్నీడు యుద్ధము, కఱియావులరాజు యుద్ధము, బాలరాజుల యుద్ధము, ఆవుల యెద్దుల జగడము- ఎఱ్ఱయ్యల యుద్ధము, కాటమరాజు యుద్ధము], అగుమంచి కథ, భక్తిరన్న కథ". ఈ కథలన్నియును తాళపత్రరూపమున యాదవగాథాకారుల యిండ్లలో నున్నవి. ఇవి కాక, "పాపనూక వలపోత"- "అగుమంచి వలపోత"- "పల్లికొండ పుటక"- "గంగ పుటక" - "భైరవ కురువ యుద్ధము" అను కథలు కూడ ప్రచారమున నున్నట్లు తెలియుచున్నది. (ఇటీవల "పాపనూక వలపోత" యను కథను ప్రొ॥ ఎం. జయదేవ్‌గారు సేకరించిరి.)

కాటమరాజు చంద్రవంశ క్షత్రియుఁడు. ఇతఁడు విష్ణుమూర్తికి డెబ్బది నాల్గవ తరమువాఁడనియు, శ్రీకృష్ణుని కిరువది మూఁడవ తరమువాడనియుఁ గొన్ని వీరగాథలలో నున్న వంశవృక్షములనుబట్టి తెలియుచున్నది. ఈ సుదీర్ఘ వీరగాథాచక్రమునఁ గాటమరాజు పితామహుఁడగు నావుల వలురాజునుండి కాటమరాజువఱకును–మూఁడు తరములకు సంబంధించిన ముప్పది రెండు వీరగాథలున్నవి. (ఇటీవలి పరిశోధనలలో కాటమరాజు ప్రపితామహుఁడగు "కవులావుల గంగురాజు కథ" కూడ తెలంగాణమున లభించినది.) ఈ వీరగాథలన్నియుఁ బరస్పర సంబంధమును గలిగి,చక్కని వరుస క్రమములో నొక పెద్ద యితిహాసమువలె నున్నవి.

ఎలమంచిని బాలించు 'కవులావుల గంగురాజు'నకు 'గంగమ్మ' యను భార్యయందు 'వలురాజు, హరిపాలుఁడు, నందగోపాలుఁడు, గోవర్ధనుఁడు' అను నల్వురు పుత్రులు పుట్టిరి. వీరందఱును 'ఖండె మొండెముల కోట' నేలు 'కలభూత గంగురాజు'తో యుద్ధము చేసి మరణించిరి. ఆవుల వలురాజు భార్య 'వల్లమ్మ'. ఈ దంపతులకు 'సింహాద్రిరాజు, పెద్దిరాజు, ఎఱనూకరాజు, నలనూకరాజు, పోలురాజు' అను నైదుగురు పుత్రులును, 'కొమరమ్మ' లేక 'కొమరక్క' యను కుమార్తెయుఁ గలిగిరి. వల్లురాజు తరువాత జ్యోతిష్కుల యాదేశమునుబట్టి ద్వితీయపుత్రుఁడగు పెద్దిరాజు సింహాసనమెక్కెను. ఇతఁడు ఎలమంచిని బదేండ్లు పాలించెను. తరువాత నితఁడు సోదరులతోఁగలిసి పంపాద్రికిఁ దరలివచ్చెను. పంపాద్రిలో నేడేండ్లు పాలించెను.

పెద్దిరాజునకుఁదప్పఁ, దక్కిన యన్నదమ్ములందఱకును సతానము కలిగెను. పెద్దిరాజు నతని భార్య పెద్దమ్మయు సంతానార్థమై కల్యాణపట్టణములోనున్న సోమేశ్వరుని సేవింపఁబోయిరి. అట పెద్దిరాజునకుఁ 'గాటమరా'జను పుత్రుఁడును, 'పాపనూక' యను పుత్రికయుఁ గలిగిరి. పాపనూక దుష్టనక్షత్రమున జన్మించినది. అందుచేఁ బెద్దిరాజు వాలికేతువరాజుతో యుద్ధముచేసి 'ఆర్లపెంట' రణరంగమున నిహతుఁడయ్యెను. ఏడేండ్ల బాలుఁడైన కాటమరాజు వాలికేతువరాజుపై దండెత్తి యాతనిఁ జంపి, తండ్రి పగఁదీర్చుకొనెను. పెద్దమ్మ సహగమనము చేసెను.

సరిగా పెద్దిరాజు మరణించు సమయమునకే యాతని సోదరులు నలుగురును వివిధ స్థలములలోఁ, బరోపకారార్థము యుద్ధములుచేసి తమతమ శరీరములను త్యజించిరి. సింహాద్రిరాజు శ్రీకూర్మముపై దండెత్తి సింధుభళ్లాని రాజుతోఁబోరి చనిపోయెను. ఎఱనూకరాజు ఏనుగనాథుని కొండకుఁబోయి ఎఱ్ఱభూపతితో యుద్ధముచేసి చనిపోయెను. నలనూకరాజు నున్నబెజవాడకుఁబోయి దానిని బాలించు నందికేశవరాజుతోఁ బోరి మరణించెను. పోలురాజు చెఱుకూరి దగ్గఱ, శ్రీరంగపట్టణమేలు చోడానిచేఁ బంపఁబడిన ముక్కంటితో యుద్ధముచేసి మడిసెను.

సింహాద్రిరాజు భార్య 'సింహాద్రిసీత'. ఈ దంపతులకు 'కఱియావుల రాజు' అను కొడుకును, 'చిట్టినూక' యను కూఁతురును బుట్టిరి. కఱియావులరాజు ఓరుగంటి ప్రతాపరుద్రుని సేనానియగు బేతాళునితో నేకాంగి కయ్యముచేసి జయించెను. ఇతని భార్యపేరు 'నాగమాంబిక' లేక 'కఱియావుల నాగ'. చిట్టినూక భర్తపేరు 'కల్లందుల పోలినేఁడు'. ఇతఁడు భైరవ కురువ యుద్ధములోఁ జనిపోయినాఁడు. చిట్టినూక భర్తతో 'సాగుమానము' చేసినది. ఈ దంపతులకు 'పోచయ్య' యను పుత్రుఁడు కలఁడు.

ఎఱనూకరాజు భార్య 'ఎఱనూక సీత'. వీరి పుత్రుఁడు భట్టావులరాజు. ఇతఁడు ఓరుగల్లులో బేతాళుని తమ్మునితో నెక్కటికయ్యము చేసి యతనిఁ బరిమార్చినాఁడు. ఇతని భార్య పేరు 'సూరమ్మ' లేక 'సూరమాంబిక'.

నలనూకరాజు భార్య 'నలనూక సీత'. వీరి కొడుకు పెయ్యల యెఱ్ఱయ్య. ఇతఁడు పాలేటికడ గంగతో వాదించును. ఇతని భార్య 'భయ్యమాంబిక'.

పోలురాజు భార్య 'సిరిదేవి'. వీరికి 'భక్తిరన్న, అయితమరాజు, ముమ్మయ్య' అను ముగ్గురు కొడుకులును, 'అగుమంచి' లేక 'అక్కన్న' అను కూఁతురును గలరు. 'పల్లికొండ' పోలురాజునకు మంత్రి. పోలురాజు చెఱుకూరికడ మరణింపఁగా, పల్లికొండ బాలరాజులను దీసికొని పంపాద్రికిఁ బోవుచుండెను. మార్గమధ్యమున 'బల్లికురువ' దగ్గఱ ముక్కంటి మనుమలు బాలరాజుల నెదిరించిరి. పల్లికొండ బొల్లావును బ్రార్థింపఁగా, నదివచ్చి శత్రువులును తఱిమివేసినది.

పోలురాజు పుత్రులలో నయితమరాజు మొదట ఎలమంచికి, తరువాత దొనకొండకుఁ బాలకుఁడయ్యెను. పెద్దవాఁడగు భక్తిరన్న ('బత్తినన్న' యని జానపదుల యుచ్చారణ) కాశికిఁబోవుచుఁ, గల్యాణపట్టణములోనున్న కాటమరాజును పాపనూకను దెచ్చి ఎలమంచిలో నుంచెను. విష్ణుస్వరూపుఁడగు కాటమరాజునకు గోగణము నంతటిని నిచ్చి పట్టము కట్టిరి. అతఁడు శ్రీశైల ప్రాంతమునఁ బశువులను మేపుకొనుచుండెను. పెయ్యల యెఱ్ఱయ్య, పద్మరాఘవుఁడు నతనితోనుండిరి. పాపనూక దుష్టనక్షత్రమున జన్మించుటచే నామెను దొనకొండ నగరము బయట నొకమేడలో నుంచిరి.

భక్తిరన్న భార్య 'నల్లమేడ' లేక 'నల్లమాంబ'. ఈ భక్తిరన్న కాశికిఁబోయి వల్లురాజునకును, పెద్దిరాజాదులకును, వారివారి భార్యలకును, మంత్రులకును, మంత్రులభార్యలకును గయలోఁ బిండ ప్రదానముచేయును. ఇతఁడు కాశిలోనుండఁగాఁ, గాటమరాజాదులు ఎఱ్ఱగడ్డపాటి పోట్లాటలోఁ గూలిరని తెలిసి, వెంటనే మేఘరథములో దొనకొండకు వచ్చి, పాపనూకను మేడనుండి తప్పించుటకు యత్నించి విఫలుడై, యాదవకాంత లందఱకును సహగమనము చేయ

నాజ్ఞాపించి, తానెఱ్ఱగడ్డపాటికిఁబోయి, సోదరులకు నితర బంధువులకును బాలేటిలోఁ బిండ ప్రదానము చేయును.

అయితమరాజు మొదట ఎలమంచికి, తరువాత దొనకొండకుఁ బాలకుఁడు. ఇతని భార్య 'నేతివారి పోతు'. ఈ దంపతులకు 'అల్లు దాడెన్న' అను కొడుకును, 'సిరిగిరమ్మ' యను కూఁతురును గలరు. యుద్ధసమయమునఁ దమ వంశాంకురమును నిలుపుకొనుటకై యాదవులు ఈ యల్లు దాడెన్నకుఁ గొంతసైన్యమును సహాయముగా నిచ్చి కటకమునకుఁ బంపివేసిరి. అయితమరాజు తన పుత్రికయగు సిరిగిరమ్మను జిట్టినూక కుమారుఁడగు పోచయ్యకిచ్చి పెండ్లిచేసెను. పోలురాజు తృతీయ పుత్రుఁడగు ముమ్మయ్య భార్యపేరు 'చిన్నమల్లు'. ఈ ముమ్మయ్యయుఁ బోచయ్యయు యుద్ధసమయమున దొనకొండలో బొంగరము లాడుదురు.

పోలురాజు పుత్రికయగు నగుమంచి లోకోత్తర సౌందర్యవతి. ఈమె భర్తపేరు పుత్తమరాజు. ఇతఁడీమెకు మేనత్త కొడుకు (కొమరమ్మ పుత్రుఁడు). ఈ పుత్తమరాజు ఓరుగల్లులోఁ బ్రతాపరుద్రుని పెంకెగుఱ్ఱమును స్వారిచేసిన వీరుఁడు. అగుమంచి– పుత్తమరాజుల పెంపుడు కొడుకు పోచయ్య. పోచయ్య పసిబాలుఁడుగా నున్నప్పుడు అతని తల్లియగు చిట్టినూక సహగమనము చేయుటచే నా బాలుని అగుమంచి పెంచి పెద్దచేసినది.

పెద్దిరాజాదుల సోదరియగు కొమరక్క లేక కొమరమ్మ భర్తపేరు 'పందుముల పాపినాయఁడు'. ఇతఁడు పోలురాజుకడ మంత్రి. పల్లికొండ కొమరక్కకుఁ బెంపుడు కొడుకు. 'పుత్తమరాజు, నాచకూళ్ల నాయఁడు' కొమరక్కకు నిజపుత్రులు. 'చట్టువారి యెఱ్ఱయ్య, పుల్లావుల కేశవయ్య' అను మఱియిరువురుకూడ నీమె పుత్రులుగా వీరగాథలనుబట్టి తెలియుచున్నారు. కొమరమ్మ సంతతిలోఁ బల్లికొండ వరపుత్రుఁడు. ఇతఁడు మొదట వల్లురాజునకును, దరువాత పోలురాజునకును, బిమ్మట అయితమరాజునకును మంత్రిగానున్నాఁడు. పుల్లావుల కేశవయ్య కఱియావులరాజుకడ మంత్రిగానున్నట్లు తెలియుచున్నది. చట్టువారి యెఱ్ఱయ్య కోటపాడునుండి తాటివృక్షమును బెకలించి తెచ్చిన మహావీరుఁడు. నాచకూళ్లనాయఁడు పాపనూకను బెండ్లాడవలసినవాఁడు. కాని ఆమె దుష్టనక్షత్రమున జన్మించుటచే నా పెండ్లి తప్పిపోయినది.

శ్రీశైలముకడ నావులను మేపుచున్న కాటమరాజు, అక్కడ క్షామము వచ్చుటచే దక్షిణ భూములకుఁ దరలి వచ్చుచుండెను. కనిగిరిసీమలోఁ బాలేటి యొడ్డున గంగతోఁ గాటమరాజు తర్కవాదమును జరపినాఁడు. మొదట వ్యతిరేకించినను జివరకు ఆమెకుఁ జేయెత్తి మ్రొక్కినాఁడు. ఆలమందతో నెల్లూరిసీమలోఁ బ్రవేశించి, నల్లసిద్ధిరాజుతోఁ బుల్లరియొప్పందము చేసికొనెను. తన యాలమందకు బోయలచే నష్టము వాటిల్లుటచే, నల్లసిద్ధికిఁ బుల్లరి నీయక, తిరిగి 'ఎఱ్ఱగడ్డపాటికి వచ్చెను. నల్లసిద్ధిరాజు పంపిన భట్టురాయబారము ఫలింపలేదు. ఎఱ్ఱగడ్డపాడులో జరిగిన ఘోరయుద్ధములోఁ గఱియావులరాజు– ఎఱ్ఱసిద్ధిరాజుతోను, భట్టావులన్న– పాపసిద్ధిరాజుతోను, అయితమరాజు– గండగోపాల రాజు కస్తూరిరాజులతోను, ముమ్మయ్య– ఉండవెల్లి విరిగోపుతోను, నాచకూళ్లనాయఁడు– గుత్తి భీమునితోను, పోచయ్య– తిర్ణమల తిప్పయ్యతోను, కాటమరాజు– నల్లసిద్ధిరాజుతోను బోరాడిరి. కడకు యుద్ధమున యాదవులు జయించిరి. కాటమరాజు తన పగఁ దీర్చు కొనెను.

ఈ కథాచక్రమున నల్లసిద్ధిరాజు, ఖడ్గతిక్కన చారిత్రక వ్యక్తులు. ఓరుగంటి ప్రతాపరుద్రుని ప్రసక్తి కల వీరగాథలును నాకు లభించినవి. పల్నాటి యుద్ధము క్రీ.శ. 12వ శతాబ్ది చతుర్థ పాదమున జరుగఁగా, కాటమరాజు ఎఱ్ఱగ్గపాటి పోట్లాట క్రీ.శ. 13వ శతాబ్ది చతుర్థ పాదమున జరిగినది. ఇది కాకతీయ మహారాజ్ఞి రుద్రమదేవి పాలనాకాలము చివరిభాగమున, ననఁగాఁ బ్రతాపరుద్రుఁడు యువరాజుగా నున్నప్పుడు జరిగినదని శాసనాధారములనుబట్టియు, వీరగాథలనుబట్టియుఁ దెలియుచున్నది. అనఁగాఁ గాటమరాజు– నల్లసిద్ధిరాజుల యుద్ధము క్రీ.శ. 1280–1289 మధ్యకాలములో జరిగినది. మనుమసిద్ధియే నల్లసిద్ధి యనుట సరికాదు. మనుమసిద్ధి పుత్రుఁడు నల్లసిద్ధి. ఇతఁడు నెల్లూరును బాలించిన తెలుఁగు చోళుఁడు. ఇతని పాలనాకాలము: క్రీ.శ. 1270/75–1297. ఈ నల్లసిద్ధియే కాటమరాజునకుఁ బ్రత్యర్థి.

నెల్లూరు రాజ్యములోని పచ్చికబీళ్లలోఁ దన గోగణమును మేపుకొనుటకుఁ గాటమరాజు నల్లసిద్ధితోఁ బుల్లరియొడంబడికను జేసికొనెను. నెల్లూరిసీమలో నున్నంతకాలమును దనమందలోఁబుట్టిన కోడెదూడలను నల్లసిద్ధి కిత్తునని యొప్పుకొనెను. కాని యతఁడొడంబడికను మీఱి, పచ్చికబీళ్లనే కాక వరిపొలములను సహితము మేపివైచెను. నల్లసిద్ధిభార్య కుందమాదేవి, బోయలచేఁ గాటమరాజుగారి యాలమందను బొడిపించెను. నల్లసద్ధికి ఈ విషయము తెలియదు. ఈ గోహత్యను నల్లసిద్ధియే చేయించెనని కాటమరాజు భావించి, దీనికిఁ బ్రతిక్రియగాఁ బుల్లరి నెగవేసెను. అందుచే నిర్వురకును యుద్ధము సంభవించెను.

ఈ కాటమరాజు కథాచక్రమును శ్రీనాథుఁడు రచించినట్లుగా జనశ్రుతియే కాక, కొందఱు గాథాకవుల వాక్యములును సాక్ష్యమిచ్చుచున్నవి. కాని శ్రీనాథుని పేరుతోనున్న వీరగాథ యొక్కటికూడ నేఁడు లభించుట లేదు. గంగుల పినయెల్లయ్య రచించిన యెఱ్ఱగడ్డపాటి పోట్లాటను వేటూరి ప్రభాకరశాస్త్రిగారు పరిష్కరించిరి. ఇందుమూఁడు వీరగాథలున్నవి. మద్రాసు, తిరుపతి ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములలో నైదు కథలు మాత్రమే కలవు.

తక్కిన కథలన్నియును బ్రజలలోనే యున్నవి. నేను సుమారుగ నిరువది కథలకు సంబంధించిన తాళపత్ర గ్రంథములను సంపాదించితిని. ఈ ప్రతులవలన పైన తెల్పిన గంగుల పినయెల్లయతోపాటు మఱియార్గురు ప్రాచీన జానపదకవులు వెలుఁగునకు వచ్చిరి. వారిపేర్లు: "మద్దులేటికవి, మల్లయ్య, కనకబండి ఘట్టయ్య, కట్టెబోయిన మారయ్య కవి, మంగళపురి (కదిరి మంగళం) వెంకటాద్రి, జరుగుపల్లె చెన్నయ్య".

ఈ కాటమరాజు కథలను 'కామ్ములవారు' అను మాదిగలు పాడుచుందురు. వీరు యాదవులను యాచించి జీవింతురు. యాదవులలోఁ గొన్ని శాఖలవారును ఈ కథలను బాడుచున్నారు. వీరిని 'సుద్దుల గొల్లలు'– 'తెరచీర భక్తులు' అను నామములతో వ్యవహరింతురు.

యాదవుల కులదైవము గంగ. ఈమె ఆంధ్రదేశమునఁగల ప్రధాన గ్రామదేవతలలో నొకతె. కొన్ని గ్రామములలో నీగంగకు జాతరలు అతివైభవముగా జరుపుదురు. ఇట్టి గంగజాతరలలోఁ గాటమరాజుకథలు పాడుట యాచారము.

'ఎల్లమ్మ కథలు, అంకమ్మ కథలు, పల్నాటి వీరకథలు, కాటమరాజు కథలు'– అను నీ నాల్గు వీరగాథా చక్రములలోను సంవాది సంఘటనలు హెచ్చుగా నున్నవి. తెలుఁగులో నీ నాల్గు గాథాచక్రములతోపాటు రాయలసీమలో జంగములు పాడుచున్న 'వెలకంటి వీరుని కథాచక్ర'మొకటి వ్యాప్తియందున్నదని తెలియుచున్నది.

## 13. బొబ్బిలివరుస కథలు:–

నెలల తరబడి పాడఁబడు వీరగాథాచక్రముల తరువాత, రెండు మూఁడు రాత్రులలోఁ బాడఁబడు వీరగాథలను బరిశీలింపవలసి యున్నది. ఈ వీరగాథలలో 'బొబ్బిలివరుస కథలు, పదములు, జంగం కథలు' అను మూఁడు ప్రధాన విభాగములను, గుర్తింపవచ్చును. బొబ్బిలికథ వరుసలోను (8+8+9/10 మాత్రలు ఒక పాదము), తద్భేదములలోను (8+8 మాత్రలు ఒక పాదముగాను, లేదా 8+9/10 మాత్రలు ఒక పాదముగాను) నుండు వీరగాథలన్నియును 'బొబ్బిలివరుస కథ' లనఁబడును. ఇవి యెక్కువగాఁ జారిత్రక సాంఘిక సంఘటనా జనితములు. 'హరిహరీ నారాయ ణాదినారాయణా, కరుణించి మమ్మేలు కమల లోచనుడ' అను జంపెవరుసలో (5+5+5+5; 5+5+5+3 మాత్రలు ఒక పాదముగా) నుండు కథలును, శారదవరుసలో (3+5+5+3 మాత్రలొక పాదముగా) నుండు కథలును పదములనఁబడును. రగడలు, పద్యములు, దరువులు, కీర్తనలు– కలిగి, యక్షగానములను హరికథలను బోలిన రచనలు జంగంకథలు. పదములు, జంగంకథలు ప్రధానముగాఁ బౌరాణికేతివృత్తములను గలిగియుండును.

బొబ్బిలివరుస కథలను నాలుగు వర్గములుగా విభజింప వచ్చును: 'చారిత్రకములు, సాంఘికములు, జానపదములు, పౌరాణికములు'. ఇందుఁ జారిత్రకములలో 'స్పష్ట చారిత్రకములు, అస్పష్ట చారిత్రకములు' అను రెండంతశ్శాఖలు గలవు. అట్లే యితివృత్తములనుబట్టి సాంఘికవర్గములోఁ 'బేరంటాండ్రు, సాహసికులు, బందిపోట్లు, గజదొంగలు, గ్రామకక్షలు– హత్యలు, కుటుంబ కలహములు, లేచిపోవుటలు' అను ఏడు అంతశ్శాఖలను గుర్తింపవచ్చును.

బొబ్బిలి కథ, దేసింగురాజు కథ, జగపతిరాజు కథ, (లేక పెద్దాపురం కోడిపుంజుల కథ), కొమార రాముడి కథ, రాణీశంకరమ్మ కథ, సదాశివరెడ్డి కథ, నల్ల సోమనాద్రి కథ, (లేక గద్వాల సోమనాద్రి కథ), రాజా రామేశ్వరరావు కథ, కర్నూలు నవాబుకథ, ఉయ్యాలవాడ నారసింహారెడ్డి కథ– మొదలగు నవి స్పష్టచారిత్రక వీరగాథలు. బంగారు తిమ్మరాజు కథ లేక దేవరాయలు కథ, ముగ్గురు మరాటీల కథ లేక ఆరె మరాటీల కథ, బాలనాగమ్మ కథ, కుంటిమల్లారెడ్డి కథ, వేమనకథ, బల్మూరి కొండల్రాయుడి కథ– మొదలుగనవి అస్పష్టచారిత్ర వీరగాథలు.

కన్యకామ్మవారి కథ, కామమ్మ కథ, సన్యాసమ్మ కథ, మండపేట పాపమ్మ కథ, శృంగవరపుకోట యెఱుకమ్మ కథ, లక్ష్మమ్మ కథ, సాసువుల చిన్నమ్మ కథ, వీరరాజమ్మ కథ, నల్లతంగాళ్ కథ, తిరుపతమ్మ కథ, ఎఱుకల నాంచారి కథ, రావులమ్మ కథ, సరోజని కథ, ఈడిగ దేవమ్మ కథ, అంజమ్మ కథ, ఉయ్యూరు వీరమ్మ కథ లేక గొల్లల వీరమ్మ కథ, గూడూరు నారాయణమ్మ కథ, సతీ రంగమ్మ కథ మున్నగునవి సాంఘిక వీరగాథలలోఁ బేరంటాండ్ర శాఖకుఁ జెందినవి. సర్వాయి పాపఁడు కథ, చిన్నపరెడ్డి కథ 'సాహసికు'లను శాఖకుఁజెందును. బందిపోట్ల శాఖలో 'మలగర బాలేసాబుకథ' పేర్కొనఁదగినది. మియ్యాసాబు కథ, పండుగ శాయన్న కథ, నక్కపల్లి రాముఁడు కథ, దువ్వన్నదొర పాట– ఇత్యాదులు 'గజదొంగల'ను శాఖకుఁజెందును. 'గ్రామకక్షలు–హత్యలు' అనుశాఖలో కుంటి పుల్లారెడ్డి కథ, యల్లమంద నాయుఁడు కథ, చెన్నకృష్ణారెడ్డి కథ, దొర్నిపాడు వెంకటరెడ్డి కథ, పరిగ రామకృష్ణా రెడ్డి కథ. సుబ్బిరెడ్డి కథ, ఒడ్డుకింద భయ్యారెడ్డి కథ పేర్కొనఁ దగినవి. కండెపు సుబ్బయ్యగారి కథ 'కుటుంబ కలహము'లను శాఖకును, మందలోడు కథ 'లేచిపోవుట' (elopement) అను శాఖకును జెందును.

గాంధారికథ, కాంభోజరాజు కథ, కమ్మవారి పణతి–పసల బాలుఁడు కథ, ఎలనాగిరెడ్డి కథ, రక్త కొమారుఁడు కథ, రత్నాంగి కథ, కాశీమజిలీ కథలు మొదలగునవి జానపద కథలు. రామ కథాసుధార్ణవము, ఆండాళ్ చరిత్రము లేక శ్రీరంగ మాహాత్మ్యము, వరాహావతార చరిత్రము లేక పందికథ, పెద్దకాపుగారి కథ, వేంకటేశ్వరుని కథ, మల్లికదేవమ్మ కథ, జరాసంధుని కథ,

కౌశాంబిరాజు కథ, పర్వతాల మల్లారెడ్డి కథ, కొమిరెల్లి మల్లన్న కథ- ఇత్యాదులు పౌరాణిక వర్గమునకుఁ జెందిన బొబ్బిలివరుస కథలు.

మొత్తముపై బొబ్బిలివరుస కథలలో నర్ధభాగము కవిత్వము, నర్ధభాగము సంగీతము నుండును. అందుచే వీనికిఁ బాడునప్పుడు ఉన్నంత రసపరిపుష్టి చదువునప్పుడు ఉండదు. పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను, సంగీతముకన్న సాహిత్యమునకెక్కువ ప్రాధాన్యముండుటచే నవి పాడునప్పుడేకాక, చదువునప్పుడును రసవంతములుగనే యుండును. బొబ్బిలివరుసకథ లిట్లు కాక, తంబుఱ శ్రుతితో, గుమ్మెట్ల లయతోఁ బాడునప్పుడు మాత్రమే హృదయావర్జకములుగ నుండును. కథాప్రధానములగుటచే వీనిలో రసవద్ఘట్టములుగూడ నక్కడక్కడ మాత్రమే గోచరించును.

## 14. పదములు- జంగంకథలు:-

వీరగాథలలో బొబ్బిలివరుస కథల తరువాత నెన్నఁదగినది 'పదములు-జంగంకథలు'. ఇందుఁ బదములు రెండు విధములు: 'హరిహరీ పదములు, శారద పదములు'. 'హరిహరీ నారాయ ణాది నారాయణా, కరుణించి మమ్మేలు కమలలో చనుఁడ' అను వరుసతోను, పునరావృత్తితోను నుండునవి హరిహరీ పదములు. ఇవి ఖండగతి ద్విపదచ్ఛందముల సమ్మేళనమున నేర్పడినవని చెప్పవచ్చును. ఈ వరుసలోఁ బాదమునకు రెండు దళములుండును. మొదటి దళమున మాత్రల క్రమము '5+5+5+5' గాను, రెండవ దళమున '5+5+5+3' గాను నుండును. హరిహరీపదము లన్నియును బౌరాణికేతివృత్తములను గలిగియుండును- ముఖ్యముగా రామాయణ సంబంధము లెక్కువ. ఈ పదములు పాడునప్పుడే కాక చదువునప్పుడు సహితము రసతృప్తి నీయఁగల కవితాపుష్టిగల రచనలు. ఇవి దేశిసాహిత్యమునకు శిరోభూషణములని విమర్శకుల మెచ్చుకోలు! పసగాడ సన్యాసివంటివారు ఉత్తమ పదకవులు. ఈ హరిహరీ పదములు క్రీ.శ. 1850 నుండి విశాఖ మండలమున విజృంభించినవి.

శారద పదములు, హరిహరీ పదములంత ఉన్నతమైనవి కావు. ఇవి నృత్తప్రధానమగు దరువులు. అంత్యప్రాస నియమముతోఁ బాదమునకు 3+5+5+3 మాత్రలతో సాఁగు రచనలు (కొన్ని పాదములు 5+5+3 గా సాగుటకూడఁ గలదు). ఇవి యెక్కువగా నటతాళమునఁబడు నడకను గలిగియుండును. ఈ శారద పదములను తెలంగాణమున శారదకాండ్రు పాడుచుందురు.

జంగంకథలోఁ బ్రధాన కథాభాగము 'రగడ' యను ఛందమున సాఁగును. బొబ్బిలికథలోని వరుసకు యతిప్రాసలు బిగించుటచే నీ జంగంరగడ యేర్పడినదని నా నమ్మకము. ఈ రగడలోఁ బాదమునకు 8+8+9 లేదా 10 మాత్రలుండును. మన జంగంకథలు మహారాష్ట్రుల కాలక్షేపములకుఁ బ్రతిబింబములని కొందఱు విమర్శకుల తలంపు. ఈ జంగంకథలు హరిహరీ పదములంత ప్రాచీనములైనవి కావు. 20వ శతాబ్ది ప్రారంభమున గుంటూరు మండలమునఁ దలయెత్తినవి. జంగంకథకు హరికథతోను, యక్షగానముతోను, తెలంగాణమందలి చిఱుతల కథలతోను మిక్కిలి సన్నిహిత సంబంధమున్నదని చెప్పవచ్చును. ముద్రితములైన జంగంకథలు కొల్లలు. కవిత్వ విషయమున మాత్రమివి గుల్లలు. రసవద్రచన నూటికికోటికి నొకటి ప్రత్యక్షమగుచుండును. తంబుఱ గుమ్మెటల యార్భాటముతోఁ బాడునప్పుడు మాత్రమే యివి రసవంతములు. వీనిని జదివి యానందించుట కష్టము.

## 15. వీరగాథానికలు లేక లఘువీరగాథలు:-

ఒక అరగంటలోపులోఁగాని, లేదా కొలది నిమిషములలోఁ గాని పాడఁబడు గేయకథలు 'వీరగాథానికలు' లేక 'లఘువీరగాథలు' (Ballalings). వీనిని జానపదులు 'పదములు' 'పాటలు' అను పేర్లతో వ్యవహరింతురు కాని, వీరగాథలవలె వీనికి 'కథలు' అను నామము నుపయోగింపరు. నేను మౌఖిక ప్రచారమున నున్న వీరగాథానికలను సుమారు ఎనుబది వఱకును సేకరించితిని. కథాఖ్యానముయొక్క నిడివినిబట్టి వీనిని బ్రధానముగా రెండు వర్గములుగా విడదీయవచ్చును: 'కథాత్మకములు, కథాసూచకములు'. "బుడ్డా వెంగళరెడ్డిపాట, అప్పలాపురం చెన్నారెడ్డి పాట, చిన్నమునెమ్మ పాట, చాకలి దుడుమన్న పదము, వానదేవుని పాట" మున్నగునవి కథాత్మకములగు వీరగాథానికలు. ఇవియొక అరగంటలోపులోఁ బాడఁ బడును. "గుజ్జాల గోపిరెడ్డి పాట, మానందిరెడ్డి పాట, నారసింహారెడ్డి పాట" మున్నగునవి కథాసూచకములగు వీరగాథానికలు. ఇవి కొలఁది నిముషములలోఁ బూర్తియగును.

ఇతి వృత్తమునుబట్టి పరిశీలించినచో లఘువీరగాథలలో నాఱు వర్గములు గోచరించును: 'చారిత్రకములు, విప్లవ జన్యములు, సాంఘికములు, దానవీర ప్రశంసలు, జానపదములు, పౌరాణికములు'. చారిత్రకములలో 'వీరమరణములు, వీరప్రశంసలు' అను రెండంతశ్శాఖలు గలవు. అట్లే సాంఘికములను వర్గములో 'గ్రామకక్షలు-హత్యలు, స్వైరిణులు-భర్తృహంతలు, పందెములు-స్పర్ధలు, ఆత్మత్యాగములు-కట్టపదములు, విధివైపరీత్యములు-ప్రమాదములు' అను ఐదు అంతశ్శాఖలను గుర్తింపవచ్చును.

"దొరవారి నరసింహారెడ్డిపాట, ధర్మాపురం నరసింహుని పాట, చిన్నపరెడ్డిపాట, అల్లూరి సీతారామరాజు పాట" మున్నగునవి వీరమరణములకుఁ జెందిన చారిత్రక గాథానికలు. "పిచ్చుకుంట్లు పాడు నారసింహారెడ్డి పాట, మరుట్ల చిన్నమల్లేశుని పాట, ఓబులరెడ్డి కోలాటపు కోపు, పెనుకొండ కోట" మున్నగునవి వీరప్రశంస చేయు చారిత్రక గాథానికలు. నల్లగొండ మండలమునను దాని పరిసరములందును వ్యాపించియున్న పాటలు- ముఖ్యముగా

"రేణికుంట రామిరెడ్డి పాట, చిలమ్మపాట, పసునూరి వెంకటరెడ్డిపాట, యలకపల్లి యాదగిరిపాట, గొట్టెముక్కల గోపాలరెడ్డిపాట, కొంతం కొండలరెడ్డి పాట, దొడ్డి కొమరయ్య పాట" మొదలగునవి విప్లవ జన్యములగు వీరగాథానికలు (తెలంగాణా విప్లవము1945-49).

సాంఘికములలో "గుఱ్ఱాల గోపిరెడ్డి, మానందిరెడ్డి, గడేకల్లు నాగిరెడ్డి, బండోళ్ల కురుమలన్న, గుడిపాటి చలమయ్య, మల్లారెడ్డి, సలపల అమ్మినాయఁడు"- మున్నగువారిపైఁ గల పాటలు గ్రామకక్షలకు- హత్యలకు సంబంధించినవి. "అద్దాల సుబ్బులు పాట, చిన్న మునెమ్మ పాట, వీరసోమి పాట, గుంటూరు ఆదెమ్మపాట" మున్నగునవి 'స్వైరిణులు- భర్తృహంతలు' అను విభాగమునకుఁ జెందును. "అప్పలాపురం చెన్నారెడ్డి పాట, గొఱ్ఱిపోతుల పందెము" మొదగునవి 'పందెములు- స్పర్ధలు' అను నంతశ్శాఖలోనివి. "లలికట్టపదము, ఒద్దిరాజులపాట, బోన కాటపరెడ్డి పాట, ముసలమ్మ గండి, వరదరాజమ్మ పాట"- ఇత్యాదులు ఆత్మత్యాగముతోఁ గూడిన కట్టపదములు. "ఎల్లల చెఱువు పొంగిన పాట, మూసి పొంగిన పాట, పల్నాటి ప్రళయము, పెన్నేటిపొంగు, అల్లునిపాట, జనగామ రైలు ప్రమాదము, జడ్చర్ల రైలుప్రమాదము"- మొదలగునవి 'విధి వైపరీత్యములు- ప్రమాదములు' అను నంతశ్శాఖకుఁ జెందిన లఘువీరగాథలు.

"బుద్ధా వేంగళరెడ్డి, సుద్దపల్లి లక్ష్మమ్మ, యాదాళ్ల నాగమ్మ, చిన్న అండ్లూరు శివమ్మ, డొక్కా సీతమ్మ" మున్నగు వారిపైఁ గల పాటలు 'దానవీరప్రశంసలు'. "ఎఱ్ఱిపాప పాట, చాకలి దుడుమన్న పదము లేక వీరనాగమ్మ పదము, వానదేవుని పాట, భూపతిరాజు పదము, బొత్తుఁడు పాట, ఒలియపాచ్చావుపాట"- మున్నగునవి జానపదములు. "రాముల పాట, మాయలేడి పాట, సీతమ్మ చెఱ, గరుటపచ్చి పాట, అశోకవనము, ముద్దుటుంగరము, లక్ష్మణ మూర్ఛ, కుశలవుల పుట్టుక, మంగమ్మ పాట, తురక బూబమ్మ పాట, జాలోరిగంగ, చెంచీతపాట"- మున్నగునవి పౌరాణికములు.

ఈ వీరగాథానికలలోఁ జారిత్రక వీరమరణములు, విప్లవ వీర మరణములు, గ్రామకక్షల మూలమున సంభవించిన హత్యలు, ఆత్మత్యాగములగు కట్టపదములు, ప్రకృతి తెచ్చిన ప్రమాదములు- ఇవి కరుణరస ప్రధానములు. ఇట్టి పాటలను పాశ్చాత్య విమర్శకులు 'Coronaches' లేక 'Planctus' లేక 'Lamenting Ballads' అందురు. మన విమర్శకులు వీనికి 'జాలిపాటలు' లేక 'కన్నీటి పాటలు' అను పేర్లు పెట్టిరి. వీరప్రశంసలగు గాథానికలలో వీరము, పందెములకు సంబంధించిన గాథానికలలోఁ బట్టుదల, భర్తృహంతలగు స్వైరిణుల పాటలలో వారి క్రౌర్యగర్హణమును ద్యోతకమగును. దానవీర ప్రశంసలలోఁ బ్రజలకు వారియెడ గల కృతజ్ఞత వెల్లడియగును. జానపదములలో నద్భుత రసము, పౌరాణికములలో భక్తిరసము హెచ్చు.

## 16. వీరగాథానుకరణములు- బుఱ్ఱకథలు:-

మీఁదఁ జర్చింపఁబడిన 'వీరగాథా చక్రములు, వీరగాథలు, వీరగాథానికలు'- అను మూఁడు వర్గములును దెలుఁగు సాంప్రదాయిక వీరగాథాకవిత్వమునకుఁ జెందినవి. ఈ సాంప్రదాయిక వీరగాథాకవిత్వములోని కొన్ని ప్రక్రియల ననుకరించుచు నాధునిక కాలమున 'బుఱ్ఱకథలు, జముకుల కథలు, సుద్దులకథలు, తందనాన కథలు, బ్రతుకమ్మ పాటలు' అనునవి బయలుదేరినవి. ఈ యనుకరణ ప్రక్రియలలో నేఁడు బుఱ్ఱకథలు విశేష ప్రచారమున నున్నవి. ఇవి బొబ్బిలివరుస కథలనుండియు, జంగంకథలనుండియు రాజకీయప్రబోధముకొఱకు 1942 ప్రాంతమునఁ బ్రభవించినవి. గుంటూరు మండలము వీని పుట్టిల్లు.

తంత్రి+బుఱ్ఱ= తంబుఱ. ఈ తంబుఱతోఁ జెప్పు కథలు 'తంబుఱ కథలు'. ఈ సమాసములో 'తం' లోపించి, శకటరేఫకుఁ బూర్వపు ద్విత్వము వచ్చి, 'బుఱ్ఱకథలు' అను నామమేర్పడియుండును. లేదా గుమ్మెటలకు 'బుఱ్ఱ' లను వ్యవహారము గుంటూరు మండలమునఁ గలదు. బుఱ్ఱలు కొట్టుచుఁ జెప్పు కథలు కావున 'బుఱ్ఱకథ' లయి యుండవచ్చును.

ఈ బుఱ్ఱకథలలో సాధారణముగా జంగంరగడ, ముగ్గురు మరాటీల కథలోని సైసై వరుస, కాంభోజరాజు కథలోని తందాన వరుసలు ప్రయోగింపఁబడుచుండును. సర్వాయి పాపని కథ వరుస (ఏలవరుస), జముకుల వరుస (హరిహరీ పదముల వరుస), శారద వరుసలు గూడ బుఱ్ఱకథలలో నచ్చటచ్చటఁ బ్రవేశపెట్టఁ బడుచుండును. శ్రీయుతులు సుంకర సత్యనారాయణగారు, వారణాసి సత్యనారాయణశాస్త్రిగారు మున్నగువారు చేయితిరిగిన బుఱ్ఱకథా రచయితలు. బుఱ్ఱకథా గానమున గుంటూరులోని షేక్ నాజర్‌గారు అమోఘప్రజ్ఞాశాలి.

1946-1948 మధ్యకాలమున భారత జాతీయ నాయకులపై బుఱ్ఱకథలు అసంఖ్యాకముగా బయలుదేరినవి. రాజమహేంద్ర వరములోని కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ మున్నగు గ్రంథప్రకాశకులు బుఱ్ఱకథలను కోకొల్లలుగా ముద్రించుచున్నారు.

ఈ బుఱ్ఱకథలలోఁ బ్రబోధాత్మకములు హెచ్చు. 'చారిత్రకములు, పౌరాణికములు, వీరగాథాజన్యములు'- అను వర్గములకుఁ జెందు బుఱ్ఱకథలును గలవు. ప్రబోధాత్మకములగు బుఱ్ఱకథలలో రాజకీయ, సాంఘిక, జాతీయ ప్రబోధములకు ఉద్దేశించినవియుఁ, బ్రభుత్వప్రచారమున కుద్దేశించినవియుఁ గలవు.

హరిహరీ పదముల ననుకరించుచుఁ బుట్టిన యాధునిక ప్రక్రియ 'జముకుల కథలు'. 'సుద్దుల కథలు' కాటమరాజు కథలకు అనుకరణములు. తెలంగాణమున బొబ్బిలివరుస కథల ననుకరించుచు 'తందనాన కథలు'ను, సాంప్రదాయికములగు

బ్రతుకమ్మపాటల ననుకరించుచు నాధునికములగు బ్రతుకమ్మ పాటలును బయలుదేరినవి (ఈ పదునాఱవ ప్రకరణముతో. ద్వితీయ భాగము పూర్తియైనది).

## తృతీయ భాగము

ఈ పరిశోధక వ్యాసమున నయిదు ప్రకరణముల కలయికచే నొప్పు తృతీయ భాగములో 'వీరగాథల రసపోషణ, వీరగాథా కవిత్వములోని వారానువర్తనములు, వీరగాథల భాష, వీరగాథల ఛందోరీతులు, వీరగాథాగానమునందలి సంగీతము' అను విషయములు చర్చింపఁబడినవి.

### 17. వీరగాథలు– రసపోషణ:–

వీరగాథలలో వీరము ప్రధానరసముగా నుండును. లాక్షణికులును, విమర్శకులును ఈ వీరరసములో ఇరువది నాలుగు ప్రభేదములను గుర్తించిరి. ఈ ప్రభేదములన్నింటికిని వీరగాథలలో నుదాహరణములు లభించుచున్నవి. అయినను వీరగాథలలో యుద్ధవీరమే ప్రచురముగాఁ గాననగును. 'వీర' మనఁగా 'యుద్ధవీర' మనియే పలువురు లాక్షణికుల యభిప్రాయము. బాలచంద్రుని కారెంపూడి యుద్ధము యుద్ధవీరమునకు మహోత్కృష్టమగు నుదాహరణము. రౌద్ర, బీభత్స, కరుణ, భయానక, హాస్య, శృంగార, అద్భుత రసములు వీరగాథలలో నాయాస్థలములలో నాయకుని వీరమునకుఁ బోషకముగా వర్ణింపఁబడుచుండును. శాంతరస మెల్లప్పుడును వీరమునకు విరోధిరసమే. శాంతరస ప్రధానమగు గేయకథలు వీరగాథానామమునకు అనర్హములు. లాక్షణికులు తెల్పిన నాలుగు విధముల వీరరసాభాసములకుఁగూడ వీరగాథలలో దృష్టాంతములున్నవి.

వీరగాథలలో వీరరసమే ప్రధాన రసమైనను, కరుణరస ప్రధానములగు కథలుకూడఁ గాలక్రమమున నేర్పడినవి. పేరంటాండ్ర కథలన్నియు నిట్టివే. "బాలనాగమ్మ కథ, గాంధారి కథ, ధర్మాంగద చరిత్ర–పాముపాట'' మున్నగు వీరగాథలలో వీరరసము కన్న నద్భుతరసమే ప్రాధాన్యమును వహించుచున్నదని చెప్పవచ్చును. బీభత్స హాస్యరసములు రెండును నాయక వీరమునకుఁ బోషకములుగా మాత్రమే కాక, ప్రత్యేకముగాఁగూడ వీరగాథలలో వర్ణింపఁబడుచుండుట గమనింపవచ్చును.

### 18. వీరగాథా కవిత్వము– వారానువర్తనములు:–

మార్గసాహిత్యమునఁ బ్రబంధములవలె, దేశిసాహిత్యమున వీరగాథలన్నియు నొకే మూసలోఁ దయారయినట్లుండును. వీరగాథ లన్నింటను నొకే రకమగు కథాప్రణాళిక, యొకే రకమగు వర్ణనలు, అలంకారములు, పదబంధములు నుండును. ఇట్లు వీరగాథలలోఁ దఱచుగాఁ గాననగు సమానాంశములను 'వీరగాథల వారాను వర్తనములు' (Ballad Commonplaces) అందురు.

తెలుఁగు వీరగాథల కథాప్రణాళికలో వీరుఁడు తన తల్లిదండ్రులకు లేక లేక కలుగుట, బొంగరములాడుట, ఆ యాటలో నాతని శౌర్యము ప్రకోపింపఁబడుట, శత్రువులపై దండెత్తి వెడలుట– మున్నగునవి సాధారణముగా నుండును. ఈ కథాప్రణాళికకు, ముఖ్యముగా బొంగరాలాటకుఁ బల్నాటి వీరకథాచక్రములోని బాలచంద్రుని కథ మూలమై యుండును.

ఇట్లు కథాకథనములో అతిప్రధానమైన ఒక కనిష్ఠాంశమును ఆంగ్లమున ''Motif'' అందురు. తెలుగులో దీనిని "మూలాంశము" లేక "కథన ఘటకము" అనవచ్చును. (కన్నడములో దీనిని 'ఆశయ'– 'ప్రేరక'– 'కథనఘటక' అని భాషాంతరీకరణము చేసినారు.) ఈ "మూలాంశము" (Motif) నకు కథాగమనమును మార్చగలిగిన శక్తియుండును. కథను చెప్పువాడు దీనిని మఱచుటకు వీలులేదు. ఈ మూలాంశము పైన చెప్పినట్లు 'బొంగరాలాట' వంటి ఒక సంఘటన కావచ్చును. లేదా సవతితల్లి, పేదరాసి పెద్దమ్మ, కడగొట్టు కొడుకు లేక కూతురు (వీరు సాధారణముగా మూడవవారుగా కాని లేక ఏడవవారుగా కాని ఉందురు), విశేషమైన శక్తులు కలిగిన చిలుక, కుక్క (బాలనాగమ్మ కథ), పాము (ధర్మాంగద చరిత్ర), గుఱ్ఱము (పల్నాటి వీరకథలలో అలరాజుగుఱ్ఱము "సవరాల జిమ్మఁడు"; పెద్దన్న బాదరాజు గుఱ్ఱము "కారు బొల్లఁడు''), కోడిపుంజు (పల్నాటి వీరకథలలో "అర్ధనాల చిట్టిమల్లఁడు"– "నల్లమల్లఁడు") మొదలగు పాత్రలు కావచ్చును. లేదా మంత్రదండము, చంద్రాయుధము, ఆకాశములో నెగిరెడి రత్నకంబళి, ఎగిరెడి చెప్పులు, చావురానీయని తులసివనమాల (బ్రహ్మనాఁడు అలరాజు మెడలోవేసినట్టిది) మొదలైన వస్తురూపమున నుండవచ్చును. (ఈ మూలాంశములు వీరగాథలలోకన్న జానపదకథలలో నధికము.) ప్రపంచములోని వివిధ వీరగాథలు జానపదకథలు పరిశీలించి, వానిలోని మూలాంశముల నన్నింటిని ''Motif Index of Folk Literature'' అను పేరుతో Stith Thompson అను అమెరికన్ జానపద విజ్ఞానవేత్త ఆఱు సంపుటములను ప్రకటించినాఁడు.

ఈ మూలాంశములు ఒక్కొక్కప్పుడు పదప్రయోగములకు సంఖ్యావాచకములకు సంబంధించికూడ నుండవచ్చును. వీనిని "పద లేక శబ్ద మూలాంశములు" (Word Motifs) అనియు, "సంఖ్యా మూలాంశములు" (Number Motifs) అనియు నందురు. ఒక రకముగా చూచినచో, తఱచుగా వచ్చెడి ఒకేరకమైన వర్ణనలను "వర్ణన మూలాంశములు" (Description Motifs) అనవచ్చును. ఈ వర్ణన మూలాంశములే వార్తానువర్తనములు.

ఏ వీరగాథలోనైనను కోపము 'తెల్లని గుడ్లకు తెచ్చె రకతంబు' – 'ఎఱ్ఱని గుడ్లకు ఎక్కి కోపములు' వంటి వారానువర్తనములతో నుండును. శోకము 'కుడికంటి వుదకాలు కుంభవరషములాయె, ఎడమకంటి వుదకాలు ఏరులై పారె' మున్నగు వాక్యములతో వర్ణింపఁ బడుచుండును. ఇట్లే 'గళ్లున నవ్వు' 'ఆగ్రుడై మండి' 'కండ్లజూచు'

'వినవయ్య–విశదంబు గాను' 'అప్పుడు– ఆడెనొకమాట' వంటి పదములు వాక్యములు ప్రతివీరగాథలోను గానవచ్చును. 'కలికి కలికి గాంధారి ఏళ, రాయి రాయి కరిగే ఏళ...' ఇత్యాదిగా రాత్రివర్ణన సాఁగును.

విశేషణములు, విశేష్యములు త్రిప్పి త్రిప్పి చెప్పఁబడుచుండును (ఉదా: 'ఎండిదే బొంగరము పైడిదే జాలె, పైడితే బొంగరము ఎండిదే జాలె'). ఎఱుకలసాని వేషము, జంగము వేషము చాలతఱచుగా వర్ణింపఁబడుచుండును. ప్రాచీనమైన సైన్యవర్ణనలోఁగూడ 'పరాసువారు, తుపాకులు, ఫిరంగులు' చెప్పఁబడును. యుద్ధవర్ణన, రణరంగ బీభత్స వర్ణన యే వీరగాథలోనైనను నొక్కటే. 'నరుకుతవుంటే నల్లశిరసులు రాలుట, పొడుస్తవుంటే పొట్టపేగులు పడుట, అప్పుడు తిన్న పప్పు అన్నమూ కుప్పలు తెప్పలగుట' ఇత్యాది వర్ణనలు ప్రతివీరగాథలోను నుండును. (ఈ వర్ణనలన్నింటికిని బొబ్బిలికథ మూలముగాఁ గన్పట్టును.) వీరపత్నులకు వీరమాతలకు దుస్స్వప్నములు వచ్చినట్లు చెప్పఁబడును. వీరులు 'ఎండలకు ఎండిపట్టుదేరాలు, నీడలకు నీలి పట్లుదేరాలు' వేసినట్లు పదే పదే చెప్పఁబడుచుండును.

వీరుఁడు ఒక ప్రయాణము చేయునప్పుడు మార్గమధ్యమున నున్న పేర్లన్నియు నేకరువుపెట్టఁబడును. వీరుని సేవకులపేర్లు, సంగాతకాండ్ర పేర్లు, జంతువుల పేర్లు వరుసగాఁ బెద్ద పట్టికగాఁ జెప్పఁబడును. సంఖ్యావాచకములలో నేడు శబ్దమునకుఁ బ్రాచుర్యము కాననగును. కొన్ని వస్తువులపేర్లు (చంద్రాయుధము, వెండికట్ల కిన్నెర), కొన్ని పట్టణముల పేర్లు (వాలుగొండ, దేవగిరి, ఓరుగల్లు మొ॥) పదే పదే వచ్చుచుండును. స్త్రీల స్నానవర్ణన, ఆలంకరణ వర్ణన మున్నగునవికూడ వారానువర్తనములే.

అలంకారములలో నుపమాలంకారము హెచ్చు. తెలుఁగు భాషలోని సిసలైన సామెతలు, జాతీయములు, పలుకుబడులు వీరగాథాకవిత్వమునఁ గొల్లలుగా నుండును. ఇట్లన్ని వీరగాథలకును సమానమగు వారానువర్తనములే కాక, ఒక్కొక్క వర్గమునకుఁ బ్రత్యేకమైన వారానువర్తనములును గలవు. వీరగాథల వారానువర్తనములవలన నిరక్షర కుక్షులైన గాథాకారులు అనేక గాథలను జ్ఞప్తియందు ఉంచుకొనఁగలుగుచున్నారు.

## 19. వీరగాథల భాష:–

వీరగాథల భాష జానపదుల వ్యావహారిక భాష. ఇది సహజమై, సూటియై, సుందరమై, మధురాతిమధురమై దేశీయతను బుక్కిలించు జీవద్భాష. 'అల్పాక్షరముల ననల్పార్థ రచన కావించుటయె కాదె కవి వివేకంబు' అను పాల్కుఱికి సోమనాథుని సూక్తికి వీరగాథల భాష చక్కని యుదాహరణము. ఇది వ్యాకరణాలంకార నియమము లకుఁ గట్టువడక, అలఁతి యలఁతి పదములతో నప్రయత్నముగా వెడలెడు వ్యావహారిక భాష.

వీరగాథలలో నర్థాలంకారములే కాని శబ్దాలంకారము లుండవని చెప్పవచ్చును. అర్థాలంకారములలోఁ గూడ నుపమాలంకారమే హెచ్చు. ఈ ఉపమాలంకారములు జానపదుల నిత్యజీవితములోఁ దారసిలునట్టివి. దృష్టాంతము, రూపకము, స్వభావోక్తి, అప్రస్తుత ప్రశంస వంటి యలంకారములు చెదురు మదురుగా నుండును.

వీరగాథలలో నింపైన సామెత లెన్నియో కలవు. ఈ సామెతలకు రెండింతలు జాతీయములున్నవి. పలుకుబడులు, నుడికారములు, వీరగాథలలో నడుగడుగునను ప్రత్యక్ష మగుచుండును. పదజాలములో నిఘంటువుల కెక్కని అపూర్వ దేశిపదము లెన్నియో కలవు. వైరిసమాసములు, అన్యదేశ్యములును గాననగును. వ్యావహారిక రూపముల ననుసరించియే సంధివంటి వ్యాకరణాంశములు కన్పట్టుచుండును. ఇంత వైవిధ్యముగల వీరగాథల భాషనుగూర్చి భాషాశాస్త్రజ్ఞులు ప్రత్యేకముగాఁ బరిశోధింపవలసి యున్నది.

## 20. వీరగాథల ఛందస్సు:–

వీరగాథల ఛందస్సు లక్షణగ్రంథములకు అందునదికాదు. తెలుఁగులో ద్విపద వికారములును, రగడ వికారములును నగు వీరగాథా చ్ఛందములున్నవి. శాసనప్రమాణమునుబట్టి తెలుఁగు ఛందస్సులలోఁ దరువోజ ప్రాచీనమైనదిగాఁ గన్పట్టును. కాని, ఛందః పరిణామమును బట్టి పరిశీలించినచో 'కిటతకిట, కిటతకిట, కిటతకిట, కిటతకిట' యని సాఁగు ఖండగతి యన్నిటికంటెను బ్రాచీనమైనదిగాఁ దోఁచును. పూర్వకాలమున వీరగాథలన్నియు నీ ఛందస్సులోనే యుండెడివి. ఈ ఖండగతినుండి మంజరీద్విపద, యీ మంజరీద్విపద నుండి ద్విపద, యీ ద్విపదనుండి తరువోజ, తరువోజనుండి సీసము పరిణమించియుండును.

శక్తికథలలో ఖండగతి, పల్నాటి వీరకథలలో మంజరీద్విపద, కాటమరాజు కథలలో ద్విపద బహుళముగాఁ గానవచ్చుచున్నది. వీరగాథలలోని ద్విపదకాని, మంజరీ ద్విపదకాని లాక్షణికులు చెప్పినట్లుగా నింద్ర సూర్య గణముల ప్రకారముండవు. ఒక్కొక్క పాదమున కయిదు మాత్రల గణములు మూఁడు, మూఁడు మాత్రల గణము ఒకటి (5+5+5+3) గా వీని రచన సాఁగును. యతి ప్రాసలైచ్ఛికములే కాని నియతములు కావు. కాని యతి సర్వత్ర పాటింపఁబడినదని చెప్పవచ్చును. ఇంద్రగణములలో 'భ' గణము, 'నల' గణము నాలుగు మాత్రలవే కావున, వీనికొక మాత్రను జేర్చి, 'భల' 'నలల' అను రీతిలో వీరగాథలలోఁ బ్రయోగింపఁబడుచుండును. ఒక్కొక్కప్పుడు ఈ ద్విపద–మంజరీద్విపదలు శిథిలములై ఖండగతిగా మాఱిపోవుచుండును. ఈ ఖండగతికూడ శిథిలమై మఱింత సాఁగిపోవుటయుఁ గలదు.

బొబ్బిలివరుసలో నొక్కక్క పాదము '8+8+9(10) మాత్రలుండును. యతిప్రాసలు కాకతాళీయములే కాని నిబద్ధములు కావు. ఈ బొబ్బిలివరుసనుండి 8+8 మాత్రలొక పాదముగా నొకవరుస, 8+9 (10) మాత్రలొక పాదముగా వేఱొక వరుస పరిణమించినవి. "కాంభోజరాజు కథ, వరాహావతార చరిత్ర (పంది కథ), చిన్నపరెడ్డి కథ" మున్నగునవి 8+8 మాత్రలొక పాదముగా సాఁగు వీరగాథలు. "బాలనాగమ్మ కథ, లక్ష్మమ్మ కథ, కమ్మవారి పణతి- పసల బాలరాజు కథ'' మున్నగునవి 8+9 (10) మాత్రలొకపాదముగా సాఁగు వీరగాథలు. ముగ్గురు మరాటీల కథలోని వరుస, సర్వాయి పాపని కథలోని వరుస ప్రత్యేకములు.

ముగ్గురు మరాటీల కథ వరుసను 'సైసై వరుస' యందురు. ఇందు పాదమునకు 12 మొదలుకొని 15 మాత్రల వఱకు నుండునట్లుగాఁ గొన్ని పాదములు చెప్పి, చివర 14 మొదలు కొని 16 మాత్రలవఱకు నుండునట్లుగా నొక్కపాదముతో ముక్తాయింపు చేయఁబడును. ఈ వరుసలోని పూర్వపాదము లిట్లు విఱుగును: 8+4=12; 8+5= 13; 9+5= 14; 10+5= 15. ఈ వరుసలోని ముక్తాయింపుపాద మిట్లు విఱుగును: 8+6= 16; 9+6= 15; 10+6= 16. వీనిలో 8 మాత్రల గణము 3+5 గాఁ గాని, 4+4 గా కాని విఱుగును. 9 మాత్రల గణము 3+3+3 గా విఱుగును. 10 మాత్రల గణము 5+5 గా విఱుగును.

ఇఁక సర్వాయి పాపని కథ వరుసను ఏలవరుస యని చెప్పవచ్చును. ఇందు 7+7= 14 మాత్రలు ఒక పాదముగా రెండు పాదములును, 7+9= 16 మాత్రలు ఒక పాదముగా మఱి రెండు పాదములును జెప్పఁబడును. మూఁడవ పాదము చివర 9 మాత్రల సంబోధనమొకటి అధికముగా నుండును. యక్షగానములలో సుంకరి కొండడు- గొల్లభామల యేల లిట్లేయుండును.

ఒక ఖండగతి పాదము, నొక ద్విపద మంజరి పాదమును గలిసి హరిహరీ పదముల వరుస యేర్పడినది. దీనిని 'జంపె వరుస' యనియు, 'జముకుల వరుస' యనియుఁ బిలుతురు: '5+5+5+5, 5+5+5+3' అని దీని గణములను నిరూపింపవచ్చును. యతిప్రాసలును బ్రాసయతులును నిందుఁ గాననగును.

'3+5+5+3' మాత్రలు ఒకపాదముగా నంత్యప్రాసలతో నటతాళమున సాఁగెడి రచనలు 'శారద పదము' లనఁబడును. ఈ శారద వరుసలో నొక్కొక్కప్పుడు మొదటి మూఁడు మాత్రల గణము లోపించి, 5+5+3 గా రచన సాఁగుటయుఁ గలదు.

8+8+9 (10) అను బొబ్బిలివరుసకు యతిప్రాసలు బిగించి, అంత్యప్రాస నేర్పఱచుటచే 'జంగంరగడ' యేర్పడి యుండును. లేదా మహారాష్ట్రుల 'గజల్, డోరా, డోరా గజల్ మట్టు' అను ఛందస్సుల ప్రభావముచే నీ జంగంరగడ పుట్టియుండవచ్చును. యక్షగానములలోఁ బ్రయుక్తములైన పై ఛందస్సులు అచ్చముగా జంగంరగడవలెనే యున్నవి.

వీరగాథానుకరణములగు బుఱ్ఱకథలలో బొబ్బిలి వరుస తద్భేదములు, సైసై వరుస, సర్వాయి పాపని వరుస, జముకుల వరుస, శారద వరుస మున్నగునవి అన్నియును గానవచ్చుచున్నవి.

తెలంగాణమునఁ బ్రసిద్ధికెక్కిన "మియాసాబు కథ, కొమిరెల్లి మల్లన్న కథ" మున్నగు వానిలోఁ ద్రిశ్రగతి (3+3+3+3) కాననగును. 'నల్లతంగాళ్ కథ' కూడఁ ద్రిశ్రగతిలోనే సాఁగినది. 'సుబ్బిరెడ్డి కథ' రూపకగతి (6+6+6+6)లో నున్నది.

వీరగాథానికలలోఁ ద్రిశ్ర, చతురశ్ర, ఖండ, రూపక, మిశ్ర, ఆది గతులన్నింటికిని నుదాహరణములు లభించుచున్నవి. "గుంటూరు ఆదెమ్మపాట, మరుట్ల చిన్నమల్లేశు పాట, గడేకల్లు నాగిరెడ్డి పాట", మున్నగునవి త్రిశ్రగతిలో నున్నవి. 'సిద్ధాపురం కట్టపదము' చతురశ్రగతి. (4+4+4+4). ఖండగతిలో (5+5+5+5) లఘువీరగాథలు పెక్కు గలవు. "లలికట్ట పదము, వానదేవుని పాట, సీతమ్మ చెఱ, నల్లగొండ పాట" మున్నగు నవన్నియును ఖండగతిలోనే సాఁగినవి. త్రిశ్రగతికి రెట్టింపు రూపకగతి. "అద్దాల సుబ్బులు పాట, అల్లుఁడు పాట, మల్లన్నపాట'' మొదలగునవి రూపకగతికి ఉదాహరణములు. మిశ్రగతి (7+7+7+7) లో నడచిన పాటలు: 'అప్పలాపురం చెన్నారెడ్డి పాట, గుఱ్ఱాల గోపిరెడ్డి పాట' మొదలగునవి. 'బుద్దా వెంగళరెడ్డి పాట, పోట్ల బూదయ్యపాట'- ఇత్యాదులు ఆదిగతి (8+8+8+8) కిఁ జెందినవి. చతురశ్రగతికి రెట్టింపు ఆదిగతి.

లాక్షణికులు చెప్పిన నవవిధ రగడలకును, వీరగాథల వరుసలకును మిక్కిలి సన్నిహిత సంబంధమున్నది. హయప్రచార- తురగవల్గన రగడలు త్రిశ్రగతికిని; మధురగతి- హరిగతి రగడలు చతురశ్రగతికిని; ద్విరదగతి- జయభద్ర రగడలు ఖండగతికిని; హరిణగతి- వృషభగతి రగడలు మిశ్రగతికిని సరిగా సరిపోవును. ఈ రగడలకుఁ గన్నడిగుల షట్పదులతోఁగూడఁ బోలికలున్నవి.

పల్నాటి వీరకథలలోను, కాటమరాజు కథలలోను యతిప్రాసలు చక్కగాఁ బాటింపఁబడినవి. కొన్ని కథలలో మాత్రాగణములు శిథిలములైనను యతిప్రాసలకు భంగము వాటిల్లలేదు. యతిభంగముగాఁ దోఁచు పదములలో జానపదుల ఉచ్చారణను పరిగణింపవలసియున్నది. యతిభంగమును వారించుటకై జానపదకవులు అపశబ్దములను సహితము ప్రయోగించిరనుటకు దృష్టాంతము లున్నవి. అఖండయతి, ద్విప్రాస, త్రిప్రాస మున్నగునవి వీరగాథలలో నచ్చటచ్చటఁ గానవచ్చును.

## 21. గాథాగానము- సంగీతము:-

పాడఁబడుట వీరగాథల ప్రధాన లక్షణము. కాని గాథా గానమున గొంతు మంద్రస్థాయినుండి తారస్థాయికెత్తినను ఎక్కువ

రాగభేదములను జూపక, ఛందస్సును సూచించు వైవిధ్యముతో మాత్రమే పాడవలెను. స్వరముతో నక్షరములను మ్రింగివేయక స్పష్టముగా నుచ్చరింపవలెను. వీరగాథలు గేయరూపమున నున్నను, వీనిలో 'ధాతువు' (సంగీతాంశము) కన్న 'మాతువు' (సాహిత్యాంశము) ప్రధానమైనది. వీరగాథల ఛందస్సంతయు సంగీతశాస్త్రములోని గతి లేక జాతి భేదములలో నిమిడిపోవును. కావున వీరగాథలు తాళ ప్రధానములని చెప్పవచ్చును. స్వరములలో సప్తస్వరములుండవు కాని, ఒకటి రెండు స్వరములుండును.

వీరగాథ లెక్కువగా అట (ఆట) తాళములోను, ఆదితాళములోను సాఁగుచుండును. యుద్ధఘట్టములందు ఏకతాళము పడును. 'జంపె, త్రిపుట, రూపకము, ఝల్ప, కుఱుజంపె' మొదలగు తాళములును సందర్భమునుబట్టి ప్రయోగింపఁ బడుచుండును. ఇట్లు వీరగాథలు తాళప్రధానము లగుటచే వీనిని బాడుటకుఁ దట్టువ్యాదములను విశేషముగా నుపయోగింతురు. పంబజోడు, గుమ్మెటలు మున్నగునవి వీరగాథలలోని తాళమును, తిత్తి, తంబుఱ వంటి వాద్యములు వీరగాథల శ్రుతిని నిలుపు చుండును.

సాంప్రదాయిక వీరగాథలలో నాయాపేర్లతో రాగములు లేకపోయినను, రసానుగుణముగా వరుసలను మార్చుట కలదు. జంగంకథలలోను, బుఱ్ఱకథలలోను రాగచ్ఛాయలు స్పష్టముగా నున్నవి. విషయప్రధానమగు ఘట్టములలో దేవగాంధారి రాగమును, ఏడ్చుటకు ముందుండెడి విచారమును సూచించుటలో తోడి రాగమును, దుర్భరశోకమును వ్యక్తమొనర్చునప్పుడు ఫీలు రాగమును, రౌద్రరస పోషణలో శ్రీరాగమును, బీభత్స భయానక రసములలో మోమన రాగమును, సంతోషమును సూచించునప్పుడు శంకరాభరణ, ఆనందభైరవి రాగములును నుపయోగించుట పరిపాటి. జంగం కథలలో అటతాళము, బుఱ్ఱకథలలో ఆదితాళము హెచ్చుగాఁ గానవచ్చుచున్నది.

సంగీతాంశమునుబట్టి వీరగాథలను మూఁడు విధములుగా వర్గీకరింపవచ్చును: 1) ఒకే వ్యక్తి పాడు వీరగాథలు, 2) ఒక వ్యక్తి పాడుచుండఁగా నిద్దఱు ముగ్గురు వంతపాడు వీరగాథలు, 3) అందఱును గలసి పాడు వీరగాథలు. తెలుఁగు వీరగాథలలో నెక్కువ భాగము రెండవ వర్గమునకుఁ జెందునని చెప్పవచ్చును. కిన్నెర కథలు, జాగట కథలు మొదటి వర్గమునకును, కోటాపుఁ గోపులుగాఁ బాడు లఘువీరగాథలు మూఁడవ వర్గమునకును నుదాహరణములు. తక్కినవన్నియును రెండవ వర్గమునకే చెందును. వీరగాథలలోని సంగీతమునుగూర్చి సంగీత విద్వాంసు లింకను శోధింపవలసి యున్నది. పాశ్చాత్య దేశములలోవలె వీరగాథల సంగీతమును చిత్రించి చూపుట కూడ నత్యావశ్యకము. (ఈ ఇరువదియొకటవ ప్రకరణముతో తృతీయ భాగము పూర్తియైనది).

# చతుర్థ భాగము

ఈ సిద్ధాంత వ్యాసమున నాల్గు ప్రకరణముల సమాహారమగు చతుర్థ భాగమున వీరగాథల వైశిష్ట్యమునుగూర్చియు, నాంధ్రదేశము లోని వివిధ గాథాకారులనుగూర్చియు, వీరగాథల క్షీణతాకారణము లనుగూర్చియు, వీరగాథల సేకరణము- పరిరక్షణములను గూర్చియుఁ జర్చింపఁబడినది.

## 22. వీరగాథల వైశిష్ట్యము:-

వీరగాథల వైశిష్ట్యము ననేక విధములుగా నెన్నవచ్చును. వీరగాథాప్రక్రియ ప్రపంచమునఁ బ్రతిసాహిత్యమందును స్వతంత్రముగాఁ బుట్టిన ప్రక్రియ. ఇది యితిహాస కవిత్వమునకు మూలకందము. వీరగాథలు నిసర్గమనోహరములు. సహజత్వమే వీనికిఁ బ్రాణము. ఒక దేశములోని వీరగాథలన్నియు నాదేశ సంస్కృతిని బట్టియిచ్చు జాతీయతా చిహ్నములుగా నుండును. దేశ స్వాతంత్ర్యమును గాపాడుకొనుటకుఁ బ్రజలలో వీరగాథాగాన మత్యవసరము. వీరగాథలు దేశమునకు గర్వకారణములు. ఇవి ప్రజా జీవితమును మణిదర్పణములవలెఁ బ్రతిబింబింపఁజేయును.

నవరసములలో కెల్ల విశిష్టమైన వీరరసముచే వీరగాథలు నిండియుండును. ఎన్నఁడో చనిపోయిన వీరులు గాథాగానముచే మరలఁ బునరుజ్జీవితులగుదురు; శ్రోతల మనోనేత్రములకుఁ బ్రత్యక్ష మగుదురు. తెలుఁగు సాహిత్యమంతయు సంస్కృత పరివర్తనమే యను నిందను బాపఁగల ఒకే ఒక సాధనము వీరగాథా కవిత్వము.

వీరగాథలకు మూఁడు మహత్తర శక్తులున్నవి: 1. సర్వజనాకర్షణ శక్తి. ఇవి సరళముగా నుండి సర్వజనులను నాకర్షించును- 2. సంఘ సంచాలక శక్తి. వీరగాథలు సంఘమును సంచలింపఁజేసి మహావిప్లవములను సృజింపఁగలవు- 3. విచిత్రానుభూతిదాయక శక్తి. ఇవి శ్రోతలకు విచిత్రమగు నాత్మీయానుభూతి నొసంగఁగలవు.

దేశదేశములలో వీరగాథలచే శిష్టకవులు ప్రభావితులైనారు. వీరగాథలవలన భాషకు సహజత్వము జీవము కలుగును. కొన్ని సాంఘిక ప్రయోజనములును నెఱవేఱఁగలవు. వీరగాథలు 'విధి బలీయము. మానవుఁడు నిమిత్త మాత్రుఁడు' అను నీతిని నిశ్శబ్దముగా ధ్వనింపఁజేయును.

## 23. గాథాకారులు:-

వీరగాథలనుబాడు 'దేశద్రిమ్మరు' లగు గాయక భిక్షువులను 'గాథాకారు'లనియు, 'గాథకు' లనియుఁ బిలువవచ్చును. ఈ గాథాకారులకు వివిధ భాషలలో వివిధ నామములున్నవి. 'Minstrels' (English); 'Jongleurs' (French); 'Scops' (Old English);'Bards' (Irish); 'Skald' (Scadinavian); 'Minnesingers' (German); 'Troubadours' (Spanish);

'రావీ' (అరేబియన్); 'చారణులు' (హిందీ); 'భోపాలు'-'మిరోసీలు' (రాజస్థానీ); 'రావత్' (మధ్యప్రదేశ్); 'వృత్తిగాయకరు' (కన్నడ); 'జంగములు' (తెలుఁగు).

నేఁడు బిచ్చగాండ్రుగా మాఱిన నీ గాథకుల చరిత్రలో నాలుగు ఘట్టములున్నవి. మొదట వీరశిఖామణులగు రాజులు తమ సాహసకృత్యములను దామే గానమొనర్చుకొనెడివారు. తరువాతఁ దమ సాహసములను గీర్తించుటకుఁ, బ్రత్యేకముగా భట్టులను నియమించుకొనిరి. కాలక్రమమున రాజ్యము లంతరింపఁగా, నీ భట్టులును వందిమాగధులును రాజ్యములను గోల్పోయిన నాయా కులములవారిని యాచించుచు 'యాచకు' లను పేరుతో వ్యవహరింపఁ బడుచుండెడివారు. పాశ్చాత్య నాగరికతా ప్రభావమున నీ యాచకులకు మన సంఘములో నీచస్థానమేర్పడి అనాదరణము హెచ్చినది. ఫలితముగా వీరు అన్ని కులములవారిని యాచించుచు సంచార గాయక భిక్షువులుగా మాఱిపోయిరి. కొందఱు తమ కులవృత్తిని విడనాడి అన్యవృత్తులను స్వీకరించిరి.

ఆంధ్రదేశమున నీ సంచార గాయక భిక్షువులు పలురకముల వారున్నారు: ''బవనీలు, పంబలవారు, వీరవిద్యావంతులు, కొమ్ములవారు, పిచ్చుకుంట్లు, పూసల బలిజలు, శారదకాండ్రు, వీరముష్టులు, జంగములు, దాసరులు, గరుడ స్తంభం దాసరులు, భాగవతులు, బీరన్నలవారు, సుద్దుల గొల్లలు, గంగిరెద్దులవారు, బాలసంతువారు, బుడబుక్కలవారు, చిందుమాదిగలు, జోగులవారు, జక్కులవారు, హట్కరులు, దక్కలవారు, మాష్టీలు, బొమ్మలాటగాండ్రు" మొదలగువారు కలరు. ఈ గాథాకారులు అతిప్రాచీన కాలము నుండియుఁ దెలుఁగునాట వ్యాపించియుండి రనుటకు శ్రీనాథుని క్రీడాభిరామము, పాలవేకరి కదిరీపతి (1650) 'శుకసప్తతి', అయ్యలరాజు నారాయణామాత్యుని (1750) 'హంసవింశతి' మున్నగు కావ్యములు సాక్ష్యమిచ్చుచున్నవి. ఈ గాథకులయందు ముఖస్థరూపమున నెన్నియో వీరగాథలున్నవి. నాగరికతా ప్రభావముచే నివి నశింపకముందే రక్షించుకొనవలసిన బాధ్యత ప్రతి ఆంధ్ర తపస్వికిని గలదు.

## 24. క్షీణతా కారణములు:-

ఆధునిక కాలమున వీరగాథలు నశించిపోవుచున్నవి. ఈ నశింపునకు అనేక కారణములున్నవి. ప్రౌఢకావ్యములను మఱగిన పండితుల అలక్ష్యము దీనికిఁ బ్రథమకారణము. పండితులు దేశికవితలను నిరసించుట ప్రాచీన కాలమునుండియుఁ గలదు. ఇట్టి నిరసనమువలననే మన ప్రాఙ్నన్నయ యుగములోని దేశికవితలు రూపుమాసినవి. వీరగాథలయెడఁ బండితపరిహాసము పాశ్చాత్య దేశములందును గానవచ్చుచున్నది. ప్రాచీనులలోఁ గొందఱు మాత్రము వీని ప్రాశస్త్యమును గుర్తించినారు. మొత్తముపై వీరగాథలను బొగడినవారికన్నఁ దెగడినవారి సంఖ్యయే యెక్కువ. వీరగాథలు కూడ సాహిత్యమున నొక ప్రధాన భాగమని మఱచుటచేతను, నిరక్షరాస్యుల నుద్దేశించి చెప్పఁబడిన జానపద కవిత్వమును బ్రౌఢకవిత్వముతోఁ బోల్చి చూచుటవలనను వీరగాథలయెడ విద్వాంసుల కిట్టి నిరసన భావము కలిగియుండును.

మహాకవులు వీరగాథా రచనముఁ గావింపకుండుట వీరగాథల క్షీణతాకారణములలో రెండవది. తెలుఁగులో నొక్క శ్రీనాథుఁడును, ఆంగ్లమున నొక్క 'గోల్డ్‌స్మిత్' మాత్రమే వీరగాథారచన చేసిన మహాకవులు. తక్కిన కవులెవ్వరును నిట్టి ప్రయత్నము చేసినట్లు కానరాదు. వీరగాథలను బ్రకటించుటలోఁ బండితులు అనేకములగు మార్పులను జేయుటవలనఁగూడ నివి నశించుచున్నవని చెప్పవచ్చును. ముద్రించుటవలన వీరగాథలు నశించిపోవునని తలంచు విమర్శకులు పాశ్చాత్య దేశములలోను, బ్రాచ్యదేశములలోను గూడఁ గలరు. కాని నాకిది సమంజసముగాఁ దోపదు. వీరగాథలోని సాహిత్యాంశమును మాత్రమే ముద్రించినచో వీరు చెప్పిన నష్టము కలుగునుగాని, సంగీతాంశమును సహితము పదిలపఱచినచో నట్టి నష్టము కలుగఁజాలదు.

నాగరికత వీరగాథలకుఁ బరమ శత్రువు. సంఘము నాగరికమైన కొలఁది నందలి జానపద కవిత్వము నశించును. నేఁటి చలనచిత్రములు, నిమ్నజాతులలోఁ గ్రైస్తవమత ప్రబోధము, జాతరులను కోడిపందెములను ప్రభుత్వము నిషేధించుట, మౌఖిక వీరగాథలను బ్రకటించుట కిష్టపడని గాథాకారుల మూర్ఖత్వము- ఇత్యాదులు వీరగాథల క్షీణతాకారణములలో మఱికొన్ని యని నా విశ్వాసము.

## 25. సేకరణ- పరిరక్షణ:-

జానపదసాహిత్య పరిశోధనమన మాటలు కాదు. వీరగాథా సంచయనము అష్టకష్టములతోఁ గూడిన పని. నిరక్షరకుక్షులును, మూర్ఖులును, దేశద్రిమ్మరులును, విపరీతమగు త్రాగుబోతులును నగు గాథాకారులతో వేగుటకు ఓర్పు కావలెను. భారతదేశములోని వివిధ ప్రాంతముల జానపద సాహిత్యము నుద్ధరించుటలో శ్రీ రామనరేశ్ త్రిపాఠీగారును, తెలుఁగు జానపదగేయములను సేకరించుటలో డా॥బి.రామరాజుగారును ఎన్నికష్టములకు లోనయిరో నేను అనుభవ పూర్వకముగాఁ దెలిసికొంటిని. ఎన్ని కష్టములున్నను వీరగాథా సంచయనము కొనసాఁగింపవలసినదే. లేనిచో నీ సాహిత్యమంతయు నశించిపోఁగల ప్రమాదమున్నది.

జానపద సాహిత్య సంచయనమున మిక్కిలి మెలకువను బ్రదర్శింపవలెను. H.M.Belden అను అమెరికను విమర్శకుఁడు జానపద సాహిత్యమును సేకరించువారు ముఖ్యముగా గమనింపవలసిన ఆఱు విషయములను దెల్పినాఁడు: 1) గాథకుని నోటినుండి పాట యెట్లు వచ్చినదో అట్లే వ్రాయవలెను (తప్పులు, అర్థములేని పదములు మొ॥ యథాతథముగా వ్రాయవలెను). 2)

పాటను ఎప్పుడు ఎక్కడ ఎవరినుండి సంపాదించితివో గుర్తింపవలెను. 3) గేయమును గాథాకారుఁడు పాడుచుండఁగా వ్రాసితివో, లేక చదువుచుండఁగా వ్రాసితివో, లేక యేదైన వ్రాఁత ప్రతినుండి వ్రాసితివో తెలుపవలెను. 4) ఆ గాథాకారుఁడు ఈ పాటను ఎక్కడ ఎవరినుండి నేర్చెనో తెలిసికొనవలెను. 5) గాథకుని కులమును పూర్వికులను స్వస్థలమును గుర్తింపవలెను. 6) గాథకుఁడు ముద్రితగాథనుగూర్చి తెలిసికొనెనో లేదో పరిశీలింపవలెను. ఈ యాఱు విషయములను దృష్టియందు ఉంచుకొనినప్పుడే వీరగాథలను నిర్దుష్టముగా సేకరింపఁగలము.

రామనరేశ్ త్రిపాఠీగారు, ఆచార్య దేవేంద్ర సత్యార్థిగారు భారతదేశమున వివిధ ప్రాంతముల జానపద సాహిత్యమును సేకరించినారు. తెలుఁగులో మొట్టమొదట వీరగాథలను సేకరించిన మహానుభావుఁడు సి.పి.బ్రౌనుదొర. ఇతఁడు క్రీ.శ. 1842లో నొక జంగమును నెలరోజులపాటు తన యింట నుంచుకొని, అతనిచే బొబ్బిలి కథను, కొమార రాముడి కథను, కామమ్మ కథను బాడించి వ్రాయించినాఁడు. 1874లో జె.యె. బోయల్ (J.A. Boyle) దొరగారు సర్వాయి పాపడు కథను సేకరించినారు. 19వ శతాబ్దపు టుత్తరార్ధము నుండి వీరగాథలు ముద్రింపఁబడుట ప్రారంభమైనది. వేటూరి ప్రభాకరశాస్త్రిగారు, మల్లంపల్లి సోమశేఖరశర్మగారు, నేదునూరి గంగాధరంగారు, శ్రీపాద గోపాలకృష్ణమూర్తిగారు, టేకుమళ్ల కామేశ్వరరావుగారు, హరి ఆదిశేషువుగారు, తిమ్మావజ్ఝల కోదండరామయ్యగారు, డా॥ బి. రామరాజుగారు, డా॥ తూమాటి దొణప్పగారు– మున్నగు పరిశోధకులు మన జానపద సాహిత్యమును గూర్చి ప్రశస్తమగు కృషిని సల్పియున్నారు.

అమెరికాలోని విస్కాన్సిన్ విశ్వవిద్యాలయములో జెనె హెచ్. రోఘేర్ (Gene H.Roghair) అను నతఁడు పల్నాటి వీరచరిత్రను గూర్చి పరిశోధన చేసినాడు. అతని సిద్ధాంత గ్రంథమును ఆక్స్‌ఫర్డ్ విశ్వవిద్యాలయమువారు ''Epic of Palnad'' అను పేరుతో ప్రచురించినారు. ఈ మహత్తర జానపద సాహిత్యమును సంరక్షించుకొనుటకై పెద్దలు కొన్ని సూచనలు చేసియున్నారు. వీరగాథలను సేకరించుటలోఁ గేవలము సాహిత్యాంశమునే కాక, సంగీతాంశమును గూడఁ బదిలపఱుచుకొనవలెను. సంప్రదాయములు నశించిపోకుండ నుండుటకై తద్గాయక భిక్షువులను బ్రోత్సహింపవలెను. ముద్రించుటచే వీరగాథలు నశించిపోవునని కొందఱి భయము. కాని కేవలము సాహిత్యమునే కాక సంగీతాంశమునుగూడ ముద్రించినచో నీ భయమునకుఁ దావుండదు. ప్రభుత్వము, సాహిత్యసంస్థలు వీరగాథల సేకరణమునకు నడుముకట్టవలెను. (ఈ ఇరువదియైదవ ప్రకరణముతో నాల్గవభాగమే కాక, యీ సిద్ధాంత గ్రంథమంతయును బూర్తియైనది. సర్వము సంపూర్ణము.)

ఓం తత్ సత్... ❐

*భగ్న పృష్ఠ కటి గ్రీవః స్తబ్ధ దృష్టి రధోముఖః*
*కష్టేన లిఖితం గ్రంథమ్ యత్నేన పరిపాలయేత్!*

**(శక ౧౮౮౯; పల్లవంగనామ సంవత్సర పుష్య బహుళ నవమి మంగళవారము– అనఁగా క్రీ.శ. 1968 జనవరి 23వ తేది, మంగళవారము, సాయంకాలము 4 గంటలకు ఈ రచనాయజ్ఞము పూర్తియైనది. విచిత్రముగా ఈ దినము– స్వాతంత్ర్య సమర యోధుడు నేతాజీ సుభాసచంద్ర బోసుగారి జన్మదినము. దీనివలన నా వీరగాథల పరిశోధన సార్థకమైనది! నా జన్మ ధన్యమైనది! బాల్యమునుండియు నాకు నేతాజీ యనిన పంచప్రాణములు!)**

వివిధానుబంధములు

# వీరగల్లులు-వీరభూములు-ముద్రితాముద్రిత వీరగాథలు

ప్రత్యేక అనుబంధము

**"బొబ్బిలి కథ"** (సి.పి.బ్రౌను సేకరణ: క్రీ.శ. 1842)

# అనుబంధము-I

# "మేడ ప్రక్కల బంతి"

**(డా॥ పి.వి.ఆచార్యగారి 'పల్నాటివీరుల చరిత్ర' నుండి, పుటలు 85-87)**

పలనాటి యుద్ధం అయిపోయింది. నలగామరాజును పట్టాభిషిక్తునిచేసి, 66గురు వీరనాయకులను, బాలచంద్రుడు యిత్యాదిగాగల వీరులను పునరుజ్జీవితులను చేసి బ్రహ్మనాయుడు వారితో కలిసి గుత్తికొండ బిలములోనికి తపశ్చర్య నిమిత్తము బయలుదేరాడు. అయితే యుద్ధానికి వచ్చేటప్పుడు మేడపిలోని వీరందరి భార్యలు, అంతఃపురకాంతలు అక్కడే వున్నారు. తాము మేడపి నుంచి బయలుదేరి మూడునెలలు దాటిపోతున్నాయి. మగతోడులేకుండా వున్న అంతఃపుర కాంతల పరిస్థితి ఏమిటి? అని ఆలోచించి, వారిని కూడా తమతో తీసుకుపోవాలనుకున్నారు. అయితే పునరుజ్జీవితులై దివ్యతేజస్సుతో దైవాంశతో వెలుగొందుచున్న తమను అనుసరించాలంటే, వారి భార్యలు కూడా పవిత్రులై యుండాలి. అందువలన వారి పవిత్రతను రుజువుపరచుకొని వారిని తమతో తీసుకువెళ్ళాలని నిశ్చయించుకొన్నారు. అందుకై వారు సంకల్ప మాత్రముచే మేడపి చేరుకున్నారు.

పట్టణములోనికి ప్రవేశించే ముందు అందరూ దైవసంకల్పముచే మరుగుజ్జులుగా మారిపోయారు. శైవులవలె భస్మము, లింగధారణతో మారురూపాలతో రాచనగరు చేరుకున్నారు. "భవతీ భిక్షాందేహి, భవతీ భిక్షాందేహి! భవతీ భిక్షాందేహి" అంటూ మూడుసార్లు ఎలుగెత్తి పిలిచారు. అపుడు బ్రహ్మనాయని తల్లి శీలమ్మ వచ్చింది. "అమ్మా! మేము ఆకలితో అలమటించిపోతున్నాము. మాకు భోజనము పెట్టి ఆదుకో"మని అడిగారు. ఐతమ్మ "నాయనలారా! ఇపుడు రాచనగరులోని పురుషులందరూ కారంపూడి యుద్ధరంగమునకు వెళ్ళారు. ఇపుడు ఎవ్వరూ పురుషులు లేరు. గృహయజమానులు లేకుండా ఆతిథ్యము ఇవ్వటము మాకు అభ్యంతరకరము. అందువలన మీ ఆకలి తీర్చలేము. క్షమించండి" అంటూ వినయంగా చెప్పింది.

"ఆకలిగొన్నవారికి అన్నము పెట్టడం పుణ్యప్రదం. అందునా పలనాటి వీరులు ధర్మమూర్తులు. అలాంటివారి యింటి ముంగిటకు వచ్చి ఆకలితో వెళ్ళటం ఏమిటి? ఆకలిగొన్న అతిథి ఆకలితీరకుండా వెళితే ఆ గృహస్థు పుణ్యాన్ని తీసుకుపోతాడని ధర్మగ్రంథాలు చెబుతున్నాయి. కావున ఎలాగైనా మీరు మా ఆకలి తీర్చవలయును" అని మరుగుజ్జుల రూపములోనున్న వీరులు చెప్పారు. అయితే శీలమ్మ అందుకు ససేమిరా వీలుకాదన్నది. దాంతో వారు ఆకలి బాధకు తాళలేక, మెలికలు తిరిగిపోతూ, కడుపులు పట్టుకొని, వేదనతో క్రిందబడి దొర్లనారంభించారు. ఈ దృశ్యమును చూసిన శీలమ్మకు, వారు చనిపోతే ఆ ఆత్మహత్యా దోషము తనవారికి చుట్టుకుంటుందని భయపడి, వారికి ఆతిథ్యము ఇవ్వటానికి అంగీకరించింది. వారిని అంతఃపురములోనికి ప్రవేశించుటకు అనుమతినిచ్చింది.

అందరూ గృహాంతర్భాగములోకి వచ్చారు. ''మీరు స్నానసంధ్యలు ముగించుకుంటే భోజనము సిద్ధము చేస్తాము" అని ఆమె ఆ ప్రయత్నములో పనులు పురమాయించింది. వీరులు అందరూ స్నానాదులు పూర్తి చేసుకుని వచ్చారు. 66గురు వీరనాయకులూ, బాలచంద్రుడు, మిగతావారికి పీటలువేసి వడ్డనకు సిద్ధము చేశారు. తీరా వడ్డించబోయేసరికి "అమ్మా! మాకొక నియమము ఉన్నది. మాకు పంక్తిలో ప్రక్కన ఎవరు లేకుండా భోజనం చెయ్యము. అందువలన ఎవరైనా మా సరసన కూర్చొని భోంచేయాలి" అన్నారు. అందుకు శీలమ్మ "పురుషులు ఎవరూ లేరని చెప్పాను గదా! మరియిపుడు మీ సరసన ఎవరు కూర్చుంటారు" అని ప్రశ్నించింది. దానికి వీరులు "స్త్రీలు అయినా ఫరవాలేదు. మీ అంతఃపుర కాంతలనే సహపంక్తికి కూర్చోబెట్టండి'' అని అన్నారు. అయితే శీలమ్మ ముందు అంగీకరించలేదు. దాంతో వారు లేచి వెళ్ళిపోతామని ఉద్యుక్తులయ్యారు. శీలమ్మ ఆలోచించి ''అంతఃపురకాంతలు పరపురుషుని ఎదుటకు రారు- అందువలన మీకు ఎదురు వరుసలో మా అంతఃపురకాంతలు కూర్చుంటారు. మీ ఇరువురకు మధ్య యినుపతెరలు కట్టిస్తాను. అపుడు మీ నియమం చెల్లించినట్లవుతుంది. మా అంతఃపురకాంతల ఔచిత్యము కాపాడినట్లవుతుంది" అన్నది. ఇందుకు సమ్మతించారు- అందరికీ భోజనాలు వడ్డించారు.

అపుడు అందరిలోకి చిన్నవాడు బాలచంద్రుడు, ఇపుడు మరుగుజ్జు రూపములో మరీ పసిబాలుడుగా వున్నాడు. భుజానికి జోలె తగిలించుకుని అందరు స్త్రీల వద్దకూ వెళ్ళి 'భవతీ భిక్షాం దేహి' అంటూ ఒక్కొక్కరి దగ్గర భిక్షను సేకరించుకుంటూ, తల్లి ఐతమ్మ దగ్గరకు వచ్చాడు. బాలుడు ఐతమ్మ దగ్గరకు రాగానే ఆమెకు పుత్ర మమకారముప్పొంగి, స్తన్యము ధారలుగా కారసాగెను. ఐతమ్మ బాలుని తీసుకొని, తొడలపై పడుకోబెట్టుకొని, హృదయానికి హత్తుకొని,

ప్రేమతో భిక్షను (ఆహారము) బాలుడి నోటికి గోరుముద్దలుగా చేసి తినిపించింది.

అక్కడ నుంచి అందరికంటే చివరగానున్న మాంచాల వద్దకు వచ్చాడు బాలుడు మరుగుజ్జు రూపములో. "భిక్షాం దేహి" అని ఆగాడు. మాంచాల ఆలోచనలో పడింది. "అందరివద్దా 'భవతి భిక్షాం దేహి' అని, నా దగ్గరకు రాగానే 'భిక్షాం దేహి' అని భిక్షను అర్థించాడు. ఇందులో ఏదో మర్మమున్నది'' అని 'మాంచాల' మరుగుజ్జు రూపములోనున్న బాలచంద్రుడి చేయి గట్టిగా పట్టుకున్నది. వెంటనే పిడుగులు పడినట్లు, మెరుపులు మెరసి అడ్డుగా కట్టిన యినుప తెరలు భగ్గుమని మండి కరిగిపోయాయి. శీలమ్మ వాకిలి వద్ద నుంచి యిదంతా గమనిస్తున్నది. ఎపుడైతే ఇనుప తెరలు కాలి కరిగిపోయాయో, అందరూ యథారూపములు పొంది, ఎదురుగానున్న వారి వారి భార్యల చేతులు పట్టుకున్నారు. భగవంతుడే వారి పవిత్రతను రుజువు చేశాడని యోచించి సంతోషంగా అందరూ గుత్తికొండ బిలమునకు వెళ్ళారు.

అయితే యిప్పటికీ నెల్లూరు, ప్రకాశం జిల్లాలలో గల వీరాచారవంతులు, పీఠాధిపతిగారి సమక్షములో, 'మేడ ప్రక్కల బంతి' (మేడపి+ప్రక్క+బంతి) అనే పేరుతో వీరవిద్యావంతులు ఈ కార్యక్రమాన్ని నిర్వహిస్తుంటారు. అంకాళమ్మ గూడారు కొలుపులు జరిగిన తరువాత, ఓ విశాలమైన ప్రదేశములో ఈ కార్యక్రమమునకు వచ్చిన ఆచారవంతులనందరినీ పురుషులు ఒకవైపు ఎవరి భార్యలు వారికి ఎదురుగా వుండేట్లు కూర్చోబెడతారు. ఇరువురికీ మధ్యలో ఒక తెల్లటి తెర కడతారు. ఆహారం వడ్డిస్తారు అందరికీ. అపుడు బాలచంద్రుడి వేషము ధరించిన ఆచారవంతునికి భార్య వున్నట్లయితే ఆమె కూర్చుంటుంది. వివాహము కాని వారు అయినచో మాంచాల స్థానముతో ఒక రవికముక్కను తాంబూలమును ఆమెకు ప్రతిగా ఉంచుతారు. అందరూ భస్మము ధరించి శైవులలాగానే అలంకరణ చేసుకుంటారు. బాలచంద్రునికి మరికొంత వేషధారణ అదనంగా చేస్తారు. బాలచంద్ర వేషధారి భుజమునకు జోలె తగిలించుకుని 'భవతీ భిక్షాం దేహి' అంటూ అందరి వద్ద భిక్ష తీసుకుంటాడు. ఐతమ్మ దగ్గరకు రాగానే ఐతమ్మ బాలచంద్ర వేషధారిని వొళ్ళొ పడుకోబెట్టుకుని ఆహారం తినిపిస్తుంది. చివరగా మాంచాల వేషధారి దగ్గరకు వచ్చి "భిక్షాం దేహి'' అనటంతో ఆమె అతని చేయి పట్టుకుంటుంది. వెంటనే సిద్ధముగానున్న విద్యావంతులు అడ్డుగా కట్టిన తెల్లతెరను రెండువైపులా కత్తిరిస్తారు. తెరతెగిపడిపోతుంది. అపుడు అందరూ ఎవరి భార్యలను వారు చేయి పట్టుకుంటారు. భోజనాలు ముగించి వెళ్ళిపోతారు. ఇది నాటకీయంగా ఈనాటికీ నెల్లూరు ప్రకాశం జిల్లాలలో పీఠాధిపతిగారి సమక్షములో పల్నాటి ఆచారవంతులు, వీరవిద్యావంతులు కథాగానము చేస్తుండగా, కథ అయిపోయిన తరువాత ఈ సన్నివేశమును నిర్వహిస్తుంటారు.

# అనుబంధము-II
# నాగమ్మ @ తెలంగాణ

(2012, ఫిబ్రవరి 19వ తేది 'ఆంధ్రజ్యోతి' దినపత్రిక ఆదివారము సంచికలో మిత్రులు శ్రీ కె.వి. నరేందర్‌గారు, శ్రీ సంగెవేని రవీంద్రగారు రెండు పుటల ఈ చిన్న వ్యాసమును ప్రచురించినారు. నాయకురాలు నాగమ్మ తెలంగాణపు ఆడుపడుచని ఈ వ్యాసము నిరూపించుచున్నది. ఈ వ్యాసములో ప్రచురించిన రంగుల ఛాయా చిత్రములను వారి అనుమతితో నా సిద్ధాంత గ్రంథములో చేర్చినాను. నరేందర్, రవీంద్రగారల సౌజన్యముతో వారి వ్యాసమును ఇట అనుబంధముగా నిచ్చుచున్నాను... తంగిరాల వెంకట సుబ్బారావు.)

'పల్నాటియుద్ధం' తెలునాట ఇప్పటికీ ఒక సజీవ దృశ్యం. జరిగి 900 సంవత్సరాలైనా ఆ యుద్ధంలోని ప్రధాన పాత్రధారులందరూ పల్నాడు బయట కూడా చిరపరిచితులే. వారిలో నాయకురాలు నాగమ్మ ఒకరు. బ్రహ్మనాయుడులా ఆమె కూడా స్థానికురాలే అనుకుంటారు చాలామంది; కాని కాదు. ఆమె తెలంగాణనుంచి వలస వెళ్ళిన మహిళ. భారతదేశంలోనే ప్రప్రథమ మహిళామంత్రిణిగా పేరుగాంచిన నాగమ్మ... పుట్టింది, మరణించింది కూడా కరీంనగర్ జిల్లా, పెగడపెల్లి మండలంలోని 'ఆరవెల్లి' గ్రామంలోనే. ఆమెకు అక్కడ ఒక గుడి ఉందనే విషయం కూడా చాలామందికి తెలియదు. ఆ ఆలయం గురించే ఈ వ్యాసం.

కరీంనగర్‌నుంచి జగిత్యాల వెళ్ళే ప్రధాన రహదారిలో ఆంజనేయస్వామి 'కొండగట్టు' దాటిన తర్వాత మల్యాల క్రాస్ రోడ్ వస్తుంది. అక్కడినుండి దాదాపు పదిమేను కిలోమీటర్లు వెళితే, 'ఆరవెల్లి' గ్రామం వస్తుంది. ప్రస్తుతం ఈ గ్రామం పెగడపెల్లి మండలంలో ఉండగా, పల్నాటి చరిత్రకారులు తమ రచనల్లో ఈ ప్రదేశాన్ని 'సబ్బిమండలం'గా పేర్కొన్నారు. ఆరవెల్లి గ్రామ శివారులో నాయకురాలు నాగమ్మకు ఒక గుడి ఉంది. గుడిపైన గోపురం కాకుండా, మట్టి పెంకులతో పైకప్పు నిర్మాణమై ఉంది. గుడి గోడలపై నాగమ్మ చిత్రాలు ఉన్నాయి. ఆవరణలో ధ్వజస్తంభం ఉంది. గుడి ఎదురుగా ఉన్న మట్టిచెట్టు మొదట్లో మూడు చిన్న చిన్న రాతి విగ్రహాలు ఉన్నాయి. అవి నాగమ్మ అనుచరుల విగ్రహాలని చెపుతారు.

### *ఇరవై అడుగుల లోతులో నాగమ్మ గర్భగుడి:-*

నాగమ్మ విగ్రహముండే గర్భగుడి దాదాపు నేలమాళిగలో ఉన్నట్టుగా ఉంటుంది. గర్భగుడిలోకి దిగడానికి మెట్లున్నాయి. విగ్రహం అంత లోతులో ఎందుకుంది అని గ్రామస్థుల్ని అడిగినప్పుడు– నాగమ్మ పుట్టలో జీవసమాధి అయిందని కొందరు చెబితే, 'కొండ్రాయుడు' అనే వ్యక్తితో నాగమ్మ తలపడిందని, అతడు తొక్కితే నాగమ్మ పాతాళానికి పోయిందని మరికొందరు చెప్పారు.

### *చరిత్ర కథనంలో...:-*

కీ.శే. కలువల వెంకట సుబ్బారావు రాసిన 'భక్త పల్నాటి వీరచరిత్ర'లోనూ, మరో పల్నాటి పరిశోధకుడు డా॥ తంగిరాల వెంకట సుబ్బారావు రాసిన 'పల్నాటి వీరకథాచక్రం'లోనూ, రెంటచింతలకు చెందిన గుఱ్ఱం చెన్నారెడ్డి రాసిన 'పల్నాటి చరిత్ర'లోనూ, నాగమ్మ 'ఆరవెల్లి' నుంచి వలస వచ్చిన స్త్రీ అనే రాశారు. ఈ చివరి గ్రంథంలోని వివరాల ప్రకారం:-

నాగమ్మ తండ్రిపేరు చౌదరి రామిరెడ్డి. వారిది వ్యవసాయ కుటుంబం. కరువు కాటకాలు, మశూచివంటి వ్యాధులు ఆరవెల్లి గ్రామాన్ని తరచూ ఇబ్బంది పెడుతున్న కారణంగా రామిరెడ్డి నాగమ్మను తీసికొని పల్నాడులోని 'జిట్టగామాలపాడు'లో ఉన్న తన బావమరిది మేకపోతు జగ్గారెడ్డి వద్దకు వెళ్తాడు. అక్కడ వ్యవసాయ భూమిని కొనుగోలు చేసి బతుకుతుంటాడు. గోపన్న మంత్రి పర్యవేక్షణలో నాగమ్మ చదువుతోపాటు సాముగరిడీలు, ధనుర్విద్య, అశ్వశిక్షణలలో ప్రావీణ్యం పొంది, సంస్కృతాంధ్ర, కన్నడ, తమిళ భాషలలో పాండిత్యం సాధిస్తుంది. రాజనీతి, తత్త్వశాస్త్రాలను కూడా అధ్యయనం చేస్తుంది. రామిరెడ్డి మేనల్లుడైన సింగారెడ్డితో నాగమ్మ వివాహం జరుగుతుంది. వివాహమైన మూడు రోజులకే సింగారెడ్డి మరణించడంతో నాగమ్మ వితంతువు అవుతుంది. కొంతకాలం తర్వాత రామిరెడ్డి భూమిలో చెరువు తవ్వించే ప్రయత్నం చేస్తాడు అనుఁ గురాజు. రామిరెడ్డి ఆ ప్రయత్నాన్ని అడ్డుకోవడంతో, బ్రహ్మనాయుడు ఆగ్రహించి, ఓ రోజు నిద్రలో ఉన్న రామిరెడ్డిని తాళ్ళతో మంచానికి కట్టివేసి, పొందుగుల అడవుల్లోకి తీసికెళ్ళి హత్య చేయిస్తాడు.

ఆ తర్వాతి కథ అందరికీ తెలిసిందే. పల్నాటియుద్ధం అయిపోయాక, నాగమ్మ ఏమైందనేది కూడా గుఱ్ఱం చెన్నారెడ్డి పుస్తకంలో వివరంగా ఉంది.

ఒక ముసలి స్త్రీ గుఱ్ఱంమీద ఆయుధాలు పెట్టుకుని యుద్ధరంగంనుండి నేరుగా ఆరవెల్లికి వచ్చిందనీ, ఊరి ప్రజలను

పిలిచి, తనను నాయకురాలంటారని, కలరా భయంతో తాను చిన్నతనంలోనే ఆరవెల్లి విడిచి, మేనమామ ఊరికి వలస వెళ్ళానని, అక్కడ జరిగిన యుద్ధంలో ఒక మహావీరుణ్ణి ఓడించి, చివరి రోజులు పుట్టిన ఊరిలో గడపడానికి వచ్చినట్టు చెప్పిందనీ రాశారు. గ్రామస్థుల యోగక్షేమాలను తెలుసుకోవడమే కాక, వారిని భయభ్రాంతులను చేస్తున్న దొంగలను తాను ఎదిరిస్తానని చెప్పిందట. వారికి దొంగలను ఎదిరించడానికి తగిన శిక్షణ కూడా ఇచ్చిందట. చివరకు దొంగలను ఎదిరిస్తూనే ఆమె చనిపోయిందని ఒక కథ చెపితే, కాదు కాదు నాగమ్మ తన చరమదశలో స్వచ్ఛందంగా జీవసమాధి అయిందని కొందరు అంటారు. ఏది ఏమైనా తన ఊరికొరకు పాటుపడిన నాగమ్మకు గుడికట్టి, గ్రామదేవతగా ఆ గ్రామస్థులు నేటికీ ఆరాధిస్తున్నారు. ఆమె గుడికి తూర్పువైపున ఉన్న నీటివాగును 'నాయకురాలి వాగు' అని, కొలనును 'నాయకురాలి నీటి మడుగు' అని పిలుస్తున్నారు. వాగు పక్కనే ఉన్న ప్రాంతాన్ని నాయకురాలు కొండ్రాయుడితో యుద్ధంచేసిన ప్రదేశమని అంటారు. కొండ్రాయుడు గెలిచాడో, నాగమ్మ గెలిచిందో ఇదమిత్థంగా తెలియదు. కొండ్రాయుడు ఓడి ఆత్మహత్య చేసుకున్నాడని కొందరు, గెలిచి నాగమ్మను పాతాళానికి తొక్కేసాడని మరికొందరు చెపుతారు. బుడిగ జంగాలు చెప్పే కొండ్రాయుడి కథలో నాగమ్మ ప్రస్తావన చాలాసార్లు వస్తుంది:–

*"ఏడేండ్ల ప్రాయంలో ఎగిరిపోయిన చిలక*
*యాడుందో ఏమైందో ఎరికలేక పోయెరా*
*ముసల్దయి వచ్చింది అమ్మోరి తీరునా*
*అందరిని పసిగట్టి అడిగించినాది*
*నాయకురాలై నడిపించినాది*
*ఉసిగొలిపి జగడముల కమ్మించినది*
*గుబాగుబా రక్తమే గుబ్బలేసింది*
*కొండ్రాయుడే గుబ్బింతో తొక్కిస్తే*
*పాతాళ లోకంల కూరుకపోయింది*
*రాయుడే... మన కొండ్రాయుడే!"*

ఇట్లా సాగుతుంది.

గురజాల ఎం.ఎల్.ఏ. జంగా కృష్ణమూర్తి పల్నాటి మహోత్సవాన్ని ఏటా ఘనంగా జరుపుతున్నారు. ఆ సందర్భంగా అనేక కార్యక్రమాలు నిర్వహిస్తున్నారు. బ్రహ్మన్న, నాగమ్మ, కన్నమదాసుల విగ్రహప్రతిష్ఠ కూడా చేశారు. మరి తెలంగాణ రాజకీయ నాయకులు నాగమ్మ విషయంలో ఏం చేస్తున్నారు? నాగమ్మ తెలంగాణ ఆడపడుచని, దేశంలోనే ప్రప్రథమ మహిళా మంత్రిణి అన్న విషయం తెలంగాణలో ఎంతమందికి తెలుసు?

నాగమ్మ తెలంగాణలో పుట్టి, చివరిదశలో తిరిగి తన సొంత ఊరు 'ఆరవెల్లి' గ్రామానికి వెళ్ళిందని పల్నాటి రచయితలు, పరిశోధకులు పాతికేళ్ళ క్రితమే ధ్రువీకరించినపుడు, అంతటి మహానాయకురాలు మన గడ్డమీద పుట్టిందన్న విషయంపై తెలంగాణ చరిత్రకారులు, పరిశోధకులు, ఇన్నేళ్ళయినా పూర్తిస్థాయిలో ఎందుకు పరిశోధనలు చేయలేదో అర్థం కాదు.

**– కె.వి. నరేందర్** *94404 02871;* **–సంగెవేని రవీంద్ర** *099871 45310;* (ఆదివారం ఆంధ్రజ్యోతి, 19 ఫిబ్రవరి, 2012)

# అనుబంధము-III

# వీరగల్లులు- సతీకల్లులు

అన్యాయమును అధర్మమును ఎదిరించి, తన జాతి జనుల మేలుకొఅకు యుద్ధము చేసి, ప్రాణత్యాగము చేయువాడు 'వీరుడు'. ఆ వీరుని భార్య 'వీరపత్ని'. పూర్వకాలములో మన సమాజములో పశుసంపదయే సంపద. అందువలన ఒక గ్రామములోని ఆలమందను దొంగలు అపహరించిన సందర్భములలోకూడ ఆ గ్రామములోని ఒక ధైర్యశాలి ఆ దొంగల నెదిరించి, ఆలమందను మళ్ళించును. ఆ జగడములో అతడు చనిపోవచ్చును. ఆతడును వీరుడే! (కేవలము మానవులే కాదు; జంతువులుకూడ ఇట్టి ధైర్య సాహసములు ప్రదర్శించుట కలదు. వేటకుక్కలు అడవిపందిని ఎదిరించి పోరి చనిపోవుట కలదు.) ఇట్టి వీరుల విగ్రహములను శిలలపై చెక్కి పూజించుట కాకతీయుల కాలమునుండి ప్రారంభమైనది. ఇట్టి వీరశిలలను 'వీరగల్లులు' అందురు.

వీరగల్లుపై శిల్పములు మూడు చట్రములలో మూడు ప్రత్యేక భాగములుగా చెక్కబడును. అడుగున నుండు మొదటి భాగములో వీరుడు శత్రువులతో యుద్ధము చేయుచుండుట సూచింపబడును. మధ్యనుండు రెండవ భాగములో రంభ, ఊర్వశి, తిలోత్తమ మొదలగు అప్సరసలు యుద్ధములో మరణించిన ఆ వీరుని స్వర్గమునకు గొనిపోవుట తెలుపబడును. దానిపైన ఉండెడి మూడవ భాగములో కైలాసములో వీరుడు శివునిలో నైక్యమగుట చూపబడును. ఈ మూడు భాగములకు మధ్యనుండు ఖాళీస్థలములలోను, శిల మొదటనుండు ఖాళీలోను ఆ సంఘటనకు సంబంధించిన వీరశాసనము చెక్కబడును. ఒక్కొక్కప్పుడు యుద్ధము చేయుచున్న వీరుని ప్రతిమ, దాని ప్రక్కనే సహగమనము చేయుచున్న ఆతని వీరపత్ని ప్రతిమయు శిల్పీకరింప బడును. సహగమనము చేసెడి వీరపత్నుల శిలలను "సతీకల్లులు" అందురు. (కన్నడములో "సతీకల్లు"ను "మాస్తికల్లు" అందురు. "మహాసతి కల్లు" అను శబ్దమే జానపదుల ఉచ్చారణమున 'మాస్తికల్లు" అయినది.) వీరిని ప్రజలు ''పేరంటాండ్రు''గా సంభావించి పూజింతురు. వీరత్వమును ప్రదర్శించిన జాగిలములను చెక్కిన వీరశిలలుకూడ మనకు దర్శనమిచ్చును.

ఆంధ్రదేశములో వీరశైవము విజృంభించిన తరువాత పరమేశ్వర ప్రీత్యర్థము కత్తులు దింపుకొనుట, నాలుకలు కోసికొనుట, పొట్టలు చీల్చుకొనుట, తలలు ఖండించుకొనుట వంటి సాహసకృత్యములను చేయుచు ఆత్మబలి చేసికొను స్త్రీ పురుషుల వీరశిలలుకూడ వెలసినవి. ఇట్లు ఈశ్వరుని ముందు ఆత్మబలి చేసికొనెడి గుడులను "చంపుడు గుళ్ళు" అని పిలిచెడివారు. ఒక వీరశైవభక్తుడు తన ఆత్మబంధువులకుగాని, తన జాతికిగాని, తన దేశమును పాలించెడి ప్రభువునకు గాని, ఏదైన అరిష్టమేర్పడినపుడు, అది శమించినచో తాను ఆత్మబలి చేసికొనెదనని శివునకు మ్రొక్కుకొనును. ఆ కష్టము తీరగనే ఆ మ్రొక్కు చెల్లించును. ఆ మ్రొక్కుబడి తలను నఱకుకొనుట, పొట్ట చీల్చుకొని ప్రేవులతో శివుని అర్చించుట, గుండెలలో కత్తులు దింపుకొనుట మొదలగు సాహస కార్యములతో కూడియుండును. ఇట్టి శివభక్తులను ''వీర మాహేశ్వరులు" అందురు. వీరిలో స్త్రీలును గలరు.

వీరశైవులలోనే కాకుండ, శాక్తేయమార్గము ననుసరించు భక్తులలోకూడ ఇట్లు ఆత్మబలితో కూడిన మ్రొక్కుబడులు చెల్లించుట కలదు. ఒక వెదురుబొంగును భూమిలో పాతి, దాని చివర ఒక త్రాడు కట్టి, ఆ త్రాటితో దానిని బాగుగ వంచి, ఆ త్రాటి రెండ కొసను బలిపీఠముపై కూర్చున్న వీరభక్తుని 'వీరగంటు' (వీరముడి) అనబడు జుట్టునకు గట్టిగా ముడివైచెదరు. ఒక్క వ్రేటుతో ఆ వీరభక్తుని శిరస్సును నఱకుదురు. వెంటనే ఆ వెదురుబొంగు వేగముగా పైకిలేచి, భక్తుని తలతో కూడిన త్రాటితో అటు ఇటు వేగముగా ఊగును. నెత్తురు నలుదిక్కులకు చిమ్మబడును. ఆ రక్తము ఎంత ఎక్కువ మేర చిమ్మునో భక్తునకు అంత ఎక్కువ పుణ్యము లభించునని ఆనాటి ప్రజల నమ్మకము. ఈ విధముగా ఆదిశక్తికి తలను సమర్పించుకొనుటను "సిడిదల" (సిడితల) అందురు. (చూ. డా॥ ఆర్. శేషశాస్త్రి సిద్ధాంత గ్రంథము, 'కన్నడ వీరగల్లుగళు– ఒందు సాంస్కృతిక అధ్యయన').

ఈ విధముగా ఆంధ్రుల చరిత్రలో రకరకములుగా కానవచ్చెడి "వీరపూజ"నుగూర్చి పురాతత్వశాఖలో నిపుణులైన డా॥ పుచ్చా వాసుదేవ పరబ్రహ్మశాస్త్రిగారు ఇట్లు తెలియజేయుచున్నారు:-

"కాతీయులనాటినుండి మృతవీరుల నారాధించు ఆచారము కొంతగా గనవచ్చును. రాయలసీమ ప్రాంతములో వైదుంబుల, బాణరాజుల యుద్ధములలో మృతిచెందినవారి స్మారకముగ వారి శిలాప్రతిమలను నిలిపి, వాటిని ఆయా పితృదినములలో ఆరాధించుట గలదు. కాని మధ్యయుగములో అది కొంత అంతరించెను. వీరశైవము పేరిట దేవునికొరకు ఆత్మబలి ఇచ్చుట ప్రారంభమయ్యెను. అట్లు తమను స్వయముగా నరకుకొనుచున్నట్లు తెలుపు శిలాప్రతిమలు అనేకము మనదేశములో రెడ్డిరాజుల కాలమునుండి కానవచ్చును. శ్రీశైలములోని "వీర శిరోమండపము" అందుకొరకేర్పడినదే! యుద్ధములందు సాహసకృత్య మాచరించి వీరస్వర్గము పొందినవారి

ప్రతిమలు ప్రతిష్ఠించి పూజించుటకై రాజులు భూదానములను వృత్తులను ఇచ్చెడివారు. పల్నాటి వీరులలో పినమల్లి దేవరాజు, శీలమ నాయుడుల నుద్దేశించి కారెంపూడిలో వారి ప్రతిమలను ప్రతిష్ఠించి, వాటిపైన నాయుడు మండపము నిర్మించినట్లు క్రీ.శ. 1445 నాటి శాసనమొకటి తెలుపుచున్నది. వారి సాహస కృత్యములనుగూర్చి పాటలు పాడెడివారు. ఇదే విధముగ శివునికొరకో, కాళికాదేవి కొరకో, వీరభద్రునికొరకో, భైరవునికొరకో తమ శిరములను నరికి, సమర్పించుచున్నట్లు తెలుపు వీరశిలలు కనుపించును. అట్టి శిలలను గూడ ఆయా దేవాలయముల వద్ద పూజించుచుందురు. అట్టి ఆలయములను "చంపుడు గుళ్ళు" అనెడివారు. కడప జిల్లాలో మోపూరు భైరవస్వామి గుడి, వరంగల్లు జిల్లాలో కొరవి వీరభద్రుడి గుడి, శ్రీశైల మల్లికార్జునుని గుడి యిట్టి గుళ్ళుగా ఆనాడు ప్రసిద్ధమయినవి. పతివ్రతలగు స్త్రీలు తమ పతులు చనిపోయినప్పుడు వారితోపాటు సహగమన మాచరించుట మరియొక ఆచారముగ నుండెడిది. ఇట్టి స్త్రీల రూపముతో నుండు శిలా ప్రతిమలు అనేకము ఈ నాటికిని కనుపించును. కాని అందరు స్త్రీలు ఇట్టి సహగమన మాచరించువారు కాదు. పుత్ర సంతతి లేని స్త్రీలు తరచుగ ఇట్లు చేయువారట. ఇట్లు సహగమన మాచరించిన స్త్రీలను 'పేరంటాలు' అను పేరుతో గ్రామదేవతలవలె పూజించు ఆచారముండెడిది... మైలారదేవుని భక్తులు, భటులు ముఖ్యముగా ఆ దేవుని రథయాత్రోత్సవములందు, నిప్పులలో దుముకుట, కత్తిని రొమ్ముగుండ ఇరువైపులకు ఉండునట్లు చొప్పించి, దానికి అడ్డుగా త్రాడు చుట్టి ఉయ్యాల ఊగుట, నాలుకలు కోసికొనుట- మొదలైన సాసహకృత్యములు చేసెడివారు. రేచెర్ల అనపోతనాయుడు వరంగల్లు వద్ద అయినవోలులో మైలారదేవునికి గొప్ప గుడి కట్టించెను. అచట పెద్ద ఉత్సవము జరుగుచుండెడిది".

[విజ్ఞాన సర్వస్వము, తెలుగు సంస్కృతి, మొదటి సంపుటము (పునస్సంశోధితము), దేశము- చరిత్ర, (హైదరాబాదు: తెలుగు విశ్వవిద్యాలయం, 1990), పుట 494.]

# అనుబంధము-IV

# వీరులు- వీరభూములు

వీరగాథలలో నెక్కువభాగము యథార్థ సంఘటనలు. కాఁబట్టి, యీ చారిత్రక సంఘటనా సంబంధములగు నవశేషములు దేశమున నచ్చటచ్చటఁ గానవచ్చుచున్నవి. ముఖ్యముగాఁ బల్నాటి వీరకథలకును కాటమరాజు కథలకును సంబంధించిన వీరుల విగ్రహములు, గుడులు, రణభూములు నేఁటికిని స్థలజ్ఞులు వర్ణించి చెప్పుచునేయున్నారు. వీనిలోఁగొన్ని గ్రామీణుల అభూత కల్పనలుగా భావించినను, వీరుల విగ్రహములు గుడులు వంటి చారిత్రకావ శేషములను సత్యములుగా నమ్మక తప్పదు. ఆయా వీరులయొక్కయు, వీరభూములయొక్కయు, వీరగాథలలో వచ్చు శక్తులయొక్కయు నవశేషములను నేను దర్శించి, వాని ఛాయాచిత్రములను దీసి భద్రపఱిచితిని. ఈ ఛాయాచిత్రములను నా సిద్ధాంత గ్రంథమున నొక అనుబంధముగా నిచ్చితిని. వీరభూములనుగూర్చిన కొన్ని విశేషాంశములను ఈ యనుబంధమునఁ దెలుపుచున్నాను.

## శక్తి కథాచక్రము

### *మండపాక ఎల్లమ్మ:-*

పరశురాముని తల్లియగు రేణుకకు 'ఏకవీర' యని నామాంతరము. ఈ యేకవీరను జానపదులు 'ఎల్లమ్మ' యని పిలుతురు. గమళ్ల కులమువారు ఈమె నెక్కువగాఁ గొలిచెదరు. ఓరుగంటి రెడ్లుకూడ నీమెభక్తులే. ఈ యెల్లమ్మ 'మండపాక, పెనుఁబాక, మాహురము, నాగవరము, పోలాస, ఓరుగల్లు' అను నాఱు ప్రాంతములలో వెలసినట్లుగాఁ గ్రీడాభిరామమునఁ గలదు (చూ. 128వ పద్యము). ఇందు 'మాహురము, నాగవరము, పోలాస' అను ప్రదేశములు మహారాష్ట్రములోనివిగాఁ గన్పట్టును. పశ్చిమగోదావరి జిల్లా, తణుకు తాలూకాలో "మండపాక" యను గ్రామమున్నది. ఈ మండకపాకలో నెల్లమ్మకొక గొప్ప దేవాలయమున్నది. అట నేటేట నెల్లమ్మకు వైభవోపేతముగాఁ దిరునాళ్లు జరుగుచున్నవి.

### *మారాసపు అంకమ్మ:-*

ఆంధ్రదేశమున నతిప్రధానమైన గ్రామదేవతలలో నంకమ్మ యొకతె. అంకమ్మగుడిలేని పల్లె లేదనవచ్చును. ఈ అంకమ్మలు మూఁడు విధములు: 'మారాసపు అంకమ్మ, పల్నాటి అంకమ్మ లేక ఈర్ల (వీరుల) అంకమ్మ, బయటి అంకమ్మ'. రవద్దేవిరాజు, గంగురాజు మున్నగువారు (అంకమ్మ కథలలో వచ్చు రాజులు) కొలిచిన అంకమ్మ మారాసపు అంకమ్మ. ఈ రాజులకు 'మారాసపు రాజు' లని పేరు. ఈ పేరునుబట్టియే వీరు కొలిచెడి అంకమ్మ కిట్టి నామము వచ్చినది. కొమ్మరాజువంటి పల్నాటివీరులు కొలిచిన అంకమ్మకు 'ఈర్ల అంకమ్మ' లేక 'పల్నాటి అంకమ్మ' అని పేరు. ఈమె దేవాలయము కారెంపూడిలో నున్నది. ఊరిబయటనుండు అంకమ్మకు 'బయటి అంకమ్మ' యని పేరు. ఈమె నిండ్లలో బూజింపరు.

రవద్దేవిరాజు, గంగురాజు వంటి మారాసపు రాజులు ఏ ప్రాంతమును బాలించిరో, వారు పూజించిన అంకమ్మ యేదియో, అసలు వారు చారిత్రక పురుషులో కాదో తెలియవచ్చుట లేదు. తిరుపతిలో నూరి బయట నొక పెద్ద అంకాళమ్మగుడి యున్నది. ఆ విగ్రహముయొక్క ఛాయాచిత్రమును నేను సంపాదించితిని. కారెంపూడిలోనున్న అంకమ్మ తప్పఁ, దక్కిన అంకమ్మ లన్నియు నొక్కటే యని నా యభిప్రాయము. మారాసపు రాజులు పూజించిన అంకమ్మయు నిట్టిదే కావచ్చును.

### *'పల్నాటి అంకమ్మ' లేక 'ఈర్ల (వీరుల) అంకమ్మ' :-*

ఇది పల్నాడులోఁ గారెంపూడి గ్రామమునకు మధ్యగా నున్నది. ఈ అంకమ్మగుడి చెన్నకేశవుని గుడికి నుత్తరముగా నున్నది. ఈ అంకమ్మను కొమ్మరాజు కొలిచినాఁడు. పల్నాటివీరులు కొలిచిన అంకమ్మ కావున నీమెకు 'ఈర్ల అంకమ్మ'-'పల్నాటి అంకమ్మ' అను పేర్లు వచ్చినవి. ఈ వీర్ల అంకమ్మ విగ్రహము ఎడమవైపున కొఱగి, చనిపోయిన తన వీరులకొఱకై దుఃఖించుచున్నట్లుగా నుండును. ఈ విగ్రహమున కెదురుగా నున్న గుడిగోడకు ఒక క్రంత కలదు. ఆ క్రంతలోనుండి చూచినచోఁ గారెంపూడి రణరంగమంతయుఁ గానవచ్చును. తన్నుఁగొల్చిన కొమ్మరాజాది భక్తులు రణనిహతు లగుటచే నీ యంకమ్మ దుఃఖించుచున్నదనియు, నందుచే నీమె యెడమ కంటిలోనుండి నేఁటికిని నీరు కారుచుండుననియు జనులు చెప్పుదురు.

### *పోలేరమ్మ:-*

ఈమెకూడ అంకమ్మవలెనే ఒక ప్రసిద్ధ గ్రామదేవత. మశూచి, పొంగు, ఆట్లమ్మ మున్నగు వ్యాధులు ఈమె ఆగ్రహించుట వలన కలుగునని జానపదుల విశ్వాసము. మశూచి వచ్చినప్పుడు 'పోలేరమ్మ కథ'ను బవనీంద్రచేఁ బాడించి రోగికి వినిపింతురు. నెల్లూరుజిల్లా దర్శితాలూకా గంగదొనకొండ గ్రామములోని గంగ గుడిలోఁగల పోలేరమ్మ విగ్రహముయొక్క ఛాయాచిత్రమును నేను సంపాదించితిని.

## పల్నాటి వీరకథాచక్రము

### *గురిజాల :–*

నేఁటి గుంటూరు జిల్లాలోని పల్నాడు తాలూకాకు ముఖ్య పట్టణము. ఇది అనులుగురాజుచే నిర్మింపఁబడెనని వీరగాథలలోఁ గలదు. గురివిందపొదలు నతికి కట్టుటచే దీనికీపేరు వచ్చెనఁట. 'గురిజాల' అనియు 'గురజాల' అనియు రెండు రకముల వ్యవహార మున్నది. 'మాధవీపురము' సంస్కృతీకరణము. ఇప్పుడున్న గురిజాల నూతనముగా నిర్మింపఁబడినది. దీనికిఁ దూర్పుగా నరమైలు దూరములోఁ బ్రాఁత గురిజాల యుండెడిది. దానిని బ్రహ్మనాయఁడు దగ్ధము చేసెనఁట.

నేఁటి గురిజాలకుఁ బశ్చిమమున 'కోటగడ్డలు' గలవు. అనఁగా నిది నలగాముని కోట. ఈ కోట మధ్యలో ముక్కంటిగుడి శిథిలమైయున్నది. కోట యగడ్త నేఁటికిఁ గూడఁ గానవచ్చుచున్నది. కోటలోని ముక్కంటిగుడికి 'ముక్కిడి గుడి' అని జనవ్యవహారము. ప్రాఁత గురిజాలలో గురిజాలమ్మ గుడియున్నది. క్రొత్త గురిజాలకు దక్షిణముగా నాలుగు ఫర్లాంగుల దూరములో 'దూబచెఱువు' గట్టున 'ఇష్టకామేశ్వరిగుడి' యున్నది. దూబచెఱువు ప్రాచీనమైనది. దీనిని నాగమ్మ త్రవ్వించినదఁట. ఈ చెఱువు మధ్యమున నొక శివాలయమున్నది. కోటగడ్డల కానుకొని దక్షిణదిశగా వీరభద్రుని గుడి యున్నది. దూబచెఱువునుండి రైల్వేస్టేషనుకుఁబోవు దారిలోఁ గుడిచేతివైపున గంగగుడి యున్నది. బ్రహ్మనాయఁడు గురిజాలను ముట్టడించినప్పుడు నలగాముఁడు ఈ గుడిలోనే దాఁగెను.

క్రొత్త గురిజాల మధ్యలోఁగల పాతపాటమ్మగుడిలోఁ బ్రతిసంవత్సరము వీరుల యుత్సవము వీరకథాగానము జరుగును. నేఁటి గురిజాల కుత్తరముగా నొక మైలుదూరములో 'కట్టుబోతుల గంగారము' అను నూరు కలదు. నాగమ్మ కోడిపందెమునఁ గట్టుకట్టుటకై కట్టుబోతుల నీయూరినుండియే రప్పించినది. గురిజాలలో అనుఁగురాజు చెన్నునిగుడి కట్టించినట్లుగా వీరగాథలలోఁ గలదు. ఇది నేఁడు కానవచ్చుట లేదు. మాచెర్లలో మాత్రమే చెన్నుని గుడి కలదు.

### *మాచెర్ల:–*

గురిజాలకుఁ బశ్చిమముగాఁ బదునైదు మైళ్ల దూరములో మాచెర్ల కలదు. ఇది మలిదేవుఁడు పాలించిన పట్టణము. ఇట చెన్నకేశవస్వామి ఆలయమున్నది. ఇది బ్రహ్మనాయనిచేఁ బ్రతిష్ఠింపఁబడినది. ఇది చంద్రవంకకు దక్షిణతీరమునఁగలదు. చెన్నుని గుడికి నెడమప్రక్కన శ్రీగిరీశ్వరస్వామి, శ్రీవేంకటేశ్వరస్వామి, వీరభద్రుని ఆలయములు కలవు. వీరభద్రుని గుడికి ఎడమప్రక్క ఇష్టకామేశ్వరాలయము, కుడిప్రక్క శివాలయముఁ గలవు.

నేఁటి మాచెర్లయు మలిదేవాదులు పాలించిన మాచెర్లయు నొక్కటి కాదు. నేఁటి మాచెర్ల చంద్రవంకకు దక్షిణతీరమున నున్నది. మలిదేవాదులు పాలించిన మాచెర్ల చంద్రవంకకు ఉత్తరతీరమున నుండెడిది. ఇట 'మాంచాల దిబ్బ'– 'మలిదేవాదుల మహలు' అను ప్రదేశములను స్థానికులు చూపుచున్నారు. దక్షిణతీరమున కన్నమదాసు సైన్యముతో నుండెడి ప్రదేశమున్నది. దీనిని 'కొట్టాల మిట్ట' అందురు.

ఇక్కడ చంద్రవంకనది తూర్పునుండి పడమరకుఁ బ్రహించుచున్నది. (కారెంపూడిలోను, జిట్టగామాలపాడులోను గల నాగులేరు దక్షిణమునుండి ఉత్తరమునకుఁ బ్రహించుచున్నది.) దీని యుత్తరతీరమున నొకచోట పెద్దరాతి పలకపై గుఱ్ఱపుడెక్కల గుర్తులున్నవి. చంద్రవంక పొంగినప్పుడు బాలచంద్రుఁడు తన గుఱ్ఱమును దూకించెననియు, దాని గుర్తులే ఇవియనియు స్థానికులు చెప్పుదురు.

మాచెర్లకు దక్షిణముగా మూఁడు మైళ్ల దూరములో నొక పెద్ద చెఱువు గలదు. దీని వైశాల్యము 1200 యకరములు. దీనిని 'బ్రహ్మనాయని చెఱువు' అందురు. దీనిని బ్రహ్మనాయఁడు త్రవ్వించెను. దీనిక్రింద నేఁటికిని నాలుగువందల యకరములు సాగుచేయఁబడుచున్నవి.

ప్రతి సంవత్సరము చైత్ర శుద్ధ పూర్ణిమనాఁడు ప్రారంభించి పదునేడు రోజులు మాచెర్ల చెన్నునకుఁ దిరునాళ్లు జరుగును.

### *జిట్ట గామాలపాడు:–*

నేఁటి గురిజాలకు నీశాన్యదిశలో నెనిమిది మైళ్ల దూరమున నేఁటి 'గామాలపాడు' గ్రామమున్నది. ఇది యాధునికమైనది. దీని కుత్తరముగా నొక యరమైలు దూరమున నాగులేటి యొడ్డున జీర్ణములైన 'నాయకురాలి కోటలు'ను, నీ కోటలకుఁ బడమర దిక్కున 'జిట్ట గామాలపాడు దిబ్బలు'ను గలవు.

నాయకురాలి కోటలు శిథిలములైనను గోటగోడ కన్పట్టుచునే యున్నది. ఈ కోటలో నొక శివాలయము కలదు. ఇది కోట ఈశాన్య మూలలోఁ దూర్పు ముఖముఁగా నున్నది. దీనికి 'నాయకురాలి గుడి' యని జనవ్యవహారము. ఇది నాయకురాలు నాగమ్మ పూజించిన శివాలయము. ఈ గుడికెదురుగా నున్న మాగాణులలో నాగులేటి యొడ్డునఁ బెద్ద పూలతోట యొకటి యుండెడిది. ఈ పూలతోటనుండి పూలు తెచ్చి నాయకురాలు శివుని నర్చించెడిదఁట. పూర్వము పూల తోట యున్న ప్రదేశము నేఁడు మాగాణిగా మాఱిపోయినను 'పూలతోట' యను నామము మాత్రము మాఱలేదు.

నాయకురాలి కోట పడమటి గోడకానుకొని జిట్టగామాలపాడు గ్రామముండెడిది. ఇప్పుడది పాటిదిబ్బలుగా నున్నది. ఇచట పాటిమట్టిని ప్రజలు త్రవ్వుకొనిపోవుచున్నారు. ఈ పాటిమట్టిలోఁ బెద్దపెద్ద రోళ్ళు, బంగారు నాణెములు లభించుచున్నవి.

నాలుగేళ్లక్రిందట (అనఁగా 1962 ప్రాంతములో) గామాలపాడులో నున్న శ్రీ చిటిప్రోలు కృష్ణమూర్తి యను కవిపుంగవునకు 'స్ర్కూ' మూఁ తగల చిన్న రాచ్చిప్ప (రాతిచిప్ప) లో నిరువది బంగారు నాణెములు లభించినవి. కృష్ణమూర్తిగారు వాని విలువను గుర్తించినవారగుటచే వెంటనే వానిని నాగార్జున 'మ్యూజియము' నకుఁ జేర్చిరి. ఇవి నాగమ్మ కాలమునాఁటి నాణెములుగాఁ దలంపఁబడుచున్నవి.

ఇప్పటి గామాలపాడునకు దక్షిణముగా రెండు ఫర్లాంగుల దూరమున నొక పెద్ద బావియున్నది. దీనికి 'నాగమ్మబావి' యని పేరు. దీనిని నాయకురాలు త్రవ్వించెనఁట. ఇది చాలా విచిత్రమైన బావి. పల్నాటిలో నేబావిని బరిశీలించినను మిక్కిలి లోఁతుగా నుండును. కాని నాగమ్మబావిలో నీళ్లు వేసవికాలములో సహితము చేతికందుచుండును. వర్షాకాలములో నీ బావిలోని నీళ్లు పొంగి పొరలువాఱి ప్రక్కనేయున్న యేటిలోఁ గలసి ప్రవహించుచుండును. ఇట్లు నీళ్లు వ్యర్థమగుటను జూచి గ్రామీణులు ఈ బావి చుట్టును చిన్న 'సిమెంటు' గోడను నిర్మించిరి. ఈ నాగమ్మబావిలోని జలము అతిస్వచ్ఛమై, స్ఫటికసదృశమై లోపలినేల కన్పట్టుచుండును. ఈ బావినీటికిఁ గల రుచి, ఈ ప్రాంతములోని బావులందెచ్చటను గానవచ్చుట లేదు.

నాయకురాలి కోటల కెదురుగా (తూర్పుగా) బ్రవహించు నాగులేటిలో నొక పెద్ద మడుగున్నది. దీనికి 'నంది మడుగు' అని పేరు.

### *'కోడేరు గుట్టలు':–*

ఇవి మాచెర్లకును గురిజాలకును మధ్యగల 'పాలవాయి' గ్రామ సమీపమున గలవు. నేఁటి పాలవాయి 'రైల్వేగేటు' ప్రక్కనే యున్నవి. 'కోడిపోరు గుట్టలు' అను శబ్దమే జానపద వ్యవహారమున 'కోడేరు గుట్టలు' అయినది. ఈ ప్రాంతమును 'కోడేరు వీరబయళ్లు' అనియుఁ బిలుతురు. ఇచట నాగమ్మకును బ్రహ్మనాయనికిని కోడిపందెము జరిగినది. ఈ కోడిపందెమును జూచుటకై వచ్చిన జనసమూహము పలుచని గుండ్రని ఱాళ్లను దెచ్చికొని ఆసనములుగాఁ బృష్ఠము క్రింద వేసికొని కూర్చొనిరి. కూర్చొనుటకు పీటలవలె నుపయోగపడిన ఱాళ్ళు కావున వీనిని "పీటఱాళ్ళు" అందురు. కోడిపందెము ముగిసిన తరువాత రెండు పక్షములవారును తమతమ పీటఱాళ్లను రెండు గుట్టలుగా విసిరివేసి పోయిరఁట. తూర్పువైపున నున్న గుట్ట గురిజాలవారిది. పడమరవైపున నున్న గుట్ట మాచెర్లవారిది. ఇవి చిన్నచిన్న పర్వతములవలె నున్నవి. ఈ గుట్టలనుబట్టి నాఁటి కోడిపోరును జూచుటకు లక్షలాది ప్రజలు వచ్చిరని సులభముగా నూహింపవచ్చును.

ఈ గుట్టలు పూర్వమింకను బెద్దవిగా నుండెడివఁట. ప్రాంతీయులైన రైతులు వీనిని గొంపోయి గోడలను నిర్మించుకొనిరి. ఈ గుట్టలలోని ఱాళ్లను నేను స్వయముగాఁ బరిశీలించితిని. ఇందలి ప్రతిశిలయుఁ బలుచగా గుండ్రముగాఁ బీటవలె నున్నది. మామూలుగాఁ బల్నాటిలో లభించు ఱాళ్లకును వీనికిని సంబంధము లేదు.

### *'అలరాజు ఒఱగుఱాయి' – 'తంబళ్లపెద్దు విగ్రహము' :–*

గురిజాలకు దక్షిణముగా నాలుగుమైళ్ల దూరములో 'చెర్లగుడిపాడు' గ్రామమున్నది. రాయబారమునకై వచ్చిన అలరాచమల్లు తిరిగిపోవుచు నీ గ్రామములోనే హత్యచేయబడెను. నేఁటికిని ఈ గ్రామము ఈ పేరుతోనే యున్నది. ఈ చెర్లగుడిపాడునకు దక్షిణముగా నొక సజ్జచేనులో నొక పెద్ద శిలపై నలరాజు విగ్రహము చెక్కియున్నది. ఈ విగ్రహమునకు దక్షిణముగాఁ దల, యుత్తరముగాఁ గాళ్లు, తూర్పుగా ముఖము గలవు. ఈ వీరగల్లు మూఁడడుగుల పొడవు, రెండడుగుల వెడల్పు ఉన్నది. దీనికి 'అలరాజు ఒఱగుఱాయి' యనిపేరు. అలరాజు ప్రాణములు వీడిన ప్రదేశమిదియే. నిన్నమొన్నటి వఱకు నిచట నొక పెద్ద వేపచెట్టుండెడిది.

చెర్లగుడిపాడునకు ఉత్తరముగా నొక తుమ్మల బీడులో అలరాజునకు విషపుష్పములనిచ్చిన దుర్మార్గుడగు 'తంబళ్లపెద్దు' విగ్రహమున్నది. ఈ విగ్రహముపైఁ బెద్ద పుట్టపోసినది. (అందుచే దీని ఛాయాచిత్రమును నేను దీయలేకపోతిని).

ఈ గ్రామములో నంటువ్యాధులు వ్యాపించినప్పుడు ఈ యలరాజు తంబళ్లపెద్దుల విగ్రహములకు వేటలు బోనములు సమర్పింతురు.

### *'నాయకురాలి కనుమ' :–*

కారెంపూడికి దక్షిణముగా రెండున్నర మైళ్ల దూరములో నొక సన్నని కనుమ యున్నది. దీనికి 'నాయకురాలి కనుమ' యనిపేరు. బాలచంద్రుఁడు తన నంగడీలతో మేడపినుండి కారెంపూడి రణక్షేత్రమునకు వచ్చుచుండఁగా నాయకురాలు ఈ కనుమ దగ్గఱ పంగచాచి నిలఁబడినదనియు, నామె కాళ్లక్రిందనుండి దూఱిపోవుట వీరునకు లజ్జాకరమగుటచే, బాలచంద్రుఁడచ్చటి కొండను బగులఁగొట్టి సన్నని మార్గమేర్పఱుచుకొని, ఆ మార్గముగుండా కారెంపూడిని జేరె ననియుఁ ప్రజలు చెప్పుదురు. బాలచంద్రుఁడు పగులఁగొట్టిన కొండదారికూడ నీ కనుమ ప్రక్కనే యున్నది. ఈ కనుమగుండా నాగులేరు ప్రవహించుచున్నది.

ఈ నాయకురాలి కనుమకు దక్షిణముగా నొక యరమైలు దూరమున నాగులేటి కడ్డముగాఁ బెద్ద కట్ట కట్టబడి, యొక చెఱువు నిర్మింపఁబడియున్నది. ఈ యానకట్టకు 'నాయకురాలి కట్ట' యనిపేరు. 'మొండికట్ట' యను నామాంతరమును దీనికిఁగలదు. ఈ చెఱువు క్రిందఁ బంటపొలములు, తమలపాకుల తోటలు గలవు.

దీనినిబట్టి నాగమ్మయు బ్రహ్మనాయఁడును కేవలము స్పర్ధలతో యుద్ధములతోఁ బ్రజలను విసిగించినవారేకాక, పెద్ద పెద్ద చెఱువులు నిర్మించి రైతులకెంతయో తోడ్పడిరని స్పష్టముగాఁ దెలియుచున్నది.

నాయకురాలి కనుమకు దక్షిణముగా మూఁడు మైళ్లదూరమున 'నల్లగుండ్ల కనుమ' యున్నది. అఱువది యార్గురు పల్నాటి వీరులును వీరమేడపినుండి బయలుదేరి యీ నల్లగుండ్ల కనుమగుండా కారెంపూడిని జేరిరి. నాయకురాలి కనుమ దగ్గఱ 'మంత్రాలమ్మ' యను శక్తిగుడి కలదు. వీనిని వీరులు ప్రతిష్ఠించిరని చెప్పుదురు.

### *కారెంపూడి రణక్షేత్రము:–*

గురిజాలకు ఆగ్నేయముగాఁ బదిమైళ్ల దూరములో నాగులేటి యొడ్డునఁ గారెంపూడి యున్నది. దక్షిణమునుండి యుత్తరమునకుఁ బ్రవహించు నీ నదికిఁ దూర్పుటొడ్డున రణక్షేత్రమును, బడమటి యొడ్డున కారెంపూడి గ్రామమును గలవు.

కారెంపూడి గ్రామములో 'ఈర్ల (వీరుల) అంకమ్మ' గుడి, 'చెన్నుఁడు గుడి'యను 'చెన్నకేశవుని గుడి', 'బ్రహ్మనాయని నామతీర్థ మండపము', 'కన్నమదాసు మేడ' కలవు. చెన్నకేశవుని గుడిలో బ్రహ్మనాయని 'నృసింహకుంత' మను గొప్ప బల్లెమున్నది. దీనిపై వెండికట్లున్నవి. బాలచంద్రుని బల్లెము కూడ నీ గుడిలోనున్నది. దీనిని 'సామంతము' అందురు.

కారెంపూడి గ్రామములో నుత్తరభాగమున 'బ్రహ్మనాయని నామతీర్థ మండప' మున్నది. దీని మధ్యన నొక బావియున్నది. దీనికి 'జడ్డిగాల బావి' యని పేరు. ఈ బావిలో వీరుల ఆయుధములు గొలుసులతోఁ గట్టఁబడియున్నవఁట. యుద్ధము జరుగుచున్న కాలములో బ్రహ్మనాయఁడు ఈ బావిలో స్నానము చేసి, నామమును దీర్చి దిద్దుకొని, ఇచ్చటఁ దపస్సు చేసికొనెడి వాఁడఁట. అందుచే దీనికి నామతీర్థ మండపమని పేరు వచ్చినది. దీనిని 'నామాల మండప' మనియుఁ బిలుతురు.

కారెంపూడి గ్రామములో దక్షిణభాగమున నాగులేటి తీరమున 'కన్నమదాసు మేడ' యున్నది. కన్నమదాసు దీనిపైకెక్కి శత్రువుల రాకను గమనించెడివాఁడఁట.

ఇచ్చటఁ బ్రవహించు నాగులేటిలో నొక మడుగున్నది. దీనికి 'గంగదార మడుగు' అని పేరు. దీనిని బ్రహ్మనాయఁడు నిర్మించెనఁట. నాగులేరు నాగమ్మదనియు, గంగదార మడుగు బ్రహ్మనాయని దనియుఁ జెప్పుదురు.

ఈ నాగులేటికిఁ దూర్పుతీరమున 'వీరులగుడి' యున్నది. దీనిలో నఱువదియాఱు లింగములున్నవి. ఇవి యఱువదియాఱుగురు వీరులును దమతమపేర్లతోఁ బ్రతిష్ఠించిన లింగములు. వీరుల ఆయుధములుకూడ నీ గుడిలో నున్నవి. ఇందుఁ గన్నమదాసు 'భైరవకత్తి', 'కంచుటరిగె' పేర్కొనఁ దగినవి. నేఁడు భైరవకత్తి మాత్రమే కనిపించుచున్నది. కంచుటరిగె నెవరో తస్కరించిరి. 'ఆరుమూళ్ల కంచుటరిగె పన్నెండు మూళ్ల భైరవకత్తి' యని వీరగాథలలోఁ బదేపదే వచ్చుచుండును. ఈ కంచుటరిగెను మార్పింపఁగా రెండు బిందెలయినవఁట.

ఈ వీరులగుడిలో నిరువురు ముస్లిము వీరసోదరుల విగ్రహములున్నవి. ఔరంగజేవు కాలములో నీ సర్దారులు ఆ మార్గమునఁ బోవుచు నాగులేటి తీరమునఁ దమసైన్యములతో విడిసిరఁట. అప్పటి కక్కడఁ గేవలము వీరుల లింగములే యున్నవి కాని, వీరులకు గుడి నిర్మింపఁబడలేదు. ముస్లిములు ఆలింగములను పొక్కిటిగడ్డలుగా నుపయోగించిరఁట. అందుచే నాయన్నమును దిన్న సైన్యమంతయును జనిపోయెనఁట. సర్దారులకేమియుఁ దోఁచలేదు. అంతలోఁ జెన్నకేశవుఁడు ప్రత్యక్షమై వారు చేసిన తప్పిదమును దెల్పి వీరులకు గుడికట్టుఁడని యాజ్ఞాపించెను. ఆ సర్దారులట్లే చేసిరి. సైన్యమంతయుఁ బ్రతికెను. కాని యా రణక్షేత్రముయొక్క ప్రభావముచే నా సర్దారులలో వీరావేశము పెల్లుబికి ఆ సోదరులు ఒకరినొకరు పొడుచుకొని చనిపోయిరి. వారిపేర్లు 'షేక్ జాఫర్' 'షేక్ ఫరీద్'. వీరి సమాధులుకూడ వీరులగుడి ప్రాంగణములో నున్నవి. గుడిద్వారమునకుఁ గుడివైపున వీరి విగ్రహములు చెక్కఁబడి యున్నవి.

ఈ ముస్లిము సర్దారు లొకరినొకరు పొడుచుకొనలేదనియు, నిరువురును జీవసమాధులైరనియు వీరాచార పీఠాధిపతులు తెలుపు చున్నారు. వీరులగుడికి బయట ముస్లిముల యాచార సూచకముగాఁ గాషాయవర్ణము వేయఁబడును. గుడిలోపల హిందువుల యాచారమును దెలుపుచుఁ దెల్లనిరంగు పూయఁబడును.

కారెంపూడి రణక్షేత్రములో నింకను గంగవిగ్రహము, కాలభైరవుని విగ్రహము, ఆంజనేయస్వామి విగ్రహము గలవు. ఇవి నాగులేటి యొడ్డుననే కలవు. కొంచెము దూరముగా నెఱుకలశక్తి, కల్లిపోతురాజు కలరు. 'కల్లుప్రతిష్ఠ' యను వీరగాథలలో బ్రహ్మనాయఁడు త్రిపురాంతకమునుండి నాగారపు స్తంభమును దెచ్చి, దానిని యుద్ధ భూమిలోఁ బ్రతిష్ఠించెనని యున్నది. దాని యవశేషమే ఈ 'కల్లిపోతురాజు'. రణక్షేత్రమున నాగులేటి తీరమున బ్రహ్మనాయని శంఖుతీర్థమండప మొకటి కలదు. యుద్ధమునకుఁ బోవు వీరులకు బ్రహ్మనాయఁడిటఁ గూర్చుండి శంఖుతీర్థమును, దులసిదళమును నిచ్చెడివాఁడఁట. బ్రహ్మనాయఁడిచ్చిన ప్రసాదమును స్వీకరించి వీరులు మహత్తరావేశముతో రణరంగమును బ్రవేశించెడివారు. ఈ ప్రవేశమున నొక ద్వారమున్నది. ఈ ద్వారము ప్రక్కనే కల ఆంజనేయ స్వామి విగ్రహము క్రింద ధననిక్షేపమున్నదని ప్రజల విశ్వాసము. ఇట రణక్షేత్రము పంద్రెండు గ్రామముల మేర వ్యాపించి యుండెడిదఁట.

కారెంపూడి గ్రామములో నామాల మండపమునకు దగ్గఱగా నున్న వీథిలో బాలచంద్రుని 'వేడుక పొటేలు' యొక్క గిట్టగుర్తును బ్రజలు చూపుచున్నారు. ఆ వీథిలోఁ గారెంపూడి కోటబురుజు కలదు. ఆ బురుజుపైనుండి బాలచంద్రుండు తన వేడుక పొటేలును దూకించెనని చెప్పుదురు. వీరోత్సవములో నీ గిట్టగుర్తును గుంకముతోఁ బూజింతురు.

కారెంపూడిలోఁ బలనాటి వీరాచార పీఠాధిపతులగు పిడుగువారున్నారు. వీరు ఆఱువేల నియోగి బ్రాహ్మణులు. వీరిది లోహితస గోత్రము, త్రయార్షేయము (అష్టక–లోహిత– కౌశిక). పిడుగు భద్రయ్యగారు పల్నాటివీరాచారము కూలంకషముగాఁ దెలిసిన విద్వాంసులు. వీరు గతించిరి. వీరి పుత్రులు పిడుగు నరసింహం గారు ఇప్పుడు పీఠాధిపతులుగా నున్నారు. వీరియారోగ్యము నేఁడు (1966 నాటికి) సరిగా లేదు. వయస్సుకూడ మళ్లినది. వీరికిఁ బుత్రులు లేరు. దౌహిత్రు నొకనిని దత్తుచేసికొనిరి. ఆ బాలునిపేరు వేంకట ఆంజనేయ శివప్రసాదరావు. ఈ చిరంజీవియే భావి పీఠాధిపతి.

కారెంపూడి కుత్తరముగా నైదుమైళ్ల దూరములో 'కొదమగుండ్ల' యను గ్రామమున్నదది. నలగాముఁడు దాఁగినది ఈ యూరనే. కొదమగుండ్ల బ్రాహ్మణులు నలగామునిఁ దఱుముకొనుచు వచ్చిన బ్రహ్మనాయని శాంతింపఁజేసిరి.

రామాయణములో వచ్చు 'ఖరదూషణాదుల'లోని ఖరుఁడను రాక్షసుఁడు పాలించిన పట్టణమగుటచే దీనికిఁ గారెంపూడి యని పేరు వచ్చినదఁట. ప్రతిసంవత్సరమును కార్తిక బహుళ అమావాస్య మొదలుగ నైదురోజులు కారెంపూడిలో వీరుల యుత్సవము జరుగును.

### *'బ్రహ్మనాయని నామము' :–*

పల్నాటిలో 'కొప్పునూరు' నుండి 'కళ్లకుంట' గ్రామమునకుఁ బోవు మార్గములో నొక బండపై పెద్ద నామమున్నది. దీనిని 'బ్రహ్మనాయని నామము' అని ప్రజలు పిలుచుచున్నారు.

### *'గుత్తికొండ బిలము' :–*

కారెంపూడి రణక్షేత్రమునకు ఈశాన్యముగా సుమారు ఎనిమిది మైళ్ల దూరములో 'గుత్తికొండ' యను గ్రామమున్నది. ఈ గ్రామమునకుఁ దూరముగా రెండు మైళ్ల దూరమున 'నాగాద్రి' యను పేరుగల పర్వతము కలదు. ఈ పర్వతములో నొక పెద్ద గుహయున్నది. దీనికి 'గుత్తికొండ బిలము' అని పేరు. యుద్ధానంతరము బ్రహ్మనాయఁడు ఈ బిలములోఁ బ్రవేశించి తపస్సు చేసికొనెనని ప్రజలు చెప్పుచుందురు.

ఈ గుహద్వారమునుండి లోపలికిఁ బండ్రెండు గజముల దూరములో నొక పెద్ద శివలింగమున్నది. దానిక్రింద మరల పంచలింగములున్నవి. పెద్ద శివలింగమును 'చీకటి మల్లయ్య' యని పిలుతురు. బ్రహ్మనాయఁ డిచ్చటనే తపస్సు చేసెనని చెప్పుదురు. పదునైదేండ్ర క్రిందట నీ చీకటి మల్లయ్య లింగముకడ నొక పెద్ద మట్టి కమండలము, నాలుగడుగుల పొడవుగల పంచలోహపు కత్తి, కొన్ని శాసనములును లభించినవఁట. (కమండలము, కత్తి, నాగార్జున మ్యూజియములోఁ గలవు. శాసనములు బెల్లంకొండ దేవాలయములో నున్నవి.)

ఈ గుత్తికొండ బిలములో రెండు ఫర్లాంగులు లోనికేఁగినచో నట నొక చిన్న నీటిచెలమ కనఁబడును. దానికడ గలగలమని పెద్ద ప్రవాహధ్వని వినఁబడును. ఆ చెలమ లోపలిభాగమున నొక భయంకర ప్రవాహమున్నదనియుఁ, జెలమలో మునిఁగినచో నా ప్రవాహమునఁ గొట్టుకొనిపోవుదురనియుఁ జెప్పుదురు.

గుత్తికొండ బిలములో 'కత్తుల బిలము, కృష్ణ బిలము, ఓంకార బిలము, విభూతి బిలము, రేణుకా బిలము' మున్నగు నూటయొక్క బిలములున్నవని తెల్పుదురు.

బిలద్వారమున కెడమవైపున మల్లేశ్వరాస్వామి ఆలయమున్నది. రణమున మరణించిన బాలచంద్రుఁడిట శివలింగముగా మాఱెనని చెప్పుదురు. ఈ శివాలయమున కెదురుగా ధ్వజస్తంభముకడ నాగేంద్రుఁడును నతని భార్య 'పంచపాళి'యుఁ గలరు. ఈ 'పంచపాళి' మాంచాల చెలికత్తె యని చెప్పుదురు.

ప్రతి సంవత్సరము నాషాఢ మాసమునఁ బూర్ణిమ ముందఱ నేకాదశినాఁడు (దీనిని 'తొలి యేకాదశి' యందురు) గుత్తికొండ బిలము దగ్గఱ నుత్సవము జరుగును. ఇచటి మల్లయ్యగుడిని నలుబది యేండ్ల క్రిందట కోలా పేరమ్మ యను భక్తురాలు పునరుద్ధరించి ఇటనొక యాశ్రమమును నెలకొల్పినది. ఈమె 'యోగామృతసారము' అను గుత్తికొండబిల మాహాత్మ్యమును రచించినది. ఈ గ్రంథములోఁ బల్నాటి వీరుల పూర్వజన్మలు చెప్పఁబడినవి.

## కాటమరాజు కథాచక్రము

### *గంగ దొనకొండ:–*

అయితమరాజాదులు పాలించిన దొనకొండ నేడు నెల్లూరు జిల్లా, దర్శి తాలూకాలో 'గంగ దొనకొండ' యను పేరుతో నున్నది. ('రైల్వేస్టేషను'న్న దొనకొండకు 'రైల్వే దొనకొండ' యని పేరు. ఇది యాధునికమైనది.) గంగ దొనకొండ పొట్లపాడు రైల్వేస్టేషనుకు ఆగ్నేయ దిశగా మైలు దూరములోనున్నది. ఇట యాదవులు పూజించిన గంగ గుడి, యందుఁ బెద్ద విగ్రహము, పాపనూక యొంటిస్తంభపు మేడ, అగుమంచి బావి, యాదవరాజుల శిలావిగ్రహములు, అయితమరాజు కోట శిథిలములు మున్నగు చారిత్రక స్థలములు గలవు. గంగగుడిలో యాదవరాజుల శిలాశాసనములు గలవు.

గంగ దొనకొండ గ్రామము నేఁడు 'ప్రాఁత దొనకొండ, క్రొత్త దొనకొండ' యని రెండు భాగములుగా నున్నది. గంగగుడి, ప్రాఁత దొనకొండకు దక్షిణముగా రెండు ఫర్లాంగులలోఁ, గ్రొత్త దొనకొండకుఁ బడమరగా నున్నది. ఈ గంగగుడికి దక్షిణముగా నాలుఫర్లాంగుల దూరములోఁ బాపనూక మేడ శిథిలము లున్నవి. ఈ శిథిలములలో సుందరమైన పాపనూక విగ్రహమొకటి లభించినది. దీనిని గంగగుడిలో భద్రపఱిచినారు.

పాపనూక మేడకుఁ బశ్చిమముగా రెండు వందల గజముల దూరములో నొక చిన్న కొండయున్నది. దీనికి 'పెయ్యల తిప్ప' యనియు 'ధనము కొండ' యనియుఁ బేర్లు. ఈ పర్వతమునకుఁ దూర్పుభాగమున అయితమరాజు పాలించిన దొనకొండ పట్టణము వ్యాపించియుండెడిది. ఆ పట్టణ శిథిలములు నేఁటికిని గానవచ్చుచున్నవి.

పాపనూక మేడకును బెయ్యల తిప్పకును మధ్యలో యాదవరాజుల కూటములున్నవి. అయితమరాజు కూటము, పుత్తమరాజు కూటము, పోచయ్య కూటము, ఎఱ్ఱయ్య కూటము, కఱియావులరాజు కూటము, పోలినీఁడు కూటము– వరుసగా నున్నవి. ఈ కూటములన్నియును కాలిపోయి చిట్టెముకట్టిన ఱాళ్లగుట్టలుగా నేఁడు ప్రత్యక్షమగుచున్నవి.

పాపనూక మేడకు దక్షిణముగా నొకఫర్లాంగు దూరములో నొక చిన్న కుంట యున్నది. దీనికి 'పాలకుంట' యని పేరు. యాదవుల లేగ దూడలు పాలు త్రాగుచుండఁగాఁ గాఱిన నుఱుగ యిట్లు కుంటగాఁ బరిణమించెనని చెప్పుదురు.

ధనుము కొండకు 'పెయ్యల తిప్ప' యని పేరు వచ్చుటకుఁ గారణమున్నది. ఈ కొండకావలివైపున నాలమంద యుండెనఁట. లేగలన్నియు నీవలివైపున పాలకుంట దగ్గఱ నున్నవి. ఈ లేగలు అరవఁగా నాలమందయంతయు ధనుముకొండ పర్వతము మీఁదుగా దాటివచ్చి లేగలకుఁ బాలిచ్చినవఁట. వాని నడకతో నా పర్వతముమీద నొక 'కురువ' (త్రోవ) యేర్పడినది. దానిని 'ఆవుల కురువ' యని నేఁటికిని బిలుతురు. ఆవుపెయ్యలు దాటిన కొండకావున దీనికిఁ బెయ్యల తిప్పయని పేరు వచ్చినది.

ఈ పెయ్యల తిప్పలో నొక గుహయున్నది. దీనిగుండా భక్తిరన్న కాశికిఁబోయెనని చెప్పుదురు. ఈ గుహకు 'బత్తిరన్న గవి' యని పేరు.

ఈ పెయ్యల తిప్పపై దక్షిణము వైపున నొక చిన్న గుట్టపై నొక నల్లని నున్నని ఱాయి కలదు. ఇది మూఁడు గజముల వెడల్పున గుండ్రముగా నున్నది. పంచలింగాల కొండ యుద్ధములో యాదవులు మరణించుట నిచ్చటనుండి గమనించిన గంగమ్మ దుఃఖించినదఁట. ఆమె కన్నీరు ఈ బండపైఁ బడినదఁట. అందుచే నీ బండకు 'కన్నీరు బండ' యని పేరువచ్చినది. ఈ బండ నేఁటికిని నిగనిగ మెఱయుచు నీఁగ వ్రాలినచో జాఱిపోవునట్లుండును.

గంగగుడిలో యాదవరాజుల విగ్రహములు, శక్తుల విగ్రహములు గలవు. ఈ గుడికిఁ బశ్చిమముగా నొక బొడ్డనబావి యున్నది. దీనికి 'అగుమంచి బావి' యని పేరు. దీని నగుమంచి త్రవ్వించెనఁట. దీని యొద్దున నొక పాలఱాతి శివలింగమున్నది. ఇది యగుమంచి పూజించిన శివలింగము.

ఈ యగుమంచి బావికి వాయవ్యముగా 'నందుల చెఱువు' గలదు. భక్తిరన్న కాశినుండి మేఘరథము మీఁదవచ్చి, యీ నందుల చెఱువుగట్టున దిగి శంఖము పూరించినాఁడని చెప్పుదురు.

గంగగుడికి దక్షిణముగా రెండు ఫర్లాంగుల దూరములో నొక శివాలయము కలదు. దీనికి 'ఓరుగంటి శంభుఁడు' అని పేరు. పల్లికొండ, అయితమరాజు, కఱియావులరాజు మున్నగువారు బేతాళుని జయించి ఓరుగల్లునుండి తిరిగివచ్చుచుండఁగా నీ శివలింగము వారి పల్లకీలవెంట దొరలుచు వచ్చెనఁట. ఇది తెల్లని పాలఱాతి లింగముగాఁ గన్పట్టుచున్నది.

గంగగుడిలో బేతాళుని విగ్రహముకూడఁ గలదు. ఎలమంచినుండి ఈ గంగను దెచ్చి యాదవులిచ్చటఁ బ్రతిష్ఠించిరని చెప్పుదురు. యాదవకాంతలు సహగమనము చేసిన యగ్నికుండము ఈ గుడిలో నున్నది.

### *పంచలింగాల కొండ – ఎఱగడ్డపాడు :–*

కనిగిరినుండి కందుకూరుకు పోవు మార్గములోఁ బెద అలవల పాడు గ్రామము దాటిన తరువాత పంచలింగాల కొండ, ఎఱగడ్డపాడు, పాలేరు వచ్చును. పంచలింగాల కొండకుఁ దూర్పుభాగమునను, నుత్తర భాగమునను కాటమరాజుకోట వ్యాపించియున్నది. పశ్చిమ భాగమున 'నేరెళ్లవాగు' ఉత్తరముఖముగాఁ బ్రవహించుచుఁ బాలేటిలోఁ గలియుచున్నది. పంచలింగాల కొండపై శివాలయమున్నది. కొండ చరియలోఁ బోలురాజు విగ్రహమున్నది. కొండదిగువను గోటలోఁ గాటమరాజు సింహాసనమున్న 'తమకము చింత', గుడారము చేసికొనిన 'గుడారు గుట్ట' కలవు.

ఈ కొండకు ఉత్తరముగా రెండు ఫర్లాంగుల దూరములోఁ బశ్చిమమునుండి తూర్పుదిశగాఁ బాలేరు ప్రవహించుచున్నది. ఈ పాలేటి దక్షిణ తీరమంతయు నెఱగడ్డపాడు. కాటమరాజు గంగతో 'తర్కవాదము' చేసిన ప్రదేశమిచ్చటనే కలదు. ఈ పాలేటి మధ్యనగల పెద్ద పెద్ద గుండుఱాళ్లపై గంగవిగ్రహము, బీరినీని విగ్రహము చెక్కఁబడియున్నవి. గుండుపైఁ జెక్కఁబడిన గంగకావున నీమెను 'గుంటిగంగ' యందురు. ఈ పాలేటిమధ్యలో రెండు గుండు ఱాళ్లున్నవి. వీనిని 'కల్లిగుండ్లు' అందురు. ఇచ్చట గంగతిరునాళ్లలో భట్టురాయబారము పాడుదురు.

ఈ పాలేటి యొద్దున గంగగుడి కలదు. ఈ ప్రదేశమున నొక పాలేటి పాయ వచ్చి నేరెళ్లవాగుతోఁ గలియుచున్నది. ఈ పాయ, యుద్ధము చేసిన యాదవుల రక్తముతో నేర్పడెనని చెప్పుదురు. దీనికి 'రకత కాలవ' యని పేరు.

**సర్వేపల్లి మిట్టలు:–**

నెల్లూరునకు దక్షిణముగా 'సర్వేపల్లి' యను గ్రామమున్నది. ఇచట సిద్ధిరాజునకు సహాయముగా వచ్చిన సైన్యము నిలిచిన విశాల ప్రదేశము కలదు. దీనిని 'సర్వేపల్లి మిట్టలు' అందురు.

**జన్నివాడ చదరంగము గుండు:–**

నెల్లూరునకుఁ బశ్చిమముగాఁ బెన్నయొద్దున ఏడు మైళ్ల దూరమున నొక పెద్ద గుండున్నది. దీనికి 'చదరంగము గుండు' అని పేరు. ఆలమందను మేపుచు కాటమరాజు, పద్మరాఘవుఁడు నిచట చదరంగమాడిరఁట. ఇది నేఁటి జొన్నవాడ గ్రామములో నున్నది. హనుమంతుఁడు 'వారధి' నిర్మాణమునకై పర్వతములను దెచ్చుచుండఁగా నొక పర్వతము జాఱి క్రిందపడినదఁట. అదియే ఈ గుండు అని చెప్పుదురు.

నెల్లూరు మండలమున చాగలకొండ, సోమేశ్వరుని గుడి, తిక్కనపాడు మున్నగునవి ఖడ్గతిక్కనకు సంబంధించిన వీరభూములు.

## బొబ్బిలివరుస కథలు– ఇతరములు

**'లడాయి స్తంభము' :–**

బొబ్బిలి యుద్ధము జరిగిన ప్రదేశములో క్రీ.శ. 1891లో "రాజా శ్రీ వేంకట శ్వేతాచలపతి రంగారావుగారు" అను బొబ్బిలిరాజా వారిచే నొక జయస్తంభము పాతఁబడినది. దీనిపైఁ దెలుఁగులోను, సంస్కృతములోను, నాంగ్లములోను బొబ్బిలి రంగారాయని శౌర్య ప్రతాపములు కీర్తింపఁబడి యున్నవి. తన ప్రభువునందు విశ్వాసముగల 'తాంద్రపాపయ్య' అను సరదారుడు విజయరామరాజును చంపి పగతీర్చుకొనుటయు నిందు తెలుపబడినది. దీనికి 'లడాయి స్తంభము' అని పేరు. ప్రసిద్ధ చిత్రకారులు శ్రీ అంట్యాకుల పైడిరాజుగారు "మల్లమదేవి" వర్ణచిత్రమును చిత్రించిరి.

**చెంజికోట:–**

దేసింగురాజు మహలు, రంగనాథస్వామి ఆలయము, మహబత్‌ఖానుని సమాధి మున్నగున వన్నియును ఉత్తరార్కాటు జిల్లాలోఁ గృష్ణగిరి పర్వతముపై నేఁటికిని గలవు.

**ఇతరములు:–**

అనంతపురము జిల్లా, కదిరి తాలూకా, కటారుపల్లెలో వేమన గుడి యున్నది. ఇందు వేమన సమాధి, పాదుకలు మున్నగునవి కలవు. కదిరిలో లక్ష్మీనరసింహస్వామి ఆలయమున్నది. ఈ యాలయములో సాసువుల చిన్నమ్మ కట్టిన గోపురము, చిన్నమ్మ విగ్రహము గలవు.

గూడూరు నారాయణమ్మ పేరంటాలును ప్రముఖ చిత్రకారులు శ్రీ అంట్యాకుల పైడిరాజుగారు ఊహించి చిత్రించినారు. (ఇది శ్రీ ముదివర్తి కొండమాచార్యులుగారు రచించిన 'నారాయణమ్మ' కావ్యములో వర్ణచిత్రముగా నున్నది.)

కర్నూలు జిల్లా, కోవెలకుంట్ల తాలూకా రూపనగుడి గ్రామమునకు సమీపమున 'నారసింహారెడ్డి గోడలు' అని పిలువఁబడు ప్రదేశము కలదు. ఇచట నారసింహారెడ్డి పూజించిన శక్తిగుడి, ఆతని సైన్యము నడచిన 'దండుబాట', దిగుడుబావి మున్నగునవి కలవు. నొస్సములో నారసింహారెడ్డి కోట యున్నది. ఉయ్యాలవాడలోను, రూపనగుడిలోను, గుళ్లదుర్తిలోను నారసింహారెడ్డి నగరులున్నవి. కోవెలగుంట్లలో నారసింహారెడ్డి దగ్ధమొనర్చిన 'తాలూకా కచ్చేరీ' యుండిన ప్రదేశమున్నది.

కడపజిల్లా, జమ్మలమడుగు తాలూకా చిన్నపసుపుల గ్రామములోని కుంటి పుల్లారెడ్డిగారి ఛాయా చిత్రమును, చిత్తూరు జిల్లా వాయలపాడు తాలూకా యల్లమందలోని యల్లమంద నాయుఁడుగారి భార్యాపుత్రుల ఛాయాచిత్రమును నేను సంపాదించితిని.

కర్నూలు జిల్లా, కోవెలకుంట్ల తాలూకా, ఉయ్యాలవాడ గ్రామములో బుడ్డా శివారెడ్డిగారి ఇంట, క్రీ.శ. 1868లో విక్టోరియా మహారాణి బుడ్డా వెంగళరెడ్డిగారి దాతృత్వమునకు మెచ్చి యిచ్చిన బంగారు పతకమున్నది. బుడ్డా వెంగళరెడ్డిగారి సమాధియు నీ గ్రామమునఁ గలదు. కర్నూలు జిల్లాలో బుడ్డా వెంగళరెడ్డిగారిని కీర్తించెడి గ్రుడ్డిదాసరు లెడనెడఁ బ్రత్యక్షమగుచుందురు.

విశాఖ మండలమున కృష్ణదేవిపేట, నర్శీపట్టణము ప్రాంతములలో అల్లూరి సీతారామరాజుగారి సాహసకృత్యములను దెల్పు స్థలములెన్నియో కలవు. సీతారామరాజుగారు చంపిన ఆంగ్ల సేనానులు– 'కెప్టెన్ హైటర్, కెప్టెన్ స్కాట్' ల సమాధులు నర్శీపట్టణములోఁ గలవు. అల్లూరి సీతారామరాజుగారిని, గాం గంటం దొరను దహనము చేసిన పవిత్ర క్షేత్రములు కృష్ణదేవిపేటలోఁ గలవు. సీతారామరాజుగారి కుడిభుజమును, గంటందొర సోదరుఁడును నగు 'గాం మల్లుదొర' (మాజీ లోకసభ సభ్యుఁడు) నేఁటికిని (1967 నాటికి) సజీవుఁడై యున్నాఁడు. వీరపూజలు సలుపు జాతీయ భక్తులకితఁడు తంగేటి జున్ను. ఈతని ఛాయాచిత్రమును నేను సంపాదించితిని. ❒

# అనుబంధము-V

# వీరగాథల పట్టిక

| | | | |
|---|---|---|---|
| **I** | ముద్రిత వీరగాథలు: | | |
| 1. | ఆంధ్రవాఙ్మయ సూచికలో నుదాహరింపంబడినవి | 137 | |
| 2. | గుజిలీ ప్రతులు | 184 | |
| 3. | శుద్ధ ప్రతులు | 59 | 380 |
| **II** | అముద్రిత వీరగాథలు: | | |
| 1. | ప్రాచ్య లిఖితపుస్తక భాండాగారములలోని ప్రాంతప్రతులు | 95 | |
| 2. | నాకు లభించిన తాళపత్ర గ్రంథములు | 67 | |
| 3. | నాకు లభించిన కాగితపు ప్రతులు | 14 | |
| 4. | నేను సేకరించిన మౌఖిక వీరగాథలు | 65 | |
| 5. | నేను సేకరించిన మౌఖిక వీరగాథానికలు | 70 | |
| 6. | అలభ్య వీరగాథలు | 30 | |
| 7. | అలభ్య వీరగాథానికలు | 14 | |
| 8. | తూమాడి దొణప్పగారు సేకరించిన లఘువీరగాథలు | 29 | 384 |
| **III** | వీరగాథానుకరణములు: | | |
| 1. | బుఱ్ఱకథలు-ముద్రితములు | 175 | |
| 2. | బుఱ్ఱకథలు-అముద్రితములు | 13 | |
| 3. | ఇతర ప్రక్రియలు-ముద్రితములు | 20 | |
| 4. | ఇతర ప్రక్రియలు-అముద్రితములు | 8 | 216 |
| | మొత్తము వీరగాథలు | | 980 |

# అనుబంధము-VI

# ముద్రిత వీరగాథలు

## 1. ఆంధ్రవాఙ్మయ సూచికలో నుదాహరింపఁబడినవి=137

***(ఎ)1921 సెప్టెంబరు నెలలోగా ముద్రింపఁబడిన వీరగాథలు:-***

- అంగద రాయబారము- చిదంబరకవి 1874
- అంగద రాయబారము, 1917
- అంగద రాయబారము, ?
- ఆండాళ్ చరిత్ర, ?
- ఆరు మరాటీల కథ, 1915
- కమ్మవారిపడతి- మునుస్వామి నాయుడు, 1913
- 'కమ్మవారిపడతి - పసుల బాలుఁడు (జంగంకథ)- వీరాస్వామి, 1916
- కాంభోజరాజు కథ- సుబ్బయ్య, ?
- కాంభోజరాజు కథ- సి. చెంగల్వరాజు, 1897
- కాంభోజరాజుకథ- జంగం సుబ్బయ్యదేవర, ?
- కామమ్మ కథ, 1898
- కుశలవకథ- కే. అనంతాచార్యులు, 1880
- కుశలవకథ- ?, 1897
- కుసలాయకము- రామచంద్రరాజు, 1894
- కుసలాయకము- ?, 1914
- కుమార రామునికథ- ?
- కొమారరాముని కథ- కె. చెంగల్వరాజు, 1896
- కోతుల జంగం కథ, ?
- గంగావివాహము, 1914
- గంగావివాహము- పసగాని సన్యాసి, 1917
- గొల్ల వీరమ్మ కథ, 1914
- చందమ్మ కథ- జ్ఞానాంబ, 1910
- చంద్రహాస చరిత్రము
- చిన్నపరెడ్డి కథ, 1914
- చిన్నమ్మ కథ- చెంగల్వరాజు, 1917
- చెంచితకథ, 1876
- చెంచితకథ-అప్పయ్యమంత్రి, 1874
- తిరుపతమ్మ- ఎమ్. నారాయణరాజు, 1916
- దక్షుని యజ్ఞము- తిమ్మరాజు పాపయ్య, 1901
- దేశింగురాజు కథ- పరదేశి దేవర,?
- దేశింగురాజు చరిత్ర- నిడిగంటి వీరయ్య, ?
- ధర్మాంగద చరిత్ర- ఈపూరి నారాయణరాజు, 1895
- ధర్మాంగద చరిత్రము- ఎన్.వేంకటదాసు, 1882
- ధేనువకొండ విరాటపర్వము (జంగంకథ)- ధేనుకొండ వెంకయ్య. 1902
- నందుల కాటమరాజు (ద్విపద)- ఎమ్. సంజీవకవి, 1917
- నలచరిత్రము-తోలేటి సీతారామయ్య, 1907
- నలచరిత్రము- కోదండరామయ్య, 1869
- నలచరిత్రము- జి. పెద్దన్నకవి, 1898
- నలచరిత్రము- భాస్కర సుబ్బకవి, 1891
- నలచరిత్రము (పదము), ?, 1913
- నలతంగారీ కథ- ఇ. మునుస్వామి నాయుడు, ?
- నిజలింగ చిక్కయ్య చరిత్ర (పదము)- పొడుగు రామబ్రహ్మకవి, 1912
- నూతన బొబ్బిలిరాజు కథ- (జంగంకథ)- వి.కన్నయ్యదాసు, 1899
- పరశురామచరిత్రము- జి.చంద్రమౌళి, 1915
- పరశురాముడు- ముడియం సీతారామారావు
- పల్నాటి వీరచరిత్రము- శ్రీనాథకవి సార్వభౌముఁడు, ద్విపద
- పల్నాటి వీరులు- అక్కిరాజు ఉమాకాంతము
- పెద్దకాపు కథ-?
- పెద్ద కుసలాయకము, 1913
- పెద్ద బొబ్బిలి మహారాజుకథ- కె.చెంగల్వరాజు, 1917
- పెద్ద బొబ్బిలి మహారాజుకథ- నిడిగంటి వీరయ్య, 1898
- పెద్దాపురపు కోడిపుంజుల కథ- ప్రకాశకుఁడు, యం.వి. రంగారావు, 1914
- పోలేరమ్మ- యం.సుబ్బారాయుడు నాయుడు, 1918

- ప్రహ్లాద- చదువుల బసవ శంకరయ్య, 1908
- ప్రహ్లాద- (పదము)- వి.సీతారామయ్య, 1910
- ప్రహ్లాద చరిత్రము- యస్.లక్ష్మీనరసయ్య, 1920
- బంగారు తిమ్మరాజుకథ, 1912
- బప్పడు- సెట్టి లక్ష్మీనరసింహము, 1912
- బాణాసుర యుద్ధము (పదము)- నడిమింటి రామయోగికవి, 1910
- బాలనాగమ్మకథ- బాలరాజు, 1917
- బాలనాగమ్మకథ-? 1920
- బాలరాజు చరిత్ర- బి.ఆదినారాయణయ్య, 1900
- బొబ్బిలిరాజు కథ (జంగంకథ)-?, 1890
- భళ్ళాణరాజు చరిత్రము- ప్రకాశకుఁడు: కె.యన్.రాజమణి శెట్టి, 1890
- మహాపతివ్రత చిన్నమ్మ కథ
- మహాలక్ష్మీకథ- కె. చెంగల్వరాజు, 1897
- రాజస్థాన పదములు- సెట్టి లక్ష్మీనరసింహము
- రుద్రాక్ష మాహాత్మ్యము, 1918
- లక్ష్మణ మూర్ఛ (పదము)- ఎ.సత్యనారాయణ, 1919
- లక్ష్మణ మూర్ఛ (పదము)- పూడిపెద్ది బుచ్చన్న పంతులు, 1896
- లక్ష్మణ మూర్ఛ (పదము)- పి. బక్కెన, 1917
- లక్ష్మమ్మ కథ- ఎల్లంటి వెంకయ్య
- వామన చరిత్రము- కొత్తపల్లి రాజలింగము, 1912
- వామన చరిత్రము- కె. శేషయ్య, 1920
- వామన విజయము
- విరాటపర్వము (జంగంకథ)- ధేనువకొండ వెంకయామాత్య
- విరాటపర్వము (పదము)- అయ్యగారి కూర్మనాథుఁడు
- శశిరేఖాపరిణయము (పదము)- తోలేటి సీతారామకవి, 1896
- శశిరేఖా ఉత్తరకథ (పదము)- ఆర్.సీతారామకవి, 1914
- శశిరేఖాపరిణయము - తోలేటి సీతారామకవి, 1917
- శారద రామాయణము-?
- శారద రామాయణము- పి. రామదాసు, 1876
- శారద రామాయణము- శ్రీరామభద్రకవి, 1882
- శారద రామాయణము-?
- శ్రీయాళ మహారాజు చరిత్ర- కురిచేటి వెంకట నరసింహం, 1908
- శ్రీయాళ మహారాజు చరిత్ర- క్రొవ్విడి శేష వేంకట కాశీపతి, 1912
- శ్రీయాళ మహారాజు చరిత్ర- ఎన్.శేషాచలం, 1915
- శ్రీయాళ మహారాజు చరిత్ర- ఎస్.సీతారామయ్య, 1916
- శ్రీయాళరాజు చరిత్ర- యం. రంగనాయకదాసు, 1917
- సర్వాయి పాపడు కథ- కె. చెంగల్వరాజు, 1897
- సారంగధర చరిత్ర- సంపత్తుదాసు, 1870
- సారంగధర చరిత్ర- శ్రీనివాసాచారి, 1870
- సారంగధర చరిత్ర (ద్విపద)-బాణాల శంభుదాసు, 1870
- సారంగధర చరిత్రము- వేంకటకవి, 1878
- సారంగధర చరిత్ర (ద్విపద)- డి. బుచ్చన్న పంతులు, 1892
- సారంగధర చరిత్ర- వి.నరసింహప్పశాస్త్రి, 1898
- సారంగధర చరిత్రము- యస్.నాగలింగము, 1906
- సారంగధర చరిత్ర- యస్. సూర్యనారాయణ, 1907
- సారంగధర చరిత్ర- జి.శ్రీరామమూర్తి, 1909
- సారంగధర చరిత్ర- మడ్డి రంగనాయకులు, 1915
- సారంగధర చరిత్ర- మంగు వేంకట రంగనాథరావు, 1917
- సారంగధర చరిత్ర- ?, 1920
- సుంకర కొండడి కథ- లాలా కన్నయ్య, 1917
- సుందరకాండ పదము- పూడిపెద్ద బుచ్చన్న పంతులు, 1918
- సుగ్రీవ విజయము- రత్నకవి, 1873
- సుగ్రీవ విజయము- కె. కృష్ణవేణి, 1893
- సురాభాండలింగ కథ- తోలేటి సీతారామయ్య, 1909
- సూర్యచంద్రుల కథ-?, 1920

***(బి) 1921 అక్టోబరునుండి 1925 డిసెంబరువఱకును గల మధ్యకాలములో ముద్రింపఁబడిన వీరగాథలు:-***

- అంగద రాయబారము- యం. సూర్యనారాయణశాస్త్రి
- ఎఱుకమ్మ పేరంటాలు కథ
- కుసలాయకము
- గాంధారికథ- భాగము1
- గాదెల గండడు- యల్లాపంతుల జగన్నాథం పంతులు
- తిరుపతమ్మ పాట
- దక్షుని యజ్ఞము- పూరి నారాయణరాజు
- దేశింగురాజు కథ- రావూరు వెంకట సుబ్బారావు

- ధర్మాంగద చరిత్ర– పాముపాట– పూరి నారాయణరాజు
- పెద్ద కామమ్మ కథ
- పెద్ద బొబ్బిలిరాజు కథ
- భల్లాణ చరిత్ర పదము– కట్టోజి వీరయ్య
- రంగమ్మ పేరంటాలు కథ– బి.సుబ్బయ్య, ఎ.వీరబ్రహ్మం
- లక్ష్మణమూర్ఛ పదము
- వరాహావతార చరిత్రము
- విరాట పర్వము పదము
- శతకంఠ రామాయణము– యం. సూర్యనారాయణశాస్త్రి
- శతకంఠ రామాయణము– పసగాడ సన్యాసి
- శశిరేఖాపరిణయము పదము
- శారద రామాయణము
- సత్యహరిశ్చంద్రీయము– కె.సూర్యనారాయణాచార్యులు
- సారంగధర చరిత్ర– సోమయాజుల రామజోగిశాస్త్రి
- సిరియాళ చరిత్రము– చదువుల బసవశంకరకవి
- సుంకర కొండడు– టి. రామారావు

***(సి) 1926 జనవరినుండి 1927 డిసెంబరువఱకును గల మధ్యకాలమున ముద్రింపఁబడినవి:–***

- గోన కాటమరెడ్డి– పి.వెంకట సుబ్బరాజు
- గోరాకుంభార్ చరిత్ర– బద్దిరెడ్డి కోటేశ్వరరావు
- శ్రీ చౌడేశ్వరీ కీర్తనలు– జి. సరవయ్య
- శ్రీయాళ చరిత్ర– చెరువు అప్పల నరసింహదాసు
- హరిశ్చంద్రోపాఖ్యానము (పదము)– పొడుగు రామబ్రహ్మము

## 2. గుజిలీ ప్రతులు= 184

(ఈ దిగువ నీయఁబడిన వీరగాథలలోఁ గొన్ని నా దగ్గఱ కలవు. మఱికొన్ని రాజమండ్రి 'గౌతమీ గ్రంథాలయము'లోను, వేటపాలెము 'సారస్వత నికేతనము'లోను, ఇతర గ్రంథాలయములోను గలవు. ఇంకను కొన్ని– రాజమండ్రిలోని కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, గొల్లపూడి వీరాస్వామి అండ్ సన్స్, కాళహస్తి తమ్మారావు అండ్ సన్స్ వారి కడను, మదరాసులో అమెరికన్ డైమండ్ ప్రెస్, ఎన్.వి.గోపాల్ అండ్ కో., సి.వి.కృష్ణాబుక్ డిపో మున్నగువారి కడను లభించుచున్నవి. మొదట వీరగాథ పేరు, తరువాత దాని వర్గము, పిమ్మట కవిపేరు, ప్రకాశకుని పేరు, ముద్రణకాలము, లభించు గ్రంథాలయము పేరు నీయఁబడును).

***వీరగాథలు:–***

- అంగద రాయబారము అను వారధికట్టు, పదము, మంగిపూడి సూర్యనారాయణ రచన, ఆర్. సంజీవి రావు అండ్ సన్, విజయ నగరము, 1925 (వెల్‌లక్ మునిసిపల్ లైబ్రరీ, విజయ నగరము).
- అంబరీషోపాఖ్యానము, జంగంకథ, ఉప్పలపాటి వేంకట రాయమయ్య రచన, వంకాయల కృష్ణస్వామి శెట్టి, మదరాసు 1902.
- అనసూయ జంగంకథ, ?, కె. కనకరాయ ముదలియార్, మదరాసు, 1908.
- అప్పర్ బర్మాయుద్ధము, బొబ్బిలివరుస కథ, ?, కె. కనకరాయ ముదలియార్, మదరాసు, 1908.
- అర్బత్ నెట్టు జంగంకథ,?, కె. కనకరాయ ముదలియార్, మదరాసు, 1908.
- అర్బత్ నెట్ హవుస్ చరిత్రము, జంగంకథ, మారెళ్లపాటి కుప్పుస్వామి నాయుని రచన. కోళప్పన్‌జేరి కనకరాయ ముదలియార్, చెన్నపట్టణము, 1907 (గౌతమీ గ్రంథాలయము, రాజమండ్రి).
- అహల్యా సంక్రందనీయము, జంగంకథ, మేడూరి నరసింహా చార్యకవి, టి. చెంగల్వరాయ నాయుఁడు, మదరాసు 1907, (గౌతమీ గ్రంథాలయము).
- అహల్యా సంక్రందనీయము, జంగంకథ, ? కె. కనకరాయ ముదలియార్, మదరాసు, 1908.
- ఆరు మరాఠీల కథ, బొబ్బిలివరుస కథ, ? కో. గోవిందస్వామి మొదలారి, చెన్నపట్టణము, 1914, (గౌతమీ గ్రంథాలయము).
- ఆరు మరాటీల కథ, బొబ్బిలివరుస కథ, ?, కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, రాజమండ్రి,?
- ఇందుమతీ పరిణయము, పదము, పూడిపెద్ది బుచ్చన్న పంతులు రచన, కె.వి. కామయ్యశెట్టి, విశాఖపట్టణము, 1896.
- కమ్మవారి పణతి– పసల బాలుని కథ, జంగంకథ, కిన్నెర వీరాస్వామి రచన, పి.యన్.భక్తవత్సల అండ్ కంపెనీ, మదరాసు, 21-11-1916.
- కమ్మవారి పణతి– పసల బాలరాజు కథ, జంగంకథ, కిన్నెర వీరాస్వామి, సి.వి.కృష్ణా బుక్ డిపో, మదరాసు, 1960.
- కర్ణపర్వము, పదము, అయ్యగారి కూర్మనాథుని రచన, విన్నకోట అప్పల నరసింహులు, విశాఖపట్టణము, 1906 (గౌతమీ గ్రంథాలయము).

- ♦ కాంభోజ మహారాజు కథ, బొబ్బిలివరుస కథ, ? , కె.కనకరాయ ముదలియార్, మదరాసు, 1908.
- ♦ కాంభోజరాజు కథ, బొబ్బిలివరుస కథ, జంగం సుబ్బయ్య దేవర రచన, (గౌతమీ గ్రంథాలయము).
- ♦ కాంభోజరాజు కథ, బొబ్బిలివరుస కథ, ? ఎన్.వి. గోపాల్ అండ్ కో. మదరాసు, 1959.
- ♦ కామమ్మ కథ, బొబ్బిలివరున కథ, ? కె. కనకరాయ ముదలియార్, మదరాసు, 1908.
- ♦ కామమ్మ కథ, బొబ్బిలివరుస కథ, ?, కుప్పుస్వామి మొదలారి, చెన్నపట్టణము, 1923.
- ♦ కామమ్మ కథ, బొబ్బిలివరుస కథ, ?, ఎన్.వి. గోపాల్ అండ్ కో, మదరాసు, 1963.
- ♦ కామమ్మ చరిత్రము, జంగంకథ, గంజి నాగయ్య వరకవి, ప. యతిరాజులు నాయుఁడు, చెన్నపట్టణము, 1900 ప్రాంతము (సారస్వత నికేతనము, వేటపాలెము).
- ♦ కాళీయమర్దనము, జంగంకథ, యు.నాగలింగము రచన, 1931
- ♦ కుమార రాముని కథ, బొబ్బిలివరుస కథ, ?, కె. కనకరాయ ముదలియార్, మదరాసు, 1908.
- ♦ కుశలాయకము, పదము, ఈపూరి రామచంద్రరాజు రచన, ఉత్పల వేంకటరంగాచార్యుల పరిష్కరణము, ఎన్.వి. గోపాల్ అండ్ కో, మదరాసు, 1960.
- ♦ కుసలాయకము, పదము, ఈపూరి రామచంద్రరాజు, ఆర్.సంజీవిరావు అండ్ సన్, విజయనగరము, 1925.
- ♦ కొమార రాముని కథ, బొబ్బిలివరుస కథ,?, (గౌతమీ గ్రంథాలయము).
- ♦ కోటప్పకొండలో జరిగిన చిన్నప్పరెడ్డి కథ, బొబ్బిలి వరుసకథ,?, కో. లక్ష్మణ ముదిలియార్ మదరాసు, 29-8-1914 (గౌతమీ గ్రంథాలయము).
- ♦ కోటప్పకొండలో జరిగిన చిన్నప్పరెడ్డి కథ, బొబ్బిలివరుసకథ, కంగా వెంకటరత్నం (బెజవాడ) రచన కాఁబోలు, కో.గోవింద రాజ మొదలియార్, మదరాసు, 1914 (సారస్వత నికేతనము).
- ♦ కోటప్పకొండలో జరిగిన చిన్నప్పరెడ్డి, అమెరికన్ డైమండ్ ప్రెస్, మదరాసు, 1928 (సారస్వత నికేతనము).
- ♦ గంగా పరిణయము, పదము, సన్యాసి రచన,?, మదరాసు, 1896 (గౌతమీ గ్రంథాలయము).
- ♦ గంగా వివాహము, పదము, ?, ఆర్.సంజీవరావు అండ్ సన్, విజయనగరము, 1925.
- ♦ గంగా వివాహము, పదము, పసగాడ సన్యాసికవి, పరిష్కర్త: ఉత్పల వేంకట రంగాచార్యులు, ఎన్.వి.గోపాల్ అండ్ కో, మదరాసు 1961.
- ♦ గయోపాఖ్యానం, జంగంకథ,?, కె. కనకరాయ ముదలియార్, మదరాసు, 1908.
- ♦ గయోపాఖ్యానము, జంగంకథ, ధేనువకొండ వెంకయ్య రచన, కో. లక్ష్మణ మొదలారి, మదరాసు, 1910 (గౌతమీ గ్రంథాలయము).
- ♦ గయోపాఖ్యానం జంగంకథ, 1939కి పూర్వపు ప్రతి, (సారస్వత నికేతనము).
- ♦ గయోపాఖ్యానము జంగంకథ, వెస్టువార్డ్ అండ్ కంపెనీ, మదరాసు, 1956.
- ♦ గయోపాఖ్యానము పదము, పొడుగు రామబ్రహ్మకవి రచన, వెంకటేశ్వరా పబ్లిషింగ్ హోమ్, రాజమండ్రి, 1948 (సారస్వత నికేతనము).
- ♦ గయోపాఖ్యానము పదము, ?, కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్స్, రాజమండ్రి 1955.
- ♦ గాంధారి కథ, బొబ్బిలివరుస కథ, ?, నెలటూరు వెంకట సుబ్బశాస్త్రులు ప్రచురణ, 1893, (గౌతమీ గ్రంథాలయము).
- ♦ గాంధారి కథ, బొబ్బిలివరుస కథ, ?, కె. కనకరాయ ముదలియార్, మదరాసు, 1908.
- ♦ గోపికా వస్త్రాపహరణము, శారదపదము, పూడిపెద్ది బుచ్చన్న పంతులు రచన, జి.నూకయ్య చెట్టి, విశాఖపట్టణము, 1898 (గౌతమీ గ్రంథాలయము).
- ♦ గోపికా వస్త్రాపహరణము (శారద రామాయణం మోస్తరు), పూడిపెద్ది బుచ్చన్న పంతులు, జి. నూకయ్య చెట్టి, విశాఖ పట్టణము, 1898, (నా దగ్గఱ నున్నది).
- ♦ చంద్రహాసుని కథ, జంగంకథ, అన్నమురాజు సుబ్బారావు రచన, వి.మధురముత్తు ముదలియార్, మదరాసు, 26-12-1903.
- ♦ చిన్నమ్మకథ, బొబ్బిలివరుస కథ, నిడిగంటి వీరయ్యదేవర రచన, పమ్మి అరుణాచలంశెట్టి, మదరాసు 1910 (గౌతమీ గ్రంథాలయము).
- ♦ చిన్నమ్మకథ, బొ.వ.;. ఎన్.వి.గోపాల్ అండ్ కో. మదరాసు, 1963.
- ♦ చిత్రాల బాలనాగమ్మ కథ, బొబ్బిలివరుసకథ, ?, ఎన్.వి.గోపాల్ అండ్ కో. మదరాసు, 1962.

